# మొదటికూర్పు పీఠిక



భారతదేశమున భక్తి, జ్ఞానము అను రెండును మోక్షసాధనములుగ నెన్నఁబడుచున్నవి. ఇతరదేశములలోఁ గూడ నిట్టి సిద్ధాంతములే యుండవచ్చును; గాని భారతీయులు మాత్రమే వీనిని గుఱించి సంపూర్ణ చర్చను గావించినారు. భారతీయులకుఁ గల ఆత్మానాత్మవివేకము అన్యులకు లేదు. ఈశ్వరవిషయకములగు గ్రంథములు ప్రతిష్ఠాపనములు ఈదేశమున నున్నన్ని మఱియెచ్చటను లేవు.

భక్తి యుత్కృష్టమా? జ్ఞానము ఉన్నతమా? యను చర్చ శాస్త్రజ్ఞుల స్వామ్యము.ఆచర్చతో నాకిచ్చటఁ బ్రసక్తిలేదు. మఱేమన: జ్ఞానమార్గమునకంటె భక్తియోగము సులభము. ఇందులకు ఉదాహరణముగ ఈవిశాలదేశమున జ్ఞానులకంటె భక్తులు అధికముగ నున్నారు. మూఁడుమతములను ఏర్పఱిచిన మతాచార్యులలో మధ్వరామానుజులు భక్తియోగమును ఉపదేశించినారు. ఒక్క శంకరభగవత్పాదుఁడు మాత్రమే జ్ఞానమును ఉపదేశించెను. భక్తియోగమువలన అనేకులు ముక్తిని గాంచినట్లు మనగ్రంథములు సాక్ష్యమిచ్చుచున్నవి.

ఈశ్వరునిఁ దెలిసికొనుటకు అర్చించుటకు ఐహికాముష్మికఫలములను బడయుటకు భిన్నోపాధులగు స్త్రీపురుషులకు భక్తియోగమున సమానాధికారము ఉన్నపుడు జాతిభేదములు ఎట్లు ఇందులకు అభ్యంతరపెట్టును? కావుననే భక్తులలో అన్నివర్ణములవారును ఉన్నారు. తుకారామస్వామి, చోకామేళుఁడు, కబీరు, భద్రాచలరామదాసు మున్నగువారి చరిత్రములు ఇందులకు నిదర్శనములు.

ఈగ్రంథమున చిత్రింపఁబడినవారిలో శ్రీశంకరభగవత్పాదులు, గౌతమబుద్ధుఁడు, పరమహంస శ్రీరామకృష్ణ, వివేకానందులు మున్నగు కొలఁదిమంది తక్క తక్కినవారు అందఱును సగుణారాధకులు. అందును హరిభక్తులు పెక్కురు.

ఈగ్రంథమున హరిభక్తుల చరిత్రములును, శివభక్తుల చరిత్రములును, ఆళ్వారుల చరిత్రములును, భక్తురాండ్ర చరిత్రములును, దేశభక్తులచరిత్రములును గలవు. ఈగ్రంథము వ్రాయుటలో భక్తవిజయము, భక్తమాల, భక్తలీలామృతము, భాగవతము, భారతము, రామాయణము, సుబోధినీగ్రంథమాలా ప్రచురగ్రంథములు కొన్ని ఇంకను అనేకగ్రంథములు నాకు సాయపడినవి; గావున ఆయాగ్రంథకర్తలకు కృతజ్ఞుఁడను.

ఇందలి ఆళ్వారులచరిత్రములు విజయనగరము మహారాజావారి కళాశాలలో సంస్కృతోపాధ్యాయులగు శ్రీయుత మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారిచే వ్రాయఁబడినవి. శ్రీఆచార్యులుగారు విశిష్టాద్వైతమతవిషయమున అట్టి

ప్రతిష్ఠలు; గావున ఆళ్వారులచరిత్రలు వారిచే వ్రాయఁబడుట ఔత్కృష్ట్యము నకు హేతువు.

శ్రీయుతులు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ఆంధ్రమున సర్వాంగ సుందరమగు భక్తులచరిత్ర లేకుండుట సూచించి కోరఁగా నేను ఈమహాభక్త విజయమును వ్రాసితిని. వేంకటేశ్వరశాస్త్రులుగారి ఆంధ్రభాషాసేవానిరతి అద్వి తీయము. ఇది వీరికి దివంగతులును, వీరిపితృదేవులు నగు రామస్వామిశాస్త్రులవారు ఇచ్చిన అమూల్యనిక్షేపము. రామస్వామిశాస్త్రులవారిపాండిత్యము సర్వతో ముఖము. వారు, బాల్యమున మాప్రాంతమున అనఁగా: మాయూరికి నాలుగు క్రోశములదూరమున నున్న దాక్షారామమున విద్యాభ్యాసము గావించి యున్నారు. వారి పాండిత్యమునకును, భాషాసేవకును, వాఙ్మయపోషణమునకును ఉత్కృష్టప్రతిష్ఠకును మాపావనగోదావరీ మధురసలిలములే హేతువులు; గావున మేము గర్వపడుచున్నాము.

ఆధునికాంధ్రభాషాచరిత్రలో ప్రప్రథమమున అనితరసాధ్యముఁగ భాషా సేవ గావించినవారిలో రామస్వామిశాస్త్రులవారు అగ్రాసన మలంకరించుచున్నారు. ఆంధ్రభాషాచరిత్రకారుఁడు వారి కీర్తిని గానము సేయఁడేని తన గ్రంథము నకు నైచ్యము నాపాదించుకొనును. నేఁటికిఁ గూడ భాషాసేవసేయుటలో వావిళ్లవారిని మించినవారు లేరు. ఆంధ్రదేశాకాశమున ధ్రువతారాతుల్యముగఁ బ్రకాశించునక్షత్రములలో వావిళ్ల నామనక్షత్రము ఉత్కృష్టము.

శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు గూడ పితృదేవునిపదాంకములనే అనుసరించుట సంతోషావహము. నేఁడు శ్రీవావిళ్లవారి ప్రతిష్ఠాపనము చూచినవారు స్వల్పకాల ములో జరిగిన అనితరసాధ్యమగు అభివృద్ధికి ఆశ్చర్యచకితులు కాకపోరు. శ్రీశాస్త్రులుగారు భాషాసేవ ప్రారంభించిన తరువాతనే ఆంధ్రగ్రంథములు ఆకార మున ఇంగ్లీషుగ్రంథములవలె కన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నవి. వీరివలన మహోన్నత సత్కారములం గాంచిన గ్రంథకర్తలును పండితులును ఆంధ్రదేశము నందు అంతటను ఉన్నారు. శాస్త్రులుగారు ఇఁకముందు ఆంధ్రభాషలో ప్రక టింపఁబోవు గ్రంథములు అపూర్వములు. వాఙ్మయమునకు ముఖ్యాలంకారములు. వానియందెల్ల శ్రీశాస్త్రులుగారు ఇపుడు తయారుచేయించుచున్న వావిళ్లనిఘంటువు నాయకరత్నము.

ఇందలిదోషములను విడిచి ఒప్పులను గ్రహించుటకు పండితులను ప్రార్థిం చుచు ఈగ్రంథమును వినీతభావముతో ఆంధ్రసోదరులకరకమలములయందు సమర్పించుచున్నాను.

మహేంద్రవాడ. }
నందనవనము. }

ఇట్లు విధేయుఁడు,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

# మూఁడవ కూర్పు పీఠిక

ఇది మూఁడవ కూర్పు. మొదటి రెండు కూర్పులను ఆదరించిన నా దేశీయులకు నేను కృతజ్ఞుఁడనై యున్నాను. నా యీ రచనముయొక్క వైలక్షణ్యమును, విశిష్టతను సకలప్రాంతములవారును గుర్తించి స్వీకరించి యున్నారు. అందుకును నేను కృతజ్ఞుఁడను.

ఈకూర్పున వెనుకటి కూర్పులలో లేని అనేక భక్తుల చరిత్రములను క్రొత్తఁగా చేర్చినాను. వానిలో త్రైలింగస్వామి మొదలు లోకనాథబ్రహ్మచారి వరకును గల 12-గురు భక్తులచరిత్రములును నాకు మదరాసున అడ్వొకేటుగా నున్న శ్రీయుత, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. యే., బి. యల్ గారివలన లభించినవి. విలువలేని యీ సహాకారమునకు వారియెడల నేను మిగుల ఋణపడియున్నాను. వారికిని నాకృతజ్ఞతను విన్నవించుచున్నాను.

క్రొత్తఁగా చేర్పఁబడిన భక్తులలో శ్రీచైతన్యస్వామి, మాణిక్యప్రభువు ప్రత్యేక ప్రశంసకు పాత్రులై యున్నారు. వారిలో చైతన్యస్వామి దక్షిణభారతమున రామానుజయతీంద్రునివలె వంగదేశమునందును, మరికొన్ని ప్రాంతములయందును ప్రబలియున్న ప్రత్యేకవైష్ణవసాంప్రదాయమునకు జనకుఁడు. ఆప్రాంతములలో శ్రీరామానుజవైష్ణవమునకు ప్రాచుర్యము లేదు. ఇక్కడ రామానుజసాంప్రదాయముపారికంటె అక్కడ చైతన్య సాంప్రదాయమువారు బహుసంఖ్యాకులై యున్నారు. ఈయుభయ సాంప్రదాయములవారును శ్రీహరి యనంతరూపములను భక్తిప్రపత్తులతో పూజించెదరు; గాని విశేషించి రామానుజసాంప్రదాయమువారు శ్రీరామచంద్రుని, చైతన్యసాంప్రదాయమువారు శ్రీకృష్ణభగవానుని ప్రత్యేకాభిమానముతో పూజింతురు.

శ్రీమాణిక్యప్రభువు దత్తాత్రేయస్వామి లీలామానుషవిగ్రహము. ప్రభువు నిజాము రాష్ట్రీయుఁడు. ఇప్పటికిని ప్రభువుపీఠము కల్యాణి (ఇప్పుడు బొంబాయి రాష్ట్రము)లో అకుంఠితభక్తితో పూజింపఁబడుచున్నది.

ఇందు చిత్రపటములును కొన్ని క్రొత్తగా చేర్పఁబడినవి.

ఇట్లు గ్రంథమును పెంచుట కవకాశ మిచ్చిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి నా కృతజ్ఞతను విన్నవించుచున్నాను. శాస్త్రులుగారిట్లే యింకను సర్వాంగ సుందరము లగు అనేకాంధ్రగ్రంథములను, సంస్కృతగ్రంథములను బ్రకటించి ఆంధ్ర వాఙ్మయమును అసాధారణాభిమానముతో పోషించుచున్నారు.

ఈవిషయమును గమనించి ఆంధ్రప్రముఖు లనేకులు నేఁడు శ్రీశాస్త్రులుగారిని మహావైభవముతో సన్మానింపఁ బ్రయత్నించుచున్నారు. ఇది చాల స్తుతిపాత్రముగా నున్నది. శ్రీవావిళ్లవారి వాఙ్మయసేవ వాఙ్మయముతోపాటు స్థిరమై యుండఁగలదు. అట్టి వాఙ్మయోద్ధారకులను సన్మానింప నెంచుట వాస్తవముగా వాఙ్మయమును పోషించుటయే. మనవారీసంగతిని గుర్తించి, యుక్తసమయమున నేతత్ప్రయత్నము ప్రారంభించుట ఆంధ్రవాఙ్మయముయొక్క అచిరోన్నతికి ప్రస్ఫుటమైన సూచనగా నున్నది. ఈసందర్భమున నాసమధికామోదమును ప్రకటించుచు సన్మానసంఘము వారికి శక్తివంచన లేకుండ తోడ్పడుటకు నేను ఉద్యుక్తుఁడనై యున్నాను.

మహేంద్రవాడ.
19-3-1931

ఇట్లు,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీకుందుర్తి వేంకటనరసయ్యగారు రచించిన 28 భక్తుల చరిత్రలు ఈ నాల్గవకూర్పున చివర చేర్పఁబడినవి.

వావిళ్ల.

# విషయసూచిక



## ప్రథమభాగము

### హరిభక్తులు

ఇట్లు గ్రంథమును పెంచుట కవకాశ మిచ్చిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి నా కృతజ్ఞతను విన్నవించుచున్నాను. శాస్త్రులుగారిట్లే యింకను సర్వాంగ సుందరము లగు అనేకాంధ్రగ్రంథములను, సంస్కృతగ్రంథములను బ్రకటించి ఆంధ్ర వాఙ్మయమును అసాధారణాభిమానముతో పోషించుచున్నారు.

ఈవిషయమును గమనించి ఆంధ్రప్రముఖు లనేకులు నేఁడు శ్రీశాస్త్రులుగారిని మహావైభవముతో సన్మానింపఁ బ్రయత్నించుచున్నారు. ఇది చాల స్తుతిపాత్రముగా నున్నది. శ్రీవావిళ్లవారి వాఙ్మయసేవ వాఙ్మయముతోపాటు స్థిరమై యుండఁగలదు. అట్టి వాఙ్మయోద్ధారకులను సన్మానింప నెంచుట వాస్తవముగా వాఙ్మయమును పోషించుటయే. మనవారీసంగతిని గుర్తించి, యుక్తసమయమున ఏతత్ప్రయత్నము ప్రారంభించుట ఆంధ్రవాఙ్మయముయొక్క అచిరోన్నతికి ప్రస్ఫుటమైన సూచనగా నున్నది. ఈసందర్భమున నాసమధికామోదమును ప్రకటించుచు సన్మానసంఘము వారికి శక్తివంచన లేకుండ తోడ్పడుటకు నేను ఉద్యుక్తుఁడనై యున్నాను.

మహేంద్రవాడ.
19-3-1931

ఇట్లు,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

☞ శ్రీకుందుర్తి వేంకటనరసయ్యగారు రచించిన 28 భక్తచరిత్రలు ఈ నాల్గవకూర్పున చివర చేర్చఁబడినవి.

వావిళ్ల.

# విషయసూచిక



## ప్రథమభాగము

### హరిభక్తులు

## ద్వితీయభాగము

### శివభక్తులు



శ్రీరస్తు

# శ్రీమహాభక్తవిజయము

## ప్రథమభాగము

## 1. ప్రహ్లాదుఁడు

శ్రీయజ్ఞవరాహరూపమున శ్రీమహావిష్ణువు హిరణ్యాక్షుని సంహరించి వేయుటచే వాని యన్నయగు హిరణ్యకశిపుఁడు తమ్ముని జంపినపగఁ దీర్చికొనవలయు నని దీక్ష వహించెను. పిదప నాతఁడు తన తమ్మునినిమిత్తము వగలం బొగులుచున్నవారినెల్లర నూరడించి, తనకు ముసలితనము - చావు - దుస్సాధ్యుఁడైన వైరియు లేకుండునట్లును, ముల్లోకములను శాసించుశక్తియు, యుద్ధరంగములయందు సంతతవిజయము, సింహపరాక్రమమును గలుగునట్లును వరములను సంపాదింపఁగోరి, మందరపర్వతమున కరిగి, యొంటికాలి బొటనవ్రేలిమీఁద నిలిచి, యూర్ధ్వబాహుఁడై, యాకసము చూచుచు బ్రహ్మదేవుని గుఱించి ఘోరతపస్సు ప్రారంభించెను. నిశ్చలతపస్సమాధినిష్ఠాగరిష్ఠుఁ డైన యారాక్షసునిపై పుట్టలు మొలిచెను. చెదలు మున్నగు పురుగులచే శరీర మంతయు జీర్ణించెను.

చారులచే వాని తపోవృత్తాంతము దేవేంద్రునకు వినవచ్చెను. హిరణ్యకశిపుఁడు తపస్సునకు వెడలకపూర్వ మాతనిభార్య లీలావతికి గర్భోత్పత్తి యయ్యెను. దేవేంద్రుఁ డదాటున రాక్షసపురిపై దండువిడిసి రాక్షసులను జించి చెండాడి లీలావతినిఁ జెఱపట్టి స్వర్గపురమునకు బయలుదేఱెను. మార్గమధ్యమున నారదుఁడు వచ్చి కలిసికొని, హిరణ్యకశిపుఁడు మృతిఁబొందలేదని చెప్పి, లీలావతి గర్భమునసున్న బాలుఁడు దేవతల నుక్కడంచు క్రూరుఁడుగాక శ్రీమన్నారాయణుని భక్తాగ్రేసరచక్రవర్తి యని యెఱింగించి, లీలావతిని విడిపించి తనయాశ్రమమునకుఁ గొనిపోయెను. అచ్చట నారదుఁడు లీలావతి కుపదేశించు నెపమున నామె

గర్భమునసున్న బాలునకు శ్రీమహావిష్ణుభక్తితత్త్వము నామూలాగ్రముగ నుపదేశించెను. బాలుఁ డంతయు నూకొట్టి యవగాహనము చేసికొనియెను.

అచట హిరణ్యకశిపుని తపోవహ్నికిఁ దాళఁజాలక సప్తకులపర్వతములతో భూమి గడగడ వడఁకెను. సప్తసముద్రములును గలఁగిపోయెను. గ్రహములతోఁ గూడ నక్షత్రములు చెదరిపోయెను. దిక్కులు మండిపోయెను. జంతువు లన్నియు గుండెబెదరువలన భయకంపితము లయ్యెను. దేవతలకు మీఁదిప్రాణములు మీఁది కెగిరిపోయెను. అంతకంతకు దేవేంద్రుని భీతి పెరిఁగిపోయెను. ఇఁకఁ జేయునదిలేక సురలెల్లరును బ్రహ్మదేవుని చెంతకుఁ బోయి, "దేవదేవా! దితికొమారుఁడగు హిరణ్యకశిపుని తపస్సువేఁడిమివలన మాడిపోవుచున్నాము. దైతేయతపోగ్నికీలావృతమైన స్వర్గపట్టణములో నిఁక నుండఁజాలము. సురజ్యేష్ఠా! మూఁడులోకములను జయించుటకును, దేవతల నెల్లరను భస్మముచేయుటకును, వేదశాస్త్రములను నాశనముచేయుటకును వాఁడు కోరుచున్నాఁడు. నీవలెనే తపోమహిమచే ననంతమహిమ సంపాదించి, యీవిశ్వమును తలక్రిందులుచేసి వేఱొకవిశ్వమును నిర్మింపఁగోరుచున్నాఁడు. వాణీనాథా! కారుణ్యనిధీ! మాప్రాణము లన్నియు నీయధీనమున నున్నవి. మమ్ము రక్షింపు మహాప్రభూ!" యని ప్రార్థించిరి.

తోడనే ప్రజాపతి దివిజుల కభయ మొసంగి, భృగుదక్షాదులతో మందర పర్వతమున కరిగి "అసురకులసార్వభౌమా! నీతపస్సునకు మెచ్చితిని. ఇట్టి తపస్సు చేసినవా రిదివఱ కెవ్వరును లేరు. పిపీలికాదికము మేదోమాంసరక్త చర్మములను భక్షించినను, గడ్డి వెదురుపొదలుగలపుట్టలోఁ బ్రాణములతో నిలిచి గాఢతపస్సుచేయుట నీకే తగును. నీసామర్థ్యమునకు నాహృదయ మానంద పూర్ణమైనది. వత్సా! కోరిన కోర్కులెల్ల నిచ్చెద వేఁడు" మని చెప్పి కమండలూదకమును ఆతనిపైఁ బ్రోక్షించెను. వెంటనే హిరణ్యకశిపుఁడు యథారూపముతో వల్మీకమునుండి వెలువడి విధాతకు మ్రొక్కి కరకమలములు ముకుళించి "చతురాననా! ఈసచరాచరప్రపంచమున కంతకు నీవే యాధారుఁడవు. రజస్సత్త్వతమోగుణసహితుఁడవై విశ్వమును సృజించి, పెంచి, తుదకు నాశనము చేసి యానందించెదవు. ప్రళయకాలమున జగ మంతయు నంధకారావృతమై యుండఁగా మందహాసచంద్రికలచేఁ బ్రకాశము గలిగించుపరంజ్యోతి వగు నిన్నుఁ గొనియాడ నేనెంతటివాఁడను? ఆదిమధ్యాంతరహితుఁడవైన నీతత్త్వ మవాఙ్మానసగోచరము. భక్తులకోరికలు తీర్చి రక్షించుటలో నీవంటివారు లేరు. అట్టి మహానుభావుఁడవు. నీవు కృపచేసి యభయ మిచ్చితివి గాన, నాకోరిక విన్నవించు చున్నాను.

శా. "గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలం ఘస్రములన్ దమఃప్రబలభూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువు లేనిజీవనము లోకాధీశ! యిప్పింపవే.', (భాగ. స్కం 7. ప. 19.)

మఱియు రణములయందు నెదురులేని శౌర్యమును, లోకపాలురను శాసించు మహిమయు, త్రిలోకవిజయమును గూడ దయచేయు" మని ప్రార్థించెను.

అప్పుడు బ్రహ్మ "కశ్యపకుమారా! ఈవరములన్నియు మిగుల దుర్లభములు. ఇట్టి ఘోరతపముచేసి యిట్టి గొప్పవరములు కోరినవారిదివఱకు లేరు. సంతోషముతో నీకోరిక లన్నియు నిచ్చితిని. బుద్ధిమంతుఁడవై సన్మార్గగామివై మంగళములు పడయు" మని దీవించి తన లోకమునకుఁ బోయెను.

వెంటనే హిరణ్యకశిపుఁడు విష్ణువుపైఁ గత్తిదూసెను. విద్యాధరాప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాదులను నానావిధములఁ బీడింపఁజొచ్చెను. స్వర్గపట్టణమును ముట్టడించి దేవేంద్రుని జయించి సుధర్మ నాక్రమించెను. ప్రకృతియంతయు సకలాభీష్టములను దీర్చుచు నాతనిని సేవింపసాగెను. ఇది చూచి యోర్వఁజాలకయు, వానివలని బాధలు సహింపలేకయు నిర్జరు లెల్లరు శ్రీమన్నారాయణునికడ కరిగి యనేకవిధముల వినుతించి ప్రసన్నునిఁ గావించుకొని "ఆర్తత్రాణ పరాయణా! హిరణ్యకశిపుని బారినుండి మమ్ము రక్షింపు" మని ప్రార్థించిరి. అంత జనార్దనుఁడు "అమరవరులారా! తొందరపడవలదు! బ్రహ్మయొసఁగిన వరములవలన గర్వించి వాఁడట్లు పోతరించియున్నాఁడు. వాని కాలము సమీపించుచున్నది.

ఆ. "శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు, గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ, డెన్నఁడలుగు నాఁడె హింసనొందు.

క. కన్నకొడుకు శమదమసం,పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా,పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్."

(భాగ. స్కంధ. 7. ప. 111. 112.)

అని యభయ మొసంగెను. విబుధు లాసమయమును నిరీక్షించుచుఁ దమతమ నిలయములకుఁ బోయిరి.

హిరణ్యకశిపునకు లీలావతీదేవియందు నలుగురు కుమారులు పుట్టిరి. వారిలో నొక్కని పేరు ప్రహ్లాదుఁడు. ఆతని చరిత్రము చాల విచిత్రము. అది యంతయుఁ జూచి, హిరణ్యకశిపుఁడు తులసీవనమున గంజాయి మొక్క మొలిచె నని వగవసాగెను. రాక్షసు లందఱును దెల్లవోయిరి.

రాక్షసేశ్వరుని కుమారుఁ డగు ప్రహ్లాదునకు హరిభక్తి యలవడెను. ఆతఁడు నారాయణా! యని పలుకుచు నిద్రనుండి లేచును. శ్రీహరీ! యని పలుకుచు

నిద్రించును. వాసుదేవా! లక్ష్మీపతీ! యని కలవరించును. ఆటలయందు, పాటలయందు, సంతోషసమయమున, విచారకాలమున—కేశవా, దామోదరా, భక్తత్రాణపరాయణా యని శ్రీవిష్ణువును కీర్తించును. కేశవార్పణ మనకుండఁ బాలుద్రావి యెఱుఁగఁడు. అతనికి మాటలు సరిగ రానపుడు హిరణ్యకశిపుఁ డేమో పలుకఁబోవుచుండె నని యానందించుచుండెడివాఁడు; గాని నారాయణా యని స్పష్టముగ నుచ్చరింపఁజాలినది మొదల దేపనిగ విచారములు సేయసాగెను. ఎన్నివిధముల యోచించినను హిరణ్యకశిపునకుఁ గుమారుని హరిభక్తికిఁ గారణములు తోఁపవయ్యెను. ఎన్ని మార్గములఁ బ్రయత్నించినను ప్రహ్లాదుఁడు హరిసంకీర్తనము మానఁ డయ్యెను.

హిరణ్యకశిపుఁడు "విష్ణువు మంచివాఁడు గాఁడు; పాపాత్ముఁడు. వానినిఁ దలంపఁగూడదు తండ్రీ!" యని పసిబిడ్డ యగు ప్రహ్లాదుని లాలించి చెప్పెను. ప్రహ్లాదుఁడు కొంచెము పెద్దవాఁడైనతరువాత "హరి మన కులమునకు గర్భశత్రువు. వానినిఁ దలపెట్టకుము నాయనా!" యని బోధించి చెప్పెను. పిదప "నారాయణుని స్మరించుట మానితివేని రత్నాభరణాదు లనేకము లిచ్చెద" నని యాశ చూపెను. పిమ్మట "దామోదరుని మఱచిపోవేని నిన్ను నేను విడిచి పెట్టెదను. మీయమ్మదగ్గఱకుఁ బోనీయ" నని చెప్పెను. తరువాత "మాధవుని యూసు తెచ్చెద వేని నిన్ను నఱకివేసెద" నని చెప్పెను; గాని ప్రహ్లాదునియెడలఁ జతురుపాయములును గూడ వ్యర్థము లయ్యెను. ఆతని కెవ్వరును బోధింపఁజాలక పోయిరి.

తండ్రి వలననిన కొలఁదిని ప్రహ్లాదుని హరిభక్తి పెరిఁగిపోయెను. ఒకదినముకంటె నొకదిన మాతఁడు విష్ణుచింతనమువలన ప్రపంచమును మఱచిపోసాగెను. ఆకసముఁ జూచి శ్రీహరీ యని పిలుచును. క్రిందఁజూచి పద్మనాభా యని కీర్తించును. ఎదుటఁజూచి హృషీకేశా యని కౌఁగిలించుకొనును. కన్నులు మూసికొని పురుషోత్తమా యని భజనసేయును. చూచుచుండఁగనే శ్రీపతీ, ఆర్తత్రాణపరాయణా, మధుసూదనా యని నృత్యము చేయును.

సీ. "శ్రీవల్లభుఁడు తన్ను జేరినయట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు—
నసురారి తనమ్రోల నాడినయట్లైన నసురబాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు
తే. హరిపదాంభోజయుగచింతనామృతమున, నంతరంగంబు నిండినట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి, జడత లేకయుఁ నుండును జడునిభంగి.
సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట

**విష్ణుఁ డింతియగాని వేఱొండు లేదని యొత్తిలి నగుచుండు నొక్కచోట**
**నలినాక్షుఁ డనునిధానము గంటి నేనని యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ**
**ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్ష జనితబాష్పసలిల**
**మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు,"**

**(భాగ. స్కం. 7. ప. 122-124)**

హిరణ్యకశిపుఁడు క్రమక్రమముగ మిన్నంటఁ బెరిఁగిపోవుచున్న కుమారుని హరిభక్తిఁ జూచి "నిర్వ్యాపారత వీని వెఱ్ఱినిఁ బెంచివేయుచున్నది. ఊపిరి తిరుగని పనిలోఁ బ్రవేశపెట్టినచో వీఁ డిది యంతయు మఱచి పోవును. బాల్యమునందే దీనికిఁ దగునుపాయము చూడకున్నఁ బిదప నపాయము సంభవించును. వీనికిఁ దెలివితేటల కేమియు లోపములేదు. తెలివిగల బాలునహృదయమును జదువుకంటె మఱేదియుఁ బూర్తిగ వశముచేసికొనఁ జాలదు; గాన వీనికి విద్యాభ్యాసముఁ గావించెద" నని తలంచి కులగురువు లగు శుక్రాచార్యుని కుమారులను చండుఁడు అమర్కుఁడు అను పేరుగలవారిని రప్పించి "మీరు మాకు గురువులు. మీతండ్రిగారియెడల మాభక్తి యచంచలము. మాకు మీయెడలఁ గూడ నట్టిభక్తియే కలదు. మీకు మాపైఁ గల యనుగ్రహము విశ్వవిదితము. మాయభ్యుదయమే తపఃఫలముగా భావించియున్న మీఋణమును మేము తీర్చుకొనఁ జాలము. మేము మీతండ్రిగారి పాదములను గొలిచి విజ్ఞానమును బడసితిమి. మాకుమారకుఁడు ప్రహ్లాదుఁ డిప్పుడు విద్యాభ్యాసమునకుఁ దగియున్నాఁడు. వానినిఁ గొనిపోయి విజ్ఞానభిక్షఁ బ్రసాదింపుఁడు. ఏకారణమువలననో, యతనికి దైత్యవిరోధి యగు హరియెడల భక్తి కుదిరినది. దానిని మీరు సమూలముగఁ బెఱికివేయవలెను. దానితోఁగూడ నాహృదయమున నాటుకొనిన చింతాశల్యమును మీరే పెఱికివేయవలెను. మాయర్థము లన్నియు మీవి. మాప్రాణములు మీచేతి లీలాకుసుమములు" అని చెప్పి వారికిఁ బ్రహ్లాదు నప్పగించెను.

చండామర్కులు మహానందముతోఁ బ్రహ్లాదునిఁ బాఠశాలకుఁ గొనిపోయి ఆతనితో సమానవయస్కులును, బుద్ధిగలవారు నగు మఱికొందఱు రాక్షసబాలురను జేర్చుకొని, చాల శ్రద్ధతో విద్య చెప్పసాగిరి. ప్రహ్లాదుఁ డొక అక్షరమైనఁ దప్పకుండ గురువులు చెప్పిన దంతయుఁ జదివెను. ఈప్రపంచమంతయుఁ గేవలము మిథ్య యని నమ్మియుండుటవలన, గురువు లేది యెట్లుచెప్పిన నట్లట్లనేక వల్లించెను.

పిదపఁ గొన్నిదినములకు హిరణ్యకశిపునకుఁ గుమారుని విద్యాభ్యాసక్రమమును బరీక్షింపవలయు నని తలంపు గలిగెను. లీలావతి గూడ "నేను బిడ్డనిఁ జూచి చాల దినము లైనవి. వానినిఁ జూడక నాకన్నులు కాయలుకాచిపోయినవి.

ఒక్కమాటు చెప్పింపు" మని కోరెను. తోడనే యసురేశ్వరుఁడు ప్రహ్లాదుని గొనిరావలసిన దని చండామర్కులకు వర్తమానము చేసెను.

మహానందముతోఁ జండామర్కులు ప్రహ్లాదుని వెంటనిడుకొని రాజభవనము సొచ్చిరి. అల్లంతదూరమునందే చూచి ప్రహ్లాదుఁడు తల్లి చెంతకుఁ బరువెత్తి పోయెను. ప్రియమారఁ బుత్రుని నుత్సంగంబునఁ జేర్చి ముద్దులుగొని, లీలావతి పిదప భర్త కిచ్చెను. హిరణ్యకశిపుఁడు గూడఁ బ్రహ్లాదుని మిగుల నానందముతో ముద్దులుగొని కుశలప్రశ్నలయిన తరువాత "చిట్టితండ్రీ! అక్కడఁ దోడిబాలురతోఁ గలిసి నీవు గురువులు చెప్పిన దంతయు శ్రద్ధగాఁ జదువుచున్నావుగదా? గురువులు సులభముగా బోధయగున ట్లుపదేశించుచున్నారుగదా! విద్య మఱచి పోవుచుండుట లేదుకదా? వేదశాస్త్రములు వల్లించుచుంటివిగదా?" యని ప్రశ్నించెను. ఇది విని చండామర్కులు ప్రహ్లాదకుమారుఁ డేమిచెప్పునోయని వినుటకు నిరీక్షించుచుండిరి. అప్పుడు బాలుఁడు "గురువుగారు చెప్పినదంతయుఁ జదివితిని. అందలి సారముఁగూడ గ్రహించితి" నని చెప్పెను. హిరణ్యకశిపుఁ డీమాటల కెంతో యానందించి "తండ్రీ! ఎంతవాఁడవైతివి? ఆసార మేమి చెప్పుము నాయనా?" యని మఱల నడిగెను. "తండ్రీ! గాంధాంధకారపూరిత మగు సంసారకూపమునఁ గూలక, నేను నీవు అను భేదభావమును జేరనీయక, సర్వము నాతనికళయే యని విష్ణునియందు హృదయమును జేర్చి యెల్లరు నడవి నుండుట మే" లని ప్రహ్లాదుఁడు చెప్పెను. ఇదివిని హిరణ్యకశిపుఁ డులికిపడెను. లీలావతి యేమి కొంప మునుఁగునో యని యదరిపడెను. ఇదియేమి వింత యని చండామర్కులు విన్నఁబోయిరి. అప్పుడు పొంగిపొరలివచ్చు కోపమును దిగమ్రింగుకొని హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని బుజ్జగించి, లాలించి "తండ్రీ! సహజముగ నీకిది తోఁచెనా? గురువులు గాని యితరులుగాని బోధించిరా? ఎవ్వరైన జెప్పుచుండఁగా విని యిదే మంచి దనుకొంటివా! మనజాతికి నీవుచెప్పిన విష్ణువు గర్భశత్రువు. వానిని మనము తలఁచుకొనుట గూడఁ దగదు. చిట్టిబాబూ! మనపని యేమో తెలియునా? సురలను బాఱఁదోలవలెను. దేవేంద్రాదులను స్రుక్కింపవలెను. సిద్ధులను వేధింపవలెను. మునీశ్వరులను బాధింపవలెను. యక్షకిన్నరగంధర్వవిహంగనాగాదులను నాశనము చేయవలెను. ఈతీరున విష్ణుపక్షమువారి నందఱను ద్రిప్పి త్రిప్పి కొట్టవలెను; గాని నీ కీవెఱ్ఱి యేల?" అని పలికెను.

ఈమాటలు వినుటవలనఁ బ్రహ్లాదునకుఁ జిఱునవ్వువచ్చెను. అప్పు డాతఁడు తండ్రినిఁ జూచి "ఎంతవెఱ్ఱి! కొందఱు జ్ఞానరహితులు 'నేను, నీవు' అను మాయలోఁ గూలి, సర్వప్రపంచమున వ్యాపించియున్న శ్రీమన్నారాయణునిఁ దెలిసికొనఁ

జాలరు. వేదవేదాంగవిదులైనవారు శ్రీహరినిఁదక్క నితరముం జూతురా? సూదంటురాయివలన నిను మెట్లు ఆకర్షింపఁబడునో, యావిధమున హృషీకేశుని వలన నాహృదయ మాకర్షింపఁబడుచున్నది. నాయనా! ఇది యొకరు నేర్పిన వచ్చునా?

సీ. "మందారమకరందమాధుర్యమునఁ దేలుమధుపంబు పోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగురాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కుకోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదరదివ్యపాదారవింద, చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు, వినుతగుణశీల మాటలు వేయునేల?"

(భాగ స్కంధ. 7. ప. 150.)

ప్రహ్లాదునిపైఁ జండామర్కులకుఁ జాలఁ గోపము వచ్చెను. "అయిదేండ్ల బాలుఁడవు. రవంతలేవు. మాటిమాటికి నెదురువాదములు చేసెదవు. మేము కష్టించి చెప్పిన దించుకయు నిచ్చటఁ జెప్పవు. రాక్షససార్వభౌమునియెదుట మాకుఁ దలవంపులు ఘటించితివి. మా ప్రభువునకు నీవు శత్రుఁడవు గాని, పుత్రుఁడవుగావు. చందనవనముఁ బోలురాక్షసకులమునఁ దుమ్మచెట్టువలెఁ బుట్టితివి. ఎప్పుడు రాక్షసుల శత్రువునే కీర్తించెదవు. నీకేమి పోఁగాలము వచ్చినది? ఇఁక నీవు మంచిమాటలకు లొంగవు. దనుజచక్రవర్తీ! ఇప్పటి కిట్లయ్యె నని నీవు మాపైఁ గోపింపకుము. కోపించియో, దండించియో యెట్లో నీకుమారునివెత్తి కుదిర్చి మంచిమార్గమునఁ బ్రవేశపెట్టుదుము. ఇప్పటికి సెలవిమ్ము" అని చండామర్కులు హిరణ్యకశిపు నొప్పించి, యాతని సెలవుఁబడసి, ప్రహ్లాదునిఁ దోడ్కొని వెడలి పోయిరి.

మఱలఁ గొన్నిదినములు విద్యాభ్యాసము జరిగెను. చండామర్కులకుఁ బ్రహ్లాదుని మతి తిరిగిపోయిన దని తోఁచెను. వారు మొదట నీసంగతి లీలావతితోఁ జెప్పిరి. ఆమె యందులకు మిగుల నానందించి, కుమారుని ముందుగఁ దనచెంతకు రప్పించుకొని చక్కఁగ నలంకరించి "నాచిట్టితండ్రీ! నీతండ్రికిఁ గోపమువచ్చు పనులు చేయకుము. నీతండ్రి త్రిలోకములను జయించెను. దేవత లెల్లరు నాతని పదసేవఁ జేయుచున్నారు. అంతవానికి నీవు తీరని చింత గలిగింపవచ్చునా? తండ్రికిని గొడుకు నకును సయోగ్యదె లేదని వైరులు లోకువసేయరా? నాకూనా! ఇఁక నీతండ్రియెదుట శ్రీహరిపేరు నీనోట వెలువడనీయకు" మని బోధించి తండ్రిచెంతకుఁ గొనిపోయెను. లీలావతి యుపదేశమైనపిదప "కుమారా! మేము చెప్పినది మఱచిపోకుము. మా

మతమునకు విఘాతము గలిగింపకుము. నీతండ్రియెదుట మనవిరోధిపేరెత్తకుము." అని చండామర్కులు గూడ బోధించిరి. ప్రహ్లాదుఁ డన్నియు వినియెను.

ఎల్లరును సభాస్థలమునకు బయలుదేఱిరి. హిరణ్యకశిపుఁడు మహావైభవముతోఁ గొలువుదీఱియుండెను. చండామర్కులు.—

సీ. 'అసురగర్భునకు మాధవానుచింతనసుధామాధుర్యమున మేను మఱచువాని
అంభోజగర్భాదు లభ్యసింపఁగలేని హరిభక్తి ప్రభావమైనవాని
మాతృగర్భమునొచ్చి మన్నది మొదలుగాఁ జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిలప్రపంచంబు శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని
తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్షణాదిగుణముల కాటపట్టయినవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జేరి గురుఁడు, ముందఱికిఁ ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు."

(భాగ. స్కం. 7. ప. 160.)

మని ప్రహ్లాదున కాజ్ఞాపించి "దానవసార్వభౌమా! ప్రహ్లాదునకు బుద్ధిగఱపితిమి. నెట్టి కుదిరినది. రాక్షసనీతిశాస్త్రమునఁ జక్కనిపాండిత్యము గలిగినది. చిత్తగింపు" మని చెప్పిరి.

తోడనే హిరణ్యకశిపుఁడు మహానందముతోఁ గుమారునిఁ జేరఁదీసి గాఢాలింగనముచేసికొని తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని "కుమారా! గురువులు చెప్పినదంతయు నీవు శ్రద్ధతోఁ జదువుచున్నావా? నీతెలివితేటలు చూచి యానందింప మనసువాడమినది. ఏదే నొకపద్యముచదివి అర్థముతోఁగూడఁ దాత్పర్యము చెప్పుము. నీ వెప్పుడు నీతివిదుఁడ వౌదువో, నాకెప్పుడు చేదోడువాదోడయ్యెదవో యని నిరీక్షించుచున్నాను" అని ముద్దుగొని యడిగెను. ప్రహ్లాదుఁడు వినయముతో నిట్లు చెప్పెను. "తండ్రీ! గురువుగారు ప్రేమతోఁ జెప్పినదంతయు శ్రద్ధతోఁ గూడఁ జదివితిని; నే నన్ని శాస్త్రములును, చదువులయందలిసారమంతయు గ్రహించితిని. నోరు బద్దలగున ట్లీశాస్త్రము లన్నియు నెంతచదివినను బ్రయోజనమేమి? సఖ్యము, శ్రవణము, దాస్యము, వందనము, పూజ, సేవ, ఆత్మజ్ఞానము, సంకీర్తనము, చింతనము ననుతొమ్మిది భక్తిమార్గములవలనను సర్వవ్యాపకుఁడగు శ్రీహరిని నమ్మియుండుటయే శ్రేయస్కరము. గ్రుడ్డివానికిఁ జంద్రోదయ మగుటయు, మహాబధిరునియెదుట శంఖధ్వనిచేయుటయు, మూగవానియెదుట సద్గ్రంథములను జెప్పుటయుఁ, గృతఘ్నులతోఁ జుట్టఱికము చేయుటయు, బూడిదలో హోమము చేయుటయు మున్నగునవి యెట్లు నిష్ప్రయోజనములో, హరిభక్తిలేని సంసారిజీవితము గూడ నట్లే నిరర్థకము. కన్నతండ్రీ!

సీ. "కమలాక్షు నర్చించుకరములు కరములు శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కుశిరము శిరము

విష్ణు సాకర్ణించువీనులు వీనులు మధువైరిఁ దవిలినమనము మనము
భగవంతు వలగొనుపదములు పదములు పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించుదినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు, తండ్రి హరిఁజేరుమనియెడితండ్రి తండ్రి.

సీ. కంజాక్షునకుఁ గానికాయంబు కాయమే పవనగుంఫితచర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడనివక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖనిర్మితదర్విగాక
కమలేశుఁ జూడనికన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములుగాక

ఆ. చక్రిచింత లేనిజన్మంబు జన్మమే, తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తి లేనివిబుధుండు విబుధుఁడే, పాదయుగముతోడి పశువుగాక.

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనములేక
తాపత్రయాభీలదావాగ్ని లాఱునే విష్ణుసేవామృతవృష్టిలేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్నిలేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభలులేక

తే. నిరుపమాపునరావృత్తినిష్కళంక, ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గికోదండచింతనాంజనములేక, తామరసగర్భునకునైన దానవేంద్ర."

(భాగ. స్కంధ. 7. ప. 169 - 170 - 171.)

ఇదంతయు విని దానవేశ్వరుఁడు చండామర్కులపైఁ జాలఁ గోపించి "ఇది యంతయు మీరే చేసితిరి. నీతిపారగునిఁ జేసెద మనిచెప్పి నాకుమారునకు విరోధిపక్షపాతము గలిగించితిరి. మీరిట్లు చేయుదురని కలనైనఁ దలఁపలేదు. నమ్మినవానిని బాగుగనే చేసితిరి. మీవంటి వంచకులను నమ్మినవారిగతి యిట్టిదే యగును. ఛీ! మీరు బ్రాహ్మణులని తలంచితిని. చండాలురని యూహింపలేనైతి" నని మండిపడెను. హిరణ్యకశిపునిఁ జూచి చండామర్కులు చాల భయపడిరి. లేనిపోని నిందవచ్చె నని వా రనేకవిధములఁ జింతించి, చింతించి "దానవసార్వభౌమా! మావలన నేమియు నపరాధములు జరుగలేదు. విష్ణుభక్తిని మేము బోధింపలేదు. అది బోధింపవలసినంత యావశ్యకము మాకేమి వచ్చినది? పరులుగూడ నీవిషయమున నేమియు నెఱుఁగరు. ఇది కేవలము నీకుమారుని సంకుచితచిత్తమునఁ బొడచూపినది. నీవు తొందరపడినఁ బ్రయోజనము లేదు. బాగుగ యోచింపుము. మేము మిత్త్రులము పురోహితులము. నీకరుణకుఁ బాత్త్రులము. నీయాజ్ఞకు బద్ధులము. నీయభ్యుదయము నాశించియున్నవారము. మమ్మిట్లు శత్త్రువులవలె నగౌరవపఱచుట నీకుఁ దగునా?" యని చెప్పిరి. హిరణ్యకశిపుఁడు "నీ కీదుర్బుద్ధి యెవరు గఱపి"రని కుమారుని గద్దించి యడిగెను. ప్రహ్లాదుఁడు మఱల నుపన్యాసము ప్రారం

ఖించెను. "తండ్రీ! నీవు మాయుపాధ్యాయులపైఁ గోపింపనేల? వారియందేలో పమును లేదు. సంసారమను నంధకారబంధుర మగు పాడునూతిలోఁ బడి, దారి తెన్నులు తెలియక మరల మరలఁ బుట్టుచుఁ జచ్చుచు నుండువారికిఁ బరులు చెప్పినను, సొంతముగనైనను అడవులకుఁ బోయి తపముండినను హరిభక్తి కలుగునా? అది సహజముగఁ బుట్టుకతోడనే కలుగవలెను. సర్వశాస్త్రములును శోధించితినిగాని, మాధవస్మరణమునఁగాక యీసంసారసాగరమును దాఁటుట తరమా?" అని చెప్పుచున్న ప్రహ్లాదునిఁ జటాలునఁ గ్రిందికి గెంటివేసి హిరణ్యకశిపుఁడు కటము లదుర నాజ్ఞలకై వేచియున్న భటులంజూచి, "చూడఁగా నైదేండ్లు పూర్తిగా లేవు. సకలభువనములను విలాసమాత్రమున నిర్జించిన నన్ను లెక్కసేయక నాయెదుట నాగర్భవైరిని బొగడుచున్నాఁడు. ఎన్నివిధములఁ జెప్పినను మానఁడు. నాశరీరమునఁ బుత్రరూపమైన వ్యాధి పుట్టెను. ఓభటులారా! వీనిని వధించిరండు. వీఁడు వధ్యుఁడు. శరీరమునఁ జెడిపోయిన భాగమును ఖండించి వైద్యుఁడు తక్కిన భాగములను రక్షించున ట్లీదురాత్ముని సంహరించివేసి, వినిర్మలమగు రాక్షసకులమును రక్షించెదను. ఇఁకఁ జూడక వీనిం గొనిపొండు" అని యాజ్ఞాపించెను.

తోడనే రాక్షసభటులు కెవ్వునఁ గేకలువేయుచుఁ బ్రహ్లాదునిఁ బట్టుకొని శూలములతోఁ బొడిచియు, గదలతో మొత్తియు, ఖడ్గములతో నఱకియు, పిడికిళులతో గ్రుద్దియుఁ, గాళ్లతోఁ దన్నియు, ఏనుఁగులచేఁ ద్రొక్కించియు, నగ్నిగుండములలో విసరియు, నాగుబాములచేఁ గఱపించియు, విషము తినిపించియు, సముద్రములో గడియలకొలఁది ముంచియుంచియు, ఎండలనెండించియు, వానలఁదడిపించియు, నవరంధ్రములు బిగించియు, భూవివరమునఁ బాతిపెట్టియు, అన్నోదకంబుల నీయకయుఁ, గశాఘాతములకు లోఁబఱిచియు, రాళ్లతో రువ్వియు, శరీరము ఛిన్నవోవునట్లు శరవర్షముఁ గురిసియు, నింక నిట్లనేకవిధముల బాధించిరి. కాని ప్రహ్లాదుఁడు వీని నేమియు లెక్కసేయలేదు. రాక్షసులు బాధించిన కొలఁది నాతఁడు విష్ణుస్మరణ యధికముగఁ జేయసాగెను. ప్రహ్లాదుఁడు భటులు పెట్టు బాధలకు సహింపఁజాలక తల్లిచెంతకుఁ బాఱిపోవుననియు, బంధువులను శరణుఁజొచ్చుననియు, తండ్రీ! రక్షింపుమని తన్ను బతిమాలు ననియు హిరణ్యకశిపుఁడు తలంచెను; గాని యందులకు వ్యతిరేకము జరిగెను. ప్రహ్లాదుఁడు హరిస్మరణ మానలేదు. రాక్షసులు కొట్టుచున్నను ఆతఁడు తన్ను గాన ట్లూరకుండెను. ఇదియంతయుఁ జూచి హిరణ్యకశిపుఁడు తన కుమారునియం దేదోమహాప్రభావ మున్నదని తలఁచెను; గాని యంతలోఁ బటుతరక్రోధమువలన నాతని కా జ్ఞానము నశించిపోయెను. ఆతఁ డీవిపత్తును దాఁటుటయెట్లని చింతించుచుండఁగా, మెల్లఁగఁ జేరి చండామర్కులు

'దనుజసార్వభౌమా! విచారము వలదు. శుక్రాచార్యులవారిని రానిమ్ము. వారే బుద్ధిహీనుని మంచిమార్గమునకుఁ ద్రిప్పఁగల" రని చెప్పిరి. ఇది బాగుగనున్నదని హిరణ్యకశిపుఁడు శుక్రాచార్యుని రప్పించి, సంగతి సందర్భము లన్నియుఁ జెప్పి ప్రహ్లాదు నప్పగించి "మహాత్మా! నావిచారమును బోఁద్రోలవే?' యని ప్రార్థించెను.

శుక్రాచార్యుఁడు ప్రహ్లాదునకు రాక్షసోచితవిద్య లన్నియుఁ జెప్పెను. ఒకనాఁ డాతఁడు అనుష్ఠానసమయమునఁ బాఠశాలను విడిచిపోఁగాఁ, బ్రహ్లాదుఁడు తోడిరాక్షసబాలురను జేరఁ బిలిచి "మనకు గురువుగారు చెప్పుచున్న చదువంతయుఁ గేవలము నసందర్భము. దాని కర్థములేదు. దానివలనఁ బ్రయోజనములేదు. అది కష్టములను దప్పించుటకు మాఱుగ దుఃఖములను దెచ్చి పెట్టును. జన్మరాహిత్య మును గలిగించి మోక్షమును జేకూర్చుటకు మాఱుగ దుఃఖములను బోధించి, నరక మునఁ గూలద్రోసి దుర్జన్మపరంపరపాలుచేసి నాశనముచేయును. కావున మనకది వలదు. నేను మీకు కేవలము మోక్షమును గూర్చెదను రం" డని చెప్పి హరి భక్తిని బోధించెను. అది యాబాలురమనస్సులను బాగుగ నాటెను. తోడనే వారు శుక్రాచార్యుఁ డుపదేశించినవిద్యను మానివేసి, హరిభజనము ప్రారంభించిరి. భోజ నముచేసి శుక్రాచార్యుఁడు వచ్చినను వా రాహరిభజనము మానలేదు. అది చూచి యాచార్యుఁడు చాలఁ గోపించి ప్రహ్లాదుని మిగుల నిందించి "దానవసార్వభౌమా! నీకుమారకుఁడు చాల దుడుకుఁదనపుఁబనులు సేయుచున్నాఁడు. తాను చెడుటయేఁ గాక హరిభక్తిని జెప్పి తోడిరాక్షసబాలకులను గూడఁ జెఱుపుచున్నాఁడు. త్రిలోక ములను జయించిన తేజశ్శాలివి. ఇట్టి వెఱ్ఱివానినిఁ గుమారునిగా నెట్లు కంటి" వని హిరణ్యకశిపునితోఁ జెప్పెను.

ఈమాట వినుటవలన హిరణ్యకశిపునకుఁ జాల నభిమానము వచ్చెను. కుమా రునిపైఁ జాల కోపము గూడ వచ్చెను. అంత నాతఁడు తనప్రతాపమంతయుఁ జెప్పి "నేను సకలదిక్కులను గెలిచితిని. అందఱును నేనే దిక్కని నన్ను గొలుచు చున్నారు. నీవు శ్రీహరి గీహరియందువు. నేను దండెత్తి పోయిననాఁడు వాఁడెం దును గానఁబడఁ డయ్యె. ఇఁక నెవ్వనిబలము చూచుకొని నీవు నాకెదు రాడెద" వని కుమారు నదలించి యడిగెను. ప్రహ్లాదున కీహుంకారములవలన భీతి లేశమును గలుగలేదు. ఆతఁడు యథాప్రకారముగనే నిలిచి

"క. బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును, బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా.

క. దిక్కులుఁ గాలముతో నేదిక్కును లేకుండుఁ గలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేనివారికి, దిక్కయ్యెడువాఁడు నాకు దిక్కు మహాత్మా."

(భాగ. స్కం. 7. ప. 264-265.)

అని ప్రత్యుత్తర మిచ్చి యంతటితో నూరకుండక "తండ్రీ ! త్రిగుణాత్మకుం డైన యీశ్వరుఁడు వినోదమున సకలప్రపంచమును సృష్టించి, రక్షించి, తుదకు సంహరించును. అవ్యయుం డగు శ్రీహరి యన్నిటనుఁ గలఁడు. చిత్తము నపసవ్యమార్గము నుండి మరలింపుము. చిత్తముకంటె శత్రువులు లేరు. చిత్తమును స్వాధీనముచేసి కొనుము. త్రిభువనములను విలాసమాత్రమున జయించితి నని చెప్పెదవు; గాని చిత్తమునకును ఇంద్రియములకును లోఁబడిపోయితివి. ఆయాభ్యంతరశత్రువులను గూడ జయించితివేని, నీవు విజయుఁడ వయ్యెదవు. సంసారసాగరముమీఁది మమతను విసర్జింపుము. హరిభక్తిని హృదయమునఁ బ్రతిష్ఠించుకొనుము" అని యుపన్యాసము గూడఁ గావించెను.

ఈయుపన్యాసమువలన హిరణ్యకశిపునకు మండుచున్న యగ్నిహోత్రమున నేయివోసిన ట్లయ్యెను. అంత నాతఁడు ప్రళయాగ్నివలె మండిపడుచు "ఎవఁడో శ్రీహరి యున్నాఁడని నాతో వాదించెదవు. నేనే జగత్తున కంతకును నాథుఁడను. నీవు చెప్పుచున్న నారాయణుఁ డెక్కడ నున్నాఁడు ? ఏరూపమున నేమి చేయు చుండును ? నిముసములో వానినిఁ బరిమార్చెద నిదే చూపు" మని యఱచెను.

శ్రీహరినిఁ జూపు మనుటవలనఁ బ్రహ్లాదునకు బ్రహ్మానందము గలిగెను. చూడఁగలవారికి హరి యంతటను గలఁడు. చూడలేనివాని శరీరములందె యుండి, మాయావరణమును గల్పించుచున్నాఁడు. శ్రీహరి యిచ్చట నున్నాఁడని స్థలనిర్దేశము చేయుట యెట్లు ? ప్రహ్లాదుఁడు నృత్యము నేయుచు

"మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
కలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాదులం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దన్నిటన్
గలఁ డీశుండు కలండు తండ్రి వెదకంగా నేల యీయాయెడన్.

క. ఇందుఁగలఁ డందు లేఁ డని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన, నందందే గలఁడు దానవాగ్రణి వింటే."

(భాగ. స్కంధ 7. ప. 274-275.)

అని చెప్పెను. హిరణ్యకశిపుని కోపమును జల్లార్చుమాట లేమియుఁ బ్రహ్లాదుని ప్రత్యుత్తరమున లేవు. అంతయుఁ గ్రోధప్రజ్వలనకారణమే యయ్యెను. తోడనే యాతఁడు "అంతట నుండు హరి నీస్తంభమునఁ జూపు" మని గద్దించి పలికెను. ప్రహ్లాదుఁడు "శ్రీహరి స్తంభములోనుండుట వింత లే" దనియెను. కోపము నాపు కొనఁజాలక హిరణ్యకశిపుఁడు స్తంభముమీఁద నఱచేతఁ జఱచెను. ఇక నేమి యున్నది ? ఫెళఫెళారావముతో స్తంభము పగిలిపోయెను. అందులకుఁ గారణము

తనబాహుబలమే యని రాక్షసేశ్వరుఁడు భావించుచుండు నంతలో, దానినుండి క్రోధాగ్నికీలాభీషణుం డగుశ్రీమన్నారాయణుని నరసింహరూపము ప్రత్యక్ష మయ్యెను. దానవవీరుని నాడులు చల్లఁబడెను.

ఈయద్భుతసంభవమువలన నాతనికి భీతిఁ గలిగెను; గాని యంతలోనే ధైర్యప్రసారము గలిగెను. "వెఱపన నెట్టిది? త్రిలోకములను జయించిన నాకీ వికారజంతువును మడియించు టెంత" యని యాతనికి గర్వము తోఁచెను; గాని కాలత్రయమందును గూడ దానిసంభవమును గుఱించి యూహించుట కవకాశము లేని వికారజంతువు తన్ను రూపుమాపుటకై యవతరించె ననుజ్ఞానమున కాతని హృదయమున స్థలము లేదయ్యెను. ఆవికారజంతువు భగభగ మండుచున్న అగ్నిహోత్రమనియుఁ, దాను ఫలభ్రాంతిచే దానిమీఁదఁ బడుచున్న శలభమనియుఁ గూడ నాతనికిఁ దోఁచదయ్యెను. తోడనే యాతఁడు గదాదండమును గిరగిరం ద్రిప్పుకొనుచు నరహరిపైఁ బడెను. నరసింహమూర్తికిఁ గ్రోధభీకరమైయున్న ముఖమునఁ జిఱునవ్వు గూడఁ గలిగెను. అంత నాశ్రీహరి కేవలపురుషరూపంబును మృగరూపంబును గాని నరసింహరూపమున, రేయును బవలును గాని సంధ్యా సమయమున, నంతరంగంబును బహిరంగంబునుగాని సభాద్వారంబున, గగనంబును భూమియునుంగాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితంబులును గాని నఖంబులఁ ద్రైలోక్యజనహృదయభల్లుండయిన దనుజమల్లుని విలాసమాత్రమునఁ బొట్టచీల్చి సంహరించి, ప్రేవులు పూలమాలికలవలెఁ గంఠమున ధరించెను. ఇది చూచి యాసభాభవనమునఁ గల రాక్షసవీరులెల్లరును ఖడ్గములు దూసి శ్రీహరిపై నుఱుకుట కుంకించుచుండిరి. తోడనే శ్రీమన్నారాయణుఁడు చక్రముచేఁ గొందఱను, గదచేఁ గొందఱను ఖడ్గముచేఁ గొందఱను చొప్పున వారి నందఱను సంహరించివేసి సింహాసన మధిష్ఠించెను; కాని యాతని ముఖమునఁ దాండవము చేయుచున్న క్రోధము తిరోహితము కాదయ్యెను. అట్లగుటఁ బ్రహ్మాదులెల్లరును నాతనిఁ జేరవెఱచి, ప్రక్కల నొదిగి తుదకు బ్రహ్లాదునిఁ జూచి "మహాత్మా! నీప్రార్థనమువలన శ్రీహరి యీరూపమును వహించె; నీవు కోరినఁ గాని యాతఁ డాభీషణరూపమును త్యజింపఁ" డని ప్రార్థించిరి. అంత నాతఁడు సమస్తదేవతలును దుదకు లక్ష్మీదేవియుఁ గూడ శ్రీహరినిఁ జేర వెఱచుచుండుటఁ గాంచి, ధైర్యముతోఁ గరకమలములు ముకుళించి, మందగమనంబున శ్రీహరిని సమీపించి, భయభక్తితాత్పర్యములతో సాష్టాంగదండప్రణామము గావించెను.

తోడనే శ్రీహరికోపము చల్లారెను. అంత నాతఁడు బ్రహ్లాదునిఁ బ్రేమతో లేవనెత్తి ప్రియమారా శిరమునఁ జేయిడి బుజ్జగించెను. ప్రహ్లాదుఁ డీతీరున శ్రీమ

న్నారాయణుని స్తుతింపఁజొచ్చెను. "శ్రీహరీ! అమరులు, విద్యాధరాదులు, మునీశ్వరులు, ప్రహ్లాదులును గూడ నీగుణకీర్తనమును సరిగఁ జేయఁజాలరు. అట్టిచో రాక్షసుఁడను, బాలుఁడను, జడుఁడను అయిన నే నెట్లు నిన్ను గీర్తింపఁగలను? జపతపములు, యజ్ఞయాగాదికర్మలు, వేదాధ్యయనాదులు, నియమములు, నిష్ఠలు భక్తివలె నీకానందమును గలిగింపఁజాలవు. జ్ఞానము, దానము, ధర్మము, సత్యము, నిర్మత్సరత్వము, యజ్ఞము, తపస్సు మున్నగువానివలన మోక్షయోగ్యుఁడ నని గర్వించు బ్రాహ్మణునికంటె సఖ్యశ్రవణాదికములచే భక్తిబంధురుఁ డగు శ్వపచుఁడే ముందుగ నీయనుగ్రహమునకుఁ బాత్రుఁ డగును. ఈసంసారమును జూచుటవలన గలుగునంతటి భయము నీయుగ్రనరసింహాకృతినిఁ జూచినఁ గలుగుటలేదు. శ్రీమన్నారాయణమూర్తీ! నాయెడలఁ గృపాళుఁడవై నన్ను రక్షింపుము. మహేశ్వరునకును, బ్రహ్మదేవునకును పుడకు లక్ష్మీదేవికినిఁ గూడ నీవు నీచేతితో నభయదానము చేయవు. అట్టియెడ రాక్షసుఁడను బాలుఁడను అయిన నాశిరస్సుమీఁద నీకరాంబుజము నుంచితివి. ఇంతకన్న నాకేమి కావలయును?" ఇంక నిట్లనేకవిధములఁ బ్రస్తుతిఁజేసిన ప్రహ్లాదునిఁ జూచి నరసింహరూపుఁ డగు మహావిష్ణువు—

"శా. సంతోషించితి నీచరిత్రమునకున్ సద్భద్రమౌఁగాక నీ
యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదన్
జింతం జెందరు భక్తకాముఁడ నే సిద్ధంబు దుర్లోక్యుఁడన్
జంతుశ్రేణికి నన్నుఁ జూచినఁ బునర్జన్మంబు లే దర్భకా.
ఆ. సకలభావములను సాధులు విద్వాంసు, లఖిలభద్రవిభుఁడ నైన నన్నుఁ
గోర్కు లిమ్మటంచుఁ గోరుదు రిచ్చెదఁ గోర మెద్దియైనఁ గుఱ్ఱ నీవు."

(భాగ. స్కంధ 7. ప. 369, 370.)

అని ప్రహ్లాదునిఁ బరీక్షించుటకై యడిగెను; గాని ప్రహ్లాదుఁ డీమాయకు లోఁబడువాఁడు కాఁడు. నారాయణుఁడు భక్తులకు దర్శన మెప్పు డిచ్చునో, యప్పటినుండియు వారిని వంచింపఁజాలఁడు. అగుటంజేసి ప్రహ్లాదుఁడు వినయముతో "ప్రభూ! పుట్టినదిమొదలు కోరికలు లేక పోవుటవలననే, నీకొఱకు సకల బాధల నోర్చితిని. ఇఁక నేనేమి కోరుకొందును. శ్రీమన్నారాయణుఁడవు నీవు నాకు సాక్షాత్కరించిన పిదప నాకేమికోర్కు లుండును?" అని మాఱుపల్కెను. అందులకు శ్రీహరి చాల సంతసించి "ప్రహ్లాదా! నీచిత్తసంయమమునకు సంతోషించితిని. నన్నుఁ జేరినవారి కేకోరికలు నుండవు. అయినను నీయెడలఁగల యనంతప్రేమవలన నేను నీకుఁ గొన్ని వరము లిచ్చుచున్నాను. నీవు మన్వంతరమువఱకును రాక్షససార్వభౌముఁడవై సకలభోగములు ననుభవింపుము. నాకథలు వినుచుండుము. సకలభూతములందును నిండియున్న యజ్ఞపురుషుని నన్ను హృదయమున నిలిపి

పూజింపుము. పిదప నీశరీరమును విడిచి నాలోఁ గలిసికొనెదవు” అని యాన తిచ్చెను. అప్పుడు ప్రహ్లాదుఁడు “దీనమందారా! నాతండ్రి నీయెడల విరోధము పూని నిన్ను నిందించి, తుదకు నీచేతులలోఁ బ్రాణములు విడిచెను. అతనికి మోక్షము దయచేయు” మని కోరెను. ఇదివిని శ్రీహరి నవ్వుకొని “వత్సా! నీతండ్రి నాయెడల నెప్పుడు శత్రుత్వము వహించెనో, యప్పుడే తనకుఁ బూర్వులగు నిరువదియొక్క తరములవారితోఁ బరిశుద్ధుఁడయ్యె. నీ విఁక నాతనికిఁ బ్రేతకార్యములు నిర్వర్తింపుము. నా దేహస్పర్శవలన నీతండ్రి ముక్తపాపుఁడయ్యెను. ఇఁకఁ బుణ్యలోకము లాతనికిఁ గరతలామలకములు” అని చెప్పెను. పిదపఁ బ్రహ్లాదుఁడు తండ్రికిఁ జేయ వలసిన ప్రేతకార్యము లెల్ల నిర్వర్తించెను. దుష్టుల కెప్పుడు నిష్టివరముల నీయకు మని శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మదేవున కాజ్ఞాపించి, నరసింహావతారమును జాలించెను. ప్రహ్లాదుఁడు బ్రతికియున్నంతకాలము విష్ణుదేవుని సేవించి పిదప విష్ణుసాయుజ్యముఁ బడసెను.

---

# 2. అంబరీషుఁడు

అంబరీషుఁడు విశాలభూభాగము నేలిన మహారాజు. ఆతఁ డనేక వైభవ ముల ననుభవించి వైరిభీకరుఁడై యుండెను. దైవవశమున నాతనికి శ్రీహరియం దనంతభక్తి కుదిరెను. ఈకారణమువలన నామహారా జెప్పుడు నక్రమమార్గమున సంచరించి యెఱుఁగఁడు. క్రమక్రమముగ నీభక్తి పెరిఁగిపోయెను. సకలము నాత నికి విష్ణుమయముగాఁ దోఁపసాగెను. తుద కాతఁడు శ్రీహరికైంకర్యతత్పరుఁడై రాజ్యమును మంత్రులయధీనముచేసి, సరస్వతీతీరమున వసిష్ఠాదిమహామునికుల తిలకుల యనుగ్రహంబున భూరిదక్షిణలువెట్టి, యనేకాశ్వమేధయాగములను జేసెను. పిదప నాతఁ డేకాంతముగ హరిధ్యానము గావించుచుఁ గాలము గడప సాగెను. ఆతనిభక్తికి మెచ్చి మహావిష్ణువు వైరిసంహారకమును, ఆత్మీయరక్షకము నగు చక్రము నిచ్చి వెడలిపోయెను.

తరువాత నాతఁడు పురుషోత్తమునకుఁ బ్రీతిగాఁ, దోడునీడయై మెలంగు భార్యతోఁగూడి యొక సంవత్సరము ద్వాదశీవ్రతముచేసెను. కార్తిక మాసమున వ్రతము ముగిసెను. అప్పుడు అంబరీషుఁడు మూఁడు రాత్రు లుపవాసములు చేసి, మధువనంబునకుఁ బోయి వలసినవస్తువులన్నియు నేకరించుకొని, కాళిందీనదిలో స్నానము గావించి మహాభిషేకవిధానమున శ్రీమన్నారాయణుని నభిషేకించి, వివిధసుగంధకుసుమసహస్రములచేఁ బూజించి వెండిగోరిజలును, బంగారుకొమ్ము

లును, జిన్నలేఁగలును గలయావులను విశేషముగఁ బాలిచ్చువానిని ఆఱున్యర్బుద ములను సదక్షిణముగా దానము చేసెను. అనేకవేల బ్రాహ్మణులకు మృష్టాన్నదానము గావించెను. అందఱు నానందించిరి. పిదప నాతఁడు పారణ చేయుట కూహించుచుండఁగా రుద్రాంశమునఁ బొడమి మహామహిమగల దుర్వాసమహాముని జనుదెంచెను. అట్లువచ్చిన మునీశ్వరు నర్ఘ్యపాద్యాదికములగు ననేకవిధుల హృదయము కరఁగునట్లు పూజించి, అంబరీషుఁడు విందు గుడిచిపోవునట్లు ప్రార్థించెను. మునియుఁ బరమానందముతో నందుల కంగీకరించి, స్నానమాడివచ్చెద నని కాళిందీనదికిఁ బోయెను. కర్మవశమున నాతనికి విందుసంగతి మఱపువచ్చెను. తుద కాతఁడు పరమధ్యానమునఁ బ్రవృత్తుఁడై ప్రపంచమునే మఱచిపోయెను. ఈశ్వరధ్యానతత్పరత నాతని నయనములు నిమీలితములైన వెంటనే స్మృతిపట మాచ్ఛాదితమై పోయెను.

పిల్లిచెలగాట మెలుకకుఁ బ్రాణసంకట మనున ట్లీస్థితివలన నంబరీషునకుఁ బ్రాణములపోకడ సంభవించెను. ద్వాదశిగడియల యంతము సమీపించెను. ఈలోపునఁ బారణసేయకున్న వ్రతము భ్రష్ట మగును. చేసిన దంతయు బూడిదలోఁ జేసిన హోమమైపోవును. ఆహ్వానితుఁడైనయతిథి రాకుండ భుజించుట కేవలము పాపము. ముందు గోయి, వెనుక నూయి. కాళ్లకు సంకెలలు, కంఠమునకు గండకత్తెర. ఏమిచేయవచ్చును? అంబరీషుఁ డనేకవిధముల యోచించెను. ఏమియు నుపాయము తోఁపలేదు. జాములోఁ గాకున్న రెండుజాములలోనైన నపాయము లేనియుపాయము వెదకవచ్చు ననుకొన్న మూఁడవకష్టము నెత్తి మీఁదఁబడుటకు సిద్ధముగ నుండెను. గడియగడచిన దానితో ద్వాదశి గడచి పోవును. పిదప నింకేమిచేసినను బ్రయోజన మేమి?

ఈధర్మసూక్ష్మమును దీర్చుటకు విద్వాంసులకుఁ దప్పదయ్యెను. అంబరీషుఁడు విద్వల్లోకమును జూచి,—

**క. ముని నీరుసొచ్చి వెడలఁడు చనియెడు, ద్వాదశియు నింత సనియె న్నీలో**
**నన పారణయుంకి వలయును, వినిపింపుం డర్హాధర్మవిధ మెట్టిదియో."**

**(భాగ. స్కం. 9. ప. 97.)**

అని ప్రార్థించెను. విద్వాంసులు చాల వాదోపవాదములుచేసి, తుదకు "రాజా! సలిలభక్షణము సేయుము. అంతమాత్రముననే వ్రతపరిసమాప్తి యగును గాని యతిథి నుపేక్షించి ముందుభుజించినట్లుగాదు. ఆదోషమున కవకాశమే యుండ" దని చెప్పిరి. అంబరీషునకుఁ దరణోపాయము దొరకెను. ఆతఁడు ముందటిగోతిని, వెనుకటి నూతినిఁ గూడఁ దప్పించుకొని బైటఁ బడెను.

ఇదిరైన యుత్తరక్షణమునందే దుర్వాసుఁ డనుష్ఠానమంతయు ముగించుకొని వచ్చెను. ఈవచ్చుట యొకక్షణమునకుఁ బూర్వమే రాఁగూడదా? యని యందఱు ననుకొనుచుండ, నంబరీషుఁడు దుర్వాసమహర్షికి వినయముతో విందు సిద్ధముచేయింపఁజొచ్చెను; గాని మునిచిత్తమున కేదో వికారము తోఁచెను. తోడనే యాతఁడు దివ్యదృష్టితోఁ జూచి, అంబరీషుని సలిలభక్షణమును దెలిసికొనియెను. అంబరీషునకుఁ దటస్థించిన విషమస్థితిమాత్ర మేల తెలిసికొనలేకపోయెను? అంబరీషునకుఁ బ్రాపించిన విషమస్థితికిని, దుర్వాసుని యోచనకును నడుమ సలిలభక్షణము జరిగెను. అక్కట తన ముసటుద్ధి తొలుత సలిలభక్షణమును దెలిసికొనిపోయెను. వెంటనే యది క్రోధఘూర్ణితమై గ్రుడ్డిదై పోయెను. పిదప రాజు విషమస్థితి దానికిఁ గాన్పించుటకుఁ దగిన యానుకూల్యమే తప్పిపోయెను. ఇఁకఁ దరువాత జరిగినది మునియాగ్రహము.

"నీ వింద్రుఁడవు, చంద్రుఁడవు అని పొగడి నన్ను విందునకుఁ బిలిచి యీ మదాంధుఁడు భుజించెను. విష్ణుభక్తుఁడనని విఱ్ఱవీఁగుచున్న వీఁడు శుద్ధకిరాతుఁడు. చూడుఁడు. వీని నేమిచేసెదనో" యని ముని చిందులు త్రొక్కసాగెను. అంబరీషుఁ డనేకవిధముల సమాధానము చెప్పెను. అనేకవిధములఁ బ్రార్థించెను; గాని యేమి ఫలము? దుర్వాసుఁడు ప్రార్థనములకు లొంగువాఁడు కాఁడు. ఈసంగతి యెఱింగి యుండిమాత్రము ప్రార్థించుటకన్న రాజేమిచేయఁగలఁడు? ఉభయతారకమగు నుపాయము చూపఁగలిగిరి; గాని ముని కోపించి గంతులువేసినయెడఁ విద్వాంసు లేమిచేయఁగలరు? దుర్వాసుని యెదుట ధర్మశాస్త్రచర్చగూడఁ బ్రయోజనము లేదు. అది పనికిరానే రాదు. ఇఁక నాతని యాగ్రహము తీఱు నుపాయము లేదు. చేతనైనచో నగ్నినిఁ జల్లార్పవలెను. లేకున్న దానిలోఁబడి మాడిపోవలెను. ఈరెండే మార్గములు. ఇఁక మూఁడవ మార్గము లేదు. అంబరీషునకుఁ దొల్లిటి విషమసంధికంటె నెక్కుడు విషమసంధి తటస్థించెను. ఏమి దిక్కు? చూచుచుండఁగనే దుర్వాసుని క్రోధాగ్ని ప్రళయాగ్ని యయ్యెను. ఆతనిపండ్లు పటపటలాడెను. కన్ను చిటచిటలాడెను. కపోలములు కంపిపోయెను. తోడనే యాతఁడు హుంకరించి, జడ పెరికి నేలకుఁ గొట్టెను. శూలమున్నగు వివిధాయుధములను ధరించిన కృత్య యనుశక్తి యాజడనుండి బయల్వెడలి రాజుమీఁది కుఱికెను. అంబరీషుఁడు నిశ్చలుఁడై యట్లే యుండెను. ప్రేక్షకు లెల్లరును హాహాకారములు ప్రారంభించిరి.

అంబరీషుని హృదయము తనలో లీనమైయుండుట యెఱింగి, శ్రీహరి అంబరీషునిలో లీనమైయుండెను. అక్కట తన దుర్వాసుఁడు కృత్యనువిడిచినవెంటనే మహా

విష్ణుచక్రమును విడిచెను. ఆ రెంటికిని యుద్ధము సాఁగెను. నిముసము నందే చక్రాగ్నిజ్వాలలోఁబడి కృత్య భస్మమై పోయెను. కాని చక్రమున కంతటితోఁ దృప్తి కలుగలేదు. మాయలమారి యున్నంతవఱకును మాయల కంతము కలుగదు. అట్లే దుర్వాసుఁ డున్నంతకాలము ప్రయోగముల కంతముండదు. కావునఁ జక్రము దుర్వాసునిమీఁదికి మఱలెను. తోడనే ముని రిచ్చపడెను. ఏమి లాభము? అంతమాత్రమునఁ జక్రము తిరిగిపోవునా? ఎదుర్కొనుట కంబరీషుఁడు గాఁడు. ఇది శ్రీమహావిష్ణువుచేతి వేయియంచుల చక్రము. ఇఁకఁ జేయునది లేక ముని యూర్ధ్వశ్వాసముతోఁ బాఱిపోయి మేరుగుహ సొచ్చెను. అయినను యమపాశమును దప్పించు వస్తువు లేదు. పురుషోత్తముని చక్రాయుధమును వారించు వస్తువు కూడ లేదు. మునివెంటఁ జక్రము మేరుగుహ సొచ్చెను. అంతియ గాదు——

మ. "భువి దూఱన్ భువి దూఱు నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు నుద్వేగియై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు దిక్కులకుఁ బోఁ దిగ్వీథులం బోవు జి
క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు నిల్వ నిలుచుం గ్రీడింపఁ గ్రీడించు నొ
క్కవడిం దాపసు వెంటనంటి హరిచక్రం బస్యదుర్వక్రమై."

(భాగ. స్కంధ. 9. ప. 107.)

ముని కాయాసము వచ్చెను. ఇట్లింత పరువెత్తినను ప్రయోజనములేదని యాతఁడు బ్రహ్మసన్నిధికిఁబోయి శరణుఁజొచ్చెను. విధాత "ఈపని నావలనఁ గాదు. రుద్రేంద్రాదులుగూడ దీని నోప" రని చెప్పెను. ముని కైలాసంబునకుఁ బోయి శంకరుని పాదములమీఁద వ్రాలెను. ఈశ్వరుఁడు "వత్సా! శ్రీహరి సర్వాధారుఁడు. బ్రహ్మ, నేను, ఇంద్రుఁడు, మహర్షులు మున్నగువా రెవ్వరునుగూడ నాతనిమాయఁ దెలిసికొనఁజాలము. ఆతనివలన మేము ప్రవర్తించుచున్నాము. అట్టి జగదీశ్వరుని యాయుధమును నేను త్రిప్పఁజాల" నని చెప్పివేసెను.

దుర్వాసుఁడు ప్రపంచ మంతయు దృష్టిసారించెను; గాని రక్షకుఁ డెవ్వఁడును గాన్పింపలేదు. తుదకుఁ జక్రమునుబంపిన శ్రీహరియే దిక్కయ్యెను. ముని వైకుంఠమున కేఁగి యంతఃపురమున శ్రీమహాలక్ష్మితో మంతనమాడుచున్న నారాయణుని పాదకమలములమీఁద వ్రాలి "ఆర్తత్రాణపరాయణా! నీమహామహిమము తెలిసికొనఁజాలక నీప్రియదాసున కెగ్గుచేసితిని. నాసాహసమును సైరించి నన్ను రక్షింపు" మని దీనాతిదీనముగఁ బ్రార్థించెను. అప్పుడు పురుషోత్తముఁడు——"తాపసా! బుద్ధిమంతులైన సాధువులు నాహృదయముసొచ్చి, రహస్యమంతయుఁ దెలిసికొని దొంగిలించుకొనిపోయి, భక్తిలతలతో దృఢముగఁ గట్టివేసిరి. అక్కతన నేను భక్తులను విడిచి, లేఁగను విడిచి యావుపోలేన ట్లెక్కడకును బోఁజాలను. బంధువు

లను, సంపత్తులను, సంసారమునువిడిచి నేనే దిక్కనియుండు భక్తులను నే నష్టము సేయలేను. సాధుల మనస్సు నాయదె. నామనస్సు సాధువుల యధీనము. నేను సాధువుల నెఱుఁగుదును. నన్ను సాధువు లెఱుఁగుదురు. మేమనన్యగతికులము. నాభక్తుల యందు నాతేజము పూర్తిగ నావరించియుండును. వారి కెగ్గుచేయువారి నది నాశము చేయును. నిన్ను వెంబడించి నన్నున్న చక్రాయుధమును నేనుకూడఁ ద్రిప్పఁజాలను. నాభాగవతుఁ డగు అంబరీషుని బ్రార్థింపు వేఁ నీకు సుఖ మయ్యె దవు" అని చెప్పెను.

ఇప్పు డేమిచేయవలయును? అంబరీషుని బ్రార్థించుట యేమిటి పౌరుషము? అద్దిరా! నారాయణుఁ డెంత యుచితజ్ఞుఁడు. మునికి మానభంగము పొలుపనే యయ్యెను. ఇఁకఁ బ్రాణమును గూడఁ బోఁగొట్టుకొనుట యొప్పదు? కావునే యాతఁ డంబరీషుని సమీపించి, సాష్టాంగనమస్కారము గావించి, అభయము వేఁడుకొనెను. దీనివలన రాజుహృదయము కరఁగెను. అప్పు డాతఁడు కరములు దోయిలించి "శ్రీహరిప్రశస్తము నలంకరింపు చక్రాయుధమా!

సీ. నీవ పావకుఁడవు నీవ సూర్యుండవు నీవ చంద్రుండవు నీవ జలము
నీవ నేలయుం నింగి నీవ సమీరంబు నీవ భూతేంద్రియనికర మీవ
నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును నీవ యజ్ఞంబును నీవ ఫలము
నీవ లోకేశులు నీవ సర్వాత్మయుం నీవ కాలంబును నీవె జగము
తే. నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య, మూలతేజంబు నీవు నేమ్రొక్కు వాఁడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి, శస్త్రముఖ్యమ కావవే చాలు మునిని."

(భాగ. స్కం 9. ప. 128.)

శ్రీమహావిష్ణువుచే నీవు విడువఁబడినవెంటనే, ధావనవేగంబునఁ బొడమిన నీగంభీర ధ్వానము నాలకించి రాక్షసులు చాపచుట్టుగఁ బడి మడిసెదరు. రక్కసులు నిద్ర లోఁగాని, కలలోఁగాని నిన్ను జూచినచోఁ బ్రాతఃకాలమున సతులు పలవరింప దీర్ఘనిద్రవోదురు. నీతత్త్వము విధాతకైనఁ దెలియనవిగాదు. ముని చాల నలసి పోయియున్నాఁడు. ఇఁక నీయౌద్ధత్యమును జాలింపుము. నేను ధర్మమార్గమున సంచరింతునేని, బ్రాహ్మణుడు మాకు దైవత మగు నేని, ఈవిప్రునకు శుభము గలుగుఁగాక! సృష్టిస్థితిసంహారకరణచణుఁడైన దామోదరుఁడు నాసేవ కానందించు నేని, ఈ బ్రాహ్మణుఁడు సుఖపడుఁగాక!" అని ప్రార్థించెను. తోడనే చక్రము దుర్వాసునివిడిచి వెడలిపోయెను.

పిదప ముని అంబరీషుని "రాజేంద్రా! నేఁజేసిన దంతయు మఱచిపోయి నాకుఁ బ్రాణదానము చేసిన నిన్నేమని సన్నుతింపఁగలను? శ్రీహరిని నీవింతగాఁ

గొలుతువా? అసలు నీ యాజ్ఞాబద్ధుఁడై యున్నాఁడు. ఈరూపమున విశ్వమున కంతకును నీవే యాధారమవై యున్నావు. నీయట్టి మహానుభావునకుఁ బ్రపంచమున సద్దేమి యున్నది? నేను నీదర్శనమువలన ధన్యుఁడ నైతిని. ఎల్లప్పుడును నీశుభము గోరుచుందును. నాకు ఇఁక సెలవిమ్ము" అని ప్రార్థించెను. రాజు మునిని భుజించి పొమ్మని చెప్పెను. అందుల కభ్యంతరము చెప్పుటకు మునికి ధైర్యమేది? మృష్టాన్నము భుజించి సంతృప్తుఁడై, ముని రాజును జూచి "రాజా! నీచరిత్రము త్రిలోకవాసులకుఁ గూడ మోక్షప్రదము" అని దీవించి సెలవుగొని వెడలిపోయెను. పిదప రాజు భూసురభుక్తంబగుట నతిపవిత్రమైన తచ్ఛేషమును హృషీకేశునకుఁ దనపైఁగల కరుణకు విస్మయమందుచు భుజించి, వ్రతసమాప్తి చేసి తరించెను.

పిదప నాతఁడు సంసారముమీఁది మమతను బూర్తిగ విడిచి, విద్యావినయవివేకములఁ బ్రసిద్ధులైనవారైన కొడుకులకు రాజ్యమప్పగించి హరిధ్యానతత్పరుఁడై యడవికిఁ బోయెను. దేహాంతమున నాతఁడు విష్ణుసాయుజ్యమును బడసెను.

**సీ. శ్రుత్యంతవిశ్రాంతమత్యనుక్రమణీయ భగవత్ప్రసంగతుల్ భాగవతులు**
**సనకాదిమునియోగిజనసదానందైక పరమభాగ్యోదయుల్ భాగవతులు**
**కృష్ణపదధ్యానకేవలామృతపాన పరిణామయుతులు శ్రీభాగవతులు**
**బహుపాతకానీకపరిభవప్రక్రియా పరుషోగ్రమూర్తులు భాగవతులు**
**తే. భావతత్త్వార్థవేదులు భాగవతులు, బ్రహ్మనాదానువాదులు భాగవతులు**
**సిరులు తనరంగ నెన్నఁడుఁ జేటులేని, పదవినొప్పారువారవో భాగవతులు.**

(భాగ. స్కంధ. 6. ప. 186.)

---

## 3. అజామిళుఁడు

కన్యాకుబ్జనగరమున అజామిళుఁ డను నొక బ్రాహ్మణ కుమారుఁ డుండెను. ఆతఁడు గురువృద్ధులకుఁ బరమభక్తితో సకలశుశ్రూషలు చేసి సకలవేదములను జదువుకొని, శాంతిదాంతిశమదమాదిసుగుణగరిష్ఠుండై ధర్మనిరతుఁ డయ్యెను. అతఁ డనేకమంత్రసిద్ధులను గూడఁ బడసెను. మఱియు సత్యవాక్యపరిపాలనము చేసెను. సకలకర్మలును భక్తిశ్రద్ధలతో నెఱవేర్పసాగెను. ఈస్థితిలో నాతనికి యౌవనము ప్రాప్తించెను. ఉద్రేకము కామవికారము మందహాసము దేహదార్ఢ్యము మున్నగు యౌవనధర్మము లన్నియు నాతనియందుఁ బొడసూపెను. అంత వసంతము గూడఁ బ్రాపించెను. అభినవతేజోవంతమై ప్రపంచ మంతయు రాగభరితమయ్యెను. అప్పు డాతఁ డొకనాఁడు కుశసమిత్పుష్పఫలముల నిమిత్తము వనమున కరిగెను.

అచట నొకనికుంజమున నొకయువకుఁ డొక వృషలితోడఁ గ్రీడించుచుం డెను. వారినిఁ జూచినతోడనే యాయజామిళుని హృదయము చలించెను. ఇఁకఁ గావలసిన దేమున్నది ? అభిజాత్యము, విద్య, జ్ఞానము, మర్యాద, పాపభీతి మున్న గున వన్నియు మఱచి, తన ముద్దులభార్యను విడిచి యాతఁ డావృషలివలలోఁ జిక్కుకొనియెను. ఈసంభవమువలన నాతఁడు ప్రపంచమంతయు మఱచి, బ్రాహ్మణ్య మును మంటఁగలిపి, దానితోడనే సంసారము ప్రారంభించెను. జూదము పానము గూడఁ బ్రారంభించెను. ఇంక నెన్ని దుష్కార్యము లున్నవో, యవియెల్ల నతఁడు మొదలుపెట్టెను. ఆఱంకుటాలివలనఁ బదుగురు కొడుకులను బడసి, యాసంసార నిర్వహణమునకై యనేకపాపకార్యము లారంభించెను.

ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి యౌవనము గడచెను. శిరోజములు తెల్లనయ్యెను. శరీరపాటవము సన్నగిల్లెను. అవయవములన్నియు వడఁకఁ జొచ్చెను. దృష్టి మందగించెను. దంతము లూడిపోయెను. వగర్పు ప్రారంభమయ్యెను. ఈ తీరున వార్ధక్యము ప్రబలెను; గాని యన్నిటిని మించి కోర్కె లతిశయించెను.

పదుగురుపుత్త్రులలోఁ గడపటివాఁ డగునారాయణునియం దాతనికిఁ బ్రేమ మెండు. తన ఱంకుటాలుగూడ నట్లే వృద్ధయైయుండుటచే నాతఁ డామెతోఁ గూడ నారాయణుని లాలించుటయందే కాలము గడుపుచుండెను. ఈపుత్త్ర వ్యామోహమునఁబడి సమస్తమును మఱచిపోయెను. తుద కిట్లుండఁగా మృత్యువు సమీపించెను. యమకింకరు లాతనికిఁ దమ దివ్యదర్శనము నొసంగిరి.

క్రూరాకారు లగు యమదూతలను జూచి తన కవసానము సమీపించె నని తెలిసికొని, అజామిళుఁడు పుత్త్రవియోగము సంభవింపనున్నందులకు వగచుచు, దుఃఖాతిరేకమ్మున గడగడ వడఁకిపోవుచుఁ దనకనిష్ఠకుమారుని 'నారాయణా! నారాయణా' యని చేరఁబిలిచెను. ఉత్తరక్షణమునందే యాతఁడు విగతప్రాణుఁ డయ్యెను. యమదూత లాతనిజీవమును పాశములతోఁ గట్టివేసి బయలుదేఱిరి; కాని విష్ణుదూతలువచ్చి వారి నడ్డగించిరి.

స్ఫురద్రూపులును, పద్మనేత్రులును, పీతకౌశేయపరిధానులును, గండ మండలనటత్కుండలద్వయులును, పటుకిరీటప్రభాభాసితులును, కల్పపుష్పమాలా లంకృతులును, బాహుకేయూరమణిగణభ్రాజమానఘనచతుర్భుజులును, నీలనీరద కోమలదేహులును, శంఖచక్రఖడ్గగదాదియుద్ధపరికరములను ధరించినవారు నగు విష్ణుదూతలను జూచి నివ్వెరపడి "అయ్యా! మీ రెవరు? వేషములవలన శాంతుల వలెఁ గన్పించెదరు. క్రియచే సాహసులని తోఁచుచున్నది. మేము ధర్మరాజుగారి సేవకులము. ధర్మరక్షణమే మావిధికృత్యము. ఈప్రాణి బహుపాపములు చేసెను.

వీనిఁ దగిన శిక్షనొందించుటకుఁ దీసికొని పోవుచున్న మమ్ము మీరేల యభ్యంతర పెట్టిరి" యని యమకింకరు లడిగిరి. అందులకు శ్రీహరిసేవకులు మందహాసము గావించి "మీరు కాలేశనాయకభటులేని దండింపఁదగినవా రెవ్వరో, దండింపఁ దగనివా రెవ్వరో, పుణ్యలక్షణమేమో, పాపచిహ్నము లేవో చెప్పుఁ" డని మేఘ గంభీరభాషణములతోఁ బలికిరి. యమకింకరు లిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి.

"వేదము శ్రీమన్నారాయణస్వరూపము అగుటంజేసి, వేదోక్తమైన దేదో అదియే ధర్మము. తద్భిన్నమే యధర్మము. సూర్యుఁడు, అగ్ని, ఆకాశము, వాయువు, గోవులు, చంద్రుఁడు, సంధ్యలు, రాత్రులు, పగలు, కాలము, భూతధాత్రి యివి ప్రాణికోటుల ప్రవర్తనములకు సాక్షులై వారివారికి విధింపవలసిన దండనలు తెలుపు చుందురు. ఈసమయమున ధర్మరక్షణకు పోవుచున్న మాకు మీ రడ్డమువచ్చి తిరి; గావున మీరు దండ్యులై తిరి. ప్రాణికోటులు సత్త్వరజస్తమోగుణాత్మకములు అగుటచేఁ గర్మ తప్పదు. కర్మననుసరించి శుభాశుభఫలములు లభించుచుండును. ఎవఁ డెట్టి కర్మ చేయునో, యట్టిఫల మనుభవింపక తప్పదు. ఈయజామిళుఁడు తాను పుట్టిన బ్రాహ్మణజాతికిని, చదివినచదువులకును సంపాదించిన జ్ఞానమునకును, బ్రారంభించిన వేదోక్తసత్కర్మలకును వ్యతిరేకముగ వృషలియందు అనురక్తుండై బిడ్డలం గని; త్రొక్కరాని మార్గములు త్రొక్కి, చేయరానిపనులు చేసి చెడిపోయెను. కావునఁ గుటిలుఁడు, ధూర్తుఁడు, దుష్టుఁడు నగువీనిని దండింపఁ గొనిపోవు చున్నాము. కర్మానురూపమైన శిక్షఁబడసి, పిదప వీఁడు విముక్తుఁ డగును."

ఈయుపన్యాసమును విని విష్ణుసేవకులు పకపక నవ్వి "అవురా!. ధర్మాధర్మ వివేకుల పస తెలిసిపోయినది. ప్రభునిర్దేశమును జక్కఁగఁ దెలిసికొనినవా రిట్లే దండ్యులను విడిచి, యదండ్యులను దండింతురు. ధర్మదూతలారా! మంచిచెడ్డలు, కష్టసుఖములు, మఱి సకలమును దెలిసిన తలిదండ్రులే బిడ్డలను దండించినచోఁ, నిఁక నాబిడ్డ లెవరిని రక్షింప వేఁడుకొందురు? తెలిసినవాఁ డేది చేయునో తెలి యనివారు నదియే చేయుదురు. వివేకి నిజమిది యని చెప్పినచోఁ దక్కినవా రట్లే ప్రవర్తింతురు. నమ్మి తొడలమీఁద నిద్రించినవానినిఁ గ్రిందికిఁ ద్రోసివేయు దుర్మార్గుఁ డెందైన నుండునా? మనసిచ్చి సకలమునిచ్చి, శరణుపొందినవానిని కరుణాత్ముఁడు రక్షింపకుండ విడుచునా? ఈతఁ డవసానకాలమున నారాయణస్మరణముచేసి ధన్యుఁ డయ్యెను. పుత్రుని 'నారాయణా' యని పిలిచినంతమాత్రమున నారాయణస్మరణ చేసినట్లగునా? యని సందేహింపకుఁడు. పిల్లవాని పేరుపెట్టి పిలిచినను, వేళాకోళ మునకు వెక్కిరింతకునైనను, పద్యములు చదివిరైయైనను, పాటలు పాడియైనను శ్రీహరిని స్మరించినంతమాత్రమునఁ బాపములు నశించిపోవును. పడిపోయినపుడు,

దెబ్బలు తిన్నపుడు, జ్వరాదులచేఁ బీడింపఁబడినపుడు, సర్పాదులచే బాధింపఁబడినపుడు, ఖడ్గాదులచే వేధింపఁబడినపుడు, ఇఁక నెట్టి కష్టసమయములయందైనను శ్రీమహావిష్ణువు నామము స్మరించెనేని వానికి యమయాతన కలుగఁబోదు. బాలుఁడైనను హరిభక్తులతోఁ గూడి భజనచేసినట్లయినను, శ్రీహరీయని, పిలిచినను సకల పాపములనుండియు విముక్తుఁ డగును. వీర్యవంతమైన యౌషధము తెలియక సేవించినను దనప్రభావము నెట్లు చూపునో, యట్లే శ్రీమన్నారాయణుని నామము అజ్ఞానమువలనఁ బలికినను మోక్షము సంఘటించును. ఘోరపాపాత్మునకైనను పురాకృత పుణ్యవశమునఁ గాకున్న ఒక్కనియందేగాక సకలప్రపంచమునందును నిండియుండు శ్రీపతి యెట్లు జ్ఞప్తికివచ్చును? త్రైలోక్యపావనమైన శ్రీహరినామస్మరణామృతము నీతఁడు సేవించెను. ఈతనిధర్మ మిఁక నెట్లు వ్యర్థమగును?" అని యమదూతలతోఁ జెప్పిరి. వారది విని తెల్లవోయి చేయునదిలేక తమ ప్రభువుకడకుఁ బోయి జరిగిన సమస్తమును విన్నవించిరి. అది విని యమధర్మరాజు "దూతలారా! వారు శ్రీమన్నారాయణుని దూతలు. వారు పోయినచోటికి మీరు పోవలదు. శ్రీహరి సకల ప్రపంచమునకును విభుఁడు. అతని కెందు నెదురులేదు. సామాన్యు లాతని నెఱుఁగ నేరరు. విధాత మహేశ్వరుఁడు మున్నగువారు గూడ నాతనినిఁ దెలిసికొనఁజాలనపుడిఁక నన్యులసంగతి చెప్పనేల? అజామిళుఁడు బ్రతికి యున్నంతకాలమును సకల దురితములును జేసినను, మరణసమయమున నేదోయొకరూపమున శ్రీహరినామస్మరణ చేయుటవలన ముక్తుఁడైనాఁడు. కావున మీరిప్పుడు తెలిసికొనవలసినది యేమనఁగా,—

సీ. "ఏకసక్కెమునకైన నిందిరారమణునిఁ బలుకంగలేవి దుర్భాషితులను
గలలోనసైన శ్రీకాంతునిన శ్రీపాదకమలముల్ చూడనికర్మదృశులు
నవ్వుచునైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ దార్చ నేరనిదుష్కథాప్రవణుల
యాత్రోత్సవంబులనైన నీశునిగుడి త్రోవఁ ద్రొక్కంగ లేనిదుష్పదులను
ఆ. బరమభాగవతులపాదధూళి సమస్త, తీర్థసార మనుచుఁ దెలియలేని
వారి వారి వారి వారిఁ జేరినవారిఁ, దోలుఁతఁ గట్టితెండు దూతలార!
ఆ. పద్మనయనుమీఁదిభక్తియోగం బెల్ల, ముక్తియోగమనుచు మొదలెఱుంగు
వారి వారి వారి వారిఁ జేరినవారి, త్రోవఁ దలఁచవలదు దూతలార!"

(భాగ. స్కంధ 6. ప. 188, 191.)

అని చెప్పెను.

ఇటు అజామిళుఁడు పాశబంధములు సడలించి యమదూతలు పోయిన వెంటనే సచేతనుఁడై లేచి నిలిచి, కేలుమొగిచి యెద్దియో పలుకఁ బ్రయత్నించుచుండ నది తెలిసి విష్ణుదూత లదృశ్యులై పోయిరి. పిదప నాతఁడు సకలమును దెలిసికొని గతించినదానికిఁ జాల వగచి,

సీ. "వృషలియం దనురాగవృద్ధి బిడ్డలఁగని కులము గోదావరిఁ గూలఁద్రోచి
రచ్చలకెక్కి పెక్కు రజ్జ సేతల పరివారిలోపలఁ దలవంపుచేసి
కట్టిడిమదుకనై కర్మబాంధవులపుట్టనై నిందల ప్రోవ నగుచుఁ
దరుణులతోఁ దనివి బోగించిన కడిఁది నాజన్మంబు కాలిపోయెఁ
ఆ. జనువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యె, బుద్ధి పురువుమేసెఁ బుణ్యమడఁగె
నీతి మట్టుపడియె నిర్మలజ్ఞానంబు, ముట్ట నడిగె బోధమూరిఁబోయె."

(భాగ. స్కంధ. 6. ప. 134.)

అక్కటా! సుగుణవతియగు చక్కనియిల్లాలిని విడిచి కలుద్రాగు వృషలిని మఱిగి దుర్వ్యాపారుఁడనై చెడిపోయితిని. నేనుచేసిన ఘోరపాపములు ప్రళయాగ్నికీలలై నన్ను దహింపవేల? కట్టా! నాకంటె దిక్కులేని తలిదండ్రులను విడిచిపెట్టితిని. అనేకపాపములు చేసి నరకకూపమునఁ గూలఁబడి పోనున్న నన్ను రక్షించి యుద్ధరించిన మహాత్ము లెంతలివారో! కలలోఁదోఁచిన యర్థమువోలెఁ, గ్రమక్రమముగ నాకంతయుఁ దెలియుచున్నది. పాశములతో బంధించి నన్ను లాగిన మహాపురుషులు యమధర్మరాజు కూర్మిదూతలు. వారిప్పు డెక్కడకుఁ బోయిరో? మఱియు,

ఉ. "దారుణపాశబంధనవిధానములన్ నరకార్ణవంబులోఁ
గూలిననన్ను నేఁడు చెడకుండ నొనర్చినపుణ్యమూర్తు లం
భోరుహనేత్రు లుజ్జ్వలశోభామణితేజులు లోచనోత్సవుల్
చారుదయాసముచితవిచారులు నల్వురు నెందు నేగిరో.
మ. నను రక్షించినపుణ్యవంతులు కనన్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛాయదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సముగ్రస్ఫూర్తి నెందేగిరో."

(భాగ. స్కంధ. 6. ప. 143, 174.)

మహాపాపాత్ముఁడ నగునాకు పురాకృతపుణ్యవిశేషంబునఁగాక యా దేవోత్తముల దర్శలాభ మెట్లబ్బును? వారి దర్శనమువలన నాయాత్మ సుప్రసన్నమై పవిత్రమైనది. అట్లుగాకున్న వృషలీభర్తనై యెల్లవిధముల భ్రష్టుఁడనై యున్న నాజిహ్వకు శ్రీమన్నారాయణనామగ్రహణ మెట్లు గలుగును?

సీ. "దారుణమోహాంధకారపూరితుఁడను హరివిస్మయస్మరణార్హమతినె
పంచమహాతిప్రపాతకోపేతుఁడ హరివిస్మయస్మరణార్హమతినె
కౌటిల్యకైతవవికారహారిణుండ హరివిస్మయస్మరణార్హమతినె
యఖిలదుఃఖైకమహార్ణవమగ్నుండ హరివిస్మయస్మరణార్హమతినె

తే. నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ, మందభాగ్యుండ నేనెడ మధువిదారి
దివ్యగుణనామకీర్తన తెలియఁగ దేడఁ, బూర్వసుకృతంబు లేకెట్లు పొందఁగలుగు."
(భాగ. స్కంధ. 6. ప. 146.)

ఇఁక మనోవికారములనన్నిటిని గట్టిపెట్టి శ్రీహరిపదకమలములను గొలిచెదను. ఈసంసారసాగరమును విడిచెదను. మాయావిమోహమైనతమము నడఁచెదను. అని తలంచి, సకలమును బరిత్యజించి, గంగాద్వారమున కేఁగి యట నొక దేవాలయమున యోగసమాధినిష్ఠాగరిష్ఠుఁడై పాంచభౌతికదేహమును విడిచి, వైకుంఠమునకుఁ బోయి శ్రీమన్నారాయణపరబ్రహ్మమున నైక్య మయ్యెను.

సీ. "బ్రహ్మహత్యానేకపాపాటవుల కగ్నికీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు
తే. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల నలరుబ్రహ్మాదిసురలకు నందరాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య, ఖేలనంబులు హరినామకీర్తనములు.
(భాగ. స్కంధ. 6. ప. 118.)

---

# 4. నారదుఁడు

ప్రపంచము నంతను సృజించు బ్రహ్మలందఱునుచేరి, యొకప్పుడు దేవసత్రము అను నొక యాగమును జేసి, యందు శ్రీమన్నారాయణుని దివ్యమంగళగాథలు గానంబుసేయుటకొఱకు అచ్చరలను గంధర్వులను బిలిపించిరి. ఉపబర్హణుం డను గంధర్వుఁ డొకఁడు సంతతము స్త్రీలతోఁ గ్రీడించుచుండియు, దైవవశమున నచ్చరలతోడను గంధర్వులతోడను గలిసి దేవసత్రమునకు వచ్చెను.

అచ్చట శ్రీహరి కల్యాణగాథలు కీర్తించుచు నప్సరసలు ఆడిరి గంధర్వులు
పాడిరి. పుండరీకాక్షుని దివ్యకథామృతమును గ్రోలియు, ... యాటలు
చూచియు, గంధర్వులపాటలు వినియు యజ్ఞమునకువచ్చినల ... మిగులఁ
నానందించిరి. ఉపబర్హణుఁడు మాత్ర మేమియుఁ బొడకల్లాపము ... నే. యా
లాడుచుఁ గూర్చుండెను. అది విధాతల కన్నులకు ఁడనే వారు ... విడిచి
ప్రళయాగ్నులవలె మండిపడి కటము లదరఁ బ్రక్కి... ... ప్పుడు
ఆ. "పంకజాక్షు నిచటఁ బాడక కామినీ,గ ... వేయు.
దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున, ... వమున ... ఁగా,
... లసలత సుతుఁడవు వగుము."
అని శపించిరి. ... డను

ఈశ్వరకారుణ్యమున ఉపబృంహణుఁడు వేదవాదుఁ డగు యోగిజనులయింట దాసీ యగు నొక శూద్రపతకుఁ గొడుకై పుట్టెను. అంత వానితల్లి తనపుత్త్రున కైదాసీపుచేఁ జిన్నవయసువాఁత యోగిసేవకు నియమించెను. ఆబాలుఁడును జాల భక్తిశ్రద్ధలతో యోగులను బూజింపఁదొడఁగెను. అవసరమైనంతసేపును పనులు చేసి తిరికినైనప్పుడాబాలుఁడు యోగులయెడల భయభక్తులుగలిగి బాలురతో నాటపాటలకుఁ బోవక, వారు చేయు బ్రహ్మవాదములను వినుచుండెను. దేవతా ప్రసాదమని పరమభక్తితో నాతఁడు వారియెంగిలి తినసాగెను. ఎండకెండియు వానకుఁ దడిసియుఁ గూడ నాతఁడు వారి ముంగిటఁ గూర్చుండుచుండెను. వారేపని చెప్పినను ఎదురుచెప్పక నిముసములో నెఱవేర్పసాగెను. వర్షాకాలమును శరత్కాలమును గడచునంతకాలమును బాలుఁ డీరీతిని బరమభక్తితో సేవలు చేయుచుండుటఁ జూచి, యోగు లాతనియెడల మిగుల ననుగ్రహము గలవారైరి.

పిదప వారు శ్రీకృష్ణభగవానునిచరిత్రలు చదువుకొనుచు, వర్ణించుకొనుచుఁ బాడుకొనుచు బ్రహ్మానందానుభవమువలన మైమఱవసాగిరి. బాలుఁడును వారి యెదుట నిలిచి శ్రీకృష్ణచరితామృతమును వీనులఁ జెలులఁ జుట్టుచు, నందలి మహామహిమమును గుర్తెఱిఁగి సకలవిషయములను వీడి శ్రీమహావిష్ణువు సేవ ప్రారంభించెను. ఈసేవవలనను, యోగులయనుగ్రహమువలనను ఆబాలునకుఁ బ్రపంచమంతయు మాయాపరికల్పితమను జ్ఞానమును, రజస్తమోగుణపరిహారిణి యగు విష్ణుభక్తియుఁ గలిగెను.

అంతలో యోగులకు చాతుర్మాస్యలు ముగిసెను. ఏమియు లోపములు లేకుండఁ దమ్ము గొలుచుచుండుటవలనను, భక్తిపరితహృదయుఁడై శ్రీహరిని గీర్తించుచుండుటఁ జూచియు వారు కొలఁగలవాఁడని యూహించి బాలకునకు ఈశ్వరరహస్యములును, జ్ఞానమును బరిపూర్తిగ నుపదేశించి తీర్థయాత్రార్థులై వెడలి పోయిరి. ఆయుపదేశమువలన నాతఁడు సకలసందేహములను నివృత్తిచేసి, మాధవపదచింతనముఁ బ్రారంభించెను. అందులకు శ్రీహరి మెచ్చి యాబాలునకు ధైర్యము దొసఁగెను.

పవిత్ర నాజీవ

యోగులకుఁ బరిచర్యచేయు కాలమున, నాతనితల్లి తనకస్వతంత్రత గలిగెనని పోలసితి ననిగాని ధీరితోడను జెప్పి యెఱుఁగదు. అచటఁ బను గాని, తనే యింటికి వచ్చి ప్రియమారఁ గుమారునిఁ జేరఁజీరి తొడ, లన్నియు మోని చుంచుదువ్వి ముద్దిడుకొని, దేహము నివిరి కౌఁగి మీఁదఁ గూర్చుండఁబెట్టి నందించుచుండును. అయినను బాలుఁడు లించుకొని, యనేకవిధముల లార మసారమనియు, భక్తిలతకుఁ జీడ ఆమె కెదురాడఁడయ్యె; గా

పుచుపువంటిదనియు, సంబంధబాంధవము లాభాసము లనియుఁ గుర్తెఱిఁగియుండుట వలన, ఆసౌఖ్యముల ననుభవించి ముగ్ధుఁడుగాక చిత్తము శ్రీహరిమీఁదనే నిలిపి యుంచెను. ఇట్లుండ నొకనాఁటిరాత్రి యాతనితల్లి పాలుపిదుకుట కావుపద్దకుఁ బోవుచు మార్గమధ్యమున నొక నల్లత్రాఁచుఁబామును ద్రొక్కెను. తోడనే పాము బుస్సుమని తిరుగఁబడి కఱచి యామెను జంపివేసెను.

తల్లి చనిపోయినందుల కాబాలుఁడు వగచుటకు మాఱుగా "సంసారబంధము తెగిపోయినది. ఇఁక నే నెట్లున్నను నాకొఱకు విచారించువారు లేరు. ఇఁక నే ననవరతము హరిభజనమునఁ బ్రొద్దుపుచ్చవచ్చు" నని మిగుల నానందించెను. ఈ తలంపుతో నాతఁ డచ్చోటినుండి కదలి యుత్తరాభిముఖుఁడై పోయి పర్వతములు, అరణ్యములు, నదులు, జనపదములు, పురములు, పట్టణములు మొదలగునవి పెక్కేనన్ని గడచి, తుదకొక్కనదీతీరమున నిలిచి స్నానమాడి నదులోని జలములు త్రాని విగతశ్రముఁడై, యొక్కరావిచెట్టుక్రింద గురూపదేశప్రకారము హృదయమున నెలకొనియున్న శ్రీపతిని ధ్యానించుచు, ఆనందాశ్రులు వెల్లివిరియఁ గూర్చుండియుండ దేవదేవుఁడు ప్రత్యక్షమైన ట్లయ్యెను. తోడనే బాలకుఁ డులికిపడి లేచి యావైకుంఠుని దివ్యమంగళవిగ్రహమును గనులారఁ జూడఁగోరెను; గాని ప్రయోజనము లేదయ్యెను. అంతఁ జేయునది లేక శ్రీహరికొఱకు ఆబాలుఁడు వనమంతయుఁ దిరుగుచుండఁగా "కుమారా! ఏల యట్లు భ్రమ్మరెదవు? నీ వీపుట్టువున నన్నుఁ జూడఁజాలవు. కామాది రిపుషడ్వర్గములను జయించినవాఁడేగాని నన్ను దెలిసికొనఁజాలఁడు. నీకోరిక కొన సాగుటకై నాతేజస్సు నీకుఁ బ్రకాశపఱచితిని. నామీఁది భక్తి సకలదోషపుంజముల నడంచును. నన్ను సేవించుటవలన నాయెడల భక్తి కలుగును. జన్మాంతరమునఁ గూడ నీకు నాయెడల నీయచంచలభక్తి కుదిరియుండును. నాయనుమతివలన నీవు నాభక్తశేఖరుఁడవై పుట్టెదవు. ఈసృష్టి కడచి, రాత్రిపోయిన పిదపఁ బుట్టి నీవు సాత్వికులలో నగ్రేసరుఁడ వయ్యెదవు" అను పలుకులు వినఁబడెను. అది విని యాబాలుఁడు మహాశ్చర్యభరితుఁడై శిరము వంచి చేతులు జోడించి మ్రొక్కి, శ్రీహరికృపకు సంతసించుచు పరమేశ్వరుని అనంతనామములతోఁ గీర్తించుచుఁ జరియించుచుండఁగాఁ, గొంతకాలమునకు మృత్యువు చేరవచ్చెను. తోడనే యాబాలుఁడు పంచభూతాత్మకమును, గర్వసంభవమును నైన పూర్వదేహము విడిచి భాగవతదేహము ధరించెను. అంతలోఁ బ్రళయము సమీపించెను. అప్పుడు నిద్రింపఁబోవుచున్న బ్రహ్మ నిశ్వాసమువెంట లోనఁ బ్రవేశించెను. ఇట్లు వేయి యుగములు గడచిన పిదప విధాత మఱల లేచి సృష్టి ప్రారంభించుచుండఁగా, నాతని ప్రాణములవలన మరీచి మున్నగువారితోఁ బుట్టి, యాతఁడు నారదుఁడను

పేరుతో బ్రహ్మమానసపుత్రుఁ డయ్యెను. పిదప నారదుఁ డఖండ బ్రహ్మచారియై నారాయణుని యనుగ్రహమువలన మూఁడులోకంబుల బహిరంతరంబులందున అడ్డులేక, యీశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులైన సప్తస్వరములు పమయంతః ప్రాయగు వీణ నాలాపించుకొనుచు, పద్మనాభునిగాథలు పాడుకొనుచు, మహానందముతోఁ దిరుగఁ జొచ్చెను.

పిదప నారదుఁడు ప్రజానిర్మాణశక్తి యలవడుటకై శ్రీమన్నారాయణునిఁ గురించి తపస్సు ప్రారంభించిన దక్షుని కుమారులకు నివృత్తిమార్గము నుపదేశించెను. తోడనే వారు తపస్సు వదలి వైకుంఠమునకుఁ బోయిరి. అది తెలిసి దక్షుఁడు మిగులఁ గోపించి, నీకొక్కచో నివాసము లేకుండుఁగాక యని శపించెను. అప్పటి నుండియు నాతఁడు సర్వదా త్రిలోకసంచారియై నారాయణుని కీర్తించుచు హరి భక్తులలో నగ్రేసరుఁడై యుండెను.

సీ. "ముక్తికాంతైకాంత మోహనకృత్యముల్ కేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపఃఫలసారముల్ కేలిమై హరినామకీర్తనములు
తే. పుణ్యమూలంబు లనపాయమూలకంబు లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామకీర్తనములు."

(భాగ స్కంధ. 6. ప. 119.)

---

## 5. విభీషణుఁడు

మూఁడవ బ్రహ్మ యగు విశ్రవోబ్రహ్మవద్దకుఁ దండ్రి యగుసుమాలి పంపునఁ గైకసి యను కన్యామణి వరించి వచ్చి పుత్రదానము వేఁడుకొనెను. అంత నాతఁడు "నీవు సంజవేళఁ గామబాధితవై వచ్చితివి. కావున నీకు ఘోరాచారు లగు రాక్షసులు పుట్టెద" రనియెను. "మహామహిమాసమంచితుఁడవు నీవిట్లు లాడఁదగునా" యని కైకసి యడుగఁగా విశ్రవోబ్రహ్మ దివ్యదృష్టితో భవిష్యద్విషయములను దెలిసికొని "కాలదోషము పెద్దలకేకాదు. విధాతకైనఁ దప్పింపఁ దరముగాదు. నీ కుమారులలోఁ గడసారివాఁ డగు మూఁడవవాఁడు మాత్రము, తన అన్నలవలెఁ గాక విద్యాగరిష్ఠుఁడును బ్రహ్మనిష్ఠుఁడు నగును. ఆతనివలననే కులము నిలుచు" నని చెప్పెను.

పిదపఁ గైకసికి ముగ్గురు కుమారులు కలిగిరి. రావణుఁడు, కుంభకర్ణుఁడు, విభీషణుఁడు నని వరుసగా వారికిఁ బేరులు పెట్టఁబడియెను. ఆమెకు శూర్పణఖ

యను కుమార్తె గూడ జనియించెను. దశగ్రీవుఁడును, గుంభకర్ణుఁడును లోకములను బాధింపసాగిరి. విభీషణుఁ డట్లుగాక భయభ్రాంతులై పరువెత్తు మునుల నాపి భయమునీఁటిచి, నానిమిత్తము వీరిని రక్షింపుఁ డని ప్రార్థించుచుండును. విభీషణుఁ డనేకసజ్జనుల యాశీర్వాదములను బడసెను. ఆతఁడు తండ్రివద్దఁ గూర్చుండి వేదార్థము లాలించుచు, వ్రతములు జేయుచు జితేంద్రియుఁడై పరోపకారము చేయుచుఁ, గులమర్యాద చెఱుపక తండ్రియనుగ్రహము గూడ సంపాదించుకొనెను.

పిదపఁ దల్లిసెలవు వడసి సోదరులు ముగ్వురును గోకర్ణాశ్రమమునకుఁ బోయి, బ్రహ్మనుగుఱించి తపస్సు ప్రారంభించిరి. రావణకుంభకర్ణుల తపోనిష్ఠలు ఘోరములై యుండెను. విభీషణుని తపోనిష్ఠ శాంతమై వెలసెను. వారితపోవహ్ని జ్వాలలను సహింపలేని దేవతలచేఁ బ్రార్థితుఁడై, వాణీపతి వారికిఁ బ్రత్యక్షమై వరములను వేఁడుకొండనియెను. దశగ్రీవుఁడు విద్యాధరోప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాదులవలన మృత్యువురాకుండునట్లు వరము కోరెను. సరస్వతి చేసినవంచన వలనఁ గుంభకర్ణుఁడు ఆఱుమాసములు నిద్రించునట్లును, ఒక్కనాఁడు భుజించునట్లును వరము ప్రార్థించెను. విభీషణుఁడు ఏయాశ్రమమునఁ బ్రవేశించినవుడాయాశ్రమధర్మములు నెఱవేర్చునట్లును, శిక్షతో నవసరము లేకుండఁగనే బ్రహ్మాస్త్రము స్వాధీన మగునట్లును వరము కోరెను. బ్రహ్మ వారు కోరిన వరములిచ్చి విభీషణుని దీవించి వెడలిపోయెను.

పిమ్మట రావణుఁడు కుబేరునిఁ బాఱఁదోలి లంకాపట్టణము స్వాధీనముచేసికొని, తాను మయునికూఁతురగు మందోదరినిఁ బెండ్లియాడి, కుంభకర్ణునకు బలికొమార్తెకుఁ గొమార్తె యగు వజ్రజ్వాలను, విభీషణునకు శైలూషుఁడను గంధర్వునికొమార్తె యగు సరమను బెండ్లిచేసెను. మఱియు నాతఁడు తనచెల్లెలగు శూర్పణఖను విద్యుజ్జిహ్వునకిచ్చి పెండ్లిచేసెను. పిదపఁ గాలము జరిగిపోవుచుండఁగా రావణుఁడు శ్రీరామచంద్రుని సతీతిలక మగుసీతామహాదేవిని హరించుకొనివచ్చి లంకలో నుంచెను. అంతవఱకును గూడ నన్నదమ్ముల హృదయవృత్తులు కలియలేదు. రావణకుంభకర్ణులు క్రూరకార్యములు చేయుట మానలేదు. విభీషణుఁ డందులకు వగచి సాధ్యమైనంతవఱకుఁ బ్రతీకారము చేయకుండ నుండ లేదు.

"రాముఁడు మనుష్యుఁడు; వంటయింటఁ జొచ్చిన కుందేలువంటివాఁడు" అని రావణకుంభకర్ణులు భావించిరి. "శ్రీరామచంద్రుఁడు లీలామానుషవిగ్రహుఁడు. కేవలము సర్వేశ్వరుని యవతారావతారము. ఆతఁడు దుష్టసంహారము నిమిత్తమును, ధర్మరక్షణముకొఱకును భూమిపై నవతరించెను" అని విభీషణుఁడు తలంచెను. తక్కిన రాక్షసు లందఱును రావణునే యనుసరించిరి. కావున వే

రావణుఁడు సీతను లంకకుఁ దెచ్చి, రాముఁడు నన్నేమి చేయఁగలఁ డని గర్వించెను. విభీషణున కిది చాలభయకారణ మయ్యెను. ఇట్లుండఁగా నాంజనేయుఁడు సీతాన్వేషణమునకై వచ్చి లంకను భస్మీపటలము గావించి పోయెను. అందులకు రక్కసులెల్లరును దెల్లపోయి మనము సరియైన ప్రయత్నములు చేసితిమిగా మాఁకొనిరి. ఇఁక లంకనువచ్చి రావణుఁడు బ్రతికిపోవఁగలఁ డని గర్వమునవహించిరి. విభీషణుఁ డట్లుగాదు. ఖరత్రిశిరాదులను క్షణమాత్రమున సంహరించినప్పుడే యాతఁడు రామచంద్రుఁ డజేయుఁ డనుకొనియెను. లంకాదహన మైనపిదప నాయూహ స్థిరపడెను. "రామభక్తుఁడే యంతపనిచేసినప్పుడు సాక్షాద్భగవానుఁ డగు రాముఁ డెంతపనిచేయును?" విభీషణుఁ డిట్లు తలంచుకొని చాల భీతిల్లెను. విజ్ఞానము భయకారణము కావుననే యని వక్కాణించును. అగ్నినిఁ జూచి, యిది దహించు నను జ్ఞానముగలవాఁడు దాని నంటఁడు. కావుననే వానికేమి కాలదు. "ఇదియొక వింతవస్తువు. అన్నిటికంటె దీనియందుఁ బ్రకాశగుణ మెక్కువయున్నది. ఇంతకంటె విశేషము లే" దని తలంచెడి అజ్ఞాని అగ్నికణమును బూలబంతివలె నాడింపఁబోవును; గాని తోడనే వాఁ డనుకొనినదానికి వ్యతిరేకముగఁ జేతులు కాలి బొబ్బ లెత్తి మంట ప్రారంభించును. అప్పుడు వగచిన లాభ మేమి ?

రావణుఁడు చేసిన దారుణవ్యాపారమువలన రాక్షసకులము నశించిపోవునని విభీషణునకుఁ దోఁచెను. అకటా! త్రిలోకములను జయించినరాక్షసవీరులు నామ రూపములు లేకుండఁబోవలసినదా? ఈతలంపుతో నాతఁడు నిండుకొలువున రాముని వానరులను నిముసమునఁ బరిమార్తుమని గండుమిగిలి ప్రగల్భములాడుచున్న రాక్షసుల నందఱను వారించి "ఏల వృథా గర్వోక్తు లాడెదరు? మంచి చెడ్డలు వలదా? మనరాజు ఆరాజుదేవినిఁ జెఱపట్టెను. అంత దండెత్తివచ్చుటలో శ్రీరామచంద్రునిదోష మేమి యున్నది? దుర్మార్గురాలగు శూర్పణఖ ఘోరరూపముతో వైదేహిని మ్రింగఁబోవుటనుగదా రాఘవులు కోపించి దానికిఁ బ్రాయశ్చిత్తముచేసిరి! దానిమీఁది యభిమానమువలననే గదా ఖరుఁడు రాఘవుల మీఁదికిఁ బోయి కూలెను. తప్పులన్నియు మనయందే యున్నవి. మంచిచెడ్డలు, ధర్మాధర్మములు తెలిపినంతమాత్రమున మగతనముపోదు. ఇపుడిచ్చటఁ బ్రగల్భములు కొట్టుచున్న మీరందఱు నారాముని దూతను హనుమంతు నేమి చేయఁగలిగితిరి? సామదానభేదములు నిరర్థకము లగునంతవఱకును దండోపాయము నవలంబింపరాదని నీతికోవిదులు చెప్పెదరు. అదియుఁగాక శ్రీరామచంద్రుఁ డిప్పుడు సంపూర్ణబలుఁడై యున్నాఁడు. అన్నా! రాక్షససార్వభౌమా! ఏల వ్యర్థపు నాశము తెచ్చిపెట్టెదవు? నీసేవకులను, బంధువులను, మిత్రులను, పుత్రకళత్రములను, నిన్ను, తుదకు

రాక్షసకులమును రక్షింపఁదలఁచెదవేని, దేవయజనసంభవయగు సీతామహాదేవిని రాముసకు సమర్పించి యభయమును బడయుము" అని పలికెను.

ఈమాటలు చెవులకు ములుకులై నాట, రావణుఁడు మిగులఁ గోపించి సభాస్థానము విడిచి యంతఃపురమునకుఁ బోయెను. విభీషణునకు విచారము మఱింత యధిక మయ్యెను. చెప్పి చేయించుటకేకాని యాతఁడు చేసి చూపుటకు సమర్థుఁడు కాఁడు గదా? ఒక్క రావణుఁడు మాత్రమే యిట్టి పట్టుపట్టియున్న మేలే కాని, రాక్షసులందఱు నిట్టి యభిప్రాయముతోడనే యున్నపు డేమిసేయవచ్చును? అయినను జెప్పవలసినస్థితి యింకను మించిపోలేదు. ఇట్లు తలంచి యాతఁడు మఱునాఁ డుదయమే రావణునియింటికిఁ బోయెను. అప్పటికి సన్నిధిని రావణుఁడు మంత్రులతో నీవిషయమే యాలోచించుచుండెను. విభీషణుఁడు మఱల "నీవు సీతను దెచ్చినది మొదలుకొని యన్నియు నపశకునములే యగుచున్నవి. ఈదుష్ప్రారంభమువలనఁగలుగు చెడుగులన్నియు నీమంత్రుల కెఱుకయే. అయినను, వారు నీకు వ్యతిరేకము చెప్పనోడి నీకోపాగ్నిని మఱింత రగుల్కొల్పుచున్నారు. సీతను రామున కిచ్చివేయుము" అని చెప్పెను. "నీవు మాకేమియు నాలోచన చెప్ప నక్కఱలేదు. పొమ్ము" అని రావణుఁడు తమ్ముని దిరస్కరించి సభకుఁ బోయెను.

విభీషణుఁడు మఱల నక్కడఁ బ్రత్యక్షమయ్యెను. కుంభకర్ణుఁడు నాఁడు నిద్ర మేల్కాంచి వచ్చెను. రావణుఁడు శూర్పణఖాపరాభవము మొదలు వాని కన్నియుఁ జెప్పెను. అప్పుడు కుంభకర్ణుఁడు "సీతను రామున కిచ్చివేయుటయే క్షేమము. ఆదిమధ్యాంతరహితుఁ డగు శ్రీమహావిష్ణువు రాక్షసకులమును నాశము సేయుట కిట్లు రాఘువకులమునఁ బుట్టెనని నారదుఁడు నాతోఁ జెప్పెను." అని యిట్లు చెప్పి, యాతఁ డంతలో రావణునిముఖము చూచి వాని కోపభావమును గ్రహించి తుదకు "నేనిన్ని మాటలవాఁడను గాను, లంక భస్మమైన దని వినినపుడే నాహృదయమునఁ గ్రోధాగ్ని ప్రజ్వలించినది. అది రాఘువులను మాడ్చి వేయకుండఁ జల్లారదు" దని చెప్పెను. రావణుఁ డందులకు సంతోషించుచుండఁగా, విభీషణుఁడు మఱల "అన్నా! ఆవెఱ్ఱిమాటల కేల యానందించెదవు? కుంభకర్ణుఁడు తొలుతఁ జెప్పినదంతయు యథార్థము. తరువాతఁ జెప్పినది నీమొగము చూచి చెప్పినది. కావున ఆదరింపఁదగినది కాదు." అని చెప్పెను. దానిపై నింద్రజిత్తు పినతండ్రిని "నీకిట్టిమాట లాడుట తగదు పొ"మ్మనియెను.

బాలకుండగు నింద్రజిత్తు పలికిన యీయనీతివాక్యమును వినిన విభీషణుని వంటి నీతిధురంధరునకు, ధర్మాధర్మపరిజ్ఞాతకు ఎట్లుండును? బాహుబలగర్వదుర్విదగ్ధుఁడా విభీషణునితో మాట్లాడఁదగినవాఁడు? ఇదియంతయుఁ జూచి విభీష

బుచు "ధర్మ మెంత తిరస్కరింపఁబడుచున్నది?" యనుకొని "అల్పుని మూర్ఖుని బహుభాషిని ఉత్సాహపూరితుని బాలుకుని రాజకార్యాలోచనము చేయునపుడు చేరనీయరాదని నీతికోవిదులు చెప్పుదురు. నీబుద్ధి యెప్పుడును ఎడతలనే పట్టుచున్నది. అట్టి నీవున్నచోట మంత్రాలోచనము చేయఁదొడఁగిన యీరాజుగారి నేర్పున కేక లోప మేమి? పుత్రరూపము పొందిన శత్రుఁడవు గాని, నీవు నాయన్నకుఁ బుత్త్రుఁడవా? శ్రీరామచంద్రుఁ డనిన దేవేంద్రుఁడో కుబేరుఁడో వీతిహోత్రుఁడో మఱియెవరో యనుకొంటివి. ఆతఁ డాదివిష్ణువు నపరావతారము సుమా. ఆతనియెడల నీబాణములు గడ్డిపోచ లగును!" అని మేఘనాదునకు బుద్ధి చెప్పి, పిమ్మట రావణునితో "తాటకను సంహరించెను. విరాధుని దునిమెను. ఖరుని ఖండించెను. మారీచుని వధించెను. ఇన్నిచేసినను నీవింకను రాముని తృణీకరించెదవు? కాలవశ మట్లి. రాక్షసకులావసానము సమీపించినప్పుడు నీకు జ్ఞాన మెట్లుండును? నీమంత్రులు సేనానాయకులు నూఱక బీరము లాడెదరు; గాని తమతమ శక్తిసామర్థ్యముల నెఱుఁగరు." అదియుఁ గాక,

ఉ. "తాత పులస్త్యుఁడట్ గనినతండ్రియు విశ్రవసుండు వైదికో
పేతము నిర్మలాచరణ మీవును బ్రహ్మవు చెప్పవచ్చునట్
నీతివివేకముల్ దొఱఁగి నిందకు నోర్చితి వేల దేవ! ము
న్నీ తెఱఁగెల్ల నొప్పదని యీవ యెఱుంగుదు చెప్ప నేటికిన్.

మ. జగతీనాథుఁడు నీకెపంబునఁ బులస్త్యబ్రహ్మవంశంబుపైఁ
దెగ నంభోధిగడాకమున్న కపు లుద్వృత్తిం ద్రికూటాద్రి పె
ల్లగిలం ద్రోవకమున్న లక్ష్మణుఁడు కీలాఘోరనారాచముల్
నిగుడం జేయకమున్న పుచ్చు మఱలన్ వేవేగ పృథ్వీసుతన్."

(భాస్కరరామాయణము, యుద్ధకాండ. ప. 134.136.)

అని చెప్పెను.

ఈపలుకులు దశకంఠునకు ములుకులవలెఁ దోఁచెను. తోడనే యాతఁడు విభీషణునిఁ జుఱచుఱఁ జూచుచు "క్రూరసర్పముతోఁ గలిసియుండుటకన్న సీతో నుండుట చాల నపాయకరము. స్నేహితునివలె దగ్గఱఁజేరుచు నొకదెస వైరము చూపు నీకంటె నిక్కపుఁ బగవాఁడే మంచివాఁడు. నీవు నాదాయాదివి గదా! నాపెంపు చూచి యెట్లు సహింపఁగలవు? కులపాంసనా! నాయెదుటనుండి లేచి పొమ్ము" అని గద్దించి పలికెను.

ధర్మజ్ఞునకు ధర్మము తిరస్కరింపఁ బడుచున్నపుడు కలుగుకోపముకంటె మఱియేకోపమును బెద్దదియు, భయంకరమైనదియుఁ గాదు. అందు నిది శ్రీహరి

యవతారమగు శ్రీరామచంద్రునకు సంబంధించిన ధర్మతిరస్కారము. ఇంక బ్రహ్మవంశజుఁడు దైవభక్తిపరతంత్రుఁడు నగు విభీషణుని కిపుడు గలుగు కోపము నెవరు వర్ణింపఁగలరు? కాని గంతులువేయుచు అంకెలువేయుట విభీషణునివంటి విజ్ఞాని లక్షణముగాదు. ఆతఁడు మఱల నిశ్చయముగా సోదరునిఁ జూచి,

ఉ. అన్నవు తండ్రియట్లు విను మంతియ కాదటమీఁద రాజ వే
మన్నను జెల్లుఁ గాక మణిచుండనముఖ్యములైన కానుక
ల్మున్నుగ సీత నిచ్చి జనలోకపతిం గని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుఁ గార్యముల్ వలదు సందియ మేలటు గాక తక్కినన్.

తే. వలదు చాటితి నతఁడు నీకోలఁదిగాఁడు, చేటుతఱిగాన నీకిట్లు చెడ్డబుద్ధి
పొడముచున్నది నాశంబుఁ బొందనున్న, మేఘమునకు వికీర్ణంపు మెఱుఁగునట్లు.

ఉ. నీ చెవిక్రిందఁ జేరి రజనీచరనాయక! తుచ్ఛవాక్యముల్
నీచులు కన్గొనిం బలుక నీకవి పథ్యము లయ్యె నేఁగతిం
జూచిన నాహితోక్తులకుఁ జొన్పదు నీమది గాన దుర్మదుం
డై చెడువానిపొంతఁ జన దండ్రు వసింపఁగ నీతికోవిదుల్.

సీ. నీ వెత్తఁజాలని నీలకంఠునివిల్లు పుడకకైవడిఁ దున్మి ప్రోగువెట్టె
నిలఁ గార్తవీర్యుబాహులు వేయుఁ ద్రుంచిన పరశురాముని నాజి భంగపఱిచె
కైలాస మెత్తిన ఘను నిన్ను గట్టిన వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నీపుత్రు వధియించి నీలంకఁ గాల్చిన హనుమంతు నేలిన యతని నేలె

ఆ. అట్టిరాముతోడ నసమానవైరంబు, పట్టి గెలుతు మనుట పడుచుబుద్ధి
చనదు సీత నిచ్చి శరణని రఘురాముఁ, గనుట మేలు చెడక మనుట మేలు."

(భాస్కర. యుద్ధ. ప. 141-143-144-146.)

అని గంభీరముగఁ బలికి యూరకుండెను.

విభీషణుని మాటలవలన రావణునకు రోషోదయంబై ప్రపంచజ్ఞానమును బూర్తిగఁ దుడిచివేసెను. తోడనే యాతఁడు తటాలున గద్దియనుండి యుఱికి తమ్ముని వక్షముపైఁ దన్నెను. ఆతాపుతో విభీషణుఁడు మూర్ఛిల్లి యాసనము మీఁదనుండి క్రిందఁ బడియెను. రావణుఁ డంతటితో శాంతింపక తమ్ముని కంఠము తెగనఱుక నూహించెను; కాని మంత్రులు వారించి గద్దియపైఁ గూర్చుండఁజేసిరి. విభీషణుఁడు కొంతతడవునకుఁ దెలివొంది సభామధ్యమున నిలిచి, మఱల—

క. "కామక్రోధమదంబులు, నీమనమున నిండియుండ నిర్మలధర్మం
బేమూలనుండు రావణ, నామాటలు చెవులఁ జొచ్చునా నీకింకన్.

చ. చనదు మహాద్విరోధ మని చక్కటిచెప్పిన నింకతప్పునం
గనలితి నీతిశూన్యులకుఁ గార్యము లేటికిఁ దోఁచు సిద్ధ వే
యును బనిలేదు నీవలన నొప్పనినావచనంబు లెల్ల నీ
వని మొన రాముచేఁ బడినయప్డు దెలింగెదు గాక పోయెదన్."

(భాస్కర. యుద్ధ. ప. 150-154.)

అని పలికి చివాలునఁ గొలువుపీడి, తల్లియగు కైకసిపాలికిం జని నమస్కరించి "అమ్మా! సీతను దెచ్చుట మంచిదిగాదని నే ననేకవిధములఁ జెప్పఁగా నీపెద్ద కొడుకు నన్ను గాలితోఁ దన్ని, తల నఱికెద నని కత్తియెత్తెను. ఇఁక నిక్కడ నుండుటకంటె వేఱుపాపము లేదని శ్రీరామచంద్రమూర్తిని శరణుగోరఁ బోవఁ దలంచితిని. సెలవిమ్ము." అని ప్రార్థించెను. కైకసియుఁ బెద్దకుమారుని దౌష్ట్యమునకుఁ జాల వగచి "పుత్త్రా! మీరు పుట్టినప్పుడే మీతండ్రి నీయన్న లిట్టి దుష్కార్యములు చేయుదురని చెప్పెను. రావణకుంభకర్ణులవలని యిడుములు సహింపఁజాలక పోయి దేవతలందఱును బ్రార్థింప, శ్రీహరి యిట్లు శ్రీరాముఁడై వారిని సంహరింప నవతరించెను. ఇఁక రాక్షసు లెల్లరు నెట్లును నశింతురు. నీవైన రఘురాముని శరణుఁజొచ్చి కులము నిలుపుట నాయదృష్టలేశము గదా? నాబిడ్డా! మీతండ్రి తపోమహాత్త్వము, హరిహరహిరణ్యగర్భులు, లోకపాలురు, గ్రహతారకములు, సప్తకులపర్వతములు, సముద్రములు, మహానదులు, నుభయసంధ్యలు, వేదవేదాంగములు, అహోరాత్రములు నిన్ను రక్షించుఁగాక! ధర్మ మెచ్చటనున్న నచ్చటనే జయమగుఁ బోయిరమ్ము" అని సెలవిచ్చెను. తన పరాభవమునకుఁ దల్లి మిగుల వగచుటంజేసి విభీషణుఁడు తన వాదమున నేమియుఁ బొరపాటులు లేవని దిటవు గాంచి, భయభక్తులతోఁ దల్లికి నమస్కరించి మంత్రిసహితముగ సముద్రము దాటివచ్చి, శ్రీరామునకు సమీపమున నాకసమున నిలిచెను.

మంత్రులతోడి విభీషణునిఁ గాంచి, సుగ్రీవుఁడు కపులతో "అదిగో! చూచితిరా ఆకసమున నైదుగురు రక్కసులు భీకరాయుధములను దాల్చి మనపై దండెత్తి వచ్చినా" రని చెప్పెను. తోడనే వానరులు "వాండ్రను గిరులు, తరువులు మున్నగు సమస్తసాధనములతోడనే మ్రందించెద మిదే చూడుఁ" డని కల్లోలము సేయసాగిరి. వానరుల సంరంభముఁ జూచి విభీషణుఁ డెలుఁగెత్తి "ఓకపివీరులారా! మేము మీతోఁ బోరవచ్చినవారము కాము. దేవయజనసంభవయగు సీతామహాదేవినిఁ దెచ్చుటవలన రాక్షసకులనంతనవనమునకు నిప్పుముట్టించుటవంటిదైనది. ఇఁకనైన జాగుసేయక యాదేవిని శ్రీరామచంద్రునకు సమర్పించి, శరణువేఁడి నీయాపదతోఁ బాటు మాయిపత్తుగూడఁ దప్పింపుమని మాయన్నయగు దశకంఠు ననేకవిధముల బోధించితిని. నాబోధన మేమియు నాతని తలకెక్కలేదు. పయిం బయిఁగఁ దనచేతలకు వ్యతిరేకము చెప్పితి నని నిండుకొలువున నన్ను దన్ని యవమానము చేసెను. అందులకు వగచి వానితోఁగూడ దుర్మరణము నొందనేల యని, శ్రీరామచంద్రుని శరణువేఁడవచ్చితిని. నాపేరు విభీషణుఁడు. వీరు నామంత్రులు" అని చెప్పెను. దానిపై వానరులలో వాదోపవాదములు పెరిఁగిపోయెను.

లక్ష్మణుఁడుగూడ రాక్షసులను నమ్మరా దనియెను. హనుమంతుఁడు "విభీషణుఁడు దుష్టబుద్ధి గాఁడు. లంకలో నేను పట్టువడినప్పు డీతఁడు దూత వధ్యుఁడు గాఁడని నన్ను విడిపించిన ధర్మాత్ముఁడు. ఈతఁ డవశ్యము అభయమిచ్చి రక్షింపఁదగినవాఁడు. వాలినిఁ జంపి సుగ్రీవునకు వానరసామ్రాజ్యపట్టాభిషేకము సేయుట విని, యీతఁడు తనయన్న యెట్లును జావక మానఁడనియు, మీప్రాపు చేరిన లంకారాజ్యము తనకుఁ బట్టముగట్టెద రనియు నమ్మివచ్చిన రాజనీతిధురంధరుఁడు. మీయం దీతనికి నిర్మలభక్తి యున్నదని చెప్పుటకు సందేహము లేదు" అని చెప్పెను. తుదకు శ్రీరాముఁడు విభీషణుని కభయ మిచ్చి సముద్రోదకముఁ దెప్పించి లక్ష్మణునిచే నాతనికి లంకాపట్టాభిషేకము చేయించెను. పిదప విభీషణుఁడు రాక్షసవీరుల బలాబలములను, రహస్యములును రామునకు స్పష్టముగ నెఱిఁగించెను.

తుదకు విభీషణుని సాయమువలననే శ్రీరాముఁడు అశ్రమముగ శత్రుసంహారము గావించివేసెను. పిదప సాక్షాత్తుగ నారాయణుఁ డగు రాముఁడు విమలభక్తిభరితుఁ డగువిభీషణునకు లంకలో రాక్షస సామ్రాజ్యమునకుఁ బట్టాభిషేకము చేసి, యిహమున సకలసౌఖ్యములును బరమున నాత్మసాయుజ్యము నొసంగెను.

---

# 6. భీష్ముఁడు

మహాతేజశ్శాలియైన ప్రతీపమహారాజు గంగాతీరమునఁ దపోనిష్ఠాగరిష్ఠుఁడై యుండఁగా, నొకనాఁ డొకసుందరి వచ్చి యాతని కుడితొడపైఁ గూర్చుండెను. కొంతదడవున కాతఁడు సమాధినుండి లేచి తన తొడమీఁదనున్న కలికి నారసి యచ్చెరువడి "నీవెవ్వతెవు? ఎందలిదానవు? ఇట్లు స్వేచ్ఛమై నాకుడితొడపై నేల కూర్చుంటివి" వని యడిగెను. తోడనే యామె "నేనుజాహ్నవిని. నీసద్గుణములు విని నిన్ను మోహించి వరించి వచ్చితిని. భానుతేజా! అనుగ్రహింపు" మని ప్రార్థించెను. అందుల కాతఁడు "మానినీ! అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన నాధర్మపత్నినిఁ గాక నే నెప్పుడును బరకాంతను దలంపనోపను. అట్టి నన్ను నీవిట్లు కోరవచ్చునా? అదియుఁగాక, నీవు స్త్రీభాగంబైన యెడమతొడ యెక్కక పురుషభాగం బైన కుడితొడ యెక్కితివి. కావున నీవు నాపుత్రునకు భార్యవు కాఁదగినదాన" వనియెను. సరియే యని గంగ యదృశ్య యై పోయెను.

పిమ్మటఁ బ్రతీపుఁడు ధర్మపత్ని యగుసునందాదేవితోఁ ననేకతీర్థములం గ్రుంకి, వేదోక్తము లగుననేకవ్రతముల నాచరించి, శంతనుఁడను నొక కుమారునిఁ

గనియెను. శంతనుఁడును బెరిఁగి పెద్దయై మహోదారగుణవంతుఁడును వీరాధివీరుఁడునై ప్రజల మెప్పులను బడయసాగెను. అపుడు ప్రతీపుఁడు సంప్రాప్తయౌవనుఁడైన తన కుమారుని సకలరాజ్యభారధౌరేయునిగాఁ బట్టాభిషేకంబు చేసి "గంగాతటమున నొకసుందరి నన్ను వరింపఁగా నాకుమారునకు రాణి వగుమంటిని. ఆమెయును నట్లేయని యంగీకరించెను; గావున నామెవచ్చినపుడు కులగోత్రములడుగక నామెయిష్టము చొప్పునఁ జేయు" మని చెప్పి తపోవనమునకుఁ బోయెను.

ప్రాప్తగా మీఁదఁబడిన రాజ్యభారమును జక్కఁగ నవరించుకొని, శంతనుఁ డొకనాఁ డొంటిగ గంగాతటమునకు వేఁట కరిగెను. అచ్చట నొక తరుణి విహరించుచుండెను. ఆమె సౌందర్యమునకు శంతనుఁడు చాల నబ్బురపడియెను. పిదప నొండొరులు చూచుకొనిరి. ఇరువురును పరస్పరమోహమును వెల్లడించిరి. "ఆమె నే నేమిచేసినను నన్ను వారింపకుండునట్లును, నాకప్రియము పలుకకుండునట్లును మాట యిచ్చెదవేని నేను నీకు భార్యనయ్యెద" ననియెను. కామశరవిద్ధుం డగుట శంతనుఁ డందుల కభ్యంతరము చెప్పక యామెను గ్రహించెను.

ఇట్లు వారు కొంతకాల మనంతసంతోషముతోఁ గడపునప్పటి కొకపుత్త్రుఁడు పుట్టెను. తోడనే గంగ యాబిడ్డను నీటిలోఁ బాఱవేసెను. ఇది తెలిసియును శంతనుఁడు "ఇట్లేల చేసితి"వని యడిగిన నామె పోవునేమోయని జడిసి యూరకుండెను. ఇట్లే యేడ్వురుబిడ్డలను గంగ నీటిలోఁ బాఱవేసెను. శంతనుఁ డామెవియోగమును సహింపఁజాలక యేమియు ననక యూరకుండెను; గాని యెనిమిదవబిడ్డను గూడ యథాప్రకారముగఁ బాఱవేయుచుండఁగా సహింపలేక, శంతనుఁ డేమైననుగానిమ్మని గంగను వారించి "దుర్లభులైన కొడుకుల నేడుగురను జంపినను సహించితిని; గాని యీబాలసూర్యప్రకాశుని విడువఁజాల" ననియెను. అపుడు గంగ మందహాసము గావించి "వసిష్ఠుఁ డష్టవసువులను మనుష్యజన్మము పొందెదరుగాక!" యని శపించెను. వారు భూమిపైఁ జిరకాలము నిలువఁజాలక నన్నుఁ బ్రార్థించిరి. అంత నేను వారి కభయమిచ్చితిని. నేను నీటిలో గిరివేసిన యాయేడ్వురు నేడ్వురు వసువులు. ఇట్లయ్యె నని నీవు వగవకుము. వారందఱ చతుర్థాంశములును, ఎనిమిదవ వాఁ డగుప్రభాసుని సంపూర్ణాంశము నీతనియందుఁ గలవు. ఈతఁడు పెద్దకాలము ఎల్లరు బలీ యన జీవించును. దేవవ్రతుఁ డగు నీకుమారుఁడు పెద్ద పెరుఁగునంత వఱకు నాయొద్దనే యుండు" నని చెప్పి గంగ నిజరూపము ధరించుకొనెను. శంతనుఁ డిదియంతయు విని దిగ్భ్రాంతుఁడై యేమియుఁ జేయలేక హస్తినపురమునకు బోయెను.

పురమున కరిగి శంతనుఁడు రాజ్యవ్యవస్థలు చక్కఁగ నేర్పఱచుకొని సామంత మహీపాలు రెల్లరును భయభక్తులతోఁ గొలుచుచుండ పరిపాలనము సేయుచు, మఱల నొకనాఁడు గంగాతీరమునకు వేఁటకు బయలుదేఱిపోయెను. నాఁ డాతఁడు చూచినచోట గంగ చాలసన్నగిలి తనవియోగమువలనఁ గృశించిపోయెనో యనునట్లుండెను. అందులకుఁ జాల వింతపడుచుఁ గారణ మరయఁగోరి యాతఁడు కొంచె మెడుటగఁ బోఁగా, నట నొక కిశోరవీరుఁడు బాణవిద్య నభ్యసించు నెపంబున శరజాలముతో గంగానదికి ఆనకట్ట కట్టియుండెను. అందులకు మఱింత వింత పడుచు నాతఁడు బాలార్కతేజుఁడై యున్న యాకిశోరవయస్కుఁ డెవ్వఁడా యని యూహింపసాగెను; గాని పుట్టినప్పుడు మాత్రమే చూచియుండుటవలనఁ దన కుమారుఁ డని గుర్తింపఁజాలకపోయెను. ఈసమయమునందే కుమారుఁడును ధను ర్ధరుఁడై యున్న తండ్రినిఁ జూచెను. ఆబాలుఁడు ఎదుటనున్న ధానుష్కుఁడు తన తండ్రి యని యెట్లూహింపఁగలఁడు? అయినను నిసర్గస్నేహమోహితుఁడై నిలిచి యుండెను. అంత గంగాదేవి దివ్యభూషణాలంకృతుఁడైన బాలుని కుడిచేయి పట్టు కొనివచ్చి "రాజా! ఏల యిట్లు వింతపడి చూచెదవు? ఈముద్దుబాలుఁడు నీకుమా రుఁడు. లక్షణములు తెలియుటలేదా? ఈచిట్టితండ్రి వసిష్ఠమహర్షివద్ద సాంగవేద ముల నభ్యసించెను. సకలశాస్త్రములును శుక్రబృహస్పతులవద్ద నేర్చెను. అస్త్ర విద్య పరశురామునిచెంత నభ్యసించి యాతనిని మించెను. ఆత్మవిజ్ఞానమున సనత్కుమారాదులతోఁ దుల్యుఁ డయ్యెను. వీనిని గ్రహింపుము" అని శంతనుని చేతి కిచ్చి నిజమార్గమున వెడలిపోయెను. శంతనుఁడును బెన్నిధిఁ గన్న పేదవాలె, మహామహిమాన్వితుఁడైన కుమారుఁడు తనకు లభించినందుకుఁ బరమానంద భరితుఁడై కుమారుని వెంటనిడుకొని పురమునకుఁ బోయెను. అట సకలసామంత సమక్షమున నాతఁడు దేవవ్రతునకు యథావద్రాజ్యపట్టాభిషేకము గావించి, యాత నితో వినోదంబుగఁ గాలము గడుపసాగెను.

ఇట్లు నాలుగు సంవత్సరములు కడచిన పిమ్మట, శంతనుఁడు యమునా తీరమునకు మఱల వేఁటకుఁ బోయెను. అచ్చట నాతని కపూర్వమైన సౌరభము ఘ్రాణతర్పణము గావించెను. అంత నాతఁడు దానిని విడువఁజాలక యది వచ్చినదిక్కునకుఁ బోఁగాఁ గొంతదూరమున నచ్చరలను దలదన్ను నొక్కకన్య యమునానదిలో నోడనడుపుచుండుట గానవచ్చెను. శంతనుఁ డామె సౌందర్య మునకు విమోహితుఁడై చెంతకరిగి "నీ వెవ్వరిదానవు? ఇచ్చట నొంటిగా నేల యోడ నడుపుచుంటి" వని యడిగెను. "నేను దాశరాజు కొమార్తను. నన్ను యోజనగంధియందురు. తండ్రినియోగమున ధర్మార్థము నేను యాతాయాతజనుల

నీనది యాచించుచున్నా" నని చెప్పెను. అదివిని సంతసించి, శంతనుఁడు దాశరాజు కడకుఁ బోయి, తనవృత్తాంతము సెప్పి తన యభిప్రాయ మెఱిఁగించెను. అందులకు దాశరాజు సంతసించి "పుట్టినప్పుడే కన్యక యొరుల కీవలసినదియే గదా ? నీవంటి యుత్తమోత్తముఁ డెందు లభించును? నీ కిచ్చుటకు నా కేమియు నభ్యంతరము లేదు; గాని యొక్కవిషయము నీతోఁ జెప్పవలసియున్నది. నీవలన నాకొమార్తెకుఁ గలిగిన పుత్త్రునకు రాజ్యాధికార మొసంగునట్లు మాట యిచ్చెదవేని నీయభీష్టము నెఱవేఱు" నని చెప్పెను. శంతనుఁ డిఁక నేమిచేయఁగలఁడు ? "నా కిదివఱకే యొక కుమారుఁడు గలఁడు. ఆతనికి యువరాజపట్టాభిషేకము చేసి యుంటిని. నీకోరిక నెఱవేఱుట కవకాశము లేదు" అని శంతనుఁడు చెప్పెను. "అయినఁ బ్రయోజనములే" దని దాశరాజు చెప్పెను. చేయునది లేక బిక్కమొగముతో శంతనుఁ డింటికి మఱలెను.

ఇంటికి వచ్చినపిదపఁ బూర్వము భగవద్ధ్యానమున సర్వమును మఱచియుండు శంతనుఁడు, ఇప్పుడు సత్యవతీధ్యానమున సర్వమును మఱచిపోయెను. ఒకటి రెండు దినములు గడచిపోయిన వెనుక దేవవ్రతునకుఁ దండ్రి యిట్లుండుట తెలియవచ్చెను. తోడనే యాతఁడు తండ్రి చెంతకు వచ్చి——

**చ. "భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టి శా**
**త్రవనివహంబు లేదు వసుధాప్రజ కెల్ల ననంతసంతతో**
**త్సవముల రాజులెల్ల ననిశంబు విధేయులు నీకు నిట్లు మా**
**నవవృషభేంద్ర! యేలొకో మనఃపరితాపముఁ బొంది యుండఁగన్."**

**(ఆంధ్రభార. ఆ. ౪. ప. 179.)**

అని యడిగెను. కొడుకు కీట్లడుగుటవలన శంతనునకుఁ గొంచెము ధైర్యమువచ్చెను. అప్పు డాతఁడు "వత్సా! అనపత్యతయు, నేకపుత్త్రతయు సమానమే యని శాస్త్రములు చెప్పుచున్నవి. అగుట నీకుఁ దోడుగ మఱికొందఱు కొడుకులఁ బడయఁ గోరితిని. అగ్నిహోత్రమును, సంతానమును, వేదములు నెడతెగకూడదని మునీశ్వరులు చెప్పిరి. నీ వస్త్రశస్త్రవిద్యాకోవిదుఁడవు. సంగరము లన్న నీకు సంబరము. రణ మన్నఁ దక్కిన సర్వమును విడిచి దూఁకెదవు. శత్రుసంహార మనిన నీకెంతో యానందము. అగుట నీవు చిరజీవి వగుదు వని నమ్ముటకు వీలు లేదు. కావున బహుపుత్త్రుల నిమిత్తము వివాహము చేసికొనఁ గోరిక కల" దని చెప్పి యూరకుండెను.

అపుడు దేవవ్రతుఁడు వృద్ధామాత్యపురోహితసుహృజ్జనులతో నీవిషయము ప్రస్తావించెను. ఆప్రసంగమునఁ దన తండ్రికిని దాశరాజునకును జరిగిన సంభాషణము

గాంగేయునకును దెలియవచ్చెను. తోడనే యాతఁడనంతసైన్యముతోఁ గదలిపోయి దాశరాజు చెంతకరిగి "మా రాజుగారికి సత్యవతిని దేవిగా సమర్పింపు" మని చెప్పెను. దాశరాజందుల కానందించి "మహాతేజా! నీవు సకలమును దెలిసినవాఁడవు. తండ్రికార్యము నిమిత్తము వచ్చితివి. ధన్యుండవైతివి. ఈసత్యవతి యెవ్వనివీర్యమునఁ బొడమినదో, యాయుపరిచరుఁడు ఈమెను నీ తండ్రికే యిచ్చునది యని చెప్పెను. ఆకారణమువలననే మున్నొకవరుఁడు రాఁగా నేను తిరస్కరించితిని. అయిన నిప్పుడు నా ప్రార్థన మేమనఁగా:— ఈసత్యవతికి శంతనునివలనఁ గలిగిన పుత్రునకు రాజ్యాధికారము రావలెను. అది యిప్పుడు నీపాలఁ బడి యున్నది. ఇఁకెట్లిది పొసఁగును?" అని చెప్పెను. అంతట దేవవ్రతుఁడు

చ. "వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయసంస్థితి యీలలితాంగి కుద్భవిం
చినతనయుండ రాజ్యము చేయఁగ నర్హుఁడు వాఁడ మాకు ని
ల్లను బతి వాఁడ కౌరవకులస్థితి కారుఁ డుదారసంపదన్."

(ఆంధ్రభార. ఆ. ౪. ప 187)

అని ప్రతిజ్ఞఁ జేసెను; కాని యంతటితో దాశరాజునకుఁ దృప్తి కలుగ లేదు. ఆతఁడు మఱల "వీరమణీ! నీవు మహానుభావుఁడవు గావున నిట్టి ప్రతిన సేయఁ గలిగితివి; కాని భావికాలమున నీకుమారులుగూడ నీవంటివారే యగుదురా? నీ నియమమును వారు పాలింతురా?" యనియెను. ఇదియు నొక ప్రబలసందేహమే. కావున గాంగేయుఁడు మఱల వెంటనే,

క. "ధృతిఁ బూని బ్రహ్మచర్య వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యతయైనను లోకము లాయతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై."

(ఆంధ్రభారతము. ఆ. ౪. ప. 190.)

అని శపథము చేసెను. దాశరాజు సంశయము లన్నియుఁ దీఱిపోయెను. ఆతఁడు తన కుమార్తె రాజమాత యగుట కానందమును, గాంగేయుఁ డంతటి దుర్ఘట ప్రతిజ్ఞలు సేసినందుల కాశ్చర్యమును గని, తోడనే సత్యవతి నిచ్చి పంపివేసెను. ఆయమయు మహానందముతో దేవవ్రతుని వెంట హస్తినాపురమునకుఁ బోయెను. ఒక శుభముహూర్తంబున శంతనుఁడు యోజనగంధి యగు సత్యవతిని వివాహమాడి మహోన్నతప్రతిజ్ఞలుపూనిన కుమారుని యాత్మోన్నతి కెంతయు నలరి, యాతనికి స్వచ్ఛందమరణం బగునట్లు వరమిచ్చెను. దేవవ్రతుఁ డిట్టిభీష్మవ్రతములు దాల్చుటవలన నప్పటినుండియు భీష్ముఁ డనుపేరున వ్యవహరింపఁబడసాగెను.

తరువాత శంతనుఁడు సత్యవతీదేవియందు చిత్రాంగదుఁడు-విచిత్రవీర్యుఁడు నను నిద్దఱు కుమారులం బడసి, వారు యౌవనముఁ బ్రాపింపకమున్నె పరలోక

గతుఁ డయ్యెను. సకలభారమును భీష్మునిపైఁ బడెను. భీష్ముఁడు తండ్రికిఁ బారలౌకిక క్రియ లన్నియు నిర్వర్తించి, చిత్రాంగదునకుఁ బట్టాభిషేకము చేసెను. చిత్రాంగదుఁడు చాలఁ బరాక్రమశాలి. గెల్లి కయ్యము చేయుట యనిన నాతనికిఁ బరమసంతోషము. భీష్ముఁడు నయమున భయమున ననేకవిధములఁ జెప్పిచూచెను, కాని ప్రయోజనము లేకపోయెను. ఇట్లుండఁగా నొకప్పుడు చిత్రాంగదుఁడను గంధర్వునకును, చిత్రాంగదునకును యుద్ధము పొసఁగెను. కురుక్షేత్రమునందలి హిరణ్మతీనదీతీరమున నిరువురు చిత్రాంగదులును కత్తియుఁ గత్తియుఁ గలిపిరి. గంధర్వుఁడు మాయావియై శంతనుకుమారుని నిర్జించెను. చేయునది లేక భీష్ముఁడు చిత్రాంగదుని రాజ్యమును విచిత్రవీర్యునకుఁ బట్టముఁ గట్టెను.

తరువాత విచిత్రవీర్యుఁడు వివాహయోగ్యుఁడై యుండుట యెఱింగి భీష్ముఁడు వివాహప్రయత్నుఁడై, కాశీరాజుకొమార్తెలకు మువ్వురకు స్వయంవర మగునని విని ధనుర్ధరుఁడై, యొక్కరుఁడు కాశీనగరమున కరిగి స్వయంవర మహోత్సవమునకై మూఁగియున్న రాజలోకంబు తెఱగుపడి చూచుచుండఁ నామువ్వురు కన్యలను రథమెక్కించికొని "ఓ రాజులారా! నాతమ్మునకుఁ బెండ్లి చేయుటకై యీకన్యాత్రయమును గొనిపోవుచున్నాను. చేతనైనవా రెదిరించి పోరవచ్చును. అష్టవిధవివాహములయందును క్షత్రియులకు గాంధర్వమును రాక్షసమును నుత్తమములు. స్వయంవరమున జయించి వివాహమగుట యంతకంటెను మహోత్తమము" అని యెలుఁగెత్తి చెప్పి రథము దోలించెను.

అచ్చటి రాజు లెల్లరు నది విని భీష్మునిపై నెత్తివచ్చిరి. పోరు ఘోరమయ్యెను. అందఱి నోడించి యార్చిపేర్చి భీష్ముఁడు ముందునకు బయలుదేఱెను. ఇంతలో నిలునిలు మని సాల్వుఁడు దండెత్తి వచ్చెను. మఱల యుద్ధము భీకరముగఁ బ్రవర్తిల్లెను. తుదకు సాల్వుఁడుగూడ భగ్నమనోరథుఁడై వెనుదిరిగి పోయెను. భీష్ముఁడు నిరంకుశుఁడై హస్తినపురమునకు వచ్చి యామువ్వురకన్యలను దమ్మునకు వివాహము సేయుటకుఁ బ్రయత్నించుచుండఁగా, కాశీరాజు పెద్దకొమార్తె యగు అంబ "నన్ను సాల్వపతి వరించెను. నే నాతని వరించితిని. మాతండ్రి యంగీకరించి మాట యిచ్చెను. ఇఁకపై నీ కేది ధర్మమని తోఁచిన నట్లుచేయు" మని చెప్పెను. తోడనే భీష్ముఁడు బ్రాహ్మణుల సహాయమున నామెను సాల్వరాజుచెంత కంపివేసి అంబాలిక, అంబిక అను తక్కినయిరువురు కన్యకలను విచిత్రవీర్యున కిచ్చి పెండ్లి చేసెను.

వివాహానంతర మచ్చెరలను దలదన్నఁగల అంబాలిక అంబికలతోడిదే లోకమని భావించి, విచిత్రవీర్యుఁడు రాజకార్యముల నుపేక్షించి క్రీడాసక్తుఁ

డయ్యెను. కాయము లనపాయములు కావు గదా? మితితప్పి భుజించిన అన్నమే విషమగుచున్నపు డిఁకఁ బక్కినవానినిగుఱించి చెప్పవలసిన దేమున్నది? విచిత్ర వీర్యుఁ డిట్టి సంతతక్రీడవలన శోషించి తుదకు స్వర్గమునకుఁ బోయెను. అందఱు కెల్లరును వగచిరి. భీష్ముఁడును మిగుల విచారించెను. ఏమిలాభము? విచిత్రవీర్యున కగ్నిసంస్కారాదికములు నిర్వర్తించి తల్లిని, మఱఁదండ్రను సమాశ్వాసించి భీష్ముఁడు రాజకార్యములను జక్కఁబెట్టఁ జొచ్చెను.

అటుమీఁది సత్యవతి భీష్మునితో "కురువీరా! నీవు సకలధర్మములు నెఱింగిన దవు. నేనొక్కటి చెప్పెద వినుము. ఇప్పు డీకురువంశమున నీవొక్కరుఁడవే యున్న వాఁడవు. ఈకురురాజ్యభారమును బరిగ్రహించి దిక్కులు తెలివొందఁ బరిపాలింపుము. సంతానమును గూడఁ బడయుము. బ్రహ్మ మొదలుగ నెడ తెగకవచ్చిన వంశము నీయట్టిపరాక్రమధౌరేయుఁ డుండఁగ విచ్ఛిన్న మగుట ధర్మముగాదు" అని పల్కెను. అందులకు భీష్ముఁ డిట్లు చెప్పెను. "అమ్మా! సకలము నెఱిఁగిన మీ రిట్లు పలుకఁదగునా! నే నలనాఁడు పల్కినపలుకులును, దాల్చినవ్రతమును మీ రెఱుఁ గనివా? వానిని నే నెట్లతిక్రమింపఁగలను? చంద్రుఁడు శైత్యమును, సూర్యుఁడు మహాతేజమును, అగ్ని ఉష్ణమును విడచినను నావ్రతమును నేనెట్లును విడువను. నావ్రతమే మీతండ్రి కోరిన శుల్కము. దానిని దప్పితినేని మీకు ద్రోహము చేసినవాఁడ నగుదును. అదియట్లుండుఁగాక! మీరు సెలవిచ్చినట్లు నాకుఁ దెలియని ధర్మములు లేవు. కావున శంతనునివంశము శాశ్వతమై వెలయుటకు క్షత్రియ ధర్మము మనవిచేసెదఁ జిత్తగింపుఁడు. నేను చెప్పినదానిని ధర్మాధర్మవిదులును, లోకయాత్రానిపుణులును అయిన పురోహితప్రముఖబ్రాహ్మణశ్రేష్ఠులతోఁగూడ నాలోచించి చేయుఁడు. పితృవధామర్షితుఁడైన పరశురాముఁడు గర్భగతబాలు రతోఁ గూడ క్షత్రియవీరులనందఱను సంహరించినపుడు, వారి స్త్రీలయందు ధర్మవిదులైన బ్రాహ్మణులు సంతానములను దయచేసి క్షత్రియజాతిని నిలుపలేదా? బలి యను రాజు దీర్ఘతముఁ డను బ్రాహ్మణునివలనఁ దన భార్యయందు అంగరాజు అను కుమారునిఁ బడసెను. మఱియు నిట్లే యుత్తమక్షత్రియక్షేత్రములయందు ధర్మమార్గమున బ్రాహ్మణులవలనఁ బుట్టి వంశకరులైనక్షత్రియు లనేకులు గలరు. కావున నియతాత్ముఁడును, ధర్మస్వరూపుఁడును, జగత్పావనుఁడు నైనబ్రాహ్మణుని రప్పించి విచిత్రవీర్యునిభార్యయందు సంతానమును బడయుఁడు."

ఈమాటలు విని సత్యవతి మిగుల నలరి, చిన్నతనమునఁ దానోడనడుపు నపుడు పరాశరుఁడు వచ్చుట, వ్యాసభట్టారకుఁ డుదయించి పనిగలయపుడు స్మరించిన వచ్చెద నని చెప్పి తపోవనమునకు వెడలిపోవుట - మున్నగునవి యెల్లఁ

జెప్పి మహాత్ముఁడైన యీ వ్యాసభగవానుడే యిప్పుడు కురువంశమును నిలుపుటకు సమర్థుఁ డని భీష్మునితో ననియెను. "ఇది బాగుగనున్నది. ఇంతకంటెఁ దరణోపాయము లేదు. వేదవ్యాసమహర్షికి బ్రహ్మలకుఁగల శక్తులన్నియుఁ గల" వని భీష్ముఁడు తనయంగీకారమును దెలిపెను. తోడనే సత్యవతి వ్యాసుని స్మరించెను. వ్యాసభగవానుఁడు ప్రత్యక్షమై వారిచేఁ బూజితుఁ డయ్యెను.

సత్యవతి చాలఁగాలమునకుఁ గనులఁబడిన యాప్రథమపుత్రునిఁ జూచి హర్ష పులకితయై ప్రియపూర్వకముగఁ గౌఁగిలించికొని "తనయునిపైఁ దండ్రి కెట్టి యధికారము గలదో, తల్లికి నట్టిదే కలదు. కావున నీకు నే నేదేని నియమింపవచ్చు" నని చెప్పి తమకుఁ బటస్థించిన విషమావస్థ నంతయుఁ జెప్పెను. వ్యాసుఁడు తల్లి యాజ్ఞ చొప్పున బ్రవర్తించెను. ధృతరాష్ట్రుఁడు, పాండురాజు, విదురుఁడు నవతరించిరి. భీష్ముఁడు ధృతరాష్ట్రుఁడు పెద్దయగునంతవఱకు రాజకార్యములను జక్కఁబెట్టి, దేశ మకంటక ముగఁ జేసి, పిదప ధృతరాష్ట్రుని భుజస్కంధమున రాజ్యలక్ష్మిని నిలిపెను.

పిమ్మట ధృతరాష్ట్రాదులకుఁ జక్కని కన్నియలను దెచ్చి భీష్ముఁడు వివాహ ములు చేసెను. వారికి దుర్యోధనాదికుమారు లుద్భవించి తమలోఁ దాము కలహించుకొనఁ బ్రారంభించిరి. భీష్ముఁ డనేకవిధముల వారించెను; కాని ప్రయోజనము లేకపోయెను. యౌవనమదంబునఁ గన్నులుగానక చరించు ప్రభుకుమారులకుఁ బెద్దల యుపదేశములు తలకెక్కవు గదా ?

అనేకావాంతరములు జరిగిపోయినపిదప ధర్మరాజు రాజసూయయాగము చేసెను. అపుడు ధర్మరాజునకు అర్ఘ్య మెవరి కీయఁబడునని సందేహము గలిగెను. ఈధర్మసందేహము దీర్ప నెవరికి సాధ్య మగును ? ధర్మరాజు భీష్మునిఁ బ్రార్థించెను. భీష్ముఁడు వెంటనే ప్రత్యుత్తరమిచ్చెను. సకలదుష్టసంహారమునిమిత్తము భువి నవతరించిన శ్రీహరి, తన నమ్మినపరమేశ్వరుఁడు, లీలామానుషవిగ్రహుఁడై యున్న లక్ష్మీపతియగు శ్రీకృష్ణుఁ డెదుటనుండ భీష్మున కాలోచనచేయవలసిన యవసర మేమున్నది? తోడనే ధర్మజుఁడు కృష్ణున కర్ఘ్య మిచ్చెను; కాని యది శిశుపాలు నకు సమ్మతము కాదయ్యెను. ఆధూర్తుఁడు విజ్ఞానిశేఖరుఁడైన భీష్ముని, ధర్మావ తారుఁడైన ధర్మజుని, సాక్షాన్నారాయణుఁ డగు కృష్ణునిఁ గూడ నీవిషయమున నిందించెను. క్రమక్రమముగ వాదోపవాదములు పెరిఁగిపోయెను. తుదకు శ్రీకృష్ణుఁడు తనచక్రముతో శిశుపాలుని సంహరించి, రాజసూయమును నిర్విఘ్న ముగఁ గొనసాగించెను.

ద్రౌపదీవస్త్రాపహరణము మున్నగు ననేకవిపత్సమయములయందు భీష్ముఁడు ధర్మము చెప్పి, దుర్యోధనాదులను దురుద్యోగములనుండి మఱలింపఁ జూచెఁగాని

ప్రయోజనము లేకపోయెను. తుదకుఁ గౌరవపాండవులకు యుద్ధము పొసఁగెను. భీష్ముని శరీరము దుర్యోధనుని పక్షమునందును, మనస్సు శ్రీకృష్ణసంబంధు లగు పాండవులపక్షమునను ఉండెను. యుద్ధప్రారంభసమయమున భీష్మునకు సర్వసేనాధిపత్యము వచ్చెను. అప్పు డాతఁడు చూపిన సంగ్రామచాతుర్యము అసమానము. భీష్ముని వధించెద నని ప్రతినపూని, యర్జునుండు తేపతేపకును ఏమియుఁ జేయఁజాలకపోవుచుండుటఁ జూచి, కృష్ణుఁడు రెండుతడవలు "అర్జునా! నీవలనఁ గాదు. భీష్ముని నేను సంహారించెద" నని రథము దిగి చక్రముదాల్చి ముందుఁన కుఱికెను. భక్తాగ్రేసరచక్రవర్తి యగు భీష్ముఁ డప్పుడు కృష్ణు నిట్లు స్తుతించెను.—

సీ. "కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి కదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక మన్నింపు మని క్రీడి మరలఁ దిగువ
తే. గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి, నేడు భీష్మునిఁ జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ, దెరలి చనుదెంచు దేవుఁడు దిక్కు నాకు."
(భాగ. స్కం. 1 ప 222.)

తుదకుఁ బాండవులు భీష్మునిజయింపలేక ఒకనాఁటిరాత్రి రహస్యముగఁ గృష్ణుని వెంటఁబెట్టుకొనిపోయి వారు "తాతా! నీవెట్లు చచ్చెదవో చెప్పు" మని కోరిరి. అందులకు భీష్ముఁడు మహానందముతో "వత్సా! నన్ను జయింప నెవ్వని తరమును గాదు. అయినను మీపక్షము ధర్మబద్ధమై యున్నది. కేవలము శ్రీమన్నారాయణమూర్తి యగు కృష్ణుఁడు మీకాంగుబంగారమై యున్నాఁడు. మీ కెట్లును జయము తప్పదు. నే నిప్పు డేపక్షమునఁ బోరుచున్నానో, యాపక్షమున కోటమి తప్పదు. దుర్యోధనుఁడు శ్రీకృష్ణునిఁ గోరక మానె ననుటకు దేవునిఁ దిరస్కరించె ననియు, విజయమును గోరక మానె ననియు నర్థము. కృష్ణా! నీవు వీరిని వెంటఁ బెట్టుకొని నాదరి కేల రావలెను? పాండుకుమారులలో నీ కాంతరంగికభక్తులు కానివా రెవరు? భవిష్యత్తును నీవే వారికేల తెలుపరాదు? ఇదియంతయు నీవృద్ధుని యెడఁగల ప్రేమ. ఈ దీనునియెడల ననుగ్రహము. ఇది భక్తరక్షణక్రమము. సర్వేశ్వరా! నీలీల లెరికిఁ దెలియును? యుధిష్ఠిరా! నేను ఆఁడుదానిని, ఆఁడుదాని పేరుగలవానిని, తొల్లిటిజన్మమున నాఁడుదియైన వానిని, మధ్యకాలమున మగతనము పొందినవానిని ఎదిరించి పోరను. మీరు శిఖండిని నాకెదుటఁ బెట్టి పోరించుచో నే నస్త్రములు క్రిందఁ బాఱవేసెదను. అప్పు డర్జునుఁడు విజృంభించి తనపని నెఱవేర్చుకొనునది" అని చెప్పెను.

అర్జునుఁ డట్లే చేసెను. భీష్ముఁ డస్త్రశస్త్రములను గ్రిందఁ బడ వేసెను. అర్జునుఁ డంపగమితో భీష్ముని జర్జరితాంగునిఁ గావించెను. భీష్ముఁడు పడిపోయెను.

కాని యొడలంతయు బాణములు గ్రుచ్చుకొని యుండుటచే నాతనిమేను భూతలము సోకలేదు. అప్పుడు కౌరవులును, పాండవులును గూడ నిరాయుధులై, నిష్కవచులై నిర్మత్సరులై తాత సన్నిధికి వచ్చిరి. అర్జునుఁ డొక్కఁడు మాత్రమే కోదండియై వచ్చెను. అప్పుడు భీష్ముఁడు వారలఁ జూచి "తల కేమియు నుపధానము లేదు. అగుటచేఁ దల నిలుచుట లే" దని చెప్పెను. తోడనే దుర్యోధనుఁడు హంసతూలికలతో నిర్మించినతలగడలను దే నియోగించెను; కాని భీష్ముఁడు వారించి, "అట్టి యుపధానములు పనికిరా" వని చెప్పి "అర్జునా! చూచెదవేల?" అనియెను. తోడనే యాతఁడు మూఁడు బాణములు విడిచి తాత తలనిలిపెను. "శయ్యకుఁ దగిన తలగడ సమర్పించితివోయీ" యని భీష్ముఁ డర్జునుని మెచ్చుకొనెను.

తరువాత భీష్మునకు దాహమయ్యెను. సుగంధ సంవాసితములగు శీతలజలములను దెప్పించుటకు దుర్యోధనుఁడు ప్రయత్నించెను; కాని భీష్ముఁడు భూతలమునందలి నీరు ముట్ట ననియెను. తోడనే యర్జునుఁడు భూమి చీల్చిపోవునట్లు బాణము విడిచెను. ఆరంధ్రమార్గమునఁ బాతాళగంగ బుస్సున ధారారూపమునఁ బైకెగసెను. ఆజలములఁ ద్రావి గాంగేయుఁడు దప్పి తీర్చుకొనెను.

ఉత్తరాయణమృతి మిగుల శ్రేష్ఠము. అగుట నాతఁడు ప్రాణములను బడిపోయినప్పుడే విడుచుట కంగీకరింపలేదు. అతనికి తండ్రి స్వేచ్ఛామరణము గలుగునట్లు వర మిచ్చియుండెను. ఆవరప్రభావమువలన నాతఁడు అంపశయ్యపైఁ బరుండి శ్రీమన్నారాయణుని దివ్యచరణకమలములను ధ్యానించుచు ధర్మరాజునకు సకలధర్మముల నుపదేశింపసాగెను. ఇంతలో మకరసంక్రమణము దాఁటిపోయెను. మాఘమాసము ప్రారంభ మయ్యెను. ఆయనములో నుత్తరాయణ మెట్టిదో యేకాదశి యట్టిది. అదియు సమీపించెను. నాఁడు ప్రాణములను విడిచెదనని భీష్ముఁడు వెల్లడించెను.

ఇది విని సకలమునితిలకులును వచ్చిరి. భక్తులు, విద్వాంసులు, కవులు, గాయకులు, రాజులు, మనుజులు సాక్షాత్తుగ శ్రీహరియైన కృష్ణపరబ్రహ్మ మున్నగువారెల్లరును వచ్చిరి. భీష్ముఁడు శ్రీకృష్ణుని ననేకవిధముల ధ్యానించి, ఐహిక జీవయాత్ర చాలించెను. భీష్ముని దేహమునుండి అపూర్వజ్యోతి యొకటి యాకసమున సంగమించుటఁజూచి, యెల్లరు నబ్బురపడి యాతని దివ్యత్వమును గొనియాడిరి.

# 7. ఆంజనేయుఁడు

కేసరి యను వానరుఁడు మేనమామ యగు కుంజరుని కొమార్తెను అంజన యనుకన్యను వివాహమాడి సుఖముగాఁ గాలము గడుపసాగెను. ఇట్లెన్ని సంవత్సరములు గడచినను సంతానము కలుగకుండుటను గేసరి యెంతయు వగచి, వాయుదేవునిఁ బూజింపుమని భార్యకు సెలవిచ్చెను. అంజనయు భర్తయనుమతిప్రకారము వాయుదేవుని గుఱించి తీవ్రతపస్సు చేసెను. అందులకు ఆనందించి వాయువు అగ్నిహోత్రమునుండి తనకు సంక్రమించిన శివతేజమును, శివుని యాజ్ఞవలన అంజనాదేవి కొసంగెను. అంజన గర్భవతియై యొక సంవత్సరము మోచి యొక శుభవాసరమునఁ గుమారునిఁ గనియెను. అంజనకుమారుఁ డగుటవలన నాతని కాంజనేయుఁ డనుపేరు వచ్చెను.

బిడ్డను గన్నపిదప అంజనాదేవి "తండ్రీ! నీకు వలసినన్ని పండ్లను దెచ్చి యిచ్చెద నుండు" మని యరణ్యమునకుఁ బోయెను. అప్పుడే సూర్యోదయమయ్యెను. బాలభానుఁడు బంగరుబంతివలె నుదయాచలమున వెలుంగుచుండెను. ఆతనిఁజూచి యాంజనేయుఁడు చెట్టున ముగ్గిన పండని భావించి తటాలున నెగసి ఉదయగిరిమీఁది నుఱికి భానుని మ్రింగఁబోయెను. అప్పుడు గ్రహణసమయ మగుటచే సూర్యునిఁ గబళించుటకు రాహువు వచ్చెను. సూర్యుఁడు స్వాధీనుఁడు కాకుండుటచే నేమి చేయుదు నని యిటునటు చూచుచున్న యాంజనేయుఁ డిదిగో యిది నల్లని పండు అని రాహువుమీఁది కుఱికెను. రాహువు ఆతని యౌద్ధత్యమున కోపలేక, పోయి యింద్రునితోఁ జెప్పుకొనియెను.

ఇది విని యింద్రుఁడు "నిన్నుగూడ సడ్డుకొనగలవాఁ డింకొకఁడు గలఁడా!" యని యబ్బురపడుచు వజ్రాయుధమును గైకొని నాల్గుదంతముల నైరావతము నెక్కి బయలుదేఱెను. అనేకదేవతలు గొలువ నేగుదెంచి రెండవ సూర్యునివలె వెలుంగుచున్న దేవేంద్రునిఁ జూచి యాంజనేయుఁడు "ఈ నల్లని పండేల" యనుకొని పోరా యని రాహువును దిరస్కరించివేసెను; అప్పుడు దేవేంద్రుఁడు "ఈ ఘనుఁ డెవ్వఁ" డని రాహువును దిరస్కరించినందులకుఁ గోపించి యైరావతమును మీఁదికిఁ బురికొల్పెను. తోడనే యంజన ముద్దుకొడుకు "ఈపండు తెల్లగానున్న" దని యైరావతము మీఁద కుఱికెను. ఐరావతము జడిసి పాఱిపోవ నుంకించుచుండఁగా, మహేంద్రుఁడు మిగులఁ గోపించి వజ్రాయుధమును విసరికొట్టెను. ఆదెబ్బ వామహనువుమీఁదఁ దగులుటచే మూర్ఛితుఁడై యావానరకిశోరము తొలిమలపైఁ బడిపోయెను.

తన ప్రియకుమారు నిట్లు దేవేంద్రుఁడు మూర్ఛిల్లఁ గొట్టుటచే వాయువు సచరాచర ప్రపంచమునం దంతటను వెలుపటను లోపటను నిండియున్న నిజమూర్తి నుపసంహరించుకొనియెను. వాయుబంధన మైనచో నిఁక దరువాయి యేమి యుండును? అంతటితో నూరకుండక వాయువు తన కుమారునిఁ దీసికొని పర్వత గుహాలోనికిఁ బోయెను.

సీ. యాజకుల్ వహ్ని హవ్యములు వ్రేల్వఁగఁ జాఁచు హస్తముల్ సాఁచినయటులనుండె
దివిజులు ప్రేరేప దివి కెగిరిన దేవయానంబు లెగిరినయటుల నుండె
మునులు నదీతోయములఁ దోఁగ ముంచిన యంగముల్ ముంచినయటుల నుండెఁ
బశుమృగనరముఖప్రాణు లుర్విని బెట్టునడుగులు పెట్టిన యటుల నుండెఁ
తే. భానుమండల మొక్కచోఁ బాదుకొనియెఁ, గాలగతిదప్పె సత్క్రియల్ గడచె వేద
పాఠ ముడివోయె బాహ్యమభ్యంతరంబు, గాఢ్పబంధించచనినయకాలమందు."

(ఉత్తరరామాయణము. ఆ. 5 ప. 111.)

ఈయుపద్రవమును జూచి దేవతాప్రముఖులు కొందఱును, మునిసార్వభౌములు కొందఱును దివ్యశక్తికలిమి నెట్లో బ్రహదేవునిచెంత కరిగి "తండ్రీ! ఏకారణమువలననో వాయుదేవుఁడు తనమూర్తి నుపసంహరించుకొనియెను. సర్వమును మృతప్రాయమై యున్నది. ఇఁక గడియ యిట్లున్న నీచే సృజింపఁబడిన ప్రపంచమంతయు రుద్రప్రయత్నము లేకయే వినాశము నందును. కావున నను గ్రహముపూని మమ్ము రక్షింపు" మని యనేకవిధములఁ బ్రార్థించిరి. అప్పుడు విధాత సకలమును దివ్యదృష్టివలన నెఱింగి, సంగతి సందర్భము లన్నియు వారికిఁ దెలిపి వారి నందఱను వెంటనిడుకొని ఉదయపర్వతమునకు బయలుదేఱెను.

యథాకాలమున వారందఱు నుదయపర్వతముమీఁదికి వచ్చిరి. అప్పటికింకను వాయుదేవుఁడు చేష్టలుదక్కి పడియున్న ఆంజనేయునిచెంతఁ గూరుచుండి యనేకోపచారములను జేయుచుండెను. ఇట్లుండఁగా మునులతోడను, దేవతల తోడను జుట్టుకొనఁబడియున్న విధాత ప్రత్యక్షమయ్యెను. వాయువు యథోచితముగ విరించికిఁ బ్రత్యుత్థానము గావించి సాష్టాంగనమస్కారములు గావించి యనేకవిధముల వినుతించెను. అప్పుడు బ్రహ్మ వాయువును జూచి సాదరముతో "వత్సా! ఇట్టిపని యేలచేసితివి? ఈతఁడే కద నీకుమారుఁడు" అని వజ్రాఘాతము వలన వివశుఁడై పడియున్న యాంజనేయుని మేను నిమిరి నవశక్తి యొసఁగెను. తోడనే మారుతి లేచి కూరుచుండెను. వాయువునకుఁ బ్రాణములు లేచివచ్చెను. బ్రహ్మ మారుతపుత్రునిఁ బ్రేమతో నంకతలమునఁ గూరుచుండఁబెట్టుకొని ముద్దాడుచు లాలింపసాగెను. ఇదియంతయుఁ జూచి యానందించి మారుతుఁడు యథాపూర్వముగ లోకమునం దంతటను దనమూర్తిని వ్యాపింపఁజేసెను. లోకమంతయు

దేఱికొనెను. దేవేంద్రాదులు "అమ్మయ్యా! ప్రాణములు తక్కిన" వనుకొనిరి. అప్పుడు పరమేష్ఠి, ఇట్టియకృత్యమును గావించిన యింద్రుని మృదువుగ మందలించి "దేవతలారా! ఈవానరశ్రేష్ఠుఁడు మహావీరుఁడు. ఈతనివలన ముం దనేకోపకారములు జరుగలసియున్నవి. లోకము నంతను జీకాకుపఱుచు దుష్టరాక్షసుల నీతఁడనేక వేలమందిని సంహరించును. కావున నీలోకోపకారికి ఉగ్రశౌర్యవైభవము గలుగునట్లు మీరందఱును వరములిండు" అని యాజ్ఞాపించెను. ఇంద్రుఁడు "వజ్రాఘాతము హనుమకుఁ దగిలినను నిరుపద్రవుఁడై వెలసెఁ గావున, నీతనికిఁ హనుమంతుఁడు అనుపేరు తగియున్నది. ఇఁక వజ్రాయుధమువలనఁ గూడ నీతఁడిసుమంతయు బాధింపఁబడఁడు" అని వరమిచ్చి సత్కరించెను.

సీ. "బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రమున హాని నందనిదీర్ఘాయు వజుఁ డొసంగె
కాలరౌద్రాస్త్రపాశుపతాదికములచేఁ జెడని ప్రభావంబు శివుఁ డొసంగెఁ
దన కాలపాశంబు దండంబు మృత్యువు నీయన నొంచ లేవని యముఁడు పలికె
నాత్మతేజమున శతాంశ మిచ్చితి విద్య లిచ్చెద నిఁక నని యినుఁడు పలికెఁ
తే. భావమున నీటఁ బడఁడని పలికె వరుణుఁ, డగ్ని తనచేత నశియింపఁ డనియె ధనదుఁ
డొసఁగెఁ దనగద నొగలని యొనికి యెల్ల, కైదువుల నొవ్వఁడని విశ్వకర్మ పలికె."

(ఉత్తరరామాయణము. ఆ ౧. ప. 128.)

తక్కిన దేవత లింక ననేకోత్తమవరము లొసఁగి గారవించిరి. బ్రహ్మ వాయువుతో "ఇఁక సంతసముతో నుండుము. నీకుమారుఁ డసమానధురంధరుఁడు. రామకార్యమును వహించి రావణుఁడు మున్నగురాక్షసవీరులకు దుస్సహుఁడై చరించును. ముల్లోకములందును నీతని కసాధ్యము లేదు." అని పలికెను. పిదప నందఱును వెడలిపోయిరి. వాయుదేవుఁడు మహానందముతోఁ గుమారునెత్తికొని అంజనాదేవికి అప్పగించి వెడలిపోయెను.

పిదప నాంజనేయుఁడు సమీపమునందలి మున్యాశ్రమములు సొచ్చి కందకావరమున వారివల్కలాజినములు చించి ప్రోవులువెట్టసాగెను. అందులకు ఋషులు మిగుల నలిగి "ఒరులు తెలుపునంతవఱుక నీబలము నీకుఁ దెలియకుండుఁగాక!" యని శపించిరి. ఈశాపమునకుఁ జాల వగచి, హనుమంతుఁడు వారినిఁ గొంతకాలము సేవించి ప్రసన్నులను గావించుకొని, విద్యలిచ్చెద నని సూర్యుఁడు వాగ్దానముచేసి యుండుట వలనఁ జదువుకొనుట కాతనిచెంత కరిగెను. అప్పుడు సూర్యుఁడు "వత్సా! నీప్రయత్నమునకు సంతసించితిని; కాని నే నెప్పుడు నొకచో నుండువాఁడను గానుగదా! వాయువేగమనోవేగములతో సతతము లోకమును జుట్టి రావలసిన నేను నీకెట్లు విద్యయొసఁగఁగలను? నడచుటకు వీలులేదుగదా! నాతో సమానవేగముతోఁ దాఁ గలిగినను, నీకు మనస్సు సుస్థిరముగా నుండదుగదా! ఇఁక

నావలన నీకేమి ప్రయోజనము?" అని పలికెను. హనుమంతుఁడు ప్రత్యుత్తరము చెప్పకయే క్షణములో శరీరముఁ బెంచివేసి ఉదయాచలముమీఁద నొకకాలును, అస్తాచలముమీఁద నొకకాలు నుంచి "ఇఁకఁ జెప్పు" మనియెను. ఈయద్భుతముఁ జూచి చాల సంతసపడి, సూర్యుఁ డాతనికి సకల వేదశాస్త్రములను జెప్పెను. ఆంజనేయుఁడు విజ్ఞానశేఖరుఁడయ్యెను. హనుమంతుని తెలివితేటలను జూచియు, బలపరాక్రమముల నరసియు నాతనివలనఁ జాలఁ బ్రయోజనము గలుగఁగలదని తలంచి, సుగ్రీవుఁ డాతనిఁ దనమంత్రిగాఁ జేకొనియెను.

వాలిసుగ్రీవు లన్నదమ్ములు. వా రిరువురకును వైరము పొసఁగెను. వాలి సుగ్రీవుని నవమానపఱచి, భార్యను గూడ నాక్రమించుకొని తమ్ముని వెలువెడలఁ గొట్టెను. సుగ్రీవుఁడు దిక్కులేక హనుమంతుఁడు మున్నగు మంత్రులతోడను, సేనాధిపులతోడను, భటులతోడను వాలికి దుర్గమ మగుఋష్యమూకపర్వతము మీఁద నివసించియుండెను. రాముఁడు సీతను వెదకికొనుచు నచ్చటికి వచ్చెను. వల్కలాజినాదులను ధరించి మునిరూపులయ్యుఁ గోదండములను దాల్చి వచ్చుచున్న రామలక్ష్మణులను జూచి, వాలిపంపునఁ దన్ను జంపవచ్చుచున్న మాయ కాండ్రని సుగ్రీవుఁడు చాల భీతిల్లఁజొచ్చెను. అప్పు డాంజనేయుఁడు వారి సంగతిఁ దెలిసికొనివచ్చెద భీతిల్లకు మని సుగ్రీవుని భయ ముడిపి, భిక్షుకవేషముఁ గైకొని రామలక్ష్మణుల కెదురేఁగి "మహానుభావులారా! దేవేంద్రసమానులును, పురుషసింహులు నగు మీ రెవరు? మీతేజస్సు అఖండభూభారధౌరేయులగు మహారాజులని తెలుపుచున్నది. మీ రీనారచీరల నేల ధరించితిరి? మునివేషమున నున్న మీ కీప్రచండకరవాలము లేల? సుగ్రీవుఁ డనువానరేంద్రుఁడు అన్న వలనఁ బరాజితుఁడై, పరాభూతుఁడై, ఋష్యమూకాచలమున నుండి మిమ్ముఁ జూచి మీతో సఖ్యముచేయఁ దలంచి నన్ను బంపఁగా నేను దూతనై వచ్చితిని. నాపేరు హనుమంతుఁడు. వాయుదేవుని కుమారుఁడను. సుగ్రీవుని మంత్రిని. కామరూపము గలవానరుఁడను. నాకుఁ గామగమనశక్తి గలదు. దూతకార్యము నిర్వర్తించుటకై నేను కపటభిక్షుకుఁడనై వచ్చితిని. మీ రెవరో, యేరాజు కుమారులరో, యీ దుర్గ మారణ్యమునకుఁ జనుదెంచినకారణ మేమో సెలవీయవలయు" ననియెను.

శ్రీరాముఁ డడవిని వెదకఁబోయిన తీవ కాళ్లకుఁ దగిలెనని భావించి, మందహాసము గావించి "తమ్ముఁడా! మనసంగతి చెప్పు" మని లక్ష్మణునకు నియమించెను. లక్ష్మణుఁడును, దమ వనసంచారకారణమును, బ్రకృతిస్థితియుఁ దెలిపి "సుగ్రీవుఁ డను వానరేంద్రునివలన సీతావృత్తాంతము తెలియఁగలదని మాకుఁ దెలియవచ్చెను; కావున, నాతనితో సఖ్యముచేయుటకు వచ్చితి" మని తమ దైన్యస్థితికి వగచెను.

హనుమంతుఁడు ఆతని విచార మడిగి "మీరును రాజ్యభ్రష్టులై తిరి. మా ప్రభువును రాజ్యభ్రష్టుఁ డయ్యెను. రాముఁడును వైరివలన భార్యను గోల్పోయెను. మా ప్రభువు నట్లే శత్రువువలన భార్యను గోల్పోయెను. ఇరువురును భార్యలను మఱల రప్పించుకొనుటకును, శత్రువులను సంహరించుటకును ఉపాయములను వెదకుచున్నారు; కావున, నిరువురకును సఖ్యము సుగమము. అనురూపము" అని చెప్పి, రామలక్ష్మణులను సుగ్రీవునికడకుఁ గొనిపోయెను.

అచట హనుమంతుఁడు సుగ్రీవునితోఁ జెప్పవలసిన రామచరిత్రమంతయుఁ జెప్పి, ధైర్యము గొలిపెను. సుగ్రీవుఁడు శ్రీరాముని నాలింగనము చేసికొని, చేతిలోఁ జేయవేసి స్నేహము చేసెను. ఆసమయమున ఆంజనేయుఁడు రెండు కట్టెలను మథించి యగ్నినిఁ బుట్టించి ప్రవృద్ధముచేసెను. అప్పుడు రామసుగ్రీవులు ఆయగ్నికిఁ బ్రదక్షిణము తిరిగి, అగ్నిసాక్షిగా స్నేహము చేసికొనిరి. సుగ్రీవుఁడు "రామా! నీవు సూర్యవంశజుఁడవు. నేను సూర్యపుత్త్రుఁడను. మన కిరువురకును స్నేహము చక్కఁగా నున్నది. ఇఁక వగవకుము. నీసతి సీతయెచ్చటనున్నను దెచ్చి యిచ్చెదను" అని చెప్పెను. శ్రీరాముఁడును "నీయన్నను జంపి నీభార్యను, నీవానరసామ్రాజ్యమును నీకప్పగించెద" ననియెను. శపథప్రకారము రాముఁడు వాలినిఁ జంపివేసి, వాని భార్యయగు తారను, వానరసామ్రాజ్యమును సుగ్రీవుని వశముచేసెను.

తోడనే వర్షాకాలము వచ్చెను. "చిరకాలమునకు భార్యతోడిసంయోగ మలవడినది. లక్ష్మణా! ఆతనిని నీసమయమున మనపనినిమిత్తము తొందరచేయుట తగదు" అని రాముఁడు సుగ్రీవునకు స్వేచ్ఛయొసంగెను. వర్షాకాలము కడచి పోయెను. జైత్రయాత్రాస్థలపాలిటి శుభముహూర్తమగు శరత్కాలము వచ్చెను. రాముఁడు, సుగ్రీవుఁడు వచ్చెడివేళ దైనదని యెదురుచూడఁజొచ్చెను; కాని, స్త్రీలతోడి విలాసములలో మునిఁగియున్న సుగ్రీవుఁడు ప్రపంచమును మఱచిపోయెను.

స్వర్ణముతోడి సంబంధమువలన రత్నమునకు శోభ హెచ్చును. అట్లే, శ్రీరామచంద్రునితోడి సంబంధమువలన నాంజనేయుని సకలశక్తులును విజృంభించెను. ఆదేవునకును, ఈభక్తునకు నింతకాలమునకు సంయోగము గలిగినది. ఇది దౌష్ట్యము నశించుటకే సమకూడినది. ఆంజనేయునకు బాల్యమున దేవేంద్రాదులచే లభించిన వరముల కన్నిటికిని వినియోగకాలము వచ్చినది. రామసేవకై హనుమంతుని మనస్సు ఉవ్విళ్లూర సాగెను; కాని, యాతఁ డేమిచేయఁగలఁడు? సుగ్రీవుఁడు అంతఃపురము వదలి వచ్చుటయే కరవయ్యెను. సాధనసంపత్తి యంతయు సమకూడనప్పుడొకఁడు తొందరపడిన నేమి ప్రయోజనము? అట్లని యూరకున్న సుగ్రీవుఁడు తెలివి

తెచ్చుకొనునట్లు కాన్పింపదయ్యెను. ఇఁక లాభము లేదని తలంచి, హనుమంతుఁడు ఉద్యానవనమున స్త్రీలతో విహరించుచున్న సుగ్రీవునిచెంతకుఁ బోయి, "ఈవైభవ మంతయు నీకు శ్రీరామవిభుఁడు దయచేసినది. ఆతనికి నీవు చేయవలసిన కార్యములు పెక్కు లున్నవి. ఇట్లు స్త్రీలోలుఁడవై యున్న నపాయము వాటిల్లును. త్రిలోక జయశీలుఁ డైన నీయన్నను సంహరించిన రఘురాముని శౌర్యము నీకుఁ దెలియనిది గాదు. ఆతనికిఁ గోపమువచ్చిన క్షణములో ముల్లోకములును భస్మీపటలమైపోవును. ఆరాముని కన్ను లెఱ్ఱఁబడకముందే సీతాన్వేషణమునకై నలుదిక్కులకును వానరుల నంపుము" అని చెప్పెను.

ఎంతకును భోగములను విడువకునికి మిగులఁ గోపించి లక్ష్మణుఁడు నిష్ఠుర వచనము లాడినపిమ్మట, సుగ్రీవుఁ డిలువెడలివచ్చి రామకార్యమునఁ బ్రవేశించెను. అనేకకపివీరులను సకలదిక్కులకు నంపి, యాతఁడు జాంబవంతుఁడు మున్నగువారినిఁ దోడిచ్చి హనుమంతుని దక్షిణమునకుఁ బంపెను. శ్రీరాముఁ డాంజనేయునివలననే తనకార్యము సిద్ధించునని నిశ్చయించి, కాంచనమయమును రత్నఖచితము నగు ముద్రిక నానవాలిచ్చిపంపెను. అందఱును బయలుదేఱి పోయిరి. హనుమదాదు లొకగుహలోఁ జిక్కుకొని, యెట్టకేలకు వెలుపలికివచ్చి "రాముఁడును సుగ్రీవుఁడును సీతను జూచివచ్చుటకై యిచ్చిన గడువు దాఁటిపోవచ్చెను. ఇఁక మన మాదేవినిఁ గనుఁగొనఁజాలము. ఇట్టే మగిడిపోయిన సుగ్రీవుఁడు మనలను సంహరింపక మానఁడని, యెల్లరును బ్రాయోపవేశముఁ జేయుటకు నిశ్చయించుకొనిరి. ఇంతలో సంపాతివలన సీతవృత్తాంత మెల్లవారికిఁ దెలియవచ్చెను. తోడనే యెల్లరును సముద్రతీరమునకుఁ బోయిరి. హనుమంతుఁ డొక్కరుఁడు మాత్రమే సముద్రము దాఁటఁగలిగెను. రామభక్తి నైజశక్తికిఁ బ్రాణమువోయకున్న హనుమంతుఁ డైన సముద్రము దాఁట లేక పోయియుండును.

అడ్డువచ్చిన దుష్టుల నెల్లరను వధించి, హనుమంతుఁడు లంకం బ్రవేశించి సీతను వెదకెను; కాని, వెంటనే కాన్పింపదయ్యెను. తుద కశోకవనమున రాక్షసాంగ నలమధ్య నున్న జానకినిఁ జూచి, యుక్తసమయమున నామెతో సకలమును మాట్లాడి రామముద్రికఁ జూపి, యామెచెప్పిన యాత్మవృత్తములను విని, యానవాలుగా నిచ్చిన శిరోమణిని గ్రహించి, తనశక్తి రావణున కొకింత చూపి పోవలెనని యాతఁ డశోకవనమును బాడుచేసెను. చారులవలన నావృత్తాంతము విని రావణుఁ డాతని మీఁదికి రాక్షసవీరుల నంపెను. ఆదనుజవీరులవలన నేమియుఁ గాదయ్యెను. పిదప గొప్పగొప్ప సేనాధీశ్వరులు వచ్చిరి. రావణుని కుమారుఁ డగు అక్షుఁడుగూడ వచ్చెను. ఆంజనేయుఁడు వారి సేనను, వారినిఁగూడ సంహరించి గండుమెఱసెను; తుద కింద్ర

జిత్తువచ్చి బ్రహ్మాస్త్రము విడిచి యాంజనేయునిఁ గట్టుకొనిపోయెను. బ్రహ్మాస్త్రము తన్నేమియుఁ జేయఁజాలకపోయినను, ఆంజనేయుఁడు కావలయుననియే కట్టుబడి పోయినట్లుండి, రాక్షసుల భుజములమీఁద రావణునాస్థానమునకుఁ బోయెను. అట ఆంజనేయునిగురించి చాల వాదోపవాదములు జరిగెను. తుదకు మారుతిని సంహరించుట కచ్చట నిశ్చయమయ్యెను. విభీషణుఁడు దూతను సంహరించుట నీతిఁగాదని యాక్షేపించెను. తాస్కై హనుమంతునితోఁకకు నూనెగుడ్డలు చుట్టి నిప్పుపెట్టునట్లనుజ్ఞ యయ్యెను. రాక్షసులట్లే చేసిరి. ఆంజనేయుఁడు ఆనిప్పుతో లంకాపట్టణము దగ్ధముచేసి వెనుదిరిగెను.

యుక్తసమయమున నాతఁడు రామునిచెంతకు వచ్చి సకలమును నివేదించెను. తోడనే రాముఁడు లంకాపట్టణముమీఁదికి దండెత్తి సముద్రతీరమున విడిసెను. అట శరణుచొచ్చిన విభీషణునకు హనుమంతుఁడే రామునిచే నభయ మిప్పించెను. వానరసాహాయ్యమున సముద్రముమీఁద వంతెనగట్టి, రాముఁడు లంకాపురమునఁ బ్రవేశించెను.

యుద్ధము ప్రారంభ మయ్యెను. సామాన్యరాక్షసులందఱును యుద్ధరంగమున నవతరించిన వెంటనే ధూపుమాసి పోవసాగిరి. ఇంద్రజిత్తు వచ్చి యుద్ధము చేసినప్పుడు రాఘవులు చాల కష్టపడిరి. అప్పుడు ఆంజనేయుఁడు సంజీవనిని గొని వచ్చి, ఉపద్రవమంతయుఁ బోఁగొట్టెను. ఈయుద్ధసమయమున హనుమంతుని సాహాయ్యము లేకున్న, రాఘవులవిజయము కలలోనివార్త యైయుండును. కావున అంతయు ముగిసి శత్రుసంహారానంతము సీతాదేవితోఁ గూడికొని, యానందసాగరమునఁ దేలియాడుచున్న శ్రీరామచంద్రుఁడు హనుమంతునిఁ జూచి "అంతయు నీవలననే కలిగినది. నీవు లేకున్న నేమియు లేకపోయియుండును. నేముఁగూడ లేకపోయియే యుందు" మని నుతించెను. ఈయభిమానమును హృదయమున నుంచుకొని, శ్రీరాముఁడు పట్టాభిషేకసమయమున హనుమంతునకుఁ జాలగౌరవము చేసెను. తనయాంతరంగికభక్తులలోఁ జేర్చికొని, తత్త్వోపదేశముచేసి రక్షించెను. ఆతనికి మృతిలేకుండను, ఎల్లప్పుడును తననామస్మరణానందమున సుఖించునట్లును వరములిచ్చెను.

ఒకప్పుడు నారదతుంబురులకు "సంగీతమున నేను ఘనుఁడను. నేను ఘనుఁడను" అని వివాదము వచ్చెను. ఈవివాదము తీర్చుకొనుటకు వారు హనుమంతుని వద్దకు వచ్చిరి. హనుమంతుఁడును వారిని మిగుల గౌరవించి, అనేకవిధములఁ గొనియాడి చంద్రకాంతశిలలపైఁ గూర్చుండఁజేసి రామునిఁ గీర్తించెను. ఈయద్భుత సంగీతమువలన నాచంద్రకాంతశిలలు కరఁగిపోయెను. నారదతుంబురులు వానిలో

జిగిపోయిరి. వెంటనే హనుమంతుఁడు పాట మానివేయుటవలన రాళ్లు పేరుకొని మఱల యథారూపము వహించెను. "మీలో నెవరీరాళ్లను పాటఁబాడి కరఁగింపఁ గలరో వారు ఘను" లని హనుమంతుఁడు చెప్పెను. నారదతుంబురు లొకరి తరువాత నొకరు పాడిరి; కాని, రాళ్లు కరఁగవయ్యెను. హనుమంతుఁడే మఱలఁ బాడి వారికి విముక్తి కలిగించెను. హనుమంతుని మహత్వము గొప్పవాఁడని నారదతుంబురులు సిగ్గుపడి వెడలిపోయిరి.

---

# ౪. ధ్రువుఁడు

ఉత్తానపాదమహారాజునకు సునీతి, సురుచి అను నిద్దఱుభార్యలుండిరి. వారిలో సునీతి పెద్దభార్య. అయినను రాజున కామెపైఁ బ్రేమ లేకపోయెను. ఆతఁ డామెదెసకే చూచుట మానివేసెను. సురుచి రెండవభార్య. ఉత్తానపాదునకు సురుచి తోడిదే లోకమ్ముగా నుండెను. ఆతఁడు సర్వకాలములయందును సురుచి మేలే కోరుచు, నామెయాజ్ఞలనే నిర్వర్తించుచు, నామె యానందమే తన మోక్షసాధనమని తలంచుచు నన్యము మఱచియుండెను. సురుచియు భర్తమనస్సు తన మీఁదినుండి తప్పిపోకుండున ట్లతిజాగ్రత్తతో నాతని కానందముఁ గొలుపుచు, మాటిమాటికి సునీతిపైఁ గొండెములు చెప్పుచుఁ గాలము గడపుచుండెను.

సునీతిని భర్త వంచించినను, భగవంతుఁడు వంచింపలేదు. ఈశ్వరుఁడు సునీతి కిని, సురుచికినిఁగూడ నొక్కొక్క కుమారు నిచ్చెను. కాని, ఉత్తానపాదునకు సునీతి కన్నకొడుకుమీఁదఁ గూడఁ బ్రేమ లేకపోయెను. ఆకుఱ్ఱనిమీఁదఁగూడఁ బ్రేమ చూపకుండునట్లు సురుచి భర్తమనస్సు విఱిచివేయుచుండెను. తనమీఁద దయలేకున్నను, దనకొడుకునెడల నైనఁ దన భర్తకు వాత్సల్యము లేనందులకు సునీతి చాల విచారించెను. అయినను ఏమి లాభము?

సునీతి కుమారుని పేరు ధ్రువుఁడు. సురుచి కొడుకు పేరు ఉత్తముఁడు. ధ్రువుఁడు అయిదేండ్ల ప్రాయమున నున్నపు డొకనాఁడు రాజు ఉత్తమునిఁ దన తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని లాలించుచు, సురుచితో వినోదించుచుండెను. ఇట్లుండఁగా బాల్యచాపలమువలన నాటలు మఱచి యున్న ధ్రువుఁ డచ్చటకు వచ్చి అంతయుఁ జూచెను. తోడనే యాబాలునకుఁ దమ్మునివలెనే తండ్రితొడమీఁదఁ గూరుచుండుటకు ఆశ గలిగెను. అట్టియాశ ముఖముపైఁ దాండవించుచుండుటఁ జూచియు, రాజు స్థానినిఁ జేరఁబిలువలేదు. ఇఁకఁ బ్రయోజనములేదని ధ్రువుఁడు



ధ్రువుఁడు—52.

తనకుఁ దానయి తన తండ్రి రెండవతొడమీఁదఁ గూరుచుండెను. కాని, వెంటనే సురుచి—

తే. "తండ్రితొడ నెక్క వేడుక తగిలెనేని, పూని నాగర్భమున నాఁడుపుట్ట కన్య
గర్భమునఁ బుట్టితోరినఁ గలదె నేఁడు, జనకుతొడయెక్కు భాగ్యంబు సవతికొడుక."

క. "అదిగాన నీవధోక్షజు, పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
యుదరమునఁ బుట్టఁ జేయును, వదలక యట్లయిన ముదము వడసెద వనఘా."

(భాగ. స్కం. 4. ప. 2 : 9, 220.)

అని పలుకుచు నివ్వలకు లాగివేసెను. అప్పుడుగూడ రాజు ఏమియు మాట్లాడఁడయెను.

ధ్రువునకుఁ దండ్రిమీఁదను, సవతితల్లిమీఁదను మిగులఁ గోపమువచ్చెను; అయిన నాయైదేండ్ల బాలుఁ డేమి చేయఁగలఁడు? ధ్రువునకు వయస్సు లేకపోయినను చాల నభిమానము గలదు. బలము లేకపోయినను మిక్కిలి రోషము గలదు. తన్నుఁ గన్న తండ్రియెదుట, విశేషించి తన సవతితల్లి కుమారునియెదుట, తనతో నాటలాడు సవతితమ్మునియెదుట నిట్టి పరాభవము జరుగుటవలన నాబాలుఁడు ఎంతో కోపించియు, దండతాడితభుజంగమురీతిని మిక్కుటమగు రోషమును వెడలఁగ్రక్కి, చెక్కిళ్లపైఁ గన్నీరు ధారలుగట్టుచుండ నేడ్చుచు, నిముసమైన నచ్చటనుండక తల్లి చెంతకుఁ బోయెను.

వెక్కి వెక్కి యేడ్చుచు వచ్చుచున్న కుమారునిఁ బొదివిపట్టి, సునీతి "తండ్రీ! ఏమి యాపదవచ్చెనోయి" యని యడిగెను. ధ్రువుఁడు సకలము నెఱింగించెను. తోడనే సునీతిహృదయము వ్రక్కలై పోయెను. విచారము పొంగిపోయెను. "నన్నుఁ బ్రేమింపకున్న మానెఁ గుమారునిఁ బ్రేమింపరాదా? ఎదుట నున్నవానినిఁ బిలువకున్న మానెఁ, దొడమీఁదఁ గూర్చున్నపుడైన నంగీకరింపరాదా? సురుచిపైఁ గోపింపకున్న మానె, బతిమాలియైనఁ దనతొడపై నాబిడ్డ కింత చోటీయరాదా? ఇంతమాత్రముననే నాబిడ్డ సురుచికుమారుని సింహాసనమునకై పోరాడఁబోవునా?" యని సునీతి యనేకవిధములఁ దలఁచికొని తలఁచికొని వగచెను. ఈసమయమునందే కొందఱు పరిచారికలును, గొంద ఱెఱిఁగియున్నస్త్రీలును వచ్చి, జరిగిన సమాచారమంతయుఁ దెలిపి సునీతిని మఱింత యేడ్పించిరి.

ఇఁక నెంత వగచినను బ్రయోజన మేమి? తుదకు సునీతి యాక్రొత్తవిచారవాహినినిఁ దన తొల్లిటి విచారసాగరమున సంగమింపఁ జేసెను. అప్పటికి ధ్రువుఁడు గూడ నేడ్పు చాలించెను. సునీతి మనస్సు రాయిచేసికొని, కుమారుని మేను నివిరి యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని, "బిడ్డా! విచారించిన నేమి లాభము? పూర్వజన్మ

మున నెంత చేసికొనిన, నంతయు ననుభవింపక తీఱదు. నాకడుపునఁ బుట్టినపుడే నీవు
దైవోపహతుఁడ వైతివి. నీవు గూడఁ దొల్లిటిజన్మమున నెంత చేసికొంటివో, యది
యెల్ల ననుభవింపక తప్పదు. ఇఁక సురుచి మాటలకును, ఆమెచేష్టలకును, నీతండ్రి
దౌర్జన్యమునకును వగచుట లక్షణము గాదు. నా పెనిమిటి నన్ను భార్యగాఁ
గాకున్న దాసిగానైనఁ బిలపోయుట లేదు. ఇఁక నిన్ను బిచ్చగానికన్న నీచముగాఁ
జూచుటలో నాశ్చర్యమేమున్నది? మన పురాతనపాపము సురుచిరూపమును వహించిన దనుకొనుము; కాని యొకవిధమున సురుచి మంచియే చేసినది. ఆమె నీకు హరి
చరణములు సేవింపు మని యుపదేశించినది గదా! నాచిట్టితండ్రీ! సురుచి యనిష్టము
చేతఁ జెప్పినను హరిచరణసేవ విపత్సముద్రమున మునిఁగిపోవుచున్న కష్టజన్ములకు
నావవంటిది. నీతండ్రి తొడమీఁదఁ గూర్చుండుటకు నీకింక నాశఁ గలదేని, శ్రీహరి
పాదకమలములను బూజింపుము. దానంజేసి నీవింకను గొప్ప ఫలములను బడయఁ
గలవు. నాదైన్యమునుగూడఁ బాపఁగలవు. తండ్రీ! నాకును నీకునుగూడఁ బ్రత్యక్ష
మున నీవే దిక్కు. పరోక్షమున నారాయణమూర్తియే కలఁడు. నిర్గుణుఁడైన పరమే
శ్వరుఁడు విశ్వపరిపాలనము నిమిత్తము సగుణుఁ డగుచున్నాఁడు. అట్టి నారాయణుని
పాదకమలములను బూజించుటవలననే బ్రహ్మకు బ్రహ్మత్వము సిద్ధించినది. మాతాత
య్యైన మనువు శ్రీపతినిఁ బూజించియే యిహపర సుఖముల నవ్వారిగాఁ బడసెను.
నీవుగూడ రమాపతి పదసరసిజములను సేవించి సుఖము పడయు" మని యుపదేశిం
చెను. తల్లిచెంత సెలవును, ఆమె యాశీర్వాదమును బడసి, ధ్రువుఁడు దామోదరుని
సేవించుటకై యడవిమార్గముఁ బట్టి పోయెను.

మార్గమధ్యమున నాతనితో నారదుఁడు కలిసికొనియెను. దివ్యదృష్టినిఁ జూచి
నారదుఁ డంతయు గ్రహించి, పాపనాశకరంబైన తనకరంబున ధ్రువుని శిరము నంటి
"ఆహా! ఈతఁడైదేండ్లబాలుఁడు. పినతల్లి యాడిన దురుక్తులకు సహింపక యడ
వికిఁ బోవుచున్నాఁడు! క్షత్రియుల యభిమాన మెంతటిది?" యని యబ్బురపడి
"వత్సా! నీవు మహారాజుబిడ్డవలెఁ గాన్పించుచున్నావు. అట్టి నీవు సకలవైభవ
ములకు నునికిపట్టగు భవనము విడిచి, యానహీనమున నేల సంచరించు
చున్నావు?" అని యడిగెను. ధ్రువుఁడు నారదునకు నమస్కరించి, తనసంగతి
యంతయుఁ జెప్పెను. అది యంతయు విని, నారదుఁడు ధ్రువుని మనోదృఢిమను
బరీక్షింపఁ దలఁచి "వత్సా! ఆటపాటలయందుఁ గాలముగడపు నీకీ బాల్యప్రాయ
మున మాన మననేమి? అవమాన మననేమి? ప్రాణులకుఁ బురాకృత మనుభవింపక
తప్పదు. వివేకముగలవాఁడు సంప్రాప్తములైన కష్టసుఖములు దైవవశము లని
తలంచి, మాఱుపలుకకుండ ననుభవించును. అట్లుఁగాక నీవు తల్లి యుపదేశించిన
ప్రకారము యోగమార్గమున శ్రీమన్నారాయణుని యనుగ్రహముఁ బడసెద

నంటివా? యోగీశ్వరులు గూడ ననేకజన్మము లెత్తియు, నిష్కామకర్మతో ధ్యానించియు శ్రీహరినిఁ దెలియనేరరు. కావున, నామార్గము నీకు దుష్ప్రవేశ్యము. ప్రయోజనము లేని యీప్రయత్నములు మానుకొనుము. అవివేకమువలన లేనిపోని ప్రయత్నములు చేయక దైవము సంఘటించిన సుఖదుఃఖములకుఁ బలయొగ్గి కాలము గడపుకొనిపోవువాఁడు వివేకవంతుఁడు. గొప్పవానినిఁ జూచి యానందించుచు, నీచుదెసఁ జూడక సమానునితో మైత్రి నెఱపి ప్రవర్తించువాఁడు తాపత్రయాదికములచేఁ బీడింపఁబడక సుఖించును" అని చెప్పెను. ధ్రువున కీయుపదేశమున సారము కాన్పింపలేదు. అగుట నాతని కిది నచ్చనిదయ్యెను. కావున నాతఁడు మఱల "అనఘా! సుఖదుఃఖోపహతుల కీశాంతి యలవడదు. నేను క్షత్రియబాలకుఁడను. మాసవతితల్లి వాగ్బాణాఘాతమువలన నాహృదయము కలఁగిపోయియున్నది. కావున, నాచిత్తమున శాంతి నిలువదు. త్రిభువనములయందు నసమానమును, అనన్యదుర్లభమునగు స్థానమును బొందఁ గోరుచున్న నాకు మంచిమార్గము నుపదేశింపుము. నారదమునీంద్రా! నీవు భగవంతుఁడగు విధాత యూరువువలన నుద్భవించి సతతము వీణవాయించుచు సూర్యదేవునివలె విశ్వశ్రేయస్సునిమిత్తము తిరుగుచుందువు. నీకుఁ దెలియనిది లే"దని ప్రార్థించెను.

ఈసంభాషణమువలన నారదునకు ధ్రువుని ప్రారంభ మచంచలమని తెలియవచ్చెను. తోడనే యాతఁ డండుల కెంతయు నానందించి "కుమారా! నీబుద్ధి నీకార్యమునకుఁ బ్రేరేచినవాఁడు వాసుదేవుఁడు. కావుననే నీదీక్ష చాల దృఢమైయున్నది. నారాయణుఁడు నీయెడల సుప్రసన్నుఁడు; కావున, నాతనిని భజించి శుభములు పడయుము. చతుర్విధపురుషార్థములను బడయఁగోరువారికి శ్రీహరి చరణకమలయుగళమే యాధారము. యమునాతీరమున హరిసంచారమువలనఁ బవిత్రమును, అతిపుణ్యము నైన మధువనమునకుఁ బొమ్ము. ఆయమునానదిలోఁ గ్రుంకి సమాధినిష్ఠుఁడవై నారాయణుని భజింపుము. నీకు శుభము సమకూఱును. నీ వనుపనీతుఁడ వగుటచే వేదాధ్యయనమున కనర్హుఁడవు. అయినను భక్తిమార్గసంచారమునకు నీకు అభ్యంతరములేదు. శ్రీహరి భక్తవశంవదుఁడు. ప్రణవయుక్తమును, ద్వాదశాక్షరకలితమును, దేశకాలవిభాగవేదియును బుధానుష్ఠితంబునగు వాసుదేవమంత్రమును సప్తవాసరములు పఠించిన ఖేచరులను గనుఁగొను సామర్థ్య మబ్బును. దానంజేసి యాహరినిఁ బూజింపవలయును. చాల నిష్ఠతో మెలఁగవలయును" అని తద్రహస్యముల నెల్ల నుపదేశించెను. అప్పుడా ధ్రువుఁ

డనన్యభక్తితో నారదునకుఁ బ్రదక్షిణనమస్కారము లాచరించి, సెలవుగైకొని మునిజనసేవ్య మగుమధువనమునకుఁ బోయెను.

నారదుఁ డిచట ధ్రువున కిట్లుపదేశించి పంపివేసి, తాను తిన్నగ నుత్తానపాద మహారాజుచెంతకుఁ బోయెను. ధ్రువుఁడు తపోవనమునకు బయలుదేఱిపోయిన పిమ్మట రాజునకు బుద్ధి వచ్చెను. "కుఱ్ఱవాఁడైనను ఎంత యభిమానవంతుఁడు! ఎంతలో నెంతపనిచేసెను" అని యాశ్చర్యమును, అట్టి సత్పుత్రుఁడు విడిచి చనినందులకు వగపును జెందుచు నేమియుఁ దోఁపక యుండెను. ఈసమయమున నారదుఁ డచ్చటఁ బ్రత్యక్షమయ్యెను. నారదుని చూచినతోడనే రాజు విచారము మఱింత పెరిఁగిపోయెను. అందుల కనుగుణముగ నారదుఁ డూరకుండక "రాజా! నీ మొగము వాడియున్నది. నీ వేమో వగచుచున్నట్లున్నది. ఏల?"యని యడిగెను

పరామర్శవలన దుఃఖము పెంపొందెను. అగుట నారదుని సంప్రశ్నమువలన ఉత్తానపాదుని హృదయము బ్రద్దలై పోయెను. ఆదుఃఖమును భరింపఁజాలక యాతఁడు వగచుచు, "మునీంద్రా! ఏమి చెప్పుదును? అయిదేండ్ల కుమారుఁడు. వివేకమహితుఁడు. అవివేకినై నాచేసిన పరాభవమువలన నడపులు పట్టిపోయెను. స్త్రీదాసుఁడ నగుట నాకప్పుడు యుక్తాయుక్తములు తెలియలేదు. నాబిడ్డఁడునాతోడ మీఁదఁ గూర్చుండుటకు ముచ్చటపడి రాఁగా నేను త్రోసివేసితిని. ఆకుమారుఁ డిలువెడలిన వెంటనే నాప్రాణములు నాశరీరమును విడిచిపోవున ట్లున్నది. బుద్ధిలేక తేజోమూర్తినిఁ బరాభవించితిని. మునికులతిలకా! నాబిడ్డ నాకిఁక నేత్రపర్వముగఁ గాన్పించునా? నా సుకుమారకుమారుఁడు వ్యాఘ్రాదిహింస్రపశువులబాఱి పడకుండ, సజీవియై తిరిగి వచ్చునా?" యని వాపోయెను. అదివిని నారదుఁడు రాజునకుఁ దగిన ప్రాయశ్చిత్తమైన దని తలంచి "విచారము వలదు. నీవు పరాభవించి తిరస్కరించినంతమాత్రమున నీకుమారునకు రక్షకులు లేకపోలేదు. ఆతఁడు శ్రీమహావిష్ణువు నాశ్రయించిన ధన్యుఁడు. మఱియు, నాతఁ డనితరసాధ్య మగు హరిభక్తిప్రభావమువలన లోకపాలురకుఁ గూడ దుర్లభమగు నౌన్నత్యమును బొందును. నీకుమారుని ప్రభావము నీకుఁ దెలియదు. నీవు స్త్రీలోలుఁడవై అట్టి యుత్తమోత్తమపుత్రునిఁ దిరస్కరించితివి; కాని, నిన్నాతఁ డుద్ధరింపఁగలఁడు. ఆతని ప్రభావమువలన నీవు ఆకల్పస్థాయియగు శుభ్రకీర్తి నందెదవు. ఆతఁడు మహామహిమోదంచితుఁడై, నేఁడో రేపో యిచ్చటకు రాఁగలఁడు. నీ వాతనిని గుఱించి వగవఁ బనిలేదు" అని చెప్పెను. రాజు నారదుని మాటలవలనఁ దనకు మంగళ మొదవుననియు, నాతఁడు మహాప్రభావసంపన్నుఁ డగుననియుఁ దలంచి

విచార ముడిగెను; గాని యాతని కెక్క రాజ్యపాలనమున మతి సుస్థిరము కాదయ్యెను. కాకుమారుఁ డెప్పుడు వచ్చునని యెదురుచూచుచు నాతఁడు రాజ్యమునెడల నిస్పృహాయుఁ డయ్యెను.

నారదుని వీడ్కొని ధ్రువుఁడు తిన్నఁగ యమునాతీరముసందలి మధువన మున కరిగి, తపోవ్రతమున కనురూప మగు స్థలము చూచుకొని యమునానదిలో స్నానమాడి తపస్సు ప్రారంభించెను. తొలుత నాతఁడు మూఁడురాత్రుల కొక్క మారు వెలగపండ్లును రేగుపండ్లును దిని మొదటిమాసము హరిధ్యానమునఁ గడపెను. రెండవమాసమున నారేసి దినముల కొకమారు ఆకు నలమును దిని విష్ణుసమారాధనము చేసెను. మూఁడవమాసమునఁ దొమ్మిదేసిదినముల కొక్క మారు జలభక్షణము గావించి, మాధవు నర్చించెను. నాల్గవమాసమునఁ బండ్రెండు దినముల కొకమారు వాయుభక్షణము గావించి జితశ్వాసుండై పుండరీకాక్షుని భజియించెను. అయిదవమాసమున నిరుచ్ఛ్వాసుండై అచేతనంబైన స్థాణువుఁబోలె నేకపదమున నిలిచి పరమాత్మను జింతించెను. పిదప నాతఁడు హృదయమును నిర్మలము గావించుకొని, సకలప్రపంచమునకు నాధారభూతుఁ డగుపరమేశ్వరు నందు నిలిపి, ధ్యానము ప్రారంభించెను. అతని యంగుష్ఠపీడవలన ఏనుఁగు పరవళ్లు త్రొక్కుటవలనఁ బడవ యెట్లు ఊఁగులాడునో, యట్లు భూతల మూఁగులాడ సాగెను.

ఇట్టి ధ్రువునియసన్యసామాన్య తపస్సువలన సకలదేవతలకును బ్రాణ నిరోధము గలిగెను. తోడనే వారు భగవంతునిచెంతకుఁ బోయి "యాపదఁ బాపవే" యని వేడుకొనిరి. శ్రీహరి వారికి సంగతిసందర్భము లన్నియు నెఱిం గించి వారివారి నివాసముల కంపివేసి గరుడారూఢుఁడై మధువనమున కరిగి ధ్రువునియెదుట సాక్షాత్కరించెను. ధ్రువుఁడును దనహృదయపీఠమునఁ దాండ వము సేయు శ్రీహరి హఠాత్తుగఁ దిరోహితుండగుటచేఁ గన్నులు విప్పిచూచెను. వెంటనే యాతఁడు దామోదరునకు సాష్టాంగదండప్రణామము లాచరించి స్తోత్రము సేయఁబోయెను. కాని యాతనికి వలనుగాదయ్యెను. అది యెఱిఁగి శ్రీహరి వేదమయమగు తన శంఖముచేత నాబాలుని కపోలము నంటెను. తోడనే ధ్రువునకు గంగాప్రవాహమువలె, నిరర్గళమగు స్తోత్రపద్ధతి యలవడెను. అంత నాబాలభక్తుఁడు శ్రీహరి నిట్లు నుతింపఁ దొడఁగెను.

"దేవా! నీవు సర్వశక్తుఁడవు. ఈప్రపంచ మంతయు నీ యిచ్ఛామాత్ర మునఁ బ్రవర్తిల్లుచున్నది. నీ వంతటను బాహ్యస్థితుఁడ వయ్యు మాయాఖ్య మగు శక్తివలన నన్నిటను వసించి, నానాప్రకారములను బ్రకాశించుచుందువు.

సీ. 'సర్వేశ! కల్పాంతసమయంబునందు నీయఖిలప్రపంచంబు నుపహరించి
యనయంబు శేషసహాయుండవై శేషపర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధుజస్వర్ణలోకకంజాతగర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు రచితోర్వి బ్రహ్మస్వరూపివైన
తే. నీకు మ్రొక్కెద నత్యంతనియమ మొప్ప, భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార, యవ్యయానంద గోవింద హరి ముకుంద'"

(భాగ. స్కం. 4. ప. 237.)

అని యిట్లెంచిన బెద్దయుఁ బ్రొద్దు ధ్రువుఁడు వినుతింప శ్రీహరి యలరి "వత్సా! నీతపంబునకు సంతసించితిని. ఈప్రాయమున నీనిష్ఠయు, నీభక్తియు, నీదీక్షయు ననన్యదుర్లభములు. నీయభీష్టము నాకుఁ దెలియవచ్చినది. సప్తర్షులును దారకా సమేతులై ప్రదక్షిణము తిరుగుచుండియు, దురాపమును, అనన్యాధిష్ఠితమును, ప్రళయకాలంబునందును నశ్వరంబుగాక వెలుంగుచుండు నగు ధ్రువక్షితి యను పదముఁ గోరుచున్నావు. నీయెడల నాకుఁ బొడమిన యసాధారణవాత్సల్యమువలన నది యిచ్చితిని; కాని యంతకుఁబూర్వము నీవు ఇరువదియాఱువేలయేండ్లు రాజ్యపాలనము చేయుదువు. తుదకు నాయందైక్యమయ్యెద"వని చెప్పి, వైకుంఠమునకుఁ బోయెను.

పిదప ధ్రువుఁడు "అక్కటా! నే నెట్టిపని చేసితిని?

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ దాటిం ఫలీకారమి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుండైనట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నకటన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్.

(భాగ. స్కం. 4. ప. 300.)

నాస్వబుద్ధిచేనైనచో నిట్టివరములు కోరియుండను. నిజముగ నిది దేవతలు చేసిన మోసము. ఆహా! నాకు మోక్షప్రాప్తియైన నీదేవతల పుట్టియేమి మునిఁగినది?'' అని వగచి, యింకఁ జేయునది లేక స్వగృహోన్ముఖుఁ డయ్యెను.

ధ్రువుఁ డింటికి వచ్చుచున్నాఁడను వార్త ఉత్తానపాదమహారాజునకుఁ దెలియ వచ్చెను. అప్పు డాతఁ డామాట నమ్మఁజాలకయు, నారదుఁ డబద్ధము చెప్పునా యని యెట్లో నమ్మి మహావైభవముతోడను, సునీతి సురుచి ఉత్తములతోడను ధ్రువున కెదురువచ్చెను. తల్లిదండ్రులు కాన్పించినవెంటనే ధ్రువుఁడు వారికి సాష్టాంగనమస్కారములు గావించెను. తన్నుఁ బరుషోక్తులాడిన సురుచికిఁ గూడ సాష్టాంగ మెఱఁగి, యామెకుమారుని ఉత్తముని గౌఁగిలించుకొనియెను. తండ్రి కౌఁగిలించుకొని ధ్రువుని దీవించెను. తల్లియు మహానందముతోఁ బుత్రు నాలింగనము చేసికొని శిరము

మూర్కొని కొంతతడ వానందపరవశయై ధ్రువుని ఆశీర్వదించెను. పూర్వపు టసూయ మఱచి, సురుచి యాతనిని "పెద్దకాలము జీవింపు" మని దీవించెను. ఉత్తముఁడు అన్నను తిరిగి కౌఁగలించుకొనియెను. పిమ్మట నందఱు నానందముతో నిల్లు చేరుకొనిరి.

అప్పటికి ఉత్తానపాదుఁడు వృద్ధుఁ డయ్యెను. ఆతఁడు తన ముసలితనము నెఱింగి, ప్రయోజకుఁ డగు ధ్రువునకు రాజ్యభారమునప్పగించి తపోవనమునకుఁ బోయెను. తరువాత ధ్రువుఁడు శింశుమారప్రజాపతిపుత్రికయైన భ్రమి యను దానిని, వాయుపుత్రియైన యిల యనుదానిని బరిణయమై, పుత్రులను బుత్రికలను బడసెను. ఉత్తముఁడు వివాహముకాకపూర్వ మొకనాఁ డరణ్యమునకు వేఁటకుఁ బోయి, యొక యక్షునితో విరోధపడి వానివలన నచ్చటనే మృతుఁ డయ్యెను. ఈ సంగతి విని, సురుచి కుమారుఁడు పడియున్న చోటికిఁ బ్రయాణ మయ్యెను. కాని, మార్గమధ్యమున నరణ్యమునందు దావాగ్నిలోఁబడి యామెయు మృతిచెందెను.

అంతఁ దమ్ముని జంపిన పగఁ దీర్పఁదలఁచి ధ్రువుఁడు దండయాత్ర బయలుదేఱి యలకాపురమును ముట్టడించెను. ధ్రువునకును యక్షులకును ఘోరయుద్ధము పొసఁగెను. యక్షు లనేకమాయలు చేసి ధ్రువుని జయింపఁజూచిరి గాని, యాతని నారాయణాస్త్రప్రయోగమువలన నందఱును నోడిపోయిరి. ధ్రువుఁడు యక్షులను దఱిమి తఱిమి కొట్టెను. అంత ధ్రువుని తాతయగు స్వాయంభువమనువు చనుదెంచి మనుమనికోపముడిపి పోయెను. తరువాతఁ గుబేరుఁడు ధ్రువుని శాంతింపఁజేసి, హరిభక్తి యలవడునట్లు వరమిచ్చి చనియెను.

ధ్రువుఁడు స్వపురముఁ జేరినపిదప హరిసేవాపరతుఁ డయ్యెను. ఇట్లు కొన్ని దినములు జరుగునప్పటికి ఒకవిమానము చనుదెంచెను. దానిమీఁద స్ఫురద్రూపులు శంఖచక్రాద్యాయుధధారులు నగునిరువురు పురుషు లుండిరి. వారిని శ్రీహరి కింకరులుగా నెఱింగి, ధ్రువుఁడు నమస్కరించెను. హరికింకరు లాతనికి వెనుకటిసంగతు లన్నియు జ్ఞాపకముచేసి ధ్రువస్థానమునకు రమ్మని యాహ్వానించిరి. ధ్రువుఁడు శ్రీహరికృపవలన ననన్యదుర్లభమగు ధ్రువస్థానమును బొంది, మహామహిమాభిశోభితుఁడై వెలసెను.

---

## 9. కుచేలుఁడు

శ్రీకృష్ణుఁడును కుచేలుఁడును బాల్యమున సాందీపనిమహామునిచెంత సకల శాస్త్రములు నభ్యసించిన సహాధ్యాయులు. విద్యాభ్యాసము ముగిసిన పిమ్మట నెవరి

యిండ్లకు వారు పోయిరి; కాని, వారి హృదయములు మాత్రము స్నేహ పాశబద్ధములై యేకత్వమునందే వెలయుచుండెను.

శ్రీకృష్ణుం డాగర్భశ్రీమంతుఁడు; కుచేలుఁడు ఆగర్భదరిద్రుఁడు. అట్టి దారిద్ర్యమునం దుండఁగనే యాతనికి వివాహ మయ్యెను. సంసారభారము మీఁదఁ బడియెను. భార మననేమి? భార్యాపుత్రాదులు తక్క నాతనికి రక్షింపవలసిన వస్తువులింటియం దేమియు లేవు. ఏపూఁటకు కావలసిన భోజనసామగ్రి యాపూఁట సంపాదించుకొనవలసినదే. కుచేలుఁ డెట్లో కష్టపడి యీభారమును నిర్వహించుచుండెను; కాని, యిట్టి దారిద్ర్యము నెట్లు గడతు నని యాతఁ డెప్పుడును వగచి యెఱుఁగఁడు. క్షుద్బాధ తీఱినవెంటనే దారాపుత్రులను జెంతఁగూర్చుండఁ బెట్టుకొని శ్రీకృష్ణుని బాలక్రీడలు, ఆతనికి సంభవించిన విపత్తులు, వానిని దప్పించుకొనిన విధములు, కంసాదిదుష్టులను సంహరించినపద్ధతులు, ప్రకృతము వినవచ్చెడి యాతని వర్తమాన కార్యములు, ఆతనిశక్తిసామర్థ్యములు నున్నగునవి చాల రసవంతముగ వర్ణించి, శ్రీకృష్ణుఁడు కేవలము శ్రీమన్నారాయణుఁడు. అందులకేమియు సందేహము లేదు. ఇప్పుడు లోకములో నధర్మము పెరిఁగియున్నది. దానిని రూపుమాపుటకే యాతఁ డవతరించె నని చెప్పుచుఁ గాలముఁ బుచ్చుచుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచిపోవునప్పటికి అనఁగా:—కుచేలునకు శ్రీకృష్ణ గుణనామకీర్తనము పెరిఁగిపోవునప్పటికి సంతానము చాల వృద్ధియయ్యెను. ఈరూపమున సంసారభారము పెరిఁగిపోయెను. ఇంతవఱకు నెట్లో బిడ్డలను గనిపెట్టుకొని వచ్చుచున్న కుచేలునిభార్యకు ఇఁక శక్తిలేకపోయెను. ఒకరిద్దఱు పిల్ల లున్నపుడు, ప్రాణ మానుకొనియైన వారి కన్నము పెట్టెడిది. పాప మాసాధ్వి కిప్పుడట్లు చక్కఁబెట్టుకొనుటకు వీలులేకపోయెను. భర్త తెచ్చిన బియ్యము వంటవండుచుండఁగా, నిముస మాగిన నిఁక నుండదని పిల్లలందఱును ఆకుదొన్నెలు చేతులలో నుంచుకొని వచ్చి దీనముగఁ జూచుచు "అమ్మా! నాకన్నముఁ బెట్టుము. నాకు ముందు పెట్టుము. నేను చిన్నవాఁడను. నే నాఁకలి కాగఁజాలను. నేను పెద్దవాఁడనే కాని నాలుగుదినముల నుండి నాకడుపు మాఁడుచున్నది. అమ్మా! నాకు ముందు పెట్టు" మని ప్రార్థింప సాగిరి.

బిడ్డలంగన్న తల్లి కింతకంటె నేమికష్ట ముండును? నిజముగఁ బుత్రప్రేమ మెఱింగిన సాధ్వికి నగ లక్కఱలేదు. నాణెము లక్కఱలేదు. కుఱ్ఱలకుఁ గడుపునిండ గంజియైన నుండినఁ జాలును. కుచేలునిభార్య యీదుర్భరస్థితినిఁ జూడఁ జాలకపోయెను. సహింపలేక యామె యొకనాఁడు భర్తచెంత కరిగి "జీవితేశ్వరా! మన దారిద్ర్యము విషయ మేమియు నూహింపవైతివి. నాకుఁ గడుపునిండ గంజియైన

లేదని నేను వగచుటలేదు. 'అన్నమో రామచంద్రా' యనుచు, నన్నము వండునపుడు వేరాసతో నాకునొన్నెలు గొనివచ్చు బిడ్డలను, ఒక్కపూటనైన క్షుద్బాధ తీర్చుకొనుటకు వీలులేకపోవుటచేఁ జిక్కి శల్యావశిష్టుఁడవగుచున్న నిన్నును, జూచి నేను సహింపకపోవుచున్నాను. గోపాలకృష్ణుఁ డాశ్రితమందార మని చెప్పుచుందువు. బాల్యసఖుఁడవగు నీ కాతఁడు ఇంత యన్నము పెట్టకపోఁడు. అమహాను భావుని దర్శించి, యీదారిద్ర్యాంధకారమును దొలఁగించుకొనరాదా?" అని విన్నవించెను.

అదివిని కుచేలుఁడు భార్యయోచన కెంతయు నానందించి, "రమణీ! నీవు మంచియుపాయము చెప్పితివి. కృష్ణునిఁ గనఁబోవుట యిహపరసాధకము. దైవోప హతుఁడ నగుట నాకీయూహ తోఁచినదిగాదు. ఆరాజీవనయనుని చరణకమలము లాశ్రయింపఁ బోయెదను; కాని యట్టి ప్రభుశేఖరుని చెంతకు రిక్తహస్తుఁడనై యెట్లు పోఁగలను? ఆగోపాలకృష్ణున కుపాయనము తీసికొని పోవుటకు మనయింట నేమైన నున్నవా?" అని యడిగెను. "అతని యర్హతకుఁ దగినవి లేవు; మన యర్హతకుఁ దగినవియున్న"వని చెప్పుచు, నామె యడుకులు తెచ్చి భర్తజీర్ణోత్తరీయమునకు ముడిచెను. గోపాలదర్శనోత్సాహియై కుచేలుఁడు బయలుదేఱి పోయెను.

కాని, మార్గమధ్యమున నాతనికి సందేహములు మెండయ్యెను. "ఆఁకట నవసి నవసియున్నాను. నేను ద్వారకాపుర మెట్లు చేరఁగలను? శ్రీకృష్ణుని దర్శింపఁబోవు నప్పుడు గూడ ధరించుట నాకు జీర్ణవస్త్రములే దిక్కయ్యెను. నేనాపుండరీకాక్షుని యంతఃపుర మెట్లు చొచ్చెదను? జీర్ణపరిధానములను ధరించిన యీబడుగు బాపనికి ద్వారపాలురు ప్రవేశము కలుగనిచ్చెదరా? అయ్యో! వారికేమైన నిచ్చినఁ బోవచ్చు ననుకొన్న, నేమైన సంపాదించుకొనుటకే పోవుచున్న నాచేత నిప్పు డేమున్నది?" ఇట్లు సందేహించి తుద కాతఁడు "యోచనలతోఁ బ్రయోజనము లేదు. ఇంత దారిద్ర్యోపహతునకు సంపద గలుగునదృష్టమున్న, రాజగోపాలుని దర్శనభాగ్య మెట్లబ్బకుండును?" అని నిశ్చయముచేసికొని మాఱుచింత లేక, గోపాలకృష్ణునే హృదయమున భావించుచుఁ బోయెను.

ఈహరిభావనాతాత్పర్యమువలన నాతనికి మైమఱపు గలిగెను. ఆతఁడు నడచుచుండెను; కాని యాతనికి నడచుచున్నానను జ్ఞానము లేదు. చూచువస్తువు లన్నియు గోపాలరూపములుగనే యుండెను. ఇట్లు కొన్ని నిముసములు గడచునప్పటికి, అంతఃపురమున వివిధాలంకారశోభితమగు పడకటింట, హంసతూలికాతల్పమున, రాకేందుముఖులు వింజామరలు వీచుచుండ రుక్మిణితో సరసోక్తులాడుచున్న శ్రీకృష్ణుఁ డాతనికిఁ బ్రత్యక్షమయ్యెను. దైవవశమున ద్వారపాలురెవ్వరు నాతని నాటంకపఱుప

రైరి; కాని యాతఁడు తానిక్కడకు నడచి వచ్చుట యెఱుఁగఁడు. అట్టిస్థితిలో శ్రీకృష్ణుని సమీపించుటకుఁ గుచేలుఁడు సందేహించుచు వెనుక కడుగు లిడసాగెను.

కృష్ణుఁడు కుచేలుని హఠాత్తుగఁ జూచెను. తోడనే సంభ్రమముతోఁ దల్పము దిగి, యతిరయమున వచ్చి వెనుదిరిగిపోవ నుంకించుచున్న కుచేలుని చేయొడిసి పట్టుకొని, బిగియారఁ గౌఁగిలించుకొనియెను. కృష్ణుని చేష్టలు చూచి, అంతఃపురస్త్రీలెల్లరును వెఱ్ఱవోయిరి. రుక్మిణి వెనువెంట వచ్చి నిలిచి యబ్బురముతోఁ జూడసాగెను. ఇది యంతయుఁ జూచి కుచేలుఁడు తెల్లవోయెను. అగుటంజేసి కృష్ణుఁడు తన్ను కుశల మడిగి, మిగుల నాదరము చూపి, తల్పముమీఁదికిఁ గొనిపోయి కూర్చుండఁ బెట్టుటయుఁ గూడఁ గుచేలుఁ డెఱుఁగఁడు. పిదపఁ గృష్ణుఁడు రుక్మిణిచే బంగారుకలశముతో నుదకము తెప్పించి స్వయముగఁ గాళ్లుగడిగి, ఆజలమును శిరమున ధరించి, మృగమదఘనసారమిళితమైన మలయజము ఆతని బడుగుమేన నలఁది, శ్రమపోవునట్లు వీవనతో విసరెను. మణిదీపముల నివాళించెను. సుగంధ కుసుమమాలికల శిరము నలంకరించెను. కర్పూరతాంబూలము నొసంగెను. ఒక ధేనువు నొసఁగి స్వాగత మడిగెను. అంత రుక్మిణి వీవన వీవఁదొడఁగెను. అప్పటికిఁ గుచేలునకు యథార్థమంతయుఁ దెలిసెను. ఇదియంతయుఁ జూచి యంతఃపురకాంతలు గుములుచేరి గుసగుసలు వోవుచు——

ఉ. "ఏమితపంబు చేసెనొకొ యీధరణీవిబుధోత్తముండు తొల్
బామున యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథునిజతల్పమునన్ వసియించియున్న వాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

చ. తనమృదుతల్పమందు వనితామణియైన రమాలలామ పొం
దును నెడఁగాఁదలంపక యదుప్రవరుం డెదురేఁగి మోదమున్
దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో."

(భాగ. స్కం. 10. ఉ. భా. ప. 985,987)

అని యాశ్చర్యపడసాగిరి.

అంత శ్రీకృష్ణుఁడు కుచేలుని కరము గ్రహించి——

సీ. "బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధదక్షిణగల చారువంశంబువలనఁ
బరిణయంబైనట్టి భార్య సుశీలవర్తనములఁ దగ భవత్సదృశ యగునె
తలఁప గృహక్షేత్రధనదారపుత్త్రాదులందు నీచిత్తంబు చెందకుంట
తోఁచుచున్నది యేను మదిలోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు చేయుం

గీ. గతి మనంబులఁ గామమోహితులుగాక, యర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధములు వాపి భవ్యనిష్ఠ, దవిలియుందురు కొంద ఱుత్తములు భువిని."
(భాగ. స్కం. 10. ఉ. భా. ప. 99.)

గురువుగారు చెప్పినవిషయము లన్నియు మనము పంతములుపట్టి వల్లించుట జ్ఞాపకమున్నదా? ఒకనాఁడు గురుపత్నిచే నాజ్ఞప్తులమై యింధనములనిమిత్తము మన మడవికిఁ బోయితిమి. అప్పుడు ప్రళయకాలమునందుఁ బోలె నొక గొప్ప వర్షము కురిసినది. రాత్రియంతయును వర్షములోఁ దడిసి చలివలన మిక్కుటముగఁ బీడితులమై, గృహముదారి గానక యరణ్యమునఁ గ్రుమ్మరితిమి. తెల్లవాఱినపిదప గురుపత్ని మనలను వెదకికొనుచువచ్చి మనయవస్థనుఁ జూచి చాల వగచి, "వత్సలారా! మానిమిత్త మెంత శ్రమ ననుభవించితిరి. అయ్యో! మీనిమిత్తము వచ్చెదమన్న ధారాపాతమగు వర్షమువలన వీలులేకపోయినది. నాబిడ్డలారా! మిమ్మెంత కష్టపెట్టితిని?" అని నొచ్చుకొని, తుద కామె "మీరు అచంచలగురుభక్తులు గావున మీకు సకలైహికసుఖములును గరతలామలకము లగును" అని యాశీర్వదించి మనల నింటికిఁ గొనిపోయినది. నీవింకను మఱువకుండ నున్నావా? మిత్రుఁడా! ఆకాలమున మన మింక ననేకవిచిత్రములు చేసితిమి. అవియెల్ల నీకిపుడు జ్ఞప్తియందున్నవా?" యని యడిగెను.

కుచేలుఁడు అందునకుఁ గొంత ప్రత్యుత్తరము చెప్పి, "కృష్ణా! జగన్నాటక సూత్రధారి వగు నీకు ఒరుఁడు గురుఁ డనుటలో నేమి యర్థమున్నది? లోకవిడంబనార్థము నీవట్లు సంచరించితివి; కాని లోకగురుఁడవగు నీకు గురుండుగాఁదగిన యాత, డెవఁడు?" అని పలికెను. అది విని కృష్ణుఁ డా ప్రస్తావనము నంతటితోఁ జాలించి "సఖుఁడా! నీవును నేనును జిన్ననాఁటి స్నేహితులముగదా! నేననిన నీకుఁ బరమానురాగముగదా! నాకుపహారమున నాసక్తి మెండని నీవెఱుఁగుదువు గదా! మఱి నాఁటికి నేఁడు చూడవచ్చుచు నీవు నాకేమి తెచ్చి పెట్టితివి?" అని యడిగెను. కృష్ణుఁడిట్లడుగకుండినను, ఆతఁడు స్త్రీజనసమక్షమున, విశేషించి దాసీపరివృతయగు పట్టపుదేవి సమక్షమున లేకుండినను, కుచేలుఁడు తాను తెచ్చిన యడుకు లుపాయనముగా నిచ్చియుండును. ఇప్పు డాతని కాపనిచేయుటకు సాహసము కలుగదయ్యెను. అయిన కృష్ణునకిప్పు డేమి చెప్పవలెను? పాపము కుచేలుఁడు లజ్జాభరమున శిరమువంచికొని యూరకుండెను. అంత శ్రీకృష్ణుఁ డేమియు నెఱుఁగనట్లు కుచేలుని జీర్ణోత్తరీయపుఁ గొంగుముడి చూచి "మిత్రుఁడా! ఇదియేమి?" యని యదివిప్పి, "ఆహా! నానిమిత్త మడుకులు తెచ్చితివా? ప్రియమిత్రుఁడా! ఇవి నాకెంతో యిష్టము" అని చెప్పి, యొక గుప్పెఁడు పుచ్చుకొని, యెంతో సంతోషముతో భుజించెను. మఱియొకగుప్పెఁడు తీసికొనుచుండఁగా రుక్మిణి పతిచేయి పట్టుకొని వారించి "నాథా! ఈద్విజశ్రేష్ఠునకు

సంపదలొసంగుటకు నొకటిగుప్పెడే చాలును. ఇంకను గైకొన్న మన మాతని ఋణము తీర్చుకొనఁజాల" మని పలికెను. కృష్ణుఁ డందులకు మాఱుపలుకకుండ నూరకుండెను.

కృష్ణుఁడు నాఁటిరాత్రి కుచేలునకుఁ దనయింట విందుచేసి సకలవిధములఁ దృప్తిఁ బొందించెను. కుచేలుఁడు మఱునాఁ డరుణోదయమున మేల్కాంచి, సకల కార్యములను దీర్చుకొని సెలవడిగెను. శ్రీకృష్ణుఁ డాతని చేయిపట్టుకొని కొంతవఱకు సాగనంపి, "నన్ను మఱవకుమా" యని చెప్పి వెనుకకు వెడలిపోయెను. కుచేలుఁడును గృష్ణుఁడు తనకుఁజేసిన మహాదరమున కెంతయు నాశ్చర్యపడుచు, "అయ్యో! ఈతని వలన నాదరిద్రము విచ్ఛిన్నమైపోవు నని వచ్చితిని. తుద కాశాభంగమే ఫలమైన" దనుకొనుచు స్వస్థలమునకుఁ బోయెను.

పోయి చూడఁగా మున్ను తనపూరిక యెచ్చటనుండెనో, యచ్చట మహోన్నత ప్రాసాద ముండుట కుచేలుఁడు చూచి యాశ్చర్యపడసాగెను. ఇంతలో పరిచారికలువచ్చి "ప్రభూ! లోనికి దయచేయు" మని ప్రార్థించి కొనిపోయిరి. అంగణమున నడుగు పెట్టునప్పటికి పూచిన తంగేడువలె భార్య యెదురువచ్చి మ్రొక్కి, లోపలకుఁ గొని పోయెను. పిమ్మటఁ గుచేలుఁ డిదియంతయుఁ గృష్ణానుగ్రహమే యని గ్రహించెను; కాని యంతటి యతులైశ్వర్యము వచ్చినను, ఆతఁ డైహికసుఖములపొంతఁ బోక నిస్పృహుఁడై కాలముఁ బుచ్చి దేహాంతమున విష్ణుసాయుజ్యమును బడసెను.

సీ. "నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకం బేఁగునే చాటిపడెకుఁ?
బరిపక్వమాకందఫలరసంబులు గ్రోలుకీరంబు చనునె దుత్తూరములకు?
ఘనరవాకర్ణనోత్కలికమయూరము కోరునే కఠినఝిల్లీరవంబుఁ?
గరికుంభపిశితసద్గ్రాసమోదికసింహ మరుగునే శునకమాంసాభిలాషఁ?
తే. ప్రవిమలాకార! భవదీయపాదపద్మ, యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన కుపాస్యంబుగాఁగ, భక్తమందార! దుర్భవభవవిదూర!"

(భాగ. స్కం. 10. ఉ. భా. ప. 257.)

---

## 10. సత్యవ్రతుఁడు

ద్రవిళదేశమును బరిపాలించు సత్యవ్రతుఁడు అను మహారాజు నీరుమాత్ర మాహారముగాఁ గొనుచు, వైకుంఠనివాససౌఖ్యమును బడయఁగోరి శ్రీమహావిష్ణువు కొఱకు గురుతరనిష్ఠతోఁ దపస్సు ప్రారంభించెను. ఒకనాఁ డాతఁడు కృతమాలిక యను నదిలో నవగాహనముచేసి, సంధ్యావందనము ముగించి, తర్పణము చేయుటకు

దోసిట నీరుదాల్చి యుండఁగాఁ దటాలున నందొక చేపపిల్ల పడెను. వెంటనే యా మహారాజు లికిపడి దాని నానదీప్రవాహమునఁ బాఱవేసెను. అంత నది గడగడ వడకుచు "రాజా! పెద్దచేపలు మ్రింగివేయు నను భయమువలనను, జాలరులు వలల సాహాయ్యమునఁ బట్టుకొని మడియింతు రను భీతివలనను, నీపాలఁ బడి నీశరణు జొచ్చిన నన్ను కష్టముల పాలఁ జేయ నీ మేటిఁ బాఱవేయుట ధర్మమా? దీనవత్సలా! కరుణామయా! నాయందు ననుగ్రహము వహించి, నన్ను రక్షింపుము" అని సవినయముగఁ బ్రార్థించెను.

ఈదీనాలాపములకు సత్యవ్రతుని హృదయము వెన్నవలెఁ గరఁగి పోయెను. తోడనే యాతఁ డామత్స్యకిశోరము నాదరముతో మెల్లఁగఁ బట్టుకొని, తన కమండలువున నిడుకొని పర్ణశాలకుఁ బోయి నాఁటికిఁ దనకు లభ్యమయిన యాహార మేదో దానికిఁ బెట్టెను. మఱునాఁ డుదయమున నాతఁడు స్నానార్థము నదికిఁ బోవుటకై కమండలువును జేకొనఁగాఁ జేపపిల్ల నిన్నటికంటెఁ జాలఁ బెద్దదియై యుండుట గాన్పించెను. అందుల కాశ్చర్యపడుచున్న సత్యవ్రతునితో నది "దయామయా! నా కీచిన్ని కమండలువు చాలుట లేదు. మఱియొక తావుఁ జూపు" మని కోరెను. నాఁ డాతఁడు దాని నొక కడవలో విడిచెను. మఱునాఁ డది యంతకంటెఁ బెరిఁగి "మహాత్మా! నే నీయిరుకుఁగడవలో బ్రతుకఁ జాలను. మఱియొక చోటుఁ జూపింపు" మని ప్రార్థించెను. రాజు దాని నొక చిన్ని మడుగులో విడిచెను. అదియుఁ జాలకపోవుటచే నొక సరస్సున విడిచెను. ఆమఱునాఁడు రాజు దాని సంగతిఁ జూచుటకుఁ బోయి, సరస్సునందుమ పెద్దభూప్రదేశమును శంకఁగొలుపు మీనమును జూచెను. అందుల కాతఁ డాశ్చర్యచకితస్వాంతుఁ డగుచుండఁగా నది మెల్ల మెల్లన "భూరమణా! నీవు విశాలదేశమునకుఁ బరిపాలకుఁడవు. నీదేశమున నింతకంటెఁ బెద్దజలాశయము లేకపోలేదు. నా కీసరస్సున నూపిరి తిరుగుట లేదు. ఇటునటు తిరుగుటలో నిందు నాయెముకలు విరిగిపోవుచున్నవి. నా తెక్కఁ లాడుట లేదు. ఈచిన్ని జలాశయమున నా కాహారము గూడఁ జాలుట లేదు. మఱియొక ప్రదేశమును జూపు" మని వేడుకొనియెను.

"ఇఁక నిట్టి వేవియుఁ జాలవు. సముద్రముగూడ ఈవింతమీనమునకుఁ జాలనట్లున్నది. అయిన నంతకంటె విశాల మగు జలరాశి మఱియొకటి లేదుగదా!" యని తలఁచి రాజు దానిని సముద్రమున విడిచెను. తోడనే మహాభీతిచే వలె, నది గడగడలాడుచు, "కరుణాలవాలా! ఇంతవఱకును నన్నుఁ గడు ననురాగముతోఁ బెంచి, నేఁ డిట్టియపారపారావారముపాలుచేయుట తగునా? ఈగభీరజలరాశి తిమింగిలములు మొసళ్లు మున్నగు క్రూరసత్త్వములచే మిగుల భయంకరమై

యున్నది. న న్నొకపంక్తిక్రింద నొక్కివేయఁగల మహామీనములుగూడ నిందు వేనవేలు గలవు. ఇందు నాప్రాణము లెట్లు దక్కును? అయినను నీవేమి చేయఁ గలవు? ప్రపంచమున నెచ్చటఁ జూచినను ఇంతకంటె పెద్దజలరాశి లేదయ్యెను. ఇంతకంటెఁ జిన్నదైనను నన్ను విలాసముగఁ గబళింపఁగల క్రూరసత్వములు లేనిది లేదయ్యెను. ఇఁక నాయదృష్ట మెట్లున్న నట్లగును. పోయిరమ్ము. నన్ను మఱవఁ బోకుము. తలఁచు వచ్చి, నీక్షేమ వార్తలు తెలిపి, నా క్షేమసమాచారములు తెలిసికొని పోవుచుండు" మని ప్రార్థించెను.

ఇదివిని యబ్బురముతోడను, సంతోషముతోడను దానినిఁ జూచి, రాజు "నీచరిత్రము చాల వింతగ నున్నది. ఒక్కొక్కదినమున నూహా కందనంతటి యభివృద్ధినిఁ బడయుచున్నావు. ఎందైన మీనుల కింతటిమేను గలదని వీనులఁ బడెనా? నీవు నిక్కపుఁజేపవు కావనుట యథార్థము. మహాత్మా! ఇట్టి విచిత్రలీలా వతారమును దాల్చిన నీ వెవఁడవో సెలవిమ్ము. నీవు దీనరక్షణమునకుఁ గంకణము గట్టుకొన్న శ్రీమన్నారాయణమూర్తివిగాని వేఱుకాదు. భక్తవత్సలా! పురు షోత్తమా! సృష్టిస్థితిసంహారచతురా! ప్రపంచమున కెల్ల నీవే దిక్కు. నీలీలావతార ములు లోకకల్యాణసంధాయకములు. దేవా! నేను లాతివాఁడను గాను. నీసేవ కుఁడ నగునాయెడల ననుగ్రహము వూనుము. లోకమంగళకారిణి యగుశ్రీమహా లక్ష్మి సేవించుటచే మైమఱచియుండు నీ వీమత్స్యరూపము నేల ధరియించితివో యానతిమ్ము" అని ప్రార్థించెను.

ఈవేఁడికోలు నంగీకరించి, ప్రళయకాలమునందలి భయంకర సముద్రమున నేకాంతముగ విహరింప నిచ్చగించి, మీనరూపమును దాల్చిన శ్రీహరి సత్యవ్రతునిఁ జూచి "ఓయీ! నేటి కేడవదినమున బ్రహ్మదేవున కొక్క పగలు నిండును. ఆ హేతువుచే నాఁడు ప్రళయము సంభవించును. భూర్భువాదికములగు లోకములు గూడ నావిలయసాగరమున మునిఁగిపోవును. నాఁడు నాయాజ్ఞ చొప్పున నోషధీ బీజరాసులతో నిండియున్న యొకపెద్దనౌక వచ్చును. దానిని వెదకికొనుచు సప్త ర్షులు వచ్చెదరు. వారితోఁ గూడ నీవు దాని నధిష్ఠింపుము. జగమంతయు నంధకార బంధురమగును. అయినను నీ వామునులదేహకాంతివలన రక్షింపఁబడెదవు. నా యానతివలన నావతో నొకపెద్దపాము వచ్చును. దానిసాయంబున సముద్రపుఁగెరట ముల తాఁకుడుచే నావ యటునిటు కొనిపోకుండఁ జేసి, దాని చుట్టును దిరుగుచుఁ దిమింగిలములు మున్నగువానివలన బ్రహ్మదేవుని రాత్రికడచునునంతదనుకఁ గాపాడె దను. ఆకారణముననే నీమత్స్యరూపమును వహించితి" నని చెప్పి యంతర్హితుఁ డయ్యెను.

పిదప సత్యవ్రతుఁడు మత్స్యరూపియగు శ్రీమన్నారాయణునిపాదపద్మములం దలంచుకొనుచు దర్భశయ్యపైఁ దూర్పుతలగడగా శయనించి, యాప్రళయకాలమును నిరీక్షింపసాగెను. ప్రళయమునుపచ్చెను. పుష్కలావర్తమేఘములు కడవలతోఁ గుమ్మరించినట్లు కురిసినవర్షమువలన సముద్రములు పొంగి, చెల్లెలికట్టలను దాఁటి, జగత్తును ముంపఁదొడఁగెను. ఇంతలో సప్తర్షులు చనుదెంచి సత్యవ్రతునిఁ జూచి యాశ్చర్యచకితులై "ఈప్రళయకాలమున నీవెట్లు బ్రతుకఁగలిగితి" వని యడిగిరి. రాజు సంగతియంతయుం జెప్పెను. మునులకు మఱింత యబ్బురపాటు తోఁచెను. వారారాజుభాగ్యమును జాలఁ గొనియాడిరి. ఇది యిట్లు జరుగుచుండఁగా, జగత్తంతయు సముద్రమగ్నమయిపోయెను. మేరుగిరిశృంగమును, భైరవమూర్తి శూలాగ్రమున మహాలక్ష్మివిలాసమందిర మగుకమలమువలె, వెలుంగుచుఁ గాశీనగరము మాత్రము ప్రళయోపహతములు కాకుండ నిలిచెను.

అప్పుడు బ్రహ్మదేవుఁడు సృష్టి చేసిచేసి విసిగి, వేసారి యొడలువిరిచికొనుచు శయనించెను. అలసి సొలసి శయనించిన యా విధాతముఖమునుండి వేదములు బయలువెడలెను. ఈశ్వరుఁ డొసఁగిన వరప్రభావమువలన సముద్రమధ్యమున భువనమోహన మనుపురము నిర్మించికొని, దేవతలకుఁగూడ నజేయుఁడై, పోతరించి సంచరించుహయగ్రీవుఁడనురాక్షసుఁడు వెంటనే యావేదములను దొంగలించుకొని పోయి తనపురిని దాఁగికొనియెను.

ఇట్లు వేదములను హరించిన రక్కసుని సంహరింపవలసియు, మ్రానుదీఁగెల విత్తనంబుల పొత్తరలు పెన్నిట నాని చెడకుండ నునుపవలసియు, శ్రీమహావిష్ణువు మఱల మత్స్యరూపముతో నాప్రళయసాగరమున దర్శన మిచ్చెను. అంతకుమున్నె శ్రీహరి యాజ్ఞవలన నొకపెద్దనొక వచ్చెను. సత్యవ్రతుఁడు సప్తమునులతోడను దానిపై నెక్కి మ్రాన్దీఁగెవిత్తనములను జాగ్రత్తచేసెను. పిదప నాతఁడు పెనుఁబాపత్రాట నాజలచరేంద్రుని కొమ్మున కా నొకను గట్టిపట్టెను. మునులు సమాధినిష్ఠాగరిష్ఠు లైరి. సత్యవ్రతుఁడు శ్రీహరి నిట్లు వినుతింపఁ దొడఁగెను.

"మాయచే నావరింపఁబడి ఘోరసంసారసాగరమున మునిఁగితేలుచు, భాగ్యవశమున జను లేమహాత్మునిఁ గొలిచి వైకుంఠముఁ జేరుదురో, యట్టి శ్రీమన్నారాయణమూర్తీ! నన్ను రక్షింపుము. కన్నులుగలవాఁడు గ్రుడ్డివానికి దారిచూపును. ఈసచరాచరప్రపంచమును బ్రకాశింపఁ జేయుసూర్యచంద్రులను నేత్రములుగా ధరించిన ముకుందా! సద్గతిఁ జూపుము. అగ్నిసంపర్కమువలన బంగార మెట్లు పరిశుభ్రమగునో, యట్లే నీసేవవలన లోకములు పాపముల బాఱినుండి తప్పి ప్రకాశించును. చెలివై, చుట్టమవై నాహృదయకమలమున వసించి, యానందమూర్తివై,

నిర్హేతుకజాయమానకటాక్షమున దీనుఁడను, ఆపన్నుఁడను అగు నాకు సాక్షాత్క-
రించిన శ్రీపతీ! పురుషోత్తమా! దీనమందారా! నా మొఱ నాలకించి, నాకు మోక్షము
దయచేయుము."

ఈ ప్రార్థనమును విని భగవంతుఁడు మిపుల నలరి, కరుణవెలయ సత్యవ్రతు
నుద్దేశించి "నేను, నీవు" అని భేదము చేయుటయే అవివేకము. భేదభావమును మఱచి,
తత్త్వము నెఱింగి, సోఽహ మను వాక్యార్థము నెఱింగి ప్రవర్తించినవారికి మోక్ష
ప్రాప్తి యగును. ఇది త్రాడు; పాము గాదు. అనుజ్ఞానముగలవానికి భయ మెట్లుం
డును? బ్రహ్మే జీవుఁడఁగాను; పరబ్రహ్మము ననుభావము గలవానికి సాంసారిక భీతి
యెట్లుండును? బ్రహ్మానందానుభవము గలవానిని మాయ సమీపింపఁజాలదు. అనేక
జన్మములు సాధుపురుషులకుఁ బరిచర్య చేసినయెడలఁ బురాణార్థము తెలియఁగలుగును.
పురాణార్థవిజ్ఞానమువలన సత్కర్మానుష్ఠానమును, దానంజేసి నాపదకమలములం
దెడల నిర్మలభక్తియుఁ బొడమును. దానిచే జ్ఞానప్రకాశము గలుగును. జ్ఞాన
మువలన సకలదురితములు నశించి, మోక్షసిద్ధి యగును" ఇట్లు చెప్పిచెప్పి, మహామీన
మూర్తి తనకు సాంఖ్యయోగక్రియతోడి పురాణసంహిత నుపదేశించెను. సత్య
వ్రతుఁడు భగవంతునిచేఁ దెలుపఁబడిన సనాతనబ్రహ్మస్వరూపమును విని, కృతార్థుఁ
డయ్యెను.

అంతలో నిశావసానము సమీపించెను. 'మమ్మైవరను రక్షింపఁజాలరా'
యను వేదముల దీనాలాపములు ఘంటానాదములవలె వినవచ్చుచుండెను. అప్పుడు
మీనమూర్తి కన్నులెఱ్ఱఁజేసి, రాక్షసునిపై సుఱుకుటకు సంరంభింపసాగెను.
ఆసన్న యెఱింగి, సత్యవ్రతుఁడు నాగబంధమును సడలించెను. తోడనే,—

మ. "ఉఱుకంభోనిధి రోసి వేదముల కుయ్యున్ దైన్యమున్ జూచి వే
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకన్ దోఁక సారించి మే
న్మెఱయన్ దౌడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిన్ దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్."

అంత నిశావసాన మయ్యెను. ప్రళయావసానము గూడ నయ్యెను.

సీ. "ఎప్పుడు వేగునం చెదురుచూచుచునుండు మునుల డెందంబులు ముదము నొందఁ
జెలువతోఁ బ్రక్క నిద్రించు భారతి లేచి యోరపయ్యెదఁ జక్క నొత్తికొనఁగ
మలినమై పెనురేయి ప్రక్కన తేజంబు దొంటిచందంబునఁ దొంగలింపఁ
బ్రాణుల సంచితభాగధేయంబులు కన్నుల కొలఁకులఁ గానఁబడఁగ
తే. నవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిఱి మేల్కాంచి నీరి మలఁగి
యొడలు విఱుచుచుఁ గనుగవలుసుముకొనుచు, ధాతగూర్చుండె సృష్టివిధాత యగుచు."

(భాగ. స్కం. 8, ప, 734.)

తరువాత శ్రీమన్నారాయణుఁడు వేదములను దెచ్చి బ్రహ్మదేవున కిచ్చి పోయెను. సత్యవ్రతుఁడు శ్రీహరిని దలంచి జలతర్పణము గావించి, వివస్వతుఁడను సూర్యునకు శ్రాద్ధదేవుఁ డనుపేరుతో జన్మించి యేడవ మనువయ్యె.

మ. "ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మో
ముల వేదంబులఁ గొన్నదైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిసి సర్వాధారుఁడై మీనమై
జలధిన్ గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్."

భాగ. స్కం. 8. ప. 740.)

---

# 11. భ ర తుఁ డు

భరతుఁడు మహావైభవసంపన్నుఁడు. ఈతఁడు పదిలక్షలవేల యేండ్లు రాజ్యపాలనము చేసెను. ఈతఁడు పాలించుటవలననే, అజనాభమను పేరుతో నొప్పు నీమహాదేశమునకు భారతవర్ష మను పేరువచ్చెను. రాజ్యపరిపాలనా కాలమున భరతుఁడు పరమేశ్వరప్రీతిగా ననేకయజ్ఞములను జేసి, శ్రీహరియెడల నత్యంతభక్తిఁ గలిగియుండెను. కాలక్రమమున నీతనికి వార్ధకము సమీపించెను. తోడనే భరతుఁడు తనకుమారులపై రాజ్యభారము నుంచి భగవద్ధ్యానము చేసికొని తరించుటకుఁ బులహాశ్రమమునకుఁ బోయెను.

పులహాశ్రమవాసు లగు పరమమునులకు దామోదరుఁ డెప్పుడును బ్రత్యక్షముగ నుండును. సాలగ్రామశిలలచే నిండియున్న గండకీనది యా యాశ్రమమును బావనముచేయుచుండును. అచట నాతఁ డనేకవిధనవపుష్పపల్లవములతోడను, తులసీదళంబులతోడను శ్రీహరినిఁ బూజించుచు, విషయసుఖముల మీఁదికి మనస్సును బోనీయక అరికట్టి, శమదమాదిసుగుణశోభితుఁడై విష్ణుభక్తిప్రభావమున సకలకల్మషములను బాసి, యోగివేషియై యుండెను.

ఇట్లుండ నొకనాఁ డాతఁడు గండకీనదిలో స్నానముచేసి మహామాత్రవమాత్ర మంత్రజలములయందుఁ బ్రణవోచ్చారణము చేయుచుండెను. అప్పుడే నిండుచూలాలగు నొకలేడి భరతుఁ డున్న చోటికిఁ గొంచెముపైని నీళ్లు త్రావుచు బ్రహ్మాండభాండము బ్రద్దలుచేయు విలయమేఘగర్జనవలె హృదయవిదారణం బగు సింహనాదము నాలకించి యులికిపడి, ప్రాణభయంబున నున్నట్లుండఁగా నది దాటిపోవుటకు ఆకసమున కెగిరెను; కాని దైవవశమున గర్భస్థ మగు హరిణకిశోరము నీటిలో జాఱిపడియెను. లేడియు నవ్వలియొడ్డున నొకరాతిపైఁబడి ప్రాణములు విడిచెను.

ఈగందరగోళ మంతయు విని, భరతుఁడు కన్నులువిచ్చి చూచునప్పటికి లేడిపిల్ల నీటిలో విలవిలఁ దన్నుకొనుచుండెను. దానినిఁ జూచి హృదయము కరుగఁ దటాలునఁ బట్టుకొని భరతుఁడు తన పర్ణకుటీరమును జేరుకొనియెను. పిదప నాతని చిత్తము లేడిపిల్లపై గాఢానురాగభరిత మయ్యెను. తుదకు పోషణపాలనప్రీణన లాలనానుధ్యానముల భరతుని హృదయము చలించి, యష్టాంగయోగసమాధి నుండియు, శ్రీహరిపూజాపరిచర్యాదులనుండియు విచ్యుతమైపోయెను.

భరతుఁ డా లేడిపిల్లను ఆసనశయనాటనస్నానసమిత్కుసుమఫలపలాశమూలోదకాహరణ దేవపూజాజపాదులయెడలఁ గూడఁ బాయఁజాలక పోయెను. నిత్యనైమిత్తికాదిక్రియాకలాపములయందుఁ గూడ నడుమనడుమ దానినిఁ జూచి లాలింపకుండ నుండఁజాలక పోయెను. వృకసాలావృకాదిక్రూరమృగంబుల వలని భీతిచే నెచ్చటకుఁ బోయిన నచ్చటికిఁ గొనిపోవసాగెను. మఱియు నధికప్రణయభరపరితహృదయుం డగుచుఁ గొంతసేపు స్కంధముల వహించియుఁ, గొంతతడవు ఉరంబున నుంచుకొనియు, మఱికొంతప్రొద్దు ఉత్సంగంబున నుంచుకొనియు నిట్లు లాలించి యానందింపఁ జొచ్చెను. తేపతేపకును దీర్ఘాయువుగా దీవించుచు, మాటిమాటికిని ముద్దుగొనుచు నతిమోహమునఁ బెంచుచుండెను.

ఇట్లు కొన్నిదినములు జరుగునప్పటికి లేడిపిల్ల తేఱుకొనియెను. తన కష్టము ఫలించినదిగదా యని భరతుఁ డానందించు చుండఁగా, నొకనాఁ డది కాన్పింపకుండ నెచ్చటికో పాఱిపోయెను. ఇఁక భరతుని యవస్థ చెప్పనేల? వ్యాకులితచిత్తుఁడై, అతిదీనుఁడై తద్విరహము నోర్వఁజాలక "హరిణపోతమా! వనమున మృగబాధ లేవియు లేకుండునట్లు నిన్నతిభద్రముగఁ గాపాడితిని. నన్ను విడిచి యేల పోయితివి? అయ్యో! నీవు నాకెచ్చటఁ గాన్పింతువు? నిన్నెట్లు తక్కించుకొందును? నీవు నాయాశ్రమమునందలి తృణచయము మేసి పొదలితివి. తుదకు నీ వేక్రూరమృగము వాతఁ బడిపోయితివో! నీవెప్పుడు వచ్చి నన్ను సంతోషపఱుతువు? నానాప్రకారములైన గతులచే నన్నెప్పు డానందింపఁజేయుదువు? నేను ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోకి యెప్పుడు సుఖింపఁ జేసెదవు?" అని యాతఁడు లేడిపిల్లమీఁది భ్రాంతిచే సకలమును మఱచిపోయెను.

ఇట్లాతఁడు తద్విరహవ్యథచేఁ గృశించు చుండఁగా హఠాత్తుగ నొకనాఁ డది యాతని కన్నులఁ బడియెను. అది ప్రత్యక్ష మగుట భరతునకు భగవంతుఁడు సాక్షాత్కరించిన ట్లయ్యెను. అది తిరోహితమైనప్పు డెంతదుఃఖముఁ గలిగెనో, మఱలఁ బ్రత్యక్షమైన పిదప నంత సంతోషముఁ గలిగెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి, భరతున కంత్యకాలము సమీపించెను. పాప మాతనికి హరిణకిశోరముతోఁ

జిరకాల మానందించుచు నుండుటకు వీలులేకయేపోయెను. "అయ్యో! ఈ హరిణకిశోరము దౌర్భాగ్యమువలన నాకవసానకాలము తటస్థించినది. ఇఁక దీని కాధార మెవరు? దీని నాదరముతోఁ బెంచువా రెవరు?" అని విచారించుచు తుద కాతఁడు ప్రాణములను బాసెను. హరిణకిశోరముమీఁది యాయనంతవ్యామోహమువలన నాతఁడు హరిణీగర్భమున హరిణమై జన్మించెను.

ఇట్లాతఁడు లేడికడుపునఁ బుట్టినను దొల్లి భగవద్ధ్యానతత్పరుఁ డై యుండెఁ గావునఁ, దన హరిణత్వమునకుఁ గారణ మెఱిఁగి యాతఁడు:—

**ఉ. "రాజులు ప్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజులన్**
**రాజిలఁజేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ**
**దేజము నొంది యీహరిణదేహమునందలి ప్రీతిఁజేసి నా**
**యోజసెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోనఁ బేలనై"** (భాగ. స్కం. 5. ప. 116.)

అని వగచుచుఁ దల్లినిఁ బాసి యెట్టెట్లో పులహాశ్రమముఁ జేరి, శుష్కపర్ణములను దిని, యచిరకాలమున దేహముఁ బాసి యొకబ్రాహ్మణుఁడై పుట్టెను.

అవాంతరవిపత్తువలన జ్ఞానముఁ గలిగి ముక్తసంగుఁడై, కర్మబంధములను భస్మీపటలము గావింపఁజాలు శ్రీహరిని శ్రవణమననధ్యానాదులఁ బూజించుచు భరతుఁడు కాలము గడుపసాగెను. భరతుని తండ్రియగు ఆంగిరసుఁడనుఁ బ్రాహ్మణున కిరువురుభార్య లుండిరి. అందు బ్రథమభార్యయందు దొమ్మండుగురు పుత్రులును, ద్వితీయభార్యయందు ఇరువురు పుత్రులును గలిగిరి. అంగిరసుఁడు కుమారుల కందఱకును చౌలోపనయనాదికర్మలం గావించి వేదవిద్య గఱపసాగెను. భరతుఁడు తండ్రి చెప్పునవి యెల్ల నిష్టము లేకున్నను మాఱుపల్కక చేయుచు, సంగభీతుఁడు గావున జనులు తన్ను రోయుటకై యున్మత్త జడాంధబధిరరూపములతోఁ బ్రవర్తింపఁ జొచ్చెను.

ఇట్లుండఁ, గొన్ని దినములకు ఆంగిరసుఁడు చనిపోయెను. భరతుని తల్లి భర్తతో ననుగమనము చేసెను. ఇంటి పెత్తనము సవతితల్లి కుమారులకు సంక్రమించెను. సాపత్న్ని సోదరులకు సోదరప్రేమ యుండదుగదా! భరతుని సవతియన్నలు అతని యున్నతిని సహింపఁజాలక విద్యాభ్యాసము మానుపించి గృహకృత్యములలో నియమించిరి. హరిచరణధ్యానమునఁదక్క దేనియందు నాసక్తిలేనివాఁడు గావున భరతుఁ డందులకు సమ్మతించెను; కాని గృహనిర్వహణమున నాతనికి మోహము మాత్రము గలుగలేదు. తండ్రి చెప్పినవిద్య నెంత ముఖ్యముతో నభ్యసించెనో, సవతిసోదరులు నియమించిన గృహనిర్వాహకముఁ గూడ నాతఁ డంతవైముఖ్యముతోడనే ప్రారంభించెను.

విషయవిముఖుఁ డగుట నాతనికి ఆత్మనిత్యానందసుఖలాభము గలిగెను. ఈకారణముచే నాతని కైహికసుఖదుఃఖములయెడల దేహాభిమానము నశించెను. శీతోష్ణవాతవర్షాతపంబులకు మీఁద వస్త్రము గప్పుకొనుట మాని, వృషభమువలె పీనుఁడును - కఠినాంగుఁడునై - స్థండిలశాయియై - పరాగపిహితం బగు దివ్యరత్నము వలె, నవ్యక్తబ్రహ్మవర్చసుఁడై మలినవస్త్రముఁ దాల్చి, మకిలియుక్తయజ్ఞోపవీతుఁడై యుండుటఁ జేసి మూఢు లాతనిని బ్రాహ్మణాధముఁ డనియు, మందుఁ డనియుఁ బిలువసాగిరి. కొందఱ అవివేకు లాతనినిఁ బిచ్చివాఁడా యని పిలిచినఁ, బిచ్చివాని వలెనే పలుకుచుండెను. చెవిటివాఁడా యనిన, చెవిటివానివలెనే ప్రత్యుత్తర మిచ్చుచుండెను. ఇట్లుండ నాతని సవతిసోదరులు గృహనిర్వాహణోద్యోగము చూడఁజేతఁగాక, చేనికాపునకు నియమించిరి. అందులకు వ్యతిరేకము చెప్పక భరతుఁ డదియు చేయసాగెను. ఊక తవుడు తెలికపిండి పొట్టు మున్నగునవి యాహార ముగాఁ బెట్టినను, భరతుఁడు వానిని అమృతమువలె భక్షింపసాగెను. ఇట్లాతఁడు సకలైహికసుఖదుఃఖములయందును సమానముగ నడచుచు, పని నంటక కాలము గడుపుచుండెను.

వృషలరాజు అనువానికి సంతానము లేకపోయెను. కాళికకు బలియిచ్చుటకై పురుషపశువును గొనితెండని యారాజు భటులకు సెలవిచ్చెను. రాత్రియంతయుఁ దిరిగిరి; కాని వారి కెవరును గాన్పింపరైరి. నిష్ప్రయోజనులై వారు పోవుటకుఁ దలంచుచుండఁగా, నాకస్మికముగ భరతుఁడు కన్నులఁ బడియెను. తోడనే రాజ భటులు "మంచిపశువు దొరకె రండు" అని భరతునిఁ గొనిపోయి, అభ్యంజనము మున్నగు సకలవిధులను నెఱవేర్చిరి. అంత వృషలరాజు చందనముంచి చక్కఁగ నలంక రింపఁజేసి మృష్టాన్నంబులు భుజియింపఁబెట్టి, ధూపదీపమాల్యలాజకసలయాంకుర ఫలోపహారాదులు సమర్పించి, మహావాద్యఘోషముతో భరతునిఁ గాళికాదేవి సమ్ముఖమునఁ గూర్చుండఁజేసి, కరాళఖడ్గమును జేతఁగొని కాళికాదేవి ప్రీతినిమిత్తము తెగవ్రేయఁబోయెను.

అప్పుడు భరతుని శరీరమున నఖండబ్రహ్మవర్చస్సు ఉదితం బయ్యెను. దానినిఁ జూచి కాళికాదేవి భీతచిత్తయై, వృషలరాజుపైఁ జాల నాగ్రహించి సపరివారముగ వానిని నాశముచేసెను. భరతుఁడు ఏమియు నెఱుంగనివానివలె శాంతుఁడై చంప వచ్చినవారియందును, ఖడ్గమునందును, కాళికాదేవియందును గూడ సమభావము ఉంచి, విష్ణుమూర్తినిఁ గొనియాడి పోయి, చేనికి యథాపూర్వముగఁ గావలియుండెను.

ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి సింధుదేశాధిపతి యగు రహూగణుఁడు ఇక్షుమతీతీరమున నున్న కపిలమహామునివలన తత్త్వవిజ్ఞాన మెఱుఁగఁ గోరి, పల్లకిపై

బయలుదేఱెను. బోయలు భరతునిఁజూచి 'వీఁడు చాల బలిసియున్నాఁడు. పాలకి నతిసులభముగా మోయఁగలఁడు' అని తలఁచి, బలవంతము చేసి, పాలకి వాని భుజముపైఁ బెట్టిరి. భరతుఁడును మాఱుపలుకక బోయలు చెప్పినట్లు నడువసాగెను. అయినను బల్లకీ యెప్పుడును మోసియుండకపోవుటచే మిట్టపల్లములు వచ్చినప్పుడు చాల కష్టపడి నడువసాగెను. ఈకారణముచేఁ బాలకిలోఁ గూర్చున్న రాజునకు సుఖము లేకపోయెను. ఆతఁడు బోయీలపైఁ గోపింపఁగా వాండ్రు "దేవరా! మావలనఁ దప్పులేదు. ఏలినవారి కీయాయాస మంతయు నీనాల్గవవానిచేఁ గలుగుచున్నది." అనివిన్నవించిరి. భరతుని రాజెంతయో మందలించెను; కాని ప్రయోజనము లేకపోయెను. తుదకు రాజు మహోగ్రముగ నుండిపడి "నీవీపు బ్రద్దలు చేయించెదఁ జూడు" మని గద్దించి పలికెను. అంత భరతుఁడు రాజు నారసి "రాజా! నీవు చేయించెదనన్న శిక్ష యీశరీరమునకే గాని నాకు లేదు. స్థౌల్యకార్శ్యములు, ఆధివ్యాధులు, క్షుత్తృష్ణలు, ఇచ్ఛావిరోధభయంబులు, జరామరణంబులు, రోషనిద్రాజాగరణంబులు, అహంకారమమకారమదశోషణాదులు ఈదేహమునకే గాని నాకుఁ గలుగనేరవు. నీవు రాజభావము కలవాఁడవు గావున నన్ను శిక్షించెద ననుచున్నావు; కాని నేను ఈశరీరముపై నభిమానము లేనివాఁడను. అట్టి నాయెడల నీశిక్ష లేమి లాభకరములు?" అని పలికి, మఱల యథాప్రకారముగ శిబిక మోయసాగెను. ఈసంభాషణమున రహూగణుని గర్వమంతయుఁ బటాపంచలై పోయెను. ఆతఁడు తత్త్వజ్ఞానార్థమై పోవుచున్నాఁడు గావున భరతుని మాటలవలన నాతఁ డొక మహాయోగి యని యెఱింగి, తటాలున శిబికనుండి యుఱికి, భరతునకు సాష్టాంగదండప్రణామము లాచరించి, "మహాత్మా! అవధూతవేషివై నీవొంటరిగా నిచ్చట నేల సంచరించుచుంటివి? నీఘనత తెలియనేరక నేను నీయెడల మహాపరాధముఁ జేసితిని. నాతప్పులు మన్నింపుము. నీమాటలు యోగిజనోచితములై యున్నవి. నేను కపిల మునీంద్రునివలన తత్త్వజ్ఞానముఁ బడయఁగోరి పోవుచున్నాను. నీవు లోకపరీక్ష చేయుటకై యవ్యక్తరూపుఁడై చరించు కపిలమహామునివని తోఁచుచున్నది. మందబుద్ధు లగు మాబోంట్లు యోగీశ్వరులచరిత్రము లెట్లెఱుఁగనేర్తురు? నీవార్తబంధుఁడవు. ఆపన్నులైన నావంటివారు మహాజనాపమానమువలన శీఘ్రముగ నశింతురు. కరుణించి నన్ను రక్షింపుము" అని ప్రార్థించెను.

అంత భరతుఁడు రహూగణునకు సకలసృష్టిరహస్యములను వివరించి, తత్త్వజ్ఞానమును బోధించెను. రహూగణుఁడు కపిలమహామునివలనఁ బడయఁదలఁచిన పరమార్థమును భరతునివలననే పడసి, చరితార్థుఁడయ్యెను. ఇరువురును గూడ తుదకు విష్ణుసాయుజ్యమును బడసి ధన్యులైరి.

సీ. "నారాయణుని దివ్యనామాక్షరములపైఁ గరఁగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యాఁదలయున్న కనకకిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి వనదుర్గ చంద్రికా వైభవంబు
ఆ. "కైటభారిభజన గలిగియుండనివాఁడు, గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదము గననివాని బ్రతుకు, పసిఁడికాయలోని ప్రాణి బ్రతుకు."

(భాగ. స్కం. 2. ప. 51.)

---

## 12. రుక్మాంగదుఁడు

సుగుణాలవాలుఁడైన రుక్మాంగదమహారాజు విదిశాపురము రాజధానిగా ప్రజాపాలనము చేయుచుండెను. కొందఱు రాజులవలె నాతఁడు ప్రజలనుబీడింపక, బిడ్డలవలె భావించుచుఁ జాల సుఖపెట్టుచుండెను. ఒకనాఁడు ఆతఁడు నిండు కొలువున కొలువుదీఱి యుండఁగా, నొక యతీశ్వరుఁడు వచ్చెను. రాజు యతిని అధికభక్తితో అర్ఘ్యపాద్యము లిచ్చి పూజించి, మహాదరముతో నారగింపఁజేసి సేవించెను. అంతట నాయతి రాజుసేవ కెంతయు నానందించి "రాజా ! నీసౌజన్యము వలన నా కానందమైనది. లోకములోఁ బ్రజలను బిడ్డలనువోలెఁ గాపాడు రాజులును, శ్రీహరియెడల విశేషభక్తియుక్తులగు ప్రభువులును అనేకులు గలరు; కాని వారందఱును నీవంటివారు గారు. ఇట్టి నీవు ఆచరింపవలసినవ్రతము ఒకటిఁ గలదు. అది యేకాదశీవ్రతము. దాని నాచరించువారికి మోక్షము కరతలామలక మగును" అని దాని నాతని కుపదేశించి, అది యాచరింపవలసిన విధు లన్నియుఁ దెలిపి, దీవించి వెడలిపోయెను.

యతీశ్వరుని యాజ్ఞాప్రకారము రాజు ఏకాదశీవ్రతము తాను ప్రారంభించుటయేఁగాక, "దేశమునందలి యెల్లరును ఈవ్రతము నాచరింపవలయును; అట్లుఁగాని వారిని కఠినముగ దండించెదము" అని దేశము నలుమూలలను జాటింపించెను. రాజాజ్ఞవలన నెల్లరు నేకాదశీవ్రతము ప్రారంభించిరి. ఏకాదశినాఁడును, ద్వాదశి నాఁడును ఆదేశమున నేయింటఁ జూచినను వారివారికి తగిన వైభవముతో శ్రీహరిని బూజింపనివారు లేరైరి. హరికీర్తనములు, హరిభజనములు నేమూలఁ జూచినను చెవుల పండువుచేయసాగెను. ఆరెండుదినములయందును స్త్రీపురుషులు ఆబాల గోపాలముగ సకలమును మాని, హరిభజనమునందే ప్రవృత్తులై బ్రహ్మానందము ననుభవింపసాగిరి.

ఇట్లుండఁగా రాణి యగు సంధ్యావళీదేవి గర్భమును దాల్చి, నవమాసము లును మోసి, మంచిలగ్నమున బాలసూర్యునివలెఁ బ్రకాశించు చక్కని కుమారునిఁ గనియెను. రుక్మాంగదుఁడు పుత్త్రోదయమునకు ఎంతయు నానందించి, విద్వాంసులకు గొప్పగొప్పబహుమానములుచేసి, ప్రజల నెల్లరను జాల నానందపఱిచెను. మఱియు నొకసుముహూర్తమునఁ గుమారునకు ధర్మాంగదుఁడు అని నామకరణము చేసెను.

భగవదనుగ్రహమువలన ధర్మాంగదుఁడు పలుకనేర్చినది మొదలు కృష్ణా, మాధవా యని పిలుచుచు హరికీర్తనము చేయుటయు, నడువనేర్చినది మొదలు చప్పటులు చరచుచు నృత్యముచేయుటయు, ఊహింప నేర్చినది మొదలు శ్రీహరిని ధ్యానించుటయుఁ బ్రారంభించెను..తనకు అట్టి భాగవతాగ్రగణ్యుఁడు కుమారుఁ డైనందులకు రుక్మాంగదుఁడు మిగుల నానందించుచు, సర్వేశ్వరుని అనేకవిధముల వినుతింపసాగెను. ధర్మాంగదుఁడు గూడ నేకాదశీవ్రతము ప్రారంభించెను. ఇట్లు రుక్మాంగదుని ప్రజలు ఆబాలగోపాలముగ నేకాదశీవ్రతము చేయుచుండుటవలన, నరకమార్గము నిర్జనమయ్యెను. దారియం దంతటను గడ్డియు, తుప్పలును పెరిఁగి పోయెను. అంతకుమున్ను పాపములుచేయుటవలన నరకలోకమునకుఁ బోయిన వారెల్లరును భూలోకముఁ దమ పుత్త్రులు పౌత్త్రులు మున్నగువారుచేయు నేకాదశీ వ్రతప్రభావమువలన, నరకమును విడిచి వైకుంఠమునకుఁ బోయిరి. క్రొత్తనీరు రాక పోవుటయు, నున్న ప్రాతనీరు గట్టు తెగిపోవుటవలనఁ బోవుటయు సంభవించు నపుడు చెఱువు ఎట్లుండునో, నరక మట్లే నిర్జనమైపోయెను. యమదూతలు చేయు నదిలేక, పరికరములను మూలఁబడవేసిరి. చిత్రగుప్తునిపుస్తక మంతయు పుణ్యాత్ముల చరిత్రలతోడనే నిండిపోవుచుండెను. ఇందునకుఁ గారణము తెలియకయు, తన ప్రభు త్వము ఇట్లు బగ్గంపాడై పోవుటయుఁ జూచి, యముఁడు చాల విచారించుచుండఁగ నారదుఁడు వచ్చెను. యముఁడు అడుగఁగా నారదుఁడు రుక్మాంగదుని యాజ్ఞానుసార ముగ దేశమునందలివారెల్లరును ఏకాదశీవ్రతము చేయుచుండుటయే యిందుకుఁ గారణ మని చెప్పెను. "ఎంతపని జరిగినది! మానవమాత్త్రులు నన్నెంత లోకువ చేసిరి!" యని వగచుచుఁ, దోడనే యముఁడు బ్రహ్మసభకుఁ బోయెను.

అట యముఁడు నిండోలగమునఁ గొలువుదీఱియున్న బ్రహ్మకు సాష్టాంగ దండప్రణామము లాచరించి, తనదైన్యము నంతను విన్నవించి "మహాత్మా! ఈయధి కారము నాకు వలదు. నీచిత్తమువచ్చినట్లు చేసికొనుము." అని కాలదండమును, కాలపాశము మున్నగువానిని ఆతనిపాదములచెంత నిడి యూరకుండెను. అంత బ్రహ్మ మందహాసము గావించి "శమనా! ఏల నీయధికారము నాకు వప్పగించివేసె దవు? ఇంత తొందరయేల? ఆరుక్మాంగదుఁ డాచరించుచుఁ, దనదేశప్రజలచే నాచ

డనే. అంతఃపురమందును నాకు సంధ్యావళి పట్టమహిషి. ఆమెయే నాకు ప్రియతమ. నిన్ను పట్టమహిషిగాఁ జేయవీలులేదు. కాని ఆమెకన్న నిన్నే ఎక్కువ ప్రేమించె దను. నీకు సందియమువలదు. నన్ను బ్రతికింపు" మని గడ్డము పట్టుకొని బతి మాలెను. అంతకు నామె వినకుండుటఁ జూచి "మోహినీ! నాతోల్లిటి భార్య లంద అను నీ కూడిగపుగత్తెలై యుండునట్లు చేసెదను. నాకుమారుని నీసేవకునిగా నియ మించెదను. నాపట్టమహిషితో మాటాడకపోవుటయే గాక ఆమెను జూడను. నీవు చెప్పినపని చేసెదను. నీమాట కడుగుదాఁటను. నీవు అగ్గిలో నుఱుకుమన్న నుఱుకు దును; కాని యిప్పుడు నామాటవినుము. ఇట్లు చేసెద నని యీయిష్టకామేశ్వరుని యెదుట శపథముచేసి చెప్పుచున్నాను" అని చేతిలోఁజేయివేసి బతిమాలెను. తోడనే యామె "ఇందులకుఁ దప్పఁగూడదుసుమా!" యని యంగీకరించెను. పిదప నిరువురకును గాంధర్వవివాహము నెఱవేఱెను. అంతట రాజు—

సీ. "దంభోళిధరసతీతాంబూలపేటీషు దహనబింబాధరీస్తనభరేషు
శమనశుద్ధాంతయోషాఫాలభాగేషు నిర్ఋతిసాధ్వీముఖనీరజేషు
కంధినాయకబాలికాకర్ణపత్రేషు గంధవహాంగనాకచభరేషు
రాజరాజాంతఃపురస్త్రీకరాగ్రేషు కరకంఠభామినీకటితటేషు

తే. చంద్రశకలంతి హారంతి చందనంతి, విశదహాసంతి హీరంతి విచికిలంతి
దర్పణంతి దుకూలంతి తవ యశాంసి, క్లేశభవభంగ యిష్టకామేశలింగ."

(రుక్మాంగదచరిత్ర. ఆ. 3. ప. 139)

అని దేవతానమస్కారము గావించి మోహినితోఁ బయలుదేఱిపోయెను.

రుక్మాంగదుఁడు నగరోపకంఠమునందలి ఉద్యానవనమునఁ బ్రవేశించెను. పరిచారకులు చూచి యీసంగతి నగరునఁ దెలిపిరి. తోడనే ధర్మాంగదుఁడు మంత్రులు సామంతులు మున్నగువారితో మహావైభవము చెలంగఁ దండ్రిని నగరునకుఁ గొనిపోవుటకు వచ్చెను. రాజును కుమారుని నమస్కారము లందుకొని దీవించి, మోహిని వృత్తాంతము నెఱింగించి యామెకు మ్రొక్కించి మంత్రిసామం తాదులను గౌరవించి నగరునకుఁ బోయెను. అచ్చట నాతని దేవు లందఱును వచ్చి నాథుని దర్శించి, క్రొత్తగా నొకతెను దీసికొనివచ్చినందులకు విచారించి వెడలి పోయిరి. పట్టమహిషి యగు సంధ్యావళిమాత్ర మట్లుగాక భర్తవలన శపథము సమస్తమును వినియు నీర్ష్యవహింపక, విచారము నెఱుంగక, ముఖమునందలిమంద హాసమున కుద్వాసనఁ జెప్పకయే మోహిని ననేకవిధముల నాదరించి, యామెకుఁ దగిన సౌకర్యముల నన్నిఁటిని ఒనఁగూర్చెను. ఆమె అకృత్రిమత్వమును జూచి మోహిని యాశ్చర్యచకిత యయ్యెను. రాజు వింతపడెను. ధర్మాంగదుఁడుగూడ మోహినియెడలఁ దల్లివలెనే ప్రవర్తించెను. పిదప ధర్మాంగదుఁడు రాజముద్రికను

సమర్పింపఁబోవ రాజు "వత్సా! కొన్నిదినము లింకను నీవే ప్రజాపాలనముచేయు చుండుము. నే నిప్పుడు వేఁటకారణమున బడలి యుంటినిగదా!" యని చెప్పెను. ధర్మాంగదుఁడు పిత్రాజ్ఞను శిరసావహించెను. రుక్మాంగదుఁడు మోహినితోడిదే లోకముగా నుండెను.

పదిదినములు గడచునప్పటికి ఏకాదశి వచ్చెను. ధర్మాంగదుఁడు వ్రతమునకై నగరున సకలప్రయత్నములను జేయించి యథాప్రకారముగ "నేఁడు ఏకాదశి కావున నందఱును నియతాత్ములై వ్రతముచేయవలయును. అట్లు చేయనివారు దండింపఁబడుదురు" అని చాటింపుచేయించెను. ఈపదిదినములును రుక్మాంగదుఁడు రాత్రింబవళ్లనుభేదము తెలియక మోహినితో నుండెను. అతఁడు మేడమీఁదఁ గూరుచుండి మోహినితో ముచ్చటలాడుచుండఁగా, నీచాటింపు వినిపించెను, తోడనే యాతఁడు తటాలున లేచి "దేవీ! నాకు సెలవిమ్ము. నేఁడు నేను ఏకాదశీ వ్రతము నిర్వర్తింపవలసియున్నది" అని బతిమాలెను. ఆవ్రతమును భగ్నము చేయుటకై వచ్చిన మోహిని యాతని కెట్లు సెలవిచ్చిపంపును? ఆమె యేమియు నెఱుఁగనట్లు పోవలదని నిషేధించెను. మన్మథుఁడు నాపై వాఁడిబాణములు విడుచు చున్నాఁడు. నన్ను రక్షింపుము" అని యామె రాజును గౌఁగిలించుకొని, అధరము నానఁబోయెను.

నియతాత్ముఁడగు రాజు తటాలున నామె కౌఁగిలి విడిపించుకొని, "దేవీ! నేఁడిట్టి పను లేమియుఁ గూడవు. సహించుకొనుము. క్షణభంగురములగు తనువుల మీఁది భ్రాంతిచే శాశ్వతానందప్రద మగుమోక్షసాధనోపాయమును మఱచుట లగ్గుగాదు; కావున నీవుగూడ నీవ్రతము నవలంబింపు" మని చెప్పెను. మోహిని "నా కామాట లేమియు విన్పింపవు. క్షణము ఉన్న నాప్రాణములు నిలువవు. నన్ను కౌఁగిటఁబొదివిపట్టుము" అని మీఁదికి వచ్చి, కౌఁగిలించుకొనఁ బోయెను. అంత నప్పుడు రాజునకు నామెకును వాదోపవాదములు ప్రారంభమయ్యెను. ఎంత చెప్పినను రాజు మోహినిమాటలు వినక తుదకు.—

సీ. "రాజసూయాదిసత్క్రతుదీక్షలందైన మగువ యేకాదశి మానరాదు
కల్యాణకమనీయకాలంబులందైన వనిత యేకాదశి వదలరాదు
పితృదేవతాసమంచితపూజలందైన వెలఁది యే॥ దశి విడువరాదు
జాతసూతకమృతసూతకంబులనైన నువిద యేకాదశి నుడుగరాదు
తే. బాలురకు వృద్ధులకు గర్భభారవాహ, తరుణులకు రోగులకు నౌషధక్రియాది
నిరతులకు నైన వర్జింప నీతికాదు, సితకరానన యేకాదశీవ్రతంబు.
ఉ. భూమి సమస్తము న్విడుతు భోగము లెల్లఁ ద్యజింతు భామినీ
స్తోమము నుజ్జగింతు నిజసూనుశిరం బసిధారఁ ద్రుంతు వో

కామినీ! నీవు నిల్వు మనఁగా విడఁజాలఁగరాని దేవతా
గ్రామణి యడ్డగించిన ధరన్ హరివాసర మేల మానుదున్."

(రుక్మాంగదచరిత్ర. 5. ఆ ప 12-113.)

అని పలికెను.

ఇది విని మోహిని ఇది రాజు నిశ్చితాభిప్రాయమని యోజించి, తానువచ్చిన పని నెఱవేఱదేమో యని శంకించి, "అయిన నీమార్గమును ద్రొక్కెద" నని నిశ్చయించుకొని, "రాజా! నే నెన్ని విధములఁ బ్రార్థించినను నాయెడల ననుగ్రహముఁ బూనవైతివి. తుదకు నిష్ఠురము లాడఁజొచ్చితివి. ఆఁడువాని యుసురువలని పాపము ఏకాదశీ వ్రతమైనను హరింపఁజాల దని తెలిసికొనఁజాలకపోతివి. అయినను నీవే పలికితివిగదా? వ్రతమును మాని నన్ను రక్షింపుము. లేకున్న నీపలికినట్లే నా యెదుట నీకుమారుని శిరము ఖండింపుము" అని పలికెను. ఇదివిని రాజు తనతొల్లిటి శపథమును ఇప్పటిమాటలను దలంచుకొని, "చచ్చితి"నని కూలఁబడెను. అంత మోహిని కరుణఁగలదానివలె "రాజా! ఏలవిచారింప? ఏల సుతుని సంహరింపఁ బోవుట? నామోహము దీర్పుము. లేకున్న ధర్మాంగదుని శిరము ద్రుంచక తీఱదు" అని పలికెను.

ఇచ్చటఁ జరుగుచున్న దంతయు విని, వచ్చి సంధ్యావళి తెల్లవోయెను. ధర్మాంగదుఁడు వచ్చి తండ్రికి నమస్కరించి "మహారాజా! ఏల చూచెదవు?

క "ఇయ్యమ్మ మనసుకోరిక, చయ్యనఁ గావించి వ్రతము సాగింపక మీ
రియ్యెడ చలచిత్తులరై, నెయ్యా కొండో యనం జనునె భూనాథా.

సీ జ్వరపాండుశోభాతిసారంబు లొకవేళ నరికట్టి యొంపగా నఱచియఱచి
క్షుత్పీనస మేహగుల్మంబు లొకవేళ నుద్రేక మొనరింప నొఱలియొఱలి
శీతాంగకఫపైత్యవాతంబు లొకవేళ పొదివికారింపఁగఁ బొఱలిపొఱలి
క్షయపీనసశ్వాసకాసముల లొకవేళ బలిమిరై గుదియింప ములిగిములిగి

తే ఘనజరాభారమునఁ జాలఁ గ్రాఁగి క్రాఁగి తనువు దొఱఁగుటకంటె వ్రతంబుకొఱకు
దేహ మర్పించి శ్రీహరిదివ్యలోకమున వసించుటఁ దగదె యోధవరేణ్య.

చ సుతుల ననేకులం బడయఁజొప్పడు నో నరనాథ నీకు నీ
యతివల నూర్వురందు నొక యాత్మజునిన్ హరి పుణ్యవాసర
వ్రతమునకై త్యజించి గరువంబున ధర్మము నిల్పి యచ్యుత
స్థితిఁ జరియింపఁగాఁ దగదె చిత్తమునం దలపోసి చూడుమా.

చ. తనువులు గావు నిత్యములు తామరసాక్షులు నశ్వముల్ కరుల్
ధనములు రాజసంబులు వృథా సహజన్ములు బంధుమిత్రులుం
దనయులు నేమియౌదురు మదంబునఁ జేసినధర్మ మొక్కటే
మనుజవరేణ్య నమ్మఁదగు మానవకోటికి నెల్లకాలమున్.

క. నందనుఁ దునుమఁగ రాదను, సందేహము మాని వ్రతము సాగింపుము గో
విందపురి విభవలక్ష్మికిఁ, బొందుదు సురసిద్ధవాక్ప్రభృతులు వర్ణింపన్.

(రుక్మాంగదచరిత్ర. 5. ఆ. ప. 131-133.135-136-138.)

అని తన్ను జంపుమని తొందరచేసి, వడివడిగఁ బోయి స్నానముచేసి, దోవతులు కట్టుకొని వచ్చి "తండ్రీ! నీకు వ్రతభంగముగాదు. నాకు ఏకాదశీమరణము ప్రాప్తించును. వేగ సంహరింపుము" అని మెడవంచెను. తోడనే రుక్మాంగదుఁడు ఏకాదశీవ్రతమును మానుటకు సాహసింపలేక పుత్త్రుని సంహరించుటకుఁ గత్తి యెత్తెను. తోడనే మోహిని కత్తిపట్టుకొని "రాజా! ఏల త్వరపడెదవు?

క. అర్థపైకంబును జేయని, హరివాసరమునకు నై నిజాత్మజుఁ దునుమన్
గరవాలు చేతఁ బూనిన, కరణి యినుపమొలకు మేఁకఁ గాల్చుటసుమ్మీ."

(రుక్మాంగదచరిత్ర. 5. ఆ. ప. 143.)

సుతునిఁ జంపినవానికి జయములేదు. సుఖములేదు. ఆనందములేదు. కేవలము యమయాతన సిద్ధించును. అయ్యో! వివేకమహితుఁడవే? ఏల యోచింపవు?

సీ. 'సగరుండు పుత్త్రసంజననంబుకొఱకునై తరుణేందుధరుఁ గూర్చి తపముచేసె
తనర దిలీపుండు తనయులకొఱకునై కామధేనువు సేవ కడఁకఁ జేసె
దశరథేశ్వరుఁడు సంతానంబుకొఱకునై పుత్త్రకామేష్టి పొల్పుగ నొనర్చె
పాండుమహారాజు పత్న్యంబు కొఱకు నై యారాధనము చేసె నఖిలసురల
తే. మందపాల జరత్కారుమానివరులు, సుతులువెలిగాఁగఁ బుణ్యసద్గతులుపడయఁ
దపము లొనరించి కాదె యీధరణి గాన, నొంతపాటులఁ బడిరి ధాత్రీశచంద్ర.
మ. కలవాఁ డొక్కఁడె నందనుం డయిన నోఁగా కేమి? సౌమ్యుండు ని
శ్చలచిత్తుం డనఘుండు ధర్మగుణవిస్తారుండు శ్రీవిష్ణుపా
దలసత్పూజుఁడు వంశపావనుఁడు మీఁదన్ దిక్కు మీకీతఁడే
చలమేమో వ్రత ముజ్జగించి సుతునిన్ సంరక్ష గావింపుమా."

(రుక్మాంగదచరిత్ర. ఆ. 5. ప. 147-157.)

అని పలికెను; కాని రాజు ఆమెమాటలు వినక "రమణీ! నీయుపన్యాసము చాలును. నేను కోరినట్లు చేయుచుంటిని. నావ్రతము మాన్పించుట బ్రహ్మకైనఁ దరముగాదు. మానమున నిలువుము" అని యాడుగఁబలికి కత్తియెత్తి విసరెను. తోడనే అది పుష్పమాలిక యై ధర్మాంగదుని కంఠమును జుట్టుకొనెను. అందఱు నందున కాశ్చర్యపడుచుండఁగా—

సీ. "సనకాదిమునియోగిసంఘంబు లుభయపార్శ్వములందు భయభక్తి సంస్తుతింపఁ
దుంబురునారదాదులు వీణియలు గూర్చి సంకీర్తనంబులు సలుపుచుండ
గంభీరరవమున శంఖోజభవశివుల్ సందడు లెడఁగల్గ జడియుచుండ
రంభాదికాప్సరోరామాసమూహంబు లభినయంబులర నాట్యంబు సలుప

తే. వ్యాసశౌనకముఖభాగవతులతోడ, సిద్ధగంధర్వకిన్నరశ్రేణిఁ గొల్వ
గరుడవాహనమెక్కి యిందిరయుఁ దాను, నాదినారాయణుండు ప్రత్యక్షమయ్యె."
(రుక్మాంగదచరిత్ర. ఆ. ౫. ప. 164.)

అంతట నందఱును భయభక్తితాత్పర్యములతో సాష్టాంగదండప్రణామంబు లాచరించి యనేకవిధంబుల నుతింపసాగిరి. వారినందఱను వారించి యప్పుడు శ్రీహరి రుక్మాంగదునిఁ జేరఁదీసి "రాజా! మోహిని బ్రహ్మమానసపుత్రిక. బ్రహ్మ నీమనశ్శుద్ధి నెఱుఁగఁగోరి యామెను సృజించి యింతఁ గావించెను. విధాతయాజ్ఞచొప్పున నీమె యింతలు చేసెనేగాని, యీమె కఠినచిత్త గాదు. ఇంక జాలమేల? మీవ్రతనియమమునకు మెచ్చితిని. మీమనశ్శుద్ధి కానందించితిని. నీకుమారుఁడు యుక్తవయస్కుఁడై యున్నాఁడుగదా? ఆతనికిఁ బట్టముఁ గట్టుము. నీవు నీరాణులతోఁగూడ వైకుంఠమునకు రమ్ము. పట్టాభిషేకంబునకు సకలము నాయితముచేయుము" అని యానతిచ్చెను. అందఱు నానందించిరి. శ్రీహరియాజ్ఞ యైనవెంటనే మంత్రులు సకలము నాయత్తపఱిచిరి. శ్రీపతి సెలవుఁబడసి రుక్మాంగదుఁడు ధర్మాంగదునకుఁ బట్టాభిషేకము చేసెను. లక్ష్మీనారాయణులు దీవించిన పిదప ధర్మాంగదుని దేవతలును, మునులు, బ్రాహ్మణులు నెల్లరు నాశీర్వదించిరి. పిదప విధాత వైకుంఠనాథుని యింగితము నెఱింగి క్షణములో ననేకవిమానములను నిర్మించెను. నారాయణుఁడు అందఱు భార్యలతోడను రుక్మాంగదుని విమాన మెక్క నియమించి, ధర్మాంగదునకు మఱియొకమాఱు హితోపదేశము గావించి బయలుదేఱెను. విమానపంక్తి నారసి యెల్లరు నాశ్చర్యచకితులైరి.

సీ. "సర్వసర్వంసహాచక్రంబు లంఘించి తగ భువర్లోకంబు ప్రస్తరించి
త్రిదశలోకము లిరువదిమూఁడు వడి దాఁటి ఘనమహర్లోకమార్గంబు గడచి
జనలోకవిస్తీర్ణసరణి వేగ క్రమించి గురుతపోలోకంబుఁ బరిహరించి
బ్రహ్మలోకసమగ్రపథము విసర్జించి శివలోకవిఖ్యాతి సీమ దరసి
తే. మాధవునిఁ గొల్చి దివ్యవిమానపంక్తి, గగనగమనంబునందు నఖర్వగరిమఁ
జనియె రుక్మాంగదక్షితీశ్వరునితోడ, భూరివిఖ్యాతి వైకుంఠపురమునకును."
(రుక్మాంగదచరిత్ర. ఆ. ౫. ప. 193.)

మ. "తమలోఁబుట్టు నవిద్య కప్పికొనుచున్ దుష్కాలసంసారవి
భ్రములై కొందఱు తేలుచున్ గలఁగుచున్ బల్వెంటలన్ సైవయో
గమునందే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్యసంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టి నీవు కరుణం బాలింపు మద్మీశ్వరా."
(భాగ. స్కం. 8. ప. 321.)

# 13. గౌతమబుద్ధుఁడు

కోసలదేశపు టీశాన్యభాగమున నున్న రోహిణీనదీతీరమునందలి కపిలవస్తు నగరమున సింహాసనము నధిష్ఠించి శాక్యవంశజుఁడగు శుద్ధోదనుఁడు అనురాజు ప్రజలను బాలించుచుండెను. అతనికి సకలసౌఖ్యములు నుండెను; కాని సంతాన సౌఖ్యముమాత్రము లేదయ్యెను. సంతానము లేనివారికి ఇఁక నెన్ని సౌఖ్యము లుండిన నేమిప్రయోజనము, ఇట్లు చిరకాలముఁ గడచిపోయెను. అంతవఱకును రాజు తనకు సంతానము వచ్చుసంవత్సరమునందే కలుగునో, అంతకుఁబైని వచ్చు సంవత్సరమునందే కలుగునో, అంతకుఁ బైనివచ్చుసంవత్సరమునందే కలుగునోయని యెదురుచూచుచుండెడివాఁడు. అట్టి యవధులు అనేకములు కడచిపోయెను. శుద్ధోదనుఁడు సంతానవిషయమున నిరాశ చేసికొనెను. "ఇఁక నీవైభవ మెందులకు? ఈరాజ్య మెందులకు? ఈజీవిత మెందులకు?" అని రాజు సకలమును గర్హింపఁదొడఁగెను. ఇట్టివైరాగ్యదశలో నాతనిరాణి యగు మాయాదేవి గర్భమును ధరించెను. దాసీముఖమునఁ దనరాణి గర్భవతియైనదని వినినపుడు ఇఁక రాజుసంతోషము నేమి చెప్పవలెను? తోడనే తొల్లిటి నిరాశ పోయెను. వైభవములనెడలఁ జిరాకు, రాజ్యమునెడలఁ బరాకు, జీవితమునెడల విసుగునుగూడఁ బోయెను. నిస్సారమని తలఁచికొనిన సంసారసుఖము సారవంతమును, దుఃఖభూయిష్ఠమనుకొనిన ప్రపంచము సౌఖ్యబహుళమును అయ్యెను. అన్నివిధముల నాశుద్ధోదనుని యానందమునకుఁ బరిమితిలేదు. ఈ మహానందముతో నాతఁడు మాయాదేవికి సీమంతము మున్నగు క్రియలు యుక్తసమయమున దేవేంద్రవైభవముతో నెఱవేర్చి సకలజనులను సంతోషపఱచెను.

మాయాదేవికి నవమాసములును నిండెను. కపిలవస్తునగరమునకు మూఁడు క్రోసులదూరమున నున్న లంబినీవనము అను నుద్యానవనము సౌఖ్యదాయకమనితలంచి, అచ్చట సకలసౌకర్యముల నొనఁగూర్చి రాజు ప్రసవించుటకై రాణి నచ్చటకుఁ గొనిపోయెను. అచ్చటిసుకుమారకుసుమసహస్రముల సౌరభమును గొని, విలాసముగ నడయాడు మలయానిలమువలన సుఖపరవశ యగుచు మాయాదేవి శుభలగ్నమున నొకకుమారునిఁ గనియెను. రాజహృదయ మానందపరీత మయ్యెను. క్షణములో నీవార్త రాజధానియందును, ఉత్తరక్షణమున దేశము నలుమూలలను దెలిసిపోయెను. నలుదెసలనుండియు నానందధ్వానములు మిన్నుముట్టెను. రాజు పుత్రోత్సవము నెఱవేర్చి, నెలపురుడుగడచిపోయిన తరువాత

శుభదినమున కుమారుని రాణిని వెంటనిడుకొని రాజధానిం బ్రవేశించెను. ఆకుమారునకుఁ బలికిం త్రులు పెట్టిన పేరు సిద్ధార్థుఁడు. ఆతఁడు గౌతమగోత్ర జుఁడగుటచే గౌతముఁ డను మాఱుపేరుగూడ వచ్చెను. కులమువారందఱు నాతఁడు శాక్యవంశ జుఁడు అగుటచే శాక్యముని యనియు, శాక్యసింహుఁడనియుఁ బిలువ సాగిరి. ఈతఁడే పెద్దపెరిగి, ప్రజలకు భగవంతునిగుఱించి బోధలు సేయుటవలనను, పరతత్త్వబోధ కలిగినవాఁడగుటను బుద్ధుఁ డని గూడ పిలువఁబడసాగెను. గౌతమబుద్ధుఁడు అను మాఱుపేరు నీతనికి వాడుకలోఁ గలదు.

సిద్ధార్థుఁడు బాల్యమునుండియు పిపిలికాది బ్రహ్మపర్యంతమునుగల సకల భూతజాలములయందును అపారదయ గలిగి ప్రవర్తింపసాగెను. వయసువచ్చిన కొలఁది నాతనికి సంసారము నెడల వైముఖ్యమును, ఇహసౌఖ్యములయెడ వైరాగ్యమును బ్రబలఁజొచ్చెను. ఏకాంతవాసమును, భగవద్ధ్యానమును, ఆత్మ జిజ్ఞాసయు నధికము కాసాగెను. రాజభోగములయెడలఁ బరాఙ్ముఖతయు, వేషభాషలయందు నిస్పృహయు మెండయ్యెను. అదిచూచి శుద్ధోదనుఁడు తన కుమారుఁ డెక్కడ విరాగియై పోవునో యని జడిసి, కాంతాలంపటులైనచో యువకుల కిక వైరాగ్యము పటాపంచ లగునని భావించి యశోధర యను నొక చక్కని కన్యను దీసికొని వచ్చి పెండ్లిచేసి, ఆనవదంపతులను దేవేంద్రభవనమును దిరస్కరించు నొక దివ్యభవనమున నుంచి, అప్సరసలమించు రమణులను అచ్చటఁ బరిచారికలుగను చెలికత్తెలుగను నియమించెను. శుద్ధోదనుఁడు తలంచినట్లుగ గౌతముఁడు పెండ్లియైనతరువాత రెండుమూఁడు ఏండ్లు స్త్రీలంపటుఁడై గడిపెను. ఇంతలో నాతని కొక కుమారుఁడు గలిగెను. కుమారునిఁ జూచినతరువాత నాతనికి సంసారము నెడల మఱింత వాంఛ గలిగెను.

ఇట్లుండఁగా నాతఁ డొకనాఁడు వనవిహారమునకుఁ బోవుచుండఁగా, మార్గ మధ్యమున నాతని కొక రోగియు, నొక వృద్ధుఁడును, నొక శవమును గాన్పించెను. వారి సంగతులను సారథివలనఁ దెలిసికొని యాతఁడు "లోకములో రోగము పాలుగాని ప్రాణియు, జరాభారముచేఁ గృంగిపోని జీవియు, మరణము పాలు గానిదియు లేదని తలంచుకొనెను. తోడనే యాతనికిఁ దొల్లిటివైరాగ్యము పూర్వాధికమై సాక్షాత్కరించెను. ప్రయత్నమువలనఁ గలిగిన మమకారము మున్నగునవి తోడనే నశించి సహజమగు వైరాగ్యము మఱలఁ బ్రభుత్వము ప్రారంభించెను. తోడనే యాతఁడు "ఇఁక సంసారమున నుండఁగూడదు. మానవ జీవితము క్షణభంగురము. అస్వల్పకాలమును దెలిసియుండియు కుమార్గమున వ్యయముచేయుట వివేకిలక్షణము గాదు. నిర్వాణోపాయమున కిదియంతయు

నడ్డుకట్ట యని భావించి, సకలమును విడిచిపోవుటకు నిశ్చయించుకొనిపోయెను. ఒక నాఁటి రాత్రి యాతనికి వైరాగ్యమును, మోక్షసాధనవాంఛయుఁ బెరిఁగిపోయెను. అప్పు డతఁడు విశ్వసనీయుఁ డగుసారథిని రథముతో రెండుజాములరాత్రి వేళ సంకేతస్థలమున సిద్ధముగానుండ నియమించి, తానంతవఱకును మేల్కాంచియే యుండి ప్రయాణమయ్యెను. పోవునపుడు ఆతఁడు "ఇది కడసారి" అని తన కుమారుని ఒకమాఱు ముద్దిడుకొని పోవలయు నని తలంచుకొని ఉయ్యెల మంచము చెంతకుఁ బోయెను; కాని అచ్చట సఖీజనపరివృతయై, అనంతదీపప్రభా పూరమున గాఢనిద్రం దవిలియు, ననుపమానసౌందర్యముచే విరాజిల్లుచున్న యశోధర నారసి "క్షణమిచ్చట నున్న ఇఁక జీవిత మథఃపతితమైపోవు" నని శంకించి, మనసు రాయిచేసికొని ముద్దుబిడ్డఁ డగు రాహులుని ముద్దుగొనకయే బయలుదేఱి పథమెక్కి పోయెను.

నగరమును విడిచి అరణ్యమునఁ గొంతద వ్వరిగిన పిదప గౌతముఁడు రథము డిగ్గి, తన వేష మంతయు సారథికి ఇచ్చివేసి సారథివేషమును తాను స్వీకరించి, చేత నున్న కత్తితో తన శిరోజములను దీసివేసికొని "నేను సన్యాసినైతి ననియు, నా కొఱకు విచారింపవలదనియు నాతలిదండ్రులకును, భార్యకును తక్కుంగలవారికినిఁ దెలుపు" మని వానిని నగరమునకుఁ బంపివేసి, తాను ముందునకుఁ బోయెను. కొంత దూర మరుగునప్పటి కాతని కొకతత్త్వజ్ఞుఁడు కానవచ్చెను. ఆతఁడు శిష్యగణపరివృతుఁడై పరతత్త్వవిచారమునఁ బ్రవృత్తుఁడై యుండెను. సిద్ధార్థుఁడు ఆతని నాశ్రయించి కొన్నినాళ్లు అచ్చట నుండి తత్త్వశాస్త్రము నభ్యసించెనుగాని, దానివలనఁ బ్రయోజనము లేదని తోఁచెను. తోడనే యాతఁ డాచార్యుని విడిచి కొంతదూరము ముందునకుఁబోయి మఱియొక యాచార్యు నాశ్రయించి, ప్రాణాయామాదుల నభ్యసించి యోగియై సమాధినుండి పరతత్త్వము నెఱుంగఁ బ్రయత్నించెను; కాని దానివలనఁ గూడఁ బ్రయోజనము గాన్పింపదయ్యెను. తోడనే యాతఁడు మగధ దేశమునకు రాజధాని యగు రాజగృహమునకుఁబోఁగా, నచ్చటఁ గొందఱు ఆచార్యులు తపస్సుచేయనివానికి ముక్తి లేదనిరి. వారియుపదేశము ననుసరించి గౌతముఁడు గయాపట్టణప్రాంతమునఁ దన యైదుగురు శిష్యులతోఁ దపస్సుచేసెను. అయిదుసంవత్సరములు ఆతఁడు అతిదీక్షతోడను అతినిష్ఠతోడను దపస్సుచేసియుఁ, దానివలనఁ గూడ లాభమును బడయఁజాలక "ఇది మోక్షసాధనోపాయము గాదు" అని దానిని విడిచివేసెను. ఇది చూచి శిష్యులు "ఈతఁడు చంచలుఁడు. ఇట్టివానిని ఆశ్రయించిన మనమును చంచలుల మైపోదుము" అని కూడఁబలుకుకొని, యాతనిని విడిచిపోయిరి.

అందుల కాతఁ డేమియు జంకక, ఆగయాపట్టణప్రాంతమునందే యొక రావిచెట్టుక్రిందఁ గూర్చుండి నిశ్చలచిత్తుఁడై తత్త్వవిచారము ప్రారంభించెను. తోడనే యాతనికిఁ బరతత్త్వమంతయు బోధపడియెను. అప్పుడే యాతఁడు బుద్ధుఁ డయ్యెను. ఆతఁ డేస్థలమునఁ గూర్చుండి పరతత్త్వమును దెలిసికొనియెనో ఆస్థలమునకు బుద్ధగయ యని పేరువచ్చెను. ఆరావిచెట్టునకు బౌద్ధులు చాల భక్తితో పూజలు చేయుదురు.

గౌతముఁడు ఇలువిడిచి పోవునప్పటికి ముప్పదియేండ్లప్రాయమున నుండెను. పిమ్మట నాతఁడు గయాపట్టణమువద్ద బుద్ధుఁ డగునప్పటికి ముప్పదియాఱవయేఁడు వచ్చెను. అప్పు డాతఁడు తనమతమును లోకులకు బోధింపవలెనని కాశీనగరమునకుఁ జనియెను. అచ్చటఁ బండితులకు, నాతనికినిఁ జాల వాదోపవాదములు జరిగెను. ఇట్లు మూఁడుమాసములు గడచునప్పటికి అఱువదిమంది బౌద్ధమతమును స్వీకరించిరి. వారి నందఱను ఆతఁడు "ఈధర్మమును లోకమున వెల్లడిచేయుఁడు" అని నలుదెసలకును బంపించెను. పిదప నచ్చటనే మఱికొందఱు శిష్యులను సంపాదించి యాతఁడు మగధదేశమునకు రాజధానియగు రాజగృహమునకుఁ బోయి, అచ్చటఁ బ్రజాపాలనము చేయుచున్న బింబిసారుఁడు అను రాజునకును, అనేకజనులకును తనమతదీక్ష నొసంగెను. అతఁ డచ్చట నున్నంతకాలము ననేకపండితులును పామరులును వచ్చి యాతని మతమును స్వీకరించిరి. మఱికొన్నిదినములు ఆతఁ డచ్చట నుండి తనకు జన్మస్థలమగు కపిలవస్తునగరమునకుఁ బోయి అచ్చటఁ దనతల్లిదండ్రులకును, భార్యకును, కుమారునకును, ఇంక ననేకులకును పరతత్త్వమునుబోధించి మతదీక్ష నొసంగెను. ఇట్లు ఆతఁడు బ్రతికియున్నంత కాలమును అనఁగా బుద్ధుఁడైనది మొదలు నలువదినాలుగేండ్లు లోకులకు పరతత్త్వబోధగావించి, మతదీక్ష నొసంగి కాశీకోసలమగధ దేశములయందుఁ దనమతమును బాగుగ వ్యాపింపఁజేసి వృద్ధుఁడై తన యెనుబదవయేఁట కుశినగరమునఁ బరమపదించెను.

సీ. "భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వాయములు గుణము నెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించుకొఱకునై నిజమాయ నెవ్వఁ డిన్నియును దాల్చు
నాపరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
చిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు
తే. మాటలను నెఱుకల మనములఁ జేరంగ, గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు, వాని కేనొనర్తు వందనములు."

(భాగ. స్కం. 8. ప. 78.)



శ్రీ శంకరాచార్య—37.

# 14. శంకరాచార్యుఁడు

కేరళదేశములోఁ బూర్ణానదికిని, వృషాచలమునకును సమీపమున "కాలటి" అను నొకయగ్రహారముఁ గలదు. అందు 'శివగురుఁడు' అను బ్రాహ్మణవిద్వచ్ఛేఖరుఁడు 'ఆర్య' యనుభార్యతో వంశక్రమముగా నివసించి యుండెను. ఆతఁడు అనేక విద్యల యందు గొప్పపండితుఁడు. ఐహికమువిషయమున నాతనికి దుఃఖకారణము లంతగా లేవు గాని, సంతానము లేని చింతమాత్రము ఆదంపతులను జాల వేధించుచుండెను. ఎన్నో వ్రతముల నాచరించినను బ్రయోజనము లేక పోవుటచే వారిరువురును మహేశ్వరునిఁ బూజింపఁ దొడఁగిరి. ఈయారాధనము కొంతకాలము జరుగునప్పటికి ఆర్యాంబ గర్భవతియై కొడుకును గనియెను. శంకర ప్రసాదమువలన నీబిడ్డ గలుగుటచే శంకరుఁడు అని పేరు పెట్టుకొని ఆదంపతు లెంతో ప్రేమతోఁ బెంచుకొనుచుండిరి. శంకరుఁడుగూడ తల్లిదండ్రులయెడలఁ జాల భయభక్తులు గలిగి యుండెను.

సంవత్సరము గడువకపూర్వమే శంకరుఁడు అక్షరములను గుర్తుపట్టి రెండవ సంవత్సరములో చదువను వ్రాయను నేర్చుకొనెను. మూఁడవయేఁట కావ్యము లన్నియుఁ జదివివేసి, ఇతిహాసములు పురాణములు మున్నగువానిని బరిశోధించెను. ఈతనికి గురువు రెండవమాఱు ఎప్పుడును పాఠముచెప్పి యెఱుఁగఁడు. ఒక మాసము గడువక పూర్వమే గురువు శంకరుని యేకసంథాగ్రాహిత్వమును గుర్తించి సకలశాస్త్రములు నాతనిచెంత నేకరువుపెట్టివేసెను. గురుఁడు పాఠము చెప్పునపుడు ఒకొక్కప్పుడు శంకరుఁడు వేయుప్రశ్నలకు సమాధానము చెప్పలేక, అతనివలననే తెలిసికొని మహాశ్చర్యనిమగ్నుఁడగుచుండువాఁడు. ఆతనిచెంత నింకననేకులు శిష్యులు ఉండిరి; కాని వారందఱకు శంకరుఁడే పాఠములు చెప్పుచుండెడివాఁడు. శంకరుఁడు చెప్పెడి పాఠము విద్యార్థులకు బాగుగ నవగాహనమగుచుండెడిది. గురుఁడు శంకరునంత చక్కఁగఁ బోధింపఁజాలకుండెను. ఇట్లు శంకరుఁడు సకలవిద్యలును నేర్చుకొనునప్పటికి ఏడవసంవత్సరమువచ్చెను. గర్భాష్టమసంవత్సరములో బ్రాహ్మణునకు ఉపనయనము జరుగవలెను. కావున అప్పుడు శివగురుఁడు శంకరునకు ఉపనయనముచేయుటకు సకలప్రయత్నములను గావించెను; కాని ముహూర్తము సమీపించు నప్పటికి ఆకస్మికముగా నాతఁడు చనిపోయెను. భర్తృమరణమునకుఁ జాల వగచి, ఆర్యాంబ శంకరునకు సన్నిహితజ్ఞాతులచే నుపనయనము చేయించెను.

పిదప శంకరుఁడు వేదముల నభ్యసించుటకు ఒక గురువు నాశ్రయించెను. అట నాతఁడు యథాశాస్త్రముగ మధూకరవృత్తిచే అన్నము సంపాదించి తెచ్చి

అందు కొంత గురువునకు ఇచ్చి, తక్కినది తాను భుజించుచు గురువును సేవించుచు వేదాభ్యాసము చేయసాగెను. ఒకనాఁడు ఒకస్త్రీ అతనికిఁ బెట్టుటకు ఏమియు లేక మధూకరమునకు వచ్చినపుడు "నాయనా! నాకు ఇదియే కలదు" అని యొక యుసిరి కాయ యిచ్చెను. శంకరుఁడు సాక్షాత్తుగ శంకరుఁడే గావున ఆమె దారిద్ర్యమును, దైన్యమును గుర్తెఱిఁగి తెల్లవారుసరికి ఆమె యిల్లంతయు బంగారపు టుసిరి కాయలతో నింపివేసెను. పిదపఁ గొన్ని దినములుమాత్రమే ఆగ్రామమున నుండి వేదము లన్నియు నభ్యసించి, మాతృదేవతను బూజించుటకు అతఁడు స్వగ్రామము నకుఁ బోయెను. కొడుకు తిరిగి మహావిద్వాంసుఁడై యింటికి వచ్చెనను ఆనందముతో ఆర్యాంబ అతనికి వెందలకడ భోజనము పెట్టఁదలఁచి స్నానముచేసి మంచినీళ్లు తెచ్చుటకు పూర్ణానదికిఁ బోయెను; కాని యామె నదిని సమీపింపకె పూర్వమే వడ గొట్టి పడిపోయెను. తల్లి యెంతసేపటికిని రాకపోవుటచే శంకరుఁడు అపాయమును శంకించి నదికిఁ బోఁగా, నాతనికి సర్వమును దెలిసిపోయెను. తోడనే శంకరుఁడు తల్లి ముఖము మీఁదఁ జల్లనినీరు చిలికి చికిత్సచేసి ఆమెకు స్మృతిఁ గలిగించి యింటికిఁ దీసి కొనివచ్చి, తనతల్లి కష్టపడిపోవుచున్నదని తలంచి తన ప్రభావమువలన ఆనది తన యింటి ముందునుండి ప్రవహించునట్లు చేసెను. ఈయద్భుతమును విని, ఆదేశపురాజు శంకరుని గౌరవింప వజ్రవైడూర్య మరకతమాణిక్యాదినవరత్నములు, వెలగలవస్త్రములు మున్నగునవి గైకొని వచ్చెను; కాని శంకరుఁడు వాని నెంతమాత్రమును అంగీకరింపక ఆరాజు రచించిన మూఁడుగ్రంథములనుమాత్రము స్వీకరించెను. అవియైన నాతఁడు తనచెంత నుంచుకొనక ఒకమాఱు పఠించి తిరుగ రాజునకుఁ బంపి వేసెను.

ఒకప్పుడు శంకరుఁడును దల్లియు వాకిటఁ గూర్చుండి యేమో ముచ్చటించు కొనుచుండఁగా, కొందఱు ఋషీశ్వరులు వచ్చి యెంతో వినుతిచేయఁదొడఁగిరి. వారినిఁ జూచి ఆర్యాంబ తన కుమారుని గొప్పతనమును గ్రహించి ఋషీశ్వరులకు మ్రొక్కి, "మహానుభావులారా! మీయాగమనమువలన నేను, నాకుమారుఁడును బునీతుల మైతిమి. మాకుటీరము పావనమైనది. చూడఁగా నాకుమారుఁడు చాల సదృష్టవంతుఁ డని తోఁచుచున్నది. తొల్లి జన్మమున నీతఁడును నేనును జేసికొన్నవ్రతవిశేషము లేవో సెలవియ్యవలెను" అని ప్రార్థించెను. అందులకు ఋషీశ్వరులు "తల్లీ! నీకుమారుని నీవు మానవమాత్రునిగాఁ దలంపకుము. ఈజన్మమునందే నీవును నీభర్తయుఁ గావించిన పూజకు సంతసించి, పరమశివుఁడే నీగర్భమున నుద్భవించెను. శివుఁడు ప్రత్యక్షమై "అవివేకియై దీర్ఘాయుర్దాయముగల కుమారుఁడు కావలెనా? వివేకియై స్వల్పాయుర్దాయము గలవాఁడు కావలెనా?" యని యడు

గఁగా, నీభర్త "స్వల్పాయుర్దాయవంతుఁడైనను వివేకముగల, అనఁగా సర్వజ్ఞుఁడైన కుమారుఁడు కావలయు" నని కోరెను. తనకంటె సర్వజ్ఞుఁడు మఱియొకఁడు లేక పోవుటచే నీభర్తవరము ననుసరించి ఈశ్వరుఁడే నీకడుపునఁ బుట్టవలసివచ్చినది. ఆగుటవలననే నీకుమారునకు ౧౬ సంవత్సరములు మాత్రము ఆయువు. అయినను కారణాంతరములచే నీతఁడు ౩౨ సంవత్సరములు జీవించును. పరమేశ్వరుఁడు చిరకాలము మానవలీలలతో నుండుటకు వీలులేదు గదా!" అని చెప్పిరి. ఈమాట వినుటతోడనే, ఆర్యాంబకు ఆనందమునకు మాఱుగ దుఃఖము వచ్చెను. తోడనే యామె మూర్ఛనొందఁగా శంకరుఁడు ఉపచారములుచేసి తేర్చెను. కొంతసేపు శంకరునితో నేమేమో ముచ్చటించి, ఋషులు వెళ్లిపోయిరి.

ఆర్యాంబ తన కుమారునకు ఆయుర్దాయము అత్యల్ప మగుటచేఁ బెండల కడఁ బెండ్లిచేయకున్న సంతానము కలుగదని యూహించి, యొకనాఁడు కుమారునకు అన్నము పెట్టి దగ్గఱఁ గూర్చుండి "బిడ్డా! అనేకులు నీకు చక్కని చుక్కలగు తమ కొమార్తెల నిచ్చి పెండ్లిచేసెదమని వచ్చుచున్నారు. వారిలో నీచిత్తము వచ్చిన కన్యను బెండ్లియాడి సుఖింపుము నాయనా" యని పలికెను; కాని యిది విని శంకరుఁడు మందహాసముచేసి, "తల్లీ! నాకుఁ బెండ్లివలదు. నేను సన్యసించెదను" అని పలికెను. ఈమాట ఆర్యాంబకు వజ్రాఘాతమై తోఁచి, మఱల నామెయు మూర్ఛావివశురాలిం గావించెను. శంకరుఁ డామెకు సేదఁదేర్చెను. అనేకపర్యాయములు ఆతఁడు తల్లికి వైరాగ్యము నుపదేశించి తనకు సన్న్యాసాశ్రమస్వీకారమునకు అనుజ్ఞ యీయవలసిన దని కోరెను; కాని యామె యంగీకరింపలేదు. ఒకనాఁడు శంకరుఁడు పూర్ణానదిలో స్నానముచేయుచుండఁగా, నొక మొసలి వచ్చి యాతని కాలుఁ బట్టుకొనెను. రక్తప్రవాహమువలన నదియంతయు రక్తమయమై పోయెను. అప్పుడు శంకరుఁడు తనకు అవసాన కాలము వచ్చినది అని తలంచి తల్లికొఱకు కేకలు వేసెను. అంత నార్యాంబ నదికిఁ బోయి కుమారునకు సంభవించిన విపత్తును జూచి చాల విచారింపఁ బ్రారంభించి, నాబిడ్డను రక్షింపుఁడు అని చెంతనున్నవారినిఁ బ్రార్థించెను; కాని యెవరును సాహసింపఁజాలకపోయిరి. అప్పుడు శంకరుఁడు "తల్లీ! ఇఁక విచారించిన నేమి ప్రయోజనము? ఎన్నిసారులు ప్రార్థించినను నాకు నీవు ఇంతకుమున్ను సన్న్యాసమునకు సెలవు ఇచ్చితివి గావు. ఇప్పుడు ఈయవసానకాలముననైన సెలవిమ్ము" అని ప్రార్థించెను. "కుమారా! నిన్ను నేను సుఖపెట్టలేకయే పోయితిని. తుదకు సన్న్యాసాశ్రమస్వీకారమునకైన సెలవిచ్చి నీముద్దు తీర్పకుండ నెట్లుండఁగలను? నీచిత్తమువచ్చినట్లు నీవు ఇప్పుడు ఆతురసన్న్యాసము స్వీకరించి తరింపుము. తండ్రీ" యని సెలవిచ్చెను.

తత్క్షణమే శంకరుఁడు ఆతురసన్న్యాసమును స్వీకరించెను. తోడనే మొసలి యాతనిని విడిచిపోయెను. కేతువిముక్తబాలభానునివలె శంకరుఁడు తీరమునకు వచ్చెను అదిచూచి సకలజనులును ఆశ్చర్యచకితులై, శంకరునకు సన్న్యాసస్వీకారమువలన రెండవజన్మము ప్రాప్తించినది; కావుననే మృత్యువు ఆతని నేమియుఁ జేయలేకపోయినది అని చెప్పుకోసాగిరి. శంకరుఁడు బ్రతికినను అతఁడు సన్న్యాసియై పోవుటచే ఆర్యాంబ దుఃఖాక్రాంతచిత్తయై యుండఁగా, శంకరుఁడు వచ్చి దేశాటనమునకు సెలవు నిమ్మని ప్రార్థించి, ఆమె కోరికప్రకారము ఆమె యవసానకాలమునకు కాలటి వచ్చి దహనసంస్కారము చేసెద నని మాటయిచ్చి వెడలిపోయెను.

నర్మదాతీరమున గోవిందుఁడు అను యోగీంద్రుఁడు ఉండెను. గోవిందయోగి శుకదేవుని శిష్యుఁడగు గౌడపాదునకుఁ బ్రియశిష్యుఁడు. గొప్పయోగులలోఁ బ్రముఖుఁడు. శంకరుఁడు ఆతని సంగతి విని యాతనియాశ్రమమునకుఁ బోయెను. గోవిందయోగియు శంకరుని సంగతియంతయు విని, తనకుఁ దగిన శిష్యుఁడు వచ్చెనని యానందించి, యాతనికి వేదాంతరహస్యము లన్నియుఁ గరతలామలకములుగ నుపదేశించెను. ఒకనాఁడు గోవిందయోగీంద్రుఁడు సమాధిలో నుండఁగా నర్మదానది యుప్పొంగి, యాశ్రమమును ముంచివేయసాగెను. అది చూచి శంకరుఁడు తన గురుని యోగనిష్ఠకు భంగము వాటిల్లునని తలంచి ప్రవాహమును దన కమండలువులోనికి ఆకర్షించుకొనియెను. సమాధినుండి లేచినతరువాత గోవిందుఁ డీసంగతి యితరశిష్యులవలన నెఱింగి శంకరుని ప్రజ్ఞకు ఆనందించి "వత్సా! వ్యాసభగవానుని బ్రహ్మసూత్రములకు నీవు భాష్యము వ్రాయుము. అందులకు నీవ తగినవాఁడవు" అని చెప్పి, వారణాసీనగరమునకుఁ బంపివేసెను.

కాశీనగరము చేరినపిదప శంకరుని అనేకులు వచ్చి శిష్యులుగాఁ జేరి యాశ్రయించిరి. అందు చోళదేశీయుఁ డగు విష్ణుశర్మ యను నాతఁడు ముఖ్యుఁడు. ఒకనాఁడు గురుభక్తిపరాయణుఁడు అగు విష్ణుశర్మ భక్తి నితరశిష్యులకు నెఱుకపఱుపఁ గోరి, శంకరుఁ డాతనిని గంగానదీజలములపై నడచివచ్చునట్లు ఆజ్ఞాపించెను. గురుపాదములను హృదయమునఁ బదిలము గావించుకొని, విష్ణుశర్మ యందఱును జూచుచుండ గంగోదకముమీఁద నడచివచ్చెను. అప్పుడు శంకరుఁడు ఆతనికి పద్మపాదుఁడు అని పేరుపెట్టి తక్కినవారినిఁ గూడ నట్లు చేయుమనఁగా, వారు చేయలేకపోయిరి. వేఱొకదినమున శంకరుఁడు శిష్యజనపరివృతుఁడై కాశీనగరవీథులలోఁ బోవుచుండఁగా, నొక మాలవాఁడు ఎదురై మీఁదికి రాసాగెను. అది చూచి శంకరుఁడు 'దూరముగాఁ బొమ్ము' అని గద్దించి పలుకఁగా నాచండాలుఁడు "ఏల పోవలెను? నీవు యతివి అని తోఁచుచున్నది; కాని నీమాటలలో నర్థము కాన్పించుట

లేదు. నీవు నాశరీరమును దొలఁగిపొమ్మని యాజ్ఞాపించెదవా? అట్లయిన నీశరీరమున కును, నాశరీరమునకును భేద మేమి గలదు? నీశరీరమును నాశరీరమును గూడ సమానముగ మలినములే. అందు నీశరీరమునం దేమియు ఘనతలేదు. ఇఁక నాయాత్మను దొలఁగిపొమ్మంటివా? అట్లయిన నాత్మ దూరముగాఁబోవుట యెట్లు? నీవు చూడఁగా అభాసయోగివని తోఁచుచున్నది. లేకున్న నీయసందర్భము లేల? నిక్కముగ యోగియైనవానికి హెచ్చుతక్కువలు లేవు. ఇపుడు నీవు నన్ను అధ మాధముఁడ నని భావించి, నీవే అట్టివాఁడ వై పోవుచున్నావు" అని యనేకవిధముల వేదాంతార్థముల నుపన్యసింపఁగా, శంకరుఁడు తెల్లఁబోయి యాలోచింపసాగెను. ఇంతలోఁ జండాలుఁ డదృశ్యుఁడై యచ్చోట సాక్షాత్తుగ విశ్వనాథుఁడు నిలిచెను. తోడనే శంకరుఁడు ఆతని పాదములమీఁద వ్రాలి తన తప్పిదమును క్షమింప వలసిన దని యనేకవిధములఁ బ్రార్థించెను. అంత విశ్వనాథుఁడు బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయవలసినదని యాతనికి ఆజ్ఞాపించి తిరోహితుఁడయ్యెను. శంకరుఁ డచ్చటనుండి బసకుఁ బోయెను.

ఒకనాఁడు శంకరుఁ డెచ్చటనుండియో వచ్చుచుండఁగా చాల దాహమయ్యెను. సమీపమునందలి తాడిచెట్టు గీయుచున్న యీడిగవాని కుండలో సురతక్క, నచ్చట మఱి యేవిధమైన జలమును లేకపోవుటచే శంకరుఁడు వాని చెంతకుఁ బోయి కల్లు పుచ్చుకొని త్రావి బయలుదేఱెను. శిష్యు లందఱు నందులకు ఆశ్చర్య చకితులయ్యు నడుగుట కోడి యూరకుండిరి; కాని శిష్యులలో నొకఁడు "గురువుగారు చేసినపనిఁ జేయుటకు మన కేమి యభ్యంతర మని తలఁచి తానుగూడ సురాపానము చేసెను. శంకరుఁ డిది చూడనట్లే నటించి ముందునకుసాగెను. అచ్చట నొక కమ్మరి యినుము కరగించుచుండెను. మూసలోనున్న యినుము కరిగి జలమువలె పలుచగ నుండెను. అది చూచి శంకరుఁడు దానినిఁ గూడ గడగడ ద్రావివేసెను. "తప్త యస్సలిలము నీవుమాత్ర మేల త్రాగవు?" అని తక్కినశిష్యులు కల్లుత్రావిన శిష్యు నడుగఁగా, నాతఁడు తెల్లవోయెను. అంత నాతఁడు "పెద్దలు చేసినయొప్పులనే గాని తప్పుల నెవ్వరును అలంబింపఁగూడదు. పెద్దలు చేసినంతమాత్రమున తప్పులు చేయ వలసినవి కావు" అను సిద్ధాంతమునకు వచ్చెను. ఇంకొకనాఁడు శంకరుఁడు వీథిలో నుండి పోవుచుండఁగా డెబ్బదియేండ్ల బ్రాహ్మణుఁ డొకఁడు "డుకృఞ్ కరణే" అని సంస్కృతవ్యాకరణమును వల్లించుచుండెను. ఇంతవార్ధకములోఁగూడ నీ వింక నీ వ్యాకరణ మేల చదివెద వనఁగా, నాతఁడు ధనసంపాదనము నిమిత్తము అని బదులు చెప్పెను. అదివిని శంకరుఁడు చాల కటకటంబడి యాతనికి "భజగోవిందం భజ గోవిందం భజగోవిందం మూఢమతే!" అని తత్త్వోపదేశము గావించెను.

గోవిందయోగి సెలవును, కాశీవిశ్వనాథుని యాజ్ఞను నిర్వర్తించుటకు శంకరుఁడు బదరికారణ్యమునకుఁ బోయి, యక్కడ భాష్యరచనము ప్రారంభించెను. అక్కడ నాతఁడు ఈశ-కేన-కఠ-ప్రశ్న-ముండ-మాండూక్య-తైత్తిరీ-యైతరేయ-ఛాందోగ్య-బృహదారణ్యకములను దశోపనిషత్తులకును, భగవద్గీతలకును, సనత్సుజాతీయమునకును, బ్రహ్మసూత్రములకును భాష్యములు వ్రాసెను. ఒకనాఁడు తాను వ్రాసిన సూత్రభాష్యమును ఒక శిష్యునకుఁ బాఠము చెప్పుచుండఁగా నొక వృద్ధబ్రాహ్మణుఁడు వచ్చి "నీవు పాఠము చెప్పుచున్నది యేమి?" యని యడిగెను. శంకరుఁడు బ్రహ్మసూత్రములకుఁ దాను వ్రాసిన వ్యాఖ్యాన మని చెప్పఁగా, వృద్ధుఁడు కొన్ని స్థలములయందుఁ బరీక్షఁ బ్రారంభించెను. తుదకు నిరువురును వాదము ప్రారంభించిరి. ఎనిమిది దినములు వారు అహోరాత్రములు వాదించిరి. కాని పర్యవసానము తేలలేదు. నాతో సమముగ వాదించుచున్న యీవృద్ధబ్రాహ్మణుఁ డెవఁడు అని శంకరుఁడు యోచించుచుండఁగా, ఆతని శిష్యుఁ డగుపద్మపాదుఁడు అంతయు గ్రహించి "మహాత్మా! నీవు సాక్షాత్తుగ శంకరుఁడవు. వృద్ధబ్రాహ్మణుఁ డగు నీవ్యాసభట్టారకుఁడు; కేవలము నారాయణమూర్తి. శంకరనారాయణులు వాదింపఁ దొడఁగినచో నిఁకఁ గింకరులమగు మేము ఏమి చేయఁగలము?" అని పలికెను. అది విని శంకరుఁడు వృద్ధబ్రాహ్మణుని పాదములమీఁద వ్రాలి "మహాత్మా, అజ్ఞానమువలన నీతో వాదమునకు డీకొంటిని. క్షమించి నీ నిజరూపమును జూపవలె" నని ప్రార్థించెను. వ్యాసుఁ డాతని ప్రార్థనము నంగీకరించి, నిజరూపముతో సాక్షాత్కరించి బ్రహ్మసూత్రభాష్యమును గైకొని సాంతముగఁ జదివి "వత్సా! నీ ప్రజ్ఞకు నాకు ఆనందము గలిగినది. నేను వ్రాసినసూత్రములకు భాష్యము చేయఁదగినవాఁడు నీవుతక్క మఱియొకఁడు లేఁడు. నాయభిప్రాయము నెఱింగి యింత చక్కఁగ విశదీకరించుట నీకే తగును. ఇందేమియు దోషములు లేవు. నీభాష్యము నామూలమునకు వన్నె పెట్టుచున్నది. నీవు సూత్రభాష్యము వ్రాసితి వని నాకుఁ గర్ణాకర్ణిగాఁ దెలియవచ్చినది. అంతట నేను నీశక్తిసామర్థ్యము నీభాష్యమును బరీక్షింపవలయు నని యిట్లు వచ్చితిని. నీహృదయము చాల విశాలమైనది. నీభావములు చాల నున్నతములైనవి. నాకుఁ జాల నానందమైనది. నీభాష్యము అద్వితీయము. ఇఁకఁ బ్రపంచమున దీనికి సాటియైనది మఱియొకటి యుండఁబోదు. గాజుపూసలనడుమ జాతిరత్నమువలెనే, నీవు వ్రాసిన భాష్యమే లోకములు సర్వోత్తమస్థానము నాక్రమింపఁగలదు. లోకము నీవలన నుద్ధరింపఁబడును" అని కొన్ని రహస్యముల నెఱింగించి యదృశ్యుఁడై పోయెను.

మునుల యాదేశమును, గురువు నానతిని, వ్యాసాజ్ఞను స్మరించి శంకరుఁడు వేదబాహ్యములగు దుర్మతములను ఖండించి, అద్వైతప్రతిష్ఠాపనము చేయుటకు

నిశ్చయించుకొని దేశయాత్రోన్ముఖుఁ డయ్యెను. ఈసంగతి విని కాశీరాజు ఆతని చెంతకు వచ్చి పాదములమీఁద వ్రాలి, "మహానుభావా! మీరు దేశయాత్రకై పోవలదు. ఈనగరమునందే యుండి, నన్నును నాయాస్థానమును నాప్రజలను పునీతులం గావించుచుండవలెను" అని యనేకవిధములఁ బ్రార్థించెను; కాని భారత వర్షము నుద్ధరింపఁ దలఁచి పోవుచుండుటచే శంకరుఁడు అందులకుఁ దిరస్కరింపఁగా, తుదకు రాజు మహారాజోచితమగు పరిధవమంతయు బహుమానపూర్వక ముగా నిచ్చి తరించెను. మొదట శంకరాచార్యుఁడు ప్రయాగక్షేత్రమునకుఁ బోయెను. అచ్చట మాతాపితలను స్మరించి, త్రివేణీసంగమమున స్నానముఁ గావించి, తత్తీరమున నాసీనుఁడై శిష్యులతోఁ బ్రసంగించుచుండ అగ్నిలో నుఱికి, భట్ట పాదుఁడు అను మాఱుపేరుగల కుమారిలుఁడు దేహమును విడుచుచున్నాఁడను వార్త వినవచ్చెను. తోడనే శంకరుఁడు అచ్చటికిఁ బోయెను.

వేదములను నిందించుచు, దేశమునం దంతటను ప్రబలుచున్న బౌద్ధమత మును నిర్మూలింపవలె నని కుమారిలభట్టు తలంచెను. ఈయూహతో నాతఁడు యథార్థముగఁ బోయినబౌద్ధులు తమ మతరహస్యములను బోధింప రని తలంచి బౌద్ధుఁడనని చెప్పుకొనుచు బౌద్ధమతరహస్యములను జదువుకొనఁ జొచ్చెను. ఒకనాఁడు పాఠమును జెప్పుచు ఆచార్యుఁడు బౌద్ధశిష్యులకు ఉత్సాహము కలుగు నట్లు, పౌరుషేయములనియు పూజింపఁదగినవి కావనియు నింక నిట్లనేకవిధముల వేదములను నిందింపసాగెను. ఈవేదనింద వినలేక కుమారిలుఁడు లోలోపలఁ జాల విచారించుచుండఁగా, కన్నులనుండి అశ్రుధార ప్రవహింపఁజొచ్చెను. బౌద్ధశిష్యులు అదిచూచి "ఈతఁడు నిజముగా బౌద్ధుఁడుగాఁడు. బౌద్ధమతఖండనము చేయుటకే బౌద్ధమతము నభ్యసించుచున్నాఁడు. మన రహస్యముల నెఱింగి మనలనే నాశముచేయ సమకట్టియున్న యీతనిని బ్రతుకనీయరాదు" అని నిశ్చయించుకొని యొకనాఁటిరాత్రి చాల ఉన్నతమైనమేడమీఁద నిద్రించుచుండఁగాఁ నీతనిని క్రిందికిఁ ద్రోసివేసిరి. అప్పుడు కుమారిలుఁడు "వేదములు అపౌరుషేయము లైనచో నాకు ఎంతమాత్రమును గష్టము గలుగకుండును గాక!" అని పలికెను. అంత యెత్తు నుండి క్రిందఁబడినను అతనికి అపాయ మేమియుఁ గలుగలేదు. ఒక్కకన్ను మాత్రము పోయెను. అది "వేదములు అపౌరుషేయము లైనచో" నని వేదముల యెడల నిశ్చయభక్తి పూర్ణముగా లేకపోవుటవలననే సంభవించెను.

నాఁటినుండియు నాతఁడు సకలవిధములను బౌద్ధమతము నున్మూలింపఁ గంక ణముఁ గట్టుకొనెను. ఒకనాఁడు ఆతఁడు సుధన్వుఁడు అనుబౌద్ధరాజుయొక్క ఆస్థాన మునకుఁ బోయెను, రాజు తనపండితుల నీతనిమీఁదికి వాదమునకుఁ బురికొలిపెను.

అందులకు వెనుదీయక కుమారిలుఁడు మహోత్సాహముతో గొప్ప యుక్తులనుజూపుచు, బౌద్ధమతమును ఖండింపఁ దొడఁగొనెను. బౌద్ధులును చాల నావేశముతో వాదించిరి. కాని తుదకు ఓడిపోయిరి. అప్పుడు వారు చేయునదిలేకయు, తామోడిపోయినట్లు అంగీకరించుటకు సమ్మతిలేకయు "వాదము వాదించువాని బుద్ధిబలమును బట్టి యుండును. ఒక్కొక సందర్భమున అన్యాయపక్షము గూడ నెగ్గవచ్చును" అని పలికిరి. అందులకు కుమారిలుఁడు "మీరేమార్గమున మీమతమును నిలువఁబెట్టఁదలఁచి కొనినను నేను దానిని పడఁగొట్టఁగలను" అని బదులుచెప్పెను. అదివిని, యెట్లయిన బౌద్ధమతమే గొప్పది అనిపించుకోవలయు నని యున్న రాజు "ఈనగరమునకు వెలుపల నొకగొప్ప పర్వత మున్నది. మీ రుభయపక్షములవారును స్వమతధర్మముల యెడలఁ జాలభక్తిఁగలవారే కదా! ఆపర్వతశిఖరము మీఁదినుండి క్రిందికుఱికి యెవరు నిరపాయముగ యథాస్థితిలో లేచివచ్చెదరో, వారిమతము గొప్పది" అని చెప్పెను. బౌద్ధపండితు లందఱును వెనుదీసిరి. కుమారిలుఁ డట్లు చేయక వేదమును స్మరించి పౌరులందఱును దెల్లవోవ, పర్వతశిఖరముమీఁదనుండి యుఱికియు పూలలోఁ బెట్టినట్లు ఏయపాయమునులేక లేచివచ్చెను. సుధన్వునకు ఈవిధముగా నాశాభంగము గలిగెను. అప్పుడుగూడ బౌద్ధపండితులు తమ యోటమి నంగీకరింపక "పర్వతశిఖరము మీఁదనుండి పడియు నపాయము, పొందకుండుటలో గొప్పలేదు. అది ఇంద్రజాల విద్యవలన సాధ్య మగును" అని పలికిరి. "అట్లయిన మఱియొక యుపాయము చెప్పెద" నని రాజు ఒక్క కుండలో రహస్యముగ నొకపామును బెట్టి మూఁతవేసి కట్టి దానిని సభలోనుంచి "దీనిలోనున్న వస్తువు నేపక్షమువారు చెప్పెదరో, వారి మతము గొప్పది" అని పలికెను. బౌద్ధులు అందు పాపము ఉన్నదనిరి. కుమారిలుఁడు శేషశాయియగు శ్రీమహావిష్ణువు ఉన్నాఁడు అని పలికెను. రాజు తనమతము నెగ్గిన దని సంతోషించుచు, బౌద్ధమతప్రాశస్త్యమును సభ్యులకుఁ దెలుపఁగోరి మూఁత తీయింపఁగాఁ, గుండలో కుమారిలుఁడు చెప్పినట్లు చుట్టుకొనియున్న పాముమీఁద శ్రీహరివిగ్రహము ఉండెను. అది చూచి బౌద్ధులు తెల్లవోయిరి. సుధన్వుఁడు వెంటనే బౌద్ధమతమును విడిచి, "ఆసేతుహిమాచలపర్యంతమైన యీదేశమున నున్న బౌద్ధులందఱను ఆబాలగోపాలముగ సంహారింపవలెను. దీని కెవ్వరైన వ్యతిరేకముచేసి నచో వారినిఁగూడ సంహారించెదము" అని చాటింపించెను. అట్లే చేయఁబడెను.

ఇట్లు తనవలన లోకమునందలి బౌద్ధు లనేకులను, విశ్లేషించి బౌద్ధమత రహస్యములను దనకు ఉపదేశించిన గురువును, సమయుటచే ఘోరపాతకము తగులు నని శంకించి కుమారిలభట్టు ఆపాపము పోవుటకై ప్రాయశ్చిత్తముఁ గావించుకొని, స్వయముగఁ జితిని ముట్టించి దానిమీఁద శయనించెను. అతని నిశ్చయమును

మఱలింపఁజాలక శిష్యులందఱును చుట్టును మూఁగి విచారింపసాగిరి. అప్పుడు శంకరుఁ డచ్చటకువచ్చి తనకమండలువునందలి పావనతీర్థముచే నగ్నిని శాంతింపఁ జేసి, సగము కాలిపోయిన కుమారిలుని దేహమును మఱలఁ బూర్తిచేయ నుంకించెను; కాని యాతఁడు "మహాత్మా! నన్ను మఱల బ్రతికింపవలదు. నేను చేసిన వేదమతోద్ధరణము ప్రశంసాపాత్రమే గాని, అది గురువధమీఁద నిలిచినది. ఈపాతకముపోవుటకే నేను ఈప్రాయశ్చిత్తము చేసికొంటిని. నాబావ మఱఁది యగుమండనమిశ్రుఁడు నాకంటె నధికుఁడు. నన్ను నీవు ఏయభిప్రాయ ముతో బ్రతికింపఁ దలఁచితివో, ఆయభిప్రాయము నాబావమఱఁదివలనఁ దీఱఁ గలదు" అని చెప్పెను. పిదప శంకరుఁడు ఆతనికి తారకమంత్రము నుపదేశించెను. అదియైన పిమ్మటఁ గుమారిలభట్టు ప్రాణములు విడిచెను.

శంకరుఁడు పోవునప్పటికి మండనమిశ్రుని యింటితలుపులు మూయఁబడి యుండెను. నాఁడు ఆతనియింట నాబ్దికము జరుగుచుండెను. లోపల బ్రాహ్మణపూజ జరుగుచుండుటచే వీథితలుపులు వేయఁబడియుండెను. అయినను శంకరుఁడు యోగబలము కలవాఁడు గావున ఆకసమున కెగిరి లోనికిఁ బ్రవేశించెను. మండన మిశ్రుఁడు సన్న్యాసులను జూడఁడు. శిఖాయజ్ఞోపవీతములను విడుచుట వేదవిరుద్ధ మనియు, నట్టివారు పాషండులనియు నాతని యభిప్రాయము. అగుటచే నాతఁడు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించి, కాషాయాంబరములను ధరించియున్న శంకరుఁ డాకస్మికముగా నట్టి పవిత్రసమయమున అచ్చటికి వచ్చుటచే అనేకవిధముల నిందింపసాగెను. అది చూచి నిమంత్రణార్థము వచ్చియున్న బ్రాహ్మణులు ఇరువురును వ్యాసభట్టారకుఁడు జైమినియుఁ గావున మండనమిశ్రునకు సమాధానము చెప్పి యూరకుండునట్లు చేసిరి. అప్పుడు మండనమిశ్రుఁడు "నేఁడు నాచేఁ బూజింపఁబడి, మాయింట భిక్ష నంగీకరింపవలయు" నని శంకరాచార్యుని వేఁడుకొనెను; కాని శంకరుఁడు కేవలము నీతనియింట భిక్షకుడుచుటకు వచ్చియుండలేదు. కావున "నాతో వాదింపవలెను. వాదమున నేను ఓడితినేని గృహస్థుఁడనయ్యెదను. నీవు ఓడితివేని సన్న్యాసివి కావలయును. వాదింప నిష్టములేనియెడల జితోఽస్మి యను ము. ఆమాట పలుకుట కంగీకారము లేకున్న సన్న్యాసము పుచ్చుకొనినను జాలును; అదియుఁ జేయవేని నిన్ను మూర్ఖులలోఁ బరిగణింపవలసివచ్చును" అని పలికెను. మండనమిశ్రుఁడు వాదించుటకు అంగీకరింపఁగా, వ్యాసుఁడు "ఇందులకు మధ్య స్థులు ఉండవలయును గదా! ఇందులకు మండనమిశ్రుని భార్యయగు భారతీదేవి యొక్కతయే యర్హురాలు" అని పలికెను. భారతి మాధ్యస్థముచేయుటకు మండన మిశ్రుఁడును, శంకరుఁడును గూడ నంగీకరించిరి. అంత భారతి వాదిప్రతివాదులు

కంఠములలో పూలదండలువేసి "ఎవరి మెడలోని పూలదండ వాడిపోవునో, వారోడిపోయినట్లు ఎంచుకొనవలసినది" అని నిర్ణయించెను.

మండనమిశ్రుఁడు చేయవలసిన వైదికకార్యములు అన్నియు ముగిసినతరువాత వాదము ప్రారంభమయ్యెను. మండనమిశ్రునిపక్షమే యుక్తియుక్తముగా నున్నట్లు కాన్పించెను; కాని యేడుదినములు గడచునప్పటికి ఆతనివాదము నిస్సారమై మెడలోని పూలదండ వాడిపోయెను. అది చూచి భారతీదేవి శంకరునితో "భార్యాభర్తలకు భేదము లేదు. కావున, నాతో వాదించిగూడ గెలుపొకున్న నీకు విజయము కలుగనేరదు" అని పలికెను. శంకరుఁడు ఆమెతోఁగూడ వాదము ప్రారంభించెను. నెలదినములకుఁ గూడ వాదము పూర్తిగాలేదు; కాని క్రమముగ భారతివాదమున యుక్తులు లేకపోవుచుండెను. అది గ్రహించి యామె శంకరుఁడు బ్రహ్మచర్యాశ్రమమునుండియే సన్న్యసించుటచే రతిరహస్యము నెఱుంగనివాఁడని తలంచి, "మహాత్మా! మన్మథునకుఁ గళ లెన్ని? అవి స్త్రీలకు ఏయేదినములయందు ఎచ్చటెచ్చట నుండును?" అని ప్రశ్నించెను. అంత శంకరుఁడు తనకు అది అచుంబితప్రక్రియగావున "దేవీ, నాకు నెలదినములు గడువు ఇచ్చెదవేని నీకుఁ బ్రత్యుత్తరమిచ్చెద" ననియెను. భారతి యందుల కంగీకరించెను.

ఆశ్రమభంగముఁ గాకుండ రతిరహస్యముల నెఱుంగు నుపాయము లున్నవా? యని పరీక్షించుటకు శంకరుఁ డాకాశమున కెగిరిచూడఁగా దూరమున నొక పట్టణమున నొకరాజు చచ్చిపోఁగా, నాతనిని దహనము చేయుటకుఁ దీసికొనిపోవుచుండుటయు, ఆతని భార్యలు లెక్కలేనంతమంది అప్సరసకాంతలను దలదన్నఁగల యందకత్తె లగుతరుణులు వగచుచు నాతనివెంటఁ బోవుచుండుటయుఁ గాన్పించెను. అప్పుడు శంకరుఁడు పద్మపాదుఁడు మున్నగు తనశిష్యులతో "అమరకమహారాజు చనిపోయినాఁడు. నేను ఆతని శరీరములోఁ బ్రవేశించి యాతనిరాణులవలన రతిరహస్యముల నభ్యసించెదను. నేను మఱల వచ్చునంతవఱకు నా దేహమును జాగ్రత్తగఁ గాపాడుచుండుఁడు" అని చెప్పి తనదేహమును విడిచి, అమరకుని దేహములోఁ బ్రవేశించెను. శిష్యులు ఆదేహమును నర్మదానదీప్రాంతమునందలి నిర్జనారణ్యమున నొకచెట్టుతొఱ్ఱలోనుంచి జాగ్రత్తగఁ గాపాడఁ దొడఁగిరి. అట శంకరుఁడు అమరకుని శరీరములోఁ బ్రవేశించి, నిద్రపోయినవానివలె లేచి కూర్చుండెను. అదిచూచి మంత్రులు మున్నగువారు రాజు వేటలో అలసియున్నవాఁడు గావున ప్రాణములు కడబట్టియుండుననియు, నదిచూచి చచ్చిపోయినట్లు తాము భావించితిమనియుఁ దలంచి, రాజును ఇంటికిఁ గొనిపోయిరి. పిదప అమరకదేహమున నున్న శంకరుఁడు రాజ్యభారమంతయు మంత్రులపై నిడి

తాను సర్వకాలసర్వావస్థలయందును అంతఃపురమునందే యుండి మదనసౌఖ్యముల ననుభవింపసాగెను. నాలుగైదుదినములు గడచునప్పటికి ఆతనికి ఆసౌఖ్యము లేదుటఁ బ్రపంచమే కాన్పింపదయ్యెను. ఆతనికి తన సంగతియే మఱపువచ్చెను. ఆతఁడు గడువుపెట్టిననెలదినములును గడచిపోయెను. "ఇదిగో వచ్చును, అదిగో వచ్చును" అని కనిపెట్టుకొనియున్న శిష్యులయాశలు నిరాశలయ్యెను. అదిచూచి వారు కళవళపడసాగిరి.

మంత్రులు రాజు ప్రకటించు వివేకమును జూచి, "ఈతఁడు అమరకుఁడు గాఁడు. అమరకుని యాత్మ నాఁడే పరంజ్యోతిలో లీనమైపోయినది. మఱి పరకాయ ప్రవేశశక్తిగల మహాపురుషుఁ డెవఁడో, యేదో కార్యమునెఱవేర్చుకొనఁ నమరకునిదేహమునఁ బ్రవేశించియుండవచ్చును" అని యనుమానించి "లోకములో నెట్టిస్థలములయందైనను ఎవ్వరైన నేదేనిశరీరమును గాపాడుచుండు రేని దానిని దహనము చేయవలయును" అని భటులకు ఆజ్ఞాపించిరి. ఆజ్ఞయైన వెంటనే రాజభటులు శిరసావహించి దానిని నెఱవేర్చుటకు బయలుదేఱిరి. ఈసంగతి పద్మపాదునకుఁ దెలియవచ్చెను. అంత నాతఁడు గురుదేహమునకు అపాయమును శంకించి కొందఱు శిష్యులను దానిని జాగ్రత్తగాఁ గాపాడునట్లు నియమించి, తాను మఱి కొందఱు శిష్యులను వెంటనిడుకొని, అమరకుని రాజధానికిఁ బోయి గాయకవేషములతో రాజదర్శనమునకుఁ బోయి, అచ్చట—

శ్లో. నేతి నేత్యాదినిగమవచనేన నిపుణం నిషిధ్య మూర్తామూర్తరాశీన్,
యదశక్యనిహ్నవం స్వాత్మరూపతయా జానంతి కోవిదా స్తత్త్వమసి తత్త్వమ్.

"ఇదికాదిదికాదని సకలమూర్తామూర్తపదార్థములను నిషేధింపఁగా సర్వనిషేధావధిభూతమైన యేసాక్షిని విద్వాంసులు స్వాత్మరూపముగా నెఱుంగుచున్నారో, అట్టి తత్త్వమవుగాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. ఖాద్యముత్సృజ్య విశ్వమనుప్రవిశ్య గూఢం అన్నమయాదికోశతుషజాలే కవయః,
వివిచ్య యుక్త్యవఘాతతో యత్తండులవదాదదతి తత్త్వమసి తత్త్వమ్.

"అవఘాతముచేత వడ్లనుండి బియ్యమును బడయునట్లు, శ్రవణమననములచేత పంచకోశాంతరస్థమై గూఢమైయున్న యేబ్రహ్మమును విద్వాంసులు గనుంగొనుచున్నారో, అట్టి తత్త్వమవుగాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో విషమవిషయేషు సంచారిణోఽక్షాశ్వాన్ దోషదర్శనకశాభిఘాతతః,
సైర్వరం సన్నివర్త్య స్వాంతరశ్మిభిర్ధీరాః బధ్నంతి యత్ర తత్త్వమసి తత్త్వమ్.

"విషమస్థలములందు దుముకులాడు గుఱ్ఱములను కొరడాదెబ్బలచేత మఱలించి పగ్గములచేతఁ బిగఁబట్టి ఇష్టస్థానమును జేర్చు నాశ్వికునివలె, దోషదర్శనము

భక్తవిజయము—7

చేత నింద్రియముల నింద్రియార్థములనుండి మఱలించి, మనోవృత్తిరూపమైన జ్ఞానముచే బిగఁబట్టి విద్వాంసులు ఏబ్రహ్మమందు బంధించుచున్నారో, అట్టి తత్త్వమవు గాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. వ్యావృత్తజాగ్రదాదిష్వనుస్యూతం తేభ్యోఽన్యదివ పుష్పేభ్యశ్చ ఇవ సూత్రమ్,
ఇంద్రియపదౌపాధికత్రయపృథక్త్వేన విందంతి సూరయ స్తత్త్వమసి తత్త్వమ్.

"జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూఁడు అవస్థలయందును, పూలయందు దారమువలె ననుస్యూతమై తద్విలక్షణమైయున్న యేస్వప్రకాశమును విద్వాంసులు నిరుపాధికమైన బ్రహ్మస్వరూపముగాఁ దెలిసికొనుచున్నారో, అట్టి తత్త్వమవు గాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. పురుష ఏవేదమిత్యాదివేదేషు సర్వకారణతయా యస్య సార్వాత్మ్యమ్,
హాటకస్యేవ మకుటాది తాదాత్మ్యం సరస మామ్నాయతే తత్త్వమసి తత్త్వమ్.

"కటకమకుటకుండలాదిభూషణములు బంగారమునకన్న వేఱుకానట్లు, సర్వకారణమైన యేపురుషునికన్న ఈజగత్తు వేఱుకాదని వేదములు ఘోషించి చెప్పుచున్నవో, ఆతత్త్వమవుగాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. యశ్చాయమత్ర వర్ష్మణి భామి సోఽసౌ యోఽసౌ విభాతి రవిమండలే సోఽహమితి,
వేదవాదినో వ్యతిహారతో యదధ్యాపయంతి యత్నత స్తత్త్వమసి తత్త్వమ్.

"ఈశరీరమునఁ బ్రకాశించు పురుషుఁ డెవఁడో, వాఁడే సూర్యమండలమునందు ప్రకాశించువాఁడు. సూర్యమండలమునందుఁ బ్రకాశించు పురుషుఁ డెవఁడో, వాఁడే యీశరీరమందుఁ బ్రకాశించువాఁడు. ఇట్లని వేదవాదులు ఏపరమార్థమును గుఱుతించుచున్నారో, అట్టి తత్త్వమవు గాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. వేదానువచనసద్దానముఖధర్మైః శ్రద్ధయానుష్ఠితై ర్విద్యయా యుక్తైః,
వివిదిషంత్యత్యంతవిమలస్వాంతా బ్రాహ్మణా యద్బ్రహ్మ తత్త్వమసి తత్త్వమ్.

"వేదోక్తములైన కర్మలచేతను, ఉపాసనలచేతను, అత్యంత విమలస్వాంతులైన బ్రాహ్మణులు ఏపరతత్త్వమును ఎఱుంగ నిచ్ఛగించుచున్నారో, అట్టి తత్త్వమవు గాని నీవు అమరకుఁడవు గావు."

శ్లో. శమదమోపరమాదిసాధనై ర్ధీరాః స్వాత్మన్యాత్మని యదన్విష్య కృతకృత్యాః,
అధిగతామితసచ్చిదానందరూపా నపునరిహా ఖిద్యంతే తత్త్వమసి తత్త్వమ్.

"బాహ్యేంద్రియాంతరింద్రియనిగ్రహాది రూపసాధనములచేత సచ్చిదానందరూపమైన పరబ్రహ్మమును గనుఁగొని ధీరులు జననమరణాదిలక్షణమైన యీ సంసారమునకుఁ దిరిగిరారో, అట్టి తత్త్వమవుగాని నీవు అమరకుఁడవు గావు."

అని యీతీరున శంకరుఁడు వేదములనుండి యుద్ధరించి క్రోడీకరించిన అద్వైతాసు భావములను శ్లోకరూపముగాఁ గీర్తించెను. అమృతసాగరతరంగములంబోలు నీశ్లోకములు వినఁబడినతోడనే శంకరునకుఁ బూర్వస్మృతిఁ గలిగెను. తోడనే యాతఁడు అమరకునిదేహమును విడిచివేసి, స్వశరీరమునఁ బ్రవేశించెను. అట నమరకునిదేహము నిర్జీవమై క్రిందఁబడిపోయి, రాణులను తక్కినవారి నెల్లరను మఱలఁ దఱిలేని దుఃఖసముద్రమున ముంచివేసెను. ఇట శంకరుఁడు తనశరీరముతోడనే లేచి కూర్చుండెను; కాని అంతకుఁబూర్వమే అమరకమంత్రులచే నియమింపఁబడిన రాజభటులు శిష్యులు సమాధినిష్ఠుఁడై యున్న యోగి యని యెన్నివిధములఁ జెప్పుచున్నను వినక, చితిపైనుంచి అగ్నిముట్టించుటచే కాళ్లు కాలిపోయెను. అప్పుడు శంకరుఁడు మహామహిమోపశోభితుఁడు గావున——

శ్లో. సంసారఘోరగహనే చరతో మురారే మారోగ్రభీకరమృగ ప్రవరార్దితస్య,
ఆర్తస్య మత్సరనిదాఘనిపీడితస్య లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్.

అని యీతీరున శ్రీహరిని బ్రార్థింపఁ దొడఁగెను. తోడనే యాతనికాళ్లు యథాపూర్వముగ నుపస్థితంబు లయ్యెను.

ఈవిధముగా ఆశ్రమధర్మము భగ్నముగాకుండ నామహానుభావుఁడు రతిరహస్యముల నామూలాగ్రముగఁ దెలిసికొని, మండనమిశ్రునియింటికి వచ్చి మఱల భారతీదేవితో వాదము ప్రారంభించెను; కాని యొకటి రెండుదినములయందే ఆమె యోడిపోయి, శంకరుని జయము నంగీకరించెను. తోడనే మండనమిశ్రుఁడు సన్న్యసించి సురేశ్వరాచార్యుఁడు అను పేరు వహించెను. భారతీదేవి శాపగ్రస్తయై భూమి నవతరించిన సాక్షాద్భారతియే గావున, శంకరుఁడు అచ్చటచ్చట నిర్మింపఁగల మతపీఠములయందుఁ దాను సాక్షాత్కరించి యభీష్టములను నిర్వహించునట్లు శంకరునకు వరమిచ్చి, తాను సత్యలోకమునకుఁ బోయెను. పిదప శంకరుఁడు ఆప్రాంతములయందు అద్వైతమతరహస్యములను వెల్లడిచేసి, దక్షిణ భారతదేశమునకుఁ బయలుదేఱెను.

శంకరాచార్యుఁడు శ్రీశైలమునకువచ్చి యుండఁగా, నచ్చటి కొక కాపాలికుఁడు వచ్చి ఆచార్యుని దర్శించి, "మహాత్మా! నేను ఒక కాపాలికుఁడను. భైరవపూజాధురంధరుఁడను. కొన్నిదినములు పూజచేయఁగా స్వామి నాకు స్వప్నమునఁ గాన్పించి, 'వత్సా! నీయర్చనకు ఆనందించితిని. మహారాజు శిరమునుగాని సర్వజ్ఞుఁడగు మహాత్ముని శిరస్సుగాని తెచ్చి హోమము చేసితివేని, నేను నీయభీష్టమును నెఱవేర్చెద' నని చెప్పిపోయెను. మహారాజు శిరముకంటె మహాపురుషుని శిరస్సు సులభసాధ్యము గాన, నేను చాలదినములనుండి దానినిమిత్తమే ప్రయత్నించు

చున్నాను. ఇట్లుండఁగాఁ దా మిచ్చుటకుఁ దయచేసినట్లు తెలియవచ్చినది. సాక్షాత్తుగ భారతీదేవిని జయించి మండనమిశ్రునకు సన్న్యాస మిచ్చిన మీకంటె సర్వజ్ఞుఁడు లోకమున మఱియొకఁడు లేఁడు గదా! అందును మీరు కేవలము బ్రహ్మజ్ఞానానందమున మునిఁగియుండువారు. మీమతమున శరీరము మున్నగునవి మిథ్యలు గదా! కావున మీశిరస్సు నాకు ఇచ్చెదరేని సంతోషించెద" నని యనేకవిధములఁ బ్రార్థించెను. అదివిని శంకరుఁడు కనికరించి "ఓయీ! నేను సమాధిలోఁ గూర్చుండి ఒడలుమఱచి యుందును. అప్పుడు నీవువచ్చి నాశిష్యులకుఁ దెలియకుండ నాశిరమును ఖండించికొని పొమ్ము" అని యాజ్ఞాపించి యోగనిష్ఠుఁ డయ్యెను. కాపాలికుఁడు అందులకుఁ బరమానందభరితుఁడై ఖడ్గమును బూజించి శంకరుని సమీపించి కత్తి యెత్తఁగా శ్రీమహావిష్ణువు పద్మపాదునిశరీరమునఁ బ్రవేశించి నారసింహావతార మెత్తి కాపాలికుని రూపుమాపువేసెను. ఈగందరగోళమువలన యోగమును విడిచి, శంకరుఁడు కాపాలికునిప్రేవులను మెడలో ధరించి యెదుట సాక్షాత్కరించియున్న నృసింహమూర్తిని అనేకవిధములఁ గొనియాడెను. కొంత సేపటికి శాంతించి, శ్రీహరి పద్మపాదుని శరీరములోనుండి వెడలిపోయెను. పద్మపాదుఁడు గొప్ప నిద్రపోయినవానివలె ఆవులించుచుఁ గూర్చుండి "గురుదేవా! ఇక్కడ నేదో గందరగోళము జరిగిన ట్లున్నది. ఏమి?" అని యడిగెను. శంకరుఁడు అంతయుఁ జెప్పెను. అది విని, పద్మపాదుఁడు "లోకమంతయు అద్వైతామృతసేచనమున నవజీవనమును బడయవలసియున్నపుడు, క్షుద్రుఁ డగు కాపాలికుని యభీష్ట మెట్లు నెఱవేఱును?" అనిచాల నానందించెను.

శ్రీశైలమునుండి శంకరుఁడు గోకర్ణము హరిహరములకుఁ బోయెను. హరిహారమునందే శంకరుఁడు చనిపోయిన బ్రాహ్మణకుమారుని బ్రతికించి, యక్కడ నుండి శ్రీబలి అను అగ్రహారమునకుఁ బోయెను. అచ్చట ప్రభాకరుఁడు అనునొకబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతని కొక్కఁడే కుమారుఁడు. ముద్దుబిడ్డనిఁ దీసికొని యాతని భార్య యొకనాఁడు స్నానార్థము నదికిఁ బోయెను. ఆయమునాతీరమున నొకముని తపస్సు చేసికొనుచుండఁగా, ఆయిల్లాలు తన కుమారునిఁ జూచుచుండ వలసినదని యాతనిం బ్రార్థించి తాను ఏటిలో దిగెను. మునియు బాలకుఁ డిక్కడ నేయుండును; ఎక్కడకుఁ బోఁగలఁడు అని తలంచి నిమీలతనేత్రుఁడై తపోనిష్ఠుఁ డయ్యెను. అంతట బాల్యచాపల్యమున నాపాపఁడు ఇటునటు కొంతతడవు తిరిగి తుదకు దైవవశమున ఏటిలోఁ బడెను. అదిచూచి కొందఱు మొత్తుకొనుచుఁ బోయి, వానినిఁ దీరమునకుఁ జేర్చిరి; కాని అప్పటికప్పుడే యాబుడుతఁడు చనిపోయెను. అదిచూచి ప్రభాకరునిభార్య చాల విచారింపఁదొడఁగెను, అదిచూచి ముని యామెదుగఱ

మును జూడఁజాలక పరకాయప్రవేశసామర్థ్యముగలవాఁడు గావునఁ, బటాలునఁ దానే యాబాలుని దేహములోఁ బ్రవేశించెను. ప్రభాకరునిభార్య తన కుమారుఁడు మఱల బ్రతికినందులకుఁ జాల నానందించుచు నింటికిఁబోయెను.

కాని, బాలకుఁడు మాత్రము అది మొదలు మాటలాడి యెఱుఁగఁడు. అందులకుఁ బ్రభాకరుఁ డనేకము లగు గొప్ప ఔషధముల నిప్పించెను; కాని ప్రయోజనము లేకపోయెను. ఇట్లు పదాతేండ్లకుఁ బైఁగాఁ గడచిపోయెను. అయినను ఆబాలుని నోటనుండి యొక్కమాట వెడలుటయైనను ఎవరు నెఱుంగరు. ఎల్లప్పుడును ఋషివలె, మౌనియై యుండు నాబాలకునిఁ జూచి తల్లిదండ్రు లదే పనిగ విచారించుచుండిరి. ఇట్లుండ, త్రిలోకపూజ్యుఁ డగుశంకరాచార్యుఁడు గ్రామమునకు వచ్చె నని విని, ప్రభాకరుఁడు తనకుమారునిఁ దీసికొనిపోయి కాళ్ల మీఁదఁ బడవేసి రక్షింపవలసిన దని ప్రార్థించెను. అప్పుడు శంకరుఁడు "కస్త్వం కిమేవం జడవత్ప్రవృత్తః" అనఁగా "నీవెవఁడవు ? ఇట్లు జడునివలె నుండుటకుఁ గారణమేమి" అని ప్రశ్నించెను. అందులకు ఆబాలుఁడు చెంతనున్న వారందఱును అబ్బురపడునట్లు—

**శ్లో. నాహం జడః కింతు జడః ప్రవర్తతే మత్సన్నిధానేన వసంది హేగురో,**
**షడూర్మి షడ్భావవికారవర్జితం సుఖైకతానం పరమస్మి తత్పదమ్.**

"నేను జడుఁడఁ గాను. ఇఁక నేమనిన : జడములైన దేహేంద్రియమనోబుద్ధులు నాసన్నిధానమహిమవలనఁ బ్రవర్తిల్ల సమర్థములై యున్నవి. అట్టి నేను జడుఁడ నెట్లగుదును ? షడూర్మివర్జితమై, షడ్భావవికారవర్జితమై నిరతిశయానందరూపమైన యే పరమపదముగలదో అదియే నాస్వరూపము. ఈవిషయమున సంశయము లేదు" అని పలికెను. అందఱును నిర్విణ్ణులైరి. అంత శంకరుఁడు ప్రభాకరునితో "ఈబాలుఁడు దైవానుగ్రహమువలనఁ దొంటిజన్మమునందే బ్రహ్మజ్ఞానమును సంపాదించెను. ఇఁక నీతఁడు లౌకికవ్యాపారప్రవృత్తుఁ డగుటయు మీ యందఱితోడను మాట్లాడుటయు కల్ల. ఈతఁ డెప్పుడు బ్రహ్మజ్ఞానానుభవానందమున మునిఁగి యుండును" అని యెఱింగించి, ఆతఁడు చెప్పినమాటలయందు బ్రహ్మజ్ఞానము కరతలామలకమువలె, సులభముగా బోధయగుచుండుటచే హస్తామలకుఁడు అని పేరు పెట్టెను. పిదప హస్తామలకుఁడు తన్ను శిష్యుఁడుగా నంగీకరింపవలసిన దని ప్రార్థించిన శంకరుఁడు అంగీకరించి, అక్కడనుండి తుంగభద్రానదీతీరమునకుఁ బోయి, శారదాప్రార్థనమున అచ్చట శృంగేరిపీఠము అనుపేరుతో శారదాపీఠమును బ్రతిష్ఠాపించెను.

అనితరసాధ్యమైన బ్రహ్మసూత్రముల యంతరార్థమును దాను భాష్యము వ్రాసి వెల్లడించినను, ఆభాష్యము సామాన్యజనదురవగాహమై యుండుటఁ జూచి, శంకరుఁడు దానికిఁగూడ టీక యవసరమై యున్నదని నిశ్చయించుకొనెను. ఈసంగతి దెలిసికొని, సురేశ్వరాచార్యుఁడు (మండనమిశ్రుఁడు) ఆటీకవ్రాయుటకుఁ దనకు ననుజ్ఞ యీయవలసిన దని ప్రార్థింపఁగా, శంకరుఁడు అంగీకరించెను. కాని తక్కిన శిష్యులు అందుకు అంగీకరింపక "సురేశ్వరుఁడు వాదమున నోడిపోవుటవలన సన్న్యసించి మీశిష్యుఁ డయ్యెనేగాని, యాతని పూర్వమీమాంసాభిమానము పూర్తిగా వదలి పోయియుండదు. కావున సూత్రభాష్యవార్తికము నాతఁడు వ్రాసినచో మీయభిప్రాయమునకుఁ గేవలము విరుద్ధముగానైన నుండవచ్చును. లేకున్న మీయాశయములు పూర్తిగాఁ బ్రకటనఁ గావింపఁబడకయైన నుండవచ్చును. అగుటచే నందులకు పద్మపాదుఁడే తగినవాఁడు" అని యైకకంఠ్యముగాఁ దమ యసమ్మతిని ప్రకటించిరి. సురేశ్వరాచార్యునిశక్తి తనకుఁ బూర్ణముగాఁ దెలిసినను, ఆయొక్కని నిమిత్తము పదుగురుశిష్యుల మనస్సులకు అసంతృప్తిఁ గలిగించి, గృహకల్లోలములకు నవకాశమిచ్చుట మంచిదిగాదని నిశ్చయించి, శంకరుఁడు వారు కోరినట్లు సూత్రభాష్యవార్తికము రచించుటకుఁ బద్మపాదునకే అనుజ్ఞ యిచ్చి, సురేశ్వరునకు తైత్తిరీయ కాణ్వోపనిషత్తులకు వార్తికము వ్రాయునట్లు సెలవు ఇచ్చెను. సురేశ్వరుఁడు ఈయభ్యనుజ్ఞను శిరసావహించి యట్లే గావించి గురుకరుణకుఁ బాత్రుఁడయ్యెను.

పిదపఁ బద్మపాదుఁడు సూత్రభాష్య వార్తికము ముగించి, తనపాండిత్యమును జన్మస్థలమున వెల్లడిచేయఁగోరి గురుదేవుని సెలవు గైకొని బయలుదేరిపోయెను. ఈసమయమునందే తనమాతృదేవతయగు ఆర్యాంబ రోగపీడితయై మరణోన్ముఖయై యున్నదని తెలిసికొని, శంకరుఁడు యోగమహిమవలన క్షణములోఁ గాలటికిఁ బోయి సాక్షాత్కరించెను. ఇఁకఁ దనకండ్లకుఁ గాన్పింపఁ డనుకొన్న ముద్దులకొడుకు కాన్పించుటచే నామె యుప్పొంగిపోవుచు నాతనిం గౌఁగిలించుకొని ముద్దాడుచుఁ బ్రేమవచనములను బలుకసాగెను. అందులకు శంకరుఁడు తల్లికి వైరాగ్యముఁ గలిగించి, పరబ్రహ్మమును గురించి బోధింపఁదొడఁగెను. కాని యామె "నాయనా! నాకిది యేమియుఁ దెలియుటలేదు. సగుణబ్రహ్మము నుపదేశింపుము" అని చెప్పెను. వల్లె యని శంకరుఁడు శివునిఁ బ్రార్థింపఁగా తద్రూపులైన శివదూతలు సాక్షాత్కరించిరి; కాని ఆర్యాంబ శివలోకమునకుఁ బోవుటకు అంగీకరింపదయ్యెను. శంకరుఁడు పిదప,

* శ్లో॥ "భుజగాధిపభోగతల్పభాజం కమలాంకస్థలకల్పితాంఘ్రిపద్మం,
అభిపీడితమాదరేణ లీలావసుధాభ్యాం చలమానచామరాభ్యామ్.

**విహితాంజలినా నిషేవ్యమాణం వినతానందకృతాగ్రతో రథేన,**
**ధృతమూర్తిభి రస్త్రదేవతాభిః పరితః పంచభి రంచితోపకంఠమ్."**

అని యాతీపున శ్రీహరిని నుతించెను. కొంతసేపటికి ఆర్యాంబ భౌతిక దేహమును విడిచి, వైకుంఠమునకుఁ బోయెను.

శంకరుఁడు అవసానకాలమున దహనాదిసంస్కారములు స్వయముగఁ జేసెద నని వాగ్దానము చేసియుండెను గదా! ఆవిషయమును గమనించి యాతఁడు తల్లికి దహనాదికర్మలు చేయఁ బ్రయత్నించుచుండఁగా, సన్న్యాసికి కర్మాధికారము లేదని చెప్పి ఆపనిచేయవలదని బంధువులందఱును నిరాకరించిరి; కాని శంకరుఁడు అందు నకు జంకి వెనుదీయలేదు. ఆతని యభినివేశముఁ జూచి బంధువులు కట్టెలు మున్నగు నవి చిక్కకుండఁ జేసిరి. అంతట శంకరుఁడు చాలఁ గోపించి, "కేరళీయులకు వేదాధి కారము లేకుండునట్లును, వారిశ్మశానములు గృహోపకంఠములయందే యుండు నట్లును, యతీశ్వరులు వారియిండ్లలో భిక్షసేయకుండునట్లు శపించి, యోగాగ్నిచేఁ దల్లికి దహనసంస్కారము చేసి, సమంత్రకముగా ఉత్తరక్రియలు గావించి వెడలి పోయెను.

ఇంతలోఁ బద్మపాదుఁడు వచ్చి యాతనిం గలిసికొనెను. ఖిన్నముఖుఁడై యుండుటఁ జూచి శంకరుఁడు కారణ మడుగఁగా, నాతఁడు "నేను నామేనమామ యింటికిఁ బోయితిని. ప్రసంగవశమున నేను ఆతనికి సూత్రభాష్యమునకు వార్తి కము వ్రాసితినని చెప్పి వినిపించి, రామేశ్వరముపోయి వచ్చునంతదనుక భద్రము చేయవలయు నని ప్రార్థించి దాని నాతనికిచ్చి నేను వెడలిపోయితిని. కొన్నిదిన ములకు మఱల వచ్చి యడుగఁగా నాగ్రంథములో ప్రభాకరమతము ఖండింపఁ బడినది గావున, నందులకుఁ గోపించి దానిని మనస్సునందే యుంచుకొని నేను అట్లుపోయిన వెంటనే నాశనముచేసి, 'నాయిల్లు పరశురామప్రీతి యైపోయినది. అప్పటినుండియు నీగ్రంథము గాన్పించుటలే' దని చెప్పెను. నేనందులకుఁ జాల వగచి, మఱల వ్రాయుదమని ప్రయత్నింపఁగాఁ బూర్వభావములేవియు నాకిప్పుడు స్ఫురించుట లేదు." అని ప్రత్యుత్తరము చెప్పి తలవంచుకొనెను. శంకరుఁడు ఆగ్రంథమును శృంగేరీపీఠమున నున్నపు డొకసారి వినియుండెను; కావున "నేను చెప్పెద వ్రాసికొనుము" అని అంతయు నేకరువుపెట్టెను. పద్మపాదుఁడు వ్రాసికొని, గురువు ఏకసంథాగ్రాహిత్వమునకు అబ్బురపడి అసాధారణమైన తనగ్రంథము నుద్ధ రించినందులకు ఆతనికి అనేకవందనములు నర్పించి కొనియాడెను.

అక్కడనుండి శంకరుఁడు శృంగేరికి వచ్చి, వెంటనే దుర్మతఖండనమును జేయుటకు అక్కడనుండి తరలెను. దేశములో అనేకవిధములైన దురాచార

ములు ఉండెను. శాక్తేయులు, గాణాపత్యులు, శైవులు మున్నగు ననేక కుమత ములవారు ఈతని నెదిరించి వాదమునకు డీకొనిరి; కాని శంకరుఁడు ఆమతాచార్యుల నెల్లర నోడించి, అంతటను నిష్కళంకమైన అద్వైతమును బ్రతిష్ఠాపింప సాగెను. ఈరీతిన నాతఁడు తొలుత పాండ్యచోళద్రవిడవిదర్భకర్ణాటకాంధ్ర దేశములను పరిశుద్ధములు గావించి, గోకర్ణమునకుఁ బోయెను. అచ్చట నీలకంఠుఁడు అను నొక గొప్పపండితుఁడు ఉండెను. అతఁడు శైవుఁడు. బ్రహ్మసూత్రములకు శైవభాష్యము వ్రాసిన మతాభిమాని. కాని శంకరునితో వాదించి యోడిపోయెను. ఆవల శంకరుఁడు సౌరాష్ట్రముమీఁదుగా ద్వారకకానగరమునకుఁ బోయి, అక్కడ నుండి ఉజ్జయినీ చేరుకొని, ఆనగరమున నున్న భట్టభాస్కరుని జయించి, తనశిష్యునిగాఁ జేసికొని, ఇంక ననేకులను దనమతములోఁ జేర్చుకొని, పిదప కామరూపదేశమునకుఁ బోయెను.

అక్కడ అభినవగుప్తుఁడు అను నొక మాంత్రికుఁడు గలఁడు. ఈతఁడు గూడ వాదమున నోడి, శంకరునకు శిష్యుఁ డయ్యెను; కాని కొన్నిదినములు వెంట నరిగి తన మతమును ఖండించిన అక్కసును మనసులో నుంచికొని యున్నాఁడు. కావున, శంకరునిమీఁద మంత్రమును బ్రయోగించెను. శక్తి శంకరునకు భగందర రోగమును గలిగించెను. యోగమహిమవలన శంకరుఁడు దానిని లెక్కచేయలేదు; కాని శిష్యులు బలవంతముచేసి యౌషధపానము చేయించిరి. అయినను బ్రయోజనము లేకపోయెను. కొన్నిదినములకుఁ బద్మపాదుఁడు సంగతియంతయు గ్రహించి, మంత్రమును అభినవగుప్తునిమీఁదికిఁ ద్రిప్పివేసెను. ఆగురుద్రోహి దానిని ద్రిప్పుకొనలేకపోయెను. రోగము శంకరుని శరీరమున మాయమై అభినవగుప్తునకు సంక్రమించి, నానాబాధలు పెట్టి తుదకు యమపురమునకుఁ గొనిపోయెను. ఇట్లు అనేకమతములను ఖండించి, అనేకవిపత్తులను దాఁటి, శంకరుఁడు శృంగేరియందువలెనే ద్వారక బదరికాశ్రమము జగన్నాథములయందుఁ గూడ మఠములను బ్రతిష్ఠించి, శిష్యులలోఁ దగినవారిని అచ్చటచ్చట నాచార్యులుగా నియమించి, అనేక దేవాలయములలోఁ జక్రప్రతిష్ఠను మఱలఁ గావించి మహిమోపశోభితముగాఁ జేసెను.

ఇట్లు అద్వైతప్రతిష్ఠ చేసిన పిదప శంకరుఁడు హిమగిరికిఁ బోయి, తచ్ఛిఖరమునందలి స్వర్ణనదియొడ్డున బ్రహ్మానుసంధానము ప్రారంభించెను. ఇట్లుండఁగా నాతని గురుబ్రహ్మ యగు గౌడపాదుఁడు సాక్షాత్కరించి, తాను వ్రాసిన మాండూక్యోపనిషత్కారికకు శంకరుఁడు వ్రాసినటీకను జూచి, తన యభిప్రాయమునకు విరోధముగ లేకపోవుటయు, విశేషించి తనభావములను జక్కఁగఁ బ్రకాశింపఁ

జేయుటయుఁ జూచి పరమానందభరితుఁడై, యనేకవిధముల శంకరుని నుతించి తిరోహితుఁ డయ్యెను. మఱల శంకరుఁడు బ్రహ్మానుసంధానమునఁ బ్రవృత్తుఁ డయ్యెను.

కాశ్మీరదేశములో శారదాదేవియాలయ మొకటి గలదు. అందొక మండపమున సర్వజ్ఞపీఠము అను నొకపీఠము గలదు. దానికి నాలుగుదిక్కులను, నాలుగు ద్వారములు ఉన్నవి. ప్రాక్పశ్చిమోత్తరద్వారములు తెఱువఁబడియే యున్నవి కాని, దక్షిణద్వారము మాత్రము మూయఁబడియుండెను. దాక్షిణాత్యులు అనేకులు పోయి ఆపీఠము నధిష్ఠింపఁగోరి దక్షిణద్వారమును భేదింపఁదలఁచిరి; కాని యచ్చటి పండితులతో వాదించి గెలువఁజాలకపోయిరి. ఈవార్త శంకరునకుఁ దెలియవచ్చెను. తోడనే యాతఁడు శిష్యసహితుఁడై యచ్చటకుఁ బోయెను. అదిచూచి అచ్చటివారు శంకరుని వాదమునకుఁ బిలిచి యందోడిపోయిరి. అంతట శంకరుఁడు పీఠము నధిష్ఠింపఁబోఁగాఁ దదధిష్ఠానదేవతయగు సరస్వతి "వలదు, వలదు. నీవు సర్వజ్ఞుఁడవేగాని మండనమిశ్రుని భార్యను జయింపఁగోరి సన్యాసి వయ్యు ననంగకేళిం దెలినవాఁడవు. కావున నీవు ఈపీఠము నెక్కుటకుఁ దగవు" అని పలికెను. అది విని శంకరుఁడు మందహాసముఁ గావించి, ఆమె మఱల మాట్లాడకుండునట్లు ప్రత్యుత్తరమిచ్చి పీఠము నెక్కెను. అచ్చటివా రందఱు నాతనికి శిష్యులైరి. పిదప నాతఁడు బదరికాశ్రమమునకుఁ బోయి కొంతకాలము ఉండి, కేదారతీర్థమునకుఁ బోయి దేవతలచేఁ బ్రార్థింపఁబడి ఇఁకఁ దాను భూలోకమునఁ జేయవలసిన పని లేకపోవుటచే భౌతికశరీరమును విడిచి, నిజస్వరూపము ధరించి "దివ్యవైభవముతో వృషభవాహనారూఢుఁడై కైలాసమునకుఁ బోయెను."

శ్లో. శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం,
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః.

---

## 15. బమ్మెరపోతరాజు

ఏకశిలానగరమున కేసన అను నొక నియోగిబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతని భార్యపేరు లక్కాంబ. ఈదంపతులకు తిప్పరాజు, పోతరాజు అను నిరువురు కుమారులు పుట్టిరి. పోతరాజు బాల్యమునఁ బశువులం గాచుచుండెను. ఒకనాఁ డాతఁడు సమీపమునందలి యొకపర్వతముమీఁదఁ బశువులను మేపుచుండఁగా, చిదానంద యోగి యను నొకయోగి కానంబడియెను. తోడనే పోతరాజు ఆయోగిపుంగవునకు భయభక్తులతో నమస్కరించెను. అంత యోగియు నానందించి యాబాలకుని దీవించి,

మంత్రోపదేశముఁ గావించి పంపెను. పిదప పోతరాజు ఆమంత్రమును జాల భక్తితో జపించెను. మంత్రబలమువలన నాతఁ డఖండపండితుఁడై, గొప్పకవి యయ్యెను.

ఒకప్పు డాతఁడు రాత్రి చంద్రగ్రహణపుణ్యకాలమున స్నానముచేయుటకు గంగాతీరమునకుఁ బోయి స్నాన సంధ్యాద్యనుష్ఠానములన్నియు నెఱవేర్చుకొని జప నిష్ఠుండై యుండఁగా, శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించి తన నామాంకితంబుగా మహాభాగవతమును దెనిఁగింపుమని చెప్పి, దీవించి యంతర్హితుఁ డయ్యెను. పోతరాజును వెంటనే యిలుసేరి, యీవృత్తాంతము నెల్లరకు నెఱింగించి యొకశుభ ముహూర్తమున,

క. "పలికెడిది భాగవత మఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట నే
పలికిన భవహర మగునఁట, పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా?

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ, గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణముఁ లగునే, నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్."

అని నిశ్చయముచేసికొని భాగవతమును ఆంధ్రీకరింపఁ బ్రారంభించెను.

పోతరాజు చాల బీదవాఁడు. ఆతనియింట నొక పూటకేఁ గాని, యెప్పుడును రెండవపూఁటకుఁ జాలునంతభోజనసామగ్రి లేకుండెను. వ్యవసాయముచేసి యీతఁడు ధాన్యము పండించుచుండెడివాఁడు; కాని ఆధాన్యములోఁ జాలవఱకు అతిథి సమర్చనము నిమిత్తమే ఖర్చు అయిపోవుచుండెను. ఇంత దారిద్ర్యము ననుభవించు చుండియు, నాతఁడు రాజసంస్థానములకుఁ బోయిగాని, సంపన్నులయిండ్లకుఁ బోయి గాని, తనకవిత్వమును విని యానందించుటకుఁ దనయింటికి వచ్చిపోవువారిఁగాని, ఒక్కకాసైనఁగోరి యెఱుఁగఁడు. ఒకప్పుడు ఆతఁడును కుమారుఁడును పొలములో నుండిరి. కుమారుఁడు దుక్కి దున్నుచుండెను. పోతరాజు గట్టుమీఁదఁ గూర్చుండి యుండెను. అప్పుడు పోతరాజు బావమఱఁదియగు శ్రీనాథమహాకవి పోతరాజుతో మాట్లాడుటకుఁ బదార్గురు బోయీల పల్లకిలో వచ్చుచుండెను. శ్రీనాథుఁడు రాజ సంస్థానములలో మెలఁగుచు వారిచేఁ జాల గౌరవింపఁబడుచు నఖండవైభవము ననుభవించుచుండెను. పోతరాజు గూడ నట్లే యుండవలయునని యాతని యభి ప్రాయము. ఎన్నిమాఱులు చెప్పినను పోతరాజు అందులకు నంగీకరింపఁ డయ్యెను.

పల్లకిలో నున్నశ్రీనాథుఁడు చేనిగట్టుమీఁదఁ గూర్చుండి పోతరాజు కుమారునిచే దున్నించు చుండుటఁ గాంచి, తన ప్రభావము వారికిఁ దెలుపఁగోరి పల్లకీముందు మోయు బోయీలను 'కొమ్ము విడిచి పొండు' అని యాజ్ఞాపించెను. ఆతని సెలవుప్రకారము చాకలివాండ్రు వదలిపోయినను, ఆకొమ్ము శ్రీనాథుని

ప్రభావమువలన మనుష్యుల భుజములమీఁద నున్నట్లే యుండి పల్లకి ముందునకుఁ బోవుచుండెను. ఇదిచూచి పోతన్న కుమారుఁ డగు మల్లన్న తండ్రికి సంగతి యంతయుఁ దెలిపెను. అంతఁ బోతన్న "కుమారా! నీకు అబ్బురమేల? నీవు దాపటి యెద్దును విప్పివేసి దుక్కిదున్ను" మని చెప్పెను. మల్లన్న అట్లుచేయఁగా నాఁగలి రెండవయెద్దు లేకపోయినను యథాప్రకారముగ భూమినిఁ జీల్చుకొనిపోవు చుండెను. అదిచూచి శ్రీనాథుఁడు వెనుకటి బోయీలను గూడ కొమ్ము విడిచి పోవునట్లు ఆజ్ఞాపించెను. వాండ్రును విడిచిపోయిరి; కాని యొక్కమనుష్యుఁడైన తాకకున్నను పల్లకి యథాప్రకారముగఁ బోవుచుండెను. అది చూచి పోతన్న కుమారుని వలపటియెద్దును గూడ విప్పివేయుమని చెప్పెను. మల్లన అట్లే చేయఁగా నాఁగలి యథాప్రకారముగనే నడచిపోవుచుండెను. ఇట్లు పోతన్న శ్రీనాథుఁడు నొకరి ప్రభావము నొకరు చూపుకొనిరి.

ఇంతలో శ్రీనాథుఁడు పోతరాజును సమీపించెను. తోడనే యాతఁడు పల్లకి దిగివచ్చి, హాలికులకుఁ గుశలమా యని యడిగెను. అందులకు ఏమియుఁ గోపింపక పోతన్న—

**ఉ. "బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్**
**గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్**
**హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ**
**ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై."**

అని ప్రత్యుత్తర మిచ్చెను. ఇది విని శ్రీనాథుఁడు వేళాకోళము మానివేసెను. పిదప నిరువురును ఇంటికిఁ బోయిరి. భోజనానంతరము శ్రీనాథుఁడు "బావా! ఈదారి ద్ర్యాంబుధి నీదుటకు నీ కింకను విసుగుపుట్టలేదు. జగత్తు నంతను జయింపఁగల పండితుఁడవు. వశ్యవాక్కుఁడ వగు మహాకవివి. నీవు ఇప్పుడు తెనిఁగించుచున్న భాగవతమును గర్ణాటక మహారాజునకు అంకితము చేసి, ఆతనివలన మహోన్నత సత్కారములం గాంచి దేవేంద్రవైభవము ననుభవింపరాదా?" అని చెప్పెను. కాని, పోతన్న అందుల కేమియుఁ బ్రత్యుత్తరము చెప్పక యూరకుండెను. శ్రీనాథుఁడు మౌనమంగీకార మని యూహించి తన స్వగ్రామమునకుఁ బోయి రాజుతో "నీపుణ్యము పుచ్చినది; మహాకవి యగుపోతరాజు ఆంధ్రమహాభాగవతమును నీకు అంకితముచేయుటకు అంగీకరించె" నని చెప్పెను. అది విని రాజుమహానందసాగరమున మునిఁగిపోయెను.

శ్రీనాథుఁడు వెడలిపోయినతరువాత పోతరాజు అంగణమునఁ గూర్చుండి "అయ్యో! శ్రీనాథుఁ డాడిన మాటలకు నేను ఏల ప్రత్యుత్తర మీయనైతిని ? ఆతఁడు నావచన మంగీకారముగా భావించి పోయి రాజుతోఁ జెప్పియుండునేమో గదా! ఎన్నఁడును లేనిది నాకు నేఁ డీ మొగమోటమేల కలిగెను? భాగవతమును గొనిరమ్మని రాజు నాకు వర్తమానము చేయును గాఁబోలు! ఈయకున్నఁ గోపించుఁ గాఁబోలు! అని కొంతతడవు వగచి; "ఈయకున్న రాజు నన్నేమి చేయఁగలఁడు? పరాత్పరుఁడే నాకు దిక్కు. ఆతనిని నమ్మియున్న నన్ను కాపాడుట కాతఁడే సిద్ధుఁడై యుండు" నని ధైర్యము తెచ్చుకొని, తన యనాలోచితకృత్యమును దలంచికొని, తన్నే నిందించుకొనుచుఁ గన్నులు మూసెను. తోడనే అశ్రుసంసిక్తనయనయై వాణి యాతని కన్నులలో సాక్షాత్కరించెను. అంత నాతఁడు సంగతి యంతయు గ్రహించుకొని చేతులు జోడించి,

> ఉ. "కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చె దో
> కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల, యోమదంబ, యో
> హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
> ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ."

అని యామె నూరడించి పొలమునకుఁ బోయెను.

"పోతరాజు భాగవతాంధ్రీకరణము ప్రారంభించి చాలదినములైనది. ఇంత వఱకు గ్రంథము పూర్తియై యుండును. అతఁడు ఇంకను ఏల రాఁడయ్యెను? మనమే పోయి చూచివత్తము" అని యుత్సాహమును బట్టఁజాలక యొకనాఁడు కర్ణాటక రాజు వేటనెపమున అనంతసేనాసహితుఁడై పోతరాజు కృతికన్యను బెండ్లియాడు టకు ఏకశిలానగరమునకుఁ దరలివచ్చి, యూరుబైట విడిచి తనరాకఁ దెలిపి, రమ్మని యొకభటునిఁ బంపెను. వాఁడు పోవునప్పటికి పోతరాజు యజ్ఞవరాహావతార ఘట్టము నాంధ్రీకరించుచుండెను. అగుటచే శ్రీహరి వరాహరూపియై పోతన్నయింటి ముందు చెలగాట మాడుచు లోపలి కెవ్వరినిఁ బోనీయకుండెను. ఆవరాహము రాజభటుని అల్లంతనే చూచి గుఱ్ఱుమని ధ్వని చేయుచుఁ గం డ్లెఱ్ఱఁ జేసి భయ పెట్టి, వానిని వెనుకకుఁ దఱిమివేసెను. వాఁడు పోయి పందివృత్తాంతము చెప్పఁగా రాజు "ఛీ! పందికి జడిసి పాఱివచ్చితివా?" యని వానినిఁ దిట్టి మఱికొందఱు భటుల నంపెను; కాని వాండ్రు గూడ దానిని జయింపలేకపోయిరి. వాండ్రు దానిచేఁ గొట్టఁబోయి, తామే గాయపడి వెడలిపోయిరి.

అది చూచి రాజు సేననంతను వెంటనిడుకొని అక్కడకు వచ్చెను. పరివార సహితుఁడైన రాజును జూచినతోడనే వరాహము కండ్లెఱ్ఱఁజేసి మఱల విజృంభిం

చెను. మఱల సంకులసమరము ప్రారంభమయ్యెను. ముందున కుఱికిన రాజభటులందఱును భూమిపైఁ బడిపోవుచుండిరి. వారినిఁ జూచి తక్కినభటులు వెనుదీయుచుండిరి. ఇదిచూచి రాజు స్వయముగఁ గత్తిదూసెను; కాని దానిని జయింపఁజాలక పోవుటయేఁ గాక గాయములుగూడఁ దినియెను. ఈకలకలం బాలకించి యిదేయేమో యని పోతరాజు వీథిలోనికివచ్చి తెల్లవోయెను. రాజు ఆతని నారసి "మహాత్మా! అపరాధిని, రక్షింపవలెను" అని ప్రార్థించెను. తోడనే వరాహము అంతర్హితమయ్యెను. అప్పుడు రాజు వచ్చి పోతరాజుపాదములమీఁద వ్రాలి "నీసామర్థ్యమెఱుఁగఁజాలక కవిసామాన్యునిగాఁ దలంచి, నన్ను బలవంతపఱిచినైన భాగవతమును గృతినందవలయు నని వచ్చితిని. అట్లువచ్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనది. ఇఁక నేను మగిడిపోయెదను. కవిబ్రహ్మా! నాసేనను బ్రతికింపుము. అంతకన్న నాకేమియును వలదు" అని ప్రార్థించెను. అంతట పోతరాజు కర్ణాటకప్రభుని దుశ్చింతకు అడలి "రాజా! గతజల సేతుబంధనమేల? శ్రీహరిని ధ్యానింపుము. నీకరివారము సజీవమయ్యెడి" నని చెప్పెను. రాజు అట్లే చేసి, సేన బ్రతికి లేవఁగా బ్రతుకుజీవుఁడా యని తిరిగిచూడకుండ వెడలిపోయెను. అంత పోతరాజు కరకమలములు ముకుళించి "శ్రీహరీ! వైకుంఠపతీ! ఈక్షుద్రునికొఱకు నీవెంత పని చేసితివి!"అని నారాయణుని అనేకవిధములఁ గొనియాడి, లోపలకుఁ బోయి యథాపూర్వముగ గ్రంథరచనము ప్రారంభించెను.

దినక్రమమునఁ బోతరాజు అష్టమస్కంధమునందలి గజేంద్రమోక్షణకథాభాగము నాంధ్రీకరించుచుండెను. అందు గజేంద్రుఁడు రక్షింపు మని ప్రార్థింప విష్ణువు విని, ప్రయాణోత్సాహి యయ్యె నని తెలుపునెడల పోతరాజు:—

"అల వైకుంఠపురంబులో నగరిలో నామూల" అని వ్రాసి యాపైనిఁ దోఁచక, పుస్తకమును కొమార్తె చేతికిచ్చి "బిడ్డా! ఉండుము వచ్చెద" నని దొడ్డిలోనికిఁ బోయి వృక్షములనీడఁ గూర్చుండి యాలోచింపఁ దొడంగెను. ఒక గడియవఱకు నాతని కేమియుఁ దోఁచినది గాదు. ఈలోపుగ శ్రీహరి పోతరాజురూపముతో వచ్చి యాబాలికచెంత పుస్తకము గైగొని "సౌధంబు దాపల" నని వ్రాసి ఇదిగో వచ్చెద నుండుమని చెప్పి వెడలిపోయెను. అప్పటికి దొడ్డిలోనున్న పోతరాజునకు అదియే తోఁచెను. వెంటనే మహానందముతో వచ్చి తనకుఁ దోఁచినదే పుస్తకము మీఁద నుండుటఁ గాంచి, కొమార్తెవలన సర్వము నెఱింగి, ఆమెను గౌఁగిలించుకొని ముద్దాడి "తల్లీ! నీవు అదృష్టవంతురాలవు. కావుననే నారూపముతో వచ్చి శ్రీహరి నీకు సాక్షాత్కరించె" నని యామె భాగ్యమును, దనభాగ్యమును గొనియాడి పిదప,

మ. "అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబుదా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై."

(భాగ. స్కం. 8. ప. 95.)

అని పద్యమును బూరించెను.

మఱియొకనాఁడు శ్రీనాథుఁడు మఱలవచ్చి పై పద్యముతరువాతనున్న,—

మ. "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

(భాగ. స్కం. 8. ప. 96.)

అను పద్యమును జూచి, పోతరాజుతో "బావా! నా కీపద్యమున దోషములు కాన్పించుచున్నవి. ఏమందువా? గజప్రాణావనము మకరమును వధించినఁగాని కాదుగదా? అట్టిచో శ్రీహరి రిక్తహస్తుఁడై పరివారమును గూడఁ బిలువకుండ బయలుదేఱె నంటివి. ఏమి ప్రయోజనము?" అని యడిగెను. అందులకుఁ బోతన్న "బావా! ఇది ప్రకృతిధర్మము. ప్రేమభాజనులు విపత్తులపాలైరన్న మాటలు వినినపుడు ప్రేమనిలయులకు ఏమియుఁ దోఁపదు. నాయనుభవమును బట్టి నేనట్లు వ్రాసితిని. ఇంతకును భగవంతునికి తన యాయుధములం గైకొనకయే పోయిన లోప మేమి? సర్వశక్తుఁ డగు శ్రీహరి ఏనుఁగునకు నవశక్తిని ఘటించి, దానిచేతనే మకరమును జంపింపఁగూడదా?" యని బదులుచెప్పెను; కాని శ్రీనాథునకు ఇది సమాధానమును గూర్పఁజాలకపోయెను. "సరియే" అని యూరకుండి, పోతన్న మఱునాఁడు శ్రీనాథుని కుమారుని ఒక గదిలో దాఁచి వాకిటఁ గూర్చుండి యేమో యాలోచించుకొనుచున్న శ్రీనాథునిచెంతకు వచ్చి "బావా! నీకొడుకు నూతిలోఁ బడిపోయె" నని చెప్పెను. అది వినిన వెంటనే శ్రీనాథుఁ డేమియుఁ దోఁచక కంగారుపడి నూతిచెంతకుఁ బయలుదేఱెను. అంతట పోతరాజు ఆతనికి అడ్డు నిలిచి, "బావా! త్రాడు నిచ్చెన మున్నగునవి యేమియుఁ గొనకయే పరువెత్తిన నేమి యగును?" అని పలుకఁగా శ్రీనాథుఁడు చాల వగర్చుచు, "బావా! అడ్డు తొలఁగుము. నాబిడ్డఁడు బ్రతికియుండఁగా నొకమాఱు చూడనిమ్ము" అని తప్పించుకొని పోయి నూతిలోఁ జూచుచు "కుమారా! పడిపోయితివా?" యని వగవసాగెను. అప్పుడు పోతరాజు "బావా! విచారింపవలదు. నీకుమారుఁడు నూతిలోఁ బడిపోలేదు.

గదిలో క్షేమముగ నున్నాఁడు. ప్రకృతిధర్మమును నీకుఁ దెలుపుట కిట్లు చేసితిని. భాగవతములో నేను వ్రాసిన 'సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడు' అను పద్యమును జూచి 'ఆయుధమును గొనిపోవకుండ నరిగి శ్రీహరి యేమి చేయు' నని ప్రశ్నించితివి. ఇప్పుడు నీవు త్రాడు నిచ్చెన మున్నగునవి లేకుండ నెట్లు వచ్చితివి?" అని యడిగెను. శ్రీనాథుఁ డది విని "బావా ! బాగుగా బుద్ధిచెప్పితివి." అని విపన్నుఁడై రక్షింపఁబడినవానిని వోలెఁ, గుమారునిఁ జేరఁదీసికొని శిరము మూర్కొని లాలింపఁదొడఁగెను.

ఇట్లు నిరాక్షేపముగను నిర్దోషముగను పోతరాజు భాగవతాంధ్రీకరణమును బూర్తిగావించెను. ఆంధ్రభాగవత మంతటి భక్తిరసబంధురమగు గ్రంథము ఏభాష యందును లేదని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. తుదకు పోతరాజు బ్రతికి యున్నంతకాలమును శ్రీహరిసేవలోఁ గడపి, అవసానమున శ్రీహరి సాయుజ్యమును బడసెను. ఆతనిభాగవతమును జదివినవారుగూడ అనేకులు ఈశ్వరసాయుజ్యము బడసినవారు గలరు.

శా. "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్."

(భాగ. స్కం. 1. ప. 1.)

---

# 16. తులసీదాసు

ఢిల్లీపురమున అక్బరుపాదుషాకు ఆత్మారాముఁడు అను నొకమంత్రి యుండెను. ఆతనికి లేక లేక యొకకుమారుఁడు ఉదయించెను. వానికిఁ దలిదండ్రులు తులసీదాసు అని పేరుపెట్టి, మిగుల గారాబముతోఁ బెంచుకొనుచుండిరి. తులసీదాసునకు వయస్సు పెరిఁగినకొలఁదియు, విద్యలయందు ఆసక్తియు విజ్ఞానమును గలుగఁ జొచ్చెను. లేక లేక కలిగినకుమారుఁడు వివేకశాలిఁగూడ నైనందులకు తల్లిదండ్రులు మఱింత సంతోషించుచు, యుక్తసమయమున విద్యావతియు వినయవతియు విశేషించి సుందరియు నైన మాతాదేవి అను కన్యకను దెచ్చి మహోత్సవముతో వివాహము చేసిరి. ఈయనురూపదంపతులను జూచి ఢిల్లీపౌరులును, దేశమునందలివారును మహానంధమును బొందసాగిరి.

మాతాదేవి యెంత సుందరియో, యెంత వినయవతియో, యంత పతిసేవా వ్రతపరాయణురాలు; అంత యనురాగవతి. తులసీదాసుగూడ మాతాదేవియెడల విశేషానురాగభరితుఁడై యుండెను. విశేషించి యాదంపతుల సౌఖ్యమునకై తల్లిదండ్రు లనేకవిధములఁ బ్రయత్నములు చేయుచుండిరి. సకలసౌఖ్యకారణములును గల యామంత్రికుమారుఁడు విజ్ఞానభరితుఁ డయ్యును, రాగభరితుఁడై, సర్వకాల సర్వావస్థలయందును భోగలాలసుఁ డయ్యెను. మాతాదేవి యట్లుగాక భర్తకు "ఇంత భోగపరాయణత తగదు. ఇది అనేకనష్టములకుఁ గారణ" మని యనేకవిధముల బోధించుచుండెను. అట్టి సమయములయందెల్ల నాతనిభోగపరాయణత కొంచెము తగ్గుచుండెను. కాని యాబోధ మఱపునకు వచ్చినతోడనే మఱింత వృద్ధియగుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు అక్బరుపాదుషా క్రూరమృగములను వేఁటాడ నరణ్యమునకుఁ బోవుచు, తులసీదాసుని రమ్మని పిలిచెను. చక్రవర్తి యాజ్ఞ చేసినపు డిఁకఁ జేయవలసిన దేమున్నది ? తులసీదాసు భార్యావియోగము దుస్సహామే యైనను దాని నెట్లో యడంచుకొని, యుక్తవేషముతో నరణ్యమునకుఁ బోయెను. ఆతఁడు అరణ్యమునకుఁ బోయిన కొంతసేపటికి మాతాదేవి పుట్టినింటి నుండి యొకమనుష్యుఁడు వచ్చి ఆమె తల్లికిఁ జాల జబ్బుగా నున్నదని చెప్పెను. ఈమాట వినుటతోడనే మాతాదేవికి హృదయము బ్రద్దలైపోయెను. ఇది యంతయు గ్రహించి, అత్తగా రామెను "తల్లీ! మీయమ్మ నీకొఱకు బెంగటిల్లి యుండును. ఆమెను జూచుటకుఁ బోయిరమ్ము. నెమ్మదిగ నున్న వెంటనే మఱల నీ విచ్చుటకు రావచ్చును. తులసీదాసు ఇందుల కేమియు నాగ్రహింపఁ" డని చెప్పి పంపివేసెను. భర్తృగృహమును విడుచుటకు ఇష్టము లేకున్నను, జేయునదిలేక మాతాదేవి పుట్టినింటికి వెడలిపోయెను.

నాఁటి సాయంకాలమునకే తులసీదాసు వేఁటనుండి యింటికివచ్చెను. అడవిలోఁ గ్రుమ్మఱినంత తడవు నాతని హృదయము మాతాదేవియెడల నత్యంత ముగ్ధమై యుండెను; కాని కలఁతనిద్రలో నున్నవానికి నడుమనడుమ మెలఁకువ వచ్చునట్లు, నడుమనడుమ నాతనికిఁ దాను పాదుషాతో వేఁటకు వచ్చి యరణ్యమున సంచరించుచుండుట జ్ఞాపకము వచ్చుచుండెను. ఈరీతి నాతఁడు తెలివి మఱపులలో నుండియే సాయంత్రమువఱకు నెట్లో కాలము గడపెను. మాతాదేవి కాపురమునకు రాకపూర్వము తులసీదా సెంతయో చుఱుకుఁదనము గలిగి యుండెను. అప్పుడనేకపర్యాయము లగ్బరు తులసీదాసు మహోన్నతదశకు రాఁగలఁ డని తలంచుచుండెను, అగుటచే నాతఁడు నేఁడు తులసీదాసు ఇట్లుండనేల యని

యనేకవిధముల యోచించియుఁ గారణము నూహించుకొనఁజాలకపోయెను. ఆకారణ మాతఁ డడుగను లేదు, తులసీదాసు చెప్పను లేదు.

తులసీదాసు మాతాదేవి ముఖచంద్రమండలము నెప్పుడు చూతునను మహోత్కంఠతో వచ్చెను; కాని యంతఃపురమున నాతని కామె కాన్పింపలేదు. మామూలుగ నామెసంచరించుస్థలము లన్నియు నాతఁ డత్యాత్రముతో వెద కెను; కాని యప్పుడును సఫలీకృతమనోరథుఁడు కాఁడయ్యెను. ఇట్లాతఁడు మాతాదేవికొఱకు అంతఃపుర మంతయుఁ బరిభ్రమించుచుండఁగా యథాపూర్వ ముగ తల్లి సంగతి యంతయుఁ జెప్పి, "నాయనా! భోజనమునకు రమ్ము" అని పిలి చెను. తోడనే యాతని హృదయమున రాయిపడెను. శరీరమున నున్న బల మంతయుఁ గ్రుంగిపోయెను. తల్లి పోయినవెంటనే యాతఁడు నిలుచున్నట్లుగాఁ గూలఁబడి "దేవీ! ఇట్టిసమయములో నీవు నన్ను విడిచిపోవచ్చునా?" యని వగవ సాగెను. ఆతనికి భార్యావియోగము కలుగుటచే విచారముగాని అత్తగారికిఁ బ్రాణము మీఁదికి వచ్చినందులకు విచారము లేకపోయెను. తుద కాతఁ డొక పరిచారిక వచ్చి పిలిచినతరువాత భోజనమునకుఁ బోయెను.

కాని యాతనికి భోజన మేమియు రుచింపదయ్యెను. వియోగదుఃఖమును మఱచిపోవుటకై నిద్రింపఁ దలఁచెను; కాని నిద్రయు రాదయ్యెను. కొంచెమునే పాతఁడు శయ్యపైఁ గూరుచుండి యేమో యాలోచించుకొని, తుదకు పాద చారియు నేకాకియునై అత్తవారి గ్రామమునకు బయలుదేఱెను. ఢిల్లీకి ఆగ్రామము అయిదుక్రోసులదూరమున నుండెను. మార్గమంతయు నరణ్యమున నుండెను. అయి నను భార్యాసక్తచిత్తుఁ డగుట నాతనికేమియు భయము లేకపోయెను. తుదకుఁ గాలిలో ముల్లుగ్రుచ్చుకొనుటఁ గూడ నాతనికిఁ దెలియలేదు. ఇట్లు మిగుల దీక్షతో నతివేగముగ నడచి, యాతఁడు మూఁడుజాముల రాత్రియగునప్పటికి అత్తవారి యూరు చేరికొనియెను.

కాని యాసమయమున నేగృహస్థుల యిండ్లవాకిళ్లు తెఱవఁబడియుండును? గ్రామమునందలి యెల్లగృహములతోఁబాటుగఁ దనయత్తవారియింటితలుపు గూడ వేయఁబడి యుండుటఁ జూచి, యాతఁడు లోనికిఁ బోవుట యెట్లాయని యాలో చింపఁదొడఁగెను. ఎంతసేపు యోచించినను ఏమియుఁ దోఁచదయ్యెను. లోపలి వారినిఁ బిలుచుట కిష్టము లేకపోయెను. ఇట్లు ఆతఁడు కొంతతడ వచ్చటఁ గ్రుమ్మరి క్రుమ్మరి, యిటునటు తిరిగి మేడమీఁదినుండి యొకత్రాడు వ్రేలాడుచుండుటఁ జూచి యది తనభార్య తన నిమిత్తమే యేర్పఱచియుంచెనని భావించి, దాని సాయమున మేడమీఁది కెక్కిపోయెను.

దైవయోగమువలన మాతాదేవి తక్క మఱియెవ్వరును తులసీదాసును జూడలేదు. ఆమెయు భర్తను జూచి పరమాశ్చర్యచకితయై "ఇది యేమి" అనియెను. అంత తులసీదాసు "ప్రియురాలా! నిన్నుఁబాసి నేనొక్కక్షణమైన నుండఁగలనా? అట్టి నన్ను విడిచి, నీవిచ్చటకు రాఁజెల్లునా? వేఁట చాలించి వచ్చి యింట నిన్ను జూడనపుడు నామనస్సు ఎంత సంక్షుభితమైపోయినదో భగవంతునకెఱుక. నీ వెప్పుడైన నాకిట్టి ఆయాసమును గలిగించితివా?" యని పలికెను. మాతాదేవి యందులకు మఱింత వింతపడి, "నాథా! ఇప్పుడు జగమంతయు గాఢసుషుప్తిం దవిలియున్నది. అన్ని గృహములును గవాటపిహితములై యున్నవి. అట్టి నీ వీమేడమీఁది కెట్లెక్కఁ గలిగితి" వని యడిగెను. తులసీదాసు "నీవు కట్టి వ్రేలాడఁదీసిన త్రాడుసహాయమున వచ్చితి" ననియెను. మాతాదేవి యేమియుఁ ద్రాడుగట్టియుండలేదు. కావున భర్తమాటలు విని తెల్లవోయి దీపము చేతఁగొని త్రాడెక్కడ నున్నదో చూపు మనియెను. చూడఁగా నది త్రాడు గాక, కృష్ణసర్పమై యుండెను. అది నల్లత్రాచు అని తెలిసినపుడు తులసీదాసుమీఁది ప్రాణములు మీఁదనే యెగిరిపోయెను. మాతాదేవి చూపులు చెదరిపోవ గుండెలు కొట్టుకొనసాగెను.

పిదప నిద్దఱును అంతఃపురమునకుఁ బోయి కూర్చుండి, జరిగిపోయిన సాహసమునకుఁ జాల భీతిల్లిరి. అది యథార్థముగాఁ గొని మాతాదేవి భర్తవైపు మొగంబై "నాథా! నీవు చేసిన సాహస మెంత యపాయకరమైనదో చూచితివా? స్త్రీతోడి భోగమున కాసించి నీయంతటి విద్యావంతులు నిశీథమున క్రూరసత్త్వభయంకర మగు నరణ్యమును గడచివచ్చినవారును, నల్లత్రాచును బట్టుకొని మేడమీఁది కెక్కినవారు నెందైన నున్నారా? ఈమాత్రపు స్వల్పవియోగమునే భరింపలేక యిట్టి యనాలోచితకృత్యమును జేయుట సత్పురుషలక్షణమా? అడవిలో నేదియైనఁ గ్రూరసత్త్వము మీఁదఁబడినను, ఏవృశ్చికమైన ప్రాణములు కడంటునట్లు పొడిచినను, ఇచ్చట నల్లత్రాచు కఱచియుండినను ఎంత యాపద వచ్చియుండునో యోచింపుము. ఈస్వల్పభోగము నిమిత్తమై నీవెంతటి నిందకుఁ బాల్పడియుందువో యూహింపుము. పాంచభౌతిక శరీరము మహాసముద్రము మీఁదఁ దేలియాడు నావవంటిది. క్షణక్షణమునందును లెక్క లేనన్ని విపత్తులు దీనినిఁ జుట్టుకొనియుండును. తుదకెట్లు నిది రూపుమాసిపోవునదేఁ గాని, శాశ్వతము గాదు. నశ్వరమైన దైహికసౌఖ్యమున కాశించి ఇంద్రుఁడు, సుందోపసుందులు, కీచకుఁడు, రావణుఁడు మున్నగు మహామహులు గూడఁ దీఱనియపాయముల పాలఁబడిపోయిరి. నాయెడల నీవు చూపుచున్న అనురాగములో సగమైన

శ్రీమన్నారాయణునియెడలఁ జూపి, ఆసర్వేశుని చరణకమలములను స్మరించినయెడల నీవును, నీదాసినగుట నేనును తరింపమా ? భగవంతుని యవ్యాజకరుణచే లబ్ధమగు దేహేంద్రియాదిసాధనసామగ్రిని భగవత్కైంకర్యమునకై వినియోగించినవారి నీడనైనను యముఁడు బాధింపఁజాలఁడని పెద్దలు వక్కాణింతురు.

ఇంతవఱకే సముద్రతీరమునందలి యిసుకరేణువులవలె, మనము లెక్కలేనన్ని జన్మముల నందితిమి. మన పురాకృతసుకృతమువలన నిప్పు డీయుత్కృష్టజన్మమును బడసితిమి. ఇప్పుడైన పురుషోత్తము సేవఁజేసి జన్మపరంపరను త్రెంపివేసికొనుటకు మాఱుగ దానిని పెంపుచేయనేల ? విషయసుఖపరాయణతయు, విజ్ఞానవైముఖ్యమును, హరిభక్తిరాహిత్యమును భావికాలమున నరకమాధ్యమజన్మపరంపరకు హేతుభూతమగును. అవి తలంచుకొనిన నాకిప్పుడే యొడలు గంపరమెత్తుచున్నది. నీవు వివేకరహితుఁడవు గావు ; కాని యావివేకాగ్ని నివురుగప్పఁబడి యున్నది. దానినిఁ బ్రజ్వలింపఁ జేయుము. నిస్సారము లగు సంసారసౌఖ్యముల నన్నిటి నందు భస్మముచేయుము. బుద్ధిసాగరా ! మేదోమాంసరక్తాదులచే నిండియున్న యీతోలుతిత్తిపై నింత మమత యుండఁ జెల్లునా ? కనులారఁ జూచుచున్న యీసుఖాభాసములపై నింత వాంఛ యుండఁజెల్లునా ? మనకండ్లయెదుట ననేకులు పుట్టుచున్నారు. అనేకులు గిట్టుచున్నారు. వారికంటె మనకువచ్చిన ఘనతయేమి ? మన మెక్కడనుండి వచ్చితిమో, ఇక్కడఁ జేయుచున్న దేమో, ఇఁక మన మెక్కడికిఁ బోయెదమో తరువాత నేమగుదుమో కొంచెమైన యోచించుకొన నక్కఱ లేదా? అట్లయినఁ బశుపక్షిమృగాదులకును మనకును భేదమేమి? అబలను; అజ్ఞానురాలను. నీయెడలఁ గల చనవుచే నింతవఱకును మాట్లాడితిని. నాపైఁ గోపింపవలదు. మంచిచెడ్డలు, లాభనష్టములు, సుఖదుఃఖములు, కీర్త్యపకీర్తులు యోచింపుము. నీవు సన్మార్గమునఁ బ్రవేశించి నన్నుఁగూడఁ గొనిపొమ్ము” అని ప్రార్థనాపూర్వకముగ మందలించెను.

తులసీదాసునకు మాతాదేవి యుపదేశము తలకెక్కెను. ఆహితోక్తిదీపికాప్రభావమున నాతనిహృదయమున ఘనీభవించియున్న గాఢాంధకారము తొలఁగిపోవుటయు, విజ్ఞానప్రకాశము గలుగుటయు నొక్కమాతే యయ్యెను. అక్కతన నాతనికి సంసారము సాగరమనియు, విషయసుఖములు దేహాభిమానమును మోక్షాపేక్షఁగలవారికి సర్వనాశకరములనియు, స్త్రీలు చిత్తసంస్కారములపాలిటి మారణమంత్రము లనియు, కాలము మనోవేగమునఁ బరువెత్తికొనిపోవుచున్న దనియు, క్షణక్షణమును మృత్యువు సమీపించుచున్న దనియు, నదిరాకపూర్వమే మోక్షార్హత సంపాదించుకొనవలయు ననియు బోధపడెను.

మఱియు నిస్త్రీవిజ్ఞానమును గలిగించిన మాతాదేవి తనకుఁ గేవలము మాతృమూర్తి యని తలంచి యాతఁ డామెను సాష్టాంగదండప్రణామము గావించి, వెంటనే యచ్చోటు వదలి గతించినదానికి వగచిన ప్రయోజనము లేదనియు, బుద్ధి కుదిరినచో నింకను మించిపోయిన దేమియు లేదనియు, మనస్సునకు సమాధానము చెప్పుకొని యెక్కడకుఁ బోవుచున్నదియుఁ దెలియకుండఁ బోయెను.

ఆతఁడు గంగాతీరమున నొకనిర్జనప్రదేశమున వసించెను. ఆతఁడు సమీప గ్రామమునకుఁ బోయి పగల్లెల్ల శ్రీరామచరిత్రమును జనులకు బోధించి, పిదప ధ్యానప్రవృత్తుం డగుటకు ప్రారంభించెను. కందమూలఫలములును, గంగాజలములును దక్క నాతఁడు వేఱు పదార్థముల నొల్లకుండెను. అక్కడ నాతఁడు చేయు విశేష మేమనఁగా:— ప్రతిదినమును బ్రాతఃకాలమున శౌచవిధి ముగించికొని శేషజలము నొకచెట్టుమొదటఁ బోయుచుండెను. ఇది యాతఁ డిట్లుచేయవలయును నను వ్రతముతో బ్రారంభించినది కాదు; కాని యాయొక్క చెట్టునకే గాని యితరవృక్షమునకుఁ బోసి యెఱుఁగఁడు. ఈతీరునఁ బండ్రెండుసంవత్సరములు కడచిపోయెను. శౌచశేషజలము స్వల్పమే యైనను బ్రతిదినమును బోయుచుండుటవలన నది యావృక్షమున కమృతధారయయ్యెను. ఆపండ్రెండు సంవత్సరములలో నది చక్కఁగఁ బెఱిఁగి, యాకస మంటుచుఁ జాలనందముఁ గాంచెను. ఇట్లు కాలముగడచిపోవుచుండఁగా, నొకనాఁడు శౌచశేషమును జెట్టుమొదటఁ బోయునపుడు తులసీదాసున కొకఘోరబ్రహ్మరక్షస్సు ప్రత్యక్షమై "భక్తశిఖామణీ! నీయెడల నా కానందము గలిగినది. ఈనదీజలమునుగాని, మఱియేప్రదేశమునందలి జలమునుగాని త్రాఁగుటకు నాకధికారము లేదు. ఈఱీతిన నేను నీళ్లు లేక చచ్చిపోవుచుంటిని. ఇట్లుండఁగా, నీవు పండ్రెండుసంవత్సరములనుండి యీచెట్టు మొదట నీళ్లు పోయు చుంటివిగదా! ఆనీళ్ల యాధారమున నే నింతవఱకును సుఖముగా నుంటిని. నాకిట్టి మహోపకారము చేయుచున్న నీకేమి కావలయునో కోరుకొను" మని పలికెను.

తులసీదాసునకు పుణ్యమునకుఁ బోవఁ బాప మెదురైనట్లయ్యెను. శ్రీరామ దర్శనాపేక్షికి బ్రహ్మరక్షస్సాక్షాత్కారమా? తులసీదాసునకుఁ దన ధ్యానప్రణాళిక యెడల ననుమానము తోఁచెను. అందేమైన లోపములుగాని, కుమార్గములుగాని యున్నవా? లేకున్న నీవిపరీత మేల? ఇట్లు భావించి, తులసీదాసు బ్రహ్మరాక్షసునితో "నావలన నీకు ఉపకారము జరిగినందులకు సంతోషము; కాని నీవు నాకేమి యీఁగలవు? నాకు ఐహికసుఖములమీఁద నాశ లేదు. నాకుఁ గావలసినది శ్రీరామసాక్షాత్కారము. అది నీవలన నగునేని చేయుము" అని పలికెను. ఇదివిని యాశ్చర్యపడి బ్రహ్మరాక్షసుఁడు, "మహాత్మా! అది నాకు సాధ్యమైనచో నీయవస్థయేల? నే నాపని

చేయఁజాలను; కాని యందులకుఁ దగునుపాయము చెప్పఁగలను. నీవు పినదినమును శ్రీరామాయణకథాకాలక్షేపము చేయుచోట నొక వృద్ధబ్రహ్మచారి అందఱకును ముందు నీసమీపమునఁ గూర్చుండుట నీకుఁ దెలిసినదే. ఆతఁ డెతఁడని నీవు భావించు చుంటివో, గాని మానవుఁడు కాఁడు. ఆమహానుభావుఁడు శ్రీరామచంద్రుని విజయమునకుఁ గారణభూతుఁ డగు అంజనాతనయుఁడు. ఆతనినిఁ బ్రార్థించితివేని నీయభీష్టమీడేరు" నని చెప్పి, మాయమైపోయెను.

ఈసంభాషణమువలనఁ దులసీదాసునకు పేదకుఁ బెన్నిధి దొరకినఁ గలుగునంతటి యానందము గలిగెను. "నేను చేయు రామగుణకీర్తనమున గుణ మున్నది. కావుననే విజ్ఞానులలో నగ్రేసరుఁడును, రామభక్తశిఖామణియు నగుహనుమంతుఁడు శ్రద్ధతో దానిని వినుట తటస్థించినది. అంజనాతనయునకు నాయెడలఁ బరమానురాగము కలిగినది; కావున నాకు రామసాక్షాత్కార మింక క్షణిక" మని తలంచి యాతఁ డానందాతిరేకముచే రామభజనము చేసెను. పిదప నాతఁడు స్నానసంధ్యాద్యనుష్ఠానములను యథాపూర్వముగ నెఱవేర్చికొని, సమీపగ్రామమునకుఁ బోయి రామాయణగానము ప్రారంభించెను. శ్రోతలందఱతోఁ బాటుగ నాంజనేయుఁడు యథాపూర్వవేషముతోఁ జనుదెంచి రామకథ వినసాగెను. తులసీదాసు నాతని రాకకు మివుల నలరి, రామగుణకీర్తనమునఁ గొంతతడవు ఆతనికానందము గలిగించి యంతటితోఁ జాలించి యాతనికి సాష్టాంగనమస్కారములు గావించి, "రామభక్తగ్రేసరా! ఇన్నిదినములును నిన్ను దెలిసికొనఁజాలకపోయితిని. నా యీదోషమును మన్నించి, నాపై ననుగ్రహము వహింపుము. నే నజ్ఞానుఁడను. స్వయముగ శ్రీరామచంద్రునకు నాపై దయఁ గలిగించుకొనఁజాలను. నాకాలోకేశ్వరుని దివ్యదర్శనము కలిగించెద నని అభయము దయచేయుము" అని ప్రార్థించెను. బ్రహ్మచారి వేషముతోనున్న మారుతి "నీయాశ్రమమునకుఁ బోయియుండుము. నీయభీష్టమీడేరు" నని చెప్పి, తనదారినిఁ బోయెను.

ఆంజనేయుఁడు స్వస్థానమునకుఁ బోయి శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి, ప్రత్యక్షమైన పిమ్మట తులసీదాసు ననుగ్రహింపవలయు నని వేఁడుకొనియెను. రాముఁ డట్లే యని యంగీకరించెను. తులసీదాసు రాముఁడు సాక్షాత్కరించు నని భావించి దర్శనలాలసుఁడై రామభజనము చేయసాగెను. ఇట్లుండఁగా, నొక తురుష్కరాజు తన తురుష్కసైన్యమును వెంటనిడుకొని తులసీదాసు నాశ్రమముముందునుండి యొటకో పోయెను. తురుష్కునితో మన కేమిపని యని తలంచి, తులసీదాసు ఆరాజు దెసకే చూడలేదు. ఎంత భజనము చేసినను ఫలము కలుగనందులకుఁ జాల వగచి, తులసీదాసు మఱల సమీపగ్రామమునకుఁ బోయెను. అట నంజనాపుత్త్రుఁడు

వచ్చి "రామదర్శన మైనదా?" యని ప్రశ్నించెను. "మీకు సంపూర్ణానుగ్రహము గలుగనిదే నాకోరిక యెట్లీడేరు" నని దాసు నిస్పృహతోఁ బలికెను. అది విని మారుతి "అయ్యో! వెఱ్ఱివాఁడా! శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించినను జూడఁ జాలకపోయితివి గదా! పరమేశ్వరుఁడు నీసర్వసమత్వభావమును బరీక్షింపఁదలఁచి తురుష్కప్రభురూపమున దర్శన మిచ్చెను. కనుఁగొనఁజాలకపోయితివి గదా!" అనియెను.

తురుష్కప్రభువే శ్రీరామచంద్రుఁడని విన్నతరువాతఁ దులసీదాసు అనుభవించినపరితాప మింతయని చెప్పుటకు వశముగాదు. అతని పశ్చాత్తాపమును జూచి మారుతి కరుణించి యేమనియెద ననియెను. "శ్రీరాముఁడు కోదండపాణియై సీతాలక్ష్మణసమేతుఁడై దర్శన మిచ్చునట్లు అనుగ్రహింపవలయు" నని దాసు కోరెను. "అట్లే యగును. పోయిర" మ్మని యాంజనేయుఁడు సెలవిచ్చి పంపివేసెను.

తులసీదాసు మఱల రామదర్శనోత్కంఠితుఁడై భజన ప్రారంభించెను. ఆతనిహృదయము కేవలము శ్రీరామునియందు లీనమైపోయెను. దాసునకుఁ బ్రాపంచిక జ్ఞానము లేని యీసమయమున శ్రీరాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై ధనుష్పాణియై సాక్షాత్కరించెను. తోడనే దాసు భగవంతునిపాదముల నానందాశ్రుపూరములతోఁ గడిగి, యనేకవిధములఁ గొనియాడెను. తులసీదాసున కభయ మొసంగి, పరమేశ్వరుఁడు తిరోహితుఁ డయ్యెను.

తరువాత హనుమంతుఁడు ప్రత్యక్షమయ్యెను. తులసీదాసు భయభక్తులతో సాష్టాంగనమస్కారము గావించి, "మహాత్మా! నీవు చేసిన మహోపకార మనంతమైయున్నది. నాకలభ్యమగుభగవద్దర్శన మశ్రమముగ ఘటించిన నీకు నే నేమి చేయఁగలను? నాసేవ నంగీకరింపు" మని ప్రార్థించెను. మారుతి దాసుతో "మనమందఱము నాదేవదేవునికింకరులము; శ్రీరామచంద్రుఁడు భక్తప్రీతుఁడగుట నీకు సాక్షాత్కరించెను; కాని యిందు నాప్రమేయ మేమియు లేదు. ఇప్పుడు నీకును నాకును భేదము లేదు. నీయాత్మయు నాయాత్మయుఁ గూడ నాపరంజ్యోతియందలి పరమాణువులు. ఇఁక నుభయులలోఁ దారతమ్యము ఎట్లుండును? నీవు నాకు సేవఁజేసెద ననుటలో నర్థము లేదు. లోకమంతయు నిప్పుడు మాయాంధకారపూరితమైయున్నది. నీవు జ్ఞానప్రకాశముఁ గలిగింపుము. స్థావరజంగమాత్మకమగు ప్రపంచము పరమేశ్వరుని దివ్యమందిరము. "ప్రజాసేవయే పరమేశ్వరసేవ" యని బోధించి వెడలిపోయెను. మారుతి యుపదేశముచొప్పునఁ దులసీదాసు అజ్ఞానకూపమునఁ బడి, జన్మపారంపర్యమువలన వంచితులై మోక్షమన నేమో యెఱుఁగనిమూఢప్రజల నుద్ధరించుటకుఁ దొలుత కాశీనగరమునకుఁ జనియెను.

అచట గంగాతీరమున నొక మఠము నేర్పఱచికొని తులసీదాసు భగవద్భజన ప్రారంభించెను. కొలఁదిదినములు గడుచునప్పటికీ దాసుమఠసమీపభూమి యంతయు భజనసమయమున జనసహస్రములచే నిండిపోసాగెను. తక్కిన సమయములలోఁ గూడ నచ్చట నుండు జనులను లెక్కించుటకు వీలుగాకుండెను. ఈతీరున ధనికులును బీదలును గూడ నచ్చటి కనేకులు వచ్చి పోవుచు, పండ్లు ఫలములు, వెండిచెంబులు, సువర్ణపాత్రలు మున్నగునవి యామఠమున నిడిపోసాగిరి; కాని యివియేమియు దాసునకు అవసరము లేకపోయెను. ఆతఁడు ఆవస్తువులదెసకే చూడఁడయ్యెను.

ఇట్లుండ, నొకనాఁటిరాత్రి యిరువురు చోరులు మఠమునఁ బ్రవేశించి, సువర్ణపాత్రములను దొంగిలించి బయలుదేఱిరి; కాని ద్వారమున ఆయుధహస్తులై యిరువురుపురుషులు కావలికాయుచుండుటచేఁ బోవుటకు వీలులేక త్రొక్కులాడసాగిరి. ఎన్నివిధములఁ జూచినను వారికిఁ బోవుట కవకాశము చిక్కలేదు. ఇంతలో నరుణోదయ మయ్యెను. ఏమిచేయునది లేక వాండ్రు స్నానార్థము గంగానదికిఁ బయనమైపోవుచున్న తులసీదాసుపాదములమీఁద వ్రాలి, చేసిన దంతయు నొప్పుకొని "మహాత్మా! మమ్ము రక్షింపు" మని ప్రార్థించిరి. అదివిని దాసు ఆశ్చర్యచకితుఁడై చోరులను జూచి, "మీ రదృష్టవంతులు. ద్వారమున మిమ్ము అడ్డగించినపురుషులు భక్తాధీనహృదయులగు రామలక్ష్మణులు. మీపూర్వపుణ్యము వలననే వారిదర్శనభాగ్యముఁ గలిగెను. మీసకలపాపములును దగ్ధములై పోయినవి. వేదాధ్యయనసంపన్నులకును, తపోధనులకును, దాతలకు, యాగకర్తలకును గూడ దర్శింపరాని భగవత్స్వరూపము మీకు గోచరమైనది" అని చెప్పెను. చోరు లాశ్చర్యచకితులై బుద్ధితెచ్చుకొని సాత్వికులై, తులసీదాసునకు శిష్యులైరి.

ఒకనాఁడు తులసీదాసు మఠమున హరిభక్తులకు అన్నసంతర్పణము జరిగెను. నాఁడొక పతితుఁడు పంక్తిలోనికి వచ్చెను. వానినిఁ జూచి భక్తు లందఱును తులసీదాసుతో "మహాత్మా! నేఁడు పంక్తిలోని కొకపతితుఁడు వచ్చియున్నాఁడు. వాఁడు పోయినఁగాని మేము భుజింప" మనిరి. తులసీదాసు అందువలన హరిభక్తుల కేమియు దోషము లంటఁబోవని యనేకవిధములఁ జెప్పెను; కాని వారందఱును నీప్రభావముఁ జూపు మనిరి. అప్పుడు దాసు విశ్వేశ్వరుని యాలయములో నున్న నందియెదుట నన్నము వడ్డించి, "హరిభక్తుల నేదోషములు నంటకపోవుట యథార్థ మేని; యీశాతినంది యీయన్నమును భుజింపవలయు" నని చెప్పెను. తోడనే నంది యాప్రకారము చేసెను. హరిదాసు లందఱును తులసీదాసు మాటను దిరస్కరించినందులకు క్షమింప వేఁడుకొని, భుజించి పరమానందభరితులై వెడలి పోయిరి.

ఒకనాఁడా కాశీనగరమునందలి యొక వర్తకుఁడు మృతిఁజెందెను. వాని భార్య సహగమనము చేయుటకుఁ గళేబరమువెంట బయలుదేరి, మార్గమధ్యమున మఠముబైట నిలిచియున్న తులసీదాసును జూచి, అతని ప్రభావమును వినియున్న దగుటచే నాతనికి వందనముచేసి సెలవుఁగైకొని పోద మని యట్లుచేసెను. సాష్టాంగ పడిన యాస్త్రీని తులసీదాసు "నీవు దీర్ఘసుమంగలివై యెనమండుగురు కుమారులను గని సుఖింపు" మని దీవించెను. అందుల కామె వింతపడి, "స్వామీ! నాభర్త మరణించెను. నేను సహగమనము చేయఁబోవుచున్నాను. మీరిట్లేల సెలవిచ్చితిరో తెలియదు" అని విన్నవించెను. తులసీదాసు అందులకు మందహాసము గావించి, "శ్రీరామచంద్రుఁడే నాచే నిట్లు పలికించెను. నాపలుకు దబ్బరగాదు. ఆకళేబరము నిచ్చటకు రప్పింపు" మని సెలవిచ్చెను. వెంటనే ప్రేత మచ్చటికిఁ గొనిరాఁబడెను. దాసు అభిమంత్రము చేయఁగా, వర్తకుఁడు సజీవుఁడై లేచి నిలిచి వందనములు చేసెను. ఆదంపతులను దీవించి దాసు వారి నంపివేసెను. వారణాసీనగరమునందలి యెల్లరును ఇది విని పరమాశ్చర్యచకితులైరి.

కాశీనగరమునందే నిలిచియుండక యీయద్భుతవార్తలు దేశమెల్లయెడల వ్యాపించెను. ఢిల్లీనగరమున అక్బరుపాదుషాకుఁ గూడ వినవచ్చెను. తోడనే యాతఁడు తులసీదాసును బరీక్షింపఁదలఁచి తీసికొనిరావలసిన దని మంత్రి కాజ్ఞాపించెను. ఆజ్ఞాప్రకారము మంత్రిపోయి యాతనిం గొనివచ్చెను. అక్బరు పురోపకంఠమున నాతనిం బ్రత్యుత్థానముచేసి, కోటలోనికిఁ గొనిపోయి, యొకగృహమున విడియించి "నీవు కాశీనగరమున ననేక విచిత్రములను జేసితివఁట. అందులకు నీకేమి శక్తిగల" దని యడిగెను. "నాకేమియు శక్తిలేదు. ఆపనులన్నియుఁ జేసినయాతఁడు శ్రీరామచంద్రుఁడు" అని దాసు చెప్పెను. "అట్లయిన శ్రీరామునిఁ జూపినఁగాని నిన్ను విడువ" నని పాదుషా దాసును కైదుచేసెను.

కైదులో తులసీదాసు మారుతినిఁ దలంచుకొనెను. తోడనే యాతఁడు ప్రత్యక్షమై "నీకేమియు భయములేదు. నేనంతయుఁ జక్కబెట్టెద" నని వెడలి పోయెను.

ఉన్నట్లుండఁగాఁ బదివేలకోఁతులు వచ్చి ఢిల్లీపట్టణముపైఁ బడెను. ఇఁక నాకోఁతులచేష్టలను జెప్పవలసిన దేమున్నది? నిముసములోఁ బట్టణమంతయుఁ జిందరవందరయైపోయెను. మనుష్యునిఁ బట్టి మనుష్యునిఁ గొట్టియు, కాళ్లు పట్టుకొని శిరస్సును గోడలకుఁ బెట్టి కొట్టియు, గోపురశిఖరముల నూడఁబెఱికి మీఁదఁ బడవేసియు, లుబ్ధుల బొక్కసములు బీదలకుఁ బంచిపెట్టియు, క్రూరుల యింట సకలామంగళములు గావించియు—నిట్లు కోఁతులు ఢిల్లీపౌరులను నానా

బాధలు పెట్టసాగెను. రాజసైన్యము కోఁతులనేమియుఁ జేయఁజాలకపోయెను. ఢిల్లీ పౌరులు ఇఁకఁ జేయునది లేక పాదుషాను శరణువేఁడిరి. ఆతఁడుమాత్ర మేమి చేయఁగలఁడు? అతఁడు నమ్మియింటికివచ్చిన తులసీదాసునిఁ గైదుచేయఁగలఁడు; కాని మీఁదికి దండెత్తివచ్చిన కోఁతుల నేమిచేయఁగలఁడు? త్రిభువనములను జయించిన రావణుఁడే కోఁతులచేష్టలకుఁ దెల్లవోయెను. తుదకు అగ్బరున కేమియుఁ దోఁచినదిగాదు. "తులసీదాసును కైదుచేయుటవలన సంభవించిన యనర్థ మిది" యని మంత్రి హితోపదేశముచేసెను. అప్పుడు అగ్బరు బుద్ధితెచ్చుకొని కైదులో నున్న హరిదాసుని రప్పించి సాష్టాంగ మెఱఁగి, "మహాత్మా! నీమాహాత్మ్య మెఱుఁగక నేను జేసిననేరమునకు క్షమింపు" మని వేఁడుకొనెను. హరిదాసు మందహాసము గావించి, "రాజా! ఇప్పుడేమి తొందరవచ్చినది? నీవు శ్రీరామునిఁ జూపు మంటివిగదా! మాప్రభువునకు ముందుగ ననంతకోటివానరులు వచ్చెదరు. వారి వెనుక రామచంద్రుఁడు వచ్చును. అట్లే యిప్పుడు ముందు వానరులు వచ్చినారు. ఇఁక నొక గడియలో మాప్రభువు వచ్చును" అని చెప్పఁగా, పాదుషా విని మఱింత భీతుఁడై "అయ్యో! ఈవఱకే వానరవీరులు వచ్చియే నాపట్టణమును ధ్వంసముచేసివేసిరి. ఇఁకఁ దక్కినవారు వచ్చిన నన్నుగూడఁ బ్రాణములతో నుండ నీయరు. శ్రీరామచంద్రుఁడు నీయందే యున్నాఁడు. నీదర్శనము శ్రీరామదర్శనము. ఇఁక వేఱుగ నేను రామసాక్షాత్కారము నపేక్షింపను" అని సవినయముగఁ బ్రార్థించెను. రాజున కిఁక బుద్ధివచ్చినదని తలఁచి, తులసీదాసు మారుతిని స్మరించెను. తోడనే వానరవీరులు మాయమై పోయిరి. అప్పుడు పాదుషాహా "నీ విచ్చటఁ గొన్నిదినము లుండి నన్ననుగ్రహింపవలయు" నని కోరఁగా తులసీదాసు అందుల కంగీకరించి, యొకసంవత్సర మచ్చటనుండి యనేకులను రామభక్తులను గావించెను.

పిదప దాసు పాదుషాను ఆశీర్వదించి బయలుదేరి మధుర, గోకులబృందావనము మున్నగుపుణ్యస్థలములను సందర్శించి యమునాతీరమున వసించెను. అచ్చట ప్రియదాసుఁడు అను నొక బ్రాహ్మణుఁడు వసించియుండెను. ఆతఁడు సంస్కృత భాషలో భక్తులచరిత్రములను వ్రాసియుండెను. తులసీదాసు ఆతని చెంతకుఁ బోయి, ఆగ్రంథ మొకమాఱు వినిపింపవలయునని కోరెను. ప్రియదాసు పెక్కురు భక్తుల చరిత్రములను వ్రాసెను; కాని తులసీదాసుచరిత్ర వ్రాయలేదు. అక్కఱతన నాతఁడు సందేహించుచుఁ జదువుచుండఁగా, నడుమ తులసీదాసుచరిత్ర వ్రాయఁబడి యుండుట కానవచ్చెను. అందుల కాతఁ డాశ్చర్యపడి వ్రాతయందలి సొగసు, పదముల మార్దవము, అర్థగాంభీర్యము మున్నగునవి చూచి, యిది వ్రాసినవాఁడు శ్రీరామచంద్రుఁడే యని భావించి, సంగతియంతయు సభలో

వెల్లడించెను. అందుచేత నెల్లరును మిగుల నాశ్చర్యముంజెంది ప్రియదాసునిం జాలం గొనియాడిరి. పిదప తులసీదాసు అనేకజనులను హరిభక్తులుగాఁ జేసి, యంతమున విష్ణుసాయుజ్యమును బడసెను.

మ. "యవనవ్యాధపుళిందహూణశకకంకాభీరచండాలసం
భవులుఁ దక్కిన పాపవర్తనులు నేభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతనులై కల్యాణులై యుండు రా
యవికారుం బ్రభవిష్ణు నాను మదిలో నశ్రాంతముం మ్రొక్కెదన్.

(భాగ స్కం. 2. ప. 63.)

---

# 17. మాధవదాసుఁడు

ఒక గొప్పపట్టణమున మాధవదాసుఁడు అను బ్రాహ్మణశ్రేష్ఠుఁ డుండెను. ఆతఁడు వేదవేదాంగములను జదువుకొని విజ్ఞానమును బడసి ధ్యానము-ఆవాహనము మున్నగు షోడశోపచారములతోడ శ్రీహరినిఁ బూజించుచు, గృహస్థాశ్రమధర్మములను మీఱక సాధువులను సజ్జనులను సేవించుచు, జన్మపరంపరకుఁ గారణము లగు నైహిక వ్యాపారములను మాని, నిష్కలహృదయుఁడై యుండెను.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా నాతనిభార్య మరణించెను. అందులకు విచారించుటకు మాఱుగ నాతఁడు సంసారసంబంధము వదలిపోయినందులకు మిక్కిలి యానందించి, యింటఁగల సమస్తవస్తువులను సద్బ్రాహ్మణులకును సాధుకోటికిని దానము చేసివేసి, పుణ్యక్షేత్రములను సేవించుటకు బయలుదేఱిపోయెను. ఒకనాఁ డాతఁడు జగన్నాథపురమున సముద్రస్నానము చేసి ఆలయమునకుఁ బోయి జగన్నాథస్వామినిఁ బ్రార్థించుచుండఁగా, నర్చకులు వచ్చి "ఎవఁడవు నీవు? ఫలములు దక్షిణయు నీయకుండ నిక్కడ నిలుచుటకు నీకేమి యధికారమున్నది? పోపొమ్ము" అని నిర్దయులై బయటకు గెంటివేసిరి. చేయునది లేక మాధవదాసుఁడు "ఆర్తత్రాణపరాయణుఁ డగు సర్వేశ్వరునిఁ జూచుటకు బీదల కధికారములేక పోయెఁగదా!" యని వగచుచు బయటకు వచ్చెను.

పిదప నాతఁ డొకచోటఁ గూరుచుండి జగన్నాథుని సగుణరూపమును సేవింపవలయు నను వాంఛతో మూఁడహోరాత్రములు నిద్రాహారములు మాని భగవద్ధ్యానము ప్రారంభించెను. ఈతనియవస్థనంతయుఁ జూచి జగన్నాథుఁడు "మన భక్తుఁడు నిద్రాహారము లేక నవసిపోవుచున్నాఁడు. నీ వీరాత్రి సగుణరూపముతోఁ బోయి మాధవదాసునకు దివ్యాన్నము నొసఁగి రమ్ము" అని రుక్మిణికి సెలవిచ్చెను. రుక్మిణియు నాయాజ్ఞప్రకారము అమృతతుల్య మగు దివ్యాన్న

మును బంగారుపాత్రమున నిడుకొని, సమాధినిష్ఠాగరిష్ఠుఁ డగు మాధవదాసు వద్దకు వచ్చి, దీనిని భుజింపు మని యుంచెను. ఆతఁడు "నీ వెవ్వరిదానవు? నా కీయన్నముదెచ్చి పెట్టుటకుఁ గారణమే?" మని యడుగఁగా, రుక్మిణి "నీవెవ్వరిని ధ్యానము చేయుచున్నావో, పరమేశ్వరుఁ డగునాజగన్నాథుని యురమున వసియించియుండు రుక్మిణిని నేను. నేను నాపతియాజ్ఞచే నీదివ్యాన్నమును నీకుఁ దెచ్చి పెట్టితి" నని చెప్పెను. ఇదివిని యాశ్చర్యచకితుఁడై దాసుఁ డామె ననేకవిధములఁ గొనియాడి, యనేక సాష్టాంగనమస్కారము లాచరించి యాదివ్యాన్నము భుజించెను. రుక్మిణి యాపాత్ర నచ్చటనే యుంచి వెడలిపోఁగా, దాసుఁడు దానిని గడిగి శుద్ధిచేసి తన చెంతనే యుంచుకొని నిద్రించెను.

మఱునాఁడు ఉదయమున అర్చకులు గుడిలోనికి వెళ్లి బంగరుపళ్లెమును గానక, యంతటి భద్రస్థలమునందలి వస్తువు మాయమైనందులకు వింతపడుచు నంతటను వెదకసాగిరి. కొంతతడవునకు వారు మాధవదాసుఁ డున్నచోటికి వచ్చి యాతనిచెంత నున్న సువర్ణపాత్ర నారసి "దొంగ దొరికెను. నాలుగు దినముల నుండియు నీచండాలుఁ డీచౌర్యము చేయుటకే యిచ్చట బకధ్యానము చేయుచుఁ గూర్చుండియుండె" నని యనేకవిధముల నాతనిని నిందించి, చౌర్యముచేసె నని నేరముమోపి కైదులో వేసిరి.

ఇఁక దాసుఁ డేమి చేయఁగలఁడు? ఇట్టిసమయములలో సర్వమానవులకును ఈశ్వరధ్యానమే శరణ్యము. అట్టిచో మాధవదాసువంటిహరిభక్తుని విషయము చెప్పవలసిన దేమున్నది? "ఈశ్వరా! నీప్రవృత్తికి ఈప్రపంచముతో నెట్టిసంబంధమును లేదు; కాని ప్రపంచప్రవృత్తియంతయు నీచేత నున్నది. నీవు నిర్వికారుఁడవు. ఆదిమధ్యాంతరహితుఁడవు. ఈజీవకోటికి వృద్ధిక్షయాదివికారముల నేల కలిగించితివి? జననమరణముల నేల కలిగించితివి? అది నీయిచ్ఛ. నీయిచ్ఛామాత్రముననే యీవిశ్వమంతయుఁ బ్రవర్తిల్లుచున్నది. ప్రభూ! నీవొక్కఁడవే ప్రభుఁడవు. ఇఁక నెవ్వరికిని స్వాతంత్ర్యము లేదు. అందఱును బరతంత్రులే. అందఱు నాజ్ఞాబద్ధులే. నీసేవకులలో ననేకు లెదుటివారినిఁ ద్రొక్కివేయఁ బ్రయత్నించుచున్నారు. త్రొక్కివేసితిమని యెగిరిపడుచున్నారు. వారి దెసకు నీవేల చూచుటలేదు? వారిని నీ వెట్లు సహించుచున్నావు? నీవు తేజోనిధివి. సర్వవ్యాపకుఁడవు. అనిష్టులను దండించుటకు అర్చకులచే కైదు అని వ్యవహరింపఁబడు ఈగదిలో మాత్రము నీవు నిండియుండ లేదా? నాస్థితియంతయు నీవు చూచుట లేదా? కాని నాకు నీ వేల కాన్పించుట లేదు? నీవు నాహృదయమున సాక్షాత్కరించియే యున్నావు. అయినను నేను తృప్తివహించుటలేదు. నీవిశ్వరూపమునకు సగుణత్వమును ఘటించి, నాబాహ్య

చక్షువులయెదుట సాక్షాత్కరింపుము. నాకంతియే చాలును" అని మాధవదాసుఁ డనేకవిధముల ధ్యానింపఁ దొడఁగెను.

నాఁటిరాత్రి జగన్నాథుఁడు అర్చకుని స్వప్నమున సాక్షాత్కరించి "మాధవదాసుఁడు నాయాంతరంగికభక్తుఁడు. ఆతనివలన నేమియు దోషములేదు. సువర్ణపాత్ర మాతనిచెంత నుండుటకుఁ గారణభూతుఁడను నేను. ఇఁక నాతనిని బాధించుట నాకుఁ గోపకారణ మగు" నని చెప్పెను. అర్చకుఁడు ఈశ్వరద్రోహము చేసితినిగదా! యని చాలవగచి, మఱునాఁటి యుదయమున శీఘ్రముగ నిద్ర మేల్కాంచి తోడి యర్చకులందఱతోడను స్వప్నవృత్తాంతమును జెప్పెను. వారు గూడఁ ద్రోహముచేసినపనికి చాల విచారించి వెంటనే కైదులోనున్న మాధవదాసుని చెఱ విడిపించి, యనేకవిధములఁ ద్రోహముచేసిన యక్రమమును సహింపఁ బ్రార్థించి, భగవత్ప్రసాదము నొసంగిరి; దాసుఁడు దానిని భుజించి, చాల నానందించి యర్చకుల కభయ మిచ్చెను.

ఇట్లు కాలము జరిగిపోవుచుండఁగా శీతకాలము వచ్చెను. ఒకనాఁడు మాధవదాసుఁడు శీతబాధను సహింపలేక గడగడ వడఁకిపోవసాగెను. అది చూచి జగన్నాథుఁడు తనపైనున్న శాలువను దాసునిపైఁ గప్పిపోయెను. మఱునాఁ డుదయమున అర్చకులు వచ్చి తలుపులు తెఱచి స్వామిమీఁద శాలువ లేకపోవుటకు మిక్కిలి నబ్బురపడి, అది మాధవదాసుమీఁద నుండుటకు మఱింత వింతపడిరి. ఇట్లు మఱికొన్నిదినములు గడచిపోవునప్పటికి మాధవదాసుని ప్రభావము దేశమం దంతటను వ్యాపించెను. రాజుగూడ విని మహోత్సవముతో వచ్చి దాసు ననేకవిధముల గౌరవింపఁజొచ్చెను. ప్రజలును, రాజును జేయుచున్న సత్కారమును జూచి మాధవదాసుఁడు అధఃపతనము గలుగునని భావించి, యెరికినిఁ దెలియకుండ నొక నిశీథమున జగన్నాథపురమును విడిచిపోయెను.

కొన్నిదినములకు దాసుఁడు మధురాపురమును జేరుకొనియెను. అచ్చట శ్రీకృష్ణదేవాలయమునందలి యర్చకులు గూడ రిక్తహస్తుఁడై వచ్చెనని దాసునిఁ ద్రోసివేసిరి. చేయునది లేక దాసుఁ డొక వివిక్తస్థలమునఁ గూరుచుండి శ్రీకృష్ణుని ధ్యానింపసాగెను. అంత నొక ధనికుఁడు భోజనసామగ్రినిఁ దీసికొనివచ్చి యాతని కిచ్చెను. దాసుఁడును ధనికుని ప్రార్థన నంగీకరించి యాసామగ్రిని పచనముగావించి యాకులో వడ్డించికొని "శ్రీకృష్ణా! వచ్చి భుజింపు" మని ప్రార్థించెను. తోడనే కృష్ణుఁ డచ్చట సాక్షాత్కరించెను. మాధవదాసుఁ డమందానందకందళితహృదయారవిందుఁడై స్వామి చరణకమలములను బాష్పోదకములచే కడుగసాగెను. అదిచూచి స్వామియుఁ గరుణార్ద్రహృదయుఁడై యాతని లేవనెత్తి "భక్తశిఖా

మణీ! నీవు నా ప్రాణమవు. అయినను నీప్రభావము నెఱుఁగని నాయర్చకులు నిన్ను బైటఁ ద్రోసివేసిరి. అగుటచే నిన్ను వెదకికొనుచు నేనే వచ్చితిని" అని యూఱడించెను. దాసుఁడు స్వామికిఁ బునఃపునః ప్రణామము లర్పించి, యనేకవిధములఁ గొనియాడెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు "భక్తశేఖరా! రమ్ము భుజింత" మని యాతనితో భుజించి, యభయ మొసంగి వెడలిపోయెను.

యథాకాలమున అర్చకులు దేవాలయమున వివిధములగు దివ్యాన్నములు స్వామికి నివేదించిరి; కాని స్వామి వాని నేమియు నొల్లక, "కండ్లకావరమున మీరు నాదాసుని గెంటివేసితిరి. ఇఁక మీరిచ్చిన నైవేద్యమును నే నెట్లు స్వీకరింతును? నేను నాభక్తుఁ డుండుచోటు వెదకికొనుచుఁ బోయి యాతనితో భుజించి వచ్చితిని. ఇఁక నాతని సెలవులేకుండ మీరుసమర్పించు పదార్థముల నేనొల్ల" నని చెప్పెను. అర్చకులు తోడనే మాధవదాసుచెంగటికిఁ బోయి, "మహాత్మా! మావలన నపరాధమైనది. మీప్రభావము నెఱుంగక మే మక్రమ మాచరించితిమి. మీరు క్షమింపకున్న మాకిఁక దిక్కు లేదు" అని ప్రార్థించిరి. మాధవదాసుఁ డందుల కంగీకరించి, మఱల నాలయమునకుఁ బోయెను. అచ్చటఁ గొన్నిదినములు గడపి, యాతఁడు గోకులము బృందావనము మున్నగు పుణ్యక్షేత్రములను దర్శించి, మఱల జగన్నాథముఁ జేరుకొనియెను.

కాని, యొకటిరెండుదినములలో నాతనికి అతిసారవ్యాధి సంభవించెను. అది చాలఁ దీవ్ర మగుటచే దేహశుద్ధి చేసికొనుటకుఁ గూడ మాధవదాసుఁ డశక్తుఁడై యుండుటచే స్వామివచ్చి, యాతనికి సకలోపచారములు చేయసాగెను. అదిచూచి దాసుఁడు "స్వామీ! సృష్టిస్థితి సంహారచతురా! సర్వము నీయధీనముగ నున్నది. చెంతఁజేరరానిస్థితిలోనున్న నాకు నీవు ఉపచారములు చేయుటకంటె ఈజాడ్యమునే నాశముచేయుట మంచిది గాదా?" యని పలికెను. అందులకు శ్రీహరి "నీవుచెప్పినది నిజమే. నాకెందు నసాధ్యము లేదు; కాని జీవకోటుల కర్మలను ద్రిప్పివేసితినేని లోకమున నియమస్థితి లేకపోవును. ఇంకను నీ వీజాడ్యము వలన నాలుగుదినములు బాధపడవలసియున్నది. నేనిప్పుడే నీజాడ్యమును నిర్మూలము చేసితినేని, నాలుగుదినముల యనుభవము నిమిత్తము నీవు మఱల నొక జన్మము పడయవలసివచ్చును. నాపాలఁబడిన వారికి శాశ్వతమోక్షము నిచ్చుట నాకు వ్రత" మని చెప్పెను. మాధవదాసు నాలుగుదినములలో నారోగ్యవంతుఁడయ్యెను. ఆతఁడు మఱల యథాపూర్వముగ నీశ్వరధ్యానమునఁ బ్రవృత్తుఁడై యుండఁగా, నొకతార్కికుఁ డరుగుదెంచి "నీవు వేదాంతి వని విని యున్నాను. కావున, తర్కశాస్త్రమున నీతో వాదము చేయుటకు వచ్చితి" నని

యేసు మాధవదాసునకు తర్కశాస్త్రపరిచయము లేదు. ఇక వాదముచేయుట యెట్లు? ఆతఁ డీవిపత్తును దప్పించుకొనఁదలంచి "నేను వచ్చునంతవఱుక నుండుము" మని సముద్రతీరమునకుఁ బోయి, యీ యాపదను దొలఁగింపు మని సర్వేశ్వరునిఁ బ్రార్థింపసాగెను. దాసుఁ డిట్లు ప్రార్థనము సేయుచుండఁగనే శ్రీహరి మాధవదాసుని రూపము వహించి పోయి, యొక్కమాటలోఁ దార్కికు నోడించి యంతర్ధాన మయ్యెను. పిమ్మట మాధవదాసుఁ డచ్చోటికి రాఁగా, పండితుఁ డాతని కాళ్ల మీఁద వ్రాలి "మహాత్మా! నే ననేకపండితుల ననాయాసముగ జయించితిని; కాని అట్టి న న్నొక్కమాటయందే జయించిన మీసామర్థ్య మనన్యదుర్లభము" అని కొనియాడెను. "పండితుఁడా! నీతో వాదముచేసిన పురుషుఁడు సర్వాంతర్యామి యగు శ్రీహరి. నీపూర్వపుణ్యలేశమువలన సులభముగ నీకు భగవద్దర్శనము లభించె" నని దాసుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అది విని పండితుఁడు పరమాశ్చర్య చకితుఁడు, అమందానందభరితుఁడు నై మరల దాసుని పాదములపై వ్రాలి, "మహాను భావా! నాకు జ్ఞానోపదేశముచేయు" మని ప్రార్థించెను.

దాసుఁడు పండితునకు జ్ఞానోపదేశము చేసి, యవసానమున విష్ణుసాయుజ్య మును బడసెను. శిష్యుఁడు గూడ మహామహిమాభిశోభితుఁడై, తుదకు ఈశ్వర సాయుజ్యమును బొందెను.

ఉ. "మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై
లూనత నొంద రట్టి మునిలోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్."

(భాగ. స్కం. 2. ప. 69.)

---

## 18. కల్యాణదాసుఁడు

హరిద్వారమున కల్యాణదాసుఁడు అను నొకబ్రాహ్మణుఁడు నివసించియుం డెను. ఆతఁడు గృహస్థాశ్రమమున నుండియు, నందఱవలె విషయసుఖపరాయణుఁడు గాక, నిస్పృహుఁడై యెట్లో సంసారము గడుపుకొనుచు సర్వదా భగవత్పూజా ధురంధరుఁడై యుండెను. ఆతఁ డొకప్పుడు తీర్థయాత్రాభిలాషి యై బయలుదేఱి సకలతీర్థములయందును గ్రుంకి, సకల పుణ్యక్షేత్రముల దర్శించి, తుదకు సేతువు చెంతకుఁ జేరుకొనియెను.

ఇట్లే యొక గౌడబ్రాహ్మణబ్రహ్మచారియు తీర్థయాత్రార్థియై బయలుదేఱి యెల్ల దేశములును దిరిగి, సేతువునకు వచ్చియుండెను. అచ్చట నీయిరువురకును

సమావేశ మయ్యెను. ఒకరిభక్తిజ్ఞానవైరాగ్యాదు లొకరికిఁ దెలియవచ్చెను. ఒకరి మొదల నొకరికి భక్తియు నాదరమును గుదిరెను. తుద కిరువురును స్నేహితులైరి. అప్పటినుండియు నేమిచేసినను వారిరువురు గలిసియే చేయసాగిరి. మఱల యాత్రార్థులై బయలుదేఱి, వారిరువురును మధురాపట్టణము చేరుకొనిరి.

అచ్చటఁ గల్యాణదాసునకు దేహమున జాడ్యము సంభవించెను. దానివలన నాతఁ డాఱుమాసములు బాధపడెను. ఈయాఱునెలలు గూడ బ్రహ్మచారి యాతనినిఁ గనిపెట్టుకొనియుండి, యాప్తునికంటె నెక్కుడు పరిచర్యలు చేసెను. ఈ యుపచారములవలనను, భగవత్కటాక్షమువలనను దాసునకు స్వస్థతగలిగెను. అంత దాసుఁడు బ్రహ్మచారినిఁ జూచి, "మహాత్మా! నీవు కరుణాస్వరూపుఁడవు. నీవంటిభూతదయాపరుని నేను చూచి యుండ లేదు. నా కిట్టి మహోపకారమును జేసిన నీఋణమును నేను ఎట్లు తీర్చుకొఁగలను? నీవు సాక్షాత్తుగ భగవంతుఁడవు; కాని గౌడబ్రాహ్మణబ్రహ్మచారివి గావు. కాకున్న మనుష్యమాత్రుఁ డింతటి యోర్పుతో నొరులకు సేవఁజేయుటఁ గలడా? ఈశ్వరుఁడు భక్తక్రీతుఁడు. కావున నిట్టి రూపములతో వచ్చి భక్తుల నుద్ధరించుట కలదు. భక్తశిఖామణీ! కొండంత దేవునకు కొండంత పత్త్రి తేఁగలమా? అయినను నాకొమార్తెను నీకిచ్చుటకు నేను ముచ్చటపడుచున్నాను. ఇంతకంటె నీఋణము తీర్చుకొనుటకు నాకు వేఱు సాధనము లేదు. నావస్తువును నేను పొగడుకొనుట కాదు; కాని నాకుమార్తె సాత్త్వికచిత్త. పెద్దలఁ బొడఁగన్న వినీతయై సేవలుచేయుటకుఁ గోరుచుండును. సదానందపరీతురాలు. ఆమె నీవంటి సాత్త్వికమూర్తికి అర్ధాంగి యగుట కర్హురాలు; కావున నట్టి నాకొమార్తను స్వీకరించి, నాఋణమును దొలంగించి నేను పితృఋణమును దీర్చికొని తరించున ట్లనుగ్రహింపు" మని బతిమాలెను. ఇదివిని బ్రహ్మచారి వివర్ణుఁ డయ్యెను. "నాకుఁ బెండ్లియా!" యని యాతఁ డప్రయత్నముగఁ బలికి, కొంచెము తడవు ఊరకుండి "ఆర్యా! ఐహికసుఖముల పొంతఁబోక యీబ్రహ్మచర్యాశ్రమమునందే యుండి జన్మరాహిత్యమును బడయఁగోరుచుండఁగా, నీవిట్లు సంసారాంధకారకూపమునఁ బడఁద్రోయఁజూచుట భావ్యమా? సంసారియగు వానికిఁ జిత్తశాంతి యుండదు. ఈప్రపంచమునందలి మానవులలో నందఱును సంసారులే. ఒక్కనికైన శాంతి యున్నట్లుఁగాని, ఆనంద మున్నట్లుఁగాని చూచుచున్నామా? అంతయు భ్రాంతి. సుఖమే యను మోహము; కాని దుఃఖము సుఖ మెట్లగును? దుఃఖము దుఃఖమే. మాయావరణమువలన దృష్టి మందగించి పోవుచున్నది; బుద్ధి మొద్దువాఱిపోవుచున్నది. మహారణ్యాదివిజనస్థలములయం దుండు మునుల హృదయములే యపుడపుడు చలించిపోవుచున్నపుడు, కామినీ

జనముల నడుమనుండువానిసంగతి యిఁకఁ జెప్పనేల ? కావున, దయయుంచి నన్ను సంసారసాగరమునఁ గూలఁ ద్రోయుటకుఁ దలంపకుము. అని బ్రహ్మచారి దాసుని వేఁడుకొనెను; కాని దాసునిచిత్తమున కిది యంగీకార్యము కాలేదు. బ్రహ్మచారికి యథార్థము తెలిసినట్లు ఆతనికిఁ దోఁచినదికాదు. "వటూత్తమా ! నీవు శుద్ధముగ భ్రమపడితివి. గృహస్థాశ్రమము నీవు తలఁచినట్లు నికృష్టముఁగాదు. అది బ్రహ్మచర్య వానప్రస్థసన్యాసాశ్రమములకు ఆధారభూతము. అదిలేనినాఁడు ప్రపంచమే లేదు. గృహస్థాశ్రమమును స్వీకరించినంతమాత్రమున స్త్రీపురుషులు మోక్షదూరులు కాఁజాలరు. నీ వీ బ్రహ్మచర్యవ్రతమును గొనసాగించి పొందు ఫలమును గృహస్థులు నీకంటె సులభముగఁ బొందఁగలరు. గృహస్థులకైనను, ఇతరాశ్రమములవారికైనను మనోనిగ్రహము తప్పనిదే యగుచున్నది. గృహస్థుఁడైనంత మాత్రమున విషయసుఖపరాయణుఁడు కావలయుననిగాని, అగుననిగాని నియమము లేదు. ఏది మన కనిష్టమో, దేనిని మనము మఱచిపోవలయునని సతతము ప్రయత్నించుచుందుమో, యదియే మన హృదయక్షేత్రములయందు సర్వకాలములయందును తాండవ మాడుచుండును.

తొల్లి ఘంటాసురుఁడను నొక రాక్షసుఁ డుండువాఁడు. వానికి శ్రీహరిపై విరోధము ప్రబలెను. అగుట వాఁడు శ్రీహరి పేరెత్తఁగూడదని నిశ్చయించుకొని యెను. కాని వానికంతటితోఁ దృప్తి కలుగలేదు. ఆపేరు విననేకూడ దని తుదకు వాఁడు నిశ్చయించుకొనెను. అయితే సమీపమునఁ బోవుచు నెవరైన శ్రీహరీ యని పిలిచినఁ జేయవలసిన దేమున్నది ? వినఁగూడని శబ్దము వినినతరువాతఁ జెవులు మూసికొనిన మాత్రమున నేమి ప్రయోజనము ? ఇట్లు తలఁచి వాఁడు ఒడలంతయు గంటలు కట్టుకొనెను. గంటలధ్వనివలన వానికిఁ బయలు శ్రీహరీ యను నపుడు విన్పించుట మానివేసెను; కాని యేమి లాభము? "శ్రీహరిపేరు మనము వినఁగూడదు. శ్రీహరి పేరు మనము వినఁగూడదు" అని క్షణక్షణమును వాఁడు తన దీక్షను దృఢతరము చేసికొనఁదొడఁగుటవలన—నేశబ్దమును వినఁగూడ దని వ్రతము పట్టెనో, యాశబ్దమే సర్వకాలములయందును స్మరింపఁబడసాగెను. అట్లే స్త్రీలతో సంపర్కము కలిగించుకొనఁగూడదని మనము దీక్షదాల్చినచో స్త్రీవ్యక్తియే మనకు స్మరణార్హమగును. ఇఁకఁ జిత్తశుద్ధి యెట్లు గలుగును? కావున, గృహస్థాశ్రమమును నిందింపకుము. నీవు గృహస్థాశ్రమమును గూడదనుచున్నావు ; కాని నీయుపాధికి గృహస్థులే రక్షకులు అగుచున్నారు. గృహస్థులు నీవలెను, మునులవలెను బ్రహ్మప్రయత్నములు చేసి మనస్సు నరికట్టుకొనకయే నీవంటి నిరాధారుల కాధారులై, మీకంటె యుత్తమస్థానములను బడయుచున్నారు. కావున, గృహస్థుఁ

డగుటవలన మానవుఁ డధఃపతితుఁ డగునను భ్రమను విడువుము" అని దాసుఁడు చెప్పఁగా బ్రహ్మచారి విని, యద్భుతాశ్చర్యరసమగ్నుఁడై అజ్ఞానాంధ్యము తొలఁగ విశాలహృదయుఁడై, దాసునకు సాష్టాంగనమస్కారము లాచరించి, "మహానుభావా ! జాడ్యపడినపుడు నీకుపకారముచేయుటవలన నీవు నన్ను భగవంతుఁడని భావించితివి; కాని నీవే నన్ను భ్రమప్రమాదములనుండి యుద్ధరింప విచ్చేసిన సర్వేశ్వరుఁడవు. ఇఁక మాఱుపలుకక నీయాజ్ఞానుసారము ప్రవర్తించెద" నని చెప్పెను.

తోడనే కల్యాణదాసుఁడు బ్రహ్మచారిని శ్రీకృష్ణుని సన్నిధికిఁ గొనిపోయి "యోగ్యుఁడ వగు నీకు నాకుమార్తెనిచ్చి వివాహము చేసెద". నని శ్రీకృష్ణుఁడు సాక్షిగా నాతనిచేతిలో నుదకము విడిచి చెప్పెను. బ్రహ్మచారి బ్రహ్మానందభరితుఁ డయ్యెను. తరువాత బ్రహ్మచారితోఁగూడ కల్యాణదాసుఁడు హరిద్వారమునందలి స్వగృహమునకుఁ బోయి, సంగతినంతయు బంధువులకుఁ జెప్పెను. తోడనే వారు పకపక నవ్వి, "ఇంతవఱకు నీవు వివేకి వని మేము తలంచుచున్నాము గాని, నీవివేక మంతయు నేఁడొక్కమాటుగ వెల్లడియయ్యెను. చదివించిన నున్నమతియుఁ బోయిన దఁట. పంచద్రావిడులకును, పంచగౌడులకు నిడివఱకెచ్చటనైన వివాహరూపమునఁ బరస్పరబాంధవ మున్నట్లు నీవెఱుఁగుదువా? నీబుద్ధి యిప్పుడేల పెడతలఁ బట్టెను?" అని వా రాక్షేపణములు చేయసాగిరి. కల్యాణదాసుఁడు గతవృత్తాంతము నెన్ని సారులు చెప్పినను వారు నమ్మరైరి. మహానుభావులకు శాఖాభేదములతోఁ బనిలేదని యెంతచెప్పినను అంగీకరింపరైరి. "నేను శ్రీకృష్ణుని సన్నిధిని బ్రహ్మచారికి నాకన్యను వాగ్దానము గావించితి, నది యెట్లు తప్పుదు" నని యెన్నివిధములఁ బ్రార్థించినను వారు సమ్మతింపకపోవుటయే గాక, "యిట్టి తెలివితేటలకు సాయము వాగ్దానములును సాక్ష్యములును గూడనా?" యని తల కొక్కరీతిని హేళనము ప్రారంభించిరి. అంతఁ జేయునది లేక కల్యాణదాసుఁడు రాజుగారివద్దకుఁ బోయి సంగతి యంతయుఁ దెలిపి, నాకొమార్త నా బ్రహ్మచారికిచ్చి పెండ్లిచేయుట కెట్టి యభ్యంతరమును లేకుండున ట్లనుగ్రహింపవలె" నని ప్రార్థించెను.

దాసుని వెనువెంట నాతనిబంధువులు గూడ రాజసన్నిధికిఁ బోయి అసందర్భముల న న్నిటినిఁ దెలిపిరి. రాజు ఉభయులవాదములను విని దాసునిఁజూచి "బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! నీవు చెప్పునది సరిగనే యున్నది. కన్య నిచ్చెద నని తప్పుటకంటె పాతకము లేదు. నీవాగ్దాన మెట్లును జెల్లింపవలసినదే; కాని నీబంధువు లందఱును దీనికి వ్యతిరేకించుచున్నారు. వారంఱకు ననిష్టముగఁ బ్రవర్తింతువేని సాంసారికము లగు చిక్కు లనేకములు తటస్థించును. అదియుఁగాక, నీబందుగు లెల్లరును "వాగ్దానము చేసితి" నని చెప్పినంతమాత్రమున నీమాటను నమ్మరాదనుచున్నారు. కావున నీవు వాగ్దానము చేసినట్లు సాక్ష్యము తీసికొనిరమ్మని చెప్పెను.

"ఇది యెట్లు? ఇంతకంటె వలనుగాదని ఖండితముగఁ జెప్పరాదా ? నావంటి మూఢుని ప్రార్థన నంగీకరించి, మధురావాసియగు శ్రీకృష్ణభగవానుఁడు సాక్ష్యము నిమిత్త మిచ్చటికి వచ్చునా" యని సందేహించి, "అట్లుగాకున్న నేనాతని చరణకమలములను వదలి రా" నని నిశ్చయించుకొని, కల్యాణదాసు మధురాపురమునకుఁ బోయెను. తమతో వాదింపలేక యీవంకఁబెట్టుకొని కల్యాణదాసు దేశాంతరమునకుఁ బాఱిపోయెనని బంధువులు తలంచిరి ; కాని కల్యాణదాసుని ప్రార్థన నంగీకరించి శ్రీకృష్ణుఁడు "సాధుజన చూడామణీ ! నేను భక్తులచిత్తానుసారముగఁ బ్రవర్తించెదను ; కావున నీతో హరిద్వారమునకు వచ్చెద నడువుము ; కాని నీవు వెనుదిరిగి చూడరాదు. అట్లు చూచెదవేని నీ వెచ్చటఁ జూచిన నచ్చట నేను నిలిచిపోయెద" నని చెప్పెను. వల్లెయని కల్యాణదాసుఁడు ముందు బయలుదేఱెను. కాలియందెలు గజ్జెలు ఘల్లుఘల్లుమని మ్రోయ శ్రీకృష్ణుఁడు వెనుక బయలుదేఱెను.

భగవంతుఁడును, భక్తుఁడును అహోరాత్రవిమర్శ లేక చాలదినములు నడచి వచ్చిరి. హరిద్వారమునకు అరకోసుదూరమున నుండఁగా వాయువశమున కల్యాణదాసునకు భగవంతుని గజ్జెలధ్వని వినరాదయ్యెను. ఏమి హేతువో యని యాతఁడు వెనుదిరిగి చూడఁగా, స్వామి యచ్చటనే నిలిచిపోయి "నిషేధమునకు వ్యతిరేకముగ నీవు వెనుదిరిగి చూచితివి. ఇఁక నేను ముందునకు రాను. నీవు పోయి రాజు మున్నగువారి నందఱ నిచ్చటికిఁ గొనిరమ్ము" అని విధించెను. చేయునది లేక దాసుఁడు గ్రామమునకుఁ బోయి సంగతి యంతయుఁ జెప్పఁగా, బంధువులును రాజును ఆశ్చర్యముతోఁ జనుదెంచి రుక్మిణీపతిని సేవించిరి. "నేను భక్తపరాధీనుఁడను. ఈకల్యాణదాసుఁడు మీయందఱచేత అవివేకి యని, భావింపఁబడుచున్న యీయమాయికుఁడు నా కాంతరంగికుఁడు. ఇట్టిభక్తుల నుద్ధరించుటకే నేను సగుణత్వము నంగీకరించుచున్నాను. నామహిమ నాభక్తు లెఱుంగుదురు. నేను నాభక్తులమహిమ నెఱుఁగుదును. సర్వజ్ఞుల మని గర్వపడు తక్కినవా రందఱును శుద్ధముగ నవివేకులు. ఈభక్తాగ్రేసరుఁడు నాయెదుట తనకొమార్త నిచ్చెదనని యీబ్రహ్మచారికి మాట యిచ్చెను. ఈబ్రహ్మచారి గూడఁ గల్యాణదాసుని వలెనే నాకుఁ గేవల మాంతరంగికభక్తశిరోమణి. ఈతనికి గౌడత్వము లేదు. ఈతనికి ద్రావిడత్వము లేదు. అవి కేవలమును మిమ్ముఁ బీడించుచున్న అజ్ఞానపిశాచములు" అని స్వామి సెలవిచ్చెను. అది విని, యెల్లరును బుద్ధితెచ్చుకొని కల్యాణదాసునిపాదములపైఁ బడి మాయపరాధమును మన్నింపు మని ప్రార్థించిరి. ఇంతవఱకును నీవివాహమున కాటంకము గలిగించిన మాదుడుకుఁదనమును సహింపు మని గౌడబ్రహ్మచారిని వేడుకొనిరి. అట్టివాని కడుపునఁ బుట్టిన తరువాత నిట్టి

వానికాలు త్రొక్కుటలో వింతలేదని కన్యక యదృష్టమును జాటఁగొనియాడి, స్వామియెదుటనే వివాహకార్యమును నిర్వర్తించిరి. స్వామి యిప్పటికి నచ్చట వేంచేసియుండి యెల్లరచేతను బూజింపఁబడుచున్నాఁడు.

ఉ. "ఏపరమేశుపాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధితో నుభయలోకము లందుల జడ్డుబాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్." (భాగ. స్కం. 7 ప. 61.)

---

# 19. హరివ్యాసుఁడు

మధురాపురమున హరివ్యాసుఁడు అనునొక బ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు దారాపుత్రులతోఁ గూడి సంసారమునందే యున్నను, సర్వకాలములయందును భగవల్లీలలను దెలిసికొనుటయందును, హరిభజనచేయుటయందును, నిత్యకర్మలను నెఱవేర్చుటయందును, సాధువులకును హరిదాసులకును బరిచర్యసల్పుటయందును, నిమగ్నుఁడై గృహస్థాశ్రమధర్మముల నుల్లంఘింపక కాలము గడుపుచుండెను. ఆతని భార్యయు నట్లే భగవద్భక్తిఁ గలిగి, పతిని ఛాయవలె ననుసరించుచుండెను. ఇట్టి సాత్వికమూర్తు లగు నీదంపతుల పాదసేవ చేసి భక్తిజ్ఞానవైరాగ్యముల నలవఱుచు కొనుటకై యనేకులు శిష్యులైరి.

ఇట్లుండ హరివ్యాసుఁ డొకప్పుడు అగణ్యశిష్యులతోడను, భార్యతోడను జగన్నాథయాత్రకు బయలుదేఱెను. చాలదినములు ప్రయాణమైనపిదప వారు ఒక నాఁటిరాత్రి సింహశార్దూలాదిభయంకరజంతువులతో నిండియున్న యొక మహారణ్యము చొచ్చి, ముందుఁబోవుటకు ఇష్టపడక, అందొక చెఱువుగట్టుమీఁద బసచేసిరి. అచ్చట నొక కాళికాదేవి యాలయము ఉండెను. మఱునాఁటి యుదయమున సమీపగ్రామవాసి యగు నొక కాపు మేఁకపోతు నొకదానిని, కొన్ని కోళ్లను కడవలతో నన్నమును వెంటఁబెట్టుకొని వచ్చి, దేవతను పూజించి, యన్నము నారగింపఁజేసి "చల్లని తల్లీ! అనుగ్రహింపు" మని మేఁకను కోళ్లను బలియిచ్చి, వానినిఁ గొని తనదారినిఁ బోయెను.

హరివ్యాసుఁ డిది యంతయుఁ జూచి "నేఁడెంత దుర్దినము! ఒకకిరాతుఁడు సాధుజంతువులను నిష్కరుణుఁడై సంహరించుట కనులారఁ జూచితిమి గదా! ఈ దేశమునందలివా రెంత కఠినాత్ములు! ఈదేవత యెంత పాపాత్మురాలు! తెలిసియుండియు నింక నిచ్చోట వసించియుండినచో నీదేశపుఁ బ్రజలును, ఈదేవతయుఁ జేయు పాప మంతయుఁ జుట్టుకొనును" అని తలంచి, కడుపు దహించివేయుచున్న

క్షుద్బాధను లెక్కచేయక, భార్యను శిష్యులను వెంటఁబెట్టుకొని యెక్కడకో పోవు టకు బయలుదేఱెను. ఇది యంతయుఁ జూచుచున్న కాళికాదేవి మిగుల వగచి, "అయ్యో! సాక్షాత్తుగ భగవంతుని యంతరంగభక్తుఁడగు నీహరివ్యాసుఁడు ఇచ్చట జరిగిన ఘోరకృత్యమును జూచి క్షుద్బాధను దీర్చికొనకయే, యనుచరులతోఁ గూడి యెందో వెడలిపోవుచున్నాఁడు. ఎట్టి యసందర్భము తటస్థించెను? సర్వవ్యాపకుఁ డగు శ్రీహరి కీసంగతి యెట్లు తెలియకుండును? తన భక్తునకు మనోవైకల్యము కలుగుటకు హేతుభూతురాల నగు నాపై నీశ్వరుఁ డెంత కోపించునో, అక్కటా! ఇంతపనికిని తెలియనైతినయ్యో" యని భయపడుచుఁ జిన్నఁగబోయి హరి వ్యాసుని పాదములమీఁద వ్రాలి, "మహానుభావా! మీవంటి మహామహిమోప శోభితులు నాస్థలమునుండి యిట్లు క్షుధార్తులై యుండియు, నెందే నరిగిన నాదేవత్వ మెట్లు నిలుచును? నామీఁద వచ్చినంత యాగ్రహమును బ్రకటించిన నేఁ దాళఁ జాలుదునా? అపరాధము వచ్చినది. క్షమించి, మఱల నాస్థలమునకు రావలయు" నని ప్రార్థించెను. హరివ్యాసుఁడు కాళికను జూచి చీకాకుపడి, "నీవు క్షుద్రురాలవు. కావున క్షుద్రవిధానముల నవలంబించి సిగ్గువిడిచి యున్నావు. నీ వెప్పుడు సాధుజంతువులను బలిగొనఁ దొడఁగితివో, నాఁడే నీదేవత్వము మంటఁగలిసి పోయినది. మూర్ఖజనులకు సర్వజీవసమత్వమును బోధింపవలసిననీవు అందు లకుఁ గేవలము వ్యతిరేకముగ జీవహింసను, స్వార్థమునకై సాధుజంతుహింసను బోధించి చేయించు నీస్థలమున నేనీ యనంతహరిభక్తులతో నెట్లు నిలువఁగలను? వైకుంఠనాథుఁ డగు శ్రీహరి సాత్త్వికమూర్తి. నే నాతని కింకరుఁడను. నీవో, కేవలము తామసివి, కిరాతసేవ్యవు. నేను నీస్థలమున దుర్వాసనచే సమీపింప రాని నీసన్నిధిని పాకముచేసి దానిని భగవంతున కెట్లు నివేదింపఁగలను? పొమ్ము, ఇఁక నొకక్షణము నీతో మాట్లాడితినేని, అనేకదినములనుండి నీవు సమార్జించుచున్న అనేకజంతుహింసారూపమగు ఘోరపాపము నన్నుఁ జుట్టుకొనును. తామసీ! ఇఁక నాయెదుట నిలువకు" మని తిరస్కరించి పలికెను.

ఇదివిని కాళిక మిగుల ఖిన్నురాలై, మఱల హరిభక్తునిపాదములమీఁదఁ బడి "ఇఁక మీయానతిప్రకారము ప్రవర్తించెదను. దయచేసి నాస్థలమును బవిత్రముచేయుం" డని ప్రార్థించెను. "ఇఁకఁ దామసగుణమును వహింపననియు, సాత్త్వికురాలనై జంతు బలులను మాని, మంచి ప్రవర్తనతో నుందుననియుఁ బ్రమాణము చేయుము. అట్లయినచో మే మిచ్చట నిలిచెదము" అని దాసుఁడు పలికెను. కాళికాదేవి యా ప్రకారమే చేసెను. అందుల కానందించి, హరివ్యాసుఁడు శిష్యులతోఁ గాళికాదేవి ప్రార్థన నంగీకరించెను.

మహానందముతోఁ గాళిక స్థలమంతయుఁ బరిశుభ్రముగఁ జేయించి సకల సామగ్రినిఁ దెప్పించియిచ్చెను. హరివ్యాసునిశిష్యు లావస్తువులం గైకొని వంటలు ప్రారంభించిరి. హరివ్యాసుఁడు భగవత్పూజ ప్రారంభించెను. త్వరఁ బూజ పూర్తి యగునప్పటి కచ్చట వంటయు సమాప్తమయ్యెను. భగవన్నివేదనము ముగిసిన పిదప నెల్లరును భుజించిరి. కాళిక వారికిఁ జాల గౌరవము చేసి, "మీరింకను గొన్నిదినము లిచ్చట వసింపవలయు" నని ప్రార్థించెను. ఆమె శుద్ధసాత్వికచిత్తయగుటఁ జూచి దాసుఁడు అందుల కంగీకరించి నిలిచిపోయెను.

నాఁటిరాత్రియే కాళికాదేవి యాదేశమును బరిపాలించు రాజునకు స్వప్నమున సాక్షాత్కరించెను. రాజు నమస్కరించినపిదప నామె "నేఁడుమొదలు నీదేశమున నెవ్వరును నానిమిత్తము మేఁకలు, కోళ్లు మున్నగు సాధుజంతువులను బలిగా సమర్పింపఁగూడదు. నేఁటినుండి నే నట్టి తామసాహారమును విసర్జించినాను. నాకు హరిహరులకుఁబోలె, నిఁక సాత్వికాహారమే చాలును. ఈవిషయము దేశమున నలుమూలల నున్నవారికి విస్పష్టముగఁ దెలియునట్లు చాటింపింపు" మని చెప్పిన తరువాత, రాజు దేవ్యాజ్ఞను దలంచుకొని యాశ్చర్యపడి, యామె సెలవుప్రకారము దేశమునం దంతటను జాటింపుచేయించెను.

కాని, రహితులు దానిని విశ్వసింపలేదు. ఇది యేమో గాదు. సాధారణముగ మంచిపను లన్నియుఁ గూడ నాచరణమునకు వచ్చుట చాల కష్టము. "రాజున కేదో దుశ్చింత కలిగినది. కావుననే యిట్టిముడలచేయుచున్నాఁడు" అని కొందఱు రహితులు తలంచిరి. "నిన్నటివఱకును దేవికి బలులు పనికివచ్చి, నేఁటినుండి పనికి రాకపోయెనా? రాజాజ్ఞలో నేదో మోసమున్న" దని కొందఱు తలంచిరి. "రాజున కేకారణముచేతనో యిప్పుడు చాలమేఁక లవసరమువచ్చినవి. అందుల్లకై యిట్టియెత్తువేయుచున్నాఁడు. నోరులేని దేవి యేమిచేయు ననుకొనినాఁడు కాఁబోలు! రాజుగాని, మాచెంత నీయాటలు సాగవు" అని కొందఱు పలికిరి. "రాజు అమ్మవారి కేదో కోరికనిమిత్తము మ్రొక్కి యుండవలయును. రాజునకుఁ జిత్తశుద్ధి లేక పోవుటవలన దేవి యాకోరికను దిరస్కరించి యుండవలెను. దేశము నేలు రాజునుగదా! నాకోరిక నేల తీర్పకపోవలయును? అని రాజునకు ఆచల్లనితల్లిపైఁ గోపము వచ్చియుండును; కాని దేవికి కిరీటాధిపతి యగు రాజును, ఆతని చేతిక్రింది ప్రజలునుగూడ సమానులే. నరుఁడు కోపపడినంతమాత్రమున భయపడిపోయి నచో నిఁకఁ గాళికాదేవి యెక్కువ యేమి?" అని మఱికొంద ఱనిరి. "మొత్తము మీఁద దేవివద్దనే లోపములు కాన్పించుచున్నవి. ఏమనః నరుల కోరికలు తఱుచుగఁ దీర్చుచున్నచో దేవి లోకువ యగును. ఇప్పు డట్టిదే సంభవించినది.

కావుననే రాజున కిట్టి బుద్ధి పుట్టినది" అని వేఱొకకొందఱూహించిరి. దేవికి నెలవేర్పఱుపఁబడు ఉత్సవములు మున్నగువాని నిమిత్తము స్వయముగ చాల శ్రద్ధవహించి పెత్తనదారులు "ఏది యెట్లుపోయినను సరియేగాని మేము బలులు మాత్రము మానము. పూర్వకాలమున దేవికి బలులు వేయుటకుఁ బ్రారంభించిన మాపూర్వులకు—ఈరాజున కున్నంత తెలివి లేకపోలేదు. మేము పూర్వాచారములను మాను కొను సంతతిని మతభ్రష్టులము కాము. రాజు నేఁడు దేవికి బలులు మానవలసిన దని యాజ్ఞాపించెను; సరియే. రేపు దారపుత్రులను విడిచిపెట్టి యడవులకుఁ బొమ్మనును. పోవలసినదేనా? ప్రజలను కన్నబిడ్డలవలెఁ జూచు దేవిని ప్రజలు కన్న తల్లినివలెఁ జూడకపోవుట కృతఘ్నత గాదా?" యని తెల్పిరి. తుదకు రహితులెవ్వరును బలులు మానుట కంగీకరింపలేదు. "మీరు దేవి యట్లు నియమించిన దని సెలవిచ్చుచున్నారు. మేము మామూలు ప్రకారము దేవినిఁ బూజించుటకుఁ బోయి తొలుత కుంభము పోసి, పిదప బలి యిచ్చుటకుఁ బ్రయత్నించెదము. అప్పుడు దేవి మీరుచెప్పినప్రకారము నేఁటినుండి బలులు వలదని నిషేధించునేని మేము మానివేసెద" మని రహితులు రాజునకుఁ జెప్పుకొనిరి.

రహితుల మూర్ఖతకు రాజునకు ఆశ్చర్యమును దుఃఖమును కోపమును గూడ వచ్చెను. అయినను ఏమియు చేయక "ఈమూర్ఖులను స్వయముగ దేవియే దండించుఁగాక!" అని తలంచి యూరకుండెను. పిదప నాతఁడు జరిగినసమాచారమును దేవికి నివేదించుటకై యాలయమునకుఁ బోయి భయభక్తులతో ననేకవిధములఁ బ్రార్థింపఁగా, దేవి "నాయుత్తరువును నీవు ప్రజలకుఁ దెలిపినందులకు సంతోషము; కాని మూర్ఖులగుటచే రహితులు నిన్ను నమ్మరైరి. అయినను చింతింపకుము. మూర్ఖులకు మెల్లఁగఁ జెప్పిన వినఁబడదు. రానిమ్ము. నన్ను బూజింపవచ్చినపుడు నేనే తగునట్లు చేసెదను. అది యట్లు పోనిమ్ము. కొందఱు హరిభక్తులు వచ్చి నాయాశ్రమమున విడిసియున్నారు. వారు కేవలము శ్రీహరిస్వరూపులు. అట్టివారు పురాకృత పుణ్యలేశము లేనినాఁ డెంతప్రయత్నించినను లభింపఁబోరు. నీ నాపుణ్యములకంటె నీదేశజనుల యదృష్టము మంచిది. కావుననే వారు నీపట్టణప్రాంతమున బస చేయుట తటస్థించెను. వారి నిచ్చట నిలుపుట నాకుఁ జాల ఆయాసమయ్యెను. నన్ను నీవు భక్తితో నారాధించితివి. అందులకు ఫలముగ నీకు నేను సకలైహికసుఖములను సమకూర్చితిని. నీ వనుభవింపని వైభవములు లేవు. అవి యన్నియు నీకు చుంబితములై పోయినవి. నీకిఁక నూత్నమైనది యొక్కటే ఆముష్మికజ్ఞానానుభవమే. దానివలన మనుజుఁడు పవిత్రుఁ డగును. ఐహికసౌఖ్యములన్నియు నీటిబుగ్గల వంటివేగాక, జీవునకు అధఃపతనకారణములు. ఆముష్మికజ్ఞాన మట్టిది గాదు. అది జీవునకు పునరావృత్తిరహిత మగుమోక్షమును ఘటించును. కావున నిఁక నీవు ఆ

వైష్ణవకింకరులను సేవించి, మోక్షసాధన మగుజ్ఞానమును బడసి, హరిధ్యానము చేసి తరింపుము" అని యుపదేశించెను. ఈతీరున ఐహికసుఖాశల నుండి మఱలించిన దేవికి రాజు శతసహస్ర ప్రణామముల నర్పించి, భాగవతు లున్న దిక్కునకుఁ బోయెను.

మహాదరముతో భాగవతులు రాజును దమ గురువుసన్నిధికిఁ గొనిపోయిరి. రాజు హరివ్యాసుని పాదములపైఁ వ్రాలి మ్రొక్కి, "గురూ! మీయాగమనము వలన నీదేశమునందలి సకలప్రాణులును పాపములను బాసినవి. మీరాకకు మా యెడలఁగల అవ్యాజవాత్సల్యమేగాని వేఱుకారణము లేదు. ఇంతవఱకును నేను కాళికాదేవినిఁ బూజించి, యామెవలన సకలైహికవాంఛలను బడసితిని. నేఁడు ఆచల్లని తల్లియే నన్ను మీపాదములసన్నిధికిఁ బంపినది. ఐహికసౌఖ్యము లన్నియు నావలనఁ దీర్చి పిప్పిచేయఁబడినవి. నాకు ఉత్తరవయస్సు ప్రారంభమైనది. ఇకనైన ఆముష్మికజ్ఞానసాధనమునఁ బ్రవృత్తుఁడఁ గానేని, కుంభీపాకనరకమునఁ గూలఁబడి పోదును. నాకు అధఃపతనము సంభవింపకుండ రక్షింపవలసినదని మిమ్ము ప్రార్థించు చున్నాను" అని వేడుకొనెను. హరివ్యాసునిహృదయ మీప్రార్థనమువలనఁ గరఁగెను. అతనికి రాజుపై ననుగ్రహము గలిగెను. తోడనే యాతఁడు వినీతవేషుఁడై యున్న రాజునకుఁ దత్త్వము నుపదేశించి, ఐహికవ్యామోహమును బోఁగొట్టెను. రాజు ఎంతో కృతజ్ఞుఁడై గురుపాదములను బూజించెను. నాఁడు రక్షితు లందఱును గాళికాదేవినిఁ బూజించుటకు వచ్చి యథాపూర్వముగఁ బూజ ప్రారంభించిరి. అందులకు దేవి చాల ఆగ్రహపడి నయమునను, భయమునను వారికి సాత్త్వికపూజావిధానము నుపదేశించెను. అదిమొదలుగ వారందఱును దేవ్యాజ్ఞను శిరసావహించిరి.

రాజు శిష్యగణముతోఁగూడి హరివ్యాసుని మహావైభవముతోఁ దననగరమునకుఁ గొనిపోయి, సకలోపచారములను గావించి యొకగొప్పమఠముఁ గట్టించి యిచ్చెను. పౌరులు గూడ ఆభగవద్భక్తుని అనేకవిధములఁ బూజించి తరించిరి. ఇట్లొకసంవత్సరము గడచినతరువాత హరివ్యాసుఁడు రాజును సకలపౌరులను దీవించి, జగన్నాథమునకు బయలుదేఱెను. ఆపట్టణమునందలి జనులు బాలురు మొదలుకొని వృద్ధులవఱకును స్త్రీపురుషభేదములేక, కన్నీటిబిందువులతో గురుదేవుని విడిచిరి. పిదప హరివ్యాసుఁడు బృందావనము మున్నగు సకలదివ్యక్షేత్రములను దర్శించి, మధురాపురమున వసించి, శ్రీకృష్ణభగవానుని దర్శనభాగ్యమును బడసి, మహామహిమాభిరాముఁడై దేహాంతమున నీశ్వరసాయుజ్యమును బడసెను.

**ఉ. "ఏవరమేశు పాదయుగ మెప్పుడు గోరి భజించి నేర్పురల్**
**లోపలిబుద్ధితో నుభయలోకములందుల జిడ్డుఁబాసి యే**
**తాపములేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే**
**నా వరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్."**

(భాగ. స్కం. 2. ప. 61.)

# 20. మనోమోహనసురదాసుఁడు

అగ్బరుచక్రవర్తికి రాజధానియగుఢిల్లీనగరమున మనోమోహనసురదాసుఁడు అను నొక పరమభాగవతశిఖామణి వసించియుండెను. ఆతఁడు దారాపుత్రులను బోషించుటకు మాత్రమే సంసారమున నిలిచి, తన్నిర్వాహణార్థము ద్రవ్యకాంక్షియై అగ్బరుచక్రవర్తికి సేవకుఁడై యుండెను. ఈతఁడు చక్రవర్తి పనులకంటె గొప్పపని నిర్వర్తింపవలసినవాఁడగుటచే రాజసభలో నియమితకృత్యములను నిర్దోషముగ నెఱవేర్చికొని, తక్కిన యుద్యోగులవలెఁ బ్రజలను వేధించి లంచములను గొనుటకై కాలము వెచ్చింపక, యింటికిఁ బోయి భగవద్ధ్యాననిష్ఠుఁడగుచుండెను. ఈతని భార్యయుఁ గూడ సుగుణవతిఁ గావున సర్వవిధములను బతి ననుసరించుచుండెను.

కాల మిట్లు గడచిపోవుచుండఁగాఁ, జక్రవర్తి యీతనిని మధురాగోకుల బృందావనక్షేత్రములపై నధికారిగా నియమించి పంపివేసెను. అయాచితముగ లభించిన యీనూతనోద్యోగమువలన నీతనికి మనోరథము నిండిపోయెను. సాధువులకు సాధుసంగము పరమాహ్లాదకరము. అది సుస్థిరముగ లభించిన మనోమోహనసురదాసుని యానందమును వర్ణింప నెవరితరము? మధురాగోకులబృందావనములకు అనుదినము వచ్చి పోవుచుండు అసంఖ్యేయభక్తజనులను దర్శించుటవలన నీతనిభక్తి మఱింత పెరిగిపోయెను. అగుట నీతఁడు తన నెలజీతములో సంసారవ్యయమునకుఁ బోఁగా, మిగిలినది సాధువులకు సదావృత్తుల నిచ్చుటలో వెచ్చింపసాగెను.

క్షణక్షణము నీతనికి సంసారము మీఁది భ్రాంతి తొలఁగిపోసాగెను. భక్తిపారవశ్యమువలన నీతఁడు పెండ్లాము బిడ్డలు ప్రపంచము మున్నగు సమస్తమును మఱచి, శ్రీకృష్ణభగవానునిగుణములను గీర్తించుచు నృత్యము చేయఁజొచ్చెను. "సంసార మసారము యాతనాపూరితము. ఇందు సుఖములేదు. అంతయు నిబిడ దుఃఖాంధకారము; కాని దీని నందఱును దెలిసికొనఁజాలకున్నారు. ఎంత మౌఢ్యము! భార్య, బిడ్డలు మున్నగువారు మోక్షమును గాంచు ప్రాణినిఁ బట్టి క్రిందికి ఈడ్చి పారవేయు సాధనములు. వారికొఱకు అహోరాత్రములు శ్రమపడుట యెంత యవివేకము! నిర్మాత - పోషకుఁడు - రక్షకుఁడు - శిక్షకుఁడు - మోక్షప్రదాత అగుపరమేశ్వరుని మఱచి, యీజనులు తమ్ము నాశనము చేయువారికొఱ కెన్నిపాట్లు

పడుచున్నారు" అని యాతనిని దలంచుకొనుచు, నాతఁడప్పుడప్పుడు విచారించు చుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచునప్పటికి శ్రీకృష్ణదేవాలయమార్గమువలెనే, నీతని గృహమార్గముఁ గూడ నిసుకవేసిన రాలకుండునట్లు సాధుజనపరంపరచే నిండిపోసాగెను. ఒకనాఁడు ఈతని క్రిందియధికారులు దేశములో రావలసిన పన్నులన్నియు వసూలుచేసి, యెనుబదిలక్షలవరాలు ఈతనియింటికిఁ బంపిరి. అప్పుడు ఈతనియిల్లు అంతయు సాధువులతోడను, భిక్షుకులతోడను నిండియుండెను. తోడనే యాతఁడు ఆయెనుబదిలక్షలవరాలను సాధువులకును, భిక్షువులకును, శ్రీకృష్ణభగవానుని యుత్సవాదులకును వ్యయము చేసెను.

క్షణములో నీవార్త పట్టణమునందంతటను వ్యాపించెను. ఉత్తరక్షణమున నాతని మంగళమును గోరు చుట్టములు, స్నేహితులు మున్నగువారెల్లరును వచ్చి "అయ్యో! ఎంత యనాలోచిత కృత్యమును జేసితివి! ఎనుబదిలక్షల రూపాయలన నేమనుకొంటివి? ఈవిషయమున నీవు రాజున కేమి సమాధానము చెప్పఁగలవు? పుణ్యముకొఱకు పరులసొమ్ము వ్యయము చేయువా రెందైనఁ గలరా? ఆముష్కర తురుష్కుఁడు సొమ్ము తెమ్మని నిర్బంధపఱిచినను, లేక కారాగారమున సకలయమ యాతనల ననుభవింపఁ జేసినను నీ వెట్లు తాళఁగలవు?" అని మందలింపసాగిరి; కాని దాసుఁ డేమియు సంచలింపలేదు. "అయ్యో! ఏమి మీ కీవెఱ్ఱి? భగవంతుని యెదుటఁ జక్రవర్తి యన నెవఁడు? సర్వేశ్వరుని విలాసవస్తువు లగు నీపాంచభౌతిక దేహమునందును, ధనమునందును మమత్వము గలిగియుండుట యెంత అన్యాయము. ఎంతపాపము! భగవంతుని వస్తువులు భగవంతుని కర్పించుటయే మనపని. సర్వేశ్వరుఁడు ఈచరాచరప్రపంచమునం దంతటను నిండియుండినను, సాధుసజ్జనుల యందు నిత్యసాన్నిధ్యము చేసియుండును. నేఁడు భగవంతుఁడు నాయింటికి అనేక సాధుజనులరూపముతోఁ జనుదెంచెను. ఆహా! అట్టిసమయమున నిఁక నాది, నీది, వానిది అను భేదబుద్ధి యెట్లు నిలువఁగలదు? సర్వసాక్షియగు నారాయణుని యెదుట నీవస్తువు నాది, లేక మఱియొకనిది అని దాచుట కెట్లు సాధ్యపడును? అయినను శ్రీహరి దివ్యతేజస్సు మీ కెప్పుడు ననుభూతము కాలేదు; కావున మీ కీయజ్ఞానాంధ్యము తొలఁగిపోలేదు. అద్దిరా! సర్వమునకును యజమానుఁడగు శ్రీపతి యెదుట నాది, నీది యనువాదమా?" అని దాసుఁడు వారికందఱికును బ్రత్యుత్తరమిచ్చెను. వారందఱును "భక్తిపారవశ్యమువలన నీతని కిప్పు డేమియుఁ దెలియుట లేదు. శృంఖలాహస్తులై రాజభటులు సాక్షాత్కరించినపుడుగాని యీతనికి బాహ్యస్మృతి కలుగదు. అప్పుడుగాని యీతనికిఁ దాను చేసిన పని యిట్టిదని తెలి

యము. సంగతి సంస్కృతములు తెలిసియున్నంతవఱకును జెప్పితిమి; కాని అంతకంటె మనమేమి చేయఁగలము?" అని వారెల్లరును వెడలిపోయిరి.

మనోమోహనసురదాసుఁడు ఎనుబదిలక్షలరాజస్వము ఖర్చుపెట్టె ననువార్త కర్ణాకర్ణిగ ఢిల్లీరాజసభలో ఘంటానినాదమువలె మ్రోఁగి, చక్రవర్తిని మేల్కొల్పెను. అదివిని యెల్లరును నిర్విణ్ణులైరి. తోడనే చక్రవర్తి "ఎనుబదిలక్షల వరహాలును ఈభటుల కిచ్చి పంపుము" అని జాబువ్రాసి నౌకరుల నంపెను. యుక్త సమయమున వారు దాసుని సమీపించి, తమ యాగమనకారణ మెఱింగించి చీటీనిఁ జూపించిరి; కాని దాసునిముఖమున వైలక్షణ్య మేమియుఁ గాన్పించుటకు మాఱుగ మందహాస మంకిత మయ్యెను. అంత నాతఁడు "హా! మానవు లెంత మూర్ఖులు! భగవద్ద్రవ్యము తమది యని భావించి యకృత్యములను గావించు వీరికిఁ బరలోకమున గతులు గలవా?" యని యూహించుకొని, "రాజద్రవ్యము ఎనుబది లక్షల వరహాలును నాచెంత యథారూపముతో లేదు. ఆద్రవ్యముతో నేను చక్రవర్తికి అని యుద్దేశించి అమూల్య రత్నములను గొనియున్నాఁడను" అని రాళ్లతో నింపించి, రెండు పెట్టెలను గొనితెచ్చి రాజభటుల యెదుట నుంచెను. వారు తాము విన్నదానికిని, ఇక్కడ వినుచుఁ గనుచున్నదానికిని వ్యత్యయ ముండుటఁ గాంచి, "యేదియేమైనను ఈపెట్టెలను జక్రవర్తియెదుటికిఁ గొనిపోయెదము గాక!" యని తలంచి వల్లె యనిరి. దాసుఁడు నేను రాజస్వమును దుర్విని యోగము చేయలేదు. ఆద్రవ్యమునకు యథార్థమైన స్వామి యెతఁడో, యాతని యానందము నిమిత్తము ఆతని యాజ్ఞవలననే వెచ్చించితిని. దీనివలన ద్రవ్యము నంతను బహుముఖములనుండి యేకముఖముఁ జేయుటకాధారమైనయాజ్ఞ గలవాఁడ వగుటచే నీవును, దద్వినియోగకార్యమునఁ బాల్గొనుటవలన నేనును దరించితిమి. ఇందులకయి సంతోషించెదవేని, పరలోకమున నీవు అఖండానందసాగరమున నీదు లాడఁగలవు" అని యొక చీటి వ్రాసి చక్రవర్తికి యిచ్చునట్లు కట్టడిచేసి, రాజభటుల కిచ్చెను. పెట్టెలను, జీటినిఁ గొని సర్కారు నౌకరులు వెడలిపోయినపిదప నాఁటి నిశీథమున దాసుఁ డెవ్వరికినిఁ దెలియకుండ భగవద్ధ్యానము చేయుచు దుర్గమారణ్యములకుఁ బోయెను.

చక్రవర్తి మనోమోహనసురదాసుఁ డంపిన చీటికిని, బెట్టెలకును ఏమియు సంబంధము లేకపోవుటఁ జూచి తొలుత వింతపడెను. పిదప పెట్టె విప్పించి చూడఁగా, వానియందు నిక్కముగ అమూల్యరత్నములే యుండెను. రాజసభలోనివా రెల్లరు నది చూచి యబ్బురపడి, "ఇది శ్రీకృష్ణభగవానుని పనిగాని, వేఱు గాదు. మనము సామాన్యుఁ డని యనుకొనుచున్న మనోమోహనసురదాసుఁడు

శ్రీకృష్ణపరమాత్మకుఁ గేవలము అంతరంగిక భక్తశిఖామణి” అని తలంచిరి. “మన మాతనివిషయమున నపచారము చేసితిమి. ఇది భగవంతునకుఁ గోపకారణము కాకమానదు” అని తలంచి, “మనోమోహనసుకదాసుఁ డెచ్చటనున్నను వెదకి సాదరముగఁ దోడితెండు” అని చక్రవర్తి పరిచారులకు ఆజ్ఞాపించెను.

రాజపురుషులు పోవునప్పటికి దాసుఁడు మహారణ్యమధ్యమున నొకవృక్షము క్రింద భక్తిపరవశుఁడై, నృత్యము చేయుచు శ్రీహరిగుణకీర్తనము చేయుచుండెను. అది చూచి రాజపురుషులును దన్మయులై నిలిచిపోయిరి. కొంతసేపటికి దాసుఁడు హరిభజన చాలించెను. ఆతనిచేతి కీలుబొమ్మలై పోయిన రాజపురుషులకు బాహ్యజ్ఞానముఁ గలిగెను. తోడనే వారు దాసునిపాదములమీఁద వ్రాలి తనఃపహా ప్రణామములు గావించి; రాజసభలో జరిగిన సమాచారము లన్నియుఁ జెప్పి తమతో రావలసినదని ప్రార్థించిరి. దాసుఁడు వారి కోరికను దొలుతఁ దిరస్కరించెను. కాని తుదకుఁ దప్పదయ్యెను. మహానందముతోఁ గొనిపోయి రాజపురుషు లాతనిని యుక్తసమయమున రాజసభలోఁ బ్రవేశపెట్టిరి.

అల్లంత దూరమునందే దాసునిఁ జూచి అగ్బరుచక్రవర్తి గద్దియ డిగ్గి, యెదురేఁగి సాష్టాంగదండప్రణామము లాచరించి, కౌఁగిలించుకొని, తనగద్దియ మీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని, యనేకవిధములఁ బ్రస్తుతిసేయసాగెను. సభయందున్న యెల్లరను గూడ మహానందముతో స్తోత్రములు ప్రారంభించిరి. దాసుఁడు ఆస్తోత్రములకు స్వస్తి చెప్పించి, హరిభజనము నుపదేశించి శ్రీకృష్ణనామమాహాత్మ్యమును విప్పిచెప్పి, యెల్లర నానందపఱచెను. పిదపఁ జక్రవర్తి దాసుని బ్రక్కందన తాంబూలాదులతో సత్కరించి, “మహానుభావా! నీవు కేవలము సర్వేశ్వరుని అంతరంగికభక్తుఁడవు. నిన్నుఁ బూజించుట దేవదేవునిఁ బూజించుటయే యగును. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని క్షుద్రులమగు మే మేమి పూజింపఁగలము? నీవే మాయెడల శ్రీకృష్ణపరమాత్మకు అనుగ్రహము గలిగింపవలెను. తొల్లిటివలెనే నీవు మధురాగోకులబృందావనములకు అధీశ్వరుఁడవై, యాదాయ మంతయు సాధుసత్కారములకై వినియోగింపుము. నీవు రెండుపెట్టెలలో నింపి నానిమిత్తము పంపిన రాళ్లు ఈశ్వరానుగ్రహమువలన అమూల్యరత్నములైనవి. అవిగూడ నీవు గొనిపోయి సాధువినియోగము నిమిత్తము వెచ్చింపుము” అని ప్రార్థించి, యొప్పించెను.

దాసుఁడు ఎల్లరను దీవించి, మధురాగోకుల బృందావనక్షేత్రాధిపత్యమును రత్నపేటికాద్వయమును స్వీకరించి, మధురకు బయలుదేఱిపోయెను. ఈతనిరాక విని అచ్చటి సాధువులును, భక్తులును మిగుల నానందించిరి. రాజస్వము హరించినందు

లకు విపత్తుల పాలయ్యెదవని భయపెట్టిన స్నేహితులు చుట్టములు మున్నగు వారు పరమాశ్చర్యచకితులై, పాదములమీఁద వ్రాలి మాసాహసమును మన్నింపు మని ప్రార్థించి, అభయమును బడసిరి. దాసుని పునరాగమనమువలన మధురాక్షేత్ర మునకు నూతనశోభఁ గలిగెను. యథాపూర్వముగ దాసుఁడు సాధువులతోఁ గూడి, హరిభజనముచేయుచు అనేకకీర్తనలను రచించెను.

ఒకనాఁ డొకసాధువు దాసుని గుణములను బరీక్షింపఁగోరి, దేవాలయము నుండి యింటికిఁ బోవుచున్నవాని కెదురై "నేను ఆలయములోనికిఁ బోయి స్వామిని సేవించుకొని వచ్చెదను. ఇచ్చట జనసమ్మర్ద మధికముగా నున్నది. నేను తిరిగివచ్చునంతదనుక నీవు నాపాదరక్షలను జాగ్రత్తగఁ గాపాడుచుండు" మని నియ మించి, లోనికిఁ బోయెను. దాసుఁడు నమస్కారపూర్వకముగా సాధువునానతి శిరసా వహించి, పాదరక్షలను చేబూని ద్వారముచెంత నిలిచియుండెను. కొంతసేప టికి సాధువు వెలుపలికి వచ్చి, దాసుఁడు తాను నియమించినట్లే యుండుటఁ గాంచి చాల వింతపడి యాతని నిగర్వత కానందించి, "నాయపరాధమును మన్నింపు" మని కాళ్లపైఁబడి ప్రార్థించెను. దాసుఁడును మఱల నాతనిపాదములంటి మ్రొక్కి, సెలవు బడసి వెడలిపోయెను.

మనోహరదాసుఁడును బ్రతికియున్నంతకాలము నిట్లే హరిభజన మును సాధుసేవయుఁ గావించి, అవసానమున నీశ్వరసాయుజ్యమును బడసెను.

తరలము:—

"హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలు చుండెడువెట్టి ముక్తికిఁ బోవనేర్చునె? వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మాహరినామసం
స్మరణ మొక్కముహూర్తమాత్రము చాలు ముక్తిద మోనృపా."

(భాగ. స్కం. 2. ప. 8.)

## 21. త్రిలోచనదాసుఁడు

త్రిలోచనదాసుఁడు చక్కని తెలివితేటలుగల యొకకంసాలి. రత్నస్థగితములగు వెండిబంగారునగలు చేయుటలో నాతనిని మించినవా రెందును లేరు. కులవృత్తిలో నాతఁ డంతటి చతురుఁడై యుండియు, గర్వమనుదాని నెఱుఁగనే యెఱుఁగఁడు. విశేషించి యాతఁడు ఐహికసుఖము లాభాసములని తలంచి, హరిభజన చేయుచు నిత్యానందము ననుభవించు భక్తశిఖామణి. ఆతఁడు కులవృత్తివలనఁ గలుగులాభము

నంతను హరిదాసుల నిమిత్తమే వెచ్చించుచుండెను. ఈకారణమువలనను, నగల నతిమనోహరముగఁ జేయుటవలనను, తెలిసినవా రెల్లరు నాతనిచేతనే తమవస్తువులను జేయించుకొనుచుండిరి. దీని కంతకును భగవదనుగ్రహమే కారణ మని తెలిసికొని, దాసుఁడు ధనము వచ్చినకొలఁదిని హరిదాసుల నిమిత్తము వెచ్చింప సాగెను.

త్రిలోచనదాసుఁడు నివసించియున్న పట్టణము నేలుప్రభువు ఒకతురక నవాబు. నవాబు తనకుమార్తె కొకనగ చేయింపఁదలంచి, త్రిలోచనదాసుని రప్పించుకొని తగిన బంగారమును, రత్నములను ఇచ్చి నాల్గవనాఁటి ప్రొద్దుట వస్తువు గొనివచ్చునట్లు ఆజ్ఞాపించెను. వల్లె యని యంగీకరించి, దాసుఁడు ఇంటికి బోవునప్పటికే గొందఱు సాధువులు వచ్చి క్షుధార్తులై ఆతనికొఱకు వేచియుండిరి. వారు వీధియరుఁగుమీఁదనే కూర్చుండియుండుటవలన, దాసునిభార్యకు ఈసంగతి తెలియదయ్యెను. అంత దాసుఁడు ఆఁకట నకనకలాడుచుఁ దననిమిత్తము వారెదురు చూచుచుఁ గూర్చున్నందులకుఁ జాల వగచి తత్క్షణమే వారికి మృష్టాన్నముఁ బెట్టించి సంతోషపఱచెను. ఇట్లే దాసునివలన గౌరవింపఁబడుచు వారు రెండుదినములుండిపోయిరి. వారిని సేవించుటయందు నిమగ్నుఁడై యుండుటవలన, దాసుఁడు ప్రపంచమును మఱచిపోయెను. మూఁడవనాఁడు వారిని సాగనంపి దాసుఁడు తాను చేయవలసిన వస్తువుసంగతి జ్ఞప్తికి దెచ్చుకొని "అయ్యో! ఇఁక నీవస్తువు చేసి యీవలసినవాయిదాఒక్కదినము మాత్రమే యున్నది. మూఁడుదినములు పనిచేసినఁగాని యిది ముగియదు. ఏమి చేయవచ్చు" నని విచారించుచుండఁగా, రాజభటులు వచ్చి "నగ యెంతవఱకునైనదో చూచివచ్చుటకు నవాబుగారు పంపినారు" అని చెప్పిరి. దాసుఁడు పాపభీతిచే ననృతమాడఁజాలక యథార్థమే చెప్పి పంపివేసెను. అదివిని, నవాబు చాలఁ గోపపడి అన్ననాఁటికి వస్తువు తయారుచేసి తెచ్చి యీయకున్నచోఁ గఠినముగాఁ దండించెదనని దాసునకు వర్తమానము చేసెను.

రాజాజ్ఞను విని దాసుఁడు తొలుతఁ గొంచె మడలెను; కాని పిదప ధైర్యము తెచ్చుకొని, "అంతకును మధురానాథుఁడు శ్రీకృష్ణభగవానుఁడే గలఁడు" అని తలంచి, రహస్యముగ మధురానగరమునకుఁబోయి శ్రీకృష్ణుని సేవించుకొని, యేకాంతవాసమునకై గోకులబృందావనమునకుఁ బోయెను. అచ్చట దాసునకు అనేకభక్తులతో సమావేశముఁ గలిగెను. అగుట నాతఁడు మహానందముతో వారికిఁ గైంకర్యము చేయుచు, హరిభజనమునఁ గాలము గడుపఁ దొడఁగెను.

నవాబు ఇచ్చిన గడువు ముగిసెను. క్షణములోనో ఈక్షణములోనో తన కొక క్రొత్తవస్తువు వచ్చునని రాజపుత్త్రిక యువ్విళ్లూరుచుండెను. కంసాలి ఇంకను

రాఁడేమీ యని నవాబు రుసరుస లాడుచుండెను. ఇఁక క్షణమందున నవాబు ఆజ్ఞను జవదాఁటినందులకుఁ గంసాలికి ఘోరతరదండనము విధించును. ఇట్లుండఁగా, అంతరంగభక్తునకు రానున్న విపత్తును దొలఁగింపఁగోరి శ్రీకృష్ణుఁడే దాసుని రూపముఁగొని అవాఙ్మానసగోచరంబగు తన మహామహిమవలన నవాబు గోరిన వస్తువును క్షణములో సృజించి, రాజాస్థానమునకుఁ గొనిపోయెను. ఇంత జాలమేల చేసితివి? అని యాభరణసౌందర్యము నాకసి కోపమును దిగమ్రింగికొని మహానంద భరితుఁడై, "ఆభరణములు చేయుటలో నీయంత చతురుఁడు లేఁడని కంసాలి రూప మునున్న భగవంతుని మిగులఁ గొనియాడి, ఆ వస్తువునకు మామూలుగా నీయ వలసిన మజూరీయిచ్చివేసి, తనమహానందమునకు గుర్తుగా విశేషధనమును బహు మానముగ నిచ్చెను. ఆరూపముతోడనే సర్వేశ్వరుఁ డాధనమును దాసుని యిం టికిఁ గొనిపోయి దాసుని భార్యకిచ్చి, "ఈధనముతో సాధుసజ్జనులకుఁ బరిచర్య చేయుచుండుము" అని నియమించి, ఎందో పోయివచ్చెద నని చెప్పి మాయ మయ్యెను.

ఆజ్ఞాప్రకారము దాసునిభార్య ఆధనము నంతను భాగవతారాధనమునందే వెచ్చించుచుండెను. ఆఱుమాసములు గడచిపోయెను. ఉన్నట్లుండఁగా, నొక్క నాఁడు ఆఱువేల సాధువులు క్షుధార్తులై దాసునియింటికి వచ్చిరి. ఇదియంతయుఁ జూచి శ్రీహరి తోడనే త్రిలోచనదాసుని రూపముతో వచ్చి, వారి కందఱకును మృష్టాన్న మిడి సంతసింపఁజేసి, తానింత భుజించి ఒక పూఁటకు సరిపడు అన్నమును మూటగట్టుమని మఱల నెందో పోయివచ్చెద ననిదాసుని భార్యకుఁ జెప్పి, ఊరు దాఁటినపిదప మఱియొక భక్తుని రూపమును దాల్చి, గోకులబృందావనమునఁ దనసేవ యందు మైమఱచియున్న త్రిలోచనదాసునిచెంతకుఁ బోయెను.

దాసవేషి యగు భగవంతునిఁజూచి, దాసు "అయ్యా! భయంకరజంతుసంకుల మగు నీమహారణ్యమున కేల వచ్చితిరి?" అని యడిగెను. కుహనాదాసుఁడు అందు లకు ఏమియుఁ దెలియనివానివలె నటించుచు, "ఇప్పటివరకును నేను నడచుచున్నది మహారణ్యమధ్యమార్గ మని నాకుఁ దెలియలేదు. కారణమేమందురా ? ఈసమీప గ్రామమున నేర్పరియగు నొక కంసాలి కలఁడు. నవాబు తన పుత్రికకు ఒకరత్నాభర ణము చేసి తెమ్మని కంసాలికి రత్నములను బంగారము నిచ్చెను. ఆజ్ఞాప్రకారమే కంసాలి వస్తువును జేసి తీసికొనివెళ్లెను. అనితరసాధ్య మగు ఆపనికి నవాబు మిగుల సంతోషించి, కంసాలికి అనంతధనమును బహుమతిగా నిచ్చెను. ఆధనముతో సాధు జనాగ్రేసరుఁ డగు ఆకంసాలి ఆఱుమాసములనుండి భక్తులకు సత్కారములు చేయు చున్నాఁడు. నేఁడు ఎక్కడనుండియో ఆకస్మికముగ నాఱువేలదాసులు వచ్చిరి.

కంసాలి వారి కందఱకును మృష్టాన్న మొసంగెను. దాసులు మహాసంతసపరవశులై వెడలిపోయిరి. వారిలో నే నొకఁడను. అయ్యా! ఆకంసాలి యాదరము నేమి చెప్పుదును? ఆతఁడును ఆతనిభార్యయును నాకు రాత్రికి సరిపడుభోజనమును మూటఁగట్టుకొనునంతవఱకును నిర్బంధపఱచిరి. అయ్యో! నీముఖము చూడ నీవు క్షుధార్తుఁడవై యున్నట్లు తోఁచుచున్నది. భగవంతునికి నివేదింపఁబడిన యీ యన్నమును భుజింపుము" అని కుహానాదాసుఁడు చెప్పెను. అంతయు విని దాసుఁడు సంపులకనబ్బురపడి, భాగవతుఁడొసఁగు భగవదుచ్ఛిష్టమును తిరస్కరింపఁగూడదని వందనపూర్వకముగ దానిని గ్రహించి భుజించి, "అయ్యా! నన్ను ఆకంసాలియింటికిఁ దీసికొనిపోయెదరా?" యని అడిగెను. కుహానాదాసుఁడు వల్లె యనెను. ఇరువురును బ్రయాణమైపోయిరి.

కుహానాదాసుఁడు వీథితిన్నెపైఁ గూరుచుండెను. త్రిలోచనదాసు లోపలకుఁ బోయి భార్యను జూచి "నేఁడు జరిగిన విశేషములేమి" యని యడిగెను. ఆమె 'పలవరించుచుంటిరా' యని వింతపడుచు సర్వము నెఱింగించెను. దాసుఁడు వీథిలోనికివచ్చి చూడఁగా, కుహానాదాసుఁడు కాన్పింపఁడయ్యెను. దాసునకు ఇది యంతయు భగవన్మాయగను, తన్నరణ్యమునుండి కొనివచ్చిన దాసుఁడే భగవంతుఁడుగను తోఁచెను. తోడనే యాతఁడు భగవంతున కనేక నమస్కారములు సమర్పించి, ఇల్లే "భాగవతారాధనము చేయుచుండుము" అని భార్యను నియమించి మఱల నడవికిఁ బోయి భగవద్భజనమునఁ బ్రవృత్తుఁడయ్యెను.

నవాబుకుమారికకు రత్నాభరణము భారము దినదినము పెరుఁగుచుండుటవలన ధరింప నైతిఁగాదయ్యెను. అంత నామె సంగతి యంతయుఁ దండ్రికిఁ దెలిపి, "ఈనగను నేను ధరింపకుండ నుండఁజాలను; కాని భారము పెరిఁగిపోవుచుండుటవలన శక్యముఁ గానకున్నది. దీనిబరువు తగ్గునట్లుచేయింపుము" అని విన్నవించెను. నవాబు త్రిలోచనదాసునిమిత్తము నౌకరుల నంపియు వ్యర్థమనోరథుఁడై, మఱియొకకంసాలినిఁ బిలిపించెను. క్రొత్తకంసాలి ఆయాభరణముయొక్క పనివానితనమున కాశ్చర్యపడుచుఁ, త్రాసులోఁ బెట్టి తూఁచెను; కాని యెన్నిరాళ్లువేసినను దానికయుఁ త్రాసును గూడ సరిపడవయ్యెను. నవాబు కాటాను ఇనుపగుండ్లను దెప్పించెను. అయినను బ్రయోజనము లేకపోయెను. కంసాలి వస్తువును మూఁడుముక్కలుచేసి తూఁచఁబోయెను. అప్పటికిని శక్యముఁగాదయ్యెను. అదిచూచి ఆక్రొత్తకంసాలి "అయ్యా! దీనిని దూఁచుటఁగాని, దీనిని మఱలఁ జేయుటఁగాని, నావలనఁ గానేరదు. దీనినిఁ దొలుత నెతఁడు చేసెనో, ఆతనికేకాని యిది సాధ్యపడదు" అని చెప్పి, వెడలిపోయెను.

"ఎట్లయినను ఆనగను మఱలc జేయింపకతీఱదు. ఆవస్తువును ధరించికొని యున్నంతకాలము శ్రీకృష్ణభగవానుఁడు నాకు సాక్షాత్కరించియుండి, మహానంద సాగరమునc దేలియాడించుచుండెను. నాయొడలినుండి యీవస్తువు నెప్పుడు తీసితినో, అప్పుడే స్వామి తిరోహితుఁ డయ్యెను. ఆమహానుభావుని దర్శనము లేక పోవుటచే నాకండ్లు కాయలు కాచినవి. ఈయాభరణమును ద్వరగc జేయించి యీయకున్న నేను ప్రాణముc బాసెదను" అని కొమార్త చెప్పఁగా విని, నవాబు ఆశ్చర్యచకితుఁడై మాటుపల్కఁజాలకపోయెను. తురకబిడ్డలో శ్రీకృష్ణుఁడు కాలముగడపుటా ? యని యెల్లరు నబ్బురపడసాగిరి. ఇదియంతయు భగవన్మాయగాని వేఱుగాదని తెలిసికొని, తనకుమారికకు భగవంతుఁడు కొంగుబంగారమైయుండుట కానందించి, నవాబు "త్రిలోచనదాసు ఎచ్చటనున్న వెదకి తెండు" అని నూర్గురు భటులకు సెలవిచ్చెను.

త్రిలోచనదాసుని నిమిత్తము ఆనూర్గురుభటులు ననేకనగరములు గ్రామములును దిరిగి యెందును గానక, తుద కరణ్యముc బ్రవేశించిరి. అచ్చటcగూడ వారి కోరిక యీడేరదయ్యెను. "ఇఁక మనము ఆకంసాలిని వెదకఁజాలము. ఇట్లే పోయిన మనకు నవాబు మరణదండనము విధింపక మానఁడు. కావున మన మీయరణ్యము నందే తిరుగుచు, నేక్రూరజంతువుల నోళ్లయందో పడి మడియుదము" అని వారందఱును గూడcబలికికొని, ముందునకుc బోయిరి. కొంతసేపటికి వారు బృందావనము చేరుకొనిరి. అక్కడకుc బోవునప్పటికి వారికి క్షుద్బాధ ప్రారంభమయ్యెను. పిపాస మెండయ్యెను. అట్టిసమయమునందేకదా ఐహికచింతానిమగ్నులగు మానవులకు భగవంతుఁడుజ్ఞప్తికివచ్చుట? వారందఱును భగవద్ధ్యానము ప్రారంభించిరి. వారి ప్రార్థనలు ఆమహారణ్యమునందే మఱియొకచోట హరిస్మరణమునం బ్రవృత్తుఁడై యున్నత్రిలోచనదాసునకు వినవచ్చెను. తోడనే యాతఁడు ధ్వనినిc బట్టి క్షుధార్తులగు నానూర్గురు రాజభటుల చెంతకును వచ్చి, వనఫలోదకంబులచే వారి క్షుత్పిపాసలు ఉడిపి, తనకుటీరమునకుc గొనిపోయి మీవృత్తాంత మేమని యడిగెను. వారందఱును భూమిపై సాగిలcబడి తమప్రాణదాతకు నమస్కారములు గావించి, యథార్థమంతయు వక్కాణించిరి. అదివిని యాతఁడు వారికి వైరాగ్యముc గలిగించి హరిభజనము నుపదేశించెను. సర్కారు నౌకరులును "మేమిఁక ఇండ్లకుc బోము గురుదేవుఁడవగు నీపాదము లాశ్రయించి యుండి తరించెదము" అని విన్నవించుకొనిరి. ఈతీరునం ద్రిలోచనదాసు కుటీరప్రాంతము భక్తులచే నిండిపోయెను. ఈభక్తుల భజనలచే నాప్రాంతములయందు శకుంతకూజితములుగూడ వినరావయ్యెను.

ఇట్లు ఆఱుమాసములు గడచిపోయెను. నవాబునకు కూఁతురుపోరు ఎక్కువయ్యెను. ఇఁకc జేయునది లేక, దాసుని వెదకుటకు ఆతఁడే స్వయముగ బయలు

దేఱెను. నాలుగైదు దినములప్రయాణము ముగిసినపిమ్మట నవాబు గోకులబృందా వనమున శిష్యగణపరివృతుఁడై, చుక్కలలోఁ జంద్రునివలె వెలుంగుచున్న త్రిలోచన దాసునిఁ జూచెను. వనమున కంతకును శోభఁ గూర్చుచున్న యాసాధువులమహాతేజ మును జూచినతోడనే నవాబుహృదయము విజ్ఞానమయ మయ్యెను. వెంటనే యాతఁడు త్రిలోచనదాసునకు సాష్టాంగనమస్కారములుగావించి, యనేకవిధములఁ గొనియాడి ముకుళితకరకమలుఁడై వినీతభావమున నిలువఁబడెను. దాసుఁడును నవాబును దీవించి "నీవు మ్లేచ్ఛుఁడవయ్యును, ఇట్టిభగవద్భక్తికిఁ బాత్రుఁడవగుట నీపూర్వకృతపుణ్యపరిపాకముగాని వేఱుగాదు. నీపుణ్యమువలననే నీకుమారికఁగూడ శ్రీకృష్ణభగవానునిసేవకు అర్హురాలైనది" అని యనేకవిధముల నానందపఱిచెను.

పిదప నవాబు వృత్తాంత మంతయుఁ దెలిపి, దాసుని స్వనగరమునకుఁ బయలు దేఱదీసెను. వీరందఱును మార్గమధ్యమునం దుండఁగనే స్వరేశ్వరుఁడు త్రిలోచన దాసు రూపమున నవాబు కూఁతురుచెంతకుఁబోయి ఆభరణశకలములం గొని, మూఁడువందల యఱువది యాభరణములుగాఁ జేసి దినమున కొక్కనగ చొప్పున ధరింపు మని చెప్పి వెడలిపోయెను. నవాబు త్రిలోచనదాసునితో కోటలోనికిఁ జేరు కొనునప్పటికి, ఆతనికూఁతురు నగలన్నియుఁ బట్టించుకొని తండ్రియెదుటకు వచ్చి "త్రిలోచనదాసు వచ్చి మున్నూటయఱువది నగలు చేసియిచ్చి దినమున కొకటి చొప్పున ధరించుకొను మని చెప్పి వెడలిపోయెను. నే నట్లే చేయుచున్నాను. ఈనగ లను నామేనఁ దాల్పఁ దొడఁగినది మొదలు యథాపూర్వముగ శ్రీకృష్ణదేవుఁడు నాకు సాక్షాత్కరించుచున్నాఁడు" అని చెప్పెను. అదివిని, నవాబు మఱింత రిచ్చపడి "త్రిలోచనుఁడు నావెంటనే యుండెనుగదా! ఇదియంతయు నేమి?" యని యాలో చన తోఁచక దాసుని రప్పించి సకలము నెఱింగించి, "మహాత్మా! నీవింత గొప్పవాఁడ వని యెఱుఁగఁ జాలనైతి" నని పాదములమీఁద వ్రాలి క్షమింప వేఁడుకొనెను. దాసుఁడు "ఇదియంతయు భగవల్లీలగాని వేఱుగాదు. ఆకృష్ణుఁడు మనలనిట్లు ఆడించు చున్నాఁడు" అని చెప్పెను. నవాబు దాసునకు మహోన్నతసత్కారములు గావించి యింటికిఁ బంపెను. దాసుఁడును మహానందముతోఁ బరమేశ్వరునిఁ గీర్తిం చుచు గృహమునకుఁ బోయి, ధనమంతయు భాగవతార్చనమునకై వినియోగింపు మని భార్యకు నియోగించి, భగవత్పూజ నెఱవేర్చి భుజించి, భగవన్నివేదితాన్న మును నవాబు అంతఃపురమునకుఁ బంపెను. నవాబు సకుటుంబపరివారుఁడై, మహా భక్తితో నాప్రసాదము నారగించెను. భగవత్కృపవలన రాజకుటుంబము భక్తి జ్ఞానవైరాగ్యములను గాంచెను.

నవాబు మహమ్మదీయుఁడై యుండియు, భారతీయులపాదములపై నిట్లు వ్రాలుచు, శ్రీకృష్ణుని మ్రొక్కుట కొందఱు మహమ్మదీయులకుఁ దగినదిగాదు. వారం

పలువురు ప్రభువు నెడల నసూయాపరవశులై, ద్రోహము తలంచియుండిరి. నవాబు ఇదియంతయుఁ దెలిసికొని, వారి అజ్ఞానమును బోఁగొట్టఁదలంచెను. వారందఱును ఒకనాఁడు శిష్యగణముతోఁ ద్రిలోచనదాసుఁడు నదిలో స్నానముచేయుచుండఁగా, నవమానముచేయఁదలఁచి మార్గమధ్యమునఁ గాచియుండిరి. ఇది తెలిసి నవాబు, శిష్యగణముతోఁ ద్రిలోచనదాసుఁడు ఇంటికి మఱలిపోవునపుడు మీఁదఁబడి కత్తులతో నఱకుచున్నట్లు నటింపుఁడు; అని సిపాయీలకు ఆజ్ఞాపించెను. సిపాయీలు అట్లే నటించిరి, మరణభీతిచే శిష్యులందఱు నటునిటు పాఱిపోవఁ జూచుచుండుటఁగాంచి, త్రిలోచనదాసుఁడు "వెఱవవలదు. ఇదియంతయు నీశ్వరలీల. శ్రీకృష్ణుఁడు మనకు నేఁడు ఈతీఱున సేవయొసంగుచున్నాఁడు" అని ప్రబోధించెను. శిష్యులు నిర్భయులైరి. సిపాయీలు విజృంభించిరి. కాని వారి కత్తులన్నియుఁ బూలమాలికలై పోయెను. ఇదియంతయుఁ జూచుచు డొంకలలో డాఁగియున్న మహమ్మదీయులు తెల్లవోయి, భాగవతులమహిమను గుర్తెఱిఁగి, వారి కాళ్లపైఁబడి శరణముఁ బ్రార్థించిరి. తాను చేసిన ప్రయత్నము సఫలమగుట విని నవాబు మిగుల నానందించెను.

మఱియొకనాఁడు దాసుఁడు శిష్యగణముతో నదీతీరమునుండి యింటికిఁ బోవుచుండఁగా, సమీపారణ్యమునుండి యొక బెబ్బులి వెలువడివచ్చి మీఁదఁ బడుటకు సిద్ధపడెను. అదిచూచి శిష్యులు చాల భయపడిరి. "ఏల భీతిల్లెదరు? పరమేశ్వరుఁడు నేఁడు వ్యాఘ్రావతారము దాల్చివచ్చినాఁడు. అయ్యో! అజ్ఞానము మిమ్ము హరిసేవనుండి మఱలించుచున్నది" అనియెను. శిష్యులు జంకు దీఱి, "శ్రీహరీ! మా యజ్ఞానమును బాపుము" అని చేతులెత్తి ప్రార్థించిరి. తోడనే యాశార్దూలము తోఁక యాడించుకొనుచుఁ ద్రిలోచనదాసునివద్దకు వచ్చి నిలిచెను. దాసుఁడు దాని యొడలు నిమిరి, ఇంటికిఁ గొనిపోయి భగవన్నివేదిత పదార్థమునిడెను. వ్యాఘ్రమును ఆనందముతో దానిని భక్షించి, శ్రీహరిపాదోదకమును ద్రావి, దాసునివలన నాజ్ఞను బడసి యిచ్చవచ్చినట్లు పోయెను.

ఈమహిమాప్రదర్శనము లన్నియు విని, నవాబు దాసునిఁ దనకోటకు రప్పించుకొని, సింహాసనమునఁ గూర్చుండఁజేసి "అజ్ఞానమువలన మాకు అకృత్యములే ఆచరణమునకు వచ్చుచుండును. మేము చూచెదముగాని మాకన్నులు సరిగ గ్రహింపఁజాలవు. ఐహికసుఖములలోఁ బరమానంద మున్నదనుకొందుము. రాజ్యాధికారము ఉన్నదని గర్వించి సంచరింతుము. గురువరా! ఇంత యెందులకు? గతజలసేతుబంధన మేమి లాభము? మేము చేసిన పాపములన్నియు నశించిపోవునట్లు అనుగ్రహింపుఁడు. ఈ సకలరాజ్యాధిపత్యమును స్వీకరించి, సకలధనమును భగవద్భాగవతులకై వినియోగింపుఁడు" అని ప్రార్థించెను.

"హృదయము నిర్మలమై భక్తిభాజనము కాదేని రాజ్యమును విడిచినను, సర్వసంగపరిత్యాగము గావించినను ప్రయోజనము లేదు. అది సిద్ధించెనేని రాజ్యమును సంసారమును విడువకయే మోక్షము నార్జింపవచ్చును. నీకు నిర్మలజ్ఞానము కలిగెనేని, రాజ్యాధికారసాహాయ్యమున నీవు దేశమునంతను బాగుచేయఁగలవు. మునులచే నుపదిష్టమగు నేకాదశీవ్రతము ననుష్ఠించి, అధికారసాహాయ్యమున దేశమునందలి సకలజనులను సద్వ్రితపరాయణులుగఁ జేసి, రుక్మాంగదుఁడు నరకలోకమును వ్యర్థము కావించెను; కావున నీవు నట్లే చేయుము" అని దాసుఁడు నవాబునకు బోధించెను.

దాసుని జీవితకాలములో భగవంతుఁ డనేకపర్యాయములు ప్రత్యక్షమై, ధైర్యముఁ గలిగించుచుండెను. త్రిలోచనదాసుఁడును, భార్యయు, ప్రభుసంపతులును, రాజపుత్రికయు, శిష్యగణమును బ్రతికియున్నంతకాలము హరిని సేవించి, అంతమున నీశ్వరసాయుజ్యమును బడసి సుఖించిరి.

క. 'విశ్వకరు విశ్వదూరుని, విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు, నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్."

(భాగ. స్కం. 8. ప. 88.)

---

# 22. జయదేవుఁడు

శ్రీజగన్నాథమునకు సమీపమునందలి తిందుబిల్వము అను నొకగ్రామమున ఒకబ్రాహ్మణునకు జయదేవుఁడు అనుకుమారుఁడు కలిగెను. ఆతనితలిదండ్రులు లేక లేక కలిగినకుమారుఁ డగుటచే మిగుల గారాబముతోఁ బెంచుకొనుచు, గర్భాష్టమ సంవత్సరమున బ్రాహ్మణవర్ణము ననుసరించి ఉపనయనమును మాత్రము నెఱవేర్చి, అలసిపోవునని భావించి విద్యాభ్యాసము చేయింపక, యిచ్చవచ్చినట్లు ఆటపాటలతోఁ గాలముఁగడపునట్లు విడిచిపెట్టిరి. జయదేవుఁడు తనకుఁ దల్లిదండ్రులు చదువు చెప్పింపకపోయినను, తోడిపిల్లలు చదువుకొనుట చూచి విద్యాభ్యాసమునం దాశ వహించి, ఆటపాటలలోఁ గడువఁగా మిగిలిన సమయములయందు సహచరుల వెనుకఁ గూర్చుండి, వారు పఠించువిద్యల నన్నింటిని వినఁదొడఁగెను. ఇట్లు ఆతఁడు రెండుదినములకో, మూఁడుదినములకో, తీఱికయైనపు డెపుడో స్వల్పకాలము మాత్రము వినినంతమాత్రమునఁ బదాతేండ్లప్రాయము వచ్చునప్పటికి సకలకలావిశారదుఁడయ్యెను.

ఉపదేశ మవసరములేకయే సకలవిద్యలను నేర్చి, ప్రతివాదిభయంకరుఁడై యున్న జయదేవునిఁ జూచి, పండితు లెల్లరును "ఈతఁడు కేవలము వ్యాసభట్టార

కుని యంశమున జన్మించిన పావనమూర్తి; కావుననే యిట్టి లోకోత్తరప్రభావ సంపన్నుఁ డయ్యె” నని కొనియాడసాగిరి. జయదేవుఁడు సకలవిద్యలసారము నెఱుంగుట రూపమునఁ బ్రపంచరహస్యమంతయు నెఱింగినవాఁడు గావున, హరిసేవయే పరమోత్కృష్టమనియు భవతారక మనియు గ్రహించి, హరిభజనపరుఁడై గీత గోవిందము అనునొక మహాగ్రంథమును రచించెను. ఆగ్రంథమునందలి కీర్తనలు శ్రీకృష్ణగుణచేష్టితములను జక్కఁగ వివరించుచు, భక్తిప్రవాహమునఁ గొనిపోయి ఆనందసాగరమునఁ దేల్చునవి యగుటఁ జూచి, భగవద్భక్తు లెల్లరును దాని నతి ప్రేమతో నాదరింపఁదొడఁగిరి. ఇదిచూచి జగన్నాథమునందే వసించుచున్న సాత్త్విక రాజు అనుభూపాలుఁడు తాను మఱియొక గీతగోవిందమును రచియించి, దానినే యెల్లరు నాదరించి పఠింపవలయునని నియమించెను; కాని భక్తులు ఈ యాజ్ఞను మన్నింపలేదు. “రాజా! జయదేవునకుఁ బోటిగా మఱియొక గీతగోవిందమును రచించుట వివేకముగాదు. నీవు నూఱుజన్మము లెత్తినను జయదేవుఁడవు కాఁజాలవు. కావున నీగ్రంథము జయదేవుని గ్రంథమువలె లోకులకు ఆహ్లాదకరము కాఁజాలదు. జయదేవునిగ్రంథమే మాకు శ్రవణపఠనములకు యోగ్యము. అదియే మాకుఁ బూజ్యము. భజనకంటె తత్పఠనమే మాకు మోక్షప్రదము. నీగ్రంథముసు మేము తాఁకము; కన్నెత్తి చూడము; నీసొమ్ము తిని నీకు దాస్యముచేయు నీనౌకరులు మాత్రమే నయముననో, భయముననో దానినిఁ బఠింతురు” అని వారు రాజును తిరస్కరించిరి.

ఈమాటలు విని రాజు మిగుల దుఃఖించెను. రాజు దండింపఁగలఁడు గాని, భక్తిని గలిగింపఁజాలఁడు గదా! తుదకు ఆతఁడు “భక్తులను నియమించుటవలనఁ బ్రయోజనములేదు. వారితో స్నేహము మంచిది” అని తలంచి “మహానుభావులారా! మీరేల నిష్కారణము నిరాకరించి పలికెదరు? జయదేవుని గ్రంథమును, నా గ్రంథమును భగవత్సన్నిధి నుంతము. ఎవరిగ్రంథము భగవదంగీకృత మగునో తెలిసికొందము”.అనియెను. భక్తులకు జయదేవుని గ్రంథమునెడల నెంతమాత్రము నపాయశంక కలుగలేదు. అగుటచే వారెల్లరును అట్లు చేయుటకు అంగీకరించిరి. రాజును భక్తులును గూడి సాయంత్రము శ్రీజగన్నాథుని దర్శించి, రెండుగ్రంథములను సముఖముననుంచి తలుపులు బిగించి ముద్రవేసి స్వస్థలములకుఁ బోయిరి. మఱునాఁడు ప్రాతఃకాలమున నందఱును బోయి చూడఁగా జయదేవునిగ్రంథము భగవత్పాదములపై నుండెను. రాజుగ్రంథము దూరమునఁ బడియుండెను. అది చూచి భక్తులు అందఱును “రాజా! ఇంక నేమైనఁ బరీక్షలుచేయవలసియున్నవా? యని యెత్తిపొడిచిరి. రాజు లజ్జచే శిరమువంచుకొని, దుఃఖోద్రేకము శమించినపిదప శ్రీజగ

న్నాథుని దిక్కు మొగంబై కరకమలములు ముకుళించి "ప్రభూ! నీవు జగత్తున కును అంతకును దండ్రివి. మానవులకుఁ బోలె, నీకుఁ గూడ నిట్లు పక్షపాతము లుండుట చెల్లునా? నీవు సర్వవ్యాపి వందురు; సర్వసముఁడవందురు; కాని నేఁడది యబద్ధముగాఁ దోఁచుచున్నది. మహానుభావుఁడవగు నీ పీయవమానమును భరింపఁ గల వేమో కాని, నేనును సహింపఁజాలను. ఇదే నేను నాశిరమును నీపాదములపై సమర్పించుచున్నాను" అని సాహసము చేయఁబోయెను. తోడనే స్వామి ప్రత్య క్షమై రాజునకు జ్ఞానము నుపదేశించి, రాజు గ్రంథమునందలి ఇరువదినాలుగు శ్లోక ములను జయదేవుని గ్రంథమునఁ జేర్చి యంతర్హితుఁ డయ్యెను.

శ్రీజగన్నాథమున మహాధనికుఁ డగు నొక బ్రాహ్మణుఁడు వసించియుండెను. లోకమునందలి ధనికులవలె నాతఁడు మత్తుఁడు గాక, విజ్ఞానియై భగవత్పూజా ధురంధరుఁ డై యుండెను. అఖండసంపద యున్నను, సంతతి లేకపోవుటవలన నాతనికి ఆనందము లేకపోయెను. తుదకు జగన్నాథునియనుగ్రహమున నొకచక్కని కన్యక యుద్భవించెను. ఆమె చక్కనిచుక్క యగుటచేఁ దలిదండ్రు లామెకు పద్మావతి యని పేరుఁబెట్టి, శ్రీహరికటాక్షముచేఁ గలిగిన యామెకు శ్రీహరియే పతి కావలెనని తలంచియుండిరి. పద్మావతి తల్లిదండ్రుల మిక్కుటపుగారాబమునకుఁ బాత్రురాలై కొన్నిదినములకు యుక్తవయస్సురాలును, విద్యావతియు నయ్యెను. సౌందర్యవతియు, విద్యావతియు నగుపద్మావతిని అనేకబంధువులు తమకుమారు లకుఁ బెండ్లి చేసికొనఁ గోరిరి; కాని, యామె తలిదండ్రులు తమనిశ్చయము తెలిపిన వెంటనే నిరాశు లగుచుండిరి. ఇట్లు జరిగిపోవుచుండఁగా, నొకనాటి రాత్రి జగన్నాథుఁడు ఆమె తండ్రికి స్వప్నమున సాక్షాత్కరించి "సర్వలక్షణసంపన్న యగునీకొమార్తను నాకే యిచ్చి పెండ్లి చేయఁ దలంచితివి కదా! అందులకుఁ బరమా నందము. జయదేవుఁడు నాయంశమునఁ బుట్టినవాఁడు. నీకొమార్తె నాతనికిచ్చి పెండ్లిఁగావింతువేని నేను ఆనందింతు" నని చెప్పి, తిరోహితుఁడయ్యెను. ఆ బ్రాహ్మణుఁ డును ఈశ్వరుని యాజ్ఞాప్రకారము జయదేవునిఁ బ్రార్థించి, కొనివచ్చి, యాతనికి సాలంకృతకన్యాదానముచేసి తరించెను.

పిదప దేశాంతరమునుండి వర్తకము నిమిత్తము అచ్చటకువచ్చిన యొక వైశ్యుఁడు జయదేవుని ప్రభావమును వినివచ్చి, జ్ఞానోపదేశము చేయవలయునని యాశ్రయించెను. వర్తకుఁడు జగన్నాథమున నున్నదినము లన్నియు జయదేవుని శుశ్రూషించుటయందే కడపి, దేశమునకుఁ బోవునపుడు "మీరు నాయూరికివచ్చి నాయింటఁ గొన్నిదినములు వసియింపవలయును" అని వేఁడుకొనెను. జయదేవుఁ డును వల్లెయని యట్లే చేసెను. వైశ్యుఁడు జయదేవునిఁ దన మేడపై నివసింపఁ జేసి పూర్వాధికభక్తితో సేవించుచు, జ్ఞానోపదేశమును బడయుచుండెను. నిర్మల

భక్తుఁడగుటచే వైశ్యునకు బోధించుట గురుదేవునకుఁ బరమానందముగా నుండియుండెను.

ఇట్లు ఒకమాసము గడచెను. జయదేవునకుఁ జగన్నాథమునకుఁ బోవలయు నని కోర్కె పుట్టెను. వైశ్యుఁడు పరమభక్తాగ్రేసరుఁ డగుటచే జయదేవుఁడు జగన్నాథుని విడిచి నెలయైన నుండఁగలిగెను. వైశ్యుఁడు అనేకవిధములఁ బ్రార్థించెను; కాని గురుదేవుఁడు ఇఁక నిక్కడ క్షణమైన నుండఁజాల ననియెను. వైశ్యునకు గురుదేవుని భూరిదక్షిణలతోఁ బనిపింపవలయు నని గొప్ప కోరికఁగలదు; కాని భాగవతాగ్రేసరుఁ డగుజయదేవుఁ డందులకు అంగీకరింపఁడు కదా! ఇట్లని తలంచి, యావైశ్యుఁడు గురుదేవుఁడు జగన్నాథమేఁగుట కొకరథము నాయత్తముచేయించి, వెంటఁ బోవునట్లు ఇరువురు నౌకరులను నియమించి, వాండ్రతో "జయదేవుఁడు ఎఱుంగకుండ దీనినిఁ గొనిపోయి వారిభార్యకు ఈయవలసినది" అని రత్నముల తోడను, బంగారముతోడను నిండినయొక పెట్టెను రథమున రహస్యముగ జాగ్రత్తచేసి యిచ్చెను.

వైశ్యుఁడు గురుదేవుని విడువలేక, తుదకు కన్నీళ్లతోఁ గూడ విడిచెను. జయదేవుఁడు వైశ్యుని దీవించి బయలుదేఱెను. రథము పట్టణము విడిచి చాల దూరమున అరణ్యమునఁ బ్రవేశించెను. అరణ్యము చాల భయంకరమై యున్న చోటికిఁ బోయిన తరువాత, వెంటఁబోయిననౌకర్లలో నొకఁడు "నా పెండ్లాము తొమ్మిదిమాసముల నిండుచూలాలు. మాయజమానుని యాజ్ఞను దిరస్కరించిన నా బ్రతుకుఁ దెరువు విచ్ఛిన్నమగు నని జడిసి, మిమ్ముఁ బ్రార్థించిన సెలవీయక పోరని తలంచి వచ్చితిని. రాకరాక యిన్నాళ్లకు నాభార్యకు గర్భము వచ్చినది. ప్రసవసమయమున దగ్గఱ నుండకున్న నాప్రాణములు నిలువఁజాలవు. మహానుభావా! సెలవీయ వలయును" అని జయదేవునిఁ బ్రార్థించెను. వెంటనే రెండవవాఁడు గూడ చేతులు జోడించుకొని "చిత్తము ప్రభూ! సేవకుని బ్రతుకు కంటె ప్రపంచమున అధమాధమము మఱియొకటి యుండఁబోదు. ఇది నాశత్రువుల కైన వలదు గురుఁడా! నాశరీరము నాయజమానునకు అమ్ముకొంటిని. ప్రభూ! ఇఁక నేమిచేయుదును? నాభార్య నెలదినముల క్రిందటఁ బ్రసవించినది. నాల్గుదినముల క్రిందట బిడ్డచనిపోయెను. రెండుదినముల క్రిందట నాభార్యకు సూతికారోగ మంకురించినది. నేఁడు మాట పోయినది; స్మృతి పోయినది. నేను యజమానుని ఆజ్ఞను దలంచుకొని కన్నీరు విడుచుచు, మంచమువద్దనుండి వచ్చుట ఆదురదృష్టవంతురా లెఱుంగనే యెఱుఁగదు. స్వామీ! నాకుఁగూడ అనుజ్ఞదయచేయరా? నేను చాల బీదవాఁడను. చాల వయస్సు ముదురునప్పటికిఁ గాని నాకుఁ బెండ్లి కానేలేదు. నాభార్య ఇప్పుడు నన్ను విడిచిపోనున్నది" అని యేడువసాగెను. వాండ్రదుఃఖ

మును జూడఁజాలక జయదేవుఁడు "మీకు మంగళమగుఁగాక!" అని దీవించి, యిరువురకును సెలవిచ్చి పంపివేసి, రథమును దానే తోలుకొని పోసాగెను.

కొంతదూరము పోవునప్పటికి ఆనాకరులే దుడ్డుకఱ్ఱలతో నెదురువచ్చి రథము నడ్డగించి, అంతలి సర్వస్వమును అపహరించి, ముందుపోనిచ్చిన జయదేవుఁడీవృత్తాంతమును బయలుపఱుచునని భావించి, ఆతనికాలుచేతులు ఖండించి యొక పాడునూతిలోఁ బాఱవేసి తమ దారినిఁ బోయిరి. ఇట్లు జరిగెనని జయదేవుఁ డేమియు వగవక, భగవద్భజనమునఁ బ్రవృత్తుఁడు అయ్యెను. రాత్రి అయ్యెను. అయినను జయదేవుఁడు నిరాధారుఁడై, నిరాధారుని నమ్మి అందే యుండెను. నాఁడు వింధ్యదేశాధీశ్వరుఁ డాయరణ్యమునకు వేటకువచ్చి, జయదేవున కీవిపత్తు ప్రాప్తించినచోటి సమీపముసందే విడిసెను. రాత్రి భోజనానంతరము రాజు గుడారము నకుఁ బైటఁ గూర్చుండి చల్లగాలి సేవించుచుండఁగా, నెదుటనున్న పాడునూతినుండి గంభీరమైన తేజస్సు ఆతనికిఁ గాన్పించెను. అందులకు వింతపడుచు భటులతోఁగూడ సమీపమునకుఁ బోఁగా, శ్రావ్యమగుసంగీతము వినవచ్చెను. పిదప చాలఁ బ్రయత్నములు గావించి రాజు జయదేవుని బయటకుఁ దీసి సర్వోపచారములు చేయించి, మఱునాఁడు తన నగరమునకుఁ గొనిపోయి చికిత్స చేయుటకు రాజవైద్యులను, పరిచర్యచేయుటకుఁ బరిచారకులను ఏర్పరిచి నియమించెను. వారందఱును గూడ అట్టి పరమభాగవతశిఖామణి సేవ యబ్బినందులకుఁ జాల నానందించిరి. రాజు ప్రతి దినమును వచ్చి భక్తి శ్రద్ధలతో జయదేవుని సేవించుచుండెను.

ఒకనాఁడు రాజు గురుదేవుని సేవించి, "మహాత్మా! సులభ మగుమోక్షప్రాప్త్యుపాయమును సెలవీయవలయు" నని ప్రార్థించెను. "భగవంతునిఁ గీర్తించుట, కొలుచుట, భజనచేయుటలుకంటె మోక్షసాధన మేమున్నది? కాని తొలుదొలుత సర్వేశ్వరునియెడల నచంచలభక్తి కుదురుట కష్టము. అది లేనినాఁడు చేసిన సేవయంతయు వ్యర్థము. భాగవతార్చనమువలన జ్ఞానవైరాగ్యము లలవడును. కావున ప్రప్రథమమున వీరు వారు అని యెన్నక, వచ్చిన భాగవతుల నెల్లరను బూజింపుము. తత్కాలమున నీకు మోక్షప్రాప్తిమార్గము సులభముగ లభించును." అని గురుదేవుఁడు చెప్పెను. రాజు అట్లే చేయసాగెను. ఇది లోకమునం దంతటను వెల్లడియయ్యెను, తోడనే అనేకభాగవతులు వచ్చి రాజువలన సత్కారములనంది పోసాగిరి. జయదేవుని పాడునూతిలోఁ బడఁద్రోసిపోయిన వైశ్యుని నౌకర్లు గూడ ధనకాంక్షచే భాగవతుల వేషమును ధరించి వచ్చిరి; కాని వారు రాజుగారి మేడలో జయదేవుని జూచి గడగడ వడఁకసాగిరి. అదిచూచి జయదేవుఁడు వారిని కౌఁగిలించుకొని, రాజభటులతో "వీరు మహానుభావులు. ఇంతటివా రెప్పుడును ఇచ్చటకు వచ్చియుండలేదు. వీరినిఁ జక్కఁగా సేవింపవలయునని రాజుతోఁ జెప్పుఁడు" అని నియమించెను.

వా రట్లే చేసిరి. రాజు గురుదేవుని సెలవు ప్రకారము ఆకపటభాగవతులను జాల గొప్పగఁ బూజించి, కొన్నిదినములు ఇచ్చట నుండవలయునని ప్రార్థించెను. జయ దేవుఁడు ఏమి అపాయము గలిగించునో అని భీతిల్లుచునే, వారు రాజుమాటను త్రోసివేయఁజాలక నిలిచిపోయిరి; కాని భయాతిరేకమువలన నిద్రాహారములు సహింపక నెలదినములు గడచు నప్పటికి వారు మిగులఁ గృశించిరి.

ఈసంగతి రాజు జయదేవునకుఁ దెలిపి, వారికార్శ్యమునకుఁ గారణ మేమై యుండునని యడిగెను. "రాజా! ఏమున్నది? వారు సంతతము ప్రపంచమున సంచ రించుచుండువారు; భుజించిన చోట నిద్రించుట వారి కలవాటు లేదు. అయినను నీప్రార్థనమును త్రోసివేయఁజాలక వా రిచ్చటనుండిరి. వారి కార్శ్యతకు ఇంతకంటెఁ గారణము లేదు. కావున వెంటనే వారిని సత్కరించి పంపివేయుము" అని గురు దేవుఁడు ఆనతిచ్చెను. తోడనే రాజు అసంఖ్యధనముతో వారిని సత్కరించి, భటు లను సాయమిచ్చి పంపివేసెను. నిరుపద్రవముగ నక్కడనుండి వెడలి పోఁగలిగినందు లకు వారు మిగుల నానందించి, 'బ్రతుకు జీవుఁడా' యని భటులతో బయలుదేఱి పోయిరి.

అరణ్యమునఁ బోవుచుండఁగా, రాజభటులలో నొకఁడు వంచకభాగవతులను జూచి "స్వామీ! మారాజుచెంతకు ఇంతవఱకును అనేక కోటిభాగవతులు వచ్చిరి; కాని గురుదేవులు వారినెవ్వరిని మిమ్ము సత్కరింపించినంత సత్కరింపలేదు. దీనికిఁ గారణము సెలవీయవలయును" అని యడిగెను. అందులకు వారిలో నొకఁడు "ఇందులకుఁ జాలగాథయున్నది. కొంత కాలముక్రిందట అవంతి దేశాధీశ్వరునిచెంత జయదేవస్వామి ప్రధానిగను, మేము నౌకరులుగను ఉంటిమి. జయదేవుఁ డేదో రాజునకు గొప్పయపకారము తలఁచెను. అందులకుఁ గోపించి, రాజు జయ దేవునిఁ జంపునట్లు మాకు సెలవిచ్చెను. మేము రాజాజ్ఞ ననుసరించి జయదేవుని అర ణ్యమునకుఁ గొనిపోయి, ప్రాణములు తీయుటకుఁ జేతులాడక పోవుటచేఁ గాలు చేతులు మాత్రము ఖండించి యొక పాడునూతిలోఁ బడవేసి, ఈసంగతి రాజునకుఁ గొంతకాలమునకైనఁ దెలియకమానదనియు, నట్లయిన నప్పుడు మాకు ప్రాణముల మీఁదికి వచ్చుననియు శంకించి, మేము విరక్తులమై భాగవతులమై యిట్లు కాలముఁ బుచ్చుచున్నాము. అప్పటి యుపకారమును దలంచి జయదేవుఁడు మాకిప్పు డిట్టి సత్కారమును జేయించెను" అని చెప్పెను. తోడనే యీయసత్యమును సహింపఁజాలకయో యనునట్లు భూమి రెండు వ్రక్కలయ్యెను. కపటభాగవతులు రథములతోఁ గూడ నాభూవివరమునఁ బడిపోయిరి. రాజభటులు ఇది చూచి మిగుల విస్మితులై యతివేగముగ నగరమునకుఁ బోయి జరిగినదంతయు రాజునకు నెఱింగించిరి.

రాజు స్వయముగ నీవృత్తాంతము జయదేవునకు విన్నవించెను. జయదేవుం డదివిని చేతులు మొగిడ్చి ఆకసమువంకం జూచి, "కృష్ణా! నీకు కష్టము గలిగించిన అనేకపాపాత్ములకు మోక్ష మిచ్చితివి. నీభక్తులను బాధించిన అనేకక్రూరులను రక్షించితివి. వీరిని మాత్ర మిట్లేల చేసితివి?" అని గొంతెత్తి ప్రార్థించెను. పిదప రాజు గొప్పసైన్యమును, గురుదేవుని వెంటనిడుకొని కపటభాగవతులు భూవివర మున దిగంబడి పోయినచోటికిం బోయెను. జయదేవుండు కాన్పించిన వెంటనే కపట భాగవంతులకు వైకుంఠమునుండి విమానములు వచ్చెను. వారిరువురును వాని మీంద నధిరోహించి, చేతులు జోడించి జయదేవునిం జూచి "మహానుభావా! ఇది యంతయు మీయాశీర్వచనఫలము. అయినను మేము మీకు చేసిన ద్రోహమును దలంచికొని యిప్పుడు సిగ్గుపడుచున్నాము. నీయనుగ్రహమువలన మాకు వైకుంఠ ప్రాప్తిం గలిగినది. ప్రభూ! మమ్ము మఱచిపోవలదు" అని ప్రార్థించి, వైకుంఠము నకుం బోయిరి. అంతట రాజు గురుదేవుని యౌదార్యమును అనేకవిధములం గొని యాడుచుం బురమునకుం దీసికొనిపోయెను.

రాజు బలవంతము చేయంగా, జయదేవుండు తనపూర్వవృత్తాంత మంతయు జరిగినది జరిగినట్లు చెప్పెను. పిదప రాజు గురుదేవుని యనుజ్ఞను బడసి సపరివార ముగం బోయి జగన్నాథమున మాతృగృహమున నున్నపద్మావతీదేవిని గొనివచ్చి భర్తచెంత నిలిపి తానును, దనరాణియు, వినయవిధేయతలు వెలయ నాపావనదంప తులను గొలుచుచుండిరి.

ఒకనాడు పరిచారికాపరివృతయై రాణి పద్మావతీదేవిసన్నిధిని గూరుచుండి యామెవలనం బుణ్యకథలను వినుచుండెను. ఇట్లుండంగా, నొక పరిచారిక వచ్చి రాణినిం జూచి "అమ్మా! మీసోదరుండు చనిపోయెను. మీవదినె సహగమనము చేసినది" అని చెప్పెను. అదివిని రాణి గోలుగోలున నేడువసాగెను. పద్మావతి మాత్రము నిశ్చలయైయుండెను. అది చూచి యుండంజాలక, రాణి "తల్లీ! నావదినె పతితోననుగమనము చేసె ననుసంగతి వినియు నీవు సంతోషమును గాని, ఆశ్చర్య మును గాని, దుఃఖమును గాని పొందకయుంటివి. కారణ మేమి?" అని యడిగెను. అప్పుడు పద్మావతీదేవి "మహాపతివ్రత భర్తమరణవార్త చెవిసోకినంతనే ప్రాణములం బాయును. ప్రయత్నపూర్వకముగ ననుగమనము చేయుటలో నేమి విశేషము ఉన్నది?" అని గంభీరముగ సమాధానము చెప్పెను. ఈమాటలు ఇంతటి దుఃఖ సమయములోం గూడ రాణికి ఆశ్చర్యమును గలిగించెను. "పద్మావతి మహాపతివ్రత వలె మాటాడుచున్నది. ఈమె పాతివ్రత్యమును బరీక్షించెదను" అని రాణి తలంచి, యుక్తసమయమున నామె సంగతియంతయు మంత్రికి నెఱింగించెను. మంత్రి "సమ యము వచ్చినప్పుడు అంతయుం జక్కంబెట్టెద"నని చెప్పెను.

ఒకనాఁడు రాజు జయదేవునిఁ దీసికొని మహారణ్యమునకుఁ బోయెను. ఇదే సమయ మని తలంచి, మంత్రి పద్మావతీదేవితో మాట్లాడుచున్న రాణిచెంతకు వచ్చి "తల్లీ! గురుదేవునితోఁ గూడ ప్రభువు మహారణ్యములోఁ బోవుచుండగా, నొక బెబ్బులి వచ్చి మీఁదఁబడెను. ప్రభువు గాయపడి యెట్లో ప్రాణములు దక్కించుకొనెను; కాని గురుదేవుఁడు పెద్దపులివాతఁ బడి మరణించెను" అని చెప్పెను. రాణి యింకను దుఃఖము నభినయింపకపూర్వమే పద్మావతీదేవి భూమిపైఁ బడి ప్రాణములు విడిచెను. రాణి యిదియంతయు నటన మని భావించి వైద్యులను రప్పించి పరీక్ష చేయఁగా, యథార్థముగఁ బద్మావతి మరణించె నని తెలియవచ్చెను. రాణి, పద్మావతిపాతివ్రత్యమహిమకు ఆశ్చర్యపడి తానుజేసినకుట్రవలనఁ దన కెట్టి యపకీర్తియు, నెట్టిబాధలును సంభవించునోయని వగచుచుండఁగా, గురుదేవునితోఁ గూడ రాజు వచ్చెను.

మంత్రి రాజునకు యథార్థమంతయుఁ దెలిపెను. రాజు అందఱకుఁ జాల వగచి, "నాభార్యవలన నాకుఁ దీరని యపకీర్తి వచ్చినది. నాభార్యను జంపుటకంటెను నేను బ్రతికియుండుటకంటెను నేనే అగ్గిలో నుఱికి చచ్చుట మేలు" అని తల పోసి కుమారునకు రాజ్యమును అప్పగించి, చితిపేర్పించుకొని సెలవీయవలసిన దని గురుదేవుని బ్రార్థించెను. అంతకుఁ బూర్వమే పరిచారికలవలన సంగతి యంతయుఁ దెలిసికొనిన జయదేవుఁడు వడివడిగ రాజుచెంతకు వచ్చి, సాహసము మానిపించి చేయి పట్టుకొని తన భార్య మృతకళేబరము చెంతకుఁ గొనివచ్చి, భక్తిపరవశుఁడై ఇరువదినాలుగు అష్టపదులను బాడి నృత్యముచేసెను. తోడనే వైకుంఠనాథుఁడు అగు శ్రీహరి సాక్షాత్కరించి, పద్మావతీదేవిని బ్రతికించి, ఈయష్టపదులను భక్తితో నెవ్వరు గానము చేయుదురో, వారి యింట నేను లక్ష్మీయుతుఁడనై వసించెద నని చెప్పి, వరము లొసంగి యంతర్హితుఁడు అయ్యెను. పిదప రాజు రాణియుఁ గలిసి తమ యపరాధములను మన్నింపవలసినదని గురుదేవుని, తత్పత్నిని అనేకవిధ ములఁ బ్రార్థించి, బ్రతికియున్నంతకాలమును వారిని సేవించిరి. జయదేవుఁడు దేహావసానమున సకళత్రుఁడై ఈశ్వరసాయుజ్యమును బడసెను. జయదేవవిరచితమగు గీతగోవిందమును ఇప్పటికి భారతీయులు అనేకులు గానముచేసి, విముక్తపాపులై తరించుచున్నారు.

ఉ. "తపముల్ చేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపడుండో యని బ్రహ్మరుద్రముఖరుల్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁగాక నాకెప్పుడున్." (భాగ. స్కం. 2. ప. 64.)

# 23. వీసోబా

పండరిపురమున వీసోబా అను నొక గొప్పవర్తకుఁడు నివసించియుండెను. ఆతని యింట నున్నధన మెంతయో యెవరును లెక్కింపఁజాలరు. వీసోబా ఇతరుల వలనఁ దనకు రావలసిన సొమ్మును లెక్కించి పుచ్చుకొనుటకుఁ గాలము చాలక, తూఁచి పుచ్చుకొనుచుండెడువాఁడు. పరులకు ఈయవలసివచ్చునపుడు గూడ నాతఁ డట్లే చేయుచుండెను. ఇంతటి ధన మున్నను ఆతఁ డెప్పుడు గర్వించి యెఱుఁగఁడు. పరులను దూలనాడియు, లేనిపోనిదాంభిక వేషములువేసి విఱ్ఱవీఁగియు, ఆభాసము లగు నైహికసుఖములకు ఆశించియు నెఱుఁగడు. అదృష్టవశమున నాతనికి అట్టి సుగుణములు గల యువతీరత్నమే భార్య యయ్యెను. ఆతనికి నలుగురు కుమారులు గలిగిరి. ఆశుద్ధసాత్వికు లగుదంపతులకు ఉద్భవించుటచే వారుగూడ నట్టివారే యైరి. ఇట్టి భార్యాపుత్రులతోఁ గూడియుండుటచే నాతనికి సంసారము ఇతరులకు వలెఁ దాపత్రయ కారణము గాలేదు. సుఖమును, వైభవమును అనుభవించు వారిలో మేమే ఘనుల మని విఱ్ఱవీగువారు వీసోబాను ఆతని భార్యాపుత్రులను జూచి "లుబ్ధులు ధనము ఉండినను దరిద్రులే యగుచున్నారు. తానింత యనుభవించి యితరుల కింత యీయని వానిబ్రతు కేల కాల్పనా" యని యాక్షేపించుచుండిరి. విజ్ఞానులు మాత్రము "మూఁడు దినములఁపట్టపగలు మాత్రమే నిలుచు జీవమును స్థిరమని నమ్ముకొని, సకలాకృత్యములకు నొడిగట్టు ప్రమత్తధనికుల వలెఁగాక యీమహానుభావుఁడు ప్రపంచము నశ్వర మనుజ్ఞానముకలిగి ఐహికముల పొంతఁ బోక యున్నాఁడు. ఆహా! అంత ధనమున్నవారి కిట్టిసుగుణములు గలుగుట యెంతవింత?" అని యబ్బురపడసాగిరి.

ప్రతిదినమును దనయింట ననేకులు ఆహారమును దినిపోవుచుండినఁగాని, వీసోబాకుఁ జాలఁ గష్టముగా నుండెడిది. ఇట్లుండఁగా నొకప్పుడు ఆదేశమున మహాక్షామము సంభవించెను. కొలఁదిదినములయందే దేశమునందు నలుమూలలను గఱవు వ్యాపించెను. ఈవార్త వీసోబా చెవుల సోఁకునప్పటికిఁ దిండిలేక అనేకులు ప్రాణములు విడిచిరి. వీసోబా యిదివిని చాలఁ గటకటంబడి తన కున్నధనమంతయు క్షామపీడితులకుఁ బంచిపెట్టుటకు ఉన్ముఖుఁడు అయ్యెను. దయార్ద్రహృదయము గలవారగుటచే నాతని భార్యయుఁ గుమారులును గూడ నందులకు అంగీకరించిరి. తోడనే యాఱుగురును గలిసి క్షామోపహతులకు విసుగువిరామములు లేకుండ సాహాయ్యము ప్రారంభించిరి. వీసోబా వితరణమును జూచి లోక

మంతయు దుఃఖించుచుండఁగా, ఇట్టి సమయములయందే సంపన్నులు కాఁజూచు వర్తకులు కొందఱు ఆతనిని మిగుల హేళనసేయసాగిరి. కొందఱు మిత్రులు వచ్చి "మిత్రుఁడా! తనకుమాలినధర్మములేదు. నూటికిఁ బదిరూపాయలకంటె నెక్కుడు దానము సేయకుము ధన మంతయు నైనతరువాతఁ జేతులు పిసికికొనినఁ బ్రయోజనము కలుగఁబోదు" అని చెప్పసాగిరి; కాని క్షామపీడితుల దీనాలాపముల ముందు అతనికి ఇవి యేవియు విన్పింపలేదు. ఉన్నధన మంతయు వెనుకముందుఁ జూడక ఆతఁడు శరణార్థులకుఁ బంచియిచ్చెను. నెలదినములు కడచునప్పటికి ఆతని యింటఁ బర్వతములవలెఁ బడియున్న ధనరాసు లన్నియు నైపోయెను; కాని మున్నూటముప్ఫదిసము క్షామబాధ తొలఁగిపోయెను. ఆతఁడును, ఆతని దారపుత్రులును దమధనము ఇట్టిసమయమున వినియోగపడినందులకును, వ్యయము సఫలమైనందులకును మిగుల నానందించిరి.

వీసోబా మున్ను కాశీయాత్ర పోయినపుడు చేతనున్న ధనమంతయు వెచ్చించి, అది చాలకపోవుటచేఁ గాశీవాసి యగు నొకతురుష్కునివద్దఁ గొంత సొమ్ము అప్పు తెచ్చెను. అది తెచ్చిన కొలఁదిదినములకే యీభయంకరక్షామము సంభవించుటచే అది తీర్పఁదలంచుచుండఁగనే ఉన్న ధనమంతయు నైపోయెను. ఈసంగతి తెలిసికొని వచ్చి తురుష్కుఁడు నిలిచియున్నట్లుగాఁ దన ధనము వడ్డితోఁ గూడఁ జెల్లింపవలసిన దని పట్టుపట్టెను. వీసోబా యందుల కేమియుఁ గోపింపక తన స్థితియంతయుఁ జెప్పి "మిత్రుఁడా! నీవు తొందరపడవలసిన పని లేదు. నీసొమ్ము ఎచ్చటికిని బోవునది గాదు; కాని ప్రస్తుత మిట్టి స్థితి సంభవించుటవలన నేఁడు మాత్రము చెల్లింపఁజాలను. నేఁటికి ఎనిమిదవనాఁడు నీసొమ్ము అణాపైసలతో నీయింటికిఁ బంపివేసెదను. నన్ను విశ్వసింపుము" అని చెప్పెను.

తురుష్కుఁడు "మిత్రుఁడా! నీయెడల నాకు విశ్వాసము లేకపోలేదు. నీవు నాస్వల్పధనమును హరించెద వని నాకు భయము లేదు. ఈభయంకరసమయమున నీవు మహమ్మదీయులని, భారతీయులని, భేదమును బరిగణింపక ఆపన్నుల కెల్లరకును సహాయము చేయుటవలననే నీయౌదార్యము వ్యక్తమైనది. కాని యిప్పుడే చెల్లింపలేనివాఁడవు. ఇఁక నెన్నిదినములలో నీవు నాసొమ్ము నెట్లు చెల్లింతువు? అప్పటికి నీవు ఇంతకంటెను దరిద్రుఁడ వయ్యెదవు. అయినను నీవన్ననాఁటికి సొమ్ము ఇచ్చుటకు సందేహములేదని ఇచ్చటి గొప్పవర్తకులచే ననిపింతువేని, నేను వెడలిపోయెద" నని చెప్పెను. వీసోబా ప్రార్థింపఁగా వర్తకు లందఱును అందులకు సందేహము లేదని చెప్పిరి. తురుష్కుఁడు వెడలిపోయెను.

ఒకప్పుడొక సిద్ధపురుషునకు వీసోబా భక్తిప్రపత్తు లెట్టివో పరీక్షసేయవలయు నని బుద్ధిపుట్టెను. అగుట నాతఁడు ధూళిధూసరితుఁడై మిగులఁ జినిగిపోయిన మసి

పాఁత గట్టుకొని, ఒడలినిండ బురద పూసికొని చేత నొక కుండ పెంకు దాల్చి "ఆఁకలి దహించివేయుచున్నది. ఇచ్చట నన్నము పెట్టు మహాత్ము లెవరైనఁ గలరా ?" యని యడిగెను. లోపలఁ గూర్చుండియున్న వీసోబా యది విని తటాలున వీథిలోనికి వచ్చి "మహాత్మా! దయచేయుము. ఈదాసుఁడు నిన్ను సేవించుటకు సిద్ధముగా నున్నాఁడు" అని యాతనిని లోనికిఁ గొనిపోయి, స్నానముచేయించి వస్త్రములుదికి యారవేసి, ఉన్నంత యన్నము పెట్టి వీలయినంతవఱకు సకలోపచారములను గావించి "స్వామీ! లోకములోనన్నము పెట్టి యాదరించువారు అనేకులు ఉన్నారు. నాపూర్వపుణ్యవశమునఁ గాకున్న నాయింటికి ఎందులకు వత్తురు? మీవంటివారిని లోనికిఁ దీసికొనివచ్చి, నేను పెట్టఁగలిగిన దేమున్నది? ఆదరవచనములు పలుకుట గైనను జేతఁగాదు. నావలన నైన యపరాధములను మఱువవలయును" అని ప్రార్థించెను. సిద్ధపురుషుఁడు అట్టి స్థితిలోఁగూడ వీసోబా యిచ్చిన యాతిథ్యమునకును, చూపిన భక్తికిని, చేసిన యాదరమునకును ఎంతో యానందించి, జ్ఞానము నుపదేశించి వెడలిపోయెను.

ఇంతలో వీసోబా తురుష్కునకు సొమ్ము చెల్లించెద నన్నగడువు ముగియ వచ్చెను. దానిని గుర్తించి యాతఁడు ఇది యెట్లు ఈశ్వరా యని కొంచెము విచారపడసాగెను. ఇట్లుండఁగాఁ బండరినాథుఁడు భక్తుని దుఃఖమును జూచి సహింపఁ జాలక, వీసోబా పరిచారకుని రూపమునుబడసి రొక్కపుసంచులతోఁ గాశీనగరము నందలి తురుష్కుని మందిరము ముందు సాక్షాత్కరించెను. భటులుపోయి వీసోబా నౌకరు సొమ్ము తెచ్చె నని చెప్పఁగా, విని తురుష్కుఁడు పరమాశ్చర్యచకితుఁడై "హా! నేను ఎంత త్వరపడితిని? ఇట్టి స్థితిలోఁగూడ నన్నమాట తప్పని వీసోబాకు నేను ఎంత అలజడి గలిగించితిని?" అని వగచి భటుని లోనికిఁ గొనిపోయి లెక్కల పుస్తకము తీసి సరిగఁ జూచి, తనకు రావలసిన సొమ్ము పుచ్చుకొని "నాకు రావలసిన యీపత్రము బాపతు సొమ్ము అంతయు నీపరిచారకుని ద్వారా ముట్టినది" అని పత్రము మీఁదఁ జెల్లువ్రాసి, చేవ్రాలు చేసి భటున కిచ్చివేసెను. పరిచారకరూపి యగు పండరినాథుఁడు ఆపత్రమును ప్రతిదినమును వీసోబా పారాయణముసేయు గీతాభాష్యమున నునిచి తిరోహితుఁ డయ్యెను.

మఱునాఁడు ఉదయము వీసోబా గీతాపారాయణము సేయుటకుఁ బుస్తకము దీసి అందలి పత్రమును చూచి ఆశ్చర్యపడి "ఔరా! ఇది భగవంతుని పని గాని, వేఱు గాదు. దీనవత్సలుఁ డగు శ్రీపండరినాథుఁడే నాపరిచారకునిరూపమునఁ బోయి యింతపని చేసి నామానము నిలిపె" నని భావించి "దీనబంధూ ! ఈమూఢునిమీఁద నీకెంతదయ యున్నది? నాకొఱకు నీవు ఎంత నీచుని రూపము

వహించితివి! రామ కృష్ణాద్యవతారములను ధరించిన నీకు ఇది తగునా! అయ్యో! నేనెంత పాపకర్ముఁడనైతి? నిజముగ నీవు నాపరిచారకుఁడ వని భావించి యాముష్కరతురుష్కుఁ డెంత నీచముగఁ జూచెనో, శ్రీహరీ! వానిసొమ్ము చెల్లించుటకు నీవే పోవలయునా? మఱియొక మార్గము లేదా ?" అని యనేకవిధముల దుఃఖించెను.

అప్పుడు పండరినాథుఁడు సాక్షాత్కరించి "వత్సా! చింతిల్లకుము. దాసానుదాసుఁడ నగు నాకు దాసుల యిక్కట్టులు తొలంగించుటయే వృత్తి" అని చెప్పి సంసారభయమ్ముఁ బాపి అంతర్హితుఁ డయ్యెను. ఈవృత్తాంతము పండరిపురము నందలి యెల్లరును విని, అత్యాశ్చర్యచకితులై వీసోబా ననేకవిధములఁ గొనియాడిరి. వీసోబా యంతమున నీశ్వరసాయుజ్యమును బడసెను.

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజపసత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప వఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పరెడి నీపదాబ్జయుగళీసేవాభిపూజానము
శ్రితధర్మం దగఁ వానిథంగి ననురారీ దేవచూడామణీ."

(భాగ. స్కం. 3. ప. 301.)

## 24. భానుదాసుఁడు

పైఠణపురమున నొకబ్రాహ్మణునకు లేక లేక ఒకకుమారుఁడు గలిగెను. తలిదండ్రులు భానుని కృపవలనఁ గలిగిన యాకుమారునకు భానుదాసుఁడు అని నామకరణము చేసి, మిగుల గారాబముతోఁ బెంచుకొనసాగిరి. భానుదాసుఁడును వరప్రసాదమువలనఁ బుట్టినవాఁడగుటచే నట్టిబాల్యముననఁగూడ జ్ఞానముగలిగి, తననిమిత్తము ప్రాణములను ధారవోయుటకుఁగూడ సిద్ధముగ నున్న తల్లిదండ్రుల ప్రేమను గుర్తెఱిఁగి, వారి చిత్తానుసారము మెలఁగుచు వారికి ఆనందము నొడఁగూర్చుచుండెను. యుక్తసమయమునఁ దల్లిదండ్రులు కుమారునకుఁ జౌలము, ఉపనయనము మున్నగువానిని నెఱవేర్చి, విద్యాభ్యాసమునిమిత్తము గురువుచెంత విడిచిరి. భానుదాసుఁడు సకలవిషయములయందును దలిదండ్రుల యాజ్ఞాప్రకారము నడుచుకొనుచుండెను; కాని విద్యావిషయమున మాత్రము వ్యతిరేకించెను. వారు బడికిఁ బొమ్మనిన నీతఁడు ఆటలకుఁ బోవును. చేతఁ బుస్తకములు గొనుమనిన గాలిపటము గొనును. ఇట్లే అనేకవిధముల నాతఁడు వారికిఁ గష్టము గలిగింపసాగెను.

ఈదుండుఁడుకుఁదనమును సహింపలేక ఒకనాఁడు భానుదాసునిఁదండ్రి చాలఁ దీక్ష్ణముగ శిక్షించెను. అందులకు సహింపఁజాలక యాతఁడు ఎవరికిని దెలియకుండ అరణ్యమునకుఁ బాఱిపోయెను. అచ్చట నాతని కొకపర్వతము కాన్పించెను.

సంతోషముతో నాతఁడు ఆపర్వతమునెక్కి అంతటను దిరిగి చివర నొక గుహఁ జేరుకొనెను. పరిశీలించి చూడఁగా నాతనికి సూర్యనారాయణమూర్తి విగ్రహ మొకటి యటఁ గాన్పించెను. వెంటనే భక్తిప్రపత్తులతో నాతఁ డావిగ్రహమునకు సాష్టాంగ నమస్కారము లాచరించి, సూర్యదేవుని అనేకవిధములఁ గొనియాడెను. అప్పుడు సూర్యభగవానుఁడు ఆవుపాలతోడి యొకగిన్నె నొకచేతఁగొని వృద్ధబ్రాహ్మణ రూపముతోఁ బ్రత్యక్షమయి "వత్సా! ఈపాలు త్రావుము. దీనివలన నీకు క్షుత్పిపాసలు ఉండవు. సకలవిద్యలును కరతలామలకము లగును" అని యిచ్చి, భానుదాసుఁడు క్షీరములు పానముచేసిన తరువాత, మరల "మఱియు నీవు అంధులవలె అశాశ్వతము లగు సాంసారికసుఖములకై ఆశపడక శ్రీహరిని సేవింపుము. శ్రీహరిభక్తు లగుధ్రువప్రహ్లాదాదులు ఇహమునఁ బరమాద్భుతప్రభావసంపన్నులై, అంతమున శ్రీహరిసాయుజ్యమును బడసిరి. వత్సా! లోకములో మానవునకు ఇంతకంటెఁ గావలసినది ఏమున్నది? కాని మూఢజనులు ఇది తెలియనేరక అపదార్థమున పదార్థభ్రాంతిని, అనాత్మయం దాత్మభ్రమను బడసి, ఈశ్వరమయం బగు ప్రపంచము ఐహికసుఖారామమని భావించి మోక్షశబ్దమునేని వినిన పాపమునఁ బోవక అజ్ఞానదగ్ధులై నరకకూపమునఁ గూలుచున్నారు. మనోవాక్కాయకర్మలతో శ్రీహరినాశ్రయించినవానికి ఇడుమలు సంభవింపనేరవు. నీవు పూర్వజన్మమునఁ జేసిన పుణ్యమునకు మెచ్చి భగవంతుఁడు నీకు ఈనరజన్మము నిచ్చెను. భగవద్దత్తమైన యీజన్మమును కుమార్గములయందుఁ గడపితివేని, ఇఁక కోటిజన్మములెత్తియు నీవు మానవజన్మమును సాధింపఁజాలవు. ఇహలోకమునందలి మానవుల ఆయుర్దాయము అతిస్వల్పము. ఆస్వల్పకాలమునందే దుష్కృత్యములు చేసినయెడల శాశ్వతముగ బాధపడవలసివచ్చును. ఇహమున మానవులు చేయునది అతిస్వల్పముగాని, పరమున అనుభవింపవలసినది అనంతము. బాలకా! ఈజ్ఞానములేక యెందఱు చెడిపోవుచున్నారు! ఇంద్రియములను జయింపలేక వ్యసనములపాలఁబడి మోక్షమార్గము కల్లయని వాదించి, యెందఱు భ్రష్టు లగుచున్నారు! జ్ఞానోపదేశకు లగు ఆచార్యులు లభింపక ఎందఱు పాడయిపోవుచున్నారు. నీదేహము పరమేశ్వరునిచే నొసంగఁబడినది; కావున కన్నుల నాతనిని సందర్శించుటయందును, వాక్కును అతనిని నుతించుటయందును, హృదయము నాతనిని మననముసేయుటయందును, బుద్ధి నాతనినిఁ దెలిసికొనుటయందును, చేతులు నాతనినిఁబూజించుటయందును, వీనుల నాతని దివ్యగాథలను వినుటయందును, పాదముల నాతని ఆలయమునకుఁ బోవుట యందును, ఇట్లే నీసకలావయవములను శ్రీహరిసేవయందు వినియోగింపుము." అని చెప్పి మాయమయ్యెను. ఇచట నిట్లుండఁగా నచట పైఠణపురమున భానుదాసునిఁ

తలిదండ్రులు ఏడుదినములు ఆతనిని వెదకి వేసారి తుదకు నిరాశ చేసికొని గోలుగోలున నేడ్వఁజొచ్చిరి. అప్పు డొకవృద్ధబ్రాహ్మణుఁడు వారినిఁజూచి, మీ రేల దుఃఖించెదరు? మీకుమారుని నేను అరణ్యమధ్యమునందలి ఫలానాపర్వతముమీఁదఁ జూచితిని. నాతో నింటికిరమ్మని అనేకవిధములఁ జెప్పితిని; కాని ఆతఁడు నామాటను దిరస్కరించెను. చేయునది లేక నాత్రోవను నేను వచ్చితిని" అనిచెప్పెను. ఇదివినఁగనే వారికి మఱలఁ జైతన్యము వచ్చెను. తోడనే యాదంపతులు వృద్ధబ్రాహ్మణనిర్దిష్ట మగు పర్వతముమీఁదికిఁ బోయి అంతటను గలయ వెదకిరి; కాని యెందును వారికిఁ గుమారుఁడు కాన్పింపలేదు. తుదకు వా రొక గుహను సమీపించిరి. వృద్ధబ్రాహ్మణుఁడు కాన్పించిన తరువాత భానుదాసుఁడు మఱియొకచోటికిఁ బోయియుండునని వారు భావించిరి; కాని యీస్వల్పస్థలమునుమాత్రము పరిశీలింపక విడువనేల యని గుహ సొచ్చిరి. అందు నలుమూలలు వెదకి చూడఁగా నిఁకఁ జెప్పవలసినది ఏమున్నది? భానుదాసుఁడు శ్రీసూర్యనారాయణమూర్తి విగ్రహపుఁ బాదములపైఁ దన శరీరము నానుకొని నిద్రించుచుండెను. తోడనే యాదంపతులు గుభాలున నచ్చటికిఁ బోయి యిరువురు నొక్కమాఱుగ "మాతండ్రీ! బ్రతికియుంటివా?" యని కౌఁగిలించుకొని ముద్దాడఁదొడఁగిరి.

భానుదాసునకు మెలఁకువ వచ్చెను. కాని తలిదండ్రుల దృఢాలింగనములఁ జిక్కియుండుటచే నాతనికిఁ బరుండుటకుఁగాని, కూర్చుండుటకుఁగాని, లేచుటకుఁగాని వీలు చిక్కదయ్యెను. ఇట్లు కొంతతడవు జరిగిపోయిన తరువాత నావృద్ధదంపతులు "చిట్టితండ్రీ! మమ్ము దిక్కు లేనివారినిగాఁ జేసి నీవిట్లు వచ్చుట ధర్మమా? ఏడుదినములనుండి మేము నిద్రాహారము లెఱుఁగము. మాహృదయములు నీమీఁదనే హత్తియుండుటచే నున్మత్తులమై చరించితిమి. తండ్రీ! మమ్మింత కష్టపెట్టెదవా? నీవు ఈకఠినశిలాతలములయందు ఇంత శ్రమపడెదవా?" యని దుఃఖించిరి. భానుదాసుఁడు వారిదుఃఖమును ఉడిపి, అక్కడ జరిగినది యంతయుఁ జెప్పెను. ఆదంపతులు భగవంతుని కనేకవందనములు సమర్పించి, కుమారుని ఇంటికిఁ గొనిపోయి, సుఖముండిరి.

మఱికొన్ని దినములు కడచునప్పటికి భానుదాసునకు నిండుజవ్వనము వచ్చెను. తలిదండ్రు లదికని పెట్టి పదాతేండ్ల సుందరినిఁ దీసికొనివచ్చి యాతనికిఁ బెండ్లి చేసిరి. కొన్నిదినములకు భానుదాసునకు సంతానము కలిగెను. ఆబిడ్డలు పెరుగుచుండఁగా నాతని తలిదండ్రు లొక్కమాఱుగఁ బరమపదించిరి. వా రున్నంతకాలమును సాంసారికవిషయములను వారే చక్కఁబెట్టుకొనుచుండిరి. ఇపుడు భానుదాసుఁడు హరిభజనమగ్నచిత్తుఁడై సాంసారికసంబంధమును వదలుకొనియెను. అగుటచే నాతని

యాలుబిడ్డలు తినుటకుఁ దిండిలేక నానాబాధల ననుభవింపసాగిరి. భానుదాసుఁడు ఇదియేమియుఁ గనిపెట్టఁ డయ్యెను.

ఇదియంతయుఁ జూచి ఆయూరియందలి వర్తకులు కొందఱు భానుదాసునిఁ జేరి "ఇది నీకుఁ దగదు. నీదారపుత్రులు తినుటకులేక మాడిపోవుచున్నారు. నీతలిదండ్రులు ఉన్నప్పుడు నీయవసరము లేకపోయినది; కాని యిప్పు డట్లు సాగదు. నీయింట నీభార్యాపుత్రులు అన్నమో రామచంద్రా యని యేడ్చుచుండఁగా, నీవు భజనచేసిన పుణ్యము ఏమైనఁ దక్కుననుకొంటివా? ఈవెఱ్ఱిచేష్టలు ఇఁకఁ గొంచెము తగ్గించి సంసారము చక్కఁబెట్టుకొనుము. మేము నీకు నాలుగువందలవరాలు అప్పుగా నిచ్చెదము. ఆధనముతో నీవు బట్టలవ్యాపారమును జేసికొనుము. నీకుఁ గూడివచ్చి నపుడు మాసొమ్ము మాకు ఇచ్చివేయుము. నీవు మాకు వడ్డిమాత్రము ఈయనక్కఱ లేదు" అని చెప్పి బజారులో నొక మంచికొట్టు అద్దెకుఁ గుదిర్చియిచ్చి, బట్టలు గూడఁ గొనియిచ్చి, వ్యాపారరహస్యములు అన్నియుఁ దెలిపిరి.

భానుదాసుఁడు బట్టలవర్తకము ప్రారంభించెను. హరిదాసుఁడు వ్యాపారము ప్రారంభించె నఁట యని వింతగాఁ జెప్పుకొనుచుఁ, దొలుతఁ గొందఱు చూచుటకు వచ్చిరి. భానుదాసుఁడు వారు అడిగిన వస్త్రములను జూచి "ఇది నాకు ఇంతవెలకు వచ్చి నది. లాభ మెంత యిచ్చెదరో మీచిత్తము" అని చెప్పఁదొడఁగెను. ఆతఁడు యథార్థ మును జెప్పుటచేఁ గొనువారికి వస్త్రములు తక్కువ వెలకు రాసాగెను. అగుట నందఱు నీతని యంగడికే మళ్లిరి. ఈకారణముచే భానుదాసుఁడు రెండు మూఁడుమాసముల యందే అప్పు తీర్చివేసి సుఖముగాఁ గాలము గడుపఁజొచ్చెను. మఱియు నాతఁడు తన యంగడికి వచ్చువారందఱికి నిట్లు ఉపదేశింపసాగెను.

"మహాశయులారా! మీరందఱును నాయంగడికి వచ్చి యిచ్చటనే మీకుఁ గావలసినవస్త్రములను గొనిపోవుచుండుటచే మివుల నానందించుచున్నాను. ఇఁక ముందుఁగూడ మీరిట్లేరావలయు నని ప్రార్థించుచున్నాను. మఱి యిప్పుడు నావిశేష ప్రార్థన మేమనఁ? మీరు విశేషముగ సంపన్నులై యున్నారు. నాయంగడియందు మీదర్జాకుఁదగిన గొప్పవెలగలవస్త్రములు అనేకములు గలవు. వానివలన నేను లాభ మును బడయుచున్నాను. అయినను యథార్థము చెప్పక తీఱదుగదా! మానవశరీ రము మలమూత్రపురీష బంధురము. పైన నెంత శుభ్రపఱిచినను లోపల శుభ్రపఱ చుటకు సాధ్యముకాదుగదా? అట్టిచో అస్థిపండువంటి యీశరీరమును ఆచ్ఛాదించు కొనుటకువెలగల జలతారువస్త్రముల నేలయుపయోగించెదరు? మీరు ఒక్కజలతారు వస్త్రమునకుఁ బెట్టువెలతో సామాన్యవస్త్రములు పది కొనవచ్చును. దాంభికవేషముల బొంతఁబోకున్న నెంతధనము కూడివచ్చునో యోచింపుఁడు. మానవులందఱును మహా

సోదరులు. వారిలో ననేకులు తినుటకు తిండియు, కట్టుటకు గుడ్డయు లేక అల్లాడు చున్నారు. మీరు సామాన్యవస్త్రములను గొని మిగిలిన సొమ్ముతో వారినిఁ బోషింప రాదా? మీరొక్క సంవత్సరము కట్టి పాఱవేయు జలతారువస్త్రముల వెలపెట్టినచో, ఇరువది బీదకుటుంబములు హాయిగా కాలము గడుపఁగలవు. మీరు ఒక్కొక్కరు అంత సొమ్ము వ్యర్థముగ నాశనముచేయుచున్నారు. అనేకులు నిలువ నీడలేక పరి భ్రమించునపుడు, మీరు పెద్దపెద్దవేషములువేసికొని తిరిగిన భగవంతుఁడు అంగీకరిం చునా?" అని యిట్లనేకవిధముల మందలించుచున్నను, ఇతరుల అంగడులలో కంటె సరసమైన వెలలకు గొప్పవస్త్రములు వచ్చుచుండుటచే నందఱును భానుదాసుని అంగ డికే రాసాగిరి. అక్కారణముగ భానుదాసుని వచ్చుబడి హెచ్చుటయేగాక, తక్కిన వర్తకులకుఁ జాల నష్టము రాసాగెను. అగుటచే వారందఱును "మనము నిలువఁ బెట్టిన భానుదాసుఁడే తుదకు మన కూటిలో దుమ్ముఁ జల్లుచున్నాఁడు" అని ఆతనిపై నసూయవహించి సమయమును నిరీక్షించుచుండిరి.

ఇట్లుండఁగా భానుదాసుని అంగడియందలి సామాను అంతయు నైపోయెను. అదిచూచి భానుదాసుఁడు ఇతరవర్తకులతోఁ గలిసి సమీపమునందలి నగరమునకుఁ బోయి, కావలసిన వస్త్రములను గొని మూటలు గుఱ్ఱములపై నెక్కించుకొని బయలుదేఱి, మార్గమధ్యమున సాయంకాల మగుటచే నొక చిట్టడవిలో నున్న పాడుదేవాలయముచెంత బసచేసెను. అచ్చట నాతనికి సమీపగ్రామమునందు ఒక గొప్పహరిదాసుఁడు హరిభజనము చేయుచున్నాఁ డని తెలియవచ్చెను. ఇఁక క్షణమైన నచ్చట నిలువలేక, ఆతఁడు తన సామానును జాగ్రత్తగాఁ జూచు చుండవలసిన దని తోడివర్తకులను బతిమాలుకొని, తాను బయలుదేఱిపోయెను. ఎన్నియోదినములనుండి ఇట్టి సమయమును నిరీక్షించుచున్న ఆవర్తకులందఱును గలిసి, భానుదాసుని సామానుమూటలను సమీపమునందలి యొక పాడునూతిలోఁ బడవేసి, గుఱ్ఱములను అరణ్యమధ్యమునకుఁ దోలివేసి, ఏమియు నెఱుఁగని వారివలె నిద్రపోయిరి. మఱికొంతసేపటికి చాలమంది దొంగలు వచ్చి ఆవర్త కుల నందఱను జావమోది వారిచెంత నున్న వస్తువుల నన్నిఁటిని దోఁచుకొనిరి. అందులకు ఆవర్తకులు అందఱును 'లబో లబో' అని మొత్తుకొని "అయ్యో! మనము భానుదాసునిఁ జెఱుపవలయు నని తలంచితిమి. మనమే చెడితిమి. అతని వస్తువులను మనము నాశనముఁ జేయఁబోయి చేతులార భద్రపఱిచితిమి" అని దుఃఖింపసాగిరి.

ఇంతలోఁ దెల్లవాఱెను. హరిభజనము ముగించుకొని భానుదాసుఁడు వర్తకు లున్నచోటికి బయలుదేఱి వచ్చుచుండఁగా, దారిలో తన గుఱ్ఱములు ఒక్కచో

చేరి మేయుచుండుట గనవచ్చెను. అందులకుఁ గారణము తెలియక అబ్బురపడుచు, నాతఁడు వానిని దోలుకొని పాండుగుడిసద్దకు రాఁగా, సత్తకు లంజటులుం బాపము చేసిన అకృత్యమును, దమకు సంభవించిన విపత్తును ఆతనితోఁ జెప్పుకొని గోలు గోలున నేడువసాగిరి. అంత భానుదాసుఁడు "అసూయ యనునది యొక్క గాధాగ్ని ఎల అగ్ని యేకట్టె నాశ్రయించియుండునో, ఆకట్టెయే బుగ్గియై పోవును. అట్లే యె ...మున అసూయాగ్నిని వహించి యుండునో వాఁడే భస్మీపటలమగును. మీరు ...భవమును రగుటచే అట్టి గతియే పట్టినది. ఇఁక నగచినఁ బ్రయోజనమేమి? ఇఁకనైన ...న్నాఁడు. నిలుపుకొనఁ యుండుఁడు" అని మందలించి వారి సాహాయ్యమునఁ బాసనూతిలో- ...న బట్టలమూటలను బైటికిఁ దీసి, ఉచితముగ నంపు అకును సరిగఁ బంచియిచ్చి స్వస్థలము చేరుకొనియెను.

పిదప భానుదాసుఁడు పండరినాథుని యనుగ్రహమువలన ననేకపర్యాయములు మహాప్రభావము వెల్లడించి, అనేకులకు జ్ఞానోపదేశముచేసి రక్షించెను. అతని భార్యాపుత్రులుగూడ జ్ఞానవంతులైరి. బిడ్డలు పెద్దలైనపిదప నాతఁడు వస్తకభార మంతయు వారిమీఁద నుంచి తాను హరిభజనమునఁ గాలముగడుపసాగెను. సంసార చింత తొలఁగిపోవుటవలన నాతనియానందము మఱింత వృద్ధియయ్యెను. ఈతీరున నాతఁడు బ్రతికియున్నంతకాలమును హరిభజనమునఁ గడపి,అంతమున హరిసాయుజ్య మును బడసెను.

సీ. "అనఘాత్మ మఱి భవదవతారగుణకర్మఘనవిడంబనహేతుకంబు లయిన
రమణీయ మగు దాశరథివసుదేవకుమారాదిదివ్యనామంబులోలి
వెలయంగ మనుజులు వివశాత్ములై యవసానకాలంబున సంస్మరించి
జన్మజన్మాంతరసంచితదురితంబుఁ బాసి కైవల్యసంప్రాప్తు లగుదు
తే. రట్టిదివ్యావతారంబు లవతరించు, నజుఁడ వగు నీకు మ్రొక్కెద ననఘచరిత
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార, భక్తమందార దుర్భవభయవిదార."

(భాగ. స్కం. 3. ప. 304.)

---

## 25. రామరాజు

తుంగభద్రానదీతీరమున మాధవవిద్యారణ్యుని ప్రోత్సాహకారణమున హరి హరరాయనిచే నిర్మింపఁబడి, మహాప్రఖ్యాతివహించిన విద్యానగరము అనురెండవ పేరు గల విజయనగరమున శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని అల్లుఁడగు అళియ రామరాజు ప్రజాపాలనము చేయుచుండెను. ఆతని రాజ్యపాలనావైశద్యమును, సంగ్రామకౌశలమును చరిత్రములయందు విశదముగ వర్ణింపఁబడినవి. అతనికి ద్వార్థా

దేవియెడలఁ బరమభక్తి గలదు. అగుట నాతఁడు ప్రపంచమున నెందును ఈడు లేని యొక గొప్ప ఆలయమును గట్టించి, యందు దుర్గామహాదేవినిఁ బ్రతిష్ఠచేసి, దేవికి నవరత్నఖచితము లగు సకలాభరణములను సమకూర్చి, మహావైభవముతో ఉత్సవములు చేయించుచుఁ బూజించుచుండెను. ఒకప్పు డాతని చెంతకుఁ బండరి అంత నినుండి యొక బ్రాహ్మణుఁడు వచ్చి, "రాజా! నేను ఒక యాగము చేయుటకు భ్రమించుసకొంటిని. అందులకు వలయు ద్రవ్య మంతయు నీవలనఁగోరి వచ్చితిని" చూనా?" అను. రాజు ఇచ్చెద నని యంగీకరించెను.

సరసమైన వెలపాయంత్ర మైనపిదపఁ గొలువు చాలించి దుర్గామహాదేవిని సేవించు టకు ఆలయమునకుఁ బోయెను. పండరిపుర బ్రాహ్మణుఁడుగూడ వెంటఁబోయెను. అనర్ఘరత్నాభరణములతోడను, చీనిచీనాంబరములతోడను అలంకరింపఁబడిన గంభీర మగు దేవీవిగ్రహమును జూచియు, అనుపమాన మగు ఆలయవైభవమును జూచియు, అచ్చటజరుగుచున్న అద్వితీయసేవావైభవమును జూచియుఁ బండరిపుర బ్రాహ్మణుఁడు నిర్విణ్ణుఁడయ్యెను. రాజు మహాభక్తితో దేవుని సేవించుట యైనపిదప పండరిపురబ్రాహ్మణునిఁ జూచి "బ్రాహ్మణుఁడా! దుర్గామహాదేవి త్రిలోకజనని. ఆమెకుఁ జాలిన దైవము మఱి లేదు. భక్తులపాలి చింతామణియగు నీయమ్మకు నామీఁద నమితపుత్రవాత్సల్యము. చూడుము. మాతల్లి యెంతవైభవము ననుభ వించుచున్నదో? మీపండరినాథునకు ఇట్టియాలయము, ఇట్టియాభరణములు, ఇట్టివైభవము, ఇట్టిప్రభావమును గలవా?" యని యడిగెను.

ఈప్రశ్నవలన బ్రాహ్మణునకుఁ జాలఁ గష్టము తోఁచెను. వెంటనే యాతఁడు "మహారాజా! నీవు పండరిపురమును ఎప్పుడును జూచియుండనట్లు తోఁచుచున్నది. చూచిన నిట్లు పలుకుటకు సాహసించియుండవు. ఆహా! అచ్చటి వైభవమునకును సామ్యమా? అది సానలుతీఱిన జాతిరత్నము. ఇది కేవలము గాజుతునక. నీవు అత్యంతభక్తిశ్రద్ధలతో నారాధించు దుర్గామహాదేవి మాపండరినాథుని గోపుర భూభాగములను సమ్మార్జనముచేయు పరిచారిక యై యున్నది. అచ్చటి వైభవములు చూచితీఱవలయునే గాని, నాబోంట్లు వర్ణింప నైతిగాదు" అని నిర్భయముగఁ బలికి యూరకుండెను.

బ్రాహ్మణుఁడు ఇట్లు పలికినందులకు రాజునకుఁ జాలఁ గోపము వచ్చెను. ఆతఁడు పండ్లు పటపటఁ గొఱుకుచు "బ్రాహ్మణుఁడా! నీవుచెప్పినది అంతయు నచ్చటఁ జూపవేని నిన్ను క్రూరముగ శిక్షింతును" అని కఠినముగఁ జెప్పెను. బ్రాహ్మణుఁడు "వచ్చితివేని చూపుటకును, లేకున్న శిక్షింపఁబడుటకును సిద్ధముగా నున్నా" నని చెప్పెను. రాజు బ్రాహ్మణునితో బయలుదేఱెను; కాని బ్రాహ్మణునకుఁ

జైతన్యము లేదు. ఏమన? రాజుమాటలకు సహింపఁజాలక ఆతఁడు పండరిపురమున లేనివిషయములనుగూడఁ జెప్పెను. వానినిఁ జూపుటయెట్లు? పుణ్యమునకుఁ బోఁగాఁ బాప మెదురైనట్లు, యాగమునకు పలయుధనము యాచింపఁబోఁగాఁ బ్రాణముల మీఁదికి వచ్చెను. ఇట్లు చింతించి యాబ్రాహ్మణుఁడు పండరినాథునిహృదయమున నిలిపి "ప్రభూ! నిన్ను రాజు చులకన చేయుటకు సహింపఁజాలక నీవైభవమును నోటికి వచ్చినట్లెల్ల వర్ణించితిని. రాజు నావర్ణనమును బరీక్షింపఁగోరి వచ్చుచున్నాఁడు. నామాటలను కుక్షింభరి నగునేను ఎట్లు నిలుపుకొనఁగలను? మాటలు నిలుపుకొనఁ జాలకున్న తల నిలువదు. నాకు ఇప్పుడు వెనుకకుఁబోయిన నూయి, ముందునకువచ్చిన గోయిగా నున్నది. ఏమి చేయఁగలను? అంతయు నీదే భారము. నాతల ఎగురఁ గొట్టించినను, నీవైభవమును జెంపుచేసిచూపినను నీవే కర్తవు. నిన్నే నమ్మితిని" అని యనేకవిధములఁ బ్రార్థించెను; కాని పండరిపురముచేరునప్పటికి ఆతనిభయము ఆకస మంటఁ బెరిఁగిపోయెను. చేతితోఁ దాఁకి పిలిచినఁ గాని పలుకఁజాలని స్థితికిఁగూడ నాతఁడు పాల్పడెను.

భక్తవరదుఁడగు పాండురంగఁడు రామరాజువచ్చునప్పటికి బ్రాహ్మణుఁడు కోరినదానికంటె శతాధికముగ వైభవమును గల్పించెను. అదిచూచి అచ్చటి వారందఱును ఆశ్చర్యపడసాగిరి. రాజు బ్రాహ్మణునితో నాలయమును సమీపించెను. మార్గమధ్యమున గోపురప్రాంతమున గొప్పగొప్ప దేవతాస్త్రీలతోఁ గలిసి దుర్గా మహాదేవి సమ్మార్జనము చేయుచుండెను. రామరాజు అదిచూచి తెల్లవోయి, తన కులదైవ మగు దేవికిఁ బ్రణమిల్లెను. అంత దేవి రాజును ఆశీర్వదించి "వత్సా! నీపూర్వపుణ్యవశమున నీవు ఇచ్చటకు రాఁగలిగితివి. శ్రీపాండురంగని మహిమ అవాఙ్మానసగోచరము. బ్రహ్మ, మహేశ్వరుఁడు, మహేంద్రుఁడు మున్నగువారికిఁ గూడ నది యవాఙ్మానసగోచరమే యైయున్నది. అట్టిపాండురంగని సేవ యబ్బుట సులభము గాదు. లోనికిఁ బోయి ఆదేవుని సేవించి తరింపుము" అని నియమించెను. రాజు ఆమె యాజ్ఞను బడసి లోనికిఁ బోయెను.

ఆహా! పాండురంగని వైభవము వర్ణింప నేరి తరము? రాజు బ్రాహ్మణుఁడు చెప్పినదానికంటె సహస్రాధికమైయున్న పండరినాథుని వైభవమును చూచి అత్యా శ్చర్యచకితుఁడై, మహానందపరవశుఁడై క్షణకాలము దిగ్భ్రాంతుఁడై, పిదప వినయ విధేయతలును, భక్తిశ్రద్ధలును వెలయ పాండురంగనికి మ్రొక్కి "దేవదేవా, కూపస్థమండూకమువలె నేనింతవఱకును విజయనగరమునందే యుండి యేమియుఁ దెలియకయే సకలమును దెలిసినవాఁడ నని గర్వించి యుంటిని. ఇప్పు డీ బ్రాహ్మణుని యనుగ్రహమున నీదర్శనలాభమును బడసితిని. నాపాపము లన్నియు భస్మీభూతముల

ములై పోయినవి. నాలోచనములు సఫలములు అయినవి. సర్వేశ్వరా! జగన్నాథా! నీలీలల నెఱుంగ నెవరికి సాధ్యము? ప్రహ్లాదనారదపరాశరాదులగు అంతరంగ భక్తులకుఁగూడ నీవు అగోచరుఁడవై యుంటివి; అనఁగా నిఁక నావంటిక్షుద్రుల విషయము చెప్పనేల? పుండరీకవరదా! నీవు భక్తులపాలిటి చింతామణివి. భక్తుల మాటలలో నిలుచు కరుణాళుఁడవు. ప్రభూ! నిన్ను విడిచి నేను మనఁజాలను. కావున నా పట్టణమునకు దయచేసి నన్ను అనుగ్రహింప వేఁడెదను" అని ప్రార్థించెను. ఈ ప్రార్థనమును అంగీకరించి పండరినాథుఁడు "వత్సా! నీవు కోరినట్లు నీపురమునకు వచ్చి వసించెదను. ఈరాత్రియే నన్ను గొనిపొమ్ము; కాని నీవు ఎప్పుడైన ఏదైన అకృత్యమును చేసెదవేని, వెంటనే నేను పండరిపురమును జేరికొందును" అని చెప్పెను. రామరాజు అందులకు బ్రహ్మానందభరితుఁడై ఆరాత్రియే పాండురంగ విభుని విజయనగరమునకుఁ దెచ్చెను.

తెల్లవాఱినపిదప అర్చకులు గుడితలుపు తెఱచి అందు స్వామి లేకుండుటఁ జూచి భయభ్రాంతులై, యాసంగతి పురమునఁ బ్రకటించిరి. తోడనే యెల్లర మీఁది ప్రాణములు మీఁదనే యెగిరిపోయిన ట్లయ్యెను. పాండురంగఁడు లేని పండరిపురమున నిఁక నేమున్నది? అంతట ఆపురమునందలి స్త్రీపురుషులు ఆబాలగోపాలముగ నిద్రాహారములు మాని పాండురంగనిఁ దలఁచికొని "ఈశ్వరా! మాపై నీ కేల ననుగ్రహము తప్పిపోయెను? మేము చేసిన యపరాధ మేమి? ఎన్నఁడును రాని రామరాజు నేఁడువచ్చి ప్రార్థించినంతమాత్రమున విజయనగరమునకుఁబోవుట యేటిన్యాయ్యము? అయ్యో! ఇన్నిదినములనుండియు నున్న యీ పండరీపురము నీకు విషమైపోయినదా? ఈచోటు నెప్పుడును విడిచిపోనని నీవు పుండరీకునకు మాట యిచ్చితివి. అది నేఁడేల తప్పవలయును?" అని యనేకవిధముల విలపింప సాగిరి. అందఱు నిట్లు విలపించుచుండఁగా అంతరంగభక్తులు కొందఱు చేరి, మరలఁ బాండురంగనిఁ బండరిపురమునకుఁ జేర్చుట యెట్లు అని ఆలోచింపసాగిరి. అపుడు భానుదాసుఁడు ముందునకు వచ్చి "నేను విజయనగరమునకుఁ బోయి పాండురంగనిఁ గొనివచ్చెదను. లేకున్న అచ్చట స్వామిపాదములపై నాశిరమును బ్రద్దలు కొట్టుకొని మేను బాసెదను" అని శపథము చేసెను. "భానుదాసుఁడు పాండురంగనాథునిఁ దెచ్చుటకు సమర్థుఁడు. అతఁడుపోయిన మనకార్యము సఫలమగును" అని అందఱు నందులకు అంగీకరించిరి. వెంటనే భానుదాసుఁడు విజయనగరమునకుఁ బోయెను.

భానుదాసుఁడు ఆపురమున నొకబ్రాహ్మణునియింట వసించి, రాజ గృహమునందు పాండురంగఁడు ఉండు స్థలమును, అచ్చటివిశేషములను ఆగృహయజ

మానునివలనఁ దెలిసికొని భిక్షుకవేషమును గైకొని, మధ్యాహ్నసమయమున 'భవతీ భిక్షాం దేహి' యని భిక్ష మడుగుచుఁబోయి రాజగృహమున దాఁగుకొని యెను. అర్ధరాత్రి యగునంతవఱకు నాతఁడు అట్లేయుండి అప్పుడు పాండురంగఁడు వసించియున్న మందిరమును సమీపింపఁగా, తలుపులు తమంతట వీడిపోయెను. లోపల నంతటను వ్యాపించియున్న దీపపువెలుఁగునఁ దళతళ మెఱయు పాండురంగఁడు భానుదాసునకుఁ గాన్పించెను. తోడనే యాతఁడు హఠాత్తుగఁబోయి పండరినాథుని కౌఁగిలించుకొని, కన్నుల నీరుగ్రుక్కుచు మాటలు తడఁబడ "శ్రీహరీ, పన్నగ శాయీ, భక్తమందారా! మమ్ము ఇట్లు అగాధవిచారసాగరమునఁ గూలఁ ద్రోసి వచ్చి నీవిచ్చట నేమివైభవము ననుభవించుచున్నావు? మేము నీయెడల నేమి యప రాధము చేసితిమి? 'అతిపరిచయాదవజ్ఞా' యనునట్లు మావలన నిఁక ముందు తిర స్కారము గలుగు ననితలంచి వచ్చితివో. నీవు పుండరీకున కిచ్చిన వాగ్దానమును ఇట్లు ఉల్లంఘింపవచ్చునా? అయ్యో! పండరిపురమునందలి స్త్రీపురుషులు ఆబాల గోపాలముగ నీనిమిత్తము గోలుగోలున నేడ్చుచున్నారు. ధ్యానగమ్యుఁడవగునీకు అదియేమియుఁ దెలియుటలేదా? మామీఁద నీకు నేఁడు ఇట్లేల ఆగ్రహము గలుగ వలెను? రామరాజు నేఁటివఱకును దుర్గనుగొల్చి నేఁడామెను విడిచి, నిన్నుఁ జేపట్టి నాఁడు. ఆతనితోని సంపర్కమువలన నీకుఁగూడ నట్టిగుణమే గలిగినదా?" అని పరిపరివిధముల వగవసాగెను.

అదిచూచి పాండురంగఁడు మందహాసము గావించి "వత్సా! ఇంతమాత్రమున కింత గోలయేల? నేను భక్తిప్రీతుఁడ నని యెఱుఁగవా? నీకుఁగూడ నింత పామరత్వమా? నాకు నీవు ఎటువంటిభక్తుఁడవో రామరాజు నటువంటి భక్తుఁడే. నన్ను రామరాజు రమ్మనిన నిక్కడకు వచ్చితిని. నేఁడు నీవు పండరిపురమునకు రమ్మనుచుంటివి; కావున అట్లే వచ్చెదను, ఎట్లయినను నేను భక్తుల ఆజ్ఞప్రకారము మెలఁగవలసినవాఁడనే కాని స్వతంత్రుఁడఁ గాను" అనిచెప్పి భానుదాసుని ఓదార్చి రామరాజు తనకు సమర్పించిన అనర్ఘ్యరత్నహారమును ఆతని మెడలోఁ గీలించి, నీబసకుఁ బొమ్ము అని పంపివేసెను.

మఱునాఁడు ప్రాతఃకాలమున రాజు కాల్యకరణీయములనుదీర్చుకొని, స్నాన సంధ్యాద్యనుష్ఠానములను గూడ నెఱవేర్చుకొని, పాండురంగని సేవింప వచ్చెను. అర్చకులు తలుపులు తీయఁగా గర్భాలయమేమో చిన్నవోయినట్లుండెను. కొంత తడవునకు వారు యథార్థమును దెలిసికొని, హారము పోయినందులకు రాజు తమ్మేమి శిక్షించునో యని గడగడ వణఁకిపోవుచుండిరి. ఇంతలో రాజు వచ్చెను. రాజు వినీతవేషుఁడై యున్నను, అర్చకులకు మాత్ర మాతఁడు ఉగ్రదండధారి యగు

యమునివలెఁ గాన్పించెను. అంతట వారు ఏమైనను సరియే యని సాహసించి "తలుపులు తెఱచి చూచునప్పటికి స్వామికంఠమునందలి రత్నహారము లేదు" అని విన్నవించిరి. అదివిని రాజు ఉలికిపడి ఎవరుతీసినదియుఁ దెలిసికొనుట కేమియు నాధారము లేకపోవుట చూచి, మిప్పల పగచి రక్షకభటులపైఁ జాలఁ గోపించి "మీ ప్రాలుమాలికవలన నిది సంభవించినది. కావున మీరు ఎట్లయిన నా హారము దొంగలించిన చోరుని వెదకిపట్టుకొని తీసికొని రాకపోతిరేని క్రూరముగ శిక్షింతు" నని గర్జించి పలికెను. అంతట వారు గజగజ వడఁకుచు మఱికొందఱు భటులను దోడుసేసికొని చోరుని వెదకుటకు నలుమూలలకుఁ బోయిరి.

అప్పటి కప్పుడే భానుదాసుఁడు తుంగభద్రలో స్నానము చేయుచుండెను. గతరాత్రి పాండురంగఁడు తనమెడలో వేసిన హారము నట్లేయుంచుకొని యాతఁడు స్నానముఁజేయుచుండెను. భటులు అదిచూచి ఈతఁడే దొంగయని పట్టి తిట్టి కొట్టి రాజసభకుఁ దీసికొనిపోయిరి. రాజు విచారణసేయకయే "భగవత్ ద్రవ్యమును హరించిన యీపాపాత్ముని శూలమునఁ గ్రుచ్చిచంపుఁడు" అని సెలవిచ్చెను. భటులు దాసుని శూలముచెంతకుఁ గొనిపోయిరి.

అప్పుడాతఁడు నిర్విచారముతో "భటులారా! రాజు నాకు శూలారోపణ శిక్ష విధించె ననియు, మీరు ఆయాజ్ఞ నెఱవేర్ప నన్ను ఇటకుఁ గొనివచ్చితిరనియు నాకు విచారములేదు. నేను మరణమునకు ఎంతమాత్రమును వగచుట లేదు. నన్ను శూలముపైఁ గ్రుచ్చుటకుముందు ఒకసారి పాండురంగని దర్శనమునకుఁ గొని పొండు. నాకు అంతియే చాలును" అనిచెప్పెను. భటు లట్లేచేసిరి. భానుదాసుఁడు పాండురంగనిఁ జూచి "ప్రభూ! నేను వచ్చినపని వేఱు. నీవు విధించినపని వేఱు. ఇంత మోసగాఁడ వని యెఱుఁగనైతినిగదా? నీవిశ్లేషమును వహింపఁజాలక దర్శనమునకు రాఁగా రత్నహారము మెడలోవేసి బుజ్జగించి పంపితివి. తెల్లవారునప్పటికి రాజు హృదయమునఁబ్రవేశించి నాకు మరణదండనము విధించితివి. హా! ఎంతయుక్తి పన్నితివి! ఇట్లు పండరిపురమునకు నిన్ను గొనిపోవుటకు ఇచ్చుటకు వచ్చినవారిని ఇట్లు చేసినచో, నీకు ఏమియు బాధ యుండదని భావించితివి కాఁబోలు. అయ్యో! భక్తలోకము ఎంత మోసపోయెను. సర్వేశ్వరా! నీవు మమ్ము వంచింపఁజాలవు. నేనిపుడానందముతోఁ బ్రాణములు విడిచెదను. ఇట్లే నిన్ను పండరిపురమునకుఁ గొనిపోవు ప్రయత్నమునఁ బ్రాణములు విడుచుటకు అచ్చటి భక్తగణముఅంతయు నిశ్చయించుకొనియున్నది. లక్ష్మీపతీ! అనేక రాక్షసులను సంహరించితివి. అజయ్యులగు ననేకశత్రువులను జయించితివి; కాని మమ్ము జయింపఁజాలవు" అని పలుకుచుండఁగా, భటులు ఆతని నచ్చటనుండి శూలముదరికిఁ గొనిపోయిరి.

అయినను ఆతఁడు తన ప్రార్థనము మానలేదు. రాజభటులు ఆతని శరీరమును గడపఁజాలిరి; కాని యాతని మనోగతిని మార్పఁజాలరైరి. "కృష్ణా! నీవు ఆపన్నార్తి హరుఁడ వని పేరువడసి యిట్టిపని చేయుచున్నావు. చేయుము. మాన వలదు. నీచిత్తము వచ్చినట్లు చేయుము. నిన్ను అడ్డు పెట్టఁగలవాఁడు లేఁడు. అంతకును నీవే నియంతవు; నీవే కర్తవు. యోచించుకొనుము. భోక్తవుగూడ నీవే యగుచున్నావు. నీవు విసరినకత్తి నీమెడకే తగులుచున్నది. మానకుము విసరుము. నీఖడ్గమెంత మృదువైనది" అని భానుదాసుఁడు ఉపన్యసించుచుండగాఁ గ్రూరులను శిక్షించుటకు ఏర్పఱుపఁబడిన యాకరాళశూలము పూవులతోడను, బాలమాలికలతోడను నిండిన చక్కని వృక్షమై యుండెను. అదిచూచి ప్రజలందఱు నబ్బురంపడిరి. రాజభటులు తెల్లవోయి, వెంటనే యీవృత్తాంతము రాజున కెఱింగించిరి. తోడనే రాజు తాను శిక్ష విధించిన యాతఁడు మహాభాగవతోత్తముఁ డనియు, తీఱని భాగవతాపచారము చేసి తాను నరకకూపమునఁ బడిపోవుట తటస్థించెననియు వగచుచు క్షణములో నచ్చటకు వచ్చి, భానుదాసునిపాదములమీఁద వ్రాలి "మహాత్మా! నివురుగప్పిననిప్పువోలె నుండుటచే నీమహిమ తెలియ నేరకపోయితిని. కట్టా! ఎంతక్రూరకర్ముఁడ నైతిని. మహాభాగవతోత్తముని ఒక నీచమానవునిగా భావించి శిక్షవిధించితినిగదా? భక్తాగ్రేసరా! నావలన నపరాధమైనది. అయినను భాగవతులు క్రోధగుణవర్జితులు గావున నీకు నేను జడియుటలేదు. మఱియేమన: భాగవతులను కంటికి ఱెప్పలవోలెఁ గాపాడు శ్రీహరి నిన్నిట్లు క్రూరశిక్షకుఁ బాల్పఱిచినందులకు నన్ను మన్నింపఁడు. కావున నేను భీతిల్లుచుంటిని. మహానుభావా! నాయెడలఁ గనికరముపూని, నాయపచారమును మఱచిపోయి లక్ష్మీపతికి నాయెడలఁ గోపము గలుగకుండునట్లు అనుగ్రహింపవలయు" నని పరిపరివిధములఁ బ్రార్థించెను. జరిగినదంతయుఁ జూచి భానుదాసుఁడు ఆశ్చర్యచకితుఁ డగుచుండగా, నాతనిని రాజు పండరినాథుని సముఖమునకుఁ గొనిపోయెను.

తోడనే పాండురంగఁడు ప్రత్యక్షమయి భానుదాసునిఁ జూచి "వత్సా! నీభక్తివలన నేను జయింపఁబడితిని. నన్ను రథమెక్కించి పాండురంగక్షేత్రమునకుఁ గొనిపొమ్ము" అని యాజ్ఞాపించెను. అంత రాజు స్వామిపాదములపై వ్రాలి, "జగదీశా! నీకిది తగునా? నాపురమున నుందునని మాటయిచ్చివచ్చి యిట్లు చేయుచున్నాఁడవేల? నీవే మాటతప్పిన నిఁక సత్యవాక్యపరిపాలనముసేయువారెవరు?" అని ప్రార్థింప, పండరినాథుఁడు "నీవు అక్రమముచేసెద వేని ఇచ్చట నిలువనని నాఁడే చెప్పితిని. నీవు భానుదాసునియెడలఁ దీఱని యపచారము చేసితివి. కావున వెడలిపోయెదను" అనిచెప్పెను. అందులకు, రాజుమిగుల వగచుచు "అహో! ఇట్టివి యుండునా?

ఇట్టివాఁడవు తెలిసి నాప్రార్థనము నేల యంగీకరింపవలయును? ఇందు నాతప్పేమి యున్నది? ఎరికిని దెలియకుండ నీమెడలోని రత్నాలహారము నీవే భానుదాసుని కంఠమునఁ గీలించితివి. పిదప నాచే నాతనికి శిక్ష విధింపించితివి. పన్నాగమంతయు నీవు పన్ని, పని యంతయు నీవు చేసి, అనుభవింపరాని ఫలమును మాత్రము నాకు అంటఁగట్టుచున్నావు. అయ్యో, ఇదియేటి ధర్మము?" అని యెన్నివిధముల నిష్ఠురము లాడుచున్నను చెవినిఁ బెట్టక, సూక్ష్మరూపియై భానుదాసుని పూజాపేటికలలో చేరి పండరిపురమునకుఁ బ్రయాణమయ్యెను.

భానుదాసుఁడు పద్మాలయ మను గ్రామమువద్ద పూజాపేటికను పరిశుద్ధస్థలమున నుంచి, నదిలో స్నానముచేసి అనుష్ఠానము చేసికొని తీరమునకు వచ్చి చూచునప్పటికి పండరినాథుఁడు పేటిక మూఁత కిరీటముగను, అడుగుభాగము పాదరక్షలుగను నిజరూపముతో నిలిచియుండెను. అదిచూచి దాసు "దేవా! నిన్ను నేను ఇప్పుడు ఎట్లు కొనిపోదును?" అని యడుగఁగా స్వామి పండరిపురమునకుఁ బోయి భక్తుల నెల్లరను గొనిరమ్మని చెప్పెను. భానుదాసుఁడు పోయి వృత్తాంతమంతయుఁ జెప్పఁగాఁ బురమునందలివా రెల్లరును గదలివచ్చి స్వామిని రథముపైఁ గొనిపోయి, యథాస్థలమునఁ బ్రతిష్ఠచేసిరి. స్వామిని మరలఁ గొనివచ్చి నందులకు భానుదాసుని నెల్లరును మిగులఁ గొనియాడిరి. పాండురంగ క్షేత్రమున కార్తికమాసమున జరుగు రథోత్సవము సందర్భమున నీకథయంతయు నిప్పటికిని ఆచరణమునకుఁ దేఁబడుచున్నది. పాండురంగఁడు రామరాజును విడిచి వచ్చినను, ఆతనియంతమున ఆత్మసాయుజ్యము నొసఁగి గౌరవించెను.

మ. "అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణియో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణులై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులన్ దత్త్వవీ
క్షణమున్ జేసెద రట్టివిష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్."

(భాగ. స్కం. 2. ప. 66.)

---

## 26. ఓ హా రు సా హు కా రు

ఒక గ్రామమున ఓహారుసాహుకారు అను నొక గొప్ప వర్తకుఁడు నివసించి యుండెను. ఆతఁడు వర్తకము చేయుచున్నను, అబద్ధమును అన్యాయమును దరికిఁ జేరనీయక ధర్మశీలుఁడై పండితులను, భగవద్భక్తులను మిగులఁ బూజించుచు, వారిచే భగవల్లీలల నాలకించి యానందపరవశుఁడగుచు, బీదలకును ఆగంతుకులకును భాగవతులకును సర్వకాలసర్వావస్థలయందును అఖండాన్నదానము చేయుచు, జ్ఞానియు

విరాగియు నై యుండెను. పుణ్యవశమున నాతనికి అనురూప యగుభార్య లభించెను. ఆమె భర్తమాట కెదురాడక, సకలవిషయములయందును జేదోడువాదోడుగా నుండి, భాగవతారాధనమును గుఱించి భర్తకుఁ జాలఁ బ్రోత్సాహముఁ గలిగించుచుండెను.

ఒకనాఁడు సాహుకారు అంగడిలోనికిఁ గావలసినవస్తువులు తెచ్చుకొనుటకు సమీపగ్రామమున జరుగుచుండు సంతకుఁ బోయెను. నాఁడు భగవంతుఁడు సాహుకారుభార్యచిత్తశుద్ధినిఁ బరిశోధింపఁ దలఁచి, వృద్ధబ్రాహ్మణరూపమును ధరించి వచ్చి "అమ్మా! నాకు మిక్కుటముగ నాఁకలియగుచున్నది. భోజనము పెట్టెదవా?" యని యడిగెను. అందులకు సాహుకారుభార్య చాల సంతసించి, "మహాత్మా! దయ చేయుఁడు. నిర్హేతుక జాయమానకటాక్షము పెంపునఁ దమరు నేఁడు మాయింటికి దయచేసితిరి. మాగృహము, మావంశము, మాపూర్వులు పావనులైనారు. స్వామీ! లోపలికి దయచేయుఁడు" అని ప్రత్యుత్థానముచేసి, అర్ఘ్యపాద్యములు ఇచ్చిపూజించి మృష్టాన్నముతో సంతృప్తిపఱిచెను. భోజనసమయమునఁగూడ గృహమేధి రాకుండుటచే బ్రాహ్మణుఁడు కారణము నామెవలనఁ దెలిసికొని, పుణ్యాత్మురాలవగు నీయింటి యజమానునిఁజూచు నదృష్టము లేకపోయినది" అనియెను. అందుల కామె "స్వామీ! అట్లేల సెల విచ్చెదరు? నానాథుఁడు రాత్రికి వచ్చును. మీవంటి మహానుభావులను జూచిన నాపతి మహానందమును గాంచును. మీపాదరజో లేశము శిరమున ధరించి నేను పావనురాలనైతిని. అట్టిభాగ్యము నాభర్తకుఁగూడఁ గలిగింపరా? ఒకదినమునైన మాయింట నుండరాదా?" యని దీనతతోఁ బ్రార్థించెను. కాని బ్రాహ్మణుఁడు వినలేదు.

ఆతఁడు "తల్లీ! నీవు ప్రార్థించినట్లు నీయింట మఱియొకపూట యుండుటకు నాకు ఎట్టియభ్యంతరమును లేదు; కాని తొందరపనులు ఉన్నవి. ఉండుటకుఁ దీఱదు. పోవలెను. ఒక్కపూటతోడనే నీసౌజన్యమును, భక్తిశ్రద్ధలును, వినయవిధేయతలును వెల్లడియైనవి. తల్లీ! ఆదరము ముఖ్యముఁగాని పెట్టుపోఁతలు గావు. నీవు పెట్టిన భోజనము నిలువదు. నీవు లక్షరూపాయలిచ్చినను అవి నిలువవు. ఆదరముమాత్రమే శాశ్వతముగ నిలుచును. నేను చిన్నతనము నుండియు ననేక స్థలములలో భుజించితిని; కాని యింత యాదరము నెఱుఁగను. పతివ్రతాశిరోమణీ! నిన్నుఁ బెండ్లియాడుటవలన నీభర్త ధన్యుఁడైనాఁడు. నీసౌజన్యమును జూచిన నాకుఁ బరమానంద మగుచున్నది. సాధ్వీమతల్లీ! సంపదలు శాశ్వతములు కావు. తనువులు సుస్థిరములు కావు. సంసారము సారమైనదిగాదు. ఐహికసుఖములు ఆభాసములు. పుట్టినపుడు మనమేమియు వెంటఁదీసికొని రాలేదు. అట్లే పోవునపుడు

కొనిపోము. మానవు లెంతసంపద నార్జించినను వెంటరాదు. చుట్టాలు, మిత్రులు అందఱును శ్మశానమువఱకు మాత్రమే వచ్చెదరు. చేసికొనిన పుణ్యపాపములుమాత్రమే వెంటవచ్చుననిన, అట్టి యీయస్థిరజీవితముకొఱకు నానాయాతనల ననుభవించుట యేమివివేకము? అంతకును మనస్సే కారణము. బుద్ధి దానినిఁ ద్రిప్పుచుండును. కావునఁ దన్మూలమున మనస్సును బరిశుద్ధము చేసికొనవలయును. విషయసుఖముల బొంతఁబోయిన ప్రాణికి ఇఁక గతి లేదు. అధఃపతనమే యాజీవికి సిద్ధించునది. మలమూత్రపురీష బంధురమగు యీదేహముపై నభిమానము వహించి, యుక్తాయుక్తపరిజ్ఞానములేక, పుణ్యపాపవిచక్షణతలేక చరించువారు కుంభీపాకనరకమునఁ గూలఁబడియెదరు. నారాయణునిఁ బూజింపుము. భాగవతుల నర్చింపుము. భాగవతులు సదా సంచారము చేయుచుందురు. వారు అన్నముకొఱకు రారు. సంసారులను తరింపఁ జేయుటకై వారు భగవత్ప్రేరితులై వచ్చుచుందురు. వారిని సేవించితివేని నారాయణునియనుగ్రహము సులభముగఁ బడయఁగలవు. వారు నాస్తికుల యింటికిఁ బోరు. గురునిందకులను జూడఁబోరు. ఒక్కొక్కప్పుడు వారు తమ్మెవ రాదరింతురో, వారిభక్తిశ్రద్ధలను గనుఁగొనుటకుఁ గఠినముగఁ బరీక్షింతురు. అందులకు జంకకుము. అనుమానపడకుము. భాగవతులకు అనుగ్రహముఁగలుగుటక్షణము. వారికి అపచారములుచేయువారికి అధోగతిఁగలుగుటయు క్షణమే. బీదలను శక్తికొలఁదిగఁ బోషించువారిని నారాయణుఁడు రక్షించును. తల్లీ! నేను నీయింటనున్న కుండలనన్నిటినిఁ దాఁకి చూచినాను. వానిని నీవు ఇప్పుడు తెఱచి చూడకుము. భాగవతారాధనము ఎప్పుడు సాగదో, బీదలకు అన్నార్తులకు అన్నముపెట్టుట యెప్పుడు సాగదో, అప్పుడు వానినిఁ జూడుము. మీయిడుమలన్నియుఁ దీఱును." అని పలికి, ఆమెవలన వినతులను పడసి వెడలిపోయెను.

సాయంత్ర మగునప్పటికి ఓహారుసాహుకారు సంతచేసికొని యింటికి వచ్చెను. భార్య భర్తకు జరిగినదంతయుఁ జెప్పెను. అప్పుడు సాహుకారు చాల ఆనందించి, "నేను ఇంటలేని లోపము లేకుండఁ జేసితివి. నామర్యాద నిలిపితివి. నిజముగఁ గుటుంబభారము గుర్తెఱిఁగి నడచుకొను రమణీమణి లభించుట చాలఁ గష్టము. నాపూర్వపుణ్యవశమున నీవు భార్యగా లభించితివి. ఒక భాగవతాగ్రేసరుని యనుగ్రహమును సంపాదించియుంచిన నీచాతుర్యము నేమని కొనియాడఁగలను?" అని భార్యను జాల నాదరించి పలికెను.

కొన్నిదినములు కడచిపోఁగా, నాకస్మికముగా సాహుకారుఇంటికి అనేక భాగవతులు వచ్చిరి. "ఇందఱు భాగవతులకు అన్నదానము చేయుటకు మనకు శక్తి లేదు. వెడలిపొండు అని చెప్పుటకు నోరాడదు. ఇప్పుడు ఏమి చేయవచ్చును?"

అని సాహుకారు పగవసాగెను. అప్పు డాతనిభార్య "మీరిట్లేల వగచెదరు ? నాఁడు మీరు సంతకుఁ బోయి యున్నపుడు వచ్చిన భాగవతాగ్రేసరుఁడు భాగవతారాధనము దుష్కటముగాఁదోఁచినపుడు, మీయింటనున్న కుండలో నొకదానినిఁ దెఱచి చూచుకొమ్మని చెప్పియుండెను. అదేమో నేఁడు చూతము" అని చెప్పెను. దంపతు లిద్దఱును బోయి యొక కుండ తెఱచి చూడఁ దానినిండ మొహరీలు ఉండెను. అందులకు వారిరువురును బరమాశ్చర్యచకితులై వలసినన్ని మొహరీలు తీసికొని బజారునకుఁ బోయి సకలసామగ్రినిఁ గొనివచ్చి, భాగవతులకుఁ దృప్తిగా భోజనమిడి, సదక్షిణాకముగాఁ దాంబూలములనిచ్చి దీవనలనంది పంపివేసిరి. పిదప సాహుకారు భార్యను జూచి "నీవు చెప్పినమాటలవలన ఆభాగవతోత్తముని నేను సామాన్యముగఁ దలంచితిని; కాని ఆమహానుభావుఁడు భగవంతుఁడు సుమా! నీసుగుణములకు మెచ్చి, నీవుచేయుభాగవతారాధనము అవిచ్ఛిన్నముగ జరుగుటకై వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి అక్షయధనము నొసంగిపోయెను. ఆహా! నీవెంత పుణ్యవతివి? భగవంతుని నెంత సులభముగ దర్శించితివి. రమణీమణీ! నీసాహచర్యమువలన నేను ధన్యుఁడనైతిని" అని భార్యను గొనియాడి, "కృష్ణా! దేవకీనందనా! యశోదానందవర్ధనా! భక్తలోకమందారా! నేను లేనపుడు వచ్చి నాభార్యకు దర్శనమిచ్చి సదుపదేశముచేసి అక్షయవరము నిచ్చిపోయితివి. నాకేల సాక్షాత్కరింపవైతివి? నేనేమి పాపముచేసికొంటిని? నాభార్యతోడిసాహచర్యము వలన నాపాపములన్నియు భస్మీపటలమైపోయియుండఁగా, నన్నేల తిరస్కరించితివి? నీవింతపక్షపాతము నెప్పటినుండి నేర్చుకొంటివి? నేను నిన్నెమియు నిందించి యెఱుగను. నీపాదారవిందస్మరణ మఱచి యెఱుఁగను. నీగుణకీర్తనమును మానిన పాపమునకుఁ బోయియెఱుఁగను. అట్టి నాకు ఈశిక్ష యేల విధించితివి? నిరపరాధి నగునాకు ఈయనుతాపము నేల ఘటించితివి?" అని యనేకవిధముల భగవంతుని దలంచి దుఃఖింపఁదొడఁగెను. తోడనే భగవంతుఁడు శంఖచక్రాద్యాయుధహస్తుఁడై నిజరూపముతో సాక్షాత్కరించి సాహుకారుపరిచర్యలను బడసి, దీవించి వెడలిపోయెను. భగవంతుఁడు సాక్షాత్కరించినందులకు ఆదంపతులు మహానందసాగరనిమగ్నులై కొంతవఱకును నిశ్చేష్టులై యుండిరి.

మఱియొకనాఁడు కొందఱు భాగవతులు వచ్చిరి. సాహుకారును ఆతని భార్యయు వినయముతో వారికి అర్ఘ్యపాద్యాదిషోడశోపచారములను జేసి పూజించిరి. అందులకు భాగవతులు మిక్కుటముగ హర్షించి, "ఓపుణ్యదంపతులారా! మీభక్తిశ్రద్ధలకు ఆనందించితిమి. లక్ష్మీనారాయణులవోలెఁ బ్రకాశించు మీయింట నాతిథ్యమును బడయుటచే మేము ధన్యులమైతిమి. మీరును

సర్వమును దెలిసినవారు. అయినను మేము వెడలిపోవుటకు ముందు ఒక్కసంగతిని దెలుపఁ దలఁచియున్నాము. మీపూర్వపుణ్యమువలనఁ దమంతనే మీకు జ్ఞానవైరాగ్యము లలవడినవి. అయినను ఆచార్యోపదేశమును మీరు పొందవలసి యున్నది. శంఖములోఁ బోసినఁగాని తీర్థము కానట్లు, సదాచార్యునివలన నుపదేశమును బడయనివారికి భక్తిజ్ఞానవైరాగ్యములు సిద్ధింపవు" అని చెప్పిరి. అప్పుడు సాహుకారును, ఆతని సతీరత్నమును వచ్చినభాగవతులలో నుత్తముఁడగు నాతనిని ఆచార్యునిగా వరించిరి. ఆభాగవతోత్తముఁడు ఆదంపతులకుఁ దారకమంత్రము నుపదేశించి, "భగవంతుఁడు సర్వసముఁడు. పిపీలికాదిబ్రహ్మపర్యంతముఁ గల సకలప్రాణులును ఆతనికి సమానము. ఈరహస్యము నెఱుంగక భేదభావమును జూపువారు సర్వేశ్వరుని యాగ్రహమునకుఁ బాత్రులయ్యెదరు. భగవంతుని యనుగ్రహము దక్క భాగవతులకు మఱియొకటి కోరఁదగినది లేదు. ఫలనిర్దేశము చేసికొని భగవదారాధనముచేయువారు కేవల మవివేకులు. సర్వలోకశరణ్యుఁ డగు శ్రీకృష్ణుని నిష్కామకర్మతో నారాధించువారికి లభింపనిది ఏమిగలదు? భగవంతుని పాదపద్మములను హృదయకమలములయందు నెలకొల్పుకొనుఁడు. భాగవతుల శ్రీపాదపద్మముల నారాధింపుఁడు. రమాకాంతుని యనుగ్రహమువలన మీకు ధనాభావము లేదు. కావున అన్నార్తులై వచ్చినవారికి సదా అన్నదానము చేయుఁడు. భూతతృప్తినిఁ గలిగించుటలో నన్నదానమును మించినది మఱి లేదు" అని యుపదేశించి వెడలిపోయెను.

ఆచార్యోపదేశానుసారముగ నాదంపతులు భాగవతారాధనమును, భగవదారాధనమును జేయుచుఁ గాలముఁ గడుపుచుండిరి. ఇట్లుండఁగా, వారికి భగవంతుఁడు సాక్షాత్కరించి "మీసేవవలన నా కానందమైనది. మీరు నాయంతరంగభక్తులైతిరి" అని చెప్పి, అంతర్హితుఁడయ్యెను. బ్రతికియున్నంతకాలమును ఆదంపతులు ఇట్లే భగవద్భాగవతారాధనముచేసి, అవసానమున నీశ్వరసాయుజ్యమును బడసిరి.

ఉ. "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

(భాగ. స్కంధ. 8, ప. 73.)

# 27. త్రిపురదాసుఁడు

మధురాపురమును భాగవతారాధనపరుఁ డగు నొకరాజు పరిపాలించుచుండెను. ఆతనికిఁ ద్రిపురదాసుఁడు అను నొకమంత్రి గలఁడు. ఆతఁడు సంసారమునం దున్నను దామరాకులోని నీటిబొట్టువలె నంటక, రాజకార్యపరతంత్రుఁడైనను కేవలపరమార్థచింతతోఁ బ్రవర్తించుచు, భక్తిజ్ఞానవైరాగ్యశాలియై భక్తిప్రపత్తులు వెలయ భగవత్కైంకర్యము సేయుచు, ఇంటికివచ్చు భాగవతులను సేవించుచు నుండెను. ఒక్కొకప్పుడు ఆతఁడు భగవద్గుణానుభవపరవశుఁడై, సకలమును మఱచి తన్మయుఁడయి దినములు గడుపుటఁ గూడఁ గలదు.

ఉన్నమంత్రులయం దెల్ల త్రిపురదాసుఁడే ప్రజ్ఞాశాలి యగుటచే నాతఁ డట్లుండుట రాజునకుఁ జాలఁ గష్టముగా నుండెను. సాధారణముగా రాజులు అతిసుకుమారులై సకలకార్యములను స్వయముగ నెఱవేర్చుకొనఁజాలక, మంత్రులపై నాధారపడి యుందురు. ఈరాజుఁగూడ నట్టివాఁడే యగుటచే నొకనాఁడు త్రిపురదాసునిఁ జూచి "ఓయీ! నీవు భగవత్పూజాధురంధరుఁడ వైనందులకు నే నెంతో సంతోషించుచున్నాను. నిన్ను ఆమార్గమును విడిచిపెట్టుమని యెన్నఁడును నిర్బంధింపఁజాలను; కాని నీవు సమాధినిష్ఠుఁడవై యన్య మెఱుఁగక దినములకొలఁది గడుపుచుండుటచే నారాజకార్యములకు భంగము తటస్థించుచున్నది. కావున నీవు నాకేదైనమార్గమును జూపవలెను. నాకుఁ గూడ నీయపారసంసారముమీఁద నసహ్యముఁ గలుగుచున్నది. రాజ్యమునకుఁ దగిన కట్టుదిట్టము లన్నియుఁజేసి, నన్నుఁ గూడఁ దరింపఁజేయుము" అని చెప్పెను. అపుడు మంత్రి "రాజా! అట్లయిన నిందుల కొకచేయుపాయముఁ గలదు. నీకుమారుఁడు రాజై రాజ్యమును బాలించుటకును, నాకుమారుఁడు మంత్రియై మంత్రాంగము చేయుటకును ఇపుడన్ని విధములను దగియున్నారు; కావున నీకుమారునకుఁ బట్టము గట్టుము. నాకుమారునకు మంత్రిత్వ మొసఁగుము. నీవు విరాగివై మోక్షమును సాధింపఁబూనుకొనుము. నన్ను భగవంతునిఁ బూజించి తరింపనిమ్ము. ఇది యుభయతారక మగుమార్గము" అనిచెప్పెను. రాజు అందుల కంగీకరించివెంటనే శుభముహూర్తమునఁ దన కుమారుని విశాలరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేసి, మంత్రిపుత్రుని మంత్రినిఁ జేసి, వారి సామర్థ్యములను గొన్నిదినములు పరిశీలించి, "ఇక నాకు రాజ్యసంబంధము అవసరము లేదు. మంత్రీ! నీకుమారుని సాహాయ్యమున నాకుమారుఁడు నిష్కష్టముగను, అరిభయంకరముగను ప్రజల నేలఁగలఁడు. కావున మనము నిశ్చింతులమైతిమి. ఇక నాకు మోక్షసాధనోపాయము నుపదే

శింపుము” అని కోరెను. దాసుఁడు రాజుతో “రాజా! మోక్షసాధనమునకు ఒరులు మార్గము చూపుటలో విశేషము లేదు. మోక్షాసక్తునకు ఉపాయముతోఁ బనిపోదు. తాడిచెట్టు ఎక్కువాని నెంతవఱకు నితరుఁడు త్రోయఁగలఁడు? అయినను వినుము. సంసారసంబంధములన్నియు వదలించుకొనుము. విషయసుఖాశాలతను ఛేదింపుము. పురోపకంఠమునఁ గలపూలతోఁటలో పర్ణకుటీరమును నిర్మించుకొని, యందు భార్యతో వసించి, భగవద్భాగవతారాధనమును జేయుచుండుము. సకలప్రాణులను సమానభావముతోఁ జూడుము. ఇట్లు జరిగిపోవుచుండునేని, కొన్నిదినములకు సదాచార్యుఁడు లభించును. అపు డాయాచార్యునిచే నుపదేశమును బడసి, యథాపూర్వముగ భగవద్భాగవతారాధనమును సాగించెదవేని, మోక్షము కరతలామలక మగును. భార మంతయు సర్వేశ్వరునిమీఁద నేయుంచి, నిష్కామకర్మతో మాత్రము శ్రీహరిని సేవింపు” మని యుపదేశించి, తాను బృందావనమునకు వెడలిపోయెను.

త్రిపురదాసుఁడు భార్యాసమేతుఁడై శ్రీకృష్ణుని యాలయమునకు సమీపమునందే యొక చిన్నవనమునఁ బర్ణశాలను నిర్మించుకొని, ప్రతిదినమును స్వామి దర్శనము చేసికొనుచు హరిధ్యానమునందును, హరిభజనమునందును, హరికైంకర్యమునందును గాలముఁ గడుపఁజొచ్చెను. ఆతనిభార్య ఛాయవలె, సకలవిషయములయందు నాతని ననువర్తించుచుండెను. ఒకనాఁడు దాసుఁడు “స్వామికి వస్త్రము నీయవలయు” నని భార్యతోఁ జెప్పెను. అందుల కాసాధ్వి యేమి చెప్పఁగలదు? ఇంటనేమియు లేదు. ప్రతిదినమును బృందావనక్షేత్రమునకువచ్చు యాత్రికులెవరైన నిన్ని బియ్యమిచ్చిన భుజించుటగలదు. లేకున్న లేదు. పాప మామె యిది యంతయు నాలోచించియే “మన మాకనకాంబరధరునకుఁ దగినవస్త్రము నెట్లు సమర్పింపఁగలము? మనము వస్త్రమునీయకున్న స్వామికిఁగఱవా?” యనియడిగెను. అందులకు దాసుఁడు “భక్తితోనిచ్చినది పత్రమైనను శ్రీహరి స్వీకరించును. లేకున్న మన మాసర్వేశ్వరుని బూజింపఁగలమా? ఆస్వామికి సేవచేయువారు కఱవనియే మనము సేవించుచుంటిమా? మానవులకుఁగాని జగన్నాథునకుఁ గఱవెక్కడిది? ఈప్రపంచమునందలి వస్తుసముదాయములో నాతనిది కానిది ఏది? అతనికి ఇది చాలునా? కఱవా?” అని యాలోచించుట మనపనిగాదు. మనపని సర్వమును ఆప్రభుచూడామణికి అర్పించుటయే. శ్రీకృష్ణుఁడు తన మందిరమున అటుకులు లేకయే కుచేలుఁడు జీర్ణవస్త్రము కొంగునముడిచి తెచ్చినవి స్వీకరించినాఁడా?” అని చెప్పి, వంటచేసికొను పాత్రనమ్మి యొకవస్త్రమును గొని ఆలయమునకుఁబోయి, “ఈ వస్త్రము స్వామికి వినియోగింపుఁడు” అని అర్చకుల కిచ్చెను. “స్వామికి నూలువస్త్రమా?” అని అర్చకులు పరిహాసించిరి. “ఎందులకుఁ గాఁగూడదు?” ఎవరికిఁ గలవస్తువు వారు సమర్పింతురు.

అందఱును కనకాంబరములు తేఁగలరా?" యని దాసుఁడు వెడలిపోయెను. "అట్లే
సమర్పింతుములే పొమ్ము" అని అర్చకులు అతనిని బంపివేసిరి. రాత్రియైనతరువాత
నర్చకులలోనొకఁడు ఆవస్త్రమును బఱచుకొని స్వామిసన్నిధిని శయనించెను.

అర్చకుఁడు చేసిన పనికి శ్రీకృష్ణునకుఁ జాల కోపమువచ్చెను. స్వామి అర్చక
లకు త్రిపురదాసుఁడు తనకు అంతరంగభక్తుఁడు అని తెలుపఁగోరి, గాఢమగుచలిని
గల్పించుకొని గజగజ వడఁకసాగెను. అదిచూచి అర్చకులు అమూల్యము లగు అనేక
వస్త్రములను గొనివచ్చి కప్పిరి; కాని, చలితీఱలేదు. అర్చకులు "ఇఁక వస్త్రముల
తేఁజాలము. ఈయుపద్రవమును దాఁటుటయెట్లు?" అని తల్లడిల్లుచుండఁగా, స్వామి
శయనించినయర్చకుని స్వప్నమున సాక్షాత్కరించి "దాసుఁ డిచ్చిపోయిన నూల
వస్త్రమును గప్పుము" అనిచెప్పెను. అంత నాయర్చకుఁడు ఉలికిపడి లేచి, తనస్వప్న
వృత్తాంతమును దోడివారి కెఱింగించెను. అదివిని వారందఱును అయ్యో! మనము
స్వామికి అపచారముచేసితిమి. అతఁడెతఁడో స్వామికి అంతరంగభక్తుఁడు. మనము
తెలియక తిరస్కరించితిమి." అని నొచ్చుకొనుచు, ఆనూలు వస్త్రమును స్వామికి
గప్పిరి. తోడనే చలియు, వడఁకును మాయ మయ్యెను. ఈయద్భుతమును జూచి
అర్చకులు చాల వింతపడి, వడివడిగఁబోయి త్రిపురదాసునకును, ఆప్రాంతములనున్న
వారికిని గడచిన సమాచార మంతయు నెఱింగించిరి. తోడనే దాసుఁడు
ఆలయమునకు వచ్చి స్వామికి సాష్టాంగదండప్రణామములర్పించి, "ప్రభూ! నీవు
పీతాంబరధరుఁడవు. అనేకభక్తులు నీకు దివ్యపీతాంబరములను సమర్పించి
తరించియున్నారు. అవన్నియు నుండఁగా, నానూలువస్త్రమే నీకు కావలసి
వచ్చెనా? దీనబాంధవా! నామీఁద నెంతయనుగ్రహము చూపితివి? ఇంతకంటె
నాకు ఏమి కావలయును? నీవు కోరినసేవ నంగీకరించితివి. ఈయనుగ్రహమును నా
మీఁద శాశ్వతముగా నుంపుము" అని కొనియాడి, వెడలిపోయెను. పోవునపుడు
"మాయపరాధమును క్షమింపవలయు" నని యర్చకులును, "మమ్ము శిష్యకోటిలోఁ
జేర్చికొనవలసిన" దని చూడవచ్చినవారును, శ్రీకృష్ణునకంటె నధికముగాఁ ద్రిపుర
దాసునకుఁ బాదములమీఁద వ్రాలి, సాష్టాంగనమస్కారములు సమర్పించి ప్రార్థించిరి
వారి నందఱను వీడ్కొలిపి...

మయ్యెను.

ఒకనాఁడు భగవంతుఁడు త్రిపురదాసుని భక్తిజ్ఞానవైరాగ్యములకు సంతో
సించి, నిజరూపముతో దర్శన మిచ్చెను. తోడనే భార్యాసమేతుఁడయి దాసుఁడు
అనంతనామములతో స్వామిపాదములను బూజించి, సాష్టాంగనమస్కారము లాచ
రించి "వరదా! ఆర్తత్రాణపరాయణా! సకలాపరాధి నగు నాయెడల నింత యను
గ్రహము చూపుదు వని కలలోనైనఁ దలంపలేదు. ఈయధముని గుఱించి నీవెంత

కష్టపడుచున్నావు. స్వామీ! యాచకునకుఁ దృప్తి యుండదు. నీయంతరంగసేవ నభిలషించు నాకు, నేఁడు నొసంగిన దర్శనముతోఁ దృప్తి కలుగుటలేదు. నీవు మాటిమాటికి నిట్టి దివ్యదర్శనము నొసంగి, నాపాపములను దహించి, నాసేవ నంగీకరించుచుండవలయు” నని ప్రార్థించెను. భగవంతుఁడు మందహాసముఁ గావించి, అట్లే కానిమ్ము. అని యంతర్హితుఁ డయ్యెను.

త్రిపురదాసుని యనుజ్ఞ నంది మధురాపురమున రాజు భార్యాసహితుండై, పూఁదోఁటయందలి పర్ణశాలలో భగవదారాధనముచేయుచుండెను గదా! ఆదంపతుల భక్తిజ్ఞానవైరాగ్యములకుఁ గూడ నానందించి, శ్రీకృష్ణుఁడు నిజరూపముతో సాక్షాత్కరించెను. ఆదంపతులు ఈశ్వరుని అనేకవిధములఁ గొనియాడి పూజించి, రక్షింపవలయు నని ప్రార్థించిరి. అంత భగవంతుఁడు వారినిఁ జూచి “మీరు సద్గురునివలన నుపదేశమును బొంది తన్నియమానుసారముగఁ బ్రవర్తింపుఁడు. గురువచనపాలనమువలన మోక్షము మీకుఁ గరతలామలకమగును. బృందావనమున త్రిపురదాసుఁడు అను మహాభాగవతచూడామణి కలఁడు. మీరాతని నాశ్రయింపుఁడు” అని చెప్పి, తిరోహితుఁ డయ్యెను. అంత వారు అనేకవిధముల భగవంతునిఁ గీర్తించి, తత్క్షణమే బయలుదేఱి బృందావనమునకుఁబోయి త్రిపురదాసునకును - ఆతని భార్యకును సాష్టాంగనమస్కారములు ఆచరించి, సకలోపచారములును జేసి శరణువేఁడిరి. దాసుఁడు రాజదంపతుల భాగ్యమును గొనియాడి, వెంటనే వారిని ఆలయమునకుఁ గొనిపోయి, శ్రీకృష్ణభగవానుని దర్శనముచేయించి, మఱల నింటికిఁ గొనివచ్చి, శుభముహూర్తమున మంత్రోపదేశముచేసి “భగవంతుఁడు మీయెడల దయఁగలిగి యున్నాఁడు. మీరు ఆదయ నభివృద్ధియగునట్లు ప్రవర్తించుకొనవలయును. ఇందు రహస్యమేమియు లేదు. భక్తిజ్ఞానవైరాగ్యమార్గము లిదివఱకే మీకుఁ దెలిసియున్నవి. ఆమార్గమునుండి మీహృదయములు తొలఁగిపోకుండునట్లు చూచుకొనుచుండుఁడు” అని బోధించెను. రాజదంపతులు గురుదేవునకు శతసహస్రప్రణామముల నర్పించి, యథాస్థానమునకుఁబోయి భగవద్భాగవతారాధనము సాగింపఁజొచ్చిరి. ఇట త్రిపురదాసుఁడు సాధుసజ్జనపూజనమును, భగవద్భాగవతార్చనమును జేయుచు, తుదకు భార్యాసమేతుఁడై శ్రీహరిసాయుజ్యమును బడసెను. అట రాజుగూడ బ్రతికియున్నంతకాలము నీశ్వరునిఁ బూజించి, భార్యతోఁగూడ తుదకు ఈశ్వరసాయుజ్యము నందెను.

మ “అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ స్వానందబ్రహ్మా మం
దరయక్ లేవఁట దండభృద్భటవిమానాకీర్ణులై కూలు నా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ.” (భాగ. స్కం 4. ప. 283.)

# 28. కూర్మదాసుఁడు

ఒక గ్రామమున నొక బ్రాహ్మణునకు లేక లేక యొక కుమారుఁడు గలిగెను. కాని యేకారణమువలననో, యాతనికిఁ గాళ్లు లేవయ్యెను. అదిచూచి యాతని తల్లి దండ్రులు ఆబిడ్డఁడు అనూరుని యంశమునఁ బుట్టెనని యానందింపసాగిరి. కాళ్లు లేమి నడవఁజాలక యాతఁడు తాఁబేటివలె ప్రాఁకుచుండుటచే తల్లిదండ్రులు కుమారునకుఁ గూర్మదాసుఁడు అను పేరు పెట్టిరి. ఆపేరు పెట్టుటలో వారి యభిప్రాయము నెఱుఁగనివారు పేరు స్థితికిఁ దగినట్లే యున్నదని యనుకొనసాగిరి. ఆదంపతులు ఆకుంటి పిల్లవానినే చాల గారాబముతోఁ బెంచుకొనుచుండిరి.

జ్ఞానము వచ్చినది మొదలు కూర్మదాసుఁడు ఎచ్చట భగవద్భజనమైనను నెట్లో ప్రాఁకిపోయి, చాల భక్తిశ్రద్ధలతో వినుచుండెను. ఒకనాఁ డాతఁడు పాండురంగమాహాత్మ్యమును వినియెను. తోడనే యాతనికి పండరిపురమునకుఁ బోయి, పాండురంగని సేవింపవలయునని యుత్కంఠ పొడమెను; కాని యది యెట్లు సాధ్యపడును? ఎంతోదూరమున నున్న పండరిపురమునకు ఈకుంటివాఁడు పోవుటయెట్లు? అయినను ఆతఁడు ఉత్కంఠఁ బట్టఁజాలక అచ్చటనున్న వారినిఁ జూచి వందనములు చేసి, "మహాత్ములారా! నాకు పాండురంగని సేవింప నభిలాషగలిగినది. ఈజన్మములో నాకది సాధ్యపడునా? పాండురంగఁడు నాసేవ నంగీకరించునా?" యని యడిగెను. అదివిని యచ్చటివా రెల్లరును పకపకనవ్వి, "ఉట్టికెగుర లేని యమ్మ స్వర్గమున కెగిరినదఁట! అట్లున్నది నీగొంతెమ్మకోరిక. సకలావయవములును గల దృఢకాయుల మగు మేమే అక్కడకుఁ బోలేమని జంకుచున్నాము. నీకెట్లు సాధ్యపడు, నూరకుండుము" అని మందలించిరి. ఆయభాగ్యుల నిరుత్సాహవచనముల నాతఁడు లెక్కచేయలేదు. "దృఢగాత్రులు ఒకదినములోఁ జేరు స్థలమునకు నేను నెలలోఁ జేరఁగలను. పండరిపురము నాకు దుర్గమముగాదు" అని భావించి, వెంటనే యాతఁడు మహోత్సాహముతో "శ్రీహరీ" యని పిలుచుచు గమ్యస్థానమునకుఁ బయలు దేఱెను.

నాఁడు సాయంత్ర మగునప్పటికి ఆతఁడు రెండుక్రోసుల దూరము పోయెను. సాయంత్ర మగుటవలనను, ఆయాసము కలుగుటవలనను ఆతఁ డిఁక ముందునకుఁ బోలేక ఒక గ్రామము చేరికొని, అందున్న ఆంజనేయస్వామి యాలయమునఁ బ్రవేశించి బడలిక తీర్చుకొనసాగెను; కాని రాత్రి యైనకొలఁదిని విజృంభించు క్షుద్బాధను తీర్చుకొనుట యెట్లు? అంత నాతఁడు "శ్రీహరీ! పాండురంగా! నీకంటె నన్ను

మెఱుఁగను. నీసేవయందు పేరాసఁ గలిగియున్నాను. నీవే నాకు దిక్కు. నీదర్శనమిచ్చి యొక్కటఁణ మైన సేవ యొసంగినఁజాలును. అంతకంటె నాకుఁ గోరఁదగినది మఱి యొకటి లేదు" అని పరితపింపఁజొచ్చెను. ఈపరిదేవనము దీనావనుండగు పాండు రంగని చెవులఁబడియెను. తోడనే యాతఁడు ఒకవర్తకునిరూపముతో వచ్చి కూర్మ దాసునకుఁ అన్నపానములిచ్చి యాదరించి, "భక్తాగ్రణీ! నేనొక వర్తకుఁడను. పండరి పురమునకుఁ బోవుభక్తజనులకు అన్నపానము లిచ్చుటయే నాపని. అందులకై నీవు బాధపడవలసిన పనిలేదు. నీకంటె ముందుఁబోయి నీవు నిలుచుచోట అన్నపానములు సిద్ధముచేసి యుంచుచుందును. నీవు యథేష్టముగ భుజించి, పండరిపురమునకుఁబోయి పాండురంగనిసేవించి తరింపవచ్చు" నని చెప్పి వెడలిపోయెను.

చెప్పినప్రకారమే వర్తకరూపియగు సర్వేశ్వరుఁడు కూర్మదాసుఁ డెచ్చట నిలిచిన, నచ్చటనే అన్నపానాదిసౌకర్యములను గూర్చి చాల ఆదరించుచువచ్చెను. వర్తకుని యవ్యాజకరుణకు ఆశ్చర్యపడుచు కూర్మదాసుఁడు అతిప్రయాసతో నాల్గుమాసములు నడచి, కార్తికశుద్ధదశమినాటికి బహుళాపురము అనుగ్రామము జేరుకొనియెను. అందలివారంఱును గార్తికశుద్ధైకాదశినాఁడు పండరిపురమున జరుగు మహోత్సవమును జూచుటకు దశమినాఁడు బయలుదేఱిరి. వారి నందఱను జూచి దాసుఁడు "కట్టా! నాకుఁగూడ కాళ్లు ఉండినచో వీరితోఁ గూడఁబోయి ఆమహోత్సవమును జూచి తరించి యుందునుగదా! అట్టి యదృష్టము నాకు లేక పోయినది. ఏమి చేయఁగలను? అని చాలఁ జింతించి, పండరిపురమునకుఁ బోవు వారినిఁ జూచి "మహాత్ములారా! మీవలెనే రేపు పండరిపురమునఁ జరుగుమహో త్సవమును జూచి యానందింపవలయు నని నాకెంతో యభిలాష గలదు; కాని నాకోరిక సాధ్యముకానిది. ఏమి చేయుదును? ఇఁక మీయెడల నాప్రార్థన మే మనఁగా: నామాఱుగ మీరు సామికి సాష్టాంగవందనములు సమర్పింతురా? ఇఁక నేడుదినములు నడచినఁగాని పండరిపురము చేరలేని యీ కుంటివానికి మీ రీ మహోపకారమును చేసెదరా? నాకు దర్శన మిచ్చి రక్షించునట్లు పాండురంగనిఁ బ్రార్థించెదరా?" అని యడుగ, వారు "భక్తశిఖామణీ! నీకు విచారము వలదు. నీయభీష్టమును మేము నెఱవేర్చెదము. నిన్నురక్షింపు మని భగవంతుని మేము ప్రార్థింతుము" అనిచెప్పి వెడలిపోయిరి. కూర్మదాసుఁడు ఆమాటలు విని భగవం తుఁడు సాక్షాత్కరించి నట్లే యానందించెను.

యాత్రికులు పండరిపురముచేరి కూర్మదాసుని వినతులను విన్నపములను బాండురంగనికి సమర్పించి, పిదపఁ దమ స్వవిషయము చూచుకొనిరి. నామదేవుఁడు

మున్నగు అంతరంగభక్తుల భజనమునకు మెచ్చి, ఆనందపరవశుఁడై యున్నస్వామి యీప్రార్థనము నాలకించి నామదేవుని జ్ఞానదేవునిఁ జూచి, నాతోఁ రండు అని చెప్పి కూర్మదాసునికి సాక్షాత్కరింప బయలుదేఱెను. అంత నాయంతరంగభక్తులిరువురును "శ్రీహరీ! నీలీలలు బ్రహ్మేంద్రాదులకుఁ గూడ నవాఙ్మానసగోచరములు. ఒకనికి సాక్షాత్కరించి యొకని నుద్ధరింతువు. ఒకనిం జూచుచు నొకనితోమాటాడెదవు. ఏకకాలమునందే కొందఱ నాడింతువు. కొందఱి నానందవివశులం గావింతువు. అప్పుడే యొకచోట భక్తులతోఁగూడి నాట్యమాడెదవు. ఒకదీనుని రక్షింపఁ బరు వెత్తెదవు. ఇట్లు సర్వాంతర్యామివై యుండునీవే తమచెంతనే యుంటివని యంత రంగభక్తులు మురిసిపోవుచుందురు. కూర్మదాసుని రక్షించుటకై మాతో బయలు వేఱి వచ్చుచున్నావు. కాని పండరిపురమున మహోత్సవనిమగ్నుఁడవై, కూడ నున్నావు. పరమేశ్వరా! దీనబంధూ! అనాథనాథా! మమ్ము అంతరంగభక్తులని ఆద రింతువు. నాప్రాణములు మీయందే యున్నవి అందువు. ఇట్టి అంతరంగభక్తులు నీకు ఎన్నికోట్లు గలరో, యెవరు చెప్పఁగలరు? ఒకనికిఁ బాండురంగఁడవై దర్శన మిచ్చె దవు. ఒకనికి జగన్నాథుఁడవై సాక్షాత్కరింతువు. మఱియొకనికి రంగనాథుఁడవై సేవయొసంగెదవు. ఇట్లు నానారూపములతో నానాభక్తులను దనుపు నీలీలలు తెలిసి కొనుటకు ఎవరుశక్తులు? భక్తచింతామణీ! మేము అపరాధులము. తెలియకుండఁగనే మావలన నపరాధములు చేయఁబడును. పుణ్యమనిభావించి, పాపమునఁ గూలఁబడి యెదము. మంచి యనుకొని చెడ్డ యాచరింతుము. మాకన్న నవివేకులు మమ్ము మహాత్ము లని భావించి పూజింతురు; కాని మేముఁగూడ భ్రాంతికి లోఁబడి పోవు చున్నారము. ఆహా! దీనమందారా! ఆర్తత్రాణపరాయణా! మేము నీకింకరులము; నీచిత్తమువచ్చినట్లు ఆడింపుము" అని కొనియాడుచు, శ్రీహరివెంటఁ బోవు చుండిరి.

మార్గమధ్యమున పెండి అనుగ్రామమున సామంతుఁడు అను నొకభక్తుఁడు నందవనము అను పూఁదోఁటలో భగవంతుని ఆరాధించుచుండెను. ఆప్రాంతము నుండియే పోవుచున్నభగవంతుఁడు జ్ఞానదేవ నామదేవులతో "మీరారిచ్చట నుండుఁడు. ఈవనమున భక్తుఁడొకఁడు నానిమిత్త మెదురుచూచుచున్నాఁడు. పోయివచ్చెదను" అని చెప్పి తోఁటలోనికిఁబోయెను. అట శ్రీహరినిఁ గీర్తించుచు నాట్యవశమున నానందపరవశుఁడై యున్న సామంతుఁడు హఠాత్తుగ సాక్షాత్కరిం చిన సర్వేశ్వరునిఁ జూచి విస్మితుఁడై, సాష్టాంగదండప్రణామము లర్పించి అనేక విధములఁ గొనియాడసాగెను. అంత పాండురంగఁడు "వత్సా! నీవిప్పుడు కొని యాడవలదు. నన్ను ఇరువురుచోరులు వెంబడించివచ్చుచున్నారు. వారిబారిఁ

బడకుండ నన్ను రక్షింపుము. జాలముచేయవలదు. వేళాకోళము అని భావింపవలదు. వేగ దాచుము" అని తొందరపెట్టసాగెను. సామంతుఁడు అందులకు మఱింత విస్మితుఁడై, "స్వామీ! నాగుడిసెలో దాఁగుకొనుము" అనియెను. "అట నేను దొరికి పోవుదును. మఱియొకనిభృతస్థలమును జూపు"మని పండరినాథుఁడు మిగులఁ దొందరఁ బలికెను. "అట్లయిన నాహృదయకుహరమునఁ బ్రవేశింపుము. అంతకంటె రహస్య స్థలమును నేను జూపఁజాలను" అని సామంతుఁడు చెప్పెను. దారిచూపుమని భగవంతుఁడు కోరఁగా, వనము బాగుచేయుటకుఁ దెచ్చినసాలితోఁ దన వక్షఃస్థలమును భేదించి, సామంతుఁడు దారిఁజూపెను. భగవంతుఁడు హృదయములోఁ బ్రవేశించిన వెంటనే, సామంతుఁడు హృదయముపై వస్త్రము నాచ్ఛాదనముచేసికొని భగవంతుఁడు తనలో నుండుటవలన విమలచిత్తుఁడై, ఆనందపరిపూర్ణుఁడై, నాట్యము ప్రారంభించెను.

ఈస్వల్పకాలవిశ్లేషమునకే జ్ఞానదేవనామదేవులు సహింపఁజాలక ఏమయినను మంచిదే యని సాహసించి, నందనవనముఁ బ్రవేశించిరి; కాని యందు వారికి నృత్యము చేయుచున్న సామంతుఁడే గాని, భగవంతుఁడు కానుపింపఁడయ్యెను. సామంతుఁడు ఆనందోన్మత్తుఁడై నృత్యముచేయుచుండఁగా, భగవంతుఁడు "భక్తశిఖామణీ! నేను ప్రపంచమంతయు నిండియున్నాఁడను. భక్తులనేకులు నాకుఁబ్రత్యేకాలయములను లెక్కలేనన్ని యేర్పఱిచినారు; అంతరంగభక్తులు అనేకులు నన్నుఁ దమహృదయములలో నెలకొల్పినారు. కాని నీ హృదయమువలె మనోహరమును, వినిర్మలమును, ఆనందదాయకము నగుస్థలమును నేసంతవఱకును దొక్కి యెఱుఁగ"నని చెప్పుచుండెను. అట్టిసమయములో జ్ఞానదేవనామదేవులు అచ్చటకుఁ బోయి శ్రీహరిని నెందును గానక, సాహసించి "సాధుజనచూడామణీ! మమ్ము వంచించి జగన్నాథుఁడు నీనిమిత్తము ఈవనమునఁ బ్రవేశించినాఁడు. ఆరమాకాంతుని వీడియుండుటచే మాప్రాణములు కంఠగతములగుచున్నవి. దయయుంచి యాతఁ డెక్కడనున్నాఁడో చూపు" మని ప్రార్థించిరి. కాని ఆనందపరవశుఁడై నృత్యముచేయుచున్న సామంతునకు ఈ మాటలు విన్పింపలేదు. అదిచూచి వారు "సర్వేశ్వరుఁడు ఈతని హృదయమునఁ జిక్కియున్నాఁడు; కావుననే యీతని కీయానందోన్మాదము" అనిభావించి, "మహాత్మా! రూపాలిటిరక్షకుని నీహృదయమున దాఁచుకొనియున్నావు. మాయెడలఁ గరుణించి, యానవనీతచోరుని ఒక్కమాఱు చూపితివేని, మావిచారముపోవును" అని ప్రార్థించిరి. ఇది విని పాండురంగఁడు "వత్సలారా! ఈ మహాభక్తునిహృదయకుహరమునఁ బ్రవేశించి నేను బైటికి రాఁజాలకున్నాను. నేను వివశుఁడనై పోయియున్నాను" అని చెప్పి, "భక్తాగ్రణీ! నావిశ్లేషమును సహింపలేక వీరు పరితపించు

చున్నారు. వీరికి నాదర్శనమును బ్రసాదింపుము" అని సెలవిచ్చెను. తోడనే సామంతుఁడు "మహాత్ములారా! పాండురంగని అంతరంగభక్తుల నగు మిమ్ము గుర్తింపఁజాలక నేను మహాపచారమును జేసితిని. ఈదాసానుదాసుని యపరాధమును క్షమింపవలయు" నని వారి పాదములపై వ్రాలి, ఆనందబాష్పములతో పాదములు గడిగెను. వారాదరముతో నాతనిని లేవనెత్తిరి. తోడనే సామంతుఁడు తనయురముపై చుట్టిన వస్త్రమును విప్పివేసెను. పాండురంగఁడు వెలుపలకు వచ్చి జ్ఞానదేవ నామదేవులకు దర్శనమిచ్చెను.

పిదప భగవంతుఁడు "అచ్చటఁ గూర్మదాసుఁడు నానావస్థలు ననుభవించుచున్నాఁడు. వేగముగఁ బోవలయును" అని నామదేవుని, జ్ఞానదేవుని వెంటనిడుకొని బహుళాపురమునకుఁ బోయి, "ఓయీ! దూరప్రయాణమువలన నీవు అలసినట్లున్నాడవు. ఇంక నెచ్చటకుఁ బోయెదవు?" అని యడిగెను. "పాండురంగని దర్శింపనుత్కంఠతో బయలుదేఱి, నాలుగుమాసములనుండి నానాశ్రమలకుఁ దాళి వచ్చుచున్నాను. నేఁడు ఎట్లయినఁ బండరిపురము చేరవలయు నని యెన్నోవిధములఁ బ్రయత్నించితిని; కాని సాధ్యపడలేదు. పాండురంగనికొఱకు నాహృదయ మెదురుచూచుచున్నది. ఇఁక నొక గడియలో నా కాభక్తవత్సలుఁడు దర్శన మీయకున్న నా ప్రాణములు నిలువవు. సర్వేశ్వరునిఅనుగ్రహమునకుఁ బాత్రుఁడనుగాని నా బ్రతుకేల? యనునౌదాసీన్యమువలన అవసానకాలము నెదురుచూచుచు, నిశ్చలుఁడనై యున్నాఁడను" అనిచెప్పెను. ఆతని తొందఱను గ్రహించి పాండురంగనితోడనే నిజరూపముతోఁ బ్రత్యక్షమయ్యెను. అంతఁ గూర్మదాసుఁడు అనేకవిధములఁ గొనియాడఁగా, భగవంతుఁ డానందించి "నీకేమి వరము కావలయునో కోరుము" అని యానతిచ్చెను. "మూవురు అంతరంగభక్తుల సమక్షమున సాక్షాత్కరించి నన్ను ధన్యునిఁ జేసితివి. ఇంతకంటె నాకు వేఱేమి కావలయును? అయినను నాకు నీవు వరమిచ్చెద నని చెప్పినపుడు అడుగకుండరాదు. నీవు నాకు ఇప్పుడు ఏరూపముతో సాక్షాత్కరించితివో, ఆరూపముతోడనే యిచట స్థిరనివాసము నేర్పఱుచుకొనుము" అనికోరెను. భగవంతుఁడు అట్లే చేసెను. నాఁటనుండియు పండరిపురమున కేఁగు భక్తులు బహుళాపురమునకుఁగూడఁ బోయి, స్వామిని సేవించి తరించుచున్నారు.

ఉ. "నిరతము తావకీనభజనీయపదాబ్జసుగంధలుబ్ధు లె
వ్వరిమది నొందఁగాఁ గలుగు వారలు తల్చి యమర్త్యదేహము
న్నరయఁ దదీయదారతనయాదిసుహృద్గృహబంధువర్గముల్
మఱతురు విశ్వతోముఖ రమాహృదయేశ ముకుంద మాధవా."

(భాగ. స్కం. 4 ప. 285.)

# 29. లాడుబావా

జ్యోతిపురము అను పట్టణమున లాడుబావా అనునొక భక్తశిఖామణి యుండెను. ఆతనికి సంసారము మున్నగు జంజాటము లేమియు లేకపోవుటచే ఈశ్వరభజనమునకును, తీర్థక్షేత్రయాత్రలుచేయుటకును జాల వీలుగనుండెను. ఈ సౌకర్యమును వ్యర్థముచేయక యాతఁడు హిమాలయము, బ్రహ్మకపాలము, హరిద్వారము, బదరీనారాయణము, గయ, జగన్నాథము, శ్రీకూర్మము, భీమవరము, సింహాచలము, ద్రాక్షారామము, శ్రీశైలము, అహోబిలము, తిరుపతి, కాళహస్తి, ఘటికాచలము, కంచి, కుంభకోణము, శ్రీరంగము, రామేశ్వరము, దర్భశయనము మున్నగు అనేకదివ్యస్థలములకుఁ బోయి, అచ్చటఁగల దివ్యతీర్థములలోఁ గ్రుంకి, అందందు వేంచేసియుండు ఈశ్వరుని ఆరాధించి, మార్గవశమున కాపూరు అను గ్రామము చేరుకొనియెను.

అచ్చటి జను లందఱును గాళికను గొలిచి ఆమెకు జంతుబలులు, నరబలులు సమర్పించుచుండురు. ఆగ్రామమునఁ గాళికాదేవిగుడి తక్క విష్ణునియాలయముగాని, శివాలయముగాని, తుదకు రామభజనకూటముగాని లేవయ్యెను. అగ్నికిఁ గాలి తోడైనట్లు, అచ్చట తక్కువజాతి మనుష్యులు కంకాళమ్మ ఎల్లమాంబికమ్మ మున్నగు క్షుద్రదేవతలను గాళికకుఁ దోడుగాఁ గొలుచుచుండిరి. వారిహృదయములలో పరమేశ్వరభక్తియనునది పొడసూపకుండ ఆక్షుద్రదేవతలు చాల మెలఁకువతో నుండిరి. అగుట నచ్చట బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదివివక్షలేకుండ సకలవర్ణముల వారును ఆక్షుద్రదేవతలకు దయమాలి ఆవులు, దున్నలు, మేఁకలు, కోళ్లు, మానవులు మున్నగు సాధుప్రాణులను బలియిచ్చి, ఆయానందముతో నుక్కిరి బిక్కిరి యగుచుండిరి. ఈకారణమువలన నచ్చట మేఁకలు మున్నగు సాధుజంతువులు సమూలముగ నాశమైపోవుచుండెను; కాని యితరము లగు పసులన్నియు మాని, వారు దేవతా పూజ అవిచ్ఛిన్నముగ నెఱవేఱుటకుఁ బరదేశములకుఁ బోయి వానిని గొనివచ్చి పెంచుచు లోపమును బూరించుచుండిరి. ఈసంగతు లేమియుఁ దెలియనివాఁడగుటచే లాడుబావా యట్టి క్షుద్రగ్రామమునఁ బ్రవేశించి, కాళికాలయసమీపమున నున్న యొక పూఁదోఁటలో విడిసెను.

ఆగ్రామమునఁ గొన్ని దినములయందు రాజు కాళికాదేవికి నరబలుల నర్పించు వాడుకయుండెను. వాడుక ననుసరించి నరబలినిఁ జెల్లించి రండని రాజు భటులకు ఆజ్ఞాపించెను. కాని వాండ్రు ఎంతవెదకినను నాఁడు వారికిఁ దగినవాఁడు

కాన్పింపఁ డయ్యెను. ఎట్లయిన నిది నెఱవేర్పనిచో రాజు తమ్మే బలియిచ్చు నని జడియుచు తిరుగుచుండఁగా, దైవవశమున పూఁదోఁటలో హరిభజనముచేయుచు నానందపరవశుఁడైయున్న లాడుబావా వాండ్రకన్నులఁ బడియెను. తోడనే బ్రతికితిమి అని వాండ్రు ఆతనిపైఁబడి ఎన్నివిధములవారించినను విడువక, ఏల యిట్లు చేసెదరనిన జవాబీయక తిన్నఁగ కాళికాలయమునకుఁ గొనిపోయిరి. అచ్చటఁ బూజా ద్రవ్యములు మున్నగు సకలపదార్థములను సిద్ధముచేసికొనియున్న మఱికొందఱు రాజభటులు వీరినిఁ జూచి "మీరింతవఱకును రాకపోవుటచే మా ప్రాణములు గుటుకుగుటుకు మనుచున్నవి. అంత యాలస్య మేల యయ్యెను?" అని యడిగిరి. లాడుబావాను కట్టితెచ్చినభటులు "ఏమిచేయుమనెదరు ? మనలో నెవఁడో యొకఁడు దీర్ఘాయువుకలవాఁడు ఉండుటచే నేఁడు బ్రతికిపోయితిమి. ఎంత వెదకినను నేఁడు ఎచ్చటను పురుషుఁడే కాన్పింపఁడయ్యెను. నేఁడు బైటికి వచ్చిచేయవలసిన పను లన్నియు స్త్రీలే నెఱవేర్చుచున్నారు. చంటిపిల్లవాఁడుగూడ వీథిలోనికి రాకుండఁ జేయఁబడెను. నేఁడు మనలో నొకనికి వంతు వచ్చు ననుకొంటిమి. ఇఁకఁ బ్రాణముల మీఁద నాశ వదలుకొనవలసినదియే యనుకొని యున్మత్తులమై, మేము పోవుచో తెలుంగకుండఁ దిరుగుచుండఁగా, నీసమీపముననున్న అమ్మవారి పూఁదోఁటలో నీనిర్భాగ్యుఁడు 'హరి హరీ' యని యేమో కూయుచు కాళ్లుబ్రద్దలగునట్లు నాటకము త్రొక్కుచున్నాఁడు. ఒడ లెఱుంగకుండ ఆడుచున్న వీనినిఁగట్టి వేయునపుడు ఏమో గాని మేముగూడ ఒడ లెఱుంగమైతిమి. ఇంతకును జెప్పవలసినది ఏమియు లేదు. పూజ వేవేగ ముగింపుఁడు. మనమింతవఱకు నిచ్చటనే యుండుటచే మనలోనొకఁడు దేవికి బలియయిపోయియుండు నని మనదారపుత్రులు అడలుచుందురు. రాజు పండ్లు పిండిచేసికొనుచుండును. ఆలసించిన అమ్మవారికిఁగూడ ఆగ్రహమురావచ్చు" నని తొందఱ పెట్టిరి.

అచ్చటనున్న భటులు క్షణములోఁ బూజాదికమును నిర్వర్తించిరి. తోడనే లాడుబావా లోనికిఁ గొనిపోఁబడెను. అప్పటికి ఆతనికిఁ దనకు సంభవించిన విపత్తు తెలిసిపోయెను. ఎన్నివిధములఁ బ్రార్థించినను విడువక వాండ్రు ఆతనిని అమ్మవారి యెదుట నిలిపి పాఱిపోకుండ ముగ్గురు గట్టిగఁబట్టుకొనిరి. ఒకఁడు దేవియెదుట నిలిచి గంటవాయించుచు "చల్లనితల్లీ! జగజ్జననీ! మమ్ము చల్లనికంటఁ జూడుము. ఈనరబలిని గ్రహించి, మాకు పాడిపంటలు సిరిసంపదలు ఇచ్చి, మారాజునకు నిత్య విజయమును దయచేయుము" అని ప్రార్థించుచుండెను. మఱియొకఁడు "తొట్రుపాటు వద్దు. ఏటు సరిగా వేయుము. ఒక్కవ్రేటునకు వీఁడు పైసలు కానిచో అమ్మవారు ఇఁక వీనిని స్వీకరింపకపోవుటయేఁ గాక మన కొంపతీయును" అని ఘాతుకుని హెచ్చ

రించుచుండెను. ఇదియంతయు వినుచు చూచుచున్న ఘాతుకుఁడు "తల్లీ! నాచేతికి బలమిమ్ము. నాకత్తికి పదను ఇమ్ము" అని ప్రార్థించి యాడుగఁబెంచి, కత్తి యెత్తి విసరుటకు సిద్ధముగా నుండెను.

అట్టిసమయములో హఠాత్తుగ ఫెళఫెళ మని యురిమిన ట్లయ్యెను. కన్ను దెఱచి చూడఁగా, అమ్మవారు భయంకరమూర్తియై, మీఁదఁబడి "దుర్మార్గులారా! హరిభక్తాగ్రేసరునకు కీడుఁదలంచిన మీరు చత్తురుగాక!" అని రాజభటులను నానా బాధలు పెట్టి విడిచెను. కనుమూసి తెఱచునంతలో వారందఱు మాఱుపలుకకుండ తిరిగి చూడకుండ ఊర్ధ్వశ్వాసముతో చేతనైనంత వడిగఁ బాఱిపోయిరి. అంతఁ గాళికాదేవి భయంకరాకారము విడిచి చేతులు జోడించుకొని "శ్రీహరిభక్తాగ్రేసరా! నన్ను క్షమింపుము. మదిముఖులన నీరాజభటులు . యుక్తాయుక్తపరిజ్ఞానము లేక నాకు బలియిచ్చుటకై నిన్నుఁగట్టితెచ్చిరి. నేను భాగవతులనినఁ బరమభక్తితోఁ బూజింతును. నేఁడు నామూలమున సంభవించిన యీ అపచారమును మఱచి, నాసేవ నంగీకరింపవలయు" నని ప్రార్థించెను. అది విని లాడుబావా నీత్కారము చేయుచు, "నీవు నన్ను సమీపింపకుము. నిన్నుఁ జూచిన పూర్వపుణ్యము లన్నియు నశించును. నీశరీరము సోఁకిన కుంభీపాకనరకమునఁ గూలఁబడుట తప్పదు. క్షుద్రరాలవై సాధుజంతువులను బలిగొను నీకు ఇంత మృదువగుప్రార్థనాసరణి యెట్లల వడినది ? నీవెప్పుడును మాంసము తినుచుండుటవలన నీమాటలు కుళ్లిన మాంసపుఁ గంపుఁ గొట్టుచున్నవి. తామసీ! హరిభక్తులను బూజింతు నంటివి. శ్రీహరియెడల నీ కింత భయభక్తు లుండునేని, నీవు పాపకర్మమగు జంతుబలి నేల యంగీకరించెదవు? ఈదేశప్రజలకుఁ దగినదానవు నీవు. నీకుఁ దగినప్రజలు వీరు. నే నీకర్మము ఏమియు నెఱుంగక యీగ్రామమున నిలిచితిని. ఛీ! ఇఁక నిచ్చట నిలువరాదు" అని చరచర నచ్చటనుండి బయలుదేఱెను.

ఈమాటలు విని కాళిక గజగజవడకుచు పాదములమీఁదవ్రాలి, "మహాత్మా! నావలన నపరాధ మైనది. నన్ను క్షమింపవలెను. నాకు శ్రీహరియెడల భక్తిఁ గలదు. కాని యిచ్చట ప్రతిష్ఠింపఁబడినపిదప నాకు భాగవతదర్శనమే కాలేదు. అగుట నాకు సౌజన్యము మఱపునకు వచ్చినదనుట యథార్థము. శ్రీహరి యనినఁ బరమాదరమే. లేనియెడల నేఁడు నిన్ను వధించుటకు సిద్ధముగ నున్నరాజభటులను నేను శిక్షించుట యెట్లు తటస్థించును? ఇఁక నీవెంత దూషించినను బడకలీఱదు. భాగవతాగ్రణీ! శాంతము వహింపుము. నేఁటితో నే నీ జంతుబలిని మానుకొను చున్నాను. నాకు జ్ఞానము గలిగినది. మాంసాహారముపై నరుచి పొడమినది. ఇఁక సాత్త్వికాహారమును స్వీకరించెదను. ఈదేశపుఁ బ్రజలనందఱను జంతుబలుల నిచ్చుట

మానునట్లు నియమింతును. అంతవఱకు నీవు హరిభక్తిఁ గలిగించి తరింపఁ జేయుము" అని ప్రార్థించెను. 'క్రూరాత్మురాల వగు నీమాటలు నమ్ముట యెట్లు?' అని లాడు బావా తొలుత నచ్చట నిలుచుటకు సందేహించెను; కాని తుదకు కాళిక విశేషముగాఁ బ్రార్థించుటవలన నంగీకరింపక తప్పదయ్యెను. తుద కెట్లో యాతఁడు అచ్చట నుండి కాళిక యాతిథ్యమును స్వీకరించుట కంగీకరించెను.

పలాయనము గావించిన భటులు పోయి రాజుతో సకలవృత్తాంతము నెఱింగించిరి. తోడనే రాజు బయలుదేఱి కాళికాలయమునకు వచ్చెను. ఆతనితో గూడ ననుచరు లనేకులు వచ్చిరి. అప్పటి కప్పుడే లాడుబావా గుడి వెలుపడి వచ్చి ఆప్రాంతమున నొకచోఁ గూర్చుండి హరిధ్యానము చేయుచుండెను. పలాయనము చేసిన భటులు రాజుతో నీతఁడే దీని కంతకును హేతుభూతుఁడని చెప్పిరి. రాజు ఎదుటకురాఁగానే లాడుబావా "రాజా! నీకేల బుద్ధిలేదు? అనేకసాధుజంతువులను మానవులను దయారహితుఁడవై కాళికకు బలియిచ్చుచున్న నీవు కుంభీపాకనరకమునఁ గూలఁబడిపోయెదవు. నీకు ఇఁక గతిలేదు. ఇఁకనైన బుద్ధి తెచ్చుకొని మసలుము" అని మందలించెను. అంతటిలోఁ దన్నిట్లు నిందించుటచే రాజు ఆగ్రహమహోగ్రుఁడై "యీనీచునిఁ గొనిపోయి పాడునూతిలోఁ బడవేసి పైని పెద్దబండ రాతినిఁ బడవేయుఁడు" అని యాజ్ఞాపించెను. తోడనే రాజభటులు ఆపనిఁ జేసిరి. అందులకుఁగూడ లాడుబావా యేమియు విచారింపక, నూతిలోఁ బడిపోవునపుడు సైతము శ్రీహరీయని హరిధ్యానము చేయుచుండెను. ఇది యైపోయినతరువాత రాజు కాళికాలయమునకుఁబోయి దేవికి సాష్టాంగపడి, 'తల్లీ! సెలవునకుబద్ధుఁడను' అని యెదుట నిలిచెను. అంత దేవి "రాజా! నేఁటినుండి నేను బలులను స్వీకరింపను. నాకు సాత్త్వికాహారమే కావలయును. నేఁటినుండి నీవు హరిభజనము ప్రారంభింపుము. ఈదేశప్రజలకుఁ గూడ నట్లు చేయ నాజ్ఞాపింపుము. నేఁడిక్కడకు నిర్హేతుకకటాక్షముతోఁ జనుదెంచినలాడుబావా అనుభాగవతాగ్రేసరునిఁ బూజించి యాతనివలన నుపదేశమును బడయుము" అని యాజ్ఞాపించెను; కాని పూజించుటకును, ఉపదేశమును బొందుటకును ఇప్పుడు లాడుబావా యెక్కడ నున్నాఁడు?

రాజు తాను వివేకభ్రష్టుఁడై, చేసిన పనియంతయు దేవికి విన్నవించి, 'తల్లీ! తెలియకచేసిన యీయకృత్యములకు ఈసేవకుని రక్షింపుము' అని ప్రార్థించెను. అది విని దేవి ఇఁక రాజుపైఁ గోపపడినను ప్రయోజనము లేదని తలంచి, "ఇప్పుడైనను చెడిపోయిన దేమియు లేదు. వెంటనే పోయి ఆభాగవతోత్తమునిఁ బైకిఁ దీయింపుము. భగవద్భక్తులకు అంతలోఁ బ్రాణాపాయము సంభవింపదు" అని చెప్పెను. రాజు ఆజ్ఞాబద్ధుఁడ నని చెప్పి, వడిగఁబోయి తొలుత బండరాతినిఁ దీయింపఁ బ్రయ

త్నించెను. కాని యెన్నివందల మంది ప్రయత్నించినను అవి కదలదయ్యెను. ఇఁకఁ జేయునది లేక రాజు "ఇంత పట్టుపట్టినను రానిరాతి క్రిందఁబడిన భాగవతుఁడు జీవించి యుండుట పొసఁగదు" అనిచెప్పి, ఆ ప్రయత్నమును మానుపించి "దేవి హరిభక్తిని బోధించినది. హరిభజన చేయుమని నియమించినది. అట్లే చేసెదను. కొన్ని దినములు గడచినప్పటికి సదాచార్యుఁడు లభింపకపోఁడు" అని తలఁచి హరిసేవ చేయుఁడని ప్రజల కందఱకు నాజ్ఞాపించెను. ఆదినముమొదలుకొని దేశమునందలివారెల్లరును హరిపూజాధురంధరులైరి.

అట నూతిలోఁ బడిపోయిన లాడుబావా భగవత్కటాక్షముచేఁ జెక్కుచెదరక యుండెను. ఆతఁడు చచ్చిపోవలయు నని రాజు త్రోయించిన బండరాయి గొడుగువలె నుండి, వర్షాతపాదులవలన నాతని కేమియు బాధ కలుగకుండు నట్లుండెను. నూతి నావరించుకొనియున్న లతాగుల్మాదులకుఁ దేనెపట్టు ఉండెను. దానిలో నుండి లాడుబావాచెంతను మధుధార పడుచు లాడుబావాకు జీవనాధారమై యుండెను. ఆహా! భగవద్భక్తులమహిమ. క్షుద్రమానవులదుశ్చింతలును దుశ్చేష్టలును వారి నేమిచేయఁగలవు? రాతిలో నుండుకప్పకుఁగూడ జీవనాధారము చూపు పరమేశ్వరుఁడు తనభక్తులకుఁ గూర్పరాని దేమిగలదు? ఆరాతిసాహాయ్యమున వర్షాతపములవలని బాధలు లేక, మధువు నానుచు ఆభక్తశిఖామణి నిశ్చలముగ భగవద్ధ్యానము చేసికొనుచుండెను.

మూర్ఖులు ఏపనిచేసినను జాలఁ దీవ్రముగనే యుండును. రాజు ఇంతకుఁ బూర్వము కాళికను జంతుబలులు నరబలులు మున్నగునవి సమర్పించుచు నెంత శ్రద్ధతోఁ బూజించుచుండెనో, యిప్పుడు అంతశ్రద్ధతో భగవద్ధ్యానము చేయఁ దొడఁగెను. అగుట నాతనిసేవకు భగవంతుఁడు మెచ్చి సాక్షాత్కరించి, "నీభక్తిశ్రద్ధలకు మెచ్చితిని. నీవు ఇప్పుడు చూపునది మూఢభక్తి. నీవు సదాచార్యు నాశ్రయించినఁగాని జ్ఞానవైరాగ్యములు గలుగవు. నీకు జ్ఞానవైరాగ్యములను గలిగింపఁగల సదాచార్యుఁడు లాడుబావా తక్క మఱియొకఁడు లేఁడు. కావున నాతని నాశ్రయింపు" మని చెప్పెను. "మహాత్మా! లాడుబావా ఇప్పుడు ఎక్కడ నున్నాఁడు? అవివేకినై నే నాతనిం జంపించితిని" అని రాజు విన్నవించెను. "సందియము వలదు. రాజా! నీవంటివారు భాగవతులకుఁ బ్రాణాపాయము గలిగింపఁ జాలరు. నూతిలోనిరాతిని దొలంగించి చూడు" మనిచెప్పి, శ్రీహరి యంతర్హితుఁడయ్యెను. భగవంతుని యాజ్ఞానుసారముగ రాజు బండరాతిని దీయింపఁగా నది సులభముగాఁ బైకి వచ్చెను. చూడఁగా, దానిక్రింద లాడుబావా భగవద్ధ్యాననిష్ఠుఁడై యుండెను. లాడుబావా రాజును గాంచి, "పరమైకాంతస్థలమున శ్రీహరి

భజనమువలన నాకంపపరవశుఁడనై యున్న నన్నేల కదిపితివి? అని యడిగెను. రాజు మాఱుపల్కకుండ నాతని పాదములమీఁద వ్రాలి, "మహాత్మా ! క్షమింప వలయును. నేను కేవలము అవివేకిని; పాపకర్ముఁడను. మీ మాహాత్మ్యము నెఱుఁగక మీయెడల నిగ్రహముచేసితిని. ఈదీనునికి బుద్ధివచ్చినది. శ్రీహరి సాక్షాత్కరించి నన్ను మీపాదముల నాశ్రయింప నియోగించెను. భాగవతాగ్రగణ్యా! నాయెడల దయ యుంచి నానగరమునకు దయచేసి నాకు జ్ఞానోపదేశముచేసి మోక్షసాధనమును గ్రహింప వలయును" అని ప్రార్థించెను. ఆప్రార్థనకుఁగరమసంతసించి లాడుబావా, "రాజా! నీవు నాకు చేసినయిగ్రహమియున్నది? పండ్రెండు సంవత్సరములు పరమైకాంతస్థలములో దాఁచి, నాహరిధ్యానము నచంచలముఁ గావించిన మహోపకారి వగు నీఋణము నేనెట్లు తీర్చికొందును?" అని మీఁది కెక్కివచ్చెను. అంత రాజు భద్రగజముమీఁద నెక్కించి లాడుబావాను మహావైభవముతో నగరమంతయు నూరేగించి, తన నగరు నకుఁ గొనిపోయి అర్హస్థలమున విడియించెను.

యుక్తసమయమున లాడుబావా రాజునకు శ్రీకృష్ణమంత్రోపదేశముఁ గావించెను. ప్రజలుగూడ ననేకు లాభాగవతాగ్రేసరు నాశ్రయించి, మంత్రోపదేశముఁ బడసిరి. దేశమంతయు లాడుబావాను మహాభక్తితోఁ బూజించెను. లాడుబావా కొన్నిదినము లచ్చటనుండి ప్రజల నందఱి నేకాదశీవ్రతనిష్ఠులం గావించి, అనేకతీర్థ క్షేత్రములు సేవించి, తుదకు స్వస్థలము చేరి అవసానమున నీశ్వరసాయుజ్యమును బడసెను. ఇట రాజుఁగూడ బ్రదికియున్నంతకాలము శ్రీహరిని బూజించి, అంతమునఁ బరంజ్యోతిలో లీన మయ్యెను.

సీ. "సర్వేశ కల్పాంతసమయంబునందు నీ యఖిలప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండవై శేషపర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభిసింధుజస్వర్ణలోకకఁజాతగర్భు
ముందుఁ జతుర్ముఖు నమరఁబుట్టించుచు రుచినొప్పు బ్రహ్మస్వరూపివైన
తే నీకు మ్రొక్కెద సత్యంతనియమ మొప్ప, భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార, యవ్యయానంద గోవింద హరి ముకుంద."

(భాగ. స్కం. 4 ప. 287.)

# 30. బోధలబావా

పాండురంగక్షేత్రమునకు సమీపమున ధామణము అను నొకగ్రామము ఉండెను. అందు మాణకోజీబోధల యను పేరుగల భగవద్భక్తాగ్రేసరుఁ డగు శూద్రుఁడు ఒకఁ డుండెను. ఆతనిభార్యపేరు మమతాబాయి. కుమారుని పేరు యమాజీ. కోడలిపేరు భాగీరథీబాయి. ఆయింట నీనలుగురే నివసించుచుండిరి. నలుగురునుగూడఁ బరమభక్తాగ్రేసరులు. శ్రీహరిభజన మనిన వారికి మహానందము. సాధుపూజయు, దీనపోషణమును వారికి నిత్యకృత్యములు. ఇంటికి వచ్చినయతిథికి శ్రద్ధాసోపేతముగ భోజనము పెట్టుటయనిన వారికి వరాలమూట లభించినట్లుండును. వారియింట నెప్పుడు శ్రీహరినామము విన్పించుచుండును. ఆపరమభక్తశిఖామణులు ఏకాదశినాఁడు పండరిపురమునకుఁబోయి యుపవసించి, స్వామినిసేవించి ద్వాదశినాఁడు అనేకులను మృష్టాన్నసంతృప్తులం గావించి, పాండురంగని కానందమును గలిగించి స్వస్థలమునకుఁ బోవుచుండురు.

ఇట్లుండఁగా నాదేశమున ననావృష్టిదోషముచే భరింపరానిక్షామము సంభవించెను. బీద లందఱును అన్నములేక మలమల మాడిపోవసాగిరి. సామాన్యసంపన్నులుగూడ కొలఁదిమాసములయందే నిరుపేదలై 'అన్నమో రామచంద్రా!' యని యేడువసాగిరి. బోధలబావా దినమునకు అనేకశవములు తన కండ్లయెదుట నుండి పోవుటఁ జూచియు, ప్రజలందఱును జిక్కి శల్యావశిష్టులై యుండుటఁ జూచియు సహింపలేక, భార్యను గుమారుని గోడలినిఁజూచి, "దుస్సహ మగు కఱవు వలన దేశములో ప్రళయము సంభవించుచున్నది. బీదలయిండ్లన్నియు జనశూన్యము లైపోవుచున్నవి. చిన్నిచిన్నిపల్లెలలోఁ గూడ నేదినమున కాదినము మృతులసంఖ్యను నిర్ణయించుట చాల కష్టముగ నున్నది. అన్నార్తుల దీనాలాపములవలన బ్రహ్మాండము బ్రద్దలైపోవుచున్నది. అనేకులు సంపన్నులు ఈస్థితినంతయుఁ జూచియుఁ దమ్ముకానట్లు ఉపేక్షించుచున్నారు. సర్వేశ్వరుఁడు మన కింత సంపద నిచ్చినాఁడు. మనముఁగూడ నీసమయమున దానిని రక్షింపఁజూచెద మేని పెట్టెలలోని రూపాయలు పెట్టెలయందే మాయమైపోవును. గాదెలలోనిధాన్యము గాదెలయందే హరించి పోవును. చేలలోని సస్యము చేలయందే మాడిపోవును. మనపశువులన్నియు మాయమైపోవును. మన పూర్వపుణ్యము నశించి, దానిస్థానమున ఘోరపాపము నిలుచును. ఉన్నట్లుండఁగా, మనము పిడుగుపడి భస్మమైపోదుము.

శ్రీమత్పాండురంగని కోపమునకుఁ బాల్పడినవారి బ్రతుకు వ్యర్థము. కావున, మనము మనచేత నైనంతవఱకును దీనులకు సాయముచేయుఁడు" మని చెప్పెను.

ఈమాటలకు ఆయింట వ్యతిరేకభాషణమే రాలేదు. అందఱు "ఇంతకంటె పుణ్య మేమున్నది?" యని యుబ్బిపోయిరి. రణవీరునిఖడ్గము రక్తాభిషేకమైన వెంటనే మఱింత విశదమగును. అట్లే వారికరములు దేశమున సంభవించిన క్షామము వలన దానధర్మములు చేయుటలో మఱింత ముందంజ వేయసాగెను. ఎవరికిఁ దోఁచి నట్లు వారు పంచిపెట్టిరి. ఎవరి కెంత శక్తియున్నదో ఆంతవఱకు అన్నపానముల నొసంగిరి. వారికి అలసటకు విసుగు అనునదియే తోఁచలేదు. కేవలము ఆనందము. బ్రహ్మానందము వారిహృదయములందు నిండి తొలుకాడసాగెను. ముఖపద్మములు వికసించి, దయాప్రసారమును వర్షింపసాగెను. బోధలబావా కుటుంబపు మహోదారవితరణము నాలించి దేశదేశములనుండి దీనజనప్రవాహమువచ్చి ధామణ గ్రామమును ముంచివేయసాగెను. అదిచూచి ఆగ్రామవాసులు అత్యాశ్చర్యపడసాగిరి. కాని, ఆర్తజనప్రవాహము దీనపోషకుల ఆనందసాగరమును పెంపుచేయునదియే గదా!

ఇట్లు దీనులు అవిచ్ఛిన్నముగ నన్నార్తులై వచ్చుచుండినను, బోధలబావాయు నాతనిభార్య మున్నగువారును ఏకాదశీదినమున పాండురంగక్షేత్రయాత్ర మానకయే యుండిరి. ఎడతెగని యీదీనరక్షణమువలన బోధలబావాచెంత నిలువయున్న అసంఖ్యధనమును, అమేయధాన్యరాసులును వ్యయమైపోయెను. అందుల కాతఁ డేమియుఁ జలింపక భార్య యొడలిమీఁదను, గోడలి శరీరముమీఁదను గలనగల నిమ్మని యడిగెను. ఆతఁ డడుగుటయే తడవుగా నంతకుఁ బూర్వమే యట్లు చేయుట కుద్యుక్తులై యున్న యారమణీమణులు మహానందముతోఁ దమ నగల నొలిచి యిచ్చివేసిరి. ఆనగల విక్రయమువలన నసంఖ్యధనము వచ్చెను. మఱల వారు యథాప్రకారముగ నార్తరక్షణ ప్రారంభించిరి; కాని మఱలఁ గొన్నిదినములయందే యాధనము గూడ నైపోయెను. ఋణ మిచ్చువా రెవరును లేకపోయిరి. అగుటచే బోధలబావాయు యమాజీయుఁ గూలినాలి చేసి, దానివలననే కొందఱుదీనులను గాపాడఁదొడంగిరి. అట్టి కష్టసమయములోఁ గూడ నాతఁడు మనశ్చింత నెఱుంగక, ఒక్కదీనునకైన క్షుద్బాధ తీర్పఁగలుగుచున్నందులకుఁ బరమానందభరితుఁడు కాసాగెను.

ఇంతలో నేకాదశి సమీపించెను. చూడఁగా నొక్క పయిసయైనఁ జేత లేకపోవుట గాంచి, బోధల అడవికిఁ బోయి కట్టెలుకొట్టితెచ్చి మూఁడుకాసులకు అమ్మి పండరిపురమునకుఁబోయెను. మొదట నాతఁడు అచ్చటఁ జంద్రభాగయందు స్నానము

చేసి సంకల్పముచెప్పిన బ్రాహ్మణునకు ఒక కాసు నిచ్చెను. మఱియొక కాసుతో అరఁటి పండ్లు, ఖర్జూరపుఫలములు, గంధమును గొని పరిశుద్ధహృదయుఁడై యాలయమునకుఁ బోయి "పండరినాథా! రిక్తుఁడను. ఈతుచ్ఛని కానుకను అంగీకరింపవలయు" నని ప్రార్థించి స్వామికి సమర్పించి, యుపవాసముచేసి ధ్వజస్తంభముచెంతఁ గూర్చుండిరాత్రి నాల్గుజాములును హరిభజనమునఁ గడపెను. మఱునాఁడు ఉదయమున చంద్రభాగా నదికిఁ బోయి స్నానముచేసి మిగిలిన కాసునకును పిండినిఁ గొని తీరమునఁగూర్చుండి, "అయ్యో! మృష్టాన్నము నొసంగి, నే నింతవఱకు ననేక సాధువులను బూజించితిని; కాని నేఁడు ఈరవంతపిండియు నెవరి కిచ్చెదను? ఇదియొకబాలుని క్షుద్బాధ తీఱుట కైనఁ జాలదే? నాస్థితి నెఱింగి సచ్చింతతో నన్నుఁ దరింపఁజేయుటకు ఈరవంతపిండియు నేమహానుభావుఁడు స్వీకరించును? ఒక్కయతిథినైన అన్నతృప్తునిఁగావింపక యేకాదశీ వ్రతము నాచరించిన నేను ఈద్వాదశీపారణ నెట్లు చేయుదును? ద్వాదశినాఁడు ఇతరునకు ఇడకుండ భుజించువానికంటెఁ బాపాత్ముఁడు ఉండఁబోఁడుకదా!" యని చింతింపసాగెను.

ఇట్లుండఁగా, భగవంతుఁడు వృద్ధబ్రాహ్మణరూపియై జీర్ణవస్త్రమును ధరించి వడవడ వడకుచు, "ఓమహానుభావా! నీవు ప్రతిద్వాదశినాఁడును అనేకవేల అతిథు లను మృష్టాన్నతృప్తులను జేయు పుణ్యాత్ముఁడవు. నే ననేకమాఱులు నీయాతిథ్య మును బడసి యానందించియున్నాను. నేఁడు నాకు ఇంత యన్నము పెట్టినవారు కాన్పింపరైరి. సాధుజనచూడామణీ! తీరనిక్షుద్బాధ నాప్రేవులను మాడ్చివేయు చున్నది. నాయాఁకలి తీర్చి, నన్ను రక్షింపుము" అని ప్రార్థించెను. అందులకు బోధల చాలఁ జింతించుచు, "మహాత్మా! నాయొద్ద నేయి లేదు. చక్కెఱ లేదు. పాలు లేవు. కొంచెము ఉప్పుసైతము లేదు. ఉన్న పిండియైనను నీక్షుత్తును బోఁగొట్టు టకుఁ జాలదు. ఈరవంతపిండిని సద్బ్రాహ్మణుఁడ వగు నీకు చేతులార నెట్లు ఈయఁ గలను? పిలిచి భోజనము పెట్టవలసినదానికి మాఱుగా, అడిగినను గడుపునిండఁ బెట్టుటకుఁజాలని స్థితిలో నున్నాను" అని దీనుఁడై విన్నవించెను. "అయ్యా! నీవు అట్లు విచారింప నక్కఱలేదు. ఎంత యున్నను నాకుఁ జాలును. క్షుధాతురుఁడనై యున్ననాకు రుచితో నేమిపని? ఇఁక మాఱుపల్కక నాకు ఆపిండియే యిమ్ము" అని ప్రార్థించెను. తోడనే బోధల పిండి యాబ్రాహ్మణున కిచ్చివేసెను. బ్రాహ్మణుఁడు దానినిఁ దన జీర్ణవస్త్రాంచలమున ముడిచికొని, "భక్తచూడామణీ! నన్ను ఎవరును చేరనీయరు. కావున నేను ఇచ్చటనే ఈపిండి రొట్టెలుచేసికొని భుజింతును. కావున ఎండుపిడకలను దెచ్చియిమ్ము" అని చెప్పెను.

బోధల పరమానందభరితుఁడై ఆప్రాంతమున వెదకి ఎండుపిడకలను దెచ్చెను. బ్రాహ్మణుఁ డంతకుఁ బూర్వమే చంద్రభాగలో స్నానముచేసి, ఒక పెంకును కల్పించి

సిద్ధముగా నుండెను. అంత నాతఁడు బోధలబావా తెచ్చిన యెండుపిడకలను నిప్పుతో నంటించి రొట్టెలు కాల్చుకొనుటకు సిద్ధముగా నుండఁగా, రుక్మిణీదేవి యీ సంగతి యంతయుఁ దెలిసి వృద్ధబ్రాహ్మణసుమంగలియై వచ్చి, "అయ్యో! నీవు ఒంటరిగా నేలవచ్చితివి? నీవు ఒకచోఁ గూర్చుండుము. నేను రొట్టెలు కాల్చెద" నని చంద్రభాగలో స్నానముచేసి వచ్చి, రొట్టెలు కాల్చుటకుఁ గూర్చుండెను. ఆసమీపమునందే యున్న భక్తుఁడు ఇది యంతయుఁ జూచి, అయ్యో! ఒక్కనికే చాలని యీపిండి కొఱకు ఇరువు రాసించియున్నారు. ఇరువురు గూడ ఆఁకట నకనకమాడుచున్న వృద్ధులు. వీరి స్థితి చూడఁగా నాకడుపు చెఱువై పోవుచున్నది" అని వగవసాగెను.

ఆవృద్ధబ్రాహ్మణి జగజ్జనని యగురుక్మిణి యగుటచే కలిపినపిండి కలిపినట్లే యుండఁగా రొట్టెలు గుట్టలుపడెను. దానినిఁ జూచి బోధల వింతపడుచుండఁగా, నామె "యీరొట్టెలు మనకును, ఈమహాత్ములకును గూడ సరిపోవును; కావున మీ రిరువురును ముందు భుజింపుఁడు; తరువాత నేను భుజించెద" నని పలికెను. అపుడు బోధల "మహాత్ములారా! మీప్రభావముఁ జూడఁగా దివ్యముగా నున్నది. మీరు నిజముగా శ్రీరుక్మిణీకృష్ణులేగాని వేఱుగాదు. ఆహా! నే నెంతధన్యుఁడను. తల్లీ! నీ వనినట్లు దయయుంచి యెసంగెద రేని, మీభుక్తశేషమును నేను భుజించి తరింతు" నని ప్రార్థించెను. అంత నావృద్ధదంపతులు వలసినంతవఱకును భుజించి, శేషమును భక్తునకొసంగిరి. బోధలయు నాభగవద్భుక్తశేషము నతిభక్తితో భుజించి, "ఆహా! ఈరొట్టెలు ఘృతక్షీరశర్కరావిహీనములైనను అమృతమునకన్న మధురములై యున్నవి. ఆదంపతులు లక్ష్మీనారాయణులనుట కింతకంటె నేమి కావలయును? ఆహా! నాభాగ్యము నేమని చెప్పుదును ?" అని యానందించి, మఱల నాలయము నకుఁబోయి "శ్రీపతీ! దినదినము నిచ్చట నీకు అనేకులు దివ్యభోగములను జేయించు చున్నారు. ఆమధురపదార్థములన్నియు వీడి నేనిచ్చినపిండినే యాశించితి వేల?" అని మోకరించి ప్రార్థింపఁ బండరినాథుఁ డాతనికి ఏకాంతదర్శన మొసంగి, "భక్తాగ్రేసరా! నీవు కేవలము అమాయికుఁడవు. భజనచేసినవా రందఱును భక్తులే యనియు, అన్నదానముచేసినవా రందఱును సేవానిరతులే యనియు, ముక్కుపట్టుకొని కూర్చుండువారందఱును మునులే యనియు, కాషాయాంబరములను ధరించిన వారందఱును విరాగులేయనియు, పద్మాదికములగు నాసనములువేసికొని కూర్చుండువా రందఱును యోగులేయనియు, భావించుచు నీయోగ్యత నేమనవలయును? ఇచ్చట శ్రీహరీ యని యాక్రోశించువారు అనేకులు గలరు గదా! అందఱిలోఁ ద్రికరణశుద్ధిగ నన్ను నమ్మియున్నవారు వ్రేళ్లపై లెక్కింపఁదగినవారు మాత్రమే యుందురు. తక్కినవారందఱును లోకవిడంబనార్థము, దంభముకొఱకు, పరులు

తమ్ముఁ బొగడవలయు నని మాత్రమే యిక్కడకు వచ్చి భజనముచేయువారుగను, అన్నదానము చేయువారుగను, ధ్యానము చేయువారుగను ఉన్నారు. నేఁడింతియ చాలును. రేపు నీకు ఇందులకు ఉదాహరణము చూపెదను" అని చెప్పి, యంత ర్హితుఁ డయ్యెను.

పాండురంగని యాజ్ఞాప్రకారము బోధలబావా అచ్చటనే యుండిపోయెను. నాఁడు ఒకవర్తకుఁడు అప్పురమునకువచ్చి, స్వామిని సేవించి వేయిమంది బ్రాహ్మణులకు అన్నదానము చేయుటకు నిశ్చయించుకొని, చంద్రభాగానదీసైకతస్థలమునఁ బందిళ్లు పాకలువేయించి, ఆసమారాధనమును నెఱవేర్చుటకుఁ దగినవారిని నియమించెను. రెండుజాములగునప్పటికి వంటలయ్యెను. వర్తకుని యాజ్ఞాప్రకారము వేయిమంది బ్రాహ్మణులును వచ్చి బంతులుదీఱి కూర్చుండిరి. వడ్డన పూర్తియయ్యెను. అప్పుడు పాండురంగఁడు వృద్ధబ్రాహ్మణరూపియై బోధలబావాను వెంటఁబెట్టుకొని వచ్చి, "వత్సా! నీవు ఇచ్చటఁ గూర్చుండి సకలమును జూచుచుండుము" అని యాతని నొకచోఁ గూర్చుండ నియమించి, తాను వడఁకుచుఁ గఱ్ఱ నానుకొనిపోయి "మహానుభావులారా! నాకు మిక్కుటముగ నాఁకలి యగుచున్నది. నేను ఈయాఁకలిని సహింపఁజాలకున్నాను. క్షణము ఉండినఁ బ్రాణములు పోవును; కావున నాకింత ప్రసాదముపెట్టుఁడు" అని ప్రార్థించెను. అదివిని అచ్చటి కార్యనిర్వాహకులు రుసరుస లాడుచు, "తొలఁగిపొమ్ము. మేము వేయిమందికిమాత్రమే సమారాధనము చేయుటకు సంకల్పించుకొంటిమి. మేము నిశ్చయించుకొనినప్రకారము వేవురును వచ్చి యున్నారు. ఇఁక మేమెవ్వరికి నన్న మిడఁజాలము. వేగముగ నవ్వలకుఁబొమ్ము" అని యదలించిరి. అప్పుడే సమారాధనము చేయించు వర్తకుఁ డక్కడకు వచ్చెను. వృద్ధుఁడు వర్తకునియెదుటకుఁ బోయి, "మహాత్మా! నేను శతవృద్ధుఁడను; ఎక్కడకును బోఁజాలను. సహింపరాని ఆఁకలిబాధచే నాకు శోష వచ్చుచున్నది. పట్టెఁడన్న మిచ్చి రక్షింపకున్నచో నే నిచ్చటఁ బడిపోదును" అని ప్రార్థించెను. అదివిని వర్తకుఁడు చాలఁ గోపపడి "ఎన్నివిధములఁ జెప్పినను నీకు బుద్ధిలేదా! నేను వేయిమందికిఁ బైన నొక్కఁడు వచ్చినను అన్నముపెట్టఁజాలను; నీమట్టునకు నీవు ఒక్కఁడ నని చెప్పుచున్నావు; కాని నిన్ను అంగీకరించిన మఱియొకఁడు వచ్చును. వానికి పిదప వేఱొకఁడు వచ్చును. ఇంకొకఁడు వచ్చును. ఇట్లు అన్నమునకు వచ్చువారికి అంతము ఉండదు. మఱియొకచోటికిఁ బొమ్ము. ఇక్కడ ప్రయోజనము లేదు." అని గదుముచుఁ బలికెను. ముసలిబాపఁడు అంతటితో నూరకుండక "అయ్యా! వేయిమందికి మృష్టాన్నము పెట్టుచున్నావు. ఇఁక నొక్కవృద్ధునకు గుప్పెఁ డన్నము పెట్టఁజాలవా?" యని దీనముగ నడిగెను. వర్తకుఁ డీ తడవ కోపము నాపుకొనఁ

జనులక నౌకరులను జూచి, "యీపిశాచము నవ్వలకు గెంటివేయుఁడు" అని సెలవిచ్చెను. ఆజ్ఞ ముగిసియు ముగియక పూర్వమే, యమభటుల ననుకరించు నాభటులు వృద్ధుని మెడమీఁదఁ జేతులు వేసి గెంటుకొని వచ్చి బైట దూరముగఁ ద్రోసివేసిరి. అదిచూచి బోధలబావా "హరిహరీ! ఎంతకష్టము! ఎంతకష్టము! ఓభటులారా! వలదు వలదు. భగవంతుని యాగ్రహమునకుఁ బాల్పడకుఁడు" అని పలుకుచుఁ బరుగుపరుగునవచ్చెను. బోధలబావా యచ్చటికి వచ్చునప్పటికి భటులు వృద్ధుని గెంటివేసి నాలుగైదుపోట్లు పొడిచి వెడలిపోయిరి. అదిచూచి మాటలేక నిలిచిపోయియున్న బోధలను జూచి భగవంతుఁడు "వత్సా! నీసందేహము తీఱినదా?" యని పలుకుచు నంతర్హితుఁడై పోయెను. తోడనే చూచుచుండఁగాఁ, పెద్ద సుడిగాలి యొకటివచ్చి పందిలి యాకసమున కెగిరిపోయెను. ఆకులలో వడ్డింపఁబడిన పదార్థములన్నియు నిసుకతో నిండిపోయెను. వెంటనే ఇదియేమి మహోపద్రవము దేవుఁడా! యని భోజనమునకు వచ్చిన బ్రాహ్మణులందఱును జెట్టాకపిట్టయై పాఱిపోయిరి. ఇఁక నచ్చట వృద్ధుని గెంటివేసిన భటులును, కార్యనిర్వాహకులును, సమారాధనము నేర్పఱిచిన వర్తకుఁడును మాత్రము నిలిచియుండి తెల్లవోవుచుండిరి. ఇంతలో వాయుదేవుఁడు విజృంభించి, గాడిపోయియుందున్న కణకణలాడు చింతనిప్పులతోడను, చండ్రయిసుకతోడను వారిని వాయించి వాయించి విడిచిపెట్టెను. బోధల యిదియంతయుఁ జూచి లోకులదంభవృత్తికి రోసి, భగవంతుని మహామహిమలను గీర్తించుకొనుచు వెడలిపోయెను.

బోధలకు మార్గమధ్యమున క్షుద్బాధ యధికమయ్యెను. అయినను దాని నాతఁడు లెక్కచేయక భగవంతుని లీలలను గీర్తించుకొనుచు నడువసాగెను. మఱికొంతతడవునకు బాధ యధిక మయ్యెను. నడుచుటకు శక్తి లేకపోయెను. అయినను అతఁ డేమిచేయఁగలఁడు? మఱికొంతదూర మెట్లో ప్రాణములు బిగఁబట్టుకొని పోవునప్పటి కెదుట నొకఫలవనము కాన్పించెను. అప్పుడే వనమునుండి యేటికో పోవుచు ద్వారముచెంతకు వచ్చియున్న యొక వృద్ధాంగన అలసిసొలసియున్న బోధలనుఁ జూచి, "అక్కటా! నీవెంత బడలియున్నాఁడవు. అన్నము లేకపోవుట వలన నీకండ్లు గుంటలుకట్టుకొని పోయినవి. దవడ లెండిపోయినవి. కడుపు నకనకలాడుచున్నది. కాళ్లు వడవడ వడఁకిపోవుచున్నవి. అయ్యో! నీవింత కష్టముతో నేల పోవలెను? అయ్యో! మాతోఁటలోనికి దయచేసి, ఫలములు తిని నీరు ద్రావి విశ్రమించి పిమ్మట పొమ్ము నాయనా!" యని బతిమాలెను. బోధల తొలుత నామె నొప్పించి ముందునకుఁ బోఁజూచెను; కాని యామెనిర్బంధ మధికమగుటచేఁ బోఁజాలకపోయెను. తుద కాతఁడు ఆమెవెనుక బయలుదేఱి తోఁటలోనున్న వారి పర్ణ

శాలకుఁ బోయెను. అందు యజమానుఁడు గూర్చుండియుండెను. యజమానురాలు బోధల నాతనికిఁ జూపి, యాతని స్థితి యంతయుఁ జెప్పెను. అది విని యావృద్ధుఁడును బోధల నెంతో యాదరము చేసి పర్ణశాలలోనికిఁ గొనిపోయి, అర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి పీఁటవేసి కూర్చుండఁ బెట్టెను. ఇంతలో యజమానురాలు రొట్టెలు, ఫలములు, పాలు పాత్రములలో నుంచుకొని వచ్చి, బోధలయెదుట నుంచెను. బోధల వారికిఁ గృతజ్ఞతఁ దెలుపుచు వారి నిర్బంధమువలనఁ గడుపు నిండ భుజించెను. ఆవృద్ధు లిరువురును గూడ "నాయనా! మొగమోటపడకుము. నీవు కడుపునిండ భుజింపకుండ వెడలిపోయితివేని, మాకు ఘోరతరపాపము చుట్టుకొనును" అని బతిమాలిరి. పాత్రములలో రొట్టెలు, ఫలములు, పాలు మిగిలియున్నను మఱికొన్ని తెచ్చివేసి, "నాయనా! మొగమోట పడితివేని నన్ను జంపుకొని తినినట్లే. తండ్రీ! ఈరెండుపండ్లే భుజింపుము. ఈయొక్కరొట్టెయే భుజింపుము. ఈగ్రుక్కెడుపాలే త్రావుము. బాబూ! నీవెంతదూరము పోవలయునో, మఱల నెంతసేపటికి అన్నము దొరకునో, తండ్రీ! కడుపార భుజింపుము" అని మాటిమాటికిని బతిమాలుచు మొగమోటపెట్టెను. ఆమె నిర్బంధమువలన నాతఁడు కడుపు నిండ భుజించి, "అమ్మా! ఇఁక నన్ను బాధింపకుము. నీనిర్బంధ మింక నున్న బాధించును" అని చెప్పి, దాహముపుచ్చుకొని వారికిఁ గృతజ్ఞతాపూర్వకముగ వందనము లాచరించిపోవుటకు వారిసెలవుఁబడసి లేచెను. చూచుచుండఁగనే క్షణములో నాతోఁటయుఁ బర్ణశాలయు వృద్ధదంపతులును మాయమైపోయిరి. కనుమూసి తెఱచునంతలో బోధల బైట యెండలో నిలిచియుండెను. ఇదిచూచి యాతఁడు పరమాశ్చర్యచకితుఁడై, "ఇది యంతయుఁ బాండురంగనిలీల యని భావించి, "దేవదేవా! సర్వేశ్వరా! లోకజననీ! ఈదీనునికొఱకు, ఈక్షుద్రుని నిమిత్తము మీరెంత కష్టపడుచున్నారు!" అని యనేకవిధములఁ గొనియాడి, తద్గుణకీర్తనమునఁ బ్రవృత్తుఁడై మరల నూరుదారి పట్టెను.

ఒకనాఁడు బోధల జొన్నచేనికిఁ గాపు ఉండెను. అయినను అతఁడు భగవద్భజనమున లీనుఁడై యుండుటచే పక్షులు వచ్చి యథేచ్ఛగ జొన్నలు తినిపోవుచుండెను. ఆతఁడు గూడ స్వయముగ క్షుధార్తులగు పథికులకు జొన్నకంకులు విఱిచి యీయఁ జొచ్చెను. ఇట్లుండఁగా, నాతనిభార్య అన్నము తీసికొనివచ్చి జరుగుచున్నది అంతయుఁ జూచి, "నాథా! ఇట్లయిన నేనేమి చెప్పఁగలను? ఇది కేవలము మనయనుభవమునకే వినియోగింపఁదగినది యైనచో నెట్లయినను నాకు విచారము లేదు; కాని ఈజొన్నలు విక్రయించుటవలన వచ్చుధనముసాయమువననే మనము దొరతనమువారికిఁ బన్నులుచెల్లింపవలసియున్నది. పన్నులు ఈయకున్నచో

రాజభటులు యమయాతనలు పెట్టెదరు. ఇది నీవు ఎఱుఁగనిదియా? ఇఁక నిట్లు చేయకుము. చేసితివేని పండరీనాథుఁడే యాన" అని చెప్పిపోయెను. మఱల బోధల బావా నృత్యము ప్రారంభించెను. ఆతఁడు పరవశుఁడై యుండఁగాఁ, గొందఱు పథికులు వచ్చి "మహాత్మా! మేము పండరినాథుని సేవింపఁబోవుచున్న బాటసారు లము. ఆఁకట మాకడుపులు నకనకలాడుచున్నవి. ఇఁక నొక్క యడుగైన నడువఁ జాలము. తినుట కేమైన లభింపదేని క్షణమైన నిలువఁజాలము. మాయెడలఁ గరుణ వహించి, మాక్షుద్బాధను దొలఁగింపుము" అని ప్రార్థించిరి. కొంతతడవునకు ఆతఁడు వారి ప్రార్థనమును దెలిసికొని, "అయ్యా! నేను మీకువలసిన జొన్నకంకులను నాచేతితో నిచ్చుటకు వీలులేదు. మీరే కైకొనుఁడు" అని చెప్పెను. వెంటనే బాటసారులు చేనిలో నడ్డపడిరి. క్షణములో చేనంతయు కంకులులేనిదై పోయెను. అప్పుడే వచ్చిన బోధలకుమారుఁడు అది చూచి, తండ్రి నేమియు ననఁజాలక చింతా క్రాంతుఁడై కూర్చుండెను. బోధల పుత్రునిస్థితి గ్రహించి, "వత్సా! ఏల వగచెదవు? ముందేమో విపత్తు వచ్చునని యిప్పుడు దీనులకు సాయముచేయకుండు టేటి వివే కము?" అని యడిగెను. అందులకు ఆనందించి యమాజీ, "ఇఁక నిక్కడ నుండు టెందులకు?" అని దండ్రినిఁ దీసికొని యింటికిఁ బోయి, సకలమును దల్లి కెఱిం గించెను. ఆమె యందుల కేమియుఁ జేయఁజాలక సంతోషించి యూరకుండెను.

పదిదినములు గడచిపోయిన పిదప రాజోద్యోగులు కర్షకులవలన రావల సిన పన్నులు వసూలుచేయఁ బ్రారంభించిరి. ప్రతిగ్రామమునందును ఎవరైన బాగుపడుచుండిన వారిని నాశనము చేయుటకును, ఎవ్వరైన మంచిపని చేయు చుండిన ఆపనిని ధ్వంసముఁజేయుటకును, సిద్ధముగానుండు దుర్మార్గు లుందురు గదా! ఆసమయమున అట్టివారు కొందఱు "బోధలవద్ద పన్ను ముందు వసూలు చేయుఁడు. ఆతఁడు దినదినమును దివాలా తీయుచున్నాఁడు. పదిదినములు గడచి నచో నిఁక వానివలనఁ బన్ను వసూలుకాదు" అని రాజభటులకు చెప్పిరి. వెంటనే రాజోద్యోగులు యమదూతలవలె వచ్చి బోధల యింటి గుమ్మము మీఁదఁ గూర్చుండి, "నీవు సర్కారుకు ఏడువరహాల నీయవలసియున్నది. ఇప్పుడే యిమ్ము" అని నిర్బంధించిరి. చూడఁగా, బోధలవద్ద మూఁడువరహాలు మాత్రమే యుండెను. తక్కిన నాలుగువరహాలును అప్పు తెచ్చియిచ్చెదనని వారి నొప్పించి, గ్రామము లోనికి బయలుదేఱెను. ఆగ్రామమున నాగాబాయి యను నొక వితంతువు దుష్ప థమున సంచరించి, చాలధన మార్జించి యుండెను. బోధల యామె నప్పు అడుగఁగా, "చేత నొక్కకాసు అయినను లేదు. రేపు ప్రాతఃకాలమువఱకు నుండువేని రావలసినచోట వసూలుచేసి యిచ్చెదను" అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

ఈసంగతి రాజభటుల కెఱింగించి అనేకవిధముల వారిని బతిమాలుకొని తుదకు రేపు వచ్చెద మనిపించుకొనెను.

మాటయిచ్చినప్రకారము ఈయవలసినవారివలన వసూలుచేయక పోయినను, పెట్టెలోనున్నవియే నాలుగువరహాలు తీసి బోధలకొఱకు నాగాబాయి ఎదురుచూచుచుండెను. ఇంతలో రాజోద్యోగులను బోధలమీఁదికిఁ బురికొల్పిన దుష్టులు ఆమెయింటికి వచ్చి, "ఇదిగో వినుము. పిదప నేడ్చెదవు. బోధలకు బదులియకుము. ఆతఁడు పూర్తిగా దివాలాతీసినాఁడు. ఆతనివలన నీకు తిరిగి సొమ్ము రాదు. ఆతఁడు దొరతనమువారి కీయక సంసారమునకు వాడుకొనును. పిదప రాజభటులు ఆతనినిఁ గైదులోఁ బెట్టెదరు. ఇఁక నీవు చెడవలసినదియే కదా! అదియుఁగాక, ఇప్పుడు మేము వలదనుటకు వేలుకారణములు గూడఁ గలవు. యథార్థము చెప్పుచున్నాము. నీవు ఆతనికి బదులు ఇచ్చెదవేని నీపనిఁ బట్టెదము. నీయింటిపై నొక్క పెంకుముక్కయైన నుండదు. నీతలపై నొక్క వెండ్రుకయు నుండదు. ఆపైని నీచిత్తము" అని చెప్పిపోయిరి. వారుచేయు దుండగములు నామె యిదివఱలో నెఱింగియున్నది కావున వారికి వ్యతిరేకము చేయఁజాలక, నాగాబాయి మఱల బోధల వచ్చి యడుగఁగా, "అయ్యా! నావలనఁ గాదు. ఈయవలసినవా ఱొక్క దమ్మిడియైన నీయలేదు. మఱియొకచోటఁ జూచుకొనుము." అని చెప్పివేసెను.

ఇది తెలిసి బోధల నెత్తిమీఁదఁ బిడుగుపడినట్లు చింతించి, తుదకు "సమీప గ్రామమునకుఁ బోయి నాలుగు వరాలును దెచ్చెదను" అని దారపుత్రులతోఁ జెప్పి, వీరాళా గ్రామమునకుఁ బోయెను. ఈసంగతిఁ దెలిసికొని ఆదుష్టులు రాజోద్యోగులతో బోధల పాఱిపోయె నని చెప్పిరి. తోడనే వారు వచ్చి ఇల్లు ముట్టడివేసి, గుమ్మముమీఁదఁ గూర్చుండి "పన్ను ఇచ్చునంతవఱకును ఇంటిలోనివా రెవ్వరును గుమ్మము దాఁటి పోఁగూడదు" అని శాసించిరి. బోధలభార్య మంచినీటికొఱకుఁ గూడ వెలుపలకుఁ బోవుటకు వీలులేదయ్యెను. వీరి యవస్థను జూచి పండరినాథుఁడు తలారివానివేషముతో రాజసన్నిధికిఁ బోయి, బోధలబావా చెల్లింపవలసిన యేడువరాలును జెల్లించి, రశీదు పుచ్చుకొని తెచ్చి, బోధల యింటిని ముట్టడించి యున్న ఉద్యోగులకుఁ జూపెను. అంతట వారు మాఱువల్కక లేచి పోయిరి. మఱునాఁడు బోధల వీరాళా గ్రామమునుండి వచ్చి రాజసభకుఁ బోఁగా అచ్చటి యధికారులు "ఓయీ! నీవు ఈవలసిన ఏడువరాలును నిన్న తలారివాఁడు తెచ్చి యిచ్చి, రశీదుఁ గొనిపోయెను" అని చెప్పిరి. అందులకు వింతపడి, బోధల తలారివానిని "నీకు ఏడువరాలు నెవ" రిచ్చి రని యడుగఁగా, "నే నేమియు నెఱుఁగను" అని వాఁడు చెప్పెను. అంతట బోధల ఇది యంతయుఁ బాండురంగని లీల

యని నిశ్చయించి, "దీనబంధూ! భక్తచింతామణీ! ఎంతపనిఁ జేసితివి? బ్రహ్మేంద్రాదులవలనఁ గూడఁ సేవింపఁబడు నీవు ఈసేవకుని నిమిత్తము అట్టి నీచరూపమును వహింప వచ్చునా? ప్రభూ! పన్ను చెల్లించునపుడు ఆరాజోద్యోగులు నిన్నేమని యదలించిరో, ఏమి చిక్కులు పెట్టిరో? అయ్యో ఈస్వల్పపుఁ బన్ను చెల్లించుట నావలనఁ గానిది కాదు గదా! అట్టిచో నీకీశ్రమ మేల? ఆశ్రితవత్సలా! శ్రీహరీ! నాహృదయము కంపితమైపోవుచున్నది. ఈయపచారమును నేను సహింపఁజాలను" అని దుఃఖింపసాగెను. అపుడు పండరినాథుఁడు సాక్షాత్కరించి, "వత్సా! వగవకుము. ఈవ్యవహారములో నీకేమియుఁ దెలియదు. శాంతించి యుండుము" అని యూరడించి, తిరోహితుఁ డయ్యెను. బోధల యింటికిఁ బోయి చూడఁగా, పెట్టె లన్నియు నపారధనసంచయముతోడను, గాదె లన్నియు ధాన్యరాసులతోడను, పొలము లన్నియు ఫలవినమ్రములగు సస్యములతోడను నిండి యుండెను. బోధల భగవంతుని అనేక విధములఁగీర్తించుచు, నాతని యనుగ్రహము వలన లబ్ధమయిన సంపత్తును మఱల భాగవతారాధనము నిమిత్తమును, దీనుల కోసమును వెచ్చింపఁ జొచ్చెను. గ్రామమునందలివా రెల్లరు నీవిచిత్రమును జూచి, బోధలమాహాత్మ్యము నెఱింగి యాతనిని గారవింపసాగిరి.

సమీపగ్రామమున బోధల సమీపబంధువులలో నన్నదమ్ములిరువురు బోధల చేలతో నంటియున్న చేను వ్యవసాయము చేయుచుండిరి. వారియింట హాసి యను నొకస్త్రీ దాసియై యుండెను. ఆమె సంసారముమీఁద విరక్తిఁబూని, బోధల చెంతకు వచ్చి "స్వామీ! నాకు సంసారముమీఁద రోఁత పుట్టినది. మీసేవ చేయ వలయునని నాకు అభిలాషము గలదు. నన్ను కరుణించి భవరోగమును బాపి అనుగ్రహింపుము" అని ప్రార్థించెను. అందులకు బోధల "నీకు వైరాగ్యము కలిగినందులకు ఆనందము; కాని సతతము భగవదారాధనమునఁ గడపుటకు ఒకనికి దాసివై యున్న నీకు ఎట్లు సాధ్యపడును? నిర్మలభక్తియున్నచో, భగవంతుని ఎప్పుడో యొకప్పుడు పూజించినను బాధలేదు. మనస్సును దుష్పథమునఁ బోనీయక నిర్మలభక్తితో నీశ్వరుని స్మరించుచు, సంసారమున నున్నవారు గూడ మోక్షమును బడసినవారు గలరు. కావున ప్రతి ఏకాదశీనాఁడును నీయజమానుల సెలవుఁబడసి పండరిపురమునకుఁ బోయి పాండురంగనిఁ బూజించుచుండుము. నీహృదయము నిర్మలభక్తిభరితమైనయెడల, నదియే చాలును" అని చెప్పి పంపివేసెను. ఆమె యట్లే చేయసాగెను.

బోధల ప్రభావము వెల్లడియైనకొలఁదిని సమీపగ్రామవాసులు అనేకులు వచ్చి, అతని భగవద్భజనమును, భగవద్గుణకీర్తనమును కని విని, యానందించి పోవుచుండిరి. ఒకప్పుడు ఢాళేరాసా అనుగ్రామమునుండి పదిమంది బోధల భగవ

ద్భజనమును జూచుటకు బయలుదేఱిరి; కాని మార్గమధ్యమున నందొకనినిఁ గృష్ణసర్పము కఱచి ప్రాణములు తీసెను. తక్కినవారు ఈసంగతి రాజభటులకుఁ దెలిసిన బాధలు గలుగునని తలంచి, ఎత్తికొని తీసికొనివచ్చి తమతోఁగూడ తమ నడుమఁ గూర్చుండఁ బెట్టికొనిరి. కొంతసేపయిన తరువాత బోధల చుట్టునున్న వారినిఁ జూచి, "భాగవతులారా! ఊరకుండవలదు. అందఱును లేచి నోటితోఁ బాడుచు, చేతులతో తాళమువేయుచు, కాళ్లతో నృత్యముచేయుచు హృదయమున భగవంతునినిలిపి భజనము చేయుఁడు" అని చెప్పెను. అందఱును భజనప్రారంభించిరి; కాని సర్పదష్టుఁడై మృతుఁడైనవాఁ డెట్లు భజనచేయును? వానినిజూచి బోధలచెంతకు వచ్చి తట్టి పిలిచి "మహాత్మా! ఏల యూరక కూర్చుండెదవు? హరిభజనము చేయుము. ఆపదుద్ధారకుఁ డగు శ్రీమన్నారాయణుని భజింపుము" అని చెప్పెను. తోడనే వాఁడు గూడ లేచి, భజన ప్రారంభించెను. అదిచూచి తక్కినవారు తెల్లవోయి కొంతతడవునకు తెలివి తెచ్చుకొని, యిదియంతయు బోధలమాహాత్మ్యమని తలంచి, యాతని పాదములమీఁద వ్రాలి యథార్థము విన్నవించిరి. బోధల ఇదియంతయు పండరినాథుని లీలయని భజనము యథాపూర్వముగ సాగించెను.

ఇట్లుండఁగా, హాసి యజమానుఁడు చనిపోయెను. అతని తమ్ములు ఋణబాధను దీర్చుకొనుటకు ఆస్తియంతయు విక్రయించుకొనుచు, ఆస్తితోఁబాటుగ హాసినిఁ గూడ విదేశీయుఁడగు నొక వర్తకునకు అమ్మఁజూచిరి. అది తెలిసికొని యామె బోధలచెంతకు వచ్చి పాదములమీఁద వ్రాలి, "మహాత్మా! నన్ను నాయజమానులు విదేశీయుఁడగు నొక వర్తకునకు విక్రయింపఁజూచుచున్నారు. మీకును నాకును, పండరినాథునకును నాకును దూరము చేయుటకు వారు తలంచి యున్నారు. నన్ను ఈవిపత్సాగరమునుండి దరిచేర్పవలయును" అని ప్రార్థించెను. అందులకు బోధల "నీవేమియు భీతిల్లకుము. భగవంతుఁడు నీహృదయమున నున్నచో, నీకును భగవంతునకును దూరముచేయఁగలవా రెవరు? భగవంతునికి సాధ్యముగాని దేమిగలదు? ఆతఁడు నీసేవ నభిలషించెనేని, నిన్నే సులభముగా పండరిపురమునకు రప్పించుకొనఁగలఁడు. లేకున్న నాతఁడే నీచెంతకు రాఁగలఁడు. అందులకు విచారింపకుము. నీకు పోయినచోట నాకంటె గొప్పయాచార్యుఁడే లభింపవచ్చును. విచారింపకుము. భగవద్ధ్యానము మాత్ర మేమరకుము" అని చెప్పెను.

అంతట హాసి మమతాబాయిచెంతకుఁ బోయి, తనకు సంభవించినదంతయుఁ దెలుపుకొని "తల్లీ! నాగురుదేవుఁడగు నీభర్తను, నాతల్లివగు నిన్నును విడిచి నేను మనఁజాలను. నన్నుఁ గొనునట్లు నీభర్తకు విన్నవింపవలయు" నని కోరెను. మమతాబాయి భర్తతో "హాసి మనలను విడువలేక యేడ్చుచున్నది. ఆమెను మన పాలము

అమ్మిరియైనను, ఆమె యజమానులు కోరుమూల్యము నిచ్చి కొనవలయునని చెప్పెను. అంత నాతఁడు అందుల కంగీకరించి, ఆమెయజమానులచెంతకుఁ బోయి "మీరు కోరినవెల యిచ్చెదను. హాసిని నాకు ఇచ్చివేయుఁడు" అని చెప్పెను; కాని వారు ఈతనియెడలఁ బ్రబలాసూయ గలవారగుటచే "లక్షవరహాలు ఇచ్చినను ఆమెను నీకు ఈయము. ఇతరులకే యిచ్చెదము" అని ఖండితముగాఁ జెప్పిరి. బోధల సంగతి యంతయు హాసి కెఱింగించి, "నీవు విచారింపకుము. శ్రీపాండురంగనికి సకలమును నివేదించి నీవిపత్తును దప్పించెద" ననిచెప్పి యింటికిఁబోయి, యావృత్తాంతము మరుతా బాయి కెఱింగించెను.

యజమానులు హాసిని, దాని కుమార్తెను దూరదేశమునుండి వచ్చిన వర్తకులకు ఇరువదియైదువరాలకు విక్రయించి, పత్రము వ్రాసియిచ్చి సొమ్ముపుచ్చుకొనిరి. తోడనే పాండురంగఁడు ఒకబ్రాహ్మణుఁడై వెళ్లి "రమ్ము, నిన్ను బోధల కొనిరమ్మన్నాఁడు" అని హాసిని ధామణగ్రామమునకుఁ బంపివేసెను. హాసి కూఁతురు చని పోయెను. ఉన్నట్లుండఁగా, హాసి మాయ మగుటఁ జూచి వర్తకులు దానిపూర్వ యజమానులవద్దకుఁ బోయి, "మాచే వరాలను గైకొని యీరకుండు రేల? హాసిని మాకు అప్పగింపుఁడు" అని యడిగిరి; కాని వారు "మీరు మాకు వరాలుఇచ్చి పత్రము ఎప్పుడు వ్రాయించుకొంటిరో, అప్పుడే హాసి మీసొత్తుఅయ్యెను. ఇఁక మా ప్రసక్తియేల ?" అని తప్పించుకొనుటకుఁ జూచిరి. ఈవివాదము ఎంతకును దీర దయ్యెను. "ప్రొద్దున నొక బ్రాహ్మణుఁడు వచ్చి, 'బోధలచెంతకుఁ బొమ్ము' అని హాసితోఁ జెప్పెను. చూడఁగా, బోధల హాసినిఁ బిలిపించుకొనిపోయినట్లు తోఁచు చున్నది. మీరు పోయి ఆతనితోఁ గలహింపుఁడు" అని గ్రామములోనివారు కొందఱు వర్తకులకుఁ దెలిపిరి. 'మాకు ఆబోధలతో నేమియును బనిలేదు' అని చెప్పి, వర్తకులు హాసి ఎచ్చట నున్నదో తెలిసికొనవలయునని బోధలచెంతకుఁ బోయి చూచిరి; కాని ఆమె యచ్చటఁ గాన్పింపదయ్యెను. ఈవివాదము నిట్లే పెంచి వర్త కులు తుదకు తామిచ్చిన ఇరువదియైదువరాలును గైకొనిరి.

మఱియొక దినమున సమీపగ్రామమునుండి యొక మాలవాఁడు వచ్చి, 'ప్రభూ! నేఁడు నాకు ఉపదేశము చేయకతీఱదు' అని పట్టుపట్టి బోధలను బ్రార్థించెను. వీఁడిట్లు చాలఁ గాలమునుండి ప్రార్థించుచుండెను. కాని వీఁడు అనర్హుఁ డని శంకించి, బోధల యింతవఱకును ఉపదేశము చేయఁడయ్యెను. నేఁడు నిర్బంధ మెక్కుడగుటచే బోధల భగవంతుని ధ్యానింపఁగా, సర్వేశ్వరుఁడు సాక్షాత్కరించి "వత్సా! వీనినిఁ బరీక్షింపక ఉపదేశము చేయకుము. నీశాసనము నతిక్రమింపఁడేని, రహస్య మును బయలు పుచ్చఁడేని అప్పుడు ఉపదేశింపుము. చేనిలో నొక క్షుద్రదేవత

యున్నదనియు, దానికి పూజించి ఆవుమాంసమును నైవేద్యము చేయవలయుననియు, నీసంగతి పరమగోప్యముగా నుంపవలసినదనియుఁ జెప్పి, వాని నట్లు చేయింపుము. ఆమాంసమును నీజాతివారికిఁ బెట్టుమనుము. ఎట్లయిన వాని మనశ్శుద్ధి తెలియఁ గలదు" అని చెప్పిపోయెను. బోధల మాలవానికి అట్లే చెప్పి, "గోశాల సున్న ఎట్టిని దూడను గొనిపోయి చేనిలోబలిచేసి, మాంసము తీసికొనిరమ్ము" అని నియమించెను. మాలవాఁడు దానినిఁ దీసికొనిపోయి సంహరించి కాళ్లును, దలయుఁ దాను ఉంచుకొని, మాంసమును దెచ్చి బోధల కిచ్చెను. బోధల దానిని వండించి నైవేద్యముచేసి తనజాతివారిని విందునకుఁ బిలిచి వారికిఁ బెట్టెను. "బోధల హరిభక్తుఁడనియందురే? నేఁడు ఈక్షుద్ర దేవతారాధనము నెట్లు చేసెను?" అని యనుకొనుచు, వారందఱును మాంసమునుజక్కఁగా భుజించి, ఆనందించి వెడలిపోయిరి. మఱునాఁడు మాలవాఁడు ఒక కాపువాని యింటిలో నిశ్శంకముగాఁ బ్రవేశించెను. ఇదేమి అన్యాయ మని యాకాపు కొట్టరాఁగా, వాఁడు "నాకంటె మీరేమి యెక్కువ? నేనును గోమాంసము తిందును. మీరును బోధలయింట నిన్న తినివచ్చితిరి" అని యదలించెను. అది విని యాతఁడు నిర్విణ్ణుఁడై, తోడివారందఱకు నీసంగతిఁ దెలిపెను. వారందఱును గుమిఁగూడి, "బోధల మాకులమును జెఱిపెను. వానినిఁ బోలమునకుఁ దీసికొనిపోయి అక్కడఁ జంపివేయుద" మని కూడఁ బలికికొనిరి. వారిలో దూరదర్శులగువారు కొందఱు "తొందరపడవలదు. మాలవానిని నిదర్శనము చూపు మని కోరుఁ" డనిరి. కొంద ఱట్లడుగఁగా వాఁడు "ఈసందేహము తీర్చుట యెంత? బోధల గోశాలలోని ఎట్టని దూడను నేను చంపితిని. తలయు కాళ్ళును ఇంకను నాయింటనే యున్నవి. చూపెదను రండు" అని చూపుటకుఁ గొందఱను గొనిపోయెను. ఉన్నవారిలోఁ గొందఱు బోధలయింటిపైఁబడి, "దుర్మార్గుఁడా! మేక వన్నెపులివలె మాయవేసము వేసికొని, అక్రమముగా మాకు గోమాంసము పెట్టి కులము చెఱిపితివి. చూడుము నిన్నేమి చేసెదమో" యని అనేకవిధముల నాతనిని నిందింపసాగిరి. ఇంతలోఁ బోయినవారు చూడఁగా, మాలవానియింట ఆవుదూడ తలకును కాళ్లకును మాఱుగ, మేఁకతలయు కాళ్ళును ఉండెను. వానినిఁ జూచి మాలవాఁడు రిచ్చపడి తెప్పిరిలి, "ఇది యిట్లు ఎందులకైనదో తెలియదు. గోశాలలో నెట్టని దూడయున్న దేమో చూచుకొనుఁడు. మీ కదే నిదర్శనము" అని చెప్పెను. వారు గోశాలకుఁ బోయి చూడఁగా, నచ్చట ఎట్టనిదూడ చక్కఁగా గడ్డిమేయుచుండెను. ఇదంతయుఁ జూచి వారు మాలవానివలన మోసపోయితిమని తలంచి, బోధల పాదములమీఁద వ్రాలి, "మహాత్మా! రక్షింపుము. అజ్ఞానుల మగుట సంగతిసందర్భములు తెలియక గంతులు వేసితిమి. మమ్ము

క్షమింపుము" అని బోధలను బ్రార్థించి సరియేయనిపించుకొని, మాలవానినిఁ జంపు టకు సిద్ధపడిరి. అపుడు బోధల వారిని వారించి, "ఇదంతయు పాండురంగని విలాసము. శ్రీహరినిఁ జూచి వానిని క్షమింపుఁడు" అని చెప్పెను. అంతట నాకాపు లందఱును బోధలయాజ్ఞాప్రకారము మాలవాని కేమియు విపత్తుఁగలిగింపకయే వెడలిపోయిరి. తాను చేసిన పనికి సిగ్గుపడి, మాలవాఁడు మఱల బోధలకుఁ దన మొగము చూపియెఱుఁగఁడు.

ఇట్లుండఁగా, నొకసంవత్సరము కార్తికమాసమువఱకును వర్షము కురువ దయ్యెను. పంటలు పండకపోవుటచే దేశములో కఱవు సంభవించెను. బోధల తన యింట నున్న ధాన్య మంతయుఁ దీనులకుఁ బంచియిచ్చెను. ఇట్లుండఁగా, కార్తిక మాసమున నొక వర్షము కురిసెను. తోడనే బోధల చేను దున్నించి జొన్నలు చల్లించెను. మఱునాఁడే పండరిపురమునకుఁబోవు బాటసారులు కొందఱు వచ్చి, "స్వామీ! మమ్ము ఆఁకలి పీడించుచున్నది. రక్షింపుము" అని ప్రార్థించిరి. చూడఁగా, నింటిలో పుచ్చిపోయినజొన్నలు ఉండెను. బోధల కుమారునిఁ బిలిచి, "వత్సా! నిన్న చేనిలోఁ జల్లిన జొన్నలు తీసి జల్లించి వీరికిచ్చి పంపివేసి, యింటిలోని పుచ్చు జొన్నలు చేనిలో చల్లుము" అని నియమించెను. యమాజీ యట్లే చేసెను. పుచ్చు జొన్నలు మొలచునా? యని చూచినవా రందఱును నవ్వసాగిరి; కాని మఱునాఁడే యవి చక్కఁగా నంకురించి పెరిగెను. ఫలకాలమున జొన్న చెట్లకు అనపకాయలు కాచెను. పగులఁగొట్టి చూడఁగా, ఆకాయలయందు గోధుమలు ఉండెను. అది చూచి అందఱును పరమాశ్చర్యచకితులైరి. ఇది నవాబునకుఁ దెలిసెను. "ఓ! బోధల ఐంద్రజాలికుఁడు; చూడుఁడు వానిపనిఁ బట్టెదను" అని నవాబు బోధలను దర్బారునకుఁ బిలిపించి, గోమాంసము వండించి తెప్పించి "ఇది తినుము. లేకున్న జైదులోఁ బెట్టించెదను" అని బెదరించెను. బోధల చూడఁగా, నామాంసపుకూర తులసీదళములై పోయెను. అంతట నవాబు బుద్ధితెచ్చుకొని బోధల పాదములమీఁద వ్రాలి, కరుణింపు మని ప్రార్థించెను. బ్రతికియున్నంతకాలము హరిభజనమునఁ గడపి, అవసానమున బోధల ఈశ్వరసాయుజ్యమును బడసెను.

చ. "హరి భవదీయమాయ ననయంబును జెందిననేము నిచ్చలుం
గర మనురక్తి నేడి తుదగా భవకర్మల మైఁ దిరిత్రిప్పెఁ
దిరుగుదు మంతదాఁక భవదీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁ జేయుము మాధవా."

(భాగ. స్కం. 4. ప. 928.)

# 31. సుఖానందుఁడు

ఒక గ్రామమున సుఖానందుఁడు అనునొక బ్రాహ్మణుఁడు ఉండెను. ఆతనిభార్య పేరు సురసురి. ఆయిరువురును ఏకమనస్కులై ఏవిషయమునందును భేదభావములు లేక, ఒకరికష్టము నొకరి కష్టముగా భావించుకొనుచు, మహానందముతోఁ గాలము గడుపుచుండిరి. అంతియేగాక శ్రీహరిభక్తులై, సదా శ్రీహరిధ్యానమును, శ్రీహరి పూజను, భాగవతారాధనమును, దీనపోషణమును జేయుచు ఇహసుఖముల యెడల విరక్తులై, సంసారము నసార మని యెంచి ప్రవర్తించుచుండిరి.

ఆ గ్రామమునఁ గొందఱు ఆదంపతుల యైకమత్యమును, సౌజన్యమును జూచి యోర్వఁజాలక, ఎట్లయినను వారిని వంచింపవలయునని చూచుచుండిరి. సుఖానందుఁడును సురసురియుఁ గూడ నెప్పుడు నిలుపీడక సదా భగవద్ధ్యానమునందే నిమగ్నులై యుండువారు గాన, ఆదుష్టులకు వంచించుటకు సమయము దొరకదయ్యెను. ఇట్లుండఁగా, వాండ్రు ఒకనాఁడు బజారునకుఁ బోయి మిఠాయిఁ గొని తెచ్చియిచ్చి, వారిని "మహాత్ములారా! మేము నేఁడు భగవంతునకు భోగము చేయించితిమి. ఈ భగవన్నివేదితపదార్థమును దాము స్వీకరింపవలయు" నని ప్రార్థించి, బలవంత పెట్టిరి. వారు బలవంతపెట్టకపూర్వమే ఆదంపతులు భగవన్నివేదితవస్తువులు బహిష్కారణీయములుకావని యెఱింగినవారు కావున, వానినిఁ గైకొని ఆనందముతో భుజించిరి. తోడనే ఆదుష్టులు "ఛీఛీ! మీరేటిబ్రాహ్మణులు! మీరు బజారులో శూద్రులుచేసిన మిఠాయిఁ దినినారు; కావున ప్రాయశ్చిత్తము చేసికొనునంతవఱకు మిమ్ము వెలివేసితి" మని గోలచేయసాగిరి. అంతట నాదంపతులు వాండ్రు చేసిన మోసము నెఱింగి, "మీరేటికిట్లు గోలచేసెదరు? మేము వానిని దాఁచితిమే కాని, భక్షింపలేదు. ఇదుగో మీమిఠాయియుండలు" అని నోళ్లనుండి తీసి యిచ్చివేసిరి. వారు చిదిపి నమలి మ్రింగిన మిఠాయి మఱల ఉండలరూపమునఁ బైకివచ్చినందులకు ఆదుష్టులు ఆశ్చర్య పడి, వారిమాహాత్మ్యమునెఱింగి, "ఓపుణ్యదంపతులారా! మేము మీప్రభావము నెఱుంగక చేసినపాపకృత్యమునకు మన్నింపవలయును. కేవలము భక్తచింతామణి సర్వేశ్వరుఁడు మీపాలనున్నాఁడు. ఇఁక మిమ్ము భగవంతునికంటె నెక్కుడుభక్తితోఁ బూజింతుము. ఈయొక్క తప్పిదమును విస్మరించి మమ్ముఁ గాపాడవలయు" నని పాద ములమీఁద వ్రాలి ప్రార్థించిరి. సుఖానందుఁడు ఇంచుకేనియుఁ గోపింపక, బుద్ధిగలిగి యుండుఁడు. భగవంతుఁడు మిమ్ము రక్షించుఁగాక!" అని యాశీర్వదించి వాండ్ర నంపివేసెను.

ఒకప్పుడు సుఖానందునకు తానొక్కఁడును తీర్థయాత్ర సేయవలయు నన్న తలంపు గలిగెను. అంతట నాతఁడు భార్యనుజూచి, "అంతకు మనకు రక్షకుఁడు అగు శ్రీమన్నారాయణుఁడే గలఁడు. నేను తీర్థయాత్ర పోయివచ్చెదను. శ్రీహరినే నమ్ముకొని భాగవతారాధనము జేయుచు నింట నుండుము. నీవుచేయుభాగవతారాధనము నాచేయు తీర్థయాత్రకంటె నెన్నోమడుంగులు మిన్నయైనది; కావున నిన్ను ఇంట నుండుమని చెప్పుచున్నాను. ఎట్లో నాకీ బుద్ధిపుట్టినది; కాని నాకు నేనై కోరుకొని వెళ్లుట లేదు. ఇంట సమస్తమును గలవు. నీకుఁ దెలియని దేమియు లేదు" అని చెప్పెను. సురసురియు భర్త కేమియు నభ్యంతరము చెప్పక "నాకింతగాఁ జెప్పనేల? నేను మీయాజ్ఞ ఎన్నఁడును జవదాఁటియెఱుఁగనుగదా? మీకును నాకును ప్రపంచమునకు అంతకును గూడ రక్షకుఁ డగుభగవంతునిపై భారము వేసి, నిశ్చింతతో మీరు తీర్థయాత్రకుఁ బోయిరండు. నేఁజేయు భాగవతారాధనమున మీకును, మీరుచేయు తీర్థయాత్రలో నాకును భాగములు లేకపోలేవు. మీచిత్తమువచ్చినట్లు చేయుఁడు" అని విన్నవించెను. అది విని పరమానందభరితుఁడై సుఖానందుఁడు నిశ్చింతతోఁ దీర్థయాత్రకు బయలుదేఱి పోయెను.

ఆయూర నున్న యొక దుష్టుఁడు చిరకాలమునుండి సురసురిని మోహించి యుండియు, నేదో కారణమువలనఁ దన యభిప్రాయము నామె కెఱింగింపఁజాలక యుండెను. ఇట్టిస్థితిలో నున్నవాఁడు సుఖానందుఁడు తీర్థయాత్రకుఁబోవుట యెఱింగి సాధువేషమును ధరించి సాయంకాలము అగునప్పటికి సురసురి యింటి ముంగిట నిలిచెను. వానినిఁజూచి యామె పరమభాగవతోత్తముఁ డని తలంచి బహుభక్తితో నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, ఆపూటఁ దనయింట నారగించి తరింపఁజేయవలయు నని ప్రార్థించెను. వాఁడు ఆమెనిమిత్తమే వచ్చినవాఁడు గావునఁ దొలుతఁ గొంచెము బింకముచూపి "మీరిప్పుడు వెడలిపోయిన శ్రీహరిపై నానగలదు" అని యామెచే ననిపించికొని చేయఁజాలినది లేనివానివలెఁ దుదకు అంగీకరించెను. తోడనే సురసురి మహానందముతో షడ్రసోపేతమగు భోజనము సమర్చి, వానిని భుజింపఁజేసి భాగవత భుక్తశేషమును భుజించుటకుఁ గూర్చుండెను.

ఆమె భుజించి వచ్చినపిమ్మట వాఁడు కొంతసేపు ఏమేమో చెప్పి తుదకుఁ దన మనోరథము నెఱింగించెను. అదివిని యామె యేమియుఁ జలింపక "భగవదారాధనము కంటె భాగవతారాధన ముత్కృష్ట మని నానాథుఁ డుపదేశించిపోయెను; కావున మీయాజ్ఞాప్రకారము ఈదాసురాలు నడచుకొనఁగలదు" అని శయ్యాగృహమునకు బోయి దాని నలంకరించి తాను శయ్యపైఁ గూర్చుండి వానినిఁ బిలిచెను. వాఁడు పరమానందముతోఁ దలుపు తెఱచికొని లోనికిఁ బోఁగా, మంచము మీఁదఁగూర్చుండి

కంటె ఘనుఁడు. నీమనోనిశ్చయము నేనెఱుఁగుదును. నీమనోనైర్మల్యము నేనెఱుఁగుదును. కావుననే నిన్ను గృహస్థాశ్రమమునఁ బ్రవేశింపు మని చెప్పుచున్నాను. అంతియే కాని నిన్ను చెఱచుటకుఁ గాదు. గృహస్థాశ్రమగౌరవము నీకుఁ దెలియదు. త్రిమూర్తులుగూడ గృహస్థాశ్రమములనే పాలించుచున్నారు. వారివలెనే తామరాకుమీఁది నీటిచుక్కవలె సంసారము నంటకుండ నున్నచో, నది మానవుల నేమియుఁ జేయఁజాలదు. కావున నామాట వినుము" అని సుఖానందుఁడు బోధించెను. ఇది యంతయు విని శిష్యుఁడు పెండ్లియాడుట కంగీకరించెను. తోడనే లక్షణవతి యగు నొక కన్యను వెదకితెచ్చి సుఖానందుఁడు శిష్యునకు పెండ్లిచేసి, భాగవతులను మృష్టాన్నదానముచే సంతోషపెట్టెను.

పిదప శిష్యుఁడు పతివ్రతాతిలక మగుభార్యతోఁ గూడి సన్మార్గమున ద్రవ్యము నార్జించుచు, సంసారమును నిర్వర్తించుకొనుచు భగవంతుని, భాగవతులను, గురుదేవులను ఆరాధించుచు, అన్నదానముచే దీనుల నానందపెట్టుచు, హరిభజనమునఁ గాలముగడుపసాగెను. ఒకప్పుడు అతఁడు నాతని భార్యయు భక్తిపరవశులై హరిభజనము ప్రారంభించిరి. తోడనే రుక్మిణీసత్యభామాసహితుఁడు శ్రీకృష్ణపరమాత్మ సాక్షాత్కరించి, సాష్టాంగనమస్కారముం జేసిన వారి నాదరించి "వత్సలారా! భాగవతారాధనముసేయుచు భజనము సేయుచుండుఁడు" అని యంతర్హితుఁ డయ్యెను. సుఖానందుఁడును సురసురియు శిష్యుఁడును అతని భార్యయుఁ జిరకాలము భగవంతునిఁ బూజించి, భాగవతులను సేవించి, దీనులను పోషించి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసిరి.

సీ. "కేశవ సంతతక్లేశనాశనుఁడవు గురుసన్మనోవాగగోచరుఁడవు
నిద్ధమనోరథహేతుభూతోదారగుణనాముఁడవు సత్వగుణుఁడ వఖిల
విశ్వోద్భవస్థితివిలయార్థధృతనిత్యవిపులమాయాగుణవిగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియమార్గనీరధిగతమార్గుఁడ వతిశాంతమానసుఁడవు
తే. తవిలి సంసారహారి మేధస్కుఁడవును, దేవదేవుఁడవును వాసుదేవుఁడవును
సర్వభూతనివాసివి సర్వసాక్షి, వైన నీకు నమస్కారమయ్య కృష్ణ."

(భాగ. సప్తమ. 4. ప. 918.)

# 32. అంగదభూపతి

శ్లో. "అనర్ఘ్యమాణిక్యవిరాజమానశ్రీపాదుకాలంకృతశోభనాభ్యాం,
అశేషబృందారకవందితాభ్యాం నమో నమో రామపదాంబుజాభ్యాం."

(ప. 9. ఆ. 2. రామకర్ణామృతము.)

రాయసింగు, అంగదభూపతి అను నిరువురు అన్నదమ్ములు అతిసోహార్దముతోఁ గలిసి పితృపితామహక్రమాగతం బగు ప్రాజ్యరాజ్యమును బరిపాలించుకొను చుండిరి. పేరునకు రాయసింహుఁడు రాజేగాని యాతఁ డేపని చేసినను తమ్ముని సలహా గొనకుండఁజేసి యెఱుఁగఁడు. అంగదభూపతియు అన్న తనయం దెంత ప్రేమ చూపుచుండునో, ఆతనియెడల నంతకంటె నధికభక్తిఁ జూపుచుఁ జేదోడువాదోడుగా నుండి చాల పేరుప్రతిష్ఠలు సంపాదించుచుండెను.

అంగదభూపతి భార్య గొప్పపతివ్రత. ఆమె యెప్పుడును పతిమాట కెదురాడి యెఱుఁగదు. పతికి వ్యతిరేక మెప్పుడును దలంచియైన నెఱుఁగదు. ఆసాధ్వి పతియే దైవమని నమ్మి, యాతనిని సకలవిధోపచారములతోడను త్రికరణశుద్ధిగాఁ బూజించుచుఁ దనకును, దనభర్తకును గూడ అనంతమంగళములను బ్రసాదింపవలె నని శ్రీహరిని సదా ధ్యానముసేయుచుండెను. అట్లు కాలము గడచిపోవుచుండఁగా, నొకనాఁడు ఆమె గురువు వచ్చెను. గురువును దేవునిగా భావించి, యనేకవిధముల నాతనిం బూజించి, యాశీర్వచనమును బడసి, యామె యాతని నంపివేసెను. ఈ సంగతి విని అంగదభూపతి, "నేఁటివఱకును నా భార్య నను దక్కభగవంతు నైనఁ బూజించి యెఱుఁగదు. నేఁడు చూడఁగా దీని గుణము చెడినట్లు తోఁచుచున్నది. లేకున్న నేఁడు గురుఁడు అని చెప్పి ఎవనినో నన్ను బూజించినదాని కంటె నధికముగాఁ బూజింపనేల?" అని సంశయగ్రస్తచిత్తుఁడై, "ప్రథమాపరాధమును క్షమించితిని. నేఁటినుండి నీవు, గురువు అనియు, గొప్పవాఁడనియు నెవ్వనినిఁ బూజింపఁగూడదు. నాయాజ్ఞకు వ్యతిరేకము నేసితి వేని నిన్ను సంహారించివేసెద" నని తీవ్రముగాఁ జెప్పెను.

ఇది విని యాసతీమణి చాలఁ గటకటంబడెను. "అయ్యో! నాభర్తకు ఎట్టి దురూహ కలిగెను. కేవలము ప్రపంచమే శాశ్వత మని ఐహికవిషయనిమగ్నుడై చెడిపోవలసిన నాకు జ్ఞానోపదేశము చేసి మోక్షోపాయము నెఱింగించిన గురుదేవునిఁ బూజింపకుండ నెట్లుండఁగలను? శ్రీహరీ! నాగతి యిప్పుడు అశోకత్రైర లోని వక్కగతి యైనది. నిన్నును, నిన్నెఱింగించిన గురుదేవునిఁ బూజింపనేని నరకమునఁ గూలిపోయెదను. నాభర్తమాట కెదురాడి ఆతని యాజ్ఞకు వ్యతిరే

కము చేసినను నాకు అదియే గతి? ప్రభూ! ఈదాసురాలికి ఇట్టి విషమదశ నేల కలిగించితివి? ఇట్టి దుర్భరవిపత్తుం గలిగించి పరీక్షింపఁబూనిన, నేను ఏమి సేయఁ గలను? అనంతమును, దుస్తరమును, పాపసంకిలమును కామక్రోధలోభమోహాది మహానక్రసంకులంబును, పునర్జన్మకారణము నగు నీ అసారసంసారసాగరమును జూచిన నాయొడలు జలదరించుచున్నది. అకటా! మఱల మఱల నన్ను ఇందేకూల వేయనెంచితివా? దేవదేవా! ఈజగత్తంతయు నీసంకల్పమాత్రమున సృష్టిస్థితి సంహారరూప మగు అవస్థాత్రయము నందుచున్నది. ప్రపంచమునందంతటను నీవు నిండియున్నావు. నాయందును నాభర్తయందునుగూడ నున్నావు! కాని నాయందు ఉండి నిన్నుఁ బూజించునట్లు నాకు విధించుచు, నాభర్తయందు ఉండి కేవలము నందులకు వ్యతిరేకముగ నాజ్ఞాపించుచున్నావు. ఇది యంతయు నీకు చెలగాట ముగా నున్నదా?" అని వగచి నిద్రాహారములు మాని,

మ సుకృతస్థానము సత్యముఙ్ బరమునఙ్ జ్యోతిస్స్వరూపంబు తా
రకనామం బపవర్గదంబు పరమబ్రహ్మంబు నోంకారసా
మకసుస్థానము సద్గుణాకరము శుంభచ్ఛాశ్వతానంద మ
త్యకలంకం బగు రామరత్నము నితాంతప్రేమునఙ్ బ్రోవుతన్.

మ. ప్రకటోంకార నివాసముఙ్ ద్రుహిణజంభద్వేషిజప్యంబు తా
రకముఙ్ మానినుతంబు నాఙ్కులమంత్రం బాసురధ్వంసముఙ్
సకలారాధ్యావసముఙ్ జగత్ప్రకటముఙ్ సన్ముక్తిమార్గంబు మా
మకషడ్వర్గహరంబు రామవిలసన్మంత్రంబు నఙ్ బ్రోవుతన్.

(107. 109 ప. ఆ. 2. రామకర్ణామృతము.)

అని సర్వేశ్వరునిఁ బ్రార్థింపఁ దొడఁగెను.

అంగదభూపతి భార్యకు అట్టి కఠోరశాసనముచేసిన నాఁటిరాత్రి రెండు జాములు గడచినతరువాత, శ్రీపతి బీదబ్రాహ్మణవేషముతో నాతని స్వప్నమున సాక్షాత్కరించెను. అంగదభూపతియు నాతనింగాంచి "నీవెవఁడవు? ఏమి చేయు చుందువు? ఇందుల కెందులకు వచ్చితివి?" అని ప్రశ్నింపఁగా, నాతఁడు "కాన్పిం చుట లేదా? నేను దరిద్రబ్రాహ్మణుఁడను" అని చెప్పెను. అందులకు రాజు "ఆమాటకు నేను అంగీకరింపఁజాలను. నీవేషము బీదలకు ఉచితమైయున్నదిగాని నీతేజస్సు మహామహుఁడవని తెలుపుచున్నది. అది మాటలవలనను మాటుల వలనను ఆచ్ఛాదింపఁబడునది గాదు. నీవిశాలలలాటమును, నీకనుదమ్ములు చూచి నను, నీయాజానుబాహువులు చూచినను నాకు అనంత భక్తిభావము గలుగు చున్నది. నీవక్షస్థలము ఏమో వింతగాఁ గాన్పించుచున్నది. నీవు యథార్థము సెప్పుము. ఎవఁడవు? ఇక్కడ కెందులకు వచ్చితివి?" అని మఱలఁబలికెను. అందు లకు బ్రాహ్మణుఁడు మందహాసముగావించి, "రాజా! నీవు వివేకివి కాదని నేనుచెప్పఁ

అవివేకము నీజీవితమునకు ఆధారమైన విషయమును మరపించుచే జాలను గాన్ని, స్మరింపోయినది. ఏమందువా? అనేక సంవత్సరములనుండి నిర్మలహృదయాచ్ఛాదింపఁబడియున్న నేను మునీశ్వరులకుఁ గూడ అవాఙ్మానసగోచరుఁ డగువానిని యమముతో తపస్సుగాని చేయఁడవు అని యడుగుచున్నావుగాని, తెలిసికొనఁజాలక పు నిర్లక్ష్య మొనర్చుటకంటె నీవివేకము మరిబాటిపోయినదని చెప్పుటకు ఇం కేమికావలెను? ఇంతకాలము తత్త్వవిమర్శచేసియు యోగు లెవ్వని నెఱుంగలేరో, అట్టినేను భక్తపరాధీనుఁడనై నగటవలన స్వయముగ నీకు నాస్థితిగతులు చెప్పుకొనవలసివచ్చినది. భూపతీ! నీవు నన్ను ఆజానుబాహుఁడనంటివి. నాయాకారముచూచిన నేమో వింతగానున్నదంటివి గాని, నేఁటియుదయము సాధ్వీమతల్లి యగు నీభార్యకుఁ జేసిన కఠోరశాసనమూలకముగ పాపాత్ముఁడవగుటవలన నాకుఁ గల నాలుగుబాహువులను, వాని యందలి శంఖచక్రాదికములను, వక్షమున నున్న క్షీరసాగరకన్యను దెలిసికొనఁ జాలకపోయితివి. ఇఁక నెందులకు వచ్చితి వందువా? సకలభువనములును నాయాజ్ఞకు లోఁబడియున్నవి. నాపోషణమున మనుచున్నవి. నాయిచ్ఛవచ్చినట్లు చరించుచున్నవి; కాని నేను భక్తుల వశమున నున్నాను. వారిచేఁ బోషింపఁబడుచున్నాను. వారి యాజ్ఞాప్రకారము ప్రవర్తించుచున్నాను. పాదరజోలేశమువలన జగత్తులను బునీతములు గావించు నేను భక్తపాదరజమును శిరసావహించుచున్నాను. అందఱిచేతను నుతింపఁబడు నేను భక్తులను నుతించుచున్నాను. ఎల్లరచేతను సేవింపఁబడు నేను భక్తులను సేవించుచున్నాను. నేను అంతటనుగలను. కాని భక్తులు నన్ను దమహృదయకుహరములయందు బంధించివేయుటచే యుష్మదాదులకు అగోచరుఁడనై యున్నాఁడను. నాకు ఎవరివిషయమునను బక్షపాతము లేదు; కాని ప్రయత్నించి చూచినఁ గాని అణువులయందుఁగూడఁ గాన్పింపదు. అట్లే నిశ్చలచిత్తముతోఁ జూచినఁ గాని అణువులయందుఁగూడ నిహితమైయున్న నారూపము అనుభూతము గాదు. సాధ్వీమతల్లి యగునీభార్య సెలవుఁబడసి నేను ఇక్కడకు వచ్చితిని. రాజ నను గర్వమువలన నీవు నీభార్య మహిమ నెఱుంగలేకున్నావు. కాని బ్రహ్మరుద్రేంద్రాదులును, నేనును గూడ నామె కటాక్షము నాసించుకొని యున్నాము. నీవు శుష్కహృదయుఁడవేమైనను నీయర్ధాంగి భక్తిరసబంధుర యగుటవలన నీయెదుట నేను నిలువవలసివచ్చిన" దని తన నిజరూపమును జూపెను.

తోడనే భూపతి గడగడ వడఁకుచు శ్రీహరిపాదములమీఁద వ్రాలి "శ్రీహరీ! సృష్టిస్థితిసంహారకరణచరణా! మహాప్రభూ! అవివేకమువలని నిన్ను దెలిసికొనఁజాలకపోయితిని. శుష్కహృదయుఁడ నగుటవలన నిన్ను గ్రహింపలేక పోయితిని. భక్తమందారా! ఆశ్రితరక్షకా!

శ్లో. "హే గోపాలక! హే కృపాజలనిధే హే సింధుకన్యాపతే
హే కంసాంతక హే గజేంద్రకరుణాపారీణ హే మాధవ
హే రామానుజ హే జగత్త్రయగురో హే పుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా.

చ. నీవు ప్రసన్నుఁడైన యెడ నేరుపు లేటికి? నప్రసన్నతన్
నీవు పరాకుసేసినను నేరుపు లేమిటి కెంచిచూడఁ గృ
ష్ణా! విభుఁ డాదరించు సమయంబున నొల్లమి సేయు వేళలన్
గావలెనే లతాంగులకుఁ గైపఱు కుంకుమపత్త్రభంగముల్.

శా. ఆనందంబున బాహ్యముల్ మఱచి యోగాత్మారామలీలారతిన్
ధ్యానుల్ గొల్వఁగ ముంగలన్ నిలచి వాచాగోచరంబై యశో
దానందాంగణరత్నమై మధురిమాధారార్ణవంబైన యే
దే నత్యుజ్జ్వల మట్టితేజమున కెంతే మక్కువన్ మ్రొక్కెదన్."

(109 ప. ఆ. 100. 108. ప. ఆ. 2. కృష్ణకర్ణామృతము.)

విషమదశ నేల
నేను ఏమి సేయఁ
ధలోభమోహాది
ంసారసాగరమును.
నన్ను ఇందేక
ముస

అని వినుతించుచు అనేకనమస్కారములు చేసెను.

అప్పుడు శ్రీమన్నారాయణుఁడు ఆదరముతో నాతనిని లేవనెత్తి, "వత్సా! సంతోషమైనది. నీభార్య జగత్పూజ్యురాలు. ఆమెసాహచర్యమువలన పుష్పసాహచర్యమువలన త్రాడు మహామహుల మూర్ధము లలంకరించునట్లే, నీవును నాదర్శన భాషణభాగ్యమును బడసితివి. నీపూర్వపాపము లన్నియు భస్మీపటలములై పోయినవి. ఇప్పుడైనను నీవు బుద్ధిగలిగి మసలుకొనుము" అని చెప్పి అంతర్హితుఁ డయ్యెను. అంతట మెలఁకువరాఁగా నాతఁడు తోడనే భార్యనులేపి, ఆమె నెంతోయాదరించి యెంతో కొనియాడి సంగతియంతయుఁ దెలిపి, "మాహాత్మ్యమువలన నేను నిన్ను అనరాని మాట లాడితిని. వానిని సహింపుము. ఇఁక నాకు బుద్ధి వచ్చినది. నీసాహచర్యమువలన ధన్యుఁడనైతిని. నాపురాకృతపుణ్యవశముననే నీవు అర్ధాంగివైతివి. ఇఁక నన్ను మోక్షమార్గమునఁ బ్రవేశపెట్టుము. పూజ్యుఁడగు గురుదేవుని రావించి నాకు జ్ఞానోపదేశము చేయించి పుణ్యము గట్టుకొనుము" అని చేతులు పట్టుకొని అనేకవిధములఁ బ్రార్థించెను. అందులకు ఆమె చాల నానందించి వినయవినమితయై, "నాథా! నేను అదృష్టవంతురాలను. కావున నీకు శ్రీమన్నారాయణమూర్తి సాక్షాత్కరించి సంభాషణలాభము నొసంగిపోయెను" అని కొనియాడి రాత్రిశేషమంతయు భగవద్భజనమున గడపెను. మఱునాఁడు ఆమె వార్త నంపఁగా గురువుదేవుఁడు వచ్చి భూపతికి జ్ఞానోపదేశము చేసి, "భూపతీ! నీవు మహాభాగ్యశాలివి. ఇఁక నీకు మోక్షము కరతలామలకము. కేవల భగవత్సాక్షాత్కారభాగ్యమును బడసిన నీకు మేము బోధింపవలసినదేమి యున్నది? లోకము పాప

జాలను గాన్పి, చయున్నది. పామరులు భాగవతులను జూచి తెయితక్కలాడుచు
నాచ్ఛాదింపఁబడ్డారు. నిందింతురు. కాని భాగవతులకు దూషణభూషణములతో
యమ్ముతో తప్పదు. నీవు మహారాజపదవినుండి భాగవతస్థానమునకు వచ్చితివి గావు
నీవు నిర్లక్ష్యముయము తెలుపవలసి వచ్చినది" అని చెప్పి వెడలిపోయెను.

యితివి. ఇంక అంగదభూపతియు, భార్యయు నిర్మలహృదయములతో శ్రీహరిని శ్రీహరికథాధ్యానపూజనాదులచే సంతృప్తిపఱుచుచు, భాగవతుల నర్చించుచు ఐహికసౌఖ్యములయెడల నిస్పృహులై శాంతముగఁ గాలము గడుపసాగిరి. కొన్ని దినములు జరిగిపోయిన తరువాత భూపతి వైరాగ్యమును దెలిసికొని శత్రురాజులు వండెత్తివచ్చిరి. వారియాధిక్యమును జూచి భీతిల్లియు, తమ్ముని వైరాగ్యమును జూచి కోపించియు, రాయసింగు "నీవు ఇట్టు లుండుటవలననే మన కీవిపత్తు సంభవించినది. ఇక భగవధ్యానమును గట్టిపెట్టి యుద్ధరంగమునకు బయలుదేఱుము. విరాగియైనవాఁడు సంసారమున నున్నచో నిట్టివి తటస్థించుచుండును. కావున నీవే యిందులకు బాధ్యుఁడవై యున్నాఁడవు. అయినను గతజల సేతుబంధన మేల? కొంత చతురంగబలములను దీసికొనిపోయి నీవు శత్రువులను దాఁకుము. నేను తక్కినబలముతోఁ గోటను గాపాడుచుండెదను. నీవు పోయి వైరులను జయించి వారివస్తుసమూహమంతయుఁ గొల్లకొట్టి రాఁగలిగితివేని, భగవంతుఁడు నీపాలఁ గలఁడని నమ్మెదను" అని తీవ్రముగఁ బలికెను. అది విని భూపతి యేమియు జంకక శ్రీహరిమీఁదనే భార మంతయు నుంచి, చతురంగబలములను దోడుకొనిపోయి శత్రువులకు ఎదురొడ్డి నిలిచి, "శ్రీహరీ! భక్తచింతామణీ! ఆర్తత్రాణపరాయణా! నాఁడు కుంతీపుత్రునిమీఁదఁజూపిన దయ నామీఁదఁ జూపరాదా?" యని యనేక విధములఁ బ్రార్థించి యుద్ధముసేయుటకు బలమునకు అనుజ్ఞ నొసంగి, తానొకచోఁ గూర్చుండెను. అంతట శ్రీపతి సేనాధిపతిరూపముతో సంగ్రామరంగమున నవతరించి వైరివీరులను దునుమాడి అంతర్ధానమైపోయెను. భూపతి సైనికులు మహానందముతో జయజయధ్వనులు చేయుచుఁ బోయి, శత్రువుల గుడారములను దోఁచుకొనిరి. ఒకసేనాధిపతి వారిధనము జవాహిరిమున్నగునవి కొల్లగొట్టి వచ్చి భూపతికి సమర్పించెను. భూపతియు శ్రీహరికటాక్షమువలననే జయము లభించెనని నమ్మి, అన్నగారి సెలవు ఫలించినందులకు సంతోషించి మహానందముతో నగరమునకుఁ బోయి, తాను తెచ్చిన రత్నరాసులలో నమూల్యమైన యొకరత్నమును జగన్నాథస్వామికి అర్పింపవలయు నని జాగ్రత్తచేసి, తక్కినవానిని అన్నగారికిఁ బంపివేసెను. రాయసింగు తమ్ముఁడు విజయము గొనివచ్చినందులకుఁ జాల సంతసించెను.

పిదప నీయన్నదమ్ముల యైకమత్యము నెట్లయిన భగ్నముచేయవలయునని, సమయమునిత్తము ఎదురుచూచుచున్న కొందఱు అసూయాంధులు రాయసింగు

వద్దకుఁబోయి "ప్రభూ, మీతమ్ముఁడు చేసినపనిఁ జూచితిరా? అతఁడు తెచ్చిన ములనన్నిటిని మీచెంతకుఁ బంపెనని మీరు ఆనందించుచున్నారు; కాని మీకుప రత్నములయన్నిటికివెలకంటెను హెచ్చువెల గల నాయకమణిని అతఁడు తన నుంచుకొనెను. పరీక్ష చేయవలయును" అని విన్నవించిరి. అందులకు రాయసింగు చాలఁగోపించి "నీవు తెచ్చిన రత్నములను నీవుగాని నేనుగాని ప్రత్యేకముగా నుపయోగించుకొనుటకు అధికారము లేదు. అవి రాజస్వములోఁ జేరినవి. కావున నీవు మిగిలించియుంచుకొన్న పెద్దరత్నమును వెంటనే పంపివేయుము" అని తమ్మునకు వార్త నంపెను. అందులకు భూపతి "ఈయనర్ఘరత్నమును మనకు జయముఘటించినజగన్నాథస్వామికి అర్పింప సంకల్పించుకొన్నాను. ఇది రాజస్వములోఁ జేర్చుటకు వలనుపడదు. లోటంత మీరు దీనిని జమకట్టుకొని పిదప జగన్నాథస్వామికి సమర్పించినట్లు ఖర్చువ్రాసికొనుఁడు" అని ప్రత్యుత్తరమంపెను.

ఈజవాబువలన రాయసింగునకుఁ జాలఁ గోపము వచ్చెను. అంత నాతఁడు తన చెల్లెలినిఁ బిలిచి, సంగతి యంతయు నెఱింగించి "భూపతికి విషాన్నము పెట్టుము" అని నియమించెను. అట్లు సేయకున్న తన ప్రాణములు నిలువ వని జడిసి, యామె యట్లు చేసెను. అంత నేమియు నెఱుఁగని భూపతి ఆపదార్థమును శ్రీహరికి నివేదించి భగవన్నివేదితాన్నమును భక్తితోఁ దాను భుజింపఁబోయెను. అప్పుడు చెల్లెలు విచారమును భరింపఁ జాలక "అన్నా నీకు అన్నములో విషము పెట్టునట్లు పెద్దన్న సెలవు అయినది. అది విషాన్నము నీవు దానినిఁ దాఁకకుము" అని చెప్పెను. అందులకు భూపతి జంకక "చెల్లెలా! విచారమునలదు. నీవు అన్నగారి సెలవు ప్రకారము ప్రవర్తించితివి; కావున నీప్రాణములు నిలిచినవి. ఈయన్నము శ్రీహరికి నివేదింపఁబడినది; కావున నాప్రాణముల కేమియు భయములేదు. ఊరకుండుము" అని చెప్పి ఆయన్నమును భుజించెను. అందలి విషము శ్రీహరికటాక్షమువలన అమృతమై భూపతికి పూర్వాధికమైన తేజస్సు గలిగించెను.

పిదప నాతఁడు "ఇఁక నిక్కడ మనము ఉండుట తగదు" అని భార్యతోఁ జెప్పి జగన్నాథక్షేత్రమునకు బయలుదేఱెను. కొందఱుదుష్టులీసమాచారమును రాయసింగున కెఱింగించిరి. అంతట రాయసింగు "నీవు పోయి వానిని జయించి ఆరత్నమును గొనిరమ్ము" అని మంత్రికి ఆజ్ఞాపించెను. మంత్రియుఁ జతురంగబలములతోఁ బోయి చూచునప్పటికి భూపతి భార్యతో నొక నది యొద్దున విశ్రమించి యుండెను. అట్లు చతురంగబలముతో వచ్చిన మంత్రినిఁ జూచి భూపతి ఆతఁడు రత్నము నిమిత్తమే వచ్చి యుండునని యూహించి, దానిని మంత్రికిఁ జూపి "ఇది శ్రీజగన్నాథస్వామికి అర్పింపఁబడినది. దీనినిమిత్తము ఆశపడుట క్షేమంకరముగాదు"

అని పలికి దానిని బొంగిపొరలి ప్రవహించుచున్న యేటిలో విసరివేసెను. మంత్రి దానిని దీయుటకు అచ్చట పల్లెవాండ్రను నియమింపఁగా, భూపతి “మంత్రీ! ఏల వాండ్రను శ్రమపెట్టెదవు? ఆరత్నము ఇఁక మీకు లభింపదు. అది యిప్పుడే శ్రీజగన్నాథస్వామి సన్నిధిఁ జేరుచున్నది” అని చెప్పెను. అదేమోచూడవలయునని మంత్రి జగన్నాథమునకుఁ బ్రయాణముసాగించెను.

రెండుదినములకు వారు జగన్నాథక్షేత్రముఁ జేరుకొనిరి. అంతట వారు స్నానసంధ్యావద్యనుష్ఠానము లన్నియుఁ దీర్చుకొనిపోయి స్వామిని దర్శింపఁగా, భూపతివిసరివేసిన రత్నము స్వామి మెడలోనున్న రత్నహారమునకు నాయకమణియై వెలుఁగుచుండెను. అదిచూచి మంత్రి అబ్బురపడి, యీరత్న మిచ్చట కెట్లువచ్చెనని యడుగఁగా, అర్చకులు “మొన్నరాత్రి మేము నిద్రించుచుండఁగా స్వామి మాకు స్వప్నమున సాక్షాత్కరించి నాయంతరంగభక్తుఁడు సమర్పించిన అమూల్య రత్నము నాపాదపీఠముమీఁద నున్నది. దానిని నా రత్నహారమునకు నాయక మణిగాఁ గూర్పుఁడు” అని యానతిచ్చెను. మేము అట్లేచేసితి” మని చెప్పిరి. అది విని మంత్రి మఱింత యాశ్చర్యచకితుఁడై, యీసంగతి రాజునకుఁ దెలుపవలసినదని దూతల నంపెను. భూపతియు నాతని భార్యయుఁ దమమీఁద శ్రీజగన్నాథుఁ డపారకృపఁ జూపినందులకు ఆనందపరవశులై :—

**చ. “జలనిధికన్యకాఘనకుచస్థలి పచ్చలతాళిగోపికా**
**విలసితహారనీలమణి విశ్వ జగద్వలయప్రకాశకో**
**జ్జ్వలమహనీయరత్నమని వారితకాళియభోగభోగమం**
**డలగిరివజ్రమై వెలయునందతనూజు భజింతు నామదిన్.** (89. ప. 1. ఆ. కృష్ణకర్ణామృతము.)

అని శ్రీహరినిఁ గీర్తించుచు నృత్యము సేసిరి.

దూతలవలన రాయసింగు సంగతి యంతయు విని చాల నాశ్చర్యపడి, అంతలో మఱల జ్ఞానము తెచ్చుకొని “అయ్యో! శ్రీహరికి అంతరంగభక్తుఁడగు నాతమ్ముని క్రూరుఁడనై యెంత బాధపెట్టితిని?” అని వగచుచు భార్యతోఁ గూడ బయలుదేఱి జగన్నాథము చేరికొని, తమ్మునిఁ గౌఁగిలించుకొని “తమ్ముఁడా! నీవు ఇంతవాఁడ వని తెలియక రజోగుణదూషితుఁడ నగుటచే నేను నీయెడలఁ జాల దౌర్జన్యమును నెఱపించితిని. నాకు బుద్ధివచ్చినది. నాయపరాధమును క్షమించి పట్టణమునకు రమ్ము. అట్లు రావేని నేను ప్రాణములను విడిచెద” నని పలికెను. భూపతి క్షణములో నన్నకు ఇట్టి మార్పును సంఘటించిన జగన్నాథస్వామిని మిగులఁ గొనియాడి, అన్నగారితో ఇంటికి బయలుదేఱిపోయెను.

పిమ్మట భూపతి తన గురుపుంగవుని రావించి అన్నగారికి జ్ఞానోపదేశము చేసి, మోక్షోపాయము నెఱిఁగింపవలె నని ప్రార్థించెను. గురువును భూపతి ప్రార్థన

మును జెల్లించి వెడలిపోయెను. అదిమొదలు రాయసింగు యథావిధిగా శ్రీహరిని బూజించుచు, మనుమార్గమును దప్పకుండ రాజ్యమును బాలింపఁదొడఁగెను. హరి కైంకర్యప్రభావమువలన నాతని బాధ లన్నియుఁ దొలఁగిపోయెను.

భూపతియు, నాతనిభార్యయు సదా శ్రీహరిధ్యానమునందే కాలము గడుప సాగిరి. రాయసింగు శ్రీహరిభక్తుల ప్రభావమును జక్కఁగఁ దెలిసికొని ప్రజల మాహాత్మ్యమును దొలఁగించి, వారికి ఆత్మజ్ఞానమును హరిభక్తిని బోధింపవలయునని గురువును నియమించెను. కొలఁది దినములయందే దేశమునం దంతటను శ్రీహరి పూజలు, శ్రీహరిభజనలు, శ్రీహరిధ్యానములు ప్రబలిపోయెను. రుక్మాంగదుని తరువాత మఱల నంతటిభక్తుఁడు రాయసింగే యని శ్రీహరి ఆతనిదేశమున నిత్య నివాసము నేర్పఱుచుకొనెను. ప్రజలందఱును హరిభజనమువలన అసాధారణ ఫలముల నందుచు తమ కిట్టిమహోపకారమునుచేసిన రాజునకుఁ జాల కృతజ్ఞులై యుండిరి. బ్రతికియున్నంతకాలమును హరిపూజ చేసి, భూపతియు నాతని భార్యయు అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసిరి. రాయసింగు తుదను భార్యతో పరంధామునిలో లీన మయ్యెను. ప్రజలుకూడ నూటికి తొంబదిమంది అవసాన మున వైకుంఠమునకుఁ బోవసాగిరి.

మ. "క్రతుభూమిం జొరఁబోవు గోపగృహపంకం బన్న మెట్టేవు గో
తతి హాలంకారము విన్నఁ బల్కెదవు విద్వద్గోష్ఠికిం బల్క వా
నతి-గావింతువు గోపజారలకు దాంతశ్రేణిఁ గైకోవు యో
గ్యత యే హేతువు ప్రేమకారణము గాదా దేవ నీ చర్యకున్."

(శ్రీకృష్ణకర్ణామృతము ఆ. 2. ప. 83.)

---

# 33. ఏకనాథస్వామి

శ్లో. "బాలాయ నీలవపుషే నవకింకిణీకజాలాభిరామజఘనాయ దిగంబరాయ,
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ నన్దాత్మజాయ నవనీతముషే నమస్తే."

(కృష్ణకర్ణా. ఆ 2. ప. 74.)

పైఠపురమున సూర్యనారాయణ అను నొక బ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు రామరాజు ప్రార్థింపఁగా విజయనగరమునకుఁ బోయిన శ్రీపాండురంగని మఱల పండరిపురమునకుఁ గొనిపోయిన భానుదాసుని కుమారుఁడు. బాల్యమునం దాతఁడు సకలవిద్యలును అభ్యసించి తలిదండ్రుల యనుమతిని రుక్మిణి యను కన్యను పెండ్లియాడి, ధర్మమార్గమును నిర్వహించుకొనుచు అతిథిపూజయు,

శ్రీహరిసేవయుఁ దప్పక కాలము గడుపుచుండెను. కొన్నిదినముల కితనికి ఏకనాథుఁడు అను ఒకకుమారుఁడు గలిగెను. ఆబాలకుని ఎంతో గారాబముతోఁ బెంచుకొనుచు తల్లిదండ్రులు ఉపనయనము చేసి విద్యాభ్యాసము నిమిత్తము గొప్ప పండితునివద్ద నప్పగించిరి. ఏకనాథుఁడు అసమానధీశాలియగుటచేఁ గొలఁది దినములయందే గురువు ఉపదేశించిన సకలవిద్యలను నేర్చుకొని యింటికి వచ్చెను. పిదపఁ దలిదండ్రు లాతనికి ఒక మంచికన్యను దెచ్చి వివాహము గావించిరి.

ఏకనాథుఁడు బాల్యమునుండియు మితభాషి. అతఁ డెల్లప్పుడును హృదయమున శ్రీహరిని ధ్యానించుచుండుటచేఁ దగినంతయవసరము వచ్చినఁగాని యొరులతోఁ బలికి యెఱుంగఁడు. భాగవతసేవ యనిన నాతనికిఁ బరమానందము. ఇట్లు జరిగిపోవుచుండఁగాఁ గొన్నిదినములకు జనార్దనయోగి యను నొక మహాత్ముఁ డచ్చటకు వచ్చి, మఠమును నిర్మించుకొని యందు వసించియుండెను. ఏకనాథుఁడు ఆతని ప్రభావమును విని యొకనాఁడు మఠమునకుఁ బోయి, జనార్దనయోగికి సభక్తికముగాఁ సాష్టాంగనమస్కారము గావించి నిలిచెను. అందులకు యోగి యెంతయుఁ బ్రీతుఁడై "వత్సా! నీ తలిదండ్రు లెవరు? నీవు ఇచ్చటి కేల వచ్చితివి?" అని యడిగెను. అందులకు ఏకనాథుఁడు కరములు జోడించుకొని యిట్లు చెప్పెను. "స్వామీ! సకలము నెఱిఁగిన మీరే యిట్లు ప్రశ్నించిన నేను ఏమి చెప్పఁగలను? ఇంతవఱకును నాకు ఎందఱో తల్లిదండ్రులైనారు. ఎందఱో అన్నదమ్ములు, నెందఱో అక్కచెల్లెండ్రు ఎందఱో ఆత్మబంధువులు నైనారు; కాని వారందఱును గతించినారు; వారితోరక్తసంబంధములుగల నాయుపాధు లనేకములు గతించినవి. నేను మాత్రము నిలిచియున్నాను. ఇప్పుడు ఈయుపాధికిఁ దల్లిదండ్రులయినవారును, ఈశరీరమును గూడ అట్లే యగును గాని నిలువవు గదా? అయినప్పుడు ఈయశాశ్వతపదార్థములను జూచుకొని నేను ఫలానావారివాఁడను అని యెట్లు చెప్పఁగలను? కావున నేను నేనే. నన్ను దెలుపుకొనుటకు నేనే చాలుదును. లోకమునందలి యెల్లరతోఁబాటు గనే ఆపరమాత్మయొక్క అనంతకోట్యంశలలో నేనొక అంశమాత్రుఁడను. నేను ఇప్పుడు మీసన్నిధికి జ్ఞానభిక్షను గోరి వచ్చినాను. అందఱును గూడ భగవదంశాసంభూతులే యైనను పాంచభౌతికోపాధి నాశ్రయించిన పిదప మాయావృత్తులై, మోహాంధులై తమ్ముతా మెఱుంగఁజాలకున్నారు. అట్టి వారికి జ్ఞానప్రకాశమును గలిగించి, మాయావరణమును దొలఁగించి మోక్షమార్గమునఁ బ్రవేశ పెట్టుసాధనము ఆచార్యసేవకంటె మఱియేమి గలదు? మహాత్మా! లోకములో ఆచార్యులకుఁ గొదవ లేదు. "భగ్నాకృషిర్భాగవతా భవంతి" యనునట్లు జీవనోపాధినిమిత్తము తిరుమణితిరుచూర్ణములను పెచ్చించువారివలన నేమి ప్రయోజనము? ఉపదేశములుచేసి పాద

పూజలు దక్షిణలు బహుమతులు ఈనాములు సంపాదించువంచకులవలన నేమగును ? నాకీసంసారమును జూచిన భయ మగుచున్నది. శ్రీహరిసేవయే భయార్తులకు తారకమని . నిశ్చయించుకొంటిని. ఆచార్యుని నిమిత్తము వెదకుచున్నాను. నన్ను నేకులు చేరఁదీయుటకుఁ బ్రయత్నించిరి; కాని భక్తుఁడ ననిపించుకొనుట నాకిష్టము లేదు. నాకుఁ గావలసినది భక్తి. హరిదాసుఁడని పిలిపించుకొనుటకు నే నంగీకరింపఁ జాలను. నేను కాంక్షించునది శ్రీహరిపూజ, శ్రీహరిధ్యానము, శ్రీహరిభజనము, శ్రీహరికటాక్షము. నాకు ఇవి సంఘటింపఁగల యాచార్యుఁడు కావలెను. ఇందు నిమిత్తమే వెదకుచున్నాను. ఇప్పుడు మీరు నన్ను పాపపంకమునుండి యుద్ధరింతు రనియు, అజ్ఞానాంధ్యమునుండి తప్పింతు రనియు ఆశించి వచ్చితిని. ఈదీనుని, ఈజ్ఞానభిక్షుకుని, ఈయార్తుని, ఈకింకరునిఁ జేరదీసి రక్షింపవలయును.

ఈమాటలు విని జనార్దనయోగి అత్యాశ్చర్యచకితుఁ డయ్యెను. "వత్సా! నీస్థితి యంతయుఁ బ్రపంచమునకుఁ గేవలము వ్యతిరేకముగానున్నది. బ్రహ్మ నిన్ను ఈప్రపంచము నంతను సృష్టించిన చేతితోఁ గాక, మఱియొక చేతితో నిర్మించినట్లు తోఁచుచున్నది. నీ ప్రాయపుయువకులు అంతయు మాయావృతులై, మోహాంధులై ఐహికవాంఛాకూపములలోఁ గూలఁబడుచుండఁగా, నీవిట్లు జ్ఞానభిక్షుకుఁడవై, మోక్షేచ్ఛుఁడవై యుండుటవలన నీవు కారణజన్ముఁడ వని తోఁచుచున్నది. నీజిజ్ఞాసాశక్తికిఁ బరమానందభరితుఁడ నగుచున్నాఁడను. భాగవతులకు భగవద్ధర్మమునకంటె భగవంతుని నిమిత్తము వెదకువారు కాన్పించుట ఎక్కుడు ఆనందకారణము. నీవు సదాచార్యునికై యెట్లు లోకము నంతయు వెదకుచున్నావో, అట్లే నేను సచ్ఛిష్యునికై ప్రపంచమంతయు గాలించుచున్నాను. నేఁటికి శ్రీహరికి అనుగ్రహాముగలిగినది. రమ్ము. నీకేమియులోపము లేదు." అని జనార్దనయోగి ఆదరముతోఁ బలికెను.

పిదప ఏకనాథుఁడు కేవల హరిభావన చేసి జనార్దనయోగిని సేవింపసాగెను. ఏకనాథుని భక్తిని, జ్ఞానజిజ్ఞాసను, దృఢదీక్షను జూచి మిగుల నానందించి "వత్సా! నీవు నీతలిదండ్రులకు ఏకపుత్రుఁడవు. వారు నీకొఱకు బెంగటిల్లియుందురు. సంసారనిర్వహణమున జాల చిక్కులుపడుచుందురు; కావున నీకు కొంతధన మిచ్చెదను. దానిని, క్షేమవార్తను నీతలిదండ్రులకుఁ బంపుము" అని చెప్పఁగా ఏకనాథుఁడు, "గురుదేవా! నాజీవితమును దమ సేవయందు వినియోగించి మీవలన జ్ఞానధనమును బడయవలయు నని వచ్చిన నేను - మీవలన ఈధనము నెట్లు గైకొందును ? ధనస్వీకారమువలన నాలక్ష్యము, నాచిత్తైకాగ్రత చెదరిపోవచ్చును. ఇది నాయధఃపతనమునకు హేతువు కావచ్చు. అందులకు సందియములేదు. నన్ను ఉద్ధరింతు నని వాగ్దానముచేసి యిట్లు క్రిందికిఁ ద్రోసివేయుధనము నిచ్చెద ననుట మీకు

న్యాయమా?" యని దీనముగ నడిగెను. అందులకు గురువు ఏకనాథుని నిర్లిప్తతకు ఆనందించియు, "ఇందులకు నీవు వ్యతిరేకము చెప్పనేల. ఇది సంయమయోగము నిమిత్తము ఇచ్చుట లేదు. నీవు నన్ను కోరునదియు, నేను నీకు ఒసంగఁగలదియుఁ గూడ జ్ఞానధనము. ఇది కేవలము నీతెలివిపరీక్షకు మాత్రమే. నేటినుండి నీవు ఈ మఠమునకు సంబంధించిన లెక్కలు వ్రాయవలసియున్నది. కావున దీనిఁ బంపుటకు నిన్ను నియమించితిని" అని నచ్చఁ జెప్పఁగా, ఏకనాథుఁడు మాఱు పలుకక అట్లే చేసి నాఁటనుండియు మఠమునకు సంబంధించిన ఆదాయవ్యయములను వ్రాయఁదొడఁగెను.

కొన్నిదినములు గడచినతరువాత జనార్దనయోగికి శిష్యునిసామర్థ్యమును, దీక్షను బరీక్షింపవలయు నని తలంపు గలిగెను. ఈయూహతో నాతఁడు, "లెక్కలను బూర్తిచేసి తెమ్ము. ఒకమాఱు తనిఖీచేసెదను" అని ఏకనాథునకు సెలవిచ్చెను. అంతట ఏకనాథుఁడు మహాప్రసాదము అని లెక్కలను దెచ్చుటకుఁ బ్రారంభించెను.

ఏదో పొరపాటువలన లెక్కలలోఁ గొంచెము తేడా వచ్చెను. దానిని గనిపెట్టి సరిచేయ నిశ్చయించి ఏకనాథుఁడు ఆచార్యుఁడు నిద్రించునంతవఱకు సేవలు చేసి, పిదప భుజింపకయే దీపముచెంతఁ గూర్చుండి గంటమును తాటియాకులను గైకొని తదేకదీక్షతో లెక్కలు వ్రాయసాగెను. మూఁడుజాముల రాత్రియగు నప్పటికి జనార్దనయోగికి మెలకువ వచ్చెను. మఱల నిద్ర రాదయ్యెను. అంత నాతఁడు మఠమున నిటునటు తిరుగుచు, ఏకనాథుని మామూలుగా శయనించు స్థానమునఁ గానక ఏమయ్యె నని యాత్రముతోఁ గొంచెము ముందునకుఁ బోయి ఏకనాథునిఁ గాంచి, ఇదియేమో పరీక్షింపవలె నని రహస్యముగా నొక చోట దాఁగెను. కొంతతడవు కష్టపడునప్పటికి లెక్క సరిపడెను. తోడనే ఏకనాథుఁడు మహానందధ్వానములు చెలంగ బళీయని చేతులు తట్టుచు లేచి నిలిచెను. అందులకు అబ్బురపడి జనార్దనయోగి అతనిముందునకుఁ బోయి, "వత్సా! ఎందులకీయానంద" మని ప్రశ్నింపఁగా, ఏకనాథుఁడు అంతయు నెఱిఁగించెను. అదివిని యోగి "వత్సా! నీచిత్తైకాగ్రత యసమానమైనది. నీభక్తి యచంచలము. నీనిష్ఠ అనుపమానము. ఇంత స్వల్పవిషయమునఁ గూడ యథార్థము తేలునంతదనుక నిద్రయు నాహారమును మాని కార్యవిజయమును బడసిన నీకు భగవత్సాక్షాత్కారము అయి తీరును. ఇంతటి మనోనిగ్రహమును నే నన్యత్ర చూడలేదు. ఇక మోక్షము నీసొమ్ము. భగవత్సేవలోఁ గూడ నిట్టి చిత్తైకాగ్రతయు, నిట్టినిష్ఠయు, నిట్టిదీక్షయు, నిట్టిమనోనిగ్రహమును జూపెదవేని, నీకు ఇఁక లేని దేమి గలదు?" అని యెంతో మెచ్చుకొని తారకమంత్రము నుపదేశించి యాదరించెను.

ఏకనాథునకు అంతకంతకు గురుభక్తియు, గురుసేవానిరతియు నధికము కాసాగెను. అందులకు బరమానందభరితుఁడై జనార్దనుఁడు "వత్సా ! నీకు నాగురుదేవుఁ డగు దత్తాత్రేయస్వామి దర్శనభాగ్యము గలిగింపఁ దలఁపు గలుగు చున్నది. అతఁడు ఒక్కొకపుడు, విపరీతవేషముతోడను, విపరీచేష్టలతోడను సాక్షాత్కరించుచుండును. అందులకు నీవు ఏమియు సందియంపడక ఆమహాత్ముని పాదములపై వ్రాలి శరణుగోరుము. నీవు ముక్తుఁడ వయ్యెదవు" అని చెప్పఁగా ఏకనాథుఁడు "మహాత్మా ! నాకు దత్తాత్రేయస్వామితో నేమిపని? మీపాదములే నాకు ముక్తి నొసఁగ సమర్థములై యున్నవి" అని ప్రత్యుత్తరము చెప్పెను. అయినను బలవంతముచేసి ఏకనాథుని వెంట నిడుకొని ధ్యానింపఁగా, తురుష్క వేషముతో నశ్వారూఢుఁడై వచ్చిన దత్తాత్రేయస్వామికి జనార్దనుఁడు వినయ వినమితుఁడై మ్రొక్కెను. అదిచూచి ఏకనాథుఁడు రిచ్చపడుచుండఁగా జనార్ద నుఁడు తన యోగబలమువలన నచ్చట షడ్రసోపేతమైన భోజనమును గల్పించి గురువుతోఁగూడ భుజింపసాగెను. అపుడు దత్తాత్రేయుఁడు "జనార్దనా! చిత్తశుద్ధి గలవాఁడైనచో నీశిష్యునిఁ గూడఁ బిలువు" మనియెను. జనార్దనుఁడు రమ్మని చేతితో సంజ్ఞచేసెను; కాని "తురుష్కునితోఁ గలిసి భుజించుటకు నామన సంగీక రింపదు" అని యనుకొనుచు ఏకనాథుఁడు దూరముగాఁబోయెను. కొంతసేపటికి దత్తాత్రేయస్వామి తిరోహితుఁ డయ్యెను. అంత ఏకనాథుఁడు జనార్దనయోగిని సమీపించి "మహానుభావా ! సాక్షాత్తుగ బ్రహ్మమూర్తులగు తమరు అధముఁడగు తురుష్కునితోఁ గలిసి యేకపాత్రమున భుజింపవచ్చునా?" యని యడిగెను. "వెఱ్ఱివాఁడా! నేనెంత చెప్పినను వినవైతివి. కేవలము మూఢునివలెఁ బ్రవర్తించి తివి. మహాయోగులకుఁ గూడ జన్మజన్మాంతరములయందును లభింపని యాగురు దేవుని దర్శనము సులభముగా లభించినను, నీవు వారి యనుగ్రహమును సంపాదించుకొనఁజాలకపోయితివి. కేవలము బాహ్యవేషమును జూచి మోస పోయితివి. తొల్లి నీవు బాహ్యవేషమును జూచి ఆచార్యు లని తలంపరా దని చెప్పి, అంతరంగమే ప్రధాన మని యుపన్యసించియు, నిప్పుడు ఇట్లు అజ్ఞానాంధ్య మునఁ బడిపోవుట చాల విచారకరము. ఇంకను మించిపోయినది లేదు. ఈతడవ యైనను జాగ్రత్తగా నుండుము" అని జనార్దనయోగి మందలింపఁగా, ఏకనాథుఁడు "మహానుభావా! నాకు దత్తాత్రేయస్వామియనుగ్రహము గలుగలేదని విచారము లేదు. తలక్రిందఁ గొండను బెట్టుకొని రాళ్లకొఱకు వెదకులాడినట్లు, కేవలము హరిస్వరూపు లగు మీయనుగ్రహము సులభమై యుండఁగా నెవరినో ఆశ్రయింప వలసిన పని యేమున్నది? ఇంతకును భక్తపరాధీనుఁడైనచో దత్తాత్రేయుఁడు మీకు శిష్యుఁడనైనంతమాత్రముననే నన్ననుగ్రహింప వచ్చును" అని బదులు చెప్పెను.

"నీకు ఏమియుఁ దెలియదు. ఊరకుండుము" అని చెప్పి జనార్దనయోగి మఱి యొకనాఁడు ఏకనాథుని వెంటనిడుకొని అరణ్యమునకుఁ బోయెను. అచట మఱల ధ్యానింపఁగా దత్తాత్రేయుఁడు కామధేనువును కుక్కగాఁ జేసికొని వెంట నిడుకొని తాను ఫకీరువేషముతో వచ్చెను. జనార్దనయోగి మఱల నాతని పాదముల మీఁద వ్రాలి యథాపూర్వముగ మాటలాడసాగెను. కొంతసే పయినతరువాత ఫకీరు సంచిలోనిరొట్టెను దీసి కుక్కపాలలో ముంచుకొని తినుచు "నీకు అతఁడు అంతరంగశిష్యుఁ డైనచో రప్పింపుము" అని యానతిచ్చెను. జనార్దనుఁడు గురు మహాప్రసాద మని కుక్కపాలలో రొట్టె ముంచి తినుచున్న ఫకీరుని, గాంచి ఏవగించుకొనుచున్న ఏకనాథునిఁ గొనివచ్చి, దత్తాత్రేయస్వామి ఉచ్ఛిష్టమగు రొట్టెముక్క నిచ్చి తినుము అని యాజ్ఞాపించి ఆతని పాదములమీఁదఁ బడవేసి "దేవా! ఈ దాసానుదాసుని రక్షింపవలయును" అని ప్రార్థించెను. దత్తాత్రేయుఁడు సంతోషించి "ఈతఁడు గొప్పభక్తుఁడై భాగవతమును మహారాష్ట్ర భాషలో రచించి, చాల హరి కీర్తనలు రచించి అనేకమానవుల పామరత్వమును దొలఁగించును" అని అనుగ్రహించెను. ఈలోపుగా ఏకనాథుఁడు రొట్టెముక్క నవ్వలఁబాఱవేసెను. అప్పుడు జనార్దనుఁడు ఏకనాథుని లేవనెత్తి, "వత్సా! శ్రీదత్తాత్రేయ స్వామికి నీయెడల ననుగ్రహము గలిగినది. వారిభుక్తశేషమును స్వీకరించితివా లేదా?" అని యడిగెను. అంతట ఏకనాథుఁడు తాను చేసిన అకృత్యమునకు పశ్చాత్తాపపడుచు, సంగతి యంతయు గడగడ వడఁకుచుఁ జెప్పెను. అందులకుఁ జాల నొచ్చుకొని జనార్దనుఁడు దత్తాత్రేయస్వామియుచ్ఛిష్ట మగు తమలపాకులతమ్మను స్వీకరించి, ఏకనాథునినోట వేసెను. తోడనే ఏకనాథునిహృదయము నిర్మలమై యాతనికి సర్వజ్ఞత్వము గలిగెను. అగుట నాతనికి ఆచార్యసేవాప్రభావము కరతలామలక మయ్యెను. అంతంతకు ఆతనికి గురు భక్తి పెరిగిపోయెను.

ఇది యంతయుఁ జూచి జనార్దనయోగి, "దత్తాత్రేయస్వాములయనుగ్రహమువలన నీతఁడు మహాత్ముఁ డైనాఁడు. ఈతనివలనఁ బరిచర్య చేయించుకొనుట నరకహేతువు" అని తలంచి ఏకనాథునిఁ బిలిచి, "నీవు ఇఁక పైఠణపురమునకుఁ బోయి మాతాపితృశుశ్రూషతోడను, భగవద్భాగవతారాధనము తోడను, పామరులకు భక్తిజ్ఞానవైరాగ్యము నుపదేశించుటతోడను కాలముఁ బుచ్చుము. గురు దేవుని మాట అవిలంఘ్యము. ఇఁక మాఱు పలుకకుము" అని నియమించెను. అంతటఁ జేయునది లేక ఏకనాథుఁడు, "నేను మిమ్ము విడిచి యుండఁజాలను. అయినను మీయాజ్ఞను జవదాటినచో నేను నరకకూపమునఁ గూలఁబడిపోదును; కాన అట్లే చేసెదను" అని విన్నవించి, పాదములమీఁద వ్రాలి బాష్పధారచే పాదప్రక్షా

శనము గావించి, వెళ్లలేక వెళ్లలేక యెట్లో మనస్సు రాయిచేసికొని వెడలిపోయెను. అతనిరాకకు తలిదండ్రు లెంతయు నానందించిరి. పిదప నాతఁడు గుర్వాజ్ఞానుసారముగాఁ బ్రవర్తించుచు, సతతము హరిభజనము చేయుచు, భోజనానంతరము పురాణకాలక్షేపముచేసి పామరుల అజ్ఞానమును బోఁగొట్టుచుండెను.

ఆతని భక్తిప్రపత్తులకు మెచ్చి పాండురంగఁడు ఒకనాఁడు స్వప్నమున సాక్షాత్కరించి, "వత్సా! నీసేవవలన నానందము గలుగుచున్నది. నీవు వాల్మీకిప్రోక్తమగు రామాయణమును మహారాష్ట్ర భాషలో రచియింపుము. ఆగ్రంథము జదువుకొని అనేకమూఢజనులు తరింతురు" అని యాజ్ఞాపించి యదృశ్యుఁ డయ్యెను. తోడనే మేల్కాంచి ఏకనాథుఁడు భగవంతునకుఁ దనమీఁద గలిగినయనుగ్రహమునకు అమందానంద కందళిత హృదయారవిందుఁడై, అనేకవిధముల స్వామిని నుతించి మఱునాఁడే "భావార్థరామాయణము" అను పేరుతో భగవంతుని యాదేశమును నిర్వర్తింపసాగెను. ఈసంగతి విని ప్రక్కయింటి బ్రాహ్మణుఁ డొకఁడు "ఈతఁడెక్కడ? మహారాష్ట్ర భాషలో రామాయణమును వ్రాయు టెక్కడ? అట్లయిన రామాయణ మంతయు పిప్పిగాఁబోదా?" యని యచ్చటచ్చట నింద చేయుచుండెను. ఇది కర్ణాకర్ణిగా వినవచ్చినను, ఏకనాథుఁ డందుల కేమియు సమాధానము చెప్పక తదేకదీక్షతో గ్రంథరచనము చేయసాగెను. ఒకనాఁడు సుందర కాండములో సీతాన్వేషణమునిమిత్తము అంజనాదేవికుమారుఁడు మహేంద్ర పర్వతముమీఁదినుండి సముద్రమును దాఁటి లంకలోఁ బ్రవేశించె నని వ్రాయుచుండఁగా, ఆంజనేయుఁడు ఆతనియందుఁ బ్రవేశించి తటాలున కూర్చున్న యట్లుగా ఎత్తి ఆతనిని నిందించుచున్న బ్రాహ్మణునియింటిముందు పడునట్లుచేసెను. ఉన్నట్లుండఁగా నేదో గుభీలున చప్పుడు అగుటచే ఆబ్రాహ్మణుఁడు అదరిపడి వీథిలోనికి వచ్చి అంతయుఁ జూచి, ఏకనాథుని చేతులలో తాటాకుల సంచికయు గంటమును ఉండుటఁ జూచి అందలివిషయము చదివి, ఆంజనేయుని యనుగ్రహమువలననే యిట్టిది సంభవించె నని యెఱింగి, ఉపచారముచేసి ఇంటికిఁ బంపివేసెను.

పిదప నాబ్రాహ్మణుఁడు ఏకనాథునివలన నుపదేశమును బడయఁగోరి ప్రార్థింపఁగా, నాతఁడు "ఈతఁడు నిన్నటివఱకును నాయెడల నసూయగలవాఁడు. ఇంతలో నీతనికి ఈభక్తి యెట్లలవడినది? ఇది స్థిరమా?" యని సందేహించి, "అయినను పరీక్షింపకుండ శిష్యునికి ఉపదేశము చేయుటకు శాస్త్రము నిషేధించుచున్నది. బోధార్థియై వచ్చినవానిగుణగణములను బరీక్షింపక వచ్చినవెంటనే ఉపదేశము చేయుట—ధనమును, పేరును, గౌరవమును, పూజను యాచించువారు చేయవలసినది. నేను అట్లు చేయఁజాలను, తొందరపడి యుపదేశము చేసినచో

పిదప శిష్యుఁడు మంచివాఁడుగాకున్న గురువునకు అధఃపతనము తటస్థించును" అని తలంచుకొని పరీక్షించుటకు నిశ్చయించి, "రేపు నేను పండరినాథునిఁ బూజించుచుందును. ఆసమయమున రమ్ము" అని యాతనికిఁ జెప్పి పంపివేసెను. పిదప నాతఁడు ఇంటిలోని వారి నందఱను బిలిచి, "నేను రేపు పాండురంగని పూజించునపుడు అది తెండు, ఇది తెండు, అని యాజ్ఞాపించెదను. కాని మీరు ఏమియు నాకుఁ బలుకవలదు. మీపనిలో మీరు నిమగ్నులై యుండుఁడు" అని యాజ్ఞాపించెను.

ఏకనాథుని యాజ్ఞాప్రకారము బ్రాహ్మణుఁడు పూజాసమయమున వచ్చి చెంతఁ గూరుచుండెను. అప్పుడు ఏకనాథుఁడు "ఓహోయి, ఎవరచ్చట? స్వామి అభిషేకార్థము జలము కావలెను" అని చాలసారులు పిలిచెను; కాని సంకేతానుసారముగ నింటిలోనివా రెవరును బలుకరైరి. అంతట ఏకనాథుఁడు, "నేఁడు అందఱును గూడ స్వామిని మఱచి ఎంత మూఢులైనారు!" అని ఆశ్చర్యపడుచు తానే పోయి జలము తెచ్చుకొని, సమస్తకార్యములును నిర్వర్తించుకొని, అతిథిసమర్పనముచేసి తచ్ఛేషమును తాను భుజించి, "ఈ బ్రాహ్మణుఁడు ఇంటిలోనివారు పలుకకుండుట చూచియు తాను పోయి జలము తీసికొనిరాక, నేను స్వయముగఁ దెచ్చుకొనుచున్నను ఏమియు నెఱుఁగనట్లు కూర్చుండెను. ఆచార్యభక్తి లేని యిట్టివానికి ఉపదేశము చేయుట యెట్లు?" అని సందేహించి "ఉపదేశము చేయుటకు ఇది మంచిసమయము గాదు. స్వామికి అనుగ్రహము గలుగలేదు. ఇంకొకనాఁడు చూచుకొందము లే" యని బ్రాహ్మణునిఁ బంపివేసెను. పిదపఁ గొన్ని దినములకు పాండురంగాజ్ఞచేఁ బ్రారంభించిన రామాయణమును ముగించి, పిదప దత్తాత్రేయ స్వామియాజ్ఞను దలంచికొని భాగవతమును గూడ మహారాష్ట్ర భాషలో రచించి, అనేకకీర్తనములుచేసి పామరులకు మోక్షమార్గమును జూపెను.

ఏకనాథునిభక్తిప్రపత్తులు దినదినములు వృద్ధికాసాగెను. శ్రీహరిహృదయము పూర్తిగ నేకనాథునిపై లగ్నమయ్యెను. ప్రేమాతిరేకంబున నారాయణుఁడు బ్రాహ్మణయువకుని వేషమున ఏకనాథులయింటికి వచ్చి, "మహాత్మా! నాకెవ్వరును బంధుమిత్రులు లేరు. కేవలము ఏకాకిని. నీసమాచారము విని నిన్ను సేవించి తరింపవలయునని తలంచి వచ్చితిని. నాకు జీత మక్కఱలేదు. అన్నవస్త్రములిచ్చినఁ జాలును. నీయింటిపరిచర్య యంతయు నేనే చేసెదను. నాకెవ్వరును సాయ మక్కఱలేదు. నాకు నీయనుగ్రహ మొక్కటియే కావలయును. అభయమిమ్ము" అని ప్రార్థించెను. అందులకు ఏకనాథుఁడు ఆనందించి, "వత్సా! దీనికై నన్నింతగాఁ బ్రార్థింపనేల? లోకములో మానవుఁడు నాది యని చెప్పుకొనుటకు తగినవస్తువు ఏదియు లేదు, అంతయు ఈశ్వరుని యాస్తి. నేను వాడుకొనుచున్న ఈయింటి

మీఁదను, ఇందలి వస్తువులమీఁదను ఈశ్వరసంతానము కంతకు నధికారము గలదు. కావున నీవు ఇందు నసించుటకును, ఇందలి సామగ్రిని వాడుకొనుటకును నాయను జ్ఞను బడయవలసిన పని యేమియు లేదు. నీవు అభయము వేఁడితివి. శ్రీహరిని నమ్ముము. హరిభక్తులకు భయము అనునది లేదు. ఆచార్యసేవను భాగవతారాధనమును చేయుచుందువేని, నీకు మోక్షము కరతలామలక మగును. నీవు ఇక్కడనుండి అతిథిపూజలో నాకొకింత సాయపడెదవేని చాల నానందించెదను" అని పలికెను. యువకుఁడు చాల నానందించి ఏకనాథుఁ డడుగఁగాఁ, దనపేరు కృష్ణుఁడని యెఱింగించి ఆతనియింటఁ బ్రవేశించెను.

దేవతలందఱును ఈసంగతిని దివ్యదృష్టివలనఁ దెలిసికొని పరమాశ్చర్యచకితులైరి. కాలము గడచిపోవుచుండఁగా ఏకనాథునియింట నాతని తండ్రియాబ్దికము వచ్చెను. అప్పుడు ఏకనాథుఁడు "కృష్ణా! నేఁడు మాతండ్రిగారి యాబ్దికము. బ్రాహ్మణనిమంత్రణముచేసి వచ్చితిని. సకల పదార్థములును నీవు త్వరగా సిద్ధముచేయవలయును" అని నియమించి తాను స్నానము చేసి వచ్చి దొడ్డిలో వస్త్రముల నారవేసికొనుచుండెను. ఇంతలో కృష్ణుఁడు దేవతలకుఁగూడ నోరూరునట్లు సకల పదార్థములును అతిచాతుర్యముతో వండఁ దొడఁగెను. ఆపరిమళము నాఘ్రాణించి, ఏకనాథుని పూలదోఁటలో చాకిరీచేయు మాలవానిభార్య తన నాథునితో "నేఁడు మన యజమానుని యింట శ్రాద్ధమగునఁట. అందులకై యాపిన్న బాపనయ్య అన్ని పదార్థములును వండుచున్నాఁడు. వాని సువాసన ఇక్కడకుఁ గూడ వ్యాపించుచున్నది. బ్రాహ్మణులు లేచిపోయినతరువాత పెంటమీఁదఁ బాఱవేయు విస్తరిఆకులలో మిగిలియుండు పదార్థములను మనము జాగ్రత్తచేసి కొని చక్కఁగా భుజింపవచ్చును" అని చెప్పెను. అందులకు మాలవాఁడు నిరాశ ప్రకటించుచు, "ఏల గొంతెమ్మ కోరికలు కోరెదవు. శ్రాద్ధదినమునాఁడు బ్రాహ్మణులు ఎంగిలి యాకులను పెంటమీఁదఁ బడవేయక అగ్నిలోఁగాని, గోతిలోఁ గాని, ఏటిలోఁ గాని పడవేయుదురు. అగుటచే మనకు ఏమియు లభింపవు" అని పలికెను. ఇదివిని మాలెత చిన్నవోయెను. ఈమాటలు ఏకనాథునకు వినవచ్చెను. తోడనే యాతని హృదయము జల్లు మనియెను. "ఈశ్వరసంతానములో భేదములను జూపుట కేవలము అవివేకము. కృష్ణుఁడు వండుచున్న పదార్థములసువాసనవలన, ముగ్ధులై తోఁటపనివాండ్రు వానిని కోరుచున్నారు. వారికి ఆపదార్థములను ఇచ్చి తృప్తి పఱుపకున్న నేఁడు నాతండ్రిగారి యాబ్దికము ఫలింపదు" అని తలంచి, కృష్ణుని బిలిచి సంగతియంతయు నెఱింగించి, "నీవువండిన పదార్థమంతయు మాలవాండ్రకుఁ బెట్టుదము" అని మాలపల్లెయందలి మాలవాండ్ర నందఱను రావించి, తన వీథిలో బారులు

తీర్చి కూర్చుండఁజేసి సకలపదార్థములును వాండ్రకు వడ్డించి, జగత్పతి యగు శ్రీహరినిఁ దలంచికొని భుజింపుఁడు అని యాజ్ఞాపించెను. ఏకనాథుని భార్యగూడ ఆనందించి అందులకు చాల తోడ్పడెను. మాలవాండ్రు తామెన్నఁడునుఎఱుఁగని క్రొత్త పదార్థములను భుజించి అమితానందపరవశులై, యేకనాథుని నుతించుచు తమ తమ యిండ్లకుఁ బోయిరి.

ఆగ్రామమునందలి బ్రాహ్మణు లందఱు నీసమాచారమును విని గుమిగూడి "తండ్రి యాబ్ధికమునకు ఉపయోగము చేయఁదలఁచిన పదార్థములను చండాలురకు వినియోగించిన ఏకనాథుని మనము వెలివేయుదము" అని నిశ్చయించుకొని ఆతని యింటికి వచ్చి, "నీకు పితృదేవతలకంటె చండాలురే పూజ్యులైరి; కావున నీయట్టివానికి బ్రాహ్మణులకంటె చండాలురే శ్రేష్ఠులు. ఇఁక మాతోనుండి ఏల కులము చెఱుపుకొందువు? నేఁటినుండి నీవు చండాలురతోడనే భోజనప్రతిభోజనాదికములు చేసికొనుచుఁ దరింపుము. నేఁటితో నీకును మాకును సంబంధము నశించిపోయినది" అని చెప్పిరి. అది విని యేకనాథుఁడు జరిగిన సంగతియంతయు నెంత వినయముతో చెప్పినను వారు వినక, "ఇఁక నీకు నీవే; మాకు మేమే" యని చెప్పి పయిమాట వినిపించుకొనకయే వెడలిపోయిరి. అందులకు ఏకనాథుఁడు భీతచిత్తుఁడై, "సంగతి సందర్భము లాలోచింపకుండ నీబ్రాహ్మణులు నామీఁద నాగ్రహమును వెడలఁగ్రక్కుచు వెడలిపోయిరి. ఇఁక వీరు నాయింటికి రారు. పితృకార్యమును ఎట్లు నిర్వర్తించుకొందును?" అని విచారింపసాగెను. మొదటినుండియు నంతయుఁ జూచుచున్న కృష్ణుఁడు అప్పుడు, "మహాత్మా! ఏల వగచెదవు? మూఢులగు ఈ బ్రాహ్మణులతో నీకు ఏమిపని? ఒక్కమాఱు శ్రీహరిని బ్రార్థించి పితృదేవతల నాహ్వానింపుము. శ్రియఃపతి యనుగ్రహమువలన నేఁడు నీపితృదేవతలే పూజను గైకొని వెడలిపోవుదురు." అని చెప్పెను. ఏకనాథుఁడు ఈయుపాయము బాగుగ నున్నదని సంతసించి, మఱల పాకము సిద్ధముచేయించి.—

ఉ. "కోరిక లిచ్చినట్టి సొనరు గూర్చిన జీవనజీవితమ్ము లే
దారి నొసర్చినట్టి తెలివిఁ దార్చిన దల్లియుఁ దండ్రియుం బటెట్టి
చేరము లోర్చినట్టి దిరుగఁ జేర్పుగఁ దీర్చినఁ గల్మిఁ జేర్చినట్టి
భారము నీవెకాని మఱి పంకజనాభ యెఱుంగ నన్యులన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 104.)

అని త్రికరణశుద్ధిగా శ్రీమన్నారాయణునిఁ బ్రార్థించి పితృదేవతల నాహ్వానించెను. తోడనే పితృదేవతలు సాక్షాత్కరించిరి. ఇఁక ఏకనాథునియానందము నేమని చెప్పవచ్చును? ఈయానందాతిరేకమువలన నాతఁడు పరవశుఁడై "మహాత్మా!

ఆలసించిన పితృదేవతల కపరాధము చేసిన ట్లగును" అని ప్రబోధింపఁగా మహానందముతోడను, అచంచలభక్తితోడను, పితృదేవతల నారాధించి వారిని, సంతోషపెట్టెను. ఈసంగతి యొ క్లొక్షణములో గ్రామ మంతయుఁ దెలిసిపోయెను. తోడనే బ్రాహ్మణు లందఱును మఱల గుమిగూడి, "అయ్యో! మనము ఏకనాథుని ఎంత చులకనఁగఁ జూచితిమి. ఆతఁడు శ్రీమన్నారాయణుని యాంతరంగికభక్తుఁడు అనుటలో ఏమియు సందేహము లేదు. అట్టివానినిఁ దిరస్కరించి మనము సాపరాధుల మైతిమి. ఆతఁడు ఎట్లయినను అనుగ్రహింపవలయు నని మనలను ఇంతకు మున్నె ప్రార్థించెనుగదా! ఆ ప్రకారము మన మాతనిని ప్రాయశ్చిత్తము గావించి మనలోఁ గలుపుకొందము. లేకున్న కీడు మూడవచ్చును" అని తలంచి, తిన్నగా ఏకనాథునియింటికిఁ బోయిరి. అప్పటి కప్పుడే అక్కడ ఆరాధనాదికము లన్నియు ముగియుటవలన, ఏకనాథుని పితృదేవతలు మఱల స్వర్గమునకుఁ బోయిరి.

తనయింటికి వచ్చిన బ్రాహ్మణులను వారు తనకు చేసిన యపకారము నేమియు మనస్సున నుంచుకొనక ఏకనాథుఁడు చాల గౌరవించి, ఆగమనకారణ మడిగెను. అప్పుడు బ్రాహ్మణులలో నొకఁడు "ఏకనాథా! ఈబ్రాహ్మణబృందమునకు నీమీఁద ననుగ్రహము గలిగినది. కావున నీవు ప్రాయశ్చిత్తము చేసికొనుము. అట్లయిన నీవు కులములోఁ జేర్చికొనఁబడుదువు" అని చెప్పెను. ఏకనాథుఁ డిది యనవసరమని యెఱింగియుండియు, అంద ఱకు వ్యతిరేకము చేయనేల? యని అందుల కంగీకరించెను. వెంటనే బ్రాహ్మణులు తమ పాచిక పాఱినందులకు ఆనందించుచు ప్రాయశ్చిత్తము నెఱవేర్చుటకు ఏకనాథుని నదీతీరమునకుఁ గొనిపోయిరి.

అట ప్రాయశ్చిత్తము ప్రారంభ మగునప్పటికి యొక బ్రాహ్మణుఁడు వచ్చి "ఇందఱిలో ఏకనాథస్వాము లెవ్వరు?" అని యడిగెను. ఆతనితో నీకు ఏమిపని యని బ్రాహ్మణు లడుగ, నాతఁడు "అయ్యా! ననుఁ జూచుటలేదా? నేను చాలకాలము నుండి ఈకుష్ఠురోగముచే బాధపడుచు, ఈశ్వరానుగ్రహమునఁ గాని యిది నివృత్తియగునది కాదని నిశ్చయించుకొని, పరమేశ్వరుని గుఱించి తపస్సు ప్రారంభించితిని. కొన్ని దినములకు నాకు త్రిలోచనుఁడు సాక్షాత్కరించి, "వత్సా! పైఠణపురమునందుండు ఏకనాథస్వామి అను శ్రీహరి యంతరంగభక్తుఁడు నేఁడు పితృశ్రాద్ధమున కుద్దేశింపఁబడిన పదార్థములతో అనేకచండాలురను భగవత్స్వరూపులుగా భావించి, సంతృప్తులంగావించెను. ఆతఁడు విశుద్ధభక్తితో నాకార్యమును నెఱవేర్చెను; కావున భగవంతుని కది ఆనందసంధాయకమయ్యెను. ఒక చండాలస్త్రీ శిశువునకు అన్నదానము చేయుటవలనఁ గలిగెడి సుకృతములో నొకభాగము నీవు ఆతనివలనఁ బడసితి వేని, సఫలమనోరథుఁడ వగుట యేగాక అవసానమున హరి

సాయుజ్యముఁ బడసెదవు" అని యానతిచ్చెను. కావున నేను ఆభాగవతోత్తముని వెదకుకొనుచు వచ్చినాను" అని చెప్పెను. అదివిని బ్రాహ్మణు లందఱు నాశ్చర్యపడి యిదియేమో చూడవలయు నని తలంచి, ఆతనికి ఏకనాథునిఁ జూపిరి. ఆగంతుకుఁడు ఏకనాథునకు సాష్టాంగవందన మాచరించి తన స్థితిగతు లన్నియు శివాజ్ఞను దెలిపి, రక్షింపుమని ప్రార్థించెను. ఏకనాథుఁ డిదివిని, "అయ్యా! పార్వతీనాథుఁడు నీయక్ష ముసు నెఱవేర్పఁగలిగియుండియు, నీభారమును నామీఁద మోపుట నాయదృష్టమే గాని వేఱుగాదు. తెలిసినంతవఱకు నేను భగవంతుని, భాగవతులను నిష్కామ కర్మతో నారాధించుచున్నాను. కావున చండాలస్త్రీశిశువునకు అన్నదానము చేయుటవలన గలిగిన పుణ్యములో నొక భాగము నీకు సమర్పించుటకు నాకే మియు నభ్యంతరము లేదు. నీవు అంగీకరించెదవేని ఆసుకృతమంతయును నానంద ముతో నొసంగఁగలను" అని పలికెను. అందులకుఁ జాల సంతసించి, ఆగంతుకుఁడు "మహాత్మా! నీవంటి పరమభాగవతోత్తములు నిర్లిప్తతకుఁ బేరుగదా! అయినను నేను శివానుమతిని మీరఁజాలను. ఆసుకృతములో నొకభాగముమాత్రమే నేను స్వీకరింతును. అంతకంటె నాకు వలదు" అనిచెప్పెను. తోడనే ఏకనాథుఁడు ఆగం తుకుఁడు కోరినది నిశ్చలచిత్తముతో ధారాపూర్వకముగ దానముచేసెను. అది స్వీకరించిన వెంటనే పరమాసహ్యముగా నున్న ఆగంతుకుని దేహము వజ్రదేహమై పోయెను. అదిచూచి ఏకనాథునకుఁ బ్రాయశ్చిత్తము విధించిన బ్రాహ్మణులంద ఱును దెల్లఁబోయి, భయభ్రాంతులై పాదములమీఁద వ్రాలి, "మహాత్మా! నీ మాహాత్మ్యము నెఱుంగక చేసిన మాయపరాధమును మన్నింపు" మని ప్రార్థించిరి. ఏకనాథుఁడు వారి నందఱను లేవనెత్తి తన యింటికిఁ గొనిపోయి, షడ్రసోపేత మయిన భోజనముపెట్టి చందన తాంబూలము లిచ్చి, సత్కరించి పంపివేసెను.

ద్వారకాపురమున మఱియొక బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణుని సందర్శనముఁగోరి తీవ్రనిష్ఠతోఁ దపస్సుచేయుచుండెను. పదునాలేండ్లు గడచినతరువాత ఆతనికిఁ గృష్ణునిభార్యలు స్వప్నమున సాక్షాత్కరించి, "బ్రాహ్మణుఁడా! వ్యర్థముగా నిక్కడ నేల కాలముఁ గడపెదవు? తీవ్రతపోనిష్ఠచే నీశరీరము నేల కృశింపఁజేసికొందువు? నీవుకోరియున్న శ్రీకృష్ణుఁ డిప్పు డిచ్చట లేఁడు. ఆతఁడు పైఠణపురమున నున్న ఏక నాథుఁడు అను భాగవతాగ్రేసరునియింట పరిచారకుఁడై యున్నాఁడు. అక్కడకుఁ బొమ్ము. అచ్చట ఏపరిచారకునకు కృష్ణుఁ డను పేరుండునో, యాతఁడే శ్రీకృష్ణుఁ డని యెఱుంగుము. మాహృదయేశుఁడు మమ్ము విడిచిపోయి పండ్రెండుసంవత్స రము లైనది. నీవు ఆతనిని దర్శించి, మమ్మిట్లు విడిచియుండుట ధర్మముఁగాదని విన్న వించి తోడ్కొనిరమ్ము" అని చెప్పి, తిరోహితలై పోయిరి. తోడనే బ్రాహ్మణుఁడు

మేలుకొని స్వక్షవృత్తాంతమును దలంచి, శ్రీకృష్ణుఁడు భాగవతాగ్రేసరుఁడగు ఏకనాథునకు పరిచర్య చేయుచున్నందులకు ఆశ్చర్యచకితుఁడై, వెంటనే బయలు దేఱి పైఠణపురమునకు వచ్చి, సూర్యోదయ మగునప్పటికి ఏకనాథునియిల్లు చేరు కొనెను అప్పు డేదోపనిమీఁద ఏకనాథుఁడు వీథిగుమ్మములో నిలిచియుండెను. ఆగంతకుఁడు ఆతఁడే ఏకనాథుఁడు అని దివ్యతేజస్సువలన గుర్తెఱింగి వందన మచరించి, "నేను ద్వారకావాసిని. బ్రాహ్మణుఁడను. నీయింటఁ బరిచర్యచేయు చున్న కృష్ణునినిమిత్తము వచ్చితిని. ఆతనిం జూపవలెను" అని కోరెను. ఏక నాథుఁడు ఆతని నెంతో ఆదరించి లోనికిఁ గొనిపోయి, "అయ్యా! కృష్ణుఁడు జలము తెచ్చుటకు ఏటికిఁ బోయియున్నాఁడు. క్షణములో రాఁగలఁడు" అని చెప్పెను.

అట్లే యొకక్షణముఁ గడచునప్పటికి కృష్ణుఁడు ఏటినుండి నీళ్లకావడి మోసి కొని వచ్చెను. తోడనే ఆగంతుకుఁడు ఆతని కాళ్లమీఁద వ్రాలి, "శ్రీహరీ! సర్వే శ్వరా! నీకు ఇట్టి పక్షపాతము తగునా? లోకములో నెందఱో భక్తులు నీనిమి త్తము వెదకుచుండ, నీవిట్లు ఏకనాథునియింట దాఁగియుండుట తగునా? రాధా రుక్మిణులను వియోగముపాలుచేసి, యిచ్చట నేకాకివై యుండుట ధర్మమా? జగ న్నాయకా! నీసంకల్పమాత్రమున నీజగమంతయుఁ బ్రవర్తిల్లుచున్నది. అయినప్పుడు నీవు ఏకనాథునకుఁ గావలసిన నీళ్లు కావడితో భుజముమీఁదఁ బెట్టుకొని తేవల యునా? దేవతలందఱును నీపరిచారకులైయుండ వారిని నియమింపక, నీవే ఏక నాథునకుఁ బరిచర్య చేయ నేల? రమాపతీ! అంతయు నెఱుఁగుదును. ఏకనాథుని భక్తి యచంచలమైనది. ఆతని భక్తివలన నీవు విమోహితుఁడ వైతివి. కావుననే యిట్టి పనులు చేయుచున్నావు. దామోదరా! గోవిందా! పదునాలుసంవత్సర ములనుండి నీనిమిత్తము తపించుచున్నాను. ఒక్కక్షణమైన ఏకనాథునివిడిచి వచ్చి న న్నుద్ధరింపరాదా? ఒక్క యేకనాథునినిమిత్తము లోకములో అనేకభక్తుల ఆశాలతలను త్రెంపివేయవచ్చునా?" అని వాపోవఁ దొడఁగెను. అది చూచి ఏకనాథుఁడు తెల్లవోవుచుండఁగా, కృష్ణుఁడు మందహాసము గావించుచు, కావడి నక్కడ దింపి అదృశ్యుఁడయ్యెను. తోడనే "నన్ను చూచినంతనే నీవు మాయమై పోయితివి. ఏకనాథునిఁ బండ్రెండు సంవత్సరములు కొలిచితివి. అచ్యుతా! అనంతా! నారాయణా! నీ కిట్టిది తగునా? నేను నీకు భారముగాఁ దోఁచితినా?" యని ఆగంతు కుఁడును, "మాధవా! మధుసూదనా! నే నేమి పాపము చేసితి నని యిట్టి విపరీ తము చేసితివి? నాచే పరిచర్య చేయించుకొనుటకు మాఱుగ నీవు నాకే పరిచర్య చేసి, నన్ను కుంభీపాకనరకమున నేలఁ గూలఁ ద్రోసితివి? నేను నిన్నెన్నడును మఱువ లేదు. వేరుప్రతిష్ఠలనిమిత్తము నిన్నుఁ గొలువలేదు. ఇంకేల నాకీయపకారము

చేసితివి? పండ్రెండు సంవత్సరములు నాయింట సకలహీనకార్యములను జేసి, నా పాపము పండించితివా? ఇంతకాలము నాయింట నుండియు, కలలోనైన దర్శన మిచ్చి యథార్థము నెఱింగించి జ్ఞానభిక్ష దయచేయవైతి. ఎక్కడ నుండియో వచ్చిన యీబ్రాహ్మణశ్రేష్ఠునకు క్షణములో దర్శనమిచ్చితివి. అయ్యో! ఇక నే నెట్లు సహింతును?" అని ఏకనాథుఁడును, ఇదంతయు విని వచ్చి "పద్మనాభా! ఇదియేమి విపరీతము? నేనుగాని, నానాథుఁడు గాని నీయెడలఁ జేసిన యపరాధ మేమున్నది? మమ్ము నిట్లేల వంచించితివి? నానాథుఁడు తినివిడిచినను ఆకులుపాఱవేసితివి. నానాథుఁడు కట్టివిడిచినబట్టలు ఉతికితివి. నాయింట స్థలశుద్ధి చేసితివి. కావడి భుజము మీఁదఁబెట్టుకొని కావలసినన్ని నీళ్లు తెచ్చితివి. ఇదంతయు నేల చేయవలెను? ముకుందా! మురారీ! మాపై నీకింత యాగ్రహమేల కలుగవలెను? మేము నిన్ను పొగడితిమి గాని తెగడలేదు. పూజించితిమిగాని నిందింపలేదు. ప్రార్థించితిమి గాని తిరస్కరింపలేదు. అట్టిచో మాకీపాటు నేల కూర్పవలెను?" అని ఏకనాథుని గృహిణియు నదేపనిగ విచారింపసాగిరి,

ఇట్లు కొంతతడవు జరిగిపోయినతరువాత, ఆగంతుకుఁడు "మీభాగ్యము నేమని కొనియాడవచ్చును? ప్రపంచమునం దంతటను గలభక్తులలో శ్రీహరికి అంతరంగికభక్తులు మీరే కావున, శ్రీరామన్నారాయణుఁడు మీయింట పరిచారకుఁడై నాఁడు. శ్రీపతి భక్తులయెడలఁ జూపించుననుగ్రహము ఇంతకంటెఁగలదా? ఆహా! మీదంపతు లెంత పుణ్యాత్ములు! మీహృదయములను విడిచి శ్రీహరి మఱియొకచోట నుండఁజాలఁడు. మీరిఁక నేల వగచెదరు? మీయనుగ్రహము వలన నాకుఁగూడ శ్రీహరిసాక్షాత్కారము సంఘటిల్లినది" అని వారికి సాష్టాంగ నమస్కారము లాచరించి, తన దారినిఁ బోయెను.

పిదప ఏకనాథుఁడును, అతని భార్యయు పూర్వాధికభక్తితో భగవద్భాగవతారాధనము ప్రారంభించిరి. ఇట్లుండఁగా, నొకనాఁడు జ్ఞానదేవుఁడు ఏకనాథుని స్వప్నమున సాక్షాత్కరించి, "వత్సా! అలకాపురమున నాసమాధిప్రక్క నొకరావి చెట్టు పెరుఁగుచున్నది. దానివ్రేళ్లు నాసమాధికి భంగము గలిగింపఁబోవుచున్నవి. కావున నీవు వచ్చి ఆచెట్టు చచ్చిపోకుండ దూరముగ నాటుము" అని చెప్పి అంతర్హితుఁ డయ్యెను. వెంటనే ఏకనాథుఁడు మేల్కాంచి స్వప్నవృత్తాంతమును భార్య కెఱింగించి, మహానందవివశుఁడై భగవంతునిఁ గీర్తించి, నృత్యముచేసి అలకాపురమునకుఁ బోయెను. అచటి జను లందఱును ఏకనాథునిఁ జాల గౌరవించిరి. పిదప ఏకనాథుఁడు సిద్ధేశ్వరుని దర్శించి, తన యాగమనకారణమును విన్నవించి, యనుగ్రహము చూపవలయునని ప్రార్థించి, జ్ఞానదేవుని సమాధి చెంతకుఁ

బోయి ప్రదక్షిణనమస్కారములు చేసి తపోనిష్ఠుండయ్యెను. కొంతసేపటికి జ్ఞాన దేవుఁడు సాక్షాత్కరించి, "వత్సా! ఏల జాలముచేసెదవు? వృక్షమును బెరికి మఱియొకచోట పాతుము" అని యానతిచ్చి యంతర్హితుఁ డయ్యెను. తోడనే ఏకనాథుఁడు లేచి చిన్ని మొలకనుబోలె ఆపెద్ద రావిచెట్టును దానొక్కరుఁడు నవలీలగఁ బెరికి మఱియొకచో నాటి, శిల్పుల ననేకులను రావించి జ్ఞానదేవుని సమాధిని మరమ్మతు చేయుటకు నియమించెను.

కాని అనేకులు క్రొత్తగా వచ్చుటచే అప్పురమునందలి కోమటులు భోజన పదార్థములను సమకూర్పఁజాలకపోయిరి. అంతట శ్రీహరియే యొక కోమటిరూప ముతో వచ్చి, శిల్పులు పనిచేయుచోటికి సమీపమున దుకాణము పెట్టి, వారికిఁ గావలసిన వస్తువు లన్నియు లేదనక అరువుగా నీయసాగెను.

కొన్ని దినములకు సమాధిపని పూర్తి యయ్యెను. అప్పుడు కోమటి ఏకనా థుని యెదుటకు వచ్చి, "మహాత్మా! మీరు నాకు ఈయవలసినధనము మఱియొకప్పు డీయవచ్చును. ప్రకృతము నాకు మీతో రావలెనని వాంఛ గలదు; సెలవు దయచేయ వలెనని ప్రార్థించెను. అందులకు ఏకనాథుఁ డంగీకరింపఁగా, నందఱును పైఠణపురము నకు బయలు దేఱిరి; కాని కొంతదూరము వచ్చినతరువాత కోమటి తనసామానుల తోఁగూడ నదృశ్యుఁ డయ్యెను. అది చూచి ఏకనాథుఁడు శ్రీమత్పండరినాథుఁడే కోమటియైవచ్చెనని, యానందమును బట్టఁజాలక నృత్యము ప్రారంభించెను. ఆతని వెంట శిల్పులుగూడ నృత్యము చేయసాగిరి. పిదప ఏకనాథుఁడు పైఠణపురముఁ జేరుకొని, బ్రతికియున్నంతకాలమును భగవద్భాగవతారాధనముఁ గావించి, యవ సానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

చ. "అలరు పసిండికంకణము లందెలు మువ్వలు రావిరేక సం
కలపులిగోరుఁ దాయెతులు గుప్పెడపున్నొలనూలు మద్దికా
యలు గల నందనందను దిగంబరుఁ జారుకటీతటోజ్జ్వలత్
విలసితనీలకేశు నవనీతహారుండగు బాలుఁ గొల్చెదన్."

(కృష్ణకర్ణా. 2. ఆ. 87. ప.)

# 34. కబీరుదాసుఁడు

శ్లో. "శత్రుచ్ఛేదైకమంత్రం సరసముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రం,
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీరామమంత్రం జపజప సఫలం జన్మసాఫల్యమంత్రమ్."

(రామకర్ణా. 1. అ. 78. ప.)

గంగాతీరమునందలి యొకపల్లెలో నొకతురుష్కుఁడు కాఁపురము ఉండెను. ఆతఁడు వస్త్రములు నేసి తన్మూలమున ధనము సంపాదించి సంసారమును నిర్వహించుకొనుచుండెను. ఒక్కసంతానహీనత తక్క నాతనికి మఱియొక చింతాకారణము లేదు. సంతానమునిమిత్తము ఆతఁడును భార్యయు రాత్రింబవళ్లు సర్వేశ్వరునిఁ బ్రార్థించుచుండిరి; కాని వారి కోరిక ఫలించునట్లు తోఁచలేదు.

ఇట్లుండఁగా, నొకనాఁడు తురుష్కుఁడు గంగకుఁ బోయి నూలు కడుగుచుండెను. ఇంతలో నొక పెద్దముత్యపుచిప్ప ఆతనిచెంతకుఁ గొట్టుకొనివచ్చెను. చూడఁగా, నందొక బాలకుఁడు ఉండెను. ఈయద్భుతమును జూచి యాతఁడు తెల్లవోయి, అంతలోఁ బ్రబోధితుఁడై తనకు సంతానములేని కొఱఁత తీర్చుటకు భగవంతుఁడు ఈబాలుని ఈతీరునఁ బంపె నని భావించి, తటాలున వాని నెత్తికొని యింటికిఁ గొనిపోయి, భార్యకు సంగతి యంతయు నెఱిఁగించి, "నేఁటితో మనకు బిడ్డలులేనికొఱంత తీఱినది. ఈముద్దుబాలునిఁ బెంచుకొందము" అని చెప్పెను. ఆతనిభార్య బాలసూర్యునివలెఁ బ్రకాశించుచున్న యాబాలకునిఁ జూచి పరమానందభరితురాలై భర్తమాటల కంగీకరించెను. దైవమాయ లెఱుంగ శక్యముగాదుగదా! ఆరమణి ఆబాలకుని ఎత్తుకొనినవెంటనే స్తనములయందు పాలు చేఁపెను. అందులకు మఱింత వింతపడి, యామె "యీబాలునిఁ బెంచుట ఈశ్వరుఁడు నాకే నియమించినాఁడు. కావుననే యిట్లు అయినది" అని యుప్పొంగిపోయెను.

ఇట్టి యానందముతో ఆదంపతులు ఆబాలుని కడుపునఁ బుట్టినవాని కంటె మిక్కిలి ప్రేమతోఁ జూచుచు, కబీరు అని పేరు పెట్టి ప్రాణప్రదముగాఁ బెంచుకొనసాగిరి. కొన్నిదినములకు కబీరు మాటలాడ నేర్చెను. అందులకు తల్లిదండ్రు లబ్బురపడుచుండఁగా, నాబిడ్డఁడు తఱుచు 'రామరామా' యని ఈశ్వరస్మరణము చేయసాగెను. అదిచూచి ఆదంపతులు ఆశ్చర్యచకితులైరి. అయినను తండ్రి యందులకు

నీయఁగలవా?" యని యడిగెను. అంతట కబీరు ఆనందముతో తనచెంతనున్న సగము వస్త్రమును ఇచ్చి, ఫకీరు నంపివేసి వస్త్రము లేకపోలేదను చింత మాని, నిశ్చలచిత్తుఁడై రామస్మరణ ప్రారంభించెను.

పిదప భగవంతుఁడు బ్రాహ్మణరూపము ధరించి కబీరునింటికిఁ బోయి ఆతని తల్లినిఁ బిలిచి, "నీ కుమారుఁడు అమ్ముటకుఁ గొనిపోయిన వస్త్రమును రెండు ముక్కలుగా చించి ఒక బ్రాహ్మణునకును, ఫకీరునకును ఇచ్చివేసి, నిన్నుఁ జూచుటకు భయపడి యొకపాడుగుడిసెలో శ్రీరామనామధ్యానము చేయుచుఁ గూర్చుండి యున్నాఁడు. నీకిది తగదని నే నెంతచెప్పినను వినలేదు" అని చెప్పెను. అందులకు "ఏమి చేయుదును నాయనా? వాని కెప్పుడు రామనామస్మరణమే. మాకింతఅన్నము పెట్టి, తరువాత వాఁడు తనయిచ్చవచ్చినట్లు ఉండరాదా? ఇంటికి రానిమ్ము; శిక్షించెదను" అని పలికెను. బ్రాహ్మణుఁడు "కబీరు నేఁడు ఇంటికి రాఁడు. చాల వెలరావలసిన వస్త్రమును దానము చేసినందులకు నీవు ఏమందువో యనుభయంబున నాతఁడు దాఁగియున్నాఁడు. కావలయునేని నాతోఁగూడ రమ్ము చూపెదను." అని పలికెను. తోడనే యామె యాబ్రాహ్మణునితో బయలుదేరెను.

అప్పటి కింకను కబీరు సమాధినిష్ఠుఁ డయియేయుండెను. బ్రాహ్మణుఁడు గుడిసెబైట నిలిచి, "అదుగో నీకుమారుఁడు." అనిచూపి యామెను లోనికిఁబంపెను. క్షుధార్తయై యున్న యామె కుమారునిఁజూచి "నీవు విక్రయించుటకుఁ దెచ్చిన వస్త్రమేదిరా?" యని గద్దించి యడిగెను. సమాధినిష్ఠుఁడై యున్న కబీరునకుఁ దన తల్లివచ్చినసంగతియే తెలియదుగదా! అంత నామె తనకు జంకియే పలుకకున్నాఁడని తలంచి, అచ్చటఁబడియున్న కఱ్ఱతీసికొని "ఇంకను పలుకవేమి?" యని కొట్టెను. అప్పటికిని కబీరునకు ప్రాపంచికస్మృతి రాలేదు; కాని యాదెబ్బ కబీరునకుమాఱుగా బ్రాహ్మణరూపముతో గుడిసెబైట నున్న శ్రీహరికిఁ దగిలెను. అంత శ్రీరామచంద్రుఁడు కబీరుని అచంచలభక్తికి ఆనందించి, కోదండపాణియై హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నసమేతుఁడై సాక్షాత్కరించెను. వెంటనే కబీరు స్వామిపాదముల మీఁద వ్రాలి,—

చ. "దురితలతాలవిత్ర ఖరదూషణకాననవీతిహోత్ర భూ
భరణకళావిచిత్ర భవబంధవిమోచనసూత్ర చారువి
స్ఫురదరవిందనేత్ర ఘనపుణ్యచరిత్ర వినీలభూరికం
ధరసమగాత్ర భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ."

చ. "అగణితజన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దగిపడ నీఁదలేక జగతీధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁగోరితిఁ బదంపడి నాదుభయంబు మాన్పవే
తగదని చిత్తమందిడక దాశరథీ కరుణాపయోనిధీ." (దాశరథీశతకము. 9. 46. ప.)

అని యనేకవిధములఁ బ్రార్థించెను. శ్రీరామభద్రుఁ డందునకు మహానందకందళిత హృదయుఁడై, ఆదరముతో కబీరుని లేవనెత్తి, "వత్సా! ఆనందమైనది. ఇట్టి యచంచల నిష్ఠ నేను మఱి యెచ్చటను జూడలేదు. నీవు నావాఁడవు. నీకు ఏమియుఁ గొఱంత లేదు" అని చెప్పి, అతనిఁ దల్లినిఁ జూచి "రమణీ! నీకుమారుఁడు నాకు అంతరంగ భక్తుఁడు. ఈతనికిఁ దల్లి వగుటచే నీకుఁగూడ నాదర్శనము లభించినది. మసిపాఁత గట్టిన మాణిక్యమువలె నుండుటచే నింతవఱకును నీకొడుకు ప్రభావమును దెలిసి కొనఁజాలకపోయితివి. ఇఁకనైన నీవు అతనిని సామాన్యునిగా భావింపకుము. నీవుఁ గూడ ఇది మొదలు నన్ను సేవించుచుండుము" అని పలికి, చూచుచుండఁగా నదృశ్యుఁడయ్యెను. కబీరు తల్లి యిదియంతయుఁ జూచి పరమాశ్చర్యచకితయై, కొంత సేపు నిశ్చేష్టయై యుండి, పిదప కుమారుని ఆలింగనము చేసికొని ప్రియమార ముద్దాడి, "నాచిట్టితండ్రీ! నీవిట్టివాఁడవని యెఱుంగక నిన్ను దండించితిని. అందులకు వగవకుము. నీ యనుగ్రహమువలన నేనుగూడఁ దరించితిని." అని ఎంతో మక్కువఁ జూపి యింటికిఁ గొనిపోయెను.

శ్రీరామభద్రుఁడు సాక్షాత్కరించినది మొదలు కబీరుతల్లిగూడ నిశ్చలభక్తి పరురాలై రామనామస్మరణము చేయుచు, నపుడపుడు తన్మయతఁ గాంచుచుండెను. కబీరుభార్యగూడ నిట్లే యెల్లపుడును రామరామా యని రామస్మరణ చేయుచుండెను. ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, కబీరుభార్య గర్భవతియై నవమాసములు మోసి శుభముహూర్తమునఁ జక్కనికుమారునిఁ గనియెను. తల్లిదండ్రులు ఆపాపనికి కమాల్‌అని పేరు పెట్టి, గారాబముతోఁ బెంచుకొనసాగిరి. కమాలు మాట్లాడనేర్చినది మొదలు ఇంట నెల్లపుడును శ్రీరామనామమును బ్రతిధ్వనించుచుండుటచేఁ దానుగూడ రామస్మరణము చేయసాగెను. అందులకు ఆతనితల్లిదండ్రులు పరమానందభరితులైరి. కమాలు తండ్రివలన జ్ఞానోపదేశమును బడసి సదా తారకమంత్రమునే జపించుచు, యుక్తవయస్కుఁడైన పిదప నొకనాఁడు తండ్రినిఁ జూచి, "తండ్రీ! నాకు తీర్థయాత్ర చేయవలయునని తలంపు గలదు. నీయనుజ్ఞ యయ్యేనేని సంతసించెద" నని విన్నవించెను. అంత కబీరు కుమారుని సత్సంకల్పమునకమితానందమును గాంచి, "వత్సా! పోయిరమ్ము" అని యాజ్ఞాపించెను.

కమాలుదాసుని భక్తిప్రపత్తులకు అద్భుతాశ్చర్యనిమగ్నులై, మార్గమధ్యమున ననేకులు అతనిని దమ గృహములకుఁ బిలుచుకొనిపోయి, చాల నాదరింపసాగిరి. ఆతఁ డీతీరున అనేకభక్తులచే నాదరింపఁబడుచు ననేకతీర్థములను సేవించి, తుదకు భీమరథీనదీతీరమునకువచ్చి నదిలో స్నానమాడి, తీరమునఁ గూర్చుండి తారక మంత్రమును జపించుచుండఁగా, నొక భక్తుఁడు వచ్చి ఆతని తేజస్సును జూచి

ఆశ్చర్యచకితుఁడై, యనేకవిధములఁ బ్రార్థించి యాతనిం దనయింటికిఁ దోడ్కొని పోయెను. కమాలు ఆతనియింట నున్న నాలుగుదినములలో నాకుటుంబమునందలి వారి కందఱకును ప్రపంచముయొక్క అస్థిరతను బోధించి, భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించి, తారకమంత్రము నుపదేశించి, మోక్షమార్గమును జూపెను. అందులకు మహానందమగ్నుఁడై యావర్తకుఁడు "నాకుటుంబమునంతను పాపపంకమునుండి యుద్ధరించిన యీమహాత్ముని నేనేమి సత్కరింపఁగలను?" అని యోచించి, తనయింట నున్నరత్నముల అన్నిటియందును నాయకమణి యగుదానిని గొనివచ్చి స్వీకరింప వలసినదని ప్రార్థించెను; కాని కమాల్దాసు "అయ్యా! నన్నేమని భావించితివి? నేను ఉపదేశములుచేసి పాదపూజ అనుపేరున ధనము సంపాదించుటకు రాలేదు. నాచేతనైనంతవఱకును మాయావృతమయి అంధకారరూపమునఁ గూలిపోవ నున్న ఈశ్వరసంతానము నుద్ధరించి, జ్ఞానప్రకాశము నొసంగుటయే నాపని" యని దానిని తిరస్కరించెను. వర్తకుఁ డెన్నివిధముల ప్రార్థించినను కమాల్దాసుఁ డంగీకరింపకపోవుటఁజూచి "ఇది యీతని కీయవలయునని సంకల్పించుకొంటిని. అట్టిచో దీనిని నేనెట్లు వాడుకొందును? ఇంటికిఁ బోయినతరువాతనైనఁ జూచుకొనుఁ గాక!" అని తలంచి దానిని దాసువస్త్రమున ముడిచి పంపివేసెను.

మార్గమధ్యమున కమాల్దాసు తనవస్త్రమున రత్నము కట్టఁబడియుండుటఁ జూచి అది వర్తకుని పనిగాఁ దలంచుకొని, "ఆతనికి నాయం దంత భక్తిగలిగినది. ఇది నాకొసఁగవలయు నని సంకల్పించుకొనియున్నాఁడు. కావున తన సంకల్పము వ్యర్థము కాఁగూడదని నిశ్చయించుకొని, నేను బుద్ధిపూర్వకముగా స్వీకరింపనని తలఁచి యిట్లు చేసియుండు" నని యూహించుకొని, యింటికిఁ బోయి తీర్థయాత్రా విశేషములను తల్లిదండ్రులకును, పితామహికి నెఱింగించెను. వారు అతనియాగమనమునకుఁ జాల నానందించిరి. కాని రత్నమును జూచిన వెంటనే దుఃఖింపఁ జొచ్చిరి. అదిచూచి కమాల్ తెల్లవోయి "అయ్యో! తొలుత తిరస్కరించియు, పిదప నీరత్నమును జూచినపుడు ఏల యంగీకరించితిని?" అని పశ్చాత్తాపపడుచు నతిశీఘ్రముగాఁ బోయి యారత్నమును తొల్లిటివర్తకునకు ఇచ్చివేసి వచ్చి, తల్లిదండ్రులకును పితామహికిని ఆవృత్తాంతము నెఱింగించెను. అదివిని వారు ఆనందించి, కమాల్దాసును ఆలింగనముచేసికొని బుజ్జగించిరి.

ఒకనాఁడు రాత్రి కబీరును, కమాలును హరిభజనమునఁ దన్మయులై యుండఁగా, కొందఱు భాగవతులు వచ్చిరి. కొంతతడవునకు తండ్రియు కుమారుఁడును భజన చాలించి భాగవతుల నాదరించిరి. కబీరు భార్యచెంతకుఁ బోయి, "అయాచితముగ నేఁ డీభాగవతులు మనలను బునీతులంగావించుటకు దయచేసి

నారు. వారికి అన్నము పెట్టవలయును" అనిచెప్పెను. అదివిని యాతనిభార్య "నేనును ఆవిషయమునే యోచించుచున్నాను; కాని యేమి చేయవచ్చును? ఇంట గిద్దెడు బియ్యమైనను లేవు. నిజముగా నీభాగవతోత్తములను పస్తుపెట్టుట కన్న మనము ప్రాణములను దొరంగుట మేలు" అని ప్రత్యుత్తరమిచ్చెను. అది విని కబీరు కుమారునిఁ బిలిచి ఆలోచనయడిగెను. అందులకు కమాల్దాసు "తండ్రీ! ఇంటికి క్షుధార్తులై వచ్చిన భాగవతశ్రేష్ఠులకు అన్నము పెట్టకపోవుటకంటె పాపము లేదు. కావున మనము నేఁడు ఎక్కడైన కన్నమువేసి తెచ్చియైనను వీరికి అన్నముపెట్టి సత్కరింపవలయు" నని చెప్పెను. కబీరు అందులకు సమ్మతించెను.

పిదప తండ్రియు కుమారుఁడును ఆయుధహస్తులై ఊరిలోనికిఁబోయి, ఒకవర్తకుని యింటికిఁ గన్నముత్రవ్విరి. కమాలు తండ్రిని కన్నముచెంత నిలిపి తాను లోపలఁబ్రవేశించెను. లోపల వర్తకుఁడు గుఱ్ఱుపెట్టి నిద్రించుచుండెను. అందులకు ఆనందించి భాగవతారాధనమునకు జాలునంత ఉప్పు పప్పు బియ్యము మున్నగు వస్తువులను దీసికొని వచ్చి తండ్రిచేతి కిచ్చి, "మనమిట్లే పోయినచో మఱికొందఱుదొంగలు వచ్చి యీతని యిలుసొచ్చి సర్వనాశనము చేయవచ్చును. కావున నీవిచటనుండుము. నేను వర్తకునిలేపి మరుగెత్తివచ్చెద" నని తండ్రికిఁ జెప్పి లోనికిఁబోయి వర్తకునిలేపి తటాలునవచ్చి కన్నములోదూఱెను; కాని వెంటనే వచ్చి వర్తకుఁడు కమాలుకాళ్లు పట్టుకొనెను. అదిచూచి కమాలు "తండ్రీ! నేనువర్తకునకు దొరికిపోయితిని. ఇఁక ననేకకష్టములు కావచ్చును; కాన నాశిరస్సు ఖండించుకొనిపొమ్ము" అని చెప్పెను. కబీరు అట్లుచేసి, యింటికిఁ బోయి భార్యకు సంగతియంతయు నెఱింగించెను. అదివిని యాయిల్లాలు కొంతతడవు వగచి, "పుత్రా! నీవుభాగ్యవంతుఁడవు. కావుననే భాగవతసేవలో నీవు ప్రాణములను విడిచితివి. నీకు మోక్షము కరతలామలకము" అని మనస్సమాధానము చేసికొని, భర్త తెచ్చిన పదార్థములను చక్కఁగా వండి భాగవతులకుఁ బెట్టెను. వారి యాదరమునకు సంతోషించి భాగవతులు క్షుద్బాధ తీర్చుకొని, ఆదంపతులతోఁ గలిసి కొంతతడవు హరిభజనము చేసి పిదప శయనించిరి. అట వర్తకుఁడు ఆమొండెమును గొనిపోయి రాజునకుఁ జూపి తనకుఁ దెలిసిన దంతయు నెఱింగించెను. రాజు "ఈమొండెమును గొనిపోయి బజారునడుమ శూలారోపణముచేయుఁడు. ఆమూలముగ చోరుఁడు తెలియఁబడును" అని భటులకు సెలవిచ్చెను. భటులు అట్లే చేసిరి.

మఱునాఁడు చీఁకటి యుండగనే లేచి భాగవతులు సూర్యోదయమగునప్పటికి కాల్యకృత్యములన్నియు నెఱవేర్చికొని, మఱియొకయూరు పోవుటకు బయలుదేరిరి. కబీరు వారిని సాగనంపుటకు వారివెంట బయలుదేఱెను. వారు బజారునకు

రాగానే శూలముమీఁదనున్న మొండెము వారినిఁ జూచి, చేతులు జోడించి నమస్క రించెను. అదిచూచి భాగవతు లాశ్చర్యపడుచుండఁగా, కబీరు "మహాత్ములారా! ఏల వింతపడెదరు. ఆతఁడు వైష్ణవోత్తముఁడనియు, శ్రీహరి ప్రసాదమువలన మీకు నమస్కరించునంతదనుక ప్రాణములు నిలిపికొనియున్నాఁడనియు తోఁచుచున్నది. భగవద్భక్తులు ఇట్టివిచిత్రములు అనేకములు చూపుట వినలేదా" యనిచెప్పెను. అంతట భాగవతులు ఇందలిరహస్యము కబీరునకుఁ జక్కఁగా దెలియునని యూహించి, "సంగతి యేమో చెప్పు" మని నిర్బంధించిరి. అప్పుడు కబీరు జరిగినదంతయు నెఱిం గించెను. అందులకు పరమాశ్చర్యానందభరితులై కమాల్దాసుని శిరముతోఁగూడ కబీరుభార్య నచ్చటకు రప్పించి, శూలమునుండి కమాలు మొండెమును దింపించి శిరస్సును దానికి తగిలించి, ఈశ్వరునిస్మరించుచు తాము చేతులతోఁదాఁకిరి. తోడనే కమాల్దాసు నిద్రవోయి లేచినవానివలె లేచి, భాగవతులకును తల్లిదండ్రులకును ప్రదక్షిణనమస్కారము లాచరించెను. భాగవతులు కబీరుకుటుంబము మాహాత్మ్య మునకు అబ్బురపడుచు, వారివద్ద సెలవుగొని తమదారినిఁబోయిరి. ఊరివారందఱును ఈచిత్రమును జూచి అద్భుతాశ్చర్యములఁ గాంచి కబీరుకుటుంబము నెడల చాల భక్తులై వారి నెంతో గౌరవింపసాగిరి.

ఒకనాఁడు కబీరు బజారులోఁ బోవుచు, అంగడిలో నొకస్త్రీ బియ్యము విసరుట చూచి బిగ్గరగా నేడ్వసాగెను. అదిచూచి అచ్చటివారందఱును వచ్చి యేమి యేమని యడిగిరి; కాని కబీరు ఏమియుఁ బలుకక, తనయేడుపును అట్లే సాగింపసాగెను. ఇంతలో నొకభక్తుఁడు ఆమార్గమున నెక్కడికోపోవుచు నిదిచూచి దగ్గఱకువచ్చి "భాగవతోత్తమా! ఏల యట్లు దుఃఖించెదవు?" అని కబీరునిఁ బ్రశ్నిం చెను. కబీరు ఆభక్తునిఁ జూచి, "మహాత్మా! ఆమె తిరుగలి విసరుట చూడఁగా, నా కీప్రపంచవృత్త మంతయు జ్ఞాపకము వచ్చినది. ఆతిరుగలియొక్క క్రిందఱాయి భూమి యనియు, మీఁది ఱాయి ఆకాశ మనియు, నడుమనలుగుచున్న బియ్యము ప్రాణులు అనియు, త్రిప్పుచున్న స్త్రీ యముఁడనియుఁ దోఁచి ప్రాణులచేయు దౌర్జ న్యములను, వారికి సంభవింపనుండు ఆపదలను, యమయాతనలను దలంచుకొని దుఃఖించుచున్నాను." అని చెప్పెను. "నీవు తలంచిన దంతయు యథార్థము. కాని తిరుగలిలోనున్న బియ్యమన్నియు నలిగిపోవుట లేదు. మఱియు లోకమునందలి ప్రాణు లన్నియు యమయాతనల ననుభవించుట లేదు. మఱేమన? తిరుగలిలో గురుసుచెంత నున్న వివరములోనుండు బియ్యము సుంతయైన నలుగుడుగాంచ కుండ నెట్లు ఉన్నవో, అట్లే లోకములో శ్రీహరిని నమ్ముకొని కైంకర్యము చేయు ప్రాణులు నిరపాయములై యుండు" నని చెప్పి, యాభక్తుఁడు వెడలిపోయెను. అదివిని కబీరు ఆనందముతో తనమార్గమునఁ బోయెను.

పిదప నొకనాఁడు కబీరునకు జ్ఞానములేని భక్తి అడవిఁగాచినవెన్నెలవలె నిష్ప్రయోజన మని తోఁచెను. జ్ఞానోపదేశముఁ బడయఁదలఁచి, కాశీనగరమునఁ గల అనంతజ్ఞానులలో రామానందస్వామి యొక్కఁడే సదాచార్యుఁడుగ నుండఁదగిన వాఁడని తలంచి, తిన్నగ నాతని యాశ్రమమునకుఁ బోయి బైట నిలిచి పిలిచి, దూరము నుండియే సాష్టాంగదండప్రణామము లాచరించి, "మహాత్మా! నిరాధారుఁడను, ఆపన్నుఁడను, సంసారసాగరమునుజూచినను, ఈమాయావృతమైన ప్రపంచమును జూచినను, నాగుండె పగిలిపోవుచున్నది. నాకు జ్ఞానభిక్ష ననుగ్రహించి, నాగుండెదడ పోఁగొట్ట వలయును" అని వినయవినమితదేహుఁడై ప్రార్థించెను; కాని కబీరు తురుష్కుఁడగుటచే నాతనిఁ దనశిష్యకోటిలోఁ జేర్చుకొనిన నేమైన బాధలు కలుగవచ్చు నని తలంచి, రామానందుఁడు ఏమియు మాఱుపలుకఁ డయ్యెను. కాని కబీరు అంతటితో నూరకుండలేదు. మేఘజలమును గాంక్షించు చాతకమువోలె నేను మీ యభయదానమును నిరీక్షించియున్నాను. దిక్కులేనివాఁడను. శరణాగతునిఁ ద్రోసి వేయుట ధర్మముగాదు. జ్ఞానార్తునిఁ దరిజేర్చి కాపాడుటకంటె మఱిపుణ్యము లే" దని యాతఁడు మఱలఁ బ్రార్థించెను. అప్పుడు రామానందుఁడు "నీవు మ్లేచ్ఛుఁడవు. మ్లేచ్ఛులు ధర్మబాహ్యులు. కావున నీకు ఉపదేశము చేయుటకు వీలు లేదు పొమ్ము" అని యానతిచ్చి లోనికిఁ బోయెను. అప్పుడు కబీరు అందులకు చింతింపక, "స్వామీ! నాహృదయము మీపాదపద్మములను బూజించుచున్నది. దానిని మీరు నిషేధింపఁ జాలరు. ద్రోణభట్టారకుని ధ్యానించి ఏకలవ్యుఁడు సఫలమనోరథుఁడైనట్లే, నేను మిమ్ము ధ్యానించి సఫలప్రయత్నుఁడ నయ్యెదను" అని చెప్పి, తన గృహమునకుఁ బోయెను.

కాని యంతటితోఁ గబీరునకు తృప్తి కలుగలేదు. "మహాత్ముఁడగు రామానందస్వామి పాదధూళి నాశిరమున ధరింపవలయును. వారి వాచా శ్రీరామనామ్మము వినవలయును" అని యాతఁడు నిశ్చయించుకొని, యొకనాఁడు రామానందుఁడు తెల్లవాఱకపూర్వము స్నానార్థము గంగకుఁబోవుమార్గమున నొకగోయి త్రవ్వుకొని దానిలోఁగూర్చుండి, శిరస్సుమాత్రము పైకిఁ గాన్పించునట్లు గోతిమీఁద కట్టెలుపఱచి మట్టి కప్పించుకొని యుండెను. కొంతసేపటికి రామానందుఁడు ఆమార్గమునఁబోవుచు చీఁకటివలన తెలియక కబీరు శిరముమీఁద పాదముమోపి 'రామరామా' తెలియక మార్గమధ్యమున నున్న యేమహాత్మునిశిరమో త్రొక్కితి నని పరితాపపడసాగెను. తోడనే కబీరు గోతిలోనుండి పైకి వచ్చి రామానందునకు సాష్టాంగవందన మాచరించి, "దేవా! నేఁటికి శిష్యునిపై ననుగ్రహాము గలిగినందులకు మహానందభరితుఁడ నగుచున్నాను. మీపావనపదస్పర్శచే నేను

పునీతుఁడ నయితిని. మీ తారకమంత్రోపదేశముచే నిఁక నాకు మోక్షము కరతలా మలకము" అని యనేకవిధముల స్తోత్రము చేయసాగెను. అది విని రామానందుఁ డేమియు మాటుపల్కక తిన్నగ గంగకుఁ బోయి స్నానముచేసి, జపతపము లన్నియు నిర్వర్తించుకొని యాశ్రమమునకుఁ బోయి, "కబీరు దీక్షచూడ చాల నాశ్చర్యకర ముగా నున్నది. మహాత్ముఁడియుఁ డయ్యు, నింతటి శ్రీరామభక్తుఁ డగుటఁ జూడ నాతఁడు కారణ జన్ముఁడని తోఁచుచున్నది. అయినను ఇంకను ఆతని హృదయనైర్మ ల్యమును బరీక్షించి చూచెదను" అని నిశ్చయించుకొనెను.

ఒకనాఁడు కబీరు బజారులో నెచ్చటకో పోవుచు, నెవరో రామనామము నుచ్చరింపఁగా విని తన్మయుఁడై రామభజనము ప్రారంభించి "రామానందస్వామి నాకు ఆచార్యుఁడై యుండ నిఁక నాకు లోపమేమి?" యని పాడఁ దొడఁగెను. అది విని యచ్చట నున్న బ్రాహ్మణులు కొందఱు రామానందుని చెంతకుఁ బోయి "మీరు కబీరునకు తారకోపదేశముఁ జేసితిరఁట! ఇది మీకు దగునా?" యని యడిగిరి. అదివిని రామానందుఁడు కబీరునెడల హృదయమున ననంతప్రేమఁ గలిగి యుండియుఁ జాల నాగ్రహము ప్రకటించి, ఆబ్రాహ్మణులను వెంటఁ గొనివచ్చి "ప్రేలరీ! నీవు నాశిష్యుఁడ వనియు, నేను నీకు తారకమంత్రోపదేశము చేసితి ననియు నేల దబ్బరలు పల్కెదవు?" అని గద్దించి పలుకుచు, తన పాదుకతో కబీరుని శిరముమీఁద నొక దెబ్బకొట్టెను. ఆదెబ్బతో కబీరుశిరముమీఁద గాయము పడి రక్తము కాఱసాగెను. అయినను కబీరు అందులకు కోపమునుగాని విచారమును గాని పొందక, "మహాత్మా! దేశికోత్తమా! ఏలినవారు నాకు తారకమంత్రోపదేశ మును జేయుటను గుఱించి యిపుడు సాక్షు లేల? అయినను వ్యామోహమునఁ బడి కొట్టుకొనుమానవులు చర్మచక్షుస్సులతోఁ జూడనంతమాత్రమున, నేమి లోపము తటస్థించును? ఉభయసంధ్యలును, సూర్యచంద్రులును, వేదములును, పంచ భూతములును సాక్షిగా దేవరవారు నాకు ఉపదేశము చేయుట కల్లయని వాదింప నెవరికి శక్తికలదు? మహాజనులు ఇందఱు చూచుచుండ నిపుడు దేవరవారు తమ పాదస్పర్శచే పరమపావనమైయున్న పాదుకతో నాశిరము నలంకరించితిరిగదా! ఇంత కంటె ప్రత్యక్ష సాక్ష్యమేమి కావలయును? ఓజనులారా! నాకు తారకోపదేశము చేసిన గురుదేవుఁడు ఇక్కడ సాక్షాత్కరించియున్న రామానందస్వామియె. మీరు గూడ వీరి పాదపద్మముల నాశ్రయించి తరింపుఁడు" అని పలికెను. కబీరుని యీ యచంచలభక్తినిఁ జూచుటవలన రామానందుని హృదయము వెన్నవలెఁ గరఁగి పోయెను. తోడనే యాతఁడు "ఈబ్రాహ్మణులు ఏమనుకొనినను అనుకొందురుగాక! కాని యిట్టి భాగవతాగ్రేసరునిఁ దిరస్కరించుటకంటె పాతకములే" దని నిశ్చయించు

కొని కబీరు పరవశుడై నిలిచియుండి "భాగవతోత్తమా! నేనే నీకు అభయ మిచ్చుచున్నాను. నీకు ఏమియు లోపములేదు. శ్రీరామచంద్రుడు నీపాలం గలడు. అనవరతమును నీవు అపరమేశ్వరుని శ్రవణమననధ్యానార్చనములతో సంతోషపెట్టు చుండుము. భాగవతులను బూజింపుము" అని యాజ్ఞాపించి, మరి యేమియును మాట్లాడక తన మఠమునకుం బోయెను.

లోకమునం దనేకవిధములైన మనుష్యులు గలరు. వారిలోఁ గొందఱు కబీరు తమ్మేమియుఁ జేయకపోయినను, వారి నేదో యొకవిధమున బాధపెట్టుచున్నచో వారి నేదో యొకవిధమున బాధింపవలెనని నిశ్చయముగఁ దలంచి, అనేకదుష్ప్రయత్నము లను జేయుచుండిరి. అట్లే కబీరుదాసు ఒకరికొకరికిని సాటిలేక పోవుట, సదా శ్రీరామభజనము చేసికొనుచుండుట గాంచి యోర్వఁజాలక, కాశీనగరమునందలి కొందఱు దుర్మార్గులు—

"మహాత్ములారా! శ్రీజానకీరమణుని యనుగ్రహమువలన నీదేశమున నుండు భాగవతోత్తముల నందఱను ఆరాధింపవలయునని నాకు సంకల్పము గలిగినది; కావున తామందఱును విజయముచేసి యీదాసానుదాసుని ధన్యుఁజేయవల యును" అని యొక విజ్ఞాపనమును వ్రాసి, కబీరుదాసు సంతకము చేసి సకలదిక్కుల కును రవాణా చేసిరి. అంతట నీపత్రికలను జూచిన సాధువులందఱును ఇది నిజమే నని నమ్మి, నిర్దిష్టదినమునకు లక్షలకొలందిగ వచ్చి కాశీనగరమున గంగాతీరమున విడిసిరి. ఇదిచూచి శ్రీరామచంద్రుఁడే నేఁ డిన్నిరూపములతో సాక్షాత్కరించెనని యానందముతో పరవశుఁడై కబీరు నృత్యముచేయుచుండఁగా, శ్రీరాముఁడు భక్తార్తిభంజనుఁడు గావున నెందఱు సాధువులు వచ్చిరో, అన్నికబీరరూపములను ధరించి వచ్చిన సాధువుల నందఱను అనేకవిధముల నాదరించి పంపివేసెను. ఈవింత చూచి పత్రికను గల్పించిన దుష్టులు బుద్ధితెచ్చుకొని కబీరుపాదములపైఁ బ్రాలి, నిజ మంతయుఁ జెప్పి అపరాధమును క్షమింపవలయు నని ప్రార్థించిరి. కాని కబీరు అందులకేమియు నాగ్రహపడక వారి నందఱను జ్ఞానోపదేశముచేసి, రామభజన తత్పరులనుగావించి పంపివేసెను.

తీర్థయాత్రకై బయలుదేఱిన జ్ఞానదేవనామదేవులు కాశీనగరమునకు వచ్చి సకలతీర్థములను సేవించి, నాలుగు మాసములు అచ్చట వసించి, ఒకనాఁటి రాత్రి కబీరునిఁ జూచుటకు వచ్చిరి. అప్పటికి కబీరు హరిభజనము చేసికొనుచుండెను. కాని ఇంటికి వచ్చిన భాగవతోత్తములను జూచి వారి ననేకవిధముల నాదరించి, భార్య చెంతకుఁ బోయి "వీరికి అన్నము పెట్టవలయును" అని చెప్పెను. అందులకు ఆమె చాలఁ గటకటంబడి యింట బియ్యము లేవనిచెప్పి, బజారునకుఁ బోయి తెచ్చుటకు

భక్తయసజ్జను బడసి బయలుదేఱెను. కాని దుకాణములు అన్నియు కట్టివేసిరి. ఒక్కడుకాణదారుఁడు కట్టివేయుటకు సిద్ధముగా నుండెను. వీథు లన్నియు నిర్జన ములై యుండెను. అంత కబీరుభార్య ఆవర్తకునిచెంతకుఁ బోయి తన్నెఱింగించు కొని, "మాయింటి కిపుడు ఇరువురు భాగవతులు వచ్చినారు. చెంత నొక కాసైన లేదు. వారికి సరిపోవుసంభారముల నీవు ఇచ్చెదవేని నీకు చాల పుణ్యము వచ్చును. వెల నేనురేపు ఎట్లయినను ఇచ్చివేసెదను" అని చెప్పెను.

కాని యీసాధ్విని జూచినవెంటనే వానికి కామోద్రేకముఁ గలిగెను. దానిని బట్టఁజాలక వాఁడు "ఇంతీ! నీవు నాకు వెల నీయనక్కఱలేదు. నిన్నుఁ జూచుటతోడనే నన్ను మన్మథుఁడు వేఁటాడఁదొడఁగినాఁడు. నాకోరిక తీర్చెదవేని నీవు కోరిన దంతయు నిచ్చెదను" అని నిర్భయముగాఁ బలికెను. అదివిని యామె చాల వగచి, "వీనికోరిక నంగీకరింపకున్న వీఁడు వస్తువుల నీయఁడు. ఈయకున్న భాగవతులను పస్తు పెట్టవలసివచ్చును. అంతకంటె పాతకమేమియున్నది? వీనిహృదయమును శ్రీరామ చంద్రుఁడు త్రిప్పకమానఁడు." అని నిశ్చయించుకొని, "అట్లే చేసెదను. కాని ముందు వస్తువులు ఇచ్చి నన్నుఁ బంపుము. భాగవతుల నారాధించి వచ్చెదను." అని చెప్పెను. "నీమాటలయందు నాకు నమ్మకము కలదు; పోయిరమ్ము. నేనిక్కడనే ప్రతీక్షించు చుందును" అని చెప్పి వర్తకుఁ డామెకుఁ గావలసిన వన్నియు నిచ్చి పంపివేసెను.

ఆమె యింటికిఁబోయి సంగతియంతయు భర్త కెఱింగించెను. కబీరు అదివిని, "భాగవతులకు పస్తుపరుండవలసిన యోగము లేకుండఁజేసిన యాపుణ్యాత్ముని హృద యమునందలి యాకళంకమును శ్రీహరి తొలంగింపకుండనుండఁడు. అంతకును మనకు శ్రీరాముఁడే రక్షకుఁడై యున్నాఁడు. నీవు భాగవతారాధనమైన తరువాతఁ బోయి రమ్ము" అని యాజ్ఞయిచ్చెను. భర్తసెలవుగొని నిముసములో వంటఁజేసి భాగవతులను భుజింపఁజేసి, వారు పరుండుటకు తగిన వసతు లన్నియుఁ గల్పించి, యామె వర్తకుని చెంతకుఁబోయెను. కాని వాఁడీమెను జూచిన వెంటనే మాతృభావముతోఁ బాద ముల మీఁద వ్రాలి, "తల్లీ! నన్ను రక్షింపవలయును. కండక్రొవ్వువలన నేను నిన్ను దుర్భాష లాడితిని. జగద్రక్షకుఁడగు శ్రీరామచంద్రుని అనుగ్రహమువలన నాకు బుద్ధి వచ్చినది. నాయపరాధమును క్షమించి, నన్ను శిష్యకోటిలోఁ జేర్చుకొని జ్ఞానోప దేశము చేయునట్లు నీభర్తతోఁ జెప్పవలయు" నని యనేకవిధములఁ బ్రార్థించెను. అది చూచి యామె వానిమనస్సు సత్పథమునకు వచ్చుటకు శ్రీరామచంద్రుఁడే కారణ మని నమ్మి, అనేకనమస్కారము లాచరించి, వర్తకుని పుత్రభావముతో దీవించి తనవెంటఁ గొనిపోయి భర్తపాదములమీఁదఁ బడవేసి రక్షింపవలె నని వేడు కొనెను. కబీరు చాల సంతసించి అభయ మిచ్చి, వానినిఁ దన శిష్యులలోఁ జేర్చుకొని యాదరించెను.

ఇది చూచి జ్ఞానదేవుఁడును, నామదేవుఁడును ఆశ్చర్యచకితులై కబీరుదాసును, ఆతని భార్యను అనేకవిధములఁ గొనియాడిరి. అప్పుడు జ్ఞానదేవుఁడు కబీరుతో "భాగవతోత్తమా! భక్తత్రాణమునకు వచ్చు శ్రీహరి పాండురంగఁడై పండరీపుర మున వసించియున్నాఁడు. ఆతనికి జ్ఞానదేవుఁ డనఁగ నేను. నీవు వచ్చి ఆదేవుని సేవింపవలయు" నని చెప్పెను. "మీరు సెలవిచ్చిన ప్రకారము ఉత్సాహమై కాశికి వచ్చెద" నని కబీరు చెప్పఁగా, జ్ఞానదేవనామదేవులు తమ నెలవుగొని తీర్థ యాత్రకుఁ బోయిరి.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, అయాచితముగా కబీరుదాసుకీర్తి దేశ మునం దంతటను వ్యాపింపసాగెను. ఆతని ప్రభావమును విని అనేకులు వచ్చి, జ్ఞానోపదేశమును బడసి శిష్యులై కొలువసాగిరి. కాశీనగరమునందే యొక బ్రాహ్మణునకు ఒక్కఁడే కుమారుఁడుండెను. బాల్యమున తండ్రి యాతనికి వేదశాస్త్ర ములను జెప్పెను. ఈవిద్యవలన నాతఁడు అవిద్యను జయించి, కబీరుదాసు నాశ్ర యించి తారకమంత్రోపదేశమును బడసి, భక్తుఁడై హరిభజనము ప్రారంభించెను. ఒకరు బోధించుటవలన వచ్చినది గాక, స్వయంభువు అగుటచే నాతనిభక్తి అంత కంతకు అధికమై, నిర్మలమై ప్రకాశింపసాగెను. శిష్యుని ధీశక్తిని జూచి గురుఁడు బ్రహ్మానందభరితుఁ డగుచుండెను. పద్మనాభుఁడు అనుపేరుగల యాభక్తుఁడు ఒక నాఁడు గంగానదికి స్నానార్థము పోయి యుండఁగా, నచ్చట నొక యద్భుతకార్యము జరిగెను.

కాశీనగరమునందలి గొప్పవర్తకులలో నొకనికి అయిదుగురుపుత్రులు కలరు. వారు తండ్రివలె శాంతులును వర్తకనిపుణులునై, చాలలాభమును సంపాదించుచు తండ్రికి వశవర్తులై యుండిరి. వర్తకుఁడు అనంతధనము గలవాఁడగుటయే గర్వపడక, శ్రీహరిని శ్రవణమననధ్యానాదులచే బూజించుచును, దేవబ్రాహ్మణభక్తిఁ గలిగి దీన పోషకుఁడై యుండెను. ఆతనిభార్య అన్నివిధముల నాతనికి అనురూపురాలై యుండెను. ఇట్టి మహావిభవుఁడు అగు ఆవర్తకునకు పూర్వజన్మార్జితమగు పాప లేశమువలన చూచుచుండఁగా, అనివార్య మగు కుష్ఠురోగము అంకురించెను. అదియెన్నియౌషధములను సేవించినను నివృత్తిఁగాక, ఎన్ని దానధర్మములుచేసినను లొంగక, కొలఁదికాలమునందే అతితీవ్రముగ విజృంభించి శరీరము అంతయుఁ దినివేసెను. అట్టి స్థితిలో నావర్తకుఁడు ఇఁక నిదిపోవునది కాదని నిశ్చయించుకొని, మరణమే శరణ్యమని తలంచి భార్యాపుత్రులను జూచి, నేను బ్రతికియుండుటవలన ఏమిప్రయోజన మున్నది? నేను ఇట్లు బాధపడుచుండఁగా, మీకు మాత్రమేమి సుఖము? కేవలము యమయాతన తక్క మఱేమియు లేదు. పరలోకములో ననుభ

వింపవలసిన యమయాతన నీలోకములచే ననుభవింపనేల? కావున నన్ను గంగలో విడువుఁడు" అని చెప్పెను. అదివిని వారు తొలుత చాల వగచి, తుదకుఁ జేయునది లేక సరే యని గంగాతీరమునకుఁ గొనిపోయిరి.

కపిల శిష్యుఁ డను పద్మనాభుఁడు అప్పు డచ్చట స్నానసంధ్యాద్యనుష్ఠానము లన్నియుఁ దీర్చికొని, యింటికి బోవుటకుఁ బయనించుచుండెను. అగుట నాతఁడు వర్తకునిచెంతకు వచ్చి యిది యేమి అని ప్రశ్నించి సంగతి యంతయుఁ దెలిసికొని, "అయ్యా! ఆత్మహత్యఁ జేసికొనుటకంటె వేఱొకపని మఱియొకటి కలదా? ఎన్ని పుణ్యములు చేసికొనఁగ నీకీ మానుషజన్మము లభించినదో యేమైన యోచించితివా? అనేకులు అజ్ఞానులై దుర్లభమైన యీమనుష్యజన్మమును బడసియు, అజ్ఞానము వలన ఆత్మహత్యలు చేసి అధఃపతితులై పోవుచున్నారు. అక్కటా! వర్తకుఁడా! ఈయాత్మహత్యవలన నీవు ఎట్టి హీనజన్మము నెత్తెదవోగదా? నీప్రయత్నము చూచిన నాగుండె పగిలిపోవుచున్నది. ఆత్మహత్య చేసికొనుటకైన సాహసించితివి. కాని ఆర్తత్రాణపరాయణుఁడగు శ్రీహరిని నమ్మియుండఁజాలకపోయితివిగదా! ఏదో కొంత తడవు భజనచేసినంతమాత్రమున నీకు చేయూత నొసంగలేదని భగవంతుని నమ్మఁజాలకపోయితివిగదా! అయినను ఇప్పుడు మించిపోయినది లేదు. నీవు ఇప్పుడు నాతోఁగూడ శ్రీహరిని ప్రార్థింపుము. నీకుమారులును, నీభార్యను గూడఁ బ్రార్థనచేయునట్లు నియమింపుము. జానకీరమణుఁడు భక్తుల విపత్తులను దొలఁగించుటకు సర్వసిద్ధుఁడై యున్నాఁడు. అదిగో శ్రీరామచంద్రుఁడు దయామృతవర్షముఁ గురియుచున్నాఁడు. ప్రార్థింపుము." అని యాతనికి బోధించి,

నాదనామక్రియ—ఆదితాళము.

ఏమి రా రామా నావల్ల నేర మేమి రా రామా,
ఏమి రామ యీలాగు కష్టము? నీమహిమో నాప్రారబ్ధమో. ఏమి
కుండలిశయన వేదండరక్షకా ఖండతేజ నా యండ నుండవే. ఏమి
పంకజలోచన శంకరనుత నా సంకట మార్పవె బొంకము తోడను. ఏమి
మందరధర నీ సుందరపదములు ఇందిరేశ కనుఁ గొందుఁ జూపవే. ఏమి
దినమొక యేడుగ ఘనముగఁ గడపెదఁ దనయుని మీఁదను దయ లే దయయో. ఏమి
సదయహృదయ నీమృదుపదములు నాహృదయకమలమున వదలక నిల్పెద. ఏమి
రామరామ భద్రాచలసీతారామదాసుని ప్రేమతో నేలవె. ఏమి

శా. "ధీరాగ్రేసర నందనందన! హరీ! దేవౌఘచూడామణీ!
ఘోరాఘౌఘహరా! ముకుంద! నృహరీ! గోవింద! శ్రీకృష్ణ! సం
సారాంభోనిధికర్ణధార! కమలాక్షా! శౌరి! దామోదరా!
శ్రీరామాచ్యుత! జానకీరమణ నిన్ సేవింతు నిష్ఠాప్తికిన్." (రామదాసుచరిత్ర. పుట. 71.)

ఉ. "నీసతి పెక్కుకల్ము లిడ నేర్పరి, లోక మకల్మషంబుగా
నీసుత చేయుఁ బావనము, నిర్మితకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁ డిచ్చు సాయుజ్యములు, నిన్నుభజించినఁ గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు దాశరథీ కరుణాపయోనిధీ!" (దాశరథిశతకము. ప. 89)

అని రామభజనము ప్రారంభించెను. అతని వెంట వర్తకుఁడును, అతని భార్యాపుత్రులుకూడ ప్రారంభించిరి. అది ముగిసినతరువాత పద్మనాభుఁడు ముమ్మారు తారకమంత్రము నుచ్చరించి వర్తకుని బాఁకెను. తోడనే వర్తకుఁడు రాహువిముక్తపూర్ణచంద్రునివలె, కుష్ఠురోగమునుండి విముక్తుఁడై వజ్రకాయుఁడై ప్రకాశింపసాగెను. అదిచూచి అందఱు నాశ్చర్యపడిరి. వర్తకుఁడును, అతని భార్యాపుత్రులు కాళ్లమీఁదఁ బ్రాలి, "మాయింటికివచ్చి మాపూజఁ గైకొనవలయును" అని యెన్నివిధములఁ బ్రార్థించినను వినక, అనుమతిపొంది పద్మనాభుఁడు గురుసన్నిధిఁ బోయెను.

కబీరు అంతయు విని, "ఈస్వల్పప్రయోజనమునకై తారకనామమును మూఁడుమారు లుచ్చరింపవలయునా?" యని శిష్యు నడిగెను. అందులకు పద్మనాభుఁడు "ఆవైశ్యుఁడు మహాత్ములగు మీపాదముల నాశ్రయించి జ్ఞానోపదేశమును బడయమిఁ గలిగినపాపము తొలఁగిపోవుటకు ఒకమారును, కుష్ఠురోగమునుగూడ భవరోగమునుగూడ సమూలముగ నశించుటకు ఒకపర్యాయమును, అతని భార్యాపుత్రాదులకుఁ గూడ ముక్తికలుగుటకై మఱియొకసారియు—నిట్లు మూఁడుపర్యాయములు తారకనామము నుచ్చరించితి" నని సమాధానము చెప్పఁగా, కబీరు అదివిని మిగుల నానందించి, "వత్సా! నీవు శ్రీహరికిఁ దగిన భక్తుఁడవు. శ్రీహరి నీహృదయమున నెల్లపుడును సాక్షాత్కరించియున్నాఁడు" అని శిష్యునిఁ బ్రశంసించెను.

పిదప నొకప్పుడు పదివేలభాగవతులు ఒక్కమాఱుగా కాశీనగరమునకు వచ్చిరి. వారి కెవరును సదావర్తి యిచ్చువారు లేకపోయిరి. వారందఱలకై తొట్రుపడుచుండఁగా, కబీరును వంచించుట కిదియే సమయమని యెంచి అకారణవిరోధులగు కొందఱుదుష్టులు వారిదగ్గఱకుఁబోయి "మీరేల కంగారు పడెదరు? కబీరుదాసుని ఇంటికిఁ బోయితిరేని, మీకందఱకు నాతఁడు సదావర్తి యిచ్చు" నని చెప్పి, వారి కాతని యిల్లుచూపి వెడలిపోయిరి. వెంటనే భాగవతు లందఱును శ్రీరామస్మరణ చేయుచు కబీరుదాసు ఇంటి ముంగిటకు వచ్చిరి. ఈరామఘోషము విని కబీరుదాసుఁడు పరమానందముతో బైటకువచ్చి, వారి నందఱి నాదరించి కూర్చుండఁజేసి, వచ్చినసమాచారము నడిగి "దయచేసి ఒక్క క్షణము

...డు. దాసుడు మీకు సహాయ మిచ్చుటకు సిద్ధుఁడై యున్నాఁడు" అని విన్నవింపఁగా, కబీరు భార్య యొక్క వర్తకుని చెంత కరిగి, "అయ్యా! నేఁడు నాయింటికి పదివేల సాధువులు వచ్చియున్నారు. వారికి సదావర్తి యీయవలసినది. నీవు ఈసాహాయ్యమును జేయవలెను" అని వేఁడుకొనెను. అందులకు పరస్త్రీలోలుఁ డగు ఆవర్తకుఁడు ఏమియు సంకోచింపక, "పదివేలకుఁ గాదు. ఇరువదివేలకు ఇమ్మనిన నేను ఈయఁగలను; కాని నేఁటిరాత్రికి నీభార్యను నాయంతఃపురమునకుఁ బంపఁ గలవా!" యని కబీరు నడిగెను. కబీరు ఆపలుకు విని వానిదుర్బుద్ధికి చాల దుఃఖించి, అన్నిఁటికిని శ్రీరామచంద్రుఁడే యున్నాఁడని నిశ్చయించుకొని వల్లె యనెను. తోడనే వర్తకుఁడు కబీరు కోరినవెల్ల నిచ్చివేసెను. కబీరు సాధువుల నంపఱను సత్కరించి పంపివేసి, సంగతి యంతయు నెఱింగించి, రాత్రి భార్యను వర్తకుని యింటికిఁ బంపెను.

వర్తకుఁడు కబీరుభార్యను జూచి పరమానందభరితుఁడై, ఆమెను అంతఃపురమునకుఁ గొనిపోయి, మీఁదఁ జేయి వేయఁబోయెను. తోడనే శ్రీరామభద్రుఁడు ఉరి కొత్వాలురూపముతో సాక్షాత్కరించి, "దురాత్మా! ఆసాధ్విపైఁ జేయివేసెదవేని చచ్చెదవు" అని పలికెను. అది చూచి వర్తకుఁ డదరిపడి, "మహాత్మా! రక్షింపుము బుద్ధి వచ్చినది" అని ప్రార్థించెను. కొత్వాలు కబీరుభార్య నింటికిఁ బంపివేసి తాను అంతర్హితుఁడయ్యెను.

ఇది భార్యవలనవిని కబీరు శ్రీరామచంద్రుఁడే యిట్టి పనిఁజేసినవాఁడు అని యెఱింగి, వడివడిగ వర్తకునియింటికిఁ బోయి "ఓవర్తకుఁడా! నీవెంతటి యదృష్టవంతుఁడవు? నీకు కాన్పించిన కొత్వాలు సాక్షాత్తుగ శ్రీరామచంద్రమూర్తి. నీవింతవఱకు ఆతనిం గొలిచియుండకపోవుటచే నిజరూపముతో నీకు దర్శన మీయఁ డయ్యెను. అయినను నీవు తరించితివి. ఇకనైన శ్రీహరిని భజింపుము." అని చెప్పెను. వర్తకుఁడు అదివిని పరమానందభరితుఁడై, కబీరు నాశ్రయించి జ్ఞానోపదేశమును బడసి, కేవలము నిర్మలహృదయుఁడై విరాగి యయ్యెను. కబీరు ఇంక ననేక పర్యాయములు ఇట్లు ప్రభావము చూపి అనేకులను ఉద్ధరించి, అవసానమున భార్యాపుత్రులతో శ్రీహరిసాయుజ్యమును బడసెను.

మ. "ఉరుసంసారసముద్రతరంబు నిగమాంతోచ్చారితంబు కల్మష
స్తరిపుధ్వంసము జన్మపావనముగా సత్సంగవేళాసము
చ్చరితంబు వ్యసనాహిదష్టజనరక్షాదక్షమై శర్వదం
బరుదౌ శ్రీరఘురామమంత్రమును జిహ్వా! భక్తిఁ గీర్తింపుమా."

(రామకర్ణామృతము. ఆ. 1. ప. 78.)

# 35. సదాశివేంద్రసరస్వతి

శ్లో. "తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ,
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ."

(ముకుందమాల. 14.)

దక్షిణాపథమున కరూరు అని పిలువఁబడు గ్రామమునకు సమీపమున ఒక చిన్నపల్లెలో ఒకబ్రాహ్మణునకు ఒక కుమారుఁడు గలిగెను. ఆతఁడు తల్లిదండ్రులచే మిగులఁ బ్రేమింపఁబడుచు, బాల్యమునుండియు అఖండశేముషీమహిమను జూపసాగెను. అయిదేండ్లు దాఁటినవెంటనే అక్షరాభ్యాసము చేసి, తల్లిదండ్రులు ఆతనిని విద్యాభ్యాసార్థము గురు నికటమునకుఁ బంపిరి. సదాశివుఁడు కావేరితీరమునందలి తిరువిసనెల్లూరు అను గ్రామమున విద్యాభ్యాసము ప్రారంభించెను. ఆగ్రామము నివాసయోగ్యము; సరస్వతికి విలాసభవనము. అందు సదాశివునితోఁ గూడ నింక ననేకవిద్యార్థులు విద్య నభ్యసించుచుండిరి. ఆతని సహాధ్యాయులలో ననేకులు పెద్దలైనతరువాత చాలకీర్తిని గడించిరి. జానకీపరిణయము అనుసంస్కృతనాటకమును రచించిన రామభద్రదీక్షితుఁడు అచ్చటివాఁడే. పందొమ్మిదిసంవత్సరముల ప్రాయమునందే సకలశాస్త్రములసారమును గ్రహించి, అనేకగ్రంథములను రచించి, "అయ్యావాళ్" అను ప్రసిద్ధిని బడసి, అనేకదాక్షిణాత్యులచే నిప్పటికిఁ గూడ పూజింపఁబడుచున్న వేంకటేశ్వరపండితుఁడును అచ్చటి యాతఁడే. పుదుక్కోట సంస్థానాధీశ్వరులకు మతబోధకుఁడును, వారివలన గొప్పభూదానమును బడసిన విద్వాంసుఁడును, మహాభాష్యము గోపాలకృష్ణశాస్త్రి యనుబిరుదము నందిన గోపాలకృష్ణశాస్త్రి యాగ్రామమునందే విద్య నభ్యసించెను.

ఇట్టివారితోఁ గలసి మెలసియుండుటవలన సహజతీక్ష్ణ మగుసదాశివుని ధిషణ మఱింత కుశాగ్ర మయ్యెను. అప్పుడే యాతనికి తఱుచుగ శాస్త్రవాదమును జేయు నలవాటు అయ్యెను. శాస్త్రవాదములో నొక్కొకప్పుడు ఉపాధ్యాయుఁడుగూడ ఆతనితో నెగ్గలేక, వెనుకంజవేయుచుండెడివాఁడు. ఇట్లు కొన్నిదినములు గడచిపోయినతరువాత ఉపాధ్యాయుఁడు సదాశివునిఁ జేరఁబిలిచి, "వత్సా! నీవిద్యాభ్యాసము పూర్తియైనది. ఇఁక నీవు ఇంటికిఁ బోవచ్చును" అని చెప్పెను. సదాశివుఁడు ప్రయాణముహూర్తము నిశ్చయపఱుచుకొనినదినమున ఆతనిభార్య రజస్వలయైనట్లు అచ్చటకుఁ దెలిసెను. అదివిని గురువును, గురుపత్నియు, సహా

భ్యాసములను అనుసరించి ఆశీర్వదించి, ఆతనిని ఇంటికిఁ బంపివేసిరి. కుమారుని రాకకు ఆతని తల్లి మిగుల నానందించి, అభ్యంగనము చేయించి వంట ప్రారంభించెను. అభ్యంగనమువలనను, పిండివంటలు చేయుటవలనను నాఁడు భోజనమునకు కొంచెము ఆలస్యమయ్యెను. అదిచూచి సదాశివుఁడు "సంసారములోనుండిన కష్టచిక్కులే తటస్థించును. ఒకటియును సరిగఁగాదు. అన్నిటికి నన్నియు నభ్యంతరములే" యని తలంచి, తత్క్షణమే వైరాగ్యము వృద్ధిపొందఁగ, ఎవరికినిఁ దెలియకుండ వెలువెడలిపోయెను.

అది మొదలుకొని యాతఁడు ప్రాపంచికవ్యవహారోచితములగు శత్రుమిత్రక్షేమాదికములు ఏమియు దరికిఁ జేరనీయక, సర్వసముఁడై ప్రవర్తింపసాగెను. ఆతనికి ఇంక ఇహలోకమునఁ బోఁదగినచోటు ఏమియు లేదు. పొందవలసిన ఫలము ఏమియును లేదు. కోరవలసిన వస్తువు ఏమియు లేదు. ఆఁకటియైన నాతఁడు ఆహారమును గ్రహించికూడ ఎవరిని ప్రార్థించి యెఱుఁగఁడు. స్వయముగ వండుకొనితినుట యింక ఎట్లుండును? వీథిలోఁబోవునప్పుడు ఎవరైనఁ బిలిచి చేతిలో నేమయిన నుంచిన రొట్టెఁ దానినిగ్రహించి ఏమియు విచారణ చేయకయే, తోఁచినంతటిని తినుచుండువాఁడు. ఇట్లు కాలముగడచిపోవుచుండఁగా, పరశివేంద్రసరస్వతి అను యోగీశ్వరునితో ఆతనికి సమావేశ మగుట తటస్థించెను. అప్పుడు ఆతఁడు ఆక్షణమునందే ఆయోగశక్తిసామర్థ్యములను దెలిసికొని ప్రార్థించి, ఆతనివలన యోగాభ్యాసము ప్రారంభించెను. యోగాభ్యాసముగూడ ఆతనికి చిరపరిచితమువలెనే సాధ్యమయ్యెను. ఇది ఇట్లుండఁగా, ఇంకను ఆతనికి వాదించుటయందుఁగల ముచ్చట తీఱ లేదు. అగుటచే నాతఁడు తన గురువును జూడవచ్చు పండితుల నందఱను నిలిపి, వాదించి, ఓడించి పంపివేయసాగెను. ఇట్లు కొన్నిదినములు జరుగునప్పటికి పండితులు ఎవ్వరును రాఁజాలకపోయిరి. తుదకు వారు చేయునదిలేక పరమశివేంద్రసరస్వతి చెంతకుఁ బోయి, "మహాత్మా! మీశిష్యునితో మేము వేగలేకుండ నున్నాము. ఆతఁడు మాటిమాటికిని శృంగభంగము చేసి పంపుచున్నాఁడు" అని విన్నవించిరి. అందులకు గురుదేవుఁడు కొంచెము అసంతృప్తుఁడై సదాశివునిఁ జూచి నీకింకను శాంతము ఎప్పుడువచ్చు నని కొంచెము కోపపడెను. తోడనే సదాశివుఁడు జ్ఞానము తెచ్చుకొని తనతప్పు మన్నింపవలసినదని గురుదేవుని పాదములమీఁద వ్రాలి, మన్నింపవేఁడుకొని "ఇది మొదలు నే నిఁక మాటలాడను" అని శపథముపూని యోగాభ్యాసము పూర్తియగుటచే గురుని సెలవుఁబడసి, అక్కడ నుండి వెడలిపోయెను.

అది మొదలుకొని యాతఁడు గ్రామైకరాత్రముగా దేశసంచారము ప్రారంభించెను. ఎవరైన నేమయిన పిలిచియిచ్చినఁ దినును, లేకున్న లేదు. తనయభిప్రాయ

మెక్కడనైన చెప్పవలసివచ్చినచో నేలమీద వ్రాసిచూపును. ఇట్లు అతడు దేశములెల్లఁ దిరుగసాగెను. యౌవనమునందలి దొడగునప్పుడు ఆతడు కావేరి తీరమున నివసించియుండెను. ఒకనాడు అతడు కావేరీనదిలో ఇసుకతిన్నెమీద సమాధినిష్ఠుడై యుండఁగా, అమాంతముగ నది పొంగెను. ప్రజ లందఱును ఆ సంభ్రమమును జూచి హాహాకారములు చేయుచుండఁగా, నది యాతనిం గొనిపోయి యొకచో మేటవేసెను. అదిచూచి జనులు చాల దుఃఖించి చేయునది లేక యూర కుండిరి; కాని మూడునాలుగుమాసములు గడచినతరువాత అచ్చటి గ్రామమునందున్నవారు నదికి అడ్డకట్టవేయుటకై కూలివాండ్రను బిలుచుకొనిపోయి దైవవశమున యోగి యున్న యిసుకగుట్టనే త్రవ్వించిరి. కొంతసేపు అగునప్పటికి ఒకనిపారనుండి రక్తపు చుక్కలు పడసాగెను. అదిచూచి వాడు ఆసమాచారమును సమీపమునందలి వానికిఁ జెప్పెను. తుదకు జనులలో ఈవిషయము అందఱకును తెలిసెను. తోడనే అందఱు వచ్చుచుండిరి, మెల్లగా అచ్చట త్రవ్వఁగా సదాశివయోగి సమాధినిష్ఠుడై యుండెను. ఆతనిని జూచి వారందఱును వెల్లవోవుచుండఁగా, ఆతడు సమాధి చాలించి లేచి ఎక్కడకో వెడలిపోయెను. ఎందఱెంతపిలిచినను పలుకలేదు. ఎంత బతిమాలినను అచ్చట నిలువలేదు.

ఒకప్పుడు ఒకగ్రామములో రైతు ఒకపొలములో కుప్పనూర్పించెను. పనియంతయు నగునప్పటికి సాయంత్రము అగుటచే నాతడు ధాన్యరాశిని అచ్చటనే యుంచి, ఎనమండుగురు కూలివాండ్రను కాపుపెట్టి ఇంటికిఁ బోయెను. కూలివాండ్రు ఆమాటయు నీమాటయుఁ జెప్పుకొనుచుండఁగా అర్ధరాత్రమయ్యెను. అప్పుడు సదాశివయోగి సదా సంచారపరాయణుడు కావున ఎక్కడకో ఆదారినిఁ బోవుచు, చీఁకటికారణమున కళ్లములోనికి వచ్చెను. అంతట అచ్చటనున్న కూలీలు ఆతడు ధాన్యము హరించుకొనిపోవుటకు వచ్చిన చోరుడు అని భావించి, బడితెలుతీసికొని కొట్టవచ్చిరి; కాని యోగిని సమీపించినవెంటనే ఎత్తఁబడినవారి చేతులు పైని అట్లే స్తబ్ధములై పోయెను. అంతట వారు చేయునది లేక ఒకరినొకరు చూచుకొనుచు ఎట్లో ఆరాత్రిఁ గడపిరి. కొంతసేపటికి తెల్లవారెను. అంతలో యజమానుడు అక్కడకు వచ్చి, అంతయుఁ జూచి తెల్లవోయెను. ఈసందర్భములో యోగి అచ్చటనుండి వెడలిపోయెను. ఆతడు కదలినవెంటనే కూలీలచేతులు సరిగ వచ్చెను.

ఒకప్పుడు ఒకగ్రామమున ఏదోపనిమీద రాజకీయోద్యోగులు అనేకులు వచ్చియుండిరి. వారి వంటబ్రాహ్మణుల యాజ్ఞచొప్పున తలారివాండ్రు వంటచెఱకు తెచ్చుటకు అడవికిఁ బోయి ఎండుకట్టెలు చాలకొట్టి పెద్దపెద్ద మోపులు కట్టిరి.

ఆమోపులు సామాన్యముగ నందఱును మోయఁజాలనివిగానుండెను. అయినను వారందఱు బలశాలులుగావున నొక్కొకమోపు నెత్తుకొనిరి; కాని ఒకమోపు మిగిలి పోయెను. అప్పుడు వారు ఆప్రాంతమున ఉన్మత్తునివలె సంచరించు సదాశివేంద్రునిఁ జూచి ఎవఁడో తమతోడివాఁడు అనిభావించి, నిర్బంధించి ఆతనినెత్తిమీఁద ఆమోపు ఎత్తి కూడఁ గొనిపోయిరి. గమ్యస్థానము చేరినతరువాత నందఱును మోపులు క్రిందఁబడవేసిరి. తుట్టతుదను సదాశివేంద్రుఁడు గూడఁబడవేసెను. అయితే సదాశివేంద్రునిమోపు తక్కినవానిమీఁదఁ బడఁగానే అది అగ్నిజిహ్వుచు తక్కినవానిని అన్నిటిని దహించివేసెను. సదాశివుఁడు తనదారినిఁ బోయెను. తలారులు తెల్లపోయి మఱల అడవికిఁ బోయిరి.

ఒకప్పుడు కొందఱు బాలురు వచ్చి, "తాతా! నేఁడు మధురాపురములో సుందరేశ్వరునకు మహోత్సవము జరుగునుగదా! అది యిప్పటికే ప్రారంభమై యుండును. మాకు ఆమహోత్సవమును జూడవలెనని కోరికగలదు. మామనోరథమును దీర్పవా?" యని ప్రార్థించిరి. తోడనే యాతఁడు వారి నందఱను "నాభుజములమీఁద ఎక్కి కన్నులు మూసికొండు" అనియెను. మఱల ఆతని సెలవుప్రకారము వారు కన్నులు తెఱచిచూచి, తాము వృషభవాహనారూఢుఁడైమహావైభవముతో వెలుఁగుచున్న సుందరేశ్వరునియెదుట మధురాపురములో నుండుటఁ జూచి, పరమాశ్చర్యచకితులై సదాశివుని అనేకవిధములఁ గొనియాడిరి. ఇక్కడ వారితలిదండ్రులు రాత్రి రెండుజాములు అయినను దమబిడ్డలు ఇండ్లకు రాకపోవుటకుఁ గారణములు ఎఱుఁగక వగచుచు అంతటను వెదకసాగిరి. సదాశివుఁడు అరుణోదయము అగునంతదనుక వారికి మహోత్సవముఁ జూపి, పిదప యథాపూర్వముగ భుజములమీఁద ఎక్కించుకొని కన్నులమూసికొన నియమించి క్షణములో స్వగ్రామమునకుఁ దెచ్చి విడిచెను. అదిచూచియు, జరిగినది అంతయు వినియు, ఆబాలుర తలిదండ్రులు పరమాద్భుతరసనిమగ్నులై, సదాశివేంద్రుని మాహాత్మ్యమును అనేకవిధములఁ గొనియాడిరి.

ఇంకనొకప్పుడు ఒక మహమ్మదీయుఁడు తనభార్యమున్నగువారితో ఒకతోఁటలో విడిసియుండెను. అప్పుడు చింపిరిగుడ్డలు కట్టుకొనియున్న సదాశివేంద్రుఁడు ఏదోపనిమీఁద ఆదెసకుఁ బోయెను. అదిచూచి ఆయవనుఁడు అతఁడు తనభార్య మున్నగువారిని అవమానించుటకు అట్లువచ్చుచున్నాఁడు అని భావించి,అతిరోషముతో వచ్చి ఆతని భుజముమీఁదఁ గత్తివిసరెను. ఆకత్తి ఏటుతప్పుటచే భుజముమీఁద సగము వఱకును గాయముచేసెను; కాని సదాశివేంద్రుఁడు భగవంతునియందు హృదయమును లీనముచేసియుండుటచే నిదియేమియు నెఱుఁగక తనదారిని బోవసాగెను. అదిచూచి తెల్లవోయి, ఆమహమ్మదీయుఁడు ఈతఁ డెవఁడో మహానుభావుఁడు అనిభావించి, అప

రాధమును విన్నవించి మన్నన వేడుకొనఁదలంచి వెంటఁబడెను. కొంతసేపటికి యోగి వెనుదిరిగిచూచెను. తోడనే మహమ్మదీయుఁడు పాదములమీఁద వ్రాలి, శరణము వేఁడెను. అప్పుడు యోగి యతనిచేసిన నేరమంతయు విని ఏమియు లేదు అని సన్నచేసి, తనకుడిచేతితో ఎడమభుజమును స్పృశించెను. తోడనే ఆభుజము యథాపూర్వముగ నైపోయెను. మహమ్మదీయుఁడు శ్లాఘించుచు సెలవుఁబడసి వెడలి పోయెను.

ఇంకొకప్పుడు ఒక మూఢబ్రహ్మచారి సంస్కృతపాఠములనేర్చి విద్వాంసుఁడు కావలెనని భావించి యెటకో పోవుచు, మార్గమధ్యమున సదాశివేంద్రునిఁ జూచి ఆశ్రయించెను. అతని చరిత్రమంతయు వినఁగనే యోగికి దయవచ్చెను. అప్పుడు ఆతఁడు తన ప్రభావమువలన రెండుమూఁడు దినములయందే ఆబ్రహ్మచారిని గొప్ప పండితునిఁజేసి పంపివేసెను. ఆతఁడు యోగిని విడిచిపోయినపిదప అనేకపురాణములకు గొప్పగొప్ప వ్యాఖ్యానములు వ్రాసి, పెద్ద ప్రతిష్ఠలను గొప్పమాన్యములును సంపాదించెను.

ఈయోగీంద్రుఁడు ఇంకను అనేకవిధములుగ తన ప్రభావమును లోకమునకుఁ జూపెను. ఈతఁడు సూర్యోదయకాలమున కావేరియందు మున్ఁగి సకలతీర్థములయందును ప్రతిదినమును గాన్పించి, అందఱకు నాశ్చర్యమును గొలుపుచుండెడివాఁడు. ఒకప్పుడు ఈతఁడు తిరువేంద్రముసమీపమున ఒకయరణ్యములోఁ బోవుచుండఁగా. తొండమానుఁడు విజయరఘునాథుఁడు అనురాజు లిద్దఱు కాన్పించి దివ్యతేజస్సును బట్టి ఈతఁడొక యోగియని భావించి, తరణోపాయమును ఎఱిఁగింపఁ బ్రార్థించిరి. యోగిమాటలాడఁడు కావున ఇసుకమీఁద మంత్రమును వ్రాసి వారికి ఉపదేశించెను. పుదుకోట్టసంస్థానమునందు ఇప్పటికిని ఆ ఇసుక పూజింపఁబడుచున్నది. మఱియు ఆయోగీంద్రుని బోధచే ఆరాజులు అతని సహాధ్యాయి యగు గోపాలకృష్ణశాస్త్రిని తమగురువుగా నేర్పఱచుకొనిరి.

ఇట్లు అనంతప్రభావసంపన్నుఁడైన ఈసదాశివయోగీంద్రుఁడు అనేకగ్రంథములను వ్రాసి, దేశమున విజ్ఞానమును వెదఁజల్లి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును అందెను.

---

# 36. రాకాకుంభారు

శ్లో. "సకలభువనరత్నం సర్వశాస్త్రార్థరత్నం
సమరవిజయరత్నం సచ్చిదానందరత్నం,
దశముఖహరరత్నం దానవారాతిరత్నం
రఘుకులనృపరత్నం పాతు మాం రామరత్నమ్."

(శ్రీరామకర్ణామృతము. అ. 1. ప. 91.)

పండరిపురమున రాకాకుంభారు అను నొక కుమ్మరివాఁడు వసించియుండెను. అతని సంసారమున రాకా యను భార్యయు, భంగ అను కొమార్తెయుమాత్రము ఉండిరి. అతఁడు తనభార్యాపుత్రికలతోఁగూడి కులవృత్తియగు కుండలవ్యాపారమును చేయుచుండినను లోకులందఱవలె లేనిపోనివన్నియు కల్పించుకొనక, మాయయు మర్మమును ఎఱుఁగక, పుణ్యపాపములను గుఱుతెఱిఁగి, వ్యామోహవర్జితుఁడై, సదా శ్రీపండరినాథుని శ్రవణమననధ్యానాదులచే నర్చించుచు, భక్తుఁడై కాలముఁ గడుపుచుండెను. అతనిభార్యయు, పుత్రికయుఁగూడ నట్లే పాండురంగ నామముతో వెలసియున్న శ్రీహరిని సేవించుచు నుండిరి. వారు ముగ్గురునుగలిసి తఱచుగ పండరినాథుని కీర్తించుచు భజనముచేయుచు ఆనందాతిరేకముచే మైమఱచుచుండిరి. వీరినిఁజూచి తక్కినకుమ్మరవాండ్రును, తదితరులును ఆశ్చర్యపడుచుండిరి. కుంభారు ఎన్నికుండలుచేసి విక్రయించినఁ దనసంసారము భక్తులకుఁదగినట్లు నిర్వహింపవచ్చునో, అన్నికుండలేచేసి విక్రయించుచుండెను; కాని తక్కినకుమ్మరవాండ్రవలె కుండలచేతలో పడి మునిఁగియుండువాఁడు కాఁడు.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, ఆవముపెట్టి కుండలు కాల్పవలయునని తలఁచి, ఒకప్పుడు కుంభారు చాల పచ్చికుండలు చేసి ఇంట నీడను ఆరఁబెట్టెను. అందొక కుండలో ఒకపిల్లి మూఁడుపిల్లలను బెట్టెను. ఒకనాఁడు పిల్లి తన పిల్లలకు ఆహారము తెచ్చుటకు బైటకుఁ బోయియుండఁగా, ఈసంగతి ఎఱుఁగక కుంభారు ఆకుండలన్నిటిని ఆవములోఁజేర్చి, పైని గడ్డి మట్టి మున్నగునవి కప్పి, నిప్పు ముట్టించెను. కుండలోనున్న పిల్లిపిల్లలు చాల చిన్నవి యగుటచే ఎందును బోఁజాలక ఆకుండయందే యుండి, సెగతగిలినతోడనే ఆస్వల్పపువేడికే సైఁపఁజాలక అఱవసాగెను. అంతలో పెద్దపిల్లి వచ్చి యథాస్థానమున కుండలు లేకుండుటఁజూచి, పిల్లలకు అపాయము సంభవించియుండు నని భావించి, అంతటను గలయఁదిరిగి కుంభారు ఆవమువద్ద నుండుటఁ జూచి, కుండలు ఆవములోఁబెట్టఁబడి కాల్పఁబడుచున్నట్లు గ్రహించి, తన ముద్దుకూనలు ఆప్రళయాగ్నిలోఁబడి మాడిపోవుచున్నట్లు నిశ్చ

యించికొని, గొంతెత్తి ఏడ్చుచు ఆవముచుట్టును, కుంభారునిచుట్టును తిరుగసాగెను. ఆవమునుండి పిల్లికూనలు వినవచ్చుచుండుటయు, పెద్దపిల్లి ఏడ్చుచుఁ జుట్టును దిరుగుచుండుటయుఁ గాంచి, సంగతి యంతయు గ్రహించుకొని భార్యను బిలిచి, తనకుఁ దోఁచిన దంతయును నెఱిఁగించి, "శ్రీహరీ! భక్తప్రాణనారాయణా! భక్తచింతామణీ! మూఢుఁడనై ఏమియుఁ దెలియక పిల్లికూనలను ఆవములో కట్టి కాల్చి వేయుచున్నాను. అయ్యో! నే నెంత పాపాత్ముఁడను! పిల్లిపిల్ల లెట్లు బ్రతుకును? అంతయును నీచేతనున్నది. ఈ క్షుద్ర సేవకుని ఉద్ధరించినను, అధోలోకమునకుఁ ద్రోసివైచినను భారమంతయును నీదే. నాఁడు లాక్షాగృహము తగులఁబడిపోవునపుడు పాండవులను, నిర్దయుఁడై హిరణ్యకశిపుఁడు అగ్నిలోఁ ద్రోయించినపుడు ప్రహ్లాదుని కరుణామూర్తివై రక్షించిన నీకు నోరెఱుఁగని యీపిల్లికూనలను కాపాడుట ఒక లెక్కలోనిది కాదు. ఆర్తప్రపదా! నారాయణా! అనాద్యంతరూపా! నేను నిన్నే నమ్మియున్నాను. నీపాదములనే నమ్మి, నీనామమునే స్మరించుచు, నీరూపమునే ధ్యానించుచు, నీయనంతగుణములనే కీర్తించుచు భజనచేయుచున్నాను. అట్టి నాకు అజ్ఞానకృతమగు ఇట్టి దారుణ పాపము సంభవింపనిచ్చితివా? నన్నుఁ గుంభీపాకనరకమునఁ గూలఁద్రోసితివా?" అని దీనాతిదీనుఁడై విలపింపసాగెను. కుంభారు భార్యయగు భాకాయు గుండెలు బాదుకొనుచు "శ్రియఃపతీ! దీనమందారా! గజేంద్రరక్షకా! అనాథనాథా! మావలన దారుణకృత్యము చేయఁబడినది. ఈదారుణమును మానవమాత్రుఁడు తప్పింపఁ జాలఁడు. ఈపిల్లులవిచారమును జూచిన నాకడుపు తఱుగుకొనిపోవుచున్నది. బిడ్డలను గన్న నేను ఈఘోరమును ఎట్లు చూడఁగలను? కృష్ణా! హృషీకేశా! వాసుదేవా! చనిపోయిన బ్రాహ్మణబాలుకను బ్రతికించి తెచ్చి తల్లిదండ్రులకు అప్పగించిన నీకు ఈ యాపత్తును తప్పించు టెంతటికార్యము? ఈయాపద తప్పదేని నాభర్తయు నేనును నాకొమార్తెయు నీచరణసన్నిధినిఁ బ్రాణములను విడిచెదము" అని విలపింపసాగెను. భంగయు ఇది యంతయుఁ జూచి తానుగూడ అట్లే ఆక్రందనము చేయసాగెను. వీరిట్లు భూమిపైఁబడి పొరలుచు దొరలుచుండఁగనే రెండు అహోరాత్రములు కడచిపోయెను. ఈరెండుదినములునుగూడ ఆవము కాలి, మూఁడవదినమున చల్లారెను. వెంటనే కుంభారు ఆవమును విప్పిచూచెను. కుండలన్నియు ఎఱ్ఱఁగఁ గాలి యుండెను; కాని పిల్లిపిల్లలున్న కుండమాత్రము సెగయైన తగులకుండ భద్రముగా నుండెను. అందలిపిల్లిపిల్లలు దీనినేమియు నెఱుఁగకయే ఎడఁటనున్న మంటనుజూచి వినోదముగాఁ జెలగాటము ఆడుకొనుచుండెను. ఇది యంతయుఁ జూచి కుంభారును భాకాయు, భంగయు పరమాశ్చర్యచిత్తులై సర్వేశ్వరుని అనేకవిధముల వినుతించి, కుండయందలి పిల్లికూనలను తల్లిచెంత విడిచి, వానికిఁ దగిన ఆహారమువేసిరి. విచార

సాగరమున మునిఁగియున్నవారు; కావున వారికి ఈమూఁడురాత్రియుంబవళ్లును నిద్రాహారములను అనుభవించుటకు అవకాశము లేకపోయెను. అయినను పిల్లిపిల్లలను జూచినవెంటనే కడుపులు దహించివేయుచున్న ఆఁకలియు, కన్నులను మండించివేయుచున్న నిద్రయు మటుమాయమైపోయెను. లోకబాంధవుఁడగు రుక్మిణీకాంతునిఁ గొలుచువారిని ఆపదలు సమీపింపఁజాలవుగదా! అప్పటినుండి ఇఁక కుండలుచేసి కాల్చి విక్రయింపఁ గూడదని వారు ప్రతినఁదాల్చిరి.

పిదప వారు ఇఁక జనులమధ్యమున నుండఁగూడదని నిశ్చయించుకొని ఊరియందలి బీదల నందఱును రావించి, తమకు ఉన్నదంతయు వారికి ఇచ్చివేసి పండరినాథునిఁ గీర్తించుచు అరణ్యమునకుఁ బోయిరి. అచ్చట వారు అచ్చటచ్చటఁ బడియున్న ఎండుకట్టెలను ఏరి, సమీపగ్రామమునకుఁ గొనిపోయి చాలతక్కువ వెలకు విక్రయించి, ఆస్వల్పధనముతో ఎట్లో జీవనపాతము చేయుచు సదా హరిభజనము చేయుచుండిరి. ఎండుకట్టెల నేరునపుడు రెండుకట్టెలు ఒక్కచో దైవవశమునఁ బడియుండినను అవి ఎవరిచేతనో అట్లు ప్రోగుచేయఁబడినవి తలంచి వానినిఁ దాఁకక, ఒక్కొక్కటిచొప్పున నున్న కట్టెలను మాత్రమే వారు ఏరుచుండెడివారు. మఱియు గ్రామమునుండి అరణ్యమునకు వచ్చునపుడు వారు తమ దృఢవస్త్రముల నన్నిటిని బీదలకు ఇచ్చివేసిరి. కావున కట్టెల నమ్ముటకు గ్రామములకుఁ బోయినపుడు వీథులలో నెచ్చటనైన గుడ్డపేలికలు దొరకినచో వానినిఁ గొనిపోయి కుట్టుకొని ధరించుచుండెడివారు.

చ. "వలపులు గుల్క గోపికలవారణ నొండొరుతోడ నాడుమా
టలఁ జెవికింపుగా వినఁదొడంగి తనర్చిన మందహాసముం
బలుమఱు నాఁగి మేను గరుపాఱఁగ నూఱక కన్నుమోడ్చు న
జ్జలరుహపత్రనేత్రు నియసత్యపునిద్దుర కేను మ్రొక్కెదన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 26.)

చ. "మరకతముఖ్యరత్నసుషమాన్వితవిగ్రహుఁ గౌసలేయు దు
ర్భరదనుజప్రహారు రఘురాజశిఖామణి జానకీమనో
హరుఁ ద్రిజగద్ధితున్ శమదమాద్యఖిలైకగుణాకరున్ సురే
శ్వరనుతరాజచంద్రు శుభవత్సలు ధార్మికు నాశ్రయించెదన్."

(రామకర్ణామృతము. ఆ. 1. ప. 1.)

ఈతీరున వారు ముప్వురును హృదయమును సతతము శ్రీమన్నారాయణుని యందు లీనముచేసి ఆనందోన్మత్తులై యుండెడివారు.

ఒకప్పుడు కుంభారు కట్టెల నమ్ముటకు ఒక సమీపగ్రామమునకుఁ బోయి బజారులో నొక యంగడిముందు గుడ్డపేలికఁ జూచి దాని గ్రహించుటకుఁ జేయి

సాచెను. అది చూచి ఒక కొంటెవాఁడు "అది స్వామి పిర్వోకుఁ జుట్టుటకుఁ బనికి వచ్చును. విరక్తులు దాని నంటఁగూడదు" అని పలికెను. కుంభారు అది విని యులికి పడి, చాచిన చేతిని చాచినట్లే ఎత్తుకొని ఆసమీపమునఁ బడియున్న ఒక యెంగి లాకును మొలకుఁ జుట్టఁబెట్టుకొనుటకుఁ దీసికొనెను.

ఒకనాఁడు కుంభారు కొమార్తయగు భంగ ఏటికిఁ బోయి స్నానముచేసి, నీటిలో నిలిచి సర్వేశ్వరుని ధ్యానించుచుండెను. అప్పుడు నామదేవపుత్రికయును ఆయేటికే ఆరేవునకే స్నానమునకు వచ్చి భంగ నిలిచియున్న చోటికి సమీపమునందే యున్న రాతిమీఁద బట్టలు ఉతుకసాగెను. భంగ బట్టలనీళ్లు మీఁదఁ బడుచుండుటఁ జూచి, "నామీఁద నీళ్లు పడుచున్నవి. కొంచెము దూరమున నున్న రాతి మీఁదికిఁ బోరాదా?" అని పలికెను. అది విని నామదేవపుత్రిక "ఏమి ఒయ్యారమే అమ్మా! కులముచే అధమురాలవయ్యు, నోటితో గొప్పమాటనే పలుకుచుంటివి. అవును నీతండ్రి తానేమో గొప్పవాఁడనని భావించి, పాండురంగని వంచించుచున్నాఁడు. ఆతండ్రికి తగిన బిడ్డవు నీమాటలు తగినవే" అని మాఱుపలికెను. ఈమాటలమీఁద భంగకుఁ గోపము వచ్చెను. "అవునమ్మా! ఏడ్చి ఏడ్చి భక్తుఁడై అర్చారూపియైయున్న పండరినాథుని ఇబ్బందిపెట్టి తనతో మాటాడునట్లును, తన పంక్తిని భుజించునట్లును, చేసికొని నీతండ్రి విఱ్ఱవీగుచున్నాఁడు. మాతండ్రి అట్లు భగవంతునకు ఏమియు హృదయావేదనమును గలిగింపక పిల్లికూనలకు విపత్తు తటస్థించినప్పటి నుండియు కేవలము విరాగియై ప్రపంచమును విడిచి, అడవికిఁ బోయి ఒంటిగా నున్నకట్టెలను ఏరికొని స్వల్పమూల్యమునకు విక్రయించుకొని, ఆకొలఁది ధనముతో జీవములను నిలుపుకొని నిష్కాముఁడై భగవంతుని అర్చించుచు కాలము గడుపుచున్నాఁడు. నాతల్లియు, నేనును, నాతండ్రి పదాంకములను అనుసరించి ఈశ్వరు నారాధించుచున్నాము. మీతండ్రివలెఁ గాదు. నీవిధమును గాదు. మాకు ఆడంబరములేమియు లేవు. నీవేమి యనినను నాకు అభ్యంతరము లేదు" అని మఱి పలుకక తనదారిం బోయెను.

అది విని అవమానజనితమగు రోషావేశమువలన ఒడలు తెలియక తిన్నగ నింటికిఁ బోయి సంగతి యంతయు నివేదింపఁగా, నామదేవుఁడు ఆశ్చర్యచకితుఁడై తోడనే పాండురంగని ఆలయంబునకుఁ బోయి, "స్వామీ! రాకాకుంభారు చరిత్ర మెట్టిది? ఆతఁడు నిష్కామకర్ముఁడా? సకామకర్ముఁడా? నాకెఱింగింపవలయును" అని ప్రార్థించెను. అందులకు శ్రీపతి! "కుంభారుతో తులతూఁగఁగల నిష్కామకర్ముఁడు సకలభువనములయందును లేఁడు" అని చెప్పఁగా, నామదేవుఁడు మఱింత వింతపడి "ఈశ్వరా! ఆతని నిష్కామపరత్వమును నాకుఁ బ్రత్యక్షముగఁ జూపవలయును"

అని వేడుకొనియెను. అంతట విఠలనాథుఁడు నామదేవుని రుక్మిణీదేవిని వెంట నిడుకొని, కుంభారు నివసించియున్న అడవికిఁ బోయి ఆతని చరిత్రమంతయు నెఱింగించి, నడచునపుడు ఏ ప్రాణియైన తనకాలిక్రిందఁ బడి నలిగిపోవునేమో యని భయపడుచు, కుంభారు అతిజాగ్రత్తతో నడచుచుండుటఁజూచి "నామదేవా! చూచితివిగదా కుంభారు నిష్కామపరత్వమును? ఇంకను చూడుము" అని రుక్మిణినిఁ జూచి కన్నుగీటెను. అంతట భగవంతుని ఇంగితము నెఱింగి రుక్మిణి తనచేతి రత్నకంకణమునుదీసి యొకకట్టెక్రింద నుంచెను. అంతట కట్టెలకొఱకై అట సంచరించుచున్న కుంభారు ఆకట్టెను ఈకట్టెను ఏరుకొనుచు, తుదకు రుక్మిణి తనకంకణముమీఁద నుంచిన కట్టెను దీసికొనెను; కాని అంతలో క్రిందనున్న రత్నకంకణము తళతళ మెఱయుచుండుటఁ జూచి "అయ్యో! ఈకంకణమును ఎవరో దీనిక్రింద దాఁచికొనినారు. ఇంక నిక్కడ నివసించినచో హృదయము వ్యామోహగ్రస్తము అయిపోవును" అని భీతుఁడై, భార్యాపుత్రికలతోడ మఱియొక కాననమునకుఁ బాఱిపోయెను.

అదిచూచి నామదేవుఁడు నిర్విణ్ణుఁడై, అద్భుతాశ్చర్యములకు లోనై "పాండురంగా! కుంభారు ప్రభావము విస్పష్టముగఁ దెలిసినది. ఈతని నిష్కామపరత్వమునకు మేఱలేదు. ఇట్టి నిష్ఠ నాకెప్పుడును గలుగలేదు. ఇంతనికంటె సహస్రాంశము హీనుఁడనయ్యు నేను "నాకు భగవంతుఁడు సాక్షాత్కరించును" అని గర్వించియున్నానుగాని, నాకంటె నెన్నోరెట్లు అధికుఁడగు భాగవతాగ్రేసరుఁడు గర్వము అనుమాటయే యెఱుఁగఁడు. ఆహా! ఈతనిఁ జూచుటవలన నేను పాపముక్తుఁడనైతిని. శ్రీధరా! పద్మనాభా! ఇట్టి భక్తశిఖామణికి నీవు ఇంకను ఏల సాక్షాత్కరింపకున్నావు" అని తొందరపెట్టెను. అంతట శ్రీహరి నామదేవుఁడు సందేహవిముక్తుఁడైనందులకును, తన హైన్యమును ఎదుటివాని ఆధిక్యమును అంగీకరించినందులకును హర్షించి, రుక్మిణీసహితుఁడై తటాలున కుంభారునకు సాక్షాత్కరించి, కౌఁగిలించికొని, "భక్తచక్రవర్తీ! నీనిష్ఠకు సంతసించితిని. నామదేవుని సంశయమును దీర్చుటకు నిన్ను పరీక్షించితిని. నీవు ఇదియేమియు మనసున నుంచుకొనకుము. నేను నిన్ను విడిచియుండను" అనిచెప్పి, తిరోహితుఁ డయ్యెను. కుంభారు ఇది యంతయు భార్యాపుత్రికలకు ఎఱింగించెను. అందఱును ఆనందోన్మత్తులై నాట్యముచేసిరి. కుంభారు అవసానమున ఈశ్వరసాయుజ్యముఁ బడసెను.

చ. "ఇనకులరాజరత్న మసురేశ్వరమర్దనరత్నముం రణా
వనిజయరత్నము న్నిగమవర్ణితరత్న మమేయరత్నముం
దనుజవినాశరత్నము విధాతృసమర్చితరత్నముం జగ
జ్జననుతరామరత్న మనిశంబు కృపామతి నన్నుఁ బ్రోవుతన్."

(రామకర్ణామృతము. ఆ. 1. ప 94.)

# 37. సమర్థ రామదాసస్వామి

శ్లో. "వేద్యం వేదగురుం విరించిజనకం వేదాంతమూర్తిం స్ఫుర
ద్వేదం వేదకలాపమూలమహిమాధారాంతకందాంకురమ్,
వేదశృంగసమానశేషశయనం వేదాంతవేద్యాత్మకం
వేదారాధితపాదపంకజమహం రామం భజే తారకమ్."

(రామకర్ణామృతము అ. 2. ప. 33.)

జగత్పావని యగు గంగానదియొడ్డున జంబూనగరము అను నొకగ్రామమున ఒక బ్రాహ్మణుఁడు శ్రీరాముని ఉపాసించుచు భాగవతోత్తముఁడై, విజ్ఞానశేఖరుఁడై ప్రపంచవాసన ఎఱుఁగక కాలము గడుపుచుండెను. అతనిభార్య అతనికి అనురూపయై అతనివలెనే విషయసుఖములపొంతఁ బోక, శ్రీరాముని శ్రవణమననధ్యానభజనకీర్తనలతో ఆరాధించుచు కాలము బుచ్చుచుండెను. ఆదంపతులు భూతదయాపరులై, క్షేత్రాటనము సేయుచు వచ్చిన యతీశ్వరులనెల్లరను మృష్టాన్నసంతృప్తులఁ గావించుచు అహోరాత్రములు శ్రీరామసేవానిమగ్నులై, విశేషించి ప్రతియేటను చైత్రశుద్ధనవమి మొదలు పండ్రెండుదినములు అత్యంతభక్తిభావముతో రామోత్సవము చేయుచు, వీలు అయినంతవఱకు భక్తుల నెల్లరను రావించి వారిని సేవించుచు ఉండిరి. ఇట్లుండఁగా, నొకయేటి రామోత్సవసమయమున వారిస్వప్నమున భక్తులపాలి చింతామణియగు శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షమై, "మీయెడల నాకు మెప్పుగలిగినది. మీసేవకు ఆనందించితిని. నాఅంతరంగభక్తులలో నగ్రేసరుఁడగు ఆంజనేయుఁడు మీకడుపునఁ బుట్టి సతతము నాసేవయందే నిమగ్నుఁడై, విజ్ఞానమూర్తియై లోకము నుద్ధరించుచు" అని చెప్పి, తిరోహితుఁ డయ్యెను.

వెంటనే వారు మేల్కాంచి తమ తమ స్వప్నవృత్తాంతములు ఒండొరులు తెలిసికొని, శ్రీరామభద్రునకు తమ యెడల నిట్టి యనుగ్రహము గలిగినందులకు ఆనందపరితహృదయులై, మైమఱచి నృత్యము ప్రారంభించిరి. పిదప కొన్నిదినములకు ఆబ్రాహ్మణపత్ని గర్భవతియై, నవమాసములు మోసి ఒక్కశుభదినమున ఆంజనేయాంశమున సుపుత్త్రునిఁ గనియెను. అంతయు శ్రీరామచంద్రుఁ డానతిచ్చినట్లు జరిగినందులకు సంతసించిరి. ఊరి స్త్రీలందఱును "ఏమి యదృష్టమమ్మా!" అని వింత పడిరి. ఆపుణ్యదంపతులు దాశరథికరుణావిశేషమువలనఁ గలిగిన తమబిడ్డకు పండ్రెండవ దినమున "రామదాసు" అని నామకరణమహోత్సవములు నెఱవేర్చిరి. లేక లేక కలిగిన యాకుమారుని వారు ఎంతో గారాబముగఁ బెంచుకొనుచు ఐదవయేట

అక్షరాభ్యాసముఁ గావించి, ఒక పండితునియొద్ద విద్యాభ్యాసార్థము నిలిపిరి. రామదాసుఁడును ఆంజనేయాంశమునఁ బుట్టినవాఁడగుటను, దేశము నుద్ధరింపవలసినవాఁడగుటను కుశాగ్రబుద్ధియై గురువు చెప్పిన దెల్ల ఒక్కమాఱు చెప్పినంతనే గ్రహించుచు, నాలుగేండ్లలో సకలవిద్యలయందును అపారపాండిత్యమును సంపాదించెను. అప్పటికి ఆతనివయస్సు తొమ్మిదేండ్లు. అంతకుఁ బూర్వమే ఆతనికి తలిదండ్రులు చౌలోపనయనాదిసంస్కారములు అన్నియుఁ గావించి, ఆతఁడు సకలకలాకోవిదుఁడై యుండుటఁ జూచి వివాహము చేయఁ దలఁచి, ఒక చక్కని కన్యను నిశ్చయించిరి. కొలఁదిదినములయందే వివాహప్రయత్నములు సమస్తము నెఱవేఱెను. అంతట వచ్చిన బంధుమిత్రాదు లందఱతోడను ఆనందసాగరమున నోలలాడుచు, ఆతని తలిదండ్రులు పెండ్లికుమారునిగా అలంకరించి తెచ్చి పెండ్లిపీఁట మీఁదఁ గూర్చుండఁజేసి, మంగళస్నానములు చేయించుటకై రామదాసుని గూడఁ గొనివచ్చిరి. రామధ్యానపరాయణుఁడై యున్న రామదాసు అంతవఱకు తనకు వివాహముజరుగు సంగతియేమియు నెఱుఁగనివాఁడగుటవలన తలిదండ్రు లందఱునడుమ కును గొనివచ్చినపుడు తెల్లఁబోయి అంతయుఁ దెలిసికొని, "అయ్యో! ఇదియేమి ఘోరము? ఏరితోడను సంబంధములేక నామట్టునకు నేను ఏమూలనో యొదిగి యుండి శ్రీరామధ్యానము చేసికొనుచుండఁగా, ఈగోల యంతయు నేమి? కట్టా! మీరు నాకెట్టి యపకారము చేయఁదలఁచితిరి. సంసారమునకును, సాగరమునకును పరిమాణమునఁదక్క మఱియేమిటను భేదము లేదు. సాగరము నైనను దాఁట వచ్చునుగాని, సంసారమును తరించుటకు బ్రహ్మకైనను తరము కాదు. సంసారమనుసముద్రమున ఆశయే జలము. మన్మథుఁడే గాలి. మోహమే కెరటములు. భార్యయే సుడిగుండములు. పుత్త్రికలు పుత్త్రులు అన్నలు తమ్ములునే మొసళ్లు. వీనితోడను, ఇంకనిట్టి అనేక భయంకరవస్తువులతోడను నిండి, అగాధమును అనంతమును చూడరానిదియు అగు ఈసంసారసాగరమున నన్నుఁ గూలఁద్రోయఁ దలఁచితిరి గదా! మీరు కూలుటచాలదా? ఆఁకలిలేనివాని కన్నము పెట్టినట్లు కోరనిదే నాకు ఈపెండ్లియేల? ఈప్రయత్నము చేయునపుడు ఈవిషయమునుగుఱించి నాతో ముచ్చటించి యున్నయెడల మీకు ఈశ్రమలేకపోయి యుండుఁగదా! నాయభిప్రాయము నెఱుఁగరైతిరి. నాయిచ్ఛను దెలిసికొనరైతిరి., మీయభిరుచినిఁ బట్టి నామనస్సును నడుపఁజూచితిరి. కట్టా! ఇంతకంటె దౌర్జన్య ముండునా! ఇప్పుడైనను మించినది లేదు. మీప్రయత్నములు మీచిత్తమువచ్చినట్లుచేసికొనవచ్చును. పెద్దలు నాసుఖదుఃఖములఁ దెలిసినవారు; నాయభీష్టమును నెఱవేర్చువారును అని యనుకొంటిని. బాగాయె. మీకిఁక శ్రమవలదు." అని పలికి, తటాలున అచ్చటనుండి పాఱిపోయెను. ఆతని తల్లిదండ్రు

మంగళవిగ్రహమును జూచుటకు ఆత్రపడుచున్నాను. ఆదేవదేవుని పాదకమలములను అర్చించుటకు నిరీక్షించియున్నాను. నీవు కరుణాసముద్రుఁడవు. నాయెడఁ గరుణించి, నన్ను ఈ ప్రపంచవాసనలనుండి తొలంగింపుము. శ్రీరామచంద్రునిఁ జూపుము." అని యాతని ననేకవిధములఁ బ్రార్థించెను. మారుతి రామదాసునెడలఁ జాలఁ గరుణార్ద్రహృదయుఁడై ప్రేమతో లేవనెత్తి, "వత్సా! నీహృదయము విశుద్ధమై యున్నది. నీదీక్ష అనంతమును, నీవాంఛ మునిజనోచితమునై యున్నది. నీవాగ్ధోరణి నన్ను ముగ్ధునిఁ జేయుచున్నది. ఇట్టి నీయెడల మావంటి కించిద్జ్ఞులప్రేరణలేకయే శ్రీహరి సానుగ్రహుఁడై యుండును. శ్రీరామచంద్రమూర్తి మెట్టవేదాంతులై ధన సంపాదనకొఱకు ఉపదేశములను జేయుచు ఆత్మవంచకులై, అజ్ఞానులను అన్నివిధములను జెఱుచుమాయదారిభక్తులకు దౌవవ్వల నుండును; కాని నిసుబోలు శుద్ధాంతరంగులను ఎప్పుడును కనిపెట్టుకొనియే యుండును. విశుద్ధభక్తుల వినిర్మల చిత్తములే ఆతనికి వాసస్థానము. నీచర్మచక్షువులకు ప్రకృతము కానిపింపకపోయినను, ఆతఁడు నీహృదయమునందేయుండి నీభావయంత్రమును ద్రిప్పుచున్నాఁడు. ఆశ్రీపతికి నే నెట్టివాఁడనో నీవు నట్టివాఁడవు. త్వరపడకుము. శ్రీహరి యగు రామభద్రుఁడు నీకు సాక్షాత్కరింపకుండ నుండఁ జాలఁడు" అని చెప్పి చూచుచుండఁగనే మాయమైపోయెను.

అంజనేయుని యుపదేశముచొప్పున రామదాసు నిశ్చలచిత్తుఁడై పగటియందు దగ్గఱి గ్రామములకుఁ బోయి భిక్షాన్నమును దెచ్చుకొని ఏకభుక్తము చేయుచు, ఇన్నూఱు శ్లోకములను రచించి, సదా వానినే చదువుచు,భజనము చేయుచు కాలము గడపుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచునప్పటికి మఱల మారుతి సాక్షాత్కరించి, "భక్తాగ్రేసరా! ఆషాఢశుద్ధైకాదశినాఁడు పండరిపురమున మహోత్సవము జరుగును. అది సమీపించుచున్నది. నాఁడు నీవు అచ్చటకుఁ బొమ్ము. శ్రీరాముఁడు నీకు సాక్షాత్కరించి నీయభీష్టములను నెఱవేర్చును" అనిచెప్పి, తిరోహితుఁడయ్యెను. అంతట రామదాసు మహానందభరితుఁడై, వెంటనే బయలువెడలి పండరిపురమునకుఁ బోయెను. అప్పటికి మహోత్సవము ప్రారంభమయ్యెను. వివిధదేశములనుండి అనేక సాధువులు, సజ్జనులు, విపన్నులు, భక్తులు మున్నగువారు చనుదెంచి; అమ్మహోత్సవానందమున మునిఁగియుండిరి. రామదాసు వారినందఱను జూచి ఆసజ్జనసమూహమున తెరచాటునఁ బోలె నీవు తిరోహితుఁడై, సాక్షాత్కరించియున్న విశ్వరూప నారాయణుని మంగళరూపము సందర్శించి, మిగుల హర్షించి చంద్రభాగానదియందు జలకమాడి, మహాద్వారమున అవతరించియున్న ఆంజనేయుని సేవించి, పిదప ఆలయమునఁ బ్రవేశించి, యిటుకరాతిపై వెలసియున్న పాండురంగనిఁ జూచెను; కాని ఆతనికి

తృప్తి కలుగలేదు. అంత నాతఁడు అత్యాతురుఁడై సాగిలఁబడి మ్రొక్కి, "శ్రీరమణా! రామచంద్రా! నీవిచ్చట నుంటివని మారుతి చెప్పఁగా వచ్చితిని. అతఁడు చెప్పినమాటలనుబట్టి నీవు నాయెడల సదయుఁడవై యుంటివని తలంచి ఉప్పొంగిపోయితిని. కాని ఎంత మోసపోయితిని. నీకు ఈవంచనము ఎప్పటినుండి యలవడెను? నీస్థితి యంతయు విపరీతముగా నున్నది. లక్ష్మణుఁడెక్కడ? సీతయేది? భరతశత్రుఘ్ను లెందున్నారు? ఆంజనేయుఁ డెచ్చటనో యున్నాఁడేల? పరివార మంతయు నేమైనది? చేత కోదండ మేది? ఈవికృతరూపమేల? నాయెడ ననుగ్రహము లేదా? నన్ను పరీక్షింపఁ బూనితివా? అయ్యో! నేను తాళఁగలనా? నిన్ను చూడక నాకన్నులు కాయలు కాచి పోయినవి. నీవనేకులను రక్షించితివి. నేనొక్కఁడను భారమైతినా? నా కేమియు వలదు. నీదివ్యమంగళవిగ్రహమును జూపినఁ జాలును. అంతమాత్రమునకైన తగనా?" అని పరిపరివిధములఁ బ్రార్థించెను. అపుడు శ్రీరామచంద్రుఁడు రామదాసు కోరిన విధమున సీతాలక్ష్మణభరతశత్రుఘ్నపరివారసమేతుఁడై, మందహాసముగావించుచు రామదాసునకుఁ గాన్పించెను.

వెంటనే రామదాసు స్వామిపాదములను ఆనందబాష్పములతోఁ గడిగి "శ్రీహరీ! ఆర్తత్రాణపరాయణా! యెన్నో దినములనుండి నీకై వేచియున్నాను. ఇప్పటికైన దయఁగలిగె నంతియే చాలు. నాకిఁక నేమియు వలదు. నీదర్శనమువలన నా హృదయమునకు శాంతి యొనఁగూడినది." అని యనేకవిధముల నుతించుచుండఁగా, శ్రీరాముఁడు ఆతని శిరమునఁ జేయియుంచి "వత్సా! నీయచంచలభక్తికి మెప్పు కలిగినది. యథార్థమున నేను నామరూపరహితుఁడను. అయినను దుష్టశిక్షణార్థమును శిష్టరక్షణార్థమును అనేకరూపములను గైకొనుచున్నాను. ఎవ రేరూపమును గోరి నన్ను ప్రార్థింతురో, వారి కారూపముతోనే సాక్షాత్కరించి సేవ యొసఁగుచున్నాను. కావుననే నీవు కోరినట్లు శ్రీరామరూపముతో ఇప్పు డిట సాక్షాత్కరించితిని. నీవు నాయంతరంగభక్తులలో నెల్ల నుత్తముఁడవు. నన్నిపుడు ఏరూపమున నుండఁగా చూచితివో, ఆరామరూపమునే ధ్యానించుచు సకలప్రపంచమునందును నన్ను గుర్తెఱిఁగి లోకుల నుద్ధరించుచుండుము." అని నియమించి, తటాలున మఱల పాండురంగ రూపమును వహించెను.

ఇది యంతయు కనుమూసి తెఱచునంతలో ముగిసిపోవుటవలన రామదాసు కలఁగన్నవానివలెఁ గొంతవడి భ్రాంతుఁడై, అంతలో హృదయము తేఱుకొన నెదుట సాక్షాత్కరించియున్న విఠలనాథుని వినుతింపఁబోడఁగెను. కొంత సేపటివఱకు నాతఁడు తన్మయుఁడై యుండి, పిదప ప్రాపంచికస్మృతిఁ గాంచి ఆనందాతిరేకము వలన నృత్యముచేసి, ఉత్సవమంతయు ముగియునంత దనుక నచ్చటనే యుండి

సాధుసజ్జనుల నెల్లను సేవించి, మహాజ్ఞానులగు నున్న మహాయోగీ మణుల మ్రొక్కి, మగుడ చంద్రభాగానదియందు స్నానమాడి, పరమపవిత్రహృదయుండై అరణ్యము నకు నరుగుచెను.

మార్గమధ్యమున జేసూరను నొక పట్టణ ముండెను. ఆనగరమున ఉన్న పార్వతీశ్వరు శ్రీరామచంద్రుని అంతరంగభక్తుండగు రామదాసు సమీపమునుండి పోవుచుండుటను జూచి, ఒక మహారాజు వేషముతోఁ బోయి యెదుట నిలిచెను. అంతట రామదాసును తనయెదుట నున్న యాతఁడు తారకమంత్రోపదేశకుఁడగు పార్వతీపతియగు శంభుఁడు అని యెఱింగి, సాష్టాంగదండప్రణామంబు లాచరించి, "పరమేశ్వరా! అయాచితముగ నాకు ప్రత్యక్షమైన నిన్ను నే నేమని కొనియాడఁగలను? నాపై నీకిట్టికటాక్షము గలుగుటకు నామెఱిఁగినంతవఱకు హేతువు లేదు. పరబ్రహ్మముయొక్క అనుగ్రహము గల్గుట ఎంతవానికి లభించును? నీతత్త్వము వాఙ్మనసగోచరము. నీవు నామరూపరహితుండవే గాని నానా కనేకరూపములతోఁ గాన్పించుచున్నావు. అనేకనామములతో విలసిల్లుచున్నావు. చక్రధరుండవై వైకుంఠనాథుండ వయ్యెదవు. పినాకపాణివై కైలాసగిరిపై, సంచరింతువు. పద్మోద్భవుండవై ప్రపంచమును సృష్టింతువు. నీలీల లనంతములు. పాండురంగ విగ్రహమున కోదండపాణివై శ్రీరామచంద్రుఁడవై సాక్షాత్కరించి, ఇపుడు పరమశివుఁడవై నన్ను పరీక్షించుటకు మహారాజరూపముతో ప్రత్యక్ష మిచ్చితివి. నీయాథార్థ్యమును తెలిసినవారు లేరుగదా! ఎఱుకలేకయే విజ్ఞానశేఖరుల మని విఱ్ఱవీగుచు, కొందఱు నీకు శివవిష్ణ్వాదిభేదములను గల్పించి తలక్రిందు లయ్యెదరు. కట్టా! ఎంత మౌర్ఖ్యము. 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే, శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః' అను తత్త్వమునెఱుంగక ఎందఱు చెడుచున్నారు!" అని ఈరీతిన అనేకవిధముల వినుతించి ప్రణతిచేసి నిలిచెను. అదిచూచి మహేశ్వర రూపి యగుభగవంతుఁడు రామదాసుని నిష్కల్మషహృదయమునకు ఆనందించి, అతనిని కొందఱు భక్తులు తనకు నిర్మించిన ఆలయమునకుఁ గొనిపోయెను. రామదాసు కొంతతడవు మహేశ్వరుని సేవించి సెలవుఁ బడసి బయలుదేరెను. రామదాసు ఇట్లు ఆప్రాంతమునకు వచ్చుట విని, భారతధర్మమును రూపుమాపఁ దలంచియున్న యవనమ్లేచ్ఛులను ఉక్కడంచుచున్న శివాజీ యను మహారాష్ట్రప్రభువు అచ్చటికి వచ్చెను. ఇరువురును ఒక పర్వతపాదమున సమావేశమైరి. శివాజీ తన్ను శిష్యునిగా నంగీకరింపవలసిన దని ప్రార్థింపఁగా, రామదాసు అందుల కంగీకరించి, అతనికి స్వధర్మబోధ గావించి, యవనవినాశముఁ గావించునట్లు ప్రోత్సాహపఱచి, సెల విచ్చి పంపివేసి, తన యాశ్రమమునకుఁ బోయెను.

సమర్థుఁడు అను బిరుదము వహించిన ఈరామదాసస్వామి యిట్లు అనేకులను స్వధర్మరతులుగాఁ బ్రయాసచేసి, అనేకులను భక్తిజ్ఞానవైరాగ్యవంతులను గావించెను. ఈతఁడు సుబోధము అనునొక గొప్పగ్రంథమును రచించెను. ఆగ్రంథమును బఠించువారు తప్పక భక్తి జ్ఞానవైరాగ్యశీలురై, మోక్షమును సులభముగఁ గాంతురు. రామదాసు బ్రతికి యున్నంతకాలమును ఈతీరునఁ గడపి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

శా. "వేదాధారు సమస్తవేదగురులన్ వేదాంతవేద్యున్ లస
ద్వేదారాధితపాదపంకజయుగున్ వేదాంతమూర్తిన్ మహా
వేదభ్రాజితవేద్య బ్రహ్మజనకున్ వేదాంతభావోల్లస
ద్వేదాగ్రేసరతల్పు రాము మహిమాధారున్ బ్రశంసించెదన్." (?)

(రామకర్ణామృతము. ఆ. 2. ప. 38.)

---

# 38. లతీబ్ సాహేబు

శ్లో. "మదమయ మదమయ దురదం యమునా మవతీర్య వీర్యశాలీ యః,
మమ రతి మమరతిరస్కృతి శమనపరస్స క్రియాత్కృష్ణః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 92.)

ఒకపట్టణమున లతీప్ సాహేబు అను నొకతురక నివసించియుండెను. ఆతఁడు తోడి తురకలవలెఁ గాక భక్తిజ్ఞానవైరాగ్యపరుఁడై, భగవంతుఁడు అగు శ్రీకృష్ణుని సేవించుచు తన్నామకీర్తనమున మైమఱచుచుఁ గాలము గడపుచుండెను. ఆతఁడు చేయునది యెల్లఁ జూచి తురక లనేకులు చాల కంటగించుకొనుచుండిరి. అయినను ఆతఁడు దానినేమియు లెక్కచేయక సూర్యోదయము కాకపూర్వమే లేచి కార్యము లన్నియు నెఱవేర్చుకొని, నదిలో స్నానమాడి, పరిశుద్ధహృదయుఁడై పరమాత్ముని ధ్యానించి, భగవద్గీతను పారాయణచేసి భగవంతునిఁ బూజించి, భాగవతాగ్రేసరు లను బధిరపంగ్వంధాదిజనులను మృష్టాన్నతృప్తులను గావించి పంపివేయుచుండును. ఇంతియెగాక ఆతఁడింక ననేకధర్మకార్యములను గావించుచుండును. ఇది యంతయుఁ జూచి ఒక ముష్కరతురుష్కుఁడు "వీఁడు మా తురకజాతి చెడఁబుట్టినాఁడు. మహమ్మదుని విడిచి భారతీయులవాడు దేవుని సేవించుచున్నాఁడు." అని కోపించి, వెంటనే ఆపురము నేలు తమజాతివాఁడగు పాదుషాహాకు ఎఱింగించెను. పాదుషాహాయు ఇదివిని రిచ్చవడి, మండిపడి ఎగిరి ఎగిరిపడి పండ్లు పటపటఁ గొఱుకుకొని, "కాని రండు, జాతిభ్రష్టుని శిక్షించెదను. వాని యిల్లు మీచిత్తమువచ్చినట్లు దోచికొనుఁడు" అని భటులను జూచి యఱచెను. వెంటనే భటులు చిందులు త్రొక్కుచు బయలుదేరిరి; వారు పోవునప్పటికి లతీబుసాహేబు భక్తిపరవశుఁడై—

ఉ. "పాయని భక్తి మ్రొక్కెద నపార కృపారస ధేనుసౌఖ్యసం
ధాయికి లోకరక్షణవిధాయికి భూసురరాధికాకుచ
స్థాయికిఁ బన్నగాధిపవిశాలఫణామణిశౌధవీథికా
శాయికి గోపికానయనసారససారఫలప్రదాయికిన్.

ఉ. చిక్కెర నాఁడు గోపికల చేలము లెత్తిన దొంగ శైలముల్
చెక్కులు చేయఁ బాని మదజృంభము నాఁచిన దొంగ భక్తిచే
నెక్కొనుమానికోటి మదినిల్పిన తాపముఁ బాపు దొంగ నా
యొక్కపుఁ జిత్తసారసముఁ జాఱలుగాఁ గొను దొంగ నేఁటికిన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 75. 81.)

అని నృత్యము చేయుచుండెను. ఇట్లు పరవశమయుండై యున్న ఆతనిం జూచి రాజభటులు ఏమి చేయుటకుఁజాలక, మఱింబయిగా భక్తిపరవశులై తాముఁగూడ భజన ప్రారంభించిరి. వారెంతకును రాకుండుటఁజూచి, పాదుషాహా మిగుల కోపించి మఱికొంతజట్టు నంపెను. వారుగూడ నట్లే చేసిరి. ఇట్లు జట్టుమీఁద జట్టుచొప్పున పది పదునైదుజట్టుల నంపెను. కాని ఆజ్ఞ నెఱవేఱదయ్యెను. అందులకు పాదుషాహా ప్రళయమార్తాండునిభంగి మండిపడుచు తానే బయలుదేఱెను.

ఇప్పటికి లతీబు నృత్యము చాలించి, బృందావనమున రాజభటుల నందఱ నొకచోఁ గూర్చుండ నియమించి భాగవతపురాణము ప్రారంభించెను. రాజభటులు తమ జన్మమధ్యమున ఎప్పుడు నెఱుఁగని ఆకృష్ణలీలలను విని రాజును, తమవచ్చిన పనిని, తుదకు తమ్మును గూడ మఱచి యుండిరి. లతీబు కుటీరముగోడలమీఁద చిత్రింపఁబడిన శ్రీకృష్ణలీలలను నడుమనడుమ వారికిఁ జూపించుచుండెను. ఆచిత్రము లనుజూచి, తురుష్కభటులు ఆనందాతిరేకముచే మైమఱచియుండిరి.

ఆసమయమున కోపఘూర్ణితహృదయుఁ డగుటవలన, పాదుషాహా అక్కడకు నడచియే వచ్చెను. ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది? తనభటులుగూడ లతీబు వలెనే కృష్ణలీలలను ఆనందముతో వినుచు మైమఱచియుండుటవలన, దండతాడితభుజంగమువలె నున్న ఆతని కోపము అగ్నిలో నేయిపోసినట్లు పెల్లెగసెను. అధరము గడగడలాడెను. నోట మాట రాదయ్యెను. మొగము కందగడ్డ యయ్యెను. తనరాకను జూచియు లేవకయే, మూఁడన్నైనఁ జూడకయే, తదేకధ్యానముతో భటులు పురాణము వినుచుండుటచే ఈస్థితి చూచుచుండఁగనే పెచ్చుపెరిఁగెను. ఇదియంతయు లతీబుమోసకృత్యమని నిశ్చయించుకొని, ఆతనిని దండించినచో అంతయు చక్కఁబడు నని యూహించి, పాదుషాహా తటాలున సమీపించెనుగాని, అంతలో లతీబు కుటీరభిత్తిపై వెలయు శ్రీకృష్ణలీలలు కన్నుల నాకర్షించుటచే ముందునకుఁ బోలేక కాట్లకుక్కవలె అఱచుచు, లతీబును అచ్చటకుఁ బిలిచి రాధాదేవి శ్రీకృష్ణ

[illegible], [illegible] అని గర్జించుచు [illegible]. [illegible] "అడుగవలసి [illegible]; [illegible] మాహాత్మ్యము పూర్తిగా [illegible] చెప్పుటకు [illegible] సాధ్యముగాదు. [illegible] విశ్వ[illegible], సంహార[illegible] అనుచెప్పిన గ్రహింపఁగలవా ? [illegible] ఆత్మజ్ఞానసగోచ[illegible]. యోగీశ్వరులకుఁ గూడ [illegible]. కాని [illegible] చేయును. చతుర్వ[illegible] అం[illegible]. అతనిని తెలిసికొనుటకు, [illegible], [illegible] సేవ చేయు టకు, అతనియనుజ్ఞాపాత్రుఁడగుటకు ఒక్కటే మార్గము కలదు. విద్యావంతుఁ డైనంతమాత్రమున అది కలుగదు. మూర్ఖుఁడైనంతమాత్రమునఁ గలుగక పోదు. దానికి స్త్రీపురుషభేదము లేదు. వయోభేదము లేదు. ఏజాతినైనను, ఏవర్ణమైనను, ఏకులమైనను దానికి అభ్యంతరము లేదు. చిత్తశుద్ధి యున్నఁ జాలును. త్యాగగుణ మున్నఁ జాలును. విశ్వాసము దానికి మూలము. అది భక్తి. భక్తిలేనివానికి ఈ చిత్రము కేవలము వినోదమాత్రము. భవబంధబద్ధులకు ఇది కేవలము రంగుగీతల ప్రోగు. త్యాగగుణ మున్నచో, విశ్వాసమున్నచో, భక్తియున్నచో, ఈచిత్రమున ఎంత మహిమ యున్నది? ఎంత గంభీరార్థ మున్నది? నీవు బుద్ధిమంతుఁడవే, విద్యా వంతుఁడవే, ధనవంతుఁడవే. కాని ఈచిత్రము ఎఱుంగునంతటిజ్ఞానమునకు నీసంకుచిత చిత్తమున స్థలములేదు. కాకున్న నిదియేమని యడిగెదవా? వినినంతమాత్రమున ఇది మనస్సున కెక్కదు. అర్థముకాదు. అనుభవమునకు రాదు. చెవులు వినఁజాలవు. హృదయము గ్రహింపఁజాలదు. అయినను చెప్పెదను. అతనినామస్మరణమే భవ తారకము. ఇఁక గుణకీర్తనమాహాత్మ్యము జెప్పనేల? దానివలననే భక్తులు తరించు చున్నారు. అతఁడు శ్రీకృష్ణుఁడు. దుష్టశిక్షణార్థము శిష్టరక్షణార్థమును అవతరించి నాఁడు. ఇది సామాన్యముగా నెల్లరుఁజెప్పుకొను సంగతి. యోగుల యభిప్రాయ మున ఈతఁడు ఇంద్రియాగోచరుఁడును, ఉపమానరహితుఁడును, అచింత్యరూపుఁ డును, మాయాతీతుఁడును అగు జ్యోతిర్మయమూర్తి. భక్తులభావమున రాధా కృష్ణుఁడు. ఆహా! ఇది యెంత మధురమైన పేరు? ఎంత దివ్యమంగళవిగ్రహము? ఎట్టి కీర్తనీయగుణము? ఎట్టి యద్భుతచరిత్రము? ఎంతటి మహామహిమము? ఓయీ! ఈతనిని వర్ణింపఁబూనినవా రెల్లరును శృంగభంగము గాంచినారు. లోకాతీతుఁడే గాని, భక్తిక్రీతుఁడు. ప్రపంచమునంతటను ఆడించువాఁడే గాని, భక్తపరతంత్రుఁడు. ప్రపంచము నంతయును కుక్షిని ధరించినవాఁడే గాని, భక్తచిత్తములఁ గాపురమున్న వాఁడు. ఈతనిని ఎఱుంగఁ గల్గుటకుఁ గల సాధనము అతిసూక్ష్మమేగాని, అసాధ్యము. నిర్గుణుఁడే గాని, ఈతఁడు విపన్నుల నిమిత్తము ధర్మసంస్థాపనార్థము సగుణత్వము

నంగీకరించిన సింహాసనపరిగ్రహుఁడు. నీలమేఘశ్యాముఁడు. శ్రీకృష్ణుని ప్రక్క నున్న శ్రీరుక్మిణీ రాధాదేవి. ఆమె భక్తికిపరమావధి. సాధనమహిమచేత ఈమహాత్ముని కొంగు బంగారముగఁ జేసికొనిన మహాత్మురాలు. ఆత్మసమర్పణమునకు ఈమెకంటె ఉదాహరణము లేదు. శ్రీకృష్ణునితత్త్వమును, మాధవుని మహిమను, సర్వేశ్వరుని అస్తిత్వమును సంపూర్ణముగ నెఱింగినది ఈమెయొక్కతెయే. ఈపావనభారతదేశమున, ఈపుణ్యభూమియందు, ఈభూలోకవైకుంఠమున ఎల్లవారిమానసక్షేత్రముల యందు నిండియున్నది ఈరాధామాధవవిలాసమే. ఈదేశమునకు దివ్యత్వము నాపాదించినది, ఔన్నత్యమును సంఘటించినది, మహామహిమను నొడగూర్చినది ఇదియే. ఓయీ! తెలిసినదా? రాధాదేవి శ్రీకృష్ణభగవానునకు తమలము మడిచి యిచ్చుచున్నది." ఇదివిని పాదుషాహా మొగము చిట్లించుకొని, "అట్లయిన శ్రీకృష్ణుఁడు ఆతమలమును ఏల యంగీకరించుటలేదు" అని ప్రశ్నించెను. "ఇష్టమైనపుడు గ్రహించును. అనుగ్రహ మొదవినపుడు స్వీకరించును. తొందరయేల?" అని లతీబ్ సమాధానము చెప్పెను.

కాని అముష్కరతురుష్కప్రభువునకు సమాధానము కాలేదు. ఆతని యభిప్రాయమున తనకంటె ఘనుఁడు లేఁడు. ఆజ్ఞాపింపఁదగినవాఁడు లేఁడు. అందఱును నెఱవేర్పవలసినవారే. ఎప్పుడో పనికి రాదు. ఇప్పుడే స్వీకరింపవలెను. అని పాదుషాహా గద్దించి పలికెను. కాని లతీబు భీతిల్లలేదు. కదలలేదు. మందహాసముచేసెను. అది చూచి పాదుషాహా కోపించి, నవ్విన నటికివ్వై చెద ననియెను. అయినను లతీబు చలించ లేదు. ఆతని ముఖమున మందహాసము తొలఁగిపోలేదు. అద్దిరా! మశకము మదగజములకాజ్ఞాపించుటా? మిణుఁగురుఁ బురువు సహస్రమయూఖునకు వెలుఁగుఁజూపుటా?" ఇట్లు తలంచుకొని, లతీబు పక్కున నవ్వెను. పాదుషాహాకు కోపము మెండయ్యెను. అదిచూచి భటులుగూడ నవ్వఁదొడగిరి. ఇఁక పాదుషాహా దౌర్భాగ్యదశ నెవరు వర్ణింపఁగలరు? ఆతనికి తొలుత రాధామాధవవిలాసమును ధ్వంసముచేయఁ దలంపు గలిగెను. పిదప లతీబును పొడిచివేయ నూహ వొడమెను. తోడనే చేయి మొల లోని కైజారుమీఁదికిని, చూడ్కి రాధామాధవవిలాసము మీఁదికినిఁ బోయెను. ఆహా! అంతలో నేమి చిత్రము. ఆతని కన్నులు నైశ్చల్యము వహించెను. చేష్ట లుడిగెను. హృదయమభావ మయ్యెను. కైజారుమీఁది కరము స్తబ్ధమయ్యెను. కొంతసేపటికి ఆతనికి రాధచేత ఏమియు లేకపోవుటయు, శ్రీకృష్ణుని చేత సగమును నోట సగమును తమలపుటాకు మడుపు ఉండుటయును, మాధవుని ముఖము దర హాసభాసురమై యుండుటయు, లతీబుముఖము దివ్య తేజస్సుచే మెఱసిపోవు చుండుటయుఁ గానవచ్చెను. తోడనే పాదుషాహామేను అవశమైన లతీబు

[illegible] తుంపస్పర్శకులు [illegible].

[illegible] లుసిగి, ఇంతలో [illegible], "[illegible]! [illegible]! [illegible]క్షమించాలయుతే ! [illegible]?" [illegible] గోనియాడి, [illegible] "[illegible]! [illegible]. మహాయోగు [illegible] జూ[illegible]. [illegible] పాత్రుడవైన [illegible] ?" అని [illegible]. [illegible] పాంసుపాహా [illegible] ఆశ్చర్యచకితులైరి.

పాంసుపాహా దేవి [illegible] నమస్కరించి నిలచి, "మహానుభావా ! నీ మాహాత్మ్యమును [illegible] చేసితిని; [illegible] తిని. ఇంత [illegible] నేను [illegible]. పూర్వజన్మ[illegible] నేను మహాపాపమును చేసితిని. కావుననే నా [illegible]. [illegible]! ఏకకాలమునందే భగవద్భాగవతాపచారము చేసిన నా బ్రతుకు కాల్చనా ? అహా ! నీయాత్మ యెంత మహోన్నతమైనది. ఎంత పావనమైనది. ఎంత శాంతమైనది. ఇది యెంతదయార్ద్రము. పారుష్యము అననెట్టిదో యెఱుంగని నీయెదుట తుచ్ఛురాలనగు నాకు నిలుచుటకైన నధికారము లేదు గదా! నేను పరివృష్టహంతుఁడను; గావున తొల్లి నాకు గురువులు భగవంతుని గుఱించి తెలుపరైరి. భాగవతాగ్రేసరులమహిమము నెఱిఁగింపరైరి. జగత్తంతయు ఈశ్వరాధీనమైనదని చెప్పితివి ; కాని గోడమీఁది బొమ్మకు చైతన్యము గలిగించిన నీయెదుట ఈశ్వరునకు స్వాతంత్ర్య మెక్కడిది? నీవచనమువలననే, ఇప్పు డీయద్భుతము జూచుటవలననే నాకు జ్ఞాన మొదవుచున్నది. తత్వము నాలోచించిన నీవన నెవరు ? భగవంతుఁడన నెవఁడు ? లోకకళ్యాణమునిమిత్తము పుడమిపై నవతరించిన ఈశ్వరుఁడవే కావా నీవు ? నాకు బుద్ధి వచ్చినది. నాపూర్వజీవితమును స్మరించుకొనిన నాయొడలు కంప మెత్తుచున్నది. నాహృదయము చెదరిపోవుచున్నది. నా కన్నులు తేలిపోవుచున్నవి. కటకటా ! నాజీవితము ఎంత పాపబంధురమైపోయినది ? నేను ఈశ్వరునకెంత ద్రోహముచేసితిని. నేనింతవఱకును జయ అను మాట నెఱుఁగను. ఈశ్వరుఁడుతాన మనుజులు నాకు సేవలుచేయుటకే ఏర్పడినవని అనేకములగు అకార్యములను చేసితిని. నాదౌర్జన్యము నోపలేక అనేకప్రాణులు మలమల మాడిపోయినవి. అనపరాధులగు ననేకులను వినోదముకొఱకు నలికించిన నాకు ఇంక పుట్టగతులు గలవా ? మహాత్మా ! అయిన దేమోయైనది. ఇంక గతజలసేతుబంధన మేల ? నాకు పరితాపము గలిగినది. భాగవతులు శత్రుమిత్రభావదూరులుగదా !

కాబట్టి నాయపరాధము లన్నియు క్షమించి, పాపపంకమునుండి నన్ను లేవనెత్తుము. కరుణాకటాక్షములచే కృతార్థునిగ నన్ను స్వీకరింపుము” అని పాదములమీఁద వ్రాలి, పశ్చాత్తాపముచే సాష్టాంగము ఘటించి అనేకవిధముల లతీబును ప్రార్థించెను.

ఈ ప్రార్థనచే లతీబు సహజకోమలహృదయము మఱింత కరఁగెను. అందు దయాప్రవాహము పెల్లుబికెను. తోడనే యాతఁడు పాదుషాశిరమునఁ జేయిడి “రాజా! నన్నింత ప్రార్థింపనేల? నీవు సామాన్యుఁడవు కావు. భగవద్దర్శనమువలన నీవు సర్వజ్ఞుఁడవైతివి. నాయంతటి క్షుద్రజనుల ననేకులకు ముక్తి యొసఁగఁగలవు. క్షణములో భగవత్సాక్షాత్కారలాభముఁబడసిన నీవు ఎంత ఘనుఁడవో, వేఱుగ వివరింపనేల?” అని ప్రత్యుత్తరమిచ్చెను. అయినను మఱల పాదుషాహా లతీబు పాదములఁ బట్టి “గురూ! నే పిల్లవాడను. అనేకులకు జ్ఞానబోధ చేసిన నీకు నేను భారమైతినా? నాకీ రాజ్యము వలదు. వైభవము వలదు. సంసారము వలదు. ఏమియు వలదు. నీ వాత్సల్యము కావలెను. నీ దాక్షిణ్యము కావలెను. నీపదసేవ నాకు చేయుటకు నీవు దాస్యముచేయనిమ్ము. నీహృదయమున నాకు కొంచెము చోటిమ్ము” అని మఱి మఱి ప్రార్థించెను. అది విని లతీబు ఆనందించి, “ఓయీ! అంతయు బాగుగ నున్నది. వైభవమును విడిచిపెట్టుము. ఆశలను జయింపుము. కోరికలను చంపుము. సమర్పణము, త్యాగము, అర్చనము, దాస్యము వీని - నలవఱు చుకొనుము. రాజ్యమును మాత్రము విడువకుము. అదియే నిన్నుద్ధరించునది. ఏమందువా, దేశమందలి ప్రజలెల్లరును నీకు అజ్ఞానువర్తులు. అందఱకును భగవ ద్భక్తి కల్గియుండునట్లాజ్ఞాపింపుము. భాగవతార్చనముచేయునట్లు నియమింపుము. సర్వసమానత్వమును చూపునట్లు కట్టడిచేయుము. అధికారము లేనినాఁడు ఇది యంతయు స్వాధీనముకాదు. ఇట్లయిన నీవొక్కఁడవు బాగుపడుటకాక, దేశమును బాగుచేసినవాఁడ వగుదువు. ఇంతకంటె ఉత్కృష్టకార్యము మఱేమున్నది?” అని బోధించి, పాదుషాహాకు మంత్రోపదేశమును చేసెను. పాదుషాహా గుర్వాజ్ఞను నెఱ వేర్చెను. కొలఁదిదినములయందే దేశమునందంతటను భక్తిరసవాహిని కూలంకష ముగఁ బ్రవహించెను. ఇఁక పాదుషాహా సంతోషము నేల చెప్ప? లతీబు బ్రహ్మానం దము నేల వివరింప? బ్రతికియున్నంతకాలము లతీబు ఇట్లు బ్రహ్మానందనిమగ్నుఁడై యుండి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

“శా. కాళిందీజల మధ్యగట్టుకెదు రెక్కంబొచ్చి హాలాహల
జ్వాలాలీఢకరాళకాళియఫణాజాలంబు నృత్తక్రియం
గాలం గేల నడంచి నిర్జరతిరస్కారంబు వారించు గో
పాలస్వామి కటాక్షవీక్షణము మా పాలం దిరం బయ్యెడిన్.”

(కృష్ణకర్ణామృతము. అ. 2. ప. 92.)

# 39. గోరాకుంభారు

శ్లో. "ముక్తేర్మూలం మునివరహృదానందకందం ముకుందం
కూటస్థాఖ్యం సకలవరదం సర్వచైతన్యరూపమ్,
నాదాతీతం కమలనిలయం నాదనాదాంతతత్త్వం
నాదాతీతం ప్రకృతిరహితం రామచంద్రం భజేఽహమ్"
(శ్రీరామకర్ణామృతము. ఆ 2. ప. 44.)

పండరిపురమునకు సమీపమునందుగల ఒక చిన్నగ్రామమున గోరాకుంభారు యను ఒక భక్తుఁడుండెను. ఆతఁడు కుండలుచేసి విక్రయించి తద్ధనమున జీవించుచుండెను. ఆతని యింట భార్యయు, ఒక చిన్నబిడ్డయు మాత్రమే కలరు.

ఆతని హృదయము మిగుల సున్నితమైనది. ఆతఁడు స్వల్పకాలముమాత్రమే కులవృత్తినిఁ జేసి, తక్కిన దినమంతయు శ్రవణమనన ధ్యానావాహన పూజనాదులచే శ్రీహరిని సేవించుటలోఁ గడపుచుండును. ఆతని భార్యగూడ పతివలెనే సకలవిధ ధర్మములయందును నడచుకొనుచుండెను. భార్యకుఁ దగిన భర్త యనియు, భర్తకుఁ దగిన భార్యయనియు వారినిఁ జూచి జనులు అందఱు నానందపడుచుండిరి.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, ఒకనాఁడు గోరాకుంభారు కుండలు చేయుటకై మట్టిని తెచ్చి చక్కఁబఱుటకై త్రొక్కుచుండెను. ఆసమయమున ఆతని భార్య బిడ్డనుదెచ్చి ఆసమీపమునఁ గూర్చుండఁబెట్టి, ఏటికి నీళ్లకుఁ బోయెను. ఆతఁడు మట్టిత్రొక్కుచునే కొంతవడి బిడ్డను లాలించి ఆనందించెను. ఇట్లొకపదినిమిషములు గడచిపోయినతరువాత, ఆతనిహృదయము హఠాత్తుగ ఈశ్వరధ్యానతత్పరమయ్యెను ధ్యానము మననముగాఁ బరిణమించెను. మననము కీర్తనముగా మారెను. వెంటనే ఆతఁడు చేతులతోడనే తాళము వేయుచు,

శ్లో. "దారా వారాకరవరసుతా తే తనూజో విరించిః
స్తోతా వేదస్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః,
ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే
మాతా మిత్రం వలరిపుసుతస్త్వయ్యతోఽన్యన్న జానే" (ముకుందమాల ప. 32.)

శ్లో. "రాజీవనేత్ర రఘుపుంగవ రామభద్ర రాకేందుబింబసదృశానన నీలగాత్ర.
రామాభిరామ రఘువంశసముద్భవ త్వం శ్రీరామచన్ద్ర మమ దేహి కరావలంబమ్"
(రామకర్ణామృతము. ఆ. 3. ప. 43.)

మ. "అల డాకేల శరన్మృగాంకనిభమౌ హైయంగవీనంబు న
వ్వలికేలన్ రసయుక్తపాయసము గ్రీవాబద్ధచామీకరో

[illegible] కటీర క్రీడ జెంపార ని
[illegible] మాకీవ్వలెన్."

([illegible]ర్ణామృతము. ఆ. 2. ప. 75.)

అని భజన ప్రా[illegible]. [illegible] నృత్య[illegible]మయ్యెను. దీనినంతను జూచి [illegible]; కాని గోరాకుంభారు అది ఏమియు నెఱుంగడు. బిడ్డ [illegible] ప్రమత్తుడుగా మట్టిలోనికి వచ్చెను. [illegible] తండ్రి [illegible]. [illegible]గనే కాళ్లక్రిందనే పడి పోయెను. తండ్రి [illegible] బిడ్డ మట్టిలో గలిసిపోయెను. తలమాత్రము పైని [illegible]. [illegible] తండ్రి పాదములును ఎఱ్ఱబడెను. ఎముకలు [illegible] పోయెను. ఈవిధముగా [illegible] చూచు చుండగనే మట్టిలో గలిసిపోయెను. అయినను గోరాకుంభారు ఇది యేమియు నెఱుంగడు. అతని [illegible] మఱింత పెరిగి పోయెను.

శ్లో. "దివివా భువివా మమాస్తు వాసో నరకేవా నరకాన్తక ప్రకామం,
అవధీరిత శారదారవిన్దౌ చరణౌ తే మరణేఽపి చింతయామి." (ముకుందమాల. ప. 6).

అని అంతకంతకు మఱింత మనోజ్ఞమైన గీతములను బాడుచు నృత్యవేగ మును హెచ్చించెను. కొంతతడ వగునప్పటికి ఆతనికి పాండురంగడు వలిపపు తెర చాటున నున్నట్లు తోచెను. ఇంక నేమికావలయును? నృత్యవేగము మఱింత యయ్యెను. తాళారావములు దిక్కులమూలల ప్రతిధ్వనింపసాగెను. గీతధ్వనులు మిన్నుముట్టుచుండెను. నేత్రములు నిమీలితము లయ్యెను. హృదయము కడు అత్యుత్కంఠ మయ్యెను. ప్రాపంచిక జ్ఞానము విలుప్తమైపోయెను. గోరాకుంభారు ఈ తీరున హరిభజనము సాగించుచు మైమఱచి యుండెను.

ఈసమయమున ఆతనిభార్య ఇంటికి వచ్చెను. నీళ్లకడవనింటబెట్టి బైటకువచ్చి ఆమె చూచెను; కాని బిడ్డ యెక్కడ? అటుతిరిగి ఇటు తిరిగి తుద కామెచూపులు భర్తత్రొక్కుచున్న మట్టిమీదికి బ్రసరించెను. ఎంత కష్టము! నవమాసములు మోసి కడుపార కన్నబిడ్డ మట్టిలో గలిసిపోయెను. భర్త కాళ్లక్రిందపడి బలవ న్మరణము పాలయ్యెను. ఇంక నేమున్నది? పాపము! ఆయిల్లాలి మీది ప్రాణములు మీదికి ఎగిరిపోయినవి.

కొంతతడవు ఆమె నిశ్చేష్టయై యుండి, పిదప ప్రబుద్ధయై రొమ్ము బాదు కొనుచు "హా! నాబిడ్డ మంటగలిసిపోయెను. అయ్యో నాథా! ఇదియేమి ఘోరము?" అని గోలపెట్టసాగెను. అది విని గోరాకుంభారు ఉలికిపడి ఎదుట ఘోర ముగ విలపించుచున్న భార్యను జూచి, "ఓసి దుర్మార్గురాలా! ఒడలెఱుంగక ఉన్మత్తు రాలవై పిశాచమువలె ఱంకలు వేయుచు, నాయెదుట సాక్షాత్కరించిన పండరినాథుని పాఱ

ద్రోహితవిగదే” యని ఊరికేయుండక నన్ను గోరకుము పట్టజాలక అగ్రహ మహోగ్రుడై ఆమెనైబడి కొట్టబోయెను. దానిచే ఆమె నన్ను నమ్మిన పాండురంగని అనగలడు.” అని తటాలున వెనుకకు తగ్గెను. ఇది యనంతరనే, గోరాకుంభారు భయవిహ్వలుడై వెనుకగ్గి ఒకమూలకుపోయి కూర్చుండి, మరల నిశ్చలహృదయుడై భగవద్భజనము ప్రారంభించెను.

అయ్యిల్లాలి రోదనధ్వని విని, తొలుత మార్గమున బోవువారు వచ్చిరి. పిదప ఇరుగుపొరుగువారు చనుదెంచిరి. ఇంతలో -కూచాలీవ్యాపారము ఊరంతయు వెల్లడిపోయెను. ఉత్తరక్షణమునందే ఊరివారందఱును విరిగిపడి అచ్చటకు వచ్చిరి. అంతయు జూచి కొందఱు వెళ్లిపోయిరి. కొందఱు నగిరి. కొందఱు ఆరమణి నూఱడించిరి. కొందఱు గోరాకుంభారునకు మతి పోయినదనిరి. కొందఱు అతని మొగముకే పోయి అతనిని నిందింపసాగిరి. అందఱు అన్నివిధముల జెప్పతొనసాగిరి. అయినను ఆమె విచారమును మానలేదు. అతఁడు వారివెనుకే చూడలేదు. ఇది చూచి వచ్చినవారెల్లరును చాల విసుగుకొని ఎవరియిండ్లకు వారు పోయిరి. మఱి కొంతసేపటికి ఆమె రోదనము కట్టువడెను. కాని అతని భజనము మాత్రము ఇంకను సాగుచునే యుండెను. ఆతనికి ప్రాపంచికజ్ఞానము పూర్తిగ లోపించి పోయెను.

కొంతసేపయిన తరువాత గోరాకుంభారు భార్య, “నే నిట్లు వగచుచు కూర్చుండిన నేమి లాభము? బ్రతికియున్నంతకాలము నేడ్చినను బిడ్డను బ్రతికింపఁ జాలను. సంసారము చెడిపోవుటతప్ప దీనివలన నింకేమి లాభము?” అని నిశ్చయించుకొని, ఒక చెంబుతో నీళ్లు గైకొని కాళ్లు కడుగుటకు భర్తచెంతకుఁ బోయెను. ఆతనికి ఆమె చాల భారముగఁదోఁచెను. మఱియు నాతఁడు మొగమోటము విడిచి, “నిన్ను తాఁకిన పాండురంగని యాన కలదంటిని. కావున నన్ను ముట్టకు” అని గద్దించి పలికెను. ఆమె యచ్చటనుండి వెడలిపోయెను. ఆతని భారముగూడ తొలఁగి పోయెను.

ఆమె తిన్నఁగ పుట్టినింటికి పోయెను. తల్లిదండ్రులు అకాలమునందలి యామె రాకకు అబ్బురపడి ‘ఏమితల్లీ’ యని అడిగిరి. తల్లిదండ్రులను చూచినతోడనే ఆమె హృదయమున విచారము ఉబ్బెత్తుగ పొంగిపోయెను. పిదప కొంతతడవున కామె తేరుకొని, అచ్చట జరిగిన దంతయు నెఱింగించి “నావంశము నిర్మూల మగునట్లు తోఁచుచున్నది. కావున అట్టిది సంభవింపకుండ నాభర్తకు నాచెల్లెలినిచ్చి పెండ్లి చేయుఁడు” అని ప్రార్థించెను. ఆమె తలిదండ్రులు ఆమె వేడికోలును త్రోసివేయఁ జాలక మహావైభవముతో తమ చిన్నకొమార్తెను గోరాకుంభారున కిచ్చి పెండ్లిచేసి,

అంతటనామెతో మఱల "మాబిడ్డలను కృపాపూర్ణ సమభావముతో చూడుము. లేకున్న పాండురంగనిపై ఆన కలదు" అని పలికెను. మఱునాఁడు ఆయక్కచెల్లెండ్రు తమ భర్తతోఁగూడ వెడలిపోయిరి.

ఇంటికి వచ్చినతరువాత కుంభారుఁడు ఏనాఁటను లోపము లేకుండునట్లు భార్యలకు సమస్తవస్తువులను సమకూర్చుచుండెను, కాని యెన్నఁడును వారితోఁడి గోష్ఠియైన నొల్లక, హరిధ్యానపరాయణుఁడై యుండెను. అట్లుండఁగా జాల కాలము గడచినపిదప పెద్దయామె యొక నాఁడు ఆతనిచెంతకు వచ్చి నమస్కరించి నిలిచి చేతులు జోడించుకొని! "స్వామీ, ఇది యేమి న్యాయము? మాయక్కచెల్లెండ్రము నేనునుగూడ మిమ్ము అచంచలభక్తితో సేవించుచున్నాము. నేను మీయెడల మహాపరాధము చేసితిని. కావున నేను దాని ననుభవించెదను; కాని నాచెల్లెలివలన నేమి యపరాధము చేయఁబడినది? ఏమియు నెఱుఁగని యాముద్దరాలి మీరేల కరుణింపరు? ఇట్లయిన ఆయమాయకురాలిగతి యేమి కావలసినది?" అని ప్రార్థించెను. అందుల కాతఁడు నిశ్చలుఁడై, "ఇంతీ! నీతలిదండ్రులు నీచెల్లెలిని నాకిచ్చిననాఁడు సకలబంధువుల సమక్షమున మాబిడ్డలను కృపాపూర్ణసమభావముతో చూడవలెనని ప్రార్థించినారుగదా? నిన్ను ముట్టుటకు పాండురంగనిపై ఆనకలదు కాన వీలులేదుకదా? కావున నేను చేయుఘోర మేమికలదు? నీచెల్లెలిని ముట్టిన నిన్నుగూడ ముట్టవలసివచ్చును. అగుటచే దానినిగూడ తాఁకుట మానితిని" అని బదులు చెప్పెను. అదివిని ఆమె కొంత పడి మ్రాన్పడి, చేయునది లేక దుఃఖించుచు లోనికి వెడలిపోయెను. నాఁడు రాత్రి భర్త గాఢముగ నిద్రించువఱకు నూరకుండి, పిదప నిరువురును యోచించుకొని యాతనికి చెరియొకప్రక్కను బరుండి యాతని చేతులను తమ యిరువురపై నునిచి కొని శయనించిరి.

ఇట్లు పదినిమిషములు గడచునప్పటికి కుంభారునకు హఠాత్తుగ మెలఁకువ వచ్చెను. తోడనే యాతఁడు తన స్థితినంతను జూచుకొని ఉలికిపడి లేచి, శయ్యదిగి పోయి "బళా ! ఈస్త్రీలు ఎంత సాహసకృత్యమును చేసిరి. ఎట్లు మోసగించుటకు తల పెట్టిరి?" అని వగచి పాండురంగని పదకమలములను స్మరించి తటాలున తన రెండు చేతులను ఛేదించుకొనెను, వెంటనే యాతని భుజమూలమునుండి చిమ్మన గొట్టముల నుండి వోలె రక్తధార లెగసి అవనితలముపైఁ బడెను. అంతట ఆరక్తపాతమువలన వారిరువురు మేల్కాంచి, జరిగిన దంతయుఁ జూచి ఆశ్చర్యవిషాదములకు లోనై కొంతతడవు చేష్ట లుడిగి పిదప, "నాథా! నీకింత యాగ్రహమేల?" యని దుఃఖింప సాగిరి. అపు డాతఁడు బాధ ఏమియు నెఱుంగక మందహాసము సేయుచు, "చంద్రముఖులారా! భక్తత్రాణపరాయణుఁడగు ముకుందుఁడుండ మన కేమిలోపము?" అని వారికి ధైర్యము గొలిపి,

శ్లో. "క్షీరసాగరతరఙ్గశీకరాసారతారకితచారుమూర్తయే,
భోగిభోగశయనీయశాయినే మాధవాయ మధువిద్విషే నమః."

(ముకుందమాల. శ. 39.)

అని శ్రీహరిని ప్రార్థింపఁ దొడఁగెను.

కాలక్రమమున ఆషాఢశుద్ధైకాదశి సమీపించెను. నాఁడు పండరిపురమున పాండురంగని మహోత్సవము జరుగును; కావున తన భార్యల నిద్దరను వెంటఁబెట్టుకొని, చంద్రభాగానదిలో స్నానముచేసి ఆలయమునఁ బ్రవేశించి, భక్తచింతామణియగు భక్తజనమందారుఁడగు పాండురంగని సేవించి ఇవ్వలకు వచ్చెను. ధ్వజస్తంభము చెంత నామదేవుఁడు మహానందముతో పాండురంగని కీర్తించుచు నాట్యము చేయుచుండెను. అతని భక్తికి మెచ్చి అతనికి మాత్రమే కాన్పించుచు పాండురంగఁడు అచ్చటనే యుండెను. కనుసిమిషములలో అచ్చటి మంతయు జనసంకీర్ణమైపోయెను. గోరాకుంభారుఁడు అతని యిరువురు భార్యలును వచ్చిరి. ఆశ్చర్యముతో నోరులు తెఱచికొని చూచుచున్న జనసమూహమును జూచి, "అయ్యలారా! ఏలచూచెదరు? పాండురంగనిఁ బాడుచు భజనసేయుఁడు" అని చెప్పెను. వెంటనే వారు భజన ప్రారంభించిరి. వారినిఁ జూచి కుంభారుభార్యలు "అయ్యో, మనభర్తకు చేతులు లేక పోయెనే" యని దుఃఖింపసాగిరి. ఈదుఃఖమువలన వారు కొంతవఱకు బాష్పాంధులై మఱలఁ జూచునప్పటికి గోరాకుంభారు చేతులుతట్టుచు, హరిగుణకీర్తనము సేయుచు అందఱితోపాటు భజనఁ జేయుచుండెను. అదిచూచి ఆవనితామణులు తొలుత తెల్లవోయి పిదప "ఇదియంతయు ఈశ్వరేచ్ఛ" అని భావించి పాండురంగని మహా మహిమను కీర్తింపసాగిరి. ఇంతలో శ్రీకృష్ణుఁడు అచ్చట సాక్షాత్కరించెను. అతని వెంట రుక్మిణి కుంభారుబిడ్డను చంకఁ నిడుకొని వచ్చి, ఆబిడ్డను కుంభారు పెద్దభార్య చేతి కిచ్చెను. అందులకు ఆమెయు ఆమె చెల్లెలును మహానందమును బడసి, రుక్మిణీ దేవిని అనేకవిధముల వినుతించిరి. అప్పుడు శ్రీకృష్ణుఁడు కుంభారుని సమీపించి "భాగవతాగ్రణీ! నీనియమనిష్ఠలకు ఆనందము. నీభక్తిప్రపత్తులకు సంతోషము. నీభార్యయు నీవును నాపైఁ బెట్టిన యాసలు నేఁటితో గతార్థములై పోయినవి. కావున నేఁటినుండి నీయిరువురుభార్యలతోఁ గూడి సంసారమును నిర్వహించుకొనుచు, మాధ్యపతిత మైపోవుచున్న లోకము నుద్ధరింపుము" అని విధించి, రుక్మిణితోఁ గూడ తిరోహితుఁ డయ్యెను. గోరాకుంభారు బ్రతికియున్నంత కాలమును హరిభజనమునుతప్పక ఇంకను అనేకాద్భుతకార్యములను జేసి, అనేకజనులను సాధుమార్గప్రవర్తకులను గావించి పెక్కుమందిని ముక్తిమార్గోన్ముఖులం గావించి, జన్మసాఫల్యమును బడసెను. భార్య లిరువురును ఛాయవలె నాతని ననుసరించిరి. అవసానమున గోరా...

అతనిభార్యలును అశ్రమముగను ఆనందముతోడను భౌతికదేహమును విడిచి, శ్రీహరి సాయుజ్యమును బడసిరి.

మ. "మునివ్యాప్తోషకరుఁ బ్రధానరహితు న్మోక్షాధినాథు న్సనా
తనుఁ గూటస్థుని సర్వవిశ్వమయుఁ జైతన్యాకృతిం గృష్ణునం
దను సర్వాత్ము ముకుందు లోకవరదు న్నాదాంతతత్త్వాత్ము న
త్యనఘున్ రాము ధరాసుతాధిపతి నాదాలీను భావించెదన్."

(రామకర్ణామృతము ఆ. 2 ప 48.)

శ్లో. "వదనే నవనీతగన్ధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్,
నయనే కుహనాశ్రుమాశ్రయేథాశ్చరణే కోమలతాణ్డవం కుమారమ్."

(కృష్ణకర్ణామృతము ఆ. 2 ప. 18.)

---

# 40. చోకామేళుఁడు

శ్లో. "కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కఙ్కణమ్,
సర్వాఙ్గే హరిచందనం చ కలయన్ కణ్ఠే చ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 109.)

పండరిపురమున చోకామేళుఁడు అను ఒకచండాలుఁడు ఉండెను. ఆతఁడు కులక్రమాగతములగు వృత్తులలో నిర్బాధకములగువానిని కొన్నిటిని మాత్రము జీవితమునకు ఉపయోగించునంతవఱకు చేయుచు, తక్కిన కాలము నంతము భగవద్ధ్యానమునఁ గడుపుచుండెను. అదిచూచి తోడిచండాలురు "ఇది యేమిపనిరా? మన జాతికి అప్రతిష్ఠ తెచ్చుచున్నావుగదరా? కల్లుద్రావినఁ గలుగు నానందమున కంటె నెవఁడో ఈశ్వరుని గొలిచినఁ గలుగు ఆనందము గొప్పదియా?" అని విసుగుకొనుచుండిరి. ఆతని భార్య సహజముగ ఆతనికి దగినదై యైనను, అపుడపుడు కులమువారు చేయు హేళనమును విని, "ఇది యెందుకులే? మనకులవృత్తి సాగించుకొందము. అన్యాయము నేయకుండ నుండిన కులవృత్తిలో మాత్రము మోక్షము లేదా యేమి?" అని [illegible]చుండెడిది. అయినను ఆతఁడు వీనిని వేనిని లెక్కసేయక తనయుల వాటుచొప్పున ప్ర[illegible] స్వామికోవిలకుఁ బోయి ప్రదక్షిణముచేసి, స్వామిదర్శనముఁ గోరి గోపుర [illegible] యెదురుగఁ గూర్చుండెడివాఁడు.

ఇట్లు కొంతకాలము జరిగిపోయినతరువాత కొందఱు బ్రాహ్మణులు చోకామేళుఁడు అనుదినమును ఆలయమునకు ముందు కూర్చుండియుండుట సహింపఁజాలక, ఒకనాఁడు "ఓరీ! అనేకదినములనుండి [illegible] చూచుచున్నారము. వాఁడే

పోవునని యూరకుంటినకొలఁదిని నీవు విజృంభించుచున్నావు. మేమీయపచారమును సహింపఁజాలము. నేఁటినుండి నీవిచ్చట కాన్పించితివేని యిఁక నీమెడపై తలయుండదు." అని గర్జించుచు పలికిరి. అందులకు చోఖామేళుఁడు వినయవినమితోత్తమాంగుఁడై "మహానుభావులారా! మీకిది తగునా? సర్వేశ్వరునిసృష్టిలో ఈజాతిభేదములు గలవా? విధాత మిమ్ము సృష్టించినచేతితోడనే మమ్ము సృష్టింపలేదా? మీశరీరము గోక్షీర పాలును, నాశరీరము గోసినసీసము గాఁబునా? మీకుఁగల మానవత్వము మాకు లేదా? మీకుఁగల హృదయము మాకులేదా? మీకుఁగల చైతన్యము మాకులేదా? మీధర్మమునకు మాధర్మమునకు భేదము గలదా? మీకు సేవ్యుఁడైన పండరినాథుఁడు మాకు సేవ్యుఁడుగాఁడా? మీకు ప్రకాశమునిచ్చుచున్న సూర్యుఁడు మాకిచ్చుట లేదా? ఇట్లాడ మీకు తగునా? అయినను భగవన్నియమనమును విరోధించి మీరు కల్పించుకొనిన ప్రాకారములు దాఁటి నేను లోనికి రాలేదే? నాజాతివారీమార్గమున అనేకులు పోవుచుండుటలేదా? పోవుచు పోవుచు నేనిచ్చట నిలచితి ననుకొనుఁడు. ఇఁక నేను చేసినవిశేషాపరాధమేమున్నది? భగవంతుని నాహృదయమందు ప్రార్థించితిని. అది దోషమందురా? నాహృదయమును భగవంతుఁడే నిర్మించెను. ఆతనిచేతితో నిర్మింపఁబడినదానియందే ఆతనిని నిల్పితిని. మీమెడమీఁదితలను, నామెడమీఁదితలను ఆతఁడే సృజించెను. ఇచ్ఛగలిగిన దానినాతఁడే తొలఁగింపవలెను; కాని మీరెవరు? అయినను మీరు కటకటఁబడుచున్నారు; కావున నేను తొలఁగిపోవుచున్నాఁడను" అని తటాలున లేచి తన గుడిసెకుఁ బోయెను. ఆబ్రాహ్మణులు వాని యుపన్యాసమువిని లజ్జించియు, మొండికెత్తి తమమార్గమునఁ బోయిరి.

చోఖామేళుఁడు అట్లు గుడిసెకుఁ బోయి కూర్చుండి, నిమీలితనేత్రుఁడై, అంజలిబద్ధుఁడై, "శ్రీహరీ! పుండరీకవరదా! నేను క్షుద్రుఁడను; పాపాత్ముఁడను. ఈప్రపంచమునుజూచిన నాయొడలు కంపమెత్తుచున్నది. నాచూపులు చెదరి పోవుచున్నవి. నాహృదయము దహించుకొనిపోవుచున్నది. శేషనారాయణా! అక్రూరవరదా! భక్తార్తిభంజనా! నేననాథుఁడను; అగతికుఁడను; నిరాశ్రయుఁడను; నిర్భాగ్యుఁడను. జనార్దనా! నన్ను రక్షింపవా? నన్నీ భవసాగరమునుండి యుద్ధ రింపవా? ఈప్రపంచవాసనలనుండి నాహృదయమును తొలఁగింపవా? నాకేమియు వలదు. నీదివ్యమంగళవిగ్రహదర్శన మొక్కటి చాలును. అన్యమువలదు. [illegible] చాలును" అని ఈశ్వరధ్యానము ప్రారంభించెను. సూర్యాస్తమయము [illegible] రాత్రముగూఁడ నయ్యెను. అప్పుడు పండరినాథుఁడు చోఖామేళుని [illegible] ఆనందించి, అర్చకులు తలుపులు బిగించిపోయిన వెంటనే [illegible]

అతనియభావములకు అక్రమముగను ఆనందముతోడను భౌతికదేహమును విడిచి, శ్రీహరి సాయుజ్యమును బడసెను.

మ. "మునివృత్తిం దపకరుఁ బ్రధానరహితు న్మోక్షాధినాథు న్సనా
తను గూటస్థుని సర్వవిశ్వమయుఁ జైతన్యాకృతిం గృష్ణసం
వను సర్వాత్ము ముకుందు లోకవరదుం బాదాంతతత్త్వాత్ము న
త్యనఘుం రాము ధరాసుతాధిపతి పాదాబ్జము భావించెదన్."

(రామకర్ణామృతము ఆ. 2 ప. 48.)

శ్లో. "వదనే నవనీతగన్ధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్,
నయనే కుహనాశ్రుమాశ్రయేథాశ్చరణే కోమలతాణ్డవం కుమారమ్."

(కృష్ణకర్ణామృతము ఆ. 2 ప. 18.)

---

# 40. చోకామేళుఁడు

శ్లో. "కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కఙ్కణమ్,
సర్వాఙ్గే హరిచందనం చ కలయన్ కణ్ఠే చ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 109.)

పండరిపురమున చోకామేళుఁడు అను ఒకచండాలుఁడు ఉండెను. ఆతఁడు కులక్రమాగతములగు వృత్తులలో నిర్బాధకములగువానిని కొన్నిటిని మాత్రము జీవితమునకు ఉపయోగించునంతవఱకు చేయుచు, తక్కిన కాలము నంతయు భగవద్ధ్యానమునఁ గడుపుచుండెను. అదిచూచి తోడిచండాలురు "ఇది యేమిపనిరా? మన జాతికి అప్రతిష్ఠ తెచ్చుచున్నావుగదరా? కల్లుత్రావినఁ గలుగు నానందమునకంటె నెవఁడో ఈశ్వరుని గొలిచినఁ గలుగు ఆనందము గొప్పదియా?" అని విసుగుకొనుచుండిరి. ఆతని భార్య సహజముగ ఆతనికిఁ దగినదే యైనను, అపుడపుడు కులమువారు చేయు హేళనమును విని, "ఇది యెందుకులే? మనకులవృత్తి సాగించుకొందము. అన్యాయము సేయకుండ నుండిన కులవృత్తిలో మాత్రము మోక్షము లేదా యేమి?" అని పలుకుచుండెడిది. అయినను ఆతఁడు వీనిని వేనిని లెక్కసేయక తనయథాలవాటుచొప్పున ప్రతిదినమును స్వామికోవెలకుఁ బోయి ప్రదక్షిణముచేసి, స్వామిదర్శనముఁ గోరి గోపురద్వారమున కెదురుగఁ గూర్చుండెడివాఁడు.

ఇట్లు కొంతకాలము జరిగిపోయినతరువాత కొందఱు బ్రాహ్మణులు చోకామేళుఁడు అనుదినమును ఆలయమునకు ముందు కూర్చుండియుండుట సహింపఁజాలక, ఒకనాఁడు "ఓరీ! అనేకదినములనుండి నిన్ను ఇక్కడ చూచుచున్నారము. వాఁడే

[illegible] తెలుసుకొని చోఖామేళుని సమీపమునకు వచ్చి ప్రశ్న మొనరించెను. అంతట ఇట్లు నిర్హేతుకజాయమానకటాక్షముతో సాక్షాత్కరించిన భగవంతునకు చోఖామేళుఁడు సాష్టాంగనమస్కారము లర్పించి, అనేకవిధములఁ గొనియాడెను. అంత నతని భక్తి నాకర్షించి శ్రీహరి "నీ కేమి కావలయును?" నని యడుగఁగా చోఖా మేళుఁడు "అనాథనాథా! కరుణాకరా! భక్తచింతామణీ! నీసాక్షాత్కారముకంటె నాకేమియును కోరిక లేదు. అయినను నీవు అనుగ్రహింతుననుచున్నావు. కావున ఆలయమున నిన్ను [illegible]వలెను" అని ప్రార్థించెను. అందులకు భగవంతుఁడు నీవు "నాయందు గాఢభక్తుఁడవు. కావున నీకేమి యభ్యంతరము గలదు" అని పలికి ఆలయమున కాతనిం గొనిపోయి చెంగటఁ గూర్చుండఁబెట్టుకొని ముచ్చటలు ప్రారం భించెను.

ఆముచ్చటలు అనేకవిధములు జరిగెను. పాండురంగఁడు చోఖామేళునిపై తనకుఁ గల ప్రేమ అంతయు విస్పష్టముగ చూపివేసెను. ఆసందర్భమున జీవాత్మ పరమాత్మగల శుద్ధాద్వైతభావమంతయుఁ బ్రకటిత మయ్యెను. అంతలో తెల్ల వారెను. అర్చకు లందఱును తమతమ పనులలోఁ బ్రవేశించుటకు వచ్చిరి. వారిలో పెద్దతాళముచెవులు గైకొని గర్భాలయము దగ్గఱకు వచ్చి, లోపల మాటలు వినఁ బడుచుండుట నెఱింగి, అబ్బురపడి తనవారి నందఱును బిలిచి తటాలున తలుపు తెఱచెను. ఇది యెల్ల గ్రహించి పండరినాథుఁడు శిలావిగ్రహమున తిరోహితుఁ డయ్యెను. చోఖామేళుఁడు నివ్వెఱపడెను. ఇంతలో అర్చకులు లోనికి వచ్చి చోఖామేళుని గాంచి తొలుత వివర్ణులై, పిదప నాగ్రహమహోగ్రులై, "అరే దురాత్మా! చండాలుఁడ వయ్యు ఎంత పని చేసితివిరా" యని ప్రహరించుటకు సిద్ధపడెను. అందులకు భక్తుఁడు "అయ్యలారా! నాపై నేల కోపించెదరు? నేనేమియు నెఱుఁగను. పండరినాథుఁడు నాగుడిసెలో సాక్షాత్కరించి చేయి పట్టుకొని యిక్కడకుఁ గొనివచ్చెను. వలదందు రేని పోయెదను. ఏల మండిపడెదరు?" అని సవినయముగఁ బలికెను. దానిపై నెల్లరును కూడఁ బలుకుకొని, అర్చకులు "అయిన దానికి విచారణ వలదు. నిలిచియున్నట్లుగ లేచిపొమ్ము. ఈసంగతి యెరికిని తెలియనీయకుము. ఇక నీవు మాలపల్లిలో వసించుటకు వలనుపడదు. చంద్రభాగానది అవ్వలకుఁ బొమ్ము" అని పలికిరి. చోఖామేళుఁడు తోడనే బయటకువచ్చి "అయ్యా లారా! మీరు నియమించితిరి గావున వెడలిపోవుచున్నాను. మఱేమన? ఈశ్వరుఁడు సర్వసముఁడు. ఆతనికి భేదభావము లేదు. భక్తిజ్ఞానవైరాగ్యములు లేనివాఁడు బ్రాహ్మణుఁడైనను ఈశ్వరకృపకు పాత్రుఁడు గాఁడు. మాటిమాటికిని మీరు నీవు చండాలుఁడవు. ఇందు రాకూడదు, అని నన్ను తఱుముచున్నారు. నేను మెట్టిన

స్థలము మీకు అపవిత్రమగునేని, నేజలకమాడిన చంద్రభాగ మీకు స్నానయోగ్య మగునా? నేను వసించిన వసుంధర మీకు వాసమునకు తగునా? నేను పీల్చిన గాలి మీకు పీల్చుటకు తగునా? అయినను ఇట్లు మీతో వాగ్వాదము చేసిన నేమి ప్రయోజనము? నేనెట్లు ప్రవర్తించిన మీకు సమ్మతమగునో అట్లే ప్రవర్తించెదను. చంద్రభాగ అవ్వలిని వసించెదను" అని చెప్పి స్వస్థలమునకుఁ బోయి సంగతి యంతయు భార్యకు ఎఱింగించి, అప్పుడే చంద్రభాగను దాటిపోయి గుడిసె వేసికొని అందు వసించెను. ఎచ్చటికిఁ బోయినను భక్తునిహృదయము భగవంతుని విడిచియుండదు కదా? చోఖామేళునకు నివాసముమాత్రము మార్పుగలిగెను, హరిధ్యానమున మార్పు తటస్థింపలేదు. ఆతఁడు ఎప్పటివలెనే శ్రీహరిని సేవించుచుండెను.

ఒకనాఁ డాతఁడు గుడిసెబయటఁ గూర్చుండి యుండెను. ఆతని భార్య కుండతో అన్నమును దెచ్చి వడ్డించుచుండెను. ఆసమయమున పాండురంగఁడు అచ్చట సాక్షాత్కరించి, "భక్తాగ్రేసరా! నీతో కలిసి భుజింపవలయును" అని చెప్పెను. అందులకు అబ్బురపడి భక్తుఁడు "శ్రీహరీ! ఇందులకు అభ్యంతరము ఏమి కలదు?" అని అన్నపుగిన్నెను చేకొని శ్రీహరిని వెంటనిడుకొని సమీపమున నున్న వేపచెట్టు క్రిందికిఁబోయి కూర్చుండి, రుక్మిణీకాంతునితోఁ గలిసి భోజనము ప్రారంభించెను. కొంతసేపటికి చోఖామేళుని భార్య దధిభాండమును తీసికొనివచ్చెను. దైవవశమున ఆమె చేతులు జాఱి కుండ పడిపోఁగా పెరుగంతయు పాండురంగని పీతాంబరము పైఁబడెను. అందులకు చోఖామేళుఁడు చాల నొచ్చుకొనియెను. కాని మఱలఁ జూడఁగా స్వామి పీతాంబరము యథాపూర్వముగ నుండెను.

ఇంతలో నచ్చటకు ఒక బ్రాహ్మణుఁడు వచ్చెను. ఆతఁడు చండాలుఁడగు చోఖామేళుఁడు శ్రీహరితోఁ గలిసి భుజించుచుండుటఁ జూచి ఓర్వఁజాలక, నిమిషములో సమీపించి బద్దలగునట్లు చోఖామేళుని చెంపమీఁద కొట్టెను. తోడనే విఠలనాథుని యెడమబుగ్గ పొంగి, దానిపై అయిదువ్రేళ్లగుర్తులును విస్పష్టముగఁ గాన్పింపఁ దొడఁగెను. అదిచూచి బ్రాహ్మణుఁడు తెల్లవోయి "కట్టా! ఎంత విపరీతము జరిగినది? చోఖామేళునిఁ గొట్ట శ్రీహరి చెంపవాచుట ఏమివింత! చోఖామేళుఁడు సామాన్యుఁ డనుకొంటిని. ఈతఁడు శ్రీహరి యంతరంగభక్తుఁడు అని కాకున్న, సామాన్యభక్తుఁడు అనియైన తెలిసికొనఁజాలక పోతిని. చండాలుఁడను. శంకలేక భగవంతుఁడు సన్నిధి చేసియుండుటఁ జూచియు గ్రహింపలేకపోతిని" అని సంతప్తచిత్తుఁడై చోఖామేళుని పాదములమీఁద వ్రాలి "మహాత్మా! భాగవతాగ్రణీ! నీమహామహిమను తెలిసి కొనఁజాలక అపరాధి నైతిని. నీవు క్షమింపకున్న ఇంక నాకు దిక్కు లేదు [illegible] ఒడలు తెలియక కేవలము శ్రీమన్నారాయణునా [illegible]

స్వామి దేహాంతమునఁ జూచిన నాకిప్పుడసువులు గొనిపోవుచున్నవి" అని అనేకవిధముల ప్రార్థింపఁగా, చోకామేళుఁడు స్వామిసన్నిధిఁ జేరి "అచ్యుతా! అనంతా! నీమాయ లనంతములు. నీలీలలు అజ్ఞేయములు. ఈతఁడు ప్రేమకుఁడై నింతటి యనుగ్రహము చూపుట కేవలము విపరీతము. ఈమహాత్మునకు సంతాపము కలిగినది. జ్ఞానప్రకాశమైనది. ఇఁక నీపాదపద్మములను విడువఁజాలను. రక్షింపుము" అని స్వామిని వేఁడుకొని పొంగియున్న కపోలములు తాఁకెను. తోడనే అవి యథాపూర్వముగా నైపోయెను.

ఇదియంతయుఁ జూచి, ఆబ్రాహ్మణుఁడు నిలిచియున్నట్లుగ గ్రామములోనికి పరుగెత్తుకొనిపోయి, సంగతి యంతయు నెల్లరకు నెఱింగించెను. తోడనే అందఱును వచ్చి పాదములమీఁద వ్రాలి "మహాత్మా! నీమహిమ తెలియక అపరాధము చేసితిమి. రక్షింపు" మని ప్రార్థించి చోకామేళుని పండరినాథుని గర్భాలయమునకుఁ గొని పోయిరి. నాఁడు మొదలు చోకామేళుఁడు బ్రతికియున్నంతవఱకు ప్రతిదినమును స్వామిసన్నిధికి వచ్చి, సేవించిపోవువాఁడు. అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

మ. 'నుదుటం గస్తురిబొట్టు నాసికతుదన్ ముత్తెంబు శ్రీగంధసం
పద మేనం గరంబులన్ గటకముల్ వంశంబు హస్తాగ్రమం
దెదపై నిస్తులకౌస్తుభంబు నలరన్ శృంగారవాసంబు నిం
పొదవన్ గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.'

(కృష్ణకర్ణామృతము. ఆ 2. ప 109.)

---

# 41. దామాజీ

శ్లో. "కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః,
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ రక్షస్వ మామ్."

(ముకుందమాల. ప 33.)

బిదరి అనునొక చిన్న గ్రామమున దామాజీ అనునొక బ్రాహ్మణుఁడు ఉండెను. అతఁడు బాల్యమునందే సకలవిద్యలను నేర్చి అన్నిటిలో గొప్పపండితుఁడై, ఆవిజ్ఞానమువలన జగత్తు మిథ్య అనువిషయమును అనుభవమునకుఁ దెచ్చుకొని సంసారము నంటక, అనవరతము ఈశ్వరధ్యానమునుచేయుచు కాలము గడపుచుండెను. ఆతని వివేక మహిమను జూచి, ఆపరగణాను ఏలు రాజు దామాజీకి మంగళవటము అను పట్టణముపై అధికార మిచ్చి పంపివేసెను. దామాజీ రాజాజ్ఞను శిరసావహించి ఆపట్టణా

మునకుఁ బోయి ఉద్యోగభారమును స్వీకరించి తొల్లిటియుద్యోగులవలెఁ గాక అక్రమము అను మాటను చేరనీయక రాజకార్యములను చక్కఁగ నిర్వర్తించుచుండెను. అదిచూచి అచ్చటిప్రజలెల్లను మహానందనిమగ్నులై, ఆతనియెడల చాల దయభక్తులుగలిగి సంచరించుచుండిరి. దామాజీ రాజకార్యములలోఁబడి మునిఁగిపోక వివేకసహితుఁడు గావున, దైనికకృత్యము లన్నిటిని అన్యాయ మొదవకుండ అతిశీఘ్రముగ నిర్వర్తించుకొని, తక్కిన కాల మంతయు భగవద్ధ్యానమునందును సాధుసజ్జనసేవయందును గడపసాగెను. మఱియును తనకు నెలనెలకును వచ్చు వేతనములో స్వల్పమునుమాత్రమే సంసారమునకుఁ బెట్టికొని తక్కినదంతయు భాగవతార్చనమునందు వినియోగించుచుండెను.

ఇట్లుండఁగా ఒకసంవత్సరము వర్షాభావమువలన తీవ్రమగుకాటకము సంభవించెను. కొలఁదిదినములయందే జను లెల్లరును సమకూర్చుకొనిన భోజనసామగ్రి అయిపోయెను. క్రమక్రమముగ జనక్షయము ప్రారంభ మయ్యెను. కొందఱు అన్నార్తులై తమదారపుత్రులసుగతినైన యోచింపక దేశాంతరములకు లేచిపోవసాగిరి. వారిలో పండరిపురమున వసించు బ్రాహ్మణుఁడు ఒకడు మార్గవశమున మంగళవటమునకువచ్చి, అన్నార్థియై ఇంటింటికిని తిరుగసాగెను. అదిచూచి దామాజీ అతిభక్తితో తనయింటికి ఆతనిపిలుచుకొనిపోయి, ఆతఁడు జన్మమధ్యమున ఎప్పుడును ఎఱుఁగని మృష్టాన్నముతోడి పాత్రమును ముంపెడియెను. ఆబ్రాహ్మణుఁడు సువాసనలు వెదఁజల్లు ఆపదార్థములనుజూచి కన్నులనీరు పెట్టికొనియెను. అందులకు దామాజీ వింతపడి, "బ్రాహ్మణోత్తమా! అన్నముచెంతఁగూర్చుండి అట్లు వగచెదవేల? నావలన నేమయిన అపరాధముజరిగెనా? ఆపదార్థములు నీకు హితవుగావా? పూర్వశోకమేదైనజ్ఞప్తికివచ్చెనా? ఏదియో తెల్పెదవేని కృతజ్ఞుఁడ నయ్యెదను. నావలన నైనచో దైవసాక్షిగ దానిని దీర్చెదను" అనియెను. అందులకు బ్రాహ్మణుఁడు కన్నులనీరుతుడుచుకొని, "మహాత్మా! నీవు జనార్దనుని అవతారమ వని తోఁచుచున్నది. లేకున్న మానవమాత్రులకు ఇంత భక్తి, ఇంత జంతుప్రేమ, ఇంత వినయము, ఇంతటి యౌదార్యము కలుగనేర్చునే? ఇట్టి మధురపదార్థములను నాజన్మమధ్యమున ఎప్పుడును జూచియైన ఎఱుఁగను. అట్టిచో నాకివి హితవు కాకుండుట యెట్లు? మఱి నాదుఃఖ కారణమేమన? నానివాసము పండరిపురము. నేను బయలుదేఱి నాలుగుదినము లయినది. నేను నాలుగుదినములుగా ఆహారమెఱుఁగను; అన్నములేక మలమలమాడిపోవుచున్న నాదారపుత్రులను ఏమయిన సంపాదించి కాపాడుదమను ఊహతో బయలుదేఱితిని; కాని ఈమృష్టాన్నమును [illegible] డనే నాభార్యాపుత్రులు 'అన్నమో రామచంద్రా'యని అన్న [illegible]

ఇప్పుడు నేను ఒక్కడనే యీ యాహారమును భుజింపవలసివచ్చినందుకు దుఃఖించు చున్నాను" అని బదులు చెప్పెను.

ఆమాటలు శరాఘాతములవలె దామాజీహృదయమును దూటాడెను. అతఁడు దుఃఖితహృదయుఁడై యాభక్తునకు ఎదురుగ వచ్చి, "బ్రాహ్మణోత్తమా! నీకా చింతవలదు. నీకుటుంబమునకు ఒకసంవత్సరము సరిపోవు ధాన్యాదికమును నేను ఇచ్చెదను. నీవు నిశ్చింతుఁడవై భుజింపుము" అని చెప్పెను. ఆమాటలు వినిన తోడనే బ్రాహ్మణుని హృదయమునఁ గల విచారమంతయు నొక్కమాఱుగ పొంగి పొరలిపోయెను. పిదప నాతఁడు దామాజీకి చాలఁ గృతజ్ఞతను జూపి తనివార భుజించిలేచెను. దామాజీ "విప్రోత్తమా! అచ్చట నీ బాలపుత్రులు ఆఁకట సకసక మాడుచుందురు. శీఘ్రమైన నీవిచట నిలువవలదు" అనిచెప్పి నౌకరులనుపిలిచి రాజు గారి గాదెనుండి నాలుగుపుట్ల ధాన్యమునుతీసి పలువురు బోయీల నెత్తిఁ జేర్చి, ఈ బ్రాహ్మణుని వెంటఁ గొనిపోయి వారియింట నప్పగించి రండు" అని నియమించెను. నౌకరులట్లే యని సామగ్రి నంతయు బండ్లకెక్కించుకొని బ్రాహ్మణునితో బయలుదేరిరి.

ఆబ్రాహ్మణుఁడు ఆనందభరితచిత్తుఁడై పోవుచుఁ దప్పుచు బండ్లతోఁ గూడ మార్గవశమున నొకయడవిలోఁ బ్రవేశించెను. అప్పుడు ఈతనివలెనే కఱవువలన ఎన్నో దినములనుండి అన్నములేక మలమల మాడుచు వచ్చుచున్న ఒక గొప్ప జనసమూహము ఎదురయ్యెను. అందలి కొందఱు ఆబ్రాహ్మణునివద్దనే బండ్లయం దున్నది భోజనసామగ్రియని తెలిసికొని, అధర్మమని జంకక ఆసామగ్రిని వెంటనే కొల్లగొట్టఁ దొడఁగిరి. ఆజనసమూహ మంతయు క్షుధార్తమే గావున అందఱును ఆపనిఁజేసిరి. క్షణములో బండ్లు అన్నియు వట్టివయ్యెను. ఎవరికి దొరకినసామగ్రిని వారు తీసికొనిరి. ఈతీరున ఆబ్రాహ్మణుని సంపత్తును ఆతని నెత్తిమీఁది శని తన్ను కొనిపోయెను. ఈదౌర్జన్యమును జూచి ఆతఁడు చేయునది ఏమియును లేక తన భాగధేయమును నిందించుకొని "ఇఁక నిది పనికాదు. ఇట్లెన్నిమాఱులు దామాజీ వలన సాహాయ్యమును పొంది, పండరిపురమునకుఁ గొనిపోవుద మన్నను ఇట్లే యగును. కావున నాకుటుంబమును వెంటనిడుకొని మంగళవటమునకుఁ బోయి ఆ మహానుభావుని సన్నిధిని ఆశ్రయించుకొని యుండెదను" అని నిశ్చయించుకొని తిన్నఁగ పండరిపురమునకుఁ బోయి, వెంటనే కుటుంబమును వెంట నిడుకొని మంగళ వటమును జేరుకొనిరయెను. ఆతనివలన దామాజీ యౌదార్యమును విని యనేకులు ఆతనివెంట బయలు దేఱిపోయిరి.

పోయిన కొంతసేపటికి అందఱును గలిసి దామాజీని దర్శించి హృదయము కరఁగునట్లు ఆతని యెదుటఁ దమ దైన్యమునంతను వెళ్లఁబుచ్చిరి. అదివిని దామాజీ

ఇప్పుటనే మిమ్ము బంధింపఁజాలము; కాని రాజాజ్ఞ ఉల్లంఘింపఁజాలము. కావున మాతో పయనము చేయుఁడు. రాజధానివఱకు మిమ్ము నిరాయాసముగఁ గొనిపోయి అచ్చటమాత్రమే మిమ్ము బంధించెదము" అని చెప్పిరి. దామాజీ అందులకు భీతిల్లక భార్యకు ధైర్యముగొలిపి వారివెంట బయలుదేఱెను.

మార్గమధ్యమున పండరిపురము తగిలెను. అచ్చట దామాజీ భటులయనుజ్ఞను బడసి, ఆలయమునకుఁ బోయి పాండురంగని సేవించి నిశ్చలచిత్తుఁడై ఈతీరున ప్రార్థించెను. "శ్రీహరీ! సర్వలోకశరణ్యా! నీకు తెలియని దేమియు లేదు. అయినను విన్నవించుట మాపని. ప్రపంచమునందంతటను నీవు నిండియున్నావు. ఆశరీరమున నుండి రాజు నన్ను పిలిపించుకొనుచు, ఈశరీరమున నుండి దామాజీ యని పేరుగొన్న నన్నే శిక్షించుటకు పిలిపించుకొనుచున్నావు. నీలీలలు అనంతములుగదా ? నీ కెట్లు క్రీడింపఁ దలంపు గలిగిన నట్లు క్రీడింపుము; కాని ఈక్షుద్రశరీరమునున్న స్వల్పాంశమును తుదకు నీయందే చేర్చికొనుము."

ఇట్లయిన తరువాత అతఁడు మఱలభటులతోఁగూడి రాజధానికి బయలు దేఱెను. అంతకు పూర్వమే పాండురంగఁడు ఒక తలారివాని వేషము ధరించి చింపిరిగుడ్డను కట్టుకొని ఒకచేత దుడ్డుకఱ్ఱయు, ఒకచేత వరాలసంచియుఁ గైకొని రాజధానికిఁ బోయి రాజగృహద్వారముననిలిచి, తనరాకను లోనికి తెలిపించెను. రాజు సెలవిచ్చెను. వెంటనే తలారి రాజసన్నిధికిఁ బోయి, "మహారాజా! ఏలినవారి పాదపద్మములసన్నిధికి నన్ను దామాజీ పంపెను. మంగళవటమున నున్న తమ గాదెలలోని ధాన్యమును విక్రయించి సొమ్ము నాచేతఁ బంపినాఁడు; కావున దానిని స్వీకరించి నాకు రసీదు దయచేయవలయును" అని చెప్పి ఆవరాలమూటను ముందిడియెను. అతనిఁ జూచియు అతని మాటలను ఆలకించియు ఆతని రూపమును తిలకించి, "అయ్యా! నీవెవఁడవో నాకనులకు విందు సేయుచున్నావు; క్షుద్రవస్త్రముల ధరించినను నీతేజస్సు సార్వభౌమపుత్త్రులకుఁ గూడ దుర్లభమై యున్నది. నిన్ను తలారి యని తలంచుటకుఁగూడ నామన మంగీకరింపకున్నది. మాకు మంగళవటమున రావలసిన ధనము నాల్గులక్షలవరహాలు. దామాజీ అంతయుఁ బంపెనని చెప్పుచున్నావు. ఆమొత్త మంతయు నీజానెఁడు సంచిలో కలదా ? నీవు మానవుఁడవు కావని చెప్పుటకు ఇంతకంటె దృష్టాంతమేమి కావల యును. నీయూరేది ? నీపేరేమి ? నీతలిదండ్రు లెవరు ? నీకు నెలజీత మెంత ?" అని ప్రశ్నించెను.

అదివిని తలారిరూపముతో నున్న పండరినాథుఁడు అందలివారి కెల్లరకును యథార్థము తెలియకుండునట్లు మాయ కల్పించి, రాజును జూచి "రాజా! నాకు

# 42. పి పా జి రా జు

శ్లో. "ఏతస్మాద్విర మేన్ద్రియార్థగహనాదాయాసకాదాశ్రయ
శ్రేయోమార్గమశేషదుఃఖశమనవ్యాపారదక్షం క్షణాత్,
శాన్తం భావముపైహి సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భఙ్గురాం భవరతిం చేతః ప్రసీదాధునా."

(భర్తృహరి. వైరాగ్య శత. ప. 63.)

మంగళపట్టణము అను గ్రామమున పిపాజిరాజు అను నొక మహారాజు ప్రజల నేలుచుండెను. అతఁడు వివేకశాలియు, పరాక్రమవంతుఁడును, క్షమారతుఁడును గావున న్యాయాన్యాయములఁ జక్కఁగ గుర్తెఱిఁగి, యుద్ధములయందు ఓటమి యన నెట్టిదో యెఱుఁగక చాలకాంతముగ ప్రజాపాలనము సాగించుచుండెను. విశేషించి లోకమాతయగు కాళికాదేవి అన్నివిధములను ఆతనిని పూలఁబెట్టినట్లు కాపాడు చుండెను. అతఁడు ప్రతిదినమునందును ప్రాతఃకాలమునందే లేచి స్నానాదినిత్య కృత్యము లన్నియుఁ దీర్చుకొని కాళికాదేవిని బూజించి, ఆమె సాక్షాత్కరించి నైవేద్యమును స్వీకరించిన తరువాత సుగంధతాంబూలము నొసంగి సంతోష పఱిచి, పిదప తాను భుజించి రాజకార్యములను జూచుకొనును. ఏకారణమువలన నైన ఆమె సాక్షాత్కరించుట కొంచెమాలస్యమగు నేని, అది యగునంతదనుక అతఁడు భోజనము కూడ సేయఁడు. ఇట్టి యచంచలభక్తితోఁ దన్ను సేవించుచుండుటవలన కాళికాదేవి రాజునకు అన్నిటను విజయమే కలిగించుచుండెను.

ఇట్లుండఁగా, కొందఱు భాగవతాగ్రేసరులు ఆపట్టణమునకుఁ జనుదెంచిరి. రాజు భూతదయాపరుఁడు గావున, వారు అట నున్నన్ని దినములు మృష్టాన్నసం తృప్తులం గావింపవలసిన దని పురోహితునకు నియమించి, తగినయేర్పాటు లన్నియుఁ గావించి తాను కాళీపూజ గావింపఁదొడఁగెను. పూజాదికములయందు ఏలోప మును సంభవింపకుండినను యుక్తసమయమున నాఁడు దేవి సాక్షాత్కరింప దయ్యెను. అందులకుఁ జింతించి రాజు అనేకవిధములఁ బ్రార్థింపఁగా ఆమె సాక్షాత్క రించి, "రాజా! నీవలన నేలోపమును లేదు. నాయెడల నీకు భక్తి అంతకంతకుఁ బెరుఁగుచున్నది; కాని తఱుఁగుట లేదు. మఱి నేఁడు ఈజాలమునకు కారణ మేమందువా? నీపట్టణమునకు కొందఱు భాగవతాగ్రేసరులు వచ్చియున్నారు. వారు మహాత్ములు. శ్రీహరి యంతరంగభక్తులు. వారికి భోజనాదికము లన్నియుఁ జక్కఁగా జరపునట్లు నీవే యేర్పఱిచి యున్నావు కదా! వారికింకను భోజనము కాలేదు. వారు భుజించునంతదనుక నేను నైవేద్యము స్వీకరింపఁజాలను. ఇది

యున్నందున నిన్ను. తల్లీ! నిష్కామకర్మయోగులకు నాయ అనుగ్రహితులుగా లభించితి కాని, ప్రయత్నించినవారో వారు లభింపరు. ఇందువలన నీకు మంచితనము లభిం పదు; కావున సున్నితమైన వారివలన నరకములు నీవు నేయుము. నాయను గ్రహమువలన నీవింతవఱకును చేసిన ప్రయత్నము కూడ అలభ్యములగు వైభవముల ననుభవించితివి. మానవజన్మము దుర్లభము. జన్మమును నిర్జించిన పిదప కామనాసక్తి. ఇంటి కష్టములు బోవుచుండగా అనేకానేకములు లనుభవింతురు. అట్లాగా ఏదియో దోషముయో నైన పుట్టుక తటస్థించును. అంత కష్టము నుభవింపనే కదా? కావున మానవుడు తెలిసిన పురుషార్థసాధనముగా ఈశ్వరసాయుజ్యమును బడయ వలసినది. ఈశ్వరప్రేమకు భక్తిజ్ఞానములు సాధనములు. వైరాగ్యము వీనికి పోషకము. జీవితకాలము బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము అను నాల్గు ఆశ్రమములుగా విభాగింపఁబడినవి. ధర్మములను బట్టి ఈనాల్గును గూడ మిక్కిలి నుత్తమములు. కొందఱు మహానుభావులు బ్రహ్మచర్యమునుండియే మోక్షసాధనకు ఉపక్రమింతురు; కాని యది మిక్కిలి కష్టము. గార్హస్థ్యమును గూడ గడపి మోక్షసాధన నుపక్రమించువారు కొందఱు. వీరిలో వారి మోక్షేచ్ఛలు భక్తిమార్గ మునో జ్ఞానమార్గమునో అవలంబింతురు. ఇవి యెల్ల నీకు తెలిసినవియే కదా! నీవు ఇప్పుడు గార్హస్థ్యమున నున్నావు. నీ వనుభవించుటవలన ఐహికసౌఖ్య మంతయు పీల్చి వేయఁబడిన పిప్పియైపోయినది. నీకు మోక్షసాధనం బ్రారంభింపఁ దరుణ మాసన్న మైనది. మోక్షమనఁగా జన్మపరంపరావిముక్తి, ఈశ్వర సాయుజ్యము. ముక్తినిసాధించు టకు జ్ఞానముకంటె భక్తి సులభము. కావున ఇఁక నీవు ఈరాజ్యభారమునంతను నీ కుమారునిపై నిడి, ఈపట్టణమునకు వచ్చియున్న భాగవతులను ఆశ్రయింపుము. వారు నిన్ను తరింపఁజేయుదురు." అని చెప్పెను.

అది విని రాజు ఆనందకంపలితహృదయారవిందుఁడై దేవిపాదములమీఁద వ్రాలి, "నాయెడల నీవు చూపిన యనుగ్రహమునకు కృతజ్ఞుఁడను. ఈక్షుద్రుని యెడల నీకింతటి ప్రేమ గల్గుటకు కారణము నీహృదయము ఆర్ద్రమగుటయే కాని నాసేవ గాదు. తల్లీ! జ్ఞానోపదేశమున నీకే ప్రథమగురుత్వము సిద్ధించినది. నీయాజ్ఞాను సారముగా నే నిదె భాగవతులను సేవింపఁబోవుచున్నాను." అని విన్నవించి, మఱల సాష్టాంగనమస్కారము లాచరించి అనుజ్ఞను బడసి భాగవతులసన్నిధికిఁ బోయెను.

అప్పటి కప్పుడే భాగవతులు భుజించి తాంబూలమును సేవించుచుండిరి. రాజాగమనమును విని వారు వింతపడుచున్నంతలో, రాజు వచ్చి వారి పాదముల మీఁద వ్రాలెను. మఱింత యబ్బురపడి వారు దీవించి రాజును లేవనెత్తిరి. రాజు వారి యెదుట మోడ్పుకరించి నిలిచి రచితాంజలిబంధుఁడై, "మహాత్ములారా

మీమహామహిమను అనిర్వచనీయము. నాపూర్వపుణ్యవశముననే మీ రిటకు వేంచేసితిరి, గాని వేఱుగాదు. అదృష్టహీనులగు వారు ఎంత ప్రయత్నించినను మీవంటివారి దర్శనము లభింపదు. చేజిక్కిన పెన్నిధిని వ్యర్థపుచ్చుకొనుట వివేకిలక్షణము కాదు. నేనింతవఱకును గాళికాదేవిని బూజించి, ఆమెయనుగ్రహమువలన సకలవైభవములు ననుభవించితిని. నేను ఆమె యాజ్ఞవలననే నేను మోక్షాసక్తుఁడ నైతిని. ఆమె యుపదేశమువలన జన్మసాఫల్యమును గోరితిని. ఆమెసెలవువలన మీసన్నిధికి వచ్చితిని. కావున శ్రీహరి అంతరంగభక్తులగు మీరు నాకు చేయూత నొసంగి, మోక్షసాధన మగు సన్మార్గము నుపదేశింపవలెను" అని ప్రార్థించెను.

భాగవతులు రాజు ప్రయత్నమును నెఱింగి మిక్కిలి నానందించి, "రాజా! కాళికాదేవి యనుగ్రహముఁ బడసిన నీకు ఇఁక లేని దేమున్నది? నీప్రయత్నము ప్రశంసనీయము. కాళికాదేవిచే నియమింపఁబడితివి గావున, నీహృదయమున కిఁక ఎంతమాత్రమును సంసారవాసన అంటఁజాలదు. నీకు ఇఁక మోక్షము కరతలామలక మగుటలో వింతయేల? ఇఁక నీకు లభింపవలసినది సదాచార్యుని పాదపద్మములు; కావున నీవు వెంటనే బయలుదేఱి అఘనాశక మగు వారాణసీపురమునకుఁ బోయి, భాగవతుల నందఱియందును నాయకమణియై రిక్కలనడుమ చంద్రుఁడువలె విరాజిల్లుచున్న శ్రీరామానందస్వామి నాశ్రయింపుము" అని చెప్పిరి. రాజు వారికి మ్రొక్కి దీవనలు బడసి అనుజ్ఞ నంది, కోటకుఁ బోయి రాజ్యమును గుమారునకు అప్పగించి, ఆతనికిని మంత్రులకును జెప్పవలసిన దంతయుఁ జెప్పి, భార్యాసహితుఁడై కాశీనగరమునకు బయలుదేఱెను.

రాజును రాణియు యుక్తసమయమున రామానందస్వామిని దర్శించి సాష్టాంగదండప్రణామము లాచరించి నిలిచిరి. స్వామి దీవించిన పిదప రా జిట్లు చెప్పెను. "మహాత్మా! భాగవతాగ్రేసరులయందు నాయకమణియైనవాఁడా! నీపాదపద్మసందర్శనమువలన నేఁడు మాపాపములన్నియు భస్మపటలములై పోయినవి" అని మ్రొక్కి తన చరిత్రమంతయు నెఱింగించి, "శ్రీహరి అంతరంగభక్తుఁడ వగునీకు అసాధ్యమెద్దియు లేదు. నీయనుగ్రహమువలన అనేకులు జన్మసాఫల్యమును బడసిరి. ఆశిష్యపరంపరలో భార్యాద్వితీయుఁడనగు నన్నుగూడఁ జేర్చుకొనుము. నాకు మోక్షమార్గము నెఱింగించి రక్షింపుము" అని ప్రార్థించెను. స్వామి పరమానందభరితుఁడై తారకమంత్రోపదేశమును జేసి జ్ఞానబోధ గావించి, ద్వారకకు పోయి అచ్చట వేంచేసియున్న శ్రీహరిని సేవింపుమని పంపివేసెను.

రాజు గుర్వాజ్ఞవలన ద్వారకకు పోయి స్వామిని దర్శించి ప్రార్థింపఁగా, శ్రీహరి సాక్షాత్కరించి "వత్సా! కాళికాదేవి యనుగ్రహమువలనను, రామా

సాంబస్వామీ! నాకు దేశమునందున నీకు భక్తుఁడక్కరలేదు. మఱియు నాకు దేవాలయ వలె నాయంతరంగభక్తుఁడవుగూడ నైతివి. నేను నీహృదయమునందును, నీభార్య హృదయమునందును ఎప్పుడును వసించియుండెదను. గురూజ్ఞానుసారముగ ప్రవర్తించుకొను" మనెను. పిదప రాజు అచ్చటి నాల్గుమాసములు వసించి మఱల కాశికి పయనము చేసెను.

మార్గమధ్యమునందు ఒక యడవిలో ఒక బెబ్బులి యెదురాయెను. దానిని చూచి రాణి "అయ్యో, బెబ్బులివచ్చుచున్న" దని భయపడఁగా "దేవీ! ఏల యిట్లు భయపడెదవు? సర్వభూతములందు భగవంతుని చూడవలెనని మఱచితివా? నీయందును నాయందును బెబ్బులియందును గూడ నున్నవాఁడు భగవంతుఁడే గదా?" అని చెప్పుచు రాజు లేచికొని బెబ్బులివంక జూచి, "ఈశ్వరా! నీరూపములు అనంతములు. నీలీలలు అగణ్యములు. నీనామములు అసంఖ్యములు. నీచర్యలు అనితరవేద్యములు. వ్యాఘ్రరూపివై వచ్చిన నిన్ను నేను నమస్కరించుచున్నా" నని మ్రొక్కెను. ఇదివిని బెబ్బులి మిగుల శాంతించి తోఁక నాడించుకొనుచు దగ్గఱకు వచ్చి నిలిచెను. రాజు దానిని బుజ్జగించి చెవిలో తారకమంత్ర ముపదేశించెను. తోడనే అది సాష్టాంగచిహ్నముగా ఆదంపతుల యెదుట పడుండి యథేచ్ఛం జనియెను. ఆదిమొదలు అది క్రిందరాలిన ఆకులను, అలమును ఏరి తినుచు సదా ధ్యాననిష్ఠమై కాలము గడపెను.

పీపాజిరాజును, అతని భార్యయు బ్రతికియున్నంతకాలము భగవద్భాగవతార్చనమునఁ గడపి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసిరి.

శా. "ఆయాసప్రద మింద్రియార్థగహనం బాత్రోవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికరచ్ఛేదార్థమై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచే దీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం గోరకుమీ మాలిన్యముల్ వీడుమీ."

(భర్తృహరి. వైరాగ్యశత. ప. 63.)

---

## 43. నానకుదాసు

శ్లో. "అరుణాధరామృతవిశేషితస్మితం, వరుణాలయానుగతవర్ణవైభవమ్,
తరుణారవిన్దదళదీర్ఘలోచనం, కరుణామయం కమపి బాలమాశ్రయే."

(కృష్ణకర్ణామృతము. ఆ 3. ప. 17)

పాంచాలదేశమున నానకుఁడు అనునొక మహానుభావుఁ డుండెను. అతఁడు మహమ్మదీయుఁడయ్యును, మహాత్ములు అన్ని మతములయందును అవతరింతురు; తాను అజ్ఞానులవలె శివుఁడు; విష్ణువు, బ్రహ్మ, అల్లా, క్రీస్తు అను భేదభావము నేయక

యున్నయెడల జన్మకర్మలనుండి తప్పించుకొని ముక్తికే చెందుదునని నిశ్చయించి, శ్రవణమననధ్యానాదులద్వారా శ్రీహరిని సేవించుచు నుండెను. నానకు దైవ భక్తితోడను మహాభక్తులకు సంకటపడకుండ వసతులు, పక్కన భాగవతులకును గూడ ఉప యోగించుటకై ఒక గొప్ప విష్ణ్వాలయమును గట్టించెను. అయితే ఆగ్రామమున మహమ్మదీయులు కూడ కొందఱు కలరు. కావున తమమతమువారగు ఇట్టి భారతీయులు పూజించు శ్రీహరిని ఆరాధించుట నంగీకరింపజాలక దురభిమాన దూషితులై ఆయాలయమును పడగొట్టివేసిరి. కాని నానకు దుండుల కేమియుం గోపపడక తానే అన్నదానికై మసీదును కట్టించెను. తురకలందఱును మిగుల నానకు మెచ్చిరి.

కాని భారతీయులకు కోపము వచ్చెను. "నానకు స్వబుద్ధివలననే శ్రీహరిని బూజింపక వోదలెను గాని, మాబోధవలనఁ గాదు. విష్ణుదేవునియాలయనిర్మాణము గూడ ఆతడు స్వయముగ యోచించిచేసెను; గాని మాకు లేకపోవుట వలనఁ గాని మాబోధవలనఁగాని చేయ లేదు. అట్టిచో తురకలు విష్ణ్వాలయమును పడఁ గొట్టనేల?" అని తలంచి కోపోద్రిక్తులయి భారతీయులు ఆమసీదును బడఁగొట్టి వేసిరి. "న్యాయమును పీరెవరును గనుగొనఁజాలకపోయిరి. ఈయుభయపక్షుల వారికిఁ గూడ స్వమతాభినివేశము ప్రబలమై యున్నది. మతవిషయమున వీరికి సంధి కుదురదు. అందులకై ప్రయత్నించుట వ్యర్థప్రయాసముగును" అని తలంచి, నానకు ఆస్థలమంతయు బాగుచేయించి పొలముగా నుపయోగింపసాగెను. ఇట్లు చేయుట వలన ఆపొలములో చాలధాన్యము పండుటయు. దానివలన అనేకదీనులు బ్రతుకు టయు సంభవించెను. భారతీయులకును మహమ్మదీయులకును గూడ కోపమున కును దౌర్జన్యమునకును గారణము లేకపోయెను. అయినను కొందఱు ఆతనిదగ్గ ఱకుపోయి "అయ్యా! మీరు తొలుత విష్ణుదేవుని యాలయమును గట్టించితిరి. తుర కలు దానిని బడఁగొట్టఁగా పిదప మసీదును గట్టితిరి. భారతీయులు దానిని బగుల గొట్టఁగా తుదకు పొలముగా చేసితిరి. ఈతీరున మీరు మహమ్మదీయులై పుట్టియు విష్ణుభక్తులయితిరి. కాని మహమ్మదీయుల దౌర్జన్యమువలన మఱల మహమ్మదీయు లైతిరి. పిదప మావారినిర్బంధమువలన వైష్ణవులగుటకుమాఱుగ నాస్తికులైతిరి. మీయాచర్యకంతకును అర్థమేమి? మీహృదయము పరిపక్వమైనదా లేదా? దానికి నైశ్చల్యము కలదా లేదా? మతవిషయమున మీభావమేమి? దైవమునుగూర్చిన మీయభిప్రాయ మెట్టిది?" అని యడిగిరి. అందులకు అతఁడు ఇట్లు చెప్పెను. "లోకు లనేకవిధముల ననుకొందురు. వారి కందఱకును నచ్చఁజెప్పుట విధాతకైన తరము కాదు. అల్లాను సేవించెదను. శ్రీహరిని పూజించెదను. శంకరుని అర్చించెదను. మీ

రంపబులను తలంచునట్లు గాక ఈనాటకము లన్నియు ఆధ్యాత్మికానందమూర్తికే చెల్లుచున్నవి. విష్ణ్వాలయములు గట్టిన మహమ్మదీయులు గలరు. మసీదులఁగట్టిన భారతీయులు పడఁగొట్టినారు. మసీదులను విష్ణ్వాలయముగను గట్టినచో ఉభయులును కలిసి పడఁగొట్టుదురు. ఇన్ని బాధ లేల? ఇంత ధనవ్యయ మేల? అప్పటి ధ్యానసాయముచేసినచో చాంచల్యము పోవును. ఆధాన్యమువలన ఇప్పుడు అనేకులు జీవించుచున్నారు. గుడిగాని, మసీదుగాని, లేకపోయినంతమాత్రమున నాదైవభక్తికి లోపములేదు. నిశ్చలమైన హృదయముతో భక్తుఁడు ప్రార్థనచేయునో, అట్టి రూపముతో ఈశ్వరుఁడు గానవచ్చును. ఈశ్వరుఁడు ప్రపంచమంతటను నిండి యున్నాఁడు. ఇచ్చట మసీదుగాని ఆలయముగాని లేనిచో, అతఁడు మనకు దూరుఁ డగునా? సామాన్యుల యభిప్రాయమున పాండురంగఁడు ఒక్క పండరిపురమునందే కలఁడు; కాని తర్కించి చూచినచో అతఁడు లేనిచో టెచ్చటనున్నది? తెలిసికొనుశక్తియున్నచో ఈశ్వరుఁడు కండ్లయెదుట నిలిచియే యున్నాఁడు. అజ్ఞానముకలవాఁడు భేదభావము చేయును. వైష్ణవులు శైవులను ద్వేషించుటకును, శైవులు వైష్ణవులను ద్వేషించుటకును, మహమ్మదీయులు భారతీయులను దూరుటకును, భారతీయులు మహమ్మదీయులను విరోధించుటకును, ఇట్లే భిన్నప్రకృతులు పరస్పరము నిందించికొనుటకును ఈయజ్ఞానమే కారణము. కావున ఈవిషయమును విశేషముగ తర్కించుట వివేక మనిపించుకొనదు.

ఈసమాధానమును విని వారిలో కొందఱు మిగుల కోపించి, ఆదేశము నేలు నవాబుయొద్దకుఁ బోయి నానకు సంగతియంతయు నెఱింగించి, ఆతనిని విచారింప వలయు నని చెప్పిరి. నవాబు వల్లెయని వారిని పంపివేసి, "నీవు మహమ్మదీయుఁడవు. మహమ్మదీయసంప్రదాయమును నీవు విడువఁగూడదు" అని యొకభటునిద్వారా నానకునకు వర్తమానముచేసెను. అదివిని యాతఁడు "సూర్యతేజము వివిధములగు గాజుపెంకులమీఁదఁ బడునపుడు పెక్కురంగుల నీనుచున్నది. అట్లే పరమేశ్వరుఁడు అనేకమతములవారికి అనేకవిధముల కనుపించుచున్నాఁడు. మీరందఱును మీ మీహృదయములయందు ప్రతిఫలించిన ఆపరమేశ్వరుని అలీకరూపములనే చూచుచున్నారు; కాని నేను మూలతత్త్వమునే యుపాసించుచున్నాను" అని యొక కాగితముమీఁద వ్రాసి ఆభటునకిచ్చి "ఇది మీప్రభువునకుఁ జూపుము" అని చెప్పెను. వాఁడట్లే చేసెను. రాజు ఆకాగితమును జూచి అందలి భావగాంభీర్యమునకు అచ్చెరువడి, "ఇతని ప్రభావము మిగుల నద్భుతముగాఁ దోఁచుచున్నది. అయినను ఎవరును తెలిసికొనఁజాలక పోవుచున్నారు. నేను దానిని పరీక్షించి నిజమైనచో అందఱకును జాటి చెప్పెదను" అని నిశ్చయించుకొని "నారాజ్యములో నుండి నాకు

లోకద్రోహియై యున్నాఁడు; మాయాజ్ఞను ఉల్లంఘించెను; కావున మీరు పోయి ఆతనిని కట్టితెండు” అని సిపాయిల కాజ్ఞ యిచ్చెను.

వెంటనే అయిదువందల సిపాయిలు బయలుదేఱిపోయిరి. అప్పటికి నానకు లోపల కూర్చుండి శిష్యులకు జ్ఞానబోధ చేయుచుండెను. ఇట్టిస్థితిలో రాజభటులు వచ్చి తనకుటీరమును ముట్టడించి యున్నారను సంగతి శిష్యునివలన విని, ఏమియు మాటాడక సుంతయైనభయపడక “అంతకును పండరినాథుఁడే గలఁడు” అనిపలికి హరి ధ్యానమున ప్రవృత్తుఁడయ్యెను. అంతట చూచుచుండఁగనే భీమబలులగుపదివేల సిక్కుభటులు నేలయీనినట్లు క్షణములో నావిర్భవించి, రాజభటుల నెదిరించి నిలిచిరి. ఇరువాగులవారికిని సంకులసమరము జరిగెను. ఉత్తరక్షణమునందే, రాజభటులు క్రొత్తభటులధాటికి నిలువజాలక వెన్నిచ్చి పాఱిపోయి, యీసంగతియంతయు తమ ప్రభువునకు విన్నవించిరి. అంతట నవాబు నానకుమాహాత్మ్యమునకు పరమాశ్చర్యచకితుఁడై తాను చేసినపనికి సిగ్గుల పశ్చాత్తాపపడుచు, వెంటనే నానకుసన్నిధికిపోయి పాదములమీఁద వ్రాలి, “మహాత్మా! నేను మహాపరాధిని. ఏలినవారి ప్రభావమును దెలిసికొనఁజాలక నే నీదుష్కార్యమును జేసితిని. మీరంపిన చీటి చూచినపుడే నాకు మీయెడల మహానుభావులను నమ్మకము కలిగెను; కాని ఇప్పుడు లోకములో దొంగహరిదాసుల సంఖ్య గణనాతీతమై యున్నది. కావున ఆనమ్మకమును స్థిరముగ నుంచుకొనఁజాలక మిమ్ము పరీక్షించుటకు ఈపనిచేయించితిని. సంకుచిత చిత్తుఁడ నగుటవలన మీమాహాత్మ్యమును దెలిసికొనుటకు నాకింతకంటె మంచి మార్గము తోఁచలేదు. అజ్ఞానకృతమైనను చేసినపనికి ఫలమనుభవింపక తప్పదు; కావున నాకు తగిన ప్రాయశ్చిత్తమేనది. మీయనుగ్రహమువలన నాకు బుద్ధివచ్చినది; కావున నాయపరాధమును మన్నించి నన్ను శిష్యకోటిలోఁ జేర్చుకొని, జ్ఞానతేజమువలన నామహాధ్యాంధకారమును తొలఁగించి నన్ను రక్షింపవలయు” నని ప్రార్థించెను. అంతట నానకుఁ డాతనికి తారకమంత్రము ఉపదేశించి,—

**సీ.** “**మాలకులికాంకుశజలజధ్వజచ్ఛత్రలాలితలక్షణలక్షితములు**
**నలలితనఖచంద్రచంద్రికానిర్ధూతభక్తమానసతమఃపటలములును**
**సురుచిరాంగుష్ఠనిష్ఠ్యూతగంగాతీర్థమండితహరజటామండలములు**
**వంచితధ్యానపారాయణజనభూరికలుషపర్వతదీప్తకులిశములును**

**తే.** **భావకాశితమనోరథదాయకములు, చారుయోగిమనఃపద్మషట్పదములు**
**వనరుహదళనిభహరిచరణాబ్జములను, నిరుపమధ్యానమున మది నిలుపవలయుఁ ”**

(భాగవతము. స్కం. 3. ప. 929.)

అని యుపదేశించి, “నీయాజ్ఞకు ఎందును అడ్డులేదు. నీవు హరిధ్యానముచేయు ఫలముకంటె నీప్రజలను అనేకులను హరిభక్తులనుజేసిన కలుగుఫలము అపరిమితము. కావున నీ వట్లు చేయుము” అని బోధించెను,

ఈయద్భుతకృత్యమును జూచియు, చూచినవారివలన వినియు, దైవభక్తులు కొందఱు వెంటనే వచ్చి నానకు నాశ్రయించి, శిష్యగణములఁ జేరిరి. అనేకులు తమకు ఉన్నదాని ననుసరించి ఎవరికిఁ దోఁచినంత వారు తెచ్చి ధనము సమర్పింపసాగిరి. ఇట్లు వచ్చిన ధన మంతయు నానకు భాగవతసేవకు వినియోగింపసాగెను. దానివలన అనేకులకు దీనపాతకులకు ఉపయోగ మేర్పడెను.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా నానకు తననమ్మిన శిష్యులగు నిద్దఱిలో సూత్ర అను వతనిని మఠమునందు ఉండ నియమించి, మర్దనుఁడు అను వతనిని వెంటఁబెట్టుకొని లోకము నుద్ధరించుటకై బయలుదేఱెను. కొంతదూరము పోవునప్పటికి మక్కాపట్టణమునఁగల శ్రీకృష్ణభగవానుని విగ్రహమును అచ్చటి తురకలు త్రవ్వి పాఱవేసి, దానిపై పశువుల యెముకలను పడవేసిరి; అను వార్త వినవచ్చెను. తోడనే నానకు ఆవిగ్రహము నుద్ధరించుటకును, ఆవిగ్రహరూపమున వెలసియున్న శ్రీకృష్ణపరమాత్మను సేవించుటకును బయలుదేఱెను. గురుశిష్యులు ఇరువురును ఇట్లు ఆత్మాత్రముతోఁ బోవుచుండఁగా, మార్గమధ్యమున నొకయేరు అడ్డువచ్చెను. అది కూలంకషముగఁ బ్రవహించుచుండెను. దాఁటుటకు యానపాత్ర మేమియుఁ గూడ లేకపోయెను. ఇదిచూచి నానకు “ఓనదీ! నీవు శిలాత్వము వహింపుము” అని విధించి ఏటి కడ్డుపడియెను. మహామహిమాభిరాముఁడు గావున నానకు ఘంటాపథముమీఁదవలెనే నడచిపోవసాగెను. అది చూచియు మర్దనుఁడు నీటిలో దిగుటకు వెఱచి, గట్టుమీఁదనే యుండిపోయి, నానకు ఏఁబది అఱువది గజములదూరము పోవునంతవఱకు నూరకుండి, పిదప “గురుదేవా! నే నిచ్చటనే యున్నాను; ఏటిలో దిగుటకు నాకు భయ మగుచున్నది” అని గొంతెత్తి పలికెను. అది విని నానకు వెనుదిరిగి చూచి మందహాసముఁ గావించి, “భయము వలదు. గురుపాదపద్మములను నిశ్చలభక్తితో ధ్యానించుచు ఏటిలో దిగి వెంటరమ్ము. అట్లయిన నీకేదియు నపాయము సంభవింపదు” అని పలికెను. మర్దనుఁడు అట్లే చేసెను. గురుదేవుని ప్రభావమువలన మర్దనునిదేహము మోలవఱకు మాత్రమే నీటిలో మునిఁగెను. కొన్నినిమిషములకు గురుదేవుని సమీపించి ఆతఁడు గురువు వెనుక మఱికొంతదూరము పోయినతరువాత “నాయాజ్ఞ మాత్రము ఏల చెల్లదు?” అని తలంచి, “శిలాత్వము వహింపుము” అని నదినిఁ జూచి పలికెను. వెంటనే ఆతనిదేహము కంఠమువఱకు మునిఁగిపోయెను. శ్రోత్రది రాకపోవుటయే గాక ఉన్నదిగూడ ఊడుటవలనను, నోటిలోనికి నీరు వచ్చుచుండుట వలనను మర్దనుఁడు భయప్రకంపితుఁడై “గురుదేవా! చెడితిని. రక్షింపవలయును” అని కేకవేసెను. నానకు వెనుదిరిగి చూచి, “గురుపాదస్మరణ [illegible]

నని పలుకఁగా, మస్తానుఁడు తొల్లిటివలెనే చేసెను. తోడనే ఆతని దేహము మొల కెత్తఁగ జేసెను. కొంతసేపటికి నానకు తీరమునకుఁ బోయి, మక్కాపట్టణము సమీపించిరి.

అచ్చటివారు మ్లేచ్ఛులు మద్యమును, గోమాంసమును విక్రయించువారు. దయాదాక్షిణ్యములు లేనివారు. విశేషించి భారతీయులను ఆనగరమున అడుగు పెట్టనీయనివారు. మఱియు అతిరహస్యముగ భారతీయు లందు ప్రవేశించినను, తెలిసినచో వారిని వెంటనేవారు సంహరించివేయుదురు. ఇదియంతయుఁ దెలిసిన వాఁడు గావున, నానకు తనప్రభావమువలన తన శిష్యునితోఁ గూడఁ బరులకు కాన్పింపకుండునట్లు మాయ కల్పించుకొని, తిన్నఁగా శ్రీకృష్ణాలయమునకుఁ బోయి చేరుకొనెను. అచ్చట నొక తురకవాఁడు కాపు కాయుచుండెను. వాఁడు వారినిఁ జూచి "మీరెవరు? మీలో నొకఁడు భారతీయుఁడుగా నున్నాఁడు. భారతీయులు ఇచ్చటకు వచ్చుటకు వలనుపడదు. కావున తీసికొనివచ్చినందుకు నిన్నును, వచ్చినందులకు భారతీయుని సంహరింపవలసియున్నది. ముందుగా మీరు ఇచ్చటకు ఎట్లు వచ్చితిరో తెల్పుఁడు" అని గర్జించుచు పలికెను. అందులకు నానకు మంద హాసముగావించి, "నీవు పెద్దప్రశ్నవేయుచున్నావు; కాని దానికి మేమిచ్చు సమాధానము నీకర్థము కాదు. పర్యవసానము వినుము. మావలన కానిది యేమియు లేదు. నీవలన నగునది గూడ అంతకుమున్నే లేదు." అని బదులు చెప్పెను. ఈమాటలమీఁద ఆయవనునకు చిఱునవ్వును, ప్రచండకోపమును వచ్చెను. "మీమాటలు వెంటనే మీతల తీసివేయునంతటి దోషమును జేయు చున్నవి; కాని అందలి యర్థము మాత్రము వినోదమును గొల్పుచున్నది. కావున కొంతతడవు శాంతించెదను. మీవలనకానిది ఏమియు లేదని చెప్పితివిగదా! మేము ఇచ్చటి కృష్ణవిగ్రహమును మట్టిలో పూడ్చియున్నాము. మీరు ఇక్కడనే యుండి క్షణము ఆవిగ్రహము యథాస్థానమునకు వచ్చి యథాపూర్వముగ నుండునట్లు చేయఁగలిగితిరేని నీప్రభావమును నమ్మెదను" అని అడుగఁగా, "నీవెంతటివాఁడవు? కాలికై విషముతినిన అధముఁడవు. నిన్నును నీతోడువారిని ఈపనికి నియోగించిన ఇచ్చటిప్రముఖులను తీసికొనివచ్చితివేని, నాప్రభావముఁ జూపెదను" అని నానకు అందులకు బదులు చెప్పెను.

వెంటనే వాఁడు మఱియొక భటునిచే కబురుచేయఁగా, ఉత్తర క్షణమున ప్రముఖులు వచ్చిరి. వెంటనే నానకు నిమీలితనేత్రుఁడై చేతులు జోడించి—

మ. "తరుణాబ్జారుణలోచనద్వయి గృపాధారేయమై యొప్ప సా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ గన్పట్ట మానీంద్రవ్రా

త్సరకేశంబులు సంచలింప మురళీసంజాతగీతామృత
స్ఫురణన్ రాల్ గరఁగం జిరుచు హరికై కోరంబు భావించెదన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 18.)

అని ప్రార్థింపఁగా, శ్రీకృష్ణుఁడు లీలామానుషవిగ్రహుఁడై సాక్షాత్కరించెను. తురక లంజలును ఈయద్భుతమును జూచి వింతపడుచుండఁగా, నానకు స్వామిపాదార విందములకు సాష్టాంగనమస్కార మాచరించి,

శ్లో. "శ్రీనాథ నారాయణ వాసుదేవ శ్రీకృష్ణ భక్తప్రియ చక్రపాణే,
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే శ్రీరామ పద్మాక్ష హరే మురారే."

(ముకుందమాల. ప. 36)

అని యనేకవిధములఁ బ్రార్థించెను. వారు చూచుచుండఁగనే స్వామి అంతర్హితుఁడు కాఁగా, తురకలంజలును విస్మితులై నానకు కాళ్లపైఁ బడి "మహాత్మా! నీప్రభావము అనితరసాధ్యము. శ్రీకృష్ణవిగ్రహమును పాతిపెట్టి తీరనియపరాధమును గావించిన మమ్ము రక్షింపవలయును" అని ప్రార్థించి, వారిలో ధర్మబుద్ధిగల కొందలు వెంటనే నానకు శిష్యులైరి.

ఇది జైనకొలఁదినిమిషములకే నానకు స్వదేశోన్ముఖుఁడయ్యెను. కొంతసేపటికి అతఁడు శిష్యసహితుఁడై ఎత్తయిన కొండలవరుసనంటి పాఱుచున్న ఒక యేటిని సమీపించెను. ఆనది కూలంకషమై ప్రవహించుచుండుటచే ఒక రాజు దానిని దాఁటవచ్చియు, దాఁటలేక దారితెన్నులు తెలియక అంతలో నానకును జూచి, మహాత్ముఁడుగా శంకించి "ఏరుదాఁటు నుపాయము చెప్పవలయును" అని ప్రార్థించెను. అంతట నానకు కరుణించి ఒక చిన్న కాగితముతో ఒక చిన్న పడవను జేసి ఇచ్చి "రాజా! దీనిపై నీపరివార మంతటితో నెక్కుదవేని ప్రయత్నము లేకయే నిన్నిది అద్దరికిఁ జేర్చును" అని చెప్పి, శిష్యుని వెంటనిడుకొని "శిలాత్వము వహింపుము" అని నది కాజ్ఞాపించి తొల్లిటివలె దాఁటిపోయెను. అంతట రాజు ఇది చూచి మిగుల నచ్చెరువడి ఆచిన్నిదోనెను నీటిలో వేసి చాల ధైర్యముతో దానిపై నెక్కెను. అది రాజు ఎక్కిన వెంటనే మఱి యొకనికి చోటిచ్చెను. మఱియొకఁ డెక్కఁగా మఱియొకనికిఁ జోటిచ్చెను. ఇంకొకఁ డెక్కఁగా ఇంకొకనికి తావిచ్చెను. వేఱొకఁ డెక్కఁగా వేఱొకనికి స్థలమిచ్చెను. ఈతీరున పరివార మంతయు ఎక్కిన వెంటనే, ఆదోనె విమానమువలె క్షణములో అవ్వలిగట్టుఁ జేరెను. అంతకు రాజు పరివారముతోఁగూడ తీరముఁ జేరి, తనకంటె ముందుగనే నానకు అచ్చటకు వచ్చి యుండుటఁజూచి, మఱింత వింతపడి సాష్టాంగ మాచరించి, "మహాత్మా! నీవు లీలామానుషవిగ్రహుఁనివలె తోఁచుచున్నావు. కరుణించి నాకు తారక [illegible] చెప్పి

వలయునను" అని ప్రార్థించెను. నానకు అందులకు ఆనందించి అష్టాక్షరీమంత్రము ఉపదేశించి "ఏకాంత భక్తితో దీని నుపాసింపుము. నారాయణుడు నీకు సాక్షాత్కరించును" అని చెప్పి అతనిని పంపివేసి, తాను స్వదేశమును చేరుకొనియెను.

పిదప కొన్నిదినములకు అతడు పునహానగరము చేరుకొనియెను. అచ్చట అంతకుపూర్వమే వచ్చియున్న గోరక్షకులు కొందఱు వచ్చి నానకుని సేవించి, "మహాత్మా! నీప్రభావము అత్యద్భుతము. అశ్రుతపూర్వము. మీదర్శనమువలన మేము తరించితిమి. రేపు హరిద్వారమునకు ఒక్కముహూర్తమున నాలుగులక్షల హరిదాసులు చేరనున్నారు. ఇంతవఱకును వారికి అన్నప్రదానముచేయు మహాత్ము లెవరును కాన్పించుటలేదు. ఎంతో ప్రయత్నము చేసినఁగాని అది నెఱవేఱదు. ఎంతధనవంతులైనను, ఇంత స్వల్పవ్యవధిలో ఆపనిని చేయఁజాలరు; కావున మీరు పూనుకొనవలసియున్నది. లేకున్న ఆహరిదాసు లందఱును క్షుధార్తు లగుటయు, తన్మూలమున దేశమునందలి జను లెల్లరును పాపభాజను లగుటయు సంభవించును. మహాప్రభావసంపన్ను లగుట మీరొకక్షణములో నిర్వహింపఁగలరు; కావున మిమ్ము ప్రార్థించుచున్నారము" అని పలికిరి. "ఏలినవారల చిత్తములకు వ్యతిరేకము చేయుటకు సాహసింపఁజాలను. కావున తాముఁగూడ అచ్చటికి విజయముచేసి, నే నొసఁగు హస్తోదకమును స్వీకరించి, నన్ను తరింపఁజేయవలయును. మఱి మావిశేష ప్రార్థన మేమనఁగా, హరిదాసు లందఱును అచ్చటకు వచ్చి తమ్మాదరించువారు ఎవ్వరును లేమి తల్లడంపడుదురు; కావున అట్టిదే సంభవింపకుండ 'నానకు దేవరవారలకు తీర్థోదకము నిచ్చి సేవించును' అని ముందుగ మీరు పోయి అచ్చట చాటించవలయును." అని నానకు బదులుచెప్పెను. తోడనే గోరక్షకులు తమతపఃప్రభావమువలన ఆకాశమార్గమున బయలుదేఱిపోయిరి.

గోరక్షకులు మఱునాఁడు ఉదయము జామున్నర ప్రొద్దెక్కునప్పటికి హరిద్వారము చేరుకొని, అచ్చట హరిదాసులు నాల్గులక్షలమందియు ఒకచో గుమిఁగూడి యుండుటఁ జూచి క్రిందికి దిగి, "భక్తాగ్రేసరులారా! నేఁడు మీకందఱకును, నానకు దాసులు అన్నప్రదానము చేయుదురు. ఒక్కక్షణము తాళుఁడు. కంగారుపడి ఎచ్చటకును బోవలదు" అని చెప్పిరి. ఇది విని హరిదాసు లందఱును ఒక్కమాఱు పకపక నవ్విరి. ఆనవ్వువలన బ్రహ్మాండభాండ మంతయు నిండిపోయెను. వారిలో కొందఱు "అయ్యా! మీరింకను తప్పుత్రోవనే యున్నారు. నానకుదాసులు వచ్చి మాకు మృష్టాన్న మొసఁగుటయు, దివ్యతాంబూలములు ఇచ్చుటయు ఇంతకు పూర్వమే జరిగిపోయెను. ఇఁక మీకు శ్రమయేల?" అని పలికిరి. ఇది విని గోరక్షకులు వింతపడుచుండఁగా, నానకు అచ్చటికి వచ్చెను. ఆతనిం జూచి గోరక్షకులు తటాలున సాష్టాం

గను నాదరించి, "మహాత్మా! మీ ప్రభావము తెలియంగఁజాలకపోయితిని. మీవంటి భాగవతాగ్రేసరులు ఇక లేరు" అని కొనియాడి, యథేచ్ఛగా ఆకాశమార్గమునఁ బోయెను. నానకు తన మతమునకుం బాయి చేసికొనియెను. అతఁడు బ్రతికియున్నంత కాలము ఇట్టి నేకమహాద్భుతకార్యములను జేసి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

ఉ. "చల్లనివాని నవ్వు వెదఁజల్లెడువాని దయారసంబు జొ
బ్బిల్లెడువానిఁ గెంపుజిగి పెంపు చెలంగెడు మోవివాని సం
ఫుల్లసరోజనేత్రములఁ బొల్చినవానిఁ బయోధివీచికా
వేల్లితనీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్."          (కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 17.)

---

# 44. నరసింహమేధ.

శ్లో. "ముగ్ధం స్నిగ్ధం మధురమురళీమాధురీధీరనాదైః
కారం కారం కరుణవివశం గోకులవ్యాకులత్వమ్,
శ్యామం కామం యువజనమనోమోహనం మోహనాంగం
చిత్తే నిత్యం నివసతు మహో వల్లవీవల్లభం నః."          (కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 50.)

ద్వారకాపురమునుండి పిపాజిరాజు భార్యతోఁగూడి కాశీనగరమునకుఁ బోవుచుండెను. ఆదంపతు లిరువురును భక్తశిఖామణులు. వారు గురుదేవుఁడగు శ్రీరామానందస్వామిని దర్శింప వారణాసీనగరమునకుఁ బోవుచుండఁగా, నొక భీకరమగు శార్దూలము అడ్డువచ్చెను. దానినిచూచి రాణి చాల భీతిల్లెను; కాని భక్త తత్వము నుపదేశించుటవలన భీతిమాని, దానిని చెంగటకుఁ బిలిచెను. ఎంతో కోపముతో వారిపైఁ బడవచ్చిన ఆబెబ్బులి ఆమె పిలిచినవెంటనే మిగుల సాధువై, వారి సమీపమునకుఁ బోయెను. అంతట రాజు బుజ్జగించి, దాని చెవిలో తారకమంత్రమును ఉపదేశించెను. అదిమొదలుకొని శుద్ధసాధుస్వభావముతో వర్తించుచు, ఆబెబ్బులి కొలఁది దినములయందే ఆవ్యాఘ్రదేహమును జాలించి, పురాతనవటము అను గ్రామమున ఒక బ్రాహ్మణునకు కుమారుఁడై పుట్టెను. తలిదండ్రులు ఆబిడ్డకు నరసింహమేధ అని పేరుపెట్టిరి.

నరసింహమేధకు ఏడుసంవత్సరముల వయస్సు వచ్చునప్పటికి; తలిదండ్రులు ఇద్దఱును ఒక్కమాఱుగ పరమపదించిరి. అదిమొదలు పినతండ్రియు, అన్నయు ఆతనిం బెంపఁజొచ్చిరి. తలిదండ్రులను గోలుపోయిన పసిపాప యగుటవలన వారీతనిని శిక్షింపక, చాల గారాబముగఁ జూడసాగిరి. ఈగారాబమువలన ఆతఁడు పెంకెవాఁడును, ఆకతాయియు నై కొలఁదిదినములయందే వారిని నిర్బం[illegible] భోజన

సమయమునఁ బక్క తక్కినసమయములయందు తనవంటిబాలకులతో విశ్శృంఖల ముగఁ బ్రవర్తింపసాగెను. అయినను అన్నయుఁ బినతండ్రియు అతనిని శిక్షింపఁ దలంపఁగా నలేదు; కాని వదినెయు పినతల్లియు మఱికొందఱు దగ్గఱిబంధుకురాండ్రును “మాళవసింహామేధ అస్పృష్టసంతుఁడు. అతని పాప లేశమువలన పెండ్లియగుట తట స్థింపనేసి ఈతనికి పెండ్లాముగాడవ లేమియు సక్కఱ లేదు. అది భుజించిన భుజించితివా యని యడుగఁడు. లేకున్న మానితివా? యని యడుగఁడు. ఇతఁడు ఏమయిన సంపాదించినప్పుడును, ఇతని పాండిత్యమును మెచ్చి యెవరైన ఒకదమ్మిడి ఇచ్చినపుడును గదా అగోడవ? కాపటయ్యా! ముద్దులయ్యా!” అని తలుచుగ హేళనము చేయ సాగిరి. దీనిని భరింపలేక కొన్నిదినములైన తరువాత, అతఁడు ఏరికిని జెప్పకుండ దిక్కుతెలియకుండ పాఱిపోయెను.

పోయిపోయి, అతఁడొక మహారణ్యమును ప్రవేశించెను. భయంకర మగు నాగహనము దాఁటునప్పటికి అతని కాయాసము తోఁచెను. అగుట నాతఁడొక చెట్టు నీడను గూర్చుండి “దీనికై విచారింపవలసిన పనిలేదు. వారు నన్ను హేళనము చేయుట కట్టి మాటలాడినను,' అవి నాకు తొల్లి ధ్రువునకు సవతితల్లి మాటలువోలె జ్ఞానోదయమునకే హేతువులైనవి. నానెత్తిమీఁద తాండవమాడుచుండిన శని నేను బయలుదేరినపుడే తొలఁగిపోయెను. ఇఁక నేను అంతములేని సంసారసాగరమునఁ గూలక మోక్షమార్గమునఁ బ్రవేశించెదను” అని యనుకొని, తటాలున లేచి ముందునకు బయలుదేఱెను. కొంతదూరము పోవునప్పటికి ఒకశివాలయము కాన్పింపఁగా, నాతఁడు అట్టినిర్జనారణ్యమున దేవాలయముండుటకు వింతపడి “సంగతియేమో చూచెదను” అని తలంచి, ధైర్యము నవలంబించి లోనికి పోయెను; కాని అం దెవ్వరును కాన్పింపలేదు. అయినను జంకక అతఁడు అందలి మహాలింగమునెదుట మోఁకరించి నిలిచి చేతులు జోడించుకొని,—

సీ. “దేవా జగన్నాథ దేవేంద్రవందిత వితతచారిత్ర సంతతపవిత్ర
వాలాహాలాహార యహిరాజకేయూర బాలేందుభూష సద్భక్తపోష
సర్వలోకాతీత సద్గుణసంఘాత పార్వతీహృదయేశ భవవినాశ
రజతాచలస్థానగజచర్మపరిధాన సురవైరివిధ్వస్త శూలహస్త
తే. లోకనాయక తద్భక్తలోకవరద, సురుచిరాకార మునిజనస్తుతివిహార
భక్తజనమందిరాంగణ పారిజాత, నిన్ను సేవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ!”

(భాగవతము. స్కం. 10. ప. 302.)

అని అనేకవిధముల సన్నుతిచేయఁ దొడఁగెను. ఈసందర్భమున నాతనిహృదయము పార్వతీరమణునియందు సంపూర్ణముగ లీనమైపోయెను. ఇట్లుండఁగనే ఏడుదినములు

గడచిపోయెను. అంతట మహేశ్వరుడు ఆతని స్తోత్రపద్ధతికిని మనోనైర్మల్యము నకు పరమానందభరితుడై సాక్షాత్కరించి, "వత్సా! నీభక్తికి మెచ్చితిని. నీకేమి కావలయునో కోరుకొనుము" అని చెప్పెను. అందులకు నరసింహమేధ ఉప్పొంగి పోయి, "చంద్రశేఖరా! మునికులతిలకులకుగూడ అగోచరుడవగు నీవు సాక్షాత్క రించుట వలనను, కావలసినది కోరుకొనుమనుటవలనను నేను ఆనందపరవశుడనై యున్నాను. కావున నాకేమి కావలయునో నాకు దెలియుటలేదు. కావున నీకు అత్యంత ప్రియతమ మగు వస్తు వేదియో దానిని అనుగ్రహింపుము" అని కోరెను. ఇది వినగనే శివునకు చిఱునవ్వువచ్చెను. అంతట నాతడు నరసింహమేధ వీపుపై ( తట్టుచు "వత్సా! తెలియకనుచునే సనకసనందనాదులకుగూడ అగోచరమగు పదార్థ మును గోరితివి. నాకు ప్రియతమ మగు వస్తుజాలమునం దెల్ల రుక్మిణీవల్లభుడు ప్రియ తముడు. కావున ఆతనిని నీకిచ్చుచున్నాను." అని ఆతనిని వెంటనిడుకొని యమునా తీరమునకు బోయెను. తోడనే ఆగోపాలుడు పశుపతిచెంతకు వచ్చెను. శ్రీహరియు శ్రీకంఠుడును ఒకరితోనొకరు ముఖ్యవిషయములను ముచ్చటించుకొనుటయైన తరు వాత, నరసింహమేధ ప్రస్తావము వచ్చెను. అపుడు మహేశ్వరుడు నరసింహమేధచే శ్రీకృష్ణునకు సాష్టాంగనమస్కారము లాచరింపజేసి, సంగతిసందర్భములన్నియు నెఱిం గించెను. ఇది విని శ్రీకృష్ణుడు నరసింహమేధను చేరదీసి "వత్సా! నీవు భాగ్యవంతు డవు కావుననే ఈమహాత్ముని దర్శనము లభించినది. లోకకళ్యాణసంధాత యగు పరమశివుని యనుగ్రహమునకు పాత్రుడైనవానికి ఇక లేనిదేమున్నది? నీభక్తికి ఆనం దించితిని. నిన్ను నాయంతరంగభక్తులలో జేర్చుకొని, నీహృదయమునందు నివసించి యుండెదను. నీవు ఇక నజ్ఞానపతితమైయున్న లోకము నుద్ధరింపుము" అని నియ మించి, శంకరునివద్ద సెలవుగైకొని వెడలిపోయెను. పిదప నీశ్వరుడు నరసింహ మేధను వెంట నిడుకొని తన యాలయమునకు వచ్చి, "వత్సా! ఇక నీకు లోపము లేదు. శ్రీహరి యంతరంగ భక్తుడవైతివి" అని చెప్పి తిరోహితుడయ్యెను.

ఆనిమిషము మొదలుకొని నరసింహమేధ నిద్రాహారములను లెక్కచేయక, అహోరాత్రములు శ్రీకృష్ణగుణకీర్తనమును, గావించుచు ఆశివాలయమునందే యుండెను. కొన్నిదినములకు ఆతని కొఱకు దేశమంతయు వెదకుచున్న ఆతని యన్న అచ్చటకు వచ్చి అనేకవిధముల బోధించి యింటికి గొనిపోయెను. ఆయూర నుండిన యొక బ్రాహ్మణుడు నరసింహమేధ ప్రభావమును జూచి ఆశ్చర్యపడి, తనకుమా ర్తెను ఆతని కిచ్చి పెండ్లి చేసెను.

కొన్నిదినములకు నరసింహమేధకు చాలమంది కుమారులును కొమా[illegible] గలిగిరి. ఈతీరున సంసారము పెరిగిపోయినను, ఆత్మనివ[illegible]

పాపకమలములనుండి ఒక క్షణమైనను వియోగమును బొంది యెఱుఁగదు. ఇట్లు అచంచలభక్తిలో ఆతఁడు కాలము గడుపుచుండుటఁ జూచి, ఎఱిఁగినవారందఱును ఆశ్చర్యపడుచుండిరి. మఱికొన్నిదినములకు అతని పెద్దకుమారుఁడు వివాహ యోగ్యుఁడయ్యెను.

పురాతనవటమునకు సమీపమున శ్యామలాపురము అను నొక గ్రామముగలదు. అందు త్రిపురాంతకుఁడు అను నొక బ్రాహ్మణుఁడు వర్తకమువలన అసంఖ్యధనమును సంపాదించుచు, మహావైభవముల ననుభవించుచుండెను. ఈసమయమునకే ఆతని కొమార్తెగూడ వరయోగ్య యయ్యెను. అది చూచి త్రిపురాంతకుఁడు కృష్ణభట్టు అను తనపురోహితుని రావించి, "మహాశయా! అమ్మాయి ఇపుడు వరయోగ్యయై యున్నది. నీకంటె మాకు మనసుకలసినవారును, మామంగళమును గోరువారును లేరు. కావునఁ నీవు పోయి తగిన వరుని వెదకి నిశ్చయించుకొని రమ్ము" అని చెప్పెను. 'వల్లె'యని కృష్ణభట్టు ఇంటికిఁబోయెను.

కృష్ణభట్టుహృదయము ఆలోచనాధీనమయ్యెను. "త్రిపురాంతకుఁడు సదాచార సంపన్నుఁడు. సత్కులప్రసూతుఁడు. చాల మర్యాదకలవాఁడు. వధువుగూడ అన్నిఁటను ఎన్నఁదగినది. ఈప్రాంతములయందు ధనవిషయమునఁ దక్క తక్కిన సకలవిషయ ములయందును, ఒక్కనరసింహామేధ తక్క త్రిపురాంతకునకు సాటియగువారు మఱె యెవరును లేరు. ధనమున త్రిపురాంతకుఁడు కుబేరుఁడైనచో, భగవత్సేవయందు నరసింహామేధ ప్రహ్లాదునియంతటివాఁడు. విషయములు భిన్నములైనను, ఇరువురును గూడ మహోన్నతులు. వీరి బాంధవము చాల బాగుగనుండును" అని తలఁచి, కృష్ణ భట్టు వెంటనే బయలుదేఱి పురాతనవటమునకుఁ బోయి, నరసింహామేధతో ఈప్రస్తా వన చేసెను. వెంటనే నరసింహామేధ యంగీకరించెను. మఱునాఁడే కృష్ణభట్టు శ్యామలా పురమునకుఁబోయి సంగతి యంతయు త్రిపురాంతకునకు ఎఱింగించెను.

ఈసంబంధము త్రిపురాంతకుని కుటుంబమున గుసగుసలకును, మూతివిఱుపు లకును హేతు వయ్యెను. దీనినిగుఱించి త్రిపురాంతకుఁడు చాల యోచించెను. "నరసింహామేధ మహాభాగవతశిఖామణియే కావచ్చును; కాని యాతనికి ధనము లేదు. వైభవములేదు. ఒక్కపూటకైన గంజియైన పూర్తిగ లేదు. ఆతనితో నాకేటి వియ్యము! అయినను కృష్ణభట్టు నిశ్చయించుకొనివచ్చెను; కావున వలదనుటకు వీలులేదు. ఏలోపమైనను నరసింహామేధమీఁద పడవలెనుగాని, నామీఁదికి రాకూ డదు. ఇందులకు తగిన తంత్రము పన్నెదను." అని యోచించి, మఱల కృష్ణ భట్టునిఁ జూచి రేపే వివాహమునకు తగిన దినమైయున్నది. రేపటిముహూర్తము దాఁటినచో మఱల నేనింతలో వివాహప్రయత్నమును జేయఁజాలను. నావైభవ

మునకు తగినట్లు రాఁగలఁడేని నరసింహమేధను రక్షింతుము. లేకున్న నీవు చేసిన నిశ్చయమునకు నేను బాధ్యుఁడను కాఁజాలను" అని చెప్పెను. కృష్ణభట్టు పోయి యీసంగతి తెలుపఁగా నరసింహమేధ మందహాసము గావించి, "అన్నిటికిని పాండు రంగఁడే కలఁడు. రేపటికే నేను తరలి వచ్చెదను" అని బదులు చెప్పెను. ఈసంగతి కృష్ణభట్టు వెంటనే త్రిపురాంతకునకు ఎఱింగించెను; కాని త్రిపురాంతకుఁడు వానిని నమ్మక "అయ్యా! ఏల నీ కీవెఱ్ఱి? కేవలము జడమతి యని పేరుగొన్న నరసింహమేధ ఇట్లు చేయఁగలఁడని నీవు నమ్మియే నీవు నా కీమాట చెప్పవచ్చితివా ? ధనవంతుఁడే ఇంత యవ్యవధిగా మహావైభవమును సమకూర్చుకొని వచ్చుట కష్టము. అట్టిచో పూఁటకు దిక్కులేని నరసింహమేధ ఎట్లు రాఁగలఁడు ? నీ కెంత వెఱ్ఱి ? కూలియివ్వని వాఁడు ఓడ ముం దెక్కినట్లు, ఆనిర్ధనుఁడు పెండ్లికొడుకును వెంటఁ బెట్టుకొని రావచ్చును. అది నాకేకాదు. నాసేవకునకైన అల్పమైన వైభవమా ? అట్టివానితో నే నెట్లు సంబంధము చేయఁగలను?" అని పరిహసించుచు పలికెను. అందులకు కృష్ణ భట్టు అసంతృప్తుఁడై "ఓయీ! నీవు యోచింపకుండ పలుకుచున్నావు. ధనమును బట్టియే నీవు గొప్పతనమును గొల్చుచున్నావు ; కాని మనస్సును బట్టి గాదు. ఆతని మహిమను నీ వెఱుంగవు. సర్వశక్తుఁడగు భగవంతుఁడు ఆతని పాలఁ గలఁడు. అగుంట నాతనికి అసాధ్యములేదు. పరమభాగవతోత్తములు నీవంటివారికి జడప్రాయులై తోఁచవచ్చును. కాని మీయూహామే యర్థము కాదు. నిజముగ నీవు గర్వము విడిచి, తగుసన్నాహముతో నుండవేని రేపు శృంగభంగము గాక తీఱదు. నేను నీకళ్యాణమును కోరవలసినవాఁడను గాన సంగతి చెప్పుచున్నాను" అని చెప్పెను.

అట నరసింహమేధ వేకువను మేల్కాంచి, స్నానసంధ్యాద్యనుష్ఠానము లన్నియు నెఱవేర్చుకొని బంధువులు, మిత్రులు, భాగవతులు మున్నగువారిని వెంటఁబెట్టుకొని, మద్దెల తాళము మొదలగు మంగళవాద్యములు బోరుకలంగ శ్యామలాపురమునకు బయలుదేఱెను. శ్రీకృష్ణుఁడు, బంధువులు, మిత్రులు, స్నేహితులు, ఆశ్రితులు, భాగవతులు, తన అంతఃపురము మున్నగు సకలపరివారముతోఁడను వచ్చి నరసింహమేధను గలిసికొనెను. దేవతలు అందఱును వచ్చిరి. పిదప అందఱును ఒక్క క్షణమునకు శ్యామలాపురము సమీపించిరి.

ఊరి బయట అందఱును ఒకచో విశ్రమింపఁ జేసి, శ్రీకృష్ణుఁడు దూతల నంపి తమ రాకను త్రిపురాంతకునకుఁ దెలియఁబఱచెను. వెంటనే వెడలిపోయి ఊరివా రందఱును వెంట నిడుకొని అచ్చటకువచ్చి, అచ్చటివా రెల్లరును [illegible] తేజస్సంపన్నులై ఉండుటఁ జూచి, తొలుత ఒక్కొక్కరికే నమస్కరింప [illegible] అది సాధ్యముకామి తుదకుఁ జేతులెత్తి పొమ్ముబాయి[illegible] సంఘమునకు [illegible],

ఉజ్జ్వలన నరసింహమేధ చెంతకు పోలేక పోలేక ఎట్లో పోయి, మాటాడలేక నిలిచెను. అప్పుడు కృష్ణభట్టు ఆచెంతనే యున్న శ్రీకృష్ణునిఁ గాంచి "శ్రీహరీ! మేము చాల సంతృప్తిచెందితిమి. నరసింహమేధ కారణముగా మీదర్శనము మాకుఁగలిగెను; కావున తొలుత ఆభాగవతశిఖామణికిని, పిదప ఆర్తత్రాణపరాయణుఁడవగు నీకును వందనములు చేయుచున్నాను. ఇందు నీకు కానివా రెవ్వరును లేరు. నీవు నరసింహమేధ పక్షముగ వచ్చితివి. అది నీకు తగునా? త్రిపురాంతకుఁడు కూడ కరుణాదృష్టుఁడు కాఁడా? ఈపక్షపాతము నీచేఁ జూపఁబడవచ్చునా? వారితోఁగూడి తరలి వచ్చితివి. వీరితోఁగూడి ఈకార్యభారమంతయు వహింపుము. ఈయుభయుల కీర్త్యపకీర్తులును మంచిచెడ్డలును నీవే" అని విన్నవించెను.

అందుల కేమియు మాఱుపల్కక శ్రీహరి త్రిపురాంతకునిదిక్కు మొగంబై "నిన్న నీవు కృష్ణభట్టుచే మావైభవమునకు తగినట్లు తరలిరావలయునని నరసింహమేధకు వర్తమానము చేసితివి. నరసింహమేధ తనకుఁ దగిన వైభవముతో వచ్చెను. నీవు చేసినసన్నాహ మేమో చూపుము" అనెను. దీని కేమియును తోఁచక త్రిపురాంతకుఁడు ఊరకుండఁగా, శ్రీకృష్ణుఁడు "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే" అనునట్లు వియ్యము తుల్యులకే తగును. నీవు మాత్రము ఈన్యాయ మెఱుఁగవా? మావైభవమునకు నీసంబంధము తగని దని నీవే యెఱుఁగుదువుకదా! అయినను ఇంతదూరము వచ్చి, వచ్చినపని చేసికొనకుండ మఱలిపోవుట మాకు మర్యాద కాదు. తొలుత మీసన్నాహమంతయుఁ జూపుము" అని మఱల నడిగెను. ఈతర్జనభర్జనములవలన త్రిపురాంతకుని హృదయము కలఁగిపోయెను. ఆతనికి కర్తవ్యజ్ఞానమును వక్తవ్యజ్ఞానమునుగూడ తొలఁగిపోయెను. తుదకాతఁ డేమియుఁ దోఁచక "మీ రెవరు?" అని శ్రీకృష్ణుని ప్రశ్నించెను. శ్రీకృష్ణునకు నవ్వు వచ్చెను. అంతలోనే దాని నాపుకొని అతఁడు "ఓయి! నీవు ద్వారకానగరము ఎఱుఁగుదువుకదా! అందలి వర్తకులలో నరసింహమేధ అగ్రస్థానమును వహించియున్నాఁడు. ఆపురమున ఈతనికి అనేకవర్తకశాలలుగలవు. అచ్చటిపనియెల్లఁజూచుటకు ఈతఁడు నన్ను నియమించియున్నాఁడు. ఇపుడు తనకుమారునకు పెండ్లియనియు, ఈవివాహసంబంధములగుకార్యము లన్నియు నీవే నెఱవేర్పవలసిన దనియు, ఈనరసింహమేధ వర్తమానముచేయుటచే నేను వచ్చితిని. నావృత్తాంతమిది. మీపురోహితుఁడగు కృష్ణభట్టు మాటలవలన నీసంగతి అంతయుఁ దెలియనైనది. ఇఁక నాలోచింపవలదు. నీవు పోయి నీబంధుమిత్రాదులను రమ్మని వార్తచేయుము" అని పలికెను. ఈనియమమువలనను, కృష్ణభట్టు తొందఱ పెట్టుటవలనను, త్రిపురాంతకుఁడు ఆపని సేయుటకై పోయెను. తోడనే శ్రీకృష్ణుఁడు విశ్వకర్మను స్మరించి "వివాహమంటపము వేయున్నగు

సకలమును ఏర్పాటు చేయుము" అని ఆజ్ఞయిచ్చి, "తక్కినవన్నియు మీరు నెఱవేర్పుఁడు" అని కామధేనుప్రభృతులకు, కల్పతరుప్రభృతులకు ఆజ్ఞ యిచ్చెను.

మఱి కొన్ని దినములలో అన్నియు సిద్ధమయ్యెను. బంధు మిత్రాదులంద ఱను జేర్చుకొని త్రిపురాంతకుఁడు వచ్చెను. శచీదేవి మున్నగు దేవతాస్త్రీలు పెండ్లి కొమార్తెను అలంకరించి తెచ్చిరి. వివాహము భూనభోంతరాళములు బోరుకలంగ మహోత్సవముతో నెఱవేఱెను. అందఱును స్వస్థానములకుఁ బోయిరి. నరసింహ మేధ పురాతనవటము చేరినతరువాత శ్రీకృష్ణుఁడు ఆతనిని చేరఁబిలిచి, "వత్సా! నీ కేమియు చింతవలదు. నీ కేమియు లోపము లేదు. నీవు నాయంతరంగభక్తుఁడవు. వలసినప్పు డెల్ల ఇట్లే నేను నీకన్నియు నెఱవేర్చుచుందును" అని చెప్పి, సపరి వారుఁడై అంతర్హితుఁ డయ్యెను.

భగవల్లీలకు విచిత్రపడుచు నరసింహమేధ ఆనందపరవశుఁడై కాలముగడపు చుండఁగా, పురాతనవటమునకు కొందఱు సాధువులు వచ్చిరి. వారు ద్వారకాయాత్ర చేయుటకై బయలుదేఱినవారు. వారిచెంత ఆఱువందల వరాలు ఉండెను. మార్గ మధ్యమున చోరులవలన అపాయము కలుగవచ్చు నని శంకించి, వారు ఆవరాలకు మాఱుగ హుండీని గొనిపోవ నిశ్చయించుకొనిరి. కావున వారు "ఈ గ్రామమున ద్వారకయందలి వర్తకులకు హుండీని ఇచ్చువారలు గలరా?" అని ప్రశ్నింపఁగా, నరసింహమేధ భాగ్యమును జూచి ఓర్వలేని కొందఱు మహానుభావులు "నరసింహ మేధ చెంతకుఁ బోయితిరేని మీయభీష్టము నెఱవేఱును" అని చెప్పిరి. అంత నా సాధువులు నరసింహమేధచెంతకుఁ బోయి సంగతియంతయు నెఱింగించిరి.

తొలుత నరసింహమేధ తెల్లవోయెను. పిదప అబ్బురపడెను. పిమ్మట గడగడ లాడెను; కాని తుదకు ధైర్యము తెచ్చుకొని "ఇట్టిదిగలదా? ఇది యేమో భగవం తుని మాయగా నున్నది. నేను పూటకు దిక్కులేనివాఁడ నని యీగ్రామమున ఆబాలగోపాలముగ నందఱకును దెలియును. అయినను వీరిని ఎవరో నాచెంతకుఁ బంపిరఁట! దీనియాద్యంతము లేమియు బోధపడుట లేదు. అంతయుఁ జూడఁగా ఇది ఈశ్వరోద్దేశమని తోఁచుచున్నది; కావున నీయాఱువందల వరాలను స్వీకరిం చెదను. ఈరొక్కమును దీనజనులకు నాచేతులతో పంచిపెట్టుట భగవంతుని సంక ల్పము. ద్వారకయందు సర్వాధారుఁడగు శ్రీకృష్ణపరమాత్మయే నాకు దిక్కై యున్నాఁడు. ఆమహాత్ముఁడు నాఁడు శ్యామలాపురమున త్రిపురాంతకునితో తాను ద్వారకయందు నావర్తకము చక్కఁబెట్టు నాప్రతినిధినని చెప్పినమాటలకు ఇదియే యర్థమని తోఁచుచున్నది." అనితలంచి, ఆవరాలను గైకొని "వీరు నాకు ఆఱువందల వరాలు చెల్లించినారు. వీరినిఁ జూచిన వెంటనే ఈహుండీని గైకొని ఆసొమ్ము ఇచ్చి వేయునది" అని ఒక వర్తకుని పేర హుండీ వ్రాసి. సాధువులకు ఇచ్చివేసెను.

నిర్విచారముతో సాధువులు ద్వారకానగరమునకుఁ బోయి, ఒకటి రెండు దినములైన తరువాత ధనము అవసరము కాఁగా, హుండీమీఁద వ్రాయఁబడిన పేరుగల వర్తకుని వెదకసాగిరి. నాలుగైదుదినములు వెదకిరి; కాని ప్రయోజనము లేకపోయెను. ఎవరు చెప్పినను "పూటకు గతిలేనినరసింహామేధకు ఈయూర వర్తకశాల లననేమి? వానిపై అధికారి యననేమి? వానిపేర హుండీ యన నేమి? ఇందేమియు అర్థము లేదు. కేవలము మోసము. శుద్ధముగ వంచనము. మీయాఱువందల వరాలును బుగ్గిమైపోయినవి" అనియే చెప్పసాగిరి. సాధువులు తుదకు ఇట్లే నిశ్చయము చేసికొనిరి. తోడనే వారి నవనాడులును క్రుంగిపోయినవి. మీఁదిప్రాణములు మీఁది కెగిరిపోయినవి. తుదకు చేయునది లేక వారు ఒకనిర్జనస్థలమునందలి ఒక చెట్టుక్రిందఁ గూర్చుండి సావకాశముగ దుఃఖింపసాగిరి.

ఇట్లుండ, సర్వాంతర్యామి యగు శ్రీ కృష్ణభగవానుఁడు ఒకవర్తకునివేషము ధరించి, ఒక గుఱ్ఱపుబండిపై నచ్చటకు వచ్చి, "మీరేల దుఃఖించెదరు ?" అని వారిని పలుకరించెను. అందులకు వారు "దుఃఖకారణ మేమున్నది? ఆఱువందల వరాలను మేము గంగలో కలుపుకొంటిమి. శ్రీహరికిఁ జేయింపఁదలఁచుకొన్న భోగము లన్నియు కలలోని ముచ్చట లై పోయినవి" అని పలికిరి. అందులకు మందహాసముచేయుచు, వర్తకవేషధారియగు శ్రీహరి "బ్రాహ్మణోత్తములారా! ఏల దుఃఖించెదరు? మి మ్మెవరో మోసముచేసినారు. మీవరాలు పోలేదు. మీవిరోధు లెవరో మీకు భీతికల్పించియుందురు. మీరు తెచ్చిన హుండీని జూపెదరేని మీ వరాలు మీకు చెల్లించెదను. మీరు పురాతనపటమున నరసింహామేధకు ఆఱువందల వరాలు చెల్లించియున్నారు. ఇది నిజమేకదా! నేను ఆమహాత్ముని ప్రతినిధిని. నన్ను ఇచ్చట అందఱును ఎఱుఁగుదురు. అయినను ఇచ్చటకు అనేకసాధుజనులు వచ్చుచున్నారు; కావున వారివలన వస్తువులకు హెచ్చువెలలు వేసి చాలధనము సంపాదింపవచ్చునని తలంచుచుండు ఇచ్చటివర్తకులకు పోటిగా, మేము సకలవస్తువులను చాల చౌకగా నిచ్చుచుండుటనుబట్టి, మాయెడల ఇచ్చట ననేకులు విరోధము వహించియున్నారు. వారే మిమ్ము ఈదుఃఖముపాలు చేసిరి. నాచెంత ధనము సిద్ధముగా నున్నది. హుండీ చూపెదరేని ఇచ్చివేసెదను" అని పలికెను. సాధువులకు పోయిన ప్రాణములు తిరిగివచ్చెను. హఠాత్తుగ వారికి అనంతసంతోషము గలుగుట వలన ఆయానందము కూలంకషమై వారికి ఉక్కిరిబిక్కిరి యొదవించెను. కొంత సేపువారు నిశ్చేష్టులై యుండి ఆహుండీని జూపిరి. వెంటనే ఆవర్తకుఁడు ఆసొమ్ము చెల్లించి, అదృశ్యుఁడయ్యెను.

ఒకసాధువు "లెక్కలో పొరపాటు గలిగినట్లు తోఁచుచున్నది" అనియెను. ఇంకొకఁడు లేదనియెను. మూఁడవవాఁడు "సందేహ మెందులకు? మఱల లెక్కిం

పురాను" అనియెను. అందఱును ప్రస్తుతించిరి. లెక్క ప్రారంభమయ్యెను. ఒక్కొక్కరు రెండేసి సంచుల నగలువొప్పున లెక్కించి మూటలుగట్టి వెనుకకుఁ బడవేసిరి; కాని ముందున్నగుట్టమాత్రము తఱుగలేదు. కొందఱొక అనువందలవరాలు తీసిరి; వేఱొక అనువందలవరాలు తీసిరి; కాని గుట్ట తఱుగలేదు. వారికి ఆశ్చర్యము కలిగెను. "ఈతఁడు మానవమాత్రుఁడుగాఁడు. మనయదృష్టమువలన శ్రీహరియే ఇట్లు మానవరూపము ధరించి వచ్చెను" అని తలంచుకొని, మహానందభరితులై ఆనగరమున నెఱవేర్చుకొనవలసిన పన్నియు తీర్చుకొని, వెంటనే బయలు దేఱి పురా తనపట్టణమునకుఁ బోయి, నరసింహామేథను సందర్శించి "మహాత్మా! నీప్రభావము ఇట్టిదని తెలిసికొనఁ జాలకపోతిమి. నీవు కేవలము శ్రీహరికి అంతరంగభక్తుఁడవు. నీయనుగ్రహమువలన అయాచితముగ శ్రీహరి సాక్షాత్కరించి, మాకు సేవ యొసంగెను. నీవు మాకు చేసినమహోపకారమునకు కృతజ్ఞులమై యుందుము" అని చెప్పి, సెలవు గైకొని వెడలిపోయిరి. నరసింహామేథ ఆవార్తవిని ఆనందపరవశుఁడై నృత్యముఁ గావించెను.

కొన్నిదినములకు నరసింహామేథ కొమార్త రజస్వల యయ్యెను. అప్పుడాతనిభార్య "మన కొమార్తె నిఁక మనయింట నుంచుకొనుట మంచిది గాదు. ఆమె యింటికి ఆమెను పంపివేయుట యుక్తము" అని పలికెను. అదివిని వల్లెయని యాతఁడు తన కొమార్తెను గొనిపోయి అత్తింట విడిచి, "తల్లీ! మన యింట నున్నధనము శ్రీహరిదివ్యనామము. వీనిని గైకొని ఆహరినామమును కీర్తించు చుండుము" అనిచెప్పి ఆమెకు తంబురను తాళములను ఇచ్చెను. నాఁడు ఆయూరి స్త్రీలందఱును ఫలానివారికోడలు కాఁపురమునకు వచ్చిన దఁట, సారె తెచ్చినదఁట! చూచి వత్తము రండు" అని ఆతని యింటికి వచ్చిరి. ఇంటియజమానుఁడు వారినందఱను మర్యాదచేసి కూర్చుండఁబెట్టి, కోడలిని గొనివచ్చి వారినడుమఁ గూర్చుండఁబెట్టెను. తొలుత అచ్చట స్త్రీలెల్లరును ఆయింటి కోడలిసౌందర్యమునకుఁ జాల మెచ్చుకొని, "పిల్ల చాల తెలివితేటలైనదే, అని తోఁచుచున్నది" అనిపలికిరి. ఇట్లు కొంతసేపు ప్రశంస లయిన తరువాత ఒక ముసలమ్మ కండ్లు చికిలించుకొనుచు చూచి "అయితే కోడలు ఏమేమిసారె తెచ్చిన దమ్మా" అని యడిగెను. తోడనే యజమానురాలి ముఖము తుమ్మలలోఁ బ్రొద్దు క్రుంకిన ట్లయ్యెను. ఆఁడుబిడ్డముఖము రుసరుసలాడఁదొడఁగెను. ఆముసలమ్మమాట వినియు అత్తగారియొక్కయు, ఆఁడుపడుచుయొక్క ముఖములు చూచియు, కోడలు ముఖము చిన్న బుచ్చుకొనియెను. ఇదిచూచి ఆమెను మఱింత దుఃఖపెట్టుటకు ఆఁడుపడుచు నరసింహామేథ యిచ్చిన తంబురను తాళములను దెచ్చి వారినడుమ నుంచి "ఇదిగో [illegible]

తెచ్చిన సారె" అని పరిహాసముగఁ బలికెను. అంతట వారిలో నొకస్త్రీ మూతి ముడుచుకొనియెను. ఒకతె పెదవులు విఱిచెను. ఇంకొకతె కండ్లు తేలవేసెను. వేఱొకతె మందహాసము చేసెను. మఱియొకతె "ఏమమ్మా! మమ్ము వేళాకోళము చేసెదరు? మీకోడలు తెచ్చినసారె మేము చూడఁగూడదా?"అని సాగఁదీసికొనుచుఁ బలికెను. చిన్నపిల్లలు కొందఱు నవ్విరి. ఇదియంతయు నైనతరువాత యజమానురాలు "మాపిల్లవానికిని, మాపిల్లకును, నాకును లాంఛనములు తీఱుయోగము ఉన్న యెడల, మా అబ్బాయికి మొదట వచ్చిన సంబంధమే యై యుండును" అని తల ఆడించుచు వచించెను. ఆఁడుపడుచు "అమ్మా! నీకేమి వెఱ్ఱి? అన్నకే లేవిలాంఛనములు మన కెట్లు తీరును?" అని కన్నులు తేలవేసికొనుచుఁ బలికెను. ఈమాటలన్నియు వినియు, ఇదియంతయుఁ జూచియు, సహింపలేక ఆముద్దరాలు తండ్రివద్దకుఁ జని జరిగినదంతయు నెఱింగించెను.

అంతట నరసింహమేధ వెంటనే ఆస్త్రీసమూహముచెంతకు వచ్చి, వియ్యంకురాలినిఁ జూచి "చెల్లెలా! మాఅమ్మాయికి సారె ఏమియు మేముపెట్టలేదని మీకు కష్టముగా నున్నట్లు తోఁచుచున్నది; కాని మాయభిప్రాయము మీరు గ్రహింపలేదు. మాకు తోఁచినమట్టుకు మాకున్నమట్టుకు సారెపెట్టియే మాఅమ్మాయిని పంపఁదలఁచితిని; కాని యిచ్చట మీకేమేమి యిష్టమగునో మీరు ఏమి కోరెదరో తెలిసికొని మఱియుఁ దేవచ్చునని ఊరకయేవచ్చితిని. గతించినదేమియో గతించినది. ఇఁక ప్రస్తావనయేల? మీకేమేమి కావలెనో చీటివ్రాసియిండు. అన్నియు సాయంత్రమునకే తెప్పించెదను. అని వాక్రుచ్చెను. మొదట సారెప్రస్తావము తెచ్చినముసలమ్మ అదివిని "మంచిపనిచేసితివి నాయనా! నేను అనేకసంపన్నులుపంపిన సారెను చూచితిని; కాని ఎవరును వియ్యాలవారిఇష్టము నెఱింగి, వారు కోరిన వన్నియు తెచ్చిన వారు కారు. నాయనా! మహాలక్ష్మివంటి కన్నబిడ్డ అత్తింటికిఁ బోవునపుడు సారె ఇచ్చుట లాంఛనముగాని, ఇంతమాత్రమున లోకములోపుట్టినింటివారికి లోపము కలుగదు. అత్తింటివారికి లోపము తీరదు. ఈయాచారము సృష్టిమొదలుకొనియు వచ్చుచున్నది. ఎంత బీదవాఁడైనను తనకు సాగినంతమట్టుకు సారె పెట్టియే పంపును; కాని కొమార్తెను ఊఱక పంపఁడు. నీవు అన్నియు నెఱిఁగినవాఁడవు. నీకుఁ దెలుపవలసిన. దేమియు లేదు." అని పలికెను.

చీటి వ్రాయుట కొకఁడు కూర్చుండెను. తొలుత అల్లుఁడు ఇట్లు చెప్పెను. "పెండ్లికాలమున నాకేమి లాంఛనములు తీరలేదు. అన్నియు ఇప్పుడే తీర్పవలసియున్నది. వ్రాయుము. వెండిచెంబులజోడా, పట్టుతాపితా, చేతులకు మురుగులు, మురిడీగొలుసులు, దర్భముడిఉంగరము, బంగారు గోవత్రాడు, బటువు ఉంగరము

ఒకటి, పట్టంచుల కట్టుపంచలు, పంచెలపట్టుపంచము, పట్టు అంగరకా, కాళ్లకు వెండి పాపోసులు, పాగా పమాలు, వీనికిఁ దగిన తక్కినపరికరములు." పిదప అందుపడుచు ఇట్లు చెప్పెను. "జరిగపట్టుచీర, పెండ్లిలో సేయవలసినవి అయినను, ఇప్పుడు ఈయవలసినవి మూఁడును మొత్తము ఎనిమిది జరిగచీరలు, ఎనిమిదిపట్టురవిక గుడ్డలు, ఎనిమిది మోహారీలు, పసుపు, కుంకుమబొట్టు పెట్టె, రెండుకాళ్లుకడుగు పళ్లెములు, కాళ్లు కడుగుచెంబులు రెండు, మఱియొక మొహారీ, ఒకవెండిచెంబు, ఒక వెండిపళ్లెము, వెండితమలపాకులు, బంగరు పోఁకచెక్కలు, సున్నమునిమిత్తము ఆణి ముత్తెములు, ఇంకను తక్కిన లాంఛనములు. నిమ్మ్యెపురాలికికూడ కాళ్లుకడుగు పళ్లె మును, కాళ్లుకడుగు చెంబును తక్క తక్కినవన్నియుఁ గోరెను. మఱియు నామె యిట్లు చెప్పెను. "పితృతు పగు మాతల్లికి మెత్తని జామాకు; మేము పెర్పులుచు కొనఁబోవు దాసికి చీర; వియ్యంకునికి మిఁచిత్తమువచ్చినవి." నరసింహమేథ వానిని గూడ వియ్యంకునివలన తెలిసికొని వ్రాయించి, పిదప వ్రాసినవానినిఁ జూచి "నీకేమి కావలయును" అని యడిగెను. "నరసింహమేథ పరమదరిద్రుఁడు. అదియుఁగాక ఇప్పుడు ఉన్మత్తుఁడైనాఁడు. కావుననే ఇట్టిచీటి వ్రాయించినాఁడు. వీరికి కోరిన వన్నియు నిచ్చినపుడు చూతము" అని తనలో తాను నవ్వుకొని, "నాకు ఒక పెద్ద గుండురాయి కావలెను" అని లేఖకుఁడు వ్రాసెను.

నరసింహమేథ ఇది యంతయు నైన తరువాత, తనతోఁ గూడవచ్చిన సేవక వేషధారి యగు పాండురంగని చేతి కిచ్చి, నీవు బజారునకుఁబోయి చీటిలోనివస్తువు లన్నియుఁ గొనిరమ్ము" అని నియమించెను.

చిత్తము అని సేవకుఁడు బజారునకుఁ బోయి, క్షణములో అన్నియుఁ గొని వచ్చెను. వెంటనే నరసింహమేథ చీటిప్రకారము ఎవరు కోరినవి వారి కిచ్చి తుదకు "ఇదిగో పుచ్చుకొని సంతోషింపుము" అని వ్రాసినవానికి గుండురాతి నిచ్చెను. ఈదృశ్యమును జూచి అచ్చటివారెల్లరును పరమాశ్చర్యచకితులై అసమానమహి మాభిరాముఁడగు నరసింహమేథను చాల కొనియాడి, "నీనెత్తిమీఁద శని యున్నాఁడు. నీనాలుకమీఁద పెద్దమ్మయున్నది; కావుననే ఇట్టి కోరిక కోరుటకు నీకు తలంపు పొడమినది" అని వ్రాసినవానిని పరిహాసించిరి.

పిదప బంధువు లెల్లరును నరసింహమేథ సేవకునిఁ జూచి "నీ వెవఁడవు? నీపేరేమి?" అని యడిగిరి. అందులకు పరిచారకవేషి యగుపాండురంగఁడు "నేను నరసింహమేథ సేవకుఁడను. ద్వారకాపురమునందలి ఈతని వర్తకము నంతేను నేనే చక్కఁబెట్టుచుందును. ఈతఁడు తన కొమార్తెకు సారె పెట్టుచున్నాఁడని నన్ను రమ్మని వర్తమానముచేయఁగా వచ్చితిని. మీరు 'బాంధవముకం[illegible]

కంటెను ధనమే యధికము' అని తలంచువారే; కావున మీకు కావలసిన లాంఛనములనే కోరితిరి; కాని నరసింహమేథ కొమార్తెకు పెట్టదగినవస్తువులను కోరలేదు. అయినను లోపములేదు. ఇదిగో మాయజమానుడు తనకొమార్తెకు తెచ్చినసారె" అని బజారునకుబోయి సకలవస్తువులనుగొని తెచ్చి ఆయింట నప్పగించి, సంకల్పమాత్రమున భోజనపదార్థములన్నిటిని కల్పించి, అందఱకును విందుజేసి, చందన తాంబూలాదులొసంగి, కట్టకడపట నరసింహమేథ కంఠమున ఒక తులసీతావళమును గీలించి, చూచుచుండగనే అదృశ్యుడయ్యెను. ఇదిచూచి అచ్చటివారెల్లరును ఆసేవకుడు పండరినాథుడని నిశ్చయించుకొని, అట్టివానిచే సేవలు చేయించుకొను చున్న నరసింహమేథ ప్రభావమును అతిశయముగ గొనియాడి, పూజించి గౌరవించిరి. పాండురంగడు నరసింహమేథ కంఠమునవేసిన తులసీతావళము అతడు హరి నామస్మరణ చేయునపుడు రత్నమాలవలె తళతళమెరయుచు, తక్కిన సమయముల యందు తిరోహితమై యుండెడిది.

ఈసకలవృత్తాంతమును ఆదేశమును ఏలు రాజునకు తెలియవచ్చెను. వెంటనే యాతడు అచ్చటికి వచ్చి నరసింహమేథ ప్రభావమును పరీక్షింపదలచి, ఆతని మెడలోని తులసీతావళమును తీసి చేత గొని "ఓయీ! నీవు యథార్థముగ భక్తుడ వేని నాచేతియందలి తావళము నాచేతియందే యుండగా, నీకంఠమున మఱియొకతావళము వచ్చియుండవలెను. అట్లు కాదేని నీశిరం బుత్తరించెద" నని పలికెను. నరసింహమేథ ఇది విని మందహాసము గావించి, నాభక్తత్వమునకు నీ యానందము ఆధారము గాదు. నీవు కోపించిన నాభక్తత్వము పోదు. నేను భక్తుడ నని విఱ్ఱవీగుట లేదు. నేను నీరక్షకు ఆనందించువాడనేని, నీశిక్షకు భయపడి యుందును. నాకు రెండును సమానములు. నీవేమిచేసినను నాకభ్యంతరము లేదు." అని పలికెను. అందులకు రాజు ఇట్లనియెను. "నాహృదయమున నున్న భావము వేఱు. నీవు గ్రహించినది వేఱు. లోకములో అనేకులు మేము హరిదాసుల మని విఱ్ఱవీగుచున్నారు. అట్టివారు ఉండగూడ దని నాయభిప్రాయము. లోకములో అనేకమాయ లున్నవి. అట్లే భక్తిజ్ఞానవైరాగ్యాదులయందుగూడ మాయ, మోసము, దంభము ఇట్టివి యుండగూడదు. నీవు ఇట్టివాడవుగాక, మహామహిమాభిశోభితుడ వగుహరిదాసుడవేని నేను కృతకృత్యుడను. నీపాదమును బట్టెదను. కేవలము ఐహికవిషయములందే పడి కొట్టుకొనుచున్న నాదేశపు ప్రజలకు ఆముష్మికజ్ఞానము కలిగింపగల ఆచార్యుడు కావలసియున్నాడు. కుహనాభక్తులు హెచ్చుపెరిగియుండుటవలన యథార్థభక్తులను తెలిసికొనుట కష్టము; అగుట ఇట్లు పరీక్ష చేయవలసి వచ్చినది. కావున దయయుంచి నాకోరికను దీర్పుము." ఇదివిని నరసింహమేథ___

శ్లో."చతుర్వేదకూటోల్లసత్కారణాఖ్యాం స్ఫురద్దివ్యవైమానికే భోగితల్పే,
పరంధామమూర్తిం నిషణ్ణాం నిషేవే నిషేవేఽన్యదైవం న సేవే న సేవే."
(రామకర్ణామృతము. ఆ. 2. ప. 92.)

అని ప్రార్థించెను. తోడనే పాండురంగఁడు సాక్షాత్కరించి, నరసింహమేథ కంఠమున మఱియొక తులసీమాలను వేసి పోయెను. అదిచూచి రాజు మున్నగువారు పరమాశ్చర్యచకితులై నరసింహమేధను చాలఁ గొనియాడిరి. పిదప రాజు ప్రార్థన నను సరించి నరసింహమేధ ఆతని రాజధానికిఁ బోయెను. అచ్చట ననేకులు ఆతనికి శిష్యులైరి. బ్రతికియున్నంతకాలము నిట్లు అనేకులను హరిదాసులను గావించి, అవసానమున నరసింహమేధ శ్రీహరిసాయుజ్యమును బడసెను.

చ. "సతతము వేదకూటవిలసద్ఘనకారణనామధేయుఁడై
యతులితదివ్యపుష్పకమునం దహితల్పశయానుఁడై జగ
ద్ధితపరధామమూర్తియగు దీప్తివహించినరాము నెంతుఁగా
కితరములైన దైవముల సేవ భజింప భజింప నెమ్మదిన్." (రామకర్ణామృతము. ఆ. 2. ప 92.)

---

# 45. నామదేవుఁడు

శ్లో. "లసద్దివ్యశేషాచలే యోగపీఠే సదానందవైమానికే మానహీయం,
మునీనాం హృదానందమోంకారగమ్యం సదాభూమిజాయుక్తమీళే హృదంతే."
(రామకర్ణామృతము. ఆ. 2. ప. 93.)

పండరిపురమున దామాజీ యను ఒక భక్తాగ్రేసరుఁడు వసించియుండెను. ఆతని భార్యపేరు గుణాబాయి. అన్నివిధముల నాదంపతులు ఇరువురును ఒకరికొకరు తగినవారు. భార్యమాట భర్త మీఱఁడు; భర్తమాట భార్య జవదాఁటదు. ఈతీరున వారు అన్యోన్యానురక్తులై యుండుటయేగాక, విశేషించి భగవద్భక్తులుగూడ నైయుండిరి. వారిరువురునుగూడ అనుదినమును దేవాలయమునకుఁ బోయి పండరినాథుని సేవించి ఇంటికివచ్చి, మఱల స్వామికి మహానైవేద్యముఁ గావించి, తన్నివేదితాన్నమును వారు భక్తితో భుజించుచుందురు. సాంసారికములు అగు స్వల్పపుఁబనులు అన్నియు వారు ఇరువురును గూడి అతిశీఘ్రముగ నెఱవేర్చుకొని తీరికయైనవెంటనే హరిభజనము ప్రారంభింతురు. ఇంతకంటె వారికి మఱియొకపని లేదు.

ఈమహానందముతోఁ గాలము గడచిపోవుచుండఁగా, హఠాత్తుగా గుణాబాయికి ఒక దుర్భరవిచారము పొడసూపెను. వారికి ఉత్తరవయస్సు ప్రాప్తమయ్యెను; కాని ఒక్క బిడ్డయైనను కలుగలేదు. సంతానములేని విచారము గుణా

బాయికి కన్నుగింపులకు హృదయభేదకమయ్యెను. చూచుచుండఁగనే, అది విపరీతముగఁ బెరిఁగిపోయెను. ఇఁక సహించుట కష్టమయ్యెను. దానిని బయటికి రాకుండ ఒత్తిపెట్టియుంచుటకుఁ జేసిన ప్రయత్న మంతయు వ్యర్థ మయ్యెను. తుదకు అది బహిర్గతము కాక మానలేదు. అగుటచే నొకనాఁడు ఆసాధ్వి భర్తదిక్కు మొగంబై "నాథా! మనకేమియు లోపము లేదు. పాండురంగని యనుగ్రహము మనపై నున్నది; కాని దానికి గురుతేది? మనము నిష్కామకర్మతోడనే భగవంతు నారాధించుచున్నాము. అయినను ఆపాండురంగఁడు మన కొక బిడ్డను దయచేయఁ గూడదా? దాన నాతని కేమి కష్ట మున్నది? నాకు ఐహికవాంఛ లేమియు లేవు. మఱేమన—మనవంశము నిర్మూలము కాఁగూడదు. ఈహరిభజనము మనతోడనే ముగియఁగూడదు. ఈస్థలమున ఎల్లకాలమును మన కుటుంబములోని వారిచే హరి సంకీర్తనము చేయఁబడుచుండవలెను. ఇంతియే. ఇది ఐహికవాంఛయైనను, పరలోకమునకు భంగకరము కాకపోయినను, మఱేమయినను ఇది నాహృదయమున చాల తీవ్రముగ జాగరిత మగుచున్నది. ఏమిచేసిన పాండురంగఁడు ఈకోర్కెను ఘటించును," అని యడిగెను. ఇది విని ఆవృద్ధుఁడు ఆశ్చర్యచకితుఁడై "దేవీ! నీవింత పిచ్చిదాన వగుచుంటివేమి? ఈముసలితనమున మనకు సంతానమా? భూతవర్తమానములయందు వృద్ధులకు ఎందైన సంతానప్రాప్తి విన్నదైన వింటివా? ఊరకుండుము. ఇది పరులు వినిన గేలి చేయుదురు" అని మాఱుపలికెను.

కాని, గుణాబాయికి నిస్పృహ కలుగలేదు. ఏల కాఁగూడదు? పండరినాథుని విలాసములను తెలియ నెవరితరము? మృతులైన బాలకులను గొనివచ్చి గురువునకు సమర్పించిన శ్రీకృష్ణుని దాక్షిణ్యభావమునకు పార మెక్కడిది? అచంచలభక్తితో సేవించువారి మనోరథములను దీర్చుట శ్రీహరికి ఎంతపని? మనకొఱకు మనము పుత్రుని కోరుటలేదు. ఈయింట హరిభజనమునకు అంతరాయము కలుగఁగూడదు. తనసేవకులలో నొకనిని శ్రీహరి మనకు పుత్రునిఁగాఁ జేయఁగూడదా? వంశపారంపర్యముగ తన్ను సేవింపఁదలఁచిన మనలను అక్రూరవరదుఁడు విఫలమనోరథులం గావించునా?" అని యామె బదులు చెప్పెను.

ఈపలుకులవలన దామాజీకి ఆశ గలిగెను. తోడనే యాతఁడు ఆలయమునకుఁ బోయి పాండురంగని అనేకవిధముల సేవించి, "శ్రీహరీ! మాకు పుత్రాశగలిగినది. మాకొక బిడ్డను దయచేయవా?" అని ప్రార్థించి, సంతానార్థులు పరుండు మంటపమునఁ బరుండెను. క్షణములో నాతనికి నిద్ర పట్టెను. ఆనిద్రలో నొక స్వప్నము వచ్చెను. ఆస్వప్నము,—

సీ. "పాదుపుఁ గొప్పువహించు బెడిదంపు విరిగొప్పురహిఁ నింపుకంఠహారంబువాఁడు
కోమలాంఘ్రులు నోరగా నఖరిగులు జాఱఁ గట్టినబంగారుబట్టవాఁడు
శృంగారగతిమీఱి చెలువొందుకస్తూరితిలకంబుచే ముద్దుగులుకువాఁడు
మకరకుండలలోలమణిజాలరుచిమీర దళుకొత్తుచెక్కుటద్దములవాఁడు
తే. తలను వలగొన్న పింఛపుదండవాఁడు, విమలశతపత్త్రజైత్త్రనేత్రములవాఁడు
మురళిఁ దా చేతఁ గలజగన్మోహనుండొ,కండు నాస్వప్నమునను సాక్షాత్కరించె."

(ఉత్తరరామాయణము. పీఠిక. ప. 19.)

అట్లు సాక్షాత్కరించిన శ్రీహరి దామాజీని ప్రబోధించి, "ఓయీ! మీభక్తికి మెచ్చితిని. మీసేవకు ఆనందించితిని. మీకోరికను ఘటించుచున్నాను. రేపు ప్రాతఃకాలమున నీవు భీమానదికి స్నానము చేయఁబొమ్ము. స్నానాదికములగు నిత్యకృత్యములన్నియు నెఱవేఱిన తరువాత, ప్రవాహవేగమున నొక ముత్యపుచిప్ప కొట్టుకొనివచ్చును. అందొక బాలకుఁడు ఉండును. ఆబాలకుఁడు నాయాజ్ఞవలన అక్రూరాంశమున జనుల నుద్ధరించుటకు భూతలమున జన్మించెను. అపాపనిం గొని పోయి మీరు పెంచుకొనుఁడు" అని చెప్పి, అంతర్హితుఁ డయ్యెను. తోడనే దామాజీ ప్రబోధితుఁడై లేచి, విఠల గర్భాలయమునకుఁ బోయి "శ్రీహరీ! నీమాయ లనంతములు. నీలీలలు అగమ్యములు. నీకరుణ అపారము. నేను నీకు ఏమిచేయఁ గలను" అని యనేకవిధముల నుతించి, యింటికి వెడలిపోయి, సంగతి యంతయు భార్య కెఱింగించెను. అది విని గుణాబాయి మహానందభరితురాలై పారవశ్యము వలన కొంతతడవు మాటాడఁజాలక, తుదకు నృత్యము ప్రారంభించెను. అందులకు తోడుగ దామాజీ హరినామకీర్తనము ప్రారంభించెను. తుదకు ఆతఁడుకూడ నృత్యము ప్రారంభించెను. ఈనృత్యమునందే తెల్లవాఱిపోయెను.

వెంటనే పాండురంగనియనుజ్ఞను దలంచి, దామాజీ భీమానదికిఁ బోయి స్నానసంధ్యాద్యనుష్ఠానము లన్నియు ముగించుకొని, ముత్యపుచిప్పకై యెదురుచూడ సాగెను. ఈశ్వరాజ్ఞఁ గావున కొంతసేపటికి అది కొట్టుకొనివచ్చెను. చూచిమూడకయమునుపే దామాజీ అందున్న బాలకునిఁ దటాలున నెత్తికొని ఇంటికిఁగొనిపోయి భార్యచేతికిచ్చెను. కొంతతడవువారు ఆబాలుని అనిందితదివ్యతేజస్సును చూచి ఆశ్చర్యపడిన తరువాత, దామాజీ భార్యనుచూచి "దేవీ! అవుపాలైనను లేవు. ఈబాలుని ఇక నెట్లు పోషింతుము" అని దీనముగఁ బలికెను; కాని ఈవాక్యము పూర్తిగాకపూర్వమే గుణాబాయిపాలిండ్లయందు క్షీరప్రవాహము పొంగిపారలెను. అది చూచి వారు మఱింత వింతపడిరి. "వింతపని లేదు. ఈశ్వరలీలలు ఎవరికిఁ దెలియఁ గలవు?" అని యనుకొనుచు, ఆబాలకుని చాల గారాబముగ పెంచుకొనుచుండిరి. కొన్నిదినములైనతరువాత ఆబాలునకు వారు నామదేవుఁడని పేరు పెట్టిరి.

నామదేవుఁడు శుక్లపక్షచంద్రునివలె, దినదిన ప్రవర్ధమానుఁడగుచుండెను. చిన్నతనమునందే యతనికి హరిభక్తి యలవడెను. వయసుతోఁగూడ బుద్ధియు, బుద్ధితోఁగూడ జ్ఞానమును, దానితోఁగూడ నాతనికి హరిభక్తియు వెంపొందఁ సాగెను. దామాజీయు, గుణాబాయియు ఆబ్బాలునిబాల్యచేష్టితములను జూచి ఆనందపారవశ్యమునఁ దమ కాతఁడు లభించినమార్గమును, శ్రీహరి చెప్పిన విషయమును మఱచిపోయి, గారాబుకుమారుని యెడల అందఱు తల్లిదండ్రులును బ్రవర్తించునట్లు ప్రవర్తింపసాగిరి.

ఒకనాఁడు దామాజీకి ఒకానొక సమీపగ్రామమునకు పోవలసిన యవసరమేమో తటస్థించెను. అంత నాతఁడు "నేఁడు పాండురంగని పూజించుటకు మన నామదేవునిఁ బంపుము." అని గుణాబాయికి నియమించి వెడలిపోయెను. పూజాసమయము సమీపించిన వెంటనే గుణాబాయి కావలసిన వన్నియు నిచ్చి, కుమారుని గుడికి బంపెను.

నామదేవుఁడు తనకు తెలిసినంతవఱకు యథాక్రమముగఁ బూజించి, మహానైవేద్యము చేసి "స్వామీ! భుజింపుము." అని ప్రార్థించెను. కాని స్వామి సాక్షాత్కరింపలేదు. నైవేద్యము స్వీకరింపలేదు. నామదేవునకు తృప్తి కలుగలేదు. భోజనపాత్రమును బట్టుకొనిపోవుటకు నామదేవుఁడు వేషధారి కాఁడు. "స్వామీ! భుజింపుము. నేను బాలుఁడను. నావలన అపరాధము గలిగిన సైరింపుము. ఇంటివద్ద మాతల్లిచే నాకు చెంపపెట్లు సంభవింపనీయకుము. నైవేద్యమును స్వీకరింపుము" అని మఱల ప్రార్థించెను; కాని అప్పటికి ప్రయోజనము లేకపోయెను. "ఈశ్వరా! నాకు ఆఁకలి యగుచున్నది. దాహము మితిమీఱుచున్నది. నీవు భుజించినఁ గాని నేను భుజింపను. నేఁడు లంఘనము చేయించెదవా? అది నీకు ముచ్చటా? జగద్రక్షకా! నన్నుఁ గాపాడుము" అని నామదేవుఁడు బతిమాలుకొనియెను. అప్పటికిని పండరినాథుఁడు సాక్షాత్కరింపలేదు. నామదేవునకు భయ మయ్యెను. ఏడ్పు వచ్చెను. చూచుచుండఁగా కన్నులనుండి అశ్రులహరియే ప్రవహించెను. "పండరినాథా! నే నేమి తప్పు చేసితిని? నేనేమియు తెలియనివాఁడను. భార మంతయు నీమీఁదనున్నది. నావలన అపరాధమైన అది నీదే యగును. ఏల జాలము చేసెదవు? మేము పేదవారము? నీకు తగిన భోజనము పెట్టఁజాలము. ఇది మాశక్తికి తగినది. దీనిని స్వీకరించునంతదనుక నే నిక్కడనుండి కదలను" అని ఆతఁడు కన్నులు తుడుచుకొని అచ్చటఁ గూర్చుండెను.

ఈ బాలభాషణములవలన పండరినాథుని మనస్సు కఱఁగెను. వెంటనే యాతఁడు దివ్యమంగళవిగ్రహుఁడై నామదేవుని తట్టి బుజ్జగించి, ఆయన్నము భుజిం

చెను. నామదేవుఁడు మహానందభరితుఁడై ఇంటికి పోయెను. భగవన్నివేదితాన్నము కొఱకు నిరీక్షించుచున్న గుణాబాయి రిక్తహస్తుఁడై వచ్చిన కుమారునిఁ జూచి “ఏమి సంగతి? అన్న మేమిచేసితివి?” అని ప్రశ్నించెను. నామదేవుఁడు సత్యము చెప్పెను; కాని ఆమె నమ్మలేక నమ్మలేక నమ్మి, మఱునాఁడు భర్తకు ఈసంగతి యంతయు నెఱింగించెను. దామాజీగూడ తొలుత వినిని నమ్మలేకపోయెను. “వత్సా! స్వామికి నేఁడుగూడ నీవే పూజింపుము. నేను దగ్గఱనుండి అంతయుఁ జూచెదను.” అని చెప్పి, దామాజీ పూజాసామగ్రి యంతయుఁ గైకొని కుమారుని వెంటఁ గొని పోయెను.

నామదేవుఁడు యథాపూర్వకముగ పూజ ప్రారంభించెను. కుమారుని చాకచక్యమును జూచి దామాజీ చాల నానందించెను. ఇంతలో నైవేద్యసమయ మయ్యెను. నామదేవుఁడు పదార్థములతో నిండిన భోజనపాత్రమును ఎదుట నుంచి నివేదించి, “స్వామీ! స్వీకరింపు” మని ప్రార్థించెను; కాని ఏమియు ప్రయోజనము గలుగలేదు. ఏమి జరుగునో యని దామాజీ ఆత్రముతో చూచుచుండెను. అంతట నామదేవుఁడు మోఁకరించి నిలిచి “శ్రీహరీ! ఏల జాలముచేసెదవు? పెనదినము ఇట్లు చేయుటకును, నాచే పలుమాఱు ప్రార్థింపించుకొనుటకును నీకు ముచ్చటయా? అల్లరిని యెఱింగించి ముందు దీనిని స్వీకరింపుము. పిదప నిన్ను నేను స్తుతిచేసెదను” అని ప్రార్థించెను. అప్పుడు “వత్సా! నీయందు నాకు ఆగ్రహము లేదు. నీచే స్తోత్రము చేయించుకోవలెనను ఊహ లేదు. నీవు నివేదించిన యన్నమును స్వీకరించుటకు నాకు అభ్యంతరము లేదు; కాని నీతండ్రికి నేను కాన్పింపను. అతని నవ్వులకుఁ బొమ్మనుము” అని యొక మాట వినవచ్చెను. ఇది పాండురంగని మాటగా నిశ్చయించుకొని దామాజీ తన దౌర్భాగ్యమును నిందించుకొనుచుండఁగా, నామదేవుఁడు. “పుండరీక వరదా! నీవు సర్వజ్ఞుండవే; కాని పొరఁబడుచున్నావు. నీవు సర్వసముఁడవే; కాని పక్షపాతముఁ జూపుచున్నావు. నీయెడల మాతండ్రి చేసిన యపరాధ మేమున్నది? నాతండ్రికంటె నీకు నేను చేసిన సేవ యేమున్నది? నీకుమారుని గౌరవించి, నిన్ను బహిష్కరించినచో ఆగౌరవమును నీకుమారుఁడు స్వీకరింపవచ్చునా? అప్పుడు నీ కెట్లుండును? మాయిరువురలో భేదము చూపుట నీకు తగదు. కావున వది మాటలు చెప్పించుకొనక వేగముగ స్వీకరింపుము” అని వేఁడుకొనియెను. దీనితో పాండురంగని హృదయము కఱఁగెను. తోడనే అతఁడు సాక్షాత్కరించి దామాజీని నామదేవుని అనుగ్రహించి, ఆయన్నమును భుజించి తిరోహితుఁడయ్యెను. కుమారుని యనుగ్రహమువలన తనకు ఈశ్వరసాక్షాత్కార మైనందులకు పరమానంద భరితుఁడై, దామాజీ ఎంతో కుమారుని ఆదరించి, గ్రుచ్చి కౌఁగిలించుకొని [illegible]

మూర్ఛకొని, ముద్దాడి, బుజ్జగించి ఎత్తుకొని ఇంటికిఁ గొనిపోయి, సంగతి యంతయు భార్యకెఱింగించెను. గుణాబాయి కుమారుని మహాప్రభావమునకు అత్యాశ్చర్య పడెను. పిదప నందఱును పరమేశ్వరుని దివ్యలీలలను గీర్తించుచు నృత్యము ప్రారంభించిరి.

నామదేవునకు పెండ్లి యీడు వచ్చెను. అపుడు దామాజీయు గుణాబాయియు చాల విచారణ చేసి, రాధాబాయి అను నొక చక్కని కన్యను దెచ్చి నామదేవునకు వివాహము చేసిరి. రాధాబాయి అన్నిటను నామదేవునకు తగిన పత్ని. నామదేవుఁడును ఆమెకు తగిన భర్త. ఇట్లియ్యిరువురును పరస్పరానురక్తులై పాండురంగనిఁ బూజించుచు, దామాజీకిని గుణాబాయికిని సపర్యలు చేయుచు కాలముఁ గడుపసాగిరి. కొన్ని దినములకు నామదేవునకు ఒక పుత్రుఁడు కలిగెను. దామాజీ పోయి పాండురంగని తనమనుమని నామకరణమహోత్సవమునకు పిలిచి వచ్చెను. అట్లే పదునొకండవ దినమున లాంఛనమున నన్నిటిఁ బట్టించుకొని నామదేవునియింటికి శ్రీహరి వచ్చెను. ఆయింటివా రందఱును పండరినాథుని రుక్మిణీదేవిని అనేకవిధముల గౌరవించి పూజించిరి. పాండురంగని యాదేశమువలన గుణాబాయి తన మనుమనికి నారాయణుఁడు అని నామకరణము చేసెను. అందఱును దీవించిరి. పాండురంగఁడు రుక్మిణితోఁగూడ వెడలిపోయెను.

కొన్నిదినములకు దామాజీయు, గుణాబాయియు సంపూర్ణముగ వృద్ధులైరి. సంసారభారము అంతయు నామదేవునిమీఁదఁ బడెను. అయినను ఆతఁడు ఆవిషయమున యోచనము గాని విమర్శగాని లేక, సదా శ్రీహరిసేవయందే కాలము గడుపసాగెను. అగుట సంసారము జరుగుట కష్ట మయ్యెను. మధ్యాహ్నము భుజించిన రాత్రికి లేనిస్థితి సంభవించెను. సంసారస్థితి ఇంత శోచనీయముగ నున్నను జోక్యము కలుగఁజేసికొనకుండుటఁ జూచి, నామదేవునిఁ జేరఁ బిలిచి యొకనాడు గుణాబాయి "అబ్బాయీ! నీవు బాలుఁడవు గావు ప్రాపంచిక ధర్మము నెఱుంగనివాఁడవు కావు. ఎంత భక్తియున్నను సంసారము జరుగుచున్నదా లేదా యని యోచించుకొనక తీఱదు. నీబిడ్డకుఁగూడ రాత్రి భుజించుటకుఁ బట్టెడు అన్నము లేదు. రాత్రి మన మందఱమును పస్తు ఉండవలెను; కాని మఱి దిక్కు లేదు. ఐహికవాంఛలు పరలోకమునకు భంగకరములు గాని దినపాతము కాదు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' మ్మను న్యాయము నెఱుంగనివాఁడవు కావు గదా! నీపుట్టుకకు నీవు ఎఱుంగనట్లు ఉండిన, ఇఁక మనయింట సంసారభారమును వహింపఁగలవారెవరు? నీతండ్రి వృద్ధుఁడు; ఒకరి సాయము లేకున్న లేచుటకైన సమర్థుఁడు కాఁడు. నేను ఎట్టి స్థితిలో నున్నదియు నీకు తెలియనిది గాదు.

నీభార్యపోయి ఏమియు సంపాదింపఁ జాలదు గదా! నీబిడ్డఁడు బిడ్డఁడే. ఇఁక నీవు మాత్రమే ఇందఱకును ఆధారము కాఁజాలుచున్నావు. ఇట్టి నీవు ఇట్లు ఊరకుండిన ఇఁక మనము అందఱమును క్షుధార్తులమై మాడిపోవలసినదే గాని, వికల్పము యున్నది. తండ్రీ! నీభక్తికి మేము అడ్డురాము. నీభజనమునకు మేము ఆటంకము చేయము. నీమార్గమును మేము కంటకితము గావింపఁజాలము. మఱేమన? మాకు కడుపునిండ అన్నము గాకపోయిన గంజియైనఁ బోయుము. ఇందఱ ప్రాణములు నిలువఁబెట్టుటఁగూడ పుణ్యమే. ఇదిగూడ మోక్షమునకు మార్గమే. కావున దీనిని నెఱవేర్పక తప్పదు" అని పలికెను.

ఇది విని నామదేవుఁడు మాఱుపలుకక, తిన్నఁగ పాండురంగని సన్నిధికిఁ బోయి మోఁకారించినిల్చి, నిటలతటఘటితాంజలి యై "జనార్దనా! ఆర్తత్రాణపరాయణా! నీకిట్టిది తగునా? నాకు ఈగతి నేల కల్పించితివి? ఈదుఃఖసాగరమున నన్నేల పాలఁద్రోసితివి? ఇట్లు చేయుట నీకుఁ దలంపు గలిగియున్న నాకు ఈజగన్మిథ్యాత్వమును, సంసారహైన్యమును ఏల తెలిపితివి? అయ్యో! నాకు ఇట్టి యగచాట్లను గల్పించుటకు నేను నీకేమి యపరాధమును జేసియున్నాను? నేను నీపాదస్మరణము తక్క ఎన్నఁడును మఱియొకటి యెఱుఁగనుగదా! సర్వవ్యాపకుఁడవు అగునీకు తెలియనిది ఏమున్నది? శ్రీహరీ! భక్తచింతామణీ! నన్ను ఉద్ధరింపుము" అని అనేకవిధములఁ బ్రార్థించెను. అంతట పాండురంగఁడు సాక్షాత్కరించి, ఆతనిం జేరఁదీసికొని, "వత్సా! విచారింపకుము. నీకు ఏమియు భయము వలదు. నీవు ఇచ్చటనే యుండుము" అని బోధించెను. నామదేవుఁడు వల్లెయని అట్లే యుండెను.

ఇప్పుడే వచ్చునో, గడియకే వచ్చునో యని నిరీక్షించుచున్న రాధాబాయి భర్త ఎంతకును రాకుండుటఁ జూచి, "అత్తా! నీకుమారునిచర్య ఏమియు తెలియుట లేదు. వారిని ఏమి యనినను ప్రయోజనము లేదు. దీనికి అంతకును గారణము పాండురంగఁడే" యని తోఁచుచున్నది. ఇఁక నేమనుకొనినను ఏమి ప్రయోజనము? అందఱమును నిరాహారులమై యుందము; కాని ఈబిడ్డనిఁ జూచిన నాగుండెలు పగిలిపోవుచున్నవి. ఇంతకంటె నాకు విచారము లేదు. అయినను రుక్మిణీకాంతుఁడు ఇట్లు చేయఁ దలపెట్టినపుడు ఇఁక నేమి యనుకొనినను ఏమిప్రయోజనము?" అని నిరాశతో పలికెను. ఈమాటలు రుక్మిణితో సరసాలాపము లాడుచున్న పాండురంగనికి వినవచ్చెను. తోడనే యాతఁడు నామదేవునకుఁ దెలియకుండునట్లు ఒక వర్తకుని రూపము ధరించి, బలమగు ఒక వృషభమును గల్పించుకొని, దానిమీఁద [illegible]మును వేసికొని నామదేవుని ఇంటికి బయల్దేఱెను.

"అయ్యా! ఆకట నకనక మాడుచున్నాను. నామదేవుని ఇంటికిఁ బోయిన ఇంత ప్రసాదము లభించు" నని తెలియవచ్చినది. కావున "ఆమహానుభావుని ఇంటి దారి చూపుఁడు" అని యూరివారి నడుగుచు, ఆవర్తకుఁడు ఊరిలోఁ బ్రవేశించెను. ఇది వినినవారు ఎల్లరును "నేఁడు ఈవర్తకుని కడుపునిండినట్లే మధ్యాహ్నము భుజించుటకే నామదేవునికుటుంబము ఏమియు లేక పస్తు ఉండెను" అని యనుకొనసాగిరి. ఇది యేమియు వినిపించుకొనకయే వర్తకుఁడు నామదేవుని యింటికిఁ బోయెను.

అప్పటికి రాధాబాయి వాఁకిట నిలిచియుండెను. వర్తకుఁడు గుమ్మములోనికి వచ్చి, "అమ్మా! నామదేవులు నాకు మిత్రులు. నేను వింటనై వచ్చితిని" అనియెను. అదివిని రాధాబాయి ఏదో పనిమీఁద వచ్చియున్న పొరుగింటియామెను జూచి "మాయింటిస్థితి ఇట్లున్నది. వచ్చెడిభాగవతులకు అంతములేదు. మాయజమానుల యాజ్ఞకుఁగూడ పారములేదు. మాదారిద్ర్యమునకుఁ గూడ దరి లేదు" అని చెప్పెను. ఈమాటలను విని వర్తకుఁడు "అమ్మా, నాకు నేటిరాత్రికి భోజనము అక్కఱలేదు. ఉండుటకు ఇంతస్థలము ఇచ్చినఁ జాలును" అనియెను. రాధాబాయి హృదయావేదనము ఒకింత తీఱెను; కాని పూర్తిగఁ దీఱలేదు. "ఇంటికివచ్చిన అతిథికి భోజనముపెట్టుటకు శక్తిలేకపోయినది" అని యామె కొంచెము వగచి, "అయ్యా! మీది ఏయూరు? మీరు ఎవరు? ఇక్కడకు ఏలవచ్చితిరి?" అని ప్రశ్నించెను. "నాపేరు? చెప్పవలసిన పనిలేదు. నేను వర్తకుఁడను గావున నాకొకచో స్థిరనివాసములేదు. నా మిత్రులగు నామదేవులు మిగుల దారిద్ర్యపీడితులై యున్నారు" అని విని, వారికి కొంతగాకున్న కొంతయైన నుపకరింపవచ్చునని తలఁచి "వారికి సమర్పించుటకు కొంచెము ధనము తెచ్చితిని" అని బదులుచెప్పి, యాతఁడు వరాలమూటను ఆమెచేతికి అందించెను. రాధాబాయి ఆమూటను గైకొని వర్తకుని లోనికిఁ గొని పోయి చాల నాదరించెను. కొంతసేపు అయినతరువాత వర్తకుఁడు "అమ్మా! నేను వచ్చినపని యైపోయినది. ఇఁక నిక్కడ కూర్చుండియుండుటకు నాకు తీఱికలేదు. నేను పోయెదను. నామదేవులు ఇంటికి వచ్చిన తరువాత నేను వచ్చినసంగతి వారికిఁ దెలుపుము" అనిచెప్పి తనమార్గమునఁబోయెను.

రాధాబాయి పరమాదరముతో వర్తకుని సాగనంపి, మూటలోని కొన్ని వరాలు తీసికొని బజారునకుఁ బోయి, నమ్మకమైన ఒక వర్తకుని దుకాణముమీఁద తనకు కావలసిన వస్తువులన్నియుఁ గొని ఇంటికివచ్చెను. ఇదియంతయు నగునప్పుడు ఇంట మఱెవ్వరును లేరు. ఒక్కరాధాబాయి మాత్రమే యుండెను. నారాయణుఁడు ఎందో ఆటలాడుకొనుచుండెను.

ఇదియిట్లుండ, గుణాబాయి నాఁటిరాత్రి వంటచేసికొని భుజించుటకు ఏమియు లేకపోవుటఁజేసి, గ్రామములోనికిఁ బోయి అటనట కొందఱు గృహయజమానుల

కాంక్ష ఇచ్చిన బియ్యములు మూటఁగట్టుకొని వచ్చుచు, మార్గమధ్యమున పండరినాథుని ఆలయము కాన్పించుటచే చాల కోపముతో లోనికిఁ బోయి, "శ్రీహరీ! ఇదె యేమి అన్యాయము? చెట్టు సత్యభామదొడ్డిలోను, పూవులు రుక్మిణిదొడ్డిలోను ఉనునట్లు, నామదేవుఁడు మాకుమారుఁడేగాని అతనినివాస మెప్పుడును నీసన్నిధిని. పుత్రుఁడోయని పడిపడి దండములు పెట్టి నిన్ను ప్రార్థింపఁగా తుదకు పుత్త్రు నిచ్చితివి; కాని అతనిని నీవు విడువవు. ఇంట మేమన్నము లేక మలమల మాడిపోవుచున్నాము. ఇక నామదేవునివలన నేమి ప్రయోజనము? నీవు తొలుత మాకు ఈయకయే యుండినయెడల మాకీ బాధలే లేకపోయియుండును. వృద్ధుల మగు మాయిరువుర ప్రాణములు నెట్లో పోయియుండును. ఇప్పుడు మాకు ఏమియు నెఱుఁగని రాధాబాయియు, ముక్కు పచ్చలారని నారాయణుఁడును తోడైనారు. వారి దీనాననములు చూచిన మాకడుపులు తఱుగుకొనిపోవుచున్నవి. "అమ్మా! రుక్మిణీ! నీనాథునిచేష్టలు చూచితివిగదా! నామదేవునివలని కష్ట మంతయు మాది. సుఖ మంతయు మీది. నీవును బిడ్డలను గన్నతల్లివి. ఆఁడువాండ్ర కిది యెంత కష్టమో యోచింపుము. తండ్రీ! పాండురంగా! ఇప్పుడైనను నీకు మనసు కలుఁగదా ?" అని అనేకవిధముల దీనాలాపము లాడెను. ఇది విని సహింపఁజాలక పండరినాథుఁడు "అమ్మా! ఏమిచేయుదును; నామదేవుఁడు నన్ను సేవించుటకుఁ బుట్టెను. లోకము నుద్ధరించుటకుఁ బుట్టెను. ఇక మీ కెట్లు ఉపకరించును? అయినను అతఁడు వచ్చునేని నీవు తీసికొనిపోవచ్చును" అని పలికి, నామదేవునిచేతిని గుణాబాయిచేత నిడియెను. వెంటనే గుణాబాయి బయలుదేఱెను. మాఱువల్కకుండ నామదేవుఁడు తల్లితోఁ గూడ నింటికిఁ బోయెను.

వారు ఇంటికిఁ బోయి చూచునప్పటికి ఇల్లంతయు సకలపదార్థములతోడ నిండి యుండెను. అది చూచి నామదేవుఁడు "అమ్మా! ఇదంతయు నేమి" అని యడిగెను; కాని "నాయనా! నాకేమియుఁ దెలియదు" అని చెప్పుచునే గుణాబాయి కుమారుని లోనికిఁ గొనిపోయెను. అప్పటికప్పుడే రాధాబాయి పంచభక్ష్యపరమాన్నములను జేసి ఎదురుచూచుచుండెను. నామదేవుఁడు ఆమె నడిగెను; కాని నిజము చెప్పినచో భర్త అంతయు వెచ్చించి వేయును. అని భయపడి ఆమె మౌనవ్రతము దాల్చెను. అంతట నామదేవుఁడు దాసివలన సంగతి సందర్భములన్నియుఁ దెలిసికొని, "శ్రీహరీ! ముకుందా! నీకిది తగునా? ఎట్లో దేహమునిలుపుకొని నీసేవయందే నాజీవితమును గడుపఁదలఁచియున్న నాకు ఈభాగ్యమంతయు నేల యిచ్చితివి? దీనివలన సంభవించు పాపములన్నియు నేను సహింపఁజాలను. నాకు నీ పాదారవింద ధ్యానము తప్ప అన్యము వలదు" అని ఆధన మంతయు బీదలకు నిచ్చివేసి, సంసారమును మఱల పూర్వస్థితికిఁ గొనివచ్చెను.

మఱికొన్ని దినములు ఆట్లు గడచిపోయిన తరువాత దేశమునందు అంత యుప ప్రఖ్యాతి వడసిన జ్ఞానదేవుఁడు అనుభక్తాగ్రేసరుఁడు నామదేవుని యింటికి వచ్చెను. నామదేవుఁడు వచ్చిన భాగవతశ్రేష్ఠునకు అర్ఘ్యపాద్యాది సకలోపచారము లనుజేసి ఆదరించెను. జ్ఞానదేవుఁడు సాష్టాంగ మెఱగియున్న నామదేవుని ప్రీతితో లేవనెత్తి, "భక్తాగ్రేసరా! నీభాగ్యము అనంతము. అది అనితరసాధ్యము. రుక్మిణీ పతిని పూర్తిగ స్వాధీనము చేసికొనినది నీవు ఒక్కఁడవే. నీవిశ్లేషములు శ్రీహరి సహింపఁజాలక, మముబోంట్ల నంజఱను ఉపేక్షించి మాకు విచారమును గలిగించు చున్నాఁడు. అట్టి భక్తాగ్రేసరుఁడవు అగునిన్నుఁ జూచిన నేఁటిదినము ఎంతో సుదినము. నేఁడు నాకు నేత్రోత్సవము అయినది. ఆహా! ఇంతవాఁడవు అయ్యు, నీవు ఎంత వినయము చూపుచున్నావు. నిజముగ ఔన్నత్యమును గుర్తెఱిగినవాఁడవు నీవు ఒక్కఁడవే. సర్వసమత్వమును భాగవతులు అందఱును నిన్నుఁజూచియే నేర్చు కొనవలయును" అని యనేకవిధముల వినుతి చేసెను. అదివిని నామదేవుఁడు అంజలి బంధము గావించి, "దేవరవారు ఇట్లు ఎందులకు సెలవిచ్చుచున్నారో తెలియదు. దాసానుదాసుఁడ నగునేను మీరు చేసిన వినుతికి అర్హుఁడను గాను. నిజముగా మీ దర్శనమువలన నేఁడు నేను ధన్యుఁడ నైతిని. వాగ్మిలలో నగ్రేసరులు గావున మీరు నాకు అవకాశము లేకుండ ఆగొప్పతనమును నాకే అంటఁగట్టినారు. ఈదాస జనుఁడు ఏలినవారి నమ్మినబంటు. వీనిని అన్యథా తలంపవలదు" అని బదులు చెప్పెను.

జ్ఞానదేవుఁడు ఈప్రత్యుత్తరమునకు ఎంతయు ఆనందించి, మఱియొకమాఱు గ్రుచ్చి కౌఁగిలించుకొని "వత్సా! నీతో మాటాడవలయును. అని నేను చాల దినములనుండి తలంచుచున్నాను. అది నేఁటికి నెఱవేఱినది. నీయెడల నాకు ఒక ప్రార్థనము గలదు. నాకు చిరకాలమునుండి తీర్థయాత్రయు దేవతాదర్శనమును జేయఁ దలంపు గలదు; కాని నీవు వెంట రాకున్నఁ దృప్తిఁ గలుగదు. నీవు నాకోరికను విఫలముచేయవు. అను నమ్మకముతో వచ్చినాను. కావున సాధ్యమైనంత త్వరగ బయలు దేఱుము." అనిచెప్పెను. తోడనే నామదేవుని శిరమున పిడుగుపడినట్లు అయ్యెను. ఆతని నల్లగుండెకు ఏదో తీవ్రతరాఘాతము తగిలినట్లు అయ్యెను. పాండురంగని దివ్యదర్శనము విడిచి యుండుట యెట్లు?

నామదేవుని ముఖమున విచారము చిహ్నితము అగుటఁ జూచి జ్ఞానదేవుఁడు ఈతఁడు నాకోర్కెను మన్నించునా మన్నింపఁడా!' యని సందేహించెను. ఇది తీఱకపూర్వమే నామదేవుఁడు జ్ఞానదేవునిపాదములను స్పృశించి, "మహాత్మా! ఈ దీనుఁడు దాసానుదాసుఁడు. వైష్ణవోత్తములపాదధూళి ఈక్షుద్రునకు ఆధారము.

భాగవతాగ్రేసరులను అడ్డుచెప్పుట యనగ నాకు ఎంతో సంకటముగా నుండును. నేను ఇంతవఱకును అట్టిది యెఱుఁగను. నాకు స్వాతంత్ర్యము లేదు. ఈవిషయమును దేవరవారు ముందుగ గమనింపవలయును. బాల్యము ప్రారంభించి ఇంతవఱకును నేను ఒక్కక్షణమైన పండరిపురమును విడిచి యెఱుఁగను. ఒక్కదినమైన శ్రీపాండురంగని సన్నిధిఁ బాసి యెఱుఁగను. త్రికరణశుద్ధిగా నేను పండరినాథునకు అర్పణమై యున్నాను. నీప్రశ్నకు నేను ఏమి చెప్పఁగలను. నీమాట వినినది మొదలుకొని నాకన్నులు అశ్రుపూరితములై యున్నవి. నాహృదయము తహతహలాడుచున్నది. మహాత్మా! శ్రీహరి నెట్లు విడిచి యుండఁగలను?" అని బదులు చెప్పెను.

జ్ఞానదేవుఁడు ఇది యంతయు విని, నామదేవునిభావము అంతయు గ్రహించి, "భక్తశిఖామణీ! నీకు హృదయావేదన వలదు రమ్ము. మనము పాండురంగనిసన్నిధికిఁ బోవుదము" అని చెప్పి ఆతనిచేయి పట్టుకొని బయలుదేఱెను.

ప్రాకారములు అన్నియు దాటి, వారు గర్భాలయము చొచ్చి పాండురంగని యథావిధిగ సేవించిరి. పిదప జ్ఞానదేవుఁడు చేతులు జోడించి "పండరినాథా! నీకుఁ దెలియనిది ఏమియు లేదు. నామనోరథమును ఈడేర్పవలయును" అని ప్రార్థించెను. అందులకుఁ బ్రీతుఁడై పాండురంగఁడు "జ్ఞానదేవా! నీమాటలు వింతఁ గొలుపుచున్నవి. సూర్యునకు కాగడా యవసరము అగునేని, నీకు తీర్థాటనము అవసరము కావచ్చును. ఇప్పుడేమిది అట్లు కోరెదవు?" అని ఆశ్చర్యమును జూపెను. మఱల కరకమలములు ముకుళించి, జ్ఞానదేవుఁడు "శ్రీహరీ! నీవు చెప్పినది యథార్థమే కావచ్చును. ఎంత విజ్ఞానులు అయినను, ఎంతటి భక్తులు అయినను మఱెంతటి విరాగులు అయినను, మానవులను అపుడపుడు అజ్ఞానము ఆవరించుచుండుట గలదు. నీవు లేని స్థలము లేదు. అయినను లోకోజ్జీవనార్థము అటనట పుణ్యక్షేత్రములు వెలసియున్నవి. అచ్చటచ్చటకు దాసజనులు లక్షలకొలఁది వచ్చుచుందురు. ఆభక్తసంఘమున ప్రాకృతులకుఁ గాన్పింపని మహాతేజముతో సాక్షాత్కరించు నిన్ను సేవించుట ఒక్కచోటనే యుండిన లభించునా? అందఱి భక్తులయందును మహానుభావులు అనేకులు ఉందురు. వారిని సందర్శించి, వారి పాదములను బూజించి, వారిని సేవించి, వారి ఉపదేశములను వినుట ఒక్కచోటనే యుండువారికి లభించునా? సాధన చేయువారి భాగవతులనుబట్టి అనేక రూపములతోడను, అనేకనామములతోడను వేంచేసియుండునిన్ను అనేకవిధముల సేవించుట ఒక్కచో నుండువారికి లభ్యమగునా? మఱియు నామదేవునివంటి భాగవతాగ్రేసరునితో సంచారముచేసి తరించుటకు తీర్థయాత్రలకన్న ఆధారము లేదు గదా! కావున నాయందు అనుగ్రహముఁ బూని నామదేవుని నాతోఁ గూడఁ బంపవలయును" అని మఱియు మఱియుఁ బ్రార్థించెను.

పాండురంగఁడు సర్వశక్తుఁడయ్యు జ్ఞానదేవునిమాటలకు అభ్యంతరము చెప్పఁజాలక తనతో వియోగము గలుగునేమోయని యడలుచున్న నామదేవునిఁజూచి, చేరఁ బిలిచి యిట్లు మాటాడెను. "వత్సా! జ్ఞానదేవునకు నేను ప్రతి చెప్పఁజాలను. ఆతనికి ఆతఁడేగాని, మఱియొకఁడు సాటిరాఁడు. ఆతని ప్రభావమును నేనుగూడఁ జెప్పఁజాలను. ఆతఁడు చెప్పుమాటలకుఁ గల బహిరర్థము నీతో మైత్రి నెఱపుట గాని, దాని పరమార్థము నిన్ను ఉద్ధరించుట యని తెలిసికొనుము. ఆతఁడు తీర్థాటనము చేయుటలో చాల శ్రమమున్నది. నిన్ను విడిచి నేనును, నన్ను విడిచి నీవును ఉండఁజాలకపోవుటలో అసత్యము లేదు; కాని ఆతనియాజ్ఞ అవిలంఘ్యము. నీవు ఆతనితోఁ బోయి ఆతని మనసున కెక్కునట్లు నడుచుకొనుము." అని యాతనికిఁ జెప్పి, జ్ఞానదేవునిఁ జూచి "ఓయీ! నీప్రభావమును ఎఱిఁగినవాఁడను నేనొక్కఁడనే. నీవు చేయునది మనోరథము గాదు; ఆజ్ఞ. నీయాజ్ఞను మీఱుటకు ఎవరికిని సాధ్యము కాదు. కావుననే చిరకాలసాన్నిధ్యమువలన నాకు విడువరాని ప్రేమభాజనమగు నామదేవుని నీయధీనము చేయుచున్నాను. సర్వజ్ఞుఁడ వగు నీకుఁ దెలుపవలసిన దేమియు లేదు. నామదేవుఁడు నాసాన్నిధ్యముఁ బాసినది మొదలు నాకు క్షణము ఒక మహాయుగమువలె నుండును. కావున నీవు ఆతనిని కడు జాగరూకతతో రక్షించుచు, సాధ్యమైనంతత్వరగా రమ్ము" అని పలికి, నామదేవుని చేతిని అతనిచేతియందుంచెను.

"చిత్తము" అనిపలికి సాష్టాంగవందన మాచరించి, సెలవుఁబడసి జ్ఞానదేవుఁడు అచ్చటనుండి కదలెను. పాండురంగఁడు నామదేవుని విడువలేక విడువలేక విడిచెను. నామదేవుఁడు పండరినాథుని సాన్నిధ్యమును వీడఁజాలక వీడఁజాలక విడిచెను. జ్ఞానదేవుఁడు అచ్చటినుండి తిన్నగ చంద్రభాగానదికిఁ బోయి జలకమాడి, ఈశ్వరార్పణముగా నామదేవునితో తీర్థయాత్రలు చేయుటకు సంకల్పము చేసెను. నామదేవుఁడు గూడ నట్లే చేసెను.

పిదప నిరువురును బయలుదేఱిరి. కొంతదూరము పోయిన తరువాత నామదేవుఁడు మాటిమాటికిని వెనుదిరిగి చూచుచు, "పాండురంగా! దూరమగుచుంటివా? నిన్ను విడిచి వచ్చుటవలన నాహృదయము కలఁగిపోవుచున్నది. నాభావయంత్రము చిక్కువడిపోవుచున్నది. నాచైతన్యము లోపించిపోవుచున్నది" అని తేపతేపకును మూర్ఛిల్లసాగెను. అదిచూచి జ్ఞానదేవుఁడు ఆశ్చర్యపడుచు నామదేవునకు ఉపచారములు చేయుచు "భాగవతాగ్రణీ! ఏల నీ కీవిచారము? పండరినాథుఁడు సర్వవ్యాపి; విశేషించి భక్తప్రీతుఁడు. ఆతనిని విడువఁజాలక నీవెట్లు కుందుచున్నావో, నిన్ను విడువఁజాలక ఆతఁడును అట్లే తహతహపడుచుండును. మీయన్యోన్యవియో

గను నీకంటె అతనికి మిగుల దుర్భరము. నీహృదయమునందే తాండవము చేయు చున్న విఠలనాథుని నీవు చూచుటలేదా? ఇక నీ కీవిచార మేల?" అని బుజ్జగించు చుండెను. అందులకు నామదేవుడు జ్ఞానదేవునిఁ జూచి "మహానుభావా! నీవు అచంచల భక్తుఁడవు కావున, సుస్థిరహృదయుఁడవు కావున నీకు బెంగ లేదు; కాని నే నెట్లు తాళఁగలను? ఆపాండురంగని దివ్యమంగళ విగ్రహమును జూడకున్న నాకన్నులు నిలువఁజాలవు. నాహృదయము తేరికొనఁజాలదు. విచారమన న్నేదో యెఱుఁగనినీకు నావిచార మ్మేదో ఎట్లుఁ దెలియఁగలదు. నీవనుగ్రహించి విఠలనాథుని దర్శనము నిన దినము నాకు కలుగునట్లు చేయవేని, నేను బ్రతుకఁజాలను" అని అనేకవిధముల దీనాలాపము లాడుచునే జ్ఞానదేవుని వెంటఁ బోవుచుండెను.

మఱికొంతదూరము పోయినతరువాత నామదేవునిఁ జూచి జ్ఞానదేవుఁడు "భక్తశిఖామణీ! నీచరిత్రము మిగుల ఆశ్చర్యకరమై యున్నది. నీవు శ్రీహరి నెట్లు ఉపాసించితివి? ఆజగదీశుని యనుగ్రహము నీకు ఎట్లు లభ్యమైనది?" అని యడిగెను. ఇదివిని నామదేవుఁడు జ్ఞానదేవుని పాదములనంటి "మహాత్మా! మీరు ఇట్లు అడుగరాదు. ఈదీనునియందు మీరు తెలిసికొనవలసినది ఏమియులేదు" అని బదులుచెప్పెను; కాని అంతటితో జ్ఞానదేవునకు తృప్తికలుగలేదు. ఆతఁడు నామదేవుని బుజ్జగించి "నీహృదయము ఇంత గంభీరమైనది" అని నాకు మొదటినుండియు నెఱుకయే. తెలిసినవానివద్ద ఇంక ఎంతతడవు దాఁచెదవు? 'నామదేవా! పయిపయి రంగులు చూచి తత్త్వము నూహించువారు నీయెదుట శృంగభంగము గాంచుటలో సందియము లేదు. తెలిసినవారికి ఇప్పుడు నీవు ఆడినపలుకులయందు ఎంతో యర్థము గలదు. నీసంభాషణము వినుటవలన నాకు పరమానందము గలుగు చున్నది. పాండురంగని అనుగ్రహము లేకున్న ఇట్టి మహామహిమోపశోభితుఁడవు అగు నీతోడిసాహచర్యము నాకు లభించియుండదు గదా! ఇఁక వెనుకటి వృత్తాంత మంతయు నేటికి? సాధుసంగమువలనఁ గలుగు ప్రయోజనము నీవలనఁ బడయుటకు నేను నీతో తీర్థయాత్రకు బయల్వెడలితిని. నీవు నాకు మనోరథమును ద్రోసివేసెద వేని పాండురంగఁడుచెప్పినట్లు నిజముగ ఈనాప్రయాణము అంతయు వ్యర్థమేగాక, విశేషించి నిన్ను ఇట్లు శ్రమపెట్టినందులకు నాకు మహాపాతకము గూడ సంభవింపఁగలదు. కావున నాప్రార్థనమును మన్నించి, నాయెడల ననుగ్రహము ఉంచి నాకోరికను దీర్పుము" అని మఱల నామదేవుని ప్రార్థనాపూర్వకముగ, బలవంతము చేసెను. నామదేవుఁడు కొంతతడవు నిరుత్తరుఁడు అయ్యెను.

తుదకు తప్పనిసరియగుటచే నామదేవుఁడు జ్ఞానదేవునిపాదములపై వ్రాల్చి "ఇటు నిర్బంధపెట్టిన నే నెట్లు తాళఁగలను? ఈయుదాధ్యాయము తెలిసిన దేమున్నది? మీ

నిర్బంధమే నన్ను పలికించుచున్నది. సర్వజ్ఞులగుమీయెదుట మాటాడుటకే సిగ్గగుచున్నది. నేను శాస్త్రములను చదివియుండలేదు. యోగములను అభ్యసింపలేదు. కేవలము శ్రీహరియెడల మాధభక్తిచేసితిని. ఈశ్వరదత్తమగు దేహమును ఈశ్వరసేవయందే వినియోగింపవలయు ననియు, ఈశ్వరునిచే ననుగ్రహింపఁబడిన హృదయమును తత్స్మరణమునందే వినియోగింపవలయుననియు, ఈవిధమున దేవదేవునిచే నొసంగఁబడినసర్వమును ఈశ్వరునికే సమర్పింపవలయుననియు నాకు తోఁచినది. నే నట్లే చేసితిని. ఏదోయొక యశరీరవాణి నేను చేసినది సరియని నాకు వినిపించినది. అప్పటినుండియు నేను ఆమార్గమునుండి విచ్యుతుఁడను గాలేదు. శ్రీహరి ఆనందముతో నన్ను స్వీకరించినాఁడు. నేనిప్పుడు ఆసచ్చిదానందస్వరూపమునే నా హృదయమున నిడుకొని శ్రవణమననాదులచే అర్చించుచు, ఆనందరసమగ్నుఁడనై యున్నాను" అని చెప్పెను.

జ్ఞానదేవునకు మహానందము కలిగెను. తోడనే యాతఁడు నామదేవుని దృఢముగఁ గౌఁగిలించుకొని "మహాత్మా! ధన్యుఁడ నైతిని. నీదివ్యసాధనా ప్రణాలి అనితరసాధ్యమై యున్నది. మముబోంట్లకు ఇంత సులభముగా హృదయము స్వాధీనము కాలేదు. నినుబోలువారు ఇఁక లేరనిచెప్పుట అసంభావ్యము గాదు" అని కొనియాడెను. తుదకు వారు డిల్లీనగరము చేరుకొనిరి. అచ్చటివారెల్లరును కొలఁది దినములయందే నామదేవుని ప్రభావమును విని, గుంపులుగుంపులుగా వచ్చి సేవించి పోసాగిరి. మఱికొన్ని దినములలో నగరమునందంతటను ఈవృత్తాంతము వెల్లడియయ్యెను. జనసంవాదము అచ్చటి తురుష్కప్రభువునకు చాల వింతగను విపరీతముగను దోఁచెను. నామదేవుని ప్రభావమునందు ఆతనికి నమ్మకము కలుగలేదు. విశేషించి పరీక్షింపవలెనని సంకల్పము కలిగెను.

ఇట్టి సంకల్పముతో పాదుషాహ ఒకగోశవమును పట్టించుకొని అక్కడకువచ్చి, "నీవు నిజముగ హరిదాసుఁడవేని దీనిని బ్రతికింపుము. లేకున్న నిన్ను శిక్షింతును" అని నామదేవునితోఁ బలికెను; కాని నామదేవుఁడు ఏమియు భయపడలేదు. చలింపనులేదు. మాఱుకూడఁ బలుకలేదు. ఈస్థితివలన పాదుషాహకు కోపము పెరిఁగిపోయెను. ఖడ్గముల నాతఁడు జడిపించుచు, "దీని నెన్నిదినములలో బ్రతికించెదవు? మాఱుపల్కుము" అని మేఘగంభీరభాషణములతో పలికెను. అది చూచి నామదేవుఁడు మందహాసము గావించి "నాలుగుదినములలో రమ్ము. పో ఇఁక పలుకవలదు" అని బదులు చెప్పెను. పాదుషాహ తెలివితేటలుగల భటులను అచ్చట కావలా వేసి కోటకుఁ బోయెను.

పిదప నామదేవుఁడు శ్రీహరిని ప్రార్థింపఁ దొడఁగెను.

శ్లో. జానాతి రామ తవ తత్త్వగతిం హనూమాన్ జానాతి రామ తవ సఖ్యగతిం కపీశః,
జానాతి రామ తవ యుద్ధగతిం దశాస్యో జానాతి రామ ధనదానుజ ఏవ సత్యమ్.
శ్లో. హే రామ హే రమణ హే జగదేకవీర హే నాథ హే రఘుపతే కరుణాలవాల,
హే జానకీరమణ హే జగదేకబంధో మాం పాహి దీన మనిశం కృపణం కృతఘ్నమ్.
(రామకర్ణామృతము. ఆ. 4. ప. 17-18.)

అని ఈతీరున నామదేవుఁడు నాలుగుదినములు ప్రార్థించెను. అప్పటికి పాండురంగఁడు నిజరూపముతో నచ్చట సాక్షాత్కరించెను. తోడనే నామదేవుఁడు శ్రీహరిని వలగొని సాష్టాంగమాచరించి, "జగన్నాథా! నాపై నాగ్రహ మేల కలుగఁజేసెను? నేనేమి యపరాధము చేసితిని? నాలుగుదినములు నన్నేల యుపేక్ష చేసితివి? నాఁడు నీ వియోగభారమును సహింపఁజాల నంటిని; కాని ఇప్పుడు ఇన్నిదినములు ఇంత దీనుఁడనై ప్రార్థించినను ఏల దయ చూపకపోతివి? ఇట్లయిన నేను బ్రతుకఁగలనా?" అని దీనముగఁ బలికెను. అందులకు పాండురంగఁడు మందహాసము గావించి "నామదేవా! తప్పంతయు నాపై మోపుట ధర్మమా! నీవు పాదుషాహాతో 'ఈయావు నాలుగుదినములలో బ్రతికింతు' నని చెప్పితివి. అగుటచే నేనింతవఱకును రాఁజాలకపోతిని. నీవు అప్పుడే బ్రతికింతునని ఏల చెప్పకపోతివి? నాహృదయమును నీవు తెలిసికొనఁజాలక పోతివి" అని పలుకుచు చచ్చిపడియున్న ఆవుకళేబరమును ముట్టుకొని తోడనే తిరోహితుఁ డయ్యెను. ఆవు లేచి నిలచెను. మహానందపరవశుఁడై నామదేవుఁడు నృత్యము ప్రారంభించెను.

ఇది యంతయుఁ జూచి రాజభటులు తెల్లవోయి కొంత తడవు మ్రాన్పడి యుండి, పిదప తిన్నగ పాదుషాహాచెంతకుఁ బోయి సంగతియంతయుఁ దెలిపిరి. ఆశ్చర్యాతిరేకముచే పాదుషాహా కొలుత నిర్విణ్ణుఁడై పిదప తేరికొని, వెంటనే అటకుఁ బరువెత్తుకొనివచ్చి "నాయపరాధమును క్షమింపవలయు" నని నామదేవుని పాదములపై వ్రాలెను. అందఱును ఆనందించిరి. నామదేవుఁడు పాదుషాహాను తన శిష్యవర్గమున చేర్చికొనియెను. నామదేవుఁడు మహామహిమము స్వల్పకాలమునందే దేశము నలుమూలలకు నల్లుకొనియెను.

పిదప నచ్చట నొకటి రెండు దినములు ఉండి, నామదేవుఁడును, జ్ఞానదేవుఁడును మఱల బయలుదేఱి ప్రయాగ, అయోధ్య, మధుర, గోకులబృందావనము, ద్వారక మున్నగు పుణ్యస్థలముల సందర్శించి మార్వాడీదేశమునకుఁ బ్రయాణమైరి; ఒకనాఁటిప్రయాణమున వారు ఒక యూరు విడిచి రెండవయూరు వచ్చుచుండఁగా, మార్గమధ్యమున ఇరువురకుఁగూడ నొక్కమాఱుగ దాహము [illegible] వారంతటను గలయఁ జూచిరి; కాని సమీపమున నేదియు తటాకము [illegible]

ప్రయాణము. ఆ ప్రయాసముతోడనే వారు మఱికొంతదూరము అరుగునప్పటికి అచ్చట నొక బావి కాన్పించెను; కాని అచ్చట చేద త్రాడు మున్నగు సాధనములు ఏమియు లేకపోయెను.

అయినను జ్ఞానదేవ నామదేవులవంటి భాగవతాగ్రేసరులకు ఏమిలోపము? జ్ఞానదేవుడు చూచుచుండగనే, దేవతలు స్వర్గమునుండి భూమికి ఆధారములు ఏమియు లేకయే దిగునట్లు నూతిలో దిగి, దప్పిదీఱ నందలి మధురజలమును త్రావి బైటకు వచ్చెను. అంతట నామదేవుడు చేతులు జోడించి, "జగన్నాథా! భక్త చింతామణీ! రక్షింపుము. సంవత్సరము బట్టి చూచిన నిక నేను పండరిపురమున నిన్ను సందర్శించుట పొసగనట్లు తోచుచున్నది. అయినను సకలమునకు నీవే కర్తవు" అని ప్రార్థించెను. తోడనే ఈప్రార్థనము ముగియక పూర్వమే బావియందలి నీరు పొంగి పైకి వచ్చెను. అది చూచి నామదేవుడు పాండురంగని పాదపద్మములను స్మరించి పిపాస శమించునట్లు జలమును త్రావెను. ఈవింతను జూచి జ్ఞానదేవుడు నామదేవుని కౌగిలించుకొని, "మహాత్మా! సర్వకాలసర్వావస్థలయందును పాండురంగడు నీకు తోడునీడయై యున్నాడు. అనుక్షణమును నేను నీసాహచర్యమువలన పునీతుడ నగుచున్నాను" అని వినుతిచేసెను. నామదేవుడుగూడ జ్ఞానదేవుని బ్రతివినుతిచేసెను. ఈతీరున ఒకరి ప్రభావమును ఒకరు కొనియాడుకొనిన తరువాత, వారు ఇరువురును మఱల ప్రయాణము సాగించిరి. వారిరువురును పిపాస తీర్చుకొను సందర్భమున మహాద్భుతములు చూపిన ఆబావిచెంతకు వచ్చి, నేటికిని వేలకొలది సాధుజనులు మార్గశిరమాసమున అవగాహనము చేసి విముక్తపాపు లగుచుందురు.

హరిద్వారము, హిమాచలము, నైమిశారణ్యము, గయ, జగన్నాథము, శ్రీకూర్మము, సింహాచలము, కోటిలింగాలు, ద్రాక్షారామము, భీమేశ్వరము, కోటిఫలి, కాళహస్తి, వేంకటాచలము, శ్రీరంగము మున్నగు సమస్తతీర్థక్షేత్రములను వారు సేవించి, తుదకు మహాశివరాత్రికి నాగనాథపురమువచ్చి చేరుకొనిరి. అచ్చట నాడు నాగనాథునియాలయము అంతయు జనసంఘముచే క్రిక్కిరిసియుండెను. అయినను వారు ఎట్లో తెలివిచేసికొని గర్భాలయమునొచ్చి, నాగనాథునకు సాష్టాంగవందనములు అర్పించి ధ్యానముచేసి, తుదకు భగవద్గుణకీర్తనము ప్రారంభించిరి. వారిమనోహరగానపద్ధతికి అబ్బురపడి, అచ్చటి జనసంఘము అంతయు నిశ్చేష్టమైయుండెను.

ఇట్లుండ గొంతసేపటికి అర్చకులు స్నానసంధ్యాద్యనుష్ఠానములు అన్నియు ముగించికొని, స్వామిని బూజించుటకు వచ్చిరి; కాని వారు లోనికి బోవుటకు మార్గము కాన్పింపదయ్యెను. అందులకు కుపితులై, వారు జ్ఞానదేవుని నామదేవుని

జూచి "ఇదియేమి గందరగోళము? తొలఁగిపొండు. ఈశ్వరుని సేవించుటకు అనేకులు వచ్చుచున్నారు. వారికి ఏరికిని, మాకుఁగూడ మార్గము లేకుండ నిట్లు అడ్డముగాఁ గూర్చుండిన నేట్లు? పొండు. ఈవేషములు అన్నియును మాకు తెలియనివి గావు" అని గర్జించి పలికిరి; కాని భగవద్గుణానుభవమున నున్న నామదేవునకును, జ్ఞానదేవునకును ఈమాటలు విన్పింపవయ్యెను. అందులకు మఱింత ఆగ్రహపడి అర్చకులు సంగతి యంతయు పూర్వవిధముగనే చెప్పి, "పొండు. ఆలయము వెనుకకుఁ బోయి మీగోల మీచిత్తమువచ్చినట్లు చేసికొనుఁడు" అని యాజ్ఞాపించిరి. నామదేవుఁడును జ్ఞానదేవుఁడును మాఱుపలుకకుండ అట్లేచేసిరి. అర్చకులు "మూర్ఖులు" అని నవ్వుకొనుచుఁ దమపనిమీఁదఁ బోయిరి.

యథాపూర్వముగ నామదేవుఁడును జ్ఞానదేవుఁడును ఆలయమువెనుకనే భగవద్గుణకీర్తనము ప్రారంభించిరి. ఇట్లు కొన్ని నిముసములు గడచునప్పటికి ఆకసమునుండి విద్యున్మూర్తులవలె వెలుంగుచు తొమ్మిదిలక్షలమంది పతాకములను గైకొని వచ్చి ఆకసమునందే సమీపమున నిలిచియుండిరి. ఈసమయమున దేవతలు పుష్పవర్షము కురిసిరి. అదిచూచి అచ్చటివారందఱును నామదేవుని ప్రభావమును అనేకవిధములఁ గొనియాడసాగిరి.

ఇట్లుండఁగా, ఆపగలును రాత్రియుఁగూడఁ గడచిపోయెను. అర్థరాత్రియగు నప్పటికి బాలచంద్రుని సిగపూవుగా ధరించిన నాగనాథుఁడు ఆలయముతోఁగూడ నామదేవునకు అభిముఖముగ అనఁగా పశ్చిమాభిముఖముగఁ దిరిగి, ఆతని అద్వితీయమగు ఈశ్వరగుణకీర్తనాచాతుర్యమునకు ఆనందింపసాగెను.

మఱికొంతసేపటికి ఉదయ మయ్యెను. యథాపూర్వముగ అర్చకులు మఱల నీశ్వరునిఁ బూజించుటకు స్నానసంధ్యాదికములు అన్నియు ముగించుకొని వచ్చిరి; కాని వారికి అంతయు విపరీతముగఁ దోఁచసాగెను. పుష్కరిణులు, తక్కిన భవనములు, మంటపములు మున్నగునవియెల్ల యథాప్రకారముగనే యున్నను, ఆలయము మాత్రము అట్లు తిరిగిపోయి యుండుటచే వారికిఁ గొంతవఱకును దిగ్భ్రమ గలిగెను. ఈస్థితి కొంతసేపటికిఁ బోఁగా వారు ఇందులకు నామదేవునిప్రభావమే కారణము అని తెలిసికొని, వెంటనే అచ్చటకుఁ బోయి అనేకవిధములఁ గొనియాడఁ జొచ్చిరి. అంతవఱకును అచ్చటనే యుండియు మైమఱచి యుండిరి; కావున అచ్చటివారు ఎల్లరును ఈవిషయమును విని పరమాశ్చర్యచకితులై, నామదేవునకు సాష్టాంగవందనములు అర్పించి ఓపినంతవఱకును సన్నుతింపఁగడఁగిరి. నింగినిఉన్న దేవతాపురుషులు అదృశ్యులైరి; ఆలయము ప్రతిధ్వనించునట్లు ఆనందధ్వానములు చెలరేఁగెను. జ్ఞానదేవుఁడు నామదేవుని కౌఁగిలించుకొని మిగులఁ గొనియాడెను. ఇప్పటికిఁ గూడ నాగనాథుని ఆలయము పశ్చిమాభిముఖముగనే యున్నది.

ఇప్పుడు మఱికొన్ని దినములు ఉండి, నామదేవుఁడును జ్ఞానదేవుఁడును నాగనాథుని సెలవు బడసి పండరిపురమునకుఁ బ్రయాణము సాగించిరి. ఇంతవఱకును నామదేవుఁడు ప్రయాణము చేయునపుడు మార్గమధ్యమున జ్ఞానదేవునితో సకల విషయములను గుఱించియు యథేచ్ఛగ ముచ్చటించెడువాఁడు; కాని ఈప్రయాణమునమాత్రము తల్లినిఁ జేరఁబోవు దూడవలె పండరినాథునియందే హృదయమును లీనముచేసి మౌనవృత్తి వహించి నడువసాగెను. అదిచూచి జ్ఞానదేవుఁడు "ఈమహాత్ముఁడు పండరినాథుని సమీపించుచున్నా నను ఆనందమువలన మైమఱచియున్నాఁడు. ఇప్పుడు ఈతనినిఁ బలుకరించి ఆయానందానుభవమునకు విఘ్నము నాపాదించుట ధర్మముగాదు" అని తలంచి, ఏమియును పలుకకయే వెంట వచ్చుచుండెను.

ఇట్లు ఒకటి రెండుదినముల ప్రయాణము సాగునప్పటికి ఒకనాఁటియుదయము. పండరిపురము కొంచెము దూరముననున్న దనఁగా, స్వామి ఆలయగోపురాగ్రము దృగ్గోచరమయ్యెను. తోడనే నామదేవుఁడు సాష్టాంగనమస్కారము లాచరించి,—

**చ. "వెతుకటి వేళలం దనుభవించిన జన్మశతంబు లట్లు నేఁ**
**డును భ్రమ మోసపోవక గడుం జెలివొందుము డెందమా! చిరం**
**తనతపముల్ ఫలించి పురతఃస్థితి నున్నది కృష్ణరూపమై**
**యనవరతానుచింతన సుధారసవీచుల నోలలాడుమీ."**

**(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 64.)**

అని పలికి; భక్తివివశుఁడై కొంతసేపటికి లేచి పూర్వాధిక వేగంబునఁ బోయి చంద్రభాగానదిలో స్నానమాడి, మఱింత వేగముగఁబోయి పండరినాథుని యాలయముఁ జొచ్చెను. ఈతనిని చూచిన వెంటనే పండరినాథుఁడు ఎదురువచ్చి చేతులు సాచి నామదేవుఁడు సాష్టాంగపడఁబోవుచుండఁగనే తటాలునఁ బట్టుకొని, కౌఁగిటఁజేర్చి యొడిసిపట్టి శిరంబు మూర్కొని, "వత్సా! నిన్నెన్ని దినములకుఁ గంటినోయి! నీవు ఇచ్చట లేకపోవుటచే ఇన్ని దినములును నాకన్నులు కాయలు కాచినవి. నామనసు మనసున లేదు. ఏమియు తోఁచినది కాదు. అంతయు అంధకారబంధురముగఁ గాన్పించెను. నేఁడు నిన్ను గాంచుటవలన నాప్రాణములు లేచివచ్చుచున్నవి. కన్నులు తేరికొనుచున్నవి. ఆహా! నేఁ డెంతయానందముగా నున్నది" అని పలికి, "జ్ఞానదేవా! మీయిరువురరాకకును నేను క్షణమొక మహాయుగమువలెఁ గడుపుచు ఎదురుచూచుచున్నాను. మీతీర్థయాత్ర సాంగమైనది గదా? దురాత్ములవలన ఏమియు చిక్కులపాలుగాకుండ నిరాటంకముగ వచ్చితిరిగదా? నీకోరిక నెఱవేఱినదిగదా? అద్దిరా! నీపట్టుదల! నీ సాధనాప్రణాళి! నీయచంచలభక్తి! నీవినిర్మలజ్ఞానము! నీయనుపమేయవైరాగ్యము! నాకు అపరిమితానందము గలుగుచున్నది. ఇంతటిజ్ఞానాఢ్య వయ్యు

నీవు దంభమును ఎఱుఁగవు. ప్రపంచమును ఎఱుఁగవు. పదియతత్త్వము తక్క నీయోచనకు మఱియొకటి అంటదు. చాల నానంద మైనది" అని యాతనిని గూడ ఆదరించి చేరఁదీసి కౌఁగిలించుకొనియెను.

నామదేవజ్ఞానదేవుల హృదయసీమలయందు నిర్మలానందవాహిని పొంగి పొరలిపోయెను. అంతట నామదేవుఁడు మోఁకరించి నిలిచి చేతులు దోయిలించి, "శ్రీహరీ! భక్తబాంధవా! నన్ను పెద్దఁజేయవలెనని నాయందలి యనుగ్రహముచే నిట్లు పలికెదవు; కాని సర్వాంతర్యామి వగు నీకు తెలియని దేమున్నది? నేను చెప్ప వలసిన దంతయు నీవే చెప్పివేసి నాకు వాగ్బంధనము చేసితివి. జనార్దనా! నీ నిర్హే తుకజాయమానకటాక్షమునకు మేర కలదా? ఈక్షుద్రునియెడల ఇంత యనురాగ మును జూపుచున్న నీతత్త్వము నెఱుంగ నెవ్వరి తరము? నీవు చెప్పినట్లు జ్ఞాన దేవుఁడు సాక్షాత్తుగ సచ్చిదానందస్వరూపుఁడు. ఆతని సాహచర్యమువలన నాహృద యము నిర్మలమైనది. నాశరీరము పావనమైనది. నాజన్మ సఫలమైనది. నేను ధన్యుఁడ నైతిని. మహాత్ముఁడగు జ్ఞానదేవుని సన్నిధి లేకపోయిన భవద్వియోగభారమును సహింపఁజాలక నాహృదయగోళము ఇంతవఱకే పగిలిపోయియుండును." అని పలు కుచు, స్వామిపాదములను కన్నీటిచే కడిగెను.

జ్ఞానదేవుఁడు కూడ నట్లే మోఁకరించి నిలిచి, కరకమలములను ముకుళించి, "అచ్యుతా! సర్వలోకశరణ్యా! నీలీలల నెఱుంగ నెవరితరము? ఏమియు నెఱుఁగ నట్లుండెదవు. నామరూపములు లేనివానివలె నుందువు; కాని ఈజగమంతను నీవే యాడించుచున్నావు. తత్త్వవిచారణ చేయఁగలుగువారికి అనంతరూపుఁడవును, అనంతనాముఁడవునై సాక్షాత్కరించుచున్నావు. నీయాద్యంతముల నెఱిఁగినవా రెవ్వరును లేరు. నీకు ఆదియు అంతమును లేనేలేదు. కొందఱు భక్తులు నీవు తమ్మే పూర్తిగ అనుగ్రహించుచున్నావని చెప్పెదరు; కాని ఎవరికివారికే అట్లుచేయు చున్నావు. నీవు ప్రతిభక్తునిఁగూడ నీకంటె నాకు ప్రేమభాజనము లేదని చెప్పెదవు; కాని ఇందఱభక్తులలో పూర్ణముగ నీవిలాసములు తెలిసినవా రెవరున్నారు? అయి నను నాయెడల చూపుచున్న ప్రేమము అపారము. ఇది నీయకారణవాత్సల్యమునకు చిహ్నము; కాని నాభక్తికి సూచకముగాదు. మాధవా! నీయనుగ్రహమునకు నీవాత్సల్యము కాక, కేవలము నాభక్తియే కారణము అగునెడల, ఎవనికి నిన్ను సమీ పింప శక్తిఁ గలదు? మాహృదయములు నిర్మలములైనవెంటనే నీకభిముఖములైన తోడనే వారికి నీయనురాగదీప్తిచే ప్రకాశముఁ గలిగించెదవు; కాని కాకున్న నెవఁడు స్వశక్తిచే నిన్ను జేరఁగలఁడు? మధుసూదనా! విశ్వమంతయు వ్యాపించి యున్న సర్వజ్ఞుఁడవయ్యు, నన్ను నీతీర్థయాత్ర నిరాటంకముగ సాగ[illegible]! యని

యుండఁగానున్నావా ? అప్పుడు అడుగవలసినదే. నేను చెప్పవలసినదే, చెప్పెదను. వినుము. నా మొదట అపారకృపవహించి నామదేవుని నాకు తోడిచ్చిన, వెనుక ఇంక నాకు లోపములు ఏమియుండును ? అంతయు నిరాటంకముగ నెఱవేఱినది. సర్వమును బ్రహ్మానందప్రదముగ పూర్తియైనది. శ్రీధరా! నీయనుగ్రహపాత్రునకు అసాధ్యము లేమి యుండును ? అంతయు అనుకొనినట్లే పూర్తియైనది; కావుననే ఇటుగ నీపట్టణమునకు వచ్చితిని." అని తానుగూడ బాష్పోదకముచే శ్రీహరికి పాద్యమును ఘటించెను.

పండరినాథుండును నామదేవుని కంఠమున తులసిహారమును వేసి, మఱల నాదరించి, "వత్సా! నీవు చాల శ్రమపడి తీర్థయాత్ర చేసికొనివచ్చితివి. కావున వ్రతము ఫలించుటకు ఉద్యాపనము సేయవలయును" అనిచెప్పి తానొక బ్రాహ్మణవేషమును ధరించి సోపానదేవుఁడు జ్ఞానదేవుఁడు మున్నగు భక్తాగ్రేసరులు వెనువెంట వచ్చుచుండ, నామదేవుని వెంటనిడుకొని గ్రామములోనికి బయలుదేఱెను. నిండుచంద్రుని వలె వెలుఁగుచు ప్రచ్ఛన్నవేషుఁడై యున్నపండరినాథునిచుట్టును చంద్రునిచుట్టునున్న నక్షత్రములవలె అలరారుచున్న భాగవతులను జూచి, గ్రామవాసులందఱును అద్భుతాశ్చర్యచకితు లగుచుండిరి. శ్రీహరి బ్రాహ్మణుల నందఱను సంబోధించి "నామదేవుఁడు తాను చేసిన తీర్థయాత్రకు ఉద్యాపనము చేయుచున్నాఁడు; కావున మీరందఱును విందునకు దయచేయవలయును" అని పిలువఁదొడఁగెను. నాలుగైదు గడియలలో ఆగ్రామమునందలి బ్రాహ్మణుల నందఱను పిలుచుట యైపోయెను. స్వస్థానమునకు వచ్చినతర్వాత, శ్రీహరి కామధేను కల్పవృక్షములను స్మరించెను. తోడనే అవి సాక్షాత్కరించి, విందునకు వలయు నేర్పాటు లన్నియు చూచుచుండఁగనే ముగించివేసెను. కొంతసేపటికి బ్రాహ్మణులు తండోపతండములుగ వచ్చిరి. పిదప పాండురంగఁడు చేయవలసిన కృత్యమంతయు నామదేవునిచేఁ జేయించి, బ్రాహ్మణులను మృష్టాన్నసంతృప్తులం గావించి, "మహానుభావులారా! తాంబూలములను పుచ్చుకొని పోవచ్చును. కొంచెము తడవు విశ్రమింపుఁడు" అని చెప్పి, నామదేవాదిభక్తులతోఁగూడ తాను భోజనమునకుఁ గూర్చుండెను. రుక్మిణీసత్యభామలు వడ్డించిరి. భోజనము ప్రారంభమయ్యెను. వారి యుచ్ఛిష్టమును వీరును, వీరియుచ్ఛిష్టమును వారును, అందఱి యుచ్ఛిష్టమును పండరినాథుఁడును, పండరినాథుని యుచ్ఛిష్టమును అందఱును భుజింపసాగిరి.

ఇది చూచి బ్రాహ్మణులు చాల కటకటం బడిరి. "ఈబ్రాహ్మణుఁ డెవ్వఁడో తెలియదు. సంగతి సందర్భములను బట్టిచూచిన బ్రాహ్మణుఁడగునా కాదా? యని గూడ సందేహింపవలసివచ్చుచున్నది. మనము ఇట్టు లేమియు విచారింపకయే త్వర

పడి పోదు మఱచితిమి. మనబ్రాహ్మణ్యము చంద్రభాగలో కలిసిపోయినది" అని తహతహపడి, వారు బ్రాహ్మణవేషధారి యగు పండరినాథుఁడు తాంబూలము లీయ వచ్చినపుడు "దూరముగ నిలువుము. తొలుత నేమో నీవు బ్రాహ్మణరూపచండాలుఁడవని తెలిసికొనఁజాలక పోయితిమి. నమ్మి వచ్చినందులకు బాగుగనే చేసితివి. నీతాంబూలములు మాకు వలదు. నీవు బ్రాహ్మణుఁడవేని వర్ణాశ్రమాచారభ్రష్టులగు వీరితో భుజించినందులకు ప్రాయశ్చిత్తముఁ జేసికొనుము. లేకున్న వ్యవహారము బాగుగ జరుగదు." అని పలికిరి.

పండరినాథుఁడు ఇది యంతయు విని, "వీరు మూర్ఖాగ్రేసరులై యున్నారు. శాస్త్రవాదమునకు పనికిరారు. యుక్తివాదమునకు రారు. తమకుఁ దోఁచదు. చెప్పిన వినరు. ఈజ్ఞానలవదుర్విదగ్ధులతో వాదింపఁబూనుట నవ్వులాటకు కారణము" అని తలఁచి, ఏమియు నెఱుఁగనివానివలె "బ్రాహ్మణప్రవరులారా! మీయాజ్ఞాప్రకారమే చేసెదను. అంతయు మీరే నెఱవేర్పవలయును." అని చెప్పెను. బ్రాహ్మణులు అంగీకరించిరి. మఱునాఁడు చంద్రభాగానదీతీరమున వారు యథాశాస్త్రముగ బ్రాహ్మణరూపి యగుపండరినాథునకు ప్రాయశ్చిత్తము చేసిరి. "మన పంతము నెగ్గినది" అని అంతయునైన తరువాత బ్రాహ్మణులు చాల గర్వించిరి.

అపుడు పండరినాథుఁడు బ్రాహ్మణుల నందఱను జూచి, "మహానుభావులారా! మీయాజ్ఞ నెఱవేఱినది. మీయనుగ్రహమువలన నేను పునీతుఁడ నైతిని; కావున నేను తరించుటకు నేఁడు నేను ప్రత్యేకముగఁ జేయఁబోవువిందునకు మీరందఱును దయచేసి ఆరగింపవలయును." అని ప్రార్థించెను. బ్రాహ్మణులు అంగీకరించిరి.

అనుష్ఠానము లన్నియు తీర్చుకొని, యుక్తసమయమునకు బ్రాహ్మణులందఱును వచ్చిరి. వారిలో వారే కొందఱు ఒక గదిలో సిద్ధముగానున్న దివ్యములగు భోజన పదార్థములను వడ్డించుకొని భోజనము ప్రారంభించిరి. ఈసమయమున పండరినాథుఁడు తన నిజరూపమును దాల్చి బ్రాహ్మణుల నడుమ సంచరింపసాగెను.

ఇది చూచి బ్రాహ్మణులు తెల్లవోయిరి. "అయ్యో! మనము గ్రహింపలేక పోయితిమి. పాండురంగఁడే ఇట్లు ప్రచ్ఛన్నరూపముఁదాల్చి ఇన్ని లీలలను జేసెను. కట్టా! మన మెంత దుర్మార్గుల మైపోయితిమి. దేవాదిదేవునకు ప్రాయశ్చిత్తము చేయించిన మనకు ఇఁక పుట్టగతులు గలవా?" అని యనేకవిధముల పరితపించు చుండ పండరినాథుఁడు చూచుచుండఁగనే మఱల తొల్లిఁటి ప్రచ్ఛన్నరూపమును ధరించి, నామదేవునిచే వారికి నమస్కారములు చేయించి, "బ్రాహ్మణోత్తములారా! ఈతనిని అనుగ్రహింపుఁడు. ఈతఁడు నాయాఱవప్రాణము. భక్తిమార్గమున [illegible] చేరఁదలఁచువారిలో ఈతఁ డగ్రేసరుఁడు. ఇంతటి భక్తశిఖామణి మఱి [illegible]

కలుగఁబోదు. నన్ను చేరుటకు అనేకమార్గములు కలవు. అందు మీరు అవలంబించిన మార్గము ఒకటి. ఈతఁడు అవలంబించిన మార్గము ఒకటి. ఇంకను అనేక మార్గములు ఉన్నవి. మీరు ఒకరినొకరు ద్వేషించుకొనుట ఏమి ధర్మము? ఏమి లాభము? మీమార్గమున మీరు ఘనులు. అట్లే ఎవరిమార్గమున వారు ఘనులు. మార్గముమాత్రము మంచిది గావలెను. అది నన్ను చేర్చునది కావలెను. కావున తత్త్వము నెఱింగి ప్రవర్తించుట మంచిది” అని చెప్పి విరమించెను.

బ్రాహ్మణులు వివేకమును గాంచిరి. వారందఱును తమ యపరాధమును మఱచి తమ్ము కాపాడవలయునని అనేకవిధముల ప్రార్థించి, పెక్కువిధముల స్తోత్రము గావించిరి. అగణ్యసాష్టాంగనమస్కారము లాచరించిరి. భగవంతుఁడు వారి ప్రార్థనలు మన్నించెను. వారికి అభయమిచ్చెను. అందఱును సెలవుఁబడసి ఎవరి యిండ్లకు వారు పోయిరి.

పిదప మఱికొన్ని దినములు గడచిపోయెను; ఒకనాఁడు నామదేవుఁడు జ్ఞానదేవుఁడు భక్తాగ్రేసరులు అందఱును, గోరాకుంభారు ప్రార్థింపఁగా, ఆతని యింటికిఁ బోయిరి. ఆసమయమున ఆతఁడు వారి నందఱను జాల మర్యాద చేసి, మహాదరముతోఁ బూజించి సేవించెను. అంతట జ్ఞానదేవుఁడు గోరాకుంభారునిఁ జేరఁబిలిచి “మహాత్మా! నేడు నీయింటికి వచ్చి నీచే నాదరింపఁబడుటవలన మేము ధన్యులము అయితిమి. నీవు తొల్లి కుంభకారుఁడవు గావున ఘటముల మంచిచెడ్డలు నీకుఁ దెలియనివిగావు. ఇచ్చట నీవు ఇన్ని ఘటములను వరుసగాఁ గూర్చుండఁబెట్టితివి గదా! ఇన్నిటిలో ఉత్తమాధమభేదములను వివరించి చెప్పుము” అని కోరెను. అది విని గోరాకుంభారు అనేకవిధముల తప్పించుకొనవలయును అని చూచెను; కాని ప్రయోజనము లేకపోయెను. తుదకు ఆతఁడు జ్ఞానదేవుని ఆజ్ఞాప్రకారము ఘటపరీక్ష చేయుటకు సన్నద్ధుఁడై ముందునకు వచ్చెను.

మృద్ఘటములను జేతితోఁ గొట్టి పరీక్షింతురు గదా! అట్లే గోరాకుంభారు అచ్చట బంతిదీఱి కూర్చుండియున్న ఆభక్తులశిరములపై చేతితోఁ గొట్టుచుఁ బరీక్షింపసాగెను. జ్ఞానదేవుఁడు, సోపానదేవుఁడు మున్నగువారు వినిర్మలభక్తులు గావున, గోరాకుంభారు చేతితోఁ దమశిరములపై గొట్టుట యెఱుఁగనే యెఱుఁగరు; కాని నామదేవుఁడు మాత్రము కుంభారు తన్ను సమీపించిన వెంటనే వెనుకకు ఒదిగి “ఓరి నిన్ను ఏమి చేసితిని? నాశిరమున నేల కొట్టెదవు” అని వడఁకుచు అడిగెను. ఆమాటలకు బదులు ప్రత్యేకముగఁ బలుకక, ఆతఁడు అందఱను జూచి “ఇన్నిఘటములలో ఇదియే ఓటిది. ఇది నిర్దుష్టముగాదు” అని యెలుఁగెత్తి పలికెను. తోడనే అజ్ఞానదేహాదులు అందఱును పకపక నవ్విరి. నామదేవుఁడు లజ్జాభరంబున ఏమియుఁ జేయఁజాలక, వెంటనే అటనుండి కదలి ఆలయము చొచ్చెను.

అల్లంత దూరముననే నామదేవునిఁ బండరినాథుఁడు చూచి, ఎదురేఁగి కౌఁగిలించుకొని, ముఖము గ్రీష్మాతపతప్తమగు కలువవలెనుండుటఁగాంచి, బుజ్జగించి సంగతి అంతయు నడిగెను. నామదేవుఁడు కొంతవఱకును లజ్జచే మాటాడఁజాలక, మఱి కొంతసేపు దుఃఖించి, పిదప "శ్రీహరీ! సర్వాంతర్యామివి అయ్యు, నన్ను సంగతి ఏమి యని అడుగుచున్నావా? ఇది నీవంటివానికిఁదగినదే? నేను నీవు నావాఁడవు అని తలంచి మోసపోయితిని. ఇట్లు చేసెదవు అని తలంపఁజాలనైతిని" అని పలికెను.

అంత శ్రీపాండురంగఁడు "వత్సా! ఏల శోకించెదవు? ఇందు అన్యాయము ఏమి ఉన్నది? నీహృదయము అచంచలమే; మఱియు భక్తిబంధురమే; కాని దానికి ఇంకను పరిపక్వస్థితి సంభవింపలేదు. నీవు జ్ఞానదేవాదులు చెప్పినట్లు ఇంతవఱకును సదాచార్యుని ఆశ్రయింపకపోవుటయే అందులకుఁ గారణము. జ్ఞానదేవాదులు నిన్ను పరిభవింపవలయు నను తలంపుతో అట్లు నవ్వలేదు. అట్లుచేసినఁగాని నీకు యథార్థము తెలియదనియు, నీకు ధన్యత సిద్ధింపదనియుఁ దలంచిరేగాని, వారికి నీయెడల మఱియొకభావము లేదు. కావున వారిమాటలును హాసమును నీకు లజ్జాకారణములు కావు. నేను తలఁచినపుడెల్ల నీకు సాక్షాత్కరించుచు, నీకుఁ దోడునీడగా నున్నను, ఆచార్యాశ్రయరాహిత్యము నీయందు లేకపోలేదు. అయినను, తక్కిన నీగుణగణములవలన నిన్ను విడువఁజాలకపోవుచున్నాను. జ్ఞానదేవాదులుగూడ నీయెడల నిట్టి యభిప్రాయముతోడనే యున్నారు. వారు నీకు ఈకళంకము తొలఁగి పోవలయును అనియే నేఁడు ప్రస్తావనచేసిరి. కావున నీవు వారియెడల అన్యథా చింతింపక, వెంటనే ఆచార్యుని ఆశ్రయింపుము" అని హితోపదేశముచేసెను.

అపుడు నామదేవుఁడు "పండరినాథా! నీవును ఇట్లే సెలవిచ్చిన ఇంకేమి చెప్పఁగలను? అయినను నీకుఁగాని, జ్ఞానదేవుఁడుమున్నగు భాగవతాగ్రేసరులకుఁ గాని నాయెడల సాధింపవలసిన ద్వేషమేమియు లేదుగావునను, నాకు నీయనుగ్రహముతోడనే గాని తదన్యముతో ప్రసక్తి ఏమియు లేదుగావునను, విశేషించి నీయాజ్ఞ యైనదిగావునను, నేను సదాచార్యుని ఆశ్రయించెదను. కాని తన్నిర్ణయము నీవే చేయవలయును" అని మనవిచేసెను. పండరినాథుఁడు నీకు తగిన సదాచార్యుఁడు విసోబాకేశుఁడు తక్క నన్యుఁడు లేఁడు." అని చెప్పఁగా, వల్లెయని నామదేవుఁడు ప్రయాణమయ్యెను.

మార్గమధ్యమున విసోబాకేశుఁడు నాగనాథుని సన్నిధి నున్నాఁడని నామదేవునకు తెలియవచ్చెను. అగుట నాతఁ డచ్చటికే పోయెను. పోయి చూచునప్పటికి విసోబాకేశుఁడు లింగాకారముతో నున్న నాగనాథునిపై తన కాళ్లు ఉంచి నిద్రించుచుండెను. ఈస్థితిని జూచి నామదేవుఁడు చాల సందేహించి [illegible]

చూచిన యిట్లున్నది. పండరినాథుని యుపన్యాసము చూచిన మహాద్భుతముగ నున్నది. కిరాతునివంటి ప్రాకృతుఁడుగూడ దేవుని విగ్రహముపై కాళ్లు ఉంచుకొని నిద్రించుట కట్టుకథలయందైనను వినలేదు. ఇట్టి అవ్యక్తునిపై పండరినాథునకు అట్టి సదభిప్రాయము ఎట్లు కలిగెనో, ఊహింప నలవికాకున్నది. అంతయుఁ జూడఁగా, జ్ఞానదేవాదులును పాండురంగఁడును నాపై నారోపించిన కళంక మొక్కటియే గాక, నాయందు అంతకు మించినది మఱి యేదోఁగూడఁ గలదనియు, దానినిగూడ తొలఁగించుటకే శ్రీహరి ఈవిశోబాకేశునివంటి అవ్యక్తులచెంతకు నన్నుఁ బంపెననియుఁ దోఁచుచున్నది. ఏది యెట్లయినను ఈతనిని పలుకరించి చూచినఁ గాని పాండురంగనిభావము తేటపడదు" అని నిశ్చయించుకొని విశోబాముఖము మీఁదనే తన చూపును నిలిపి ఎదుట నిలిచి యుండెను.

కొంతసేపటికి విశోబాకేశునకు మెలఁకువ వచ్చెను. తోడనే యాతఁడుకన్నులు విచ్చి చూచెను. అంతట నామదేవుఁడు అతనిం జూచి "అయ్యా! నీవంటివాఁడు ఇట్లు శివలింగముపై పాదములు ఉంచుకొని నిద్రించుట తగునా?" అని యడిగెను. అందులకు విశోబాకేశుఁడు మందహాసము చేసి, "ఇందు అసంభావ్యమేమున్నది? మీరు పరోపకారపారీణు లని తోఁచుచున్నది. దివ్యతేజస్సువలన భాగవతాగ్రేసరు లనిగూడ పొడగట్టుచున్నది; కావున దయయుంచి ఎచ్చటనుంచిన దోషముండదో అచ్చట నాపాదముల నుంపఁగోరుచున్నాను." అని బదులు పలికెను. నామదేవుఁడు మాఱుపలుకకయే క్రిందఁ బెట్టవలెనని విశోబాకేశునిపదముల నంటెను. కాని వెంటనే జగత్తంతయు శివమయముగాఁ గాన్పించెను. శివలింగము లేని స్థలము ఆవగింజంతయైనను కాన్పింపదయ్యెను. నామదేవుఁడు ఈయద్భుతమును చూచి నిర్విణ్ణుఁడై యుండఁగా. విశోబాకేశుఁడు "వత్సా! ఏల యాశ్చర్యపడెదవు? శివలింగము లేని స్థల మెచ్చట నున్నది? హరి యెచ్చట నుండునో, హరుఁడు నచ్చటనే యుండును. బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు పృథక్స్థితియున్నదా?" అని యడిగెను. విశోబాకేశుని పాదముల నంటిన వెంటనే విద్యుత్తువలె విజ్ఞానము తన హృదయమున వ్యాపించుటచే గతకల్మషుఁడై యున్న నామదేవుఁడు అంతయు నెఱింగి, విశోబాప్రభావమును తెలిసికొని అతనికి సాష్టాంగవందనము లాచరించి, "మహాత్మా! నన్ను ఉద్ధరింపవలయును. పండరినాథుని యనుజ్ఞవలన నీసన్నిధికి వచ్చితిని. నాకిఁక నన్యము దిక్కు లేదు." అని ప్రార్థింపఁగా, విశోబాకేశుఁడు అతనిం జేరఁదీసి, అభయమిచ్చి జ్ఞానోపదేశముఁ గావించెను.

తోడనే నామదేవుని హృదయముపై నావరించియున్న మాయావరణము తొలఁగిపోయెను. అతనికి జగత్తంతయు శ్రీహరిమయముగాఁ దోఁచెను. ఈదివ్యసంద

ర్శనములవలన ఆతఁడు పండరిపురమునందలి సకలమును విస్మరించెను. ఆతఁడు నడచును; కాని తానెందుఁ బోవుచున్నదియు నెఱుఁగఁడు. చూచుచుండును; కాని ఎందు చూచున్నదియు నెఱుఁగఁడు. కండ్లకు శ్రీహరిరూపమే కాని మఱి యేమియు కాన్పింపదయ్యెను. శ్రవణములకు శ్రీహరినామముతప్ప ఇతరము విన్పింపదయ్యెను. వాక్కునకు హరిగుణకీర్తనము తక్క అన్యము అందదయ్యెను. ఇట్లాతఁడు సచ్చిదానందానుభవమున వివశుఁడై యుండెను.

ఒకప్పుడు పండరినాథుఁడు ఆతఁడున్న చోటికి వచ్చి తట్టి ప్రబోధించి, "నామదేవా ! నాపై కోపించితివా యేమి? మఱి యీ విపరీతమేమి? తొల్లి నన్నొక్కనిమిషమైనను బాసియుండఁజాలకపోయెడివాఁడవు. ఇప్పుడు నీకు పండరిపురస్మృతియే లేకపోయెను. నీకిది తగునా?" అని యడుగఁగా, నామదేవుఁడు "శ్రీహరీ! నీయనుగ్రహమువలన నాయజ్ఞాన మంతయుఁ దొలఁగిపోయినది. ఇప్పుడు నీవు లేనిస్థలమేదియు నాకు కాన్పించుటలేదు. నీకంటె నితరరూపము కాన్పించుటలేదు. ప్రపంచమంతంతటను నీవే నిండియున్నావు. అట్టిచో నేను పండరిపురమునకు ఏలరావలయును?" అని బదులుచెప్పెను. ఈప్రత్యుత్తరమునకు శ్రీహరి పరమానందభరితుఁడై ఆతనిచేతిం గైకొని తన యెదుట నిలిచియున్న జ్ఞానదేవాది సాధుపుంగవులం జూచి "ఇప్పుడు నామదేవుఁడు అపక్వఘటమని ఎవరైన చెప్పఁగలరా?" యని యడిగెను; కాని ప్రత్యుత్తరము రాలేదు.

ఒకప్పుడు పండరినాథుఁడు నామదేవునిఁజూచి "వత్సా! నీహృదయస్థితి యెట్లున్నది? వీశోబాకేశుని యుపదేశమును మరచితివా?" అని యడిగెను. అందులకు నామదేవుఁడు "అదెట్లు సంభవించును? పదార్థ బాహుళ్యము గలిగినపుడు భ్రాంతికి అవకాశము ఉన్నది; కాని నీకంటె నన్యము లేనపుడు భ్రాంతి గాని, పతనముకాని విచ్యుతి గాని, ఎట్లు సంభవించును?" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఇది యెంత నిశ్చయమో యెఱుంగుటకు నామదేవుని పరీక్షింపవలయు నని పండరినాథునకు సంకల్పముఁ గలిగెను. ఈయూహతో నాతఁడు ఒకనాడు ఒకచో భాగవతాగ్రేసరులు అనేకులు గుమికూడి భుజించుచుండఁగా, శ్వానరూపముధరించి అచ్చటకు వచ్చెను. కొందఱు భాగవతులు ఛీఛీ యని దానిని తఱిమివేసిరి. మఱికొందఱు తమముందున్న పదార్థము అపవిత్రమైపోయినదని దానిని విడిచివేసిరి. మఱికొందఱు అసహ్యపడియుఁ జూచియుఁ జూడనట్లు నటించిరి; కాని పదార్థములను మాత్రము విడువలేదు. ఇంతలో నది పదార్థములు నిలువయున్న చోటికిఁబోయి ఒకపాత్రమున మూతిపెట్టెను. తోడనే కొందఱు దుడ్డుకఱ్ఱలతో [illegible] వారి కందక అచ్చటినుండి తొలఁగిపోయి, భుజించు భాగవతులలో ప్రవేశించెను.

మగుడ భాగవతులు కొందఱు దానిని తఱుమఁజొచ్చిరి. అంతట నది నామదేవుని చేతనున్న రొట్టెను చటాలున నోటఁ గఱచుకొని పాఱిపోఁదొడఁగెను; కాని నామ దేవుఁడు అందులకేమియు కోపపడక, ఏవగించుకొనక విశేషించి ప్రపంచములో శ్రీ హరికంటె నన్యము ఏమి కలదు? అని తలంచి, "మహాత్మా! ఏల పరుగెత్తెదరు? ఏల భయపడెదరు?" అని దానిని పట్టుకొని ఒడిలోఁ గూర్చుండఁబెట్టుకొని "వట్టిరొట్టె తినవలసిన గతియేమి?" అని పలికి, రొట్టెను తన చేతఁ గొని చిదిపి ఆముక్కలను నేతిలో ముంచి, చక్కెరలో నద్ది దానినోటి కందింపసాగెను. శ్వానమును నిర్భయ ముగా ఆరొట్టెముక్కలను భుజింపసాగెను.

ఇది చూచి, అచ్చటనున్న భాగవతులలో కొందఱు "నామదేవునకు పిచ్చి పట్టినది. లేకున్న కుక్కకు రొట్టె పెట్టుటయేమి? ఆహా! అంతటి భాగవతశిఖామణికి ఇట్టి పాటు రాఁజెల్లునా? అంతయు ఈశ్వరునిసంకల్పము" అని నవ్వుకొనసాగిరి. మఱికొందఱు భాగవతులు "అట్లనఁగూడదు. నామదేవుఁడు పండరినాథుని అంతరంగ భక్తులలో నగ్రేసరుఁడు. ఈశ్వరతత్త్వము ఆతనికిఁ దెలిసినట్లు అన్యులకుఁ దెలియదు. ప్రపంచమంతయు ఈశ్వరమయ మని మనకుఁ దెలియనిది గాదు; కాని మనకు అనుభవజ్ఞానము లేదు. నామదేవుఁడు శ్వానమునందుఁ గూడ భగవంతుని గనుఁ గొనెను. కావుననే ఆతఁ డిట్లు ప్రవర్తించుచున్నాఁడు. పండరినాథుఁడు నామదేవు నకుఁ గొంగుబంగారమై యున్నాఁడు. ఆతఁడు భక్తశిఖామణిని విడిచి ఎప్పుడును ఉండఁజాలఁడు" అని చెప్పుకొనసాగిరి.

ఈవాదప్రతివాదము లిట్లు జరిగిపోవుచుండఁగనే,అట కుక్క చూచుచుండఁగ దివ్యమంగళవిగ్రహమై నామదేవుని అనుగ్రహించి అంతర్ధానమయ్యెను. దీనినిఁ జూచి తొలుత ఆక్షేపించినవారు తెల్లవోయిరి. కొనియాడినవారు ఆశ్చర్యచకితులైరి. తుదకు అందఱును "భగవంతుఁడు అగు పండరినాథుఁడు నేఁడు ఇచ్చటఁజేరిన భాగ వతుల నందఱను భరీక్షించుటకువచ్చెను. ఆసర్వేశ్వరుని అనంతలీలలలో నిది యొకటి. మనము మందబుద్ధులము గావున మొట్టమొదట తెలిసికొనఁజాలక పోయితిమి. నామ దేవుఁ డన్న అఖండజ్ఞానపరిపూర్ణుఁడు గావున, శ్వానరూపియై వచ్చిన ఈశ్వరుని తెలిసి కొనఁ గలిగెను. కావుననే ఆతఁడు అనుగ్రహింపఁ బడియెను." అని యనేకవిధముల నామదేవునిఁ గొనియాడుచు, తమదౌర్భాగ్యమును నిందించుకొనసాగిరి.

పిదప కొంతకాలము గడచిపోయెను. కార్తికశుద్ధైకాదశి వచ్చెను. నాఁడు నామదేవుఁడు మహానందముతో పండరినాథునిఁ బూజించుటకు ఆలయమునకుఁ బోయెను. పూజ ముగిసిన పిదప పండరినాథుఁడు సాక్షాత్కరించి, నామదేవుని ఆలింగ నము చేసికొని "వత్సా! నీవు నేఁ డిచ్చట భుజింపవలయును" అని చెప్పెను. కాని

నామదేవుఁడు పండ్లను అంగీకరింపలేదు. "ఈశ్వరా! తప్పుత్రోవలనుండి ఉద్ధరింప వలసిన నీవే ఇట్లు చెప్పిన మేమేమి చేయఁగలము? నేఁడు ఏకాదశి. నేఁడు భుజించిన వానికి పుష్టిగతు లుండునా?" అని బోధించి చెప్పెను. అందులకు శ్రీహరి ఏమియు అడ్డుచెప్పక అంగీకరించెను. మఱికొన్ని దినములు గడచిపోయెను. మరల ఏకాదశి వచ్చెను. నాఁడు పండరినాథుఁడు నామదేవుని పరీక్షింపఁదలఁచి, వృద్ధబ్రాహ్మణ రూపము దాల్చి వచ్చి "మహానుభావా! చాల దూరమునుండి వచ్చుచు, కడు డస్సి యున్నాను. ఆఁకలిచే నాకడుపు మాడిపోవుచున్నది. గడియ యాగకున్న నేను శోషవచ్చి పడిపోదును. పట్టెఁడన్నమైన నాకు చాలును. రక్షింపవలెను" అని దీనముగ ప్రార్థించెను; కాని నామదేవుఁడు "అయ్యా! వృద్ధుఁడవగు నీకు నేను చెప్ప వలసిన దేమున్నది? నేఁడు ఏకాదశిగదా! నేఁడు ఒక్కమెతుకైనను భుజించిన వాఁడును, పెట్టినవాఁడును నరకలోకమునకు పోవుదురు. కావున నీవు అంత బాధపడుచుంటివేని ఫలముల నిచ్చెద భుజింపుము" అని పలికెను.

బ్రాహ్మణుఁడు అందులకు అంగీకరింపలేదు. "నాకు పండ్లు అక్కఱలేదు. అన్నమే కావలెను. ఇఁక మాటలాడఁజాలను. కండ్లు తేలిపోవుచున్నవి. అన్నము అన్నము అన్నము. లేకున్న చచ్చిపోయెదను. ఈపాపము నీకు తగులును" అనెను కాని నామదేవుఁడు మెత్తపడలేదు. "పుణ్యపాపములతో నాకేమియు సంబంధము లేదు. నేను హరిదాసుఁడను. హరిధ్యానముకంటె నాకు మఱియొకటి వలదు. హరి విస్మృతికంటె నాకు పాపకారణము లేదు" అని యాతఁడు బదులు చెప్పెను. వృద్ధుఁడు ఇది విని చాల కోపమును బ్రకటించి, "నీయంతక్రూరుఁడు లేఁడు. విష్ణుభక్తుఁడ నని గర్వించియున్న నీకంటె చండాలుఁడు మేలు" అని కన్నులు తేలవేయుచు కూలఁబడిపోయెను.

అంతట నామదేవుఁడు పరీక్షించిచూచి, బ్రాహ్మణుఁడు చనిపోయెనని తెలిసి కొనెను. ఇది చూచి ఇరుగు పొరుగువా రందఱును "నామదేవుఁడు శిలాహృదయుఁడు. దుర్మార్గుఁడు. వృద్ధబ్రాహ్మణుని చేతులార చంపిన పాపాత్ముఁడు". అని నిందింపసాగిరి. అయినను ఆతఁడు వారికేమియు ప్రత్యుత్తరము చెప్పక, ఆబ్రాహ్మణుని కళేబరమును భుజములపై నిడుకొని భీమానది యొడ్డునకు తీసికొనిపోయి చితి పేర్చి, దానిపై నెక్కించి అగ్ని ముట్టించి, ప్రక్క మఱియొక చితి పేర్చుకొని దానికి నిప్పు ముట్టించి దానిపై తా నెక్కెను. ఈసంగతి వెంటనే గ్రామములో తెలిసిపోయెను. నామదేవుని భార్యయు విని, ఒక్క క్షణమైన నింట నుండక అచ్చటకుఁ బోయి, భర్తయున్న చితిపై తానును నెక్కెను. ఈవింతను అచటివారు స్త్రీపురుషు లందఱును చూచి నామదేవునిమాహాత్మ్యమునకు ఆశ్చర్యపడసాగిరి.

చితి మంటలు నల్వంకల నలుముకొనుచుండఁగా, బ్రాహ్మణరూపియగు పాండురంగఁడు నిజరూపముతో సాక్షాత్కరించి నామదేవుని, అతనిభార్యను సురక్షితముగ పైకి లేపి, "వత్సా! నీధైర్యస్థైర్యములకు మెచ్చితిని. నీనిష్ఠకు ఆనందించితిని. ముల్లోకములయందును నాకు నినుబోలు అంతరంగభక్తుఁడు లేఁడు. నీభార్యను బోలు పతివ్రతలు లేరు" అని పలుకుచు, చూచుచుండఁగనే తిరోహితుఁడయ్యెను. అచ్చట నున్నవారందఱును ఈయద్భుతమును జూచి, నామదేవుని మాహాత్మ్యమును గొనియాడి, మహోత్సవముతో ఆదంపతులను గ్రామమునకుఁ గొనిపోయిరి. నామదేవుఁడు బ్రతికియున్నంతకాలము నిల్లే హరిభక్తి సలిపి, అవసానమున శ్రీహరి సాయుజ్యమును బడసెను. దేశమునందలి భక్తలోకమంతయు అతని నిర్యాణమునకు వగవని దినము లేదు.

మ. "వరశేషాద్రిలసద్విమానమున భాస్వద్యోగపీఠంబునం
దు రమాయుక్తముగా వసించి మునిసంతోషాకృతిక్ గల్గి వి
స్ఫురదోంకారమునక్ భజింపఁదగు రాముక్ మేఘసుశ్యాము సుం
దరకాముక్ రవిధాము నిచ్చలు పరంధాముక్ భజింతుక్ మదిన్."

(రామకర్ణామృతము. ఆ. ?. ప. 93.)

---

# 46. కూ పా కుం భా రు

శ్లో. "బృన్దావనద్రుమతలేషు గవాంగణేషు వేదావసానసమయేషు చ దృశ్యతే యత్,
తద్వేణువాదనపరం శిఖిపింఛచూడం బ్రహ్మ స్మరామి కమలేక్షణమభ్రనీలమ్"

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 21.)

మార్వాడీదేశంబున ఒకపల్లెయందు కూపాకుంభారు అను నొక కుమ్మరి యుండెను. అతఁడు ఇరుగుపొరుగువా అందఱవలె సంసారనిమగ్నుఁడు కాక, తామరాకుమీఁది నీటిబిందువువలె, సంసారము నంటక సదాభగవద్ధ్యానతత్పరుఁడై యుండెడివాఁడు. అతని భార్యయు సద్గుణరాశియై రమణీమణియై భర్తయాజ్ఞాప్రకారము వర్తించుచుండెను. ఆమెగూడ భర్తవలెనే భక్తురాలు. కూపాకుంభారు దినమునకు ఒక్కకుండ చేసి, నెలకొకమారు ముప్పదికుండలను ఆవము పెట్టి కాల్చి, వానిని దినమునకొకటిచొప్పున విక్రయించి, ఆస్వల్పధనముతోడనే దినపాతము చేయుచుండెను. ఆదంపతులు ఇరువురునుగూడ నిస్పృహులే యగుటవలన అంతకంటె ఎక్కుడు కుండలు చేసి, ధన మార్జింత మని ఎన్నఁడును ఊహింపలేదు. కుంభారు దినమున కొక్కటిచొప్పున చేయుటయైనను కేవలము దినపాతనిమిత్తమే గాని మఱియొకందులకుగాదు. "ఒక్కకుండ క్రయముతో మనసంసారము గడచిపోవుచున్నది. మనకు

ఏమియును లోపము లేకుండ రోజులు గడచిపోవుచున్నప్పుడు మనమెల్ల శ్రీహరిని ధ్యానించుట మాని, ఆశావిజితులమై ధనధాన్యసంపదం బెంపుకొనఁజాలని అవస్థను మనము రానేల? పూర్వజన్మసుకృతవిశేషంబున పండరినాథుని దివ్యనామామృతము మనకు లభించినది. దీనిని మఱచిపోవుటకంటె దౌర్భాగ్య మేమున్నది?" అని అతఁడును భార్యయుఁ జెప్పుకొనుచు, ఇంద్రియములను జయించి, ఈశ్వరధ్యానమున నిమగ్నులగుచుండిరి.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, ఆదేశపు నేలు ప్రభువు ఆశక్తిదుర్జనుఁడై కుండలుచేయు కుమ్మర లెల్లరును ఆవము ఒకటింటికి నెలకు పదికుండలు చొప్పున కోటలో నప్పగింపవలయునని శాసనము చేసెను. చేయునది లేక కుమ్మరు లెల్లరును ఆశాసనమునకు లోఁబడిరి. కూపాకుంభారుకూడ అట్లే ఈయసాగెను; కాని ఆవము పెట్టునపుడు ముప్పదికుండలనే పెట్టినను, ఆవము తీయునప్పటికి అందు నలువదికుండలుండెడివి. అది చూచి ఆదంపతు లిద్దఱును పరమాశ్చర్యచకితులై "ఇది పండరినాథుని లీల. ఇంతకంటె అన్యముగాఁ గాదు. సర్వశక్తుఁడు అగు ఆరుక్మిణీకాంతుని లీలల నెఱుఁగ నెవ్వరివశము?" అని నిశ్చయించుకొని, అది మొదలు మఱింత భక్తిశ్రద్ధలతో నాతనిఁ బూజింపఁజొచ్చిరి.

ఇట్లుండఁగా, పండరినాథునకు కూపాకుంభారును బరీక్షింపఁ దలంపు గలిగెను. అంతట నొకనాఁడు ఆతఁడు ఇన్నూర్గురు భక్తులతోఁగూడి ఒకబ్రాహ్మణుని వేషముఁబూని కుంభారు ఇంటికి వచ్చెను. అప్పుడు గృహయజమానుఁడు అగు కుంభారు లోపల భార్యతోఁగూర్చుండి భగవంతుని స్మరించుచుండెను. ఈసమయమునందు వీథిలోని భక్తులుఅందఱును ఒక్కమారుగ శ్రీహరినామోచ్చారణము గావించిరి. ఆధ్వని కుంభారు కర్ణములలోఁ జొచ్చెను. తోడనే యాతఁడు బైటికి వచ్చి, సాక్షాత్కరించిన విష్ణుదూతలోయన వెలుంగుచు, వీథియందు నిలిచియున్న భాగవతాగ్రేసరులం గాంచి అనేకసాష్టాంగనమస్కారములు ఆచరించి, ఆదరవచనములు పలికి, అర్ఘ్యపాద్యాదివిధులతోఁ బూజించి, సుఖోపవిష్టులం గావించి, చేతులు జోడించుకొని ఎదుట నిలిచి, "మహానుభావులారా! మీయాగమనమువలన నా జన్మము నావంశము నాజీవితమును ధన్యములైనవి. నేను పునీతుఁడనైతిని. ఇందఱు భాగవతోత్తములను ఒక్కచోట ఒక్కమాఱు చూచుటకు నాకు ఇదియే ప్రారంభము. మీదర్శనమువల్ల నాకుఁ గలిగిన యానందము కూలంకషమై యుక్కిరిబిక్కిరి యొదవించుచుండుటచే, బహుభాషలు ఆడుటకు నేను ఓపఁజాలకున్నాను. మహాత్ములు ఊరకరారు. కావున దేవరవారలు విచ్చేసినకారణమును ఎఱింగింపఁ బ్రార్థింతును" అని వేడుకొనెను.

అంతట ఆభాగవతులు ఇట్లనిరి. "నీవు చేయు ఆదరము మాకు ఆనందముం గొలుపుచున్నది. మాకు విశేషము అగు కోర్కె ఏదియు లేదు. మేము ఆఁకట నకనకలాడుచున్నారము. ఈపూట మాకు ఈక్షుద్బాధ తీర్చెదవేని కృతజ్ఞులమై యుండెదము" ఇట్లు చెప్పునపుడు ఆభాగవతులు చాల ఆయాసమును బ్రకటించిరి. అది విని సహజనియార్ద్రహృదయుఁడు అగు కుంభారు హృదయము బ్రద్దలుకాఁగా, ఓర్వఁజాలక అంతకును పండరినాథుఁడే కలఁడు. అను విశ్వాసముతో స్వశక్తి విచారణ సేయక, "భాగవతోత్తములారా! ఇందులకై ఇంతవైన్యము పాలుకానేల? ఈదాసునియెడల దవి యాజ్ఞయగును. కాని ప్రార్థన మెట్లగును? ఒక్కక్షణము మాత్రము తాళుఁడు. ఇంతలోనే సకలమును సన్నద్ధము గావించెదను" అని చెప్పి, వారిని అచ్చట నుండఁగోరి బైటకు వచ్చి నలుదిక్కులు గలయం జూచి "ఇప్పుడు ఏమి దారి? ఇంటకుభాగవతులు కోరిన కోర్కెను కొనసాగింపఁజాలనేని, ఇఁక నాజన్మము ఏల? ఇందు అనేకమహాత్ములు గలరు. అందఱును శ్రీహరికి అంతరంగభక్తులు. ఒక్కపూటయైన వారికి దురంతము అగు క్షుత్తుతీర్చుట రూపముగ సేవఁజేయఁగలుగుదునేని ఇఁక నాకుఁ గావలసినది ఏమికలదు?" అని కొంతతడవు యోచించి, తిన్నఁగ బజారునకు దారితీసెను. పోవుచుండఁగా, హఠాత్తుగా నాతనికి ఒక ఆలోచనము తోఁచెను. తోడనే యాతఁ డొక అంగడిచెంతకుఁ బోయి నిలిచెను.

భక్తిరసము ఇట్లు అవతరించి వచ్చినదో యని తేజరిల్లుచున్న కూర్మాకుంభారు నారసి, యావర్తకుఁడు "అయ్యా! మీరు వచ్చిన పనిఏమి?" అని ప్రశ్నించెను. అంతట కుంభారు సంగతి అంతయు నెఱింగించి, "శ్రీమంతుఁడా! ఇపుడు వచ్చియున్న భక్తులు కేవలయు శ్రీహరికి ఆంతరంగికులు. వారిని సేవించుభాగ్యము అయాచితముగ నాకు లభించినది. వారిని సఫలమనోరథులం గావింపకుండ నేను పంపివేయఁజాలను. నేఁడు నీవు వారికిఁ గావలసిన సామగ్రి యంతయు ఒసంగెదవేని కృతజ్ఞుఁడను. మఱియు అచిరకాలమునందే వడ్డితోఁగూడ ఆమూల్యమును ఇచ్చివేసెదను" అని కోరెను. వర్తకుఁడు అందులకు అంగీకరించి, "అయ్యా! మీరు బీదవారు అగుట నేను కోరినప్పుడు గాని మీకు తోఁచినపుడు గాని మీచెంత ధనము ఉండక పోవచ్చును. అట్టిది సంభవించినచో పిదప చాల చిక్కులు తటస్థింపఁగలవు. ఇన్నియేల? ఉభయతారకము అగు ఒక యుపాయము చెప్పెదను. ఆలింపుఁడు. మీరు కోరిన పదార్థములను నేను ఒసంగుట ఏమో యథార్థము. మఱి విశేషము ఏమన: నేను ధర్మార్థము ఒకబావి త్రవ్వింపఁ దలఁచియున్నాను. నేఁడు నేను మీకు ఇవ్వఁబోవుచున్న సామగ్రిమూల్యమునకు బదులుగా ఆబావిని మీరు త్రవ్వుటకు అంగీకరించెదరేని, ఉభయుల కోరికలునుగూడ నిర్బాధముగ నెఱవేఱఁగలవు" అని చెప్పెను.

కుంభారు భాగవతోత్తమునకు ఇక్కట్టులు కలుగకున్న నేమైనను సరే చేయుదునని యందులకు అంగీకరించెను. వర్తకుడు స్వల్పధనముతో గ్రహించినట్టి బావి తయారగుచున్నందులకు ఆనందించి, ఆతడు కోరినది అంతయు ఇచ్చి పంపివేసెను. కుంభారు ఆసామగ్రి అంతయు ఇంటికిఁ గొనివచ్చి, భాగవతులను అగ్రామసమీపమున నున్న నందనవనమునకుఁ గొనిపోయి "పాకముచేసికొని తృప్తితీర భుజింపుడు" అని ప్రార్థించెను.

కుంభారు కోరిక ప్రకారము భాగవతులు మహానందముతో వంటచేసికొని తనివితీర భుజించి తాంబూలములు స్వీకరించి, "భక్తాగ్రేసరా! నీ సహాయమున ఆనందము కలిగినది. నీహృదయము విశుద్ధము గావున మాకిచ్చిన యాతిథ్యము శ్రీహరినిఁ జేరినది. ఈరూపమున నీవును మేమును కూడ ధన్యుల మైతిమి. తొలుత నీసంగతి మాకు తెలియదయ్యెను. నీవు సాక్షాత్తుగ శ్రీహరికి అంతరంగభక్తుడవు. నీకు ఎందును లోపము లేదు; అయినను నీయాతిథ్యమును బడసితిమి; కావున నిన్ను ఆశీర్వదింపకుండఁ బోవరాదు; కాని, నీవు నిష్కాముడవు. ఈప్రపంచమున నీకు అభ్యర్థనీయము అగు కోరిక యేమియు లేదు. అయినను నీహృదయమున ఏతలంపు పొడసూపునో, వెంటనే అది నెఱవేఱుఁగాత!" మని యాశీర్వదించి వారు తమ దారినిఁ బోయిరి.

మఱునాఁడు కూరాకుంభారును ఆతని భార్యయు యథాపూర్వముగ ప్రాతఃకాలమున లేచి కాల్యములు అన్నియు ముగించుకొని, స్నానమాడి హరినిఁ బూజించి, కలమట్టుకు చక్కఁగా వండిన భోజనపదార్థములను విశుద్ధహృదయములతో స్వామికి నివేదించి, పిదపఁ దాము భుజించి గునపము పాఱ మున్నగుఖననసాధనములను గైకొని వర్తకునియింటికిఁ బోయిరి. ఆవర్తకుడును వీరినిఁ జూచి వ్యాపారబాహుళ్యము వలన తామేర్పఱచికొనినది మఱచి, "ఏల వచ్చితిరి?" అని వారినిఁ బ్రశ్నించెను. అంతట కుంభారు సంగతి అంతయు జ్ఞాపకము చేసి "మేము బావి త్రవ్వెదము స్థలము చూపుము" అని చెప్పెను. వర్తకుడు ఆనందించి, వారి సత్యనిష్ఠకు ప్రశంసించి, తన పొలమునకుఁ గొనిపోయి "ఇచ్చటఁ ద్రవ్వుఁడు" అని చెప్పి యొకచోటు చూపి, "ఇట్లు సూక్ష్మములో మోక్షము ఉండవలయును" అని యానందించుకొనుచు ఇంటికిఁ బోయెను.

కుంభారు తొలుత "శ్రీహరి" యని గునపమువేసి తట్టలోనికి మట్టియెత్తెను. ఆతని భార్య "పుండరీకాక్షా" యని గంప నెత్తిమీఁదఁ బెట్టుకొని పోయి అవ్వలఁ బాఱఁబోసెను. ఈతీరున వారు శ్రీహరిని ధ్యానించుచు పని చేసిరి.

సాయంకాలము అగుచుండఁగా, వర్తకుడు చేసిన పనినిఁ బరీక్షించుటకు వచ్చెను. కుంభారు వినయముతో అంతయుఁ జూపఁగా, ఇరువదిమూండి [illegible]

పనిని ఇట్లు చేసినందులకు ఎంతయు ఆశ్చర్యపడుచు, ఆనందముతో వర్తకుఁడు ఇంటికిఁబోయెను. మఱునాఁడు మధ్యాహ్నము వఱకును కుంభారు భార్యతోఁగూడ అవిశ్రాంతముగఁ బనిచేయఁగా, అప్పటికి గంగాజలమువంటి నీరు పడెను. అదియు ఝరీవేగముతో రాసాగెను. అంతలకు కుంభారు ఆనందించి, "మాట యిచ్చినందులకు వర్తకునకు మనము ఋణము తీర్చికొనఁగలిగితిమి" అని సంతృప్తుఁడై, చెంతనున్న ఒక తియ మామిడిచెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆతని భార్య ప్రక్కనే యుండెను. ఇరువురును హరిభజనము ప్రారంభించిరి.

వీరు ఇట్లుండఁగా, వర్తకుఁడు మఱల వచ్చెను. కుంభారు అప్పుడే భజనము మాని, వర్తకునకు సకలమును నివేదించెను. ఆనీటి మాధుర్యమునకు వర్తకుఁడు పరమాశ్చర్యచకితుఁడై, మహానందపరిపూర్ణచిత్తుఁడై యూరివారినందఱను రావించి, సంగతి యానుపూర్వికముగ నెఱింగించెను. అందఱును ఆనీటి మాధుర్యమును జూచి రిచ్చపడి, "ఇది అమృతోపమానము. నీపుణ్యమువలన నిట్టిజలము పడినది. ఇది ఎన్ని దినములు వర్షము లేకున్నను ఎండిపోదు. ఈయూరి పొలములకు అంతయు ఈనీరు చాలును" అని ప్రశంసించిరి. తాము కష్టపడినందులకు వ్యర్థము కాలేదని కుంభారు మిగుల నానందించెను.

ఇది యంతయు ఇట్లగుచుండఁగా, ఆతీరున ఆనందించుచు కుంభారు నూతి చెంత నిలిచియుండెను; కాని ఉన్నట్లు ఉండఁగా హఠాత్తుగ అచ్చటి భూమి క్రుంగిపోయెను, కుంభారు భూమిలోనికిఁ బోయెను. అంతట అతనిభార్య విలపించుచు అచ్చటకు రాఁగా, అచ్చటివా రెల్లరును కుంభారును బైటకుఁ దీయుటకుఁ బ్రయత్నించిరి; కాని అతఁడు ఎందును గాన్పింపఁడయ్యెను. ఇఁకఁ జేయునది లేక వారు కుంభారు భార్యను ఓదార్చి, ఇంటికిఁ దీసికొనిపోయిరి.

పిదప ఆమె భర్తకొఱకు కొంతతడవు విచారించి, తుదకు ఈభౌతిక ప్రపంచముగతియే యిట్టిదని మనస్సునకు సమాధానము చెప్పుకొని, అత్యంతభక్తిశ్రద్ధలతో పాండురంగని మూఁడు అహోరాత్రములు ధ్యానించెను. అంత శ్రీహరి సాక్షాత్కరించి విచారము ఉడుపఁగా, ఆమె అనేకవిధముల వినుతిచేసెను. అందులకు సంతోషించి, స్వామి ఆమెకు అభయము ఇచ్చి "సాధ్వీ! నీకు విచారమువలదు. ఇఁక నొక్క సంవత్సరము అయినపిదప నీభర్త మఱల భూవివరమునుండి వచ్చును. అంతవఱకును నీవు యథాపూర్వముగ నన్నుఁ బూజించుచుండుము. పిదప నీభర్తయు నీవును గలిసి సేవించి ధన్యులయ్యెదరు. ఒక్క సంవత్సరము వఱకును భర్తృవియోగమును సహింపుము" అని పలికి, తిరోహితుఁడయ్యెను.

అట వర్తకుఁడు అకారణము కుంభారు భూమిలో దిగఁబడిపోయినందులకు విచారించి, అతఁడు దిగఁబడిపోయినచోట నొకమఠమును, దానిచుట్టును చక్కని

పూఁదోఁటయు నిర్మింపించెను. ఆబావి మధురజలమును గ్రోలినవారలకు సాత్త్వికభక్తి జ్ఞానవైరాగ్యములు అలవడెను. మఱియు ఈవృత్తాంతము అంతయు వినియు, ఆనూతి యందలి మధురజలములను విను జాలకయు, అనేకభాగవతులు ఆపురమున స్థిర నివాసములు ఏర్పఱచుకొనిరి.

ఈతీరున పాండురంగఁడు ఏర్పఱచిన గరుడస్తంభముగ నిలిచియుండాగ, ఒకనాఁటి రాత్రి ఆమఠమునందు కుంభారుఁ డుండగిపోయినచోట భూమిలోనుండి తాళములు మృదంగము మున్నగు వాద్యములు మ్రోయుచుండగ హరిభజనము వినవచ్చెను. అది విని అచ్చటివారు ఎల్లరును ఆశ్చర్యచకితులై, ఈవార్త గ్రామమున వెల్లడించిరి. తుదకు అది ఆదేశమును ఏలురాజునకుఁగూడఁ దెలిసెను. తోడనే రాజు వింతపడి అనంతపరివారముతోఁగూడి వచ్చి, అచ్చట త్రవ్వింపఁగా అడుగున శంఖచక్రాది సకలాలంకారములతోడ ఒప్పుచున్న ఒంగి శ్రీకృష్ణవిగ్రహమును, దానిముందు తాళములు వాయించుచు పాటలుపాడుచు హరిభజనచేయుచు కుంభారును ఉండిరి. రాజు ఆసంభవమును జూచి కుంభారుమహిమకు చాల నబ్బురపడి, తోడనే యతని పాదములమీఁద వ్రాలి, "మహాత్మా! రక్షింపుము" అని ప్రార్థించెను. అచ్చటి వారు ఎల్లరునుగూడ కుంభారుపాదములమీఁద వ్రాలి, రక్షణమును వేఁడుకొనిరి. భక్తుఁడు వారినందఱను ఆశీర్వదించుట అగునప్పటికి, వర్తకుఁడు వచ్చి భక్తుని కాళ్ల మీఁద వ్రాలి సాష్టాంగనమస్కారములు ఆచరించి"మహాత్మా! ఏలినవారి మాహాత్మ్య మును దెలిసికొనఁజాలక నీచమైన పనిచెప్పి మీమనసు నొప్పించితిని. ఈనూతి జలము త్రావిన పిమ్మట నాకు జ్ఞానము కలిగినది. ఎంతచేసినను నేను చేసిన పాపము పోదు. అది తమయనుగ్రహమువలననే పోవలయును. కావున అనుగ్రహించి రక్షింపవలెను." అని ప్రార్థించెను. భక్తుఁడు ఆతని నాదరముతో లేవనెత్తి, "మహాను భావా! విచారమువలదు. నీవు చేసిన అకృత్యము ఎద్దియును లేదు. నీయనుగ్రహము వలననే నాకు ఈయదృష్టము గలిగినది. నీయనంతకరుణవవలన నేను ఒక సంవత్సరము శ్రీహరితో ఏకాంతవాసముచేసి బ్రహ్మానందమును అనుభవించితిని. నీమీఁద ఈశ్వ రునకు అనుగ్రహము గలుగు" నని పలికెను.

పిమ్మట రాజు "ఈతఁడు మానవమాత్రుఁడు గాఁడు" అని చెప్పి, ఆందోళిక మీఁద నాతనిని, మనోహరమగు విమానముమీఁద శ్రీకృష్ణవిగ్రహమును ఎక్కించి యుక్తస్థలమునకుఁ గొనిపోయి విడియించెను. ఇంతలో కుంభారుభార్య వచ్చి భర్తకు సాష్టాంగనమస్కారము లాచరించి నిలువఁగా, ఆతఁడు ఆమెను దీవించి "నీవు భగవ దనుగ్రహమునకుఁ బాత్రురాలవు అయ్యెదవు" అని చెప్పెను. అప్పుడు ఆమె తన స్వప్నవృత్తాంతము అంతయు నివేదింపఁగా కుంభారు ఎంతయు ఆనందించెను.

తరువాత ఆరాజు తన పట్టణమున ఒక గొప్పఆలయమును గట్టించి అందు శ్రీకృష్ణవిగ్రహమును బ్రతిష్ఠచేసి, ఆసమీపమునందే ఒకమఠము కట్టించి, అందు కుంభారును భార్యాసహితముగా నిలిపెను. మఱియు నాతఁడు శ్రీకృష్ణపరమాత్మను

సేవించుటకును, కుంభారునివలన జ్ఞానోపదేశమును బడయుటకును ఏఁగుదెంచుభాగవతులు కుమ్మరునివారికిని శ్రీకృష్ణునకును ఏమియు లోపములు ఒదవకుండునట్లు వలసిన ప్రయత్నము, వారిని భక్తమార్గములయందు పెచ్చించుటకు కొందఱు ఉద్యోగులను నియమించెను. కొన్ని దినములు గడచినతరువాత, రాజు సంపూర్ణముగ జ్ఞాన వైరాగ్యములనుబొంది కుంభారు పాదములను బట్టి "అనుగ్రహింపవలయును" అని ప్రార్థించెను. కుంభారు కరుణాళుండై, రాజునకు శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి దాని క్రమమంతయు నెఱింగించి ఆశీర్వదించెను.

మఱి కొన్నిదినములకు వర్తకుఁడు భార్యాద్వితీయుఁడై అచ్చటకు వచ్చి కుంభారునకు సాష్టాంగనమస్కారములు ఆచరించి, "మహానుభావా! మేము ఇంతవఱకును సంసారసాగరమునఁగూలి దరిఁగానక పరితపించితిమి. ఇప్పుడు మాకు పశ్చాత్తాపము గలిగినది. మాయెడల ననుగ్రహము పూని మాకు మోక్షప్రాప్త్యుపాయము నెఱింగింపుము" అని ప్రార్థించిరి. కుంభారును వారికి పరమభక్తిజ్ఞానవైరాగ్యములు అలవడినందులకు ఆనందించి, వారికి మంత్రోపదేశము చేసి "భగవంతునకు మీ యెడల అపారకరుణ కలుగును" అని ఆశీర్వదించెను. పిదప అనేకులు వచ్చి ప్రతి దినమును కుంభారువలన ఉపదేశములు పొందసాగిరి.

కుంభారు చేయుభజనకు మెచ్చి కొన్నిదినముల శ్రీహరి సాక్షాత్కరించి, "వత్సా! నీభక్తికి మెచ్చితిని. నీవు నాకు అంతరంగభక్తుఁడవు. ఏమికావలయునో కోరుకొనుము" అనిచెప్పెను. కుంభారు పరమానందభరితుఁడై, అనేకవిధములఁ గొనియాడి "భక్తవత్సలా! సనకసనందనాదులకుఁ గూడ దుర్లభుఁడవు అగు నీవు సాక్షాత్కరింప, నిఁక నాకుఁ గావలసినది ఏమిఉన్నది? లోకము మాయావరణమునఁ గూలియున్నది. దానికి తరణోపాయమును అనుగ్రహింపుము" అని ప్రార్థించెను. "అందులకు నీవే తగినవాఁడవు. నీకోరిక యెప్పుడును వృథగాదు" అనిచెప్పి, భగవంతుఁడు అంతర్హితుఁ డయ్యెను. కుంభారు బ్రతికియున్నంతకాలమును అనేకులను భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నులను గావించి, అవసానమున భార్యతోఁగూడ శ్రీహరి సాయుజ్యమును బడసెను. అవసానమునకుఁ బూర్వము కుంభారునకు మఱియొకప్పుడు స్వామి సాక్షాత్కరించి, "వత్సా! నీనివాసమువలన ఈనగరము పుణ్యక్షేత్రములలో నొకటియైనది; ప్రతిసంవత్సరమును ఆషాఢకార్తికమాసములయందు నన్ను సేవించుటకు పండరిపురమునకు వచ్చు భక్తులందఱును ఇక్కడకుఁ గూడ వచ్చి పోవుచుందురు" అని చెప్పెను. ఇప్పటికిఁగూడ అట్లే జరుగుచున్నది.

శా. "బృందారణ్యతరుప్రదేశముల గోబృందాంగణశ్రోణులన్
ఛందోవీథులఁ గానుపించు పరమస్వచ్ఛంద మాతేజ మా
నందబ్రహ్మము వందనీయమురళీనాదానుమోదంబు నా
యందున్ నిల్పెడిఁ బింఛచూడము పయోజాక్షంబు మేఘాభమున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 21.)



శ్రీరామకృష్ణపరమహంస—341.

# 47. శ్రీరామకృష్ణపరమహంస

శ్లో. "నర మిహ ముపదేశమాద్రియధ్వం నిగమవనేషు నితాంతచారఖిన్నాః,
విచినుత భవనేషు వల్లవీనా ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 28.)

వంగదేశమునందలి పూర్వకర మను గ్రామమున కుదీరాం చటర్జీ అను నొక వైదిక బ్రాహ్మణుం డుండెను. అతనికి ముగ్గురుకుమారులు గలిగిరి. మూవురిలోఁ గడగొట్టువానిపేరు గదాధరుఁడు. అయిదేండ్లప్రాయము వచ్చిన తరువాత తల్లిదండ్రులు ఈతనిని యథాశాస్త్రముగ అక్షరాభ్యాసము గావించి, బడికిఁ బంపిరి; కాని అక్షరజ్ఞానము గలిగినతరువాత గదాధరుఁడు గ్రంథములను జదువుటకుఁ జాల నసహ్యము చూపఁదొడఁగెను. అందులకుఁ గారణమేమన? అతనికి లౌకికవిద్యల యందు అభిలాష లేకుండెను. అంతటి చిన్నతనముననే గూడ నాతనికి భగవద్భక్తి గలిగియుండవలయు నను పేరాస యుండెడిది. అందుల కుదాహరణముగ నాతఁడు ఎల్లవేళలయందు ఏకాంతముగఁ గూరుచుండి భగవంతుని ధ్యానించుచుండెడివాఁడు. ఇదిచూచి అన్నలును, తల్లిదండ్రులును జాలఁ గోపించి పాఠశాలకు వెళ్లవలసివచ్చునని యిట్లు మాయలుచేయుచున్నాఁడని తలంచి, బలవంతముగాఁ దీసికొనిపోయి పాఠశాలలోఁ గూలవేసి వచ్చుచుండిరి. ఎన్నివిధములఁ బ్రయత్నించినను, ఆతఁడు పుస్తకము ముట్టఁడయ్యెను. అందులకు విసిగి, ఆతనిని అన్నలలో నొకఁడు రక్తము కక్కునట్లు చేసెదనని భయపెట్టెను. మఱి నాలుగైదుదినములు గడచునప్పటికి గదాధరుఁడు ఏకారణముననో రక్తము కక్కెను. తుద కీతని తల్లిదండ్రులు ఈతని చేష్టలకు విసిగి, కలకత్తానగరసమీపమున నున్న దక్షిణేశ్వరమను గ్రామమునకుఁ బంపి, యచ్చట కాళికాదేవిగుడిలో అర్చకునిగా నేర్పఱచిరి.

కాళికాలయముననుగూడ నాతనికి ఆత్మజ్ఞానసాధనమును గుఱించిన పరితాపమే పీడింపసాగెను. కొన్నిసమయములయం దాతఁడు దేవీపూజను మఱచి గర్భాలయము నొచ్చి క్రిందఁబడి దొరలుచు, "తల్లీ! మానవుని ఆయుర్దాయము అల్పము. జ్ఞానము చిరకాలసాధ్యము. ఇట్లుచేసియు భగవంతుఁడు జ్ఞానరహితునకు నరకము విధించినాఁడు. కట్టా! నాజీవితము తరిగిపోవుచున్నది. నీవేల కరుణింపవు? నాకేమియు వలదు. ఆత్మజ్ఞానతృష్ణ నన్ను దహించివేయుచున్నది. లోకజననీ! నా దాహము తీర్పవా?" అని పరితపించుచుండెను. ఇట్లు అనేకదినములు గడచిపో[illegible] ఒకొక్కప్పు డాతని కీవిచారమున రాత్రింబవళ్లు తెలియకయే [illegible] చుండెడివి.

ఈషణాత్రయము మోక్షసిద్ధికి ప్రతికూలములు. దానిచే నెవరిహృదయములు పూరితములై యుండునో, వారికి జ్ఞానసంపాదనము శశవిషాణమువంటి దగును. తల్లిదండ్రులు బాల్యమునందే పెండ్లిచేయుటవలన గదాధరునకు శారదాదేవి యను భార్యయుండెను. ఆత్మజ్ఞానమును బడయవలయునని యాతని కెప్పుడు తోఁచెనో, అప్పుడే స్త్రీలను జూడరాదు; అనుసంకల్పము గూడ గలిగెను. అట్లే "నేఁటి నుండి యొక కాసైనను ముట్టుకొనఁగూడదు" అని యాతఁ డొకనాఁడు శపథము చేసి కొనెను. పిదప నాతని బీదతనముఁ జూచి యనేకు లాతనికి అయాచితముగ ధనము నొసంగఁ జూచుచుండిరి; కాని యాతఁడు ఒక్క కాసైనను స్వీకరించి యెఱుఁగఁడు. కొందఱు ధనికులు ఆతనికి ఎట్లయినఁ దమధనము నొకింత యిచ్చి తీరవలయు నని దీక్షఁదాల్చియుండిరి. వారు ఆతఁడు తెలిసియున్నఁ బుచ్చుకోఁడని తలంచి సమాధిలో నున్నపుడు ఆతనిచేతిలోనో, కాలిమీఁదనో పెట్టెడివారు; కాని యానాణెములు తీసివేయునంతదనుక నవి యెచ్చటనుండెడివో, యాచోటు గజగజ వడఁకి పోవుచుండెడిది. పిదప నాతఁడు వివాహబంధమును ద్రెంపుకొనఁ దలఁచెను. కాని భారతీయులవివాహబంధమునకు విచ్ఛేదము లేదుగదా! ఇది యెఱింగి, యాతఁడు శారదాదేవిచెంతకుఁ బోయి దోసిలి యొగ్గి, "మన దాంపత్యబంధనమును ద్రెంపి వేయుము. నాకు ఐహికవాంఛ లేమియు లేవు. నీవు నాకు ఈవరమిచ్చితివేని సుఖం చెదను" అని ప్రార్థించెను. అంత నామె మాఱు పలుకక భర్తకోరికను నెఱవేర్చి, తాను సన్యాసిని యయ్యెను.

పిదప నాతఁడు పరతత్త్వజ్ఞానమునకై చేసిన పరిశ్రమ మనంతము. ఆతఁడు అన్నిమతములవారి యుపాసనాపద్ధతులను దెలిసికొనియెను. అన్నిమతములరహస్యములను దెలిసికొనెను. సకలము నాతఁ డాదరించెను. "భారతీయులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు మున్నగువారు అందఱునుగూడ ఆపరబ్రహ్మము కొఱకే వెదకుచున్నారు; కాని విశ్వాసములు వేఱు. మార్గములు వేఱు. అయిన నేమి? ఫలమొక్కటియే. ఉపాధిభేదమువలన రుచిభేదము గలిగినట్లే, జాతిభేదముల ననుసరించి మతభేదములు గలిగినవి. ఇది ప్రకృతి విరుద్ధము గాదు. ప్రపంచమంతయు నద్వైతమును ధ్రువపఱుచుచున్నది. ప్రపంచము నెఱుఁగనివారు భేదమును, ద్వేషమును బెంచెదరు" అని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఇట్లుండఁగా, గదాధరుఁడు సన్యసించి పరమహంస రామకృష్ణుఁ డయ్యెను. అప్పుడు కలకత్తానగరమున కేశవచంద్రసేనుఁడు అనునొకజ్ఞానార్థుఁడు పరమహంస నాశ్రయించి జ్ఞానభిక్షమును వేఁడెను. ఆతనికిఁ దొలుత రాజారామమోహనరాయ్ యేర్పఱిచిన బ్రహ్మసమాజమునఁ జాల నాసక్తి యుండెను. అగుటచేఁ గొంతకాలు

మాతఁడు పరమహంసవలన జ్ఞానోపదేశమును బడసి, పిదప "ఇది మంచిమార్గము గాదు" అని నిశ్చయించుకొని, సాధారణబ్రహ్మసమాజమునకుఁ బునాదివేసెను; కాని యీతనివలననే పరమహంసశక్తి సామర్థ్యములు ప్రఖ్యాతము లయ్యెను. పిదప వివేకానందుఁడు పరమహంస నాశ్రయించి యఖండజ్ఞానమును బడసి, గురూపదేశమును దిరస్కరింపక దానిని పాశ్చాత్యులకు విప్పి చెప్పి, అద్వైతమతప్రాముఖ్యమును ధ్రువపఱుచుట అందఱకును దెలిసినదియే.

పరమహంస యుపదేశమువలన ననేకులు తరించిరి. అద్వైతమతము మఱల నున్నతస్థితికి వచ్చెను. అతఁ డెంతసేపును "తర్కశాస్త్రముతోఁ బనిలేదు. వేదాంతశాస్త్రచర్చలతోఁ బనిలేదు. జ్ఞానముమీఁద తఱుగని ఆశ, పరతత్త్వమును దెలిసికొనుటలో నత్యాసక్తి, సాధన, దీక్ష-మున్నగునవి యున్నఁ జాలు" నని యుపదేశించుచుండెను. ఈ కాలమున భారతజాతికి రామకృష్ణుఁడు చేసినమహోపకారము శతసహస్రయుగములయందైనను మఱువరానిది. తమమతమునందు అధికాభినివేశము గల పాశ్చాత్యులలో ననేకులు రామకృష్ణునిమతమును, ఉపదేశములును విని మహానందముతో నాదరించిరి. అతని ప్రజ్ఞ యెల్లరచేతను గొనియాడఁబడెను. రామకృష్ణుఁ డిట్లు చిరకాలము లోకము నుద్ధరించి, ప్రపంచధర్మము ననుసరించి నశ్వరమగు దేహమును విడిచి, పరబ్రహ్మసాయుజ్యమును బడసెను.

సీ. "వరధర్మ కామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి కవ్యయదేహమిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్మ లెవ్వాని మునుకొని చింతింతు రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు
ఆ. రామహేశు నాద్య నవ్యక్త నధ్యాత్మ, యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్మ
బ్రహ్మమయినవానిఁ బరుని నతీంద్రియుఁ, నీశు దూరు సూక్ష్ము నే భజింతు."

(భాగ. స్కంధ. 5. ప. 83.)

# 48. ని వే ది త

శ్లో. "తమసి రవిరివోద్యన్మజ్జతామంబురాశౌ ప్లవ ఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః,
నిధిరివ విధనానాం దీర్ఘతీవ్రామయానాం భిషగివ కుశలం నో దాతుమాయాతు శౌరిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 79.)

ఐరోపాఖండమున వాయవ్యభాగమున నున్న బ్రిటిషుద్వీపములలో నొకటి యగు ఐర్లండు అను ద్వీపమున "రెవరెండు, యస్. ఆర్. నోబుల్" అను మహాజనుఁడు ఉండెను. ఆతఁడు పెద్దవాఁడు అయినతరువాత, మాంచెష్టరు పట్టణ

మున ఒక భక్త బోధకురాలుగా నేర్పఱుపఁబడెను. ఆతఁడు చాల మంచివాఁడు. "మార్గరెటు నోబిల్" అనునామె అతనికి ముద్దులకూఁతురు.

ఈకొమార్తె యనిన నాతనికి ఎంతో ప్రేమ. ఎట్టిచిక్కుసమయమునందైనను ఎట్టి విచారసమయమునందైన నయినను ఆమెను జూచినచో ఆనందము వచ్చెడిది. తండ్రియెడల ఆమెకు విశేషమైన భక్తిగలదు. ఆమె తండ్రి గౌరవమును బాగుగ గ్రహించెను. అతఁడును ఆమె ముఖమున తాండవము చేయుతేజస్సును గాంచి "ఈమె మహాత్మురాలు అగును" అని తలంచుచుండెడివాఁడు. మఱియునాతఁడు కూఁతునకు చాలశ్రద్ధతోఁ జదువుచెప్పెను. ఆమె చిన్నతనమున అతఁడు మాంచెష్టరు నగరమున బీదజనులకు అనేకులకు అనంతసాహాయ్యముచేయు చుండెను. అగుట నాతని కొమార్తెకు అట్టి పరోపకారగుణమే పట్టుపడెను. కొన్నిదినములకు ఆతనికి మరణము సమీపించెను. మరణకాలమున ఆతఁడు తనభార్యను జూచి "మార్గరెట్ ముందుముందు చాల గొప్పపనులం జేయును. నీవు అప్పుడు ఆమెకు అడ్డుచెప్పక, అడ్డంకులు గలిగింపక, చేయఁబూనిన పనియందు విశేషమైన ప్రోత్సాహమును గలిగింపుము" అని చెప్పిపోయెను.

కొన్నిదినములకు ఈమె లండనుపురమునఁ బ్రవేశించెను. అచ్చటఁ గొందఱు పండితులు స్త్రీవిద్యవిషయమునఁ గ్రొత్తమార్గములను గనిపెట్టి వానిని బ్రకటించిరి. ఈమె ఆపద్ధతులను బాగుగ గ్రహించి, అందు చాల ప్రయోజనములు గలిగించు చిహ్నములు ఉండుటచే వానిని అంగీకరించి, ఆపద్ధతులతో ఒక పాఠశాలను స్థాపించి దానికి తానే అధీశ్వరియై నడుపసాగెను. ఈకాలమున నీమె అనేకులకు అనేకవిధముల సాహాయ్యము చేసెను.

ఇంతలో అనేకుల కోరికమీఁద శ్రీరామకృష్ణపరమహంసశిష్యుఁడగు వివేకానందస్వామి ఇంగ్లాండునకు వచ్చెను. ఆతఁడు భారతధర్మమును గుఱించియు, అద్వైతమతమును గుఱించియు అనేకోపన్యాసములు ఇచ్చెను. మార్గరెటు అన్నియుపన్యాసములను వినెను. వివేకానందునియెడల చాల గౌరవభావమును జూప సాగెను. కాని యాతఁడు బోధించు మతమును మాత్రము ఆమె అంగీకరింపలేదు. ఆమె స్వామి మతమును తొలుత గౌరవింపలేదు. ఇంతలో స్వామి భారతదేశమునకు వచ్చి యొక సంవత్సరము మాత్రము ఉండి,మఱల ఇంగ్లాండునకుఁ బోయెను. ఈలోపుగా నామె వివేకానందుని మతమును గుఱించి అనేకవిధముల జర్చించుకొని, "ఇందుఁ గొంతగాకున్న గొంతయైన యథార్థము ఉండకపోదు" అని సంశయగ్రస్త యయ్యెను. ఇంతలో మఱల స్వామి యుపన్యాసములను వినుట తటస్థించెను. ఈసంభవమువలన ఆమెకు స్వామియందేగాక, స్వామిమతమునందుఁగూడ గౌరవభావము కలిగెను. కాని అప్పటికిఁ గూడ ఆమె తన మతమును విడువలేదు.

ఇట్లుండఁగా, వివేకానందుఁడు ఒక దినమున "మా దేశపుస్త్రీల వృద్ధిని గుఱించి కొన్ని యాలోచనములు చేసితిని. ఈప్రయత్నమున నీవు చేయూతనిచ్చి వారి నుద్ధరించెదవా?" యని ఆమె నడిగెను. తోడనే సందేహింపక, ఆమె యందులకు అంగీకరించి స్వామివెంట భారతదేశమునకుఁ బ్రయాణ మయ్యెను.

భారతదేశమునకు వచ్చినపిదపఁ గూడ, నామె ఇంకను వివేకానందునిమతమును గుఱించి యోచించుచునే యుండెను. ఒకప్పుడు ఆమె తనస్నేహితురాలియింటనుండి ఆమెతో ఈవిషయమును గుఱించియే ప్రస్తావన చేయుచుండఁగా,నచ్చటకు స్వామి వచ్చెను. అప్పుడు స్వామిముఖమున ఆమెకు ఏదో యనిర్వచనీయమగు దివ్యతేజము పొడగట్టెను. తోడనే యామె మోఁకరించి నమస్కరింపఁగా, స్వామి ఆదరముతో శిరముపైఁ జేయిడి ఆమెను ఆశీర్వదించెను. స్వామి హస్తస్పర్శవలన ఆమెశరీరము పులకాంకిత మయ్యెను. భావయంత్రము కదలిపోయెను. సందేహములు సమూలముగ నాశనమై పోయెను. అప్పుడామెకు నూతనజీవనము ప్రారంభమయ్యెను. అనఁగా ఆమెకు భారతీయత్వము ప్రాప్తించెను.

ఆమె అప్పుడు వివేకానందుని మాహాత్మ్యములను బాగుగ గుఱుతెఱిఁగెను. ఏమన? ఒకప్పుడు ఆమె రామకృష్ణపరమహంస వివేకానందునిఁ గుఱించి "ఈతని హస్తస్పర్శవలననే దివ్యజ్ఞానము గలుగును" అని చెప్పియున్నట్లు విని యుండెను. అందులకుఁ దార్కాణముగా నీమె "నేను ఆమహాత్ముని పాదములు ఎప్పుడు స్పృశించితినో, అప్పుడే నాకు బ్రహ్మజ్ఞానము కలిగినది" అని చెప్పి, గురుదేవునియెడల చాల భక్తిశ్రద్ధలతో సంచరింపసాగెను.

పిదప ఆమె రామకృష్ణపరమహంసశిష్యబృందమునఁ జేరెను. హృదయమును మార్చుకొనినట్లే ఆమె "మార్గరెటునోబుల్" అను నామమును "నివేదిత" అని మార్చుకొనెను. తన్ను తానే భారతధర్మమునకు నివేదించుకొనినది; కావున నీమె ఈపేరు గైకొనెను. పిదప నీమె వివేకానందస్వాముల శిష్యురాలు అయ్యెను. అందఱును ఈమెను "నివేదితాసోదరి" యని పిలువసాగిరి.

మతవిషయికములగు చింతలు అన్నియు మానినతరువాత ఈమె వివేకానందుఁడు తొలుత తన్ను ఈదేశమునకు ఎందులకు ఆహ్వానించెనో, ఆపని చేయుటకుఁ బూనఁదలఁచెను; కాని అందులకుఁగాను నివేదిత కులీనస్త్రీలనడుమ నుండవలయు నని నిశ్చయించుకొనెను. అందును బ్రాహ్మణుల మధ్య నుండఁదలఁచెను. అగుట నీమె ఈప్రయత్నసాఫల్యముకొఱకు కొన్నిదినములు కష్టపడవలసి వచ్చెను. తుదకు ఎట్లయినను ఆకోరిక నెఱవేర్చుకొనెను. కాని [illegible] కష్టము ప్రాప్తించెను. ఈమెకు వంటవాండ్రవలన కష్టములు [illegible]

తేటలు గల వంటవాండ్రు తొలుత లభింపరైరి. లభించిరో స్థిరముగ నుండరైరి. మాటిమాటికిని మానిపోం జొచ్చిరి. కొన్నిదినములయందు ఈమెకు ఎట్టివాం డ్రైనను వంటవాండ్రే లేకపోవుచుండిరి. అప్పుడెల్ల నీమె ఏపండ్లో, ఏపాలో పుచ్చు కొని దినములు గడుపసాగెను. ఒక్కొక్కనాడు ఇరుగుపొరుగు స్త్రీలు ఈవార్త విని సకరుణలై అన్నాదికములు పంపంగా, నీమె కృతజ్ఞతతో వానిని స్వీకరించి భక్షింపసాగెను.

కొన్ని దినములు గతించిన తరువాత నీమె స్వయముగ తనయింటిముంగిట వీథిని తుడుచుకొనం జొచ్చెను. అదిచూచి ఆయిరుగు పొరుగు స్త్రీలెల్లరును తాము స్వయముగ ఆపనికిం బూనుకొనకున్నను, సేవకులచేనైనను శ్రద్ధగా చేయింపసాగిరి. ఈకారణమువలన అంతకుమున్ను చాల మురికితో నిండియుండెడి బోస్పారా అనుపేరుగల ఆవీథి చాల శుభ్రముగా నుండుచుండెను.

తరువాత నీమె స్త్రీలకు జ్ఞానము నొసంగుటకుం తలపెట్టెను. భారతదేశ ములో ప్రకృతము ఆచరణలో నున్న విద్యావిధానము కేవలము నిరుపయో గము అగుట నామె అది కనిపెట్టి, క్రొత్తపద్ధతితో తొలుత బాలికలకు చదువు చెప్పుటకుం బ్రారంభించెను. ఇది ప్రయోజనకరము అగుచుండుటం జూచి కొన్ని దినములు కడచినతరువాత ఆవీథిని, సమీపవీథులయందునుగల ఇరుగుపొరుగుగృహ యజమానురాండ్రు గూడ తీరికయైనపుడు వచ్చి, ఆమెవలన విద్యాదానమును బడయుచుండిరి. ఈతీరున తొలుత ఇంటినిం గుదురనీయకయు, వంటలక్కను గుదుర నీయకయు ఆమె ననేకవిధముల బాధపెట్టిన స్త్రీలు అందఱును ఆమెకు శిష్యురాండ్రు అయిరి. వారికి ఆమెను ఋణము విడిచియుండుటం గూడం గష్టముగాం దోంచు చుండెను. ఆమె మంచితనమే ఆమెకు ఇట్టి విజయమును గలిగించెను.

భారతస్త్రీలను ఉద్ధరింప వ్రతముపూని, ఈవిషయమున అనంగా తన పాఠశాల లకు స్త్రీలను దీసికొనిరావలసినదని ఈమె తొలుత డాక్టరు బోసుగారి భార్యను సాయము గోరెను. ఆమె నివేదిత ప్రార్థనమును త్రోసివేయక, కొంత ప్రయత్నించెను; కాని ఆవంతయు ఫలము గలుగదయ్యెను. అంతట నామె విసిగిపోయి, "ఈవిషయ మున నావలన నేమియుం గాలేదు" అని చెప్పియుండెను. అగుటచే నివేదిత ఇప్పుడు ఆమె నొకనాడు తన యింటికిం గొనివచ్చి ఇరుగుపొరుగు స్త్రీలు అనేకులు చదువు కొనుచుండుటం జూపెను. అది చూచి బోసుగారిభార్య మిగుల వింతపడి సిగ్గు పడెను. నివేదిత స్త్రీలకు విద్య చెప్పుటతో మాత్రమే తృప్తి వహింపలేదు. ఆమె అనాథశిశువులకు ఆశ్రయము ఇచ్చెను; బాలవితంతువులను ఆదరించెను; అనేక వితంతువులను ఉపాధ్యాయురాండ్రనుగాం దయారుచేసెను. ఇన్నిసత్కార్యములు

చేయుచుండుటవలన నివేదిత ఏర్పఱిచిన పాఠశాలకు సోదరీబృందము అని పేరు వచ్చెను.

ఈసోదరీబృందవిషయమును, నివేదితవృత్తాంతమును దేశదేశములయందు వెల్లడి యయ్యెను. అందుచే కలకత్తాకు వచ్చిన భారతీయులలో ననేకులును, భారత దేశమును జూడవచ్చిన పాశ్చాత్యు లనేకులును ఆమెను జూచిపోవుచుండిరి; కాని ఆమె ఆయాశ్రమనిర్వహణార్థము ధనము ఈయవలసినది అని ఎవరినిఁ బీడించి ఎఱుఁగదు. ఆమె తఱుచుగ గొప్ప గొప్పపత్రికలకు మంచిమంచి వ్యాసములను వ్రాసి పంపుచుండెడిది. ఈవ్యాసములకు ఆయా పత్రికాధిపతులు వెలనిచ్చుచుండిరి. ఇదియుఁగాక ఆమె అనేకమహావిషయములను గుఱించి అనేకగ్రంథములను వ్రాసి ప్రకటించెను. ఈగ్రంథప్రకటనమువలనఁ గూడ ఆమెకుఁ జాలధనము వచ్చుచుండెడిది. ఈతీరున సంపాదించిన ధనమంతయు, ఆమె ఈయాశ్రమమును బోషించుటకే విని యోగించుచుండెడిది.

ఈమె కలకత్తాలోఁ బ్రవేశించిన కొలఁదిదినములకే ఆనగరమున ప్లేగు జాడ్యము చెలరేఁగెను. నగరమునందలివారు ఎల్లరును అడలిపోయి దిక్కు తెలియకుండఁబోవసాగిరి. కలకత్తాకుఁజేరెడి యోడలును రైలుబండ్లును శూన్యములగుచుండెను; కాని కలకత్తానుండి వివిధ ప్రాంతములకుఁ బోవునవి మాత్రము క్రిక్కిరిసిపోవుచుండెడివి. కొందఱు ఇట్లు పాఱిపోవుచుండఁగా, అనేకులు ఇష్టము లేకయు నీళ్లు లేకయు మఱి యితరకారణములవలనను నగరమునందే నిలిచిపోయిరి. వారిలో ననేకులు మృత్యువువాతఁ బడసాగిరి. నివేదిత యప్పుడు విసుగును విరామమును భయమును లేక నగరము అంతయుఁ దిరుగుచు, చేతనైనంతవఱకును ప్లేగు సోఁకిన వారికి ఉపచారములు సలహాలుచెప్పుట, మందులు ఇచ్చుట మున్నగునవి చేయుచుండెడిది. ఒకప్పుడు ఒకబీదస్త్రీ తనతల్లి ప్లేగువలననే చచ్చిపోయియుండఁగా ఏడ్చుచుండెను. అప్పుడే ఆమెకుఁగూడ జాడ్యము అంకురించెను. తోడనే నివేదిత ఆమెకుఁ జికిత్స ప్రారంభించెను; కాని కొలఁదిసేపటికి నివేదిత యొడియందే ఆమె ప్రాణములు విడిచెను. ఈతీరున నివేదిత శక్తివంచనలేకుండ ననేకులకు సేవచేసి, కొందఱిను మాత్రము బ్రతికింపఁ గలిగెను.

మఱికొన్నిదినములకు తూర్పుబంగాళాదేశమున తీరని కఱవు ప్రాప్తించెను. దీని వలన అనేక ప్రజలు మలమల మాడిపోయిరి. ఆవిపన్నుల నప్పుడు ఈమె మఱల రక్షించుటకుఁ బ్రారంభించెను. ఈకార్యమున ఆమె నిద్రాహారములను మఱచి శక్తికిమించిన పనిఁజేసి యనేకులను రక్షించెను; కాని యీపరోపకారపారీణతకు ఫలమో యనునట్లు ఆమెకు శీతజ్వరము సంభవించెను. ఈతీక్ష్ణజ్వరమువలన

ఆమె చాల సలిగిపోయెను. రోగస్థితినిఁ జూచి అనేకదేశీయ విదేశీయవైద్యులును, అనేకమిత్రులును ఈమెను ఆబోస్ఫారాపీథినుండి మఱియొక వీథికిఁ బోవలసినదని చెప్పిరి; కాని ఆమె వినక అచ్చటనే యుండెను.

నివేదిత అనేకపత్రికలలో అనేకవ్యాసములు ప్రకటించియున్నది గదా! అట్లే యామె కొన్నిగ్రంథములను గూడఁ బ్రకటించియున్నది. ఆమె వ్రాసిన గ్రంథములయం దెల్ల నాదిమము "కాళీమాత." ఇది కాళిక యొక్క తత్వము నంతను వివరించును. ఇందు మనలోఁ జాల మంది తలఁచునట్లు కాళిక యని నరబలులను జంతుబలులను గోరు మారణదేవత గా దని, యీమె సహేతుకముగా నిరూపించి యున్నది. దీనిని ఇంగ్లాండు దేశమున ఒకపుస్తకవిక్రేత ప్రకటించెను. మఱియు నివేదిత వ్రాసిన మఱియొక గ్రంథము "భారతీయాచారముల యల్లిక" యనునది. ఇందు మనయాచారముల ఘనత చక్కఁగ వివరింపఁబడియున్నది. నివేదిత "స్వామిని నేఁగన్నవిధము" అని మఱియొకగ్రంథము వ్రాసెను. అందు వివేకానందునకును దనకును పరిచయము అగుట యాదిగ జరిగిన సంగతులు వ్రాసియున్నది. అజంతా విహారమునందలి ప్రతిమలను గుఱించి ఈమె వేఱొక గ్రంథము వ్రాసి యున్నది. అది భారతీయు లెల్లరును తప్పక పఠింపవలసిన గ్రంథము. నివేదిత శైలి యతి మధురము. ఈమెకుఁగల విషయనిరూపణశక్తి అత్యద్భుతము. ఈమెకు వ్రాయుటయందు చెప్పుటయందునుగూడ సమానమైన అసమానశక్తియున్నది. ఈమె వ్రాసిన విషయములును, చెప్పిన సంగతులును గూడ క్షణములో పాఠకులచిత్తములయందును శ్రోతల హృదయములయందును అంకితలగును. ఇట్లు ఈమె అసమానసామర్థ్యముతో పదునాలుగు సంవత్సరములు భారతదేశమునకు అనంతసేవనుజేసి, అవసానమున పరబ్రహ్మైక్యముఁ బడసెను.

మ. "అడవిం జీఁకటిఁ బోవువాని కుదయం బైనట్టిసూర్యాకృతిన్
జడధిం గ్రుంగఁగఁ నావ దగ్గిఱిన ఘోరాజం బేదరన్ లిబ్బి చా
ష్పడురీతిన్ దృషఁ దీర్పఁగా జడిమొగుల్ వైకొన్నచందాన నా
వ్వడరన్ మాన్పెడు వైద్యునట్టు హరి డాయన్ వచ్చి నన్ బ్రోచుతన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 97.)




రా మ దా సు—349.

# 49. భద్రాచల రామదాసు

బెజవాడకు సమీపమున నున్న నేలకొండపల్లెయందు లింగన్న అను నొక బ్రాహ్మణుడు వసించియుండెను. అతని భార్యపేరు కామమ్మ. ఆదంపతులు అన్యోన్య ప్రేమ సకలసుఖములు అనుభవించుచుండిరి; కాని వారికి సంతానసుఖముమాత్రము లేదయ్యెను. సంతానము నిమిత్తము లింగన్న చాలదినములు ఇంటివేలుపుని భజించెను. మఱికొన్ని దినములకు హరిపూజాఫలముగ కామమ్మ గర్భవతియై, నవమాసములు మోసి ఒకమంచిలగ్నమున కుమారునిఁ గనియెను. లింగన్న కుమారునకు జాతకర్మా దులు నిర్వర్తించి, గోపన్న అని నామకరణముఁ గావించెను.

శ్రీహరిప్రసాదమువలన జన్మించినవాఁడు గావున గోపన్నమాటలాడ నేర్చి నదిమొదలు 'శ్రీహరి' యనియు, 'శ్రీరామా' యనియు నెల్లప్పుడును పలుకుచుం డెను. లింగన్న తన కొడుకు ఇట్లు దైవభక్తి కలవాఁడగుటకు ఆనందించి, యుక్త సమయమున అక్షరాభ్యాసము గావించి విద్యాభ్యాసార్థము ఒక పండితునకు అప్ప గించెను. అచ్చట గోపన్న తొలుఁదొలుత బాలరామాయణము చదివెను. అదిమొదలు అతఁడు రామనామస్మరణ తత్పరుఁ డయ్యెను. కొలఁదిదినములకే అతఁడు విద్దెలను నేర్చి ఇంటికిఁ జేరుకొనెను. విద్వాంసుఁడై వచ్చిన గోపన్ననుజూచి తలిదండ్రులు మిగుల నానందించిరి; కాని మఱికొలఁది దినములయందే వారు దివమునకుఁ బోయిరి.

సంసారభారము గోపన్నమీఁదఁ బడెను. ఇరుగుపొరుగువారి బోధవలన అతఁడు ఒకమంచి కన్యను జూచి పెండ్లియాడెను. పెండ్లియైన కొన్నిదినములకు ఆమె కాఁపురమునకు వచ్చెను. దంపతు లిరువురును చాల అనురాగముతో మెలఁగ సాగిరి. ఇట్లు కొలఁదికాలము గడచునప్పటికి గోపన్నకు ఒకకుమారుఁడు గలిగెను. అతఁడు కుమారునకు రాముఁడు అని పేరుపెట్టి, మిగుల గారాబముతో పెంపఁ దొడఁగెను. అప్పటికి గోపన్నవయస్సు రమారమి ఇరువదిసంవత్సరములు.

ఒకనాఁడు తంబుర శ్రుతిచేసికొని హరికీర్తనలు పాడుచు నొకహరిదాసుఁడు గోపన్న ఇంటిముంగిటకు వచ్చి నిలిచెను. తోడనే గోపన్న "ఎవరో మహానుభావులు వచ్చినారు" అని చింతించి వీథిలోనికి వచ్చెను. వెంటనే హరిదాసుఁడు గోపన్నలక్షణ ములను బరిశీలించి అద్భుతాశ్చర్యచకితుఁడై, దగ్గఱకు రమ్మని చేరఁబిలిచి "వత్సా! నీకు అఖండయోగము ఉన్నది. నీమీఁద శ్రీరామచంద్రునకు అఖండానుగ్రహము గలు గును. ఇక నీకు లేనిది యేమి గలదు? ప్రపంచమునఁ బుట్టినవారు యెల్లరును జచ్చి, మఱలమఱలఁ బుట్టి, మఱలమఱలఁ జచ్చుట ప్రకృతిధర్మము. ఇది సామాన్యధర్మము.

విశేష ధర్మముకూడ నొకటి గలదు. అనఁగా పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మలోకనిత్యనివాసము. దీనిముఖ్యభాగము ఈశ్వరసాయుజ్యము. మానవజన్మము ఎత్తినందులకు ఫలము ఈశ్వరసాయుజ్యమును సాధించుట. ఇది సాధింపనిప్రాణి జన్మపరంపరచే యమయాతన ననుభవించును. ఇట్టి యవస్థ రాకుండఁ జూచుకొనుట వివేకలక్షణము. ప్రపంచవాసనలను పరిహరింపఁజాలనివాఁడు ముక్తి పడయఁజాలఁడు. ఈజగత్తంతయు మిథ్య. శాశ్వతము గాదు. ఆత్మ యొక్కటే శాశ్వతము. అయినను మాయావరణమువలన ఆత్మజ్ఞానము తిరోహితమై, జగత్తు యథార్థము అను మోహము యెల్లప్రాణులకును గలుగుచున్నది. ఎవరు ఈవ్యామోహమునఁ జిక్కుదురో, వారికి మోక్షము లేదు. ఈవ్యామోహమును దొలఁగించుకొనుటకు ఆధారము ఈశ్వరసేవ. శ్రీహరిని గొలిచినవారికి అక్షయానందము సిద్ధించును; కావున నీవు ఈసంసారము అసారము అని ఎంచుము. దానిని అంటకుము. తారకమంత్రమును జపింపుము" అని మంత్రోపదేశము చేసెను. ఆహరిదాసుఁడు కబీరుదాసు.

కబీరుదాసు వెడలిపోయినతరువాత గోపన్న తారకమంత్రమును తదేకనిష్ఠతో జపింపసాగెను. ఉన్నది ఎంతయో, రావలసినది ఎంతయో, ఎఱుఁగకుండ తన ఇంటఁ గల ధనమంతయు బీదలకుఁ బంచి ఈయసాగెను. సంతర్పణలమీఁద సమారాధనలు. దానములమీఁద ధర్మములు. ఇఁక వెనుకముందులు ఆలోచించుట లేదు. ఈ తీఱున కొలఁదికాలముమాత్రమే జరుగునప్పటికి ఇంటఁగల సర్వస్వమును అయిపోయెను. దినపాతమునకు కష్టము సంభవించెను. మధ్యాహ్నము అరగడుపుతో లేచిన రాత్రికి మొదలే లేకుండెను. ఇట్టి స్థితి సంభవించినను ఆతఁడు సంపాదనకుఁ బూనుకొనలేదు. అన్నము లేదే యని విచారింపలేదు. అన్నిటికిని రామనామామృతమే చాలును అని యాతఁడు తదేకదీక్షతో నుండెను.

తొలుత నాతఁడు రామకోటి వ్రాసి ముగించి, అందులకు సంతర్పణము ప్రారంభించెను. ఇట్లుండఁగా, నొకయూరినుండి యొకబ్రాహ్మణుఁడు వచ్చెను. ఆతని నెంతో ఆదరించి గోపన్న సకలమును ప్రారంభించెను. వంటలన్నియుఁ బూర్తి యయ్యెను. అనేకబ్రాహ్మణులు వచ్చి వాఁకిటఁ బంతులుదీటి గూర్చుండిరి. కొందఱు బ్రాహ్మణులు వడ్డనలుచేయుచుండిరి. ఈసమయమున గోపన్న కుమారుఁడు అగు రాముఁడు గంజితొట్టిలోఁ బడిపోయెను. వెంటనే తల్లి ఆబాలుని ఒడ్డుమీఁదికి లాగివేసెను; కాని అంతకుముందే బాలుఁడు విగతప్రాణుఁడయ్యెను. అయినను ఇప్పుడు తెలిసినచో బ్రాహ్మణ సమారాధనమునఁ దత్పరుఁడై యున్నపతి తత్తరపడి చేయుచున్నపని మానివేయునని శంకించి యూరకుండెను. కొంతసేపటికి బ్రాహ్మణులు తృప్తిగా భుజించిరి. అప్పుడు గోపన్నకు ఈవార్త తెలిసెను, తోడనే యాతఁడు

తననుమోసిన మృతకళేబరము నెత్తికొని శ్రీరామచంద్రునిఁ దలంచి అభిషేకముగ విలపింపసాగెను. ఒకటిరెండు నిమిషములయందే ఆతనికి దుఃఖము పోయెను. “జగదీశ్వరుఁడగు శ్రీరామచంద్రుఁడు నాపాల నుండఁగ నాకీదుఃఖమేల?” అని తలంచి ఆతఁడు కాళ్లకు గజ్జెలు కట్టుకొని ఒకచేత తంబురా ధరించి, ఒకచేత బాలుని మృతకళేబరమును ఎత్తుకొని, శ్రీరాముని గుణగణములను కీర్తించుచు మహానందముతో నృత్యము ప్రారంభించెను. కొంతసేపటికి బాలుఁడు దీర్ఘనిద్ర పోయి మేల్కొన్న వానివలె లేచి కూర్చుండెను. అదిచూచి అందఱును ఆశ్చర్యపడిరి. గోపన్న మహానందపరవశుఁడై శ్రీరామచంద్రుని మఱల ననేకవిధముల ప్రార్థించెను. భోజనమునకు వచ్చిన బ్రాహ్మణు లందఱును భూరిసంభావనలు గైకొని, గోపన్న మాహాత్మ్యమునకు ఆశ్చర్యపడుచు వెడలిపోయిరి. ఈ విధమున అనేకపర్యాయములు సమారాధనలు చేయుటవలననే ఆతఁడు కడుబీదస్థితికి వచ్చెను. ఈస్థితిఁ జూచి భార్య వగచుచుండఁగా, గోపన్న “బేలా! ఏల వగచెదవు? శ్రీరామచంద్రుఁడు ఉండఁగా మనకు ఏమిలోపము?” అని యామె నోదార్చెను.

అదిమొదలు ఆమె మఱల తమబీదస్థితినిఁ దలంచుకొని వగచి ఎఱుఁగదు. ఎల్లప్పుడును భర్తతోఁగూడ నత్యానందముతో శ్రీరామనామమును స్మరించుచు, భర్తకు సకలోపచారములనుజేసి సరివారిలో నామె మేలుబంతి అని పేరుబొందెను.

ఇంతలో ఒక సంవత్సరము గడచి పోయెను. శ్రీరామజన్మోత్సవము సమీపించెను. అది తెలిసి గోపన్న “ఇంటఁ జూచిన నేమియు లేదు. శ్రీరామజన్మోత్సవమును బ్రతికియుండియు శక్తికొలఁది చేయకపోవుటకంటె అన్యాయము లేదు. ఇందులకు ధనము కావలయునుగదా! గోల్కొండకుఁ బోయెదను. నేను పూర్వజన్మమున పుణ్యముచేసికొనియుంటినేని ఈయేటి మహోత్సవము జరుగుటకు తగిన అవకాశములు అక్కడ సంభవింపవచ్చును” అని నిశ్చయించుకొని గోల్కొండకు బయలుదేఱెను.

గోపన్న కొన్ని దినములకు గోల్కొండకుఁ జేరుకొని అక్కన్న మాదన్న గార్ల ఇంటికిఁ బోయెను; కాని లోపలకుఁ బోవుటకు పహరాజవానులు అడ్డుపడిరి. అప్పుడు ఆతఁడు “నేలకొండపల్లె కాపురము, తండ్రి లింగయ్య, తల్లి కామమ్మ, పేరు గోపన్న దర్శనమునకు సెలవుఁగోరుచున్నాఁడు అని చెప్పుఁడు” అని జవానులతోఁ జెప్పెను. జవానులు లోపలకుఁ బోయి రాజ్యాంగము గుఱించి ఆలోచించుచున్న అక్కన్న మాదన్న గార్లకు ఈసంగతులు తెలిపిరి. ఇది వినినతోడనే వారు దిగ్గనలేచి వీథిలోనికి వచ్చి మేనల్లుఁడు అగుగోపన్నను కౌఁగిలించుకొని ఆదరించి లోనికిఁ గొనిపోయి, “వత్సా! నీతల్లియు మాఅక్కయునగు కామమ్మ స్త్రీలయందు మేలుబంతి.

ఆస్త్రీయామెను ప్రపంచమున మఱల జూడము" అని ఆమెను దలంచుకొని వగచిరి. అంతట గోపన్న "గంగాజలసేతుబంధనము వలన ప్రయోజనము లే"దని వారికి తెలిపెను. పిదప వారు గోపన్న స్థితిగతుల నడిగి తెలిసికొని, జరిగినదానికి ఎంతయు వగచి నీకేమియు ఇబ్బందిలేదు. అంతకును శ్రీరామచంద్రుడును, పిదప మేముసు గలము" అని చెప్పి ఆతనికి ధైర్యముఁ గొలిపి, భోజనానంతరము కచ్చేరికి బోయిరి.

వారిరువురును కచ్చేరికిఁ జేరుకొని తొందరపనులన్నియు ముగించు కొనునప్పటికి తానీషావచ్చి సలాములుచేసి "అమాత్యవరులు నేడు జాలముచేసి నట్లున్నది. ఒకానొక పనివిషయము మీకొఱకు ఎదురుచూచుచున్నాము" అని పలికెను. అక్కన్న తమ మేనల్లుఁడు వచ్చిన సంగతిఁ దెలుపఁగా, తానీషా "వారిని మేము చూడవలయును" అని పలికెను. అంతట తానీషా యాజ్ఞప్రకారము ఒకసర దారుఁడు పాలకినిఁ బట్టించుకొనిపోయి నవాబు సెలవు నెఱింగించి, గోపన్నను ఆపాల కీలోఁ గోటకు గొనివచ్చెను. అక్కన్నపోయి గోపన్నను గొనివచ్చి నవాబుదర్శనము చేయించెను. గోపన్న నవాబునకు వంగి సలాములు చేసి ఆశీర్వదించెను. పిదప నవాబు మంత్రులవలన గోపన్న శక్తిసామర్థ్యములను విని, ఆతనికి భద్రాచలము తాలుకాకు తహసీలుదారీఉద్యోగము ఇచ్చి సబహుమానముగాఁ బంపెను. సాయంత్రము ఇంటికి వచ్చిన తరువాత అక్కన్న మాదన్నగార్లు మేనల్లునకు నీతులు ఉపదేశించి, పాలకీమీఁద భద్రాచలమునకు మఱునాఁడు పంపివేసిరి.

గోపన్న భద్రాచలము చేరినమఱునాఁడే అచ్చట అంతకుఁబూర్వము తహ సీలు చేయుచున్న యాతఁడు అధికారము అంతయు గోపన్నకు ఇచ్చివేసెను. పుర జనులు క్రొత్తతహసీలుదారుగారినిఁ జూచుటకు వచ్చిరి. వారినిఁ జూచి గోపన్న "అయ్యలారా! మీ రిదివఱకు బాకీయున్న సొమ్మంతయుఁ జెల్లించివేయుఁడు. నేను మిమ్ములను సుఖపెట్టుటకై వచ్చియున్నాను. నేను ఏమి చేయఁదలఁచుకొన్నను మీరే ఆధారము; కావున మీరు నాకు అన్నిటను జేదోడువాదోడుగానుండి నాకు సర్కారులో గౌరవమును గలిగింపుఁడు. మీరు సాయపడరేని, మీకు నేను చేయఁదలఁచిన సౌకర్యములు చేయఁజాలను. మీరును శ్రీరామచంద్రమూర్తి అవత రించియున్న భద్రగిరిప్రాంతములయందున్నవారు. మీకు ధర్మము లేమియు ఉపదే శింపవలసిన పనిలేదు. మనమందఱమును శ్రీరామచంద్రుని భటులము గావున మన భేదభావములన్నియు నుఱచి, శ్రీరాముని సేవింతము" అని చెప్పెను. రైతులు అందులకుఁ బరమానందముతో నంగీకరించిరి.

ఆసంవత్సరము గోపన్న పన్నులు అన్నియు ఒక్క దమ్మిడియైన బాకీ లేకుండ వసూలుచేసి యుక్తకాలమున గోలకొండకుఁ బంపివేసెను. అబిదాలి నవాబు ఆతని చాకచక్యమునకు ఎంతయు మెచ్చుకొనెను. ఇట్లు కొన్ని దినములు గడచి పోయెను. కాలము గడచినకొలఁదిని భద్రాచలము తాలూకాయందలి ప్రజలకు గోపన్న తహసీలుదారు అనుటకంటె రామదాసు అని ఎక్కుడు గౌరవభావము గలిగెను. ఆతని పేరులను గోపన్న యనుట మానివేసి, రామదాసు అని పిలువ సాగిరి. మఱికొన్ని దినములు గడచునప్పటికి గోపన్న తనపేరు మఱచిపోయి, ఎవరైన నడిగినచో రామదాసు అనియే చెప్పసాగెను. తెల్లవాఱినది మొదలు సాయంత్రము అగునంతవఱకు రాజకార్యములయందును, సాయంత్రము అయినది మొదలు తెల్ల వాఱునంతవఱకు రామకార్యములయందును, రామదాసు లీనుఁడై పోవుచుండెను. ఆతని ఏల్బడిలోనున్న ప్రజలుగూడ తొల్లిటికంటె రామభక్తులు కాఁజొచ్చిరి. ఎక్కడఁ జూచినను రామోత్సవములే. ఎక్కడ వినినను రామనామమే.

ఇట్టి స్థితి సంభవించునప్పటికి రామదాసునకు ఒకతలంపు పొడమెను. శ్రీరామ చంద్రుఁడు ఆచ్ఛాదనములేకుండ కొండమీఁదఁ బడియుండుట ఆతనికి మంచిదిగా తోఁచలేదు. తనయేల్బడిలో శ్రీరామునకు ఆలయనిర్మాణము కాకపోయినచో, తనకు అధోగతి తప్ప వేఱు లేదని ఆతఁడు భావించి, ఆలయము ఎట్లు పూర్తియగునని భావింపసాగెను. ఇంతలో ఆతాలూకాయందలి పెద్దరహితులు కొందఱు ఏదోపని మీఁద రామదాసు చెంగటకు వచ్చిరి. అప్పుడు ఆతఁడు వారినందఱను ఆదరించి, "అయ్యలారా! జననమరణములు సహజములు. భూమిమీఁద నుదయించిన ఏప్రాణియుఁ జావకుండ నుండదు. ఇహలోకమున మనముచేయు సుకృత దుష్కృతములను అనుసరించి మన భవిష్యజ్జన్మము కల్పింపఁబడును. మనభవిష్యత్తు అంతయు మనఅఱచేత నున్నది. ఈసంగతి అనేకులకుఁ దెలియదు. కావుననే వారు మంచి చెడ్డలు యోజింపక తోఁచినట్లెల్లఁ బ్రవర్తింతురు. నరజన్మమునకంటె స్వర్గమున దేవతలయి పుట్టుట మంచిది. అందులకు మనము ఇచ్చటఁ బుణ్యము చేసికొనవలెను; కాని పుణ్యము శాశ్వతము గాదు. అది కొన్ని దినములకు తరిగి పోవును. అప్పుడు స్వర్గమున నున్న ఆత్మ మఱల నరజన్మము నెత్తి, భూమిమీఁద సంచరింపవలసియుండును. ఇది యెంత కష్టమో యోచింపుఁడు. మఱల నేజన్మమును నెత్తకుండ శాశ్వత బ్రహ్మలోక నివాసము బసంగు నుపాయము ఒకటి గలదు. అది నిష్కామబుద్ధితో శ్రీహరిని సేవించుటయే. శ్రీహరిని సేవించినవారు శ్రీహరి సాయుజ్యమును బడయుదురు. దానికి ఇఁక అంతము అనునది లేదు. అందులకు మా[illegible] అ[illegible]ణము; కావున మనకు గలది అంతయు శ్రీరామచంద్రునకు సమర్పించి [illegible]గాంతము. శ్రీరామచం

ప్రభుఁడు పర్వతోపరిభాగమున ఎండకు ఎండుచు, వానకుఁ దడియుచు, దిక్కులేనివాని వలె నవయుచున్నాఁడు. అది మనకే అపాయకరము. కావున మనము మనచెంతనున్న ధనముతో ఒక యాలయము కట్టించి స్వామిని నందుఁ బ్రవేశపెట్టుదము. ధనము గల వారము ధనము ఇత్తము. ధనము కలవారును లేనివారునుగూడ కూలి అడుగకుండ పనిచేయుదము" అని చెప్పెను. అందులకు రహితులు అందఱును అంగీకరించిరి.

అంతట శుభముహూర్తమున ఆలయనిర్మాణము ప్రారంభించిరి. చుట్టు ప్రక్కల గ్రామములయందలి రహితులందఱును వచ్చి పనులు చేయసాగిరి. దూరదూరములనుండి గొప్పగొప్పశిల్పులు వచ్చిరి. ఒక గడియమైన విఘ్నము రాలేదు. కొలఁది దినములయందే ఆలయనిర్మాణము పూర్తియయ్యెను. ఆయాలయమును జూచియు రామదాసు భక్తిశ్రద్ధలను జూచియు అందఱును ఈవిధముగఁ జెప్పుకొనసాగిరి.

కల్యాణిరాగము - ఆదితాళము.

కైంకర్యము చేసెను రామదాసు కైంకర్యము చేసెను॥
కైంకర్యముచేసె కాకుత్స్థునకు సంకటహరణాసర్వాత్మయని మ్రొక్కి॥ కైంకర్యము॥
శ్రీకర మగు రాజతమణిశాలల, ప్రాకారంబుల బహుమతపంక్తుల
మంజుళతర మగు మణిమంటపముల, కంజరాగమణికలితాంగణముల
చారుచక్రకాంచనకూటంబుల, నాకాశంబున కంటెను తేరుల
గోపుర మెరసెడి గోపురవితతుల, దీపించు వితర్దికల బెడంగుల
తళుకు గులుకు పగడపు కంబంబుల, కలవడంబులను గల కలువడముల
రంగగు ముత్యపురంగవల్లికల, శృంగారములగు చిత్రపాళికల
మకరతోరణసమాజంబుల మణి, ముకురతోరణసమూహంబులఁ గడు
ఘుగఘుగ వలచెడు ఘూచప్పరముల, అగరుధూపముల నాలవట్టముల
మెరసెడి రీతిని మేలిమి గాఁగను॥ కైంకర్యము॥
ధారాళము లగు ద్వారబంధముల, చారురత్నకాంచనశిఖరంబుల
గమగమ మనియెడు గంధవాసనల, ఘుమఘుమ యను ఘలుకుంకుమరసముల
ఘణఘణఘణ యనుగంటల తలుపుల, ధణధణ యనెడు మృదంగవాద్యముల
మినమిన మెరసెడిమేలిమిగోడల, కనకమయం బగు గరుడధ్వజముల
రామరామయను రామశుకంబుల, వేమరు పొగడెడు విబుధగణంబుల
పొసఁగ మ్రోయుతుంబురు గానంబుల, కొసరియాడుభక్తుల నృత్యంబుల
వైనతేయముఖవాహనచయముల, పూనిశంఖభుంభుంనాదంబుల
మెరసెడి రీతిని మేలిమి గాఁగను॥ కైంకర్యము॥
వెల్లగొడుగులను వింజామరముల, మల్లెల మొల్లల మంచివాసనల
పిల్లనగ్రోవిగభీరస్వరముల, ఝల్లరిఢక్కాజయనాదంబుల
పల్లవపాణుల పాటల నాటల, సల్లలితోత్సవచయపరిమళముల

వనమాలాసంకలితసౌరభముల, ఘనతులసీవనచణగంధంబుల
రామభజనసంరావోత్కరముల, రామతీర్థసారసముల తావుల
రామస్మరణల రవమధురంబుల, రామభద్రవిగ్రహదర్శనముల
హనుమద్గజవాహనముల ఘనముల, అనుపమశృంగారానందంబుల
రమణభద్రగిరిరామాలయ మృత్యమలానందమై ధరలోలా
మెరసెడి రీతిని మేలిమి గాఁగను॥ కైంకర్యము॥

గుళ్లు గోపురములు మున్నగునవి అన్నియు పూర్తియగునప్పటికి రామదాసు చెంతను, రక్షితులవద్దను గల ధనము అంతయు నైపోయెను. ఇంకను సంప్రోక్షణాదికములు అన్నియు మిగిలియే యుండెను. ఇదంతయు నెట్లు అగునని రామదాసునకు దిగులుపుట్టెను. ఎన్నివిధముల నాలోచించినను అతనికి ఏమియుఁ దోఁచినదిగాదు. కాని నాటిరాత్రి శ్రీరాముఁడు స్వప్నమున సాక్షాత్కరించి, "విచారింపకుము. సర్కారుపైకము వెచ్చింపుము" అని చెప్పెను. మఱునాఁడు ఉదయము రాముఁడే ఉపాయము చెప్పినందులకు పరమానందకందళిత హృదయారవిందుఁడగుచు, రామదాసు కోశాధికారినిఁ బిలిచి కోశమున ధనము ఎంతయున్నది? యని యడిగెను. కోశాధికారి పోయి చూచి వచ్చి ఆఱులక్షలు కలవనియెను. రామదాసు ఆయాఱులక్షలతోడను తక్కిన సమస్తమును నెఱవేర్చెను.

ఆసంవత్సరము అన్నితాలూకాలనుండియు పన్నులు వసూలయ్యెను; కాని భద్రాచలము తాలూకానుండి మాత్రము వసూలు అయి రాకపోవుటకుఁ గల కారణము నెఱుంగక, గోల్కొండయందును కోశాధ్యక్షుఁడు కలవరపడసాగెను. ఇంతలో మాదన్న కోశమును లెక్కలను పరీక్షించెను. అప్పుడు మాదన్న "గోపన్న పన్ను వసూలుచేసి ఏల పంపలేదో కనుఁగొని రండు" అని కొందఱు సరదారులను నియమించెను. వారును ప్రభువు నానతి చొప్పున వెంటనే బయలుదేఱి స్వల్పకాలమునందే భద్రాచలము చేరుకొనిరి. వారు వచ్చిన కార్యమును విని, గోపన్న మాఱువలుకక:

దర్బారురాగము - చాపుతాళము

పల్లవి. వచ్చేవో రావో మాయింటికి॥ వచ్చేవో॥

అనుపల్లవి.

వచ్చేవో రావో వాసుదేవ నేఁడు అక్షయముగ నన్నాదరించఁగ వేగ॥ వచ్చేవో॥

పాపిష్ఠినైతి రామ నీపాదము నమ్మితి, మాపాలిదైవ మని మఱువకెల్లప్పుడు దాపుదండకుచేరితి
కాపాడు మని వేగ॥ వచ్చేవో॥

కరుణించరాదా రామా నిన్ను శరణమ్మలేదా, గరుడగమన గౌతమసతి నహల్యను వరరూపుచేసిన
చరణముల మ్రొక్కెద॥ వచ్చేవో॥

మ్రొక్కెను రారా ఏలఁగ నన్ను దిక్కుగావేరా, చక్కని భద్రాచలరామదాసుఁడ నక్కరతోడ
నన్నాదరించు వేగ॥ వచ్చేవో రావో॥

అని ఆవేశముగ రామదాసు ప్రార్థించెను. ఈ నిరుత్తరమువలనను ఆతని రామదాసుని బ్రోవక పోవుట ఆతని మన్నింపకపోవుటచేసె నని తలంచి, మఱి కొంతసేపటికి అప్పటి కోశాధ్యక్షునివలన నిజమెఱింగి గడగడలాడుచు సరదారులు గోలకొండకుఁ బోయి, సంగతులు అన్నియు మాదన్నకు ఎఱింగించిరి. ఇది విని మాదన్న చాల వగచి అక్కన్నతోఁ జెప్పి కార్యగతుల నూహించుచుండఁగా, తానీషా లెక్కలు పరీక్ష చేయుటకు కోశాగారమునకు వచ్చెను. అచ్చట నాతఁడు అన్ని తాలూకాలనుండియు సొమ్ము పూర్తిగా వచ్చియుండుటయు, ఒక్క భద్రాచలము తాలూకానుండిమాత్రమే రాకపోవుటయుఁ జూచి, "ఏమి కారణము?" అని యడిగెను. అంతట కోశాధికారి రామదాసు భద్రాచలరామునకు ఆలయాదులు కట్టించుట మున్నగు తాను వినిన సంగతుల నెల్ల నెఱింగించెను. అది వినినతోడనే తానీషా "మా ఖజానాకు ఆఱులక్షలరూపాయలు నిర్భయుఁడై వీఁడు రాముని నిమిత్తము వెచ్చించినాఁడా?" యని మహోగ్రుఁడై మండిపడి, "ఉన్నట్లుండఁగా వానిని కట్టితెండు" అని సరదారులకు ఆజ్ఞయిచ్చెను.

తోడనే వారు బయలుదేఱి భద్రాచలముఁ జేరి, గోపన్నను తిట్టుచు నిందించుచు త్రోయుచు గోల్కొండకుఁ బ్రయాణమైరి. భద్రాచలమునందలి వారెల్లరును రామదాసునకు ఇట్టి గతి పట్టినందులకు ఎంతయు వగచి, "రామా! నీదాసునిఁ బ్రోవ నిదే సమయము" అని అనేకవిధములఁ బ్రార్థింపసాగిరి. అంతకంటె వారు ఏమి చేయఁ గలరు?

యమునాకల్యాణిరాగము - ఆదితాళము

గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా
పరమపురుష యే వెఱపులేక నీ మఱుఁగు చొచ్చితిని అరమరచేయకు॥ గరుడ॥
పిలువగానె రమ్మా అభయము తలువఁగానె ఇమ్మా
కలిమి బలిమి నాకిలలో నీవని కలువరించితిని నలువను గన్నయ్య॥ గరుడ॥
పాలకడలిశయన దశరథబాల జలజనయన
పాలముంచు నను నీళ్లముంచు నీ పాలఁబడితి నిఁక జాలము సేయకు॥ గరుడ॥
ఏలరావు స్వామీ నను నిపు డేలుకోవదేమి
ఏలువాఁడ వని చాల నమ్మితిని ఏలరావు కరుణాలవాల హరి॥ గరుడ॥
ఇంత పంతమేల భద్రగిరీశ వరకృపాళు
చింతలడఁచి కంచర్లరామదాసాంతరంగపతివై రక్షింపుము॥ గరుడ॥

అని రామదాసు గూడ అనేకవిధములఁ బ్రార్థింపసాగెను. కొలఁదిదినములలో వారు గోల్కొండఁ జేరుకొనిరి. యుక్తసమయమున సరదారులు గోపన్నను తానీషా ఎదుటకుఁ గొనిపోయి నిలిపిరి. రామదాసునిఁ జూచిన వెంటనే తానీషా

ముఖము మహాకోపముచే నెఱ్ఱబడెను. అంత నాతఁడు మండిపడుచు, "గోపన్నా! బుద్ధిమంతులం గానకుండ సంచరించుచున్నావటే! మాకైనను నేఁటనే చెల్లింపుము" అని పలికెను. అందులకు రామదాసు "ఏల కట్టు లోపించెదవు? నీధనము శ్రీరామచంద్రునకు సమర్పింపఁబడినది. నీవు ధన్యుఁడవైతివి" యని జవాబు చెప్పెను. తానీషా కోపము ఈమాటలతో అధికముగఁ బెరిగిపోయెను. తోడనే యాతఁడు హర్కారులకు "ఈతని బందిఖానాలో వేయుఁడు. నాధనమ్ము ఎట్లురాదో చూచెదను. పండ్రెండుదినములలో మీరు ఈతనివలన ఆఱులక్షపైకమును కక్కింపవలెను" అని యాజ్ఞాపించెను.

తోడనే హర్కారులు రామదాసుని కైదులోనికిఁ గొనిపోయిరి. ఈదారుణ చర్యఁజూచిన పౌరులెల్లరును చాల వగచిరి. రామదాసు నాకు రక్షింపుమని శ్రీరామచంద్రుని ప్రార్థించుచు కైదులోనికిఁ బోయెను. హర్కారులు ఉప్పు బియ్యము మున్నగు సామగ్రి తెచ్చియిచ్చి వెడలిపోయిరి. రామదాసు వారు వెడలిపోయిన తరవాత వానిని పచనముచేయ, పాత్రయందు అన్నమునకు మాఱుగా అమృత తుల్యము అగుపాయసము ఉండెను. ఇదియంతయు రామునికరుణయే యని, యాతని యెడల రామునకు దయ తప్ప లేదనియు ఆనందించుచు, రామదాసు ఆపాయసమును రామునకు నివేదించి పిదప తాను భక్షించెను.

మఱునాఁడు కారాగారరక్షకులు తానీషా చెంతకుఁ బోయి "ప్రభూ! అతఁడు ఈకారాగృహవాసమును ఏమియు లెక్క చేయుటలేదు. ఆనందముగా నున్నాఁడు. ధనము ఇచ్చునట్లు కాన్పింపదు" అని చెప్పిరి. అదివిని తానీషా మండిపడి, "మంచిమాటలతో ఇచ్చువాఁడు కాఁడు. కొట్టుఁడు. మూఁపుపై ఇనుపగుండ్లుగట్టి పురమున అన్ని వీథులను ద్రిప్పుఁడు. మీచేతనైనన్ని బాధలు పెట్టుఁడు" అని యాజ్ఞాపించెను. యమభటులకుఁగూడఁ గ్రౌర్యము నేర్పఁగల ఆభటులు ప్రభువునాజ్ఞ ముగిసిన వెంటనే ఆహాహా! యని యఱచుచుఁ బోయి, ఆప్రకారముగ రామదాసునిఁ బీడింప సాగిరి. అయినను రామదాసు వానిని లెక్కచేయక ఏమియు నెఱుంగనట్లు రామస్మరణము చేయుచు ఆనందించుచుండెను.

ఒకనాఁడు భటులలో నొకఁడు మే మెంతకొట్టినను నీవు "అమ్మాయనవు; ఏడువవు; నీకు దిక్కెవరు? మాదెబ్బలు నీకు ఏల తగులుటలేదు?" అని యడిగెను. అప్పుడు రామదాసు "తనమీఁద శ్రీరామచంద్రునకు అనుగ్రహము గల" దని చెప్పి, రాముని మాహాత్మ్యమును వారియెదుట నుపన్యసించెను. అదివిని కొందఱు భటులు రామభక్తులైరి. తక్కినవారు మండిపడుచు తానీషాచెంతకుఁ బోయి, "ఏలినవాఁడా ఎన్నికొట్టినను వాఁడు లెక్కచేయుటలేదు. కొట్టిన కొలఁది నవ్వుచున్నాఁడు. ధనము

వచ్చేమార్గము కాన్పింపదు" అని మరలఁ జెప్పిరి. అప్పుడు తానీషా రామదాసుని నిండోలగమునకు రావించి, "మాధనము ఇచ్చెదవా లేదా?" యని గద్దించి పలికెను. రామదాసు అందులకు భీతిల్లక "నీసొమ్ము శ్రీరామచంద్రునకు వినియోగింపఁబడినది. నీవు తరించితివి. మఱల ఆధనము గోరెదవేని నరకమునఁ గూలఁబడిపోయెదవు" అని ప్రత్యుత్తరము నిచ్చెను. ఈజవాబు తానీషాకు నిప్పుమీఁద నేయిపోసినట్లు అయ్యెను. తోడనే ఆతఁడు మఱింత మండిపడి, "వీనిని దయచూడక సంహరించి వేయుఁడు" అని యాజ్ఞాపించెను.

భటులు రామదాసునిమీఁద అనేకపర్యాయములు ప్రచండచంద్రహాసములు విసరిరి; కాని ఆతనికి ఏమియు అపాయముఁ గలుగలేదు. యథాప్రకారముగనే యుండెను. అంతట విసిగిపోయి భటులు ఆతనిని మఱలఁ గైదులోఁ బడవేసి నల్లులు, దోమలు, తేళ్లు మున్నగువానిచేఁ గఱపించిరి. కాని అప్పుడును వారిప్రయత్నములు విఫలములే యయ్యెను.

రామదాసు విసుగు విరామములు లేకుండ శ్రీరామునిఁ బ్రార్థించి కారామోచనము గానక "రాముఁడు దయఁ దలఁపలేదు." అని భావించి, అనేకవిధముల సీతాదేవినిఁ బ్రార్థించెను. సీతాదేవి హృదయము వెంటనే కరిగెను. తోడనే ఆమె రామునకు జాలిగలుగునట్లు రామదాసు స్థితిగతుల నెఱింగించి, "ఆతనిని వెంటనే చెఱ విడిపింపవలయును" అని యాజ్ఞాపించెను. అంతట రాముఁడు లక్ష్మణునితోఁ గూడ సేవకవేషములు ధరించి, అర్ధరాత్రమున బయలుదేఱి గోల్కొండనగరముఁ జేరి, తానీషా యంతఃపురము ప్రవేశించి, తానీషాకు స్వప్నమున సాక్షాత్కరించెను. తోడనే తానీషా లేచి కూర్చుండి ఏకశయ్యపై నిదురించుచున్న భార్యను లేపి, స్వప్నమున ఇరువురు మహాత్ములం గాంచితి నని చెప్పుచు అబ్బురపడుచుండ, రామలక్ష్మణులు తలుపు తట్టిరి. తోడనే తానీషా తలుపులు తెఱచెను.

రామలక్ష్మణులు లోపలఁ బ్రవేశించిరి. వారినిఁ జూచి తానీషాయును ఆతని భార్యయు ఏమియుఁ దోఁచక అబ్బురపడసాగిరి. కొంతసేపటికి రాముఁడు "తానీషా! రామదాసు నెచ్చట నేమి చేయుచున్నావు?" అని యడిగెను. అందులకు జవాబు చెప్పకయే తానీషా "మీరెవరు? అనేకవీరభటపరిరక్షితములగు ఈయంతఃపురమునకు ఎట్లువచ్చినారు? ఏల వచ్చితిరి." అని యడిగెను. ఈసందర్భమున వారికి ఈక్రిందిరీతిని సంభాషణము జరిగెను.

నాదనామక్రియరాగము - ఆదితాళము

**ఎవరి సర్దారులు మీరు వహ్వా ఎవరి హుకుమున వచ్చినారు?**
**గోపన్న గారి సర్దార్లు మా ప్రాపున కోటీశ్వర్లు.**

ఎందుకు నిటకు వచ్చినారు మీ మైందులకై పంపినారు?
తెల్లవారకముందు మీకు బాకీ చెల్లఁగట్టేటందుకొఱకు.
వహ్వా మీనామము లేమి? మీవంగసమునకు పేరేమి?
రామోజి లక్ష్మోజి నామం మాదీ రఘువంశుల మను కులనామం.
కొల్వు కొచ్చినవారు మీరు మెచ్చి కూటికిచ్చుటఁ జెల్వు మాకు.
మూఁడుతరములుగ నున్నాము మమ్ముఁ గాపాడి పెదుదురన్నాము.
కొలువు కొలవఁగ ఫలమేమి? ఈకొల్వునవచ్చినదేమి?
కొల్వు కొలుచుట నేల నయ్యా పొట్టకూటికే కాదఁటవయ్యా.
మాపైకము దెచ్చినారా? పొల్లుమాట లాడఁగ వచ్చినారా?
మీపైకముఁ దెచ్చినాము పొల్లుమాట జాడ లెఱుఁగము.
ఎంతపైకముఁ దెచ్చినారు? మీరిపుడేమి చెప్పుచున్నారు?
మీకెంత బాకి చెప్పండి అది మీరిపుడె చెల్లించుకొండి.
ఆరులక్షలు ఇవ్వండి మీరావల గోపనను జూడండి
ఆరులక్షలు తేలేదండి మీకు అరులిచ్చేవారు లేరండి.
మీరెంత తెచ్చి నారండి మంచి పోరాటమాయెను లెండి
మూఁడులక్షలున్నదండి మీయెడ మారుపల్కు లేమండి
వేగఁ దెచ్చినవి ఇవ్వండి మీరొగ ముడిపెనను చూడండి.
పదివేలు తెచ్చినామండి మీపంతము మాన మేలండి.
మకురుగుణములు మీకుమెండు మామర్జివిరంగిలోగుండు.
మర్జియెఱిఁగి నడువఁగలమా? మమువిసర్జన చేసిన ఫలమా
విడుదలఁ గను దలంపు లేదు మీయెడ మాకుసంతృప్తిలేదు.
జడిగొన్న క్రోధ మేలయ్యా మాకిడరాని దొకటి లేదయ్యా.
ఖైదో ఇచ్చుట సుంత మీబాటల నెఱిఁగెద నంత.
భేటికొఱకు వచ్చినాము మీబాట లెఱిఁగిన వారిఁగనము.
మీ బాట లెఱుఁగమాకేల? వహ్వా సెబాసు ఈమాటలేల?
మాటలేల మీతోనింక మేము భూటఁ బడక పోదు మింక.
గోపన్న సరదార్లు గనుక మీకేపట్ల ఖైదే గతికాక.
బాకీదార్లకు కద్దు ఖైదు మేము బాకీ ఏమాత్రము లేదు.
తెచ్చిన పైకమీయండి మీ తెగులు మాన్పెదను జూడండి.
తెగులు మాన్పెడు దొరయుంటే నీకే వగపేల వచ్చునకంటే.
మాయబ్బ సొమ్ముకు వగపా వద్దు మాను మనుచుఁ జెప్పు నీవా?
అబ్బబ్బలకు అబ్బలము మాశిబ్బందులందఱు వినుము.
తబ్బిబ్బుగా బలికేరు మా డబ్బుకు గతి గానలేరు.
గతిలేనివారలకెల్ల మేమే గతి యుల్లమునఁ దేజరిల్ల.
ఆర్తజనులకు గతిలేదు మీ బోర్డ బాటు గన్న చేదు.
కోటిలక్షలు తేఁగలము ఇట్టి చోటికేల వచ్చెదము?

తగదన మీకింత తెగవా? మా ధనమీయక ఇంత బిగువా ?
ధనము రాఁబోసి రంత దండనము చేయఁదలఁచిరంత.

ఈవిధముగా వారు వినోదార్థము కొంత తడవు వాదించి, తమచెంతనున్న చిన్న వరాలసంచిని బ్రసన్నులై "లెక్కించుకొనుము." అని పలికిరి. తానీషాతొలుత "ఈరాశి ఏమాత్రము ఉండును?" అని పలికి, పిదప లెక్కింపఁదొడఁగెను; కాని రాశి ఎంతకు తఱుగదయ్యెను. అందులకు ఆశ్చర్యపడుచు ఆతఁడు విసుగుకొనక లెక్కింపఁగా, ఆఱులక్షలవరాలు అగునప్పటికి రాశి మాయ మయ్యెను. అందులకు ఆశ్చర్యపడి తానీషా మాఱుపలుకఁ జాలకుండఁగా, రామచంద్రుఁడు "నీసొమ్ము ముట్టినట్లు రశీదు ఇమ్ము" అని యడిగెను. అచ్చట రశీదు ఇచ్చుటకు కాగితమా? కలమా? అగుట నాతఁడు తమ్మపడిగముమీఁద తనమొహరువేసి ఇచ్చి వారిని పంపి వేసెను.

పానినిఁ గైకొని, రామలక్ష్మణులు బయలుదేఱి చెఱసాలకుఁ బోయిరి. అప్పటికి ఇంకను జాము రాత్రి ఉండెను. రామదాసు తనకు ఇఁక విముక్తిలేదని పరిపరివిధముల దుఃఖించుచు,—

మ. "అతికాఠిన్యుఁడ వీవు నిక్కముగ నత్యాపన్నుఁడ న్నేను నీ
మతిలో నించుక జాలిపుట్ట దిఁక నేనేదేవుఁ జింతింతు నే
గతి యేత్రోవఁ జరింతు నన్ను మెఱుఁగక్ గాంక్షించి నీప్రాపుఁ జొ
చ్చితి నీచిత్తము ఎట్లు వచ్చిన సరే శ్రీభావనారాయణా."

మ. "కరి నేలింది హుళిక్కి ద్రౌపదికి కోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్నం బగవాని తమ్మునికి రాజ్యం బిచ్చుటల్ కల్ల యి
త్తఱి నన్నేలిన నిక్క మీకథ లనంతా భావనారాయణా."

అని ఈతీరునఁ బ్రార్థించుచుండెను. ఈస్థితినిఁ జూచిన వెంటనే రామునిహృదయమునఁ జాల తత్తరము ఒదవెను. అపుడు ఆతఁడు "లక్ష్మణా! జాగుచేయక చెఱలోఁ బ్రవేశింపుము. రామదాసు దీనాననము నేను చూడఁజాలకున్నాఁడను" అని తమ్ముని లోనికిఁ బంపి తానీషారూపముతో తానుగూడ లోపలఁ బ్రవేశించెను. అంతకుఁ బూర్వము రామదాసు ఇఁక నెట్లును రాముని కృప గలుగదని, జీవితమునెడల నిరాశచేసికొని విషపానము చేయుటకు సిద్ధముగా నుండెను. ఆతఁడు పాత్రముతో విషము నెదుట నుంచుకొని శ్రీహరికి అంత్యప్రార్థనము సమర్పించి, విషము పానము చేయఁదలఁచెను. రామదాసు ప్రార్థనముచేయుచుండఁగా, చెఱలోఁబ్రవేశించిన రామలక్ష్మణులు ముమ్ముందు ఆపాత్రమునందలి విషమును మాయముచేసిరి. ప్రార్థనానంతరము కన్నులుతెఱచి పాత్రమున విషము లేకుండుటఁజూచి, రామదాసు ఇది

మంతయు రామునిలీల యని ఆశ్చర్యపడసాగెను. అతడు కన్నులు విప్పునప్పటికి రామలక్ష్మణులు మాయమై పోయిరి.

ఇవి ఇట్లు జరుగుచుండఁగా, నచ్చట నవాబు ఖాజాతో సంగతు లన్నియు నెఱింగించి, వెంటనే కొలువుకూటమునకు వచ్చి అక్కన్నమాదన్నగార్లకు తక్షణము రావలసినదని వర్తమానము చేసెను. అదివిని వారు ఆశ్చర్యపడి, సముచిత వేషములతో బయలుదేఱి వచ్చిరి. తానీషా వారితో జరిగినది అంతయుఁ దెలిపి "వెంటనే రామదాసుని జెఱవిడిపించి మేము స్వారిచేయు బండిలోఁ గూర్చుండఁ జేసి, మహోత్సవముతో నూరేగించి కొనిరావలసినది" అని యాజ్ఞాపించెను. అక్కన్నమాదన్నగార్లు తమ మేనల్లునకు సంభవించిన యోగ్యస్థితికి ఆనందించి, అంతయు నవాబు చెప్పినట్లు చేసి, ఆతనిని కొలువుకూటమునకుఁ గొనివచ్చిరి. తానీషా రామదాసుని అల్లంతదూరమునందే చూచి గద్దియడిగి, ఎదురువోయి సాష్టాంగనమస్కారములు ఆచరించి, కౌఁగిలించుకొని కొనివచ్చి, సింహాసనమునఁ గూర్చుండఁజేసి, తాను అతని పాదములచెంతఁ గూర్చుండి, "తన అపరాధములు అన్నియు క్షమింపవలసినది" అని యనేకవిధములఁ బ్రార్థించెను. పురమంతయు ఆనందించెను. రామదాసు "గతమునకు వగవవలదు" అని నవాబునకు అభయమిచ్చి, "నీవు మహాయదృష్టవంతుఁడవు; కావుననే శ్రీరామచంద్రుఁడు నీకు అయాచితముగ దర్శనము నిచ్చెను. నీవు పూర్వమున తపశ్శాలివి. కాకున్న నిట్టిది తటస్థింపదు" అని యాతని ననేకవిధములఁ గొనియాడెను.

అట భద్రాచలమున మఱునాఁటి ప్రాతఃకాలమున అర్చకులు యథాప్రకారముగ తలుపులు తెఱచునప్పటికి రామలక్ష్మణులు రాత్రి గోల్కొండలో తానీషాకు దర్శనమిచ్చినవేషములతో నుండిరి. రాముని చేతిలో నవాబు ఇచ్చిన విచిత్రపురసీదు ఉండెను. ఇది యంతయుఁ జూచి వారు చాల అబ్బురపడి ఈవృత్తాంతమునంతయు అమీరునకుఁ దెలిపిరి. అమీరు ఆవింత రసీదును బేగిరావుటపామీఁద గోలకొండకుఁ బంపివేసి, ఆహార్కారులతో 'ఇక్కడి సంగతులు అన్నియు నెఱింగింపుఁడు' అని నియమించెను. ఈబేగిరావుటపా గోలకొండ చేరునప్పటికి నవాబు మంత్రిసామంతాదులతోఁగూడ నిండుకొలువున రామదాసునకు మహాసత్కారము చేయుచుండెను. అప్పుడు అతఁడు ఈరసీదును జూచి ఆశ్చర్యపడి, "రాముఁడు రామదాసు ఆజ్ఞానువర్తియై ఉన్నాఁడు" అని తలఁచి, వృత్తాంతము అంతయు సభ్యులకు ఎఱింగించెను. అందఱును పరమానందభరితులైరి. పిదప తానీషా ఆవింతరసీదును రామదాసునకు ఇచ్చుచు ఇట్లు చెప్పెను.

నాదనామక్రియరాగము - ఆదితాళము

పల్లవి॥ రామదాసుగారూ రండీ రశీదందుకొండీ

అనుపల్లవి॥ రండీ మనవి వినండీ కృపయుంచండీ రాములమహిమగనుండీ. రామ.

చరణములు॥ వచ్చి నిల్చిరిందు రాతిరి వహ్వా ఏమందు

వచ్చియిచట మీపైకంబంతయు నిచ్చిరశీదును పుచ్చుకవెళ్లిరి. రామ.

జట్టీలాగులతో వారలు పట్టాకత్తులతో

నెట్టనమిమ్మాపట్టున మనుపఁగ ఇట్టివేషముల నుట్టిపడిరి ఇట. రామ.

ఎంతశాంతనిధులో మీదగు స్వాంతంబిది యెటులో

ఇంతకష్టముల కెట్లోర్చితిరో పంతగించితిని అంతర మెఱుఁగక. రామ.

కృపణుఁడనేఁగనుకా మీపై కృపలేశము లేకా

యపవాదంబున కాలయుఁడైతిని కృపతోఁజూడుము కేవలుఁడనకను. రామ.

తురకవాఁడనగుట నాకు దుర్గుణమె బాట

పరమపావనుని భద్రగిరీశుని స్థిరమతిఁ దలఁచక చింతఁగుందెదను. రామ.

రసీదు ఇచ్చుట యైనతరువాత తానీషా భద్రాచలము తాలూకాను రామదాసునకు జాగీరుగా నిచ్చి, అప్పుడే పరమానాగూడ ఇచ్చివేసి, రాముఁడు ఇచ్చిన ఆఱులక్షల పైకంబును మఱి యనేకరత్నాభరణములును రామదాసునకు ఇచ్చి, అనేకవిధముల మన్ననను బ్రార్థించి మహావైభవముతో నాతనిని భద్రాచలమునకుఁ బంపివేసెను. రామదాసును మఱల రాముని జూడఁబోవుచున్నాను అను, పరమానందముతో నృత్యము చేయుచుఁ బోవుచుండెను. భద్రాచలమును సమీపించు నప్పటికి ఒకనాఁటి సాయంకాలము అఖండవర్షము కురియసాగెను. ఆసమయమున దారిదోపుగాండ్రు వందలకొలఁదిగవచ్చి రామదాసుని అరికట్టి, సొమ్ముఅంతయు అక్కడఁ బెట్టుమని నిర్బంధింపసాగిరి. అదిచూచి రామదాసు భీతిల్లక రామస్మరణము ప్రారంభించెను. తోడనే ఆదొంగలు అందఱును మాయమైపోయిరి. ఇదిచూచి రామదాసు ఇది యంతయు రాముని మాయయనియు, రాముఁడు తన్నుపరీక్షించుటకు ఇట్లుచేసెననియు భావించి, మఱింత యానందముతో మఱల నృత్యముచేయుచుఁ బ్రయాణము సాగెను.

మఱునాఁటి ప్రాతఃకాలమునకు రామదాసు పరివారముతోఁగూడి భద్రగిరిని సమీపించెను. తోడనే ఆతఁడు అఖండగౌతమీనదిలో జలకమాడి పరివారముతో నూరిలోనికి బయలుదేఱెను. అంతకుఁబూర్వమే ఈసంగతి యంతయు వినిన భద్రగిరివాసులు మృదంగములు తంబురలు మున్నగు సకలమంగళవాద్యములతోడను ఎదురువచ్చి, మహోత్సవముతో రామదాసుని పురములోనికిఁగొనిపోయిరి.

రామదాసు తొలుత శైలము నెక్కి విధివిధానమున రాముని సేవించి, పిదప స్వగృహము చేరుకొనెను. అది మొదలుకొని యాతఁడు శ్రీరామచంద్రునకు

ఏమియు లోపము కలుగకుండునట్లు మహోత్సవములు చేయుచు, అనుదినమును అనేక బ్రాహ్మణులకు సంతర్పణము చేయుచు, సంసారమునంటక తామరాకుమీఁదనీటి బిందువువలె సంచరించుచుండెను.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, ఒకనాఁడు సీతాదేవి శ్రీరామునితో "నాథా! నీకు ఇది ఏమి ధర్మము? అనవరతము నిన్నే నమ్మియున్న రామదాసునకు దర్శనము నీయకపోయితివి. నిన్ను కలనైన తలంపని మ్లేచ్ఛునకు దర్శనము నిచ్చితివి. ఇది బాగుగ నున్నదా?" అని యడిగెను. అందులకు రాముఁడు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"దేవీ! నీవు మంచిప్రశ్న వేసితివి. వినుము. తొల్లి ఒక బ్రాహ్మణుఁడు ఉండెను. కాశీనగరమునకు అవ్వల నొకచోట నొకశివాలయము ఉన్నది. విధివిధానమున ఒక్కసంవత్సరకాలము ఆదేవునకు రుద్రాభిషేకము చేసినవారికి మహేంద్రపదవి తటస్థించును. ఆబ్రాహ్మణుఁడు మహేంద్రపదవిని గోరి ఆదేవునకు రుద్రాభిషేకముచేయ ప్రారంభించెను. అతఁడు సంవత్సరమును చేసెను. కాని రేపటికి సంవత్సరము ముగియు ననఁగా 'అతఁడు ఇంకను ఏల ఈమహాసుభావుఁడు సాక్షాత్కరింపఁడు? అని ఉత్కంఠను బట్టఁజాలక కోపించి, అభిషేకార్థము తెచ్చిన జలపూర్ణమగు ఘటమును లింగముమీఁద విసరివేసెను. తోడనే ఈశ్వరుఁడు సాక్షాత్కరించి 'నీవు ఇంతవఱకును ఎంతభక్తియుక్తుఁడవై నను నేఁడు తొందరపడి మనస్సును చెఱచికొంటివి. కావున నీకిఁక మహేంద్రపదవిరాదు. మఱేమన: భూలోకమున మహారాజవు అయ్యెదవు. అయితే ధూర్తుఁడవై జలపూర్ణమగుఘటమును నామీఁద విసరివేసితివి; కావున మ్లేచ్ఛుఁడ వయ్యెదవు. నాదర్శనభాగ్యమును బడసినందులకు మ్లేచ్ఛులయందెల్ల ధర్మాత్ముఁడవు అయ్యెదవు. నిన్ను శ్రీరామచంద్రుఁడు రక్షించు' నని పలికెను. ఆబ్రాహ్మణుఁడే ఈతానీషా. ఈశ్వరాజ్ఞవలన నేను ఆతనికి దర్శన మిచ్చి కరుణించితిని."

"ఇంక రామదాసుసంగతి వినుము. తొల్లి ఒక భూసురుఁడు ఒక చిలుకనుబట్టి పంజరమున నునిచి, అతిప్రీతితో దానినిఁ బెంచుచు 'రామరామా'యని పాటలు నేర్పుచుండెడివాఁడు. కొన్నిదినములకు ఆతఁడు చనిపోయి, రామదాసై పుట్టినాఁడు. ఆతఁడు చిలుకను పంజరమున బంధించెను; కావున ఈజన్మమున కైదులో నుండవలసివచ్చినది. అయినను దానికి రామనామమును నేర్పెను; కావున నాకు భక్తుఁడు అయ్యెను. ఆతనిం గొలఁది దినములయందే రక్షించెద. తొందర పడకుము."

రాముఁడు ఇట్లు చెప్పుట విని, సీత సంగతులు అన్నియుఁ దెలిసికొని, మిగుల నానందించెను. కొన్నిదినములకు రామదాసునకు వృద్ధత్వము వచ్చెను. ఆతఁడు రామ

పద్మాసనమునను రాజాలని స్థితికి వచ్చెను. అంత నాతఁడు "రామా! ఇఁక భూమిపై నిలువఁజాలను. రక్షింపుము" అని ప్రార్థింపసాగెను. ఆ ప్రార్థనకు ఆనందించి, రాముఁడు తానొక గుఱ్ఱమువాని వేషము ధరించి, లక్ష్మణుని గొడుగుపట్టువానినిగా నియమించి గరుత్మంతుని అశ్వముగఁజేసి, తిన్నగ రామదాసుఇంటికిఁబోయి "రామదాసుగారూ! రండి వైకుంఠమునకుఁ బోదము" అని పిలిచెను. తోడనే రామదాసు బైటకు వచ్చి రాముని యాజ్ఞచే గుఱ్ఱము నెక్కి "వైకుంఠమునకుఁ బోదము రమ్ము" అనిభార్యను బిలిచెను; కాని ఆమె లోపలనుండి "స్నానముచేయుచున్నాను. కొంచెముతడవు ఉండవలెను" అని జవాబు చెప్పెను. అంతట రామాజ్ఞచే గుఱ్ఱము బయలుదేఱెను. రామదాసు భార్యను దలంచుకొని "ఎవరి పుణ్యమునకు ఎవరు కర్తలు" అని యనుకొనుచు వెడలిపోయెను.

కొంతసేపటికి గుఱ్ఱము భద్రగిరిశిఖరము నెక్కెను. ఆలయద్వారము మూసి యుండుటఁ గాంచి రామదాసు రామస్మరణ ప్రారంభించెను. తోడనే తలుపులు తెఱవఁబడియెను. గుఱ్ఱము లోపలకుఁ బోయెను. ఖాసీదారీ వేషముతో నున్న రాముఁడును, ఛత్రము పట్టియున్న లక్ష్మణుఁడును గూడ లోపలకుఁబోయిరి. వెంటనే తలుపులు మూసికొనిపోయెను; రాముఁడు నిద్రించుచున్నాఁడు అని భావించి, రామదాసు మేలుకొలుపు ప్రారంభించెను. కొంతసేపటికి ఖాసీదారీ మాయ మయ్యెను. పిదప ఛత్రగ్రాహి మాయమయ్యెను. గుఱ్ఱముగూడ తిరోహిత మయ్యెను. అదిచూచి రామదాసు అబ్బురపడుచుండఁగా, రామచంద్రుఁడు విశ్వరూపముఁ దాల్చి రామదాసుని తన సన్నిధిని చేర్చుకొనెను. అప్పుడు రామదాసునకు బ్రహ్మానందము కలిగెను. అంత నాతఁడు తొలుత కబీరుచేసిన యుపదేశమును స్మరించి,—

నాదనామక్రియరాగము-ఆదితాళము

ఇది గురువాక్యం బిది వేదాంతం బిది తారక మిది బ్రహ్మము
ఇది మొదలిది నడు మిది తుది నాదమువదలక తెలిసినవాఁడే వాఁడా॥ ఇది॥
నేఁడు చూచితను నీటి చందమున తోడై యుండుట నీవేగా
నేఁడై నాఁడై నీడను నీడై నిండినవాఁడవు నీవేగా
ఆడుచుఁ బాడుచుఁ దేటల మాటల నన్నిఁటికూటము నీవేగా
ఓడక మని గురుఁడాడిన లక్ష్యము జాడనిలుచుటయు నీవేగా॥ ఇది॥
అకారంబున అష్టాక్షరియై యాత్మకు ప్రణవము నీవేగా
ఉకారంబున నున్నతోన్నమిత మురుపోషకుఁడవు నీవేగా
మకారంబునను మఱి భవభయముల మడియఁ జేయుటలు నీవేగా
అకలంకతను అఖండరూపమై యలరెడు ప్రణవము నీవేగా॥ ఇది॥

నాయకి గన నానాయకి కావల నాయికత్వం బీవేగా
పాయక చీకటి బయలఁగలపి భవభయములఁ ద్రుంచుట నీవేగా
కాయంబు నిరాకారంబును ధృతి గలుగఁజేయుటలు నీవేగా
మాయాప్రపంచపు మాయలలోఁ బడవేయు మాయకుఁడ నీవేగా॥ ఇది॥
కామమోహములఁ గట్టుపడక మముఁ గడతేర్చుటయును నీవేగా
తామస గోష్ఠినిఁ దగులనీక నీతత్త్వముఁ దెలుపుట నీవేగా
పామరత్వమునఁ బడనీయక చేపట్టి ప్రోచుటయును నీవేగా
రామదాసగురురాయ భద్రగిరి ధామ సర్వమును నీవేగా॥ ఇది॥

ఇట్లు రామదాసు తత్త్వములను మననము చేయుచు ఈశ్వరసాయుజ్యమును బడసెను. పిదపఁ గొన్ని దినములకు రామదాసుభార్యయు “ఈశ్వరసాయుజ్యము నాకేల సిద్ధింపదయ్యె” నని చింతించి ప్రార్థింపఁగా, రాముఁడు “నీవు ఇంకను భూతలమున కొన్నిదినములు ఉండవలెను. ఇచ్చట నీవు తులసీవనకైంకర్యముచేయుచుండుము” అని నియమించెను. ఆమె అట్లే చేసి, తుదకు వైకుంఠమునకుఁ బోయెను.

---

# 50. తుకారామస్వామి

నామదేవుఁడు ఒకప్పుడు పాండురంగని నూఱుకోట్ల వృత్తములతోఁ గొనియాడుటకు సంకల్పించుకొనెను. అందులకు పాండురంగఁడు “వత్సా! నీవు చేయఁ దలఁచినపనికి మానవజీవితముచాలదు” అని పలికెను. అందులకు నామదేవుఁడు నిరుత్సాహపడక “దేవాదిదేవా! నీవు నాకు ప్రాపైయుండ నది అసాధ్య మెట్లగును? ఈసంకల్పమును నెఱవేఱునట్లు చేయవలయును” అని ప్రార్థించెను. భక్తుని సంకల్పమును త్రోసివేయఁజాలక పాండురంగఁడు సరస్వతినిఁ బిలిచి, “నామదేవుని జిహ్వాపై వసింపుము” అని తానే వ్రాయుటకుఁ గూర్చుండెను.

అంతలో నామదేవుని హృదయమునఁ గవితావాహిని పొంగిపారలెను. పాండురంగఁడు వ్రాఁత ప్రారంభించెను. కొన్నిదినములు అగునప్పటికి నామదేవునకు మానుషదేహముమీఁద నసహ్యము గలిగెను. అప్పటికి తొంబదినాలుగు కోట్ల నలువదివృత్తములు అయ్యెను. అదిచూచి పాండురంగఁడు “వత్సా! నీకు ఇప్పుడు ఈదేహముమీఁద రోతకలిగినది; కావున నీయిచ్ఛవచ్చినట్లు దీనిని విడువుము; కాని నీవు నన్ను శతకోటి వృత్తములతో వినుతించెద నని సంకల్పము చేసియున్నావు. ఆసంకల్పము పూర్తికాకతీరదు. ఇప్పుడు ఈపాంచభౌతికదేహమును విడువుము; కాని మఱియొకప్పుడు వృత్తసంఖ్యను పూర్తిచేయుటకు మరల మనుష్యుఁడవై పుట్టవలసివచ్చును. అంతయు నాలోచించుకొని నీయిష్టమువచ్చినట్లు

చేయుము" అని చెప్పెను. నామదేవుఁడు "మఱియొకప్పుడు మఱల మానవజన్మము ఎత్తిన నెత్తెదను; కాని ఇప్పుడు ఈనిర్వేదమును భరింపఁజాలను" అని పలికి, శ్రీహరి సెలవుఁ బడసి భౌతికదేహమును విడిచెను.

మఱల ఈశ్వరనియమమువలన ఈనామదేవుఁడే దేవనగరము అనుగ్రామమున తుకారాముఁడు అనుపేరుతో నుద్భవించెను. ఆతనితల్లిదండ్రులు వర్తకులు అగుటచే బాల్యమున ఆతనికిఁగూడ వర్తకము అభ్యాసమయ్యెను. ఆతఁడు వయస్సువచ్చిన తరువాత ఇరువురుభార్యలను పెండ్లియాడెను. అందు పెద్దభార్య యందు ఇరువురు కుమారులు పొడమిరి. కుమారులకు యుక్తవయస్సు వచ్చిన తరువాత ఆమె చనిపోయెను. పిదప ఆమెయందు పుట్టినకుమారులు ఇద్దఱును తండ్రి యెల్లప్పుడును భగవద్భజనమున ప్రవృత్తుండై వర్తకము సంగతి శ్రద్ధగాఁ జూడ కుండుటచే కోపించి ఇలువిడిచిపోయిరి. తుకారాముఁడు అందులకు వగవక, "క్రమముగా విఘ్నములును సంసారబంధములును తొలఁగిపోవుచున్నవి" అని యానందింపసాగెను.

ఇట్టిస్థితిలో నొకనాఁడు తుకారామస్వామి రాత్రి నిద్రించుచుండఁగా, పండరినాథుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! నీవు పూర్వజన్మమున నామదేవుఁడవు. నీవు సంకల్పించిన వృత్తములను బూర్తిచేయుటకై మఱల మనుష్యజన్మ పొందితివి. ఇంక నెన్నిదినములు గడపెదవు? నీపనిం బూర్తిచేసికొనుము" అని చెప్పి పోయెను. తుకారామస్వామికి వెంటనే మెలఁకువవచ్చెను. అదిమొదలుకొని ఆతఁడు శ్రీహరిగుణకీర్తనము ప్రారంభించి, తొల్లిటి లోపమును కొలఁదిదినములయందే తీర్చివేసెను.

తుకారాస్వామి ఏఁటేఁటను ఆషాఢమాసమున పండరిపురమునకుఁ బోయి, స్వామిని సేవించుకొని వచ్చుట అభ్యాసమైయుండెను. ఒకసంవత్సరము పాండురంగ క్షేత్రమునుండి వచ్చినతరువాత తుకారామస్వామి తనయింటఁ గూర్చుండి శ్రీహరిని ధ్యానించుకొనుచుండఁగా, శివాజీమహారాజు ఆతనిం జూచి సేవింపవలయునను చిరసంకల్పముతో పళ్లెమునిండ రత్నాద్యనర్ఘములగు కానుకలను నింపుకొనివచ్చి, స్వామికి సాష్టాంగ మాచరించి, పళ్లెమును ఎదుటనుంచెను. అదిచూచి తుకారామస్వామి "వత్సా! నీభక్తికి ఆనందము; కాని ఈద్రవ్యముతో నాకేమియుఁ బనిలేదు. దీనిని మఱలఁ దీసికొనిపొమ్ము. నీవు సొంతమునకు వాడుకొనుటకు ఇష్టములేదేని దీనజనులనిమిత్తము వెచ్చింపుము" అని చెప్పి, హరిభజనము ప్రారంభించెను. శివాజీమహారాజు అందులకు మాఱుపలుకఁజాలక ఆధనమును దీనులకు వెచ్చింపఁ దలఁచి, హరిగుణ కీర్తనము వినుచుఁ గూర్చుండెను. ఇంతలో శివాజీ ఏకాకియై

యున్నాఁడని తెలిసి, ఢిల్లీచక్రవర్తిసైన్యము అతిరభసంబున అచ్చటకు వచ్చెను. బైటనున్న స్వామి శిష్యుఁడు ఒకఁడు ఈవార్త లోనికి ఎఱిఁగించెను. ఇంతలో తురుష్కభటులు "ఇచ్చటకు శివాజీ వచ్చియున్నాఁడు. మాకీయకున్న మీప్రాణములు దక్కవు" అని కుప్పిగంతులు వేయసాగిరి.

ఈవార్త నెఱింగించిన శిష్యుఁడు ఇచ్చట లేఁడని చెప్పెద ననియెను. కాని అబద్ధము ఏల పలుకవలెను? అని స్వామికి నమస్కారము ఆచరించి, శివాజీ తటాలున బైటకు వచ్చి ఆయుధములను సవరించుకొని గుఱ్ఱమునెక్కి, ఇట్లు తిరిగి వచ్చి తురుష్కభటులముందు నిలిచెను. తుకారామస్వామి "స్వధర్మరక్షకుఁడు అగు ఈమహారాజును ఈశ్వరుఁడు రక్షించుఁగాక!" అని ధ్యానము చేయఁదొడఁగెను. అట తురుష్కభటులు శివాజినిఁజూచి "గుఱ్ఱము దిగుము. నీవు మా కైదీవి" అని గర్వముతోఁ బలికిరి; కాని శివాజీ "ఎవరురా మీరు? ఆఁడువాండ్రవలె మాట్లాడెదరు?" అని కత్తిదూసెను. తురుష్కులు గూడ కత్తులుదూసిరి. సమరము ప్రారంభమయ్యెను. అయినను శివాజీ యొడలిమీఁద నీగవ్రాలలేదు. శత్రువులు అనేకులు కూలిరి. హతశేషులు పలాయనము చిత్తగించిరి. శివాజీ తనమార్గమునఁ బోయెను.

మఱియొకప్పుడు శివాజీ "ఎట్లయిన తుకారామస్వామికి ఒకతృణమునొమ్ము ముట్టఁజెప్పవలయును; అట్లయినగాని ఈజన్మకుఁ దరణోపాయము లేదు" అని తలంచి, ఒక వర్తకుని వేషము వేసికొని ఒకబండిమీఁద ధాన్యపుబస్తాలు వేసికొని వచ్చి "స్వామీ! నేను ఒక వర్తకుఁడను. ఈసంవత్సరమున నాకు వర్తకమున ఈబండెఁడుధాన్యము లాభము వచ్చినది; కావున తమరు స్వీకరింపవలయును" అని ప్రార్థించెను. తుకారాముఁడు ఆతఁడు వర్తకుఁడు కాఁడనియు, శివాజీయే తన యెడలఁగల భక్తిపెంపున ఇట్టి వేషము వేసికొనివచ్చె ననియు గ్రహించి, మాఱు పలుకఁజాలక కనులుమూసికొని ధ్యానముచేసికొనసాగెను.

శివాజీ మౌనము అంగీకారముగా గుర్తెఱింగి ఆబస్తాలను స్వామిఇంటఁ బడ వేయించి, ఆతని భార్యకు అప్పగించి వెడలిపోయెను. తుకారామస్వామి సమాధి నుండి లేచినతరువాత సంగతి యంతయు విని "మనకు ఒకపూటకు వలయు ధాన్యము మాత్రము ఉంచి, తక్కినది అంతయు దీనులకుఁ బంచిపెట్టుము" అని భార్యకు ఆజ్ఞాపించెను; కాని యామె "ఈధాన్యము ఉన్నచో సంవత్సరము పొడుగునను లోపము లేకుండ కడుపునిండ భుజింపవచ్చును" అని తలంచి జాగ్రత్తచేసెను. అంతట స్వామి తనయాజ్ఞ వ్యర్థమగుటఁజూచి "ఒరులకు ఆజ్ఞాపింపనేల?" అని ఆపని తానే చేసివేసెను.

ఆయూరియందు గాజులవర్తకుఁడు ఒకఁడు ఉండెను. ఆతఁడు అనుదినమును తుకారామస్వామి ఇంటికిఁ బోయి చాలతడవు హరిభజనమువిని పోవుచుండును. ఒకనాఁడు ఆతనిబిడ్డకుఁ బ్రాణముమీఁదికి వచ్చెను. అయినను దానిని లెక్కఁగొనక ఆతఁడు తుకారామస్వామి ఇంటికిఁ బ్రయాణమయ్యెను. అందులకు ఆతని భార్య సహింపఁజాలక మార్గమునకు అడ్డువచ్చి నిలుపఁదలఁచెను. అయినను ఆతఁడు నిలువలేదు. ఆతఁడుపోవునప్పటికి తుకారామస్వామి పరవశుఁడై హరిగుణములను కీర్తించుచు నృత్యము చేయుచుండెను. కొంతతడవు అదిచూచి వర్తకుఁడుగూడ తన్మయుఁ డయ్యెను.

ఇట్లు ఒక గడియ యగునప్పటికి తుకారామస్వామి భజన మాని నిలిచెను. వర్తకునకుఁగూడ చైతన్యము వచ్చెను. ఈలోపున వర్తకునిబిడ్డ చనిపోయెను. అంతట ఆతనిభార్య ఆబిడ్డ కళేబరమును భుజముమీఁద నిడుకొనివచ్చి, తుకారామస్వామి ముందుఁ బడవేసి గోలుగోలున ఏడ్చుచు, "అయ్యా! నీవు కారణముగా నాభర్త నన్ను ఒల్లకున్నవాఁడు. నాభర్త అశ్రద్ధవలన వైద్యలోపము సంభవింపఁగా నాబిడ్డ చనిపోయెను. ఈపాపము అంతయు నీదే. ఇప్పుడైన నాభర్తను మందలింపుము" అని నిష్ఠురోక్తు లాడఁజొచ్చెను. అదివిని చెంతనున్నవారు రందఱును "అమ్మా! త్వరపడకుము. స్వామి నీభర్తను వంచింపలేదు. నీభర్త సంగతి ఏమియు స్వామికిఁ దెలియదు." అని పలికిరి. తుకారామస్వామి ఈమాటలు చాలింపుఁడు అని పలికి, తాళము వేయుచు నృత్యముచేయుచు గొంతెత్తి,—

శ్లో. "బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణబాష్పాంబునా,
నిత్యన త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్." (ముకుందమాల. శ. 20.)

అని శ్రీహరినిఁ బ్రార్థింపసాగెను. ఆతనివెంట నందఱును బ్రారంభించిరి. ఇట్లు పది దినములు జరుగునప్పటికి వర్తకునిబిడ్డ జీవించి, పరమారోగ్యముతో లేచి నిలిచెను. అది చూచి, అందఱును తెల్లవోయిరి. వర్తకునిభార్య "అపరాధమును క్షమింపవలసినది" అని తుకారామస్వామి పాదములమీఁద వ్రాలెను.

ఒకప్పుడు తుకారామస్వామి ఇంటిని, సంసారమును విడిచి, అడవులకుఁ బోయెను. నేఁడే వచ్చునో రేపే వచ్చునో యని, ఆతనిభార్య కనిపెట్టుకొనియుండెను. ఇంటనున్న భోజనపదార్థములు అన్నియు నైపోయెను. ఇంట పిల్లలు ఆఁకట నకనకమాడుచుండిరి. ఇది చూడలేకయు ఏమియుం జేయంజాలకయు ఆమె దుఃఖసాగరమునం బడి దరిగానక కొట్టుకొనుచుండెను. ఇట్లు రెండుమాసములు కడచిపోయెను.

ఇఁక నిట్లు నిరీక్షించుచుండినఁ బ్రయోజనము లేదనియు, అతఁడు ఎక్కడనుండిన నచ్చటకు వెదకుకొనుచుఁ బోవలయు నని నిశ్చయించికొని, ఆమె అరణ్యమునకు బయలుదేఱెను. కొంతదూరము పోవునప్పటికి పాండురంగని సేవించుటకు వచ్చుచున్న భర్త ఎదురయ్యెను.

తోడనే ఆమె అతని నచ్చట నిలిపి "నాథా! ఇది తగునా? రెండుమాసముల క్రిందట నీవు ఇల్లు విడిచిపోయితివి. నాసంగతి యోచింపవైతివి. బిడ్డలవిషయము ఆలోచింపవైతివి. మేము ఏమి చేయఁగలము? ఆఁకలివలన మేము మాడిపోవుచున్నాము. మాకు భోగభాగ్యములు కావలయును నని కోరము. కేవలము గంజి చాలును. రెండుపూటలయందును గంజమాత్రమే చాలును. అది మాకు సమకూర్చి పొమ్ము. అట్లయిన నీకు మావలన ఏమియు తొందరలు కలుగవు. నీభక్తికి ఏమియు అంతరాయము ఒదవదు. అట్లుగాక ఆఁకలికి తాళఁజాలక మేము ఇంట నీ ప్రాణములకు ఉసురుపడి ఏడ్చుచుండఁగా, నీవు వనములయందును పాండురంగని ఎదుటను ఎంత భజనము చేసినను ఏమి ప్రయోజనము? ఆభజనము భగవంతునకు ఏమి తృప్తికరము అగును? భక్తిజ్ఞానములు సంపూర్ణముగఁ గలనీకిది ఏల తోఁచకపోయెను?" అని తీవ్రముగఁ బ్రశ్నించెను.

తుకారామస్వామి అందులకు సమాధానము చెప్పలేక కొంతతడవు ఊరకుండి "వనితా! ఏల నిష్ఠురోక్తులు పలికెదవు? సంసారమునందున్న వానికి నీవు చెప్పినవి అంతయు నిజము; కాని నాకు అవియేమియుఁ దెలియదు. నీకు పాండురంగని పాదపద్మములపై స్థిరభక్తి లేదు. కావున నీతోడి సాహచర్యమును నేను అంగీకరింపకుండ నున్నాను. ఇప్పుడైనను, పాండురంగనినే నమ్మియుండెద నని మాట ఇచ్చెదవేని తప్పక నేను ఇంటికి వచ్చెదను" అని పలికెను. ఆమె వల్లె యనెను. తుకారామస్వామి ఆమెతోఁగూడ ఇంటికిఁ బోయెను.

వారముదినములు గడచునప్పటికి ఏకాదశి వచ్చెను. నాఁడు తుకారామస్వామి తనభార్యకు మంత్రోపదేశము చేసెను. ఆ యుపదేశమువలన ఆమె జగన్మిథ్యాత్వమును సంసారాసారతను ఎఱింగి, ఇంటనున్న సకలమును దీనులకుఁ బంచి ఇచ్చివేసెను. దొడ్డిలో నొక చీరమాత్రము మిగిలిపోయెను. అది దొడ్డిలో నున్నదన్న సంగతి ఆమె మఱచిపోయెను. లేకున్న నదిగూడ ఇచ్చివేసియే యుండును. దానిని తుకారామస్వామి చూచెను. ఫకీరుకైన ఇచ్చివేయవలయునని ఆతఁడు ఆచీరను వీథిగుమ్మములోనికి తెచ్చునప్పటికి రుక్మిణీదేవి బీదరాలివేషము వేసికొనివచ్చి, దానినిఁ బట్టుకొని పోయెను. రెండుదినములు గడచునప్పటికి తుకారామస్వామి భార్యకుఁ గలిగిన వైరాగ్యము నిలిచినదిగాదు. బిడ్డలు అన్నములేక మలమల మాడుచుండుటఁ

జూడఁగా, ఆమాటకెంపు తపసుకొనిపోయెను. అంతట నామె "ఎవనిని స్మరించుట వలన కన్నబిడ్డలను విపత్సముద్రమున ముంచివేయునంతటివైరాగ్యము కలిగినదో, ఆపాండురంగనిపాదములను నలుగఁగొట్టివచ్చెదను" అని ఒక నల్లఱాయిపట్టుకొని బయలుదేఱెను. దానిని జూచి తుకారామస్వామి భార్య చేయఁదలఁచిన పనికి చాల చింతాక్రాంతహృదయుఁడై, ఆమెను వారించుటకు వెనుక బయలుదేఱెను.

ఇదియంతయుఁజూచి పాండురంగఁడు గడగడ లాడసాగెను. అంతట రుక్మిణీ దేవి భయమువలదు అని భర్తను ఆశ్వాసించి, భర్తురాలు గర్భాలయము సొచ్చి నంతనే తలుపులు బిగించి, ఆమెను తనచెంతకుఁబిలిచికొనెను. అది చూచి తుకా రాముఁడు "అద్దిరా! నాఁడు రాముఁడు తనమీఁద చాల విరోధము వహించిన రావ ణుని వెంటనే వైకుంఠమునకుఁ గొనిపోయినట్లు, తనభర్త పాదములను నలుగఁగొట్టఁ దలఁచిన నాభార్యను రుక్మిణిచెంతఁజేర్చి ఆదరించెను. తీవ్రముగ నున్నచో విరో ధముగూడ ఈశ్వరునియెడల నుపయోగించు" నని అబ్బురపడసాగెను. ఇంతలో రుక్మిణి భర్తురాలికి వెలగలచీరను గట్టనిచ్చి, అమూల్యాభరణముల నలంకరించి, ఒడి నిండ వరాలను బోసి తలుపులు తెఱచి ఇంటికిఁ బంపివేసెను.

తుకారామస్వామి మహాలక్ష్మివలె నవరత్నాభరణముల ప్రభలతో తేజరిల్లుచు వచ్చిన తన భార్యనుజూచి చాల కటకటఁబడి, "రమణీ! ఎంతపని చేసితివి. మఱల వ్యామోహమునఁ జిక్కితివిగదా! నాకిచ్చినమాటను పొల్లుచేసితివిగదా! కట్టా! అఖండసచ్చిదానందమును గోరవలసిన నీవు ఐహికసుఖము నపేక్షించితివిగదా! ఇప్పుడైనను మించిపోయినది లేదు. లోకజనని యగు రుక్మిణీదేవి నిన్ను పరీక్షించు టకు ఇట్లుచేసినది; కావున వెంటనే ఈధనము నంతను దీనులకుఁ బంచియిచ్చి, రుక్మిణికి ఆనందము గలిగింపుము" అని పలికెను.

ఈమాటలు వినుట తోడనే ఆమెకు మఱల అఖండవైరాగ్యముకలిగెను. ఇదియంతయు అజ్ఞానుల పనియనియు, తాను పొరపడితిననియుఁ జింతించి, భర్త యాజ్ఞాప్రకారము ఉత్తరక్షణమునందే రుక్మిణి ఇచ్చినది యంతయు దీనులకుఁ బంచి పెట్టెను. అదిచూచి తుకారాముఁడు చాల నానందించెను.

దేవనగరమునకు సమీపమునఁ గల యొక జనపదమున ఒక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు ఒకగణపత్యుపాసకుఁడు. ఆయూరి బ్రాహ్మణులు అందఱును ఆతనిని చాల గౌరవింతురు. ఆగ్రామమునందలి బ్రాహ్మణులకు అందఱకును "తుకారాముఁడు శూద్రుఁడు; వేదములకు అనధికారి; ఆతనితో పాండురంగఁడు సహపంక్తిని భుజించు నఁట. ఇదియెంతవఱకు నిజమో పరీక్షింపవలెను" అనుసంకల్పము గలిగెను.

వారు అందఱును ఇట్లు యోచించుచుండుదినమున తుకారాముఁడు దైవ ప్రేరితుఁడై ఆగ్రామమునకుఁ బోయెను. అతఁడుబోయినతీర్థము ఎదురైనది. అని

యానందించుచు ఆగణపత్యుపాసకుఁడు తుకారాముని యాదరముతోఁ దనయింటికిఁ గొనిపోయి, నాఁడు భోజనమునకుఁ దన యింట నుండఁ గోరెను. తుకారాముఁడు అందులకు అంగీకరించెను.

పూజాదికములు అన్నియు ముగిసినతరువాత బ్రాహ్మణుఁడు తుకారాముని స్నానమునకు లెమ్మనిచెప్పెను. ఆతఁడును స్నానము చేసివచ్చి అప్పుడు వచ్చిన తరువాత, చేష్టలనుబట్టి ఆబ్రాహ్మణుని భావము నెఱింగినవాఁడు గావున "ద్విజశ్రేష్ఠా! నాకు వడ్డించినచోట రెండవయాకువేసి అందుఁగూడ వడ్డింపవలెను. ఏమన? నాతోఁగూడి భుజించుటకు పాండురంగఁడు గూడ వచ్చును. అట్లే నీవు గూడ నాయెదుట వడ్డింపించుకొనుము. నీవు అర్చించు గణపతినిఁ గూడ ఆహ్వానించి, ఆతనికి రెండవయాకులో వడ్డింపింపుము" అని చెప్పెను. నాఁడు విందునకు వచ్చిన బ్రాహ్మణులు అందఱును ఈసంగతిని విని ఆశ్చర్యపడి, "మనము అందఱమునుగూడ తుకారామునకు ఎదుటనే వడ్డించుకొందము. పాండురంగఁడును గణపతియువచ్చి ఆతని పంక్తిని భుజించుట యథార్థమేని, ఇంక మనకు మాత్రము దోషము ఎట్లు వచ్చును?" అని నిశ్చయించుకొని అట్లే చేసిరి. ధ్యానాదికములు అన్నియు నైనతరువాత తుకారాముఁడు గణపత్యుపాసకునిఁ జూచి, "అయ్యా! ఇఁక జాలముచేయనేల? త్వరగ గణపతినిఁ బిలువుము" అని పలికెను. అందులకు ఆబ్రాహ్మణుఁడు "అయ్యా! నాతోఁగూడ గణపతి ఎప్పుడును భుజించియుండలేదు. నేను ఆతనిని రప్పింపఁగల నని చెప్పఁజాలను. గణపతిని పాండురంగనిఁ గూడ నీవే రప్పింపుము" అని బదులుచెప్పెను. తోడనే తుకారాముఁడు గణపతినిఁ బ్రార్థించెను. వెంటనే గణపతి ప్రత్యక్షమయ్యెను. అంతట తుకారాముఁడు అనంత భక్తితో గణపతిపాదములమీఁద వ్రాలి సాష్టాంగనమస్కారముల నాచరించెను. గణపతియు ఆదరముతో తుకారాముని లేవనెత్తి కూర్చుండఁజేసెను.

పిదప తుకారాముఁడు పాండురంగని స్మరించెను. వెంటనే దేవుఁడు ప్రత్యక్షమయ్యెను. తోడనే భక్తుఁడు స్వామిపాదములమీఁద వ్రాలి నమస్కారములు ఆచరించి, అనేకవిధములఁ గొనియాడెను. పాండురంగఁడు ఆదరముతో తుకారాముని లేవనెత్తి కూర్చుండఁజేసెను.

ఇది యంతయుఁ జూచి పరమాశ్చర్యచకితులై యున్న బ్రాహ్మణులు అప్పుడు తెలివి దెచ్చుకొని, గణపతికిని పాండురంగనికిని సాష్టాంగవందనములు ఆచరించి, "అపరాధమును క్షమింపవలసినది" అని అనేకవిధములఁ బ్రార్థించి అభయముఁ బడసిరి. పిదప నందఱును గలిసి భుజించిరి. భోజనానంతరము గణపత్యుపాసకుఁడు గణపతికి, పాండురంగనికి, తుకారామునకు, తక్కుంగల బ్రాహ్మణులకు చందనతాంబూ

మాహాత్మ్యాదికములు చేసి పూజించెను. అది నైనవెంటనే గణపతియు పాండురంగఁడును తిరోహితులైరి. బ్రాహ్మణులు తుకారాముని చుట్టును జేరి జ్ఞానబోధను విన సాగిరి. కొంతసేపు అయినతరువాత తుకారాముఁడు స్వగ్రామమునకు బయలు దేరెను. బ్రాహ్మణులు అతనిని చాల దూరము చేరి సాగనంపిరి.

మార్గమధ్యమున నొకకోష్ఠకుఁడు తుకారామస్వామిని తన చెఱకుగానుగ కడకుఁ గొనిపోయి తనివితీఱ చెఱకురసము త్రావించి, ఇంటికిఁ గొనిపోవలసిన దని ఒక చెఱకుల కట్ట నిచ్చెను. కొంతసేపటికి తుకారామస్వామి గ్రామమునఁ బ్రవేశించెను. వీధులలో ఆడుకొనుచుండు పిల్లలు తుకారామస్వామికి అడ్డుపడి "నాకొక చెఱకు నిమ్ము, నాకొక చెఱకు నిమ్ము" అని అడుగసాగిరి. ప్రపంచమంతయు ఈశ్వరుఁడే నిండియున్నాఁడు. అని ఎఱిఁగిన తుకారామస్వామి ఆబాలురను జూచి, శ్రీకృష్ణ లీలను స్మరించి వారే కృష్ణరూపులుగా భావించి, ఒక్కొక్కనికి ఒక్కొకగడ ఇచ్చి వేసెను. తుదకు నింటికిఁ బోవునప్పటికి అతనిచేత నొక్కగడమాత్రమే మిగిలి యుండెను. దానిని అతఁడు భార్య చేతి కిచ్చెను.

ఏదో పనిమీఁద వీథిగుమ్మములో నిలిచియున్న తుకారామస్వామిభార్య అతఁడు చెఱకుగడలవంటి అలభ్యపదార్థములను తనకుమారులును మఱచి విచ్చల విడిగా ఊరివారి పిల్లలకుఁ బంచిపెట్టుటఁ జూచి సహింపఁ జాలకయు, కోపము నణఁచుకొనఁజాలకయు, ఆచెఱకుగడతో అతని నెత్తిమీఁదఁ గొట్టెను. అప్రేటున స్వామికి ఏమియు దెబ్బ తగులలేదు; కాని గడమాత్రము రెండు ముక్క లై పోయెను. ఒకటి క్రిందఁ బడిపోయెను, రెండవది ఆమె చేతనే యుండెను. అది చూచి స్వామి ఏమియుఁ గోపింపక మందహాసముతో "ఆహా! నీవు ఎంత నిష్పక్ష పాతముగా పంచితివి. రెండు ముక్కలును సరిగ నున్నవి. నీచేత నున్నది నీవు భుజింపుము. ఇది బిడ్డలకు చాలును" అని క్రిందఁ బడినదానిని తీసి బిడ్డలకు ఇచ్చెను. ఆమె తనభర్త శాంతమును జూచి ఆశ్చర్యపడి, కడకు లజ్జించి "నాయపరాధము క్షమింపు" మని భర్తకాళ్లమీఁద వ్రాలెను.

ఒక సంవత్సరము తుకారామస్వామి పాండురంగక్షేత్రమునకు అరుగుటకు సకలసన్నాహములును జేసికొనుచుండునపుడు హఠాత్తుగా ఉద్ధృతమైన జ్వరము వచ్చెను. ఆజ్వరమువలన ఒకటిరెండు దినములు అతఁడు ఒడలు తెలియక పడి పోయెను. ఈయాద్ధత్యము తగ్గునప్పటికి ఏకాదశి సమీపించెను. అంతట నాతఁడు సంభవించిన దానికి చాల వగచి, "పాండురంగా! నీయాజ్ఞ ఇట్లున్నది. అయినను నేనేమి చేయఁగలను? ఈచరాచరప్రపంచము అంతయు నీఇచ్ఛామాత్రమున ప్రవర్తిల్లుచున్నది. దేనిని ఎట్లు నడిపింపవలయునో నీకంటె నన్యున కేరికిఁ దెలియును?

రంగఁడు చాల విచారించి, ఎట్లో ఆయేకాదశి గడిపి మఱునాఁడు రుక్మిణీసహితుఁడై దేవనగరమునకుఁ బోయి, తుకారామునకు సేవయొసంగెను.

తుకారాముఁడు మహానందముతో శ్రీహరికి సాష్టాంగవందనములు ఆచరించి, ఆనందబాష్పముల తోడనే పాద్యాదికమును సంఘటించి అనేకవిధములఁ గొనియాడెను. ఆసేవకు ఆనందించి, పాండురంగఁడు "వత్సా! నీభక్తి యచంచలము. నీయర్చనమునకు ఆనందమైనది. ఏదేనివరము కోరుకుము" అని పలికెను. అదివిని భక్తుఁడు చేతులు జోడించుకొని స్వామి యెదుట నిలిచి "శ్రీహరీ! ఆర్తత్రాణపరాయణా! విశ్వరూపుఁడవును, విశ్వేశ్వరుఁడవును అయిన నీవు ప్రేమతో సేవయొసంగితివి. ప్రపంచమున మానవునకు ఇంతకంటె కోరఁదగిన వరము మఱియేమిఉన్నది ? అయినను నీవు అనుగ్రహించెద ననినపుడు వలదనుట మంచిదిగాదు. కావున నాకు ఈవరము ప్రసాదింపుము. సర్వకాలసర్వావస్థలయందును నాహృదయమున నీకంటె నన్యము తోఁచకుండునట్లును, నీయెడల నాఅచంచలభక్తి తఱుగకుండునట్లును, కోరినపుడెల్ల నీసేవ లభించునట్లును అనుగ్రహింపుము" అని కోరెను.

ఇది విని పాండురంగఁడు తుకారామస్వామి పరమవైరాగ్యమునకు ఆనందించి, "వత్సా! నాకు ఆఁకలియగుచున్నది. ఏమయినఁ బెట్టుము" అని అడిగెను. అంతట తుకారామస్వామి పరమానందభరితుఁడై, ఇంటనున్న ఒకరొట్టెను దెచ్చి ముందుంచి "పరమేశ్వరా! ఈరొట్టె కాల్చి రెండు దినములు అయినది. ఇది నీకు పెట్టుటకు నా మనసు అంగీకరింపలేదు." కాని ఇంతకంటె నాయింట మఱియొకటిలేదు. ఏమిచేయఁ గలను? క్షమింపుము" అని అంజలిబద్ధుఁడై పలికెను. అందులకు మాఱుపలుకకయే పాండురంగఁడు ఆనందముతో ఆరొట్టెను భుజించి, "వత్సా! నీవు సందేహింపవలదు. ఇంతకంటె నాకేమి కావలెను? నీభక్తిసామృతము సోఁకుటవలన ఇది అమృతము కంటెను మధురముగా నున్నది. నాకు ఆనందమైనది. నీకు ఏమియు లోపము ఒదవఁ బోదు. నీవు కోరినపుడెల్ల సేవ యొసంగుదును. ఇప్పటికిఁ బోయెద" ననిచెప్పి తిరోహితుఁడుఅయ్యెను.

ఒకప్పుడు ఒక బ్రాహ్మణయువకుఁడు తాను అశ్రమమున మహావిద్వాంసుఁడు కాఁగోరి ఆలోచించుచుండఁగా, ఒక మహానుభావుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! దేవనగరమున ఉన్న తుకారామస్వామి చెంతకుఁ బొమ్ము; ఆతఁడు నీయభిలాషను దీర్చును" అని చెప్పిపోయెను. మఱునాఁడు ప్రాతఃకాలమునందే ఆబ్రాహ్మణయువకుఁడు స్వప్నవృత్తాంతమును స్మరించి బయలుదేఱి, దేవనగరమునకు వచ్చి తుకారామస్వామికి సాష్టాంగవందనములు ఆచరించి, సంగతులు అన్నియు నెఱింగించి అభయమును వేఁడెను. అంతట తుకారామస్వామి ఆయువకునిపై చాల

ననుగ్రహము పూని మహారాష్ట్రభాషలో రచించిన స్వగ్రంథపు అభంగవృత్తములను మంత్రించి ఒక నారికేళమును ఇచ్చి, "వత్సా! ఈనారికేళఫలమును నీవు ఒక్కఁడవే భుజించి ఈవృత్తముల నొక్కమాఱు పఠింపుము. అట్లయిన నీయభీష్టము సిద్ధించును" అనిచెప్పెను. కాని ఆయువకుఁడు "ఇది పొసఁగనిమాట. నీచెంతకు వచ్చినందులకు వ్యర్థముగా తిరిగి పొమ్మనుటకును, వేషఁ గావనుటకును సందేహించి ఈతఁడు ఇట్లు వేషము వేసెను; కాని ఈకొబ్బరికాయను తినినంత మాత్రమునను, ఈగ్రంథపు వృత్తములను చదివినంత మాత్రమునను విద్యవచ్చునా?" యని సందేహించి, వాఁడు అచ్చట నుంచి మాఱు పలుకకయే వెడలిపోయెను. తుకారామస్వామి తొలుత అందులకు ఆశ్చర్యపడి, పిదప దివ్యదృష్టివలన సకలమును గ్రహించి "ఇట్టివానిని నేను పరీక్షింపకుండ నేల అభయమిచ్చితిని?" అని చింతింపసాగెను.

ఇంతలో మఱియొక బ్రాహ్మణుఁడు విద్యార్థియై వచ్చి అభయమును గోరెను. తుకారామస్వామి తొల్లిటివలెఁ గాక, ఆయువకుని హృదయస్థితిని బాగుగఁ బరీక్షించి నమ్మి, తొంటి బ్రాహ్మణుఁడు విడిచిపెట్టిపోయినదానిని ఇచ్చి సంగతి యంతయు నెఱింగించెను. అంత నాయువకుఁడు స్వామి చెప్పినది అంతయుఁ జేసెను. తోడనే ఆతని జిహ్వపై సరస్వతి వచ్చి వాసముచేసెను. ఆతఁడు శివాజీమహారాజు ఆస్థానమునందలి ఒకపండితునికుమారుఁడు. విద్యావిహీనుఁడు అగుటవలన ఆతని నందఱును నీచముగఁ జూచెడివారు. ఇందులకు లజ్జించి, ఆతఁడు ఇట్లు బయలుదేఱివచ్చెను. అదృష్టవశమున వచ్చినవెంటనే పని అయిపోయినందులకు పరమానందభరితుఁడై, ఆతఁడు గురుమహాశయునకు మఱల సాష్టాంగవందనంబులు ఆచరించి, సెలవుఁ బడసి బయలుదేఱి స్వగ్రామమునకుం బోయెను.

ఆతఁడు ఇల్లుచేరునప్పటికి రాజసభలో ఒక గొప్పపండితుఁడు పురాణము చెప్పుచుండెను. అది విని యాతఁడు సభకుఁ బోయెను. పండితుఁడు పురాణము బాగుగనే చెప్పుచుండెను; కాని రహస్యార్థములను జెప్పలేకుండెను. అంతట ఈయువకుఁడు అందుకొని రహస్యార్థములను జెప్పెను. అదిచూచి అందఱును ఆశ్చర్యపడి సంగతి సందర్భములు అడుగఁగా, ఆతఁడు జరిగినదంతయుఁ జెప్పెను. అచ్చటివారు ఎల్లరును తుకారామస్వామిమాహాత్మ్యమునకు, ఆయువకుని అదృష్టమునకును చాల ఆశ్చర్యపడిరి. శివాజీమహారాజు మహాపండితుఁడైన ఆబాలునకు చాల సన్మానము గావించి, ఆదరించి తండ్రికి ఆనందముఁ గలిగించెను.

చించవటి యనుగ్రామమునుండి వచ్చిన బ్రాహ్మణులు కొందఱు అప్పుడు అచ్చట నుండిరి. వారు తుకారామస్వామి ప్రభావమును బరీక్షించి తెలియఁగోరి "రాజసభకు రావలసినది" అని యొక మనుష్యునిఁ బంపిరి. కాని యానౌకరు పోవునప్పటికి తుకా

రామస్వామి హరిభజనము చేయుచుండెను. అదివిని అచ్చటఁ జేరియున్నవారంద ఱును ఆనందాతిరేకముచే మైమఱచి యుండిరి. ఈనౌకరుగూడ వారివలెనే అయ్యెను. చించనట్టి బ్రాహ్మణులు మఱియొకనౌకరు నంపిరి. వాఁడును అట్లే యయ్యెను. ఇంకొకనినిఁ బంపినను యథాపూర్వముగనే అయ్యెను. అందులకు కారణము నెఱుం గక ఆబ్రాహ్మణులు విసిగి తామే బయలుదేరిరి.

ఈసంగతి దివ్యదృష్టివలన నెఱింగి తుకారామస్వామి హరిభజనము చాలించి, ఎదురుపోయి సగౌరవముగ బ్రాహ్మణులను దోడితెచ్చి, తనయింట నాసీనులం గావించి చాల గౌరవించెను. అప్పుడు బ్రాహ్మణులలో అగ్రేసరుఁడు తుకారామస్వామినిఁ జూచి "స్వామిా! మీా ప్రభావమును గుఱించిన వింతలు అనేకవిధములు వినఁబడు చున్నవి. ఒకవింత చేసి మాకు ఆనందముఁ గలిగింపవలయు" నని కోరిరి. అందులకు మాఱుపలుకకయే తుకారామస్వామి కత్తితో తన తొడను గోసి బ్రాహ్మణులకుఁ జూపెను. తొడయందు ప్రాణిలోకమునకు అంతకును ఉండునట్లు రక్తమాంసములు గాక ఒక తెల్లని పదార్థము ఉండెను. అదిచూచి బ్రాహ్మణులు ఆశ్చర్యపడి స్వామికి సాష్టాంగవందనములు ఆచరించి, "మహానుభావా! నీప్రభావము అభూతపూర్వముగ నున్నది. దేహమంతయు సత్వభూయిష్ఠమైయున్న దేవరవారికి అసాధ్యము ఏమి యున్నది? మీాదర్శనమువలన నేఁడు మాజన్మలు పావనములైనవి. మాయెడ నను గ్రహముంచి మాగ్రామమునకు వచ్చి కొన్నిదినములు అచ్చట వసించి, మాకు ముక్తిమార్గమును ఉపదేశింపవలయును" అని కోరిరి. తుకారామస్వామి వల్లెయని వారితో బయలుదేఱెను.

మార్గవశమున ఒకయూరి చెంతనుండి పోవుచుండఁగా, ఆయూరివారు వచ్చి ప్రార్థించి తమ గ్రామమున ఒక నెలదినములు ఉండునట్లు ఒడఁబఱుచుకొని తుకారామస్వామినిఁ గొనిపోయిరి. అచ్చట స్వామి వారికందఱకును జ్ఞానబోధఁ గావింపఁదొడఁగెను. ఇట్లుండఁగా, పండరిపురమునుండి ఒక బ్రాహ్మణుఁడు యాచ్నార్థమై ఆగ్రామమునకు వచ్చెను. నాఁడు గ్రామమునందలివారు ఎల్లరును రెండుగడి యల ప్రొద్దెక్కినను ఇంకను నిదురమంచములనుండి దిగలేదు. కారణము అడు గఁగా, నిద్రాహారములు మాని తుకారామస్వామి బోధనము వినుట యని వారు చెప్పిరి. అంత నాబ్రాహ్మణుఁడు "తుకారామునిబోధవలన మైమఱచియున్న ఈయూరి వారి నానందపెట్టుటకు నాపాండిత్యము చాలదు" అని తలంచి వచ్చిన దారినే మఱల బయలుదేఱెను; కాని తుకారామస్వామి దివ్యదృష్టివలన ఈసంగతి నెఱింగి, వెంటనే పోయి ఆబ్రాహ్మణునిఁ గొనివచ్చి "మీాకిది తగునా? వచ్చిన పనికి ప్రయ త్నము చేయకయే వెడలిపోవుట ధర్మమా? ఇచ్చట మీాకు నిస్పృహపడవలసిన

కారణము లేదు." అని బుజ్జగించి, తిరిగి గ్రామములోనికి గొనిపోయెను. అప్పటికి అప్పుడే గ్రామమునందలి పెద్దలు అందఱును తుకారామస్వామి కడవద్ద మూగి యుండిరి. స్వామి వారినందఱను జూచి బ్రాహ్మణుని ఆగమనమునకు కారణము నెఱింగించి "మీరందఱును మీశక్తి ననుసరించి ఈ బ్రాహ్మణుని సత్కరించి పంపుఁడు" అని నియమించెను. అంతట వారిలోఁ గొందఱు పెద్దలు వారివారిశక్తి ననుసరించి అందఱిచెంతను వసూలు చేసిరి; కాని ఒక బట్టలవర్తకునివలన తిరస్కరింపఁబడిరి. నేను కష్టించి సంపాదించికొన్నాను. నేను ఎవరికిని ఏమియు ఉచితముగ నీయఁజాలను" అని వాఁడు ఖండితముగాఁ జెప్పుటయే గాక, వారిని దూషించెను. అదివిని వానిభార్య కటకటఁబడి అనేకహితవచనములు చెప్పఁగా, వాఁడు తుదకు "నీకంటె నాకు ప్రియమైన వస్తుప్రపంచమున మఱిలేదు; కావున నీకు నేను వ్యతిరేకము చెప్పఁజాలను. నీకు అంతగా దానము చేయవలయు ననుత్సాహము ఉన్నయెడల మన ఇంటనున్న ఓటిచెంబు నిమ్ము" అని పలికెను. ఏదో యొకటి ఇచ్చుటకు అంగీకరించినందులకు ఆనందించి, ఆమె ఆయోటిచెంబును వారికి ఇచ్చి "అయ్యలారా! ప్రస్తుతము ఇంతే వీలయినది. అయినను ఈసడింపక స్వాముల వారు దీనినే బంగారు కలశముగా భావింపవలయును" అని విన్నవించెను.

అంతట వారు సొమ్మంతయుఁ గొనిపోయి స్వామి కిచ్చి, ఓటిచెంబుగూడ ఇచ్చి సంగతి అంతయు నెఱింగించిరి. అంతట స్వామి ఆనందముతో ఆయోటిచెంబును తాఁకఁగా నది బంగరుకలశమే యయ్యెను. అందుకు అందఱు నాశ్చర్యపడు చుండఁగా, "ఆమె మహాపతివ్రత; కావుననే ఇట్లు జరిగినది." అని చెప్పి స్వామి ఆరొక్కమును కలశమును బ్రాహ్మణునకు ఇచ్చి పంపి వేసెను.

ఇట్లు మఱికొన్ని దినములు ఆగ్రామమున నుండి, స్వామి చించవడికి పోయి అచ్చట నొక నెలయుండి, పిదప స్వస్థలముఁ జేరుకొనెను. ఒకనాఁడు ఆయూరి యందలి బ్రాహ్మణులు కొందఱు వచ్చి "తుకారామా! నీవు లోకులకు భక్తియే మంచిది అని బోధించుచు, కర్మమార్గమును భ్రంశము చేయుచున్నావు. కావున నీవు వ్రాసిన పుస్తకములను మేము ఏటిలోఁ బాఱవేసెదము. ఎన్నిదినములున్నను అవి నీటిలో చెడిపోకుండునేని నీమార్గమే మంచిదని అంగీకరించెద" మని చెప్పి బలాత్కారముగ ఆతని గ్రంథములను గొనిపోయి ఏటిలో పాఱవేసిరి. పిదప వారు పదునైదుదినములు ఆగ్రంథములను గనిపెట్టుకొని యుండిరి; కాని ఒక్కఅవగింజంతయైన గ్రంథములు చెడిపోలేదు. అదిచూచి బ్రాహ్మణులు లజ్జించి, ఉన్నట్లుండఁగా వచ్చి తుకారామస్వామి కాళ్లమీఁదఁబడి అభయమును బడసిపోయిరి. స్వామి బ్రతికి యున్నంతకాలము నిట్లు అనేకాద్భుతకృత్యములను జేసి, అవసానమున ఈశ్వర సాయుజ్యమును బడసెను.

అభంగలు

ముంగీ ఆణిరావ, సారఖాచీ జీవ. ౧
గేలా మోహా ఆణిఆశా, కళికాళాచాహాఫాంసా. ౨
సోనే ఆణిమాతీ, ఆహ్మాం సమాన హే చిత్తీం. ౩
తుకాహ్మణే ఆలేల, ఘరా వైకుంఠ సగళేం. ౪
తుహ్మాం పాశీం ఆహ్మీ యే ఊనియాం కాయ, వృథా శీణఆహే చాలణ్యాచా. ౧
మాగాంవేం హేం అన్నతరీ భిక్షాథోం, వస్త్రాసీ హే భారచింథ్యా విదీ. ౨
నిద్రే సీ ఆసన ఉత్తమ పాషాణ, వరీ ఆవరణ ఆకాశాచేం. ౩
తేథేంకాయకరణేం కరణాచీ ఆస, వాయాం హోయనాశఆయుష్యాచా. ౪
రాజగృహాయావేం మానాచియే ఆసే, తేథేంకాయవసే అనుభవ. ౫

# 51. జ్ఞానదేవుఁడు

గంగాతీరమునందలి అప్పు గ్రామమున వసించు గోవిందపండితుని కుమారుఁడు అగు విఠోబా తన పండ్రెండవయేట తల్లిదండ్రుల యనుజ్ఞనుబడసి, తీర్థయాత్రకు బయలువెడలెను. ఆతఁడు అనేకక్షేత్రములను సేవించి ఒకనాఁడు అలకాపురము చేరుకొనెను. అచ్చట నాతఁడు చక్రతీర్థమున స్నానమాడి నిర్మలహృదయముతో ఈశ్వరధ్యానము చేయుచుండెను. ఇట్లుండఁగా, ఆపురమున వసించుచున్న సిద్ధపండితుఁడు అను ఒక మంచి బ్రాహ్మణుఁడు స్నానార్థము అచ్చటకు వచ్చి, విఠోబాను జూచి ఆనందించి, ధ్యానాదికము ముగిసిన పిదప వృత్తాంతము అంతయు అడిగి తెలిసికొని ప్రార్థించి, తన ఇంటికిఁ గొనిపోయి చాల మర్యాద గావించెను. అందులకు విఠోబా చాల నానందించెను.

నాఁటిరాత్రి పాండురంగఁడు సిద్ధపండితుని స్వప్నమున సాక్షాత్కరించి "విఠోబా మహానుభావుఁడు. ఆతనికి మహాప్రభావసంపన్నులు అగునలుగురు బిడ్డలు పుట్టవలసియున్నారు; కావున నీకుమార్తెను ఆతనికిచ్చి వివాహముచేయుము" అని నియమించెను. మఱునాఁడు సిద్ధపండితుఁడు విఠోబాను చేరఁబిలిచి వృత్తాంతము అంతయుఁ జెప్పి, నాప్రార్థనము నంగీకరింపవలయునని కోరఁగా, విఠోబా "అయ్యా! నాకుఁగూడ పాండురంగఁడు అట్లు నియమించినచో నాయభ్యంతరము లే" దని చెప్పెను. నాఁటిరాత్రియే పాండురంగఁడు విఠోబాస్వప్నమునఁగూడ సాక్షాత్కరించి "వత్సా! సిద్ధపండితునియాజ్ఞను జవదాఁటకుము. ఆతనికొమార్తెను పెండ్లి యాడుము" అని నియమించెను. మఱునాఁడు ఆనందముతో విఠోబా ఈవృత్తాంతము నెఱింగింపఁగా, సిద్ధపండితుఁడు మహానందభరితుఁడై రుక్మాబాయి అను తన కొమార్తెను మంచిముహూర్తమున విఠోబాకు ఇచ్చి పెండ్లిచేసెను.

నాలుగైదు దినములు గడచినతరువాత సిద్ధపండితుఁడు భార్యను పుత్రికను అల్లుని వెంటనిడుకొని, పండరిపురమునకుఁ బోయి పాండురంగని సేవించెను. అర్చనము అంతయు నైనతరువాత విఠోబా మామగారినిఁ జూచి "నాకు సెల వీయవలయును. నేను తక్కిన తీర్థములను గూడ సేవించుకొని వచ్చెదను" అని ప్రార్థించెను. సిద్ధపండితుఁడు అందులకు అంగీకరించెను.

ఇట్లు అత్తమామలసెలవుఁ బడసి విఠోబా మఱల బయలుదేఱి అనేకపుణ్యక్షేత్రములను సేవించి, తుదకు సేతువునకుఁ బోయి అచ్చటఁ జేయవలసినవి ఎల్ల ముగించుకొని, మఱల అత్తవారింటికి వచ్చి చేరుకొనెను. అత్తమామలును భార్యయు చాల సంతసించిరి. మఱినాల్గుదినములు అచ్చటనుండి విఠోబా అత్తమామలం గాంచి "నాతలిదండ్రులను విడిచివచ్చి చాల ఏండ్లయినవి. కావున పోయివచ్చెదను. సెలవు ఈయవలయును" అని ప్రార్థించెను. వారు అందులకు అంగీకరించి, రుక్మాబాయిని ఈతనికిచ్చి పెండ్లిచేయుట ఈతనితలిదండ్రులు ఎఱుఁగరు. కావున ఆతనితోఁగూడ మనము మన బిడ్డను వెంటఁబెట్టుకొనిపోయి, అచ్చట అప్పగించి వత్తము అని కూడఁబలికికొని అల్లునితోఁగూడ బయలుదేఱిరి. కొలఁదిదినములకే వారు నలుగురును అప్పుగ్రామము చేరుకొనిరి. విఠోబా తొలుత భార్యాద్వితీయుఁడై తలిదండ్రులకు నమస్కరించెను. సిద్ధపండితుఁడు సంగతి యంతయు నెఱింగించెను. అంతయుఁ జూచి, అంతయు విని, విఠోబా తలిదండ్రులు పరమానందభరితులై కుమారుని కోడలిని ఆశీర్వదించి, వియ్యాలవారిని చాల గౌరవించిరి. అచ్చట సిద్ధపండితుఁడు ఒకవారము దినములు ఉండి కొమార్తెకు బుద్ధులు చెప్పి అల్లునిదీవించి వియ్యాలవారివలన సెలవుఁ బడసి స్వగ్రామమునకుఁ బోయిరి. మఱికొన్ని దినములకు గోవిందపండితుఁడు ఆతని భార్యయుఁ బరలోకమునకుఁ బోయిరి. సంసారభారము విఠోబామీఁదఁ బడెను.

కాని విఠోబా సంసారవృత్తమును గమనించుట మానివేసెను. అప్పటికి ఆతనికి వైరాగ్యము పెరిఁగిపోయెను. సర్వకాల సర్వావస్థలయందును ఈశ్వర ధ్యానముదక్క నాతఁడు అన్యము నెఱుఁగఁడు. ఈసంగతి అలకాపురమున నున్న సిద్ధపండితునకుఁ దెలిసెను. తోడనే ఆతఁడు అప్పుగ్రామమునకు వచ్చి మంచి మాటలుచెప్పి అల్లుని కొమార్తెను తనఇంటికిఁ బిలుచుకొనిపోయెను. అక్కడ కూడ విఠోబాకు వైరాగ్యము ఆకసము అంటఁ బెఱిగిపోయెను. ఒకనాఁటిరాత్రి ఆతఁడు భార్యను జేరబిలిచి, "మనకు ఇంతవఱకును సంతానము కలుగలేదు. సన్న్యాసాశ్రమముమీఁద నభిలాష నాకు పెరిఁగిపోవుచున్నది. కావున సెలవు ఇమ్ము. కాశికిఁబోయి నేను సుఖించెదను" అని అడిగెను. అందులకు రుక్మాబాయి ఏమియుఁ జెప్పక మౌనముగా నుండి, మఱునాఁడు ఈసంగతి తలిదండ్రులకు ఎఱింగించెను.

వారును ఇట్లని వైరాగ్యమునకు భీతిల్లి, "వత్సా! విఠోబా ఈ ప్రస్తావన తెచ్చినప్పు డెల్ల నీవు మానవ్రతమును అవలంబింపుము" అని చెప్పిరి. రుక్మాబాయి అట్లే చేసెను. కాని యొకనాడు నిద్రపోవుచుండగా రుక్మాబాయిని లేపి "నేను కాశికి బోయెద" ననియెను. నిద్రమత్తులోనున్న రుక్మాబాయి వల్లె యనెను. పులినోటనుండి తప్పితి నని పరమానందముతో విఠోబా అప్పుడే కాశికి బయలుదేరిపోయెను.

కాశికి జేరుకొన్న పిదప, ఆతనికి సన్యాసముమీద అభిలాష హెచ్చు ఆయ్యెను. అచ్చట గంగాతీరమున గూరుచుండియుండు సన్యాసులను జూచి ఆతడు పొంగిపోదొడగెను. తుదకు ఒకనాడు ఆతడు ఆనగరమున నున్న సన్యాసులలో నెల్ల మేలుబంతి యగు రామానందస్వామి చెంతకు బోయి, సాష్టాంగనమస్కారములు ఆచరించి అభయము వేడెను. అందులకు రామానందస్వామి ఆనందించి "ముందు ఈసంగతి జెప్పుము. నీవు పితృఋణవిముక్తుడవైతివా? నీతలిదండ్రుల వలన సెలవు బొందితివా? నీ భార్యాపుత్రులకు లోపములు కలుగకుండునట్లు చేసితివా? నీ హృదయమున ఉన్న వైరాగ్యము సుస్థిరమేనా?" అని ప్రశ్నించెను. "నాతలిదండ్రులు పరమపదించినారు. తక్కినవానిలో లోపములు ఏమియు లేవు" అని విఠోబా అందులకు ప్రత్యుత్తరమిచ్చెను. స్వామి విఠోబాకు సన్యాసము ఇచ్చెను. విఠోబా పరమానందభరితు డయ్యెను.

కొలది దినములలో విఠోబా సన్యసించినట్లు అలకాపురిలో సిద్ధపండితుని యింట దెలిసెను. తోడనే పెద్దకోలాహలము పుట్టెను. సిద్ధపండితుడు మనస్సు రాయి చేసికొని అనేకవిధముల నూరడించెను; కాని రుక్మాబాయికి విచారలహరి ఆగలేదు. ఆమె దుఃఖమును జూడలేక సిద్ధపండితుడుగూడ మఱల విచారింప సాగెను. ఇట్లు కొన్నిదినములు జరిగిన తరువాత రుక్మాబాయి ఇక ఎంత వగచినను ప్రయోజనములేదని గుర్తెఱిగి, అశ్వత్థనారాయణుని బూజింపసాగెను.

అచ్చట రామానందస్వామి సేతుస్నానము చేయ నభిలషించి ఆశ్రమమున ఉన్న శిష్యులకు కట్టుబిట్టములుచేసి, బయలుదేఱి మార్గవశమున అలకాపురికి వచ్చి ఊరి బయట చెఱువుగట్టుమీద నున్న అశ్వత్థవృక్షముక్రింద గూరుచుండెను. కొంత సేపటికి ఆయశ్వత్థమును పూజించుటకు అచ్చటకు వచ్చి, రుక్మాబాయికి సాక్షాత్కరించిన పరమశివుడో యన ఎదుట దేజరిల్లుచున్న రామానందస్వామిని జూచి, వినయముతోడను భక్తితోడను నమస్కరించెను. అందులకు ఆనందించి స్వామి "దీర్ఘసుమంగలివై రత్నములవంటి బిడ్డలను బడసి సుఖింపుము" అని ఆశీర్వదించెను. అది విని రుక్మాబాయి మందహాసము గావించెను.

స్వామికి సందేహము గలిగెను. "ఎందులకు ఈమె ఇట్లు మందహాసము చేయుచున్నది?" ఈసందేహము ఆతనికి దీరలేదు. వెంటనే ప్రశ్నింపగా, రుక్మాబాయి

గనెను. ఇట్లు ఆమె వరుసగా ముగ్గురు కుమారులను ఒక కొమార్తెను గనెను. ప్రథమపుత్రునకు నివృత్తిదేవుఁడు అనియు, రెండవపుత్రునకు జ్ఞానదేవుఁడు అనియు, మూఁడవపుత్రునకు సోపానదేవుఁడు అనియు, కొమార్తకు ముక్తాబాయి అనియు వారు పేరులు పెట్టిరి.

బిడ్డలు యుక్తవయస్కులైన తరువాత రుక్మాబాయి భర్తను జూచి "మన బిడ్డలు ఇట్లు బ్రాహ్మణ్యహీనులై యుండుటఁజూడ నాకుఁ జాల కష్టముగా నున్నది; వీరు బ్రాహ్మణులలోఁ జేర్చుకొనఁబడుటకు ఏదయిన ఉపాయము చేసినఁ గాని నేను సహింపఁజాలను" అని పలికెను. విఠోబాకుగూడ ఇటువంటి చింతయే యుండెను. కావున ఆతఁడు అలకాపురమునకు బిడ్డలతోఁగూడఁ బోయి, వారిని బ్రాహ్మణులకుఁ జూపి "మహాత్ములారా! నాబిడ్డలను రక్షింపుఁడు. మాకు ప్రాయశ్చిత్తము గావించి మమ్ము మీలోఁ గలుపుకొనుఁడు" అని కోరెను. అందులకు ఆబ్రాహ్మణులు నవ్వి, "మరణముకంటె మీకు మఱియొక ప్రాయశ్చిత్తము లేదు; పోయి ఏసాగరమునందైన ఉఱుకుఁడు" అని పలికిరి. ఆమాటలను విని విఠోబా భార్యాపుత్రులను విడిచి, ఎందో పోయెను.

మఱునాఁడు జ్ఞానదేవుఁడు అన్నదమ్ములను చెల్లెలిని వెంటనిడుకొని మఱల అలకాపురమునకుఁ బోయి, బ్రాహ్మణులకు సాష్టాంగవందనములు ఆచరించి, "మహానుభావులారా! మీరు అనిన మాటలకు లజ్జించి మాతండ్రి ఎందో పోయెను. ఇఁక మాకు ప్రాయశ్చిత్తము విధించుటకు ఏమి అభ్యంతరము ఉన్నది?" అని యడిగెను. అందులకు వారు మీహృదయమునఁ బశ్చాత్తాపము గలుగుట చాల మంచిది. అయినను సాహసించి మేము ఏమియుఁ జేయఁజాలము. పైఠణపురమున ఉన్న బ్రాహ్మణులు సరస్వతీపురుషావతారములు. కావున వారి చెంతకుఁ బోయి ప్రార్థింపుఁడు. వారివలన మీయభీష్టము నెఱవేఱవచ్చును" అని చెప్పి, ఒకజాబు నిచ్చిరి. ఆజాబు గైకొని జ్ఞానదేవుఁడు వారితోఁ గూడి పైఠణపురమునకుఁ బోయెను.

పైఠణపురమునందలి బ్రాహ్మణులు అలకాపురపు బ్రాహ్మణులు వ్రాసిన జాబు వలన సకలమును ఎఱింగి, "వత్సలారా! మీకు సంభవించిన దుర్గతికి మాకు దుఃఖము అగుచున్నది. అయినను మేము ఏమియుఁ జేయఁజాలము. మీరు సన్న్యాసికిఁ బుట్టినారు. దీనికి ఎందును ప్రాయశ్చిత్తము లేదు. ఫలములేని శ్రమకు ఏల పాల్పడెదరు? మీరు భగవంతుని ఆరాధింపుఁడు. అదియే మీకు భవతారకము." అని చెప్పిరి. జ్ఞానదేవుఁడు అది విని "ఇది మీరు చెప్పకున్నను మాహృదయములయందు జాగరితమగుచున్నది. మీకు శక్తిలేని దానిని కోరుటవలనఁ బ్రయోజనము లేదు; కావున బ్రాహ్మణ్యసంపాదనము నెడల మేమింక నిరాశ చేసికొనియెదము"

అని పలికెను. అటుమీఁదట ఆబ్రాహ్మణులయందలి మూర్ఖులు కొందఱు "వేద వేదాంగముల నభ్యసించిన జ్ఞానదేవుఁడను పేరు ఏల వహించితివి? బీదనకు శూరుఁడు అను పేరు తగినట్లు, నీకు జ్ఞానదేవ పేరు తగదు." అని పలికిరి. ఆసమయమున ఒక తురుష్కుఁడు ఒక దున్నపోతుమీఁద ధాన్యపుబస్తా వేసికొని వచ్చుచుండెను. అదిచూచి ఆబ్రాహ్మణమూర్ఖులలో నొకఁడు "జ్ఞానదేవుఁడు అనుపేరు నేను ఈమహిషమునకుఁ బెట్టెదను. నీకంటె దీని తక్కువ ఏమి?" అనియెను.

అంతట జ్ఞానదేవుఁడు ముకుళితకరకమలుఁడై "ఆర్యా! అందు అసంబద్ధ మేమియున్నది? మీరు తోఁచినట్లు చేయుటకు అభ్యంతరము ఏమియు లేదు. మీరు తలంచినట్లు ఈమహిషమునకును నాకును ఏమియు భేదము లేదు. నాయందును ఆమహిషమునందునుగూడ ఒక్కపరమాత్మయే యున్నాఁడు. కుండయందును బిందెయందునుగూడ నున్నజలము గంగాజలమే. మీరు బాహ్యచిహ్నములను బట్టి భేదభావము వహించుచున్నారు. కాని వేఱుగాదు" అని పలికెను. "అట్లయిన ఈమహిషమును కొట్టినచో ఆదెబ్బ నీకుఁ దగులవలయును." అని ఆబ్రాహ్మణుఁడు మాఱు పలికెను. జ్ఞానదేవుఁడు 'చూడవచ్చు' ననియెను. తోడనే ఆబ్రాహ్మణుఁడు మహిషము వీఁపుమీఁద ఒక దెబ్బ కొట్టెను. మహిషమునకు ఏమియుఁ దెలియదు; కాని జ్ఞానదేవుని వీఁపుమీఁద ఒక బొబ్బ లేచెను. అది చూచి కొందఱు బ్రాహ్మణులు ఆశ్చర్యపడి "వీరు మహానుభావులు" అని తలఁచిరి; కాని తక్కినవారికి తృప్తి కలుగలేదు. "ఈమహిషముచే వేదములను బలికించినఁ గాని నిన్ను నమ్మ" మని బ్రాహ్మణులు మఱలఁ బలికిరి. "అయ్యలారా! మీకు అట్టిసంకల్పమున్నచోఁ జూడ వచ్చును." అని జ్ఞానదేవుఁడు మహిషముచెంతకుఁబోయి దాని శిరమునఁ జేయిడి "భద్రా! వేదమును ఉచ్చరించి ఈబ్రాహ్మణుల అనుగ్రహమును బడయుము" అని పలికెను. తోడనే మహిషము సస్వరముగ వేదపఠనము ప్రారంభించెను. బ్రాహ్మణులందఱును తెల్లవోయిరి. మూర్ఖపుపట్టుపట్టి విపరీతపుప్రశ్నలు వేసినబ్రాహ్మణులు "కట్టా! మన మెంత అక్రమప్రవర్తనము చేసితిమి? అని వగవసాగిరి" "మీకు బ్రాహ్మణ్యము సిద్ధింపదు." అనిన బ్రాహ్మణులు "వీరు మనకంటె గొప్పబ్రాహ్మణులు" అని లజ్జించి యూరకుండిరి.

పిదప అచ్చటివా రందఱును వారిని చాల గౌరవించిరి. సుశీలుఁడను బ్రాహ్మణుఁడు వారినిఁ దన ఇంటికిఁ దీసికొనిపోయి, ఒకభాగము వారి కిచ్చి "మీరు ఇష్టమున్నంతకాలమును ఇచ్చట వసింపవచ్చును." అని చెప్పెను. వారందులకుఁ జాల నానందించిరి. జ్ఞానదేవుఁడుచూపిన యద్భుతమును ఆయూరియందున్న కొలఁదిమందిమాత్రమే చూచిరి. తక్కినవారు "మీరు చెప్పెడిమాటలు ఏమియును

మేము నష్టజాలము. ఒకవేళ ఆతఁడు భక్తి విచిత్రములను జేసినను వారు బ్రాహ్మణులుమాత్రము ఎన్నటికిని గారు. ఒకప్పుడు చండాలుఁడు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడవు కావచ్చును; అంతమాత్రమున వాఁడు బ్రాహ్మణుఁ డగునా? మనవర్ణమునకు ఒక విశిష్టధర్మము ఉన్నది. ఆధర్మము లేనివాఁడు మనకంటె గొప్పవాఁడే కావచ్చును; కాని బ్రాహ్మణుఁడు మాత్రము కాఁడు. వర్ణము వర్ణమే. ఘనత ఘనతయే. రెండింటికిని సంబంధము లేదు" అని చెప్పిరి. ఇందలి యుక్తినిఁ జూచి అందఱును గూడ ఆవాదమునే అంగీకరించిరి. సుశీలుని వారు చేరనీయలేదు. "తక్కినవారు చెడిపోలేదు. నీవు కులభ్రష్టుఁడ వైతివి" అని వారు ఆతనిని వెలివేసిరి. అట్లుండఁగా, సుశీలుని తండ్రి ఆబ్దికమువచ్చెను. "నాయపరాధమును క్షమించి, నాకు ప్రాయశ్చిత్తముచేసి బ్రాహ్మణ్యము ఇచ్చి, మీలో ఒక ఇంటివానినిఁగా అంగీకరింపుఁడు" అని ఆతఁడు ఎన్నోవిధములఁ బ్రార్థించెను; కాని ఆబ్రాహ్మణులు "నీబ్రాహ్మణ్యము ఎప్పుడో పోయినది. ఆసన్న్యాసిపుత్త్రులకు ప్రాయశ్చిత్తాధికారము ఎట్లు లేదో, నీకును అట్లే లేదు" అని వారు తిరస్కరించిరి. సుశీలునకు శిరముమీఁద పిడుగు పడిన ట్లయ్యెను.

ఆతని దైన్యమును గ్రహించి జ్ఞానదేవుఁడు "అయ్యా! నీకు సంభవించిన విపత్తు ఏమియు లేదు. ఈబ్రాహ్మణులవలన నీకు సంభవించు ఇక్కట్లు ఏమియు లేవు. ఈబ్రాహ్మణులు భోక్తలుగా రాకున్న నీకేమి? నీపితృదేవతలే స్వయముగ వచ్చి భుజించి పోయెదరు. కావున నీవు చింతమాని సకలప్రయత్నములును కొనసాగింపుము" అని చెప్పెను. జ్ఞానదేవునిమాహాత్మ్యమును ఎఱిఁగియున్నవాఁడు కావున సుశీలుఁడు ధైర్యము వహించెను.

ఆదినము వచ్చెను. జాముపొద్దెక్కునప్పటికి సుశీలునిభార్య పచనకార్యము సాంగోపాంగముగ నిర్వర్తించి, ఆసంగతి భర్తకు ఎఱింగించెను. సుశీలుఁడు జ్ఞానదేవునకుఁ దెలిపెను. వెంటనే జ్ఞానదేవుఁడు శ్రీహరినిఁ బ్రార్థించెను. చూచుచుండఁగనే సుశీలుని పితృదేవతలు నిజరూపములతో స్వర్గమునుండి దిగివచ్చిరి.

సుశీలుఁడు భక్తిశ్రద్ధలతో పితృదేవతలకు స్వాగతమిచ్చి అర్ఘ్యపాద్యాదికములు ఒసంగి పూజించి, మృష్టాన్నతృప్తులంగావించి, చందనతాంబూలాదులు ఒసంగి సత్కరించెను. పితృదేవతలును చాల తృప్తులై జ్ఞానదేవునిఁ గొనియాడి సుశీలుని ఆశీర్వదించి వెడలిపోయిరి. ఈసంగతి ఊరివా రందఱును తెలిసికొని, వచ్చి తమ యపరాధమును మన్నింపవలయు నని జ్ఞానదేవాదులను అనేకవిధములఁ బ్రార్థించి, అచ్చట వారుచేసిన అద్భుతకార్యము లన్నియుఁ దెలుపుచుఁ, "వీరు బ్రాహ్మణులందెల్ల నుత్తములు"అని జాబువ్రాసి యిచ్చిరి. జ్ఞానదేవుఁడు దానిని గైకొని తోఁబుట్టు

వులతో బయలుదేఱి మార్గమధ్యమున తురకవానియింటికిఁబోయి సమాధానపెట్టి, తాను వేదము జెప్పించిన మహిషమును వెంట బోయిరాఁగ బయలుదేఱెను. మార్గ మధ్యమున, వారు అనేకపుణ్యక్షేత్రములను దర్శించిరి; కాని కొంతదూరము పోవు నప్పటికి ఆమహిషము చనిపోయెను. అంతట జ్ఞానదేవుఁడు దానిని సమాధిచేసి. అలకాపురము సమీపించెను. అప్పటివా రెల్లరును కీర్తి అద్భుతకార్యములను అంతకుఁబూర్వమే వినియున్నారు; కావున ఎదురువచ్చి పురములోనికిఁ గొనిపోయి, చాల గౌరవించిరి.

కొలఁదిదినములకు దీపావళ్యమావాస్య వచ్చెను. జ్ఞానదేవుఁడు చెల్లెలగు ముక్తాబాయికి "నేఁడు పండుగ కావున పిండివంటలు చేయుము" అని నియమించెను. అట్లేయని ఆమె సకలపదార్థములను సమకూర్చుకొని క్రొత్తకుండలకొఱకు కుమ్మర వాని యింటికి బయలుదేఱెను. అయూరో విసోబాకేశరుఁడు అను ఒకధూర్తుఁడు ఉండెను. ఊరియందలివారు ఎల్లరును చాల గౌరవించుచున్నను, జ్ఞానదేవాదు లను వాఁడుమాత్రము చాల అసూయతోఁ జూచుచుండెడివాఁడు. వాఁడు ముక్తా బాయి కుమ్మరయింటికిఁ బోవుచుండుటఁ గాంచి చెంతకుఁబోయి, సిగ్గులేనిదానా యని ఒకచెంపకాయ ఇచ్చి ఆమెకన్న ముందు కుమ్మరయింటికిఁ బోయి, "ఈమెకు కుండలు ఈయవలదు. ఇచ్చితివేని నీవు నాకు ఈయవలసిన పైకము నిమిత్తము బాధపెట్టె దను" అని కుమ్మరవానిని భయపెట్టెను. చేయునది లేక కుమ్మరవాఁడు ఆమెను కుండలు లేవు పొమ్మనెను. అంతట ఆమె ఏడ్చుచు ఇంటికిఁబోయి సంగతి యంతయు జ్ఞానదేవునకుఁ దెలిపెను. ఆతఁడు "విసోబా కొట్టెననిగాని, కుమ్మరి కుండలు లేవనియె ననిగాని దుఃఖింపకుము. నీవు వండఁదలఁచికొనిన పిండివంటలు నావీఁపుమీఁద వండుము" అని పలుకొని జఠరాగ్నిని ప్రజ్వలింపఁజేసి వీఁపు ఎఱ్ఱఁగాఁ గాలునట్లు చేసెను. ముక్తాబాయి అన్నయాజ్ఞప్రకారము అతని వీఁపుమీఁదనే పిండివంటలు తయారుచేసెను.

అంతయు నైనతరువాత అన్నదమ్ములు ముక్తాబాయియు సమస్తపదార్థము లను శ్రీహరికి నివేదించి, పిదపఁ దాము భుజించిరి. ఇది యంతయు చాటున నిలిచి చూచుచున్న విసోబాకేశరుఁడు వారివృత్తమును మాహాత్మ్యమును బాగుగ గుఱుతెఱిఁగి, పశ్చాత్తాపపడి తిరిగి వారిసముఖమునకు వచ్చి పాదములమీఁద వ్రాలి, తన యపరాధమును అనేకవిధముల మన్నింపవలయునని ప్రార్థించెను. జ్ఞానదేవుఁ డును వానిపశ్చాత్తాపము హృదయపూర్వకమే యని గ్రహించి, ఆనందముతో వానికి అభయము ఇచ్చి చేరఁదీసెను. విసోబాకేశరుఁడు పిదప జ్ఞానదేవునివలన ఉప దేశమును పొంది మహాభక్తుఁడై ప్రకాశించెను.

భీమనదీతీరమున చాంగదేవుఁడు అను నొక భక్తుఁడు ఉండెను. ఆతఁడు బాల్యమునుండియు భగవద్భక్తిఁ గలిగియున్న సజ్జనుఁడు. ఆతని నిష్ఠవలన ఏమి

కావలయుననిన అది వెంటనే అయిపోవుచుండెడిది. అయినను ఆతనికి ఒక చింత కలిగెను. "నేను అనేకశిష్యులకు ఆచార్యుండనై యున్నాను; కాని నాకు ఆచార్యుఁడు లేఁడు; కావున నాజన్మసాఫల్యమును బడయలేదు. ఇప్పుడయినను ఆచార్యోపదేశమును బడసినఁగాని నేను తరింపను" అని చింతించి, ఆతఁడు తనకుఁ దగిన ఆచార్యుఁడు ఎవఁడా యని యోచింపఁగా, జ్ఞానదేవునికంటె అధికుఁడు ఎందును గాన్పింపలేదు. ఆచార్యుఁడగుటకు జ్ఞానదేవుఁడే అర్హుఁడు అని తుదకు నిశ్చయించుకొని, ఆతఁడు ఆతనికి వర్తమానము పంపఁదలంచి జాబువ్రాయుటకు కాగితమును కలమును చేతఁబట్టెను. చిరంజీవి అని వ్రాయుటకు జ్ఞానదేవుని అనంతజ్ఞానము అభ్యంతరముగా నుండెను. బ్రహ్మశ్రీ అనుటకు ఆతఁడు తనకంటె చిన్నవాఁడు. తాను ఒక మహానుభావుఁడు అని పేరుపొందియు, వేఱొకనిని బ్రహ్మశ్రీకి పాత్రునిగాఁ జేయుటకు ఆతని మనస్సు అంగీకరింపలేదు. తుదకు ఆతఁడు ఏమియు వ్రాయక రేవట్టికాగితమే చుట్టి శిష్యునకు ఇచ్చి జ్ఞానదేవునకుఁ బంపివేసెను. జ్ఞానదేవుఁడు అది చూచి సంగతులు అన్నియు గ్రహించుకొని, ఆతనికి బుద్ధివచ్చునట్లు జాబువ్రాసి పంపెను. దానిని జూచినవెంటనే చాంగదేవుఁడు పశ్చాత్తాపపడి బయలుదేఱి, మార్గమధ్యమున అరణ్యములో నొకపులి కాన్పింపఁగా, దానిమీఁద నెక్కి పయనము సాగించెను. ఊరిబైట నున్నవారు కొందఱు ఈవృత్తాంతమును జ్ఞానదేవునకు విన్నవించిరి. అంతట నాతఁడు అన్నదమ్ములతోడను చెల్లెలితోడను ఒక గోడమీఁద నెక్కి "చాంగదేవునకు ఎదురుగాఁ బొమ్ము" అని దానికి ఆజ్ఞాపించెను. తోడనే గోడ బయలుదేఱెను. చాంగదేవుఁడు ఇది చూచి "క్రూరజంతువును స్వాధీనము చేసికొంటిని. అని నేను గర్వించుచున్నానుగాని, అచేతనపదార్థమును ఇట్లు నడుపఁగలనా?" అని కించపడి పులిని దిగి, వారికి భూమిమీఁద వ్రాలి సాష్టాంగనమస్కారములు ఆచరించెను. జ్ఞానదేవుఁడు ఆతనిని లేవనెత్తి అభయ మిచ్చెను.

ఒకనాఁడు చాంగదేవుఁడు ఇంటిలోనికిఁ బోవలయునని తలుపు తెంటెను. తోడనే ఆతనికి ఎట్టయెదుట దిగంబరియైయున్న ముక్తాబాయి కాన్పించెను. అందులకు లజ్జించి ఆతఁడు వెనుదిరిగి పోవుచుండఁగా, ముక్తాబాయి మఱలఁ బిలిచి "నీవు మహాత్ముఁడ నని గర్వించుచున్నావు; కాని ప్రాపంచికభావములు నీకు ఇంకను పోలేదు. నీసంగతి కనిపెట్టవలయునని నేను నీకు వివస్త్రగాఁ గాన్పించితిని. కాని నేను నిజముగా వివస్త్రను కాను" అని చెప్పి ఈవృత్తాంతము జ్ఞానదేవునకు ఎఱింగించెను. జ్ఞానదేవుఁడు అందులకు చింతించి ఆతనికి జ్ఞానోపదేశముచేసెను. అదిమొదలు చాంగదేవుఁడు జ్ఞానదేవునితో సమానుఁడు అయిపోయెను. జ్ఞానదేవుఁడును ఆతని తోఁబుట్టువును బ్రతికి యున్నన్నినాళ్లును అనేకులకు మోక్షమార్గమును జూపి, అనేకాద్భుతకార్యములు చూపి, అవసానమున శ్రీహరి సాయుజ్యమును బొందిరి.

---

# 52. రామతీర్థస్వామి

పంజాబుదేశమునందలి గుజరాన్వాలా మండలమునందలి మురళీవాలా యను గ్రామమున గోస్వామివంశజుఁడు అగు హీరానందుఁడను ఒక బ్రాహ్మణుఁడు వంశపారంపర్యముగ వాసము చేయుచుండెను. ఆ దేశాచారము ననుసరించి ఆతఁడు "హీరానందగోస్వామి" యని వ్యవహరింపఁబడుచుండెను. హిందీభాషలో తులసీరామాయణము అనుపేరున రామాయణమును వ్రాసిన తులసీదాసు, ~~హీరానందగోస్వామి~~ వంశమువాఁడు. అట్టి సద్వంశమున అవతరించుటచే హీరానందుఁడు గూడ పరమవైదికుఁడై పూర్వుల ప్రతిష్ఠకు భంగము కలుగకుండ కాలముఁ గడుప సాగెను. గొప్పవంశమువాఁడు అయినను, హీరానందునకు దారిద్ర్యబాధ తప్పలేదు. ఆతనికి పంజాబుదేశమున అనేక స్థలములయందు అనేకశిష్యులు గలరు. ఆతఁడు అపుడపుడు సంచారముచేసి శిష్యులు సమర్పించిన స్వల్పధనముతో కుటుంబము నెట్లో నిర్వహించుకొనుచుండెను.

ఆతనికి ఇరువురు కుమారులు. జ్యేష్ఠునిపేరు గురుదాసగోస్వామి. కనిష్ఠునిపేరు తీర్థరామగోస్వామి. తీర్థరాముఁడు పుట్టిన కొలఁదిదినములయందే తల్లినిఁ గోల్పోయెను. అగుటచే నాతనిని మేనత్త పెంపసాగెను. బాల్యమునందే తల్లినిఁ గోల్పోవుటచే నామె యాపాపనికి ఆవుపాలను అలవాటు చేసెను. ఈయలవాటుచొప్పున కాలక్రమమున నాతనికి ఆవుపాలనిన అధికప్రీతిఁ గలిగెను. నేఁడు పాలనుగూడఁ ద్రాగుటకలదు. తండ్రి సంచారమునకు వెళ్లినపుడెల్ల గురుదాసగోస్వామి తమ్ముని రక్షణము చూచుచుండెను.

రామాయణము భారతము భాగవతము మున్నగుగ్రంథములనిన తీర్థరామునకు పరమప్రీతి. ఎక్కడనైన పురాణము చెప్పుచున్నారని వినినచో, తీర్థరాముఁడు అచ్చటకుఁబోయి అధికానందముతో వినుచుండెడివాఁడు. రాముఁడు కృష్ణుఁడు భీముఁడు మున్నగువారిచర్యలఁ జదువునపుడు తీర్థరాముఁడు అనేక ప్రశ్నలువేసి, వారిజీవితములందలి ఘనతను దెలిసికొనుచుండెడివాఁడు. భాగవతము భగవద్గీత మున్నగు వేదాంత గ్రంథములు చదువునపుడు, ఆతఁడు "జీవుఁడు అనిన నేమి? పరమాత్మ యనిన నేమి? ఉభయులకును సంబంధ మెట్టిది ? కర్మ అన నేమి? అది యెట్లు వచ్చినది?" అని ఇట్లు విద్యాధికుఁడువోలె గొప్ప గొప్పప్రశ్నలువేయుచుండెడివాఁడు.

ఈతీరునఁ గాలము గడచిపోవుచుండఁగా, హీరానందగోస్వామి తీర్థరామునకు యుక్తసమయమున అక్షరాభ్యాసము గావించి పాఠశాలకుఁ బంపెను. శైశవమున

కూడ అతఁడు తోడిబాలురతో ఆటపాటలయందుఁ గాలముఁబుచ్చక సర్వకాల సర్వావస్థలయందును ఏదో చదువుచునో, చింతనచేయుచునో, యోచించుచునో యుండుచుండెను. అట్టి అచంచలశ్రద్ధతో విద్యాభ్యాసముచేయఁ బోఁడగుటవలన అతఁడు ఎన్నితరగతులయందును ఓటమి యనునది ఎఱుఁగక జయమందసాగెను. కొలఁదికాలములోనే అతనికి పాఠశాలావిద్య పూర్తి యయ్యెను. వ్యయాధిక్యమునకు ఓర్వఁజాలక హీరానందుఁడు తీర్థరామునిఁ గళాశాలకుఁ బంపఁ దలఁపకుండినను, ఉన్నతరగతులయందు క్రమముగా జయముపొందుచుండుటవలన విద్యార్థివేతనము దొరకుటయు, మిత్రసాహాయ్యమున నాతఁడు కళాశాలయందుఁ జేరి ఉన్నతవిద్య నభ్యసింపసాగెను.

తీర్థరామునకు విద్యాసక్తియు ప్రతిభయు హెచ్చిపోసాగెను. కాని వారి ద్రవ్యము మాత్రము తఱుఁగు నుపాయములు గానరావయ్యెను. రెండులాగులును, ఒక చొక్కాయు, ఒకతలగుడ్డయు మాత్రమే ఆతని ఉడుపులు. రెండుపూటలైనను గడుపునిండఁ గాకున్న అరగడుపుగానైనను భుజించుటకు ఆహారము లేకుండెను. రాత్రులయందు చదువుకొందమన్న తైలాభావముచే దీపము లేకుండ నుండెను. అయినను ఆతఁడు ఒకపూట అన్నమైన మాని, ఆతఁడు అందులకు అగుఖర్చుతో నూనె సంపాదించి, దీపమును నిలిపి రాత్రులయందు చదువుకొనుచుండెను. అందఱును నిద్రించిన తరువాతఁగాని, ఆతఁడు ఎప్పుడును నిద్రించి యెఱుఁగఁడు. మఱియు అందఱును లేచునంతవఱకు ఆతఁడు లేవకుండ నుండి యెఱుఁగఁడు. పగలు కూర్చున్నపుడేగాక, నడుచునపుడు గూడ నాతనికి అదేపనిగాని మఱియొకధ్యానము లేకుండెను. ఒకనాఁడు ఆతఁడు ఎచ్చటికో పోవుచుండియు, నడుచుచున్నను పుస్తకము చదువుకొనుచుండెను. అది చూచి యొకఁడు "రామా! నడుచునపుడుగూడ 'చదువవలెనా? ఇది పాఠశాల గాదు; మార్గము" అని యడిగెను. అందులకు తీర్థరాముఁడు "నాకు విశ్వమంతయు పాఠశాలయే" అని బదులు చెప్పెను. ఆసమాధానమును విని లజ్జించి ఆతఁడు వెడలిపోయెను.

ఇట్లు ఆతఁడు విశేషపరిశ్రమ చేసి గణితశాస్త్రమును అభిమానముగాఁ గైకొని ఆతఁడు బి. ఏ. పరీక్షయందు పంజాబునం దంతటను మొదటివాఁడుగా నెగ్గెను. మఱియు ఆశాస్త్రమునే అభిమానముగాఁ గైకొని ఎం. ఏ. పరీక్షలోఁగూడ ఆఱితేఱెను. ఈతీరున ఆతఁడు ఇరువదిసంవత్సరముల ప్రాయమున ఎం. ఏ. పరీక్షలో విజయము గాంచి లోకమును ఆశ్చర్యసాగరమున ముంచివేసెను. అప్పటికి ఆతని దేహము అస్థిపంజర మయ్యెను. కన్నులు గుంటలు పడెను. ఇది అపాయకరమని తెలిసికొని, పిదప ఆతఁడు ఆవుపాలను త్రావుట ప్రారంభించి దానితోఁగూడ వ్యాయా

మును ప్రారంభించెను. అగుట నాతడు మఱల నొంటరిగనుండుటచే పూర్ణముగ ఆరోగ్యమును బడసెను. కృష్ణయనంతరమునకు ఉపకారము చేయుటకై ఆతడు ప్రతి దినమున్నంతకాలము వ్యాయామమును విడిచి యుండలేదు.

తీర్థరాముడు కళాశాలను విడిచిన వెంటనే, ఆరోగ్యము కొఱకై తప్పక వ్యాయామమును ప్రారంభించెను గదా! ఆతడు ఆరోగ్యమును బొందిన వెంటనే ఆతడు చదివిన లాహోరు, ఫార్మన్, క్రిస్టియన్ కళాశాలలో ప్రధానగణితశాస్త్రపండితుడుగా నియమింపబడెను. గణితశాస్త్రమున అనంతప్రావీణ్యమును, అంతములేని అభిమానమును గలవాడగాన, ఆతడు అనేకులను ఆశాస్త్రమున అభిజ్ఞులగునట్లు చేయవలెనని యత్నములు గావించెను. విద్యార్థులయందు మొదటి వాడుగా జయమందినయాతడు శిష్యులను చేరదీసికొనుచుండెను, ఉన్నత గణితశాస్త్రము బోధింపగలుగుటకై పంజాబువిశ్వవిద్యాలయమువారు ఒక విద్యార్థివేతనమును ఏర్పఱిచిరి. అది తొలుత తీర్థరామునకు ఒసగబడెను; కాని అంతలో నేకారణముచేతనో అది యొక మహమ్మదీయవిద్యార్థికి ముట్టెను. తీర్థరాముడు చేసిన ప్రయత్నములలో ఇది యొకటిమాత్రమే విఫలమైనది.

తీర్థరాముడు బోధించుటలో సమర్థుడు. అందులకుదోడుగ నాతడు గణితశాస్త్రమున నిపుణుడు; కావున ఆతడు ఉపాధ్యాయుడుగా నుండిన కళాశాలయందలి విద్యార్థులు చాల సంతృప్తులై యుండిరి, అతనియెడల చాల భయభక్తులు చూపుచుండిరి. ఆతడు సంస్కృతము, హిందీ, ఉరుదు, పరిషియన్, ఇంగ్లీషు భాషలయందు అపారపాండిత్యమును సంపాదించెను. పంజాబీ అతని మాతృభాషయే. కావున దానియందు అతడు అఖండపాండిత్యము గలవాడని వేఱుగ వివరింపబనిలేదుగదా! ఆతడు ఈభాషలయందలి తత్త్వగ్రంథములన్నిటిని మిగుల జాగ్రత్తగా జదివి, అందలిసారమును గ్రహించెను. అగుటచే ఆతనిహృదయము మిగుల విశాలమును, భావములు మహోన్నతములును అగుట సంభవించెను.

తీర్థరాముడు కళాశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించిన పిదప అతని భార్య కాపురమునకు వచ్చెను. ఆమెకు దగిన భర్త తీర్థరాముడు. తీర్థరామునకు దగినభార్య ఆమె. ఇట్లు వారు అన్యోన్యప్రణయముగలవారై, అందఱును ఆశ్చర్యపడునట్లు గార్హస్థ్యమును నిర్వహింపసాగిరి. తీర్థరాముడు ఎంత వైభవపరాఙ్ముఖుడో, ఆవిషయమున ఆమెయు అంత పరాఙ్ముఖియే. ఆతడు ఎంత నిష్కాముడో, ఆమెయు నంత నిష్కామురాలు. వారికి ఇరువురకును గూడ మోక్షమే కోరిక అయ్యెను. వారు దానిని బడగొట్టు పనులనుగాని, తలంపులనుగాని దగ్గఱకు రానిచ్చి ఎఱుగరు.

గృహస్థాశ్రమమున ఉన్నంతకాలమును తీర్థరాముఁడు అతిథి సత్కారమును అతి శ్రద్ధాభక్తులతో నెఱవేర్చును. మఱియు నాతఁడు ఎప్పుడును తానుఆత్మవిచారమునఁ బ్రవృత్తుఁడయి యుండుటయేగాక, భార్యకుఁగూడ ఆత్మానాత్మవివేకమును బోధించుచుండెను. అతఁడు కొన్నిదినములు ఆత్మసాక్షాత్కారము నిమిత్తము హిమాలయమునకుఁ బోయి తదేకనిష్ఠతోఁ జపముఁ గావించుచుండెడివాఁడు. ఇట్లు ఆతఁడు కొలఁదిదినములుమాత్రమే పరిశ్రమచేసి, అచిరకాలమునందే సఫలమనోరథుఁడయ్యెను. మఱియు నాతఁడు పిదప రెండుసంవత్సరములు గృహస్థాశ్రమమునందే యుండి, భార్యకు వైరాగ్యమును జ్ఞానమును బూర్తిగఁ గలిగించి, పిదప సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. అప్పుడు ఆతఁడు రామతీర్థస్వామి యయ్యెను.

పిదప ఆతఁడు హిమాలయమునకుఁ బయలుదేఱెను. మార్గమధ్యమున నాతనికి ఒక్కమాఱుగ అయిదు ఎలుఁగుగొడ్లు ఎదురుపడెను. కాని వానినిఁ జూచి ఆతఁడు ఏమియు జంకలేదు. నిశ్చయముగా నాతఁడు ముందునకు నడచిపోయెను. ఎలుఁగుగొడ్లు తొలుత నొకింత కోపదృష్టులను బఱపెను గాని, పిదప స్వామిచెంతకు వచ్చి శిరములువంచి వెడలిపోయెను. ఆతఁడు తిన్నగ పర్వతాగ్రమునకుఁ బోయెను. అచ్చట నొకగుహ యుండెను. అందు భూతములు గలవు అనియు, అచ్చటకుఁ బోవలదనియు, అచ్చటి కొండవాండ్రు చెప్పిరి; కాని ఆతఁడు అందులకు లక్ష్యపెట్టలేదు. నిశ్చింతతో నాతఁడు అందు వసించెను. ఒక్కభూతమైనను ఆతనికిఁ గాన్పింపలేదు. అందు వృశ్చికములును ఆతనితోడఁ గూడి వసించి యుండెను ; కాని వానిని రామతీర్థుఁడు గాని, అవి రామతీర్థునిఁగాని పరస్పరము పీడింపఁ దలంచి యుండలేదు. ఒకప్పుడు ఆతఁడు పర్వతము దిగి క్రిందికి వచ్చి అచ్చట కొందఱు యోగులు కూర్చుండియుండఁగా వారిచెంతఁ గూర్చుండెను. ఇట్లు కొలఁదిగడియలు గడచిపోవునప్పటికి అతనిజన్మగ్రామమునుండి ఒకఁడు అచ్చటకు వచ్చి "నీకుమారుఁడు చనిపోయెను" అని చెప్పెను. అయిన నాకేమి? అని బదులు పలికి, రామతీర్థస్వామి అచ్చటనుండి వెడలిపోయెను.

ఆపోవుట పోవుట తిన్నగ నాతఁడు గంగోత్తరికిఁ బోయెను ; కాని అచ్చట స్వల్పకాలము మాత్రమే నిలిచి యమునోత్తరికిఁ బోయెను. అయిన నచ్చట నాతనికి గంగోత్తరీవియోగము దుర్భర మయ్యెను. అగుట నాతఁడు వెంటనే గంగోత్తరికి మఱలెను. అచ్చటఁ గొన్ని దినములు ఉండి సుమేరుపర్వతమునకు దారి తీసెను; ఈప్రయాణమున ఆతఁ డెంతో కష్టపడెను. కాని పట్టినపట్టు విడువక, గమ్యస్థానము చేరుకొనెను. అక్కడనుండి వసిష్ఠాశ్రమమునకు వెడలెను.

స్వామి మఱికొన్నిదినములకు ప్రపంచోద్ధరణమునకై అడవులనుండి మరలెను. అతఁడు కొడియాకొండమీఁదనుండి డేరాదూనునకు వచ్చి, అక్కడనుండి లక్నో కలకత్తాలుచేరి, కలకత్తాలో ఓడనెక్కి జపానుదేశమునకు బయలుదేఱెను. ఆదేశములో స్వామి పదునైదుదినములుమాత్రమే యుండెను. ఈ స్వల్పకాలము నందే స్వామి ప్రాచ్యవిజ్ఞానగౌరవము వెల్లడియగునట్లు రెండు మహోపన్యాసముల నిచ్చుటయు, జపానుపండితులు అనేకులు అనంతమైన అతని సామర్థ్యమును దెలిసికొని చాల గౌరవించి పత్రికలలోఁ బొగడుటయు, ఆదేశీయులందఱును స్వామివైరాగ్యనిష్ఠను పరమాశ్చర్యచకితులు అగుటయు జరిగెను. స్వామి అచ్చట నున్నంతకాలమును, పిదప మఱికొన్నినెలలును ఆదేశీయులు స్వామిని గుఱించిన ప్రస్తావములతోనే గడపివేసిరి.

అమెరికాలోఁ బ్రవేశించి స్వామి చేసినపని చాల గొప్పది. అతఁడు ఆదేశీయులకు ఆర్యమతరహస్యముఁ దెలిపి, దాని గౌరవము నెల్లెడఁ గలుగునట్లు చేసెను. వచ్చినవారి కందఱకు తత్త్వము నుపదేశించి సత్ప్రశ్నోత్తరములఁ గావించి, ఆనందముఁ గొలుపుచుండెను. జీవాత్మనుగుఱించియు పరమాత్మనుగుఱించియు తమ తత్త్వశాస్త్రము ననుసరించి నిశ్చయజ్ఞానమును బడయని అమెరికాదేశీయు లనేకులు స్వామివలన సందేహములనుబాసి, భారతీయుల తత్త్వవిచారము ఇంతటి యుత్కృష్టమైనదా ? యని యాశ్చర్యపడసాగిరి.

స్వామి అచ్చట ఈతీరున అనేకులను ముక్తిమార్గమునకుఁ దెచ్చెను. అమెరికావారి గ్రంథములు అనేకములు చదివెను. అచ్చట నాతఁడు ఇంగ్లీషుభాషలో కవనము ప్రారంభించెను. అది యత్యద్భుతముగా నున్నది ; కాని అతఁడు చెప్పిన కవిత్వ మంతయు ఇంగ్లీషుభాషలోనే యున్నది. ఇట్టి యలౌకికశక్తుల నారసి ఆదేశపు పత్రికాధిపతు లనేకులు అతని మాహాత్మ్యములు వర్ణించి, తమ పత్రికల నాతనికి పంపసాగిరి; కాని స్వామి "నాకు ఈకాగడ్తలతో నేమి పని ?" అని ఆపత్రికలను విప్పకయే నదిలోఁ బారవేయసాగెను. ఇట్టి అచంచలవైరాగ్యమును జూచి ఆదేశీయులు మఱింత అబ్బురపడసాగిరి.

ఒకప్పుడు అమెరికాదేశపాలకుఁడు స్వామిని దర్శింప వచ్చెను. అప్పుడు గొప్ప ఉత్సవమయ్యెను. రామతీర్థస్వామి వసించియున్న ప్రదేశము ఒక స్త్రీయధికారము క్రింద నుండెను. ఆమె యాపాలకునకు మిగుల మర్యాద గావించి స్వామిదర్శనము చేయించెను. ఆపాలకుఁడు చాల భక్తిశ్రద్ధలతో సాష్టాంగనమస్కారములు ఆచరించి నపుడు, స్వామి ఆదరముతో లేవనెత్తి దీవించి, తాను రచించియున్న "భారతీయుల కొఱకు ఒకవిన్నపము" అను పుస్తకమును ఇచ్చెను. దానిని ఆపాలకుఁడు ఎంతో ఆదరముతోఁ గైకొని, చాల ఆనందముతోఁ బఠించెను.

పిదప స్వామి అమెరికాదేశమందలి పెద్దపెద్ద నగరములన్నియుఁ జూచెను. ప్రాచీనమగు ఆర్యమతమును బోధించెను. అనేకస్థలములయందు వేదాంతసమాజములను స్థాపించెను. ఆకాలమున "సెంటు లూయి" అను నగరమున "విశ్వైకమత్యసభ" అను ఒక గొప్పసభ మూఁడుదినములు జరిగెను. అందలివిశేషము ఏమనఁగా: ఆసభకు స్వామి యొకదినమున అగ్రాసనాధిపత్యము వహించెను. తక్కినదినములలో ఆర్యమతమును గుఱించి చక్కని ఉపన్యాసము లిచ్చి, సభకు వచ్చినవారికి అందఱకును నిశ్చేష్టతను గొలిపెను. పిదప ఆదేశమున కొలఁదిదినములుండి జిబ్రాల్టరునకు బయలుదేరెను.

జిబ్రాల్టరునుండి స్వామి ఈజిప్టునకు బయలుదేరెను. ఆదేశీయులు అగుమహమ్మదీయులు అతని మహాత్మ్యమును దెలిసికొని, ఆతఁడు మహమ్మదుయొక్క అపరావతారము అని భావించి విశేషముగ సన్మానించిరి. స్వామి అచ్చటి మసీదులలో అనేకస్థలములయందు పరిషియనుభాషలో అనేకోపన్యాసములిచ్చి, వారికి ముక్తిమార్గమును జూపెను. అచ్చటిపత్రికలన్నియు ఆతనిని విశేషముగఁ గొనియాడెను. పిదప స్వామి భారతదేశమునకు బయలుదేరెను.

భారతదేశములో ఆతఁడు అనేకస్థలములయందు ఉపన్యాసము లిచ్చెను. దేశమంతయుఁ దిరిగెనని చెప్పవచ్చును. ఈసంచారము అయినతరువాత ఆతఁడు మఱల గంగోత్తరి మున్నగుపుణ్యస్థలములను దర్శించి, కాశికి వచ్చి గంగలో స్నానము చేయుచు మునిఁగిపోయెను. మఱల నాతని శరీరమును జూచినవా రెవ్వరును లేరు. ఈతీరున స్వామి పరమాత్మలో నైక్యమైపోయెను.

---

## 53. వివేకానందస్వామి

కలకత్తానగరమునకు సమీపమున నున్న శిమూలియా యనుపల్లెయందు విశ్వనాథదత్తుఁడు అను నొక కాయస్థుఁడు ఉండెను. ఆతఁడు పెద్ద పెరిగినతరువాత కలకత్తాలో న్యాయవాదిగాఁ బ్రవేశించెను. ఆతనికి ధనలోపమును సౌఖ్యలోపమును గలుగలేదు; కాని సంతానము లేకపోవుటచే ఆనందలోపముమాత్రము సంభవించెను. దానికై యాతఁడు అనేకప్రయత్నములను గావించి తుదకు కాశీయాత్రకుఁ బోయి వచ్చెను. తద్యాత్రాఫలముగ వచ్చిన కొలఁదిదినములకే ఆతనిభార్య గర్భవతియై నవమాసములు మోసి ఒకకుమారుని గనియెను.

తల్లిదండ్రులు ఆబిడ్డకు నరేంద్రుఁడు అని పేరుపెట్టి చాలగారాబముగాఁ బెంచుకొనుచుండిరి. ఆతఁడు చాల చురుకైన బాలుఁడు. మాటలు వచ్చినదిమొదలు



శ్రీ. వివేకానందస్వామి.—౩౯౨.

ఆబాలుఁడు చూపిన తెలివితేటలఁజూచి గురుమహాశయులందఱును ఆశ్చర్య పడుచుండిరి. ఇట్లుండఁగా, విశ్వనాథదత్తుఁడు యుక్తకాలమున ఉన్నతవిద్యాభ్యాసమునకై కుమారుని పాఠశాలకుఁ బంపెను.

పాఠశాలలో నరేంద్రుఁడు ఎప్పుడును తనతోటివారిలో అగ్రపీఠమునే అధిష్ఠించుచుండువాఁడు. యుక్తసమయమున ఆతఁడు ఇంగ్లీషుభాష ప్రారంభించి, ఏటప గతియందును వెలిపోక, క్రమముగా బియేపరీక్షలో నుత్తీర్ణుఁడాయెను. ఆతనికి తత్వశాస్త్రము అభిమానము అగుటచే ఆతఁడు హెర్బర్టు స్పెన్సరు మున్నగు ఆంగ్లేయులు వ్రాసిన తత్వశాస్త్రగ్రంథములు అనేకములు పఠించెను; కాని ఆతనికిఁ దృప్తి గలుగలేదు. ఆగ్రంథములయందు ఆతనికి ఏమియు పస గాన్పింపలేదు. ఆగ్రంథముల మీఁద ఆతఁడు అనేకపూర్వపక్షములు చేసెను. హెర్బర్టు స్పెన్సరు నరేంద్రుఁడు తన గ్రంథముల యెడలఁ జేసిన పూర్వపక్షములను విమర్శింపఁజాలక వానిని అంగీకరించి, నరేంద్రునకు భారతీయుల వేదాంతశాస్త్రము జదువునట్లు ప్రోత్సాహము నిచ్చెను; కాని నరేంద్రుఁడు అప్పుడు నవనవలాడుచు కొనసాగుచున్న బ్రహ్మసమాజము వలన ఆకర్షింపఁబడి, అందుఁ బ్రవేశించెను. అయినను ఆతనిసంశయములు తీఱలేదు. తత్వము తెలియునప్పటికి నరేంద్రునకు బ్రహ్మసమాజమతముమీఁద ఏవ కలిగెను. అదిమొదలుకొని ఆతఁడు పరమాత్మను దెలిసికొనుఉపాయములు అన్వేషింప సాగెను.

ఆతని పినతండ్రి ఆతనిభావములను ఎప్పటికి అప్పుడే గ్రహించుచుండెను. ఆతని గురువు శ్రీరామకృష్ణపరమహంసుఁడు. తన గురువుకంటె మహాత్ముఁడు మఱి లేఁడు; అని ఆతనిభావము. అగుటచే నాతఁడు "పిల్లవాఁడు దారిలోనికి వచ్చుచున్నాఁడు" అని తలంచి నరేంద్రునిఁ జేరఁబిలిచి "వత్సా! నీభావమును నేను గ్రహించితిని. నీయాందోళనము నాకుఁ దెలియును. కాళీఘట్టమున నాగురుదేవుఁడు కలఁడు. ఆతఁడు నీసందియములను బాపి, నీహృదయమునకు శాంతిని సంఘటింపఁ జేయఁగలఁడు. నాతో వచ్చెదవేని మేలు అగును" అని చెప్పెను. అందులకు అంగీకరించిన నరేంద్రుఁడు పినతండ్రితో రామకృష్ణునిచెంతకుఁ బోయెను.

వందనాదులు ముగిసిన పిదప, రామకృష్ణుఁడు నరేంద్రుని ముఖవర్చస్సుఁ జూచి "ఈతఁడు మహాపురుషుఁడు అగును" అని భావించెను. అప్పుడు నరేంద్రుని స్థితిగతులను ఆతని పినతండ్రి స్వామికి ఎఱింగించి, "ఈబాలుని ఉద్ధరింపవలయును" అని ప్రార్థించెను. స్వామి అంగీకరించినతరువాత, నరేంద్రుఁడు "స్వామీ! రేపు మఱల నేనొక్కఁడను వచ్చెదను. ఏకాంతదర్శనము గోరుచున్నాను" అని సెలవు నడిగెను. స్వామి వల్లె యనెను. నరేంద్రుఁడు వెడలిపోయెను.

అనిన సమయమునకు నరేంద్రుఁడు మఱునాఁడు స్వామి చెంతకుఁ బోయెను. వందనాశీర్వచనములు ముగిసిన పిదప స్వామి నరేంద్రునిఁ గూర్చుండ నియమించి, ఆతని ప్రశ్నలకు చక్కని సమాధానములు ఇచ్చెను. నాఁటితో నరేంద్రుఁడు "పట్టు కొమ్మ దొరకినది" అని ధైర్యమువహించి కొలఁదిదినములయందే తన సందియ

ములను బొాసెను. స్వామి ఆతనికి భారతవేదాంతరహస్యములను అన్నిఁటిని కరతలా మలకముగ బోధించెను. నరేంద్రునకుఁ బూర్తిగఁ దృప్తి యయ్యెను.

కొన్నిదినములకు రామకృష్ణుఁడు ఈశ్వరసాయుజ్యమును బడసెను. ఆతని శిష్యులు అంతటను తమ గురుదేవుని యుపదేశములను లోకమునందు అంతటను వెల్లడింపవలయునని తలంచిరి. ఎవ రెన్నిఅభ్యంతరములు చూపినను వారు ఆప్రయత్నములను మానలేదు. వారియందెల్ల మననరేంద్రుఁడు ప్రథముఁడు; ముఖ్యుఁడు. రామకృష్ణునిమార్గము సంసారులు క్రొక్కుట కనువుగాదు; కావున వెంటనే సన్న్యసించి, నరేంద్రుఁడు వివేకానందస్వామి యనుపేరు ధరించి, తలిదండ్రులకు నమస్కరించి హిమవత్పర్వతమునకుఁ బోయెను.

ఇదిమొదలు మనము నరేంద్రుని వివేకానందుఁడని పిలిచెదము. అచ్చట నాతఁడు ఆఱుసంవత్సరములు తదేకదీక్షతో తపస్సు చేసి పరమాత్మను దెలిసికొని; "జన్మము తరించినది" అని పరమానందమునుగాంచి అక్కడనుండి టిబెట్టుదేశమునకుఁ బోయెను. ఆదేశము మతము బౌద్ధము. వివేకానందుఁడు బౌద్ధమతరహస్యములను బూర్తిగా గ్రహించి స్వదేశమునకు మఱలెను. ఆతఁడు మొదట ఖత్రి అను సంస్థానమునకుఁ బోయి అచ్చటిరాజును దన శిష్యునిఁగాఁ జేసికొని, బయలుదేఱి కొన్నిదినములకు తిరువాన్కూరు వచ్చి, అచ్చటినుండి చెన్నపట్టణము చేరికొనెను. వెళ్లిన చోటులందెల్ల నాతనికి విశేషసమ్మానము జరుగుచుండెను. చెన్నపట్టణములోఁ గూడ నాతనికిఁ జాలసమ్మానము జరిగెను.

అమెరికాఖండమునందలి చికాగో అను నగరమున ప్రపంచమునఁగల సకల మతములకును సంబంధించిన ఒక సభజరుగును అని ప్రకటింపఁబడెను. అప్పుడు చెన్నపట్టణమునందలి ముఖ్యపౌరులును, మఱికొందఱు సంస్థానాధిపతులును ఆర్యమతప్రతినిధిగా వివేకానందుని ఆసభకుఁ బంపఁదలఁచి, ఆతని యభిప్రాయము నడిగిరి. అందుల కాతఁ డంగీకరించెను. తోడనే తగినంతధనము సమకూర్చి వారు ఆతనికి సెలవు ఇచ్చిరి.

వివేకానందుఁడు సభకుఁ జాలదినములకుఁ బూర్వము అమెరికా చేరుకొనియెను. ఆతఁడు అచ్చటి సంగతులు తెలిసికొనఁగోరి దేశమంతయుఁ దిరుగఁ జొచ్చెను. ఈ సంచారమువలన ఆతని చేతనున్నధనము అయిపోయెను. అప్పుడు ఆతఁడు రెండుమూఁడుదినములు పస్తుపడియుండవలసివచ్చెను. ఇట్టిస్థితిలో నాతఁడు బోస్టను పట్టణపరిసరమున నున్న ఒక పల్లెటూరి వీథిలో నడచిపోవుచుండఁగా, అన్నాభావమువలన కృశించి ముఖము కళావిహీనమైయున్నను, ఆతఁడు ధరించిన కావి వస్త్రములను ఆతని మేని చాయను జూచి యొకవృద్ధాంగన తనఇంటికిఁ గొనిపోయి అన్నంబిడి ఆదరించెను. ఆసమయమున వివేకానందుఁడు తనసంగతియంతయు ఆమెకు ఎఱింగించెను. అత్యద్భుతమైన ఈసమాచారమును విని అబ్బురపడి, ఆవృద్ధవనిత ఆగ్రామమున ఉన్న ఒక తత్త్వశాస్త్రపండితునివద్దకుఁ గొనిపోయి ఆతనిని విడిచెను. అంతట తత్త్వజ్ఞునకును వివేకానందునకు వాదము పొసఁగెను. తుదకు సమా

ధానము చెప్పలేక తత్వజ్ఞుఁడు వివేకానందుని సామర్థ్యమును గొనియాడి, అతనిని వెంట నిడుకొని ఆమహాసభకుఁ బోయి అధ్యక్షునకుఁ బరిచయముచేసెను. అధ్యక్షుఁడు అగు డాక్టరు బారోసు వివేకానందుని ఆర్యమతప్రతినిధిగా నంగీకరించెను.

సభ ప్రారంభమయ్యెను. తమతమ మతములనుగూర్చి కొందఱు ఉపన్యసించినతరువాత, అధ్యక్షుఁడు ఆర్యమతమును గుఱించి యుపన్యసించుటకు వివేకానందస్వామికి అనుజ్ఞ యిచ్చెను.

తోడనే వివేకానందుఁడు లేచి నిలిచెను. అతనివిగ్రహమును జూచి అందఱును ఆశ్చర్యపడిరి. ఇంతలో అతఁడు ఉపన్యాసము ప్రారంభించెను. సభలోని వారి కంతయు నూతనముగను ఆహ్లాదకరముగను దోఁచెను. వారు బొమ్మలవలె చేష్టలుడిగి వినసాగిరి. "నీకిచ్చిన వ్యవధి ముగిసినది" అని చెప్పుటకు అధ్యక్షునకు నోరాడలేదు. అతఁడు గూడ ప్రతిమాకారము వహించెను. అతని వాగ్ధాటి గంగా ప్రవాహమువలె నిరర్గళముగ నుండెను. విషయనిరూపణము అఱచేతిపండొలిచి చేతఁ బెట్టినట్లు ఉండెను. విమర్శనాపద్ధతి అద్దములో వస్తువులను జూపినట్లు ఉండెను. కంఠస్వరము అన్నిటిని మించినమాధుర్యము నీనుచుండెను. "మన దేశీయుఁడుగూడ, మన భాషలో నిట్లు మాటలాడఁజాలఁడు" అని అచ్చటి అమెరికా వారు తలంపసాగిరి. ఈకారణమువలన నాతఁడు అప్పుడు చాలతడవు ఉపన్యసించెను. సభలోనివారు అందఱు నత్యాశ్చర్యపడిరి.

అదిమొదలు ఆతనివెంట అనేకులు బయలుదేఱిరి. అనేకనగరములలో నుపన్యసించుటకు ఆతఁడు ఆహ్వానింపఁబడెను. ఆతఁడు అనేకోపన్యాసములు ఇచ్చెను. అనేకులు ఆతనికి శిష్యులైరి. వారందఱును భారతీయుల నామములను ధరింపసాగిరి. శివవిష్ణ్వాలయములు ఆదేశములో వెలసెను. శిష్యులు ముఖమున తిలకము ధరింపఁ బ్రారంభించిరి. గాయత్రీజపము ప్రారంభించిరి.

ఇట్లు అమెరికాదేశీయులను భారతీయులనుగాఁ జేయుచు, వివేకానందుఁడు ఆదేశమున ఒకసంవత్సరము ఉండి, అక్కడనుండి ఇంగ్లాండునకు బయలుదేఱెను. అమెరికావారు ఆతనిని విడుచుటకు మిగుల దుఃఖించిరి. ఇంగ్లాండువారు అట్టి మహాత్ముఁడు తమ దేశమునకు వచ్చినందులకు పరమానందభరితులై, ఆతనినిఁ జాల నాదరించిరి. అచ్చట స్వామి మూఁడుమాసములు మాత్రమే యుండెను. ఈస్వల్ప కాలమునందే ఆతఁడు అనేకస్థలములయందు అనేకోపన్యాసములను గావించెను. ఆంగ్లేయులుగూడ కొంతమంది ఆతనికి శిష్యులైరి. మాక్సుముల్లరు అనుగొప్ప పండితునితో మాటాడి ఆతనికి రామకృష్ణపరమహంస జీవితచరిత్రమును వ్రాయుటకు నియమించి "మార్గరెట్టునోబులు" అనునారీమణితో వివేకానందుఁడు స్వదేశమునకు మఱలెను.

ఆతఁడు సింహళద్వీపమునందలి కొలంబోనగరమున ఓడ దిగెను. ఆనాఁడు ఆపట్టణము స్వర్గమువలె ప్రకాశించెను. ఆనగరమునందలి భారతీయప్రముఖులు అనే

కులు సౌకార్యముకు బోయి స్వాగతమిచ్చి, పుష్పహారములతో నలంకరించి, మహాప్రభవముతో నగరములోనికి గొనివచ్చిరి. అచ్చట స్వామి కొన్ని యుపన్యాసములు గావించి వారి అజ్ఞానాంధకారమును బాపెను.

అక్కడనుండి ఆతఁడు చెన్నపట్టణము వచ్చెను. ఆతఁడు ఎగ్మూరు మజిలీలో పొగబండి దిగినవెంటనే అంతకుఁ బూర్వము అచ్చట వేచియున్న ప్రధానన్యాయస్థానమందలి న్యాయాధికారులు మున్నగు గొప్పయుద్యోగులును, తక్కుంగల పౌరప్రముఖులును పూఁదండలతో నలంకరించి, అపూర్వోత్సవముతో నగరములోనికిఁ గొనివచ్చి విడియించిరి. నాఁటిసాయంకాలమున వివేకానందుఁడు పురమందిరముపైఁట మహోపన్యాసము చేసి చెన్నపట్టణవాసుల నానందపఱిచెను. మఱికొన్ని దినములు చెన్నపట్టణమున నుండి ఇంక కొన్ని ఉపన్యాసములు ఇచ్చి, పిదప జన్మదేశమగు కలకత్తానగరమునకు బయలుదేఱెను.

కలకత్తానగరమునఁగూడ వివేకానందునకు జరిగిన గౌరవము అభూతపూర్వము. ఇది యంతయు నైనతరువాత ఆతఁడు భారతజాతి నుద్ధరించు ప్రయత్నములను బ్రారంభించెను. ఈప్రయత్నమున ఆతఁడు నిద్రాహారములు ఎఱుఁగఁడు. ఆతఁడు అనేకపాఠశాలలను నెలకొల్పెను. ఇంతలో సాతత్యంబగు నిట్టి పరిశ్రమవలన వివేకానందుని దేహారోగ్యము చెడెను.

వైద్యులు పరీక్షించి ఇఁక నొకతడవ అమెరికాకును ఇంగ్లాండునకును బోయి వచ్చుట లగ్గు అని చెప్పిరి. వారి ఆలోచన ననుసరించి మఱల వివేకానందుఁడు ఆఖండములకుఁ బోయెను. అమెరికాయు ఇంగ్లాండును ఆనందసాగరమున మునిఁగిపోయెను. వివేకానందుని జాడ్యముగూడఁ గుదిరిపోయెను. ఈపర్యాయముగూడ ఆతఁడు అనేకస్థలములయందు ఆశ్రమములను స్థాపించెను.

ఆతఁడు అక్కడనుండి బయలుదేరి ఫ్రెంచిదేశమునకుఁ బోయి, అచ్చట జరిగిన మతసభలో ఫ్రెంచిభాషలో నుపన్యాస మిచ్చి, భారతమత గౌరవమును బోధించెను. పారిసులో నుండఁగా మఱల నాతని యారోగ్యమునకు భంగము గలిగెను. ఈస్థితియందే ఆతఁడు స్వదేశోన్ముఖుఁడయ్యెను.

స్వదేశము చేరినపిదప వైద్యులు విశ్రాంతిని పుచ్చుకొనవలయునని చాల గట్టిగాఁ జెప్పిరి; కాని ఆతఁడు దేశము నుద్ధరించుదీక్షను విడువఁజాలక వైద్యుల సలహాలను బెడచెవినిఁ బెట్టెను. మఱల నాతఁడు స్వదేశమునఁ బని ప్రారంభించెను.

ఇట్లుండఁగా, "తమదేశమునకు ఒక మాఱు వచ్చిపోవలసిన" దని జపానుదేశమునందలి ప్రముఖులు వివేకానందస్వామిని ఆహ్వానించిరి. కాని అనారోగ్యకారణమున ఆతఁడు వారికోరికను నిరాకరించెను. ఆతఁడు తనశక్తులను అన్నిఁటిని భారతదేశమునిమిత్తము ధారపోసెను. ఒకనాఁడు ఉదయమున శిష్యులకు పాణినిసూత్రములను బోధించి, సాయంకాలమున ఉపనిషద్భాష్యమును బోధించి, ఎవరికినిఁ దెలియకుండ రాత్రిసమాధిలో భౌతికదేహమువిడిచి, ఈశ్వరసాయుజ్యముఁ బడసెను.



# 54. వేమన్న

కొండవీడు రాజధానిలో ప్రభుత్వము చేయుచున్న కోమటి వేమారెడ్డి చాల యోగ్యుఁడు అనియు, చతురుఁడు అనియుఁ బేరుపొందియుండెను. ఆతనికి వేమన్న అను ఒకసోదరుఁడు ఉండెను. వేమన్న చిన్నతనమునుండియు అన్న మాటను లక్ష్యపెట్టక అల్లరిచిల్లరిగా తిరుగుచుండెడివాఁడు. మహారాజు తమ్ముఁడు అగుటవలన ఆతని కేవిషయమునను లోపమును, ఎందును అభ్యంతరమును లేకుండెను. వేమన్నకు అన్నగారియెడల భయ మంతగా లేకున్నను, వదినెయగు నరసమ్మ యనిన చాల భయభక్తులు గలవు.

కాలక్రమమున వేమన్న ఒక భోగముదానిని ఉంచుకొనెను. కొంతకాలము మాత్రము బెట్టుసరిగా నుండెను; కాని వేమన్న తుదకు దానికి దాసుఁడు అయి పోయెను. అది యేపని చేయుమన్నను చేయుటకు సంకోచించుటలేదు. ఇదియంతయుఁ గనిపెట్టి వారకాంత ఆతనిని బొంగరమువలె త్రిప్పుచుండెను.

ఒకనాఁడు ఆవారకాంత వేమన్న ఆనందసాగరమున మునిఁగియున్నప్పుడు "ప్రియుఁడా! నాకొక కోరిక పొడమినది. నీవుతక్క నాకు అన్యథాశరణము లేదు కదా! సతికి పతివలన తీరనిది ఉండదు. కావుననే కోరుచున్నాను. మాఱు పల్కక తీర్చెద నందువేని చెప్పెదను" అనియెను. వేమన్న తీర్చెద చెప్పు మనఁగా, వార

కాంత "నీపదినెగారు ధరించుచున్న నగలను ధరింపఁ గోరిక పుట్టినది. వయయుంచి తెచ్చి పెట్టెదవా?" అని పలికెను. వేమన్న మాఱుపలుకక వల్లెయని అంగీకరించి, అప్పుడే బయలుదేఱిపోయి మార్గమధ్యమున "ఈకోరికను ఆసాధ్వీమణితో నేమని చెప్పుదును" అని సందేహించుచునే పోయి, మనసు త్రాయి చేసికొని నరసమ్మ పాదముల మీఁద వ్రాలెను. అంతట రాణి యగు నరసమ్మ "వేమన్న జీవితమున నేదో మార్పు కలిగినది." అని యానందించుచు లేవనెత్తి, "వత్సా! విశేషములు ఏ"మని యడిగెను. కాని వేమన్న మఱల నామె పాదముల మీఁద వ్రాలి, "తల్లీ! నీకంటె నాకు శరణము లేదు. తల్లి తన బిడ్డని కోరికలు తీర్పకుండ నుండదు. నాకొక కోరిక గలదు. అది తీర్చెద నను నంతదనుక నీపాదములను విడువను" అని పలికెను. "సంకోచింపక చెప్పుము." అని నరసమ్మ పలికిన వెంటనే వేమన్న తెలుపలేక తెలుపలేక, తన వారకాంత యభిలాష నెఱింగించెను. అది విని నరసమ్మ "బుద్ధి ఇంకను తిరుగలేదు" అని నిశ్చయించుకొనియు లేవనెత్తి, "వత్సా! ఇంతమాత్రమునకు ఇంత బెంగయేల? ఇదే ఇచ్చెద పుచ్చుకొనుము" అని ఒక అడ్డబాస తక్క తనయొడలిమీఁది తక్కినసగల నన్నిఁటిని ఒలిచి ఇచ్చి పంపివేసెను. అంతట వేమన్న నరసమ్మకు మఱియొకమాఱు మ్రొక్కి, వారకాంత ఇంటికిఁ బోయెను.

వారకాంత వేమన నెంతో యాదరించెను. ఆయాదరమునకుఁ బొంగిపోయి, ఆతఁడు తాను తెచ్చిన నగలను ఇచ్చెను. వారకాంత అన్నియు నుండుటయు అడ్డబాస లేకపోవుటయుఁ జూచి "ప్రియుఁడా! ఆఁడువారి కోరికలు అద్భుతములుగా నుండును. నీవు నాయభిలాషను వెంటనే తీర్చితివి. నీవదినెనగలు అన్నియు తెచ్చితివి; కాని ఒక వస్తువు మఱచితివి. రూపమునను వెలయందును అది అన్నిటికంటె చిన్నదియేగాని, అదియొక్కటియు అనేకలక్షల వెలచేయు ఈనగలకు అన్నిటికిని సమానము. అది లేకున్న స్త్రీలకు ఆనందము ఉండదు. అది యేమందువా? నీవు తేకుండుటచే దానిని గుఱించి ఇంత చెప్పవలసివచ్చినది; కాని లేకున్న అవసరము లేదు. దాని పేరు అడ్డబాస. అదికూడ తెచ్చి పెట్టవా?" అని బుజ్జగించుచు అడిగెను.

వేమన్న ఈలాలనకుఁ బొంగిపోయెను. మఱల వెంటనే అతఁడు ఇంటికిఁ బోయెను; కాని వదినెగారి ముఖముఁ జూచుటకు సంకోచము కలిగెను. అక్కతన ఆతఁడు చేయునదిలేక తన కొఱకు ఏర్పఱుపఁబడిన పడకయింటిలోనికిఁ బోయి దుప్పటి ముసుఁగువేసికొని పండుకొనెను. నరసమ్మ భోజనసమయమున వేమన్న రాకుండుటను జూచిఁ వెదకికొని రావలసినదని దాసీలకు ఆజ్ఞాపించెను. దాసీలు వచ్చి పిలిచిరి; కాని వేమన్న వారికి జవాబుచెప్పలేదు. వారు పోయి నరసమ్మకు ఆవృత్తాంతము నెఱింగించిరి. అంతట నరసమ్మ స్వయముగ బయలుదేఱివచ్చి "నాయనా!

ఇక్కేల పండుకొంటివి? పోయిరా" అని బుజ్జగించుచుండ నడిగెను. వేమన్న ఆమె ప్రియముగా వచ్చుట కాంచి కొంతతడవు లజ్జించి, తనకు సంగతియంతయు నెఱింగించెను.

అంతట నరసమ్మ "తెలివితక్కువాడా! ఇంతమాత్రమునకే పెట్టుకొని పండుకొనవలయునా? అన్నివస్తువులనడిగినట్లు దీని నేల అడుగక పోతివి! అన్నియును ఇచ్చినట్లు ఇదిమాత్రము నేను ఈయనా? నాయనా! విచారము మానుము; కాని నాకొక్క మాట ఇమ్ము. ఈఅడ్డబాసను నీప్రియురాలు ముక్కునకు అలంకరించుకొనిన తరువాత, ఆమెను నన్నుగాభావించి దేహాంతమువరకు పోషింపవలయును. అట్లుగాకున్న నీయన్నగారి అనగలడు" అని పలికెను. వేమన్న అందులకు అంగీకరించెను. నరసమ్మ వెంటనే అడ్డబాస తీసి మఱఁది కిచ్చివేసెను.

అంతట వేమన్న ఒక దూకున వారకాంతయిల్లు చేరుకొనెను. అతని యుత్సాహమును జూచి వారకాంత తన కోరిక నెఱవేఱెనని గ్రహించి, ముసిముసినవ్వులతో నెదురేఁగి కౌఁగిటఁ గదియించి తెచ్చి, ఆసనమునఁ గూర్చుండఁ జేసి మర్యాదలు చేయసాగెను. వేమన్న అపుడు అడ్డబాస దానికి ఇచ్చివేసి, వదినెగారు చెప్పిన విషయమును మనసునందు ఉంచుకొని ఆప్రకారమే చేసెను. తోడనే ఆతనికి విషయసౌఖ్యముల మీఁద రోఁత పుట్టెను. ఇక ఒక్కక్షణమైన అచ్చట నుండక అతఁడు తిన్నఁగ ఇంటికిఁ బోయి వదినెగారి పాదములమీఁద వ్రాలి, "తల్లీ! కోటిజన్మము లెత్తియు నీఋణము తీర్చుకొనఁజాలను. కుంభీపాకనరకమునఁ గూలిపోవుచున్న నన్ను ఉద్ధరించుటకు నాతల్లివి అగు నీవే తగుదువు." అని యనేక విధముల నామెను కొనియాడెను.

పిదప క్రమక్రమముగ నాతనికి సంసారముమీఁది విరక్తి పెరిగిపోయెను. ఇంతలో నొకయోగీశ్వరుఁడు ఆతనికిఁ గాన్పించెను. యోగి తనయెడల వేమన్న చూపుచున్న భక్తిశ్రద్ధలకు మెచ్చి ఆతనికి జ్ఞానోపదేశమును మంత్రోపదేశమును గావించెను. తోడనే వేమన్నకు ప్రపంచమును తత్త్వమును గరతలామలకముగఁ దెలిసిపోయెను. అప్పుడే ఆతఁడు ఇల్లువిడిచి నిర్జనస్థలమునకుఁ బోయెను. యోగి కరుణవలన అఖండకవితాధార యొదవెను. అంతట వేమన్న తన యఖండజ్ఞానలహరిని అద్వితీయకవితావాహినితో నేకముచేసి ఆంధ్రజాతిపైఁ బ్రవహింపఁజేసెను. పిదపఁ గొన్ని దినముల కాతఁడు ఈశ్వరసాయుజ్యమును బడసెను. కాని తక్కిన వారివలెఁ గాక ఆతఁడు ఇప్పటికిని ఆంధ్రజాతిలో జీవించియే యున్నాఁడు.

# ౫౫. తరికుండ వెంకమ్మ

శ్లో. "హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ,
హేరామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్ష మాం
హేగోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా." (ముకుందమాల.)

పూర్వకాలమందు ఒకప్పుడు ఆంధ్రదేశమున జనులను మాడ్చివేయుకఱవము సంభవించెను. అగుట దేశమునందలి జనులందఱు 'అన్నమో రామచంద్రా' అనుచు నానాదేశములకు బయలుదేరు చుండిరి. రాయపూర్గ్రామము అను ఒక గ్రామమునందున్న జనులును కూటికిలేక మలమల మాడుచు, గొడ్డుగోదల వెంటఁబెట్టుకొని దారాపుత్రాదులతో బయలుదేఱి, యొక్కచో మార్గాయాసము దీరుటకై విశ్రమించిరి. ఆప్రదేశమును పూర్వము ప్రత్తిమిట్టయని యందురఁట! అచ్చట వారికి కొంత సౌఖ్యముగా నున్నట్లు తోఁచినందున కొన్నిదినములు చిన్న చిన్న పాకలువేసికొని, దొరకినమట్టుకు కలియో అంబలియో త్రాగుచుఁ గాలముఁ గడపుచుండిరి.

ఒకనాఁడు లక్ష్మీనరసమ్మ అను ఒక బ్రాహ్మణయువతి తమగ్రామములో వేంచేసి యుండు శ్రీలక్ష్మీనరసింహస్వామిని తలంచుకొని "స్వామీ! లక్ష్మీనరసింహా! నీకు దయ రాదా? ఈఘోరకఱవములోఁ దినఁ గూడులేక మాకడుపులు మాడిపోవుచున్నవి. ప్రహ్లాదరక్షకా! దీనబంధూ! రక్షింపుము" అని అనేకవిధములఁ బ్రార్థించుచు, ఒక కుండలోఁ బెరుగును బోసి, తరిగంబముకడఁ బెట్టి కవ్వముతోఁ జిలుకుచుండెను. అట్లు చిలుకునపుడు మజ్జిగకుండలో ఒకరాయి కవ్వమునకు తటుకు తటుక్కున తగులు చుండఁగా, ఇది యేమని యాశ్చర్యమొంది తనచేతితో కుండలోపల తడవిచూచెను; కాని అందేమియుఁ గనఁబడలేదు. మఱల నామె తరువ నారంభించెను. కాని పూర్వపు రీతి తటుకుతటుక్కున రాయి కవ్వమునకుఁ దగులసాగెను. తిరిగి చేతితో బాగుగ కుండను బరిశోధించెను. అం దేమియుఁ గనబడలేదు. అగుట ఆశ్చర్యచకితయై ఇది యేమో మాయ యని, తటాలున తన పెనిమిటికడకేగి జరిగినవృత్తాంతము నంతయు నెఱిఁగించెను. ఆతఁడును మిగుల అచ్చెరువొంది వచ్చి చూచునప్పటికి మజ్జిగ కుండలో లక్ష్మీనరసింహాకారమునొందిన యొకశిల ప్రత్యక్షమయ్యెను.

ఆగృహస్థుఁడు విగ్రహమును జూచి ఆశ్చర్యచకితుఁడై, ఇదియొకభగవంతుని లీలయని తమవారికందఱికి ఈసంగతినంతయుఁ దెలిపి, వారితోఁగూడ అనేకవిధముల ప్రార్థించిరి. అంత నరసింహుఁడు అశరీరవాక్కుతో "ఓభక్తులారా! మీరు

పడుకష్టములను జూడలేక నిన్ను రక్షింపుటకై నే నీ కలికాలములో సాక్షాత్కరించితి. నన్ను మీరు భక్తిశ్రద్ధలతోడ బూజింపుడు. మీరెన్నడేని కష్టముల నొందరు. ఇచ్చటనే యుండుడు. మీరు కలవృత్తాంతము మఱవకుడు. ఇచ్చట నాకు ఒక ఆలయమును కట్టింపుడు" అని యదృశ్యుడయ్యెను.

వారు ధన్యులమయితి మని భగవంతుని ప్రార్థించి, నారసింహవిగ్రహమును బూజించుచుండిరి. ఇంతలో కలవు నిజమాయెను. దేశము సుభిక్షమాయెను. అప్పుడు వారు తరికుండ నృసింహుడు అని పేరు పెట్టి, భగవంతునకు ఒక ఆలయమును కట్టించిరి. ఆ గ్రామమును గూడ *తరిగొండయని పిలుచుచుండిరి.

ఈ గ్రామమునందు పై వారివంశమువారగు కౌండిన్యగోత్రజాతుడగు కృష్ణయ్య అను నొక బ్రాహ్మణు డుండెను. అతనికి లేక లేక యొకకొమార్తె పుట్ట నందున వెంకమ్మ అని పేరుపెట్టుకొని గారాబముతో పెంచుచుండిరి. కన్యయు దిన దినాభివృద్ధినొందుచు, ఎనిమిదేండ్ల వయస్సు గలదయ్యెను. తండ్రి ఆమె రూపమున కును సుగుణములకును సంతసించి, ఒకగొప్పకుటుంబములోఁ బుట్టినవాని కిచ్చి వివాహాము చేసెను; కాని కర్మఫలమునకు యెటువంటివారికి అనుభవింపకతీరదు. ప్రొద్దున లేచినదిమొదలు మనుజులకోరికలు దొంతరలు దొంతరలుగ బయలువెడలు చుండును; కాని ఆకర్మబలములేనిచో ఆకోరిక లన్నియు పుట్టినవి పుట్టినట్లే నశించును. పాపము వెంకమ్మకు పెండ్లియయిన ఒక సంవత్సరమునకే భర్త పరలోకగతుఁ డయ్యెను. ఆయవస్థను జూచి తల్లిదండ్రులు మితిలేని శోకసముద్రములో మునిఁగి పోయిరి.

వెంకమ్మ యొకటిసుండియు వైరాగ్యవంతురాలు అగుట, తనభర్త గతించి నందులకు వగవక, ప్రారబ్ధకర్మ మనుభవింపకతీరదని దృఢబుద్ధి నవలంబించి, తలిదండ్రుల శోకమును దీర్చి వైరాగ్యమును బూని, భగవత్కథలను జదువుచు వినుచు బ్రహ్మచారిణియై భక్తిమార్గమునఁ గాలము గడుపుచుండెను.

ఇట్లు కొంతకాలముండి మదనపల్లెలో వేదాంతతత్త్వజ్ఞు లగు రూపావతారం సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని ఆశ్రయించి, వారిదగ్గర వేదాంతజ్ఞానము నలవఱుచుకొని పరమవిరక్తయై, యచ్చట నుండి బయలుదేరి తరికుండ నరసింహస్వామి కోవెలలో నుండు ఆంజనేయస్వామి విగ్రహమునకు వెనుకప్రక్కనున్న రహస్యస్థలమున నాహారవిహారము వర్జించి యోగనిష్ఠురాలై యుండెను.

లోకములో సామాన్యముగ సంగతి తెలిసికొనకయే ఒకరిపై తటాలున అపనిందలను వేయుట పామరజనుల స్వభావము. వారు కూపస్థకూర్మములవలె

* ఈ గ్రామము కడపజిల్లాలో చేరిన వాయిల్పాడునకు నాలుగుమైళ్లదూరమున కలదు.

లోకజ్ఞానముగాని శాస్త్రజ్ఞానముగాని లేక, యెవఁడో అనామధేయుఁడు చెప్పిన మాటను నిజముగ నమ్మి తత్వజ్ఞులను సైతము దూషించుచుందురు. వెంకమ్మ వేదాంతమును జపుపుకొనుటకుఁ బోయినదని తత్వమును దెలిసికొనక, పామరులు పరాపు చిత్తగించినదని అపనిందపుమోపి పలువిధముల దూషించుచుండిరి. పాపము! భక్తాగ్రేసరురాలగు వెంకమ్మకు ఈసంగతి ఏమి తెలియును ?

ఒకనాఁడు అర్చకుఁడు కోవెలలో ఎందులకో మూలమూలలఁ బరీక్షించుచు, ఆంజనేయవిగ్రహము వెనుకఁ గూర్చుండియున్న వెంకమ్మను జూచి మొదట నేమో యని భయపడి, ధైర్యము దెచ్చుకొని పరీక్షించి చూచి వెంకమ్మ యని స్పష్టముగఁ దెలిసికొనెను. అగుట వెంకమ్మపై అపనింద గలిగియుండుటయు, దానికిఁ దగినట్లు నాల్గుదేండ్లు గ్రామములోఁ గనఁబడకుండుటయు, ఆలోచించి లోకాపవాదము సత్యమని తలఁచి కోపముతో "ఓసి లంజముండా! చెడ్డపనులు చేయుటయే కాక సిగ్గులేక యీదేవాలయములోఁ జేరి దొంగవేషము వేసికొని స్వామివారి వస్త్రాభరణములు దొంగిలించుటకుఁ గూడఁ బూనితివా ? ఛీ ! లెమ్ము" అని తటాలున ఆమె జుట్టుఁబట్టికొని లాగి, ఆమెయోగమును భంగపఱిచెను. అంతవఱకును వెంకమ్మ శ్రీమన్నారాయణునే మనమున ధ్యానించుచు, ప్రపంచవిషయములను మఱచి భగవదేకాయత్తచిత్తయై యున్నందున ఈసంగతి ఏమియుఁ దెలిసికొనినది కాదు.

అంత అర్చకుఁడు బలాత్కారముగ నవలకు ఈడ్చికొనివచ్చునప్పుడు వెంకమ్మ తెలివొంది కన్నులు దెఱచి చూచెను. ఆమె ప్రభావమువలన నాతఁడు నిలిచినవాఁడు నిలిచినట్లు స్తబ్ధుఁడై యేమియుఁ జేయఁజాలకపోయెను. వెంకమ్మ "శ్రేయాంసి బహువిఘ్నాని" అనునట్లు మంచికార్యమునకు దిగిన నందఱు భంగము చేయ నెంతురు. కాన నిచ్చట నుండఁగూడదు. "కలౌ వేంకటనాయకః" అనునట్లు సర్వేశ్వరుఁడు వేంకటాచలమున నెలకొనియున్నాఁడు. ఆదేవదేవుని సేవించి ఆతని పాదారవిందములసన్నిధినే నాప్రాణములు సమర్పించుకొందును గాక!" యని తలఁచి,—

శ్లో. "శ్రీకాంతాత్మసరోజచండకిరణం శీతాంశుబింబాననం
శ్రీకంఠాబ్జజసన్నుతాంఘ్రికమలం చిన్మాత్రమప్రాకృతం
లోకాతీతమనేకగోపయువతీలోలం పరం సర్వగం
స్వాకారం తరికుండకేశవధరాధ్యక్షం భజేఽహం సదా."

(వేంకటాచలమాహాత్మ్యము, అ. 1. శ్లో. 1.)

అని తరికుండదేవుని ప్రార్థించి సెలవుగైకొని, శ్రీవేంకటాచలమునకు బయలుదేరి పోయెను,

ఇటు అప్పుడువారు కొంతవడికి తెలివి తెచ్చుకొని నాయకుడు నాగరాజాగ్రణి యనియు, ఆమెప్రభావముననే తన కష్టస్థితి సంభవించినదనియు తెలిసికొని, యపరాధ క్షమాపణకై యామెకాళ్లమీఁదఁ బడి వేఁడుకొనఁ జూచెను; కాని ఆమె యతని కగపడలేదు. అంత నతఁడు స్వామిసన్నిధి కేతెంచి "స్వామీ! అసలు తెలియక నీభక్తురాలి కపచారముచేసితిని. నన్ను క్షమింపుము. నాదోషములను బోకడచి రక్షింపుము" అని ప్రార్థించి, ఆసంగతి యంతయు ఊరివారి కందఱకుఁ దెలిపెను. పౌరులందఱు తాము నిష్కారణముగ వెంకమ్మయందు అపవాదను మోపినందులకు వగచి, బుద్ధి తెచ్చుకొని ఆమెను ఎక్కుడు గొనియాడిరి.

అట్లు వెంకమ్మ తరికుండనుండి బయలువెడలి వేంకటాచలమును జేరి

సీ. "ఘనగోపురములు ప్రాకారమంటపములు తేరులు సత్పుణ్యతీర్థములును
కమలాప్తకిరణసంకలితంబులై ప్రకాశించుచుండెడు హేమశిఖరములును
పావనపరివారదేవాలయంబులు మహిమనొప్పు విరక్తమఠవరములు
రంగత్తురంగమాతంగతురంగము ల్గోమరారుబహుసాధునోగణములు
తే. ముద్దుగాఁబల్కు శుకపికములును నీలకంఠములును మరాళసంఘములు మఱి కందఫలవనంబులు తులసికాదళసుమములు, క్రిక్కిఱిసి యందుఁ వేంకటగిరిని గాంచి."
(వేంకటాచలమాహాత్మ్యము. ఆ. 1. ప. 24.)

భక్తిపూర్వముగ స్వామిపుష్కరిణిలో తీర్థమాడి, వేంకటేశ్వరుని వలగొని సాష్టాంగ దండప్రణామము లాచరించి, "వేంకటేశ్వరా! దీనబంధూ! ఏడుకొండలవాఁడా! వేంకటరమణా! అనాథనగు దాసురాలిని దేవరపాదారవిందములఁ జేర్చికొనుము. అశరణ్యశరణ్యా! సర్వవిధబంధువు నీవు దక్క మఱియొకఁడు లేఁడు" అని పలువిధములఁ బ్రార్థించి, యాదివ్యపర్వతమునఁ బుణ్యతీర్థమగు తుంబురుకోనదగ్గఱ నొక వివిక్తప్రదేశమున భగవద్ధ్యానమునఁ గాలక్షేపముచేయుచు,—

సీ. "నాచిన్ననాఁట నెోనామాలునైన నాచార్యులచెంత నేఁ జదువలేదు
పరగుఛందస్సులోఁ బదిపద్యములనైన నిక్కంబుగా నేను నేరలేదు
లలి కావ్యనాటకాలంకారశాస్త్రము ల్వీనులనైనను విన గలేదు
పూర్వేతిహాసవిస్ఫురితాంధ్రసత్కృతు లొకొక్కింధించి వరుసఁగఁ జూడలేదు
తే. చేరి తఱికుండపురినారసింహదేవుఁ, డానతిచ్చినరీతిగ నేనిమిత్త
మాత్రమునఁ బల్కుదును స్వసామర్థ్యమిప్పు, డరయ వించుకయేని నాయందు లేదు."
(వేంకటాచలమాహాత్మ్యము. ఆ. 1. ప. 21.)

అని నైచ్యానుసంధానపూర్వకముగ వేంకటాచలమాహాత్మ్యము, ముక్తికాంతావిలాసము, రాజయోగసారము, భాగవతము (ద్విపద) అను గ్రంథముల రచించి

శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి పోయి, కొన్ని దినములు యోగనిష్ఠలోనుండి, తరువాత శ్రీవేంకటేశ్వరసాయుజ్యమును బొందెను.

మాలిని "కలశజలధిబాలా కాంతశృంగారలీలా
సలలితగుణజాలా సామగానాభిలోలా
కలుషనిచయశైలోగ్రాశనీ వేదమూలా
విలసితగుణశీలా వేంకటాఖ్యాద్రిపాలా."

(శ్రీవేంకటాచలమాహాత్మ్యము. ఆ. 1. ప. 249.)

---

## 56. ప్రేమాబాయి

శ్లో. "మమ చేతసి స్ఫురతు వల్లవీవిభో, ర్మణినూపుర ప్రణయి మంజుశింజితం,
కమలావనేచరకళిందకన్యకా, కలహంసకంఠకలకూజితాదృతమ్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 17.)

కాశీక్షేత్రమున ప్రేమాబాయి అను నొక రమణీమణి యుండెను. ఆమె భర్త సుగుణశాలి; అనవరతము భగవద్ధ్యానమున మునిఁగియుండుట తక్క నాతఁడు అన్య మెఱుఁగఁడు. ప్రేమాబాయి భర్తృపూజాధురంధరయై, ఐహికసుఖాపేక్ష లేక శ్రీహరిని గొలుచుచుఁ గాలము గడపుచుండెను. నగరమునందలివారెల్లరును ఆమెను చాలగౌరవించుచుండిరి. ఆదంపతులకు ఒకకుమారుఁడుకలిగెను. కుమారుఁడు పదిసంవత్సరముల ప్రాయమువాఁడు అయినపుడు దైవవశమున తండ్రి పరమ పదించెను. ప్రేమాబాయి ఎప్పటికైన నిది తప్పనిదేయని ఎఱింగి విచారింపక శ్రీకృష్ణునిఁబూజించుచు నానందపరవశయై యుండెను.

ఒకనాఁడు ప్రేమాబాయియింటకి కొందఱు భాగవతులు వచ్చిరి. ప్రతిదినము ప్రేమాబాయి మధ్యాహ్నభోజనానంతరము ఆవీథియందే ఒకపండితుఁడు భాగవతము పురాణము చెప్పుచుండఁగాఁ బోయి పరమభక్తితో వినుచుండెడిది. నేఁడు భాగవతులు వచ్చుటచే వారికి సపర్యలు చేయవలసివచ్చెను. ఈపనిలోఁ గూర్చున్న పురాణమువినుట తటస్థింపదు. వినిన భాగవతసేవ తటస్థింపదు. అత్యవసరములయిన ఈరెండింట నేది విడువఁగలదు?

కొంతసేపు ఆమె ఇట్లు ఆలోచించి, కుమారునిఁ జేరఁబిలిచి "కుమారా! నేఁడు భాగవతులు వచ్చియున్నారు. వారిని సేవింపకుండ పురాణము వినుటకుఁ బోవుట ధర్మముగాదు. పురాణము వినకుండ నుండఁజాలను; కావున నీవు పోయి పురాణము శ్రద్ధతో ఒక్క అక్షరమైన విడువకుండ విని వచ్చి నాకుఁ జెప్పవలెను. నేను

భాగవతారాధనము గావించుము" అని చెప్పెను. కుమారుడు తల్లియని చెప్పి పోయెను.

మరల ప్రేమాబాయి హరిధ్యానముతో గంగానదికిఁ బోయి స్నానము చేసి స్వామిదర్శనము చేసివచ్చి, సకలపదార్థములును వండి భాగవతులకు తృప్తిగా భోజనము పెట్టి సంతోషపడెను. ఇంతలో కుమారుడు వచ్చెను. అంతట ప్రేమాబాయి కుమారునకు భోజనము పెట్టి, తాను భుజించి కూర్చున్నతరువాత, కుమారుడు పురాణవిషయము నంతయుఁ జెప్పెను. కౌరవేశ్వరుడు యశోద కృష్ణుని రోటికి కట్టివేయుట, అతడు లాగికొనిపోయి నడిపించుకొని జంటవృక్షము మోక్షించుట మున్నగువిషయములను వ్యాఖ్యానము చేసినట్లు చెప్పెను. కుమారుడు ప్రేమాబాయికి వినవచ్చునట్లుగా వివరముగా చెప్పెను. తోడనే ప్రేమాబాయి "హా కృష్ణా! నీకెట్టిపాటు వాటిల్లె" నని యేడ్చుచు, "నిన్నో వచ్చి విడిపించెదను" అని మనసుగట్టి కొనిపోవుచు కొంతదూరము పోయిన తరువాత క్రిందఁబడి ప్రాణములు విడిచెను. భాగవతులు ఆమె తన్మయత్వమునకు ఆశ్చర్యపడి ఆమె ననేకవిధములఁ గొనియాడి వెడలిపోయిరి. కుమారుడు తల్లికి యథాశాస్త్రముగ ఉత్తరక్రియలను నిర్వర్తించి, తాను గూడ భక్తిమార్గమునఁ బ్రవేశించెను. ప్రేమాబాయి ఈశ్వరసాయుజ్యమును బడసెను.

మ. "దినముల్ నాదు హృదంతరాళమున వర్తిల్లుల్ గళిందాత్మజా
వనజాళిల్ విహరించు నంచకలరావంబుల్ విడంబించున
వ్వనజాతేక్షణు పాదనూపురమణిధ్వానంబు గోపాంగనా
జనరాసోత్సవనృత్తకేళికలనాసాచివ్యథా రేయమై."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 17.)

---

# 57. గోమాబాయి

శ్లో. "మాధుర్యేణ ద్విగుణశిశిరం వక్త్రచంద్రం వహంతీ
వంశీవీథీవిగళదమృతస్రోతసా సేచయంతీ,
మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం
మత్పుణ్యానాం పరిణతిరహో నేత్రయోస్సన్నిధత్తే."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 74)

గోమాబాయి అను ఒకవితంతుస్త్రీ విరాగిణియై భిక్షాటనమున జీవము నిలుపుకొనుచు, అనవరతము భగవద్ధ్యానతత్పరయై యుండుచుండెను. ఒక సంవత్సరము ఆమె పండరిపురమున జరుగుమహోత్సవమును జూచి, స్వామిని సేవించుటకు నిశ్చ

యుంచుకొని బయలుదేఱెను. మార్గస్థులతోఁ గలిసి యామె చంద్రభాగానదియొద్దకు వచ్చెను. కూడవచ్చినవారందఱతోఁ బాటుగ నామెయు ఓడయెక్కెను. కళాసులు అందఱివలనను కేవు వసూలు చేసి గోమాబాయి చెంతకు వచ్చిరి. ఆమెచెంత నొక కాసైనను లేదు. "నేను బీదరాల" నని ఆమె ఎంత బ్రతిమాలినను వాండ్రు అంగీకరింపలేదు. "నాచెంత కొంచెము పిండి యున్నది. అందలి సగము ఇచ్చెద" ననినను, వాండ్రు "మాకు పిండి వలదు. డబ్బుకావలయును. ఇచ్చుటకు శక్తిలేదేని దిగిపొమ్ము" అని బలవంతముగ క్రిందికి దింపివేసిరి.

గోమాబాయి యేమియుఁ జేయఁజాలక విచారముతో ఒడ్డుమీఁదికిఁ బోయి పండరినాథుని యిట్లు ప్రార్థింపఁదొడఁగెను.

మ. "యమునాతీరవనాంతసంజనితదావాగ్నిస్ఫుటార్చిర్నికా
యము నానాజనభీకరం బగుచు డాయన్ వ్రేల వేఁ గాచునె
య్యము నాయం బని దాని నానె నఁట నిత్యంబున్ హరిన్ గుప్తసం
యమునారాధనసేయుఁ నాకిపు డభీష్టావాప్తి గాకుండునే!

ఉ. "కోమలసుందరాకృతియుఁ గొప్పకసుంగవ కెంపుమోవియు
న్సోముని వ్రేలుముంగురులు నూత్నవిభూషణభూషితాంగము
ద్దామదిగంబరాకృతియుఁ దాల్చిన వెన్నునిఁ జిన్నిబాలునిన్
శ్రీ మెఱయన్ భజింతు నతసీసుమభాసుని నందసూనునిన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 16, 19.)

ఇట్లు ఒకటి రెండుగడియలు గడచునప్పటికి పండరినాథుఁడు ఒకపల్లెవాని వేషము ధరించి, చిన్ననావను నడపుకొనుచు నచ్చటికి వచ్చి, "తల్లీ! ఇచ్చట నీవు ఏల ఏకాకివై యుంటివి? పండరినాథునిఁ బ్రార్థించుచున్నావు. కావున నీవు యాత్రార్థినివై వచ్చితివని తలంచుచున్నాను. అయిన నిచ్చట నేల కూర్చుందువు? నావ నెక్కుము. అవ్వలిగట్టునకుఁ గొనిపోయెదను". అని పిలిచెను. అంతట నామె "నాయనా! నేను నిరుపేదరాలను. ఒక్కకాసైనను లేదు. కొంచెము పిండి మాత్రము ఉన్నది. కొంత నీకిచ్చెదను. నన్నవ్వలకుఁ జేర్చి పుణ్యము, గట్టుకొమ్ము" అని ప్రార్థించెను. అందులకు ఓడవాఁడు మందహాసముచేసి, "తల్లీ! నేను ధనము సంపాదించుటకు ఈవృత్తిలోఁ బ్రవేశింపలేదు. భక్తులకు సాయముఁజేయుటయే నావృత్తి. నాకేమియు వలదు. నీవు ఆనందముతో నాయోడ నెక్కుము. భద్రముగా నిన్ను అవ్వలకుఁ గొనిపోయెదను" అని బదులుచెప్పెను. నేను ఏకవస్త్రను; అందును, "నేను ధరించినది చినుఁగులగుడ్డ; అది తడిసిపోయెనేని వృద్ధురాలనగు నేను ఈరాత్రి చలిబాధను ఎట్లు తొలఁగించుకోఁగలను?" అని యామె యడుగఁగా, "నీకు భయము వలదు. నేను నీకు పుత్రప్రాయుఁడను; నీవు సందియములేక నాభుజ

ముపై నెక్కు" మని చెప్ప యామెం డావెం అంగీకరింపఁగా, నాతఁడు భుజము
మీఁద నెక్కించుకొని పోయి పడవలో నెక్కించి, శీఘ్రముగా అవ్వలిగట్టునకుఁ
గొనిపోయి దింపి గ్రామములోనికి బంపివేసెను. అందులకు ఆమె చాలకృతజ్ఞయై
"తండ్రీ! నాచెంతనున్న పిండిలో కొంచెము చేకొనుము" మనఁగా, నాతఁడు "నాకు
వలదు. రేపు ద్వాదశి కావున ఆపిండిని ఒక యతిథికి నిమ్ము. అదియె నాకు ఆనంద
ప్రదము" అని చెప్పి అదృశ్యుఁడై పోయెను.

పిదప గోమాబాయి ఊరిలోనికిఁ బోయి ఆలయమున సొచ్చి, యథావిధాన
ముగ స్వామిని దర్శించి, ప్రార్థించి కొనియాడి మ్రొక్కి, ఆరాత్రి జాగారము చేసి
కడపెను. తెల్లవారినపిదప భక్తులందఱితోఁ గలిసి చంద్రభాగకుఁ బోయి స్నానము
చేసి, పండరినాథుని నామస్మరణము గావించుచు అతిథినిమిత్తము నిరీక్షింపసాగెను;
కాని ఎంతకు ఎవరును రారైరి. అంతట నామె విచారముతో "రుక్మిణీనాథా! నీభ
క్తులు అందఱును ధనముకలవారు; కావున తమతమ వైభవముల ననుసరించి అతిథి
సంతర్పణము చేయుచున్నారు. నేను అట్టిదానను కాను. ఇట్లు నీవు గూడ పక్ష
పాతము చూపిన నిఁక లోకము నిలుచునా?" యని ప్రార్థించుచుండఁగా, పండరి
నాథుఁడు ఒక వృద్ధబ్రాహ్మణరూపముతో వచ్చి, "తల్లీ! ఆఁకలికి నేను దాళఁజాలక
యున్నాను. నావికృతవేషమును జూచి ఎవరును నన్ను చేరనీకున్నారు. నీవైన
నాప్రాణములు నిలుపవా? నాకు ఒకరొట్టె చాలును" అని కూలఁబడెను. అందులకు
గోమాబాయి చాల సంతసించి ఉపచారములు పలికి, తనచెంతనున్న పిండితో రెండు
రొట్టెలు కాల్చి ఒకరొట్టె బ్రాహ్మణుని ముందు ఉంచెను; దానిని ఆతఁడు తినఁబోవు
చుండఁగా, రుక్మిణీదేవి వృద్ధబ్రాహ్మణీరూపముతో వచ్చి "నేను ఆఁకట నననక మాడు
చుండఁగా నీవు ఇక్కడకు వచ్చి ఒక్కఁడవును రొట్టె తినుచుంటివా?" యని పలికెను.
అప్పుడు వృద్ధుఁడు గోమాబాయినిఁ జూచి "తల్లీ! మిగిలినరొట్టెను ఈమె కిమ్ము"
అని పలికెను. గోమాబాయి అట్లేచేసెను. వారిద్దఱును ఆరొట్టెలను తిని, నిజరూపము
లతో ఆమెకు సాక్షాత్కరించి అనుగ్రహించి అదృశ్యులైరి. గోమాబాయి బ్రతికి
యున్నంతకాలమును పండరినాథుని సేవించి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును
బడసెను.

శా. "లావణ్యాంబుధి చంద్రబింబముఖలీలన్ దాల్చి వంశీనినా
దావిర్భూతసుధాప్రవాహమున నోలాడం బ్రవర్తిల్లునా
దైవాకారము నావచోవిహరణస్థానంబు నాపుణ్యభ
ద్రావంబారఁ బ్రసన్నమయ్యెను యశోదాపుత్రరూపంబునన్."

(కృష్ణకర్ణామృతము. ఆ 1. ప. 74.)

# 58. రామాబాయి

శ్లో. "సోఽయం విలాసమురళీనినదామృతేన సించన్నుదంచితమిదం మమ కర్ణయుగ్మం,
ఆయాతి మే నయనబంధురనన్యబంధు రానందకంచలితకేళికటాక్షలక్షః."

(కృష్ణకర్ణామృతము ఆ. 1. ప. 75.)

కాశీనగరమునకు అధిపతియగు సంతరాజు చాల మంచివాఁడై నీతిమంతుఁడై ప్రజలను కన్నబిడ్డలను వోలెఁ గాపాడుచు, సదా హరిధ్యానతత్పరుఁడై యుండు చుండెను. అతనికి లేకలేక ఒకకొమార్తె కలిగెను. ఆబిడ్డను తలిదండ్రులు అతి ప్రేమతోఁ బెంచుకొనుచుండిరి. ఆమెకు రామాబాయి అని పేరు ఉంచఁబడెను. బిడ్డను జూచి ఇరుగుపొరుగువారుగూడఁ జాల సంబరపడుచుండిరి.

సంతరాజు ఆమెకు యుక్తసమయమున అక్షరాభ్యాసముచేయించి, యోగ్యుఁడగు నొక గురువువద్ద విద్యాభ్యాసమునకు అప్పగించెను. సుగుణఖని యగు ఆబ్రాహ్మణుఁడు ఇట్టి కన్యారత్నమునకు విద్యచెప్పునదృష్టము పట్టినందులకు చాల నానందించెను. అతఁడామెను కన్నబిడ్డవలెఁ దలంచి చదువు చెప్పఁబూనెను. ఆమెయు వయస్సునఁ జిన్నదియయ్యు గుణముల వృద్ధురాలుగావున, గురువును దేవునిగను తండ్రిగను దలంచి పూజింపసాగెను. కొలఁదిదినములయందే ఆమెకు విద్యాభ్యాసము పూర్తియయ్యెను. ఒకనాఁడు ఉపాధ్యాయుఁడు "తల్లీ! ఇఁక నీకుఁ జెప్పవలసినదేమియు లేదు" అని పలికెను. అంతట రామాబాయి "మీయనుగ్రహమువలన నాకు సకలమును దెల్లమైనది. అయినను పతివ్రతాధర్మములను మీవలన వినవలయునని కుతూహలము గలదు" అని విన్నవించెను.

అందులకు ఉపాధ్యాయుఁడు "అమ్మా! వివాహమైనది మొదలుకొని జన్మము ఉన్నంతకాలమును పతి ననువర్తింపవలసిన రమణీమణులధర్మములను ఆమూలముగ వివరించిచెప్పుట కెవ్వరికి శక్యమగును ? నీవు తెలియనిదానవు కావు. తెలియనివారికి జెప్పినను బ్రయోజనములేదు. పతి సురూపియైనను, కురూపియైనను, సుగుణశాలియైనను, దుర్గుణవంతుఁడయినను, జారుఁడైనను, చోరుఁడైనను, అనాచారుఁడైనను, అపాత్రుఁడైనను, మఱియెట్టివాఁడయినను ఎదురాడక పదదాసియై రమణి మెలంగవలయును. అంతయు దీనియందే యున్నది" అని యిట్లే కొంతతడవు చెప్పెను. పిదప రామాబాయి గురువునకు అనంతధనము గురుదక్షిణగానిచ్చి ఆనందపెట్టెను. సంతరాజు గూడ ఉపాధ్యాయుని చాల గౌరవించెను.

పిదప సంతరాజు తనకుఁ దగినసంబంధమును జూచి రామాబాయి నొక రాజపుత్రునకునిచ్చి మహావైభవముతోఁ బెండ్లిచేసెను. వివాహానంతరము రామాబాయి

అత్తవారింటికిఁ బోయెను; కాని పితృసదనమున నభీష్టసుఖానుభవము చేయుచుం
వ్యతిరిక్తుఁడయ్యెను. అతఁడు సకలమును ధర్మశాస్త్రోక్తమార్గమున ఐహికసుఖ
ములమీఁద వైరాగ్యమని కొంతవఱకైనను విమర్శించెను. విప్రుఁడౌ అతఁడే
పురమునువిడిచియుండుటకు అంగీకరింపకయుండెను. ఇప్పుడైన భర్తను స్వాధీనముచేసు
కొనవలయునని రామాబాయి యోచించి, తన యుక్తాయుక్తములను వెంటనె తోఁచు
దని అతఁడు చిక్కుబిగియ సాగెను. పయింపయిగ నాతఁడు తన స్వభావమును
మార్పవలయుననిగూడ సంకల్పించి యనేకవిధములఁ బ్రయత్నింపసాగెను.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగా, రామాబాయి గర్భవతియయ్యెను. తొమ్మిదిమాసములు గడచిన పిదప నామె ఒక పుత్త్రునిఁ గనియెను. ఆ కుమారుని తనవంటి వానిని జేయవలయునని తండ్రియు, తనవంటివానినిఁ జేయవలయునని తల్లియుఁ బ్రయత్నింపఁబొచ్చిరి. ఒకయేకాదశినాఁడు రామాబాయి తాను వసించి భర్తనుగూడ ఉపవసింపవలసినదని చెప్పెను. అతఁడు అంతట అంతఃపురమునకు ఒక మేఁకను దెప్పించి, స్వయముగ రామాబాయియెదుట దానిని సంహరించి వంటవాండ్రకు "నేఁడు దీనిని వండుఁడు" అని నియమించెను. అదిచూచి రామాబాయి చాలఁ గటకటఁబడి, ఇట్టివానిని ఎట్లు మంచిమార్గమునకుఁ దేవచ్చునని చాల యోచించి, ఒకనాఁడు పాలలో విషముగలిపి బిడ్డకు ఇచ్చెను. కొంతసేపటికి ఆబిడ్డఁడు చనిపోయెను. అంతటఁ దండ్రివచ్చి ఆవేదనగ విచారింపసాగెను. అప్పుడు రామాబాయి ఇదేసమయమని యోచించి, "నాథా! ఏల విచారించెదవు? కానున్నది కాక మానదు. ఇట్లు విచారించుచుఁ గూర్చుండిన మనపుత్త్రుఁడు బ్రతుకఁడు. ఈశ్వరాజ్ఞ లేనిదే చీమయుఁ గుట్టదు. ఇట్లగుటకు ఈశ్వరుని సంకల్పమె యయినది. మనపుత్త్రుఁడు బ్రతుకవలయుననినచో మరల ఈశ్వరునియాదేశము కావలయును; కాని విచారమువలనఁ బ్రయోజనములేదు. దేవాలయమునఁ గొందఱు భాగవతులు వచ్చియున్నారు. వారు శ్రీహరి శ్రీపాదతీర్థమును మనబిడ్డకళేబరముమీఁదఁ జిలికినచో ప్రయోజనము ఉండ వచ్చును; కావున నీవు పోయి ప్రార్థించి వారినిఁ గొనిరమ్ము" అని చెప్పెను. అతఁడు ఇది విని తొలుత నొకింత కోపించెను; కాని తుదకు "ఏపుట్టలో నేపామున్నదో ఎవరు చెప్పఁగలరు?" అని తలంచి, భార్య చెప్పినట్లు దేవాలయమునకుఁ బోయి, భాగవతులను అనేకవిధములఁ బ్రార్థించి ఇంటికిఁ గొని వచ్చెను. రామాబాయి భాగవతుల ననేకవిధములఁ బూజించెను. అంత భాగవతులు దయార్ద్రహృదయులై శ్రీహరిదివ్యపాదోదకమును బాలునిమీఁదఁ జల్లిరి. తోడనే బాలుఁడు నిద్రించినవానివలె లేచి కూర్చుండెను. అది చూచి ఎల్లరును ఆశ్చర్యచకితులైరి. రాజు చాల సంతసించి భాగవతుల ననేకవిధములఁ గొనియాడి, పూజించి

వారిచే జ్ఞానోపదేశమును బడసి, "ఇంతపఱకును నేను క్రూరుఁడనై నిన్ను అలయించితిని. అయినను నీవు నామీఁద పగఁబూనక సంతత పరిశ్రమచే నన్ను ఉద్ధరించితివి. కోటిజన్మములయందు నీకు దాస్యముఁ జేసియు నేను నీఋణమును దీర్చుకొనఁజాలను" అని రామాబాయిని అనేకవిధములఁ గొనియాడెను.

పిదప ఈదంపతులు బ్రతికియున్నంతకాలమును సకలవిధములను శ్రీహరిని సేవించి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసిరి.

శ్లో. "శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముపచితతమస్సంఘనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీకృష్ణమంత్రం జపజప సతతం జన్మసాఫల్యమంత్రం." (ముకుందమాల. 23.)

---

# 59. కర్మాబాయి

శ్లో. "మాతః కిం యదునాథ దేహి చషకం కిం తేన పాతుం పయ
స్తన్నాస్త్యద్య కదాస్తి వా నిశి నిశా కా వాంధకారోదయః
ఆమీల్యాక్షియుగం నిశాప్యుపగతా దేహీతి మాతుర్ముహు
ర్వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణస్స పుష్ణాతు వః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 60.)

జగన్నాథక్షేత్రమున కర్మాబాయి అనునొకస్త్రీ యుండెను. ఆమె గర్భవతియై యుండఁగా భర్త పరమపదించెను. అదుఃఖమువలన నామె ప్రపంచ మెఱుంగక యుండి, కొన్నిదినములకు ఒకకుమారుని గనియెను. కర్మాబాయి ఏకపుత్రుని మిగుల గారాబముతోఁ బెంచుచు, ఆయాయుక్తసమయములయందు విద్యాభ్యాసము ఉపనయనము మున్నగువానిని నిర్వర్తింపించి, తుదకొక మంచికన్యను దెచ్చి వివాహము గావించెను. వివాహమైన కొలఁదిదినములకే కర్మాబాయికోడలు గర్భవతి యయ్యెను. సకలకష్టములను అనుభవించి పెంచిన తన బుడుతఁడు ఇఁకఁ గుమాళ్లతండ్రియగును గదా!" యని యామె యానందించుచుండఁగా, ఆకస్మికముగా నుద్ధృత రోగమువచ్చి ఆతఁడు చనిపోయెను. గోరుచుట్టుమీఁది రోకటిపోటువలె దుస్సహమైన పుత్రవియోగ మనుదుఃఖమును అనుభవించుచుండఁగా, కోడలు ప్రసవమయ్యెను. మగబిడ్డ కలిగినందులకు కర్మాబాయి మఱల నానందించుచుండఁగా మాటలువచ్చుప్రాయమున మనుమఁడుగూడ ఈలోకమును విడిచిపోయెను. అంతట కర్మాబాయి మిన్నువిరిగి మీఁదఁబడినట్లు ప్రపంచము నెఱుంగక, మింటికి మంటికి నేకధారగా విచారింపసాగెను.

కాలక్రమమున ఈవిచారము వెనుకపడసాగెను; కాని తరుగలేదు. ఇట్లుండఁగా, జగన్నాథయాత్ర చేసికొనుటకు వచ్చిన భాగవతోత్తముఁడొకఁడు కర్మాబాయి యింట బసచేసెను. అతఁడు కర్మాబాయి తరచుగ చింతతో విచారించుచుండుటఁజూచి కారణము నెఱింగి, ఆమెను చేరఁబిలిచి యిట్లు చెప్పెను.

"తల్లీ! నీవు కాలము గడచినదానవు. ప్రాపంచికవృత్తములలో నీకుఁ దెలియనివి లేవు. సంసారమున సంభవించు నష్టములు నీవు ఎఱుఁగనివి లేవు. ఇట్టి పూర్ణానుభవమును గలిగియు, సంగతి సందర్భములను గ్రహింపలేకున్నావు. భర్త, పుత్త్రుఁడు, పౌత్త్రుఁడు అచిరకాలమున వరుసగా గతించుట విస్మయకరమే; విచారకారణమే; కాని బాగుగ యోచింపుము. పుట్టిన తరువాత చావకుండ నుండిన వారెవరో తెలుపుము. పురిటిగదియందే కొందఱు చచ్చిరి. పదియేండ్లు బ్రతికి కొందఱు కూలిరి. నూఱేండ్లు బ్రతికి అనేకులు సమసిరి. ఇట్లే అనేకప్రాయముల యందు అనేకులు రూపుమాసిరి. చావుమాత్రము ఎవరికిని తప్పియుండలేదు; తప్పదు. 'జాతస్య మరణం ధ్రువ' మ్మను నెఱుఁగవా? కాని చనిపోయినవాఁడు మఱల బ్రతికినట్లు ఎప్పుడును వినఁబడలేదు. దానికి ఏవియు ఉపాయములు లేవు. ఇఁక ఇట్లు విచారించుటవలన ఏమి ప్రయోజనము? ఇంతకంటె అజ్ఞానము ఏమి యున్నది? విచారించుచున్న నీవును చనిపోదువు. విచారింపవలదని చెప్పుచున్న నేనును చనిపోదును; కాని ఒక్కభేదము గలదు. కొందఱు మఱల జన్మింతురు. కొందఱు పునరావృత్తి రహితమైన శాశ్వత బ్రహ్మభావమును గాంతురు. ఇంతభేదము సంసారసంబంధములగు సకలవిషయములను అనుభవపూర్వకముగ నెఱుంగుచున్న నీకు పునర్జన్మమున సుఖమున్నదో, బ్రహ్మైక్యమున సుఖమున్నదో, వేఱుగఁ జెప్ప నక్కఱలేదుగదా! యుక్తాయుక్తవిచారము చేయఁగల వ్యక్తి పునర్జన్మమును గోరదు. పునర్జన్మమును బ్రహ్మైక్యమును మన ఇష్టానిష్టములయందున్నవి. కావున జగన్నాథ స్వామిసాక్షిగా నిన్ను ఉద్ధరించుటకుఁ జెప్పుచున్నాను. నేఁటినుండి,—ఈగడియ నుండి,—ఈక్షణమునుండి నీవు దుఃఖమును మానుము. నీకు గోపాలమూర్తి విగ్రహమును ఇచ్చెదను. దానిని నీవు నీకుమారుని, నీపౌత్త్రుని పెంచి లాలించునట్లు లాలించుచుండుము. అవసానమున నీకు ముక్తి చేకూఱును."

ఈమాటలు విని కర్మాబాయి దుఃఖమును మాని, భక్తుని యుపదేశానుసారముగఁ బ్రవర్తింపసాగెను. ప్రతిదినమును ఉదయమున ఆమె లేవఁగానే సకలకృత్యములను విడిచి, తొలుత అన్నము వండి గోపాలవిగ్రహమునకు నివేదించి, పిదప తొట్టిలోఁ బెట్టి జోలలుపాడి, పిదపఁ దాను సకలమును నిర్వర్తించుకొని స్నానము చేసి భగవన్నివేదితాన్నమును భుజింపసాగెను. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి ఆమెకు గోపాలవిగ్రహముతోడిదే లోకమయ్యెను. ఒకప్పుడు కర్మాబాయి

ఇంటికిఁ గొందఱు బ్రాహ్మణులు వచ్చిరి. వారామె ప్రవర్తనముఁ జూచి సందేహించి "తల్లీ! నీవు ప్రాతఃకాలమున లేవఁగానే అన్నము వండి పిదప స్నానము చేయుచున్నావు; ఇదియేల?" అని యడిగిరి. అందులకు ఆమె నాయనలారా! నేను స్నానముచేసి వచ్చునంతవఱకు నాబిడ్డఁడు ఆఁకలికిఁ దాళఁజాలఁడు. కావున నట్లు చేయుచున్నాను" అని చెప్పెను. "నీయింట బాలుఁడు కాన్పింపఁడేమి?" అని వారు అడుగఁగా, నామె గోపాలవిగ్రహమును దెచ్చి చూపి సకలమును వారికిఁ జెప్పెను. మధ్యాహ్నము వారు చూచుచుండఁగా, నామె గోపాలవిగ్రహము నెదుట అన్నమును వడ్డించి నివేదనము చేసెను. చూచుచుండఁగానే పాత్రమున ఉన్న సకలపదార్థములును మాయ మయ్యెను. బ్రాహ్మణులు అది చూచి పరమాశ్చర్యచకితులై, "ఈమెచరిత్రము అద్భుతముగా నున్నది. ఇట్టిది ఎందును కని విని యుండలేదు" అని యనుకొని, "తల్లీ! భగవంతుఁడు నీప్రాపున ఉన్నాఁడు. నీ యదృష్టము అనితరలభ్యము. అయినను ఇట్లుగాక స్నానముచేసి మఱియు పాకము చేయుట మంచిది" అని చెప్పి వెడలిపోయిరి. మఱునాఁడు ఆమె అట్లే చేసెను; కాని పాత్రమున వడ్డింపఁబడిన అన్నము అట్లే యుండెను. అందులకుఁ గారణము తెలియక ఆమె తహతహపడసాగెను. నాఁటిరాత్రి గోపాలుఁడు అర్చకునకు స్వప్నమున సాక్షాత్కరించి "కర్మాబాయి భక్తి విశ్వాసములు లేని శాస్త్రజ్ఞులమాటలను విని, నాకు అన్నము పెట్టుటలో మామూలుమార్గమును విడిచిపెట్టినది. అగుటచే నేఁడు నాకు అన్నము సహింపలేదు. నాకడుపు ఆఁకట నకనకలాడుచున్నది" అని చెప్పెను. మఱునాఁడు ఈసంగతిని అర్చకుఁడు కర్మాబాయితోఁ జెప్పి "తల్లీ! నీయనుగ్రహమువలన నాకు భగవంతుఁడు సాక్షాత్కరించి అనుగ్రహించెను" అని కొనియాడి, వెడలిపోయెను. కర్మాబాయి మఱల యథాప్రకారముగఁ జేయసాగెను. అప్పటినుండియు గోపాలవిగ్రహమునెదుటఁ బెట్టినపదార్థములు వెంటనే అదృశ్యములు కాసాగెను. అది చూచి కర్మాబాయి గోపాలునకు మఱలఁ దనమీఁద ననుగ్రహము కలిగెనని పరమానందభరితురాలు అయ్యెను. ఈసంగతి విని వచ్చి ఊరివారందఱును ఆమెను జాలఁ గొనియాడిరి. కర్మాబాయి బ్రతికియున్నంతకాలమును ఇట్లే గడపి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసెను.

ఉ. "అమ్మ ఇదేమిరా యదుకులాగ్రణి గిన్నె యొసంగు మేల పా
లిమ్ముగఁ ద్రావ లే దిపు డదెప్పుడు రేయదియొట్టి దంధకా
రమ్మగునన్నఁ గన్మోగిచి రాతిరి వచ్చెను వేగ పాలు తే
తెమ్మని తల్లిపైఁట పడిఁదీయుఁమకుందుఁడు నన్నుఁ బ్రోచుతన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 60.)

# 60. మీరాబాయి

శ్లో. లీలాటోపకటాక్షనిర్భరపరిష్వంగప్రసంగాధిక
ప్రీతే గీతివిభంగసంగరలసద్వేణుప్రణాదామృతే,
రాధాలోచనలాలితస్య లలితస్మేరే మురారేర్ముదా
మాధుర్యైకరసే ముఖేందుకమలే మగ్నం మదీయం మనః.

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. శ్లో. 22)

ఉదయపుర సంస్థానపు ఏలుబడిలోని మెర్తా రాజునకు మీరాబాయి అను పుత్త్రి కలిగెను. తలిదండ్రులు ఆమె నెంతో గారాబముతోఁ బెంచుకొనసాగిరి. మాటలాడ నేర్చిన దినములలు మీరాబాయి శ్రీకృష్ణా యని తీయగ పలుకుచుండెడిది; ఆటలాడఁబోవఁదగిన దినములలు ఆమె బంగరు శ్రీకృష్ణవిగ్రహమును అలంకరించుచు దానితో నాడుకొనుచుండెడిది; ప్రతిదినము ను ఆవిగ్రహమునకు జలకమాడించి, క్రొత్తబట్టలు కట్టి, గంధము అలఁది, పూదండలు వేసి—ఈతీరున ఆమె కాలము గడపుచుండెను. యుక్తసమయమునఁ దలిదండ్రులు ఆమెకు అక్షరాభ్యాసముఁ గావించిరి; కాని విద్యావిషయమున ఆమె శ్రద్ధచేయలేదు. తలిదండ్రులలో నెవరైన "చదువుకొనుమమ్మా" యని చెప్పినచో "ఇదిగో వెళ్లుచున్నాను" అని చెప్పి, వారు అవ్వలకుఁ బోయినవెంటనే తనపనిఁ దాను చేసికొనుచుండెడిది. కొంతకాలమునకు ఆమె వివాహయోగ్య యయ్యెను. అది చూచి తలిదండ్రులు ఆమెకుఁ దగిన వరుని అన్వేషించుటకుఁ బ్రారంభించిరి. ఒకనాఁడు తండ్రి కొమార్తెను చేరఁబిలిచి, "తల్లీ నీకు పెండ్లియీడు వచ్చినది. నీవు ఎవ్వరినేని వరించియున్నచోఁ జెప్పుము" అనియెను. అంతట మీరాబాయి లజ్జను బోఁద్రోసి, "నేను శ్రీకృష్ణమూర్తిని వరించితి" నని పలికెను. తలిదండ్రులు ఆశ్చర్యపడి "తల్లీ! నిన్ను వేళాకోళమునకు అడుగుట లేదు. యథార్థము చెప్పుము" అని యడిగిరి. మీరాబాయి "నేను వేళాకోళపుఁ బ్రత్యుత్తరము ఇచ్చుటలేదు. నిజమేచెప్పితిని" అని పలికెను. తల్లిదండ్రులకు ఈ మాట వజ్రాయుధ మయ్యెను. కొంతతడవు వారు మాటాడఁజాలకపోయిరి.

పిదప తండ్రి ఇట్లు చెప్పెను. "చిట్టితల్లీ, లోకములో నిట్టివింతలు గలవా? ఇది విన్న నలుగురును నవ్వరా? మాకుఁ దలవంపులు గదా! నీకు సిగ్గులచేటుగాదా? నీవు ఇదివఱలో యోచించుకొనియుండనిచో ఇపుడు యోచించుకొనుము. లేకున్న తగినవరుని మేము తెచ్చెదము. చెప్పుము." ఆమె ఇది విని, "తండ్రీ! నీవు పొరఁబడుచున్నావు. ఇదివఱకే నేను సకలమును ఆలోచించుకొంటిని. ఇఁక యోచింపవలసినది ఏమియు లేదు. వివాహముఁ గూడ ఆకష్టము పనిలేదు. తండ్రీ! నీకు ఈ వెఱ్ఱి ఏల? నాకు

రుక్మిణీకాంతునికంటె మంచివరుఁడు లభించునా? నీకు శ్రీకృష్ణునికంటె మంచిఅల్లుఁడు దొరకునా? ఇఁక నాయెదుట వివాహప్రస్తావము తేవలదు. నేను మానవమాత్రునిఁ బెండ్లియాడఁజాలను. మీకుఁ దెలియకపోవచ్చును. కాని నేను శ్రీకృష్ణునకుఁ బరిచర్య చేయుటకుఁ బుట్టితిని. మానవునకు మీరు నన్ను బలవంతముగాఁ గట్టిపెట్టిద రేని, నేను మీకును మీరు ఆనందముతోఁ దెచ్చుకొనిన అల్లునకుఁ గూడఁ దక్కను" అని చెప్పెను. తలిదండ్రులు ఇఁకఁ జేయునది లేక అందులకు అంగీకరించి, "వంశమునకు అమర్యాద రానీయకుము" అని చెప్పిరి.

పిదప మీరాబాయి సువర్ణగోపాలవిగ్రహమే లోకముగా నుండెను. అంతట లోకులు ఆమెను గుఱించి అనేకవిధములఁ జెప్పుకొనసాగిరి. అవి ఆమె తండ్రిచెవులఁ బడెను. ఆతఁడు సహింపలేక భార్యను బిలిచి "మనబిడ్డవలన మనకు అపకీర్తి వచ్చుచున్నది. సాధువులను సజ్జనులను చేర్చి ఆమె హరిభజనచేయుట లోకులకు అనుమానకారణమైనది. నేను ఈయవమానమును సహింపఁజాలను" అనియెను. ఆమె కూడ అట్లే చెప్పెను. పిదప ఇరువురును మాటాడుకొని గిన్నెలో విషమును బోసి దానిని ఆమెచెంతకుఁ గొనిపోయి, "నీవు మాయిష్టముప్రకారము పెండ్లియాడుము. లేకున్న ఈవిషమును బానము చేయుము" అని చెప్పిరి. మిరాబాయి ఆనందముతో ఆగిన్నెను అందుకొని, "నాథా! నీకుఁ దెలియనిది లేదు. నీకొఱకు నేను ఈవిషముఁ బానముచేయుచున్నాను."అని గడగడఁ ద్రాగివేసెను.ఆవిషము మిరాబాయికంఠము దిగుచుండఁగానే ఎదుటనున్న సువర్ణగోపాలవిగ్రహము నల్లఁబడెను. అది చూచి ఆమె తలిదండ్రులును చూచినవారును ఆశ్చర్యపడి, శ్రీకృష్ణుఁడు మిరాబాయికి స్వాధీనుఁడై యున్నాఁడని యెఱింగి, మిరాబాయికిని శ్రీకృష్ణునకును తీరని యపచారము చేసితిమని విచారించి, ఆమెను క్షమింపఁ బ్రార్థించిరి. అంతట నామె "హృదయేశ్వరా! ఈయపరాధమును క్షమించి,నాతలిదండ్రులను గాపాడుము"అని ప్రార్థించెను. తోడనే సువర్ణవిగ్రహము తొల్లిఁటివలె ప్రకాశించెను. అంతట రక్షింపవలసినదని మిరాబాయిని ఎల్లరును బ్రార్థించిరి. అదిమొదలు మిరాబాయిని ఎల్లరును బూజింపసాగిరి. మిరాబాయి బ్రతికియున్నంతకాలమును ఇట్లు కాలముగడపి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసెను. మిరాబాయిని అనుగ్రహించిన సువర్ణగోపాలవిగ్రహమును ఇప్పటికిని ఉదయపురమున జనులు కొలుచుచున్నారు.

మ. లలితాలోకతరంగసంగతము లీలామందహాసప్రభా
పులినంబుల్ మురళీరవామృతరసంబుల్ రాధికాలోచనో
త్పలసంభావితమాధురీగుణముసై భాసిల్లు శ్రీకృష్ణుని
ర్మలవక్త్రాంబురుహాకరంబున రమింపంగోరెదన్ నామదిన్. (కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 22.)

# 61. జనాబాయి

శ్లో. "అవతారాస్సన్త్వనేకే సరసిజనయనస్య సర్వతోభద్రాః,
కృష్ణాదన్యః కోవా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 85.)

ఒక బ్రాహ్మణుఁడు సకుటుంబముగా కార్తికోత్సవమున పండరినాథుని సేవించుటకు పాండురంగక్షేత్రమునకుఁ బోయెను. అచ్చట నాతనికొమార్తె పాండురంగని వైభవమునకుఁ జొక్కి, అటనుండి కదలఁజాలకపోయెను. తల్లియుఁ దండ్రియు నెంత నిర్బంధించినను, ఆమె "నేను పాండురంగని పాదకమలములను విడిచి రాఁజాలను. నన్ను మఱచిపొండు. మీరు యథేచ్ఛగఁ బొండు" అని చెప్పెను. వారందఱును ఆమె నచ్చట విడిచి వెడలిపోయిరి. పిదప నామెనిశ్చింతయై, భగవంతుని యెదుటఁ గూరుచుండి ధ్యానము ప్రారంభించెను. కొంతసేపు అయిన తరువాత నామదేవుఁడు ఆమెను జూచి "నీ పేరేమి? నీవు ఇచ్చట ఒంటరిగా నేల యుంటివి?" అని యడిగెను. "నాపేరు జనాబాయి. పాండురంగఁడే నాతండ్రి. రుక్మిణీదేవియే నాతల్లి. నేను నాతలిదండ్రుల ఇంట నున్నాను" అని యామె ప్రత్యుత్తరమిచ్చి యూరకుండెను. అంతట నామదేవుఁడు "తల్లీ! నీవు మాయింటికి వచ్చియుండుము. నీకేమియు లోపములు ఉండవు. అక్కడ నుండి నీవు నిశ్చింతతో హరిభజనము చేసికోవచ్చును" అని చెప్పి చేయిపట్టుకొని కొనిపోయి, తల్లినిఁ జూచి "అమ్మా! ఈచిన్నది పాండురంగని అంతరంగభక్తురాలు. మనతో నుండి భగవంతుని పూజించుకొనుచుండును" అని యప్పగించెను.

అదిమొదలు జనాబాయి నామదేవుని యింట సకలమును నిర్వర్తించుచు వారియెడల చాల భయభక్తులతో మెలంగుచు నుండెను. ఇట్లుండఁగా, నొక నాఁటిరాత్రి గాలివానపట్టి నామదేవుని ఇంటికప్పు ఎగిరిపోయెను. అప్పుడు పాండురంగఁడు తనసుదర్శనముచే ఆయింటికి ఆచ్ఛాదనము చేసి ఇంటియందు ఒకవాన చినుకుఅయినను పడకుండఁజేసి, పడిపోయిన గోడలను మన్ను కలిపి పెట్టుటకుఁ బ్రారంభించెను. గోడలు పూర్తి చేసి, అచ్చటచ్చటఁ బడియున్న చెత్తను అవ్వలఁ బాఱవేయుచుండఁగా తెల్లవారెను. అపుడు నామదేవుఁడు నిద్రమేల్కాంచి వచ్చిచూచి, నిర్విణ్ణుఁడై "శ్రీహరీ! ఇది యేమి?" అని ప్రశ్నింపఁగా, పాండురంగఁడు అంతయు నెఱింగించి, ఇంటిలోనికిఁ బోయి నామదేవునితో సరససల్లాపములు ప్రారంభించెను. అదిచూచి వచ్చి, నామదేవునితల్లియగు గుణాబాయి పండరినాథు

నకు సాష్టాంగనమస్కారములు ఆచరించెను. అంతలో జనాబాయి వచ్చి "కరుణా సాంద్రా! మానిసిమాత్రము నీవు ఎంత ఆయాస మనుభవించితివి!" అని చెంతఁ గూర్చుండి ఒడలు నొక్కసాగెను. ఇంతలో గుణాబాయి వంట తయారుచేసెను. నామదేవుఁడు ఒడలినొప్పులు పోవుటకై పాండురంగని వేఁడినీట జలకమాడించి, భోజనమునకుఁ గొనిపోయెను.

నామదేవుని నలువురు కుమారులతో పాండురంగఁడు ఒకపంక్తినిఁ గూర్చుండెను. గుణాబాయియు, నామదేవుఁడును ఒకబంతినిఁ గూర్చుండిరి. పండరినాథుని ఆజ్ఞయగుటచే నామదేవుని భార్యయగు రాధాబాయిగూడ వచ్చి కూర్చుండెను. అందఱకును జనాబాయి వడ్డించెను. అందఱును భోజనములు ప్రారంభించిరి. కొంత సేపైనతరువాత జనాబాయి "నన్ను విడిచి మీరందఱును భుజించుట చాల రసభంగముగా నున్నది" అని యనుకొనెను. అది గ్రహించి పాండురంగఁడు తినుటకు ఎత్తినకబళమును పాత్రమునఁ బడవేసి, "నాకీక భోజనము రుచించుటలేదు" అని పలికి, యూరకుండెను. నామదేవుఁడు "అవును. శ్రీహరీ! జనాబాయి బంతిని లేకుండ నీకు భోజనము ఎట్లు రుచించును?" అనియెను. ఇంతలో అందఱి భోజనములును పూర్తియయ్యెను. అందఱును లేచి చేతులు కడుగుకొని యొకచో సుఖోపవిష్టులైరి. గుణాబాయి భగవంతుని భుక్తశేషమును జనాబాయికి ఇచ్చి "ఇది బ్రహ్మాదులకుఁ గూడ అలభ్యము. పండరినాథుని అనుగ్రహమువలనను, నామదేవునికరుణవలనను నీకు ఇది లభించినది" అని చెప్పుచు ఇచ్చివేసెను. తరువాత భుజింపవచ్చునని జనాబాయి ఆప్రసాదమును ఒకచో భద్రముగ దాచెను.

నాఁటిరాత్రి అందఱును నిద్రించిన వెనుక, పండరినాథుఁడు ధ్వనిచేయకుండ జనాబాయిచెంతకు వచ్చి "ఇందాఁక నాకు అన్నము రుచింపలేదు. ఇపుడు ఆఁకలి నన్ను దహించివేయుచున్నది. ఏమయినఁ బెట్టుము" అని యడిగెను. జనాబాయి "శ్రీహరీ! నీకు నాయెడలఁ గలిగిన కటాక్షము నిర్హేతుకము. నీకు ఒసఁగఁదగినవస్తువు నాచెంత ఆత్మకంటె మఱియొకటి లేదు. దానిని స్వీకరింపుము" అని పలికెను. శ్రీహరి జాలము చేయక, పగటి నాభుక్తశేషమును దెమ్ము" అనియెను. జనాబాయి అట్లేచేయఁగా, మఱల పండరినాథుఁడు "నాతోఁ గూర్చుండి భుజింపుము" అని నియమించెను. అంత జనాబాయి పండరినాథునితోఁ గలిసి ఏకపాత్రమున భుజింపసాగెను. ఇదిచూచి గుణాబాయి మెల్లఁగ నామదేవుని చెంతకుఁ బోయి జరుగుచున్నదంతయుఁ జెప్పెను. నామదేవుఁడు "అమ్మా! నీవు ఇందులకు వింతపడ నక్కఱలేదు. శ్రీహరి రామావతారకాలమున శబరి యెంగిలి భుజింపలేదా?" అని యడుగ, నామె మారు పలుకక తన స్థానమునకుఁ బోయి పరుండెను. భోజనానంతరము జనాబాయియును పాండురంగఁడును ఎవరిస్థానమున వారు శయనించిరి.

తెల్లవాఱుజామున మఱల పాండురంగఁడు మేలుకొంచి మఱల లేచి, జనాబాయి చెంతకుఁ బోయి లేపి, “నీవు పిండి విసరునపుడు నీకు సాయముఁ జేయ వచ్చితిని రమ్ము” అనియెను. జనాబాయి తిరుగలి వేసి గోధుమలు తెచ్చి అప్పుడు నుంచఁగా, పండరినాథుఁడు “నీవు పాటపాడుచుండుము; నేను విసరెదను” అనియెను. జనాబాయి ఒక చక్కనిపాటఁ బ్రారంభించెను. పండరినాథుఁడు పిండి విసరఁ దొడఁగెను.

ఈధ్వని విని గుణాబాయి లేచి, “నీతో పిండి విసరుచున్న చెండకాఁడు ఎవఁడే? ఇందులకు నీవొక కూలివానినిఁ బెట్టుకొంటివా యేమి? అర్ధరాత్రివేళ కూలికి వచ్చినవాఁ డెవఁడే?” అని జనాబాయిని గద్దించి పలికెను. జనాబాయి నిరుత్తర యయ్యెను. అంతట పండరినాథుఁడు “నేను కూలివాఁడను గాను. జనాబాయి కోరుట వలన నిప్పుడు విసరుటకు వచ్చి పిండి విసరుచున్నాను. నాపేరు కృష్ణాబాయి” అని చెప్పెను. అప్పుడు నామదేవుఁడు తల్లినిఁ బిలిచి, “అమ్మా! ఇఁక మాటాడకుము. నీకు పండరినాథుఁడు ప్రత్యుత్తరము ఇచ్చుచున్నాఁడు. జనాబాయి తన సుగుణము లనుపాశముచే శ్రీహరిని బంధించి వేసి, వెంటఁబెట్టుకొని యున్నది” అనియెను. అది విని గుణాబాయి తాను చేసిన ధార్ష్ట్యమునకుఁ జాల సిగ్గుపడి, క్షమింపవలసినదని శ్రీహరినిఁ బ్రార్థించెను.

పిండి విసరుట యగునప్పటికి ఇంకను రాత్రి యుండెను. పండరినాథుఁడు జనాబాయితో మాటాడుచునే నిద్రించెను. అంతలోఁ దెల్లవాఱెను. అప్పుడు జనాబాయి స్వామిని ప్రబోధించి “శ్రీహరీ! తెల్లవారినది. నీకొఱకు ఆలయమున అర్చకులును, యాత్రికులును వేచియుందురు” అని విన్నవించెను. పండరినాథుఁడు జనాబాయి యెడలఁ దనకుఁగల ఆదరమును అందఱకును బ్రకటనఁ జేయఁగోరి, తన యాభరణములను అన్నిటిని పీతాంబరమున మూటఁగట్టి జనాబాయి బట్టల మూటలోఁ బెట్టి, ఆమె జీర్ణ వస్త్రములలో నొకటి తీసికొని కప్పుకొని వెడలి పోయెను.

అర్చకులు తలుపులు తెఱచి చూడఁగా, అంతయు విపరీతముగా నుండెను. అందులకుఁ గత మెఱుఁగఁజాలక వారందఱును తహతహపడుచుండఁగా, నం దొకఁడు “ఈజీర్ణవస్త్రము కొన్న నీనడుమ నామదేవుఁడు తనయింటికిఁ దీసికొని పోయిన జనాబాయి ధరించినది. స్వామి ఆభరణములను పీతాంబరమును ఆమెయే హరించి యుండవలెను” అని పలికెను. ఈమాటమీఁద నందఱును “అయి యుండ వచ్చు” నని కోలాహలము చేయుచు నామదేవుని యింటికి వచ్చిరి. అందఱును ఒక మాఱుగ జనాబాయిని “భగవంతుని పదార్థములను శీఘ్రముగ నిమ్ము. లేకున్న దండింపఁ బడెదవు” అని గద్దింపసాగిరి. అది చూచి జనాబాయి తెల్లవోయెను. నామదేవుఁడు ఆశ్చర్యచకితుఁడై సంగతి యేమని యడుగఁగా, అర్చకులు తాము యోచించి నిశ్చయించిన విషయమును దెల్పిరి. నామదేవుఁడు ఆమీఁద మాటాడఁ

జాలక పోయెను. జనాబాయి "ఆపదార్థములు నాచెంత నున్నచో నాకండ్లు పోవును గాక" అని పలికెను. అంతట అర్చకులు లోపలఁ బ్రవేశించి ఆమె బట్టలమూఁటను వెదకిరి. అందున్న వస్తువులు తోడనే వారికిఁ గాన్పించెను. పిదప నందఱును ఆమె దోషియని నిర్ధారించి, శూలారోపణ శిక్ష విధించుటకు చంద్రభాగా నదీతీరమునకుఁ గొనిపోయిరి. జనాబాయి తనమీఁద నిట్టి జనాపవాదము వచ్చినదని ఏమియు వగవక, నిశ్చింతయై—

శ్లో. "భక్తాపాయభుజంగ గారుడమణిస్త్రైలోక్యరక్షామణిః
గోపీలోచనచాతకాంబుదమణిస్సౌందర్యముద్రామణిః,
యః కాంతామణిరుక్మిణీఘనకుచద్వంద్వైకభూషామణి
శ్శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో గోపాలచూడామణిః." (ముకుందమాల. 22.)

అని తదేకదీక్షతో శ్రీహరిని ధ్యానింపఁ దొడఁగెను. కొంతసేపటికి అర్చకులు ఆమెను ఎత్తి శూలముమీఁద ఎక్కించిరి. తోడనే శూలము భస్మమయిపోయెను. అది చూచి అందఱును జనాబాయి నిర్దోషురాలే గాక మహాత్మురాలనియు, ఆమెయెడఁ దా మపచారము చేసి, అపరాధము చేసితిమనియు నొచ్చుకొనుచు, ఆమె పాదములమీఁద వ్రాలి అనేకవిధముల రక్షింపఁగోరి, మహావైభవముతో మఱల గ్రామములోనికిఁ గొనిపోయిరి.

ఒకనాఁడు జనాబాయి పనులన్నియు ముగిసిన తరువాత, వాకిటఁ గూర్చుండి పాండురంగని మీఁద కవిత్వము చేయుచుండెను. పాండురంగఁడు ఆ కవితామాధుర్యమునకు సొక్కి, తాటాకుమీఁద ఆపద్యములను వ్రాసికొను చుండెను. ఈసమయమున జ్ఞానదేవుఁడు తలుపులు తెఱచికొని స్వామిని సేవించు టకు వచ్చెను. ఆతనిం జూచి స్వామి తాటాకులను దాచెను. అందులకు అసం తృప్తుఁడై జ్ఞానదేవుఁడు అనేకవిధముల గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁగా, స్వామి తుదకు యథార్థము చెప్పెను. జనాబాయి కవిత్వమును జూచి జ్ఞానదేవుఁడు ఆశ్చర్యపడెను. మఱునాఁడు జ్ఞానదేవాది భక్తశిఖామణులు ఎల్లరును నామదేవుని యింటికిఁ బోయి జనాబాయిని అనేక విధముల గౌరవించిరి.

బ్రతికియున్నంత కాలమును జనాబాయి ఇట్లే కాలము గడపి, అవసానమున శ్రీహరి సాయుజ్యమును బడసెను.

మ. "అవతారంబులు లేవె శౌరి కతికల్యాణంబు లిద్ధాత్రిలో
నవి పెక్కుల్ గల వెంచ గోనికరగోపానీకగోపాంగనా
నివహశ్రేయ మొసంగఁ జాలెనె కృపానిర్నిద్రుఁ డైనట్టి శౌ
రివలెన్ వేరొకమూర్తి కావునఁ దదంఘ్రిం గొల్తు నెల్లప్పుడున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 85.)

# 62. పిళాబాయి

శ్లో. "తృష్ణాతురే చేతసి జృంభమాణం ముష్ణన్ముహుర్మోహమహాంధకారం,
పుష్ణాతు నః పుణ్యదయైకసింధోః కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 9.)

ఒకమంత్రికి చాలపుత్రుల వెనుక లేక లేక ఒక కొమార్తె కలిగెను. ఆమెను తల్లిదండ్రులు మిగుల గారాబముతోఁ బెంచుకొనుచు, పిళాబాయి అని పిలువసాగిరి. పిళాబాయియు జ్ఞానము వచ్చినది మొదలు శ్రీహరినామస్మరణము చేయుచు, శ్రీహరివిగ్రహములను పూజించుచు, ఆనందమూర్తిగా నుండెను. అన్నదమ్ములు గూడ ఆమెను చాల ప్రేమించెడివారు. ఆమెకు యుక్తవయస్సు వచ్చినతరువాత తలిదండ్రులు ఒక చక్కని వరునిఁ దెచ్చి శుభముహూర్తమున మహావైభవముతో వివాహముఁ గావించిరి.

కాని ఆమె దౌర్భాగ్యమువలన కొలఁదికాలమునందే ఆమెభర్త చనిపోయెను. అందులకుఁ జేయునది యేమియులేక ఆమె తన కాలమునంతను తల్లిదండ్రులను సేవించుటయందును, శ్రీహరినిఁ బూజించుటయందును గడపసాగెను. ఇట్లుండఁగా, మఱికొన్ని దినములకు తలిదండ్రులుగూడ ఒక్కమాఱుగ కాలము చేసిరి. పిళాబాయి ఈతీరున ఆపత్సముద్రమున మునిఁగిపోయియు, ధైర్యమును వీడక సదా హరినామమును స్మరింపసాగెను. ఇట్లు మఱికొంతకాలము జరుగునప్పటికి ఆమె సోదరులు ఒకరితో నొకరు తగవులాడుకొని విడిపోయిరి. వారు ఆస్తియంతయు పంచుకొనుటలో పిళాబాయి దేవతార్చనచేయు పెట్టె చిన్నవాని భాగమునకుఁ బోయెను. దీనిని వాటాలు వేసికొనుట మంచిదిగాదని పెద్దవాఁడు ఎంత పట్టుపట్టినను తక్కినవారు అంగీకరింపరైరి. పిళాబాయి పెద్దన్నవద్ద నుండెను. ఆమె తన పెట్టెను పంపవలసినదని ఒక నౌకరుని చిన్నఅన్నవద్దకుఁ బంపెను. కాని ఇచ్చుటకు ఇష్టము లేక "చాల వెదకితిని. ఎచ్చటను గాన్పింపలేదు" అని వర్తమానము పంపెను. పిళాబాయి ఆపెట్టెలో నున్న శ్రీకృష్ణవిగ్రహమును బూజింపకుండ భోజనము చేయదు. అగుట నామె ఉపవాసములు చేయఁజొచ్చెను. ఇట్లు అయిదాఱు దినములు గడచిన తరువాత ఒకరాత్రి శ్రీకృష్ణుఁడు స్వప్నమున వృద్ధబ్రాహ్మణరూపముతో పిళాబాయికి సాక్షాత్కరించి, "నీవు వగవవలదు. నేటినుండి నీవు అనవరతమును భగవద్గీతను పారాయణము చేయుచుండుము. శ్రీకృష్ణుఁడు భగవద్గీతారూపమును స్వీకరించియున్నాఁడు. భక్తులకు అంతకంటె పూజ్యము మఱియొకటి లేదు" అని చెప్పి, ఆమె పెట్టెను ఆమెచేత నుంచి తిరోహితుఁ డయ్యెను.

శిఖాబాయి ఆశ్చర్యముతో మేల్కాంచి చూడఁగా, చేతిలో తనపెట్టె యుండెను. "భగవంతుఁడే వృద్ధబ్రాహ్మణరూపముతో సాక్షాత్కరించె" నని తెలిసికొని యామె పరమానందముతో అది మొదలు భగవద్గీతాపారాయణము చేయసాగెను. కొన్నిదినము లయినతరువాత ఆమె చిన్నియన్న చెల్లెలి మాహాత్మ్యమును గుర్తెఱిఁగి, పెద్దన్నను ఆమెను పాదములు పట్టి క్షమింపవలసిన దని ప్రార్థించి పోయెను. అదిమొదలుకొని ఆమె యన్నలుఁగూడ శ్రీహరినిఁ బూజించుచు, అతిథులను అభ్యాగతులను ఆదరించుచు, శాంతముగఁ గాలము గడపసాగిరి. శిఖాబాయి బ్రతికియున్నంతకాలమును శ్రీహరినిఁ బూజించి, అవసానమున ఈశ్వర సాయుజ్యమును బొందెను.

మ. "అమితాశావశమై నామది నవశ్యంబైన మోహాంధకా
రము గారుణ్యకటాక్షవీక్షణవిభారాశిన్ విఘాలించి నె
య్యమునం బ్రోచుదయాపయోధి ఘనబృందారణ్యకర్మందిబృం
దమనోలోచనసాధుసేవధి ప్రమోదంబొప్ప నెల్లప్పుడున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 9.)

---

# 63. గుణవతీబాయి

శ్లో. "ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం, ముదాముహురుదీర్ణయా మునిమనోంబుజామ్రేడితం,
మదాలసవిలోచనవ్రజవధూముఖాస్వాదితం, కదాను కమలేక్షణం కమపి బాలమాలోకయే."

(కృష్ణకర్ణామృతము. ఆ 3 ప. 11.)

మాధవసింగు అనురాజునకు గుణవతీబాయి యనుభార్య యుండెను. ఆమె పతివ్రత యని చాల ప్రఖ్యాతి గడించెను. ఆమెకు ఇరువురు కుమారులు కలిగిరి. వారినిఁ బెంచుటకు నియమింపఁబడిన దాదియు చాల మంచిది. ఆమె పెదవులు ఎల్లప్పుడును కదలుచుండెడివి. అందులకు రాణి ఆశ్చర్యపడి ఒకనాఁడు అడుగఁగా, దాది "నేను ఎపుడును శ్రీహరినామపారాయణము చేయుచుందును" అని చెప్పెను. రాణి అందలి విశేషము అడుగఁగా, దాది అంతయుఁ జెప్పెను. గుణవతికి అది వినఁగనే తానుగూడ నట్లే శ్రీహరినిఁ బూజింపవలయునని తోఁచెను. అంతట నామె కోరఁగా, దాది శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి, శ్రీకృష్ణవిగ్రహమును ఇచ్చి "భక్తిశ్రద్ధలతోఁ బూజింపుము" అని చెప్పెను.

అది మొదలు రాణి దాది చెప్పిన చొప్పునఁ జేయసాగెను. ఆమె ప్రతిదినము లెక్కలేనంతమంది బీదలను వికలాంగులను భాగవతాగ్రేసరులను మృష్టాన్న తృప్తులం గావించుచు, అచిరకాలములోనే అంతటను ప్రఖ్యాతి వహించెను. అంతే

గాక ఆమె పూర్వకాలమునందే ప్రయత్నములన్నియు విడిచి, కేవలము శ్రీహరిపూజయందే నిమగ్న యయ్యెను. ఒక నాటి రాజు ఆమెకు మనోహరాకార మగు నిశ్చయించి, అనేకవైద్యులను రావించి పలుమారులు అడిగెనా, వారు పరీక్షించి యథార్థమును గనుగొని రాజునకు దెలిపిరి. రాజు అది విన్నవాడై "నీవు ఇన్ని దినములు ఏమి పనిలో నిట్లు ఉన్మత్తవలె నుంటివే?" యని ప్రశ్నించగా, "నేను శ్రీహరిపూజను పక్క నన్నియును మఱచియున్నా" నని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట రాజు చాల కోపములోన గన్నులెఱ్ఱజేసి చూడగా, రాణి భయభ్రాంతురాలై కన్నులు మూసికొనెను; కాని శ్రీహరి దివ్య మంగళవిగ్రహములో ఆమె మూసిన కనులయందే సాక్షాత్కరించి, "నే నున్నాను. నీకు భయము వలదు" యని ధైర్యము నిచ్చెను. అంతట గుణవతీబాయి చేతులు జోడించుకొని "శ్రీహరీ! ప్రాణములు పోయిన వె లైనను నేను నీసేవను విడువను" అని పలికి, బాష్పపూర్ణనయన యయ్యెను. రాజు ఇది యంతయు నటనయని భావించి, "నేను మరల నీవు యుక్తమార్గమునకు రానిచో దండింతు" నని రాణితోను, "ఈమె భాగవతులు అను దేశభ్రష్టులవల్లలో జిక్కియున్నది; కాన వారిని కోటలోన ప్రవేశింపనీయవలదు" అని భటులకును, తీవ్రముగ నాజ్ఞాపించి వేటకుబోయెను.

భర్త యిట్లు ఆజ్ఞాపించినను గుణవతి శ్రీహరిపూజ యథాపూర్వముగ జేయుచునే యుండెను. భాగవతాహ్వానము మాత్రము జరుగకుండెను. "నగరునందలి సమాచారములను ఎప్పటికప్పుడు వివరముగా దెలుపుచుండవలయు" నని రాజు మంత్రికి నిర్బంధించియుండెను. ఆప్రకారము మంత్రి రాణి ప్రవర్తనమంతయు అడవియం దున్న రాజునకు వ్రాసి పంపెను. అదిచూచి రాజు మండిపడి, "రాణిని చంపి రండు" అని నలుగురు హంతకులకు ఆజ్ఞ ఇచ్చి పంపెను. రాజాజ్ఞను బడసి, వాండ్రు నగరు నకు వచ్చునప్పటికి రాణి హరిపూజానిమగ్నయై యుండెను. అగుటచే వాండ్రు కొంత తడవు నిరీక్షించిరి. ఇంతలో ఆమె పూజించుచున్న శ్రీకృష్ణవిగ్రహము నుండి ఒక క్రూరవ్యాఘ్రము వెలువడి వచ్చి, హంతకులను చూచుచుండగనే చంపి వేసి మాయమైపోయెను.

ఆధ్వని వినినవారును, రాణియు వచ్చిచూచి జరిగిన దంతయుం దెలిసికొని తెల్ల వోయిరి. రాణి మరల యథాస్థానమునకు వచ్చి 'శ్రీహరీ! నీసంకల్పమును తొలుత నీక్షుద్రురాలికి ఎఱిఁగింపకూడదా? ఈపనివలన అనేకాసందర్భములు తటస్థింప వచ్చును. ఎట్లయినను ఈయభాగ్యులను నామీాఁద దయయుంచి బ్రతికింపవలెను" అని ప్రార్థింపఁగా, "వీరిమీాఁద నీవు తులసితీర్థమును ప్రోక్షింపుము" అని అశరీరవాణి వినఁబడెను. వెంటనే రాణి యాప్రకారము చేసెను. అంతట హంతకులు నిద్ర

బోయినవారివలె లేచి నిలిచి నిటలతటఘటితాంజలులై, "మేము రాజాజ్ఞచే నిన్ను సంహరింపుటకు వచ్చితిమి. అయినను మాయెడఁ గరుణించి మమ్ము బ్రతికించితివి. మాయపరాధములను మన్నించి, మమ్ము దాసులుగా నంగీకరించి, మాకు మోక్షమార్గమును జూపుము" అని పాదములమీఁద వ్రాలి ప్రార్థించిరి. గుణవతి సన్మార్గమునఁ బ్రవర్తింపుఁడు; అని వారికి హితోపదేశమును జేసి శ్రీహరి పూజ ముగించి, భగవన్నివేదితాన్నమును భుజించెను.

మంత్రి మహాశ్చర్యమగ్నుఁడై ఇదియంతయు రాజునకు వ్రాసిపంపెను. అది చూచి అచ్చట రాజును ఆశ్చర్యచకితుఁడై, "ఇన్నాళ్లను నేను గుణవతి మాహాత్మ్యము నెఱుంగక క్రూరుఁడనై ప్రవర్తించితి" నని చింతించి, "రాణిమీఁద నేను విధించిన నిషేధము లన్నియు తొలఁగించి వేసితిని. ఆమె భాగవతార్చనము మున్నగు వానికి ఎట్టియభ్యంతరము లేదని తెలిపి, అడిగినదెల్ల వెంటనే యొసంగుచుండవలసినది" అని మంత్రికి ఆజ్ఞాపించెను.

రాజు మఱినాలుగుదినములు కడచిన తరువాత నగరమునకు బయలుదేరెను. మార్గమధ్యమున నొకనది పొంగిపారలుచు, కూలంకషముగఁ బ్రవహించుచుండెను. రాజు రాణి నెప్పుడు చూతునను సంభ్రమముతో కష్టసుఖము లాలోచింపక పడవలు విడిపించెను. పడవలు ఏటినడుమకు వచ్చునప్పటికి ప్రవాహ వేగమువలన మునిఁగి పోవుటకు సిద్ధమయ్యెను. అంతట రాజు "రాణీ! నీవు చేయు హరిపూజయందు మాహాత్మ్యమున్నచో, మేము ఇపుడు నిరపాయులము కావలయును" అని పలికెను. అంతట కనుమూసి తెఱచినంతలో పడవ సురక్షితముగ ఒడ్డునకుఁ జేరెను.

పిదప రాజు నగరముచేరి, వెంటనే అంతఃపురమున నున్న రాణిచెంతకుఁ బోయి మోఁకరించి నిలిచి, "నీవు మహనీయురాలవు. నీమాహాత్మ్యము నెఱుఁగక నీకు ఎగ్గుచేసితిని. అపరాధిని క్షమింపవలయును". అని ప్రార్థించెను. అపుడు రాణి రాజును లేవనెత్తి, "మీరిట్లు పలుకుట ధర్మముగాదు. అంతయు శ్రీహరిచేతిలో నున్నది. శ్రీహరియే లోకరక్షకుఁడు. ఈసంసారము ఈప్రపంచము నంతయు అశాశ్వతము. మఱియు అసారము. దీనియెడల మోహితులై యుండుట బుద్ధిమంతుల లక్షణము గాదు. శ్రీహరిని నమ్మనివారు బాగుపడలేదు" జనార్దనుని నమ్మినవారు చెడిపోలేదు. ఉత్తమమైన నరజన్మము ఎత్తినందులకు శ్రీహరిని సేవించుటకంటె సర్వోత్తమము లేదు" అని చెప్పెను.

రాజు రాణివాక్యములు వేదమంత్రములుగా భావించి, అదిమొదలు శ్రీహరియెడల భక్తిప్రపత్తులు గలిగి ప్రవర్తించుచుండెను. రాణి రాజునకు చిత్తశుద్ధిఁ గలిగినదని నిశ్చయించుకొని, "మీరు, అన్నివిధములను ధన్యులరైతిరి. జ్ఞానశేఖరులు

గూడ నయితిరి. అయినను ఆచార్యోపదేశము పొందనివారు భగవంతుని అంత రంగభక్తులలోఁ జేరఁజాలరు. ఆచార్యోపదిష్టముగానిజ్ఞానము మోక్షము నొసంగఁ జాలదు. కావున మీరు ఒక సదాచార్యు నాశ్రయించవలసిన” దని చెప్పెను. రాజు అందుల కంగీకరించి “నాజ్ఞానము గురూపదిష్టమైనదే. నీకంటె నాకు సదాచార్యు లెవరు ? నీవు నాయెడల దయయుంచి ఉపదేశించితివి; కావుననే నాకు మోక్ష మార్గము తెలిసినది. అయినను నీయిష్టమువచ్చినట్లు మెలంగెదను. నీయుపదేశము గాక మఱియొకరి యుపదేశముగూడ నాకు అవసరమని నీకుఁ దోఁచినచో, నట్లే చేయ వచ్చు” నని చెప్పెను.

అంతట రాణి తనకు ఉపదేశముఁ జేసిన దాదినిఁ బిలిచి, “నాకు జ్ఞానోపదేశము చేసితివి. రాజగారిని గూడ అనుగ్రహింపుము” అని చెప్పెను. దాది తొలుత నొకింత సందేహించెను. కాని తుదకు అంగీకరింపక తీరదయ్యెను. యుక్తసమయ మున దాది రాణిచే నాజ్ఞప్తయై, యథావిధిగ రాజునకు జ్ఞానోపదేశముఁ గావించి, పూజింపు మని శ్రీకృష్ణవిగ్రహమును ఇచ్చెను.

రాజు శ్రీహరిపూజ ప్రారంభించెను. ఒకనాఁడు శ్రీహరి దివ్యమంగళవిగ్రహ ముతో రాజునకు సాక్షాత్కరించి, “నీవు నాయంతరంగభక్తుఁడవు. నీకు ఏమియు లోపములు గలుగఁబోవు” అని చెప్పి, తిరోహితుఁ డయ్యెను. తరువాత రాజును, రాణియు, దాదియు సకుటుంబముగ తీర్థయాత్రకు బయలుదేరిపోయిరి. అనేక దివ్యస్థలములయందు శ్రీహరి వారికి దర్శనమిచ్చి సేవయొసంగెను. రాజు తన కుప దేశముచేసిన దినము మొదలుకొని దాదికి సేవకతను బాపి, ప్రత్యేకముగ మఠమును నిర్మించి ఇచ్చెను. రాజును, రాణియు, దాదియు బ్రతికియున్నంతకాలము ఇట్లు శ్రీహరినిఁ బూజించి, అవసానమున సాయుజ్యముక్తినిఁ బడసిరి.

ఉ. “కన్నులకొద్దిఁ జూచి వ్రజకాంతలు వేడుక ముద్దులాడఁగా
సన్నపునవ్వువెన్నెలలు సల్లఁగఁ జల్లఁగ నెల్లమానులున్
సన్నుతమానసాబ్జముల సారెకుసారె వహింప మించున
క్కన్నులపండువైన ముఖకంజము రంజిలుబాలుఁ గాంచెదన్.”

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 11.)

# 64. సక్కుబాయి

మ. అలరున్ ధన్యుల కేకథామృతము జిహ్వన్ లేహ్య మేబాల్యచా
పలముల్ రాఘవు నెయ్యపుంగినుక నాపాదించు నేయంటముల్
వెలయుంగా మోమున వేణుగానకలనన్ వేమాఱు నాదివ్యచ
ర్యలె నామానసవీథి వేడెదను ధారాళంబుగా నిల్వఁగన్.

(కృష్ణకర్ణామృతము ఆ 1. ప 106.)

కృష్ణాతీరమున కరవీరపురము అను నొకగ్రామము కలదు. అందు ఒక బ్రాహ్మణుఁడు ఉండెను. అతఁడు గొప్పవిద్వాంసుఁడే; కాని సత్యధర్మదయాశౌచములు లేని కఠినుఁడు. అన్నివిధముల నాతనిప్రవర్తనము హేయమైనది. ఆతనిభార్య సకలవిధముల నాతనికిఁ దీసిపోనిది. వారికి ఒక కుమారుఁడు ఉండెను. అతఁడు బాల్యమునందే సకలవిద్యలను నేర్చుకొనెను.

వృద్ధబ్రాహ్మణుఁడు తన కుమారుఁడు వివాహయోగ్యుఁడై యున్నాఁడని యెఱింగి, భార్యతో యోచించి పెండ్లికొమార్తను వెదకి కుదుర్చుటకు బయలుదేఱెను. ఆతఁడు ఒకనాఁటి సాయంకాలమునకు పండరిపురమునకు మిగుల చేరువనున్న ఒక జనపదము చేరుకొనెను. చీకటిభయంబున నాతఁడు ఆరాత్రి నాయూరనే గడుపఁగోరి ఒక బ్రాహ్మణునియింటికిఁ బోయెను. ఆయింటి యజమానుఁడు వచ్చిన బ్రాహ్మణుని చాల నాదరించి, భోజనమునకు ఉండవలసిన దని కోరెను. ఆతని కొక కూఁతురు ఉండెను. ఆమె చక్కనిచుక్క; విద్వాంసురాలు; వినయవతి; సుగుణఖని ఆమెను జూచిన వెంటనే మన వృద్ధబ్రాహ్మణుఁడు ఆమెను తనకుమారునకుఁ జేసికొనిన బాగుండునని తలంచి, భోజనానంతరము ఆమె తండ్రితోఁ దన యభిప్రాయము చెప్పెను. అతఁడును తన ఇల్లాలితో నాలోచించి వల్లె యనెను. పిదప వారిరువురును నిశ్చయపఱుచుకొనవలసినవి ఎల్ల నిశ్చయపఱచుకొని, ముహూర్తమునుగూడ ఏర్పఱచుకొనిరి. మన వృద్ధుఁడు ఆనందముతో ఇంటికి బయలుదేరెను.

కరవీరపురము చేరిన వెంటనే వృద్ధుఁడు సంగతులు అన్నియు భార్యకు ఎఱింగించెను. ఆమె చాల నానందించెను. పిదప వారు సుముహూర్తసమయమునకు బంధువులు అందఱతోడను దరలివెళ్లి కొడుకునకు వివాహమహోత్సవము గావించివచ్చిరి. పెండ్లికొడుకు అత్తవారిఇంటఁ గొన్నిదినము లుండి, పిదప సక్కుబాయిఅను తన భార్యతో తన స్వగ్రామమునకు వచ్చెను. తలిదండ్రులు ఓపినకొలఁదిని సక్కుబాయికి సారె చీరలు ఇచ్చి పంపిరి.

సక్కుబాయి బాల్యమునుండియు శ్రీహరినామస్మరణము చేయుచుండెడిది. ఒకనాడు అతిథియొక్కడు ఆమె సత్కీర్తులు విని ఆమెకు శ్రీకృష్ణమంత్రము నుపదేశించిపోయెను. సక్కుబాయి అప్పటినుండియు శ్రీహరిధ్యానమును అనవరతమును జేయుచుండెను. అత్తవారింటికి వచ్చిన తరువాతగూడ నామె శ్రీహరి స్మరణము మానలేదు. అదిచూచి అత్తమామలు చాల కోపించుచుండగ, "ఈహరి పూజవలన ఇప్పుడు గృహకృత్యములు సాగవు. ముందు ముందు విరక్తి గలిగి చెడిపోవుదు" వనియుఁ జెప్పుచు, ఆమెను హరిస్మరణ మానునట్లు నిర్బంధింపసాగిరి. అంతట సక్కుబాయి వారి దౌర్జన్యమునకు భీతిచెంది అంతరంగమునందే హరిని ధ్యానించుచు, వారుచూడనప్పుడు ఎల్లో పీలువేసి హరినామమును గీర్తించుచుండెను. హఠాత్తుగా నిది యొకనాడు అత్తగారు చూచెను. నాఁడు మొదలుకొని అత్తమామలు "మన యాజ్ఞలను ధిక్కరించిన" దని నిశ్చయించి, అనేక విధములఁ బాధ పెట్టసాగిరి. చాకిరి అంతయు ఒక్కతెయే చేసినను సక్కుబాయికి కొన్నిదిన ములు అన్నపానీయములు ఇచ్చుట మానివేసిరి. అయినను ఆమె దుఃఖింపక, వారి యాజ్ఞలను అనువర్తించుచుండెను. "ఇది మొండికెత్తినది" యని తలంచి, అత్త మామలు ఆమెను మగనిచేఁ గూడఁ గొట్టింపసాగిరి. ఇది చూచి ఇరుగుపొరుగు వారు కొందఱు "మీకోడలు కేవలము లోకజనని యగుమహాలక్ష్మివలెఁ గాన్పించు చున్నది. ఆమెను మీ రిట్లుబాధించుట మీకుఁ దగ" దని చెప్పిరి. అంతట ఆదంప తులు ఇరువురును "మాఇంటికోడలు మీకు ఏల" యని వారిని దూషించి పంపి వేయుటయేగాక, అదిమొదలు "ఇది ఇంటిగుట్టంతయు పొరుగువారికిఁ దెలుపు చున్నది" అని అనేకవిధముల సక్కుబాయిని మఱింత బాధింపసాగిరి.

ఒకనాడు సక్కుబాయియు ఆమెవలెనే సుగుణవతియు ఇరుగుపొరుగుల వారి బిడ్డయునగు శాంతయను యువతియుఁ గలిసి చెరువునకు నీళ్లకు వెళ్లిరి. అచ్చట అయిదారుగురు భాగవతులు కూర్చుండి శ్రీహరికీర్తనలు గొంతెత్తి శ్రావ్యముగఁ బాడుచుండిరి. సక్కుబాయి ఆకీర్తనలకు మైమఱచి "శాంతా! నీవు ఇంటికిఁ బొమ్ము. నేను వీరితోఁ బండరిపురమునకుఁ బోయి పాండురంగని సేవించి వచ్చెదను. అనిచెప్పెను. శాంత ఈసంగతి సక్కుబాయి అత్తమామలకు ఎఱింగించెను. అంతట వారిరువురును మండిపడి కొడుకును వెంటనిడుకొని చెరువునకుఁ బోయిరి. భర్త సక్కుబాయిని చావమోది, జడపట్టి ఈడ్చుకొనిపోయెను. ఆతని తలిదండ్రులు భాగ వతుల ననేకవిధములఁ దూలనాడిరి. ఇంటికి వచ్చిన తరువాత వారు సక్కుబాయిని పెడరెక్కలు విఱిచి స్తంభమునకుఁ గట్టి పెట్టి, అన్నపానములు ఈయక పీడింప సాగిరి. సక్కుబాయి చేయునది ఏమియు లేక,

మ. "అమరీమానితవేణుగానమున బృందారణ్యమందారబృం
దము క్రిందన్ యమునాతరంగకణికాంతర్వేదికామధ్యదే
శమునన్ సాంద్రఘనాఘనప్రతిభటశ్యామద్యుతిం బొల్చు ధా
మము నామానసపీఠికం గరుణ గ్రమ్మన్ నిల్చుఁగాకెప్పుడున్.

ఉ. చీఁకటిమ్రానిజొంపములఁ జెన్నగు సైకతవేది నీలపు
న్వాకజలంబుగో మురళి వామకరంబునఁబట్టి దట్టిపై
దాఁకొనఁ గొమ్ము జెక్కుకొని తామరపాకునఁ జల్దిమెక్కుచున్
గోకులముం బ్రతిక్షణముఁ గూరిమిఁ గన్గొనుబాలుఁ గాంచెదన్.

శా. శ్రీవత్సాంకితు గోపికానయనరాజీవార్చితుం గోపగో
సేవాభావితుఁ గౌస్తుభోల్లసితు వంశీవాదమోదాన్వితున్
గోవిందున్ నవపింఛయుక్తశశివక్త్రున్ ఫుల్లనీలోత్పలున్
శ్రీవిభ్రాజితు హాటకాంబరయుతున్ సేవింతు భూషాంచితున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 84. 82. 80.)

అని నిశ్చలచిత్తముతో శ్రీహరిని ధ్యానించుచు, "పాండురంగా! నాకు ఎట్టికష్టములు సంభవించినను బాధ లేదుగాని, నీయుత్సవమును జూచుటకు శక్యముగానందులకు మాత్రమే వగచుచున్నాను." అని వగవసాగెను. ఆప్రార్థనమునకు హృదయము కరుగ, విఠలనాథుఁడు సక్కుబాయి రూపమును ధరించి అర్ధరాత్రి వచ్చి సక్కుబాయిని ప్రబోధించి "నీవు వచ్చునంత దనుక నేను ఈకట్లయందుఁ బడియుండెదను. నీవు పోయి పాండురంగని సేవించుకొని రమ్ము" అని చెప్పెను. సక్కుబాయి అందులకు సందేహింపఁగా, విఠలనాథుఁడు అనేకవిధముల నచ్చఁజెప్పి ఆమెను కట్లువిప్పి పంపివేసి తాను కట్టుకొనెను. సక్కుబాయి పండరిపురమునకుఁ బోవు భాగవతులతోఁ గలసి మార్గమున అనేకపుణ్యనదులు దాఁటి పండరిపురముఁ జేరుకొనెను.

అచ్చట నామె సకలోత్సవములును జూచి మహానందభరితురాలై, పాండురంగని పాదములమీఁద వ్రాలి "శ్రీహరీ! ఇఁక నే నీప్రపంచమున ఈయమయాతనల ననుభవింపఁజాలను. నన్ను నీలోఁ గలుపుకొనుము" అని ప్రార్థించెను. అంతట జ్యోతిర్మయమైన సక్కుబాయి ఆత్మ పాంచభౌతికదేహమును విడిచి, శ్రీపండరినాథునియందు ఐక్యమైపోయెను. అది చూచుచున్న భాగవతాగ్రేసరులు అందఱును ఆశ్చర్యచకితులై, బ్రహ్మానందముతో సక్కుబాయి కళేబరమును చంద్రభాగానదీతీరమునకుఁ గొనిపోయి దహనసంస్కారముఁ గావించి వచ్చిరి.

అట సక్కుబాయి రూపముతో నున్న పాండురంగఁడు నిద్రాహారములులేక పదునైదుదినములు కట్లయందు ఉండెను. అంతట సక్కుబాయి మగఁడు ఒకనాఁడు

"ఇది పదున్నైదు దినములనుండి కట్లు స్నానాహారములు లేక యున్నది. ఇంకను కట్లు యుంచిన మరణించును. ఇంత సుందరి - ఇంతగుణవతి-ఇంతటి పాతివ్రత్య-ఇంతటి పనులు చేయు వతి ఇంక లభించుట కష్టము" అని తలంచి, కట్లువిప్పి "పోయి స్నానముచేసి వచ్చి వంట చేయుము" అని నియమించెను. సక్కుబాయిరూపమునున్న భగవంతుడు సకలమును నిర్వర్తింపసాగెను. ఆమె వండిన పదార్థముల మాధుర్యమును జూచి వారు అత్యాశ్చర్యచకితులై, అపమొదలు చాలఁగా ఆమెను ఆదరింపసాగిరి.

ఇది యిట్లుండఁగా, అట రుక్మిణి పండరిపురమున వెఱఁగి యున్నది; కాపున "సక్కుబాయిరూపముతో నానాథుఁడు అక్కడఁ జిక్కుకొనియున్నాఁడు. ఇట సక్కుబాయి మరణించినది; ఏమిచేయుదు"నని యోచించి, సన్నిధినాశ్రయించియున్న భాగవతాగ్రేసరులను బిలిచి "మీరు సక్కుబాయి కళేబరమునకు దహనసంస్కారముచేసి వచ్చితిరిగదా! ఆమె అస్థులను గొనివచ్చి నాయొద్దట నుంపుఁడు" అని నియమించెను. ఆమె యాజ్ఞాప్రకారము వారు చంద్రభాగానదికిఁ బోవునప్పటికి సక్కుబాయి అస్థికలు నారాయణస్మరణము సేయుచుండెను. అందులకు పరమాశ్చర్యభరితులై భాగవతులు వానిని బంగరుపళ్లెరమున నిడి తెచ్చి రుక్మిణి పాదములచెంత నుంచిరి. రుక్మిణి వానిని దాఁటిన వెంటనే సక్కుబాయి సజీవయై సదేహియై లేచి నిలిచెను. భాగవతులందఱును సక్కుబాయి భాగ్యమును, రుక్మిణి కరుణాహృదయమును అనేక విధములఁ గొనియాడిరి.

రుక్మిణి సక్కుబాయిని కౌఁగిటఁ బొదివి పట్టి "తల్లీ! శ్రీహరి నీరూపముతో కరవీరపురమున నున్నాఁడు. నేను అతని విశ్లేషమును సహింపఁజాలకున్నాను. నీవు పోయి నానాథునిఁ బంపివేయుము" అని చెప్పెను. ఆప్రకారము సక్కుబాయి బయలుదేఱెను. ఆమె కరవీరపురము చెఱువుగట్టుమీఁదికి వచ్చునప్పటికి సక్కుబాయిరూపముతో నున్నశ్రీహరి జలాహరణార్థము పోయి "తల్లీ! నీమనోరథము నెఱవేఱెనదిగదా!" యని యడిగి, బిందెను ఆమెకు ఇచ్చివేసి అదృశ్యుఁడయ్యెను. సక్కుబాయి ఆబిందెను గైకొని జలకమాడి, నీళ్లు ముంచుకొని ఇంటికిఁ బోయెను.

రుక్మిణి పాదములసన్నిధిని సక్కుబాయి అస్థికల నుంచిన భాగవతులలో నొకఁడు సక్కుబాయి మాహాత్మ్యమును ఆమె అత్తమామలకును, మగనికినిఁ జెప్పవలయునని వెంటనే బయలుదేఱి కరవీరపురము వచ్చెను. అతఁడు సక్కుబాయి యింటికి వచ్చునప్పటికి ఆమె లోపలనుండి యెదురువచ్చి "మహానుభావా! దయ చేయుము" అని స్వాగతమిచ్చెను. అందులకు ఆశ్చర్యచకితుఁడై, ఆతఁడు పండరిపురమున జరిగిన దంతయు అందఱకును ఎఱిఁగించెను. అది విని అత్తమామలు యథా

ర్థము చెప్పుమని యడుగఁగా, సక్కుబాయి తనకుఁ దెలిసినది అంతయుఁ జెప్పెను. అది విని వారందఱును మహానందభరితులై ఆమె ననేకవిధములఁ గొనియాడి, "నీమాహాత్మ్యము నెఱుఁగక నిన్ను అనేకవిధముల బాధించితిమి. క్షమింపుము" అని ఆమెను ప్రార్థించిరి. మఱియు "నీవు బాల్యమునందే మోక్షమార్గమును సాధించితివి. మాకుఁగూడఁ దరణోపాయమును ఎఱింగింపు" మనిగూడ వేఁడుకొనిరి.

అంత సక్కుబాయి సకలమును వారికి బోధించి, "ఆచార్యోపదేశముఁ బడసినఁగాని ప్రయోజనము లేదు" అని వారిని వెంట నిడుకొని పండరిపురమునకుఁ బోయి ఆచార్యుని పాదములమీఁద వ్రాలి "వీరు మిమ్మాశ్రయింప వచ్చినారు. వీరిని అనుగ్రహింపవలయు" నని ప్రార్థించెను. ఆచార్యుఁడు వారి కందఱకును శ్రీకృష్ణమంత్రము నుపదేశించి జ్ఞానబోధ గావించెను. అందఱును స్వస్థలముఁజేరుకొని బ్రతికియున్నంతకాలమును శ్రీహరిని సేవించి, అవసానమున సాయుజ్యముక్తిఁ బడసిరి.

మ. "పరమామ్నాయతురంగసేవితలసత్పాదాంబుజద్వంద్వుఁ బం
కరుహాస్థానుఁ గృపాబ్ధి నిర్గుణు నఘౌఘధ్వంసు రమ్యుం బరా
త్పరమంబుర్ బురుషోత్తముర్ బరుఁ బరబ్రహ్మర్ నిజానందు శ్రీ
హరి శ్రీరాముఁ బ్రధానవర్జితు ఘనశ్యామాంగు భావించెదన్."
(రామకర్ణామృతము. ఆ. 2. ప. 45.)

---

## 65. కుపరాబాయి

శ్లో. "దేవక్యా జఠరాకరే సముదితః క్రీతో గవాం పాలినా
నందేనానకదుందుభేర్నిజసుతాపణ్యేన పుణ్యాత్మనా,
గోపాలావళిముగ్ధహారతరళో గోపీజనాలంకృతిః
స్థేయాన్నో హృది సంతతం సుమధురః కోఽపీంద్రనీలో మణిః."
(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 97.)

శరవాహనుఁడను అనురాజు సభలో ఒకపురోహితుఁడు ఉండెను. ఆతఁడు సకలశాస్త్రములును జదివినపండితుఁడు. శమదమాది సుగుణభూషితుఁడు. ఆతని కేవిధమునను లోపము లేదు; కాని సంతానము లేదు. ఆతనిభార్య అన్ని విధముల నాతనికిఁ దగినది. ఆదంపతులు ఇరువురును సంతానమునిమిత్తము అనేక వ్రతములు, అసంఖ్యదానములు, ఇంకను అగణ్యప్రయత్నములును జేసిరి; కాని సంతానము గలుగలేదు" "ఇఁకఁ బ్రయోజనము లేదు" అని నిశ్చయించుకొని, వారు సంతానము నెడల నిరాశచేసికొని శ్రీహరిధ్యానమునఁ గాలము గడుపుచుండిరి.

ఒకనాఁటి రాత్రి పండరినాథుఁడు ఆమెకు స్వప్నమున సాక్షాత్కరించి, "నీ భర్తతోఁ గలసి ద్వారకాపురమునకు వచ్చి నన్ను సేవింపుము" అని నియమించి తిరోహితుఁ డయ్యెను. వెంటనే యామె మేల్కాంచి, భర్తను లేపి జరిగినది అంతయు నెఱిఁగించెను. ఆబ్రాహ్మణుఁడు అది విని పరమానందభరితుఁడై భార్య సౌభాగ్యమును గొనియాడి, మఱునాఁడే ద్వారకకుఁ బ్రయాణ మయ్యెను.

ఆదంపతులు యుక్తసమయమునకు ద్వారకాపురము చేరి యథోక్తముగ స్వామిని సేవింపఁబోయిరి. వారు గర్భాలయమును సమీపించునప్పటికి స్వామి దివ్య మంగళవిగ్రహముతో సాక్షాత్కరించి ఎదురుగ వచ్చి, కౌఁగిలించుకొని ఆదర ముతోఁ గొనిపోయి "మీకుఁ జింతవలదు. మీకు నాయందు మిగుల భక్తిప్రప త్తులు గల కొమార్తె కలుగును. ఆమెవలన లోకమంతయు నానందించును" అని చెప్పి, తిరోహితుఁ డయ్యెను. ఆదంపతులు పరమానందభరితులై యుండఁగా, వారితో స్వామిదర్శనమునకు వచ్చినవా రందఱు వారి సద్భాగ్యమునకు మిగుల నచ్చెరువడ సాగిరి.

పిదప వారు బసకుఁ బోయి వంటఁ జేసి భగవంతునకు నివేదించి, భాగవతారా ధనముగావించి తచ్ఛేషమును భుజించిరి. పిదప వారు ఆనగరమునందే యుండి శ్రీహరి నర్చించుచుండిరి. కొంతకాలమునకు ఆమె గర్భవతియై నవమాసములు నిండిన తరువాత ఒకనాఁడు చాల బాధపడసాగెను. ఆబాధ దుస్సహము కాఁగా ఆమె భరింపలేక అనేకవిధముల గొంతెత్తి ఏడువసాగెను. అప్పుడొక మంత్రసాని వచ్చి లోపలఁ బ్రవేశించి అచ్చట నదివఱకే వచ్చియున్న మంత్రసానిని తొలఁగి నిలువుమని నియమించి, "తల్లీ! నీవు చాల బాధపడుచున్నావని విని నీకు చికిత్స చేయుటకు వచ్చితిని. నీవు పడుబాధయు నాకరుణ హృదయమును ద్వరపెట్ట అయా చితముగనే నేను వచ్చితిని. కన్నులు మూసికొనుము. నీకు ఏమియు భయము వలదు" అని చెప్పెను. తోడనే ఆమె కన్నులు మూసికొనఁగా, క్రొత్తమంత్రసాని చెప్పిన విధమున వెంటనే ఆఁడుబిడ్డ పుట్టెను. తోడనే క్రొత్తమంత్రసాని ఆశిశువును స్నానము చేయించి, చెవిలో శ్రీకృష్ణమంత్రము నుపదేశించి మంచముమీఁద పరుండఁ జేసెను.

పిదప షష్ఠియవదినమున జాతకర్మ చేసి, బిడ్డకు కుబరాబాయి అని పేరుపెట్టి మిగుల గారాబిముతోఁ బెంచుకొనసాగిరి. క్రొత్తమంత్రసాని మూఁడుమాసముల వఱకును వారియింట నుండి శిశువునకు పరిచర్య చేసి, తల్లిదండ్రులకు ఆనందమును గొలిపి దివ్యమంగళవిగ్రహముఁ దాల్చి వారియెదుట నిలిచెను. అప్పుడు వారు ఇంత వఱకును తమయింట దాస్యముచేయుచున్న మంత్రసాని నిజముగ మంత్రసాని

కాదనియు, శ్రీకృష్ణుఁడే తమయెడలఁ గలయనుగ్రహముచే నట్లు వేషము వేసికొని వచ్చెననియు తెలిసికొని, పరమాశ్చర్యభరితులై వెంటనే పాదములమీఁద వ్రాలి, "శ్రీహరీ! మమ్ము ఇట్లు వంచించుటకు మేము ఏమి యపరాధము చేసితిమి? ఇట్లు మమ్ము చేయుటకు నీకు ఎట్లు తోఁచినది?" అని యనేకవిధముల నపచారములు పలికి బాష్పోదకముతో పాదములు కడిగి పూజించిరి. అందులకు శ్రీకృష్ణుఁడు ఏమియుఁ జెప్పక "మీరు నాయంతరంగభక్తులు. మీకు ఏమియు లోపము కలుగఁబోదు. అవ సానమున మీరు నాసాయుజ్యముక్తినిఁ గాంతురు. కుపరాబాయియు మీవలెనే సాయుజ్యమోక్షముఁ గాంచును" అని తిరోహితుఁ డయ్యెను.

కుపరాబాయి మాటలాడనేర్చినది మొదలు హరినామసంకీర్తనము ప్రారం భించెను. భుజించునపుడు, ఆటలాడునపుడు, నిద్రించునపుడు, ఇఁక నిప్పు డప్పు డన నేల? సర్వప్రారంభములయందును, సర్వకాలసర్వావస్థలయందును, ఆమె శ్రీహరి నామము నుచ్చరించుట మఱచి యెఱుఁగదు. తలిదండ్రులు కొమార్త హరిభక్తినిఁ జూచి ఆశ్చర్యచకితులగుచు, ఆమెను చాల గారాబముగఁ బెంచుకొనుచుండిరి.

మఱికొన్ని దినములు గడచిపోయిన తరువాత శ్రీకృష్ణుఁడు వారికి "ఇఁక మీ గ్రామమునకుఁ బోయి సుఖముగా నుండుఁడు" అని సెలవిచ్చెను. వారు స్వామియాజ్ఞ ప్రకారము వెడలిపోయిరి. కుపరాబాయికి ఏడేండ్లవయస్సువచ్చెను. అప్పుడు తల్లి దండ్రులు ఒక చక్కనియువకునిఁ దెచ్చి ఆమెకుఁ బెండ్లి చేసిరి. మఱికొన్ని దినములకు కుపరాబాయి రజస్వల యయ్యెను. ఆమెతల్లిదండ్రులు ఆమెను పునస్సంధానముచేసి అత్తింటికిఁ బంపివేయవలయునని ముహూర్తము ఏర్పఱచికొనిరి. కుపరాబాయి తలి దండ్రుల ప్రయత్నము నెఱింగి "పెద్దలు తమముద్దుముచ్చటలు తీర్చికొనుటకే యూహించుచున్నారు; కాని, నాసంగతిసందర్భములు ఆలోచించుటలేదు. లోకనింద లకు జంకి నన్ను మాయామయంబగు ఈలోకమునఁ బడవేయఁ జూచుచున్నారు; కాని పిదప నాకు సంభవించుపాట్లను ఆలోచించుట లేదు. ఇప్పుడు నేను సిగ్గుపడి నా బాగోగులు నేను చూచుకొనకున్న, అవ్యాహతమగు జన్మపరంపర పాలై చెడవలసి వచ్చును" అని నిశ్చయించుకొని, ఎవరికిఁ జెప్పకుండ అర్ధరాత్రిసమయమున తీర్థ యాత్రలు సేవించుటకు ఏకాకిని యై బయలుదేఱెను.

అప్పుడు పురద్వారములు మూయఁబడి యుండెను. అదిచూచి కుపరాబాయి శ్రీహరిని స్మరించెను. తోడనే భగవంతుఁడు దివ్యమంగళవిగ్రహుఁడై సాక్షాత్కరించి తలుపులు తెఱచి "తల్లీ! నీయచంచలభక్తికి ఆనందము. నీకు ఏమియు భయము లేదు. ద్వారకకుఁ బోయి సుఖముండుము" అని చెప్పి, అంతర్హితుఁ డయ్యెను. పిదప కుపరాబాయి మహానందముతో బయలుదేఱిపోయి బృందావనము మున్నగు దివ్య

స్థలములను సేవించి, ద్వారకానగరమున నున్న శ్రీహరిని బూజించుచు బ్రహ్మానంద మనుభవించుచుండెను. అచ్చట శ్రీకృష్ణుఁడే ఆమెకుఁ బ్రసాదముఁ దెచ్చి యిచ్చు చుండెను.

కొంతకాలమునకు ఆమె తండ్రి వెదకికొనుచు వచ్చి, "తల్లీ! ఇన్ని దినములును నీవెచ్చట నున్నదియుఁ దెలియక మేము పడు తాపమునకు మేరలేదు. నీవు ఇక్కడకు ఎట్లు వచ్చితివి? నీకు యౌవనము ప్రాపించినది. ఇక నీవు ఇక్కడ ఉండుట మంచిదిగాదు. ఇప్పటికే మాకు అవమానము వచ్చుచున్నది. కావున ఇంటికి రమ్ము" అని పిలిచెను. అందులకు కుబరాబాయి "తండ్రీ! అన్నిఁటను నీవు వృద్ధుఁడవు. నీవు సకలమును దెలియుదువు; కాని మాయావృతుఁడవై యున్నాఁడవు. ప్రపంచవాసనలనుండి నన్ను తొలఁగించుటకు మారుగ, అందు కూలఁద్రోయుట యేటిధర్మము? నీవుగూడ యోచింపుము. కాయము అపాయసంయుతము. ఇహసౌఖ్యములు ఆభాసములు. మనము చూచుచున్నది యంతయు మిథ్య. భ్రాంతియే జనులను పాడుచేయు చున్నది. శ్రీకృష్ణపాదారవిందముల నాశ్రయించినవారికి భ్రాంతియుండదు. నేను మీకు చెప్పునంతటిదానను గాను; అయినను ఇంతవృద్ధులైయుండియు మీరింకను ఇట్లు సంసారచింతలతో వేగుచుండుట బాగుగలేదు" అని చెప్పెను. అది విని తండ్రి "తల్లీ! నీమాటలు నాహృదయమును గరగించినవి. ఇది జ్ఞానోపదేశముగాని వేఱు గాదు. నీవుచెప్పినట్లు మసలుకొందుము; కావున ఇంటికి రమ్ము. మనము అందఱముగూడి శ్రీహరిని బూజించుకొందము" అని చెప్పెను. అంతట అశరీరవాణితో శ్రీకృష్ణుఁడు "కుబరా! ఇది యథార్థము. నీతలిదండ్రులు నీవలెనే భక్తిపరితులయ్యెదరు. నిశ్చింతతో నీవు నీతండ్రితో వెడలిపొమ్ము. నేనును అచ్చటకు వచ్చెదను. నిన్ను నేను విడిచి యుండఁజాల" నని చెప్పెను. కుబరాబాయి ఆనందముతోఁ గూడ అరిగెను.

కుబరాబాయి ఇలుసేరిన తరువాత తల్లికి నమస్కరించి, అపరాధము క్షమింపఁ బ్రార్థించెను. తలిదండ్రులే కాక, కుబరాబాయి భర్తయు అత్తమామలును గూడ ఆమె భక్తిజ్ఞానవైరాగ్యములకు అచ్చెరువడి చూచుటకు వచ్చి, ఆమెవలన నుపదేశముఁ బొంది తాముఁ గూడ శ్రీహరిభజనము ప్రారంభించిరి. కుబరాబాయి వృత్తాంతము తోడనే నగరమునందంతటను తెలిసిపోయెను. రాజు విని యబ్బురపడి ఆమె తండ్రి యగు తనపురోహితుని రప్పించి, "నీకొమార్త హరిగుణకీర్తనము చేయుచుండ విన వలయునని కోరికయున్నది" అని చెప్పఁగా, పురోహితుఁడు రమ్మని చెప్పెను. రాజు నాఁటి రాత్రి చెప్పినప్రకారము పోయి వినియెను. అతనికిఁ గూడ హరిభక్తి యొదవెను; కాని వెంటనే ఆమెపై హృదయము లగ్నమయ్యెను. భక్తిమోహములతో

పరవశుండై యుండఁగా, నాతనికి ఒక స్వప్నము వచ్చెను. అందు కువరాబాయి ఒకనది యొడ్డున నున్నట్లును, తాను నవ్వలిగట్టున నున్నట్లును, మూర్ఖుఁడా! ఇటకు రమ్మని యామె తన్ను పిలిచినట్లును దోఁచెను. రాజు స్వప్నవృత్తాంతము ఇంటికిఁ బోయి తనవిద్వాంసులకు ఎఱింగించెను; కాని వారు "మాకిందలి యంతరార్థము బోధపడుట లేదు. పోయి కువరాబాయినే యడుగుట మంచిది" అని చెప్పిరి. రాజు మొదట క్షమింపఁగోరి, పిదప ఆమెకు తన స్వప్నవృత్తాంతము నెఱింగించెను. ఆమె ఇట్లు చెప్పెను. "నీకు స్వప్నమునఁ గాన్పించిన నేను ముక్తికాంతను. నీకును నాకును మధ్య జన్మాంతరము ఉన్నది. దానిని దాఁటి నాచెంతకు రమ్మని పిలిచితిని. రాజా! ఇఁక నీకు ఏమిలోపము? హృదయమును స్థిరపఱుచుకొనుము. ఏమియు శాశ్వతముగాదు. నీవు తెలివిగలవాఁడవు. నీవు చెడిపోయిన నీక దేశమును ఎవరు శాసింతురు? చెడిపోక, శ్రీహరిని బూజించి సుఖింపు" మని చెప్పెను. రాజునకు బుద్ధివచ్చెను. ఆతఁడు జ్ఞానము నుపదేశించి రక్షింపుమని ప్రార్థింప, కువరాబాయి అట్లే చేసెను. రాజు అదిమొదలు భగవద్భాగవతార్చనముఁ గావించుచు, ధర్మమార్గమున రాజ్యము నేలుచుండెను.

కొన్నిదినము లయినతరువాత రాజు కువరాబాయివద్ద సెలవుగొని తీర్థయాత్రకు బయలుదేఱెను. ఆతఁడు మార్గవశమున నొక అరణ్యమధ్యమున విశ్రమించి యుండఁగా, అనంతగజములు వచ్చి బాధింపఁదొడఁగెను. అపుడు రాజు కువరాబాయి పాదపద్మములను స్మరించెను. తోడనే భగవంతుఁడు సింహరూపియై వచ్చి ఆయేనుఁగుల నన్నిఁటిని సంహరించి తిరోహితుఁ డయ్యెను. అది చూచి రాజు కువరాబాయి యనుగ్రహమువలన భగవంతుఁడే ఇట్లు వచ్చె నని తెలిసికొని, మహానందముతో ముందునకు బయలుదేఱిపోయెను.

ఆరాజు ఒక నగరముచేరి రాత్రిభోజనము అయిన పిదప, భగవంతుని స్మరించి శయనించెను. ఆపట్టణము నేలు రాజునకు ఒకకొమార్తె కలదు. ఆమెను బేతాళుఁడు పట్టి పీడించుచుండెను. నాఁటిరాత్రి బేతాళుఁడు ఆమెతండ్రికి స్వప్నమున సాక్షాత్కరించి "రాజా! ఈనగరమున సత్రములో నొక రాజు శయనించియున్నాఁడు. ఆతనిం దెచ్చి నాకు బలియిచ్చెదవేని నీకొమార్తను నేను విడిచిపోయెదను" అని చెప్పెను. రాజు వెంటనే మేల్కాంచి భటులకు ఆజ్ఞాపింపఁగా, వాండ్రు నిద్రందవిలియున్న రాజభాగవతునిఁ గొనివచ్చి కైదులో వేసిరి. రెండుజాములరాత్రి యగునప్పటికి మెలఁకువ రాఁగా, రాజు తాను బందికానాలో నుండుట యెఱింగి, భగవంతుని స్తోత్రముఁ జేసెను. అప్పుడే శ్రీకృష్ణుఁడు రాజునకు స్వప్నమున ప్రత్యక్షమై, "నీవు నాభక్తుని కైదుచేసితివి. వెంటనే యాతని విడిచిపెట్టి కాళ్లమీఁదఁబడి క్షమింపఁ బ్రార్థించి,

అతఁడు చెప్పినట్లు నడచుకొనుము. ఇట్లు చేసిన నీకు దుఃఖనాశమగును" అని చెప్పెను. రాజు ఉలికిపడి లేచి, వెంటనే స్వయముగా రాజభాగవతునికడకు వచ్చి తన చేతులతో రాజభాగవతునిసంకెలలు విప్పి, పాదములమీఁద వ్రాలి ప్రార్థించి, తనకష్టములు అన్నియు విన్నవించుకొనెను. అది విని రాజభాగవతుఁడు "రేపటి మధ్యాహ్నము పూజాసమయమున నీకొమార్తెను గొనిరమ్ము" అని చెప్పి, తన బసకు పోయెను.

రాజు భాగవతుఁడు చెప్పినప్రకారము చేసెను. అంతట రాజభాగవతుఁడు శ్రీహరిపాదతీర్థమును రాజకుమారికి ఇచ్చెను. ఆతీర్థమును పుచ్చుకొనినవెంటనే ఆమెను ఆవేశించియున్న పిశాచము భయాక్రాంతమై ఆమెను విడిచిపోయెను. అంతట ఆమెయు, రాజును, మంత్రి మున్నగువారును రాజభాగవతుని చాలఁ గొనియాడి, చాలఁ బూజించి, స్వదేశమునకుఁ బంపివేసిరి. స్వస్థత చెందిన పిమ్మట ఆరాజు కువరాబాయికి మ్రొక్కి సకలమును నివేదించెను.

ఆరాజు సకుటుంబముగ వచ్చి తమకు మోక్షమార్గమును జూపవలయునని రాజభాగవతునిఁ బ్రార్థించెను. ఆతఁడు కువరాబాయి సెలవుఁబడసి వారికి జ్ఞానోపదేశముఁ గావించెను. అందఱును కువరాబాయియాజ్ఞచొప్పున శ్రీహరిని యథాశాస్త్రముగఁ బూజించుచు బ్రహ్మానందభరితులై యుండిరి.

కువరాబాయి బ్రతికియున్నంతకాలమును శ్రీహరినిఁ బూజించి, అవసానమున సాయుజ్యముక్తినిఁ బడసెను.

మ "వసుదేవప్రియదారగర్భఖనిజత్వం బొప్ప జన్మించి యా
వసుదేవుం డిడ నందగోపుఁడు సుతాపత్యంబునం గాంచు రా
నసమానవ్రజబాలహారరతరళంబై గోపికాకల్పమై
రసలీలాకృతమైన కృష్ణమణి నశ్రాంతం బెదన్నిల్పెదన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 97.)

---

# 66. శీలాబాయి

శ్లో. "కర్ణలంబితకదంబమంజరీ కేసరారుణకపోలమండలం,
నిర్మలం నిగమవాగగోచరం నీలిమాన మవలోకయామహే."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 31.)

ఒకరాజునకు శీలాబాయి అనునొకకొమార్తె పుట్టెను. తలిదండ్రులు ఆమెను మిగుల గారాబముతోఁ బెంచుకొనుచు, యుక్తసమయమున విద్యాభ్యాసార్థము ఒక బ్రాహ్మణుని రావించి, సుముహూర్తమున ప్రారంభముచేయించెను. ఆమె సూక్ష్మబుద్ధిఁ గలదగుటచే గురువుచెప్పినదియెల్ల నిముసములో గ్రహించుచు, అందఱు నాశ్చర్య

పడునట్లుగా విద్యలన్నియు స్వల్పకాలమునందే నేర్చుకొనెను. ఆమె తనతండ్రి దిన దినమును సాలగ్రామపూజ చేయుచుండుటఁ గాంచి, తానుగూడఁ జేయఁగోరి, యొక నాఁడు "నాకుఁగూడ సాలగ్రామపూజ సేయఁగోరికకలదు. ఒకసాలగ్రామమును దెచ్చి యిచ్చి యుపదేశము చేయవలయును" అని ప్రార్థించెను. ఉపాధ్యాయుఁడు ఆమె భక్తిప్రపత్తులకు ఆనందించి, అప్పటికి సాలగ్రామము ఏదియు లభింపకపోవుటచే నొక నల్లరాతినిఁ దెచ్చియిచ్చి పూజావిధానము నుపదేశించెను.

శీలాబాయి అది మొదలు అత్యంతభక్తితో ఆనల్లరాతినిఁ బూజించుచుండెను. తల్లిదండ్రులు అది చూచి "ఆట" యని భావించి యూరకుండిరి. ఇంతలో ఆమెకు సంపూర్ణ యౌవనము వచ్చెను. అంతట తండ్రి ఒక చక్కనికౌమారుని వెదకితెచ్చి, శుభముహూర్తమున దేవేంద్రవైభవముతో కొమార్తకుఁబెండ్లిఁగావించెను. ప్రజలు అందఱును ఆనందించిరి. కొన్నిదినములు అల్లుని తన ఇంట నుంచుకొని, పిదపరాజు అల్లుని కొమార్తను బంపివేసెను.

అత్తింటికిఁ బోయిన పిదపఁగూడ శీలాబాయి ఆరాతికిఁ బూజచేయుట మాన లేదు. ఒకనాఁడు ఆమెభర్త వచ్చి "ఇది ఏమి?" అని యడుగఁగా, ఆమె "ఇది మా కులాచారము" అని ప్రత్యుత్తర మిచ్చెను. "ఈవయస్సున ఇది తగినది గాదు" అని చెప్పి, యాతఁడు ఒకనాఁటిరాత్రి ఆరాతిని నదిలోఁ బాఱవేసెను.

మఱునాఁడు శీలాబాయి రాతికొఱకు ఎంత వెదకినను గాన్పింపకయుండెను. అగుటచే "నాదేవుఁడు లభించునంతదనుక నేను భుజింప" నని యామె శపథము పట్టెను. భర్తయే గాక అత్తమామలు గూడ ఎంత చెప్పినను ఆమె వినదయ్యెను. ఇట్లు అయిదాఱు దినములు గడచిపోయెను. శ్రీహరి శీలాబాయికి తనయెడలఁగల భక్తిశ్రద్ధలకు మెచ్చి నాఁటిరాత్రి వృద్ధబ్రాహ్మణవేషముతో వచ్చి, ఆరాతిని ఆమెకు ఇచ్చి వెడలిపోయెను. మఱునాఁడు ప్రొద్దున మేల్కాంచి ఆమె తనదేవుఁడు తనప్రక్కలో నుండుటఁ గాంచి పరమానందభరితయై, భక్తితోఁ బూజించి నివేదన చేసి తాను భుజించెను. అత్తమామలు ఆమెప్రభావమును జూచి ఆశ్చర్యపడిరి. భర్త తెల్లవోయెను. అందఱును ఆమెకు అనేకవందనములు ఆచరించిరి. శీలాబాయి బ్రతికి యున్నంతకాలము ఇట్లే శ్రీహరినిఁ బూజించి, అవసానమున సాయుజ్యముక్తినిఁ బడసెను.

మ: "చెవులన్ ప్రేలుకదంబమంజరులచేఁ జిన్నారిచెక్కుల్ జ్వల
న్నవసంధ్యారుణితాభ్రకాంతి చెలువందన్ మందహాసప్రభా
అవముక్ వెన్నెలతళ్కుఁ జూప మృదులాలంకారుఁడై వేదసం
స్తవనాగోచరుఁడైన శౌరి యసితచ్ఛాయల్ విలోకించెద."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 31.)

# 67. రామచంద్రభట్టు

శ్లో. అగ్రే దీర్ఘతరోఽయ మర్జునతరు స్తస్యాగ్రతో వర్త్మనీ
సా ఘోషః సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా,
తస్యా స్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పంథాన మవ్యాహతమ్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. శ్లో. 43.)

దాశరథి అను నదియొడ్డున గల అమలనేరి అనునగరమున రామచంద్రభట్టు అనునొక బ్రాహ్మణుఁడు ఉండెను. అతఁడు పరమభాగవతోత్తముఁడు. ప్రాపంచిక సుఖములు అనిన ఆతనికి తలనొప్పి. ఆ దేశమును ఏలు రాజునకు గురువు. అయినను ఆతఁడు వైభవములపొంతఁబోక, కేవలము ఉంఛవృత్తిచేతనే దినములను గడుపుచుండెను. ఆతనిహృదయమున సర్వకాల సర్వావస్థలయందును శ్రీహరి నామము జాగరితమగుచునే యుండెను.

ఆతని భార్య సర్వవిధముల నాతనికిఁ దగిన రమణి. ఐహికసుఖముల యెడల నామెకు తనభర్త కంటెను ఎక్కుడు అనిష్టము. అత్తమామలను బూజించుట యందును, పతికి సకలోపచారములును జేయుటయందును, ఆమెతో సాటిబోటులు ఆకాలమున ఎందును లేరని యామె ప్రఖ్యాతి వడసెను.

ఇట్టి దంపతులయొక్క శిష్యుఁడు ఎట్టి గుణవంతుఁడై యుండెను? తుల్యప్రకృతులు కానివారికి లోకములో స్నేహసంబంధములు ఎందును ఎఱుఁగము. ఆతఁడు భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నుఁడు. శ్రీహరిభక్తుఁడు మనుమార్గమును దప్పని ధర్మప్రభువు. ప్రజలయైశ్వర్యమును వృద్ధిచేయుటకును, వారికి అనంతసౌఖ్యములు కలిగించుటకును, ఆతఁడు ప్రాణములు విడువవలసివచ్చినను సంతోషముతో విడుచును. మనకుఁ గాన్పించుచున్న జగత్తు అంతయు మిథ్యయనియు, దీనిని నమ్ముకొనుట కంటె అవివేకము లేదనియు నమ్మి, శ్రీహరిసేవయందే కాలము గడుపు భక్తాగ్రేసరుఁడు.

ఆతని రాణి ఒకనాఁడు మహాపతివ్రత యగు గురుపత్ని దారిద్ర్యమును బాపుటకు నిశ్చయించుకొని, ఆమెకు వర్తమానముచేసెను. రాణియాజ్ఞప్రకారము రామచంద్రభట్టుభార్య కోటలోనికిఁ బోయెను. రాణి ఆమె ననేక విధముల ఆదరించి చాలమర్యాదచేసి, అనేకసద్విషయములను దెలిసికొని, ఆనందభరితయై వెలగల పెక్కురత్నాభరణములను స్వయముగ నామెకు అలంకరించి, సగౌరవముగ సాగనంపి ఇంటికిఁ బంపివేసెను,

రామచంద్రభట్టు పూచిన తంగేడువలె నున్న భార్యను జూచి ఆశ్చర్యచకితుఁడై "ఇదంతయు నేమి?" అని ప్రశ్నించెను. అందులకు ఆమె జరిగినది అంతయు నెఱింగింపఁగా, రామచంద్రభట్టు చాలఁ గటకటంబడి "రమణీ! నీవు సకలమును నెఱిఁగినదానవే; కాని నేఁడు భ్రాంతవైతివి. ఎట్లో ఈతనువుఁబోషించిన చాలునని యున్న మనకు ఈరత్నాభరణములు అన్నియు ఎందులకు? సంగతి తెలిసియుండియు రాణి నీకు ఇవి యెట్లు నెట్లు ఇచ్చినది? నీవు ఎట్లు అంగీకరించితివి? అయ్యో! ఎంత అనాలోచితకృత్యమును చేసితివి! ఈమాత్రపు యోచన నీకుఁ దోఁచినది కాదు గదా!" యని పలికెను. అందుఁకు ఆమె "నేను ఏమిచేయఁగలను? రాణి అతిభక్తితో వీనిని నాకు అలంకరించినది. భక్తులు సమర్పించు వస్తువులను దిరస్కరించుట యెట్లు? శ్రీరామచంద్రుఁడు శబరియిచ్చిన ఎంగిలిఫలములను స్వీకరింపలేదా? ఆసమయమున మీరైనను మాఱు పలుకఁజాలరు. అయినను ఇపుడు మించినది ఏమి యున్నది. మీయాన జవదాఁటుటకు నేను ఎంతటిదానను?" అని పలికి, తనయొడలి మీఁదిరత్నాభరణముల నన్నిటిని దీసి ఎదుట నున్న హోమకుండములోఁ బడ వేసెను. అది చూచి రామచంద్రభట్టు చాల సంతోషించెను.

ఈవార్త రాజునకుఁ దెలిసెను. తోడనే ఆతఁడు వచ్చి, "రాణి ఇచ్చిన వస్తువులు మీకు వలదేని నాకు దయచేయుఁడు" అని పలికెను. రామచంద్రభట్టు అందులకు వగవక, నిర్మలచిత్తుఁడై శ్రీహరిని స్మరింపఁగా, నాతని రమణి హోమకుండములోఁ బడవేసిన వస్తువు లన్నియు పూర్వాధికశోభతో రాజునెదుటఁ బడియుండెను. రామచంద్రభట్టు "తీసికొనవచ్చును" అని పలికెను; కాని రాజు "ఇచ్చినది మఱలఁ బుచ్చుకొనుట మాకుఁ దెలియదు" అని తిరస్కరించి, ఆరత్నాభరణాదులను అచ్చట నున్న బీదల కందఱకును బంచి ఇచ్చెను.

ఒకనాఁడు రామచంద్రభట్టు ప్రార్థనానిమగ్నుఁడై యుండఁగా, శ్రీహరి దివ్యమంగళవిగ్రహుఁడై సాక్షాత్కరించెను. అంతట ఆనందమును బట్టఁజాలక రామచంద్రుఁడు నృత్యము ప్రారంభించెను. ఆతనిం గాంచి ఆతని రమణి గూడ అట్లే చేసెను. వారిభక్తికి మెచ్చుకొని శ్రీహరి వారికి అభయ మిచ్చి తిరోహితుఁడయ్యెను. రామచంద్రభట్టును, ఆతని భార్యయు బ్రతికి యున్నంతకాలమును శ్రీహరిని సేవించి, అవసానమున సాయుజ్యమోక్షమును బడసిరి.

**"మ. అదిగో ముంగల పెద్దమద్ది యట బో నాచెంత వ్రేపల్లె యుం**
**న్నది యీదండఁ గళిందజాతటమునం దాపించభూజాళిలోఁ**
**గదుపుల్ మేపుచు గోపబాలకుఁడు నిక్కం బొప్పఁగాఁ జెల్వునఁ**
**ద్పదవిం బొమ్ము సఖా శుభాస్పదముగా భావంబు రంజిల్లెడున్."**

(కృష్ణకర్ణామృతము. అ. 2. ప 43.)

# 68. జయమల్లరాజు

శ్లో. "ఆసాలంబితవామకుండలధరం మందోన్నతభ్రూలతం
కించిత్కుంచితకోమలాధరపుటం సాచిప్రసారేక్షణం,
ఆలోలాంగుళిపల్లవైర్మురళికా మాపూరయంతం ముదా
మూలే కల్పతరో స్త్రిభంగిలలితం జానే జగన్మోహనమ్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. శ్లో. 102.)

మేడము అను పట్టణమున జయమల్లుఁడను అనునొక ప్రభువు పాలించు చుండెను. అతఁడు అనవరతము భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నుఁడై శ్రీహరిని ధ్యానించుచుండెను. ప్రతిదినము ఉదయమున పూజనొనర్చినపిమ్మట ఏకాంతమున కూర్చుండి ఒకజామునేపు శ్రీహరిని ధ్యానించుట అతనికి అలవాటు. అప్పుడు అతని చెంతకు ఏవారును పోరాదు; ఎవరును మాటాడఁగూడదు. అతఁడు మధ్యాహ్నభోజనమునకు నిట్లు శ్రీహరిపూజాతత్పరుఁడై, భోజనానంతరము మనుమార్గమున ధరాపాలనము గావించుచుండును.

అతనికి ఒక తమ్ముఁడు ఉండెను. తమ్మునకు అన్నరాజ్యము హరింపఁ దలంపుఁ గలిగెను. ఈతలంపుతో నాతఁడు దగ్గఱనున్న మఱియొకపట్టణమున వసించి సేనలను సేకరించుకొనసాగెను. తదేకదీక్షతో పనిచేయుచుండుటవలన అనంతసైన్యము త్వరలోనే సమకూడెను. తోడనే ఆతఁడు అన్నగారు హరిధ్యానతత్పరుఁడై యుండుసమయమున మేడముకోటను ముట్టడించెను. మంత్రి వెంటనే తనసైన్యముతో వాని నెదిరించెను; కాని ప్రయోజనము లేకపోయెను. శత్రుసేన అసంఖ్యముగ నుండుటచే రాజుసేన వెనుదీయఁ జొచ్చెను. అదిచూచి మంత్రి రాజుతల్లి చెంతకుఁ బోయి, సంభవించిన యాపద నెఱింగించెను. ఆమె పోయి రాజుతోఁ జెప్పుమనియెను; కాని "రాజుతో నిప్పుడు మాటాడుటకు బ్రహ్మాండనాయకునకైన సెలవులేదుగదా!" అని యాతఁడు మాఱు పలికెను. "ఇఁక ఉత్తరప్రత్యుత్తరములతోఁ బ్రయోజనములే" దని తలంచి, రాజమాత వెంటనేపోయి "శత్రువులు వచ్చి కోట ముట్టడించినారు. ఇప్పుడు లేవకున్న ఉపాయముతప్పదు" అనియెను; కాని రాజు మాట్లాడలేదు. "భయము వలదు. శ్యామళుఁడు అను నేను ఉండఁగా శత్రువులు జయింపఁజాలరు" అను ఆకాశవాణి మాత్రము వినఁబడియెను. అది విని రాజమాత ధైర్యముతో నీవలకు వచ్చెను.

అంతట శ్రీహరి శ్యామళుఁడు అను యోధుని రూపమును దైకొని, గుఱ్ఱమునుఎక్కి యుద్ధరంగమున నుఱికెను. అంతట అనంతమైన వైరివాహినికిని

ఏకాకియగు శ్యామళునకును ఘోరయుద్ధము ప్రాసంగెను. ఒకటి రెండునిముసములు నడచునప్పటికి రక్తనదులు ప్రవహింపం జొచ్చెను. హతులు ఆనదులలోం గొట్టుకొనిపోసాగిరి. హతశేషులు పలాయనము చిత్తగించిరి. అపుడు శ్యామళుండు రాజుతమ్మునిఁబట్టుకొని పెడరెక్కలు విఱిచి కట్టి, మంత్రికి అప్పగించి తాను తిరోహితుం డయ్యెను. మంత్రి శత్రుని కారాగృహమున బంధించి నిశ్చలుం డయ్యెను. ఇంతలో రాజు పూజాదికము ముగించుకొని, ఇవ్వలకు వచ్చెను. మంత్రి రాజుతో సకలమును ఎఱింగించెను.

రాజు ఆశ్చర్యచకితుండై, "మంత్రీ! శ్యామళుండు ఎతఁడో ఎఱుంగుదువా? నీవు ఎంత అదృష్టవంతుఁడవు! అనాయాసముగ భగవంతునిదర్శనము చేయంగలిగిన నిన్ను ఏమని కొనియాడఁగలను?" అని మంత్రితోం బలికి, "శ్రీహరీ! గోవిందా! నీవు భక్తపరాధీనుఁడవని విందును; కాని భక్తుఁడగు నాయెడలం జూపని యనుగ్రహము దుర్మార్గగామియగు వైరియెడల నేల చూపితివి? ఇది నీకుం దగునా? అయ్యో! నీవు సర్వాంతర్యామివి గదా! సర్వసముఁడవుగదా! అదియుం గాక నాకంటె వైరి నీకు అంతరంగభక్తుఁడై యుండవచ్చును. నేనే పొరపడితిని. కాదేని నాయెడల నేల యనుగ్రహము చూపవు? నీదర్శనము నపేక్షించియున్న నాకు నీదివ్యమంగళవిగ్రహసందర్శనలాభము నేల కలిగింపకున్నావు? జనార్దనా! నారాయణా! నీకంటె నేను అన్య మెఱుఁగను. నన్ను రక్షింపవా?" యని ప్రార్థింపసాగెను.

అపుడు శ్రీహరి నిజరూపముతో నచ్చట సాక్షాత్కరించెను. రాజు పరమానందభరితుండై భగవంతునకు సాష్టాంగనమస్కారములు ఆచరించి, అనేకవిధములం గొనియాడెను. శ్రీహరి ప్రేమతో రాజును లేవనెత్తి కౌఁగిలించుకొని, "వత్సా! నీభక్తికి మెచ్చితిని. నీచిత్తశుద్ధి అనన్యదుర్లభము. నీవు నాయంతరంగభక్తుఁడవు. నీకేమియు లోపములు కలుగవు. నీవు కోరినపుడెల్ల నీకు సాక్షాత్కరించుచుందును. సదాచార్యు నాశ్రయింపుము. ఆచార్యోపదేశమును బడసినంగాని నిశ్చలభావము కలుగదు" అని యాశీర్వదించి తిరోహితుం డయ్యెను.

పిదప రాజు కారాగారమున నున్నతమ్మునిం గొనివచ్చుటకు మంత్రికి ఆజ్ఞాపించెను. మంత్రియు కైదులోనికిం బోయి బద్ధుండై పడియున్న రాజుతమ్మునిం జూచి "నిన్ను కట్టి నాకు అప్పగించినయోధుఁడు శ్రీహరి! శ్రీహరి! నీయన్నగారిని కంటిని రెప్పవోలెం గాపాడుచుండును. భగవంతుని అంతరంగభక్తుఁడగు నీయన్నగారు నిన్ను గొనిరమ్మని నాకు సెలవు ఇచ్చినారు" అని పలికి, ఆతనిం దీసికొనిపోయి రాజు నెదుట నిలిపెను. అంతట రాజు తమ్ముని బంధములను విప్పి కౌఁగిలించుకొని,

"తమ్ముఁడా! అశ్రమముగ శ్రీహరిప్రత్యక్షసాక్షాత్కారభాగ్యమును బడసిన నీయదృష్టము నేమని కొనియాడవచ్చును? భగవంతునిఁ జూడఁగలిగితివి; కావున ఇఁక నీకు ఏమియు లోపము కలుగదు. నిన్నుఁ జూచిన నాకు మహదానందము కలుగు చున్నది. అని యాదరముతోఁ బలికెను. అప్పుడు తమ్ముఁడు అన్నపాదములమీఁద వ్రాలి, "మహాత్మా! నీప్రభావము తెలియఁగలేక నీయెడల ఎగ్గుచేసితిని. అయినను దీనుఁడ నగు నన్ను మన్నించితివి. నీహృదయౌన్నత్యమునకు ఇంతకంటె వేఱు ఉదాహరణము కావలెను? నాకు బుద్ధివచ్చినది. ఇంతవఱకును నేను జేసినదుష్కృత్యములకు పరితపించుచున్నాను. నన్ను నీశిష్యకోటిలోఁ జేర్చుకొని కాపాడుము" అని ప్రార్థించెను. రాజు తమ్ముని ఆదరముతో లేవనెత్తి అభయ మిచ్చెను.

పిదప రాజు గొప్పగొప్ప శిల్పులను రావించి, అద్భుతపూర్వమగు నొక గొప్ప ఆలయమును గట్టించి, శుభముహూర్తమున నందు శ్రీహరిని ప్రతిష్ఠచేసి, ప్రతిదినమును బూజింపసాగెను. ఆయాలయమున తానొకఁడేగాని ఇతరులు ఎవరును బ్రవేశింపఁగూడదు. ఆతఁడు నూలునిచ్చెన వేసికొని పైకి ఎక్కి, నిచ్చెన వెంటఁ గొని పోయి ఒకజాము శ్రీహరినిఁ బూజించి సేవించి మఱల వచ్చును. ఒకనాఁడు అతఁడు నిచ్చెన వెంటఁగొనిపోవుట మఱచి లోనికిఁ బోయెను. ఇట్టి సమయముకొఱకు కనిపెట్టుకొనియున్న రాణి వెంటనే నిచ్చెన యెక్కి లోనికిఁబోయెను. అప్పటికప్పుడే రాజు మామూలుప్రకారము సాక్షాత్కరించియున్న శ్రీహరిపాదములను ఒత్తుచుండెను. అపుడు రాణియు శ్రీహరికి ప్రదక్షిణ నమస్కారములు ఆచరించి, "పుండరీకవరదా! రాక్షసాంతకా! నేఁటికి నాజన్మ సార్థకమైనది" అని యానందాతిరేకముచే మఱల మాటాడఁజాలక పోయెను. శ్రీహరి రాణిభక్త్యావేశమునకు మెచ్చి చేరఁ బిలిచి, "నీవును నీభర్తయు నాకు అంతరంగభక్తులరైతిరి. మీరు తలంచినపుడెల్ల నేను సాక్షాత్కరించు చుండును" అని చెప్పి, అంతర్హితుఁడయ్యెను.

ఇది యంతయుఁ జూచి రాజు ఆశ్చర్యచకితుఁడై, "నాకుఁదక్క ఇతరులకు జొరరాని ఇచ్చటకు నీవెట్లు వచ్చితివి?" యని యడుగఁగా, రాణి "మీరు వచ్చు నపుడు నిచ్చెన తీసి వేయుట నేఁడు మఱచిపోయితిరి. ఇట్టిసమయమునకై చాలదినములనుండి వేచియున్న నేను వెంటనే లోపలకు వచ్చితిని. కాని నాథా! నేను మీకు పదదాసినిగదా! అర్థాంగినిగదా! అట్టి నన్ను ఇట్లు వేఱుచేయుట మీకు న్యాయమా? మీకు నేను ఏమియపరాధము చేసితిని? మీకు ఎప్పుడును ఎదురాడి యెఱుఁగను. ఏవిషయమునందును మీకు అడ్డువచ్చి యెఱుఁగను. నియమమ్ము నెన్నఁడు ఉపేక్షించి యెఱుఁగను. అట్టి నన్ను ఇట్లు వేఱుచేయుటకు మీకు ఎట్లు మనసు ఒప్పెను!" అని యడిగెను. రాజు గతజల సేతుబంధనము వల దనియెను. అదిమొదలు రాజును రాణియు అనుదినమును శ్రీహరినిఁ బూజించుచు సాక్షాత్క

రించిన డామోదరుని సేవించుచు బ్రహ్మానందముతోఁ గాలము గడపి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసిరి.

ఉ. "మూఁపున వామకుండలము మోవి నొకించుక మోదువునందముం
జూపెడు నోరచూపు సొగసుంబొమ నొక్కట నిక్కగన్పడం
గ్రేఁపులు సొక్కఁ గల్పకముక్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళ
వ్యాపితవంశపూర్తియయి వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 102.)

---

# 69. గిరిధరలాలు

శ్లో. "అంగనామంగనామంతరే మాధవో మాధవం మాధవం చాంతరే చాంగనా,
ఇత్థ మాకల్పితో మండలే మధ్యగః సంజగౌ వేణునా దేవకీనందనః".

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. శ్లో. 35.)

బృందావనక్షేత్రమున గిరిధరలాలు అనునొకబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు సంసారముయొక్క అసారతనుగుర్తించి ఐహికసౌఖ్యములు ఆభాసములు అని యెఱింగి, ప్రపంచమంతయు మిథ్యయని తెలిసి, తామరాకుమీఁది నీటిచుక్కవలె ఎందును అంటక శ్రీహరిపూజా తత్పరుఁడై కాలము గడుపుచుండెను. కాళ్లకు గజ్జెలు కట్టుకొని తంబుర మీటుచు, శ్రీహరిగుణములను వర్ణించుచు, నాతఁడు భజనము చేయునపుడు అనేకులు వచ్చి విని చూచి, బ్రహ్మానందపరవశులై పోవుచుందురు.

ఒకప్పుడు ఆతఁడు గోపాలకృష్ణుని సేవించుటకు ఆలయమునకుఁ బోయెను. అంతకుఁ బూర్వమే అచ్చటకు అనేకభాగవతులు వచ్చియుండిరి. వారందఱును గిరిధరలాలుని గానప్రావీణ్యమును వినియున్నారు కావున, అందఱును జేరి "మహాత్మా! శ్రీకృష్ణభగవానుని రాసక్రీడా వైభవమును గీర్తించి, మాకు ఆనందము గలిగింపుము" అని ప్రార్థించిరి. ఆతఁడు వారిమాటఁ ద్రోసివేయఁజాలక పోయెనుగాని , తంబురయు గజ్జెలు మఠముననుండిపోవుటచే వీరి నెట్లు సంతోషపెట్టఁగలనని చింతింపసాగెను. ఇట్లుండఁగా, ఆకాశమునుండి తళతళ మెఱయు గజ్జెలును కలకల పలుకు తంబురయు వచ్చి గిరిధరలాలు ముందుఁ బడెను. అది చూచి భాగవతులు ఎల్లరును ఆశ్చర్యచకితులై, గిరిధరలాలు మాహాత్మ్యమును వేనోళ్ల గొనియాడిరి.

తరువాత గిరిధరలాలు ఇదియంతయు గోపబాలుని అనుగ్రహము అని యెఱింగి, వానికి మ్రొక్కి పీతాంబరమును గజ్జెలను ధరించి, తంబుర గైకొని భాగవతుల యనుజ్ఞను బడసి నృత్యము ప్రారంభించెను. ఇట్లు రెండు మూఁడునిమిషములు గడచునప్పటికి భాగవతులకు తన్మయత్వము గలిగెను. మఱి రెండునిముసములకు గిరిధరలాలుగూడఁ దన్మయుఁడై చేష్టలు దక్కి నిలిచెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు తొల్లి బృందావనమున గోపికలతో నెట్లు రాసక్రీడ సలిపెనో, అట్లే అచ్చట

సాక్షాత్కరించి రాసక్రీడ సలుపసాగెను. భాగవతులు ఆనందమున సొక్కి మగ్నులై, కొంత వడి తెలివి గాంచి శ్రీకృష్ణుని అనేకవిధముల గొనియాడసాగిరి. అంతలో కృష్ణుఁడు తిరోహితుఁడయ్యెను. గిరిధరలాలు అంతట మూర్ఛాక్రాంతుఁడై పడెను. భాగవతులు ఆతని భక్త్యావేశమునకు ఆశ్చర్యపడి అందఱును ఆతనిచుట్టును జేరి, చేతులతోఁ దాళము వేయుచు శ్రీహరికీర్తనలు పాడసాగిరి.

కొంతసేపటికి గిరిధరలాలునకు ప్రాకృతస్మృతి వచ్చెను. వెంటనే భాగవతులందఱును ఆనందబాష్పములతో నాతనిపాదములు తడిపివైచి, "మహాత్మా! నిర్హేతుకజాయమానకటాక్షమున మాకు శ్రీకృష్ణుని రాసక్రీడావైభవమును ప్రత్యక్షము చేసితివి. నిన్ను మేము ఏమని కొనియాడఁగలము? నీ ప్రజ్ఞ అసామాన్యము" అని ప్రస్తుతించిరి. గిరిధరలాలు వారిని తన మఠమునకుఁ గొనిపోయి మృష్టాన్నసంతృప్తులం గావించి, సుగంధ కుసుమ తాంబూలములు అర్పించి, చాల నాదరించి పంపివేసెను.

ఒక దినమున ఒక బైరాగి వచ్చెను. గిరిధరలాలు ఆతనిని తనమఠమునకుఁ గొనిపోయి చాల గౌరవించి, మృష్టాన్నసంతృప్తుని గావించెను. ఇది తెలిసి ఊరు వారందఱును వచ్చి "శ్మశానమునుండి వచ్చినవానికి నీవు ఆతిథ్యము ఇచ్చితివి; కావున నిన్ను వెలివేసితిమి" అని పలికిరి. అందులకు అతఁడు "మహానుభావులారా! మీరు ఆతనిని ఇట్లు పలుకఁ దగదు. అతఁడు కేవలము భాగవతాగ్రేసరుఁడు" అని చెప్పఁగా, వారు "అతఁడు మహాత్ముఁడని నీవు చెప్పుచున్నావు. నీవు శవమును బ్రతికింపఁ గలవా? అట్లయిన నీమాటలను, ఆతనిమాహాత్మ్యమును నమ్మెదము" అనిరి. గిరిధరలాలు వల్లె యనెను. గ్రామవాసులు ఆతని నొక శవము చెంతకుఁ గొనిపోయి 'దీనిని బ్రతికింపుము' అనిరి. గిరిధరలాలు నిర్మలచిత్తముతో శ్రీహరినిఁ బ్రార్థించి ఆశవమును దాఁకెను. తోడనే మృతుఁడైనపురుషుఁడు నిద్దుర పోయినవానివలె లేచి, భక్తునకు వలగొని, సాష్టాంగవందనములు అర్పించి, అనేకవిధములఁ గొనియాడెను. అది చూచి ఊరివారందఱును లాలుపాదములమీఁద వ్రాలి, "మహాత్మా! నీశక్తి నెఱుంగక నిన్నుఁ దూలనాడిన మమ్ము క్షమింపవలయును" అని అనేకవిధముల బతిమాలికొనిరి. గిరిధరలాలు వారికి అభయమిచ్చి తన మఠమునకుఁ గొనిపోయి మృష్టాన్నతృప్తులం గావించి పంపివేసెను.

గిరిధరలాలు బ్రతికియున్నంతకాలము నిట్లే శ్రీహరిని బూజించి, అవసానమున సాయుజ్యముక్తిని బడసెను.

చ. ఇరుదెసఁ దాను నిల్చి తన కింతులు పార్శ్వములన్ వసింపఁగాఁ
గరములు గంతపాళిఁ బెలఁగన్ బలభిన్మణివిద్రుమంబులన్
సర మొనరించినట్లు సరసస్థితి మండలమధ్యవర్తియై
మురళిరవంబునం బెలఁగు మోహనమూర్తి మురారిఁ గొల్చెదన్.

(కృష్ణకర్ణామృతము. ఆ. ౨. ప. ౭౫.)

# 70. సుహక్ షా

శ్లో. "ఆపాటలాధరమధీరవిలోలనేత్ర మామోదనిర్భరితమద్భుతకాంతిపూరం,
ఆవిస్మితామృతమనుస్మృతిలోభనీయమాముద్రితాననమహో మధురం మురారేః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 63.)

అహమ్మదాబాదు అను నగరమున సుహక్ షా అనునొకమహమ్మదీయుఁడు వసించియుండెను. అతఁడు నపుంసకుఁడు; కావున స్త్రీలవలెనే వస్త్రాభరణాదులను ధరించి, సిగ్గు వెంపున వీథిలోనికి రాఁజాలక సదా ఇంటియందే యుండెడివాఁడు. పూర్వపుణ్యవశమున అతనికి శ్రీహరిభక్తి యొదవెను. అతఁడు సర్వకాలములయందును శ్రీహరిస్మరణము తక్క నన్య మెఱుఁగక యుండెను.

ఇట్లుండఁగా, ఆదేశమున అనావృష్టిచె క్షామము సంభవించెను. త్రాగుటకు జలమును తినుటకు పదార్థములు లేకుండుటచే, అనేకజనులు చనిపోవసాగిరి. ఇది చూచి అహమ్మదాబాదు నగరమున ధరాపాలనము చేయుచున్న రాజు జననష్టమును జూడలేక నిరాహారుఁడై, ఏడుదినములు మహోగ్రతపస్సుఁ జేసెను. శ్రీహరి అందులకు ఆనందించి, సాక్షాత్కరించి "వత్సా! నీభక్తికిని, నీతపోనిష్ఠకును, నీదీక్షకును, నీప్రజాపరత్వమునకును మెచ్చితిని. నీవు సర్వజీవదయాళుఁడవై ప్రజను కన్నబిడ్డలంబోలె భావించుచు, భూమి నేలుచుండుట మొదటినుండియు నేను గమనించుచున్నాను. నీకెందును లోపము కలుగదు. నేను నిన్నెపుడును వేయికండ్లతోఁ జూచుచుందును. నీవు ఇపుడు వర్షమును గోరి నానిమిత్తము ఈ ఘోరతపస్సు చేసితివి. నీనగరమున నొక పర్ణకుటీరమున నొక సుహక్ షా అను నొక మహమ్మదీయుఁడు నాభక్తుఁడు వసించియున్నాఁడు. నీవు పోయి ఆతనిని మ్రొక్కి ప్రార్థించెదవేని నీకోరిక నెఱవేఱును" అని చెప్పి, తిరోహితుఁడయ్యెను.

అంతట రాజు తపస్సు చాలించి, నిండుకొలువునఁ గొలువుదీఱి మంత్రిసామంతాదులకును, విద్వాంసులకును జరిగినదంతయు నెఱింగించెను. అందఱును ఆశ్చర్యచకితులైరి. ఒకబ్రాహ్మణుఁడు "మహారాజా! భగవంతునిమాట తప్పదు. ఆమహమ్మదీయుఁడు భగవంతుని అంతరంగభక్తులలో అగ్రేసరుఁడు. కాకున్న ఇట్టిది యుండదని వేఱుగఁ జెప్పవలసినది ఏమున్నది? ఆమహాత్ముఁడు మహమ్మదీయుఁడు అనుశంక వలదు. మహాత్ములు అన్ని జాతులయందును ఉందురు. మాహాత్మ్యము ఉన్నచోట జాతిభేదములను గణించుట వివేకిలక్షణము కాదు. అదియుఁగాక

శ్రీహరిసేవలైనపుడు సందేహమునకు అవకాశమే లేకుండఁ బోయినది" అని చెప్పెను. అంతటను అప్పనని. వెంటనే రాజు సుహాక్ షాకడకుఁ బయలుదేఱెను.

రాజుచే సత్కృతుఁడై సుహాక్ షా పలుగు సంకీర్తనములు అన్నియును విని, శ్రీహరినిఁ బ్రార్థింపఁ దొడఁగెను. అయిదారుదినములు గడచినను వర్షము కురియ నందున సుహాక్ షా కోపించి, "శ్రీహరీ! నన్ను మోసముఁ జేసితివా!" యని మునుపున్న గల వస్త్రము నూడఁబెఱికి, చేతి గాజులు పగులఁ గొట్టుకొనఁ బోయెను. అంతట శ్రీహరి సాక్షాత్కరించి, "వత్సా! వలదు" అని, సాహసమును వారించి అంతర్హితుఁ డయ్యెను. తోడనే పదునాలుగుదినములు అహోరాత్రములు ఏకధారగా వర్షము కురిసెను. క్షామము చల్లారెను. రాజు పరమానందభరితుఁడై సుహాక్ షా ననేక విధములఁ బూజించి, "మహాత్మా! ఈ సేవకుఁడు సమర్పించు వస్తువులను స్వీకరింపవలయును" అని ప్రార్థించెను. అందులకు భక్తుఁడు "నాకేమియు వలదు. శరీరమును విసర్జింపఁ దలంచుచున్నాను. సమాధిని నిర్మించి యిమ్ము" అని కోరఁగా, రాజు అంగీకరించెను.

అపు డొక దీనుఁడు వచ్చి, "మహాత్మా! నాయెడఁ గరుణించి నాకు ముక్తిమార్గమును ఉపదేశింపవలయును" అని ప్రార్థించెను. సుహాక్ షా పరమానందముతో నాతనికి శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి, తత్త్వమును ఎఱింగించి పూజావిధానమును దెలిపెను. అది చూచి ఇంక ననేకులు అతనివలన ఉపదేశములను బడసిరి. ఇంతలో గోరీ సిద్ధమయ్యెను. ఈసంగతి తెలియఁగనే సుహాక్ షా గోరీ చెంతకుఁ బోయి నిలిచి, నిమీలిత నేత్రుఁడై శ్రీహరినిఁ బ్రార్థించెను. తోడనే ఆతనియాత్మ సూర్యమండలమును భేదించుకొని పోయి శ్రీహరిసాయుజ్యమును బడసెను. రాజు ఆతనిశరీరమును మహావైభవముతో ఆగోరీలో సమాధి చేయించెను.

మ. "అతులానందరసామృతార్ణవమహాంగాభంగరంగత్తరం
గతతిం బొంగుచుఁ గెంపుమోవి సరిదాఁకం దత్సుధాబిందువుల్
స్మితలీలన్ విలసిల్లె నంచు జనముల్ చిత్తంబులన్ మెచ్చ న
ద్భుతశృంగారరసైకముద్రితముఖాంభోజున్ హరిం గొల్చెదన్."

# 71. బహిరంభట్టు

శ్లో. "అనన్యసాధారణ కాంతి కాంతమాక్రాంతగోపీనయనారవిందం,
పుంసఃపురాణస్య నవం విలాసం పుణ్యేన పూర్ణేన విలోకయిష్యే."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 32.)

ప్రతిష్ఠానపురమున బహిరంభట్టు అను నొక బ్రాహ్మణుడు సకలశాస్త్రముల యందును అనంతప్రజ్ఞను గడించియుండెను. ఆతఁడు అఱువదిసంవత్సరముల వయస్సు దాఁటిన తరువాత నొకనాఁడు భోజన సమయమున "కూరలో ఉప్పు తక్కువయైన" దని భార్యతోఁ బలికెను. అది విని యామె "మీకు అఱువది యేండ్లు నిండినవి. ఇంకను రుచులు చాలలేదు. కామక్రోధాదులు మఱల లేదు. రుచి విషయమునఁ గల యీదీక్ష మీకు భగవంతుని విషయమున నున్నచో ఇరువుర మును గూడఁ దరించిపోదుము" అని పలికెను.

ఈమాట ఆ బ్రాహ్మణుని నల్లగుండెకు వాడిబాణమువలె చురుక్కున నాఁటెను. తోడనే యాతఁడు తినుచున్నపదార్థమును విడిచివేసి హస్తప్రక్షాళనాదికము గావించుకొని వచ్చి, భార్యకుఁ బ్రదక్షిణనమస్కారములు ఆచరించి "స్త్రీవైనను జ్ఞానమున నాకంటె ఎక్కువదానవై యున్నావు. నీవు ఇపుడు నాకుఁ గావించిన యుపదేశము ఈజన్మము ఉన్నంతకాలమును నాకర్ణపథమున మాఱుమ్రోగుచునే యుండును. శ్రీహరియే నీరూపమున వచ్చి నాయజ్ఞానమును దొలంగించెను" అని యామెను అనేకవిధములఁ గొనియాడి, "ఆకస్మికముగ ఒక్కక్షణములోఁ గలిగిన యీవైరాగ్యము అడవులలోఁ బ్రవృద్ధము అగును" అని నిశ్చయించుకొని, వెంటనే ఎందఱు వలదనుచున్నను వినక అడవులం బట్టి పోయెను.

తరువాత ఆతని భార్య ప్రార్థనమువలన బంధుమిత్రులు అనేకులు అరణ్యము నకుఁ బోయి వెదకి పట్టుకొని, నిర్బంధించి ఇంటికిఁ దీసికొనిరాఁ దొడఁగిరి. అపుడు ఆతఁడు నడచుచునే "వీరు చాల పట్టుపట్టి యున్నారు. అస్పృశ్యుఁడు అను మాట వీరు నన్ను విడువరు" అని తలంచి, ఎట్లో వారినిఁ గికురించి సమీపమునందలి ఒక పట్టణమునకుఁ బోయి తురకల మతాచార్యుఁడగు కాజీచెంతకుఁ బోయి "నేను తురకమతములోఁ గలిసెదను" అని పలికెను. తోడనే కాజీ మహానందభరితుఁడై, ఆతనికి సున్తీ మొదలగు సంస్కారములు చేసి మహమ్మదీయమతదీక్ష యొసంగెను. బహిరంభట్టు "కాజీ నన్ను కష్టముల నుండి గట్టెక్కించెను; కాని హృదయమును ద్రిప్పుటకు ఈతఁ డెవఁడు? నేను మహమ్మదీయుఁడ నైనను శ్రీహరి కింకరుఁడను. శ్రీహరి వేషభాషలను లెక్కించునా? హృదయము పరిశుద్ధమైయున్నపుడు నాకేమి భయము" అని ధైర్యము వహించియుండెను.

అతని బంధుమిత్రులు [illegible] అతనిం బట్టుకొనిరి; వాఁడు వారివలన "నన్నుఁ బట్టుకొనుటకు మీకు ప్రయోజనము [illegible]. నేఁడు మహాత్ము డెవండో నైతిని" అని పలికెను. తోడనే వారు "ఛీ ఛీ మహాపాతకుని మొగము చూడఁగూడ"దని తొలఁగిపోయిరి. అంతట వాఁడు "బంధుమిత్రాదుల నిర్బంధము తప్పినది. ఇఁక నా తురకతనము [illegible]?" అని తలంచి కాశీనగరమునకుఁ బోయి విద్వద్బ్రాహ్మణులకు [illegible] "నన్ను మరల మీమతములోఁ గలుపుకొనవలెను" అని ప్రార్థించెను. బ్రాహ్మణులు అతని మీఁద దయయుంచి [illegible] ప్రాయశ్చిత్తములు జరపి, బ్రాహ్మణులలోఁ గలుపుకొనిరి. అటుపైన [illegible] "విద్వాంసులారా! నాకొక సందేహము గలదు. దానిని మీరే తీర్పవలయును" అని ప్రార్థించి, "మున్ను సున్తీ మొదలగు సంస్కారములను జరపి తురకనైతిని. ఇప్పుడు మీరు బ్రాహ్మణులలోఁ గలుపుకొన్నాము అని చెప్పుచున్నారు. అయినను [illegible] సున్తీ పోలేదు. ఇప్పుడు నేను తురకనా? బ్రాహ్మణుఁడనా? అని ప్రశ్నించెను. బ్రాహ్మణులు ఆలోచించి "నీకు ఈశ్వరుఁడే చెప్పవలయును; కాని మేము చెప్పఁజాలము" అని తమ దారినిఁ బోయిరి.

బహిరంభట్టును జూచినవారందఱును "బాపనతురక" అనియు, "తురక బాపఁడు" అనియు నింక ననేకవిధములను చెప్పసాగిరి; కాని భట్టు ఈనిందలకు జంకక, దేశయాత్రకు బయలుదేఱెను. బడబానలము అను నొకగ్రామమున నాగనాథుఁడు అను నొకవృద్ధబ్రాహ్మణుఁడు గొప్పదేవాలయమును గట్టింపఁ దలఁచి, బెండ్లతో బండ్లుచేయించి వానిమీఁద కొండవంటిరాళ్లను ఎక్కించి, కోఁతులచే లాగించుకొని పోవుచుండెను. భట్టు అతనిఁ జూచి 'ఈతఁడు సిద్ధుఁడు. ఈతనివలన నాసందేహము తీరును' అని నిశ్చయించుకొని, తిన్నగ నాతనియెదుటకుఁ బోయి నిలచి 'నే నెవ్వఁడనో చెప్పుము. నీతెలివితేటలు ఇప్పుడు తెలియును' అని పలికెను. నాగనాథుఁడు ఆతని మాటలకుఁ గోపించి, "చావుము అని తన బెత్తముతోఁ గొట్టెను. తోడనే భట్టు భూమిపైఁ బడిమరణించెను. నాగనాథుఁడు "ఈశవమును గొనిపోయి రోటిలో వేసి దంచి ముద్దచేసి తెండు" అని నియమించెను. వారు అట్లేచేసిరి. నాగనాథుఁడు ఆముద్దను చితిమీఁద నుంచి దహనముచేసి, భస్మము నంతను ప్రోగుచేసి తనకమండలూదకమును జల్లెను. తోడనే భట్టు పూర్వాధిక తేజస్సుతో లేచి నిలిచి, నాగనాథుని పాదములమీఁద వ్రాలెను. అపుడు నాగనాథుఁడు "మూఢా! ఇప్పుడు నీవు ఎవఁడవో చెప్పుము" అనియెను. భట్టు అప్పుడు తనశరీరమున తురకలుచేసిన సంస్కారములుగాని, పిదప బ్రాహ్మణులు చేసిన సంస్కారములను గాని కానక, ఏమి

చెప్పుటకును దోఁచక మౌనియై యుండెను. అప్పుడు వానిని నాగనాథుఁడు చేరఁ బిలిచి భట్టుచెవిలో తారకమంత్రమును ఉపదేశించి తత్త్వమును దెలిపి "నాహితోపదేశమును మఱువక సాధువులను సేవించుచుఁ గాలము గడుపుము" అని చెప్పి పంపివేసెను.

భట్టు గురువుననుజ్ఞను బడసి అనేక పుణ్యక్షేత్రములను దర్శించి, తుదకుపండరిపురమునందు పాండురంగని సన్నిధిఁజేరి, భాగవతమును అభంగవృత్తములతో మహారాష్ట్రభాషలోనికిమార్చి, బ్రతికియున్నంత కాలమును భగవద్భాగవతులనర్చించుచు అనేకులకు ముక్తిమార్గమును ఉపదేశించి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసెను.

చ. "ఇతరుల కందరాని జగదేకమనోహరకాంతిచర్యఁ గమా
గతనవయౌవనాకరవికాసము లన్నియుఁ గోపబాలికా
యతనయనారవిందముల కగ్గము సేయు పురాణపూరుషుక్
మతిఁ దలపోసి చూచెద సమగ్రసనాతనపుణ్యసంగతిన్."

(కృష్ణకర్ణామృతము. అ. 3. ప. 32.)

---

## 72. కేశవస్వామి

శ్లో. "వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధం,
భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మన శ్రీకృష్ణదివ్యౌషధమ్."

(ముకుందమాల. శ్లో. 24.)

ఒకగ్రామమున కేశవస్వామి అను పరమభాగవతోత్తముఁడు నివసించియుండెను. ఆతఁడు అనవరతమును శ్రవణ మనన ధ్యానాదికమగు శ్రీహరిపూజతక్క నన్యమెఱుంగఁడు. ఆతనివలన ననేకులు ముక్తిమార్గోపదేశమును బడసిరి. ఒకనాఁడు ఆతఁడు కాళ్లకు గజ్జెలుకట్టుకొని,ఒకచేతఁ జిఱుతలును, ఒకచేత తంబురయును గైకొని హరిభజనము ప్రారంభించెను. మనోమోహనమగు కేశవస్వామిగానామృతమును గ్రోలఁగోరి, అనేకభాగవతులు పెక్కుపామరులును వచ్చి చుట్టును జేరి వినసాగిరి. కొంతసేపయిన తరువాత కేశవస్వామి శిష్యులలో నొకనిఁ జేరఁ బిలిచి "వత్సా! నేఁడు హరివాసరము. భాగవతు లందఱును ఉపవాసదీక్షలో నున్నారు. నీవు బజారునకుఁ బోయి సొంటి బెల్లమును గొని రోటిలో దంచి ముద్దచేసి తెమ్ము" అని నియమించెను.

అప్పటికి రెండుజాములరాత్రి యైనందున [illegible] తలుపులు మూయఁ బడి యుండెను. ఒకవర్తకుఁడు మాత్రము మరికొంతసేపు [illegible] ప్రాంతములో నిద్రక్రమ్ముటచే దుకాణము మూయకనే, అచ్చట నొరగియుండి కునికిపాట్లు పడుచుండెను. కేశవస్వామి [illegible] వర్తకుని లేపి [illegible] చెప్పెను. తోడనే వర్తకుఁడు మహానందముతో లేచి, బెల్లము పసుపు లేక పోవుటచే సొంటి యనుకొని వసనాభిని పలసినంత ఇచ్చి ఆ బ్రాహ్మణుని పంపివేసెను. అతఁడును ఆ రెండు వస్తువులను గొనివచ్చి [illegible] ముగ్గురకి తెచ్చి [illegible] ఇచ్చెను. కేశవస్వామి దానిని భగవంతునకు నివేదించి [illegible] దానిని అచ్చట నున్న భాగవతులు పదియిదుగురకు అందఱకును పంచియిచ్చెను. అందఱును మిగుల భక్తితో దానిని భుజించి, తెల్లవాఱుచుండఁగ [illegible] పిదప ఎవరి ఇండ్లకు వారు పోయిరి.

మఱునాఁడు మరల దుకాణమును తెఱచునప్పుడు సొంటిబస్తా కట్టఁబడియే యుండుటయు, వసనాభినుంచి విప్పబడి సగమే యుండుటయుఁజూచి "రాత్రి ఘోరము జరిగినది. అనేకభాగవతుల మృతికి నేను కారణభూతుఁడ నైతిని." అని చాలభయం పడుచు, ఊరిలోని భాగవతుల ఇండ్లకు బయలుదేఱెను. ఆ గ్రామమునసున్న భాగవతులు అందఱును రాత్రి భగవత్పూజనకు కేశవస్వామి ఇంటికిఁ బోయియే యున్నారు; కావున వారు దానినిఁ దినక మానరనియు, వారినిఁ జూచినచో సకలమును దెలియఁ గలదనియు నిశ్చయించుకొని యాతఁడు అట్లు బయలుదేఱెను; కాని యొకరిద్దఱు భాగవతులను జూచునప్పటికి ఆతనికి భయము తీఱెను. "రాత్రి కేశవస్వాములవారికి సొంటియు బెల్లమును నీవే ఇచ్చితివఁట. కేశవస్వామి మాకందఱకును బ్రసాదము నిచ్చెను. ఆహా! ఏమి యామాధుర్యము; కాని సెట్టీ! ఆ ప్రసాదమున మాకు సొంటి రుచి కాన్పింపలేదుసుమా! భగవంతునకు నివేదింపఁబడుటవలనను, నీవు ఇచ్చుటవల నను, విశేషించి కేశవస్వాములు అనుగ్రహించుట వలనను అది అమృతోపమానమై యున్నది" అని ఆయొకరిద్దఱు భక్తులును జెప్పిరి. వారి ప్రసంగమున తా నిచ్చినది సొంటికాకపోవుట వ్యక్తమైనను, దానివలన వారికి ఏమియు విపత్తు రాకుండుటఁ జూచి "నేను ఇచ్చినది వసనాభి యగుటలో నెంతమాత్రమును సందేహములేదు; కాని కేశవస్వామియెడలఁగల ప్రేమాతిరేకమువలన శ్రీహరి అందలి విషమును దొలఁ గించి, అమృతమును జిలికెను; ఇదియే ఇందలి రహస్యము" అని నిశ్చయించుకొని, కేశవస్వామి ఇంటికి బయలుదేఱెను.

అప్పటి కప్పుడే కేశవస్వామి స్నానసంధ్యాద్యనుష్ఠానములు అన్నియు నిర్వ ర్తించుకొని, శ్రీహరినిఁ బూజించుటకు తన ఇంట నతిథులై యున్న భాగవతులతోఁ

గావునఁ బూజామందిరమును బ్రవేశించెను. అచ్చటం జూడఁగా, శ్రీహరి స్వర్ణవిగ్రహము తళతళలాడుచుండుటమాని నల్లఁబడియుండెను. అందులకు ఆశ్చర్యచకితుఁడై కేశవస్వామి చెంతనున్న భాగవతులకు అదియంతయు నెఱిఁగించి "ఇందులకుఁ గారణము ఏమైయుండును?" అని యోచించుచుండెను. అట్టిసమయమున వర్తకుఁడు అచ్చటకు వచ్చి, కేశవస్వామికిఁ దక్కిన భాగవతులకును సాష్టాంగవందనములు ఆచరించి, కేశవస్వామి యెదుట నమస్కరించి నిలిచి "మహాత్మా! నిన్నరాత్రి నేను భాగవతులకు భోజనమున విషాహారము గావించితి" అని సకలమును ఎఱిఁగించి, మన్నింపఁ బ్రార్థించెను. అది విని కేశవస్వామి ఆశ్చర్యచకితుఁడై శ్రీహరివిగ్రహము నల్లఁబడియుండుటకుఁ గల కారణమును అప్పటికిఁ దెలిసికొని "శ్రీహరీ! నీకు ఎంత యపచారము చేసితిని? నీకు విషము పెట్టితిని గదా! అయ్యో! భాగవతులకు ఎంత గండము తప్పినది? నేను ఎంత పాపాత్ముఁడనైతిని!" అని యనేకవిధముల విచారించి, "అనాథనాథా! నీకు అసాధ్యము లేదు. నీలీలలు తెలిసికొనుట కెవరికిని శక్తి లేదు. ఇఁక నావంటి కుక్షింభరుల సంగతి వేఱుగ వివరింపనేల? అయినను నీకు నాయెడల అనుగ్రహముండుట ఇప్పటికిఁ బేట తెల్లమైనది; కాని ఈయనుగ్రహము అనుగ్రహము గాదు. నీవు మఱల యథారూపము వహించినఁగాని నాకు విచారము పోదు" అని ప్రార్థించెను. అంతట శ్రీహరి దివ్యమంగళవిగ్రహుఁడై సాక్షాత్కరించి భాగవతుల నందఱను దీవించి, కేశవస్వామినిఁ జూచి "వత్సా! నీకేమియు లోపము లేదు. నీవు నాయంతరంగభక్తుఁడవు; కావున నీహృదయమున సదా నేను వసించియుండుదును. నీవాక్కులు పీయూషతరంగితములై నాకు మహానందమును గలిగించినవి. నీవు తలఁచినపుడెల్ల నీకు సాక్షాత్కరించి సేవయొసంగుచుందును" అని అభయమిచ్చి అంతర్హితుఁ డయ్యెను.

తోడనే సువర్ణవిగ్రహము యథారూపము వహించెను. అది చూచి కేశవస్వామి చాల నానందించి, భాగవతుల నెల్లరను గొనియాడి, వర్తకునిఁ జాల వినుతించి అందఱకు ఆతిథ్యము నొసఁగెను. కేశవస్వామి ఇట్లే అనేకాద్భుతములను జేయుచుఁ బ్రతికియున్నంతకాలమును శ్రీహరినిఁ బూజించి, అనేక పామరులకు ముక్తిమార్గమును ఉపదేశించి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసెను.

మ. "విలసత్పింఛవతంసుఁడై చిగురుమోవిన్ వేణువుం జేర్చి కం
దళితాలాపసుధాపరంపరలచేతం జేతనాచేతన
క్షాలనన్ విశ్వలతాచలత్వముల పెంపుల్ గూర్చు వర్గోపికా
లలితాంగీజనవశ్యవంచకునిఁ గొల్వం గాంతు గోపాలకున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 78.)

# 73. పన్హాజీసింగు

శ్లో. "ఉపాసతామాత్మవిదః పురాణాః, పరం పుమాంసం నిహితం గుహాయాం,
వయం యశోదాశిశుబాలలీలా, కథాసుధాసింధుషు లీలయామః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. శ్లో. 55.)

గుజరాతుప్రదేశమున షోకాపూరు అను పట్టణమున గుమాన్సింగు అనురాజు ప్రజాపాలనము గావించుచుండెను. అతడు సుక్షత్రియవంశాలంకారుడు. మనుమార్గమును దప్పక పరిపాలనముచేయు ధర్మాత్ముడు. అతనికి పన్హాజీసింగు అను ఒకక్షత్రియకులశేఖరుడు స్నేహితుడై యుండెను. లౌకికవ్యవహారము లన్నియును శీఘ్రముగ నెఱవేర్చుకొని వారిరువురును ఏకాంతస్థలమున గూర్చుండి హరినామసంకీర్తనము చేసికొనుచుండురు.

ఒకనాడు దీపావళిపండుగు వచ్చెను. రాత్రి వారిద్దఱును ఏకాంతస్థలమున గూరుచుండి హరినామసంకీర్తనము చేయుచుండిరి. ఉన్నట్లుండగా, పన్హాజీ హరిహరీ యని తన భుజముమీది యుత్తరీయమును జేతులతో లుంగచుట్టి నలిపి వేసెను. అదిచూచి గుమాన్సింగు అందులకు గారణము ఏమనగా: పన్హాజీ "ద్వారకానగరమున శ్రీకృష్ణభగవానునకు దీపోత్సవము జరుగుచున్నది. అర్చకుని అజాగ్రతవలన శ్రీకృష్ణుని పీతాంబరము అంటుకొనినది. నేను ఆర్పివేసితి" నని చెప్పెను. అందులకు గుమాన్సింగు మఱింత యాశ్చర్యపడి, మఱునాడు "నిన్న రాత్రి ద్వారకానగరమున శ్రీకృష్ణాలయమున జరిగిన విశేషమేమో తెలుపవలె" నని రావడాపట్టణమునకు ప్రభువైన తన తోడియల్లునకు వ్రాసెను. అతడు వెంటనే "దీపోత్సవసమయమున అర్చకుని అజాగ్రత్తవలన స్వామి పీతాంబరము అంటుకొనినది, కాని వెంటనే పన్హాజీసింగు వచ్చి నలిపి యార్పివేసెను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

గుమాన్సింగు వెంటనే వచ్చి పన్హాజీసింగు పాదములమీద వ్రాలి, "మహాత్మా! మీ మాహాత్మ్యమును ఎఱుంగజాలకపోయితిని. మిమ్ము సామాన్యస్నేహితులవలె జూచుచు మీచే గొన్ని సమయములయందు సేవ జేయించుకొంటిని. ఇక మిమ్ము నేను ఏమని క్షమింపవేడుదు? రాజగర్వము నాకన్నులు గప్పి, మిమ్ము జులకనగా జూచునట్లు చేసినది. అక్కటా! నేను ఎంతపాపి నైతిని" అని వగవసాగెను. అపుడు పన్హాజీ రాజును కౌగిలించుకొని "రాజా! ఏల ఇంతగా వగవ? నీవు చేసిన యపరాధము ఏమియున్నది? విష్ణ్వంశ లేనివాడు పృథివీపతి కాజాలడు. అని మనశాస్త్రములు శాసించుచున్నవి. ఇక నిన్ను సేవించుటకు నాకు అభ్యంతర మేమి గలదు? నేడు నాయెడల నీవు ఇట్లు భేదభావ

గురుని గావలె నేల? నీవు సుకృతాత్ముడవు. శ్రీహరిభక్తుఁడవు. శ్రీహరి నీకు గురువై నిన్ను ఉద్ధరింపుమని నాకు ఆజ్ఞాపించెను. నీకు ఏవిధము లోపములు కలుగఁ బోవు" అని శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి, "ఈమంత్రమును భక్తిశ్రద్ధలతో జపింపుము. ఇది మహామంత్రము. పాపముల నన్నిటిని ద్రోసివేసి, ముక్తి నొసంగును. నీవు భాగ్యశాలివి; కావుననే నీవు శ్రీకృష్ణుని హృదయమున ఉత్కృష్టస్థానమును ఆక్రమించితివి. నీకు నేను చెప్పవలసినది ఏమిగలదు? ప్రజలను గన్న బిడ్డలవలె పాలింపుము. సాధుసజ్జనులను ఆరాధింపుము. శ్రీకృష్ణభగవానుని సేవింపుము" అని పల్కుచు దీవించెను. రాజు అంతులేని పరమానందభరితుఁడై గురుని పాదములమీఁద వ్రాలి, "మహాత్మా! గురుదక్షిణ యొసంగవలసినచో మీకు ఏమి ఈయఁగలను? అయినను యథాశక్తి సమర్పణము శాస్త్రచోదితమేగదా! కావున నారాజ్యములో సగభాగమును స్వీకరించి వినియోగింపవలయును" అని ప్రార్థించెను. పరహాజీసింగు "నీగురుభక్తికి ఆనందము. ఆరాజ్యభాగమును నీవే పరిపాలించి, ధనమును భగవద్భాగవతసేవయందు వినియోగింపుము. నీకు శ్రీకృష్ణభగవానుఁడు దివ్యమంగళవిగ్రహముతో దర్శనమొసంగి రక్షించును" అని చెప్పి, ద్వారకాపురమునకుఁ బోయెను.

గుమానాసింగు గుర్వాజ్ఞాప్రకారము శ్రీహరిసేవ చేయుచు ఒకటిరెండు మాసములు గడచిన తరువాత గురువును జూడకుండ నుండలేక రాజ్యమును మంత్రికి అప్పగించి, రాణితో బయలుదేఱి ద్వారకానగరమునకుఁ బోయెను. అప్పటికి పరహాజీ మఠమునఁ గూరుచుండి శ్రీహరిస్మరణము చేయుచుండెను. రాజు ఆచార్యునిఁ జూచినవెంటనే సకళత్రుఁడై పాదములమీఁద వ్రాలి, బాష్పోదకముతో గురుపాదములను అభిషేకించెను. పరహాజీ తోడనే ఆదరముతో రాజును రాణిని లేవనెత్తి ఆశీర్వదించి, ప్రీతివచనములాడి కూర్చుండఁబెట్టి, హరిభజనము గావించి ఆనందము నొలిపెను. ఇట్లు కొంతసేపు అయిన తరువాత గురుశిష్యులు ఇరువురును యమునానదికిఁ బోయి స్నానమాడి కృష్ణాలయమునకుఁ బోయి స్వామిని దర్శించి, అచ్చట నున్న భాగవతులతోఁ గొంతసేపు భగవద్గుణకీర్తనము చేసి, మఱలి మఠమునకు వచ్చి భగవన్నివేదితాన్నమును భుజించి, శ్రీహరిభజనము ప్రారంభించిరి. ఇట్లు కొన్నిదినములు గడచిపోయిన తరువాత నొకనాఁడు గుమానాసింగునకు శ్రీకృష్ణభగవానుఁడు సాక్షాత్కరించి అభయమిచ్చి చనెను.

మఱికొన్నిదినములు గడచిన తరువాత రాజు సకళత్రుఁడై స్వస్థలమునకు బయలుదేఱెను. మార్గవశమున అరణ్యములో ఇరువురును పాదచారులై పోవుచుండఁగా, నొక తస్కరుఁడు ఆయుధహస్తుఁడై వచ్చి ఎదుట నిలిచెను. వానినిఁ జూచి రాణి భీతిల్లఁగా, రాజు "దేవీ! ఏల భీతిల్లెదవు? గురూపదేశమును ఇంతలోనే

మఱచితివా? మనయెదుటనే నిలిచియున్న వ్యక్తియందు భగవంతుఁడు లేఁడనుకొంటివా? ఈశ్వరుఁడు ఈప్రపంచమునందు అంతటను నిండియున్నాఁడే. కత్తియతని అను వేసిన ఆతని దేహమునకే కాని ఆత్మకు తగులదు. అట్లే రాజు రాణి అనువారలు మన దేహములకే కాని ఆత్మకుఁ జెందవు. ఈసంబంధము నాత్మలను ఉపాధిచే భిన్నములై యున్నవి; కాని వేఱుగావు. అట్టిచో ఆతనిం గాంచి నీవేల భయపడెదవు? ఒక్కమాఱు భగవంతుని రూపమును స్మరింపుము. వెంటనే నీకు ఈ వ్యామోహము పోయి జ్ఞానజ్యోతి ప్రకాశించును" అని చెప్పెను. రాణి అట్లేచేసి నిరీకచిత్త యయ్యెను.

అంతట చోరుఁడు రాజదంపతులను సమీపించి ఆభూషణములను గ్రిందఁ బాఱవేసి పాదములమీఁద వ్రాలి, "ఇంతవఱకును నేను అనేక దుష్కృత్యములను జేసితిని; కాని నన్ను ఇట్లు రక్షించినవారు లేరు. మీరే నాకుఁ దల్లిదండ్రి యును. నాయెడ మీరు అభేదప్రతిపత్తిని బ్రకటించితిరి; కావున దాని స్థిరము చేసి నాకు జ్ఞానోపదేశము చేసి తరింపఁజేయవలయును" అని ప్రార్థించెను.

అంతట రాజు తస్కరునిఁ బొదివి పట్టి "వత్సా! భయము వలదు. నీయెడల భగవంతునకుఁ గృప గలిగినది. నీవు సదా శ్రీహరిని ధ్యానింపుము. భగవన్నామ స్మరణతో నీతాపత్రయము తొలఁగిపోవును. సంసారదుఃఖములు దరిఁజేరవు" అని వానినిఁ బంపివేసి, తాను తన నగరమునకుఁ బోయెను. తస్కరుఁడును తన గృహము చేరికొని, అదిమొదలు సకల దుర్వృత్తులను విడిచి ఇంద్రియములను జయించి, సదా శ్రీహరిని ధ్యానించుచుఁ, గొన్నిదినములు అయిన తరువాత గురు పుంగవునిఁ జూడఁగోరి, తగునుపాయనములతో బయలుదేఱెను. రాజు తస్కరుని జూచి చాల ఆదరించెను, ఆచార్యవందనాదికములు ముగిసినతరువాత తస్కరుఁడు "స్వామీ! తమ కరుణచే నేను పవిత్రుఁడనైతిని" అని విన్నవించెను. రాజు వానిని "ద్వారకానగరమున బ్రహ్మానందపరవశులై యుండు పక్‌హాజీస్వాములను ఆశ్రయింపుము." అని పంపివేసెను. యుక్తసమయమున వాఁడు పోయి పక్‌హాజీ నాశ్రయించెను. పక్‌హాజీ వానికి శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి, విధానము నెఱిఁగించెను. మఱియు నిట్లనేకులకు ముక్తిమార్గమును ఉపదేశించెను. పక్‌హాజీయు, రాజును, రాణియు, తస్కరుఁడును జీవితములను శ్రీహరిసేవయందుఁ గడిపి అవసానమున హరిసాయుజ్యమును బడసిరి.

మ. "దహరాకాశనివాసమా పరము నాత్మజ్ఞాను లీక్షించి ప్ర
త్యహమంబుం గాంతురు గాత నే నల యశోదాబాలలీలాసుధా
లహరీవీచిపరంపరం గడిపి కొల్లల్ కాఁగఁ గ్రీడించు న
న్నహమానప్రౌఢిఁ దెలుంగుడెందమున నానందంబు సంధించెదన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2, ప. 55.)

---

# 74. స్పర్శభాగవతుఁడు

శ్లో. "ఇదం శరీరం పరిణామపేశలం, పతత్యవశ్యం శ్లథసంధిజర్జరం,
కిమౌషధైః క్లిశ్యసి మూఢ దుర్మతే, నిరామయం కృష్ణరసాయనం పిబ."

(ముకుందమాల శ్లో. 31.)

పండరీపురమున నొకబ్రాహ్మణుఁడు ఉండెను. అతఁడు సదా శ్రీపాండురంగని సేవించుచుఁ గాలము గడుపుచుండెను. ఒకనాఁడు అతఁడును భార్యయుఁ గలిసి నిశ్చలచిత్తముతో ధ్యానించఁగా, రుక్మిణీదేవి సాక్షాత్కరించెను. బ్రాహ్మణదంపతులు ఆమెకు సాష్టాంగదండప్రణామములు అర్పించి, పూజించి, అనేక విధముల వినుతించిరి. రుక్మిణి సంతుష్టచిత్తయై. "మీభక్తికి ఆనందమైనది. మీకేమి కావలయును?" అని యడిగెను. బ్రాహ్మణుఁడు "తల్లీ! సంసారసాగరమువలనఁ గ్రుంగిపోవుచున్నాను. ఉద్ధరింపుము" అని ప్రార్థించెను. రుక్మిణి బ్రాహ్మణుఁడు ధనము కోరుచున్నాఁడని యోజించి పరుసవేదినిచ్చి "దీనిని తాఁకించినచో ఇనుము బంగారమగును. జాగ్రత్తగా వాడుకొనుము" అని చెప్పి, తిరోహితయయ్యెను. బ్రాహ్మణుఁడు అమందానంద కందళితహృదయారవిందుఁడై పరుసవేదిని భార్యకు ఇచ్చి "రుక్మిణీదేవి యనుగ్రహమువలన మన దరిద్రము తొలఁగిపోయినది. ఈపరుసవేదివలన మనకు ఇఁక సంసారము స్వర్గము అగును. దీనిని జాగ్రత్తగా వాడుము. ఈరహస్యమును ఎవరికినిఁ దెలియనీయకుము" అని చెప్పెను.

ఆతనిభార్య భర్తయాజ్ఞానుసారముగ వలసినప్పుడెల్ల పరుసవేదిని తాఁకించి ఇనుమును బంగారముగాఁ జేసికొని వలసినసంబారముల నన్నిటిని సమకూర్చుకొను చుండెను. బ్రాహ్మణుఁడు యథాప్రకారముగ విరక్తునివలె పండరినాథుని సేవించు చుండెను.

ఒకనాఁడు ఆబ్రాహ్మణుని భార్యయగు కమలాబాయి జలాహరణార్థము చంద్రభాగకుఁ బోవుచుండెను. మార్గమధ్యమున ఆమె నామదేవుని భార్యయగు రాధాదేవితో "ఏమమ్మా! ఎప్పుడు చూచినను మీరిల్లు కష్టపడుచున్నారు. నీభర్త సదా పాండురంగని సేవించుచుండును గదా! ఆతఁడు మీకేమియు నీయ లేదా? అట్లు ఈయనివానిని ఏల అట్లు పూజించెదరు?" అని యడిగెను. "నాభర్తకు నిస్పృహ మెండు. ఆతనికి మోక్షాసక్తితక్క మఱియే యాసక్తియు లేదు" అని రాధాదేవి బదులు చెప్పెను. "నీభర్త ఫలమును నీయని వృక్షమునకు నీళ్లుపోసి వెట్టి చేయుచున్నాఁడు. నాభర్త ఒక్క సంవత్సరము సేవించునప్పటికి రుక్మిణీదేవి

సాక్షాత్కరించి, పరుసవేదినిచ్చె. దానియాధారంబున నేము ఏలోపమును లేకుండ జీవించుచున్నాము" అని కమలాబాయి మరలఁ బలికెను. అది విని రాధాబాయి ఆశ్చర్యపడి "వదినే! నాభర్త సంసారమునకు ఏమియు సంపాదింపక యున్నాడు. ఒకమారు పరుసవేదిని బదు లిచ్చినచో వలసినంత బంగారము చేసి మరల నిచ్చి వేసెదను. బ్రతికియున్నంతకాలము నీయుపకారమును మరువను" అని ప్రార్థించెను. కమలాబాయి ఆ ప్రార్థనకు కరిగి పరుసవేదిని యిచ్చెను.

రాధాబాయి పరుసవేదితో చాల బంగారము చేసికొని, "భోజనము పిమ్మట తరువాత పరుసవేది నీయవచ్చును. ఇపుడు తొందర లేదు. వంటకు వేళయైనది." అని తలంచి, పరుసవేది నొకచో దాచి వంట ప్రారంభించెను. వంట ముగియునప్పటికి నామదేవుఁడు పూజాదికములు అన్నియును ముగించుకొనివచ్చెను. రాధాబాయి పంచభక్ష్యపరమాన్నములను వడ్డింపఁగా, నామదేవుఁడు ఆశ్చర్యపడి "ఇది యంతయు నెట్లు వచ్చె" ననియడిగెను. రాధాబాయి "అది యంతయు మీకు ఏల? వలసినంత ఆనందముతో భుజింపుఁడు" అని బదులు పలికెను. "ఇందలి రహస్యము నెఱుంగఁ జిననగాని నేను భుజింప" నని నామదేవుఁడు పట్టుపట్టఁగా, రాధాబాయి చేయునది లేక అంతయుఁ దెలిపి, పరుసవేదిని దెచ్చి చూపెను. నామదేవుఁడు వెంటనే ఊర్ధ్వశ్వాసముతోఁ బరువెత్తుకొనిపోయి, దానినిఁ జంద్రభాగలోఁ బడవేసి వచ్చి అన్నము తినెను. ఇది విని రాధాబాయి "కమలాబాయికి నేను ఏమి చెప్పుదు" నని గోలుగోలున ఏడ్వసాగెను.

ఇది యిట్లుండఁగా, కమలాబాయి రాధాబాయి పరుసవేదిని దెచ్చి యెంతకును ఈయకుండుటఁ జూచి సందేహించి, ఆమె ఇంటికిఁ బోయి సంగతి సందర్భమును అన్నియు విని తెల్లవోయి, ఆమెతోఁగూడ కంటికి మంటికి నేకధారగా ఏడ్వసాగెను. కొంతసేపటికి ఈవార్త ఆమెభర్తకుఁ దెలిసెను. వెంటనే అతఁడు పరుగు పరుగున వచ్చి "నాకొంప తీసితివి. నాపరుసవేదిని నాకు ఇమ్ము" అని నామదేవుని ఖణాయించి పలికెను. అందులకు నామదేవుఁడు "నీవు విరాగినని చెప్పుకొనుచున్నావు అట్టి నీకు ఈపరుసవేది ఏల?" యని యడుగఁగా, అతఁడు "ఇది యంతయు నాకుఁ దెలియదు. నాపరుసవేదిని ఈయవేని పస్తుపడియుండెదను" అని అతఁడు పలికెను. నామదేవుఁడు "ఇఁక నీతఁడు వదలఁడు." అని తలంచి, చంద్రభాగకుఁ బోయి అందు మునిగి గుప్పెడు రాళ్లనుదీసి ఇందు నీపరుసవేది ఏదో తీసికొనుము" అని ఆ బ్రాహ్మణునిముందు పోసెను.

తోడనే బ్రాహ్మణునకు జ్ఞానోదయ మయ్యెను. అంతట నాతఁడు కా[illegible] వ్రాలి ప్రార్థింపఁగా, నామదేవుఁడు మంత్రోపదేశము చేసెను. ఆ బ్రా[illegible]

[illegible] ప్రకారము బ్రదికియున్నంతకాలమును ఈశ్వరుని సేవించి, అవసానమున సాయుజ్యమును గాంచెను. పరసవేది సంసర్గమువలన ఆ బ్రాహ్మణునకు స్వర్ణ భాగవతుండగుట యని చెప్పవచ్చును.

శ్లో. "తత్త్వం బ్రువాణాని పరం పరస్మాత్, మధు క్షరంతీవ సతాం ఫలాని,
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే, నామాని నారాయణగోచరాణి."

(ముకుందమాల. శ్లో. 30.)

---

# 75. హరిపాలదాసుఁడు

శ్లో. "కృష్ణాంకురే చేతసి జృంభమాణా మష్ట స్మహర్మోహమహాంధకారం,
పుష్ణాతు నః పుణ్యదయైకసింధోః కృష్ణస్య కారుణ్యకటాక్ష కేళిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 9.)

ఒకపట్టణమున హరిపాలదాసుఁడు అను నొకభక్తుఁడు ఉండెను. ఆతనికిఁ బూర్వార్జితమైన విత్తము లెక్కలేనంతగా నుండెను. ఆతఁడు సర్వకాలసర్వావస్థలయందును శ్రీహరినిఁ బూజించుచు, భాగవతులను దీనులను మృష్టాన్నసంతృప్తులం గావించుచుండెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి ఆతనియింటనున్న ధనమంతయు నైపోయెను. అయినను యథాప్రకారముగ భాగవతులును దీనులును ఆతని యింటికి అన్నవస్త్రాదులకై వచ్చుట మానలేదు.

అది చూచి యాతఁడు "వీరినిఁ బొమ్మనఁజాలను. అన్నము పెట్టుటకును జాలను. ఏమి చేయుదును?" అని చాలఁదడవు చింతించి, తుదకు చౌర్యమువలన ధనము సంపాదించి యథాపూర్వకముగ భాగవతార్చనముచేయ నిశ్చయించుకొని, ఒకనాఁడు కత్తి కటారి మున్నగు ఆయుధములను గైకొని మార్గముఁ గాచెను. ఇదియంతయుఁ గనిపెట్టుచున్న శ్రీమన్నారాయణుఁడు వర్తకవేషమును ధరించి, అనేకాభరణములను అలంకరించుకొని లక్ష్మిని వెంట నిడుకొని హరిపాలుఁడు ఉన్నదిక్కునకు వచ్చెను. వారినిఁ జూచి హరిపాలుఁడు పొంగిపోయి సమీపమునకు రానిచ్చి, "నిలువుఁడు. ప్రాణముల మీఁద ఆశకలదేని మీశరీరములమీఁద ఆభరణములను అన్నిటిని అక్కడనుంపుఁడు. లేకున్న బుఱ్ఱలు ఎగురవేసెదను" అని పలికెను. అదివిని ఆదంపతులు భయభ్రాంతుల వలె నటించుచు "ఓయీ! మా ప్రాణముల నేల తీసెదవు? కొంచెము తాళెదవేని మా యాభరణములను అన్నిటినిఁ దీసి ఇచ్చెదము" అని పలికి, క్షణములో సకలాభరణములను ఇచ్చిపోయిరి. హరిదాసుఁడు మహానందముతో ఆయాభరణములనన్నిఁటిని ఇంటికిఁ గొనిపోయి, క్రమక్రమముగా నొకటొకటి చొప్పున విక్రయించి, యథాపూర్వముగ భాగవతారాధనము సాగించుచుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచిపోయినతరువాత శ్రీహరి హరిపాలునియెడలఁ జాల ననుగ్రహముకలవాఁడై ఒకనాఁడు ఆతనికి సాక్షాత్కరించి అభయమిచ్చెను.

అది చూచి లక్ష్మి "నన్నుమాటిమాటికిని ఆక్షేపించెదవు; కాని నీవు చేయుచున్న పని ఏమి సరసముగా నున్నది? ఆతఁడు మన ప్రాణములు తీయుటకు సిద్ధపడెను. మన యాభరణముల నన్నిటిని హరించెను. అట్టివానికి ఏమని సాక్షాత్కరించితివి? ఇది యేమి బాగున్నది? లోకములో అనేకభాగవతులు నిర్మలచిత్తులై, నిష్కళంకప్రవర్తనులై, సదానిన్ను ధ్యానించుచున్నారు. వారికి ప్రసన్నమవుదువు. కలుషమైన వారిని యిటులను ఎత్తవు. తప్పిదారిమైన వారినిఁ బలుకవు. నీవు ఎప్పుడును ఇట్లేచేసెదవు" అని చెప్పెను. అందులకు శ్రీహరి మందహాసము గావించి, "నీవు చెప్పినందులకు నాకు సంతోషమే; కాని నీవు సంగతి సందర్భములు ఏమియు గమనించుట లేదు. కేవలము బాహ్య ప్రవర్తనమును జూచి, నీవు హరిపాలుఁడు క్రూరుఁడు అని పలుకుచున్నావు; కాని ఆతని చిత్తశుద్ధిని నీవు గ్రహించుట లేదు. ఆతఁడు లుబ్ధులను దోఁచి భాగవతారాధనము సేయుచున్నాఁడు. నీవా చూడఁ దలంతువేని నాతో రమ్ము" అని బదులు చెప్పెను. లక్ష్మి అందులకు అంగీకరించెను. తోడనే శ్రీహరి భాగవతవేషము ధరించి, లక్ష్మితోఁ గూడ హరిపాలుని ఇంటిముంగిట సాక్షాత్కరించి "గోవిందా" యని ఉచ్చస్వరముతోఁ బలికెను.

ఆధ్వనిని వినినవెంటనే హరిపాలుఁడు వీథిలోనికి వచ్చి వారికి అర్ఘ్యపాద్యములు ఇచ్చి పూజించి, మృష్టాన్నతృప్తులఁ గావించి, "మీ రెచ్చటనుండి ఎచ్చటకుఁ బోవుచున్నారు?" అని ప్రశ్నించెను. అందులకు శ్రీహరి "మహాత్మా! ఏమి చెప్పుదును? నేను వర్తకుఁడను. ఈమె నాగృహిణి. మేము వర్తకస్థానమునుండి మాయూరుపోవుచుండఁగా, మార్గమధ్యమున నొకచోరుఁడు మమ్ము అడ్డుకొని మాయాభరణముల నన్నిఁటిని హరించెను. అప్పటినుండియు మేము ఇట్లు ఉన్నాము" అనిచెప్పి, వర్తకరూపముఁ దాల్చెను. తోడనే హరిపాలుఁడు వారినిఁ జూచి గడగడ వడఁకిపోవుచు పాదములమీఁద వ్రాలి, "మహాత్ములారా! మీ యాభరణములను దొంగిలించిన దొంగను నేనే. రక్షింపుఁడు" అని తనయుదంతము నంతను విన్నవించెను. అది విని లక్ష్మి ఆశ్చర్యచకితయై "నేను పొరపడితిని" అనియెను. అపుడు శ్రీహరి దివ్యమంగళవిగ్రహుఁడై సాక్షాత్కరించి, "వత్సా! నీకు ఏమియు భయమువలదు. నిన్నుఁ బరీక్షించుటకై మేము ఆరూపములతో వచ్చితిమి. నీవు మాయంతరంగభక్తులలో నొకఁడవై యున్నావు. నీకు ఏలోపమును గలుగదు. మేముఇచ్చిన వస్తువులవలన నీవు చాల కాలము భాగవతారాధనము చేయఁగలవు" అని చెప్పి, లక్ష్మితోఁగూడఁ దిరోహితుఁడయ్యెను. హరిపాలదాసుఁడు బ్రతికియున్నంతకాలమును భగవద్భాగవతారాధనము గావించి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

మ. "అమితాశావశమైన నామది నవశ్యంబైన మోహాంధకా
రము కారుణ్యకటాక్షవీక్షణవిభారాశిన్ విభాళించి నె
య్యమునం బ్రోచు దయాపయోధి ఘనబృందారణ్యకర్మందిబృం
దమనోలోచనసాధుసేవధి ప్రమోదం బొప్పు నెల్లప్పుడున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. [illegible])

# 76. రోహిదాసచాంభారు

శ్లో. "త్రిభువనసరసాభ్యాం దీప్తభూషాపదాభ్యాం
దృశి దృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యాం
అశరణశరణాభ్యామద్భుతాభ్యాం పదాభ్యాం
మయమయ మనుజాజస్వేణు రాయాతి దేవః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. శ్లో. 80.)

గంగాతీరమున ఒక గ్రామమునందు రోహిదాసచాంభారు అను నొక చండాలుడుండెను. ఆతడు యుక్తవయస్కుడై కులవృత్తిలో ప్రవేశించిన తరువాత పూర్వజన్మార్జితపుణ్యవిశేషమున శ్రీహరియందు అనన్యసాధారణమగు భక్తి కలిగెను. తన వెంపుటకొరకు యాతడు అనుదినమును ప్రాతఃకాలమున, తోలుతో గుట్టిన పాదరక్షలు బజారులో నుంచి, తనవారు గట్టినవాని నమ్ముకొని జీవించుచుండెను. ఇట్లు అనుదినమును మిగిల్చిన పాదరక్షలను భాగవతులకు సమర్పించుచుండెను. భాగవతులు, దీనులు, బీదలును మున్నగువారు కోరినచో వారి జీర్ణపాదరక్షలు ఉచితముగ బాగుచేసి ఇచ్చుచుండును. పాదరక్షలను గుట్టునపుడుగూడ ఆతడు హరినామస్మరణమును మాని యెఱుగడు.

ఆతడు తన కుటీరమునకు ఎదుటనున్న విశాలస్థలమున తులసి మున్నగు పావన వృక్షములును, అనేక విధములగు పుష్పతరులను బెంచి, దానికి నందనవనము అని పేరుపెట్టి, ప్రతిదినమును శ్రీహరిని బూజింప నువ్విళ్లూరుచుండును. ఇట్లుండ, నొకరాత్రి స్వప్నమున శ్రీహరి ఆతనికి సాక్షాత్కరించి సాలగ్రామము నిచ్చి పోయెను. వెంటనే రోహిదాసు మేల్కాంచి, శ్రీహరి కటాక్షమువలన అమందానందహృదయుడై ఒక తోలుపెట్టెను తయారుచేసి, సాలగ్రామము నందు ఉంచి పూజ ప్రారంభించెను. పుష్పములు తక్క తక్కుంగల పూజాసామగ్రియంతయు చర్మమయమే. పాత్రలుచర్మములు. పీఠము చర్మము. ఇట్లు సకల వస్తువులను చర్మముతో స్వయముగా దయారుచేసికొని, ఆతడు శ్రీహరిపూజ ప్రారంభించెను.

ప్రథమదినమున చెప్పి గుడుచుట మానివేసి, యాతడు పూజ ప్రారంభించెను. కాని సగము పూజ యగునప్పటికి ఆకలి విజృంభించి కడుపు మాడ్చివేయ సాగెను. అప్పుడు ఆతడు "నేడు అవివేక కృత్యమును జేసితిని. ఆకలి నన్ను దహించివేయుచున్నది. అనుటచే నామనస్సు శ్రీహరినుండి చలించుచున్నది. భగవంతునకు మనస్సే ప్రధానముగాని శరీరముగాదు. కావున నేను మనస్సును స్వాధీనము చేసికొన్నచో, భగవంతుడు చల్దియన్నము భుజించినను కోపగింపడు"

అని నిశ్చయించుకొని, మఱునాఁడు మొదలుకొని ప్రాతఃకాలమునందె లేచి స్నానము చేసికొని, భగవంతుని ప్రార్థించి, భగవన్నివేదనకు దగువద్ధ గూర్చి, శ్రీహరినిఁ బూజించుటకుఁ బ్రారంభింపఁ దొడఁగెను.

ఒకనాఁడు ఆగ్రామ పురోహితుఁడు ఏదో పనిమీఁద సంధ్యావందనముచేసికొని వచ్చి రోహిదాసును బిలిచెను. తోడనే భయభక్తులతో నతఁడు బ్రాహ్మణునకు మ్రొక్కి, తాము వచ్చిన పని ఏమి యని యడిగెను. ఆ బ్రాహ్మణుఁడు నందనవనమునఁ దులసిమొక్కలు ఉండుటఁ గాంచి, రోషఘూర్ణితనయనుఁడై తాను వచ్చిన పనిఁ దెలుపకయే "నీవు తులసినిఁ బెంచుచుంటివటరా?" యని గర్జించుచుఁ బలికెను. అది విని రోహిదాసు వినయవినమితదేహుఁడై "మహానుభావా! ఏల కోపపడెదరు? తులసిమొక్క నే నంటిన నపవిత్రమగునా? నే నంటినదానిని మిమ్ము తాకఁదగ లేదే? ఇఁక మీకేమి బాధ? శ్రీహరిని మేము కొలువఁ దగినవారము, శ్రీహరికిఁ బ్రియమైన తులసిని మేము తాకఁగూడదా?" అని యడిగెను. దానిమీఁద సందేహించి నీవు శ్రీహరినిగూడఁ బూజించుచున్నావటరా? యని బ్రాహ్మణుఁ డడిగెను. "అవును మహాప్రభూ!" యని రోహిదాసు వృత్తాంతము నంతయు నెఱింగించెను.

అది విని బ్రాహ్మణుఁడు మఱింత మండిపడి, "దుర్మార్గుఁడా! నీవు సాలగ్రామమును కూడ ముట్టుకొంటివా? దానిని తోలుసంచిలోఁగూడ నుంచితివా? తోలుసంచిలోని నీటితో దానికి అభిషేకము చేయుచున్నావా? పవిత్రమగు ఆసాలగ్రామమును తోలుముక్కమీఁద నుంచుచున్నావా? తుచ్ఛుఁడా! ఇదంతయు నీకు ఎవరు ఉపదేశించినారురా?" యని కటము లదరఁ బలికెను. అందులకుఁ గూడ రోహిదాసు కోపింపక, జంకక, "స్వామీ! సాలగ్రామమును నాకు ఏబ్రాహ్మణుఁడును ఈయలేదు. నేను నర్మదానదికిఁ బోయి తీసికొనిరాలేదు. శ్రీహరియే నాకు స్వప్నమున సాక్షాత్కరించి ఇచ్చిపోయెను. దానిని భక్తితో నేను పూజించుకొనుచున్నాను. మేము శ్రీహరినిఁ బూజించుకోఁగూడదా? మిమ్ము పూజచేయింపవలసినదని కోరలేదు. నిర్బంధపెట్టలేదు. మీవేదములను జెప్పుఁ డనలేదు. వినలేదు. నాకుఁ దోఁచినట్లు నేను పూజ చేసికొనఁగూడదా? నాయింట నున్నది తోలు. తోలుపాత్రయందలి జలముతో నభిషేకముచేసిన శ్రీహరి యంగీకరింపఁడా? శ్రీహరి తోలుపీఁటమీఁద నాసీనుఁడు కాఁడా? తోలుసంచిలో విశ్రమింపఁడా? తోలుచేతితో తాఁకుటకుమాత్రము అభ్యంతరము లేదా? స్వామీ! ఈశ్వరుఁడు చిత్తశుద్ధినిమాని బాహ్యాడంబరమునే మెచ్చునా? స్వర్ణవిగ్రహమునందున్న శ్రీహరి మంటిబొమ్మయందు లేఁడా? శ్రీహరి ప్రపంచమునం దంతటను ప్రతివస్తువునందును వ్యాపించియున్నాఁ డని బ్రాహ్మణులే యంగీకరింతురు. అయినచో [illegible]

యుండి పోదా! మూడు దినము లుండినచో మైలపడని జగన్నాథుఁడు నేను పూజించిన మైలపడునా? మీరు కోపోద్రేకమువలన అర్థింపరు; కాని తోలులో మాత్రము భగవంతుఁడు లేఁడా!" యని ప్రత్యుత్తరము చెప్పెను.

ఇది వినుటవలన బ్రాహ్మణునకు ఆపాదమస్తకమును క్రోధాగ్నితో నిండిపోయెను. "మూఢుఁడవు, నన్నేమి చేయించెదవో?" యని యాబ్రాహ్మణుఁడు మాటలు పలుకఁజాలక అట్లే నిలిచిపోయెను. ఇంతలో శ్రీహరి గరుడవాహనారూఢుఁడై వచ్చి రోహిదాసునకు దర్శన మిచ్చెను. రోహిదాసు భయసంభ్రమములతో వలఁగొని సాష్టాంగనమస్కారములు ఆచరించి వినుతింప నుండఁగా, శ్రీహరి ఆతనిని లేవఁదీసి శిరంబు మూర్కొని, "వత్సా! నీభక్తికి మెచ్చితిని. నీవు నా యంతరంగభక్తుఁడవైతివి. నీకు అవసానమున మోక్షము నిచ్చెదను" అని తిరోహితుఁడయ్యెను. ఇదియంతయుఁ జూచుచున్న బ్రాహ్మణుఁడు నిర్విణ్ణుఁడై బుద్ధితెచ్చుకొని "రోహిదాసా! సంగతిసందర్భములు తెలియక నిన్ను ఆడరానిమాటలు అడిగితిని. క్షమింపుము." అని బతిమాలికొని, అనేకవిధములఁ గొనియాడెను. "నీయనుగ్రహముచే నాకు శ్రీహరిదర్శనము గలిగెనది. నీఋణమును నేను అనేకజన్మము లెత్తినను తీర్చుకోఁజాల" నని మఱియుఁ గొనియాడెను. రోహిదాసు బ్రతికియున్నంత కాలమును ఇట్లే కాలము గడపి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

శా. "క్రీడాభూషణధాములై యశరణశ్రేయశ్శరణ్యంబులై
చూడం జూడఁగఁ జల్లనై సొగసునై చోద్యంబులై దేవతా
చూడారత్నములైన పాదముల రా నొంపొంది వేణుధ్వనుల్
జాడల్ జల్లఁగ వీఁడె వీఁడె యన నాస్వామిన్ విలోకించెదన్."

(కృష్ణకర్ణామృతము ఆ. 1. ప. 80.)

---

# 77. నరహరి

శ్లో. "జాగృహి జాగృహి చేత శ్చిరాయ చరితా భవతః,
అనుభూయతా మిద మిదం పురః స్థితం పూర్ణనిర్వాణమ్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 64.)

పండరిపురమున నరహరిభక్తుఁడు అను నొకస్వర్ణకారుఁడు ఉండెను. ఆతఁడు బంగారపుఁబనిలో అద్వితీయుఁడు అని పేరువడసెను. విశేషించి శివభక్తుఁడు. శివుని కంటె మఱియొక దైవము లేఁడని ఆతని నమ్మకము. తన ఇంటికి సమీపమునందే యున్న అద్వితీయాలయముననున్న పండరినాథుఁడు దేవుఁడు కాఁడనియు, వైష్ణవులచే స్థాపింపఁబడినది కేవల శిలావిగ్రహము అనియు, దానినిఁ బూజించుటకంటె

అవివేకము లేదనియు, అతఁడు తలుచు చెప్పుచుండెను. లోకమంతయు మాయలో మునిఁగిపోవుచున్నది. ఏతఁడు శైవమో అతనిని విడిచి, నిజ కేవల శిలావిగ్రహమో దానిని లోకము పూజించుచున్నది. అయ్యో! దుష్పాషండమునఁ గూరుకొనుచున్న ఈ అమాయికలోకమును ఉద్ధరించుమహాత్ములు ఎందును లేరా!" యని యాతఁడు తహతహపడుచుండును. "హాహాహా! ఈ వైష్ణవులు లోకమునకు ఎంతద్రోహము చేయుచున్నారు" అని మాటిమాటికిని చింతించుచుండును. ఇట్టి భావోద్రేకము గలవాఁడగుటచే వాఁడు ఎప్పుడును పాండురంగని దర్శించి యెఱుఁగఁడు.

ఆయూర నరహరి యింటిప్రక్క గొప్పధనికుఁడగు నొకవర్తకుఁడు ఉండెను. అతఁడు అనేకవ్యాపారములలోఁ బ్రవేశించి లెక్కలేనంతధనమును సంపాదించెను. దేవేంద్రవైభవము ననుభవించుచుండెను. కాని సంతానము మాత్రము కలుగలేదు. దానినిమిత్తము అతఁడు అనేకదినములు ఎదురుచూచెను. కాని ప్రయోజనము కలుగదయ్యెను. తుదకు అతఁడు పాండురంగని సందర్శించి, "స్వామీ! నాకు సంతానము నిచ్చెదవేని నీకు రత్నాలమొలత్రాడు చేయించి ఇచ్చెదను" అని మ్రొక్కుకొనెను. పిదప అతని యనుగ్రహమువలన వెంటనే అతనిభార్య గర్భవతియై, నవమాసములు మోసి ఒక శుభముహూర్తమున కుమారునిఁ గనియెను.

వర్తకుఁడు తనకు సంతానము కలిగినది; కావున మ్రొక్కు చెల్లింపఁదలఁచి రత్నాలమొలత్రాడు చేయుటకు తగినపనివాఁడు ఎవఁడా యని యోచింపసాగెను. అతఁడు ఒకరిద్దఱు మిత్రులచెంతఁ బ్రస్తావన చేయఁగా, వారు నరహరికంటెఁ దగిన వాఁడు లేఁడని చెప్పిరి. అందులకు వల్లెయని వర్తకుఁడు బంగారమును రత్నములను గొని నరహరిచెంతకుఁ బోయి, సంగతి యంతయు నెఱింగించెను. అదివిని నరహరి "అయ్యా! నాకు తగినమజూరీ ఇచ్చెదరు; కావున ఆవస్తువు చేయుటకు నాకు ఏమియు అభ్యంతరము లేదు. కాని నేను పండరినాథుని ఎప్పుడును జూచి యెఱుఁగను; కావున మీరు పోయి కొలతను దీసికొనిరండు. పాండురంగనిఁ జూడనని నాకు వ్రతము ఉన్నది" అని చెప్పెను. వర్తకుఁడు ఆశ్చర్యచకితుఁడై, "ఓయీ! నీమాటలు చాల వింతగా నున్నవి. శ్రీమన్నారాయణుఁడగు పండరినాథునిఁ జూడనని వ్రతముదాల్చిన నీకంటె అవివేకులు గలరా?" అని పలికెను. ఈమాటకు నరహరికిఁ గోపమువచ్చెను. "అది యేమి మాట? 'లోకో భిన్నరుచిః' అనుట మీరెఱుఁగనిదియా? కైలాసనాథుఁడే దేవుఁడని నేను విశ్వసించెదను" అని స్వర్ణకారుఁడు మునికోపముతో జవాబు చెప్పెను. "నీవిశ్వాసముతో నాకేమియుఁ బని లేదు" అని చెప్పి, వర్తకుఁడు స్వయముగఁ బోయి పండరినాథుని మొలకొలత తెచ్చి ఇచ్చి పోయెను.

నరహరి మఱునాటికి మొలత్రాడు సిద్ధముగాఁ జేసి వర్తకునకు వర్తమానకుని కిచ్చి, "నాత్రాడు మీకుఁ దెలిసినదే యున్నది. మీరు పట్టుకొనిపోయి స్వామికి సమర్పించుఁడు" అని యిచ్చి వేసెను. వర్తకుఁడు వస్తువు చాల సందముగా నున్నదని మెచ్చుచు నదిని, పట్టుకొనిపోయి స్వామికి అలంకరించెను; కాని నాలుగు అంగుళములు హెచ్చు పొట్టిగ నుండెను. వర్తకుఁడు వచ్చి అసంగతిఁ జెప్పఁగా, నరహరి లోపముఁ బాగుపఱచి యిచ్చెను. వర్తకుఁడు మరల అలంకరింపఁగా, రెండు అంగుళములు పెద్దది యాయెను. అయిదాఱు తడవలు సరిచేసినను ఇట్లే హెచ్చు తగ్గులు వచ్చెను. తుదకు వర్తకుఁడు నరహరినిఁ జూచి "ఇదియేమో వింతగా నున్నది. నీవు వచ్చినగాని ఇది సరిపోవునట్లు తోఁచుటలేదు" అనియెను. నరహరి వెంటనే బయలుదేఱిపోయి కండ్లకు గంతలు కట్టుకొని గర్భాలయము సొచ్చి పండరినాథుని విగ్రహమును తడవిచూడఁగా నది ఐదుముఖములు, పునుకపేరులు, జటాజూటము మున్నగు చిహ్నములు గల ఈశ్వరవిగ్రహముగాఁ దోఁచెను. నరహరి "ఇది ఈశ్వరవిగ్రహము గాని విష్ణువిగ్రహము గాదు" అని నిశ్చయించుకొని, ఆనందముతో గంతలు విప్పుకొని చూచునప్పటికి విగ్రహము పూర్వరూపముతోడనే యుండెను. తోడనే నరహరి ఘూర్ణాక్రోశములు సేయుచు మఱల గంతలు కట్టుకొని తడవిచూడఁగా, మఱల శివవిగ్రహముగాఁ దోఁచెను. మరల నరహరి గంతలు విప్పుకొని చూచునప్పటికి విగ్రహము పూర్వమువలెనే యుండెను. ఇందలి యర్థము నెఱుఁగఁజాలక నరహరి క్రిందును మీఁదును జూచుచుండఁగా, పండరినాథుఁడు హరిహరరూపముతో సాక్షాత్కరించి ఆదరముతో నరహరినిఁ జేరఁదీసి, లాలించి, "వత్సా! నీచిత్తశుద్ధికి మెచ్చితిని. నేను త్రిమూర్త్యాత్మకుఁడను. భక్తుని భావన ననుసరించి నేను మూఁడుమూర్తుల రూపములలో నొకరూపమును దాల్చుచుందును. నిన్ను నాయంతరంగభక్తులలోఁ జేర్చుకొనియున్నాను. నీకు ఏలోపములును గలుగఁబోవు" అని వచించి, మఱల యథారూపముఁ దాల్చెను. నరహరి వెంటనే ఆనందకంపకలితచిత్తుఁడై పండరినాథునకుఁ బ్రదక్షిణము చేసి, "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే, శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః" అని సాష్టాంగవందనము లాచరించి, మొలత్రాటిని అలంకరించెను. ఇదియంతయుఁ జూచి వర్తకుఁడు మున్నగువారు ఆశ్చర్యచకితులై, నరహరిని అనేకవిధములఁ గొనియాడిరి. నరహరి బ్రతికియున్నంతకాలమును యథాపూర్వముగ నీశ్వరపూజఁ గావించి, అవసానమున సాయుజ్యముక్తిని బడసెను.

చ. "వెనుకటివేళలం దనుభవించిన జన్మశతంబు లట్లనేఁ
దును భ్రమ మోసపోవక గదుం దెలివొందుము డెందమా చిరం
తనతపముల్ ఫలించి పురతస్స్థలి నున్నది కృష్ణరూపమై
యనవరతానుచింతనసుధారసవీచులనోలలాడుమీ."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప 64.)

---

# 78. గణేశనాథుఁడు

శ్లో. "యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం
యే వా శైశవచాపలవ్యతికరా రాధావరోధోన్ముఖాః,
యా వా భావిత వేణుగీతగతయో లీలాముఖాంభోరుహే
ధారావాహికయా వహంతు హృదయే తాన్యేవ తాన్యేవ మే."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. శ్లో. 166.)

ఉజ్జయినీనగరమునకు సమీపమున నున్న అరణ్యమున గణేశనాథుఁడు అను నొకభాగవతోత్తముఁడు సుఖసంతోషములను విడిచి, సంతతహరినామస్మరణ తత్పరుఁడై యుండెను. ఆతని యాహారము కందమూలఫలములు. కౌపీనమును మాత్రమే యాతఁడు ధరించును. గణేశనాథుఁడు ప్రతిదినము పండరీపురమునకుఁ బోయి పాండురంగని సేవించుచుండును.

ఒకనాఁడు గణేశనాథుఁడు పాండురంగని సమీపమున హరిగుణకీర్తనము చేయుచుండఁగా, శివాజీమహారాజు స్వామిని సేవించుటకు వచ్చెను. వచ్చిన పని యెల్ల ముగిసిన తరువాత శివాజీ భాగవతుల నందఱను జూచుచు రాఁగా, గణేశనాథునికీర్తనలు హృదయము నాకర్షించెను. అగుట నాతఁడు అచ్చటఁ గూర్చుండి భక్తిశ్రద్ధలతో నాగానమును విని, గణేశనాథునియెడలఁ జాల భక్తిభావముఁ దాల్చెను. శివాజీ అంతకుఁ బూర్వము మనోహరమైన యొక గొప్పమంచమును హంసతూలికాతల్పమును జేయించెను. దానిమీఁద నింతవఱకు నాతఁడు శయనింపలేదు. "ముందు గణేశనాథుని దానిమీఁద శయనింపఁ జేయవలయును" అని తలంచి, శివాజీ "మహాత్మా! మీరొకమాఱు నాకోటకు దయచేయవలయును" అని ప్రార్థించెను. గణేశనాథుఁడు శివాజీహృదయము తనయెడల నిర్మలభక్తిపరీతమై యుండుట గ్రహించి వల్లె యని యంగీకరించెను.

పండరినాథుని సేవించుకొని ఇరువురును బయలుదేరిరి. మార్గమధ్యమున గణేశనాథుఁడు బొమ్మరాళ్లను గొన్నిఁటిని ఏరి తనసంచిలో వేసికొనెను. అది చూచి శివాజీ వాని ప్రయోజన మేమని యడుగఁగా, నాతఁడు "శ్రీరామనామమును లెక్కించుటకు" అని బదులు పలికెను. మఱికొంత సేపటికి వారు గమ్యస్థానము చేరుకొనిరి.

శివాజీ గణేశనాథునిఁ జాల నాదరముతోఁ బూజించి, నిద్రాసమయమున నూత్నతల్పమును జూపి సెలవుఁబడసి వెడలిపోయెను. గణేశనాథుఁడు మఱి కొంతసేపు హరినామస్మరణము గావించుకొని, పిదప సంచిలోని బొమ్మరాళ్లను

హంసతూలికాతల్పమునఁ బఱచి దానిమీఁద శయనించి నిదురవోయెను. తెల్ల వాఱఁగ ప్రాతఃకాలమున శివాజీ గణేశనాథుఁడు శయనించినచోటికి వచ్చెను. అంతకుఁ బూర్వమే గణేశనాథుఁడు లేచి హరిస్మరణ చేయుచుండెను. శివాజీ వందనసమర్పణముచేసి ఆశీర్వాదస్వీకారముఁజేసి, తల్పముమీఁద బొమ్మగాళ్లుండుటఁ జూచి నిర్ఘాంతపడి, “మహాత్మా! ఇదియేమి?” యని ప్రశ్నించెను. గణేశనాథుఁడు శివాజీ నిర్ఘాంతపాటు నాలోకించి మందహాసము గావించి ఇట్లు అనియెను.

“వత్సా! ఇట్లేల నిర్ఘాంతపడెదవు? లోకమునందలి ప్రకృతులు అన్నియు పరస్పరభిన్నములై యున్నవి. “స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః” అని శ్రీకృష్ణభగవానుఁడు ఆనతిచ్చెను. నాయాశ్రమధర్మములను నీవు అనుసరింతువేని నీయుద్యోగములు అన్నియుఁ జెడుటయు, నీవు రాజ్యభ్రష్టుఁడ వగుటయు సిద్ధము. అట్లే నేను గృహస్థాశ్రమధర్మములను అనుసరింతునేని నరకమునఁ గూలఁ బడియెదను. హంసతూలికాతల్పముమీఁద శయనించుటకంటె ఐహికసుఖము లలో మిన్నయైనది ఏమున్నది? కాని ఆ సౌఖ్యమును అనుభవించితినేని, ఇఁక నా మనస్సు నాకు స్వాధీనము గాదు. ఇఁక నేను చెడుట యెంతసేపు? కావుననే నాతల్పమున కాలు పఱచితిని. నిర్మలచిత్తుఁడవగు నీవు కోరుటచేఁ ద్రోసివేయఁ జాలక పోయితిని; కాని మఱియొకరు కోరినచో నేను తల్పమునే తాఁకను. ఆశ్రమధర్మముల నతిక్రమించుట మహాపాతక మనుట నీకుఁ దెలియనిది గాదు కదా! వత్సా! నరకమును దలంచుకొనిన ఎవనిహృదయము వ్రక్కలు గాదు? ఇది తెలిసియుండియు నన్ను ఇట్లు ప్రశ్నించెద వేల?”

ఇది విని శివాజీ ఆశ్చర్యచకితుఁ డయ్యెను. పిదప గణేశనాథుఁడు “వత్సా! నీసపర్యలవలన మాకు ఆనంద మైనది, నీవు చేపట్టినకార్యము మహోత్కృష్టము. దేవతలకుఁగూడ ఆచరణీయము. నీసదసద్వివేచనాసామర్థ్యము అద్వితీయమైనది. ఈమహాకార్యమువలన నీజన్మము సఫలమైనది. రాజ్యతంత్రమున నీకుఁ దెలియని రహస్యములు లేవు. నేను చెప్పవలసినది ఏమి కలదు? నీకార్యము ఎంత యుత్కృష్టమో అంతగా నపాయబంధురము. కను గలిగి ప్రవర్తింపుము. ఆర్యధర్మమును రక్షింపుము. ఈ కార్యమునఁ గృతకృత్యుఁడ వైతివేని యోగిజనలభ్యమగు మోక్షము నీకుఁ గరతలామలకము అగును” అని హితబోధచేసి ఆశీర్వదించి తన దారిం బోయెను.

పిదప అనేకులు అరణ్యమధ్యమున నున్న గణేశనాథుని చెంతకుఁబోయి, ఆతని వలన ఉపదేశమును బొంది భక్తిజ్ఞానవైరాగ్యవంతులైరి. ఇట్టివారిసంఖ్య దినదిన మును బెరుగుచుండుటఁ గాంచి యోర్వఁజాలని మూఢులు కొందఱు “నీవు ఇంద్ర

జాలము చేసి ఇంపజి సంసారకులను [illegible]. నీవు నిజముగా భాగవతాగ్రేసరుఁడవేని జంగమములకు వలెనే స్థావరములకును మోక్ష ముపదేశించి నీమహిమఁజూపుము” అని పలికి, ఎదుట నున్న ఒకవృక్షమును జూపిరి. గణేశ నాథుఁడు .వారిసందేహములను బోఁగొట్టఁదలఁచి, అవృక్షమును జూచి తారకమంత్ర మును ఉపదేశించి, వారు తెచ్చినపదార్థములను ఆచెట్టుమీఁద నుంచెను. క్షణములో చూచుచుండఁగానే ఆపదార్థములు మాయమైపోయెను. మఱియు చెట్టునందుఁ గలతొఱ్ఱలు అన్నియుఁ బూడిపోయెను. అదిచూచి ఆగస్త్యులు లజ్జితులై, ఆతని పాదములమీఁద వ్రాలి క్షమింపఁ బ్రార్థించి, ఆతనివలన నుపదేశముఁ బడసి తరించిరి.

ఒకనాఁడు వేదవిదులైన బ్రాహ్మణులు అచ్చటకు వచ్చి, “మేము అగ్రజాతి వారము. మేము ఒకరికి ఉపదేశింతుముగాని ఇతరులవలన ఉపదేశముఁను బొందు వారము కాము. ఒకరిచే నమస్కరింపించుకొందుము గాని, ఒరులకు నమస్కరిం పము” అని పలికిరి. గణేశనాథుఁడు మీరిట్లు చెప్పుట తగదు. బ్రహ్మజ్ఞానము లేని వాఁడు బ్రాహ్మణుఁడు కాఁడు' ఆత్మస్తోత్రము చేసికొను బ్రాహ్మణునికన్న హరిభక్తి గలిగియుండు చండాలుఁడుగూడ నుత్తముఁడు. భాగవతులకటాక్షవీక్షణమునకుఁ బాత్రములైన రాళ్లకుఁ గూడ మోక్షము లభించును” అని చెప్పి అచ్చటనున్న రాళ్ల దెసఁజూచెను. తోడనే అవి తటాలున ఆకసమునకు ఎగిరిపోయెను. అదిచూచి ఆబ్రాహ్మణులు బుద్ధితెచ్చుకొని, ఆతనివలన నుపదేశమును బడసిపోయిరి. గణేశ నాథుఁడు జీవితమంతయు నిట్లే కడపి, అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

మ. “అలరుక్ ధన్యుల కేకథామృతము జిహ్వాక్ లేహ్య మేబాల్యచా
పలముల్ రాధకు నెయ్యపుంగినుక నాపాదించు నేయందముల్
వెలయుం మోమున వేణుగానకలనక్ వేమాఱు నాదివ్యచ
ర్చలె నామానసవీథి వేఁడెదను ధారాళంబుగా నిల్వఁగన్.”

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 106.)

# 79. జోగాపరమానందుఁడు

శ్లో. “నఖనియమితకండూన్పాండవస్యందనాశ్వా ననుదినమభిషించన్నంజలిస్థైః పయోభిః,
అవతు వితతగాత్రస్తోత్రనిష్ఠ్యూతమౌళిర్దశనవిధృతరశ్మిర్దేవకీపుణ్యరాశిః ”

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. శ్లో. 47.)

ఒక గ్రామమున జోగాపరమానందుఁడు అను నొకభక్తాగ్రేసరుఁడు ఉండెను. ఆతఁడు ఐహికసుఖవిముఖుఁడై సంసారము అసారమని దానిని విడిచి, ఏకాకియై జీర్ణవస్త్రమును దాల్చి, భిక్షాన్నమును గుడుచుచు, సదా భగవద్గీతాపారాయణము

చేయుచుండెను. అతనికి భగవద్గీతయందు తక్క మఱియేగ్రంథమునందును భక్తి లేదు. శ్లోకమునకు ఒకసాష్టాంగనమస్కారము చేయుచు, అతఁడు భగవద్గీతను పారాయణముచేయును.

ఒకనాఁడు ఒకవర్తకుఁడు జోగాపరమానందుఁడు సాష్టాంగనమస్కారపూర్వకముగ భగవద్గీతను పారాయణము చేయుచుండఁగా, వచ్చి కూర్చుండెను. కాని ఈసంగతి మాత్రము భక్తుఁడు ఎఱుఁగఁడు. అతఁడు సాష్టాంగనమస్కారములను జేయుచునే యుండెను. ఇంతలో చూచుచుండఁగా ఆకసమంతయు మేఘములు గ్రమ్మి, నిలిచియుండఁగా ముసలధారగా వర్షము ప్రారంభించెను. ఆవర్షమునకు జోగాపరమానందుఁడును, వర్తకుఁడును గూడఁ దడిసిపోయిరి. వర్తకుఁడు వాన దెబ్బకుఁ దాళఁజాలక చాల బాధపడెను; కాని భక్తుఁడు అదియేమియు నెఱుఁగఁడు. ఆవర్షమువలన నేలయంతయు బురదమైపోయెను. అయినను భక్తుఁడు ఆమోఁకాలి లోతు బాడిలోనే సాష్టాంగవందనములు చేయుచు, యథాపూర్వముగ భగవద్గీతా పారాయణము సాగించుచుండెను.

ఇది చూచి వర్తకుఁడు "ఈతఁడు అందఱు భక్తులవంటివాఁడు కాఁడు. కేవలము నిస్పృహాయు నిశ్చలత్వమును గల మహానుభావుఁడు. ఈతని దర్శనమువలన నేఁడు నాజన్మము పావనమైనది. నాపాపములు అన్నియుఁ బటాపంచలై పోయినవి. వాణిజ్యనిమిత్తము పోవుచున్న నాకు నాపూర్వపుణ్యవశమున కాకతాళీయ న్యాయమున ఈమహానుభావుని దర్శనభాగ్యము గలిగినది. బ్రహ్మానందపరవశుఁడై ఈతఁడు తాను ధరించిన వస్త్రమును తనశరీరమును గూడఁ బంకిలములై యుండుట గమనించుట లేదు. ఇట్లే యుండిన ఈతని దేహమునకు అపాయము సంభవించి, భగవత్కైంకర్యమునకు అభ్యంతరము కలుగవచ్చు" నని తలంచి, గుఱ్ఱములమీఁద నున్న మూటలలో నొకటి విప్పి, అందలి అమూల్యమగు పీతాంబరమును దీసి తెచ్చి "మహానుభావా ! మీరు ధరించిన వస్త్రమంతయు పంకిలమై యున్నది. అట్లుండిన జబ్బు చేయును. ఈపీతాంబరమును స్వీకరించి ఈసేవకుని యెడల ననుగ్రహముఁ జూపవలయును" అని ప్రార్థించెను. అది విని జోగాపరమానందుఁడు "ఓయీ! నీ భక్తికి ఆనందమైనది. మాకు జీర్ణవస్త్రము భిక్షాన్నమునే కాని ఇతరమును స్వీకరించుట తగదు. నీవు చూపిన భక్తియే చాలును. కావున నీవస్త్రమును నీవే కొనిపొమ్ము" అని ప్రత్యుత్తర మిచ్చెను; కాని వర్తకుఁడు అందులకు అంగీకరింప లేదు. "మహానుభావా! కుటుంబజంబాలపటలమునఁ బడి ఇద్దరద్దరిఁగానక పరితపించుచుండు, నాబోఁటి వారిపై మీరు అనుగ్రహము చూపకున్న నెట్లు?" అని బలవంతమున నాతని యొడలు కడిగి, పీతాంబరమును గట్టి తనమార్గమునఁ బోయెను. భాగవతుఁడు

క్షీస్తకునిఁ గాదనఁజాలక అంగీకరించి, అమూల్యమగు పీతాంబరము పంకిలమై చెడి పోవు ననుభయముచే సాష్టాంగవందనములు మాని నిలిచియే నమస్కరించుచు గీతాపారాయణము చేయసాగెను. ఇట్లు కొంతసేపు అగునప్పటికిఁ జోగాపరమానందునకు మనస్సు చలించెను. ఆయాసము వచ్చెను. ఆకలిపుట్టి దహింపఁ దొడఁగెను. ఇదంతయుఁ జూచి "నేఁడు నే నెంత మూర్ఖుడనైతిని? ఈపట్టుపీతాంబరమును స్వీకరించుటవలననే నాకిట్టిగతి తటస్థించినది" అని నిశ్చయించుకొని, దీనికిఁ దగిన ప్రాయశ్చిత్తమునకై యోచింపసాగెను.

ఇంతలో నొకరైతు పొలములో దున్నుట పూర్తిచేసికొని, నాగటిని భుజముపై నిడుకొని ఎడ్లను దోలుకొని ఇంటికిఁ బోవుచుండెను. జోగాపరమానందుఁడు అతనిని దగ్గరకు రమ్మని పిలిచి, "నీకు ఈపీతాంబరమును ఇచ్చెదను. నీ యెడ్లను నాకు ఒక క్షణము ఎరువు ఇమ్ము" అని యడిగెను. కర్షకుఁడు అందులకు అంగీకరింపఁగా, భక్తుఁడు కాడిని ఎడ్లమెడలకుఁగట్టి తన్ను దానికిఁ గట్టుకొని ఎడ్లను పరువెత్తించెను. ఈవిపరీతమును జూచి బెదరి ఎడ్లు తోఁచినట్లెల్లఁ బరుగులెత్తెను. ఒక గడియలో ముండ్లకంపలు రాళ్లు మున్నగునవి గీచుకొనిపోవుటవలన శరీరమంతయు రక్తమయమై జోగాపరమానందుఁడు పూచిన మోదుగువృక్షము వలె నయ్యెను. అప్పుడు అతఁడు "నేను చేసినపనికి తగిన ప్రాయశ్చిత్తమైనది" అని యానందించి, హరిస్మరణము ప్రారంభించెను. తోడనే శ్రీహరి గజేంద్రుని రక్షించి నప్పటివలె, వచ్చి అతనిమేను నిమిరి యథాపూర్వముగఁ జేసి "వత్సా! ఏల యిట్టి ఘోరమును జేసితివి? అన్నా! దేహమును ఎంత కష్టపెట్టితివి?" అని యూరడించి, అభయ మిచ్చి తిరోహితుఁ డయ్యెను. పిదప జోగాపరమానందుఁడు జీవితమంతయు హరిభజనమునఁ గడపి, అవసానమున ముక్తిని బడసెను.

మ. "కలఁ డోత్రంబు ధరించి పగ్గములు దంతశ్రేణిఁ గీలించి య
గ్గలికన్ మేనిగిడించి పార్థరథకంభూణంబులన్ దోయిటన్
జలముల్ సల్లి నఖాళిమై నివురుచున్ రక్షించు నాదేవకీ
లలనాపుణ్యఫలంబు నన్ను గరుణాలంకారుఁగాఁ జేయుఁతన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 47.)

---

# 80. బాలభక్తులు

శ్లో. "సంసారే కిం సారం, కంసారేశ్చరణకమలపరిభజనం,
జ్యోతిః కిమంధకారే, యదంధకారేరనుస్మరణమ్."

(కృష్ణకర్ణామృతము ఆ. 2. ప. 80.)

మాధవసింగు అను రాజునకు గుణవతీబాయి అనురాణి యుండెను. వారిరువురునుగూడ సహృదయ అను దాది ఉపదేశమువలన భక్తాగ్రేసరులైరి. వారికి శ్రీమంతుఁడు, లక్ష్మీకాంతుఁడు అను ఇరువురు కుమారులు గలిగిరి. వారిని పెంచుటకు సహృదయ నియమింపఁబడెను.

మాటలాడ నేర్చినది మొదలు రాజపుత్రులు తమదాది శ్రీకృష్ణవిగ్రహమునకుఁ బూజసేయం జూచి, తాముగూడ చెరియొక విగ్రహమును సంపాదించి విధివిధానములు తెలియక పోయినను దాది చేసినట్లే పూజచేయసాగిరి. ఒకనాఁడు దాదివారు పూజచేయుటఁ జూచి, "వీరికి పుట్టుకతోడనే హరిభక్తి యలవడినది" అని సంతసించి, రెండు స్వర్ణవిగ్రహములను జేయించి యిచ్చి "నాగురువు ఫలానామఠమున నున్నాఁడు. మీరు ఆతని చెంతకుఁ బోయి ఉపదేశమును బొందుఁడు" అని చెప్పెను. వారు అట్లె పోయి ఆయోగికి తమసంగతి యంతయు విన్నవించిరి. అందులకు ఆతఁడు ఆశ్చర్యచకితుఁడై, శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి పూజావిధానమును దెలిపెను.

కొన్నాళ్లు గడచిపోయినతరువాత బాలకులు ఇరువురును తల్లిదండ్రులవద్ద సెలవుఁబడసి, తీర్థయాత్రలు సేవించుటకుఁ బోయిరి. ఒకనాఁడు ఒక నగరమున సాయంకాలము వీరు రాజోద్యానవనమునందలి చెఱువుగట్టుమీఁదఁ గూరుచుండి శ్రీకృష్ణవిగ్రహములకుఁ బూజలు చేయుచుండిరి. అప్పుడు విహారము నిమిత్తము అచ్చటకు వచ్చిన రాజపుత్రికలు పూజాంతమువఱకును అచ్చటనుండి, వారి హరిభక్తికిని సౌందర్య సౌకుమార్య లావణ్యములకును మిగుల నానందించి, తమమార్గమునఁ బోయిరి; కాని రాత్రి వారికి నిద్రాహారములు సహింపవయ్యెను. "ఎప్పుడు తెల్లవాఱు నెప్పుడు వారిని జూతు" మని వారికిఁ దహతహ పుట్టెను. తుదకు ఎట్లో తెల్లవాఱెను. వెంటనే వారు కార్యములను దీర్చుకొని, ఉద్యానవనమునకుఁబోయి రాజపుత్రులవద్దఁ గూరుచుండిరి.

ఇట్లు నలువది దినములు గడచెను. రాజపుత్రికలకు "ఇఁక అంతిపురము విడిచి బైటికిఁ బోరాదు" అని యాజ్ఞయయ్యెను. వారు రాజపుత్రులను వారిచెంత నున్న

శ్రీకృష్ణవిగ్రహములనుజూడకుండ నుండలేక వారిని అంతఃపురమునకు భిక్షకు ఆహ్వానించిరి. ఇట్లు వారము దినములు గడచిన పిదప, ఒకనాఁడు రాజపుత్త్రులు కృష్ణవిగ్రహములను అంతిపురమున నుంచి బైటకుఁ బోయిరి. ఇఁక నొకగడియ యైనతరువాత రాజు "కొమార్తెల అంతిపురమున పరపురుషులను బ్రవేశింపనీయరాదు" అని యాజ్ఞాపించెను. అది విని రాజపుత్త్రులు తమ కృష్ణవిగ్రహములను బంపవలసినదని రాజపుత్త్రికలకు వర్తమానము చేసిరి; కాని వారు "మేము వానిని విడిచి యుండఁజాలము" అని ప్రత్యుత్తర మంపిరి. అది విని రాజపుత్త్రులు ఆ విగ్రహములను విడిచి యుండఁజాలక కృష్ణునిఁ దలంచి విచారించుచుండఁగా, "వత్సలారా! మీకు విచారము వలదు. నేను కొన్నిదినములు రాజపుత్త్రికలను తృప్తిపఱిచి, మఱల మీచెంతకు వచ్చెద" నని ఆకాశవాణి వినఁబడెను. అది విని వారు ఊరడిల్లిరి.

నాఁటిరాత్త్రి శ్రీకృష్ణుఁడు ఆపట్టణపురాజు స్వప్నమున సాక్షాత్కరించి, "వత్సా! నీకొమార్తలు భక్తిజ్ఞానవైరాగ్యబంధురలైయున్నారు. వారికిఁ దగిన వరులు నీ యుద్యానవనమున ఉన్నారు. తొలుత నీవు నీభార్యతోడను నీపుత్త్రికలతోడను ఆతని గురువువలన ఉపదేశమును బొంది, పిదప నీకొమార్తలను వారికిచ్చి పెండ్లి చేయుము" అని యానతిచ్చెను.

మఱునాఁడు రాజు రాజపుత్త్రులను బరీక్షింపఁ దలఁచి "ఇచ్చటికి మీరు ఏల వచ్చితిరి? నేను ఎవఁడను" అని యడిగెను. అందులకు వారు ఇట్లు చెప్పిరి. "ఓయీ! నీవు అడుగఁ దగినది అడిగితివి. "నీవు నేను" అను పేరులు ఆత్మలకే గాని శరీరములకుఁ జెందవు; కావున నీవు రాజవు కావు. భగవంతుని అనంతాంశములలో ఒకఅంశమవు" ఇది విని యాతఁడు పరమానందభరితుఁడై, 'నాకు జ్ఞానమును ఉపదేశింపుఁడు" అని కోరెను. అందులకు "మాయాచార్యుని ఆశ్రయింపుము"అని వారు బదులు చెప్పిరి. రాజు భార్యతోడను పుత్త్రికలతోడను గూడి, ఆరాజపుత్త్రులవెంట వారి గురువుచెంతకుఁ బోయి ఆశ్రయించెను. ఆచార్యుఁడు వారి భక్తికి మెచ్చి అందఱకును శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి, "నీకొమార్తలను ఈరాజపుత్త్రులకు ఇమ్ము" అని నియమించెను.

ఆరాజు ఆచార్యానుమతిని తనకొమార్తలను ఆరాజపుత్త్రులకు ఇచ్చి వివాహముచేసెను. బాలభక్తుల తలిదండ్రులును ఉత్తమోత్తములును సంగవర్జితులై శ్రీకృష్ణునిఁ బూజించి, అవసానమున శ్రీహరి సాయుజ్యమును బడసిరి. శ్రీమంతుఁడు రాజుగను లక్ష్మీకాంతుఁడు యువరాజుగను కొంతకాలము ధరాపాలనము చేసి భగవద్భాగవతులను అర్చించి, వారుగూడ అవసానమున శ్రీహరిసాయుజ్యమునుబడసిరి.

ఉ. "సారము కంసవైరిపదసారసచారుతరార్చనంబు సం
సారమునందు నిందుధరసన్నుతి గాఢతమాంధకార ని
స్తారము పీనికిం దగినసద్గురుసేవయ కారణంబుగా
కారయ నింతకంటెను శుభావహమైన విశేష మున్నదే." (కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 80.)

# 81. సురదాసు

శ్లో. "కరకమలదళదళితలలితతరవంశీ, కలనినదగళదమృతఘనసరసి దేవే,
సహజరసభరభరితదరహాసితవీథీ, సతతవహదధరమణిమధురిమణి లీనే."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. శ్లో. 52.)

మధురాపురమున సురదాసుఁడను నొకభాగవతోత్తముఁడు ఉండెను. ఆతఁడు జాత్యంధుఁడు. అయినను వగవక సదా భగవంతుని స్మరించుచు, "శ్రీహరీ! నాకు అంధత్వము ప్రాప్తించినదని విచారింపను. మనోమోహములగు ప్రాపంచిక వృత్తములను అరసి చెడిపోకుండుటకు ఈయంధత్వమే నాకు మంచిదైనది" అని యాతఁడు సంతోషించుచుండును.

ఒకనాఁడు ఆతఁడు ఒకని సాయంబున దేవాలయమునకుఁ బోయి స్వామి యెదుట నిలిచి:—

శా. "బాలుర్ మోహనవేషలీలు మురళీపాండిత్యశీలుర్ దయా
లోలుర్ సాంద్రఘనాఘనావళివినీలుర్ గోపకన్యానుత
శ్రీలావణ్యవయోవిలాలు నవనీరేజాయతాక్షి ప్రభా
జాలుర్ సర్వకళాలవాలు నతివాంఛం గొల్తు నావెన్నునిన్.

శా. ఎందే నెవ్వనిమాళిఁ గాంచి గుహవాజీంద్రంబు వర్తించు నా
నెందే నెవ్వనియానరీతి హరిమత్తేభంబు గాంక్షించుఁ దా
నెందే నెవ్వని మంద మూర్కొనుచు భూతేశాశ్వముం బొంగునా
బృందారణ్యసురద్రుసాంద్రువని నాకృష్ణుఁ మదిర్ గొల్చెదన్."

(కృష్ణకర్ణామృతము ఆ. 3. ప. 14-16.)

అని రాలు కలుగునట్లు పాడి శ్రీకృష్ణుని వినుతించెను. అంతట శ్రీకృష్ణుఁడు అతనికి దృష్టి నిచ్చి, దివ్యమంగళవిగ్రహుఁడై ఎదుట సాక్షాత్కరించెను. తోడనే సురదాసుఁడు ప్రదక్షిణము చేసి, శ్రీహరి పాదములమీఁద వ్రాలి బాష్పోదకముచే పాదములను గడిగి, "రుక్మిణీకాంతా! ఆదిమధ్యాంతరహితుఁడగు నీలీలలు అనంతములు. అవాఙ్మానస గోచరంబులు అంతటను నిండియున్న నిన్ను గ్రహింపలేక లోకమంతయు నీమాయయందుఁ గూలిపోవుచున్నది. నీయనుగ్రహమువలననే నాకు నీయెడల భక్తి కుదిరినది. అంతకును నీవే మూలమవు. అనంతా! నాకు దృష్టినిచ్చి నీవిరాడ్రూపమును జూచిన ఈకండ్లకు నన్యపదార్థమును చూచుటకు నాకు ఇష్టము లేదు. కావున మఱల యథాపూర్వముగ నాదృష్టిని దగ్గించివేయుము" అని

ప్రార్థించెను. తోడనే శ్రీకృష్ణుఁ డంతర్హితుఁడయ్యెను. సురదాసుని చూపుగూడ బోయెను. మఱల నాతఁడు వెంటవచ్చిన మనుష్యునిసాయంబున నింటికిఁ బోయెను.

సురదాసుఁడు అనేకకీర్తనములను రచించి, అనేకులకుఁ జెప్పెను. ఆకీర్తనములయందు భక్తిరసము పొంగిపొరలిపోవుచుండును. అనేకగాయకులు ఆపాటల యందలి పాండిత్యమును జూచి అబ్బురపడుచుందురు.

ఆదేశమునేలు రాజు ఆస్థానమున గంధర్వులకుఁగూడ శృంగభంగము సేయఁగల గాయకులు అనేకులు కలరు. ఆరాజు తఱుచు గానసభలను జేయించి, సంగీతమును విని యానందించుచుండును. ఆవిద్వాంసులలో నొకఁడు పాడిన నల్ల రాళ్లు కరఁగిపోవును. ఆతని పాట విని రాజు ఒకనాఁడు "విద్వాంసుఁడా! నేను అనేకగాయకుల గానమును విని యున్నాను; కాని నీయంత సమర్థుని జూచి యెఱుఁగను" అని కొనియాడెను.

అందులకు ఆతఁడు "ప్రభూ! మన్నింపవలయును. మధురాపురమున సురదాసుఁడు అను నొకభాగవతోత్తముఁడు గలఁడు. ఆతఁడు పాడిన మోడులు చిగురించును. శిలలు కఱఁగును. ఆకీర్తనలు విన్నవారికి హరిభక్తియొదవి, మోక్షము కరతలామలక మగును" అని విన్నవించెను. రాజు "అయినచో ఆతని గానమును వినవలయును" అని తలంచి, మంత్రిని గాయకులను బంపి ఆతని రప్పించి, దేవిడీ వద్దకు వచ్చినతరువాత ఎదురేఁగి సగౌరవముగఁ గొనివచ్చి, అర్ఘ్యాసనమిచ్చి "మహానుభావా! తమకీర్తిని విని ముగ్ధుఁడనై యున్నాను. తమవలన శ్రీహరికీర్తనములను విని తరింపఁ గోరుచున్నాను." అని కోరెను. సురదాసుఁడు వల్లెయని సంగీతము ప్రారంభించెను. తోడనే శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి తాండవము ప్రారంభించెను. అందఱును అబ్బురపడి చూచుచుండఁగా, సురదాసుఁడు పాటఁ జాలించెను. శ్రీకృష్ణుఁడు అంతర్హితుఁడు అయ్యెను. రాజు సురదాసుని జాలఁ బూజించెను. రాణి "మేము ఈతనివలన సంగీతము వినఁ గోరుచున్నాము" అని ప్రార్థించెను. రాజు అంగీకరించి భాగవతుని రాణివాసమునకుఁ బంపెను. అచ్చట నాతఁడు పాడుచుండఁగా, సత్యభామ సాక్షాత్కరించి పాట వినసాగెను. తోడనే సురదాసునకుఁ జూపువచ్చెను. ఆతఁడు సత్యను పొగడఁదొడఁగెను. ఇది యిట్లు జరుగుచుండఁగా, శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి సత్యభామను సురదాసుని దనలో నైక్యము జేసికొని అంతర్హితుఁ డయ్యెను.

చ. 'లలితకరాంగుళీదళదళన్మురళీమధురస్వరామృతో
జ్జ్వలసరసీ మనోజ్ఞసహాజస్మితకందళచంద్రచంద్రికా
వలదరుణాధరోష్ఠమధువాసితచారుముఖాంబుజంబునన్
దొలఁగక నాదుమానసమధువ్రత మియ్యెడ లీన మయ్యెడున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 52.)

# 82. కమలాకరుఁడు.

చ. "వలదు పరాకు భక్తజనవత్సల నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు వజ్రమువంటిది కావ కూరకే
వలదు పరాకు నాదురితవార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతుమె కా నిరంతరము దాశరథీ కరుణాపయోనిధీ." (దాశరథీశతకము. ప. 57.)

పండరిపురమున కమలాకరుఁడు అను ఒకభక్తుఁడు ఉండెను. ఆతనికి భగవద్భాగవతారాధన మనిన చాల ఆనందము. ఆతనిభార్యపేరు సుమతి. ఆతనికి పద్మాకరుఁడు అను ఐదేండ్ల కుమారుఁడు గలఁడు. వారు గూడ కమలాకరునివలెనే భగవద్భాగవతసేవాధురంధరులు. సంతత హరినామస్మరణపరాయణులు.

యథాపూర్వముగ కమలాకరుఁడు ఒకనాఁడు పద్మాకరునితోఁ గూడ చంద్రభాగానదికిఁ బోయి స్నానసంధ్యాద్యనుష్ఠానము లన్నియుఁ దీర్చుకొనివచ్చి, భిక్షాటనమునిమిత్తము ఊరిలోనికి బయలుదేఱెను. ఒకచోట భాగవతాగ్రేసరులగు నివృత్తిదేవుఁడు, జ్ఞానదేవుఁడు, సోపానదేవుఁడు, ముక్తాబాయి, నామదేవుఁడు, గోరాకుంభారు, రాకాకుంభారు, కుపాకుంభారు, చోకామేళుఁడు, కబీరుదాసు మున్నగువారు కూర్చుండి భగవద్భజనము చేసికొనుచుండిరి. కమలాకరుఁడు వారినిఁ జూచి సాష్టాంగవందనములు ఆచరించి, వినుతించి "మహానుభావులారా! నాపూర్వార్జితపుణ్యమువలన మిమ్ము సందర్శింపఁ గలిగితిని. నేఁడు నాయొక్కయు, నాకుమారునియొక్కయు జన్మములు సార్థకములైనవి. స్వాములవారు కరుణించి మాయింటిని, నాభార్యజన్మమును పవిత్రములు చేయవలయును" అని ప్రార్థించెను. అది విని నామదేవుఁడు "మీభక్తికి ఆనందము. మీయాదరము మాకు ఆనందము గొల్పినది. మేము సంఖ్యలో అధికులమై యున్నాము. మాకు ఆతిథ్యము ఇచ్చుట కష్టము" అని మాఱు పలికెను. స్వాములు అందులకు సందేహింపఁ బని లేదు. పండరినాథుఁడును రుక్మిణియు నాకుఁ దలిదండ్రులై యున్నారు. వారి యనుగ్రహము ఉన్నన్నిదినములు నాకు ఏలోపమును లేదు; కావున ఈదాసునిఁ గరుణింపవలయును" అని కమలాకరుఁడు మఱలఁ బ్రార్థింపఁగా, జ్ఞానదేవాదులు మాఱుపలుకఁజాలక "అట్లే వచ్చెదము. మీరు ముందు నడువుఁడు" అని చెప్పిరి.

కమలాకరుఁడు వెంటనే ఇంటికిఁ బోయి సంగతియంతయు సుమతికి ఎఱిఁగించెను. తోడనే ఆమె పొరుగుఇంటికిఁ బోయి కావలసినపదార్థములు అన్నియు అప్పుతెచ్చి, పాకము చేయుట ప్రారంభించెను; కాని వంటకట్టెలు తక్కువ అయ్యెను. అంతట సుమతి కుమారుని బిలిచి "నాయనా! పిడుకలు గొనిరమ్ము" అని పంపెను. ఆ[illegible]డు పిడుకలు విప్పునపుడు నల్లత్రాఁచు కఱచుటవలన ఎలుఁగెత్తి ఏడ్చుచుఁ బడి

పోయెను. ఆరోదనధ్వని విని సుమతి పరుగుపరుగునఁ బోయి, స్థితిగతులు అన్నియుఁ దెలిసికొని ఒక నిముసము విచారించి, భాగవతార్చనము చేయవలసియుండుటచే ఆవిచారమును ఎట్లో దిగమ్రింగుకొని బాలుని కళేబరమును దెచ్చి ఇంటిలో నొకమూల నుంచి, చంద్రభాగానదికిఁ బోయి మఱల స్నానము చేసి, వచ్చి వంటఁ బూర్తిచేసెను.

ఇంతలోఁ గమలాకరుఁడు భాగవతులను గొనివచ్చి సమస్తమును సిద్ధముగా నుండుటచే వారికి అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి, పాదోదకమును స్వీకరించి వదార్థములు వడ్డించిన తరువాత "భుజింపవలయును" అని ప్రార్థించెను. నామదేవుఁడు యథాపూర్వముగ శ్రీకృష్ణుని స్మరించెను; కాని తలఁచునపుడెల్ల సాక్షాత్కరించు శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరింపఁడయ్యెను. నామదేవుఁడు మఱల స్మరించెను; ధ్యానించెను; ప్రార్థించెను. ఎలుఁగెత్తి యాహ్వానించెను; కాని ఎంతచేసినను ప్రయోజనము కలుగలేదు. అందులకు ఆశ్చర్యచకితుఁడై ఆతఁడు దివ్యదృష్టిం జూచి సకలమును గ్రహించి, కమలాకరునిం జూచి "భాగవతాగ్రేసరా! మీకుమారుని ఇందాక చూచితిని. ఆతఁడును భాగవతాగ్రేసరుఁడై యున్నాఁడు; గావున భుజించుటకు ఆతనింగూడఁ గొనిరమ్ము" అని పలికెను. అందులకు కమలాకరుఁడు ప్రత్యుత్తరము చెప్పక పూర్వమే సుమతి "మహాత్ములారా! బిడ్డఁడు ఇపుడే నిద్రించినాఁడు. తమరు ప్రసాదమును స్వీకరింపుఁడు. నిద్రమేల్కాంచిన తరువాత ఆతనికి అన్నముఁ బెట్టెదను" అని బదులు చెప్పెను. "తల్లీ! అట్లుగాదు. లేపి దీసికొనిరమ్ము" అని జ్ఞానదేవుఁడుమఱల చెప్పెను. సుమతి లోనికిఁ బోయి వచ్చి "మహానుభావా! ఆతనికి గాఢ నిద్రపట్టినది. ఎంతలేపినను లేచుటలేదు" అని బదులు పలికెను. మఱల నామదేవుఁడు పాండురంగనిఁ బ్రార్థించెను. తోడనే శ్రీహరి ప్రత్యక్షమై, "నీయభిప్రాయమే" మని యడిగెను. "కమలాకరుని కుమారుఁడు మాతో భుజింపవలయును" అని జ్ఞానదేవుఁడు ప్రార్థించెను. "అట్లె యగును" అని పాండురంగఁడు తిరోహితుఁ డయ్యెను.

ఇంతలో పద్మాకరుఁడు నిద్రితునివలె లేచి కూర్చుండి, "అమ్మా! మంచినీళ్లు కావలయును" అని కేకవేసెను. తోడనే సుమతి మహానందభరితయై, పరుగెత్తి కొనిపోయి ఎత్తుకొని వచ్చి దాహమిచ్చి, భాగవతాగ్రేసరుల పాదములమీఁద వ్రాలించి, సాష్టాంగదండములు చేయించెను. జ్ఞానదేవాది భాగవతులు చాల నానందించి పద్మాకరుని దీవించిరి. అపుడు నామదేవుఁడు భాగవతులకు అందఱకును జరిగిన సంగతియంతయు నెఱింగించి "సుమతీదేవియు, కమలాకరుఁడును, పద్మాకరుఁడును శ్రీహరి అంతరంగ భక్తశిఖామణులు. వారి యాతిథ్యమును స్వీకరించుటవలన మనము నేఁడు తరించితిమి. శ్రీహరి మనయెడల నిఁకఁ బరిపూర్ణకరుణాలవాలుఁ డగును". అని చెప్పెను. భాగవతులు అందఱును హర్షించిరి. కమలాకరుఁడును, సుమతియు, పద్మాకరుఁడును భాగవతులకు అనేక సాష్టాంగవందనములు అర్పించిరి. జ్ఞానదేవుఁడు

ఆముప్పునకును శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి పూజావిధానములు ఎఱింగించి, భాగవతులతోఁగూడి వెడలిపోయెను.

మఱియొకనాఁడు కమలాకరుఁడు కుమారుని వెంట నిడుకొని భిక్షాటనమునకు బయలు వెడలెను. ఈసమయమున పాండురంగఁడు వృద్ధబ్రాహ్మణ వేషముతో వచ్చి సుమతీ దేవినిఁ జూచి "తల్లీ! నన్ను ఆఁకలి దహించివేయుచున్నది. తాళఁజాలను" అని కూలఁబడెను. సుమతీదేవి వెంటనే పొరుగింటికిఁ బోయి పదార్థములను దెచ్చి, అతిశీఘ్రముగా పాకముచేసి ఆతనికిఁ బెట్టెను. భోజనము చేసిన వెంటనే వృద్ధుఁడు ఆయాసముతోఁ బండుకొనెను. సుమతీదేవి చెంతఁ గూరుచుండి కాళ్లుపట్ట సాగెను. ఇంతలో కమలాకరుఁడు ఇంటికి వచ్చెను. సుమతి సంగతియంతయు నెఱింగింపఁగా, కమలాకరుఁడు వంటచేయుటకు సుమతిని ఇంటిలోనికిఁ బంపివేసి, తాను వృద్ధునకు సేవఁజేయఁ దొడంగెను. వంట శీఘ్రముగనే ముగిసెను. గాని మేల్కాంచు నందాఁక నీతనిపాదములను ఒత్తవలె నని కమలాకరుఁడు నిశ్చయించుకొనెను. తుదకు వృద్ధుఁడు లేచునప్పటికి రెండు జాములరాత్రి యయ్యెను. అప్పటివఱకును గూడ ఇంటివారు భుజింపకుండఁ దన్ను సేవించుచుండుటం జూచి ఆతఁడు నిజరూపముతో సాక్షాత్కరించి అభయమిచ్చెను. కమలాకరుఁడును, సుమతియు, పద్మాకరుఁడును బ్రతికియున్నంతకాలమును భగవద్భాగవతారాధనము గావించి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసిరి.

చ. "చిరతరభక్తి నొక్క తులసీదళ మర్పణసేయువాఁడు ఖే
చర గరుడోరగప్రముఖసంఘములో వెలుఁగున్ సదా భవ
త్స్ఫురదరవిందపాదములఁ బూజ లొనర్చినవారికెల్లఁ ద
త్పర మరచేతిధాత్రి గద దాశరథీ కరుణాపయోనిధీ." (దాశరథీశతకము. ప. 35.)

# 83. జంబుదాసు

శ్లో. "పశుపాలబాలపరిషద్విభూషణం, శిశురేష శీతలవిలోలలోచనః,
మృదులస్మితార్ద్రవదనేందుసంపదా, మదయన్మదీయహృదయం విగాహతే."
(కృష్ణకర్ణామృతము. ఆ. 1. శ్లో. 71.)

ఒకగ్రామమున జంబుదాసు అను నొక పంటకాపు ఉండెను. అతఁడు శాంతముగ వ్యవసాయము చేసికొని జీవయాత్ర గడుపుకొనుచు, సదా శ్రీహరినామస్మరణ తత్పరుఁడై యుండును. భగవద్భాగవతార్చన మనిన నాతనికి మహానందము. పొలములోఁ బనిచేసికొనుట, ఊరిలోనికి వచ్చి భాగవతాగ్రేసరులను సేవించుట తక్క నాతఁడు అన్య మెఱుఁగఁడు.

ఒకనాఁటిరాత్రి దొంగలు వచ్చి అతని పసులకొట్టములో నున్న రెండు ఎడ్లను దోలుకొని పోయిరి. అది చూచి శ్రీహరి "నాభక్తుఁడు ఎడ్లులేమిఁ దున్నుకొనుటకుఁ జాలఁ జిక్కుపడును" అని తలంచి, వెంటనే వెనుకటి ఎడ్లను బోలిన రెండు ఎడ్లను నిర్మించి కొట్టమునఁ గట్టివేసి వానిముందు గడ్డివేసి పోయెను. మఱునాఁడు ప్రాతఃకాలము ఇదియేమియు నెఱుఁగని జంబుదాసు కొట్టములో నున్న పశువులను విప్పి పొలమునకుఁ దోలుకొనిపోయి యథాప్రకారముగ దున్నుకొనెను. అది చూచి దొంగలు "నిన్నటిరాత్రియేగదా మనము ఈతని యెడ్లను దొంగలించుకొని పోయితిమి! మనలను వంచించి మఱల నీతఁడు తన యెడ్లను దోలుకొనిపోయెనా యేమి? ఈయెడ్లు మనము తోలుకొనిపోయినవే. ఏమియు సందేహము లేదు" అనుకొని వెంటనే ఇంటికిఁ బోయి చూడఁగా, రాత్రి దొంగలించికొనివచ్చినయెడ్లు కట్టు కంబములవద్ద యథేచ్ఛగ మేయుచుండెను. అందులకు వాండ్రు పరమాశ్చర్యచకితులై "ఈయెడ్లు వేఱు, ఆయెడ్లు వేఱు. వానినిఁ గూడ నేఁటిరాత్రి దొంగిలింతము" అని నిశ్చయము చేసికొనిరి. అనుకొనిన ప్రకారము వారు ఆరాత్రి ఆయెడ్లనుగూడ దొంగలించుకొనిపోయిరి. శ్రీహరి యథాపూర్వముగ జంబుదాసు పసులకొట్టములో ఎడ్లను సృజించి, కట్టివేసి వెడలిపోయెను.

మఱునాఁడు జంబుదాసు యథాప్రకారముగ ఎడ్లను దోలుకొనిపోయి దున్న సాగెను. చోరులు చూచి మఱలఁ దెల్లవోయి ఇంటికిఁ బోయి చూడఁగా, రెండు కాళ్లయెడ్లును మేయుచునే యుండెను. నాఁటిరాత్రి మఱల జంబుదాసు ఇంటనున్న ఎడ్లనుగూడఁ దోలుకొని పోయిరి. ఇట్లు ఎన్నిమారులు చేసినను, జంబుదాసు పసుల కొట్టములో రెండు ఎడ్లును ఉండుచునే వచ్చెను. అది చూచి దొంగలు ఏమియు అర్థముగాక, చాలసేపు ఆలోచించి జంబుదాసు శ్రీహరిస్మరణ సేయుటఁ జూచి "ఇది వేషమని మనము తలంచితిమి; కాని శ్రీహరి అతనికిఁ బ్రత్యక్షదైవమని తోఁచు చున్నది. శ్రీహరిపనిగాకున్న ఇట్లేల సంభవించును" అని నిశ్చయించుకొని, జంబు దాసు నింటికిఁ బోయి అతని పాదములమీఁద వ్రాలి జరిగిన దంతయు నెఱింగించి, క్షమింపఁ బ్రార్థించిరి. ఆమాటలను విని జంబుదాసు కొంతతడవు నిశ్చేష్టుఁడై, తుదకు "శ్రీహరీ! గోపాలకృష్ణా! నానిమిత్తము నీవు ఎంతశ్రమ నొందితివి? ఈతుచ్ఛుని మీఁది అనుగ్రహము వలన ప్రతిదినమును అర్ధరాత్రి అసహ్యమగు పసులకొట్టములోఁ జొచ్చి ఎంతబాధపడితివోగదా! ముకుందా! మురమర్దనా! నాకొట్టములో ఎప్పటికప్పుడు క్రొత్తపశువులను నిర్మించుటకు దొంగలమీఁది యనుగ్రహము గూడఁ గారణము గదా! అయినచో వారికి చౌర్యబుద్ధినే లేకుండఁ జేయక ఏల దానిని దోహద మొనరించితివి? నీమాయలు ఎవరికి ఎఱుక? నిన్నుఁ దెలియ నెవనికి శక్యము?" అని అనేకవిధముల శ్రీహరిగుణకీర్తనము సేయసాగెను.

అంతట శ్రీహరి దివ్యమంగళవిగ్రహముతో సాక్షాత్కరించెను. తోడనే జంబుదాసు ప్రదక్షిణ నమస్కారము లాచరించి, "శ్రీహరీ!అక్రూరవరదా! నీవు అంతటను నిండియున్నావు. నీకుఁ దెలియనిది లేదు. ఆనందాతిరేకముచే నాకంఠము రుద్ధమగుచున్నది. నీగుణములఁ గీర్తింపఁజాలకున్నాను. అయినను నాహృదయము నీకుఁ దెలియనిది కాదు" అని యూరకుండెను. శ్రీహరి అందులకుఁ బరమానందభరితుఁడై, జంబుదాసునిఁ గౌఁగిలించుకొని "వత్సా! నీభక్తిజ్ఞానవైరాగ్యములకు మెచ్చితిని. నీవు నాయంతరంగభక్తులలో నగ్రేసరుఁడవు. నీకు కావలసినవరము వేఁడుము" అని యానతిచ్చెను.

అందులకు జంబుదాసు చేతులు జోడించుకొని మోకరించి నిలిచి, "నారాయణా! మునిజనదుర్లభమగు నీదర్శన మొసంగి నన్ను చేపట్టితివి. ఇంతకంటె నేను కోరఁదగినది ఏమున్నది? అయినను నీవిశ్వరూపము సర్వకాల సర్వావస్థలయందును నాచూపులకు లక్ష్యమైయుండునట్లు అనుగ్రహింపుము" అని ప్రార్థించెను. భగవంతుఁడు వల్లె యని తిరోహితుఁడయ్యెను. ఇదియంతయుఁ జూచుచున్న దొంగలు తటాలున జంబుదాసు పాదములపైఁబడి, "మహాత్మా! నీప్రభావము ఎఱుంగఁజాలక పోయితిమి. మమ్ము రక్షింపవలయును" అని ప్రాధేయపడిరి. జంబుదాసు వారిని ఆదరముతో లేవనెత్తి తత్త్వము నెఱింగించి, శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి పూజావిధానమునుఁ దెలిపి, భగవన్నివేదితాన్నముతో సంతృప్తులం గావించి పంపివేసెను. వారు తఱచు వచ్చి గురుదర్శనము చేసికొనిపోవుచుండిరి. జంబుదాసుఁడును, దొంగలును గూడ బ్రతికియున్నంతకాలమును త్రికరణశుద్ధిగా గోభగవద్భాగవతుల నర్చించి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసిరి.

**చ. "వికవికనవ్వుచున్ నుదుట వ్రేలుకురుల్ నునుపాలబుగ్గలుం**
**జికిలిమెఱుంగుచూపు రహిఁ జెందఁగ నాననశీతలద్యుతిం**
**బ్రకటితగోపబాలకసభానవభూషణమై చెలంగు బా**
**లకుఁడు మదీయమానసతలంబున నిల్చెను సొంపు నించుచున్."**

(కృష్ణకర్ణామృతము. ఆ. 1. ప. 71.)



సుందరమూర్తినాయనారు—475.



# శ్రీ మహాభక్తవిజయము

## ద్వితీయభాగము

### శివభక్తులు

## 84. సుందరమూర్తినాయనారు

దక్షిణదేశమున తిరునావలూరు అను దివ్యక్షేత్రమున శడయనాయనారు అను ఒక ఆదిశైవుఁడు ఉండెను. అతని భార్యపేరు ఇశైజ్ఞానమ్మ. వీరువురును యుక్త మార్గమున కాలము గడపుచుండిరి. కొన్నిదినములకు జ్ఞానమ్మ గర్భవతియై నవమాసములు మోసి, ఒక శుభముహూర్తమున కుమారునిఁ గనియెను. పిదప ఆదంపతులు కుమారుని మిగుల గారాబముతోఁ బెంచుకొనుచు, సుందరమూర్తినాయనారు అని నామకరణము చేసిరి; కాని ఆబాలుని ఊరివారందఱును "నంబియారూరి వారు" అని పిలుచుచుండిరి.

ఒకనాఁడు సుందరమూర్తి వీథిలో నాడుకొనుచుండఁగా, ఆనగరమును ఏలు నరసింగనాయనారు అనురాజు ఆబాలునిఁ జూచి ప్రేమించి ఆతని తండ్రినిఁ బిలిచి "ఈతనిఁ జూచిన నాకు ఆనందముగా నున్నది. కొన్నిదినములు ఈతనిని నా చెంత నుంచుకొందును" అనియెను. శడయనాయనారు వ్యతిరేకము చెప్పలేక వల్లె యనఁగా రాజు సుందరమూర్తిని గొనిపోయెను. రాజుగారి ఇంటికిఁ బోయినను సుందరమూర్తి బ్రాహ్మణధర్మమును విడువక వేదవేదాంగముల నభ్యసించి మహా పండితుఁడై, కొన్నిదినములకు యువకుఁడై వివాహయోగ్యుఁ డయ్యెను.

శడయనాయనారు కుమారునకు వివాహకాలము సమీపించినదని ఎఱింగి, పుత్తూరు అనుగ్రామమున ఒక్కచక్కని కన్యను కుదిర్చి, ముహూర్తకాలమున పెండ్లికొడుకగు సుందరమూర్తి నలంకరించి సబంధుమిత్రుఁడై పుత్తూరునకు తరలి వెళ్లెను. అచ్చట పెండ్లికొమార్త తండ్రియగు షడంగవిశ్వాచారి వారిని ఎదుర్కొని సగౌరవముగ నూరిలోనికిఁ గొనిపోయి, చక్కని ఇంట విడియించెను.

పెండ్లివారు అందఱును సకల సన్నాహములను జేసికొనుచుండఁగా, నొక వృద్ధబ్రాహ్మణుఁడు వచ్చి సుందరమూర్తినిఁ జూచి "నీకును నాకును ఒక వివాదము ఉన్నది. దానినిఁ దీర్చినఁగాని నీవు పెండ్లి చేసికొనఁగూడ" దని పలికెను. అది విని అందఱును ఆశ్చర్యపడిరి. "బ్రాహ్మణుఁడు బ్రాహ్మణునకు సేవకుఁడు అగుట ఏయుగమునందైనను గలదా?" యని సుందరమూర్తి యడిగెను. "అదియంతయు నాకుఁ దెలియదు. నీతాత తనవంశపరంపరగా నాకు సేవచేయుటకు అంగీకరించి వ్రాసియిచ్చిన పత్రము నావద్దనున్నది. నీవు సేవచేసి తీరవలెను" అని వృద్ధుఁడు పట్టుపట్టెను. సుందరమూర్తి పత్రము చూపుమనఁగా వృద్ధుఁడు "చీటి చూపిన ఒప్పుకొందువా? వీరు అందఱును తగవుచెప్పవలయునా?" అని మఱల నడిగెను. సుందరమూర్తి అందులకు జవాబు చెప్పకయే చీటి లాగికొనుటకుఁ బ్రయత్నముచేయఁగా వృద్ధుఁడు "అన్యాయము, అన్యాయము" అని పాఱిపోఁ దొడఁగెను. సుందరమూర్తి వెంటఁబడెను.

కొంతదూరము పోవునప్పటికి వృద్ధుఁడు ఆయాసమువలన ఆఁగిపోయెను. వెంటనే సుందరమూర్తి బలవంతమున ఆతని చేతనున్న చీటిని గుంజుకొని "బ్రాహ్మణునకు సేవచేయుట ఏటి న్యాయము?" అని దానిని చించివేసెను. అంత 'ఈఅన్యాయము చూడుఁడు' అని వృద్ధుఁడు బొబ్బలుపెట్టగా, పదుగురు బ్రాహ్మణులు వచ్చి అభయమిచ్చి సంగతియంతయు విని, "నీ వెచ్చటివాఁడవు" అని యడిగిరి. నానివాసము తిరువెణ్ణైనల్లూరు అని వృద్ధుఁడు చెప్పెను. ఈతగవు అక్కడనే తీర్చుకొందమని సుందరమూర్తి చెప్పెను. అందఱును బయలుదేఱిరి.

తిరువెణ్ణైనల్లూరున బ్రాహ్మణులు అందఱును సమావేశమై ఈవిషయమున విచారణ ప్రారంభించి, "సుందరమూర్తి కాగితము చింపివేసె ననుటవలన ప్రయోజనములేదు. బ్రాహ్మణునకు బ్రాహ్మణుఁడు దాస్యముచేయుట లోకవిరుద్ధము. కావున నీవు ఇప్పుడు నీవాదమునకు ఏమయిన ఆధారములు ఉన్నచోఁ జూపవలయును" అని వృద్ధునిఁ గోరిరి. వృద్ధుఁడు మఱలఁ గాగితమును జూపెను. అందు ఇట్లు ఉండెను. "తిరునావలూరున ఉండు ఆదిశైవుఁడగు ఆరూరాఖ్యుఁడు అను నేను తిరువెణ్ణైనల్లూరున ఉండుపిచ్చివాని వంశపారంపర్యముగ దాస్యము చేయుటకు త్రికరణశుద్ధిగా నంగీకరించి ఈపత్రము వ్రాసియిచ్చుటయైనది." ఇది చదివి,వారందఱును "ఇది లోకధర్మమునకు కేవలము వ్యతిరేకముగ నున్నను పత్రము పుట్టియున్నది. కావున ఇది తప్పదు. సుందరమూర్తి వృద్ధునకు సేవచేయవలెను" అనిరి. సుందరమూర్తి అంగీకరించెను. అప్పుడు బ్రాహ్మణులలో నొకఁడు "అయ్యా! మీ దీగ్రామమే యని చెప్పుచున్నారు. మిమ్ము ఇచ్చటఁ జూచినవారు ఎవరును లేరు. మీవృత్తాంతము ఏమో

చెప్పుఁడు” అనియెను. అందఱును అవునని. వృద్ధుఁడు “నాయింటికి రండు. చెప్పెద” నని ముందు దారి తీసెను. అందఱును బయలుదేరిరి. వృద్ధుఁడు శివాలయము సమీపించి “ఇదే నాయిల్లు” అని అందుఁ బ్రవేశించి మాయమయ్యెను. అందఱును ఆశ్చర్యచకితులై నిశ్చేష్టులైరి. సుందరమూర్తి వెంటనే ఆలయముసొచ్చి అనేకవిధములఁ బ్రార్థింపఁగా, మహేశ్వరుఁడు పార్వతీసహితుఁడై నందివాహనారూఢుఁడై సాక్షాత్కరించి, “వత్సా! తొల్లి నీవు నాభక్తుఁడవు. నిన్ను రక్షించుటకు నేను ఇట్లుచేసితిని. ఇఁకమీఁద నీవు నామీఁద పద్యములు అల్లి పాడుము” అని నియమించి అంతర్హితుఁడయ్యెను. సుందరమూర్తి ఈశ్వరాజ్ఞ ప్రకారము పద్యములు ప్రారంభించెను. ఇట్లుండఁగా, చాలదినములు గడచిపోయెను. అచ్చట సుందరమూర్తికొఱకు నిశ్చయింపఁబడిన కన్యక సుందరమూర్తిమీఁదనే మది నిలిపి నిరుత్సాహమువలనను నిరాశవలనను శుష్కించి ఈశ్వరసాన్నిధ్యము చేరెను.

సుందరమూర్తి తిరునావలూరు తిరుత్తుఱైయూరు మొదలగు గ్రామములకుఁ బోయి అచ్చటచ్చట వెలసియున్న మహేశ్వరులను పద్యములతో వినుతించి, సిద్ధవటమునకుఁ బోయెను. అచ్చట తిరువడిపరమేశుని స్తుతించుట యైనతరువాత సుందరమూర్తికి గాఢనిద్ర వచ్చెను. అపుడు పరమేశ్వరుఁడు వృద్ధబ్రాహ్మణరూపముతో వచ్చి తనపాదములు సుందరమూర్తిశిరమునకుఁ దగులునట్లు పెట్టి శయనించెను. కొంతసేపటికి సుందరమూర్తి మేల్కాని, “బ్రాహ్మణుఁడా! నాశిరముపై నీ కాళ్లు పెట్టుట తగునా?” యనఁగా వృద్ధుఁడు “ఓయీ! వార్ధకమువలన నాకు కన్నులు సరిగఁ గాన్పింపవు” అని పలికెను. సుందరమూర్తి మఱియొకచోటికిఁబోయి శయనించెను. వృద్ధుఁడు తొల్లిటియట్లె చేసెను. మఱల సుందరమూర్తి మేల్కాంచి “మఱల నిదియేమి? బ్రాహ్మణుఁడా!” యనఁగా వృద్ధుఁడు “నన్నెఱుఁగవా” యని పలుకుచు తిరోహితుఁ డయ్యెను. అంతట సుందరమూర్తి లేచి కూరుచుండి, పరమశివుఁడే తన్ను అనుగ్రహించుటకు అట్లు వచ్చె నని తెలిసికొని చాల నొచ్చుకొని గతజలసేతుబంధనము వ్యర్థపని యని నిశ్చయించుకొని తిరువడి పరమేశుని పద్యలహరితో నభిషేకించి, అచ్చటనుండి తిరుమాణిక్కుళి, తీర్థనగరు, చిదంబరములకుఁ బోయి అచ్చటచ్చట వెలసియున్న మహేశ్వరులను అనేకపద్యములతో వినుతించెను.

ఇట్లుండఁగా, “నీవు కమలాలయమున నున్న నాయొద్దకు రావలయును” అను నొక అశరీరవాణి వినఁబడియెను. తోడనే సుందరమూర్తి బయలుదేఱి కొల్లడము అనఁబడు నదిని దాఁటి, జ్ఞానసంబంధమూర్తినాయనారు ఉద్భవించిన స్థలము గావున బ్రహ్మపురము ప్రవేశింపరాదని పొలిమేరలో నుండియే సాంబుని నుతించి

ఆస్వామి సాక్షాత్కరింపఁగా పద్యకుసుమములతోఁ బూజించి, అట కదలి తిరుక్కోలక్కా, తిరుప్పుకొళూరులకుఁ బోయి మహేశ్వరులను స్తుతించి, కావేరిలో స్నానమాడి మాయూరమునకును అంబర్మాగాళమునకును తిరుప్పుగలూరికిని బోయి కమలాలయమును సమీపించెను. కమలాలయమున వెలసియున్న వల్మీకనాథుఁడు "నా పరమభక్తుఁడైన సుందరమూర్తి వచ్చుచున్నాఁడు. మీరందఱును ఎదురుపోయి తోడుకొని రావలసిన" దని ఊరివారందఱకును జెప్పఁగా, వారును అట్లే చేసిరి.

సుందరమూర్తి మహావైభవముతో నూరిలోఁ బ్రవేశించి, యథావిధిగ వల్మీకనాథుని త్యాగేశ్వరుని దర్శించి పద్యములతో వినుతించెను. ఆయూరివారు అదిమొదలు సుందరమూర్తిని పరమశివునిగా భావించి పూజింపసాగిరి. సుందరమూర్తియు ప్రతిదినమును వల్మీకనాథుని దర్శించి సేవించుచుండెను. ఆగ్రామమున పరవయను నొకతరుణగణిక యుండెను. ఆమె పార్వతీదేవి పరిచారికలలో నొకతె. కమలిని యను పేరుగలది. అదియు ననుదినమును స్వామిని సేవింప వచ్చుచుండెడిది. ఒకనాఁడు సుందరమూర్తియు పరవయు స్వామిని సేవించుటకు ఒక్కనిముసమునందే వచ్చిరి. హఠాత్తుగా వారికి ఒకరిపై నొకరికి మోహోదయము అయ్యెను. పిదప సుందరమూర్తి పరవమీఁది హృదయమును ద్రిప్పికొనఁజాలక వేయికాళ్ల మండపమునఁ గూరుచుండి పరవను స్వాధీనము చేయుమని వల్మీకనాథుని గూర్చి తపస్సు ప్రారంభించెను. ఇంతలో సూర్యుఁడు అస్తమించెను.

పరవయు ఇంటికిఁబోయి సుందరమూర్తికొఱకు వేదనపడసాగెను. అప్పుడు వల్మీకనాథుఁడు ఊరివారందఱతోడను "రేపు ఉదయము పరవకును సుందరమూర్తికిని వివాహము చేయవలసిన" దని నియమించి, అట పరవచెంతకును ఇట సుందరమూర్తిచెంగటకును బోయి "మీకిరువురకును వివాహము అగు" నని చెప్పిపోయెను. ఊరివారు ఈశ్వరుని ఆదేశము చొప్పున సుందరమూర్తికిని పరవకును మహావైభవముతో వివాహము గావించిరి. సుందరమూర్తి పరవయింటికిఁ బోయి ఐహికసుఖసాగరమున ఈదులాడసాగెను.

ఒకనాఁడు సుందరమూర్తి పరవతోఁగూడ వల్మీకనాథుని సేవించుటకుఁ బోయెను. అపుడు ఆలయమున ఉన్న దేవాశ్రమమునఁ గల దేవాశ్రమము అను సహస్రస్తంభమంటపమున అనేకమందిభక్తులు కూరుచుండియుండిరి. వారినిఁజూచి సుందరమూర్తి "వీరిని ఎట్లు సేవింపఁగలుగుదును?" అని చింతించుచుండఁగా, వల్మీకనాథుఁడు ఆతనిభావవీథిని సాక్షాత్కరించి "పద్యములతో వీరిని వినుతింపుము నీయభీష్టము నెఱవేఱును." అని యానతిచ్చెను. సుందరమూర్తి వల్మీకనాథునివలన గురుపరంపర నెఱిఁగి ఆభక్తగణమును వినుతించెను.

గుండయూరు అను నొక గ్రామమున గుండయూరువారు అనునొక వెలమ యుండెను. ఆతఁడు సంపన్నుఁడు కావున పరవకును సుందరమూర్తికిని గావలసిన భోజనపదార్థములను బంపుచుండెను. ఇట్లుండఁగా, నొకసంవత్సరము పంటలు సరిగా పండవయ్యెను. అప్పుడు గుండయూరువారు "వ్రతము నెట్లు కొనసాగించు కొందును" అని విచారించుచుండఁగా, ఈశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "నీకు చింతవలదు. సుందరమూర్తికి బంపుటకు నీకుఁ గొఱవయుండదు" అని చెప్పిపోయెను. గుండయూరువారు తెల్లవాఱిన పిదప లేచిచూడఁగా, ధాన్యాదికములగు సకలభోజనపదార్థములును గుట్టలుగ పడియుండెను. ఆపదార్థములను సుందరమూర్తి యింటికిఁ జేర్చుటకుఁ దగినంతమంది కూలీలు దొరకుట కష్టమని భావించి, గుండయూరువారు సంగతియంతయు సుందరమూర్తి కెఱింగించెను. 'అంతయు ఈశ్వరుఁడే చేయును' అని సుందరమూర్తి చెప్పఁగా వెలమ ఇంటికిఁ బోయెను. మఱు నాఁడు ఉదయము లేచి చూచునప్పటికి సుందరమూర్తియిల్లువాకిండ్లును ఊరును గుండయూరివారియింటనుండిన పదార్థములతో నిండియుండెను. అందులకు పరవ ఆశ్చర్యచకితయై "ఎవరికిఁగావలసిన పదార్థములు వారు కొనిపోవచ్చును" అని యాజ్ఞాపించెను. ఊరివారందఱును మహానందముతో ఎవరికి కావలసినవి వారు తీసికొనిరి.

ఒకప్పుడు తిరునాట్యత్తాన్ గుడినుండి కోట్పులినాయనారు వచ్చి తనగ్రామమునకు రావలసిన దని ప్రార్థింపఁగా, సుందరమూర్తి బయలుదేరెను. కోట్పులినాయనారు మహావైభవముతో నెదురుకోలు సలిపి సుందరమూర్తిని దనగ్రామమునకుఁ గొనిపోయెను. అచ్చట కోట్పులినాయనారు యుక్తవయస్సున నున్న తన కొమార్తల నిరువురను బెండ్లియాడవలయు నని ప్రార్థింపఁగా అందులకు నిరాకరించి అక్కడనుండి తరువలివలయను స్థలమునకుఁ బోయెను. అప్పటికి పరవకు ఫాల్గునోత్తరమను ఉత్సవమునకుఁ బోవుటకు ధనము అవసర మయ్యెను. సుందరమూర్తి ధనసంపాదనార్థము బయలుదేఱి మార్గమధ్యమున శివభక్తులు కాన్పింపఁగా, నచ్చటఁ గూరుచుండి ఆయాసవశమున అచ్చట నిద్రించెను. తలక్రింద కు ఏమియు లేకపోవుటచే రెండు ఇటికలను దెచ్చి యుపయోగించుకొనెను. మఱల మేల్కాంచి లేచి చూచునప్పటికి శివభక్తులు కాన్పింపరైరి. తలక్రింద నున్న ఇటికలు రెండును బంగారపు ముద్దలై యుండెను. అందులకు ఆశ్చర్యపడి సుందరమూర్తి పరమశివునిఁ బద్యములతో వినుతించెను.

పిదప సుందరమూర్తి అనేకదివ్యస్థలములు సందర్శించి, ఆయాస్థలములయందెల్ల తన అనర్గళకవితాలహరినిఁ బ్రవహింపఁజేసి, లోకులను అద్భుతానందరస

నిమగ్నులం గావించెను. తిరుముదుకూడు అనుస్థలమున సుందరమూర్తి దేవుని స్తుతింపఁగా స్వామి పంన్రెండువేలసువర్ణములు ఇచ్చెను. "శివా! ఈధన మంతయు కమలాలయము చేరుట ఎట్లు?" అని యడుగఁగా, "దీనిని ఇచ్చట నదిలోఁ బడ వేయుము. పోయి కమలాలయమునందలి చెరువులో వెదకికొనుము" అని అశరీర వాణి వినఁబడియెను. సుందరమూర్తి అట్లే చేసి, పరవయింటికిఁ బోయెను.

మఱియొకప్పుడు సుందరమూర్తి మఱల శివస్థలములను సేవింప బయలుదేఱెను. మార్గమధ్యమున నొకచోట సుందరమూర్తికి అన్నపానములు దొరకవయ్యెను. ఆశ్రమను లెక్కచేయక అతఁడు ఎట్లో పోవుచుండఁగా, పరమశివుఁడు భక్తుని స్థితిగతుల నెఱింగి బ్రాహ్మణవేషముతో మార్గమధ్యమున నిలిచి ఒకపందిరిని గల్పించి అన్నపానీయములతో వేచియుండెను. కొంతతడవునకు సుందరమూర్తి అచ్చటకు వచ్చెను. వృద్ధబ్రాహ్మణుఁడు సుందరమూర్తినిఁ బిలిచి, "ఓయీ! నీవు ఆఁకటఁ గడు బడలియున్నావు. కావున ఈప్రసాదమును భుజించి, ఈతీర్థమును ద్రావుము" అని అన్నోదకములను జూపెను. సుందరమూర్తి భక్తగణములతోఁగూడ ఆపదార్థములను సేవించి, గాఢనిద్రాముద్రితుం డయ్యెను. మఱల నాతఁడును, భక్తగణమును మేల్కాంచి చూచునప్పటికి పందిరియు వృద్ధబ్రాహ్మణుఁడునుగూడ మాయమైపోయియుండెను. అదిచూచి "ఇది ఈశ్వరునిలీల, మనలను క్షుత్తునుండి రక్షించుటకు ఇట్లుచేసె" నని అందఱును ఆనందించి, పరమేశ్వరుని పద్యసహస్రములతోఁ బ్రస్తుతించెను.

అతఁడు అక్కడనుండి బయలుదేఱి అనేకదివ్యస్థలములను సేవించి, పక్షితీర్థమును జేరెను. అచ్చట భోజనసమయమునకు పరిచారకులు వచ్చి వంటచేయకుండుటచే సుందరమూర్తి యొకచోఁ గూరుచుండి ఆఁకట నకనక మాడుచునే పద్యశతములతో స్తోత్రము సేయుచుండఁగా, ఈశ్వరుఁడు ఆనందించి వృద్ధబ్రాహ్మణరూపముతో వచ్చి "మహానుభావా! నీకవిత అతిమధురముగ నున్నది. నిన్ను జూచిన నాకుఁ జాల నానందముగ నున్నది; కాని నీవు ఆఁకొనియున్నట్లు తోఁచుచున్నది. కదలకుండ ఒక్కగడియ యిక్కడనే కూర్చుండియుండువేని ఈబ్రాహ్మణుల యిండ్లకుఁబోయి అన్నము యాచించి తెచ్చెదను" అని చెప్పిపోయెను. సుందరమూర్తి వృద్ధబ్రాహ్మణుని మాటలను విని యానందించుచుఁ గూర్చుండియుండఁగా, అతఁడు అన్నము గొనితెచ్చి ఎదుటఁబెట్టెను. సుందరమూర్తి భోజనము ప్రారంభించెను. అంతలో వృద్ధుఁడు అంతర్హితుఁడు అయ్యెను. అదిచూచి సుందరుఁడు సాంబశివుఁడే ఈవేషముతో వచ్చెనని ఎఱింగి మఱలఁ గవితాలహరిని బ్రవహింపఁజేసెను. అక్కడనుండి బయలుదేఱి ఆసేతుహిమాచలం బగు ఆర్యావర్తమునఁ గల సకల శివక్షేత్రములను దర్శించి తిరువట్టూరు చేరుకొనెను.

కైలాసగిరిపై పార్వతీదేవి పరిచారికయు సుందరమూర్తిని మోహించి యున్నదియు నగు అనిందిత అనునది భూమిమీఁద ఆదిత్యుఁడు అను వెలమకు 'సంకిలి' అనుపేరుతో కొమార్తెయై పుట్టెను. ఆమె వివాహయోగ్య కాఁగా, తలిదండ్రులు మనబిడ్డకుఁ దగినవరుఁడు ఎవఁడు అని యోచింపసాగిరి. ఇది యెఱింగి సంకిలి తన్నొకవేళ తలిదండ్రులు సామాన్యునకు ఇచ్చి పెండ్లి చేయవచ్చునని యోచించి "మీరు నాతో చెప్పకుండ వరాన్వేషణము చేయుచున్నారు. మీరు చేసినపెండ్లి నేను అంగీకరించుదానను గాను. నేను పరమశివ భక్తాగ్రేసరునిఁ దక్క-నన్యునిఁ బెండ్లియాడను. మీరు అట్టివానినిఁ దీసికొనిరాఁజాలరు; కావున నేను తిరువట్టూరునకుఁ బోయి స్వామి సన్నిధి గాచియుండి వరుని వెదకుకొనెద" నని చెప్పెను. తలిదండ్రులు ఆమె మాటలను విని ఇతరులకుఁ దెలియనీయక హృదయమునందే యుంచుకొనిరి. ఇట్లుండఁగా, సమీప గ్రామవాసి యొకఁడు సంకిలి రూపరేఖావిలాసములను విని, తనకు ఈయవలసినదని ఆమెతండ్రికి వర్తమానము చేసెను. ఆతఁడు వీలు పడదు అనియెను. వచ్చినవారు తిరిగిపోయిరి. ఇలు చేరిన వెంటనే వచ్చినవారును పంపిన యాతఁడునుగూడ చనిపోయిరి. అది విని సంకిలితండ్రి "ఈమెను శివభక్తుఁడె గాని అన్యుఁడు పెండ్లియాడఁ దగఁడు" అని నిశ్చయించుకొని, ఆమెను తిరువట్టూరికిఁ గొనిపోయి ఆలయమున ఒకగది యేర్పాటు చేసి "నీవు ఇందు వసించుచు స్వామిని సేవించుకొనుచుండుము" అని చెప్పి, స్వామిసన్నిధికిఁ బోయి "ఈశ్వరా! మాబిడ్డను రక్షింపుము" అని ప్రార్థించి, కొమార్తెను విడువలేక స్వగ్రామమునకు వెడలిపోయిరి. సంకిలి అచ్చట అనుదినమును పుష్పమాలలు గ్రుచ్చి వానితో స్వామిని సేవించుచుండెను.

ఒకనాఁడు సుందరమూర్తి స్వామిని సేవించుటకుఁ బోయినపుడు సంకిలి పుష్పమాలికలను జేకొని స్వామిని సేవించుటకు వచ్చెను. ఆమెను జూచినవెంటనే సుందరమూర్తి ముగ్ధుఁడై స్వామిసన్నిధికిఁబోయి "ఈశ్వరా! క్షమింపుము. నిన్ను పుష్పమాలికలు సమర్పించి సేవింపవచ్చిన కన్యపై నాకు మోహము గలిగినది. ఆమెను బెండ్లియాడకుండ నేను బ్రతుకఁ జాలను. కావున అంతయు నీవు ఏర్పాటు చేయవలయును" అని ప్రార్థించెను. ఈశ్వరుఁడు సుందరమూర్తికి ధైర్యముచెప్పి, సంకిలి కలలో సాక్షాత్కరించి "నాభక్తులలో అగ్రేసరుఁడు అగు సుందరమూర్తి నిన్ను మోహించియున్నాఁడు. ఆతనిని బెండ్లియాడి సుఖింపుము" అని నియమించెను. అదివిని సంకిలి "స్వామీ! సుందరమూర్తిసంగతి నీకుఁ దెలియనిది గాదు; ఆతఁడు "పరవ" అనువారకాంతకు వశుఁడై యున్నాఁడు. ఇఁక నన్నుఁజూచునా?" యని యడుగ, ఈశ్వరుఁడు "నీకట్టివిచారము వలదు. అది నేను చక్కఁజేసెదను. నీవు

వకుళవృక్షము క్రిందికి రమ్ము. అచ్చట వివాహము నెఱవేఱును" అనిచెప్పి, సుందర మూర్తికిం గూడ ఈవిషయమును ఎఱింగించెను.

యుక్తసమయమున సంకిలియు సుందరమూర్తియు వకుళవృక్షము చెంతకు వచ్చి ఆవృక్షమునకు ప్రదక్షిణనమస్కారములు ఆచరించి, "మనము బ్రతికియున్నంత కాలమును ఒండొరులను బాసియుండఁగూడదు" అని బాసచేసికొని పెండ్లి యాడిరి. సుందరమూర్తి సంకిలితోఁ గొన్నిదినములు సుఖించినపిదప వల్మీకనాథుని దర్శింపవలయుననికోరి బయలుదేఱెను; కాని సంకిలికి ఇచ్చిన మాటను దప్పుటచే వెంటనే కండ్లుపోయెను. అయినను పట్టినపట్టు విడువఁగూడదని పరిజనునిసాయం బున బయలుదేఱెను. మార్గమధ్యమున ఆతఁడు అనేక శివక్షేత్రములకుఁ బోయి అచ్చటచ్చట వివిధనామములతో వెలసియున్న సాంబమూర్తిని పద్యసహస్రము లతో వినుతించి, కండ్లు ఈయవలసినదని ప్రార్థించెను; కాని ప్రయోజనము లేక పోయెను. ఏకామ్రేశ్వరుఁడు మాత్రము కనికరించి ఎడమకన్ను ఒసంగెను. అందులకు ఆనందించి, మఱల బయలుదేఱి మార్గమధ్యమున మఱికొన్ని శివక్షేత్రములను సేవించియు ఫలము గానక తిన్నగ వల్మీకనాథుని సన్నిధిఁ జేరి, స్వామీ! దాసుని గరుణింపుమని ప్రార్థింపఁగా, కుడికన్ను ఇచ్చెను. అంతట మహానందభరితుఁడై అనేక పద్యములతో స్వామిని నుతించి, దేవాశ్రయము అను సహస్రస్తంభమంటపమునకు బోయి కూర్చుండి, నౌకరును జూచి "మేము వచ్చుచున్నాము అని పరవతోఁ జెప్పిరమ్ము" అని వర్తమానము చెప్పెను. నౌకరు పోయి అట్లే చెప్పఁగా, ఆమె "మీయజమానుఁడు ఇక్కడకు రానక్కరలేదు. తిన్నగ తిరువట్టూరికిఁ బోయి సంకిలి పాదసేవ చేసికోవచ్చును" అని తిరస్కరించెను. అందులకు విచారభరితుఁడై సుందరమూర్తి ఈశ్వరునిఁ బ్రార్థించి, స్వామి సాక్షాత్కరింపఁగా "మహేశ్వరా! నీకుఁ దెలియనిది ఏమియు లేదు. సకలభూతాంతర్యామివైయున్న నీకు పరవ నాయెడలఁ జూపిన తిరస్కారము తెలియనిదిగాదు. పరవను సుముఖురాలినిఁ జేయకపోయితివేని నేను బ్రతుకఁజాలను" అని విన్నవించెను. ఈశ్వరుఁడు భక్తుని యభీష్టమును నెఱవేర్పఁగోరి శైవబ్రాహ్మణరూపముతోఁ బోయి సుందరమూర్తి స్థితిగతులు అన్నియు నెఱింగించి, భక్తుని రక్షింపవలయునని చెప్పెను; కాని పరవ తిరస్కరించెను. తోడనే వల్మీకనాథుఁడు నిజరూపముతో ఎదుట నిలిచి "ఏమి చెప్పెదవు?" అనియెను. పరవ భయభ్రాంతయై స్వామిపాదములమీఁద వ్రాలి, "క్షమింపుము. నీయాజ్ఞను ఎన్నఁడును జవదాఁటి ఎఱుఁగను" అని పాదములను బాష్పోదకముతోఁ గడిగెను. పరమేశ్వరుఁడు పరవను లేవనెత్తి, భయము వలదని చెప్పి అంతర్హితుఁ డయ్యెను

వల్మీకనాథుఁడు సంగతియంతయు నెఱింగింపఁగా, సుందరమూర్తి పరమా నందభరితుఁడై పరవ యింటికిఁ బోయెను. పరవయు నాతనికి నెంతో యాదర ముతో స్వాగతమిచ్చి గౌరవించెను. సుందరమూర్తి పరవతో యథాపూర్వముగ ననంతసుఖములను బడయసాగెను.

ఒకగ్రామమున కలికామనాయనారు అను ఒకశైవభక్తుఁడు ఉండెను. ఆతఁడు చాల గొప్పవాఁడు. సుందరమూర్తి పరమేశ్వరుని దూతకృత్యమునకు నియమించె నని విని క్రోధఘూర్ణితుఁడై సుందరమూర్తిని నిందింపసాగెను. సుందరమూర్తి అది తెలిసి, "కలికామనాయనారు కోపమును బోఁగొట్టుము. అని వల్మీకనాథునిఁ బ్రార్థించెను. అంతట ఈశ్వరుఁడు కలికామనాయనారునకు తీవ్రమైన శూలరోగ మును గలిగించి వృద్ధబ్రాహ్మణరూపముతో నతని చెంతకుఁ బోయి "దీనిని సుందర మూర్తినాయనారు నిర్మూలింపఁగలఁడు. ఆతనికిఁ దెలుపుము" అనిచెప్పెను; కాని ఆతఁడు "నేను పాపాత్ముఁడగు సుందరమూర్తినిఁ జూడఁజాలను" అని బదులు చెప్పెను. అంతట పరమేశ్వరుఁడు సుందరమూర్తిచెంతకు వచ్చి "నీవు పోయి కలి కామనాయనారు శూలరోగమును నిర్మూలింపుము" అని నియమించెను. తోడనే సుందరమూర్తి "వైద్యము చేయుటకు వచ్చుచున్నాను" అని వార్త నంపెను. ఆ వార్త నాలకించి కలికామనాయనారు "వీని మొగము చూడరాదు" అను సంకల్ప ముతోఁ బొడుచుకొని చనిపోయెను. ఇది తెలియని సుందరమూర్తి తిన్నగ నటకుఁ బోయి జరిగినదెల్లను దెలిసికొని, "ఇట్టి మహాత్ముఁడు చనిపోయె నిఁక నేనెందు లకు?" అని పొడుచుకొనుటకు ఖడ్గమును ఎత్తెను. అంతట పరమశివుని అనుగ్రహము వలన కలికామనాయనారు జీవించి లేచి. సుందరమూర్తిని బట్టుకొని ఆత్మహత్య నుండి మరలించెను. పిదప నొకరినొకరు గౌఁగిలించుకొని; స్వామిసన్నిధికిఁ బోయి ఎవరి గ్రామమునకు వారు పోయిరి. చేరదేశాధీశ్వరుఁడైన చేరమాన్ పెరుమాళ్ నాయనారు సుందరమూర్తినిఁ జాలదినములనుండి చూడవలయునని యున్నవాఁడు. కావున నొకనాఁడు బయలుదేఱి కమలాలయమునకుఁ బోయెను. అట వారిరువురును సమావేశమైనపుడు ఒకరినొకరు కౌఁగిలించుకొని, నమస్కారములు గావించుకొని, ప్రియము నెఱపుకొని, మహానందముతో వల్మీకనాథుని సన్నిధికిఁ బోయిరి. స్వామిని సేవించుట యైన తరువాత సుందరమూర్తి చేరమాన్ పెరుమాళ్ నాయనారును పరవ ఇంటికిఁ గొనిపోయి, ఆతనికి ఆతని పరివారమునకు జాలదినములు విందుచేసి, పిదప దివ్యక్షేత్ర దర్శనమునకై చేరమాన్ పెరుమాళ్లుతో బయలుదేఱి అనేకస్థల ములు సేవించి, అచ్చటచ్చట వివిధనామములతో వెలసియున్న పార్వతీపతిని సేవించి పద్యజాలములతో వినుతించిరి. తిరుచ్చుళి అనుస్థలమున సాంబుని పద్యములతోఁ

బ్రస్తుతించుచుండఁగా, ఈశ్వరుఁడు వృషభరూపుఁడై వచ్చి "నేను ఉండునది ఇక్కడఁ గాదు. కానప్పేరున" అని చెప్పెను. పిదప సుందరమూర్తి చేరమాన్ పెరుమాళ్లుతోఁ గానప్పేరునకుఁ బోయి స్వామిని నుతించి, రామేశ్వరము మున్నగు సకల దివ్యస్థలములను సేవించుకొని, తుదకు కమలాలయము చేరుకొనెను.

ఇట కొన్ని దినములు గడచిన తరువాత చేరమాన్ పెరుమాళ్లు "మీరు మా యింటఁ గొన్ని దినములు వసించి నాకుటుంబమును పావనము చేయవలయు" నని ప్రార్థింపఁగా, సుందరమూర్తి వల్లె యనెను. పిదప ఇరువురును బయలుదేఱి పోవు చుండఁగా, మార్గవశమున పంచనదము కాన్పించెను. చేరమాన్ పెరుమాళ్లు సుందరమూర్తినిజూచి "స్వామీ! నాహృదయము పంచనదమునకుఁ బోయి స్వామిని సేవింపఁ గోరుచున్నది." అని చెప్పెను. మధ్యమున కావేరీనది కూలంకషమై ప్రవహించు చుండుటయు, దానిని దాఁటుటకు దోనె మున్నగు సాధనములు ఏవియు లేకుండు టయుఁ జూచి సుందరమూర్తి పరమేశ్వరుని ప్రార్థించెను. తోడనే కావేరి మార్గమును ఇచ్చెను. అచ్చట నున్నవారు అందఱును ఆశ్చర్యచకితులై తమప్రభావమును గొని యాడుచుండఁగా, సుందరమూర్తియు చేరమాన్ పెరుమాళ్లును పంచనదమునకుఁ బోయి స్వామిని సేవించుకొని, అచ్చటచ్చటఁ గల పుణ్యక్షేత్రములను అన్నిఁటిని సేవించికొనిరి. చేరమాన్ పెరుమాళ్లు సుందరమూర్తితోఁగూడ తనపట్టణము చేరు కొనెను. చేరమాన్ పెరుమాళ్లు మంత్రి సామంతాదులు మహావైభవముతో తమ రాజును సుందరమూర్తిని నగరు ప్రవేశపెట్టిరి. చేరమాన్ పెరుమాళ్లు సుందర మూర్తినిఁ దనఅంతఃపురమున విడియించెను.

అచ్చట సుందరమూర్తికిఁ జాల గౌరవము జరిగెను. కొంతకాలము గడచిన తరువాత సుందరమూర్తి హృదయము వల్మీకనాథుని సేవింపఁ గోరసాగెను. ఈసంగతి నెఱింగించి సుందరమూర్తి పయనముకాఁగా,చేరమాన్ పెరుమాళ్లు పోవలదని వారిని అనేకవిధములఁ బ్రార్థించెను; కాని ప్రయోజనము లేకపోయెను. అంతట పెరుమాళ్లు సుందరమూర్తినాయనారును ఇంట నుంచిరందు అని పరిజనులకు రత్నాభరణాదులు అనేకములు ఇచ్చెను. వారిని ముందిడుకొని సుందరమూర్తి బయలుదేఱెను. మార్గ మధ్యమున ఈశ్వరుఁడు కిరాతనాయకవేషమును దాల్చి ప్రమథులను కిరాతులనుగాఁ జేసికొని వచ్చి పరిజనులచే సుందరమూర్తి కొనిపోవుచున్న రత్నాభరణాదులను గొల్లగొట్టించుకొనిపోయెను. అందులకు విచారింపక సుందరమూర్తి తిన్నగ నడచి పోయి తిరుమురుగంపూడి అను గ్రామము తగులఁగా, అందలి దేవాలయమునకుఁ బోయి జరిగిన దంతయు స్వామికి విన్నవింపఁగా, ఈశ్వరుఁడు "నీ నిర్భీతచిత్తమునకు సంతసించితిని" అని ఆభరణములు అన్నియుఁ దెచ్చియిచ్చెను. పిదప అనేకపద్యములతో

స్వామిని మఱల వినుతించి, సుందరమూర్తి రత్నాభరణాదులను బట్టించుకొని మఱల బయలుదేఱి కమలాలయము చేరుకొని, ఆభరణము లన్నియు బరవకు ఇచ్చి సుఖముగ నుండెను.

ఇట్లు కొంతకాలము జరిగిన తరువాత మఱల పెరుమాళ్లను జూడవలయునని సుందరమూర్తికి తలంపు గలిగెను. పరవకు ధైర్యముచెప్పి వెంటనే అతఁడు బయలుదేరెను. మార్గమధ్యమున నొకగ్రామములో ఒకయింట మంగళధ్వనులును, ఒకయింట రోదనధ్వనులును మిన్నుముట్టుచుండెను. సుందరమూర్తి అందులకుఁ గారణ మేమని అడుగఁగా, దగ్గఱనున్న బ్రాహ్మణులు "ఈయింటివారి పిల్లవాఁడును ఆయింటివారి పిల్లవాఁడును ఒకనాఁడు చెరువునకు స్నానమునకుఁ బోయిరి. కొంతసేపు ఈఁదులాడిన తరువాత అందొక బాలుని మొసలి ఎత్తుకొని పోయెను. నేఁడు రెండవబాలునకు ఉపనయము జరుగుచున్నది. చనిపోయిన బాలుని తలిదండ్రులు 'బ్రతికియున్నచో మనవానికిఁ గూడ నేఁడు ఉపనయనము చేసికొందుము గదా!' అని విచారించు చున్నారు" అని చెప్పిరి. అంతలో వారు అచ్చటకు వచ్చి సుందరమూర్తికి నమస్కరించి, "మహాత్మా! ఏలినవారి దర్శనమునకు రావలయునని తలంచుచుండఁగా, మాకు ఇట్టి యాపద సంభవించినది. తుదకు మీరు మాగ్రామము వచ్చుచునుకమిమ్ముఁజూడఁ జాలక పోయితిమి" అని పలికిరి. అది విని సుందరమూర్తి ఇట్టి విపత్సమయములోఁ గూడ తనయెడల అట్టి భక్తిశ్రద్ధలు చూపుచున్న ఆదంపతుల జ్ఞానమునకు ఆనందించి "మీపిల్లవాఁడు చనిపోయిన చెఱువు చూపుఁడు" అని యడిగెను. తోడనే వారు నాయనారును అచ్చటకుఁ గొనిపోయిరి.

సుందరమూర్తి చెఱువుగట్టుమీఁదఁ గూరుచుండి ఈశ్వరుని బ్రార్థింపఁగా, మొసలి ఆపిల్లవానిని దెచ్చి గట్టుమీఁద బడవేసిపోయెను. నిద్రపోయి లేచినవాని వలె ఆ బాలుఁడు నలుగెలఁకులఁ జూచి పోయి తల్లిదండ్రులనుఁ గౌఁగిలించుకొనెను. తలిదండ్రులును మహానందభరితులై కుమారుని సుందరమూర్తి పాదములమీఁదఁ బడవేసి, తామును వ్రాలి అనేకవిధములఁ గొనియాడి, ఇంటికిఁ దీసికొనిపోయి చాల గౌరవించిరి. సుందరమూర్తి నాఁడే ఆబాలునకుఁగూడ ఉపనయనమును జేయించెను.

పిదప సుందరమూర్తి చేరమాన్ పెరుమాళ్లనగరమునకు బయలుదేరెను. ఈవార్త వెంటనే అచ్చటఁ దెలిసిపోయెను. అంతట పెరుమాళ్లు మహావైభవముతో సుందరమూర్తినాయనారును దననగరమునకుఁ గొనిపోయెను. కొన్నిదినములు అచ్చటనుండి సుందరమూర్తి మహోదయమను గ్రామమునకుఁ బోయి అచ్చట వృత్తరూపముగ పరమేశ్వరునిఁ బ్రార్థింపఁగాఁ, కైలాసమున నిండుగొలువున్న మహేశ్వరుఁడు బ్రహ్మకును విష్ణువునకును "మీరు పోయి సుందరమూర్తిని తెల్ల

యేనుఁగుమీఁదఁ గొనిరండు" అని యాజ్ఞాపించెను. వారును అట్లే మహోదయ మునకుఁ బోయి సంగతి యంతయు నెఱింగింపఁగా, సుందరమూర్తి ఆనందముతో నేనుఁగు నెక్కెను.

అందఱును బయలుదేరిరి. సుందరమూర్తి "పెరుమాళ్లు నాతో రాక పోయెను" యని అనుకొనుచుఁ బోవుచుండెను. అది తెలిసి పెరుమాళ్లు తన భద్రాశ్వమును అధిరోహించి మహోదయమునకుఁ బోయి, ఆకాశమునఁ బోవుచున్న సుందరమూర్తినిఁ జూచి తన గుఱ్ఱమునకుఁ జెవులో పంచాక్షరి నుపదేశించెను. తోడనే గుఱ్ఱము ఆకాశమునకు ఎగిరి సుందరమూర్తి అధిష్ఠించిన శ్వేతగజముతోఁ గలిసి కొనెను. ఇది చూచి పెరుమాళ్లు నమ్మిన భటులు తమ ప్రభువును విడిచియుండఁ జాలక కత్తులతోఁ బొడుచుకొని వెంట బయలుదేఱిరి. కొంతసేపటికి వారందఱును కైలాసము చేరుకొనిరి. సుందరమూర్తి నిరభ్యంతరముగా లోపలకుఁబోయెను. పెరుమాళ్ళు పోవుటకు వీలులేదయ్యె. పరమేశ్వరుఁడు సుందరమూర్తినిఁ గౌఁగిలించుకొని ఆదరించెను. సుందరమూర్తి కోరఁగా, పరమేశ్వరుఁడు పెరుమాళ్ళును లోనికిఁ గొని రండు, అని భటులకు ఆజ్ఞాపించి, వచ్చిన తరువాత నాతనిని గణాధిపతులలో నొక నింగాఁ జేసెను. సుందరమూర్తి పరమేశ్వరుని యాదరము నొందుచుండెను.

---

# 85. నేత్రేశ నాయనారు

శ్లో. "బ్రహ్మైవాహమిమం జగచ్చ సకలం చిన్మాత్రవిస్ఫారితం
సర్వం చైతదవిద్యయా త్రిగుణయా సేశం మయా కల్పితం,
ఇత్థం యస్య దృఢా మతి స్సుఖతరే నిత్యే పరే నిర్మలే
చండాలోఽస్తు సతు. ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ." (మనీషాపంచకము.)

పొత్తపనాడునందు ఉడుప్పూరు అను గ్రామమున నాగఁడు అనుబోయ తేఁడు ఉండెను. అతనిభార్య పేరు దత్త. వారికి ఏమిటను గొదువ లేదు; గాని సంతానము లేని కొఱఁత అనివార్యమై యుండెను. ఆదంపతులు ఇరువురును తమకు నిశ్చితమన స్కులై సుబ్రహ్మణ్యస్వామిని అనేకవిధముల నర్చింపసాగిరి. అగుట దత్త కొలఁదిదినములయందే గర్భవతియై నవమాసములు మోసి, శుభముహూర్తమున నొకపుత్రునిఁ గనియెను. తల్లిదండ్రులు ఆబాలునకు తిన్నఁడు అని పేరుపెట్టి, చాల గారాబముతోఁ బెంచుకొనుచుండిరి.

నాగఁడు యుక్తవయస్సునఁ దిన్ననికి విలువిద్య నేర్పింపఁదొడఁగెను. యౌవనము వచ్చునప్పటికిఁ దిన్నఁడు బోయలకు వలయు సకల విద్యలందున్నదును జాణ

యయ్యెను. అపుడు నాగఁడు తనకు ముసలితనము పూర్తిగ వచ్చుట నెఱింగి రాజ్యభారమును దిన్ననిపై నుంచెను.

ఒకనాఁడు తిన్నఁడు నాముఁడు, కాముఁడు అను నిజభృత్య సహచరులతో వేఁటకుఁ బోయెను. వారు గొప్పజంతువులనిమిత్తము అరణ్యమంతయు వెదకుచుండఁగా, నొకచో నొక పంది వారికంటఁ బడియెను. తోడనే తిన్నఁడు దానిని వెంబడించెను. ఒకటిరెండుగడియలలోఁ బంది అలసటవలన ఏమైనఁ గానిమ్మని ఒక చెట్టు క్రిందఁ బడిపోయెను. తిన్నఁడు వెంటనే దానిని ఖడ్గముతో రెండుఖండములుచేసి చంపివేసెను. అప్పుడు నాముఁడును, కాముఁడును "దొరా! ఆఁకలి యధికముగా నున్నది. సహించుట కష్టమగుచున్నది. దీనిని ఇచ్చట కాల్చికొని తిందము. సెలవు దయచేయుము" అని పలికిరి. తిన్నఁడు అంగీకరించెను. అంతట తిన్నఁడు ముందు నడువ నాముఁడును, కాముఁడును బందిని మోసికొని అచ్చటకు సమీపమున నున్న సువర్ణముఖనదీతీరమునకుఁ బోయిరి. అచ్చటకు కాళహస్తి పర్వతమును దాని మీఁది దేవాలయమును స్పష్టముగాఁ గాన్పించుచుండెను. తిన్నఁడు అది యేమని యడుగఁగా, నాముఁడు "అది యొకపర్వతము. దానిమీఁద నున్నది గుడి. అందు దేవుఁడు ఉన్నాఁడు" అనిపలికెను. "అట్లయిన నచ్చటికిఁ బోయి చూచి వత్తము ర"మ్మని తిన్నఁడు నామునితోఁ గూడ పర్వతముమీఁదికిఁ బోయెను. కాముఁడు పంది చెంతఁ గాపుండెను.

ఆలయద్వారములు తెఱచి లోపలకుఁ బోఁగా, తిన్ననికి పుష్పములతోఁ బూజింపఁబడిన ఈశ్వరవిగ్రహము కంటఁబడెను. తోడనే అతని చిత్తవృత్తి జీవితము అంతయు మాఱిపోయెను. ఒక్కదూఁటున తిన్నఁడు పోయి ఈశ్వరవిగ్రహమును కౌఁగిలించుకొని "ఈశ్వరా! ఈమహారణ్యమధ్యమున నీవు ఒక్కఁడవు ఏల యుంటివి? నీకు ఆహారము ఎట్లు వచ్చుచున్నది?" అని యిట్లు చంటిపిల్లల నడిగినట్లు అడిగి, "నాముఁడా! దేవుఁడు ఆఁకలిగొని యున్నాఁడు. ఆహారము తెత్తము రమ్ము" అని మఱలఁ గ్రిందికి బయలుదేరెను. నాముఁడు అందులకు ఆశ్చర్యపడసాగెను. తిన్నఁడు ఈశ్వరుని విడిచి ముందునకుఁ బోవుటకు సాహసింపఁజాలక ఎట్లో పోయెను.

అప్పటి కప్పుడే కాముఁడు పందిని పరిశుభ్రముగఁ గాల్చియుంచెను. తిన్నఁడు మంచిమాంస మంతయుఁ దీసి తక్కినదానిని అవ్వలకుఁ బాఱ జిమ్మివేసెను. అది చూచి కాముఁడు నిర్విణ్ణుఁడు కాఁగా, నాముఁడు "మిత్రుఁడా! ఏమి చెప్పుదును? మన యేలికకు మతి పోయినది. దేవునకుఁ బెట్టుటకై ఈమాంసము కొనిపోవుచున్నాఁడు" అని పలికెను. అందులకు మఱింత స్తబ్ధుఁడై కాముఁడు నామునివలెనే

మాఱుపలుకక తేనివెంట బయలుదేఱి పోయెను. తిన్నఁడు ఈశ్వరపూజకుఁగాను పూవులుకోసి వానిని తన జుట్టున నుంచుకొనియు, అభిషేకము చేయుటకు సువర్ణ ముఖీజలములను పుక్కిట నుంచుకొనియు, మాంసమును జేతులతోఁ గైకొనియు ఆలయము ప్రవేశించెను.

నాముఁడును కాముఁడును తమయజమానుని పనులు అన్నియు అతిజాగ్రత్తతోఁ బరికించుచుండిరి. తిన్నఁడు తొలుత ఈశ్వరునిమీఁదనున్న పూవులను తన పాదరక్షలతో తొలఁగించి, నోటిలోని నీటిని యుమిసి యభిషేకము గావించి, "ఈశ్వరా! ఇది చాల మంచి మాంసము. ఇది యదృష్టపూర్వమగు నొక గొప్ప పంది మాంసము. స్వీకరింపవలయు" నని ప్రార్థించి, "ఈశ్వరుని దొంగలు దోచుకొని పోకుండుటకు సాయుధుఁడనై నేను ద్వారమునఁ గాపుండెదను" అని నిశ్చయించుకొని అట్లే చేసెను.

మఱునాఁడు తిన్నఁడు దేవునకు మాంసము తెచ్చుటకు వేకువ జామున లేచి అరణ్యమునకుఁ బోయెను. మఱికొంతసేపటికి అనుదినమును కాళహస్తీశ్వరుని బూజించు మహాత్ముఁడగు శివకేసరి అర్చించుటకు వచ్చి గర్భాలయమున మాంసపు ముక్కలును ఎముకలు నుండుటఁ గాంచి తెల్లవోయి, "ఇవి యిక్కడ కెట్లు వచ్చినవి ? ఎవ రిచ్చటకు వచ్చి యిట్టి యనుచితకార్యములను జేయుచున్నారు ?" అని చాలతడవు వగచి, తుదకు చేయునది లేక ఆలయమంతయు శుభ్రము చేసి, అభిషేకముచేసి, వేదమంత్రములతో పూజించి కాళహస్తీశ్వరునకు నైవేద్యముచేసి ఆనంద భరితాంతరంగుఁడై యింటికి వెడలిపోయెను.

ఇంతలో తిన్నఁడు నోట నీరును, శిరమునఁ బూలును, చేత మాంసమును ఇడుకొని వచ్చి, విగ్రహామువిూఁది పూలను తన పాదరక్షలతో తొలఁగించి నోటిలోని నీటితో నభిషేకించి మాంసమును ఎదుటనుంచి "దేవుఁడా! నేఁడు చాల మంచిమాంసము దొరకినది. మాకాముఁడు చక్కఁగా కాల్చినాఁడు. నేను కొఱికి రుచి చూచి తెచ్చితిని. నీవు అవశ్యము భుజింపవలయు"నని ప్రార్థించి మఱల యథా పూర్వముగ క్రూరజంతువులు ఏమియు రాకుండఁజేయుటకై బయటకుఁ బోయెను.

మఱునాఁడు మఱల నిట్లే జరిగెను. ఇట్లే అయిదాఱు దినములు గడచెను. ఏడవనాఁడు తిన్నఁడు మాంసము నిమిత్తము అరణ్యమునకుఁ బోయిన తరువాత శివకేసరి వచ్చి, "ఈశ్వరా! నీవృత్త మంతయు విపరీతముగ నున్నది. ప్రతిదినమును ఎవరో కిరాతులు వచ్చి ఇచ్చట తమ చిత్తము వచ్చినట్లు అమాంగల్యములు అన్నియుఁ జేయుచున్నారు. వాండ్రను ఎట్లు సైరించుచున్నావు ?" అని పలుక, ఈశ్వరుఁడు సాక్షాత్కరించి "వత్సా! నీకు సందేహము వలదు. నాకు ఆఱు దిన

ముల క్రిందట నొక బోయభక్తుఁడు లభించెను. అతని భక్తి యచంచలమై యున్నది. భక్తిక్రీతుఁడ నగునేను భక్తులు ఏమి సమర్పించినను స్వీకరింపవలయును గదా! అతఁడు మాంసము నర్పించినను అది అతని చిత్తశుద్ధిప్రభావమువలన నాకు అమృతాయమానమై యున్నది. నీవు నాశిరమున నిడిన పుష్పముల నాతఁడు తన పాదరక్షలతోఁ దొలఁగించుచున్నాఁడు. ఆకృత్యము బుడుతఁడు తల దన్నిన తండ్రికి ఎంత యానందముఁ గూర్చునో నాకు అట్లున్నది. నీవు ఇప్పుడు నావెనుక డాఁగి యుండుము. ఆతని భక్తిని నీవు చూడఁగలవు” అని పలికెను. శివకేసరి ఆశ్చర్యచకితుఁడై అట్లే చేసెను.

కొంత సేపటికి తిన్నఁడు యథాపూర్వకముగ మాంసము జలము పూలు తెచ్చుచు, ఆలయము బైటనుండియే దేవుని కంటినుండి రక్తము కారుచుండుటఁ గాంచి తటాలున లోనికి వచ్చి పుష్పాదికముల నచ్చటఁ బాఱవేసి, కంటి ననేకపర్యాయములు తుడిచెను; కాని ప్రయోజనము లేక పోయెను. తిన్నఁడు కొంతతడవేమియుఁ దోఁచక స్తబ్ధుఁడై యుండి, అంతలో బైటకుఁ బోయి అనేకమూలికలను దెచ్చి చికిత్సచేసెను; కాని వానివలనఁగూడ లాభము లేక పోయెను. అంత తిన్నఁడు “ఇది పని గాదు” అని తనకంటి నొకదానిని పెఱికి ఈశ్వరునికంటిమీఁదఁ బెట్టెను తోడనే ఆకన్ను అతుకుకొనిపోయి రక్తధార కట్టుబడెను. కాని మఱల రెండవకన్ను స్రవింప సాగెను. తిన్నఁడు అది చూచి “నాకేమియు భయము లేదు. నాకు చికిత్స తెలిసియే యున్నది” అని యనుకొని రెండవకన్ను పెఱుకుకొనుటకు అమ్ము నెత్తి కంటిమీఁదఁ బెట్టెను. తోడనే ఈశ్వరుఁడు సాక్షాత్కరించి, “నిలువుము కన్నప్పా! నీభక్తికి మెచ్చితిని. ఇంత నిశ్చలమైన భక్తి నే నిదివఱకుఁ జూచియెఱుఁగను. చాలకాలము పంచాగ్ని మధ్యమున నిలిచి తపస్సుచేసిన మునుల చిత్తముకంటె నీచిత్తము అతిశుద్ధ మైనది. నాహృదయమునకు సంపూర్ణానందము గలిగించినవాఁడవు నీవు ఒక్కరుఁడవే” అని ప్రశంసించెను. తోడనే దేవతలు పుష్పవర్షముఁ గురిసిరి. గంధర్వులు పాడిరి. కిన్నరులు ఆడిరి. మునులు కొనియాడిరి. శివకేసరి ఆశ్చర్యచకితుఁ డయ్యెను. తిన్నని ఈశ్వరుఁడు కన్నప్పా యని పిలిచెను. కావున ఆతఁడు కన్నప్పనాయనారని పిలువఁబడెను. నేత్రేశనాయనారు అనునది సంస్కృత నామము.

---

# 86. అమర్నీతినాయనారు

చోళదేశమున నొక గ్రామమున అమర్నీతినాయనారు అనునొక వైశ్యకుల తిలకుఁడు ఉండెను. అతనియింటఁ గల ధనమును ఎవరును ఏవిధముగను లెక్కింపఁ జాలరు. ఆతఁడు అంత ధనవంతుఁడు అయ్యును, లోకసామాన్యమువలె ప్రవర్తింపక సదా పరమేశ్వరపాదములను స్మరించుచు, సత్కార్యములను జేయుచు నుండెను. ఆతఁడు తిరునల్లూరు అను క్షేత్రమున ఒకమఠమును గట్టించి, అందు ఎందఱు శివ భక్తులు వచ్చినను లేదనక అన్నవస్త్రముల నిచ్చి పూజించుచుండును.

ఒకనాఁడు పరమశివుఁడు అమర్నీతినాయనారు చిత్తశుద్ధిని బరీక్షింపఁదలఁచి బ్రహ్మచారివేషముతో నచ్చట సాక్షాత్కరించెను. అమర్నీతినాయనారు బ్రహ్మచారిని అల్లంతదూరమునందే గాంచి భక్తిశ్రద్ధలతో ఎదురేఁగి అర్ఘ్యపాద్యములిచ్చి తోడ్కొనివచ్చి, మహాదరముతో స్వాగత మిచ్చెను. బ్రహ్మచారి నీవు శివభక్తుల నందఱను విశేషాదరముతో కౌపీనాదికములు ఇచ్చి సన్మానించుచున్నావనివిని వచ్చితిని" అనియెను. అమర్నీతి అందులకు వినతుఁడై, "స్వామీ! మీరు సెలవిచ్చినది యథార్థము. ఇచ్చట బ్రాహ్మణసమారాధనము అవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. తాము ఇచ్చటనే భుజింపవచ్చును" అని ప్రార్థించెను. బ్రహ్మచారి వల్లెయని యంగీకరించి, "నాచెంత పైగా రెండుకౌపీనములు ఉన్నవి. ఒకటి నీచెంత నుంచుము. నాతోకూడ నుండునది వర్షాదికములచేఁ దడిసిపోవునేని ఇది యుపయోగించు" నని ఒక కౌపీనమును ఇచ్చి, స్నానార్థము కావేరికిఁ బోయెను.

అమర్నీతి ఆకౌపీనమును అతిభద్రమైన స్థలమున ఉంచి మఱియొక పనిమీఁదఁ బోయెను. స్నానమునకు వెడలిన బ్రహ్మచారి అమర్నీతి జాగ్రత్తపఱచిన కౌపీనమును మాయము చేసి, తనచెంత నున్నకౌపీనమును తడిపి, కొంచెము సేపటికి మఠమునకు వచ్చెను. వచ్చినబ్రహ్మచారి అమర్నీతిని బిలిచి, "నావద్ద నున్న కౌపీనము తడిసిపోయినది. నీకిచ్చినది తెమ్ము" అనఁగా, అమర్నీతి తెచ్చుటకుఁ బోయి పెట్టిన చోటఁగానక, మఠమంతయు వెదకికూడ గానక మ్లానాననుఁడై వచ్చి, "స్వామీ! నాదురదృష్టమువలన దేవరవారు నాచేతికిచ్చిన కౌపీనము కాన్పింపకున్నది. మఱి యొకకౌపీనము తెచ్చితిని. అది కోకలోనుండి గాని పంచెలోనుండి గాని చింపఁబడినది కాదు. ఇందులకే నేయఁబడినది." అని విన్నవించెను.

అది విని బ్రహ్మచారి క్రోధతామ్రాక్షుఁడై, "నీసంగతి నాకుఁ దెలిసినది; భక్తులవద్ద నుండు మంచివస్తువులను హరించుటకే నీవు ఈమఠమును ఏర్పఱిచితివి.

కాని అన్యము గాదు. నీవు కోమటివని యెఱింగియు నేను మోసపోయితిని" అని గర్జించి పలికెను. అమర్నీతినాయనారు గడగడ వడఁకుచు, "స్వామీ! ఆగ్రహపడ వలదు. రత్నాభరణాదులు కోరినన్ని యొసంగెదను. పుచ్చుకొని నన్ను మన్నిం పుఁడు" అని వేడుకొనఁగా, బ్రహ్మచారి నాకు రత్నాభరణాదులు అక్కఱలేదు. నాకౌపీనమునకు సరియైన తూనికగల కౌపీనమును ఇమ్ము" అనియెను. అమర్నీతి నాయనారు అందులకు అంగీకరించి, త్రాసుతెచ్చి బ్రహ్మచారి యొద్దనున్న కౌపీనమును ఒక పళ్లెములో నుంచి తాను తెచ్చిన కౌపీనమును రెండవదానిలో నుంచెను; కాని మఠమునందున్న కౌపీనములను అన్నిటిని బెట్టినను సరిపోవయ్యెను. అంతట నాయ నారు బ్రహ్మచారి యనుజ్ఞఁ బడసి మఠమునఁ గల సకలవస్త్రములను సకలాభరణము లను ఉంచియుఁ బ్రయోజనము గానక, తుదకు "మేము నిక్కమైన శివభక్తుల మైత్రి మేని మాతో సరిపోవుగాక!" యని పలికి పంచాక్షరిని జపించుచు తనకుమారుని తోడను, భార్యతోడను, త్రాసులో నెక్కెను. తోడనే త్రాసు సరిగా నిలిచెను. అపుడు ఈశ్వరుఁడు నిజస్వరూపముతో సాక్షాత్కరించి "వత్సా! నీభక్తినిఁబరీక్షించు టకు ఈ బ్రహ్మచారివేషముతో వచ్చితిని. నీకంటె నాకు అంతరంగభక్తులు లే" రని చెప్పుచు, చూచుచున్నవారందఱును అబ్బురపడుచుండ అమర్నీతినాయనారును, ఆతనికుమారుని, భార్యను దనతోఁ గొనిపోయెను.

---

# 87. చండీశ్వరనాయనారు

శ్లో. "శశ్వన్నశ్వర మేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచా గురో
నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజశాంతాత్మనా,
భూతం భావి చ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషా మమ." (మనీషాపంచకము.)

చోళదేశమున నొక గ్రామమున కాస్యపసగోత్రుఁ డగు యజ్ఞశర్మయను బ్రాహ్మణునకు పవిత్ర యనుభార్యయందు విచారశర్మ యను కుమారుఁడు కలిగెను. విచారశర్మ కారణజన్ముఁ డగుటచే అయిదు సంవత్సరములు నిండక పూర్వమే, వేద వేదాంగములయందు అసామాన్య పండితుఁ డయ్యెను; కాని ఈసంగతి యేరికినిఁ దెలియదు. ఏడవసంవత్సరమున యజ్ఞశర్మ కుమారునకు ఉపనయనముచేసి, గురువు చెంగట విద్యాభ్యాసార్థము అప్పగించెను.

విచారశర్మసంగతి యంతయు గురువుచెంగట వెల్లడియయ్యెను. గురువు సంతచెప్పుటకుఁ బ్రారంభింపఁబోవుచుండఁగనే, ఆతఁడు వేదముల నన్నిటిని పకరువు

పెట్టెను. పాఠము చెప్పుటకుఁ దలంచుచుండఁగనే శాస్త్రముల నన్నిటినిఁ జింతన చేసెను. ఇదిచూచి గురువు విస్మితుండై, కొంతవడికిఁ దెలిసి "సరస్వతీపురుషావతారమవు. నీదర్శనమువలన నేను ధన్యుఁడ నైతిని" అని విచారశర్మను కౌఁగిలించుకొని ఆనందబాష్పములతో నాతని మూర్ధము నభిషేకించెను.

విచారశర్మ సకలవిద్యల నెఱింగినవాఁడు. అయినను గురుశుశ్రూష నిమిత్తము అచ్చటనే యుండెను. ఒకనాఁడు ఆతఁడు గురువునకు సమిత్కుశలు తెచ్చుటకు బయలుదేఱెను. మార్గమధ్యమున పశువులం బొలము తోలుకొని పోవు పసులకాపరులు ఆతనితోఁ గలిసికొనిరి. కొంతదూరము పోవునప్పటికి అందొక యావు మందనుండి విడివడిపోయెను. పసులకాపరి వెంటనే పోయి కఱ్ఱ విఱుగునట్లు దానినిఁ జావమోది, మఱల మందలోఁ గలిపెను. విచారశర్మ అది చూచి "శివునియాజ్ఞచే గోవులు భూలోకమున అవతరించినవి. వాని సర్వాంగములయందును దేవతలు వసించియున్నారు. పంచగవ్యము శివునకు అభిషేకద్రవ్యము. గోమయము ఈశ్వరచిహ్న మగు విభూతికి మూలము. ఇట్టి పూజ్యములగు ఆవులకు ఎట్టి గతి పట్టెను?" అని చింతించి, తటాలున వాని చెంతకుఁ బోయి "మూర్ఖుఁడా! ఆవులను గొట్టి ఎందులకు పుట్టగతులు లేకుండఁ బోయెదవు? ఆవులను మేపుట మీవలనఁ గాదు. పొండు. నేనే వానిని మేపి యజమానుల కప్పగించుచుందును" అని పలికెను. వాండ్రు వల్లె యని పసులను విడిచిపోయిరి.

యజమానుల యనుజ్ఞను బొంది విచారశర్మ పశువులను మణ్ణియేటియొడ్డునకుఁ దోలుకొనిపోయి, ఏపుగాఁ బెఱిగిన పచ్చిక బయళ్లలో మేపుచు, నిర్మలములగు ఏటినీళ్లు త్రాగించుచు, ఎండ తీక్ష్ణముగా నుండునపుడు చెట్లనీడలయందు విశ్రమింపఁ జేయుచు, చక్కఁగాఁ గాపాడి సాయంత్రమునకు ఇండ్లకుఁ దోలుకొని పోసాగెను. ఇట్లొకపక్షముదినములు గడచునప్పటికి ఆవులన్నియు బలిసి, మనోహరముగ నుండెను. మఱియు శేరుపాలిచ్చు ఆవు నాలుగుశేర్ల పాలును, కుంచెఁడు పాలు ఇచ్చు ఆవు నాల్గుకుంచముల పాలును ఈయసాగెను. ఈయద్భుతమును గాంచి పసుల యజమానులు ఆశ్చర్యచకితులును, ఆనందకలితులు నై విచారశర్మను అనేకవిధములఁ గొనియాడసాగిరి.

మఱియొకపక్షము గడచునప్పటికి ఆవులను విడిచి విచారశర్మయు. విచారశర్మను విడిచి ఆవులును ఉండఁజాలనిస్థితి వచ్చెను. రాత్రియంతయు కొట్టములలోఁ గడపి, మఱునాఁడు ప్రాతఃకాలమున విచారశర్మను జూచిన వెంటనే ఆవుల కన్నిటికిని కనులనుండి బాష్పధారయు, స్తనములనుండి క్షీరధారయు అవ్యాహతముగఁ గురియసాగెను. అది చూచి శర్మ "ఈయావులకు క్షీరములు అధిక మగుచున్నవి. వ్యర్థముగా నేల పోనీయవలయును?" అని తలఁచి, మణ్ణియేటియొడ్డున ఇసుకలింగము

గావించి పూజింప నిశ్చయించుకొనెను. ఈనిశ్చయముతో నాతఁడు కడవలు తెచ్చి పొదుగుల క్రింద నుంచి స్తనములను వాకిన వెంటనే క్షీరములు కురిసి క్షణముతో కడవలు నిండిపోయెడివి. శర్మ ఆపాలతో అయిసుకలింగమునకు అభిషేకము గావించి, వివిధములగు పత్రపుష్పములతోఁ బూజించి, పాలనే నివేదించుచుండెడివాఁడు. ఈశ్వరుఁడు ఆయిసుకలింగమునందే సన్నిధిసేసి శర్మ పూజలు ఆనందముతో గ్రహింప సాగెను. ఆవు లన్నియు కొట్టములు చేరినతోడనే యజమానులకు యథాపూర్వముగ పాలు ఇచ్చుచుండెడివి.

శివపూజ యీతీరునఁ గొన్నిదినములు జరిగిన వెనుక, విచారశర్మ యొకనాఁడు మణ్ణియేటియొడ్డున యథాపూర్వముగ పూజఁ గావించుచుండఁగా,గ్రామస్థుఁ డొకఁడు చూచి సంగతి సందర్భములు గ్రహింపకయే గ్రామమునకుఁ బోయి "విచారశర్మ మాయావుల నన్నిటినిఁ బాలుపితికి ఆపాలను ఇసుకలోఁ బోసి యాడుకొను చున్నాఁడు" అని చెప్పెను. బ్రాహ్మణులు ఇది విని యధికారిచెంతకుఁ బోయి ఫిర్యాదుచేసిరి. అధికారి విచారశర్మ తండ్రియగు యజ్ఞదత్తుని రప్పించి, "బ్రాహ్మణుల హోమధేనువుల పాలను పితికి నీకుమారుఁడు ఇసుకలోఁ బోసి యాటలాడు చున్నాఁడు" అని మందలించిరి. ఇది విని యజ్ఞదత్తుఁడు విచారపూరితహృదయుఁడై విచారశర్మ ప్రవర్తనమును బరీక్షింపఁదలఁచి వెనుకనే పోయి అడవిలో నొకచోట దాఁగుకొనెను. విచారశర్మ యథాప్రకారము ఇసుకలింగము గావించి, పాలు గైకొని పత్రపుష్పములను దెచ్చి పూజ ప్రారంభించెను. యజ్ఞదత్తుఁడు అది చూచి శర్మ తన కడుపుచెడఁ బుట్టె నని కోపఘూర్ణిత నయనుఁడై, ఒక్కదూకున ముందునకు ఉఱికి చేతనున్న దుడ్డుకఱ్ఱతో "చావుము, నిర్భాగ్యుఁడా" యని పడమోది, నానాదూషణ వాక్యముల నాడెను. విచారశర్మచిత్తము పరమశివునియందు లీనమైయుండుటచే నివి యేవియు నాతనికిఁ దెలియవయ్యెను. అది చూచి యజ్ఞదత్తుఁడు తనకొడుకు మొండికెత్తెనని భావించి, క్షీరభాండములను దన్నివేసెను. శర్మ అప్పటికిఁ దెలివొంది జరిగిన దంతయు గ్రహించి, యజ్ఞదత్తుఁడు తన తండ్రియైనను శివాపరాధము గావించెను; కావున దండ్యుఁడని ఎదుటనున్న కఱ్ఱతీసి కాళ్లు విఱుగఁ గొట్టఁదలఁచి విసరఁగా, అది ఖడ్గమై కాళ్లను నఱికివేసెను. వెంటనే పరమేశ్వరుఁడు ఉమాసహిత ముగ వృషభవాహనారూఢుఁడై సాక్షాత్కరించి, విచారశర్మను అనేకవిధముల లాలించి "ఇఁక నేనే నీకుఁ దండ్రిని. నీకు చండీశ్వరత్వము నిచ్చితి"నని ఆదరించెను. వెంటనే దేవతలు పూలవాన గురిసిరి. వేదఘోషములు చెలరేగెను. శివగణ ములు నాట్యముచేసెను. శర్మ చండీశ్వరపదవి నధిష్ఠించెను. యజ్ఞదత్తుఁడు శివ ద్రోహము చేసినను చండీశ్వరనాయనారువలన దెబ్బతినియెను; కావున ఈశ్వర సాయుజ్యమును బడసెను.

# 88. నీలకంఠనాయనారు

చిదంబరమున ఒక కులాలయువకుఁడు ఉండెను. అతఁడు సత్యనిరతుఁడు. శివపూజాధురంధరుఁడు. శివభక్తులను ఆదరించుటయందు అత్యాసక్తి గలవాఁడు. సంసారమున నుండియు ఆత్మానాత్మవివేకము గలిగి వర్తించువాఁడు. అతఁడు ప్రతిదినమును సంసారమునకు వలయుధనము ఎన్నికుండలు అమ్మిన వచ్చునో అన్నికుండలనే చేసి విక్రయించి జీవించుచుండెను. అతఁడు తఱుచుగ పరమేశ్వరునకు నీలకంఠనామము వచ్చుటకుఁ గారణమైన క్షీరసాగరమథనగాథను అందఱకును జెప్పుచుండును. ఆకారణమువలన అతనికి తలిదండ్రులు పెట్టిన పేరు పోయి, "నీలకంఠుఁడు" అని పేరు వచ్చెను.

ఒకనాఁటిరాత్రి నీలకంఠుఁడు ఒక వేశ్యయింటికిఁబోయి సుఖించి, ప్రాతఃకాలమున నింటికి వచ్చెను. అతిబుద్ధిమంతురాలగు ఆతనిభార్య ఆసంగతి కనిపెట్టి, అందులకు ఏమియు ననక యథాపూర్వముగ అన్నమువండిపెట్టి, రాత్రి ఆతనితోఁగూడ ఒక గదియందే శయనించియు, అతఁడు సంగమాపేక్షతో రాఁగా "వలనుపడదు" అని ఖండితముగాఁ బలికెను. నీలకంఠుఁడు 'ఈమె సరస మాడుచున్నది' అని తలంచి మంద హాసముతో ఆమె చేయిపట్టుకొనుటకు సమీపింపఁగా, ఆమె వెనుకకుఁబోయి "నన్ను తాకిన నీలకంఠుని పాదము ఆన" అని పలికెను. అదివిని నీలకంఠుఁడు తొలుత రిచ్చవడి, పిదప మాఱుపలుకక యొకచో నిశ్చింతతో శయనించెను. ఆమెయు మఱియొకచోట నిర్విచారముతోఁ బరుండెను.

అది మొదలుకొని వారిరువురును ఒకరి నొకరు తాకక, తక్కుంగల సమస్త కార్యములను ఐకమత్యము గలిగి నిర్వర్తించుకొనుచు, శివపూజ గావించుకొనుచుండిరి. వారికి ఒకరి నొకరు తాకవలయు నను సంకల్పమే లేకుండఁబోయెను. ఇట్లు చాలఁ గాలము గడచెను. వారిరువురును గూడ వృద్ధులైపోయిరి. ఏస్పర్శసౌఖ్యములును లేకుండఁగనే వారు ఇంతకాలమును గడపిరి. ఈదీర్ఘకాలములో వారు శివపూజను ఒక్కదినముననైనను అశ్రద్ధచేయలేదు. శివభక్తుల నాదరించుట మానలేదు. కులవృత్తిని మానలేదు; కాని వారిరువురును ఒకరి నొకరు తాఁకికొనరు అను సంగతి మాత్రము ఏరికిని దెలియదు.

పరమశివుఁడు వారినిఁ బరీక్షించి వారి మహిమమును లోకుల కందఱకును ఎఱుకపఱుపవలయు నని సంకల్పించి, యొకనాఁడు శివయోగివేషముతో వారి యింటికి వచ్చెను. ఆదంపతులు ఇరువురునుగూడ నాతని నత్యాదరముతో ఇంటిలోనికిఁ

గొనిపోయి చాల గౌరవించి, వినీతులై "నేడు మాయింట భిక్ష స్వీకరింపవలయు" నని ప్రార్థించిరి. యోగి వారు కొంచెముసేపు ఇతరులెరుగని చోటవారి నంపుల కంగీకరించి! "ఈభిక్షాపాత్రమును నీవు జాగ్రత్తచేసి యుంచుము. ఇది నాకు పరమాధనపాత్రమైనది. దీనినివిడిచి నేను ఉండజాలను. నీవు విశ్వాసపాత్రుడవుగాఁ గాన్పించుచున్నావు; కావున నీచేతి కిచ్చుచున్నాను. ఇది మృత్పాత్రమేయైనను కనకపాత్రముకంటెను మహత్త్వమైనది. రత్నములకంటెను గూడ మూల్యమైనది. ఇది నాప్రాణపదము. జాగ్రత్తగా దాఁచుము" అని ఇచ్చి, స్నానముచేసి వచ్చెదనని చెప్పి పోయెను.

నీలకంఠుఁడు ఆపాత్రను అతిజాగ్రత్తమైన స్థలమున నుంచి యోగికి వలయు సకలపదార్థములను సేకరింపఁజొచ్చెను. యోగి ఒక గడియ యైనతరువాత ఆపాత్రను మాయముచేసి, స్నానాదికమును నిర్వర్తించుకొని ఇంటికి వచ్చెను. నీలకంఠుఁడును ఆతనిభార్యయు యోగిని ఆదరముతోఁ దీసికొనివచ్చి కూర్చుండఁబెట్టిరి. అపుడు యోగి పాత్రను దెమ్మనఁగా, నీలకంఠుఁడు లోనికిఁ బోయెను; కాని పాత్ర ఉంచిన చోట లేకుండుటఁ గాంచి భయభ్రాంతుఁడై, కాలుగాలిన పిల్లివలె ఇల్లంతయు పరువు లెత్తుచు వెదకి, ఎంతకును గాన్పింపక పోవుటచే విసిగి, ఏమయినను సరియే యని యోగిచెంతకు వచ్చి చేతులు జోడించుకొని "క్షమింపవలెను. భిక్షాపాత్ర ఉంచిన చోట లేదు. అంతటను వెదకితిని; కాని కాన్పింపదయ్యెను. ఏమయినదో తెలియదు. నాభార్యఁగూడ వెదకినది. క్షమించి మమ్ము రక్షింపవలయును. ఆజ్ఞయిచ్చితిరేని తమ చిత్తమువచ్చిన పాత్రను క్షణములోఁ దయారుచేసి యిచ్చెదను" అని యనేకవిధములఁ బ్రార్థించెను.

అదివిని యోగి క్రోధతామ్రాక్షుఁడై, "నీవు బుద్ధిపూర్వకముగ నాభిక్షాపాత్రమును హరించితివి. నీవు శివపూజాధురంధరుఁడ వనియు, శివభక్తుల నారాధించు సత్పురుషుఁడవనియు విని వచ్చి మోసపోయితిని. నీవు కోటిపాత్రలను జేసియిచ్చినను దానికి సరిరావు. పదికోట్ల సువర్ణపాత్రములైనను నేను పుచ్చుకొనువాఁడను కాను. నీవు ఎఱుఁగ ననుచున్నావు; కావున నీభార్యచేతిని బట్టుకొని గుండములోదిగి స్నానముచేసి వచ్చి సత్యము పలుకుము. అట్లయిన నిన్ను క్షమింతును." అనియెను. నీలకంఠుఁడు మఱల నాతని పాదములమీఁద వ్రాలి "మహాత్మా! తమయాజ్ఞకు ఎదురు నభ్యంతరములేదు; కాని కొండొకకారణము వలన నేను నాభార్యను దాఁకను. నే నొక్కఁడను స్నానము చేసి సత్యము పలికెదను." అని ప్రత్యుత్తర మిచ్చెను. యోగి అందులకు అంగీకరింపక, "నీపని యిట్లుగాదు. చిదంబరమునందలి బ్రాహ్మణుల సభలో నీవిషయము తెలిపెద" నని యోగి

బయలుదేఱెను. నీలకంఠుఁడు నిశ్చింతతో నాతని వెంబడించెను. యోగిచెప్పిన దంతయు విని, బ్రాహ్మణులు "వారి భిక్షాపాత్రను ఇమ్ము. లేకున్న వారు నియమించి నట్లు భార్యచేతిని బట్టుకొని గుండములో మునిగి శపథము చేయుము" అని చెప్పిరి. నీలకంఠుఁడు మాఱుపలుకక భార్యను రప్పించి, ఒక వెదురుతెచ్చి ఒకకొన భార్యకిచ్చి రెండవకొన తాను పట్టుకొని గుండములో దిగఁబోయెను; కాని యోగి అందులకు అంగీకరింపక, "వెదురు వలదు. ఒకరిచేతి నొకరు పట్టుకొనవలయు" నని యఱచెను. అపుడు నీలకంఠుఁడు "ఇఁక దాఁచుటవలనఁ బ్రయోజనములేదు" అని నిశ్చయించుకొని, తమ శపథకారణమును బహిరంగముగ నుపన్యసించెను. అది విని అందఱు నాశ్చర్యపడి చూడఁగా, నచ్చట యోగి కాన్పింపఁడయ్యెను. ఇంతలో ఆకాశమునుండి యొక్కమాట విన్పఁబడియెను. పైకిఁ జూడఁగా, ఉమాసహితుఁడగు శంకరుఁడు వృషభారూఢుఁడై ఆకసమున నిలిచి "నీలకంఠా! నీవు నిక్కముగ నా భక్తుఁడవు. నీభార్య నాభక్తురాలు" అని, అందఱును జూచుచుండ నీలకంఠుని ఆతని భార్యను జేతులతో నెత్తి వృషభముమీఁద నెక్కించుకొని కైలాసమునకుఁ బోయెను. అచ్చటివా రెల్లరు నీలకంఠునియొక్కయు, ఆతనిభార్యయొక్కయు శివ భక్తికిని, శివుని భక్తపరతంత్రతకును అబ్బురపడుచు వెడలిపోయిరి.

---

## 89. జ్ఞానసంబంధమూర్తినాయనారు

శ్లో. "ప్రాతస్స్మరామి హృదిసంస్ఫురదాత్మతత్త్వం సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయం,
యత్స్వప్నజాగరసుషుప్తిమవైతి నిత్యం తద్బ్రహ్మ నిష్కళమహం నచ భూతసంఘః."

(ప్రాతస్స్మరణత్రయము)

చోళదేశమునందలి శియ్యాళి అనుస్థలమున నొకగ్రామమునందు శివపాద హృదయుఁడు అను నొకబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతనికి భగవతి యను భార్య కలదు. వారిరువురును సర్వకాల సర్వావస్థలయందును భక్తిశ్రద్ధలతో పరమశివునిఁ గొలుచుచు నుండిరి. వారికి సాంసారికమగు విచారము తక్క మఱేయేవిచారములేదు. అగుటచే వారు అందులకై చిరకాలము వేచియుండియు, ఫలము గానక బ్రోణీశ్వరుని బృహి నాయికను గొలువసాగిరి.

కొలదిదినములు గడచునప్పటికి భగవతి గర్భవతియయి నవమాసములు మోసి, చక్కని కుమారునిఁ గనియెను. యుక్తసమయమున శివపాదహృదయుఁడు కుమారునకు జాతకర్మాదికమును నెఱవేర్చి, చాల గారాబముతోఁ జూడసాగెను, శిశువు పరమశివుఁడు తన్ను భూలోకమున పుట్టించినందులకు మిగుల 'వగచుచు,

తలుచు అంబా యని ఏడువ సాగెను. ఒకనాఁడు శివపాదుఁడు కుమారుని ఇంట నుంచి స్నానమాడుటకై తటాకమునకుఁ బోయెను. బాలుఁడు వెంటఁబడియెను. అదిచూచి శివపాదుఁడు బాలుని భుజముమీఁద నెక్కించుకొనిపోయి తీరమునఁ గూర్చుండఁబెట్టి తాను తటాకమున దిగెను. కుమారుఁడు శివవియోగమును సైపఁ జాలక అంబా యని ఏడువఁ దొడఁగెను. అది చూచి సహింపఁజాలక పరమేశ్వ రుఁడు పార్వతితోఁగూడ నచ్చటకు వచ్చి పార్వతిచే బాలునకు పాలు ఇప్పించెను. తాను లాలించెను. ఇంతలో శివపాదుఁడు స్నానము చేసి, పరమశివుని ధ్యానించి, పరమశివుఁడు వచ్చి బాలుని లాలించుట మున్నగునవి ఎఱింగి పైకి వచ్చి, "వత్సా! నీకిపుడు పాలిచ్చినవారు ఎవరో చూపుమనియెను బాలుఁడు వ్రేలితో పైకిఁ జూపఁగా, నచ్చట పార్వతీపరమేశ్వరులు వృషభవాహనారూఢులై యుండిరి. అపుడు బాలుఁడు వేదసారమును ఎఱింగి; లోకులు ఉజ్జీవింపవలయునని తలంచి ద్రవిడభాషలో వృత్తరూపముగా విరచించెను. అది చూచి అందఱును ఆశ్చర్య పడిరి. దేవతలు పుష్పవర్షమును గురిసిరి. బాలునకు జ్ఞానసంబంధమూర్తి అని పేరు కలిగెను. అపుడు పార్వతీపరమేశ్వరులు ద్రోణికిఁ బోయిరి. జ్ఞానసంబంధమూర్తి నాయనారు వెంట బయలుదేఱెను. శివపాదుఁడు ఈయద్భుతమును గాంచి ఆశ్చర్య చకితుఁడై, పరమేశ్వరుని వినుతించుచు వెనుక బయలుదేఱెను. బ్రాహ్మణులు అంద ఱును అబ్బురపాటుతో నితరము తెలియక అట్లేయుండిరి. జ్ఞానసంబంధుఁడు కొంత సేపు పరమశివుని వినుతించి ఇంటికి మఱలఁగా, శివపాదుఁడు ఆతని నెత్తుకొని బయలు దేఱెను.

తరువాత నాయనారు అనేకబ్రాహ్మణుల ప్రార్థనలమీఁద తిరుననిప్పళ్లి, తలచ్చం గాడు, తిరువలంపురం, పల్లవనీశ్వరం, తిరుచ్చాక్కాడు, తిరువెణ్కాడు, తిరుముల్లె వాయిల్ మొదలగు వివిధస్థలములకుఁ బోయి, అందందు వెలసియున్న పరమశివుని వృత్తజాలంబులతో వినుతించి, మఱల స్వస్థలము చేరుకొనెను.

నీలకంఠయాప్పాణుఁడు అను గాయకుఁడు భార్యయగు విరవితోఁ గూడ నాయ నారును సేవించుటకు బయలుదేఱెను. నాయనారు ఎదురుచనఁగా పాణుఁడు సాష్టాంగ నమస్కారములు ఆచరించెను. పిదప ముప్పురును దేవాలయమునకుఁ బోయిరి. నాయ నారు తాను రచించిన కొన్నివృత్తములను పాడఁగా, పాణుఁడు వానిని వీణమీఁద వాయించి "స్వామీ! మీరు రచించిన వృత్తములను వీణెయమీఁద వాయించుటకు నాకు అనుజ్ఞ నీయవలయును" అని ప్రార్థించెను. నాయనారు అందులకు అంగీకరించెను. పాణుఁడు అదిమొదలు ఆవృత్తముల నన్నిటిని వీణమీఁద పాడుచు, లోకులను ఆనందింపఁజేయుచుండెను.

నాయనారు నటనసభాపతిని సేవింపవలయునని చిదంబరమునకుఁ బోయెను. అచ్చట అర్చకులు, బ్రాహ్మణులు మున్నగువారు నాయనారును చాల గౌరవించిరి. పిదప నాయనారు భగవత్సన్నిధికిఁ బోయి వృత్తములతో వినుతింపఁగా, పాణుఁడు వానిని అన్నిటిని వీణమీఁద వాయించి, నాయనారును బ్రార్థించి తన జన్మస్థలమగు తిరువెక్కత్తంపులియూరునకుఁ గొనిపోయెను.

నాయనారు తండ్రి భుజముల నొప్పివలన బాధపడుచుండుటఁ గాంచి, తప్పుటడుగు లిడుచు నడువఁదొడఁగెను. మారకపాడి అను గ్రామమునకుఁ బోవుచుండఁగా, మార్గమధ్యమున నొకయూరిచెంత నాతనికాళ్లు నొప్పి యెత్తెను. అప్పటికి సాయంత్రము అగుటచే వా రాయూరున మకాము చేసిరి.

నాఁటిరాత్రి పరమశివుఁడు మారకపాడిలోనున్న బ్రాహ్మణులకు స్వప్నమున సాక్షాత్కరించి, "ఇక్కడకు జ్ఞానసంబంధమూర్తినాయనారు వచ్చుచున్నాఁడు. ఆలయములో ముత్యాలగొడుగు, పల్లకి మున్నగునవి కలవు. వానిని గొనిపోయి నాయనారును గొనిరండు" అని చెప్పి, ఇక్కడ నాయనారునకుఁ గూడ స్వప్నమున "మారకపాడిబ్రాహ్మణులు ముత్యాలపాలకి మున్నగునవి తెచ్చుచున్నారు. వానిలోఁ బొమ్ము" అని యాజ్ఞాపించెను. మఱునాఁడుఉదయము నాయనారు అనుచరులకు స్వప్నవృత్తాంతము నెఱింగించి బయలుదేఱి కొంతదూరము పోవునప్పటికి, బ్రాహ్మణులు ఎదురువచ్చి పల్లకిలోఁ గూర్చుండఁ జేసి మహావైభవముతోఁ గొనిపోయిరి. నాయనారు అచ్చట స్వామిని సేవించి, వృత్తములతో వినుతించుచు కొన్నిదినములు ఉండి, అక్కడనుండి బయలుదేఱి తిరునెల్వెణ్ణై, తిరుప్పళువూరు, తిరుచ్చేంజలూరు, తిరుప్పనందాళ్ మున్నగు శివక్షేత్రములను దర్శించి స్వామిని పూజించి, వృత్తజాలములను గుఱిపించి, తుదకు స్వస్థలము చేరుకొనెను. ఆతనితల్లియగు భగవతి మిగుల నానందించెను.

శివపాదుఁడు యుక్తసమయమున కుమారునకు ఉపనయనము కావించి, వేదములను జెప్పుటకు గురువు నేర్పఱిచెను. నాయనారు వేదవేదాంగములను, సమస్తకళలను అతిస్వల్పకాలమునందే అభ్యసించెను. అనేకబ్రాహ్మణులు వచ్చి అనేకసందేహములఁ దీర్చుకొని నాయనారు పరమశివుని అపరావతార మని వినుతించుచుండిరి. వాగీశనాయనారు జ్ఞానసంబంధునిమహిమ విని సేవించుటకు వచ్చెను. నాయనారు ఎదురుపోయెను. పిదప నిరువురు స్వామిసన్నిధికిఁ బోయి సేవించి, ఇంటికి వచ్చిరి. వాగీశుఁడు జ్ఞానసంబంధునియింట కొంతకాలము ఉండి, వృత్తములతో నాతనిని వినుతించెను. పాణుఁడు ఆవృత్తములను వీణమీఁద వాయించి అందఱకును ఆనందము గలిగించెను.

ఒకనాఁడు జ్ఞానసంబంధుఁడు భక్తులు, బ్రాహ్మణులు మున్నగువారు అనేకులు పరివేష్టించి యుండఁగా, "ఈ ద్రావిడదేశమునఁ గల సకలక్షేత్రములను దర్శించి, అచ్చటచ్చట వెలసియున్న పరమశివుని సేవింప బయలుదేఱుచున్నాను" అని చెప్పెను. అది విని శివపాదుఁడు "కుమారా! నేను నిన్ను అనేకవ్రతములుచేసి కంటిని. లేకలేక వరప్రసాదమునఁ గలిగిననిన్ను విడచి నేను ఎట్లు ఇక్కడ నుండఁగలను? కావున నీతో నేనుగూడ వచ్చెదను. గొనిపొమ్ము" అని యడుగఁగా, నాయనారు అందులకు సమ్మతించెను. అంతట నొకశుభదినమున అందఱును బయలుదేరిరి. తొలుత వారు కావేరీనదికి ఉత్తరమునఁగల శివక్షేత్రములను సేవించిరి. నాయనారు తిరుప్పాచ్చిలాశ్రమము చేరవగాఁ బోవుచుండఁగా, నొకరాజు వచ్చి పాదములమీఁద వ్రాలి, "మహానుభావా! నాకు లేకలేక ఒక్కకొమార్త గలిగినది. యౌవనముతోఁగూడ నామె నొక పిశాచము ఆవహించెను. ఎందఱో మంత్రవాదులు వచ్చిరి; కాని ఏమియుఁ బ్రయోజనము కలుగదయ్యెను. అంతట నేను విసిగి స్వామిసన్నిధికి నాకొమార్తను బంపి వేసితిని; కాని ఇంతవఱకును ఆమెపై స్వామికి అనుగ్రహము కలుగలేదు. ఇంకను ఆమె అట్లే పీడిత యగుచున్నది. దేవరవారు వచ్చి నాకొమార్తను నన్ను కరుణింపవలయును" అని బహుభంగుల ప్రార్థించెను. రాజుదైన్యమును జూచి నాయనారు అంగీకరించెను. రాజాజ్ఞచే రాజపురుషులు క్షణములో పట్టణమును శృంగారించి మహా వైభవముతో ఎదురువచ్చి నాయనారును గొనిపోయిరి.

నాయనారు అక్కడకు వెళ్లినప్పటికి రాజకొమార్తె క్రిందఁబడి దొరలుచుండెను. ఆమెను జూచి నాయనారు దయార్ద్రహృదయుఁడై, "రాజపుత్రికను గరుణింపు" మని వృత్తజాలములతో స్వామిని వినుతించెను. వినుతి పూర్తియగు నప్పటికి రాచకన్నె నిద్రించిలేచినదానివలె లేచి, తండ్రి చెంతకుఁ బోయి కౌఁగిలించుకొనియెను. రాజు పరమానందభరితుఁడై, నాయనారునకు తాను మ్రొక్కి, కొమార్తచేత మ్రొక్కించి, చాల వినుతించెను. నాయనారు అక్కడనుండి యనేక శివస్థలములను దర్శించి, కొడిమాడచెంగునూరికిఁ బోయెను. అచ్చటఁ గూడ వచ్చినవారికి అందఱకును జ్వరములు ప్రారంభించి చాల బాధపెట్టెను. అంతట నాయనారు స్వామిని వృత్తజాలములతో ప్రార్థింపఁగా వారు నిరామయు లగుటయేగాక దేశమునందలి రోగములు అన్నియుఁగూడ నిర్ధామధామము లయిపోయెను. నాయనారు అక్కడనుండి చోళదేశమునకు దారితీసెను.

నాయనారు తొలుత త్రిశిరపురము (తిరుచినాపల్లి), జంబుకేశ్వరము మొదలగుస్థలములను దర్శించుకొని, తరువాత తిరువలంజుళి భట్టీశ్వరములకుఁ బోయెను. నాయనారు ఎండవలన బాధపడుచుండుటఁజూచి, ఒక శివభూతము ముత్యాల గొడు

గును తెచ్చి ఆకసమున నిలిచి పరమశివుఁడు నన్ను బంపెనని చెప్పెను. ఆమాట విని కూడనున్నవా రందఱును నాయనారుమహిమమును సన్నుతించిరి. అక్కడనుండి అందఱును తిరునల్లైయూరుమీఁదుగా తిరువావడుదుఱై గ్రామమునకు వచ్చిరి. అచ్చట శివపాదుఁడు "కుమారా! నేను యాగము చేయుకాలము సమీపించినది. ధనము కావలయును" అని చెప్పెను. అంతట నాయనారు పరమశివుని వినుతింపఁగా, నొక శివభూతము అనంతధనము తెచ్చి ఎదుటనుంచి "పరమశివుఁడు ఈధనమును పంపె" నని చెప్పెను. ఆధనముతో శివపాదుఁడు మహావైభవముతో యాగము చేసెను.

అందఱును మాయూరము మున్నగు క్షేత్రములను సేవించి, నీలకంఠయాళ్పాణుని తల్లి పుట్టినిల్లుగల ధర్మపురమును జేరిరి. పాణుని బంధువులు అందఱును ఎదురువచ్చి మహావైభవముతో గ్రామమునకుఁ దోడుకొనిపోయిరి. పాణుఁడు అక్కడ నాయనారు చేసిన వృత్తములను వీణెమీఁద వాయించి అందఱి నానందపెట్టెను. నాయనారు అక్కడనుండి బయలుదేఱి తిరుచ్చాత్తమంగమునకుఁ బోయి అచ్చట నాయనారునింట విందు కుడిచి, పిదప తిరునాగక్కారోణగ్రామమునకును తిరుచ్చెంగాట్టంగుడికినిఁ బోయి అందు చిరుతొండనాయనారునింట విందు కుడిచి, ఆతనిని వృత్తములతో వినుతించి, వానిని పాణునిచే వీణియమీఁద వాయింపించెను. అక్కడనుండి తిరుమగలమను స్థలమునకుఁ బోయిరి. నాయనారు దేవాలయమునకుఁ బోవునప్పటికి ఒక కోమటి పాము కఱువఁగా చనిపోయెను. అందులకు అతనితో నున్నయువతి ప్రక్కను బడి ఏడ్చుచుండెను. అనేక విషవైద్యులు వచ్చి పనిచేసిరి; కాని ప్రయోజనము కలుగదయ్యెను. నాయనారు వచ్చి సంగతి ఏమని యడుగఁగా, "స్వామీ! ధాముఁడు అను నాతండ్రికి మేము ఏడుగురము కొమార్తలము. మాతండ్రి 'నీకు నాకొమార్తనిచ్చెద'నని సర్పదష్టుఁడైన ఈతనిని ఆశపెట్టి దుర్బుద్ధియై అన్నమాట చెల్లింపక మాపెద్దయక్కను మఱియొకనికి ఇచ్చి పెండ్లిచేసెను. ఈతఁడు 'ఇది నీకు ధర్మము కా'దనఁగా నాతండ్రి "రెండవపిల్ల నిచ్చెద" నని చెప్పి మఱల మోసము చేసి ఆమెను గూడ మఱియొకనికి ఇచ్చెను. నాతండ్రి తుదకు నిర్దయుఁడై ఈతనికి ఆశపెట్టియు నా అక్కలనాలుగురను అట్లు ఇతరులకే ఇచ్చి పెండ్లిచేసెను. తుదకు న న్నిచ్చెద ననియెను. ఇంటివద్దనున్నచో నన్నుఁ గూడ నన్యునకు ఇచ్చునని భయపడి నేను ఈతనిం బెండ్లియాడఁ దలఁచి, ఈతనితో ఇలువెడలివచ్చితిని. ఇక్కడ నితఁడు ఇట్లయ్యెను" అని ఘోరముగా విలపింపసాగెను. అంతట నాయనారు ఆమెను విలపింపవలదని చెప్పి, మృత్యుంజయుని వృత్తజాలములతో వినుతింపఁగా ఆవైశ్యుఁడు లేచి కూర్చుండెను. ఆకన్యకవలన సంగతి యంతయు విని, ఆవైశ్యుఁడు

పరమభక్తితో నమస్కరించెను. నాయనారు వారిని ఆశీర్వదించి, వధూవరులై మెలంగుఁడు అని హితోపదేశము గావించి, అక్కడనుండి బయలుదేఱి తిరుశ్వాసగలూరు సమీపమునకుఁ బోవుచుండెను. అప్పుడు మురుగనాయనారు అనునాతఁడు వచ్చి సవైభవముగాఁ దీసికొనిపోయెను. అంతట వాగీశనాయనారు తిరువాలూరును సేవించుకొని వచ్చుచున్నాఁడని కలకలం బుప్పతిల్లెను. జ్ఞానసంబంధుఁడు అతనికి ఎదురుగఁ బోయెను. ఇరువురును గలిసికొనిరి. ఒకరినొకరు వందనస్తుత్యాదులచే గారవించుకొనుట యైనతరువాత, వాగీశునిచే తిరువాలూరి వైభవమును విని జ్ఞానసంబంధుఁడు అచ్చటికిఁ బోయి కొన్ని దినములు వల్మీకనాథుని సేవించి, మఱల వాగీశునిచెంతకు వచ్చెను. అక్కడకు నీలకక్కనాయనారును చిరుతొండనాయనారును వచ్చిరి. అందఱును మహానందముతో కాలము గడపసాగిరి.

ఇట్లు కొన్ని దినములు జరిగినతరువాత వాగీశనాయనారును, జ్ఞానసంబంధనాయనారును, మురుగనాయనారును అక్కడనుండ నియమించి, నీలకక్కనాయనారును చిరుతొండనాయనారును స్వస్థలములకుం బో నియమించి, తాము తక్కుంగల శివక్షేత్రములను సేవించుటకు బయలుదేఱిరి. తొలుత వారు తిరువంబరమునకుఁబోయి అక్కడనుండి తిరుక్కడయూరికిం బోయిరి. అచ్చట వారిని గుగ్గులుకలశనాయనారు ఎదురువచ్చి తిరువరట్టానమునకుఁగొనిపోయి తనయింట విందుపెట్టెను. అచ్చట వా రిరువురును చెరియొకమఠమునందును తమతమశిష్యులతో నివసించిరి.

శియ్యాళినుండి కొందఱు బ్రాహ్మణులు వచ్చి, దయచేయవలయునని ప్రార్థించిరి. అందులకు జ్ఞానసంబంధుఁడు స్వామి సెలవు పుచ్చుకొని వచ్చెదనని చెప్పి దర్శించి ప్రార్థింపఁగా, నారాత్రి ద్రోణీశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి, "నీ యిచ్చవచ్చినట్లు పోయి క్షేత్రములను సేవించుకొనుము" అని సెలవిచ్చెను. మఱు నాఁడు సంబంధుఁడు బ్రాహ్మణులను పిలిచి, శివక్షేత్రములను సేవింప ద్రోణీశ్వరుఁడు అనుజ్ఞ నిచ్చెను. మీరు పొండు అని చెప్పెను. వారు వెడలిపోయిరి. వాగీశుఁడును సంబంధుఁడును తిరువీళిమిలగ్రామమున నుండఁగా ఘోరమైన క్షామము సంభవించెను. జనసామాన్యమే గాక శివభక్తులుగూడ లెక్కలేనంతమంది చనిపోసాగిరి. అదిచూచి నాయనారులు ఇరువురును సహింపలేక స్వామిసన్నిధికిఁ బోయి ప్రార్థింపఁగా దర్శన మిచ్చి "ఈక్షామము పోవునంతదనుక నేను ధనమిచ్చెదను. దానితో మీరు అన్నార్తులను రక్షింపుఁడు" అని ఆనతిచ్చెను. వాగీశునకు పడమటి బలిపీఠమునందును, సంబంధునకు తూర్పుబలిపీఠమునందును, అసంఖ్యధనము దొరికెను. అంత నిరువురును నిరంతరాన్నదానము ప్రారంభించిరి; కాని వాగీశుని మఠమునందువలె, సంబంధుని మఠమున సంతతము నన్నము లభింపదయ్యెను.

సంబంధుఁడు కారణమేమని పరివారమును అడుగఁగా "స్వామీ వాగీశులు ఇచ్చు నాణెములు త్వరగా మాఱుచున్నవి. మీరు ఇచ్చిన నాణెములు మారక మిచ్చి బతిమాలిన గాని ఎవరును పుచ్చుకొనుట లేదు. ఈకారణమువలన మనకు సామానులు వెంటవెంటనే సమకూడుట లేదు" అని చెప్పిరి. సంబంధుఁడు అపుడు "వాగీశుఁడు మహానుభావుఁడు. ఆతనితో నేను సాటియా?" అనుకొని తన మొహారీలుగూడ ఏఆటంకములును లేకుండ మాఱునట్లు అనుగ్రహింపవలయునని వృత్తజాలముతో పరమశివుని వినుతించెను. తోడనే అట్లయ్యెను. అప్పటినుండియు వాగీశునిమఠమునందును, సంబంధునిమఠమునందును సమానముగ అన్నదానము జరుగసాగెను.

కొన్నిదినములకు క్షామము తొలఁగిపోయెను. నాయనారులు ఇరువురును శివక్షేత్రములను దర్శించుకొనుచు వేదారణ్యమునకు వచ్చిరి. అచ్చట వేదారణ్యేశ్వరస్వామి ఆలయద్వారము వేదము లర్చించినదినము మొదలు మూసికొనిపోయి యుండుటచే భక్తులు మఱియొకద్వారమును ఏర్పాటు చేసికొనిరి. సంబంధుఁడు అది చూచి వాగీశునితో, "మహానుభావా! మనము ఆద్వారమున లోనికిఁ బోవుట తగదు; ఈద్వారము తెఱవఁబడునట్లు దేవరవారు వృత్తజాలముతో వినుతింప వలయు" నని కోరెను. వాగీశుఁడు అట్లే చేయఁగా, తోడనే తలుపులు తెఱువఁబడెను. "వారిరువురును కైలాసమునుండి వచ్చిన మహానుభావులు" అని భక్తులు ఎల్లరును తలంచిరి. కొంతసేపటికి సేవ ముగియఁగా వారిరువురును ఇవ్వలకు వచ్చి వాగీశుఁడు, "తలుపులు మూయఁబడునట్లు దేవరవారు ప్రార్థింపవలయును" అని సంబంధుని కోరెను. సంబంధుఁడు వృత్తజాలముతో వినుతింపఁగా, తోడనే ద్వారము పిహితమయ్యెను.

వాగీశుఁడును, సంబంధుఁడును నొకరినొకరు పొగడుకొనుచు నిద్రింపఁగా, స్వప్నమున స్వామి సాక్షాత్కరించి, "నాదర్శనము తిరువామూరున నగును" అని చెప్పి పోవుచుండెను. అంతట వాగీశుఁడు "అట్లుగాదు నిలువుము" అని వెంటఁబడెను. అంతట స్వామి నిలిచి సేవ యొసఁగెను. అపుడు సంబంధుఁడు గూడ పోయి సేవించెను. మఱునాఁడు ఇరువురును తిరువామూరునకుఁ బోయి దర్శనముచేసికొని వృత్తజాలముతో వినుతించి మఱల వేదారణ్యమునకు వచ్చి చేరిరి.

శైవమతస్థుఁడగు పాండ్యరాజు దైవదుర్విపాకమువలన జైనమతమునఁ బ్రవేశించెను. "యథా రాజా తథా ప్రజా" యనునార్యోక్తి యథార్థము గదా! జనులు ఎల్లరునుగూడ జైనులైరి. రాజుభార్యయు, చోళరాజుకొమార్తయు నగు మహిళానాయికయు, మంత్రియగు కులచ్చిరైనాయనారును మాత్రము శైవమత

మును విడువక ఎవరికినిఁ దెలియకుండ తమ మతధర్మములను నెఱవేర్చుకొనుచుం డిరి. ఇంతలో వారికి జ్ఞానసంబంధుఁడు శైవమతోద్ధారణమునకై యవతరించెనని తెలియవచ్చెను. తోడనే ఇరువురును వారినిఁ బ్రార్థించి తీసుకొనిరావలసిన పని రాయబారుల నంపిరి. వారు వచ్చి చెప్పవలసిన వన్నియుఁ జెప్పిరి. సంబంధుఁడు వాగీశునితోఁ బ్రయాణ మయ్యెను; కాని వాగీశుఁడు "మహానుభావా! మీరు ప్రాయమున బాలురై యున్నారు. జైనులు కడు దుర్మార్గులు. వారివలన ఏమి కీడు మూడునో యని శంకించుచున్నాను" అనెను. సంబంధుఁడు "మనకు అట్టి సందేహము వలదు. పరమశివుని అనుగ్రహము ఉన్నంతకాలమును ఎట్టియాపదయు మన లను సమీపింపఁ జాలదు" అని పలికి "మీరు ఈచోళరాజ్యమునందే యుండుఁడు నేను పోయి అంతయుఁ జక్కఁజేసికొని వచ్చెదను." అని చెప్పి అతనిని అచ్చట నిలిపివేసి తాను వేదారణ్యేశ్వరుని ఒకమారు సేవించి వృత్తములతో నుతించి పాండ్యదేశమునకు బయలుదేరి మధురానగరమును సమీపించెను.

అచట జైనులకు దుస్స్వప్నములు, దుశ్శకునములు, దుర్నిమిత్తములును దోఁపసాగెను. అది చూచి జైనమతప్రముఖు లందఱును ఒకచోఁగూడి విచారణలు ప్రారంభించిరి. ఇది యిట్లుండఁగా సంబంధుఁడు వచ్చుచున్నాఁడని మహిళానాయి కకుఁ దెలియవచ్చెను. తోడనే ఆతని నెదుర్కొని తీసుకొనివచ్చుటకు తగిన ఏర్పా టులు చేయవలసినదని ఆమె మంత్రికిఁ దెలిపెను. మంత్రి పరివారమును వెంటఁ బెట్టుకొని స్వయముగా నెదురేగెను. రాణి సుందరేశ్వరస్వామిసన్నిధికిఁ బోయి సేవించి, అచ్చట సంబంధునిరాకకు ఎదురు చూడసాగెను.

అట సంబంధునిముందు పరమతహృదయభేదిని మున్నగు వివిధవాద్య ములు మ్రోగుచుండెను. 'పరమతవేదండకంఠీరవులు వేంచేయుచున్నారు. దుర్మత నిర్మూలనస్వామి విచ్చేయుచున్నారు' అని పరివారము బరాబరులు చేయుచుండిరి. సంబంధుఁడు ముత్తెములపల్లకి నెక్కెను. పరిజనులు ముత్తెముల గొడుగును పట్టి నడచుచుండిరి. కులచ్చిరైనాయనారు ఆతనిని ఎదుటఁ జూచి సాష్టాంగపడి లేవక అట్లె యుండెను. అదిచూచి పరులు ఈసంగతి చెప్పఁగా సంబంధుఁడు పల్లకిదిగి వచ్చి మంత్రిని లేవనెత్తి ఆదరముతోఁ గౌఁగిలించుకొని "పరమశివుఁడు మహిళా నాయకను సర్వదా రక్షించును" అని యాశీర్వదించెను. అందులకు మంత్రి పర మానందభరితుఁడై "ఈపాండ్యమండలమున జైనమతము నిండియున్నది. దేవర వారు దానిని నిర్మూలించి శైవమతమును నెలకొల్పి ఎల్లప్పుడును ఈదేశమున ఇతర దుర్మతములు ఏవియుఁ బ్రవేశింపకుండునట్లు అనుగ్రహింపవలయును" అని ప్రార్థించెను.

మధుర ఎట్టయెదుటఁ గాన్పించెను. అదిచూచి సంబంధుఁడు "పరమశివుని హాలాస్య మేది?" యని ప్రశ్నింపఁగా మంత్రిగారు "ఆగోపురమే" యని చూపించెను. తోడనే సంబంధుఁడు సాగిలఁబడి మ్రొక్కి లేచెను. పిదప నగరము సొచ్చి సుందరేశ్వరస్వామి ఆలయమునకుఁ బోయిరి. మహిళానాయిక వారినిఁ జూచియు సిగ్గువెంపున ఎదుటకుఁ బోఁజాలక మస్తకన్యస్తహస్తయై యొకప్రక్క నిలువఁబడెను. మంత్రి నాయనారునకు ఆమెను జూపెను. సంబంధుఁడు ఆదెసకు వెళ్లెను. మహిళానాయిక అపుడు సాష్టాంగము ఆచరింపఁగా, సంబంధుఁడు ఆమెను లేవనెత్తి "శివానుగ్రహము కలుగుఁగాక!" అని దీవించెను. ఆమె ఆతనిని అనేకవిధములు వినుతించెను. తరువాత మంత్రి జ్ఞానసంబంధుని ఒకచక్కని మఠమునఁ బ్రవేశపెట్టెను.

అప్పుడు జైనులు సంబంధునిరాక విని గుండె పగులగా, అందఱును ఒకచోఁ గూడి ఆలోచించికొని రాత్రి రాజుచెంతకుఁ బోయి, "శియ్యాళినుండి బ్రాహ్మణబాలకుఁడు ఒకఁడు శైవమతోద్ధరణము నిమిత్తము వచ్చియున్నాఁడు". అని చెప్పిరి. అందులకు రాజు కోపపడి "ఇపుడు మనము ఏమిచేయవచ్చు" నని యడిగెను. "సెలవయినచో రాత్రి మంత్రబలమువలన ఆతఁడు ఉండు మఠమును భస్మము చేసెదము. అది చూచి ఆతఁడు పాఱిపోవును" అని చెప్పిరి. రాజు అందులకు అంగీకరించెను. రాణి "ఏల మీరిట్లు చింతాక్రాంతులై యున్నారు" అని యడుగఁగా రాజు "మనపురమునకు శైవుఁ డొకఁడు వాదించుటకు వచ్చియున్నాఁడు; అందులకు ఇట్లు ఉన్నా" నని చెప్పెను. అందులకు ఆమె "మనకు ఈవిచారము ఏల? వాదములో ఏమతమువారు నెగ్గిన మనము ఆమతము నవలంబింతము." అని చెప్పి తన మేడకుఁ బోయి కులచ్చిరైనాయనారును రప్పించి, "మెలకువ గలిగియుండుము. జైనులు దౌర్మార్గ్యములు చేయవచ్చును." అని చెప్పెను. మంత్రి వల్లెయనెను.

జైనాచార్యులు మంత్రములతో నగ్నిని ఉపాసించిరి; కాని అగ్ని పంచాక్షరీజపపరాయణుఁ డగు సంబంధుఁడు ఉన్నచోటికిఁ బోఁజాల దయ్యెను. అంతట "రాజు ఈవృత్తాంతమును వినినచో మనలను నిందించును" అని తలంచి వారు ఆయగ్నినిఁ గొనిపోయి సంబంధుఁడు ఉన్న మఠముచుట్టును ప్రజ్వలింపఁ జేసిరి. పరిజనులు అగ్నినిఁ జూచి చెప్పిరి; కాని నాయనారు "ఇది రాజానుమతమున జైనాచార్యులు చేసియుందురు" అని నిశ్చయించి, "అగ్నినిఁ బురికొల్పుదునేని రాజు క్షణములో భస్మపటలమగును; కాని అట్లయిన మహిళానాయికకు ఉపద్రవము సంభవించును" అని యోచించి, ఆతఁడు "ఈయగ్ని రాజునకు ఉష్ణరోగమై బాధించుగాక!" యని శపించెను. వెంటనే ఆయగ్ని పాండ్యరాజును బాధింపసాగెను.

ప్రాతఃకాలమున లేచునప్పటికి ఉష్ణరోగ మంకురించి క్షణములో విజృంభించి బాధింపసాగెను. రాణియు, కులచ్చిరై నాయనారును ఆబాధను జూచి "ఇది జైనులు చేసిన అక్రమమునకు ఫలము" అని నిశ్చయించికొని, "ప్రభూ! మన నగరమునకు శైవమతోద్ధారకుఁ డగు మహాత్ముఁడు ఒకడు వచ్చియున్నాఁడు. ఇది జైనులు ఆతనికి చేసిన కీడునకు ఫలము. ఆతని నాశ్రయించెదమేని ఇది క్షణములో నివృత్తి యగును" అని చెప్పిరి. రాజు అది విని "అట్లయిన ఆతనిని రప్పింపుఁడు. ఈరోగము నాతఁడు నివృత్తిచేయునేని ఆతనిని శరణు వొందెదను" అని పలికెను.

మంత్రియు, మహిళానాయికయు వెంటనే సపరివారముగా బయలుదేరి నాయనారునకు సాష్టాంగదండప్రణామము లాచరించి, జైనులు గతరాత్రి చేసిన అక్రమమునకుఁ గొంతతడవు వగచి, కోటలో జరిగిన వృత్తాంతమంతయు నెఱింగించి 'వచ్చి కరుణింపుఁడు' అని ప్రార్థించిరి. సంబంధుఁడు అందులకు అంగీకరించి పరివారము ముత్యముల గొడుగులు పట్టి బరాబరులు చేయుచుండ, ముత్యముల పల్లకిమీఁద బయలుదేఱెను. రాణియు మంత్రియు పాదచారులై ఆతనిని మహావైభవముతోఁ గోటలోనికి దీసికొనివచ్చిరి. నాయనారుం జూచినతోడనే రాజునకు ఉష్ణవేగము కొంచెము తగ్గెను. అంత నాతఁడు నాయనారు మహాత్ముఁడని నిశ్చయించి, లేచి నమస్కరించి రత్నాసనమున నుపవిష్టునిఁ గావింపఁజేసెను. అపుడు సంబంధుఁడు "రాజా! ఉత్కృష్టమగు శైవమతమును విడిచి జైనమతమును అవలంబించితివి. సంకుచితచిత్తుఁడవు; కావున వాదోపవాదములవలన నీవు ఏమతము మంచిదో, గ్రహింపఁజాలవు; పరీక్షచేసి చూచి గ్రహింపుము. నీవు ఇపుడు క్రూరరోగమువలన బాధపడుచున్నావు. జైనులను రప్పింపుము. నీజాడ్యమును జైనులు తొలంగింతురేని, జైనమతమునందే యుండుము. మేము తొలంగింతుమేని శైవమతము నవలంబింపుము" అని పలికెను. పిదప కొంతసేపటికి రాజాజ్ఞచే జైనాచార్యులు వచ్చిరి. వారు శైవుఁడు రత్నాసనముమీఁదఁ గూరుచుండుట జూచి యోర్వఁజాలక, "మతవాదములో నీతని నోడించి అధోలోకమునకుఁ ద్రొక్కివేసెదము గాక!" అని నిశ్చయించుకొని వాదోన్ముఖులైరి. అపుడు రాజు వారినిఁ జూచి "నే నిపుడు క్రూరవ్యాధివలన బాధపడుచున్నాను. దీనిని మీ రిపుడు తొలంగింపఁ గలరేని నేను జైనుఁడనై యుందును. లేకున్న శైవాచార్యు లగు శ్రీజ్ఞానసంబంధనాయనారు వచ్చియున్నారు. వారు తొలఁగింతురేని శైవుఁడనయ్యెద" నని పలికెను. జైనాచార్యులు పన్నిదము బాగుగ నున్నదని అందులకు అంగీకరించి, మంత్రతంత్రములను బ్రయోగించిరి; కాని ఎంతసేపటికిఁ బ్రయోజనము కలుగలేదు. అంత రాజు సంబంధుని దెసకుఁ జూచెను. రాజు ఇంగితము నెఱింగి, సంబంధుఁడు పంచాక్షరి జపించి రాజునకు విభూతి నిచ్చెను. తోడనే

నిరామయుఁడును వజ్రకాయుఁడు నయ్యెను. అందులకు మంత్రియు, రాణియుఁ బరమానందమును బొందిరి. రాజు 'ఏమి చెప్పెద' రని జైనులఁ బ్రశ్నించెను. "ఇంకను గొన్ని పరీక్షలను చూడవలయు" నని జైనులు కోరిరి. రాజు వల్లెయని యంగీకరించెను.

"మేము మాజైవముయొక్క గుణగణములను ఒక పత్రమున వ్రాసెదము. మీశైవము గుణగణములను మీరు వ్రాయుఁడు. రెండును అగ్నిలోఁ బడవేయుదము. ఎవరిపత్రము మండిపోకుండునో, వారిమతము ఉత్కృష్టము" అని యొక జైనాచార్యుఁడు పలికెను. సంబంధుఁడు అందులకు అంగీకరించెను. ఉభయపక్షములవారును అట్లు వ్రాసిరి. వానిని రాజు అగ్నిలోఁ బడవేసెను. చూచుచుండఁగనే జైనులపత్రము బూడిదయైపోయెను. సంబంధునిపత్రము అట్లే యుండెను. మంత్రియు, మహిళానాయికయు చాల నానందించిరి. రాజునకు నాయనారుమీఁది భక్తి యధిక మయ్యెను.

జైనులు అంతటితో నూరకుండలేదు. "మేము ఇంకను పరీక్ష యిచ్చెదము. మఱల ఉభయులును చెరియొక పత్రమును వ్రాసెదము. వానిని వైఘునదిలో విడువవలయును. ఎవరి పత్రము ఏటికి ఎదురీదునో, వారిమతము శ్రేష్ఠము" అని మఱి యొక జైనాచార్యుఁడు అనియెను. సంబంధుఁడు అందులకు అంగీకరించెను. ఉభయ పక్షములవారును చీట్లువ్రాసి రాజుచేతికి ఇచ్చిరి. ఓడిపోయినవారికి శిక్ష యేమని యడుగఁగా జైనులు "ఓడినవారిని కొఱతవేయుఁడు" అని పలికిరి. అంతట నందఱును వైఘునదికిఁ బోయిరి. రాజు రెండు చీట్లను నదిలోవిడిచెను. చూచుచుండఁగా జైనులపత్రము సముద్రము దెసకు కొట్టుకొని పోయెను. శైవులపత్రము ధూమశకటమువలె నిరర్గళముగ ఏటికి ఎదురీదసాగెను. అది చూచి జైనులు భయభ్రాంతులైరి. పెంకితనము జూపిన జైనులను, ఎనిమిదివేలమందిని రాజు కొఱత వేయించెను. తక్కిన జైనులు అందఱును శైవమతము నవలంబించిరి. రాజుఁగూడ పరమ భక్తితో నాయనారునకు సాష్టాంగ దండప్రణామము లర్పించి, "పతితుఁడను, రక్షింపుడు" అని ప్రార్థించెను.నాయనారు దీవించి రాజునకు అపుడే శైవమతదీక్షనిచ్చెను. మంత్రియు, మహిళానాయికయు ఆనందసాగరమునఁ దేలియాడుచు నాయనారునకు సాష్టాంగప్రణామములు సమర్పించి, అనేకవిధముల వినుతించిరి. అంతట నాయనారు రాజు, రాణి, మంత్రి మున్నగువారిని వెంట నిడుకొని సుందరరేశ్వరుని ఆలయమునకుఁ బోయి సేవించెను. రాజు నాయనారును అక్కడనుండి సవైభవముగఁ గొనిపోయి మఠములోఁ బ్రవేశపెట్టెను. శివపాదుఁడు తన కుమారుఁడు పాండ్యమండలమునందలి జైనుల నోడించి అక్కడ శైవమతమును బ్రతిష్ఠించెనని విని వచ్చి కుమారునిఁ జూచి పరమానందభరితుఁడై, అక్కడనే యుండెను.

కొన్ని దినములు అక్కడ నుండి, పిదప నాయనారు తిరునెల్వేలి మున్నగు శివ క్షేత్రములను సేవించుటకు బయలుదేరెను. రాజు, రాణి, మంత్రియు ఆతనివియోగమును సైపలేక వెంట బయలుదేరిరి. ఆపోవుట పోవుటగా తిన్నగ రామేశ్వరమునకుఁ బోయి, నాయనారు అక్కడనుండియే లంకయందు వేంచేసియున్న పరమశివుని వృత్తజాలముతో వినుతించి, అక్కడనుండి కులచ్చిరైనాయనారు జన్మస్థలమగు మణమేర్కుడికిం బోయి అచటి స్వామిని సేవించుచు కొన్ని దినములు ఉండి "మేము చోళమండలమునకుఁ బోవలసియున్నది. మీరు మధురకుఁ బోయి శైవమతము నుద్ధరించుచుండుఁడు" అని చెప్పి యొప్పించి పంపివేసి తానపుడు చోళదేశము మార్గము బట్టెను.

మార్గమధ్యమున నొకనది యడ్డము వచ్చెను. అది కూలంకషముగఁ బ్రవహించుచుండుటచే చేయునదిలేక, పడవవాండ్రు పడవలను గట్టివేసి ఇండ్లకుఁ బోయిరి. అంతట నాయనారు భక్తుల నందఱను వానిపై నెక్కించి, పిదప తానెక్కి, ఎదుటఁ గాన్పించుచున్న తిరుకొళ్ళంబూదూరుస్వామిని వినుతించుట ప్రారంభించెను. తోడనే పడవ అవ్వలి గట్టునకుఁ బోయి చేరుకొనెను. నాయనారు తిరుకొళ్ళంబూదూరులో కొన్ని దినములు ఉండి స్వామిని సేవించి, బయలుదేరి శంఖకాహళాది బిరుదములను పరిజనులు వాయించుచు బరాబరులు చేయుచుండ బౌద్ధుల నివాసమగు బోధిమంగళము సమీపించెను. బౌద్ధులు అందులకు సమ్మతింపక "మీరు వాదించి మామతమును జయింపుఁడు; లేదేని ఊరక పొండు. అంతవఱకును మీ బిరుదులను వాయింపనీయము" అని పలికిరి. నాయనారు వాదించుటకు అంగీకరించెను. బుద్ధనంది అను బౌద్ధాచార్యుఁడు మహారోషముతో సంబంధుని జయించుటకు బయలుదేరెను. అపుడు నాయనారు శివుని వినుతించెను. తోడనే పిల్లల పిడుగుపడి దేహము తుకాతుకలుకాఁగా బుద్ధనంది మరణించెను. శైవులు హరహరయని వీర శంఖముల నూదిరి. అల్లకల్లోలము గావించిరి. అంతట బౌద్ధులు తర్కశాస్త్రప్రవీణుఁడగు సారబుద్ధుఁ డను మఱియొకయాచార్యుని వాదమునకు సిద్ధము చేసిరి. అంతట ఉభయపక్షములవారికిని తీవ్రమగు వాదము ప్రారంభమయ్యెను. కొంత తడవు వాదించి తుద కాతఁడు 'ఓడితి' నని యంగీకరించి 'శరణు' అని నాయనారు పాదములమీఁద వ్రాలెను. తక్కిన బౌద్ధులుగూడ నట్లే చేసిరి. అప్పుడు నాయనారు "మీమతము కూసుమతము అయిపోయినది; కావున శ్రేష్ఠమైన శైవ మతమును అవలంబింపుఁడు" అని బౌద్ధులకు ఆదేశించెను. బౌద్ధులు అంగీకరించి వెంటనే శైవు లయిరి.

తరువాత సంబంధుఁడు తిరుక్కడైయూరికి వచ్చెను. అక్కడ స్వామిసేవమైన తరువాత, వాగీశుఁడు తిరువూందురుత్తి యనుగ్రామమున నున్నాఁడని తెలిసెను.

తోడనే సంబంధుఁడు ముత్యాలపల్లకిమీఁద బయలుదేరెను. వాగీశుఁడు వాద్య ఘోషములు విని సంబంధుఁడు వచ్చుచున్నాఁడని యెఱింగి ఎదురువచ్చి పల్లకిదండిని మోయసాగెను. తిరుప్పూందురుత్తి చేరినతరువాత సంబంధుఁడు "వాగీశనాయనారు ఎక్కడ నున్నా" రని యడుగఁగా నప్పుడు ఆతఁడు ఎదురుగ వచ్చి "దాసుఁడు ఇంతవఱకును దేవరవారి పల్లకి మోసి ధన్యతఁ గాంచినాఁడు" అని పలికెను. తోడనే సంబంధుఁడు పల్లకి దిగి వచ్చి, వాగీశుని కౌఁగిలించుకొనియెను. ఇరువురు నొకరికొకరు ఏకకాలమున నమస్కారములు ఆచరించుకొని, ఒండొరుల వినుతించి కొని మఠమునకుఁ బోయిరి. అక్కడ సంబంధుఁడు తాను పాండ్యమండలమునఁ జేసిన దంతయుఁ జెప్పెను. వాగీశుఁడు తాను తొండమండలమునఁ జేసినదంతయు నెఱిం గించెను. సంబంధుని యనుజ్ఞనుబడసి వాగీశుఁడు పాండ్యమండలమునకుఁ బోయెను. సంబంధుఁడు కావేరికి ఉత్తరమున నున్న శివక్షేత్రములను దర్శించి, అక్కడనుండియే శియ్యాళికిం బోయి స్వామిని సేవింపసాగెను.

అక్కడ కొంతకాలము ఉండి సంబంధుఁడు భక్తులతోడను, తండ్రియగు శివపాదునితోడను తొండమండలమునకు బయలుదేరి తిరుప్పాదిరిపులియూరు, తిరువీథి, తిరుక్కోవెలూరు, తిరువణ్ణామల మొదలగు క్షేత్రములకుఁ బోయి తిరు వొత్తూరు చేరెను. అక్కడ నొక శివభక్తుఁడు వచ్చి "స్వామీ! నేను స్వామి నిమిత్తము తాటిచెట్లను పెంచుచున్నాను. అవి యన్నియు మగచెట్లయిపోయినవి; శైవ మతము మంచిది అయినచో, ఆమగచెట్లు అన్నియు ఆఁడుచెట్లు కావలయును. అని జైనులు ప్రగల్భములు గొట్టుచున్నారు. ఆమీఁద దేవరచిత్తము" అని విన్నవించి యూరకుండెను. వెంటనే సంబంధుఁడు స్వామిని వృత్తములతో వినుతింపఁగా, మగచెట్లు అన్నియు ఆఁడుచెట్లు అయి, పిందెలతోడను, గెలలతోడను ప్రకాశింప సాగెను. అంతట జైనులు అందఱును సంబంధుని శక్తికి పరమాశ్చర్యచకితులై, "ఇట్టి మహాత్ముని యెదుట బౌద్ధమతము నిలువఁజాల" దని తలంచి, ఆతని నాశ్ర యించి శైవులైరి. పిదప సంబంధుఁడు కాంచీనగరముమీఁదుగా తక్కుంగల శివ క్షేత్రములను సేవింపఁ బోవుచుండఁగా, మార్గమధ్యమున తిరువాలంగాడు అను గ్రామము తగిలెను. అది కారక్కాలమ్మ శిరస్సుతో నడచిన స్థలము; కావున తాను పాదములతో త్రొక్కఁగూడ దని సమీపమునుండియే ధ్యానించి, ఆరాత్రి అక్కడ శయనించెను. రాత్రి అచ్చట పరమశివుఁడు సంబంధునకు స్వప్నమున సాక్షాత్కరించి "నన్ను వృత్తములతో వినుతింపవా?" యని ప్రశ్నించెను. సంబం ధుఁడు తోడనే మేల్కాంచి, వృత్తజాలములను వెల్లివిరియునట్లుఁ గావించెను. మఱు నాఁడు అక్కడనుండి బయలుదేఱి తిరుప్పాచూరు మున్నగు క్షేత్రములను సేవించి,

కాళహస్తి చేరి స్వామిని సేవించి, కన్నప్పనాయనారును వినుతి చేసి, అచ్చట నివసించి యుండియే ఉత్తరకైలాసము, కేదారేశ్వరము మున్నగు దివ్యస్థలములను సన్నుతించి, పిదప ననేకస్థలములు సేవించుకొనుచుఁ బోయి, తిరువట్టూరు చేరికొని స్వామిని సేవించుచుండెను.

మైలాపురమున శివభక్తుఁడును అధిక ధనవంతుఁడు నగు శివమిత్రుఁడు అను నొక వైశ్యకులజుఁడు ఉండెను. అతనికి సమస్తమును గలవు; కాని సంతానము మాత్రము లేదయ్యెను. అందుఁకు వగచి, ఆతఁడు పరమభక్తితో శివునిఁగూర్చి తపస్సు చేయఁగా, కొన్ని దినములకుఁ గొమార్తె కలిగెను. ఆమె పార్వతివలె మనోమోహినియై యుండెను. తలిదండ్రులు ఆమెకు పుష్పవతి యని పేరుపెట్టిరి. ఆమె శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానయై, రంభవలె త్రిలోకసుందరి యయ్యెను. శివమిత్రుఁడు ఆమెనుజూచి "ఈమె వివాహయోగ్యయై యున్నది. ఈమెను బెండ్లి యాడుటకుఁ దగు వరుఁడు ఎచ్చటను గాన్పింపఁడు. ఏమి చేయుదును?" అని చింతించుచుండఁగా, కొందఱు బందుగులు జ్ఞానసంబంధనాయనారు పాండ్యమండలమునఁ జేసిన అద్భుతకృత్యములను జెప్పి వినుతించిరి. అది విని శివమిత్రుఁడు "మీ రందఱు నుండఁగాఁ జెప్పుచున్నాను. నేనును, నాకొమార్తెయు, నాసర్వధనమును జ్ఞానసంబంధనాయనారునకుఁ జెందిపోయితిమి" అని పలికెను.

ఒకనాఁడు పుష్పవతి చెలికత్తెలతోఁ బూవులు కోయుచుండఁగా పాము కఱచి చనిపోయెను. శివమిత్రుఁడు "నాబిడ్డను బ్రతికించినవారికి నాధనమంతయు నిచ్చెద" నని ప్రకటించెను. దానిమీఁద ననేకులు వచ్చి పనిచేసిరి; కాని ప్రయోజనము లేకపోయెను. తుదకు శివమిత్రుఁడు "నాకొమార్త జ్ఞానసంబంధనాయనారునకు అర్పితయయ్యెగదా! ఆమెను దహనము చేసి, అస్థులను భస్మమును జాగ్రత్త చేసి, జ్ఞానసంబంధనాయనారు ఇక్కడకు వచ్చినప్పుడు సమర్పించెదను" అని తలంచుకొని, అట్లేచేసి బూడిదను అస్థులను భద్రముచేసెను.

పిదపఁ గొన్నిదినములకు సంబంధుఁడు తిరువట్టూరునకు వచ్చెనని తెలిసి శివమిత్రుఁడు మైలాపురమునుండి తిరువట్టూరుదాఁక పూలపందిళ్లు వేయించి భక్తజనులను వెంట నిడుకొని సంబంధునిఁ గొనిరావలయునని బయలుదేరెను. అప్పుడె నాయనారు మైలాపురమునకు బయలుదేరెను. ఇరువురును మార్గమధ్యమున సమావేశమై ఒకరి నొకరు చాల నాదరించుకొని, మైలాపురము చేరుకొనిరి. అందఱును కపాలేశ్వరుని ఆలయమునకుఁ బోయిరి. శివమిత్రుని యుదంతమంతయు మార్గమధ్యమున వినియున్నాఁడు; కావున సంబంధుఁడు శివమిత్రునిఁ జూచి "నీకుమార్తె అస్థులను బూడిదను దెప్పింపుము" అని యాజ్ఞాపించెను. శివమిత్రునియాజ్ఞవలన

పుష్పవతి చెలికత్తెలు అస్థులబరిణను ముత్యాలపల్లకిలో నుంచి తెచ్చిరి. సంబంధుఁడు ఆబరిణను దెఱచి స్వామి సన్నిధి నుంచి "మృత్యుంజయా! భక్తురాలి నను గ్రహింపుము" అని ప్రార్థించి "పుష్పవతీ రమ్ము" అని పిలిపించెను. తోడనే ఆబరణి నుండి పుష్పవతి పూర్వాధికశోభతో లేచి వచ్చెను. ఈయద్భుతమును జూచి అందఱు నాశ్చర్యచకితులై సంబంధుని అనేకవిధములఁ గొనియాడిరి. దేవతలు పుష్పవృష్టిఁ గురిసిరి. అచ్చర లాడిరి. కిన్నరులు పాడిరి. దేవదుందుభులు మ్రోగెను.

పిదప శివమిత్రుఁడు తాను నిశ్చయించుకొనిన దంతయు నెఱింగించెను. అందులకు నాయనారు "నీకుమార్తె బ్రతుకుటకు ఈశ్వరుఁడే సర్వకారణుఁడై నను నేను నిమిత్తమాత్రుఁడ నైతిని; గావున పుష్పవతి నీకువలెనే నాకును బిడ్డ యైనది. ఆమెను నేను పెండ్లియాడుట తగదు" అని తిరస్కరించెను. అంతట శివమిత్రుఁడు చేయునది లేక, ఆమెను కన్యకామఠమున అప్పగించెను. కొన్నిదినములు అయిన తరువాత ఆమె సిద్ధిపొందెను. పిదప సంబంధుఁడు మైలాపురమున కొంతకాలము ఉండి, అక్కడ నుండి తిరువామూరు, అచ్చరపాక్కము, పక్షితీర్థము మొదలగు దివ్యస్థలములు సందర్శించి, చిదంబరమునకుఁ బోయి శియ్యాళినుండి తండ్రి మున్నగువారు రాఁగా వారితోఁ గలిసి శియ్యాళికిఁ బోయెను. మురుగనాయనారు, నీలనక్కనాయనారు మున్నగువారు ఈవృత్తాంతము నెఱింగి శియ్యాళికి కుటుంబములతోఁ గూడ వచ్చి వసించి జ్ఞానసంబంధుని సేవింపసాగిరి.

తండ్రియగు శివపాదుఁడు అప్పటికి కుమారునకు పదునాలుగేండ్ల వయస్సు వచ్చియుండుటఁ జూచి, ఇదియే వివాహమునకు యుక్తవయస్సు అని నిశ్చయించి "పెండ్లి చేసికొనుము" అని చెప్పెను; కాని నాయనారు నిరాకరించెను. అప్పుడు అచ్చట నున్న బ్రాహ్మణులు అందఱును నమస్కరించి, "దేవరవారు వేదాగమములను స్థాపించుటకు అవతరించినారు; వేదాగమప్రకారము వివాహము చేసికొనుట ధర్మము" అని విన్నవించిరి. సంబంధుఁడు అందులకు అడ్డుచెప్పలేక, వల్లెయని యంగీకరించెను.

తిరునల్లూరు అను గ్రామమున నంబాండారునంబి అను మహాత్మునకు ఒక కొమార్త యుండెను. బ్రాహ్మణులు ఆమెయే జ్ఞానసంబంధునకు అన్నిటను దగిన కన్య యని నిశ్చయించి అడుగుటకు తిరునల్లూరునకుఁ బోయిరి. నంబాండారునంబి వారి యాగమనమునకు కారణము నెఱింగి పరమానందభరితుఁడై తన కన్యను సంబంధునకు ఇచ్చుటకు అంగీకరించి లగ్ననిశ్చయము గావించి పంపెను. యుక్త సమయమున వివాహ మయ్యెను. మానవులును దేవతలును కూడ ఆనందించిరి. పిదప నాయనారు నుతింపఁగా పరమశివుఁడు ఆకాశవాణి వాక్యములతో "నీవును,

నీభార్యయు, నీపెండ్లికి వచ్చిన భక్తులును మీయెదుట నున్న జ్యోతిలోఁ బ్రవేశిం పుఁడు" అని యానతిచ్చెను. చూడఁగా, ఎదుట శివసన్నిధిమొదలు ఆకాశమువఱకు జ్యోతి సాక్షాత్కరించియుండెను. అపుడు భార్యసహితుఁడై శ్రీజ్ఞానసంబంధనాయ నారు అగ్రేసరుఁడు కాఁగా, అచ్చట గలభక్తులెల్లరును ఆజ్యోతిలో ప్రవేశించి శివసాయుజ్యమును పొందిరి.

---

# 96. వాగీశనాయనారు

తిరుమునైప్పాడి దేశమునఁ గల తిరువామూరిలో వెలమజాతివాఁడగు పుగళనారు అనునతఁడొకఁడుండెను. ఆతని భార్యపేరు మాదినియారు. ఆమె కొన్నిదినములకు గర్భము దాల్చి ఒకకొమార్తను గనియెను. మఱికొంతకాలము నకు ఒక కుమారుఁడు గూడ గలిగెను. వారు కొమార్తకు 'తిలకవతి' యనియు, కుమారునకు 'మరునీక్కియరు' అనియుఁ బేరులు ఉంచి మిగుల గారాబముతోఁ బెంచుకొనుచుండిరి. తలిదండ్రులు విద్యాభ్యాసము నిమిత్తము గురునికటమునకుఁ బంపఁగా, మరునీక్కియరు స్వల్పకాలమునందే సకలవిద్యలను నేర్చి తలిదండ్రుల నానందసాగరమున నోలలాడించెను.

ఇంతలో తిలకవతి యుక్తవయస్కురాలై వివాహయోగ్య యయ్యెను. ఈసంగతి విని "కలిప్పగయారు" అను సైన్యాధిపతి ఆమెను తనకు ఇచ్చి పెండ్లి చేయవలసిన దని మాట్లాడుటకుఁ గొందఱ నంపెను. వారు పోయి మాట్లాడఁగా పుగళనారు కలిప్పగయారు శివభక్తుఁడును, తమ కులములోఁ బేరుపొందినవాఁ డును, అన్నివిధములఁ దనతో బాంధవము నందుటకుఁ దగినవాఁడును అయి యుండుటఁ జూచి తిలకవతిని ఆతనికి ఇచ్చుటకు అంగీకరించి లగ్న నిశ్చయము గావించి రాయబారులను గౌరవించి పంపివేసెను; కాని నిశ్చితదినమునాఁటికి శత్రువులతో యుద్ధము పొసఁగుటచే కలిప్పగయారు యుద్ధరంగమునకుఁ బోయెను.

ఇచ్చట వృద్ధాప్యమువలన పుగళనారు చనిపోయెను. ఆతని భార్య సహ గమనము చేసెను. మరునీక్కియరును, తిలకవతియు తలిదండ్రుల మృతికి విచా రించుచుండఁగా బంధువులు అందఱును వచ్చి విచారము ఉడిపి మృతులకుఁ జేయవలసిన ఉత్తరక్రియలు అన్నియు నెఱవేర్చిరి. ఇంతలో కలిప్పగయారు యుద్ధ రంగమున అనేక శత్రువీరులను దునుమాడి, తాను ఒఱఁగెను. ఆవార్త తెలిసి తిలకవతి, "మన తలిదండ్రులు నన్ను ఆయనకు ఇచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించిరి. ఇంతలో వివాహము కాకపూర్వమే వారు వీరమరణము పొందిరి, వారి

తోడనే నేను బోయెదను." అని తత్ప్రియత్నములు చేయఁగా మరుసీక్కయరు "అక్కా! తలిదండ్రులు పోయినప్పటినుండియు నిన్నే తలిదండ్రులుగా భావించు చుంటిని. అట్టిచో నీవు గూడ ఇహలోకమును విడిచి నన్ను దిక్కులేనివానినిగాఁ జేసిపోయెదవా?" అని దీనముగఁ బలికెను. తమ్ముని దైన్యముఁ జూచి తిలకవతి ఆత్మ హత్యకు సాహసింపఁజాలక యూరకుండెను. పిదప మరుసీక్కయరు "దేహము లశాశ్వతములు. కూడ వచ్చునది ఏమియు లేదు" అని నిశ్చయించుకొని విరాగియై కల ధనముతో సత్రములు, చావళ్లు, బావులు, చెఱువులు, తోఁటలు మున్నగువానిని నిర్మించి, ఇంక నిట్లే అనేక ధర్మకార్యములను జేయుచుండెను; కాని ఉత్తమమైన మతమిది యనుజ్ఞానముమాత్రము ఆతనికి లేదయ్యెను.

ఆకారణముచే నాతఁడు ఆసేతుహిమాలయ మగు భరతఖండమంతయుఁ జూచి వచ్చుటకుఁ బ్రయాణమై పోయి, మార్గవశమున పాటలీపుత్రనగరము చేరి అచ్చట జైనులప్రభావమును జూచి జైనమతమే ఉత్కృష్టమని నిశ్చయించుకొని ఆమతాచార్యుల నాశ్రయించి జైనమత గ్రంథములను జదివెను. సహజముగ నాతఁడు వివేకసంపన్నుఁ డగుటచే జైనమతమును స్వల్పకాలమునందే ఆమూలాగ్రముగ నవగాహనము చేసికొనెను. జైనులు ఆతని ప్రజ్ఞకు ఆశ్చర్యచకితులై, ఆతనిని దమ యాచార్యునిఁగా ఏర్పఱచుకొనిరి. ఇట తిరువామూరులో నున్న తిలకవతి పరమ శివునియెడల భక్తి యతిశయింపఁగా గరుడనది ఉత్తరతీరమున నున్న తిరువీధియను వీరట్టానక్షేత్రమునకుఁ బోయి ప్రతిదినమును అరుణోదయము కాకమున్నే లేచి కాల్యములు నిర్వర్తించుకొని, స్వామి ఆలయమునకుఁ బోయి ఊడ్చి గోమయ ముతో అనులేపనము చేసి పూలుగోసి తెచ్చి ఇట్లు కైంకర్యమును చేయుచుం డెను. ఇట్లుండఁగా నామెకు తన తమ్ముఁడు జైనమతము నవలంబించెనని తెలి సెను. అందులకు ఆమె చాల విచారించి, పరమశివుని ధ్యానించి "పరమేశ్వరా! నాతమ్ముఁడు అధఃపతితుఁడై పోయియుండుటఁ జూచియు చేయూఁత నిచ్చి రక్షింప కుండుట నీకుఁ దగునా?" యని ప్రార్థింపఁగా, ఈశ్వరుఁడు "మరుసీక్కయరు తొలి జన్మమున గొప్ప తపస్సుచేసెను; కాని అందొక తప్పిదము వచ్చుటచే నాతనికి స్వల్ప కాలము దుష్టమతమున నుండవలసివచ్చినది. వగవకుము. శీఘ్రముగనే ఆతఁడు నన్నాశ్రయించును. అందులకు కాలము సమీపించుచున్నది. ఆతనిని శూల వ్యాధిచే బాధించి, తన్మూలమున మంచిమార్గమునకుఁ ద్రిప్పెద" నని అనుగ్రహిం చెను. తెల్లవాఱి లేచునప్పటికి మరుసీక్కయరు తీవ్రమగు శూలవ్యాధిచే బాధ పొందసాగెను.

మరుసీక్కయరునకు జైనులు ధర్మసేనుఁడు అని నామకరణము చేసిరి. తమ మతాచార్యుఁడగు ధర్మసేను శూలరోగముచే పీడితుఁ డగుచుండుటఁ గాంచి

మందులు ఇచ్చియు, మాకులు ఇచ్చియు, మంత్రతంత్రములు ప్రయోగించియు చాల సేవ జేసిరి; కాని ప్రయోజనము కలుగకయుండెను. అంతేగాక జైనులు ఉపచారములు చేసినకొలఁదిని ధర్మసేనునకు బాధ యధికము కాసాగెను.

తుదకు అతఁడు "నాయక్క ఉపచారమువలనఁ గాని యీరోగము కుదురదు" అని నిశ్చయించుకొని, ఒకచాకునిఁ బంపి "సకలము నెఱిఁగించి. ఆమెను తీసికొనిరమ్ము" అని చెప్పెను. వాఁడుపోయి అంతయుఁ జెప్పఁగా, తిలకవతి "నీచులగు జైనుల స్థలమును నేను అడుగిడఁజాల" నని బదులు చెప్పెను. చాకుఁడు ఈసంగతి నెఱిఁగింపఁగా, ధర్మసేనుఁడు "శ్రేష్ఠమైన మాహేశ్వరమతమును విడిచి ఈజైనమతము నవలంబించుటచే నా కీబాధ కలిగెఁ గాఁబోలు" ననుకొని తన చెంతనున్న జైనసాంప్రదాయపు పరికరములను అన్నిటిని విడిచివేసి ఎట్లో తిరువీథికి వచ్చి తిలకవతి పాదములమీఁద వ్రాలి "రక్షింపుము" అని ప్రార్థించెను. అపుడు ఆమె ఈశ్వరుఁడు ఆనతిచ్చిన కాలము ఆసన్నమైనదని నిశ్చయించుకొని పంచాక్షరితో మంత్రించి విభూతినిచ్చి తమ్ముని ఆలయమునకుఁ గొనిపోయి స్వామికిఁ బ్రదక్షిణ నమస్కారములు చేయించెను. వెంటనే ఆతనికి మహేశ్వరానుగ్రహమువలన అనర్గళమైన కవితాధార పొడసూపెను. ఆప్రవాహమును విడిచి ఆతఁడు పరమేశ్వరుని వృత్తజాలముతో వినుతింపఁగా, చేతితో తీసివేసినట్లు శూలరోగము నివృత్తియయ్యెను. అపుడు పరమేశ్వరుఁడు ఆకాశవాణిరూపమున "నీవు నామహిమ నెఱిఁగి నన్ను తేవారములతో వినుతించితివి; కావున నీవు వాగీశుఁడు (నావుక్కరశు) అను బిరుదునామము నిచ్చుచున్నాను. ఇఁక నీవు వాగీశుఁడు అనియే వ్యవహరింపఁబడుదువు" అని చెప్పెను. అదివిని వాగీశుఁడు "పరమశివా! అజ్ఞానాంధకారకూపమున కూలియున్న నన్ను నిర్హేతుకజాయమానకటాక్షమువలన రక్షించిన నిన్ను ఏమని వర్ణింపఁగలను" అని మఱల వృత్తజాలముతో వినుతించి, ఆనందాతిరేకమువలన నృత్యము గావించెను. పిదప నాతఁడు ఇదివఱకు అవలంబించిన జైనమతము నీచాతనీచ మని యుక్తులతో సమర్థించుచు శైవమతాచారములను యథావిధిగా ననుష్ఠించుచు, అనేకులను సన్మార్గమునకుఁ ద్రిప్పి ఉజ్జీవింపఁ జేయసాగెను.

పాటలీపుత్రమున నున్న జైనులకు ఈసమాచారము వినవచ్చెను. వారికి అందఱకును గూడ చాలకోపము వచ్చెను. "మన దేవుఁడు . ఆశూలరోగమును మాన్పఁజాలక పోయెను. మహేశ్వరుఁడు కుదిర్చెను; కావున నిఁక ధర్మసేనుఁడు మనలను ఉన్మూలించు" నని జైనులు అందఱును వగచి కూడఁబలుకుకొని పల్లవ రాజు సన్నిధికిఁ బోయి "మహారాజా! ఇంతవఱకును మనకు ఆచార్యుఁడై యున్న

ధర్మసేనుఁడు నిష్కారణముగ మహోత్కృష్టమగు జైనమతమును విడువఁగోరి శూలరోగము బాధించుచున్నదని బొంకి, మనదేవుఁడు కుదుర్పఁజాలకపోయె నని ప్రకటించి, తిరువీధి నున్న తన అక్కయగు తిలకవతి చెంతకుఁ బోయి మహేశ్వరునిఁ గొలిచి శూలరోగము పోయిన దని చెప్పుచు వాగీశుఁడు అని పేరుపెట్టుకొని జైన మతమును అనేకవిధముల నిందించుచున్నాఁడు" అని చెప్పిరి. రాజు చాల మండి వాగీశుని శిక్షింపఁ దలఁచి, "భటులను బంపి తెప్పింపుము" అని మంత్రికి ఆజ్ఞా పించెను.

మంత్రి భటుల నంపక తానే స్వయముగఁబోయి "రాజాజ్ఞయైనది. రావలసినది" అని ప్రార్థింపఁగా, వాగీశుఁడు సర్వమునకును మృత్యుంజయుఁడు ఉండఁగా నాకేమి భయము?" అని నిర్భయుఁడై, మంత్రితోఁ గూడఁ బోయి రాజు నెదుట నిలిచెను. రాజు జైనుల సలహా చొప్పున నాతనికి నిర్బంధ కారావాసశిక్షను విధించెను. భటులు అగ్నిమయములగు గోడలు గల కైదులో నాతనిం బెట్టిరి. గొప్పనేరములను చేసిన వారి నుంచుటకు ఆకారాగృహము నిర్మింపఁబడెను. అందు మానవుఁడు ప్రవేశించి నచో రెండుదినములయందే భస్మమైపోవును; కాని వాగీశుఁడు అకలంకమహేశ్వర భక్తుఁడుగావున నాతనికి ఆగది మలయమారుతభరితమగు పుష్పవనమువలె నుండెను. భటులు వెడలిపోయినవెంటనే ఆతఁడు పరమశివుని ధ్యానించుటయందుఁ బ్రవృత్తుఁ డయ్యెను. ఏడుదినములు గడచిన తరువాత "ఆతఁడు ఎట్లు ఉన్నాఁడో చూచిరండు" అని రాజు భటుల కాజ్ఞాపించెను. వాండ్రు పోయి చూచి, "నిశ్చింతతో మహేశ్వర ధ్యానమున లీనుఁడైయున్నాఁడు" అని చెప్పిరి. రాజు అందులకు ఆశ్చర్యపడి, జైను లతో నాలోచించి "విషపానము చేయింపుఁడు" అని భటులకు ఆజ్ఞాపించెను. వాగీ శుఁడు మృత్యుంజయుని ధ్యానించి నిశ్చింతతో ఆవిషమును ద్రాగెను; కాని ఆతఁడు చావలేదు. ఆతఁడు చచ్చునంతదనుక ప్రయత్నింపవలసినదే యని జైనాచార్యులును, రాజును కూడఁబలుకుకొనిరి. రాజు ఏనుఁగుచే త్రొక్కించెను ; కాని ఆయేనుఁగు ఆతనిం ద్రొక్కక ప్రదక్షిణముచేసి ప్రక్కనిలిచెను. "చంపుము" అని మావటివాఁడు అంకుశముతోఁ బొడిచెను. తోడనే అది వీరభద్రావతారముదాల్చి మావటివానిని గ్రిందఁబడవేసి చంపి, మఱియు కాన్పించిన జైనుల నందఱను బొట్టలు చించి చంప సాగెను. కొందఱుజైనులు దాని కంటఁబడక తప్పించుకొని రాజునెదుటకుఁ బోయి 'ప్రభూ! వాఁడు మున్ను నేర్చికొనిన జైనమంత్రముల సాయమున బ్రతికియున్నాఁడు, వానిం దప్పక కడతేర్పవలయును' యని మొఱపెట్టిరి. ఇందులకు ఉపాయము ఏమని రాజడుగఁగా "బండరాతితోఁజేర్చి కట్టి సముద్రములోఁ బడవేయవలయు"నని వారు చెప్పిరి. రాజు అట్లే చేయించెను. సముద్రములో పడినవెంటనే బండరాయి తెప్ప

యయ్యెను. కట్లు విడిచిపోయెను. అలలు ఆతనిని తిరుప్పాదిరిప్పులియూరు క్షేత్రమునకుఁ గొనిపోయెను.

అంతట ప్రమథులు హరహర యని ఘోషించుచు వచ్చి ఆతనిం దీరమునకుఁ జేర్చి, పాటలీశ్వరస్వామి యాలయమునకుఁ గొనిపోయిరి. నాయనారును స్వామిని అనేక వృత్తములతో వినుతించి, అక్కడనుండి బయలుదేఱి, తిరుమాణికుళి మున్నగు శివక్షేత్రములను సేవించుచు తిరువీథిని సమీపించెను. అప్పుడు తిరువీథియందున్న భక్తులెల్లరును వాగీశుఁడు అక్కడనుండి వెడలినది మొదలుకొని నాఁటివఱకును జరిగిన దంతయు నెప్పటికప్పుడు వినియున్నారు; కావున మహావైభవముతో నెదురేగి పురమునఁ బ్రవేశపెట్టిరి. వాగీశుఁడు పరమభక్తిశ్రద్ధలతో స్వామిని సేవించుచు వినుతించుచు నుండెను.

ఇట్లుండఁగా అట వాగీశుని జైనుల సలహాలచొప్పున బాధించిన పల్లవరాజు వాగీశుని మహిమలను విని పశ్చాత్తప్తుఁడై తిరువీథికి వచ్చి వాగీశునికాళ్ల మీఁదఁబడి ప్రార్థించి, శరణు జొచ్చి శైవమతము నవలంబించి, వాగీశుని, తిలకవతిని సేవింపసాగెను. ఆతఁడు అంతటితో నూరకుండక, పాటలీపుత్రమున నున్న జైనమతమును బడఁగొట్టి, యారాళ్లతో తిరువీథితో స్వామికి గోపురమండపములను గట్టించెను.

పిదప నాయనారు అనేక శివస్థలములను దర్శించి, తిరుత్తూంగానైమాడము అను క్షేత్రమునకుఁ బోయి, స్వామిని వృత్తములతో వినుతించి, "స్వామీ! జైనమతాచారములను కొన్నినాళ్లు చేయుటచే నపవిత్రమైన ఈదేహముతో జీవించియుండుట దాసునకు ఇష్టము లేదు; కావున త్రిశూలవృషభాంకములను నాభుజములయం దుంపుము" అని ప్రార్థింపఁగా, పరమశివుఁడు ఆతని భక్తిజ్ఞానవైరాగ్యములకు మెచ్చి, ప్రమథులలో నగ్రేసరునిఁ బంపి "ఆతని కోరికను నెఱవేర్పుము" అని నియమించెను. ఆతఁడు వచ్చి అట్లే చేసెను. అక్కడనుండి నాయనారు తిరువరత్తర, కనకసభ మున్నగు స్థలములకుఁ బోయి చిదంబరము చేరుకొనెను. ఇట్లు ఉండఁగా నాతనికి శియ్యాళియందలి జ్ఞానసంబంధమూర్తినాయనారు ప్రభావము వినవచ్చెను. వెంటనే ఆతఁడు శియ్యాళికి బయలుదేఱిపోయి సంబంధుని గలిసికొని చాల నానందముతో నుండెను.

పిదప వాగీశుఁడు చోళమండలమునందలి శివస్థలములను దర్శింపనెంచి, సంబంధునివలనను స్వామివలనను సెలవుబడిసి తిరువాడుదురై, తిరువిడమరుదూరు మొదలగు శివస్థలములకుఁ బోయి, తిరుచ్చత్తిముత్తము అనుచోటికిఁ జని యుండఁగా స్వామి స్వప్నమున "తిరునల్లూరికి రమ్ము" అని చెప్పెను. ఆయాజ్ఞాప్రకారము వాగీశుఁడు అచ్చటకుఁ బోఁగా స్వామి, "నీకోర్కెను దీర్చెద" నని చెప్పి

శిరముపై తనచరణముల నుంచెను. అంతట వాగీశుఁడు మహానందభరితుఁడై బహు భంగుల వినుతించి అటనుండి అనేకస్థలములకుఁ బోయి సేవించుకొని, మఱల తిరునల్లూరునకుఁ జేరుకొనెను.

తాగళూరు అను గ్రామమున అప్పూదియడిగళ్ నాయనారు అను మహాత్ముఁడు ఒకఁడు ఉండెను. ఆతఁడు వాగీశునియందున్న భక్తివలన కుమారులకు అందఱకును వాగీశులు అనిపేళ్లు పెట్టెను. మఱియు నాతఁడు త్రవ్వించిన నూతులకును, వేయించిన తోఁటలకును, నిర్మించిన తటాకములకును ఇంకను ఇట్టి ధర్మకార్యములకు అన్నిటిమీఁదను "వాగీశుని ధర్మము" అని వ్రాయించెను. ఇదియంతయు విని వాగీశుఁడు ఆగ్రామమునకుఁ బోయెను. అప్పూదియడిగళ్ నాయనారు వాగీశుని సగౌరవముగ ఇంటికిఁ గొనిపోయి, విందునకు ఉండవలయునని ప్రార్థించెను. ఆతఁడు అందులకు అంగీకరింపఁగా నిముసములో వంటయయ్యెను. అప్పూదియడిగళ్ నాయనారు పెద్దవాగీశునకు, 'తోఁటకుఁ బోయి ఆకులు కోసికొని రమ్ము' అని యాజ్ఞాపించెను. ఆతఁడు ఆకు కోయుచుండఁగా పాము కఱచెను. వెంటనే యాతఁడు ఆకులు తెచ్చి ఇంటఁ బడవేసి, జరిగిన దంతయుఁ దలిదండ్రులకు ఎఱింగించి ఒక మూలయింటికిఁ బోయి పరుండి ప్రాణములు విడిచెను. ఈసంగతి తెలిసినచో వాఁగీశుఁడు భుజింపఁడు అని వృద్ధదంపతులు రహస్యముగా నుంచి, వాగీశుని భోజనమునకు లెమ్మని చెప్పిరి. ఆతఁడు భోజనమునకు వచ్చి పరమేశ్వరానుగ్రహమువలన గలిగిన దివ్యదృష్టివలన సంగతియంతయు గ్రహించి శవమును తనయెదుట తెచ్చియుంచునట్లు ఆజ్ఞాపించి వృత్తజాలముతో పరమశివునిఁ బ్రార్థించెను. తోడనే పెద్దవాగీశుఁడు నిద్రించి లేచినవానివలె లేచి కూర్చుండెను. "స్వామీ! ప్రొద్దు పోయినది. భుజింపుఁడు" అని వృద్ధదంపతులు అదేపనిగ ప్రార్థించుటవలన వాగీశుఁడు మాఱుపలుకకుండ భుజించి అక్కడనుండి వెడలిపోయెను. అనేకశివస్థలములను దర్శించి ఆతఁడు తిరువాలూరికిఁ జేరుకొనెను. అచ్చట నున్న నమినంది యడిగళ్ నాయనారు నీటితో దీపములు పెట్టెను. వాగీశుఁడు ఆతనిప్రభావమును వృత్తజాలములతో వినుతించుచు అచ్చటఁ గొన్ని దినములు ఉండెను. వాగీశుఁడు జ్ఞానసంబంధమూర్తినాయనారును కలిసి అనేకశివస్థలములను దర్శించి అనేకాద్భుత కృత్యములను గావించిరి.

తరువాత వాగీశుఁడు వడదళి యను స్థలమునకుఁ బోయెను. అచ్చటి శివలింగమును జైనులు దాఁచియుండిరి. అది తెలిసి వాగీశుఁడు "స్వామీ! దర్శన మిచ్చి రక్షింపుము" అని ప్రార్థించెను. నాఁటిరాత్రి స్వామి ఆయూరి నేలు రాజునకు స్వప్నమున సాక్షాత్కరించి "నన్ను జైనులు ఫలానిస్థలమున దాచియుంచినారు. వాగీశ

నాయనారు నాదర్శనము నిమిత్తము వేచియున్నాఁడు. నీవు జైనులను నాశనము చేసి నాకు ఆలయమును నిర్మింపుము" అని చెప్పి తాను మఱుగుపడియున్న స్థలము నెఱింగించెను. రాజు మేల్కాంచి స్వప్నవృత్తాంతమును మంత్రులకు ఎఱింగింపఁగా వారు 'స్వామి యాజ్ఞను తప్పక నెఱవేర్పవలయు' ననిరి. రాజు పోయి వెదకింపఁగా శివలింగము దొరకెను. దానిని దాఁచినారన్న కోపముతో రాజు జైనుల నందఱను ఏనుఁగుకాళ్ల క్రిందఁ ద్రొక్కించి గుడి కట్టుటకు శిల్పులకు సెలవు ఇచ్చెను. శిల్పులు అతిస్వల్పకాలమునందే ఆలయమును తయారుచేసిరి. రాజు వాగీశునిచే నిశ్చయింపఁబడిన శుభదినమున సంప్రోక్షణాదికముఁ జేయించి స్వామి నందు ప్రతిష్ఠసేయించెను. వాగీశుఁడు అచ్చట మహానందముతో కొన్ని దినములు వసించెను.

ఆతఁడు అక్కడనుండి బయలుదేరి జంబుకేశ్వరము, త్రిశిరపురము మున్నగుస్థలములను సేవించి ముందున కరుగుచుండఁగా నొకచోట తీరని యాఁకలి యయ్యెను. దానిని దీర్చుకొనుటకు ఉపాయముఁ గానక వాగీశుఁడు తడబడుచు పోవుచుండఁగా, ఈశ్వరుఁడు అది తెలిసి కాయలతోడను ఫలములతోడను నిండిన యొకతోఁటను నిర్మించి అన్నము మొదలగు ఆహారపదార్థములను ముందిడుకొని అక్కడఁ గూరుచుండి విశేషశ్రమతో వచ్చుచున్న వాగీశునిఁ గాంచి,— "మహానుభావా ! నీవు ఆఁకలిచే మలమలమాడుచున్నట్లు తోఁచుచున్నది. దయయుంచి ఈసరోవరమున స్నానమాడి ఈయన్నము భుజించి పొమ్ము" అని బతిమాలెను. వాగీశుఁడు చాల నానందించి స్నానము చేసి ఆయన్నము దిని తిరుప్పంజీలికిఁ బోయెద నని బయలుదేరెను. వృద్ధబ్రాహ్మణుఁడు "నేను గూడ ఆగ్రామమునకు వచ్చెద" నని చెప్పి, వెంట బయలుదేఱె, ఆగ్రామము సమీపమున తిరోహితుఁడు అయ్యెను. వాగీశుఁడు హఠాత్తుగ వృద్ధుఁడు మాయమగుటఁ గాంచి ఆతఁడు పరమేశ్వరుఁడు అని నిశ్చయించుకొని అనేకవిధముల వినుతించి, తిరుప్పంజీలికిఁ బోయి స్వామిని దర్శించి సేవించి, వినుతించి, తరువాత అరుణాచలము, కాంచీపురము, పక్షితీర్థము, తిరువాన్మియూరు, తిరువట్టూరు, తిరువాలంగాడు మొదలగు శివస్థలములను దర్శించి సేవించి, కాళహస్తివెళ్లి స్వర్ణముఖీ నదియందు స్నానమాడి, గిరిప్రదక్షిణాదికము నిర్వర్తించుకొని, స్వామిని సేవించి,అచ్చోట కొన్ని దినములు ఉండి, మఱల బయలుదేఱెను.

ఆతనికి ఉత్తరకైలాసమున నున్న పరమశివుని దర్శింపఁ గుతూహలము గలిగెను. ఆయూహతో నాతఁడు కాశీనగరము మున్నగుక్షేత్రములను దాఁటి కొంత దూరము పోవునప్పటికి చీలమండలవఱకును పాదములు అరిగిపోయెను. పిదప చేతులతో నడువఁగా, మణిబంధములవఱకును చేతులు అరిగిపోయెను. తరువాత వక్షస్థలముతోఁ గొంతదూరము నడచునప్పటికి వక్షముగూడ నరిగిపోయెను. పిమ్మట

వీఁపుతోఁ గొంతదూరము ప్రాఁకునప్పటికి వీఁపుగూడ నరిగిపోయెను. వాగీశుఁడు ఇఁకఁ జేయునదిలేక ఉత్తరకైలాసమును జేరఁజాలక పోయితిని గదా! యని దుఃఖించుచుఁ బడియుండెను. అప్పుడు పరమశివుఁడు అచ్చట నొకతటాకమును గల్పించి, తాను మునివేషముఁ దాల్చి నాయనారు ఎదుట నిలిచెను. నాయనారు ఆతనిం గాంచి మ్రొక్కి, తన సంగతి యడుగఁగాఁ జెప్పెను. అంతట మునిరూపధరుఁడగు ఈశ్వరుఁడు "ఉత్తరకైలాసమును జూచుట మానవమాత్రులవలనఁ గాదు. వెను దిరిగి పొమ్ము" అని చెప్పెను. వాగీశుఁడు "ఉత్తరకైలాసము చూచినఁగాని నేను వెనుదిరిగిపోను" అని బదులు చెప్పెను. ఆతని దీక్షకు మెచ్చి పరమేశ్వరుఁడు వెంటనే తిరోహితుఁడై అశరీరవాక్యముతో "వాగీశా! లెమ్ము" అనెను. ఆమాట వినఁబడఁగానే శరీరము యథాపూర్వముగ కాఁగా వాగీశుఁడు లేచి నిలిచి ఈశ్వరుని వినుతించెను. మఱల ఈశ్వరుఁడు అశరీరవాక్కుతో "ఈతటాకమున స్నానముచేసి పంచనదమునకుఁ బోయి, నన్ను ఉత్తరకైలాసమునఁ జూచినట్లే అక్కడఁ జూడు" మని యాజ్ఞాపించెను. వాగీశుఁడు వెంటనే లేచి పంచాక్షరిని జపించి, ఆసరోవరమున మునిఁగి, తాను పంచనదమునందలి యొకతటాకతీరమున నుండుటఁగని, పంచనదక్షేత్రమే కైలాసగిరిగను, అచ్చట నున్నవారు ప్రమథులుగను మునులుగను గాన్పింపఁ బ్రమథగణపరివేష్టితుఁడై యున్న పార్వతీపతిని గాంచి మహానందభరితుఁడై సేవించి, కన్నులు మూసికొని కొంతసేపటికిఁ దెఱువఁగా కైలాసము మాయమయ్యెను. అందులకుఁ జాల చింతించుచు వాగీశుఁడు అచ్చటనే కొన్ని దినములు ఉండెను.

పిమ్మట నాతఁడు అనేకశివస్థలములను సేవించి, జ్ఞానసంబంధమూర్తినాయనారుతో కలిసికొని తాను చోళమండలమునఁ జేసిన దంతయు నెఱింగించి, సంబంధుఁడు పాండ్యమండలమునఁ జేసిన దంతయు విని, ఒకరి నొకరు వినుతించుకొని, ఎవరి స్థలములకు వారు పోయిరి.

ఒకప్పుడు పరమశివునకు వాగీశుని వైరాగ్యమును బరీక్షింప సంకల్పము గలిగెను. అంత నాతఁడు వాగీశుఁడు ఆలయమున కైంకర్యము చేయుచుండఁగా, అంతటను నవరత్నములను బుట్టించెను. వాగీశుఁడు వానిని గమనించి చూడకయే చెత్తతోఁబాటు తుడిచిపాఱవేసెను. మఱియొకనాఁడు శివుఁడు వాగీశుని ముగ్ధునిఁ గావించిరమ్మని రంభాదుల నంపెను. వారందఱు సవైభవముగ వచ్చి యనేకవిధములఁ బ్రయత్నించిరి; కాని ప్రయోజనము కలుగలేదు. అది చూచినవారందఱును అత్యాశ్చర్యచకితులై వాగీశుని మిగులఁ గొనియాడిరి. పరమశివుఁడును మిగుల నానందించెను. వాగీశుఁడు ఇట్లు అచంచలభక్తుండై యెల్లపుడును పరమశివుని సేవించుచు, అవసానమున శివసాయుజ్యమును బడసెను.

---

# 91. కారక్కాలమ్మ

చోళదేశమునందలి కారక్కాలు అను గ్రామమున ధనదత్తుఁడు అను వైశ్యుఁడు ఉండెను. ఆతనికిఁ బుణ్యవతి యను నొకకొమార్తె పుట్టెను. అతఁడు తనబిడ్డ యుక్తవయస్కురాలైన పిదప పరమదత్తుఁడు అను వైశ్యున కిచ్చి, ఏక పుత్రిక యగుటచే ఆమెను విడిచియుండఁజాలక తన ఇంటిప్రక్క నొకపెద్దమేడను గట్టించి, అందు అల్లునిఁ గొమార్తను బ్రవేశపెట్టి విశేషధనమునుఁగూడ నిచ్చెను. పరమదత్తుఁడు ఆధనముతో వర్తకము ప్రారంభించి, విశేషధనము నార్జింపసాగెను. పుణ్యవతి తనకింత భాగ్యమున్నదిగదా యని గర్వింపక శివునిఁ బూజించుచు శివ భక్తుల నాదరించుచు నుండెను.

ఇట్లుండ నొకనాఁడు వర్తకవ్యవహారమువిషయమున పరమదత్తుని దర్శన మునకు వచ్చిన యొకఁడు రెండు గొప్పమామిడి పండ్లను నజరు ఈయఁగా పరమ దత్తుఁడు వానిని భార్యచెంతకుఁ బంపెను. ఆమె వానిని జాగ్రత్త చేయఁబోవు చుండఁగా నొక శివభక్తుఁడు క్షుధార్తుఁడై వచ్చెను. పుణ్యవతి ఆతనికి అన్నము వడ్డించి కూర యేమియు లేక పోవుటచే ఒక మామిడిపండు వడ్డించెను. భక్తుఁడు కడుపునిండ భుజించి వెడలిపోయెను. కొంత సేపటికి పరమదత్తుఁడు భోజనమునకు వచ్చెను. పుణ్యవతి మిగిలిన పండును వడ్డింపఁగా, దత్తుఁడు దానిని భుజించి, "ఇది చాల మధురముగా నున్నది. ఇంకొకటి తెమ్ము" అనెను. పుణ్యవతి మాఱుపలుకఁ జాలక లోపలకుఁ బోయి పరమశివుని ధ్యానించుచు విచారింపసాగెను. అంతట నీశ్వరుఁడు కరుణించి ఆమెచేత నొకపండు ఉండునట్లు చేసెను. అందుల కామె యాశ్చర్యపడుచు దానిని వడ్డింపఁగా, దత్తుఁడు భుజించి "ఇది అపూర్వమాధుర్యము గలిగియున్నది. ఇది దివ్యఫలముగా నున్నది; కాని ఈలోకమునకు సంబంధించినది గాదు ఇది నీకు ఎట్లు వచ్చినది?" అని యడిగెను. పుణ్యవతి జరిగినదంతయుఁ జెప్పఁగా, దత్తుఁడు ఆమాటలను నమ్మఁజాలక ఆమెయెడల సంశయము గలవాఁడై "అట్లయిన మఱియొకపండు గొనిరమ్ము" అని పలికెను. తోడనే పుణ్యవతి చేతిలో మఱియొకపండు ఉండెను. ఆమె దానిని భర్తచేతిలో నుంపఁగా వెంటనే మాయ మయ్యెను. అంతట దత్తుఁడు "ఈమె సామాన్యస్త్రీగాదు. ఈమెతోఁ గాఁపురము చేసిన కీడుమూడును" అని నిశ్చయించుకొని, ఆసంగతి బయల్పడనీయక కాలము గడుపుచుండెను.

ఒకప్పుడు విదేశమునకు వర్తకము నిమిత్తము పోయివచ్చెద నని బయలు దేఱి పోయి, విశేషవిత్తము సంపాదించి తిన్నగ ఇంటికిఁ బోక పాండ్యదేశమునకుఁ బోయి, అచ్చట ధనవంతుఁడగు నొక వైశ్యుని కొమార్తను బెండ్లియాడి, యచ్చటనే యుండెను. మఱియు నాతఁడు కొన్నినాళ్లకు కొమార్త గలుగఁగా, పుణ్యవతి యని పేరు పెట్టి మొదటిభార్యను దలంచుకొనుచు ఉండెను.

పరమదత్తుని వృత్తాంతమంతయు బంధుగులకుఁ దెలియవచ్చెను. అంతట వారు "ఆతఁడు ఇంక నిచ్చటకు రాఁడు. మనమో పుణ్యవతిని దీసికొని అచ్చటకుఁ బోవుట మంచి"దని భావించి, సకలము నామె కెఱిఁగించి, ఆమెను వెంటఁబెట్టుకొని పరమదత్తుఁడు ఉన్నచోటికిఁ బోయి ఒకయింట బస చేసిరి. అది చూచి పరమదత్తుఁడు భార్యను బిడ్డను వెంట నిడుకొనివచ్చి పుణ్యవతికి సాష్టాంగనమస్కారము లాచరించి, "మీయనుగ్రహముచే సుఖముగాఁ గాలము గడుపుచున్నాను. ఈదాసునిమీఁద నెప్పుడు నిట్టి యనుగ్రహమును జూపుచుండవలయును"అని ప్రార్థించెను. ఆశ్చర్య చకితయై పుణ్యవతి ప్రక్కకుఁ దొలఁగఁగా, బంధుగులు "భార్యకు ఇట్లు నమస్కరించుట తగునా?" యని ప్రశ్నించిరి. అది విని యాతఁడు "ఈమె మహిమ మీకుఁ దెలియదు. ఈమె మానవరూపము దాల్చిన లోకజనని గాని వేఱు గాదు. తెలిసిన తరువాత నామెతోఁ గాఁపురము చేయుట అధఃపతనమునకుఁ గారణమని ఎఱిఁగి, నేను ఇట్లు ఇక్కడ నుంటిని. ఆమె నామమే సంసారమున మునిఁగియున్నపుడుగూడ నన్ను బవిత్రము చేయునని భావించి నాకొమార్తకు పుణ్యవతి యని యామెపేరు ఉంచుకొంటిని" అని బదులు చెప్పెను. అపుడు పుణ్యవతి "పరమేశ్వరా! నాభర్త యానందముకొఱకు నేను ఇట్లు అలంకారములు ధరించి, సుందరిగా నుండఁగోరితిని. నాభర్త నన్నుఁ దిరస్కరించెను; కావున ఇఁక నాకు ప్రేతశరీరమును దయచేయుము" అని ప్రార్థించెను. తోడనే ఆమె మేననున్న ఆభరణములు అన్నియు డుల్లిపోయెను. శరీరమునందలి రక్తమాంసములు మాయమైపోయెను. అస్థిపంజరము మాత్రము నిలిచెను. అది చూచి బంధుగులెల్లరును పుణ్యవతి సాక్షాల్లోకజననియే యనియు, లోకమును రక్షించుట కామె యిట్లు అవతరించె ననియు నిశ్చయించుకొని, ఆమెకు సాష్టాంగదండప్రణామము లర్పించి యెవరి యింటికి వారు పోయిరి. పరమదత్తుఁడు తన యింటికిఁ బోయెను.

అంతట పుణ్యవతి "ఇఁక నిక్కడ నెందులకు?" అని యూహించి, కైలాసమునకు బయలుదేఱెను. పరమశివుని యనుగ్రహమువలన ఆమె వాయువేగమనోవేగములఁ బోయి కైలాసమును సమీపించెను. అప్పుడు ఆమె "ఇది కైలాసపర్వత పాదభూములు. ఇక్కడ కాళ్లతో నడువఁగూడదు" అని భావించి శిరముతో నడచి కైలాసగిరి

మీఁదికిఁ బోయెను. ఆమెను పార్వతీదేవి చూచి మిగుల నాశ్చర్యపడి పరమేశ్వరునకుఁ జూపి "ఆమహాత్మురాలిచరిత్రము అద్భుతముగా నున్నది. నాకుఁ దెలుపవలయును" అని కోరెను. "ఆమె మనలను సంతతమును వినుతించుచుండు అంబ. ఆమె కోరి యిట్టిదేహమును బొందెను" అని శివుఁడు చెప్పెను. ఇంతలో పుణ్యవతి పార్వతీపరమేశ్వరులను సమీపింపఁగా, శివుఁడు "తల్లీ ! రా" అని ఆదరవచనములు ఆడెను. పుణ్యవతి ఆపురాణదంపతులకు మ్రొక్కి, 'తండ్రీ!' అని మ్రొక్కెను. పరమశివుఁడు ఆనందించి 'నీకు ఏమివరము కావలయును?' అని యడిగెను. అంతట నామె "పరమేశ్వరా! నాకు పునర్జన్మ లేకుండునట్లు అనుగ్రహింపుము. ఒకవేళ పునర్జన్మ ఘటించెదవేని నీనామమును స్మరించుచు, నీగుణములను గీర్తించుచు, నృత్యసమయమున ఆనందించుచు నుండునట్లు అనుగ్రహింపుము" అని ప్రార్థించెను. పరమశివుఁడు "పుణ్యవతీ ! నీవు దక్షిణదేశమునందలి తిరువాలంగాడులో వసించుచు, నానృత్యముఁ జూచుచు, నన్ను వినుతించుచుండుము" అని ఆజ్ఞాపించెను. పుణ్యవతి వెంటనే తలతో నడచి తిరువాలంగాడు చేరి శివుఁడు ఆనతిచ్చినట్లు చేయుచు శివానందమున మైమఱచి యుండుచుండెను.

---

## 92. బాలభక్తనాయనారు

చోళదేశమునందలి తిరుచ్చెంగాట్టంగుడి యనుగ్రామమున బాలభక్తుఁడు అను నొక మహామద్రబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు అశ్వవిద్యయందును, శస్త్రవిద్యయందును, విశేషించి ఆయుర్వేదమునందును మహానిపుణుఁ డయ్యెను. ఆతనికి వేదసారమును గ్రహింపఁ దలంపుగలిగెను. ఆయూహతో నాతఁడు పరమశివుని ధ్యానించుచుఁ గీర్తించుచు నుండఁగా, శివుఁడే పరమేశ్వరుఁ డని యాతనికి విశ్వాసము దోఁచెను. ఎప్పుడు ఇట్టి నమ్మకము కలిగెనో అప్పటినుండియు ఆతఁడు శివభక్తులను బూజించుచు, మృష్టాన్నదానాదులచే వారిని సంతృప్తులం గావింపఁజొచ్చెను. బాలభక్తునకుఁ దొల్లిటి పేరు పరంజ్యోతి.

ఆతఁడు చోళరాజు నాస్థానమున ముఖ్యసేనానియుద్యోగము నిర్వహించుచుండెను. ఆతఁడు ఒకప్పుడు ఉత్తరదేశమునకుఁబోయి అచ్చటఁ గొందఱు రాజులను జయించి, అసంఖ్యధనమును గజాశ్వాదులను దెచ్చి తన రాజునకు సమర్పించెను. అప్పుడు మంత్రి రాజుతో "పరంజ్యోతియన సామాన్యునిగాఁ దలంపఁగూడదు. ఆతఁడు అచంచల శివభక్తుఁడు. నిజముగ అవతారపురుషుఁడు" అని చెప్పెను. అది విని రాజు "అయ్యో! తెలియక ఈమహానుభావునివలనఁ బనిగొంటిని గదా !" యని వగచి,

అసంఖ్యధనము నిచ్చి పరంజ్యోతి పాదముల మీఁద వ్రాలి, "స్వామీ! దాసుని అపరాధము క్షమించి, ఈధనమును స్వీకరించి సతతమును పరమశివుని బూజించుచు, శివభక్తులను ఆరాధించుచు, లోకము నుజ్జీవింపఁజేయుచుండుఁడు" అని పలికెను. పరంజ్యోతి వల్లెయని యాధనమును గైకొని ఇంటికిఁబోయి, అచ్చట వెలసియున్న పరమశివుని బూజించుచు, భార్యయైన తిరువెంగాడునంగై యను నామెతోఁగూడి పరమశివుని శివభక్తులను బూజించుచు నుండెను.

కొన్నిదినములు గడచినతరువాత తిరువెంగాడునంగై గర్భవతియై, గణపతి ప్రసాదమున ఒకకుమారునిఁ గనియెను. తలిదండ్రులు బిడ్డకు శ్రీయాళుఁడు అని పేరుపెట్టి మిగుల గారాబముతోఁ బెంచుకొనుచు అయిదవయేటఁ అక్షరాభ్యాసము గావించిరి. అప్పుడు జ్ఞానసంబంధమూర్తినాయనారు మార్గవశమున నచ్చటకు వచ్చి శ్రీయాళుని వృత్తములతో వినుతించెను.

ఒకప్పుడు పరమశివునకు పరంజ్యోతిని పరీక్షింపఁ దలంపు గలిగెను. అంతట నాతఁడు ఒక జంగము వేషము ధరించి వచ్చెను. పరంజ్యోతియింటిదాసి "యజమానులు ఆరాధనార్థము జంగములం గొనివచ్చుటకు పోయియున్నారు. ఇప్పుడే వచ్చెదరు. దయచేయుఁడు" అనెను; కాని ఆతఁడు అందులకు సమ్మతింపలేదు. అంతలో పరంజ్యోతి భార్యయగు తిరువెంగాడునంగై అచ్చటకువచ్చి అట్లే ప్రార్థించెను; కాని జంగము "నేను పురుషులు లేనిచోట నుండను. నేను గణపతి యాలయమున నుందును. నాయనారు వచ్చినతరువాత నాసంగతిఁ దెలుపుఁడు." అనిచెప్పి గణపతి ఆలయమునకుఁ బోయి ఒకచెట్టుక్రిందఁ గూర్చుండెను. పరంజ్యోతి ఊరంతయు వెదకెను; కాని యొక్కజంగము అయినను ఆతనికిఁ గాన్పింపలేదు. అంతటఁ జేయునదిలేక ఆతఁడు ఇంటికి రాఁగా, భార్య జరిగినదంతయు నెఱింగించెను. పరంజ్యోతి అపుడు మహానందముతో గణపతి ఆలయమునకుఁ బోయి, జంగముని ఆరాధనకు దయచేయవలయు నని ప్రార్థించెను.

జంగము "నేను నీయాహ్వానము నంగీకరించెదను; కాని నాకొకనియమము ఉన్నది. ఆఱునెలల కొకసారి నేను పశువును వండించుకొని తిందును. నేఁడు ఆదినము; కావున నీవు పశువును వండించి పెట్టఁగలవా ?" అని అడిగెను. పరంజ్యోతి తనకుఁ జాలపశువులు ఉన్నవనియు అట్లే చేయించెద ననఁగా, "నాయభిప్రాయము నీకుఁ దెలియలేదు. పశువు అనఁగా నాలుగుకాళ్లపశువు గాదు. రెండుకాళ్ల నరపశువు. అది యొకటే ఆకుటుంబమునకు భావ్యాధారమై యుండవలెను. అయిదేండ్లప్రాయమున నుండవలెను. తల్లి పట్టుకొనియుండఁగా తండ్రి ఖండింపవలెను. ఎవరును విచారింపఁగూడదు. మహానందముతో నుండవలెను. తినువారిని

తిట్టఁగూడదు. అట్లయిన నేను నీయింట విందు స్వీకరించెద" నని జంగము బదులు చెప్పెను. "నాయింట నట్టిపశువు గలదు. మీరు కోరినప్రకారము చేసెదను. దయ చేయుఁడు" అని పరంజ్యోతి మఱల ప్రార్థించెను. జంగము అంగీకరించి బయలు దేఱెను.

పరంజ్యోతి ఇంటికి వచ్చి సంగతి అంతయు నెఱింగించెను. ధర్మవతి అట్టి బాలుఁడు ఎక్కడదొరకు ననఁగా, 'మనపిల్లవాఁడే అన్నిటికిఁ దగియున్నాఁడు' అని పరంజ్యోతి చెప్పెను. ధర్మవతి ఆనందముతో నంగీకరించి, బాలుని స్నానముచేయించి పట్టుకొనఁగా, పరంజ్యోతి ఖండించెను. శిరస్సు పనికిరాదని విసర్జించి ధర్మవతి తక్కిన అవయవములనన్నిటిని వండెను. వంటయయిన తరువాత పరంజ్యోతి ప్రార్థింపఁగా జంగము భోజనశాలకు వచ్చెను. ధర్మవతి వడ్డించెను. "ఇందు తలకాయమాంసము ఉన్నట్లు తోఁచదు" అని జంగము అనఁగా, 'పనికిరాదని నూనివేసితి' నని ధర్మవతి చెప్పెను. దాసి, 'అది చాలదేమోయని శిరస్సుఁగూడ వండితిని' అని తెచ్చి వడ్డించెను. జంగము 'తోడులేక నేను భుజింపను; కావున రెండవజంగమును గొనిరమ్ము' అని పలుకఁగా, పరంజ్యోతి 'ఊరంతయు వెదకితిని. ఎందును గాన్పింపలేదు' అనియెను. జంగము 'నీవే ర'మ్మనఁగా పరంజ్యోతి వచ్చి కూర్చుండెను. 'నీకొడుకును గూడఁ దీసికొనిరమ్ము' అని మఱల జంగము పలికెను. 'వాఁడు ఇప్పుడు వచ్చుటకు వీలులే'దనఁగా, 'వీథిలోనికిఁ బోయి పిలువుము. వాఁడు రాకున్న నేను భుజింప' నని జంగము అనెను. అంతట చేయునదిలేక ధర్మవతి వీథిలోనికిఁ బోయి పిలువఁగా శ్రీయాళుఁడు పరుగుపరుగున వచ్చెను. ధర్మవతి కుమారుని ముద్దిడుకొని తీసికొని వచ్చి పరంజ్యోతికి ఇచ్చెను. ఆతఁడును ఆనందముతో ముద్దిడుకొని, "జంగము సెలవైనది. రమ్ము" అని భోజనశాలలోనికిఁ దీసికొనివచ్చిచూడఁగా జంగము అదృశ్యుఁడయ్యెను. వడ్డించినమాంసముగూడ కనఁబడదాయెను. అంతట పరంజ్యోతి జరిగినదానికి ఆశ్చర్యమును, తనకుమారుఁడు మఱల బ్రతికినందులకు ఆనందమును, జంగము భుజింపకుండఁ బోయినందులకు విచారమును బొందుచుండఁగా ఈశ్వరుఁడు పార్వతీసహితుఁడై వృషభారూఢుఁడై ఆకాశమున దర్శన మొసంగి సంగతి యంతయు వివరించి చెప్పి, తనతో నెల్లపుడు నుండుటకు పరంజ్యోతిని, ధర్మవతిని, శ్రీయాళుని, దాసియగు చందనవతిని కైలాసమునకుఁ గొనిపోయెను.

---

# 93. చేరమాన్ పెరుమాళ్ నాయనారు

మలనాడున రాజధానియగు మహోదయ మను మాఱుపేరుగల కొడుం గోళూరిలో గురుమహోదయుఁడను మాఱుపేరుగ చేరమాన్‌పెరుమాళ్లు అను నాతఁడు శైవమతమును అభివృద్ధిచేయుటకు చేరవంశమున అవతరించెను. దైవకృప వలన ఆతని బాల్యమునందే శివభక్తి యలవడి, కాలక్రమమున వృద్ధి యయ్యెను. తుదకు ఆతఁడు పరమశివుఁడు స్వతంత్రుఁడు అనియు, మానవులతోఁ గూడ తక్కినవారందఱును అస్వతంత్రులు అనియు, శివపూజయే తారక మనియు, నిశ్చయించి; ఇఁక సంసారమున నుండినచో చెడిపోవుట నిశ్చయమని సిద్ధాంతము చేసికొని, రాజకార్యములను విడిచి, తిరువంజక్కళ మను శివస్థలమునకుఁ బోయి శివపూజాధురంధరుఁడై యుండెను.

ఆదేశమునకు చెంగప్పరుఁడు అనునాతఁడు రాజు. ఆతఁడును బాల్యమునందే పురాకృతసుకృతపరిపాకమున సత్యాసత్య వివేకము నెఱింగి మోక్షము సంపాదింపవలయు ననియు, నది యోగాభ్యాసమువలన లభ్యమగు ననియు నిశ్చయించుకొని రాజ్యమును విడిచి అరణ్యమునకుఁ బోయెను. అపుడు మంత్రులు రాజులేని రాజ్యము చెడిపోవునని గ్రహించి తమరాజు మఱల నెట్లును సింహాసనము నధిష్ఠింపఁడని నిశ్చయించుకొని, తిరువంజక్కళమున నున్న చేరమాన్ పెరుమాళ్ చెంతకుఁ బోయి సంగతిసందర్భములు అన్నియు నెఱింగించి, "సింహాసనమును స్వీకరింపవలె" నని ప్రార్థించిరి. అంతట నాతఁడు "సింహాసనము నలంకరించి నచో విషయసౌముఖ్యము గలుగును. ఇఁకఁ జెప్పవలసినది ఏమున్నది? నవంటి వారికి..."

తట్టను బెట్టుకొని వచ్చుచుండెను. తొలుత వర్షముకురియుటచే మున్నుకరంగి వాని శరీరమంతయు నిండి పిదప నెండకాయఁగా ఒంటి తెల్లనై రజకుని భస్మానులిప్తుఁడగు మహేశ్వరునివలెఁ గనఁబడఁజేసెను. అంతట పెరుమాళ్లు ఆచాకలవాఁడు మహేశ్వరుఁడుగా కాన్పింపఁగా ఏనుఁగు డిగివచ్చి "స్వామీ! సేవకుని అనుగ్రహించినందులకు వందనములు" అని మ్రొక్కెను. అదిచూచి రజకుఁడు తెల్లవోయి కొంతతడవునకు జ్ఞానము రాఁగా "ప్రభూ! నేను చాకలవాఁడను, ఏలినవారి దాసుఁడను, ఇట్లు తమకు ధర్మమా?" యని తత్తఱపడసాగెను. "దేవరవా రిట్లు సేవ ప్రసాదించినారు. దాసుఁడు అంతకే ఆనందించుచున్నాఁడు" అనిపలికి, ఉత్సవమును ముందునకు నడపుకొనిపోయెను. ప్రజలు ఆతనిభక్తిశ్రద్ధలను జూచి అత్యాశ్చర్యపడిరి. అప్పటినుండియు పెరుమాళ్లు అనేకవిధముల శైవమతమును వృద్ధిచేయసాగెను.

పెరుమాళ్లు అనేకశివస్థలములను దర్శించి అందందు వెలసియున్న పరమశివుని సేవించి, స్వస్థలముఁ జేరుకొనెను. ఒకప్పుడు మధురయందు అవతరించి యున్న సోమసుందరేశ్వరుఁడు తన అంతరంగభక్తులలో అగ్రేసరుఁడగు బాణభద్రునకు సకలైశ్వర్యములను ఒసంగఁదలఁచి ఒకరాత్రి స్వప్నమున సాక్షాత్కరించి, "నీకు సకలైశ్వర్యములను ఒసంగఁదలఁచితిని. చేరమాన్ పెరుమాళ్లుపేర నొక చీటి నిచ్చెదను. దానిని గొనిపోయి ఆతనికిమ్ము. సకలమును నెఱవేర్చును" అని చెప్పి యొకచీటి నిచ్చెను. మఱునాఁడు బాణభద్రుఁడు ఆచీటినిఁ గైకొని పెరుమాళ్లు చెంతకుఁ బయలుదేఱెను. పెరుమాళ్లు బాణభద్రుఁడు వచ్చుచున్నాఁడని విని, పురముబైటకు ఎదురేగి సవైభవముగా నాస్థానమునకుఁ గొనివచ్చి రత్నాసనమునఁ గూర్చుండఁజేసి అర్ఘ్యపాద్యాదిక మిచ్చి పూజించి ఆగమనకారణ మడిగెను. అపుడు బాణభద్రుఁడు మాఱుపలుకక చీటినీయఁగా పెరుమాళ్లుచదువుకొని మహానందభరితుఁడై "సోమసుందరేశ్వరస్వామికి నేఁటికి నామీఁద అనుగ్రహాము గలిగినదా?" యని కొనియాడుచు, చీటిసంగతి మంత్రులకు ఎఱింగించి "కోశమున సకలమును బాణభద్రునియింట నుంచిరండు" అని ఆజ్ఞాపించెను. మఱియు బాణభద్రుఁడు మధురకుఁబోయెద ననఁగా పెరుమాళ్లు "స్వామీ! రాజ్యముగూడ స్వీకరించి దాసునిసేవ నంగీకరింపవలయు" నని ప్రార్థించెను. అందులకు బాణభద్రుఁడు "రాజ్యమును స్వీకరించుటకు పరమశివుని యనుజ్ఞలేదు." అనిచెప్పి వెడలిపోయెను.

ఒకనాఁడు పెరుమాళ్లు చిదంబరమున కనకసభాపతినిఁ బూజించునపుడు "నేఁడు స్వామి నూపురధ్వని వినరాదయ్యెను. ఇఁక నీపాడుజీవన మెందులకు?" అని కటారితోఁ బొడుచుకోఁబోఁగా స్వామి తటాలున సాక్షాత్కరించి "వత్సా! త్వరపడవలదు. సుందరమూర్తినాయనారు వృత్తజాలముతో వినుతించుచుండఁగా

ఆకవితామాధుర్యమునకు పరవశుఁడనై జాలము చేసితిని" అని పలికి సాహస ముడిపెను.

పిదప పెరుమాళ్లు సుందరమూర్తినాయనారును జూడఁగోరి తిరువాలూరికి బోయి సేవించి ఆతనితోఁ గూడి అనేక శివస్థలములను దర్శించి తుదకు ఆతనిని వెంట నిడుకొని కొడుంగోళూరికివచ్చి చేరుకొనెను. సుందరమూర్తి కొన్నిదినములు అక్కడ నుండి తరువాత తిరువాలూరికిఁ బ్రయాణము కాఁగా పెరుమాళ్లుభాండాగారమునఁ గల సకలధనరాసులను ఇచ్చి పంపించెను.

మఱియొకమాఱు శివస్థలములను సేవించుచు మార్గవశమున సుందరమూర్తి కొడుంగోళూరికి వచ్చెను. పెరుమాళ్లు ఎదురేగి మహావైభవముతోఁ బట్టణమునకుఁ గొనివచ్చి చాల నాదరించి మంచి బసలోఁ బ్రవేశపెట్టి విందులుచేసెను. ఒకనాఁడు భక్తిపరవశుఁడై సుందరమూర్తి వృత్తజాలముతో నుతించుచుండఁగా కైలాసము నుండి తెల్లని యేనుఁగు వచ్చి ఎదుట నిలిచెను. "నీవు కైలాసమునకు రమ్ము" అను అశరీరవాక్యముగూడ వినవచ్చెను. వెంటనే సుందరమూర్తి ఏనుఁగు నెక్కెను. ఆవెంటనే ఏనుఁగు కైలాసమునకు బయలుదేఱెను. అది చూచి పెరుమాళ్లు ఇఁక జాలము చేసినఁ బ్రయోజనము లేదని తటాలున గుఱ్ఱము నెక్కి దాని చెవిలో పంచాక్షరి నూఁదఁగా అదిగూడ ఏనుఁగువెనుక కైలాసమునకుఁబయనము సాగించెను. అది చూచి పెరుమాళ్లు ననుచరులలో ఆతనియెడల అవ్యాజ భక్తి గలవారు ఆతని వియోగమును సహింపఁజాలమని ఆత్మహత్య గావించుకొనిరి.

పెరుమాళ్లు సుందరమూర్తితో కైలాసమునకుఁ బోయెను. ఇరువురును ద్వారమువద్ద వాహనములు దిగిరి. ప్రమథులు వచ్చి సుందరమూర్తిని స్వాగతమిచ్చి లోనికిఁ గొనిపోయిరి; కాని పెరుమాళ్లును ద్వారికులు అడ్డగించిరి. సుందరమూర్తి అది చూచి పరమశివుని దగ్గఱకుఁ బోయిన తరువాత "స్వామీ! మహానుభావుఁడగు చేరమాన్ పెరుమాళ్లునాయనారు ద్వారమున వేచియున్నాఁడు; సెలవు ఈయవలె" నని ప్రార్థించెను. అంతట పరమశివుని అనుజ్ఞనుబడసి ప్రమథులు ద్వారముననున్న పెరుమాళ్లును లోపలకుఁ గొనిపోయిరి. పెరుమాళ్లుస్వామికి సాష్టాంగనమస్కారములు ఆచరించినపిదప, స్వామి "ఎందులకు వచ్చితివి ఇక్కడకు?" అని అడిగెను. అందులకు పెరుమాళ్లు "స్వామీ! సుందరమూర్తినాయనారును ఎడఁబాసి యుండఁజాలకయు, ఈదాసుఁడురచించిన స్తోత్రవృత్తములు సమక్షమున విన్పింపవలయుననియు, విశేషించి దేవరవారిని దర్శించి జన్మసాఫల్యమును బడయవలయుననియు వచ్చితిని" అనిచెప్పెను. పరమశివుఁడు పెరుమాళ్లు కవితామాధుర్యమునకు చాల మెచ్చి, గణాధిపత్యము నొసంగి ఆదరించెను.

# 94. కలిక్కామ నాయనారు

చోళదేశమునందలి తిరుప్పెరమంగలము అను గ్రామమున కలిక్కామ నాయనారు అనునతఁడు ఒకడు ఉండెను. కులమున అతఁడు వెలమ. చోళరాజులకు అతని వంశమువారు సేనాధిపతులుగానుండిరి. అది యాకుటుంబమునకు పారంపర్యాధికారమై యుండెను. కలిక్కామనాయనారు గొప్పశూరుఁడు. అనేక యుద్ధములలో జయముఁబడసిన వీరాధివీరుఁడు. మఱియు అచంచలశివభక్తుఁడు. అతఁడు తిరుప్పుంగూరిశివాలయమునకు అనేక ధర్మకార్యములు చేసెను.

సుందరమూర్తి పరవ అను వారకాంత ఇంటికి దౌత్యము చేయుటకు పరమశివునిఁ బంపియుండెను. ఆవార్త కర్ణాకర్ణిగా కలిక్కామనాయనారునకుఁ దెలిసెను. అది విని కలిక్కామనాయనారు దండతాడితభుజంగము రీతి ఆగ్రహమహోగ్రుఁడై "ఈనీచుఁడు ఒడలు తెలియక క్రిందుమీఁదెఱుంగక పరమేశ్వరుని తుచ్ఛురాలగు వారసతి యింటికి దౌత్యమునకు పంపునా? వీనిని ఏమి చేసినను బాపము లేదు. ఇఁక వీఁడు ఎందునకును బనికిరాఁడు. వీని మొగము చూచిన పాప మగును" అని నిశ్చయించుకొని "పరమశివా! ఆనీచుఁడు బుద్ధిలేక పంపె ననుకొందము; కాని నీవు ఆపనికి ఎట్లు అంగీకరించితివి? ఎట్లు పోయితివి? అతిశుద్ధములగు భక్తుల అంగణములు త్రొక్కుటకు సందేహించు నీవు పడుపుకత్తెయింటికి ఎట్లు పోయితివి?" అని యిట్లు అనేకవిధముల ననుకొనసాగెను. మఱియు సుందరమూర్తిమీఁద చాల నసూయ వహించెను.

ఈసంగతి సుందరమూర్తి గ్రహించి పరమశివునకు విన్నవించెను. పరమశివుఁడు వారిరువురకును సఖ్యము చేయనెంచి కలిక్కామనాయనారునకు తీవ్రమగు శూలరోగమును కలిగించెను. ఆబాధను తాళఁజాలక శివుని స్తుతింపఁగా స్వప్నమున సాక్షాత్కరించి 'సుందరమూర్తివలన నీవ్యాధి రూపుమాయఁగలదు' అని పలికెను. అది విని కలిక్కామనాయనారు "ఈశ్వరా! నీవు సర్వశక్తుఁడవు. నీవు కుదుర్పవలసినవ్యాధిని ఒక నీచునివలన కుదుర్పఁజూచుట భావ్యముగాదు. వానిచే నీబాధను తొలఁగించుకొనుటకంటె నేను ఈబాధను అనుభవించుటయే మంచిది" అని పలికెను. ఈమాటలు వినుచునే పరమశివుఁడు తిరోహితుఁ డయ్యెను.

వెంటనే శివుఁడు సుందరమూర్తి స్వప్నమున సాక్షాత్కరించి, "కలిక్కామనాయనారు శూలరోగముచే బాధపడుచున్నాఁడు. నీవు పోయి ఆబాధను తొలఁగింపుము" అని చెప్పి అంతర్హితుఁ డయ్యెను.

సుందరమూర్తి వెంటనే బయలుదేరి తిరుప్పెరుమంగలము సమీపించి "శూల రోగము కుదుర్చుటకు వచ్చుచున్నాను" అని కలిక్కామనాయనారునకు వార్తనం పెను. ఆవృత్తాంతమును విని కలిక్కామనాయనారు 'ఆయపాత్రుని జూచుటకంటె మరణము మేలు' అని నిశ్చయించుకొని కటారితోఁ బొడుచుకొని ప్రాణములు విడి చెను. కొంతసేపటికి సుందరమూర్తి అక్కడకు వచ్చెను. అందఱను నిశ్శబ్దముగా నుండ నియమించి, కలిక్కామనాయనారు భార్య సుందరమూర్తికి స్వాగతమిచ్చి ఆద రించెను. అప్పుడు సుందరమూర్తి 'ఈయాదరము లిప్పుడు వలదు. తొలుత కలిక్కామ నాయనారును జూపవలయును' అనెను. పరిచారకులు అందులకు 'వారు నిద్రించు చున్నారు' అని చెప్పిరి; కాని సుందరమూర్తి "అయినను వారిని నేను ఇప్పుడే చూడ వలయును" అని పట్టుపట్టెను. చేయునది లేక వారు ఆతనిం జూపిరి. అంతట సుందర మూర్తి సకలమును జూచి "కలిక్కామనాయనారు లేని భూలోకమున నుండఁ గూడదు" అని నిశ్చయించుకొని చనిపోవుటకు తానుగూడ పొడుచుకొనఁబోయెను. అంతట హఠాత్తుగ ఈశ్వరుఁడు సాక్షాత్కరించి సుందరమూర్తి చేయి పట్టుకొని కలిక్కామనాయనారును బ్రతికించి తిరోహితుఁడయ్యెను.

పిమ్మట నాయనారులు ఇరువురును ఒకరి కొకరు నమస్కరించుకొని చాల నాద రించుకొని, గౌరవించుకొనిరి. సుందరమూర్తి కలిక్కామనాయనారు యింట విందు కుడిచి, ఆతనిం దనయూరికిఁ గొనిపోయి విందు పెట్టెను.

పిదప కలిక్కామనాయనారు బ్రతికియున్నంతకాలమును శివపూజాధురం ధరుఁడై యుండి, అవసానమున సాయుజ్యమును బడసెను.

---

## 95. సద్వస్తునాయనారు

చేదిదేశమున తిరుక్కోవలూరు అను గ్రామమున మెయ్‌ప్పొరునాయనారు అను నొకయాతఁడు ఉండెను. ఆతఁడు మలయమహానాడునకు ప్రభువు. వేదశాస్త్ర ముల గుప్తార్థముల నెఱింగినవాఁడు. మఱియు శివభక్తుల యుదయమే సద్వస్తువు అని తలంచువాఁడు; కావున నాతనికి సద్వస్తునాయనారు అని పేరువచ్చెను. ఆతఁడు రాజ్య పాలనమున ఏలోపమును లేకుండునట్లు నడచెను. శివక్షేత్రములయందు అక్రమ ములును, లోపములును లేకుండునట్లు ఏర్పాటుచేసెను. శివభక్తులను నిరంతరమును సేవించును. శివపురాణములయందు ఆతనికి చాల నాసక్తియుండెను.

ఒకప్పుడు ముక్తినాథుఁడు అను నొక ఇరుగుపొరుగురాజు యుద్ధమునకు వచ్చి కోట ముట్టడించెను. సద్వస్తునాయనారును సంకోచింపక సకలమును సన్నద్ధముగావించు కొని ఎదిరించెను, పోరు ఘోరమయ్యెను. ఇరువాఁగులవారును చాల పట్టుదలతోఁ

బోవసాగిరి. నాలుగైదు దినములు గడచునప్పటికి ముక్తినాథునకు జయించుట కష్టమని తోఁచెను. అంత నాతఁడు మోసముచేసి జయము బడయనెంచి శివభక్తునివలె విభూతిని జడలను కాషాయాంబరములను దాల్చి చాకును పుస్తకమువలెఁ గట్టుకొని నిశీథమునఁ గోటకడకు బయలుదేఱెను.

సద్వస్తునాయనారు శివభక్తులను అత్యంతాదరముతోఁ బూజించుట యెఱుంగుదురు; కావున భటులు తలుపులు తెఱవకయే అతని నెట్లో కోటలోఁ బ్రవేశపెట్టిరి. "ఇఁక మనము కోటలోఁ బాగావేశించితిమని యానందించుచు నాతఁడు కవాటములు అన్నియు దాఁటి రాజు శయనించియున్న మేడచెంతకుఁ బోయెను. రక్షకపురుషులు 'రాజు గాఢనిద్రం బవళించియున్నాఁడు' అని చెప్పిరి; కాని 'వలనుపడదు. నిలిచియుండఁగా మేము సద్వస్తునాయనారుం జూడవలెను. వారి కిప్పుడు మేము యుద్ధములో జయము బడయుటకు మంత్రోపదేశము చేయవలసియున్నది. అందులకు ఇదియే సమయ'మని జంగమవేషధారి యగు ముక్తినాథుఁడు పలుకఁగా, రక్షకభటులు నిజము కాఁబోలు ననుకొని లోపలకుఁ బోనిచ్చిరి.

అప్పుడు సద్వస్తునాయనారురాజు రాణితో నేకశయ్యపైఁ బరుండియుండెను; కాని రాణి అప్పటి కింకను మేల్కొనియున్నది; కావున తటాలున లేచి నమస్కరించి, భర్తను లేపెను. సద్వస్తునాయనారు లేచి ఎదుట సాక్షాత్పరమశివునివలె నిలిచియున్న జంగమునిఁ జూచి సాష్టాంగదండప్రణామములు ఆచరించి 'దాసుఁడు ఆజ్ఞలకై వేచియున్నాఁడు' అని పలికెను. 'శివాజ్ఞచే ఈయుద్ధమున జయము కలుగుటకై నీకొకమంత్రమును ఉపదేశించుటకు వచ్చితిమి. నీవును మేమును దక్క నిక్కడ మఱియెవ్వరు నుండఁగూడదు' అని జంగము చెప్పెను. రాజు రాణిని పంపివేసి, 'ఇంకేమి ?' యనెను. 'నీవు నాకు సాష్టాంగపడి భగవంతుని బ్రార్థింపుము' అని జంగము ఆజ్ఞాపించెను. రాజట్లే చేసెను. తోడనే ముక్తినాథుఁదు ఆయుధమును విప్పి సద్వస్తునాయనారును నఱకెను.

రాజు ముఖ్యానుచరులలో దత్తుఁడనువాఁడు ఒక్కఁడు. ఆతఁడు జంగము ఆసమయమున అంతఃపురము సొచ్చుటఁ జూచి అనుమానించి, వెంట వచ్చి తలుపు చాటున నక్కియుండెను; కావున, ఈపని జరిగినవెంటనే కటారిదూసి జంగముపైఁ బడి పొడువఁబోయెను. అంతట సద్వస్తునాయనారు 'వలదు. నాకు సంగతి యంతయు నిప్పుడు బోధపడినది. అయినను ముక్తినాథుఁడు ఇప్పుడు జంగమవేషధారియై యున్నాఁడు; కావున ఆతనియందు కొంచెమైనను శివాంశ యుండకపోదు. నాకిది యకాల మరణమేయైనను నాకు సద్గతి కరతలామలక మగును. ఇట్టి యుపకారమును జేసిన ముక్తినాథునకు నీవు అపకారము చేయవలదు' అని యాజ్ఞాపించెను.

రాజాజ్ఞను జవదాటఁజాలక దత్తుఁడు మాఱుపలుకక యూఱకుండెను. అపుడు రాజు మఱల 'దత్తుఁడా! నీవలెనే ముక్తినాథుఁడు చేసిన పనిని మనవారు అనేకులు చూచియుందురు. వారందఱును ఈతనిని సంహరించుటకు వేచియుందురు. అట్టిది ఏమియు జరుగకుండ నీతనిని కోట దాఁటించిరమ్ము' అని చెప్పెను. దత్తుఁడు అట్లే యని, ముక్తినాథుని వెంట నిడుకొని బయలుదేరెను. దారిలో రక్షకభటులు అనేకులు ముక్తినాథునిఁ బొడువఁబోయిరి; కాని దత్తుఁడు రాజాజ్ఞను దెలిపి వారి నందఱను వారించెను. ముక్తినాథుఁడు కోట దాఁటిపోయెను. దత్తుఁడు అపుడు వెనుకకు మఱలి తనకొఱకు నిరీక్షించుచున్న సద్వస్తునాయనారు చెంతకువచ్చి సంగతి యంతయు నెఱింగించి, ఆతని యాజ్ఞచే బాకు లాగివేసెను. తోడనే ప్రమథులు సద్వస్తునాయనారు ఆత్మను శివలోకమునకుఁ గొనిపోయిరి. పరమశివుఁడు దానిని తన అనంత తేజస్సులోలీనము చేసికొనెను.

---

## 96. ఎరిభక్తనాయనారు

కొంకణదేశమున రాజధానియగు కరువూరునందు ఎరిభక్తనాయనారు అనునొక మహాత్ముఁడు ఉండెను. ఆతఁడు శివాగమములను బాగుగఁ జదువుకొనెను. శివభక్తులను సేవించుట యనినను, శివపురాణములను జదువుటయనినను, వినుట యనినను అతనికి ఎంతో ప్రీతి. ఆతఁడు ఆయుధవిద్యలోఁ జాల నిపుణుఁ డగుటచే శివభక్తులకు ఏమయిన నాపదలు సంభవించునెడల నెట్టి సాహసకార్యము నైనను జేసి వారిని రక్షించును.

ఆ గ్రామమున శివకామియాండారు అను మఱియొక శివభక్తుఁడు ఉండెను. ఆవృద్ధుఁడు అనుదినమును స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని, పూలు కోసి మాలలు కట్టి స్వామికి సమర్పించుచుండును. ఒకనాఁడు ఆతఁడు పుష్పమాలికలను ఆలయమునకుఁ గొనిపోవుచుండఁగా, ఆపట్టణము నేలు కీర్తిచోళమహారాజుగారి పట్టపుటేనుఁగు ఆదారిన బోవుచు వృద్ధుని చేతిలో నున్న పూలసజ్జను తొండముతో నూడఁబెఱికికొని నలిపివేసి దూరముగాఁ బాఱవేసెను. అదిచూచి శివకామియాండారు ఆగ్రహమహోగ్రుఁడై ఆయేనుఁగును గొట్టుటకు వెనుకఁ బరువెత్తెను; కాని దానితో సరిగ పరుగెత్తఁజాలక కూలఁబడిపోయెను.

అది చూచి ఎరిభక్తనాయనారు త్రిశూలమును ధరించి, శీఘ్రముగఁ బోయి శివకామియాండారు నోదార్చి, "మిమ్ము పీడించిన ఏనుఁగు ఎట్లు పోయినది?" అని యడుగఁగా, ఆవృద్ధుఁడు అది పోయిన దిక్కు చూపెను. తోడనే ఎరిభక్తుఁడు మనో

వేగముతోఁ బోయి ఏనుఁగును దాఁకెను. అది వెనుదిరిగి ఎదిరించెను. వెంటనే ఎరిభక్తుఁడు దాని తొండమును నఱకి అంతలో చిత్రవధ గావించెను. ఏనుఁగు క్రిందఁబడి గీపెట్టుచు మరణింపఁగా, దానిమీఁద నున్న మావటివాఁడుంఒకఁడును రౌతులు ఇరువురును తటాలున క్రిందికి దుమికి నాయనారుపైఁ బడిరి; కాని ఉత్తరక్షణము నందే నాయనారు వాండ్రను సంహరించి, కోపముతీఱక గ్రుడ్లు ఎఱ్ఱఁజేసి పడిపోయిన శవములమీఁదఁ బరవళ్లు త్రొక్కసాగెను.

ఈవార్త రాజునకుఁ దెలియవచ్చెను. వెంటనే యాతఁడు "పట్టపుటేనుఁగును జంపిన అల్పాయుష్కుఁడు ఎవఁడురా ?" అని యఱచుచు, పదుగురు వీరులను వెంట నిడుకొని అక్కడకు వచ్చెను. అప్పటి కింకను ఎరిభక్తుఁడు వీరభద్రావతారము దాల్చి పరవళ్లు త్రొక్కుచుండెను. అదిచూచి కీర్తిచోళమహారాజు "ఈతఁడు మానవ మాత్రుఁడు కాఁడు. వీరభద్రుని యంశమున జనించిన శివయోగి. భద్రగజమును ఎవఁడో సామాన్యమానవుఁడు చంపె ననుకొంటిని. తగినంతకారణము లేకుండ నీతఁడు భద్రగజమును జంపియుండఁడు" అని శాంతించి, వీరులను వెనుకకుఁ బంపివేసి గుఱ్ఱముదిగివచ్చి దూరమునుండియే నమస్కరించి "మహాత్మా! కారణము లేనిదే శివయోగులు ఆగ్రహపడరు. తమయాగ్రహము ఏనుఁగును, మావటివానిని, రౌతులను జంపుటతోఁ దీఱియుండకున్నచో ఈదాసునిఁగూడ సంహరింపుఁడు" అని చెంతకుఁ బోయెను. అపుడు ఎరిభక్తుఁడు కొంచెము శాంతించి, జరిగిన దంతయు నెఱింగించెను. రాజు అది విని "ఎంతపని జరిగినది. లేకున్న శివయోగికి ఇంతటి యాగ్రహ మేలవచ్చును ? ఈక్షుద్ర భద్రగజము స్వామికైంకర్యమునకు భంగము గలిగించినది; కావున దీనికి ఈశిక్ష తగియేయున్నది. మావటివాఁడును, రౌతులును ఏనుఁగు దౌర్జన్యము చేయుచుండఁగాఁ జూచుచు నూరకున్నారు; కాన వాండ్రకుఁ గూడ తగినశిక్షయే యైనది; గాని ఏనుఁగు చేసిన పాపము ఇంకను దీఱలేదు. నేను గూడ మరణించినఁ గాని అది పోదు" అని తలంచి రాజు "నన్నుఁగూడ సంహరించి, మీకోపము రూపమున నున్న ఏనుఁగుచేసిన పాపమును తొలఁగింపుఁడు" అని మొలలోని కత్తినిఁదీసి శివయోగికి అందించెను; కాని ఆతఁడు అందుకొనఁ డయ్యెను. రాజు వినలేదు అని మఱల నట్లే చెప్పెను. అపుడు ఎరిభక్తుఁడు, "రాజు హృదయము చాల సున్నితమైనది. అది పశ్చాత్తాపముచే దహింపఁబడుచున్నది. ఇప్పుడు ఈకత్తిని బుచ్చుకొనకున్నచో నీరాజు ఆత్మహత్య గావించుకొనును" అని భావించి, దానిని చేకొని "నీభక్తిని ఎఱుంగక నేను త్వరపడితిని ; గావున శిక్షగా నన్ను సంహరింపుము" అని త్రిశూలమును అందించెను; గాని రాజు దాని నందుకొనలేదు. "ఇతఁడు సంశయగ్రస్తుఁడై నాఁడు. ఇది ఖ్యాతనివలనఁ గాదు" అని తలంచి, ఎరి

భక్తుఁడు తన్నుఁ దాఁ బొడుచుకొనుటకు శూలము నెత్తెను. అప్పుడు పరమశివుఁడు అశరీరవాక్కులతో 'సాహసము వలదు. మీభక్తినిఁ బరీక్షించుటకు నేను ఇట్లు చేసితిని' అని పలికెను. ఎరిభక్తుఁడును రాజును ఆశ్చర్యపడిరి. ఇంతలో ఏనుఁగును, మావటివాఁడును, రౌతులును లేచిరి. పూలసజ్జ చక్కని పూలచెండ్లతో నిండి యుండెను. ఇది యంతయుఁ జూచి అందఱు నబ్బురం పడిరి. అంతట ఎరిభక్తుఁడును, రాజును ఒకరికొకరు మ్రొక్కుకొని కౌఁగిలించుకొని స్వామి కోవెలకుఁ బోయి సేవించిరి. శివకామియాండారు పూలసజ్జను గైకొని ఆలయమునకుఁ బోయెను. మావటివాఁడు రౌతుల నెక్కించుకొని ఏనుఁగును దోలుకొనిపోయెను.అందఱును రాజును ఎరిభక్తుని నుతించుచు వెడలిపోయిరి. ఎరిభక్తనాయనారు బ్రతికియున్నంతకాలము నిట్లు ప్రవర్తించి అవసానమున శివసాయుజ్యమును బడసెను.

---

## 97. గుగ్గులుకలశనాయనారు

చోళదేశమున తిరుక్కడయూరు అను గ్రామమున కలశుఁడు అను నొక బ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు యుక్త వయస్కుఁడైనది మొదలు ఆగ్రామమున నున్న వీరట్టానమనుగుడియందు వేంచేసియున్న పరమశివుని అనుదినమును గుగ్గిలముతో ధూపము వేయుచుఁ బూజించుచుండెను. ఈకారణమువలననే ఆతనికి గుగ్గులుకలశనాయనారు అనువేరు వచ్చెను.

ఆతఁడు ఇట్లు కొలఁదిదినములు చేయునప్పటికి ఇంటనున్న ధనమంతయు నైపోయెను. అదిచూచి యాతఁడు 'ఏమి వచ్చినను శివపూజ మానఁగూడదు' అని నిశ్చయించుకొని ఒక్కొక్క మాన్యమునే యమ్ముచు, ఆక్రయధనముతో యథాపూర్వముగ గుగ్గిలమును సంపాదించుచు శివపూజ జరుపుచుండెను. మఱికొన్ని దినములు గడచునప్పటికి మాన్యములేఁ గాక అమ్ముటకు మఱియేవస్తువును గూడ లేకపోయెను. ఇంట భార్యాపుత్త్రులు అన్నములేక మలమల మాడసాగిరి. నాలుగైదురోజులు ఉపవాసములు చేసిన తరువాత ఆతనిభార్య తన కంఠమున నున్న మంగళసూత్రమును దీసియిచ్చి, "దీనిని విక్రయించి ధాన్యము కొని తీసికొని రండు" అని భర్తకు ఇచ్చెను. అదిగొని నాయనారు బజారునకుఁ బోవుచుండఁగా, నొకవర్తకుఁడు విక్రయించుటకు గుగ్గిలపుమూటలను భుజములమీఁద నిడుకొని ఎదురుగ వచ్చుచుండెను. నాయనారు అదిచూచి "ధాన్యమును గొనుటకంటె దేవునకు ఉపయోగింపవచ్చును; కావున గుగ్గిలము కొనుటయే మంచిది" అని భావించి ఆమంగళసూత్రమును ఇచ్చివేసి, ఆవర్తకుని చెంతనున్న గుగ్గిలపు మూట

లను గైకొని ఆలయమునకుఁ బోయి యథాప్రకారముగ ఈశ్వరుని బూజింప సాగెను.

ఇంట నాతని భార్య ఎంతసేపటికి భర్త ధాన్యము పట్టుకొని రాకయుండుటఁ జూచి క్షుద్బాధవలన మఱింత పీడింపఁబడఁజొచ్చెను. పిల్లలు గోలుగోలున ఏడువ సాగిరి.

సాయంత్ర మయ్యెను. అంధకారముగూడ నావరించెను. జాముురాత్రి యయ్యెను. అప్పటికిఁగూడ భర్త యింటికి రాకుండుటఁ జూచి భార్య చేయునది లేక విచారించుచు పరుండెను. రెండుజాముల రాత్రియైన తరువాత పరమశివుఁడు ఆమెకు స్వప్నమున సాక్షాత్కరించి "మీకు భాగ్యము నొసంగితిని" అని చెప్పి తిరోహితుఁడు అయ్యెను. వెంటనే ఆమె మేల్కాంచి చూడఁగా ఇల్లంతయు పప్పు, బియ్యము, బెల్లము, నేయి మున్నగు ఆహారపదార్థములతోను ధనధాన్యములతోను నిండియుండెను. అందులకు ఆమె మహానందభరితయై వెంటనే వంట చేసి బిడ్డలకు అన్నముపెట్టి తాను భుజించెను. అట నీశ్వరుఁడు "ఆఁకలిగొని యున్నావు. ఇంటికిఁబోయి భుజించి రమ్ము" అని నాయనారునకుఁ జెప్పెను. ఆయాజ్ఞ చొప్పున ఆతఁ డింటికిఁ బోయి అంతయుఁ జూచి ఆశ్చర్యచకితుఁ డయి "ఈభాగ్య మంతయు నెట్లువచ్చినది" అని యడుగఁగా నామె అంతయుఁ జెప్పెను. అందులకు ఆతఁడు ఆనందించి పరమశివుని చాల వినుతించెను.

ఇక్కడ నాయనారును, ఆతని భార్యయు అనంతైశ్వర్యము గలిగినను గర్వింపక లేనిపోని దుర్గుణములను దఱిఁజేరనీయక శివుని శివభక్తులను అనేకవిధముల నాదరించుచు వారిని మృష్టాన్నసంతృప్తులం గావించుచు నుండఁగా తిరుప్పనందాళు అనుస్థలమున నున్న శివలింగము ఒఱఁగియుండుటఁ జూచి ఆనగరమును ఏలురాజు దానిని సరిచేయఁదలఁచి శిథిలమైయున్న ఆలయమును బడఁగొట్టించి లింగమును దీయుటకు ఊరిలోనున్న బ్రాహ్మణులకు సెలవు ఇచ్చెను; గాని ఎందఱు బ్రాహ్మణులు పట్టినను ఆలింగము కదలదయ్యెను. పిదప రాజు లింగమునకు మోకు త్రాళ్లు కట్టించి ఏనుఁగులచే లాగించెను. అయినను బ్రయోజనము కలుగలేదు. "ఇది యెట్లు సాధ్యమగును." అని రాజు ఏమియుఁ దోఁచక విచారింప సాగెను. ఎవరును ఉపాయము చెప్పలేక యుండిరి.

ఈసంగతి గుగ్గులుకలశనాయనారునకుఁ దెలియవచ్చెను. ఆచిత్రము ఏమో చూచిరావలయునని ఆతఁడు ఆయూరు పోఁగా త్రాళ్లతో లాగఁబోయిన ఏనుఁగులును మనుష్యులును మూర్ఛిల్లి పడియుండుటఁ గానవచ్చెను. అపుడు నాయనారు 'నేను గూడ కొంచెము ప్రయత్నించెదను' అని తలంచి మీఁద నున్న ఉత్తరీయ

మును లింగమునకుఁగట్టి లాగెను. తోడనే లింగము లేచి వచ్చెను. అదిచూచు చున్న రాజును ప్రజలును "ఈతఁడు భక్తి రజ్జువుచే ఇట్లు చేయఁగలిగెను" అని ఎఱిఁగి ఆతనిం జాలగౌరవించి, అనేకవిధముల వినుతించి, మఱల యథాపూర్వముగ నాయనారుసాయంబున శివప్రతిష్ఠఁ గావించిరి.

పిదప నాయనారు కొన్ని దినములు అచ్చట నుండి అనేకులను ఉజ్జీవింపఁజేసి, స్వస్థలముఁ జేరుకొనెను. కొన్ని దినములకు వాగీశనాయనారును జ్ఞానసంబంధ మూర్తినాయనారును అచ్చటకు వచ్చిరి. వారిని ఆతఁడు అనేకవిధములఁ బూజించి, బ్రతికియున్నంతకాలమును అనేకధర్మకార్యములను జేసి, అవసానమున శివసాయుజ్యమును బడసెను.

---

# 98. దండియడిగళ్ నాయనారు

చోళదేశమున తిరువాలూరు అనుగ్రామమున దండియడిగళ్ అను నొక నాయనారు ఉండెను. ఆతఁడు పుట్టుగ్రుడ్డి. అయినను మనస్సున శివుని ధ్యానించుచు అంతరంగదృష్టిచే పరమశివుని దర్శించుచు, ఆయూర నున్న శివాలయమునకుఁ బడుచు లేచుచుఁ బోయి స్వామిని వినుతించి వచ్చుచుండెను.

ఆగ్రామమున నున్న వారు అందఱును జైనులు. వారు ఆ శివాలయము వెనుక నున్న తటాకమును కొంతవఱకు పూడ్చివేసిరి. దండి అందులకు సహింపలేక తన వారితో నెన్నిసారులు చెప్పినను ప్రయోజనము లేకపోవుటఁ జూచి తానే చెఱువునకు ఇవ్వలియొడ్డున నొక స్తంభమును పాతి రెంటికిని పెద్దత్రాడు కట్టి ఆత్రాడు పట్టుకొని చెఱువులో దిగి జైనులు పోసిన మట్టిని గంపలో నెత్తుకొని మఱల త్రాడు సాయంబున తీరమునకు వచ్చుచు ఈతీఱున స్వామికైంకర్యము చేయుచుండెను.

అది చూచి ఆయూరున నున్న జైనులు 'అంధుఁడా! ప్రాణములకు ఆశ లేదా? ఎందులకు అట్టిపనిఁ జేసెదవు? ప్రాణాపాయకరమైనపని ఏల చేసెదవు? మానుము' అని పలికిరి. అందులకు నాయనారు 'ఇది పరమేశ్వరునకుఁ బ్రీతికరమైన కార్యము. నేను ఎట్లు మానఁగలను?' అని సమాధానము ఇచ్చెను. అంతట జైనులు 'నీనికిఁ గన్నులులేనట్లే చెవులుగూడ లేవు?' అనిరి. 'నాకు కన్నులు నున్నవి. చెవులు నున్నవి. మీకే లేవు' అని నాయనారు పలుకఁగా 'నీకు కన్నులు ఉండుటయే నిజమేని మేము ఈయూరనుండము' అని పలికి పోయిరి.

నాఁటిరాత్రి దండికి స్వప్నమున పరమశివుఁడు సాక్షాత్కరించి 'దండీ! చింతింపకుము. నీకు కన్నులు ఇచ్చితిని. జైనుల నందఱను అంధులనుఁగాఁ జేసితిని' అని పలికి

ఆయూరి రాజునకుఁగూడ స్వప్నమున నగపడి 'జైనులు నాయనారునకు అడ్డు తగులు చున్నారు. నీవు నాయనారునకు సహాయము చేయుము' అని యాజ్ఞాపించెను.

మఱునాఁడు రాజు నాయనారు దర్శనమునకు వచ్చి ఏమిసెలవు? అని అడిగెను. అంతట నాయనారు రాజును చెఱువుదగ్గఱకుఁ గొనిపోయి 'జైనులను రప్పింపుము' అనెను. రాజు భటులకు ఆజ్ఞాపించెను. భటులు రాజాజ్ఞను దెలుపఁగా 'జైనులు అందఱును అంధులైరి; కావున పడుచు లేచుచు ఎట్లో అచ్చటకు వచ్చిరి. రాజు 'మీరు పలికిన శపథముప్రకారము ఊరువిడిచి పొండు' అని యాజ్ఞా పించెను. అంతట దురభిమానదూషితులగుజైనులు గ్రుడ్డితనమువలన బాధపడుచునే ఇతరగ్రామములకుఁ బోయిరి కాని అనేక జైనులు దండిని ఆశ్రయించి 'మమ్ము రక్షింపుము' అని ప్రార్థించి శైవులయిరి. వెంటనే వారికి అంధత్వము తొలఁగిపోయెను. దండి బ్రతికినంతకాలమును శివకైంకర్యముచేసి తుదను శివసాయుజ్యమును బడసెను.

---

## 99. ఇయర్పగైనాయనారు

చోళదేశమునందలి కావేరీపట్టణమున నొకనాయనారు ఉండెను. ఆతనిపేరు ఇయర్పగైనాయనారు. ఆతఁడు గృహస్థాశ్రమమున నుండియు, తామరాకుమీఁది నీటిచుక్కవలె దేనిని అంటక విభూతిధారులయిన ఎల్లవారికిని అడిగినవెల్ల నున్నంత వఱకు లేదనక సకలమును ఇచ్చుచు వారి సంతోషమే పరమశివుని అనుగ్రహ కారణ మని నిశ్చయించి ఆప్రకారము నడచుకొనుచుండెను.

నాయనారు ఉన్నపదార్థములలో నేది యడిగినను ఇచ్చుట ఎల్లరకును జూప వలయునని భావించి, పరమశివుఁడు ఒకనాఁడు శైవాచార్యరూపముతో వచ్చి ఇంటి యెదుట నిలిచెను. నాయనారు ఆతనింగాంచి పరమానందముతో స్వాగతమిచ్చి లోనికిఁ గొనిపోయి 'మహాత్ములు ఊరక రారు. మీరు వచ్చిన కారణము నెఱింగింపఁ గోరినాను' అని వినయముతోఁ బలికెను. అపుడు ఆతఁడు 'అయ్యా! నీవు ఉన్నపదార్థ ములలో అడిగినదానిని లేదనకుండ నిచ్చువాఁడవు. అని తెలిసికొని, నిన్నొకవస్తువు కోరుటకు వచ్చితిని' అనియెను. నాయనారు ఆనందించి, 'సెలవిండు. తమరు ఏమి కోరి నను నాదగ్గఱ నున్నచో తప్పక ఇచ్చెదను' అని మఱలఁ బలికెను. ఆగంతుకుఁడు 'నీభార్యను గోరివచ్చితి' నని సందేహము లేకుండఁ బలికెను. 'ఇచ్చితి' నని మాట యిచ్చి, నాయనారు ఈ సంగతి భార్యకు ఎఱింగించెను. ఆమె తొలుత రిచ్చవడెను; గాని వెంటనే భర్తదీక్షను స్మరించి వల్లెయని యంగీకరించెను. 'ఈయూరు దాఁటు లోపల నీబంధువులు అందఱును నన్ను అడ్డుకొనకుండ నీవు వెంటరావలె' నని

బ్రాహ్మణుఁడు కోరెను. వల్లెయని ఖడ్గము చేఁబూని వెంట బయలుదేఱెను. కొంత దూరము పోవునప్పటికి ఆతని బంధుగులు అందఱును అడ్డువచ్చి ఎదిరించిరి. 'నా భార్యను త్రికరణశుద్ధిగా నిచ్చితిని. మీరు అడ్డుపడఁగూడదు' అని నాయనారు వారించెను; కాని వారు వినక, 'బుద్ధిలేక నీవు ఇచ్చినను మేము అంగీకరింతుమా? ఈయపకీర్తి నీయొక్కనితోఁ బోవునది గాదు' అని కత్తులు తీసిరి. నాయనారు ఒక్కఁడే అందరతోడను గలియఁబడెను. ఒకగడియలో ఎదురుకొనినవారు అందఱును మడిసిరి. నాయనారు నిశ్చింతతో భార్యను ఆగంతుకుని వెంటఁ దీసికొని బయలుదేరెను.

కొంతదూరము వెళ్లిన తరువాత ఆగంతుకుఁడు 'నీవు పోవచ్చును' అని నాయనారునకు అనుజ్ఞనిచ్చెను. నాయనారు పోవుచుండఁగా, ఆగంతుకుఁడు మఱల బిలిచెను. నాయనారు వెళ్లునప్పటికి బ్రాహ్మణుఁడు అదృశ్యుఁడయ్యెను. అదిచూచి నాయనారు ఆశ్చర్యచకితుఁడై ఇటు నటు చూడఁగా పరమశివుఁడు వృషభవాహనారూఢుఁడై పార్వతీసహితుఁడై ఆకసమున సాక్షాత్కరించెను. వారినిఁ జూచి భార్యాభర్తలిరువురును మ్రొక్కి వినుతించిరి. అపుడు పరమేశ్వరుఁడు 'మీరిరువురును ఇఁక భూలోకమున నుండఁ దగరు; మాతో రండు' అని వారిని కైలాసమునకుఁ దీసికొనిపోయెను. ఇది చూచినవారు ఎల్లరును ఆశ్చర్యచకితులై నాయనారు మాహాత్మ్యమును చాల వినుతించిరి. పరమేశ్వరునిఁ జూచిరి; కావున నాయనారు తోడియుద్ధమున నిహతులైనవారందఱును గూడ కైలాసమునకుఁ బోయిరి.

---

# 100. మారనాయనారు

ఇళయాఱ్కుడి అనుగ్రామమున మారనాయనారు అను నొకపంటకాపు ఉండెను. ఆతఁడు అనుదినమును అనుష్ఠానములు అన్నియుఁ దీర్చికొని మహేశ్వర పూజఁ గావించి వచ్చిన శైవమహాజనులను అత్యాదరముతో గౌరవించి పంచభక్ష్యపరమాన్నములతోఁ దృప్తులం గావించుచుండును. ఆతఁడు అట్లు చేసిన కొలఁదిని పాడిపంటలు వృద్ధియై కుబేరునివలె అత్యంతధనవంతుఁడు అయ్యెను.

ఒకప్పుడు పరమశివుఁడు ఆతని శివపూజాధురంధరత్వమును శైవార్చనానిరతియుఁ బరీక్షింపఁ దలఁచి సంపదయంతయుఁ దొలఁగిపోవునట్లుచేసి దారిద్ర్యమును గలిగించెను. ఆతఁడు శైవార్చనమునిమిత్తము భూములు అన్నియు అమ్మివేసెను. భార్య నగలను మంగళసూత్రమునుగూడ నమ్మివేసెను. ఇఁక విక్రయించుటకు వస్తువు లేదయ్యెను. అప్పు అంతకుమున్నే పుట్టుట లేదయ్యెను. ఒకనాఁడు ఆతఁడు ఏమియులేక ఏమి చేయనుం దోఁపక చింతింపసాగెను. అప్పటికి జాముమురాత్రి

యయ్యెను. ఆకసమంతయు నుఱుములతోడను మెఱుపులతోడను భయంకరమై యుండెను. అట్టిసమయమున నొక వృద్ధబ్రాహ్మణుఁడు వెదకుకొనుచు నాతనియింటికి వచ్చి 'అన్నము పెట్టుఁడు' అని కోరెను. నాయనారు అతని నాదరముతో ఇంటిలోనికి తీసికొనిపోయి తుడిచి ఒకచోఁ గూర్చుండఁ బెట్టి భార్యచెంతకుఁ బోయి "ఒక శివ భక్తుఁడు వచ్చియున్నాఁడు. అన్నము కోరుచున్నాఁడు. ఏమి యుపాయము" అని యడిగెను. అందులకు ఆమె "ఇంటిలో నేమియు లేదనుట మీకుఁ దెలియనిదిగాదు. చేనిలో చల్లిన విత్తనములు మొలకలు వచ్చినవి గోనిరండు. ఎట్లో కష్టపడి అన్నము వండెదను. కూరకొఱకు ఏతోఁటకూరయైనను తెండు" అని చెప్పెను. ఆతఁడు ఆమాటలు విని ఆవానలోఁ దడియుచునే పోయి భార్యకోరినవి తెచ్చియిచ్చెను.

ఆమె వానిని యుక్తరీతిని పచనము చేసి భర్తకు ఎఱిఁగించెను. ఆతఁడు పిలుచునప్పటికి బ్రాహ్మణుఁడు పరుండియుండెను. మారనాయనారు లేపఁగా వృద్ధుఁడు పరమశివుఁడై లేచెను. అది చూచి నాయనారును భార్యయు నాశ్చర్యపడుచుండఁగా పరమశివుఁడు వృషభారూఢుఁడై పార్వతీసహితుఁడై నిజదర్శన మొసంగి "మీరిఁక భూలోకమున నుండవలదు. కైలాసమునకు రండు" అని వెంటనిడుకొని పోయెను.

---

## 101. మూర్తి నాయనారు

పాండ్యదేశమునందలి మధురానగరమున మూర్తినాయనారు అను నొక వైశ్యుఁడు ఉండెను. ఆతఁడు చాలధనవంతుఁడు అయ్యు అందఱవలె దుష్ప్రవర్త కుఁడుగాక సన్మార్గమున నడచుచు ప్రతిదినమును ఆనగరమున వెలసియున్న సోమ సుందరేశ్వరస్వామికి మంచిగంధమును సమర్పించుచు కాలము గడపుచుండెను. ఇట్లుండఁగా ఒకరాజు దండెత్తివచ్చి ఆపట్టణమునేలు రాజును జయించి రాజ్యమును స్వాధీనపఱుచుకొని మధురానగరసింహాసనము నధిష్ఠించి ప్రజాపాలనము ప్రారంభించెను. ఆతఁడు శుద్ధజైనుఁడు. అగుటచే ఒకమాసములో అనేకజైనులు వచ్చి ఆనగరమునఁ బ్రవేశించి తొల్లిటివారిని అనేకులను తమమతమునఁ గలుపుకొనిరి. కొందఱు జైనమతము కూసుమత మని యెఱింగి అందుఁ బ్రవేశింపఁజాలక లేకున్న రాజువలన బాధలు వచ్చునని తలంచి ఇచ్చవచ్చిన చోటికి లేచిపోయిరి. మూర్తి నాయనారుమాత్రము జైనులలోఁ గలియక ఇతరగ్రామములకుఁ బోక అచ్చటనే యుండి యథాపూర్వముగ స్వామికి మంచిగంధమును సమర్పించుచుండెను.

జైనాచార్యులు మూర్తినాయనారు సంగతి రాజునకు విన్నవించిరి. రాజు ఆతనికి మంచిగంధపుచెక్కలు అమ్మకుండునట్లు వర్తకులకు ఆజ్ఞాపించెను. నాయనారు

నాఁడు బజారు అంతయు అనేకపర్యాయములు తిరిగెను; కాని ఎవరును మంచి గంధపుచెక్కలు ఆతనికి ఈయలేదు. అగుటచే నాతఁడు విచారించుచు సోమసుంద రేశ్వరుని సన్నిధికిఁ బోయి తటస్థించినది అంతయు స్వామికి విన్నవించి, అంతలో నొక ఆలోచనము తోఁపఁగా "ఏల విచారము" అని తలంచి తనచేతులనే సాన మీఁద నలుగఁదీయసాగెను. కొంతసేపటికి ఎముకలు బయలుపడి కొంతవఱకును అఱిగిపోయెను. రక్తము ఆలయ మంతయుఁ గ్రమ్మెను.

అపుడు పరమశివుఁడు ఆతని భక్తికి మెచ్చి సేవానిరతికి ఆనందించి "సాహసము చాలును లెమ్ము. నిన్ను హింసించిన రాజు చనిపోవును. నీవు రాజ వగుదువు. పిదప జైనాచార్యుల సాయంబున శైవమతమును ఉద్ధరింపుము" అని అశరీరవాక్కులతోఁ బలికెను. అది విని మూర్తినాయనారు తటాలున లేచి నిలువఁగా చేతులు యథాప్రకారముగ నుండెను. "పరమశివుని తలంపునకు అభ్యంతర మేమి గలదు" అని తలంచుచు ఆతఁడు ప్రాకారములు దాఁటి వీథిలోనికి వచ్చెను.

శివుని ఆజ్ఞాప్రకారము జైనరాజు చనిపోయెను. ఆతని యనంతరము సింహాసన మెక్కుటకు ఇతని సంబంధమైనవారు ఎవ్వరును లేకపోవుటచే "పట్టపు టేనుఁగునకు గంతలుకట్టి వదలుదము. అది యెవ్వరినిఁ దనమూఁపుమీఁద నెక్కించుకొని తీసికొనివచ్చునో వారినే ప్రభువుగా అభిషేకము చేయుదము" అని మంత్రులు అట్లే ఏనుఁగును విడిచిరి. అంత నాయేనుఁగు వీథులు అన్నియుఁ దిరుగుచు, సోమసుందరేశ్వరుని ఆలయము బైట నిలిచియున్న మూర్తినాయనారు చెంతకు వచ్చి మ్రొక్కి వీఁపుమీఁద నెక్కించుకొని కోటలోనికిఁ గొనిపోయెను. మంత్రులు అందులకు చాల నానందించి నాయనారును దింపి పట్టాభిషేకప్రయత్నములు చేయుచుండఁగా "ముందు మీరు శైవమతమునఁ జేరుఁడు" అని నాయనారు ఆజ్ఞాపించెను. మంత్రులు అట్లే చేసిరి. అపుడు నాయనారు "నాకు విభూతియే పట్టాభిషేకమునకు వలయు సామగ్రి. రుద్రాక్షలే ఆభరణములు. జటాజూటమే కిరీటము మీరు వానిని గుఱించి ప్రయత్నింపవల" దని శుభముహూర్తమున సింహాసనము నధిష్ఠించి రాజ్యమును బాలింపఁ దొడఁగెను. నెలదినముల యందే పట్టణమున నున్నవారు అందఱును శైవమతము నవలంబించిరి. పిదప మూర్తినాయనారు బ్రతికియున్నంతకాలమును శైవమతమును వృద్ధిచేసి శైవుల నర్చించి శివపూజాధురంధరుఁడై యుండి అనేక ధర్మకార్యములను గావించి, అవసానమున శివసాయుజ్యమును బడసెను.

# 102. నందనారు

చోళదేశమున ఆదనూరులో నందనారు అను నొకపంచముఁడు ఉండెను. ఆతఁడు పూర్వపు ప్రభువులవలన నొసఁగఁబడి పరంపరగా వచ్చుచుండిన భూమిని పండించుకొనుచు శివధ్యానతత్పరుఁడై కాలము గడపుచుండెను. ఆభూమి ఈశ్వరునకు భేరి మృదంగము మున్నగువాద్యములును వీణియకు తీగలు మున్నగువానిని ఇచ్చుచుండుటకై ఒసంగఁబడినది. ఆతఁడు తనకులవృత్తి చేయుచు తీరిక యైనపుడెల్ల శివాలయము ఎదుటకుఁ బోయి నిలిచి పరమశివుని ధ్యానించుచుండును.

ఆతఁడు అనేక శివస్థలములకుఁ బోయి ఇళ్లే స్వామిని సేవించి అచ్చటచ్చట తోఁటలు తటాకములు మున్నగువానినిఁ బ్రతిష్ఠించెను. ఒకప్పుడు ఆతఁడు చిదంబరమునకుఁ బోయి పరమశివుని సేవింపఁగోరెను. అంతలోనే ఆతఁడు "ఏమిలాభము? చండాలుఁడ నగు నన్ను లోనికిఁ బోనీయ" రని నిరాశుఁడయ్యెను; కాని యాతని యాశ సమూలముగ పోలేదు. తుదకు ఆతఁడు "ఎట్లయినను చిదంబరమునకుఁ బోవలయు"నని నిశ్చయించుకొనెను; కాని రేపు రేపు అని చాలదినములు గడచెను.

ఎట్టకేలకు ఆతఁడు చిదంబరమునకుఁబోయెను. ఊరిబైటనే యుండవలసి వచ్చుటచే నాతఁడు అక్కడనే యుండి నటరాజస్వామిని వినుతింపఁజొచ్చెను. నాఁటిరాత్రి స్వామి యాతని స్వప్నమున సాక్షాత్కరించి "రేపు బ్రాహ్మణులు సకలమును సన్నద్ధముగావింతురు. నీవు అగ్గిగుండములో మునుఁగుము. బ్రాహ్మణుఁడ వయ్యెదవు. తరువాత నీయిచ్ఛవచ్చినట్లు నన్ను సేవింపవచ్చును" అని చెప్పి బ్రాహ్మణులకుఁగూడ స్వప్నమునందే "రేపు పురద్వారము చెంగట అగ్గిగుండమును ఏర్పఱుపుఁడు పంచముఁడగు నందనారు అందు ఉఱికి బ్రాహ్మణుఁడగును. ఆతనికి మీరు సేవలు చేయుఁడు" అని నియమించెను.

ఈశ్వరాజ్ఞ చొప్పున బ్రాహ్మణులు సకల సన్నాహములను నెఱవేర్చి ఆసంగతి నందనారునకు ఎఱింగించిరి. నందనారు ఈశ్వరాదేశము చొప్పున అగ్గిగుండములో మునుఁగఁగా వెంటనే విభూతి రుద్రాక్షలు జటాజూటమును గల బ్రాహ్మణశ్రేష్ఠుఁడై ఒడ్డునకు వచ్చెను. తోడనే బ్రాహ్మణులు ఆతని ననేకవిధముల గౌరవించి నటరాజస్వామి ఆలయమునకుఁ గొనిపోయిరి. నందనారు అచ్చట స్వామిని సేవించుచు చూచుచుండఁగనే స్వామిలో నైక్యమై అదృశ్యుఁడు అయ్యెను. బ్రాహ్మణులు అందఱును ఆతనిని గుఱించి అనేకవిధములఁ జెప్పుకొనుచు ఇండ్లకుఁ బోయిరి. నందనారు చిదంబరము పోవుటకు రేపురేపుఅని కొన్నిదినములుగడపెను; కావున ఆతనికి అపరవారగమ్యనాయనారు అని మాఱుపేరు వచ్చెను.

# 103. అరివాట్టనాయనారు

చోళదేశమున గణమంగల మనెడి గ్రామమున దాయఁడు అను నొకవెలమ యుండెను. ఆతఁడు సేనాధిపతుల వంశములోఁ బుట్టెను. ఆతఁడు భాగ్యవంతుఁడు అయ్యును, గర్విగాక సదా పరమశివుని ధ్యానించుచు సన్నబియ్యమును కాయగూరలును స్వామికై యాలయమునకుఁ గొనిపోయి స్వామికి సమర్పించి ప్రతిదినమును ఈతీరునఁ గైంకర్యము చేయుచుండెను.

ఇట్లు కొన్నిదినములు గడచునప్పటికి ఆతనికి దారిద్ర్యము సంభవించెను. కూలిచేసిన గాని జీవయాత్ర జరుగని స్థితి వచ్చెను. అయినను ఆతఁడు స్వామి కైంకర్యమును మానలేదు. సన్నబియ్యము లేకున్నను ముదుక బియ్యమును, కాయగూరలు లేకపోయినను ఆకుకూరలును స్వామికి ఆతఁడు భక్తితో సమర్పించుచుండెను. కొన్నిదినములకు బియ్యము లేకపోగా ఆకుగూరలను మాత్రమే సమర్పించెను. మఱికొన్ని దినములకు అదియు లేకపోఁగా, మంచినీళ్లు మాత్రమే సమర్పింపసాగెను.

ఒకనాఁడు ఆతఁడును భార్యయు చాలఁ గష్టపడి పొలములు తిరిగి ఏవో ఆకుఁగూరలు సంపాదించుకొని గుడికి పోవుచుండఁగా చాల దినములనుండి అన్నము తినుట లేదు; గాన దాయఁడు కన్నులుతిరిగి పడిపోయెను. భార్య పరిచర్యచేయఁగా కొంతసేపటికి ఆతనికి తెలివి వచ్చెను. అప్పుడు ఆతఁడు గంపలోని ఆకుఁగూరలన్నియు చెదరిపోయి యుండుటఁ గాంచి "ఇవి ఈశ్వరునకు సమర్పింపరాదు" అని నిశ్చయించుకొని, "ఇంతకష్టపడి సంపాదించిన వస్తువులు ఈశ్వరునకు సమర్పించుటకు వీలు లేకపోయెను; నిఁక నీబ్రతుకు ఏల" అని ఆతఁడు మొలలోని కైజారు తీసి పొడుచుకొనఁబోయెను. తోడనే పరమశివుఁడు పార్వతీసహితుఁడును వృషభవాహనారూఢుఁడు నై సాక్షాత్కరించి ఆతనిని వారించి "మీభక్తికి మెచ్చితిని. ఇఁక మీరు భూలోకమున నుండనేల?" అని వారిని కైలాసమునకుఁ గొనిపోయెను. చెదరిపోయిన వస్తువులు దేవునకు నివేదింప నర్హములు కావని వానిని వదలిపెట్టెను; కావున ఆతనికి అరివాట్టనాయనారు అని మాఱుపేరు గలిగెను.

# 104. మానక్కంజార్ నాయనారు

కంచారూరిలో మానక్కంజార్ నాయనారు అను నొకవెలమ యుండెను. అతని వంశమువారు అందఱును సేనాధిపతులు. అతఁడు అచంచల శివభక్తుఁడు. అతనికి సకలము నుండెను; కాని సంతానము లేదయ్యెను. అందులకు అతఁడు చాల కాలము నిరీక్షించి, తుదకు ఈశ్వరుని గుఱించి తపస్సు చేసెను. కొన్ని దినములకు పరమశివుని అనుగ్రహమువలన ఆతనికి ఒక కుమార్తె కలిగెను.

ఆమె తలిదండ్రులు మిగుల గారాబముతోఁ బెంప శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానయై యుక్తవయస్కురా లయ్యెను. యౌవనము ప్రాపించు నప్పటికి ఆమె సుందరియు, విదుషియు, విశేషించి శివభక్తురాలు నయ్యెను. మానక్కంజార్ నాయనారు కొమార్తెకు వివాహము చేయఁదలంచి వరాన్వేషణము ప్రారంభింపఁగా కలిక్కామనాయనారు ఈసంగతి తెలిసికొని ఆమెను తనకు మాట్లాడుటకు రాయబారుల నంపెను. యుక్తసమయమున వారు కంచారూరికిఁ బోయి తమరాక నెఱింగింపఁగా మానక్కంజార్ నాయనారు సంతోషముతో నంగీకరించెను.

కలిక్కామనాయనారు మహానందముతో బంధువుల నందఱను వెంటనిడుకొని మహావైభవముతో తరలివచ్చెను. నాఁడు ఒక శైవాచార్యుఁడు మానక్కంజారునాయనారు ఇంటికి వచ్చెను. నాయనారు ఆతనిని చాల నాదరించి లోనికిఁ దీసికొనిపోయి ఆతిథ్యము స్వీకరింపఁ గోరఁగా "మీయింట జరుగఁబోవు కార్యము ఎద్ది?" అని ఆగంతుకుఁడు అడిగెను. పెండ్లి అని నాయనారు చెప్పఁగా, ఆ బ్రాహ్మణుఁడు "వధువు నిచ్చుటకుఁ దెమ్ము" అనెను. నాయనారు తేఁగా, "ఈమె శిరోజములను నాకిచ్చెదవేని నీయింట నాతిథ్యము స్వీకరించెద" నని బ్రాహ్మణుఁడు మోమోటము విడిచి పలికెను. తోడనే నాయనారు ఆనందముతో కత్తెర తెచ్చి కొమార్తె శిరోజములను కత్తిరించి యీయఁగా బ్రాహ్మణుఁడు పుచ్చుకొని, ఆకాశమున వృషభారూఢుఁడై ఉమాశంకరుఁడై నిలిచెను. మానక్కంజారునాయనారు అప్పుడు శంకరుఁడు వచ్చినది దెలిసికొనఁజాలకపోయితినే యని వగచి, సాగిలఁబడి మ్రొక్కి, అనేకవిధముల వినుతించెను. అందులకు ఆనందించి పరమశివుఁడు ఎప్పుడును దనచెంతనుండి తననామమును ఊచ్చరించుటకై నాయనారును దనతోఁ దీసికొనిపోయెను. అది చూచి బంధువులు అందఱును ఆశ్చర్యాతిరేకముచే మైమఱచిరి.

అట కలిక్కామనాయనారు విడిదిలో నీవార్త విని పెండ్లివారి యింటికివచ్చి అకేశయైయున్న వధువు నారసి "అకేశను పెండ్లియాడుట శాస్త్రవిరుద్ధము" అని

ఆమెను పెండ్లియాడుటకు నిరాకరించెను. అంతట పరమశివుఁడు "వత్సా! నీకు అట్టి సందేహము వలదు" అని అశరీరవాక్కుతోఁ బలికెను. మఱలఁ జూడఁగా వధువు యథాపూర్వముగ సకేశియై యుండెను. పరమేశ్వరునకు తనయందు అనుగ్రహమున్నందునకు ఉప్పొంగుచు కలిక్కామనాయనారు ఆమెను పెండ్లియాడెను.

---

## 105. ఆనాయనాయనారు

వర్ష దేశమునందలి మంగళూరు అను నొక గ్రామమున ఆనాయనాయనారు అను నొక యాదవకులజుఁడు ఉండెను. ఆతనికి శివపూజయనినను శైవార్చనయనినను శివపురాణాగమాదులను వినుట యనినను పరమప్రీతి. ఆతనికి పిల్లనగ్రోవి యూఁదుటయందు చాల నేర్పుఁగలదు. ఆతఁడు ప్రతిదినమును తోడి గొల్లపిల్లవాండ్రతో అడవికిఁ బశువులను దోలుకొనిపోయి మేపుచు పిల్లనగ్రోవి యూఁదుచుండును.

ఒకనాఁడు ఆతఁడు ఒక మఱ్ఱిచెట్టుక్రింద వేణువులో పంచాక్షరిని వాయింపఁదొడఁగెను. ఆగానమాధుర్యమును గ్రోలి పశువులు పరవశములై నెమరువేయుట మాని చెంతఁ జేరి వినసాగెను. గొల్లవాండ్రు చేష్టలు దక్కియుండిరి. పాములు, వ్యాఘ్రములు, సింహములు, గజములు మున్నగు క్రూరజంతువులు, లేళ్లు, దుప్పులు, జింకలు, నెమిళ్లు మున్నగునవియు సహజవైరమును మఱచి, యొకచోఁ జేరి ఆనందముతో వినసాగెను. కిన్నరకింపురుషవిద్యాధరాదులు విమానారూఢులై ఆకసమున నిలిచి వినసాగిరి.

అప్పుడు పరమశివుఁడు ఉమాసహితముగ వృషభారూఢుఁడై ఆకసమున సాక్షాత్కరించి, ఆనాయనాయరును బిలిచి, "వత్సా! నీగానము త్రిలోకములయందును గూడ నత్యద్భుతమై యున్నది. నారదతుంబురాదులుగూడ నిట్లు పాడఁజాలరు. నీగానమును వినకుండ మేము ఉండఁజాలము; గావున మాతో కైలాసమునకు రమ్ము" అని యాతనిం గైలాసమునకుఁ గొనిపోయిరి. అది చూచుచున్న పసులకాపరులు ఆశ్చర్యచకితులైరి.



త్యా గ రా జు—543.

# 106. త్యాగరాజు

ఖరహరప్రియ - రూపకము

పల్లవి

రామనీసమాన మెవరు రఘువంశోద్ధారక॥ రామ॥

అనుపల్లవి

భామా మరువంపుమొలక భక్తయుపంజరపు చిలుక॥ రామ॥

చరణము

పలుకు పలుకులకు తేనె - లొలుకుమాటలాడుసోద

రులుగలహరి త్యాగరాజ - కులవిభూషమృదు-సుభాష॥ రామ॥

చోళదేశమునందలి పంచనదము అనుపుణ్యక్షేత్రమున రామబ్రహ్మము అను నొకబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు జ్ఞానవైరాగ్యములు కలవాఁడై శ్రీరామ చంద్రుని సదా భజించుచు ఐహికభోగాభిలాషిఁ గాక కలదానితో తృప్తిపడుచు కాలము గడపుచుండెను. ఆతనిభార్య పేరు శాంత. ఆమె పేరునకుఁ దగినట్లు శాంత స్వరూపిణి. పతిమాటను జవదాఁటియెఱుఁగని పతివ్రత. శ్రీరామనామస్మరణమునెప్పు డును మానియుండనిభక్తురాలు. ఈతీరున ఆదంపతులు ఇరువురును పరస్పరప్రేమతోఁ గాలము గడపుచుండఁగా, కొన్ని దినములకు ఇరువురు కుమారులు కలిగిరి. పెద్ద వానికి జప్యేశుఁడు అనియు, చిన్నవానికి త్యాగరాజు అనియు పేరులు పెట్టఁబడెను. రామబ్రహ్మము వారిని మిగుల గారాబముతోఁ బెంచుచు, యుక్తసమయములయందు అక్షరాభ్యాసము చౌలోపనయనాదులను గావించి, విద్యాభ్యాసార్థము గురునికట మునకుఁ బంపెను; కాని జప్యేశునకు విద్య అంటలేదు. ఆతనికి ఆటపాటలయందును, అల్లరి చేయుటయందును గల ఆసక్తి మఱి యెందును లేదు. అందులకుఁ తోడుగ నాతఁడు మందబుద్ధి. త్యాగరాజు అట్లుకాదు. ఆతఁడు ఎప్పుడును ఆటపాటలయం దును అట్టివిషయములయందును గాలము బుచ్చి యెఱుఁగఁడు. కుశాగ్రబుద్ధి యగు టచే గురువుచెప్పినదియెల్ల వెంటనే గ్రహించుచు సర్వకాలసర్వావస్థలయందును శ్రీరామచంద్రుని ధ్యానించుచు అచిరకాలమునందే విద్యను ముగించి ఇంటికిఁ జేరు కొనెను.

జప్యేశుఁడు యథాపూర్వముగ ఆటపాటలయందే కాలము గడపుచుండెను. త్యాగరాజు వాని మార్గమునఁ బోక దేవతార్చనము నిమిత్తము తండ్రికి పుష్పాదిక ముల నందిచ్చుచు వీలయినప్పుడెల్ల ఆగ్రామమున గల వీణ వేంకటదాసు అను

విద్వాంసునిచెంత సంగీతవిద్య నభ్యసించుచు ఉండెను. కొలఁదిదినములయందే ఆత నికి సంగీతసాహిత్యములయందు అఖండమైదుష్య మలవడెను. అప్పుడు శ్రీరామ చంద్రుని దివ్యగాథలను ఇరువదినాలుగువేలకీర్తనలుగా రచింపవలయు నని సంకల్పించి త్యాగరాజు తొలుత "గిరిరాజసుతాతనయ" అనుకీర్తనముతో గణపతిప్రార్థనము గావించెను. తోడనే గణపతి సాక్షాత్కరించి "నీయభీష్టము నెఱవేఱును" అని చెప్పి తిరోహితుఁ డయ్యెను. అందులకు త్యాగరాజు పరమానందభరితుఁడై 'నిన్నే భజన సేయువాఁడ' 'జగదానందకారక' 'దుడుకుగల' 'ఎందఱో మహాను భావులు' 'కనకనరుచిరా' అను అయిదుకీర్తనలతో శ్రీరాముని వినుతించెను.

కొన్ని దినములు గడచినతరువాత రామబ్రహ్మము తన కుమారులకు ఇరు వురకును వివాహములు చేసి కొలఁదిదినములకే స్వర్గమునకుఁ బోయెను. పిదప అల్లరిచేయుటయందు ప్రసిద్ధుఁడైన జప్యేశుఁడును, భక్తిజ్ఞానవైరాగ్యబంధురుఁడు అగు త్యాగరాజును ఒకరితో నొకరికి సయోధ్యలేకపోవుటచే విభక్తులయిరి. ఇంటిలో సగముభాగమును, తండ్రిపూజించు శ్రీసీతారామలక్ష్మణభరతశత్రుఘ్నాంజ నేయవిగ్రహములును త్యాగరాజునకు వచ్చెను. త్యాగరాజు ఆవిగ్రహములను అలంకరించి పూజించి "కొలువైయున్నాఁడే" "కొలువమరెగదా" యను కీర్తనలతో వినుతించెను. ఇట్లుండఁగా, ఆచార్యుఁడు లేనిదే మోక్షము కలుగదని తలంచి, ఆతఁడు మహాభక్తుఁడు అగు నారదుని ప్రార్థించెను. తోడనే నారదుఁడు సన్యాసివేషముతో వచ్చి నిలిచెను. త్యాగరాజు చాల ఆదరించినపిదప, సన్యాసి "భక్తశేఖరా! నీవు శ్రీరామచంద్రునిమీఁద రచించిన కీర్తనములను వినవలయునని వచ్చితిని. నాకోరికఁ దీర్పుము" అని కోరెను. త్యాగరాజు ఆతఁడు నారదుఁడే అని గ్రహించి 'రామా నిన్నే' 'శ్రీనాదర' 'నారద గురుస్వామి' 'వరనారద' అనుకీర్తనములను గానము చేసెను. నారదుఁడు తన్నుగ్రహించినందులకు అబ్బురపడుచు ఆతని గానమైపుణ్య మునకు మిగుల ఆనందించి తారకమంత్రమును ఉపదేశింపఁగా త్యాగరాజు పరమా నందభరితుఁడై 'ధ్యానమే' 'ముమ్మూర్తులు' 'సందేహమును తీర్పుము' అనుకృతులను బాడి నారదుని ఆనందపఱిచెను. అంతట నారదుఁడు 'స్వరార్ణవము' అను నొక గ్రంథమును ఒసంగి అంతర్హితుఁ డయ్యెను.

అదిమొదలు త్యాగరాజు అనేకసందర్భములయందు విసుగువిరామములు లేకుండ భక్తిపరవశుఁడై రచియించిన కృతులకు లెక్కలేదు. ఆతఁడు వాగీశనాయ నారునకు శంకరుఁడు ప్రత్యక్షమయినయాక్షేత్రమునఁగల దక్షిణకైలాస మను ఆల యమునకు భార్యతోఁగూడ ప్రతిదినమునుపోయి దినమునకు లక్షయు నెనుబదివేల పర్యాయములు రామనామమును స్మరించి భగవంతునకు సమర్పించుచువచ్చెను. భక్తి

లేని నరులను గాంచి ఆతఁడు పరితాపపడుచు, ననేకకృతులను నిర్మించెను. ఆతని కీర్తనలను ఆలకించి అనేకులు ఐహికసుఖాశ వీడి, మోక్షేచ్ఛులై శ్రీరామచంద్రునిఁ గొలువసాగిరి. దక్షిణకైలాసమున తొంబదియారుకోట్ల రామనామములను జపించి ముగించిననాఁడు శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణభరతశత్రుఘ్నాంజనేయాదులతో సాక్షాత్కరించి అభయ మీయఁగా త్యాగరాజు ఆనందపరవశుఁడై, కొంతతడవునకు తెలివి తెచ్చుకొని శ్రీరామచంద్రునకు అనేకసాష్టాంగములు ఆచరించి, 'నన్ను వినా సుఖము' 'శ్యామసుందరాంగ' మున్నగు అనేకకృతులను రచించెను. అదిమొదలు ఆతఁడు తాను శయనించుటకుపూర్వము పాలు, పండ్లు, పంచదార మున్నగువస్తువులను శ్రీరామవిగ్రహము సన్నిధి నుంచి 'ఆరగింపవే' 'విడెముసేయవే' మున్నగు కృతులతోఁ బ్రార్థించి శయనింపసాగెను. మఱునాఁటి ప్రాతఃకాలమున చూచునప్పటికి పెట్టిన వస్తువులు సగము సగమే ఉండసాగెను. అది చూచి త్యాగరాజు, ఆనంద పరవశుఁడై భగవచ్ఛేషమును అతిభక్తితో స్వీకరించుచుండెను.

ప్రతిసంవత్సరము నాతఁడు పెక్కుసారులు బ్రాహ్మణసంతర్పణలు చేయుచుండువాఁడు. ఆతని క్రొత్తకీర్తనలను వినుటకు వచ్చువారిసంఖ్య ఇంతింతని చెప్పుటకు అలవిగాదు. జప్యేశుఁడు కారణములేకయే త్యాగరాజుచేయు ఉత్సవములకును, సంతర్పణములకును అనేక విఘ్నములను గలుగఁజేయుచుండువాఁడు. ఒకనాఁడు ఆతఁడు అంతటితో నూరకుండఁజాలక, త్యాగరాజు అర్చించు శ్రీసీతాలక్ష్మణ భరతశత్రుఘ్నాంజనేయ సహితమగు శ్రీరామవిగ్రహమును కొనిపోయి కావేరీ నదిలోఁ బాఱవేసెను. అది తెలిసి త్యాగరాజు నిద్రాహారములను మాని, 'అన్యాయముసేయకురా' 'నాయెడవంచన' 'మరియాదగాదుర' 'మరియాద గాదయ్య' 'ఎందు దాగినాఁడో' 'చేరరావదేమిరా' మున్నగు అనేక కీర్తనలను బాడుచుఁ బ్రార్థింపఁగా, శ్రీరాముఁడు త్యాగరాజు దీక్షను ఒకసంవత్సరము పరీక్షించి, కావేరీ నది ఇసుకలో దొరికెను. త్యాగరాజు నాఁడు బ్రహ్మానందభరితుఁడై ఆవిగ్రహములను ఇంటికిఁ గొనివచ్చి సంప్రోక్షణచేసి, 'రఘువీర రణధీర' 'ముద్దుమోము' 'అలకలల్లలాడ' 'శ్రీరామ జయరామ' మున్నగుకీర్తనలతో కొనియాడి తన అన్న మంచిమార్గమునకు రావలెనని శ్రీరామునిఁ బ్రార్థించెను. వెంటనే రాముఁడు అట్లు అనుగ్రహించెను. అదిమొదలు జప్యేశుఁడు తమ్మునితోఁగూడి రామభజనము చేయసాగెను.

ఒకనాఁడు త్యాగరాజు భార్యయు, ధర్మసంవర్ధనీదేవియు ఏదో మాట్లాడుకొనుచుండిరి. ఇంతలో త్యాగరాజు లోనికి వెళ్లెను. అది చూచి దేవి వెంటనే తిరోహిత యయ్యెను. అప్పుడు ఆతఁడు "నీవెవరితో మాట్లాడుచున్నావు?" అని యడిగి

భార్యవలనఁ బ్రత్యుత్తరము బడయక, ఇంతలో అంతయుఁ దెలిసికొని "తెలిసి తెలిసికొంటి" "అంబ నిన్ను కన్న తల్లి" "నన్ను కన్నతల్లి" మున్నగు కీర్తనలను బాడి సంగతియంతయుఁ బ్రకటపఱిచెను. కొంతకాలమైన తరువాత త్యాగరాజునకు కళత్రవియోగము తటస్థించెను. అప్పుడు ఆతఁడు ఆమె సుగుణములను దలంచు కొని "తొలిజన్మమున" "ఏపాపము" అను కీర్తనములను రచించెను.

ఒకప్పుడు తంజావూరురాజు త్యాగరాజును దన యాస్థానమునకు రమ్మని వర్తమానము చేసెను; కాని త్యాగరాజునకు నరులను వినుతించి వారి యనుగ్రహము నాసించుట ఇష్టము లేదు; కావున నాతఁడు "నిధి చాలసుఖమా రాముని సన్నిధిసేవ సుఖమా" యను కీర్తనపాడి మనస్సును మఱలించుకొని యూరకుండెను. అట రాజు త్యాగరాజు తనయాజ్ఞను జవదాఁటినందులకు కుపితుఁడై నిర్బంధముతో రప్పింపఁదలఁచెను. ఈదౌర్జన్యమునకు ఫలముగా వెంటనే ఆతనికి శూల ప్రారంభించి, చాల తీవ్రముగ బాధింపసాగెను. అపుడు రాజు కన్నులుతెఱచి "ఇది పెద్దలయెడల అపరాధము చేయుటవలన సంభవించిన" దని యెఱింగి, వినీతవేషముతోఁ బోయి పాదములమీఁద వ్రాలి ప్రార్థింపఁగా, త్యాగరాజు రాముని ప్రార్థించి ఆబాధ లేకుండఁజేసి పంపివేసెను.

పిదప త్యాగరాజు తిరుపతికిఁ బోయి శ్రీనివాసమూర్తిని దర్శించుటకు ఆలయమునకుఁ బోయెను; కాని స్వామికి తెరవేయఁబడియుండెను. 'నాపురాకృత పాపము ఇట్లు అడ్డు వచ్చినది' అనితలఁచి 'తెరతీయఁగరాదా' యను కీర్తన పాడగా వెంటనే తెరతెగి పడిపోయెను. పిదప నాతఁడు వేంకటేశ్వరుని సేవించి స్వస్థలమునకు మఱలఁగా కోవూరు అను శైవస్థలమున నివసించియున్న సుందరేశ మొదలియారు అను శైవభక్తుఁడు ఒకఁడు వచ్చి ప్రార్థించి తనయూరికిఁ గొనిపోయెను. త్యాగరాజు ఆతనియింట వారముదినములు నివసించియుండి ఆతనివలన ప్రార్థితుఁడై పరమశివునిమీఁద "కోరిసేవింప" "నమ్మివచ్చిన" "శంభో మహాదేవ" అనియిట్లు కొన్ని కీర్తనములు రచించి అక్కడనుండి బయలుదేరెను. పోవునపుడు మొదలియారు 'ఈమహానుభావునకు ధనకాంక్ష లేదు; కావున ప్రత్యక్షముగా నిచ్చినఁ బుచ్చుకోఁడు' అని తలంచి అతనిపెట్టెలో వేయిరూపాయలను బోసి పల్లకిలో నుంచి ఆతని ముఖ్యశిష్యులకు ఈసంగతి నెఱింగించి భద్రమని చెప్పి పంపివేసెను.

మార్గమధ్యమున అర్ధరాత్రమున కొందఱు చోరులు వచ్చి తుప్పలవెనుక నిలిచి వారిమీఁదికి ఱాళ్లు రువ్వసాగిరి. అది చూచి శిష్యులు భీతిల్లఁగా త్యాగరాజు "భీతిల్లవలదు. చోరులకు మనవద్ద దొరకునది ఏమియులేదు. శ్రీరామునికటాక్షము

మనపైఁగలదు" అని పలికెను. కొంతసేపయిన తరువాత రామలక్ష్మణులు లిరువురును రాజకుమారరూపములతో వచ్చి చోరులపై బాణవర్షమును గురిసి పాఱద్రోలి వెడలిపోయిరి. చోరులు వారి సౌందర్యమును జూచి ముగ్ధులై వచ్చి త్యాగరాజునకు మ్రొక్కి- "మహానుభావా! ఇంతవఱకును మీపాలకి ముందువెనుకల నిలచి మాపై బాణవర్షమును గురిసిన రాజకుమారులను జూపి పుణ్యము కట్టుకొనుఁడు. మేము మీవద్దనున్న లిబ్బిని దొంగిలింపవచ్చిన చోరులముగాన వారినిఁ జూచిన పిదప మామనస్సు తిరిగిపోయినది. వారినిఁ జూపినఁ గాని మేము బ్రతుకఁజాలము" అని ప్రార్థించిరి. అది విని త్యాగరాజు దివ్యదృష్టితో సంగతియంతయు గ్రహించి "మీభాగ్యమే భాగ్యము! వారు రామలక్ష్మణులు. అప్రయత్నముగ వారిని దర్శింపఁగలిగిన మీరు అదృష్టవంతులు" అని పలికి "వాచామగోచరమే" మున్నగు కీర్తనలను బాడి, భగవంతుని వినుతించెను. పిదప చోరులు త్యాగరాజునకు శిష్యులై నాఁటినుండి క్రూరత్వమును మాని, కేవలము సాత్త్వికులై రామభజనము ప్రారంభించిరి.

వారందఱును అక్కడనుండి బయలుదేఱి వచ్చుచు నొక యగ్రహారము చేరిరి. అచ్చట నొకదేవాలయముచెంత ననేకులు గుంపులుగూడి యుండిరి. త్యాగరాజు శిష్యులలో నొకఁడు అచ్చటకుఁ బోయి అడుగఁగా, వారిలో నొకఁడు "ఒకబ్రాహ్మణుఁడు నిన్నరాత్రి జాము అగునప్పటికి భార్యాపుత్రులతో నీగ్రామము చేరిరి. పులిమున్నగు దుష్టమృగములకు జంకి అగ్రహారము నందలివారు ఎవ్వరును వారెంత పిలిచినను తలుపులు తీయలేదు. అంతట వారు విసిగి దేవాలయమున నుందమని ఇచ్చటకు వచ్చి చూడఁగా ఆలయద్వారము లోపల గడియ వేయఁబడి యుండెను. అప్పుడు ఆబ్రాహ్మణుఁడు గోడదాఁటి లోనికిఁ బోయి తలుపు తెఱచెద నని భార్యాపుత్రులను ద్వారముచెంత నుంచి మఱియొకచోట గోడ దుమికెను. ఆతఁడు ఎక్కడ దుమికెనో అచ్చట లోపల ఒకపెద్ద బావియున్నది. దైవదుర్విపాకమువలన నాతఁడు ఆబావిలోఁ బడి చనిపోయెను. అంతట ఆతని యిల్లాలు భర్త యెంతకును రాకుండుటఁ గాంచి యేదో విపత్తు సంభవించె నని భావించి రాత్రియంతయు నదేపనిగ దుఃఖించెను. తెల్లవాఱినతరువాత ఇది విని ఊరిలోని వారందఱును ఇచ్చటకు వచ్చిరి. నూతిలో నున్న ఆబ్రాహ్మణుని పైకితీసితిమి. ఆ బ్రాహ్మణి భర్తమీఁదఁబడి విలపించుచున్నది. ఇది సంగతి"అని చెప్పెను. శిష్యుఁడు ఈ వృత్తాంతము త్యాగరాజునకు ఎఱింగించెను. వెంటనే త్యాగరాజు అచ్చటకుఁ బోయి "నాజీవాధార" అను కీర్తనపాడి ప్రార్థించుచుండఁగా ఆబ్రాహ్మణుఁడు నిద్రపోయిన వానివలె లేచి కూరుచుండెను. అందఱును త్యాగరాజు మహిమ నారసి ఆశ్చర్యచకితులైరి. పిదప ఆబ్రాహ్మణుఁడు త్యాగరాజు సెలవుబడసి తిరుపతికిఁ బోయెను.

ఒకప్పుడు త్యాగరాజు శ్రీరంగమునకుఁ బోయెను. అచ్చట నాతఁడు రంగనాథుని దర్శించి సేవించి కీర్తనలతో వినుతించి అచ్చటనుండి బయలుదేఱి మధ్యార్జునము, గోవిందపురము, నాగపురములకుఁ బోయి మహాలింగస్వామిని, బోధేంద్రస్వామిని, శ్రీధర వేంకటేశ్వరుని, కాయారోహణస్వామిని సేవించి, తుదకు స్వస్థలమగు పంచనద క్షేత్రము చేరుకొనెను.

గోవిందదాసు అను నొకసంగీతవిద్వాంసుఁడు పంచనదమున త్యాగరాజు నిమిత్తము ఎదురుచూచుచు నుండి, ఆతఁడు వచ్చినవెంటనే తనయాగమనకారణము నెఱింగించి, అనుజ్ఞను బొంది పాడి తన సంగీతవిద్యాప్రావీణ్యమును గనఁబఱిచెను. త్యాగరాజు చాల నానందించి ఆతనిని దీవించి పంపెను. పిదప నొక బ్రాహ్మణుఁడు కాశీనుండి రామేశ్వరమునకుఁ బోవుటకు వచ్చుచుండఁగా, శ్రీరాముఁడు ఒకనాఁటి రాత్రి ఆతనికి "పంచనద క్షేత్రమున నాయంతరంగభక్తుఁడగు త్యాగరాజు ఉన్నాఁడు. ఆతనిని సేవించి పొమ్ము" అని స్వప్నమునఁ జెప్పెను. ఆబ్రాహ్మణుఁడు అట్లే చేసెను. త్యాగరాజు అది విని పరమాశ్చర్యచకితుఁడై "దాశరథే" అను నొక కీర్తనము రచించి ఆనందించెను.

త్యాగరాజు ప్రహ్లాదవిజయము, నౌకాచరిత్ర మున్నగు కొన్నిగ్రంథములను వ్రాసి యెనుబదియేండ్ల వయస్సున "జ్ఞాన మొసఁగరాదా" "ఇది సమయము గాదా" యని రెండు కీర్తనములను రచించి పాడెను. శ్రీరామచంద్రుఁడు నాఁటి రాత్రి స్వప్నమున సాక్షాత్కరించి 'సన్యసింపుము. నేఁటి కెనిమిదవ దినమున నీకు మోక్షము నొసఁగెద' నని చెప్పెను.

త్యాగరాజు అట్లే చేసెను. కలియుగము ౪౯౪౮ సంవత్సరములు గడచిన పిదప పరాభవసంవత్సర పుష్యబహుళపంచమినాఁడు ఆతఁడు పాంచభౌతికదేహమును విడచి, శ్రీహరిసాయుజ్యమును బడసెను. మరణసమయమున ఆతని కపాలము బ్రద్దలు చేసికొని, దివ్యతేజస్సు ఆకసమునకు నిర్గమించెను. అది చూచి అందఱును ఆశ్చర్యచకితులైరి.

త్యాగరాజు ఆంధ్రుఁడు. ఆతనివలననే కర్ణాటకగానము భూమిపై నిలిచినది. ఆతఁడు చేసిన కృతులు అన్నియు సంస్కృతమునందును ఆంధ్రమునందును ఉన్నవి. ఆతని కృతులను బాడియే దాక్షిణాత్యులు అనేకులు నేఁటికిఁ గూడ జీవయాత్ర గడుపుచున్నారు. ఎప్పటికినిఁ గూడ దక్షిణభారతదేశమున గాయకులకు త్యాగరాజుకృతులే శరణ్యములు. ఆతని సమాధి కావేరీతీరమున ఇప్పటికినిఁ గలదు.

శంకరాభరణము - దేశాది

పల్లవి

ఎందుకు పెద్దలవలె బుద్ధియ్యవు - ఎందుబోదునయ్యరామయ్య॥ ఎం॥

అనుపల్లవి

అందఱవలె దాఁటిదాఁటివదరితి - అందరానిపండాయెగదరా॥ ఎం॥

చరణము

వేదశాస్త్రతత్వార్థములు తెలిసి - భేదరహిత వేదాంతము తెలిసి
నాదవిద్యమర్మంబులను దెలిసి - నాథ త్యాగరాజనుత నిజముగ॥ ఎం॥

---

# 107. దశావంతుఁడు

శ్లో. "అర్థమనర్థం భావయ నిత్యం, నాస్తి తతస్సుఖలేశస్సత్యం,
పుత్రాదపి ధనభాజాం భీతి, స్సర్వత్రైషా విహితా రీతిః."

(శ్రీ. గోవిందద్వాదశమంజరికాస్తోత్రము.)

కాశీనగరమున దశావంతుఁడు అను నొకవర్తకుఁడు ఉండెను. ఆతని పూర్వులు విశేషధనమును సంపాదించి ఇచ్చి పోయిరి. దశావంతుఁడు గూడ పూర్వులు చేసిన వర్తకమునే చేయుచుండెను; కాని పూర్వులకును ఈతనికి జాల భేదము ఉన్నది. పూర్వులు ఎట్లయినను ధనము నార్జించుటయే ప్రధానము అని నమ్మి చరించిరి. దశావంతుఁడు అట్లుఁగాక వర్తకులు చేయు మాయల నన్నిటిని విడిచి, యథార్థముగను స్వల్పలాభమునకును క్రయవిక్రయములు చేయుచు ఐహికసుఖముల యెడల నిస్పృహ వహించి ఆముష్మికఫలాపేక్షుఁడై యుండెను. ఆతఁడు సంసారమునందు ఉన్నను తామరాకుమీఁది నీటిచుక్కవలె ఎందును అంటక భక్తివైరాగ్యబంధురుఁడై భగవద్భాగవతార్చనము చేయుచుఁ గాలము గడపుచుండెను.

ఆతనికి అయిదుగురుకుమారులు ఉండిరి. వారందఱును యుక్తవయస్కులును, వ్యవహారపరిజ్ఞాతలును అయిరి. దశావంతుఁడు "సంసారభారము నంతను కుమారుల మీఁద నుంచుటకు యోచించుచుండఁగా వారు అయిదుగురును ఆనగరమును ఏలు రాజు సన్నిధికిఁ బోయి "ప్రభూ! ఏలినవారు సావధానముగఁ జిత్తగింపవలయును. మా తాత ముత్తాతలు అపారధనము నార్జించి పోయినారు. మా తండ్రి దానిని వృద్ధిచేయకున్న మానె నిలిపినఁ జాలును; కాని మాకష్టసుఖములను ఇంచుకయు యోచింపక సాధువులని, సజ్జనులని, భాగవతులని,

సమారాధన లని, అన్నవస్త్రాదిదానములని అనేకవిధములను వెచ్చించివేయు చున్నాఁడు. ఇంట నున్న ధనపేటికలు అనేకములు ఖాళీ యైనవి. ఇఁక కొలఁదిదిన ములు ఇట్లే జరిగినచో మాకుఁ గుండయుఁ గట్టయుఁ జేతికి వచ్చును; కావున మహాప్రభూ! మాతండ్రి యధీనమున నున్నధనము మాస్వాధీనము చేయుము" అని ప్రార్థించిరి. రాజు దశావంతుని రావించి ఇది యంతయు నెఱింగించి, "ధనము అంతయు నీవు పాడుచేయుచున్నావు. ఇది నీస్వార్జితముకాదు. కావున నీచిత్తము వచ్చినట్లు వెచ్చించుటకు వీలులేదు. సొమ్ము అంతయు నీకుమారుల స్వాధీనము చేయుము. వారు నీకు గ్రాసవాసాదులకు లోపము లేకుండ మనోవృత్తి రూప ముగా సంవత్సరమునకు ఇంతయని కొంత సొమ్ము ఇచ్చుచుందురు" అని పలికెను.

ఇది విని దశావంతుఁడు మందహాసము! గావించి "రాజా! భూపతి సకలధర్మ ముల నెఱింగినవాఁడై యుండవలయు నని పెద్దలు శాసించినారు. అది నీయెడల వ్యర్థమైనట్లు తోఁచుచున్నది. ఆకొండికవాండ్రు యుక్తాయుక్తపరిజ్ఞానములేక ధనమును గుఱించి తగాదాచేయ నీ విట్లు తీర్పు చెప్పెదవా? సంసారముకంటె జీవు నకు భయంకరశత్రువు లేదు. అట్టిచో సంసారమునకు ఎల్ల మూలమగు ధనమును గుఱించి వివరింపవలసిన దేమున్నది? అట్టి ధనమును ఇంతచిన్నతనమునందే ఆకొండిక వాండ్ర కిచ్చిన ముందేమి జరుగునో యోచింపవలదా? యౌవనమదమువలనను, ధనగర్వము వలనను వాండ్రు సకలదుష్కార్యములను జేసి చెడిపోరా? ఆపాపము అంతయు నీకు తగులుకోదా? ఏల యిట్టి యేర్పాటు చేసెదవు? బుద్ధిని కానిత్రోవ లను ద్రొక్కనీయక బాగుగ యోచింపుము" అని పలికెను.

ఈమాటలు వినుటవలన రాజునకు కోపము వచ్చెను. దశావంతుఁడు నిజమైన విరాగి కాఁడు. రాజతిరస్కారము చేసిన పాపాత్ముఁడు అని నిశ్చయించుకొని యాతఁడు తలారులను జూచి "ఈదంభవ్రతుని కట్టి కొనిపోయి నదిలో పాఱవేయుఁడు" అని యాజ్ఞాపించెను. తలారులును రాజాజ్ఞప్రకారము గావించిరి. దశావంతుఁడు నది లోఁగా వేయఁబడిన వెంటనే కట్లు ఊడిపోయెను. భక్తవత్సలుఁ డగుపాండురంగఁడు కూర్మరూపియై వీఁపుమీఁద నెక్కించుకొని దశావంతుని నదియంతయు త్రిప్ప సాగెను. ఇది చూచి చూడవచ్చినప్రజలు యెల్లరును ఆశ్చర్యచకితులై మాటలాడఁ జాలకపోయిరి. రాజభటులు వడివడిగఁ బోయి ఇది యంతయు రాజునకు ఎఱింగించిరి. రాజును ఆశ్చర్యచకితుఁడై అచ్చటకు వచ్చి కొంతతడవు మాటలాడఁజాలక ఎట్టకేలకు తెప్పిరిలి "దశావంతా! నీవు నీటిమీఁద నెట్లు తేలియాడుచున్నావు?" అని యడిగెను. అందులకు దశావంతుఁడు మందహాసముగావించి ఇట్లు పలికెను.

"రాజా! నీవు తత్వమెఱుంగనివాఁడవు; కావున నిట్టు పలుకుచున్నాఁడవు. ఇందు నాప్రజ్ఞయేమియు లేదు. అంతయుఁ బరాత్పరుఁడు చేయుచున్నాఁడు. ఎవని

చింతామాత్రమున ఈప్రపంచ మంతయు పుట్టి పెరిగి గిట్టుచున్నదో, ఎవని లీలలు అనంతములును అవాఙ్మానసగోచరములు నై యున్నవో, ఎవని దెలిసి కొనుటకు సనకసనందనాదులుగూడ శాశ్వతతపోనిష్ఠాగరిష్ఠులై యున్నారో, నిర్మల భక్తితో స్మరించినమాత్రమున మానవులకు ఎవఁడు మోక్షము నొసంగుచున్నాఁడో భక్తపరాధీనుఁడగు ఆపుండరీకవరదుఁడు కూర్మరూపియై, నన్ను వీఁపుమీఁద నెక్కించుకొని నదియంతయు సంచరించుచున్నాఁడు."

"జనులారా ! ఈకాన్పించుచున్న దంతయు క్షణభంగురము. సంసారము అసారము. తనువులు బుద్బుదప్రాయములు. సంసారమునఁ గూలి అన్య మెఱుఁగక యుండువానికి పరములేదు. దారపుత్త్రాదిబంధుభావములు అన్నియుఁ అజ్ఞానవిలసితములు. ఒకరితో నొకరి కేమియు సంబంధములేదు. అట్టియెడలఁ బరులనిమిత్తము పరమునకు చెడువానికంటె అజ్ఞాని యుండఁడు గదా ! జీవోపహతులకు పాండురంగఁడు ఆధారభూతుఁడై యున్నాఁడు; కావున మీరందఱును ఆతనిపాదపద్మములను ఆశ్రయించి తరింపుఁడు."

ఇది వినఁగనే రాజునకు జ్ఞానము వచ్చెను. చూడవచ్చినవారికి తత్త్వము బోధపడెను. వెంటనే అందఱును ప్రార్థింపఁగా, కూర్మరూపియగు భగవంతుఁడు దశావంతుని తీరమునకుఁ దెచ్చి విడిచెను. రాజును, ప్రజలును, కుమారులును, బ్రహ్మరథముపట్టి దశావంతుని పట్టణమునకుఁ గొనిపోయిరి. రాజును, కుమారులును, ప్రజలలో ననేకులును, దశావంతునివలన జ్ఞానోపదేశమును బడసిరి. దశావంతుఁడు బ్రతికియున్నంతకాలమును అనేకులకు జ్ఞానోపదేశము చేసి అవసానమున ఈశ్వర సాయుజ్యమును బడసెను.

శ్లో. "బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణబాష్పాంబునా,
నిత్యం త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్." (ముకుందమాల. 20.)

---

# 108. సంతోబా

శ్లో. "తమసి రవిరివోద్యన్మజ్జతామంబురాశౌ ప్లవ ఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః,
నిధిరివ విధనానాం దీర్ఘతీవ్రామయానాం భిషగివ కుశలం నో దాతుమాయాతు శౌరిః."
(కృష్ణకర్ణామృతము. ఆ. 3. శ్లో. 97.)

ఒకగ్రామమున సంతోబా యను నొకవర్తకుఁడు ఉండెను. ఆతఁడు తన సంసారకృత్యములను అన్నిటిని మామూలుగ నిర్వహించుకొనుచు శ్రీహరిధ్యానము తప్పక యుండెను. ఒకనాఁడు ఒకచోట తుకారామస్వామి హరిభజనము చేయుచుండఁగా నీతఁడు వినియెను. తోడనే వైరాగ్య మతిశయించెను. ఆవెంటనే

సంతోబా యింటికి వచ్చి లక్షలకొలఁదిగ నున్న ధనమంతయు బీదలకుఁ బంచియిచ్చి, కాషాయవస్త్రములను ధరించి అరణ్యమునకుఁ బోయి నిర్జనస్థలమునఁ గూర్చుండి హరిధ్యానము ప్రారంభించెను.

సంతోబా తల్లి కుమారుని మనసు త్రిప్పుటకు అనేకవిధముల సొంతముగాఁ బ్రయత్నించి ప్రయోజనము గానక "తల్లీ! సకలాభరణములను ధరించుకొందువేని నీవు రంభవలె నుందువు. నీవు చక్కఁగ నలంకరించుకొని అడవికిఁ బోయి నీభర్త పాదములమీఁద వ్రాలి ప్రార్థింపుము. అట్లయిన నీకోరిక నెఱవేఱును" అని కోడలికిఁ జెప్పెను. కోడలు వల్లె యని అత్తగారు చెప్పినప్రకారము చక్కఁగ నలంకరించుకొని అరణ్యమునకుఁ బోయెను.

సంతోబా భార్యను జూచి మందహాసము గావించి, కూర్చుండ నియమించి "కాంతా! కుసుమమువలె నీవు సుకుమారురాలవు. అత్తింటను పుట్టినింటను గూడ నెన్నఁడును కష్టములను ఎఱుఁగవు. పూలలోఁ బెఱిగిన నీవు ఈగాఢారణ్యమునకు ఏల వచ్చితివి? గతమునకుఁ జింతించినఁ బ్రయోజనము లేదు. త్వరగ నింటికిఁ బోయి సుఖముండుము" అని పలికెను. అందులకు ఆమె "నాథా! మీయాజ్ఞను నేనెన్నఁడును జవదాఁటి యెఱుఁగను. ఇఁకముందుగూడ జవదాఁటఁజాలను. మీరు పొమ్మనినఁ బోదును. ఉండు మనిన నుందును. మీ రెంతవిరాగులు అయినను మీరు నాకు భర్తలు కాకపోరు. నేను మీపదదాసిని కాకపోను. మేఘమును విడిచి మెఱపును, చంద్రుని విడిచి చంద్రికయు, సూర్యుని విడిచి ప్రకాశమును ఉండఁజాలనట్లు పతిని విడిచి సతి యుండఁజాలదు. మిమ్ము విడిచి నేను ఎట్లు ఉందును? నాకిట్లు ఆజ్ఞాపించుట మీకు ఏమిధర్మముగ నున్నది?" అని బదులు పలికెను. సంతోబాకు అనందము కలిగెను. అంతట నాతఁడు "సాధ్వీ! నీపలుకులకు ఆనందమైనది; కాని ఒకసంగతి వినుము. నీవు నాతో నిచ్చట నుండుటకు ఏమియు అభ్యంతరము లేదు. భార్యాభర్త లిరువురును అరణ్యమున నుండుట వానప్రస్థాశ్రమ మనఁబడును; కాని నేను జీర్ణవసనములను ధరించియుండఁగా నీవు చీనిచీనాంబరములను ధరించియుండిన నెట్లు? నీవు ధరించియుండిన సకలాభరణములను చీనాంబరములను విడిచి కాషాయాంబరములను ధరించి కందమూలఫలాశనముతోఁ గాలము గడపెదవేని ఇక్కడ నుండుటకు ఎట్టి యభ్యంతరమును లేదు" అని చెప్పెను.

ఆమె తోడనే ఆభరణములను చీనాంబరములను విడిచి కాషాయ వస్త్రములను ధరించి పల్లకిలో ఆభరణాదుల నిడి "ఇంటికిఁ బొండు" అని బోయీలకు ఆజ్ఞాపించెను. బోయీలు ఆశ్చర్యచకితులై మాఱు పలుకఁజాలక తిన్నగ వచ్చిన దారినే పోయిరి. పిదప ఆమె భర్తృచరణముల నంటి "చిన్నతనమునందే మీపాద

ముల నాశ్రయించితిని. ఇఁక బ్రతికియున్నంతకాలము నేను మీపాదములను విడిచియుండను. ఇఁక నాజ్ఞాపింపుఁడు. నావలన మీచిత్తమువచ్చిన సేవలుగొనుఁడు" అని పలికెను. "సమీపగ్రామమున మన బంధుగులు ఉన్నారు. నీవు ఆగ్రామమునకుఁ బోయి ఎవరేమనినను చలింపక, సగమురొట్టెను సంపాదించి తెమ్ము. ఎవరిచ్చినను సగమురొట్టెకంటె నధికము తేకుము" అని సంతోబా యాజ్ఞాపింపఁగా, వల్లె యని యామె వెంటనే బయలుదేరి పోయెను.

ఆగ్రామమున సంతోబా సోదరి యుండెను. కాషాయాంబరములను ధరించి వచ్చి "వాసుదేవా!" యని పలికి గుమ్మముననిలిచియున్న వదినెగారిని జూచి యామె తొలుత నిర్విణ్ణయై కొంతతడవు మాటలాడఁజాలక పిదప నెట్లో తెలిపిచేసికొని తటాలునవచ్చి కౌఁగిలించుకొని ఇదిమేమి వదినెయని గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను గాని ఏమియుఁ బ్రయోజనము లేకపోయెను. రొట్టె యనుమాటతక్క సంతోబాభార్య మఱేమియుఁ బలుకలేదు. తుదకు విసిగిపోయి సంతోబాసోదరి గోధుమపిండి, నేయి, పంచదార వీనితోఁ జేయఁబడిన రొట్టెలను దెచ్చి, వదినెగారు "ఇవి పనికిరావు. మీయన్నగారు వీనిని అంగీకరింపరు" అని యెంత చెప్పుచున్నను వినక ఆమె కోక చెంగునకుఁ గట్టి పంపివేసెను. మఱియొక యిల్లాలు సంతోబాభార్య కోరినప్రకారము మామూలు రొట్టెలో సగము ఇచ్చిపంపెను.

సంతోబా సోదరి యిచ్చిన రొట్టెలను జూచి "ఇవి మనకేల? నిర్బంధించి యిచ్చినది; కావున మఱల ఇచ్చివేసిరమ్ము" అని పంపివేసెను. ఆతనిభార్య వల్లె యని పోయి ఇచ్చివేసి వెనుదిరిగెను. ఇంతలో మార్గమధ్యమున నున్న నది అమాంతముగ పొంగి మార్గమును అరికట్టెను. అదిచూచి యామె "పండరినాథా! నాభర్త నేను వెడలిన గాని భుజింపఁడు. ఈయేరు ఇట్లు పొంగియున్నది. ఏమి చేయుదును?" అని విచారింపసాగెను. అపుడు పండరినాథుఁడు ఒక పల్లెవాని వేషముతో వచ్చి "తల్లీ! ఏల వగచెదవు? నన్ను నీకడుపునఁ బుట్టిన బిడ్డగా ఎంచుకొనుము. నాభుజములపైఁ గూర్చుండుము. నిముసములో నిన్ను అవ్వలియొడ్డునఁ గూర్చుండఁ బెట్టెదను" అని పలికెను. ఆమె యందులకు అంగీకరింపఁగా పల్లెవాని వేషమున నున్న పాండురంగఁడు ఆమెను భుజముమీఁద నెక్కించుకొని క్షణములో నవ్వలియొడ్డునకుఁ జేర్చెను.

పల్లెవానికిఁ జాలఁ గృతజ్ఞతఁ జూపి ఆమె భర్తచెంతకుఁ బోయి జరిగినదంతయు నెఱింగించెను. అదివిని సంతోబా, "కాంతా! నీయదృష్టము నేమని చెప్పఁగలను? పల్లెవేషముతో భగవంతుఁడు నీకు దర్శన మొసఁగెను. నేనేమి పాపాత్ముఁడనో నాకు దర్శన మివ్వకపోయెను; గావున పాండురంగఁడు నాకు సాక్షాత్కరించునంత

దనుక నేను నిద్రాహారముల నొల్లను" అని వ్రతము పట్టెను. ఈవ్రతము నెఱింగిన పాండురంగఁడు సమీపగ్రామమునందలి యొకవర్తకుని స్వప్నమున సాక్షాత్కరించి "వర్తకుఁడా! నీవు పోయి అరణ్యమధ్యమున నున్న సంతోబాకు రొట్టెలను ఇచ్చిరమ్ము" అని చెప్పి అదృశ్యుఁ డయ్యెను. వర్తకుఁడు నిద్రమేల్కాంచి ప్రాతఃకాలమునందే రొట్టెలను తయారుచేసికొని అరణ్యమునకుఁ బోయి సంతోబాను దర్శించి, జరిగినదంతయు నెఱింగించి "రొట్టెలను స్వీకరింపవలయు" నని ప్రార్థించెను. నీకు సాక్షాత్కరించిన పాండురంగఁడు నాకుఁగూడ సాక్షాత్కరించినఁగాని నే నీ రొట్టెల నొల్లనని తిరస్కరించెను. చేయునదిలేక వర్తకుఁడు తనదారిం బోయెను.

పాండురంగఁడు సంతోబా చిత్తశుద్ధికిని, దృఢదీక్షకును మెచ్చి రుక్మిణీసహితుఁడై సాక్షాత్కరించెను. అపుడు సంతోబా పరమానందభరితుఁడై పరమేశ్వరుని వలఁగొని మ్రొక్కి, "శ్రీహరీ! సనకసనందనాదులకుఁ గూడ అలభ్యమైన దివ్యదర్శనమువలన నాపాపములన్నియు భస్మపటలమై పోయినవి. అన్నియు బాగుగనే యున్నవి గాని నీ దివ్యరూపసందర్శనమువలన యుత్కంఠచే నాకు గాఢదర్శము వొడముచున్నది. ఇఁక నిన్ను వినుతింపఁ జాలను" అని పాదముల మీఁద వ్రాలి, కరుణింపుము అని ప్రార్థించెను. "నీవు నా యంతరంగభక్తుఁడవైతివి. నిన్ను విడిచి నేను ఉండను" అని అభయ మిచ్చి పాండురంగఁడు తిరోహితుఁ డయ్యెను. అది మొదలు సంతోబా మహానందముతో హరిభజనముఁ జేయుచు భిక్షాన్నము భుజించుచుఁ గాలము గడపసాగెను.

ఒక సమీపగ్రామమున నొక బ్రాహ్మణుఁడు భార్యమీఁద కోపము వచ్చినపుడెల్ల "నేను సంతోబావలె విరాగినై యరణ్యమునకుఁ బోయెద" నని బెదరించుచు, ఆమెవలన వలసిన వెల్లఁ జేయించుకొనుచుండెను. ఒకనాఁడు ఆబ్రాహ్మణి సంతోబా భిక్షకు వచ్చినపుడు సకలము నెఱింగించి, ఉపాయము చెప్పవలయునని ప్రార్థించెను. అందులకు సంతోబా "నీచిత్తము వచ్చినట్లు చేసికొనుము. అని చెప్పుము" అని నియమించెను. ఆమె యట్లేచేసెను. అదివిని బ్రాహ్మణుఁడు "ఇఁక నిచ్చట నుండిన నిది లోకువచేయు" నని చింతించి ఒక చెంబును ఒకవస్త్రమును మాత్రము గైకొని సంతోబా చెంతకుఁ బోయి "నేను విరాగినై మీశరణు బొందవచ్చితిని" అని ప్రార్థించెను. సంతోబా అందుల కంగీకరించి "తటాకమునకుఁ బోయి జలము గైకొనిరమ్ము. అచ్చట అపుడపుడు చోరులు సంచరించుచుందురు; కావున నీ ఇత్తడిచెంబు నిచ్చటనుంచి సొరకాయబుఱ్ఱతో తీసుకొనిరమ్ము" అని పంపెను. ఆబ్రాహ్మణునకు చెఱువునుండి గుడుసన్నిధికి వచ్చునప్పటికి తీఱనిఆఁకలి బాధింప

సాగెను. ఆసంగతి విన్నవింపఁగా సంతోబా తినుమని చెప్పి వెఱ్ఱిపుచ్చకాయ నిచ్చెను.

ఒకకాయ నోటఁ బెట్టుకొనినప్పటికి విపరీతపు చేదువలన నోరు చెడిపోయెను. "ఇఁక నేను తినఁజాలను. నాకు రుచ్యమైన పదార్థమును ఈయవలసిన" దని బ్రాహ్మణుఁడు కోరెను. "నీవు నిక్కముగా విరాగివి కావు. వేషధారివి. సంగతి యంతయు నెఱింగింపుము" అని సంతోబా కోరఁగా నాతఁడు అంతయు నెఱింగించెను. "నీకిట్టి దౌర్జన్యము తగదు" అని బ్రాహ్మణునకు బుద్ధిచెప్పి ఆతనిని గ్రామమునకుఁ గొనిపోయి భార్యాభర్తల కైక్యము సంఘటించి తన దారిం బోయెను.

ఒకప్పుడు ఆషాఢశుద్ధ ఏకాదశినాఁడు పండరిపురమున జరుగు మహోత్సవమును చూచుటకు అనేక భాగవతులు బయలుదేరి సంతోబాయున్న అరణ్యమార్గమున వచ్చిరి. అచ్చట భీమానదియు మఱియొకనదియు సంగమించును. అపుడు ఆనది కూలంకషమై ప్రవహించుచుండుటఁ జూచి భాగవతులు అందఱును "ఱేపే మహోత్సవము. నది ఇట్లున్నది. ఏమిసేయుదుము" అని చింతించుచుండఁగా సంతోబా అచ్చటకు వచ్చి "మీరేల చింతించెదరు? భవార్ణవమును దాటించు శ్రీహరికి ఈనదిని దాఁటించుట లెక్కయా? రండు నావెంట" నని ముందు బయలుదేరెను. భక్తులందఱును అతని ననుసరించిరి. నది మోఁకాలి లోఁతు అయ్యెను. అంతయు నైనతరువాత సంతోబా పాండురంగఁడు మహాకూర్మమై నదిని దాఁటు నపుడు తమ పాదముల క్రిందనుండుట యెఱింగి అనేకవిధములఁ గొనియాడి బ్రతికి యున్నంతకాలమును ఇట్లే అనేకులకు మోక్షమార్గమును జూపి అవసానమున శ్రీహరిసాయుజ్యమును బొందెను.

మ. "అడవిం జీఁకటిఁ బోవువాని కుదయం బైనట్టిసూర్యాకృతిన్
జడధిం గ్రుంగఁగ నావదగ్గఱిన యోజం జేదకున్ లిబ్బి చొ
ప్పడురీతిం దృషదీర్పఁగా జడిమొగుల్ పైకొన్నచందాన నొ
వ్వడరన్ మాన్పెడువైద్యునట్లు హరి డాయన్ వచ్చి నన్ బ్రోచుతన్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. ప. 97.)

# 109. జగన్మిత్ర నాగనాథుఁడు

శ్లో. "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథా శ్శ్రోత్రద్వయ త్వం శృణు,
కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీ మూర్ధం నమాధోక్షజమ్."

(ముకుందమాల. 16. శ్లో.)

వైద్యనాథపురమున నాగనాథుఁడు అను బ్రాహ్మణుఁడు ఒకఁడు ఉండెను. అతఁడు సంసారమున నున్నను తామరాకుమీఁది నీటిబిందువువలె నెందు నంటక సంతతము భగవద్భాగవతారాధనము చేయుచు సుఖముగాఁ గాలము బుచ్చుచుండెను. ఆతనికి అందఱును ఇష్టముగా నుండుటవలన జగన్మిత్రుఁడు అనుపేరు వచ్చెను.

ఆపురమునఁ గల కొందఱు దుర్మార్గులు మొదటినుండియు నాగనాథుఁడు అనిన అనిష్టముగ నుండిరి. నాగనాథుఁడు ఎవరిజోలికినిఁ బోవువాఁడు కాకున్నను అకారణజగచ్ఛత్రువులు అగువారికి కారణములు అవసరము లేదుగదా! ఆదుర్మార్గులలో నొకఁడు ఒక రాత్రి రెండుజాములవేళ నాగనాథుని ఇంటికి అగ్గిపెట్టెను. తోడనే ఇల్లంతయు వ్యాపించి భగభగ మండసాగెను. భగవన్నామస్మరణము గావించుకొనుచున్న నాగనాథుఁడు అది జూచియు "సంసారబంధములలో నొక్కటొకటే అయాచితముగను అప్రయత్నముగను వదలిపోవుచున్నవి" అని యానందింప సాగెను; గాని చిటచిట ధ్వానములను ఆలించి ఇరుగు పొరుగువారు అందఱును లేచి వచ్చి "మహానుభావునకు ఎంత చిక్కువచ్చె" నని విచారించుచు ఆర్పుటకు అవకాశము లేకపోవుటచే ఏమియుఁ జేయఁజాలక అట్లే చూచుచు నిలువఁబడిపోయి యుండిరి. వారికి గుమ్మమునకు ఎదుట ఆయనంతప్రకాశమునఁ గూరుచుండి చిఱుతలు వాయించుచు హరిభజనము చేయుచున్న నాగనాథుఁడు కాన్పించెను. ఆతనిం గాంచినతోడనే వారికి ఆశ్చర్యమును భయమునుగూడ నొక్కమాఱు కలిగెను. "ఈమహాత్ముఁడు అగ్నిలోఁబడి చనిపోవును గాఁబోలు'!' నని కొందఱును "ఆహా! ఈభక్తుని మాహాత్మ్యము అగ్ని ఇంతతీవ్రముగ విజృంభించుచున్నను, ఒక్క నలుసైన ఆతనిమీఁదఁ బడుట లేదు" అని మఱికొందఱును జెప్పుకొనసాగిరి; కాని నాగనాథుఁ డేమియు జంకక అట్లే యుండెను. భగవన్నియామకమువలన ఆతని యాలు బిడ్డలు గాఢనిద్రాముద్రితులై యేమియు నెఱుంగక యుండిరి. ఇది యంతయుఁ జూచి అగ్గిముట్టించిన దుర్మార్గులు పశ్చాత్తాప

పడి సంగతియంతయు నెఱింగించి, నాగనాథుని పాదములమీఁద వ్రాలి శరణము గోరిరి. నాగనాథుఁడు వారు చేసినపనికిఁ గోపింపక జ్ఞానబోధఁ గావించి, శ్రీకృష్ణ మంత్రమును ఉపదేశించి పంపివేసెను.

కొన్ని దినములు గడచినతరువాత ఆగ్రామమున వసించువారందఱును వచ్చి "మహాత్మా! మీ యర్హతకు తగకున్నను మీకుటుంబసంరక్షణమునకుఁ గొంత భూమి నేర్పాటు చేసెదము. అనుగ్రహించి తమరు అంగీకరింపవలయును" అని ప్రార్థించిరి. అందులకు ఆతఁడు అంగీకరింపక "ఆభూమిని నేను ఏమి చేసికొందును? నేను ఉంఛవృత్తిచే జీవించువాఁడను. ఈశ్వరానుగ్రహమువలన నేను ఉంఛవృత్తి చేసికొనుచునే అతిథులను బూజించుచు తరించుచున్నాను. నానిమిత్తము మీరు భూమినొసంగఁబనిలేదు" అని బదులుచెప్పెను. గ్రామవాసులు అంతటఁ జేయునది లేక నాగనాథుని పేరిట నొక గ్రామమును ప్రతిష్ఠించి దానిమీఁది వచ్చుబడిని ధర్మ కార్యములయందు వినియోగింపసాగిరి.

ఇట్లుండఁగా ఆగ్రామముల నేలు అధికారి మాఱిపోయి ఆతనిస్థానమున నొక తురుష్కుఁడు వచ్చెను. ఆతఁడు నాగనాథునిపేర ధర్మకార్యములకు ఏర్పఱుపఁ బడిన భూములను తా నాక్రమించుకొనెను. ఊరివారందఱును అట్లు చేయవల దనియు వానిని యథాప్రకారము జరుగనీయవలసినదనియుఁ బ్రార్థించిరి; గాని యవ నుఁడు అందులకు అంగీకరింపక నాగనాథుని రప్పించి, "నీవు జగన్మిత్రుఁడవని పిలి పించుకొనుచున్నావు; మొదటినుండియు మాకు బెబ్బులి కులదైవమైయున్నది. మహారణ్యమునకుఁ బోయి నీవు ఒక వ్యాఘ్రిమును గొనివచ్చెదవా సరే, లేకున్న నీపేర ధర్మార్థము ఏర్పడిన భూములకు ప్రథమమునుండియుఁ బన్నుగట్టి నీవలన వసూలు చేసెదను" అని గద్దించి పలికెను.

నాగనాథుఁడు వల్లె యని మహారణ్యమునకుఁ బోయి పండరినాథుని ధ్యానిం చెను. తోడనే పాండురంగఁడు వ్యాఘ్రిరూపియై వచ్చి సాక్షాత్కరించెను. అంతట నాగనాథుఁడు వ్యాఘ్రిరూపియగు భగవంతుని వలఁగొని అనేకవిధముల వినుతించి, "శ్రీహరీ! నీవు తురుష్కుని ప్రార్థనము నంగీకరింపవలయును" అని కోరెను. పండరి నాథుఁడు అందులకు అంగీకరింపఁగా నాగనాథుఁడు వ్యాఘ్రిముమెడకు తన యుత్త రీయమును జుట్టబెట్టి గ్రామమునకు బయలుదేఱెను. మార్గమధ్యమునఁ దారసిల్లిన వారందఱును గజగజ వడఁకిపోవసాగిరి. పట్టణమునందలివారు తటాలున ఇండ్లలో దూఱి తలుపులు మూసికొనసాగిరి. ఇట్లుండఁగా నాగనాథుఁడు పులితో కోటగుమ్మము సమీపించెను.

భయాతిరేకమువలన కావలివాండ్రు కోటతలుపులు బిగించిరి. అదిచూచి వ్యాఘ్రేశ్వరుఁడు గుండెలవియునట్లు అఱచి, రెండుచఱపులు చఱచి తలుపులు

పగులఁగొట్టెను. తోడనే ఇరుదెసలనున్న భటులు తోఁచినట్లెల్లఁ బాఱిపోయిరి. నాగనాథుఁడు వారికి అందఱకును ధైర్యముఁగొలిపి నగరుచెంగటికిఁ గొనిపోయెను.

నగరివాఁకిలిగూడ మూయఁబడియే యుండెను. వ్యాఘ్రేశ్వరుఁడు తొల్లిటివలె మఱలఁ దలుపులు పగులఁగొట్టి లోపలఁ బ్రవేశించెను. ఇదివిని తురుష్కుఁడు భయభ్రాంతుఁడై యొకమూల నొదిగికొనెను. నాగనాథుఁడు ఆతనియెదుటకుఁబోయి "నీకులదైవము వచ్చెను. ఏల మూలఁ గూర్చుందువు?" అని ప్రశ్నించెను. అది విని తురుష్కుఁడు ఎట్లో ధైర్యము చిక్కబట్టుకొని వచ్చి నాగనాథుని పాదములమీఁద వ్రాలి "మహాత్మా! నీ ప్రభావమును ఎఱుంగక మోసపోయితిని. నన్ను క్షమింపవలయును" అని ప్రార్థించెను. తోడనే వ్యాఘ్రేశ్వరుఁడు శాంతించెను. తురుష్కునకు ధైర్యము పూర్ణముగఁ గలిగెను. అగుట నాతఁడు మఱల చేతులు జోడించుకొని నాగనాథుని యెదుట నిలిచి "మహానుభావా! శ్రీహరి నీయెడల నింతటి యనుగ్రహము చూపునని యెవరును ఎఱుంగరు. పులిని ఎప్పటి యట్ల అరణ్యమున విడిచి వచ్చి మమ్ము అందఱను గరుణింపుము" అని ప్రార్థించెను. తురుష్కుని ప్రార్థనము ప్రకారము నాగనాథుఁడు పులిని అరణ్యమున విడిచివచ్చెను. పట్టణమునందలివారు ఎల్లరును అతని కెదురేఁగి మహాగౌరవముతోఁ గొనివచ్చిరి. నాగనాథుఁడు అధికారి యగు తురుష్కునకును, ప్రజలలో ననేకులకును జ్ఞానమును శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి బ్రతికియున్నంత కాలమును ఇట్లే గడపి, అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసెను.

శ్లో. "శ్రీమన్నృసింహవిభవే గరుడధ్వజాయ, తాపత్రయోపశమనాయ భవౌషధాయ,
తృష్ణాదివృశ్చికజలాగ్నిభుజంగరోగ, క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే."
(శ్రీలక్ష్మీనరసింహస్తోత్రము. 25. శ్లో.)

---

## 110. సాత్త్వికరాజు

శ్లో. "అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీ, సరసతరసరసిరుహసదృశదృశి దేవే,
వ్రజయువతిరతికలహవిజయనిజలీలా, మదముదితవదనశశిమధురమణిలీయే."
(51. 1. కృష్ణకర్ణామృతము.)

జగన్నాథక్షేత్రమున సాత్త్వికరాజు అను ఒకభూపాలుఁడు ప్రజాపాలనము గావించుచుండెను. ఆతఁడు సంసారమునసుండియు, తామరాకు మీఁది నీటిచుక్కవలె నెందు నంటక సదా శ్రీహరిని ధ్యానించుచు, రాజభావముతోఁ గాక సేవకభావముతోఁ బ్రజల నేలుచుండెను.

అలవాటు చొప్పున నాతఁడు ఒకనాఁడు స్వామిని దర్శించుటకు ఆలయమ్ము నకుఁ బోయెను. అప్పటికి నైవేద్యము జరుగుచుండుటచే ఆలయద్వారములు మూయఁబడియుండెను. రాజు తలుపులు తెఱువఁబడునంతవఱకు ఊరక కూర్చుండ నేల? యని పాచికలను దెప్పించి మంత్రిసామంతాదులతో జూదము ప్రారంభించెను.

కొంతసేపటికి ఆలయమున జగన్నాథస్వామికి నైవేద్యము చేయుట ముగిసెనుఁ అర్చకులు వచ్చి కొందఱు దేవుని దర్శించుటకు ఇది వేళయని తెలిపిరి. కొందఱు భగవత్ప్రసాదమును ఈయఁబోయిరి; కాని జూదమువలన పరవశుఁడై యుండుట వలన రాజు స్వామిప్రసాదమునకు ఎడమచేతినిఁ జాచెను. అర్చకులు ప్రసాదమును ఎడమచేత నిడఁగూడదని తిరిగిపోయిరి. రెండుజాములు అగునప్పటకి రాజునకు జూదముమీఁద విరక్తిపుట్టెను. అతఁడు ఆట మానివేసి "నేఁడు స్వామిదర్శనము నకు ఇంకను జాల మేల?" యని ప్రశ్నించెను. అపుడు చెంతనున్న సేవకులు సంగతి యంతయు విన్నవించిరి. అది విని రాజు కొంతతడవు నిరుత్తరుఁడై పిదప "అకటా! నే నెట్టి దురదృష్టవంతుఁడను. చింతామణిని విడిచి గాజుపలకనుఁ గైకొన్న నాబుద్ధి నేమని నిందించుకొందును?" అని కొంతసేపు చింతించి స్వామిని సేవించుకొని ఇంటికిఁ బోయెను.

రాత్రి రాజు శయ్యమీఁదఁ బరుండి ఏమియుఁ దోఁపక "జూదమాడిన ఈ చేతిని ఛేదించుకొనుటకంటె ఇందులకు ప్రాయశ్చిత్తములే" దని నిశ్చయించుకొని మంత్రిని రావించి "నెలదినములనుండి నిశీథమున ఒకభూతము వచ్చి కిటికీరంధ్రము నుండి లోనికిఁ జేయి చాచి నన్ను బాధించుచున్నది. నేఁడు నీవు ఈగదిలోనుండి భూతము చేయిచాచిన వెంటనే దానిని నఱికివేయుము" అని యాజ్ఞాపించెను. మంత్రి వల్లె యనెను. పిదప రాజు బైటకుఁ బోయి గవాక్షమునకుఁ దిన్నగ నిచ్చెన వేసికొని లోనికిఁ జేయి చాచెను. తోడనే మంత్రి భూతము అని తలంచి ఆచేతిని నఱికి వేసెను.

రాజు మహానందముతో నిచ్చెన దిగి గదిలోనికిఁ బోయి మంత్రినిఁ గౌఁగిలించుకొని "మహానుభావా! నాకు మంచి యుపకారముచేసితి" వని కొనియాడెను. మంత్రి యథార్థము నెఱింగి విచారింపఁ దొడఁగఁగా రాజు సంగతులన్నియు బోధించి యాతని నూరడించి తమ కుడిహస్తమును పల్లకియం దునిచి స్వామి యాలయమునకుఁ గొనిపోయి అర్చకులను జూచి "నేను స్వామి సన్నిధికివచ్చుటకు అర్హుడను గాను. మీరు ఈహస్తమునుఁ గొనిపోయి స్వామి సన్నిధి నుంచి నన్ను రక్షింపఁ బ్రార్థింపుఁడు" అని విన్నవించెను.

అర్చకులు అట్లే చేసి ప్రసాదము గొనివచ్చి రాజునకు ఇచ్చిరి. తోడనే రాజు కుడిచేయి యథాపూర్వముగ వచ్చెను. మహానందముతో రాజు ప్రసాదమును రెండు చేతులతోడను గ్రహించి భక్షించెను. అచ్చటివా రెల్లరును ఈయద్భుతమును గాంచి పరమాశ్చర్యచకితులై రాజు ననేకవిధములఁ గొనియాడిరి. సాత్త్విక రాజు బ్రతికియున్నంత కాలమును శ్రీహరినిఁ బూజించి, యవసానమున సాయుజ్యముక్తినిఁ బడసెను.

చ. "రతికలహమ్మునన్ సతుల రాయిడిఁ జేసి జయించి మించు న
ద్ధతిఁ గనిపించు లేనగవు నందము గుల్కెడు మోముఁదమ్మిచే
నతులవిభాతభానుకిరణాప్తవికస్వరభాస్వరాంబుజా
యతనయనద్వయిం జెలఁగు నామధురద్యుతి లీనమయ్యెడిన్."

(51. 1. కృష్ణకర్ణామృతము.)

    

### శ్రీ విశిష్టాద్వైత

# గురుపరంపరాప్రభావము



## పీఠిక

ఇది దక్షిణదేశమున నవతరించిన శ్రీవైష్ణవగురువుల చరిత్రము. "పిన్బఴగియ పెరుమాళ్ జీయర్" అను ప్రాచీనుఁ డగు వైష్ణవాచార్యుఁడు ప్రప్రథమమున ద్రవిడదేశీయులకు ఉపయోగించునట్లు ఈగ్రంథమును ద్రావిడభాషలో రచించెను. తరువాత మఱికొంతకాలమునకు అనంతాచార్యుఁడు అను విద్వచ్ఛిఖామణి 'ప్రపన్నామృత' మనుపేరుతో నీచరిత్రమును సంస్కృతభాషలో వ్రాసెను. మఱియొకఆచార్యుఁడుగూడ సంస్కృతభాషలో 'దివ్యసూరిచరిత్ర' మను మఱియొకగ్రంథమును వ్రాసెను.

ఒక శతాబ్దము క్రిందట మంగళగిరినివాసి యగు నంబూరి కేశవాచార్యుఁడు ఈచరిత్రమును తెనుఁగుబాసలో ప్రబంధరూపమున నొనర్చెను. దీనికి "ఆచార్యసూక్తిముక్తావళి" యని పేరు. ఇతనికి సమకాలికుఁ డగు వంగల సీతారామాచార్యుఁడు 'ఆచార్యరత్నహార' మను పేరుతో నాంధ్రమున మఱియొకగ్రంథమును వ్రాసెను; గాని పైనిఁ జేర్కొనఁబడిన ద్రవిడసంస్కృతభాషలయందు నిబద్ధములైన గ్రంథములును, ఆంధ్రభాషలో వ్రాయఁబడిన గ్రంథములును ఆభాషలయందు కొంచెమేనిఁ బాండిత్యము కలవారికేఁ గాని సామాన్యులకు గ్రాహ్యములు గావు. ఆంధ్రులును, శ్రీరామానుజ సిద్ధాంత భక్తులును, పాండిత్యము లేనివారు నగు స్త్రీపురుషులకు ఉపయోగించునట్లు తేటతెనుఁగున ఈగురువులచరిత్రమును ఎవ్వరును వ్రాసియున్నట్లు కానము.

ఈనడుమ నాప్రియమిత్రులు, చెన్నపురినివాసులు నగు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు చిరకాలమునుండి ప్రోత్సహించు చుండుటంజేసి పామరులకుఁ గూడఁ దెలియునట్లు సులభశైలిని ఈగ్రంథమును వ్రాయ నారంభించితిని. దీనికి "విశిష్టాద్వైతగురుపరంపరాప్రభావము" అని పేరు. ఇది ప్రపన్నజనులకు మతవిషయికజ్ఞానమును గలిగించి, గురువుల జ్ఞాననిష్ఠ, భగవదుపాసనాపద్ధతి, పరమభక్తి మున్నగువానినిఁ దెలిపి, ఇతరజనవైలక్షణ్యమును గలిగించును. పండితులు ఇందలి తప్పులను సవరింతురుగాక.

విజయనగరము. }

ఇట్లు విన్నవించు, బుధవిధేయుఁడు,
**మేడేపల్లి వేంకటరమణాచార్యులు.**

# భూమిక

శ్రియఃపతి, శ్రీవైకుంఠనివాసి, అఖిల హేయప్రత్యనీకుఁడు, సకలకల్యాణ గుణాకరుఁడు, అవాప్తసమస్తకాముఁడు, శ్రీమదనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరి పరిషన్నిషేవ్యమానుఁడు, అఖిలమంగళస్వరూపుఁ డగు సర్వేశ్వరుఁడు వేదములవలనను, మహర్షులవలనను, ఆళ్వారులవలనను, ఆచార్యులవలనను, ఏకకంఠముగఁ బ్రతిపాదింపఁబడిన ప్రభావాతిశయముగల పరమపదమందు ఆనందైకార్ణవమగు తిరుమామణి మంటపమున పర్యంకవిద్యాదిప్రద్యోతితానవద్యమాహాత్మ్యముగల దివ్యస్థానమంటపమున ఉభయవిభూతికార్యనిర్వాహమును నడపుటకు తగిన సన్నివేశము గల దివ్యసింహాసనముపై వేంచేసియుండి, నిరవధికతేజోరూపము, సదైకరూపము, నిత్యసిద్ధపరమేష్ఠ్యాది పంచోపనిషన్మయము, స్వానురూపము, చిన్మయమై ప్రకాశించెడు కిరీటాది నూపురాంతమైన దివ్యస్రగ్వస్త్రాభరణములచే విభూషితము, దివ్యాయుధదేదీప్యమానము, నిరతిశయసౌందర్యసౌకుమార్యలావణ్యయౌవనాద్యపరిమితగుణనిధి అగు దివ్యమంగళవిగ్రహముతో విశిష్టుఁడై శ్రీభూమినీళాది దివ్యమహిషీజనసమేతుఁడై నిత్యముక్తబృందానవరతపరిచర్యమాణచరణనళినుఁడై ఉభయవిభూతినిర్వాహకుఁడై నిరతిశయానందయుక్తుఁడై యుండి, అనంతగరుడవిష్వక్సేనాదినిత్యసూరులను, లబ్ధకైంకర్యపరులైన ముక్తులను ఆనందింపఁజేయుచు నిత్యముక్తులవలె సంసారిచేతనులును, తన్ననుభవించి తదనుభవజనితప్రీతికారితాశేష శేషైకరతిరూపనిత్య నిరవద్య నిరతిశయానందరూపకైంకర్య మను మహాసంపత్తును బడసి సుఖించుటకు ప్రాప్తికలిగియుండియు తదప్రాప్తిచే సంసారదుఃఖార్ణవనిమగ్నులయి తానొసఁగిన కళేబరముచే తన్నారాధింపక సమిధలు కోయుటకిచ్చిన కత్తితో ఆవుతోఁక కోసినట్లు, ప్రవాహము దాఁటుట కిచ్చిన తెప్పతోఁ దరిచేరక ప్రవాహవేగమున సముద్రములోఁ బడినట్లు దుర్విషయాసక్తులయి తనకు దూరభూతులయి చెడిపోవుచుండుటఁ జూచి చింతించి మనుపరాశరప్రభృతులను ఈవిభూతియందుఁ బుట్టించి వారివలన ఈసంసారులు బాగుపడుటకు శాస్త్రమునుఁ బ్రవర్తింపఁ జేయఁగా దానియందు విశ్వాసము లేక విపరీతజ్ఞానము కలవారై 'నేను సమర్థుఁడను, స్రక్చందనవనితాదిసకలభోగముల ననుభవించువాఁడను, బలవంతుఁడను, కృతకృత్యుండను, ధనవంతుఁడను, నాతోసమానుఁడు ఎవ్వఁడు కలఁడు' అని/ స్వస్వాతంత్ర్యరూపాత్మాపహారమహాపాపం బొనర్చి యనాదికర్మవాసనాదోష

దూషితాంతఃకరణులయి ఆమార్గమందు ప్రవర్తింపఁగాఁ జూచి పరమకారుణికుఁ డగు భగవంతుఁడు ఎటులనైనను సంసారుల నుద్ధరింపవలె నని సంకల్పము గలవాఁడై భూలోకమందు మనుష్యసజాతీయుఁడై రామకృష్ణాదిరూపముగా నవతరింపఁగా నీచేతను లాసునభావము నవలంబించి తనయందుఁ దగినభక్తివిశ్వాసములను చూపక అవమానించి అధోగతి కభిముఖులయి యుండఁ గనుంగొని శ్రీవత్సకౌస్తుభవైజయంతీవనమాలాపంచాయుధానంతగరుడవిష్వక్సేనప్రభృతులం జూచి మీరేఁగి భూలోకమందు ద్రవిడదేశములో కావేరి, తామ్రపర్ణి, కృతమాల మున్నగు నదులయొడ్డున మీకు ఇష్టమగుచోట్ల ఇష్టములగు వర్ణములయందు జనించి సర్వచేతనుల నుద్ధరింపుఁడని ఆజ్ఞాపింపఁగా భగవదాజ్ఞ శిరసావహించి వారందఱు సరోభూతమహదాహ్వయాదిదివ్యనామములచే నాళ్వారులయి లోకమందు అవతరించి సర్వాధికారమగు ద్రావిడవేదమును సాంగోపాంగముగా లోకోపకారార్థమయి రచించిరి. దానిని పైన వివరించుచున్నాను.

విజయనగరము.
12—7—1918.

ఇట్లు,
మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

# శ్రీమహాభక్తవిజయము

## తృతీయభాగము



## 111. పొయిగైయాళ్వారు

(సరోయోగి)

పొయిగైయాళ్వారు (సరోయోగి) ద్వాపరయుగమునందు సిద్ధార్థినామ సంవత్సరమున, ఆశ్వయుజమాసమున, శుక్లపక్షమున, అష్టమీ మంగళవారము నాఁడు, శ్రవణనక్షత్రమున, కాంచీపురమందున్న యథోక్తకారిస్వామిసన్నిధి నొక తామరకొలనులో తామరసపుష్పమునందు సర్వేశ్వరుని పాంచజన్యాంశమున అవతరించి చెప్పతరము గాని జ్ఞానభక్తివైరాగ్యములు కలవారై ఆశ్రితులను ఉజ్జీవింపఁ జేయుచు నుండిరి.

వీరి నిత్యతనియ:—శ్లో. కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినం,
కలయే యశ్శ్రియఃపత్యా రవిం దీప మకల్పయత్.

తిరునక్షత్రపుతనియ:—తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచనవారిజాత్,
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే.

---

## 112. పూదత్తాళ్వారు

(భూతయోగి)

పూదత్తాళ్వారు (భూతయోగి) పొయిగైయాళ్వారు అవతరించిన మఱునాఁడు నవమితోఁ గూడిన ధనిష్ఠానక్షత్రమునందు సముద్రతీరమందున్న తిరుక్కడల్మల్లై (మల్లాపురము) అను దివ్యతిరుపతియందు మాధవీకుసుమము (బండిగురివిందపుష్పము)న సర్వేశ్వరుని గదాంశమున అవతరించి భగవదనుగ్రహముచే పొందఁబడిన పరమభక్తి పరమజ్ఞానపరమభక్త్యాదులు కలవారై సర్వేశ్వరుని కంతరంగభక్తులై యుండిరి.

నిత్యతనియ:—శ్లో. మల్లాపురవరాధీశం మాధవీకుసుమోద్భవం,
భూతం నమామి యో విష్ణో ర్జ్ఞానదీప మకల్పయత్.

తిరునక్షత్రపుతనియ:—తులాధనిష్ఠాసంభూతం భూతం కల్లోలమాలినః,
తీరే ఫుల్లోత్పలే మల్లాపుర్యా మీడే గదాంశజమ్.

---

# 113. పేయాళ్వారు

(మహాయోగి)

నందకాంశసంభూతులయిన పేయాళ్వారు (మహాయోగి) పూదత్తాళ్వారు జనించిన మాసమునందే శతతారానక్షత్రముతోఁ గూడిన దశమినాఁడు దివ్యదేశములలో నొకటియైన మైలాపురము (మయూరపురము) అను పట్టణమునందు మాధవస్వామి ఆలయసమీపమున నున్న కోనేటిలో వికసించిన యెఱ్ఱకలువ పూవునందు అవతరించి లోకులు తన్ను భ్రాంతుఁడు (వెఱ్ఱివాఁడు) అని వ్యవహరించునట్లు భగవంతునియందు ఒడలెఱుంగని భక్తికలవారై యుండిరి.

ఇట్లు అయోనిసంభూతులయిన యీముువ్వురు ఆళ్వారులును ప్రత్యేకముగా మూఁడుదివ్యదేశములయందు అవతరించి ఒకరు మఱియొకరిని ఎఱుఁగనివారై ఈశ్వరుని పూర్ణకృపచే రాజసతామసరహితులయి భగవద్దాస్యమునం దతిశయిత ప్రీతిఁగలిగిజననము మొదలు భగవద్గుణములనే ధారకముగాఁ గలవారై, భగవద్గుణానుభవముచే కాలక్షేపము చేయుచు భగవద్విముఖులయి, దుర్విషయాసక్తులగు సంసారులతోఁ దమకు సహవాసము దుస్సహమని తలంచి, వీరిని దిద్దవలెనని దయఁబూని, ఒకనాఁడు ఉన్నగ్రామమందు మఱుసటిదినమున ఉండక గ్రామైకరాత్రముగా దేశాటనము జేయుచున్నకాలమున సర్వేశ్వరుఁడు వీరిద్వారా సంసారిచేతనులకు అజ్ఞానాంధకారమును పోఁగొట్టి తనయందు జ్ఞానభక్తులు కలిగించుటకు సంకల్పించి యొకనాఁడురాత్రి ఈముగ్గురను మూఁడు దిక్కులనుండి వచ్చి యదృచ్ఛగా తిరుక్కోవలూరు (దేహళీనగరము) అనుగ్రామమునందు ప్రవేశించి శయనింప స్థలము వెదకుచు నొక భాగవతోత్తముని ఇంటి యరుఁగుమీఁద మొదట పూదత్తాళ్వారును, మఱికొంత సేపటికి పొయిగైఆళ్వారును, తరువాత పేయాళ్వారును వచ్చి చేరి ముగ్గురుగూడి ఒకరివృత్తాంతము నొకరికిఁ జెప్పుకొనుచు నిష్ఠగోష్ఠినుండఁగా వారి యోర్పు పరీక్షించు బుద్ధితో నాస్థలము వారి ముగ్గురికి చాలనంత ఇరుకు అగునట్లు చేసెను.

అప్పుడు వారు ఇంతవఱకును లేని యీసంకటమునకుఁ గారణమేమని యోచించి జ్ఞానదృష్టిచే వీక్షింపఁగా గరుడవాహనారూఢుఁడు - శంఖచక్రాదిదివ్యాయుధోపేతుఁడు - శ్రీవత్సలాంఛితవక్షస్థలుఁడు - లక్ష్మీసమేతుఁడు అగు శ్రీమన్నారాయణుఁడు వారి కన్నులకు సాక్షాత్కరించెను. అట్లు అగుపడిన ఆసర్వేశ్వరుని కన్నులార సేవించి వారు ఆనందపరవశులై మాటిమాటికి ప్రదక్షిణ నమస్కారములు

ఆచరించుచు, భక్త్యుద్రేకము కలవారై స్తుతించిరి. అట్టి భగవదనుగ్రహమువలన పుట్టిన ప్రీత్యతిశయము వారిలోపల నణఁగక పైకి స్తోత్రరూపముగా వెలువడెను. ఇట్లు వీరు ముప్వురును భగవంతుని స్తోత్రరూపమైన మూఁడు అందాదిప్రబంధములను (అందాది=అంతాది. మొదటిపద్యముయొక్క కొనపదము రెండవపద్యమునకు మొదటిపదమై యుండును. ఇదియొకరీతి ముక్తపదగ్రస్తము. ఇట్టి కవనము తెలుఁగులోఁ గాని సంస్కృతములోఁ గాని తరుచుగా కానరాదు.) పాడించిరి. అందు పొయిగైయాళ్వారు పాడించిన ప్రబంధమునకు—

"వైయందగళియా వార్కడలే నెయ్యాగ వెయ్యకదిరో న్విళక్కాగ—
శెయ్య శుడరాగియా నడిక్కే శూట్టిననే శొన్మాలై ఇడరాళినీంగవే యెన్ను."

అను పాశురము మొదటిది. దీనికి సరియైన తెలుఁగు పద్యము.

క. ధారుణి ప్రమిదగ పారావారము ఘృతపూరముగను వనజాతహితుం
డారోపితదీపముగా, వారలి నిడి సూక్తిమాల హరి కర్పింతున్.

పూదత్తాళ్వారు పాడించిన అందాదిప్రబంధమునకు మొదటిపాశురము—

"అన్బేతగళియా ఆర్వమే నెయ్యాగ ఇన్బురుగుశిందై ఇడుతిరిమానంబురుగి
ఞానచ్చుడ ర్విళక్కేత్తినేన్ నారనార్కు ఞానత్తమిపురిందినాన్"

క. తనమును ప్రమిదగ భక్తిని, ననువగు నెయిగాఁగ ప్రేమ నధికోజ్జ్వలమై
తనరెడుచిత్తము వర్తిగ, ఘనదీపము నెత్తి తిపుడు కమలాక్షునకున్.

పేయాళ్వారు పాడించిన అందాదిప్రబంధమునకు మొదటిపాశురము—

"తిరుక్కండేన్ పొన్మేనికండేన్ తిగముళ్మరుక్కవణి నవముంకండేన్
శెరుక్కిళరుం పొన్నాళి కండేన్ ఎన్నాళివణ్ణ న్బాలిన్ను."

క. కంటిని నురమున లక్ష్మిని, గంటిని కనకంపుమేను కమలాప్తరుచిన్
గంటిని కరయుగమును నేఁ, గంటిని చక్రాబ్జములను గమలాక్షునెడన్.

ఇట్లు మొదటివారైన ఈయాళ్వారులు మువ్వురును ఋగ్యజుస్సామవేదముల సారాంశముల నెత్తి అందాదిప్రబంధరూపముగా రచియించి, సంసారుల కుప దేశించి వారి అజ్ఞానమును దొలఁగించి, బహుకాలము తమ మహిమ నీభూలోకము నందు వ్యాపింపఁజేసి తుదకు శ్రియఃపతి ఆజ్ఞచొప్పున వైకుంఠమునకు వేంచేసిరి.

---

## 114. తిరుమళిశైయాళ్వారు

(భక్తిసారులు)

ఈయాళ్వారు కృష్ణునివలె నొకరికిఁ బుట్టి మఱియొకరి బిడ్డ యనిపించుకొనెను. ఎట్లనః అత్రి, భృగువు, వసిష్ఠుఁడు, భార్గవుఁడు, అంగిరసుఁడు మొదలయిన మహా ర్షులు పూర్వకాలమందు బ్రహ్మయొద్దకుఁ బోయి తాము స్థిరముగా నివసించి తపస్సు

చేసికొనుటకు ఉత్తమ మయిన పుణ్యక్షేత్ర మొకదానిని ఈభూలోకమందు నిరూపించి చెప్పవలయు నని ప్రార్థించిరి. వారి ప్రార్థనమును మన్నించి విశ్వకర్మను రావించి, యొక పెద్ద త్రాసు చేయించి, దానిలో భూమండలమంతయు నొక వైపునను, మఱియొక వైపున "తిరుమళ్ళిశై" అను పుణ్యక్షేత్రములు ఉంచి తూపింపఁగా తిరుమళ్ళిశై యున్నవైపు త్రాసు మొగ్గెను. అగుటచే దానికి మహీసార క్షేత్రమని పేరు పెట్టి అందు నిత్యవాసము చేయుఁడని వారికి ఉపదేశించెను. అది మొదలుకొని ఆఋషులు అందఱును అచ్చట నివసించి తపస్సుచేసికొనుచుండిరి. ఈమహీసార క్షేత్రమునకు విదేహభవనక్షేత్రమని నామాంతరము కలదు. ఇది కాంచీపురమునకు తూర్పుదిక్కున నున్నది.

అట్లు ఈదివ్యదేశములో నివసించుచున్న మహర్షులలో నొకఁడైన భార్గవ మహర్షి ఆకాలమందు సర్వేశ్వరు నుద్దేశించి దీర్ఘసత్ర మను నొకయాగమును ఆరంభించి చేయుచుండఁగా, నతనిభార్య గర్భము ధరించెను. కాలక్రమమున నెలలు నిండిన తరువాత పుష్యమాసమందు మఖానక్షత్రయుక్తపుణ్యదినమున భృగుపత్ని ఆకారములేని యొక మాంసపుముద్దను కనెను. భార్గవుఁడు, ఆతని భార్యయు దానిని జూచి ఉత్సాహము చెడినవారై ఆమాంసపు ముద్దను అనాదరముతో నొక వేపత్పులో విడిచిపెట్టిరి. పిదప లోకమాతయగు శ్రీమహాలక్ష్మి యనుగ్రహముచే నామాంసపిండము మనుష్యాకృతి నొంది అవయవస్ఫుటతకలది యయి సజీవమయిన శిశువై, క్షుత్పిపాసాదిబాధలచే స్తన్యము నభిలషించుచు విజనమైన వనమందు ఏడువసాగెను. అపుడు మహీసార క్షేత్రాధిపతి యగు సర్వేశ్వరుఁడు అచటికేతెంచి కరుణారసమును చిలుకు తన చల్లని చూపులచే నాశిశువును ఆఁకలిదప్పులు పోవునట్లు కటాక్షించి తన అప్రాకృతదివ్యమంగళవిగ్రహమును జూపి ఓదార్చి స్వస్థానమునకుఁ బోయెను. అంతట నీయాళ్వారు భగవద్విరహమును సహింపలేక మఱల రోదనమారంభించెను. ఖడ్గుఁడు (తిరువాళన్) అను బెత్తుపని చేయువాఁ డొకఁడు బెత్తములు కోయుటకు ఆయరణ్యమునకుఁ బోయి శిశురోదనధ్వనిని విని నల్గడలను వెదకి యొకబెత్తపుతుప్పలో నప్పుడు ఉదయించిన సూర్యునివలె ప్రకాశించుచున్న ఈశిశువును గని సంతసిల్లి యెత్తుకొని తన యింటికిఁ దీసికొనిపోయి పిల్లలులేని తన భార్యచేతి కిచ్చెను. అపుడు ఆమె పెన్నిధి దొరకిన పేదవలె మిగుల హర్షము నొంది ఆపిల్లవానియందు పుత్రప్రీతినిఁ జేయుచు ముద్దుగాఁ బెంచుచుండెను. గొడ్రాలైన ఆమెకు స్తనములయందు పాలు పడెను; కాని ఈయాళ్వారు స్తన్యపానాదికమందు ఆశలేనివాఁడై భగవద్గుణైకధారకుఁడయి యేడ్చుటయు మాటలాడుటయు మాని మలమూత్రవిసర్జనముకూడ లేనివారై స్ఫుటములగు నవయవములతో బెత్తువాని యింటఁ బెరుగుచుండెను.

ఇట్లుండఁగా తిరుమళిశై గ్రామనివాసి, నాల్గవజాతియందు పుట్టినవాఁడు, ప్రాజ్ఞుఁడు, సంతతిలేనివాఁడు అగు ఒకవృద్ధుఁడు. ఈయద్భుతవార్తను విని బాగుగ కాచినపాలు పట్టుకొని భార్యతోఁ గూడ ప్రాతఃకాలమున నొకనాఁడు వీరి యింటికి వచ్చి ఆప్రాకృతదివ్యతేజస్సుఁగల ఆశిశువును జూచి ఆశ్చర్యపడి ఈక్షీరము లారగింపు మని పలుమారులు ప్రార్థింపఁగా ఆళ్వారు వారియందలి కృపాతిశయముచే నాపాలు త్రాగెను. ఇట్లు అనుదినమును ఆవృద్ధదంపతులు తెచ్చెడు పాలను ఇతఁడు ఆరగించుచుండెను. కొంతకాలము గతించిన తరువాత ఈయాళ్వారు ఒకదినమున ఆవృద్ధదంపతుల అభిప్రాయము నెఱింగి, నేను త్రాగఁగా మిగిలినపాలను మీరు ఈదినమున పుచ్చుకొనుఁడు; మీకొక మంచి పుత్త్రుఁడు జనించు నని చెప్పెను. వారు అటుల గావింపఁగా, ఇరువురును బూర్ణయౌవనము గలవారు అయిరి. పిమ్మట నాతని భార్య గర్భవతియై పదిమాసములు నిండఁగా విదురునివలె మహాప్రాజ్ఞుఁడగు నొక కుమారునిఁ గనెను. అతనికి వారు కణికృష్ణుఁ డని పేరుపెట్టి పెంచి, విద్యాభ్యసనకాలమున సకలవిద్యలు నేర్పిరి.

అమృతమువంటి సర్వేశ్వరుని దయచే తృప్తినొందియున్న ఈభక్తిసారుఁడు అన్నపానాదులయందు ఆశ లేనివాఁడై, పితృగృహమునఁ బెరుగుచున్న కాలమున భగవద్ధ్యానతత్పరుఁడై యుండెను. ఋషిపుత్త్రుఁడైన వాసనచే యమనియమాదులతోఁ గూడిన అష్టాంగయోగము నభ్యసింప రుచిగలవాఁడై దానికి ధ్యేయవస్తువు సర్వజగత్కారణభూతుఁడైన శ్రీమన్నారాయణుఁడే యని నిశ్చయించెను. శాక్యోలూక్యాదిబాహ్యమతములను శైవమాయావాదన్యాయవైశేషికాదికుదృష్టిమతములను నిరసించి భగవద్విశేషకటాక్షపాత్త్రుఁడయి సర్వేశ్వరుఁడు తన దివ్యాత్మస్వరూపమును, తదాశ్రయమగు జ్ఞానశక్త్యాదికల్యాణగుణములను, దివ్యమంగళవిగ్రహమును, శంఖచక్రాది దివ్యాయుధములను, దివ్యమహిషీజనమును, దివ్యసూరివర్గమును, భోగవిభూతియగు; పరమపదమును ప్రకృతిపురుషకాలాత్మకమగు లీలావిభూతియొక్క సృష్టిస్థితిసంహారములను కనపఱుపఁగాఁ జూచి పరిపూర్ణ జ్ఞానము కలవాఁడై శ్రీమన్నారాయణుఁడే సకలజగత్కారణుఁడు అనియు చిదచిత్తు లతనికి ప్రకారములు అనియు అతఁడు ప్రకారి యనియు జీవాత్మలందఱు అతనికి శేషభూతు లనియు అతఁడు సర్వశేషి యనియు నెఱింగి సర్వభూతాంతరాత్మ యగు సర్వేశ్వరుని సర్వదేశసర్వకాలసర్వావస్థలయందును ధ్యానించుచు తిరువల్లిక్కేణియందున్న గజేంద్రసరస్తీరమందు యోగాభ్యాసనిరతుఁడయి చిరకాలము నివసించెను.

ఇట్లున్న కాలమందు ఒకనాఁడు ఇతఁడు బొంతను కుట్టుచుండఁగా రుద్రుఁడు పార్వతితోఁగూడి విమానము నెక్కి అంతరిక్షమందు సంచరించుచు వీరిని భూచెను.

అపుడు ఈతఁడు రుద్రునినీడ తనపైఁ బడకుండ దూరముగా తొలఁగిపోయెను. అది పార్వతిచూచి ఇతఁ డెవఁడు అని యడిగెను. అందులకు శితికంఠుఁడు "ఈతఁడు ఒక మహానుభావుఁడు. మనలను లక్ష్యపెట్టువాఁడు కాఁడు" అని చెప్పినను వినక, పార్వతి "అట్టివానిని మనము అవశ్యము చూడవలయును; గాన క్రిందికి దిగుటకు విమానము నాజ్ఞాపింపుము" అని భర్తను వేఁడెను. అపుడు వా రిరువురును భక్తిసారునివద్దకు వచ్చి నిలువఁబడఁగా ఆతఁడు వారిని కన్నెత్తిచూడక ఉదాసీనుఁడై యుండఁగా, రుద్రుఁడు "నిన్ను మేము చూచుటకు ఇచ్చుటకు వచ్చియుండఁగా నీవిట్లు మమ్ము అలక్ష్యము చేయఁదగునా?" యనెను. అది విని తిరుమళిశైయాళ్వారు "మిమ్ము చూచుటవలన నాకేమి ప్రయోజనము?" అని పలికెను. శివుఁడు "నీకేదేని వరము ఇచ్చుటకు వచ్చితి" మనెను. "మీవలన నేను అభిలషించున దేమియు లే" దని భక్తిసారుఁడు ప్రత్యుత్తర మియ్యఁగా పినాకినీ కడకు మారాక వమ్ము కాఁగూడదు. ఏదేని కోరుమని నిర్బంధింప "సామర్థ్యము ఉన్నయెడల మోక్షము నిమ్ము" అనెను. "నేను మోక్షము నీయఁజాలను. శ్రీమన్నారాయణుఁడు ఒకఁడే మోక్షప్రదాత" అని పార్వతీపతి బదులు చెప్పెను. "నేఁడు మృతుఁడు అనువానిని రేపటి వఱకును బ్రతికింపఁగలవా ?" అని మఱల భక్తిసారుఁడు అడుగఁగా "అది కర్మానుగుణముగా జరుగును. నే నందులకు ఏమియుఁ జేయఁజాలను" అని కపర్ది బదులు చెప్పెను. అంతట భక్తిసారుఁడు "నాసూదివెంట దారము తప్పకుండవచ్చునటుల వరము ఇమ్ము" అని పరిహాసపూర్వకముగా నడుగఁగా ప్రమథనాథుఁడు కుపితుఁడై లలాటనేత్రముతోఁ జూచెను. ఆనేత్రమునుండి పైకి వెడలిన అగ్నిజ్వాలలు లోకమంతను దహించుటకు సిద్ధమయియుండఁగా నింతలో భక్తిసారుఁడు తనకుడికాలిలో నున్ననేత్రమును దెఱచెను. వెంటనే అంతకంటె భీషణతరమయిన అగ్ని బయలుదేఱి శంభుఫాలనేత్రాగ్నిని మ్రింగివేసెను. అదిచూచి శివుఁడు ఆశ్చర్యపడి అతని మాహాత్మ్యమును శ్లాఘించి భక్తిసారుఁడు అని పేరుపెట్టి "అంబరీషునిచే దూర్వాసుఁడు అవమానమును పొందినట్లు ఈతనిచే నవమానింపఁబడితి" నని తలంచుచు స్వస్థానమునకుఁ బోయెను.

ఆళ్వారు తిరిగి యోగప్రణిధానపరుఁడై యుండఁగా నొకనాఁడు శుక్తిహారుఁడు అను ఖేచరుఁ డొకఁడు వ్యాఘ్రవాహనము నెక్కి ఆకాశమందు పోవుచుండెను. అపుడు ఆళ్వారు యోగప్రభావముచే నావ్యాఘ్రము ఆకాశమునుండి నడువఁజాలక స్తబ్ధమయ్యెను. అపుడు అఖేచరుఁడు ఇట్లు అగుటకుఁ గారణము అరయఁగోరి క్రిందికి దిగి యోగములో నున్న ఆళ్వారుని గాంచి ఆశ్చర్యపడి, వ్యాఘ్రవాహనము దిగి అతనివద్దకు వచ్చి "భార్గవమునీంద్రుఁడా! ఆబొంతను కప్పు

కొనుటమాని దివ్యపటనిర్మితమైన ఈకవచమును ధరింపుము" అని యొకకవచము నిచ్చెను. ఆళ్వారు వానిని నిషేధించి స్వసంకల్పజనిత మగు నొకరత్నకవచము నాతని కీయఁగా ఆఖేచరుఁడు లజ్జించి తన కంఠమందు ఉండు హారమును పైకివేసి 'దీనిని జపమాలికగా వినియోగింపుము' అని యిచ్చెను. భక్తిసారుఁడు తన కంఠము నందు ఉన్న పద్మాక్షమాలికను దీసి నవరత్నహారముగాఁ జేసి యొసంగెను. అది చూచి ఖేచరుఁడు వీరి యోగసిద్ధికి మిగుల ఆశ్చర్యచకితుఁడై, 'మీరు మహాను భావులు పరిపూర్ణులు, నాపరిహాసమును క్షమింపుఁడు' అని క్షమాపణఁ గోరుచు నమస్కరించి ఇచ్చవచ్చినచోటికిఁ బోయెను.

పూర్వమందు భక్తిసారులు త్రాఁగగా మిగిలిన క్షీరమునుఁ డాగిన శూద్ర వృద్ధదంపతులకు కుమారుఁడై పుట్టిన కణికృష్ణుఁడు అనువాఁడు శ్రీమన్నారాయణుని యందును, తద్భక్తులయిన భక్తిసారులయందును, అపారమగు భక్తి కలవాఁడై భగవదనుగ్రహముచేతను, భక్తిసారుని అనుగ్రహముచేతను, సకలశాస్త్రముల యందును బూర్ణజ్ఞానము గలవాఁడై కవనమందు అసదృశుఁడై కవిశిరోమణి యని బిరుదుపొందెను. భక్తిసారుని పాదపద్మములకు పరిచర్య చేయఁగోరి అతఁడు తిరు వెక్కాలో యోగనిరతుఁడై యున్నాఁడను వార్త విని అచ్చటకుఁ బోయి అతని సన్నిధిలో సర్వవిధకైంకర్యములనుఁ జేయుచుండెను. ఆగ్రామమునందు అర్చారూప ముతో వేంచేసియున్న శేషశాయిస్వామియొక్క కోవెలలో సమ్మార్జనకైంకర్య ము జేయుచున్న ఒక వృద్ధదాసినిఁ జూచి దాని భక్తిశ్రద్ధలకు మెచ్చుకొని కణి కృష్ణుఁడు ఆదాసి యెల్లకాలము భగవత్సన్నిధిని కైంకర్యము చేయుటకు తగిన శరీరదార్ఢ్యము కలదియై యుండవలయు నని తన కవనముతో శేషశాయిస్వామిని ప్రార్థింపఁగా దానికి క్రొత్తయౌవనము లభించెను. ఆవార్త విని ఆపట్టణము నేలు వల్లవరాయఁడు అను రాజు కణికృష్ణునిఁ దన ఆస్థానమునకు రప్పించి "నీకు కావలసినంత ధనమును, వస్త్రాలంకారములను ఇచ్చెదను; నే నెప్పుడును ముసలి తనము నొందక పడుచుతనముతో నుండునట్లు నాపై నొకప్రబంధమును రచింపు" మని ప్రార్థించెను. అందులకు కణికృష్ణుఁడు "శేషశాయియైన శ్రీమన్నారాయణుని, అతని భక్తులను స్తుతించుట కలవాటుపడిన నాజిహ్వ పామరుఁడు, ధనమత్తుఁడు నగు నీవంటివానిని స్తుతించుట కిష్టపడదు. నీవిచ్చుధనము, వస్త్రములు, నగలు మొదలగువానియందు నాకు లక్ష్యములేదు" అని తిరస్కారముగా పలికెను. ఆమాటలు విని రాజు మిక్కిలి ఆగ్రహము కలవాఁడై "నావిషయమయి కవి త్వము చెప్పుటయందు ఇష్టము లేనివానికి నాదేశమునందు నివసించుట యెట్లు ఇష్టమగును? కావున నీవిక ఒక క్షణమైనను నాపట్టణమందు ఉండకూడదు" అని

కఠినముగా పలుకఁగా విని కణికృష్ణుఁడు "నీవెంత? నీరాజ్య మనఁగా నెంత ? నిన్నెవ్వఁడు లక్ష్యము చేయును ? సర్వలోకరక్షకుఁడగు సర్వేశ్వరునిచే పరిపాలింపఁబడు మహాపృథివి మాకు నివసించుటకు ఉన్నది. నీకు భయపడువారము కాము చూడుము. ఇదిగో ఈక్షణమున నీగ్రామమును విడిచి స్థలాంతరమునకుఁ బోవుచున్నాక" మని నిర్లక్ష్యముగాఁ జెప్పి భక్తిసారుని సన్నిధికి వచ్చి, తనకును రాజునకును జరిగిన ప్రసంగము దెలియఁజేసి, "ఎచ్చటి కైనఁ బోవుటకుఁ దాసున కాజ్ఞ ఈయవలయు" నని ప్రార్థించెను. అందులకు ఆళ్వారు "కణికృష్ణుఁడా ! నీవు లేనిచోట నేను మాత్ర మెందులకు నివసింపవలెను ? ఈ శేషశాయిస్వామి సన్నిధిలో ననుజ్ఞ పొంది నేనును నీవెంట వచ్చెదను" అని చెప్పి శేషశాయిస్వామి ఆలయమునకుఁ బోయి స్వామికి సాష్టాంగ దండప్రణామము సమర్పించి జరిగిన వృత్తాంతము నంతయును స్వామితో విన్నవించి "ఓజగన్నాయకా! నీభక్తులకు ఉండరాని చోటు నీకును విడువ తగినదియే; కావున నీవును మావెంట రమ్ము" అని ప్రార్థించెను. శేషశాయిస్వామి భక్తపరాధీనుఁడు; కావున వెంటనే శేషశయ్యను చుట్టి చంకఁ బెట్టుకొని శ్రీమహాలక్ష్మి వెనువెంట రాఁగా భక్తిసార కణికృష్ణుల వెన్నుదన్ని పోయెను.

అంతట అర్చకులు, పరిచారకులు, స్వామికి పూజచేయుటకు కోవిల తలుపులు తీసి అచట స్వామినిఁ గానక భయమును ఆశ్చర్యమును పొంది తొందరగా రాజు వద్దకుఁ బరుగిడి ఆవృత్తాంతమును జెప్పిరి. అది విని రాజు ఆశ్చర్యముతో నులికిపడి, "ఇది యేమి వింత! ఆలయమునందు స్వామి లేకపోవుటకు కారణమేమి?" అని మంత్రుల నడుగఁగా వారు "నీవు కణికృష్ణుని విషయమై అపరాధము చేసితివి. ఆతఁడు శేషశాయిస్వామికి అంతరంగభక్తుఁడు; ఆతనిని నీవు దేశమునుండి వెళ్లఁగొట్టఁగా భక్తుని వియోగము సహింపలేక స్వామికూడ ఆతనివెంట వెళ్లిపోయి యుండవచ్చును" అని చెప్పిరి. దానిమీఁద రాజు, "తన అపచారమువలన ఇంతమట్టుకు సంభవించిన" దని భయముతో గడగడ వడఁకుచు దేహమంతయు చెమ్మటలు క్రమ్మగా కాళ్లు తడబడఁగా పాదచారియై బయలుదేఱి పోయిపోయి అచ్చటచ్చట వెదకి కొంత కొంత మార్గమునందు భక్తిసార కణికృష్ణుల వెనుక లక్ష్మితో వేంచేయుచున్న సర్వేశ్వరునిఁ జూచి అడ్డముగాఁ జని ఆతని పాదములపైఁ బడి "ఓజగన్నాథుఁడా! నే నపరాధిని. నాతప్పు క్షమింపుము. కణికృష్ణునియందు దేవరవారికి ఉన్న ప్రేమాతిశయము నే నెఱుఁగక యిట్లు ఆతనివిషయమయి అపచారము చేసితిని. నాతప్పు మన్నించి తిరువెక్కాలో ఎప్పటివలె వేంచేసి యుండుటకు సమ్మతింపుము" అని యనేకవిధముల వేడుకొనఁగా భక్తవత్సలుఁడైన ఆశ్రితపతి

"రాజా! నీవు నావిషయమున నేమియు అపచారము చేయలేదు. నీయపరాధమును క్షమించువాఁడను నేను గాను. నా ప్రియభక్తుఁడైన భక్తిసారునియెడ నీవు అప్రియ మొనర్చితివి; ఆకారణమువలన నతఁడు నీమీఁదకోపము కలవాఁడై నీదేశము నుండి వెడలిపోయెను. అతని నెడఁబాసియుండలేక నేనును అతనివెంటఁ బోవు చున్నాను" అని ఆనతిచ్చెను. రాజు అప్పుడు పెయ్యవెంట ఆత్రముతోఁ బోవు ఆవు వలె కణికృష్ణుని వెనుకఁ బోవుచున్న తిరుమఴిశైయాళ్వారునకు అడ్డముగాఁ బోయి వారిపాదములపైఁ బడి, "దాసుని అపరాధమును క్షమించి తిరువెక్కాకు వేంచేయుఁడు" అని ప్రార్థించెను. అందులకు ఆళ్వారు "నీనేరమును గాచువాఁడను నేనుకాను" అని నిషేధించెను. అత్తఱి రాజు మిక్కిలి కోపముతో తిరిగి చూడక అంధుఁడును ముందు నడచుచున్న కణికృష్ణుని అడ్డగించుకొని అతని పాదములపై బడి దాసుని ప్రథమాపరాధమును క్షమింపుమని రెండుపాదములు రెండుచేతులతోఁ గట్టిగాఁ బట్టుకొని వదలక మొఱ్ఱపెట్టగాఁ గణికృష్ణుఁడు దయార్ద్రుఁడై "ఓ భూవరా! నీవు నారాజ్యమునందు ఉండకూడదని నాకు ఉత్తరువుచేసితివి; కావున ఇంకొకదేశమునకుఁ బోవుచున్నాను. నన్నేల ఇపుడు అడ్డగించుకొనెదవు" అని బదులుచెప్పెను. రాజు పట్టినపాదములను విడువలేదు. అతఁడు మఱల "దాసుఁడు మూఢుఁడై పలికిన పలుకులను తమరు పాటింపవలదు; ఎప్పటివలె తిరువెక్కాలో వేంచేసియుండుఁడు" అని ప్రార్థించెను. అందులకు పరమసాత్వికుఁడు అగుకణి కృష్ణుఁడు సమ్మతించి మఱల తిరువెక్కాకు వచ్చెను. అప్పుడు అతనివెంట తిరుమఴిశై యాళ్వారును అతనివెంట లక్ష్మీసమేతుఁడగు శేషశాయిస్వామియును వేంచేసి ఎప్పటి వలె తిరువెక్కాలో స్థిరపడిరి. తన భక్తుఁడు చెప్పినట్లు చేసెను; కావున ఆ శేషశాయి స్వామికి 'యథోక్తకారి' అని పేరు కలిగెను.

అట్టి యథోక్తకారి సన్నిధియందు తిరుమఴిశైయాళ్వారు కణికృష్ణునితోఁ గూడ కొన్నాళ్లు నివసించి పిమ్మట తిరుక్కొడంద (కుంభకోణము) అను దివ్యదేశ మునకుఁ బోయి అచ్చట వేంచేసియుండు శార్ఙ్గపాణిస్వామిని సేవించు కోరికగల వారై యథోక్తకారిసన్నిధినుండి బయలుదేఱి పోవుచు మార్గమధ్యమందు పెరుం బులియూరు (బృహద్వ్యాఘ్రపురము) అను ఒక దివ్యదేశమును జేరిరి. అచట ఈతిరుమఴిశైయాళ్వారు మేదరవానివేషముతో బ్రాహ్మణవీథివెంబడివచ్చుచుం డఁగా నాసమయమందు వీథి అరుఁగులమీఁద వేదము చదువుచున్న బ్రాహ్మణులు ఇతనిం జూచి శూద్రుఁడని భావించి శూద్రసమీపమందు వేదము చదువఁగూడదని అధ్యయనము మానివేసిరి. పిదప చదువునపుడు ఆ బ్రాహ్మణులకు అవతలి భాగము జ్ఞాపకమురాదయ్యెను. అపుడు వారందఱు పరమభక్తుఁడగు ఈతనియందు శూద్ర దృష్టిచేయుటచే అపరాధుల మైతి మని తలంచి క్షమాపణ చెప్పుకొనఁగా, ఆళ్వారు

వారు చూచుచుండఁగా నొక నల్లవడ్లగింజను దెచ్చి గోటితో ఒలిచి చూపింపఁగా నపుడు వారికి *తరువాతి భాగము స్మృతికివచ్చెను.

ఈయాళ్వారు ఆయూరిలో నున్న కోవెలకుఁ బోయి ప్రదక్షిణ మాచరించుచుండఁగా అందుండు అర్చావిగ్రహము ఆతఁడు ఎట్లు తిరిగిన అట్లు తిరుగుటకు ఆరంభించెను. అర్చకులు ఆవింతను చూచి చెప్పఁగా నచ్చటి బ్రాహ్మణులు కొందఱు వచ్చి ప్రత్యక్షముగాఁ జూచి పరమాశ్చర్యము నొందిరి. ఆతని అమానుషమాహాత్మ్యమును కనిపెట్టి ఆకాలమందు ఆగ్రామములో యాగము చేయుచున్న బ్రాహ్మణుఁడు ఒకఁడు యాగసభయందు వీరికి అగ్రపూజ యొసంగెను. అచ్చట నున్న బ్రాహ్మణులు కొందఱు అసూయాదిష్టులై రాజసూయయాగమునందు శ్రీకృష్ణునకు అగ్రపూజ నిచ్చిన ధర్మపుత్రుని శిశుపాలుఁడు నిందించినట్లు నిందింపసాగిరి. ఆకారణముచే ఆదీక్షితుఁడు వా రొనర్చిన భాగవతాపచారమునకు మనమందు నొచ్చుకొని ఆళ్వారును శరణుపొందఁగా దీక్షితునకు భగవద్భక్తి వివృద్ధి చిత్తశాంతిని నిందకులయినవారికి భయము కలుగఁజేసి అచ్చట దేవీభూషణాయుధపరివారముతో సర్వేశ్వరుని సాక్షాత్కరింపఁజేసి తనవక్షస్థ్సలమందు జ్వాలామయమగు సుదర్శనమును కనుపఱిచెను. ఆధూర్తులు అందఱును అట్టి మహిమకు ఆశ్చర్యపడి భయభక్తులతో ఆళ్వారునకు దండప్రణామములుచేసి తమ అపరాధము సహింపవలె నని క్షమాపణము వేఁడుకొనిరి. ఆళ్వారు వారియపరాధమును క్షమించి శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వమనియు భాగవతులు పరమపూజ్యులు అనియు ఉపదేశించి దీక్షితునకు యాగఫలము పూర్ణముగా సిద్ధింపవలె నని అనుగ్రహించి అచటనుండి కుంభకోణమునకు వేంచేసిరి. అచట అర్చారూపముతో వేంచేసియున్న ఆరావముదును (అతృప్తామృతము) సేవించి ఎల్లజనులు చదువుకొని ఉజ్జీవించునట్లు ఆస్వామివిషయమయి సకలవేదాంతార్థములను ప్రతిపాదించు తొంబదియాఱు పాశురములతోఁ గూడిన "నాన్ముగన్ తిరువందాది" అను ఒక దివ్యప్రబంధమును ఉపనిషత్సారమగు నూటయిరువది పాశురములు గల "తిరుచ్చంద విరుత్తము" అను ఒక దివ్యప్రబంధమును రచించి లోకమునకు ఉపకార మొనర్చెను. ఇతఁడు లోకమునందు రెండు వేల యేనూఱు సంవత్సరములు వేంచేసియుండి, పిమ్మట భగవదాజ్ఞచే పరమపదమునకు వేంచేసెను.

నిత్యతనియ—శక్తిపంచమయవిగ్రహాత్మనే శుక్తికారజితబుద్ధిహారిణే,
ముక్తిదాయకమురారిపాదయో ర్భక్తిసారమునయే నమోనమః.
తిరునక్షత్రపుతనియ—మఘాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవం,
మహీసారపురాధీశం భక్తిసార మహం భజే.

---

* యజుర్వేదము. కా. 1. ప్ర. 8. అ. 9. ప. 1. నైర్ఋతం చరుం పరివృత్త్యై గృహే కృష్ణానాం వ్రీహీణాం నఖనిర్భిన్నం.

# 115. పెరియాళ్వారు

(విష్ణుచిత్తుఁడు)

శ్లో. "తాదాత్విక ప్రతిఫలద్భగవత్పరత్వం విస్తీర్య పాండ్యకథ కేంద్ర జయా గజేన,
గచ్ఛన్ ప్రియాదుపగతే గరుడేన నాథే ప్రేమాశివం రచయతిస్మ నమోస్తు తస్మై."

భరతఖండపు దక్షిణదిగ్భాగమున నున్న పాండ్యదేశమునందలి దివ్యదేశములలోఁ బ్రసిద్ధిగాంచిన శ్రీవిల్లిపుత్తూరు (ధన్వినవ్యపురము) అను నొకగ్రామము కలదు. పెరియాళ్వారు ఈగ్రామమున నవతరించెను. ఈగ్రామమందు వేంచేసియున్న శ్రీవటపత్రశాయి అను అర్చావతారస్వామి ఆలయమున పరిచారకుఁడైన ముకుందాచార్యుఁడు ఈతనితండ్రి, తల్లి పేరు పద్మ, బోధాయన సూత్రము, యజుశ్శాఖ. ఈతఁడు పురశిఖాచూడుఁడు (నడినెత్తిని జుట్టుఉంచుకొను వైష్ణవ శాఖలోనివాఁడు). తలిదండ్రులు యుక్తకాలమున జాతకర్మాది సంస్కారములను గావించి విష్ణుచిత్తుఁడు అని పేరుపెట్టిరి. ఏడవయేట నుపనయనము చేసి వేదాదివిద్యలు గరపిరి; కాని విద్యావిశేష మబ్బలేదు. ఈతఁడు విద్యలేనివాఁడైనను బాల్యమునుండియు శ్రీమన్నారాయణునియందును భాగవతుల యందును అధిక భక్తిగలవాఁడై ఆగ్రామమందు వేంచేసియున్న వటపత్రశాయిస్వామిని నిత్యము సేవించుచు చతుర్వేదసారమయిన తిరుమంత్రార్థమును (అష్టాక్షరీమంత్రార్థమును) తన మనస్సునం దెల్లకాలము మననము చేయుచు చూచువారికి శరీరమును ధరించిన భగవద్భక్తివలె కనిపించుచుండిరి.

ఒకనాఁడు పెరియాళ్వారు వటపత్రశాయిస్వామిని సేవింపఁబోయి ఆస్వామి శరీరమందు అవతరింపఁబడిన తోమాలికలం జూచి "ఇవి ఈస్వామి శరీరమున నుండుటకు ఎంత పుణ్యము చేసినవో, ఈమాలికలను కట్టి స్వామికి సమర్పించిన వారు ఎంతటి భాగ్యశాలురో అట్టిభాగ్యము లభించుటయేఁగదా శరీరము ఉన్నందులకు ఫలము!" అని తలపోయుచు నింటికి రాఁగా పూర్వము శ్రీకృష్ణస్వామికి పుష్పమాలికలను సమర్పించి ధన్యుఁడైన మాలాకారునిచరిత్రము స్మృతికి వచ్చెను. అప్పటినుండియు తానును మాలాకారునివలె స్వామికి పుష్పకైంకర్యము చేయుటయే పరమపురుషార్థము అని నిశ్చయించి తన పూర్వులు సంపాదించిన సారవత్తరమయిన యొకభూమిలో సంపెఁగ, పొన్న, జాజి, మల్లె, చామంతి, గులాబీ, మాలతి, పారిజాతము మొదలగు నానావిధ పుష్పవృక్షములను; తులసి, దవనము, మరువము నాటించి కాలక్రమమునఁ బెద్దపూఁదోటగా పెంచి ఆపువ్వులను

ప్రతిదినమును స్వయముగా తానే కోసి పలుతెఱంగుల పూలదండలు మిక్కిలి నేర్పుతోఁ గట్టి, సాయంప్రాతఃకాలములయందు వటపత్రశాయికి సమర్పించు చుండెడివాఁడు.

ఇట్లు పెరియాళ్వారు పరమభక్తితో వటపత్రశాయికి పుష్పమాలికాకైంకర్యము సలుపుచున్న కాలమందు పాండ్యదేశమునకు రాజధానియై మధురలో రాజ్యము చేయుచున్న వల్లభదేవుఁడు అను పాండ్యవంశపురాజు ఒకనాఁటి రాత్రి తన పరిపాలనమును గుఱించి ప్రజలు అనుకొనుమాటలను ప్రచ్ఛన్నముగా వినఁగోరి మాఱు వేషముతో మధురాపురి వీథులలోఁ దిరుగుచు నొకయింటి అరుఁగుమీఁద గాఢనిద్రను జెందియున్న ఒక బ్రాహ్మణునిఁ జూచి అతనియొద్దకుఁ బోయి చేతితో తట్టిలేపి "నీవెవ్వఁడవు? ఈయర్ధరాత్రియందు ఇచట నేల యొంటరిగా పరుండి యున్నావు?" అని ప్రశ్నించెను. "అయ్యా! నేను పరదేశపుబ్రాహ్మణుఁడను. కాశికిఁబోయి గంగాస్నానము చేసికొని సేతుస్నానేచ్ఛచే రామేశ్వరమునకుఁ బోవుచు నిచ్చటకు వచ్చు సరికి సాయంకాలమయి చీఁకటిపడినందున ప్రయాణము చేయఁజాలక ఈగ్రామము చేరుకొని యీ యింటియరుగుమీఁద విశ్రమించితి" నని విప్రుఁడు మాఱుపలికెను. రాజు అది విని "భూసురోత్తమా! నీవు అనేకదేశములు తిరిగివచ్చుటచేత గొప్పజ్ఞానమును సంపాదించినవాఁడవై యుందువు. నీకు అనేకవిషయములు తెలిసియుండవచ్చును. నీకుఁ దెలిసినవానిలో సారమైన యొక విషయమును నాకు విన్పింపుము" అని ప్రార్థింపఁగా ఆబ్రాహ్మణుఁడు తన్ను అడిగిన వాఁడు రాజు అని తెలియఁజాలకపోయినను ఎవ్వఁడో పరమార్థమును దెలిసికొనుట కభిలషించు పెద్దమనుష్యుఁడని యూహించి.—

శ్లో. "వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థ మర్థం దివసం యతేత,
వార్థక్యహేతో ర్వయసా నవేన పరత్ర హేతో రిహ జన్మనా చ."

అను శ్లోకమును జదివెను. రాజు అది విని ఆశ్లోకతాత్పర్యమును గ్రహించి, "పరలోకము సంపాదించుటకు దగిన ధర్మము నాచరింపక ఆయువు నంతయు వ్యర్థముగాఁ గడపి మోసపోయితి" నని పరితాపమునొంది తన నగరికిఁ బోయి, సర్వశాస్త్రవేది, అధిగతపరమార్థుఁడు, భగవద్భక్తుఁడు నగు శెల్వనంబి అను తన పురోహితుని పిలిపించి ఆతనితో తన యభిప్రాయమును జెప్పి బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులలో నెవ్వఁడు పరుడో, ఎవ్వని నుపాసించిన మోక్షము సిద్ధించునో, ఆయంశము నిశ్చయపఱుచు నుపాయము చెప్పుమని యడిగెను. అందులకు ఆతఁడు ఆలోచించి రాజు కొలువుకూటమున నొకస్తంభమును నాటించి దానికొనను బంగరునాణెముల్ల సంచిని వ్రేలఁగట్టించి "ఈలోకమునందు ఏమతస్థుఁడైనను పర

తత్త్వ మిది యని యుక్తులతో నుపపాదించి సిద్ధాంతము చేసి నన్ను ఒప్పించుటకు తగిన సామర్థ్యముగలవాఁడు ఈవరాల మూటను పుచ్చుకొనఁ దగ్గవాఁడు అని యెల్ల దేశములకుఁ బ్రకటనపత్రికల నంపు" మని ఉపదేశించెను. అందులకు వల్లభదేవరాజు మిక్కిలి బాగున్న దని సంతోషించి, తన పురోహితుఁడు చెప్పినట్లు కావించెను.

అంతట ఆప్రకటన పత్రికలను జూచుకొని బౌద్ధులు, శైవులు, కాపాలికులు, శాక్తేయులు, పాశుపతులు, మాయావాదులు, వైశేషికులు, సాంఖ్యులు మొదలుగాఁ గల నానాబాహ్యమతస్థులలో పేరుపొందిన సిద్ధాంతవేత్తలు తమతమ శిష్యగణములతో బయలుదేఱి మధురకు వచ్చి రాజస్థానమును నిండిపోయిరి.

అట్టియెడ శ్రీవిల్లిపుత్తూరులో వటపత్రశాయిస్వామికి నిరంతరము మాలాకైంకర్య మొనర్చుచు భగవచ్చింతాపరాయణుఁడై వీతరాగుఁడై యున్న పెరియాళ్వారునకు ఆస్వామి యొకనాఁటిరాత్రి స్వప్నమందు సాక్షాత్కరించి, 'ఓయీ విష్ణుచిత్తుఁడా! మధురాపురము నేలు వల్లభదేవుఁడు పరతత్త్వనిర్ణయముఁ జేయింపఁ గోరి తన ఆస్థానమంటపమునందు ఒకవిద్యాశుల్కగ్రంథిని వ్రేలఁగట్టించి యున్నాఁడు. నానామతసిద్ధాంతవేత్తలు అనేకులు తమతమ మతములను స్థాపించుకొని ఆధనగ్రంథిని గొనిపోవలయు నని మధురకుఁ బోవుచున్నారు. నీవు ఈవేకువజామున లేచి ఆగ్రామమునకుఁ బోయి వారి కుత్సిత మతసిద్ధాంతముల నెల్ల ఖండించి ప్రతివాదులను నోరెత్తనీయక మన విశిష్టాద్వైతసిద్ధాంతమును స్థాపించి రమ్ము" అని ఆజ్ఞాపించెను. వటపత్రశాయిస్వామి యిట్లు ఆజ్ఞాపింపఁగా పెరియాళ్వారు స్వామి దివ్యమంగళవిగ్రహమును గన్నులారసేవించి పెక్కుమారులు సాగిలఁబడి మ్రొక్కి కండ్లయందు ఆనందబాష్పములు, శరీరమునందు పులకలు విస్తరింపఁగా భక్తి నమ్రుఁడై—,

శా. "స్వామీ! నన్ను నితఃపురాపవిత్రశాస్త్రగ్రంథజాత్యంధు సా
రామత్స్నాఖనన క్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరుఁ భవద్భవనదాసుఁ వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభనోటమైనసయశంబుఁ మీకు రావే హరీ

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరుల్ సీలీలకుం బాత్రముల్."

(90. 91 ప. 2. ఆ. ఆముక్తమాల్యద.)

"నన్నేలినవాఁడా! పుట్టిన నాఁటనుండియు చదు వెట్టిదో యెఱుఁగక జ్ఞానమందు గ్రుడ్డివానివలె నుండి బొరిగ పట్టుకొని పూఁదోటనేల త్రవ్వఁగా చిరకాల

మునుండి చేతులు కాయలు కాచియున్న నన్ను పండితులతో వాదింపు మని రాజ సభకుఁ బొమ్మన్నచో నచట నాకుఁగలుగు పరాభవము దేవరవారిది కాదా? నే నెక్కడ? పండితులతో వాద మెక్కడ? ప్రాజ్ఞులగు నీయితరదాసులం బంపఁగూడదా?" అని విన్నవింపఁగా స్వామి ఆతనిభక్తికి మిగుల మెచ్చుకొని "ఓయి విష్ణుచిత్తుఁడా! నీవు లేశమును భయపడకుము. వాదసమయమందు నేను నీజిహ్వాగ్రమందుండి సకల శాస్త్రజ్ఞానమును, యుక్తిపాటవమును, వక్తృత్వశక్తినిఁ గలిగించెద. నీవు వాదమందు ప్రతివాదుల నందఱను జయింపఁగా నాసొమ్మమూట తెగి నీముందర పడును. ఆరాజు నీకు పాదానతుఁడు అగును" అని ప్రత్యుత్తరము నిచ్చెను. అపుడు పెరియాళ్వారు "ధన్యోస్మి" యని భగవదాజ్ఞను శిరసావహించి స్వామి పరివారముతో మధురకుఁ బోయి వల్లభదేవుని ఆస్థానమును సమీపింపఁగా, నారాజు ఈతని నెదుర్కొని అర్ఘ్యపాద్యాదిసముచిత సత్కారములు సలిపి ఉన్నతసింహాసనాసీనుం గావించెను. అంతట విష్ణుచిత్తుఁడు భగవద్తత్త్వప్రజ్ఞావిశేషంబు గలవాఁడగుటచే నుత్తరోత్తరోక్తి సంతానంబునఁ బ్రతివాదుల నెదిరించి క్రమక్రమముగా వారివారిమతముల నుండెడు అసంగతములను వారిచే నొప్పించి వానిని అన్నింటిని ఖండించి శ్రీమన్నారాయణుఁడే పరుఁడు అనియు, ఆతఁడే ఉపాస్యుఁడు అనియు, ఆతఁడే మోక్షప్రదాత యనియు సిద్ధాంతీకరించెను. అంతట విద్యాశుల్కగ్రంథి స్వయముగా తెగి నేలఁగూలెను. ప్రతివాదులు అందఱును విస్మితచిత్తులయిరి. వల్లభదేవుఁడు పెరియాళ్వారి సామర్థ్యమునకు భగవన్మహిమంబునకు సంతసించి, ఆళ్వారు నేనుఁగుమీఁద నెక్కించి మధురాపట్టణపు వీథులయందు ఊరేగించి పెద్దయుత్సవము గావించెను. తమకుమారుఁడు గొప్పఅభ్యుదయమొంది వాహన మెక్కి వీథిలో నుత్సవముతో నేఁగుచుండఁగా ముచ్చటతోఁ జూడవచ్చు తలిదండ్రులవలె శ్రీయు, శ్రియఃపతియు గరుడవాహనారూఢులై అట్టి అభ్యుచ్ఛ్రియదశలో నున్న పెరియాళ్వారునకు దర్శనమొసంగిరి. దివ్యాభరణభూషితము, శ్రీవత్సకౌస్తుభవనమాలావిరాజితము, దివ్యాస్త్రపుష్పితచతుర్భుజము, లక్ష్మీవిరాజిత వక్షఃస్థలము నగు శ్రీమన్నారాయణుని దివ్యమంగళవిగ్రహము కన్నుల కఱవుదీర సేవించి ఆనందపరవశుఁడై "ఆతఁడు సర్వరక్షకుఁడు; మనమందఱము నాతనిచే రక్షింపఁబడువారము" అను జ్ఞానము భక్తిపారవశ్యముచే మాఱఁగా ఆసర్వేశ్వరుని శరీరశోభకు, లక్ష్మికి, దివ్యాభరణములకు, దివ్యాయుధములకు దుష్టులగు వారి దృష్టిదోషము తగులునని భయపడి తానెక్కిన ఏనుఁగుమీఁద వ్రేలవేసిన గంటలే తాళములుగాఁజేసికొని "పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పలకోడి నూఱాయిరం, మల్లాండతిణ్డోళ్ మణివణ్ణా వున్ సేవడి శెవ్వి తిరుక్కాప్పు" అని

ప్రారంభించి పదునొకండుపాశురములచేత స్వామికి మంగళాశాసనము చేసెను. అంతట ఆరాజును, ఆతని పురోహితుఁడగు శెల్వనంబియు పెరియాళ్వారుమూలముగా తమకుఁగూడ సర్వేశ్వరునిసేవ లభించె నని మిక్కిలి సంతోషించిరి. రాజసభయందు పరతత్త్వనిర్ణయముచేసి నాకు సంతోషము గలిగించితివి; కావున నీకు నేను పట్టర్ పిరాణ్ (భట్టనాథుఁడు) అను బిరుదునామమును ఇచ్చితిని. ఈవేషముతో ఇంకను కొంతకాలము నాయపరమూర్తియగు వటపత్రశాయికి మాలాకైంకర్యము చేయుచు వేదాంతార్థప్రతిపాదకములు అయిన దివ్యప్రబంధములను రచియించి జీవాత్మలను దిద్దుచునుండి, తుదను నాసన్నిధికి రమ్మని శ్రీమన్నారాయణుఁడు ఆళ్వారునకు ఆజ్ఞాపించి అంతర్ధానము నొందెను. ఆళ్వారు వల్లభదేవుఁ డొసఁగిన ధనము తెచ్చి వటపత్రశాయికి సమర్పించెను. ఇతఁడు కృష్ణునియందు భక్తిగల మాలాకారుని కైంకర్యము అవలంబించుటవలన కృష్ణభక్తిగలవాఁడై కృష్ణుని సౌశీల్యసౌలభ్యాదిగుణములు అతిమానుషచేష్టలు, బాల్యలీలలు మొదలగువానిని అనుభవించి ఆ యనుభవమును నన్నూటడెబ్బదిరెండుపాశురములతోఁ గూడిన యొక దివ్యప్రబంధమును సాధించెను. దానికి "పెరియాళ్వార్ తిరుమొழி" అని పేరు. ఇతఁడు గరుడాంశచే జనించెను. సర్వేశ్వరునియందు పెద్దభక్తికలవాఁ డగుటచే పెరియాళ్వారు అని పేరు కలిగెను.

**తిరునక్షత్రపు తనియః——మిథునే స్వాతిజం విష్ణో రథాంశం ధన్వినః పురే,**

**ప్రపద్యే శ్వశురం విష్ణో ర్విష్ణుచిత్తం పురశ్శిఖమ్**

**నిత్యతనియః——గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషా**

**న్నరపతి పరిక్లప్తం శుల్క మాదాతు కామః,**

**శ్వశుర మమరవంద్యం రంగనాథస్య సాక్షా**

**ద్ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి.**

---

# 116. ఆండాళ్

(గోదాదేవి)

**శ్లో. "దేవస్య మహిషీం దివ్యా మాదౌ గోదా ముపాస్మహే,**

**యన్మౌళిమాలికాం ప్రీత్యా స్వీకరోతి స్వయం ప్రభుః."**

పూర్వోక్తచరిత్రగల పెరియాళ్వారు పాండ్యరాజసభలో జయముగొని తన నివాసగ్రామమయిన శ్రీవిల్లిపుత్తూరునకు వచ్చి యెప్పటియట్ల వటపత్రశాయికి పుష్పకైంకర్యము ఒనర్చుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన తరువాత, జనకరాజు యజ్ఞశాల కట్టింపఁ దలఁచి భూమిని దున్నుచుండఁగా నాఁగలికి తగిలిన

పెట్టెలో నావిర్భవించిన సీతవలె పెరియాళ్వారు తులసీ కాననభూమి త్రవ్వుచుండ నొకనాడు:—

శ్లో. "తదా ఖనిత్రపత్రేణ విష్ణుచిత్తే మహాత్మని,
తులసీవృక్షమూలస్య ఖననం చ ప్రకుర్వతి,
లక్ష్మ్యంశాల్లోకరక్షార్థం గోదా భూమ్యాస్తతో౽జని."

అనినట్లు ఒక బాలిక భూమినుండి ఆవిర్భవించెను. విష్ణుచిత్తుఁడు ఆబాలికను జూచి ప్రమోదభరితాంతరంగుఁడై ఆబిడ్డ నింటికిఁ గొనిపోయి పెంచుమని తన భార్యచేతికి ఇచ్చెను. మఱియు ఆమెకు గోదాదేవియని పేరు పెట్టెను. గోదాదేవి చంద్రకళవలె దినదినప్రవర్ధమానయగుచు, నసమానలావణ్యము గలిగి లోకుల నేత్రముల కానంద మొసంగెను. చిన్ననాఁటనుండియు నామెకు భగవద్భక్తి విశేషముగ నుండెను. ఆమె శ్రీమన్నారాయణునిఁ దక్క ప్రాకృతమనుష్యుని ఎట్టివానినిఁగూడఁ బెండ్లియాడనని ప్రతిజ్ఞపట్టెను. ఆమెచెలులు పరిహాసమునకు ఇతఁడు నీకు మగఁడు అగునని నుడివినచో మూర్ఛిల్లుచుండెడివి. తన తండ్రి వటపత్రశాయి స్వామికొఱకు కట్టిపెట్టిన పుష్పమాలికలను మొదట తానొకపరి తన కొప్పుపై ధరించి బావిలో సౌందర్యమును చూచుకొని తిరుగ నా పూలదండ నెప్పటియట్ల తండ్రికి తెలియకుండ పూలసజ్జలో నుంచుచుండెడిది. ఇట్లు అనేకదినములు జరుగఁగా నొకనాఁడు ఆమె మాలికను కొప్పునఁ జుట్టుకొనుట తండ్రి కంటఁ బడెను. ఆళ్వారు పుత్రికాప్రేమచే నామె నేమియు ననలేక "అమ్మా! స్వామికి అర్పింపందగిన పూలదండ నీవిట్లు ధరించుట యుచితమగునా?" అని మందలించి ఆదివసమున స్వామికి మాలికాసమర్పణము మానెను. నాఁటిరాత్రి వటపత్రశాయి పెరియాళ్వారునకు స్వప్నమున సాక్షాత్కరించి మాల్యములు సమర్పింపక పోవుటకు కారణమేమని యడిగెను. అందులకు ఆళ్వారు "స్వామీ! ముగ్ధయగు నాబాలిక బాల్యచాపల్యముచే నామాలికలను ధరింపఁగా, చూచి యవి నిర్మాల్యమయ్యెనని పరిహరించితిని; మఱియొకటి కట్టి సమర్పించుట కవకాశము చిక్కదయ్యెను; క్షమింపుము" అని విన్నవించెను. అదివిని స్వామి చిరునగవుతో "ఓయీ! ఆమెసంగతి యెఱుంగనివాఁడవు. అగుటచే నీవు ఇట్లు ఒనర్చితివి. ఆమె రక్షణార్థమయి యీలీలావిభూతియందు ఈలోకరూపముతో నవతరించిన లక్ష్మి. నీవు కృతపుణ్యుఁడ వగుటచే నీయింట నవతరించినది. ఇప్పటినుండి నీవు నిర్మించు మాలికలను మొదట నామె కొప్పున నలంకరించి పిమ్మట మాకుఁ దెమ్ము. ఆమె తాల్చిన మాలికయే మాకుఁ గోరఁదగినది. ఆమెకొప్పుతో సంపర్కము నొందని మాలికలను మేమొల్లము" అని పలికెను. అదిమొదలు పెరియాళ్వారు ఆమె

యెడల పుత్రిక యను ప్రాకృతాభిమానము విడిచి పరదేవతాభావమును జూపఁ దొడఁగెను. ఇట్లు క్రమక్రమముగా గోదాదేవి సంప్రాప్తయౌవనయై పతి సంయోగసులభ మగువయస్సునొంది గోపికలవలె కృష్ణునియం దత్యంతానురాగము కలదియై అహర్నిశములు తత్ప్రాప్తికై ధ్యానించుచుండెను. కృష్ణుఁడవతరించిన మధురాపట్టణము, అతఁడు పెరిగిన బృందావనము, గోపికలతో నాతఁడు జలక్రీడ లాడిన యమున మొదలగు వానివద్దకుఁ బోవుటకుఁ దనకు శక్తిలేక కృష్ణసంశ్లేషము కొఱకు గోపాంగనలు కాత్యాయనీవ్రత మాచరించిరని విని, వారి ననుకరించి, ధనుర్మాసములో ముప్పది రోజులును వేకువజామున లేచి తోడిబాలికలతో స్నానము చేసి వటపత్రశాయిస్వామి వేంచేసియుండు కోవెల నందగోపుని గృహమునను, అందుండు స్వామిని కృష్ణునిగను, తోడిచెలులు అందఱును గోపికలుగను, తాను ఒక గోపాంగనగను భావించి ఆస్వామిని ధూప దీపనైవేద్యాదులతో నిత్యము నారాధించుచు దినమున కొక్కొక్క గాథను ద్రావిడభాషలో (శ్లోకముగా) రచించి స్వామి సన్నిధిని విన్నవించుచు నామె వ్రతము చేసెను.

ఇట్లు భగవత్సంశ్లేషముకొఱకు తహతహపడుచున్న గోదాదేవి యొకనాఁడు తన తండ్రిగారిని నూటయెనిమిది దివ్యతిరుపతులలో వేంచేసియున్న స్వాముల విగ్రహసౌందర్యమును కల్యాణగుణములను వర్ణించిచెప్పుమని ప్రార్థింపఁగా ఆళ్వారు అందఱను వర్ణించి చెప్పెను. అప్పుడు గోదాదేవి శ్రీరంగమందు వేంచేసియున్న శ్రీరంగనాయకుని లోకోత్తరసౌందర్యమును విని ఆస్వామియందు అనురక్త యయ్యెను. అది కని పెరియాళ్వారు అర్చారూపముతో వేంచేసియున్న రంగనాథ స్వామికిని తనపుత్రికకును పాణిగ్రహణ మెట్లు జరుగునని ఆలోచించి వ్యాకులాంతఃకరణుఁడై వటపత్రశాయితో విన్నవింపఁగా నాశౌరి 'యీమెను శ్రీరంగనాయకుని సన్నిధికిఁ గొనిపొమ్ము' అని యాజ్ఞాపించెను. అంతలో రంగనాథుఁడు పెరియాళ్వారునకు స్వప్నమున సాక్షాత్కరించి "నీవు చింతింపకుము. నీపుత్రికను నేను పెండ్లియాడెద" నని చెప్పెను. మఱునాఁడు ఛత్రచామర వాహనాదులతో వచ్చి రంగనాథుని పరిజనులు తండ్రితోఁగూడ గోదాదేవిని స్వామి ఆజ్ఞచొప్పున శ్రీరంగమునకు తోడుకొనిపోయిరి. ఆదినమున రంగనాథుని అర్చావిగ్రహమునకును, గోదాదేవికిని విధ్యుక్తముగా పాణిగ్రహణము జరిగెను. ఇంతలో గోదాదేవి పెద్దమాళ్లను సేవించుటకు గర్భాలయములోనికిఁ బోయి జనులు చూచుచుండఁగా నాస్వామిలో లీనమయ్యెను. అది చూచి విష్ణుచిత్తుఁడు ప్రీతివిషాదములతోఁ గూడుకొన్నవాఁడై యుండఁగా రంగనాథుఁడు "నీవు వగవకుము. సముద్రునివలె నీవు నాకు

మామవైతివి" అని శ్లాఘించి తిరుప్పరివట్టము, తోమాల, శ్రీ శఠగోపము మొదలగు వానితో సత్కారములు చేయించి పంపెను. పెరియాళ్వారు శ్రీవిల్లిపుత్తూరునకు మఱలివచ్చి యెప్పటియట్లు వటపత్రశాయిస్వామికి పుష్పకైంకర్యము ఒనర్చుచుండెను. ఈగోదాదేవికి ఆండాళ్ (భక్తులనేలుకొనునది) అనియు, శూడికొడుత్తాళ్ (స్వామికి తాను చుట్టుకొనినమాలికలు ఇచ్చునది) అనియు నామద్వయము కలదు. ఈమె రచించినప్రబంధములు. 1 తిరుప్పావై (ముప్పదిపాశురములు కలది.) 2 నాచ్చియార్ తిరుమొழி (నూటనలువదిమూఁడుపాశురములు గలది).

**తిరునక్షత్రపుతనియ:—శ్లో.** కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవాం,
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్.

**నిత్యతనియ:—శ్లో.** నీళాతుంగ స్తనగిరితటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిర స్సిద్ధ మధ్యాపయంతీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజ నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏవాస్తు భూయః.

---

# 117. శ్రీకులశేఖరాళ్వారు

**శ్లో.** "ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే,
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్."

పూర్వకాలమందు కేరళదేశమునందున్న కొల్లి అనుపట్టణమును చేరవంశజుఁడగు దృఢవ్రతుఁడు అనురాజు పరిపాలించుచుండెను. ఆరాజు సకలైశ్వర్యములు కలవాఁడైయున్నను, సంతానము లేక దుఃఖించి, శ్రీమన్నారాయణునిఁ గూర్చి చిరకాలము తపస్సు ఒనరించెను. సర్వేశ్వరుఁడు తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై 'తప్పకుండ నీకొకకుమారుఁడు జనించు'నని ఆనతిచ్చి అంతర్ధానమునొందెను. తరువాత కొంతకాలమునకు ఆదృఢవ్రతుని భార్య భగవదనుగ్రహముచే గర్భవతియై నెలలు నిండఁగా మాఘశుక్లద్వాదశీశుక్రవారమునాఁడు పునర్వసునక్షత్రమందు ప్రకాశమానుఁడగు ఒక కుమారునిఁ గనెను. రాజు పుత్త్రుఁడు పుట్టెనన్న శుభవార్త విని ఆనందభరితుఁడై స్నానముచేసి బ్రాహ్మణోత్తములకు తన ఉత్సాహమునకు తగినట్లు అనేకమహాదానముల నొనరించి పుత్త్రునకు విధ్యుక్తముఁగా జాతకర్మాది సంస్కారములు ఒనరించి కులశేఖరుఁడు అని నామకరణము చేసెను. మఱియు కాలక్రమమున పిల్లవాఁడు ఎదుగుచుండఁగా ఆయాకాలములయందు చేయవలసిన అన్నప్రాశనాది కర్మలనుగూడ చేసెను. పిదప రాజు కుమారునకు పదియేండ్లప్రాయమున నుపనయనము చేసి విద్యాభ్యాసమునిమిత్తము గురుకులమునకుఁ

బంపెను. సూక్ష్మబుద్ధియగు నాచిన్నవాఁడు శ్రీఘ్రకాలములో నాలుగువేదములను, సకలశాస్త్రములను, ధనుర్వేదమును, మల్లవిద్యను అభ్యసించి గొప్పవాఁడయ్యెను. మఱియు రాజ్యపరిపాలనమునకు ఉపయోగించు నీతిశాస్త్రమున అతినిపుణుఁడు అయ్యెను. దృఢవ్రతుఁడు అట్టికుమారునిఁ జూచి మిక్కిలి సంతోషించి, తగినకుల శీలవయోరూపములుగల యొకరాజకన్యకను వివాహముచేసి రాజ్యము ఆతనికి అప్పగించి కృతకృత్యుఁడై తపస్సు చేసికొనుటకు భార్యతో వనమునకుఁ బోయెను.

కులశేఖరాళ్వారు రాజ్యము నంతయు నిష్కంటకము గావించి, కోశదండ ములను వృద్ధి నొందించుచు బలవంతులు బలహీనులను పీడింపకుండ ధార్మికుఁడై రాజ్యమును పాలించుచుండెను. మఱియు శ్రీరామునివలె బ్రాహ్మణులకు అనేక గోవులను ఒసంగుచుండెడివాఁడు.

సర్వేశ్వరుఁడు శ్రీవైకుంఠమునుండి సేనముదలియాళ్వారును ఇతనియొద్దకుఁ బంపి ఇతనికి పంచసంస్కారములను, మంత్రోపదేశమును చేయించి, పరతత్త్వమును బోధించు సకలార్థమును ఉపదేశముచేయించెను. శ్రియఃపతి ఇతనిని కేవల సత్త్వ నిష్ఠుఁడగునట్లు అనుగ్రహించి తన స్వరూపగుణవిభూతులను కనుపఱిచెను. ఆకారణమువలన ఈయాళ్వారునకు జ్ఞాన భక్తి వైరాగ్యములు ఉప్పొంగి రాజ్య పాలనమునందును రాజ్యభోగానుభవమునందును వైముఖ్యము కలిగెను. భగవ ద్విముఖులగు నిత్యసంసారులతో సహవాసము ఇతనికి దహింపఁ బడుచున్న గృహ మునందలి ఉనికివలె అతిదుస్సహమయ్యెను.

ఇతఁడు దేహసంబంధులను పరిత్యజించెను. రాజ్యము భగవద్భాగవత కైంకర్యమున ఉపయోగించునట్లు ఎఱింగి దానిని భాగవతాధీనము గావించి విభీష ణునివలె శ్రీరామపాదారవిందములయందు శరణాగతిఁ జేసెను.

అవతారములలో శ్రీరామావతారమునందును, అర్చావతారములలో శ్రీవేంకటేశ్వరునియందును ఇతఁడు అపరిమితమైన భక్తి కలిగియుండెను. ఇందుకు తార్కాణగా ఇతఁడు శ్రీరామవిషయమై నూటనాలుగుపాశురములతోఁగూడిన "పెరుమాళ్ తిరుమొழி" అను నొకదివ్యప్రబంధమును రచించి లోకమునకు అను గ్రహించెను. దానిలో నాతఁడు తిరువేంగడముడైయాన్ విషయమై తనకుఁగల అపారభక్తిని పదిపాశురములలో వెల్లడిచేసెను. అందులో నొకపాశురము నీ దిగువ నుదాహరించుచున్నాను.

"ఆనాద శెల్వ త్తరంబైయర్గళ్ తఱశూళ
వానాళుం శెల్వముం మణ్ణరశుం యాన్వేండేన్,
తేనార్ పూం శోలై తిరువేంగడచ్చునైయిల్
మీనాయ్ పిఱక్కుం విదియుడై యేనావేన్"

(పె. తిరుమొழி 2. పాశు.)

"రంభ మొదలగు నప్సరసలు నన్ను చుట్టుకొని సేవింపఁగా స్వర్గరాజ్యమును ఏలుకొనుటయు, భూలోకరాజ్యము నేలుకొనుటయు నే నపేక్షింపను. మకరంద పూర్ణములగు పుష్పోద్యానములుగల తిరుమలయందున్న బావులలో చేపనయి పుట్టుట అను మహాభాగ్యము నపేక్షించెదను."

ఒకనాఁడు ఈతఁడు శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును చదివించి విని శ్రీరంగ నాథుని నిత్యకైంకర్యముచేయుచు నెల్లకాలము శ్రీరంగమందే నివసించుటకు నిశ్చ యించి ప్రతిదినము శ్రీరంగమునకుఁ బోవుటకు ప్రయాణసన్నాహములు చేయిం చుచు "మనమందఱమును గలిసి శ్రీరంగమునకుఁబోదము. సిద్ధముగా నుండుఁడు" అని పురజనులకుఁ దెలుపుచు తనపట్టణమునందు చాటింపించుచుండెను. అది చూచి మంత్రులు 'ఈతఁడు శ్రీరంగమునకుఁ బోయినయెడల శ్రీరంగనాథునివిగ్రహ సౌందర్యమున మగ్నుఁడయి అచటనే యుండును. మఱల స్వదేశమునకు వచ్చి స్వరాజ్యమును చూడఁడు' అని ఆలోచించుకొని, శ్రీరంగయాత్రకు ఏదోమిష పెట్టి ప్రతిదినమును విఘ్నము గలిగింపసాగిరి. కులశేఖరుఁడు అష్టాదశపురాణములను, ఇతిహాసములను, వైష్ణవపండితులవలన విని వానిసారమును చక్కఁగా గ్రహించి ముకుందుఁడే పరతత్త్వమని నిర్ణయించి "ముకుందమాల" అను నొకస్తోత్రమును రచించెను. అది యెల్లరకును నిత్యమును ప్రాతఃకాలమున చదువుకొనఁదగినది. కుల శేఖరాళ్వారు రాజ్యమందును, ఐశ్వర్యమందును, లేశమును మమకారము లేక దినమునందు కొంచెముకాలమే రాజ్యవ్యాపారములను జూచుచు తక్కినకాల మంతయును పరమసాత్త్వికులయిన భాగవతోత్తములతోఁ గలిసి భగవంతుని దివ్యలీలలను దివ్యావతారములను గీర్తించుచు తనకంటెముందు అవతరించిన ఆళ్వార్లనుపాదించిన దివ్యప్రబంధములను అనుసంధానము చేసికొనుచు నిత్యము శ్రీవైష్ణవగోష్ఠితోఁ గాలము గడపుచుండెడివాఁడు.

ఇట్లు కులశేఖరాళ్వారు సర్వకాలసర్వావస్థలయందును భాగవతగోష్ఠియందే కాలము గడపుచుండుటచే రాజ్యవ్యాపారములకు భంగము కలుగునని యెంచి మంత్రులు ఆతనికి వైష్ణవులయెడల ద్వేషబుద్ధి పుట్టింప నూహించి, ఆతని దేవతా ర్చన పెట్టెయందున్న స్వామిరత్నహారమును దీసి దాచి, "దానిని మీతో సహ వాసముచేయు శ్రీవైష్ణవులు కుట్రచేసి అపహరించి" రని యొకనాఁడు చెప్పిరి. ఆమాటలను విని ఆళ్వారు మిక్కిలి పరితాపమును బొంది "శ్రీవైష్ణవులు ఇట్టిద్రో హము ఎంతమాత్రమును చేయువారు కారు. మీరిట్టి పాపమునకు ఒడిగట్టుకొని వారిపై ఈనిందను మోపితిరి. మీమాటను విని కొందఱులోకులు పరమపావను లయినభాగవతోత్తములయందు సంశయము కలవారగుదురు. మీమాటలు నమ్మఁ

దగినవి గావని నే నిప్పుడు ఉపేక్షించినయెడల రాజు భాగవతపక్షపాతముచేత మంత్రులమాటలను నిరాకరించె నని లోకము నన్ను నిందించును. కావున ఇందు వలన లోకులకు గలుగు సందేహమును ప్రమాణముతోఁ బోఁగొట్టవలెను" అని పలికి, పాములవానిచే ఒకకృష్ణసర్పమును దెప్పించి దాని నొక కుండలో నుంపించి తన చేతియుంగరము నందు విడిచి "మీరు ఈయుంగరమును తీయఁగలుగుదురేని మీమాట నమ్మెదను" అని మంత్రులతోఁ జెప్పెను. అందులకు మంత్రులు మొగములు వ్రేల వేసికొని యొక మూలకుఁ బోయిరి. అప్పుడు ఆళ్వారు సభవారినిఁ జూచి "ఈనీచులు నిష్కారణముగా భాగవతులమీఁద నింద నారోపించినారు. ఈకుండలోని యుంగరమును నేను దీసెదఁ జూడుఁడు" అని నిశ్చయముగ దానిని పైకిఁ దీసెను. తాఁకినను సర్పమేమియుఁ జేయదయ్యెను. అదిచూచి సభాసదులందఱు ఆశ్చర్యపడి ముక్కులమీఁద వ్రేళ్లిడుకొని ఆళ్వారు భాగవతభక్తికి మిగుల సంతోషించిరి.

ఇతఁడు దృఢమగు రామభక్తి కలవాఁడు అగుటచే నొకకాలమున రామాయణార్థమును వినుచుఁ గాలము గడుపుచుండెను. ఒకనాఁడు అరణ్యకాండ కథను వినుచు ఖరదూషణయుద్ధములో—

శ్లో. "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణాం,
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి"

అనుశ్లోకముయొక్క అర్థమును విని ఒక్క రాముఁడు పదునాలుగువేలమంది రాక్షసులతో నెట్లు యుద్ధము చేయఁగలఁడని భయపడి గుండె బాదుకొనుచు రామప్రేమపారవశ్యమున నొడ లెఱుఁగక రామునకు యుద్ధమున సాహాయ్యము చేయుటకు కవచము, ఖడ్గము మొదలగువానిని ధరించి, చతురంగబలముతో జనస్థానముదిక్కు పరుగిడసాగెను. మంత్రులు అది చూచి ఇతని నెట్లయిన మళ్లింపవలయునని ఆలోచించి, కొందఱు వైష్ణవుల నెదురుగాఁ బంపిరి. వారప్పుడు కులశేఖరాళ్వారునిఁ గాంచి "మీరు పోవలసిన అవసరము లేదు. ఇదివఱకే రాముఁడారాక్షసుల నందఱను క్షణములో సంహరించి వేసినాఁడు. విజయము బడసిన భర్తను జూచి సీత ఆనందముతో కౌఁగిలించుకొనినది." అని చెప్పఁగా విని, సంతోషించి ఆవైష్ణవులకు తన మేననున్న భూషణములను దీసి కానుకగా నిచ్చి పురమునకు మఱల వచ్చెను.

రామాయణపురాణము యథాప్రకారము సాగుచుండెను. ఆపౌరాణికుఁడు ఆళ్వారు రామభక్తిని బాగుగ నెఱుంగును; కావున రామునకు సంభవించు అపజయములను, ఆపదలను జెప్పక అట్టి కథాభాగములను విడిచిపెట్టుచుండెడువాఁడు. ఆతఁ డొకనాఁడు పనిమీఁద గ్రామాంతరమునకుఁ బోవుచు పురాణముచెప్పుటకు తన కుమారుని నియమించెను. ఆబాలుఁడు తండ్రివలె రాజుసంగతి నెఱుంగని ముగ్ధుఁడు;

గావున గ్రంథములో నున్నదానిని ఉన్నట్లు చెప్పసాగెను. ఒకనాఁడు పురాణము చెప్పుచుండఁగా అరణ్యకాండమునందలి—

శ్లో. "జహార రావణస్సీతాం బుధః ఖే రోహిణీమివ" అనుశ్లోకమును జదివి రావణుఁడు సీతను హరించె నని చెప్పెను. అది విని కులశేఖరాళ్వారు తోఁక త్రొక్కిన త్రాచువలె మండిపడుచు లేచి "ఎట్టెట్టా? దురాత్ముఁడగు రావణుఁడు జగన్మాత యగు సీతను హరించెనా? ఇదిగో చూడుఁడు. ఈక్షణమందే సముద్రమును దాఁటి లంకఁ జొచ్చి నాబాణాగ్నిచే లంకను భస్మీభూతము గావించి సపుత్రామాత్యబాంధవముగా రావణుని సంహరించి, సీతను దెచ్చి స్వామికి అర్పించెద" నని ప్రతిజ్ఞ చేసి ధనుర్బాణములను ఖడ్గమును ధరించి లంకాభిముఖుఁడై సముద్రములో నుఱికెను. వెనుక చతురంగసైన్యములు బయలుదేఱెను. ఈవింతనుచూచుటకు దేవతలు విమానములతో నంతరిక్షమందు ఉండిరి. క్రిందనుండిచూచుచు మనుష్యులు ఎల్లరును హాహాకారములు చేయసాగిరి. అట్టి సమయమున కరుణాసముద్రుఁడు, భక్తపరాధీనుఁడు నగు శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణసహితుఁడై ఆళ్వారునకు సాక్షాత్కరించి, "ఓయి కులశేఖరా! నేను ఉండఁగా నీకు ఎందులకు ఈశ్రమ? దారపుత్రాదిసహితుఁడైన రావణుని ఇప్పుడే యుద్ధమున సంహరించి సీతనుదీసుకొనివచ్చినాను. ఇదిగో సీతను చూడుము" అని పలికెను. ఆళ్వారు అప్పుడు సీతారామలక్ష్మణులను సేవించి బ్రహ్మానందభరితుఁ డయ్యెను. పిదప రామాయణ పురాణము యథాపూర్వముగఁ బ్రారంభమయ్యెను.

ఇట్లు కులశేఖరాళ్వారు మఱికొంతకాలము రాజ్యముపాలించి తుదకు పరమవిరాగియై దృఢవ్రతుఁడు అను తనకుమారునకు రాజ్యము నొప్పగించి శ్రీవైష్ణవ సంఘముతో శ్రీరంగమును సేవించుటకు బయలుదేఱెను. అచ్చట కొంతకాలము ఉండి తిరుమల, కాంచి, తిరుకణ్ణపురము, తిరుమాలిరుంజోలై (వానాద్రి), శ్రీముష్ణము మొదలగు దివ్యదేశములను సేవించి నమ్మాళ్వారు అవతరించిన తిరునగరికిఁ బోయి ఆసమీపమున నున్న బ్రహ్మదేశపురమను దివ్యదేశమందు వేంచేసియున్న స్వామిని సేవించుచు నచట కొంతకాలము నివసించి, కులశేఖరాళ్వారు తన అఱువదియేడవయేట ఆక్షేత్రమునుండి శ్రీవైకుంఠమునకు వేంచేసెను.

**తిరునక్షత్రపుతనియ:—కుంభే పునర్వసౌ జాతం కేరళే కోళిపట్టణే,**

**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే.**

**నిత్యతనియ:—ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే,**

**తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్.**

# 118. తిరుప్పాణియాళ్వారు

(యోగివాహనుఁడు)

శ్లో. శ్రీలోకసారంగమహామునీంద్రస్కంధాధిరూఢం కలయామి నిత్యం,
కళంకహీనం కమనీయభక్తిం కవీశ్వరం గాయకసార్వభౌమమ్.

తిరుప్పాణియాళ్వారు దుర్మతిసంవత్సర కార్తికమాసములో రోహిణీనక్షత్రముతోఁ గూడిన పూర్ణిమనాఁడు శ్రీరంగమునకు దగ్గఱనున్న చూళాపురము అను ఉఱైయూర్ (ఇది తిరుచినాపల్లితో కలిసియున్నది) గ్రామముతో సంబంధించిన వరి పొలములో వరివెన్నునుండి శ్రీవత్సాంశమున నవతరించెను.

శ్లో. అథ తత్ర కులే౽౦తిమే రమారమణోరస్థ్సలలాంఛనాంశజః,
సమజాయత పాణిసంజ్ఞకః సుకవిః కార్తికమాసి వైధభే.

అనినట్లు వీరయోనిసంభూతుఁడై అవతరించెను. బాల్యమందు స్వల్పకాలము అంత్యకులమున పెరిగెను. ఎట్లన? పూర్వజన్మపాపలేశమున నీచమైన పంచమవర్ణమందు జనించినను భగవద్భక్తి, జ్ఞానము, వైరాగ్యము గలవాఁడైయున్న ఒకమాల దాసరి ఉఱైయూర్ వరిమళ్లలోనుండి తనగ్రామమునకు భార్యయు తానును పోవుచు నొక వరిమడిలో బాలసూర్యునివలె ప్రకాశించుచున్న యీశిశువునుజూచి బిడ్డలు లేక చింతిలుచున్న తనకు భగవంతుఁడు నిర్హేతుకకృపచే నీకుఱ్ఱని అనుగ్రహించెనని అపారమైన ఆనందమును పొంది రెండుచేతులతో నెత్తికొని తనభార్య చేతికి ఇచ్చెను. ఆభాగ్యవతియు పదినెలలు మోసి కన్నకొడుకునందువలె నతిప్రేమ కలదియయి యెత్తుకొని యింటికి తీసికొనివెళ్లి తన జాతిస్త్రీలచే స్తన్యమును ఇప్పింపఁగా ఆశిశువు నోరు తెఱువలేదు. అందులకు ఆదంపతులు ఆశ్చర్యపడి, పరిశుద్ధమగు గోక్షీరము తెప్పించి ఇవ్వఁగా శిశువు ఆప్యాయముతో త్రాగెను. అదిమొదలుకొని వారు ఆవుపాలు పోసి పిల్లవానిని పెంపసాగిరి.

ఇట్లు మాలదాసరియింటఁ బెరుగుచున్న తిరుప్పాణయాళ్వారు సర్వేశ్వరానుగ్రహమువలన ప్రహ్లాదునివలె బాల్యమునుండియు భగవంతునియందు భక్తియు, ఇతరవిషయములయందు విరక్తియు కలవాఁడై విష్వక్సేనుని యనుగ్రహమువలన పొందఁబడిన పంచసంస్కారములు కలవాఁడై సర్వార్థములను ఎఱింగెను. ఇతఁడు ఎల్లప్పుడును వీణాపాణియై భగవన్నామసంకీర్తనము చేయుచు కాలక్రమమున తన్ను పెంచినమాలదాసరియింట నివాసముమాని కావేరీతీరముఁజేరి, ప్రతిదినము తెల్లవాఱుజామున కావేరిలో స్నానము చేసి అతిపావనమైన శ్రీరంగ

భూమిని తనపాదములతో త్రొక్కఁ గూడదని తలంచి, శ్రీరంగవిమానమునకు ఎదురుగా దూరమున నిలచి భగవద్గుణానుభవము చేయుచు భగవంతునిలీలలు పాడుచు కాలము గడపుచుండెను.

ఇతని గానము అప్రాకృతదివ్యగానము అగుటవలన అప్సరసలు, గంధర్వులు మొదలగు ఖేచరులు అంతరిక్షమున విమానములమీఁద నిలిచి వినుచుండెడివారు. ఇతఁడు తలుచుగ రంగనాథునిపై పాటలుపాడుచు రంగనాథుని ధ్యానించుచు తన్మయుఁడై మేను మఱచి యుండెడివాఁడు. కావేరికి స్నానార్థము వచ్చు బ్రాహ్మణులు అందఱును ఇతఁడు పంచముఁడు అని భావించి "దూరముగా తొలఁగిపొమ్ము" అని కేకలు వేయుచుండిరి. అప్పుడెల్ల నీతఁడు భగవద్ధ్యానపరవశుఁడై యొడ లెఱుంగని స్థితిలో నుండుటచే ఆబ్రాహ్మణులు రాళ్లు రువ్వసాగిరి. శిలాఘాతమువలన గాయములై రక్తము స్రవించుచున్నను ఈతఁడు బాహ్యజ్ఞానములేక అట్లే ధ్యానసమాధి యందు ఉండెడివాఁడు. బ్రాహ్మణులు విసరినరాళ్లు శ్రీరంగమునందు రంగనాథస్వామిని బాధింపసాగెను. ఒకనాఁడు స్వామి లలాటమునుండి రక్తము హెచ్చుగా స్రవింపసాగెను. అది విని ఆదేశమును పాలించురాజు వచ్చి, తనవలన నిట్లు సంభవించెనేమో యని శంకించి, భయమును, దుఃఖమును పొందెను. ఇది యిట్లు జరుగుచుండఁగా రంగనాయిక రంగనాథునిఁ జూచి "వల్లభా! పరమభాగవతశిఖామణి యగు తిరుప్పాణయాళ్వారు తన గానరసముచే చిరకాలమునుండి మనలను మిగుల రంజిల్లఁ జేయుచున్నాఁడు. ఆతఁడు మహానుభావుఁడు; భక్తాగ్రగణ్యుఁడు; అట్టివానిని దూరముగా నుండనిచ్చుట నాకు భావ్యముగా కానవచ్చుట లేదు. ఆతనిని మనసన్నిధికి రప్పించి పాడించి వినవలయు నని నాకు మనసగుచున్నది." అని విన్నవింపఁగా, స్వామి "ప్రాణనాయికా! ఆభక్తుని గుఱించి నీకింత చింతయేల? ఇదిగో ఇప్పుడే ఆతనిని ఇచ్చటకు రప్పించెద" నని ఆనతిచ్చి సారంగయోగి అను నాతనికి స్వప్నమున సాక్షాత్కరించి "నా ప్రియభక్తుఁడు అగు తిరుప్పాణయాళ్వారు నీచుఁడు అని తలంపక దగ్గఱకు వెళ్లి నేను రమ్మంటి నని చెప్పుము. ఆతఁడు సంకోచించి రాకున్నచో రెండుచేతులతో నాతనిని బలవంతముగా నెత్తుకొని ఇక్కడకు తీసికొనిరమ్ము" అని యాజ్ఞాపించెను. అంతట సారంగయోగి మేల్కాంచి ధన్యుఁడనైతినని సంతోషించి, ప్రాతఃకాలమందు లేచి కాల్యకృత్యములను నిర్వర్తించుకొని, 'తిరుప్పాణయాళ్వారుసన్నిధికిఁ బోయి సాష్టాంగదండప్రణామము లాచరించి, రంగనాయకుని ఆజ్ఞయైనదని విన్నవించెను. అందులకు ఆతఁడు "నేను పంచముఁడను; పావనమైన శ్రీరంగక్షేత్రమును నాకాళ్లతో నెట్లు త్రొక్కుదును" అని తన నైచ్యమును దెలియఁజేసి సంకోచించుచుండఁగా సారంగ

యోగి! ఇది రంగనాథుని ఆజ్ఞ. మనము ఉభయులము తప్పక మన్నింపవలయు" నని దృఢముగఁ బలికెను. అంతట తిరుప్పాణియాళ్వారు భగవత్పారతంత్ర్యుఁడై యూరకుండఁగా సారంగయోగి ఆతనిని తనభుజములపై నెక్కించుకొని బయలుదేరెను. అతివాహకపురుషులు ముక్తపురుషుని శ్రీవైకుంఠమునకు తీసికొని వెళ్లునట్లు ముందు శ్రీవైష్ణవులు దివ్యప్రబంధముల ననుసంధించుచుండఁగా, వెనుక వేదాధ్యేతలు వేదమును బఠించుచుండఁగా, మహావైభవముతో సారంగయోగి తిరుప్పాణియాళ్వారును రంగనాయకుని సన్నిధికి తీసికొనివెళ్లెను. అప్పుడు ఆళ్వారు పెన్నిధిఁగన్న పేదవలె నానందభరితుఁడై, శేషతల్పమునందు శయనించిన పెరియపెరుమాళ్లను తిరుముఖమండలము మొదలుకొని తిరువడివఱకును సకలావయవసౌందర్యమును కన్నుల కఱవుదీఱ సేవించి అనుభవించి అత్యనుభవముచేతఁ గలుగు ప్రేమను సూచించు నొక ద్రావిడప్రబంధమును పదిపాశురములతో రచించి స్వామి సన్నిధిని విన్నవించెను. ఆప్రబంధముపేరు "అమలనాదిపిరాన్".

ఇట్లు తనయందు అపారభక్తిగల తిరుప్పాణియాళ్వారునందు రంగనాథుఁడు నిర్హేతుకానుగ్రహము గలవాఁడై, చుట్టును నిలిచియున్నవారు చూచుచుండఁగా తన పాదపద్మములయందు ఆతనిని లీనముచేసికొనెను. ఈయాళ్వారు ఏఁబదిసంవత్సరములు ఈవిభూతియందు ఉండిరి.

తిరునక్షత్రపుతనియ:— శ్లో. వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణిం నిచుళాపురే,
శ్రీవత్సాంకం గాయకేంద్రం మునివాహనమాశ్రయే.

నిత్యతనియ:— శ్రీలోకసారంగమహామునీంద్రస్కంధాధిరూఢం కలయామి నిత్యం,
కళంకహీనం కమనీయభక్తిం కవీశ్వరం గాయకసార్వభౌమమ్.

---

## 119. తొండరడిప్పొడియాళ్వారు

(విప్రనారాయణుఁడు)

శ్లో. 'చోళక్షితౌ ధనుషి మాసి మహేంద్రతారే యః ప్రాదురాస మురజిద్వనమాలికాంశః,
రంగేశకేళిసఖమూర్ధ్వశిఖం ద్విజేంద్రం భక్తాంఘ్రిరేణుమనఘాత్మగుణం ప్రపద్యే."

చోళదేశమునందు మండంగుడి యను నొకగ్రామము కలదు. అందు సదాచారియు, దేవతాగురుభక్తుఁడును అగు ఒకపురశ్శిఖ బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆతనిభార్య గుణవతియు, రూపవతియు నై యుండెను. ఈదంపతులు ఉభయులు సంతానము లేనివారై పుత్రుని కొఱకు సర్వేశ్వరు నారాధింపఁగా, వారికి ప్రభవసంవత్సర మార్గశిరకృష్ణచతుర్దశినాఁడు జ్యేష్ఠానక్షత్రమున భగవంతుని వన

మాలాంశమున నొక పుత్త్రుఁడు ఉదయించెను. అత్యద్భుత తేజస్సుఁగల ఆపుత్త్రునిఁ జూచి తల్లిదండ్రులు పరమానందభరితులై విధ్యుక్తముగా జాతకర్మాది సంస్కారములు గావించి, శ్రీమన్నారాయణునికటాక్షమున పుట్టినవాఁడు గావున 'విప్రనారాయణుఁడు' అని నామకరణము చేసిరి. కాలక్రమమున ఆచిన్నవాఁడు పెద్దవాఁడై గురువులచెంత సాంగోపాంగములగు వేదములను జదివి పండితుఁడయ్యెను. విష్వక్సేనుఁడు ఆతనికి పంచసంస్కారములు ఒనర్చి, మంత్రార్థమును బోధించిరి. ఆకారణముచే నాతఁడు భక్తిజ్ఞానవైరాగ్యబంధురుఁడై వివాహము మాని, స్వగ్రామమును విడిచి శ్రీరంగము ప్రవేశించెను. తొల్లి మాలాకారుఁడు శ్రీకృష్ణునకు ఒక పుష్పమాలికను సమర్పించి కృతార్థుఁడు అయ్యెను; కావున సర్వకైంకర్యములలో పుష్పకైంకర్యము భగవంతునకు ఎక్కువ ప్రీతినిఁ గలుగఁజేయునది యని నిశ్చయించి తొండరడిప్పొడియాళ్వారు శ్రీరంగమునకు దగ్గఱగా నతిరమ్యమగు నొక పుష్పోద్యానమును వేయించి పెరియాళ్వారువలె నిత్యము రంగనాథస్వామికి పుష్పకైంకర్యము చేయసాగెను. మఱియు నాతఁడు ప్రతిదినము శ్రీవైష్ణవగృహములయందు భిక్షాన్నమును సంపాదించి జీవించుచు జితేంద్రియుఁడై పూఁదోఁటయందే వినిర్మింపఁబడిన పర్ణశాలయందు నివసించుచు రాత్రింబగళ్లు తెఱపిలేక తోఁటపనియే చేయుచుండెను.

ఇట్లుండ కావేరీనదికి ఉత్తరపుదిక్కుననున్న కరంబనూరు అనుగ్రామమునందు నివసించునదియు, దివ్యాంగనాంశమునఁ బుట్టినదియు నగు దేవదేవి యను నొకవేశ్య యొకనాఁడు సఖులతో చోళరాజును సేవింపఁబోయి అచ్చట నృత్యగీతాదులు ఒనరించి రాజును సభ్యులను ఆనందింపజేసి, మఱలివచ్చుచు మార్గాయాసమును పోఁగొట్టుకొనుటకు విప్రనారాయణుని పుష్పోద్యానమున సఖులతోఁ బ్రవేశించి నల్గడలఁ దిరుగుచు తోఁటసొబగు చూచి ఆనందించుచు చల్లనిగాలి ఆవటించు నొక వృక్షచ్ఛాయయందు విశ్రమించెను. అప్పుడు విప్రనారాయణుఁడు ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించి నిర్మలవస్త్రధారియై కంఠమున తామరపూసలదండలను, తులసిమాలికలను దాల్చి, పూలమొక్కలకు గొప్పు త్రవ్వుచు ఉండెను. దేవదేవి ఆతనిం గాంచి మ్రొక్కెను; కాని ఆతఁడు చూచియుఁ జూడనట్లు ఊరకుండెను. అదిచూచి దేవదేవి తన అక్కగారింగాంచి "అక్కా! ఇతఁడు వెఱ్ఱివాఁడా, నపుంసకుఁడా? లోకమును మోహింపఁజేయఁగల సౌందర్యవతినైన నన్నుఁజూచియు నీతఁడు వికారము పొందకయున్నాఁడు. ఏల?" అని యడుగఁగా, ఆమె "నీవు తలంచునట్లు ఇతఁడు వెఱ్ఱివాఁడును, నపుంసకుఁడును గూడఁ గాఁడు. ఘనుఁడేమన? మహావిరాగి. రంగనాథునికైంకర్యమున అత్యాసక్తికలవాఁడు. లక్ష

రూపాయలు ఇచ్చినను నీదెసఁ జూడఁడు. ఇతఁడు లోకములోనున్న పురుషులవంటి వాఁడు కాఁడు" అని ప్రత్యుత్తరమిచ్చెను. అందులకు దేవదేవి "వెఱ్ఱిదానా! వాతాంబుపర్ణాశనులై ఊర్ధ్వరేతస్కులై తపమునేయు యోగులునై తమ నా సౌందర్యమును జూచి మోహించి వ్రతములను విడిచిపెట్టిరి. ఇతఁడు ఒక నేపాటి ? మనోహరమైన యిట్టి పూఁదోఁటలో తొంటరిగానున్న నవయౌవనుఁడైన యితనిని వశపఱచుకొనుట యేపాటిపని ?" అని మఱల పలికెను. ఇదివిని ఆమె అక్కయగు అలివేణి చెల్లెలి సాహసపుఁ బల్కులకు ఆశ్చర్యచకితయై, "నిజముగా నీవు ఇతనిని లోఁబఱుచుకొనఁ గలిగితివేని నేను అఱువదిమాసములు నీకు దాస్యము చేసెదను" అని ప్రతినపట్టెను. అందుమీఁద దేవదేవి "అక్కా! అట్లే కానిమ్ము. చూడు నా మహిమ" అని చెప్పి, తన ఆభరణములను వస్త్రములను ఇంటికిఁ బంపివేసి, స్నానమాడి, కాషాయాంబరము ధరించి, ఊర్ధ్వపుండ్రములను దాల్చి, అతివినయముతో విప్రనారాయణునివద్దకు వచ్చి, సాగిలఁబడి మ్రొక్కి, కన్నుల నీరు నించుచు విపదంబుధియందు కూలినదానివలె దొంగయేడ్పులు ఏడ్చుచు, నతిదీనముగా నెదుటనిలువఁబడెను. అంత ఆళ్వారు ఆమెను జూచి మనస్సుకరుగఁగా "నీవు ఎవ్వరిదానవు ? ఇచ్చటకేల వచ్చితివి ? నీదైన్యమునకు కారణ మేమి ? నీవృత్తాంతమును సవిస్తరముగా నెఱింగింపుము" అని ప్రశ్నించెను. అందులకు ఆమాయలాడి "స్వామీ! దేవరవారితో నాదురవస్థ యేమని విన్నవింతును ? నేను శ్రీరంగమునకు సమీపమున నున్న కరంబనూరులో వసించువేశ్యను. నాపేరు దేవదేవి. లోకములో స్త్రీజన్మమే నీచమైనది. అందును వేశ్యాజన్మము మఱియు నీచమైనది. వీఁడు కురూపి, వీఁడు నిత్యరోగి అనకుండ ధనమిచ్చువానితో నెల్ల బోవుట మాకులమున ఆచారము. ఎంత సుందరుఁడైనను ధనహీనుని విడువవలెను. మనస్సునకు ఇష్టమయిన పురుషుని పొందఁ గోరినచో ధనలాభము లేదని తల్లి బాధించును; కావున ఎంత కాలము బ్రతికినను ఇట్టి నీచపు బ్రతుకేకదా యని వైరాగ్యము కలదాననై స్వగృహమును, స్వజనమును విడిచి, పరమభాగవతోత్తములగు దేవరవారు నియమించు కైంకర్యమును చేయుచు నిచట నివసించుటకు వచ్చితిని" అని బదులు చెప్పెను. తొండరడిప్పొడియాళ్వారు దానిమాటలు యథార్థములు అని నమ్మెను. పాపము దీనముగా వేడుచున్నది అని కనికరించెను. తోఁటపనులకు కొంచెము సాయము చేయునని ఆశపడెను. ఈనమ్మకముతోడను, ఈకనికరముతోడను ఆతఁడు దానిని అంగీకరించి చేర్చుకొని నిత్యమును తాను తెచ్చుకొను భిక్షాన్నముతో దానిని పోషింపసాగెను. దేవదేవి ఆళ్వారుఆశను నిరాశను జేయక తోఁటపనులలో నాతనికి చాల సాయపడసాగెను. కొన్ని దినములకు "ఈమె నిష్కపటముగా నాకు సేవ

చేయుచున్నది. దీనిని విడువఁగూడదు. ఈమెయందు రంగనికి అనుగ్రహము కలిగింపవలెను" అని ఆళ్వారు తలంచుకొనియెను.

ఒకనాఁడు సాయంకాలము ఉఱుము మెఱుములతో గాలివాన వచ్చెను. ఆళ్వారు పర్ణశాలలోఁ గూర్చుండి కాషాయాంబరమును గప్పుకొని కూర్చుండెను. అప్పుడు దేవదేవి సగము తడియుచు నాతనికెదుట చూరుక్రింద నిలిచియుండెను. ఆళ్వారు హఠాత్తుగ నామెను గాంచి "ఏల యిచ్చటఁ దడియుచున్నావు? లోపలకు రమ్ము. నేను హరిదాసుఁడను. నీవును హరిదాసురాలవు. ఇట ఎంచవలసిన భేదమేమియు లేదు. లోనికి వచ్చి కూర్చుండుము" అని పలికెను. ఆమాటకే ఎదురుచూచుచున్న దేవదేవి సంకోచించుచున్న దానివలె తక్కుచుఁ దారుచు లోనికిఁబోయి ఆతనియెదుటఁ గూరుచుండి "స్వామీ! దేవరవారికి పాదసేవ చేయుటకు దాసురాలికి ఆజ్ఞ యొసఁగుఁడు" అని పలుకుచు పాదములమీఁదఁ జేయివేసెను. వెంటనే ఆళ్వారుహృదయము చెడిపోయెను. దేవదేవి కరస్పర్శవలన నాతనికి అపూర్వసౌఖ్యము కలిగెను. ఇన్నిదినములనుండి శ్రీరంగనాయకుని సేవించుచున్నను ఆతని కింతటి సౌఖ్యము ఎప్పుడును కలుగలేదు. అగుట నాతఁడు దాసురాలికి సెలవు ఇచ్చెను.

ఇఁక నాసందర్భమునందలి విషయముల నన్నిటిని వివరించుటకంటె పర్యవసానమును దెల్పుట మంచిది. విప్రనారాయణుని గతి వక్రమార్గమును బట్టెను. ఆతఁడు ఇంతవఱకును బాటించిన బ్రహ్మచర్యవ్రతము బూదిలోఁ బోసిన పన్నీరు అయిపోయెను. దైవవంచితుఁడై ఆతఁడు ఆక్షణమునందే లోలుఁడై దేవదేవి పదదాసుఁడు అయ్యెను.

ఇట్లు విప్రనారాయణుఁడు దేవదేవితోఁ గూడి విషయసుఖములు అనుభవించుచు బాల్యమునుండియు అతిభక్తితోఁ జేయుచున్న కైంకర్యమును విడిచెను. స్నానసంధ్యాద్యనుష్ఠానములకు సున్నజుట్టెను. పూర్వము అంత నిష్ఠాపరుఁడై జితేంద్రియుఁడై యున్న తాను ఇప్పు డిట్లు అయినందులకు లోకులు ఆక్షేపించి పోదురేమో యనుసిగ్గును భయమును గూడ విడిచెను. చేతిలోని సొమ్ము అంతయు నైపోయెను. అపుడు దేవదేవి తల్లి వచ్చి——

ఉ. "అల్లుని యమ్మగారి కిపు డాఁకలి గాదొకొ యింటి కేమియుం
జిల్లరవెచ్చసచ్చములు చీరలు నంపవు తోడివేడ్కకాం
డ్రెల్లను బండుగ ల్దగవు లీయఁగ దాఁకి తలంపనీవు చేఁ
బెల్లుగ రొక్క మీక ధరఁ బిల్తురె? వారసతుల్ విటావళిన్.

సీ. నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు గణికకు వెండిబంగారు లౌనె
నీపుట్టగోచియుఁ నీకావివేష్టువ ల్వారకాంతకు పట్టుచీరలౌనె?

నీముష్టిగూడయుం నీతులసీసరుల్ వేశ్యకు పాదుగు జేట లౌనె?
నీవేదశాస్త్రముల్ నీసంధ్యజపములు లంజెసానికి బంజాలగము లగునె?
గీ. పెట్ట నోపితివా యెప్పటట్లె యుండు, పెట్టలేకున్న విచ్చేయుం పెందలకడ
మొదలరోయింతులకు నొక్క ముదుపెకాక, నీసదాచార మేలయ్య దాసరయ్య.”
(102, 103 వైజయంతీవిలాసము.)

అని నిష్ఠురము లాడి యిలు వెడలఁగొట్టెను; కాని విప్రనారాయణుఁడు దేవదేవిని విడిచిపోఁజాలక సొమ్ము నివ్వలేక విరహావేశన నొందుచు దాని యంటి యరుఁగు మీఁద పండుకొనియుండెను.

ఆళ్వారు ఇట్లు దురవస్థలో నుండుట రంగనాయిక యెఱింగి “ప్రాణవల్లభా! మనకు అంతరంగభక్తుఁడైన యీతనిని మీతలఁపు మఱపించి ప్రాకృతసుఖాసక్తునిఁ గావించుట ధర్మమా? సర్వమోహకమయిన మీమాయకు ఇతనిని లక్ష్యము చేయుట మీకు తగునా?” అని భర్తతోఁ బలికెను. అందుపై రంగనాథుఁడు ఆమె మాటలు విని “ఇతఁడు వనమాలికాంశమున జనించినాఁడు. తామరాకునకు నీళ్లో అంటనట్లు ఇతని మనస్సునకు రాగమలము లెవ్వియు నంటవు. నేనొకలీల సలుపఁ దలఁచి యిట్లు చేసితిని. ఇంకను మఱియొకలీలఁ జేసెదఁ జూడుము” అని ఆనతిచ్చి, తానొక బ్రహ్మచారివేషముదాల్చి, కోవెలలోనున్న తన ఆరాధనపాత్రలలో నొక బంగారుగిన్నెను పట్టుకొని ఆవేశ్య నివసించుగ్రామమునకుఁ బోయి దాని యింటి తలుపుతట్టి దేవదేవి తల్లినిఁ బిలిచి “నేను విప్రనారాయణుని శిష్యుఁడను. నాపేరు అళగియమణవాళదాసుఁడు. మాగురువుగారు ఈబంగారుగిన్నెను నీకు ఇమ్మనిచెప్పి పంపఁగా వచ్చితిని” అని పల్కెను. అది విని వేశ్యమాత దానిం గైకొని “అయ్యో! ఇది వారు ఇప్పుడే పంపవలయునా? మా కేమికొఱత? వారు మాకు నిత్యము దర్శన మొసఁగి మాపిల్లను సంతోషపెట్టినఁ జాలును. నీ విపుడు పోయి వారిని శీఘ్రముగా నిచ్చటకు రమ్మనుము” అని బదులు చెప్పెను. శిష్యుఁడు దాని యింటి అరుఁగుమీఁదఁ బండుకొనియున్న విప్రనారాయణునిఁ జూచి “అయ్యా! మిమ్ము దేవదేవి రమ్మని చెప్పినది. అది మీకొఱకు బెంగపెట్టుకొని ఊరంతయు వెదకుచున్నది” అని చెప్పెను.

ఈమాటలకు విప్రనారాయణుఁడు పొంగి లోపలకుఁ బోయి దేవదేవి దాని తల్లియుఁ జూపు అధికాదరమునకును, మాయమాటలకును ఉబ్బిపోయి దేవదేవితో మునుపటివలె సుఖముగా నుండెను.

మఱునాఁడు ప్రాతఃకాలము అర్చకులు, పరిచారకులు, కోవెల తలుపులు తెఱచి, ఆరాధనమునకుఁ బ్రారంభింపఁగా అయిదవ బంగారపుగిన్నె కాన్పింప దయ్యెను. అందుపైని వారు కోవెల అంతయు వెదకి అడుగవలసినవారిని అడిగి

కానక, యీవృత్తాంతమును పై అధికారులకుఁ దెలియఁజేసిరి. వారు రాజుతోఁ జెప్పఁగా రాజు ఆఅర్చకులనే దండింపసాగెను. ఆసమయమున దేవదేవిదాసి యొకతె అక్కడకు దైవికముగా వచ్చి యా అల్లరిఁ జూచి "నిన్నరాత్రి విప్రనారాయణుఁడు ఒక బంగారుగిన్నెను దెచ్చి యిచ్చినాఁడు. మీరు పోయి దానియిల్లు శోధింపుఁడు" అని చెప్పఁగా వారు ఆవృత్తాంతము రాజునకుఁ దెలియఁజేసి, ఆతని ఉత్తరువుమీఁద దేవదేవియిల్లు శోధించిరి. గిన్నె దొరకెను. రాజభటులు దేవదేవితోఁగూడ విప్రనారాయణుని రాజుసమ్ముఖమునకుఁ గొనితెచ్చి నిలిపిరి. రాజు వారి వృత్తాంతమును విచారించి ఉభయులను చెఱసాలలో నుంచెను.

అపుడు శ్రీరంగనాయిక "ఇఁక నీలీల చాలించి ఆతనిని నీకృపాపాత్రునిఁ గావింపుము" అని విన్నవించెను. అది విని స్వామి నిచుళాపురము నేలుచుండెడి రాజునకు స్వప్నమున సేవ సాదించి "ఓరాజా! విప్రనారాయణునకు ప్రారబ్ధకర్మమనుభవింపఁ జేయుటకు నేనే బంగారుగిన్నెను వేశ్య కిచ్చి ఇతనిని శిక్షించితిని. ఇతఁడు నిర్దోషి. ఈవేశ్యాధనము నాకక్కఱలేదు. దానికే ఇచ్చివేయుము. ఇతఁడు మాకు మునుపటివలె పుష్పకైంకర్యము చేయును; కావున విడుదల చేయుము" అని సెలవిచ్చెను. ఆరాజు తెల్లవాఱిన వెంటనే లేచి రంగనాథుఁడు తనకు ఆజ్ఞాపించిన ప్రకారము అందఱతోఁ జెప్పి ఆశ్చర్యపడి విప్రనారాయణుని రావించి నమస్కరించి బహువిధముల సత్కరించి క్షమాపణ చేసికొనెను. ఆళ్వారును తాను లోఁగడ చేసిన అకృత్యమునకు పశ్చాత్తాపపడి యెప్పటియట్ల వైరాగ్యము వహించి స్వామికి పుష్పమాలాకైంకర్యము ప్రారంభించెను.

ఇతనికి రంగనాథుఁడు "తొండరడిప్పొడి (భక్తాంఘ్రిరేణువు)" అని బిరుదనామమును బ్రసాదించెను. ఇతఁడు తిరువడి, ఇళైయపెరుమాళ్లు (లక్ష్మణస్వామి), నమ్మాళ్వారు మొదలగువారివలె భగవత్పాదారవిందములయందు తక్క ఇతర విషయములయందు అభిరుచిలేక యుండెను. మఱియు 'తిరుప్పళ్లియెళుచ్చి, (నిద్రనులేపుట), 'తిరుమాలై' అను రెండు ప్రబంధములను రచించి లోకము నుజ్జీవింపఁ జేసెను. చిరకాలము ఈలీలావిభూతియందు ఉండి తుదకు ఈతఁడు రంగనాథుని తిరువడిని జేరెను.

దేవదేవియు జ్ఞానభక్తి వైరాగ్యములు కలది యయి బంగారు గిన్నెతో తన ఆస్తినంతను శ్రీరంగనాథునకు సమర్పించి, పరమపదము నొందెను.

**తిరునక్షత్రతనియః—శ్లో.** కోదండే జ్యేష్ఠనక్షత్రే మండంగుడిపురోద్భవం,
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణుమాశ్రయే.

**నిత్యతనియః—శ్లో.** తమేవ మత్వా పరవాసుదేవం రంగేశయం రాజవదర్హణీయం,
ప్రాబోధకీం యోఽకృత సూక్తిమాలాం భక్తాంఘ్రిరేణుం భగవంతమీడే.

# 120. తిరుమంగైయాళ్వారు

(పరకాలుఁడు)

శ్లో. "పరకాలహరిం వందే హరిపాదగుహాశయం,
ఉన్నతప్రతికూలేభకుంభసంభేదవిభ్రమమ్,
నాదప్రసభసంత్రస్తశైవశాక్యాదివర్ద్విపం,
పరకాలమృగేంద్రం త్వాం ప్రపద్యేఽచ్యుతవందితమ్."

సర్వసంపత్సమృద్ధమయిన చోళదేశమునందు బిల్వారణ్యమను మాఱుపేరుగల పరిరంభపుర మను నొకపట్టణము కలదు. దానికి సమీపమున తిరుక్కురయలూరు (కమలాపూర్ణపురము) అను గ్రామము ఒకటి యున్నది. ఆయూరిలో శూద్రకులమున నీలుఁడనువాఁడు ఒకఁడు ఉండెను. ఇతఁడు శైవమతప్రవర్తకులలో ప్రధానుఁడు. ఇతనికి చోళదేశపురాజు తనరాజ్యములో నొక పరగణాయగు తిరువాలినాఁడు అను కొంతదేశముపై నధికారము ఇచ్చి, దానిపైకము వసూలుచేయుటకు నియమించెను. ఆకారణమున నీతనికి 'తిరువాలినాడుడైయార్' అనుపేరు వచ్చెను. అతని పూర్వపుణ్యావశమున శ్రీమన్నారాయణుని పంచాయుధములలో ముఖ్యమైన శార్ఙ్గముయొక్క అంశముచే నొక కాలంబున కార్తిక శుక్ల పూర్ణిమా గురువాసరమునాఁడు కృత్తికానక్షత్రమందు ఒకకుమారుఁడు జనించెను. ఆపుత్రునకు తలిదండ్రులు నీలుఁడు అని పేరుపెట్టిరి. ఆకుఱ్ఱవాఁడు కాలక్రమమున భగవత్కృపచే వృద్ధినొంది, సకలశాస్త్రములయందును ధనుర్విద్యయందును, శస్త్రవిద్యయందును, రాజ్యతంత్రమునందును, అతినిపుణుఁడు అయ్యెను. ఇంతలో నతని తండ్రియగు తిరువాలినాడుడైయార్ కాలధర్మము నందెను. ఆతఁడు చేయుచున్న ఉద్యోగమునకు తగినవారు ఎవ్వరైన ఉన్నారాయని ఆలోచించి చోళభూపతి ఈనీలునకు రమ్మని వార్తనంపెను. ఇతఁడు పోయి రాజసందర్శనము చేయఁగా నాతఁడు యాతని శరీర సౌష్ఠవమును, ఆజానుబాహువులను, విశాలవక్షస్స్థలమును జూచి ఈతని శౌర్యము, ధైర్యము, పరాక్రమము మొదలగు నాత్మగుణములను పైవారు చెప్పఁగా విని, మిక్కిలి మెచ్చుకొని, ఆయుద్యోగమును ఇచ్చెను. కాని నీలుఁడు యౌవనవంతుఁడు అయినది మొదలు విషయసుఖములయందు ఆసక్తిగలవాఁడై స్త్రీలోలుఁ డయ్యెను.

ఆపరిరంభపట్టణమునకు క్రోశమాత్ర దూరమున శ్వేతహ్రదమను నొక సరస్సుగలదు. అది నిత్యము వికసించిన తామరపువ్వులు, కలువపూవ్వులు మొదలగు

వానిచే నిండి మిక్కిలి రమణీయముగా నుండును. స్వర్గమునుండి ప్రతిదినము అప్సరసల సమూహము అచ్చటకువచ్చి, జలక్రీడ లాడుచు, పద్మములు కోయుచు, వినోదములు సలుపుచు నుందురు. ఒకనాడు ఆ యప్సరసలతో వచ్చిన పది సంవత్సరముల వయస్సుగల బాలికయొకతె కలువపూవులను గోయుచు వెనుక చిక్కెను. దానివారంద ఱును దానిని తోడుకొనిపోవుట మఱచి తొందఱగా స్వర్గమునకుఁ బోయిరి. అంతట నాచిన్నది దివ్యరూపమును విడిచి, మానుషరూపమును ధరించి, ఒంటరిగా నాసరస్తీరమునందు సంచరింపసాగెను. పరిరంభ పట్టణనివాసి, వైద్యుఁడు నగు ఒకవైష్ణవుఁడు తిరువాన్గూరిలో వేంచేసియున్న స్వామిని సేవించి మఱలి వచ్చుచు దైవికముగా నాసరస్సుదగ్గఱకుఁ బోయి ఆచిన్నదానినిఁ జూచెను. అంత నాతఁడు దానిపై వాత్సల్యము కలవాఁడై, "ఓపిల్లా! నీవు ఎవ్వరిదానవు? ఇచట నేకాకినివై యెందులకు తిరుగుచున్నావు?" అని అడిగెను. అందులకు ఆబాలిక తనవృత్తాంత మాతనికిఁ దెలియఁజేసి "మీయింటికి నన్ను దీసికొని పోయినయెడల తప్పక వచ్చెద" ననెను. పిల్లలు లేని ఆవైద్యుఁడు ఆకన్యకమాటలు విని మిగుల సంతోషించి, దానిని వెంటఁ బెట్టుకొని యింటికిఁ బోయి భార్యకుఁ జూపఁగా నామెయు గొడ్రాలగుటచే బిడ్డలకొఱకు తపించుచున్నది, గావున ఆచిన్నదానిని కన్నకూఁతురు కంటె నధికముగా అత్యంతప్రేమతో సంరక్షింపసాగెను. ఆదంపతులు ఆబాలికకు కుముదవల్లి యని నామకరణము చేసిరి. కొన్నాళ్లకు ఆచిన్నది శుక్లపక్ష చంద్రరేఖ వలె దినదినప్రవర్ధమాన యయి సంప్రాప్తయౌవన అయ్యెను. ఆమెతండ్రి ఈమెను ఎవ్వరికిచ్చి వివాహము చేయుదు నని విచారింపసాగెను. ఇంతలో కొందఱు చారులు పోయి, కుముదవల్లి రూపగుణలావణ్యములను వర్ణించిచెప్పఁగా విని తిరుమంగై యాళ్వారు ఆవైద్యుని యింటికిఁ బోయి ఆచిన్నదానిని స్వయముగా చూచి ముగ్ధుఁడై తన కిమ్మని అడిగెను. ఆదంపతులు అతనికి ఆపిల్ల నిచ్చుటకు సమ్మతించిరి; కాని యామె "పంచసంస్కారపరుఁడగువానిని గాని, ఇతరుని నేను పెండ్లియాడను. ఇది నా ప్రతిజ్ఞ" అని తన నిశ్చయము తెలిపెను. ఆళ్వారు తోడనే తిరునరైయూరిలో వేంచేసియున్న నంబిసన్నిధిని పంచసంస్కారములను పొంది ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించి వచ్చెను. అది చూచి మఱల కుముదవల్లి, "దినమునకు ఒక వేయి మందివైష్ణవులకుసాపాటుపెట్టుచు వారి పాదతీర్థము, తళిహప్రసాదము స్వీకరించుచు నొక సంవత్సరము మీరు నియమము జరిపినయెడల మిమ్ము భర్తగా నంగీకరించెదను. లేకున్న మీకోరిక సిద్ధింపదు" అనెను. ఆళ్వారు అందులకు సంతోషముతో నంగీకరించి—

శ్లో. "ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరం,
తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప."

అనిన్నాళ్లు అతి ప్రీతితో తనకుఁ గల ధనము అంతయు భాగవతారాధనము నకు వ్యయపఱచి చేతిలో ధనము లేనపుడు రాజుగారి ధనముగూడ ఖర్చుపెట్టెను. చోళరాజు కొంతకాలమువలన ఈవృత్తాంతము నెఱిఁగి "మాకు నీవు ప్రతిసంవత్సరము చెల్లింపవలసిన సొమ్ము క్రమముగా చెల్లింపలేదు. ఈఉత్తరవు చూచినవెంటనే మాకు నీవు బాకీఉన్న పైకమంతయు యీమనుష్యునిద్వారా పంపవలయును" అని ఆజ్ఞవ్రాసి భటులనంపెను. వారు రాజు నాజ్ఞచొప్పున తిరుక్కురయలూరికి వచ్చి ఆళ్వార్లచర్యలెల్లను కన్నులారఁ జూచి ఆయన ధైర్యసాహసములకు శ్రీవైష్ణవ తదీయారాధనకు మిక్కిలి ఆశ్చర్యపడి నయభయములతో "రాజధనము చెల్లింపుము. లేకున్న నీకుహాని కలుగు"నని యెన్నోవిధములఁ జెప్పిరి; గాని యాతఁడు వినక వారికి సరియైన ప్రత్యుత్తరము చెప్పక వారి నవమానించి పంపెను. వారు పోయి జరిగిన సమాచారమును రాజుతోఁ జెప్పిరి. అది విని రాజు మంచి మాటలతో నతఁడు లొంగఁడు అని నిశ్చయించి, బలిష్ఠులైన సైనికుల నిచ్చి యొక సేనాధిపతిని "తిరుమంగైయాళ్వారను కాలుసేతులు విఱిచికట్టి, బలాత్కారముగా తీసికొని రమ్ము" అని ఆజ్ఞాపించెను. అంతట సేనాధిపతి చతురంగబలముతో బయలుదేఱి వెళ్లి ముట్టడింపఁగా ఆళ్వారు తన సైన్యముతో నాతని నెదిరించి పాఱఁదోలెను. అంతటఁ రాజు దండతాడితభుజంగమువలె మండిపడుచు తాను స్వయముగా అఖండ సైన్యముతో భూమి గ్రక్కదల నరుదెంచి ముట్టడించెను; గాని ఆళ్వారు రాజునుగూడ నోడించెను. అంతట రాజు ఆళ్వారుతో కొంతతడవు ద్వంద్వయుద్ధముచేసి ఆతని ధైర్యసాహస పరాక్రమములకు మిక్కిలి సంతోషించి "నీతో నాకిఁక వైరము వలదు; నీవు నావిషయమునఁ జేసిన అపకారమును స్మరింపను. ఇంక నాయొద్ద అనుకూలముగా నుండుము. నేను దైవము సాక్షిగా చెప్పుచున్నాను" అని చెప్పి తన పట్టణమునకుఁ బోయెను. ఆళ్వారు రాజుమాటను నమ్మి, ఆతనియొద్దకుఁ బోఁగా "మన పైకము ఇచ్చునంతదనుక ఈతనిని విడువ వలదు" అని మంత్రికి ఆజ్ఞాపించెను. మంత్రియు ఆళ్వారును ఒకదేవాలయమున కైదుచేసెను. ఆళ్వారు ఆగుడిలో మూఁడుదినములు ఉపవాసము చేసెను. మూఁడవనాఁటిరాత్రి సర్వేశ్వరుఁడు స్వప్నమున సాక్షాత్కరించి, "నీవు రాజునకు ఇవ్వవలసిన దండనద్రవ్యమును ఇచ్చెదఁ గాంచీపురమునకు రమ్ము" అని చెప్పెను. అపుడు ఈతఁడు రాజమంత్రికి ఈవార్త తెలిపి అతనితో కాంచీపురమునకుఁ బోయి కరుణాకరుఁడైన వరదరాజస్వామి కృపచే ధనము ఉన్నతావు గనుఁగొని, రాజునకు బాకీయున్న ధనముచెల్లించి, శేషించిన సొమ్ముతో భగవద్భాగవతారాధనము సాగించెను. రాజమంత్రి ఆధనమును దీసికొని వెళ్లి రాజు నెదుటనుంచి, వరదరాజస్వామి ప్రసన్నుఁడై ఆళ్వారునకు ధనము నిచ్చిన

సంగతి తెలుపఁగా రాజు ఆశ్చర్యచకితుఁడై, "ఆహా! ఆపదలో ద్రౌపదికి వస్త్రముల నిచ్చినట్లు స్వామి ఆమహానుభావునకు ధనమిచ్చె" ననుకొని, "ఆయన సామాన్యులు కారు. సర్వేశ్వరునకు అంతరంగభక్తులు. ఆయనయెడల మనము అపరాధముచేసితివి" అని ఆళ్వారును రప్పించి, పాదములమీఁద వ్రాలి, "నాయపరాధములను క్షమింపుఁడు" అని వేఁడుకొని, బహువిధముల సత్కరించి పంపెను. మఱియు రాజు ఆళ్వారును మూఁడుదినములు పస్తుపెట్టించిన పాపము పోవుటకు ఆతనివలనఁ బుచ్చుకొనిన ధనమంతయు దేవబ్రాహ్మణ సంతర్పణముకొఱకు వినియోగపఱిచెను.

కంచివరదరాజస్వామి యిచ్చిన సొమ్ముఁగూడ నైపోవుటచే ఆళ్వారు కొంత పరివారమును గూర్చుకొని దారులు కొట్టసాగెను. ఆళ్వారు కొన్నిదినములకు ఒక మహారణ్యము ఉనికిపట్టుగాఁ జేసికొని అర్ధరాత్రమున బయలుదేఱి, పట్టణములు, పల్లెలు, సొచ్చి, వైష్ణవులుకాని ధనవంతులయిండ్లకు కన్నములు త్రవ్వి, దోచుకొనుచు అనుదినము వైష్ణవార్చనము చేసి తప్పక కుముదవల్లికిఁ బ్రియము కూర్చుచుండెను.

ఆళ్వారు, ఒకనాఁటిరాత్రి ఆకాశము మేఘములచేఁ గప్పఁబడి గాఢాంధకారపూరితమై యుండఁగా నొకవైష్ణవుని తిరుమాళిగలోఁ జొరఁబడుటకు సమయమునకై యింటిపంచను పొంచియుండి ఆయింటి యజమానురాలు వాఁకిటిలో వెండిపళ్లెమును తోముచుండఁగా తటాలున దానిని గుంజుకొని పాఱిపోయెను. అందులకు ఆయిల్లాలు "అస్మద్గురుభ్యో నమః" యని లోపలికిఁ బోయి భర్తకు ఈసమాచారమును ఎఱింగించెను; అది విని వైష్ణవోత్తముఁడు "మన సొత్తు సద్వినియోగమయ్యెను. ఇందులకు వగవకుము. పళ్లెము నెత్తుకొనిపోయిన యాతఁడు తిరుమంగైయాళ్వారు గాని అన్యుఁడు కాఁడు. ఆతఁడు రిక్తుఁ డగుటచే ఈవిధముగా ధనము ఆర్జించి, శ్రీవైష్ణవారాధనము చేయుచున్నాఁడు. నీవు ఇపుడు కేకలు పెట్టితివేని శ్రీవైష్ణవకైంకర్యమునకు భంగము చేసినదానవు అగుదువు" అని పలికెను. ఆమాటలు ఆళ్వారు విని తొందరగా ఆవైష్ణవుని యెదుటకుఁ బోయి పాదములపై వ్రాలి, "స్వామీ! శ్రీవైష్ణవుల తిరుమాళిగ యని తెలియక దాసుఁడు అపచారముచేసినాఁడు క్షమింపుఁడు" అని వేఁడుకొనియెను.

ఇట్లు ఊళ్లు దోచి, మార్గమునఁ బోవువారినిఁ గొట్టి, ధనము ఆర్జించి ఆళ్వారుచేయుచున్న శ్రీవైష్ణవారాధనమునకు శ్రీరంగనాథుఁడు మెచ్చి, యెట్లయిన నాతనిం గృతార్థుం జేయఁగోరి, ఒకనాఁడు ఎక్కడను ఎవ్వరును దోచుకొనుటకు లేకుండఁ జేసి తానును రంగనాయికయు పెండ్లికొడుకు పెండ్లికూఁతుండ్రవలె నలంకరించుకొని, సపరివారముగను, వాద్యములతోడను, తిరుమంగైయాళ్వారు

చౌర్యమునకు కాచుకొనియున్న అరణ్యమున బయలుదేఱెను. తిరుమంగైయాళ్వారు "మూఁడుదుర్దినములు కావచ్చినవి. ఇంతవఱకును ఒకబోటసారియైనను రాలేదు. ఇంటిలో సోలెఁడు బియ్యమైనను చేతిలో నొక్కదమ్మిడియైనను లేదు. రేపు కైంకర్యము జరుగు ఉపాయము తోఁచుటలేదు" అని చింతించుచు పొడుగైనచెట్టెక్కి నాలుగుదిక్కులు కలయఁజూడఁగా నొకవైపున పెండ్లివారు కాన్పించిరి. ఆళ్వారు వెంటనే చెట్టుదిగి ఈలలువేసి తనవారినందఱను ఒక్కచోటికి రప్పించి దోచుకొనుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో నచ్చటకు పెండ్లివారు వచ్చిరి. ఆళ్వారుసెలవు పొంది పరివారమును దోపుడు ప్రారంభించెను. ఆళ్వారు వధూవరుల చెంతకుఁ బోయి వస్త్రాభరణముల నన్నిటిని ఒలిచి పుచ్చుకొని వరుని వ్రేల నున్న యుంగరముఁ దీయఁబోయెను; కాని అది బిగిసియుండుటచే రాదయ్యెను. అపుడు ఆళ్వారు "దీనిని ఏల విడువవలయును? ఇది పదుగురు వైష్ణవోత్తముల సాపాటునకు సరిపోవును" అని యోచించి కటుక్కున వరునివ్రేలు కొఱికి ఆయుంగరము లాగుకొనెను. అపుడు వరుఁడు "నమ్‌కలియనో" అని పలికెను. ఆకారణమువలన తిరుమంగైయాళ్వారునకు "కలియన్" అను పేరు కలిగెను. అపుడు ఆళ్వారు "ఈయుంగరము రాకుండ నీవు మంత్రము కట్టితివా?" అని యడుగఁగా, వరరూపముతో నున్నరంగఁడు "ఆమంత్రమును నీకును ఉపదేశించెదను. ఇటు రమ్ము" అని చేరఁబిలిచి, సర్వలోకమునకు అభయ మొసఁగు తన కరకమలము నాతనికి శిరస్సునందు ఉంచి, సకలవేదసంగ్రహమయి, బహుదుఃఖములను గలిగించు సంసారమును దొలఁగించునదియయి, ఐహికైశ్వర్యము, కైవల్యము, మోక్షము మొదలగువానిని ఒసంగునది యయి, శిష్టపరిగ్రహయుక్తమయి, యొప్పు పెరియతిరుమంత్రమును ఉపదేశించి, ఆక్షణమునందే ఆమంత్రముచేఁ బ్రతిపాదింపఁబడిన దివ్యరూపమును ధరించి, అనంతవిష్వక్సేనాది నిత్యసూరులు, బ్రహ్మాదిదేవతలు సేవింపఁగా పెరియపిరాట్టితో గరుడవాహనారూఢుఁడై తిరుమంగైయాళ్వారునకు దర్శన మిచ్చెను. అపుడు ఆళ్వారు స్వామి దివ్యమంగళవిగ్రహమును కన్నులార సేవించి, పులకితగాత్రుఁడై మాటిమాటికి దండప్రణామములు సమర్పించుచు, ఆనందసాగరమున మునిఁగి, కొంతతడవునకు "నాయపరాధమును క్షమింపుము" అని ప్రార్థించెను. మఱియు భగవదనుగ్రహమువలనఁ గలిగిన ఆనందము లోపలపట్టక ద్రావిడప్రబంధరూపముగా వెలికివచ్చెను. తిరుమంగైయాళ్వారు రచించిన దివ్యప్రబంధములు ఆఱు:—

1 పెరియతిరుమొழி 1084 పాశురములు.

(ఇందులో వీరు భరతఖండము నందున్న దివ్యదేశములన్నిటికి స్వయముగాఁ బోయి అచ్చటచ్చట వేంచేసియున్న

భగవద్విగ్రహములను సేవించి, పదేసి పాశురములతో ఆపెరు
మాళ్లను కీర్తించిరి. ఇది నాలాయిరప్రబంధములలో హెచ్చు
భాషాకాఠిన్యము గల ప్రబంధము.)

| | |
|---|---|
| 2 తిరుక్కురుందాండగము (చిన్న దండకము) | 20 పాశురములు. |
| 3 తిరునెడుంతాండగము (పెద్దదండకము) | 30 పాశురములు. |
| 4 తిరువెళిగూర్తిరుక్కై | 1 పాశురము. |
| 5 శిరియతిరుమడల్ | 40 పాశురములు. |
| 6 పెరియతిరుమడల్ | 78 పాశురములు. |
| మొత్తము | 1253 పాశురములు. |

శీఘ్రముగను, చిత్రముగను, మధురముగను, విస్తరముగను, కవనము చెప్పుటయందు అసాధారణశక్తియుండుటవలన ఇతనికి "చతుష్కవి" అను బిరుదు వచ్చెను.

ఇతఁడు సకలదివ్యదేశములను సంచరించుచు పెరియతిరుమొళిరచించు కాలమున "నాలుకవిప్పెరుమాళ్ (చతుష్కవిస్వామి"), కలియన్ (కలిఘ్నులు), ఆలినాడన్ (తిరువాలిదేశమునకు అధిపతి), పరకాలన్ (శత్రువులకు యమునివంటి వాఁడు), మంగై వేందన్ (తిరుమంగకు రాజు) మొదలగు బిరుదులు ఉద్ఘోషించు కొనుచు చోళదేశమునకు విచ్చేయఁగా ఆకాలమందు గొప్ప ద్రావిడకవి యగు "సంబంధుఁడు" అను నాతనిశిష్యులు వచ్చి, "మాగురువుగారు ఉన్నచోట మీరు చతుష్కవిబిరుదమును వహించుట తగదు" అని పలికిరి. అపుడు ఆళ్వారు ఆత నితో వాదించుటకు ఆతఁడు ఉన్నచోటకిఁ బోయెను. ఆయూరివారు అందఱును వీరశైవులు. అచట నొకవిష్ణ్వాలయమైనను, శ్రీవైష్ణవగృహమైనను లేదు. దగ్గఱ తిరువారాధనము లేకపోవుటచే ఈయాళ్వారునకు వాగ్విజృంభణము లేకపోయెను. ఆళ్వారు ఇందులకు ఏమిసేయుదునని చింతించుచుండఁగా దైవికముగా నొక వైష్ణవ స్త్రీ కాన్పించెను. ఆమె నడిగి ఒక భగవద్విగ్రహమును బుచ్చుకొని ఆతఁడు సంబం ధునియొద్దకుఁ బోఁగా నాతఁడు ఒక పద్యము రచించి చదివెను. ఆకవనము సలక్షణ ముగా లేదని ఆళ్వారు ఆక్షేపించెను. "మీరు ఎట్లు చెప్పెదరో చూచెదను. ఒక పద్యము చేయుఁడు" అని సంబంధుఁడు కోరెను. అపుడు ఆళ్వారు,—

"ఒరుకుఱళాయిరునిలమ్ మూవడిమణ్ వేణ్డియులగనైత్తు మీరడియా లొడుక్కి ఒన్రుం తరుగవే నామావలియై చ్చిఱైయిల్ వైత్తతాడాళన్, తాళనై

వీర్ తక్కకీర్త్తియరుమరైయిఱ్ తిరళ్ నాన్గుం వేళ్విమైయొంజుం అంగంగళవై యాఱు మిశైగళెళుమ్ తెరువిల్‌మలివిళవుం శెరక్కుం కాళిచ్చీరామవిణ్ణగరే శేర్మినరే.”

(పె.తిరుమొఝి. ప. ౧౦. తిరు. ౪)

అను పాశురము మొదలుగల ఒకతిరుమొళి చదివి, దానికొస నున్న—

“శెంగమలత్తయనన్నై యమరైయోల్ కాళిచ్చీరామవిణ్ణగరేఱ, శెంగణ్మాలై అందముత్తడవయల్ శూళావినాడఱ అరుళ్మారిఅరట్టముక్కియమరైయార్ శీయం కొంగుమలర్‌కుఝలియర్ వేళ్మంగై వేందఱ కొత్తవేప్పరకాలఱ, శెంగముగత్తఝ మాలై పత్తుం వల్లార్ తడంకడల్‌శూళులగుక్కు తలైవర్ తామే”

(3 పది—10 పాశురము, పెరియమొఝి.)

అనుపాశురమును చదువఁగా విని ప్రత్యుత్తరము చెప్పుటకుఁగాని, కవిత్వము చెప్పుటకుఁ గాని శక్తిలేనివాఁడై, సంబంధుఁడు “ఇట్టివారు ఇంకొకరు కలరా?” అని ఆశ్చర్యపడి, “స్వామీ! ‘చతుష్కవిశిఖామణి’ అను బిరుదు మీకే తగును. ఇతరులకుఁ దగదు” అని శ్లాఘించి, నమస్కరించి పోయెను.

మఱికొంతకాలమునకు తిరుమంగైయాళ్వారు రంగనాథస్వామికి ప్రాకారములు, మంటపములు, గోపురములు మొదలగునవి కట్టించుటకు ఆలోచించి, “ధనము సంపాదించు ఉపాయము ఏమున్న ?” దని పరిజనుల నడుగఁగా, వాండ్రు “నాగపట్టణమునందు బౌద్ధాలయములో నొక బంగారువిగ్రహ మున్నది. దానిని ఎట్లయిన మాయోపాయముచే హరించి తెచ్చి, ముక్కలుగా చితుకఁగొట్టి, కరగించి, ఆబంగారము నమ్మి, ఆసొమ్ముతో పని చేయింపవచ్చు” నని చెప్పిరి. ఆళ్వారు పరిజనులు చెప్పినట్లే చేసి ప్రాకారాదులను కట్టించెను. ఇట్లు పరకాలుఁడు రంగనాథునకు శాశ్వతకైంకర్యము చేసి, కొంతకాలము శ్రీరంగమందు నివసించి, పిమ్మట తిరుక్కురుంగుడికి వేంచేసి అచ్చట నున్న నిన్నినంబి, ఇరుందనంబి, కిడందనంబి, తిరుప్పార్కడల్‌నంబి, తిరుమలైనంబి అను పంచనంబులను సేవించుచు నుండి అచ్చటనే విష్ణుసాలోక్యమును పొందెను. ఇతఁడు ఈవిభూతియందు నూటఅయిదు సంవత్సరములు వేంచేసియుండెను.

తిరునక్షత్రతనియః—శ్లో. వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిం.
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహమాశ్రయే.

నిత్యతనియః—కలయామి కలిధ్వంసం కవింలోకదివాకరం,
యస్య గోభిః ప్రకాశాభిరావిద్యం నిహతం తమః.

---

# 121. నమ్మాళ్వారు

(శఠకోపులు)

---

# 122. మధురకవియాళ్వారు

శ్లో. "హస్తస్థతాళద్వితయం ప్రపద్యే, శఠారివాగ్వ్యాస ముదారకీర్తిం,
మాధుర్యసంశ్లిష్టకవిత్వయుక్తం, మహత్వసంభావితబుద్ధితత్వమ్."

పాండ్యదేశమందు ఉన్న కురుకానగరమునకు పశ్చిమమున క్రోసుదూరమున కోళూరు అను దివ్యదేశము కలదు. ఆయూరిలో సామశాఖీయుఁడగు నొక పురశ్చూడబ్రాహ్మణుఁడు ఉండెను. ఆతఁడు మహావిద్వాంసుఁడు; భగవద్భక్తుఁడు. ఆతని పేరు నారాయణుఁడు. ఆతని పూర్వపుణ్యవశమున శ్రీసేనమొదలియాళ్వారి గణాధిపతులలో నొకఁడగు కుముదుఁ డనువాని అంశమున ఈశ్వరసంవత్సర చైత్రశుక్ల చతుర్దశీ శుక్రవారమునాఁడు నొక కుమారుఁడు జనించెను. ఆతనికి తలిదండ్రులు మధురకవి యని పేరుపెట్టిరి. ఆతఁడు బాల్యమందు వేదవేదాంగముల నభ్యసించి, మహాభక్తుఁడై తీర్థయాత్రాటనము చేయసాగెను. అష్టాంగయోగనిరతుఁడై కొంతకాలము బదరికాశ్రమమందు తపస్సు చేసెను. ఆతనియవతారము వకుళాభరణ (నమ్మాళ్వారు) భాస్కరోదయమునకు అరుణోదయము వంటిది. ఇట్లు మధురకవి నిరంతరము దివ్యదేశసందర్శనకుతూహలుఁడై తిరుగుచుండెను.

## నమ్మాళ్వారు అవతారము

శ్రీవైకుంఠమందు లక్ష్మీసమేతుఁడై వేంచేసియున్న శ్రీమన్నారాయణుఁడు ఒకకాలమందు తనయెదుట బద్ధాంజలియై నిలువఁబడియున్న అనంతుని కటాక్షించి భూలోకమందు అనాదికర్మవాసనాపరవశులై జననమరణాది దుఃఖముల నొంది బాధపడుచున్న జీవాత్మలను ఉద్ధరించుటకు తిరుక్కురుగూరను దివ్యదేశమునందు ఈ విష్వక్సేనుని అవతరింపఁ జేయఁబోవుచున్నాను; గనుక నీవు ముందుగాఁబోయి ఆతిరుక్కురుగూరిలో నొకచింతచెట్టుగాఁ బుట్టియుండుము" అని ఆజ్ఞాపించెను. అనంతుఁడు శ్రియఃపతి ఆజ్ఞను శిరసావహించి, తత్క్షణమే భూలోకమునకు వచ్చి మధురకవియాళ్వారవతరించిన సంవత్సరమునందే చైత్రమాసమున పాండ్యదేశ మధ్యవర్తియగు తామ్రపర్ణీనదీతీరమందు ఉన్నకురుగూరిలో భగవంతుని

అర్చావతారమూర్తియగు ఆదిప్పిరాన్ (ఆదినాథుఁడు) సన్నిధికి ఉత్తరభాగమందు నిర్నిద్రతింత్రిణీ (రాత్రి ఆకులుముడుచని చింతచెట్టు) రూపముతో నవతరించి చూచువారికి సుందరముగాఁ బెరుగుచుండెను.

సర్వసంపదలతో నిండిన తిరుక్కురుగూరిలో నాకాలమందు ధనాఢ్యుఁడు, దాత, భాగవతాగ్రగణ్యుఁడు, పరమధార్మికుఁడు నగు; విభూతినాథేంద్రుఁడు అను నొక ఉత్తమశూద్రుఁడు ఉండెను. ఆతని కుమారుఁడు ధర్మధను వనువాఁడు. ఆ ధర్మధనువునకు చక్రపాణి అను పుత్త్రుఁడు పుట్టెను. వాని కొడుకు అచ్యుతుఁడు. వానికి పోత్కారి అనువాఁడు జనించెను. పోత్కారికి కారి అనువాఁడు పుత్త్రుఁడు. కారికి యౌవనము నిండఁగా పోత్కారి తన గ్రామమునకు కొంతదూరమందు ఉన్న పరిశారము అను విష్ణుస్థలమునకుఁ బోయి అచట తుల్యాభిజాత్యముకల వంశమందు పుట్టిన ఉడయనంగ అను నొక పడుచును తన కుమారునకు పెండ్లిచేసెను. కారి భార్యతోఁ గూడ కొంతకాలము అత్తవారియింట నుండి, కురుకానగరమునకు తిరిగి వచ్చుటలో మార్గమధ్యమందున్న తిరుక్కురుంగుడికిఁ బోయి అచ్చట వేంచేసియున్న తిరుక్కురుంగుడినంబి అను అర్చామూర్తిని సేవించి, "స్వామీ! నాకొకపుత్త్రుఁడు పుట్టునట్లు కటాక్షింపు" మని ప్రార్థించెను. అందులకు ఆస్వామి, ప్రసన్నుఁడై "నేనే నీగర్భమందు అవతరించెద" నని చెప్పెను. కారి మహానందభరితుఁడై స్వామిచెంత సెలవుగైకొని భార్యతో తిరుక్కురుగూరు ప్రవేశించి, గృహస్థసౌఖ్యమును అనుభవించుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట భార్య యగు ఉడయనంగ భగవదంశ తన గర్భమందు ప్రవేశింపఁగా గర్భవతి యయి, పదిమాసములు మోసి, ప్రమాదిసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమాదినమున విశాఖానక్షత్రమందు ఒక శిశువును గాంచెను. కారి, సుపుత్ర జననవార్తను విని, ఆనందపరవశుఁడై స్నానముచేసి, బ్రాహ్మణోత్తములకు గోభూహిరణ్యాదిదానముల నొసంగి, శిశువునకు విధ్యుక్తముగా జాతకర్మాదుల నొనరించి, మారుఁడు అని నామకరణము చేసెను.

ఇట్లు జనించిన శిశువు బాలసూర్యునివలెఁ బ్రకాశించుచున్నను లోకములోని పిల్లలవలె కన్నులు తెఱచి చూచుట, నోరు తెఱచి యేడ్చుట, స్తన్యపానము చేయుట, కాలుసేతులు కదలించుట మొదలగునవి లేక యెల్లప్పుడును యోగాభ్యాసపరుఁడై భగవద్గుణానుభవము చేయుచుండు మహాయోగివలె కనఁబడసాగెను. ఇట్టి స్థితిలో నున్న శిశువును జూచి తల్లి తత్త్వము తెలిసికొనలేక ఉత్సాహభంగమును పొంది దుఃఖించుచు ఈవృత్తాంతమును భర్తకు తెలియఁజేసెను. అంతట కారి వచ్చి చిత్తరువులో నున్న బొమ్మవలె నిశ్చలుఁడై యున్న పుత్త్రుని

జూచి ఆతనిదేహమందున్న అప్రాకృతదివ్యతేజస్సును గ్రహించి, ఈపిల్లఁడు భగవదంశసంభూతుఁడుగాని సామాన్యుఁడు కాఁడని యెంచి, సమయోచితములైన మాటలతో భార్యకు దుఃఖోపశమనము చేసి, కొలువుకూటమునకుఁ బోయి తన పుత్త్రునిఁ అద్భుతచరిత్రమును గూర్చి మంత్రులతో ఆలోచించెను. వారు "సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు నగు ఆసర్వేశ్వరునకే యాశిశువుతత్త్వము తెలియవలయును. మనుష్యులమైన మనకు తెలియ శక్యముకాదు; కావున నీబిడ్డని ఎత్తుకొనిపోయి ఆదినాథునిసన్నిధిలోనుంచి ప్రార్థించిన యెడల నిజము బయలుపడును" అని చెప్పిరి. అంతట కారియు భార్యయు ఆపిల్లవానిని ఉయ్యేలలో నుంచి మోసికొనిపోయి ఆదినాథునిసన్నిధిలో నుంచిరి. అపుడు తల్లిదండ్రులు దగ్గఱనున్నవారును అత్యాశ్చర్యము నొందునట్లు ఆపిల్లవాఁడు ఉయ్యేలనుండి క్రిందికి దిగి మెల్లఁగా ప్రాఁకుచు ఆస్వామి కోవెలకు ఉత్తరభాగమున పెరుగుచున్న చింతచెట్టుక్రిందికిఁ బోయి పద్మాసనమున గూరుచుండి కన్నులు మూసికొని యోగముచేయుట ప్రారంభించెను. అప్పుడు అచ్చటివారు అందఱును "ఇతఁడు భగవంతుఁడు" అని నిశ్చయించిరి.

'సుజ్ఞానఘనపూర్ణత్వా త్తింత్రిణీమూలసంశ్రయః, బాల ఆషోడశాబ్దాత్తు మూకభావం గమిష్యతి' అన్నట్లు ఆచింతచెట్టుక్రిందనే కూర్చుండి పదునాఱువత్సరములు యోగనిష్ఠుఁడైయుండి ఆళ్వారు కన్ను తెఱచెను; కాని యెవ్వరిదెసకును జూడలేదు. ఎవ్వరితోడను మాటాడలేదు.

పైని చెప్పఁబడిన మధురకవియాళ్వారు తీర్థయాత్ర చేయుచు పోయిపోయి తిరువయోధ్యఁ జేరెను. అచ్చట స్వామిసేవచేయుచున్న సమయములో నొకనాఁటి రాత్రి జలశంకానివృత్తికొఱకు పైకి వచ్చి ఆళ్వారు దక్షిణపువైపున నొక అప్రాకృత దివ్యతేజస్సును జూచెను. ఆతఁడు 'ఈతేజస్సు ఏమైయుండవచ్చును? ఎచ్చటనైన గ్రామములు దహింపఁబడుచున్నవా? లేక వనాగ్నియా?' అని తనలో తాను బహుభంగుల చర్చించుకొని, ఆరాత్రి నిద్రించెను. రెండు మూఁడు దినములు యథాపూర్వకముగా రాత్రులయందే ఆతేజస్సు మఱలఁ గాన్పింపఁగా, ఆళ్వారు 'ఇది అప్రాకృత దివ్యతేజస్సు గాని ప్రాకృతతేజము కాదు. దీని కారణమును నేను పరీక్షించెదను' అని నిశ్చయించుకొని పగలంతయు నిద్రించి రాత్రులయందు ఆ తేజస్సు కాన్పించు దిక్కునకు అభిముఖముగా నదులు, పర్వతములు, అరణ్యములు మున్నగువానిని లెక్కసేయక ప్రయాణము సేయుచు మార్గమధ్యమందు తారసిల్లు పుణ్యక్షేత్రములను శోధించుచు నడచి నడచి కొన్నాళ్లకు తిరుపతికి వచ్చి చేరి, అచ్చట శ్రీవెంకటేశుని సేవించి, ఎప్పటివలె రాత్రులయందు ఆ దివ్య

తేజస్సును జూచుచు శ్రీరంగము చేరెను. ఆతఁడు శ్రీరంగనాథుని, సేవించి, అచ్చట నుండి మఱల బయలుదేఱి నడుమనడుమ దివ్యదేశములను సేవించుచు క్రమముగా తామ్రపర్ణీతీరము చేరి, శ్రీవైకుంఠము అనఁబడు దివ్యదేశమునందున్న స్వామిని సేవించి, ఆనదికి దక్షిణదిక్కున నుండు తిరుక్కురుగూరు సమీపించఁగా అంతకు పూర్వము కానవచ్చుచుండు ఆదివ్యతేజస్సు కానరాదయ్యెను. అంతట మధురకవి నిదానించి నాలుగుదిక్కులు చూచి, తిరుక్కురుగూరిలో వేంచేసియుండు ఆది ప్పిరాన్ కోవెలనుండి ఆతేజస్సు బయలుదేఱుచున్నదని ఊహించి అచ్చటకుఁ బోయి ఆపెరుమాళ్లను సేవించి, కోవెలకు ప్రదక్షిణముగా వచ్చునపుడు చింత చెట్టుక్రింద సూర్యసహస్రతేజస్సుతో ప్రకాశించుచున్న నమ్మాళ్వారు సాక్షా త్కరించెను. అపుడు మధురకవి అచ్చట గుమిగూడియున్న జనులను జూచి, ఇదేమి వింత? అని అడుగఁగా కారియు, ఆతని భార్యయు ఆళ్వారు వృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పిరి. అది విని మధురకవి, పరమానందభరితుఁడై ఆనందబాష్ప ములు కన్నులవెంబడి స్రవింపఁగా పులకితమైన దేహముతో ఆళ్వారు సమీప మునకుఁ బోయి, సాష్టాంగదండప్రణామము లాచరించి, 'వీరికి చైతన్యము కలదా? వినుటకు చెవులు ఉన్నవా?' అని పరీక్షించుటకు ఒక గుండురాతిని ఆతనియెదుట పెద్దచప్పుడు అగునట్లు దొర్లించెను. నమ్మాళ్వారు అపుడు ఆధ్వని విని కన్నులు తెఱచి చూచెను. అంత మధురకవి 'వీరికి చైతన్యము ఉన్నదో లేదో' అని సందే హించి—

'శెత్తత్తిన్ వయిత్తిలే శిఱియదు పిఱందాల్, ఎత్తైతిన్ను ఎంగే కిడక్కుమ్' అని ప్రశ్నించెను. దీనికి అర్థము శెత్తత్తు=అచిత్తుయొక్క, వయిత్తిలే = కడుపులో, శిఱియదు=చిన్నది, పిఱందాల్ = పుట్టినయెడల, ఎత్తైతిన్ను = దేనిని తిని, ఎంగేకిడ క్కుమ్ = ఎక్కడ నుండును? అనఁగా; అచిత్తు దేహము దీనియందు పుట్టిన చిన్న వస్తువు, అణుపరిమాణ మగు ఆత్మ; దేహమందుండు ఆత్మ, దేనిని తిని ఎక్కడ నుండును? అందులకు ఆళ్వారు 'అత్తైతిన్ను అంగేకిడక్కుమ్' దానిని తిని అక్క డనే పడియుండును. అని ప్రత్యుత్తరము ఇచ్చెను. అనఁగా 'శరీరగతములైన సుఖదుఃఖములు అనుభవించుచు శరీరముననే ఆశ్రయించియుండును' అని అర్థము.

అందులకు మధురకవి మిక్కిలి ఆనందించి, 'అడిగినదానికి సరియైన ప్రత్యు త్తరము చెప్పెను. వీరు మనుష్యమాత్రులు కారు. చేతనుల నుద్ధరించుటకు పరమ పదమునుండి వచ్చిన పరమపురుషుఁడు' అని నిశ్చయించుకొని, పలుమాఱు సాగిలఁ బడి దండప్రణామములు సమర్పించి, చేతులు జోడించుకొని నిలిచి—

శ్లో. "పద్మాసనోపవిష్టం పరపదయుగళీనివిష్టచైతన్యం,
భరతత్త్వబోధముద్రం పరమాచార్యం పరాంకుశం వందే."

అని బహుభంగుల వినుతించి, ఆతని తిరువడిగళు ఆశ్రయించి సకల కైంకర్యముల నాచరించుచు తదేకానుభవతత్పరులై యుండిరి.

ఆసమయమందు వైకుంఠనివాసియగు శ్రీమన్నారాయణుఁడు శంఖచక్రాది దివ్యాయుధోపేతుఁడై లక్ష్మీసమేతుఁడై గరుడవాహనారూఢుఁడై యేతెంచి సేవ సాదించి, తన స్వరూపగుణవిభూతిచేష్టితములను గనుపఱిచి, వాని ననుభవించుటకు దివ్యజ్ఞానము నిచ్చెను. అంతట ఆపరాంకుశయోగి సర్వేశ్వరుని దివ్యాత్మస్వరూపమును దానినిఁ బ్రకాశింపఁజేయు దివ్యమంగళవిగ్రహమును కల్యాణగుణములను అనుభవించి తదనుభవజనితప్రీతి లోపల నిముడక పైకి పొంగెనో అన్నట్లు ఋగ్యజు రథర్వణసారభూతములగు 'తిరువిరుత్తము' 'తిరువాశిరియము' 'తిరువందాది' అను మూఁడు ప్రబంధములను సామవేదసారమైన 'తిరువాయిమొళి' అను ప్రబంధమును రచించి అనన్యప్రపన్నుఁడగు మధురకవియాళ్వారు మొదలగువారికి అర్థానుభవపూర్వకముగా నుపదేశించి సకలచేతనులను ఉజ్జీవింపఁజేసెను. అదిమొదలు వైకుంఠమునుండి అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు, బ్రహ్మాదిదేవతలు, సనకసనందనాది దివ్యర్షులు తింత్రిణీవృక్షముకడకు ఏతెంచి మహాప్రభావసంపన్నుఁడు పరభక్తిపరజ్ఞానపరమభక్తిసంపన్నుఁడు, ప్రపన్నజనకూటస్థుఁడు నగు పరాంకుశమునీంద్రుని దర్శించి, సామగానరూపమగు తిరువాయిమొళిని వినుచుండెడివారు. మధురకవిసూరి 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను నొక దివ్యప్రబంధమును పరాంకుశయోగి విషయమున రచియించి యమ్మహాత్ముని ప్రభావంబును చరమపర్వనిష్ఠులగు సాత్త్వికులకుఁ దెలియఁజేసి అర్చారూపమగు అతని విగ్రహమును కురుకాపురియందు ప్రతిష్ఠించి కొఱఁతలేవియు లేకుండ ఉత్సవములు జరుపుచు తద్బిరుదాంకితగాథలం బొగడుచు విజయకాహళము లూఁదింపఁగా ద్రవిడకవీశ్వరుఁడు అగు కంబనాథునిశిష్యుఁడు ఒకఁడు వచ్చి "మాగురువు కంబకవీశ్వరుని మీవకుళాభరణుఁడు జయించినఁగాని యీవీరకాహళములు ఊఁదింపఁగూడ" దని నిరోధించెను. అందులకు మధురకవి నీవిట్లు పలుకుట న్యాయమైనను మాశఠగోపకవీంద్రులు ఈపురమును విడిచి ఎక్కడకును వచ్చువారు కారు. అమ్మహాత్ములు రచించిన దివ్య ప్రబంధములలోని ఒకపాశురమును గొనిపోయి మీశంఖఫలకమందు ఉంపుము. ఆఫలకము ఆపాశురమును వహించెనేని అస్మదాచార్యులు అక్కడకు వచ్చి మీగురువును జయించినట్లు అగును." అని చెప్పి,—

"కణ్ణన్ కళలిణై, నణ్ణుం మనముడైయీర్,
ఎణ్ణుం తిరునామమ్, తిణ్ణం నారణమే."

అను పాశురమును ఎత్తి ఒక పత్రముమీఁద వ్రాసి యిచ్చిన వాఁడు అది పట్టుకొనిపోయి, తన గురువునకు ఈవృత్తాంతమును దెలిపి ఆపాశురము వ్రాసిన పత్రమును శంఖఫలకముమీఁద నుంచఁగా దక్షిణ మధురావాసులగు మూఁడు

వందల ద్రావిడపండితులు కంబకవీంద్రునితో ఆశంఖఫలకం జెక్కిరి. అపుడు వాగ్దేవతాధిష్ఠితమగు ఆశంఖఫలకము నమ్మాళ్వారు పాశురము వ్రాసియున్న తాళపత్రమును మాత్రము వహించి; తక్కినవారి నందఱను గ్రిందఁబడునట్లు చేసెను. అగుట కంబకవి మిక్కిలి భీతిల్లి నమ్మాళ్వారును తన మనస్సులో ధ్యానించుచు ఇట్లు నుతించెను.—

"ఈ యాడువతో కరుడ క్కెదిరే, యిరవిక్కెదిర్ మిన్మిని యాడువదో
నా యాడువతో యురుపుమువ్వులిముక్, నరకేసరిమున్నడై యాడువదో
పే యాడువతో వర్పుకూర్వశిముక్, పెరుమానడిశేర్ వకుళాభరణర్
ఓరాయిరమామఱైయిర్ తమిళ్, లొరుశొల్ పొరువో వులకిల్ కవియే."

"గరుడునకు, ఈఁగకును; సూర్యునకు, మెఱుఁగుఁ బురుగునకును; కుక్కకు, పులికిని; నక్కకు, సింహమునకును; సుందరియైన ఊర్వశికి, పయ్యమునకును ఎంత అంతరమున్నదో లోకములోని కవుల కవిత్వమునకును, వేదమును ద్రావిడభాషరూపముగా రచించిన నమ్మాళ్వారుకవిత్వమునకును అంత అంతరమున్నది."

మధురకవి, నమ్మాళ్వారు పాడించిన దివప్రబంధములయందు ఉండు వేదాంత సారార్థమును స్వయముగా ననుభవించి, ఆనందము నొందుచు పరులకు ఉపదేశించుచు, రాత్రింబవళ్లు ఎడతెగక నమ్మాళ్వారుల చరణారవిందములను ఆరాధించుచు నుండెను. కురుగూరిలో వేంచేసియున్న ఆదిప్పిరాన్ (ఆదినాథస్వామి) ప్రసాదించిన పొగడపూదండ ధరించుటచే వకుళాభరణుఁడు అనియు, పరమతములను నిరసించుటచే పరాంకుశుఁడు అనియు, శఠులను మఱుగుపఱుచుటచే శఠగోపుఁడు అనియు నమ్మాళ్వారునకు నామములు కలిగెను. ఆతఁడు తలిదండ్రులగు ఉడయనంగకును కారికిని పరమపదము అనుగ్రహించి, మధురకవితో, భగవద్గుణానుభవముచేయుచు కొంతకాలము ఈవిభూతియందు ఉండి, మఱికొంతకాలమునకు ఆతఁడు, "ఈదేహబంధమును బాపి మోక్షము ననుగ్రహింపు" మని సర్వేశ్వరుని ప్రార్థించి, ఆతని కటాక్షమువలన పరమపదమునకు వేంచేసెను. మధురకవియాళ్వారును నమ్మాళ్వారి దివ్యప్రబంధములను లోకమున వ్యాపింపఁజేసి, పిమ్మట మఱికొంతకాలమునకు పరమపదము నలంకరించెను.

*నమ్మాళ్వార్ తిరునక్షత్రపుతనియః—శ్లో. వృషభేతు విశాఖాయాం కురుకాపురి కారిజం,
పాండ్యదేశే కలే రాద్యా శఠారిం సైన్యపం భజే.

నిత్యతనియః—శ్లో. మాతాపితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానాం,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.

మధురకవియాళ్వార్ తిరునక్షత్రపు తనియ—
శ్లో. మేషే చిత్రాసముద్భూతం పాండ్యదేశే గణాంశకం,
శ్రీపరాంకుశసద్భక్తం మధురంకవి మాశ్రయే.

# 123. యామునాచార్యులు

చోళదేశమందు వీరనారాయణపుర మను నొక గ్రామము కలదు. నాథముని అను నొక వైష్ణవోత్తముఁడు అచ్చట వేంచేసియుండెను. ఆతనికుమారుఁడు ఈశ్వరముని. ఈశ్వరమునికి ధాతసంవత్సర ఆషాఢ శుక్ల పూర్ణిమా బుధవాసరమున, ఉత్తరాషాఢానక్షత్రమునందు పరమపదనాథుని సింహాసనాంశమున నొకకుమారుఁడు జనించెను. తండ్రి కుమారునకు చేయవలసిన సంస్కారములు అన్నియుఁ జేసి, తన తండ్రి యాజ్ఞచొప్పున "యమునైత్తురైయవర్ (యామునాచార్యుఁడు)" అని నామకరణము చేసెను. క్రమముగా పెరుగుచున్న యామునాచార్యునకు కాలము తప్పకుండ తండ్రి అన్నప్రాశనము, చౌలము, ఉపనయనముచేసి, ఆకాలమందు మహాపండితుఁడై యున్న మహాభాష్యభట్టరు అను నతనియొద్దకు వేదశాస్త్రాధ్యయనము చేయుటకు పంపెను. ఈతఁడు అతిసూక్ష్మబుద్ధికలవాఁడు. ఏకసంథాగ్రాహి. గురువు ఒక దినమునందు తనకు పాఠముచెప్పిన గ్రంథమునంతయును మఱునాఁడు ఒప్పఁజెప్పఁగల ధారణగలవాఁడు. అది చూచి ఆగురువు మిక్కిలి ఆశ్చర్యపడెను. ఇతర బాలకులు ఒకసంవత్సరములో నేర్వఁగలవిద్య, నీతఁడు ఒక మాసమునందు నేర్చెను. ఇట్లు యామునాచార్యుఁడు పదిసంవత్సరముల ప్రాయమునకు లోపున సకలశాస్త్రములయందును అతినిపుణుఁడు అయ్యెను. పిమ్మట కొన్నినాళ్లకు ఆచోళదేశమునేలు రాజుయొక్క పురోహితుఁడగు ఆక్కియాళ్వాన్ అను నొక బ్రాహ్మణుఁడు ఆకాలమందున్న పండితుల నందఱను శాస్త్రవాదమున జయించి, విద్వజ్జనకోలాహలుఁడు అను బిరుదమును పొంది, తనచే జయింపఁబడిన స్వదేశపుపండితుల వలన కప్పము పుచ్చుకొనుటకు రాజువలనఅధికారపత్రమును పొందెను. ఒకనాఁడు అతఁడు యామునాచార్యుని గురువగు ఆక్కియాళ్వాను తనకు ప్రతిసంవత్సరము ఈయవలసిన అరియప్పన మీయవలయు నని ఒక యుత్తరము వ్రాసి, భటునిచేతికి ఇచ్చిపంపెను. అదిచూచి యామునాచార్యుని గురువు దరిద్రుఁడు అగుటచే ఆసమయమునందు ధనము ఈయఁజాలక దైన్యము నొందెను. అపుడు యామునాచార్యుఁడు తన గురువుదుర్దశకు మిగుల చింత నొంది, ఆభటుని చేతి చీటి నందుకొని పదిముక్కలుగా చింపి పాఱవేసి, మఱియొకపత్రముమీఁద—

శ్లో. "న వయం కవయస్తు కేవలం న వయం కేవలతంత్రపారగాః,
అపి తు ప్రతివాదిమస్తకప్రకటాటోపవిపాటనక్షమాః."

అని యొకశ్లోకమును వ్రాసి, ఆదూతచేతికి ఇచ్చి పంపెను. రాజపురోహితుఁడు అగు ఆక్కియాళ్వాన్ జరిగిన వృత్తాంత మంతయు దూతవలన నెఱింగి,

ఆశ్లోకార్థమును రాజునకు వివరించి, తనతో వాదించుటకు యామునాచార్యుని రప్పింపవలసిన దని కోరెను. దానిమీఁద రాజు మహావిద్వాంసుల గౌరవమునకు తగిన ఒక పల్లకీని తన ఉద్యోగులను పంపి, యామునాచార్యుని రమ్మని ప్రార్థించెను. అందులకు అంగీకరించి, యామునాచార్యుఁడు అపల్లకి నెక్కి రాజసన్నిధికిఁ బోయి —

శ్లో. "ఆశైలా దద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకంఠా
దారక్షోనీతసీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః,
ఆచ ప్రాచ్యప్రతీచ్యక్షితిధరయుగళా దర్కచంద్రావతంసా
న్మీమాంసాశాస్త్రయుగ్మశ్రమవిమలమనా మృగ్యతాం మాదృశోఽన్యః."

అను బిరుదశ్లోకమును చదివెను. అది విని ఆక్కియాళ్వాను మిక్కిలి అసహనము కలవాఁడై, యామునాచార్యునితో వాదించుటకు సిద్ధపడెను.

ఆసమయమందు భగవద్భాగవతభక్తిఁగల రాజభార్య వాదోన్ముఖులయిన పండితుల నిద్దఱను గాంచి భర్తను బిలిచి, "ప్రాణవల్లభా! వీరిరువురలో నెవరు వాదమున గెలుతురో చెప్పఁగలరా?" అని యడిగెను. రాజు పురోహితుఁడు గెల్చు ననిరెను. రాణి బాలుఁడు అగు యామునాచార్యుఁడు గెలుచు ననెను. "అట్లయిన నేను నీకు అర్ధరాజ్యమును ఇచ్చెదను; లేకున్న నీవు నాఆజ్ఞకు లోఁబడి యుండవలెను" అనిరెను. రాణి అంగీకరించెను.

అపుడు రాజపురోహితుఁడు యామునాచార్యునిఁ జూచి "నీవు విద్వాంసుఁడ వైనను బాలుఁడవు. నాతో వాదించుటకు తగిన శక్తిఁగలవాఁడవు కావు; కావున నీకుఁదోఁచిన మూఁడు లౌకికవాక్యములను బలుకుము. నేను వానిని ఖండించెదను. లేకున్న నేను పలికెదను. నీవు ఖండింపుము. జయించినవాఁడు వీగిపోయిన వానితలను పాదముతో తన్నవలయును" అని పలికెను. యామునాచార్యుఁడు ఈప్రతిజ్ఞకు అంగీకరించి,—

"నీతల్లి గొడ్రాలు కాదు"
"ఈరాజు సార్వభౌముఁడు"
"రాజమహిషి పతివ్రత"

అని మూఁడు వాక్యములను పలికెను.

అప్పలుకులను విని రాజపురోహితుఁడు ప్రత్యుత్తరము చెప్పుటకు ఏమియు తోఁచక తల వంచుకొని మూఁగవానివలె నూరకుండెను. అంతట రాజమహిషి బాలుఁడైనను యామునాచార్యుని యుక్తిచాతుర్యమునకు మిక్కిలి సంతసిల్లి, దిగ్గున లేచివచ్చి, గ్రుచ్చి కౌఁగిలించుకొని ముద్దాడి "నమ్మై ఆళ వందీరో" (మమ్మేలుకొను

టకు వచ్చితివా ?) అని పలికెను. ఆకారణమువలన ఆతనికి ఆళవందార్ (రక్షా గతుఁడు) అని పేరువచ్చెను. యామునాచార్యుని అసాధారణబుద్ధిచాతుర్యమునకు మెచ్చుకొనిన రాజు వివాదసమయమునందు యామునాచార్యుఁడు గెల్చినచో భార్యకు ఇచ్చెద ననిన అర్ధరాజ్యము భార్యప్రార్థనమీఁద యామునాచార్యునకు ఇచ్చెను. దైవకృపచే నీవిధమున యామునాచార్యుఁడు రాజ్యపదము నొందెను. ఇంతలో నాతని తండ్రియగు ఈశ్వరముని పరమపదము నలంకరించెను. ఇతనికి నలుగురు పుత్రులు పుట్టిరి.

యామునాచార్యుఁడు ఇట్లు రాజ్యపదస్థుఁడై సకలభోగముల ననుభవించుచుండఁగా ఇతని తాతగారి శిష్యుఁడగు మణక్కాల్‌నంబి (శ్రీరామమిశ్రుఁడు) అను వైష్ణవోత్తముఁడు ఒకఁడు ఆతనివృత్తాంతమును విని సంతోషించి, "ఈమహానుభావుఁడు ఇంత పండితుఁడై యున్నను విశిష్టాద్వైతసిద్ధాంతస్థాపకుఁడుగా నుండుట మాని కేవలము రాజ్యభోగములయందు ఆసక్తికలవాఁడై యున్నాఁడు. ఇది ప్రాజ్ఞునకు తగదు. పరమార్థమందు బుద్ధి పుట్టింపవలయు" నని ఆలోచించి ఒకనాఁడు ఆతనినిఁ జూడఁబోయెను; కాని ద్వారపాలకులు లోనికి బోనీయరైరి. అంతట ఆతఁడు యామునాచార్యుని దర్శన మెట్లు అగును ? అని చింతించి ఏమియు తోఁచక తుదకు వంటవానితో స్నేహము చేసి, దినదినము ఉస్తికూర తెచ్చి ఈయసాగెను. వంటవాఁడు దానిని జాగ్రత్తగా వండి వడ్డింపఁగా యామునాచార్యుఁడు అత్యాదరముతో దానిని భక్షింపసాగెను.

ఇట్లు ఆఱుమాసములు గడచెను; కాని శ్రీరామమిశ్రుని కోరిక నెఱవేఱలేదు. ఆతఁడు ఆలోచించి నాలుగుదినములు ఆకూర నిచ్చుట మానివేసెను. యామునాచార్యుఁడు ఆకూరరుచి మఱచెను; కావున "నేఁడేల వండవైతివి ?" అని యొకనాఁడు అడుగఁగా వంటలవాఁడు "ఎవ్వఁడో యొకవృద్ధవైష్ణవుఁడు ఇన్నిదినములు ఇచ్చుచుండెడివాఁడు. ఏమికారణముననో నాలుగుదినములనుండి తెచ్చియిచ్చుటలేదు" అని బదులుచెప్పెను. "ఈసారి ఆతఁడు వచ్చినచో నాచెంతకుఁ గొనిరమ్ము" అని యామునాచార్యుఁడు చెప్పెను. "ఈపాటికి నాప్రశంస వచ్చియుండును" అనిభావించి శ్రీరామమిశ్రుఁడు ఎప్పటియట్లు ఆకూరపట్టుకొని యామునాచార్యుని పాకశాల కరుగ పాచకుఁడు ఆతనిని రాజుసన్నిధికిఁ గొనిపోయెను. యామునాచార్యుఁడు శ్రీరామమిశ్రునకు ఎదురుగా వచ్చి, సాష్టాంగదండప్రణామము లాచరించి, యథోచితముగా సత్కరించి, సముచితాసనాసీనుం గావించి, "మీరెందులకు వచ్చితిరి ?" అని యడిగెను. అందులకు శ్రీరామమిశ్రుఁడు "నేను నిస్పృహుఁడను. ఏప్రయోజనమును నపేక్షించియుఁ మీచెంతకు వచ్చినవాఁడను గాను.

మీ తాతయగు నాథముని నాయొద్ద నొక నిక్షేపమును ఉంచి, మీకిమ్మని చెప్పి పరమ పదమునకుఁ బోయెను. అది శ్రీరంగమున నున్నది. అచ్చటకు వచ్చినచో మీకు ఇచ్చెద" నని బదులు పలికెను. యామునాచార్యుఁడు అందులకు ఆనందించి అంగీకరించి శ్రీరంగమునకు బయలుదేఱిపోయెను. అచట శ్రీరామమిశ్రుఁడు యామునాచార్యుని శ్రీరంగనాయకుని సన్నిధికిఁ గొనిపోయి, దేవుని పాదారవింద యుగళమును జూపి "ఇదియే మీ తాత మీకిమ్మని నాకు ఇచ్చిపోయిన నిక్షేపము" అని చూపెను. యామునాచార్యుఁడు అపు డానందపరవశుఁడై కొంతతడవునకు "ఆహా! ఇట్టి పరమప్రాప్యవిషయమును విడిచి, ఇంతకాలమును క్షుద్రభోగముల యందు ఆసక్తుఁడనై కాలమును వ్యర్థపుచ్చితిని. బుద్ధికి మోసము వాటిల్లె" నని దుఃఖించి, విరక్తుఁడై పెద్దకుమారునకు రాజ్యమును అప్పగించి తాను సన్న్యసించెను.

ఇతఁడు రచించిన గ్రంథములు:—1 సిద్ధిత్రయము, 2 ఆగమప్రామాణ్యము, 3 పురుషనిర్ణయము, 4 చతుశ్లోకి, 5 గీతార్థసంగ్రహము, 6 స్తోత్రరత్నము, 7 మాయావాదఖండనము.

వీరిశిష్యులు:—

పెరియనంబి (మహాపూర్ణులు), తిరుకోట్టియూర్ నంబి (గోష్ఠిపూర్ణులు), పెరియతిరుమలనంబి (శ్రీశైలపూర్ణులు), తిరుకచ్చినంబి, (కాంచీపూర్ణులు), తిరు మాలై యాండాన్ (మాలాధరులు) మొదలగువారు కలరు. కొంతకాలమునకు తరువాత వీరు అయిదుగురు శ్రీభగవద్రామానుజులవారికి ఆచార్యులు అయిరి. వీరిలో పెరియనంబిగారు, ఆళవందారుఆజ్ఞచొప్పున శ్రీరామానుజులవారికి పంచ సంస్కారమును ప్రసాదించిరి.

ఇట్లు శిష్యపరంపరతో సిద్ధాంతప్రవచనము చేయుచు ఆళవందారు శ్రీరం గమునందు వేంచేసియుండఁగా, నొకనాఁడు మణక్కాల్‌నంబి (శ్రీరామమిశ్రుఁడు) వచ్చి "మీ తాతయగు నాథముని తనశిష్యులలో ముఖ్యుఁడయిన "కురుగై కావ లప్పన్" అను వైష్ణవునకు యోగము నుపదేశించి "దీనిని మాపౌత్రుఁడు అగు యామునేయునకు ఉపదేశింపు" మని ఆజ్ఞయిచ్చెను. కాఁబట్టి మీరు ఇపుడు ఆస్వామి సన్నిధికిఁ బోయి, మీ తాత ఆజ్ఞానుసారముగా ఆ యోగమును ఉపదేశము పొంది రండు" అని చెప్పెను. ఆళవందారు అందులకు సమ్మతించి, కురుగై కావలప్పన్ యోగాభ్యాసము చేయుచున్న స్థలమునకు వెళ్లి, వారితో తమ అభిప్రాయమును తెలుపఁగా ఆతఁడు "మీరు నానిర్యాణదినమునాఁటికి సరిగా నాయొద్దకు వచ్చితిరేని నేను దానిని మీకు ఉపదేశించెద" నని ప్రతిజ్ఞ చేసి, తననిర్యాణతిథి యెప్పుడు సంభవించునో ఆకాలము ఒకపత్రమువీఁద వ్రాసి, ఆళవందారుచేతికి ఇచ్చెను.

అందులకు ఆళవందారు సంతోషించి, మరల శ్రీరంగమునకు వచ్చెను. కొంతకాలము గడచిన తరువాత యామునాచార్యుడు కురుగైకావలప్పన్ చెప్పిన గడువు జ్ఞాపకమునకు తెచ్చికొని పత్రికను విప్పిచూడఁగా ఆతఁడు పరమపదించుదినము నాఁడే అయ్యెను. అగుటచే యామునాచార్యుఁడు అంతదూరము పోవుటకు అవకాశము లేకపోవుటచే చేయునది లేక ఊరకుండెను. నాఁటినుండియే విశిష్టాద్వైతసిద్ధాంతమునకు యోగాభ్యాసము నివారింపఁబడె నని యొకసాంప్రదాయము కలదు. యామునాచార్యుఁడు ఈలోకమున నూటయిరువదిసంవత్సరములు వేంచేసియుండి, అవసానమున పరమపదము నలంకరించెను.

ఇతని కాలమునందే శ్రీమన్నారాయణుని ఆజ్ఞచొప్పున శ్రీఅనంతాళ్వాను విశిష్టాద్వైతసిద్ధాంతనిర్వాహమునకు రామానుజుఁడయి అవతరించెను.

**తిరునక్షత్రపుతనియః—శ్లో. శుచౌ మాస్యుత్తరాషాఢా జాతం యామునదేశికం,**
**శ్రీరామమిశ్రచరణసరోజాశ్రిత మాశ్రయే.**
**నిత్యతనియః—యత్పదాంభోరుహధ్యానవిధ్వస్తాశేషకల్మషః,**
**వస్తుతాముపయాతో౽హం యామునేయం నమామ్యహమ్.**

---

## 124. ఇళైయాళ్వారు

(శ్రీభగవద్రామానుజాచార్యులు)

**శ్లో. "యో నిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,**
**అస్మద్గురోర్భగవతో౽స్య దయైకసింధో రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే."**

తూర్పుసముద్రమునకు పశ్చిమపుదిక్కున తుండీరమండలము అనుదేశము కలదు. ఆదేశమున భూతపురి (శ్రీపెరుంబూదూరు) అను నొకగ్రామము కలదు. అందు వేదవేదాంగములను చదివినవాఁడు - దేవబ్రాహ్మణపూజకుఁడు - మహాభాగవతోత్తముఁడు - హారీతగోత్రోత్పన్నుఁడు అగు ఆసూరి కేశవయజ్వ అను పేరుగల ఒక్క శ్రీవైష్ణవోత్తముఁడు నివసించుచుండెను. ఆతని భార్య పేరు కాంతిమతి. ఆదంపతులిద్దఱును చిరకాలము సంతానములేనివారై, పుత్రోత్పత్తికొఱకు ఎల్లపుడు భగవంతుని ప్రార్థించుచుండెడివారు.

ఆతఁడు ఒకపుడు చంద్రగ్రహణము రాఁగా భార్యతోఁ గూడి సముద్రస్నానమును కైరవిణిస్నానమును జేసి, పార్థసారథిస్వామిని సేవించి, పుత్రులకొఱకు పార్థసారథి నుద్దేశించి పుత్రకామేష్టి చేసెను. అంతట పార్థసారథి ప్రసన్నుఁడై స్వప్నమందు సేవసాధించి, "నేను నీకు పుత్రుఁడనై పుట్టఁగల" నని అభయ మొసంగెను

ఇట్లు పార్థసారథివలన వరమును బొంది, సంతసించి తన భార్యతోఁగూడ కేశవయజ్వ స్వగ్రామము చేరెను. పిమ్మట కొన్నిదినములు గడచినతరువాత కాంతిమతి గర్భము ధరించి, పదిమాసములుమోసి, అదితి వామనమూర్తినిఁ గన్నట్లు, కౌసల్య శ్రీరామ చంద్రుని కన్నట్లు, పింగళసంవత్సర చైత్రశుక్లపంచమినాఁడు ఆర్ద్రానక్షత్రయుక్త కర్కాటకలగ్నమున కోటిసూర్యప్రకాశమానుఁడగు నొక పుత్రునిఁ గనియెను. "అనంతః ప్రథమం రూపం లక్ష్మణశ్చ తతః పరం, బలభద్రస్తృతీయస్తు కలౌ కశ్చి ద్భవిష్యతి" అన్నట్లు, మొదట శ్రీవైకుంఠమందు అనంతులుగా వేంచేసియున్న వారే లక్ష్మణస్వామి అయి జనించిరి. తరువాత ద్వాపరమందు ఆయనే బలరాములై పుట్టిరి. వారే కలియుగమందు ఎవ్వరో అయి పుట్టఁగలరని రామానుజావతారము పురాణములయందు సూచింపఁబడినది. ఇదిగాక నమ్మాళ్వారుగూడ తిరువాయి మొళిలో—

"పొలిగ పొలిగ పొలిగ పోయిత్తు వల్లుయిర్ చాపమ్, నలియు నగరముం నైందనమనుక్కింగియా దొన్రు మిల్లై, కలియుం కెడుం కడుంకొళ్లిన్ కడల్వణ్ణన్ పూతంగళ్ మణ్మేల్, మలియప్పుగుందిశై పాడి యాడి యుళితరక్కండోమ్."

(5 పది 2 తిరువాయిమొళి.)

"మంగళాశాసనము, మంగళాశాసనము, మంగళాశాసనము. సకలాత్మల పాపము పోయినది. నరకముకూడ నశించును. యమునకు ఈలోకమందు అవకా శములేదు. కలియుగముకూడ నశించును. సముద్రవర్ణుని భూతములు భూమిమీఁద సమృద్ధిగాఁ బ్రవేశించి అంతటను తిరుగుచు ఆడుట, పాడుట, చూచినారము" అను పాశురమునందు శ్రీరామానుజావతారము సూచనచేసెను.

ఇట్లు ఉదయించిన ఆకుమారునిఁ జూచి తలిదండ్రులు మిక్కిలి ఆనందించిరి. సత్పురుషులు అతిహర్షము నొందిరి. అపుడు కాంతిమతి సోదరుఁడగు శ్రీశైల పూర్ణార్యుఁడు (పెదియతిరుమలనంబి) మేనల్లుఁడు పుట్టె నను శుభవర్తమానమును విని మహానందముతో భూతపురికి వచ్చి తేజోరాశియగు ఆశిశువును వీక్షించి, నిత్య సూరులలో నొకఁడు ఇట్లు పుట్టె నని నిశ్చయించెను. పండ్రెండవరోజున కేశవయజ్వ బంధువుల నందఱను రావించి, బారసాల మహావైభవముగా చేసి, పెరియతిరుమల నంబిచే చక్రాంకితము చేయించి, 'రామానుజుఁడు' అని నామకరణము చేసెను. శిశు వును జూచినవారు అందఱును ఇతఁడు శేషుఁడా, సైన్యనాథుఁడా యని ఊహిం చిరి. కాలక్రమమున పిల్లవానికి అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము చేసి, కేశవయజ్వ తాను స్వయముగా వేదముఁనుపదేశింపఁ దొడఁగెను. మఱియు రామా నుజుఁడు స్వల్పకాలమునందే వేద వేదాంగములను జదువఁగా కేశవయజ్వ అతనికి

సమావర్తనవ్రతము చేయించి, పదునాఱవయేట వివాహము చేసి, మఱికొంతకాల మునకు విష్ణుసాయుజ్యము నొందెను. అంతట రామానుజముని పితృశోకమును జ్ఞానముచే మఱలించి, పితృకార్యమును శ్రద్ధతో నెఱవేర్చి, ఆగ్రామమునందే కొంత కాలము భార్యతోఁ గూడ నివసించియుండెను. అంతట సర్వశాస్త్రములను జదివి లోకోత్తరపాండిత్యమును సంపాదింపవలయు నని అభిలాషగలవాఁడై ఆతఁడు, యాదవప్రకాశుఁడు అను నొక మహాపండితుఁడు కాంచీపురమున ఉన్నాఁడు అని జనులవలన విని, అతనివద్ద శాస్త్రాధ్యయనము చేయుటకు భార్యతోఁగూడ కాంచీ పురమునకుఁ బోయి అచట నివసించెను. నాఁటినుండియు ప్రతిదినము రామాను జుఁడు యాదవప్రకాశుని దగ్గఱకుఁ బోయి శాస్త్రము చదువుచుండెను. యాదవ ప్రకాశుఁడు 'ఈతఁడు అనంతుఁడు' అని నిశ్చయించెను.

ఆకాలమున రామానుజుని పినతల్లి కుమారుఁడు అగు గోవిందభట్టరు గూడ శాస్త్రాధ్యయనము చేయుటకు యాదవప్రకాశునిచెంతకుఁ బోయెను.

ఒకనాఁడు యాదవప్రకాశుఁడు "తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అను ఛాందోగ్యశ్రుతిలో కప్యాసం అను పదమునకు మర్కటపృష్ఠము అని అర్థము చెప్పి, సర్వేశ్వరుని నేత్రములు ఆతీరున నుండు నని సమర్థించెను. అపుడు యాదవప్రకాశునకు తలయంటుచున్న రామానుజుఁడు కేవలము అనుచిత మైన ఆయర్థమును విని, మిక్కిలి పరితాపము నొంది, కన్నీరు విడువఁగా వెచ్చని కన్నీటిచినుకు ఒకటి యాదవప్రకాశుని తొడమీఁదఁ బడి చురుక్కుమనెను. అంతట నాతఁడు ముఖము ఎత్తి తత్తఱముతోఁ జూచి "నీకన్నులనుండి ఇట్లేల వేఁడినీటి బిందువులు ఉరలె" నని ప్రశ్నించెను. అందులకు రామానుజుఁడు "భగవద్విషయిక మైన శ్రుతికి సరసమైన అర్థమును విడిచి, ఇట్లు మిక్కిలి అసందర్భమగు అర్థమును చెప్పుట అపచారమని నామనస్సులో శోకము కలుగుటవలన కన్నీరు జాఱె" నని బదులు చెప్పెను. దానిమీఁద "ఈశ్రుతికి నీవు ఎట్లు అర్థము చెప్పెద" వని గురువు అడిగెను.

1 "కం జలం పిబతీతి కపిః=ఆదిత్యః, తేన అస్యతే=వికాస్యతే ఇతి కప్యాసమ్. కపి అనఁగా జలమును త్రాగువాఁడు సూర్యుఁడు; ఆతనిచే వికసింపఁజేయఁబడినది.

2. "కం=జలం, పిబతీతి కపిః = నాళం; తస్మిన్ ఆస్తె ఇతి కప్యాసమ్." "నాళ ముతోఁ గూడినది" కోసివేయఁబడినను నాళముతోఁ గూడిన పద్మమునకు శోభ హెచ్చుగా నుండును.

3. "కం=జలం; అసభువి అపివూర్వకః ఉదకమందు ఉన్నది."

ఈమూఁడు విధములైన వ్యుత్పత్తులను బట్టి తేలిన అర్థ మేమనఁగా?

"గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళరవికరవికసితపుండరీకదళామలాయతేక్షణః" 'లోఁతైన నీటిలో పుట్టినదియు మంచికాఁడతోఁ గూడినదియు, సూర్యకిరణములచే వికసింపఁజేయఁబడినదియు అగు తెల్లతామరపుష్పముయొక్క రేకులవలె విశాలములైన నేత్రములు గలవాఁడు' అని రామానుజుఁడు అర్థము చెప్పఁగా విని, యాదవప్రకాశుఁడు తానుచెప్పిన అర్థముకంటె నిది సరసముగా నుండుటవలన అతి మాత్సర్యము కలవాఁడై కోపించి, "నేను చెప్పిన అర్థమును నీవు ఒప్పుకొనలేదు; కావున నేను చెప్పు చదువుమాత్రము నీకెట్లు పనికివచ్చును? కావున నేఁటినుండి నీవు చదువుకొనుటకు నావద్దకు రానక్కఱలేదు. పొమ్ము" అని పలికెను. రామానుజుఁడు అట్లే అతని యొద్దకు వెళ్లుట మానివేసెను.

కొన్నిదినములు కడచినపిదప యాదవప్రకాశుఁడు రామానుజుని ఎట్లయిన చంపవలయునని దుర్బుద్ధికలవాఁడై "నేను శిష్యులతోఁ గాశికిఁ బోవుటకు సిద్ధపడియున్నాను; కావున నీవు గూడ నావెంట రావలె" నని గోవిందభట్టరు ద్వారా రామానుజునకు వార్తనంపెను. అందులకు సమ్మతించి రామానుజుఁడు యాదవప్రకాశునితో బయలుదేఱి కాశికిఁ బోవుచుండఁగా, గోవిందభట్టరు ఈ కుట్ర యెఱిఁగినవాఁడు; గావున తన అన్నతో నీరహస్యమును దెలుపుటకు సమయము నిరీక్షింపసాగెను; అంతట వింధ్యాటవిలో ప్రవేశించునప్పుడు జలస్పర్శకై రామానుజుఁడు దూరముగాఁ బోవునపుడు గోవిందభట్టరు రహస్యమునంతను రహస్యముగాఁ జెప్పి, ఒక అడుగైనను ముందునకు రావలదని ఉపదేశించెను. అంతట ఇళైయాళ్వారు గురువు దురాలోచనమునకు చాల చింత నొంది, వింధ్యాటవిలో నొక చెట్టుక్రింద గూర్చుండి విచారింపసాగెను. ఆసమయమున ధనుర్ధరుఁడైన ఒక కొండవాఁడు భార్యతోఁ గూడ రాఁగా చూచి, రామానుజుఁడు కొంత కలఁత తేఱి "అయ్యా! మీరు ఎచ్చటనుండి వచ్చుచున్నారు? ఎచ్చటకుఁ బోయెదరు?" అడిగెను. అందులకు ఆతఁడు "ఉత్తరదేశమునందలి సిద్ధాశ్రమము నుండి బయలుదేఱి వచ్చుచున్నాము. కాంచికిఁ బోయెదము" అని బదులు చెప్పెను. "నేనును కాంచీపురమునకుఁ బోవలసియున్నది. నన్ను మీవెంట తీసికొని పొండు" అని ప్రార్థింపఁగా ఆభిల్లదంపతులు అంగీకరించి, రామానుజుని వెంటఁ బెట్టుకొని బయలుదేఱిరి. వారు వింధ్యారణ్యము దాఁటి కొంతతడవు పోయి, అలసిపోవుటవలన నిరాహారులై ఒకచెట్టుక్రింద పరుండిరి. అర్ధరాత్రమున ఆవ్యాధుని భార్య "దాహము అధికమగుచున్నది; కావున నీళ్లు తెచ్చి పెట్టు" మని భర్తను కోరెను. అది విని కొండవాఁడు "సమీపమునందే ఒక మంచినీళ్ల బావి యున్నది; కాని ఈచీకటిలో నేను అచ్చటకుఁ బోఁజాలను. తెల్లవాఱిన తర్వాత మంచి

నీళ్లు త్రాగవచ్చును. అంతవఱకును పండుకొమ్ము" అని బదులు చెప్పెను. రామానుజుడు ఆదంపతుల సంభాషణము విని 'అయ్యో! నాకు పరమోపకారులయిన వీరి విషయమున నేనిపుడు ఏమియు చేయలేకపోయితిని. ఈదేశపరిచయము లేకపోవుటచే నీళ్లు ఎక్కడ నున్నవో నాకు తెలియదు' అని మనస్సులో మిక్కిలి పరితాపము నొందుచుండఁగా నింతలో తెల్లవాఱెను. అపుడు కాల్యకృత్యములు తీర్చికొని రామానుజుఁడు తిరిగి ప్రయాణము చేయుటకు ఆదంపతులకొఱకు చూడఁగా వారు కానరారైరి. అపుడు రామానుజుఁడు మిక్కిలి ఆశ్చర్యపడి, మఱినాలుగు అడుగులు నడచిపోయి అచ్చట నొక నూయి, తోఁట, కొందఱు మనుష్యులు నుండుట చూచి, "ఈ యూరుపేరు ఏమి ?" అని అడిగెను. అందులకు ఆమనుష్యులు ఇది కాంచీపురము అని పలికిరి. అది విని రావణవధవార్త వినిన సీతవలె మిక్కిలి సంతోషించి, ఆవ్యాధదంపతులు వరదరాజస్వామియు, పెరుందేవి తాయారు నని నిశ్చయించి వారికి తనయందున్న అసాధారణ కటాక్షమునకు రామానుజుఁడు అతివ్యామోహమును చెందెను. రామానుజుఁడు, వ్యాధదంపతులు కనఁబడి అంతర్ధానమును పొందిన అభిప్రాయమును దెలిసికొని, ఆదినము మొదలు వరదరాజస్వామి తిరుమంజనార్థము ఆశాలకూపమునుండి తీర్థమును తీసి అనుదినము సమర్పించుచుండెను.

ఇట్లు యాదవప్రకాశుఁడు శిష్యసంఘముతో వింధ్యారణ్యమునుండి కదలి పోవుచు గోవిందభట్టరుని జూచి రామానుజుఁడు ఎక్కడనున్నాఁడని అడుగఁగా అతఁడు "నేను ఆతనినిఁ జూడలేదు" అని ప్రత్యుత్తరము చెప్పెను. అపుడు అతఁడు తనశిష్యులను నాలుగు దిక్కులకును పంపి వెదకించి ప్రయోజనము గానక "రామానుజుఁడు ఒంటరిరై పోయినాఁడు. ఈయడవిలో నాతనికి ఏమి కీడుమూఁడునో" యని దుఃఖము నభినయించి, కాశికిఁ బోయెను. ఒకనాఁడు గోవిందభట్టరు గంగలో స్నానము చేయుచుండఁగా యాదవప్రకాశుఁడు మాయపన్ని, ఆతని చేతిలో నొక లింగము పడునట్లుచేసెను. గోవిందభట్టరు అది చూచి ఆశ్చర్యపడి, ఇది యేమని చూపింపఁగా యాదవప్రకాశుఁడు "గంగాధరుఁడు నీయెడల విశేషకటాక్షమును చూపి తనంతట తాను నీచేతిలో ప్రవేశించెను; కాన నీవు శివభక్తుఁడవు కావలయు"నని చెప్పెను. అందులకు అతఁడు సమ్మతించి, శైవుఁడు ఆయెను. ఆతనిచేతిలో లింగము పడుటవలన యాదవప్రకాశుని శిష్యులు అందఱును ఆతనిని 'ఉళ్లంగై కొణర్ందనాయనార్' అని పిలువసాగిరి. యాదవప్రకాశుఁడు గంగాస్నానము చేయుచు కాశిలో కొంతకాలము నివసించి తన శిష్యపరివారముతో జగన్నాథము మొదలగు దివ్యదేశములను సేవించుకొనుచు కొలఁదిదినములలో స్వస్థలమగు కాంచీపురము చేరుకొనెను.

ఇంతలో ఉళ్లంగై కొణంర్ండపనాయనార్ 'ఈలింగమును ఉచితస్థలమున ప్రతిష్ఠచేసి వచ్చెద' నని యాదవప్రకాశునిచెంత సెలవుగైకొని మధురమంగలము అను స్వగ్రామము చేరి అచట నుండెడువిద్వాంసుల సభజేసి రావించి, తనచేతిలో పడిన లింగమును అచ్చట ప్రతిష్ఠ చేయించి మహాభక్తుఁడై యుండెను. ఇతని భక్తికి మెచ్చి కాళహస్తీశ్వరుఁడు ఒకరాత్రి స్వప్నమున సాక్షాత్కరించి 'నీవు నావద్దకు రావలయును' అని చెప్పెను. అంతట ఇతఁడు శివాజ్ఞచొప్పున కాళహస్తికిఁ బోఁగా అచ్చటి అధికారులు అందఱును ఇతనిని చాల గౌరవించి, ఆస్థలమునకు ధర్మకర్తగా నిర్ణయించి, మొహారుదస్కతులు ఇతని అధీనము చేసిరి.

అనంతరము యాదవప్రకాశుఁడు కాంచీపురమున రామానుజునిఁ జూచి ఆశ్చర్యచకితుఁడై "నీవు వింధ్యాటవిలో కానరాకపోవుటచే నీవిషయమున మఱేమియొకలాగున తలంచి శోకించితిని. దైవకృపచే నీవు మఱల నిచ్చట కనఁబడుటచే బ్రహ్మానందమైనది" అని పలికెను. అందులకు రామానుజుఁడు 'వింధ్యాటవిలో దారితప్పి తెన్ను గానక తహతహపడుచుండఁగా ఎవరో వ్యాధదంపతులు కాన్పించి నన్ను కాంచీపురసమీపమున విడిచిపెట్టి అదృశ్యులైరి.' అని బదులు చెప్పెను. గురువు 'ఇతని చరిత్ర లోకాతీతముగాఁ గాన్పించుచున్నది' అని అబ్బురపడి, మఱల యథాపూర్వముగా ఆతనికి పాఠములు చెప్పసాగెను.

ఈసమయమున ఇరువురు శ్రీవైష్ణవులు కాంచీపురమునుండి శ్రీరంగమునకుఁ బోయి రంగనాథుని సేవించి, ఆళవందారు సన్నిధికి వెళ్లి సేవింపఁగా "మీయూరవిశేషములు ఏమి?" యని యాతఁడు అడిగెను. అందులకు వైష్ణవులు ఇట్లు చెప్పిరి.

"శ్రీపెరుంబూదూరునుండి వచ్చి రామానుజుఁడు అను నతఁడు మా గ్రామనివాసియగు యాదవప్రకాశుఁడు అను ఏకదండిసన్యాసివద్ద కొంతకాలమునుండి వేదాంతశాస్త్రము చదువుచున్నాఁడు. ఒకనాఁటి పాఠమందు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతికి యాదవప్రకాశుఁడు "అసత్యజడ పరిచ్ఛిన్నములనుండి వ్యావృత్తము" అని అర్థము చెప్పఁగా, రామానుజుఁడు "గుణయోగము చెప్పవలసియుండఁగా నిట్లు వ్యావృత్తి చెప్పఁగూడునా? అని శంకించెను. గురుఁడు అందులకు అంగీకరింపక ధిక్కరించెను. మఱియొకనాఁడు "యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అను శ్రుతికి యాదవప్రకాశుఁడు కేవలానుచితార్థమును చెప్పఁగా, రామానుజుని కన్నులనుండి ఉష్ణమగు దుఃఖబాష్పబిందువు జాఱి గురువు తొడమీఁదఁ బడి చుఱుక్కు మనెను. అది చూచి గురుండు ఏమిని యడిగెను. శిష్యుఁడు "సద్యోవికసితమైన తామరపూవువలె నుండెడు పరమపురుషుని నేత్ర

ములు అని అర్థము చెప్పవలసియుండఁగా, మీరు అపార్థమును చెప్పుటవలన నాకు దుఃఖముకలిగె" నని చెప్పెను.

ఇట్లు సవిస్తరముగా ఆవైష్ణవులు చెప్పినది విని ఆళవందారు—

శ్లో. "అసంత ఏవాత్ర హి సంభవంతి హాసంతికాయామివ హవ్యవాహాః,
అత్రైవ సంతో యది సంభవంతి తత్రైవ లాభ స్సరసీరుహాణామ్."

"కుంపటిలో నిప్పు ఉన్నట్లు, ఈసంసారములో అసత్పురుషులు ఉండుట సహజము. ఒకానొకచో సత్పురుషులు పుట్టినయెడల కుంపటిలో తామరపూవు పుట్టినట్లు ఆశ్చర్యకరముగా నుండును."

అనినట్లు ఈయుగమందు ఇట్టిమహానుభావుఁడు అవతరించుట ఆశ్చర్య మని మిక్కిలి సంతోషించి, ఎట్లయిన వారి నొకమాఱు సేవించి రావలెనని ఆశతో సపరివారముగా కాంచీపురమునకుఁ బోయెను. అపుడు అచట నున్న తిరుక్కచ్చినంబి (శ్రీకాంచీపూర్ణుఁడు) మొదలగు శిష్యులు ఆళవందారును చాల గౌరవించి, వరదరాజస్వామి సన్నిధికిఁ గొనిపోయి శ్రీశఠగోపము, తిరుప్పరివట్టము, తీర్థము, ప్రసాదము నిప్పించి, సత్కరించిరి. ఆమఱునాఁడు ఆళవందారు కోవెలకు వచ్చి పేరరుళాళప్పెరుమాళ్లను (వరదరాజస్వామి) పెరుందేవితాయారును సేవించి కోవెలకు ప్రదక్షిణముగావచ్చుచు తనకెదురుగా విద్యార్థిసంఘముతో యాదవప్రకాశుఁడు వచ్చుచుండుటఁ గాంచి "వీరిలో శ్రీరామానుజుఁ డెవఁడు?" డని తిరుక్కచ్చినంబి నడిగెను. అపుడు అతఁడు "పుటముపెట్టిన బంగారువంటి దేహచ్ఛాయ, ప్రసన్న గంభీరమగు ముఖము, ఆకర్ణాంతవిశాలనేత్రములు, ఆజానుబాహువులును గలిగి యున్న యాతఁడే" అని వ్రేలితోఁ జూపి చెప్పెను. ఆళవందారు కన్నులనుండి ఆనందబాష్పములు కురియ, చాలసేపు నేత్రపర్వముగఁ జూచి "ఆముదల్వానివన్" ఈమహాపురుషుఁడు మనసిద్ధాంతమును ఉద్ధరింపఁగలవాఁడు అగుఁ గాక! యని సంకల్పించి—

శ్లో. "యస్య ప్రసాదకలయా బధిరశ్శృణోతి, పంగుః ప్రధావతి జవేన చ వక్తి మూకః,
అంధః ప్రపశ్యతి సుతం లభతే చ వంధ్యా, తం దేవ మేవ వరదం శరణాగతోఽస్మి."

అన్నట్లు 'ఓవరదా' భక్తులకు వరముల నిచ్చువాఁడవు; కావున మహానుభావుఁడగు రామానుజుని దర్శనప్రవర్తకుఁ డగునట్లు కటాక్షించి, అడియేనికి వరము కృపచేయుము' అని వరదరాజస్వామిసన్నిధిని ప్రపత్తిచేసి, శిష్యగణముతో తిరుగ శ్రీరంగమునకుఁ బోయెను.

మఱికొన్నిదినములు గడచిన తరువాత కాంచీపురమునేలు రాజు కొమార్తెను బ్రహ్మరాక్షసు పట్టుకొని పీడింపసాగెను. నానాదేశములనుండి పిలిపించు

బడిన మాంత్రికులు అనేకులు పిశాచమును వెడలఁగొట్టలేక మఱలిపోయిరి. రాజు యాదవప్రకాశుని ప్రార్థింపఁగా, నాతఁడు ఒక శిష్యుని 'నేను వదలిపొమ్మన్నా నని బ్రహ్మరక్షస్సుతోఁ జెప్పి రమ్ము' అని పంపెను. శిష్యుఁడు పోయి అట్లే చెప్పఁగా ఆపిశాచము "అతనిని నేనే పొమ్మన్నా నని చెప్పు" మనెను. ఆమాటలు విని యాదవప్రకాశుఁడు కోపము తెచ్చుకొని, స్వయముగా నచ్చటకుఁ బోయి ఉచ్చాటన మంత్రములను జదువ నారంభించెను. అంతట ఆ బ్రహ్మరక్షస్సు "నేను నీ మంత్రములకు భయపడువాఁడను కాను. నే నింతకంటె మహత్తరములగు మంత్రముల నెఱుఁగుదును. నీపూర్వజన్మవృత్తాంతమును గూడ నే నెఱుఁగుదును వినుము చెప్పెదను. నీవు పూర్వజన్మమందు మధురాంతకపు చెఱువువద్ద నున్న పుట్టలో ఉడుమవై ఉండువాఁడవు. ఒకప్పుడు కొందఱు శ్రీవైష్ణవులు శ్రీరంగమునుండి తిరుమలకుఁ బోవుచు మార్గవశమున అచట బసచేసి భగవత్ప్రసాదమును సాపడి భోజనపాత్రలను పరిహరింపఁగా నందుండు మెతుకులను భక్షించుటచే నీకిట్టి విద్వజ్జన్మము లభించినది. నేను వేదవేదాంగములను చదువుకొని బ్రాహ్మణులవంశమునందు జనించినవాఁడను. యాగముచేయుటలో సంభవించిన మంత్రలోపక్రియాలోపములవలన నాకు ఈ బ్రహ్మరక్షోజన్మము కలిగినది." అని చెప్పెను. 'మఱి నీవు ఎట్లు పోదువు' అని యాదవప్రకాశుఁడు అడుగఁగా 'నీ శిష్యులలో నొకఁడగు రామానుజుఁడు నాశిరముమీఁద పాదమునుంచి పొమ్మన్నచోఁ బోయెద' నని పిశాచము బదులు చెప్పెను. రామానుజుఁడు అట్లు చేయఁగా పిశాచము ఆతని తిరుపడిని కన్నుల నద్దుకొని మాఱు పలుకక తాను పోవుచున్నట్లు గుఱుతుగా రాజద్వారమున నున్న పెద్ద రావిచెట్లును విఱచి వేసి, రాజపుత్రికను విడిచి పెట్టి వెంటనే పోయెను. దీనివలన యాదవప్రకాశునకు రామానుజునిమీఁద నున్న అసూయామాత్సర్యములు నూఱింతలు పెరిగి పోయెను; కాని సంతోషమును బ్రకటించి అందఱియెదుటను రామానుజుని శ్లాఘించెను.

ఒకనాఁడు ఆళవందారు కాలక్షేపసమయమందు "ఇలింగ త్తిట్ట పురాణత్తీరుమ్" అను పాశురమునకు వ్యాఖ్యానమును సాధించుచు, "నా అనంతరము ఈ విశిష్టాద్వైతదర్శనమును నిర్వహించువారు ఎవ్వరో" అని విచారించిన అంతలో రామానుజుఁడు జ్ఞప్తికి వచ్చెను. అంతట నాతఁడు "ఆతనిని యాదవప్రకాశునివద్దనుండి విడఁదీసి మన పక్షమునకు త్రిప్పుకొను ఉపాయము ఎద్ది? నేను వరదుని సన్నిధిలో చేసిన ప్రపత్తి ఇంతవఱకును ఫలింపదయ్యెను" అని చింతించి, తిరిగి వరదుని ప్రార్థించెను.

అనంతరము యాదవప్రకాశుఁడు ఒకనాఁడు రామానుజునకు పాఠము చెప్పుచు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' "నేహ నానాస్తి కించన" అను శ్రుతులకు అద్వైత పరముగా జీవబ్రహ్మములకు ఐక్యము ప్రతిపాదింపఁగా రామానుజుఁడు ఆయర్థము నిరసించి విశిష్టాద్వైతపరముగా అర్థము చెప్పెను. అందులకు అతఁడు మిగుల కోపించి, "ఇటుమీఁద నీవు నావద్ద చదువుటకు రావలదు. నీబుద్ధికి తగిన ఉపాధ్యాయునిఁ జూచికొమ్ము" అని చెప్పెను. రామానుజుఁడు యాదవప్రకాశునివద్ద చదువు మానుకొని, తల్లిగారి ఆజ్ఞాప్రకారము తిరుక్కచ్చినంబి నాశ్రయించి,ఆతని నియమము వలన ఎప్పటియట్ల వరదరాజస్వామికి తిరుమంజనకైంకర్యము చేయుచుండెను.

పిదప రామానుజుఁడు యాదవప్రకాశునివద్ద చదువుమానివేసెనని విని యామునాచార్యుఁడు వరదరాజస్వామి సన్నిధిలో తాను చేసిన ప్రపత్తి ఫలించెనని సంతోషించి, పెరియనంబిని పిలిచి, "నీవు సాధించిన స్తోత్రరత్నమును రామానుజుఁడు వినునట్లు చేసి నీవద్దకు వచ్చునట్లు ప్రయత్నింపు" మని ఆజ్ఞాపించెను. పెరియనంబి యామునాచార్యుని ఆజ్ఞను శిరసావహించి కాంచీపురమునకుఁ బోయి రామానుజుఁడు వరదరాజస్వామికి తిరుమంజనము తెచ్చి సమర్పించెడి సమయమున స్వామి సన్నిధిని ఆస్తోత్రరత్నము ననుసంధించుచు,—

శ్లో. "స్వాభావికానవధికాతిశయేశితృత్వం నారాయణ త్వయి న మృష్యతి వైదికః కః,
బ్రహ్మా శివ శ్శతమఖః పరమ స్వరాడి త్యేతేఽపి యస్య మహిమార్ణవవిప్రుషస్తే."

అను శ్లోకమును చదివెను. రామానుజుఁడు దానిని విని, పరమాశ్చర్యము నొంది పెరియనంబి పాదములపైఁ బడి సాష్టాంగదండప్రణామములు సమర్పించి, "స్వామీ! ఈశ్లోకము సమర్పించిన మహానీయులు ఎవ్వరు ? వారిని దాసుఁడు సేవించుకొనుట యెట్లు సంభవించును?" అని పలికెను. పెరియనంబి, "ఈశ్లోకమును రచించినవారు శ్రీవైష్ణవదర్శనస్థాపకులగు ఆళవందారు. వారు శ్రీరంగమును వేంచేసియున్నారు. వారు ఇపుడు మీరు నావెంట శ్రీరంగమునకు వచ్చిన యెడల వారి దర్శనము మీకు లభించును" అని చెప్పెను. వెంటనే రామానుజుఁడు మహాసంతోషముతో ఆళవందారును సేవించుటకు పెరియనంబివెంట శ్రీరంగమునకు బయలుదేఱెను. వీరిరువురును అతిశీఘ్రముగా శ్రీరంగమునకుఁ బోవుచుండఁగా మార్గములో కావేరినది యిసుక తిన్నెమీఁద వైష్ణవజనసంఘము కాన్పించెను. రామానుజుఁడు ఇదేమి అని యడుగఁగా, "ఆళవందారు నేఁటి ప్రాతఃకాలము తిరునాఁడు అలంకరించినారుఁ వారికి శ్రీవైష్ణవులు చరమసంస్కారము చేయఁబోవుచున్నా" రని చెప్పెను. అది విని రామానుజుఁడు "యామునాచార్యులు లీలావిభూతియందు ఉండఁగా సేవింపఁజాలక పోయితిని" అని మిక్కిలి

దుఃఖించి, వారి చరమదేహము నైన సేవించెద నని పెరియనంబితో దగ్గఱకు వెళ్లగా ఆతనికి కుడిచేతి మూఁడువ్రేళ్లు ముడుచుకొనియుండుట చూచి ఇదేమని అచ్చటి వారిని అడుగఁగా, వారు 'కారణ మేమో మాకుఁ దెలియదు. ఆళవందారు సజీవులు అయియున్నకాలమున నిట్లు లేదు. ఇందులకు కారణ మేమో మాకు తెలియదు' అని చెప్పిరి. అపుడు రామానుజుఁడు 'యామునాచార్యులవారు తమ తిరువుళ్లమందు ఏమో సంకల్పించుకొని ఇట్లు వ్రేళ్లు ముడుచుకొని యుండి రని నిశ్చయించి, వారి తిరువుళ్లమును బాగుగా నెఱిఁగిన శిష్యులను కొందఱ నడుగఁగా వారు శ్రీవిష్ణుపురాణమును రచించి లోకమునకు పరతత్త్వమును ప్రకాశింపఁజేసిన పరాశరులవారి తిరునామము యోగ్యులైన వారికి ఒకరికి ఉంచవలెననియు, వ్యాససూత్రములకు విశిష్టాద్వైతపరముగా భాష్యము రచింపవలయుననియు, నమ్మాళ్వారు పాడించిన తిరువాయిమొళ్ళికి వ్యాఖ్యానమును చేయవలయు ననియు తలుచుగా ఆచార్యులవారు మాతో ఆనతిచ్చుచుండెడివారు' అని చెప్పిరి. అపుడు రామానుజుఁడు 'ఆచార్యకృప పూర్ణముగా నున్నయెడల దాసుఁడు ఆమూఁడు పనులను తప్పక నెఱవేర్పఁగలఁడు' అని దృఢముగాఁ బలికెను. వెంటనే యామునాచార్యుని మూఁడు వ్రేళ్లును చక్కఁగా సాగి తొల్లిటివలె నుండెను. అది చూచి అక్కడనున్న శ్రీవైష్ణవులు అందఱును ఆశ్చర్యమునొంది 'ఇఁకమీఁద దేవరవారే దర్శనప్రవర్తకులు కాఁగల' రని రామానుజుని మంగళాశాసనము చేసిరి.

అనంతరము రామానుజుఁడు పెరియనంబికి దండముసమర్పించి ఆళవందారు సేవ తమకు దొరకునట్లు అనుగ్రహింపని శ్రీరంగనాథుని సేవింపకయే మఱల కాంచీపురమునకు వచ్చి తిరుక్కచ్చినంబితో ఈవృత్తాంతమంతయు విన్నవింపఁగా, నాతఁడు ఆచార్యవియోగమునకు అతిదుఃఖితుఁడై తిరువధ్యయనమును యథావిధిగా నాచరించెను. రామానుజుఁడు తిరుక్కచ్చినంబియెడల భక్తికలవాఁడై ఆతని తిరువడి నాశ్రయింపఁదలఁచి ఒకనాఁడు తనయింట నానావిధభక్ష్యములతో తళిహాచేయించి, ఆతనిని సాపాటునకు పిలిచెను. ఆతఁడు స్నానసంధ్యాద్యనుష్ఠానములు ఆచరించి, వరదరాజస్వామిసన్నిధికిఁ బోయి తీర్థశఠగోపములను స్వీకరించి, బయలుదేఱెను. రామానుజుఁడు మఱియొకమార్గమున ఆతనిం బిలువఁబోయెను. దారిలో నుభయులు కలియలేదు. ఇంతలో తిరుక్కచ్చినంబి రామానుజుని తిరుమాళిగకు వచ్చి సాపడి సన్నిధి కైంకర్యమునకు విలంబ మయ్యె నని శీఘ్రముగాఁ బోయెను. రామానుజుని భార్య ఆతఁడు సాపాటు చేసిన తళిహాను కఱ్ఱతో దూరముగా పరిహరించి, అచట గోమయముతో శుద్ధిచేసి, మఱల స్నానముచేయఁ బోయెను. ఇంతలో రామానుజుఁడు వచ్చి ఎందులకు స్నానముచేయఁబోవుచున్నావని

భార్య నడిగెను. తిరుక్కచ్చినంబి వచ్చి ఆరగించి వెళ్లెననియు, ఆతఁడు ఆరగించిన ఆకును కట్టెతో ఎత్తి పాఱవేసితి ననియు, శూద్రుని యెంగిలి శుద్ధి చేయుటచే మైల పడితిని; కావున స్నానము చేయుచున్నాననియు నామె చెప్పెను. అది విని రామానుజుఁడు తనకోరిక నెఱవేఱనందులకు మిక్కిలి పరితాపము నొంది భార్యమీఁద కోపించెను. ఆతఁడు భార్యను విడుచుటకు ఎంచిన మూఁడు నేరములలో నిది మొదటిది.

నాఁడు రామానుజుఁడు తిరుక్కచ్చినంబియింటికిఁ బోయి జరిగిన అపరాధమును క్షమింపు మని వేఁడుకొని, "స్వామీ! దాసునిమనస్సులో కొన్ని సంకల్పములు ఉన్నవి. అవి నెఱవేఱునట్లు అనుగ్రహింపు మని వరదునితో విన్నవించి, అందులకు ఆసర్వేశ్వరుఁడు ఆనతిచ్చు ప్రత్యుత్తరమును దాసునకు కటాక్షింపవలయు" నని ప్రార్థించెను. అందులకు అంగీకరించి తిరుక్కచ్చినంబి నాఁటిరాత్రి ఏకాంతసేవా సమయమందు గుణానుభవము చేసి ప్రార్థింపఁగా, వరదరాజస్వామి "నేనే పరతత్త్వము. భేదమే వాస్తవము. ప్రపత్తియే ఉపాయము. అంతిమస్మృతి అవసరము లేదు. దేహావసానమందు మోక్షము సిద్ధించును. పెరియనంబి శ్రీపాదము నాశ్రయింపుము. ఈ యాఱువార్తలను రామానుజునకు తెలియఁజేయుము" అని చెప్పెను. మఱునాఁడు స్వామి దివ్యసూక్తులను నంబి రామానుజునకుఁ దెలుపఁగా నాతఁడు మిక్కిలి ఆనందించెను.

అంతట శ్రీరంగమున నున్న ఆళవందారు శిష్యులగు వైష్ణవోత్తములందఱును దర్శనస్థాపనమునకు రామానుజుని శ్రీరంగమునకు తీసికొనిరావలయునని పెరియనంబిని ప్రార్థించిరి. ఆతఁడును కుటుంబసహితుఁడై మధురాంతక మను దివ్యస్థలమునకుఁ బోవునప్పటికి శ్రీరంగమునకే బయలుదేఱివచ్చుచున్న రామానుజుఁడు ఎదురుపడెను. రామానుజుఁడు వినయముతో 'స్వామీ! అపుడు ఇపుడు అనక దేవరవారు శ్రీఆళవందారు సన్నిధిలో గ్రహించిన పరమార్థమును దాసునకు అనుగ్రహింపవలయు' నని ప్రార్థింపఁగా, పెరియనంబి వల్లె యని అచ్చటికోవెలలో పంచసంస్కారములను జేసి, తిరుమంత్రమును ఉపదేశించెను. మఱునాఁడు ఇరువురును బయలుదేఱి కాంచీపురము ప్రవేశించిరి. అచ్చట పెరియనంబి రామానుజునియింటియందే ఉండి, ఆతనికి ద్రావిడవేదము బ్రహ్మసూత్రములు, రహస్యములు మొదలగునవి ఉపదేశింపసాగెను.

అట్లు కాలక్షేపము జరుగుచుండఁగా ఒకనాఁడు రామానుజుఁడు తనకుతల అంటిన వైష్ణవునకు చలిదిఅన్నము ఉన్నచో పెట్టుము అని భార్యకు ఆజ్ఞాపించెను. కాని ఆమె లేదని బదులు చెప్పెను. రామానుజుఁడు ఆమాటను విశ్వసింపక

చలిదికుండ ముట్టుకొని స్వయముగా చూడఁగా నందు ఇద్దఱుముగ్గురకు సరిపడు అన్నము ఉండెను. అక్కతన ఆతఁడు ఆమెకు ...... జూపి ఆవైష్ణవునకు స్వయముగా అన్నము పెట్టి నాఁటినుండి ఆమెమీఁద చాలకోపము వహించెను. ఆమెను విడుచుటకు ఇది రెండవకారణము. మఱియొకనాఁడు పెరియనంబిభార్యయు రామానుజునిభార్యయు నీళ్లు తోడుకొనుటలో నంబిభార్యనీళ్లు రామానుజుని భార్య తోడుబిందెమీఁద పడెను. అందులకు కోపించి రామానుజుని భార్య నంబి భార్యను కొట్టఁబోయెను. అది చూచి పెరియనంబి భార్యమీఁద చాల కోపపడి ఆమెను దీసికొని ఇంటిలోనివారికి ఎవ్వరికిని తెలియకుండ శ్రీరంగమునకు వెడలి పోయెను. పిదప రామానుజుఁడు స్నానసంధ్యావంద్యనుష్ఠానములు అన్నియుఁ దీర్చికొని, స్వాచార్యుని సేవించుటకు ఆతఁడు నివసించు భాగమునకుఁ బోయి వారచ్చట లేకపోవుట చూచి తనభార్యతోడి కలహమును భరింపలేక వారు వెడలిపోయినారని విని ఇది మూఁడవ అపరాధముగా గణించి, భార్యను బిలిచి, "నీవు నావిషయమున ముమ్మారు అపచారపడితివి. ఇఁక నీతో నాకు సహవాసము వలదు" అని తత్క్షణమే ఆమెను పుట్టినింటికి పంపివేసి, వరదరాజస్వామి సన్నిధికిఁ బోయి ఆస్వామినే ఆచార్యునిగా వరించి త్రిదండసన్న్యాసమును స్వీకరించెను. ఆతనికి వరదరాజ స్వామి "రామానుజముని" అని తిరునామమును కటాక్షించి, "ఇతనిని మధురలో ప్రవేశపెట్టిరమ్ము" అని తిరుక్కచ్చినంబికే ఆజ్ఞాపించెను.

అనంతరము రామానుజుఁడు "ఆళవందారు కృపవలన మనస్సంకల్పములు అన్నియు నెఱవేఱినవి. ఇటుపైని వారి ఆజ్ఞానుసారముగా మన విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రవర్తింపఁ జేయుటయే ముఖ్యమైనపని అయియున్నది. ఇందులకు సమర్థుఁడు అగు సహాధ్యాయుఁడు ఒకఁడు నాకు కావలెను. నాహితముఁ గోరువాఁడు, విరక్తుఁడు, శుద్ధమైన శాస్త్రజ్ఞానము కలవాఁడు నగు గోవిందభట్టరు నాకు ఇపుడు దొరకినయెడల నాకోరిక సిద్ధించును; కాని ఆతఁడు ఇపుడు అన్యమతమందు ప్రవేశించియున్నాఁడు. ఆతనిని మన మతములోనికి త్రిప్పి తీసికొని రాఁగలుగువారు ఎవరు ఉన్నారు?" అని తలంచి "ఈపనికి మహాపండితుఁడైన తిరుమలనంబి తగినవాఁడు" అని నిశ్చయించి, ఒక వైష్ణవునిచే ఆతనిని పిలిపించి, "స్వామీ! చెడిపోయిన గోవిందభట్టరును ఎట్లయిన దిద్ది దేవరవారి శ్రీపాదదాసునిగా చేసికొనవలయు" నని కోరెను.

కందాడై ముదలియాండాన్, కూరత్తాళ్వాన్ అను శ్రీవైష్ణవులు ఇద్దఱు రామానుజుఁడు యత్యాశ్రమమును స్వీకరించె నను వార్త విని అతి ప్రీతితో కాంచీపురమునకుఁ బోయి, రామానుజుని సేవించి "మాకు పంచసంస్కారములను

కృపచేయవలయును" అని ప్రార్థించిరి. అంతట రామానుజుఁడు వారి కోరిక నెఱ వేర్పఁగా- వారు కృతార్థులై, ఒకక్షణమైనను స్వాచార్యుఁడగు రామానుజుని విడు వక సర్వదా కైంకర్యము చేయుచు మధురయందే యుండిపోయిరి.

యాదవప్రకాశుని తల్లి సర్వకాలము వరదరాజస్వామిని సేవించుచుండుట వలనను తిరుక్కచ్చినంబికటాక్షమువలనను రామానుజునితో తఱచు మాట్లాడు చుండుటవలనను, శ్రీరామానుజముని సిద్ధాంతమునందు ప్రీతికలదియయి తన కుమారుఁడు గూడ ఈసిద్ధాంతము నవలంబించినయెడల కృతార్థుఁడు అగునని తలం చుచు హస్తిగిరిసోపానములు ఎక్కుచుండఁగా "అది మంచిది అది మంచిది" అను ఉపశ్రుతి వినఁబడెను. అంతట నామె కుమారునియొద్దకుఁ బోయి తన యభిప్రాయ మును, తాను విన్న ఉపశ్రుతిని తెలియఁజేసి, "నాయనా! నీవును రామానుజుల వారిపాదముల నాశ్రయించి, వారివలెనే శిఖాయజ్ఞోపవీతములను ధరించి త్రిదండ సన్యాసివి కమ్ము" అని నొక్కి చెప్పఁగా యాదవప్రకాశుఁడు లోఁగడ రామాను జుఁడు తనవద్ద చదువుచున్న కాలమున సమర్థించి చెప్పినఅర్థములు మనస్సున నాటియుండుటవలనను; వింధ్యారణ్యమందు అసహాయుఁడై యున్న అతనికి పెరుం దేవితో వరదరాజస్వామి కిరాతరూపమున సాక్షాత్కరించి అనుగ్రహించిన సమా చారమును వినియుండుటవలనను, బ్రహ్మరక్షస్సువలన ఆతని మహాత్మ్యమును, తన పూర్వజన్మవృత్తాంతమును వినియుండుట వలనను, తల్లిచెప్పిన మాటలయందు గురి కలవాఁడై 'తల్లీ! నీవు చెప్పినట్లు యతిరాజుల నాశ్రయించి, త్రిదండసన్యాస మును స్వీకరించుటకు ఇప్పుడు నాకున్న దోషమును పోఁగొట్టుకొనవలయును. ఆదోషము భూప్రదక్షిణము చేసినఁ గాని నివర్తింపదు. వార్ధకావస్థలో నున్న నేనిపుడు భూప్రదక్షిణమెట్లు చేయఁగలను?" అని విచారముతో నుడివెను. ఆరాత్రి పేరరుళాళప్పెరుమాళ్లు (వరదరాజస్వామి) ఆతనికి స్వప్నమందు సాక్షా త్కరించి 'ఒకసారి యతిరాజులకు ప్రదక్షిణము చేసినయెడల నీదోషములు అన్నియు తొలఁగిపోవును. వేఱుగ భూప్రదక్షిణము చేయనక్కఱలేదు' అని ఆజ్ఞ యిచ్చెను. ఆమాటలయందు విశ్వాసము లేక, ఆతఁడు 'వరదరాజస్వామి తిరువుళ్ల మెట్లున్నదో కనుఁగొను' మని తిరుక్కచ్చినంబిని ప్రార్థించెను. నంబి, యాదవప్రకా శుని విన్నపమును స్వామిసన్నిధిలో విన్నవించెను. అందులకు పెరుమాళ్లు తాను తొలిదినమున స్వప్నమున కనఁబడి నియమించినవిషయమును మఱల ఆనతిచ్చెను. మఱునాఁడు తిరుక్కచ్చినంబి ఆవిషయము యాదవప్రకాశునకు తెలియఁజేసెను. అంతట నాతఁడు ఇది వరదుని ఆజ్ఞయే- యని నమ్మకము గలవాఁడై రామానుజుని సన్నిధికిఁ బోయి ఆతనిచరణారవిందములకు సాష్టాంగదండప్రణామములు సమర్పించి

తాను కన్నకలను తిరుక్కచ్చినంబి ఆనతిచ్చినవిషయమును విన్నవించి, ప్రదక్షిణము చేసి అనుగ్రహపాత్రుఁడై శిఖాయజ్ఞోపవీతములను పరిగ్రహించి త్రిదండసన్న్యాసి అయ్యెను. అప్పుడు యతిరాజు ఆతనికి 'గోవిందజియ్యరు' అని పేరు పెట్టి పంచ సంస్కారములచే పరిశుద్ధినొందించి ఆతఁడు రచించిన 'యతి ధర్మసముచ్చయ' మను గ్రంథమును కటాక్షించెను. ఇట్లు కృతార్థుఁడైన గోవిందజియ్యరు కొంతకాలము భగవద్గుణానుభవముచేయుచు ఆచార్యసన్నిధిలో నివసించియుండి అనంతరము పరమపదమును బొందెను.

ఇట్లు యతిరాజు కాంచీపురమందు వేంచేసియుండఁగా రంగనాథుఁడు ఆతనిని తనసన్నిధికి రప్పించుకొనఁదలఁచి వరదరాజస్వామికి ఒక శ్రీముఖము నంపెను. అందులకు వరదరాజస్వామి 'ప్రియవస్తువునందు అపేక్ష యెల్లవారికి తుల్యముగా నుండును; గావున మేమును మావలెనే రామానుజుని విడువలేము' అని ప్రత్యుత్తరము నంపెను. రంగనాథుని సన్నిధియందు వేంచేసియుండు పెద్దలందఱును ఎట్లయిన యతిరాజును శ్రీరంగమునకు తీసికొనిరావలయు నని నిశ్చయించుకొని ఆలోచించి గానవిద్యావిశారదుఁడగు తిరువరంగప్పెరుమాళరయరు ఇందులకు తగినవాఁడని ఎంచి ఆతనిం బిలిచి 'కాంచీపురమునకుఁ బోయి వరదుని సన్నిధియందు గానవిద్యానైపుణ్యమును జూపి యతిరాజు నిచ్చటకుఁ గొనిరావలయు' నని బోధించి పంపిరి. ఆతఁడును మంచిదని కాంచికిఁ బోయి వరదుని సేవించి దేవగానముతో పాడనారంభించెను. ఆగానరసమునకు వరదుఁడు మిక్కిలి లోలుఁడై సంతోషించి 'నీగానమునకు మెచ్చితిని. నీకేమి కావలసినను ఇచ్చెదను' అని పలికెను. అరయరు 'రామానుజులవారిని నాతో శ్రీరంగమునకుఁ బంపవలయు' నని కోరెను. వరదుఁడు మాట తప్పలేక అందులకు అంగీకరించెను.

పిదప రామానుజుఁడు అరయరుతో తనసన్నిధికి వచ్చుచున్నాఁడని విని రంగనాథుఁడు పెరియనంబి మున్నగువారిని ఎదురుపంపి మహావైభవముతో స్వాగతము ఇప్పించెను. అపుడు యతిరాజు పరమానందభరితుఁడై రంగనాథుని సేవించి తిరుప్పతియట్టము శ్రీశఠకోపము మొదలగు మర్యాదలను పొంది అదిమొదలుకొని రంగనాథుని ఆజ్ఞాప్రకారము దేవాలయాధికారమును వహించి ఏలోపమును లేకుండ శ్రద్ధతో కైంకర్యము చేయసాగెను.

ఒకపుడు దేశాటనము చేయుచు అక్కడక్కడనుండి పండితులను వాదమున జయించుచు గొప్పప్రతిష్ఠ వహించిన (కాండూరు) యజ్ఞమూర్తి అను ఏకదండసన్న్యాసియొకఁడు శ్రీరంగమునకు వచ్చి రామానుజునితో వాదించి పరాజితుఁడై శిఖాయజ్ఞోపవీతములను ధరించి త్రిదండసన్న్యాసమును స్వీకరించి రామానుజపాదములన

పంచసంస్కారములను పొంది సకల సంప్రదాయగ్రంథములను చదివి రామానుజుని శిష్యులలో గొప్పవాఁడు అయ్యెను. అతనికి "పేరరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్" అని పేరు వచ్చెను.

పిదప రామానుజుఁడు సకల దివ్యదేశములయందును వేంచేసియున్న పెరుమాళ్లకు మంగళాశాసనములుచేసి బౌద్ధక్షపణక జైనాదిమతస్థులను వాదమందు జయించి స్వమతమును విస్తరింపఁజేసిరి. వీరి ముఖ్యశిష్యుఁడు కూరత్తాళ్వాఁ. రామానుజుఁడు ఈశిష్యుఁడు సన్నిధినుండి ప్రాయఁగా బ్రహ్మసూత్రములను శ్రీభాష్యమును రచించెను. వేదాంతసారము, వేదాంతదీపము, వేదార్థసంగ్రహము, శ్రీరంగగద్యము, వైకుంఠగద్యము, శరణాగతిగద్యము, ఎనుబదిరెండు వార్తలు అనునవి ఇతని తక్కినగ్రంథములు రామానుజుఁడు మతమును ప్రవర్తింపఁజేయుటకు మహాపండితు లయిన డెబ్బది నలుగురను సింహాసనాధిపతులనుగా ఏర్పఱచెను.

కొసకు చేయవలసిన ఏర్పాటులు అన్నియు చేసి, శిష్యులకు చెప్పవలసిన బుద్ధులు చెప్పి, శ్రీరంగనాథుని సన్నిధికిఁ బోయి సేవించుకొని తనకు నిత్యవిభూతివాసము కటాక్షింపు మని ప్రార్థించి పింగళసంవత్సర మాఘశుక్ల దశమినాఁడు శ్రీరామానుజుఁడు వైకుంఠధామమునకు వేంచేసెను.

ఈయన లీలావిభూతియందు ఉన్న కాలము నూటయిరువది సంవత్సరములు.

---

# పాండురంగక్షేత్రమాహాత్మ్యము

**శ్లో. "సంసారవృక్షమఘబీజమనంతకర్మ శాఖాయుతం కరణపత్రమనంగపుష్పం,**
**ఆరుహ్య దుఃఖజలధౌ పతితో దయాళో లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం."**
**(9. శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము.)**

శౌనకాదిమహర్షులు నిఖలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డగు సూతునిం గాంచి "మహాత్మా! క్షేత్రము, తీర్థము, దైవతమును జేరినప్రదేశము ఏది?" అని యడిగిరి. "ఈయర్థమును దొల్లి పరమేశ్వరుఁడు కుమారస్వామికి ఎఱింగించెను. దానిని వేదవ్యాసమహామునీంద్రుఁడు నాకుఁ దెలిపెను. నేను మీకుఁ దెలిపెదను" అని సూతుఁడు వారికి ఇట్లు చెప్పఁదొడఁగెను.

పూర్వము ఒకప్పుడు అగస్త్యాదిమహామునీంద్రులును, కుమారస్వామి మున్నగువారును, తీర్థక్షేత్రమూర్తులుగల ప్రదేశమును దెలుపవలయునని పరమేశ్వరునిఁ గోరిరి. ఈవిషయమునే మున్నొకపుడు పార్వతిఁ గూడ నడిగియుండెను. అపుడు పరమేశ్వరుఁడు అందఱును వినుచుండ నిట్లు చెప్పెను. భీమరథీనదికి దక్షిణదిగ్భాగమున పాండురంగక్షేత్రము గలదు. అందు సకలసుగుణములకు నాలవాల

మగు పుండరీకుఁడు అనునొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు సంపన్నుఁ డయ్యు వైభవములను ఆసింపఁడు; ఐహికసౌఖ్యములనిన కంటగించుకొనును. అంతటి విరాగి, అంతటిచిత్తశుద్ధిగల మహాత్ముఁడు మఱియొకఁడు ఎందును ఉండఁబోఁడు. అతని భార్యయు భర్తవలెనే సుగుణమణిగణభూషితురాలు. అన్నివిధముల నామె పుండరీకునకుఁ దగిన యిల్లాలు.

ఇంటఁ బరిచారకు లెందఱు ఉండినను పుండరీకుఁడు తలిదండ్రులకు స్వయముగ సకలోపచారములు చేయును. అతిథులను బూజించును. భగవద్భాగవతారాధనము గావించి తలిదండ్రులకు భోజనంబిడి, ఇంకను గౌరవింపవలసినవారు అందఱు నైనతరువాత నాతఁడు భుజించును. ఆతనిభోజనమైనఁగాని ఆతని భార్య ఎన్నఁడును భుజించి యెఱుఁగదు.

ఇట్లు కొన్నిదినములు జరుగునప్పటికి పుండరీకుని తలిదండ్రులు పరమపద మలంకరించిరి. పుండరీకుఁడు వారికిఁ జేయవలసిన యౌర్ధ్వదైహిక క్రియల నన్నిటిని ముగించి కొన్నిదినములకు సంతానము గాంచి ఏమిటను లోపము లేదని జనులు కొనియాడుచుండ ఈశ్వరకారుణ్యము నపేక్షించి యొకచోఁ బర్ణశాల నిర్మించుకొని పత్నితోఁ గూడ నందు వసించి తపస్సమాధినిష్ఠాగరిష్ఠుఁ డయ్యెను. కొన్నిదినములకు శ్రీహరి యాతని భక్తిజ్ఞానవైరాగ్యములకు ఆనందించి కటివిన్యస్తహస్తుఁడై సాక్షాత్కరించి "వత్సా! నీచిత్తశుద్ధికి మెచ్చితిని. నీకు ఏమి వరము కావలయునో కోరుకొనుము" అని చెప్పెను. అందులకు పుండరీకుఁడు ఆనందకందళితహృదయారవిందుఁడై, "శ్రీహరీ! నేను అజ్ఞుఁడను. నీవు సకలమును దెలిసినవాఁడవు. నీమాహాత్మ్యము, నీలీలలు, బ్రహ్మాదులకుఁ గూడఁ దెలియునవి కావు. అట్టిచో నిన్ను నుతించుటకు నేనెంతటివాఁడను? దేవతలకుఁ గూడ దుర్లభదర్శనుఁడ వగు నీవు సాక్షాత్కరించుటకంటె నాకిఁకఁ గావలసిన దేమున్నది? అయినను నీవు కోరుకొనుమంటివి; కావున వినుము. నీవిపుడు నాకు ఎట్టిరూపముతో నిచ్చట సాక్షాత్కరించితివో ఆరూపముతోడనే ఇచ్చట నుండి ఈప్రదేశమును తీర్థక్షేత్రమూర్తులుగలదానినిగాఁజేసి అనుగ్రహింపుము" అని కోరెను. శ్రీహరి కేవలము నిష్కామమునకు పరమావధియగు ఈవరమునకుఁ బరమానందభరితుఁడై "ఇది పండరిపురము అను నామాంతరముతో నీపేర పాండురంగక్షేత్రము అని ప్రసిద్ధి వహించును. నిన్ను అనుగ్రహించిన నేను పాండురంగఁడను పేరుతో నిచ్చట నిట్లే పశ్చిమాభిముఖుఁడనై యుందును. ఈభీమరథీనది తీర్థరాజమై వెలయును. ఈతీరున నిది తీర్థము, క్షేత్రము, దైవతమును గల దివ్యస్థలమై యొప్పారును" అని యానతిచ్చెను. పుండరీకుని ప్రార్థనము చొప్పున నచ్చట వెలసిన పాండు

రంగఁడు ప్రాతఃకాలమున నెఱ్ఱనివాఁడును, మధ్యాహ్నమున తెల్లనివాఁడును, సాయాహ్నమున నల్లనివాఁడునై త్రిమూర్తిస్వరూపుఁడై తేజరిల్లుచుండును. ఆత్రిమూర్తిస్వరూపుని మహర్షులు పూజించుచుందురు. అచ్చట వేంచేసియున్న పాండురంగని షోడశోపచారములతో నర్చించువారికి సకలైశ్వర్యములును, అవసానమున మోక్షమును గలుగును; కాని ప్రథమమున తీర్థమూర్తిని దర్శించి సేవింపనివారికి ఏఫలమును గలుగదు. పద్మతీర్థతీరమున అశ్వత్థరూపులై వెలయు నరనారాయణు లను దేవతలు సర్వకాలములయందును అర్చించుచుందురు; కాన ఆ పావనవృక్షములను గూడఁ బూజింపవలయును. అచ్చటఁ గుండలతీర్థము గలదు. అందు అవగాహనము చేయువారు సకలపాపములనుండియు విముక్తు లగుదురు. ఆక్షేత్రమున భీమానది గలదు. అందు నృసింహతీర్థము గలదు. అచ్చట నృసింహమూర్తి ముప్పదిరెండుకరములతో వెలసియున్నాఁడు; కావున దానికి ఆపేరు వచ్చినది. అచ్చటనే అగస్త్యతీర్థము గలదు. మఱియు గణపతితీర్థము, కౌమోదకీతీర్థము, కలశతీర్థము, సోమతీర్థము, బ్రహ్మతీర్థము, చక్రతీర్థము మున్నగు దివ్యతీర్థము లచ్చట నవేకములు గలవు. వానియందు స్నానము చేయువారిపాపములు అన్నియు పంచబంగాళమై పోవును. మఱియు తమ పితృదేవతలకును దమకును గూడ మోక్షము సిద్ధించును.

తొల్లి నిగమశర్మ యను నొకబ్రాహ్మణుఁడు పీఠికాపురమున వేశ్యాలంపటుఁడై సంచరించుచుండెను. కొన్నిదినములకు వారకాంతలు ఆతని ధనమంతయుఁ దోఁచుకొని లక్షాధికారి యగువానిని భిక్షాధికారినిఁ జేసిరి. అయినను ఆతఁడు వేశ్యలను విడువఁజాలక దొంగతనముచేసి ధనము తెచ్చి వాండ్రతోఁ గ్రీడించుచుండెను. కొంతకాలమునకు అదియు సాగకపోవుటచే తుదకు కట్టెలు అమ్ముకొని జీవింపసాగెను.

కొంతకాలమైనతరువాత నిగమశర్మ అచ్చటకు కొలఁదిదూరముననున్న తన అక్కయింటికిఁ బోయెను. ఆతఁడు వేశ్యాలంపటుఁడైన పిదప భార్యను విడిచిపెట్టఁగా, ఆమె ఆడుపడుచు నింటికి వచ్చి తలదాఁచుకొనెను. ఆతని తలిదండ్రులు గూడ కొమార్త యింటికిఁ జేరుకొనిరి. అట్లు నిర్భాగ్యుఁడై వచ్చిన నిగమశర్మను సోదరి చాల నాదరించి అభ్యంగనము చేయించి అందఱ పంక్తిని షడ్రసోపేతమగు అన్నము నిడి భోజన మైన తరువాత రహస్యస్థలమునకుఁ గొనిపోయి బుద్ధిచెప్పి జాగ్రత్తగ మసలు కొమ్ము అని చెప్పెను. ఆమె యాజ్ఞాప్రకారము ఆతఁడు అచ్చట తలిదండ్రులను సేవించుచు భార్యను సంతోషపఱుచుచు బావమఱఁదికి చేదోడు వాదోడుగా నుండెను.

కొలఁదిదినములు జరుగునప్పటికి ఆతని మనస్సు మఱల పీఠికాపురమునం దలి వారకాంతలమీఁదికిఁ బోయెను. తోడనే యాతఁడు ఒకనాఁటిరాత్రి సోదరి నగల నన్నిటిని హరించి పాఱిపోయెను; కాని మార్గమధ్యమున కొందఱు చోరులు అడ్డుపడి ధనమంతయు దోఁచుకొని ఆతనిని మొత్తగ మర్దించి తమ మార్గమునఁ బోయిరి. ఆతఁడు లేచుటకైన శక్తిలేక పడియుండఁగా నొక కర్షకుఁడు పొలము నకుఁ బోవుచు నాతనిం గాంచి కనికరించి తన యింటికిఁ గొనిపోయి అన్నవస్త్రా దులు ఇచ్చి ఆదరింపసాగెను. కర్షకుఁడు కర్షకపత్నియుఁ జేయు సేవలవలన నిగమ శర్మ కొలఁదిదినములయందేఁ దేరికొనెను. మఱలఁ దొల్లిటివలె స్ఫురద్రూపి యయ్యెను. తోడనే కర్షకపత్నికి ఆతనియెడల మోహోదయం బయ్యెను. అది యెఱింగి నిగమశర్మ పరమానందభరితుఁడై యామెతో రహస్యముగ క్రీడింప సాగెను. ఒకనాఁడు ఆ గ్రామమునందలివారెల్ల పసు గ్రామదేవతయుత్సవమున మునిఁగియుండిరి. నాఁటిసాయంకాలము కర్షకపత్నియు, నిగమశర్మయు 'ఈరహస్య మేమి ?' యని ఏరికినిఁ దెలియకుండ బయలుదేఱి రాత్రియంతయు అతిశీఘ్రింబుగ నడచి తెల్లవాఱు నప్పటికిఁ జాలదూరమునఁ గల యొక బోయపల్లెఁ జేరి బోయ వృత్తిచే జీవించుచు సుఖంపడసాగిరి. కొన్నిదినములకు వారికి ఒక కుమారుఁడు కలిగెను.

పిదప నిగమశర్మకు పశ్చాత్తాపము కలిగెను. 'విప్రుఁడనై పుట్టిన నాకు ఈకర్మ మేల ? శూద్రస్త్రీని తగుల్కొని వచ్చినదేఁగాక ఆమెయందు సంతానమును గూడఁ బడసిననాకు ఇంక ఉత్తమజన్మము లేదు. రౌరవాదినరకములే శరణ్యములు' అని చింతించి, యాతఁడు తన ప్రియురాలితోఁ జెప్పకయే యొకరాత్రి తోఁచినట్లు బయలు దేఱిపోయి తెల్లవాఱునప్పటికి నృసింహతీర్థముఁ జేరి మనోవైకల్యమువలన నిద్రా హారములను విడిచి కృశించి యచ్చటఁ బ్రాణములను విడిచెను. వెంటనే యమ దూతలు వచ్చి వానినిఁ దీసికొని పోవుచుండఁగా నృసింహమూర్తి సుదర్శనము వచ్చి యమదూతలను బాఱఁదోలెను. నిగమశర్మకు ఈశ్వరసాయుజ్యము సంభవించెను. అట్టి పాపాత్మునకు సాయుజ్యముక్తి యెట్లు కలిగె నని నారదుఁడు అడుగఁగా పర మేశ్వరుఁడు 'అది పాండురంగని విహారప్రదేశము. తీర్థము, క్షేత్రము, దైవము గల ప్రదేశమునఁ జనిపోయినచో నెట్టిపాపికైనను మోక్షము కరతలామలక మగును' అని ప్రత్యుత్తర మిచ్చెను.

పాండురంగ క్షేత్రమున ఎట్టి జంతువైనను ఈశ్వరానుగ్రహమునకుఁ బాత్రము కాఁగలదు. ఇందులకు ఉదాహరణముగ నొకఇతిహాసము కలదు.

పూర్వము ఒకప్పుడు శ్రీకృష్ణుఁడు భీమరథీతీరమున వేణుగానము చేయుచు రాసక్రీడ సలుపుచుండెను. అప్పుడు ఒకయావు ఆగానమాధుర్యమునకు సొక్కి

పాలుకురియుచుండఁగా వాయువశమున పాలచుక్కలు కొన్ని శ్రీకృష్ణభగవానుని శిరమునఁ బడియెను. ఆకారణమువలన ఆగోవు అవసానమున సుశీల యను పేరుతో నొక భాగవతోత్తమునకుఁ గొమార్తయై పుట్టెను. తలిదండ్రులు ఆమెకు యుక్తవయస్సువచ్చిన తరువాత యోగ్యుఁడగు నొకవరుని వెదకితెచ్చి వివాహము గావించిరి. సుశీల యెంత సుగుణవంతురాలయినను, ఎంత సుందరియైనను, భర్తకు ఆమెయనిన చాలకోపముగను, అసహ్యముగను ఉండసాగెను. ఆతఁడామె దెసకుఁ జూచుట మానివేయుటయేఁ గాక అన్నవస్త్రములు గూడ సరిగ నీయక బాధపెట్ట సాగెను. సుశీల అందులకు వగవక 'నాభర్త ఇహసౌఖ్యములను లెక్కింపకున్న బాధలేదు; కాని పరమునకైన నాశించుటలేదు. నేనేమి చేయఁగలను' అని విచారించుచుండెను.

ఒకనాఁడు ఒక బ్రహ్మచారి సుశీల యింటికి వచ్చి, 'తల్లీ! ఆఁకలి బాధించుచున్నది. అన్నము పెట్టి రక్షింపుము' అని ప్రార్థింపఁగా, నామె 'ఓయీ! నీవు ఎచ్చటివాఁడవు? ఎందుఁ బోయెదవు?' అని యడిగెను. "నేను కొందఱు వటులతోఁ బండరినాథుని సేవించుకొనుటకై పాండురంగక్షేత్రమునకు బయలుదేఱితిని. ఇప్పుడే ఇక్కడకు వచ్చితిని. నాస్నేహితులు తెచ్చుకొనిన యన్నము మిగులుట వలన దానిని దిని ముందునకుఁ బోయిరి. నేను తెచ్చుకొనినది అయిపోవుటవలనను క్షుద్బాధ పీడించుటవలనను ఇట్లు వచ్చితిని" అని బ్రహ్మచారి మాట పల్కెను. అది విని సుశీల 'అయ్యో! నేనేమి చేయఁగలను? నే నిప్పుడే భుజించితిని. కొంచెము అన్నము మిగిలినది. స్త్రీభుక్తశేషమును, అందును స్వల్పము నగు అన్నమును నీకెట్లు పెట్టుదాన?' నని కటకటంబడఁగా నాతఁడు 'తల్లీ! నీకు చింతవలదు, ఆయన్నమే త్వరగ పెట్టుము. లేకున్న నాప్రాణములు పోవును' అని త్వరపెట్టెను. సుశీల తుదకుఁ జేయునదిలేక బ్రహ్మచారిని ఇంటిలోనికిఁ గొనిపోయి అన్నము పెట్టెను.

అది భుజించి, బ్రహ్మచారి 'తల్లీ! నీవు పెట్టిన యన్నము భుజించుటవలన నాయాఁకలి పెఱిగిపోయినది. ఇంకను ఏమయిన నున్నచో పెట్టుము' అనియెను. సుశీల తన భర్త గ్రామాంతరమున కరుగునపుడు మూటకట్టియిచ్చిన యన్నము పట్టుకొనిపోకుండుటచే దానిని నప్పుడే చూచి బ్రహ్మచారికిఁ బెట్టెను. అది తిని 'ఇంకను కావలె' నన్ని బ్రహ్మచారి పలికెను. అంతట సుశీల భర్తకొఱకు దాఁచి యుంచిన పిండివంటలను బెట్టెను. బ్రహ్మచారికి అప్పటికిని ఆఁకలి తీరదయ్యెను. అపుడు సుశీల ఆశ్చర్యచకితయై, అగ్నిదేవునిఁ బ్రార్థింపఁగా వంటయిల్లంతయు సకల పదార్థములతోడను నిండిపోయెను. సుశీల పరమానందభరితురాలై ఆపదార్థము

లను ఆతనికి వడ్డింపసాగెను. బ్రహ్మచారి యెంతతిన్నను ఆపదార్థములు తఱుగకుండుటఁజూచి నిజరూపముతో నవఁగా శ్రీకృష్ణమూర్తియై యెదుట నిలిచెను. సుశీలయు మహాశ్చర్యచకితయై కృష్ణభగవానుని వఁగొని అనేకవిధములఁ మ్రొక్కి నిలువఁగా కృష్ణుఁడు 'రమణీ! నీవు పెట్టిన భుక్తశేషమునకు పరమానందభరితుఁడనైతిని. పాతివ్రత్యమాహాత్మ్యమువలన దేవతలందఱును నీయాజ్ఞలను క్షణములో నెఱవేర్చుచున్నారు.

ఒక నగరమున నొక బ్రాహ్మణపుత్రుఁడు స్వధర్మములను విడిచి వేశ్యాలంపటుఁడై పాండురంగక్షేత్రమున నుండెను. ఆతఁడు నాప్రసాదమును స్వీకరించుట వలన నాసన్నిధిని వసించియుండుటవలనను మఱల బ్రాహ్మణుఁడై పుట్టి నిన్ను పెండ్లియాడినాఁడు. నీపాతివ్రత్యమే నీభర్తను మఱల సన్మార్గమునకుఁ దెచ్చును. నీవు నన్నుఁ జూచితివిగదా యని గర్వింపక తొల్లిటివలెనే పతిభక్తిఁ గలిగి నన్ను సేవించుచుండుము' అని యాదేశించి తిరోహితుఁ డయ్యెను. ఇది జరిగిన మఱుదినముననే సుశీలభర్త ఇంటికి వచ్చెను. తోడనే యాతని చిత్తవృత్తి మాఱిపోయెను. అంత నాతఁడు తన ప్రథమప్రవర్తనమునకుఁ జాల చింతించి భార్యను క్షమింపఁ బ్రార్థించి ఆమెతోఁ గూడ పాండురంగని బూజించుచు సుఖముగ నుండెను.

ఒకప్పుడు ఒక కాకి పండరినాథుని ఆలయమున కెదుట నున్నరావిచెట్టు మీఁద వసించుచుండెను. ఒకనాఁడు ఆలయమునందలి బలిపీఠము అన్నము చెదరి యుండుటచే అసహ్యమై యుండఁగా ఆకాకి ఆయన్నమును దిని ఆస్థలమును శుభ్రపఱచెను.

పండరిపురమున నొక తటాకమున నొక హంస యుండెను. అది గ్రీష్మకాలమున వేడిమికిఁ దాళఁజాలక ప్రాతఃకాలముననే జలకమాడి, పాండురంగని గర్భాలయము సొచ్చి రెక్కలు విదిర్చుకొనఁగా వానికంటియున్న జలము పాండురంగని శిరమునఁ బడెను.

పాండురంగని పరిచారికలలో నొకతె యొక చిలుకను పెంచుకొనుచుండెను. ఒకనాఁడు పరిచారిక స్నానము చేయుటకై ఆభరణములను దీసి యొడ్డుననుంచి జలములో దిగెను. అపుడు చిలుక హఠాత్తుగ ముత్యాలహారమును ముక్కునఁ గఱచుకొని పాండురంగని గర్భాలయముసొచ్చి ఫలభ్రాంతిచే ముత్యములను చిదుపఁబోగా హారము తెగి ముత్యములు చెదరి ఆలయమంతయు వ్యాపించి ఎంతో సౌందర్యమును గలిగించెను.

ఒక యెలుక పాము తఱుముకొని వచ్చుటచే పాండురంగని గర్భాలయమును సొచ్చెను. పాముగూడ దాని వెంటరాఁగా దానినెత్తిన మాణిక్యము ధగధగ మెఱయుటచే పాండురంగని సన్నిధియంతయుఁ బ్రకాశవంత మయ్యెను.

ఒక తేనెటీగ మధువు సంపాదించుటకు బయలుదేఱి గర్భాలయము సొచ్చి పాండురంగని మెడలోని హారమునందలి పూవుమీఁద వ్రాలి మధువును గ్రోలెను.

ఈరీతిన పాండురంగని సేవించిన కాకి, హంస, చిలుక, పాము, తేనెటీఁగ ఈ యైదును సుశీలకు అయిదుగురు కుమారులై పుట్టినవి. సుశీలయు ఆమె భర్తయు బ్రతికియున్నంతకాలమును కుమారులకును ఇంకను ఇతరులకు అనేకులకును జ్ఞానోపదేశము గావించి అవసానమున ఈశ్వరసాయుజ్యమును బడసిరి. వారికుమారులు గూడ అట్లే బ్రతికియున్నంతకాలమును పాండురంగని సేవించి, అనేకులకు తత్త్వోపదేశము గావించి, శ్రీకృష్ణమంత్రము నుపదేశించి తరణోపాయము చెప్పి అవసానమున సాయుజ్యముక్తినిఁ బడసిరి.

మున్ను విద్యాధరుఁ డొకఁడు విద్యాధరస్త్రీలతో విమానారూఢుఁడై విహారార్థము బయలుదేఱి పాండురంగని యాలయముమీఁదుగాఁ బోవుచుండఁగా క్షేత్రపాలకుఁడు కినిసి విమానముతోఁ గూడ వానిని క్రిందికి ఈడ్చివేసెను. విద్యాధరుఁ డపుడు సంగతియంతయు నెఱిఁగి పాండురంగని సేవింపఁగా స్వామి ఆతనికి అభయ మిచ్చి పంపివేసెను.

ఒక బోయ జింకమీఁద బాణము విడువఁగా నది పరుగెత్తుకొనివచ్చి సంగమతీర్థమున నుఱికి ప్రాణములఁ బాసి దివ్యదేహమును బడసి ఆకసమునకు ఎగిరి పోయెను. ఆది చూచి బోయ ఆశ్చర్యచకితుఁడై తాను గూడ నందుఱికి ప్రాణములను బాసి ముక్తినిఁ బడసెను.

మున్ను పాండవులు ధౌమ్యుని యానతిచొప్పున పండరిపురమునకుఁ బోయి పాండురంగని సేవించి రాజ్యవైభవములం గాంచి అవసానమున మోక్షమును బొందిరి.

సుశర్మ యను పాపాత్ముఁ డొకఁడు గ్రీష్మకాలమున పద్మతీర్థమున స్నానము చేయుటకు దిగి హఠాత్తుగ నీటిలో మునిఁగి చనిపోయెను. యమకింకరులు వానిని యముని యెదుటకుఁ గొనిపోయిరి. చిత్రగుప్తుఁడు వాఁడు చేసినపనులు అన్నియుఁ జదివి చెప్పెను. అతఁడు చేసినవన్నియు పాపకృత్యములేయైనను, తుదకు పాండురంగక్షేత్రమునందలి పద్మతీర్థమునఁ జనిపోవుటచే "వీఁడు స్వర్గమునకుఁ బోఁదగిన వాఁడు" అని యముఁడు వానిని విమానముమీఁద స్వర్గమునకుఁ బంపివేసెను. సుశర్మ స్వర్గమునఁ జాలఁకాలము మహేంద్రవైభవము ననుభవించి క్షీణపుణ్యుఁడై సుకీర్తి యను పేరున భూమిమీఁద నొకరాజై పుట్టి, అనేక సత్కార్యములను గావించి పాండురంగని సేవించి అవసానమున సాయుజ్యమోక్షమును బడసెను.

పరమేశ్వరుఁడు మఱల నిట్లు చెప్పెను. నేను శ్రీహరిచే నుపదేశింపఁబడిన సిద్ధమంత్రమును జపించుచు సిద్ధేశ్వరుఁడు అను పేరుతో పాండురంగక్షేత్రమున

వసించియున్నాను. బలరామునకు కృష్ణుఁడు ఈమంత్రమును ఉపదేశించెను. రుక్మిణీదేవిగూడ ఈమంత్రమును జపించుచుండును. దీనిని స్త్రీపురుషులు జపించిన వారికి మోక్షము కరతలామలక మగును.

తొల్లి, నేను త్రిపురాసురులను సంహరించుటకై భీమాకృతిందాల్చి, కదన మొనర్చినపుడు నాయొడలినుండి చెమట పుట్టి నదియై మహావేగమునఁ బ్రవహింప సాగెను. పాండురంగక్షేత్రపాలుఁడు దానిని ఆపఁజాలక శ్రీకృష్ణునిఁ బ్రార్థింపఁగా నాతఁడు సాక్షాత్కరించి "భీమాకృతిం దాల్చియున్న పరమేశ్వరుని శరీరమునుండి పుట్టితివి; కావున భీమరథినాఁబరఁగుదువు. వేగము నుపసంహరించుకొనుము" అని శాసించెను. అది యట్లే యయ్యెను; ఆభీమరథియందు స్నానముచేసి పాండురంగని దర్శించువారికి మోక్షము సిద్ధించును.

అగస్త్యుని శిష్యులలో ప్రయుతుఁడు అనుముని యొకఁడు కలఁడు. ఆతనికి అయుతుఁడు నియుతుఁడు అని యిరువురు కుమారులు గలరు. వారు అగస్త్యము నీంద్రు నతిభక్తితోఁ గొలుచుచుండిరి. అగస్త్యుఁడు వారియెడల మిగులఁ బ్రీతుఁడై వీరికిఁ దగిన కన్యలను దెచ్చి వివాహము చేయవలయునని తలంచి వీరికి దగు కన్యలు బ్రహ్మదేవుని కొమార్తలగు గాయత్రీ సావిత్రులు తక్క నన్యలు గారని నిశ్చయించి సత్యలోకమునకుఁ బోయి తన రాకకుఁ గల కారణమును బ్రహ్మ కెఱిం గించెను. బ్రహ్మ యడ్డు చెప్పక ఆతని కోర్కెను నెఱవేర్చెను. అగస్త్యుఁడు ఆకన్ని యలను వెంటనిడుకొని వచ్చి సంగతి నెఱింగింపఁగా అయుతుఁడు గృహస్థాశ్ర మము స్వీకరించుట కంగీకరింపఁ డయ్యె. అగస్త్యుఁడు ఆకన్యల నిరువురను నియు తునకే పెండ్లిచేసి "నీవు నాయానతి నతిక్రమించితివి; కావున ఇచ్చట నుండి వెడలి పొమ్ము" అని అయుతునిఁ బంపివేసెను. అయుతుఁడు అచ్చటనుండి హిమాచలసమీ పమునకుఁ బోయి ఘోరతపస్సు ప్రారంభించెను. ఆతని తపోగ్నివలన లోకములు తల్లడిల్లఁ దొడంగఁగా, ఇంద్రుఁడు కపటబ్రాహ్మణవేషముతో అచ్చటకువచ్చి కూర్చుం డెను. అయుతుఁడు ఇంద్రు నాదరించి ఆతిథ్యమిచ్చి నీవృత్తాంతమేమని యడుగఁగా 'నేను తీర్థయాత్ర చేయఁదలఁచి తిరుపతి, శ్రీరంగము సేవించితిని. పాండురంగక్షేత్ర మునకుఁ బోవుచున్నాను. నీచరిత్ర చెప్పు'మని యింద్రుఁ డడిగెను. అయుతుఁడు తన వృత్తాంతము నెఱింగింపఁగా ఇంద్రుఁడు "ప్రయుతుఁడు నాకు బాల్యస్నేహితుఁడు. నీవు నామిత్రుని కుమారుఁడవు. నీదర్శనమువలన నాకు పరమానందమైనది. నాయనా! గుర్వాజ్ఞ నేల యతిక్రమించెదవు? పోయి గృహస్థాశ్రమమునఁ బ్రవే శింపుము" అని బోధించెను; గాని అయుతుఁడు అంగీకరింపలేదు. ఇంద్రుఁడు 'ఈతని కామధేనువువలనఁ గాని సాధ్యపడదు' అని తలంచి స్వర్గమునకుఁ బోయి కామధేనువు నంపెను. అయుతుఁడు 'ఈయావు ఇందాఁక వచ్చిన తీర్థయాత్రాపరు నిదై యుండు' నని తలంచి దానిని తోలివేసెను.

అంతట కామధేనువు సమీపమునందలి వాధూలముని చెంతకుఁ బోయి తన సంగతి యంతయుఁ జెప్పఁగా ఆతఁడు కోపించి అయుతుని చెంతకుఁ బోయి నీవు కప్ప వగు మని శపించెను. అయుతుఁడు భయభ్రాంతుఁడై పాదములమీఁద వ్రాలి శాపాంతమును వేఁడఁగా వాధూలముని 'ఓయీ! నీవు పాండురంగక్షేత్ర మునకుఁ బోయి నృసింహాతీర్థమున నృసింహాసన్నిధి నుండుము. అచ్చట నీకు ఎప్పుడు ఆఁడుకప్పయందు సంతానము గలుగునో అప్పుడు శాపాంత మగు' నని చెప్పెను. అయుతుఁడు నృసింహాతీర్థమును జేరి వెంటనే కప్పయై పోయెను.

ఒకరాజపుత్రి నృసింహాతీర్థమున స్నానమాడుటకు వచ్చి యొక కప్పను దీసి యొకవృద్ధబ్రాహ్మణునిమీఁద విసరెను. బ్రాహ్మణుఁడు అలిగి 'నీవు కప్పవగుదువు గాక'! అని యామెను శపించెను. వెంటనే ఆమె ఆఁడు కప్ప కాఁగా అయుతుఁడు దానియందు సంతానముఁ బడసెను. వెంటనే వారిరువురును శాపములను బాసి, శ్రీహరి సాయుజ్యమును బొందిరి. పాండురంగక్షేత్రమును సేవించినవారు ఎట్టి పాపాత్ములు అయినను సులభముగా ముక్తినిం గాంతురు.

---

## 125. పుండరీకుఁడు

శ్లో. "అంధస్య మే హృతవివేకమహాధనస్య, చోరైర్మహాబలిభిరింద్రియనామధేయైః,
మోహాంధకారకుహరే వినిపాతితస్య, లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్."

(15. లక్ష్మీనృసింహాస్తోత్రము)

లోహదండనగమున జహ్నువు అను నొక బ్రాహ్మణోత్తముఁడు కలఁడు. ఆతఁడు సర్వకాలసర్వావస్థలయందును, శ్రీమన్నారాయణుని పాదకమలములను ధ్యానించుచు సత్కర్మల నాచరించుచు తాపత్రయమును, ఈషణాత్రయమును వర్జించి శ్రీహరినిఁ బూజించుచును గాలము గడుపుచుండెను. ఆతని భార్య పేరు సాత్యకి. ఆమె ఆతనికి అన్ని విషయములయందును తగిన యిల్లాలు.

ఆదంపతులకు లేక లేక చాలాకాలము తీవ్రతపము చేసిన వెనుక నొకకుమారుఁడు కలిగెను. ఆతఁడు తేజశ్శాలి యగుటఁ గాంచి జహ్నువు పుండరీకుఁడు అని నామకరణము చేసి చాలఁ బ్రేమతోఁ జూచుకొనుచుండెను. సాత్యకి కుమారుని మిగుల గారాబముతోఁ బెంచుచు బుద్ధులు గఱపుచుండెను. ఆదంపతులు పుండరీకునకు ఎనిమిదియేండ్లప్రాయమున ఉపనయనమును, ఇరువదియేండ్లయీడున చక్కని కన్యను దెచ్చి వివాహమును గావించి ఆనందింపసాగిరి.

పుండరీకుఁడు సకలవిద్యలయందును అసమానపండితుఁ డయ్యెను, దుర్వృత్తులు ప్రారంభించెను. సాత్యకి గఱపిన బుద్ధులు పెడతలంబట్టెను. పుండరీకుఁడు తుదకు వేశ్యాలోలుఁ డయ్యెను. ఆతఁడు పెండ్లాముసంగతి ఆలోచింపలేదు. తలి

దంద్రులవిషయముల గమనింపలేదు. భోజనసమయమునఁ దప్ప తక్కుంగల యెల్ల సమయములయందు ఆతఁడు వేశ్యావాటిక విడిచి వచ్చుట మానివేసెను.

జహ్నువును, సాత్యకియు, కుమారుని బుద్ధిని మరలించుటకుఁ బలుసుపాయములను బ్రయోగించిరి; కాని ప్రయోజనము లేకపోయెను. వేశ్యాసంపర్కము వలని దోషములను జెప్పినను, పుండరీకుఁడు వారియాజ్ఞను బాలింపలేదు. మీఁదు మిక్కిలి తోఁకత్రొక్కిన త్రాఁచువలె మండిపడుచు లేచి 'ఎందుల కెందుల కని యూరకొన్న కొలఁదియు మేఱమీఱుచున్నారు. మీచిత్తము వచ్చినట్లు మీ రేద్వాఁడు; అందులకు నాయభ్యంతర మేమియు లేదు; గాని నాప్రస్తావన తేవల సిన యవసరము మీకు ఏమియులేదు' అని గద్దించి పలికి, అంతటితో నూరకుం డక చింతబరికెలతో వారిని మోది తన భార్యను వెంటనిడుకొని మఱియొక చోటికిఁ బోయెను.

జహ్నువును, సాత్యకియు తమ పూర్వపాపములు ఇట్లు ఫలించెనని కుందుచు ఎందేనిఁ బోయి కాలము గడపుటకు యోచింపసాగిరి. ఇంతలో కొందఱు కాశికిఁ బోవుచు మార్గవశమున లోహదండనగరమునకు వచ్చి జహ్నువునింట బసచేసిరి. ఆతఁడు వారిసంకల్పమును దెలిసికొని భార్యతోఁ జెప్పి యొప్పించి కాశికి బయలు దేఱెను.

కొలఁది దినములు గడచిన తరువాత పుండరీకునకుఁ గూడ కాశికిఁ బోవలయు నను సంకల్పము కలిగెను. అంతట నాతఁడు విశేషధనమిచ్చి వారకాంతల నంద అను ఒప్పించి రెండుగుఱ్ఱములను కొని ఒకదానిపై భార్య నెక్కించి రెండవ దానిపైఁ దానెక్కి హుటాహుటి నడకలతోఁ బయనము సాగించెను. జహ్నువును, సాత్యకియు, ముందు పోయినను, వృద్ధులగుటచే మెల్లఁగ నడచి పోవుచుండిరి. పుండరీకుఁడు అట్లు గాక మంచి గుఱ్ఱములమీఁదఁ బోవుచుండుటచే ఒకటిరెండు దినములయందే వారినిఁ గలసికొని వారు విశేషశ్రమ ననుభవించుటఁ జూచు చుండియు ఏమియు మాటాడక గుఱ్ఱము నుఱాయించి ముందునకుఁ బోయి కాశికి సమీపమునఁగల కుక్కుటమున్యాశ్రమము చెంగట విడిసెను.

కుక్కుటముని పరాశరాదులవలె తపోనిష్ఠుఁడై యుండు మునికాఁడు. ఆతఁడు ప్రాతఃకాలము లేచినది మొదలు రాత్రి శయనించుదనుకఁ జేయుపని మాతాపితృశుశ్రూష. పుండరీకుఁడు ఈపనియందు నిద్రాహారములేఁ గాక నిత్య కృత్యములగు స్నానసంధ్యాద్యనుష్ఠానములను గూడ లెక్కసేయలేదు. మాతాపితృ దేవతలకంటె నిఁక గొప్పదేవత లెందుఁగలరు? కుక్కుటముని చాల గొప్పవాఁడని విని పుండరీకుఁడు చూచివత్తమని పోయి, "అయ్యా! ఇచ్చటకుఁ గాశీనగర మెంతదూర మున్నది?" అని యడిగెను. కుక్కుటముని "నేను కాశీనగరము అనుశబ్దమునే వినలేదు. అది యెచ్చట నున్నదో ఎంత దూరమున నున్నదో నాకుఁ దెలియదు." అని బదులు చెప్పెను.

ఇది విని పుండరీకుఁడు తొలుత నాశ్చర్యపడి, పిదప "ఇన్ని యేండ్లు గడచి నవి. ముని నని పేరు పెట్టుకొని ఆశ్రమము నేర్పఱచుకొంటివి. ఏమి ఫలము? పరమపావన మగు కాశీనగరము పేరే యెఱుంగవు. తటాకమున మహిషము ఎంత కాలము ఉన్నను; పద్మసౌరభమును గ్రహింపఁజాలనట్లు ఇంతసమీపము నుండియు నీవు గంగామాహాత్మ్యమునైన నెఱుంగఁజాలకపోయితివి. ఇఁక నిచ్చట నుండరాదు. నిన్నుఁ గాంచిననే సకలపాపములును జుట్టఁబెట్టుకొనును" అని చివాలున లేచి తనభార్య యున్నచోటికిఁ బోయెను.

రెండుజాముల రాత్రివేళ పుండరీకునకు నిద్రాభంగ మయ్యెను. అగుట నాతఁడు లేచి కూర్చుండి అదియు నిదియు యోచించుకొనుచుండఁగా, మలిన రూపిణులగు ముగ్గురుస్త్రీలు కుక్కుటమున్యాశ్రమము చొచ్చిరి. వారినిఁ జూచి పుండరీకుఁడు తొలుత పిశాచభ్రాంతిచే భయకంపితుఁడై కిక్కురు మనకుండ గూర్చుండెను. ఇంతలో ఆస్త్రీలు మువ్వురును కుక్కుటముని పర్ణశాలను ఊడ్చి అలికి ముగ్గులు పెట్టి ఆశ్రమమంతటను నీళ్లు చల్లి మునిచెంగట సెలవు గైకొని చూచుచుండఁగా తటిల్లతలవలె మెఱసిపోవు దేహములతోడను గూడిన రమణీ మణులై వెనుఁదిరిగిరి.

వారు సమీపించిన తరువాత పుండరీకుఁడు వారినిఁ బిలిచి "ఇందాఁక మీరు అట్లు పోవునపుడు ఘోరాకారిణులయి యుంటిరి. ఇపుడు దేవతాస్త్రీలకంటె నధిక ముగా మెఱసిపోవుచున్నారు. ఇందులకును, అందులకును గారణమేమి?" యని ప్రశ్నించెను. అది విని యులికిపడి ఆమూవురలో నొకతె ఈతనిదిక్కు మొగంబై "దుర్మార్గుఁడా! పాపాత్ముఁడా! నీయెదుట నిలువఁదగదు" అని తనవారిని వెంటనిడు కొని బయలుదేఱెను. అంత పుండరీకుఁడు తటాలున లేచి ఆమెపాదములమీఁద వ్రాలి "దేవీ! ఈదీనుని రక్షింపవలయును. నాకు పశ్చాత్తాపము కలిగినది. నాపాప ముల నన్నిటిని దహించి నన్ను పరిశుద్ధినిఁ జేయుము. తొలుత నీవెవరో ఎఱిం గింపుము" అని దీనముగఁ బ్రార్థించెను.

అపుడు ఆమె కరుణార్ద్రహృదయయై "ఓరీ! నీయంతటి పాపాత్ముఁడు ఇఁక నీజగంబున లేఁడు. అయినను, నీపూర్వపుణ్యవశమున నీవు ఈకుక్కుటముని ఆశ్ర మము త్రొక్కితివి. అగుటచే నీపాపములు అన్నియుఁ దొలఁగిపోయినవి; కావుననే మమ్ముఁ జూడఁగలిగితివి. ఇఁక మావృత్తాంతముల నెఱింగించెద వినుము. ఆమె సర స్వతి; ఈమె యమున; నాపేరు గంగ. మేము మువ్వురమును ప్రతిదినమును మా యందు అవగాహనము చేయువారి సకలపాపములను హరించి, వానిని మేముపొందు దుము. ఆపాపమువలననే మాదివ్యరూపములు మొదట నీవుచూచినట్లు మలినము లును, ఘోరములు అయియుండును. ఈకుక్కుటమహామునికి సేవలు చేసి ప్రతి దినమును మేము ఆమహాపాతకములను తొలంగించుకొనుచుందుము. ఈమహాముని

అనవరతమును మాతాపితలను బూజించుచుండును. అంతకంటె నీతఁడు చేయు తపస్సు ఏమియు లేదు. అంతకంటె నీతఁడు జేసినది నెఱుంగఁడు. కేవలము మాతా పితృపూజవలన ఈతఁడు మహర్షికులతిలకులు ఎప్పుడును పొందజాలని మహిమను గాంచి యున్నాఁడు. మహాపాతకములను ఈతఁడు తక్క నన్యులు తొలంగింపఁ జాలరు. మాతాపితృశుశ్రూషయందు అంత మాహాత్మ్యము ఉన్నది. నీవు మాతా పితలను కొట్టి తిట్టి, మఱియు సకలవిధములను అవమానపఱచిన దురాత్ముఁడవు. మాతాపితృశుశ్రూషతక్క మఱేదియు నీపాపములను తొలంగింపఁజాలదు. నీయదృష్టమువలన నీకు మాదర్శన మైనది. ఇప్పుడైనను బుద్ధి తెచ్చుకొని తలిదండ్రులను బూజింపుము" అని చెప్పి, తనవారిని వెంట నిడుకొని వెడలిపోయెను.

పుండరీకుఁడు ఇది విని వెంటనే కుక్కుటముని చెంగటకుఁ బోయి పాదముల మీఁద వ్రాలి అపరాధమును క్షమింపఁ బ్రార్థించి ఆశీర్వచనముఁ బడసి పత్నితోఁ గూడ గుఱ్ఱములమీఁద మఱల వెనుకకుఁ బోయి తలిదండ్రులను వెదకి పట్టుకొని వారికి సాష్టాంగనమస్కారములు ఆచరించి వారిని గుఱ్ఱములమీఁద ఎక్కించి కాశికి బయలుదేఱెను. జహ్నువును, సాత్యకియు పుండరీకుఁడు మఱల సన్మార్గమునకు వచ్చెనుగదా యని మిగుల నానందింపసాగిరి. పుండరీకుఁడు యుక్తసమయమున కాశీనగరమునఁ బ్రవేశించి అచ్చటఁ దలిదండ్రులు చేయవలసిన కృత్యముల నన్నిటిని సాంగముగాఁ జేయించి, వారిని అతిభక్తితో కుక్కుటమునికంటె అధికముగా శుశ్రూషింపసాగెను.

తొల్లి వృత్రాసురుఁడు దేవేంద్రుని జయింపఁ గోరి పాతాళమున తపస్సు చేయుచుండఁగా ఇంద్రుఁడు అది యెఱింగి అచ్చటకుఁ బోయి వాని తలను వజ్రాయుధముతో ఖండించెను. అపుడు వృత్రాసురుఁడు "తపస్సమాధినిష్ఠుఁడనై యుండఁగా నీవు నాశిరస్సును ఖండించితివి; కావున భూమిమీఁద ఇటుకవై పడియుండుము" అని శపించి ప్రాణములను విడిచెను. వెంటనే ఇంద్రుఁడు,

శ్లో. "శ్రీమత్పయోనిధినికేతన చక్రపాణే, భోగీంద్రభోగమణిరాజితపుణ్యమూర్తే,
యోగీశశాశ్వతశరణ్య భవాబ్ధిపోత, లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్"

([1]. లక్ష్మీనృసింహస్తోత్రము)

అని ప్రార్థింపఁగా శ్రీహరి "నీకు విచారము వలదు. నీవు పుండరీకాశ్రమమున ఇటుకవై యుందువు. ఒకపుడు నీమీఁద నేను నిలుతును. అపుడు నీకు శాపాంత మగును" అని చెప్పెను. వెంటనే ఇంద్రుఁడు పుండరీకాశ్రమమున ఇటుకయైపోయెను.

శ్రీహరి పుండరీకుని మాతాపితృశుశ్రూషకు మెచ్చి పుండరీకుని అనుగ్రహించి వచ్చెద నని లక్ష్మికిఁ దెలిపి, పుండరీకుని యెదుట దివ్యమంగళవిగ్రహుఁడై నిలిచెను. పుండరీకుఁడు అతనిం గాంచియు, అతఁడు మహావిష్ణువు అని యెఱిం

గియు, చేయుచున్న మాతాపితృసేవను మానలేక దగ్గఱనున్న ఇటుకను ముందునకు విసరి "నేను వచ్చునంత వఱకు ఆయిటుకపై కూర్చుండుము" అని పలికెను. తన పని తాను చేయసాగెను. శ్రీహరి అచంచల మగు పుండరీకుని మాతాపితృభక్తికి ఆనందించి, మందహాసముతో ఇటుకమీఁద నిలిచెను. ఆయిటుక వృత్రాసురునిచే శపింపఁబడిన దేవేంద్రుఁడు గావున తొల్లి శ్రీహరిచేసిన సమయము చొప్పున శ్రీహరి తనపై నెక్కిన వెంటనే నిజరూపమును బడసి శ్రీహరికి మ్రొక్కి సెలవు గైగొని తన నగరమునకుఁ బోయెను.

పుండరీకుఁడు కొంతసేపటికి తలిదండ్రుల సేవను ముగించుకొని తటాలున శ్రీహరిపాదకమలములకు అనేకవందనములు అర్పించి "అపరాధిని; రక్షింపుము" అని ప్రార్థించెను. శ్రీహరి పుండరీకుని ఆదరముతో లేవనెత్తి "వత్సా! నీమాతాపితృభక్తికి మెచ్చితిని. నీకిఁక నెందును కొదువ యుండఁబోదు. వలయువర మిచ్చెద; వేఁడుకొనుము" అని పలికెను. పుండరీకుఁడు పరమానందభరితుఁడై మఱల ననేక విధముల వినుతించి, "శ్రీహరీ! నీసాక్షాత్కారలాభమును బడసినపిదప కోరవలసిన వరములు ఉండవు. అయినను విఠ్ఠల్ అను పేరుగల ఇటుకపై నిలిచితివి; కావున, విఠలమూర్తి అను పేరుతో నీవు శాశ్వతముగా నిచ్చట వసించియుండవలయును. నిన్ను దర్శించువారిసకలపాపములును దర్శనమాత్రముననే భస్మపటలము గావలయును. ఈప్రదేశము పుండరీకపురము (పండరిపురము) అని నాపేరుతో వెలయునట్లు నీవు పుండరీకవరదుఁడవనియు, పాండురంగఁడ వనియు పిలువఁబడునట్లును అనుగ్రహింపవలయును. మఱియు ఇచ్చట సర్వోత్కృష్టమైన తీర్థము ఉండునట్లు అనుగ్రహింపవలయును" అని ప్రార్థించెను. వల్లె యని శ్రీహరి యంగీకరించెను. ఆమధ్యాహ్నమునకే త్రిలోకములయందును గల సకల నదులును వచ్చి అచ్చటఁ ద్రవ్వఁబడిన తీర్థమునఁ బ్రవేశించెను.

లక్ష్మీదేవి శ్రీహరి విశ్లేషమునకు ఓర్వఁజాలక అచ్చటకు వచ్చి ఆతని యెడమ ప్రక్క నిలిచెను. దేవేంద్రుఁడు మయునిఁ బిలిచి "భూలోకమునకుఁ బోయి విష్ణు చక్రము మధ్యగల పండరిపురమున విఠ్ఠల్ అను ఇటుకపై శ్రీహరి వెలసియున్నాఁడు నీవు అచ్చట గోపురప్రాకారములును, మహోన్నత మగు ఆలయమును అందమైన నగరమును నిర్మింపుము" అని యాజ్ఞాపింప మయుఁడు అట్లే సకలమును నెఱవేర్చెను.

పండరిపురము తీర్థము, క్షేత్రము, దైవము గల దివ్యప్రదేశమై వెలయుచున్నది. అంతకంటె గొప్పస్థలము లేదు.

# శ్రీ మహాభక్తవిజయము

## చతుర్థభాగము

### దేశభక్తులు

## 126. లోకమాన్య బాలగంగాధరతిలకు

బొంబాయిరాజధానియందలి రత్నగిరి యనుపట్టణమున గంగాధర రామచంద్రతిలకు అను నొకగొప్పపండితుఁడు ఉండెను. అతఁడు మహారాష్ట్రుఁడు. చిత్పావనబ్రాహ్మణుఁడు; గణితశాస్త్రమునందును, ఆంగ్లేయభాషయందును, అతని పాండిత్యము అసమానము. అతని బోధనాశక్తి అనుపమానము. అతఁడు సర్కారులో అసిస్టంటు డెప్యూటీ యెడ్యుకేషనల్ ఇన్‌స్పెక్టరు అను గొప్పపదవివహించి పేరు వడసెను. మన బాలగంగాధరతిలకునకు అతఁడు జనకుఁడు.

తిలకు క్రీస్తుశకము ౧౮౫౬వ సంవత్సరము జూలై ౨౩వ తేదీని అవతరించెను. తండ్రికి తిలకు నెడల చాల ప్రేమగలదు. తిలకు పసితనముననే తండ్రివద్ద ఆంగ్ల భాషను, మహారాష్ట్రభాషను నేర్చుకొని పదునాఱవయేట తండ్రినిఁ గోలుపోయెను. అంతట మేనమామయు, పినతండ్రియు నాతనిం జేరఁదీసి విద్యాబుద్ధులు గఱపింప సాగిరి. వారిపోషణమున అతఁడు ఇంగ్లీషుభాషలో బి. యే. పరీక్షలో జయమంది, తన ఇరువదిమూఁడవయేట న్యాయశాస్త్రపరీక్ష (యల్. యల్. బి) లో నుత్తీర్ణుఁడు అయ్యెను. న్యాయశాస్త్రమును జదువునపుడు తిలకునకు ఆగరుకరు అనునతనితోఁ జెలిమిఁ గలిగెను. వారిరువురును ఎప్పుడును ఒకచోటనే వసించియుండి ఏకాభిప్రాయులై చరింపఁజొచ్చిరి.

తిలకునకు సేవకవృత్తియనినఁ జాల తలనొప్పి. తనతండ్రి సర్కారులో నౌకరీ చేసినను అతనికి అది యిష్టము లేదు. ఒకపుడు అతఁడు ఆగరుకరుతో నీవిషయము ప్రస్తావించెను. ఇరువురును తుదకు "సర్కారులో నౌకరీ చేయఁగూడదు. దేశసేవ చేయవలయును. సకలదానములయందును విద్యాదానము ఉత్తమము; గావున ప్రజలకు విద్యగఱపుటకు పాఠశాల ప్రారంభింపవలయును" అని నిశ్చయించుకొనిరి. ఇది విని వారితోడివారు సంగతిసందర్భముల నెఱుఁగఁజాలక వారిని ఎగతాళిసేయఁజొచ్చిరి. అయినను వారు అందులకు చలింపలేదు.

విష్ణుకృష్ణచిపళూణకరు అనునాతఁడు మహాకవి. ఆతఁడు మహారాష్ట్రభాషలో అనేక చంపూకావ్యములను వ్రాసి ప్రసిద్ధి వడసెను. ఆతఁడు దొరతనము వారివలన చిక్కులుపడి విముక్తుఁడై వచ్చిన పిదప పాఠశాలను స్థాపింపవలయునని తలపోయసాగెను. ఇది విని తిలకును, ఆగరుకరును మహానందభరితులై ఆతనితోఁ జేరి మాటాడిరి. వారికి మాటలు కలిసెను. ఇంతలో యం. బి. నామజోషి యను నాతఁడును వీరితోఁ జేరెను. తుదకు తిలకు, చిపళూణకరు, నామజోషి- ఈముప్పురును గలిసి పూనానగరమున 2-1-1880 సంవత్సరమున నూత్నపద్ధతులతో ఆంగ్లేయ పాఠశాలను స్థాపించి స్వల్పవేతనములు గైకొనుచు తామే నడుపసాగిరి. కొలఁది దినములయందే ఆగరుకరు ఎం. ఏ. పరీక్షలో జయమంది కలిసికొనెను. వి. యస్. ఆప్టి యనునాతఁడుగూడ వారికి బాసట యయ్యెను.

ఒక్కపాఠశాలను స్థాపించుటతో వారికి తృప్తికలుగలేదు. వారందఱును వార్తాపత్రికలను ప్రారంభించి దేశములో విజ్ఞానమును వెదచల్లవలయు నని నిశ్చయించుకొనిరి. ఈ నిశ్చయముతో చిపళూణకరు రెండుముద్రాక్షరశాలలను గొని ఒకదానికి "ఆర్యభూషణము" అనియు, రెండవదానికి 'చిత్రశాల' యనియు పేరులు పెట్టెను. వెంటనే "కేసరి" అను పత్రిక మహారాష్ట్రభాషయందును, "మరాటా" యను పత్రిక ఇంగ్లీషుభాషయందును ప్రారంభింపఁబడెను. చిత్రశాల చిత్రపుపనులు నేర్పుటకు ఏర్పఱుపఁబడెను. అది అనేకవిఘ్నములకు లోనయ్యెను; కాని తుదకు అన్నిటిని గడచి నిలిచెను.

ఇట్లుండఁగా కోల్హాపురరాజగు శివాజీరావు పరిభవింపఁబడెను. అది అన్యాయ మగుట తెలిసికొని తిలకును ఆగరుకరును రాజును పరిభవించినవారినిగుఱించి కఠినముగ వ్రాసిరి. దానిమీఁద రాజద్రోహమును మోపి దొరతనమువారు వారిని ఇరువురను న్యాయస్థానమునకు ఈడ్చిరి. ఈయభియోగము విచారింపఁబడుచుండఁగా చిపళూణకరు స్వర్గమునకుఁ బోయెను. వెంటనే తిలకు ఆగరుకరులకు మూఁడు నెలల విడికైదు విధింపఁబడెను. అయినను ఆప్టి, నామజోషి ఈయిరువురును జంకక తమ మిత్రుల కార్యములను దామే నిర్వహింపసాగిరి. ప్రజలు అందఱును తిలకును, ఆగరుకరును నిర్దోషులు అనియు, ప్రజాసౌఖ్యము నిమిత్తము పాటుపడుమహానుభావులు అనియు ఎఱింగి పాఠశాలకు అనేకవిధముల సాయపడఁ జొచ్చిరి. కారాగారమునుండి విముక్తుఁడైన తరువాత సర్వకార్యములను స్వాయ త్తముగ నిర్వహింపసాగెను. ఆప్టియు ఆగరుకరును విద్యావిషయములను చక్కబెట్టఁ జొచ్చిరి.

వీరు తాము స్థాపించిన పాఠశాల శాశ్వతముగ ప్రజోపయోగము సలుపుచుండునది కావలయు నని భావించి దక్షిణహిందుస్థానవిద్యాసంఘమును స్థాపించిరి.

అంతట అచిరకాలములోపలనే వి. బి. కేల్కారు, ధారపు, వామ. గోఖలు, గోపాలకృష్ణుడు, ఛాసు, పతంకరు మున్నగువిద్వాంసులు చేరిరి. వారలందరు శాశ్వతసభ్యులుగ నుండ వలయు నని నియమించికొని 1885-వ సంవత్సరమున ఫెర్గూసను కళాశాలను స్థాపించి స్వయముగ నుపాధ్యాయులై సకలమును తమచేతులమీఁదనే నిర్వహింపసాగిరి. ప్రతిసభ్యుఁడును ఇరువదిసంవత్సరములు అందు ఉపాధ్యాయత్వము వహింపవలయు నని వారు నిర్ణయించుకొనిరి. కళాశాలానిర్మాణమునకు స్థలమునిచ్చి దానిపోషణము నకుఁ గూడ దొరతనమువారు ద్రవ్యసహాయమును జేయుచుండిరి. కొలఁదికాలము నందే నవీనాంగ్లపాఠశాలయు, ఫెర్గూసను కాలేజియు వృద్ధిపొందెను.

కొన్నిదినములు గడచిన తరువాత భారతసంఘములను సంస్కరింపవలయునని ఆగరుకరు సంకల్పము కలిగెను; కాని తిలకునకు ఇది కిష్టమది గాదు. భారతసంఘమున దోషములు లేవని యాతని యభిప్రాయము. ఇది ముఖ్యకారణముగను మఱికొన్ని కారణములవలనను వారికి మనస్పర్థలు జనించెను. వెంటనే తిలకు విద్యాలయము తోడి సంబంధమును వదలుకొనెను. ఆగరుకరు కేసరిపత్రికను విడిచి "సుధాకర" అను క్రొత్తపత్రికను ప్రారంభించెను. కేసరిని తిలకు చేపట్టెను. అతని యనుజ్ఞ చొప్పున కేల్కారు కేసరి, మరాటాపత్రికలకు అధిపతియై నిర్వహింపఁ దొడఁగెను. తిలకు ఆసంఘమును విడిచిన వెంటనే పతంకరును, నామజోషియుఁ గూడ విడిచి వచ్చిరి.

తిలకు విద్యాసంఘమును విడిచి తత్కాలమున బోధనమును గూడ మానుట వలన విద్యార్థులకు చాల విచారము గలిగెను. తిలకువంటి ప్రేమగల ఉపాధ్యాయుని, దేశభక్తి అవతారమని చెప్పఁదగిన వేతకుని పండొలిచి చేతిలోఁ బెట్టునట్లు సకలవిషయములను వివరించిచెప్పు బోధకుని విడువలేక విడువలేక వారు చాల తహతహపడిరి. గణితశాస్త్రమున తిలకును మించినవారు ఎందును గాన్పింపలేదు. ఆతఁడు విజ్ఞానసర్వస్వమని అనేకులు కొనియాడసాగిరి.

ఇట్లు ఉండఁగా బంగాళాదొరతనములో నొక క్రొత్తచట్టము ఏర్పఱుపఁబడుటకు ప్రయత్నములు జరుగసాగెను. తిలకు దానికి ప్రతిఘటించి నిలిచెను. ఏమన? ఆతనికి ఇంగ్లీషువారుగాని మఱి యితరు లెవరైనఁగాని భారతీయుల మతము విషయమున నధికారులు అగుట ఇష్టములేదు. ఈకారణమువలన పునహాలో రెండు కక్షలు ఏర్పడెను. తిలకు పూర్వాచారపరాయణుల కక్షలోఁ జేరెను. మఱియు నాతఁడు అటు కలాశాలను విడిచిన వెంటనే ఇటు న్యాయశాస్త్రమును బోధించు పాఠశాల ప్రారంభించెను. ప్లీడరీపరీక్షకు చదువుచెప్పు పాఠశాలను అంతవఱకు దేశీయు లెవరును స్థాపించియుండలేదు. ఈసమయమున కేల్కారు కళాశాలలో

కార్యభారము మెక్కువ యైన కారణమున మరాటా పత్రికాధిపత్యమును విడిచిపెట్టెను. కొలఁదిదినములయందే గోకులకృష్ణుఁడును కేల్కారును గలిసి ఆర్యభూషణ ముద్రాలయమును దామువుచ్చుకొనిరి. కేసరీ మరాటాపత్రికలు తిలకు ఆధిపత్యముక్రిందకు వచ్చినదిమొదలు ఆపత్రికలకు పాఠకులు ఎక్కువైరి? కాని ఈసమయమున నాతనికి కారాగారశిక్ష విధింపఁబడెను.

కారాగారమున నీతఁడు సర్వదా ఋగ్వేదమును భగవద్గీతలను జదివి "ఓరయన్, లేక ది ఆంటిక్విటి ఆఫ్ వేదాస్" అను నొక గొప్పగ్రంథమును వ్రాసెను. గ్రీకుదేశపుటార్యులును, భారతదేశపుటార్యులును గలిసియున్నపుడు ఋగ్వేదము రచింపఁబడెనని తిలకు అందు అనేక కారణములను జూపుచు నిర్ణయించెను. ఆతని గ్రంథములను మాక్సుముల్లరు మున్నగు విదేశీయపండితులు, అనేకులు ఆశ్చర్యముతో వినుతించిరి. మొదటినుండియు రాజకీయవిషయములయందు ఈతఁడు కాంగ్రెస్సుపక్షమునఁ బనిచేసెను. 1893-వ సంవత్సరమున మహమ్మదీయులకును, భారతీయులకును కలహములు సంభవించెను. ఈతఁడు ఆకలహముల నడఁపఁ బ్రయత్నించుచు దీనికంతకును దొరతనపుటుద్యోగస్థులే కారకులు అని నిశ్చయముగా తన పత్రికలలోఁ బ్రకటించెను. దానిమీఁద బొంబాయిగవర్నరు మున్నగునుద్యోగులు ఈతనిని భయపెట్టిరి; కాని ప్రయోజనము లేకపోయెను. ఇది యైన తరువాత నాతఁడు పాఠశాలలయందు బాలురకు బోధింపఁబడు గ్రంథములు సర్వాసహ్యములుగా నున్నవని ఆందోళనము ప్రారంభించెను. మఱియు నాతఁడు మహారాష్ట్ర యువకులహృదయసీమలయందు దేశాభిమానబీజములను నాటుటకై గణపతి మహోత్సవమును శివాజీమహోత్సవమును బ్రారంభించెను.

వీరపూజ దేశీయులను బాగుసేయు సాధనములలో నొకటి. ఈకాలమున మనదేశీయులు వీరులు, దేశాభిమానులును గావలయు ననునెడల పూర్వవీరుల చరిత్రలను జదువుటయు, వారినిఁ బూజించుటయు తప్పక ఆచరింపవలసినవిధులు. ఈసంగతి నెఱింగియే తిలకు మహాశయుఁడు శివాజీమహోత్సవమును ప్రారంభించెను. శివాజీ మహారాష్ట్రదేశమును ఉద్ధరించి దానికి విశ్వవిఖ్యాతిని గలిగించినవాఁడు; కావున మహారాష్ట్రులు అందఱును తిలకు పదాంకముల ననుసరించి శివాజీనిఁ బూజింపఁదొడఁగిరి. కొలాబాజిల్లాలోని రైగాడుకోటలో శివాజీసమాధి శిథిలప్రాయమై యుండెను. దానిని బాగుచేయుటకు ధనము కావలయునని కోరుచు తిలకు శివాజీమహిమను కేసరిపత్రికలో నుగ్గడించుచు వ్రాయఁగా అచిరకాలమున ఇరువదివేలరూపాయలు సమకూడెను. తోడనే ఆపని పూర్తిచేయఁబడెను.

1895-వ సంవత్సరమున పునహానగరమున సమావేశమయిన భారతదేశీయ మహాసభాకార్యనిర్వహణమునకుఁగాను తిలకు కార్యదర్శిగా నేర్పఱుపఁబడెను.

ఆతఁడు తత్సంబంధమైన పనులను అతిజాగ్రత్తతో నెఱవేర్చుచుండఁగా దేశీయమహాసభ కూడు మంటపమునందే భారతసంఘసంస్కరణ సభ కూడ సమావేశమగునని తెలియవచ్చెను. తోడనే తిలకు తన పనికి రాజీనామా ఇచ్చివేసెను.

మఱుసంవత్సరమున బొంబాయి రాజధానిలో గొప్ప కఱవు తటస్థించెను. అపుడు తిలకు కఱవుచట్టములో నిర్ణయింపఁబడిన ప్రకారము ద్రవ్యము నిమ్మని దొరతనమువారి నడుగుచు అప్పుడు చేయవలసిన కృత్యములను సూచించెను; గాని ఏమియు ప్రయోజనము కలుగలేదు. అన్నములేక అనేకజనులు మాడిపోఁ జొచ్చిరి. అపుడు తిలకు పునహా వర్తకులవలన చాలసాయమును బడసి క్షామోపహతులకు అన్నము దొరకునట్లు చేసెను.

బొంబాయిరాజధానిలో మహామారిజాడ్యము ప్రవేశించెను. దానివలన అనేకులు మృత్యువు వాతఁ బడసాగిరి. ప్రభుత్వోద్యోగులు తగిన సౌకర్యములను గలిగింపఁబూనిరి; గాని పునహాలో దొరతనపునౌకరులు ప్రజలను అనేకవిధముల హింసింపసాగిరి. అది చూచి సహింపలేక తిలకు వారిదౌర్జన్యమును వెల్లడించుచు ఆయుర్వేదౌషధశాలలను స్థాపించి అనేకులకు సేవచేయసాగెను. నగరములోని వారు అనేకులు ఊరు విడిచి లేచిపోయినను ఈతఁడు మాత్రము జంకలేదు. ఇట్లు ఈతఁడు అనేకవిధములఁ బాటుపడుచుండఁగా దొరతనమువారు ఈతనిమీఁద రాజద్రోహమును మోపి శిక్షించిరి.

తిలకు కర్మయోగి. ఆతనికిఁ గ్రియలతోనేకాని మాటలతోఁ బనిలేదు. ఆతనికి భగవద్గీత యనినఁ బరమప్రీతి. "పనిచేయుము. ఫలము కొఱకు ఎదురుచూడకుము." ఇదియే యాతనిసిద్ధాంతము. ఆతఁడు నిర్దోషుల ఆర్తధ్వనుల నాలకింప లేఁడు. బరోడాలో డబ్ల్యు. ఎస్. బాపట్ అనునాతఁడు లంచము పుచ్చుకొనెనని కేసు వచ్చెను. తిలకు అతనివిషయమున చాల పాటుపడి సాయముచేసెను. కొన్ని దినములకు తిలకు రాజద్రోహముచేసెనని బొంబాయి ప్రధానన్యాయస్థానమున అభియోగము తేఁబడెను. ఆఱుగురు తెల్లదొరలు పంచాయితీగా నేర్పడిరి. అందు అయిదుగురు తిలకు అపరాధి యని చెప్పిరి. న్యాయాధికారి తిలకునకు పదునెనిమిది మాసముల కారాగారశిక్ష విధించెను. తిలకు కారాగారములో నుండఁగా జర్మను దేశీయుఁడును మహాపండితుఁడును అగు మాక్సుముల్లరు మొదలగు వారు పని చేయఁగా కొలఁది దినములయందే ఆతఁడు విడువఁబడెను.

ఇంతలో సూరతునగరమున దేశీయమహాజనసభ కూడెను. అందు అతివాదులకును మితవాదులకును వివాదము కలిగెను. ఆతఁడు మితవాదుల వలలోఁ జిక్కక వారియాటను సాగనీయక చాల పనిచేసెను, అప్పుడు సభలో చాల గంధరగోళము

గలిగెను. తిలకు మున్నగు జాతీయనాయకులు దేశీయమహాజనసభను అప్పుడు విడిచి పెట్టిరి.

ఇంతలో నాతఁడు మఱలఁ గేసరీపత్రికలో రాజద్రోహవిషయములను వ్రాసె నని మఱల విచారింపఁబడి ఏడుసంవత్సరములు బర్మాదేశమునందలి మాండలేకోటలో కారాగారశిక్ష ననుభవింపఁ బంపఁబడెను. అచ్చట నాతఁడు కాలమును వ్యర్థముగఁ గడుపక సదా భగవద్గీతలు చదువుచు "ఓరియన్" అనుగ్రంథమును విస్తరింపఁజేసి దానికి "వేదిక్, క్రొనాలజీ" అనఁగా: వేదకాలమును దెలుపునది అని పేరుపెట్టెను. "ఆర్యుల ఉత్తరధ్రువనివాసము" అను గ్రంథమునుగూడ పెంపుచేసెను. "గీతా రహస్యము" అను గొప్పమహారాష్ట్రగ్రంథమును వ్రాసెను. టాడ్‌హంటరు మహా శయుని గణితశాస్త్రమున అర్థముకాని విషయములకును స్థలములకును వివరణములు వ్రాసెను. జర్మనీ, ఫ్రెంచి, పాలిభాషలనుగూడ అభ్యసించెను. తుదకు ౧౯౧౪-వ సంవత్సరము జూన్ ౧౭ తేదీని విడుదల జేయఁబడి పునహానగరమున వచ్చి చేరు కొనెను.

పిదప ఆతనికి షష్టిపూర్తిమహోత్సవము జరుపఁబడెను. అపుడు మహా రాష్ట్రులు తమ దేశభక్తునకు లక్షరూపాయలు బహుమతిచేసిరి. అప్పుడు తిలకు కొన్ని ఉపన్యాసములు ఇచ్చెను. దానిమీఁద దొరతనమువారు "శాంతికి భంగము కలిగింపకుండ నుండుటకుఁగాను ఇరువదేసివేలరూపాయల జామీనులు ధనికులు, మర్యాదగలవారు నగు ఇరువురుపెద్దమనుష్యులవలన ఈయవలసినదని విధించిరి. కాని బొంబాయిప్రధానన్యాయస్థానమున అవసరము లేదని తీర్మానింపఁబడి కొట్టి వేయఁబడెను.

పిదప భారతదేశమున ఆనిబిసెంటు భారతస్వపరిపాలనమును గుఱించి తీవ్రాందోళనము ప్రారంభించెను. ఆసందర్భమును బురస్కరించుకొని తిలకుమహా మహుఁడు ౧౯౧౮ ఏప్రియలు నెలలో భారతదేశపు స్థితిగతులను ఆంగ్లదేశమున వివరించుటకు బయలుదేఱెను. ఆతనివెంట విపినచంద్రపాలు మున్నగు దేశ భక్తులుగూడ బయలువెడలిరి. తొలుత వీరికి అందఱకును రహదారీచీట్లు ఒసఁగఁ బడెను. కాని వారు ప్రయాణమై సింహళమునకుఁ బోయి, అచ్చట ఓడ నెక్కఁ బోవుచుండఁగా "జాతీయభంగకరమగు నుద్యమము నిమిత్తము ఇక్కడకు రాను వీలులేదు" అని లండనునందలి యుద్ధమంత్రివర్గమువారు వారిప్రయాణమునకు నిరోధములు గలిగించి వెనుకకుఁ బంపివేసిరి. ఆరాయబారివర్గము స్వస్థలములు చేరికొనినతరువాత భారతీయులకు వ్యతిరేకముగఁ బనిచేయుడాక్టరు నాయరు అను ఘళయాళదేశీయునకు లండనునకుఁ బోవుటకు దొరతనమువారు రహదారీ

చీటి నొసంగిరి. అందులకు దేశమునందు అంతటను అసమ్మతి చూపఁబడెను. "ఇచ్చినచో ఉభయపక్షములవారికిని రహదారీచీట్ల నిచ్చుట ధర్మము. మానినచో ఉభయులకును మానుట ధర్మము; కాని ప్రజాశయసాఫల్యము నిమిత్తము పని చేయు దేశభక్తునిప్రయాణమును నిరోధించి, 'దేశమునకు వ్యతిరేకముగఁ బని చేయుచున్న మహానుభావుఁడు' అని ప్రజలచే నమ్మఁబడుచున్న నాయరుమహాశయునకు సెలవిచ్చుట ధర్మముగాదు" అని ప్రజలుచెప్పినమాటలను దొరతనమువారు పెడచెవినిఁబెట్టిరి.

బొంబాయిరాజధానీపాలకులు యుద్ధసందర్భములను బురస్కరించుకొని యొకసభచేసి దేశీయప్రముఖుల నందఱను సభకు ఆహ్వానించిరి. అందు తిలకు మహాశయుఁడు హిందూదేశము యుద్ధసందర్భమున చేయుసహాయమును గుఱించి యుపన్యసించుచు "హిందూదేశమునకు స్వపరిపాలనము నిచ్చుటకును, హిందువులు ధనబలసహాయము చేయుటకును అవినాభావసంబంధము ఉన్నది" అని చెప్పఁబోవుచుండఁగా గవర్నరు మాటాడవలదని నిరాకరించెను. అపుడు తిలకు ఆత్మగౌరవము గలవాఁడు; కావున వెంటనే సభవిడిచి పోయెను. ఆతనితోఁగూడ కేల్కారు, బొమ్మంజీ, హార్నిమన్, యమునాదాసు ద్వారకాదాసుగార్లుకూడ సభ విడిచి పోయిరి. ఆసభలో గవర్నరు స్వపరిపాలనమును గుఱించి ఆందోళనము చేయుచున్న దేశభక్తులను తూలనాడెను.

తుదకు తిలకుమహాశయునకు ఇంగ్లండునకు పోవుటకు రహదారీచీటి నొసంగిరి. తనయెడల అన్యాయపు వ్రాతలువ్రాసిన లండన్ టైమ్సు విలేఖరి వెలంటైను షిరోలు అను యూరోపియనుమీఁద మానసష్టపుదావాచేయుటకు తిలకు పయనమయ్యెను. ఈసందర్భమున దొరతనమువారు ఈషరతులను ఏర్పఱచిరి. "వ్యాజ్యెము ముగియఁగనే తిరిగి స్వదేశమునకు రావలెను. యూరపునందున్నంతకాలమును రాజకీయవిషయములను గుఱించి నోరెత్తఁగూడదు" ఈషరతులను తిలకు వ్రాసి ఈయవలయునని దొరతనమువారు కోరిరి.

చేయునదిలేక తిలకు అందుల కంగీకరించి అక్టోబరునెల ఆఖరున ఇంగ్లండు చేరెను. ఇచ్చటి ఆంగ్లేయులకును ఆంగ్లదేశమునందలి ఆంగ్లేయులకును భేద ముండునని యాతఁడు భావించెను. ఎందుల కుండదు ? ఇక్కడివారు భారతభూమియొక్క సారవత్తను, భారతీయుల సాత్వికతనుజూచి పక్షపాతమునకును, విశేషించి అత్యాశకును పాల్పడక మానరు. అక్కడివారిలో అధికారులయందును, ఇక్కడ నౌకరీచేసి వెళ్లినవారియందును తప్ప తక్కినవారియందు ఔదార్యమునకు కొదువయుండదు; భారతదేశమునకు సంబంధించిన ఫలానుభోగమున వారికి గూడ భాగము న్నను

ప్రత్యక్షసంబంధము లేకపోవుటచే ప్రకృతి ధర్మము వారి యెదుట తిరస్కృతము గాదు. ఈయభిప్రాయముతో తిలకు ఇంగ్లండుచేరెను. ఏమయిననేమి ? ఎట్లయిన నేమి ? ౧౯౧౮-వ సంవత్సరమున ఏప్రియల్ నెలలో బయలుదేరిన తిలకు అక్టోబరులోఁ గాని అక్కడ చేరుకొనలేకపోయెను.

యుక్తసమయమున తిలకు విలంటైను షిరోలుగారిమీఁద దావా చేసెను; కాని "న్యాయ మెటులున్నను వ్యాజ్యె మీతనికిఁ బ్రతికూల మయ్యెను." ఈ దావావిషయమున నాతఁ డంతగా పనిచేయలేదు.

తిలకును గుఱించి ఇంగ్లాండున దుర్భావము లధికముగా నుండెను. "బ్రిటిషు వారియెడల ద్వేషమును పూనినవాఁడు బ్రిటిషుసామ్రాజ్యవిచ్ఛేదనమునిమిత్తము పూనికతో నున్నవాఁడు" అని యీతనిని గుఱించి అక్కడ షిరోలుగారి వ్రాతలు కొంతవఱకు అభిప్రాయమును పుట్టించియుంచెను. ఇందులకు ఇండియాదొరతనము వారి చర్యలుగూడ కొంతవఱకును తోడయ్యెను. అన్నివిధములను ఈతని తత్వ మక్కడ దుర్గ్రాహ్యమై యుండెను. అయినను గొప్ప విద్వాంసుఁడును, స్వార్థపరత లేని నాయకుఁడును గావున ఆతఁడు తనమార్గమును నిష్కంటకము చేసికొనుటకుఁ బ్రారంభించెను.

"రాజకీయమును గుఱించి నోరెత్తఁగూడదు" అని దొరతనమువారు ఈతని నోటికి తాళమువేసియుండిరిగదా ! ప్రప్రథమమున తిలకు మాంటాగుగారితో కలిసికొని స్థితిగతు లన్నియు చూచి ఆతాళమును దీయించుకొనియెను. దీనితో మూగవానికి అపారవాగ్ధాటి కలిగినట్లయ్యెను.

తిలకు ఇఁక నిద్రాహారములను గమనించుకొనలేదు. పార్లమెంటుసభ్యుల నందఱను ప్రత్యేక ప్రత్యేకముగ దర్శించి సంగతులన్నియు వారికి బోధించెను. ప్రజలకు అనేకసభలలో భారతదేశముయొక్క నిజస్థితిని హృద్గతము గావించెను. లేబరుపక్షమువారిని తనపక్షమున గలిపికొనియెను. ఇందులకై యాతఁడు అనేక లక్షలకరపత్రములను బంచిపెట్టెను. ఈకొననుండి యాకొనవఱకును దిరిగి దేశమునం దంతటను అనేక గంభీరోపన్యాసముల నిచ్చెను.

ఇది యిట్లు జరుగుచుండఁగా, ఇక్కడ భారతదేశమున డిల్లీనగరమున భారత జాతీయమహాసభ జరిగెను. "జాతీయమహాసభపక్షమున కొందఱు ప్రతినిధులు ఇంగ్లాండునకుఁ బోయి దేశముయొక్క స్థితిగతుల నక్కడివారికి విశదము చేయ వలయుననియు, ఈవర్గమునకు తిలకు అధిపతియై యుండవలయుననియు పార్లమెంటులో అపుడు ప్రవేశపెట్టఁబడిన మాంటుఫర్డుసంస్కరణశాసనమును సరి చూచుటకు ఏర్పఱుపఁబడిన జాయంటుకమిటీవారియెదుట సాక్ష్య మీయవలయు

ననియు అందు తీర్మానింపఁబడెను" దీనితో తిలకునకు అనంతబలము వచ్చెను. ఇప్పుడు తిలకు ఇంగ్లండు దేశమున ౩౧౫ కోట్ల భారతీయులకు ప్రతినిధియై నిలిచి యుండెను.

భారతజాతీయమహాసభ తిలకునెడల చూపిన విశ్వాసము అపాత్రన్యస్తము కాలేదు. మహాసభ దేనిని విధించెనో తిలకు దానినంతను అనుకొనినదానికంటె అధికముగను చక్కగను నెఱవేర్చెను. జాయంటుకమిటీవారియెదుట నతఁడు గంభీర మగు నుపన్యాసము నిచ్చి అడ్డసవాళ్లువేసి సాక్షిని పడఁగొట్టుటకు వారికి అవకాశము లేకుండఁ జేసెను. "సంపూర్ణస్వరాజ్యమునకు దేశ మిపుడు అర్హమై యున్నది. రాజ్యాంగములో కావలసిన సంస్కరణముల నన్నిటిని నిర్ణయించుకొనుటకు మాకే (ప్రజలకే) అధికార ముండవలయును." అని యీతఁడు వారికి దృఢముగా బోధించెను. సాక్షి యెంతవాఁ డయినను ఆకమిటీవారు అడ్డసవాళ్లను గుప్పించి విసివించి వేసెడివారు; కాని తిలకు నొక్కఁడు నొక్కప్రశ్నయైన వేయఁజాలకపోయెను. ఒక్కఁడును పట్టుదలకైన నాతనిని ప్రతిఘటింపఁజాలక పోయెను.

ఇంగ్లండు దేశమున లండనునగరమున "ఇండియా" అని యొకవారపత్రిక కలదు. హిందూదేశముయొక్క స్థితిగతులను ఇంగ్లండులో ప్రకటించి అక్కడి వారికి ఈదేశమునెడల అభిముఖ్యములను, సద్భావమును గలిగించుటకు అది ప్రారంభింపఁబడెను. దానికి వ్యయపడు ధనమంతయు మనదేశమునుండియే పంపఁబడుచుండెను; కాని దానిని నడుపువారు మాత్రము ఆంగ్లేయు లగుటచే జాతీయసభయొక్క ఆజ్ఞలు ఉల్లంఘింపఁబడుచుండెడివి. "జాతీయమహాసభపక్షమున ప్రకటింపఁబడు పత్రిక తదాదేశములను తదాశయములను వెల్లడింపవలయును. అట్లు కానినాఁడు ఈపత్రికకు జాతీయమహాసభనుండి యెట్టి సాహాయ్యమును కలుగఁగూడ" దని తిలకు వాదించెను. ప్రతికాధిపతి మొదట ఇందుల కంగీకరింపలేదు; కాని జాతీయమహాసభ తిలకువాదము నంగీకరించుటచే తుదకు లొంగక తప్పినదిగాదు.

ఇది యిట్లుండఁగా ప్రపంచమును అల్లకల్లోలపఱచిన మహాయుద్ధము చల్లాఱెను. సంధినియమములను నిశ్చయించుటకు ప్యారిసునగరమున "సంధిసభ" యను పేరున గొప్పసభయొకటి జరుపుటకు నిశ్చయమయ్యెను. ఆసభకు భారతదేశప్రతినిధిగా వెళ్లుటకు తన కవకాశమీయవలసిన దని తిలకు అనేకవిధముల అధికారులను కోరెను; గాని వారు అంగీకరింపలేదు. అంతటితో నిరుత్సాహపడక అంతట నాతఁడు "ఊరకుండుట మంచిదికా" దని తలఁచి భారతదేశముయొక్క స్థితిగతు

లను వివరముగ విశదీకరించి భారతదేశమునకు స్వరాజ్యము నిచ్చుట ఆంగ్లేయుల విధి" యని యొక గొప్ప కరపత్రమును తయారుచేసి దానిని తత్సభాధ్యక్షునకుఁ బంపెను.

ఈతీరున తిలకు ఆంగ్లదేశమున నూర్గురకైన సాధ్యపడని గొప్పకార్యము నొక్కఁడు నిర్వహించి, ౧౯౧౯-వ సంవత్సరము నవంబరు నెలలో మరలి స్వదేశమునకు వచ్చెను. తిలకు ఇంగ్లండులో నున్నంతకాలమును ఇక్కడ ప్రజలకు నిమిష మొకమహాయుగముగా నుండెను. అక్కడ తిలకు నిమిష మొక్కయుగ మంత విలువగలదానినిగా భావించి పనిచేసెను.

తిలకు ఇంగ్లండులో నున్నపుడు ఏబిల్లును గుఱించిన విచారణలో జాయింటు కమిటీయెదుట సాక్ష్యమిచ్చెనో అది (మాంటుఫర్డు సంస్కరణముల బిల్లు) ఆతఁడు భారతదేశమునకు వచ్చినకొలఁదిదినములకే చట్టమయి జార్జిచక్రవర్తియనుమతిని బడసెను. ఎవ రెన్నిచెప్పినను పాలకులు పాలితుల యభిప్రాయములను పాలింప లేదు. తిలకు ఈశాసనము నిష్ప్రయోజన మనియెను. పార్లమెంటు ఏమి యిచ్చినను "సంపూర్ణస్వరాజ్యము నిమిత్తము ప్రజలు పూర్ణమైన కృషిచేయవలయు" నని తిలకు ప్రజలకు బోధించెను. అమృతసరమున జరిగిన జాతీయమహాసభలో తిలకు సంస్కరణశాసనమును బహిష్కరింపవలయు నని వాదించెను ; గాని గాంధీగారు అందులకు అంగీకరింపలేదు. "శాసనమును మనము పరిగ్రహింపవలెను. దొరతనమువారికి సాయపడవలయు" నని వారు వాదించిరి. తీవ్రవాద ప్రతివాదములు జరిగెను. "తునితగవుగాళ్ల" తీవ్రప్రయత్నమున రాజీ కుదిరెను. "సంస్కరణశాసనము ఆశాభంగములు గలిగించినది ; అయినను ప్రజలు దానిని ఉపయోగించి ఇంకను సంపూర్ణ స్వరాజ్యప్రాప్తినిమిత్తము పనిచేయవలెను" అని తుదకు మహాసభలో తీర్మానింపఁబడియెను. తుదకు గాంధీగారికి మాత్రము తమవాదము తప్పు. అని మార్చుకొనక తప్పినది గాదు.

౧౯౨౦-వ సంవత్సరమధ్యమున తిలకుమహాశయునకు దేహారోగ్యము చెడియెను. వ్యాధి ప్రబలునప్పటి కాతఁడు బొంబాయినగరమున సర్దారుగృహమున నుండెను. ఒక దినముకంటె యొకదినముస్థితి విషమింపఁబొడఁగెను. మహాసమర్థులగు వైద్యు లనేకులు పనిచేసిరి ; కాని ఇఁక ప్రయోజనము లేదని నిరాశఁ గలిగెను. పునహాయంతయు స్పెషలురైళ్లలో వచ్చి బొంబాయి చేరెను. గంధి మున్నగు ప్రముఖు లనేకులు తిలకుపాదములను కనిపెట్టుకొనియుండిరి. తుదకు "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం" మను గీతావాక్యమును స్మరించుచు లోకమాన్య బాలగంగాధర తిలకు కైలాసమునకుఁ బోయెను.

నాఁడు బొంబాయి పునహాలు సర్దారుగృహమువద్దనే యుండెను. అయిదు లక్షలమంది ప్రజలు లోకమాన్యుని దర్శించుటకు వచ్చిరి. వీథియంతయు క్రిక్కిరిసిపోయెను. రాకపోక లాగిపోయెను. సర్దారుగృహమునుండి ఉదయముననే బయలుదేరిన శవము సమీపముననే యున్న శ్మశానమును చేరునప్పటికి ఒంటిగంట యయ్యెను. దొరతనమువారు ఎవరికిని ఎప్పుడును అంగీకరింపని స్థలమున తిలకు శరీరమును దహనము చేయుట కనుజ్ఞ నిచ్చిరి. ఒక పార్సీమహాశయుఁడు చితికి సరిపడినన్ని మంచిగంధపుతుండ్లను సమర్పించెను.

ఈసమయమున లజపతిరాయి పంజాబుమెయిలుదిగి రొజుకొనుచు వచ్చెను, గాని ఎవరు వచ్చినను ఏమి లాభము? లోకమాన్యుని పాంచభౌతికశరీరము పంచ భూతములలో కలిసిపోయెను. ఆతనియాత్మ పరమాత్మలో లీనమయ్యెను; గాని ఆమూర్తి, ఆతేజోరాశి ఇంకను కనులయెదుట నిలిచియేయున్నది. ఆగంభీరవాగ్గుంభనము ఇంకను చెవులలో అమృతమును వర్షించుచు, నవశక్తిని సంఘటించుచునే యున్నది.

---

# 127. మోహనదాసకరంచంద్ గాంధి

శ్లో. "తుంగత్వ మితరా నాద్రౌ నేదం సింధా వగాధతా,
అలంఘనీయ తా హేతు రుభయా తన్మనస్విని."    (శిశుపాలవధ. ౨. సర్గ. ౪౮ ప.)

గాంధి ౧౮౬౯-వ సంవత్సరము అక్టోబరునెల ౨-వ తేదీని గుజరాతీదేశమున జన్మించెను. వర్ణమున ఆతఁడు వైశ్యుఁడు. మతమున జైనుఁడు. ఆతని తండ్రి, తాత మున్నగు పూర్వులు అందఱును సంస్థానములయందు దివానులుగా పనిచేసిరి. గాంధి తండ్రి కొన్నిదినములు బొంబాయిదొరతనమువారి సభలో సభ్యుఁడుగాఁ గూడ నుండెను. తండ్రి చాల నీతిమంతుఁడు. ఎదుటివాఁడు తప్పుచేసినపుడు నిర్భయముగా నెదిరించును. తల్లికి దైవభక్తి మెండు. సదాచారములను ఎప్పుడును ఆమె విడిచి యెఱుఁగదు. తల్లిదండ్రులసుగుణములు గాంధియందు పూర్తిగ అంకిత మయ్యెను.

గాంధి ప్రాథమికవిద్యను భారతదేశముననే చదివి, పిదప లండనునకుఁ బోయెను. ఆతని తల్లి తొలుత ఆతఁడు ఇంగ్లాండునకుఁ బోవుటకుఁ అంగీకరింపలేదు. "నేను మద్యము త్రాగను. మాంసమును ముట్టను. స్త్రీలను స్పృశింపను" అని ఒకజైన పురోహితునియెదుట శపథము తొల్చినపిదప ఆమె కుమారుని ప్రయాణము నంగీకరించెను. గాంధి ఎప్పుడును శపథమును దప్పలేదు. ఆతఁడు ఇంగ్లాండులో మెట్రిక్యులేషనుపరీక్షయందు నెగ్గి, బారిష్టరుపరీక్షలో విజయముఁ

బడసి, బొంబాయికి వచ్చి ప్రధానన్యాయస్థానమున పని ప్రారంభించెను. పిదప ౧౮౯౩-వ సంవత్సరమున నాతఁడు ఒక వ్యాజ్యెములో పనిచేయుటకు నేటాలు నకుఁ బోయి, అక్కడనుండి ట్రాన్సువాలుకుఁ బోయెను. చాలకష్టముమీఁద గాంధి నేటాలు ప్రధానన్యాయస్థానమున బారిష్టరుగాఁ జేర్చుకొనఁబడెను. అచ్చట నున్న భారతీయు లందఱును గాంధి సుగుణసంపత్తినిఁ జూచి అచ్చట నుండవలసిన దని ప్రార్థించిరి. ఆతఁడు అట్లేచేసి ఆదేశమున భారతీయులకు సంభవించు అన్యాయములు ఇక్కట్టులు మున్నగువానిని తొలఁగింపుఁడు అని దొరతనమువారికి అనేకములయిన అర్జీలను వ్రాసెను. దొరతనమువారు కొన్నిటిని తొలఁగించిరి. ఆదేశీయులు ఎల్లరును ఆతనిభాషాపాండిత్యమునకు చాలమెచ్చుకొనిరి. ఇంతలో నేటాలు దొరతనమువారు ఆసియాఖండమువారిని బహిష్కరించుటకు ఒకచట్టమును చేసిరి, గాంధి చాలా పాటుపడి ఆశాసనమును తొలఁగించివేసెను; కాని భారతీయులకు పార్లమెంటులో అధికారము లేకుండఁజేసిన శాసనమునిమిత్తముగూడఁ జాలఁ బని చేసియు లాభము గనలేకపోయెను.

నేటాలునందలి తమకడగండ్లను భారతదేశమున ఎల్లరకును తెలుపవలసిన దని అచ్చటి భారతీయులు గాంధిని ఇచ్చటకుఁ బంపిరి. ఆతఁడు ఇక్కడకు వచ్చి చేయఁగల పనులు అన్నియుఁ జేసెను. ఈసందర్భమున గాంధి దక్షిణాఫ్రికాయందలి ఆంగ్లప్రముఖులను క్రూరత్వము, నిరంకుశత్వము, దుర్నీతి, మున్నగు దుర్గుణములను ఆరోపించి నిందించుచున్నాఁడు అను అసత్యతంత్రీవార్తలు దక్షిణాఫ్రికాకు పంపఁబడెను. దానిమీఁద అచ్చటిఆంగ్లేయులు మండిపడిరి. ఈసమయమునందే కుటుంబసహితముగా గాంధి నేటాలునకుఁ బ్రయాణమయ్యెను. ఆతనివెంట ననేకభారతీయులు వెళ్లిరి. వారు ఓడకదలినవెంటనే 'గాంధి అచ్చటి తెల్లకూలీల మీఁద పోటీకి నల్లకూలీలను తెచ్చుచున్నాఁ' డని అసత్యవార్తలు పంపఁబడెను. దీనితో నచ్చటి యూరపియనులకోపము పూర్తియయ్యెను. రేవు అధికారి కొన్ని దినములవఱకును ఓడను రేవులోనికి రాకుండ నిషేధించెను; కాని ఈనిషేధము త్వరలోనే పోయెను. గాంధి స్టీమరు దిగుచున్నాఁడని తెలిసి ఆతనినిజూడ తెల్లవారు కోపారుణాస్యులై అనేకులు రేవులోనికి వచ్చిరి. పోలీసు ఇన్స్పెక్టరు "అపాయము రావచ్చును. మీరు ఓడదిగవలదు" అని చెప్పెను; కాని గాంధి అందులకు అంగీకరింపలేదు. "తెల్లవారు నీతిమంతులు అనియు, ధర్మాత్ములు అనియు నానమ్మకము. నేను పట్టణములోనికి ఇప్పుడే పోయెదను" అని గాంధి సాహసించి ఓడదిగెను. తోడనే ఆగుంపు ఆతనిమీఁదఁ బడినది. అపుడు పోలీసు సూపరింటెండెంటుభార్యవచ్చి గొడుగుచాటు పెట్టి ఆతనిని ఒక భారతీయవర్తకుని ఇంటిలో

నికిఁ గొనిపోయెను. ఇంతలో నామె గుంపువచ్చి నిరపరాధుఁడగు వర్తకుని ఇల్లు పాడుచేయునని తలంచి పోలీసు కానిస్టేబిలు వేషము వేసి గాంధిని తప్పించెను. కొలఁదిదినములలో కలవరము తగ్గినతరువాత ఓడను రేవులోనికి రానీయక నిషేధముచేసిన ఉద్యోగివచ్చి "మీసంగతి తెలియక నేను అట్టిపని చేసితిని. క్షమింపవలసిన" దని ప్రార్థించి ఒక అరగంటలో చనిపోయెను.

౧౮౯౯-వ సంవత్సరములో దక్షిణ ఆఫ్రికాలో బోయరుయుద్ధము ప్రారంభ మయ్యెను. అపుడు గాంధి యుద్ధములో గాయపడిన సేనకు సేవచేయుటకు భారతీయులను ఒకగుంపుగా చేర్చి "మాసేవను అంగీకరింపవలసినది" అని దొరతనము వారిని కోరఁగా వారు అంగీకరించిరి. ఆసమయమున గాంధి చేసిన సేవకు మెచ్చి ఆదొరతనమువారు ఒకపతకమును బహుమానము చేసిరి.

ఇట్లుండఁగా గాంధికి చాలజబ్బు చేసెను. స్థానము మార్పవలయునను సంకల్ప ముతో నాతఁడు భారతదేశమునకుఁ బ్రయాణ మయ్యెను. అప్పుడు నేటాలు నందలి భారతీయులు గాంధికి ఒక బంగారు పళ్లెమును, ఆతని భార్యకు సువర్ణాభరణములను గానుక పెట్టిరి; గాంధి వానిని స్వీకరింపక "ఎప్పుడైన భారతసంఘమునకు తీరని ఇబ్బంది వచ్చినచో అపుడు ఉపయోగించుటకు వీనిని జాగ్రత్తచేయుఁడు" అని చెప్పి భారతదేశమునకు వచ్చి కొన్ని దినములు అయినతరువాత బొంబాయి ప్రధాన న్యాయస్థానములో పని ప్రారంభించెను.

కొన్ని దినములకు చేంబర్లేను ఇంగ్లాండునుండి రాజ్యాంగము సందర్భమున దక్షిణాఫ్రికాకు ప్రయాణమయ్యెను. అప్పుడు నేటాలులోనున్న భారతీయులు "చేంబర్లేనుగారు ఇక్కడకు వచ్చుచున్నారు. వారికి మేము విజ్ఞాపనము సమర్పింపఁ దలఁచినాము. అందులకు మీరు ఉండవలయును; గావున వెంటనే రావలసిన" దని తంత్రివార్త నంపిరి. గాంధి వెంటనే వెడలిపోయెను; గాని విజ్ఞాపకవర్గములో ఆతనిని దొరతనమువారు చేర్పరైరి. "మీరే ఈపనిని నిర్వహించుకొనుఁడు" అని గాంధి భారతీయులకుఁ జెప్పెను. వారు తొలుత "మీరు లేకున్న మేము మాని వేసెద" మని తొలుత పట్టుపట్టిరి; కాని తుదకు సాధకబాధకముల నెఱింగించిన తరువాత అట్లే చేసిరి; అయినను వారి బాధలు అంతకంతకుఁ బెరిగిపోసాగెను. అది చూచి వారు "మీరు ఇక్కడ నుండకున్న మేము అనాథుల మయ్యెదము. దయతో ఇచ్చటనే యుండుఁడు" అని కోరఁగా నాతఁడు అట్లుచేసెను. నేటాలులో జోహాన్సు బర్గు అను నొకనగరము కలదు. ఒకపుడు ఆనగరమున భారతీయులు విశేషముగ నున్న వీథులలో ప్లేగు విజృంభించెను; కాని పురపారిశుద్ధ్యసంఘమువారు జోక్యము కలిగించుకొనరైరి. భారతీయులు అనేకులు చనిపోసాగిరి. అది చూచి గాంధి స్వయ

ముగ ఔషధసౌకర్యములను గలిగించి అనేకులను మృత్యువు వాతనుండి రక్షించెను. దొరతనమువారు "ప్లేగు గాంధి చెప్పినపుడు ప్రవేశింపలేదు. తీవ్రముగఁ గూడ లేదు" అని చెప్పిరి; కాని గాంధిని మాత్రము చాల మెచ్చుకొనిరి. ఆసంవత్సరము భారతీయులకును, పురపారిశుద్ధ్యసంఘము వారికిని వివాదలు సంభవించెను. ఈవ్యాజ్యెములో గాంధికి చాలధనము దొరకెను; కాని దానిని ఆతఁడు భారతీయుల సౌకర్యములనిమిత్తమే ఖర్చుపెట్టెను.

భారతీయులసంగతి ఆంగ్లేయులసంగతి భారతీయులకును దెలిసినఁగాని వారికి పొత్తు కలియదని భావించి గాంధి "ఇండియన్ ఒపీనియన్" అను నొక పత్రికను ప్రారంభించెను. అందు ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, అరవభాషలలో వ్యాసములు వ్రాయించుచుండెను; కాని కొన్నిదినములు కడచినతరువాత ఇంగ్లీషు గుజరాతీలు మాత్రమే నిలుపఁబడెను. గాంధి పత్రికకొఱకు అహోరాత్రములు చాల పాటుపడెను; గాని దానితో నాతనికి ఎట్టి ఆర్థికసంబంధమును లేదు. దాని నిమిత్తము ఆతఁడు ఎంతపాటుపడినను అభివృద్ధికి రాలేదు. అందులకు ఆతఁడు దీర్ఘముగ యోచించి పట్టణమునుండి కొనిపోయి పల్లెలోఁ బెట్టినచో బాగుగనుండునని తలంచి నేటాలునార్తుకోష్టురైలునకు సమీపమున ఫోనిక్సు అనుప్రదేశమున నూఱుఎకరముల భూమినిఁ గొని ఇండ్లు కట్టించి మఱల పత్రికాప్రచారమును ప్రారంభించెను.

ఇంతలో నేటాలునందలి ప్రజలు దొరతనముమీఁద తిరుగఁబడిరి. దాని నడఁచుటకు సాయపడఁదలఁచి గాంధి భారతీయులను గొందఱను జేర్చుకొనెను. పిదప దొరతనమువారి ఆజ్ఞనుబొంది అతఁడు గాయపడినవారిని మోసికొని పోవుటయందును, వైద్యోపచారములు చేయుటయందును చాల పనిచేసెను. ఈసందర్భమున నాతఁడు అనేకకష్టములను పొందెను; కాని ఆతఁడు పరిగణింపలేదు. ఇదియంతయు శాంతించినతరువాత నాతఁడు జోహాన్సుబర్గులో మఱల బారిష్టరీపని ప్రారంభించెను.

దక్షిణాఫ్రికా దొరతనమువారికి భారతీయులమీఁది అసూయ గంటగంటకుఁ బెరిగిపోవుచునే యుండెను. వారు భారతీయుల నీతిని, మతమును, ఆత్మగౌరవమును, మానవత్వమునుగూడ మంటఁగలుపునట్టి యొక క్రూరశాసనము జేయఁబూనిరి. గాంధి అపుడు హెచ్. ఓ. అల్లి అనునాతనితోఁ గలసి ఇంగ్లండునకుఁ బోయి అచ్చటి పెద్దలతో మాటాడెను. తొలుత ఇంగ్లాండు దొరతనమువారు ఆశాసనమును ప్రస్తుతము అమలులో పెట్టవలదని నిర్ణయించిరి; కాని యీ నిరోధము నిలిచినది గాదు. తుదకు శాసనము నిశ్చయమయ్యెను. గాంధి అపుడు భారతీయులకు సంగతులన్నియు బోధించి "మేము ఈశాసనమునకు లోఁబడము"

అని దొరతనమువారిని ఎదిరించెను. దానిమీఁద దొరతనము నిర్దయత్వము వహించి గాంధిని ఆతని అనుచరులను కైదులోఁ బెట్టిరి. పిదప జనరలు స్మట్స్ అనునతఁడు వచ్చి "కొలఁదిదినములలో శాసనము రద్దుపడునట్లు చేసెదము. ప్రకృతము ఈకల్లోలము మాన్పుఁడు" అని రాజీకోరెను. గాంధి కాఁబోలునని నమ్మి అంగీకరించెను; గాని స్మట్స్ విశ్వాసద్రోహము చేసెను. ఆతఁడు శాసనమును రద్దుచేయక పోవుటయేగాక ఇంకను భారతీయులకును కొన్ని తీరని ఇబ్బందులు గలిగించెను. భారతీయులు అంతటను "గాంధి ధైర్యమును తన తోడిదేశీయులను గూడ విడిచి దొరతనములో కలిసిపోయినాఁడు" అని దూషింపసాగిరి. అయినను గాంధి చలింపక హాజీ హబీబ్ సాహేబుతోఁ గలిసి ఇంగ్లాండునకుఁ బోయి స్థితిగతులు అన్నియు బ్రిటీషు దొరతనమునకు ఎఱిఁగించెను. ఎంతచేసినను తుదకు ఆతని ప్రయత్నములు అన్నియు కానఁగాచిన వెన్నెలవలె వ్యర్థము లయ్యెను. అంత నాతఁడు మఱల నేటాలుచేరుకొని మఱల కల్లోలము ప్రారంభించి శాసనము నెదిరించెను. చాలగందరగోళము జరిగినవెనుక తుదకు ఆతని ప్రయత్నములు కొంతవఱకును ఫలించెను.

ప్రపంచమునందు అంతటనుగల నిర్లిప్తులలో గంధి అగ్రేసరుఁడు అని చెప్పవచ్చును. ఒకప్పుడు ఒకపఠాను గాంధిని కొట్టెను. ఆదెబ్బతో నాతని ప్రాణములు పోవలసినదే. అంత దెబ్బకొట్టినను గాంధి వానిమీఁద అభియోగము తేలేదు. ఇటీవల దొరతనమువారే ఆపఠానుని శాసనధిక్కారము చేసినందులకు దేశాంతరవాసశిక్ష విధించి భారతభూమికి పంపిరి. ఆతఁడు ఇక్కడకు వచ్చిన తరువాత "మీరు జంకవలదు. మీమార్గము మిగుల నుత్కృష్టమయినది. నేను మీ యాజ్ఞలను నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నాను" అని గాంధికి జాబు వ్రాసెను.

ఒకప్పుడు గాంధి భారతీయుల పక్షమున దొరతనముతో పోరాడి శిక్షింపఁబడెను. రక్షకభటులు ఆతనిని కైదునకుఁ గొనిపోవుచుండఁగా ఆతనికొమార్తెకు చాల జబ్బుగా నున్నదని వార్తవచ్చెను. "బిడ్డకు భయము లేదు. ఇచ్చటి భారతీయులను విడిచి పోఁజాలను" అని యాతఁడు ఏమియు చలింపలేదు. కైదులోఁ బెట్టిన తరువాత భార్యకు గొప్పరోగము వచ్చినదనియు, బ్రతుకుట దుర్ఘటమనియు తంత్రీవార్త వచ్చెను. "అపరాధమును చెల్లించెదవేని నిన్ను విడిచిపెట్టుదుము. పోయి భార్యను జూడవచ్చును" అని దండనాధికారి చెప్పెను; గాని ఆతఁడు "నేను ఇక్కడనుండి వెడలి పోయిన యెడల భారతీయులు అధైర్యము వహింతురు; గావున నేను పోను" అని ఆతఁడు అందులకు నిరాకరించెను. ఆతఁడు కైదులోనికిఁ బోయెను, అంతకుఁ బూర్వమే ఆతని పెద్దకుమారుఁడు గూడ కైదులో

నుండెను. చిన్నకుమారుఁడు ఇట్టికష్టములు అనుభవింపవలయునని గాంధి ఆతనినిఁ గూడ వెంటనిడుకొని పోయెను.

ఒకప్పుడు గాంధియు మఱికొందఱు భారతీయులును కైదులోఁ బెట్టఁబడిరి. గాంధికి మాత్రము మంచియాహారము నిచ్చి దొరతనమువారు తక్కినవారి కందఱకును చాల చెడ్డఆహారము నివ్వసాగిరి. అందులకు గాంధి యంగీకరింపక "అందఱకును సమానముగ నాహారము ఇండు" అని నలువదిరోజులు పోరాడెను. తుదకాతఁడు ఆప్రయత్నములోఁగూడ జయించెను.

ఆతఁడు దక్షిణాఫ్రికాలోను, భారతదేశమునందును, ఇంకను అనేకోత్కృష్ట కార్యములను జేసెను. అవియన్నియు నిచ్చట వర్ణించిన గ్రంథ విస్తరమగును. అతఁడు చేసిన పనులు అన్నియుఁ దెలిసికొనఁ దలఁచువారికి ఇంకను అనేకగ్రంథములు గలవు. మఱి మూఁడు విషయములను మాత్రము ఇట నుదాహరింతును.

చాంపరాన్ జిల్లాలో భారతీయులకును, యూరోపియనులకును తగాదాలు వచ్చెను. భారతీయవ్యవసాయదారులను యూరోపియను ధనికులు అనేకవిధముల బాధింపసాగిరి. అపుడు గాంధి అచ్చటకుఁ బోయి బాధనిని తొలఁగించుటకు ప్రయత్నములు ప్రారంభించెను. ఇంతలో భారతదేశపుదొరతనమువారు ఒక సంఘమును ఏర్పఱచి విచారణలు జరిపించి కొంతవఱకు సౌకర్యములను గలిగించిరి.

అహమ్మదాబాదులో అఱువది బట్టలునేయు యంత్రాలయములు గలవు. అందు పదివేల కూలివాండ్రు పనిచేయుచుండిరి. అప్పుడు లోకమునంతను తలక్రిందులుచేయుచున్న ఐరోపామహాసంగ్రామమువలన ఆహారపదార్థముల వెలలును, వస్త్రముల వెలలును చాల పెరిగిపోవుటచే జీతములు చాలక ఆకూలివాండ్రు మూఁడవవంతు జీతము హెచ్చుచేయవలసినదని తమ యజమానులను గోరిరి. వారు అంగీకరింపరైరి. తుదకు గాంధికిఁగూడ పని గలిగెను. ఆతఁడు వచ్చియంత్రాలయాధికారులతో మాట్లాడెను; కాని ఎన్నివిధముల ప్రయత్నించినను ప్రయోజనము లేకపోయెను. తుదకు గాంధి "కూలిజనులు కోరినట్లు చేయునంతవఱకును నేను భుజింప" నని శపథము దాల్చెను. యంత్రాలయాధికారులు మొదటిరోజున హేళనము చేసిరి. రెండవరోజున బింకములు తోలిరి. మూఁడవరోజున తహతహలాడి తుదకు గాంధి చెప్పినట్లు అంగీకరించిరి. గాంధి అప్పుడు తనవ్రతమును ఉపసంహరించుకొనెను.

౧౯౧౭ వ సంవత్సరమున గుజరాతీదేశమునందలి కెయిరాజిల్లాలోని పంటలు చెడిపోయెను. రూపాయలో నాల్గవవంతు పంటయైనను పండలేదు. బీదరైతులు "పన్నులు చెల్లించుటకు మీఁదటి వఱకును వాయిదా ఇవ్వవల

యును" అని కోరిరి; కాని బొంబాయి దొరతనమువారు నిరాకరించిరి. మఱల-ఈరూపమున గాంధికి పని గలిగెను. ఆతఁడు సంగతులు అన్నియు విచారించి కెయిరాప్రజలకు సాత్వికనిరోధవ్రతమును బోధించెను. తోడనే రెండువందలరైతులు "మేము పన్నులు చెల్లింపము; మమ్ము మీరేమి జేసినను అనుభవించుటకుసిద్ధముగానున్నాము" అని ప్రకటించిరి. సాత్వికనిరోధకులసంఖ్య దినదినమును పెరిగిపోయెను. దొరతనమువారు కొందఱి ఆస్తులను జప్తుచేసిరి; కాని తుదకు గాంధితో రాజీపడి రైతుల పద్ధతి నంగీకరించిరి.

ప్రపంచమంతయు నలముకొనిన ఐరోపామహాసంగ్రామముయొక్క వేడిమి యింకను తగ్గలేదు. ఆంగ్లేయులకు చాలమంది జనులును, ధనమును కావలసివచ్చెను. భారతీయులలో పక్షము లేర్పడెను. దొరతనమునకు ఏవిధముగను సాహాయ్యము చేయఁగూడ దని కొందరు పట్టుపట్టిరి. గాంధి వారికి వ్యతిరేకముగ నిలిచి దేశమంతయు సంచరించి సైన్యములో అనేకవీరులను జేర్పించెను. అసంఖ్యధనమును గూడ సమకూర్చెను.

ఈసాహాయ్యము ఆంగ్లేయులకు సంజీవి యయ్యెను. దీని యాధారమున వారు విజయమును బడయ నారంభించిరి. ౧౯౧౭-వ సంవత్సరము ఆగస్టు ౨౦.వ తేదీని కామన్సుసభలో యుద్ధమున అనంతసాహాయ్యమును జేయుచున్న భారతీయులకు బాధ్యతాయుతస్వపరిపాలనము నొసంగవలయుననియు అందులకు మొదట నేర్పరుపవలసిన విధానము ఏదో నిర్ణయించుటకు అప్పుడు భారతదేశమును సెక్రిటరీ యగు మాంటాగూగారును, రాజప్రతినిధి యగు చెల్మ్సుఫర్డుప్రభువును దేశమంతయు తిరిగి విచారణచేసి ప్రజాభిప్రాయము నెఱింగి నివేదికమును పంపవలయుననియు అధికారులు ప్రకటించిరి. ఇందుల కనుగుణముగ మాంటాగూమంత్రి హిందూదేశమునకు వచ్చి రాజప్రతినిధితో పర్యటనము ప్రారంభించెను.

ఈ సమయమున గాంధి యొక ప్రణాళికను తయారుచేయించి అందు సూచింపఁబడి విధమున హిందువులకు పరిపాలనాబాధ్యత నీయవలసిన దని దేశీయులందఱిచేతను ఆప్రణాళికమీఁద సంతకములు చేయించి ప్రతిష్ఠలమునందును దానిని మంత్రిపుంగవున కిప్పించెను. దేశీయు లందఱును ఆప్రణాళిక ననుసరించియే తమ కధికారముల నీయవలసిన దని దృఢముగఁ గోరిరి.

మంత్రియు రాజప్రతినిధియు ఇట్లు సంచారము చేయుచుండ ఒక దెస భారతప్రభుత్వమున క్రూరశాసననిర్మాణమునకు పునాదులు ప్రారంభింపఁబడెను. రౌలటుదొర యాజమాన్యమున నొకసంఘము దేశమునందలి విప్లవసంఘములను గుఱించి విచారణ చేసియుండెను. దాని నాధారపఱుచుకొని ప్రభుత్వమువారు

శాసనసభలో రౌలటుబిల్లును ప్రవేశపెట్టిరి. అన్నికక్షులకు చేరిన ప్రతినిధులును దాని నెదిరించిరి. దేశమంతయు వద్దువద్దని గగ్గోలుపడెను; కాని అధికారుల పట్టుదలవలన ఇదివఱకున్న అనేకనిరంకుశశాసనములకు తోడుగ రౌలటుబిల్లు రౌలటుశాసన మయ్యెను.

ఈసందర్భమున గాంధి చాల పనిచేసెను. దేశమంతయు తిరిగి శాంతనిరోధము నవలంబింపవలయు నని ప్రజలకు బోధించెను. దీని ననేకు లామోదించిరి. అంతటను అల్లరులు ప్రారంభమయ్యెను. శాంతమును వదలఁగూడ దని గాంధి గట్టిగ బోధించెను; గాని మూకచెలరేగిన తరువాత అది యొకదారిని బోవునని చెప్పుట కవకాశ లేదుగదా! దొరతనము ప్రజలకు శిక్షలు విధింపఁజొచ్చెను. ఈసమయమున గాంధి ఢిల్లీకి బ్రయాణమయ్యెను. అప్పుడు పాంచాలదేశము నేలు లెప్టినెంటు గవర్నరు "మైకేలు ఓడ్వ్యాయరు" అను నాతఁడై యుండెను. నిరంకుశమున కీతఁడు జంగమరూపము. ప్రజాపీడనమున కీతఁడు ముందంజ. ఇతరపరగణాలలో ప్రకటింపఁబడు పత్రికలు పాంచాలమునకు రాఁగూడ దని మొట్టమొదట శాసించిన యాప్రభువు గాంధిని పంజాబులో నడుగు పెట్టఁగూడదని నిషేధించెను; గాని గాంధి యందులకు అంగీకరింపక రైలెక్కెను. సరిహద్దులో వెనుకకు బోవలసినదని అధికారులు చెప్పిరి. గాంధి బండి దిగనందున అతఁడున్న పెట్టెను తొలఁగించి అధికారులు రైలును నడుపుకొనిపోయిరి.

ఈసంగతి పంజాబులో తెలిసిపోయెను. వెంటనే అంతటను అల్లరులు చెలరేఁగెను. అధికారులు క్రూరశిక్షలు ప్రారంభించిరి. అమృతసరమున డయ్యరు అను సేనాధిపతి తన యాజ్ఞలను జవదాఁటి రని చెప్పి జలియన్‌వాలాబాగు అనుతోటలో సభకూడియున్న రెండువేల జనులమీఁద ఆగ్నేయాస్త్రమును పురికొల్పెను. ఇఁక చెప్పవలసిన దేమున్నది? అనేకులు వికలాంగు లయిరి. అనేకులు మృతిపొందిరి. దేశమంతయు హాహాకారములు గావించెను. గాంధి ఇట్టి క్రూరకృత్యములను గావించిన అధికారులను శిక్షింపవలయునని—ఉద్యోగములనుండి తొలఁగింపవలయు ననియు అంతమాత్రమే చాలు ననియు చెప్పెను. దేశమంతయు ఆతనిమాట ననువదించెను; గాని ప్రయోజనము కలుగలేదు. ఆంగ్లదేశమున ఆయాంగ్లేయులకు గొప్ప బహుమానములుగూడ ఈయఁబడెను.

పిదప మాంటాగూచెమ్సుఫర్డుదొరలు దేశమంతయు తిరిగి నేర్చుకొనిన విషయములను పురస్కరించుకొని యొకనివేదికను తయారుచేసిరి. దానితో దేశమున పక్షములు బయలుదేరెను. చక్రవర్తిగారు ఆబిల్లును శాసనము చేసి సందేశమును పంపుటతో కక్షులు దృఢపడెను. గాంధి దొరతనమువారిపక్షమున నిలిచెను.

కాంగ్రెసులో ఈశాసనమును అంగీకరించుటా? మానుటా? అను విషయము చర్చకు వచ్చెను. తిలకు వద్దనెను. గాంధి కావలె ననియెను. దీర్ఘచర్చ జరిగినమీఁదట గాంధి వాదమునకు నెగ్గెను.

గాంధివద్ద నొక విచిత్రమైన గుణ మున్నది. తన యిష్టము ననుసరించి ప్రజలు నడువవలయును. పరాజయము స్వయముగ ననుభవించిన గాని తనవాదము నాతఁడు విడువఁడు. ఎదుటివారు ఎంత యనుభవపూర్వకముగ చెప్పినను వారివాదము అరణ్యరోదనము కావలసినదే. అయితే ఈ తన నిరంకుశచర్యను గాంధి చమత్కారముగ కప్పిపుచ్చుకొనఁగలఁడు.

కాంగ్రెసులో గాంధివాదము నెగ్గెను; కాని శాసనము అమలులోనికి వచ్చినతరువాత తిలకువాదము మంచి దయ్యెను. గాంధికి తన యభిప్రాయమును మార్చుకొనవలసివచ్చెను. ఈపరాజయము రాకుండ ఆతఁడు తిలకువాదము నంగీకరించియుండినచో "శాసనము మంచిదా? చెడ్డదా?" యను విచారణమున గడచి పోయిన అమూల్యమగు కాలమున మఱికొంత పని జరిగియుండును.

ఖిలాఫత్తు విషయమున జరిగిన యక్రమమును పురస్కరించుకొని గాంధిదొరతనముమీఁద తిరుగఁబడెను. అప్పు డీతఁడు సహాయనిరాకరణవ్రతమును ప్రారంభించెను. కలకత్తాలో జరిగిన కాంగ్రెసుయొక్క ప్రత్యేకసమావేశమున గాంధి చెప్పిన సూత్రములు స్థిరపఱుపఁబడియెను. అవి యివి:—

౧. అందఱును దొరతనమువా రిచ్చిన బిరుదములను విడువవలెను.

౨. న్యాయవాదు లందఱును తమ వృత్తిని విడిచి, దేశసేవ ప్రారంభింపవలెను.

3. విద్యార్థులు దొరతనమువారి పాఠశాలలను విడిచి, జాతీయ పాఠశాలలలో చేరవలెను. లేకున్న చదువు మానివేసి దేశసేవ చేయవలెను.

౪. శాసనసభల నందఱును బహిష్కరింపవలయును. ఎవరును అభ్యర్థులై నిలువఁగూడదు. ఎవరును ఓట్లు నీయఁగూడదు.

౫. హిందువు లందఱును స్వదేశవ్రతమును అవలంబించి విదేశవస్తువులను బహిష్కరింపవలయును.

దేశము బాగుపడుటకు ఈసిద్ధాంతములు మంచివే; గాని యివి ఆచరణమున నిలువలేదు. ప్రారంభమున విద్యార్థులు చురుకుదనము చూపిరి; కాని తరువాత వెనుదీసిరి. శాసనసభాబహిష్కారము వ్యర్థమైనది. న్యాయవాదులు ప్రారంభమున కొందరు—చాల తక్కువమందిమాత్రమే వృత్తి మానిరి; కాని యేయొక్కరిద్దరో తప్ప తక్కిన వారందఱును చివరకు మఱల వృత్తిలో ప్రవేశించిరి. బిరుదుల

విషయముగూడ ఇట్లే పరిష్కారమయ్యెను. స్వదేశీవ్రతము బంగాళావిభజన సమయమునందుకంటె అధికముగ జరుగలేదు.

తరువాత మూడుమాసములకు నాగపురమున జాతీయమహాసభ జరిగెను. అక్కడఁగూడ గాంధికే విజయము గలిగెను. చిత్తరంజనదాసువంటి ప్రముఖులు అనేకులు ఆమార్గమునఁ బడి ప్రయాణము ప్రారంభించిరి.

దేశమున రాజతిరస్కారము ప్రబలినది. అనేకదోషములమీఁద అనేకులు చెఱసాలల కేగిరి. దొరతనమువారు కేవలము ప్రతిష్ఠనే ముఖ్యముగా చూచుకొని పనిచేసి ప్రజల యాదరమును పూర్తిగఁ గోలుపోయిరి.

పిదప గాంధి ఒకకోటిరూపాయలును ఇరువదిగ్గెదులక్షలరాటములును కాంగ్రెసుపక్షమునకు కావలెనని చెప్పెను. కాంగ్రెసువారి లెక్కలో ఇరువది గ్గెదులక్షల రాటములును నిండిపోయెను. సొమ్ముగూడ వసూలయ్యెను. కాని ఫలము గలుగలేదు. ద్రవ్యమంతయు అక్రమమార్గములలో ఖర్చయ్యెను. రాటములలో నూటికి తొంబది మూల కూర్చుండెను.

తరువాత కాంగ్రెసు అహమ్మదాబాదులో జరిగెను. అప్పటికి స్వరాజ్యము వచ్చుననియుఁ స్వరాజ్యము వచ్చినపిదపనే అహమ్మదాబాదులో కాంగ్రెసు జరుగుననియు గాంధి చెప్పెను; గాని అట్లు జరుగలేదు. కాంగ్రెసు వలంటీయరులకు అసభ్య పనులు నియమింపఁబడెను. స్వరాజ్యము రాకుండుటకు గాంధి ఏమేమో కారణములు చెప్పెను; గాని అవి అతుకలేదు.

తరువాత గాంధి శాసనోల్లంఘనమునకు పూనుకొనెను. అందులకు కొన్ని షరతులను సూచించి అవి నెఱవేరిననే శాసనోల్లంఘనము ప్రారంభింపవలెనని తన యనుచరులకు చెప్పెను; గాని గుంటూరువగైరా ప్రాంతములలో కొందఱు తొందరపడి కారాగారములకుఁ బోయిరి. గాంధి మొదట బార్డోలీ తాలూకాను ఇందులకు తయారుచేసి తన ఆశ్రమవాసులకు అందఱకును అప్పగింతలు చేసి బయలు దేరెను; గాని చౌరాచౌరలో అల్లరులు, దౌర్జన్యము జరిగెనని మఱల వెనుకకు వచ్చెను. తాను తయారుచేసిన బార్డోలీలో అల్లరులు జరుగకున్నను ఆయుద్యమమును ఏల మానెనో ఆతఁడు సరిగ్గైన కారణములను చెప్పలేదు. కొలఁదిదినముల కాతఁడు అహమ్మదాబాదులో విచారింపఁబడి ఆఱుసంవత్సరముల విడిఖైదు విధింపఁ బడెను.

1924-వ సంవత్సరప్రారంభములో గాంధిగారికి గొప్ప జబ్బుచేసెను. బ్రతుకుటకూడ దుస్తరము అని తోఁచెను. 1924-వ సంవత్సరము డిసెంబరునెలలో గాంధిజీ బెల్గాము కాంగ్రెసునకు అధ్యక్షుఁడు ఆయెను.

ఆయన యీఅధ్యక్షతను చాల చాకచక్యముతో నిర్వహించెను. కార్యక్రమమును పెక్కుమంది పూర్వపుఅధ్యక్షులకంటె త్వరలో ముగించెను. ఆయన సర్వకార్యములను బహువేగముతో ముగించుచుండును. కాలహరణము ఆయనకు గిట్టదు.

ఇట్లు అనేకవిధముల కాంగ్రెసు అధ్యక్షతను సర్వనాయకులకు ఆదర్శము అగునట్లు చాల సమర్థతతోను చులుకుతనముతోను నిర్వహించి ఆయన కాంగ్రెసు డెలిగేట్ల మెప్పును పొందెను. ఇట్లింక నెన్నియో ఘనకార్యము లొనరించెను.

గాంధిజీ నేడు శతకోటిచంద్రులకాంతితో ఆకసము మధ్య చల్లగా వెలుగఁజొచ్చెను. ఆయనకీర్తి సర్వప్రపంచములోని సర్వపట్టణములందును, సర్వగ్రామములందును వ్యాపించెను.

లక్షలకొలఁది యుద్ధభటులు, గుఱ్ఱములు, ఏనుఁగులు, చనిపోయినను వేలకొలఁది ఆకాశవిమానములు, ఓడలు, ఫిరంగులు నాశమైనను స్వరాజ్యములో సహస్రాంశమును కూడ పొందలేని ప్రపంచమునందలి సర్వదేశములు "ఏమిరా! అంగవస్త్రమును ధరించిన ఈ అర్ధదిగంబరుఁడు ఆశ్వికదళములు, కాల్బలములు, తుపాకులు, ఫిరంగులు లేకయే ఏబదికోట్ల ప్రజలకు అధిపతి అగు బ్రిటిషుప్రభుత్వమును ఎట్లు లొంగదీసి స్వాధీనము చేసికొనఁగలిగెను? ఎట్లు రాష్ట్రస్వాతంత్ర్యమును సంపాదింపఁగలిగెను?" అని ఆశ్చర్యపడుచు ఆయనను గుఱించిన కథలనే నిత్యమును చెప్పుకొనఁజొచ్చిరి.

35 కోట్ల ప్రజలకు అధికారియగు హిందూదేశపు రాజప్రతినిధి 1937-వ సంవత్సరము ఆగష్టునెల మొదటి తేదీని ఉత్తరము వ్రాసి "మహాత్మా గాంధిజీ! ఒకసారి దర్శనము ఇత్తురా?" అని కోరి ఢిల్లీకి పిలిపించుకొని ఆయన ఆశీర్వాదమును పొందెను.

ఒకసారి, రెండుసారులు, మూఁడుసారులు, అర్జీలుపెట్టుకొనియు శ్రీరాజప్రతినిధిగారి దర్శనమును పొందఁజాలని రెండు, మూఁడు, నాలుగుకోట్ల రూప్యముల సంవత్సరాదాయములును, రత్నఖచిత కిరీటాది రాజోచితాలంకారములును, గజతురగరథాది చతురంగబలములును కల స్వదేశసంస్థానాధిపతులు అడుగకయే రాజప్రతినిధిగారి ఆహ్వానమును పొందఁగలిగిన ఆ గాంధిమహాత్ముని అదృష్టమును జూచి నివ్వెఱపడిపోయిరి.

ఇట్లు గాంధిజీ హిందూదేశ రాజకీయ అంతరిక్షమునందు అత్యున్నతమును అద్వితీయమును అగు స్థానమును వహించి కోటిసూర్యప్రభలతో వెలుంగుచు ప్రజలకు ప్రభువులకుకూడ ఆప్తుఁడును బంధువును అయి శ్లాఘింపఁబడుచున్నాఁడు.

ఇట్లుండగా 1935-వ సం॥ చట్టముక్రింద ఎన్నికలు 1936 అంత్యమునను, 1937 ప్రారంభమునను వరుసగ అన్ని రాష్ట్రములలోను జరిగినవి. అన్ని రాష్ట్రములలోను కాంగ్రెసువాదులు పోటీచేసిరి. పంజాబు, బంగాళము, సింధు, తప్ప మిగత అన్ని రాష్ట్రములందును కాంగ్రెసునకే మెజారటీ వచ్చినది. ఆ పంజాబు, సింధు, బంగాళములలోనైన ముస్లింలీగునకు ప్రాబల్యము లేదు. ముస్లీములు ఇతరపక్షముల పేరట వచ్చి సంయుక్తమంత్రివర్గముల నేర్పఱచుకొనిరి. అఖిలభారతకాంగ్రెసు సంఘము డిల్లీన సమావేశమై, పదవీస్వీకారవిషయమై, తర్జన భర్జన లారంభించినది. అప్పుడు స్వీకారవాదులకు శ్రీగాంధీ అవసరమాయెను. దానితో శ్రీగాంధీ మరల తాత్కాలికముగ నాయకత్వమును చేబట్టెను. "మంత్రుల వ్యవహారమును ఆటంకపఱచుట కేర్పడిన ప్రత్యేకాధికారములను మేము అమలుపరుపము; కేవలము చట్టబద్ధమగు అధిపతులముగానే 'వ్యవహరింతుము' అని గవర్నర్లవద్ద హామీ తీసుకొని శాసనసభానాయకులు మంత్రివర్గము నేర్పరుపవచ్చునని సలహా నిచ్చెను. అది పలువు రకంగీకారమయ్యెను. కాని దానిని గవర్నరు లంగీకరింతురా? నిరాకరించిరి. అప్పుడు కాంగ్రెసునాయకులును పెద్దమెజారటీలు వెనుకనున్నను-మంత్రివర్గము నేర్పఱుప నిరాకరించిరి. పదవీస్వీకారవాదుల యుబలాటమంతయు అడఁగెను. అయితే వారి అదృష్టవశమున అట్టి రాష్ట్రశాసనసభాకాంగ్రెసుపార్టీనాయకులలో శ్రీసీ. రాజగోపాలాచారిగారు ఒకరైరి. వీరు నిరాకరించు కాలమునకు శ్రీగాంధీజీ మద్రాసున యుండుటయు తటస్థించెను. "హామీ" అన్నమాటయే గవర్నరులకు మ్రింగుడుపడ లేదని శ్రీసీ. ఆర్. యెఱుఁగును. దాని నిర్వచనములో దానిని పలచపఱుపవలయుననియు ఆయన యెఱుఁగును. శ్రీగాంధీజీతో కొంత చర్చింపగా, అట్టి "హామీ" నిచ్చుట ప్రమాదముగాదు అని ఒకప్రకటనను శ్రీగాంధీగా రొనర్చిరి. ఆహామీ "పెద్దమనుష్యుల ఒడంబడిక"గ (Gentlemen's agreement) నున్న చాలునని దానిలో వ్రాసిరి. అదియు బిరుసుపాకమే యని శ్రీసీ. ఆర్. తలఁచి దానిని "పెద్దమనుష్యులు తమలోతా మేర్పఱచుకొను అభిప్రాయము" (Gentlemen's understanding) అని సవరింపఁ జేసిరి. అందుచే నీ "హామీ" ఘనపదార్థముగాక ద్రవపదార్థమునుగాక వాయుపదార్థమై పోయినది. అయినను శ్రీగాంధీజీతో వ్యవహారము నిప్పుతో చెరలాటమని ఆంగ్లరాజకీయవేత్తల కెఱుకయే. కావున ఏప్రిలునుండి, జూలైవరకు చాల తర్జన భర్జనలు జరిగినవి. గవర్నరులు తాత్కాలికప్రభుత్వముల నేర్పరచుకొని, శాసనసభలను పిలువకే ప్రభుత్వమును సాగింప నారంభించిరి. కొంత వాదోపవాదము లైన అనంతరము వైసరాయి ఒకప్రకటన గావించెను. అందులో "నిత్యకృత్యములలో మీ కడ్డు

రాము; పెద్దవ్యవహారములు, యుద్ధము వంటివి వచ్చినప్పుడు అవసరమైన అడ్డురాక తప్పదు" అని పల్కెను. దానితో చింతితార్థము నెఱవేరినదనియు, కోరిన "అభిప్రాయము" నకు వచ్చుట కవకాశమేర్పడెననియు ఆప్రకటన కన్వయించి శ్రీగాంధీచే ఒప్పించి మంత్రివర్గము స్వీకరించిరి.

అయితే శ్రీగాంధీ ఇంతటితో నీవిషయమును విడువక మరి సంవత్సరము నాఁటికి రాజకీయఖైదీలవిషయమై బీహారు, యు. పి., గవర్నర్లు అడ్డుపడఁగా వారిచే రాజీనామా లిప్పించి వారు తమతప్పు దిద్దుకొనునట్లుఁ జేసెను.

అండమానులలోను దౌర్జన్యఖైదీలనుసమేతము దౌర్జన్యపద్ధతుల తమకు విశ్వాసము నశించినదని వారు ప్రకటింపఁగా వారందరిని విడుదల గావింపించెను. ఈవిధముగ నవయువకు లెందరో అండమానులలో మ్రగ్గుచున్నవారు విడుదలలై బంధుమిత్రులతోఁ గూడి సుఖించుచున్నారు. హింసామార్గమున విశ్వాసముతో దాని నవలంబించి ఉరికంబములకును సిద్ధమైన యువకులు శ్రీగాంధీ అహింసామార్గమున విశ్వాసము వెలిబుచ్చుట నొకవిధముగ నాయనకు విజయధ్వజమైనది. అట్టివారిలో నొక్కఁడు సాహసికుఁడైన శ్రీపృథ్వీసింగు, పరారిలోనుండి శ్రీగాంధీ ఆశ్రమమున బహిర్గతమై పట్టుబడి మంత్రివర్గముచే విడుదలఁగాంచి కొన్నిసంవత్సరము లాయన ఆశ్రమమునందే యుంటూవచ్చి యుద్ధపురోజులలో ఆయనతో అభిప్రాయ భేదము వచ్చి వెడలిపోయి కమ్యూనిస్టుపార్టీలోఁ జేరెను.

శ్రీగాంధీ కాంగ్రెసు మంత్రివర్గములకు తగుసలహాల నిచ్చుచు వారి కండయై నిల్చెను. అయితే సి. పి. రాష్ట్రమందు తన గుజరాతీ, హిందీ ముఖ్యానుచరులతో కీచులాడిన శ్రీ డా॥ ఖరేను నిష్కారణముగ పదవీచ్యుతుని జేసి కాంగ్రెసునుండియే వెళ్లగరిమెను. ఆయన సుప్రసిద్ధదేశభక్తుఁడయ్యు నాఁటినుండియు శ్రీగాంధీ ద్వేషిగ పరిగణించినాఁడు.

అంతవరకు తనతో ఏకీభవింపని శ్రీసుభాషచంద్రభోసును జైలునుండి విడుదలయైరాఁగానే ఆహ్వానించి కాంగ్రెసుఅధ్యక్షుపదవి నొసంగెను. కాని ఆయన శ్రీనెహ్రూవలెనే మరొక్కసారి ఆపదవిని ఆకాంక్షింపఁగా వలదని ఆయనకు పోటీగా శ్రీఅబుల్‌కలాంఅజాదును నిలప జూచెను. కాని శ్రీఆజాదుఁబంగాళముఁన చీలిక తెచ్చుట కిష్టపడక పోటీకి నిలువనిరాకరించెను. అప్పుడు శ్రీడా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని శిఖండినిగానిల్పి ఆయనను ఓడింపయత్నించెను. శ్రీగాంధీ అనుచరులందరును శ్రీపట్టాభిగారిని బహిరంగముగ బలపఱచిరి కాని తాను తటస్థుఁడుగానుండి ఏమియు పలుకలేదు; శ్రీజవాహరిలాలునెహ్రూ మధ్యస్థుఁడుగా ఉభయపక్షములకు హితముగపల్కెను. శ్రీభోసు 'స్టైాకమూాందు' (గాంధీ బృందమున

కాపేరు వచ్చెను.) వారు ఫెడరేషన్ విషయమున బ్రిటీషువారితో లాలూచీపడ నున్నారని రహస్యము బయలుపఱచెను. తుదకు దాక్షిణాత్యులనాయకులగు శ్రీమార్ యస్. శ్రీనివాసఅయ్యంగారుకృషివల్లనే శ్రీభోసు గెల్చి శ్రీపట్టాభిగారు ఓడిరి. అప్పుడు శ్రీపట్టాభివోటమి నాఓటమియే అని హరిజనపత్రికలో శ్రీగాంధీ వ్రాసెను. శ్రీపట్టాభిగారిగెలుపు నాగెలుపే అని ముందే శ్రీగాంధీ వ్రాసియున్నచో ఆయన గెలిచియుండవచ్చును. అయితే ఈఓటమిని శ్రీగాంధీజీగాని వారి అను చరులు గాని సరసముగ స్వీకరింపలేదు.

శ్రీగాంధీ "ఈ ఓటమి తనసిద్ధాంతములపట్ల కాంగ్రెసు ప్రతినిధులకు విశ్వాసము లేనందువల్లనే గలిగినది" అన్నాడు. దానికి జబాబుగ "మహాత్ముని విశ్వాసము నర్థింతును; అందరివిశ్వాసము చూరకొన్నను ఆయనవిశ్వాసములేనిది వ్యర్థమే" అని బోసుప్రకటించెను. కాని శ్రీగాంధీయందు తమవిశ్వాసము ప్రకటించుటకై కాంగ్రెసు (1939)-న సమావేశముగాకముందే ఫిబ్రవరిలోనే తే 22 ది 15 గురు కార్యనిర్వాహక వర్గసభ్యులలో 13 గురు రాజీనామాలనిచ్చిరి. ఈరాజీనామాలు వార్ధాలో శ్రీగాంధీ సమక్షమందు వీరందరు సమావేశమై చర్చించి జేసినవే. శ్రీజవహరిలాలుమాత్రము ఇవ్వలేదు; కాని శ్రీబోసునకు తనరిమార్కుల నుపసంహరించుకొమ్మని అన్యాపదేశముగఁ జెప్పెను. మార్చిమాసమున త్రిపురిలో కాంగ్రెసుసమావేశమైనది. శ్రీబోసు తన కార్యనిర్వాహకుల రాజీనామాలను (అంతకుముందు సంవత్సరముకూడ ఆయనయే అధ్యక్షుఁడుగదా) అంగీకరించెను. కాంగ్రెసుబహిరంగసమావేశములో శ్రీయు. పి., ప్రధాని ప్రధానతీర్మానము ప్రవేశపెట్టినాఁడు. అందులో శ్రీగాంధీ గారిసిద్ధాంతములయందు విశ్వాసము వెలిబుచ్చఁబడినది. గతవత్సరపు కార్యనిర్వాహక వర్గమును నిర్దుష్టమైనది అని నిర్వచింపఁబడినది. ఇక రాఁగలకష్టకాలములో శ్రీగాంధీ ఒక్కఁడే దేశమును నడుపగలఁడు గావున ఆయనతో సంప్రతించి ఆయనకుసమ్మతమైన. కార్యనిర్వాహకవర్గమేర్పఱుపవలయును" అని యున్నది. శ్రీబోసుపక్షమువారు దీనిని శ్రీబోసుయెడ అవిశ్వాసముగ భావించిరి. కాని తీర్మానము అధికసంఖ్యాకులచే నిర్ణయింపఁబడెను. శ్రీబోసు జబ్బుగానుండి ఈతీర్మానపు చర్చలో పాల్గొనఁజాల కున్నాఁడుగాన ఈతీర్మానము వాయిదావేయమని శ్రీనారిమేన్ సవరణ పెట్టెను ఓడి పోయినది. ఇప్పుడు ధర్మసందేహ మేర్పడినది. కొద్దిమెజారటీ శ్రీబోసును అధ్యక్షు నిగా నెన్నుకొన్నది; బహుళసంఖ్యాకులు అధికులై శ్రీగాంధీతో సంప్రతించి కార్య నిర్వాహకవర్గ మేర్పఱచుకోమన్నారు. శ్రీబోసు ఎన్నిక తన ఓటమియనియు తనసిద్ధాంతములయెడల అవిశ్వాసమనియు శ్రీగాంధీ అనియుండెను. అందుచే కాంగ్రెసు ప్రతినిధులు శ్రీగాంధీయందు ఈవిధముగ విశ్వాసము వెలిబుచ్చి ప్రాయశ్చిత్తమొనర్చుకొని

తాము పరిశుద్ధులైనారు. ఇక బోసును వారి ఇష్టానుసారము తనకార్యనిర్వాహక వర్గము నేర్పఱచి 'ప్రాయశ్చిత్తము గావించుకొని పరిశుద్ధుఁడు' కావలయును. శ్రీబోసు తనయాత్మగౌరవమునకు దేశక్షేమమునకు భంగముకానివిధమున తీర్మానము నమలు గావింప యత్నించెను. "కార్యనిర్వాహకవర్గము అనఁగా దేశమందలి వివిధాభిప్రాయములుకలవారి ప్రతినిధులతో కూడినదై సంపూర్ణప్రాతినిధ్యము గలదగుచో శ్రీగాంధీని సంప్రతించుటకు అభ్యంతరము లేదు; కాని నొకేఅభిప్రాయము కలవారికూటమి కావలయుచో లాభములేదు" అని శ్రీభోసు ప్రకటించెను. ఇచ్చట వెనుక శ్రీలాహోరుకాంగ్రెసులో భిన్నాభిప్రాయులకు తావులేదనియే శ్రీబోసు, శ్రీయస్. శ్రీనివాసయ్యంగార్లను త్రోసివేసిరని పాఠకులు జ్ఞప్తితెచ్చుకొన్నచో శ్రీగాంధీకి శ్రీబోసు చెప్పినదానిలో ప్రథమభాగము సమ్మతముకాదని తెలియఁగలదు. అయినను శ్రీబోసు శ్రీగాంధీని సంప్రతించిగాని నిశ్చయపఱచుకోఁ దలచలేదు.

మార్చినెలాఖరు మొదలు మేనెలాఖరువరకు శ్రీబోసు గాంధీలమధ్య ఈ విషయమై విస్తారముగ ఉత్తరప్రత్యుత్తరములు నడచెను. శ్రీగాంధీ కడపటిఉత్తరములో "నీవును పాతకార్యనిర్వాహకులున్ను అభిప్రాయములు గలియనివారు. నేను (వారి వంకవాడనుగాన) నీకు కార్యనిర్వాహకులపేర్లు పేర్కొనుచో నీపై వారిని రుద్దుట అగును; కావున నీ యిష్టమువచ్చినవారి నేర్పఱచుకొమ్ము" అని వ్రాసెను. కాంగ్రెసు తీర్మానముప్రకారము శ్రీగాంధియే శ్రీబోసుతో సహాకారమొనర్ప నిరాకరించెను. తుదకు అ. భా. కాం. సంఘసభలో కొంత తర్జన భర్జన అయినపిదప శ్రీబోసు లాభములేదని తలంచి తనఅధ్యక్షపదవికి రాజీనామా నొసంగెను. శ్రీజవహరిలాలు బహిరంగముగ సభాముఖమున శ్రీబోసును తన రాజీనామా నుపసంహరించుకొమ్మని కోరెను. కాని శ్రీబోసు అన్ని వర్గములకు సంపూర్ణప్రాతినిధ్యముగల కార్యనిర్వాహకవర్గము కావలెననెను. శ్రీనెహ్రూ పాతవర్గమునకు ఇద్దరు క్రొత్తవారిని చేర్చుకొమ్మనికోరి బులుపుచ్చదలచెను. శ్రీబోసు మోసపోక నిరాకరించెను. అందుచే శ్రీబోసు రాజీనామా తప్పదాయెను. ఆస్థానే శ్రీరాజేంద్రప్రసాదుగారు అధ్యక్షులుగ నియమింపఁబడిరి. మరునాడు పాతకార్యనిర్వాహకవర్గమే నియమింపఁబడెను.

ఆ పిదప శ్రీబోసు ఫెడరేషను వ్యతిరేకప్రచారము నారంభించెను. కాంగ్రెసున కది గిట్టలేదు. కొంత తగాదాజరిగినమీాద శ్రీబోసును కాంగ్రెసునుండి వెడలఁ గొట్టిరి. పిదప ఆయన నిర్బంధింపఁబడుటయు నిర్బంధమునుండి విడుదలయ్యె తన యింటనే 'ఇంటర్ను' చేయఁబడుటయు అచ్చటనుండి గుప్తముగ పారిపోయి విరో

పాలో గ్రుమ్మరి జర్మనీ, జపానులతో సంప్రతించి భారతజాతీయసైన్యము నేర్పఱచి భారతదేశమునందలి బ్రిటిషుసైన్యములతో పోరాడి ఇంఫల్ పర్వతము లాక్రమించి భారతజాతీయపతాకము స్థాపించి దైవవశమున జపానుతో కలతపడుటయు, సంశయాత్మకమగు అతని మరణవార్తయు పిదప గాథలు.

ఇట్లుండగా యుద్ధము తటస్థించెను. వైసరాయి శ్రీగాంధిని పిలువనంపి మాట్లాడెను. శ్రీగాంధీ పూర్వమువలెనే (1917-18) ఎట్టిషరతులు లేకుండ యుద్ధమునకు సహాయముజేయవలయునని ప్రకటించెను. కాని ఆయన అనుచరులుమాత్రము ఈ తరుణమున బేరమాడి దేశమునకు స్వాతంత్ర్యము సంపాదింపవలెననిరి. అతివాదులైన కమ్యూనిస్టులును సోషియలిస్టులును, ఎట్టిసహాయమును చేయక సంపూర్ణస్వాతంత్ర్యమునకై సమష్టిపోరాటమును సాగింపవలెననిరి. వీరి ఈకోరికకు రష్యా, జర్మనీలు సఖ్యపడుటయు కొంతకారణము. అప్పుడు శ్రీగాంధీ తన తొలిఅభిప్రాయమును కొద్దిగ సవరించుకొని తనసహాయము నైతికసహాయముమాత్రమే అని పల్కెను. అయితే కాంగ్రెసువారికోర్కెను బ్రిటిషువా రంగీకరింపలేదు. కాంగ్రెసు తమసహాయరనిరాకరణమునకు మొదటిమెట్టుగ కాంగ్రెసుమంత్రులను రాజీనామా నిమ్మన్నది. అన్నిరాష్ట్రములలోని మంత్రులును రాజీనామా నిచ్చిరి. గవర్నర్లు అడ్వైజర్లసాయమున తిరిగి పాలింపసాగిరి.

ఇట్లుండగ శ్రీగాంధీ తనఅహింసామార్గమును ప్రస్తావనకుదెచ్చెను. కాంగ్రెసు మంత్రులు యేర్పడిననాఁటినుండియు ఈ అహింసావాదవివాదములు లోలోన నలుగుచుండెను. ఇప్పుడు యుద్ధమున ప్రత్యక్షసహాయముగావింప నీ అహింసాతత్వము ఆటంకమాయెను. సంపూర్ణసహాయము గావింతుమన్నచో బ్రిటిషువారు రాజీకి వత్తురని తాము మంత్రిపదవులవీడితిమన్న అహముతో తలంపసాగిరి. అయితే శ్రీగాంధినాయకత్వమును వీడవలసిన అగత్యమువచ్చెను. అందుకును పాల్పడిరి. అయితే వ్రతముజెడినను సుఖముదక్కలేదు. బ్రిటిషువారు ఏమియు లొంగలేదు. ఏమనఁగా కాంగ్రెసుమంత్రులు తొలగుటచే ధారాళముగ బ్రిటిషుప్రభుత్వము వారు జనధనసహాయము పడయసాగిరి. శ్రీగాంధీనాయకత్వమువిడిచిన కాంగ్రెసునందు భయమేలేకపోయెను. అప్పుడు కాంగ్రెసునకు పోరాటమే శరణ్యమాయెను.

అయితే కాంగ్రెసువ్యవహారమున శ్రీగాంధీయుగమున పోరాటము సత్యాగ్రహవిధానము. 1934 సం॥ లో శ్రీగాంధీ సత్యాగ్రహమును (ఏప్రిల్ 7-వ తేది) ఉపసంహరించుచు, తనజీవితకాలమున దాని తనుఒక్కఁడే నడపగలసమర్థుఁడ ననియు, కావున తననాయకత్వముక్రిందనే అది ఇతరులచే ఆచరింపఁబడఁదగుననియు ప్రస్తుతమునకు దాని నితరు లెవ్వరు ఆచరింపరాదనియు నిషేధించి తనకొక్కనికే ఆధీనమై

యుండుననియు ప్రకటించియుండెను. దానిని కాంగ్రెసుకమిటీవారును (A. I. C. C.) తే 18-5-1934 దీన అంగీకరించియుండిరి. కావున ఇప్పుడాయనను ఆశ్రయింపక తప్పి నదిగాదు. ఆయనయు సంతోషపూర్వకముగ నాయకత్వము వహించెను.

ముందుగ ప్రభుత్వమునకు నోటీసు లిచ్చి ఆ ప్రకారము బహిరంగస్థలముల వ్యక్తులు సత్యాగ్రహ మొనర్చుటకు నిర్ణయించెను. సత్యాగ్రహులు అహింసామార్గమున విశ్వాసముగలవారుగా నుండవలయును; నిర్మాణకార్యక్రమమునందు నమ్మక మున్నవారు కావలయును; నిత్యఖద్దరుధారులై యుండవలెను; నూలువడుకనేర్పరులై యుండవలెను అని షరతులు నిర్ణయించెను. అట్టివారి జాబితాల తాను పరీక్షించి సమ్మతించిన సత్యాగ్రహులు తాను నిర్ణయించిన తేదీన కాలమున స్థలమున. "ఈయుద్ధమునకు ధనముచేగాని జనముచేగాని సహాయ మొనర్చుట పాపము" అని కేకలు వేయవలయును అని సత్యాగ్రహస్వరూపము నిర్ణయించెను. మొట్టమొదట సత్యాగ్రహిగ అంతవరకు ప్రపంచమున కేమాత్రమును పరిచితుడుగాని శ్రీవినోబ భావే అను తనసహచరుని యేర్పఱచెను. ఇందు కాయన ముఖ్యానుచరులందరికి ఆగ్రహముచ్చెను. అయిననేమి ఆయన సత్యాగ్రహ మొనర్చెను. ఆయనను వెంటనే ప్రభుత్వము అరెస్టుచేసివైచిరి; ఆపిదప క్రమముగా మంత్రులు, శాసనసభాధిపతులు, శాసనసభ్యులు, కాంగ్రెసు సంఘాధికార్లు, స్థానికసంస్థల కాంగ్రెసు సభ్యులు, పిదప కాంగ్రెసువాదులు - అని వరుసగా సత్యాగ్రహుల నిర్ణయించి రోజు కొక్కరినిగా వారమున కొక్కరినిగా-సత్యాగ్రహము జేయించెను. చాల మందిని అరెస్టుచేసిరి. అయితే మనరాష్ట్రమున ఒకలతాధికారిని గూడూరున సబ్ కలెక్టరు గెలటీ అరెస్టుచేయుటకై వారంటు నివ్వనిరాకరించి ఈసత్యాగ్రహము బూటకమని ప్రకటించెను. నిజమునకు చాలమంది పిదప పదవుల వ్యామోహమున సత్యాగ్రహ మొనర్చిరి. ఇప్పుడీఅరెస్టుకానివారిగతి ఏమి? వారి నట్లే కేకలు వేసుకొనుచు ఢిల్లీకి వెళ్లమని శ్రీగాంధీ నిర్ణయించెను. అది చాల వ్యయప్రయాసలకు మూలమని తెలిసినపిదప ఆయాజిల్లాలలోను పదేపదే అట్లే కేకలువేయుచు తిరిగి నిర్మాణ కార్యక్రమమునకు గడంగుడని తెల్పెను.

శిక్షించు మ్యాజస్ట్రేట్లు హెచ్చుగ జుల్మానాలు వేయనారంభించిరి. జుల్మానాలివ్వరాదని కాంగ్రెసు ఆచారము. 1932-వ సం॥ లో జైళ్లభయము, లాటీదెబ్బల భయము అంతరించిన పిదప హెచ్చుజుల్మానాలు వేసి జుల్మానాలకు మించిన వెలగల ఆస్తుల జప్తులుచేయుటచే కొందరు జంకిరి. ఈసత్యాగ్రహమున శ్రీగాంధీ జుల్మానాలను ధనము సిద్ధముగనున్నవా డిచ్చి వేయవలెను; తిరిగి జాతీయప్రభుత్వము యిచ్చివేయును అని సలహానిచ్చెను. సత్యాగ్రహులు పలువురు జరిమానాలనిచ్చిరి.

ప్రభుత్వమువారును జప్తులు మానిరి. అయితే కొందరివ్వగల్గియు ఇచ్చుటలేదని గ్రహించి ప్రభుత్వము జుల్మానా లిచ్చినవారికే ఏ. బి. క్లాసు లనిరి; చాలమంది ధన మిచ్చి ఏ. బి. క్లాసులు కొనుక్కొనిరి.

ఇట్లు సత్యాగ్రహము 1 సం॥ కాలము గడిచెను. దానివల్ల బ్రిటిషుప్రభుత్వము అల్లరిపడినదేకాని జంకలేదు. విడుదలయైవచ్చిన నాయకులు "ఈసంజ్ఞారూపక సత్యాగ్రహమువల్ల కలుగవలసిన ఫలితము గలిగిన"దని తలఁచి తిరిగి రాయబారములను ప్రారంభించిరి. శ్రీ సీ. అర్. విడుదలై ఢిల్లీకి బయలుదేరెను. ప్రభుత్వమువారును కేవలము సంజ్ఞామాత్రముగ సత్యాగ్రహ మొనర్చినవారిని విడుదల గావింతుమని ప్రకటన గావించిరి. శ్రీగాంధిమాత్రము ఎట్టి రాజీలేకయే ఈవిడుదల గావించుచున్నారు కాఁబట్టి సత్యాగ్రహము సాగుచుండును అని ప్రకటించెను. అయితే విడుదలయైనవారు సత్యాగ్రహము చేయనక్కఱలేదు. క్రొత్తవారు సత్యాగ్రహము చేయవచ్చుననిరి. ఇంతలో శ్రీ సీ. ఆర్. శ్రీగాంధీగారికి నాయకత్వమిచ్చుచు గావించిన తీర్మానమున రంధ్రాన్వేషణ మొనర్చి అపూర్వవ్యాఖ్యాన మొనర్చెను. దానితో శ్రీగాంధీ ఆ అర్థము తా నిదివరలో నూహింపనిదైనా సమ్మతించి సత్యాగ్రహమును తిరిగి ఉపసంహరించెను.

ఈ సందుకాలమున రష్యా మిత్రమండలివైపునకు తిరిగినది. జపాను అక్షు రాజ్యములతోఁ జేరినది; ఆమెరికా యుద్ధమున దిగినది. జపాను వాయువేగమనోవేగముల జయపరంపరలతోఁ బోవుచు 1941 డిసంబరు ఆఖరున రంగూనుపై వైమానికదాడి సల్పినది. ఇఁక భారతదేశము యుద్ధక్షేత్రమగునేమో అని తలఁపఁబడెను. కాంగ్రెసు నాయకులకు తిరిగి ఆశ పొడమినది. మఱొక్కసారి శ్రీగాంధీ నాయకత్వము నెడపెట్టి బ్రిటిషు ప్రభుత్వమునకు తిరిగి హెచ్చరిక చేసిరి. బ్రిటిషుప్రభుత్వమువారు ఉదాసీనతనే జూపిరి.

ఇట్లుండగ జపానువారు విజృంభించుచున్నారు. సింగపూరుకూడా జపానువారి వశమైనది (15 ఫిబ్రవరి). ఇఁక భారతదేశము ప్రధానరంగముగ జపానుపై పోరు సాగింపవలసిన అవసరమేర్పడినది. చర్చిలుప్రధాని క్రిప్సును రాయబారమంపెను. 1. అవసరమైన బ్రిటిషుసామ్రాజ్యమునుండి విడిపోవుటకును హక్కుతో డొమినియన్‌స్టేటస్సిచ్చుట బ్రిటిషువారి ఆశయము. 2. ఇందు కనుగుణ్యముగ యుద్ధము ముగిసినవెంటనే భారతీయప్రతినిధులు రాజ్యాంగచట్టము తయారుచేసుకొనుట కేర్పాట్లుచేయఁబడును. 3. ఈలోపల మిలిటరీమినహాగా యావత్తు రాజ్యాధికారమును భారతరాజకీయనాయకులు వహించవలెను.

అయితే ఈరాయబారముదెచ్చిన క్రిప్సుముందు మూరెడుసాగి వెనుక బారెడుకుంగినాఁడు. సంప్రతింపులలో 1. కేంద్రప్రభుత్వము కాబినెట్టు పద్ధతిని

అవలంబించుననియు, 2. మిలిటరీ భారతమంత్రి పదమగుననియుఁ దెల్పెను కాని ఆమాటలపై నిలువజాలఁడాయెను. అదిగాక ముస్లింలీగు పాకిస్థానముకోరిక కనుగుణ్యముగ నేదైనరాష్ట్రము అవసరమనితోఁచినచో భారతయూనియనులోఁజేర నిరాకరింపవచ్చునని యొక సూత్రము గల్పింపఁబడెను.

అయితే ఈరాయబారభంగమునకు ముఖ్యుఁడు శ్రీగాంధీజీయే అని క్రిప్సు లండనువెళ్లినతరువాత అన్నాఁడు. అసలు శ్రీగాంధీ కాంగ్రెసునాయకత్వమునుండి ఎడతొలిగింపఁబడెనుగాన ఆయన మొదట్లో ఢిల్లీకి వెళ్లలేదు. రావలసినదని క్రిప్సు వార్తబంపెను; వచ్చినను ప్రయోజనములేదని శ్రీగాంధీజబాబిచ్చెను. "అట్లుకాదు; వచ్చి సన్నిధానముననుండవలసిన"దని కోరెను. ముస్ముందుగఆయనకు రాయబారపు చిత్తుచూపెను. దీనిని "దివాలాతీయుచున్న బ్యాంకుపై పిదపతేదివేసి ఇచ్చిన చెక్కు" అన్నాఁడని వదంతి. నేనట్లు నిర్వచింపలేదని ఆయన ప్రకటించెను. క్రిప్సు ఇంకను ఇక్కడ రాయబారములు జరుపుచుండగనే కలకత్తా, విశాఖపట్నము, కాకినాడలలో జపానువిమానములు బాంబులు పడవేసినవి.

క్రిప్సువెళ్లినపిదప దేశమున మౌంద్యము హెచ్చెను. ఆకాలమందే శ్రీగాంధీ తిరిగి జాతీయసమరము సాగింపవలయునని చింతింపనారంభించెను. బ్రిటిషు ప్రభుత్వముతో రాయబారములు విఫలులైన కాంగ్రెసునాయకులకు తిరిగి శ్రీగాంధీజీని ఆశ్రయింపక తప్పినదిగాదు. శ్రీగాంధీ అప్పుడు "క్విట్ ఇండియా" ఉద్యమమును సూచించెను. శ్రీ సి. ఆర్., నెహ్రూలు ఇది జపానుదురాక్రమణకు ప్రోత్సాహము గల్పించునని మొదట్లోఝడిసిరి. నెహ్రూ పిదప బుద్ధిమార్చుకొనెను.

1942-వ సం॥ ఆగస్టు 8-వ తేదిన బొంబాయిలో అఖిలభారతకాంగ్రెసు సంఘము "క్విట్ ఇండియా" తీర్మానము నంగీకరించెను. తిరిగి శ్రీగాంధీగారినాయకత్వము నంగీకరించిరి. శ్రీగాంధీ వైసరాయిదర్శనము కోరెను. నిరాకరింపఁబడి అర్ధరాత్రమున హఠాత్తుగ కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యుల నందరిని అరెస్టుచేసి ఎచ్చటికో తెలియకుండ తీసుకొనివెళ్లిరి. బొంబాయిలో తీవ్రమగునిర్బంధ విధానము నవలంబించిరి. దేశమంతట ముఖ్యమగు నాయకులనందరిని ఎక్కడివారి నక్కడ అరెస్టుచేసిరి. దేశీయులకు దిక్కుతోఁచలేదు. కార్యక్రమము తోఁచలేదు. ఎవరికి తోఁచిన కార్యక్రమము వారవలంబించిరి. పుర్రెకొకవిధముగ అనుకొనుచున్న వన్నియు అమలుజరిగెను. ప్రజాసామాన్యమును రెచ్చిపోయిరి. అహింసావ్రతము గాలికెగిరిపోయినది. రైలుపట్టాలులాగివేయఁబడినవి. రైలుస్టేషనులు, గవర్నమెంటు ఆఫీసులు తగులపెట్టఁబడినవి. టెలిగ్రాపుతీగలు త్రెంపఁబడినవి. వంతెనలు బ్రద్దలుకొట్ట ప్రయత్నములుజరిగినవి. ప్రభుత్వమును తుపాకులకాల్పు నారంభించెను. పలుతా

వుల చాలమందిమరణించిరి. బీహారు, యు. పి., సి. పి., రాష్ట్రములలో పలుతావుల గ్రామములలో తాలూకాలలో కొన్ని నెలలు ప్రభుత్వమే లేదు. ప్రభుత్వపుపోలీసులు, సేనలు ఆయాగ్రామములపైఁబడి అత్యాచారములు గావించిరట! అందులకు ప్రత్యామ్నాయముగ ప్రజలును పోలీసులధికారులను హింసించిరట! సతారా జిల్లాలో ప్రతిసర్కారునేర్పఱచి బ్రిటిషుప్రభుత్వస్థానే పరిపాలనసాగించిరి. ఇట్లూరు నెలలు పర్యంతము సాగినపిదప చప్పఁబడెను. కాని ఉద్యమము రహస్యమార్గముబట్టి దౌర్జన్యపద్ధతులు చిరస్థాయియగుసూచనలు గన్పట్టెను.

అప్పుడు శ్రీగాంధీ వైసరాయితో ఉత్తరప్రత్యుత్తరములను ప్రారంభించెను. ఆగస్టు అల్లరులకు శ్రీగాంధీజీయు, కాంగ్రెసును కారణమని ప్రభుత్వమువారు తమ ప్రకటనలయందు పేర్కొని యుండిరి. మమ్ము హఠాత్తుగ అరెస్టుచేసి ప్రజలకు న్యాయమగు సౌమ్యనాయకత్వము లేకుండఁజేయుటయే ముఖ్య కారణమని శ్రీగాంధీ వ్రాసెను. దానిని వైసరాయి అంగీకరింపలేదు. అయితే న్యాయ విచారణ చేసినచో తమనిర్దోషిత్వమును నిరూపించుకొందుననెను; తన్ను కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును కలుపుచో తిరిగి దేశపరిస్థితులఁ గూర్చి పునరాలోచింప వీలగుననెను. వైసరాయి దేనికిని సమ్మతింపలేదు. దానితో తనశక్తికొలది 21 రోజులు ఉపవాసము ప్రారంభించెను. వైసరాయికార్యనిర్వాహకసభ్యులు ముగ్గురు రాజీనామాల నిచ్చిరి. దేశమంతయు గగ్గోలుపెట్టెను. ప్రపంచమంతయు ఘోషించెను. ఉపవాసకాలమున తాత్కాలముగా విడుదల చేతుమని వైసరాయి అనెను. కాని శ్రీగాంధీ నిరాకరించెను. సర్. సప్రూ అధ్యక్షతక్రింద నిఖిలపక్షసభ సమావేశమై శ్రీగాంధీ విడుదల నర్థించెను. ప్రభుత్వము పెడచెవినిఁ బెట్టినది. ఒకనాడు డాక్టరులు ఆశ వదలుకొనిరి. శ్రీగాంధీకి మైకముకమ్మెను. ప్రభుత్వమును ఆయన జైలున మరణించుటకు సమ్మతింప సాహసించెను. అంత్యక్రియలకన్ని ఏర్పాట్లు చేయఁబడినవి. అల్లరులుగాకుండ దేశమంతటను బందోబస్తుకూడ జరిగినది. అయితే దైవనిర్ణయము వేరుగా నుండెను. శ్రీగాంధీ ఆధ్యాత్మికశక్తికే విజయము గలిగెను. శ్రీగాంధీసురక్షితుఁడై ఉపవాసానంతరము పారణ గావించెను. దీనివల్ల శ్రీగాంధీకి గొప్ప నైతిక విజయము గలిగెనేగాని అంతకన్న స్థూలప్రయోజనమేమియు కలుగలేదు.

శ్రీగాంధీ జైలులో నుండగ శ్రీజిన్నా విజృంభించి నాతో రాజీ చేసుకుంటే బ్రిటిషుప్రభుత్వము దిగివచ్చునుగాని వారినిప్రార్థించి శ్రీగాంధీ ఏమి బావుకోగలఁడని సవాలు చేసినాఁడు. శ్రీగాంధీ అట్టికోరిక తెల్పుచో బ్రిటిషువారు నిరాకరింపగలరా అనికూడ ప్రగల్భము గొట్టెను. ఆవార్త విని శ్రీగాంధీ శ్రీజిన్నాకు ఉత్తరము వ్రాసెను. బ్రిటిషుప్రభుత్వము ఆయుత్తరము ఆయన కివ్వక ఉత్తరమును వ్రాసినాఁడని మాత్రమే చెప్పిరి. శ్రీజిన్నా కిమ్మనలేదు.

మొదట ఆయనను ఏజైలులో పెట్టినది ప్రజలు ఎఱుఁగరు. ఈయుపవాసముతో ఆయనను "పూనా సమీపమున శ్రీఆగాఖాన్ భవనము" న యుంచి నారని తెలియవచ్చెను. అందుంచిన వారము రోజులలో ఆయనకు పుత్రసమానుఁడు ఆయన నమ్మిన కార్యదర్శి, శ్రీమహాదేవదేశాయి హఠాత్తుగ మరణించెను. ఉపవాసము ముగిసినపిదప మరికొన్నినెలలకు ఆయనభార్య శ్రీకస్తూరిబాగాంధికి జబ్బు చేసినది. ఆమె జబ్బుగానున్నకాలమున ప్రభుత్వమువారు ఆమెకు సరియైన ఔషధసేవ చేయుటకు తగినసౌకర్యములను జరుపలేదని శ్రీగాంధీ పిదప వ్రాసియున్నాఁడు. మొత్తమున కామె 22-2-1944-వ సం॥ న శ్రీఆగాఖాన్‌భవనములోనే మరణించినది. శ్రీగాంధీ తనకు ప్రియతముఁడగు కార్యదర్శి శ్రీదేశాయిని, ప్రియతమయగు శ్రీకస్తూరిబాను ఆభవనము ఆవరణలోనే దహింపించి సమాధికట్టినాఁడు. ఇట్లుండగ ఆయనతో నుండిన శ్రీమతి సరోజినీదేవిగారికి సన్నిపాతముతోకూడిన మలేరియా జ్వరము వచ్చినది. ప్రభుత్వము ఆమెను వెంటనే విడుదలఁ గావించెను. ఆపిదప శ్రీగాంధీగారికే మలేరియావ్యాధి వచ్చెను. ప్రభుత్వమువారప్పుడు శ్రీగాంధీని (6-4-1944) ఏ షరతులులేక విడుదలచేసిరి; ఆయన సిబ్బందినిగూడ వెంటనే విడిచి పెట్టిరి. విడుదల అనంతరము చాలకాలము ఆయన ఆరోగ్యసంరక్షణప్రయత్నములతోనే జరిగిపోయెను.

శాసనోల్లంఘనమును ఆపుఁజేయమని కొందరు కోరిరి. తాను "శాసనోల్లంఘనము నారంభించిన కదా—ఆపుఁజేయుటకు" అని ఆయన సమాధాన మిచ్చెను. అయితే ఎవ్వరుచేసి రిదంతా? ప్రజలే; తమ స్వేచ్ఛానుసారము-వారు తాము ప్రారంభించినది విరమింపనక్కఱలేదు; అందుకు కారణములు విపరింపలేదుగదా! అయితే దేశమందు సౌమ్యపరిస్థితు లేర్పడుటకు ఆలోచింతమని వైసరాయికి వ్రాసెను. అప్పటికి వీరిని జైలులో పెట్టిన లిన్లిత్గో ప్రభువు ఇంటికి వెళ్లినాఁడు; వేవెల్ ప్రభువు వచ్చియున్నాఁడు. ఇట్లు కొంత ఉత్తరప్రత్యుత్తరములు సాగినను లాభము లేకపోయినది. విడుదలైవచ్చినవారికి ఏమిచేయుటకు తోఁచలేదు. వారికి నిత్యపంట నిర్మాణకార్యక్రమము చూపఁబడెను. 14 అంశములందున్నవి; ఎంతచేసినను తరుగనివి. అయితే ప్రజలకం దుత్సాహము లేదు; రాజకీయదాహ మందువల్లతీరదు.

హిందూ ముస్లిముసఖ్యత కుదరకుండుట భారతరాజకీయములకు మొదటినుండియు ప్రాణగోడ్డము. 1916-వ సం॥ న లక్నోలో హిందూముసల్మానులకు రాజకీయపరిష్కారము శాశ్వతముగ జరిగినది; ఇఁక పైవారేమియు క్రొత్తకోరికలు కోరకుండుటకు సమ్మతించిరని ఇటీవల కీ॥ శే॥ శ్రీయన్. సీ. కేల్కారుగారు ప్రకటించియుండిరి. అయితే శ్రీగాంధీ రాజకీయనాయకత్వ మారంభించినప్పుడు ఘన

దేశమునకు సంబంధింపని ఖిలాఫత్ సమస్యను జేబట్టెను. కెమాల్ పాషా జాతీయపద్ధతిని దానిని తుదముట్టింపఁగా ఖిలాఫత్ ఉద్యమమున మతప్రేరణగల్గిన ముస్లిము జాతీయవాదులు తిరిగి మతోద్రేకులైరి. శ్రీఆలీసోదరులే శ్రీగాంధీవశము తప్పిరి. 1924-వ సం॥లో నొకసారి హిందూముస్లీం సఖ్యతకై 21 రోజులు ఉపవాసముగావించినాఁడు. ఆపిదప శ్రీచిత్తరంజనదాసు, శ్రీశ్రీనివాస అయ్యంగార్లు చేసినప్రయత్నములు భంగమైనవి. రౌండు టేబిలుసభలోను సఖ్యము పొసఁగలేదు. ఇంగ్లాండునుంచి వచ్చినపిదప అందుకై తీవ్రకృషి చేయుదమని తలఁచెనుగాని రాఁగానే శాసనోల్లంఘన మారంభమాయెను. కమ్యూనల్ అవార్డు (మెక్డొనాల్డుఇచ్చినది) తురకలకే లాభకరమైనది. దానిని ప్రతిఘటింతమంటే డాక్టరు అన్సారీప్రభృతులు అడ్డుపడిరి. ఈసందుకట్లలో ముస్లింలీగు శ్రీజిన్నా చేతిక్రింద బాగుగాబలపడెను.

1935-వ సం॥న శ్రీరాజేంద్రప్రసాదు, 1937-వ సం॥లో శ్రీజవహారిలాలు నెహ్రూ 1938-వ సం॥ లో శ్రీసుభాషచంద్రబోసు శ్రీజిన్నాతో సంప్రతింపులు సాగించిరి. శ్రీజిన్నా మొండిపట్లు మొదటినుండీ ముఖ్యముగా రెండు: (1) ముస్లింలీగువక్కటే ముస్లిములందరిప్రతినిధి సంస్థ. (2) జాతీయసంస్థయగు కాంగ్రెసు హిందువుల పక్షమున మాట్లాడవలయును. తిరిగి 1939-వ సం॥ లోను సంప్రతింపులు జరిగెను. ఈసంప్రతింపు లన్నిటిలోను శ్రీగాంధీయున్నాడు. 1937-వ సం॥ లో కాంగ్రెసు ఏడు రాష్ట్రములలో ప్రభుత్వము సాగించుట కారంభింపగానే శ్రీజిన్నా-'హిందూ మెజారటీ యెన్నడును ముస్లిములకు క్షేమకరముకాదు' అన్న వాదము బలపరుప పన్నాగమునారంభించెను. దానితో ముస్లిముల ప్రత్యేకతాభావమేగాక ప్రత్యేకరాజ్య కాంక్షయు నేర్పడెను.

1930-వ సం॥లో శ్రీసర్ మహమ్మదుఇక్బాల్ ఈపాకిస్థానమును సూచించెను. ఆమీఁద ఆంధ్రులు శ్రీగాంధీ అనుచరులు కోరితెచ్చుకొన్న కాంగ్రెసు అధ్యక్షుఁడు. శ్రీమహమ్మదాలీగారే కాకినాడ కాంగ్రెసున పాకిస్థానము జాడఁగ సూచించెను. రౌండుటేబిలు సభాసమయమునకూడ దీనిప్రస్తావన కలిగెను. ఆపిదప 1938-39-వ సం॥లో అఖండభారతదేశైక్యతకు భంగములేకుండ పాకిస్థానము నేర్పరుప వచ్చుననే భావము పోషింపఁబడెను. 1940-వ సం॥ న ముస్లింలీగులో లాహోరున ప్రత్యక్షముగ నదికోరఁబడెను. 1942-వ సం॥లో క్రిప్సురాయ బారము భంగము కాఁగానే మద్రాసునాయకులు తిరిగియిండ్లకువచ్చిరి. ఏప్రిల్ 1?-వ తేదీన క్రిప్సు తిరిగివెళ్లెను. తే 13, 14 దీలలో జపానునావలు వస్తున్నవని మద్రాసులో అలజడి పుట్టెను. లండనువెళ్లిన క్రిప్సు హిందూ ముస్లింసఖ్యత పొసగలేదు శ్రీగాంధీచెడఁగొట్టినాఁడు అని సాకులు చెప్పెను. శ్రీ సీ. ఆర్. గారికి

శ్రీజిన్నాకు పాకిస్థానముదానమిచ్చి సఖ్యమొనర్చుకొందమని ఆశపుట్టినది. ఆసంగతిప్రకటింపఁగానే కాంగ్రెసునాయకులు అంపరును నిరసించిరి. శ్రీగాంధీయు నిరసించెను. శ్రీ సీ. ఆర్. కాంగ్రెసునుండి రాజీనామా నిచ్చినాఁడు. క్విట్ ఇండియా ఉద్యమమున చేరలేదు. కాని ఆయన ఉపవాసములో నున్నప్పుడు శ్రీ ఆగాఖాన్ భవనమున ఆయనను చూచి, పాకిస్థానవిషయమై శ్రీజిన్నాతో రాయబారములు సలుపుట కొకప్రణాళిక నాయనకు సూచించి ఆయనయాశీర్వాదములఁ బడసెను. దానిని శ్రీగాంధీ విడుదలగుటకు కొద్దిరోజులకుముందు శ్రీజిన్నాకు తెలియపఱచెను. అయితే ఆప్రణాళిక నతఁడు నిరాకరించెను. ఆపిదప శ్రీగాంధీవిడుదలయై వచ్చిన తర్వాత ఆయనకు కొంతస్వస్థత చేకూరగానే, శ్రీగాంధీ శ్రీజిన్నా భేటీని శ్రీసీ. ఆర్. ప్రోత్సహించెను. వారుభయులు- 1944-వ సం॥న సెప్టంబరు మాసమున ఢిల్లీలో 15 రోజులపాటుచర్చించిరి. కాని సంధిపొసగలేదు. శ్రీగాంధీ పాకిస్థానరాజ్యములను ప్రత్యేకింప నంగీకరించినను శ్రీజిన్నా ఫెడరేషన్‌గాని కాన్‌ఫెడరేషన్‌గాని అంగీకరింపలేదు. వ్రతముచెడ పాకిస్థానమును అంగీకరించినను, సఖ్యముకుదిరెనన్న సుఖము దక్కలేదని శ్రీగాంధీ వగవగా, ఈసంప్రతింపులలో నీచేత పాకిస్థానము తత్త్వతః వప్పించితి నంతియ జాలునని శ్రీజిన్నాహర్షించెను. దీనితో ఇటు లీగును, అటు బ్రిటిషురాజకీయవేత్తలును ధైర్యముతోను పట్టుదలతోను కృషిచేయఁగా భారత దేశమునకు ప్రాణాంతకమైన పాకిస్థానమేర్పడినది. తుదకు శ్రీగాంధీయు కాంగ్రెస్సును దానినంగీకరింపక తప్పినదికాదు.

1945-వ సం॥ లోను ఆపిదప కాంగ్రెసుపై ఆంక్షతీసివేయఁబడలేదు; కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులును విడుదలగాంచలేదు. వీరు అహమ్మదునగరము కోటలోనుంచఁబడిరని పిదప తెలియవచ్చినది. విడుదలైన కాంగ్రెసువాదులు కృషి సల్పుటకుసంస్థ కావలసిరాగా శ్రీగాంధీఉపాయముపన్నెను. ప్రతి రాష్ట్రమునందును కాంగ్రెసు వాదులెల్లరుకలిసి, కాంగ్రెసుసమితు లేర్పరుపవలయునని సూచించెను. అట్లే మండల, తాలూకా, సమితు లేర్పఱచి నిర్మాణకార్యక్రమమును ప్రచారము చేయ నారంభించిరి. ఇట్లుండగా జర్మనుయుద్ధము ముగింపునకు వచ్చెను. జపాను కూడా చాలవరకు ఆక్రమించిన రాజ్యములను తిరిగి మిత్రమండలికి ధారవోసు కొన్నది.

ఇట్లుండగా కొంతకాలముక్రిందట అనఁగా 1944-వ సం॥ మధ్యలో కేంద్రశాసనసభయందు కాంగ్రెసు ముస్లింలీగునాయకులు కేంద్రరాజ్యాధికారము వహించుటకు ఒకతాత్కాలికప్రణాళిక తయారుచేసుకొనిరి. దానికి శ్రీగాంధీ సమ్మతి నిచ్చెను. ఆప్రణాళికను వెంటగొని వైసరాయి వేవెలు ఇంగ్లాండు వెళ్లి

వచ్చెను. రాగానే ఇచ్చట కార్యనిర్వాహకసభ్యులనందరిని విడుదలచేసి వారిని సంప్రతింపులకు సిమ్లా కాహ్వానించెను. వారితోపాటు శ్రీగాంధీని శ్రీజిన్నాను కూడా ఆహ్వానించెను. కాని అసంప్రతింపులు ఫలించినవి కావు. శ్రీవైసరాయియు, శ్రీగాంధీయు కలిసి కుట్రచేయుచున్నారని శ్రీజిన్నా ఆగ్రహపడెను. ఇంతలో జపానుకూడా ఓడిపోయినది. బ్రిటిషుప్రభుత్వము అచ్చట కార్మికపక్షస్వాధీనమైనది. వారు కాంగ్రెసుపై ఆంక్షదీసివేసి ముందు కేంద్రశాసనసభలకు ఎన్నికల నేర్పాటుచేసిరి. అది సాగినవెంటనే రాష్ట్రశాసనసభలకు యెన్నిక లేర్పాటుచేసిరి. రాజకీయవాతావరణము మాత్రము సరళమగుచున్నదేగాని రాజకీయసమస్య పరిష్కారము కాలేదు. పార్లమెంటరీ కమిషనువారు వచ్చిరి. భారతదేశసమస్య పరిష్కరించినగాని లాభములేదని వారికి తోచినది. కాబినెట్ మిషన్‌వారు ఒక ప్రణాళికను వెంటకొనివచ్చిరి. దానిలో చాల చిక్కులుండెను. కాంగ్రెసువారు ఇంటరిం కేంద్రప్రభుత్వమునందుఁ జేర నిరాకరించిరి; కాని రాజ్యాంగచట్టసభలో పాల్గొన సమ్మతించిరి. పిదప కేంద్రమున ప్రభుత్వమేర్పఱుప సమ్మతించిరి. ఆపిదప ముస్లింలీగువారి డైరెక్టు ఆక్షన్ దేశమందు అల్లరులు, ముస్లింలీగు కేంద్రప్రభుత్వమునఁ జేరుట, శ్రీజిన్నా శ్రీనెహ్రూ శ్రీబలదేవ్ శ్రీలియాఖత్ ఆలీలు లండన్ వెళ్లుట, డిశంబరు ప్రకటన, కాన్స్టిట్యుయంట్ అస్సెంబ్లీ సమావేశము, లీగు ప్రతిఘటన, తుదకు ఫిబ్రవరిలో - శ్రీఅట్లీ భారతదేశమున తమ అధికారము వదలు కొందుము అని ప్రకటించుట, శ్రీవేవెల్ నిష్క్రమణము, మౌంట్ బాటన్ రాక, ఆతనిప్రణాళిక పాకిస్థానస్థాపననిర్ణయము, దేశీయుల అంగీకారము, ఆగష్టు 15 తేదీన స్వాతంత్ర్య ప్రదానము, దేశవిభజన తదుపాంగములు అందరికి ఎరుకయేగదా! ఈ అన్ని కాంగ్రెసు నిర్ణయములు శ్రీ గాంధీసమ్మతముప్రకారమే జరిగినవి. కావున కాంగ్రెసు డిక్టేటరాయెనని భావింపవలెను.

1945-46 సంIIలలో నొకసమస్య ఉదయించెను. శ్రీసీ. రాజగోపాలాచారి 1942 లో కాంగ్రెసునుండి రాజీనామా నిచ్చెను. క్విట్ ఇండియాఉద్యమమునుండి విరమించెను. ఆకాలమున కాంగ్రెస్సును అపరిమితముగ విమర్శించెను. శ్రీగాంధీని కాంగ్రెసునాయకులను తిరస్కరించి తుస్కరించెను. కాని వారిబాంధవ్యము చెడలేదు. ఉపవాసవ్రత మప్పుడు వెళ్లిజూచెనని ఇదివఱకే చెప్పియుంటిని. విడుదలానంతరమును అంటకాచెను. తిరిగీ కాంగ్రెసునాయకులు జైళ్లనుండి వ్యవహారరంగమున కురుకుచున్నారని తెలియఁగానే వారిలోదూర మొదలుపెట్టినాఁడు. కాంగ్రెసుఆజ్ఞలకు కట్టుఁబడియుందునని మౌలానాఅజాద్ అధ్యక్షునికి హామీనిచ్చి పూర్వప్రధానామాత్యుఁడుగ సిమ్లా కాహ్వానింపఁబడినాఁడు. రహస్యముగ

నతనితో తిరుగ కాంగ్రెసును ప్రవేశింప నాలోచించి మజల 0-4-0సభ్యుఁడై నాఁడు. కాని 1942 నుండి ఆతనిచర్యలు మద్రాసు రాజధానిలో కాంగ్రెసువాదులకు చాల అసహ్యాకరములయ్యెను. అందుచే వీరు తిరిగి కాంగ్రెసులోనికి రాక ప్రధానామాత్యపదవికని తెలిసిపోయినవి. ప్రబలమగు వ్యతిరేకపక్షము బయలుదేరెను. శ్రీ సీ. ఆర్. గారు లేనిపక్షమున శ్రీ ప్రకాశంపంతులుగారు ఆపదవినందుట న్యాయమని పలువురు భావించిరి. కాని శ్రీసీ. ఆర్. గారు దానిని హెచ్చుగ నాశించిరి. వ్యతిరేకపక్షమును భంగపుచ్చుటకై దక్షిణభారత హిందీప్రచారక సభారజతోత్సవవ్యాజమున శ్రీగాంధీ రప్పింపఁబడెను. శ్రీగాంధీని మధుర పళనియాత్రలకు శ్రీసీ. ఆర్, వెంటనుండి కొనిపోయెను. శ్రీగాంధీ తనయందలి భక్తివిశ్వాసములతో వచ్చిన జనసమూహములనందరిని శ్రీసీ. ఆర్. ప్రభావసంభావులనుగ శ్రీగాంధీ ప్రకటించినాఁడు. తిరిగివెళ్లునప్పుడు "శ్రీసీ ఆర్. గారిని ప్రధానినిచేయవచ్చితివా?" అని ఎవ్వరో ప్రశ్నింపఁగా శ్రీగాంధీకి కోపమువచ్చెను. అందుకింతదూరము రానక్కఱలేదు; సేవాగ్రామమున నుండియే చేయఁగలను అని శ్రీగాంధీ ధీమసమున వక్కాణెను. పిదప శ్రీసీ ఆర్. పై పలువురు కుట్ర పన్నుచున్నారు అని ఆయన వ్రాసెను. దానితో ఇచ్చట శ్రీసీ. ఆర్. వ్యతిరేక పక్షములవారికి కిర్రెక్కినది. రానురాను వ్యవహారములు విషమించినవి. శ్రీసీ. ఆర్. గారేగాక, ఆయనదళవాయి శ్రీసుబ్బరాయన్ కూడ కాండిడేటులే గాక పోవుట తటస్థించెను. అయిన శ్రీగాంధీయు హైకమాండును విడువలేదు. ఎట్లైనను శ్రీసీ. ఆర్. గారిని ప్రధానిగా గొనిరా విశ్వప్రయత్న మొనర్చిరి. శ్రీప్రకాశము పంతులుగారిని పిలిపించి అదిలించి బెదిరించి అపవాదులు వైచిరి. అయినను శ్రీ ప్రకాశంపంతులు గారు అచల స్థైర్యమున నిల్చి ఇందరినికాదని శాసన సభ్యుల సాయమున నాయకులై ప్రధానమంత్రులైరి. కాని చలముపట్టు హైకమాండు ఆరు సంవత్సరములోపల వారిని ఆ పదవినుండి తొలగించినారు. అప్పుడందుకు కారకులైన వారిలో శ్రీవైద్యనాథయ్యర్ ప్రభృతులు నేడుచింతించుచున్నారు. శ్రీ సీ. ఆర్. పక్షము ఛిన్నాభిన్నమైనది. ఇందులో బ్రాహ్మణసభ్యులకు బ్రాహ్మణేతరసభ్యులకు తీవ్రవిభేదములు జనించెను. అయితే దీనివల్ల ఒక్కసత్యము ప్రకటితమైనది. శ్రీగాంధీని వ్యతిరేకించువారు కాంగ్రెసురాజకీయముల నిలువఁజాలరు. వారి నాయన నిలువనివ్వఁడు అనిస్పష్టమైనది. శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారు, శ్రీసుభాషచంద్రబోసు, శ్రీడా॥ ఖరే, శ్రీనారిమన్, శ్రీప్రకాశంగార్లిందుకు తార్కాణము.

1916 ఆగష్టులో ముస్లిములు అల్లరులు ప్రారంభించిరి. కలకత్తాన ఘోరమైన దారుణములు జరిగెను. ఆవెంట నవఖాలిలో జరిగెను. వీనికి ప్రత్యామ్నాయముగ

బీహారులో హిందువులు విజృంభించిరని అల్లరి ప్రారంభయాయెను. అప్పటికి కాంగ్రెసు కేంద్రప్రభుత్వమును చేపట్టెను. మంత్రులువచ్చి బెంగాలు బీహారులలో త్రాలిరి. ముస్లిముల ప్రత్యేకతాభావమును అంగీకరించి, కాబినెట్ కమిషన్‌వారి ప్రణాళిక నమలుజరుప యత్నించిన ఫలితముగా ముస్లిములు చెలరేగి సాగించిన అల్లరులవలన హింసాకాండ దేశమంతా అలుముకోకుండా ఆపవలసిన బాధ్యత శ్రీగాంధీ భుజస్కంధములపైఁ బడినది.

ముస్లిములు దురుసుచేసి పాకిస్థానమును సంపాదింపవచ్చునని తలంచిరి. ముస్లిములహింసాకాండ ప్రారంభమును చూచి హిందువులును ప్రతిఘటనకు పూనుకొనిరి. వెనుక నిట్లే 1930 లో ఒకవంక ప్రభుత్వమున్ను ఒకవంక విప్లవకారులున్ను హింసాకాండకు చెలరేఁగగా శ్రీగాంధీ "సత్యాగ్రహిధర్మ మీ రెండు తిరుగటిరాళ్ల మధ్యపడి నలిగిపోవుటే" అని యుండెను. నేడును అట్లే హిందూముస్లిములు పరస్పరము ప్రయోగింపదొరకొన్న హింసాకాండలో తాను ఆహుతిఅగుటే యని నిశ్చయించుకున్నాఁడు." వెంటనే కలకత్తాకు బయలు దేరినాఁడు. బీహారులో హిందువులను ఉపవాసమొనర్తునని హెచ్చరించి సౌమ్యపఱచినాఁడు. కలకత్తాలో ఎవరైతే ఈఅల్లరులకు మూలవిరాట్టని హిందువు లాక్రోశించుచున్నారో ఆ సుహ్రావర్దీసాయమునే నవ్‌ఖాలీపర్యటన మొనర్చెను. స్మశానవాటి కలమధ్యనున్న ఆయుద్యానవనములందు దారుణహింసా దేవత తలవిరియఁబోసుకొని క్రూరబీభత్సనృత్య మొనర్చిన ఆపల్లెలందు పర్యటన మొనర్చి నివసించి, అనాథల, అభాగ్యుల, భయభ్రాంతుల, కన్నీళ్లుతుడువను, ధైర్యవచనములుపలుకను, దాగిన వారిని స్వగృహములకు మరలింపను, తిరిగీ దేవతాపూజాదికములచేయింపను. ఆ నిస్తేజప్రదేశమున తిరిగి ఆశాజ్యోతిని వెలిఁగింపను శ్రీగాంధీకే చెల్లినది. ప్రపంచమున మఱి ఏప్రజానాయకుఁడుగాని, నిరాయుధుఁడు, నిస్సహాయుఁడు ఏకాకియై యిట్లు సాధింప నేర్చునా?

ఇట్లుండఁగా ఢిల్లీప్రాంతములలోఁగూడ అల్లరులు ఆరంభమైనవి. దేశవిభజనయు తీర్మానింపఁబడినది. లోలోనకుములుచున్న కుమ్ము కలకత్తా. అచ్చటికి శ్రీ సీ. రాజగోపాలాచారి గవర్నరుగా వెళ్ల అల్లరి హెచ్చినది. మఱెవ్వరు నీపదవిని వహింప సాహసింపలేదట! తానును వెళ్లి అక్కడ మకాము వేసినాఁడు. శాంతి నెలకొల్పెను. ఆయనకు సుహ్రావర్దీ అన్నివిధముల సహాయభూతుఁడైనాఁడు. ఆయనను తనపుత్త్రవత్తు మన్నించితినన్నాఁడు. ఎన్నియో దురంతముల నాతని కనుసన్నల ననుభవించిన కలకత్తా హిందువులకు గాయములపై ఉప్పుజల్లినట్లైనది. తిరిగీ వారు ప్రతిహింస

ప్రారంభించిరి. వారి ఆవెఱ్ఱిఆవేశమున శ్రీగాంధీ పవిత్రతయు మరపునకు వచ్చినది కాబోలు! ఆయనబస్సుపై మూకలువచ్చిపడినవి. అల్లరి చేసినవి; కడకు ఆయనపై లాఠీ కూడవిసరినవి. అయితే దైవవశమున అవి తలుపులకు తగిలినవి. శ్రీగాంధీ తిరిగి చింతించినాఁడు. ఆయనకట్టిసమయముల శరణ్యమొక్కటే. ఆయన తపస్సు ఉపవాస రూపకము గావున ప్రారంభించినాఁడు. వారముగడచులోపలనే హింసాప్రకృతితో తాము జాగ్రత్తజేసిన ఆయుధసామగ్రిని హిందూయువకులుమాత్రము తెచ్చి వారి ముందుంచిరి. పెద్దలు, హామీనిచ్చిరి. పట్నము తిరిగి శాంతిపొందినది. ఇంతలో పంజాబునుండి ఆర్తనాదము పోవలయును. ఢిల్లీకి పయనమాయెను.

ఆగష్టు (1946) నుండి అల్లరులు చేయఁగా ముస్లీములకు పాకీస్థానము సిద్ధించినది. అయితే పూర్తిగ పంజాబు దక్కలేదు; పూర్తిగ బంగాళము దక్కలేదు. ఈరెండు కలియుటకు మార్గములేదు. మొగలాయిచక్రవర్తులు నెమలిసింహాసనమున గూర్చుండి సామ్రాజ్యము లేలిన ఢిల్లీ, ఒక మొగలాయీలేదేమి? పృథ్వీసింహుఁడుహతమారిన నాటినుండి ముసల్మానులేలిన ఈరాజధాని హిందూయాని యఁలో ఉండిపోయినది. ముసల్మాను లూరకోఁగలరా? మరికొంతదురుసుచేసిన అవియు రావా? పాకీస్థానముదక్కినది. అయితే ఇంకా ఈబనియాలు, హిందువులు ఉన్నారే? ఎంతెంతఆస్తులు! వీరును మతాంతరులై మనలో కలియనైనా కలియవలెను. లేదా, వారిఆస్తులు మనవి; వారిస్త్రీలు మనస్వేచ్ఛాధీనలు; కట్టుగుడ్డలతో వీరిని సాగనంపుదము; ఆదండుగకూడ మారీయెందుకు? బరిసెలతో, బాకులతో మట్టుపెట్టుదము అని ప్రారంభించినారు. హింసాకాండనుండి తప్పించుకొనివచ్చిన వారూరకొందురా? ఢిల్లీప్రాంతమున సోదరహిందువులను రెచ్చగొట్టినారు. హింసకు ప్రతిహింస! దీనికి అంతెక్కడ? పొంతెక్కడ? రెండుచేతులు గలిసినగాని చప్పట్లు గావు; ఒకచేయి ఆపుచేతాము అని శ్రీగాంధీ యత్నించినాఁడు. ఆయత్నములో, ఒకవిచిత్రవ్యక్తి ఆగ్రహమున కాహుతియైనాఁడు. ఇతనా హత్యకు కారణము? నిమిత్తమాత్రము!

వెనుక పునహాలో బాంబువేయలేదా? మరొక్కసారి రైలుక్రింద బాంబు పెట్టఁబడలేదా? కలకత్తాలో లాఠీ తప్పిపోలేదా? వారమురోజులక్రింద బాంబు తప్పిపోలేదా? ఈ 79 సం॥లుగ ఆయన నెవరు రక్షించిరి? ఈశ్వరుఁడేగదా? నిజముగ వీరివియ్యంకుఁడు శ్రీ సీ. ఆర్. చెప్పినట్లు ఈశ్వరసంకల్ప మది! కాకున్న ఒక మానవమాత్రుఁడు ఆయనకు నమస్కరించి, కన్నులలోఁ జూచుచు, ప్రసంగించుచు, తెలివితో పిస్తోలు కాల్చగలఁడా? ఆవిద్యుచ్ఛక్తి ఎదుట అది దుస్సాధ్యము! అసాధ్యము!!

కిరాతక్రూరకృత్యమగు సొస్తికవధకు ఈశ్వరుఁడే వచ్చి అశ్వత్థామకు దివ్య ఖడ్గమిచ్చినట్లు ఈశ్వరుఁడే వచ్చి ఆవెఱ్ఱి యువకునిచేతి కాపిస్తోలు నిచ్చియుండును కాబోలు! ఏమైననేమి లోకమంతయు దివ్యజ్యోతి ఆరిపోయినదని వాపోవు చున్నది. వెల్గు నిచ్చిన ఆజ్యోతిని వెల్గించిన పరంజ్యోతికలఁడు గదా యని మానవ లోకము ఊరటనందుఁగాక! ఇఁకనైన వివేకముతో, శాంతి, సత్యముల చేబట్టి సుఖ సౌఖ్యముల నందుగాక! ఇకనైన ముస్లిములకు సహాయపడువారు లేరు కావున భారతదేశము శాంతిఁ జెందునని ఆశించుచున్నాను.

## శ్రీగాంధీగారికి ప్రియమైన ప్రార్థనగీతాలు

వైష్ణవజనతో తేనే కహీయే, జోపీడ పరాయీ జానేరే
పరదుఃఖే ఉపకారక హేతోయే, మన అభిమాన న ఆణేరే.

సకలలోక మాం సేనే, వందేనిందా నకరే కేనీరే
వాచ కాఛ మన నిశ్చల, రాఖే ధన ధన జననీ తేనీరే.

సమదృష్టినే తృష్ణా, త్యాగీ పరస్త్రీ జేనేమాతరే
జిహ్వాథకీ అసత్యనబోలే, పరధన నవఝాలే హాథరే.

మోహమాయావ్యాపే, నహీఁజేనే దృఢవైరాగ్యజేనా మన మాఁరే
రామనామ సూఁతా లీలాగీ, సకల తీరథ తేనా తనమాఁరే.

వణలోభీనే కపట రహీత, ఛేకామక్రోధ నివారయారే
భణేనరసై యోఁతేసూఁదర్శన, కరతాకుళ ఏకోతేరతారయారే.

రఘుపతి రాఘవ రాజారాం, పతితపావన సీతారాం
ఈశ్వర్ అల్లా తేరేనాం, సబ్‌కో సన్మతి దే భగవాన్.

---

# శ్రీమహాభక్తవిజయము

## మఱికొందరు విష్ణుభక్తులు



# పులక్ప్సకారు

శ్లో. "చలత్కనకకుండలోల్లసితదివ్యగండస్థలం చరాచరజగన్మయం చరణపద్మగంగాశ్రయం,
చతుర్విధఫలప్రదం చరమపీఠమధ్యస్థితం చిదంశమఖిలాస్పదం దశరథాత్మజం చింతయే.
(72-2 శ్రీరామకర్ణామృతము)

పులక్ప్సకారు జన్మతః మహమ్మదీయుఁడు. కాని పూర్వజన్మకృతపుణ్యపరిపాకంబున భాగవతశిరోమణియై అనేకులకు భవబంధవిమోచనోపాయము నుపదేశించెను.

పులక్ప్సకారు గొప్ప చక్రవర్తి. అతని రాజధాని గంగాతీరమున నుండెను. అతనివద్ద పదునెనిమిదిలక్షల అశ్వికులును, కోటి కాల్బలమును, ఒకలక్ష గజబలమును,పదిలక్షల వృషభములును గలవు. ఇంతటి మహారాజ్యము నేలువాఁడయ్యు నతఁడు పరమశాంతుఁడును, మహోదారుఁడును, దయాసత్యశౌచములు కలవాఁడునై యుండెను; గాని అతనికి స్త్రీలయెడల వ్యామోహ మత్యధికముగా నుండెను. అతనికి పదునారువందల భార్య లుండిరి. వారితో అతఁడు చాలకాలము గడపుచు ప్రపంచమును మఱచియుండెడివాఁడు.

అయినను కారు మబ్బులలో మెఱపుతీగవలె అపుడపుడు అతని హృదయమున భగవద్భక్తి యుప్పొంగుచునే యుండెడిది.

ఇట్లు చాలకాలము గడచిపోయిన పిదప నతఁ డొకనాఁడు మంత్రులను జూచి "మీసద్భావమువలన నేను మహాచక్రవర్తినై సకలసుఖములను పొందితిని. నాతో సమానముగ భోగముల ననుభవించిన మానవుఁడు మరియొకఁడు లేఁడు; గాని ఐహికభోగము లన్నియు తుచ్ఛము లనియు, సద్గతికి ప్రతిబంధకము లనియు నా కిప్పటికి తోఁచుచున్నది. ఐహికభోగము లెన్ని యనుభవించినను ఆశ తీరదు. గాని వాని పరమావధిమాత్రము సుఖకర మైనది కాదు. ఐహికభోగముల యనంతరము దుఃఖముగాని సుఖము లేదు. చింతగాని ఆనందము లేదు. నిరాశ గాని తృప్తి లేదు. అధోలోకమున బడద్రోయు అఖాతమే గాని ఊర్ధ్వలోకమునకు గొనిపోవు నిచ్చెన లేదు. అయ్యో! నేనెంత భ్రాంతుఁడ నైతిని! ఎంతకాలము వ్యామోహమున పొరలాడితిని! దీనికి ప్రతిక్రియ యేమిగలదు? నాహృదయము

భగభగ మండు విచారదావానలమున వేగిపోవుచున్నది. కావున దయయుంచి నాకు కర్తవ్యమును తెలుపుఁడు; నన్ను ఉద్ధరింపఁగల మహానుభావుఁడెవరో? ఎందున్నాఁడో? చెప్పుఁడు" అని యడిగెను.

అది విని మంత్రులు మొదట ఆశ్చర్యపడిరి; కాని తుదకు లోకవృత్తమును స్మరించి "ప్రభూ! నీహృదయ మింత మహోన్నతభావబంధురమై యున్నపుడు ఇఁక మా సలహా లెందుకు? సర్వమును నీకే తెలియును. మేమును ఇంతవరకును నీవలెనే ఐహికవిడంబనములయందే మునిఁగియుంటిమి; గాని అన్య మెఱుఁగము. కావున కర్తవ్యము మాకు మాత్ర మేమి తెలియును? అయినను ఒక్కసంగతి చెప్పెదము. కాశీనగరమున కబీరు అను నొకమహాత్ముఁడు కలఁడు. అతఁడు భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నుఁడు. భాగవతశిఖామణి. ఈశ్వరసాక్షాత్కారముగన్నవాఁడు. జీవన్ముక్తుఁడు. అక్కడికి వెడలి అతనిపాదముల నాశ్రయించుట మంచిదని మాకు తోఁచుచున్నది. ఇంతకంటె మే మేమియు చెప్పలేము" అని బదులు చెప్పిరి.

అది విని చక్రవర్తి పరమానందభరితుఁడై పరిమితపరివారముతో బయలు దేరి కాశీనగరమునకు పోయి కబీరుదాసు కుటీరము ప్రవేశించి అతని పాదార విందములకు సాష్టాంగనమస్కారము లాచరించి "మహానుభావా! నేను చక్ర వర్తినే; గాని యిప్పుడు భిక్షుకుఁడనై వచ్చితిని. పూర్వాపరములను పరిశీలింపకుండ చాలకాలము అజ్ఞానమున బడి మునిఁగియుంటిని. ఇప్పటికి నాకు బుద్ధి వచ్చినది. సంసారముమీఁద విరక్తి పుట్టినది. భవబంధవిమోచనోపాయము నెఱుంగుటకై మీపాదముల సన్నిధికి వచ్చితిని. దయయుంచి నాయెడల అభిమానము పూని నాహృదయము నావరించియున్న అవిద్యను పోద్రోలి నాకు జ్ఞానభిక్ష ప్రసాదింపుము" అని ప్రార్థించెను.

కబీరుదాసు పులకృశారు పొందిన మార్పు చూచి చాల ఆనందించెను. వెంటనే యతఁడు చక్రవర్తిని ఆదరముతో లేవనెత్తి "వత్సా! నీ కర్మముపక్వమైనది; కావున నీబుద్ధి యిట్లు సత్యవస్త్వన్వేషణప్రవణ మైనది. ఇఁక భయము వల్లదు. చిత్తశుద్ధి కలిగినచో మోక్షసాధనము దొరకుట క్షణము. గతమునకు వగవకుము, ఆకాల మిఁక కలసిరాదు. రాకున్నను బాధ లేదు. ఇఁక భ్రాంతి పొందకుండిన చాలును. దీపము దొరకినచో చిరకాలమునుండి గుహాలలో ఘనీభవించియుండిన అంధకారము చెదరిపోవుట కెంతకాలము పట్టును? గాని ఆదీపము దొరకుటయే కష్టము. ఈశ్వరానుగ్రహమువలన నీ కది అప్రయత్నముగను శీఘ్రముగను లభించినది. భూమండలమున ఎందరో రాజు లున్నారు. ఎందరో చక్రవర్తులున్నారు. వారి కందరికిని గూడ మనస్సు ఐహికములయందే చిక్కుపడియున్నది. గాని

ఆముష్మికము దెసకు పోదు. వారందరును బైటి సామంతుల నణచియుంతురు. అణచియుంచుటకు ఎల్లప్పుడును జాగరూకులై యుందురు; లొంగనివారి నడచుట కనేకవిధములఁ బ్రయత్నింతురు; కాని వారిలో నొక్కఁడు తన లోపలిసామంతు లగుఇంద్రియముల నణచియుంచఁడు. వానివిషయమున జాగరూకుఁడై యుండఁడు. వానిని అణచిపెట్టుటకుఁ బ్రయత్నింపఁడు. ప్రయత్నించుట ధర్మమని, అవసరమని గూడ తలపోయఁడు. రాజ్యముమీఁద రాజ్యము వచ్చి తనస్వాధీనము కావలయు ననియే ఆశ; గాని రాజ్యములన్నియు నెందుకు? శరీరము విడిచిన తరువాత నవన్నియు నేమగును? తన శరీరమే తనకు స్థిరము కానపుడు రాజ్యములు వైభవ ములు నెందుకు? కాని ఐహికములలోనున్న బాధ ఇదియే. అవి యీజ్ఞానమును కలుగనీయవు. అవి ఆశాపాశమును పెంచుటకే పని చేయును; కాని త్రెంచుట కాలోచింపవు.

అయితే ఈయైహికవాంఛలు జయింపరానివా? నిగ్రహ మున్నవానికి ఏమియు అడ్డులేదు. అసాధ్యము లేదు. ఇది యంతయు మాయ అని యెఱిఁగినవాని కిఁక నేమియు లేదు. ఒక్కటి చూడుము. ఈరాజులు బ్రతికియున్నంతకాలము ఐహికములయెడల అతిజాగరూకులై యుందురు. కాని చనిపోయిన పిదప తమ శరీరములను గురించి యెవరును అట్టిజాగ్రత్త వహింపరని వారెఱుఁగరు. ఎంత పోషించినను ఈశరీరము బుద్బుదము వంటిది; కాని శాశ్వతము కాదు. ఇదియే శాశ్వతము కానపు డిఁక దీనికి పోషకము లైన వెట్లు స్థిరము లగును?

కావున ఈజ్ఞానము కలుగుటయే మోక్షము. ఇది ఆత్మాయత్త మైనను ఈశ్వ రానుగ్రహ ముండినగాని అనుభవమునకు రాదు. నీవు అదృష్టవంతుఁడవు; ఐహిక జంబాలమున మునిగియుండియే దీనిని పొందఁగలిగితివి. మమకారము పోయినచో నిఁక నేమియులేదు. అంతయు శూన్యము. అంతయు నంధకారము. అయితే మమ కారము పోయినచో అంధకారము వెలుపల ధగద్ధగాయమానముగ వెలుఁగు పరంజ్యోతి కనఁబడఁగలదు. ఈక్షుద్రమానవకళేబరమున బద్ధుఁడై యున్న ఆత్మకు ప్రాప్య మదియే. జీవునకు సాధ్య మదియే. అదియే పరబ్రహ్మము. అదియే కేవ లము శాశ్వతము. అనంతము. అపారము.

అయితే అది సులభముగ లభించునా? తత్సాధనమున ఎన్ని అంతరాయములు? ఎన్ని ఆటంకములు? ఎన్ని చిక్కులు? అది అవాఙ్మానసగోచరము. మనస్సు కందదు. మాటల కందదు. ఈచర్మచక్షువులకు కనఁబడనే కనఁబడదు. ప్రాపంచికవాసనలన్నియు జయించినవారికే అది లభ్యమగును. వానిని జయించుట కెన్నో మార్గము లున్నవి. అన్నిటను సులభమైనది భక్తి.

ఏది నిర్గుణమో, కష్టసాధ్యమో అది లోకహితముకొఱకు సగుణమై భక్తి గమ్య మగుచున్నది. మోక్షమున కింతకంటె సులభోపాయము లేదు.

ఈశ్వరదృష్టిలో స్త్రీపురుషభేదము లేదు. పెద్దపిన్న తారతమ్యము లేదు. బీద సాదభేదము లేదు. స్వామ్యత్వసేవకత్వములు లేవు. అందరును సమానులే. అంతయు నొకటే; ఈమార్గమున నిఁక మమకారమున కవకాశ మెక్కడ?

కావున ప్రపంచమున నంతటను ఈశ్వరుఁడు నిండియున్నాఁడని యెఱుఁగుము. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఈశ్వరనిష్ఠయే. కావున భేదబుద్ధిని జయించుము. అందరను సేవింపుము. అందరిలో నైక్య మగుము. అట్లయిన రుక్మిణీవల్లభుఁడు నీకు సాక్షాత్కరించును" అని బోధించి తారకమంత్రము నుపదేశించి, "రాజా! యిది తారకమంత్రము అనఁగా జన్మసాగరమును దాటించునది. దీనివలన చిరసంచితములై యున్న నీపాపము లన్నియు తొలఁగిపోయినవి. నీవు పరిశుద్ధుఁడ వైతివి. భగవంతుని యనుగ్రహమునకు పాత్రుఁడవు నయితివి. ఈస్థితి చెడకుండ చూచుకొనుము. భగవంతుని శ్రవణమనన పూజనాదులతో సుముఖుని గావించుకొనుము. భగవద్భాగవతకైంకర్యములు మరువక ఎల్లపుడును భక్తిశ్రద్ధలతో నెఱవేర్చుచుండుము" అని చెప్పి పంపివేసెను.

పులక్పుకారు చాల ఆనందించెను. "తరించితిని" అని బ్రహ్మానందపడెను. గురువునకు మరల సాష్టాంగనమస్కారము లాచరించి బయలుదేరి కొలఁది దినములయందే రాజధాని చేరుకొనియెను.

కాని అతని కీజ్ఞానము నిలిచినది కాదు. పట్టణము చూడఁగానే మమకారము విజృంభించినది. గద్దె యెక్కగానే అహంకారము రేకెత్తినది. అంతఃపురమునకు పోఁగానే స్త్రీవ్యామోహము పెచ్చుపెరిగినది. వెంటనే అతఁడు మఱల సంసార సముద్రమున మునిఁగిపోయెను. జ్ఞానము లేదు. భక్తి లేదు. తారకమంత్రము లేదు. కబీరు లేఁడు. భగవంతుఁడు గూడ కారుమబ్బులలో తిరోహితుఁడయ్యెను.

ఇట్లు కాలము కడచిపోవుచుండెను. అతని ప్రియురాండ్రలో కొందరు వేశ్య లుండిరి. ఒక రాత్రి ఒక వేశ్యవంతు వచ్చెను. ఆమె చాల చక్కనిది. చతుర, ప్రౌఢ, విశేషించి భగవద్భక్తురాలు, భేదభావము లేనిది. ఆమె శయ్యను బాగుచేసి గది యంతయు సుసజ్జితము గావించి అంతలో నిద్ర కూరుకురాగా మంచము మెట్లు మీఁద కూర్చుండి తల్పమున శిర మిడి నిదురించెను.

అట్లొకటి రెండు గడియలు కడచిన తరువాత చక్రవర్తి వచ్చెను; గాని ఆసంగతి ఆమె యెఱుఁగదు. ఆమెకు మేలుకువ రాలేదు. చక్రవర్తికి కోపము మాత్రము వచ్చినది. వెంటనే యతఁడు నౌకరులను రావించి, "రక్తము కారునట్లు కొరడాలతో కొట్టుఁడు" అని యాజ్ఞాపించెను.

రాక్షసులతో సమానులగు భటు లట్లే చేసిరి. చక్రవర్తి కోరినట్లే ఆమె దేహమునుండి రక్తము కారసాగెను; కాని ఆమె చలింపలేదు. భీతిల్లలేదు. అయ్యో అనలేదు. దుఃఖింపలేదు. పైఁగా నవ్వసాగినది.

అది చూచి చక్రవర్తి ఆశ్చర్యపడి "శరీర మిట్లు చితికిపోవుచున్నది. నెత్తురు కారుచున్నది. ఇట్టి స్థితిలో నీ కీనవ్వెట్లు వచ్చినది?" అని యడుగఁగా ఆమె "ప్రభూ! ఈశయ్యమీఁద నాతల నానుకొంటిని. అంత మాత్రమునకే నాకిట్టి శిక్ష తటస్థించినది. ఈరాత్రియంతయు నీవు ఈశయ్యమీఁద పూర్తిగా మేనువాల్చి శయనింతువు. అట్టి నీ కెట్టి దండన కలుగ నున్నదో యని నవ్వుచున్నా" నని బదులు చెప్పెను.

దీనితో చక్రవర్తికి కొరడాదెబ్బ తగిలినట్లయినది. వెంటనే యాతఁడామె పాదములమీఁద వ్రాలి "తల్లీ! నా యపరాధము క్షమింపుము. నేను మంచి దారి కాంచియు బురదగుంటలో కూలఁబడిపోయినాను. నీ వింతటి తత్వజ్ఞురాలవనీ, ఇంతటి భగవద్భక్తురాలవనీ, ఇంత మహిమ గలదానవనీ యెఱుంగలేకపోయితిని. కావుననే నేను కాశీవరకును పోయితిని. అయినను అజ్ఞానమును గూడ నేను నిలుపుకొనఁజాలకపోయితిని. నాయెడల ననుగ్రహము పూని నాకు తరుణోపాయములు నుపదేశింపుము" అని ప్రార్థించెను.

ఆమె యాతనిని లేవనెత్తి "ప్రభూ! నీకు తరుణోపాయమును మహాత్ముఁడగు కబీరుదాసే యుపదేశించెను; కాని దానిని నీవు తిరస్కరించితివి. గాజురాళ్లను శిరమున ధరించి నిక్కంపుమణులను పారజిమ్మితివి. చవుటిపట్టులో ప్రవహించిన గంగవలె నీయందు నిక్షేపింపఁబడిన తారకమంత్రము స్తబ్ధమైపోయినది. జన్మపరంపర దుఃఖభాజనమే గాని అందు మానవజన్మముత్కృష్టమైనది. దానిని పొందియుఁ గూడ భవనాశనదీక్ష పూని ఈశ్వరసేవ చేసి తరింపకపోవుట యేమి వివేకము? చెవిటివానియెదుట శంఖమూదినట్లు కబీరుమహాత్ముఁడు నీకు చేసిన జ్ఞానోపదేశ మంతయు వ్యర్థమైపోయినది. అయినను మించిపోయినది లేదు. ఇకనైనను ఆచార్యుని యుపదేశము ననుసరించి మసలుకొనుము" అని యుపదేశించెను.

చక్రవర్తి ఆమెకు మరల సాష్టాంగనమస్కారము లాచరించి తారకమంత్రమును జపించుచు సకలమును విడిచి పురమును విడిచి బయలుదేరెను. అది చూచి సేవకులు, ఆప్తులు, బంధువులు, అంతఃపురస్త్రీలు కొందఱు వెంట బయలుదేరగా నాతఁడు "మీరిక రావలదు నన్ను మఱచిపొండు. నాకు ఈశ్వరుఁడు తప్ప మఱెవ్వరును లేరు" అని వెనుకకుఁ బంపివేసి ఒక భయంకరారణ్యమునఁ బ్రవేశించెను.

అం దతఁడు నాలుగు దినము లుండెను. ఆనాలుగు దినములు నతఁడు నిద్రాహారములు మఱచి శ్రీరామనామజపము చేసెను. శ్రీరాముఁ డంతట ఆనందించి

శంఖచక్రగదాద్యలంకారములతో సాక్షాత్కరించి "వత్సా! నీ భక్తికి నీ నిష్ఠకు ఆనందమైనది. నీవు నాయనుగ్రహమునకు పాత్రుఁడ వైతివి" అని యానతిచ్చి తిరోహితుఁడయ్యెను.

పులక్ష్వకారు జరిగినదానికి చాల నానందించి పరమేశ్వరుని అనేకవిధముల ప్రస్తుతించి ముందుకు బయలుదేరెను.

ఒకచోట నొక యోగి పర్ణశాలలో నించియుండెను. అతఁడు సద్గుణనిధి. భగవద్భాగవతభక్తుఁడు. ఇంద్రియములను జయించి ఆహారపానములు వర్జించి అతఁడు యోగనిష్ఠుఁడై యుండుచుండును. అందు కానందించి శ్రీహరి సాక్షాత్కరించి "వత్సా! నీభక్తికి మెచ్చితిని? కాని అన్నపానములు విడిచి నీవు శరీరమును శుష్కింపఁజేసికొనుచున్నావు. నా యనుగ్రహముపడయుట కట్టి పద్ధతి యవసరము లేదు. మితాహారపానివై యుండిన చాలును" అని చెప్పి యంతర్హితుఁడయ్యెను. అది మొదలు ప్రతిదినమును మధ్యాహ్నభోజనసమయమున అతని యెదుట రెండు అప్పములు వచ్చి వ్రాలసాగెను. యోగియు అత్యానందముతో వానిని భుజించి మరల బ్రహ్మధ్యానతత్పరుఁ డగుచుండెను.

ఒకనాఁడు పులక్ష్వకారు అక్కడకు వచ్చెను. అప్పటికి యోగియెదుట రెండు అప్పములును వచ్చియుండెను. యోగి పులక్ష్వకారు నారసి రెండు అప్పములలో నొకటి యైన అతని కీయకతప్పదని గ్రహించి అట్లుచేయుట కిష్టపడక "ఓయీ! నీ వెందలివాఁడవు? ఎన్నిదినములనుండి నీ వీ వేషముతో నున్నావు?" అని యడిగెను. అందుకు పులక్ష్వకారు "ఎనిమిది దినములనుండి" అని భయభక్తులతో జవాబు చెప్పెను. దానిమీద యోగి "ఓయీ! నీవు క్రొత్తగా సన్యసించితివి; గావున మాకు నీతో పొత్తు కుదురదు. మరియొకచోటికి పొమ్ము" అని పలికెను. అది విని పులక్ష్వకారు "దేవరవారి యాజ్ఞ అని బదులు పలికి మరియొకచోటికి పోయి భగవద్ధ్యానప్రవృత్తుఁ డయ్యెను. వెంటనే యోగి నిశ్చింతతో అప్పములను భక్షించెను.

అంతటను నిండియున్న శ్రీహరి యిది చూచి లక్ష్మీదేవిని పిలిచి "అల్లదే అక్కడ పరమభక్తాగ్రేసరుఁ డొకఁడు ఎనిమిది దినములనుండి అన్నపానములు వర్జించి నన్నే ధ్యానించుచు చిక్కియున్నాఁడు. నీవు పోయి అతనికి మృష్టాన్నమిడి సంతృప్తునిఁ గావింపు" మని చెప్పెను. లక్ష్మియు అందుకు వల్లె యని సువర్ణపాత్రమున పంచభక్ష్యపరమాన్నములను గొనిపోయి అతని యెదుట నిలిచెను అనంతతేజస్సుతో ప్రకాశించు ఆమెను చూచి పులక్ష్వకారు "ఈమె జగన్మాత యగు లక్ష్మి; కాని యన్యులు కారు" అని నిశ్చయించి సాష్టాంగదండప్రణామము

లాచరించి "తల్లీ! నీ యనుగ్రహమునకు నాకు ఆనందపారవశ్యము కలుగుచున్నది. ఈక్షుద్రునియెడల నీ కింత జాగ్రత్తయా? అమ్మా! నిన్ను కొనియాడుటకు నా కెట్టి శక్తియు లేదు" అని యనేకవిధముల వినుతించెను. అపుడు లక్ష్మి అతనికి తాను తెచ్చిన పదార్థముల నిడి భక్షింప నిచ్చి "వత్సా! నీహృదయమతి నిర్మలముగా నున్నది. నీభక్తి శ్రీహరికి పరమానందము కలిగించుచున్నది. నీవు తరించితి" వని చెప్పి అంతర్హితురా లయ్యెను. పులక్స్కారు చాలసేపు ఆమెను కొనియాడి మరల ధ్యాననిష్ఠుఁ డయ్యెను.

యోగి యిది యంతయు చూచి చాల కటకటఁబడెను. "అయ్యో! ఇది యెంత వ్యత్యాసముగా నున్నది. ఈ తఁడు ఎనిమిది దినముల క్రిందటనే సన్యసించియుం డెను. ఇతని కింకను సంసారవాసనలు విలుప్తములై యుండవు. నిర్మలభక్తి కుదిరి యుండదు. ధ్యాననిష్ఠ అలవడియుండదు. అయినను ఇట్టివానికి శ్రీహరి మహాలక్ష్మిచే మృష్టాన్నము పెట్టించి ఆదరించెను. నాకును ఇతనికి నెంత తేడాయున్నది! నేను సన్యసించి యెన్ని దినము లైనవి? ఎంత తపస్సుచేసితిని! ఎంత భక్తి చూపితిని! ఎంత ధ్యానించితిని. ఇంత చేసినందుకు దినమునకు నాకు రెండు అప్పములు మాత్రమే శ్రీహరి యొసంగుచున్నాఁడు. ఇది యెంత అక్రమముగా నున్నది?" అని మిగుల పరితపింపసాగెను.

ఆరాత్రి అతనికి స్వప్నమున శ్రీహరి వృద్ధసాధురూపముతో కనఁబడి "వత్సా! నీచిత్త మింకను పరిశుద్ధము కాలేదు. నీ వింకను ద్వంద్వాతీతుఁడవు కాలేదు. ఈర్ష్యామాత్సర్యాది రాక్షసగుణము లింకను నీయందు విలుప్తములు కాలేదు. నీకును పులక్స్కారునకును ఇదియే భేదము. ఐహికవిషయములలో నీ కంటె నతఁడెక్కువ వాఁడు. అతఁడు చక్రవర్తి. అనంతవైభవసమగ్రుఁడు. అపార చతురంగబలసమన్వితుఁడు. అతఁ డనుభవించిన ఐహికభోగములకు పరిమితి లేదు. అయినను సన్యసించిన ఈయెనిమిది దినములయందును అతఁడు అహంకార మమకారములను పూర్తిగా విసర్జించెను. ఆశల నన్నిటిని జయించెను, ఇంద్రియముల నన్నిఁటిని నిగ్రహించెను. ద్వంద్వములను పూర్తిగా తొలఁగించుకొనెను. నీవో! నీవు సామాన్యసంసారివి. నీ యైహికసంపత్తి మిగుల పరిమితము. అయినను నీ వింకను ప్రాపంచికవాసనలనుండి దూరుఁడవు కాలేదు. సమదర్శిత్వము నీ కింకను పట్టుపడలేదు. అసూయను జయింపఁజాలకపోయితివి. ఎనిమిది దినములనుండి నిరాహారియై యున్న నాపరమభక్తుఁడు భక్తితో సేవించుటకు మాత్రమే నీ చెంతకు రాఁగా అతనిని మోసపుచ్చి, హీనముగ చూచి, తిరస్కరించి, పొమ్మని అప్పములు తిని తృప్తుఁడ వైతివి. ఇది మంచిదా? ఇది నాకు సంతోషము కలిగించునా? నిన్నీపూట

భక్తుఁడవే; అయినను సద్గురుబోధ లేకపోవుటవలన నీకింకను మంచి మార్గము దొరకలేదు; కావున ఇప్పుడైన కబీరు నాశ్రయించి జ్ఞానోపదేశము పొందుము అని చెప్పి అంతర్హితుఁ డయ్యెను.

వెంటనే ఆయోగి మేల్కాంచి సమీపమునందే తన్మయుఁ డయి యున్న పులక్పుకారు నెదుటికిఁ బోయి అంజలిబద్ధుఁడయి నిలిచెను. పులక్పుకారు కొంత తడవునకు కన్నులు విప్పి చూచి 'మహానుభావా! మీ కిది తగునా? ఈతుచ్ఛుని కింత శిక్ష చేయుట తమకు న్యాయమా? కనుసన్న చేసిన చేతులు జోడించుకొని వచ్చి సేవలు చేయకుందునా?' అని పలికెను. అందుకు యోగి అతని పాదముల మీఁద వ్రాలి "మహానుభావా! నీమహిమ నెఱుంగఁజాలక అపరాధము చేసితిని. తూలనాడితిని. నన్ను రక్షింపవలయును. శ్రీహరి నా యపరాధమును సహింపక దండించె" నని స్వప్న వృత్తాంత మంతయు నెఱింగించి, 'మహాత్మా! నాయెడల వాత్సల్య ముంచి నాకు సద్గురూపదేశభాగ్యము కలిగింపవలయును' అని మిగుల ప్రార్థించెను.

పులక్పుకారు అందుకు తగునట్లు పలికి అతనిని వెంట నిడుకొని కాశీనగరమున కరిగి కబీరుదాసు పాదములకు ప్రణమిల్లెను. కబీరును అతనిని లేవనెత్తి 'వత్సా! నీ వైరాగ్యమునకు, నీ జ్ఞానమునకు, నీ భక్తికి చాల ఆనంద మైనది. నీచెంత నున్న ఈమహానుభావు లెవరు?' అని ప్రశ్నించెను. అప్పుడు పులక్పుకారు సంగతి యంతయు విన్నవించి 'గురూత్తమా! ఈమహానుభావుఁడు పరమభాగవత శిఖామణి. మీదర్శనము, మీయుపదేశము నపేక్షించి వచ్చియున్నాఁడు. కటాక్షింపవలెను' అని ప్రార్థించెను.

అంతట కబీరు యోగిని కూర్చుండు మని చెప్పి 'భాగవతాగ్రేసరా! శ్రీహరి సాక్షాత్కారమువలన నీవు ధన్యుఁడ వైతి' వని పలికి అతని శిరమున చేయిడి తారక మంత్ర ముపదేశించి భగవద్భాగవతారాధనావశ్యకతను, తద్విధమును విశదపఱిచి ఇఁక నీయిచ్ఛవచ్చిన స్థలమునకుఁ బోయి తారకమంత్రమును జపింపు మని యానతిచ్చెను.

అంతట యోగి మరియొకమారు కబీరు పాదకమలము లంటి 'మహాత్మా! తమ యనుగ్రహమువలన తరించితి' నని విన్నవించి, పులక్పుకారు పాదముల నంటి 'మహానుభావా! తమ కరుణవలన జ్ఞానవంతుఁడ నైతి' నని మనవి చేసి నిజనివాసమున కరిగి భగవధ్ధ్యానపరాయణుఁడై యుండెను.

పులక్పుకారు కాశీనగరమున మఱికొన్ని దినము లుండి గురువును సేవించి తదనుమతిని తీర్థయాత్రలు చేయ ద్వారకానగరము చేరెను.

అతఁ డచ్చట కొంత కాల ముండి శ్రీకృష్ణుని సేవించెను. ఒకనాఁడు అతఁడు భాగవతులతోఁ గూడి హరినామకీర్తనము చేయుచుండఁగా శ్రీకృష్ణుఁడు వారిమధ్య నిలిచి తదనుగుణముగ వేణుగానము చేయసాగెను. భాగవతు లందఱును కొంత తడవు తన్మయులై యుండి తుద కంతయు గ్రహించిచూడఁగా శ్రీకృష్ణుఁడు తిరోహితుఁ డయ్యెను. అంతట వా రందరును పులక్ప్రకారు పాదములకు వందనము లాచరించి "భాగవతాగ్రణీ! నీమహామహిమము గుర్తింపలేని మమ్ము రక్షింపుము. నీ యనుగ్రహమువలన శ్రీకృష్ణభగవానుని దివ్యమంగళవిగ్రహమును కన్నులార గాంచి తరించితి" మని యనేకవిధముల కొనియాడి, అతని యనుమతి నంది నిజనివాసము లకు వెడలిపోయిరి. పులక్ప్రకారుసు తనయెడల శ్రీహరి చూపిన వాత్సల్యమునకు పరమానందభరితుఁడై ప్రాతఃకాలమున స్నానాద్యనుష్ఠానములు ముగించుకొని ఆలయమునకుఁ బోయి శ్రీకృష్ణభగవానుని సేవించుకొని బయలుదేరెను.

మార్గవశమున అతఁ డనేకపుణ్యక్షేత్రములను సందర్శించెను. ఒకచోట నొక ఆంజనేయాలయము గాన్పింపఁగా నతఁడు స్నానాద్యనుష్ఠానములు నిర్వర్తించు కొని అందు ప్రవేశించి, నమస్కరించి, స్తుతించి, అన్నపానములను తలఁపునకైన రానీయక ఏడుదివారాత్రములు తారకనామమును జపించెను. అందుకు శ్రీరామ చంద్రమూర్తి ఆనందించి సీతాదేవితోడను, లక్ష్మణస్వామితోడను, ఆంజనేయుని తోడను సాక్షాత్కరించెను. తోడనే పులక్ప్రకారు ప్రదక్షిణసాష్టాంగనమస్కారము లాచరించి,

శ్లో. శ్రీరామచంద్ర కరుణాకర రాఘవేంద్ర, రాజేంద్రచంద్ర రఘువంశసముద్రచంద్ర
సుగ్రీవనేత్రయుగళోత్పలపూర్ణచంద్ర, సీతామనఃకుముదచంద్ర నమో నమస్తే.
శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య, రాజేంద్ర రాజసురనాయక రాఘవేశ
రాజాధిరాజ రఘునందన రామభద్ర, దాసోఽస్మ్యహం చ భవతశ్శరణాగతోఽస్మి.
(7 ప్రథమాశ్వాసము. రామకర్ణామృతము.)

అని యనేకవిధముల వినుతించెను. శ్రీరామచంద్రమూర్తి మరింత యానందించి "వత్సా! నీభక్తి కెంతయు నానందమైనది. నీ నిష్ఠ అచంచలమైనది. నీవు ఎల్లప్పు డును నాహృదయమున నుందువు. నీకు అవసానమున సాయుజ్యముక్తి నిచ్చెద" నని యాశీర్వదించి తిరోహితుఁ డయ్యెను.

అపు డాంజనేయుఁడు అతనిని చూచి "భాగవతోత్తమా! నీభక్తి యచంచలమై యున్నది. తారకమంత్రోపాసనవలనను, శ్రీరామచంద్రసాక్షాత్కారలాభము పడయుటవలనను నీవు నాకు ప్రియసఖుఁడ వైతివి. నీవెప్పుడు కోరిన నే నప్పుడు నీకు దర్శన మిచ్చుచుండెద" నని యభయమిచ్చి అంతర్హితుఁ డయ్యెను.

పులకప్పకారు వెంటనే అక్కడనుండి పోవుచుండఁగా నొక యరణ్యమున కొందరు సాధువు లొక పర్ణశాలలో కూర్చుండి హరిభజనము చేయుచుండిరి. పులకప్పకారు వారి చెంతకు బోయి నమస్కరించి నిలువగా వారు "ఇతఁడు వేషగానివలె నున్నాఁడు; నిక్కముగ వైష్ణవుఁడే యైనచో మెడలో తులసిపూసలహారము లేకుండునా? కావున ఇతనిని మనలో చేర్చుకొనరాదు" అని కూడఁబలుకుకొన్ని "పొమ్ము" అని ఆజ్ఞాపించిరి. వెంటనే యతఁడు "చిత్త"మని మరల నమస్కరించి కొంచెము దూరమున నొక చెట్టుక్రింద కూర్చుండి ఆంజనేయుని స్మరించెను.

వెంటనే హనుమంతుఁడు సంగతియంతయు గ్రహించి సాధువేషముతో సాధువులచెంత కరిగి "అయ్యా! మీ భగవద్భక్తి మంచిదే; కాని మీరు పై వేషములకు వ్యామోహము పొందుచున్నారు. ఎవరు నిరాడంబరభక్తులో వారిని గెలిచేసి కించపరిచి తరిమివేయుచున్నారు. ఇది మంచిరి గాదు. దీనిని శ్రీరామచంద్రమూర్తి సహింపఁజాలఁడు. మీ రిప్పుడే యొక భాగవతశ్రేష్ఠుని గెంటివైచితిరి. అతఁడు చాల భక్తుఁడు. శ్రీరామచంద్రుని యనుగ్రహమునకు పాత్రుఁడై యున్నవాఁడు. అంతటి విరాగి, అంతటి జ్ఞాని, అంతటిభక్తుఁడు, అంతటిసాధువు ముల్లోకములయందును లేడు. అతని కంఠమున తులసిపూసలపేరులు లేవనీ, ద్వాదశోర్ధ్వపుండ్రములు నతని శరీరమున లేవనీ మీరు అతనిని తిరస్కరించితిరి. ఆతఁడు బాహ్యవేషముల పొంతకు పోవువాఁడు కాఁడు. అతని కంఠమున తులసిపూసలు లేకున్నను శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణసమేతుఁడై ఆతనిహృదయపీఠమున వేంచేసియున్నాఁడు" అని చెప్పి అంతర్హితుఁ డయ్యెను.

అది విని సాధువులు మిగుల భయపడి యిర్వురకు వచ్చి సమీపమునందే యొక చెట్టుక్రింద కూర్చుండియున్న పులకప్పకారు చెంత కరిగి ప్రదక్షిణనమస్కారము లాచరించి అంజలిబంధములు గావించుకొని "మహాత్మా! మాయపరాధమును మరచిపోయి మమ్ము రక్షింపవలెను. సద్గురుముఖతః మేము భగవంతుని అనంతలీలలు విని యుండకపోవుటవలన భాగవతులవిషయమున మే మిట్లే తలఁచుచు భ్రాంతుల మగుచున్నాము; కావున మా యజ్ఞతను పోఁగొట్టి మాకు జ్ఞానోపదేశము గావింపు"మని యనేకవిధములఁ బ్రార్థించిరి.

అపుడు పులకప్పకారు వారి ప్రార్థనము నంగీకరించి తారకమంత్రము నుపదేశించి "సాధుపుంగవులారా! లోకప్రవృత్తియే యిట్టిది. ప్రపంచ మంతయు అవిద్యచే ఆవరింపఁబడియున్నది. భ్రమప్రమాదములు విచ్చలవిడిగా చెలరేఁగుచున్నవి. ఇవియే మానవులను ఈశ్వరునకు దూరముగా కొనిపోవుచున్నవి. మీకు వేషభాషలతో పనిలేదు. సర్వకాలసర్వావస్థలయందును శ్రీరామచంద్రునే స్మరింపుఁడు.

మానవులయందు, పశువులయందు, అచేతనములయందు, సర్వస్థలములయందును భగవంతుఁడు వేంచేసియున్నాఁడు. కావున ఎచ్చటను భగవదస్తిత్వమును శంకింపకుఁడు. విషయేచ్ఛలను సమూలముగ పెల్లగించివేయుఁడు. సాధుసమాజములను సేవింపుఁడు. భాగవతుల నారాధింపుఁడు. భేదభావమును జయింపుఁడు" అని బోధించి ముందుకు బయలుదేరెను. ఆసాధువులు గూడ అతనిని విడిచి యుండలేక వెంట బయలుదేరిరి.

ఫులక్పుకారు స్వస్థలమునకు చేరెను. అతఁడు సాధుబృందముతోఁగూడ పురమున్బైట విడిసెను. వెంటనే యిది తెలిసి మంత్రులు, రాజబంధువులు మున్నగువారందరును వచ్చిరి. వారిని చూచి అతఁడు "సందడి పెంచవలదు. ఇఁక రాజ్యాధికారము నాకు వలదు. ముందుగ నీ భాగవతోత్తముల నారాధింపుఁడు. ఇట నొక మఠమును నిర్మింపఁజేయుఁడు" అని చెప్పి మఠనిర్మాణమైన పిదప అందు ప్రవేశించి సదా రామస్మరణము చేయుచు సచ్చిదానందము ననుభవింపసాగెను.

అతఁడు బ్రతికియున్నంతకాలము నిశ్శ్రేయస హరిభజనము చేసి అనేకులకు తరణోపాయ ముపదేశించి, అవసానమున శ్రీహరిసాయుజ్యమును బడసెను.

చ. "ఘనతరకుండలోల్లసితగండయుగున్ నిజపాదపద్మసం
జనితసురాపగున్ జరమసంజ్ఞకపీఠనివాసితున్ బరా
త్మునిఁ సచరాచరాత్మకుఁ జతుర్విధసత్ఫలదున్ జిదంశురా
ముని నఖిలాస్పదున్ భువనమోహను దాశరథిన్ భజించెదన్."

(72-2 రామకర్ణామృతము.)

---

# షేక్పరీదు దాసుఁడు

శ్లో. మజ్జీవం మదనుగ్రహం మదధిపం మద్భావనం మత్సుఖం
మత్త్రాతం మమ సద్గురుం మమవరం మోహాంధవిచ్ఛేదనం,
మత్పుణ్యం మదనేకబాంధవజనం మజ్జీవనం మన్నిధిం
మత్సిద్ధిం మమ సర్వకర్మసుకృతం రామం భజే తారకమ్.

(38-2 రామకర్ణామృతము.)

నీలోబాయి శ్రీనాథుఁడు భార్యాభర్తలు. ఆమె భర్తనే పరమదైవముగా నెంచి పూజించుచు అత్తమామలు మున్నగు గురుజనులను చాల గౌరవముగా చూచుచుండెను. శ్రీనాథుఁడు సకలవిద్యాప్రవీణుఁడు. విశేషించి దయాధర్మశౌచములు కలవాఁడు. జ్ఞానభక్తివైరాగ్యసంపన్నుఁడు. భాగవతారాధనాతత్పరుఁడు. అతఁడు సర్వకాలసర్వావస్థలయందును శ్రీహరిని స్మరించుచు నిత్యానందమగ్నుఁడై యుండెడివాఁడు.

ఎఱిఁగినవారందఱును వారిని "భార్యకు తగినభర్త. భర్తకు తగినభార్య" అని ప్రశంసించుచుండిరి. కాలక్రమమున నీళోబాయి గర్భవతియై శుభముహూర్తమున చక్కని కుమారుని కనెను. శ్రీనాథుఁడు బాలునకు యుక్తసమయమున జాతకర్మాదులు చేసి సాధువులను మృష్టాన్నతృప్తులను గావించి వారి యాశీర్వాదములను బడసెను. సాధువులు బాలునకు 'షేక్పరీదు' అని నామకరణము చేసిరి.

షేక్పరీదు పాలు త్రాగునపుడుగూడ భగవద్ధ్యానము గావించుచుండెను. అతఁడు మూఁడేండ్లవాఁడయి యుండఁగా నొకనాఁడు శ్రీనాథుఁడు పూలకై పుష్పవనమున కేగెను. అతఁ డప్పుడుగూడ శ్రీహరినే ధ్యానించుచు పూలు కోయుచుండఁగా పరిమళముగ్ధమై పొదలలో నక్కియున్న పాము కఱచెను.

శ్రీనాథుఁ డది యెఱింగి వెంటనే యింటికి వచ్చి స్నానము గావించి, శ్రీహరిని బూజించి, నివేదన చేసి, నిశ్చింతుఁడై తుదకు నివేదితాన్నమును భుజించి, సుఖముగ కూర్చుండి, భార్యనుబిలిచి, "నాకు శ్రీహరి సెలవైనది. పుష్పవనమున నన్ను సర్పము కఱచినది. నేను శ్రీహరిచెంతకు పోవుచున్నాను. నీవు సకలము నెఱిఁగినదానవు. వగవవలదు. శ్రీహరియే నీకు దిక్కు. బాలుని శ్రద్ధగా పెంచికొనుము. మీకు మంగళము లగుఁగాక!" అని చెప్పి అనాయాసముగ శరీరము విడిచెను.

నీళోబాయి పతికై చాల విచారించెను; కాని అర్భకుని చూచుకొనియు, ఈశ్వరసంకల్పమును గుర్తెఱిఁగియు తుదకు ధైర్యము పూని, శ్రీహరిని స్మరణ భజనాదులతో పూజింపసాగెను. ఆగ్రామమునం దున్నవా రందరును ఆమె సచ్చరిత్రమునకు చాల అబ్బురపడుచు దినదినమును ఆమె సన్నిధికి వచ్చి ఆమెతోఁ గూడ హరిభజనము గావించుచుండిరి.

అయిదేండ్లు వచ్చినదిమొదలు షేక్పరీదుగూడ తల్లితోడను, ఊరివారితోడను హరిభజనము చేయుచు శ్రీహరి దివ్యచరిత్రమును దెలిసికొనసాగెను. పండ్రెండేండ్లు కడచునప్పటికి అతనికి పూర్తిగా జ్ఞానోదయమయ్యెను. అంత నొకనాఁ డాతఁడు "అమ్మా! నే ననుదినమును శ్రీహరిని మననము చేయుచున్నాను, స్మరించుచున్నాను, ధ్యానించుచున్నాను, పూజించుచున్నాను, తదీయదివ్యచరిత్రము నాలించుచున్నాను; గాని యింతవరకును నాకు తదీయదివ్యసందర్శనము లభింపలేదు. ఇంతలో లభించునట్లును కాన్పింపదు. ఎంత కాల మని నే నిఁక యిట్లు ఓర్వఁగలను? శ్రీహరిని చూచినగాని నా కిఁక శాంతి సుఖములు లేవు. ఆనందము లేదు. కావున నాయెడల ననుగ్రహ ముంచి ఆమహానుభావుని దర్శించు నుపాయ మెఱిఁగింపు" మని ప్రార్థించెను.

అది విని నీళోబాయి చాల సంతోషించి యిట్లు పలికెను.

"బిడ్డా! శ్రీహరిని చూచుట కనేకమార్గము లున్నవి. అం దొకటి తపస్సు సర్వమును విడిచి, అరణ్యములకు పోయి, అన్యచింతలు మాని, నియతవ్రతుఁడై, శీతకాలమున కంఠదఘ్న మగు జలమున నిలిచియు, వర్షాకాలమున బయట కూర్చుండియు, వేసవిలో పంచాగ్నిమధ్యమున నుండియు సమాధిస్థుఁడై శ్రీహరిని జపించుటయే తపస్సు. తపస్వులు కొందఱు కందమూలములుతిని యుందురు; కొందఱు క్రింద రాలిన యాకులుమాత్రమే భక్షింతురు. కొందఱు జలపానము మాత్రమే చేయుదురు. కొందఱు వాయుభక్షణము మాత్రమే చేసి యుందురు. ఇది మంచి మార్గమే; కాని కాయక్లేశములు సహించియుండవలెను."

"కొందఱు యోగాభ్యాసము చేసి శ్రీహరిని దర్శింతురు. కొందఱు ఏకాదశీ వ్రతాదులు చేయుదురు. కొందఱు యజ్ఞయాగాదు లాచరింతురు. కొందఱు కేవలము భజనముమాత్రమే చేయుదురు. ఇట్లు ఈశ్వరసాక్షాత్కారము కలిగించు మార్గము లనేకము లున్నవి. దేశకాలపాత్రముల ననుసరించి యిందేదో యొకటి అవలంబించి స్థిరచిత్తుఁడై ఈశ్వరసాక్షాత్కారము గనవచ్చును. నీ చిత్త మెందు లగ్నమైన అది నీ వవలంబింపవచ్చును. అయితే యేమార్గ మవలంబించినను చిత్తశుద్ధి యుండవలెను. ప్రాపంచికవాసన లుండరాదు. అన్నిటికిని మూలము సర్వ సమత్వము. నదులయందు, పర్వతములయందు, గాలిలో, అగ్నిలో, వృక్షముల యందు, జలచరములయందు, మనుష్యులలో, సకలప్రాణులయందును, సర్వవస్తువుల యందును, సర్వస్థలములయందును శ్రీహరి యున్నాఁడు. శ్రీహరిలేని వస్తువు లేదు. ఇట్లు రమాపతి అంతటను నిండి, అంతకును ప్రభువై అంతకును కర్తయై యున్నాఁడు. అతని రూప మిట్టి దని చెప్పుటకు ఎవరును చాలరు. అవాఙ్మానసగోచరుఁ డగు శ్రీహరి లోకానుగ్రహము నిమిత్తము సగుణుఁడై భూలోకమున అనేకరూపములతో నవతరించి తన్ను ఆరాధించువారిని రక్షించుచుండును; కావున నీవు తపస్సు చేసినను, యోగమార్గము నవలంబించినను భక్తిమార్గము త్రొక్కినను సర్వమును శ్రీహరినిష్ఠమని యెఱిఁగి వర్తింపుము."

తల్లి యిట్లు చెప్పఁగా షేక్పరీదు చాల సంతసించి "అమ్మా! అట్టి భగవంతుని చూచుటకు నామన ముర్విళ్ళూరుచున్నది. ఇఁక నేను కాలము కడుపఁజాలను. నాకు నిద్రాహారములతో పని లేదు. అయినను దయయుంచి నాకొక్కరొట్టె కాల్చి యిమ్ము. నా కంతే చాలును" అని యడిగెను. అందుకు తల్లి "అన్నపానాదులను విడువనున్న నీకు రొట్టె యేల?" అని ప్రశ్నింపఁగా అతఁడు "నే నన్నపానములను త్యజించుటకే ప్రయత్నించెదను. ఆవ్రతము నాకు సిద్ధించునంతవఱకును నావద్ద నొక రొట్టె యుండవలయును" అని చెప్పెను. అందుకు సంతోషించి నీళ్ళోభాయి

ఒకరొట్టె తయారుచేసి ఈయఁగా షేక్పరీదు ఆనందముతో దానిం గైకొని తల్లికి సాష్టాంగనమస్కారము లాచరించి ఆమెసెలవు బొంది అరణ్యమునకు వెడలి పోయెను.

షేక్పరీదు తల్లి యిచ్చిన రొట్టె వస్త్రమున గట్టుకొని వస్త్రమును నడుమునకు చుట్టుకొనియెను. అతఁడు ఒక పర్వతపాదమున ఒక సెలయేటియొద్దను వసించి తపస్సు ప్రారంభించెను. అతఁడు రొట్టెను ముట్టక దానిని తలంపున కైన రానీయక ఆకలములను మాత్రమే భక్షించుచు క్షుద్బాధను తీర్చుకొనుచుండెను.

ఇట్లు ఆతఁడు చాలదినములు తపస్సు చేసెను గాని శ్రీహరి సాక్షాత్కరింప లేదు. అయినను ఆతని దీక్ష చలింపలేదు. అట్లే యుండెను.

ఇట్లుండ నొక వర్తకుఁడు చక్కెరమూటలను ఎద్దులమీఁద వేసికొని వ్యాపారము చేసికొనుటకు బయలుదేరి ఆ మార్గమునఁ బోవుచుండెను. షేక్పరీదు "అయ్యా! మూటలలో నున్న వస్తువు ఏమి అని యడిగెను. అందుకు వర్తకుఁడు నిజము చెప్పుట కిష్టపడక పరిహాసము గూడ చేయఁదలఁచి "ఇసుక" అని చెప్పి వెడలి పోయెను. షేక్పరీదు దానికి జవాబు చెప్పక తపోనిష్ఠుఁ డయ్యెను.

వర్తకుఁడు గమ్యస్థానము చేరి అమ్ముటకు చక్కెరమూటలను విప్పఁగా వాని యందు చక్కెరకు బదులు ఇసుక యుండెను. అది చూచి వర్తకుఁడు దిగ్భ్రాంతుఁడై పోయి "ఇది యంతయు ఆయరణ్యమునందలి తాపసోత్తముని పరిహాసించినందుకు ఫలము. ఆతఁడెవ్వరో మాయలమారి జడదారి యనుకొంటిని; కాని ఇంతటి ప్రభావము గలవాఁ డని యెఱుంగనైతి. అయ్యో! ఇప్పు డేమి చేయుదును? ఉన్న ధనమంతయు ఈవ్యాపారమున పెట్టితిని. నాపొగరువలన ధన మంతయు బూడిదయై పోయినది. ఇంకేమి దారి? అయ్యో! బాల్యమునుండియు పడిన శ్రమ అంతయు ఒక్క మాటతో కన్ను మూసి తెఱచునంతలో వ్యర్థ మైపోయినది" అని యనేక విధముల విచారించి తుదకు 'మఱల ఆతపస్విముఖ్యుని పాదముల నాశ్రయించుట తప్ప వేరుగతి లేదు' అని నిశ్చయించుకొని ఇసుకమూటలను ఎద్లమీఁద వేసి బయలుదేరి అరణ్యమునకు వచ్చెను.

షేక్పరీదు అప్పటి కింకను అక్కడనే యుండెను. అందులకు వర్తకుఁడు మిగుల సానందించి సమీపించెను.

షేక్పరీదు మరల "మూటలలో నున్నది యేమి" టని యడుగఁగా వర్తకుఁడు నిట్టూర్పు విడిచి "మహానుభావా చక్కెర" అని బదులు చెప్పి మూటలు విప్పిచూడ అందు చక్కెరయే యుండెను. అంతట ప్రాణము లేచివచ్చినట్లు కాఁగా అతఁడు బ్రహ్మానందభరితుఁడై ఒక పళ్లెమునిండ చక్కెర నింపి దానిని షేక్ప

రీదు పాదముల చెంతనుంచి సాష్టాంగ మాచరించి "మహాత్మా! ఈదాసుని తప్పు సైరించి దీనిని వినియోగింపఁగోరెదను. తమ్ము పరిహసించినందుకు నాకు ప్రాయశ్చిత్త మైనది. దయయుంచి యీ దీనుని రక్షింపవలెను" అని ప్రార్థించెను.

షేక్పరీదు అది విని, చక్కెర చూచి "శ్రీహరీ! ఈచక్కెర మిమతో నామనస్సు చెలుపఁజూచెదవా?" అని తడబడుచు క్షణమైన అచ్చట నుండక పారి పోయెను.

వర్తకుఁడు అతని తపోబలమునకు మిగుల నాశ్చర్యపడి, నిర్లిప్తతకు మిగుల ఆనందించి ఇంక నిక్కడ నుండిన నేమగునో యని బెదరుచు బయలుదేరి పోయెను.

అంతట షేక్పరీదు మరల ఆస్థలమునకే వచ్చి అన్నపానములు విడిచి పండ్రెండు సంవత్సరములు ఘోరతపస్సు చేసెను; కాని శ్రీహరి యనుగ్రహము కలుగలేదు. అందు కాతఁడు మిగుల చింతించి స్వస్థలమున కరిగి తల్లికి సాష్టాంగ నమస్కారము లాచరించి చేతులు జోడించుకొని నిలిచి జరిగినదంతయు చెప్పి "అమ్మా! శ్రీహరికి నాయెడల ననుగ్రహము రాలేదు. కారణ మేమి?" అని యడిగెను.

దానికి బదులు చెప్పక నీళ్లోబాయి అతని జడలను పట్టుకొని లాగెను. అందు కాతఁడు నొప్పిగా నున్నదనఁగా, ఆమె "నాయనా! జడలను లాగిన నీకు నొప్పిగా నున్నది. అట్లే ఆకులు కోసినచో. చెట్లకు మాత్రము నొప్పి కాదా? ఈ సంగతి నీ వింతవఱకును గ్రహింపవైతివి. ఇట్లు జీవహింస చేయు నీకు శ్రీహరి యెట్లు సాక్షాత్కరించును?" అని యడిగెను.

షేక్పరీదు అది విని సంగతి యంతయు గ్రహించి వెంటనే మఱల అడవికి పోయి క్రింద రాలిన యాకులు మాత్రమే భక్షించుచు మరల ఘోరతపస్సు ప్రారంభించెను. అట్లు చేసినను శ్రీహరికి అనుగ్రహము రాకపోగా తీఁగలతో తన కాళ్లు చెట్టునకు కట్టి తలక్రిందుగా వ్రేలాడుచు ఆకులను గూడ తినుట మాని తపస్సు ప్రారంభించెను.

ఇట్లు కొన్నిదినములు జరుగునప్పటికి అతని శరీరము పూర్తిగా శుష్కించి పోయెను. అది చూచి పక్షులు అది శవ మని యూహించి ముక్కులతో పొడుచు కొని తినసాగెను. అతఁ డందుకు చింతింపక "ఓకాకుంతములారా! దీనుఁడ నగు నాశుష్కశరీరము మీకు ఆహార మైనందుకు నాకు చాలా సంతోషముగా నున్నది. లోకములో నా కేమియు కోర్కె లేదు? గాన శరీర మేమైపోయినను సరియే; కాని నాకు కళ్లు మాత్రము ఉండనిండు. ఏమన? శ్రీహరి దివ్యమంగళ

విగ్రహమును చూచుటకు మాత్రమే నేను కన్నులుండఁగోరుచున్నాను" అని ప్రార్థించెను. అయినను పక్షులు ఆమాటలను లెక్కచేయక కళ్లుగూడ పీకికొని తినసాగెను.

అయినను షేక్పరీదు విచారింపలేదు. అతఁడు శల్యావశిష్టము లగు చేతులనే జోడించి 'శ్రీహరీ! కరుణామయా! ఆపద్బాంధవా! దీనజనశరణ్యా! గజేంద్రవరదా! భక్తమందారా! నీలీలలు గ్రహింప మహామునులకైన శక్యము కాదన నే నెంత వాఁడను? చరాచరాత్మకమగు నీజగత్తున నీ వంతటను నిండియున్నావు. నీకు తెలియనిది, నీకు ఒరులు తెలుపవలసినది యేమియు లేదు. నాహృదయ మెట్లున్నదో నీ కెఱుకయే. నా కేమియు వలదు. నీదివ్యమంగళవిగ్రహమును నాకళ్లకు చూపుము. నాకంతే చాలును' అని ప్రార్థింపసాగెను.

భగవంతుఁడు అప్పటికి మనసు కరగి దర్శన మిచ్చెను. శ్రీహరి కరస్పర్శ తగిలినంతనే షేక్పరీదు దేహము తేజస్వంతమయ్యెను. అప్పు డాతఁడు భగవంతుని దివ్యమంగళవిగ్రహమును గాంచి బ్రహ్మానందము పొంది 'శ్రీహరీ! జగదాధారా! రాధామనోహరా! సత్యభామారతా! రుక్మిణీప్రాణవల్లభా! గోపికాలోలా! మునిహృదయనివాసా! దుష్టశిక్షణశిష్టరక్షణపరతంత్రా! ఇప్పటికి నేను తరించితిని. నా కన్నులు చల్లఁబడినవి. ఈశరీరమునుండి నా ప్రాణములు పోవు నని నాకు భయము లేదు. బెంగయు లేదు. మరియొక శరీరమును పొందినచో అప్పుడు నా కిప్పటి భావములు కలుగునో లేదో? అప్పటి అభిరుచి యెట్లుండునో! ఈజన్మమున నిన్ను చూడఁ గోరిక కలిగినది. చిరపరీక్ష చేసియైన నాకు సాక్షాత్కరించితివి. నా యాందోళనము తీరినది. నా వేదన యుపశమిల్లినది. ఇంతకంటె నాకేమి కావలయును?' అని యనేకవిధములఁ గొనియాడెను. అందుకు భగవంతుఁడు 'వత్సా! నీతపోనిష్ఠ శ్లాఘ్యముగా నున్నది. నీభక్తియు అచంచలము. నీవలె ఇరువది నాలుగేండ్లు ఇట్లు ఘోరతపస్సు చేయుట చాల కష్టమైనది. నీ దీక్ష చాల ప్రశంసాపాత్రముగా నున్నది. ఇఁక తపస్సు చాలును. నీయూరికి పోయి సదాచార్యు నాశ్రయించి సర్వకాలసర్వావస్థలయందును నన్ను ధ్యానించుచుండుము' అని చెప్పి తిరోహితుఁ డయ్యెను.

వెంటనే షేక్పరీదు తపస్సు చాలించి నిజనివాసమున కరిగి సంగతి యంతయు తల్లి కెఱిఁగించి భగవద్ధ్యానపరుఁడై యుండెను.

ఇట్లుండ నొకభాగవతోత్తముఁడు శిష్యులతోఁగూడ మార్గవశమున ఆగ్రామమున కరుదెంచి ఉద్యానవనమున విడిసెను. ఈసంగతి విని వారిని దర్శించుటకు ఉద్యానవనమునందలి కొలనిలో స్నానము చేయుటకును షేక్పరీదు అక్కడకు వచ్చెను. అప్పటి

కప్పుడే వచ్చిన భాగవతోత్తముడు ఆసరోవరమున జలకమాడిపర గురుంపరా ధ్యానము చేయుచు భగవదర్చనము చేయుచుండెను. శ్రీహరి అతని భక్తిప్రపత్తులకు ప్రీతుడై అతని యెదుటనే నిలిచియుండెను.

షేక్సరీదు ఇది చూచి ఆశ్చర్యచకితుడై 'ఇది యంతయు చాల వింతగా నున్నది. శ్రీహరినామసంకీర్తనము తక్క వీరివద్ద విశేష మేమియు లేదు. అయి నను శ్రీహరి వీరితో సర్వదా క్రీడించుచున్నాడు. నే నిరువదినాలుగేండ్లు దుర్ఘట నిష్ఠతో ఉగ్రతపస్సు చేసితిని. నా శరీరమును పక్షుల కాహారముగా నిచ్చితిని. మనస్సు నెంతమాత్రమును చలింపనీయ నైతిని. అయినను శ్రీహరి నాకొక్క మాఱే సాక్షాత్కరించెను; కాని వీరికివలె తలచినపుడెల్ల ప్రత్యక్ష మగుట లేదు' అని చాల విచారించెను.

అతడు కొంత తడవు అట్లు వగచి వారి సన్నిధి కరిగి సేవించి స్నానాద్యను ష్ఠానములు ముగించుకొని నిజావాసమున కరిగి తాను చూచినదంతయు తల్లి కెఱింగించి తనస్థితికి మిగుల వగచెను. అందుకు నీళ్లోబాయి వగవ వల దని కుమా రుని ఊరడించి "వగవకుము. శ్రీహరిని సేవించుటలో నీ మార్గము వేరు. వారి మార్గము వేరు. నీవు ఇరువది నాల్గేండ్లు ఘోరముగా తపస్సు చేసితివి. సదాచార్యుని వలన ఉపదేశము పొంది వారు శ్రవణ మనన ధ్యాన భజనాదులతో శ్రీహరిని సేవించుచున్నారు. భేద మిది. అనగా సదాచార్యుని బోధకంటె తపస్సు, యజ్ఞయా గాదులు ఉత్తమములు కావు. నీ కున్న లోటిది. ఆచార్యోపదేశముయొక్క మాహాత్మ్యము చెప్పెద వినుము. ఒకచో నొకధనవంతుడుండెను. అతడు పరస్త్రీ పరాఙ్ముఖుడు. ఇతరుల ద్రవ్యమును ఆశించువాడు కాడు. అసత్యమన్న నాతనికి చాల జుగుప్స. తినరాని వస్తువులను, త్రాగరాని ద్రవపదార్థములను ఆతడు చూచి యైన నెఱుగడు. దయాసత్యశౌచవంతుడు. సమదర్శి. అతడొక సదాచార్యు నాశ్రయించెను. ఆచార్యుడు ధనికుని భక్తిపరునిగా చేసెను.

ఇట్లుండగా ఆధనికుడు "నాపట్టణమునకు వేంచేసి నా కుటీరమున నిత్యనివా సము చేయవలయు" నని గురువును ప్రార్థించెను. గురువు దానికి సమ్మతించి శిష్యునియింట నుండి ధర్మోపదేశము చేయుచుండెను.

మూడుమాసము లైనతరువాత గురువు తన స్వస్థలమునకు బోవలయు నని చెప్పగా శిష్యు డంగీకరించి అనేకవిధముల పూజించి ప్రదక్షిణనమస్కారము లాచరించి ఒక యానముమీద గురువును బంపివేసెను. అంతకు ముందే అతడు, గురువునకు తెలియకుండ అసంఖ్యధనము నారథముమీద జాగ్రత్తపఱచెను.మరియు విశ్వాసపాత్రు లగు ఇద్దరు భటులతో ఈసంగతి యంతయు చెప్పి ధనమును

జాగ్రత్తగా కొనిపోయి గురువులవారి కెరుకపడకుండ వారిభార్యకు సమర్పింపుఁడు" అని చెప్పెను.

రథము బయలుదేరెను. శిష్యుఁడు వీడ్కోల్పి చనగా గురువు భగవద్ధ్యాన పరుఁడయ్యెను.

కొన్నిదినములకు రథము గాఢారణ్యము ప్రవేశించెను. అంతట భటు లిద్దరును దుర్బుద్ధులై గురువును కరచరణములు ఖండించి యొక పొదచాటున బడవైచి రథమున నిక్షిప్తమై యున్న ధనము నంతను గొని వెడలిపోయిరి. ఇంత జరిగినను గురువునకు విచారము కలుగలేదు. శ్రీహరినామోచ్చారణమువలన అతనికి గాయముల బాధయేఁ గాక ప్రాపంచికవాసనలుగూడ పోయెను. భగవన్నామోచ్చారణమువలన అతఁడు పరవశుఁడై యుండెను.

ఇట్లు కొంతకాలము కడచెను. ఆచార్యుని గాయములు మానిపోయెను; కాని ఆతఁ డక్కడనే యుండి నిద్రాహారములు మాని శ్రీహరిభజనమునందే నిష్ఠుఁడై యుండెను.

ఒకనాఁడు ఆదేశము నేలురాజు వేటకై ఆయరణ్యమునకు వచ్చి పొదచాటున ఒకానొక బ్రహ్మతేజము ప్రజ్వరిల్లుచుండుటఁ గాంచి ఆశ్చర్యచకితుఁడై సమీపించి గురువు ప్రజ్ఞానుల నెఱిఁగి సాష్టాంగనమస్కారము లాచరించి "మహాత్మా! మీతేజస్సు నాకనులకు మిఱుమిట్లుఁ గొలుపుచున్నది. నేనింతవఱకును తపసు బోలు భాగవతాగ్రగణ్యుని చూచియుండలేదు. నేటికి నా జన్మ పావన మైనది. అయితే తమ కీ దండన చేసినవా రెవరో యెఱింగించినచో వారిని ఘోరముగ శిక్షించెద" నని ప్రార్థించెను.

ఆచార్యుఁడు రాజు భక్తికి ఆనందించెను; కాని తన్ను ఖండించిన భటులను కాపాడఁదలచి "రాజా! నేను పుట్టుకయందే కాలుసేతులు లేనివాఁడను. నీ వెవరిని దండింపవలసిన పని లేదు" అని పలికెను; గాని రాజు అది నమ్మలేదు. గాయములు నిన్న మొన్ననే మానినట్లు స్పష్టముగా కాన్పించుచుండెను. అయినను ఆచార్యుఁడు ప[illegible]స సహింపనోపక యథార్థమును చెప్పుట లేదని రాజు గుర్తించి ఆతనిని తనరథమున నిడుకొని పట్టణమునకుఁ గొనిపోయి యుక్తస్థలమున విడియించి సకలసపర్యలను చేయసాగెను.

రాజునకు దినదినము భక్తి యధిక మగుచుండెను. ఆచార్యున కతనియెడల ప్రీతి పెరుగుచుండెను.

కాల మిట్లు కడచిపోవుచుండ రాజు ఒకనాఁడు ఆచార్యుని సమ్ముఖమున నిలిచి "మహాత్మా! అంత కంతకు నా కీ యైహికవిడంబనములయెడల ఆసక్తి పోవు

చున్నది. ఐహికభోగము లెన్ని యనుభవించినను తుదకు మిగులునది యేమియు లేదు. వానివలన ఆశాపాశము పెరుగుటయు, తన్మూలమున మనస్సు దుర్వృత్తులలో ప్రవేశించుటయు తప్పని దగును. దానం జేసి మనుజుఁడు నరకమున కూలఁబడును. ఐహికసుఖములే యిట్టి వైనపుడు వానిని పోషించు రాజ్యాధికారమింక నెంత అపాయకరమైనది? తమ దర్శనము లభింపనంతవఱకే ఈరాజ్యాధిపత్యమునుచూచుకొని నేను మురిసితిని. తరువాత నాకు క్షణక్షణము భీతి పెరిగి పోవుచున్నది. "రాజ్యాంతే నరకం ధృవ" మ్మని పెద్దలు చెప్పియే యున్నారు, కాని రాజ్యము స్వాధీనమున నున్నవానికి అజ్ఞాన ముండదు. కేవలము ఈశ్వరానుగ్రహమువలననే నాకు తమ దర్శనము లభించుటయు, తాము నాగృహమును పావనము చేయుటయు, తన్మూలమున నాహృదయమున ఇట్టి జ్ఞానజ్యోతి ప్రకాశించుటయు తటస్థించినది. ఇట్టి సదవకాశమును జారవిడుచుకొనుటకంటె మూఢత్వము లేదు; కావున నాకు ఈభవబంధము వదలిపోవు సూక్ష్మోపాయము నుపదేశింపుఁడు" అని కోరెను.

అందుకు ఆచార్యుఁడు మిగుల సంతసించి "రాజా! నీవు మిగుల నదృష్టవంతుఁడవు. లేకున్న నీ కిట్టిజ్ఞానము కలుగదు. జ్ఞానులతోడను, భక్తులతోడను, సజ్జనులతోడను సంతతసాహచర్యమువలనఁ గాని యిట్టి సంకల్పము కలుగదు. నీవుద్రొక్కిన దారి చాల శ్రేయస్కర మైనది. జన్మములలో మానవజన్మ ముత్తమమైనది. మంచి చెడ్డ ఏర్పఱచుకొనుటకు వీ లయిన జ్ఞానము మనుష్యున కున్నది. అది లేనివానికిని పశువునకును భేద మేమి? అయితే అనేకులు ముందు గతి తలంచికొనక దుర్లభమైన మానవజన్మ మెత్తియు మాయాంధకారమున కూలి ఇంకను నికృష్టపు జన్మలు సంభవించు పనులు చేయుదురు. కేవల మానవులే ఇట్టివారైనపుడు ఇక రాజుల సంగతి చెప్పనేల? 'యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా, ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయ' మ్మని పెద్దలు చెప్పుదురు. యౌవనము, ధనము, అధికారము, అవివేకము ఇవి ఒక్కొక్కటి అనర్థములకు కారణములై యున్నవి. ఇవి నాలుగును ఒకచో నుండిన నిఁక చెప్పవలసిన దేమున్నది? కాని నీ విట్లు గాక చాల మంచి మార్గమున ప్రవేశించినావు. పూర్వజన్మమున పుణ్యము చేసికొనుటవలననే మన కీ మానవజన్మము లభించినది. వర్తమానమున ప్రతివాఁడును సన్మార్గమునందే సంచరించుచున్నాఁడా? కావున ఇప్పు డిట్టి యుత్తమజన్మ లభించిన దని ముందుఁ గూడ మంచి జన్మయే దొరకు నని చెప్పుటకు వలనుపడదు. అపుడు మంచి జన్మయు లభింపవచ్చును. కేవలము చెడ్డజన్మమును లభింపవచ్చును. ఏటు చెప్పుటకును ఆధారము లేదు. ఈకారణమువలన ముందు మంచిజన్మ లభించుటకు తగిన

పనులనే యీజన్మమున చేయఁబూనవచ్చును. అయితే అవిద్యవలన వానికి భంగము వచ్చిన ఏమి గతి? కావున సదాచార్యు నాశ్రయించి అవిద్యను పోద్రోలి జన్మ రాహిత్యము కలుగుటకు ప్రయత్నించుటయే సర్వోత్తమమైనది. జన్మరాహిత్యమే మోక్షము.

మోక్షము పొందుట కనేకమార్గములున్నవి. అన్నిటియందును శ్రీహరిభజనముకంటె ఉత్తమమైనది లేదు. సాధువుల సేవించుటయే శ్రీహరికి ప్రతిపాత్రము. శ్రీహరిని సేవించువారే సాధువులు. అయితే వారిలో కొందరు వేషధారు లుండవచ్చును. వీరు వేషధారులు, వీరు నిక్కమైన వారు అని గ్రహించుట యెట్లు? ఇది యంతయు అనవసరప్రసంగము. భగవంతుఁడు సకలపదార్థములయందును నిండి యున్నాఁడు. కావున ఎవరిని గురించియు మనకు పరీక్షయే అవసరము లేదు. కావున నీవు భాగవతారాధనమున అప్రమత్తుఁడవై యుండుము. ఇదియే నీకు సూక్ష్మమైన మోక్షప్రాప్త్యుపాయము" అని చెప్పెను. రాజు చాల సంతసించి ఆచార్యుఁడు చెప్పిన చొప్పున చాల భక్తిశ్రద్ధలతో సంచరించుచుండెను.

కాల మిట్లు కడచిపోవుచుండఁగా అరణ్యమధ్యమున ఆయాచార్యుని కర చరణములు ఖండించి హింసించిన దుష్టులగు సేవకులు ఈరాజు చాల వినయవిధేయతలతో భాగవతారాధనము చేయుచుండుట విని సాధువేషములు ధరించివచ్చిరి. వారు యుక్తసమయమున రాజభవనము ప్రవేశించిరి; కాని అట ఆచార్యునిఁ గాంచి దిగ్భ్రాంతులై పోయిరి. ఆచార్యుఁడు మాత్ర మిదియంతయు గ్రహించి, "మహానుభావులారా! దయచేయుఁ" డని వారిని ఆహ్వానించి రాజభటులనుచూచి "వీరు పరమభాగవతోత్తములు. ఇట్టివారిని నేను నాజన్మమున చూచియుండలేదు. మన ప్రభువు పుణ్యవిశేషమువలననే వీ రిచ్చటకు వేంచేసినారు. కావున వీరిని ప్రభువు చెంతకుఁ గొనిపోయి పూజింపవలసిన దని చెప్పుఁ" డని చెప్పెను. సేవకులు అట్లే చేసిరి. రాజు వారిని ఆచార్యుని సెలవుచొప్పున చాల భక్తితో పూజించి విశేష ధనము సమర్పించి "కొన్నిదినములు ఇక్కడ నుండి మమ్ము ఉద్ధరింపవలయు" నని ప్రార్థించెను.

అందుకు వారు అభ్యంతరము చెప్పలేక నిలిచిపోయిరి; కాని ఆచార్యుఁడు ఎప్పుడు తమగుట్టు బయలు చేయునో యని బెంగపెట్టుకొనిరి. వారికి నిద్రాహారములు దూరమయ్యెను. ఈకారణములవలన వారు ఒకనాఁటి కొకనాఁడు కృశింప సాగిరి.

రాజు వారి కార్శ్యతనుచెప్పఁగా ఆచార్యుఁడు సంగతియంతయు గ్రహించి "రాజా! తిరిగిన కృశించువారు కొందరు, తిరుగకున్న కృశించువారు కొందరు.

వీరు మహానుభావులు. పరమపావనులు. నిర్లిప్తులు. గ్రామైకరాత్రముగా సంచరించుట వీరి నియమము. అయినను నీభక్తికి ఆనందించి నీ నిర్బంధమువలన ఇక్కడ నిన్ని దినము లుండిరి. సంతతవివిధదేశసంచారప్రవణ మగు వీరి మనస్సు నీచే అరికట్టఁబడినది. అందువలననే వీరు చిక్కిపోవుచున్నారు; గావున వెంటనే వీరిని బాగుగా గౌరవించి స్వేచ్ఛగా పోనిమ్ము" అని చెప్పెను. రాజు వల్లె యని వారిని భక్తితో పూజించి విశేషధన మిచ్చి కొంతసైన్యమును సాయ మిచ్చి రథారూఢులం గావించి పంపివేసెను.

వా రందఱును ఒక యడవిలో ప్రయాణము చేయుచుండిరి. అప్పుడు భటులలో కొందఱు "మహాత్ములారా! మారాజు ఇటీవలనే భక్తుఁడై భాగవతుల నారాధించుచున్నాఁడు. కాని ఇంతవరకు నెవ్వరిని మిమ్ము సత్కరించినంతఘనముగా సత్కరించియుండలేదు. ఆచార్యుఁడును ఇంత సత్కారము చేయవలయు నని చెప్పియుండలేదు. మీకు చేసిన గౌరవమునకు హద్దు లేదు. మీ కిచ్చిన ధనమునకు లెక్కలేదు. దీని కంతకును కారణ మేమై యుండును?" అని యడిగిరి.

అందులకు ఆమాయాసాధువులు ఇట్లు చెప్పిరి. మేము మొదట ఉజ్జయినీ రాజువద్ద భటులుగా నుంటిమి. ఆచార్యుఁడు అక్కడ మంత్రి. ఒకప్పుడు మంత్రి దారుణ మగు అపరాధము చేసెను. అందుకు రాజు కినిసి మంత్రిని చిత్రవధచేయుటకు మాకు ఆజ్ఞాపించెను. మేము రాజాజ్ఞచొప్పున మంత్రిని అరణ్యమునకుఁ గొని పోయి కనికరించి కాలుసేతులు మాత్రము ఖండించి విడిచిపెట్టితిమి. అది మొదలు ఈసంగతి తెలిసినచో రాజు మమ్మును శిక్షించు నని తలఁచి సన్యసించి యిట్లు తిరుగుచున్నాము. నాడు మేము చేసిన యుపకారమును తలంచి ఆచార్యుఁడు మీరాజువలన మా కిట్టి గౌరవము చేయించెను" అని చెప్పిరి. ఇది ముగించుటయే తడవుగ వారి యసత్యదోషమును సహింపఁజాలక భూమి బ్రద్దలై ఆపాపాత్ములను లోనికిఁ గొనిపోయెను.

ఇది యంతయు విని చూచిన సైనికు లందరును ఆశ్చర్యచకితులై వెంటనే పట్టణమున కరిగి జరిగినదంతయు రాజునకు ఆచార్యునకు నివేదించిరి. ఆచార్యుఁ డది విని మిపుల దుఃఖించి శ్రీహరిని పెక్కువిధముల కొనియాడి "ఆర్తజనశరణ్యా! నీనామస్మరణము సకలపాతకములను తొలగించును. వారి నేల అట్లుచేసితివి? దీన బాంధవా! వారిని రక్షింపుము" అని ప్రార్థించెను. అంతట శ్రీహరి సాక్షాత్కరించి ఆచార్యునకు కాలుసేతు లిచ్చి అభయ మిచ్చి తిరోహితుఁడయ్యెను. రాజును ప్రతివారమును ఇందుకు మఱింత వింతపడి ఆచార్యుని మహామహిమమును అనేకరీతుల ప్రశంసించిరి.

పిదప రాజు, ఆచార్యుని, పరివారమును వెంట నిడుకొని భటులుచూపిన మార్గమున అరణ్యమునకుఁ బోగా భూమిలోనికి క్రుంగిపోయిన కుహానాభాగవతు లిద్దరును దివ్యశరీరములు తాల్చి అంతరిక్షమున విమానారూఢులై నిలిచి ఆచార్యుని చూచి చేతులు జోడించుకొని "మహాత్మా! అపరాధులము. మొదటినుండియు నీకు ఎగ్గులనే చేసితిమి. అయినను నీవు మాయెడల అసాధారణానుగ్రహము పూని మ మ్ముద్ధరించితివి. నీ యనూనానుగ్రహమువలననే మేము పాపముల నుండి దూరము చేయఁబడి స్వర్గమునకు పోవుచున్నాము" అని కృతజ్ఞతను తెలిపి అదృశ్యులైరి.

నీళోబాయి యిది యిట్లు చెప్పి "కుమారా! భగవద్భక్తులను పూజించుట, భాగవతోత్తములను సేవించుట, వారితో సహవాసము చేయుట, భాగవతులను మృష్టాన్నతృప్తులను గావించుట, వేషముననైన భాగవతులవలె నటించినను తుదకు ఆచార్యానుగ్రహమువలన స్వర్గమునకు పోవుట వింటివి గదా! ఇఁక ఆచార్యుఁ డెట్టివాఁడు? శిష్యుని యోగ్యత లెట్లుండవలెను? ఈసంగతులు చెప్పెద నాలకింపుము.

మానవులకు సదాచార్యుఁడే మోక్షమార్గప్రదర్శకుఁడు. కావున ఆచార్యుఁడు సర్వలక్షణసంపన్నుఁడై యుండవలయును. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను అరిషడ్వర్గమును అతఁడు పూర్తిగా జయించినవాఁడై యుండవలెను. శాంతము, శమము, దమము గలవాఁడుగను, ఇంద్రియములను జయించినవాఁడుగను, సర్వసమదర్శిగను, దయాసత్యశౌచవంతుఁడుగను ఉండవలయును. ఐహికములయెడల నతని కాశ లుండరాదు. జ్ఞానభక్తివైరాగ్యసంపన్నుఁడుగను, సద్గురుని పూజించి ఆతని యనుగ్రహమును పొందినవాఁడుగను, సకలజగన్నివాసుఁ డగు నారాయణుని తనహృదయమున నిలుపుకొన్నవాఁడుగను ఉండవలయును.

శిష్యుని లక్షణము లెటిఁగించెద వినుము. గురువునెడల శిష్యునకు అనంత భక్తి యుండవలెను. అతఁడు గురుని యాజ్ఞలను ఈషన్మాత్రమును జవదాఁటరాదు. గురుశుశ్రూషయం దప్రమత్తుఁడై, భగవద్భాగవతారాధనమునఁ గూడ వ్యగ్రోత్సాహుఁడై యుండవలయును. సత్యమునే పలుకుచు హింసాదూరుఁడై ఐహికవిడంబనమున పొంతఁ బోక ఇంద్రియములను జయించి, వైరాగ్యసంపన్నుఁడును, భక్తిపరవశుఁడును, జ్ఞానియు, నైష్ఠికుఁడును, సాధుసజ్జనపూజకుఁడును అయి యుండవలెను.

నీ విట్టి లక్షణములతో కూడియుండుట నిజమే; కాని సదాచార్యుని ఆశ్రయింపని లోపము నీవద్ద గలదు; కావున వెంటనే గయాక్షేత్రమున కరిగి, జ్ఞానా

నందాచార్యులవారి నాశ్రయించి ముక్తిమార్గము నెఱింగి గుర్వాజ్ఞాబద్ధుఁడవై శ్రేయస్సులు పడయుము" అని చెప్పెను.

షేక్ఫరీదు తల్లి చెప్పినచొప్పున వెంటనే గయాక్షేత్రమునకుఁ బయలుదేరెను.

జ్ఞానానందుఁడు షేక్ఫరీదు వృత్తము నెఱింగి చాల సంతసించి అతనికి శ్రీకృష్ణ మంత్రము నుపదేశించి "నీజన్మ పావనమైనది. నీకు ఇప్పుడు భక్తిపరాధీనుఁడగు శ్రీ కృష్ణుని సమర్పించితిని. ఆమహాత్ముని నీవు నీహృదయమున పదిలపఱచికొనుము. సర్వ కాలసర్వావస్థలయందు ఆరుక్మిణీవల్లభునే స్మరణమననాదులతో నర్చించుచు భాగవ తులను సేవించుచుండుము" అని చెప్పెను.

షేక్ఫరీదు ఆచార్యునకు శతసహస్రసాష్టాంగనమస్కారము లాచరించి, గురు పాదరజోలేశమును తన శిరమున ధరించి సెలవు పొంది బయలుదేరి ముద్దుందు ద్వారకానగరమునకరిగి శ్రీకృష్ణపరబ్రహ్మమునర్చించి "జగన్నాథా! సర్వగతుఁడవు, సర్వజ్ఞుఁడవు నగు నీకు విన్నవింపవలసిన దేమియు లేదు. జ్ఞానానందాచార్యులవారు నన్ను నీపదకమలములచెంగట నప్పగించిరి. నాకు నీకంటె మఱియొక దిక్కు లేదు. నేను మూఢుఁడను. మూర్ఖుఁడను. ఏమియు తెలియనివాఁడను. నాయపరాధము లన్నియు క్షమించి నన్ను కాపాడుము" అని ప్రార్థించెను. అంతట రుక్మిణీవల్లభుఁడు అతనికి సాక్షాత్కరించి "భక్తశిఖామణీ! నీనిష్ఠ అచంచలమై యున్నది. నీహృద యము మిగుల నిర్మలమై భక్తిప్రకాశమై యున్నది. నీనడవడి నా కానందము గలి గించుచున్నది. నీవు జ్ఞానదేవ, నామదేవ, కబీరులవలె నా కంతరంగభక్తుఁడవైతివి. నే నెల్లప్పుడును నీహృదయకమలమున అధివసించుచుండెదను" అని ఆనతిచ్చి అంతర్హితుఁ డయ్యెను.

షేక్ఫరీదు అందు కెంతయు నానందించి ద్వారకనుండి బయలుదేరి జగన్నాథ మున కరిగి స్నానాద్యనుష్ఠానములైన తరువాత జగన్నాథుని దర్శించి పూజించి వినుతించి ప్రసాదము స్వీకరించి నిజపురమున కరిగి జననికి ప్రదక్షిణసాష్టాంగాభివంద నము లాచరించి "తల్లీ! నీ యుపదేశమువలన సదాచార్యుఁడు నన్ననుగ్రహించెను. రుక్మిణీవల్లభుఁడు నాసేవ నంగీకరించెను" అని విన్నవించి అచ్చటనే యుండిపోయి భగవద్భాగవతారాధనము గావించుచుండెను.

ఇట్లుండఁగా ఆదేశము నేలు రాజు సంతానము లేకయు, కుష్ఠరోగమువల నను పీడితుఁ డగుచుండి షేక్ఫరీదు ప్రభావము విని వచ్చి మ్రొక్కి తన యిక్కట్టుల నెఱింగించి అనుగ్రహింప ప్రార్థించి అతని పాదముల చెంత పెద్ద కనకరాశినుంచి స్వీకరింపవలసిన దని వేడుకొనెను. అందుకు షేక్ఫరీదు "భగవంతుఁడు నీకోరికలను దీర్చుగాక!" యని దీవించి "రాజా! ఈసువర్ణము నాకేల? శ్రీహరి చరణములే నాకు

అనంతకనకరాశి. నాకు వేఱొకటి యవసరము లేదు. ఇదంతయు మానవుని దారి తప్పించివేయును. కనకము రౌరవాదినరకములకు మూలకారణమై యున్నది. ఆశ, ఈసు, ద్వేషము మున్నగు రాక్షసగుణములను గల్గించి అది జీవితమును ధ్వంసము చేయును. లోకమునందలి భ్రష్టు లందరును దీనివలన చెడినవారే. కావున ఇది నాకు వలదు. మరల కొనిపొమ్ము. కాదేని దీనుల కిచ్చివేయుము" అని బోధించెను.

రాజందుల కానందించి ఆధనము నంతను దీనులకు పంచి యిచ్చి, షేక్పరీదు ననుగ్రహము నాశించి అక్కడనే భగవద్భాగవతారాధనము చేయుచు కాలము గడపుచుండెను.

ఒకరాత్రి రుక్మిణీవల్లభుఁడు షేక్పరీదునకు స్వప్నమున సాక్షాత్కరించి "రాజు హృదయము నిర్మలమై యున్నది. అతని ననుగ్రహింపుము" అని సెలవిచ్చెను. అది విని తదనుగుణముగ చేయఁదలఁచి షేక్పరీదు మరునాఁ డుదయము స్నానాద్యనుష్ఠానములు ముగించుకొని శ్రీహరిని పూజించుచుండ రాజును స్నానాదులు ముగించుకొనివచ్చి గురుదేవునకు నమస్కరించెను. అప్పుడు షేక్పరీదు ఆనందముతో రాజునకు తీర్థమును, తులసిదళము నొసంగెను.

రాజు ఆదరగౌరవములతోడను, భక్తిప్రపత్తులతోడను వానిని స్వీకరించెను. తోడనే అతఁడు కుష్ఠవిముక్తుఁడై బాలచంద్రునివలె ప్రకాశింపసాగెను.

ఇది చూచినవా రందరును మిగుల ఆశ్చర్యపడిరి. పిదప షేక్పరీదు రాజపత్నికి తులసితీర్థ మిచ్చెను.

వెంటనే యామె గర్భవతియై మంచి ముహూర్తమున బాలసూర్యునివంటి కుమారునిఁ గనెను. రాజదంపతులు గుర్వాజ్ఞ చొప్పున జ్ఞానసంకాశుఁ డని కుమారునకు నామకరణము చేసి భాగవతులను, సాధువులను, దీనులను మృష్టాన్నతృప్తులను గావించిరి.

రాజపుత్రుఁడు శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానుఁ డగుచు సకల శాస్త్రములను అభ్యసించి శాంతుఁడని సత్త్వగుణప్రధానుఁడని ప్రఖ్యాతివహించెను. అతనికి యౌవనము వచ్చిన పిదప చక్కని చుక్క యగు నొకరాజపుత్రికను దెచ్చి వివాహము చేసి రాజ్య మంతయు నాతని కప్పగించి రాజదంపతులు షేక్పరీదు చెంతకు వచ్చి వసించి భగద్భాగతారాధనము గావించుచుండిరి.

బ్రతికియున్నంతకాలము షేక్పరీదు ఇట్లనేకుల నుద్ధరించి,అవసానమున శ్రీహరి సాయుజ్యమును బడసెను.

# సజ్జనక చారుకదాసు

సజ్జనకచారుకుఁడు కటికకులమునకు చెందినవాఁడు. అతని వృత్తి మాంస విక్రయము. అతని పూర్వు లందరును జంతువులను స్వయముగ వధించి దుకాణమున కూర్చుండి మాంసమును అమ్ముచు కాలము గడపిరి. అట్టి వంశమున పుట్టినను సజ్జనకుఁడు భూతదయాపరుఁ డగుటవలన జంతువులను స్వయముగ వధించుట మానివేసి జంతువధ చేసిన యితరులవద్ద టోకుగా మాంసము కొని చిల్లరగా విక్రయించి ఆవ్యాపారమున వచ్చెడి స్వల్పలాభముతో కుటుంబమును పోషించుకొనుచుండెను.

ఈక్రొత్తపద్ధతివలన పూర్వుల రాఁబడికంటె అతనిరాఁబడి చాల తగ్గిపోయెను. గృహకృత్యముల సందర్భమున వెచ్చములను కొంచెము తగ్గించుకొనవలసివచ్చెను. అయినను ఆతఁ డందులకు చింతింపలేదు.

అతఁడు గోపాలకృష్ణచిహ్నములు గల సాలగ్రామముతో మాంసమును తూచి యమ్ముచుండెను. దాని కట్టి రూపు ముండుటకు అతఁడు వింతపడుచునే యుండెడివాఁడు; కాని తరతరములనుండియు అది యందుకే వినియోగింపఁబడుచుండుటవలన విశేషచర్చ నిలిపివేసి వర్తకము చేసికొనుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁ డొక బ్రాహ్మణుఁ డారాతిని చూచుట తటస్థించెను. సాలగ్రామపూజ చేయుచుండు వాఁడు గావున ఆబ్రాహ్మణుఁడు దానిని సులభముగా గుర్తించెను. అది యిట్టిదని తెలియఁగనే విప్రుఁడు చాల కటకటఁబడి "అక్కటా! ఎట్టి వస్తువున కెట్టి గతి పట్టినది?" అని దుఃఖించి వర్తకుని చెంతకు వెళ్లెను.

శిష్టాచారవంతుఁ డగు బ్రాహ్మణుఁ డొకఁడు తన అంగడి చెంతకు వచ్చుచుండుటచూచి సజ్జనకుఁడు భీతిల్లి, అంగడి దిగి ఎదురువెళ్లి "స్వామీ! ఇది కసాయి దుకాణము. మీ రిచ్చటకు రాగూడదు. నేను చేయవలసిన పని యేమో ఆనతిచ్చినచో వెంటనే చేసి యేలినవారిని పంపివేసెదను" అని పలికెను.

బ్రాహ్మణుఁడు సజ్జనకుని మాటలు విని 'ఇతఁడు నీచవృత్తిలో నున్నను సజ్జనుఁడు. కావుననే యిట్లు పలుకుచున్నాఁడు' అని గ్రహించి "ఓయీ! నీయంగడిలో ఆమాంసపుముద్దల నడుమ,ఆపసారక్తములలోఁబడి శ్రీహరియేపొరలాడుచున్నాఁడు. ఇఁక నేను వచ్చిన నేమి? అయ్యో! నీ వెంత అజ్ఞానుఁడవు! మాంసము తూఁచుటకు సాలగ్రామము నుపయోగించుచున్నావా? ఎంత దారుణమైన సంగతి! ఈయపరాధ

మునకు నీ వెన్ని జన్మము లెత్తి యైన ప్రతిక్రియ చేసికొనగలవా? గత జన్మమున నేమి పాపము చేసితివో యిప్పుడీజన్మము నెత్తితివి. ఈయపరాధము ముందు ముందు నీ కెట్టి యధమాధమజన్మ కలిగించునో! ఓయీ! నీ యీ భక్తి ప్రపత్తు లేమి? నీవు ఆసాలగ్రామమును గుర్తింపకుండుట యేమి? నీవు అగ్నితో చెరలాడు చున్నావు. ఇప్పటికైన వివేకము తెచ్చికొనుము. అయితే తెలియక చేసినదానికి పరిహారముకలదు. పశ్చాత్తాపమే అందుకు తగిన పరిహారము. ఆసాలగ్రామము బ్రాహ్మణుల శిరస్సులమీఁద నుండఁదగినది; కాని మాంసపు తక్కెడలో నుండఁదగినది కాదు; గావున నీకు శ్రేయస్సు కావలయునేని వెంటనే దానిని నా కిచ్చివేయుము. నేను దానిని శిరమున నిడుకొని పూజించెదను. దానం జేసి నేను తరించుటయే గాక నీ పాపములు గూడ తొలఁగిపోవును" అని చెప్పెను.

అది విని సజ్జనకుఁడు మిగుల భీతిల్లి "స్వామీ! ఇది తరతరములనుండి మా యింట తూనికరాయిగనే యున్నది. ఇది సాలగ్రామ మని మావారి కెవరికిని దెలియదు. ఇది యెన్ని తరములనుండి యిట్లుపయోగింపఁబడుచున్నదో తెలియదు. అయినను నిజస్థితి తెలిసిన తరువాత నిఁక దీని నిట్లే వాడుట మంచిది గాదు. కావున దేవరవారి కిచ్చివేసెదను; గాని స్వామీ! నాగతి యేమి? నాహృదయమున అప్పుడే దుఃఖజ్వాల విజృంభించినది. జీవహింస చేయలేక నే నితరులవద్ద మాంసము కొని వర్తకము చేసికొనుచున్నాను; కాని యిది జంతువధకంటెను మిగుల పాపకృత్యముగా నున్నది. అయినను చేయునది లేదు. దీనిని మీరు తీసికొని పోయి పూజింపుఁడు. భగవంతుఁడు సర్వస్థలములయందును నున్నవాఁడు గదా? కావున నాచిత్తవృత్తిని గూడ శ్రీహరి గుర్తించియే యుండును. నేను నాపాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనియెదను. మీరు మాత్రము దీనిని భక్తి శ్రద్ధలతో పూజింపుఁడు" అని ప్రార్థించుచు దాని నిచ్చివేసెను.

సజ్జనకుఁడు యథార్థమును గుర్తించినందుకును, ఆసాలగ్రామము తనకు లభించినందుకును మిగుల నానందించుచు ఆ బ్రాహ్మణుఁడు ఇంటికి పోయి మహాన్యాస పూర్వకముగా నభిషేకమును, సహస్రనామార్చనమును గావించి పంచభక్ష్యపరమాన్నములతో నివేదన గావించి చాల నానందించుచుండెను.

బ్రాహ్మణుఁ డిక్కడ నిట్లు ఆనందించుచుండఁగా సజ్జనకుఁ డక్కడ మిగుల దుఃఖింపసాగెను. సాలగ్రామము నిట్టి యధమకార్యమున నుపయోగించిన దుఃఖ మొకటి. సాలగ్రామమును విడిచిన దుఃఖ మొకటి. "నేనే పూజించుకొనక దాని నేల యిచ్చివేసితిని? అయ్యో! ఎంత పని జరిగినది?" అని యిట్లాతఁడు మిగుల ఖేదపడసాగెను.

ఆరాత్రి గోపాలకృష్ణుఁడు బ్రాహ్మణునకు స్వప్నమున కనబడి "నీవు ద్రోహము చేయలేదు; గాని సజ్జనకుని యింటినుండి నన్ను నీవు తీసికొనివచ్చుట చాల తప్పు; చండాలుఁడు సాలగ్రామమును తాఁకగూడ దనుట సామాన్యవిధి. నాయిచ్ఛ విశేష విధి. నీవు సామాన్యవిధిని మాత్రమే యెఱుంగుదువు. నేను నీయింట వేదోక్తముగా షోడశోపచారములను పొందుటకంటె సజ్జనకుని తక్కెడలో మాంసము తూఁచుటకు వినియోగింపఁబడుటకే ఆనందించెదను. బహిఃప్రపంచమున అతని చుట్టును ఆవరించి యున్నది అసంగతమైనదియే; కాని అతని చిత్తవృత్తి మిగుల నిష్కల్మషముగా నున్నది; కావున నన్ను తీసికొనిపోయి వెంటనే వాని కిచ్చివేయుము. లేకున్న సకు టుంబముగ నిన్ను నాశనము చేసెద" నని చెప్పెను.

బ్రాహ్మణుఁడు మేల్కాంచి, స్వప్నవృత్తాంతమును స్మరించి మిగుల భయ భ్రాంతుఁడై, సాలగ్రామము శిరమున ధరించి అప్పుడే బయలుదేరి సజ్జనకుని యింటికి వచ్చెను. సజ్జనకుఁడును ఈవిచారమువలన నిద్రపట్టకపోఁగా శయ్యమీఁద పొర లాడుచున్న వాఁడు గావున బ్రాహ్మణుని పిలుపు విని లేచివచ్చి సంగతి యేమని యడి గెను. అందుకు బ్రాహ్మణుఁడు జరిగిన దంతయు చెప్పి వానికి సాలగ్రామము నిచ్చి వేసెను. సజ్జనకుఁడు దాని నిచ్చినది మొదలు తనకు నిద్రాహారములు లేకుండుట యెఱింగించి దాని నానందముతో గ్రహించి వెంటనే స్నానము చేసి పూజించి తాను తీర్థమును స్వీకరించి భార్యకు గూడ ఇచ్చెను.

అతని భార్యయు మిగుల ధర్మాత్మురాలు. సజ్జనకునకు తగినది. జరిగిన దంతయు విని ఆమెయు మిగుల నానందించి అది మొదలు తానును ఆసాలగ్రామమును పూజింపసాగెను.

ఆక్షణముననే సజ్జనకుఁడు భక్తుఁడై పోయెను. అతఁడు అంగడిలో కూర్చుండి నపుడు గూడ హరిభజనమే—హరినామస్మరణమే చేయసాగెను. ఇది చూచి యూరి వారందరు నాశ్చర్యచకితులైరి. సాలగ్రామమును గొనిపోయిన బ్రాహ్మణుఁడు తన కట్టి భక్తి లేనందుకు మిగుల సిగ్గుపడెను.

కొన్ని దినములకు సజ్జనకుఁడు జగన్నాథయాత్రకై బయలుదేరి కొంత దూరము పోవునప్పటికి ఒక భక్తబృందమును గలిసికొనెను. ఒక గ్రామమున అతఁడు సాధువులతోఁ గలిసియుండఁగా వ్యభిచారిణి యగు నొకయువతి చూచి అతని రూపలావణ్యములకు ముగ్ధయై "స్వామీ! నామీఁద ననుగ్రహించి మాయిల్లు పావనము చేయఁగోరెదను. నేను తమకు వలయు పదార్థములను అన్నిఁటిని సమ ర్పించుకొందును. వానిని పక్వము చేసి శ్రీహరికి నివేదించి తాము భుజించి తచ్ఛేష మును నాకొసంగిన అదియే నాకు మహాప్రసాదము" అని ప్రార్థించెను. సజ్జనకుఁ డది కపటభక్తి యని యెఱుంగక వల్లె యని ఆమె యింటికి పోయెను.

ఆమె చెప్పిన చొప్పున సకలము నిచ్చెను. సజ్జనకుఁడు వంటచేసి, శ్రీహరిని పూజించి పదార్థముల నన్నిఁటిని నివేదించి, తాను భుజించి శేషము నామె కిచ్చి వేసెను. ఆమెయు దానిని మహానందముతో భుజించి సజ్జనకునకు శయ్యను సిద్ధము చేసి గంధతాంబూలాదు లిచ్చి సత్కరించెను.

సజ్జనకున కీసత్కారము లేమియు నిష్టము లేదు; కాని యామె నిర్బంధము వలన స్వీకరింపక తీరదయ్యె. ఆతఁడు వాటిని సేవించి నిద్రింపఁగా ఆసమయమున ఆమె వచ్చి లేపి తన వాంఛ నెఱింగించి "కటాక్షింపుఁడు. లేకున్న నేను బ్రతుక జాలను" అని చెప్పెను.

ఇదివిని సజ్జనకుఁడు నిర్విణ్ణుఁ డయ్యెను 'ఎట్టి ప్రారంభ మెట్లుపరిణమించినది ?' అని ఆశ్చర్యపడెను. వెంటనే ప్రకృత మనుసరించి "స్త్రీరత్నమా! నీవు నాకు తల్లివి. నీసత్కారమును నేను పసిబిడ్డ మాతృస్తన్యమును గ్రోలునట్లే స్వీకరించితిని; కావున నాయెడల నీ విట్టియుద్దేశమును బెట్టుకొనఁగూడదు. నాకిట్టివాంఛ లేమియు లేవు. నేను జగన్నాథస్వామిని సేవించుటకు పోవుచున్నాను. నాకు స్వామికటాక్షము కలుగునట్లు ఆశీర్వదింపుము. అమ్మా! ఇదియంతయు రౌరవాదినరకములకు ప్రధాన కారణ మగును. నా సంగతి యట్లుండ నీ కైన నిది యేమి మంచిది? ఈ పాంచ భౌతికశరీరము స్థిరమా? ఈయావనమును, ఈ విషయవాంఛలును మాత్రము స్థిరములా? దీనివలన నేమి తృప్తి యున్నది? దుర్లభ మగు మానవజన్మ మెత్తితివి. మనోహరరూపమును బడసితివి. శరీరసౌందర్యమునువలెనే మానసికసౌందర్య మును గూడ నీవు పడయవలదా? శరీరసౌందర్యమునకు మలినవస్త్రములు, స్నానము చేయకపోవుట యెట్లు భంగకరములో మానసికసౌందర్యమునకు ఇట్టి దుర్వృత్తులు అట్లు భంగకరములు కావా? క్షుద్రమైన నాసౌందర్యమున కిప్పుడు ముగ్ధవైతివి. నాకంటె సౌందర్యవంతుఁడు కాన్పించిన వానిని మాత్రము నీవు మోహింపవా ? మఱియొకనిని కూడ నీవు కోరవా? దీని కంతముండునా? ఇంతకంటె నీకు సర్వనాశక మైన వృత్తి యున్నదా? నీవు సుమంగలివై యున్నావు. విషయసుఖములయెడల నీ కింకను జుగుప్స కలిగియుండనిచో వానిని నీభర్త తీర్పఁజాలఁడా? నీ శీలము నేల భంగపఱచికొందువు? మానహాని కేల యొడఁబడెదవు? క్షణికమైన శారీరకతృప్తికై ఇహమున దుష్కీర్తికరమును, పరమున నరకకరము నగు ఈదుర్వృత్తి నేల యవలం బించెదవు. నీసౌందర్యమునకు ముగ్ధులై భ్రష్టులగు పురుషులే నిన్ను కోరినచో బుద్ధి చెప్పి తిరస్కరింపవలసిన నీవు స్త్రీల కుచిత మగు లజ్జను దిగఁద్రొక్కి నీకు నీవై పర పురుషుల నిట్లు కోరుట నీకు బాగుగా నున్నదా? తల్లీ! వలదు. మనస్సు మరలించు కొనుము. నీ భర్త లోపల నిద్రించుచున్నాఁడు. పోయి అతనితో సుఖింపుము. అతనితో ఆనందింపుము" అని యాతఁడు చెప్పెను.

ఇది విని యామె తటాలున లోని కరిగి భర్త శిరమును ఖండించి తెచ్చి అతని యెదుట బడవైచి "ఇదే నాభర్తను కడతేర్చితిని. నీవే నా కిఁక భర్తవు. నీవే నా కిఁక దేవుఁడవు. నన్నేలుకొనుము. నన్ను సుఖపెట్టుము" అని కోరెను.

కాని యేమియు ప్రయోజనము కలుగలేదు. ఆమె సాహసకృత్యమునుజూచి యాతఁడు శ్రీహరీ! యని మొగము త్రిప్పుకొని ఇఁక నిక్కడ నుండఁగూడదని వెంటనే లేచి బైటికి వచ్చెను.

తన మనోరథము దీరకపోవుటయేఁగాక పైగా నిట్లు సంభవించినందుకుఁగూడ ఆమె మిగుల కోపించి కాలభుజంగినివలె రోజుచు "అధముఁడా! నీవు నపుంసకుఁడవని యెఱుంగక మోసపోయితిని. ఎక్కడికి పోయెదవు? నన్నిట్లు భంగపుచ్చి నీ వెట్లు సుఖముగా నుండఁగలవు?" అని మండిపడి గోలుగోలున ఏడ్చుచు వీథిలోఁ బడెను.

ఆధ్వనికి ఇరుగుపొరుగువా రందరును లేచివచ్చిరి. వెంటనే యామె "విరాగి యని, భక్తుఁడనీ భక్తితో నేను పూజింప నీయధముఁడు నేను చేసిన సత్కారములను స్వీకరించి పైగా నాభర్తను ఖండించిపోవుచున్నాఁ" డని చెప్పెను. అది విని వారందరును సజ్జనకుని ముట్టడించిరి. అందరును తలొక మాటయు నడిగిరి; కాని అతఁ డెవ్వరికిని జవాబు చెప్పలేదు. అంతట వా రంతను నాతఁడు హంతకుఁడే యని నిశ్చయించుకొని ఆపట్టణము నేలు రాజు చెంతకుఁ గొనిపోయిరి.

రా జంతయు విని సజ్జనకుఁడు దోషి యని విశ్వసించెను. ఆరాజు సహజముగనే దుర్మార్గుఁడు. పైగా ఒక సుందరి ఫిర్యాదు చేయుట, ఒక వీథివా రందరు ఆమె పక్షమున నుండుట, పైగా సజ్జనకుఁడు బదులు చెప్పకపోవుట—ఇవి యన్నియు అతని మౌర్ఖ్యమునకు తోడయ్యెను. వెంటనే యతఁడు"వీని హస్తములను ఖండించి వేయుఁడు" అని భటుల కాన తిచ్చెను.

వెంటనే భటులు వచ్చిరి. వారు ముస్తుందు తమ ఖడ్గములను ఆమె చేతి కిచ్చి పిదప తాను గైకొని రాజసభ యందే సజ్జనకుని చేతులు ఖండించి వెడలి పోయిరి.

సజ్జనకుఁడు మూర్ఛిల్లి కొంతసేపటికి తెప్పరిల్లి లేచి "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ" మ్మని భావించి అట్లే జగన్నాథమునకు పోయి పురము బైట నున్న ఒక పూలతోటలో మకాము చేసి జగన్నాథుని ధ్యానింపసాగెను.

అంతట సర్వాంతర్యామి యగు జగన్నాథుఁ డిది యంతయు నెఱింగి నాఁటి రాత్రియే అర్చకునకు స్వప్నమున సాక్షాత్కరించి "పురోపకంఠమునందలి యుద్యానవనమున నిక్కృత్తహస్తుఁ డగు నొక పురుషుఁడు పడియున్నాఁడు. అతఁడు నా కత్యంత

రంగభక్తుఁడు. మీ రందరు నచ్చటి కరిగి అతనిని సేవించి పల్లకిలో కూర్చుండఁజేసి రాజోపచారములతో నాసన్నిధికి కొనిరండు” అని చెప్పెను.

అర్చకుఁడు వెంటనే మేల్కాంచి తన వారి కందరికిని ఇది తెలిపెను. అందరు నాశ్చర్యచకితులై బయలుదేరి వచ్చిరి. వచ్చి చూడఁగా నిక్కృత్తహస్తుఁడగు పురుషుఁడు స్వామిని స్మరించుచు పడియుండెను.

వా రందరు నాతనిని సమీపించి అనేకవిధముల కొనియాడి పల్లకిలో కూర్చుండవలసినదని కోరిరి. అందు కాతఁడు బదులు పలుకక “శ్రీహరీ! రుక్మిణీవల్లభా! భక్తత్రాణపరాయణా! రాజభటులు నాచేతులను ఖండించునపుడు, ఇపుడు చూపిన దయను నాయెడల నేల చూపవైతివి? అప్పటికంటె నిప్పుడు నాయందేమి విశేషమును కనిపెట్టితివి? అయ్యో! అపుడు నీకు నాయవస్థ తెలియకుండెనా? నేనధర్మము ఏమైన చేసితినా? ఇప్పుడైన నాకేల దివ్యమంగళవిగ్రహమును చూపవు? స్వామీ! రమారమణా! నే నిఁక పడయఁజాలను. ఈకన్నులుండఁగనే నాకు నీదర్శనమిమ్ము” అని భక్తిపరవశుఁడై ప్రార్థించెను.

వెంటనే జగన్నాథస్వామి నిజరూపముతో నతనికి సాక్షాత్కరించెను. అందు కానందించి సజ్జనకుఁడు అనేకవిధముల నుతించి వాక్యములతోడనే సాష్టాంగముగ నమస్కరింపఁగా స్వామి ప్రీతుఁడై “వత్సా! నీభక్తికి ఆనందించితిని” అని ఆతనిని లేవనెత్తెను;

శ్రీహరి తాకినంతనే సజ్జనకునకు మరల చేతులు వచ్చెను. అంతట నాతఁడు శ్రీహరి పాదములమీఁద వ్రాలి “ప్రభూ! నాచేతులు ఖండింపఁబడుటకు కారణమేమి?” అని అడిగెను.

అందుకు జగన్నాథస్వామి యిట్లు చెప్పెను. “వత్సా! పూర్వజన్మమున నీ వొక బ్రాహ్మణుఁడవు. ఒక నాఁడు నీవు గంగానదిలో స్నాతుఁడవై నిలిచి నన్ను ధ్యానించుచుండఁగా నక్కడి కొక కసాయివాఁడు వచ్చెను. వాఁడు గోవులను వధించి తన్మాంసమున ద్రవ్య మార్జించుచుండెను. వాఁడు తన గోవులలో నొకటి కట్టుత్రాళ్లు తెంచుకొని నీవున్న దెసకు పరుగెత్తికొని రాగా వాఁడు వెంటఁబడి వచ్చి “ఆవెట్లు పోయిన” దని నిన్నడిగెను. అందుకు నీవు నోటితో సమాధానము చెప్పక ఆవు పోయిన దిక్కునకు చేతులు చాపితివి. వెంటనే వాఁడు నీవు చెప్పిన చొప్పున పోయి ఆవును బట్టుకొని ఇంటికిఁ గొనిపోయి దానిని వధించి మాంసము విక్రయించెను. ఆగోవే నీ చేతులు నరికించిన స్త్రీయై పుట్టినది. దానిని చంపిన కసాయివాఁడే ఆస్త్రీ మగఁడై పుట్టెను. తొల్లిటిజన్మమున నన్ను ధ్యానించునపుడు కసాయివానిని చూచితివి. కావున ఇప్పుడు నీవు కసాయివై పుట్టితివి. ఆవుపోయిన

దిక్కును నీవు కసాయికి చేతులతో చూపితివి; గావున ఇప్పుడు నీచేతులు నరుకఁబడినవి. ఇంతకును జన్మజన్మములనుండి నీవు నన్ను నిష్కలుషభక్తితో ధ్యానించుచున్నావు; గాన పరిణతము లగు నీభక్తివైరాగ్యములకు మెచ్చి నేనిప్పుడు నీకు సాక్షాత్కరించితిని."

ఇది చూచి విని, అందరును ఆశ్చర్యచకితులై సజ్జనకచారుకదాసుని అనేక విధముల సేవించిరి.

తరువాత సజ్జనకుఁడు సముద్రస్నానము చేయుచు, స్వామిని సేవించుచు నాలుగు మాసము లక్కడ నుండి పిదప శ్రీకృష్ణుని సేవించుటకు బృందావనమునకుఁ బయలుదేరెను.

మార్గమధ్యమున బృందావనమునకే చనుచున్న కొందరు భక్తు లాతనికి కాన్పించిరి. ఆతఁడు వారితో గలిసి ఆడుచు, పాడుచు, శ్రీహరిని సేవించుచు తనకుఁ గల సందేహము లన్నియు తీర్చుకొనుచు బృందావనము చేరుకొనియెను.

సజ్జనకుఁడు బృందావనమున యథావిధిగా స్వామిని సందర్శించి సేవింపఁగా స్వామి సాక్షాత్కరించి అతని కభయ మిచ్చి "వత్సా! ఈయూరిలో కృష్ణానందుఁడను మహాత్ముఁడు కలఁడు. ఆతని నాశ్రయించి నీవు పరమార్థవిషయముల నెఱుంగుము" అని యానతిచ్చి తిరోహితుఁ డయ్యెను.

సజ్జనకుఁడు సంగతి యంతయు నెఱిఁగించి ఆశ్రయింపఁగా కృష్ణానందుఁడు స్వామి యాజ్ఞను నెఱవేర్చి అతనికి శ్రీకృష్ణమంత్రము నుపదేశించి ఆశీర్వదించి "ఇఁక స్వగ్రామమునకుఁ బోయి స్వగృహమున వసించుచు శ్రీహరిని సేవించుచు సుఖముగా నుండు" మని చెప్పెను.

సజ్జనకుఁడు గురువునకు ప్రదక్షిణనమస్కారము లాచరించి యింటికి బయలుదేరెను. మార్గమధ్యమున నొక గ్రామమున నాతఁడు భజనకూటమున విడిసెను. నాఁటి రాత్రి అచట అయిదువేల భాగవతులు చేరి హరిభజనము చేయుచు సజ్జనకచారుకుని స్తుతి చేయఁసాగిరి. అపుడు శ్రీకృష్ణుఁడు వారికి సాక్షాత్కరించి "మీరు కొనియాడుచున్న సజ్జనకచారుకదాసు లిదే యిక్కడ విజయము చేసియున్నారు. మీ రందరును వారిని సేవించి ఉపదేశము పొంది సుఖింపుఁడు" అని తెలిపి తిరోహితుఁడయ్యెను. అందుకు వా రత్యాశ్చర్యచకితులై పరమానందముతో సజ్జనకుని చేరి "మహానుభావా! మీదర్శనమువలన మేము పాపదూరుల మైతిమి. మమ్ము కటాక్షించి శిష్యులుగా స్వీకరింపవలసిన" దని ప్రార్థించిరి. ఆప్రార్థనము ననుసరించి అతఁ డచ్చట కొలది మాసము లుండి వారిని విజ్ఞానవంతులుగా చేసి శ్రీకృష్ణమంత్రము నుపదేశించి స్వగ్రామమునకుఁ వెడలిపోయెను.

సజ్జనకుని మహాత్మ్యము, అతఁడు స్వగ్రామము చేరిన సంగతి దేశము నలుమూలలకును తెలిసిపోయెను. అంతట అనేకులు వచ్చి అతనివలన జ్ఞానబోధను, మంత్రోపదేశమును పొంది ఆనందింపసాగిరి. దుష్టస్త్రీప్రేరణవలన అతని చేతులు ఖండింపించిన రాజు గూడ ఒకనాఁడు వచ్చి కాళ్లమీఁదఁబ్రాలి 'అనుగ్రహింపవలసిన' దని పరిపరివిధముల ప్రార్థించెను. అందుకు సజ్జనకుఁడు "రాజా! నీకు విచారము వలదు. చేసికొనిన పాపము ఎవనికిని అనుభవింపక తీరదు. నాపూర్వపాపము అప్పుడు అట్లు తీరిపోయినది. ఆసందర్భమున నీవు నిమిత్తమాత్రుఁడవు. కావున విచారింపకుము" అని యోదార్చెను. దానిమీఁద రాజు "కర్తవ్యము నెఱింగింపవలసిన" దని ప్రార్థింపఁగా సజ్జనకదాసు "ప్రజలందరును సమానులు. అందరియెడలను నీవు ఒక రీతిగనే యుండుము. భూతదయఁ గలిగి సత్యనిరతుఁడవై శ్రీహరిని ధ్యానించుచు నుండుము" అని శ్రీకృష్ణమంత్రము నుపదేశించి "భగవద్భాగవతారాధనము నెప్పుడును మానవద్దు" అని చెప్పి పంపివేసెను.

పిదప సజ్జనకదాసు స్వగ్రామమున నొక హరిమందిరమును కట్టించి స్వామికి శాస్త్రోక్తముగ పూజాదికము చేయుచు అనేకులకు మోక్షోపాయము నుపదేశించి, అవసానమున శ్రీహరి సాయుజ్యము పొందెను.

---

# చాంగదేవుఁడు

భీమరథీనదీతీరమునందలి యొకగ్రామమున విఠోబా యను బ్రాహ్మణుఁడుండెను. అతని భార్యపేరు రుక్మిణి. వారి కొక పుత్రుఁడు ఇంద్రాంశమున జన్మించెను. అతఁడే చాంగదేవుఁడు.

యుక్తవయస్సున నుపనయనమైన తరువాత చాంగదేవుఁడు విద్యాభ్యాసము గావించెను. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అను సీయెనిమిది సిద్ధులు నతని స్వాధీనమున నుండెను. అష్టాంగయోగములుగూడ నతనికి కరస్థములై యుండును. మఱియు లక్ష్మీసరస్వతు లెప్పుడు నతని గృహమున నుండుచుండిరి.

అతఁడు తాపించీనదీతీరమున నొక మఠము నిర్మించికొని యందు వసించుచుండెను. వేయియేండ్లు కడపినందున మహాత్ముఁ డగుటవలన జనులందరు నాతని దైవమును వోలె సేవించుచుండిరి.

ఇతఁడు ప్రతిదినమును పండరిపురమునకుఁ బోయి సర్వేశ్వరుని నుతించి, ధ్యానించి, పూజించి, భజనచేసి యానందించుచుండెడివాఁడు. అతఁ డెక్కడికి పోయిన నక్కడి కతని పదునాలుగువందలశిష్యులునుగూడ వెడలుచుండిరి.

అతఁడు సహస్రవర్ష జీవి. గొప్ప పండితుఁడు, జ్ఞాని. విరాగి. భక్తుఁడు. యోగి. సిద్ధుఁడు. కాని సదాచార్యు నాశ్రయించి ఉపదేశము పొందని దోషము అతనిని విడువలేదు. అతఁడు తనకు తోఁచిన ట్లనేకులకు జ్ఞానోపదేశము చేసెను; కాని అందు కతనికి తృప్తి లేకుండెను. అప్పు డప్పు డాతఁడు "నాకుశాస్త్రము లన్నియు తెలి యును. నేను గొప్ప సామర్థ్యము సంపాదించినాను; కాని వానివలన నాకు తృప్తి కలుగుట లేదు. బంగారము అమూల్యలోహ మైనను ఒకకిడిరాతిమీఁదఁ గీయఁ బడిన కాని చెలామణి కానట్లు ఆచార్యోపదేశము లేకుండుటవలన నాభక్తి జ్ఞాన వైరాగ్యములు పెద్దల కంగీకృతములు కావు; కావున ఇఁకనైన నేను ఒక సద్గురుని ఆశ్రయింపవలెను. నాకు ఆచార్యుఁ డగుటకు జ్ఞానదేవునకు తప్ప నన్యున కర్హత లేదు; గాన వారినే ఆశ్రయించెదను" అని నిశ్చయించుకొనియెను.

అప్పటికి జ్ఞానదేవుఁడు పాండురంగని సెలవు పొంది అలకాపురమునకు పోయి యుండెను. చాంగదేవుఁ డక్కడికే జాబు పంపదలఁచి వ్రాయుటకు కూర్చుండెను.

అయితే "హరిః ఓ" మ్మనఁగనే అతనికి సందేహ మొకటి కలిగినది. అతని నెట్లు సంబోధింపవలయును? చాంగదేవుఁడు చాలసేపు యోచించెను. కాని యీ సందేహము తీరలేదు. తుద కాతఁడు విసిగి ఏమియు వ్రాయకయే తాటియాకుచుట్టి జ్ఞానదేవునకు తన శిష్యునిచేత పంపెను.

జ్ఞానదేవుఁ డాయాకు చూచి "నిన్ను చాంగదేవుఁడు పంపెను కాదా?" అని యడిగి "చాంగదేవుఁడు ఇన్ని సంవత్సరములు జీవించినను అతనిజీవితము వ్యర్థమే అయినది. ఇతనికి నిశ్చయ జ్ఞానము లేదు. సదాచార్యుని యుపదేశము లేకపోవుటయే దీనికి కారణము. బాలవిధవ ఎంత శృంగారించుకొనిన నేమిలాభము ? గ్రుడ్డికంటి కెంత కాటుక పెట్టిన నేమి ప్రయోజనము ? అట్లే చాంగదేవుని జీవితమును సదా చార్యోపదేశము లేకపోవుటవలన కేవలము వ్యర్థమైపోయినది" అని తలఁచి యొక తాటియాకుమీఁద "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చా న్యః—ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్" అను భగవద్గీతావాక్యము వ్రాసి దాని క్రింద "చాంగదేవా ! దీనిని తెలిసికొనుము" అని గూడ వ్రాసి ఆశిష్యుని పంపివేసెను.

దానిని చూడఁగానే చాంగదేవునకు 'జ్ఞానదేవుని సన్నిధి కెప్పుడు పోవుట?' అని తొందర కలిగెను. ఈకారణమువలన నాతఁడు తన మహిమచే నొకబెబ్బులిని రప్పించి దాని నధిష్ఠించి భయంకర మైన యొక నల్లత్రాచును కొరడాగా ధరించి తన శిష్యు లందరును వెంటరాగా అలకాపురికి బయలుదేరెను.

బెబ్బులిమీఁద నెక్కి ఒక యోగి వచ్చుచుండుట గాంచి అలకాపురవాసు లెల్లరును అత్యాశ్చర్యచకితులై ఈసంగతి జ్ఞానదేవునకు విన్నవించిరి. దానిని విని జ్ఞానదేవుఁడు "ఆవచ్చునది చాంగదేవుఁడు తప్ప వేరు కాదు. సద్గురూపదేశము లేకపోయినను అట్టిమహిమ అతనికి మాత్రమే కలదు" అని నిశ్చయించుకొని అపుడు తాను కూర్చుండియుండిన మట్టిగోడను సంబోధించి "నన్ను చూచుటకు చాంగదేవుఁడు వ్యాఘ్రవాహన మెక్కి వచ్చుచున్నాఁడు. నేనతనికి ప్రత్యుత్థానము చేయవలసియున్నది. కావున నీవు ఉన్నట్లుండఁగా బయలుదేరి అతని కెదురుగా పోవలయును" అని యాజ్ఞాపించెను. వెంటనే ఆగోడ అట్లే చేయఁగా చాంగదేవుఁడు చూచి "ఆహా! జ్ఞానదేవుని మహిమ ఎంతటిది? అతఁ డచేతనమునే నడిపించుకొని వచ్చుచుండఁగా నేను చేతనమును నడిపించుకొనివచ్చుట యేమి విశేషము? ఇట్టి మహాత్ముని పాదము పట్టనివాని జన్మమేమి జన్మము?" అని చింతించి, వెంటనే వ్యాఘ్రమునుండి దిగి అడుగడుగునకు మ్రొక్కుచు సమీపించి జ్ఞానదేవునకు ప్రదక్షిణనమస్కారము లాచరించి "మహాత్మా! తమ దర్శనమువలన నేడు తరించితిని. ఎన్నిదినములనుండియో తమ ప్రభావమును ఆలకించుచున్నాను. ఎంత కాలమునుండియో దర్శనము చేయుట కువ్విళ్లూరుచున్నాను. అది నేటికి లభించినది" అని అనేకవిధముల నుతి చేసెను.

అంతట జ్ఞానదేవుఁడు చాంగదేవుని లేవనెత్తి "నీకంటె నేనేమి గొప్పవాఁడను? వయస్సున నీకంటె పెద్దలు ఈజగత్తునందే లేరు. నీజ్ఞానము చిరకాలముక్రిందటనే పరిపక్వమైనది. నీ కెందును లోటు లేదు; కాని ఇంతవఱకును ప్రధానవిషయమును గుఱించి అశ్రద్ధ చేసితివి. అది లేనిచో ఏమియు లేనిదే. ఇప్పుడైన చాల మంచి పని చేసితివి" అని బుజ్జగించుచు అతని చేయి పట్టుకొని ఒక మఱ్ఱిచెట్టుక్రిందికి తీసికొని పోయి కూర్చుండఁబెట్టి మంత్రోపదేశము చేసెను.

ఆవటవృక్ష మిప్పటికిని అలకాపురమున గలదు. దాని ననేకులు పూజించుచుందురు. ఆస్థలము నిప్పటికిని భక్తులు సేవించుచుందురు. ఆస్థలమున సంచరించిన వారికి మోక్షము కరతలామలక మగు నని అందరును నమ్ముచున్నారు.

ఉపదేశమైన తరువాత జ్ఞానదేవుఁడు చాంగదేవుని తన యాశ్రమమునకుఁ గొనిపోయెను. ఆశ్రమము ప్రవేశించిన వెంటనే చాంగదేవునకు వస్త్రహీనయగు ముక్తాబాయి కాన్పించెను. అందు కాతఁడు సందేహించి వెనుదీయఁగా ముక్తాబాయి అతనిని మందలించి "ఏల యట్లు పోయెదవు? ఇచ్చట నీకు చూడరాని దేమున్నది? ప్రపంచము అంతయు బ్రహ్మనిష్ఠము. జ్ఞానులకు అన్ని వస్తువులయందును బ్రహ్మమే కాన్పించుచుండును. అవిద్యాదూషితులకు మాత్రమే యిట్టి సమదర్శిత్వము కలదు

రదు. వేయేండ్లు కడపితివి. బాల్యమునుండియు కాలము యోగసాధనమునందే చెల్లి పోయినది. సకలవిద్యలును సాధించితివి; కాని ఇంద్రియములను జయింపఁజాలక పోయితివి. ఇఁక నీ ప్రజ్ఞ యేమున్నది? జ్ఞానదేవుని వలన ఉపదేశము పొందియు నీ వజ్ఞానమును జయింపలేకపోయితివి. తొల్లి వివస్త్రుఁడగు శుకుని చూచి తొలఁగి పోని నగ్నలగు దేవకన్యలు వస్త్రధారియు వృద్ధుఁడు నగు వ్యాసుని చూచి తొలఁగిపోయిరి. అందుకు వ్యాసుఁడు కారణ మడుగఁగా వారు "శుకుఁడు వివస్త్రుఁడు. స్త్రీపురుషభేద మతఁ డెఱుఁగడు. అతని కైహిక దృష్టియే లేదు. ఏవస్తువు చూచినను అతఁడు పరబ్రహ్మముగనే భావించును. నీ వట్టివాఁడవు కావు. నీవు వస్త్రము ధరించియుండుటయే యిందుకు నిదర్శనము. కావుననే నిన్ను చూచి తొలఁగితి" మని జవాబు చెప్పిరి. అట్లే ఇంద్రియములను జయించియున్నవాఁడు దేని కైన నేల జంకును? నీ కిట్టి యోగ్యత లేదు; కావున నీవు నన్ను చూచి చకితుఁడ వైతివి. నీ జ్ఞానమును పరీక్షించుటకై నేను వస్త్రహీననుగా కాన్పించితిని; గాని నే నిపుడు నగ్ననై యుండలేదు. ఇఁక నైన జ్ఞానదేవుని యుపదేశము చొప్పున నడచుకొని బాగుపడుము" అని చెప్పెను.

అపుడు చాంగదేవుఁ డామెపాదముల మీఁద వ్రాలి "తల్లీ! నీవు లోకమాతవు గాని మానవాంగనవు కాదు. తిరస్కారపూర్వక మగు నీయుపదేశవాయువు వలన జ్ఞానదేవునిచే ప్రతిష్ఠింపఁబడిన నాజ్ఞానాగ్ని యిఁక ప్రవృద్ధమై నామోక్షమునకు కారణము కాఁగలదు. నేటితో అన్నివిధములను నేను తరించితిని" అని విన్నవించెను.

అపుడు జ్ఞానదేవుఁడు తన హస్తమును చాంగదేవుని శిరమున నుంచెను. తోడనే చాంగదేవుఁడు అజ్ఞానదూరుఁడై జీవన్ముక్తిఁ బడసి బ్రహ్మానందము ననుభవించెను. అది మొదలు చాంగదేవుఁడు జ్ఞానదేవుని మహిమ నెల్లఱకును ప్రకటపఱచుచు ప్రజల ననేకులను జ్ఞానవంతులను గావించెను.

---

# ధనాజాటుఁడు

ఇతఁ డొక శూద్రబాలుఁడు. బీదవాఁడు. అమాయకుఁడు. శైశవమునగూడ అతఁ డేడువకుండుట, మంకుపట్టు పట్టకుండుట, శాంతముగా పరుండియుండుట, సదా యేదో ధ్యానించుచున్నట్లుండుట—ఇట్టి లక్షణములను చూచి కారణము తెలియఁగక ఆశ్చర్యచకితు లగుచుండు తలిదండ్రులును, ఇరుగుపొరుగువారును, బంధువులును అయిదేండ్లవయస్సువచ్చిన పిదప ధనాజాటుఁడు హరిభక్తుఁ డనీ, అతనికి భక్తి పూర్వజన్మమునందే ప్రారంభమై యీజన్మమునగూడ వృద్ధియగుచున్నదనీ గ్రహించిరి.

అయినను అతనిని కూర్చుండఁబెట్టి గారాబముగా పెంచుటకు తలిదండ్రులకు శక్తిలేదు. పవూఁట కావూఁటనే వారు కష్టపడినఁగాని వారికి కాలము గడుఁకుండెను. అందుచేత వారు అయిదేండ్లవయస్సునందే తమ కుమారునివలనఁగూఁడ డబ్బు సంపాదింపవలసినవారై అతనిని ధనికుల పశువులను కాచుచుండుటకు ఏర్పఱచిరి.

ప్రతిదినమును అతఁడు తోడిబాలురతోఁగూడ పశువులను మేపుట కరణ్యమునకుఁ బోవుచుండెను; కాని వారివలె ఆతఁ డాటపాటలలో ప్రొద్దుపుచ్చక "కృష్ణా! కృష్ణా!" యని స్మరించుచు, వచ్చియు రాని పాటలతో హరిభజనము చేయుచుండువాఁడు.

ఇంతేగాక అతఁడు భాగవతులను చూచినను, విరాగులను చూచినను, సన్న్యాసులను చూచినను, యోగులను చూచినను చాల భక్తిప్రపత్తులు కనపఱచుచు తీరినప్పుడెల్ల వారికి సేవ చేయుచు పూజాపద్ధతులను కొంతవఱకును గ్రహించెను. ఒకనాఁడు ఒక యూరినుండి ఒక యూరికిఁ బోవుచు అతఁ డున్న యరణ్యమునందలి సెలయేటియొడ్డున కొందరుభాగవతులు స్నానసంధ్యానుష్ఠానములు ముగించుకొని సాలగ్రామపూజఁ గావించుకొనుచుండిరి. కొంతసేపటికి పశువులను నీళ్లు త్రాగించుట కక్కడకు వచ్చిన ధనాజాటుఁడు శ్రీహరి పూజను చాలసేపుచూచి ఆభాగవతులకు నమస్కరించి వినయవిధేయతలు తోప "మహానుభావులారా! నాకును సాలగ్రామమును పూజింప నాసక్తి కలదు. బాలుఁడ నని సందేహింపక నాకుఁ గూడ నొక సాలగ్రామము దయచేయుఁడు" అని ప్రార్థించెను.

ఆమాటలు విని వారు తెల్లపోయిరి. చూడఁగా అయిదాతేండ్ల బాలుఁడు. మాటలైన సరిగ రానివాఁడు. పైగా పశువులను కాచుటలో శ్రద్ధగలవాఁడు ఇట్టికోరిక కోరుట వారికి ఆశ్చర్యము కలిగించెను; కాని అది చాల మంచి కోరిక. 'అయితే ఈబాలుఁ డేమి చేయఁగలఁడు' అని వారికి సందేహము కలిగెను. మనము సాలగ్రామములను పూజించుట చూచి అనుకరణపరాయణత్వమువలన నీతఁ డిట్టి కోరిక కోరెను; కాని సాలగ్రామమాహాత్మ్యము వీని కేమి తెలియును? పూజయైనతరువాత వీడు సాలగ్రామమును ఒడిసెలలోవేసి పిట్టలను కొట్టుట కుపయోగించిన నేమి చేయవచ్చును? ఆపాపమునకు మనమే కదా కారకుల మగుదుము? దానిని మన మెట్లు పోఁగొట్టుకొనగలము?" అని వా రిట్లు చాల తడవు యోచించి, వాని భక్తిశ్రద్ధలను చెఱచుట కిష్టపడక పరిసరములయం దేరి ఒకగులకరాతిని తెచ్చి "ఇది నీకు తగిన సాలగ్రామము. దీనిని నీవు భక్తిశ్రద్ధలతో పూజింతువేని నీకు ఐశ్వర్యము కలుగును. జ్ఞానము, వైరాగ్యము, భక్తి కలిగి తన్మూలమున నీకు మోక్షమును సంభవించును" అని చెప్పిరి.

జ్ఞానహీనుఁ డగు ధనాజాటుఁడు ఆగులకరాయి సాలగ్రామమే అని నమ్మి దానిని గైకొని భాగవతులకు అనేకవందనము లాచరించి కొంత దవ్వునకుఁ బోయి కాళ్లు కడుగుకొని శుచిగల ప్రదేశమునఁ గూర్చుండి ఆయపూర్వసాలగ్రామమును మంత్రములు రాకపోయినను భాగవతులు చేసిన వరుసనే పూజించి, తనకై తెచ్చు కొనిన చలిదిఅన్నము మూట విప్పి అక్కడ నుంచి "శ్రీహరీ! భుజింపుము" అని ప్రార్థించెను. కాని యెంతసేపటికి నది యట్లే యుండెను. అందుకు సహింపలేక శ్రీహరీ! శాతుసాంతకా! భక్తపోషకా! నామీఁద అనుగ్రహ ముంపుము. నీవు దీనిని ఆరగించినఁగాని నే నిఁక అన్నము ముట్టను" అని శపథము పట్టి ధ్యాననిష్ఠుఁడై కూర్చుండెను.

ఒక గడియ కడచినది; కాని బాలుని ధ్యానము భంగము కాలేదు. పైఁగా శ్రీహరి దానిచే నాకర్షింపఁబడి గోపాలకృష్ణరూపముతో సాకారుఁడై సాక్షాత్క రించి బాలుఁడు నివేదించిన యన్నము నానందముతో భుజించి వానిని బుజ్జగించి తిరోహితుఁ డయ్యెను. అందుకు మిగుల నానందించుచు ఆబాలుఁడు భగవచ్ఛేషము కన్నుల కద్దుకొని భుజించెను.

అదిమొదలు ఆసెలయేటితీరమున ఆయపూర్వసాలగ్రామము నదే రీతిగా పూజించి తనకై తెచ్చికొనిన చద్దియన్నమును నివేదన చేసి ధ్యానించుటయు, శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి దాని నారగించుటయు, తచ్ఛేషమును ధనాజాటుఁడు భుజించుటయు ప్రతిదినమును జరుగుచుండెను.

ఇట్టి భగవత్పూజవలన, భగవత్సాహచర్యమువలన, చలింపని భక్తివలన ధనా జాటుఁడు గొప్ప తేజశ్శాలి యయ్యెను. అతని చరిత్రమును చూచి, అతనితేజస్సు వలన చకితులై యూరివా రందరు నాతనిని చాల ప్రేమించుచుండిరి.

ఒకనాఁడు ధనాజాటుఁడు తండ్రి యాజ్ఞచొప్పున పొలమున చల్లుటకు విత్తన ములు మూట కట్టుకొని వచ్చెను. పూజాదిక మైనది. ఇఁక విత్తనములు చల్లుటకు పోవలయు నని యతఁడు బయలుదేరఁగా ఆమార్గమున ఎక్కడికో పోవుచుండిన కొందఱు భాగవతులు క్షుధాతురులై తేజస్సువలన అతఁడు భక్తుఁ డని యెఱిగించి "బాలకా! మమ్ము ఆఁకలి దహించివేయుచున్నది. దయయుంచి మాకు అన్నము పెట్టెదవా?" అని యడిగిరి. దానిమీఁద ధనాజాటుఁడు "ఇప్పు డేమి చేయుదును? ఈవిత్తనములు తప్ప నావద్ద నిప్పు డేమియు లేదు. వీనిని పొలమున చల్లినచో సంవత్సరమునకు సరిపోవుధాన్యము పండును. అట్లు చేసిన ఈభాగవతుల కప చారమును చేసినవాఁడ నగుదును. వీనిని చల్లినచో పరిమితమగు ధాన్యరాశియే లభించును; కాని భాగవతాపచారమువలన అనంతపాపరాశి సంభవించును" అని

చింతించి తుదకు "ఏమయినను సరే. భాగవతోత్తములను సేవించెద" నని నిశ్చయించుకొని, "మహానుభావులారా! స్నానాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొని భగవంతుని సేవింపుఁడు. ఇంతలో నేను పదార్థములను తయారు చేసెద" నని విన్నవించెను. భాగవతు లందుల కానందించి అనుష్ఠానాదికము ముగించిరి. అప్పటికప్పుడే ధనాజాటుఁడు వంట ముగించి ఆపదార్థమును వారికి వడ్డించెను. బాలుని శ్రద్ధాసక్తులకును, భక్తిప్రపత్తులకును ఆశ్చర్యపడుచు, భాగవతోత్తములు కడుపునిండభుజించి తృప్తులై బాలుని దీవించి వెడలిపోయిరి. బాలుఁడును "నేడు బాధాపీడితులగు భాగవతోత్తముల నానందపెట్టఁ గలిగితినిగదా!" యని యానందించెను.

కాని యీసంగతి విని ఊరివారు "ఇదియేమి అవివేకము? పొలములో చల్లవలసిన విత్తనములను వండి సాధువులకు పెట్టితి వేమి? ఇప్పుడు ఆవిత్తనములనే వినియోగించుటవలన నలుగు రైదుగురు సాధువులు ఒక్క పూట మాత్రమే సుఖించిరి. వానిని చల్లినచో సంవత్సర మంతయు మీ రందరును సుఖముగా అనుభవించుటకు తగినంతధాన్యము వచ్చియుండును. ఇఁక నీకు విత్తనములు ఎట్లు వచ్చును? ఇఁక సంవత్సరమంతయు నెట్లు కడపెదవు?" అని తలొక విధముగ నిందించిరి; కాని ధనాజాటుఁ డందులకు భయపడక, విచారింపక, పైఁగా ఆనందించుచు "మన ప్రజ్ఞ చాల అల్పమైనది. సంపాదింపవలయు నని మన మెంత ప్రయత్నించినను ఒక్కొకపుడు దమ్మిడీయైన లభింపదు. ఒక్కొక్కపుడు ప్రయత్నము లేకపోయినను అనంతధనము లభించును. అనఁగా శ్రీహరి కరుణలేనిదే యేమియు జరుగదు. ఆసాధువులు ఆఁకట నకనక మాడిపోవుచుండిరి. వారిచెంత నేమియు లేకుండెను. ఎటు పోవుద మన్నను గ్రామము సమీపమున లేదయ్యెను. వారి ప్రాణములు నిలుచుట కప్పుడు నాచెంత నున్న విత్తనములకంటె వేరు ఆధార మేమియు లేకుండెను. అట్టి స్థితిలో నేను విత్తనములను వారికై వినియోగింపకుండిన నెంత పాపము నన్ను చుట్టికొనియుండును? పొలమున చల్లుటకు నా కిఁక విత్తనములు లేక పోవుట నిజమే; కాని చల్లఁబడిన విత్తనము లన్నియు నెక్కడను ఫలించుట లేదు. ఆహారపదార్థములను సంగ్రహించి యుంచుకొననంతమాత్రమున లోకమున నెవరును చచ్చిపోవుట లేదు. శ్రీహరి యీజీవకోటి నెట్లు సృష్టించెనో అట్లే పోషించును. మన ప్రయోజకత్వము ఇందేమియు లేదు" అని వారికి బదులు చెప్పెను.

ఇది విని వా రందరును చకితులై వెడలిపోయిరి. ధనాజాటుఁడు విత్తనములను గుఱించి విచారమే లేక యథాపూర్వముగ ఆయపూర్వసాలగ్రామమును పూజించుకొనుచుండెను; కాని భక్తప్రీతుఁడు శ్రీకృష్ణుఁడు ధనాజాటుని పొలమున

విత్తనములు చల్లెను. భగవంతుఁడు చల్లిన విత్తనము లగుటవలన పూర్వము కంటె ఆపొలమున పెక్కురెట్లధాన్యము ఫలించెను. అది చూచి ధనాజాటుని మందలించినవా రంపదును శ్రీహరియే దీనికి కారణ మని గ్రహించి ధనాజాటుని హరిభక్తికి, ఆతని యదృష్టమునకు ఆశ్చర్యచకితులై మహానందభరితులైరి.

భగవత్కృపకు బ్రహ్మానందపడుచు అపంట నంతను ధనాజాటుఁడు భాగవత కైంకర్యమునకే వినియోగించి "శ్రీహరీ! రుక్మిణీవల్లభా! ఆపద్బాంధవా! గజేంద్ర వరదా! నీవే నాకు దిక్కు" అని ప్రార్థించెను. అంతట శ్రీహరి దివ్యమంగళవిగ్రహ ముతో సాక్షాత్కరించి ధనాజాటున కభయ మిచ్చి తిరోహితుఁడయ్యెను.

ధనాజాటుఁ డదిమొదలు తనకుఁ గలదంతయు భాగవతారాధనమునందే వినియోగించుచు చిరకాలము భగవత్సేవ చేసి, అవసానమున ఈశ్వరసాయుజ్యము పడసెను.

---

# హరి అనంతవైష్ణవుఁడు

దక్షిణదేశమునం దొక పల్లెటూరిలో హరిఅనంతుఁ డను నొకవైష్ణవో త్తముఁ డుండెను. అతఁడు కుటుంబపోషణము విషయమున నేమియు శ్రద్ధచేయక, సదా శ్రీహరిని ధ్యాన, మనన, శ్రవణార్చనాదులతో సేవించుచు, భాగవతోత్త ములకు పరిచర్య చేయుచు, అహింసానిరతుఁడై దయాసత్యశౌచములు కలవాఁడై దంభవర్జితుఁడై నిర్లిప్తుఁడై అహంకారమమకారదూరుఁడై కాలము గడపుచుం డెను. ఇది యంతయు చూచి అతని సద్గుణములచే నాకర్షింపఁబడి గ్రామమునందలి జను లనేకులు అతని శిష్యులై పారమార్థికజ్ఞానము భక్తివైరాగ్యములు నలవఱచు కొనుచు అతనికి సేవ చేయుచుండిరి. వారిలో నొకశిష్యుఁడు గురుసేవలో నందరి కంటె నుత్తముఁడై యుండెను.

అతఁడు ప్రతిదినమును ఊరిలోనికిఁ బోయి ఇంటింటను బిచ్చ మెత్తి పిండి తెచ్చి ఆచార్యున కిచ్చుటయు, ఆచార్యుఁడు దానిని భాగవతోత్తములకై విని యోగించుటయు వ్రతముగా జరుగుచుండెను.

ఇట్లు కాలము గడచుచుండఁగా రామానందుఁ డను నొక ప్రఖ్యాతభక్తా గ్రేసరుఁ డొకనా డాగ్రామమునకు విచ్చేసెను. భిక్షాటనమునకుఁ బయలుదేరిన శిష్యుఁడు ఇది విని అతనిని బసవద్ద దర్శనము చేసి వినయవిధేయతలు, భక్తిప్రపత్తు లును పెనఁగొన నమస్కరించెను.

ఆరామానందుఁడు, అతని ప్రవృత్తి యంతయు విని "ఇతని గురుభక్తిప్రశంసాపాత్రముగా నున్నది; కాని రేపటితో ఇతనికి ఆయువు చెల్లిపోవుచున్నది. రేపీతఁడు తప్పక మరణింపఁగలఁ" డని చెప్పెను. దానిమీఁద శిష్యుఁడు రామానందునకు మఱియొకమారు నమస్కారము చేసి భిక్షానంతరము ఆచార్యుని సన్నిధికిపోయి పిండి అతనిపాదములచెంత నుంచి తాను వినిన సంగతి యంతయు నెఱిఁగించి "మహాత్మా! మీసేవ చేసి బ్రహ్మానంద మనుభవించుచున్నాను; కాని రామానందులవారు నా ఆయువు రేపటితో ముగిసిపోవునని సెల విచ్చినారు. మరణమునకై నేను విచారించుట లేదు; కాని దేవరవారి పాదపద్మములను సేవించి తరించుటకు నాకవకాశము లేకపోవుచున్నందులకు విచారించుచున్నాను. అయ్యో! నే నెంతదురదృష్టవంతుఁడ నైతిని" అని దుఃఖించెను.

అది విని ఆచార్యుఁడు "వత్సా! విచారింపకుము. "జాతస్యమరణం ధ్రువ" మ్మని పెద్దలు చెప్పెదరు. ఇంతేఁగాక "మరణం ప్రకృతి శ్శరీరిణాం వికృతి ర్జీవిత ముచ్యతే బుధైః" అనఁగా "ప్రాణికి మరణమే ప్రకృతి జీవితము వికృతియే" అని గూడ పెద్దలు చెప్పెదరు. అయితే సహస్రమాసజీవులుగూడ సహజమైన యీ మృతికి భీతిల్లుచున్నపుడు కేవలము పసివాఁడవగు నీవు బెంగపెట్టుకొనుటలో ఆశ్చర్యము లేదు. నీవిషయమున నింకొక విశేషముగూడ నున్నది. వయస్సున నీవు కేవలము నిండు యౌవనములో నున్నావు. నీ వయస్సువా రందరును ఐహికసుఖ సముద్రమునఁబడి ఓలలాడుచు ఆనందపరవశులై యున్నారు; కాని నీవు మాత్ర మట్టివాఁడవు గావు. ఐహికసుఖములయెడల నీ కెంతమాత్రమును ఆశ లేదు; కేవల పరమార్థచింతతో భగవద్భాగవతారాధనమున సుఖము పొందు నాసతో నీవు దీర్ఘాయువును గోరుచున్నావు. ఇంతకంటె మానవునకు గొప్పయోగ్యత మఱియొకటి లేదు. నేను చేయుచున్న భాగవతారాధనమునకు నా అసంఖ్యశిష్యులలో నీ వొక్కఁడవే ఆధారమవై యున్నావు. అనఁగా ఈభాగవతార్చనమునకు మూలము నీవు. నేను నిమిత్తమాత్రుఁడను. నీవు మృతినొందినచో అనేకభాగవతులకు ఆపద కలుగును. వారి భగవత్కైంకర్యమునకు గొప్ప ఆటంకము కలుగును. సర్వాంతర్యామి యగు శ్రీహరి యిది గమనింపఁడా? సకలజగత్కర్తయగు రుక్మిణీవల్లభుఁడు అకాలమున నొకదివ్యసాధనమును ఉపసంహరించుకొనునా? నీకేమియు విచారమక్కర లేదు. అధైర్య మక్కరలేదు. సకలమునకు సర్వేశ్వరునిమీఁద భారము వైచి నిశ్చింతుఁడవై నీవు నీవిధిని నెఱవేర్చుచుండుము. శ్రీహరి భక్తపరాధీనుఁడు. శ్రీహరియిచ్ఛ యెదుట బ్రహ్మాదిసకలనిలింపుల శక్తులును అణుమాత్రములు; కావున భగవద్ధ్యానపరాయణుఁడవై, స్థిరచిత్తుఁడవై యుండుము" అని బోధించెను.

శిష్యుడు ఆచార్యుని ప్రబోధమువలన స్థిరబుద్ధియై భగవద్ధ్యానమున ప్రవృత్తుడై మైమఱచియుండెను. మఱునాటి అరుణోదయమునందే ఆచార్యుడును స్నానాద్యనుష్ఠానములు ముగించుకొని శిష్యునిచెంతఁ గూర్చుండి శ్రీహరి పాద కమలములను తనహృదయాంబుజమున పదిలపఱచుకొని,—

శ్లో. యా శేఖరే శ్రుతిగిరాం హృది యోగభాజాం, పాదాంబుజే చ సులభా వ్రజసుందరీణాం,
సా కాపి సర్వజగతా మభిరామసీమా, కామాయ నో భవతు గోపకిశోరమూర్తిః”

ఉ. కోమలసుందరాకృతియుఁ గొప్ప కనుంగవ, కెంపుమోవియుం
మోమున వ్రేలు ముంగురులు నూత్నవిభూషణభూషితాంగ ము
ద్దామ దిగంబరాకృతియుఁ దాల్చిన వెన్నునిఁ జిన్నిబాలునిం
శ్రీ మెఱయం భజింతు నతసీసుమభాసుని నందసూనునిన్.

శ్లో. హస్తాంఘ్రినిక్వణితకంకణకింకిణీకం, మధ్యేనితంబ మవలంబితహేమసూత్రం
ముక్తాకలాపముకుళీకృతకాకపక్షం, వందామహే వ్రజచరం వసుదేవభాగ్యమ్.

శా. బృందారణ్యతరుప్రదేశముల గోబృందాంగణక్షోణులం
ఛందోవీథులఁ గానిపించు పరమస్వచ్ఛందమా తేజ మా
నందబ్రహ్మము వందనీయమురళీనాదానుమోదంబు నా
యందుం నిల్పెదఁ బింఛచూడము పయోజాక్షుంబు పేఘాభమున్.

శ్లో. గోధూళిధూసరితకోమలకుంతలాగ్రం, గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసం
గోపీజనస్య కుచకుంకుమముద్రితాంగం, గోవింద మిందువదనం శరణం భజామః.
(2 ఆ. 18, 19, 20, 21-26 వ కృష్ణకర్ణామృతము.)

అని ధ్యానించుచు కూర్చుండెను.

ఈధ్యాననిష్ఠకు ఆనందించి శ్రీహరి సపరివారముగ విజయము చేసి కట్టెదుట నిలువఁగా ఆచార్యుడు సాష్టాంగదండప్రణామము లొనరించి, వినీలనీరదశ్యామల మగు శ్రీహరి దివ్యమంగళవిగ్రహసౌందర్యమును గ్రోలుచుండఁగా శిష్యుని ప్రాణములు కొనిపోవుటకై యముఁడు పాశహస్తుఁడై స్వయముగ వచ్చెను; కాని సుదర్శనము శిష్యుని శిరస్సుమీఁద తిరుగుచుండుటవలన వీలులేక తెల్లపోయి నిలిచిపోయెను. అట్లాతఁడు చాలకాలము అవకాశమునకై నిరీక్షించియుండెను; కాని ప్రయోజనము లేకపోఁగా తుదకు ప్రాణములు తీయవలసినవేళ యతిక్రమించిపోవుటవలన ఆసమయమున తీయుట కధికారము లేనివాఁడై సిగ్గుపడి వచ్చిన దారినే వెడలిపోయెను.

ఇది యంతయు చూచుచుండిన శిష్యుడు పరమానందముతో లేచి ఆచార్యునకు పాదాభివందనము గావించి “స్వామీ! నాకు మరణశంక తొలఁగిపోయినది. నేను చనిపోవలసిన కాలము గతించి అప్పుడే నాల్గుజాములైనది” అని విన్నవించెను.

హరిధ్యానమున స్థిరచిత్తుఁడై యోగసమాధియం దుండుటవలన యీ సంగతి శిష్యుఁడు చెప్పునంతవనుక నెఱుఁగడు గాన ఆచార్యుఁడు వెంటనే లేచి బ్రహ్మానందముతో శిష్యుని కౌఁగిలించుకొని "మార్కండేయునివలె నీవును మృత్యుంజయుఁడవైతివి. హరిధ్యానమునందును, భాగవతారాధనమును నిష్ఠఁ గలిగి యింక నీ దీర్ఘాయువును వినియోగపఱుచుకొనుము" అని యాశీర్వదించెను.

మఱునాఁడు శిష్యుఁడు యథాప్రకారముగ భిక్షకు పోఁగా రామానందుఁడు చూచి ఆశ్చర్యచకితుఁడై యడుగఁగా శిష్యుఁడు అతనికి నమస్కరించి జరిగినదంతయు నెఱిఁగించెను. అది విని రామానందుఁడు ఆచార్యుని ప్రభావమునకు చకితుఁడై అతనిని దర్శించుటకు వెంటనే బయలుదేఱిపోయెను.

రామానందుఁడును, హరిఅనంతుఁడును ఒకరి కొకరు నమస్కరించుకొని ఆదరసత్కారములు చేసికొనినపిదప రామానందుఁడు "స్వామీ! ప్రభావము త్రిలోకములయందును లోభమును పుట్టించునదిగా నున్నది. శిష్యుని దీర్ఘాయుష్మంతునిగా చేయుటకు మీకే తగి యున్నది" అని యింక ననేకవిధముల కొనియాడెను. అందుకు ఆచార్యుఁడు "రామానందా! చక్రపాణియగు భగవంతుని కరుణాకటాక్షము తప్ప నిందు నాప్రజ్ఞ యేమున్నది?" అని ప్రత్యుత్తర మిచ్చెను.

తరువాత శ్రీహరి మఱియొకపుడు హరిఅనంతునకు సంపూర్ణలక్షణలక్షితుఁడై సాక్షాత్కరించి సేవ ప్రసాదించెను; కాని ఆచార్యుఁడు "ప్రభూ! నా యజ్ఞానమును పూర్తిగా తొలఁగించి కటాక్షింపుము" అని ప్రార్థించెను. శ్రీహరి అతని భక్తిప్రపత్తులకు, జ్ఞానవైరాగ్యములకు ఆనందించి కోరిన కోర్కెలిచ్చి తిరోహితుఁడయ్యెను.

తరువాత హరి అనంతుఁడు శిష్యవర్గముతో నెల్లపుడు హరినామసంకీర్తనము చేసి, అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

---

## మత్స్యేంద్రనాథుఁడు

ఒకనాఁడు శంకరుఁడు క్షీరసముద్రమున విహరించుచు తారకమంత్రమును పునశ్చరణచేయుచుండ పార్వతి "నాథా! తారకనామమాహాత్మ్యము నా కెఱిఁగింపుము." అని కోరెను. అపుడు శంకరుఁడు చెప్పెను.

"రాముఁడు దశరథుని జ్యేష్ఠపుత్రుఁడు. సంతానము లేక చిరకాలము వేచి యుండియు విసిగి తుదకు పుత్రకామేష్టి అను యజ్ఞము చేయఁగా దశరథునకు నలుగురు కుమారులు పుట్టిరి. రాముఁడు జ్యేష్ఠుఁడు. లక్ష్మణుఁడు రెండవవాఁడు. భరతుఁడు మూఁడవవాఁడు. శత్రుఘ్నుఁడు నాల్గవవాఁడు. రావణాదిదానవులను

సంహరించి లోకమును నిష్కంటకముగ చేయుటకై శ్రీహరియే దశరథునకు కౌసల్యా, సుమిత్ర, కైకేయి అనుముగ్గురుభార్యలయందును రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల నే నలుగురు రూపమున నవతరించెను. శ్రీహరి యవతారము లన్నియు లోకరక్షణార్థ మెత్తఁబడినవే. వానిలో శ్రీరామావతారము చాల గొప్పది. ఇందు సమస్త శుభలక్షణములును ఏకత్ర మిళితములై ఘనతను గలిగించినవి. రాజుల కంటెకును రామరాజ్యము ఆదర్శమైనది. ప్రజల కంటెకును రాముఁడు తమబిడ్డలకంటెను మిగుల నిష్టుఁడు. యోగులకు రాముఁడే దైవము. అట్టి శ్రీరామునినామము స్మరించువారికి పాపము లంటవు. మోక్షము కరతలామలకమగును. సర్వశక్తులును విజృంభించును. మనస్సు దుష్పథముల దెసఁ బోవఁజాలదు. నారదుఁడు వాల్మీకి మున్నగు మహర్షులు రామనామప్రభావము నెఱుఁగుదురు. వారికి శ్రీహరియొక్క సమష్టిత్వమునకంటె రామరూపము అగు ఈవ్యష్టిత్వమునందే అధికప్రీతి. జ్ఞానుల కంటెకును ఇదియే నిశ్చయము. ఇట్టి శ్రీరామతారకనామము అందఱికిని ధ్యేయమై యున్నది."

ఈమాటలు విని పార్వతి సంతోషించినది. ఇది యంతయు వారికి సమీపమున సంచరించుచుండిన గర్భవతి యగు నొకమహామీనముఁ గూడ ఆలకించెను. లీలావతీ గర్భమున నున్న ప్రహ్లాదుఁడు నారదోపదేశమును విని మహాభక్తుఁడైనట్లు మత్స్య గర్భమున నున్న శిశువు పరమశివుఁడుచేసిన యీతారకమంత్రోపదేశమును గ్రహించి అది మొదలు రామనామస్మరణము చేయసాగెను.

మఱికొన్ని దినములకు ఆమత్స్యము ప్రసవింపఁగా ఒక మానవశిశువు పుట్టెను. దైవసంకల్పమువలన ఆశిశువు మత్స్యేంద్రనాథుఁడను పేరుతో మన పుణ్య భూమికిఁ జేరుకొనియెను.

శ్రీహరి యనుగ్రహమున అతఁడు క్రమముగ పెఱిఁగి పెద్ద యయ్యెను; కాని తన శరీరము మత్స్యగంధము కల దగుటవలన మనుష్యులను దరియక నేను "అస్పృశ్యుఁడ" నని చెప్పుకొనుచు సంచరించుచుండెను. ఒకక్షణమైన అతఁడు రామస్మరణము మానుట యెఱుఁగఁడు. ఐహికసుఖవాసనల నతని నంటలేదు. అతఁ డెల్లప్పుడును భిక్షాటనమున జీవించుచు తీర్థక్షేత్రములనుసేవించుచు బ్రహ్మానందానుభవమున మైమఱచుచు నుండెను.

ఒకనాఁ డాతఁ డొకయూరిలో భిక్ష మడుగుకొనుచుండఁగా నొక గొప్ప వర్తకుని భార్య కాషాయాంబరములు, విభూతిపుండ్రములు, బ్రహ్మవర్చస్సు చూచి మహాత్ముఁ డని యెఱింగి అన్న మిడి "మహాత్మా! మాకు అపారమైన ధన మున్నది; కాని సంతానము లేకపోవుటవలన గృహము మాకు అరణ్యమువలె నున్నది.

కావున మాకు పుత్త్రుఁడు కలుగున ట్లనుగ్రహించి పుణ్యము కట్టుకొనుము” అని ప్రార్థించెను. అందుకు మత్స్యేంద్రనాథుఁడు వల్లె యని యొక చిటికెడు విభూతి నామె కిచ్చి “దీనిని భక్షింపుము. నీకు శ్రీహరివంటి కుమారుఁడు కలుగు” నని చెప్పి వెడలిపోయెను.

వర్తకపత్ని “ఏమో” అని సంశయించి ఆవిభూతిని భక్షింపక దాని సంగతి నొక చెలికత్తెతో చెప్పెను. అందు కామె “అయ్యో! బైరాగులను నమ్మరాదు. విభూతి అని చెప్పుచు మత్తు మం దిచ్చి వాండ్రు స్త్రీలను కొనిపోయెదరు” అని చెప్పెను. వర్తకపత్ని “నిజమే” అనుకొని దానిని పొయిలో పారఁబోసి యూర కుండెను.

పండ్రెండేళ్లకు మరల నాతఁ డాయూరు వచ్చి వర్తకుని యింటికిఁ బోయి ఆవర్తకపత్నిని బిలిచి “పండ్రెండు సంవత్సరములనాఁడు నేనిచ్చిన విభూతివలన నీకు కుమారుఁడు కలిగియుండును. వాని నొక సారి నాకు చూపుము” అని యడిగెను. ఈమాట విని యామె తెల్లవోయెను. అందుకు కారణ మాతఁడు గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁగా నామె జరిగిన దంతయు చెప్పి క్షమింప వేఁడుకొనియెను. మత్స్యేంద్రుఁడు పొయిలోని బూడిదె పోసిన చోటు అడిగి తెలిసికొని అక్కడికిఁ బోయి పెంటకుప్పపై నిలిచి “అస్పృశ్యుఁడా! ఏమిచేయుచుంటివి? లేచి రమ్ము” అని పిలిచెను. దానికి “గురూ! వచ్చుచున్నా” నని కుప్పనుండి ప్రత్యుత్తరము వచ్చెను. ఇది విని వర్తకపత్ని నిర్ఘాతపడి నౌకరులను దీసికొనివచ్చి పెంటకుప్ప తీయించి వేయఁగా అందు నుండి పండ్రెండేండ్ల బాలుఁడు లేచి వచ్చెను. బాలసూర్యునివలె ప్రకాశించుచున్న ఆబాలునిఁ జూచి అందరును ఆశ్చర్యచకితు లైరి.

అంతట మత్స్యేంద్రుఁడు వాని శిరమున చేయిడి భూగర్భమున పండ్రెండేండ్లు సురక్షితుఁడై యుండుటవలన గోరక్షకుఁ డని పేరు పెట్టి “రమ్ము” అని తీసి కొనిపోవుటకు బయలు దేరెను.

అది చూచి వర్తకుఁడును, అతని భార్యయు మత్స్యేంద్రుని పాదములమీఁద వ్రాలి “మహాత్మా! పెన్నిధిఁ గోల్పోయిన పేదవలె మేము నీయనుగ్రహమునుండి వంచితులమైపోతిమి. స్వయంకృతాపరాధమువలన మేము దుఃఖభాజనులమైతిమి; కావున మా తప్పు మన్నించి మాకు పుత్రభిక్ష దయచేయు” మని ప్రార్థించిరి. అక్కడ చేరియున్నవారు గూడ అట్లే ప్రార్థించిరి. “అందుకు మత్స్యేంద్రుఁడు కరుణార్ద్రహృదయుఁడై మీకు కుమారుఁడు కలుగును. విచారింపకుఁడు” అని ధైర్యముచెప్పి వెడలిపోయెను.

ఒకచో కూర్చుండియుండఁగా గోరక్షకుఁడు గురువు పాదములమీఁద వ్రాలి “నాకు తారకమంత్రము నుపదేశింపుము” అని ప్రార్థించెను. దానిమీఁద గురువు

శిష్యుని లేవనెత్తి "వత్సా! నాకు నీవు, నీకు నేను తప్ప మన కెవ్వరును లేరు. భగవంతుఁడే మనకు సర్వాధారమై యున్నాఁడు. మనకు సంసారమువలని భీతి లేదు. నీకిది మంత్రోపదేశసమయము కాదు. కొంచె మోపిక పట్టి వేచియుండుము. కాలము పరిపక్వ మైనపుడు నేనే నిన్ను పిలిచి మంత్రోపదేశము చేసెద" నని చెప్పి సమాధానపఱచెను. మరల ఇరువురును అక్కడినుండి బయలుదేరిపోయిరి.

వా రొకనాఁ డొక గ్రామము చెంత విడిసిరి. గురువు "వత్సా! ఊరిలోనికి పోయి భిక్షము తీసికొనిరమ్ము" అని చెప్పెను. వెంటనే శిష్యుఁడు గ్రామమునఁ బ్రవేశించి యింటింటికి తిరుగుచుండఁగా నొక యింట బ్రాహ్మణసమారాధనము జరుగుచుండెను. గోరక్షకుఁడు అక్కడికి పోయి భిక్ష మడిగెను! ఇంటి యజమానురాలు అతని తేజస్సున కలరి పిండివంటలతో అన్నము ఇచ్చి పంపివేసెను.

గోరక్షకుఁ డాపదార్థములను తెచ్చి ఈయఁగా మత్స్యేంద్రుఁడు భుజించి శేషము వాని కిచ్చి "వత్సా! నేఁడు నీవు తెచ్చిన భిక్ష చాల రుచిగా నున్నది. ఇఁక ముందు దినదినము నిట్టిదానినే తెమ్ము" అని చెప్పెను.

మఱునాఁడు గోరక్షకుఁడు గ్రామములోనికిఁ బోయి ఆ బ్రాహ్మణినే పిలిచి "అమ్మా! నిన్న నీవు పెట్టిన భోజనము చాల రుచిగా నున్న దని మాగురువుగారు చాల ఆనందముతో భుజించి నిన్ను నన్నును గూడ దీవించి నేఁడు నట్టి భిక్షనే తెమ్మని నన్ను పంపినారు. కావున నన్ను త్వరగా పంపుము. తల్లీ" అని ప్రార్థించెను. ఇది విని ఆమె తెల్లవోయి "ఇది యేమి అక్రమము? నిన్నటిదినము మాయింట సమారాధన మైనది; కావున పిండివంటలు చేసికొంటిమి. ప్రతిదినము న ట్లెవరు చేసికొనఁగలరు? నేఁడును అట్లె పెట్టుమనిన నే నేమి చేయఁగలను? సామాన్యభోజనమైనను ప్రతిదినమును పెట్టుటకు సంసారులకు కష్టముగా నుండునే" అని బదులు చెప్పెను; గాని గోరక్షకుఁ డది వినిపించుకోలేదు. ఇది యంతయు నారుచికోసమే యని నీవు తలంపకుము. నేను ఆకు నలము తినియైన నుండుదును. నాకు ప్రపంచమున కావలయు నను వస్తు వేదియు లేదు. కేవలము క్షుద్బాధ పోవుట కేమి దొరకినను చాలును. నాయాచార్యులు నిట్టివారే; కాని వారికి నిన్న నీవు పెట్టిన భక్ష్యములు ప్రలోభము కలిగించినవి. ఇఁక నొక్కసారి తినినచో వారు ఈరుచిని చంపుకొనఁగలరు. కావున నేఁడుగూడ అట్టి వానినే ఇమ్ము. లేకున్న నే నిక్కడనుండి కదలి పోవువాఁడను గాను" అని భీష్మించుకొని అతఁ డక్కడనే గూర్చుండెను.

గృహిణి కోపము వచ్చి లోపలకుఁ బోయెను; కాని గోరక్షకుఁడు వెడలి పోవునంత దనుక నామెశాంతి యెట్లుండును? అందుచేత నామె వాఁడు పోయెనో లేదో చూచుటకు రెండు మూఁడు సారు లివ్వలకు వచ్చెను. వచ్చినపుడెల్ల గోరక్ష

కుఁడు "తల్లీ! ఆలస్యము చేయకుము. నా యాచార్యుఁడు క్షుద్బాధవలన పీడింపఁబడుచున్నాఁడు. భిక్షము లేకుండ నేనాయన చెంతకు పోవుటకు వీలులేదు. నిన్నటి భిక్షమువంటిది కాకున్న ఆయన తాకరు" అని యడుగుచుండెను.

తుదకు గృహిణి కాగ్రహమువచ్చెను. "నీవంటి మొండివానికి నిన్న భిక్షము పెట్టుటయే నాది తప్పు. ఎఱిఁగియెఱిఁగి నేఁడు గూడ నెట్లు పెట్టెదను. నీవిక్కడ నుండి కదలకున్నను—తుదకు కన్ను పెఱికికొన్నను నీకు నేఁ డేమియు పెట్టను" అని ఆమె పలికెను. అందుమీఁద గోరక్షకుఁడు 'అమ్మా! మేము నీవంటి సతీ తిలకముల కరుణవలననే జీవింపవలసియున్నాము. నీకు కోపము వచ్చిన నేమి చేయఁగలము? కాని నే నిక్కడనుండి ఊరకే కదలిపోను. కావలసినచో నాకన్ను పెఱికి యిమ్మనినను ఇచ్చెదను' అని బదులు చెప్పఁగా 'వీఁడు కన్ను ఎట్లు ఇచ్చును? కన్ను అడిగినచో మాఱు పలుకకుండ వెడలిపోఁగలఁడు' అని తలఁచి ఆమె 'అట్లయిన నీకన్నొకటి పెఱికి యిమ్ము' అని కోపముతో నడిగెను. అంత గోరక్షకుఁడు "తల్లీ! పుచ్చుకొనుము. నాయాచార్యునకు నామీఁద ఆగ్రహము రాకుండఁజేసిన నా కదియే చాలును. నాయాచార్యుని కోరిక నెఱవేర్పఁగలిగినచో నేనును నీవును గూడ ధన్యతఁ గాంతుము" అని పలుకుచు వెంటనే కన్నొకటి పెఱికి నిశ్చింతతో ఆమె చేతఁ బెట్టెను.

ఆసాహసమున కామె మిగుల ఆశ్చర్యపడి, గోరక్షకుని వికృతాననము గాంచి నిర్విణ్ణయై "ఇది తెలిసినచో రాజేమి చేయునో?" అని మిగుల భయపడుచు ఇఁక చేయునదిలేక వెంటనే గోరక్షకుఁడు కోరిన పదార్థములు వండి యిచ్చి పంపి వేసెను.

గోరక్షకుఁడు తన కంటిని వస్త్రముతో కప్పికొని భిక్షము గురువు ముందు ఉంచెను; కాని ఆచార్యుఁడు గోరక్షకుని మోము చూచి "నీకంటి కేమి యాపద కలిగినది?" అని యడిగెను. ఇఁక దాఁచుటవలన ప్రయోజనములేదని తలఁచి గోరక్షకుఁ డప్పుడు జరిగిన దంతయు చెప్పివైచెను. మత్స్యేంద్రుఁడు శిష్యుని భక్తికి మిగుల నానందించెను. అప్పు డాతఁడు 'వత్సా! భిక్షకై ఆమె కొక కన్నిచ్చితివి. రెండవకన్ను నా కిచ్చెదవా?' అని యడిగెను. అందుకు గోరక్షకుఁడు మాఱు పలుకకుండ రెండవకంటిని పెఱికి గురువుపాదముల చెంత నుంచి నమస్కరించెను.

మత్స్యేంద్రనాథుఁడు ఈభక్తికి చకితుఁ డయ్యెను. అంతట నాతఁడు గోరక్షకుని కౌఁగిలించుకొని "వత్సా! నీగురుభక్తి అలోకసామాన్యముగా నున్నది. ఇంతటి త్యాగమును నే నిదివర కెందును చూచి యెఱుఁగను. ఎవరును చెప్పఁగా నైనను వినియు నుండలేదు" అని మిగుల కొనియాడి వెంటనే అతనికి తారకమంత్రము

నుపదేశించి 'నీవే సచ్ఛిష్యుఁడవు. నీకు ఈయరాని దేమియు లేదు. ఈమంత్రమును నాకు పరమశివుఁ డుపదేశించెను. నేను నీ కుపదేశించితిని భద్రము' అని చెప్పి అతని మోము తడవెను.

వెంటనే గోరక్షకునకు మరల కన్నులు వచ్చెను. ఇరువురును ఆనందించిరి.

పిదప బ్రతికియున్నంతకాలము గోరక్షకుఁడు గురుపూజచేసి తరించెను. మత్స్యేంద్రనాథుఁడు అనేకులకు జ్ఞానభక్తివైరాగ్యములు గలిగించి తారకమంత్రము నుపదేశించి అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

---

# రసికకుమారుఁడు

రసికకుమారుఁ డను నొకభాగవతోత్తముఁడు సంసారమున నుండియు నిర పేక్షుఁడై భగవన్నామస్మరణము చేయుచు పరమానందము ననుభవించుచుండెను. అతని కనేకశిష్యు లుండిరి.

రసికకుమారుఁ డనుదినమును భాగవతుల పాదోదకమును స్వీకరించుట వ్రతముగా నడచుకొనుచుండెను. అది లేనినా డతఁడు పస్తుండవలసినదే. ఇంతవరకు నతఁ డెప్పుడు నట్టి యభావమును జూచి యెఱుఁగడు; కాని యొకనా డతఁడు భాగవతుల సన్నిధికి పోకుండ నేదో యొక అడ్డంకి యేర్పడెను.

అందు కాతఁడు మిగుల కటకటఁబడి యొక శిష్యునిఁ బిలిచి "నేడు భక్తుల పాదోదకము తెచ్చికొనుట కవకాశము లేకుండ నున్నది. కావున నీవు పోయి తెచ్చి పెట్టుము" అని చెప్పెను.

శిష్యుఁడు గుర్వాజ్ఞ శిరసా ధరించి పోయి భాగవతపాదోదకము తెచ్చి యిచ్చెను. అందుకు రసికకుమారుఁ డానందించి శిష్యుని భక్తికి మెచ్చుకొని ఆయుదకమును పుచ్చుకొనియెను; గాని యది ప్రతిదినము నున్నట్లు మధురముగానుండక చప్పఁగా నుండెను. అందుకు రసికకుమారుఁడు గడగడవడఁకుచు "నేఁ డేదో నావలన అపరాధము జరిగినది. లేకున్న ఇట్టిది సంభవింపదు. భాగవతపాదోదకము మధురముగా నుండనిచో నిఁక మధురపదార్థమే లోకమున మఱియొకటి యుండఁజాలదు" అని నిశ్చయించుకొని దానిని తెచ్చిన శిష్యునిఁ జూచి "ఏమి చెప్పుటకును తోఁచుట లేదు. శర్కరకంటెను, తేనెకంటెను, మధురముగా నుండవలసిన— ప్రతిదినము నట్లుండుచుండిన భాగవతుల శ్రీపాదతీర్థము నే డేలకో చప్పఁగా నున్నది. నా యపరాధ మిందు హెచ్చుగా నుండవలయును; కాని నీ వేమయిన అశుచిగా నుండి తెచ్చితివా? భాగవతుల కేదయిన అప్రియము చేసితివా? మనసా! వాచా! కర్మణా!

శ్రీహరి కే మైన ఎగ్గు చేసితివా?” అని యడిగెను. అందులకు శిష్యుఁడు “స్వామీ! తమ యాజ్ఞ చొప్పున నే నెప్పుడును మడిగనే యుందును. అపరిశుభ్రత నావద్ద నెప్పుడు నుండఁజాలదు. నేను భాగవతుల యెడల నపరాధమును జేయలేదు. శ్రీహరి కరుణ తప్పెడి పనియు చేయలేదు. నావలన ఏదోషమును కానఁబడదు. అట్లని దోషము మీా దని చెప్పఁజాలను. నే నేమియు నెఱుఁగను” అని విన్నవించెను.

దానిమీాఁద రసికకుమారుఁ డనేకవిధముల నాలోచించెను. శిష్యుఁడు చిత్తశుద్ధిఁ గలవాఁ డగుట, భక్తుఁ డగుట నతఁ డెఱుఁగును. ఇఁక దోషము తనయందే యుండవలయును. అయిన నది యెట్టిది? అతఁడు తన దినచర్య నంతను పరీక్షించి చూచుకొనియెను; కాని ఏమియు దోషము తట్టలేదు. తుదకు ఒక సందేహము తోఁచి “వత్సా! నీకు భగవద్భక్తు లెక్కఁడ కాన్పించిరి? వాస్తవముగా భగవద్భక్తులగువారి శ్రీపాదతీర్థము లభించుట కష్టము. నీ వెట్లు తెచ్చితివి?” అని యడిగెను. అందుకు శిష్యుఁడు “గురుదేవా! తమ యానచొప్పున నేను వెదకికొనుచుఁ బోఁగా కొందఱు మహాత్ములు కాన్పించిరి. అందొకరు కుష్ఠువ్యాధిచే బాధపడుచుండిరి; ఆకారణమువలన వారిని విడిచి తక్కినవారిని ప్రార్థించి తీర్థము తెచ్చితి” నని బదులు చెప్పెను.

“తప్పు ఇదే” అని రసికకుమారుఁడు పెద్ద నిట్టూర్పువిడిచెను. “వత్సా! ఎంత యపరాధము చేసితివి! భగవంతునియెడ నెట్టి దోషము చేసితివి! కారణ మిప్పుడు తెలిసినదా? నీకు పాదోదక మిచ్చిన భాగవతులు మహాత్ములే; కాని ఆయొక్క భాగవతోత్తముని నీవు తృణీకరించుటచే తక్కిన వారి ప్రభావముఁ గూడ నిస్సారమై పోయినది. ఇట్లు ఇది వారియెడలఁ గూడ అపరాధమైనది. భాగవతులకు జాతిమత భేదములు లేవు. స్త్రీ పురుష భేదములేదు. పిన్న పెద్ద తారతమ్యము లేదు. వ్యాధి, ఆరోగ్యము ఇట్టి అవస్థాభేదములును లేవు. భగవద్భక్తిగలుఁడున్నఁడా? ఇఁక చతుష్పాత్తుఁ గూడ పూజ్యమే. లేదా బ్రాహ్మణుఁడును నీచుఁడే. ఎన్నికకు యోగ్యత యిది గాని మఱియొకటి కాదు. శ్రీకృష్ణపరమాత్మ కుబ్జసేవ నంగీకరించెను. విదురునియింట విందు కుడిచెను. శ్రీరామచంద్రమూర్తి శబరియెంగిలి అమృతతుల్యముగా భావించి స్వీకరించెను. అంతటివా రట్లు చేసినప్పుడు మన మిట్టిపరీక్షలు చేయుట, ఇట్టి భేదములు చూపుట, ఇట్టి అకార్యములు ఆచరించుట—ఇంతకంటె భగవదపచార మేమున్నది. ఎంతపనిజరిగినది. నాకు భాగవతశ్రీపాదతీర్థమా లభించినది కాదు. నీకు మహాపాతకమా చుట్టుకొనినది. అక్కటా! ఎట్టి దారుణసంఘటనము. దీని నెన్ని జన్మములెత్తి మనము పరిహరించుకొనఁగలము.ఇఁక విచారించుటవలన ప్రయోజనములేదు. పోయి ఆమహాత్మునిపాదములమీాఁద వ్రాలి క్షమాప్రార్థనముఁగావించి పరిశుద్ధుల మైపత్తము

రమ్ము” అనిచెప్పి బయలుదేరెను. ఇది విని శిష్యుఁడు వజ్రోపహతుఁడైనట్లు మిగుల దుఃఖించి ముందుః ఆచార్యుని పాదములమీఁద వ్రాలి క్షమాభిక్షఁ బడసి తరువాత వెంట బయలుదేరెను.

యుక్తసమయమున వారు భాగవతుల చెంతఁ జేరిరి. వెంటనే యిరువురును ఆభాగవతోత్తమునకు ప్రదక్షిణనమస్కారము లాచరించి పాదములమీఁద వ్రాలి “మహాత్మా! మావలన ఘోరాపరాధ మైనది; మేము కేవలము రాక్షసకృత్యము గావించితిమి. కన్నులు మూసికొనిపోయినవానివలె సదసద్వివేకము లేకుండ ప్రవర్తించితిమి; కాని యిది బుద్ధిపూర్వకము కాదు. అయినను దాసులము; గావున కటాక్షించి మమ్ము రక్షింపుము. పుత్రవాత్సల్యము చూపి దేవరపాదతీర్థము దయ చేసి అనుగ్రహింపుము” అని ప్రార్థించెను. అందుల కాభక్తుఁడు మారు నమస్కారము లాచరించి “మహాత్మా! ఇది నీ శిష్యుని దోషము కాదు. జన్మజన్మములలో చేసికొనిన పాపము నన్నిట్లుపీడించుచున్నది. శ్రీహరి కింకను నాయెడల కృపరాలేదనుట కిదియే తార్కాణము. నేను భగవంతుని ప్రీతిపాత్రులలోఁ గాక భక్తులలోఁ గూడ చేరుట కర్హుఁడను గాను. నాపాపముల తీర్థము మీ కిచ్చుటకంతెను నాకు అధర్మము లేదు” అని వినయముగా పలికెను.

కాని రసికకుమారుఁ డందుల కంగీకరింపక అంతటితో నూఱకుండక మరల పాదాభివందనము గావించి అనేకవిధముల ప్రార్థించెను. తక్కిన భక్తులు గూడ “ఇమ్ము. లేకున్న ఆమహాత్మునకు వ్రతభంగ మగు” నని చెప్పిరి. అంతట ఆతఁడు చేయునదిలేక అంగీకరింపఁగా రసికకుమారుఁడు వెంటనే పరమభక్తితో నతని పాదములు కడిగి దానిని శిరమున చల్లుకొని ఆప్యాయనముగ పుచ్చుకొని అది మిగుల మధురమైయుండుట చూచి “మహాత్మా! నీవు శ్రీహరి యాంతరంగికభక్తుఁడవు గాని సామాన్యుఁడవు కావు” అని ప్రదక్షిణనమస్కారములాచరించి అనేక విధముల కొనియాడెను. శిష్యుఁడును ఆతీర్థమును శిరమున ప్రోక్షించుకొని పుచ్చుకొని, దాని మాధుర్యమున కాశ్చర్యచకితుఁడై “మహాత్మా! నీయనుగ్రహమువలన తరించితిని” అని కొనియాడెను.

ఇది యంతయు చూచుచున్న జనులందరును, భగవద్భక్తియందలి శ్రేష్ఠతను భాగవతుల మాహాత్మ్యమును, కుష్ఠవ్యాధిపీడితుఁడై యున్న భాగవతుని భక్తిని, రసికకుమారుని పరిశీలనాశక్తిని గుర్తించి ఆశ్చర్యచకితులై ఆభాగవతుల నందఱిని పూజించి, వారి ఆశీర్వచనములును, సెలవును బడసి వెడలిపోయిరి.

రసికకుమారుని గురు వగు దయార్ణవస్వామిని పూర్వపు రాజు భగవద్భాగవతారాధనలో వినియోగ మగుటకు మంచి యాదాయము నిచ్చు భూమ

సతి నిచ్చి సత్కరించెను; కాని క్రొత్తగా సింహాసన మెక్కిన రాజు మదమాత్సర్య దూషితుఁడే గాక పరమనాస్తికుఁడు నగుటవలన అభూవసతిని సంస్థానమునఁ గలిపి కొనియెను. అందుకు కటకటంబడి ఏయార్జవస్వామి శిష్యుని పిలిపించి మొన్నటివరకు నవిచ్ఛిన్నముగా జరుగుచుండిన భగవద్భాగవత కైంకర్యము నిలిచిపోయినది; కావున నీవు పోయి రాజు మనసు త్రిప్పి ఆమాన్యము మఱల మనకు భుక్తమగునట్లు చేయుము" అని యాజ్ఞాపించెను. అంతట రసికకుమారుఁడు గుర్వాజ్ఞను శిరసా వహించి శిష్యులతోఁ గూడ రాజధాని కరిగి తన రాక శిష్యునిద్వారా రాజున కెఱిఁగించి సమావేశము నీయఁగోరెను. రాజసభయం దున్నవా రంపరును రసికకుమారుని భక్తిప్రపత్తులను, ప్రభావమును అనేకవిధములఁ గొనియాడి "మన యదృష్టము వలన ఆమహానుభావుఁ డిక్కడికి దయచేసియున్నాఁడు. వెంటనే దర్శనము ఇప్పింపుఁడు" అని రాజుతో చెప్పిరి. అందులకు కుటిలబుద్ధి యగు రాజు "రేపు దర్శన" మని చెప్పి శిష్యుని పంపివేసి, గజాధ్యక్షుని రావించి "మదించిన యేనుఁగుతో రేపు హాజారమున సిద్ధముగా నుండి రసికకుమారుఁడు వచ్చిన వెంటనే దానిని వానిమీఁదికి విడువుము" అని యేకాంతమున ఆజ్ఞాపించెను.

ఇది యేమియు నెఱుఁగని రసికకుమారుఁడు మఱునాఁడు భోజనానంతరము శిష్యులును, పౌరు లనేకులును వెంటరాఁగా రాజసభకు బయలుదేరెను. అదివరకే అక్కడ చేరి యున్న గజాధ్యక్షుఁడు రసికకుమారుఁడు సింహద్వారము దాఁటివచ్చి నంతనే తలుపులు వేయించి యేనుఁగును కవ్వించి విడిచిపెట్టెను. నడగొండవలె కళ్లు మూసికొని మీఁదికి వచ్చుచున్న ఆయేనుఁగును జూచి ప్రజ లందరును, తుదకు రసికకుమారుని శిష్యులుఁ గూడ పరుఁగుపరుఁగున బోయి ప్రాణములు తక్కించు కొనుటకు గోడల కెగఁబ్రాకిరి; కాని రసికకుమారుఁ డించుకయు చలింపకపోవుటయేఁ గాక వారి నందఱిని సంబోధించి "అయ్యో! మీా రక్లేల పారిపోయెదరు? ఇప్పుడు వచ్చిన యుపద్రవ మేమి యున్నది? పరిమిత మగు మన శరీరమునందును, అపరిమితమగు నీ యేనుఁగు శరీరమునందును గూడ ఒకటే యాత్మ వెలుఁగొందుచున్నది. ఇక్కడ నుపాధిభేదము తప్ప మఱియేమియు లేదు. అట్టిచో మన కీ భయ మేల?" అని చెప్పి ఏనుఁగున కెదురుగాఁ బోయి మందహాసము చేయుచు నిలిచెను.

అంతట భూమి గ్రక్కదల ప్రళయాగ్నివలె వచ్చుచుండిన ఆయేనుఁగు రసికకుమారుని చూచినంతనే శాంతమై, సమీపించినంతనే వినమ్రమై నమస్కరించి, బాష్పధారతో అతని పాదములు గడిగెను. అది చూచి రసికకుమారుఁడు దాని శిరమున చేయిడి, తన మెడలోని తులసిహారమును దీసి దాని మెడలోవైచి, చెవిలో తారకమంత్రమును నుపదేశించి శరీరము నివిరి విడిచెను.

దీనితో ఆమదగజము పరమభక్తాగ్రేసరమై, శ్రీహరిని ధ్యానించుచు రసిక కుమారుని వెంటఁబయలుదేరెను. ఇది చూచి గజాధ్యక్షుఁడు తెల్లపోయెను. ప్రజలందరును ఆశ్చర్యచకితులైరి. రాజు మిగుల భయభ్రాంతుఁడై పశ్చాత్తప్తుఁడై వడివడిగ వచ్చి రసికకుమారుని పాదముల మీఁద వ్రాలి రక్షింపఁ బ్రార్థించి "మీగురువుగారి మాన్యము నిప్పుడే మరల నిచ్చివేయుచున్నా" నని మనవి చేసి ఆయేనుఁగును రసికకుమారునికిచ్చి అత్యాదరముతో సాగనంపెను.

ఆయేనుఁగును అదిమొదలు తక్కిన శిష్యులవలెనే రసికకుమారుని భక్తిప్రపత్తులతో పూజించి ఆనందించుచుండెను. అది ఆచార్యునియొక్కయు తచ్ఛిష్యులయొక్కయు సామానుల నెక్కడికి పోవలసిన నక్కడికి మోసికొనిపోవుచు నిట్లు అనేకవిధముల నుపచరించుచుండెను.

ఒకనాఁడు రసికకుమారుఁడు శిష్యులతోఁగూడ యాత్రకు బయలుఁదేరెను. వారి వస్తువులను మూపున వహించి ఏనుఁగుఁ గూడ వెంటనే పోవుచుండెను. ఒక యరణ్యమునఁ బోవుచుండఁగా కొందఱు చోరులు వచ్చి వారిని నడ్డగించిరి. అప్పుడు ఏనుఁగు తొల్లిటి సౌమ్యము నంతను మఱచిపోయినదో యనునట్లు ప్రళయరుద్రాకారము దాల్చి ఆచోరులలో ననేకులను కాళ్లతో త్రొక్కియు, తొండముతో నెత్తికొట్టియు భీభత్సపఱచెను. అనేకులు మడిసిరి. దాని యాథార్థ్యమును చూచిన వెంటనే పాఱిపోయినవారే బ్రతికిరి.

పిదప రసికకుమారుఁడు నిరాఘాటముగ అనేకతీర్థయాత్రలు గావించి తుదకు కురుక్షేత్రము చేరెను. కాని అక్కడి రాజు రసికకుమారు నాదరించి సత్కరించుటకు బదులు ఆయేనుఁగు సర్వలక్షణసంపన్నమైయుండుటఁ గాంచి కోరినంత వెల యిచ్చెద ననియు, దానిని తన కీయవలయు ననియు భటులచే నడిగించెను. అందుకు రసికకుమారుఁడు "ఇది యేవిధమునను మమ్ము విడిచి పోదు. విడిచి యుండఁజాలదు. మాతోఁబాటిదియు భగవద్భాగవతకైంకర్యము చేయుచు బ్రహ్మానందానుభవముఁ గాంచుచున్నది. దీనికి విఘాతము కలిగింపనేలచూచెదవు? ఏనుఁగులకు నీకు కొదువా? దీనిని విడిచిపెట్టుము. దీనినుండి మనస్సు మఱలించుకొమ్ము." అని బదులు చెప్పఁగా రాజు చతురులగు కొందఱు భటులకు "హరిభక్తవేషములతోఁబోయి దానితో స్నేహము చేసి తీసికొనిరం" డని నియమించెను.

వారట్లే బయలుదేరిరి. కొలఁదిదినములయందే ఆయేనుఁగు వారికి మచ్చికపడెను. ఈమువూర్తము కొఱకే చూచుచున్న రాజభటులు వెంటనే దానినిఁ గొనిపోయి గజశాలలో చేర్చిరి. రాజు చాల ప్రీతుఁడై వారికిఁ గొప్ప గొప్ప బహుమానము లిచ్చెను.

తెల్లవారిన పిదప చూడఁగా ఏనుఁగు కాన్పింపదు. అందుకు రసికకుమారుఁడు భ్రాంతుఁడై సంగతి యంతయు నూహించి "రాజునకు దుర్బుద్ధి పుట్టినది. ఇది యతని పనియే. క్రొత్తగా మనతో చేరిన హరిభక్తులు వంచకు లనీ, వారు రాజభటులు అనీ

నిశ్చయమే. రాజు దుర్బుద్ధియై ఎడఁబాటు లేని మనకును ఏనుఁగునకును దుఃఖము తెచ్చి పెట్టినాఁడు ; కాని మీ రిపుఁ డేమియు చేయవలదు. అంతకును శ్రీహరియే కలఁడు" అని శిష్యులకు హితోపదేశము చేసెను. ఇంతేఁగాక రసికకుమారుఁడును, శిష్యులును గూడ ఏనుఁగు లేకపోవుటచే మందు తినినవారివలె నైపోయిరి.

రాజు తెల్లవారిన వెంటనే గజశాలకుఁబోయి కోరుకొనిన యేనుఁగు అశ్రమముగ—ధనవ్యయము లేకుండ లభించినందుకు మిగుల నానందించెను. కాని అతఁడు అంతఃపురమునకు పోయిన వెంటనే అది మేత మేయుట లేదని భటులుపోయి అతని కెఱిఁగించిరి. పైఁగా రాజునకును శూల ప్రారంభమై చాల, బాధింపసాగెను.

గజమునకును, రాజునకును గూడ చికిత్స జరిగినది; గాని ప్రయోజనము కలుగ లేదు. అది చూచి మంత్రి "భాగవతాపచారమువలననే యిట్టిదిసంభవించె" నని రాజును మందలించెను. తక్కినవారు నిట్లే తలఁచిరి. చికిత్సకులుగూడ "నిదియే కారణ మనీ" "దానిని వారి కిచ్చివేయుటయే చికిత్స" అని తెలిపిరి. అంతట రాజు ఈయపరాధమువలన ఈబాధలే కలుగుటయే గాక తనకు రాజ్యము, తనఆలుబిడ్డలు గూడ నశించిపోవచ్చునని గ్రహించి భయభ్రాంతుఁడై వెంటనే పాదచారియై యేనుఁగుతోఁ గూడ పోయి రసికకుమారుని పాదములమీఁద వ్రాలెను. ఏనుఁగు ఆచార్యుఁడు కాన్పించిన వెంటనే మోకారించి దుఃఖింపసాగెను.

అది చూచి ఆచార్యుఁడు ఏనుఁగును కౌఁగిలించుకొని కన్నుల నీరురాగా సమాళించుకొని దానిని సమాశ్వాసించెను. శిష్యులు గూడ చుట్టును జేరి మేను నిమిరి వివిధోపచారవాక్యములతో సమాశ్వాసించి వెంటనే మేత పెట్టి నీళ్లు త్రాగించిరి.

రసికకుమారుఁడు రాజు చేసిన అపరాధమును మఱచి పోయి అతనిని తన శిష్యవర్గమున జేర్చుకొని జ్ఞానబోధ మంత్రోపదేశము చేసెను. రాజును ఆచార్యుని, శిష్యవర్గమును అనేకవిధముల పూజించి, సత్కరించి వారి యనుమతి పడసి నగరమునకుఁ బోయెను.

పిదప ఆయేనుఁగు చిరకాలము రసికకుమారుని సేవించి, అవసానము సమీపింపఁగా గంగయందు దురికి భౌతికదేహమును విడిచి వైకుంఠమునకుఁ బోయెను. రసికకుమారుఁడును బ్రతికియున్నంతకాలము భగవద్భాగవతకైంకర్యము గావించి అనేకులకు తరణోపాయము నుపదేశించి, అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

శా. లా వొక్కింతయుఁ లేదు; ధైర్యము విలోలం బయ్యెఁ; బ్రాణంబు లా
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

# మృత్యుంజయుఁడు

పూర్వము శాంతబ్రహ్మణి యను నొక రాజు బిసరి యనుపట్టణము పరిపాలించుచుండెను. అతఁడు సర్వకాలసర్వావస్థలయందును మధురపదార్థములు భుజించుచు, ద్రాక్షారసము మున్నగు వాటిని త్రావుచు, అందకత్తెలగు అనేక యువతులతో క్రీడించుచు—ఇట్లు రాజకార్యములనుగూడ సరిగ చూచుట మానివైచి విషయసుఖములయందే నిమగ్నుఁడై యుండెను.

ఒకనాఁడు సాయంత్రము అతఁడు అంతఃపురమున మేడమీఁద స్త్రీలతో విహరించుచుండెను. అందరునుగూడ మధురఫలములను భక్షించుచు పండ్లచర్మములను క్రిందికి పారవేయుచుండిరి

ఇట్లుండఁగా నొక సాధువు రక్షకభటుల నేమరించి ఆ మేడక్రిందకుఁ బోయి ఆచర్మముల నేరికొని తినసాగెను. కొంతసేపటి కొక రాజస్త్రీ క్రిందికి చూచి సాధువు పండ్లచర్మములు తినుచుండుట గమనించి ఆసంగతి రాజున కెఱిఁగించెను.

అంతట రాజు భటులను రావించి "అంతఃపురసమీపమున సంచరించుచున్న నేరమునకు ఆమూర్ఖుని చితుకఁగొట్టుఁ" డని ఆజ్ఞాపించెను. అది విని రక్షకభటులు గడగడ వడఁకుచుండఁగా పైనుండి భటులు వచ్చి దయ యనుమాటనుగూడ మఱచిపోయి దుడ్డుకఱ్ఱలతో ఆసాధువును మర్దింపసాగిరి.

పదుగురు రక్కసులవంటి రాజభటులు మర్దించుచున్నను ఆసాధువు బాధ లేక నవ్వసాగెను. ఎంతసేపు కొట్టినను అతఁడట్లే నవ్వుచున్నందుకు భటులాశ్చర్యపడి సంగతి యంతయు రాజున కెఱిఁగించిరి. అది విని రాజును మఱింత యాశ్చర్యపడి స్త్రీలతోఁగూడ క్రిందికి వచ్చి "ఏల నవ్వెదవు? దెబ్బలవలన బాధ కలుగుటలేదా?" అని యడిగెను.

అందుకు సాధువు మఱింత నవ్వుచు ఇట్లు చెప్పెను. "రాజా! నీభటులు కొట్టుచుండుట నిజమే; గాని అవి శరీరమునకు తగులుచున్నవి; కాని నాకు బాధ కలుఁగుట లేదు. ఇంతకును నీ సంగతి యోచించుకొంటివా? పాఱవైచిన చర్మములను భుజించినంతమాత్రమున నాకీ దెబ్బలు తగులుచున్నవి. ఫలసారమునే మితిలేకుండ భుజించుచుండిన నీ కెట్టి దెబ్బలు కొట్టునో ఈశ్వరుఁడు? అంతఃపురమునకు బైట నున్నను నాకు శిక్ష సంప్రాప్తమైనది. లోపల నుండు నీకెట్టి శిక్ష కలుగునో! ఏకాకి నగు నన్ను నీ విట్లు బాధించిన స్త్రీసహస్రపరివృతుఁడ వగు నిన్ను దేవుఁ డెట్లు పీడించునో! ఎవని జోలికిని పోని నన్ను నీ విట్లుదండించుచుంటివి. పరహా

ధులను మర్దించు నీ కెట్టి శిక్ష కలదో? ఇంద్రియనిగ్రహము చేసిన నన్ను ఇట్లు కష్టపెట్టుచు ఇంద్రియదాసుఁడవై యున్న నీకు ఎట్టి యిక్కట్టులు కలుగునో? ఈ సంగతి నీ వేమయిన యోచించుకొంటివా? నాకు నేఁడు శిక్ష యైన నీకు రేపు శిక్ష. ఇంతే భేదము ; గాని అంతటి అహంకారమమకారములు గల నీ వెట్లు బాధ సహింపఁగలవు? రాజ్యాధిపత్యమును చూచుకొని గర్వించుచు నీవిట్లు చేయుచుంటివి. సర్వేశ్వరుఁడు నీ కెట్టి పాట్లు పెట్టునో యెఱుఁగుదువా? నన్ను శిక్షించుట మానిపింపకుము. నా కేమియు నాక్షేపణలు లేవు ; గావున నీ పాపమును పూర్తి చేసికొనుము.

ఇది వినఁగానే రాజునకు మెఱుపుదెబ్బ తగిలిన ట్లయ్యెను. వెంటనే యతఁడు "అయ్యో! ఐహికము లే స్థిరము లనీ, ఇవియే కల వనీ నమ్మి చెడితిని. దయాశౌచములు లేక ఎన్నో దుష్కృతములు చేసితిని గాని యీవిషయ మింతవరకును నాకు తోఁచనే లేదు. నే నెంతటి పాపిని! ఈపాప మెట్లు పోవును?" అని వగచుచు సాధువు పాదములమీఁద వ్రాలి "మహాత్మా! అజ్ఞానమువలన అకార్యములు చేసితిని. నా గత జీవిత మంతయు కలుషపూర్ణమే. దానిని తలఁచికొనిన ఒడలు జలదరించుచున్నది. కావున దయయుంచి నాయపరాధములు మఱచిపోయి నన్ను క్షమింపుము. మఱిన్ని నాకు తరుణోపాయము నెఱిఁగింపుము" అని ప్రార్థించెను.

అందుకు సాధువు అలరి అతని నాదరముతో లేవనెత్తి "రాజా! గతమునకు వగవకుము. పశ్చాత్తాపాగ్ని యందు సకలకలుషములును భస్మమైపోవును. ఇఁక భవిష్యత్తుననే నీవు జాగ్రత్తఁగా నుండవలయును. నీయందును, నాయందును, చీమయందు, చెట్టునందు—అంతటను ఈశ్వరుఁడు నిండియున్నాఁడు. కావున ఏ ప్రాణి నాయాసపెట్టినను ఈశ్వరునకే ఆయాసము కలుగుచున్నది. ఇఁక నీవు దయా సత్యశౌచములు గలిగి అహింసాపరుఁడవై, భాగవతారాధనము గావించుచు శ్రీహరినే నమ్మి యుండుము. ఐహికసుఖములు ఆభాసములు. నరకప్రదములు. కావున సంగవర్జితుఁడవై విరాగివై శ్రీహరిని సేవింపుము" అని చెప్పి యథేచ్ఛఁగా వెడలిపోయెను.

పిదప రాజు జ్ఞానవంతుఁడై సతులను, సుతులను, భోగములను, ధనమును, రాజ్యమును—సకలమును త్యజించి అరణ్యమునకుఁ బోయి కందమూలాదులు మాత్రమే భుజించుచు నొకవివిక్తప్రదేశము వసించెను.

ఒకప్పుడు కొందఱుభక్తులు హరినామస్మరణము చేయుచు, ఆడుచు, పాడుచు ఆమార్గమున పోవుచుండిరి. అది చూచి రాజు వారిని దరిసి సాష్టాంగ వందనము లాచరించి "మహాత్ములారా! మీ రెక్కడకు బోవుచున్నా రని యడి

గెను. అందుకు వారు పాండురంగని సేవించుటకై పండరిపురమునకు పోవుచున్నా"మని చెప్పఁగా రాజు "మహానుభావులారా! పాండురంగని సేవించుటకు నేనును ఉత్సుకుఁడనై యున్నాను. నన్నుఁ గూడ మీవెంటఁ గొనిపొండు" అని ప్రార్థించి వారితో బయలుదేఱిపోయెను.

పండరిపురము చేరి రాజు చంద్రభాగానదియందు స్నానమాడి శ్రీహరిస్మరణము చేయుచు ఆలయమునకుఁ బోయి భక్తుల నుద్ధరించుటకై రుక్మిణితోఁగూడ కటిహస్తుఁడై యిటుకరాతిమీఁద నిలిచియున్న పాండురంగని పాదములకు తన శిరమును మోపి

శ్లో. నిఖిలాగమమూళిలాలితం పదకమలం పరమస్య తేజసః,
ప్రజభువి బహుమన్మహేతరాం పరసకరీమవిశేవదూషితమ్.

అని ధ్యానించి "శ్రీహరీ! అవివ్యాహతుఁడనై యున్న నాకు జ్ఞానముకలిగించి రక్షించితివి. నీ నిర్హేతుకజాయమానకటాక్షమునకు బ్రహ్మానందము మగుచున్నది. నేనింతవరకును కుపథమునందే యుంటిని; అయిన సాధువు ద్వారా నీవు నన్ను కాపాడితివి. ఇఁక ముందుఁగూడ నారక్షణమును గుఱించి నీచేభారము" అని ప్రార్థించి గోపురద్వారమునకు వచ్చి అక్కడ కూర్చుండి మూఁడహోరాత్రములు నిద్రాహారములు విడిచి శ్రీహరిని గుఱించి తపస్సు చేసెను. అంతట మూఁడవనాటి రాత్రి పాండురంగఁడతని స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! నీ భక్తికిమెచ్చితిని. నీవు కోరిన చొప్పున నీరక్షణమున నేనే శ్రద్ధ పూని యుండెద. కల్యాణపురమున సహజానందస్వామి యను నొకమహాత్ముఁ డున్నాఁడు. నీవు పోయి అతనిశిష్యుఁడవై మంత్రోపదేశముఁ బడసి తరింపుము" అని చెప్పి వివేకసింధు వనునొకగ్రంథము నతనిచేతనుంచి తిరోహితుఁడయ్యెను. వెంటనే రాజు మేల్కాంచి వివేకసింధువు తన చేతిలో నుండుటఁ గాంచి అచ్చెరువుపడి "అద్యమే సఫలం జన్మ భవత్పాదాబ్జదర్శనాత్" అని యనేకవిధముల స్తోత్రము చేసి ఆగ్రంథమును మననము చేయుచు నుండఁగా నతని భాగ్యవశమున కల్యాణపురమున నున్న సహజానందస్వామి పాండురంగని సేవించుటకు పండరిపురమునకే వచ్చెను.

ఈవార్త విని రాజు పరమానందభరితుఁడై యుక్తసమయమున సహజానందస్వామిని దర్శించి పాండురంగని ఆదేశము నెఱింగించి "నన్ను పాలింపు"మని ప్రార్థించెను. అది విని స్వామియు పాండురంగనికి తనమీఁదఁ గల వాత్సల్యమునకు బ్రహ్మానందపడి యథావిధిగా రాజునకు శ్రీరామతారకమంత్రము నుపదేశించి మృత్యుంజయుఁ డని పేరుపెట్టి కల్యాణపురమునకు వెడలిపోయెను.

పిదప రాజు నారాయణపుర మనుగ్రామమునకుఁ బోయి అక్కడ వసించి వివేకసింధువు నెల్లప్పుడును పఠించుచు హరిపూజాపరాయణుఁడై యుండెను.

నారాయణపుర మంతయు జంగములతో నిండియుండెను. వారందరును శివ భక్తులు. అయినను ఒకరితో సంబంధములేనివాఁడు కావున మృత్యుంజయుఁడు తన కుటీరమునందే హరిస్మరణ చేసికొనుచు నుండెను. అయితే కొలఁదిదినములయందే భవరాయజంగ మను జంగము మృత్యుంజయుని ప్రభావము నెఱిఁగి, అతని నాశ్రయించి జ్ఞానోపదేశముఁ బడసి ఈశ్వరస్మరణము చేసికొనుచుండెను.

ఆపురమున హంసుఁ డను మఱియొక జంగము ఉండెను. అతఁడు జంగములలో నెల్ల విద్యాధికుఁడు. జ్ఞానాధికుఁడు. మఱియు వారి కందఱికిని నేత. అతనికిఁ భవరాయని స్థితి వెంటనే తెలిసెను. తోడనే యతఁడు చాల కోపపడి భవరాయని తనవద్దకు రప్పించుకొని "అతఁడు జ్ఞానవంతుఁడే కావచ్చును; గాని మన జాతివాఁడు కాఁడు. మన మతమునకు సంబంధించినవాఁడు కాఁడు. అతనివలన నీ వేల జ్ఞానోపదేశముఁ బడసితివి ? అతని నేల ఆచార్యునిగా వరించితివి ? ఈవిధముగా నీవు కుల ద్రోహము, మతద్రోహము చేసితివి; గావున నిన్ను వెలిపెట్టినాను" అని చెప్పి జంగముల నందఱను రావించి యిది యంతయు చెప్పి "అతనితో మీరు సంబంధము పెట్టుకొనరాదు". అని శాసించెను.

అందుకు భవరాయఁడు గడగడ వడఁకుచు పోయి సంగతి యంతయు మృత్యుంజయున కెఱిఁగించెను. మృత్యుంజయుఁడు "శోకింపకుము. ఈశపభిష లన్నియు శ్రీహరిభక్తుల నేమియు పీడింపఁజాలవు. దూషణభూషణము లాత్మకు సంబంధించినవి కావు. ఆత్మకు స్వయంకృతాపరాధములే గాని పరాపాదితదుఃఖము లుండవు. జాతి, మతము, దేశము, పాత్ర ఇవన్నియు ఐహికములు. మోక్షప్రాప్తికివి అవశ్యకములు కావు. పైఁగా ప్రతిబంధకములును; గావున ఎవరో వెలిపెట్టిరని భీతిల్లవలదు. దుఃఖింపవలదు. ఒకనిని వెలిపెట్టుట రాక్షసకృత్యము. ఒకఁడు వెలివేసెనని దుఃఖించుట అజ్ఞానము. ఆత్మ నాశము పొందునది గాదు. నిత్యము. అది బంధింపఁబడునది గాదు. స్వచ్ఛందము. నీకు బహిష్కారము చెప్పినవారు సంకుచితచిత్తులు. నీహృదయము విశాలము. కావున దుఃఖింపకుము" అని ధైర్యము చెప్పెను.

ఇది యిట్లుండ—ఆదేశమును కాశీపతి యను రాజు పాలించుచుండెను. అతఁడు ధర్మాత్ముఁడు. శివభక్తుఁడు. జంగమార్చనాపరతంత్రుఁడు. అతఁడు ప్రతిదినమును పదివేల జంగములకు అన్నదానము చేయుచుండును. అతఁడు జంగము లందరును భవరాయని వెలిపెట్టినదినమునఁ గూడ యథాపూర్వముగ అన్నదానము చేసెను. పదివేలజంగములును వచ్చి కూర్చుండిరి. సకలపదార్థములును వడ్డించుట పూర్తి యాయెను.

అపుడు రాజు "మహాత్మా వేద్యము చేయవచ్చు" నని చెప్పెను. అందరును చేతులకు కట్టుకొని యుండిన గుడ్డలు విప్పఁగా అందుండవలసిన లింగములు కాన్పింపలేదు. దానిమీఁద అందరును పెద్దగోల చేసిరి. తుద కిది రాజునకు తెలిసినది. అతఁడును తెల్లవోయెను.

అందరును కలిసి యాలోచించిరి. కాని కారణము గాని, ఉపాయముగాని తోఁచలేదు. తుదకు రాజు "జంగమోత్తములారా! మీరు భవరాయని విషయమున చాల క్రూరముగా ప్రవర్తించినారు. దానివలన ఆగ్రహము వచ్చి మీరందరును భవరాయని బహిష్కరించినట్లే మిమ్ము పరమశివుఁడును బహిష్కరించి యుండవచ్చును. మృత్యుంజయుఁడు పరమయోగి. అది తెలియక మీరు తామసము చూపినారు. ఇప్పుడైనను మించిపోయినది లేదు. మన మందరమును పోయి ఆమహాత్ముని ప్రార్థింతము. దాన నంతయు శుభముగా పరిణమింపఁగలదు." అని చెప్పెను.

దాని కందరును సమ్మతించి రాజు వెంట మృత్యుంజయుని చెంతకుఁ బోయిరి. మృత్యుంజయుఁడు స్వయముగను, జంగము పక్షమునను క్షమింపవేడెను. అపుడు మృత్యుంజయుఁడు "రాజా! నావద్ద వేదాంతి, సిద్ధాంతి అని రెండు శ్వానములు గలవు. అవి ఈజంగమోత్తము లారాధించు లింగములను కబళించియుండవచ్చును. వాటిని అడిగి ఉన్నచో ఇప్పించెదను" అని చెప్పి శ్వానములను పిలిచి "మీ రీజంగముల లింగములను కబళించినట్లు తోఁచుచున్నది. అట్లేల చేసితిరి? వెంటనే వాటిని వారి కిచ్చివేయుఁడు" అని ఆజ్ఞాపించెను.

వెంటనే స్వామి ఆజ్ఞ చొప్పున శ్వానములు శివలింగములను కక్కివేసినవి. అందుకు అందరు నాశ్చర్యపడిరి. అపుడు రాజు "మహాత్మా! జంగములు పదివేలున్నారు. లింగములు పదివే లున్నవి. ఇందేది యెవరిదో యెవరికిని తెలియుట లేదు; కావున మీరే ఆవిభాగము చేసి ఎవరివి వారికి దయచేయుఁడు" అని కోరెను. స్వామి పరమేశ్వరుని ధ్యానించెను. వెంటనే ఎవరి లింగములు వారి చేతులలో కాన్పించెను. అందు మృత్యుంజయునిఅనేకవిధముల కొనియాడి "జయపరమేశ్వరా!" యని ఉఱుములవలె జయధ్వానములు చేయుచు మృత్యుంజయునకు ప్రదక్షిణనమస్కారము లాచరించి వెడలిపోయిరి.

పిదప హంసుఁడు "మృత్యుంజయుఁడు సాక్షాత్తుఁగ పరమశివావతార మనుటకు సందియము లేదు. సదానందస్వామి ఆయనకు మృత్యుంజయుఁ డని పేరు పెట్టుట చాల యుక్తముగనున్నది. భవరాయఁడు స్వామిని గురువుగా స్వీకరించుటలోఁ గూడ చాల వివేకము ఉన్నది. గాని మన మీపరమార్థమును గ్రహింపఁజాలక అజ్ఞానలవ దుర్విదగ్ధులమై అతనిని వెలిపెట్టితిమి; గావున పోయి క్షమింపవేడి పూజించి

మనలో కలుపుకొందము రండు" అని చెప్పుచు జంగముల నందఱిని తోడుకొనిపోయి భవరాయనికి క్షమార్పణము చెప్పి ఆదరించి అతనిని గురువుగా కులదైవముగా పూజించిరి.

మృత్యుంజయుఁ డిట్లు బ్రతికియున్నంతకాలము అనేకులకు మోక్షమార్గము చూపి అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

శ్లో. విరాజమానోజ్జ్వల పీతవాసనం విశాలవక్షస్థలకౌస్తుభశ్రియం,
భజే కిరీటాంగదరత్నకుండలం నమ స్థలస్యా వనమాలయాంకితమ్.

(2 ఆ. 17 రామకర్ణామృతము.)

## సేనానాపితుఁడు

అవంతిపురమున సేనానాపితుఁ డను నాతఁడు నివసించియుండెను. అతఁడు కులమున మంగలి. కులవృత్తియే యాతఁడు చేసికొనుచుండెను; గాని సదా పాండు రంగని సేవించుచుండెను. ఇతరులకు క్షౌరము చేయుటవలన వచ్చిన ధనముతో నాతఁడు కుటుంబపోషణము చేసికొనుచు, ద్రవ్యార్జనము నిమిత్తము కాని పను లేమియు చేయక కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్స ర్యము నను అరిషడ్వర్గమును జయించి శమము, దమము, తపము, శౌచము, సత్యము, దయ మున్నగు సద్గుణములు కలిగి నిర్లిప్తుఁడై నిరహంకారుఁడై నిష్క్రియుఁడై బ్రహ్మానందము ననుభవించుచుండెను.

అతఁడు అరుణోదయముననే లేచి స్నానమాడి ధౌతవస్త్రములు దాల్చి, పుండ్ర ధారణము గావించి శ్రవణమననధ్యానావాహనాదులతో పాండురంగని పూజించి భగవత్ప్రసాదమును కన్నుల నద్దుకొని స్వీకరించిగాని బైటకు ఎప్పుడును పోకుండెను. ఇట్లు నీచకులమునఁ బుట్టినను, నీచభావప్రేరితుల నడుమనే నివసించుచుండినను అతఁ డెప్పుడును నీచోద్దేశములు కలనైన పెట్టుకొనక ఉదారుఁడై, దంభవర్జితుఁడై, మిత భాషియై, మితాహారియై, సౌమ్యుఁడై, వినీతుఁడై యుండుచు తనవారిచే ఆదరింపఁ బడుచు సంసారమునందే యుండినను తామరాకునందలి నీటిబొట్టువలె కేవలము నిమిత్తమాత్రుఁడై సంచరించుచుండెను.

ఇట్లు ఆతఁడు వృత్తిసందర్భమున నితరులతో పని గలిగియున్నను ఎవరితోడను ఐహికసంబంధములు పెట్టుకొనియుండకపోయినను, అందరు నాతని నాదరించుచుండి నను ఒక్కఁడు మాత్రమే అతనిని ద్వేషించుచుండెను. వాఁడు అతనికి జ్ఞాతి. ఈ ద్వేషమునకు సేనానాపితుని సద్గుణములే కారణము లయ్యెను. జ్ఞాతి అతని పద్ధతు లను చూచి ఈర్ష్య చెంది కేవలము చూపోపమివలన మాత్రమే ద్వేషమును ప్రక

టించుచుండెను. అయినను ఆజ్ఞాతియెడల సేనానాపితుఁ డెట్టి వైరమును బూనక, ఈసంగతియే గమనింపక తన వృత్తిలో తా నుండుచు వచ్చెను.

ఒకనాఁడు ఆతఁడు స్నానాద్యనుష్ఠానములు ముగించుకొని ఏకాంతమున గూర్చుండి పాండురంగని పూజించుకొనుచుండెను. ఈసమయమున ఆపట్టణము నేలు నవాబునకు క్షౌరము చేయుట కాతనిని పిలుచుకొనిపోవుటకై కొందరు రాజభటులు వచ్చిరి. జ్ఞాతి సేనానాపితుని పూజాసమయము నెఱిఁగినవాఁ డగుటవలన రాజభటులు రా గానే ఇప్పుడు తన ద్వేషము తీర్చుకొనుటకు తగిన సందర్భము రావచ్చు నని పనికి పోక వీథియరుగుమీఁద కూర్చుండియుండెను.

రాజభటులు సేనానాపితుని పిలచిరి. కేకవేసిరి; గాని ఆతఁడు భక్తిపరవశుఁడై యుండెను. ఈపిలుపు, ఈకేకలు అతని కేమియు వినఁబడుట లేదు. కొంతసేపయిన తరువాత స్త్రీలు వచ్చి ఆతఁ డింట లేఁడని చెప్పిరి. ఒకని తరువాత నొకని చొప్పున ఇట్లు అనేకభటులు వచ్చిరి. కాని అందరికి నిదియే ప్రత్యుత్తరము. అంతట వా రందరును వెడలిపోయి సేనానాపితుఁ డింటలేఁడని నవాబుతో చెప్పిరి.

జ్ఞాతి వెంటనే దర్బారుకు వెళ్లి "ప్రభూ! నా మనవి చిత్తగింపవలెను. సేనానాపితునకు దేవరవా రనిన భయభక్తులు లేవు. ఆతనికి మీ మాటయనిన లక్ష్యమే లేదు. అతఁ డిపు డింటనే యున్నాడు; గాని లేఁడని చెప్పించుచున్నాఁడు" అని వంగివంగి సలాములు చేయుచు చెప్పెను.

ఇది విని నవాబుమండిపడి, "వాఁడు కళ్లు మూసికొనిపోయి యున్నాఁడు. వెంటనే వాని కాలుసేతులు విరిచికట్టి సముద్రమున బడవైచిరండు" అని భటుల కాజ్ఞాపించెను. భటులు బయలుదేరిరి.

సరిగ నీసమయమున సేనానాపితుఁడు రాజసన్నిధికి వచ్చి మోకరించి నిలిచి "తమ సెలవుచొప్పున వచ్చియున్నా" నని మనవి చేసెను. అతని ముఖమునఁ గల విలక్షణ తేజము చూడఁగనే నవాబున కాగ్రహము పోయెను. భటులుగూడ నిలిచి పోయిరి.

నవాబు క్రూరమైన ఆజ్ఞ యిచ్చుటవలన రాజభటులు తన యంతరంగభక్తుని మిగుల బాధించి సముద్రమునఁ బడవేయుదు రని అనుకంపాపరాయణుఁడై పాండురంగఁడే స్వగృహమున ధ్యాననిష్ఠుఁడై యున్న సేనానాపితుని ధ్యానము భంగము కాఁగూడ దని అతని వేషముతో రాజసన్నిధికి వచ్చెను. ఆశ్రితవత్సలుఁడును, భక్తక్రీతుఁడు నగు పాండురంగఁడు క్షౌరము చేయుట అధములు చేయు నీచవృత్తి యైనను ప్రియురాలికి సకలసేవలును చేయు కాముకునివలె, శిశువు లాలామూత్ర పురీషాదులను శుద్ధి చేయుటకు ఏవగించుకొనని మాతృశ్రీవలె పొదిని చేబూని మంగలియై వచ్చెను.

ఇది యేమియు నెఱుంగని నవాబు క్షౌరమునకు కూర్చుండెను. సేవకులు జలము మున్నగునవి తెచ్చియిచ్చిరి. అంత పాండురంగఁడు యుక్తపద్ధతులతో పని ప్రారంభించెను.

పాండురంగఁడు ముఖమున హస్తము ఉంచుటతోడనే కత్తితో తాఁకిన తోడనే నవాబునకు హృదయము జల్లుమనియెను. క్రొత్త యనుభవ మేదో కలుగు చున్నట్టు తోఁచెను. హృదయమున ఏదో యొకభావము గుబగుబలాడ దొడఁగెను.

ఇంతవఱకును సేనానాపితుఁడే అనుదినమును నవాబునకు క్షౌరము చేయు చుండెను; గాని యెప్పుడును అతని చేతు లింత మృదువుగను, కత్తి యింత మెత్త గను, క్షౌరము ఇంత సుఖావహముగను తోఁచలేదు. పాండురంగఁడు క్షౌరము చేయుచున్నంతసేపును నవాబునకు పట్టమహిషి స్వయముగ వచ్చి ముఖసంస్కారము చేయుచున్నంత ఆనందముగా నుండెను.

క్షౌరము పూర్తి యైనది. సేవకులు సుగంధతైలమును స్వర్ణపాత్రమున తెచ్చి ఉంచిరి. అప్పుడు పాండురంగఁడు ఆతైలము రాచి నవాబునకు కేశసంస్కారము చేయసాగెను. ఈసందర్భమున కారణములేకయే నవాబు తైలపాత్ర దెసకు చూచెను. చూడఁగా పాండురంగఁడు సేనానాపితుని సంపూర్ణస్వరూపముతోడనే కేశసంస్కారము చేయుచుండినను తైలపాత్రలో శంఖచక్రములతోఁడను, అరవిందయుగళముతోడను, చతుర్భుజములతోఁడను, వనమాలతోడను, శార్ఙ్గముల తోడను, శ్రీవత్సలాంఛనముతోడను, కౌస్తుభమణితోడను, వక్షస్థలమున శ్రీ మహాలక్ష్మితోడను, నీలదేహముతోడను, పీతాంబరముతోడను—ఇట్లు సమస్త లక్షణములతోడను, వరదాభయహస్తుఁడై మందస్మితసుందరవదనారవిందుఁడై కాన్పించెను.

ప్రభువు మహమ్మదీయుఁడైనను హిందూసాంప్రదాయములు, హిందూపురాణములు వినియుండుటవలన ఆరూపమును చూచి చకితుఁడై శ్రీహరి సాక్షాత్కారమువలన పవిత్రజీవితుఁడై, బ్రహ్మానందపరవశుఁడై, నిశ్చలుఁడై పోయెను.

పాండురంగఁడు పని నిలిపిన తరువాత సేవకులు వచ్చి స్నానమునకు దయ చేయవచ్చునని మనవిచేయు నంతవరకును నవాబునకు బాహ్యస్మృతి కలుగలేదు. అప్పు డాతఁడు లేచి నిలిచి సేనానాపితుని చూచి “నీయందు నే దేదో క్రొత్త మార్పు కనఁబడుచున్నది. నాహృదయము నిన్ను విడువఁజాలకున్నది. క్షణ మైన నీ యెడఁబాటు నేను సహింపఁజాలను. నేను స్నానమునకుఁ బోయెదను; గావున నీవును ఇంటికిఁ బోయి నాభోజన మగునప్పటికి భుజించి వెంటనే రమ్ము” అని యాజ్ఞాపించి దోసెడు వరాలు పాండురంగని యొడిలో పోసెను.

అందుకు చిత్త మని పాండురంగఁడు సెలవు గైకొని సేనానాపితుని యింటికి అదృశ్యుఁడై యరిగి వరాలు అతని పొడిలో పోసి వెడలిపోయెను. అప్పటికిఁ గూడ సేనానాపితుఁడు ధ్యాననిష్ఠుఁడై బాహ్యప్రపంచము నెఱుఁగకయే యుండెను.

కొంతసేపటికి ఆతఁడు ప్రకృతిస్థుఁడై యివ్వలకు రాఁగా నవాబు కబురు పంపినసంగతి తెలిసెను. అందు కాతఁడు "అయ్యో! నవాబు న న్నేమి చేయునో? తనమాట కెదురాడిన వారిని, తనపిలుపున కాలస్యము చేసినవారిని, తనయాజ్ఞను నెఱవేర్పని వారిని అతఁడు క్రూరముగా దండించును. నామీఁదనెవ రేమి చాడీలు చెప్పెదరో? నాకై వచ్చిన రాజభటు లేమి చెప్పెదరో?" అని కొంత తడవు భీతిల్లి, తుదకు "భయ మేల? ఈకాయము నిరపాయము కాదుగదా! రాజదండన యీపాంచభౌతికదేహమునకే కాని ఆత్మకు లేదుగదా! అట్టిచో నపరాధము చేసినవానివలె నే నేల యిట్లు భీతిల్లవలయును? రాజాజ్ఞ నే నెఱుఁగను. బుద్ధిపూర్వకముగ తిరస్కరించి యెఱుఁగను. అట్లని నేను వ్యసనములలో చిక్కియుండలేదు. నాకును, ఈనవాబునకు, ఈసకలప్రపంచమునకు నెవఁడు మహాప్రభువో ఆతనిని నా హృదయమున నిలిపికొనియున్న తఱి జరిగిన ఆలస్యమునకు నా కేల దండన కలుగును. అయినను వెళ్లెదను. ఏ మయినను సంతోషమే" అని నిశ్చయించుకొని

ఉ. కాంచుట యెన్నఁ డీక్షణసుఖంబుగ దొంగలిఱెప్పలున్ బనా
యించిన వింటివంటి బొమ లింపగు మాటలు కెంపు మోవిఁ బొం
దించిన పిల్లఁగ్రోవిఁ బలికించు హళాహళియున్ దయోన్నతిన్
మించిన బెళ్కుఁజూపుఁ గల మిక్కిలి చక్కని ముద్దుబాలకున్?

శా. ఆకారుణ్యకటాక్షవీక్షణము లాయందంపు లేఁబ్రాయ మా
యాకారద్యుతి యా దరస్మితము తీ రా మోము చక్కందనం
బా కెంజాయపదంబు లానడల యొయ్యారంబు లే వేల్పులం
దే కాలంబున లేదు లే దనుచు నే నెందేనిఁ జాటించెదన్.

(౧. ఆ. 54. 55 ప. కృష్ణకర్ణామృతము.)

అని శ్రీహరిని స్మరించుచు రాజసభకు వెడలిపోయెను.

నవాబువలన వినయముతో పునరాగమననిమిత్తము ప్రార్థింపఁబడుట, దోసెడువరాలు కానుకఁ బొందుట—ఇట్టి వన్నియు మాత్రమే యెఱింగియున్న రాజభటులు మునుపటివలెఁ గాక దారి యిచ్చిరి. ఉద్యోగులు ఆదరవచనము లాడిరి; కాని యిందు కేమియు కారణము ఎఱుంగక వినయముతో నవాబు ఎదటికి రాఁగానే వంగి సలాము చేసి సేనానాపితుఁ డెదుట నిలిచెను. అది చూచి నవాబు తనట్లాలు

అతని చేయి పట్టుకొని "మహానుభావా! నే నింతవఱకును నీప్రభావము నెఱుఁగక నీవలన సేవలు గొంటిని. నా యజ్ఞానమును మన్నించి నన్ను క్షమింపుము. నీవు నాకు క్షౌరము చేసినపుడు తైలమున చూపిన నీదివ్యమంగళవిగ్రహము ఇప్పటికిని నాస్మృతిపథమున అంకిత మైయే యున్నది. దానిని నే నెప్పుడును మఱువఁజాలను; కాని దానిని మరల చూడవలయునని యుత్కంఠగా నున్నది. కావున దయయుంచి మరియొకమారు చూపు" మని పరిపరి విధముల ప్రార్థించి సేవకులతో చెప్పి స్వర్ణ పాత్రమున సుగంధతైలము తెప్పించెను.

ఇది యేమియు నెఱుఁగని సేనానాపితుఁడు నవాబు మాటల కర్థము తెలియక తెల్లవోయెను. అప్పుడు నవాబు అతని చేయి పట్టుకొని తీసికొనిపోయి తైలముచెంత నిలిపి చూచెను; గాని మునుపటివలె ఆదివ్యమంగళవిగ్రహము కానరాకపోఁగా నిరాశుఁ డయ్యెను.

విచారణ చేయఁగా సేనానాపితునకును, నవాబునకును గూడ తత్త్వము బోధ పడియెను. సేనానాపితుఁడు పొది చూచుకొనఁగా అందు దోసెడు వరాలుండెను. అందుల కాతఁడు వింతపడి "శ్రీహరీ! దయానిధీ! రుక్మిణీవల్లభా! భక్తత్రాణపరా యణా! ఆర్తరక్షకా! దీనబంధూ! నీచుఁడనగు నానిమిత్త మెట్టి సాహసము చేసి తివి! సకలజగత్తులచేతను సేవింపఁబడఁదగిన నీవు నాకై యొక మానవమాత్రు నేల సేవించితివి! నాయెడల నింత యనుగ్రహ మున్నపుడు స్మృతి కలిగించి నాచేతనే ఆపని యేల నెఱవేర్పింపవైతివి? శ్రీమన్నారాయణా! నన్నెంత పెద్దచేసితివి?" అని ఆక్రోశించుచు క్రిందపడి పరవశుఁడయ్యెను. అంతట నవాబును సంగతి యంతయు నూహించుకొని, సర్వేశ్వరుని యనుగ్రహమునకు కృతజ్ఞుఁడై, దీని కంతకును గారణమైయున్న సేనానాపితుని ప్రభావమున కాశ్చర్యపడి అతని చెంతఁగూర్చుండి యుపచారములు చేయసాగెను.

అది చూచి రాజభటులుగూడ మూఁగి అనేకవిధముల నుపచారములు చేసిరి. కొంతసేపటికి సేనానాపితుఁడు ప్రబుద్ధుఁడై "రాజా! నీవే యదృష్టవంతుఁడవు. నీ భాగ్యమే ప్రశంస చేయఁదగినది. నీ జన్మమే పరమపావన మైనది. అనంతబ్రహ్మాండ ములవలనను సేవింపఁబడు శ్రీహరి నీకు నేడు స్వయముగా సేవ చేసెను. మహర్షు లకు, మహాభక్తులకును గూడ ఎన్నివేలసంవత్సరములు ధ్యానించినను, ఎంత ప్రార్థించినను సేవ యొసంగని శ్రీహరి అయాచితముగ నీకు దర్శన మొసఁగి నీకు సేవ చేసెను" అని కొనియాడెను.

అది మొదలు సేనానాపితుఁడు సకలమును మానివేసి, శ్రీహరిధ్యానమునందే ప్రవృత్తుఁ డయ్యెను. నవాబు అతని పాదములు పట్టి ఉపదేశము పొంది అతని సెలవు చొప్పున వర్తింపసాగెను.

బ్రతికియున్నంతకాలము నిట్లే సేనానాపితుఁడు శ్రీహరిని సేవించుచు, అనేక మందిని సన్మార్గమునకు త్రిప్పి తారకమంత్రము నుపదేశించి పాపముక్తులను గావించి అవసానమున శ్రీహరి సాయుజ్యము బడసెను.

నవాబును బ్రతికియున్నంత కాలము సేనానాపితుని సేవించి తన రాజ్యము నందలి ప్రజల కందరికిని పాండురంగపూజ నిర్బంధము చేసి అవసానమున సాయుజ్య ముక్తిఁ బడసెను.

మ. "ప్రకటాజ్ఞానభవాంబురాశిబడబప్రాయం బభివ్యక్త మ
త్యకలంకంబు సలక్షణం బవనిజాతాయుక్తమవ్యక్తముక్
సకలవ్యాపకముక్ మహాప్రణవసుస్థానంబు రామాఖ్యతా
రకముక్ మామకదృష్టిగోచర మగుక్ బ్రాణప్రయాణంబునన్."

(2. ఆ. 111. ప. రామకర్ణామృతము.)

---

# రామరాజు

శ్లో. శత్రుచ్ఛేదైకమంత్రం సరసముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీరామమంత్రం జప జప సఫలం జన్మసాఫల్యమంత్రం.

రామరాజు ప్రజారంజకముగ పరిపాలించుచుండెను. అతఁడు గొప్ప వీరుఁడే; గొప్ప శూరుఁడే; గాని యెప్పుడును యుద్ధాద్యుత్పాతములు లేకుండునట్లు ప్రవర్తించుచు సతతము రామనామజపతత్పరుఁడై యుండి యొకపౌరాణికుని ఆస్థానమున నుంచుకొని సతతము రామాయణము చదివించి వినుచుండెను.

పౌరాణికుఁడు రామాయణము ప్రారంభింపఁగానే అం దెప్పు డేరసము వర్ణింపఁబడిన రాజు అప్పుడు ఆరసము ననుభవించుచుండెడివాఁడు. అందువలన పౌరాణికుఁడు దుఃఖము, క్రోధము వచ్చెడి భాగములను విడిచి తక్కిమ్మా భాగములను చదువసాగెను.

ఇది యిట్లుండఁగా నొకనాఁడు పౌరాణికుఁడు అస్వాస్థ్యమువలన కోటలోనికి పోఁజాలక ఆపని నెఱవేర్చుకొనిరమ్మని కుమారునితో చెప్పెను. పోవునపుడు ఆతఁడు తాను ఏర్పఱచికొనిన పద్ధతిప్రకారమే చదువవలయు నని చెప్పెను; గాని ఆబాల పౌరాణికుఁడు సభలో కూర్చున్న పిదప నది మఱచిపోయి సీతాపహరణఘట్టము తీసెను.

మారీచుఁడు బంగరులేడియై వచ్చుట, సీత ప్రోత్సాహమున రాముఁడు దానిని బట్టఁబోవుట, సీత నిష్ఠురోక్తులకు జంకి లక్ష్మణుఁడు రాముని వెదకుచుఁబోవుట,

వెంటనే రావణుఁడు సన్యాసియై వచ్చి సీత నెత్తుకొనిపోవుట—ఇదియంతయు ఆబాలపౌరాణికుఁడు తండ్రికంటెను బాగుగా ప్రత్యక్షపాంచాలబాహాట శయ్యలతో చదివి చెప్పెను. సభలో నున్నవా రందరును అతని ఉపన్యాసధోరణిని చాల మెచ్చుకొనిరి; గాని రాజు ఇదియేమియు నెఱుఁగఁడు. అతఁడు రావణుఁడు సీత నెత్తుకొనిపోయెనని వినినవెంటనే మంత్రిని చూచి "ఓయీ! తుచ్ఛుఁడగు రావణుఁడు వైదేహిని ఎత్తుకొనిపోయెను. వానిని చంపి సీతను గొనివచ్చెద; కావున వెంటనే రథము సిద్ధము చేయుము" అని చెప్పెను. రాజు తన్మయత్వమును జూచి అందరును ఆశ్చర్యపడిరి; గాని అతని తత్వము నెఱిగియున్న మంత్రి ఇక ప్రయోజనము లేదని తలఁచి వెంటనే అట్లు చేసి రాజునకు విన్నవించెను.

రాజు ఒక అంగలో రథమెక్కి వాయువేగ మనోవేగాలమీఁద తోలించుకొనుచు బయదేరి సముద్రతీరము చేరి గభీలున రథము డిగ్గి సముద్రములో దిగి నడువఁజొచ్చెను. అది చూచి సైనికులందరును హాహాకారములు చేసిరి; కాని రాజు ఏమియు వినిపించుకోలేదు.

అప్పుడు శ్రీరామచంద్రుఁడు అతని తాదాత్మ్యమునకు ఆనందించి సీతాలక్ష్మణాంజనేయులతో ఆసముద్రమునందే ఎదురై "వత్సా! ఇంతమాత్రమునకు నీవు రానక్కఱలేదు. రావణుని నేనే సంహరించి ఇదిగో సీతను తెచ్చుచున్నా" నని పొదివి పట్టి తీరమునకు తెచ్చెను. అంతట రాజు శ్రీరామచంద్రుని పాదములమీఁద వ్రాలి,

శ్లో. "ఉత్ఫుల్లామలకోమలోత్పలదళశ్యామాయ రామామన
శ్చంద్రాయ ప్రశమాయ నిర్మలగుణారామాయ రామాత్మనే,
ధ్యానారూఢమునీంద్రమానససరోహంసాయ సంసారవి
ధ్వంసాయాద్భుతతేజసే రఘుకులోత్తంసాయ పుంసే నమః.
రాజీవాయతలోచనం రఘువరం నీలోత్పలశ్యామలం
మందారాంచితమండపే సులలితే సౌవర్ణకే పుష్పకే,
ఆస్థానే నవరత్నరాజిఖచితే సింహాసనే సంస్థితం
సీతాలక్ష్మణలోకపాలసహితం వందే మునీంద్రాస్పదం
వల్లీప్రవాళనవపల్లవపాదపద్మం కంజేక్షణం జలదనీలసరోరుహాభం,
సీమంతినీనయనమోహనమూలమంత్రం రామం నమామి మునిమానసరాజహంసమ్."

అని పరిపరివిధముల నమస్కరించి లేచి నిలిచి, "శ్రీరామచంద్రా! మహామునీంద్రులకుఁ గూడ అవాఙ్మానసగోచరము కాని నిన్ను నే నెట్లెఱుంగ నేర్తును? మత్స్యకూర్మవరాహనారసింహవామనపరశురామరూపములతో నవతరించి నీవింతవరకును లోకభీకరు లగు అనేక రాక్షసులను సంహరించి ధర్మము నుద్ధరించితివి! నేటి యీ యుగావతారమున నేటికింకను శిష్టప్రతిపాలనము, దుష్టరక్షణము చేయుచునే యుంటివి,

జగన్నాథా! అధర్మ మెప్పు డెక్కడ విజృంభించినను వాసిని వెంటనే సమ యించి లోకస్థితిని కాపాడుచున్నావు. నిన్నేమని నేను కొనియాడఁగలను? సీతా మనోనాయకా! లక్ష్మణాగ్రజా! నేను పాపాత్ముఁడను. అజ్ఞానుఁడను. కర్తవ్యమూఢుఁ డను. నాకు నీవే తండ్రివి. నీవే తల్లివి. నీవే భ్రాతవు. లక్ష్మణుని సేవల నెట్లంగీక రించితివో, మారుతాత్మజుని కైంకర్యము నెట్లు స్వీకరించితివో అట్లే నాపరిచర్య లనుమతించి నన్ను నీయంతరంగదాసునిగా అంగీకరింపుము. శ్రియఃపతీ! ముని హృదయలోలా! విదురాక్రూరవరదా! నిన్ను నేను విడిచియుండలేను. వినీలనీరద శ్యామల మగు నీ యీదివ్యమంగళవిగ్రహమును జూచినకండ్లతో మరియొక వస్తువు చూడఁజాలను; కావున నాయింట నిత్యనివాసము నంగీకరించి యీరూపము తోడనే నాసేవ నంగీకరించుచు నన్ను ధన్యునిఁ జేయుము" అని ప్రార్థించెను.

అందుకు శ్రీరాముఁడు "వత్సా! నీభక్తికి, నీవైరాగ్యమునకు, నీయాత్మా నాత్మవివేకమునకు మెచ్చితిని. నీ తాదాత్మ్యము అనన్యసాధారణముగా నున్నది. ఆంజనేయునివంటి నిన్ను విడిచి నేనును ఉండఁజాలను; గాని యుగధర్మము నను సరించి నేనిట్టి రూపముతోడనె నీయింట నుండుటకు వీలు లేదు; గావున విగ్రహ రూపమున నుండి కోరినపు డెల్ల నీకు కనులకు తృప్తిఁ గలిగించుచు నీ సేవల నంగీ కరించుచుందును" అని చెప్పి తిరోహితుఁడయ్యెను.

అంతట రామరాజు వెంటనే నగరమునకు వచ్చి స్వర్ణవిగ్రహములు చేయించి పూజించుచు యథాపూర్వముగ రామాయణము వినుచు భాగవతారాధనమున బ్రహ్మానంద మనుభవించుచుండెను.

ఇట్లుండ ఆనగరమున నరహరిదాసు అను నొకభాగవతాగ్రగణ్యుఁ డుండెను. ఆతఁడు సదా భగవద్భాగవతారాధనము చేయుచు భగవంతునియవతారముల నన్నింటిని తాను ధరించి అందుకు తగిన వ్యక్తుల రూపములు తాల్చి శిష్యులు కలిసిరాఁగా నాటకము లాడుచుండెను. ఆనాటకములు చూచి ప్రజ లానందించుటయే గాక భక్తులుఁగూడ నగుచు నరహరిదాసునివలన హితోపదేశము బడయుచు నానందించుచుండిరి.

ఒకపుడు దాసు నృసింహావతార వేషము ధరించెను. ఒక శిష్యుఁడు ప్రహ్లాదుఁడు గను, ఒకఁడు హిరణ్యకశిపుఁడుగను, మఱికొందరు తక్కిన పాత్రలుగను తయారు కాఁగా దాసు ప్రహ్లాదనాటకము ప్రారంభించెను. వేలకొలఁదిజనులు వచ్చిచూచి ఆనం దింపసాగిరి.

ఎన్నిసారు లెన్నివిధముల చెప్పినను ఎంత శిక్షించినను జంకక ప్రహ్లా దుఁడు శ్రీహరినామస్మరణము చేయుచుండుటవలన హిరణ్యకశిపుఁడు "నీవు పలుకు

చున్న శ్రీహరి భగవంతుఁ డేని ఈ స్తంభమున చూపఁగలవా?" అని యడుగగా ప్రహ్లాదుఁడు

క. అందుఁ గలఁ డిందు లేఁడని, సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన, నందందే గలఁడు దానవాగ్రణి వింటే."

అని పలికెను. అందులకు హిరణ్యకశిపుఁడు మరింత మండిపడి "ఏడీ?" అని గదతో ఆ స్తంభమును గొట్టెను. వెంటనే పెళపెళ ధ్వనులతో స్తంభము బ్రద్దలు కాఁగా నరసింహావతారముతో శ్రీహరి సాక్షాత్కరించెను.

నాటకమున ఈసందర్భము వచ్చెను. అప్పుడు నరహరిదాసు తన్మయుఁడై ప్రపంచము నెఱుఁగని స్థితిలో నుండుటవలన హిరణ్యకశిపువేషధారిని తన తొడల మీఁద పరుండఁబెట్టుకొని కడుపు చీల్చి ప్రేఁగులు బైటికి తీసి మెడలో వేసికొని యెను. చూచుచున్నవా రందరును హాహాకారములు చేసిరి; గాని ఆవేషధారి వెంటనే చనిపోయెను.

దాసు తాదాత్మ్యమున కంపరు నచ్చెరువు పొందిరి; గాని చనిపోయిన శిష్యుని బంధువులు ఈదారుణవార్తను రాజున కెఱింగించిరి. అది విని రాజు నరహరి దాసు మహాభక్తుఁ డగుట యెఱుంగును; గావున ఏమి చేయుటకును తోఁచక "ముందు శవమును దహనము చేసిరండు" అని బంధువులను పంపివేసెను.

రాజు ఆలోచనలోపడెను. ఇప్పు డేమి చేయవలయును? హత్యాపరాధమునకై దాసును విచారణ చేసి శిక్షింపకున్న మృతుని బంధువులే గాక లోకులును దూషింతురు. దుష్టులు పరిపాలనమును లోకువ చేసి చెలరేగెదరు. దాసును శిక్షించెదమా యనిన అది ఆయన బుద్ధిపూర్వకమైన పని గాదు. తన్మయత్వమునఁగలిగిన భావోద్రేకము తప్ప అందుకు మరియొక కారణము గాని, హత్య చేయవలయునను ఉద్దేశము గాని లేదు" అని నిశ్చయించుకొని యుక్తసమయమున దాసును సందర్శించి "మహాత్మా! తాము దశరథుఁడుగను మీశిష్యులు రామలక్ష్మణభరతశత్రుఘ్నాదులు గను, కైక మంథర మున్నగుస్త్రీలుగను శ్రీరామ ప్రవాసగాథను ప్రదర్శించిన చూడఁ గోరిక గలదు. దయ యుంచి నాయీప్రార్థనము మన్నించి నన్ను కృతార్థుని గావింప వలయు" నని ప్రార్థించెను.

నరహరిదాసు అందుకు అంగీకరించెను. అంతయు సిద్ధము కాఁగా నాటకము ప్రారంభమయ్యెను. దశరథరూపమున నున్న నరహరిదాసు కైక దుర్బోధవలన రాముని అరణ్యమునకుఁ బంపివైచి రామవిశ్లేషమును సహింపఁజాలక మిగుల దుఃఖించి, మూర్ఛిల్లి, తుదకు ప్రాణములు విడిచెను. ప్రేక్షకు లందరును హాహాకారములు చేసిరి; గాని ఏమి లాభము? అంతయు నైపోయినది.

హిరణ్యకశిపుఁడుగా చనిపోయినవాని బంధువు లది చూచి "అయ్యో! స్వామియెడల మనము అక్రమము తలఁచితిమి. తన్మయత్వము ఆయనకు సహజమైనది; ఇది యాధారముగా చూచుకొని మన కసి తీర్చుటకే రాజట్టి పన్నుగడచేసెను; మనమే స్వామిమృతికి కారణమైతిమి" అని మిగుల దుఃఖించిరి.

రాజును లౌక్యము చేసి తాను నరహరిదాసు మృతికి కారణమైనందుకు చాల విచారించెను; గాని యేమి లాభము?

తరువాత రాజు బ్రతికియున్నంతకాలము భగవద్భాగవతారాధన మవిచ్ఛిన్నముగా గావించి, అవసానమున శ్రీహరిసాయుజ్యముఁ బడసెను.

ఉ. హాళినిఁ దాటకం దునిమి యాగముఁ గాచి యహల్యఁ బ్రోచి సీ
తాలలన న్వరించి, రణదర్పితరావణకుంభకర్ణులై
త్యాళిని ద్రుంచి రాజ్యము నయంబుగ నేలినరామచంద్రభూ
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచార మేటికిన్?

---

# నా భా జీ దా సు

శ్లో. హే గోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హే కంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హే మాధవ!
హే రామానుజ హే జగత్త్రయగురో హేపుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా.

కాశీనగరమున ఒక స్త్రీ పతియే దైవముగా భావించుచు నిరాడంబరజీవనము గడపుచుండెను. ఆమె కొక్కఁడే కుమారుఁడు. వానికి ఏడెనిమిదేండ్ల వయస్సు వచ్చినపిదప తండ్రి చనిపోయెను.

ఒకసారి ఘోరమైన కఱవు వచ్చినది. జను లందరును తల్లడిల్లిపోయిరి. ఆ స్త్రీయును మిగుల బాధపడి గతి లేక ఒకనాఁడు కుమారుని దీసికొని గంగకుఁ బోయి వానిని తీరమున నుంచి భగవంతుని స్మరించి గంగలో నురికి దేహము విడిచెను.

అది చూచి ఆబాలకుఁడు ఏడువఁదొడఁగెను. అప్పుడు అగ్రజిదాసు అను భాగవతుఁడు చూచి ఓదార్చి వానిని తన మఠమునకుఁ గొనిపోయి, నాభాజీదాసు అని పేరుపెట్టి పెంచసాగెను. అగ్రజిదాసు కాశీనగరమున నొకమఠము నిర్మించి కొని శిష్యులతో నివసించియుండెను. అతఁడు ఆనగరమునందలి భగవద్భక్తు లందరి యందును ఉత్తముఁడు; శ్రీహరికి అంతరంగభక్తుఁడు.

నాభాజీ అగ్రజిదాసునకును, తక్కిన భాగవతులకును సేవచేయుచు, వారు చేయు భజన మున్నగునవి చూచుచు హృదయమును శ్రీహరియందే నిలిపి పెరుగు చుండెను. అతని భక్తిప్రపత్తులకును, శ్రద్ధాసక్తులకును మెచ్చి ఆచార్యుఁడును, శిష్యులును అతనిని చాల ప్రేమతో చూచుచుండిరి.

ఒకనాఁడు అగ్రజిదాసు గంగానదియందు స్నానము చేసి యథాపూర్వముగ యోగసమాధిలోఁ గూర్చుండెను; గాని యెంతసేపటికిని శ్రీహరి దర్శనము కాకుండెను. అతఁడు మరల మరల ప్రయత్నించెను; గాని ఆశాభంగమునే పొందుచుండెను. అందుకు కారణము తెలియక లోపల నతఁడు కంగారు పడుచుండఁగా "మహాత్మా! సముద్రమధ్యమున నొకయోడ మునిఁగిపోవుటకు సిద్ధముగా నున్నది. అందుకు విచారించుచు తదధిపతి యగు వర్తకుఁడు—

శ్లో. "లక్ష్మీపతే కమలనాభ సురేశ విష్ణో యజ్ఞేశయజ్ఞ మధుసూదన విశ్వరూప,
బ్రహ్మణ్య కేశవ జనార్దన వాసుదేవ లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్.
ప్రహ్లాదనారదపరాశరపుండరీకవ్యాసాంబరీషశుకశౌనకహృన్నివాస,
భక్తానురక్తపరిపాలనపారిజాత లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్."

అని యిట్లు తన్మయుఁడై ప్రార్థించుచు "నాయోడను నన్ను రక్షించితివేని ఈనౌక యందలి బంగారమునం దైదవవంతు నీయంతరంగభక్తుఁ డగు అగ్రజిదాసు మఠమునకు సమర్పించుకొందు" నని మ్రొక్కుకొనుచున్నాఁడు. ఆకారణమువలన శ్రీహరి

మ. "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబునుఁ జేరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్క నొత్తఁడు వివాదప్రోద్ధితశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

అనినట్లు సకలమును విడిచి తదుద్ధరణార్థము వెడలియున్నాఁడు. తమకు దర్శనము కాకుండుటకు కారణ మిది. అది పూర్తి యగువరకును మీరు ధ్యానము నిలుపుట మంచిది" అని నాభాజీ చెప్పెను.

అప్పు డేమియు మాట్లాడక అగ్రజి కొంతతడవు వేచియుండెను. మరి కొంత సేపటికి నాభాజీ "గురువరా! ఓడను, వర్తకుని రక్షించుట యైనది. ఇఁక ధ్యానింప వచ్చును" అని మరల చెప్పెను. అప్పుడు అగ్రజి ధ్యానింపఁగా శ్రీహరి స్వస్వరూప ముతో సాక్షాత్కరించి "వత్సా! ఆలస్యమునకు వగవకుము. సముద్రమధ్యమున ఓడతోఁ గూడ మునిగిపోవనున్న వర్తకుఁ డొకఁడు ప్రార్థింపఁగా వెళ్లి ఉద్ధరించుటలో కొంచె మాలస్య మైనది; గాని వేరు కారణము లేదు" అని చెప్పి "ఆవర్తకుఁడు ఓడయందలి బంగారమున ఐదవవంతు నీకిచ్చునట్లు మ్రొక్కుకొనియున్నాఁడు.

అతఁడక్లే దానిని తెచ్చి నీకీయఁగలఁడు. అప్పుడు వలదనక ఆసొమ్మును నీవు నీమతము నిమిత్తము వెచ్చింపుము" అని నియోగించి తిరోహితుఁడయ్యెను.

పిదప ఆచార్యుఁడు ఇవ్వలకు వచ్చి "వత్సా! నీప్రభావము అద్భుతముగా నున్నది. చిరకాలము యోగసమాధిలోనుండి సిద్ధి పొందినవారికిఁ గూడ సాధ్యము కాని యీ శక్తి నీ కెట్లు వచ్చినది ? నీభక్తిప్రపత్తులు చూచి నీవు కాఁగలవాఁడవని తలఁచియుంటినే; గాని యింతవఱకును నీవింతటివాఁడ వని యెఱుంగ జాలనైతి" నని కౌఁగిలించుకొని ఆదరింపఁగా, నాభాజీ ఆతనికి పాదాభివందనము ఆచరించి "మహాత్మా! నాప్రవర్తనము మీ రెఱుగనిది గాదు. తమకును, తమ శిష్యులకును పాదసేవ చేయుట తప్ప నేనే తపస్సును, ఏయోగసమాధిని ఏపూజను ఎఱుఁగను; గాని శ్రీహరినిర్హేతుకజాయమానకటాక్షమున ప్రపంచమున నెక్కడ నేమి జరుగు చున్నదియు ఎదుట జరుగుచున్నట్లు తెలియుచున్నది. ఈకారణమువలననే తమకు ఆసంగతి యింతకు ముష్ను విన్నవించియున్నాను. నా కింక నేమియు తెలియదు" అని విన్నవించెను.

అగ్రజిదాసు అందులకు మిగుల నాశ్చర్యపడి "వత్సా! స్మరణము, కీర్తనము, భజనము, పూజ, యోగము, తపస్సు—ఇట్టివి అన్నియు సాధనములు గాని మోక్ష మునకు చిత్తశుద్ధియే ప్రధానమైనది. అది కుదురుటయే కష్టమైన పని; గాని నీపూర్వజన్మసుకృతపరిపాకమువలన చిన్నతనమునందే నీవు చిత్తము నరికట్టఁ గలిగి తివి. ఇఁక నీకు ఎందును అడ్డు లేదు" అని దీవించి వెంటనే అతనికి మంత్రోపదేశము చేసెను.

పిదప అగ్రజి చెప్పుచుండఁగా నాభాజీ అనేకభక్తులయొక్క పావన చరిత్ర ములను వ్రాసి దేశమునకు మహోపకారము చేసెను. నాభాజీయు, అగ్రజియు బ్రతికియున్నంతకాలము నిట్లు శ్రీహరిని సేవించి, అవసానమున సాయుజ్యముక్తిఁ బడసిరి.

స. "పృథ గా దెవ్వఁడు నిన్ను గొల్చిన గృపన్ వీక్షించి వాఁడేమనో
రథమున్ వేఁడిన నట్టులే యిడుదుగా రక్షావిధేయుండవై
కథ గాఁదీవచనంబు నిక్కమటులే కాదేని మున్నేల పా
ర్థునకై యర్జునుతేరు దోల రఘువీరా! జానకీనాయకా!"

# నీళోబా దాసు

ఉ. "ఇవ్వల నవ్వలన్ వెదక నేటికి నవ్వుల మాటిమాటికిన్
దవ్వుల నుండి యైన గరుణావరుణాలయగోపమూర్తియై
నవ్వుచు డాయవచ్చి యదనన్ శరణాగతవజ్రపంజరుం
దవ్వనజాతనేత్రుఁ డనయంబు నయంబునెలంగ బ్రోవగన్."

నీళోబా మహాభక్తుఁడు. అతఁడు సంసారమున నుండినను తామరాకులోని నీటిబిందువువలె వర్తించుచు శ్రవణమననధ్యానాదులతో శ్రీహరిని పూజించుచు ఆనందము నందుచుండెను.

ఒకనాఁటిరాత్రి స్వప్నమున తుకారామస్వామి సాక్షాత్కరించి అతనికి తారక మంత్రము నుపదేశించెను. అది భగవల్లీల యని గుర్తెఱిగి నీళోబా అది మొదలు హరిభజనమున మరింత మైమఱచుచు సర్వకాలసర్వావస్థలయందును శ్రీహరిస్మరణమే చేయుచుండెను.

ఇట్లుండఁగా అతని యేకపుత్రిక వరయోగ్యయయ్యెను. అతఁడు చాలచోట్ల ప్రయత్నించి ఒక మంచి వరుని గుదిర్చి పెండ్లికివలయుసంభారములును కొంచెము కొంచెము మాత్రమే సేకరించెను. అతఁడు మిగుల దరిద్రుఁడగుటవలన ఎంత ప్రయత్నించినను భార్యకు తృప్తి కలుగునంత సామగ్రి సమకూర్పఁజాలకపోయెను.

నీళోబా నిర్విచారముగనే వివాహముహూర్తము నెదురుచూడసాగెను; గాని అతని పత్ని అట్లుగాక "అయ్యో! సామగ్రి చాలదే" యని బెంగపెట్టుకొనియే యుండెను.

ముహూర్తము సమీపించినది. పెండ్లివారు తరలివచ్చిరి. నీళోబా భార్య విచారమునకు తగినట్లు ఆత్మబంధువులే గాక మగపెండ్లివారు గూడ అసంఖ్యాకులుగా వచ్చిరి. ఉభయపక్షముల బంధువుల సంఖ్యను జూడఁగా ఉన్న సామగ్రి ఒక్కదినమునకైన చాలనట్లుండెను. అందుల కామె మిగుల కళవళపడుచు "మొదటినుండియు నే నెంత మొత్తుకొనినను వినవైతివి. ఇప్పటికే అనేకులు వచ్చియున్నారు. ఇంకను కొందరు రావచ్చును. ఊరివారిని గూడ చేర్చినచో మనము ఒక్కనాఁడైన అన్నము పెట్టలేమని తోచుచున్నది. ఇట్టి స్థితిలో నీ విట్లు నిశ్చింతుఁడవై హాయిగా హరిధ్యానముతోఁ గూర్చుండిన నెట్లు? హరి వచ్చి మనకిప్పు డేమైన సాయము చేయునా? లేకున్న నీహరిభక్తిని జూచి వచ్చినవారు భుజింపకయే వెడలి పోదురా? అయ్యో! నీకు చీమకుట్టినట్లు లే దేమి? మగవాఁడవు. నీ విట్లయిన ఆడుదానను నే నేమి చేయఁగలను? ఈపెండ్లి కారణముగా మనము బంధువిరోధుల

మగుదుము; అపకీర్తికి పాలగుదుము; పైఁగా పెళ్లిలో పిండివంటలు లేకున్న మానె కడుపునిండ అన్నమైన పెట్టి గౌరవింపకపోయితి మని అత్తవారు మన అమ్మాయిని బ్రతికియున్నంతకాలము దెప్పెదరు. భర్త దానిని సరిగ చూడఁడు” అని యిట్లనేక విధముల విచారింపసాగెను.

అందుకు నీళోబా ‘ఏల బెంగ పెట్టుకొందువు?’ నాది నేను అని గర్వించుటయేఁ గాని మనవల్ల నేమగును? అంతయు శ్రీహరి యధీనమై యున్నది. మానవులు నిమిత్తమాత్రులు. మానవసంకల్పమే అప్రతిహతమైన నిఁక నీ హెచ్చు తక్కువలు, ఈకష్టనష్టములు, ఈసుఖదుఃఖములు ఇవి యేల యుండును? అన్ని విషయములయందును ఎవఁడు తక్కువస్థితిలో నుండుట కంగీకరించును? కావున విచారింపవలదు. ప్రయత్నమునకే మన ప్రసక్తిగాని ఫలము శ్రీహరి యొసంగవలెను. మన చిత్తశుద్ధి, మన సత్ప్రవర్తన. మననిర్లిప్తత—ఇవియే భగవంతునకు మనపై ననుగ్రహము కలిగించు సాధనములు. వీటిని సంపాదించుకొనకుండిన శ్రీహరి మనలను చూడఁడు. శ్రీహరి మనలను చూడకుండిన నిఁక నేమియు లేదు; గాన శ్రీహరియనుగ్రహమును సంపాదించుకొనుటయే కర్తవ్యము. సంసారమున ఏమియు నిలిచిపోదు. చక్రవర్తి కొమార్తకును పెండ్లియగుచున్నది. భిక్షుకుని కొమార్తకును పెండ్లి యగుచున్నది. మనబిడ్డకును బెండ్లి యగును. అనఁగా పెండ్లి ప్రధానము గాని విందులు, సత్కారములు, వేడుకలు—ఇంక నిట్టివి ప్రధానములు కావు. మన అమ్మాయి పెండ్లి ఎట్లుకావలెనో అట్లగును. మరియొక విధమున కాదు. కావున విచారము మాని, నీవును నావలె తుకారామస్వామి నాచార్యునిగా స్మరించుచు హరిభజనము చేయుము. అట్లయిన సకలవిచారములు తొలఁగిపోవును” అని చెప్పెను. అందు కామె మొదట అసంతృప్తినే కనఁబఱచెను; గాని తుదకు భర్త మాటలయందలి పరమార్థమును గమనించి నిర్విచారయై భవిష్యత్తు నెదురుచూచుచు వివాహకార్యములలో ప్రవృత్తురా లయ్యెను.

వైవాహికోత్సవములు ప్రారంభమైనవి. అప్పుడు పండరినాథుఁ డొక బ్రాహ్మణునివలె వచ్చి “అయ్యా! నేను పరదేశిని. నావద్ద బియ్యము పప్పు, ఉప్పు మొదలలైనవి కొలదిగ మాత్రమే యున్నవి. ప్రత్యేకముగ నేను వంట చేసికొనుటకవి చాలవు; గావున వానిని పుచ్చుకొని యీపూట నాకు భోజనము పెట్టెదవా?” అని నీళోబా నడిగెను. అందుకు నీళోబా నవ్వి “బ్రాహ్మణోత్తమా! నాకొమార్త పెండ్లి యగుచున్నది. నాకు చేతనైనంతసరకును సామగ్రి సంపాదించితిని. వంటలగుచున్నవి. భోజనములు పూటపూటకు నగుచున్నవి. నీకొరకు ప్రత్యేకప్రయత్నము లక్కఱలేదు. అంతమందికి ఏదో—ఉన్న యెత్తున తీర్థోదకము లిచ్చుచున్న

నాయింట నీకొక్కనికి అన్నము లేకపోవునా ? పాండురంగని దయ యున్నచో నెవనికిని లోపము గలుగదు. కావున నీవద్ద నున్న వస్తువులను నీవద్దనే యుంచుకొని స్నానము చేసి మడి కట్టుకొని రమ్ము" అని యాహ్వానించెను; గాని యట్లు చేయుట కా బ్రాహ్మణుఁ డంగీకరింపలేదు. బ్రాహ్మణున కాశ పనికి రాదు. నావద్ద నేమియు లేకుండినచో సర్వమును యాచించుట యెట్లును తప్పదు. కాని ఉన్నవి యేమి చేసికొందును ? ఇంటికి పట్టుకొనివెళ్లుద మన్న నా కిల్లు లేదు. నా కెవరును లేరు; గాని లోకమున నున్నవా రందరును నావాళ్లే; నాస్థితి యిట్టిది. కావున నీవు నాకింత అన్నోదకము లీయఁదలంతు వేని యీవస్తువులు పుచ్చుకొనుము. లేకున్న నేను భోజనము లేకున్న పస్తు ఉందును. గాని నీయింట భుజింపఁజాలను" అని యాతఁడు కచ్చితముగా చెప్పెను. దానిమీఁద నీళోబా ఆవస్తువులను పుచ్చుకొనుటకు మనస్సు అంగీకరింపక, భోజనము పెట్టకుండ బ్రాహ్మణుని పంపివేయుటకు అసలే సాహసింపఁజాలక అతని ననేకవిధముల బతిమాలియు తుదకు చేయునదిలేక బ్రాహ్మణుని మడి కట్టుకొని రమ్మని చెప్పుచు ఆవస్తువులను పుచ్చుకొమ్మని భార్యతో చెప్పెను.

బ్రాహ్మణుఁ డందుల కానందించి ఇంటి యజమానురాలిని చూచి "అమ్మా ! కారణ మడుగవద్దు. నే నిచ్చిన బియ్యము బియ్యమునందు; పప్పు పప్పునందు, ఉప్పు, ఉప్పునందు, ఇట్లు ఏవస్తువు లావస్తువులలో కలుపుము. అట్లు కలుపకుండ వంటకు వస్తువు లీయకుము" అని చెప్పెను. బ్రాహ్మణి 'అది యేమో' అని దానిని గురించి తర్జనభర్జన చేయక అట్లే చేసెను.

మరునాఁటి ఉదయము ఆబ్రాహ్మణుఁడు నీళోబాను చూచి 'మరియొక పాచకునికొఱకు చూడకుము. అంతయు నేనే నిర్వహింతును. మగపెళ్లివారివిషయమున జరుపవలసిన మర్యాదాదికము నీవు చూచుకొను మని చెప్పెను. మొదటి నుండియు బ్రాహ్మణుని మాట లిట్లే యుండుటవలన 'ఇది యేమో చిత్రముగా నున్నది. అయినను ఏమి జరుగునో చూచెద' నని తలఁచి నీళోబా 'వల్లె' యనెను. గృహిణియు గూడ అందుకు సమ్మతించి వియ్యపురాలికి ఆడుఁబడుచులకు తక్కినవారికి జరుగవలసిన మర్యాదలను గురించి జాగ్రత్తగా నుండసాగెను.

ఆగంతుకబ్రాహ్మణుఁడు కార్యక్రమమున పాల్గొనెను. అతఁడు వంటచేయును. వడ్డించును. స్థలశుద్ధి చేయును. తక్కిన పనులు గూడ చాలవరకు అతఁడే చేయసాగెను. అతఁడు వంట మొదలుపెట్టిన తరువాత ఏపదార్థమును తరుగక ఎప్పటియట్లె పూర్తిగా నుండుచువచ్చెను. ఏవస్తువును 'లేదు' అను మాట లేకుండెను. పదార్థము లన్నియు చాల క్రొత్తగను, మిగుల రుచిగను ఉండుచు వచ్చెను.

ఇది యంతయు గమనించి నీళోబా బ్రాహ్మణునిఁజేరి 'అయ్యా! నీచరిత్రము అద్భుతముగా నున్నది. నీ దేయూరు? ఏమి పని? ఇక్కడి కేల వచ్చితివి? నా కిట్టి అమూల్యసాహాయ్యము చేయుటకు కారణమేమి?' అని యడిగెను. అందుల కా బ్రాహ్మణుఁడు 'మహానుభావా! నేఁనెక్కడను స్థిరముగా నుండువాఁడను గాను. నన్ను ఎవరు ఆదరింతురో వారికి నాశక్తి కొలఁది సాయము చేసెదను. గ్రామైక రాత్రముగా తరుచు తిరుగుచునే యుందును. గాన మార్గవశమున ఇట్లు ఈ గ్రామము వచ్చితిని. నీవు ఒంటరివి. తలఁపెట్టిన కార్యము పెద్దది. గృహస్థ ధర్మము ననుసరించి నీకు సాయము చేయుచున్నాను' అని యిట్లు ప్రశ్నకు సరిగా ప్రత్యుత్తరము చెప్పున చెప్పి వివాహము పూర్తియై పెళ్లివారందరును వెడలిపోవుసమయ మాసన్న మగుటవలన వారి కందరికి మంచివస్త్రములతోఁ గూడ సత్కారము చేసి మిగుల ఆనంద పెట్టెను.

ఒక దినముకంటె ఒక దినము అభేద్యముగా నున్న ఆగంతుకుని తత్వమును జూచి ఆశ్చర్యచకితుఁడును, విశ్వాసభరితుఁడునుగూడ నై నీళోబా అతనిని నూతన వస్త్రము లిచ్చి సత్కరింపఁదలచెను; గాని అప్పటికే ఆతఁడు అంతర్ధానమయ్యెను.

అప్పుడు నీళోబా 'ఇది యంతయు పాండురంగని అనుగ్రహము ఆబ్రాహ్మణుఁడు పాండురంగఁడే' అని నిశ్చయించుకొని 'శ్రీహరీ! కరుణానిధీ! ఆపద్బాంధవా! అనాథనాథా! నన్నెంత పెద్ద చేసితివి. సంకల్పమాత్రమున సర్వమును నెఱవేర్పగల నీవే స్వయముగ నాయింట నిట్లు అరవచాకిరీ ఏల చేసితివి? అయ్యో! నీవు సకలమును నిర్వర్తించుచు ఆయాసపడుచుండ నేను సోమరివలె కూర్చుండి యెంతయపచారము చేసితి' అని యనేకవిధముల ఉపచారములు పలికియు నిద్రాహారములు మాని విచారింపసాగెను.

అది యెఱింగి పాండురంగఁడు నాఁటి రాత్రి అతనికి స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! నీవు నాయంతరంగభక్తుఁడవు. విచారింపవలదు. నిన్నెపుడును నేను కాపాడుచుండెదను. నేనే నీయింట వివాహమున ఏలోపమును లేకుండఁజేసితిని" అని చెప్పెను.

అందుకు నీళోబాయు, అతని భార్యయు పాండురంగని అనేకవిధముల గొనియాడిరి.

పిదప నీళోబా బ్రతికియున్నంతకాలము పాండురంగని సేవించి అవసానమున సాయుజ్యముక్తిఁ బడసెను.

శా. పెంపన్ దల్లి యగున్ రుజాపటలదుష్పీడావిధిక్షోభ వా
రింపన్ వైద్యుఁ డగున్ గుమార్గవిధులన్ గ్రీడింపఁ బోకుండ శి
క్షింపన్ బల్లిదుఁ డైన తండ్రి యగుచున్, శ్రీమంతుఁగా జేయఁగన్
సంపద్వృద్ధి యొనర్ప దాత యగు నీ సద్భక్తి సర్వేశ్వరా!

---

# ఉద్ధవచిద్ఘనుఁడు

శ్లో. దోర్దండేన చ మండలీకృతమహాకోదండచండాశుగై
ర్విఘ్నాతై రవికోటితుల్యనిశితైర్బ్రహ్మాదిముఖ్యాస్త్రతైః,
సుగ్రీవాదిసమస్తవానరవరా నాజ్ఞాపయంతం గిరా
దైత్యాన్ తాడయ తాడయేత్యనుపదం శ్రీరామచంద్రం భజే.

హరిభక్తులలో ఉద్ధవచిద్ఘనుఁడు చాల గొప్పవాఁడు. అతనికి భార్యా పుత్త్రులు మున్నగు ఆత్మీయు లెవరును లేరు. ఏకాకి. అందుకు తగినట్లు అతఁడు ఎప్పుడు నొకచోట నుండక గ్రామైకరాత్రముగా తిరుగుచుండును. రాత్రింబగళ్లు హరిభజనము తప్ప నతఁడు మరియొక పని యెఱుఁగఁడు.

ఒకనా డతఁడు మార్గవశమున నొక యూరికిఁ బోయి భిక్షమెత్తుకొని భుజించిన పిదపఁ గూడ రామాలయమువద్ద భజన చేసికొనసాగెను. ఊరివారు అలవాటు చొప్పున వచ్చి తాము భజనచేయుట మాని అతని భజన చూడసాగిరి.

అతఁడు కేవలభక్తుఁ డగుటవలన అడుగు, తాళము, పాట—వీటివలననే గాక అడుగడుగునకును భక్తిపరవశుఁ డగుచు వారిని ఆనందపఱచెను.

భజన ముగిసిన పిదప వారందరు నతని చుట్టును జేరి "మహాత్మా! నేటితో మాజన్మములు పావనములైనవి. ఇంతవరకును మేము మీవంటి మహాత్ములను చూచియుండలేదు. మీభజన, మీభక్తి, మీవైరాగ్యము, మీజ్ఞానము, మా హృదయముల నాకర్షించినవి. మీరు కొన్ని దినములు మాగ్రామమున నుండి మాకందరకును భజనము నేర్పి జ్ఞానము కలిగించి తరణోపాయము నెఱింగింపవలయును" అని ప్రార్థించిరి. అందు కతఁడు 'అయ్యా! మీ రిట్లు కోరుచున్నప్పుడు నేను కాదనఁగూడదు; గాని పోక తప్పదు. శ్రీరామజయంతీ మహోత్సవము ఇంక మూఁడుదినములలో వచ్చుచున్నది. నాటికి నేను ద్వారకాపురమునకు పోవలసి యున్నది' అని బదులు చెప్పెను.

అది విని వారు "మహాత్మా! మీ రెక్కడనున్నను శ్రీరామచంద్రుఁడు మీవెంటనే యుండును; గావున స్వామి దర్శనమునకై మీ రెందును పోవలసిన పని లేదు. ఇఁక మేమా? సంసారసాగరమున ఈఁదులాడుటతోడనే మాకాలము చెల్లిపోవుచున్నది. మాకు శ్రీరాముని స్మరించుటకు, ధ్యానించుటకు, పూజించుటకు, భజన చేయుటకు కాలమే లేకున్నది; గావున శ్రీరామచంద్రునకు మేము దవ్వుననే ఉండిపోయినాము. మీ రిక్కడ కొన్నిదినము లుండినయెడల ఆకొన్ని

దినములైన మాకు దాశరథి సన్నిధి కలిగి మా పాపములు నశించును. ఇఁక మహోత్సవమా? మీ రెక్కడ నున్న అక్కడనే మహోత్సవము. మా ధనప్రాణములు మీవి. వీటిని మీ రెట్లు కోరిన అట్లు వినియోగించుకొనవచ్చును. మీ సెలవైనచో మేమన్ని పనులును చేసెదము. కావున దయయుంచి మీరు ఆమహోత్సవము నిక్కడనే జరిగించి మమ్ము ఉద్ధరింపుఁడు" అని ప్రార్థించిరి.

అతఁ డిఁక మాట్లాడఁజాలకపోయెను. చేయునది లేక సరే యనెను. వెంటనే ఊరివారు ధనము తెచ్చి గ్రుమ్మరించిరి. సకలవస్తువులును తెచ్చి రాశులు పోసిరి. పందిళ్లు పాకలు ఒక్కరాత్రిలో పూర్తిజేసిరి. సకలమును సిద్ధ మయ్యెను.

అంతట దాసు విధ్యుక్తముగా జయంతిమహోత్సవము ప్రారంభించెను. ఊరిలోని స్త్రీపురుషులె గాక పొరుగూరివారు గూడ తండోపతండములుగా వచ్చిరి. గ్రామమంతయు కిటకిట లాడిపోవుచుండెను.

ఇట్లుండఁగా రెండువేలమందితురుష్కు లొక్కసారి వచ్చి మహోత్సవము మీఁద పడిరి. అప్పు డాదేశము నొక తురుష్కప్రభు వేలుచుండెను. ఆకారణము వలన ఆగ్రామమున తురుష్కు లనేకులు కాఁపురముండిరి. వారికి హిందువుల ఆచారము లేమియు కిట్టకుండెను. అగుటచే వారు అట్లు ఉత్సవముమీఁదఁ బడి పాకలు పందిళ్లు పీకివేసి, సకలవస్తువులను పాడుచేసి అర్చావిగ్రహములను విరుగఁ గొట్టి ఇట్లు నానాబీభత్సము చేసిరి.

ఊరి వారందరును దెబ్బలు తగిలి బాధపడుచు "అయ్యో! ఈహరిదాసును మన మేల నిలిపితిమి? ఈయుత్సవము నేల ప్రారంభించితిమి?" అని విచారింప సాగిరి.

అంతట హరిదాసు "శ్రీరామచంద్రా! జ్ఞానమువచ్చినప్పటినుండియు జయంత్యుత్సవమున పాల్గొని యానందించుచున్నాను; గాని నాదురదృష్టమువలన నే డిట్టిది సంభవించినది. పాపము నన్ను నమ్మి వచ్చిన గ్రామవాసుల కందరికిని దెబ్బలు తగిలినవి. సొమ్ము నష్టమైనది. మానము పోయినది. ఎంత యాపత్తు! దీని కంతటికిని కారణము నేను. వారి బాధయంతయు పాపమై నన్ను పీడించును. శ్రీహరీ! సీతామనోహరా! నావలన నేమైన నపరాధము జరిగినదా? వ్రతమున నేమయిన లోపములు జరిగినవా? లేకున్న నీపూజ కిట్లు విఘ్నము కలుగఁగా నీ వేల యూరకుంటివి?" అని వగచి,

ఉ. "దాసిన చుట్టమా, శబరి, దాని దయామతి నేలినావు; నీ
దాసుని దాసుఁడా గుహుఁడు తావకదాస్య మొసంగినావు; నేఁ
జేసిన పాపమా వినుతి చేసినఁ గావవు; కావుమయ్య నీ
దాసుల లోన నే నొకఁడ దాశరథీ కరుణాపయోనిధీ!

చ. వలదు పరాకు భక్తజనవత్సల నీ చరితమ్ము నమ్ము కా
వలదు పరాకు నీబిరుదు వజ్రము వంటిది కావ కూరుకో
వలదు పరాకు నాదురితవార్ధికి తెప్పవుగా మనంబులో
దలతుమెకా నిరంతరము దాశరథీ! కరుణాపయోనిధీ!

ఉ. కోతికి శక్యమా యసురకోటులగెల్వను? గెల్చె బో నిజం
బాతని మేన శీతకరుఁ డౌట దవానలుఁ డెట్టి వింత! మా
సీతపతివ్రతామహిమ సేవకుభాగ్యము మీకటాక్షముఀ
ధాతకు శక్యమా పొగడ దాశరథీ! కరుణాపయోనిధీ!"

అని ధ్యానించెను.

ఇది ముగియుటయే తడవుగ ఆంజనేయుఁడు మహోగ్రరూపుఁడై వచ్చి మాహమ్మదీయుల మసీదువద్దకుఁ బోయి దానిని తోకతోఁ జుట్టి పీకి పారవేయుటకు సిద్ధపడెను. అపుడు గ్రామమునందలి తురుష్కపురుషు లందరును మసీదునం దుండిరి. బైట సంచరించుచుండిన ఒక తురుష్కుఁడు ఆంజనేయుని పూనికఁ జూచి 'మహాత్మా! మావల్ల నేమి యపరాధము జరిగిన' దని యడిగెను. అందులకు ఆంజనేయుఁడు "శ్రీరామచంద్రుని భక్తులను మీవారు బాధించి అవమానించినారు. దాని కిది ప్రతిక్రియ" అని చెప్పఁగా అతఁడు వెంటనే లోనికిఁ బోయి కలుగఁబోవు విపత్తు నెఱిగించెను. తురుష్కు లందరు నాతనిని వెక్కిరించిరి. అంతట నతఁ డేమియు చేయలేక ఊరకుండఁగా ఆంజనేయుఁడు వెంటనే మసీదు నేలమట్టము చేసివేసెను. దానిక్రిందఁ బడి అందలి తురుష్కు లందరును గతించిరి.

చారులచే నిది విని సమీపమునందే యున్న రాజధానినుండి పాదుషా వచ్చి ఉద్ధవచిద్ఘనుని పాదములమీఁద వ్రాలి "మహాత్మా! జరిగిపోయినదానికి చాల విచారముగా నున్నది; గాని యిఁక అది కలిసివచ్చునది కాదు. ఇఁకముందు నా రాజ్యమున నెక్కడను నామతమువారు మీమతమువారి నేవిధముగను బాధింప కుండునట్లు కఠినముగా శాసించెదను; గావున దయయుంచి తురుష్కవినాశము నింతటితో నిలుపుచేయింపుము. హనుమంతుని నాకై నీవు వేఁడుము" అని బతి మాలెను.

అది విని రామభక్తుఁడు అనుకంపాపరాయణుఁడై "రాజా! భగవంతుఁ డొక్కఁడే; గాని అతనిని జేర్చు మార్గము లనేకము లున్నవి. అందు మీ మార్గ మొకటి. మా మార్గ మొకటి. యథార్థమిట్లుండఁగా నీ కలహము లేల? నేడు మీ వారు విజృంభించిన రేపు మావారు విజృంభింతురు; మతము పేరు చెప్పి దేవుని పేరు చెప్పి ఇట్లు రక్తపాతము కలిగించుట మానవకృత్యము కాదు. దీనికై నీవు వెంటనే కట్టుదిట్టములు చేయుము" అని బోధించి "రామభక్తాగ్రేసరా! అంజనా

నందవర్ధనా! నాకోఱకు ఇఁక ఔద్ధత్యము చాలించి శాంతింపుము. తురుష్కప్రభువు పశ్చాత్తాపము తెలుపుచున్నాఁడు. కావున మమ్ము అందరిని రక్షింపుము" అని ప్రార్థించెను.

అంతట ఆంజనేయుఁడు శాంతించి వెడలిపోయెను. పాదుషా శ్రీరామ జయంతిని మరల స్వేచ్ఛగా జరుపుకొనునట్లు బతిమాలి నష్టమైన సొత్తుకు పదిరెట్లు అధికముగా ముదరా యిచ్చి వెడలిపోయెను.

ఉద్ధవచిద్ఘనుఁడును ఆమహోత్సవమును మహావైభవముతో పూర్తి చేసి గ్రామవాసుల కానందము గలిగించి మరికొంతకాల మక్కడ నుండి అనేకులను రామభక్తులుగా చేసి వెడలిపోయెను.

అతఁడు బ్రతికియున్నంతకాలము నిష్ఠె రామభజనము చేసి అనేకులకు తర ణోపాయము నెఱిఁగించి, అవసానమున శ్రీహరిసాయుజ్యము పొందెను.

శ్లో. యో దండకారుణ్యనివాసరేంద్రాన్ కోదండలీలావిషయాం చకార,
వేదండశుండాయితబాహుదండః కోదండపాణిః కులదైవతం నః.

---

# మాండలికరాజు

శా. "నీ మూర్తుల్గన నీ కథల్వినన మదిన్నీ పాదతీర్థాల్గొని
ప్రాక్ప్రేమోదంబు తెరుంగ నీచరణతోయం బాడ, నైవేద్యము
న్నేమం బొప్ప భుజింప, నీ జపము వర్ణింపం గృపం జేయవే
శ్రీమించన్ బహుజన్మజన్మములకున్ శ్రీయాదినారాయణా!"

మాండలికునకు చిన్నతనమునందే వైరాగ్యము భక్తి అంకురించెను. అది చూచి తల్లిదండ్రులు ఆనందమును, దుఃఖమును గూడ బొందిరి. రాజ్యము, వైభ వము, ఐశ్వర్యము విడిచి సన్న్యాసి యగునేమో యని దుఃఖము, ప్రహ్లాదుని వలె శ్రీహరి కటాక్షమునకు పాత్రుఁడగునని యానందము. ఏమయినను మంచి దియే యని తండ్రి యుక్తకాలమునందే కుమారునకు విద్యాభ్యాసము ప్రారంభము చేసెను.

మాండలికునకు అచ్చియున్నట్లు సకలవిద్యలును స్వల్పకాలమునందే స్వాధీన మయ్యెను. విద్యలు స్వాధీనమైన కొలఁది జ్ఞానము హెచ్చెను. జ్ఞానము హెచ్చిన కొలఁది వైరాగ్యము హెచ్చెను. వైరాగ్యము హెచ్చిన కొలఁది భక్తి హెచ్చెను. అయితే అతఁడు మాటకారి కాఁడు. మితభాషి. ఈకారణముచే అతని హృదయ మున ఏమి జాగరత మగుచున్నదో యెవరికిని దెలియకుండెను.

ఒకనాఁడాతఁడు శ్రీహరిని స్మరించుచు ఉద్యానవనమున విహరించుచుండఁగా నొకభాగవతోత్తముఁడువచ్చి "వత్సా! నీవు రాజపుత్రుఁడవే భావికాలమున ఈరాజ్యమునకు నీవే యధిపతివి; గాని నీముఖమున రాజసమునకు బదులు సత్త్వగుణము వెల్లివిరియుచున్నది. నీ కన్నులు కరుణార్ద్రహృదయతను దెలుపుచున్నవి. మొత్తము నీయాకారమంతయు శ్రీహరిభక్తుఁడ వని తెలుపుచున్నది. ఓయీ! కావున నే పాండురంగనికి నీయం దట్టి వాత్సల్యము కలిగినది. పండరినాథుఁడు నాకొకరాత్రి స్వప్నమున సాక్షాత్కరించి నాయంతరంగభక్తుఁ డగు మాండలికునకు తారకమంత్రము నుపదేశింపు మని యానతిచ్చుటవలన వెదకికొనుచు నే నిట్లు వచ్చితిని" అని చెప్పఁగా మాండలికుఁడు "మహానుభావా! మీయనుగ్రహము కంటెను పాండురంగని యనుగ్రహము ఆశ్చర్యము గొలుపుచున్నది. ఏమన? నేను బాలుఁడను. ఏమియు నెఱుఁగనివాఁడను. పాండురంగని సేవించుటయు నెఱుఁగని వాఁడను. అట్టి నాకు ఇట్టి యదృష్టమా? మహాత్మా! అంతో యింతో జ్ఞానము వచ్చినప్పటినుండియు నా కైహికములయెడల జుగుప్స కలుగుచున్నది. నాతలిదండ్రులు నన్ను ఐహికసుఖలోలునిగాఁ జేయుట కనేకవిధముల ప్రయత్నించుచున్నారు. అట్టిసమయమున కాలక్రమమున నేను సంసారవ్యామోహమున చిక్కి పతితుఁడనై పోకుండ పాండురంగఁడు నాకిట్టివరము అయాచితముగ దయచేయుట కంటెను నా కిం కేమి కావలెను? మహానుభావా! ఇప్పటికే నేను సదాచార్యునికై యన్వేషించుచున్నాను. కావున దయచేసి నాకు శ్రీహరితత్త్వము నెఱింగించి తారకమంత్రోపదేశము చేయుము" అని ప్రార్థించెను.

అంతట ఆభాగవతోత్తముఁడు శుచిర్భూతుఁడై, రాజపుత్రుఁడు స్నానాదికము నిర్వర్తించుకొని రాఁగా తారకమంత్రోపదేశముచేసి "వత్సా! దీనిని శ్రద్ధతో జపించుచు దయాసత్యశౌచములు గలవాఁడవై సంసారవ్యామోహమునఁ దగుల్కొనక జాగ్రత్తగా నుండుము. ఎల్లప్పుడును భగవద్భాగవతకైంకర్యము చేయుచు నిత్యానందివై యుండుము" అని చెప్పెను. అందుకు మాండలికుఁడు "స్వామీ! నన్ను తరింపఁజేసితిరి. అయితే రూపరహితుఁ డగు శ్రీరామచంద్రుని నే నెట్లు పూజింపఁగలను? దీని కుపాయము చెప్పవలయు" నని కోరెను. అందుకు ఆచార్యుఁడు "వత్సా! పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు. నిరాకారుఁడు. నిరంజనుఁడు; అయినను ఆతఁడు లోకముల నుద్ధరించుట కప్పుడప్పుడు సాకారుఁడై యవతరించుచుండును. రావణాదిరాక్షసుల బారినుండి ప్రజల నుద్ధరించుటకు శ్రీరామచంద్రుఁ డట్లవతరించినవాఁడే. శ్రీరామచంద్రునియందు భగవల్లక్షణము లున్నంత యధికముగా మఱే యవతారమునందును లేవు. ఆకారణమువలననే దేశమంతయు రామభక్తిభరితమై

యున్నది. కావున నీవు సగుణారాధనము చేసినను నిర్గుణారాధనము చేసినను పర మేశ్వరుని కొక్కటే. నీ కెట్లు మనస్కరించిన అట్లుచేసి తరింపుము" అని బోధించి వెడలిపోయెను. మాండలికుఁడు మితభాషి. గావున అది మొదలు మానసికముగ నిర్గుణపరబ్రహ్మమునే యారాధించుచుండెను.

తల్లిదండ్రుల యనుజ్ఞవలన మాండలికుఁడు యుక్తకాలమున సర్వలక్షణ సంపన్నురా లగు సులక్షణయను రాజపుత్రికను బెండ్లియాడెను. ఆమె రూపవతియే గాదు. విద్యావతియు. పైఁగా ఆమె విరాగిణి. రాజసభోగము లన్న ఆమె కిష్టము తక్కువ. ఆమెయు భగవద్భాగవతారాధనమున చాల యభిలాష గలది. తన భర్త భగవద్భక్తుఁ డగుట మాత్రమే యామె యెఱుఁగును; గాని కీర్తనము, పూజనము, భజనము మున్నగువాటియం దాఁతడు పాల్గొనకపోవుట యామెకు కష్టముగా తోఁచెను. అందుచే నామె యొకనాఁడు "నాథా! శ్రీహరిని పూజించినచో మీ భక్తికి బంగారునకు పరిమళ మబ్బినట్లుండును" అని విన్నవించెను. అందుకు మాండలికుఁడు "ప్రియా! నీహితోపదేశము చాల విలువగ్గైనది. దానికి నా కెంతయు నానందమైనది. అయితే మాతండ్రిగారు రాజ్యభారమంతయు నామీఁదనే మోపి తాము సాక్షీభూతులుగా నున్నారు. పూజాదికమున ప్రవృత్తుఁడనైనచో నాకు రాజకార్యాలోచనములలో శ్రద్ధ చేయుటకు వీలుండదు. రాజకార్యములకును పూజాదికమునకును సామరస్యము లేదు. నే నీవూజాదికములలో ప్రవృత్తుఁడనై యుండునెడల పరరాజులు కుట్రలు పన్ని దండెత్తివచ్చెదరు. జయ మెవరి దైనను దానంజేసి రక్తపాతము కలుగును. అనేకమనుష్యులను సంహరింప వలసివచ్చును. అంతకంటె యుద్ధాదికములగు ఉత్పాతములు లేకుండఁజూచుకొనుట మంచిది గాదా? ఏమి చేయుచున్నను శ్రీహరి నాహృదయమున అంకితుఁడై యే యున్నాఁడు" అని బదులు చెప్పెను.

సులక్షణకు దీనితో తృప్తి కలుగలేదు; గాని అంతకంటె అధికముగగాని, తరుచుగాని యీవిషయము చెప్పినచో భర్తకు ఆయాసము కలిగ్గి, దానివలన చిక్కులు రావచ్చు నని తలఁచి యామె అప్పటి కంతటితో నూరకుండెను; గాని వలయునపు డెల్ల యీవిషయము నాతనికి జ్ఞాపకము చేయుచుండెను.

కాల మిట్లు కడచిపోవుచుండఁగా నొకనాటిరాత్రి గాఢనిద్రలో నుండఁగా మాండలికుని నోటినుండి రామనామము బహిర్గత మయ్యెను. అప్పటి కింకను నిద్ర పట్టక యిటునటు దొర్లుచు ఉన్న సులక్షణ అది విని చకితయై లేచి కూర్చుండి భర్తదెసకు చూడసాగెను. మరల ఆతని నోటినుండి అట్లే రెండు మూఁడుమార్లు

రామనామము ఉండియుండి బహిర్గతమై తుదకు కట్ట తెగిన చెఱువునుండి నీరు ఏకధారగా ప్రవహించునట్లు రామనామోచ్చారణము భజనముగా మారెను.

అది చూచి సులక్షణ తన భర్త గాఢనిద్రలోఁ గూడ రామభజన చేయుచున్నందుకు చాల నానందించెను. మానసికారాధనము మితిమీరినఁ గాని యిట్టిది సంభవింపఁదని గూడ ఆమె గ్రహించెను.

దినదినమును రాత్రి యిట్లే యగుచుండెను. అంతట సులక్షణ ద్వాదశి రాఁగా నాఁడు నగరమునందలి ప్రజల కంపరకును అన్నదానము చేసెను. కారణమేమని మాండలికుఁ డడుగఁగా నామె "మీరు చేయుచున్న తారకమంత్రజపమునకును, రామభజనమునకును శాంతిగా అన్నదానము చేయుచున్నా" నని చెప్పెను. అదివిని ఒకందుకు ఆనందించినను మాండలికుఁడు తన రామభజనముఅందరికిని తెలిసిపోయినదే యని లజ్జించెను.

కాల మిట్లే కడచిపోవుచుండఁగా మాండలికుఁ డొకనాఁడు "శ్రీరామ చంద్రుఁడు అప్పుడప్పుడు దివ్యమంగళవిగ్రహసేవ యొసంగుచు నాకు ప్రలోభపెట్టుచున్నాఁడు. ఆవిగ్రహము చూడకుండ నే నిఁక క్షణమైన నుండఁజాలను" అని నిశ్చయించి బహిరంగముగా అంతఃపురమునందే రామభజనము చేయుచు ఆవేశ మధికము కాఁగా ఇచ్ఛామాత్రమున పాంచభౌతికదేహమును విడిచెను. అది చూచి పరిజనులందరును తరువాత ఆత్మీయు లందరును వచ్చి దుఃఖించుచుండఁగా సులక్షణ "భర్తలేని ఆడుదాని బ్రతుకు రోత" అని తలంచి "నేను నాభర్తచెంతకే పోయెదను" అని నిశ్చయించుకొని రామస్మరణము చేయుచు మాండలికునివలెనే ఇచ్ఛామాత్రమున తనువు దొరంగెను. ఇది యంతయుఁ జూచి అందరును ఏకకాలమున ఆశ్చర్యమును దుఃఖమును గూడ బొందిరి.

ఉ. చాలును శాస్త్రపాఠములు చాలును వేదము లభ్యసించుటల్
చాలు జపంబులుఁన్ దపము చాలు వ్రతంబులు తీర్థయాత్రలున్
జాలు సదోపవాసములు సత్క్రతువుల్ ఘనయోగనిష్ఠలున్
జాలఁగ భీతి మాన్ప రఘుసత్తమునంస్మరణంబు గల్గుటన్.

# గోపీచంద్రుఁడు

చ. నిలయములో నొకర్తు నవనీతహరున్ హరి డాఁచి గట్టిగా
తలుపు బిగించి యక్కొడుకు తల్లికిఁ దెల్పఁగఁబోయి యందులో
ఖలగుణబద్ధుఁడౌ నతని గన్గొని యూరడివచ్చి రిత్తబా
నలు గని సారె కేక లిడ నత్తిలు నా బలుదంటఁ గొల్చెదన్.

గౌడబంగాళాదేశమున త్రిలోచనచంద్రుఁ డనురాజు న్యాయముగా ప్రజాపాలనము చేయుచుండెను. అతని భార్యపేరు మైనావతి. కొడుకు గోపీచంద్రుఁడు.

గోపీచంద్రుఁడు యౌవనవంతుఁ డగునప్పటికి త్రిలోచనచంద్రుఁడు గతించెను. అంతట గోపీచంద్రుఁడు పండ్రెండువందల రాజపుత్రికలను పెండ్లి చేసికొని, పదునాఱువందల ఉంపుడుకత్తెలను ఉంచుకొని ఐహికవిలాసములలో మునిఁగి తేలసాగెను.

మైనావతి భర్త గతించిన తరువాత విరాగిణియై కాలము గడుపసాగెను. ఒకనాఁ డామె మేడమీఁద సంచరించుచుండఁగా పురము బైట నొక సాధువు అరణ్యమునుండి కట్టెల మోపు తెచ్చుకొనుచుండెను. ఆమోపు అతని నెత్తిమీఁద ఉండక ఒక మూర యెత్తున అంతరాళమున నుండెను.

ఇది చూచి మైనావతి అతఁడు యోగసిద్ధిఁ బడిసిన మహానుభావుఁ డని తలంచి పరిచారికలవలన జాలంధరుఁ డను సాధువు అని యెఱింగి వెంటనే అంతఃపురము విడిచి అతని సన్నిధికిఁ బోయి సాష్టాంగవందనము లాచరించి "మహాత్మా! నాకు తరణోపాయము నెఱిఁగింపవలె" నని ప్రార్థించెను. అందుల కాతఁడు "రమణీ! నీవు రాజమాతవు. ఏవిషయమునందును నీ కేమియు లోటు లేదు. మా మార్గము చాల కఠిన మైనది. నీవు అనుసరింపలేవు. కావున నీవు సంసారమునం దుండియే దానధర్మములు చేయుచు తన్మూలమున పుణ్యలోకములను బడయుము" అని చెప్పెను; గాని మైనావతి అందుకు అంగీకరింపలేదు. "స్వామీ! భర్తతో నేను సకలసుఖముల ననుభవించితిని; గాని నాకిప్పుడు ఐహికసుఖములమీఁద విరక్తి పుట్టినది. దేవరవారు నన్ను తిరస్కరింపవలదు. నాకు భవబంధవిమోచనము కావలెను. అందుకు మీరే యాధార మని వచ్చితి" నని యనేకవిధముల నామె ప్రార్థించెను.

అపుడు జాలంధరుఁడు 'ఈమెకు నిక్కమైన వైరాగ్యము కలిగినదని నిశ్చయించుకొని "అమ్మా!

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

అనగా "సకలధర్మములను విడిచి నన్నే శరణు పొందుము. నేను సకలపాపముల నుండి నీకు ముక్తి నిచ్చెదను. దుఃఖింపకుము" అని శ్రీకృష్ణభగవానుఁడు సెల విచ్చెను. సర్వము శ్రీకృష్ణార్పణము చేయుటయే మోక్షమునకు ప్రథమో పాయము; గావున నీవు సకలైహికములను తృణీకరించి శ్రీహరినే సేవింపుము. ఐహికవిలాసము లన్నియు అవిద్యాజనితములు. నరకప్రదములు. అందు సుఖము లేదు ఆనందము లేదు" అని బోధించి ఆమె శిరమున చేయి ఉంచి మంత్రోపదేశము చేసి పంపివైచెను.

అది మొద లామె శుచియై నిష్ఠాపరురాలై శ్రీహరి నర్చించుచు, సర్వ కాలసర్వావస్థలయందును శ్రీహరినే స్మరించుచు, కీర్తించుచు, భజన సేయుచు అప్పుడప్పుడు జాలంధరుని దర్శించుచు కాలము గడుపసాగెను.

మైనావతి ఊరిబైట నున్న జాలంధరుని మఠమునకు తరుచు పోవుచుండుట అనేకు లనేకవిధముల చెప్పుకొనుట కారంభ మయ్యెను. ఈసంగతి కర్ణాకర్ణిగా పెద్ద కోడలికి తెలిసెను. అంతట నామె యొకరాత్రి భర్తతో సంతోషముగ నున్న సమయమున మైనావతి ప్రస్తావము చేసెను. గోపీచంద్రుఁ డందుకు "రేపు ఆసంగతి యోచించెద" నని బదులు చెప్పెను.

మరునాటి ఉదయము మైనావతి మరల మఠమునకుఁ బోయెను. అది చూచి రాజు చాల క్రుద్ధుఁడై నమ్మిన బంటుల నంపి జాలంధరుని కోటకు రప్పించి ఎదురేగి "స్వామీ! దయచేయుఁడు మీరిక్కడ చాల కాలమునుండి యున్నను నేను మీమహిమ గుర్తింపలేకపోయితిని" అని పొగడి "నేడు మీరిక్కడనే యుండి మాగృహము పావనము చేయవలయు" నని కోరెను. జాలంధరుఁడు ఆనందించి అట్లే చేసెను. అంతట అర్ధరాత్రిసమయమున రాజనియోగమున భటులు జాలంధరుని గొనిపోయి ఒక బావిలోఁ బడద్రోచి వెడలిపోయిరి. అయినను అతఁడు తన యోగశక్తివలన నీటిమీఁద తేలుచు హరిధ్యానము చేసికొనసాగెను.

మరునాఁడు యథాపూర్వముగ మైనావతి మఠమునకుఁ బోయి శిష్యులవలనఁ గూడ గురునాథుని సంగతి తెలిసికొనజాలక దుఃఖించుచు నింటికి వచ్చెను. పిదప పండ్రెండు సంవత్సరములు కడచిపోయెను; ఈదీర్ఘకాలమున శిష్యులు నాలుగు దెసలకును జని వెదకుచునే యుండిరి; గాని స్వామిజాడ తెలియలేదు. మైనావతి దుఃఖము పోలేదు.

ఒకనాఁడు గోపీచంద్రుఁడు స్త్రీపరివృతుఁడై కూర్చుండెను. మేడమీఁద నున్న మైనావతి అది చూచి "అయ్యో! నా కుమారుఁ డెంత యందముగా నున్నాఁడు.

ఎంత వైభవము ననుభవించుచున్నాఁడు; గాని ఇతనిని గూడ తుదకు యముఁడు తీసికొనిపోవునుగదా" అని కన్నుల నీరు గార దుఃఖించెను. ఆవెచ్చని కన్నీరు క్రింద నున్న గోపీచంద్రునిమీఁదఁ బడెను. అంతట నాతఁడు పైకి చూచి, వెంటనే తల్లి చెంత కరిగి "ఏమమ్మా? దుఃఖించెద వేఁ?" అని యడిగెను. అందు కామె జరిగిన దంతయు చెప్పి "బిడ్డా! ఎంత హెచ్చుగా నున్నను సంపదయు, ఎంత చక్కగా నున్నను ఐహికసుఖములును, ఎంత దృఢముగా నున్నను శరీరమును చంచలములు గాని స్థిరములు గావు. సర్వేశ్వరుఁ డొక్కఁడే అవ్యయుఁడు. సదాచార్యు నాశ్రయించి భగవన్మహిమ తెలిసి తరింపు" మని చెప్పఁగా కొడుకు "సదాచార్యు లెక్కడ లభింతు" రని యడిగెను. "జాలంధరులే సదాచార్యులు. వారు కాన్పించుట లేదు" అని యామె మరల చెప్పగా కొడుకు ముందు 'క్షమించెద' నని పించుకొని పిదప పండ్రెండు సంవత్సరముల క్రిందట జరిగిన దంతయు చెప్పెను. అందుకు మైనావతి మిగుల దుఃఖించి చాలసేపటికి కోల్కొని "ఆబావిలో వెదకింపుము. అందేయున్నచో వారు చనిపోయి యుండరు. వారు జరామరణములను సాధించినవారు నీటిపైని తేలుచునే గూడ నుందురు" అని చెప్పెను.

ఇంతలో జాలంధరుని శిష్యులై దువందమంది వచ్చి పురముబైట ఉద్యానవనమున విడిసి తమ రాక మైనావతి కెరిగించిరి. వారు జాలంధరునికై దేశదేశములు తిరుగుచుండఁగా నొకచో నొక సాధువు కనబడి 'జాలంధరులవారు స్వస్థలము నందే ఒక బావిలో సుఖులై యోగసమాధిలో నున్నారు' అని చెప్పఁగా విని, ఆనందించి యిక్కడకు వచ్చిరి. మైనావతి గోపీచంద్రునకు వారి రాక నెరిగించి కొనిపోయి ప్రధానశిష్యుని కంతయు నెరిగించి అతని కాళ్లమీఁదను బడు మని కుమారుని కాజ్ఞాపించెను. ప్రధానశిష్యుఁడు గోపీచంద్రుని చూడగానే ఆగ్రహావేశము పొందియు మైనావతి కోరుటవలనను, తనకు తోచియుఁగూడ ఆగ్రహము నుపసంహరించుకొని "నీకు బ్రతుకుట కవకాశ మున్నది. ఇనుము, తామ్రము, వెండి, బంగారము—వీటితో నీపోలికగా నుండునట్లు నాలుగు విగ్రహములను చేయింపుము" అని చెప్పెను.

రాజట్లే చేయించెను. విగ్రహములతోఁగూడ అందరును నూతిచెంతకుఁ బోయిరి. భటులు పైని పెరిగిపోయిన నాచు తొలఁగింప జాలంధరుఁడు నీటిమీఁద బాలచంద్రునివలె తేలుచుండెను.

అపుడు ప్రధానశిష్యుఁడు గోపీచంద్రుని పిలిచి "ముస్ముందు ఇనుపవిగ్రహమును ముందు ఉంచుకొని నీవు గురూ అని పిలువుము. వెంటనే అది భస్మమైపోవును. తరువాత తామ్రవిగ్రహమును ముందిడుకొని అట్లే పిలువుము. నాలుగువిగ్రహ

ములను ఇక్లే ముం డిడుకొని పిలుపుము" అని చెప్పి "గురూ! ఈరాజునకు నే నభయదానము చేసియున్నాను. ఇతనిని నన్నుగూడ రక్షింపవలయును" అని ప్రార్థించెను.

పిదప నతఁడు 'పిలువు' అనగా గోపీచంద్రుఁడు 'గూరూ' అని పిలిచెను. యోగి 'నీ వెవర' వని యడుగగా రాజు 'దాసుఁడు గోపీచంద్రుఁ' డనియెను. వెంటనే 'నీవు భస్మమై పోవుదువుగాక' అని యోగి యనగా ముం దున్న ఇనుప విగ్రహము భస్మమైపోయెను.

తరువాత మూఁడు విగ్రహములను ముందు ఉంచుకొని రాజు అక్లేచేయగా యోగియు అక్లేచేసెను. పిదప ప్రధానశిష్యుని ప్రోత్సాహముమీఁద గోపీచంద్రుఁడు బావివద్ద నిలిచి మరల 'గూరూ' అనియెను. నాలుగు మాట్లు ప్రయోగించినను తన శాపము వ్యర్థమైపోయినందుకు ఆశ్చర్యపడి జాలంధరుఁడు మరల 'నీవెవర' వని యడిగెను. అందుకు రాజు 'మైనావతి కొమారుఁడ' నని బదులుచెప్పగా యోగి "నీవు చిరకాలము జీవించి హరిభక్తుఁడవై అవసానమున ముక్తి పొందెదవుగాక" అని యాశీర్వదించెను. అందుకు గోపీచంద్రుఁడును, మైనావతియు చాల ఆనందించి స్వామిని, ప్రధానశిష్యుని అనేకవిధముల కొనియాడిరి.

పిదప జాలంధరుఁడు పైకి రాగా మైనావతి పాదముల వ్రాలి తరువాత తన కొడుకును జూపెను. గోపీచంద్రుఁడును పాదాభివందనము గావించి తన యపరాధ ములను క్షమింపఁగోరగా యోగి క్షమించెను.

అందరును మఠము చేరిరి. రాజు నాఁడు మహానందముతో జాలంధరులవారి పునరాగమనసూచకముగా తన రాజ్యమున నున్న సకలప్రాణులకును మృష్టాన్న దానము చేయించెను. జాలంధరుఁడు గోపీచంద్రుని భక్తివైరాగ్యములకు చాల ఆశ్చర్యపడియెను.

పిదప గోపీచంద్రుఁడు "స్వామీ! నామనస్సు సంసారమునుండి విముఖమై పోయినది. దయయుంచి నాకు సన్న్యాసము దయచేయుఁడు." అని ప్రార్థించెను. అందుకు స్వామి "వత్సా! నీవు విరాగి వగుట నిజమే గాని అందుకురాజ్యమును త్యజించి సన్న్యసింపనక్కరలేదు. సంసారమున నుండియే నీవు హరినిసేవింపవచ్చును" అని చాలదూరము చెప్పియు అతఁడు విననందునను, తుదకుమైనావతి గూడ నంగీక రించుటవలనను సన్న్యాసమిచ్చి జ్ఞానోపదేశము చేసెను.

సన్న్యసించిన వెంటనే గోపీచంద్రుఁడు తన యింటికి వెళ్లి "భవతి భిక్షాం దేహి" అని పలికెను. ఎవరో సన్న్యాసి అని యువ్వలకు వచ్చి పెద్ద భార్య అంతయుఁ

దెలిసికొని విచారింపగా గోపీచంద్రుడు ఆమెకు హితోపదేశముచేసి వెడలి పోయెను. అతఁడిట్లే తన ఆత్మీయుల కంపరికిని గూడ కొంతబోధ గావించి దేశాటన మునకు వెడలిపోయెను.

మ. అమరు ల్హోత్రుకులచే మునుల్ సుతులచే నార్యుల్ మహానిష్ఠచే
సమరోత్సాహజనుల్ పురశ్చరణచే సాధుల్ దయాంభోధిచే
సమితోదారకళాఢ్యు లర్పణముచే నధ్యాత్ము లైక్యంబుచే
సమతం గాంచిరి నీ పదాబ్జములు కృష్ణా! దేవకీనందనా!

---

# కాన్హోపాత్ర

శ్లో. "నళినీదళగతజలమతితరళం, తద్వజ్జీవితమతిశయచపలం,
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం, లోకం శోకహతం చ సమస్తమ్."—భజగోవిందము.

పండరీపుర ప్రాంతము నందలి మంగళవట మను గ్రామమున శ్యామ యను నొక వేశ్య యుండెను. ఈకాన్హోపాత్ర ఆమె కొమార్తె.

శ్యామ చాల ధనము సంపాదించెను. ఆమె యౌవనవతియై యున్నపుడు ధనవంతు లగు పురుషులును రాజకుమారులును అనేకు లామె యనుగ్రహమును గోరి ఆమె ముగింట వేచి యుండెడివారు. వారిలో ననేకు లామెకై తమ సర్వ స్వమును పోగొట్టుకొని బికారు లైపోయిరి.

శ్యామ తానంత ధనము నార్జించియు కొమార్తమూలమున గూడ ఇంకను విశేషధనము నార్జింపఁదలఁచియున్నది. అందు కనుగుణముగా కాన్హోపాత్ర మిగుల సుందరియై ప్రతిభానతియై యుండెను.

జ్ఞానము వచ్చినది మొదలు కాన్హోపాత్రకు శ్యామ విటుల నాకర్షించు రీతులు, ధనము సంపాదించు ప్రక్రియలు అనేకములు నేర్పెను. అక్షరజ్ఞానము కలిగినది మొద లామె కిదియే ప్రధానవిద్య.

కాని శ్యామ తన వాంఛ అంతయు మరుమరీచికవలె ఉపహాత మైపోవునని యెప్పుడును తలంపలేదు. కాన్హోపాత్ర పెరుగుచున్న కొలఁదియు నాముహూర్తము సమీపించుచున్న దని యామె యెంతమాత్రమును గ్రహింపలేదు.

కాలక్రమమున శ్యామయింటికి మరల యువకుల రాకపోకలు ప్రారంభ మయ్యెను. శ్యామ చాల బెట్టుసరిగా నుండెను.

ఈసమయమున కాన్హోపాత్ర ఇప్పుడే మేల్కొఁనకున్న చిక్కు వచ్చు నని తలంచి ఒకనాడు 'అమ్మా, నాకై నీవు పురుషులను చూడ నక్కరలేదు. సుముఖుము

వచ్చినపుడు నాకు తగినవానిని నేనే చూచికొనియెదను' అని తల్లితో చెప్పెను. అందుకు శ్యామ కూఁతురు మోహావేశముతోడనే కొంత కాలము గడపివేయు నేమో యని భీతిల్లి అందుకు ప్రతిక్రియ చేయవలయు నని మతబోధ ప్రారంభించెను; గాని కాన్హోపాత్ర 'విను' మని యిట్లు చెప్పెను.

"నీవు నేను పుట్టకపూర్వమునుండియు, నాకొరకు నీవు కష్టపడి అపార ధనము నార్జించితివి. నాకొరకు నీవు కష్టములనే పొంది ఎవఁడు వచ్చినను ధనమే ప్రధాన మనుకొని నీయౌవనము నంతను గడపివేసితివి. తత్ఫలముగా నీవు కోట్లు సంపాదించినావు. నీ విపుడు మహారాజులకుఁగూడ అప్పు పెట్టఁగల స్థితిలో నున్నావు. నెలనెలకును మనకు వసూ లగుచున్న వడ్డీ నైన మనము వెచ్చింపఁజాలకున్నాము."

"ఇట్టి స్థితిలో నేను కేవలము ధనసంపాదనమునందే ప్రవృత్తురాలను గావలసిన యవసర మేమున్నది? రాశిలో తీయుటయే గాని వేయుట వలదా. యందు వేని జాగ్రత్తగా తీసికొనుచో వేయవలసిన యావశ్యక ముండదు తీయుటకే నేర్చినవా రట్లు జాగ్రత్తగా మసలుకో గలరా యందువేని అట్లుండలేనివారు వేయుటకు మాత్ర మెట్లు సమర్థు లగుదురు? కావున దుర్లభ మైన యీశరీరమును అమ్ముకొని ఉత్తమమైన మానవజన్మము పాడుచేసికొనుటకు నాకిప్పుడు కారణము లేదు."

"అది యట్లుండనిమ్ము. అమ్మా! నీవెవరు నే నెవతను? నేను పుట్టకపూర్వము నన్ను నీవు, నిన్ను నేను ఎరుగము. ఈదేహము విడిచిన తరువాత గూడ మనస్థితి యిట్టిదే."

"ప్రాణులకు భోగము లవసరములా? గంజి త్రాగువానికి ఆహారముయొక్క ప్రయోజనము శరీరధారణము. స్వర్ణపాత్రమున పంచభక్ష్యపరమాన్నములు భుజించువానికిని ఆహారముయొక్క ప్రయోజన మదియే శరీరధారణమునకు గంజి, కందమూలములు, అకు నలము, జలము, తుదకు గాలిగూడ సమర్థమైయున్నపుడు భక్ష్యము లేల? పానీయము లేల? అవి రాజసమును, తామసమును పెంచి మానవ జన్మను ధ్వంసముచేయుటకే పనికివచ్చును; గాని మంచికి పనికిరావు"

"క్రిందటి జన్మమున మన మెట్టి రూపము పొందితిమో తెలియదు. లోకములో అనేకరకముల జంతువు లున్నవి. ఒక్కొక్క రకమున మరల ననేకరీతుల ప్రకృతు లున్నవి. అన్నియు ఈశరీరధారులు ధరింపవలసినవే. గతజన్మమున చీమయై యుండుప్రాణి యిప్పుడు బ్రాహ్మణుఁడై యుండవచ్చును. ఇప్పుడు బ్రాహ్మణుఁడై యుండు ప్రాణి ముందు పందియైగాని, సక్కయై కాని, ఛుంచియై గాని,

తుదకు అమేధ్యమునందలి పురుగై గాని పుట్టవచ్చును. అనగా ముందే జన్మము వచ్చునో యెవరికిని తెలియదు."

"అయితే యీఅజ్ఞాతవిషయమునకు సాధన మేదియు లేదా? మానవబుద్ధికిది అసాధ్య మైన దేనా?"

"ఇది యాలోచింపఁదగిన విషయము. మానవులకు శ్రీహరి యీశక్తి నిచ్చియున్నాఁడు. దీనిని ఉపయోగించుకొనకుండుట, లేకున్న దురుపయోగము చేయుట—ఇవి రెండును ఈశ్వరద్రోహములో చేరును;"

"కాయికసుఖమే జీవితపరమావధి యనుకొనువారే కోటానకోట్లు కలరు; కాని యాసుఖ మెంతకాలము? యౌవనము వచ్చువరకును ఆవాంఛయే కలుగదు. యౌవనము పోయిన నిఁక ఆవాంఛ నిలువదు. అనఁగా యౌవన మున్నంత కాలమే ఐహికసుఖము. అయితే మానవుని ఆయుర్దాయమున యౌవనము యొక్క పరిమితి బహుస్వల్పము; గాని అదియే మానవుల నధోగతి కీడ్చివేయు సమయము. అదియే పశువులకంటె మానవులకుఁగల విశిష్టతను చూపవలసిన కాలము. పశువులు ఆహారము తినును. నిద్రపోవును. అపాయములకు భయపడును. కాయికసుఖము పొందును. మానవులు గూడ నంతియే; యైన నిక మానవజన్మమునందలి యుత్కర్ష యెక్కడ కాన్పించును? భగవంతుఁడు జగత్తునంతను మానవులు లేకుండ పశుజాతులతో నింపివేయఁజాలఁడా? పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సృష్టిక్రమము ప్రాణికోటియొక్క తారతమ్యమును తెలుపుటకే యేర్పడినది. అనగా మానవజన్మకంటె ఉత్కృష్ణ మైనది మరియొకటి లేదు; గాని మానవులు శ్రీహరి ఏర్పరచిన యీవిశిష్టతను చంపుకొని పశువులలో చేరిపోవుచున్నారు. ఇతరులను చేర్చుచున్నారు."

"ఈవిధముగా మానవబుద్ధి దురుపయోగమై పోవుచున్నది. ఈరీతిగా మానవజన్మ కళంకితము చేయఁబడుచున్నది."

"ఐహికసుఖము లెంత యాభాసములో గమనించితివా? మన మీ శరీరమును చీనిచీనాంబరములతోడను, రత్నాభరణములతోడను, సుగంధద్రవ్యములతోడను అలంకరించుకొనుచున్నాము. అనేకవిధములైన విలువగల పదార్థములతో దీనిని పోషించుకొనుచున్నాము. మన మింత ప్రీతిగా చూచుకొనుచున్న ఈశరీరము శాశ్వతమా? ఉన్నంతకాలమైన దృఢముగా నుండునని చెప్పఁగలమా? సకలమునకును మనము ప్రాతిపదికగా—ఆధారముగా చూచుకొనుచున్న యీశరీరము ఆగామి-కాసంతయు నెగిరిపోయిన తరువాత ఒక్కక్షణమైన ఎవరైన నింటనుండనిత్తురా! పూలతో నలంకరింపఁబడు నీ శరీరము తుదకు బొగ్గులలోనే గదా ఉంచబడుచున్నది?"...

"ఇంతకును ఈశరీర మెట్టిది? ఏలాలత యనీ, బంగరు సలాక యనీ, విద్యుల్లత యనీ వర్ణింపఁబడు ఈశరీరము చర్మము తొలఁగించి చూచిన నేమగును? నేటికి గూడ నన్ను ఒడిలో కూర్చుండఁబెట్టుకొని ముద్దాడుచున్న నీవు అప్పు డట్లు చేసెదవా ? అథవా నాకు నేను నీమీఁద వ్రాలిన అంగీకరింతువా? నన్ను చూచిన పొంగిపోయెడి నీహృదయ మప్పుడు ఎట్లుండును? నన్ను చూచిన విప్పారెడి నీకను లప్పు డెట్లుండును?"

"ఆలోచింపుము. నీకు వ్యతిరేకము చెప్పి నీమనస్సునకు కష్టము కలిగించుటకు నేను పూనుకొనలేదు. నిన్ను దుఃఖపెట్టుటకు నేను పుట్టలేదు. నాసుఖము కోరి నీవు నీసకలమును వెచ్చించితివి. ఇఁక ముందును అట్లే చేయుము. అమ్మా! నలుగురతోపాటు భోగము లనుభవింపవలయు ననినచో నాకు నీవు అనంతధనరాసులను చేర్చిపెట్టియున్నావు. అట్లే పరమేశ్వరుఁడు నన్ను గురించి నేను జాగ్రత్త పడుటకు అపార మైన వివేకము నిచ్చియున్నాఁడు. ధనమును ఉపయోగించుట కనేకమార్గము లున్నవి; గాని వివేకమును వినియోగించుట కొకటే మార్గము. "నేను నే" ననుకొనే యీ నే నెవరు? వివేకమునకు వినియోగము కలిగించు జిజ్ఞాస యిది."

"నాకు యౌవనము వచ్చినది మొదలు మన యింటి కనేకయువకు లెగబడి వచ్చుచున్నారు. వారికి కాయికసుఖములు పొందుట కిండ్లలో స్త్రీలు లేక వచ్చుచున్నారా ? ఒక్క నాతో మాత్రమే వా రుండి పోదురా? నాకు ఈరూపము లేనిచో వారు నాకొఱకు వత్తురా? అనఁగా నేమి? వారిది పశుప్రవృత్తి. ఆపశువులకా నన్ను అప్పగింప చూచెదవు?"

"తల్లీ ! సంసారముయొక్క ప్రవృత్తి యిట్టిది. ఇందు సారము లేదు. ఇందు ఆపదలు అధికముగా నున్నవి. ఇది యొక మహాసముద్రము. ఇందు కూలుటకు ఆలోచన అక్కర లేదు. పుట్టుకతోడనే మన మిందు కూలియున్నాము. ఇఁక మన మిందు ఉండిపోవలసిన దేనా? వలదు వలదు. మన మీ సముద్రమును దాటి పోవలెను. ఇందుకు చేయవలసిన దేమి ? జన్మ యుండిన మన మీసముద్రమున కూలక తప్పదు; గనుక ఇఁక జన్మ లేకుండ చూచుకొనవలెను. ఇదియే మోక్షము. జన్మలన్నిం దెల్ల మానవజన్మము ఈమోక్ష మను ప్రాసాదము నెక్కుటకు చివరి మెట్టు. ఇఁక పైని మెట్టు లేదు. మోక్షమే యున్నది. అందే మన మడుగు పెట్టవలెను. మేడ యెక్కుటయా? క్రింద కూలబడుటయా? అమ్మా. ఐహికసుఖములే యింత మోహజనకములుగా నున్నవి. ఐహికసుఖములే ఇంత ప్రలోభము పుట్టించుచున్నవి. వీటికి పై మెట్టున నుండు ఆముష్మికసుఖము లెంత మోహజనకములుగా

నుండునో? అవి యెంత ప్రలోభమును పుట్టించునో మనము వాటినిగూడ చవి చూతము."

"అమ్మా! అదే పాండురంగఁడు చేతు లెత్తి నిన్ను నన్ను, ముక్తిప్రాసాదము నెక్కుటకు పిలుచుచున్నాఁడు. ఇంకను మనము వెనుకముందులు చూచుటా? తల్లీ! ఇంకను మనకు సందేహమా? ఇంకను మనకు సంశయమా?"

"నను గన్నతల్లీ ! నా యభ్యుదయమును కోరితివి. నా ముక్తిని గూడ కోరుము. నీవుగూడ నాతో రమ్ము."

ఇది విని శ్యామ ఆశ్చర్యపడెను. ఆమెకు దీనితో అజ్ఞానము పోయినది. కొమార్త కామె యెదురు చెప్పుటకు సాహసింపఁజాలక పోయినది.

పిదప నొకనాఁడు భాగవతు లనేకులు స్త్రీలును, పురుషులును—తుదకు బిడ్డలునుగూడ హరిభజనము చేసికొనుచు కాన్హోపాత్ర యింటిముందునుండి పండరీపురమునకుఁ బోవుచుండిరి. ఆషాఢశుద్ధమున ఏకాదశినాఁ డక్కడ గొప్ప మహోత్సవము జరుగును. వా రందరు నందునిమిత్తమే పోవుచుండిరి. గోవిందధ్యానములతో వారు వీథిలోనికి రాఁగా కాన్హో వడివడిగ నివ్వలకు వచ్చి, వారు హరిభక్తులగుట నెరింగి, ఒక్కక్షణము నిలువఁగోరి, వారి కందరికిని ముమ్మారు ప్రదక్షిణ నమస్కారము లాచరించి 'మహానుభావులారా! మీ రెక్కడకు దయచేయుచున్నా' రని యడిగెను. అందుకు వారు 'పాండురంగని సేవించుకొనుటకు పండరీపురమునకు పోవుచున్నా' మని చెప్పఁగా 'మహానుభావులారా! నాకును పాండురంగని సేవింప నుద్దేశ మున్నది. ఏకాకినై పోవుటకు జంకుచున్నాను; గావున నన్ను మీ వెంట గొనిపోయి తరింపఁజేయుఁడు' అని ప్రార్థించెను. వారు 'వల్లె' యనిరి. అంతట కాన్హో తల్లిదగ్గరకుఁ బోయి సెల వడిగి వారితోఁ గలిసి బయలుదేరెను.

మార్గమధ్యమున వా రామె ఐశ్వర్యమును తెలిసికొని అంతటైశ్వర్యవంతురాలు—అంత సౌందర్యవంతురాలు—విశేషించి నవయౌవనవంతురా లగు వేశ్య ఐహికముల నిట్లు త్యజించి శ్రీహరి సేవలో ప్రవృత్తురా లయినందు కాశ్చర్యపడి ఆమె భక్తిప్రపత్తులను మెచ్చుకొని పాండురంగని విలాసముల నన్నిటిని చెప్పుచు నామె నానందపరచిరి.

యుక్తసమయమున అందరును పండరిపురము చేరిరి. కాన్హో వారితోఁగూడ చంద్రభాగానదియం దవగాహనము గావించి పండరినాథుని దర్శించి, కరకమలములు జోడించి మోకరించి నిలిచి,

శ్లో. "నాస్థా ధర్మే న వసునిచయే, నైవ కామోపభోగే,
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం,

ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు.
దివి వా భువి వా మమాస్తు వాసో, నరకే వా నరకాన్తక ప్రకామమ్,
అవధీరితశారదారవిందౌ, చరణౌ తే మరణేఽపి చింతయామి.
కృష్ణ! త్వదీయపదపంకజపంజరాన్త, మద్యైవ మే విశతు మానసరాజహంసః,
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః, కంఠావరోధనవిధౌ స్మరణం కుత స్తే"

—ముకుందమాల.

అని యిట్లు ప్రార్థించి, యాత్రాపరులు చేయుచున్న గోవిందధ్యానము లాలించి పరవశ యగుచు గోపురద్వారమునకుఁ బోయి కూర్చుండి మరల హరిస్మరణము ప్రారంభించెను.

ఆమెతో వచ్చిన భాగవతు లందఱును వెంటనే వెడలిపోయిరి ; గాని ఆమె మాత్ర మక్కడనే యుండిపోయెను. ఆగోపురద్వారమునందే ఆమె నివసించి శ్రీహరిని సేవించుకొనుచుండెను. ఇట్లు కొలఁదిదినములు జరుగునప్పటికి ఆదేశము నేలు రాజు ఆమె సౌందర్యమును కర్ణాకర్ణిగా విని ముగ్ధుఁడై ఆమె గణిక యగుట వలన మరింత సాహసించి 'ఆమెను నాయెడల ముగ్ధ యగునట్లు చేసి అంతఃపురము నకుఁ గొనిరండు' అని భటులకు ఆజ్ఞాపించెను.

రాజభటులు వచ్చి హరిదాసులవలె నామెతో పరిచయము చేసికొని కొంచెము చనవు చిక్కఁగా రాజు సౌందర్యము, ఐశ్వర్యము, రసికత వర్ణించి తుదకు రాజాజ్ఞ నెఱిఁగించిరి. అది విని కాన్హో కళవళపడక 'రాజభటులారా ! మీరాజు అనుగ్రహము అపారముగా నున్నది. మీనేర్పు ప్రశంసాపాత్రముగా నున్నది. ఒక్క క్షణ మిక్కడ నుండుఁడు. పాండురంగని సందర్శించి, సేవించి క్షణములో వచ్చెద' నని బయలుదేరెను.

ఆరాజభటులు తమ ప్రయత్నము అనాయాసముగ అతిశీఘ్రముగ నెరవేరి నందుకు ఆనందపడుచు ఆమెను తీసికొనిపోవుటకు తగిన యేర్పాట్లు చేసికొ సాగిరి.

అట్లు కాన్హో ఆలయమునకుఁ బోయి స్వామి యెదుట మోఁకరించి నిలిచి "ప్రభూ ! ఆపద్బాంధవా ! దీనశరణ్యా ! ప్రాణవల్లభా ! నీయందే మనసు నిలిపి, నీ పాదసేవయందే బ్రహ్మానంద మనుభవించు నీ దాసి నొకరాజపశువు అపేక్షించు చున్నది. నీ వుపేక్షవహించినచో కుక్క పురోడాశము గొనిపోవునట్లు నన్ను రాజ భటులు కొనిపోఁగలరు. నిన్ను తప్ప అన్యుని నేను పురుషునిగా తలంపను. నా మనస్సు నీయందే లగ్నమై యున్నది. శ్రీహరీ! నన్ను రక్షింపుము' అని ప్రార్థించెను.

ఇది విని అర్చకులును, స్వామిని పూజించుచున్న భక్తులును రాజు దౌర్జ న్యమును నిందించుచుండఁగా కాన్హో శరీరమునుండి బ్రహ్మాండ మగు దివ్యతేజము వెలువడి శ్రీపాండురంగనిలో లీన మైపోయెను.

అది చూచి అక్కడివా రందఱును ఆశ్చర్యపడి, కాన్హోపవిత్రజీవనము ననేక విధముల ప్రశంసించి, పాండురంగని యాన చొప్పున ఆమె మృతకళేబరమును ప్రదక్షిణప్రాకారమున నొకచో సమాధి చేసిరి. ఆసమాధిమీఁద నొక వృక్షము బయలుదేరి యిప్పటికి అట్లే యున్నది. ఇప్పటికిని యాత్రాపరులు ఆవృక్షమును జూచి, కాన్హో పవిత్రజీవితమును స్మరించి ఆవృక్షమునుండి యొక పత్రమును గోసి కొని శిరమున ధరింతురు.

పిదప కాన్హో ఎంతసేపటికిని మరలి రాకుండుటవలన రాజభటులు విసిగి ఆలయ మునకుఁ బోయి విచారింపఁగా వారికి జరిగిన దంతయు అర్చకులు తెలిపిరి; గాని వా రది నమ్మక 'ఆమెను మీరే మోహించి ఎక్కడనో దాచివేసితి' రని నిందించుచు, వా రెంత మొరపెట్టుకొనినను వినక వారిని కట్టి కొట్టుచు రాజ ధానికిఁ గొనిపోయి జరిగిన దంతయు ప్రభువునకు చెప్పిరి.

అందుకు రాజు ప్రళయరుద్రునివలె మండిపడి అర్చకు లిచ్చిన ప్రసాదము గైకొని అందు కేశఖండము లుండుట చూచి 'ఇదేమి? పాండురంగనికి కేశకలాప మున్నదా?' అని ఉఱుముచు నడిగెను.

ప్రసాదమున కేశఖండము లుండినందుకే భయభ్రాంతులై యున్న అర్చ కులు ఈప్రశ్నకు మరింత గజిబిజిపడి ఆలస్యము చేసిన రాజు దండించు నని తలఁచి ముందు సంగతి చూచుకొనవచ్చు నని భావించి 'ఉన్నది' అని చెప్పిరి.

అసలే క్రోధోద్రిక్తుఁడై యున్న రాజు ఇది విని చకితుఁడై 'ఇక్కడ మీ మాట నమ్మక తీరదు; గాని నేను పండరిపురమునకు వచ్చి అంతయుఁ బరీక్షించెదను స్వామికి కేశకలాప ముండినచో మీరు బ్రతికినవారే. లేకున్న మిమ్ము చిత్రవధ చేయించెద' నని చెప్పుచు పండరిపురమునకు బయలుదేరెను.

యుక్తసమయమున అందఱును పండరిపురము చేరిరి. రాజు పరీక్షించెద నని న క్షణము నుండియు అర్చకులు 'పాండురంగా! నిన్ను తరతరములనుండి చిత్తశుద్ధిగాఁ గొలుచుచున్నాము. నీయెడల యెరిగియుండి మే మేమియు నపరాధము చేసియుండలేదు. నేఁడు మాకు విషమావస్థ వచ్చినది. మమ్ముద్ధరించినను రాజదండన మునకు పాలు చేసినను నీదే భారము' అని ప్రార్థింపసాగిరి.

రాజు స్నానాదికము నిర్వర్తించుకొని ఆలయమునఁ బ్రవేశించి పూజాదికము నిర్వర్తించుకొని పరిశీలింపఁగా స్వామికి ఆగుల్ఫలంబితమగు కేశకలాప ముండెను.

అది చూచి రాజు ఆశ్చర్యపడి సాష్టాంగపడి 'ప్రభూ! రాజసమువలన పరీక్షకు సిద్ధపడితిని. బుద్ధి వచ్చినది' అని లెంపలు వాయించుకొని అర్చకులను గూడ క్షమింపఁ గోరి కాన్హో సమాధిచెంతకు వచ్చి ప్రదక్షిణనమస్కారము లాచరించి, ఆవృక్షము నుండి యొక పత్రమును గోసికొని శిరమున ధరించెను.

పిదప రాజు అక్కడ నున్న భగవద్భక్తులకు, సాధువులకు బధిరపంగ్వంధాదులకు—సకలజనులకు మృష్టాన్నము పెట్టించి తృప్తి చేసి స్వామికి గొప్పగొప్ప కానుకలు చెల్లించి వెడలిపోయెను.

చ "తెలియక నాశహేతు వగు తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁగాక; మఱి చాఁక మీనము గాలపుం గొనం
గల పిశితంబు తా మెసఁగుఁగాక; యెఱింగియు మేము దుఃఖదో
హాలవనితాసుఖంబు విడనాడము మోహమహత్త్వ మెట్టిదో?"

—18 వైరాగ్యశతకము, భర్తృహరి.

---

# గౌరాంగస్వామి అను చైతన్యస్వామి

వంగదేశమునందలి నవద్వీపమున జగన్నాథమిశ్రుఁడు అను నొక బ్రాహ్మణుఁడుండెను. అతని భార్యపేరు శచీదేవి. వారికి వరుసగా ఎనమండుగురు ఆఁడుబిడ్డలు కలిగిరి; గాని ఒక్కతెయు నిలువలేదు. అందఱును గతించిరి.

కొంతకాలమునకు తొమ్మిదవ గర్భమున శచి కుమారుని కనెను. విశ్వరూపుఁడని వానికి పేరు పెట్టఁబడెను. పసితనమునుండియు విశేషప్రతిభను ప్రకటించుచు విశ్వరూపుఁడు పదియారేండ్లకే వేదవేదాంగములయం దసమానపండితుఁడయ్యెను; గాని అప్పటి కప్పుడే అతనికి వైరాగ్యము ప్రబలెను. వెంటనే యతఁడు సన్న్యసించి నాలుగేండ్లు కొంత దేశము తిరిగి తుదకు పండరీక్షేత్రమున సిద్ధిపొందెను.

మరికొంతకాలమునకు శచి మరల చూలాలై యొకమగబిడ్డను కనియెను. ఆప్రసవము వేపచెట్టుక్రింద నగుటవలన శచి కుమారునకు ముద్దుగా నిమి అని పేరు పెట్టుకొనెను. తండ్రి వానికే విశ్వంభరుఁ డని పేరు పెట్టెను.

నిమి పుట్టినపుడు సూతికాప్రదేశ మంతయు దివ్యతేజస్సు ప్రకాశించెను. వాని శరీరము మిసిమివలె పసిమి గలిగి మనోహరమై యుండెను. నిమి సాధారణముగ ఏడ్పే యెఱుఁగఁడు. ఎప్పుడైన ఏడ్చినచో వెంటనే 'కృష్ణా, కృష్ణా' అని యెవరైన పలికినచో వెంటనే ఊరకుండి కిలకిల నవ్వుచు ఆడుకొనుచుండును.

తలిదండ్రులు నిమి నెంతో గారాబముగా పెంచుకొనుచుండిరి. తమకుఁగలిగిన తొమ్మండుగురు బిడ్డలయందును నిమి విలక్షణముగ—ఒక దివ్యపురుషుఁడు లీలా



గౌరాంగస్వామి అను చైతన్యస్వామి—768.

మానుషవిగ్రహము తాల్చిన ట్లుండుటచే పరింత యుప్పొంగుచు వారు నిమిని క్రింద అడుగిడకుండ చూచుచుండిరి.

యుక్తసమయమున నిమికి ఉపనయన మైనది. గాయత్రి నుపదేశించునపుడు నిమి యొకకేక వేసి మూర్ఛిల్లెను. వెంటనే ఉపనయనమంటపమంతయు తేజస్వంతమై అందరిని ముగ్ధులనుచేసెను. ఆకాంతి తగ్గిపోవునప్పటివఱకును నిమికి చైతన్యము కలుగలేదు. ఉపనయనకాలమున నిమికి గౌరాంగుఁ డని పేరుపెట్టఁబడెను.

గౌరాంగుని పదకొండవసంవత్సరమున జగన్నాథమిశ్రుఁడు గతించెను. అది మొదలు శచియే గౌరాంగుని తల్లిగను తండ్రిగను కాపాడుచుండెను.

ఉపనయన మైనవెంటనే నిమి విద్యాభ్యాసము ప్రారంభించెను. అతనిగురువు గంగాదాసను విద్వాంసుఁడు. పదునెనిమిదేండ్లకే నిమి సకలశాస్త్రములయందును ప్రజ్ఞ సంపాదించెను. విశేషించి అతఁడు తర్కవ్యాకరణములలో సాటిలేని పండితుఁ డని ప్రఖ్యాతి పొందెను. విద్యాభ్యాసకాలమున గురువు గౌరాంగునకు శ్రీకృష్ణ చైతన్యుఁడని పేరుపెట్టెను. తరువాత చైతన్యుఁడు, గౌరాంగుఁడు అను నీ రెండు పేరులును సమానముగా వాడుకకు వచ్చెను.

విద్యాభ్యాసము ముగిసినవెంటనే చైతన్యుఁ డొకపాఠశాల నెలకొల్పెను. అతని బోధనాచాతుర్యమునకు ముగ్ధులై శిష్యు లనేకులు చేరిరి. అచిరకాలము నందే శిష్యులు గొప్ప గొప్ప పండితులై దేశమునం దంతటను వ్యాపించి చైత న్యుని జగత్పండితునిగాఁ జేసిరి.

చైతన్యుఁడు కొంతకాలము తూర్పుబంగాళమున నుండి అనేకులకు పాఠ ములు చెప్పి కృష్ణభక్తిని గూడ ఉపదేశించెను. అక్కడ నందఱును అతనిని గురు వుగా పూజించిరి. అయినను అతఁ డక్కడ కొలఁదికాలము మాత్రమే యుండి స్వస్థా నమును చేరుకొనెను.

చైతన్యుని భార్య లక్ష్మీదేవి అకాలమృత్యువువాతఁ బడెను. అందుకు చైత న్యుఁడు దుఃఖింపలేదు; గాని పదుగురు తరువాత పుట్టి బ్రతికియున్న యేకపుత్త్రుఁడు జగత్పండితుఁడు విధురుఁడై యుండుట సహింపలేక శచీదేవి సాంప్రదాయముగల యొక కుటుంబమునుండి గుణవతి, శీలవతియు నగు విష్ణుప్రియయను కన్యను వెంటనే త్వరల పెండ్లి చేసెను.

పిదప చైతన్యుఁడు కొందఱు శిష్యులతో గయాక్షేత్రమునకు బయలు దేరెను. అక్కడ నాతఁడు విష్ణుపాదమున తండ్రికి పిండమువేసి ధ్యానించుచుండఁగా స్మృతితప్పి పడిపోయెను. అపుడు చెంతనున్న యొకసన్యాసి సేదతేర్చెను. అది మొదలు చైతన్యుఁడు కృష్ణుని స్మరింపసాగెను. అతఁడు ఉన్నట్టుండి నృత్యము

చేయును. భజన చేయును. ఏడ్చును. నవ్వును. కృష్ణా! ఇదే వచ్చుచున్నా” నని పరుగెత్తును. కూర్చుండి ధ్యానించును. ఒకనాఁడు చైతన్యుఁడు “కృష్ణా! దేవకీనందనా! పార్థసారథీ! ద్రౌపదీమానసంరక్షకా! నన్ను రక్షింపవా? నన్ను కరుణింపవా?” అని తదేకదీక్షతోఁ బ్రార్థింపఁగా శ్రీకృష్ణుఁడు సాక్షాత్కరించి కౌఁగిలించుకొని అదృశ్యుఁ డయ్యెను.

చైతన్యుఁడు గయాయాత్ర ముగించుకొని యింటికి వచ్చెను. తల్లియు భార్యయు మిగుల నానందించిరి. నాఁటిరాత్రి విష్ణుప్రియ భోజనాదికమైనతరువాత శయనమందిరమునకు పోయి చూడఁగా చైతన్యుఁడు శయ్యమీఁద బోరగిలి పరుండి దుఃఖించుచుండెను. భర్తతో సుఖముగా రాత్రి గడుపవచ్చునని తలఁచి లోనికరుగగా ఇట్టిది సంభవించినందుకు తెల్లవోవుచు ఆమె పోయి అదియంతయు శచికి చూపెను. అప్పటికిఁ గూడ చైతన్యుఁడు ప్రకృతిలో లేఁడు. గది యంతయు దివ్యతేజస్సుతో నిండియుండెను. ఇదియేమియు బోధపడక శచి యిరుగుపొరుగువారిని తీసికొనివచ్చి చూపఁగా చైతన్యునితో గయాక్షేత్రమున కరిగినవారు మార్గమున జరిగిన దంతయు నెఱిఁగించి “అమ్మా! నీ కొడుకు మన మనుకొనుచున్నట్లు కేవలము మనుష్యుఁడు కాఁడు. ఇతఁడు అవతారపురుషుఁడు. భక్తియోగమునకు ప్రాముఖ్యము నిచ్చి ప్రజల నుద్ధరించుటకు ఇచ్ఛాపూర్వకముగా జన్మించినవాఁడు కాని యితఁడు లోకముతోటిపాటివాఁడు గాఁడు” అని చెప్పిరి. వెంటనే అంపఱును దైవతమునకువలె ఉపచారములు చేయఁగా చైతన్యుఁ డప్పటికి స్మృతికలిగి లేచెను.

అది మొదలు అతఁడు శాస్త్రబోధ మాని అందఱికిని శ్రీకృష్ణభక్తి నుపదేశింపఁ జొచ్చెను.

పదునెనిమిదేండ్లప్రాయమున తూర్పుబంగాళమున నున్నకాలమున చైతన్యుఁ డొకనాఁడు శిష్యపరివృతుఁడై యుండఁగా తపనమిశ్రుఁ డను నొకపండితుఁడు వచ్చి పాదములమీఁద వ్రాలి సాష్టాంగనమస్కారము లాచరించెను. అందుకు అంపఱును ఆశ్చర్యపడుచుండఁగా చైతన్యుఁడు ఆవృద్ధపండితుని లేవనెత్తెను. అప్పు డాపండితుఁడు చేతులు జోడించుకొని నిలిచి “మహాత్మా! నేను చాలకాలమునుండి ఈశ్వరస్వరూపము నెఱుఁగఁగోరి అనేకులవలన జ్ఞానబోధ పడసితిని. అనేకసాధనలు చేసితిని; గాని ప్రయోజనము కలుగలేదు. ఇట్లుండఁగా నొకరాత్రి నాకొకస్వప్నము వచ్చెను. అందొక అశరీరవాణి “చైతన్యుని ఆశ్రయింపుము, అతఁడు నీ యభిప్రాయము నీడేర్చును” అని చెప్పెను; అంతట నే నిట్లు మిమ్ము వెదకికొనుచు వచ్చితిని; గావున నాయెడల అనుగ్రహముంచి నాకు తరణోపాయము నెఱిఁగింపుఁడు” అని ప్రార్థించెను. తోడనే చైతన్యుఁడు అతనిని కౌఁగిలించుకొని “నేను కొలఁది దినములలోనే

కాశీక్షేత్రమునకు వచ్చెదను. అప్పటివరకును మీా రక్కడ క్షేత్రవాసముచేయు చుండుఁడు" అని చెప్పి, ఏవో కొన్ని రహస్యవిషయములు తెలిపి పంపివేసెను.

నవద్వీపము పండితులకు నిలయము గదా ? సకలశాస్త్రములయందును అచ్చట దిగ్గంతులవంటి పండితులున్నారు. వారిని జయించినవారికి జగత్ప్రఖ్యాతి, అనంతగౌరవము, సత్కారములు జరుగుచుండును. ఇది యెరిగిన కేశవపండితుఁ డను నొక పండితుఁడు తా నాయాస్థలములలో జయించిన ధనరాసులతోడను, శిష్య బృందముతోడను నవద్వీపము ప్రవేశించి "నన్నోడించినవారికి ఈధనరాసు లిచ్చి శిష్యులతోఁగూడ పాదాక్రాంతుఁడ నయ్యెదను. నాకు ఓడినవారు నాకు పాదాక్రాంతులు కావలె" నని పండోరా వేయించెను; గాని దానిని నవద్వీపపండితు లెవరును లక్ష్యపెట్టలేదు. అందుకు ఉపాయము వెదకుచు కేశవపండితుఁడు అక్కడనే ఉండి పోయెను. కొన్ని దినములకు ఆపండితులలో చైతన్యుఁడు తలమానిక మని అతనికి తెలియవచ్చెను. అంత నొకనాఁటిరాత్రి గంగాసైకతమున వెన్నెలలోఁ గూర్చుండి చైతన్యుఁడు శిష్యులతో విద్యాగోష్ఠిలో నుండఁగా కేశవపండితుఁడు శిష్యులతోఁ గూడ అక్కడకు వెళ్లెను. చైతన్యుఁడు ప్రత్యుత్థానముచేసి పండితుని తనప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని గౌరవించెను. తరువాత కేశవపండితుఁడు చైతన్యుని ప్రీతుని చేయుటకొఱకు ఆసైకతస్థలమును, పండువెన్నెలను వర్ణించుచు ఆశువుగా రెండు వందలశ్లోకములు చేసెను. తరువాత అతఁడు చైతన్యుఁడు అడిగిన శ్లోకములకు భావము చెప్పఁబోయి చైతన్యుని పూర్వపక్షముల విమర్శింపఁజాలకపోయెను. కేశవపండితుఁ డొకటి రెండుగడియలు పెనగులాడెను; గాని ప్రత్యుత్తరమే తోఁచకపోఁగా తుదకు సచ్ఛాత్త్రుఁడై చైతన్యునిపాదములమీాఁద వ్రాలి "ఈధన రాసులు మీావి. మీాకు నే నోడిపోయితిని. నా కిఁక ఐహికములతో పనిలేదు. ముక్తిమార్గము నెఱిఁగింపుఁడు" అని ప్రార్థించెను. చైతన్యుఁ డట్లే చేయఁగా కేశవ పండితుఁడు స్వస్థలమున కరిగి పరమవిరాగియై తన కున్న దంతయు బీదలకు పంచియిచ్చి యేకాకియై యెక్కడికో పోయెను.

చైతన్యుని భ్రాత యగు విశ్వరూపుఁడు పండరిక్షేత్రమున సిద్ధిపొందిన సంగతి యిదివఱకే చెప్పియున్నాము. అప్పు డాతనివెంట నిత్యానందుఁ డనుయువ కుఁడు పండరిపురమున కరిగియుండెను. ఇతఁడు పదునాలుగేండ్లవయస్సునందే సన్య సించి దేశమంతయు తిరుగుచు శ్రీకృష్ణభజనము చేయుచు పారవశ్యము పొందు చుండెను. అతఁడును ఒకప్పుడు నవ్వును, ఒకప్పు డేడ్చును, ఒకప్పుడు నృత్యము చేయును, ఒకప్పుడు పడియుండును. ఇట్లుండఁగా గయాక్షేత్రమున పిండప్రదాన సమయమున చైతన్యున కుపచారములు గావించిన సన్యాసి నిత్యానందు నొకదినమున

కలిసికొని "నవద్వీపమునకుఁ బొమ్ము. అచ్చట కృష్ణుఁడు నీకు కాన్పించును" అని చెప్పెను. అది విని వెంటనే అతఁడు నవద్వీపమునకు బయలుదేరెను.

ఇది యిట్లుండ నట నవద్వీపమున చైతన్యుఁడు శిష్యులతో "కొలఁది దినముల యందే ఒక మహాత్ముఁడు రా నున్నాఁ" డని చెప్పసాగెను. ఆవెనుకనే నిత్యానందుఁడు నవద్వీపము చేరెను. అప్పుడు చైతన్యుఁడు "నేను చెప్పుచుండిన మహాత్ముఁడు వచ్చియున్నాఁడు. మీరు పోయి ఆయనను వెదకి తీసికొనిరండు" అని చెప్పెను. శిష్యులు వెడలిరి; గాని మరల వచ్చి "వారు మాకు కాన్పించలేదు" అని చెప్పిరి. అంతట చైతన్యుఁడు వారిని వెంట నిడుకొని చరచర ఒక బ్రాహ్మణుని యింటికివెళ్లి అరగుమీఁద కూర్చుండియున్న నిత్యానందస్వామిని "రండు" అనుచు చేయిపట్టుకొని పిలిచెను. ఎక్కడనుండియో వచ్చిన అపరిచితుని వెదకికొనకుండ కని పెట్టుట, చిరపరిచితునివలె పలుకరించి చేయిపట్టుకొని రమ్మనుట చూచి శిష్యులు ఆశ్చర్యచకితు లగుచుండఁగా నిత్యానందస్వామి చైతన్యుని చూచి వెంటనే పరవశుఁడై పడిపోయెను.

అంతట శిష్యులతోఁ గూడ చైతన్యుఁడు నిత్యానందునకు పరిచర్యలు చేసి అతఁడు లేచినతరువాత యింటికిఁ గొనిపోయి "అమ్మా! ఇదిగో నీ పెద్ద కుమారుఁడు" అని తల్లికి చూపెను. శచి అది విని నిత్యానందుఁడు విశ్వరూపునివలెనే యుండుట వలన తన పెద్ద కుమారుఁడే మరల బ్రతికి వచ్చె నని ఆనందించెను.

అది మొదలు చైతన్యుఁడును, నిత్యానందుఁడును ఒకప్పుడును విడిచియుండక సంచరింపసాగిరి. క్రమముగ బలరాముఁడే నిత్యానందుఁడుగను, శ్రీకృష్ణుఁడే చైతన్యుఁడుగను లోకపరిత్రాణము నిమిత్త మవతరించిరని వంగదేశ మంతటను ప్రఖ్యాత మయ్యెను.

భక్తితత్వము నెఱుఁగని జనసామాన్యము చైతన్యునకు ఉన్మాదము కలిగె నని తలంచెను. లేకున్న యీగంతులు, ఈయేడ్పులు, ఈనవ్వులు, ఈతూలిపడి పోవుట, ఇవి యేమియు నుండవని తలఁచి కొందఱు శచిచెంతకు వచ్చి "అమ్మా! నీకుమారుని స్థితి యేమియు బాగుగా లేదు. మతిపోయినది. వెంటనే తగిన చికిత్స చేయింపకపోయినచో తరువాత చింతింపవలసివచ్చు" నని చెప్పిరి. అందు కామె కాబోలు ననుకొని తన భర్తకు మిత్రుఁడును మంచి చికిత్సకుఁడు నగు వాసుదేవుని రప్పించి కుమారుని చూపెను.

వాసుదేవుఁడు శాస్త్రజ్ఞానము గలవైద్యుఁడు కావున చైతన్యుని బాగుగా పరీక్షించి "అమ్మా! నీ వెవరి మాటలును నమ్మరాదు. నీకుమారుఁ డున్మాది కాఁడు. ఇతఁడు ప్రహ్లాదాదిమహాభక్తులవంటివాఁడు. ఇతని కిప్పుడు సిద్ధావస్థ లభించి

యున్నది. పూర్వపుజన్మమున గొప్పగొప్ప పుణ్యకార్యములు చేసియుండుటవలన ఇతఁడు నీకడుపున పుట్టుటయు, విష్ణుప్రియకు భర్త యగుటయు తటస్థించినది" అని చెప్పి ఆమెను తృప్తిపరిచెను.

అంతట చైతన్యుఁడు వాసుదేవుని కౌఁగిలించుకొనఁగా అతనికి రోమాంచ మయ్యెను. వెంటనే వాసుదేవుఁడు చైతన్యుని పాదములమీఁద వ్రాలి "మహాత్మా! ఎన్ని శాస్త్రము లభ్యసించినను, ఎన్ని పూజలు చేసినను, భక్తి లేనిచో అంతయు వ్యర్థము. మే మందఱము అదృష్టవంతుల మగుటవలన మహాభక్తుఁడ వగు నీయిరుగు పొరుగున నుండఁగలిగితిమి" అని యనేకవిధముల నుతిచేసి స్వామిని తన వెంట తనయింటికి పిలుచుకొనిపోయెను.

గదాధరుఁ డను భక్తుఁడుగూడ కలియగా ఈనలుగురును, వీరితోపాటు మఱి కొందఱును అదిమొదలు ప్రతిరాత్రి వాసుదేవుని యింట హరిభజనము ప్రారంభించిరి. ఒకటి రెండుదినములకే యీభజనసంగతి ఊరివారి కందఱికిని వెల్లడపడగా అంద ఱును వచ్చి ఆభక్తిరసామృతమును గ్రోలి ఆనందింపసాగిరి. అయితే దీనిని చూచి యోర్వఁజాలని దుష్టులు కొందఱు "ఇట్లు హరిభజనము చేయువారిని నవాబు శిక్షించు నని వదంతులు పుట్టించిరి. అది విని కొందఱు తొలఁగిపోయిరి; గాని అనేకులు చైత న్యుని భక్తిపారవశ్యమును చూడకుండ నుండఁజాలక శిక్షపడినను సరే అని భజ నకు వచ్చుచునే యుండిరి.

ఒకనాఁడు వాసుదేవుఁడు ఉదయము శ్రీకృష్ణపూజకు కూర్చుండఁగా చైత న్యుఁడు వచ్చి వెంటనే తలుపు తట్టెను. పూజ కిట్లు విఘ్నము కలిగినందుకు వగ చియు వాసుదేవుఁడు చైతన్యుఁడు వచ్చుటవలన మాఱు పలుకఁజాలక వచ్చి తలుపుతీసెను.

చూడఁగా చైతన్యుఁడు దివ్యతేజస్సుతో వెలిఁగిపోవుచుండెను. అదిచూచి వాసుదేవుఁడు స్తబ్ధుఁడైపోయి యుండ చైతన్యుఁ డాతనిని చేయిపట్టుకొని పూజా మందిరమునకుఁ గొనిపోయి తానే పూజాపీఠమున కూర్చుండి 'వాసుదేవా! గంగా జలము తెచ్చి నా కభిషేకము చేయుము.' అని చెప్పెను. వాసుదేవుఁడు అందుకు బదులు చెప్పక గంగాజలము తెచ్చి స్వామి నభిషేకించి షోడశోపచారపూజ గావిం చెను. పూజ ప్రారంభింపఁగానే తేజస్సు అధికమై వేణుగానముగూడ వినఁబడసాగెను. అందుకు వాసుదేవుఁడును తక్కినవారును పరమాశ్చర్యభరితులై స్వామికి సాష్టాంగ నమస్కారము లాచరించి అనేకవిధముల నుతించిరి.

చైతన్యుఁడు పూజానంతరము గూడ పూజాపీఠముమీఁదనే కూర్చుండి యుండి, సమీపమున నాల్గేండ్ల పిల్లయుండగా రమ్మని, శిరమున హస్త ముంచి

'అమ్మా! హరిస్మరణము చేయుము' అనఁగా మాటలు సరిగా రాని ఆబాలిక లేచి నిలిచి చేతులతో తాళము వేయుచు, కాళ్లతో నృత్యముచేయుచు 'హరే రామ హరే రామ, రామరామ హరేహరే, హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణకృష్ణ హరేహరే' అని పాడసాగెను. అందుకు అందఱును వింత పడుచుండ చైతన్యుఁడు వాసుదేవుని సంబోధించి 'నే నెవరిని హింసించుటకు, శిక్షించుటకు జన్మింపలేదు. మహా పాపులనుగూడ భక్తివలన పుణ్యాత్ములుగను ముక్తులుగను చేసెదను; నవాబుగాని మఱియొకరుగాని యెవరు యేమియు చేయఁజాలరు. ఎవరును భీతిల్ల నక్కరలేదు' అని చెప్పుచు స్మృతి తప్పి క్రిందఁబడిపోయెను. స్వామి పడిపోగానే ఆదివ్యతేజస్సు మాయ మయ్యెను.

దీనితో వారందరును చైతన్యుఁడు శ్రీకృష్ణుఁడే అని నిశ్చయించుకొని అనే కోపచారములు చేసిరి. కొంత సేపటికి చైతన్యుఁడు లేచి శిష్యులతో గంగకుఁబోయి స్నానము చేసివచ్చి సాయంకాలపుపూజగూడ నెఱవేర్చెను. అది మొదలు అంద ఱును నిశ్చయముగా శ్రీకృష్ణనామము స్మరించుచు భజనలు చేయసాగిరి.

ఒకనాఁడు చైతన్యుఁడు వాసుదేవుని యింటఁ గూర్చుండి శ్రీకృష్ణుఁడు మధురాపురమున కొలువుతీరి యుండినట్లు కన్పడసాగెను. అంతట వాసుదేవుఁడు స్వామికి పూలదండలు వేసెను. నిత్యానందుఁడు చామరములు పట్టెను. మఱియొక భక్తుఁడు వీవన గైకొనెను. ఇట్లు భక్తులందఱును తలొక యుపచారమును చేయ సాగిరి. ఈవార్త క్షణములో పురమంతయు తెలిసిపోయెను. వెంటనే స్త్రీలు, పురు షులు, పిన్నలు, పెద్దలు అను భేదములేక ఊరివారందఱును వచ్చి స్వామిని సేవించి బ్రహ్మానందమునొందిరి.

చైతన్యుని శిష్యులలో హరిదాసు అను నొకభక్తుఁ డుండెను. జన్మతః అతఁడు మహమ్మదీయుఁడు; అయినను చైతన్యుని ప్రభావము విని అతనికి శిష్యుఁడై హరి భక్తుఁడై మఱికొందరుమహమ్మదీయులనుగూడ హరిభక్తులుగా తయారుచేసెను.

చైతన్యుని శిష్యులలో మఱియొకఁడు మురారి; ఇతఁడు రామభక్తుఁడు. ఎల్లప్పుడు నీతఁడు రామభజనము చేయుచుండును. ఒకనాఁడు చైతన్యుఁడు మురారిని పిలిచి "ఇదే నీయిష్టదైవము స్వస్వరూపము" అని చెప్పుచు, తాను కూర్చున్నట్లుగనే శ్రీరామపంచాయతనముగ మారి మురారికి సేవ యొసఁగి "హరి స్మరణమే మోక్షోపాయము. ఈయుగమున నింతకంటె మంచి మార్గము లేదు, జనుల కీసంగతి తెలుపుటకే నే నవతరించితిని" అని చెప్పి మరల యథారూపము దాల్చెను.

ఒకప్పుడు చైతన్యస్వామి తన శిష్యులలో నిత్యానందుఁడు, హరిదాసు అనువారిని పిలిచి 'మీరు ఈగ్రామమునందలి ప్రతిగృహమునకును బోయి కృష్ణ స్మరణము చేయవలసిన' దని తనయాజ్ఞగా నెఱిఁగించి రావలసిన దని చెప్పెను. వారట్లే చెప్పిరి ; కాని కొందరే అట్లు చేయసాగిరి. తక్కినవారిచేతఁగూడ గుర్వాజ్ఞ ప్రకారము కృష్ణస్మరణము చేయించుటకు తమకు శక్తి లేదని గ్రహించి వా రట్లు చేయింపవలసిన దని కోరుటకు మాధవమిశ్రుఁడు, జగన్నాథమిశ్రుఁడు అను కొత్వా లులవద్దకు పోయిరి.

మిశ్రులు నవాబు నాజ్ఞ చొప్పున పన్నులు వసూలు చేయుచుందురు. వారికి ఊరివా రందఱును భయకంపితు లగుచుందురు. అర్ధరాత్రి తమ్మెవరో పిలుచు చుండుట కాశ్చర్యపడి మాధవమిశ్రుఁడు తలుపుతీసి 'మీ రెవరు? ఏమి పని?' అని యడిగెను. స్వామి శిష్యులు తాము వచ్చిన పని తెలిపిరి. అయితే మిశ్రులు శాక్తేయులు, మద్యమాంసములను సేవించుచు మత్తెక్కి వా రనేక స్త్రీహత్యలు, శిశుహత్యలు ఇంక ననేక దారుణకృత్యములు చేయుచుందురు. అగుటవలన మాధవుఁడు ఈమాటలు విన్నంతనే రుద్రునివలె మండిపడుచు హరిభక్తులను తరిమి తరిమి కొట్టెను.

ఇది విని స్వామి శిష్యుల నందఱను వెంట నిడుకొని భజన చేయుచు మిశ్రు లున్న తోటలోనికి పోయెను. మాధవమిశ్రుఁడు అందుకు సహింపక భజన చేయు వారిలో నిత్యానందుని గుర్తించి తల తగులునట్లు కొట్టెను. దానితో తల పగిలి రక్తధారలు ప్రవహించుచుండ నిత్యానందుఁడు పడిపోఁగా స్వామి అతనికి పరి చర్యచేసి మిశ్రుని యెదుటకుఁ బోయి 'అతని నేల కొట్టితివి?' అని యడిగెను. 'ఇతఁడు ఇంతకు పూర్వమే మాబసకు వచ్చి మమ్ము హరిస్మరణము చేయు మనిచెప్పుచు పారిపోయెను. అప్పుడు చిక్కనందున ఇప్పుడు కొట్టితి' నని మాధవమిశ్రుఁ డందుకు జవాబు చెప్పఁగా స్వామి, 'నీవు కృష్ణస్మరణము చేయు మన్నందు కాతనిని కొట్టితివి. దినదినము నీవు స్త్రీహత్యలు, నరహత్యలు, శిశుహత్యలు, పరద్రవ్యాపహారణము మున్నగు అనేక దుష్కర్మములు చేయుచున్నావు. వాటికి ఫలితముగా నీపాపము పర్వతములవలె పెరుగొనుచున్నది. అట్టి నిన్నెట్లు శిక్షింపవలసియున్నదో నీ వెఱుఁగు దువా?' అని యడిగి వెంటనే మాధవుని శిక్షించుటకై చక్రమును ధ్యానించెను. అది చూచి నిత్యానందుఁడు 'స్వామీ! ఎట్టి పాపాత్ముని గూడశిక్షింపను, భక్తితో వాని మనస్సు మరలించెద నని మీరు సెల విచ్చియున్నారు. అట్టియెడల వీనికై చక్రాయుధ మేలా? మన్నింపుము' అని ప్రార్థించెను.

ఇంతలో అగ్నిహోత్రమువంటి తేజ స్సొకటి ఆవహింపఁగా జగన్నాథ మిశ్రుఁడు స్వామి పాదములమీఁద వ్రాలి 'కటాక్షించి రక్షింపుము' అని ప్రార్థించెను.

అందుకు స్వామి జగన్నాథుఁడు మాధవు నంత పాపి కాకపోవుటవలన క్షమించి 'కృష్ణుని భజన చేయుము. అదియే పాపములనుండి నిన్నుద్ధరించును' అని యుప దేశించి శిష్యులతో మరలి గృహమునకు వెడలిపోయెను.

మాధవున కారాత్రి నిద్ర రాలేదు. తాను చేసిన పాపము లన్నియు రూపొందినట్లు కాన్పించి అతనిని పీడింపసాగెను. అంతట నాతఁడు ఆరాత్రి అతి కష్టముమీఁద కడపి తెల్లవారిన వెంటనే స్వామి గంగాఘట్టమున స్నానము చేయు చుండఁగా అక్కడికి పరువెత్తుకొనిపోయి 'రక్షింపు' మని ప్రార్థించి కాళ్లమీఁద వ్రాలెను; గాని స్వామి అది వినిపించుకొనక 'నా కపరాధమును గావించిన వానిని నేను క్షమించెదను; కాని నాశిష్యున కపచారము చేసిన అతఁడే రక్షింపవలయును. అని తిరస్కరించెను. అందుకు గడగడ వడఁకుచు మాధవుఁడు నిత్యానందుని కాళ్లమీఁద వ్రాలెను. నిత్యానందుఁడు మాధవున కభయ మిచ్చి 'ఈతనిని రక్షింపు' మని స్వామిని ప్రార్థించెను. అప్పుడు స్వామి మాధవుని గంగలో స్నానము చేసి రమ్మని వానిచే నొక తాంబూలము దానముగా గ్రహించెను. దానిని స్వీకరించిన వెంటనే దబ్బపండువంటి స్వామి శరీరము నల్లఁగా కాటుకవలె నైపోయి ఉత్తర క్షణమునందే యథారూపము దాల్చెను.

అది చూచి భక్తులును, శిష్యులును ఆనలుపు మాధవమిశ్రుని పాప మనియు, దానముద్వారా అదిస్వామికి సంక్రమించె ననియు, కాని స్వామి అపారశక్తివలన అది వెంటనే నశించిపోయె ననియు గ్రహించి స్వామిని మిగుల కొనియాడిరి. మాధవుఁడు ఇట్లు తా నుద్ధరింపఁబడినందుకు మిగుల నానందించి స్వామిశిష్యులలో నొకఁడై కృష్ణ స్మరణమున కాలముఁ గడుపఁజొచ్చెను.

రాక్షసులకంటెను క్రూరు లగు మాధవజనార్దనమిశ్రు లిట్లు స్వామి శిష్యులై కృష్ణభజనమునందే కాలము గడపుచుండుట చూచి అనేకు లాశ్చర్యచకితులై తాము ను స్వామి శిష్యకోటిలో చేరి కృష్ణభజనము ప్రారంభించిరి.

ఇట్లు అనేకులు స్వామి శిష్యులుగా నుండి అక్కడక్కడ గుంపుగుంపు లుగా చేరి పాడుట, భజన నేయుట మున్నగు విధమున శ్రీకృష్ణుని సేవించుచుం డఁగా ఇది కిట్టని కొందఱు ఉద్యోగులు ఆపట్టణము నేలు కాజీవద్ద కరిగి 'ఈభజనల వలన పట్టణముయొక్క శాంతికి, క్షేమమునకు భంగము కలుగుచున్నది; కావున మాన్పింపవలసిన' దని ప్రార్థించిరి. దానిమీఁద కాజీ అదివరకే హిందువు లనిన అసహ్యము కలవాఁడు గావున వెంటనే 'ఈపట్టణమున కొందఱు బాధ్యత యెఱుఁ గనివారు బొబ్బ లిడుట, భజన చేయుట మున్నగు పనులు చేయుచుండుటవలన పట్టణముయొక్క శాంతికి క్షేమమునకు భంగము రావచ్చు నని నా యుద్యో

గులు చెప్పుచుండుటవలను, నేను దానిని విశ్వసించుటవలనను, ఇక ముందు ఎవరును ఈపట్టణమున అట్టివి చేయరాదని ప్రజల సుఖశాంతులను కోరుచు నేను శాసించుచున్నాను. ఈయుత్తరువు నుల్లంఘించినవారు దారుణశిక్షలకు పాల్పడెదరు' అని దండోరా వేయించెను. అది విని అనేకులు కృష్ణస్మరణము భజనలు మానివేసిరి. కొందఱు పొరుగూళ్లకు పోవలచిరి గాని అందుకు స్వామి అంగీకరింపక 'ఈరాత్రి మీరందఱును ఒక్కొక్క దివిటీ వెలిగించుకొని రండు అందర మును వాసుదేవుని యింటినుండి జట్టుజట్టులుగా భజనచేయుచు ఊరంతయు తిరిగి కాజీ యింటికి పోవుదము' అని చెప్పెను.

క్షణములో ఊరంతయు నీ సంగతి తెలిసెను. అందఱును ప్రయత్నములు చేయసాగిరి. పట్టణ మంతయు అలంకరింపఁబడెను. స్త్రీలు వీథి యంతయు కలయంపులు చల్లి రంగమల్లికలు తీర్చిరి. ఇది తెలిసి ఇరుగు పొరుగు గ్రామములనుండి అనేకులీ వేడుక చూచుటకు రాసాగిరి.

ఇది యంతయు చూచి క్రింది అధికారులు 'అల్లరులు జరుగవచ్చు' నని విన్నవింపఁగా కాజీ సేనలను రప్పించి సిద్ధముగా నుంచెను.

సూర్యాస్తమయ మయ్యెను. చీఁకటిపడినది. భుజింపవలసినవారు భుజించిరి. ఫలహారములు చేయువారు ఫలహారములు చేసిరి. కొంద ఱుపవసించియే యుండిరి. అందఱును వాసుదేవుని యింటికి చేరిరి.

వాసుదేవుఁడు చైతన్యస్వామిని పుష్పమాలికాదులతో నలంకరించెను. భక్తులు అసంఖ్యాకులుగా నుండుటవలన నాలుగు జట్టులుగా విడదీసి ఒక జట్టును, నిత్యానందుఁడును, మఱియొక జట్టును హరిదాసును, వేఱొక జట్టును గదాధరుఁడును, అన్నిటికి [illegible]నందుంచి ఒక జట్టును స్వామియు నడపించుకొనుచు బయలుదేరిరి. కృష్ణనామ స్మరణముతో పట్టణమంతయు ఘూర్ణిల్లిపోయినది.

కాజీనివాసము గంగకు అవ్వలి యొడ్డున ఒక తోటలో నుండెను. కాజీ మేఁడమీఁద షికారు చేయుచు ఉత్సవమును చూచి పెండ్లి ఊరేగింపు అనుకొని 'పోయి చూచిరం' డని భటులను పంపెను.

కృష్ణస్మరణము నాలించిన వెంటనే కాజీభటులును మైమఱచి భజనమున చేరిపోయిరి.

జనులలో కొందఱు కాజీయే దీనికంతటికిని కారణమని యాగ్రహించి ఆతనిని కొట్టుటకు కఱ్ఱలతో బయలుదేరిరి; గాని స్వామి అదిచూచి 'మనము శ్రీకృష్ణుని కింకరులము. భక్తియే మనకు సాధనము. ఎవరిని మనము హింసింపరాదు. కాజీ అట్లు ఆజ్ఞాపించుటవలన మనకు శ్రీకృష్ణునియెడల భక్తిశ్రద్ధలు హెచ్చినవి; గాని

మనకు నష్టము కలుగలేదు; కావున అట్టి దుష్కృత్యములు మాని మీరును భజన చేయుఁడు' అని చెప్పెను. దానికి అడ్డు చెప్పలేక తుదకు వారుగూడ భజనమున ప్రవృత్తులైరి.

కాని అంతకు ముందు వారు 'కాజీని కొట్టుఁడు' అని అఱచుటవలన ఆయఱపులను విని కాజీ భయభ్రాంతుఁడై సైనికుల నంపి గుంపులను శిక్షించునట్లు చేయవలసినదని సేనాధిపతి కాజ్ఞాపించి తా నంతఃపురమునకుఁ బోయి స్త్రీల నడుమ దాఁగికొనియెను. స్వామిభక్తిపరాయణుఁ డగు నాసేనాధిపతి సైనికులను పిలువ నంపియు వారు రాకపోఁగా చేయునది లేక భార మంతయు దేవునిమీఁద వేసి యూరకుండెను.

ఇంతలో భజనలు కాజీ మేడ యున్నతోటలో ప్రవేశించినవి. కాజీ భయభ్రాంతుఁ డైనసంగతి స్వామికి తెలియవచ్చెను.

అంతట స్వామి భజన చూచుచున్న కాజీ అంతరంగికులను పిలిపించి 'మీ కాజీని మేము ఏమియు చేయము. మాయెదటికి తీసికొనిరండు' అని నమ్మఁబలికెను.

వారు లోపలికి పోయి ఈసంగతి చెప్పి అనేకవిధముల ధైర్యముఁ గొలుపఁగా కాజీ గుండెబెదరుతోనే వచ్చి స్వామి యెదుట నిలిచెను.

స్వామి మాతామహుఁ డగు నీలాంబరమిశ్రుఁడు కాజీకి పరమమిత్రుఁడు. కాజీకి అతనికి పుత్రజనకరూప మగు వావి ప్రవర్తిల్లుచుండెను. అందువలన స్వామికి కాజీ వరుసకు మామయై యుండెను.

స్వామి కాజీని చూచి 'మామా! అల్లుఁడు రాఁగా భయపడి స్త్రీల నడుమ దాఁగికొంటి వేల ? అల్లుని ఇట్లేనా ఆదరించుట ? నే నేమి అపరాధము చేసితిని?' అని యడిగెను.

దీనితో ప్రాణములు లేచి రాగా కాజీ తన యపరాధము నంగీకరించి 'నాక్రింది యధికారుల ప్రోద్బలమువలన శ్రీకృష్ణభజన నాపునట్లు దండోరా వేయించితిని; గాని శ్రీహరియెడల మీయెడల ద్వేషము వహించి కాదు.' అని విన్నవించి స్వామి దర్శనమువలన, సంభాషణమువలన ఆకర్షింపఁబడి 'నాయపరాధమును మన్నించి నన్ను శిష్యవర్గమున చేర్చుకోవలసిన' దని వేఁడుకొనెను.

అందుకు స్వామి ఆనందించి 'మామా! నీవు 'హరి, కృష్ణ' అను శబ్దముల నుచ్చరించితివి. గావున నీపాపములు నశించినవి ఇఁక భయపడకుము. శ్రీకృష్ణస్మరణమును, భజనమును ఎప్పుడు నిషేధింపకుము' అని చెప్పెను.

భయభ్రాంతుఁడై పోయిన కాజీకి చనవు ధైర్యము కలిగెను. అంతట నాతఁడు స్వామి పాదములమీఁద వ్రాలి 'మహాత్మా! నీవు త్రిలోకపూజ్యుఁడవు. నేను

అకించనుఁడను. పాపిని. నాకు తరణోపాయము నెఱిఁగింపుము' అని పాదములంటి 'నేను శ్రీకృష్ణనామస్మరణము చేయుదును. నావంశమువారును అట్లే చేయునట్లు శాసింతును' అని చెప్పెను.

అంతట స్వామి భజనలతో వెనుకకు మరలెను. శిష్యులు, ప్రజలు స్వామికి జేజేలు పెట్టిరి. కాజీ నది దాఁటి మఱికొంతదూరము ననుగమించి వచ్చి స్వామివద్ద సెలవుపుచ్చుకొని నిర్భీతుఁడై ప్రముదితచిత్తుఁడై వెడలిపోయెను.

ఇట్లు కాజీగూడ స్వామి శిష్యుఁడగుట చూచి సంశయాత్ము లగు ననేకులు గూడ స్వామి నాశ్రయించిరి. ఈరభసమున కంతకును కారకులైనవా రందఱును పశ్చాత్తాపముపొంది స్వామిపాదము లాశ్రయించిరి. బ్రతికి యున్నంతకాలమును కాజీ కృష్ణనామస్మరణముచేసి అవసానమున మోక్షము పొందెను. ఆప్రాంతములకు యాత్రార్థమై బోయెడి వైష్ణవభక్తు లిప్పటికిని కాజీ సమాధిని సందర్శింతురు.

ఒకనాఁడు యథాపూర్వముగ వాసుదేవుల యింట శ్రీకృష్ణనామసంకీర్తనము జరుగుచుండఁగా వాసుదేవుని కుమారుఁడు మృతిచెందెను; సంగతి తెలిసినచో స్వామి భజనకు అంతరాయ మగును; గాన స్వామి వెడలిపోవువరకును ఎవరును రోదనము చేయవల దని వాసుదేవుఁడు ఇంటిలోనివారిని శాసించి తానును భజనమున చేరెను; గాని కొంతసేపైన పిదప స్వామి భజన నిలిపి "వాసుదేవా! ఎంత ప్రయత్నించినను నేడు భజన హృదయంగమముగా లేదు. దీనికిఁ గొప్ప కారణ ముండవలయును నీ కేదో ఆపత్తు వచ్చినట్లు తోఁచుచున్నది. అంతయు వివరింపుము' అని యడిగెను. అంతట వాసుదేవుఁడు ఇఁక లాభము లేదని యెఱిఁగి జరిగిన దంతయు చెప్పెను.

స్వామి అది విని 'వాసుదేవా! ఇంతసేపు యీసంగతి వెల్లడి కాకుండుట ఆశ్చర్యకరముగా నున్నది. పుత్రశోకమునకు పాల్పడక చిత్తమును కృష్ణభజనమున లెస్సగా అంకితము చేసిన నీశక్తి ప్రశంసాపాత్రముగా నున్నది. నీజ్ఞానమునకు, నీ వైరాగ్యమునకు, నీ భక్తికి సాటి లేదు. ఇట్టిజ్ఞానము, ఇట్టి వైరాగ్యము ఇట్టి భక్తి—ఇవియే మానవునకు జన్మరాహిత్యము కలిగింపఁగలవు. దారాపుత్రాదులు జలప్రతిబింబములు గాని నిక్కమైన ఆత్మీయులు కారు. శ్రీకృష్ణుఁ డొక్కఁడే మానవున కాత్మీయుఁడు. ఈ భావన నీయందు దృఢముగా నున్నందుకు చాల ఆనంద మగుచున్నది' అని పలుకుచు- ఆనందబాష్పములు విడిచెను. అపుడు వాసుదేవుఁడు అంజలి ఘటించి 'స్వామీ! తాము భజన చేయుచుండఁగా భౌతిక దేహము విడిచిన నా కొడుకు భాగ్యమే భాగ్యము' అనఁగా స్వామి 'నీవే నిజమైన కృష్ణభక్తుఁడవు. శ్రీకృష్ణుని నమ్మినవారికి వ్యసనములు కలుగవు. పుత్రశోకము

గూడ నన్ను చలింపఁజేయలేకపోయినది' అని చెప్పి వాసుదేవుని భార్యను జూచి 'నీబిడ్డ కళేబర మిటు తెమ్ము' అని చెప్పెను.

వెంటనే అమె అట్లు చేసెను. అప్పుడు స్వామి శవమును మాట్లాడింపఁగా అది 'స్వామీ! నేనుత్తమలోకమునకు పోవుచున్నాను. నన్ను వెనుకకు లాగవలదు' అని విన్నవించుకొనెను.

అక్కడ నున్నవా రందఱు నిది చూచి స్వామియెడల మిగుల భక్తి గల వారైరి. తమ బిడ్డ అక్షయానందలోకమునకు పోవుచుండుటవలన వాసుదేవుఁడును, అతని భార్యయు నానందించి పూర్వాధికముగ కృష్ణస్మరణము చేయ సాగిరి.

ఇట్లు కొంతకాలము గడచిన పిదప చైతన్యుఁడు సన్న్యసింపఁదలఁచెను. బ్రహ్మచర్యాశ్రమము, గార్హస్థ్యము యథావిధిగ నిర్వహించియుండుటవలన చైతన్యుఁ డందుకు మిగుల అర్హుఁడై యుండెను. మఱియు చైతన్యుఁడు సన్యసించుటకు తల్లి యనుజ్ఞను గూడ బడసియుండెను. ఈసంగతి యంతయు నెఱింగి, ఆ బాల్యముగ చైతన్యుని ప్రభావము గుర్తించి యున్న ఈశ్వరపురి అను సన్యాసి చైతన్యుఁడువచ్చి కోరినవెంటనే సన్యాస మిచ్చి 'శ్రీకృష్ణచైతన్యస్వామి' అని నామకరణము చేసెను. స్వామి వెంటనే శిష్యులతో జగన్నాథక్షేత్రమున నివసింపఁ బయలుదేరెను.

జగన్నాథమును సమీపింపఁగనే శ్రీకృష్ణుఁడు జగన్నాథాలయగోపురాగ్రమున నిలిచి రెండు చేతులును చాచి రమ్మని పిలిచినట్లు కన్పింగాస్వామి 'రాధేశా! కృష్ణ! జయ" అని నృత్యము ప్రారంభించెను.' వెంట నున్న శిష్యులును భక్తులును గూడ నీయద్భుతము చూచి చకితులై తాము నృత్యము చేయసాగిరి.

జగన్నాథమున వాసుదేవసార్వభౌముఁ డను నొకగొప్పపండితుఁ డుండెను. అతఁడు సకలశాస్త్రములయందును విద్వాంసుఁడు. కాశీవాసి యగు ప్రకాశానంద స్వామి శిష్యుఁడు శాస్త్రార్థము చేయుటయందును, పాఠములు చెప్పుటయందు నంతటివాఁడు ఓఢ్రులలోనే గా దితరులలో గూడ లేరు; గాని యతఁడు భక్తి యనినమాత్ర మెట్టిదో యెఱుఁగడు. స్వామి జగన్నాథాలయమున ప్రవేశించుచునే స్మృతితప్పి పడిపోఁగా గోపీనాథుఁ డనుబంధువువలన స్వామి సంగతియంతయు విని ఆపండితుఁడు పరిచర్యలుచేసి తనయింటికిఁ గొనిపోయి మధురాహారములతో తృప్తిపఱిచెను.

చైతన్యస్వామి ప్రతిదినము కృష్ణగానము చేయుచుండఁగా చూచుచుండిన ఆపండితుఁ డొకనాఁడు "మీరు భాష్య శాంతి చేసినారా?" అని యడిగెను. అందుకు

స్వామి "లే" దని జవాబు చెప్పఁగా అతఁడు "అయ్యో! సన్యాసులు సూత్రభాష్య శ్రాంతి చేయకుండిన నెట్లు? నేను మీకు పాఠము చెప్పెద. చదివెదరా?" అనియడిగెను. స్వామి 'వల్లె' యనియెను. అంతట పండితుఁడు అధ్యాపనము ప్రారంభించి పదిదినము లైనతరువాత 'బోధ యగుచున్నదా లేదా? ఎక్కడ నైన సందేహము లుండిన అడుగుడు' అని ప్రస్తావించెను. దానిమీఁద స్వామి కొన్నిసందేహములను చూపి వివరణ మడుగఁగా వానికి పండితుఁడు యుక్తముగా సమాధానములు చెప్పలేకపోయెను. వినుచున్న వారందరును పండితుఁడు 'ఓడిపోయె' నని గ్రహించిరి. పండితుఁడు లజ్జపడి అంతటితో ఊరకుండెను.

నాఁటిసాయంత్రము ఆలయమున స్వామి కృష్ణస్తుతి చేయుచుండఁగా ఆలయ మంతయు కోటిసూర్యప్రభాసమాన మగుదివ్యతేజస్సుతో నిండిపోయెను. పరిశీలించి చూడఁగా ఆతేజస్సు స్వామి శరీరమునుండియే వినిర్గతమగుచుండెను. ఆసమయమున చైతన్యస్వామి 'రెండుచేతులతో ధనుర్బాణములను (ఇది రామావతారము) రెండు చేతులతో మురళిని (ఇది కృష్ణావతారము) రెండు చేతులతో దండకమండలములను (ఇది స్వామి సహజాకారము) ఇట్లు షడ్బాహుస్వరూపుఁడై వాసుదేవసార్వభౌమ పండితునకు దర్శన మిచ్చెను. ఈస్వరూపము ఆలయమున పూర్తిగా ఒక్కపగలు నొక్కరాత్రి యునుండెను. పండితుఁడును నిర్విణ్ణుఁడయ్యెను. తక్కినవారు చకితులైరి. ఇది విని పట్టణము, పరిసరగ్రామములుగూడ విరుచుకునివచ్చి స్వామిని సందర్శించి ధన్యము లయ్యెను.

అంతట పండితుఁడు అంత చదువు చదువుకొనియు నేఁడు స్వామి యెదుట నిలుచుట కైన తన కర్హత లేకుండుట గ్రహించి, మిక్కుల లజ్జించి స్వామి పాదములమీఁద వ్రాలి ఆసన్నివేశమువలన స్వామి మూర్ఛిల్లఁగా సకలోపచారములు చేసి తన యింటికిఁ గొనిపోయి స్వామికి ప్రధానశిష్యుఁడై అదిమొదలు కృష్ణనామకీర్తనమునందే దినములు గడుపసాగెను.

చైతన్యస్వామి ప్రభావమువలన జగన్నాథపరిసరారణ్యములయందలి జంతువులుగూడ స్వామి పరవశుఁడై నృత్యము చేయుట చూచుటకు వచ్చుచుండెను. ఒక కుక్క రోగపీడిత యగుచుండఁగా స్వామి దానికి మోక్షము కలిగించెను.

పిదప స్వామి దక్షిణదేశములకు బయలుదేరెను. మార్గమున ఓఢ్రదేశప్రభువైన ప్రతాపరుద్రుఁడు స్వామి శిష్యులలో చేరెను.

తంజావూరుప్రాంతమున నొక యరణ్యమున క్రూరుఁ డగు నొక దొంగల నాయకుఁ డుండెను. తెలిసినవారు స్వామి నా మార్గమున పోవల దనిరి. శిష్యులును జంకిరి; గాని స్వామి అందు కంగీకరింపక వారి నందర నొకచో నుంచి తా నా యర

ణ్యము ప్రవేశించి ఒక చెట్టుక్రింద కూర్చుండెను. దొంగలనాయకునియాజ్ఞ చొప్పున కొందరు దొంగలు వచ్చి "మాదొర సెలవైనది, రమ్ము" అని పెడరెక్కలు కట్టబోగా స్వామి వారిని వారించి "మీదొర పరమభాగవతోత్తముడు. అతనిని చూచుటకే నే నిక్కడకు వచ్చితిని. కావున అతనినే ఇక్కడికి గొనిరండు" అని పలికెను. వారు పోయి యీ మాటల చెప్పిరి. అందుకు ఆదొర "ఎవడురా నా కాజ్ఞాపించువాడు" అని మండిపడుచు వచ్చి "ఎవడవు నీవు? ఏలవచ్చితివి?" అని యడిగెను. స్వామి "నీవు పరమభాగవతోత్తముడ వని విని నిన్నుచూచుటకు వచ్చితిని" అని చెప్పెను.

స్వామిని చూడగానే దొరకు మార్పు కలిగెను. ఈమాటలు వినగా మనస్సు పూర్తిగా మారిపోయెను. అంతట నాతడు స్వామిపాదములకు మ్రొక్కి "స్వామీ! అనేకహత్యలు చేసినాను. అనేకఘోరములు జరిగించినాను. పశ్చాత్తాపము కలిగినది. నేను తరించు మార్గము నుపదేశింపు" మని ప్రార్థింపగా స్వామి శ్రీకృష్ణనామము నుపదేశించెను. అది యైన వెంటనే స్వామి పడిపోగా దొర ఉపచారములు చేసి సేద తేర్చెను. పిదప దొర తన సర్వస్వము విడిచిపెట్టి నిర్లిప్తుడై స్వామితో వెడలి పోయెను.

స్వామి మరల బయలుదేరగా మార్గవశమున తుంగభద్రానది తగిలెను. స్వామి అందు స్నానము చేయుచు కొన్ని దినము లుండి అక్కడివారికి కృష్ణభక్తి నుపదేశింపసాగెను. ఈసంగతి అప్పుడు విజయనగరసామ్రాజ్యమునకు ప్రభు వైన రామానందరాయడు విని స్వామిని దర్శించుటకు వచ్చెను.

రామానందరాయడు కృష్ణభక్తుడు. స్వామి "ఎటువంటి భక్తి మిక్కిలి శ్రేష్ఠ మైనది?" అని ప్రశ్నించెను. అందుకు రాజు "ప్రేమభక్తియే శ్రేష్ఠమైనది. 'యోషా జారమివ ప్రియం' అనగా యువతి జారునియెడ చూపు ప్రేమయే శ్రేష్ఠ మైన ప్రేమ అనియు, అట్టి ప్రేమను రాధ కృష్ణునియెడ చూపించె ననియు, అదియే ప్రేమభక్తి యనియు చెప్పగా అది వినిన స్వామి శిష్యు లందరును 'రాధేశా! కృష్ణ జయ' అని జయధ్వనులు చేసిరి. స్వామి మైమరచి నృత్యము గావించెను. అప్పుడు స్వామి దేహమునుండి ఒక దివ్యతేజస్సు వెలువడెను. స్వామి అందుమగ్నుడై పోయి స్వామి స్థానమున రాధాకృష్ణస్వరూపము అందరికిని కాన్పించెను.

అందు కందరు నాశ్చర్యపడుచుండగా కొంతసేపటికి మరల స్వామియే కాన్పించెను. రాజు ఆశ్చర్యపడి స్వామి అవతార మని గ్రహించి వెంటనే స్వామి శిష్యకోటిలో చేరెను.

తరువాత స్వామి గుజరాతీదేశమునకు పోయెను. ఆదేశమున దొంగలదొర ఒకనాఁడు కృష్ణుని స్మరించుచు భజన చేయుచు మైమరచి ఒక దివ్యతేజస్సుసాక్షాత్కరింపఁగా అందు లీనమై వైకుంఠమునకు పోయెను. ఆదేశస్థు లాతనిశవమును కృష్ణ స్మరణముతో సమాధి గావించిరి.

అతనితోఁడి సహవాసము ఇటీవలనే కలిగినను చిత్తశుద్ధి కలవాఁ డగుటవలన దొంగలదొరవిశ్లేషమునకు స్వామి చాల వగచెను; గాని అంతలో దానిని మరచి బృందావనమునకుఁ బోయెను. అచట స్వామి కృష్ణుని క్రీడలకు తావలములై, పవిత్రములై, చూచినవారిని పాపపంకమునుండి యుద్ధరింపఁగల యమునానది, గోవర్ధనగిరి మున్నగు ప్రదేశములను జూచుచు తరుచు స్మృతితప్పి పడిపోవుచు, శిష్యుల కృష్ణభజనమువలన మరల తేరికొనుచు కొంతకాల ముండి కాశీక్షేత్రమున కరుగ సంకల్పించుకొనియెను.

ఈసంగతి స్వామి పూర్వ మాజ్ఞాపించిన చొప్పున కాశీనగరమున ఎదురు చూచుచుండిన తపనమిశ్రుఁడు విని స్వామిని కాశీనగరమునకు తోడుకొనిపోవుటకు వెంటనే బృందావనమునకు వచ్చెను. ఆపండితుని చూడఁగానే స్వామి పరవశుఁడై వెంటనే అతనితో బయలుదేరెను.

జగన్నాథమున స్వామి శిష్యవర్గమున చేరిన వాసుదేవసార్వభౌమునకు ప్రకాశానందస్వామి యను గురువు ఉండెనని చెప్పియుంటిమి కదా? ఆతఁడు కాశీ నగరమునందే యుండెను. తర్కము, వ్యాకరణము, వేదాంతము మున్నగు శాస్త్రములయందు ప్రకాశానందుఁ డసమానుఁడై మిగుల ప్రతిష్ఠ సంపాదించి యుండెను; గాని భక్తి యనునది అతఁ డెంతమాత్రము నెరుఁగడు. అతఁడు చాలదినముల నుండి చైతన్యస్వామిని చూడవలయునని యుండెను. పైఁగా తన శిష్యుని ఓడించి నందుకుబదులుగా స్వామిని తానోడింపవలయు నని వ్రతము పూనియుండెను. ఇది తెలిసి అచ్చటి పండితులు, సన్యాసులు వీరిద్దరికి ఎప్పుడు వాదము పొసగునా అని చూచుచుండిరి. ఇది యేమియు నెరుగని స్వామి యథారీతిగా కృష్ణస్మరణము చేయుచు, భజన చేయుచు, మైమరచుచు—ఇట్లు భక్తియోగనిష్ఠుఁడై యుండెను.

ఇట్లుండ కాశీనగరమునందలి ఒక సంపన్నుఁడు నగరమునందలి సన్యాసుల కంపరికిని, వారి శిష్యుల కంపరికిని భిక్షచేయుటకు సంకల్పించెను. యుక్తసమయమున అందరు నచ్చట చేరిరి. అందరికంటెను ప్రకాశానందుఁడు గొప్పవాఁ డగుటవలన ఆయన కొక యున్నతపీఠము నమర్చిరి. చైతన్యస్వామి ఒక చివర, ఒకమూల సామాన్యునివలె కూర్చుండియుండెను.

యుక్తసమయమున ప్రకాశానందుఁడు "చైతన్యస్వామి యెక్కడ?" అని యడుగగా "వారే" యని మూల నున్న వారిని చూపిరి. వెంటనే ప్రకాశానందుఁ

డచ్చటికి పోయి వినయముగ నాహ్వానించికొని వచ్చి తన పార్శ్వమున కూర్చుండఁ బెట్టుకొనెను.

పిదప ప్రకాశానందుఁడు అతివినయమును వెల్లడించుచు "స్వామీ! తాము వేదమును పూర్తిగా నభ్యసించితిరా? తర్క-వ్యాకరణాదు లెంతవరకు చూచినారు? బ్రహ్మసూత్రభాష్యశాంతి నెన్ని పర్యాయములు చేసినారు?" అని ప్రశ్నించెను. అందుకు చైతన్యస్వామి తడవుకొనకయే 'నే నేమియు చదువుకొనలేదు. వేదశాస్త్రములయందు నాకు బుద్ధి నిలువదు' అని ప్రత్యుత్తర మీయఁగా ప్రకాశానందుఁడు మరల 'సన్న్యాసులకు నిషేధింపఁబడిన నృత్యగీతాదు లవలంబించి యున్నారట మీరు నిజ మేనా?' అని యడిగెను. అందుకు స్వామి 'ఔ' ననగా ప్రకాశానందస్వామి గర్వము, నిరాదరణము, ప్రకటించుచు 'యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః, న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం' అనగా శాస్త్రవిధిని మీఱి యెవఁడు కామప్రేరితుఁడై వర్తించునో వాఁడు భ్రష్టుఁడగునని గీతలు చెప్పుచున్నవి కావా?' అని టాకాయించి యడిగెను. మరిన్ని అతఁడు ఇక చైతన్యస్వామి జవాబు చెప్పలేఁ డనియు, తనకు జయము తానే వచ్చినదనియు ఉప్పొంగసాగెను.

అంతట చైతన్యస్వామి అనుద్ధృతుఁడై అందుకొని 'స్వామి! వేదశాస్త్ర పఠనము, సూత్రభాష్యశాంతి—ఇవి పరబ్రహ్మమును తెలుపును; కాని అంత మాత్రమున ఎవరికిని ముక్తి లభింపదు. ఆజ్ఞానము అనుభూతము కావలెను. శమ దమాదిషట్కర్మసంపత్తి ననుష్ఠించుటలో మహావిద్వాంసు లనేకులు అశక్తులై యున్నారు.

శ్లో. "ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీదమపి మే భవిష్య తి పునర్ధనమ్.
అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోస్తి సదృశో మయా,
యక్ష్యే, దాస్యామి, మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః,
అనేక చిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ."

(16 అ. 13,14,15,16. భగవద్గీత)

వేదశాస్త్రములు చదివి శాస్త్రార్థము చేయుటలో నిపుణు లైనవారి స్థితి తరుచు యిట్లుండుచున్నది. ఈస్థితిలో నెంత శాస్త్రజ్ఞాన ముండిన నేమి లాభము? కావున వేదాభ్యాసము, శాస్త్రాభ్యాసము మున్నగువానివలన నా శానందము

కలుగదు. కృష్ణనామస్మరణము, హరిభజనము, నృత్యగీతములతో చేసినపుడు నాకు బ్రహ్మానందము కలుగుచున్నది. అదియే అందరికిని ప్రాప్యము. ఇట్టి ఆనందము ననుభవించుటకు సెల వీయఁగోరఁగా నాగురువులవా రంగీకరించి అనుజ్ఞ నిచ్చియున్నారు. గుర్వాజ్ఞ నతిక్రమించి నే నేమియు చేయుట లేదు. శాస్త్రములకుఁ గూడ నిది ప్రతికూల మైనది కాదు. అని చెప్పెను. ఈవిషయమే భగవద్గీతలో నిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో. "భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప.
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ."

(11. అ. 54, 55 భగవద్గీత.)

ఇంతలి భావజటిలతను గుర్తించి ప్రకాశానందస్వామి మనుమాటాడక "అయ్యో! నేనింతవరకును శాస్త్రార్థము చేసి జయము సంపాదించుటయందే గాని శాస్త్రచోదిత మైన పరబ్రహ్మమును తెలిసికొనుటకు ప్రయత్నింప నైతిని. భక్తిని చూడనే చూడ నైతినని పశ్చాత్తాపపడి అంతటితో నూరకుండెను.

అది చూచి అచ్చటి సన్న్యాసులును, పండితులును అందరును గూడ ప్రకాశానందుఁ డపజయ మందుట గ్రహించి చైతన్యస్వామి ప్రజ్ఞకు ఆనందించిరి.

ఒకనాఁడు సాయంత్రము చైతన్యస్వామి కాలభైరవస్వామి ఆలయమువద్ద కృష్ణనామస్మరణము చేయుచు మైమరచి నృత్యము చేయుచుండెను. అప్పుడామార్గమున నెటకో పోవుచున్న ప్రకాశానందుఁ డది చూచి ముందుకు పోలేక రెప్పవాల్పకుండ చూచుచు నిలిచిపోయెను. అంతట చైతన్యస్వామి భక్తిపరవశుఁడై,

శ్లో. 'బాలోఽపి శైలోద్ధరణాగ్రపాణిర్నీలోఽపి నీరంధ్రతమః ప్రదీపః
ధీరోఽపి రాధానయనావబద్ధో జారోఽపి సంసారహరః కుతస్త్వమ్.

మ. క్రతుభూమిం జొరఁబోవు; గోపగృహపంకంబన్న మెట్టేవు; గో
తతి హుంకారము విన్నఁ బల్కెదవు, విద్వద్గోష్ఠికిం బల్కవు; వా
నతి గావింతువు గోపజారలకు, దాంతశ్రేణిఁ గైకోవు; యో
గ్యతయే హేతువు ప్రేమ కారణము కాదా దేవ నీచర్యకున్.

శ్లో. యాసాం గోపాంగనానాం లసదసితతరాలోలలీలాకటాక్షా
యన్మానసాచారుముక్తామణిరుచినికరవ్యోమగంగాప్రవాహే
మీనాయంతేఽపి తాసామతిరభసచలచ్చారునీలాలకాంతా
భృంగాయంతే యదంఘ్రిద్వయసరసిరుహే పాతు పీతాంబరో నః.

మ. మును జన్మాంతరవేళ దుష్కరతపంబుల్, పాత్రదానంబు, స
జ్జనసంసేవయు, సద్వ్రతంబు లొనరించం గంటిఁ గాకున్నఁ గ
ల్గునె లోకోత్తరభక్తి నిందు మది నాలోకింపఁ బాదావనే
జనకృత్తోషణు దుష్టభీషణు మహాచాణూరవిద్వేషణున్.

శ్లో. సంధ్యావందన భద్ర మస్తు భవతే, భో స్నాన! తుభ్యం నమః
భో దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతాం,
యత్ర క్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారం స్మారమఘం హరామి తదలం మన్యే కిమన్యేన మే.

(2. ఆ. 73, 83, 95, 99, 107. కృష్ణకర్ణామృతం.)

అని యనేకవిధముల కృష్ణస్మరణము గావింపసాగెను. అప్పుడు స్వామిదేహమున నొక దివ్యతేజము వెడలి కన్నులను మిరిమిట్లు గొలిపెను.

అదిచూచి ప్రకాశానందస్వామి ఇఁక తడయఁజాలక వెంటనే చైతన్యస్వామి పాదములమీఁద వ్రాలెను. అప్పటికి ప్రభాత మయ్యెను. చైతన్యస్వామికి స్మృతి వచ్చెను. అప్పుడు స్వామిపాదాక్రాంతుఁడై యున్న ప్రకాశానందుని లేవనెత్తెను. పిదప నిరువురును భజన ప్రారంభించిరి. ఇరువురును కన్నీరు కార్చిరి. ఇరువురును స్మృతి తప్పి పడిపోయిరి. అంతట శిష్యులు ఉపచారములు చేయఁగా వారు కొంతసేపటికి లేచిరి.

అపుడు ప్రకాశానందుఁడు చైతన్యస్వామి పాదములమీఁద వ్రాలి "మహాత్మా! నేటితో నాయజ్ఞానము తొలఁగిపోయినది. నాయహంకారమమకారములు సన్నగిల్లినవి. నాజన్మము పావనమైనది. ఇంతవరకును నేను ఘటపటాదిశబ్దజాలములోఁబడి పొరలుచుంటిని. ఇప్పు డాదురవస్థ తప్పిపోయినది. స్వామీ! నాయెడల అనుగ్రహముంచి నాకు మోక్షమార్గము నెఱిఁగింపుము. నీవే నాకు ఆచార్యుఁడవు. నీపాదములే నాకు గతి" అని ప్రార్థించెను. దానిమీఁద చైతన్యస్వామి అతనిని లేవనెత్తి ఈకలియుగమున హరిభజనమే ముక్తిదాయకమైనది. ఇంతకంటె సులభమైన మార్గము మరియొకటి లేదు.

శ్లో. 'హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్,
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా."

హరినామస్మరణము తప్ప ఈకలియుగమున మరియొకగతి లేదు. భూతదయ గలిగియుండి హింసను విడువవలెను. సత్యనిష్ఠులైయుండవలెను. అందరియందును భగవద్విలాసములు గుర్తించుచు అందరియెడలను ప్రేమతో మసలుకొనవలెను. అహంకారమమకారములు నిర్జింపవలెను. శ్రీకృష్ణనామకీర్తనము చేయుచు భజన సేయుచు సకలమును రాధవలె శ్రీకృష్ణుని కర్పింపవలెను. ఇదియే తరణోపాయము. ఇదియే మోక్షప్రాప్తికి సాధనము.

శ్లో. "హరే రామ హరే రామరామ రామ హరే హరే,
హరే కృష్ణ హరే కృష్ణకృష్ణ కృష్ణ హరే హరే."

ఇదియే మహామంత్రము. ఇదియే ఆనందమును కలిగించును" అని ఉచ్ఛస్వరమున ప్రబోధించెను.

పిదప చైతన్యస్వామి కొన్ని దినము లక్కడనేయుండి నవద్వీపమునకువచ్చెను. అక్కడ భార్య, తల్లి, బంధువులు, శిష్యులు మున్నగువా రందరును స్వామినిజూచి బ్రహ్మానందభరితులైరి.

తరువాత స్వామి జగన్నాథమునకు బయలుదేరెను. అప్పుడు పూర్వాశ్రమమున స్వామికి భార్యయై యుండిన విష్ణుప్రియ స్వామిపాదములమీఁద వ్రాలి "తమ స్మృతిచిహ్నముగా నాకేదైన దయచేయవలె" నని కోరెను. అందుకు స్వామి "నేను సన్న్యాసిని. నావద్ద నేమున్నది?" అని యడుగఁగా విష్ణుప్రియ పాదుకలు కోరెను. స్వామి సంతోషముతో వాని నామె కిచ్చివేసి వెడలిపోయెను. విష్ణుప్రియ బ్రతికియున్నంతకాలము వానిని పూజించెను. అవి యిప్పటికిని జగన్నాథమున నొక యాలయమున పూజింపఁబడుచున్నవని చెప్పుదురు.

జగన్నాథమున వసించుచుండఁగా స్వామి చుట్టును కూర్చుండియున్నవా రొకనాఁడు "స్వామీ! నిజమైన హరిదాసుల నెఱుంగుటె" ట్లని యడిగిరి. అందుకు స్వామి 'హరిదాసులలో భేద మేమియు లేదు. మనస్ఫూర్తిగాఁగాని, వేడుకకు గాని, ఇతరులను జూచి అనుకరించుటకుగాని, ఇతరులు తన్ను భక్తుఁడనుకొనవలెనని గాని—ఎట్లయినను శ్రీకృష్ణనామము స్మరించినచో అతఁడు హరిదాసే. ఒక్కమారైనను కృష్ణా యనువారు పాపవిముక్తు లగుదురు కావున హరిదాసులలో తారతమ్యము లేదు; గావున మీ రెవరిని పరీక్ష చేయవలదు' అని చెప్పెను అదివిని అందరును సంతృప్తి పొందిరి.

ఇట్లు నిరంతరకృష్ణస్మరణమువలన బ్రహ్మానంద మనుభవించుచు చైతన్యస్వామి నలువదియెనిమిది సంవత్సరములు భూలోకమున నుండెను. ఒకనాఁటి రాత్రి స్వామి హరిస్మరణము చేయుచు నృత్యము చేయుచుండఁగా కృష్ణుఁడు ఎదుట సాక్షాత్కరించి పిలిచినట్లు అందరికిని కనఁబడెను. అంతట స్వామి పట్టుకొనఁబోఁగా కృష్ణుఁడు సముద్రముదెసకు పరువెత్తెను. స్వామికూడ వెంట పరువెత్తఁగా శ్రీకృష్ణుఁడు సముద్రముఁ జొచ్చెను. అది చూచి అతివేగముగ చైతన్యస్వామి గూడ సముద్రము జొచ్చి అవతారము చాలించెను.

మ. "మను భక్షించితె కృష్ణ! యెవ్వరనిరమ్మా? యన్న యన్నాఁడు; క
న్గొను నా మోమది కల్ల చూడు మనఁచుక్ నోరెత్త విశ్వంబు లె
ల్లను గన్పించిన నింత వెఱ్ఱఁ దిన నేలా గయ్యొ నాశ్చర్య మం
చును వీక్షించు యశోదఁ గాంచి నగుకృష్ణుం గాంతు నశ్రాంతమున్."
(2. ఆ. 65. కృష్ణకర్ణామృతము.)

# త్రైలింగస్వామి

దక్షిణదేశమున నొక బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు చిరకాలము చూచియు సంతానము కలుగకపోవుటవలన మరియొకకన్యను పెండ్లి చేసికొనియెను. తాను వంధ్య యగుటవలననే తనభర్త మరియొకతెను పెండ్లియాడుటచే మొదటిభార్య చాల వగచి, తనకు సంతానఫల మీయవలసినదని శివుని వేఁడెను. తత్ఫలముగా నామె తన సవతికంటెను ముందుగనే యొకకుమారుని కనెను. శివప్రసాదము వలన పుట్టిన యీకుమారునకు ఆదంపతులు శివారాముఁ డని పేరు పెట్టి గారాబముగా పెంచుకొనుచుండిరి.

శివారాముని సవతితల్లికిఁగూడ కొంతకాలమునకు సంతానము కలుగసాగెను.

శివారాముఁ డైదేండ్లవాఁడై యుండఁగా తండ్రి గతించెను. అందుకు అతని జ్యేష్ఠపత్ని మిగుల విచారించెను; గాని కుమారుని చూచికొని ఊరట చెందెను.

పిదప నామె శివారాముని ఆగ్రామమున నున్నపాఠశాలలో విద్యాభ్యాసమునకై అప్పగించెను. ఆచిన్నతనమునఁగూడ ఆతఁడు మిగుల మేధావి. విద్యయెడల అతనికిఁ గల శ్రద్ధాసక్తులకును, కుశాగ్రబుద్ధికిని ఉపాధ్యాయుఁడు మిగుల నానందించుచు అతనికి ప్రత్యేకశ్రద్ధతో విద్య చెప్పెను.

ఇతరులకు పాతికయేండ్లలో వచ్చువిద్య శివారామునకు పదియేండ్లకే వచ్చెను. అతఁడు అనేకవిద్యలలో గొప్పపండితుఁ డయ్యెను.

కాని చిన్నతనమునుండియు అతనికి దైవభక్తియు, వైరాగ్యము నధికముగా నుండెను. వయసు హెచ్చినకొలఁదియు నాతఁడు సన్యసించి మోక్షము సంపాదింప నాలోచనలు చేయసాగెను. ఇది యెఱిఁగి తల్లి అనేకవిధముల బలవంతపఱచి అతనికి వివాహము గావించెను. కేవలము తల్లిమాటను తీసివేయఁజాలకయే అతఁడు పెండ్లియాడెను; గాని సంసారసుఖములు పడయఁగోరి కాదు.

ఆతని కిరువదినాల్గేండ్లు వచ్చునప్పటికి తల్లిఁగూడ గతించెను. అతఁడు తల్లిమృతికి వగచెను; గాని ఇఁక తనకోర్కె ఈడేర్చుకొనవచ్చు నని మిగుల నానందించెను సహచరులు వారించిరి. హితైషులు బోధించిరి. బంధువులు మందలించిరి; గాని అతఁడు చలింపక తనయాస్తి తనసవతితమ్మున కిచ్చివేసి విరాగియై సంచరింపఁజొచ్చెను.

ముస్ముందు అతడు సకలతీర్థములను సేవింపదలంచి బయలుదేరెను. కొంతదూరము పోవునప్పటి కాతని కొకపరివ్రాజకుడు కాన్పించెను. వారొకని యెడ నొకడు ముగ్ధులై కొంతదేశము తిరిగిరి. తుదకు శివారాముడు పరివ్రాజకునకు శిష్యుడై యోగవిద్య నభ్యసించి త్రైలింగస్వామి యనుపేరితో వ్యవహరించుకొనసాగెను.

కొంతకాలమునకు పరివ్రాజకుడు స్వర్గధామమునకు పోగా త్రైలింగ స్వామి రామేశ్వరము ప్రవేశించెను.

అప్పటి కప్పుడే యోగవిద్యాప్రభావమువలన అతడు మహాత్ముడయ్యెను. రామేశ్వరము ప్రవేశించినవెంటనే అచ్చటివారి కాతని యద్భుతశక్తులు వెల్లడి యాయెను. దినదినము ననేకు లాతని దర్శించి పూజింపసాగిరి.

దినములు కడచినకొలదిని వచ్చి చూచేవారు అసంఖ్యు లగుచుండుటవలన యోగదీక్షకు భంగము రాగా అతఁ డక్కడనుండుట మంచిదికాదని ఉత్తర హిందూదేశమునకు వెడలిపోయెను.

అతడు నేపాళదేశమున, టిబెట్టుదేశమున కొంతకాల ముండి, హిమగిరిపై కొంతకాలము తపస్సు గావించి పిదప వారణాసి చేరుకొనియెను.

కాశీనగరము ప్రవేశించిన కొలదిదినములకే అతని శిష్యులసంఖ్య చాల పెరిగెను. వారిలో వంగదేశీయుడు ఒకడు స్వామికి విశ్వాసపాత్రుడై యుండెను. ఒకనాడు స్వామి, వంగశిష్యునికుమారుడు స్వస్థలమున మృతి నందుట యోగ మహిమవలన నెఱిఁగి, శిష్యున కది యెఱింగించి, జ్ఞానోపదేశముచేసి అతని దుఃఖము నుడిపెను.

ఒకనాఁ డొకపురుషుడు పాము కరువగ చనిపోయెను. బంధువులు ఆతని కళేబరమును దహనసంస్కారము గావించుటకు గంగాతీరమునకు తెచ్చిరి. వెంట వచ్చిన మృతునిపత్ని మిగుల దుఃఖింపసాగెను. గంగాప్రవాహమున తేలి యాడుచు యోగమున నున్న త్రైలింగస్వామి అది యెఱింగి మృతుని బ్రతికించి అందరికి నానందము కలిగించెను.

ఒకనాఁడు కొందఱు దుష్టులు సున్నపునీరు తెచ్చి పాలని చెప్పుచు స్వామి కిచ్చిరి. స్వామియు ఆద్రావ్యమును గ్రహించియు నేమియు చలింపక గడగడ త్రాగివేసెను. ఆదుష్టులు ఇఁక స్వామి కడతేరు నని భావించిరి గాని అందుకు వ్యతి రేకము జరిగెను. ఆనీరు స్వామికి పాలకంటెను ఎక్కువశక్తి నిచ్చెను. అది చూచి ఆదుర్మార్గులు పశ్చాత్తాపపడి సంగతియంతయు విన్నవించి స్వామిని క్షమింపవలె నని ప్రార్థించిరి. అందుకును స్వామి యేమియు ననక సంతోషముతో వారికి సెల విచ్చెను.

ఒకనాఁడు స్వామి గంగాప్రవాహమున తేలియాఁడుచు తపస్సు చేసికొనుచుండఁగా రామనగరమునుండి యొక రాజపుత్త్రుఁడు నావమీఁద వచ్చుచు స్వామి ప్రభావము నదివరకే వినియున్నవాఁడు. కావున నావను స్వామిచెంతకు పట్టించి "మహాత్మా! నావ నధిరోహింపుడు" అని ప్రార్థించెను. స్వామి వెంటనే నావ నెక్కెను. రాజపుత్త్రునిచేత నొక చక్కనిఖడ్గ ముండెను. దానిమీఁద రాజపుత్త్రున కెంతో మక్కువ. స్వామి అది గ్రహించి "చూచెద" నని దానిని పుచ్చుకొని, చూచి నట్లే చూచి గంగలో విడిచెను. అందుకు రాజపుత్త్రుఁడు చాలవగచి నిష్ఠురము లాడఁగా స్వామి మందహాసము గావించుచు తటాలున నీటిలో చేతిని ముంచి ఖడ్గమును పైకితీసి యిచ్చివేసెను. రాజపుత్త్రుఁడు మిగుల నబ్బురపడి స్వామి యద్భుత మహిమకు ముగ్ధుఁడై సాష్టాంగనమస్కారము లాచరించి మన్నింపఁ బ్రార్థించెను. స్వామియు నందుకుఁగూడ నేమియు వికారము పొందక యుక్తసమయమున నావ దిగి ఆశ్రమమునకు వెడలిపోయెను.

ఇట్లు అనుదినమును స్వామిమాహాత్మ్యము వెల్లడి యగుచుండెను. అందువలన ప్రతిదినము ననేకులు వచ్చి స్వామిని దర్శించి యుపదేశము లాలకించి దుఃఖములను మఱచి, ప్రహృష్టమానసులై వెడలిపోవసాగిరి. స్వామి వచ్చినవారిముఖములు చూచియే వారి భూతభవిష్యద్వర్తమానములు తెలుపసాగెను.

ఒకనాఁడు కలకత్తానుండి ఒకన్యాయవాది స్వామిని దర్శింప ఆశ్రమమునకు వచ్చెను. స్వామి ఆతనిని చూచినవెంటనే ఆత్రముతో 'వెడలిపొ' మ్మని చేతితో సంజ్ఞ చేసెను; గాని న్యాయవాది మొండిపట్టు పట్టి అక్కడనే నిలిచెను. అంతట స్వామి శిష్యులకు సకలము నెఱిఁగింపఁగా వారు వచ్చి న్యాయవాదిచేసిన పాతకముల నన్నిఁటిని బహిరంగపఱిచిరి. అందుకు ఆశ్చర్యమును, తన పాపబాహుళ్యమునకు విచారమును పొంది న్యాయవాది ఒక క్షణమైన నచ్చట నిలువకుండ వెడలిపోయెను.

స్వామి కాశీనగరమున త్రైలింగస్వామిఆలయమును కట్టించెను. ఇఁక రెండునెలలకు మరణము కలుగు నసఁగా స్వామి శిష్యులకు భవిష్యద్వృత్తాంతము నెఱిఁగించి, వారి కందరికిని జ్ఞానము నుపదేశించెను. శిష్యుల జ్ఞానముతోపాటు వగపును వృద్ధి పొందుచుండఁగా ఆదినము వచ్చెను.

స్వామి నాఁడు నిమీలితనేత్త్రుఁడై యోగనిద్రాముద్రితుఁడై స్థూలదేహమును విడిచి ఈశ్వరసాయుజ్యమును పడసెను.

# భాస్కరానందస్వామి

కాన్పూరు సమీపమునందలి యొకపల్లెలో నొక కనౌజబ్రాహ్మణుఁ డుండెను. అతఁడు సంస్కృతమున గొప్పపండితుఁడు. లేకలేక యతని కొకకుమారుఁడు పుట్టెను. వాని నతిప్రేమతో పెంచుకొనుచు తల్లిదండ్రు లతనికి మతిరాముఁడను పేరు పెట్టిరి. తండ్రి మతిరామున కెనిమిదవసంవత్సరమున ఉపనయనసంస్కారము గావించి పాఠశాలలో చదువవేసెను.

మతిరాముఁడు చాలశ్రద్ధతో విద్య నభ్యసించెను. సహజముగ నతఁడు మంచి ప్రతిభావంతుఁడు. అగుటచే పదునేడేండ్లప్రాయము వచ్చునప్పటికే యతఁడు మహావిద్వాంసుఁ డయ్యెను.

మతిరామునకు బాల్యమునందే వివాహమైనది. మరియు వివాహమైన యెనిమిదేండ్లకే యతని కొకశిశువు కలిగి వెంటనే చనిపోయెను. అదిమొదలు మతిరామునకు వైరాగ్యము ప్రబలెను. వెంటనే యతఁడు సంసారమును విడిచి తీర్థాటనమునకు బయలుదేరెను.

మొదట నతఁ డుత్తరహిందూదేశమంతయు తిరిగి ఉజ్జయినీపట్టణము చేరుకొనెను. అందు పూర్ణానందస్వామి యను మహాముని యుండఁగా మతిరాముఁ డామహాత్ము నాశ్రయించెను.

ముని మతిరాముని వైరాగ్యమును గమనించి అతనికి యోగవిద్య నుపదేశించి, సన్న్యాసము నిచ్చెను. మతిరాముఁ డప్పుడే భాస్కరానందస్వామి యయ్యెను. కొంతకాలము భాస్కరానందుఁడు గురువునుసేవించి ఆముష్మికవిషయములను బాగుగ నెఱింగి పిదప అనుజ్ఞపొంది పుణ్యక్షేత్రములను దర్శించుటకు బయలుదేరెను.

సన్న్యాసము పుచ్చుకొన్నపిదప అతఁడు కౌపీనమునుమాత్రమే ధరించెను. దానితోడనే అతఁడు ఆసేతుశీతనగమధ్యస్థములగు తీర్థక్షేత్రములనన్నిటిని సందర్శించెను.

బదరికాశ్రమమున కరుగుమార్గమున స్వామి అతిశీతమునకు దేహము ముడుచుకొనిపోఁగా మృతునివలె పడిపోయెను. అపు డొక పుణ్యాత్ముఁడు మార్గవశమున అట్లు పోవుచు చూచి తగిన యుపచారములు చేసి స్వామిని ప్రకృతికి తెచ్చెను.

స్వామి మరల బయలుదేరిపోవుచుండఁగా అనంతరామస్వామితో సాహచర్యము కలిగెను. అనంతరామస్వామి వేదాంతవిద్యలో సాటిలేనివిద్వాంసుఁడు. భాస్కరానందస్వామి అందుకు మిగుల నానందించి వేదాంతవిచారముల ప్రారంభించెను. వా రిరువురును వాల్మీక్యాశ్రమము సమీపమున వేదాంతచర్చచేయుచు చాల

కాలము గడపిరి. అప్పటికి భాస్కరానందస్వామి వయస్సు నలువదిసంవత్సరములు. అక్కడనుండి స్వామి వారణాసికి పోయెను.

కాశీనగరము చేరినపిదప నతఁడు కౌపీనమునుగూడ విసర్జించెను. దుస్సహ శీతము విజృంభించి యున్నపుడుగూడ స్వామి దిగంబరుఁడుగనే యుండి తపస్సుచేసి కొనసాగెను.

కాశీలో స్వామికి అనేకులు శిష్యులైరి. వారందరును ధర్మసాధకమైనశరీరమును శీతవర్షాతపాదులవలననుండి రక్షించుకొనవలయు నని ప్రార్థించిరి; గాని స్వామి వినలేదు. ఏకాంతస్థలమున నుండుట అతని యుద్దేశము; గాని అది కొనసాగలేదు. స్వామి ప్రతిభ నలుదెసల వ్యాపింపఁగా దివారాత్రము లనుభేదమును గమనింపక వేలకొలఁదిజిజ్ఞాసార్థులు వచ్చి యాశ్రయించి యుపదేశముల నాలించి ప్రహృష్టచిత్తు లగుచుండిరి. ధనికులు, బీదలు, హిందువులు, హైందవేతరులు అను విచక్షణ లేకుండ అన్నికులములవారును, అన్ని తరగతులవారును, అన్నిమతములవారును అతని శిష్యులైరి.

తపోనిష్ఠవలన భాస్కరానందుని ప్రభావ మధిక మయ్యెను; గాని దాని నాతఁడు ప్రపంచమున వెల్లడిచేయుట కిష్టపడలేదు. కొలఁది సందర్భములలోమాత్ర మది తనంతట తానే బహిర్గతమయ్యెను.

ఒకరాజపుత్రిక జ్యోతిశ్శాస్త్రవిషయమున నొకప్రశ్న యడుగఁగా స్వామి దానికి సరియైనప్రత్యుత్తరము చెప్పెను. అందుల కామె మిగుల నలరి యొకలక్ష రూపాయలు సమర్పింపఁబోయెను; గాని యాతఁడు వానిని తిరస్కరించివేసెను. "నేను సన్న్యాసిని" అనిచెప్పి ఆధనము నాతఁడు చిల్లపెంకువలె చూచెను. ఆనిర్లిప్తతకును ఆమె మిగుల నలరి "ఈధనమును 'న మమ' అనుకొంటిని; గావున మీరు స్వీకరింపరేని మరియొకవిధముగా వినియోగించెద" నని చెప్పి యామె దానితో ఒక శిశుసంరక్షణమందిరమును నిర్మించి అందు స్వామివిగ్రహమును నెలకొల్పెను.

ఒకనాఁడు ఒకశిష్యునికుమారుఁడు మేడమీఁదనుండి క్రింద పడిపోయెను. వెంటనే యాబాలునకు చైతన్యము లోపించిపోయెను. అనేకమంది ఘనవైద్యులు వచ్చిరి; గాని ప్రయోజనము కలుగలేదు. అందరు నిఁక లాభము లేదనుకొనిన పిదప స్వామి శిష్యుని సమాశ్వాసించి బాలునినోట గంగోదకము పోసెను. వెంటనే బాలుఁడు లేచి కూరుచుండి ఆడుకొనసాగెను.

ఒకప్పు డొకవంగీయుఁడు వచ్చి శిష్యకోటిలో చేర్చుకొనవలసిన దని ప్రార్థించెను. ఆతఁ డెంత వేడినను స్వామి తిరస్కరించి "నీవు దారాపుత్రుల యనుమతి పొందిరాలేదు. విషయోపభోగముల ననుభవించునపుడు నీవు చేసిన పాతకములకు నీ విఁకను పశ్చాత్తాపముతో తపింపవలసియున్నది" అని చెప్పి పంపివేసెను. మఠ

కొన్నిదినములు కాతఁడు అర్హత సంపాదించుకొని రాఁగా వెంటనే స్వామి యతనికి దీక్ష నిచ్చెను.

తరువాత భాస్కరానందస్వామి తన కాలమునంతను కాశీనగరమునందే గడపి వై చెను. ఇప్పటికి ముప్పదిసంవత్సరములకు పూర్వమతఁడు దేహము చాలించెను. అవ సానసమయమున నాతఁడు శిష్యుల నందరిని చేరఁబిలిచి "వత్సలారా! నేను నేటితో తనువు దొరంగుచున్నాను. ఇదియే నా కడపటి తపస్సమాధి" అనిచెప్పెను.

స్వామి యవతారము చాలింపఁగా శిష్యులందరు నాతని కళేబరమును గంగా తీరమున వహనము గావించి అస్థికలను సమాధి చేసిరి. ఈసమాధిని నిర్మించుట కొక భక్తుఁడు చాల ధనము వెచ్చించెను.

శిష్యులందరును స్వామి పేరిట నొక సంస్కృతవిద్యాలయమును నెలకొల్పిరి. అందు పలువురు విద్యార్థులు విద్య నభ్యసించి గొప్పవిద్వాంసు లగుచుండిరి.

---

# హ రి దా సు

వంగదేశమునందలి నడియామండలమున నొక పల్లెయం దీతఁడు పుట్టెను; గాని అతిబాల్యమునందే తల్లిదండ్రులు చనిపోవ మహమ్మదీయులచే పెంపఁబడి వారి మతమ్మున కలుపఁబడెను. ఈకారణమువలన నాతఁడు మొదటినుండియు మహమ్మ దీయమతగ్రంథములనే చదువవలసివచ్చినను పూర్వజన్మవాసనావశమున హైంద వాచారములయెడను, హరిభజనము మున్నగువానియందును ప్రీతుఁడై సమాజ భీతి కోడి హృదయమునందే వానిని పదిలపఱచికొని యుండెను.

ఇట్లుండ శాంతిపురమున నొకగొప్పతపోధనుఁడు నివసించుచుండెను. ఈముసల్మానుయువకుఁడా స్వామి చెంత కరిగి తన్ను శిష్యునిగాఁ గైకొనవలెనని ప్రార్థించెను. హిందూమహమ్మదీయులకు ఆకాలమున ఇప్పటికంటెను స్వమతముల యెడల పట్టుదల అధికముగ నుండెను. ఈకారణమువలన స్వామి ఆయువకుని తిరస్కరించెను.

అయినను యువకుఁడు స్వామిని విడువలేదు. దివసక్రమమున వాని వినయ విధేయతలు, భక్తివైరాగ్యములు చూచి తుదకు స్వామి వానికి హరినామస్మర ణము నుపదేశించి హరిదాసు అని పేరు పెట్టెను.

వెంటనే హరిదాసు అరణ్యమున నొక సెలయేటితీరమున కుటీరము నిర్మించు కొని అందు వసించి హరినామస్మరణముతో కాలము గడుపసాగెను.

అయినను ఈసంగతి తురకలకు వెంటనే తెలిసిపోయెను. దానిమీఁద వారు చాల కోపపడి నయభయములుచూపి మరల మహమ్మదీయునిగా చేయుటకు ప్రయ త్నించియు విఫలులై మతద్రోహి అనిచెప్పుచు అతనిని నవాబుచెంతకుఁగొనిపోయిరి.

హరిదాసు నారసి నవాబు మండిపడెను. హైందవబాలుఁడుగా నున్నప్పుడు వానిని మహమ్మదీయులు తమమతమున చేర్చుకొనుట నవాబున కక్రమముగా తోఁచలేదు. కాని అతఁడు హరిభక్తిపరాయణుఁ డగుట ఘోరాపరాధముగా తోఁచినది. దానిని మహమ్మదీయు లందరును బలపఱచిరి.

ఇఁక చెప్పవలసిన దేమున్నది ? నవాబు ఆజ్ఞాపించుటయే తడవుగ భటులాతనిని చావమోదిరి. ఆదెబ్బలకు హరిదాసు స్మృతి తప్పి పడిపోఁగా మహమ్మదీయులు ఆతనిని గంగలోఁ బడవైచి వెడలిపోయిరి. మొదట వా రాతనిని భూస్థాపనము చేయుటకే చూచిరి; గాని స్మృతిహీనుఁడై పడియున్నను సమాధి చేయఁబోవు సమయమున తెలివి వచ్చి యాతఁడు లేచుటవలన అట్టివానిని సమాధిచేయఁగూడదని తలఁచి గంగలో పడవైచిరి.

శ్రీహరికరుణాకటాక్షమువలన హరిదాసు గంగాప్రవాహమున మునిఁగి చనిపోవుటకు బదులు బలపడెను. అతఁ డొక పల్లెకడ తీరము చేరి ఒక బ్రాహ్మణుని ఆశ్రయ మీయవలసినదని ప్రార్థించెను. ఆబ్రాహ్మణుఁడు దయార్ద్రహృదయుఁడు అగుటవలన ముసల్మానుల సంపర్కమును దలఁచి తొలుత సంశయించెను; గాని తుదకు సాహసించి వానిని చేరనిచ్చెను.

హరిదాసు బ్రాహ్మణుని మిగుల గౌరవముతో చూచుచు హరిస్మరణమునందే మైమరుచుచుండెను.

కొన్ని దినములు జరిగిన తరువాత హరిదాసు మరల శాంతిపురమున ప్రవేశించెను. గంగాతీరమున నొకకుటీరము నిర్మించుకొని అతఁ డందు నివసించెను; గాని యీసారి యెవరు నేమియుఁ జేయలేదు.

ఒకజమీందారుఁడు హరిదాసును భంగపరుపఁదలచి ఒక నిశీథమున నతని కుటీరమున కొక వేశ్య నంపెను. వేశ్యయు ననేకవిధముల పనిచేసెను; గాని హరిదాసు చలింపలేదు. మరియు నతఁడు హరిస్మరణము విడువలేదు. తెల్లవారిన పిదప ఆవేశ్య మరల వచ్చెను; గాని తుద కామె తన ప్రయత్నమునకు మిగుల సిగ్గుపడి ఆతని పాదములమీఁద వ్రాలి క్షమింపఁ బ్రార్థించి, అతనివలన హరిస్మరణము నుపదేశము పొంది విరాగిణియై వెడలిపోయెను.

తరువాత హరిదాసు నవద్వీపమున కరిగి చైతన్యుని శిష్యుఁ డాయెను. గౌరాంగస్వామి హరిదాసును చాల ప్రేమించెను. హరిదాసు భౌతికదేహమును విడిచినపుడు స్వామి శిష్యులతోఁగూడి అతని కళేబరమును చుట్టును నృత్యము చేయుచు భజనచేసి మృతకళేబరమును సముద్రపుటిసుకపర్రలో సమాధి చేసెను.

---

# రామప్రసాదుఁడు

ఇతఁడును వంగదేశమునందే హాలీనగరసమీపమునందలి యొకపల్లెయందు జన్మించెను. జనకుఁ డీతనికి రామప్రసాదుఁ డని పేరుపెట్టి శ్రద్ధతో విద్యచెప్పెను. పిన్నవయసునందే రామప్రసాదుఁడు విద్వాంసుఁడై చక్కని కవిత్వము చెప్పసాగెను. తంత్రశాస్త్రమునఁగూడ నాతఁడు చాల పాండిత్యము సంపాదించెను.

ఆతఁ డింకను కొంతకాలము విద్యాభ్యాసము చేసియుంటినచో ఇంకను గొప్ప పండితుఁడై యుండును; గాని ఆసమయమున అతనితండ్రి గతించెను. వెంటనే దమ్మిడీయైన లేనిసంసారము రామప్రసాదునిమీఁద పడెను.

వెంటనే తన కుటుంబమును వెంట నిడుకొని యతఁడు కలకత్తానగరముచేరి అందొక ధనికునిచెంత గుమాస్తాగా ప్రవేశించెను.

రామప్రసాదుఁడు కాళీభక్తుఁడు. మరియు కవి. అతనికవనము భక్తిరసోజ్వలమై మనోహరముగా నుండెను. అతఁడు యజమానుని యనుజ్ఞచొప్పున లెక్కలు వ్రాయుచు కవితావేశము కలిగినపు డాపుస్తకములయందే అతఁడు పద్యములు వ్రాయసాగెను.

ఒకనాఁడు పెద్దగుమాస్తా యిది కనిపెట్టి మిగుల దూషించి ఆపుస్తకములను యజమానునకు చూపెను.

యజయానుఁడు కేవలము ధనికుఁడే కాదు, కాళీభక్తుఁడును, పైఁగా రసపిపాసి. అతఁడు రామప్రసాదుని పద్యములను చదివి అందలి పరమార్థమును గ్రహించి ముగ్ధుఁడై "సుకవీ! నీవు సామాన్యుఁడవు కావు. ఈసంగతి తెలియక నేను నిన్ను గుమాస్తాగా పెట్టుకొని అపచారములు చేసితిని. ఇఁక నీవు నా కేమియు పనిచేయ నక్కఱలేదు. నీవు నీగృహమునందే యుండి నీయిష్టమువచ్చినట్లు కాళీమాతను సేవించుకొనుచుండుము. నీకు సంసారనిర్వహణమునకు ఆవశ్యకమైనడబ్బు నే నూరకనే యిచ్చుచుందును" అని గౌరవించి పంపివేసెను.

అదిమొదలు రామప్రసాదుని జీవనమున మార్పు కలిగెను. అతఁడు కాళీపూజ, కవిత్వము ఇవితప్ప నన్యము మరచిపోయెను. అతఁడు. మంచికంఠముకలవాఁడు. పద్యములను పాటలను అతఁడు గొంతెత్తి పాడినచో అనేకులు వచ్చి చుట్టును మూఁగి విని పరవశులగుచుండిరి.

కొందరు అతని గానము నాలించి కొంచెము కొంచెముద్రవ్యమిచ్చి పోయెడివారు.

కొలఁదికాలమునందే అతని కవితాచాతుర్యము, పఠనకౌశలము, కాళీభక్తి దేశప్రఖ్యాతము లయ్యెను. ఇవి నవద్వీపాధిపతి విని అతనిని తన యాస్థానమున నుండఁగోరెను. ప్రభువు విశేషవార్షికసాహాయ్యము చేసెదననినను రామప్రసాదుఁడు అందుకు తిరస్కరించి స్వేచ్ఛాజీవనమునే స్థిరపఱచికొనెను. రాజు అందులకు నిరాశుఁడై చాల వగచెను; గాని చేయునదిలేకయు, పరసుఁ డగుటవలనను మంచిభూవసతిని, బిరుదములను ఇచ్చి రామప్రసాదుని గౌరవించెను.

ఒకనాఁడు రామప్రసాదుఁడు పడవమీఁద కూర్చుండి గంగానదిలో గానము చేయుచుండ మరియొకపడవమీఁద జలవిహారమునకు బయలుదేరిన బంగాళానవాబగు సురాజుద్దౌలా ఆమధురగానము నాలించి తనపడవ రామప్రసాదుఁ డున్నపడవ చెంతకు నడిపించుకొనిపోయి అతనిని తన పడవమీఁదికి రమ్మని పిలిచికొనిపోయెను. అప్పుడు రామప్రసాదుఁడు తన నైపుణ్యము నంతను ప్రదర్శించి నవాబు నానందపఱచెను.

రామప్రసాదునకు కాళీమాత అనేకరూపములతో సాక్షాత్కరించెడిదని ప్రతీతి. ఒక్కొకప్పు డామె మానవీరూపముతో వచ్చి అతని మంజులగీతము నాలించెడిదనియు, అన్నపూర్ణాదేవి యాదేశముచొప్పున గానముచేయుటకై అతఁడు వారణాసికి వెడలిపోయెననియు అనేకులు చెప్పుకొనసాగిరి.

అతఁడు దేవీపూజ గావించి, పూజ అనంతరము దేవీవిగ్రహమును గంగానదియందు కలుపుచు దేహమును చాలించెను.

అతని గీతము లిప్పటికిని వంగదేశమున అత్యాదరముతో పాడఁబడుచుండును.

---

# విజయకృష్ణగోస్వామి

ఈతఁడు బంగాళాదేశమున నడియామండలమునం దొకజనపదమున మేనమామ యింట జన్మించెను. స్వగ్రామమునందే యీతఁడు ప్రారంభవిద్య నభ్యసించి తరువాత కలకత్తానగరమున కరిగి సంస్కృతకళాశాలయందు ప్రవేశించెను; గాని అందు ఏపట్టమును పొందకయే వైద్యపాఠశాలయందు ప్రవేశించి పరీక్షలో నుత్తీర్ణుఁ డయ్యెను.

వెంటనే ఇతఁడు ఢక్కానగరమున కరిగి అందు వైద్యవృత్తిని ప్రారంభించెను. సహజముగ నీతఁ డమృతహస్తుఁడు, పైఁగా ద్రవ్యాశ లేనివాఁడు. ఈకారణమువలన అనేకు లితనిచికిత్సనే కోరెడివారు. గోస్వామి చికిత్సచేసినచో రోగవిముక్తి యగునని ప్రఖ్యాతి యేర్పడెను.

బ్రహ్మసమాజమునకు సంబంధించినభావము లపుడు వంగదేశమున జటిలముగా వ్యాపించుచుండెను. పాశ్చాత్యదేశములలో సంచరించి అపుడే వచ్చినకేశవచంద్రసేనుఁడు బ్రహ్మసమాజమున నూత్నశాఖ నేర్పఱచెను.

వంగదేశమున కేశవచంద్రునియెడల స్త్రీపురుషుల కపారమైనభక్తియేర్పడెను. మన గోస్వామియు నట్లే కేశవునియుపదేశముల నాలించి ముగ్ధుఁడై యజ్ఞోపవీతమును విసర్జించి బ్రహ్మసమాజమున ప్రవేశించెను.

శివనాథశాస్త్రి, ద్వారకనాథగంగోపాధ్యాయుఁడు, విజయకృష్ణగోస్వామి— వీరు సాధారణబ్రహ్మసమాజమునకు నాయకులైరి. గోస్వామి వంగదేశమంతయు సంచరించి బ్రహ్మమతమును గురించి అనేకోపన్యాసములు చేసెను. ఆకాలమున ఢక్కానగరమున బారది యను నొకమహాపురుషుఁ డుండెను. గోస్వామి ఆయనప్రభావమును విని సఖ్యము చేసెను.

ఇతఁ డొకసారి ఉత్తరసీమలకు ప్రచారమున కరిగి అక్కడ రోగపీడితుఁ డాయెను. అనేకవైద్యులు చికిత్స చేసిరి; గాని లాభము కలుగలేదు. అది విని బారది అచ్చట కరిగి తన యద్భుతప్రభావమున గోస్వామిని బ్రతికించెను.

బారది హరిభక్తుఁడు. అది మొదలు బారదివలెనే గోస్వామియు హరిభక్తుఁ డాయెను. గోస్వామి పరమవిరాగి యయ్యెను; గాని సంసారమును మాత్రము విడువక తామరాకుమీఁది నీటిబిందువువలె అందే యుండియు మనస్సు చలింపకుండ జాగ్రత్తగా నుండెను.

మన గోస్వామి ఎక్కడకేగినను కుటుంబముతోడనే పోయెడువాఁడు. ఒకప్పు డీతఁడు సతీసమేతుఁడై బృందావనమున కరిగెను. అక్కడ గృహిణికి విషూచి (కలరా) సంభవించెను; గాని అందుకు గోస్వామి యేమియు విచలితుఁడు కాలేదు.

యౌవనవతి యగుగోస్వామికొమార్తె యొకసారి కలకత్తానగరమున రోగపీడిత అయినది. వైద్యులు తీవ్రప్రయత్నములు గావించిరి; గాని లాభము లేకపోయినది. తుద కామె పరమపదించినది; గాని విజయకృష్ణుఁ డప్పుడు హరిపూజామగ్నుఁడై యుండెను. ఇల్లంతయు రోదనధ్వనులచే ముఖరితమైనను గోస్వామి చలింపలేదు. ఇతఁడు తృప్తిగా హరిస్మరణము గావించుకొని యివ్వలకు వచ్చి కొమార్త శవముచుట్టును నృత్యముచేయుచు హరిస్మరణముచేసి ఆకళేబరము నవ్వలకు పంపివైచెను. సంసారమున నుండియు గోస్వామి రాగబద్ధుఁడు కాలేదనుట కిది ప్రబలచిహ్నము.

విజయకృష్ణుఁడు దయాపరుఁడు. ఇతరుల కష్టములనుజూచి యాతఁ డోర్వఁజాలకపోయెడివాఁడు. ఇతఁడు అన్నార్తుల కన్నమిడి బాధితుల కేడుగడయై లోకబాంధవుఁ డని ప్రఖ్యాతిపొందెను. ఇతని యశస్సౌరభములు దేశమునం దంతటను పర్వెను. వంగదేశమునందలి భక్తులలో మన విజయకృష్ణగోస్వామి ఉన్నతస్థానమును బడసెను.

# కమలాకాంతుఁడు

కమలాకాంతుఁడు వంగదేశమునందలి వర్ధమానుజిల్లాయం దొక పల్లెలో జన్మించెను. చిన్నతనమునందే తండ్రి గతింపఁగా తల్లియే అతనిని పెంచి పాఠశాల కంపెను. వయసు హెచ్చినకొలఁదియు నతఁడు సంస్కృతమునందును, సంగీతమునందును ప్రజ్ఞావంతుఁ డాయెను. అతని మేధాశక్తి కందరు నాశ్చర్యచకితు లగుచుండిరి.

వర్ధమానప్రభువు అతనిని తన యాస్థానమున జేర్చుకొనియెను. అప్పటికే ఆతనికి వివాహమయి భార్య కాఁపురముచేయుచుండెను. ఆతనిభార్య కేవలము రూపవతి కాదు; గాని గుణవతి; పతియే దైవమని నమ్మిన పావనచరిత.

కమలాకాంతుఁడు కాళీభక్తుఁడు. అతనిభక్తికి మెచ్చి రాజు పురముబైట నొకగృహము కట్టించి యిచ్చి నెలనెలకును కుటుంబపోషణమునకై కొంతపైకము పంపుచుండెడివాఁడు. కమలాకాంతుఁడు సంసారమున నుండియు ఐహికవిడంబన ములఁబొంతఁ బోక విరాగియై యుండువాఁడు.

అతనిభార్య మృతిచెందినది; గాని యందు కాతఁడు ఎంతమాత్రమును దుఃఖింపలేదు. పైఁగా శ్మశానమున ఆమె కళేబరమును దహనముచేయుచు నిశ్చలచిత్తముతో కాళీమాతను స్తోత్రము చేయసాగెను.

ఒకప్పు డాతఁ డెక్కడినుండియో అంధకారమున ఇంటికి వచ్చుచుండఁగా బందిపోటుదొంగలు పట్టుకొని బంధించిరి. అయినను అతఁ డిసుమంతయు భీతిల్లకయు, విచారింపకయు, మృదుమధురగానము చేయుచు కాళీమాతను స్తవము చేయసాగెను. అంతట అతని నిర్భీతికిని, గానమాధుర్యమునకును, భక్తిపారవశ్యమునకును మెచ్చి దొంగలు విడిచిపెట్టి వెడలిపోయిరి.

మరియొకప్పు డాతఁడు తీవ్రవ్యాధిగ్రస్తుఁ డయ్యెను. అది తెలిసి ప్రభువు వచ్చి స్వయముగా అతనికి పరిచర్యలు చేయసాగెను. వైద్యులు చాల పనిచేసిరి; గాని లాభము లేకపోయినది. కమలాకాంతుఁడు నీతిగర్భితములగు మాటలతో ప్రభువు నానందపఱచుచు నిశ్చింతగను, అనాయాసముగను పరమపదమున కరిగెను.

# రఘునాథదాసు

వంగదేశమున గోవర్ధనదాసను నొక ధనాఢ్యుఁ డుండెడివాఁడు. అతని కుమారుఁడే యీరఘునాథదాసు. కుమారునియెడల అధికానురాగము చూపుచు గోవర్ధనుఁ డయిదేండ్లప్రాయమునందే పాఠశాలకు పంపెను. పండ్రెండేండ్లువచ్చు నప్పటికి రఘునాథుఁడు గొప్పమేధావి అని ప్రఖ్యాతిపొందెను.

ఈసమయమున హరిదాసను నొక యవనభక్తుఁడు రఘునాథదాసు గురువు చెంతకు వచ్చెను. బాలకు లందరును యవనుని చూచుటకైన నిష్టపడలేదు; గాని రఘునాథుఁ డాతని హరిభజనము చూచి ముగ్ధుఁడై నిద్రాహారములు విడిచి పెట్టెను.

హరిదాసునకు నిద్రాహారము లక్కఱలేదు. పగలు, రాత్రి అని భేదములేదు. ఎల్లప్పుడును హరిభజనమునందే అతఁడు తన్మయుఁడై యుండెడివాఁడు. ఆతనిని చూచి రఘునాథుఁడును అట్లుకాఁగా గోవర్ధనదాసు అది గుర్తించి కుమారుని మందలించెను; కాని ప్రయోజనము లేకపోయినది. అంతట అతఁడు గురువుతో చెప్పఁగా గురువు హరిదాసుని తరిమివేసెను.

గోవర్ధనదాసు తనకుమారుఁ డిఁక దారిలో పడునని భావించెను; గాని ఆయాశ వ్యర్థమైనది. రఘునాథుని హృదయమున హరిదాసు నాఁటిన హరిభక్తి బీజములు చక్కఁగా అంకురించి దృఢముగా పెరిగెను. వైరాగ్యాంకురములు వేళ్లుతన్నెను. అతులైశ్వర్యసంపన్నునియింటఁ బుట్టియు విలాసములదెస నాతఁడు చిత్తమును పోనీయలేదు. దాసదాసీలసేవ నాతఁ డపేక్షింపలేదు. విలువగల వస్త్రములను విసర్జించెను. పంచభక్ష్యపరమాన్నములను తృణీకరించెను. కేవలము భగవధ్ధ్యానమునందే అతఁడు కాలము గడుపసాగెను.

మహాత్ముఁ డగు చైతన్యస్వామి అప్పుడు శాంతిపురమున నుండెను. అది యెఱిఁగి రఘునాథుఁ డచటి కరిఁగి గౌరాంగశిష్యులనుగలిసి రేయింబవళ్లు హరిభక్తి తత్పరుఁడై యుండఁజొచ్చెను. అదిచూచి చైతన్యుఁడు రఘునాథుని భక్తివైరాగ్యముల కచ్చెరువొంది "వత్సా! ఇపుడు నీవు సంసారమును విడిచిపెట్టుట మంచిది గాదు. నీవు సంసారసుఖము ననుభవించుచునే హరిధ్యానము చేయుచుండ వచ్చును. నీవయస్సు కేవలము చిన్నది. నీయభ్యుదయమునుజూచి యానందించు టకు నీతలిదండ్రులు ఎంతో యువ్విళ్లూరుచుందురు. వారిని దుఃఖపెట్టుట నీకు శ్రేయస్కరము కాదు; గావున ఇంటికిపోయి పెండ్లిచేసికొని నీతలిదండ్రుల నానంద పెట్టుచు హరిధ్యానపరుఁడవై యుండుము" అని బోధించెను.

రఘునాథుఁ డందుకు మారుపలుకక స్వామియుపదేశమును శిరసావహించి ఇంటి కరిగి కొంతకాలము సంసారసుఖము లనుభవించెను. ఇట్లుండఁగా నిత్యానందుఁ డను యోగిపుంగవుఁ డొకఁడు వంగదేశమున సంచరించుచుండెను. ఈసంగతి విని రఘునాథుఁ డాతనిని దర్శింప నుత్సహించెను.

కాని యక్కడి కరుగుట తలిదండ్రులయనుమతి కావలెను. అతఁ డది లభింపదని తొలుత జంకెను; గాని సాహసించి కోరి యెట్టకేలకు 'సరే' యనిపించుకొని శాంతిపురమున కరిగి స్వామి నాశ్రయించి "ముక్తిసాధనము నుపదేశింపు" మని కోరెను. ఐశ్వర్యమున నత్యున్నతపదవి నంది యుండిన లేఁబ్రాయపువాఁ డొకఁడు వచ్చి ముక్తిమార్గము నెఱిఁగింపఁగోరుట స్వామికి ఆశ్చర్యము కలిగించెను. "వత్సా! నీచరిత్ర వింతగా నున్నది. అయినను నిన్ను నిరుత్సాహపఱుపను" అని చెప్పి స్వామి అతనియభిలాష నెఱవేర్చి "ఇక ఇంటికి పొమ్ము" అని చెప్పెను.

రఘునాథుఁ డందుకు మిగుల నానందించి స్వగృహమున కరిగి కొంతకాలమందు వసించి, తుద నొకనాఁటి రాత్రి నిశీథమున తలిదండ్రులను, అర్ధాంగిని, అతులైశ్వర్యమును పరిత్యజించి నిరాహారుఁడై, నిర్నిద్రుఁడై, బయలుదేరి పాదచారియై చాలదూరము నడచి కొన్ని దినములకు జగన్నాథము చేరుకొనియెను.

ఉపవాసములవలన, మార్గాయాసమువలన రఘునాథుఁడు పడియుండ జగన్నాథమున అతనికి పరిచర్య చేయుటకు శ్రీచైతన్యస్వామి యొకశిష్యుని నియోగించెను. ఆశిష్యుఁడు రఘునాథునకు సాగరస్నానము చేయించి, చైతన్యస్వామి భుజించి విడిచిన పాత్ర నాతని కొసంగెను. ప్రముదితచిత్తుఁడై రఘునాథుఁ డందలి అవశిష్టమును మహాప్రసాదమని భక్తితో భుజించెను.

ఇట్లనుదినమును రఘునాథుఁడు చైతన్యప్రసాద మారగించుచు కొన్ని దినములకు పరమపవిత్రమైన యాప్రసాదమును నిజోదరపోషణార్థము స్వీకరించుట యోగ్యమైనపని గాదని నిశ్చయించుకొని అది మొదలు ప్రత్యహము సముద్రస్నాన మొనరించి పగలంతయు జగన్నాథస్వామి ద్వారముకడ నుపవిష్టుఁడై యుండి స్వామిని ధ్యానించుచు సాయంకాలము భిక్షమెత్తుకొని దానివలన క్షుద్బాధ నివారించుకొని యిట్లు దినములను గడుపసాగెను.

చైతన్యస్వామి ఆగర్భశ్రీమంతుఁడగు రఘునాథుని భక్తివైరాగ్యములకు మిగుల నచ్చెరువందెను.

కొన్ని దినములకు ఉదరపోషణమునిమిత్తము ధ్యానమున వినియోగింపవలసిన అమూల్యకాలమును భిక్షమెత్తుకొనుటకై కడపుట మంచిదికాదని తలఁచి రఘునాథుఁడు తుదకు యాత్రాపరులు భుజించి పారవేసిన ఆకులయందున్న మెతు

కులను, చెడిపోఁగా తీర్థసంవాసులు మార్గమునకు ప్రక్కలయందు పారవేసిన యన్నమును కడుగుకొని భుజించి జీవయాత్ర చేయసాగెను. చైతన్యస్వామి అందుకు మరింత యబ్బురపడుచు అతనిని కౌఁగిలించుకొని యొకప్పుడు రఘునాథుని యుచ్ఛిష్టమును భుజించి పరమానందభరితుఁ డయ్యెను.

రఘునాథస్వామి తరువాత బృందావనమున కరిగి కొన్నిసంవత్సరము లందు వసించి అవసానమున యోగబలమున శ్రీకృష్ణసాన్నిధ్యమును కల్పించుకొని ఐహిక జీవితమును చాలించెను.

---

# విశుద్ధానందస్వామి

దక్షిణదేశమున కల్యాణపురమునం దీతఁ డొకవిప్రకులమున నుద్భవించెను. ఈతని జననియగు యమునాదేవి మహాపతివ్రత యని ప్రఖ్యాతిచెందెను. ఈమెకు మొదట గలిగిన ఇరువురుపుత్రులు గతించిరి. అందుకు చిరకాలము యమున వగచుచునే యుండఁగా నీతఁడు జన్మించెను. ఇతనికి తలిదండ్రు లుంచినపేరు వంశీధరుఁ డని.

వంశీధరుఁడు శైశవమున ఒకప్పుడు తీవ్రవ్యాధిపీడితుఁడై తనకు తలిదండ్రుల అదృష్టవశమున జీవించెను. చిన్నప్పటినుండియు, నీతఁడు భగవద్భక్తి తత్పరుఁడై యుండెను. ఇతనికి పూర్వజన్మస్మృతిఁగూడ నుండెడిదనియు, నీయద్భుత శక్తికి తలిదండ్రులు ఇరుగుపొరుగువారు నాశ్చర్యచకితు లగుచుండిరనియు తెలియుచున్నది.

అయిదేండ్ల వయస్సు రాఁగానే తండ్రి వంశీధరుని, పారశీకిభాషాభ్యాసమునకు అప్పగించెను. వంశీధరుఁడు కుశాగ్రబుద్ధి యగుటవలన ఆభాషయందే గాక, మహారాష్ట్రమునందును, సంస్కృతభాషయందునుగూడ గొప్పపాండిత్యము సంపాదించెను.

కుమారుని యున్నతిని గాంచి యానందించుచు అచిరకాలమునందే యమునయు, ఆమెభర్తయు గతించిరి. అదిమొదలు ఇతఁడు మేనమామయింట నుండెను. ఇతని శక్తిసామర్థ్యములకు ఆనందించి హయారోహణమునఁగూడ మేనమామ శిక్షకరపించెను.

ఒకప్పుడు హైదరాబాదు నవాబుచెంత నొకగుఱ్ఱ ముండెను. అది చాల పెంకిది. దానిని ఎవరును లొంగదీయఁజాలకపోయిరి. కొన్నిదినములకు నవాబు వంశీధరుని సామర్థ్యమును విని తనచెంతకు పిలిపించుకొని "దీనిని లొంగఁదీయుము"

అని ఆగుజ్జుమును చూపెను. వంశీధరుఁడు వెంటనే దానిని లొంగదీసి నవాబునకు చూపెను; గాని కొలఁదిదినములయందే అది మృతిచెందెను. దానిమృతికి "ఇతఁడే కారణము" అని నవాబు నిశ్చయించుకొని వంశీధరుని ఖైదుచేసెను.

మరియొకఁడైనచో కారాగారవాసము తటస్థించినందులకు చాల దుఃఖించియుండును. మన వంశీధరుఁ డట్లుఁగాక మిగుల నానందించెను. ఏమన? కారావాసము తటస్థించినతోడనే యితనికి ఐహికసుఖములయొక్క దుష్పరిణామము తేటతెల్లముగ తెలిసివచ్చెను. అగుటవలన నాతనికి వైరాగ్యము ప్రబలెను. ఇట్లు కారానిర్బంధము వంశీధరుని ప్రవృత్తిని పూర్తిగా మార్చివేసెను.

ఖైదునుండి విడుదల యైనపిదప వంశీధరుఁడు కొంతకాలము మేనమామ యింట నుండెను; గాని తరువాత కాశీక్షేత్రమున కరిగి ఒకమునీంద్రునివలన బ్రహ్మచర్యదీక్ష వడసి అచట కొంతకాలముండెను. పిదప గురువుననుజ్ఞఁ బడసి ఉజ్జయినీనగరమున కరిగి అచట మహాకాళేశ్వరుని సేవించి అక్కడనుండి గ్వాలియరుపట్టణమున కరిగెను.

గ్వాలియ రపుడు విప్లవకారుల కాలవాలమై యుండెను. రాజు వంశీధరుని కుట్రలో చేరినవాఁడని తలఁచి కారాగారమున బంధించెను.

విడుదల జరిగినపిదప యితఁడు బ్రహ్మావర్తమున కరిగి అక్కడినుండి హరిద్వారమును, ఖంఖనను దర్శించి పిదప బదరీవనమున కరిగెను. తరువాత నితఁడు హిమగిరియందొక యోగిపుంగవుని గాంచి ఆమహాత్ముని సేవించి కొంతకాల మందు తపోనిష్ఠయందుండెను.

పిదప వంశీధరుఁడు హృషీకేశమున కరిగి చాలకాల మందు యోగాభ్యాసము గావించి, తుదకు కాశీనగరము చేరుకొనెను. కాశీనగరమునందే వంశీధరుఁడు విశుద్ధానందుఁ డనుపేరు బడసెను.

స్వామి యద్భుతశక్తుల కాశ్చర్యపడి యోగు లనేకులు శిష్యులైరి. వేదాంతచర్చలకు ముగ్ధులై పల్వురు పాశ్చాత్త్యులుగూడ అతని ఉపదేశవాక్కులు వినఁజొచ్చిరి.

ఇట్లు తొంబదియేండ్లు జీవించి స్వామి కాశీక్షేత్రముననే యుండి, అవసానమున యోగాసనమున భౌతికదేహమును వీడి ఈశ్వరసాయుజ్యము పొందెను.

# శ్రీరూపసనాతనగోస్వాములు

వీరిద్దరును కర్ణాటకాధీశ్వరునివంశమునకు చెందినవారు. ఇద్దరును అన్న దమ్ములు.

స్వధర్మమున వీరి కధికమగు నభిమాన ముండెను. మతధర్మములను వీరు చాల శ్రద్ధతో పాటించుచుండిరి. ఇద్దరిలోను కనిష్ఠుం డగు సనాతనుఁడు అన్న యగు రూపునివలన ధార్మికవిషయములు ఉపదేశింపఁబడుచుండెను.

వీరిద్దరును వంగదేశమున నొకనవాబుఆస్థానమున ఉన్నతోద్యోగపదవు లయం దుండిరి. ఆకాలమున హిందువులకును మాహమ్మదీయులకు ఎంతమాత్ర మును సఖ్యము లేకుండెడిది. మ్లేచ్ఛసేవ చేయుచున్నారని వీరిని ఆగ్రామమునందలి హిందువులు బహిష్కరించిరి.

ఒకనాఁటి నిశీథసమయమున రూపుఁడు రాజకార్యముమీఁద గ్రామమున తిరుగుచుండెను. ఉన్నట్లుండఁగా ఆకసమంతయు మేఘావృతమై క్షణములో ధారాపాతముగా వర్షము ప్రారంభించెను. రివ్వురివ్వుమని పెనుగాలి వీచుచుం డెను. జగమంతయు గాఢాంధకారబంధురముగా నుండెను. అయినను ఆకాళ రాత్రియందు రూపగోస్వామి ప్రభుకార్యతత్పరుఁడై సంచరించుచునే యుండెను.

తుదకు వర్షము, గాలి, అంతకంత కధికము కాఁగా నతఁ డొకగుడిసెపంచను నిలువఁబడెను. అది యొకపేదవానిది. లోపల భార్యాభర్త లుండిరి. గోస్వామి తడియుచు పంచకుఁ జేరినసవ్వడి వా రాలకించిరి. "పాప మెవరో వానలో తడిసి పోవుచున్నా" రని యజమానురా లనియెను; కాని "ఇట్టిభయంకరనిశీథమున నెవ్వ రిల్లువిడిచి బైటికి వత్తురు?" అని గృహమేధి పలికెను. దానిమీఁద "ఏదో కుక్క వచ్చి యుండు"నని ఆమె మరల ననఁగా కుక్కలుగూడ నిప్పుడు బైటికిరా" వని అతఁ డనెను.

ఈపలుకులు గోస్వామి చెవులఁబడెను. దానితో అతనికి నిశితశరము గ్రుచ్చు కొనినట్లయినది. "ఒకనిచెంత నుద్యోగముచేయువాఁడు కుక్కకంటెను నికృష్టుం" డని వారియభిప్రాయమైన ట్లాతఁడు తలంచెను. ఈనిశ్చయముతో నాతఁడు సంసా రము మీఁది ఆశను త్రెంచుకొని ఆఝఁఝూవాతమునందే ప్రయాగమార్గమును పట్టెను.

హఠాత్సంభవమైన అతని వైరాగ్యము ప్రయాగ చేరునప్పటికి చాలవృద్ధి యై కనకము చిల్లపెంకునుగూడ నొక్కటే యనునంతటి నిర్లిప్తత ప్రబలెను. శ్రీ

చైతన్యుఁ డప్పుడు ప్రయాగయందే యుండెను. గోస్వామి అతని నాశ్రయించి ఉపదేశముబడసి ఆయనవెంట బృందావనమున కరిగి తనసంగతియంతయు తనతమ్ముఁడగు సనాతనగోస్వామికి వ్రాసెను.

ఈజాబు చూడఁగానే సనాతనునకు ఆశాపాశము తెగిపోయెను. అహంకారమమకారములు నశించెను. తనభ్రాతమార్గమే తనకును అనుసరింపఁదగినదని అతనికి తోఁచెను.

ఈభావముతో నాతఁడు రాజకార్యములయెడల నశ్రద్ధ చూపుచు తుదకు వానిని పరిత్యజించి మోక్షోపాయము నాలోచింపసాగెను; గాని తనయెడల ద్రోహముచేసెనని తలంచి కోపించి, నవాబాతనిని కైదుచేసెను.

కాని సనాతనుఁడు నవాబ్ బేదో పనిమీఁద ఊరువిడిచి దక్షిణసీమ కరుగఁగా కావలివానికి లంచమిచ్చి కైదు తప్పించుకొని అన్నగారిని కలిసికొనుటకు సన్యాసి వేషముతో బృందావనమునకు బయలుదేరెను. ఇది గ్రహించి అతని వెనుక అతని యనుచరుఁ డొకఁడు బయలుదేరెను. అనుచరునిచెంత కొంత ద్రవ్య ముండెను. అది గ్రహించి దారిలో కొందరు దొంగలు వారి నెదిరించిరి. ఈయాటంకమునకు కనకమే కారణమగుటచే సనాతనుఁడు పైకమును దొంగల కిప్పించి అనుచరుని వెనుకకు పంపివైచెను.

పిదప నాతఁడు తదేకదీక్షతో ప్రయాణము సాగించెను. కొంతదూరము పోవునప్పటికి చైతన్యస్వామి కాశీక్షేత్రమున నుండెనని విని అతఁడు మార్గము మార్చుకొనెను.

సనాతనుఁడు కాశీనగరము చేరినవెంటనే స్వామిని సందర్శించెను. స్వామి అతని భక్తివైరాగ్యముల కానందించి "నీసోదరుని కలిసికొనుము" అని యాన తిచ్చెను.

గుర్వాజ్ఞ చొప్పున సనాతనుఁడు బృందావనమునకు బయలుదేరెను; గాని దురదృష్టవశమున తమ్మునికోసము రూపుఁడు మరియొకమార్గమున కాశీనగరమునకు బయలుదేరెను.

బృందావనమున సనాతనుఁడు నిరంతరము యోగదీక్షయం దుండెడివాఁడు. ఒకనాఁ డతఁడు స్నానమునకై యమునానది కరుగుచుండ మార్గమున విలువగలమాణిక్య మొకటి కంటఁబడెను; దాని నాతఁడు తాకనైన తాకక ఒకబ్రాహ్మణుని పిలిచి "కొనిపొమ్ము" అని చూపెను. అట్టి మాణిక్యము నెడలగూడ ఆశపడనందుకు సనాతనుని నిర్లిప్తతకు ఆబ్రాహ్మణుఁడు మిగుల నాశ్చర్యపడి కైకొనెను; గాని వెంటనే సనాతనునివలన జ్ఞానోపదేశము పడసెను.

కొన్ని దినములైనతరువాత సనాతనుడు చైతన్యస్వామినిదర్శించుటకు బృందావనమునుండి బయలుదేరెను; కాని ప్రారబ్ధవశమున నాతనికి కుష్ఠురోగమంకురించెను. అందుకు చాల వగచి, అట్టి నికృష్టవ్యాధితో స్వామిని సందర్శించుట యనుచితమని తలంచి యాతఁడు దారితప్పించి జగన్నాథమునకు బయలుదేరెను. జగన్నాథస్వామి రథచక్రముల క్రిందఁబడి ప్రాణములు కోల్పోవలెనని యాతనిసంకల్పము; గాని మార్గమధ్యమునందే చైతన్యస్వామి యతని కెదురయ్యెను.

గోస్వామిని చూచినంతనే చైతన్యస్వామి ఆనందముతో కౌఁగిలించుకొనఁబోయెను. అయితే అందుకు సందేహించుచు సనాతనుఁడు "స్వామీ! నేను కుష్ఠురోగిని; నన్ను తాకవల" దని వెనుకకు తగ్గెను. స్వామి యిది వినిపించుకోలేదు. అతఁడు గోస్వామిని గాఢముగా కౌఁగిలించుకొని యుక్తసమయమున బృందావనమునకు పంపివైచెను.

బృందావనమున అన్నదమ్ము లిరువురును—రూపగోస్వామియు, సనాతన గోస్వామియు కలిసికొనిరి. వారిరువురు నందే వసించి, అవసానమున శ్రీహరిసాయుజ్యము పొందిరి.

ఐశ్వర్యమును, ఉన్నతపదవులను త్యజించి, దారిద్ర్యమును కౌఁగిలించుకొని విరాగులై, పరమభక్తాగ్రేసరులై ఆదర్శజీవనముఁ గడపిన యీయనుజన్ము లిరువురును మనకు ప్రాతస్స్మరణీయులు.

---

# ప వృ హా రి స్వా మి

జౌన్‌పూరుజిల్లాయందొక పల్లెయం దీతఁడు బ్రాహ్మణకులమున పుట్టెను. హరిభజనదా సని తలిదండ్రు లీతనికి పేరు పెట్టిరి. బాల్యమున మశూచికవ్యాధివచ్చి అందొకకన్ను పోవుటవలన పలువు రీతనిని శుక్రాచార్యుఁ డని పిలిచెడివారు.

ఈతని పెదతండ్రి లక్ష్మీనారాయణుఁ డనునాతఁడు విరాగియై యిల్లువీడి జాహ్నవీతీరమున వనస్థలియందు కుటీరమును నిర్మించుకొని నిరంతర యోగదీక్ష యందుండెడివాఁడు. శుక్రాచార్యుఁ డాతనికి శుశ్రూషచేయుటకు నియమింపఁబడి అతనికిని, అతనిశిష్యులకు సేవలుచేయుచు తీరుబడియైనపుడు సమీపమునందలి పల్లె కరిగి అందు సంస్కృతభాష నేర్చుకొనసాగెను.

ఇట్లుండ కొంతకాలమునకు లక్ష్మీనారాయణుఁడు ఈశ్వరసాయుజ్యము పొందెను. అంతట శుక్రాచార్యుఁడు కొంతకాలము ఆకుటీరమునందే నివసించి, తరువాత కాలినడకను బయలుదేరి సేతుబంధనరామేశ్వరము, చిదంబరము మున్నగు

మహాక్షేత్రములను సేవించి ఆపర్యటనము సందర్భమున ఒకపర్వతగుహలో ఒక యోగిపుంగవునిఁ గాంచి అతనికరుణవలన యోగదీక్ష పొందెను.

తరువాత కొంతకాల మక్కడనే యోగసాధనమున ప్రవృత్తుఁడై యుండి పిదప ఉత్తరదేశములలో సంచరించి, తుదకు పెదతంత్రికుటీరమునకు వచ్చి అక్కడనే వసించి సమాధినుండి ఆయన అస్థికలనుదీసి గంగానదిలో కలిపివేసెను.

అతఁడు వేకువయందే మేల్కాంచి జాహ్నవీనదిలో స్నాన మాచరించి రమారమి అయిదుగంటలకాలము యోగసమాధియందుండి, తరువాత స్వహస్తములతో రొట్టెలుచేసికొని భుజించి పాలు త్రావి, తరువాత నాతఁ డతిథులను, అభ్యాగతులను ఆగంతుకులను సత్కరించెడివాఁడు. క్రమముగ రొట్టెలుచేయుటలో కాలము వ్యర్థముగాఁ గడచిపోవుచుండుట యెఱింగి పిదప నతఁడు బిల్వపత్రములను భుజించి పాలుత్రావి యూరకుండెడివాఁడు.

తరువాత నొకప్పుడు కుంభమేళామహోత్సవము సందర్భమున ప్రయాగక్షేత్రమున కరిగి త్రివేణీతీర్థమున గ్రుంకులిడెను; గాని దురదృష్టవశమున అపుడు జబ్బుపడెను.

అదిచూచి యాత్రాపరులు పలువు రాతని దుస్థితికి వగచి ఔషధములు తెచ్చి యిచ్చిరి; గాని యాతఁడు వానిని స్వీకరింపక ఫలాహారము లిమ్మని కోరెను. బిల్వపత్రములను భక్షించుయోగి ఫలాహారముగు గోరుట కానందించి వారు మంచి మంచిపండ్లు, భక్ష్యములు మున్నగునవి తెచ్చియిచ్చిరి. అంతట నతఁడు వానిని ఉత్తరీయమున మూటఁగట్టుకొని అక్కడనుండి వెడలిపోయెను.

యోగి వాని నేమిచేయునో యని యాత్రాపరులలో కొందరు రహస్యముగ వెనువెంట వెళ్లిరి. యోగి కొంత దూర మరిగి భక్ష్యాదులను నిశ్శంకఁగా గంగయందు గిరివైచెను. అదిచూచి వారు చాల కోపించి దూషించిరి. యోగి అందుకు మిగుల దుఃఖితుఁడై మస్తకన్యస్తహస్తుఁడై వారికి నమస్కరించి "సోదరులారా! మీ రీవస్తువులను నాకిచ్చుట నావ్యాధి తొలఁగిపోవుటకుగదా ! మీకరుణవలన నే నిపుడు తెవులునుండి విముక్తుఁడ నైనాను" అనియెను. యాత్రాపరులందుకు క్షమింపవేడి వెడలిపోయిరి.

ఆసమయమునందే శుక్రాచార్యునకు 'పవుహారీబాబా' యని పేరు వచ్చెను. శైశవమునుండి స్వామి యోగులకు సేవలుసలుపుటయం దారితేరెను. నదీకూలమున నాశ్రమ మేర్పఱచుకొని అతిథులను, అభ్యాగతులను సత్కరించుచుండెను. ఈకారణమువలన పరిసరములయందలి పల్లెటూరివారును, జమీందారులును ధాన్యము మున్నగు భోజనపదార్థములను దెచ్చి స్వామి కిచ్చుచుండెడివారు.

పైఁగా స్వామి యాశ్రమముచెంత జాహ్నవి కొంత మేటవేసెను. ఈవిధముగ ఆశ్రమప్రాంతమున గంగామృత్తికచేరి విశాలస్థల మేర్పడఁగా స్వామి శిష్యులతోఁగూడి అందు సేద్యముచేసి ధాన్యాదులను పండించి అతిథిసేవకై వినియోగించుచుండెను.

ఒకనాఁ డొకయున్మత్తుఁడు కోపోద్రిక్తుఁడై దండధరుఁడై ఆశ్రమము ప్రవేశించి స్వామిని అంత మొందించుటకు యోగపీఠమును సమీపింపఁబోయెను. అది గ్రహించి స్వామి శిష్యులు తటాలున వానిని పట్టుకొని నిలిపివేసిరి; గాని హోమము చేయుచున్న దానిని సక్రమముగా ముగించుకొని బైటికివచ్చి చిరునవ్వుతో ఉన్మత్తునిమీఁద కరుణాకటాక్షములు పఱపుచు "ఇతఁడు సాధుపుంగవుఁడు. విడిచిపెట్టుఁడు" అని పలికెను. శిష్యులు విడిచిపెట్టిరి. అంతట నావ్యక్తి మంచి తేజస్సుపొంది స్వామిపాదములమీఁద వ్రాలి "మహాత్మా! క్షమింపు" మని పాదధూళి తనశిరమునఁ దాల్చి వెడలిపోయెను. అదిచూచి ఈశ్వరానుగ్రహమునకు స్వామియు, స్వామి యద్భుతశక్తికి శిష్యులును ఆశ్చర్యచకితులైరి.

ఒకప్పుడు పరివ్రాజకుఁ డొకఁడు "స్వామీ! యోగి వయ్యు విలాసవస్తువులమీఁది ఆసక్తిని చంపుకొన వైతివి. బంగరునగలతో నీయాశ్రమమునందలి పూజావిగ్రహముల నలంకరించుట యేమి ధర్మము?" అని ప్రశ్నించెను. అందుకు స్వామి "వలయు నెడ నీ వీ వస్తువులను గైకొనవచ్చును" అని బదులు చెప్పెను. పరివ్రాజకుఁడు "సన్యాసివయ్యు సేద్యవృత్తిలో తగుల్కొని జనపరివృతుఁడవై యుండుట ధర్మమా?" అని మరల నడిగెను.

స్వామి దానికి జవాబు చెప్పక ఆశ్రమమునకు సంబంధించిన బీగములను పరివ్రాజకున కిచ్చివేసి "శిష్యు లెఱింగిన పోనివ్వ" రని తలఁచి నిశీథమున ఎక్కడికో వెడలిపోయెను.

తెల్లవారినది; కుటీరమున స్వామి లేఁడు. అందుకు శిష్యు లాశ్చర్యపడి పరివ్రాజకుని అడుగఁగా "నా కేమియు తెలియ" దని చెప్పుచు తప్పించుకొని వెడలిపోయెను. శిష్యులు చాల స్థలములు వెదకిరి; గాని లాభము లేకపోయినది.

స్వామి యట్లు నడచిపోయి ఒకచో మార్గమధ్యమున వ్యాధిపీడితుఁడై పడిపోయెను. అది చూచి కరుణాళుఁడు అగు వంగదేశీయుఁ డొకఁడు ఆతనిని ఔషధాద్యుపచారములచే స్వస్థపరిచి గంగాతీరమున నొక యాశ్రమము నిర్మించి అందు ప్రవేశ పెట్టెను,

స్వామి ఆయాశ్రమమునందే యోగసమాధిలో దినము గడపుచుండెను.

ఒకనాటినిశీథమున గంగాస్నాన మొనరించుకొని ఆశ్రమమున యోగ నిష్ఠుఁడై యుండఁగా స్వామికి దుర్భరమైన వ్యాధి సోకెను. వెంటనే స్వామి యోగము చాలించి హోమము ప్రారంభించెను. అతనికై ఆప్రాంతమున వెదకు చున్న శిష్యులు కుటీరమునుండి ధూమము వచ్చుట చూచి స్వామి అక్కడనుండ వచ్చు నని శంకించి అక్కడకు వెళ్లిరిగాని స్వామి అప్పటికప్పుడే హోమము ముగించి ఆప్రజ్వలితాగ్నియందు నిజశరీరము నాహుతియొనర్చుకొనెను.

ఇదిచూచి శిష్యులు హాహాకారములు చేసిరి; గాని యేమి ప్రయోజనము?

---

## మౌనీ బాబా

తూర్పుబంగాళమునందలి యొకపల్లెయందు శివనాథుఁ డనునాతఁడు నివసించుచుండెను. అతని కిరువురుకుమారులు కలిగిరి. శివనాథుఁడు కుమారుల నిద్దరిని పాఠ్శాయందలి ఆంగ్లపాఠశాల కంపెను.

ఆపాఠశాలలో నుపాధ్యాయుఁడు బ్రహ్మసమాజమతమునకు చెందిన వాఁడు. అతఁడు తనశిష్యులలో నొకఁడును, శివనాథుని పెద్దకుమారుఁడు నగు ప్యారీలాలు భక్తితత్పరుఁడని గ్రహించి అనుదినము పాఠములు ముగిసిన తరువాత అతనికి ధర్మోపదేశము చేయసాగెను.

ఇంతలో శివనాథుఁడు మరణించెను. కుటుంబమును పోషించుభార మంతయు ప్యారీలాలుమీఁదఁ బడెను. ఈకారణమువలన నాతఁడు తమ్మునకు చదువుచెప్పించుటకును, సంసారమును నిర్వహించుటకును ద్రవ్యార్జనము చేయ వలసివచ్చెను.

అతఁడు పగలంతయు ద్రవ్యార్జనమునందే గడపి అర్ధరాత్రియందు మేల్కాని భగవంతుని ధ్యానించుచుండువాఁడు. అతఁ డల్పాహారి. మిగుల సామాన్యవస్తువులనుమాత్రమే భక్షించెడివాఁడు.

ఇట్లాతఁడు పండ్రెండుసంవత్సరములు కడపెను. ఇంతలో దురదృష్టవశమున అతనిభార్య పరలోకగతురా లయ్యెను. అదిమొదలు అతనివైరాగ్య మధిక మయ్యెను. నిర్జనస్థలములకుఁ బోయి ఒంటరిగా నుండి యాతఁడు తపోనిష్ఠలో కాలము గడుపసాగెను.

ఒకనాఁ డతనిదగ్గరిచుట్టము వచ్చి "మరల పెండ్లియాడి సుఖపడవలసిన" దని కోరెను. అందుకు ప్యారీలాలు "ఈశరీరము నాశముపొందునదియేగాని స్థిరముగా నుండునది గాదు. దీని నెంత స్వాధీనమున నుంచుకొనిన నంత మంచిది. లాలించినకొలఁది నిది ఎక్కువ శుశ్రూష కోరును. ఈనశ్వరదేహము నిమిత్తము

సంసారమును పెంచుకొనుట శ్రేయస్కరము కా" దనిచెప్పి ఆసలహాను నిరాకరించెను.

ప్యారీలాలు తమ్ముఁడపుడు విద్యార్థిదశ ముగించుకొని సంసారప్రవిష్టుఁడై ద్రవ్యార్జనముచేయసాగెను. ఈయనుకూలావకాశమును చూచుకొని ప్యారీలాలు వెంటనే సంసారభారమంతయు తమ్మునిమీఁద మోపి తపస్సుచేసికొనుటకై చిత్రకూటపర్వతమున కరిగెను.

రాత్రింబగల్లాతఁడు పర్వతశృంగమున తపోనిష్ఠుఁడై యుండుటఁ గాంచి దయాళువగు మారువాడీవర్తకుఁ డొకఁడు అతని నిమిత్తము గిరిశిఖరమున నొక యాశ్రమము నిర్మించి యిచ్చెను. అదిమొద లతఁడు అందే యుండి అశ్రాంత యోగదీక్షానిమగ్నుఁడై యుండఁజొచ్చెను. కాల్యకృత్యములను దీర్చుకొనుట కాతఁ డెపుడు బైటికి వెళ్లుచుండునో యెవ్వరు నెఱుఁగరు. ఎపుడును మౌనవ్రతముతో నుండుటవలన జను లాతనిని 'మౌనీబాబా' యని పిలువఁజొచ్చిరి. ప్రజలనేకులు ఆశీర్వాదము పొందుటకును, శుశ్రూష చేయుటకును, అతని యాశ్రమమున కరిగి యానందించెడివారు.

బాబా కొంచెము బిల్వపత్రరసమును, కొంచెము పాలును మాత్రమే పుచ్చుకొని యూరకుండువాఁడు. ఆరోగ్యమును నిలుపుకొనుటకు గాని, దేహదార్ఢ్యమును పెంచుకొనుటకు గాని అతఁ డెన్నఁడును ప్రయత్నించి యెఱుఁగఁడు. తత్ఫలముగ నతఁడు క్రమక్రమముగ చిక్కి శల్యావశిష్టుఁడై తూలిపోవసాగెను. ఎముకలరాశివలెనుండియే అతఁడు యోగదీక్ష వహించుచుండెడివాఁడు; గాని యిట్లెంతయో కాలము గడుపఁజాలకపోయెను. నలువది యేండ్లయిన నిండకపూర్వమే యాతఁడు ఆసన్నకాలుఁడై—యీసంగతి యెఱిఁగి యోగసమాధిలో నుండి భౌతిక ప్రపంచమును విడిచి పరంధామము చేరుకొనెను.

---

# లోకనాథ బ్రహ్మచారి

ఇతఁడు పశ్చిమబంగాళమున నొక బ్రాహ్మణకులమున జన్మించెను. పదిసంవత్సరములప్రాయమువచ్చువరకు నీతఁడు స్వగ్రామమునందే విద్యాభ్యాస మొనరించెను. తరువాత నీతని కుపనయనము కావించి వెంటనే సంస్కృతవిద్య నభ్యసించుటకు తండ్రి ఒకగురువుకడ కంపెను. ఆగురువు వంగదేశమందంతటను మిగుల ప్రసిద్ధిపొందిన పండితుఁడు.

గురువు లోకనాథునియెడల మిగుల దయఁగలిగియుండెడివాఁడు. లోకనాథునకు మిక్కిలి ప్రియుఁడగు నొకసహాధ్యాయి యుండెను. ఆచార్యుఁడు వాని

నిరువురిని వెంటనిడుకొని పోయి కలకత్తా చేరుకొని కాళీఘట్టము సమీపమున నొకకుటీరమును నిర్మించుకొని అందు నివసించెను.

ఆరోజులలో కాళీఘట్టము ఒకసాంద్రమైన అడవియై యుండెడిది. తపోనిష్ఠులై కాలము గడుపదలంచు మునిపుంగవు లపుడు అక్కడకు చేరుచుండెడివారు.

అక్కడ నున్నపుడు లోకనాథునిమనసు విషయసుఖములయందే మగ్నమై యుండెడి దనీ, యిది యెఱిగి ఆచార్యుఁ డీతని మక్కువ తీరునేర్పాటు చేసెననీ వాడుకకలదు. అప్పటినుండియు లోకనాథునిమనసు ఐహికసుఖవిముఖమై భగవద్ధ్యానతత్పరమై యుండసాగెను.

విద్యాభ్యాసము ముగిసినపిదప సహాధ్యాయు లిద్దరును హిమవన్నగమున కరిగి చాలకాల మచ్చట యోగాభ్యాస మొనరించిరి. తరువాత లోకనాథుఁడు మిగుల ప్రజ్ఞావంతుఁడై సహపాఠితోఁగూడ గురువర్యుని కలిసికొని కాశీనగరమున కరిగెను. ఆసమయమున త్రైలింగస్వామి కాశీయం దుండెను. కొన్నిదినములకు ఆచార్యుఁడు శిష్యులను స్వామికి అప్పగించి పరమపదించెను.

త్రైలింగస్వామికడనుండి లోకనాథుఁడు కొన్నిదినములు యోగదీక్ష యందుఁ గడపెను. తరువాత నాతఁడు స్వస్థలమున కరిగి యొకానొక నిర్జనస్థలమున ఆశ్రమ మేర్పఱచికొని తపోనిష్ఠుఁడై యుండెను. అది మొదలు ప్రజ లాతనిని లోకనాథబ్రహ్మచారి యని పిలువసాగిరి.

లోకనాథుఁడు పూర్వజన్మస్మృతిఁ గలమహాత్ముఁడు. ముఖము చూచినంతనే యాతఁడు ఎటటివాని మనోభావముల గ్రహించెడివాఁడు. ఇతరుల రోగముల నాతఁడు అతిసులభముగా తగ్గించెడివాఁడు.

క్షయరోగగ్రస్తుఁ డగు నొక మానవుఁ డొకప్పుడు వచ్చి బ్రహ్మచారిని ఆశ్రయించెను. అప్పు డాతఁడు రోగిబెవులు తాను గ్రహించి వానిని స్వస్థునిగావించెను. పిదప కొన్నిదినములకు లోకనాథబ్రహ్మచారి ఆక్షయవలననే పీడింపఁబడుచు యోగాసనమున ఆసీనుఁడై యుండి పాంచభౌతికదేహమును పరిత్యజించెను.

---

# శ్రీ దత్తావతార మార్తాండ మాణిక్యప్రభువు

శ్లో. "నాహం దేహో, నేంద్రియా, ణ్యాంతరంగం, నాహంకారః, ప్రాణవర్గో, న బుద్ధిః,
దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః, సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్.

హైదరాబాదు రాజ్యమున గుల్బర్గానగరమునకు 12 క్రోసులదూరమున నున్న కల్యాణి యనునగరమున మనోహరుఁడను నొకసంపన్నగృహస్థుఁడు ఉండెను. అతని భార్య పేరు బయాదేవి. ఆదంపతులు పరమభక్తులై దయాసత్యశౌచములు గలవారై యుండిరి.

వారు ఎంతకాలమునకును సంతానము కలుగకపోవుటవలన భక్తిశ్రద్ధలతో పరమేశ్వరుని ధ్యానింపఁగా ఒక కుమారుఁడు కలిగెను. లేకలేక కలుగుట వలన వారెంతో గారాబముగా పెంపసాగిరి; గాని అతఁడు మూగవాఁడయ్యెను. ఇకనే వచ్చునో, యింకనే వచ్చునో మాట అని వారు వేచియుండిరి; గాని ఉపనయనవయస్సు వచ్చినను మాటలు రానే లేదు. పైఁగా నతఁడు తోడిపిల్లలతో ఆడుకొనక తనకు వారిదెస చూడనైనచూడక ఒకచోట కూర్చుండి ధ్యాననిమగ్నుఁడై యుండువాఁడు.

ఏమయినను బ్రాహ్మణబాలునకు ఉపనయనము చేయకుండ నుండరా దని పలువురు చెప్పుటవలన వారు తత్ప్రయత్నములు గావించిరి. తండ్రి తొడమీఁద కూర్చుండఁబెట్టుకొని గాయత్రీమంత్రము నుపదేశించెను. వెంటనే గాయత్రీప్రభావమో, దైవనిర్ణయమో అతనికి వెంటనే మాటలు వచ్చెను. పండితునివలెనే అతఁడు అక్షరములను పలుకుచు గాయత్రీమంత్రము నుచ్చరించెను. అది చూచి అందరును ఆశ్చర్యపడిరి. తల్లిదండ్రులు బ్రహ్మానందపడిరి.

ఉపనయనమైనవెంటనే తలిదండ్రులు దాదాసాహేబు అను పేరు గల యీబాలుని విద్యాభ్యాసము నిమిత్తము కల్యాణియందే యున్న మహాపండితుఁడగు సదానందస్వామికి అప్పగించిరి. స్వామి వారిని ఆదరించి, బాలునకు విద్య చెప్పుట కంగీకరించి "ఇతనిని గురించి మీ రేమియు బెంగపెట్టుకొన నక్కఱలేదు. పూర్వజన్మమున నితఁ డొక మహాయోగి; అయితే నేఁడు మొదలు పదునాలుసంవత్సరములు మీరు ఉభయులును శ్రీదత్తాత్రేయచరిత్రము పారాయణము చేయవలెను. అట్లు చేయుటవలన మీకు ముందుముందు చాల మేలు కలుగఁగలదు. ఈబాలుని నావద్ద విడిచి మీరు నిశ్చింతతో నుండవచ్చును" అని చెప్పెను.

బయాదేవియు మనోహరుఁడును అట్లే చేసి పదునాలుసంవత్సరముల యనంతరము సహస్రబ్రాహ్మణ్యమునకు సమారాధనము చేసిరి.

అంతట నొకరాత్రి దత్తాత్రేయుఁడు కౌపీనము, జోలె ధరించి విభూతి భూషితసర్వాంగుఁడై నాలుగుకుక్కలను వెంట నిడుకొని బయాదేవికిని మనోహరునకు స్వప్నమున సాక్షాత్కరించెను. ఆదంపతులు మహాతేజస్వంతుఁడై యున్న స్వామికి ప్రదక్షిణనమస్కారము లాచరించి స్వామి "వరము కోరుఁ" డని చెప్పఁగా "మాకు పుత్రులు లేని లోపము తీర్చితివి; కాని సంపూర్ణాంశముతో మాకు కుమారుఁడవై పుట్టి మమ్ము అనుగ్రహింపవలెను" అని ప్రార్థించిరి. స్వామి "అట్లే" అని అనుగ్రహించి తిరోహితుఁడయ్యెను.

కొలఁదిదినములకే బయాదేవి మరల గర్భవతి యయ్యెను. ప్రభువు స్వప్నమున సాక్షాత్కరించుట వరమిచ్చుట నగరము, మండలము, తుదకు దేశమంతటను తెలిసిపోవుటవలన అనేకులు పసుపు, కుంకుమ, ఫలములు, సుగంధద్రవ్యములు, నూతనవస్త్రములు పట్టుకొని వచ్చి దేవికి వొలె సమర్పించి స్త్రీపురుషులు బయాదేవిని సేవింపసాగిరి. ఈసారి ఆమె గర్భమున దత్తాత్రేయులే అవతరించెదరని అందరును నమ్మి తదావిర్భావము నెదురుచూడసాగిరి.

నవమాసములు నిండెను. ప్రసవకాలము సమీపించినది మొదలు చాతుర్వర్ణములవారు, అస్పృశ్యులు, తుదకు అరబ్బులు, మునల్మానులు మున్నగువారు గూడ కానుకలు తెచ్చి బయాదేవికి సమర్పింపసాగిరి. ఒక శుభలగ్నమున బయాదేవి మరియొకపుత్రుని కనెను. కల్యాణినవాబు ఏనుగులు, లొట్టిపిట్టలు, గుఱ్ఱములు, పాలకులు, సైన్యములతో వచ్చి బాలుని దర్శించిపోయెను. ఇఁక ప్రజల ఆనందమునకు మేర లేకుండెను. పురమునందలి స్త్రీ లందరును, బాలునకు ఏఁడాది లోపు వయస్సులోఁగూడ తమనగలన్నియు నలంకరించి తల్లులై సేవించుచుండెడివారు. ఎప్పుడు చూచినను బాలుని ఒడలిమీఁద లక్షరూపాయలవెలగల నగ లుండుచు వచ్చెను.

బాలున కైదేండ్లవయస్సు వచ్చెను. అతఁ డాటలకుఁగూడ ఎక్కడికి వెళ్లినను వెంట సిపాయిలు పారా యిచ్చుచుండెడివారు. ఏడేండ్లు వచ్చినది మొదలు అతఁడు దైవికచర్యలను ప్రదర్శింపసాగెను. అది విని, చూచి ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి పండ్లు, కానుకలు సమర్పించి కర్పూరహారతు లిచ్చి ఆదరింపఁ సాగిరి.

బాలునకు ఏడవయేట ఉపనయన మైనది. చక్రవర్తి యేకపుత్రుని వివాహము గూడ అంతవైభవముగా జరుగఁజాలదు. పొరుగూళ్లనుండి వచ్చిన ప్రజకు కల్యాణిలో తావు చాలకపోయెను. గాయత్ర్యుపదేశ మైనపిదప బాలుఁడు తక్కిన మంత్రములను స్వయముగ పఠింపసాగెను. అది చూచి కొమ్ములు తిరిగినవిద్వాంసులుగూడ బాలుఁడు దత్తాత్రేయులవారి లీలామానుషావతారమే అని గ్రహించి సాష్టాంగనమస్కారము లాచరించిరి.

ప్రభువు ఎనిమిదియేండ్లు వచ్చినది మొదలు ఏకాంతవాసమునం దధిక ప్రీతి గలవాఁడై ఆటల కని చెప్పుచు బైటికిఁ బోయి రెండుమూఁడుదినములవరకును ప్రాంతారణ్యమున నుండి పిదప ఇంటికి రాసాగెను. అట్టి సమయములలో తల్లిదండ్రులే గాక ఊరివారందరును గూడ నిద్రాహారములు మాని దుఃఖించుచుండిరి. రాజభటులు తండోపతండములుగా బయలుదేరి వెదకుచుండిరి; గాని యింటికి వచ్చువరకును ప్రభువు రాకపోకలు ఎవరికిని తెలియకుండెను.

కల్యాణికి 40 మైళ్లదూరమున ఉమ్మాబాదుసమీపమున మంటాళ అనునొక గ్రామ ముండెను. దానికి చేరియున్న ఘోరారణ్యమున అంబిలకుండ మను సరోవరము ఒడ్డున ఒక మహామునిసమాధి కలదు. మంటాళగ్రామకరణము ప్రతి దినము ఆకుండమున స్నానముచేసి సమాధిని పూజించెడివాఁడు. ఒకనాఁడు ఆతఁ డక్కడకు వచ్చునప్పటికి ప్రభువు ఆకుండమున స్నానము చేయుచుండెను. అట్టిగాఢారణ్యమున 10 ఏండ్ల బాలుఁ డట్లు నిర్భయముగా సంచరించుచుండుటకు ఆకులకర్ణి ఆశ్చర్యచకితుఁడై దగ్గరకు వచ్చి పలుకరించెను; కాని ప్రభువు బదులు చెప్పక అతని దెసకు చూడనైన చూడక సమాధికి ప్రదక్షిణనమస్కారము లాచరించి వెడలిపోయెను. కులకర్ణి విడువక కొంతదూరము వెంటనంటి వెళ్లెను; గాని బాలుని స్థానమున ఒక బెబ్బులి కాన్పించుటచే భయభ్రాంతుఁడై వెనుకకు పోయెను. అతఁడు బాలుఁడు, తప్పక మాణిక్యప్రభువే అని అప్పుడు నిశ్చయించుకొని చాల ఆనందించెను. బయాదేవికి ఆకులకర్ణి ఆప్తుఁడు అయియుండెను.

తరువాత పదిదినములకు ప్రభువు అశ్వారూఢుఁడై మంటాళగ్రామము ప్రవేశించి కులకర్ణియింటికిఁ బోయి "నా కాకలి యగుచున్నది. భోజనము పెట్టు" మని యడిగి ఆసమయమున కులకర్ణి భార్య తీవ్రమైన ప్రసవవేదన అనుభవించుచున్నదని తెలిసికొని 'నలుగురు బ్రాహ్మణుల కాళ్లు కడిగి ఆనీళ్లు త్రాగించినచో ఆమె సుఖముగా ప్రసవించు" నని చెప్పెను. అది విని బాలుఁడు మాణిక్యప్రభువే అని నిశ్చయించుకొని కులకర్ణి అట్లే చేయఁగా వెంటనే ఆమె బాధలన్నియు తీసివేసినట్లు పోఁగా సుఖముగా ప్రసవించెను. అందుకు చాల కృతజ్ఞుఁడై కులకర్ణి ఒకలడ్డు తెచ్చి ప్రభువున కిచ్చెను. ప్రభువు సగముమాత్రమే భక్షించి తక్కినసగము అతని కిచ్చివేసి అదృశ్యమైపోయెను. అతఁడు దానిని మహాప్రసాదముగా భావించి ఆనందముతో స్వీకరించెను.

ఈసమయమున ప్రభువు వయస్సు 10 ఏండ్లు; అన్నయైన దాదాసాహేబు వయస్సు 16 ఏండ్లు; తమ్ముఁడు తాత్యాసాహేబు వయస్సు 4 ఏండ్లు. దాదాసాహేబు ఐహికముల నన్నిఁటిని త్యజించి అనవరతము తపోనిష్ఠుఁడై యుండుచుండెను.

ఒకనాడు ప్రభువు ఉన్నట్లుండగా మాయమయ్యెను. ఎవరి నడిగినను జాడ చెప్పజాలకపోయిరి. నవాబు సకలదిక్కులను గాలించి రమ్మని సిపాయిలను పంపెను. ప్రజలలోఁ గూడ ననేకులు స్వయముగా గాలించసాగిరి. బయాదేవి, మనోహరుఁడును తాత్యాసాహేబును వెంట నిడుకొని వెనకట కరణ్యములలో ప్రవేశించిరి. ఎవ రెంత ప్రయత్నించినను ప్రభువు కాన్పింపలేదు; గాని మంటాళ గ్రామమున నున్నట్లు జాడ తెలిసెను. వెంటనే తలిదండ్రు లక్కడకుఁ బోయిరి; గాని కాన్పింప లేదు. అంతట వా "రిఁక యిది కాదు పని" అని నిశ్చయించుకొని అంబిలకుండమువద్ద మకాము చేసి దత్తాత్రేయజపము, పారాయణ ప్రారంభించిరి. ప్రభువు కనఁబడునంత దనుక యింటికి వెళ్లఁగూడదని వారు నిశ్చయించుకొనిరి. ఇంటివద్ద దాదాసాహేబు ప్రభువును జూడవచ్చినవారి కందరికిని నచ్చన మిచ్చుచు కొంతవర కాసంద పెట్టు చుండెను.

ఒకనాడు ప్రభువుతలిదండ్రులకు కొంచెము దూరమున ఒక పెద్దపులి కాన్పించెను. మరికొంతసేపటి కాబెబ్బులితో తమ కుమారుఁడు ఆడుకొను చున్నట్లు వారికి తోఁచెను. ఉత్తరక్షణమున కేవలము దత్తాత్రేయులవారే అక్కడ నున్నట్లు కాన్పించిరి. వెంటనే దంపతు లిద్దరును బోయి పాదములమీఁద వ్రాలి తమ దుఃఖము సంగతి చెప్పఁగా స్వామి "దుఃఖింపవలదు. మీకు ముగ్వురు కొమాళ్ల నిచ్చినాను. పెద్దవాఁడు రాజయోగియై వంశము నుద్ధరించును. రెండవ వాఁడు సర్వసంగపరిత్యాగము చేయుచు ప్రపంచమునే యుద్ధరించును. మూఁడవ వాఁడు మీముద్దుముచ్చటలు తీర్చుచు నిమ్ము సుఖపెట్టును. యుక్తసమయ మున మాణిక్యప్రభువును మిమ్ము సంతోషపఱచును; గావున చింత మాని యిఁక గృహము చేరుకొని, యెప్పటియట్ల నన్ను స్మరించుచుండుఁడు" అని చెప్పి తిరో హితుఁడయ్యెను. బయాదేవియు, మనోహరుఁడును చేయునది లేక స్వామి యాజ్ఞ చొప్పున కల్యాణికి వెడలిపోయిరి. ఈసంవత్సరమున ప్రభువు ఒక్కసంవత్సరము గుహా వాసము చేసెను.

తరువాత ప్రభువు ఒకప్పుడు పండరీపురయాత్రకు బయలుదేరెను. వెంట చిమ్నాయు, అనేకులు శిష్యులు నుండిరి. గాఢాంధకారమున కొంతదూరము పోయిన తరువాత ప్రభువు "నా కాఁకలి యగుచున్నది. అన్నము తీసికొని రమ్ము" అనియెను. అందుకు చిమ్నా "ఈగాఢారణ్యమున అన్న మెట్లు లభించు" నని వగవ సాగెను. అది చూచి ప్రభువు "తెల్లబోయెద వేల? ఈకొండమీఁదికి పోయి "మాణిక్యప్రభువు వచ్చియున్నారు. భిక్షము పెట్టుము అని పిలువుము" అనిచెప్పఁగా. చిమ్నా "చిత్త" మని కొండ యెక్కి అట్లు కేకవేసెను. వెంటనే ఎదుటనున్న అడు

ణ్యము ఒక తపోవనముగా మారెను. మునులు తపస్సు చేసికొనుచుండిరి. ముని కన్యలు అన్నము తెచ్చి చిమ్నా చేతి కిచ్చిరి. తరువాత చిమ్నా యెదుట చూడఁగా అంతయు యథాప్రకారముగ అరణ్యమై పోయెను. అదిచూచి ఏమియు పోల్చుకొనఁ జాలక చిమ్నా ఆశ్చర్యచకితుడై త్రిప్పికి వెళ్ళివచ్చి అన్నము ప్రభువు యెదుట నుంచెను. అది అందరును భుజించి మరల ప్రయాణము సాగించిరి.

పండరీపురము సమీపించునప్పటికి సూర్యాస్తమయ మయ్యెను. చంద్రభాగా నది దాటిన పండరీపురమే; గాని నది కూలంకషముగా ప్రవహించుచుండెను. పడవలు ఇవ్వలనే కట్టఁబడి యున్నవి; గాని మనుష్యు లెవ్వరు లేరు. అప్పుడు చిమ్నా "ఏమి చేయుదము?" అని అడుగఁగా ప్రభువు ఒకపడవ యెక్కి "రండు. అందరును పడవ యెక్కుఁడు" అని ఆజ్ఞాపించెను. వారందరు నట్లే చేయఁగా ప్రభువు పాండురంగవిఠలుని ప్రార్థించెను. వెంటనే పడవ కట్టుత్రాళ్లు త్రెంపికొని అవ్వలి యొడ్డున చేరెను. అందరు వింతపడిరి. అప్పటికప్పుడే ఒక బ్రాహ్మణుఁడు భార్యతో కూడి అక్కడకు వచ్చియుండి తోడనే స్వాగత మిచ్చి ప్రభువును, శిష్యవర్గమును తన యింటికి పిలిచికొనిపోయి ఆతిథ్య మిచ్చెను. శిష్యుల కందరికిని పాండురంగఁడే రుఖమాబాయి (రుక్మిణీదేవి) తోఁగూడ వచ్చి తీసికొనిపోయినట్లు కనఁబడెను.

మరునాఁడు ప్రభువు చంద్రభాగానదిలో అవగాహనము చేసి పాండురంగని సేవించి ఆయాలయమునందున్న తుకారాము, జ్ఞానదేవుఁడు, నామదేవుఁడు మున్నగు మహాభక్తాగ్రేసరులనుగూడ పూజించెను.

అక్కడినుండి ప్రభువు మోరయేశ్వరుని పూజించుటకు శిష్యులతో మాయూరక్షేత్రమునకుఁ (చించవడకుఁ) బయలుదేరెను. కొంతదూరము పోవునప్పటికి ప్రభువుతో నొకసన్యాసి కలిసికొనియెను. శిష్యులు ముందు నడచుచు చించవడలోని దేవాలయగోపురము కాన్పింపఁగా ఆసంగతి ప్రభువుతో చెప్పుటకు వెనుఁదిరిగిచూచిరి; గాని ప్రభువు కనఁబడలేదు. అందుకు వా రందరును వగచి చించవడ చేరి దేవాలయములో చూడఁగా ప్రభువు బ్రహ్మచారియు స్వామిని పూజించుచుండిరి.

అక్కడినుండి పాంచాలేశ్వరుకు బయలుదేరిరి. దారిలో గోదావరి తగులఁగా ప్రభువు అందు స్నానముచేసి ఒకచోఁ గూర్చుండి జపము చేసికొనుచుండఁగా నొక సన్యాసి వచ్చి ప్రక్కన కూర్చుండెను. అపుడు ప్రభువు కొంచెముదూరమున స్నానాద్యనుష్ఠానములు తీర్చుకొనుచున్న శిష్యులవద్దకు వెళ్లి "ఈజోలె, యీయోగదండము భద్రముగా చూచుచుండుఁడు వచ్చెద" నని వెడలిపోయెను. ప్రభువు వచ్చునప్పటికి భిక్ష తేవచ్చు నని శిష్యులు సమీపగ్రామమునకు పోయివచ్చి చూడఁగా జోలె, యోగదండము కాన్పింపవయ్యెను. అందుకు వగచుచు మూఁడు

దినము లక్కడనే యుండి లాభము లేకపోగా శిష్యు లందరును కల్యాణికి పోయి సంగతి యంతయు ప్రభువు తల్లిదండ్రులకు చెప్పి దుఃఖించిరి. తలిదండ్రులును చాల దుఃఖించిరి. కాని ఏమియు ప్రయోజనము కలుగలేదు.

అట్లు ప్రభువుచెంత కూర్చుండిన సన్యాసి అనఁగా దత్తాత్రేయులవారు ప్రభువును తమ ఆశ్రమమునకుఁ గొనిపోయి తమ తలిదండ్రులైన అత్రిమహర్షికి, అనసూయాదేవికి చూపించి ప్రభువునకు అష్టాంగయోగము లుపదేశించి మహామంత్రాధిదేవతలను వశపఱచిరి.

ఒకప్పుడు ప్రభువు కల్యాణికి ఆఱామడలదూరమున నున్న బాలకీగ్రామ పరిసరగాఢారణ్యమున చిమ్నా, నారాయణదీక్షితులు, బాపాచార్యుఁడు, బ్రహ్మచారి అను నలుగురు శిష్యులతో వసించి తపస్సు చేసికొనసాగెను. అప్పుడు నవాబుసాహేబు, గురురావు మున్నగు ఉన్నతోద్యోగులును ప్రభువుదర్శనార్థము వచ్చియుండిరి. ఇట్లుండఁగా ఒక బీదబ్రాహ్మణుఁడు భార్యను శిశు వగు ఏకపుత్రుని వెంటనిడుకొని ప్రభువుదర్శనము చేసికొంద మని ఆమార్గముగా పోవుచుండిరి. కొంతదూరము ప్రయాణము సాగునప్పటికి బాలునకు మశూచికము వచ్చెను. అందుచే మార్గమున ఏగ్రామమునందును వారికి బస దొరకదయ్యెను. ఇక చేయునదిలేక వారు ఉపవాసములతోడనే నడచుచు బాలునిమీఁదనే ప్రాణము లుంచుకొని వచ్చుచుండిరి. ఒక చెరువుగట్టుమీఁద కూర్చుండియుండఁగా బాలుఁడు మరణించెను. దారిద్ర్యము, అన్నము లేకపోవుట—ఇట్టి స్థితిలో ఏకపుత్రుఁడుగూడ చనిపోయినందుకు వారు అమితముగా దుఃఖింపసాగిరి.

నవాబుసాహేబు, గిరిరావు ఈయవస్థ చెప్పి ప్రభువు నక్కడకు తీసికొని వచ్చిరి. ప్రభువు వచ్చిన వెంటనే శరీరముమీఁద చేయి పెట్టఁగా బాలుఁడు వెంటనే లేచి కూర్చుండెను. మశూచికముగూడ లేక, ఆ యానవాళ్లయిన లేక మంచి తేజస్సుతో ప్రకాశింపసాగెను. అది చూచి బ్రాహ్మణదంపతులు అత్యానందభరితులై ఆవేశమును పట్టలేక దుఃఖించుచు ప్రభువుపాదములమీఁద వ్రాలి బిడ్డనుగూడ పడవేసిరి.

పిదప ప్రభువు "మీ రెక్కడికి పోవుచున్నా" రని యడుగఁగా వారు వీరే ప్రభువు అని యెఱుంగక "శ్రీమాణిక్యప్రభువులదర్శనము చేసికొనుటకు కల్యాణికి పోవుచున్నా" మనిరి. "అక్కడ ప్రభువు లేకుండిన ఏమి చేయుదురు?" అని ప్రభువు మరల నడుగఁగా "ఇప్పటికి మాకు మూఁడుదినములనుండి అన్నము లేదు. ఈస్థితిలో మాకు ప్రభుదర్శనము కానిచో మేము మరణించుట తప్ప వేరు గతిలేదు" అని చెప్పిరి. దానిమీఁద ప్రభువు "మీకు భయము లేదు, విచారింపకుఁడు. ప్రభువు

ఇప్పుడు కల్యాణిలో లేరు. కొంచెమునేపటికి మీకు భోజనము పెట్టెనింతలో ద్రష్ట ప్రభుదర్శనముగూడ చేయించెద" నని చెప్పి వారిని నిలిపివేసెను. కొంత

ఇంతలో ఒక శిష్యుఁడు సమీపగ్రామమునుండి జోలెతో భిక్షము ఉురి. అది చూచి ప్రభువు నవాబుసాహెబు మొదలైనవారిని భోజనమునకు లేవ నాజ్ఞ యిచ్చి శిష్యుల నంపి సమీపగ్రామవాసులనుగూడ పిలిపించెను.

మొత్తము నాలుగువందల మంది చేరిరి. ప్రభువు "ఆకులు వేయండి" అనిసెల విచ్చిరి. శిష్యు లట్లే చేసిరి. "వడ్డించండి" అని ప్రభువు మరల ఆజ్ఞాపించెను. శిష్యుఁడు తెల్లఁబోయి చేయునది లేక జోలెలో చేయి పెట్టి ఒకయాకులో వడ్డించెను. చూడఁగా ఆకులలో లడ్డు, అన్నము, పప్పు, కూరలు, పచ్చడులు, క్షీరాన్నము ఇట్టివి యుండెను. జోలెలో తీసినకొలఁదియు ఈపదార్థము లక్షయముగా చేతికి వచ్చుచుండెను. అదిచూచి శిష్యులు, భోజనమునకు కూర్చుండినవారునుగూడ నిర్విణ్ణులైరి.

వడ్డన పూర్తియైనది. అపుడు ప్రభువు "శ్రీఅవధూతచింతన గురుదేవ సమర్థ" అని పలికి భోజనమునకు సెలవిచ్చెను. అందరును తృప్తిగా భుజించిరి. అందరికిని ప్రభువు తలకు ఒక రూపాయ చొప్పున దక్షిణ లిచ్చి బ్రాహ్మణదంపతులకు వేయిరూపాయ లిచ్చెను. పిల్లవానిని బ్రతికించి, అన్నము పెట్టి పైఁగా వేయి రూపాయ లిచ్చిన ప్రభువు ఔదార్యమునకు, ప్రభావమునకు ఆదంపతులు పరమాశ్చర్యచకితులై పదేపదే ప్రదక్షిణసాష్టాంగనమస్కారము లాచరించి ప్రభువు సెలవుకాఁగా వెళ్ల లేక, వెళ్ల లేక వెళ్లిపోయిరి. పరిసరగ్రామవాసులుగూడ ఈయోగి మాణిక్యప్రభువే అని గ్రహించి పరమానందభరితులైరి. పిదప ప్రభువు జోలెలో నుండి నాలుగైదుకబళములు తీసికొని భక్షించి మిగిలినది భుజింప శిష్యుల కాజ్ఞాపించెను. వారు నలుగురును చూడఁగా అందు వారికి సరిపడు పదార్థములు ఉండెను. శిష్యుఁడు గ్రామమునకుఁ బోయి తెచ్చిన పదార్థము ఒక్కనికి మాత్రమే చాలునట్లు ఉండెను.

పిదప ప్రభువు కల్యాణికి వచ్చెను. దర్శనార్థులు వేలకొలఁది రాసాగిరి. అందరికిని భరద్వాజవిందుగా భోజనసదుపాయములు ఏర్పఱుపఁబడెను.

కాని కొలఁదిదినములయందే ప్రభువు కల్యాణి విడచి "నేను మరల వచ్చునంతవరకును యాత్రికుల కుపచరించుచుండుఁ"డని తల్లికి, తాత్యాసాహెబునకును చెప్పి బేదరగ్రామమునకు వెడలెను. అచ్చట వారందరును ఊరిబైట నున్న ధర్మశాలలో విడిసిరి. శిష్యులు గ్రామములోనికిఁ బోయి భిక్ష తెచ్చుచుండిరి. ఇట్లుండఁగా ప్రభువు ఒకనాఁడు యథాపూర్వముగ అరణ్యమున సంచరించుట కరిగి యోని

దినము లక్కడనేసు ధర్మశాలకు రాలేదు. ఈసమయమున వెంకమ్మ యను యోగిని సంగతి యంశ్మనమునకు వచ్చి శిష్యులతోపాటు ధర్మశాలయందే యుండెను.
దుఃఖించి వెంకమ్మ కల్యాణిపురమునందలి మల్లప్ప అను నొక్కవైశ్యుని కొమార్త.
ఇతకు ఏడుగురు సోదరు లుండిరి. మల్లప్ప సాధువులనిన చాల ఆనందించుచు పూజించుచుండెను. అది తెలిసి ఒక సాధువు వచ్చి మల్లప్ప యింట మకాము చేసెను. ఇంటివారికి సాధువుమీఁద విశ్వాసము పెరిగినకొలఁది యింటివారిమీఁద మహాలక్ష్మికి విశ్వాసము తగ్గిపోయెను. దారిద్ర్యము వచ్చినను వైశ్యకుటుంబము సాధువును గాని, సాధువు వైశ్యకుటుంబమును గాని విడువలేదు. తుదకు సాధువు పెద్ద యెత్తు యెత్తెను. అతఁడు తన శిష్యులలో ఇష్ట మున్నవారికి బొందితో కైలాస మిప్పించెద నని చెప్పెను. వా రది నమ్మిరి. 40 మందివరకు అతనితోఁగూడ రుద్రకుండ మను మడుగుచెంతకుఁ బోయిరి. వారిలో వెంకమ్మఁగూడ నుండెను.

సాధువు వారిలో ఒక్కొక్కరికే మంత్ర ముపదేశించి, పాదపూజ చేయించుకొని, దక్షిణ స్వీకరించి "శ్రీహరికి మ్రొక్కి గురుపాదములు స్మరించి గుండములో నురుకుఁడు" అని చెప్పసాగెను. వారును అట్లే చేసిరి. సాధువు యిట్లు అందరికి సంఘమరణము కలిగించెను; గాని వెంకమ్మమాత్రము ఇది మోసమని గ్రహించెను. అది గ్రహించి సాధువు పలుకకుండ వెడలిపోయెను. పిదప వెంకమ్మ ప్రభువు నాశ్రయించెను. ప్రభువు ఆమె పూర్వజన్మసంస్కారమును గ్రహించి అంతరంగశిష్యకోటిలో చేర్చుకొనియెను. ఆమె అవివాహిత. ప్రభువును సేవించుట, సపర్యలు చేయుట తప్ప ఆమెకు మరియొకపని లేదు. ప్రభువు శిష్యులలో ఈమె శ్రేష్ఠురాలుగా నుండెను. అంత నిర్లిప్తత మరియొకరికి లేకుండెను. ప్రభువు తనశిష్యు లందరిలో ఆమెకు మాత్రమే కాలక్రమమున అష్టాంగయోగసిద్ధి కలుగఁజేసెను.

బేదరగ్రామమున దొంగలభయ మధికముగా నుండెను. దేశముఖు ధర్మశాలయందలివారికి దొంగలవలన అపాయము రావచ్చు నని తలఁచి ధర్మశాలకు పోయి "ప్రభువు వచ్చువరకును గ్రామములో నుండి నాయాతిథ్యము స్వీకరింపవలసిన"దని దొంగల సంగతి చెప్పి ప్రార్థించెను; గాని వారు అందుకు వినలేదు. "మే మిక్కడ నుండి కదల"మని వెంకమ్మ కచ్చితముగా చెప్పెను. దేశముఖు చేయునదిలేక వెడలిపోయెను.

నాలుగైదుదినములకు దేశముఖు చెప్పినట్లు, దొంగలు వచ్చి ధర్మశాలమీఁద పడిరి. ప్రభువు శిష్యులు తమవద్ద నేమియు ధనము లేదని యెంత చెప్పినను వినక చోరులు వారిని ఘోరముగా హింసింపఁగడఁగిరి. శిష్యులు ప్రభువు

నామము స్మరించుచు దొంగలుచేయు శిక్షను స్వీకరించుచుండిరి. ఇంతలో దీర్ఘ కాయుండగు నొకపురుషుండు దుడ్డుకఱ్ఱతో వచ్చి చోరులమీఁదఁబడెను. కొంత తడవు యుద్ధమైనతరువాత నలుగురుదొంగలు కూలిరి. మిగిలినవారు పారిపోయిరి.

మరునాఁడు దేశముఖు వచ్చి అంతయు విచారించి అక్కడనే వారికి భోజనాదికము ఏర్పాటు చేసెను. ఆమరునాఁడు ప్రభువు వచ్చెను. పిదప అందరును ఒక నదీతీరమునందలి శివాలయమునకు వెడలిపోయిరి; గాని అక్కడ నెవ్వరికిని ఆహారము దొరకకుండెను. అది చూచి ప్రభువు అందరిని "కల్యాణికి పొండు" అని చెప్పెను. కొందరు వెడలిపోయిరి; గాని వెంకమ్మ, చిమ్నా—ఈయిరువురు "నిన్ను విడిచి పోము" అని స్పష్టముగా చెప్పివేసిరి. అంతట ప్రభువు వారి కిద్దరికిని ఆధ్యాత్మవిద్య బోధించి యోగాసనములు నేర్పి "మీరిక నిక్కడ నుండవలదు. నేను సిద్ధపురుషుల దర్శనార్థము పోవలసియున్న" దని చెప్పెను; గాని లాభము లేకపోఁగా ప్రభువు ఎక్కడకో వెడలిపోయెను.

తరువాత ఒక పెద్దపులి కనపడఁగా వెంకమ్మ అనుజ్ఞనంది చిమ్నా కల్యాణికి వెడలిపోయెను. వెంకమ్మమాత్ర మక్కడనే యుండి ఏమైన దొరకిన తినుచు లేకున్న పస్తుపడియుండుచు పగలంతయు హింస్రకమృగవ్యాకులమగు అరణ్యమున నిర్భయముగా సంచరించుచు రాత్రి ఏచెట్టు మొదటనో పడి నిద్రించుచు పిచ్చిపట్టినదానివలె నుండెను.

ఇట్లు మూఁడుదినములు జరుగునప్పటికి వెంకమ్మ మూర్ఛవచ్చి యొకచో పడిపోయెను. జీవించుట సంశయగ్రస్తముగా నుండెను. అప్పుడు ప్రభువు వచ్చి మొగమున నీళ్లు చల్లి తన అమృతహస్తముతో స్పృశింపఁగా ఆమె లేచి కూర్చుండి "యికనైన మౌర్ఖ్యము విడిచి కల్యాణికి పొ"మ్మని యెంత చెప్పినను "నాప్రాణములు ఉండునంతవరకు తమ పాదములు విడువ" నని చెప్పెను.

ఆయచంచలభక్తికి ప్రభువు ఆశ్చర్యపడి "అట్లయిన నీవు నేను చెప్పినట్లు చేయుము. నీవు ఏడుమాసములు సమాధిలో నుండుము. అప్పుడు నేను వచ్చెద" నని చెప్పి సమాధిస్థితి నుపదేశించి ఆమె సమాధిలో కూర్చున్న తరువాత వెడలిపోయెను.

తరువాత ఏడుమాసములకు ప్రభువు ఒక యవనసిద్ధపురుషునితో కలిసి వచ్చి వెంకమ్మను సమాధినుండి ప్రజ్ఞ వచ్చునట్లు చేసి దర్శన మిచ్చెను. పిదప ఈ మువ్వురును బేదరదెసకు వచ్చుచుండఁగా మసీదులో మరియొక యవనసిద్ధుఁడు కాన్పించెను. ఆతేజస్సున కద్భుతపడి మువ్వురును సాష్టాంగనమస్కారములు చేయఁగా అతఁడు "నేను దత్తాత్రేయుఁడను. మాణిక్యప్రభువు నాసంపూర్ణాం

శము” అని యనసిద్దునకు, వెంకమ్మకు తెలిపి “మీకు కొలఁది కాలమునందే కోర్కి లీడేరు”నని తెలిపి తిరోహితుఁడయ్యెను.

ప్రభువు కల్యాణికి వచ్చెను; గాని వెంటనే ఒకసంవత్సరము యోగ సమాధిలో నుండుటకు నిశ్చయించుకొనియెను. ఈసంగతి తెలిసి “అంతకాలము మేము విశ్లేష మెట్లోర్వగలము?” అనియు, “దర్శనార్థము వచ్చువారిని మే మెట్లు సమాళింపఁగల”మనియు బయాదేవి, తాత్యాసాహేబు, చిమ్నా, వెంకమ్మ మున్న గువా రందరును అభ్యంతరములు చెప్పిరి; గాని ప్రభువు అందుకు సమ్మతింపక తాత్యాసాహేబును బయాదేవిని, వివిక్తప్రదేశమునకుఁ గొనిపోయి తత్వోపదేశ ముచేసి, పరబ్రహ్మానుసంధానము చేయు మార్గము తెలిపి, తాను మరల బైటకు వచ్చునంతవరకును వ్యవహారము లన్నియు యథాపూర్వముగను, యథావిధి గను జరుపుచుండునట్లు ఏర్పఱచి వెడలిపోయెను. చిమ్నాను సమాధిద్వారమును కాపాడునట్లు నియమించి, సమాధిద్వారమువద్ద ఊడ్చి, శుభ్రపఱచి పూజాదికైంకర్య ములు సలుపుచుండు ననియు, అందు కాటంకము చెప్పక అనుజ్ఞ దయచేయవలె ననియు వెంకమ్మ పట్టుపట్టఁగా అందుకును సమ్మతించెను.

ప్రభువు యుక్తసమయమున సమాధిలో కూర్చుండెను. ప్రభువు సెలవు చొప్పున శిష్యులు ద్వారము మూసి, రాతిబంధన మమర్చి వెడలిపోయిరి. చిమ్నా ద్వారరక్షకుఁడుగా నుండెను. వెంకమ్మ పూజాకైంకర్యముచేయుచు ప్రభువుయిచ్చిన రుద్రాక్షమాల త్రిప్పుచు ప్రభువును స్మరించుచుండెను. చిమ్నా సమీపగ్రామ మునకు వచ్చి భిక్ష తెచ్చి వెంకమ్మకుఁ బెట్టి తానును భుజించుచు దేహధారణము గావించుకొనుచుండెను.

ఇది తెలిసి అనేకులు వచ్చి సమాధిని ప్రభువుస్థానమున వెంకమ్మను పూజించి వెడలిపో సాగిరి.

ఇఁక పదునైదు దినములలో ప్రభువు సమాధినుండి లేచుననఁగా అందరును సమాధి చెంతకు చేర నారంభించిరి. క్షణములో ఆగాధారణ్య మంతయు ఉద్యాన వనమువలె సుపరిష్కృత మయ్యెను. కల్యాణినవాబు మరికొందరు ఉద్యోగులువచ్చి సకలమును జాగ్రత్తఁగా చూచుచు అన్ని వసతులను కల్పింపసాగిరి. నారాయణదీక్షి తులు, బాపాచార్యులు మున్నగుశిష్యులు సమాధిద్వారము చెంత నొకలతామండ పము నిర్మించి చక్కఁగా నలంకరించి ప్రభువు బైటికి వచ్చునప్పటికి చేయవలసిన పూజాదికములకు అవసరమైన వస్తువులన్నియు చేర్చిరి.

శుభముహూర్తమున బయాదేవి, తాత్యాసాహేబుమున్నగువారు మంగళ తూర్యరావములు సెలంగ సమాధితలుపులు తెరపించిరి. వెంటనే సూర్యకాంతిని గూఢ

మించు తేజస్సుతో ప్రభువు బైటికి వచ్చి జయజయధ్వనులు మిన్నుముట్టుచుండ పండెపైఁగూర్చుండి అందరికిని దర్శన మిచ్చెను. పుష్పవృష్టి కురిసెను. మంగళవాద్యములు ఘోరుకలంగెను. భక్తులు ధన్యవాదములు చేసిరి. అందరును సాష్టాంగనమస్కారములు చేసిరి. అపుడు ప్రభువు అందరికిని తీర్థప్రసాదము లిచ్చెను. ఆసమయమున ప్రభువునకు అప్పాసాహేబు 5000 ల రూపాయలు పాదపూజ చేసెను. రాజారావు 10000 ల రూపాయలు పాదపూజ చేసెను. ఇట్లు జమవచ్చిన రూపాయలుగాక తాత్యాసాహేబు మరియొక లక్షరూపాయలుగూడ వెచ్చించి వచ్చినవారి కందరికిని మొదటినుండి చివరవరకు రాజవైభవముగా భోజనసత్కారములు చేసి, అర్హులకు సంభావన లిచ్చి ఆనందపఱచెను.

హైదరాబాదువాసు లగు కృష్ణాజీ, రాజమ్మ అనువారిరువురు పుత్రార్థమై ప్రభువును దర్శించుటకు వెళ్లిరి. అప్పుడు ప్రభువు వీథిలో గోలీలు ఆడుచు బాలురకు 8 గోలీలు ఓడిపోయెను. అందుకు బాలురు ప్రభువును నిలిపివేయఁగా రాజమ్మ అది చూచి బాలురయందలి ప్రీతివలన అక్కడకు వచ్చి "ఇది యేమి?" అని యడిగెను. అందుకు ప్రభువు "నేను వీరికి 8 గోలీలు బాకీపడితిని. అవి నీవు ఇచ్చివేసినచో నీకు 8 గురు కొడుకులు పుట్టెదరు" అని చెప్పెను. రాజమ్మ అట్లేచేసి ప్రభువును విడిపించెను. మరునాఁడు ఆమె స్నానముచేసి మడిబట్టలు కట్టుకొని ప్రభువును పూజించుటకై వెళ్లి తొలినాఁడు తాను విడిపించిన బాలుఁడే ప్రభువై సింహాసనముననుండి పూజ లందుట చూచి తెల్లపోయెను. అపుడు ప్రభువు "నిన్ననే నీకు 8 గురు బిడ్డలు పుట్టెద రని చెప్పితిని. ఇంకేమి కావలెను?" అని యడిగెను. రాజమ్మ "అది చాలు" నని పూజాదికము నిర్వర్తించి వెడలిపోయెను. పిదప ఆమె కెనమండుగురు బిడ్డలు కలిగిరి.

ఒకసాహుకారు సంతతిలేక "నాకు కొడుకు పుట్టినచో ప్రభువునకు బిడ్డ ఒడలిమీఁది నగలు నిలువుదోపు ఇచ్చెద" నని మ్రొక్కుకొని అట్లు అచిరకాలమునందే కొడుకు పుట్టఁగా వచ్చి ప్రభువును సందర్శించి బాలుని నగలు ఎదుట నుంచెను. వానిని చూచి ప్రభువు "ఇందు ఒక గాజు కొరఁతగా నున్న" దని చెప్పఁగా సాహుకారు చకితుఁడై గాజు తెచ్చి యిచ్చి క్షమింపఁగోరి ఆనందముతో వెడలిపోయెను.

ఒకప్పు డొక బ్రాహ్మణుఁడు వచ్చి "మహాలక్ష్మిని సర్వాభరణములతో నలంకరించి పూజించెద నని నేను మ్రొక్కుకొంటిని. ఇటీవలన దేవి నాకు కలలో కాన్పించి మాణిక్యప్రభువు నట్లు పూజించినచో నాకు ఆపూజ ముట్టు" నని సెలవిచ్చెను; గాపున అ ట్లంగీకరింపవలెనని కోరెను. ప్రభువు రేపు చేయవచ్చుననియెను.

మరునాడు ఆబ్రాహ్మణుఁడు అట్లే పూజింపఁగా ప్రభుపు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి రూపముగనే కాన్పించెను.

ఒకప్పు డొకఁడు కడుపునొప్పివలన మిగుల బాధపడుచువచ్చి తన కాబాధ తీర్పవలె నని ప్రభువును కోరెను. "తలిదండ్రులు వాని ప్రారబ్ధమును నీ వనుభవింప వలసివచ్చు" నని చెప్పుచు చాల వాదించిరి; గాని ప్రభువు "శరణాగతుని రక్షింపక తప్పదు" అని బదులు చెప్పి రోగి కడుపు తన చేతితో స్పృశించెను. వెంటనే వాని కాబాధ పోయెను. అది ప్రభువున కంకురించి శరీరము రంగు మారిపోయెను. అందుకు అందరును వగచిరి; కాని ప్రభువు కొలఁది కాలముననే శరీరము బాగు పఱచికొనియెను.

మరియొకప్పుడు బొల్లి (శ్వేతకుష్ఠు) వలన బాధపడుచు నొకఁడువచ్చెను. లక్ష మంది బ్రాహ్మణులకు సమారాధనము చేయు మని ప్రభువు చెప్పెను. ఆబ్రాహ్మణుఁ డట్లే చేయఁగా వ్యాధి వెంటనే తొలఁగిపోయెను.

ఒక గ్రామమున అరుణప్ప అను నొక పూజారి జలోదరవ్యాధిచే బాధపడు చుండెను. అతఁ డొకనాఁడు బాధ భరింపఁజాలక చచ్చిపోవలయు నని యేడ్చుచు అంతలో ప్రభువు గుఱ్ఱము మీఁదరాఁగా నమస్కారముచేసి "వెంటనే ప్రాణము పోవున ట్లనుగ్రహింపవలయు" నని కోరెను. అందుకు ప్రభువు భయపడవల దని ధైర్యము చెప్పి నుప్పులు, కొబ్బరి, పెరుగు, అటుకులు తెప్పించి మెత్తఁగా కొట్టి ఉండ చేసి తిను మనియెను. అది విని అందరును బాధ హెచ్చు నని చెప్పిరి; గాని అరుణప్ప ప్రభువు శక్తి నెఱుంగును; గాన మారుమాట చెప్పకుండ దానిని భక్షించి బాధ వ్యాధి తగ్గిపోగా సుఖపడెను.

మరియొకప్పుడు విఠలరావు అను బ్రాహ్మణుఁడు చాలదినములనుండి సేవించు చున్నాఁడు గాన హైదరాబాదు పెళ్లికిఁ బోవుచు ప్రభువును సందర్శింపవచ్చెను. ప్రభువు "అక్కడ నిలువయుండక వెంటనే ర" మ్మని చెప్పెను; కాని అతఁ డది మరచిపోయి చాలదినము లుండెను. ఆకాలమున సవతితల్లి అతనికి విషము పెట్టెను. జీవితాశ వదలుకొని అతఁడును భార్యయు వగచుచు ప్రభువునామము స్మరింపసాగిరి. అంతట నొకబైరాగి వచ్చి జోలెనుండి యొకమూలిక నిచ్చి నూరికొని త్రాగుమనెను. విఠలరావు అట్లే చేసి సుఖపడి వెంటనే ప్రభువును జూచుటకు కల్యాణి వచ్చెను. అప్పటికి ప్రభువు విఠలరావు బాధపడినట్లే బాధపడుచుచుండెను. ప్రభువు విఠల రావును జూచి నీబాధ పోఁగొట్టఁగా అది నాకు వచ్చినదని చెప్పి వెంటనే దానిని పోఁగొట్టుకొనియెను.

ఒకప్పుడు ప్రభువు రాజూరీ అను గ్రామమునకుఁ బోవుచు మార్గవశమున పహాడ అను గ్రామమున మజిలీ చేసి ఆంజనేయుని ఆలయమున శిష్యులతో విడిసెను.

అప్పుడు ఆగ్రామమున ఒకస్త్రీ చనిపోఁగా బంధువు లామెను గుడి ముందునుండి శ్మశానమునకు తీసికొనిపోవుచుండిరి. ప్రభువు అది చూచి "మీగ్రామములో బ్రతికియున్న వారినే దహనము చేయుదురా?" అని యడిగెను. అందుకు వాహకులు తెల్లఁబోయి కటుకు క్రిందికి దింపి చూడఁగా ఆమె బ్రతికి లేచి కూర్చుండెను. అందరును ఆశ్చర్యపడిరి. ప్రభువు ఆమెను స్నానము చేయించి తీసికొనివచ్చునట్లు చేసి మంత్రతీర్థము ప్రోక్షింపఁగా ఆమె పూర్వపుబలముతో లేచి ప్రభువునకు పాదాభివందనము చేసి నడచి యింటికి వెళ్లిపోయెను. బంధువులును ప్రభుప్రశక్తి కాశ్చర్యపడి నమస్కరించి స్తుతించి ఆనందముతో వెడలిపోయిరి.

రేహాళదాసు అను సాధువు తల్లి ప్రభువును గురుభక్తితో సేవించుచుండెను. ఒకనాఁడు ప్రభువు ఆమె గుడిసెవద్ద ఆమెకు జ్ఞానోపదేశము చేయుచుండఁగా కొంప లంటుకొనెను. అది చూచి అక్కడివా రంపరును ప్రభువు, వృద్ధాంగన మంటలలోఁ బడి భస్మమై పోయిరని వగచుచు ఈవార్త తెలుపుటకు కల్యాణికి పోయి చూడఁగా ప్రభువు, ఆవృద్ధాంగన ఒకచో కూర్చుండి ఆధ్యాత్మికవిషయములు మాట్లాడుకొనుచుండిరి. అందుకు అందరును ఆశ్చర్యపడి ఇండ్లకు పోయిరి.

ఒకప్పు డొకబాలుఁడు పిల్లలతో నాడుకొనుటలో బావిలో పడిపోయెను. అది చూచి తమ కేమి చిక్కులువచ్చునో యని మిగిలిన బాలురు పారిపోయిరి. నూతిలో పడిన బాలుఁడు "ప్రభూ! నేను నూతిలో పడిపోయినాను" అని కేక లేసెను. ఇంతలో తల్లిదండ్రులు, ఇతరులు కొందరు వచ్చిరి. కొందరు నూతిలో దిగి వెదకిరి; గాని దొరకలేదు. అంతట తల్లి కుమారుని తలంచికొని బిగ్గరగా ఏడువసాగెను. ఇక్కడ నిట్లుండఁగా బాలుఁడు ప్రక్కవీథినుండి బయవెత్తుకొనివచ్చి "నేను నూతిలో పడిపోఁగా ప్రభువుగారు తీసినారు. ఆవీథిలో ఆడుకొనుచున్నాను" అని చెప్పెను. పిల్లవాఁడు బ్రతికినందుకు అందరు నానందించి ప్రభుప్రభావమున కాశ్చర్యపడిరి.

ఒకప్పుడు ప్రభువు అంతరంగభక్తుఁ డగు అబనాయబు హుమ్నాబాదులో శుక్రవారపువార్షికోత్సవము జరిపెను. ప్రభువు చెంతనున్న రామచంద్రబోవా అనుజ్ఞఁబడసి ఆమహోత్సవము చూచుటకు వెళ్లెను. అంతయు చక్కఁగా నెఱవేరి నది; గాని బోవా రాత్రికి ప్రభువు సన్నిధి చేరవలె నని బయలుదేరెను. హాఠాత్తుగా వర్షము ప్రారంభ మయ్యెను. వెళ్లునపు డొకచుక్క నీరైన లేని చిన్నకాలువ యొకటి ఇపుడు పొంగి, బోవా మధ్యకు వచ్చునప్పటికి అగాధ మయ్యెను. అంతట నతఁడు వెనుకకు పోవుటకును, ముందుకు పోవుటకునుగూడ చేతఁగాక నీరుద్రావుచు అపాయశంకలో నుండఁగా ఆజానుబాహువు వగు నొక మనుష్యుఁడు దుడ్డుకర్ర

చేబూని వచ్చి అతనిని ఒడ్డునచేర్చి మాయ మయ్యెను. ఆమనుష్యుఁడు ప్రభువే అని తలంచికొనుచు బోవా పాడిబట్టలు కట్టుకొని ప్రభువును దర్శింపఁగా "ఇక నెప్పుడు నట్టిసాహసము చేయకుము" అని ప్రభువు మందలించెను.

మరియొకప్పుడు ప్రభువు ఒక యజ్ఞము చేయించెను. అన్నదానము చాల వైభవముగా జరిగెను. అనేకులు దక్షిణలకును మృష్టాన్నభోజనములకు ఆసపడి వచ్చిరి. కొన్నిదినములు కడచిన తరువాత నొక బాలుఁడు అజీర్తివలన బాధ పడుచు యజ్ఞశాలయందే చనిపోయెను. అందువలన యజ్ఞము చెడిపోయెనని ఋత్విక్కులు చెప్పిరి. అందరును ఏమి చేయుటకును తోఁచక వగవసాగిరి. అప్పుడు ఆబాలుని తలిదండ్రులు ప్రభువువద్దకు వెళ్లి సంగతి యంతయు చెప్పి వగవసాగిరి. లక్షరూపాయలు వెచ్చించి చేయుచున్న యజ్ఞ మిట్లు విచ్ఛిన్నమైనందుకుఁ గూడ అందరును వగచిరి. ప్రభువు ముస్సుందు ఆతలిదండ్రులను వగవవలదనీ, విధివిధా నము దాట నెవ్వరికీ శక్తి లేదనీ, మీారు బ్రతికియున్నంతకాలమును నేనే పోషిం చెదననీ ఓరడించెను; గాని వారు ఓరకుండలేదు. అంతట ప్రభువు తాత్యామహా రాజును బిలిచి "వచ్చియున్న బ్రాహ్మణోత్తములందరియొక్క పాదములు కడిగి ఆనీటిని బాలుని ముఖమున చల్లవలసిన"దని ఆజ్ఞాపించెను. తాత్యామహారాజు అట్లే చేయఁగా వెంటనే బాలుఁడు నిద్రపోయి లేచినవానివలె లేచి కూర్చుండెను. అందరు నద్భుతపడి పలువిధముల కొనియాడిరి.

ఒకప్పుడు ప్రభువు దర్బారుతీర్చియుండెను. అనేకులు పరివేష్టించియుండిరి. అప్పుడు ప్రభువు అకస్మాత్తుగా దర్బారుదుస్తులు విడిచి సాదాపంచె కట్టుకొని నీటిలో పడిపోయినవారిని పైఁకి తీయుచున్నట్లు అభినయింపసాగెను. అది యెవ్వ రికిని బోధపడక—ఏమియు అడుగలేక యూరకుండిరి; గాని నాలుగునెలలకు ఒకవర్తకుఁడు నాలుగైదులక్షలురూపాయలు వెంటనిడుకొని కల్యాణికి వచ్చెను. అతఁడు ఖండాంతరములతో వర్తకముచేసి ఏడెనిమిదిలక్షలరూపాయలతో వచ్చు చుండఁగా సముద్రమధ్యమున ఓడ మునిఁగిపోవుటకు సిద్ధపడెను. అప్పుడు ఓడ యందున్నవా రందరును ప్రభువును ప్రార్థించిరి. వర్తకుఁడు తాను బ్రతికి ఆధన ముతో ఇల్లు చేరఁగలిగినచో విశేషధనము ప్రభువును పూజించుటకై ఖర్చుపెట్టెద నని మ్రొక్కుకొనియెను. నాఁడు ప్రభువు దర్బారులో చేసిన అభినయమంతయు వారిని ఉద్ధరించుటలో చేసినదే. నాఁడు ప్రభువు ఇక్కడనే యుండి అక్కడ సముద్రమధ్యమున వారి నందరిని రక్షించెను. వర్తకుఁడు తన సంగతి చెప్పఁగా కల్యాణిలోనివా రప్పటికి సంగతియంతయు గ్రహింపఁగలిగిరి.

వర్తకుని మర్యాదలతో మేనాలో కొనిరావలసిన దని ప్రభువు ఆజ్ఞాపిం చెను. అనుచరులు అట్లేచేసిరి. వర్తకుఁడు ప్రభువు పాదములచెంత మూఁడు లక్షలు

వెలచేయు స్వర్ణరజతరత్నవస్తువులను సమర్పించి పూజించి, ఏబదివేలు వెచ్చించి బ్రాహ్మణులకు దాన ధర్మములు, సకలజాతులకు సమారాధనము గావించెను. మరియు నొకనెల కల్యాణియందే యుండి పిదప ప్రభువు సెలవు పొంది వెడలిపోయెను.

ఒకప్పుడు గడవంతీ అను గ్రామమునుండి కొందరుభక్తులు ప్రభువును సందర్శించి పూజించి అనుగ్రహము పొందుటకు సకుటుంబముగా బయలుదేరిరి. అరణ్యమున నొకచో శివాలయ ముండుటం గాంచి వారందరును వంటలు చేసి కొనుట కచ్చట విడిసిరి; గాని ఆశివాలయమున అప్పుడు పూజాదికములు జరుగుట లేదనియు, అది దొంగలకు ఆకరమై యున్నదనియు వా రెఱుఁగరు. వారు వంటల ప్రయత్నములో నుండఁగా ఏబదిమందిదొంగలు మీఁదఁబడిరి. వారివద్ద ధన మేమియు లేదు. స్త్రీలకు ఆభరణాదికములుఁ గూడ స్వల్పముగనే యుండెను. అయి నను దొంగలు నిర్దయులై వారిని హింసింపసాగిరి. అంతట భక్తులు చేయునది లేక అందరును ప్రభువును ధ్యానింపసాగిరి. తోడనే యొక కోటీశ్వరుఁడు విశేషధన ముతో వచ్చి శివాలయము ముందు విడిసెను. ఆధనము చూచి దొంగ లందరును భక్తులను విడిచి శ్రీమంతునిమీఁదఁ బడిరి. దొంగ లందరును కత్తు లెత్తిరి; గాని ఎత్తిన చేతు లెత్తినట్లే యుండిపోఁగా—పైఁగా కొందరు కత్తులు తమ మెడల మీఁదనే పడఁగా చనిపోయిరి. దొంగలనాయకుఁడు శూలనొప్పితో దారుణమగు బాధ ననుభవింపసాగెను. ఇది యంతయు చూచి భక్తులు ఇది ప్రభువు చేష్టయే యని గ్రహించి మరింత భక్తితో నామస్మరణము గావింపసాగిరి. అంతట ప్రభువు సంపన్నుని రూపము విడిచి నిజరూపము ధరించి కూర్చుండెను. భక్తులు ఆనంద బాష్పములతో ప్రభువుపాదముల కభిషేకముచేసిరి. దొంగలనాయకుఁడు పశ్చా త్తాపపడి శరణువేఁడి రక్షితుఁడై ప్రభువు శిష్యకోటిలోచేరి ఆశివాలయము నుద్ధ రించి అదిమొదలు విరాగియై ప్రభువు పాదములు కొలువసాగెను. హతశేషులగు అతని యనుచరులును అట్లే చేసిరి.

బోలానాథుఁ డను నొకబైరాగి మానవదేహముతోడనే స్వర్గమునకు పోవలయు ననుకోరికతో నుండెను. అతని గురువు "ఇట్లు చేయుటకు నాకు శక్తిలేదు. పోయి మాణిక్యప్రభువు నాశ్రయింపుము" అని చెప్పెను. బోలా నాథుఁడు కల్యాణికివచ్చెను. కాని ఆఱుమాసములు నిరీక్షించుచుండినను ప్రభువు దర్శ నము కాలేదు. కావలె నని ప్రభువు బోలానాథు దర్శనమునకు వచ్చునప్పటికి అరణ్య మునకు వెడలిపోయి, అతఁడు వెడలిపోఁగానే మరల రాసాగెను. ఇట్లు చేయుచు తుదకు ప్రభువు బోలానాథునకు పరిచర్యకూడ ప్రారంభించెను. అతఁడు ఎవరో భాగ వతభక్తుఁడు అని తలంచెను; గాని ప్రభువే ఈరూపముతో వచ్చెనని గ్రహింపలేక

పోయెను. ఇట్లు ఆఱుమాసములు కడచిపోయెను. బోలానాథుఁడు దిక్కుతోఁచక విచారింపసాగెను. అంత నొకనాఁటిరాత్రి గురునాథుఁడు అతనికి స్వప్నమున సాక్షాత్కరించి పరిచారకునిస్థితి యెఱిఁగించెను. మరునాఁడు ప్రభువు పరిచారకుని రూపముతో గుమ్మమున అడుగు పెట్టఁగానే బోలానాథుఁడు రెండుపాదములు గట్టిగా పట్టుకొని "అనుగ్రహించి నా కోర్కె తీర్చినఁ గాని పట్టువిడువ" ననియెను. అందుకు ప్రభువు స్నానము చేసి రమ్మని చెప్పి వెడలిపోయెను.

ప్రభువు దర్బారులో సింహాసనమున ఆసీనుఁడై యుండఁగా బోలానాథుఁడు వచ్చి అనుజ్ఞఁ బడసి పాదములచెంతఁ గూర్చుండెను. ప్రభువు "దేహముతో స్వర్గమునకు పోవుట మానవులకు సాధ్యము కానిదనీ, యీయుగమున నిది ఆచరణమున లేదనీ" అనేకవిధముల చెప్పెను; గాని లేనిచో "నాశిరస్సు మీపాదములకడ సమర్పించెద" నని బోలానాథుఁడు తనతలను క్రిందవేసి కొట్టుకొనఁబోయెను.

అప్పుడు ప్రభువు అతనిని వారించి అతని భక్తికి ఆనందించి కళ్లు మూసికొమ్మనియెను.

దర్బారులో నున్న వారందరును ఏమి జరుగునోయని ఆత్రముతో చూచుచుండిరి. బోలానాథుఁడు కన్నులు మూసికొనియెను. ప్రభువు శిష్యులు భృదవల్లని జపింపసాగిరి. వెంటనే బోలానాథుఁడు పక్షివలె పైకెగిరిపోయెను.

వృషభాద్రి అను పర్వతమున గుహలో విరూపాక్షుప్ప అను నొక లింగాయతుఁడు ఉండెను. అతఁడు ఆతెగవారి కందరికిని గురువు. మహామహిమాసంపన్నుఁడని శిష్యు లందఱు నాతనిని పూజించుచుండిరి. ఒకనాఁడు ఆతఁడు పార్థివపూజ చేయుచు నిమీలితనేత్రుఁడై ఈశ్వరుని ప్రార్థించుచుండెను. శిష్యు లనేకులు చుట్టును గూర్చుండి గురుని నిష్ఠకు ఆనందించుచుండిరి. ఇట్లు కొంతతడవు అయిన పిదప విరూపాక్షుప్ప కన్నులు తెఱచిచూడఁగా ఎదుట పార్థివలింగమునకు బదులు మాణిక్యప్రభువు ఉండెను. అతఁడు ప్రభువుమహిమ నిదివరకే వినియున్నవాఁడు; గావున వెంటనే పాదములమీఁద వ్రాలి నమస్కరించెను. ఇందుకు అతనిశిష్యులు అసంతృప్తి పడిరి. "ప్రభువు మరి లింగములలో దర్శన మిచ్చినగాని మేము నమస్కరింపము" అని వారనిరి. వారు నమస్కరింపకున్న ప్రభువునకు లోప మేమియు కలుగదు; గాని వారి యజ్ఞానమును పరిహరింపఁగోరి ప్రభువు స్నానము చేసి రమ్మని వారి కాజ్ఞాపించెను.

వెంటనే వారందఱును తమ వస్త్రములను, లింగములను, తీరములను ఒడ్డున ఉంచి కాసారమున దిగిరి. వారు యథాన్యాయముగా స్నానము చేసి తీరమునకు వచ్చిరి; గాని లింగములు కానిపింపవయ్యెను. అందుకు లింగాయతు లంద

మను లింగములు లేకున్న బ్రతుకఁజాల మని తమ గురువుతో ననిరి. అందుకు గురువు "ప్రభువుగారిని ప్రార్థింపుఁ" డనియెను. వెంటనే వారందఱును సాష్టాంగ నమస్కారము లాచరించి ప్రార్థించి ప్రభువు ఆజ్ఞ చొప్పున మరల స్నానములు చేసి రాఁగా లింగములు పెట్టినచోటనే యుండెను. అప్పుడు లింగాయతు లందఱును మరియొకమారు ప్రభువుపాదములమీఁద వ్రాలి కొనియాడిరి.

ఒకప్పుడు హైదరాబాదు నవాబగు నైజామాలిఖాఁ నిజాముల్ ముల్కు, ప్రభువును హైదరాబాదు రమ్మని కోరుచు, "అట్లు వచ్చినచో సంవత్సరమునకు ఏడువేల యాదాయము వచ్చు జాగీ రిచ్చెదను" అని వర్తమానము చేసెను. దానిమీఁద ప్రభువు "బైరాగిని నేను జాగీ రేమి చేసికొందును" అంతకంటె మీ ప్రభువే యిక్కడకు వచ్చుట మంచిది. అట్లు వచ్చినచో మాదర్శనము కానే వచ్చును. ఈశ్వరుఁ డింతవరకే మీప్రభువున కొక రాజ్యము నిచ్చియున్నాఁడు. ఇక్కడకు వచ్చినచో నేను మరియొక రాజ్యము నీయఁగలను" అని కబురు తెచ్చిన వానితో ననెను. అది విని నిజాము లజ్జించెను.

హైదరాబాదులో నొకపండితుఁ డుండెను. అతఁడు షట్ఛాస్త్రపండితుఁడు. వాదకౌశలము కలవాఁడు. కాని పరుషభాషి. పరశ్రేయస్సు సహింపలేనివాఁడు. అతఁడు ప్రభువు చదువురాని మూర్ఖుఁడనీ, అతనిమాటలు విని అందఱును కులభ్రష్టు లగుచున్నారనీ నిందించుచుండెను. తుద కాతఁడు కల్యాణిగ్రామమునకే వెళ్లి గ్రామమునందలి బ్రాహ్మణుల నందరిని చూచుచు "మీరు భ్రష్టునిమాటలు విని భ్రష్టులైపోవుచున్నారు. మీప్రభువు నాతో శాస్త్రార్థము చేసి నెగ్గఁగలఁడా?" అని డంభములు పలుకసాగెను. ఇది ప్రభువు విని మందహాసము చేసి యూరకుండెను.

ఇట్లుండఁగా ఆపండితుఁ డొకనాఁడు క్షురకర్మ చేయించుకొనఁ దలఁచి మంగలిని బిలిచి చెంబుతో నీళ్లు చెంత నుంచుకొని కూర్చుండెను. నీళ్లు చల్లఁగా నుండుట చూచి మంగలి "ఏమి? నీళ్లు చల్లఁగా నున్నవే, జఠరాగ్నితో వెచ్చచేయరాదా?" అని యడిగెను. అందుకు పండితుఁడు ఆయగ్ని తీక్ష్ణముగా లేదు" అని బదులు చెప్పఁగా మంగలి "జఠరాగ్నితో చెంబులోనిజలము వెచ్చచేయఁజాలనివాఁడవు మాప్రభువుతో నెట్లు వాదింపఁగల" వని టొకాయించి యడిగెను. అది విని పండితుఁడు మండిపడి "శ్రీరంగనీతులు చెప్పుచున్నావే, ఏదీ నీ వట్లు వెచ్చఁజేయుము" అనఁగా మంగలి లేచి నిలువఁగా వానికడుపులో ఒక తేజస్సు కనఁబడి చెంబులోని నీళ్లు కళకళ మరుఁగసాగెను. అది చూచి పండితుఁడు విభ్రమము చెంది "మంగలియే యింత ప్రభావము కలవాఁడై యున్నాఁడు. ప్రభు వెంతటివాఁడో" అని భయభ్రాంతుఁడై మంగలిద్వారా ప్రభువును దర్శించి క్షమింప వేఁడి అనుగ్రహమును సంపాదించుకొని వెడలిపోయెను.

ఒకప్పుడు శ్రీశృంగేరిజగద్గురువు హైదరాబాదురాజ్యమున సంచారము చేయుచుండి కల్యాణినగరమున కరిగి ప్రభువును దర్శింపఁగోరెను. ఈసంగతి జగద్గురువు

ఏజంటు ప్రభువునకు తెలియఁజేసెను. అంతట ప్రభువు జగద్గురువు నంతటివారు తమ గ్రామమునకు వచ్చుట తన యదృష్ట మని చెప్పుచు జగద్గురువును గొప్పఁగా సన్మానించుటకు సంకల్పించుకొనియెను. జగద్గురువున కిచ్చుటకు ఏడువేలరూపాయలు వెచ్చించి రత్నములు పొదిగిన సువర్ణహార మొకటి చేయించెను. లక్షరూపాయలు వెచ్చించి రత్నములతో బంగారుకిరీటమును చేయించెను. జగద్గురువున కర్పించుటకు ఒకయేనుఁగు, మంచిజాతిగుఱ్ఱములు పది, ఒకపాలకీ, ఒక మేనా, ఇరువది యైదు పాడియావులు తెప్పించెను. మంచివస్త్రములును తయారుచేయించెను. వారి సిబ్బందికి ఇచ్చుటకుఁగూడ వస్త్రాభరణములను తయారు చేయించెను. జగద్గురువు విడియుట కొక మంచి భవంతిని ఏర్పఱచి, సంతర్పణకు అవసరమగు సామగ్రి కూడ సిద్ధము చేయించెను.

మాఘశుద్ధ ౭ నాఁడు జగద్గురువు హుమ్నాబాదు ప్రవేశించెను. అచ్చట వారికంపరికిని ప్రభువు పరివారములోనివా రగు శంకరరావు, విఠల్‌రావు మున్నగు వారు జగద్గురువునకు స్వాగత మిచ్చి ఆతిథ్య మిచ్చిరి. ఈసంగతి కల్యాణిలో తెలిసెను. అష్టమినాఁడు తెల్లవారునప్పటికి ఊరంతయు రంగవల్లికలతోఁడను, తోరణముల తోఁడను, పతాకములతోఁడను, పూలదండలతోఁడను అలంకరింపఁబడెను.

అక్కడ జగద్గురువు విశేషపరివారముతో బయలుదేరెను. ఇది తెలిసి ప్రభువు తాత్యామహారాజును, ఆతని యిరువురు కుమారులను ఏనుఁగులు, గుఱ్ఱములు, సిపాయీలు మున్నగు వైభవముతోడను జగద్గురువు నెదుర్కొనుటకు కాలినడకతో పంపెను.

యుక్తసమయమున తాత్యామహారాజు రెండువేలరూపాయల పాదపూజ చేసి తనకుమాళ్లను జగద్గురువు పాదములమీఁదఁ బడవైచెను. జగద్గురువు ఆబిడ్డల నెత్తి ముద్దు పెట్టుకొని, తన మెడలో నున్న రెండు ముత్యాలహారములను వారి మెడలో వేసి ఆశీర్వదించితాత్యామహారాజునకుఫలములు, మంత్రాక్షతలు నిచ్చెను. మరల నందఱును అక్కడనుండి ముందుకు సాగిరి.

ఈవార్త విని ప్రభువు రెండుయేనుఁగులను అంబారీలతో అలంకరింపించి, సిపాయీలు గుఱ్ఱములపై నెక్కి వెంట రాఁగా మంగళవాద్యములు చెలంగు చుండ రెండువేల బ్రాహ్మణులతో కాలినడకను జగద్గురువును ఎదుర్కొనుటకు బయలుదేరెను. ఉభయుల వెంటను లక్షజనము ఆనందముతో వచ్చిరి.

ప్రభువును, జగద్గురువును అన్యోన్యము సమీపించిన వెంటనే హరాకు శబ్దము లుచ్చరింపఁబడెను. జయజయధ్వానములు మిన్నుముట్టెను. తుపాకులు మ్రోఁగెను.

జగద్గురువు పాలకి దిగిన వెంటనే ప్రభువు పాదాభివందనము చేయఁబోఁగా జగద్గురువు వారించి లేవనెత్తి కౌఁగిలించుకొనెను. ఇరువురి నేత్రములయందును ఆనందబాష్పములు ధారలు గట్టెను.

జగద్గురువు తనతోపాటు తన పాలకీలో కూర్చుండవలసినదని అనేకవిధములఁ బలవంతపరిచెను; గాని ప్రభువు అంగీకరింపక వినయముతో జవాబు చెప్పి జగద్గురువు పాలకి స్వయముగా నెత్తెను. అది చూచి తాత్యామహారాజు, విఠలరావు, దయాళు దాసు, రామశాస్త్రి మున్నగువారును పాలకి మోసిరి.

జగద్గురువు కల్యాణి ప్రవేశించెను. ప్రౌఢ లంచఱులు ఎదురు వచ్చి కొని పోయిరి. స్త్రీలు ప్రతియింటి వద్దను మంగళహారతు లిచ్చిరి.

పాలకి దత్తగురుపీఠసన్నిధిని దింపఁబడెను. ప్రభువు జగద్గురువును స్వయముగా సింహాసనమునఁ గూర్చుండఁజేసెను. అంతట తాత్యాసాహెబు జగద్గురువునకు పాద పూజ చేసి, షోడశోపచారపూజయుఁ గావించి, కిరీటము హారములు, వస్త్రములు, మేనా, పాలకీలు మున్నగునవి అన్నియు సమర్పించెను. పంచభక్ష్యపరమాన్నములతో తృప్తులను గావించెను. పిదప పదివేల బ్రాహ్మణులకు సమారాధనము చేసి ఒక్కొక్క రూపాయ దక్షిణగూడ యిచ్చెను.

ఇట్లు చాలదినములు పూజలు జరిగెను. పిదప జగద్గురువు ప్రభువునకు విలువగల ముత్యాలకంఠహారము, ఒక ఏనుఁగు, నాలుగు గుఱ్ఱములు, ఒక మేనా, మంచి శాలువలు మున్నగునవి ఇచ్చి సత్కరించెను.

పిదప జగద్గురువు బయలుదేరి వెడలిపోయెను. అప్పుడు గూడ ప్రభువు జగ ద్గురువు వచ్చినప్పుడువలెనే మహోత్సవముచేసి రెండు క్రోసులదూరము వెంట వెళ్లి సాగనంపెను.

బేదరగ్రామమున లక్ష్మణసాహా అను నొకపకీ రుండెను. ఇతఁడు చాల గొప్ప వాఁడే; గాని ముసల్మానులు కొందరు మాణిక్య ప్రభువును గొలుచుచుండుటచూచి సహింపలేక పోయెను. అందుచే నాతఁడు కొందరు దుండగీండ్రను ఉసికొల్పి ప్రభుభక్తులను హింసింపఁదొడఁగెను. ప్రభువుపీఠమునుగూడ పాడుచేయించి కొం దరు శిష్యులనుగూడ చంపించెను. పైఁగా హైదరాబాదులో నున్న అతనిశిష్యులు నవాబుతో చెప్పి బేదరగ్రామమునందలి ప్రభుశిష్యుల నందరిని హింసించి మిగిలి యున్నపీఠమును పూర్తిగా పాడుచేయించునట్లు ఆజ్ఞ పుట్టించిరి.

కాని యిది ప్రారంభమైనవెంటనే నవాబు ఉంపుడుకత్తెలకును, భార్యలకును ఏకకాలమున దారుణమైన శూల ప్రారంభమయ్యెను. ఎట్టి వైద్యు లెట్టి చికిత్సలు చేసినను ప్రయోజనము లేకపోఁగా నవాబు ఏమియు తోఁచక విచారింపసాగెను.

అది చూచి ఒక బ్రాహ్మణమంత్రి సాహసించి, "యిది యంతయు ప్రభువు శిష్యులయెడలను, పీఠమునెడలను చేయించిన అత్యాచారములకు ఫల మని చెప్పెను. అది విని ఔనని తలంచి నవాబు వెంటనే ఆకల్లోలము నాపి బేదరు గ్రామమునకు వెళ్లి ప్రభుశిష్యులను తృప్తిపఱచి ముసల్మానులను శిక్షించి, పీఠ

మునకు పూజాదికము చేయించెను. వెంటనే అంతఃపుర స్త్రీలకు సకల బాధలును పోయి సుఖము కలిగెను.

ప్రభువునకు హిందువులవలెనే అనేక మహమ్మదీయులుగూడ శిష్యులై యుండి తీర్థప్రసాదములు స్వీకరించుచు, హైందవసాంప్రదాయముల ననుసరించియే ఈశ్వర పూజ చేయుచుండిరి. అది చూచి బేదరుననవాబు మున్నగు పెద్దపెద్ద మహమ్మదీయులు చాల కటకటంబడి మహమ్మదీయ లనేకులు ప్రభువు నాశ్రయించి హిందువులై పోవుచున్నదానికి ఫలముగా ప్రభువునే సపరివారముగా మహమ్మదీయ మతమునం గలిపి వేయవలెనని నిశ్చయించుకొనిరి. ఈనిశ్చయముతో వారొకనాడు వినయము నటించుచు ప్రభువుసన్నిధికిం బోయి "ప్రభూ! మీవారివలెనే మావారును పెక్కుమంది మీపాదముల నాశ్రయించి మీ శిష్యులై తరించు చున్నారు. అది మాకు చాల ఆనందకారణముగా నున్నది; గావున మాకును మీపాదము లాశ్రయింపం గోరిక కలదు. మాకోరికను తాము వ్యర్థము చేయరని నమ్ముచున్నాము; కాంబట్టి దయయుంచి రేపు తాము సపరివారముగా మా యింటికి విందుకు దయచేయంగోరుచున్నాము" అని ప్రార్థించిరి. ఇది విని శిష్యులందరును నిర్విణ్ణులైరి; గాని ప్రభువు మాత్రము తొణకక వెంటనే "తప్పక వచ్చెదము. అంతయు సిద్ధము చేయవచ్చు" నని చెప్పెను. మహమ్మదీయు లత్యానందముతో మరల నమస్కారములు చేసి వెడలిపోయిరి.

ప్రభువు శిష్యులలో అనేకులు తలక్రిందులై పోయిరి. చాటుచాటున కొందఱు ప్రభువును గూడ "తొందర యెక్కువ" అని విసుర్కింపసాగిరి.

అంతయు సిద్ధమయ్యెను. మహమ్మదీయులు మంగళవాద్యములతో వచ్చి ఆహ్వానించిరి. అంతట ప్రభువు "మాతో తురకలవిందుకు రాందలంచినవా రందఱును రండు" అని పిలిచెను.

అనేకుల కిది ప్రాణము పోసెను. దీనితో సంశయాత్ములు వెనుక నుండి పోయిరి. వెంకమ్మ, చిమ్నా, తాత్యామహారాజు, బాబాసాహేబు మున్నగువారు సర్వసిద్ధముగ ప్రభువుతో బయలుదేరిరి.

మహమ్మదీయులు ప్రభువును సగౌరవముగా లోపలకుం గొనిపోయి, భోజన శాలలో సింహాసనమునం గూర్చుండంబెట్టిరి. సేవకులు సారాయము నింపిన కూజాలును, ఆవులు, మేకలు మున్నగువాని మాంసములతో తయారు చేయంబడిన వంటకములు గల పళ్లెములును చలవచేసిన బట్టలు కప్పి ఒక్కొకరిముందే ఉంచిరి.

అంతయు సిద్ధమైనది. మహమ్మదీయులు బిస్మిల్లా అనిరి. ప్రభువు, తదంతరంగశిష్యులు మందహాసముతో పదార్థములమీంది బట్టలు తొలంగించిరి.

చూడంగా పళ్లెములలో మాంసపువంటకములకు బదులు గులాబి, మల్లె మున్నగు పుష్పములును, కూజాలలో సారాయములకు బదులు పాలును ఉండెను,

అది చూచి మహమ్మదీయు లందఱును తెల్లఁబోయి అపరాధమును క్షమింపఁగోరి వెంటనే ప్రభువుపాదములు పట్టిరి.

ప్రభువు అంతరంగశిష్యులలో ప్రముఖురా లగు వెంకమ్మ ప్రభువువలన రెండువరములు పొందియుండెను. మొదటి వరము ప్రభువుకంటె ముందుగ తాను సమాధి గావలె నని రెండవది ప్రభువు స్వహస్తములతో తనను సమాధి చేయవలె నని.

మార్గశీర్ష శు ౭ నాఁడు శ్రీదత్తగురుజయంత్యుత్సవము ప్రారంభమైనది. పౌర్ణమినాఁడు జయంతి. నాఁటి ఉదయము వెంకమ్మ "ఓం నమో మాణిక్యాయ" అని మూఁడుమార్లుచ్చరించుచు ప్రభుపు పాదములమీఁద తననుదుటఁగొని ప్రాణములు విడిచెను.

వెంటనే ప్రభువు సెలవు చొప్పున పుష్పవిమానము తయారుచేయఁబడెను. ఇరువురు అంతరంగశిష్యు లామెకు స్నానము చేయించిరి. తాత్యామహారాజు భార్య విలువనైన చీర కట్టి గంధము మున్నగువానితో నలంకరించెను. ప్రభువు గారి నిర్మాల్య మామెయొడిలో నుంచిరి. పిదప నెనమండుగురు బ్రాహ్మణులు విమానము మోసిరి అది శేషాళదాసు తల్లి సమాధివద్ద దింపఁబడెను. వెంటనే ప్రభువు స్వయముగా వెంకమ్మకు ధూపదీపాదికమగు పూజచేసి శ్రీగురుదత్త నామము స్మరించుచు ఆమెను సమాధిలో నుంచిరి.

అప్పు డక్కడ చేరియున్న వేలకొలఁది భక్తులు అనేకవిధముల వెంకమ్మను కొనియాడిరి.

పిదప ప్రభువు తల్లి, అన్నగారు, తమ్ముఁడు మున్నగువారు సిద్ధి పొందిరి. అప్పుడు గూడ మహోత్సవములు జరిగెను.

ఇట్లు ప్రభువు నలువదిమైదు సంవత్సరములు ఈశ్వరలీలలను ప్రదర్శించి అప్పుడు సిద్ధిపొందిరి.

మార్గశీర్ష శు ౭ నాఁడు శ్రీదత్తగురు జయంత్యుత్సవము ప్రారంభమయ్యెను. ప్రభువు అపుడు "నాకును మీకును ఏకాదశితో భౌతికసంబంధము తీరిపోఁ గలదు. నానిమిత్తము మీ రెవరు నెంతమాత్రము విచారింపఁగూడదు. మీ రం దఱు నిఁక ముందు యథాపూర్వకముగ శ్రీదత్తగురుపూజాపరులై యుండవలెను. నన్ను మీరు నలుగురును మాత్రమే అతిరహస్యముగా సమాధిస్థునిగా చేసి తరువాత నాలుగుదినముల యనంతరమే అనఁగా జయంత్యుత్సవములు పూ ర్తిగా ముగిసిన పిదపనే యీవార్త అందఱికి నెఱిఁగింపవలెను. అట్లుగాక వెంటనే ప్రకటించినచో చాల చిక్కులు రాఁగలవు." అని యిట్లు బాపాచార్యునకును

నారాయణదీక్షితునకును మరియిద్దరికిని సర్వవిషయములును బోధించి "రాత్రుల యందు మాత్రమే రహస్యముగా పనిచేసి మీరు సమాధి తయారుచేయుఁ" డని యాజ్ఞాపించెను.

అనుకొనిన దశమి వచ్చినది. నాఁడు అతిరహస్యముగా బాపాచార్యులు మున్నగు ఆంతరంగికులు పదిమంది బ్రాహ్మణవిద్వాంసులను కొనిపోయి ప్రభువునకు సంస్కారము నిమిత్తము సన్న్యాస మిప్పించిరి. అప్పుడు చేయవలసిన పూజాదిక మంతయు అప్పాసాహేబు చేసెను. ఆంతరంగికు లందఱును ప్రభువునకు సాష్టాంగ నమస్కారములు గావించి దుఃఖింపసాగిరి.

అపుడు ప్రభువు ఇట్లు చెప్పెను. "ఇది మునుపటి సమాధుల వంటిది కాదు. చివరిది. నాయెడనున్న ప్రేమాదరాదులచే నెవరైన నాయీ సమాధిని భంగపఱచి నచో వారి వంశములు నశించిపోవును. పౌర్ణమివరకును యథారీతిగా సంతర్ప ణలు మున్నగునవి జరుపవలెను. అంతవరకును నాసమాధిని గురించి యెవరికిని తెలియనీయరాదు. నేఁటికి పదవనాఁడు అప్పాసాహేబు సింహాసన మెక్కి కొలువు తీరవలెను."

ఇది యైనపిదప ప్రభువు సమాధిగృహమున ప్రవేశించెను. అచ్చట నేతి తో వెలిఁగింపఁబడిన రెండు నందాదీపము లుండెను. గురుచరిత్ర గూడ నచ్చట నుండెను. పిదప అప్పాసాహేబు ప్రభువునకు గంధముపూసి పూలదండలు వేసెను. పూజమున్నగునవన్నియు యథావిధిగా ముగిసినవి. ఆసమయమున ప్రభువు సూర్య మండలమువలె విశేషతేజస్సుతో ప్రకాశించెను. అప్పుడు ప్రభువు అందఱికిని తీర్థ ప్రసాదము లిచ్చి తన కంఠమునందలి పుష్పహారమును అప్పాసాహేబుకంఠమున నుంచెను.

ఇది యంతయు నైనపిదప ఆంతరంగికు లందఱును "అవధూతచింతన శ్రీ గురుదత్త"అని ఉచ్చస్వరముతో నుచ్చరించుచుండ ప్రభువు నేత్రములు, పాయూప స్థలు—ఇట్లు నవద్వారములు బంధించుకొనియెను. అపుడు ఘంటానాదము బయలు వెడలెను. వెంటనే అందఱును బయటకు వచ్చి సమాధిద్వారములు బంధించి, దుఃఖభరితు లైపోయిరి.

"జయజయ శ్రీభక్తకార్యకల్పద్రుమా, గురుసార్వభౌమా, శ్రీమద్రాజాధి రాజయోగిరాజమహారాజత్రిభువనానంద, అద్వైత అభేదనిరంజన, నిర్గుణ, నిరా లంబపరిపూర్ణ, సదోదితసకలమతస్థాపిత శ్రీసద్గురు మాణిక్యప్రభూ, మహా రాజకీ జై."

---

# శ్రీ మహాభక్తవిజయము

## *పంచమ భాగము

### భక్తుల చరిత్ర



## కరమైతీబాయి

శ్యామసుందరుని సుందరముఖారవిందమందహాసమందును, ఆతని మధుర మురళీనాదమందును మునిఁగిన మనస్సు గలవారికి ప్రాపంచిక విషయభోగము లన్నియుఁ దుచ్ఛములుగఁ దోఁచుచుండును. భగవంతునకు దూరమొనర్చువిషయము లన్నియును విషతుల్యములే. ఈ సాంసారికవిషయములే భగవద్భక్తికి సహాయకము లగునేని అవన్నియు భగవత్పూజాసామగ్రులే కాఁగలవు. వాటివలన సుఖమే లభించుచుండును. అందుకనియే భగవద్భక్తులు తమభక్తికి అనుకూలములుగ నుండువాటిని గ్రహించి, ప్రతిబంధకముగ నుండువిషయములను సర్వదా సర్వథా పరిత్యాగము చేయుచుందురు. సాంసారిక విషయములను గ్రహించువారు అవి భగవత్పూజాసామగ్రి యను భావముతో గ్రహించుచుందురు. వాటిని త్యజించువారు అవి భక్తివిరోధు లనుభావముతోఁ దిత్యజించుచుందురు. మొత్తముమీఁద నంపదలును విషయములను వదలవలసినదే. భోగాపేక్షతోఁగాక భగవత్సేవాకైంకర్యములకై వాటిని గ్రహింపవచ్చును. నిజమునకుఁ దనసుగూడ భగవత్పాదారవిందముల కర్పించుకొన్నవానికి భోగ్యవస్తు వేమి యుండఁగలదు? ఆతఁడును భగవంతునివాఁడే, ఆ భోగ్యవస్తువులును భగవంతునవే. భగవంతున కాత్మసమర్పణము కావించుటకు విఘ్నరూపములగువాని నన్నిటిని వదలుటయే భక్తిశాస్త్రము ననుసరించి ధర్మము కాఁగలదు. ఇట్లే మన కరమైతీబాయికూడ పతిని, పతిగృహమును వదలి బృందావనమునకుఁ బ్రయాణమయ్యెను.

జయపురరాజ్యములో ఖండేలా యను సంస్థానము కలదు. దానిలో పరశురాముఁడనువాఁడు కులపురోహితులు. మన కరమైతీబాయి ఆతని పుత్రిక. ఆమె సద్గుణవతి. పూర్వసంస్కారవశమున నామెకు బాల్యమునుండియు బాలగోపాలుని

*శ్రీకుందుర్తి వేంకటనరసయ్యగారు వ్రాసినది.

యందు భక్తి యధికము. నిరంతర మామె శ్రీకృష్ణనామస్మరణము కావించుచు నేకాంతస్థలమున ధ్యానమునుగూడ చేయుచుండెడిది. ధ్యానసమయమున నొక్కొక్కప్పు డామె "హానాథా! హానాథా!" యని పిలుచుచుండెడిది. నేత్రములనుండి ఆనందబాష్పములు ప్రవహించుచుండెడివి. రోమాంచము, గద్గదికాది సాత్త్వికభావములన్నియు నామెయందు వ్యక్తమగుచుండెడివి. ఒక్కొక్కప్పు డేడ్చుచుండుటయు ఒక్కొక్కసమయమున నవ్వుటయు,మఱియొకయెడ సుచైస్స్వరమునఁ గీర్తించుచుండన్నయురాలయ్యెడిది. బాల్యముననే యిట్టి భగవత్ప్రేమను గాంచి తల్లిదండ్రులును, ఇరుగుపొరుగువారును మిక్కిలి యానందపడుచుండిరి. ఇట్లుండఁగనే ఆమె వివాహయోగ్య యయ్యెను. తల్లిదండ్రులు సంబంధమును వెదకుచుండిరి. కాని యిది యంతయు కరమైతీబాయికి రుచింపలేదు. లజ్జావశమున నామె తల్లిదండ్రులతో నేమియును జెప్పలేదు. కాని యామెకు విషయ చర్చ విషముగఁ దోఁచుచుండెను. ఆమె కిష్టము లేకున్నను వివాహమయ్యెను. కాని ఆమె వివాహమునకుఁబూర్వమే కాదు, కాదు పూర్వజన్మయందే తనను భగవంతున కర్పించుకొనియుండెను. భగవంతుని వస్తువుపై నన్యు లధికారము వహించుట నామె యెట్లు సహింపఁగలదు?

ఆమె సంసారమునకావల దివ్యప్రేమ సామ్రాజ్యమున కధీశ్వరుఁడును, నిత్య నవీన చిరకుమార సౌందర్యరాశియగు శ్రీకృష్ణచంద్రుని, సచ్చిదానందఘనమును వరించి, రాత్రింబవళ్లు ఆతనినే చింతించుచుండెను. కొన్ని దినము లిట్లు గడువఁగానే అత్తవారు ఒకానొకదినమున నామెను గొనిపోవ వచ్చిరి. ఆమె అత్తవారింటిలోనివారు భగవద్విముఖులు. వారికి వైష్ణవులన్నను, సాధువులన్నను మిక్కిలి యేవగింపు. అచ్చట తన నిజహృదయాధినాథుఁడగు శ్యామసుందర పదారవిందములను సేవింప వీలుండదనియు, శరీరమును మనస్సును విషయసేవనములో లగ్నము చేయవలసివచ్చుననియు గ్రహించి, అమితముగఁ బరితాపము పడి ఒంటరిగ నున్న సమయములో భగవంతుని స్మరించి స్మరించి, భగవానునికొఱకు బిగ్గఱగ నేడ్చుచు నిట్లు ప్రార్థించినది:—"నాథా! ఈ విపత్సమయమున నీవు నన్ను రక్షింపవలయును. నేఁటినుండి నీదాసి బలవంతముగ విషయములకు దాస్యము చేయవలసినదేనా? నీవ్రజధామమునకుఁ జేరి అచ్చటి పవిత్రధూళిని నాశిరస్సున ధరింపఁగలుగునట్లు నీ వేదైన నుపాయమును నాకు జూపింపవా?"

ఇంటిలో తల్లిదండ్రులు మొదలగువారు కరమైతిని అత్తవారింటికిఁ బంపుటకుఁ బ్రయత్నము చేయుచునేయుండిరి. కాని యామె ప్రయత్నము వేఱు. అలసి యలసి అందఱును నిద్రించిరి. కాని కరమైతికి నిద్ర యెక్కడిది? ఆమె యొంటరిగఁ గూర్చుండి భగవంతుని బ్రార్థింపుచుండెను, ఇట్లు ప్రార్థింపుచుండఁగా నామెహృదయమున నిట్లు

స్ఫురించెను:—"భగవద్విముఖులగు గావించు నీవిషయసుఖములను సేవింపనేల? అట్టి విషయసుఖముల కంగీకరించుట మూర్ఖతయే యైనను గానిండు. విషయసుఖములను వీడి నాకడకు వచ్చుటయే శ్రేయస్కరము." ఇట్లు స్ఫురింపఁగా నామె యర్ధరాత్రమునఁనే లేచి, అంధకారబంధురమగు నాచీఁకటిలో, నిశ్శబ్దముగ నిశ్చయచిత్తముతో నొంటరిగా నింటినుండి బయలుదేరెను. ప్రాణప్రియుఁడగు భగవంతుని భక్తిచే మత్తులైనవారికి భయ ముండనేరదు. ఇదివఱ కామె యెప్పుటికిని బయలుదేఱనే లేదు. ఒంటరిపాటెఱుఁగనిది. కాని నేఁడు నిశీథసమయమున సమస్తమును మఱచి పరువిడ నారంభించెను. వెంట నెవరును లేరు. వెంటనున్నవాఁ డొక్కఁడే. శరణాగతుల యండనుండి వారిని నిరంతరము రక్షించుచుండు శ్యామసుందరుఁ డొక్కఁడే యామెకు సంగడికాఁడు.

భగవత్ప్రేమోన్మత్తయగు కరమైతి అంధకారమును ఛేదించుకొనుచు వెళ్లుచుండెను. ఆమెకు తా నెవరో, ఎచ్చటికి వెళ్లుచున్నదియో యీస్పృహయే లేదు. ఆమె అదేపనిగఁ బరువిడుచుండెను. రాత్రియంతయు నిట్లు పరువిడుచు నెంత దూరము వెళ్లినదియో గుర్తులేదు. ప్రాతఃకాలముగూడ నైనది. ఆమె యింకను నిద్రాహారములను మఱచి అదేపనిగఁ బరువిడుచుండెను.

ఇచ్చట తెల్లవారఁగానే కరమైతియొక్క తల్లి చూడఁగాఁ దనకూఁతురు ఇంట లేదు. ఆమె దుఃఖించుచుఁ దనపతియగు పరశురామునికడకు పోయి తనదుఃఖకారణము నంతయు జెప్పుకొనెను. పరశురామునకును మిక్కిలి దుఃఖము కలిగెను. ఒక్కయెడ పుత్రికాప్రేమ, ఇంకొకయెడ లోకాపవాదభీతి. తనకూఁతురు పరమపవిత్రయను సంగతి ఆతనికి బాగుగాఁ దెలియును. ఆమె విషయవిరాగమువలనను, భగవదనురాగకారణముననను నెక్కడికో వెళ్లిపోయిన దనుసంగతియుఁ దెలియును. కాని గ్రామస్థు లామెమీఁద నెన్నియపవాదములు పెట్టుదురో యని ఆతఁడు చాల భయపడుచుండెను. ఈయాలోచనలచే నాతఁడు మిక్కిలి దుఃఖితుఁడై తనకు యజమానియగు రాజుదగ్గఱకుఁ బోయెను. రాజు తనపురోహితుని దుఃఖమునకు సహానుభూతిని బ్రకటించుచు నాల్గువైపులకును పనభటులను గుఱ్ఱములమీఁద వెదుకుటకుఁ బంపెను. కరమైతి వెళ్లుచున్న మార్గమునకుఁగూడ ఇద్దరు భటులు వెళ్లిరి. వారు గుఱ్ఱములమీఁద నతివేగముగ వచ్చుచుండిరి. దూరమునుండి గుఱ్ఱముల డెక్కలచప్పుడు వినఁబడుచుండెను. అప్పుడు కరమైతి బాహ్యజ్ఞానములోనికి వచ్చెను. మొత్తముమీఁద వీరు తనకొఱకే వచ్చుచున్నారని ఆమె గ్రహించినది. రాజస్థానమంతయు మైదానము. ఆ విశాలమైదానములో నామె దాఁగుకొను టెక్కడ? అచ్చట కొండలుగాని, కొండగుహలుగాని, పొదలుగాని వృక్షములుగాని

లేవు. ఇంతలో నొకయాలోచన తోఁచెను. ఆప్రక్కనే ఒకఒంటె చచ్చిపడియుండెను. నక్కలు, కుక్కలు, కాకులు, గ్రద్దలు దానిపొట్టలోని మాంసమును బూర్తిగా లాగి తినివేసెను. దానిపొట్ట యొకగుహావలె నుండెను. కరమైతి భయముపడక ఆదుర్గంధయుక్తమగు నాయొంటెయొక్క అస్థిపంజరములో దాగుకొనెను. దానిలో మానవుఁడు సహింపఁజాలనంతదుర్గంధ ముండెను. ఈక్రుళ్లువాసన ఆమెకు విషయ వాసనకంటె నపాయకరముగను, నసహ్యకరముగను దోఁచనేలేదు. ఆభటు లాదిక్కునకే వచ్చుచుండిరి గాని యొంటెపొట్టలో దాగుకొనిన యామెను వారు చూడనే లేదు. తీవ్రదుర్గంధముచే నామె దానిలో నిలువఁజాలకుండెను. ఆమె అట్లే భగవన్నామమును జేయుచు గన్నులు మూసికొని బృందావనవిహారుఁడగు శ్రీకృష్ణచంద్రుని మాత్రమే ధ్యానించుచుండెను. ఆసమయముననాయొంటె పొట్టలోనుండి సుగంధము బయలుదేరెను. తులసీమాలికాగంధముకూడ వీఁచుచుండెను. ఆమె భగవత్సాన్నిధ్యమును గల్పించుకొనుటచే భగవంతుఁడు ధరించిన పుష్పములయొక్కయు, నవతులసీమాలికలయొక్కయు, ఆతఁ డలఁదుకొన్న కస్తూరీచందనాగురాది సుగంధద్రవ్యములయొక్కయు దివ్యసౌరభము ఆమె ఘ్రాణములకుఁ దగులుచుండెను. ఏమహామహుని కృపచే విష మమృతముగను, అగ్ని శీతలముగను నైనదో అట్టివాని కృపచే దుర్గంధము సుగంధమగుటలో నాశ్చర్య మేమున్నది? ఈవిధముగ నిద్రాహారములు లేకయే కరమైతి మూఁడుదినములువఱ కాయొంటెపొట్టలోనే ధ్యానమగ్నయై పడియుండెను. నాల్గవదినమున నచ్చటనుండి బయలుదేరెను. కొంచెముదూరము పోఁగానే తోడుచిక్కెను. ఆతోడుతో నామె ముందుగా హరిద్వారము చేరి అచ్చట భగవతీ భాగీరథీస్నానము చేసి, ఆపిమ్మట బయలుదేరి బాలగోపాలుని లీలాభూమియగు బృందావనమునకుఁ జేరెను. ఆరోజులలో బృందావనము ఇప్పటివలె పట్టణముకాదు. అదివిరాగులగు వైష్ణవసాధువులుండు కేంద్రము. ఆరోజులలో నచ్చట నెటుగాంచినను భగవత్ప్రేమోన్మత్తులు కనఁబడుచుండెడువారు. అందువలన నది అతిపవిత్రముగ నుండెడిది. అందువలన భక్తులందఱదృష్టి ఆక్షేత్రము మీఁదనే యుండెడిది.

ఆమె బృందావనము చేరఁగానే ఆనందసాగరములో మునిఁగిపోయెను. ఆమె బృందారణ్యములోఁ గల బ్రహ్మకుండమున నివసించుచుండెడిది. ప్రేమసింధువు ఉప్పొంగుటచే నామె జీవనము నిత్య అపారప్రేమప్రవాహములోఁ బడి కొట్టుకొని పోవుచుండెను.

ఇచ్చట పరశురాముఁడు కుమార్తెకొఱకై యెంతగా వెదకించినను విఫలుఁడు కాఁగా, వెదకుచు వెదకుచు బృందావనమునకు వచ్చెను. బృందావనములో

మాత్రము కరమైతిజాడ యెట్లు తెలియఁగలదు? తనభక్తిని లోకమునకుఁ జూపుట కామెకు డాంబికభక్తి లేదు. అట్లు లోకమునకుఁ జూపియుండిన నామె ప్రసిద్ధిగ నుండెడిదే. కాని ఆమె ప్రియతముని ప్రేమలో మునిఁగి యొంటరిగా నొక యరణ్యములో నివసించుచుండెడిది. ఒకదినమునఁ బరశురాముఁడు పెద్దచెట్టు నెక్కి నలువైపులను జూడఁగా బ్రహ్మకుండము వద్దఁ నొక్క విరాగిణిని గాంచి, వెంటనే దిగి అచ్చటకుఁ బరువిడెను. పోయిచూడఁగా కరమైతిబాయి ధ్యానసంమగ్నయై సాధు వేషములోఁ గూర్చుండియుండెను. ఆమెముఖమందు నిర్మల శీతల భక్తితేజస్సు గోచరించుచుండెను. నేత్రములనుండి ప్రేమాశ్రువులు అనవరతము ప్రవహించుచుండెను. పరశురాముఁడు పుత్రియొక్క యీస్థితిని గాంచి హర్షశోకములలో మునిఁగిపోయెను. కుమార్తెయొక్క బాహ్యవేషమును జూచిన దుఃఖమును, భక్తిప్రేమలను గాంచిన హర్షమును గలుగుచుండెను. తానట్టిభక్తురాలికిఁ తండ్రియైనందుఁ కను ధన్యుఁడ ననుకొనుచుండెను. అట్టి బిడ్డలను గన్నవారి జన్మమేకదా సార్థక జన్మము!

పరశురాముఁ డక్కడ కూర్చుండి గంటయైనది. అతఁడామె ప్రేమస్థితిని గాంచి యేమియుఁదోఁచనివాఁ డయ్యెను. కరమైతి యింకను లేవనేలేదు. చివర కాతఁ డామెను గదలించి, యూపి స్పృహలోనికిఁదెచ్చి, అనునయ వినయములతో నింటికివచ్చి యచ్చటనే భజన చేసికొనవలసినదని కోరెను. కరమైతి యిట్లనెను:— "నాయనా! ఇక్కడికి వచ్చినవారెవరు తిరిగి వెళ్లినారు? నే నాతని ప్రేమసాగరములో మునిఁగి నన్ను నేనే కోల్పోయినాను. నేను బ్రతికియుండియుఁ జచ్చినదాననే. ఈశవ మిచ్చటనుండి యెట్లు లేవఁగలదు? మీరింటికి వెళ్లి మాతల్లిగారితోఁగూడి శ్రీకృష్ణభజనము చేయుచుండుఁడు. దీనితో సమానమగు సుఖ మీత్రిలోకముల నెచ్చటను లేదు." ఇట్లు పలికి భగవద్గుణకీర్తనమును జేయుచు కరమైతీబాయి మూర్ఛితురాలయ్యెను. పరశురాముఁడు తన సాంసారిక జీవనము నేవగించుకొని ఆమెను లేపి, యిఁకఁ దానుగూడ శ్రీకృష్ణభజనము చేయుదునని అచ్చటనే ప్రతిజ్ఞను గొని ప్రేమోన్మాదుఁడై రోదనముచేయుచు నింటికి తిరిగిపోయెను. ఇంటికి చేరి భార్యతోఁ దమ పుత్రికాసమాచారమును జెప్పి యిట్లనెను:—"నీ కడుపున నిట్టి భక్తురాలు పుట్టినది. నీవు ధన్యురాలవు. నేఁడు మనకులము పవిత్రమైనది, ధన్యమైనది. "కులం పవిత్రం జననీ కృతార్థావసుంధరా పుణ్యవతీ చ తేన" ఎవని కులములో నిట్టిభక్తు లుద్భవించెదరో అట్టికులము పవిత్రమైనది. కన్నతల్లి కృతార్థురాలు. అట్టిభక్తులు మెట్టిన ప్రదేశము లన్నియుఁ బుణ్యతీర్థములే"

రా జీవృత్తాంతమును వినఁగానే ఆతఁడును కరమైతీదర్శనమునకు బృందావనమునకుఁ బోయెను. అచ్చట నాతఁడు కరమైతియొక్క ప్రేమావస్థను గాంచి అనిచ్ఛా

పూర్వకముగనే ఆమెపాపములమీాదఁబడి ప్రాణమిల్లెను. రా జూకఆశ్రమమును నిర్మింతునని యెంతగా బలవంతము చేసినను కరమైతి నిరాకరించెను. చివరకు రాజు బలవంతముచేసి ఒకకుటీరమును నిర్మింపఁగా నంగీకరించి దానిలో నుండెను. కరమైతి ఆశ్రమముయొక్క శిథిలావశేషము లింకను గలవఁట.

కరమైతి మిక్కిలి త్యాగముతో నుండెడిది. ఆమె మనస్సు క్షణక్షణము శ్రీకృష్ణదర్శనలాలసముతో నుండెడిది. ఆమెకన్నులవెంట ఆనందాశ్రులు కారుచు నిరంతరము వర్షించుతు వున్నట్లుండెడివి. ఇట్లు పరమతపస్సు చేయుచుఁ జివర కీతపస్వినీ రత్నము దేహమును విడిచి గోలోకమునకుఁ జేరెను.

---

# భక్త రాంకా బాంకా

పండరీపురములో లక్ష్మీదత్తుఁడను నొక ఋగ్వేదమహారాష్ట్రబ్రాహ్మణుఁ డుండెడువాఁడు. అతఁడు భార్యతో భగవంతునియొక్కయు, భగవద్భక్తులయొక్కయు సేవలో నుండెడువాఁడు. ఒకసారి భక్తవాంఛాకల్పతరువగు భగవంతుఁడు ఆతని యింటికి సాధురూపమున వచ్చి, ఆతని సేవకుఁ బ్రసన్నుఁడై నీకడుపున నొక భక్తుఁ డగుపుత్రుఁ డుదయింపఁగలఁడని వరమొసంగెను.

తదనుసారముగ విక్రమశకము 1347 మార్గశిర శుద్ధ విదియా గురువారమున ధనుర్లగ్నమున రూపాదేవిగర్భమున రాంకా జన్మించెను. అట్లే బాంకా జన్మము 1351 సం|| వైశాఖ కృష్ణసప్తమీా బుధవారమునఁ గర్కటలగ్నమునఁ బండరీపురమున హరిదేవ బ్రాహ్మణుని యింట నయ్యెను.

యువకుఁడు కాఁగానే భక్తవరుఁడగు రాంకా బాంకాదేవిని పెండ్లాడెను. రాంకా మిక్కిలి దరిద్రుఁడు. రంకనఁగా దరిద్రుఁడు. అందుకనియే ఆతనికి రాంకా యని పేరిడిరి. రాంకా బక్కవాఁడు, అశిక్షితుఁడై ప్రపంచదృష్టిలో నిగణ్యుఁడయ్యుఁ దీవ్రవైరాగ్యము, పరమభక్తి కలిగియుండుటచేఁ బరమాత్మకు మిక్కిలి ప్రేమపాత్రుఁ డయ్యెను. రాంకాజీభార్య గొప్ప పతివ్రత, భక్తిపరాయణ, సాధ్వి. వైరాగ్యమందు రాంకాకంటె ఆతనిభార్యయే మించినది. రాత్రింబవళ్లు పతిసేవ, భజన, ధ్యానము చేయుచుండెడిది. రాంకాయును, బాంకాయును ప్రతిదినము వనమునకుఁ బోయి యెండుపుల్లల నేఱితెచ్చి, వాటి నమ్ముకొని, వచ్చినధనముతో భగవన్నివేదనమును గావించి, ప్రసాదమును గైకొనెడువారు.

రాంకా తనభార్యయగు బాంకాతో బాధ ననుభవించుటను గాంచి ప్రసిద్ధ సిద్ధభక్తుఁడగు నామదేవునకు గొప్పదుఃఖము కలిగెను.

ఆతఁడు రాంకాకు ధనమిమ్మని భగవంతునిఁ బ్రార్థించెను. నామదేవునకుఁ బ్రత్యుత్తరము, రాంకా ధనమును గొంచెమైన నపేక్షింపఁడనియు, కావలెనసిన మఱునాఁడు ప్రాతఃకాలమున దారిలో దాఁగి చూడవచ్చునని వచ్చెను. మఱు నాఁడు ప్రాతఃకాలమున నేవారిగుండ రాంకా భార్యతో వనమునకుఁ బోవునో ఆదారియందే ఒక మొహారీలసంచిని పడవైచి దూరముగఁ బోయి నిలుచుండెను.

అది ప్రాతఃకాలము. రాంకా బాంకా యిద్దరును గట్టెలు తెచ్చుటకు వనమునకుఁ బోవుచుండిరి. భగవత్ప్రేమోన్మత్తుఁడై వెళ్లు రాంకాకు కాలి కాసంచి తగిలెను. రాంకా కూర్చుండి చూడఁగా అది మొహారీలసంచి రాంకా దానిపై దుమ్మును జల్లుచుండెను. ఇంతలోనే ఆతనిభార్యకూడ అచ్చటికి వచ్చెను. 'ధూళిచేఁ గప్పుచున్నారేమి'టని ఆమె అడిగెను. రాంకా స్పష్టముగ జవాబీయలేదు. భార్య మరల నడుగఁగా రాంకా యిట్లనెను:— "ఇక్కడొక మొహారీలసంచి పడియున్నది; నీవు వెనుక వచ్చుచున్నావు. దీనిని జూచి నీవు లోభపడితివా మనసాధనకు విఘ్నము కలుగునను భయముచే దీనిమీఁద దుమ్ముసు గప్పుచున్నాను." పరమవైరాగ్యవతి యగు భార్య యీవిషయమును విని నవ్వి యిట్లనెను:— "నాథా! మట్టికిని బంగారునకును భేద మేమున్నది? మీరు దుమ్ముసుదుమ్ముతో నేల కప్పుచున్నారు? భార్య పలికిన యీమాటలను విని మిక్కిలి యానందపడి రాంకా యిట్లనెను:— "నీవైరాగ్యము చాల గొప్పది. నాబుద్ధియందు మట్టి బంగారు భేదమున్నది. నీవు నాకు మించినదానవు."

ఇట్టి బృహద్వైరాగ్యముచే నామెకు బాంకా యను పేరువచ్చెను. బాంకా అనఁగా సాహసముగలదని యర్థము. భక్తవత్సలుఁడగు భగవంతుఁ డీవైరాగ్యలీలను గాంచి ముదితుఁడయ్యెను.

నామదేవుఁడు రాంకా బాంకా దంపతుల వైరాగ్యమును గాంచి తన్ను నిరసించుకొని భగవానునితో నిట్లనెను:—"ప్రభూ! నీకృపాదృష్టి కలవారికి త్రైలోక్యరాజ్యమందైనను బుద్ధిపోదు. వారికి నీవు తప్ప మఱియొకటి రుచింపదు. అమృతమును రుచిచూచినవారు బెల్లపుపానకము నేలకోరెదరు?"

భక్తవత్సలుఁడగు భగవాసుఁ డాదినమున రాంకా బాంకాలకు అడవిలోని యెండుకట్టెల నన్నిటిని మోఁపులు కట్టియుంచెను. రాంకా బాంకాలు యెవరో మోఁపులు కట్టుకొని పోయినని భావించి, పరులవస్తువులను దాఁకుట పాపమని వాటిని జూడనైనఁ జూడలేదు. ఎండుకట్టె దొఱకకపోవునప్పటికి వట్టిచేతులతోడనే తిరిగి వెళ్లిపోయిరి. ఆదినమున దంపతులు ఉపవాసము చేసిరి. మొహారీలను జూచిననే యిట్టిస్థితి కలిగినది. ఇఁకఁ దాఁకిన నెంత కలుగునో యని యనుకొనిరి.

చివరకు భగవంతుఁడు దయచే నాదంపతులకు దేవదుర్లభమగు దర్శన మొసంగి కృతార్థులను ధన్యులను గావించెను.

భక్తవరుఁడగు రాంకా 101సంవత్సరముల వయస్సువచ్చువఱ కీవసుధాస్థలి నుండి 1452 వైశాఖ శుద్ధ పూర్ణిమాదినమున బాంకాతోఁగూడ పరమపదాసనము నలంకరించెను.

---

# భక్తధనుర్దాసు

భక్తిమార్గములోని కొన్ని సుగమ సులభసాధనములు విషయలిప్తులు, భగవద్విముఖులగువానినిగూడ సహజముగ భగవద్భక్తుల నొనర్పఁగలవు. గానాదులను వినుట, విచిత్రాఖ్యానములను జెప్పుట, వినుట, సుందరరూపములను గాంచుట మొదలగు నింద్రియవిషయధారలు భగవద్విముఖులుగఁ జేయుచుండును. ఒక్కొక్కయెడఁ బైన పేర్కొనఁబడిన విషయలోలుపతా కారణమునఁ గొందఱు స్వభావతః అకస్మాత్తుగ భగవత్కృపాప్రభావమున భగవద్భక్తు లగుటను గాంచుచున్నాము. ఒక్కొక్కచోట విశేషముగ మహాత్ములవలనను, సాధువుల ప్రయాస, ప్రభావములచేతను భగవద్భక్తు లగుచుందురు. ఈవిషయమున ననేకోదాహరణములు పౌరాణికేతిహాసములందును, భక్తమాల, భగవద్భక్త చరిత్రగ్రంథములందును లభింపఁగలవు. శ్రీసాంప్రదాయ ప్రవర్తకులగు శ్రీమద్రామానుజాచార్యులవారి జీవితచరిత్రయందు దిట్టి సంఘటనము లనేకములుగ లభింపఁగలవు. అందులో నొకదాని నిచ్చట నుల్లేఖించుచున్నాము.

చెన్నరాజధానిలో తిరుచునాపల్లి యనునగరమునొద్దఱ ఉరయూరను పేరుగల నొకపట్టణము గలదు. దీని ప్రాచీననామము నిచులాపురి. ఇది వైష్ణవుల కొక పవిత్రస్థలము. ఇప్పటికి సుమారు వేయిసంవత్సరములకుఁ బూర్వము ధనుర్దాసను పేరుగల నొకబలవంతుఁ డుండెడువాఁడు. ఈతని ఖ్యాతి అంతటను వ్యాపించెను. ఈతని కొక చక్కనిభార్య కలదు. అది మొట్టమొదట వేశ్య. తర్వాత నది ధనుర్దాసునకు భార్య యయ్యెను. ధనుర్దా సామెసౌందర్యమునకు మురిసిపోవుచుండువాఁడు. ఆతఁ డెచ్చటికి వెళ్లినను ఆమెను వెంటఁ గొనిపోయెడువాఁడు. ఊరక వెంటఁ దీసికొనిపోవుటయే కాదు, ఆతఁ డెచ్చటఁ గూర్చుండిన నచ్చటఁ గూర్చుండఁబెట్టుకొని అదేపనిగ నామెసౌందర్యమును జూచుకొనుచుండెడువాఁడు. దారిలో నడచునప్పుడైనను నామెకు ముందుగా బోవలయును. ఏదైన వాహనము మీఁదఁ గానిండు, పాదచారులై పోనిండు ఆమె కెదురుగా వెనుకగా నడచి ఆతఁడు పోవలయును. ఈవిచిత్రమును జూచువారందఱకును గౌతూహలముగ నుండెడిది.

పాఠకులు పత్రికలమునఁగ శ్రీరంగక్షేత్రమును గురించి వినియుందురు. ఇది తిరుచునాపల్లికి దగ్గఱనే కలదు. ఇచ్చట ప్రసిద్ధ అర్చావతారుఁడగు శ్రీరంగనాథస్వామి మందిరము కలదు. ఇచ్చట ప్రతిసంవత్సర మనేకతఱవలు మహోత్సవములు చాలవైభవముగ జరుగుచుండును. ఉత్సవములకు లక్షలకొలఁదిజనులు వచ్చుచుందురు. దగ్గఱవారేకాదు, దూరదూరముల నుండివారుకూడ వచ్చుచుందురు. ఒకానొకప్పుడు చైత్రవసంతోత్సవములు జరుగుచుండెను. ఉత్సవములు కొన్నాళ్లు జరిగెను. ఇంకను గొన్నిదినములు జరుగవలసియుండెను. ధనుర్దాసు భార్య ఉత్సవములు చూడవలయుననుకొనెను. ఆకోర్కె ధనుర్దాసుకు చెప్పుటయేతడవుగా నిచులాపురినుండి శ్రీరంగమునకు బయలుదేరిరి. వీరిద్దరును నౌకరులతోఁగూడి శ్రీరంగమునకుఁ జేరిరి. ధనుర్దాసు భగవద్దర్శనము చేయవలయునని భార్యను ముందిడుకొని, యెండ యెక్కువగుటచే నామెకుగూడ గొడుగుపట్టుచుఁ బోవుచుండెను. ఒకచెంప సూర్యునివేఁడిమి, మఱియొకవైపు జనముకాక. ఆమెకు ఛత్రమును బట్టుచు, ఆసౌందర్యమును జూచుకొనుచు వెనుక నడకతోఁ బోవుచుండెను. వెనుక మెరకయో, పల్లమో ఆతఁడు చూచుకొనుటలేదు. తాను చెమటతో స్నానము చేసెను. శరీరస్పృహ లేదు. ఆ మహోత్సవసమయమున శ్రీమద్రామానుజాచార్యులవారు శ్రీరంగములోనే నివసించుచుండిరి. శిష్యులతోఁగూడి ఆతఁడును దేవాలయమునకు ఒకప్రక్క పోవుచుండెను. ధనుర్దాసుని యీపద్ధతి చాలమంది కంటఁబడెను. అయితే యిది యెప్పుడును జరుగుచున్నవిషయమే యగుటచే నందఱకును, నాశ్చర్యము కలుగలేదు. అందువలన నొకసారి గాంచి తలవంచుకొని పోవుచుండిరి. కాని శ్రీరామానుజాచార్యులవారి కిది చాల క్రొత్తవిషయము. అందువలన నాతఁడు తనశిష్యులతో నిట్లనెను:—"ఈతఁ డెవఁ డింతనిర్లజ్జగఁ బ్రవర్తించుచున్నాఁడు?" శిష్యు లిట్లనిరి:—"ఈతఁడు నిచులాపురిలో నుండు ప్రసిద్ధమగు మల్లయుద్ధవిశారదుఁడు. ఆమె ఆతని భార్య. ఆమెపేరు హేమాంబా. అది మొట్టమొదట వేశ్య. కాని ధనుర్దాసామెను పెండ్లాడినాఁడు." శిష్యుని సమాధానమును విని రామానుజస్వామి లోలోనఁ బ్రసన్నుఁడై యాశిష్యునితో నిట్లనెను:—"సాయంత్రము జాముప్రొద్దున్నపనఁగా నాతనిని మనమఠమునకుఁ బిలిచికొనిరావలయును. వీలైన నిప్పుడే యాతనికి చెప్పిరమ్ము. అప్పటికి వచ్చుటకుసిద్ధపడఁగలఁడు." స్వామి నోటవెంట నీమాటలు వచ్చుటయేతడవుగ శిష్యుఁడు పరువిడిపోయి స్వామి సందేశమును వినిపించెను. ధనుర్దాసు వినఁగానే కంపించెను. కోసినను ముఖమున నెత్తురు లేదు. ఆతఁడు మనస్సున నిట్లనుకొనెను:—ఆచార్యస్వాములు నా నిర్లజ్జతకు చాల కోపపడియుండవచ్చును. నన్ను చీవాట్లుపెట్టుటకే మఠమునకు రమ్మని

యుండును. మొత్తమున కిది చెడ్డపనియే. భగవంతునికి ఉత్సవము జరుగువేళ నానా దేశములనుండి లక్షలకొలఁది ప్రజలు భక్తిశ్రద్ధలతో, పవిత్రభావములతో, తమ కలుషితభావములను ఇంటివద్దనే వదలిపెట్టి వచ్చిరి. ఈజనసమూహములో నన్ను మించిన విషయలోలుఁడు, పాపకర్మలిప్తుఁడు ఇంకెవఁ డుండఁగలఁడు? ఒకవేళ యున్నను వారు తమదుర్భావములను వదలి పవిత్రభావముతో భగవద్దర్శనము ఇచ్చట నేనొక్కఁడనే స్త్రీసౌందర్యలోలుపుఁడనై యున్నాను. ఛీ! ఛీ! నా యీవిషయలోలుపతకు, నిర్లజ్జతకు ధిక్కారము." ఇట్లు ధనుర్దాసు ఆలోచించుకొని మఠమునకుఁ బోవుదమా, మానుదుమా యని యాలోచించుకొనుచుండెను. మనస్సులో వెళ్లిన చీవాట్లు తినుటయు, వెళ్లకున్న ఆచార్యావజ్ఞతయు కలుగునని చివరకు వెళ్లుటకే నిశ్చయించెను. అట్లు నిశ్చయించి శిష్యునితో నిట్లనెను:—"స్వామీ! నేను భోజనము చేసిన తర్వాత శ్రీచరణసన్నిధికి వచ్చెదను. ఈ విషయమును ఆచార్యస్వామివారికి చెప్పవచ్చును" శిష్యుఁడు వచ్చి శ్రీమద్రామానుజులకు సమస్తమును విన్నవించెను. శ్రీరామానుజులు మందిరమునకు దయచేసిరి. హారతి సమయమున నాతఁడు మిక్కిలి కరుణతో నిట్లు ప్రార్థించెను:—"స్వామీ! దయామయా! ఒకానొక విముఖజీవికి నీసౌందర్యమును జూపింపుము." హారతి అయిన తర్వాత శ్రీరామానుజస్వామి తనమఠమునకు వచ్చెను.

భోజనము చేసినతర్వాత మాటయిచ్చినప్రకారము సరిగా సమయమునకు ధనుర్దాసు మఠమునకు వచ్చెను. రాఁగానే ఆచార్యస్వాములవారికి కబు రందించిరి. ఆతఁ డిట్లనెను:—"సరియే. ఆతనిని నావద్దకుఁ గొనిరండు" పిలువమనిన శిష్యుఁ డిట్లనెను:—"స్వామీ ! ఆతఁడు మఠములోపలి కెట్లు రాఁగలఁడు. మల్లయుద్ధము చేయువారు సాధారణముగ హీనజాతివారుగ నుందురు." స్వాము లిట్లనిరి:—"దీనికి శంకాసమాధానములు చెప్ప నవసరములేదు. నేను చెప్పినదేమియో చేయుము" ధనుర్దాసు లోనికి వచ్చి స్వామికి సాష్టాంగనమస్కారము గావించి, దూరమునఁ జేతులుకట్టుకొని నిలుచుండెను. ఆతని యీప్రవర్తనమువలన శ్రీరామానుజులు ప్రేమతో నిట్లనెను:—"ఏల చేతులుజోడించి నిలుచుంటిరి? రమ్ము, నాదగ్గఱ కూర్చుండుము. నిన్ను కొన్ని యడుగవలయును. భయపడకుము. నిన్ను నేను శిక్షింపను." స్వాములవారి యీ స్నేహయుక్తసంభాషణమును విని ధనుర్దాసు ధైర్యము తెచ్చుకొని సాహసముతోఁ గొంచెముదూరములోఁ గూర్చుండెను. స్వాము లిట్లనిరి:—"నాయనా ! ఒక్కవిషయమును జెప్పుము. ఆస్త్రీతో నిర్లజ్జతో, నీశ్రీరంగములో, రాజవీథిలో, నింతటి జనసమ్మర్దములో వెళ్లుటకుఁ గారణమేమి? స్పష్టముగఁ జెప్పుము. దాఁచవలదు. ధనుర్దాసునకుఁ గొంచెముగ సాహసము

కలిగెను. అతఁడు నిస్సంకోచముతో నిట్లనెను:—"స్వామీ! ఆమెసౌందర్యమునకు నేను ముగ్ధుఁడనైతిని. నామనస్సులోఁ గామవాసనావిశేషము లేదు. అయితే అది స్త్రీ యైనదియేకాని కామవాసన లేదు. ఆమెసౌందర్యమును జూచి నామన స్సాకర్షింపఁబడినది. ఆమెను జూడనిదే నేనుండఁజాలను. యదార్థ మిది. స్వామి వారికి ఇష్టమువచ్చినట్లు చేయుఁడు. కాని దానిని నన్ను వేఱుచేయవలదు." అంత స్వామివా రిట్లనిరి:—"అట్లు గాదు. మేము దానిని వదలుమనుటలేదు. ఆమె నీకు భార్యయైనదని ఆమెపైఁ బ్రేమ కలిగియుండుట సహజము. సౌందర్యమునకు లోఁబడితి నంటివిగదా అంతకు మించిన సౌందర్యమును జూపిన మామాట వినెదవా?" ధనుర్దా సిట్లనెను:—"ఏల విననుఁ? ఆమె ముఖముకంటె సుందరముఖము నాకుఁ గనఁబడెనా నే నామెను బరిత్యజింపఁగలను." శ్రీమద్రామానుజు లిట్లనిరి:—"ఆమెను బూర్ణముగఁ ద్యజింపుమనియు నే ననను. అట్లు వదలుటయు క్షేమము కాదు. ఏలననఁగా నామె వేశ్యావృత్తిని వదలి నీకు భార్యయైనది. ఇప్పుడొక విధముగ నామె బాగుపడినది. ఇప్పు డామెను వదలితివా మరల వేశ్యావృత్తినిఁ బ్రారంభింపవచ్చును. అది క్షేమముకాదు. ఆమె భార్యారూపమున నీవద్ద నుండవచ్చును; కాని యిట్లు నిర్లజ్జగ నామెపై ముగ్ధుఁడవు కారాదు. నీదగ్గఱ నుండిన నామె క్రమక్రమముగ బాగుపడఁగలదు. ధనుర్దాసు అంగీకరించెను. అప్పుడు స్వామివా రిట్లనిరి:— "మంచిది, ఇఁక వెళ్లవచ్చును. సంధ్యాసమయమున భగవానునకు హారతినిచ్చువేళ నాకుఁ గనఁబడవలయును. ఒంటరిగ రావలయును. నే నక్కడనే యుందును. ఎవ్వరు నిన్నడ్డగింపరు. నేను నీకొఱకు కనిపెట్టుకొని అచ్చటనే యుండెదను." ధనుర్దాసు సాష్టాంగనమస్కారముచేసి యింటిత్రోవఁ బట్టెను. దారిలో నాతఁ డిట్లనుకొనెను:— "ఆచార్యస్వాములు నన్ను చీవాట్లు పెట్టుననియు, కోపఁబడుననియు, నలుగురిలో నానామాట లని కోపపడఁగలడనియు భావించితిని; కాని దానికి పూర్తిగ విపరీతముగ నున్నది. సంధ్యాకాలమున మరల దర్శించెదను."

ధనుర్దాసు ఇంటికి చేరెను. అచ్చట భార్యతో "ఆచార్యస్వాములు సంధ్యావేళ భగవన్మందిరమునకు హారతివేళ దర్శనమునకుఁ బిలిచినాఁడు. నే నొంటరిగా వెళ్లెదను" అనెను.

సంధ్యావేళకు హారతిసమయమున ధనుర్దాసుమందిరమునకుఁ బోయెను. అచ్చట శ్రీమద్రామానుజాచార్యులను దర్శించెను. ఆయన యాతనికొఱకు నిరీక్షించుచుండెను. హారతి సమయమైనది. బాజాలు వాయించిరి. శ్రీమద్రామానుజులు ధనుర్దాసుతో నిట్లనెను:—"నీవు తదేకదృష్టితో భగవంతుని దర్శించుము." హారతి యయ్యెను. స్వాములవారి యాదేశానుసారముగఁ దదేకదృష్టితో భగవంతుని దర్శించెను.

ఆతఁడు భగవంతుని దివ్యసౌందర్యమును గాంచి ఱెప్పలార్పక నిర్జీవప్రతిమవలెఁ జూచుచుండెను. హారతియైన తర్వాత నాతఁడు రామానుజులకాళ్లపైఁ బడి విహ్వల స్వరముతో నిట్లనెను:—"స్వామి! యీ యలౌకిక సౌందర్యముముందు ఆస్త్రీయొక్క సౌందర్యము గవ్వకు కొఱగాదు. ఇప్పుడు మీ రెట్లు చేయుమనిన నట్లు చేసెదను; కాని యీ సౌందర్య మెల్లప్పుడు నుండునట్లు చేయవలయును." స్వామి యిట్లనెను:—"అన్నియు జరుగఁగలవు. ఈ సమయమున నింటికిపోయి యీ వృత్తాంత మంతయు నీభార్యకుకూడ చెప్పుము." ధనుర్దాసు యింటికివచ్చి తనభార్య కీవృత్తాంతమునంతను జెప్పెను. కొన్నిదినములతర్వాత నాదంపతులిద్దరును స్వామి శ్రీ చరణములను సమాశ్రయించిరి. స్వాములవారును వారికి సాంప్రదాయికజ్ఞానవిషయము లన్నిటిని ప్రతిదినము చెప్పుచు వారిని బహుజ్ఞుల నొనర్చిరి. వారిక నిచులాపురికి వెళ్లక మఠము దగ్గఱ నొకగృహమును దీసికొని నివసించుచు, వారివలన సద్విషయములను వినుచు నాదర్శప్రాయులైరి. ధనుర్దాసుయొక్క సద్గుణములవలన శ్రీమద్రామానుజులును జ్ఞానవిషయములను దాఁపక నన్నిటినిఁ జెప్పిరి. క్రమక్రమముగా నాతఁడు ఆచార్యస్వామియందు పరమానురక్తుఁడును, విశ్వస్తభక్తుఁడు నయ్యెను. ఆతని జీవితము పరమపవిత్రమయ్యెను. స్వాములవారికి ఆతనియందు పరమవాత్సల్య మేర్పడినది. వారి వృద్ధాప్యమందు కావేరీస్నానము గావించి వచ్చునపుడు మఠమువఱకు ఈతనిని ఆధారముగఁ జేసికొని వచ్చెడువారు. దేవాలయము వఱకు బ్రాహ్మణశిష్యుని ఆధారమున వచ్చి, తిరిగి వెళ్లిపోవునపు డీధనుర్దాసుని యాధారమునఁ బోయెడువారు. ఇది నిత్యవ్యవహారమయ్యెను. కాని మఠములోని బ్రాహ్మణశిష్యులు దీనిని గాంచి యసూయపడసాగిరి. స్వామివా రేమనుకొందురో యని వారిమనోభావములను బయటకుఁ జెప్పెడువారు కారు. ఇఁక నిలువఁజాలక, ధైర్యమువహించి యొకదినమున శిష్యులలో నొకఁడు స్వామివారితో నెమ్మదిగ నిట్లనిరి:— "స్వామీ! మీరు స్నానముచేసిన తర్వాతఁ గైంకర్యమునకు మేమందఱ మిందఱ ముండఁగా ధనుర్దాసు నేల స్పర్శించెదరు?" వెంటనే రామానుజు లిట్లనిరి:—"మీరు లేరనికాదు అట్లు చేయుట. నా హృదయాభిమానము పోవుటకే అట్లు చేయుచుంటిని. ధనుర్దాసుని యాచరణము చాలమంది బ్రాహ్మణుల యాచరణముకంటె శ్రేష్ఠమైనది." ఇట్టి ప్రత్యుత్తరమును విని వా రూరకుండిరి; కాని వారిహృదయములోని మంట నాపుకొనఁజాలక ధనుర్దాసుని గాంచి అప్పుడప్పుడసూయపడుచుండిరి. ఈవిషయమును రామానుజులు గ్రహించెను. ఎన్నటికైన నీర్ష్యాంకురమయ్యెనా అది నాశనమునకే యని గ్రహించి ఒకానొకరాత్రి వారి యంతరంగికునితో నిట్లనెను:— "నీ వీబ్రాహ్మణశిష్యు లందఱు యెండవైచిన గుడ్డల

నుండి ఒక్కొక్క జేనెడు గుడ్డలను జించి నా కీయవలయును. కాని యీ విషయ మెవరికిని జెప్పరాదు." ఆసజ్జనుఁ డట్లే చేసెను. మఱునాఁడు వారివస్త్రములు చిరుగుటను గాంచి పరస్పరము దిట్టుకొననారంభించిరి. ఈ విషయము ఆచార్యస్వాముల వారివఱకుఁ బోయెను. ఆచార్యస్వాములు వారికి క్రొత్త వస్త్రములను దెప్పించియిచ్చెదను పోట్లాడుకొనవలదనియు, నా మూలముననైన క్షమింపవలయుననియు, వారి నంగీకరింపఁజేసెను. ఈ విషయ మెవరికిని దెలియదు. చాల రహస్యముగ నుండెను. మరలకొన్నాళ్లైనతర్వాతఁ దన శిష్యులలోఁ గొందఱను పిలిచి స్వామివారు వారితో నిట్లనిరి:—"నేను ధనుర్దాసున కేమైనఁ జెప్పుచుఁ జాల ప్రొద్దుపోవువఱకు ఇచ్చటనే నిలిపెదను. మీరు చాల జాగ్రత్తగ నాతనియింటికి వెళ్లి హేమాంబ ధరించిన సొమ్ములను దొంగిలించుకొని వచ్చి నాకీయవలయును." శిష్యు లట్లే గావించిరి. ధనుర్దాసు రామానుజుల వారివద్ద జ్ఞానశ్రవణము చేయుచుండఁగా వీరాతని యింటికి వెళ్లిరి. భర్తకొఱకు నిరీక్షించుచుఁ దలుపులు తెఱచియే హేమాంబ ఒంటరిగా మంచముపైఁ బరుండియుండెను. ఈ వైష్ణవులు రాత్రి సమయమున మెల్లగ నింటఁ బ్రవేశించిరి. వీరు దొంగిలింపవచ్చినారని యామె భావించి, గుఱకలుపెట్టుచు నిద్రను నటించెను. ఆమె చాలఆభరణములు ధరించి పరుండియుండెను. ఆమె శరీరముమఱచి నిద్రించుచున్నదని గ్రహించి, వీరు ఆమెశరీరముమీఁది యాభరణములను ఒకప్రక్కవి తీసిరి. రెండవవైపువికూడ తీసికొనిన బాగుండునని ఆమె మఱియొకప్రక్కకు వత్తిగిలెను. కాని శిష్యులు ఈమె మేల్కొనిన బాగుండదని పాఱిపోయి మఠమునకు వచ్చిరి. వీరు వచ్చినసంగతి తెలిసికొన్నతర్వాత ధనుర్దాసునకు రామానుజులు సెలవొసంగిరి. తర్వాత నాశిష్యులను బిలిచి వారిదగ్గఱనుండి యాయాభరణములను గైకొని, వేఱుగ దాఁచియుంచి యిట్లనెను:—"మీరు మెల్లగా ధనుర్దాసుఇంటిబయటనుండి వారిద్దరేమి సంభాషించుకొనుచున్నారో విని రండు" ఆదేశానుసారముగ వారందరును వెళ్లి బయటనుండి వారిసంభాషణను వినుచుండిరి. అప్పుడు ధనుర్దాసు ఇట్లనుచుండెను:—"తుచ్ఛమగు నాభరణముల వ్యామోహమున నేమిపని చేసితివే? నీ కింకను ధనువ్యామోహము, మమత పోనే లేదు. అందువలననే నీవు వైష్ణవమహానుభావులను వీటిని దీసికొనిపోనీయలేదు." అప్పుడు హేమాంబ భర్తకు వినయముతో నిట్లనెను:—"స్వామీ! నా కున్నదంతయు భగవానునిదే కదా! ఇంక నాకు మమత యెందులకు? వారీవైపుసొమ్ములు కూడ తీసికొనిపోదురుగదా యని నేను వత్తిగిలితిని. కాని నాదౌర్భాగ్యవశమున వారు వెడలిపోయిరి. దయతో నాయపరాధమును క్షమింపుఁడు. నేనీనాటినుండి యిట్టివిషయములలో జాగ్రత్తగ నుందును" ఇదివిని శిష్యులు తిరిగివచ్చి, యున్న

దున్నట్లు గురువునకు విన్నవించిరి. తర్వాత నందఱును నిద్రపోవుటకు పంపివైచి మఱునాఁడు ప్రాతఃకాలమున సంధ్యావందనాదికార్యములు, అనుష్ఠానములు తీరినంబిమ్మట, భగవంతునికి హారతియైనపిమ్మట చినిఁగినగుడ్డలకొఱకు పోట్లాడుకొనిన శిష్యులనందఱును బిలిచి చినిఁగినపేలికల నిచ్చి యిట్లనెను:—"ఇవిగో కైకొనుఁడు, మీఁగుడ్డలలోఁ జినిఁగినపేలికలు సాధారణమానవులుకూడ సాధారణముగఁ జేయని దుర్వ్యవహార మీగుడ్డలకొఱకు మీరు చేసికొంటిరి. కాని, ధనుర్దాసు, ఆతనిభార్య హేమాంబను జూడుఁడు. సొమ్ములవిషయములో నెట్లొనర్చిరో. మీయాచరణము శ్రేష్ఠమైనదో వారియాచరణము శ్రేష్ఠమైనదో మీరే చెప్పుఁడు. నేను స్నానము చేసివచ్చునపుడు ధనుర్దాసుని ఆధారముగఁ గొనివచ్చినది ఆతనిఆచరణము శ్రేష్ఠమగుటచేతనే ఇప్పుడు మీసందేహము తీరిన దనుకొందును." శ్రీరామానుజులు చెప్పినతర్వాత మఠములోని శ్రీవైష్ణవుల కందఱకును ధనుర్దాసుని మహత్వము తెలిసెను. అప్పటినుండియు వారందఱాతనియెడ సానుభూతితో నుండిరి. తర్వాత స్వాములవారు ధనుర్దాసుని బిలిపించి సొమ్ములన్నిటి నొసంగి, "ఇదంతయు నిన్నుఁ బరీక్షించుటకై చేయించితిని. అన్యథా తలంపవలదు" అనెను. అప్పుడు ధనుర్దాసు ఇట్లనెను:—"దాసునిసర్వస్వము శ్రీచరణములవే. దీని నన్యథా తలంపవలసిన పని యేమున్నది?" ఈవిధముగ భగవత్కృపాకటాక్షవిశేషముచేతఁ దన విషయలోలుపతను సదుపయోగము కావించుకొనెను. ఆచార్యస్వామి కృపాకటాక్షమున నేమి నెఱవేరదు? ఆతఁడు తనయాదర్శాచరణముచే శ్రీవైష్ణవసాంప్రదాయేతిహాసములోఁ దననామము నమరము గావించుకొనెను. ఇప్పటికిని నాతనినామమును శ్రీవైష్ణవులు గౌరవముగఁ బలుకుచుండురు. ఆతనితో ఆతనిభార్య హేమాంబయుఁ దరించెను.

---

# భక్తపురందరదాసు

పదునైదవ, పదునాఱవశతాబ్దములలో విజయసామ్రాజ్యవైభవము దక్షిణభారతములోననే కాదు సమస్త భారతఖండమందు మధ్యాహ్నమార్తాండునిరీతి వెలిఁగెను. ఆసామ్రాజ్యాశ్రయమున సంగీత, సాహిత్య, కళా, భారతీయ, సంస్కృతాదు లొక్కసారిగఁ దమతలల నెత్తుకొని కీర్తికిరీటమును ధరించి, సమస్తవిశ్వమునకును దనవైభవమును బ్రదర్శించెను. సాహిత్యాభివృద్ధి కాకాలము సర్వోత్తమమైనదిగ నుండెను. ఈస్వర్ణయుగమందే శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమును బరిపాలించుచుండెను. ఆతఁడు సాహిత్యజ్ఞుఁడు, సాహిత్యప్రేమ కలవాఁడు. ఆతని యాస్థానమున ననేక తెలుఁగు, కన్నడకవుల కాశ్రయము లభించినది. ఆతని

యాస్థానముననే అప్పయదీక్షితాది అష్టదిగ్గజములను ప్రసిద్ధితో నుండిన యెనిమిది మందికవులు కలరు. ఆతనిరాజ్యమందే కుమారవ్యాసుఁడు (మహాభారతమును గన్నడములో రచించినవాఁడు) కుమార వాల్మీకి(తొరవేయరామాయణమును వ్రాసినవాఁడు) కనకదాసాది కవిశ్రేష్ఠు లుండెడువారు. వారికృతులు నేటికిని గన్నడ సాహిత్యమం దున్నతస్థాన మలంకరించినవి. పురందరదాసకవియు నీయుగమున నొక మహావిభూతి.

ధర్మము సాహిత్యమునకు ఉపాదానకారణము. ధర్మము లేక సాహిత్య నిర్మాణము కాఁజాలదు. ప్రపంచములోని సమస్తదేశములందును ధర్మమను పునాదులపైననే సాహిత్యప్రాసాదము నిర్మింపఁబడినది. కన్నడసాహిత్యముయొక్క ఆదికాలమందు జైనసాహిత్యము చాలయున్నతిఁజెందినది. 'రన్న' 'పంప' అను రచనలు విశ్వసాహిత్యములో నెన్నఁదగినవి. తర్వాత శైవసాహిత్యము అభ్యున్నతి చెందినది. శైవ సాహిత్య నిర్మాతలలో బసవేశ్వరుఁడు, సర్వజ్ఞ మహాదేవి మొదలగువారు ముఖ్యులు. విజయనగరములో హిందూసామ్రాజ్యము స్థాపింపఁబడఁగానే ఆశ్రయమునుబొంది బ్రాహ్మణ లేక దాస సాహిత్యము వృద్ధిపొందినది. బ్రాహ్మణుల ద్వైత సాహిత్యము సరళము, సరసము, సుబోధకమై జనుల హృదయములలో నాటుకొనినది. దానికిముందు స్మృతి, దర్శనశాస్త్రములయొక్క జటిలసమస్యలవలన సర్వసాధారణులకు సంతోషము కలుగలేదు. అంతేకాక ధార్మికకృత్యములలో వితండవాదము, ఆడంబరమువలన సదాచారము లుప్తమయ్యెను. పారస్పరిక విద్వేష, కలహాదులు సర్వసామాన్యమయ్యెను. సాధారణులకు సంస్కృతభాషా జ్ఞానము లేకపోవుటచే అజ్ఞానాంధకారములోఁ బడియుండిరి. శాస్త్రజ్ఞులనఁబడువారు తమ యాచరణముచే వారిని భ్రమలోఁ బడవైచిరి. సన్న్యాసులు ననేకములగు నకార్యము లొనర్చుచుండిరి. నిష్కపటవ్యవహారము, శుద్ధమనోభావములు, భగవద్భక్తి, సద్గుణములు లుప్తమయ్యెను. అందఱును భోగవిలాసములందును, ఆమోదప్రమోదములందును మగ్నులైయుండిరి.

ఇట్టి పరిస్థితిలో లోకహితైకసాహిత్యము మిక్కిలి యావశ్యకమయ్యెను. ఆకారణమున పథభ్రాంతప్రజలను సన్మార్గమునకుఁ దెచ్చుటకును, ప్రజల యజ్ఞానాంధకారమును బోఁగొట్టుటకును వైష్ణవసాహిత్యము సృష్టింపఁబడెను. ఆసమయమున భగవంతుఁడు భక్తశ్రేష్ఠుఁడగు పురందరదాసును ప్రేరేపించి, వైష్ణవ సాహిత్య నిర్మాతలలో నాతని కగ్రస్థానమును బ్రసాదించెను. ఆతఁడు కన్నడసాహిత్యమునకును, జనులకును జేసినసేవ వర్ణనాతీతమైనది. ఆతనిసాహిత్యములో భక్తిరసమును సర్వసుల భమగు నమృతధారను బ్రవహింపఁజేసెను. అందులో నొకగ్రుక్కెఁడు త్రాగినవారు

తరించిరి. పురందరదాసుని మూలమునఁ గర్నాటకసంగీతముకూడ ఉద్ధరింపఁబడినది. ఆతనికీర్తనములే తెలుఁగుభక్తకవియగు త్యాగరాజు నుత్పన్నము కావించినవందురు. దక్షిణభారతదేశమునఁ పురందరదాసుయొక్కయు, త్యాగరాజుయొక్కయు కీర్తనలు విననివా రుండరు. ప్రతియింటిలో వీరికీర్తిని ముక్తకంఠముతోఁ జెప్పుకొనుచుందురు. వీరికీర్తనలను పాడుకొనుచుందురు.

భగవల్లీలల కంతము కలదా? ఆతఁడు స్వయముగఁగాని, భక్తులద్వారమునగాని యేయే రూపములతో నేయేలీల నొనర్చుచుండునో, ఈరహస్యము ఆతని భక్తులకు తప్ప యింకెవరికిని దెలియదు. మహాత్ముఁడగు పురందరదాసు తన పూర్వజీవితములో నపారధనరాశికి స్వామి యనియు, అయితే అతిలోభి యనియు నెవఁడనఁగలఁడు ? కాని అసలువిషయ మిది. పండరీపుర సమీపమున పురందరగఢమను నొకనగరము కలదు. అచ్చట వరదప్పనాయకుఁడను నొకబ్రాహ్మణుఁడు నివసించుచుండెను. వి.శ.1404లో నీతనికి శ్రీనివాసనాయకుఁడను పేరుగల నొకపుత్రుఁడు పుట్టెను. పుత్రుఁడు పుట్టఁగానే కొద్దికాలముననే వరదప్పనాయకుఁడు మృతిచెందెను. తండ్రియొక్క అపారధనమునకు శ్రీనివాసుఁడు ప్రభువయ్యెను. ఆసమయమున విజయనగరము, గోల్కొండ యీరెండురాజ్యములు సమృద్ధికలవి. ఆరాజులతో శ్రీనివాసనాయకుఁడు రత్నములు, మణులు, మాణిక్యములు మొదలగువాటి వ్యాపారము చేయుచుండెను. దానివలన నాతని సంపత్తియుఁ బెరిగెను. ఆతఁడు గొప్ప భాగ్యవంతుఁడయ్యెను; కాని లోకములో సాధారణముగ ధనము పెరిగినకొలఁది ఉదారత తగ్గుచుండును. ఈసామెత ననుసరించి శ్రీనివాసుఁడును నతిలోభియయ్యెను. ఆతని నేదైన నీయుమనినఁ జాలును మండిపడిపోవును. అత్యధిక ధనమోహము ఆతని కన్నుల కెక్కెను.

భగవంతుఁడు శ్రీనివాసుని పూర్వకృతపుణ్యఫలోదయమై భక్తుని మోహనిద్రనుండి లేపదలఁచెను. ఒకానొక బ్రాహ్మణుని వేషమున భగవంతుఁడు శ్రీనివాసుని దగ్గఱకు వచ్చి యిట్లనెను:—"అయ్యా! మాపిల్లవాని ఉపనయనము. కావున నాకు కొంచెము ద్రవ్యసహాయము చేయవలయును. నేను చాల దీనవాఁడను. అవశ్యము మీరు నాకు సహాయము చేయవలయును. మీరు కోటీశ్వరులు." శ్రీనివాసుఁడు అతిలోభియైనను సాధ్యమైనంతవఱకు సాధుబ్రాహ్మణులయెదుట నవినయముగ నుండఁడు. ఆతఁ డిట్లనెను:—"ఇప్పేళ వీలులేదు, రేపు రండు" ఇట్లుచెప్పుట యెందులకనఁగా రేపటిరోజున బ్రాహ్మణుఁడురానేరాఁడు. ఈరీతిగానైన వాని కిచ్చుట తప్పునని యట్లు చెప్పెను. కాని బ్రాహ్మణుఁ డేలరాఁడు. బ్రాహ్మణుఁడు మరల వచ్చెను. మరల మఱునాఁడు రమ్మనెను. ఇట్లు మూఁడు, నాలుగు, అయిదుదినములు కాదు

ఆఱునెలలిట్లు వాయిదా వేసెను గాని బ్రాహ్మణుఁడు విసుగుకొనక యాచకుఁ డెప్పుడు రమ్మనిన నప్పుడే వచ్చుచుండెను. చివరకా బ్రాహ్మణునివలన శ్రీనివాసనాయకునకు విసుగెత్తి, విదలించుకొనుచు, పైకముతో నిండిన రొక్కపుసంచులను దెచ్చి, యాబ్రాహ్మణునిముందు పడవైచి "యీసంచులనుండి నీకిష్టమువచ్చినదానిని దీసికొనుఁడు" అనెను.

బ్రాహ్మణవేషధారియగు భగవంతునకన్నియును దెలియును, కావునఁ దాను అధైర్యపడినట్లును, ఆఱుమాసములనుండి తిరిగి తిరిగి అతని సొమ్మంతయు నెత్తుకొనిపో వచ్చినాఁడనుకొందురేమో అన్నట్లు నటించి బ్రాహ్మణుఁడు దుఃఖితుఁడై యాసంచులను తెఱువకయే, అచ్చటనుండి శ్రీనివాసనాయకుని ఇంటికి వెళ్లి, యాతని భార్య లక్ష్మీబాయివద్దకు వెళ్లి వృత్తాంతమంతయును వినిపించి 'నీ వేదైన సహాయము చేయఁదలఁచినఁ జేయు' మనెను. లక్ష్మీబాయి శ్రీనివాసనాయకునివంటి లోభి కాదు. సార్వభౌమునకు భార్యయైనను నుదారవంతురాలు. ఆమె భర్తచేయించిన సొమ్ములను గాక పుట్టినింటివారు చేయించిపెట్టిన రత్నాలుపొదిగిన విలువగల ముక్కుపుడకను 'శ్రీకృష్ణార్పణమ' స్తని దీసియిచ్చివేసెను. ఆవిచిత్రపుబ్రాహ్మణుఁడు దానిని గైకొని శ్రీనివాసనాయకుని దుకాణముదగ్గఱకుఁ బోయి, ఆతని నెక్కైన సరియైనమార్గమునకుఁ ద్రిప్పఁదలఁచుటచే నీముక్కుపుడకను గుదువఁబెట్టుకొని నాలుగువందలు మొహరీలిమ్మని యడిగెను. శ్రీనివాసుఁడు ముక్కుపుడకను జూడఁగానే గుర్తించి యిట్లనెను:- "మీ రీముక్కుపుడకను నాదగ్గఱయిచ్చిపొండు. రేపువచ్చిన నాఱుమొహరీలిచ్చెదను."

బ్రాహ్మణుఁ డంగీకరించి వెళ్లెను. శ్రీనివాసనాయకుఁడు ఆముక్కుపుడకను దన యినుపపెట్టెలో జాగ్రత్తగఁ దాఁచి, యింటికివెళ్లి 'నీముక్కుపుడక యేమైన'దని భార్య నడిగెను. ఆమె సమాధానము చెప్పలేక మెదలకుండెను. శ్రీనివాసుఁడు మండిపడిపోయెను. కారణము తాను లోభియగుటచేతను, రెండవది తానేమియు నీయక ఆఱునెలలు త్రిప్పఁగా నీమె సందేహింపక ముక్కుపుడక యిచ్చుటయే. ఆతఁడు కోపముతో మరల నిట్లనెను:— "అడుగునది నిన్నే, నీముక్కుపుడక యేమైనది? నీ వీఉదయమువఱకు ధరించియుంటివిగదా!" పతివ్రతయగు నా లక్ష్మీబాయి చాల భయపడెను. ఆమెకు భర్తయొక్క క్రోధస్వభావము బాగుగఁ దెలియును. ఆమెకు భయముచే నంతయు నంధకారబంధురమయ్యెను. ఆమె యేమియును బలుకఁ జాలక పోయెను. అప్పుడు శ్రీనివాసుఁడు గర్జించి యిట్లనెను:— "చెప్పవేమి నీముక్కుపుడక యేమైనది? ఇప్పుడే తెచ్చియిమ్ము లేదా నిన్ను బ్రదికియుండఁగనే పూడ్చిపెట్టెదను."

లక్ష్మీబాయి ముక్కుపుడక నెక్కడనుండి తెచ్చియీయఁగలదు? ఆబ్రాహ్మణు నెక్కడనుండి తేఁగలదు? దానిని దానమిచ్చినాననిన భర్త యింకను మండిపడి పోవచ్చును. చివరకామె ముక్కుపుడక లోపల యింటిలోనున్నదని లోపలికిఁబోయి వెంటనే ఆత్మహత్యచేసికొనుటకుఁ బ్రయత్నించెను. తనవద్ద రవ్వలఉంగరము కలదు. దానిని నూరి విషమును దయారుచేసెను. విషపుగిన్నెను జేతిలోఁబట్టుకొని యనన్య భక్తితో భగవంతుని యిట్లని ప్రార్థించెను:— "స్వామీ! నేను నీప్రీత్యర్థముగ ముక్కుపుడకను దానముచేసినాను. భిక్షుక బ్రాహ్మణవేషముతో నీవే వచ్చినావని నేను నమ్మితిని. నీవు ద్రౌపదీమానసంరక్షణమును గావించితివి. ధ్రువ, ప్రహ్లాద, అజామిళాదుల నుద్ధరించితివి. న న్నుద్ధరింపవా? నేను జీవింపఁగోరుటలేదు. నన్ను నీచరణసన్నిధికిఁ జేర్చి, నాపతియొక్క బుద్ధిని నిర్మలము గావింపుము. ఆతఁడు నీస్మరణము చేయునట్లును, సాధుబ్రాహ్మణులను, దీనదుఃఖులకు ముక్తహస్తముతో సేవచేయునట్లును చేయుము." ఇట్లు ప్రార్థించి లక్ష్మీబాయి ఆవిషపుగిన్నెను నోటిదగ్గఱకుఁ బెట్టుకొనఁబోవుచుండఁగా టపక్కున నేదియో అచ్చట పడెను. లక్ష్మీబాయి ఉలికిపడెను. కన్నులు దెఱచి చూచునప్పటి కచ్చట ముక్కుపుడక పుట్టినది. నలువైపులఁ జూచెను. కాని గదితలుపులు మూయఁబడియుండెను. లోన నెవ్వరును లేరు. అప్పు డామె యానందమునకు మేఱలేకుండెను. భక్తవత్సలునిలీల యామెకు స్పృహకు వచ్చెను. ఆమె గద్గదకంఠముతో మరల స్తుతించెను. అనంతర మాముక్కుపుడకను గైకొని భర్తదగ్గఱకుఁ బోయెను.

మఱునాఁడు నిన్నటిబ్రాహ్మణుఁడు నూఱుమొహరీలకొఱకు వచ్చిన నేమి చేయవలయునని శ్రీనివాసుఁ డాలోచించుచుండఁగా భార్యచేతిలోని ముక్కుపుడకను గాంచి యాతఁడు చాల యాశ్చర్యముఁ జెందెను. దుకాణపుపెట్టె తాళపుచేతులు తనదగ్గఱనే యుండెను. ఆతనికి నమ్మకము కలుగక దానిని దనచేతులలోనికిఁ దీసికొనిచూచిన నట్లే యుండెను. వెంటనే దుకాణమునకు వెళ్లిచూడఁగా అచ్చట ఆవస్తువు లేకుండెను. తాళము వేసియేయుండెను. అప్పు డాతనికి విచారణ కలుగనారంభించెను. "ఆతఁ డిట్లనుకొనెను:—ఇది యేమిలీల? ఆబ్రాహ్మణుఁ డెవరు? ఇది పెట్టెనుండి లక్ష్మీబాయిచేతిలోని కెట్లు వచ్చినది?" అని యిట్లాలోచించుకొనుచు శ్రీనివాసుఁ డింటికి వచ్చెను. నేఁటిసంఘటనకు లక్ష్మి ఆశ్చర్యపడుచుండెను. ఇంతలో గంభీరాకృతిని ధరించి శ్రీనివాసుఁడు ఆమెదగ్గఱకు వచ్చెను. నేఁ డాతనిలో నొకవిచిత్రపరివర్తనము కలిగెను. విశ్వముయొక్క వినశ్వరత ఆతనికంటికి ప్రత్యక్షముగఁ గనఁబడుచుండెను. అప్పు డిట్లనుకొనెను:—"ఛీ! ఛీ! నాజీవితముకూడ ఒక జీవితమేనా? ఇంతవఱకొక్కసారైనను నాజీవితములో భగ

వంతుని ధ్యానింపలేదు. నాదియు నొకజన్మమేనా? ఒక్కకాసైన దానముచేయని కటికలోభినే నేను." అతఁడు తనభార్యతో నిట్లనెను:—"లక్ష్మీ! నిజముచెప్పుము. నీవు ముక్కుపుడక నెవరి కిచ్చితివి? ఆబ్రాహ్మణుఁ డెవఁడు? నీ కీముక్కుపుడక మరల నెట్లు లభించినది? ప్రియా! చెప్పుము. త్వరగాఁ జెప్పుము. నే నీయాశ్చర్యజనకమగు విషయమును వినఁ గుతూహలపడుచున్నాను."

పతియొక్క కాతరవాక్కులను వినఁగానే లక్ష్మీబాయికి రోమాంచమయ్యెను. ఆమె మిక్కిలి వినయమున శాంతముగ బ్రాహ్మణుఁడు దీనుఁడై తనవద్దకువచ్చి ప్రార్థించుటయును, దాను ముక్కుపుడక నిచ్చుటయును, విషము మ్రింగఁబోవుచుండ ముక్కుపుడక వచ్చుటయును వృత్తాంతమునంతయు సమగ్రముగ వర్ణించెను. ఇది వినఁగానే శ్రీనివాసునకు పూర్ణముగఁ బరివర్తనము కలిగెను. అతఁడు రెండు చేతులను జోడించి యిట్లని ప్రార్థించెను:—"నీవు బ్రాహ్మణరూపమున నావంటి లోభి వానిని యాచింపవచ్చితివి కాని నేను లోభవశమున నీకేమియును నీయకపోతిని. నశ్వరమగు ధనమును నమ్ముకొని నిన్ను మఱచితిని. నాభార్య నీ కీయఁదలఁచినను దానిపై నేను గోపపడితిని. అట్టివాఁడనైనను నా నీచతను గమనింపక నా ప్రాణప్రియ యగు పత్నిని రక్షించితివి. నన్ను నరకమునుండి కాపాడితివి." శ్రీనివాసనాయకుఁ డిట్లు పలుకుచు జడుఁడువలె నైపోయెను. అతనికన్నులనుండి అశ్రుధారలు ప్రవహించుచుండెను. అతఁడు తదేకదృష్టితోఁ దనభార్యను జూచుచుండెను. లక్ష్మీబాయి భగవల్లీల లెన్నిటినో చెప్పి తనభర్తకు చైతన్యము కలుగఁజేసెను. అతఁ డచ్చటనుండి స్నానాగారమునకుఁ బోయెను. స్నానమైనతర్వాత శ్రీనివాసనాయకుఁడు తనభార్యతోఁగూడి అనన్యభక్తితో భగవత్పూజను గావించెను. ఆసమయముననే చేతులలోఁ దులసీదళమును జలమును గైకొని 'శ్రీకృష్ణార్పణమ'స్తని తన యాస్తినంతను దానముచేయుటకు సంకల్పించెను.

శ్రీనివాసనాయకుఁడు దీనులను, దరిద్రులను, బ్రాహ్మణులను బిలిపించి తన ధనమునంతను బంచిపెట్టెను. లోభమునకు ప్రాయశ్చిత్తముగ ఫకీరయ్యెను. తన భార్యాపుత్రుల కొక గవ్వైన మిగుల్పలేదు. పాప మాతనిభార్య కేవలము తన సిందూరతిలకభూషణమును మాత్రము కొంగునఁ గట్టుకొనెను. దారిలో శ్రీనివాసుఁ డీసంగతిని దెలిసికొని దానినిగూడ పారవేయించెను. ఎవరెన్ని చెప్పినను వినలేదు. ఎవ రేమిచ్చినను బరిగ్రహించుటలేదు. ఇట్లు కొన్నిదినములకుఁ బండరిపురము జేరెను. దరిద్రుఁడగుటచే నాతఁడచ్చట ననేకములగుబాధలు పడవలసి వచ్చెను. అతఁడు ప్రతిదినము పాండురంగనిసన్నిధినిఁజేరి గానము చేయుచుండుటయు, భిక్షమునకుఁబోఁగా లభించినదానితోఁ దృప్తిపడుటయుఁ, గాలమునంతను

విఠలనాథునిభజనమందే గడుపుచుండెను. ఈవిధముగ నాతఁడు పండరిపురమునఁ బండ్రెండువత్సరము లుండి, అచ్చట ముసల్మానుల బాధ యెక్కువగానుండఁగా విజయ నగరమునకు వచ్చెను.

విజయనగరాధీశ్వరుఁడగు శ్రీకృష్ణదేవరాయలు ఇదివరలో శ్రీనివాసనాయకునితో రత్నాలవ్యాపారమును జేసియుండుటచే నాతనిని బాగుగా నెఱిఁగియుండెను. అప్పటిస్థితినిఁగాంచి మరల నిప్పుడు చూడఁగానే శ్రీకృష్ణదేవరాయలు మిక్కిలి యాశ్చర్యమును జెందెను. శ్రీకృష్ణదేవరాయలగురువు శ్రీవ్యాసరాయలు. ఈతఁడు సంస్కృతమున గొప్పపండితుఁడు, యతిశ్రేష్ఠుఁడు. ఈతఁ డెన్నో ధర్మగ్రంథములను రచించెను. ఈతనికి శిష్యులనేకులుండిరి. శ్రీనివాసుఁడును ఆతని నాశ్రయించెను. ఆతఁ డీతనిని శిష్యునిగ గ్రహించి వేద, పురాణ, శ్రుతి, స్మృతేతిహాసాదులనధ్యయనము గావింపఁ జేసి, ఆతనికి 'పురందరవిఠల్' అను దీక్షానామము నొసంగి తన జ్ఞాన, బుద్ధి, బలానుభవముచే జనతాజనార్దనుని సేవించుచు జగత్పితనుగూర్చి గానము చేయుమని యాజ్ఞనొసంగెను. ఆతఁడే తర్వాత 'పురందరదాసు' అనుపేర విఖ్యాతిని జెందెను.

దాసుఁడనఁగా సేవకుఁడు. వాస్తవమున కీవిశ్వమున నీశ్వరత్వ - దాసత్వములు రెండే కలవు. భగవంతుఁడు జగదీశ్వరుఁడు. మిగిలినవన్నియు దాసభూతములు. ఈవిశ్వములోని జీవులన్నియు భగవంతునిదాసులే. భగవంతుఁడు తనకు ప్రభువనియుఁ, దాను దాసుఁడననియు భావించి, ఆతనిమహిమమును గానము జేయుచు, నాతనియాజ్ఞానుసారముగఁ దనజీవితమును జరుపుకొనువాఁడే శ్రేష్ఠుఁడు. ఆతనిజీవనము సార్థకమైనది. శాస్త్రాజ్ఞ యిదియే. అనుభవజ్ఞులగు మహాత్ములయుపదేశ మిదియే. మనపురందరదాసు ఇట్టిహరిదాసులలో నొకఁడు. ఆతనిమహిమమును గుఱించి యాతనిగురువగు వ్యాసస్వామియే ముక్తకంఠముతో గానముచేసెను. పురందరదాసు నిజమగు దాసత్వమును గ్రహించి, లోకహితమున కనేక లీలలను బ్రదర్శించెను. ఆతనిత్యాగ మమోఘమైనది. ఆతనియాస్తినంతను దానముచేసియుండుటచే నాతనిజీవితమంతయు భిక్షాచర్యమీఁదనే గడచెను. ఇఁక నాతనిభార్య విషయము చెప్పవలసినపనియే లేదు. భర్త తెచ్చినభిక్షమును పక్వముచేసి, యతిథులకుఁ బెట్టి, తర్వాత భర్తయుఁ, బిల్లలును భోజనముచేసినతర్వాత మిగిలినది తాను దినెడిది. ఇంకను మిగిలినజలచరములు తినుగాక యని తుంగభద్రాస్రవంతిలోఁ జక్రతీర్థమునఁ గలిపెడిది. పురందరదాసుయొక్క ఆజ్ఞ యేదినమున కాదినమంతయు వ్యయముచేయవలసిన దనియే. మిగుల్పరాదు. అందుకనియే వ్యంగ్యముగ దరిద్రునింటిని 'పురందరదాసు నట్టిల్లు' అని పిలుచుచుందురు.

పురందరదాసు భగవత్ప్రేరణచేతను, గురుని యాజ్ఞచేతను గవిత్వమును బ్రారంభించెను. ఆతనిలోఁ బ్రసుప్తమైయున్న కవితాశక్తి జాగృతిచెందెను. ఆతఁడేది రచించినను భగవద్భక్తిని, తత్త్వజ్ఞానమును, వైరాగ్యమును బ్రబోధించు నవియే రచించెను. ఆతఁడు సంఘములోఁగల బాహ్యాడంబరములను, జాతిద్వేషమును, కురీతులు మొదలైనవాటిని ఖండించెను. ఎక్కడనైన మోసము, చెడ్డను గాంచెనా నిర్మోగమాటముగ దానిని ఖండించితీరవలసినదే. భక్తిజ్ఞానవైరాగ్యముల పేరు పెట్టుకొని లోకమును మోసముచేయువారికి బుద్ధిచెప్పునట్లు చేసెను. ఎచ్చట దుర్గుణముండిన నచ్చట ఖండించుటయును నెచ్చట సుగుణముండిన దాని నితరుల నుండి గ్రహించుటయును నాతని స్వభావము. ఉద్దేశ్యరహితముగ రచించిన పురందరదాసునికీర్తన మొక్కటియును లేదు. పాపాచారములను బోఁగొట్టుటకును, సన్మార్గమునం దందఱను బ్రవేశపెట్టుటకును పురందరదాసుకీర్తనలు చాలతోడ్పడినవి. ఆతఁడు స్పష్టవాది యనుట కనేకములగు నుదాహరణములు గలవు. ఒకానొకప్పుడు శ్రీకృష్ణదేవరాయలు ప్రశ్నింపఁగా నిట్లు సమాధాన మొసంగెను:—"రాజా! నేను నాభౌతిక ధనమును గొల్లపెట్టఁగా నమూల్యమగు నీశ్వరవైభవము నాకు లభించినది. నీవు రాజవు. నీవద్ద నపరిమితమగు ధనమున్నది. నీధనము గొప్పదో, నాధనము గొప్పదియో నీవే చెప్పుము." వాస్తవమునకుఁ బురందరదాసునకు దారిద్ర్యమును వరించుటచే లభించిన యా యవి నశ్వరసంపత్తితోనే భౌతికసంపత్తి తులఁదూగఁగలదు? భగవానుఁ డిట్లు చెప్పనే చెప్పియుండెను:—"యస్యాహమనుగృహ్ణామి హరిష్యే తద్ధనం శనైః" నే నెవని ననుగ్రహింపనిచ్ఛింతునో అతని విత్తంబు నే నపహరింతు"

కన్నడభాషలో దాససాహిత్యమునకు ఆదినిర్మాత పురందరదాసని చెప్పుచుందురు కాని యిది నిజముకాదు. దాససాహిత్యము పురందరునికి ముందే యుండి యుండెను. తొమ్మిదవ శతాబ్దముననే శ్రీఅచలానందదాసు దాససాహిత్యమును సృష్టించెను. ఆతర్వాత మాధవాచార్యులవారి శిష్యుఁడు నరహరితీర్థులు, ఆ తర్వాతఁ బదునైదవ, పదునాఱవ శతాబ్దములలో శ్రీపదరాయలు, శ్రీవ్యాసరాయలు మొదలగువారు దాససాహిత్యమును వృద్ధిగావించిరి. కాని పురందరదాసు దాససాహిత్యమును సమున్నతము కావించెననిమాత్రము చెప్పవచ్చును. దాససాహిత్యోద్ధారమున కాతని స్థానము మిక్కిలి యున్నతమైనది. ఆతఁడే దాససాహిత్యముయొక్క క్రమాగతనిర్మాతలసంస్థకు 'హరిదాస పంథా' లేక 'దాసకూట' మనియుఁ బేరు పెట్టెను. పురందరదాసుని నల్గురు కుమారులును నీ పంథాను వృద్ధికావించిరి. ఇప్పటికిని 'దాసకూట' మున్నది. అప్పుడప్పు డాయనుయాయులు

లోక్కుచోఁ జేరి వారికీర్తనలను బాడుకొనుచుండెదరు. దాసకూటముమూలముననే దాససాహిత్యము నశింపలేదు.

దేశము, మతముయొక్కయు అభ్యున్నతిచేతనే సాహిత్యమునకును సహాయము లభింపఁగలదు. దేశమున కుపయోగించు సాహిత్యము, సాహిత్యముద్వారా అభివృద్ధినిఁజెందు ధర్మము, వీనివలనఁ బ్రజలకు ధర్మార్థకామమోక్షములను సంపాదించుటలో సహాయత లభింపఁగలదు. వస్తుతః ఇట్టిదియే సాహిత్యము, పురందరదాసుని సాహిత్యమునకు పరమోద్దేశ్య మిదియే. ఆతఁడు సంస్కృతగ్రంథములను సహాయముగ గ్రహించెను. వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాది ధర్మగ్రంథములసారమును గ్రహించి దానిని సరసకన్నడ భాషలోఁ బ్రకటించెను. దీని కనేకోదాహరణము లీయవచ్చునుగాని స్థలాభావమున విడువఁబడినది. శ్రుతులలో సచ్చిదానందఘనబ్రహ్మను బరిపూర్ణముగఁ జెప్పఁబడినవి. దానినే పురందరదాసు ఇట్లు వచించెను.

పదనఖ పరిపూర్ణ జాను జంఘే పరిపూర్ణ, ఊరుకటి పరిపూర్ణ నాభి కుక్షి పరిపూర్ణ
శిరో బాహు పరిపూర్ణ శిరోరుహ పరిపూర్ణ, సర్వాంశ పరిపూర్ణ పురందర విఠ్ఠలా.

ఇందువలననే పురందరదాసుని గురువు వ్యాసరాయలు ఆతని కృతులకు పురందరోపనిషత్తని నామకరణమొనర్చి సన్మానించినాఁడు..

పురందరదాసు భగవన్నామమునుగూర్చి అధికముగఁ బ్రచార మొనర్చెను. అందుకనియే ఆతనిని నారదావతారమనిరి. ఈతని భగవన్నామప్రచారమువలన నగణితముగ నరనారీజనము తరించిరి. పురందరదాసు దేనిని గాంచినను దానికి తాత్త్వికరూపము నొసంగి ఆత్మాభివృద్ధి సాధనముగఁ జేసికొనెడువాఁడు. ఒకానొకఁడు హుక్కాను బీల్చుచుండఁగాఁ జూచి యిట్లు బోధించెను. "భక్తి యను హుక్కాను బీల్చి కామక్రోధములను ధూమమును బయటకు వదలివేయుము." ఒకానొకప్పుడు ఆతఁడు భిక్షమునకుఁ బోఁగా నొకయిల్లాలు తలుపులు వైచికొనెను. అప్పు డీతఁడు ఆమె తనపాపమును బయటకుఁ బోనీయకుండ దాఁచుకొనుచున్న దనెను. ఆయా యవసరములం దిట్టి సుందరసూక్తుల నెన్నిటినో వెదఁజల్లెను. స్పష్టవాదియయ్యు పురందరదా సెవ్వరికిని విరోధి కాఁడు. అందఱియెడల నాతనిపలుకుబడికలదు. ఇద్దరువ్యక్తులు కానిండు, రెండుజాతులు కానిండు, రెండుసంప్రదాయములవారు కానిండు పోట్లాడుకొనుచుండిరా వారికి నేర్పుతో సమాధానమొసంగి రాజీ చేసెడువాఁడు. అస్పృశ్యులయెడల పురందరదాసునకు చాల సహానుభూతి యుండెడిది. ఆతఁ డస్పృశ్యులయెడలఁ జెప్పిన విషయము లత్యంత ప్రశంసనీయములు. ఆతఁ డిట్లనెను:—"పరస్త్రీ, పరధనము లస్పృశ్యములు కావా? పరమేశ్వర విస్మృతి అస్పృశ్యము కాదా? వీటిని దాఁకకుఁడు."

పురందరదాసు ౪౭౫౦౦౦ శ్లోకములను రచించెనని చెప్పుచుందురు. కాని యిందులో నెన్నియో వేలు లభించుటలేదు.

ఈవిధముగఁ బురందరదాసు తన గైహికసుఖములను బరిత్యజించి, త్యాగమందు సుఖానుభూతిని జెందుచు, భక్తి జ్ఞాన వైరాగ్యములను నతుల సంపత్తిని బొంది, వానిద్వారా సంఘమునకును, సాహిత్యమునకును గొప్పసేవ చేసెను. ఆతఁడు చేసిన సేవకు సమాజ మాతనికి ఋణపడియున్నది. మన కతఁడు ముఖ్యముగఁ బ్రాతః స్మరణీయుఁడు. రమారమి నలువదిసంవత్సరములు తీర్థాటనము గావించి యాతఁడు లోకకల్యాణము గావించెను. చివరకు వి. శ. 1562వ సంవత్సరములో నెనుబదవ యేట భగవద్ధామమును జేరెను.

---

# భ క్త గ ం గా ధ ర దా సు

ఓఢ్రదేశములో జగన్నాథక్షేత్రమందు గోవిందపురమను నొక ప్రసిద్ధపుణ్య స్థలము గలదు. అచ్చట గంగాధరదాసు తనభార్యయగు శ్రీయా యనునామెతో నివసించుచుండెను. ఆసమయమున ఆరాజ్యమును బ్రతాపరుద్రచక్రవర్తి పరిపాలించుచుండెను. మన గంగాధరదాసు వైశ్యకులమునఁ బుట్టినవాఁడు. ఏదియో చిల్లరదుకాణము పెట్టుకొని భార్యయుఁ దానును భగవత్పూజనము, సాధుసేవ చేసికొనుచుఁ గాలము కడుపుకొనుచుండిరి. వీరికి సంతానములేదు. సంతానము లేదను చింతయును లేదు. చివరకు వృద్ధాప్యము సంభవించెను.

ఒకానొకదినమున గ్రామములోని స్త్రీలు సంతానము లేనికారణమున నీమెను గాంచి వ్యంగ్యముగ మాటలాడిరి. అందులకని ఆమె చాల చింతించి, పతితో నిట్లనెను:—"నాథా! గ్రామములోని స్త్రీలందఱును నన్ను ముఖము చూడరాని గొడ్డురాలుగ నెంచుచున్నారు. కొందఱు నాయెదుట నేమియు ననరు. కొందఱు నాయెదుటకే రారు. కొందఱు వచ్చి 'యీరోజున నిది యెదురుపడినది యేమి యమంగళము సంభవింపనున్నదో 'యని నేను వినునట్లుగానే పలికి పోవుచుందురు. ఏమైనఁ గానిండు నాముఖమున సంతానముగీటు లేదు. ఒకవేళ కావలయునన్నను నెట్లు లభింపఁగలదు? అయితే, ఒక్కపని చేయవచ్చును. మీారేదైన నొకబ్రాహ్మణ బాలకునకు ఉపనయనమును గావింపుఁడు, వివాహము చేయించుఁడు. లేదా ఒక దరిద్రబాలకుని కొని వానిని బుత్రభావముతోఁ బెంచుఁడు. లేదా వానిని బెంపుడు తీసికొనుఁడు."

భార్యపలికిన శోకభరితములగు వాక్కులను విని గంగాధరదాసు 'నేఁడు తప్పక నీకొకపుత్రుని దెచ్చిపెట్టెదను. వానిని జాగ్రత్తగఁ బెంచుచుండుము." అని కొంతపైకమును దీసికొని అర్చావిగ్రహము లమ్ము బజారునకుఁ బోయి, కొంతధన మొసంగి సర్వలక్షణసంపన్నమగు నొక శ్రీకృష్ణవిగ్రహమును దీసికొనివచ్చి శ్రియాదేవి కిచ్చి యిట్లనెను:—"దీనికి బాగుగా సేవాశుశ్రూషలు గావించుచుండుము. దీనివలన లోకనిర్వాహము కాఁగలదు. లోకాపవాదముక్తియు, భవబంధ విముక్తియు లభింపఁగలదు. ప్రియా! ఈతఁడే యశోదమ్మకు పుత్రభావమునఁ జరించి యామె నుద్ధరించినాఁడు. బ్రహ్మాదిదేవతలును నీతని భజించుచుందురు. ఈ ప్రభువు తప్ప జీవనోద్ధారమును గలిగించువాఁడు లేఁడు. నీకోరికలనన్నిటిని నెఱవేర్చువాఁడీ శ్రీకృష్ణుఁడే."

భర్తయొక్క ఆజ్ఞ ననుసరించి శ్రియాదేవి శ్రీకృష్ణుని అర్చావిగ్రహము నకు మార్జనస్నానాదుల నొనర్చి సింహాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టి ఉత్త మోత్తమమగు నైవేద్యములను బెట్టుచుండెడిది. వారు లోలోన నిట్లనుకొను చుండెడివారు:—"చాలకాలమునకు మాకు పుత్రుఁడు లభించినాఁడు. మే మీతని జూచుకొనుచు సుఖముగ నుండఁగలము. శరీరపాతమైన తర్వాత ముక్తిగూడ లభింపఁగలదు. ఆతనికి సేవచేయుచుండిన మిక్కిలి ఆనందముకూడ లభింపఁగలదు. తల్లికి తన పసిశిశువునం దెంతటిప్రేమ యుండునో శ్రియాదేవికికూడ యీ అర్చా విగ్రహరూపమగు శిశువునందు అట్టిప్రేమ యుండెడిది. ఆమెప్రేమ దినదినప్రవర్ధ మానమగుచుండెను. ఆమె తలయంటి అభ్యంగనము చేయించి స్నానమజ్జనాదులు కావించి, కర్పూర చందనలేపనములను నానావిధములుగఁ జేయుచుండెడిది. ఆపిల్లవానిని కౌఁగిలించుకొని, నానావిధాలంకారములతో విభూషితుని గావించు చుండెడిది. శ్రియాదేవి శిశువునకుఁ దల్లి యెట్లు చేయునో అట్లే ఆవిగ్రహ మునువ దలక చేయుచుండెడిది.

ఏదైన ద్రవ్యము ప్రాప్తించెనా దానిని ముందు పుత్రునికి నివేదించి, తర్వాత దంపతులిద్దరును దినుచుండెడువారు. భగవంతున కర్పింపక జలమును డాఁకెడు వారు కారు. ఇంకఁ ద్రాగుట యెట్లు సంభవింపఁగలదు ? వాత్సల్యభక్తిలో గంగా ధరదాసు శ్రియాకు తీసిపోఁడు. గ్రామములోనికిఁ బిల్లలకు పనికివచ్చెడువస్తు వేదైన వచ్చినచో దానిని గంగాధరదాసు తప్పని సరిగా కొనితెచ్చి బాలగోపా లున కర్పించవలసినదే. తల్లి పిల్లవాని నెల్లప్పుడును జంకను బెట్టుకొనియుండెడిది. ఒక్కక్షణమైనను ఆతనిని విడిచియుండెడిది కాదు. గంగాధరుఁడు దుకాణమునుండి మంచిమంచి మధురపదార్థములను దెచ్చిపెట్టుచుండెడువాఁడు. పుత్రునికి వంట

చేయునప్పుడును జిత్తము పుత్త్రునిపై ననే యుండెడిది. క్షణక్షణము వంటచేయుచునే మరలమరలవచ్చి పుత్త్రునిఁ జూచిపోవుచుండును. చూడఁగానే ఆమెకు చాల యానందము కలుగుచుండెడిది. ఒక్కొక్కప్పుడు వంట నాపివచ్చి యిట్లనెడిది:—నాయనా! నే నభాగ్యురాలను. నిన్నొంటరిగా వదలిపెట్టి పోవుచుందును. అని ఆశిశువు నెత్తుకొని, ముద్దిడుకొని, కౌఁగిలించుకొనెడిది. ఈదంపతులకు పుత్త్రుఁడు తప్ప సాంసారికపదార్థము లేమియు జ్ఞాపకమునకు వచ్చుటలేదు. పుత్త్రునిపైఁ దల్లికంటెఁ దండ్రికి మక్కువ మిక్కుటముగ నుండును.

ఈవిధముగ వాత్సల్యభావముతో దంపతులకు చాలకాలము గడచెను. ఒక దినమున గంగాధరదాసు భార్యతో నిట్లనెను:—"నేను దుకాణమునకు వెళ్లుచున్నాను. నాకృష్ణుని జాగ్రత్తగాఁ జూచుభారము నీదే. ఇదిగో! వీని నొక్కక్షణమైన నొంటరిగా వదలిపోరాదు." అని యిట్లు వాత్సల్యాతిశయముచేఁ జెప్పి, ఆతని చరణములందు జిత్తముంచి వాణిజ్యార్థమై వెడలెను. కొంతకాలము గడచునప్పటికి ఆతనికి పుత్త్రవియోగముచేఁ జిత్తము వ్యాకులతకలిగి, ఒక్కొక్కక్షణమొక్కొక్కయుగముగఁ దోఁచుచుండెను. అందువలన వెంటనే కొన్ని యపూర్వఫలములను, మృష్టాన్నములను, బక్ష్యాన్నములను దీసికొని గోవిందుఁడింటికి మఱలెను. పుత్త్రదర్శనకాంక్షచే వృద్ధుఁడగు గంగాధరుఁడు శరీరమును మఱచి యింటికి వెళ్లుచుండెను. మనస్సులో ననేకములగు నాలోచనము లుప్పొంగుచుండెను. "ఇంటికి వెళ్లఁగానే పుత్త్రుని దర్శింపఁగలను. ఈపదార్థముల నన్నిటిని వేలువేలుగా నివేదించెదను. వడిలోనికిఁ దీసికొని ముద్దుపెట్టుకొందును. నాసర్వస్వమును ఆతని కర్పించుకొందును. నాచేతితో ముద్దలుచేసి పాయసమును బెట్టెదను." అని యీ విధముగ ననుకొనుచు వాత్సల్యభావమున మునిఁగి దారిని బోవుచుండఁగా గ్రామములోఁ బ్రవేశింపఁగానే కాలికి ఎదురుదెబ్బ తగిలి, కాళ్లు మెలికలు పడి క్రింద పడెను. క్రిందఁ బడఁగానే ప్రాణము లెగిరిపోయెను. ప్రాణములు పోవునపు డాతనికి విరహాగ్ని ప్రజ్వలించుచుండెను. ప్రాణములు విడుచునపు డిట్లు పలికెను:—"హా అబ్బాయీ! కృష్ణా! నేను నిన్నుఁ జూడకనే పోయితిని గదా! నేను ఘోరపాపాత్ముఁడను." కృష్ణనామస్మరణము చేయుచు నాతఁడు ప్రాణములు విడిచెను. గ్రామవాసు లీవార్తను శ్రియాదేవికి వెళ్లి చెప్పిరి. ఆసమయమున నా సతీలలామ పుత్త్రునకు భోజనము సిద్ధము చేయుచుండెను. పతివియోగసమాచారమును విని భయభీతయై శోకాతురతతోఁ బుత్త్రునిదగ్గఱకుఁ బోయి యిట్లని యేడ్వఁదొడఁగెను:—"ఓరీ! నాకృష్ణా! ఓరీ! నాకృష్ణా! నీవు అరక్షితుల కాధారుఁడవు. దీనులకు మిత్త్రుఁడవు. వంశీధరుఁడవు. జగన్మోహనుఁడవు. ఓరీ! నీతండ్రి దారిలో మృతిని

జెందినాఁడు. నే నేమి చేయుదును? ఓరీ! పుత్రా! నిన్నే అడుగుచున్నాను నన్నేమి చేయుమందువో చెప్పుము." అని ఆమె విలపింపఁగాఁ జక్రధరుఁడును, విశ్వంభరుఁడును, వైకుంఠనివాసుఁడును, అంతర్యామియు, సర్వాంతర్వర్తియు, సర్వులమనోభావముల నెఱిఁగినవాఁడును, స్వతంత్రుఁడయ్యును భక్తవశుఁడై భక్త వత్సలుఁడైన భగవంతుఁడు తల్లి వాక్కులను విని, ఆమె భక్తికి వశుఁడై ఆమె పుత్రభావమును బూర్ణ మొనర్చుటకై యిట్లనెను:—"అమ్మా! నీవు నిశ్చింతఁగా నుండుము. చింతించెద వేల? నాతండ్రి మరణింపలేదు. ఆతఁ డలసి రాళ్లమీఁద దారిలో నిద్రించుచున్నాఁడు. అబ్బాయిని ఒంటరిగా విడచి యిచ్చట నేల పడి యున్నావు? మనపిల్లవాఁడు నిన్ను పిలుచుచున్నాఁడని ఆతనిని లేపుము."

పుత్రుని వచనములను విని యామె పతికడకుఁ బోయిచూడఁగా నాతని శరీరములోఁ బ్రాణము లేదు. కాని యామె యేమిచేయఁగలదు? కృష్ణునియాజ్ఞ ననుసరించి యాతనితలమీఁదఁ జేయియుంచి యిట్లనెను:—"ప్రాణనాథా! నేను పుత్రుని ఒంటరిగా వదలి యిచ్చటికి వచ్చితిని. నాకు తోడెవరును లేరు. ఇప్పుడు వెంటనే వెళ్లుదము. మనకు పుత్రసేవయే సర్వస్వమును." ఇది వినఁగానే ఆతఁడు నిద్రించినవాఁడు మేల్కొన్నట్లు కన్నులు నులుముకొనుచు లేచి కూర్చుండెను. అప్పుడాతఁ డామెతో నిట్లనెను:—"నీ విచ్చటి కేల వచ్చితివో చెప్పుము. మన అబ్బాయి కృష్ణుఁ డెచ్చట నున్నాఁడు? వాని నొంటరిగా యెచ్చట వదలిపెట్టి వచ్చితివి?" ఆమె జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పెను. వెంటనే ఆదంపతులు 'కృష్ణకృష్ణ' యని స్మరించుచుఁ బుత్రునిదగ్గఱకువచ్చిరి. మునుముందుగా గంగాధరుఁడు ఫల ములను మిష్టాన్నములను బుత్రునకు నివేదించి, పుత్రదర్శనమున శరీరము తెలియక ఆనందమగ్నుఁడయ్యెను. ఆ నిరతిశయానందమున నాదంపతులిద్దరును దేహమును మఱచి పుత్రునెత్తుకొని ముద్దుపెట్టుకొనిరి. భక్తులగు నాదంపతులు ఒకరి తర్వాత నొకరు శ్రీకృష్ణుని జంకలోనికిఁ దీసికొని, గట్టిగాఁ గౌఁగిలించుకొని, మాటిమాటికి యెదుటకుఁ దెచ్చుకొని ఒక్కసారి చూచుకొని ముద్దిడుకొని శ్రీకృష్ణుని పూర్వము కంటెఁ గోటిరెట్లుగఁ బ్రేమించిరి. రాత్రిపూట పరుండఁబోవునపుడు వాత్సల్యభావ ముతో గంగాధరదాసు యిట్లు పలికెను:—"నాయనా! నీవియోగమును సహింప లేనైతిని! ఆఁకలిచిచ్చుకు ఆహుతివేయక తప్పదాయెను!! భోజనములేకుండ బ్రదుకఁ జాలముకదా! దానికొఱకు వ్యాపారము చేయవలసి వచ్చుచున్నదిగదా!!!" తండ్రి పలికిన ఘూపలుకులు విని యంతర్యామియగు భగవానుఁడు నవ్వి యిట్లనెను:— "నాయనా! నీవు చింతింపవలదు. నావంటిపుత్రుఁడు నీ కుండఁగా నీ కేమి కొఱత? నీకోరిక నెఱవేరునులే. నీయిల్లు ధనధాన్యములతో నిండిపోఁగలదు. ఇందుకు సందేహము లేదు."

దివ్యస్వరూపమును జూపించి యీపలుకులు పలికి భగవంతుఁ డంతర్ధానమయ్యెను. ఇల్లంతయు ధనధాన్యములతో నిండిపోయెను. కాని భగవంతుఁడు వెళ్లిపోయెను. సింహాసనము పట్టిపయ్యెను. ఇది నిజమే.—

గీ. కాముఁడుఁ డెచటనుండు రాముఁ డచ్చటలేఁడు, రాముఁ డున్నచోటఁ గాముఁడు నహి
కలిసియుండ రెపుడు గాముండు రాముఁడు, రాత్రిపవలువలె ధరిత్రియందు.

సింహాసనము పట్టిపగుటను గాంచి దంపతులు నిర్ఘాంతపడిపోయి, నేలమీఁద పడి, హతభాగ్యులమని నెత్తినెత్తి బాదుకొని యేడ్వదొడంగిరి. ఆస్థితిలోఁ బుత్రుని స్మరించుచు నిట్లనిరి:—"అయ్యో! నా లోభకారణమునఁ గృష్ణుఁడు మమ్ములను విడిచిపోయినాఁడు. నాతండ్రీ! మే మజ్ఞానులము. మాకు జ్ఞానము లేదు. దీనిలో నేను పాపబడితిని. తండ్రీ! నీవేల పొరపాటుచేసితివి? పోతే పోయితివిగాక మమ్ముల నేల వెంటఁ గొనిపోలేదు? తండ్రీ! నీవియోగమున నీపాపి ప్రాణములు నిలుపుకొని యేమిచేయఁగలఁడు?" ఈవిధముగా విలపించుచుఁ 'కృష్ణకృష్ణ' యనుచు గంగాధరుఁడు శరీరమును విడిచెను.

పతిశరీరమును ప్రియాదేవి తనతొడమీఁదఁ బరుండఁబెట్టుకొని పుత్రుని స్మరించుచు యిట్లనుకొనెను:—"నేనును ఈ క్షణభంగుర దేహమును నిలుపుకొని యేమిచేయుదును? సతీధర్మము ననుసరించి ఉదయమున సహగమన మొనరించెదను." ఇట్లనుకొనుచుండఁగనే తెల్లవారెను. ఇంటిలోని ధనమునంతను అందరికును బంచిపెట్టెను. అంతఁ జితిపేర్పించి యగ్నినివెలిఁగించి, భర్తశరీరమును దనతొడమీఁదఁ బెట్టుకొని సహగమన మొనర్చెను. ఆసమయమున దివ్యవిమానమున శ్రీమన్నారాయణుఁడు వచ్చి వారినిరువురను దానిమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని వైకుంఠమునకుఁ గొనిపోయెను. అందఱకును కేవలము దివ్యప్రకాశము మాత్రమే కనఁబడెను. ఈచరిత్రనుబట్టి విశ్వాసమే చాల ముఖ్యమైనదనియు, విశ్వాసము లేకున్న నేదియు ఫలము నీయఁజాలదనియు తెలుచున్నది.

---

# భక్త శ్రీనివాసాచార్యులు

చైతన్యమహాప్రభుని అనన్యభక్తులలో శ్రీనివాసాచార్యుఁ డొకఁడు. చైతన్యుఁడు నవద్వీపములోఁ బండితులను బరాస్తులఁ జేయుసమయమందు నవద్వీపమున కెనిమిదిమైళ్లదూరములో చాకందీ (బర్ద్వాన్ జిల్లా) గ్రామములో శ్రీగంగాధరభట్టాచార్యులవారికి జన్మించెను. గంగాధరభట్టాచార్యులు వ్యాకరణములో నసాధారణపండితుఁడు. సాధారణముగ "విద్యా దదాతివినయమ్" అని శాస్త్రములు

చెప్పుచున్నవిగాని వ్యవహారము దానికి విపరీతముగనున్నది. అయితే కొందఱు ఉదారులగుపండితులు లేకపోలేదు. అయితే మనగంగాధరు లట్టి ఉదారులే. చైతన్యుని గుణగణములను గుఱించి వినఁగానే గౌరాంగునియెడల నాతని కాదరభావ ముప్పతిల్లెను. ఆతనికి నవద్వీపము వెళ్లి గౌరాంగుని జూడవలయునని కలదు. కాని శిష్యుల కది యిష్టములేదు. తమగురు వొకానొకపండితుని ఖ్యాతిని విని పరుగిడి పోయిన తమకవమానముగఁ దోఁచెను. కాని గంగాధరుఁడు సరిపుచ్చుకొని కొన్నాళ్లు వెళ్లకుండెను గాని అ ట్లెన్నాళ్లుండఁగలఁడు ? చైతన్యచరణములం దీత నికి భక్తి యభివృద్ధిచెందుచుండెను. చైతన్యుఁడు గయాధామమునకు వెళ్లివచ్చిన తర్వాత తన పాండిత్యమునంతను మఱచి, కేవలము భగవత్ప్రేమలో మునిఁగి హరి నామకీర్తనముచే నవద్వీపవాసులనందఱను ప్రేమోన్మత్తుల నొనర్చుచున్నాఁడనివిని, యిప్పు డెవఁడును నడ్డగించువాఁడు లేకపోవుటచే గంగాధరుఁడు గౌరదర్శనము చేయ బయలుదేరెను. మహాప్రభువు సన్న్యాసమును గ్రహింప కటవా యనుచోట నున్న కేశవభారతీస్వాములవారివద్దకు వెళ్లుచున్నాఁడనుసంగతి గంగాధరునకు దారిలోఁ దెలిసి, ఆతని భక్తిభావ మింకను నుప్పొంగఁగాఁ గటవా గ్రామమునకు బోవుమార్గమును బట్టుకొనెను. వృద్ధురాలగు తల్లిని, నవయావనవతియగు భార్యను వీడి గౌరాంగుఁడు కేశవభారతివద్ద సన్న్యాసమును గ్రహించుటను, అతని భగవదను రాగమును గాంచెను. వేలకొలఁది స్త్రీలును బురుషులును నచ్చట మూఁగియుండిరి. కోమలహృదయముగల నరనారీజనమంతయుఁ గంటఁ దడిపెట్టుచుండిరి. ఈదృశ్య మును జూడఁగానే గంగాధరపండితునకు దుఃఖముప్పొంగి వెక్కివెక్కి యేడ్చి స్పృహతప్పి క్రిందఁ బడిపోయెను. స్పృహ తెలిసినతర్వాతనైన దాని నాపుకొన లేకపోయెను. కేశవభారతి నిమాయిపండితునకు శ్రీకృష్ణచైతన్యభారతి యను పేరి డెను. గంగాధరపండితుఁడు 'శ్రీకృష్ణచైతన్యుఁడు అని బిగ్గఱగా నేడ్చుచు చాకం దీకి వచ్చెను. గ్రామములోనివా రాతని చైతన్యభక్తినిఁ గాంచి యాతనికి చైతన్యదా సనునామ మొసంగిరి.

చైతన్యదాసు వివాహము చాల చిన్నతనములోనైనను సంతానము లేకుండెను. ఆతని కా చింతయును లేదు. ఆతనిభార్య వయస్సుకూడ మఱలి పోయెను. కాని భగవల్లీలలు విచిత్రములు, ఒకదినమున నాతనిమనస్సులోఁ బుత్రకాంక్ష యుద్భవించెను. ఆతనికి చైతన్యునియాశీర్వచనముపై మిక్కిలి విశ్వాసము కలదు. అందువలన నాతఁడు చైతన్యుఁడు దేశదేశాంతరములను దిరిగి పూరీకి వచ్చినాఁడనుసంగతిని దెలిసికొని వారిని దర్శింపఁబోయి, వారివలన నాశీర్వాదమును బొందెను. ఆయాశీర్వాదబలమున లక్ష్మీప్రియకు గర్భము నిలిచెను.

చివరకు వైశాఖపూర్ణిమయందు శుభముహూర్తమున నామె గర్భమునుండి శ్రీనివాసుఁ డుదయించెను. ఈశ్రీనివాసుఁడే మన శ్రీనివాసాచార్యులు.

తల్లిదండ్రుల యాచారవిచారములు సంతానమున కబ్బుచుండును. ముఖ్యముగఁ దల్లి ప్రథమగురువుకావునఁ దప్పక ఆమె యాచారవిచారములు తప్పక పట్టువడుచుండును. తల్లిపాలద్వారమున కొన్నివిద్యలుకూడ వచ్చుచుండుటను మనము వినుచున్నాము. లక్ష్మీప్రియ ధర్మపరాయణ. ఆమె యుగ్గుపాలతో భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు గుణానువాదమును వినిపించుచుండెడిది. దానిఫలితముగ నాతనికి మాటలతోడనే భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు నామములే వచ్చెను. చైతన్యునియొక్కయు నాతనిశిష్యులయొక్కయు నామము లాతనినాల్కపై నెల్లప్పు డాడుచుండెడివి. తండ్రియును గొడుకునకు భగవచ్చర్చనే వినుపించుచుండెడువాఁడు. ఈకారణమున నారంభమునుండియే ఆతనికి భగవద్భక్తి పట్టువడెను. వెంటనే యోగ్యగురువువలన విద్యనుగూడ అభ్యసించెను. అసాధారణప్రతిభావిశేషముచే నల్పకాలములోనే శ్రీనివాసుఁడు వ్యాకరణ, న్యాయ, కావ్యాలంకారాదులలో గొప్పపండితుఁ డయ్యెను. నూఱువిద్యలు వచ్చినను రాకున్నను భక్తి యాతనిహృదయములో స్థిరనివాస మేర్పఱచుకొనెను. భక్తిదేవి వెంటనే విద్యలన్నియు వాటి కవియే పరుగిడివచ్చును.

యువావస్థలోనే ఆతనికి భక్తి పట్టుబడుటచే చైతన్యదాసునకు ఆతని విషయములోఁ దప్పుమార్గమునఁ బడుననుభయము లేకుండెను. ఇంతలోనే చైతన్యదాసు స్వర్గస్థుఁడయ్యెను. లక్ష్మీప్రియయును, శ్రీనివాసుఁడు చాల దుఃఖించిరి. చివరకు శ్రీనివాసుఁడు మాతామహులఆస్తికిని అధికారియయ్యెను. తండ్రికి ఉత్తరక్రియలు చేసినతర్వాతఁ దల్లిని దీసికొని మాతామహులగ్రామమగు జాజిగ్రామమునకుఁ బోయెను. అఖండపాండితీగరిమ, అద్భుతమగుభగవద్భక్తి కలిగినశ్రీనివాసుఁ డాగ్రామమునకుఁ బోఁగానే గ్రామస్థులందఱును జాల సంతసించిరి. బంగారునకు తావి యబ్బినట్లయ్యెను. సాధారణముగ నహంకారమును గలిగించు పాండిత్యమునకు భక్తి తోడయ్యెను. జాజిగ్రామమున గల వైష్ణవ పండితులలో నీతఁడు చుక్కలలోఁ జంద్రునివలె వెలుఁగుచుండెను.

చిన్నప్పటినుండియు శ్రీనివాసుఁడు చైతన్యభక్తుఁడని చెప్పియేయుంటిమి. కాని యాతనిని జూడలేదు. కన్నులార ఆమనోహరమూర్తిని గాంచి ధన్యుఁడు కావలయునని యాతని కోరిక. కటవా నివాసియగు సర్కారు ఠాకూరనువారు చైతన్యుని భక్తులు. వారిసలహాను గ్రహించి చైతన్యుని గాంచుటకుఁ బురీకి పయన

మయ్యెను. కాని దారిలో నాతఁడు చైతన్యమహాప్రభువు అదృశ్యుఁడయ్యెనను వర్తమానమును విని స్పృహతప్పి క్రింద పడిపోయెను. ఒక్కొక్కసారి స్పృహ తెలిసి తలబాదుకొని విలపించుచు మరల మరల స్పృహ తప్పెడువాఁడు. దారిని పోవు వార లీవృత్తాంతమును దెలిసికొని వారును గంటఁ దడిపెట్టెడువారు. ఈవిధముగ నెన్నిదినములు గడచినను శ్రీనివాసునివేదన తగ్గలేదు. రాత్రులందు వుండు తీవ్ర మిక్కుటమైన ట్లీవేదనయు నధికమగుచుండెడిది. ఇంతవఱకు ఆతఁడు చైతన్యునిఁ జూడనే చూడలేదు. ఊరక ఆతని గుణగానమును వినుటచేతనే సంతోషలాభ మును బొందుచుండెడువాఁడు. చైతన్యదేవుని దర్శింపనిః యీజీవితము వ్యర్థమని యాతఁడు భావించెను. ఆతనికి వ్యాకులత అధికముకాఁగానే నిద్రాదేవి యాతని దన వడిలోనికి దీసికొనెను. ఆతనికి నిద్రలోఁ జైతన్యుఁడు దర్శనమొసంగి యి ట్లనెనుః—“నీవు శోకమును వీడి ఆలస్యముచేయకయే పురీకి రావలయును. అచ్చట గదాధరాదిభక్తులు నీకొఱకు ఎదురుచూచుచున్నారు.” కన్నులఁ దెఱవఁగానే శ్రీనివాసుని వ్యథితహృదయమునకుఁ గొంచెముగ శాంతి యీస్వప్నమువలన లభించినది. తెల్లవారఁగనే ఆతఁడు పురీకి పయనమయ్యెను.

పురీక్షేత్రమునకు శ్రీనివాసుఁడు చేరి చూడఁగా నగరములోని ప్రతిరాయి గౌరహరి విరహమునకు అశ్రువులు రాల్చుచున్నట్లుండెను. అడుగుచుఁబోయి గదా ధరునిఆశ్రమమునకుఁ జేరి చూడఁగా గదాధరుఁ డచేతనుఁడై విరహాశ్రుప్రవాహ మును గన్నులనుండి ప్రవహింపఁజేయుచుండెను. చైతన్యుని నామమును బలుకుచు శ్రీనివాసుఁ డాతనిపాదములపైఁ బడి తనదుఃఖాశ్రువులచే గదాధరుని దడుపు చుండెను. • చైతన్యునినామము చెవులలోఁ బడఁగానే మొద్దువలెఁ బడియున్న గదాధరుని శరీరములోఁ జైతన్యసంచారము కలుగసాగెను. శోకసంతప్తహృదయ మునకు శీతలత ప్రాప్తించెను. నవశక్తిని బొందినవానివలె నిద్రనుండి లేచిన వ్యక్తి వలె లేచి కూర్చుండి, పాదములపైఁ బడియుండిన శ్రీనివాసుని లేవఁదీసి కౌఁగిలించు కొని యిట్లనెనుః—“నాయనా! నీ వెవఁడవు? ఎచ్చటినుండి వచ్చితివి? అమృత మయమగు నామమును బలికి శవమువలెఁ బడియుండిన నన్ను బ్రదికించితివి. ధన్యుఁ డవు. నీకు శుభమగుఁగాక!”

ఇంతకుముందు గదాధరపండితునకును గౌరాంగమహాప్రభువు స్వప్నములోఁ గనఁబడి శ్రీనివాసుని విషయము చెప్పియుండెను. ఇప్పు డావిషయము జ్ఞాపకము నకు రాఁగా మరల నాతని నాలింగనము కావించుకొని యిట్లనెనుః—“నాయనా! నీకు భాగవతమును జెప్పుదును. దానిని త్వరగాఁ జదివి నీవు బృందావనము వెళ్ల వలయునని మహాప్రభువారి యాదేశము. అచ్చట రూప సనాతనులిద్దరును

రచించిన భక్తిశాస్త్రము నధ్యయనము గావించి గౌడప్రదేశమంతటను భక్తిభాగీ రథిని ప్రవహింపఁ జేయవలయును. నాయనా! ఒక్క చిక్కు కలదు. నాదగ్గఱనున్న భాగవతములోని అక్షరముల మీఁద నశ్రువులు పడుటచేఁ గొన్ని చెదిరిపోయినవి. కావున నొక్కపని చేయుము. నేను సర్కారు ఠాకూరు పేరట నొక ఉత్తరము వ్రాసియిచ్చెదను. దానికొఱకు నీవు రేపుఉదయముననే బయలుదేరవలయును. అతఁడొసంగెడు క్రొత్త భాగవతపుస్తకమును దీసికొని నీవు త్వరగ రావలయును. కారణమేమియనఁ జూచితివికదా నాస్థితి. నేనెప్పుడో మృత్యువాతఁ బడఁగలను.

గదాధరునివలన గౌరాంగప్రభువు నిర్ధారించిన ప్రణాళిని విని చాలయానంద మును జెంది గదాధరునియాజ్ఞను బొంది, మఱునాఁడు ప్రాతఃకాలముననే సముద్ర స్నానముగావించి, జగన్నాథుని దర్శించెను. అనంతరము సార్వభౌమాచార్యులను, రామానందరాయలు మొదలగు భక్తులను దర్శించి హరిదాసునిసమాధికడకుఁ బోయి ఆతని హరినామకీర్తననిష్ఠను స్మరణకుఁ దెచ్చుకొని యశ్రువులురాల్చి పయన మయ్యెను.

మఱునాఁడు ప్రాతఃకాలమున లేచి గదాధరపండితునిచరణములకు మ్రొక్కి గౌడదేశమునకుఁ బోయి యథాసమయమునకు శ్రీఖండమను పేరుగల గ్రామ ములోనున్న సర్కారుఠాకూరు దగ్గఱకుఁ బోయి గదాధరుఁ డిచ్చిన చీటీ నిచ్చెను. గౌరాంగుఁడు లేని శ్రీక్షేత్రము శోభించుటలేదని చెప్పెను. మహాప్రభు తిరో ధానమును గూర్చి ఠాకూరు ఇదివఱకే వినియుండినను శ్రీనివాసునివలన మఱల వినుటచే నది మఱల నూతనమయ్యెను. చైతన్యభక్తు లిద్దరును మిక్కిలి దుఃఖించిరి.

గదాధరుని యాదేశానుసారముగ సర్కారు ఠాకూరుదగ్గఱ భాగవతమును గొనివచ్చుచుండఁగాఁ బురీకి చేరకపూర్వమే దారిలో గదాధరుఁ డీలోకమును విడిచెనని తెలిసికొని మిక్కిలి దుఃఖించెను. గదాధరునికి కాలము సమీపించుటచేఁ బ్రభువు త్వరగా శ్రీనివాసునకు భాగవతము చెప్పవలయునని యాదేశించెను. కాని గదాధరుఁ డట్లుచేయక క్రొత్తపుస్తకమును దెమ్మనెను. గదాధరుని మృత్యు వార్త శ్రీనివాసుని జర్జరునిఁ గావించెను. హృదయము ముక్కలు ముక్కలైన ట్లుండెను. కన్నులనుండి జలప్రవాహము బయలుదేరెను. సూర్యచంద్రులను రాహువు గ్రసించినట్లాతనిశరీరమును శోకము గ్రసించెను. ఎటులనో కుదుటపడెను గాని కాలు పురీవైపునకుఁ బడుటలేదు. అటువెళ్లినను వ్యర్థమే కాఁగలదు. అందు వలన మరల నాతఁడు గౌడదేశమునకు మరలెను. ఆతఁడింకను గమ్యస్థానము చేరక పూర్వమే గౌరాంగుని అంతరంగులగు నిత్యానంద, అద్వైతాచార్యులిద్దరును పరమపదమును జేరిరను సమాచారమును వినెను. ఇప్పుడు శ్రీనివాసున కున్న

ధైర్యమును దొలఁగిపోయెను. ఆతని యాధారములన్నియు నొక్కటొక్కటే తెగిపోయెను. దుఃఖపర్వత మాతనితలపైఁ బడుటచే నలిగిపోయెను. సత్పురుష వియోగదుఃఖమున నాతఁడు తల బాదుకొనుచు, వెండ్రుకలను బీకికొనుచు నేలపైఁ బడి దొరలుచుండెను. సత్పురుషవియోగ మిట్టులే యుండును. గౌడదేశమునకుఁ బోయి శ్రీఖండమునకుఁ జేరినతర్వాత నాతఁడు వృత్తాంతమునంతయు సర్కారు ఠాకూరుకు విన్నవించెను. సర్కారు ఠాకురు గుండెలమీఁద రాయిపెట్టినట్లుండి, ఒక్కరితర్వాత నొక్కరు ప్రభుని పార్షదులందఱు నంతర్ధాన మగుచున్నారని చాల విలపించెను. శ్రీనివాసుఁడు కొన్నాళ్లచ్చటనే గడపి గౌరాంగప్రభువు వారి జన్మస్థలమగు నవద్వీపమునకు బ్రయాణమయ్యెను. గౌరాంగుఁడు సన్న్యాసము తీసి కొనినతర్వాత విష్ణుప్రియాదేవి పురుషుని ముఖమునైనఁ జూడని బ్రహ్మచర్యవ్రత ములో నుండి నిరంతరము హరినామస్మరణము చేయుచు రాత్రివేళమాత్రము భోజనము చేయుచుండెడిది. శ్రీనివాసుని కామెను దర్శింపవలయునను కోరిక యుం డెను. ఈతఁడు నవద్వీపమునకు రాకపూర్వమే విష్ణుప్రియాదేవి కలలో గౌరాం గుఁడు దర్శనమొసంగి శ్రీనివాసుని గుణగణములను గుఱించి చెప్పి, ఆతఁడు నవ ద్వీపమునకు వచ్చుచున్నాఁడని చెప్పెను. ఆతఁడు వచ్చినసమాచార మామెకు తెలి యఁగనే ఆతనిని రమ్మనెను. ఆతఁడు రాఁగానే సాష్టాంగప్రణామమును గావించి ఆమె యాశీర్వాదమును బొందెను. కొన్నిదినములు నవద్వీపములో నుండి విష్ణు ప్రియాదేవియాజ్ఞను బొంది అద్వైతాచార్యుని నివాసస్థలమగు శాంతిపురము నకును, నిత్యానందుని ప్రచారభూమియగు ఖడదహామునకును జూడఁబోయెను. అంత ఖానాకుల కృష్ణనగరమందు శ్రీఅభిరామగోస్వామియింటికిఁ బోయెను. ఆతఁ డీతనికి బాగుగా నాతిథ్యసత్కార మొసంగి యాతనితో నిట్లనెను:—"శ్రీనివాసా! నీవు శీఘ్రముగ బృందావనమునకుఁ బోయి గోపాలభట్టువద్ద దీక్షను గైకొనుము. అచ్చట రూప, సనాతన, రఘునాథదాసులను దర్శింపుము. ఆతర్వాతఁ జైతన్యుఁడే నీద్వారమునఁ దనకార్యమును నెఱవేర్చుకొనును. ఆతనిదయచే నీమూలమున గౌడ దేశమున భక్తిధార ప్రవహింపఁగలదు.

శ్రీనివాసుఁడు విష్ణుప్రియాదేవియాజ్ఞను బొంది బృందావనమునకు బయలు దేరెను. దారిలో చైతన్యులు సన్న్యాసమును గ్రహించినస్థలమగు కటవాను, నిత్యానందుని జన్మభూమియగు ఏకచక్రను, గయ, ప్రయాగ, అయోధ్య మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించుచు మధురకుఁ జేరెను. మధురకుఁ బోవునప్పటికి సనా తనగోస్వామి అవతారమును జాలించెననియు, బృందావనమును జేరునప్పటికి రూప గోస్వామియు, రఘునాథదాసుకూడ పరలోకము నలంకరించిరనువార్త తెలిసెను.

దీనివలన నాతనిహృదయమునకు బాధ యెక్కుడయ్యెను. బుద్ధి పనిచేయలేకపోవుచుండెను. గౌరాంగుఁ డేమిచేయింపఁదలఁచుకొనెనో యెవరికి తెలియును. ఇట్లు బాధపడుచునే చివరకు బృందావనము జీవగోస్వామియాశ్రమమునకుఁ జేరెను. జీవగోస్వామి యీతనిని గాంచి మిక్కిలి యానందించెను. ఆతఁ డిట్లనెను:—'నిన్నరాత్రియే నీయాగమనమునుగూర్చి స్వప్నము వచ్చినది.' అనంతర మీతనిని గోపాలభట్టు దగ్గఱకుఁ గొనిపోయెను. "రా నాయనా! మంచిపని చేసితివి. వచ్చితివి. నీకొఱకే యెదురుచూచుచున్నాను." అని గోపాలభట్టు పలికి చైతన్యులవారు వ్రాసిన యొకఉత్తరమును జూపించుచు నిట్లనెను:—"దీనిలోఁ జైతన్యులవారు నీవిషయమై చాల వ్రాసినాఁడు." చైతన్యుని కరకమలాంకితాక్షరములను జూడఁగానే శ్రీనివాసుఁడు భావనిమగ్నుఁడై క్రిందపడిపోయెను. శరీరము స్పృహలోనికి వచ్చిన తర్వాత జీవగోస్వామి యీతనిని తన యాశ్రమమునకుఁ గొనిపోయెను.

శుభముహూర్తమున గోపాలభట్టు ఈతనికి దీక్షాసంస్కారము కావించెను. అనంతరము జీవగోస్వామివద్ద వైష్ణవగ్రంథముల నధ్యయనము కావించెను. శ్రీనివాసునివిషయములో గౌరాంగుఁడు చెప్పిన భవిష్యద్వాణి నిజమే యయ్యెను. భక్తిశాస్త్రాధ్యయనములోనే ఆతని ప్రతిభ అద్భుతమని తెలిసెను. ఆతఁడు భక్తమండలిలో శ్రీనివాసునిఁగూర్చి యిట్లు చెప్పెను:—"మనకు సర్వస్వమగు గౌరాంగదేవుఁడు లీలాసంవరణముఁ గావించి వెళ్లిపోయెను. ఆతని వెనువెంటనే ఆతని పార్షదులును నొక్కొక్కరే వెళ్లిపోయిరి. శ్రీరూప, సనాతన, రఘునాథదాసులు భక్తశిరోమణులు. వారీనాఁడు మనమధ్యను లేరు. మనము హతప్రభులమైతిమి. వంగదేశము నిస్తబ్ధముగ నున్నది. ఆ తుషారగ్రస్తభూమికి భగవత్తత్త్వప్రకాశము ప్రసరించుట చాల అవసరము. కాని కార్యము చాలగొప్పది. ఇది యే మహాపురుషునివలననో కావలసియున్నది. నా యుద్దేశ్యమున గౌరాంగుఁడు గౌరాంగుఁడే. నిత్యానందుఁడు, అద్వైతాచార్యులు తమ తమక్షేత్రములలో నద్వితీయులు. కావున నాలోటు యెవరివల్లను బూర్తి కాఁజాలదు. కాని వారు నాటినభక్తి యను నుద్యానవనము చిగిర్చి పచ్చపచ్చగ నుండవలయునని మన యాశయము. అది నశింపరాదు. గౌరాంగునకు శ్రీనివాసాచార్యులపైఁ జాల యాశకలదు. దీనికి ప్రమాణస్వరూపముగ శ్రీచైతన్యులవారి చేతితో వ్రాసిన పత్రమొకటి కలదు. నిశ్చయముగ శ్రీనివాసాచార్యులు అసాధారణపురుషుఁడు. ఈతనిలో నద్భుతమగు ప్రతిభ కలదు. పాండిత్యమునకును గొదువ లేదు. భక్తిభావము విషయమునఁ గొదువ యేమికలదు? చైతన్యుని యాదేశమేకాక నేను స్వయముగ నీతని గుణములను గ్రహించితిని. మీకందఱకు సమ్మతమగుచో శ్రీరూపసనాతనులు రచించిన

భక్తి శాస్త్రగ్రంథములన్నిటిని జెప్పి గౌడదేశమునకుఁ బంపెదను. ఈతనివెంట నరోత్తముని, శ్యామానందుని గూడ పంపుట మంచిది. వీరీతనికి ఘనిష్ఠ మిత్రులు. కావునఁ గార్యక్షేత్రమందు ఈతనికి సహాయపడఁగలరు.

ఈప్రస్తావనమును అచ్చటనున్న వారందఱును అంగీకరించిరి. ప్రయాణము నిశ్చయమైన తర్వాత కావలసిన గ్రంథములనన్నిటిని ఒక మైనపుగుడ్డలోఁ దడియకుండునట్లు చేసి దాని నొక గట్టిపెట్టెలోఁ బెట్టి ఒక యెద్దులబండిమీఁద గౌడదేశమునకుఁ బ్రయాణమైరి. రక్షణకొఱకు ఆయుధములుధరించిన పదెనుండి సిపాయిలు పంపఁబడిరి. ఈవిధముగ నరోత్తమదాసును, శ్యామానందుని వెంటఁగొని చైతన్యుని యాజ్ఞను బరిపాలించుటకై శ్రీనివాసుఁడు బృందావనమునుండి బయలుదేరెను. వీడ్కోలుదృశ్యము అత్యంత కరుణారసయుక్తమై యుండెను. ఇరుదెసలవారికిని కన్నుల నీరు గారుచుండెను.

ముగ్గురును భగవచ్చర్చ కావించుకొనుచు క్రోసుదూరము తెలియకయే పోవుచుండిరి. వారు బాహ్యచైతన్యములేక తదేకధ్యానముతోఁ బోవుచుండిరి. ఈవిధముగ ననేక నగరములను గ్రామములను దాటుచుఁ జివరకు గౌడదేశసీమలకుఁ జేరిరి. అచ్చట బాంకుడాజిల్లాలో వనవిష్ణుపుర మను గ్రామమందు విడిసిరి. కాని యిచ్చట నొకదుర్ఘటన ప్రాప్తించెను. రాత్రి యందఱును నిద్రించుచుండఁగా బండి మీఁదఁగల పెట్టెలు ధనపుపెట్టెలనుకొని దొంగలగుంపు మొత్తపుబండిని ఒకానొక యడవికి పట్టించిరి. శ్రీనివాసాచార్యాదులు చేతులు నులుముకొనుచుఁ గూర్చుండిరి. చివరకు తెల్లవారగానే బృందావనవాసులగు సిఫాయిలను త్రిప్పి పంపవైచి ఈదుర్ఘటనమునంతను ఉత్తరముద్వారా జీవగోస్వామికి తెలిపిరి. నరోత్తమ, శ్యామానందులను గూడ వారివారియిండ్లకుఁ బంపివైచి యిట్లనెను:—"సోదరులారా! పుస్తకములు దొఱకునంతవఱకు నే నింటికిరాను. మీరు వెళ్లుఁడు."

ఈవిధముగఁ దోడువచ్చినవారిని ఇండ్లకుఁబంపి అన్యమనస్కుఁడై యా విష్ణుపురముననే సందుసందు గొందిగొంది తిరుగుచు, నేదో రెండుమెతుకులు దొఱకినఁ దినుచు నెట్లో కాలముగడుపుచుండెను. గ్రామస్థు లీతని నెవఁడో పొట్టగడుపుకొనుటకు వచ్చినవాఁడని తలఁచిరి. గ్రంథాపహరణము జరుగుటచే నూరక యేమియును దోఁచక యే చెట్టుక్రిందనో, ఏ పుట్టమీఁదనో కూర్చుండి చింతామనస్కుఁడై కాలముగడుపుచుండెను. కాని కేవలము మేఘాచ్ఛన్నతవలన సూర్యప్రకాశ మెంతసేపు దాగఁగలదు? అట్లేశ్రీనివాసాచార్యుఁడును నెక్కువదినములు బయటపడకుండ నుండలేదు. ఒకదినమున విష్ణుపురములో నున్న కృష్ణదాసను నొక బ్రాహ్మణకుమారునితోఁ జేసిన ప్రసంగమువశమున నీతఁ డొక యసాధారణవ్యక్తి యని

తెలిసికొని యాతనియందు భక్తి జనించెను. ఒకదినమున నీతనిని హమ్మీరు సభకుఁ గూడ గొనిపోయెను. అప్పు డచ్చట భాగవత పురాణ కాలక్షేపము జరుగుచుండెను. మాసి చినిఁగినగుడ్డలతో నీతఁ డొకమూల నొదిగి కూర్చుండి భాగవతమును వినుచుండెను. వినుటలోఁ గథావాచకునకు జ్ఞానము చాల కొద్దియనియు, సాహసముతోఁ దనకుఁదోఁచిన యర్థములను నేకరువుపెట్టుచున్నాఁడని గ్రహించి నిలువఁజాలక పండితుని తప్పులను సరిదిద్దుటకుఁ బ్రారంభించెను. పండితుఁ డీతని దనహీనవేషమును గాంచి యాతఁ డెవఁడో సామాన్యపు వ్యక్తి యనుకొని ఒకపరిహాసముగ నీతని పాండిత్యపుబుకాయింపులు బుకాయించెను గాని వ్యాఖ్యానగుణము లుండవనుకొనుచుండఁగానే విచిత్ర సంకటధీరముగ స్వయముగఁ జేయుట వ్యర్థమని తోఁచెను. ఈ వ్యాఖ్యానవిషయము చెప్పునపుడే యాతని ప్రజ్ఞాతిశయములు దేదీప్యమానముగ సభయందఱకును తెలిసెను. సూదంటురాయి లోహము నాకర్షించి నటుల నీతని వాక్కు రాజాహమ్మీరు నాకర్షించుటచే నాతఁ డిట్లనెను:—"స్వామీ! మీరే కొంచెముసేపు ఈ దివ్యకథామృతమును మాచే బానముచేయించి అందఱను కృతకృత్యులను గావింపుఁడు." సభయంతకును భావపరివర్తనము కలుగుటచే రాజాజ్ఞచే నిదివఱకున్న పౌరాణికుఁడు వ్యాసపీఠమును విడిచి వేఱొకచోట కూర్చుండెను. రాగద్వేషరహితుఁడై సహజస్వభావముచే వ్యాసాసనమునఁ గూర్చుండి కథను బ్రారంభించెను. శ్రోతలందఱును చిత్రలిఖితప్రతిమలవలె నగునట్లు అమృతవర్షమును గురిపించెను. భగవల్లీలలలోని రసపానమును జేయుటలోఁ దృప్తిని జెందెడువాఁడు కాఁడు. రాజాహమ్మీరునకును అశ్రుప్రవాహము బయలుదేరెను. పూర్వపు వక్తయొక్క గర్వ మడంగెను. ఆతఁ డీతనికి బ్రణామముకావించి వినయముతోఁ క్షమాపణను వేఁడుకొనెను. ఈకథవలన రాజహమ్మీరు కృతార్థుఁడైనట్లు భావించెను. ఆతని దుష్కర్మమయజీవనమునందు ఆతనికే యేవగింపుకలిగి, హృదయమందు భగవచ్చరణారవిందసేవ చేయవలెనను సంకల్పము కలిగెను. ఆతఁడు కథను రాజులు విన్నట్లు వినుచుండెను. విషయానందమున కావలనున్న యానందము కొంత యాతఁడు చవిచూచి, తాను కృతకృత్యుఁడనైనానని శ్రీనివాసుని చరణములమీఁదఁబడి, తన యశ్రుధారలచే నాతని పాదములను గడిగెను. ఏదియో ప్రసంగవశమున శ్రీనివాసుని గ్రంథములను దొంగలు దోఁచుకొనిరను విషయమును విని హమ్మీరు నీరైపోయెను. ఏలననఁగా నాతఁడు రాజు కాఁడు. దొంగల నాయకుఁడు. ఈతని జీవితము చాల దుష్కర్మలతోఁగూడినది. ధనాశచే నీతఁడు శ్రీనివాసుని బండినే మాయమొనర్చెను. పగలంతయు దారియు డొంకయును లేక తిరుగువాఁడు రాత్రికి యింటికి చేరఁగానే ఆశ్రమమును మఱచిపోవునో అట్లే పాపాతిపాపాత్ముఁడైనను భగవంతుని శరణ వేఁడినవాని యుద్ధారమునకు సందేహ ముండఁజాలదు. భగవంతుఁడు స్వయముగ నిట్లు చెప్పినాఁడు గదా!

శ్లో. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మన్తవ్యః సమగ్వ్యవసితో హిసః (గీత. ౯ - ౩౦. శ్లో.)

"ఎట్టి దురాచారుఁడైనను నన్ను అనన్యభావముతో భజించునెడల నాతనిని సాధువుగానే భావింపవలయును. వాఁడే బాగుగాఁ దెలిసినవాఁడు.

రాజు శ్రీనివాసుని క్షమాపణ వేఁడుకొని సద్గురులు వాల్మీకి ననుగ్రహించుటకు వచ్చినటుల మీరు నన్ననుగ్రహించుటకు వచ్చితిరని పలికి తన సమస్తజీవితమును నాతనిపాదముల కర్పించెను.

తర్వాత శ్రీనివాసుని ఆతఁడొక గదిలోనికిఁ గొనిపోయి గ్రంథములున్న పెట్టెలను జూపించి, అందులోనుండి ఒక్క చిన్న కాగితము ముక్కనైనఁ బోనీయలేదనెను. శ్రీనివాసునకు మరలఁ బ్రాణములు లేచివచ్చినట్లయ్యెను. ఆతఁడు వాటికి నమస్కరించెను. కొన్ని దినములు రాజున కతిథిగనుండినపిదప రా జాతనికి స్వతంత్రముగనుండుట కేర్పాటు కావించెను. ప్రతిదినము హమ్మీరుఁడు భాగవతమును వినుటయేగాక శ్రీనివాసునివద్ద మంత్రదీక్షనుగూడ గైకొనెను.

వనవిష్ణుపురమునుండి శ్రీనివాసుఁడు జాజిగ్రామమునకుఁ బోయెను. చాల రోజులైనతర్వాత కుమారుఁడు వచ్చుటను గాంచుటచే తల్లికి ప్రేమ యుప్పొంగి ఆతనిని దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దిడుకొని వీపున నిమిరెను. గ్రామవాసులును దమకు దారిచూపింపఁగలఁడని స్వాగత మొసంగిరి. శ్రీనివాసుఁ డచ్చటనే యుండి అధ్యయనము, హరినామసంకీర్తనములతోఁ గాలము గడుపుచుండెను. గొప్పగొప్ప తార్కికు లాతనివద్దకు వచ్చి, వాదించి, చివరకు ఓడిపోయి శిష్యులైరి. రామచంద్రకవి రాజతార్కికులు పండితసార్వభౌముఁడని చెప్పవచ్చును. ఆతఁడు పున శ్రీనివాసాచార్యులవద్దకు వాదమును జేయవచ్చెను. ఆధ్యాత్మ ప్రకాశమును దూరముననుండి చూచుటచేతనే తర్కబుద్ధులకు కన్నులు తిరిగి పోఁగలవు. అట్టియెడ రామచంద్ర తార్కికులు వాద వివాదములో శ్రీనివాసునితో నెట్లు నెగ్గఁగలఁడు? శ్రీనివాసుఁడును పాండిత్యములోఁ దక్కువవాఁడు కాఁడు. రామచంద్ర తార్కికులే యుక్తులను ఖండింపఁబడనివిగఁ దలఁచి ప్రయోగించుచుండెడువాఁడో వాటినన్నిటిని శ్రీనివాసుఁడు చికిత్సకుఁడు రణమును గోసి రోగిహితమును గోరినట్లు ఖండించి ఆతనికి శాశ్వతముగ మే లొనఁగూర్చెడు విషయములను బ్రతిపాదించెడువాఁడు. శిష్యవాత్సల్యముగల గురువు శిష్యునిలోపముల నెట్లు చక్కఁగఁ దెలియపఱచునో అట్లే శ్రీనివాసుఁడు రామచంద్రకవిలోపములను దెలిపెను. చివరకు రామచంద్రకవి రాజు శ్రీనివాసునకు సాష్టాంగప్రణామమును గావించి శిష్యుఁ డయ్యెను. ఘోర తార్కికుఁ డగు రామచంద్రుఁడు భక్తిపథగామి కాఁగానే తార్కికబుద్ధి పూర్తిగ

వదలిపోయెను. అనేకులగు దిగ్గజములవంటి పండితులు భక్తిపతాకముక్రిందకు వచ్చుటచే వంగదేశములోని గ్రామగ్రామములలో హరినామసంకీర్తనము వ్యాపించెను. ఇంతలోనే యీతని నతిప్రేమతోఁ జూచు యీతని తల్లి మరణించి చాల దుఃఖమును గలిగించెను గాని, భగవదుద్దిష్టకార్యమున కేమియును భంగము కలుగలేదు. తర్వాత సర్కారు ఠాకూరును, ఈతని గురువును నీతనికి బలవంతమున వివాహము కావించెను. గార్హస్థ్యజీవనము జరుపుచున్నను నీతనికి భక్తిప్రచారకార్యము వెనుకటివలెనే జరుగుచుండెను. బృందావనమునుండి వచ్చినతర్వాత మరల నీతఁడు రెండుసారు లాపుణ్యభూమిని దర్శింపఁబోయెను గాని ఆతనికి దీక్షాగురువైన గోపాలభట్టుని దర్శనము కాలేదు. ఒకసారి వెళ్లినప్పు డాయన పరమపదించెను. రెండవసారి వెళ్లినపుడు మరల నీతనికి తిరిగిరా బుద్ధిపుట్టక అచ్చటనే యుండెను. ఇప్పటికి ఆతనికార్యము నెఱవేరుటచేఁ దన యంతిమజీవనమును బృందావనములోనే గడుపుటకు నిశ్చయించుకొనెను. బృందావనవిహారియగు గోపాలుని యనుకంపచే నా పవిత్రక్షేత్రమందు హరినామసంకీర్తనము చేయుచు నీతఁడు తన యంతిమ గడియలను గడిపెను. శ్రీనివాసుని తండ్రియగు చైతన్యదాసునకుఁ జైతన్య మహాప్రభువు ఆతని కుమారునిలోఁ దన ప్రకాశముండునని చెప్పియుండెను. చైతన్యుని యాచైతన్యమయప్రకాశము అసంఖ్యాకములగు నంధకారపూర్ణహృదయములను ప్రకాశము కావించి, చివరకు సమస్తవిశ్వమందును వ్యాప్తమగు మహాప్రకాశమునఁ గలిసెను.

---

# భక్తలోచనదాసు

వంగదేశములోని బర్ద్వాన్ జిల్లాలో కోగ్రామ మనునది లోచనదాసు జన్మభూమి. ఈతని తండ్రిపేరు కమలాకరుఁడు; తల్లిపేరు సర్వానందీ దేవి. వీరు సంపన్నులు. లోచనదాసు తల్లిదండ్రులకు ఏకైకపుత్త్రుఁడు. ఆతని మాతామహులును ఆగ్రామమువారే. వారును లోచనదాసుని మిక్కిలి ప్రేమించెడువారు. ఈకారణమున నాతఁ డిటు తల్లిదండ్రులకును, నటు తాత ముత్తవ్వలకును గారాబపుబిడ్డఁ డగుటచే లోచనదాసు బాల్యము ఆటపాటలతోడనే గడిచినది కాని చదువునవసరము చిక్కలేదు.

ఈతఁ డిరువంశములవారికిని గారాబపు బిడ్డఁడైనను పూర్వసంస్కారవశముచే నీతని మనస్సు విషయములలోఁ జిక్కుకొనలేదు. ఆతఁ డాడుకొనునప్పుడు మట్టితో నిండ్లనుగట్టి మరలఁ బాడుచేసి యీవిశ్వముకూడ యింతయే. నేఁ

డుండును రేపు పోవును” అనుచుండును. నిజమున కింతయే. పిల్లలుకట్టిన యిండ్లను గాంచి తల్లిదండ్రులు నవ్వుచుందురు. పిల్ల లాయాటలో నిమగ్నులగుటను గాంచియు, మధ్య మధ్యను ఆటలో నా మట్టియిండ్లకొఱకై పోట్లాడుకొనుటను, ఏడ్చుటను నవ్వుటనుగాంచి పెద్దవా రాతనిగాంచి మూర్ఖుడని భావించుచుందురే కాని తమదశను గాంచి విచారింపరు. పార్థివపదార్థము లన్నియు దేనితోఁ జేయఁబడినవి ? రత్నములు, మణులు, బంగారము, వెండి, ఇండ్లు, వాకిండ్లు, మోటారులు, విమానములు, పండ్లు, ఫలములు, మిఠాయిలు మొదలగునవన్నియు, మట్టితోఁ జేయఁబడినవియే. మనము బాలురను గాంచి నవ్వుచుందుము. వారిని మూర్ఖులని తిట్టుచుందుము. కాని మనమే అట్టి మృద్వికారములగు వస్తువులకొఱకు ప్రయత్నించుచుందుము. భోగములకొఱకు రాత్రింబవళ్లు తిరుగుచుందుము. ప్రాణులను హింసించుచుందుము. ఇతరులతో విరోధములను పెట్టుకొనుచుందుము. ఈ మృద్వికారపదార్థములకొఱకే యిన్నికర్మాగారము లేర్పడినవి. ఈ పార్థివ పదార్థములకొఱకే యిన్ని పోరాటములు, న్యాయస్థానము లేర్పడినవి. మట్టిబొమ్మలమగు మనము మట్టి పదార్థములకై వెఱ్ఱులెత్తి తిరుగుచున్నాము. పిల్లల మట్టియిండ్లు నిమిషములో నాశనమగుచున్నవి. అట్లే మనవికాదా.

లోచనదాసుని తల్లిదండ్రులు త్వరలో మనుమని జూడఁదలంచి పదునొకండవయేటనే లోచనదాసునకు పెండ్లిచేయఁదలంచిరి. కాని దాసు వలదని యెంతగాఁ జెప్పినను తల్లిదండ్రులమాటను దిరస్కరింపలేక వివాహమాడెను. సాక్షాల్లక్ష్మీదేవివంటి కోడలిని జూచుకొని లోచనదాసుని తల్లిదండ్రులు మిక్కిలి యానందించిరి కాని లోచనదాసు మనస్సచ్చట లగ్నము కాలేదు. ఆతని మనస్సచ్చట నుండవలయునో అచ్చటనే యున్నది.

శ్రీఖండ మనుచోట చైతన్యమహాప్రభుని భక్తుడును, పండితప్రవరుఁడు నగు నరహరి నివసించుచుండెను. ఆతఁడు ప్రేమభక్తుడును, సర్వశాస్త్రార్థజ్ఞుతయు నైయుండెను. ఆదినములలో శ్రీఖండములో రాస జరిగెడిది. దూరదూరమునుండి భక్తులు వచ్చి రాసోత్సవములోఁ బాల్గొనెడువారు. లోచనదాసును గ్రామములోని బాలురతోఁగూడి శ్రీఖండమునకుఁబోయి, అచ్చట నరహరితో సత్సంగలాభమును బొందెను. లోచనదాసు నరహరివద్ద దీక్షను గైకొని శిష్యుఁడయ్యెను. ఇదివఱ కాతనికున్న యాసక్తియును బోయెను. ఆతని వైరాగ్యము శ్రీకృష్ణానురాగరూపమును మారిపోయెను. వస్తుతః వైరాగ్యవంతుఁడే శ్రీకృష్ణప్రేమకు అధికారి. సంసారభోగములం దాసక్తిగల విషయాసక్తులకు శ్రీకృష్ణునిప్రేమ యెట్లు ప్రాప్తింపఁగలదు ?

లోచనదాసు అక్కడనే యుండి మిక్కిలి వేగముగ సాధన పథములో నగ్రేసరుఁడయ్యెను. ఆతఁడు తల్లిదండ్రులను, బాలికయగు భార్యను, గ్రామమును

గృహమును, బంధువులను మఱచి భగవత్సేవలో నిమగ్నుఁ డయ్యెను. సద్గురుఁడగు నరహరియు నధికారియగు శిష్యుని యున్నతినిగూర్చియే యోచించుచుండెను.

నరహరి ప్రసిద్ధవిద్వాంసుఁడు. తమ కుమారుఁడు ఆతనికి శిష్యుఁడైనాఁడని తెలిసికొని యానందించిరి కాని ఆదంపతులు వాని నింటికి తీసికొని రాఁదలఁచిరి. కాంతామణి యనఁగా కోడలిప్పుడు యుక్తవయస్కురా లయ్యెను. పదునాఱేండ్లు వచ్చెను. ఎనిమిది సంవత్సరములక్రిందట పెండ్లినాఁ డామె భర్తముఖమును జూచెను. మఱల పతియింటికి ఒకసారి రాఁగా నప్పుడు భర్త యింట లేకుండెను. ఇంతకాలము భర్త తన విషయమునే విచారింపలేదు. అందువలన నామెకు మానసికవేదన మధికమయ్యెను. ఆమె రాత్రిందివము కన్నుల నీరు గార్చుచు నా వేడికన్నీటితో వ్యాకులహృదయమును శాంతింపఁజేసికొనఁజూచెడిది. కోడలి యీస్థితిని గాంచియు వినియు లోచనదాసుని తల్లిదండ్రులకును మిక్కిలి చింత గలిగెను. ఆమె తల్లిదండ్రులు కూఁతురి దుఃఖమును గాంచి ఆమెను అత్తవారింటికిఁ బంపిరి. అప్పుడు కమలాకరపండితుఁ డీవృత్తాంతమును లోచనదాసునకుఁ జెప్పఁగా నాతఁడు ద్రవించెను. అంత వారు లోచనదాసునకుఁ జెప్పి యొప్పించి బలవంతమున ఆమోదపుర మనుపేరుగల గ్రామమునకు అత్తగారింటికిఁ బంపిరి.

లోచనదాసు గురునాజ్ఞచే ఆమోదపురమునకుఁ జేరుకొనెను. ఇచ్చట కెంతోకాలముక్రిందట వచ్చియుండెను. అందువలన నత్తవారిల్లు గుర్తులేకుండెను. విధివిధానము వేఱుగనుండెను. గ్రామములోఁ బ్రవేశింపఁగానే ఒకసుందరస్త్రీ కనఁబడఁగా వినయముతో "అమ్మా మాయత్తవారి లెచ్చట?"నని యడుగఁగా నామె ఒక్కసారి యాతనిని గాంచి ప్రేలితో మార్గమును జూపింపఁగా నాదారిని బోయి లోచనదాసు అత్తవారిల్లు చేరెను.

రాకరాక అల్లుఁడు వచ్చుటచే నత్తమామలు చాల యానందించి స్వాగత సత్కారములు కావించి భోజన మజ్జనాదులు కావింపఁజేసెను. ప్రొద్దు క్రుంకఁగనే లోచనదాసు అత్తగారి యాజ్ఞచే నొకగదిలోనికిఁ బోఁగా నొకయువతి నిలుచుండి యుండెను. తాను గ్రామములోఁ బ్రవేశించినపుడు 'అమ్మా' యని సంబోధించిన దీమెనే. ఆమెయు నాయపరిచితపాంథుఁడు తనభర్త యని గ్రహించెను. భర్త ముఖమునుండి అసమయమున వచ్చిన 'అమ్మా' యనుశబ్దము జ్ఞాపకమునకు రాఁగా ధర్మభీరువగు నాకాంత కంపించెను. ఆమెముఖము మలినమయ్యెను. విషాదచ్ఛాయ ప్రత్యక్షముగ నామెముఖమునఁ గనఁబడుచుండెను. అల్పకాలమునకే ఆమెహృదయములోని దుఃఖము అశ్రుబిందువులరూపమున రాలెను. యువతి తనపైటకొంగుతోఁ గన్నులను దుడిచికొనుచు దూరముగఁ దొలఁగెను.

లోచనదాసుకూడ అంతయును గ్రహించెను. యువతియగు భార్యయొక్క దీనదశను గాంచఁగానే లోచనదాసుహృదయము విదీర్ణమై నోట మాట రాకుండెను.

కాల మాగదుగదా! రాత్రి గడచి తెల్లవారవచ్చెను. కాని భార్యాభర్త లిరువురును మెదలకుండిరి. ఇద్దరికన్నులనుండియు నశ్రుప్రవాహము ప్రవహించు చుండెను. నిశానాథుఁ డస్తాచలము దాటఁగానే దినేశునకు స్వాగతమొసంగ అరుణోజ్జ్వలవస్త్రములను ధరించి ఉషాదేవి వెలువడెను. ఇప్పుడు లోచనదాసు నోరు తెఱచెను. ధర్మభీరువగు లోచనదాసు విధివిధాన మనివార్యమని చెప్పి భార్యకు నచ్చఁజెప్పెను. ఆమె గద్గదస్వరములో నిట్లనెను:— 'స్వామీ! నాకు మీరే ఆరాధ్యదైవతము. మిమ్ములనుదప్ప నే నింకొక-ఈశ్వరు నెఱుఁగను. నేను నిద్రాజాగరణము లందును మిమ్మే సదా స్మరించుచుంటిని. నేను భోగలాలసను గాను. నాకు మీశరీర సుఖసరములేదు. నాకు కావలసినది హృదయము. మీరు 'అమ్మా!' యని పిలిచినదానితోఁ బత్నిభావముతో మెలఁగవలయునని నేను గోరను. మీధర్మచ్యుతిని నే నంగీకరింపను. నా కొక్కటేకోరిక. నన్ను మీ రెల్లప్పుడును మీదగ్గఱ నుంచుకొనవలెను. మిమ్ములను స్పర్శించుటకు నా కధికారము లేకున్నను మీకు సేవచేయుటకు నా కధికారమున్నది. నేను కామదాసిని కాదని మీరు గ్రహింపుఁడు. నేను ప్రేమను గాంక్షించెదను. ఈశ్వరుఁడు మీయొక్కయు నాయొక్కయు వ్రతమును రక్షించుఁగాక!"

ఈవిధముగ నామె భర్తయొక్క చరణప్రాంతమునఁ గూర్చుండి యెన్నియో విన్నవించుకొనెను. వాటిలో వెదకిచూచినను కాతరతగాని, కామలోలుపతగాని, విషాదముకాని, అధీరతగాని, భోగవాసనగాని లేదు. కేవలము కలిసియుండు కోరికమాత్రమే కలదు. దానికి లోచనదాసు అంగీకరించెను. పవిత్రశీలవ్రతమును ధరించి యిద్దరును బరమాత్మమార్గమునఁ బోవుటకు సూర్యోదయమునకుఁబూర్వమే అచ్చటినుండి బయలుదేరిరి.

ఆహా! యెట్టి యున్నతభావము! ఒక్కసారి పొరపాటున "అమ్మా" యని పిలువఁగా నామె ధర్మపత్నియైనను హృదయమును గతోపము కావించుకొని, యామెతో భర్తవలె మెలఁగు వ్యవహారమును ఆతఁడు త్యజించుటయును, భార్యభావని కంగీకరించుటయును నెంతటి ధర్మప్రియత్వము!

తల్లిదండ్రులు కాలముచెందినపిమ్మట లోచనదాసు తన ధనమునంతను బీద లకుఁ బంచి గ్రామము బయట నొక పర్ణకుటీరమును వేసికొని భార్యాభర్త లిరువురు నచ్చట భగవద్భజనము చేసికొనుచుండిరి. ఇద్దరును వయస్సులో నుండిరి. ఒక్క చోటనే యొంటరిగా నివసించుచుండిరి; కాని వారివ్రతము అవిచలముగ నుండెను.

వా రెన్నఁడును ఆత్మవిస్మృతిని జెంద లేదు. వారు ధర్మపథమునుండి యణుమాత్రమైన దిగ లేదు. ఎల్లప్పుడు నిద్దరును భగవత్ప్రేమలో మునిఁగియుండిరి. లోచనదాసునకు చైతన్యమహాప్రభుచరణములందు మిక్కుటమగు ప్రేమ. అందువలన నాతఁడు చైతన్యలీలలను వర్ణించుటకు 'చైతన్యమంగళ' మను మహాకావ్యమును వంగభాషలో రచించెను.

లోచనదాసు కుటీరములోఁ గూర్చుండి యేకాంతమునఁ జైతన్యమంగళమను నాకావ్యమును గానముచేయుచు పత్నితో నానందాశ్రువులను గార్చెడువాడు. ఈవిధముగ లోచనదాసునిభార్య యువతియయ్యు సాధనసంగిని యయ్యెను. వీరి దాంపత్యప్రేమ శ్రీకృష్ణప్రేమగాఁ బరిణమించెను. ఆ ప్రేమసుధాధార విశ్వమును పావనము చేయుచుండెను. లోచనదాసునిచిత్తము ఆనందముతో నిండిపోయెను. ఆతని చైతన్యమంగళమనుగ్రంథము వైష్ణవులకుఁ బరమప్రియమును, అమూల్యమగు గ్రంథము, దానిలోఁజైతన్యునిలీల లతిమధురభాషలోఁ జక్కనిభావములతో వర్ణింపఁబడినవి. ఇదిగాక లోచనదాసు దుర్లభసారము, వస్తుతత్త్వసారము, ఆనందలతిక, ప్రార్థన, శ్రీచైతన్యప్రేమవిలాసము, దేహనిరూపణ, రాగలహరి యను నేడుగ్రంథములను రచించెను. ఇవి వైష్ణవులకు మిక్కిలి ప్రియమగుగ్రంథములు. ఆతని జీవితమంతయును భజనకీర్తనములందును, గ్రంథరచనమందు గడిచెను. అఱువది ఆఱవయేట 1645 సం॥ పుష్యమాసమున భగవన్నామస్మరణము చేయుచు దేహమును విడిచెను. కోగ్రామమందు కునుయీనదీతీరమున నాతనిసమాధి కట్టఁబడినది. ఆతని భార్యజీవితమును భగవద్భజనములోనే గడిచెను.

---

# భక్త శ్రీధరుఁడు

వంగదేశమందు పుణ్యసమియగు భాగీరథీతీరమున నవద్వీపమను నొక నగరము కలదు. పూర్వకాలమునుండియు నది విద్యకును శాస్త్రాధ్యయనమునకును మిక్కిలి ప్రసిద్ధి చెందియుండెను. ఇచ్చట న్యాయ, వేదాంతశాస్త్రములందు దిగ్గజములవంటి పండితు లుండెడువారు. సుమారు అయిదువందల సంవత్సరములక్రిందట అచ్చట శ్రీధరుఁడను బీదబ్రాహ్మణుఁడు నివసించుచుండెను. బీదవారి నెవ రాదరించెదరు? దరిద్రునకు దాన మెవరొసంగెదరు? సాధారణముగ ధనికుల వద్ద ధూర్తులు, మోసగాండ్రు, బులిబుచ్చికపు మాటలాడువారికే ఆదరము కలుగుచుండును. అచ్చటికి బీదవారికి ప్రవేశముండదు. ఈ పేదబ్రాహ్మణునకు మాసినగుడ్డలు, చినిగిన గుడ్డలు తప్ప వేఱు లేవు. కట్టుకొనుటకు సూది దారమైనను లేదు. ఒక కప్పు

పోయినగుడిశెయే ఆతని రాజమహాలు. అదియు నగరమునకుఁ జాలదూరమునఁ గలదు. ధనికులమధ్య పేద లుండుటెట్లు?

ఈ పేదబ్రాహ్మఁ డెచ్చటనో పదిపండ్రెండుకాసుల నెచ్చటనో తెచ్చుకొని జీవనము చేయుచుండెడువాఁడు. అణాకో అణన్నఅకో ఒక పడఁగొట్టిన యరఁటి చెట్టును గొని దానిపొత్తులతో దొన్నెలు కుట్టి, గంగకుఁబోవుదారిలో నాకులను పొత్తులను బఱచి అమ్ముకొని, వచ్చినదానిలో సగమువ్యయముచే ఫలపుష్పములను గొని భగవంతు నుద్దేశించి గంగ కర్పించును. కుటీరములో భగవత్పూజ చేయు టెట్లు? గంగను విష్ణుపదియను నుద్దేశముతో భగవానుని బూజించి, మిగిలినడబ్బుతో సెనగలు, మరమరాలు, బటానీలును గొని భగవంతునకు నివేదించి భోజనము చేయును. ఆతనికుటీరములో వంటకు పాత్రములుకూడ లేవు. నీరుత్రాగుటకు చిల్లుల లోటా తప్ప యింకొకటిలేదు. ఇట్టి దీనహీన దరిద్రునిపై నెవరు కరుణ చూపుదురు?

ఆతఁడు దరిద్రుఁడయ్యు రాత్రియంతయు హరినామకీర్తనము బిగ్గఱగ చేయుటచే నాతనిఁ జూచినఁ గోపపడెడువారు చాలమంది కలరు. ఈతనినిగూర్చి జనులు నానావిధము లనుకొనుచుందురు. కొందఱు ఈదరిద్రునికి పొట్టనిండ నన్నము లేకపోవుటచే రాత్రులందు నిద్రపట్టదు. అందువలన కడుపులో మండి రాత్రియంతయు నఱచుచుండుననియు, ఈదుర్మార్గునిపాకకు నిప్పుపెట్టిన బాగుండునని కొందఱును, నిప్పుపెట్టిన ప్రక్కననున్న పాకలుకూడ తగులపడి పోఁగలవు. కావున వీకి గంగలోఁ బాఱవైచిన పీడ వదలగలదని కొందఱును, ఈదుర్మార్గుఁడు చచ్చిన మాకు సుఖముగ నిద్ర పట్టగలదని మఱికొందఱును బలుకుచుండిరి. కొందఱు శ్రీధరునకు ముఖముననే తిట్టుచుందురు. కాని యీదుర్వ్యవహారమున నాతనికి కోపము వచ్చెడిదికాదు. ఏమాత్రమును దుఃఖించెడువాఁడు కాఁడు. ఆతఁడే యితరుల వలన భయ భీతుఁడై పీడింపఁబడుచుండెడువాఁడు.

నవద్వీపములో నొకపోఁకిరి నవయువక బ్రాహ్మణ పండితుఁ డుండెడువాఁడు. ఆతని పేరు నిమాయీపండితుఁడు. ఆతఁడు నవయువకుఁడే యైనను ఆతనిని గాంచిన నానగరములోని పండితులందఱును భయపడుచు నాతనిని సన్మానించుచుండెడువారు. ఆతఁడు చక్కని గౌరవర్ణము కలవాఁడగుటచే నాతనిని గౌరాంగుఁడనియు, గౌరనియుఁ బిలుచుచుండెడువారు. తల్లిదండ్రు లాతనికి విశ్వంభరుఁడని పేరిడిరి. ఈ నిమాయి యెట్టిపోఁకిరియో ఆతని యనుచరులును నట్టివారే. సాధారణముగ విద్యార్థు లుత్పాతము కావించుచుందురు. కాని యీ యధ్యాపకపడితునకు ధూర్తత్వమబ్బుట సువర్ణమునకు సుగంధ మబ్బినట్లుండెను.

నిమాయిపండితుఁడు శ్రీధరుని దుకాణముమీఁదుగాఁ బోయెనా పాప మాతనికి కలుగుబాధ యింతని చెప్ప వీలులేదు. నిమాయి శ్రీధరునివద్ద నేదియో కొంత నియమము పెట్టుకొనెను. ఆతఁ డెంతవెలచెప్పిన దానిలోఁ సగ్గించి అప్పుగాఁ గొనుట నిమాయికి అలవాటు. ఇచ్చినను నియమకపోయిన పేరిద్దరు కలసి మాటర్షింపబడెడువారు. ఒకదినమున నిమాయి యేదియో తీసికొని అప్పుగా నీయుమనెను.

శ్రీధరుఁడు:—"లేదు బాబయ్యా! నేను ఏమి బలహీనపు దరిద్ర బ్రాహ్మణుఁడను. నామీఁద కొంచెము దయచూపుఁడు."

నిమాయి:—నేనుమాత్రము బ్రాహ్మణుఁడను గానా? దయాపాత్రుఁడను గానా?

శ్రీధరు:—బాబూ! మీరు పండితులు, ధనికులు, మాన్యులు. నేను నిర్ధనుఁడను, పేదుఁడను, దయాపాత్రుఁడను, దయ యుంచుఁడు.

నిమాయి:—నీవు నిర్ధనుఁడవు కావు. నీవద్ద చాల ధనమున్నదని అందరికి తెలియదు. నాకు తెలియును.

శ్రీధర:—బాబూ! ఆకులు, దొప్పలు వదలి లేయుఁడు, మీపాదము పట్టుకొందును.

నిమాయి:—ఇంతపొగరా? నాచేతులలో నుండి లాగుకొందువా?

శ్రీధర:—బాబూ! మీరు తీసికొనిపొండు. నాతో పోట్లాట యెందులకు? నే నోడితిని. మీరు గెలిచితిరి.

నిమాయి:—నేను ప్రతిగ్రహినా? నీసొమ్ము నూరకఁ గొనిపోవుటకు. నీవు ప్రతిదినము గంగాపూజను చేయుచున్నావే. ఆగంగ కబ్బను. కావున నాకు ఆకులు, దొప్పలు తక్కువధరేదున కీయవలెను.

శ్రీధర:—(చెవులు మూసికొని)నారాయణ! నారాయణ! పండితులు దేవతలను గౌరవించుచుందురు. మీరు పండితులయ్యును దేవతాపరాధమునకు జంకరు. హరి! హరి!!

శ్రీధరుఁడు చెవులు మూసుకొన్నప్పుడు నిమాయి ఆకులను దొప్పలను దీసికొనిపోయెను. నిమాయి కిది కౌతుకమయ్యప్రమోదముకాని పాపము శ్రీధరుని కిది మహావిపత్తు.

నిమాయి శ్రీధరుల కిట్లు ప్రతిదినమును జగడము జరుగుచుండెను.

నిమాయి దిగ్విజయీపండితుని నోడించి నాఁడనుసంగతి నవద్వీపమంతటను వ్యాపించెను. ఇప్పుడు నవద్వీపములో నిమాయిని మించినపండితుఁడు లేఁడు. శ్రీధరుఁ డిదివిని నిర్ఘాంతపడెను. "ఇట్టిపండితునికిఁ బ్రతికూలముగఁ వర్తింప నెవనికి సాహసముండును? నామొఱ యెవరు విందురు? నాకు చాల విపత్తు వచ్చిపడినది.

నవద్వీపమును వదలి యెక్కడికి వెళ్లఁగలను? ఇక్కడ పడిపోయిన పాకయైనఁ గలదు. ఇంకొకచోట స్థలమైన నుండుటకు దొరకదుకదా! ఏమి చేయుదును? భగవానుఁ డాయనకు సుబుద్ధి నొసంగుఁగాక! ఇంత ప్రతిష్ఠను సంపాదించి యింక నట్టిపనులను జేయఁ డనుకొందును" శ్రీధరుని మన స్సిట్టి చిక్కులోఁ బడిపోయెను.

నిమాయిపండితుఁడు గయకుఁ బోయెను. వెళ్లినాఁడని యందఱమనస్సులు చింతామగ్నములై యుండెను. నవద్వీపములో నంధకారము వ్యాపించినట్లుండెను. నిమాయిపండితుఁ డెప్పుడువచ్చునా యని యందఱును దినములు లెక్కించుకొను చుండిరి. అందఱున్నను నవద్వీపము శూన్యమైనట్లుండెను.

నిమాయిపండితుఁడు వచ్చినాఁడు కాని యిప్పుడు వెనుకటి నిమాయిపండితుఁడు కాఁడు. ఆతని పాండిత్య గర్వమంతయు నణఁగిపోయెను. నేత్రముల నిరంతరము నశ్రుధారలు కార్చుచు నెవనిని గాంచిన వాని కంఠమును కౌఁగిలించుకొని యి ట్లనుచుండెను:—"నాజీవితము వ్యర్థమైనది. నాప్రాణజీవనమగు కృష్ణుఁ డెచ్చట నున్నాఁడు? ఆతఁ డెచ్చట లభించునో చెప్పుము. నాప్రాణములు పోవుచున్నవి చెప్పుము." ఇ ట్లనుచుఁ గ్రిందఁబడి దుమ్ములోఁ బొరలాడును. సువర్ణఛాయకలిగిన ఆతని కమనీయ కళేబరము ధూళిధూసరితమగుచుండును. అశ్రుధారలచే నాతని గుడ్డలన్నియుఁ దడిసిపోయెడివి. "హా కృష్ణా! హా కృష్ణా!" అని అఱచుచు నేలపైఁ బడి మూర్ఛితుఁడయ్యెడు వాఁడు. స్నానాన్నపానములను మఱచెను. రాత్రింబవళ్లు స్పృహయే లేదు.

నిమాయిపండితుని యీ పరివర్తనసమాచారము మెల్ల మెల్లగా నవద్వీపమంతటను వ్యాపించెను. లోకు లనేకవిధముల ననుకొనుచుండిరి. కొందఱు "రాత్రింబవళ్లు తర్కవితర్కము లొనర్చుటచే వాయుప్రకోపమైనదనియు, కొందఱు వేడి తలకెక్కినదనియు, మఱికొందఱు నిమాయి మహాపురుషుఁడనియు, లేకున్న నంతకన్నీరు, అట్టి మూర్ఛాకంపములు సాధారణమానవున కుండఁజాలవనియు, నింకఁ గొందఱు మూఢనమ్మకములు పనికిరావనియు, నిది మృగీరోగమనియు, ఏ ట్లెన్ని నోళ్లుండిన నన్ని మాటలు పలుకుచుండిరి."

నిమాయి మూర్ఛపడఁగానే దారిని పోవువారు 'హరిబోల్ హరిబోల్' అని కేకలువేసిన మూర్ఛావిముక్తుఁ డగుచుండును. బాలబాలికలు ఈతనిని గాంచి 'హరిబోల్ హరిబోల్' యనినచో మూర్ఛితుఁ డయ్యెడువాఁడు. ఈతఁడు గౌరవర్ణముగ నుండుటచేతను, హరినామముచే నాతనిస్థితి పరివర్తనము చెందుటచేతను నాతనికి గౌరహరి యను నామమిడిరి.

నిమాయి పరమభక్తుఁడైనాఁడనియు, వెనుకటి పోఁకిరితనము, ఔద్ధత్యము లేదని విని శ్రీధరుఁ డానందముచెందెను. నిమాయి సుందరుఁడనియు, నాతని

దర్శనముచే హృదయము తృప్తిచెందుననియు, నేత్రములు చల్లఁబడుననియుఁ, బ్రాణము ఆకృష్టముచెందుననియు శ్రీధరుఁ డెఱింగియు నాతనిని దర్శించి పూజించుట కాతఁ డుత్పాతములు కావించు ననుభయముచే మానెడువాఁడు.

గౌరహరి ప్రాచీన, నవీనభక్తులందఱు తనదగ్గఱ నుండవలయు ననుకొనెడు వాఁడు. ఆతనిచరిత్రను, ప్రభావమును గాంచి ఆతని నందఱును భక్తశ్రేష్ఠుఁడనియు, మహాపురుషుఁడనియేకాదు కేవలము భగవదవతారమని తలఁచుచుండిరి.

శ్రీధరుఁడు భక్తుఁడు. అందువలనఁ దనదేశములోఁ దనగ్రామములో నీ కలి కాలములో సాక్షాద్భగవంతుఁ డవతరించినాఁడు. ఆతనిదర్శన స్పర్శనాలాపనముల వలన మహాసౌభాగ్యమును బొందవచ్చునని ఆతఁడు తలఁచుచుండెడువాఁడు.

నిమాయిపండితుఁడు మొట్టమొదట తార్కికుఁడు. భక్తులు వారిలోఁ గనఁబడినవారితో వాదవివాదములు పెట్టుకొని, వారియెదుట 'సోఽహమ్' అని యెగతాళిచేసి, ఈ యభేదవాదము వైష్ణవులకుఁ గర్ణకఠోరమగుటచే నీతనిని జూడఁగనే పాఱిపోయెడువారు. ఇప్పుడట్టివారే యీతనివెంట నెప్పుడు కనిపెట్టు కొనియుండి రక్షించుచు, పాదములకు నమస్కరించుచు నతనిసేవ దుర్లభ మనుకొనుచుండిరి.

గౌరహరి యాజ్ఞచే శ్రీవాసపండితుని ప్రాంగణమందు వైష్ణవులందఱును జేరి వీణా, మృదంగ, తాళ, శంఖ, ఘంటా, శృంగాది నాదములచే హరిసంకీర్తనము చేయుచుండెడువారు. ఇది రాత్రులందు జరుగుచుండెడిది. ఇది నిందకులకును, పాషండులకును మంచి యవకాశము చిక్కెను. వారందఱి ట్లనుకొనుచుండిరి:— "నిమాయిపండితుఁడు గొప్పవిద్వాంసుఁడు. పండితులలో నగ్రగణ్యుఁడు. కాని గయకు పోయివచ్చినది మొదలు ఈతఁడు విద్యావ్యాసంగమును మాని గోలగ నఱచుటయును, గంతులు వేయుటయును, వ్యర్థకర్మ లొనర్చుటయును జేయు చుండును. ఈతనికి దీనివలన నేమిలాభము? ఇదివఱకీగ్రామములో నొకముసలి బ్రాహ్మణుఁ డుండెడువాఁడు. ఆతఁడును ఆఁకలిబాధచే నిశ్లే నిద్రలేకుండ గోలపెట్టుచుండెడు వాఁడు, వీరందఱును దిండిలేనివారు కారే. వీరికి నిద్ర రాన ట్లున్నది. తెల్లవారువఱకు నఱచుచునేయుందురు. వీరు నిద్రపోరు, ఇతరులను బోనీయరు. తలకు వేడి యెక్కినవానికి నిద్రరాదని వినుచుందుము. వెఱ్ఱివాఁ డొక్కఁడైన సరియే, వందలకొలఁది కలరే. ఉన్మాదముకూడ అంటువ్యాధియా యేమి? వీరు తలుపులనుగూడ మూసికొందురఁట. లోన నేమి చేయుచుందురో!"

శ్రీవాసపండితుని యంగణములో హరినామసంకీర్తనసమయమున గౌరహరి యైశ్వర్యప్రకాశ మొనర్చుచున్నాఁడని విని శ్రీధరుఁ డి ట్లనుకొనెను:—"ఆహా!

నాజన్మ మెట్టిశుభ సమయమునఁ గలిగినది! భగవంతుఁడు మనుష్యాకారముతో వసుంధరపైఁ దిరుగుచున్నాఁడు. ఆతనిని దర్శింతును, స్పర్శింతును, సంభాషింతును. ఇట్లు కాకున్నను దూరమున నుండియైనఁ జూడఁజాలకపోదునా? అయితే ఆతఁడు అద్వైతాచార్యుఁడు, శ్రీవాసపండితుఁడు మొదలగువారితో నుండఁగా నాబోటి వాఁ డాతనిని జేరు టెట్లు?"

శ్రీవాసుని అంగణములోఁ గీర్తనచేయుచు గౌరహరి ఆనందావేశములో మానవనాట్యమును మఱచెను. ఐశ్వర్య ప్రకాశమయ్యెను! ఆతఁడు వెళ్లి భగవానుని సింహాసనముమీఁదఁ గూర్చుండెను. ఆతని ప్రకాశము సహస్రసూర్య ప్రభా భాసమానమై కన్నులకు మిరుమిట్లు గొలుపుచుండుటలేదు కాని ప్రకాశ ముజ్జ్వలమై, శాంతముగను శీతలముగను నుండెను. భక్తులు జయజయధ్వానములు చేయుచుండిరి. అందఱు నానందసాగరమున మునిఁగిరి. దివారాత్రముల జ్ఞానము గాని, తా మెక్కడ నున్నదియు నెవరైనదియు, నిది విశ్వమో వైకుంఠమో వారికి తెలియకుండెను. ప్రభువు ఒక్కొక్క భక్తుని బిలిచి, దర్శన మొసంగి, వరము లొసంగుచుండెను. భక్తులు వారివారి యిష్టదేవతారూపములతోఁ బ్రభుని దర్శించుచుండిరి. ప్రభు విట్లు పిలిచెను:—"శ్రీధరా! శ్రీధరా! శ్రీధరునిఁ దీసికొనిరండు" ఈమాట వినఁగానే కొందఱు శ్రీధరుని ఇంటికి పరువిడి ఆతనితో నిట్లనిరి:— "శ్రీధరా! రమ్ము! శ్రీధరా! నిన్ను ప్రభువు పిలుచుచున్నాఁడు." ప్రభువు పిలిచినాఁడను సమాచారమును వినఁగానే శ్రీధరుఁ డానందవిహ్వలుఁడై క్రిందఁ బడిపోయెను. ఆతనిమనస్సులో భావతరంగము లుప్పతిల్లెను. "ప్రభువు పిలిచినాఁడు- అనేక సహస్రజన్మలలో జప-తప-యోగ-యజ్ఞాదు లొనర్చినను దర్శన మొసంగని ప్రభువు స్వయముగఁ బిలిచినాఁడు. ఇంతకంటె జీవికి కావలసిన సౌభాగ్య మేమున్నది? ఆహాహా! జీవుని భగవానుఁడు పిలుచునా? నాబోటిదీనునిపై నింతటి దయయా? భగవంతునకు నాపై దృష్టి కలదు. భగవంతుఁడు న న్నెఱుఁగును. ఎఱుఁగుటయే కాదు పిలుచుచున్నాఁడు కూడా." ఈ భావములన్నియు శ్రీధరుని స్తబ్ధము గావించినవి. ఆతని బాహ్యేంద్రియజ్ఞానము, అంతర్జ్ఞానము లుప్తమయ్యెను. ఇంక వెళ్లున దెవరు?

ఇద్దరు ముగ్గురుభక్తు లాతనిని లేవఁదీసి, యెత్తుకొనిపోయిరి. కొందఱు దరిద్రవృద్ధబ్రాహ్మణు నెత్తుకొనిపోవుచున్నా రనుసంగతి నగరములోనివారు తెలిసికొని ఆనందమున నవ్వుచు, నృత్యము చేయుచుండిరి. పది పదునైదుగురు వెంట హరినామకీర్తనము చేయుచుఁ బరువిడుచుండిరి. నగరములోనివా రిట్లనుకొనుచుండిరి:—పాపము వృద్ధబ్రాహ్మణుఁడు గంగపాలగుచున్నాఁడు! గంగామార్గమును

వీఁడి పీ రిమ్మృతకళేబరమును నగరములోనికిఁ గొనిపోవుచున్నా రెచ్చటికి? వీనిపై నొక గుడ్డనైనఁ గప్పలేదే! అయితే వీరు నవ్వుచుఁ బోవుచున్నారేల? పిచ్చివాండ్రు కాలేదుగదా!"

శ్రీధరునిఁ గొనిపోవువారల కీమాటలు నగరములోనివారు పలుకుచున్న గుర్తే లేదు. వా రానందములోఁ దాండవమాడుచుండిరి. ప్రభువువారియాజ్ఞను బాలించుచుండిరి. వారు శ్రీధరుని మూర్ఛితుఁడై యుండఁగానే శ్రీవాసపండితుని యావరణములోఁ బరుండఁబెట్టిరి. భక్తులందఱును జుట్టును నిలుచుండి చూచుచుండిరి.

గౌరహరి మేఘగంభీరస్వరముతో 'శ్రీధరా!' యనెను. ఆశబ్దము శ్రీధరుని హృదయములో విద్యుత్తుచేసిన పనిని జేసెను. అతఁడు కన్నులు తెఱచి చూచునప్పటికి మృదు మందగతితో యమునాది ప్రవహించుచున్నట్లును, పుష్పించిన ద్రుమలతాదులపైఁ బక్షులు కలరవమొనర్చుచున్నట్లును, భ్రమరములు ఝంకారము లొనర్చుచున్నట్లు, కదంబతరుమూలమున నవజలధరగోపకిశోరుఁడు పీతాంబరమును, మయూరముకుటమును, వనమాలను ధరించి త్రిభంగ లలితభంగిమతో నిలుచుండి వేణువు నూఁదుచున్నట్లును, గోపాలబాలకు లిటునటు నాడుచున్నట్లును, గోవులు మేయుచున్నట్లును, లేఁగ లెగురుచున్నట్లును గనఁబడెను. శ్రీధరుఁడు లోలోన నిట్లనుకొనెను. "ఇదేమి? నే నెచ్చట నున్నాను? స్వప్నమును గాంచుచున్నానా? యథార్థమేనా? నేను మేల్కొనియేయున్నానే. ఇంతదూర మిచ్చటి కెట్లు వచ్చితిని?"

శ్రీధరుఁ డిట్లనుకొనుచుండఁగనే "శ్రీధరా! నన్నుఁజూడుము. నేను నీఆకులలోను, దొప్పలలోను చాలసారులు భోజనము చేసితిని. నీవు నాకు చాల ఆకులు దొప్ప లిచ్చితివి" యను శబ్దము చెవులలోఁ బడెను. "ఆకులుదొప్ప లేమిటి? ఎవరి కిచ్చితిని. ఈ విచిత్రపుఖేలన మేమి?" యని శ్రీధరుఁ డనుకొనుచుండెను. ప్రభువు నవ్వి యిట్లనెను:—"కాదు కాదు నీవీయలేదు. నేనే లాగుకొంటిని. నే నన్యాయము చేయుచుంటినని నీ వనుకొంటివి. కాని ప్రియుఁడా! నేను భక్తుని ధనము నాదియే యనుకొనుచుందును. అందువలననే ఒక్కొక్కప్పుడు లాగుకొనిపోవుచుందును. ఒక్కొక్కప్పుడు దొంగిలించుచుందును. కాని అభక్తుఁ డొసంగినదాని నేమియును గ్రహింపను."

ఇప్పుడు శ్రీధరునకు స్మరణకు వచ్చెను:—"ఆహా! ఈతఁ డునిమాయిపండితుఁడు. హా! నేను పైసకొఱకు పరమేశ్వరునితోఁ బోరాడితిని! ఛీ! నాజీవితము పాడుకాను. నేను ఘోరాపరాధిని. ఎవని నుద్దేశించి ఋషులు మునులు వేద

మంత్రములచే నగ్నియందు వ్రేల్చుచుం దనజీవితమును కృతార్థము కావించుకొను చుందురో, అట్టి హరి నాయకులను తనచేతులతో గ్రహింపఁగా నేను విదిలించి లాగుకొంటినిగదా! నాశిరస్సుపై వజ్ర మేలపడదు? ఇప్పుడు దీనికి ప్రాయశ్చిత్త మేమి? పాపమునకుఁ బ్రాయశ్చిత్తము గాని అపరాధమునకుఁ బ్రాయశ్చిత్తమేమి? భగవదపరాధమునకు శాంతి భగవానుఁడే. వెళ్లి యాతనిపదములపైఁ బడుదును. అపరాధికి కాళ్లను తాఁకుట కధికార మెక్కడిది?" ఇట్లనుకొనుచు శ్రీధరుఁడు మరల మూర్ఛిల్లెను!

ప్రభువు భక్తసంతాపమును గ్రహించి మరల మేఘ గంభీరస్వరముతో నిట్లనెను:—"శ్రీధరా! ఇటురమ్ము" శ్రీధరుఁడు లేచి మంత్రముగ్ధునివలె వెళ్లెను. హర్షవిషాదముల కలియకచే నేసుఖము లభించునో అది ఒక్కసారైనను అనుభవించినవానికే తెలియును. ఇది సుధాగరళముల కలయిక వంటిది. జీవనమరణములు ప్రతిక్షణము కలిసియుండును.

ప్రభువు తన కుడిపాదమును శ్రీధరునిశిరస్సునసుంచి యిట్లనెను:—"శ్రీధరా! నీకేమి కావలయునో అడుగుము. నీవు దారిద్ర్యముచే బీడింపఁబడుచున్నావు. గుడ్డ కుట్టుకొనుటకు సూదియైన నీకు లేదు. నీ చినిఁగినగుడ్డలలో ముడులు, దుమ్ము కలదు. నీయింటిపై గడ్డి లేదు. నేఁడు నీకు ధనము, రాజ్యము, సంపద వీనిలో నేమి కావలయునో అడిగి కైకొనుము!"

ఇప్పుడు శ్రీధరునిబాధ తగ్గెను. తనయపరాధములను మన్నింపఁబడె నను కొనెను. "ఎట్టికృప! ఆనందమానందము.

శ్లో. భృత్యస్య పశ్యతి గురూనపి నాపరాధాన్,
సేవాం మనాగపి కృతాం బహుధాభ్యుపైతి.

నేను సేవ యేమి చేసితిని? నే నీతని చేతులనుండి లాగుకొంటినే. ఎట్టివానిపై నిట్టి కృప! ఆహా!" అని అనుకొనెను. ఇట్టివిచారము లెన్నియో బయలు దేఱినవి కాని ప్రభుపాదస్పర్శానందసముద్రములో నన్నియు మునిఁగిపోయెను. ఆనంద మొక్కటియే మిగిలెను.

శ్రీధరునకు మరల నానందమూర్ఛ కలిగెను. బహిరింద్రియ, అంతరేంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము అన్నియు నానందములో లయమయ్యెను. ఈప్రేమానందము ముందు బ్రహ్మానందము కూడ తుచ్ఛమే!

శ్లో. బ్రహ్మానందో భవేదేష చేత్పరార్థగుణీకృతః,
నైతి భక్తిరసాంభోధేః పరమాణు కలామపి.

# భక్త గదాధర భట్టు

చైతన్యమహాప్రభువువారి సమకాలీనులలో గదాధరభట్టు తన మధురోపాసనచే భక్తులలో నగ్రగణ్యుఁడుగ నెన్నఁబడెడువాఁడు. ఆతఁడు సరసహృదయము కలవాఁడు. రసికుఁడు శ్రీకృష్ణభక్తుఁడు. ఎల్లప్పుడును శ్రీరాధాకృష్ణప్రేమలీలారసాస్వాదనము కావించుచుండును. ఒకానొకదినమున జీవగోస్వామివారి సన్నిధానమున నిద్దరు సాధువులు భట్టుని కీర్తనమును బాడిరి. ఆకీర్తనమును విని జీవగోస్వామి యాసాధువుల చేతికిచ్చి భట్టువద్దకు నొకయుత్తరమును బంపెను. దానిలో నీశ్లోకముండెను—

శ్లో. అనారాధ్య రాధా పదాంభోజయుగ్మం అనాశ్రిత్య బృందాటవీం తత్పదాంకామ్,
అసంభాష్య తద్భావగంభీరచిత్తాన్ కుతః శ్యామసింధో రసస్యావగాహః.

"రాధాపాదపద్మద్వయము నారాధింపకయు, బృందావనములోని యామె పాదాంకములను ఆశ్రయింపకయు, భావగంభీరచిత్తమును గూర్చి సంభాషింపకున్నచో శ్యామసింధువులో మునుఁగు టెట్లు?"

ఈ శ్లోకమును పఠించి భట్టు ప్రేమావేశమున మూర్ఛితుఁడయ్యెను. తెలివి వచ్చినతర్వాత నన్నిటిని త్యజించి బృందావనమునకు బయలుదేరెను. అచ్చట నాతఁడు చైతన్యమహాప్రభువు శరణుఁజొచ్చెను. జీవగోస్వామి ఆతనికి సంక్షేపముగ రసతత్త్వమును గూర్చి చెప్పెను. ఈతఁడు చాల మంచిహృదయము కలవాఁడు. ఉత్తమశీలము కలవాఁడు. నోట పలికిన మాట నెఱవేర్చును. నిర్మత్సరము, నిష్కామము, కృప, కరుణ వీని కాలవాలుఁడు. నిరంతరము అనన్యమనస్కుఁడై భజనముచేయుచుండును. పరమధామమునకు సేతువగు బృందావనమున నివాసము నేర్పఱచుకొనెను. నోటపలికిన పలుకులన్నియు భాగవతసుధాసూక్తులే. దుఃఖ మెఱుఁగనివాఁడు.

ఈతని విషయములో చాల మహత్త్వపూర్ణములగు సంఘటనములు ప్రసిద్ధమైనవి కలవు. వానిలో నొకటి రెండుమాత్ర మిచ్చట నుద్ధరింపఁబడుచున్నవి. భట్టు చాల బాగుగా కథను జెప్పెడువాఁడు. ఆతనికథలో రసప్రవాహము ప్రవహించుచుండెడిది. కథాశ్రవణముచేయుచుండిన శ్రోతలకన్నులవెంటఁ బ్రేమాశ్రువులు ప్రవహించెడివి. అందులో నొకమహంతునకు కన్నులనీరు రాకపోవుటచే చాల లజ్జఁజెందెను. ఒకదినమున నాతఁడొకమిరపకాయపొడిపొట్లమును వెంటఁ దెచ్చుకొనెను. ఏదైన రసప్రసంగము వచ్చునా అప్పు డాపొట్లమును గన్నులమీఁద రాచుకొనెడువాఁడు. వెంటనే కన్నుల నీరు కారెడిది. దగ్గఱనే కూర్చుండిన యొకఁడీయుక్తిని గ్రహించెను. ఆతఁడు కథ పూర్తియైనతర్వాత దీనిని భట్టునకు విన్నవించెను.

భట్టు మహాంతుచేసిన యీపనిని గూర్చి యేవగించు ననుకొనెను గాని భట్టు ఈవిషయము నింకొకవిధముగ భావించి యిట్లనెను:—"అట్లైన ఆతఁడు గొప్పమహాత్ముఁడే. నే నిప్పుడే ఆతనిని దర్శింపఁబోయెదను." భట్టు వెంటనే మహాంతునింటికి పోయెను. భట్టును జూడఁగానే తనగుట్టు నీతఁడు గ్రహించినాఁడని భావించి యేమని దూషించునో యని యనుకొనెను:— "స్వామీ! ఏవిషయమునను గఱఁగని యిట్టి కఠోర హృదయమును నా కేలఁ గల్పించితివి?" భట్టు రాఁగానే ఆతనికిఁ బ్రణామము కావించి యిట్లనెను:—"మహాంతుగారు! నిజముగ మీరు గొప్ప మహాత్ములరు. నేఁడు నాకు మీయున్నతభావము గోచరించినది. బిల్వమంగళుఁడు స్త్రీదర్శనమునఁ గన్నులను బొడుచుకొనెను. మీరు భగవద్గుణానువాదమునఁ గన్నుల నీరు రాలేదని వాటికి శిక్ష విధించితిరి. మీకును, మీభక్తికిని ధన్యవాదములు." భట్టుని సరళవాక్కులను వినఁగానే నిజముగ నానాఁడు మహాంతు హృదయము కఱఁగి, కన్నులవెంట నీరు ప్రవహింపఁజొచ్చెను. దోషములో గుణమును జూచుట యన నిదియే. సాధారణముగ సాధువుల కిట్టి గుణ ముండును.

ఒకరాత్రి దొంగ భట్టుని యింటిలోఁబడి దోఁచుకొని, సామానంతను నొక మూఁటగఁ గట్టి తీసికొనఁబోఁదలఁచెను గాని మూఁట బరువగుటచే లేవలేదు. ఇంతలో భట్టు మూత్రవిసర్జన చేయఁదలఁచి బయటకు రాఁగా నీస్థితిని గాంచి చాల జాలిపడి ప్రేమతో నిట్లనెను:—"ఇదిగో! నే నెత్తెదనులే." దొంగ భట్టును జూడఁగనే పారిపోఁదలఁచెను గాని భట్టాతని నాశ్వాసించి యిట్లనెను:—"నాయనా! పాఱిపోవు టెందులకు? భయములేదు. నీ కవసరమున్నది కావుననే యిట్టి చీఁకటిరాత్రియం దిట్టి కష్టమున కొడిగట్టితివి." దొంగ సిగ్గుపడెను. భట్టుయొక్క బలవంతముచే దొంగ మూఁటను దనయింటికిఁ గొనిపోయెను గాని యాతని మనస్సు మారిపోయెను. మఱునాఁ డా దొంగ మూఁటను దెచ్చి భట్టుముందు పడవైచి, కాళ్లమీఁదఁబడి యేడ్వఁదొడంగెను. భట్టాతనినిఁ గౌఁగిలించుకొనెను. చోరుని యంతఃకరణము శుద్ధమయ్యెను. ఇప్పు డాతఁడు నిజమైన సాధు వయ్యెను.

త్యాగమునకును, అనురాగమునకును, ప్రేమభక్తికిని ఆతఁడు మూర్తిభవించెను. ఆతఁడు రాధాతత్త్వములోను సరసమధురగీతములను రచించెను. అందులో నొకటి యిదిగో—

"జయతి శ్రీరాధికే సకలసుఖసాధికే, తరుణి నిత్య నవతన కిసోరీ।
కృష్ణ తన లీన ఘన రూప కీ చాతకీ, కృష్ణ ముఖ హిమకిరణ కీ చకోరీ॥
కృష్ణ దృగ భృంగ విశ్రామ హితపద్మినీ, కృష్ణ దృగ మృగజ బంధన సుడోరీ।
కృష్ణ అనురాగ మకరంద కీ మధుకరీ, కృష్ణ గుణగాన రస సింధు బోరీ॥
విముఖ పరచిత్త తే చిత్తజాకోసదా, కరత నిజ నాహ కీ చిత్త చోరీ।
ప్రకృతి యహ గదాధర కహాత కైసే బనై, అమిత మహిమా ఇతై బుద్ధి థోరీ॥

# లోకనాథగోస్వామి

శ్లో. కదా బృందారణ్యే విమలయమునాతీరపులినే
చరంతం గోవిందం హలధర సుదామాది సహితం,
అయే కృష్ణ స్వామిన్ మధురమురళీవాదన విభో
ప్రసీదేత్యాక్రోశన్ నిమిషమివ నేష్యామి దివసాన్.

విమలయమునానదీతటమున బృందావనమున మధురవేణువు నూదుచు బలరామ, సుదామాది ప్రియగోపకులతో నీవు చరించుచున్నట్లు నా ప్రాణనాథా! మనోహరా! నేను మనస్సులో నిలుపుకొని పిచ్చివానివలె 'కృష్ణకృష్ణ'యని యఱచుచు నాజీవితమును నిమిషమువలె గడుపుదును.

లోకనాథగోస్వామి జీవితము ఈశ్లోకమునకు చక్కని మిక్కిలి సజీవభాష్యము.

వంగదేశములో జైసోరుజిల్లాలో తాల్‌ఖడీ యను చిన్నగ్రామము కలదు. రమారమి నాల్గువందలసంవత్సరములకు పూర్వ మాగ్రామములో పద్మనాభ చక్రవర్తి యను నొకబ్రాహ్మణు డుండెను. ఈయనభార్యపేరు సీతాదేవి. సీత సీతయే. ఈదంపతులకు లోకనాథుఁ డేకైకపుత్త్రుఁడు. ఇంటిలో వైష్ణవోపాసన వంశపరంపరగ వచ్చుచుండెను. పద్మనాభచక్రవర్తి అద్వైతాచార్యుల శిష్యుఁడు. సదా ఆతనికి సేవాశుశ్రూషలు గావించుచుండును. ఈకారణమువలన లోకనాథునకు దివ్యసంస్కారములు కలిగినవి. చిన్నతనముననే బాలకునకు సంస్కృతములో మంచిజ్ఞానము లభించుటచే నెట్టికఠినగ్రంథములనైన నన్వయము చేసికొనఁగల్గుచుండెను. ఆతని యీ యలౌకిక ప్రతిభను, నిర్మలబుద్ధిని గాంచి అందఱును సంతోషించుచుండిరి. ఆతనిప్రతిభ, మేధాశక్తి లోకోత్తరములు. ఆతఁడు భక్తిపరాయణుఁడు కూడ. శ్రీకృష్ణనామ మనిన నాతని కమితప్రాణము. గోవింద, వాసుదేవ, మాధవ, నారాయణాదినామము లాతనిచెవినిఁ బడినా ఆతనిస్థితి మారుచుండెడిది. వెంటనే గద్గదికమై, కన్నుల నీరుగార్చుచు నామమును బలుకువానివైపు అదేపనిగఁ జూచుచుండును. సాంసారికవార్త లాతనికి గరళసమానములు.

ప్రేమావతారుఁడగు చైతన్యమహాప్రభువు కేవలము మానవుల ననుగ్రహించుకొఱకు వచ్చిన భగవదవతారమని శుభ్రకీర్తిని లోకనాథుఁడు విని యాకర్షింపఁబడెను. ఆతఁ డూబిలోఁ జిక్కుకొనిన నావవలె తడతడ కొట్టుకొనుచుండెను. ప్రభువు నొక్కసారి చూడవలయునని ఆతని కోరిక, లోకనాథుని యింటి

కిని నవద్వీపమునకును రెండుదినముల ప్రయాణము. సాంసారికవిషయములలో రసము లభింపకపోవుటచే రాత్రింబవళ్లు రోదనము చేయుచుండెడువాఁడు. అందఱు ననేకవిధముల ననుకొనుచుండిరి. కాని తల్లిహృదయము తల్లికే తెలియవలెను. ఆమె పుత్రునిస్థితిని గ్రహించి యేడ్చుచుఁ బుత్రుని నోదార్పఁబూనెను; కాని ఓదార్పువలన నాతనిదుఃఖ మధికమయ్యెను. ఈతఁడు తల్లిదండ్రులకు ఏకైక పుత్రుఁ డగుటచే నీతఁడు మహాప్రభువుకడకు వెళ్లి, సన్న్యాసులతోడను, సాధువుల తోడను దిరిగిన నిఁకఁ దమకు దక్కఁడని భావించి యాతనితో నిట్లనిరి:—"నాయనా! నీవు భగవత్పథమున వెళ్లఁదలఁచిన మేము అడ్డగించు టెందులకు? శ్రీహరి దయాళుఁడు. ఆతఁ డెక్కడ లేకున్నాఁడు? ఇచ్చటనేయుండి యాతనిని భజించుము, ఆతని నుపాసింపుము; కాని మమ్ములను వదలిపోవఁ జూడనేల? మాకు ఏకైక పుత్రుఁడవు కదా! నీవులేక యెట్లు జీవింపఁగలము? నీ వేమైనఁ జేసికొనుము కాని, యింటిలోనుండి చేసికొనుము."

కాని లోకనాథునిహృదయములో కొలిమి మండుచుండెను. అది యెట్లు ఆగిపోఁగలదు? తల్లిదండ్రు లొకయాలోచన చేసిన నీతఁ డొకటి చేయుచుండెను. మదించినయేనుఁగును గడ్డిపోచతోఁ గట్టఁగలమా? వారు లోకనాథుని హృదయ దాహమును వివాహమను చులకోదకముచే నార్పఁదలఁచిరి. లోకనాథుఁడిది గ్రహించి యిఁక నచ్చట నుండరాదని తల్లిదండ్రులను, ఇల్లువాఁకిండ్లను, వీడి నింక సమస్త మోహమును ద్రెంచుకొని ప్రేమమార్గమునఁ బోయెను.

ఇది శూరుల మార్గము. వీరుల పథము. పిఱికిపంద లీమార్గమునఁ బోలేరు. కోరికలు లేనివా రీమార్గమునఁ బోవలయును. దారా, సుత, బంధు, ధన, కనక వస్త్ర వాహనాదు లన్నిటియందును మోహమును వదలినవాఁడే ప్రభుసన్నిధానమునకుఁ జేరఁగలఁడు. తనతలను దనహస్తమునఁ బెట్టుకొనవలసియున్నది. తనతలపైఁ దాను నడువవలయును. అప్పుడే ప్రేమమందిరమునఁ బ్రవేశింపఁగలుగుదురు. అడుగడుగు నకును, క్షణక్షణమునకును, శరీర, ధన, జన, పరివారముపై మమకారమును వీడి, దిక్కులు చూడక, ఇక్కడుండవలయును, అక్కడుండవలయు నను నభిమానము లేక చావునకుఁగూడ సిద్ధమైనవాఁడే యీప్రేమమార్గమునకు రావలయును. ఒడ్డున నిలుచుండి విచిత్రమును గాంచువానికి ముత్యము లేల చిక్కును. ముత్యములు కావలయుననిన సముద్రములోనికి మునుఁగవలయును. ఈ ప్రేమజ్వాలను లోనసే చూచుకొనిన నమితసుఖమును బ్రసాదించును. వెలుపల విచిత్రముగఁ జూచిన వానిని మాడ్చివేయును. రామప్రేమోన్మత్తతలో నేడ్చుచున్నప్పుడు స్వామిలీలలనుగాంచి యానందపులకితుఁ డగును.

అది శరద్రాత్రి. పూర్ణచంద్రుఁడు తన స్వచ్ఛప్రకాశమును పదిదిశలఁ బఱపుచు నమృతమును వర్షింపుచుండెను. ఆచంద్రబింబమునుండి యేదియో శబ్దము వినిపించుచున్నట్లుండెను. "ఓయీ! ఏల ఆలస్యము చేయుచుంటివి? ప్రభువు నిన్ను నాలోనున్న వటవృక్షముక్రిందనుండి వేణువుతోఁ బిలుచుచున్నాఁడు. ఎన్ని జన్మములనుండియో నీవు ప్రభుని వీడి తిరుగుచుంటివి. ఇప్పుడైన నను రమ్ము" అని చంద్రుఁడు పిలుచుచున్నట్లును, నక్షత్రములు నిజమని తోడుపలికినట్లును లోకనాథునకు వినఁబడఁగా 'ఇదిగో వచ్చుచున్నా' నని ప్రేమమార్గమున బయలుదేఱెను.

లోకనాథుఁ డారాత్రియంతయును బ్రయాణము కావించెను. మఱునాఁడు సాయంత్రము సూర్యాస్తమయమువేళకు నవద్వీపమునకుఁ జేరుకొనెను. ఆఁకలిదప్పు లాతనికిఁ దోఁచలేదు. అలసట బొత్తుగా లేనేలేదు. ప్రేమమార్గమునఁ బోవువాఁడు మార్గమున నాగునా? మందిరములోని పూజారి మధ్యలో నాగునెట్లు? అతఁ డవిరామముగ నవిశ్రాంతుఁడై పోవుచునే యుండును. గంగాప్రవంతి తననాథుఁడగు సాగరునిఁ జేరువఱ కెట్లు ప్రవహించుచునే యుండునో అట్లే భగవత్సాధకుఁడు తన్ను భగవత్పదారవిందముల కర్పించుకొనువఱకును ఆగఁడు.

"మహాప్రభుదర్శనము చేయుభాగ్యము నా కబ్బునా? అతఁడు నా కాతని చరణసన్నిధిని ఆశ్రయమొసంగునా? అతఁడు నాచేయిపట్టుకొని దగ్గఱకు దీసికొనునా? అతఁడెంతో మహానుభావుఁడు. నేనో తుచ్ఛుఁడను. అతఁడు నావైపు చూచునా? అతఁడు నావైపునఁ జూచినను నాకు తరింపు కలదా? అతఁడు నన్నుఁ దనవానిఁగాఁ గొనినప్పుడే నాకు గతికలదు. నే ననధికారినని దూరముగఁ దన్నిపాఱవేయునేమో! అతనిచేఁ దన్నులు తిన్నను ఆనందము కలదు. అట్లుకాదు నే నధముఁడనైనను అతఁ డుదారుఁడు కావున నన్ను స్వీకరింపకుండునా?" హృదయ మిట్టిభావములతో నాందోళనడోలికలలో నూగుచుఁ బ్రాణము కొట్టుకొనుచుండెను.

మహాప్రభు విచ్చటనే యున్నాఁడని యెవరో చూపించినట్లుండెను. ఇది గాంచఁగానే లోకనాథునిహృదయ మొకవిచిత్రసంవేదనములోఁ బాషాణమువలె కఠినమయ్యెను. శక్తియుఁ, జైతన్యమును లుప్తమయ్యెను. కొంచెముసేపు భారమేదియో యెత్తికొన్నట్లుగ నట్లే నిశ్చేష్టుఁడై నిలువఁబడియుండెను. తెలివి వచ్చిన తర్వాతఁ జూడఁగాఁ బ్రభువు ఒకసింహాసనమున విరాజిల్లుచుండెను. ఆతనిని బరివేష్టించి శ్రీవాస, ముకుంద మురారాదిభక్తు లుండిరి. అతఁడు మహాప్రభువును జూడఁగానే కొయ్యబారి, మూగవానివలె నట్లే నిలిచిపోయెను. దారిలో ననేకవిధముల "నిట్లు చేసెదను, నట్లు చేసెదను; మహాప్రభుదర్శనము కాఁగానే ఆతని చరణములను హృదయమునకు హత్తుకొని హర్షాశ్రువులను విడిచెదను. ఆతనివడిలోఁ దలనుంచి

నావ్యథను జెప్పికొందును." అని యిట్లనుకొనెను గాని చివరకు ఇచ్చటకు వచ్చునప్పటికి పాషాణమువలె నయ్యెను.

అంగణములోఁ బ్రతిమవలె నిలువఁబడిన లోకనాథుని మహాప్రభువు గాంచి గబగబ పరువిడిపోయి లోకనాథుని తనభుజములతో గట్టిగాఁ గౌగిలించుకొనెను. ఆపవిత్రసమ్మేళనము, ఆమధురాలింగనము వాగతీతమైనది! "లోకనాథా! ఇన్నిదినములనుండి నన్ను వదలి యెచ్చట నున్నావు" అని పలుకుచుండఁ గన్నుల నీరు విడుచుచు, శరీరము తెలియక భావావేశమున లోకనాథుఁడు మహాప్రభువక్షఃస్థలమున మూర్ఛిల్లెను.

అయిదురోజులు స్వప్నమువలెఁ గడచిపోయెను. ఎక్కడేమిజరిగినదో లోకనాథునకుఁ దెలియదు. ఒక నవీనజీవనము, ఒక నవీనప్రాణము, ఒక నవీనస్ఫూర్తిచే నాతని యంగప్రత్యంగములు ఉచ్ఛ్వసితములయ్యెను. లోకనాథుఁ డిప్పుడు వెనుకటి లోకనాథుఁడు కాఁడు. మహాప్రభుని మధురపావనస్పర్శచే నాతనిరోమరోమములు పులకితములై ఆహ్లాదితము లయ్యెను. కణకణమందును కృష్ణకృష్ణశబ్దమును, రోమరోమమునను హరిహరి యను ధ్వనియు, ప్రాణప్రాణమందును ప్రభునియెడల ప్రేమ వెల్లివిరియుచుండెను. మహాప్రభువాతని హృదయసింహాసనమున నాసీనుఁడయ్యెను. లోకనాథుఁడు తనలోఁ గలిగిన నీస్వర్గీయ సుషమా సౌందర్యమునుగాంచి ముగ్ధుఁడై విమూఢుఁడయ్యెను. సంధ్యాకాలమున శరత్పూర్ణిమనాఁడు పదునాఱుకళలతోఁ జంద్రుఁ డుదయించి సమస్తలోకమును దన శీతలకాంతులచే నానందమగ్నము గావించునట్లు మహాప్రభువు లోకనాథుని హృదయాకాశమున విరాజమానుఁడై యుండెను. ఇట్టిస్థితిలో లోకనాథునకు బాహ్యప్రపంచపుస్పృహాయే లేకుండెను.

ఐదుదినము లిట్లు స్వప్నమువలె నలౌకికోన్మాదములో గడచిపోయెను. ఆఱవ దినమున మహాప్రభువు లోకనాథునిఁ బిలిచి యిట్లనెను:— "వత్సా! నీవు బృందావనమునకుఁ బొమ్ము. అచ్చట నీ జీవితశేషమును గడుపుము."

శ్లో. భ్రాత స్తిష్ఠ తలే తలే విటపినాం గ్రామేషు భిక్షామట
స్వచ్ఛందం పిబ యామునం జలమలం చీరాణి కంథాం కురు
సమ్మానం కలయాతి ఘోర గరలం నీచాపమానం సుధాం
శ్రీరాధా మురళీధరౌ భజ సఖే బృందావనం మాత్యజ.

"సోదరా! వృక్షములక్రింద నెక్కడ స్థానము దొఱకిన నచ్చట పడియుండుము. సమీపగ్రామములందు భిక్షనడిగి తెచ్చుకొనుము. స్వాచ్ఛందముగ యమునానదీజలమును గ్రోలుము. కప్పుకొనుట కొకబొంత నేర్పఱచుకొనుము. సమ్మానమును ఘోరవిషముగ గ్రహించుము. నీచులవలనఁ గలిగిన యవమానము

సమ్మతముగ భావింపుము. రాధామాధవులను భజింపుము. కాని మిత్రమా! బృందా వనమునుమాత్రము వీడకుము."

లోకనాథునకు దెబ్బకొట్టినట్లయ్యెను. ప్రభు వొసంగిన యీకోమలకఠోర మగు నాజ్ఞకు ఆతనిహృదయము కంపించెను. "ప్రభువారు నాకు తనచరణప్రాంత మున నాశ్రయ మొసంగరా? శ్రీచరణములను వదలిన నా కాశ్రయ మెచ్చట లభించును? న న్నెవరడుగుదురు? ఈదివ్యచరణములను వీడి నే నెట్లు ప్రాణమును నిలుపుకొనఁగలను? నా కీజీవనము భారము కాఁగలదు! ప్రభువారు న న్నీవిధముగా శ్రీచరణములనుండి నిర్వాసితునిఁ గావింపరాదు. నేను మీకు అబోధశిశువును గానా? న న్నెవనికి ఒప్పగింపఁదలఁచితిరి! తల్లి లేక బిడ్డ బ్రదుకఁగలదా?" అని లోక నాథుఁడు పలుకఁగా నాతనిభుజముపైఁ జేయివైచి యోదార్పువాక్కులతో మహా ప్రభు విట్లనెను:—"నీ విట్లేల పలికెదవు? నేను నిన్ను వదలఁగలనా? నన్నుగూర్చి నే నెంతగా బ్రీతినిజెంది వ్యథపడుచుందునో నీ కేమి తెలియును? నిరాశను జెంద కుము. ఇది మార్గశిరమాసము. పుష్యమాసము వెళ్లఁగానే మాఘములో నేనును సన్యాసమును గైకొందును. నీవు బృందావనమునకు మాకు దారిని దీయుము. నీవెంటఁ గొందఱువైష్ణవులుకూడ రాఁగలరు. బృందావనమునకుఁ బురాతనపు మహిమ పోయినది. ఆబృందావనములో శ్రీకృష్ణుఁ డొనర్చిన లీలాస్థానములన్నిటినిఁ బునరుద్ధింపవలసియున్నది. నీవు వెళ్లిన కొలఁదిదినములకే నీ వెనువెంట నేనును రాఁగలను. తెలిసినదా?"

ఈవిధముగ లోకనాథునకు నచ్చఁజెప్పి బృందావనమునకుఁ బంపెను. లోక నాథుఁడు బృందావనమునకు వెళ్లిన మహాప్రభుని శిష్యులలో మొదటివాఁడు. తాను సన్న్యాసమును గ్రహించువిషయము మొట్టమొదటగాఁ జెప్పినది లోక నాథునకే. చివరకుఁ దన కళేబరరూపుఁడగు నిత్యానందునకును ఒక్కదినమునకు ముందుమాత్రమే తెలిపెను. దీనినిబట్టి లోకనాథునిపైఁ బ్రభువున కెంతటిప్రేమ కలదో విదితమగుచున్నది.

మహాప్రభునియాజ్ఞను లోకనాథుఁడు తిరస్కరింపఁజాలకుండెను. కావున నాతనియాజ్ఞను బొంది మహాప్రభుచరణములకు మ్రొక్కి శ్రద్ధతోడను ప్రేమాతి రేకమునను నిట్లు నివేదించెను:—"ప్రభువారి యిష్టమే నాకును నిష్టము. ఇక నే నేమియు మాటలాడను. మీయాజ్ఞను శిరసావహించుచున్నాను. దానిని బాలిం చుటలోనే నా కానందము కలదు. నే నచ్చటకు వెళ్లి యేమిచేయవలయునో దానినిఁ గూడఁ జెప్పవలయును.

మహాప్రభువు లోకనాథుని కౌఁగిలించుకొని యశ్రుధారలచే నాతనిని స్నానముచేయించి, లోకనాథుని హృదయములో బృందావనములో జరిగిన శ్రీకృష్ణ

లీలలనన్నిటిని దర్శింపఁజేసి యిట్లనెను:—లోకనాథా! నీవు చీరఘట్టమునకుఁ బోయి, యచ్చటఁ గల కదంబ, తమాల, వకుళాది సఘనకుంజముల క్రిందఁ గూర్చుండి నీవు నీప్రేమసాధనమును జేసికొనుము.

మఱునాఁడు ప్రాతఃకాలమున లోకనాథుఁడు ప్రభువుకడ వీడ్కోలుగైకొనుటకు వచ్చి ప్రభుచరణములను తనభుజపాశమున బంధించి వెక్కి వెక్కి యేడ్చెను. ఆ సమయమున గదాధరపండితుఁడును, ఆతనిశిష్యుఁడు భూగర్భుఁడును నచ్చటనుండెను. వీడ్కోలుదృశ్యమును గాంచి గదాధరుని శిష్యుఁడు భూగర్భుఁడును బృందావనమునకు బయలుదేరెను. గదాధరుఁడును మహాప్రభువువారి యాదేశమున భూగర్భునకు సెలవొసంగెను.

నాల్గువందలసంవత్సరముల క్రిందట వంగదేశమునుండి బృందావనమునకు వెళ్లుట కెన్ని బాధలు పడవలసియుండెనో వాటిని మన మిప్పు డూహింపఁజాలము. లోకనాథ భూగర్భులును బద్ధవారు కారు. చిన్నతనముననే స్వదేశమును, ఇల్లు వాకిలి, తల్లి దండ్రులను, సుఖసౌకర్యాదుల నన్నిటిని వదలి తమభాషకూడ తెలియని పరదేశమునకు బయలుదేఱిరి. రెండుమాసముల ప్రయాణము. భిక్షాటనము తప్ప చేత నొకచిల్లిగవ్వైన సంబళము లేదు. రాజమందిరములకుఁ బోయిచూడఁగా నావినములలో రాజులు పరస్పరము విరోధించుకొనుచుండిరి. ఎక్కడచూచినను నశాంతి వ్యాపించియుండెను. వారు రాజమహాలునుండి తాజపురము, తాజపురము నుండి పూర్ణియాకు వచ్చిరి. పూర్ణియానుండి అయోధ్య, లక్నో (లక్ష్మణాపురము), ఆగ్రామీఁదుగా గోకులము చేరుకొనిరి. ఇచ్చటనే శ్రీకృష్ణుఁడు బాలలీల లొనర్చెను.

ఆరోజులలో బృందావనమిప్పటివలెఁగాక కేవలము అరణ్యమయముగ నుండెను. ముసల్మానులు అచ్చటిమందిరములను, ప్రదేశములను, విగ్రహములను, నాశముచేసివేసిరి. కొన్నికొన్ని విగ్రహములు పగిలి ముక్కలై యుండెను. యమునానది, గోవర్ధనపర్వతము తప్ప శ్రీకృష్ణలీలలకు సంబంధించిన విషయములే అచ్చట గుర్తింప వీలులేనట్లుగ నుండెను. అచ్చట నున్నవారును బృందావనేతిహాసమును మఱచిరి. భూగర్భ లోకనాథు లిద్దరును వ్యాఘ్ర భల్లూకసంకులమగు నాయరణ్యములలోఁ దిరుగ నారంభించిరి. కాని వారేమి చేయఁగలరు? మహాప్రభువువారి యాదేశపాలన మెట్లు చేయవలయునో వారికి తోఁచలేదు. వంశీవట మెచ్చటనో, నిధువన మెచ్చటనో, భాండీరవనము, శ్యామకుండము, రాధాకుండము లెచ్చటనో? ఏమి చేయవలయునో, ఎచ్చటకు వెళ్లవలయునో వారికి తెలియుటలేదు. మహాప్రభువు లేక మనకు మార్గమును జెప్పువా రెవరు? చీరఘట్ట మెచ్చటనున్నదో, తమాల, కదంబ, వకుళాదివృక్షము లెచ్చట నున్నవో వారికి తెలియలేదు. చివరకు

వారు హతాశులై తమ్ముఁ దామ రాధాకృష్ణులకు సమర్పణము గావించుకొనిరి. వారు—

గోవింద గోవింద హరే మురారే!
రాధాకృష్ణ, గోపీకృష్ణ, శ్రీకృష్ణప్యారే!

అనునామముచే నావనమంతయును ప్రతిధ్వనింపఁజేయఁగాఁ దమకు వారిజీవితశేషమును గడుపుటకు ప్రభువు వారిచే నిర్దేశింపఁబడిన చిరఘట్టముజాడ తెలిసెను.

బృందావనవాసుల కీయిద్దరును విలక్షణమగు వ్యక్తులుగఁ గనఁబడిరి. క్షణక్షణము ఏడ్చుటయును, క్షణాక్షణము నవ్వుటయును వారికర్థము కాలేదు. వారిని బోవువారి పాదములపైఁబడి వెక్కివెక్కి యేడ్చుచు శ్రీహరిదర్శనము చేయించుఁడు, అతఁ డెచ్చట నున్నాఁడో చెప్పుఁడని ప్రార్థించుచుండిరి. ఒక్కొక్కప్పుడు ఉన్మత్తులవలె బృందావనమున భూమిపైఁబడి దొరలుచు, దానిని ముద్దుపెట్టుకొనుచు, ఆరజమును శిరస్సునను, గన్నులందునను ధరించుచుఁ దెలియనిస్థితిలో నిట్లనుచుండిరి:—
"నీవు ధన్యురాలవు. ఓ వ్రజపావనరజమా! నీవు ధన్యురాలవు. శ్రీహరి కోమలచరణములు నీపైఁ బడినవి. ఆతఁడే గోపికలతోడను, రాధాదేవితోడను నీమీఁదఁ బ్రేమలీల లొనర్చినాఁడు. ఆతఁడు నేఁ డెచ్చట దాఁగినాఁడు? ఓ వ్రజరజమా! నీవు మెదలకున్నావేమి? చెప్పవా? దయయుంచి చెప్పుము, ఒక్కశబ్దమును బలుకుము! అయ్యో! నీవు మెదలకుండిన నాకు మేచకశ్యామునిజాడ తెల్పఁగలవా రెవరు?

ఎవరో యిద్దరుభక్తులు బృందావనమునకు వచ్చినారనుగోల పుట్టఁగా నెందఱో వారినిఁ జూడవచ్చుచుండిరి. వారిని దర్శించి వారి కొకయాశ్రమమును నిర్మింపవలయునని సంకల్పింపఁగా లోకనాథుఁడు నిరాకరించి ప్రభ్వాజ్ఞచే జెట్టుక్రిందనే యుండి, అయాచితముగ లభించిన యాహారమును గొనఁదలఁచెను. లేకున్నఁ గేవలము యమునాజలమునే త్రాగఁదలఁచెను.

మహాప్రభునిశిష్యులలో మొట్టమొదటగా బృందావనమునకు వచ్చినవారు లోకనాథభూగర్భులే. సుబుద్ధిరాయ లింకను వంగదేశములోనే యుండెను. రూపసనాతను లిద్దరు నింకను వంగదేశములోని ముసల్మానునవాబువద్ద దివానులుగ నుండిరి. గోపాలభట్టింకను దండ్రిదగ్గఱ దక్షిణభారతములో నివసించుచుండెను. రఘునాథభట్టు, రఘునాథదాసు, జీవగోస్వామి వీరందఱింకను పసిబాలకులు.

మార్గశిరములో లోకనాథుని బృందావనమునకుఁ బంపి, మాఘమాసములో మహాప్రభువు సన్న్యాసమును గ్రహించెను. తర్వాత నాతఁడు దక్షిణభారతములో రెండుసంవత్సరములు తీర్థయాత్రలు గావించి, మరల వంగదేశమునకు వచ్చెను గాని గౌడదేశమువఱకు వచ్చి మరల నీలాచలము (జగన్నాథము)నకుఁ దిరిగి

పోయెను. అక్కడనుండి బృదావనమునకు ఛోటానాగపురము మీఁదుగాఁ బోయెను గానిదౌర్భాగ్యవశమున నచ్చట లోకనాథ భూగర్భులు దొఱకలేదు.

మహాప్రభువు సన్న్యాసమును గ్రహించెననియు, దక్షిణ భారతమునకు యాత్రార్థము వెళ్లిరనియు లోకనాథుఁడు విని చాల దుఃఖించి మహాప్రభుని దర్శింపవలయునని దక్షిణ భారతమునకుఁ బోయెను. కాని అచ్చటకు వెళ్లఁగానే మహాప్రభువు బృందావనమునకు వెళ్లెనని విని మరల బృందావనమునకు బయలుదేఱెను. అతఁడింకఁ గొలఁదిదినములకు బృందావనమునకుఁ జేరుననఁగా మహాప్రభువు బృందావనమునుండి బయలుదేఱి వెళ్లిపోయెను. లోకనాథునిహృదయము చాల బాధచెందెను. నిరాశయుఁ జెందెను గాని స్వప్నమున మహాప్రభువు దర్శనమొసంగి యిట్లోదార్చెను:—"నీవింతగా నిరాశను జెందెదవేల? ధైర్యమును గోల్పోవనేల? నీవు నవద్వీపములోఁ జూచినరూప మిప్పుడు నాకు లేదు. నే నిప్పుడు దారిబిచ్చగాఁడను. ఇప్పటి నారూపమును గాంచిన నీకు చాలదుఃఖము కలుగఁగలదు. నీవు నా గృహస్థవేషమునే హృదయములోఁ దలఁచుకొనుము. ఈ రూపమును నీకుఁ జూపుట కిష్టములేకనే నిన్నుఁ గలిసికొనకపోయితిని."

ప్రభువేల గనఁబడలేదో యిప్పుడు లోకనాథునకుఁ దెలిసెను. మహాప్రభుని సన్న్యాసవేషమును అతఁడు హృదయములో నిర్మించుకొనెను - మహాప్రభునిశరీరము చింపిగుడ్డలతోఁ గప్పఁబడినట్లును, లజ్జనివారణముకొఱకు హరినామము నొనర్చుచుఁ బిచ్చివానివలెఁ దిరుగుచున్నట్లును స్మరించి లోకనాథుఁడు వెక్కివెక్కి యేడ్వఁ బ్రారంభించెను. మహాప్రభు విఁక నీశరీరముతో దర్శన మీయఁడని తెలిసికొని లోకనాథభూగర్భులు చీరఘట్టమునఁ గుటీరము నేర్పఱచుకొని అంత్యకాలము వఱకు నచ్చటనే యుండిరి. రాత్రింబవళ్లు కృష్ణకృష్ణ యని పలుకుచు, రాత్రులందు మాత్ర మొకటి రెండుగంటలుమాత్రము నిద్రించెడువారు. ఎవ్వరినిఁ గలిసికొనుటయును లేదు; మాటలాడుటయును లేదు. యాదృచ్ఛికముగఁ బ్రాప్తించినదానిని భగవత్ప్రసాదముగ గ్రహించుచుండిరి. ఏదైన నొకరోజున నేమియు దొఱకకున్నచో హరినామమును జపించుచు నుపవాసముందురు.

లోకనాథుఁడు తనజీవితశేషమును బృందావనమున భజనములో గడపి, భగవన్నామము నాధారముగఁ గొని, సాంసారికవిషయములందుఁ దటస్థుఁడై, ఆదర్శభక్తుఁడుగను, ఆదర్శప్రేమసాధకుఁడుగను, ఆదర్శవిరహునివలెను గడిపెను. ఆజీవనములో నఖండస్మరణరసము కలదు. ప్రభువుయొక్క ప్రేమ, కరుణారసములందు గలవు. అట్టివారికి కావలసినది భగవత్కృపయొక్కటియే. వా రిట్టి అమూల్యజీవితమును బృంధావనమధుమయపావనభూమియందు గడిపెను.

"శ్రీచైతన్యచరితామృతమును" రచియించిన శ్రీకృష్ణదాసకవిరాజు తన గ్రంథరచనమును జేయుటకుఁబూర్వము లోకనాథగోస్వామి చరణసన్నిధికి వచ్చియుండెను. ఆదినములలో బృందావనములోని మహాప్రభుని శిష్యులలో నందఱకంటె వృద్ధుఁడు లోకనాథుఁడే. మాటలాడుటకైనఁ దీరనంతటి భజనములో నాతఁడు వ్యస్తుఁడై యుండెడువాఁడు. శ్రీచైతన్యచరితావళీరచనకు ముందు శ్రీకృష్ణదాసు ఆజ్ఞ దీసికొనుటకు లోకనాథునిదగ్గఱకు రాఁగా సహర్షముతో వ్రాయుమని పలికెను గాని దానిలోఁ దనవిషయ మేమియును రారాదనియుఁ, తనకును ప్రభువునకును గలసంబంధమును వ్రాయరాదనియు నాదేశించెను. లోకనాథగోస్వామి కీర్తి మూక, నిరీహోపాసన కలదు.

---

# భక్త మురారిదాసు

రమారమి మూఁడువందలసంవత్సరములకుఁ బూర్వము మధ్యప్రాంతమున భత్తీసగఢ పరగణాలోఁ జేరిన విలోవా యనుగ్రామములో నొక యకించనబ్రాహ్మణునియింటిలో మురారి జన్మించెను. అట్టి పేదకుటుంబమున బుట్టి సుందర సుదృఢమగు శరీరము కలిగి, ఆనందముతోఁ దాండవించు బాలకుఁడు పుట్టుట సాధారణముగ నరుదుగ నుండును. శ్యామసుందరునివంటి యిట్టిబాలకునిఁ గని తల్లిదండ్రులు దరిద్రులయ్యు సర్వమును బొందినవారైనట్లు భావించుచుండిరి. తల్లి యానందమునకు మేర లేదు. తల్లి యాతని నెత్తుకొనినప్పుడును, నీళ్లు పోయునప్పుడును, భోజనము పెట్టునపుడును, ఊయల నూఁపునపుడు ననేకములగు పాటలను బాడి సంతోషపెట్టుచుండెడిది. ఈవిధముగ సంగీతరసము మురారికి తల్లిపాలతోడనే పట్టుపడెను. ఆతఁ డావులను గాయునపుడు సంగడిగాండ్రతోఁ జేరి తల్లి పాడి నేర్పిన పాటలన్నియును బాడును. చూపుల కందగాఁడే కాక పాటయును జాల మధురముగ నుండెడిది. అందువలన నాతఁడు జనముద్దుబిడ్డఁడై అందఱిచేతను ప్రేమింపఁబడుచుండెడువాఁడు. ఆతఁ డెక్కడికి బయలుదేరినను పది పండ్రెండు మందిపిల్లలు వెంట నుండెడువారు. గ్రామములోని స్త్రీ లాతనిని బ్రాణముకంటెఁ బ్రీతిగఁ జూచెడువారు. ప్రతివారును ఆతనిచేఁ బాటలు పాడించుకొనెడువారు.

గ్రామములోని గొల్లపడుచు లీతని మధురకంఠధ్వనితోఁ గమ్మని భక్తిరససమ్మిళితములగు పాటలను వినుచుండెడువారు. ఆమురారియే యీమురారిగా వచ్చినాఁడనుకొని ఆగోపవనితలీబాలకునకు పచ్చని పట్టువస్త్రమును గట్టి, తలదువ్వి ముడివైచి దానిపై నెమిలిపింఛము నలంకరించి, మెడలోఁ బాదములవఱకు వన

పూలనర్పించి, చేతి కొకకట్టెను వేణువు నిచ్చి యానందించుచుండును. ఆతఁడు పాడుచు నెగురుచుండిన జగన్మోహనముగ నుండెడిది.

ఈవిధముగ నెక్కువదినములు జరుగదు. ప్రభువు భక్తుని దనవైపునకు లాగుకొనును. అప్పు డీప్రాపంచకపుసంబంధములన్నియు తెగిపోవును. మును ముందుగాఁ దండ్రి కాలధర్మమును జెందెను. తర్వాతఁ గొన్ని దినములకు తల్లియు బడిపోయెను. ఆమె అవసానకాలమున మురారిని కౌఁగిలించుకొని, ముద్దిడుకొనుచు కన్నుల నీరు బెట్టుకొని యి ట్లనెను:—"నాయనా! నేను వెళ్లిపోవుచున్నాను. ఎక్కడికి వెళ్లవలయునో అక్కడికే వెళ్లుచున్నాను. కొంద ఱేడ్చుచు వెళ్లుదురు, కొందఱు నవ్వుచుఁ బోవుదురు. నేను నవ్వుచు నానందముతోడనే పోవుచున్నాను. బాలనఁగా నేను నీహృదయమందు కృష్ణప్రేమలతను నాఁటినాను. దానికి నీరుపోసి పల్లవితముఁ బుష్పితము నొనర్చినాను. ఆ లత నీహృదయములో బాగుగా నాటుకొనుటను గాంచినాను. కావున నాకు చింత యెందులకు? నీవుమాత్రము ప్రభుప్రేమలో మునిఁగియుండుపుగాక! ఇదియే నా యాశీర్వాదము. భగవంతుఁడు నకు శుభ మొనఁగూర్చుఁగాక!

తల్లి పోఁగానే మురారికి ఇల్లు బంధమయ్యెను. ఒక్కొక్కప్పు డాతని తల్లిప్రేమ జ్ఞాపకమునకువచ్చి అంత్యకాలమున తల్లియన్న మాటలు మరల నిప్పుడు ప్రత్యక్షమై యనుచున్న ట్లాతనికిఁ దోఁచెడిది. ఇట్టిదుఃఖస్థితిలో నాతఁడు ఊరిబయట నున్న శిథిలదేవాలయపు మెట్లపైఁ గూర్చుండి కూనరాగములతో భగవంతుని గూర్చి భక్తితన్మయుఁడై పాడుకొనుచుండెడువాఁడు.

ఒక్కొక్కప్పు డా గ్రామములోఁ దన కెవరును 'నా' యనువారు లేరు కావున నెచ్చటికైన వెళ్లఁదలచెడువాఁడు. ఆతఁడు మనశ్శాంతికొఱ కెల్లప్పుడును శిథిలదేవాలయమువద్దనే యుండెడువాఁడు. గ్రామములోని స్త్రీలు జాలి దలఁచి ఆతని నోదార్చి భోజనము తీసికొనివచ్చి పెట్టుచుండెడువారు.

ఒకానొకప్పు డాతఁడు మూఁడుదినము లుపవాసము చేయవలసివచ్చెను. ఆతనివిషయమును విచారించినవారే లేకపోయిరి. పాప మాఁకలిచే వటించిపోవు చుండెను. పోనిండు ఊరిలోనికిఁబోయి తినివచ్చెదమన్న నది అర్ధరాత్రిసమయము. అంతట నిశ్శబ్దముగ నుండెను కాని మురారిస్థితి నీరెండిన చెఱువువలె నుండెను. ఆతఁ డానీరసస్థితిలోనే రాధాకృష్ణులనుగూర్చి ప్రార్థించుచు గీతమును మెల్లగఁ బాడెను. మురారి ఆదినము తనకంతిమదిన మనుకొనెను. మాట వచ్చుట లేదు. గుడ్లు పీకుకొనిపోవుచుండెను. నాలుక లాగుచుండెను. ఆతనికి దిక్కెవ్వరును లేకుండిరి. నిజమునకు దిక్కులేనివానికి దేవుఁడే దిక్కు.

ఇట్లు నిస్సారస్థితిలో నుండఁగా నాజీర్ణదేవాలయమునుండి సుందరవస్త్రాభరణములను ధరించి త్రైలోక్యమోహనరూపముతో నొకచేతిలో నానావ్యంజనములతో నిండిన బంగారుపళ్లెరమును, రెండవచేతిలో శీతలజలకలశమును గైకొని వచ్చి మురారిని వడిలోనికిఁ దీసికొని యిట్లనెను:—"నాయనా! దిక్కులేనివారికి నేనే దిక్కు. ఈ సమస్తవిశ్వము నా సంతానమే. అందఱను గూర్చిన వ్యథ నాహృదయములోఁ గలదు. నిన్నుఁగూర్చి నేను దుఃఖించి యిటు వచ్చితిని. భోజనము చేయుము" ఏమి జరుగుచున్నదో మురారికి తెలియక ఆమె పెట్టినయన్నమును గొంచెముగఁ దిని యామెవడిలోనే నిద్రించెను. మరల లేచునప్పటికి సూర్యోదయము కాఁబోవుచుండెను. పక్షులు కలరవము చేయుచుండెను. జనసంచారము జరుగుచుండెను.

నిద్ర లేవఁగానే మురారి రాత్రి జరిగినవిషయమును తలఁచుకొని రాధామహాదేవికృపను స్మరించి యేడ్వఁ బ్రారంభించెను. ఇట్లేడ్చుచు నెవరు కనఁబడిన వారికాళ్లమీఁదఁబడి 'అమ్మా! అమ్మా!' అని పలుకుచుండును. భక్తితో వారి పాదరజమును శిరస్సున ధరించుచుండును. వారినిబోవువాఁడు బ్రాహ్మణుఁడగుగాక చండాలుఁడగుగాక ప్రతివారును మురారికి జగజ్జననిగఁ దోఁచుచుండెను. ఈ విషయమును అచ్చటిరాజునకుఁ జెప్పఁగా నాతఁడు మురారిని బిలిపించి దేశమునుండి వెడలిపొమ్మనెను. మురారి యెక్కడికి వెళ్లఁగలఁడు? అంతయును గోపాలుని భూమియే. ఆతనికి హద్దులు తెలియవు. అందువలన నాతఁడు ప్రేమోన్మత్తుఁడై రాధాదేవి కనఁబడినట్లును, ఆమె చంద్రునివలె దివ్యప్రకాశముతో వెలిఁగినదనియు, ఆమెయే తనప్రాణమును దివ్యాన్నము నొసంగి రక్షించినదనియుఁ బాడెను. కాని యింకేమియును బలుకలేదు. ఆతనికా రాధారూపము తప్ప వేఱురూపము కనఁబడుటలేదు. ఆరాధాపలుకులు తప్ప వేఱుపలుకులు వినఁబడుటలేదు. వైష్ణవులను జాతిభేదముచేఁ జూచినను, రాగిచెట్టును, తులసీవృక్షమును సాధారణవృక్షములవలె నెంచినను, సాలగ్రామమును సాధారణశిలగా భావించినను వారు ఘోరపాపభాగులగుదురు. మురారిదాసు ఛత్రసంగథమునకు నమస్కరించి నడకమీఁద కొలఁది మాసములకు బృందావనమునకుఁ జేరెను. అచ్చట ఆతని కేమియును బనిలేదు. యమునాతీరమునఁ జరించుచు నొక్కొక్కప్పుడు నృత్యము చేయుటయు, ఒక్కొక్కప్పుడు పాడుటయు, నేడ్చుటయును, ఊరక నవ్వుటయును, ఒక్కొక్కప్పుడు పెద్దపెట్టునఁ గేకలు వేయుచుండును.

ఈ యనుభవ మందఱకు తెలియు టెట్లు? భక్తుఁడు తన సర్వస్వమును భగవంతున కర్పించును. లోక మాతనిని వెఱ్ఱివాఁ డనుచుండిరి గాని వారి కేమితెలి

యును? రత్నమో గాజుముక్కయో అది రత్నపరీక్షకునికిఁ దెలియును. భక్తునివిషయము భక్తులకే తెలియఁగలదు.

మురారి పురాణప్రసిద్ధమగు బృందావనమునఁగల ముఖ్యముఖ్య స్థానముల నన్నిటిని దర్శించెను. అచ్చట మధువనములో లీలామూర్తియగు శ్రీకృష్ణుని పదధ్వని వినఁబడెను. భక్తునకు భగవంతుఁడు దూరముగ లేఁడు. హృదయపటము తెఱచుకొనెనా యెక్కడఁజూచినను నాతఁడే.

మానవలోకములో నిష్కపటప్రేమ లభింపదు. ఒకవేళ లభించెనా ప్రేమకు సారభూతమగు విరహము ప్రాప్తింపదు. విరహాగ్ని మండుచున్నప్పుడు మానవున కేమియును దోఁచదు. ఆతని యిష్టమూర్తి తప్ప యింకొకటి తోఁచనే తోఁచదు. మనస్సు, ఇంద్రియములు చేష్టారహితములై నిశ్చలములగును. అది స్తంభదశ. శరీరములో నొక విలక్షణమగు మధురోల్లాసము, కంపము బయలుదేరి శరీరము స్వేదముతో నిండిపోవును. అనాయాసముగఁ గన్నులనుండి గంగా యమునలు అశ్రుధారారూపమునఁ బ్రవహించును. రోదనములో నొకవిధమగు సుఖము లభించును. వాక్కు గద్గదికమగును. ముఖమున నొకవిధమగు చింతతో నున్నట్లుండి, పచ్చఁదనముగ నుండును. ఆకృతి యేదో యొకరకముగ విలక్షణముగ నుండును. శరీరమంతయును బులకించును. ఒక్కొక్కప్పుడు బాహ్యస్మృతి లేకయే క్రిందఁ బడిపోవును. ఇట్టి సాత్త్వికభావములు కలిగి, ఆనందోన్మత్తుఁడైన మురారి యమునాతీరమున దొరలుచుండెను. వానిని జూచినవారందఱును నా ప్రేమప్రవాహములోఁ గొట్టుకొనిపోవలసినదే. ఇదియే ప్రేమలోఁ గల ప్రభావము.

మురారిదాసు వెళ్లినతర్వాత ఛత్రసగఢప్రభువు రాజమదమున నొనర్చిన యపరాధమునకు మిగులఁ జింతించుచుండెను. పశ్చాత్తాపము నల్లఱాతినిగూడ మైనముగ నొనర్చును. రాజు అంతఃపురములో విలపించుచు ని ట్లనుకొనెను:— "నేను సాధువున కపకార మొనర్చితిని. భగవంతుఁడు తన యవమానమును సహించును గాని భక్తుని యవమానమును సహింపఁడు. నేను మురారిని మరలఁ దీసికొని రాకపోయితినా నా రాజ్యమంతయు నష్టమైపోఁగలదు. నేను భగవంతునిదర్శనమున కేముఖము పెట్టుకొని పోవుదును" అని విలపించుచు రాణిని, పరివారమును గైకొని మురారికొఱకు బృందావనమునకుఁ బోయి, జాడను దెలిసికొని యమునాతీరమునకు ఆతనిదగ్గఱకుఁ బోయెను. అది గ్రీష్మఋతువగుటచే నిసుకలోఁ గాళ్లు బొబ్బలెక్కుచుండెను. అట్టి మాడ్పుటిసుకలో మురారి పాడుచు నాట్యము చేయుచుండెను. ఇంతలో యమునలోనికి దుమికి తల్లివడిలో నాడు పిల్లవానివలె నాడుచు కిలకిల నవ్వుచుండెను. రాజు వద్దునకు వెళ్లి సాష్టాంగదండప్రణామము కావించి తనయపరాధమును క్షమింపుమని వేఁడుకొనెను.

కాని సాధువుల కపరాధము జ్ఞాపకముండునా? వారిస్వభావము శిశువులరీతి నుండును. వారికి కామ, క్రోధ, లోభ మోహ, మద, మత్సర, ఈర్ష్యాసూయ లుండవు. మురారిదాసు రాజువైపొకసారి చూచి కిలకిల నవ్వెను. మురారిదాసు తనను గుర్తింపలేదని రాజనుకొనెను. నిజముగ గుర్తింపనేలేదు. అతని కంతయు వాసుదేవమయముగ గనబడుచుండెను. మురారిదాసును క్షేత్రనగరమునకు రమ్మని రాజు ప్రార్థించెను. కాని మురారికి ఆగ్రామములో నేమున్నది? ఇట్టి యున్మత్తస్థితిలో నాతనికి రాకపోకలగుర్తు లేనేలేదు. చివరకు రాజొకపల్లకిని దెప్పించి దానిలో మురారిని గూర్చుండబెట్టి రాజు, రాణి, మంత్రులు మొదలగువారందరును మోసిరి. కాని మురారికి బృందావనమును విడచుట కిష్టములేదు.

రెండునెలలు ప్రయాణము చేయవలసియుండెను. చివరకు క్షేత్రనగరమునకు జేరగానే రాజు పెద్దయుత్సవము నేర్పాటుగావించెను. రాజ్యమంతటను బ్రాహ్మణ సంతర్పణములు కావింపబడెను. సాధువులకును, మహాత్ములకును బూజలు కావించి సదావ్రతుల నొసంగెను. మురారిదాసునిరాకచే క్షేత్రనగరమునకు బ్రాణము వచ్చినట్లుండెను. ఎక్కడచూచినను ఆనందము, మంగళవాద్యములే. రాజ్యమంతటను ఉత్సవములే. రాజుయొక్క జీవనచర్య మారిపోయెను. అతడు సాధుసాంగత్యము, ప్రజాపాలనముననే కాలమును గడుపుచుండెను. ప్రజయందాతనికి నారాయణబుద్ధి యుండుటచే బ్రజాసేవయందే ఆతనికి ఆనందము లభించుచుండెను. సాధుసాంగత్య మహిమ యిదియే. దానివలన నంతర్దృష్టి కలిగి జీవితమంతయు మారిపోగలదు.

మురారిదాసు తనగ్రామములోని శిథిలమందిరసోపానములమీదనే కాలము గడుపుచుండెను. జను లెందఱో దర్శింపవచ్చుచుండిరి. వారి కాతడిట్లు చెప్పుచుండును:—“నాదర్శనమువలన మీకేమి ప్రయోజనము? మీహృదయములో బహురూపుడుగ నున్నహరిని దర్శింపుడు. ఆతడతిదయాళుడు. అందఱి ననుగ్రహించును. హృదయకవాటమును దెఱచుట యవసరము. హృదయాంతరాళమున హరి దాగియున్నాడు. ఆతనిని వెదకుడు, ఆతనిని బట్టుకొనుడు. ఆతనిని గుర్తింపుడు.” అని యిట్లు చెప్పి యూరక రోదనము చేయుచుండును.

ఒకరోజు ప్రాతఃకాలమున జూచునప్పటికి మురారిదాసు కూజా, ఉత్తరీయముమాత్ర మామెట్లమీద బడియుండెను. కాని మురారిదాసు అచ్చట లేడు. జనులందఱును వెదకిరి గాని ఆవెఱ్ఱివానిజాడ తెలియలేదు. ఆతడు శ్యామసుందర స్థానమునకు బోయెనని జనులంద ఱనుకొనిరి.

# భక్త భువనసింహచౌహాన్

ఠాకూరు భువనసింహ చౌహాన్ రాజపుత్రులలో నొకశాఖకు చెందిన వాఁడు. ఉదయపుర మహారాణాదర్బారులో నుండెడువాఁడు. ఈతఁడు సాలునకు రెండులక్షలఆదాయమున కధికారి. వీరత్వములోఁ బ్రసిద్ధుఁడు. ఉదయపుర సామంతులలో నీతఁడు ప్రధానుఁడయ్యెను భక్తులలో నీతఁడు శ్రేష్ఠుఁడు. ఈతని హృదయము శ్రీకృష్ణభక్తిభరితమై యుండెడిది. సూర్యోదయమునకుఁబూర్వమే నిద్రనుండి లేచి, కాలకృత్యములు తీర్చుకొని పదునొకండుగంటలవఱకు భగవద్భజన మునఁ గాలమును గడపి, మధ్యాహ్నకాలమున దర్బారునకుఁ బోయి విధ్యుక్త కార్యములను గావించుకొని, మరల సాయంకాలము పదుండువఱకు భగవద్భజన మందే కాలమును గడుపుచుండెడువాఁడు. ఆతనిఆచరణము చాల పవిత్రమైనది. సత్య, దయా, ప్రేమోదారతాదిసద్గుణము లాతనియందున్నవి.

రాజులకు వేటవ్యసన ముండును. అది రాజధర్మము కాకపోయినను రాజ ధర్మమని పలుకుచుఁ బాపము పశువులను జంపితినుచుందురు. పైగా నిది గౌర వాన్వితకార్యమని భావించుచుందురు. మహారాణా మృగయావ్యసనము కలవాఁడు. ఒకదినమున నతఁడు సకలసామంతులతో వేటకుఁ బోయి ఒకమృగమువెంట గుఱ్ఱ మును దౌడుతీయించెను. గాని అది యెచ్చటనో దాగినది. దానికొఱకు వెంటనున్న భువనసింహుని వెదకఁ బంపెను. భువనసింహుఁడు వెదుకఁబోయెను. పాప మాహరి ణము పరువిడి యలసి యొకచెట్టుచాటున రొప్పుచు, వణఁకుచుఁ గరుణాపూర్ణము లగు నేత్రములతోఁ జూచుచుండెను. అది జీవితభిక్ష నడుగుచున్నట్లుండెను. భువన సింహుఁడు వేటతమకమున నుండుటచే దానిని గ్రహింపక మృగమును దనఖడ్గ ముతో రెండుముక్కలుగ నఱికెను. దానితో దానికడుపులోనున్న పిల్లకూడ రెండుముక్కలయ్యెను. అది కరుణాదృష్టులతో నీతనివైపు చూచుచుఁ బ్రాణములు విడిచెను. ఈతని కాదృష్టులలో భగవంతుని కోపముకూడ గోచరించెను. దానితో నీతనిగుండె లదరెను. తానుజేసిన కుకృత్యమునకుఁ జాల పశ్చాత్తాపమును జెంది మనస్సులో ని ట్లనుకొనెను:—"ఛీ! ఛీ!! ఈవిధముగ నిర్బలమూకజంతువులను దయావిహీనుఁడనై చంపితిని. ఇదికూడ రాజపుత్రధర్మమేనా? ఇదికూడ పౌరుష కార్యమేనా? ఇది నాకేమి యపకారమొనర్చినది? పాప మీ నిరీహగర్భవతియగు హరిణమును జంపుటచే నాకేమి ప్రయోజన మబ్బినది? ఇట్టి హింసాకార్యము నొన ర్చియు భగవద్భక్తుఁడ నగుదునా? భగవంతుఁడు సృజించిన యీయమాయకపుజంతు

వులను జంపుటకు భగవద్భక్తున కేమి యధికారము కలదు. భక్తుఁడ ననుకొనుట విడంబనమమాత్రమే. నేను పాపమును జేసితిని. "దయామయా! శ్రీకృష్ణా! నే నిఁక పాపమును జేయను." అని ప్రార్థించుచుఁ దా నిఁక కరవాలమును ధరింపననియు, అలంకారమునకుమాత్రము హింసింపవీలులేని కొయ్యకత్తిని ధరింతుననియుఁ బ్రతిన బూనెను.

వేటనుండి అందఱును మరలిపోయిరి. తన నిశ్చయానుసారముగ భువనసింహుఁడు కొయ్యకత్తిని జేయించుకొనెను. ఈవిషయ మెట్లో యితరసామంతులకుఁ దెలిసెను. అందులో నొకఁడు భువనసింహుని ఖ్యాతికి, ప్రతిష్ఠకు అసూయనుజెంది సమయముచూచి మహారాణాకు చెప్పెను. మహారాణాకు భువనసింహుని సత్యత్వముపై విశ్వాసముండుటచే రాణా నమ్మలేదు. సామంతునకు నిరాశ కలిగెను. ఆతఁ డొకదినమున రహస్యముగ భువనసింహుని ఖడ్గమును వఱనుండి తీసిచూచెను. ఖడ్గము కొయ్యదియే. ఇప్పుడు నిశ్చయమై, మరల మహారాణాతోఁ జెప్పెను గాని మహారాణాకు నమ్మకము కలుగలేదు. ఒకసంవత్సరము గడచెను. అప్పు డాతఁ డేకాంతమున మహారాణాతోఁ నిట్లనెను:—"నే నిన్నిసార్లు మీకు విన్నవించినను మీరు నాసత్యవాక్కులను విశ్వసింపలేదు. ఒక్కసారి వఱనుండి కత్తిని తీసిచూడుఁడు. అది అబద్ధమైనచో మీ రాక్షణముననే నాతల తీయవచ్చును." మహారా ణిట్లనుకొనెను:—ఈతఁ డింతగాఁ జెప్పుచున్నప్పుడు ఖడ్గమును దీసిచూచుట అవసరమే. దానిని జూచుటెట్లు? నాసందేహమును బ్రకటించి, ఆతనిఖడ్గమును జూచెదనేని, అది కొయ్యదే కాకున్నచో నే నేమి ప్రత్యుత్తర మొసంగఁగలను? ఎవఁడో యొకఁడు చెప్పినాఁడని భువనసింహునివంటి సంభ్రాంత పురుషుని యవమానముగావించుట యనుచితము. వీని కాతనియెడల ద్వేష ముండియుండవచ్చును, ఆకారణమున నాతని నవమానించుట కిట్లు చెప్పియుండవచ్చును." చివరకు రాణామనస్సున కొక యుక్తి తోఁచెను. ఆతఁడొకదినమున సుపవనమున కొలనుసమీపమున విందు జేసెను. దర్బారులోని సామంతులందఱును బిలువఁబడిరి. విందు పూర్తియైనతర్వాత రాణా మాటలలో నిట్లనెను:—"మీఖడ్గములలో నెవనిఖడ్గము బాగుగా మెఱయుచుండునో చూతము" అని పలుకుచు ముందుగా రాణా తనఖడ్గమును దీసి చూపించెను. భువనసింహుఁడు ప్రధాన సామంతుఁడు. అట్టియెడ ముందుగ నాతనిఖడ్గమును జూపింపవలసియుండెను. కాని యాతఁడు మెదలక కూర్చుండెను. దీనిమూలమున రాణామనస్సులో సందేహము కలిగెను. రాణా యిట్లనెను:—"భువనసింహా! నీవు ఊరక కూర్చుంటివేఁ? నీవుకూడ నీఖడ్గమును దీయుము." దీనికి ప్రత్యుత్తరముగ భగవద్విశ్వాసముగల భువనసింహుఁడు "నాఖడ్గము దారుమయమైనది. దాని నేమని చూపింతు" ననఁబోయి "నాఖడ్గము సారమయ (ఉక్కు అనఁగా నినుముసారము)

మైనది. దాని నేమని చూపింతు" ననుచు వఱనుండి కత్తిని లాగెను. భగవంతుఁడు భక్తవత్సలుఁడు. ఆతఁడు తనభక్తునినోట నచ్చినమాటను సత్యమొనర్చి, ఆతని ప్రతిష్ఠను వృద్ధిగావించును. ఖడ్గము వఱనుండి బయటకుదీయునప్పటి కది మెఱపుతీఁగ వలెఁ దళుక్కున మెఱసెను. అంపఱకన్నులు మిఱుమిట్లు గొలిపెను. దాని కిట్టి మెఱుగుండుటనుగాంచి అందఱును జకితులైరి. భువనసింహుఁడును నాశ్చర్యములో మునిఁగెను గాని మఱుక్షణముననే ఇదంతయును తనస్వామిలీల యని గ్రహించెను. ఈయనమీఁదఁ జాడీలు చెప్పిన సామంతుఁడు తల వంచుకొనెను. ఆతనికి గాటువేసిన ను రక్తము లేదు. రాణాముఖము క్రోధముచే మండిపోవుచు గర్జించి యిట్లనెను:—"ఏమి? భువనసింహునిపై మిథ్యారోపణము చేయుటచే నీకు సిగ్గుగుట లేదా? శిరస్సు నీయుటకు సిద్ధపడియుండుము." ఇట్లు పలికి రాణా ఆసామంతుని తలఁ దెగఁగొట్టుఁడని యాజ్ఞాపించెను.

భువనసింహుఁడు మెదలకఁ గూర్చుండి వినుచుండెను. ఇప్పుడింక నాగలేక నిలుచుండి, శిరమువంచి మహారాణాతో నిట్లనెను:— "అన్నదాతా! సామంతుని శిరస్సును దెగఁగొట్టనీయకుము. ఈతఁడు సత్యమునే చెప్పెను. నాఖడ్గము కొయ్యదియే. మన మాదినమున గర్భిణీహరిణమును జంపినప్పుడు నాకట్టి శూరత్వముపై నేవగింపు కలిగి, అప్పటినుండియు లోహఖడ్గమును త్యాగము చేసితిని. ఇదంతయును శ్రీకృష్ణునిలీల. ఆతఁడు నన్నవమానమునుండి రక్షించుటకు దారువును లోహపుకత్తిగాఁ జేసినాఁడు."

మహారాణా ఆతనివాక్యములను విని చకితుఁడయ్యెను. భగవంతుని భక్తవత్సలతను గాంచి ఆతనికి రోమాంచమయ్యెను. రాణా సామంతుని విడిచి పుచ్చుట కాజ్ఞాపించి యిట్లనెను:—"భువనసింహా! నేఁడు నీబోటిమహాభక్తుని గాంచి కృతార్థుఁడనైతిని. నీదర్శనము ప్రతిదినమును జేయుచునేయుంటిని గాని నీమహత్త్వమును నేఁడు తెలిసికొంటిని. ఇఁక నీవు నాదర్బారునకు రానవసరము లేదు. ఇప్పుడు నీవు రాజరాజేశ్వరుని దర్బారులో నధిపతివి. నేను స్వయముగ నీచరణసన్నిధికి వచ్చెదను. నీవు ధన్యుఁడవు. నేఁటినుండి నీజాగీరు రెండులక్షలనుండి నాల్గులక్షలైనది."

భువనసింహుఁ డిట్లనెను:—"మహారాజా! నాకు రెట్టింపుజాగీరు అక్కఱలేదు. తమరు నేఁటినుండి దయయుంచి వేటాడుటను మానివేయుఁడు భగవంతుని స్మరింపుఁడు. నన్ను మీరు దర్బారునుండి తీసివైచి చాల ఉపకారమొనర్చితిరి. నే నెల్లప్పుడును మీకు కృతజ్ఞుఁడుగ నుందును."

గోష్ఠిలో నుండిన సామంతులందఱును హర్షగద్గదితులైరి. అందఱును ఉచ్చైస్స్వరముతో నేకకంఠముతో భగవంతునకును, భక్తునకును జయజయధ్వానములు కావించిరి.

---

# భక్త బిల్వమంగళుఁడు

## ౧

దక్షిణప్రదేశమందు కృష్ణవేణీనదీతీరమున నొకగ్రామమందు రామదాసను బ్రాహ్మణుఁడుండెను. ఆతని పుత్రునిపేరు బిల్వమంగళుఁడు. తండ్రి యాతనికి ధర్మశాస్త్రములనన్నిటిని అధ్యయనము చేయించెను. బిల్వమంగళుఁడు తండ్రి శిక్షణవలనను, ఆతని భక్తిభావప్రభావమువలనను బాల్యకాలమందే అతిశాంతుఁడు, శిష్టుఁడు, భక్తిగలవాఁడయ్యెను. కాని దైవయోగముచే దండ్రి చనిపోఁగా యింటిమీఁదను, ఆస్తిమీఁదను పెత్తనము రాఁగా దుష్టసహవాసకాండ్రు చుట్టుకొనిరి.

శ్లో. యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా,
ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్.

"యౌవనము, ధనము, ప్రభుత్వము, అవివేకము.- ఇవి ఒకదానికి మించి యొకటి అనర్థము కావించును. ఇవినాలుగు నొక్కచోఁ జేరుచోఁ నిఁకఁ జెప్పవలసినదేమి?"

బిల్వమంగళునివద్ద ధనమున్నది. ఇంటిలో నింకొకరు పెత్తనదారి లేఁడు. నిండుయౌవన ముండెను. ఇఁక నుండవలసిన దుస్సాంగత్యము కలదు. క్రమక్రమముగా బిల్వమంగళుని యంతఃకరణమం దనేకదోషములు తిష్టవేసినవి. ఒకానొక దినమున నాగ్రామములోఁ జింతామణి యను నొకవేశ్య నృత్యము కలదు. అక్కడికి విలాసపురుషులు వెళ్లుచుండ వారితోఁగూడి యీతఁడును వెళ్లెను. వేశ్యను జూడఁగానే బిల్వమంగళుని మనస్సు చంచలించెను. వివేకవిహీనమగు బుద్ధి దానికిఁ దోడయ్యెను. బిల్వమంగళుఁడు మోహములోఁ బడిపోయెను. మాంసాస్థినిర్మితమైన రూపమునకుఁ దనసర్వస్వమును, తన, మన, ధన, కుల, మాన, మర్యాదా, ధర్మములను సమర్పించెను. బ్రాహ్మణకుమారుఁడు పూర్తిగఁ బతనమయ్యెను. సర్వకాల సర్వావస్థలయందును నాతనికి చింతామణిచింత తప్ప వేఱు లేదు. దుస్సాంగత్యమును నల్పకాలము చేసినప్పటికిని దుష్పరిణామము తప్పదు. వేశ్యానృత్యము చేయించు విలాసపురుషులారా! కొంచెముగ విచారించుఁడు, మీ రెందఱను బతనము కావించిన పాపమున కొడిగట్టుకొందురో!

## ౨

బిల్వమంగళుని తండ్రి శ్రాద్ధము. అందువలన నాతఁడు నది కావలియొడ్డున నున్న చింతామణియింటికి పోలేదు. శ్రాద్ధము సిద్ధమగుచుండెను. కులపురోహితుఁడు శ్రాద్ధమంత్రములను జదువుచుండెనుగాని ఆతనిమనస్సంతయును జింతామణిమీఁద నే

యుండెను. ఆతనిమనస్సున కీశ్రాద్ధము బాధాకరముగ నుండెను. ఎటులనో శ్రాద్ధమును త్వరగాఁ బూర్తికావించి బిల్వమంగళుఁడు చింతామణియింటికిఁబోవఁ సిద్ధపడెను. సంధ్యాకాలమయ్యెను. గ్రామస్థులు కొందఱు "నాయనా! ఇవ్వేళ శ్రాద్ధదినము. అట్టియెడ వేశ్యాగృహమునకుఁ బోరాదని చెప్పిరి. కాని వినలేదు. ఆతని హృదయము ధర్మకర్మ శూన్యమై పోయెను. బిల్వమంగళుఁడు త్వరత్వరగ నదీతీరమునకుఁ బోయెను. భగవన్మాయ అపారము. అకస్మాత్తుగ ప్రబలవేగమున తుపాను వచ్చి, దానికి తోడుగఁ గుంభవృష్టి కురిసెను. ఆకాశము అంధకారబంధురమయ్యెను. మేఘగర్జనలు, మెఱుపులు అంతఱును భయభీతుల నొనర్చుచుండెను. రాత్రింబవళ్లు నదిలో నుండు పల్లెవాండ్రు కూడ భయభీతులై నావలను ఒడ్డున లంగరు వేసి చెట్ల నాశ్రయించిరి. వారు బిల్వమంగళుని జూడలేదు. బిల్వమంగళుఁడు వారినందఱను ఆవలి యొడ్డునకు దాఁటవేయుమని బ్రతిమలాడెను, ధనాశ పెట్టెను కాని వారు సాహసింపలేదు. ప్రాణములను విడుచుట కెవరు సిద్ధపడఁగలరు? అందువలన నెవఁడును పడవనడుపుట కంగీకరింపలేదు. ఆలస్యమైన కొలఁది బిల్వమంగళుని వ్యాకులత అధికమగుచుండెను. ఆతఁడిఁక వెనుక ముందు చూడక ఈది యావలి ఒడ్డునకుఁ జేరవలయునని నదిలోనికి దుమికెను. ఇది భయానకమగు దుస్సాహసకర్మ. 'కామాతురాణాం నభయం నలజ్జా' యనునది అబద్ధమా? దైవికముగ నదిలో నొకపీనుఁగు కొట్టుకొనిపోవుచుండెను. బిల్వమంగళుఁడు బాగుగా నలిసిపోవుటచే నాపీనుఁగును ఆధారముగఁగొని ఆవలియొడ్డు చేరెను. శరీరముమీఁద గుడ్డలేదు. నదిలోఁ గొట్టుకొనిపోయెను. గాఢాంధకారము. వనమృగములు భయానకశబ్దము లొనర్చుచుండెను. ఆసమీపమున నొక్కమనుష్యుఁడైనను లేఁడు. కాని బిల్వమంగళుఁడు ఉన్మత్తునివలె తనధ్యానములోనే వెళ్లుచుండెను. దగ్గఱనే చింతామణిగృహముండెను. నాఁడు బిల్వమంగళునింట శ్రాద్ధమగుటచే నాతఁడు రాఁడని యామె తలుపులన్నిటిని బిగించి నిశ్చింతగ నిద్రించెను. బిల్వమంగళుఁడు తలుపుకొట్టి కేకలు వైచెను గాని గాలివానయగుటచే నాగాలి శబ్దములో నామెకు వినఁబడలేదు. బిల్వమంగళుఁ డటునిటుఁ గాంచి, మెఱుపువెలుఁగులో నేదో గోడఁమీఁద వ్రేలాడుచున్నట్లు భావించి దానిని బట్టుకొని, దాని సహాయమున గోడను దుమికి లోపలకుఁ బోయెను. వర్ష మాగిపోయెను. చింతామణి దీపమును తెచ్చి చూచునప్పటికి గోడమీఁద భయంకరమగు సర్పముండెను. నదీతీరమునకుఁ బోయిచూడఁగాఁ దాను దాటినది తెప్పసహాయమునఁ గాదు శవముసహాయమున. బిల్వమంగళుఁడును దీనిని గాంచి భయముచేఁ గంపించెను. అప్పుడు చింతామణి గద్దించుచు నిట్లనెను:—"నీవు బ్రాహ్మణుఁడవు. నేఁడు నీతండ్రి తద్దినము. అయినను చర్మాస్థిమాంస నిర్మితమగు

బొమ్మకొఱకు ఇంతగా నాసక్తిని జెంది, స్వధర్మ కర్మలకుఁ దిలాంజలుల నొసంగి అర్ధరాత్రిని శవ సర్పసహాయముచే నిచ్చటికి పరుగిడివచ్చితివా? నీవు దేనిని సౌందర్య ఖని యనుకొని యింతగా మోహమును జెంది యనుభవింపవచ్చితివో అదియు నొకనాఁడు నీయెదుటనున్న దుర్గంధశవము రూపమును బొందిపోవును. ఛీ! ఛీ! నీ నీచవృత్తి పాడుగాను. ఈవిధముగ జగన్మోహనాకారుఁడగు శ్యామసుందరుని కొఱకు తహతహలాడి పరువిడియుండినచో నిప్పటికి నీ వవశ్యము కృతార్థుఁడవై యుండెడువాఁడవే."

వేశ్యయనిన మాటలు చాల మంచిపని చేసెను. బిల్వమంగళుఁడు మొదలక యాలోచింపసాగెను. బాల్యకాలస్మృతి అతనిమనస్సున జాగృతి చెందెను. తండ్రి యొక్క భక్తియు, ధర్మపరాయణతయు అతనికన్నులకుఁ గట్టినట్లుండెను. బిల్వమంగళుని హృదయతంత్రి నవీనశ్రుతిలో మ్రోగసాగెను. వివేకాగ్ని ప్రజ్వలించెను. భగవత్ప్రేమసముద్ర ముబికెను. అతనికన్నులనుండి యశ్రుధారలు ప్రవహింపఁ జొచ్చెను. బిల్వమంగళుఁడు చింతామణియొక్క శ్రీచరణములను బట్టుకొని యిట్లనెను:— "అమ్మా! నీవు నేఁడు నాకు దివ్యదృష్టి నొసంగి కృతార్థురాలను గావించితివి." లోలోనఁ జింతామణిని గురువుగ భావించి నమస్కరించి, యాక్షణమునసే జగచ్చింతామణియొక్క చారుచింతయందు నిమగ్నుఁడై యున్మత్తునివలె నింటినుండి బయలుదేరెను. బిల్వమంగళుని జీవితము పూర్తిగ మాఱిపోయెను.

### 3

శ్యామసుందరుని ప్రేమమయ మనోహరమూర్తిని దర్శించుటకు బిల్వమంగళుఁడున్మత్తునివలె నటునిటు దిరుగుచుండెను. ఒకానొకదినమున నకస్మాత్తుగ నాతనికి దారిలో పరమరూపవతియగు యువతి కనఁబడెను. ఈతని కింకను బూర్వసంస్కారము మాయలేదు. యువతియొక్క సుందరరూపమును గాంచఁగానే ఆతనినేత్రములు చంచలములయ్యెను. నేత్రములతో మనస్సుగూడ ఆకర్షింపఁబడెను. భగవానుఁడు గీతలో నిట్లు చెప్పెను:—

శ్లో. యతతోహ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః,
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః. గీత-అ. ౨. ౬౦. శ్లో.

ప్రయత్నమొనర్చినను బుద్ధిమంతుని మనస్సుగూడ ప్రమథనస్వభావముగల ఇంద్రియములు బలాత్కారముగ హరించును.

అట్లే బిల్వమంగళునకును మోహము కలిగెను. భగవంతుని మఱచి మరల పతంగమై విషయాగ్ని దిక్కునకుఁ బరువిడెను. బిల్వమంగళుఁడు ఆయువతివెన్నువెంట నామెయింటివఱకును వెళ్లెను. యువతి తనయింటిలోనికిఁ బోయెను. బిల్వమం

గళుఁడు చింతతో వాఁకిటఁ గూర్చుండెను. ఇంటియజమాని వచ్చిచూడఁగా నొక్క మలినముఖముగల బ్రాహ్మణ అతిథి వచ్చి బయటఁ గూర్చుండియుండెను. ఆతనిని గారణ మడుగఁగా బిల్వమంగళుఁడు కపటమునువీడి జరిగిన విషయమును జెప్పి యిట్లనెను:—"నే నాయువతిని మరల నొక్కసారి కన్నులారఁ జూడఁగోరుచున్నాను. ఆమె నిటకుఁ బిలుచుకొనిరమ్ము" యువతి యాశెట్టిగారి భార్య. చూచినందుననే వచ్చినహాని యేమికలదని, అతిథివత్సలుఁడగు శెట్టి తనధర్మ పత్నినిఁ బిలుచుటకు లోనికిఁబోయెను. ఇచ్చట బిల్వమంగళుని మనస్సముద్రమున నానావిధతరంగములు రేగుచుండెను.

ఒక్కసారి సమస్తభారముల నాయనమీఁద వైచి యాతనిని జింతించువాని యోగక్షేమముల భారమును భగవంతుఁడు తనమీఁదనే పెట్టుకొనెను. ఇప్పుడు బిల్వమంగళుని రక్షింపవలసినభార మాతనిపైననే పడినది. యోగమనఁగా భగవత్ప్రాప్తి, క్షేమమనఁగా దానినిమిత్తమై చేయుసాధనలను రక్షించుట. దీనవత్సలుఁడగు భగవానుఁడు అజ్ఞానాంధుఁడగు బిల్వమంగళునకు దివ్యచక్షువును బ్రసాదించెను. ఆతనికి తనస్థితి బాగుగఁ దెలిసెను. హృదయము శోకముచే భారమయ్యెను. ఎక్కడనుండియో రెండుమారేడుముండ్లను దెచ్చుకొని యుంచుకొని, శెట్టిగారి భార్య రాఁగానే ఆమెను గన్నులారఁ గాంచి "అభాగ్యులగు నోకన్నులారా! మీరు లేకుండియుండిన నాకింతపతన మేల కలుగును?" అని పలికి బిల్వమంగళుఁడు ఇది యతని బలహీనతయనుఁడు లేక కన్నులకు శిక్షయనుఁడు ఆముండ్లచే నారెండు కన్నులను బొడుచుకొనెను. కన్నులనుండి రక్తధార ప్రవహించుచుండెను! బిల్వమంగళుఁడు నవ్వుచు, నెగురుచు తుములహరినామసంకీర్తనముచే నాకాశమును బ్రతిధ్వనింపఁజేయుచుండెను. శెట్టిగారు, ఆతనిభార్యయును జాల దుఃఖించిరి కాని వారిచేత నేమి కాఁగలదు? కొంచెముగనో గొప్పగనో ఉన్న మనోమలము నేఁటితో బూర్తిగ నశించెను. ఇప్పుడాతఁ డనాథనాథుని బడయుటకు మిగుల వ్యాకులము చెందుచుండెను.

౮

పరమప్రియతముఁడగు శ్రీకృష్ణవియోగ దారుణ వ్యథచే నాతని చిదికిన కన్నులనుండి ఒకరోజంతయు అశ్రువర్షము కురిసెను. ఆతనికి ఆఁకలిదప్పులుగాని, నిద్రాజాగ్రతలుగాని లేవు. నిరంతరము 'కృష్ణ కృష్ణ' యను నామసంకీర్తనముచే దిక్కులను బ్రతిధ్వనింపఁజేయుచు వనవనము గ్రామగ్రామము తిరుగుచుండెను! ఏ దీనబంధువు కొఱకు కన్నులను బొడుచుకొనెనో, ఏ ప్రియతముని బొందుటకై సాంసారిక సౌఖ్యములన్నిటిని వదలుకొనెనో అట్టి వానినిఁ బొందుటకు ఆలస్య

మైన నెవఁడు సహింపఁగలఁడు? నేఁటికాలపు స్వార్థ భక్తుఁడే యైయుండునెడల భగవంతుని యిష్టము వచ్చినట్లు తిట్టుచువాఁడే. ఎప్పుడో భక్తిత్యాగము కూడ చేసెడువాఁడే! కాని నిజమైనభక్తుఁడు ప్రేమాస్పదుని విరహమున జీవితమంతయు నేడ్చుచుండును. ఎన్ని ఆపత్తులు వచ్చినను సహించుచుండును; కాని దేవునిపై దోషారోపణఁ గావింపఁడు. మేఘములోని జలమునే త్రాగు చాతకముపై మేఘము నీటిని వర్షింపక పిడుగులను బడవైచి దానిరెక్కలను ముక్కలుముక్కలు చేసినను చాతక మామేఘముపైఁ గినియదు.

భక్తి స్వార్థ కలంకములతోఁ గూడిన ప్రేమాస్పదుఁడైన భగవంతునిలో దోషములను గాంచును. ఏలనఁగా దీనిలో నిచ్చిపుచ్చుకొనుట అనఁగా గోరిక కలదు. కాని నిర్మలప్రేమ సముద్రము వంటిది. అచ్చట ప్రేమ తప్ప యింకొకటి లేనే లేదు. ఇట్టి భక్తుని కూర్చియే భగవంతుఁడు పరువిడివచ్చును. నేఁడు మన బిల్వమంగళుఁడు శ్రీకృష్ణప్రేమలో మునిఁగి యమునకు తిరుగుచుండెను. కన్నులు లేకపోవుటచేఁ ద్రోవయును లేదు, డొంకయును లేదు. ఒక్కొక్కచోట నెదురుదెబ్బలు తగిలి పడుచుండును, ఒక్కొక్కచోట ముండ్లపొదలు ఇట్టి స్థితిలో మనభక్తుఁడుండిన భగవంతుఁ డోర్చుకొనఁగలఁడా? అప్పుడు శ్రీకృష్ణుఁడొక చిన్నగోప బాలకునివలె వచ్చి మునిమనమోహన మృదుమధురవాక్కులతో నిట్లనెను:—"గ్రుడ్డి తాతయ్యా! మీకు బాగుగ నాఁకలియైనట్లున్నది నేను మిఠాయిని, పండ్లను, జలమును తెచ్చి తిని తీసికొనుఁడు." ఆమధుర వాక్కులకు బిల్వమంగళుఁడు మోహమును జెంది దేవదుర్లభమగు నా భగవద్దత్తప్రసాదమును దిని హర్షోల్లాసతరంగములలో నూగులాడుచుండెను. బిల్వమంగళుఁడు బాలకునితో నిట్లనెను:—"అబ్బాయీ! మీ యిల్లెక్కడ? నీ పేరేమి? నీవేమి చేయుచుండువు?"

బాలకుఁ డిట్లనెను:—"నాయిల్లు మీకు దగ్గఱనే యున్నది. నాకొక పేరు లేదు. నన్నే నామముతోఁ బిలిచినను బలుకుచుందును. నే నావులను గాయుచుందును. నన్నెవరు ప్రేమించుచుందురో నేనును వారినిఁ బ్రేమించుచు వారి పనులన్నియుఁ జేయుచుందును. బిల్వమంగళుఁడు వీణావినిందిత వాక్కులను విని విముగ్ధుఁడయ్యెను. బాలుఁడు వెళ్లుచు వెళ్లుచు నిట్లనెను:—"నేను నీకు రోజును భోజనము తెచ్చెదను." బిల్వమంగళుఁడు సంతోషమున నాయనా ! రోజును రా నాయనా!" అనెను. బాలకుఁడు వెళ్లిపోయెను. తనతో బిల్వమంగళుని మనస్సును గూడ కొనిపోయెను. ఆతఁడు మనశ్చోరుఁడు కదా! ఎన్నియో భోజనములు, పిండి వంటలు పెట్టియు నెవనిని మెప్పింపఁజాలమో అట్టివాఁడు తన కరకమలములతో భోజనము బెట్ట వచ్చుచుండెను. భక్తునకు భగవానుఁ డేమిచేయఁడు?

ఎవనికొఱకు సన్యాసియై కన్నులను బొడుచుకొనెనో ఆ జగన్మోహన కృష్ణుఁడే యీ గోపబాలకుఁడని బిల్వమంగళుఁ డింకను దెలిసికొనలేదు కాని ఆబాలకుని మాటలు వినినఁ జాలును ఆతని కేమియు నక్కఱలేనంతగ నాకర్షణము చెందెను. ఒకానొకదినమున బిల్వమంగళుఁడు లోలోన నిట్లు తలఁచుచుండెను:—"ఆపత్తుల నన్నిటిని గడచి యిక్కడికి రాఁగా మరలఁ గ్రొత్తయాపత్తు వచ్చిపడినదే. స్త్రీమోహమును వదలుకొనివచ్చి యిచ్చట బాలుని మోహములోఁ బడితినే" అని యాలోచించుచుండఁగనే ఆరసికశిరోమణి యగు బాలకుఁడు వచ్చి దగ్గఱఁ గూర్చుండి యిట్లనెను:—"తాతయ్యా! ఊరక కూర్చుండి యేమి యాలోచించుచున్నారు? బృందావనమునకు రాఁగలరా?" బృందావనముమాట వినఁగానే ఆతనికి ప్రాణము లేచి వచ్చినట్లయ్యెను కాని తన యసమర్థతను బ్రకటించుచు నిట్లనెను:—నాయనా! నాబోటి గ్రుడ్డి కబోది బృందావనమున కెట్లు రాఁగలఁడు?" బాలకుఁ డిట్లనెను:—"ఇదిగో! ఈకఱ్ఱను బట్టుకొనుఁడు. నేను పట్టుకొని తీసికొనిపోవుదును." బిల్వమంగళుఁడు మిక్కిలి సంతోషమును జెందెను. కఱ్ఱను బట్టుకొని భగవంతుఁడు భక్తుని ముందు బయలుదేరి వెళ్లుచుండెను. భక్తుఁడు కఱ్ఱను బట్టుకొని పోవుచుండెను. కొంతదూరము తీసికొని పోయి యిదిగో బృందావనము వచ్చినది నేను వెళ్లిపోవుచున్నాను. అనెను. బిల్వమంగళుఁడు బాలకుని చేయి పట్టుకొనునప్పటికి, ఆస్పర్శ విద్యుత్తువలె శరీరమంతటను సాత్త్వికప్రకాశము కావించి సమస్త ద్వారములను బ్రకాశితములు కావించెను. బిల్వమంగళునకుఁ దాత్కాలికముగఁ జూపు వచ్చెను. చూడఁగా నాబాలకుఁడు సాక్షాత్తుగ తా నుపాసించుచున్న శ్రీకృష్ణుఁడని తెలిసికొనెను. బిల్వమంగళుని శరీరము రోమాంచమయ్యెను. కన్నులనుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండెను. ఆతఁడు భగవంతుని యింకను గట్టిగఁ బట్టుకొని యిట్లనెను:—"ఇప్పటికి గుర్తించితిని. చాలరోజులకుగాని నిన్నుఁ బట్టుకొనఁజాలకపోయితిని. ఇఁక నిన్ను విడువను!" శ్రీకృష్ణుఁ డిట్లనెను:—"వదలిపెట్టవా?" బిల్వమంగళుఁ డిట్లనెను:—"వదలి పెట్టను. ముమ్మాటికిని వదలిపెట్టను."

శ్రీకృష్ణుఁ డొక్కవిదిలింపు విదిలించి చేయి వదల్చుకొనెను. బలమునకు గూడ బలమైన బలరామానుజుని బట్టుకొనఁగలవాఁడెవఁడు. సమస్తములోకమును బలాత్కారముగఁ బట్టుకొనిన మాయను దన్ని దానిని లోబఱుచుకొనిన గోపాలుని గ్రుడ్డి బిల్వమంగళుఁడు పట్టుకొనఁగలఁడా? యని యనుకొనరాదు. ఆతఁడట్టి తెగని త్రాడుతోఁ గట్టినాఁడు. దానిని వదలించుకొనుటకు వాసుదేవునకు సాధ్యము కాదు. చేయి వదలించుకొనఁగానే బిల్వమంగళుఁ డిట్లనెను:—"వెళ్లుచున్నావా? అయితే జ్ఞాపకము పెట్టుకొనుము.

శ్లో. హస్త ముత్క్షిప్త యాతోఽసి బలాత్కృష్ణ కిమ ద్భుతమ్‌,
హృదయాద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే.

చేతిని బలాత్కారముగ వదలించుకొని పోవుచున్నావు. ఇదేమి యాశ్చర్యము! హృదయమునుండి వదలించుకొనిపోఁ గలిగితివా అప్పుడు నీపౌరుషమును గణింతును." భగవానుఁ డట్లు వెళ్లఁజాలఁడు! వెళ్ల నెట్లు? ప్రతిజ్ఞను జేయనే చేసెను గదా!

"యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్." (గీతా.౪-౧౧.)

ఎవరు న న్నెట్లు భజింతురో వారిని నే నట్లు భజించుచున్నాను."

భగవంతుఁడు బిల్వమంగళునికన్నులపైఁ దనకోమల కరకమలములను నిమురఁగా నాతనికి కన్నులు వచ్చెను. నేత్రములతోఁ బ్రత్యక్షముగ భగవానుని దర్శించి బిల్వమంగళుఁడు సంతోషమును బట్టఁజాలకపోయెను. ఆతఁడు చరణములపైఁ బడి ప్రేమాశ్రువులతో నాతని పావనచరణకమలములను గడిగెను.

అంత భగవంతుఁడు లేవఁదీసి కౌఁగిలించుకొనెను. భక్తుఁడు, భగవంతుఁడు కలియుటచే సమస్తజగత్తునకును మాధుర్యము వ్యాపించెను. దేవతలు పుష్ప వృష్టిని గురియించిరి. సాధువులు, భక్తులు నాట్యమాడిరి. హరినామసంకీర్తనధ్వని ఆకాశమున నిండిపోయెను. భక్తుఁడు భగవంతుఁడును ధన్యులైరి. వేశ్యయగు చింతామణియు, శెట్టియు, నాతనిభార్యయు నచ్చటికి వచ్చిరి. భక్తునిప్రభావమున భగవంతుఁడు వారందఱకును దర్శన మొసంగెను.

బిల్వమంగళుఁడు జీవితాంతమువఱకు భక్తిప్రచారమును గావించి భగవ న్మహిమను వ్యాపింపఁజేయుచుఁ జివరకు గోలోకమునకుఁ బోయెను.

---

# శ్రీరూపసనాతనులు

## ౧

ఒక్కొక్కసమయమున నీశ్వరోపముఁడగు మహాపురుషుఁ డవతరించినపుడు ఆతనికార్యమునకు సహాయ మొనర్చు విభూతులుకూడ నివురు కప్పిన నిప్పువలె నచ్చటచ్చట యుద్భవించి సమయము రాఁగానే బయటకు వచ్చుచుందురు. శ్రీచైతన్యమహాప్రభువు అవతరించినప్పుడు శ్రీరూపసనాతనులుకూడ అట్లే యుద్భ వించిరి.

నాలుగువందలసంవత్సరముల క్రిందట వంగదేశమును హుసేన్‌షాహా యను ముసల్మానునవాబు పరిపాలించుచుండెను. వంగరాజధాని అప్పుడు రాజమహాలు

దగ్గఱనున్న గౌడ యనునగరము అది యిప్పుడు లేదు. నవాబు ముసల్మానుఁ డైన ప్పటికిని ఆతనిరాజ్యములోని పెద్దపెద్ద యుద్యోగులందఱును హిందువులే. అప్పటి యాహిందువుల యాచరణము ముసల్మానుల యాచరణమువలెనే యుండెడిది. మన నవాబు ఆస్థానములో నున్నతోద్యోగులలో దక్షిణదేశమునుండి వచ్చి మంత్రిపదవి నధిష్ఠించినవారు గలరు. వారు రామకేళి యనుగ్రామమున వసించుచుఁ దమ విద్యా బుద్ధులచే వీ రింతయున్నతపదవి నధిష్ఠించిరి. సనాతనుని అసలుపేరు అమరుఁడు.' రూపునినామము 'సంతోషుఁడు' హుస్సేన్‌షాహా వీరిని దను కుడిభుజముగా భావిం చుచుండెడువాఁడు. పాదుషాయొక్క ప్రతికార్యమందును వీరు సహాయపడు చుండెడువారు. సాధారణముగ నప్పుడు ముసల్మాను లొనర్చు దేవాలయనాశనము, గోవధ, మొదలగు దేవనాశనకరమగు కార్యములలో వీరు ప్రత్యక్షముగ సహాయ పడకున్నను బరోక్షముగ నన్నియును జేయవలసివచ్చుచుండెడిది. వీరి వేషభాష లలోఁగాని కార్యములలోఁగాని ముసల్మానులకువలెనే యుండెడిది. ధనాశ యెంతటి పనినైనఁ జేయింపఁగలదు. అట్లే యీబ్రాహ్మణకుమారు లిట్టిపనులు చేయుచు నధిక ముగ ధనమును సంపాదించిరి. వీరు రామకేళిగ్రామమునకు రాజులు. కాని వీరిహృద యము హిందూభావములతోడనే నిండియుండెను. రామకృష్ణాదులందు భక్తియు, బ్రాహ్మణ సాధువులయెడల శ్రద్ధయు నుండెడిది. రామకేళిగ్రామములో నెల్లప్పుడును బ్రాహ్మణసాధుసమ్మేళనము జరుగుచుండెడిది. ధనమునకు లోటు లేదు, ఉదారబుద్ధియగు టచే ధనము నెక్కుడుగ వెదజల్లుచుండెడువాఁడు. అనేకబ్రాహ్మణకుటుంబములను బోషించుచుండెడువారు. వీ రిట్లుండుటచే హిందువులు వీరిని ద్వేషించెడువారు కారు. వీరి తమ్ముఁడు 'అనుపముఁడు' ఇంటిలోనే యుండెడువాఁడు కాని వీరెల్లప్పు డును గౌడనగరములో పాదుషావద్ద నుండెడువారు. వీరికి ముసల్మానునామములనిన మిక్కిలి యిష్టమగుటచే సనాతనునికి 'దబీరుఖాస్' అనియు, రూపునకు 'సాకర్‌మల్లిక్' అనియుఁ బేర్లఁ బిలువఁబడుచుండిరి.

వీరు చైతన్యమహాప్రభుని నామమును వినఁగానే ఆతనిమీఁద స్వాభావిక మగుభక్తి యేర్పడి యెప్పుడెప్పుడు దర్శింతుమాయను నుత్కంఠతతో నుండిరి. కాని రాజకార్యములలోఁ దీరిక చిక్కకుండుటచే స్వయముగ వెళ్లి దర్శింపకుండిరి. ఉత్కంఠాయుక్తమగు నేకాగ్రచిత్తము మనోవాంచితపదార్థమును దగ్గఱకు తెచ్చును. ఉత్కంఠత యెక్కువగ నున్నచోఁ బరమాత్మదర్శనము కాఁగలదు. మన కట్టియుత్కంఠత లేకపోఁబట్టియే భగవద్దర్శన మగుటలేదు.

ఈప్రేమవలన శ్రీచైతన్యమహాప్రభువు బృందావనయాత్ర యనునెపమున గంగాతీరముననే గౌడనగరసమీపమునకు వచ్చెను.

చైతన్యమహాప్రభువువెంట వందలకొలఁది భక్తులు తుములధ్వనితో హరినామ సంకీర్తనము చేయుచుండెడువారు. వేలకొలఁది స్త్రీ పురుషులు ప్రభువును దర్శింప వచ్చుచుందురు. వారును, వారిలోనుండు గ్రామవాసులును హరినామసంకీర్తన ములోఁ బాల్గొనెడువారు. ఇంతమంది హరినామముచేయుటచే ఆకాశమంతయును ప్రతిధ్వనించెడిది. ఇదిగాక కోలాట కరతాళాదిశబ్దములలో వేఱొకవిషయము వినఁ బడెడిది కాదు. ప్రేమోన్మాదముతోఁ జేయు నీసంకీర్తన నృత్యములవలన తేగినధూళి యెక్కడపడిన నక్కడ పాపతాపములను బోఁగొట్టుచుండెను.

మహాప్రభువు గౌడసమీపమునకు రాఁగనే ఆహరినామసంకీర్తన తుముల ధ్వనివలన నగరము ప్రతిధ్వనించెను. పాదుషా యెవఁడో శత్రువు తనసేనతో దాడివెడలెనని భావించి భయముచేఁ గేశవుఁడనువానిని పోయి చూచిరమ్మనెను. ఆతఁడు వచ్చి ఒకానొకసన్యాసి కొందఱుశిష్యులతో బృందావనమునకుఁ బోవు చున్నాఁడట యనెను. కొందఱుశిష్యులైన నింతకోలాహల మేలయుండునని విచా రింపఁగా వేలకొలఁదిగ శిష్యులుండిరి. అంత భయముచే మంత్రులగు మన దబీరు ఖాస్‌ను, సాకర్ మల్లిక్‌ను పిలిపించి యడుగఁగా వా రింతవఱకు మహాప్రభువును జూడకున్నను చైతన్యమహాప్రభువు సాక్షాదీశ్వరుఁడని వారినమ్మకము. అందువలన వారు చైతన్యుని గూర్చి పాదుషాతో నిట్లనిరి:—"హుజూర్! సాక్షాద్భగవంతుఁడే సన్యాసివేషమున భూమిమీఁద యవతరించినాఁడని మా యూహ. ఎవనియను గ్రహమున మీ రీగౌడదేశమునకు పాదుషాలైతిరో ఆభగవంతుఁడే నేఁడు మీవాఁకిటను నిలిచియున్నాఁడు."

భగవల్లీల అతివిచిత్రమైనది. ఈమాటలు వినఁగానే హుసేన్‌షాహా శాంతుఁడై మిక్కిలి నమ్రతతో నిట్లనెను:—"నాకును అట్లే తోఁచుచున్నది. నేను గౌడదేశమునకుఁ బాదుషాను లక్షలకొలఁది జనముయొక్క జీవనమరణములు నాచేతిలో నున్నవి. ఒక సాధారణపు సేవకునికి ఒక్కపూట జీత మీయకున్న నామాట వినఁడు. సైనికులకు ఆఱునెలలు జీతమీయకున్న నన్నుజంపనే చంపు దురు. ఒక్కగ్రుడిగవ్వైనను లేకున్నను వేలకొలఁదిమంది యిల్లువాఁకిండ్లను వదలి పెట్టి, ఆఁకలిదప్పులు మఱచి రాత్రింబవళ్లు బానిసులవలె నీతనిని జుట్టుకొనియున్నారు. అట్టివాఁ డీశ్వరుఁడుగాక మఱి యెవరు?"

బాదుషా బాగుగానే మాటలాడెను. కాని యీసోదరు లిద్దరును నీ ముసల్మానుఁ డేమియపకారము ప్రభువునకుఁ జేయునో యని చాల భయపడిరి. ఆభయముచేతనే ప్రభువును బయటనుండియే త్వరగాఁ బంపించివేయవలయునని యత్నించిరి. కాని కేవలము ప్రభువు వచ్చినది వీరిద్దరి నుద్ధరించుటకే కదా! అట్లుద్ధ

రింపకఁబోవు టెట్లు? ప్రొద్దుగ్రుంకఁగానే సోదరులిద్దరును మహాప్రభునికడకు వెళ్లిరి. అప్పుడు ప్రభువు సమాధిలో నుండెను. నిత్యానందుఁడు ప్రభువును లేపి వీరిద్దరిని బరిచయము కావించెను. ఇద్దరును మహాప్రభువునకు నమస్కరించి యిట్లనిరి:— "ప్రభూ! నీవు పతితులను దీనులను నుద్ధరించుటకై భూమిమీఁద నవతరించితివి. మాబోటి దయనీయులైన పతితులు మీ కెచ్చట లభింపఁగలరు. జగన్నాథ మాధవుల నుద్ధరించితిరి. వా రజ్ఞానమునఁ బాపము లొనర్చిరి. మేము తెలిసి తెలిసి పాప మొనర్చితిమి. వాస్తవికముగఁ బతితులము మేమే. మమ్ముల నుద్ధరించుటలోనే విశేషమున్నది. మాకు మీరుతప్ప దిక్కెవ్వ రున్నారు?"

ధన, జన, పదవుల బలముపై మానవున కెక్కుడుగర్వ ముండును. జగత్తులోఁ దనను మించినవాఁ డెవఁడును లేఁడని వాని యూహ. విషయబల మున్నంతవఱకు భక్తి ప్రాప్తింపదు. విషయబలమును వదలి పరమాత్మయొక్క ప్రబలబలముపై నాధారపడెనా సఫలత తత్కాలముననే ప్రత్యక్షము కాఁగలదు.

దబీరుఖాస్, సాకర్ మల్లిక్ గౌడదేశమునకు హర్త, కర్త, విధాతలు. పాదుషాను విడిచిన నా వంగదేశమున వీరియాజ్ఞకు తిరుగులేదు. ఇంతటి బలశాలురకు ప్రభుకృప రావలయుననినఁ గావలసినది 'దీనత్వము'. వారు దానినే గ్రహించి మూర్తీభవించిన దైన్యమును బొంది యిద్దరును బ్రభుచరణములమీఁదఁ బడిరి. వారు ప్రభువుతో విన్నవించుకొనినది ముమ్మాటికిని సత్యమే. అది శబ్దచలమును కాదు. అత్యుక్తియును గాదు. వాస్తవికముగ వారు జగత్తులో నందఱికంటె మిగుల అభాగులుగ, దీనులుగ భావించుచుండిరి. భగవంతున కీదీనభావమే అధిక ప్రియమైనది.

మహాప్రభువువారి నిష్కపట దీనభావమును గాంచి ముగ్ధుఁడయ్యెను. దయచే నాతనిహృదయము ద్రవింపఁగా నిట్లనెను:—"లెండు, దీనత్వమును బోఁగొట్టుకొనుఁడు. మీదీనత్వమును గాంచిన నాహృదయము విదీర్ణమగుచున్నది. మీరు నాకుఁ బ్రియులు నేను మీయిద్దరను గలిసికొనుటకే వచ్చియుంటిని. మీరు నిశ్చింతగా నుండుఁడు. శీఘ్రముగనే మీమీఁదఁ గృష్ణకృప రాఁగలదు. నేఁటినుండి మీ పేరులు 'సనాతనుఁడు' 'రూపుఁడు'గ వ్యవహరింపఁబడును. మహాప్రభువు వాక్యములు వినఁగానే వారిహృదయము లానందభరితములయ్యెను. వారికి చైతన్య మహాప్రభువు సాక్షాదీశ్వరుఁ డను విశ్వాసము కలిగెను. వాస్తవముగ వారికి ప్రభువులో శ్రీకృష్ణుఁడు కనఁబడుచుండెను.

అంత మహాప్రభువు సనాతనుని పరామర్శచే వీరందఱను వెంటఁబెట్టుకొని బృందావన ప్రయాణమును విరమించి జగన్నాథపురమునకుఁ బ్రయాణమయ్యెను.

ఇచ్చట రూపసనాతనుల స్థితి మాఱిపోయెను. వైరాగ్య ముప్పొంగెను. రాజ్యవైభవములు, మంత్రిత్వము వీనిపై నేవగింపు కల్గెను. ఒక్కక్షణమైన రాజ్యకార్యములలో నుండ నిష్టపడకుండిరి. అది యొకనరక కూపముగ నుండెను. ఎట్లైన ముసల్మాను పాదుషా నౌకరినుండి వదలిపోవలెనను బుద్ధి వారిద్దఱకును గలిగెను. సనాతనుని యనుమతితో రూపుఁడు సెలవుతీసికొని రామకేళికి వెళ్లిపోయెను. సనాతనుఁడు అనారోగ్యమను నెపమున వేఱుగా నుండెను. రూపుఁడు ఇంటికి బోయి చూచునప్పటికి యింటిలోని భోగసామగ్రి పాషాణములుగఁ దోఁచెను. ఎప్పుడెప్పుడు ఈసంసారబంధమునుండి బయటఁబడఁగలమా యని తహతహలాడుచుండెను. రూపుఁ డిద్దఱు గూఢచారులను మహాప్రభువునగ్గఱకు బృందావనప్రయాణము పెట్టుకొన్నప్పుడు కబురుచేయవలసినదని చెప్పిపంపెను. ఈలోగా ధనమునంతను బంచిపెట్టుట కేర్పాటు జరుగుచుండెను. వీరితమ్ముఁడు అనుపముఁ డనువాఁడు. ఆతఁడు మొదటినుండియు భక్తిపరుఁడే. ఆతఁడుకూడ సోదరులతో గృహమును వదలిపోవుటకు సిద్ధపడెను. రూపసనాతనులకు సంతానము లేదు. అనుపమునకు జీవుఁ డనుకుమారుఁడు కలఁడు. కొద్దిధనము నాతనికిచ్చి మిగిలిన ధనమునంతను బీదలకుఁ బంచిపెట్టెను. ఇంతలోనే పాదుషా సనాతనుని బంధించెనను సమాచారమును, జగన్నాథమునుండి మహాప్రభువు బృందావనమునకు బయలుదేరు సమాచారమును తెలియఁగా రూపుఁడును, అనుపముఁడును బయలుదేరుచు సనాతనున కొకఉత్తరము నిట్లువ్రాసిరి:—"మేమిద్దఱమును బృందావనమునకుఁ బోవుచున్నాము. ఏదోవిధముగఁ దప్పించుకొని నీవుకూడ బృందావనమునకు రావలయును. నీకు కావలసిన వ్యయమునకు పదివేలరూపాయలను చిల్లరదుకాణపు వర్తకునివద్ద నుంచియున్నాము. తీసికొనవచ్చును."

సర్వదా భాగ్యభోగ్యములతోఁ దులదూగిన రూపానుపములు వాటి నన్నిటిని వీడి, ఒకచింపిగోఁచీలను, చినిఁగిన బొంతలను ధరించి, ఆఁకలిదప్పులను, నిద్రాహారములను మఱచి పరమానందముతోఁ గాలినడకను మహాప్రభువుకడకుఁ బోవుచుండిరి. అయాచితముగ లభించినదానితోఁ దృప్తిపడుచు వైరాగ్యమూర్తుల వలెఁ బోవుచుండిరి. వారు జగన్నాథమునకు దగ్గఱైనకొలఁది వారియుత్సాహ మినుమడించుచుండెను. వెళ్లివెళ్లి వారు ప్రయాగకుఁ జేరిరి. అక్కడికి పోఁగానే మహాప్రభువు అచ్చటకు చేరినాఁడను జాడ తెలిసెను. అగ్నియున్నచోట ధూమమున్నట్లు లక్షలకొలఁది ప్రజ లెచ్చట హరినామసంకీర్తనమును ప్రేమభావముతోఁ జేయుచుందురో అచ్చట మహాప్రభువు కలఁడని భావించి అచ్చటకుఁ జేరిరి. చైతన్యచరితావళిలో నిట్లు వ్రాయఁబడినది.

గంగా యమునా సారిల ప్రయాగ డుబాయితే,
ప్రభు డుబాఇలా కృష్ణప్రేమ బన్యాతే.

"గంగాయమునలు ప్రయాగను ముంపలేకపోయినవి. కాని కృష్ణప్రేమ యను వరదచేఁ బ్రభువు ప్రయాగను ముంచివేసెను." మహాప్రభుని యాశయము ప్రేమ ప్రవాహములో జగత్తునే ముంచివేయవలయు ననియే.

ఇద్దరును మహాప్రభువుసమీపమునకుఁ బోయిరి. మహాప్రభు వాసమయమున బిందుమాధవుని దర్శించి ప్రేమావేశమున నృత్యము చేయుచుండెను. సోదరులిద్దరు నీలీలను దూరమువనుండి చూచుచుండిరి. మహాప్రభువు బసకు రాఁగానే మధ్యాహ్న సమయమున నేకాంతముగ నున్నప్పుడు ఇద్దరును దీనులు దరిద్రులై వణఁకుచు, రోదనముచేయుచు, పడుచు లేచుచు మహాప్రభుని చరణములమీఁదఁ బడిరి. ఇద్దరును ప్రేమావేశమున నున్మత్తులై, కొంచెము సేపటికి ధైర్యమును వహించి యిట్లనిరి:—"హేదయామయా! పతితపావనా!! నాథా!!! మాబోటి పతితులకు నీవు తప్ప ఆశ్రయ మీయఁగలవారెవరు?"

మహాప్రభు విదివఱకు ఒకరాత్రిని రూపునిఁ గాంచెను; ఇప్పుడాతనిని జూడఁగానే గుర్తించి మహాప్రభు విట్లనెను:—"లెమ్ము! లెమ్ము!! రూపా!!! దీనతను వీడుము. మీపైన శ్రీకృష్ణ కృప అపారముగఁ గలదు. అందుకనియే ఆతఁడు మిమ్ములను విషయకూపమునుండి యుద్ధరించినాఁడు. రూపా! భగవంతునకు భక్తులే ప్రియులు గాని మఱియొకరు కారు.

శ్లో. నమేఽభక్తశ్చతుర్వేదీ మద్భక్తః శ్వపచః ప్రియః,
తస్మై దేయం తతోగ్రాహ్యం స చ పూజ్యో యథాహ్యహమ్.

చతుర్వేదములను జదివినవాఁడైనప్పటికిని నాభక్తుఁడు కాకున్నవాఁడు నాకు ప్రియుఁడు కాఁడు. కాని నాభక్తుఁడు చండాలుఁడైనను నాకుఁ బ్రియుఁడే. నేను వానికి ప్రేమ నొసంగెదను. ఆతనిప్రేమను నేను గ్రహించెదను. జగత్తులో నందఱకును నే నెట్లు పూజ్యుఁడనో అట్లే నాభక్తులును బూజ్యులే."

ఈశ్లోకమును జదివి మహాప్రభువు ప్రేమచే నశ్రుపాతము కావించి సోదరులను గట్టిగాఁ గౌఁగిలించుకొని తనదగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని సమస్త వృత్తాంతము నడుగుచుండెను. రూపుఁ డిట్లనెను:—"ప్రభూ! పాదుషా సనాతనుని ఖైదుచేసినట్లు వినియున్నాను." అంతఁ బ్రభు విట్లనెను:—"భయపడకుము! సనాతనుఁడు ఖైదునుండి బయటపడినాఁడు. నాదగ్గఱకు వచ్చుచున్నాఁడు!" రూపానుపము లారాత్రి యచ్చటనే యుండి ప్రసాదమును గ్రహించిరి. వల్లభ భట్టును వైదిక, యాజ్ఞిక బ్రాహ్మణుఁడు మహాప్రభు[illegible]నమునకు రాఁగాఁ జాలసేపటి

వఱకును శ్రీకృష్ణప్రేమప్రసంగము జరిగెను. మహాప్రభువు సోదరులిద్దరను వారికి పరిచయము గావించెను. ఆయిద్దరును దూరమునందుండియే బ్రాహ్మణునకు సాష్టాంగ నమస్కారమును గావించిరి. భట్టును వడల వారికిఁ బ్రణమిల్లి వారినిద్దరిని గలసికొనఁదలఁచెను గాని వారిద్దరును దూరముగఁ దొలఁగి యిట్లనిరి:—"స్వామీ! మే మస్పృశ్యులము. పామరులము. మీరు మమ్ముఁ దాకరాదు." ఇది వినఁగానే భట్టునకు మిక్కిలి ఆశ్చర్యము కలిగెను, గాని భక్తుల యీదీనతను గాంచి మహాప్రభువు హర్షించెను. మహాప్రభువు వారిజీవిత వృత్తాంతమును వినిపించి భట్టుతో నిట్లనెను:—"మీరు కులీనబ్రాహ్మణులు, వీరు జాతినుండి పతితులైనారు." భట్టు యిట్లనెను:—"ప్రభూ! నాలుకమీఁద శ్రీకృష్ణనామ మాడుచుండిన నాతనికంటె జగత్తులో గొప్పవాఁడెవఁడు? భాగవతములో దేవహూతి యిట్లనెను:-

శ్లో. అహో బత శ్వపచోఽతో గరీయాన్ యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్యమ్,
తేపుస్తపస్తే జుహువుః సస్నురార్యా బ్రహ్మానూచుర్నామ గృణంతి యే తే!

(భాగ. 3-33-7.)

'ఎవనినాలుకమీఁద నీపవిత్రనామము వర్తించుచుండునో అట్టివాఁడు చండాలుఁడైనను శ్రేష్ఠుఁడే. నీనామమును గ్రహించు మహానుభావులు గొప్పతపస్సు చేసినవారును హోమము చేసినవారును, తీర్థస్నానమును జేసినవారును, వేదాధ్యయనము చేసినవా రగుచున్నారు."

భట్టునోట నీశ్లోకమును విని మహాప్రభువు ఆతనినిఁ బ్రశంసించుచు నిట్లనెను:—

శ్లో. శుచిం సద్భక్తిదీప్తాగ్నిదగ్ధం దుర్జాతికల్మషః, శ్వపాకోఽపి బుధైః శ్లాఘ్యో న వేదజ్ఞోఽపి నాస్తికః
భగవద్భక్తిహీనస్య జాతిః శాస్త్రం జపస్తపః, అప్రాణస్యైవ దేహస్య మండనం లోకరంజనమ్.

ఎవనియొక్క హీనజాతీయపాపము సద్భక్తిరూపమను దీప్తాగ్నిలో దగ్ధమైనదో అట్టిచండాలుఁడుకూడ పండితులచే సమ్మానింపఁబడినవాఁడు; కాని నాస్తికుఁడు వేదము నెఱిఁగినవాఁడైనప్పటికి సన్మానయోగ్యుఁడు కాఁడు.

ప్రాణహీనశవమున కలంకారముచేయుట కేవలము లోకరంజనముకొఱకే గాని దానివలన ఫలమేమియును లేదు. అట్లే భక్తిహీనుఁడగువాని జాతియు, శాస్త్రజ్ఞానమును, వాని జపతపములును విఫలములే కాఁగలవు."

ఈవిధముగఁ బ్రేమాలాపములు చేయుచు మహాప్రభువు చాలదినములవఱకు రూపానుపములను బ్రయాగలోఁ దనదగ్గఱ నుంచుకొనెను. రూపునిచే ప్రభువు చాల పనిని జేయింపఁదలఁచెను. బృందావనములోని దివ్యప్రేమలీలను బునరుజ్జీవింపవలసియున్నది. అందువలన రూపుని ఏకాంతమున నుంచుకొని విధువక చాలదినముల

వఱకు మహాప్రభువు వానికి భక్తియొక్క యథార్థరహస్యమును బాగుగా బోధించి చివర కిట్లనెను:—"రూపా! నేను కాశీకిఁ బోవుచున్నాను." రూపుఁడు దుఃఖిత మనస్సుతో నిట్లనెను:—"మీవియోగమును నేను సహింపఁజాలను."

ఈవచనములకు ప్రభువు కొంచెమైన మెత్తఁబడలేదు. రూపుఁడు మరల నిట్లనెను:—"ప్రభూ! మీరు నన్నువదలిన నేను బ్రదుకుట దుర్లభము."

రూపుఁడు మరల నట్లనినప్పటికిని ప్రయోజనము కలుగక యిట్లనెను:—"ఇదేమి? బృందావనమునకుఁ బొమ్ము. నాయాజ్ఞను పాలించుము. జీవులకు మేలొనర్పుము. స్వసుఖమును వదలి బృందావనమునకుఁ బొమ్ము. ఆతర్వాతఁ గోరికయుండిన నన్ను నీలాచలము (జగన్నాథము)నఁ గలిసికొనుము." ఇట్లు చెప్పి ప్రభువు అచ్చట నుండి బయలుదేరి వెళ్లిపోయెను. రూపుఁడు మూర్ఛితదశలో నుండఁగాఁ బ్రభువు వెళ్లిపోయెను. కర్తవ్యపాలనము కఠినమైనది.

ధైర్యమును ధరించి ప్రభుని ఆజ్ఞానుసారముగ రూపుఁడు తనతమ్ముఁడగు అనుపమునితో బృందావనమునకుఁ బోయెను.

రూపానుపములు బృందావనమునకుఁ జేరిరి. అచ్చట వారు సుబుద్ధిరాయలను గలిసికొనిరి. భగవానునిలీల విచిత్రమైనది. ఒకానొకప్పుడు రూపుఁడు గౌడదేశమునకు మంత్రి, సుబుద్ధిరాయలు గౌడాధిపతి. హుసేన్‌శాహాకుపూర్వము గౌడాధిపతి సుబుద్ధిరాయలే. హుసేన్ ఆతనిదగ్గఱ నౌకరు చేయుచుండెను. ఒకసారి యేదో యపరాధమునకు సుబుద్ధిరాయలు హుసేనునివీఁపుమీఁద కొరడాతోఁ గొట్టెను. కొరడా బాగుగా తగులుటచే నాచిహ్నము (వాత) వీఁపుమీఁదఁ జాలదినములవఱకుండెను. తర్వాత కొన్నాళ్లకుఁ గౌశలముతో హుసేను సుబుద్ధిరాయలను సింహాసనచ్యుతునిఁ గావించి తానే పాదుషా యయ్యెను. అప్పుడు హుసేన్‌ఖాన్ యనునామమును హుసేన్‌శాహా యని మార్చుకొనెను. హుసేన్‌శాహా సుబుద్ధిరాయలను గొట్టక పదచ్యుతుని గావించి తనదగ్గఱనే యుంచుకొనెను. కాని ఒకానొకదినమున హుసేనునిభార్య తన భర్తవీఁపుమీఁద కొరడావాతను గాంచి వృత్తాంతమును దెలిసికొని, కోపమునుజెంది తననోటిలోని యెంగిలినీటిని సుబుద్ధిరాయలనోటిలోనికి యుమ్మివేసెను.

సుబుద్ధిరాయలు జాతిచ్యుతుఁడయ్యెను. ఆతఁడు తన బుద్ధిపూర్వకముగ ముసల్మాను జలమును ద్రాగకున్నను సమాజమాతనికి ప్రాయశ్చిత్తమేర్పాటుచేయక పోవుటచే జాతినుండి బహిష్కృతుఁడు కావలసివచ్చెను. రాజ్యచ్యుతుఁడైన పేదవానిమాట నెవఁడు మన్నింపఁగలఁడు? ఆతనిదగ్గఱ బాగుగా ధనముండియుండిన ప్రాయశ్చిత్తమునకుఁ దోడుగా సమాజములో స్థానము లభించెడిదే. సుబుద్ధిరాయలు

సమాజచ్యుతుఁడై మిక్కిలి దుఃఖించి హృదయపూర్వకముగఁ బ్రాయశ్చిత్తము చేసికొందమని కాశీపండితులకడకు వెళ్లి ప్రాయశ్చిత్తవ్యవస్థ నొసఁగుమని ప్రార్థించెను. పండితు లిట్లనిరి:—"తుకతుక ఉడుకుచున్న నేతిని ద్రావి ప్రాణత్యాగము చేయుటయే దీనికిఁ దగిన ప్రాయశ్చిత్తము" ఇదివిని సుబుద్ధిరాయలు భయపడి ప్రాణత్యాగము చేయుటకంటె జాతిచ్యుతుఁడగుటయే మేలని తలఁచెను. సుబుద్ధి ప్రాణత్యాగము చేయకున్నను తనజీవితముపై నేవగింపు కలిగెను. ఇట్టి హిందూజాతిబిడ్డలెండలు ప్రాయశ్చిత్తవ్యవస్థ లేకపోవుటచే పరమతము పాలైరో యెవరికి తెలియును?

చైతన్యమహాప్రభువను వాఁడొకరు దీనజనోద్ధారకుఁ డవతరించినాఁడనియు, నాతఁ డెవరిని నేవగించుకొనక ప్రేమించుననియు వినియుండెను. సుబుద్ధిరాయల మనస్సునకుఁ గొంచెముగ నుత్సాహము కలిగి ప్రభువుకడకు పరువిడెను. మహాప్రభువుకడకుఁ బోయి ప్రాయశ్చిత్తవ్యవస్థనుగూర్చి ప్రస్తావింపఁగాఁ ప్రభు విట్లనెను:- "కృష్ణ నామైవ కేవలమ్" శ్రీకృష్ణుని పరమపావననామసహాయమున సమస్తపాపములను బోఁగొట్టుకొనవచ్చును." సుబుద్ధిరాయలు బృందావనమున కీయాజ్ఞ ననుసరించియే వెళ్లి, అచ్చట తన జీవనమును శ్రీకృష్ణనామజపమున కల్పించెను. అట్టి సుబుద్ధిరాయలను జూడఁగనే రూపానుపములకు మిక్కిలి సంతోషము కలిగెను. ప్రభుకృపచే నేఁడు గౌడదేశమునకు పూర్వపురాజును, బూర్వపుమంత్రియు నొకే యుద్దేశ్యమున నొక్కచోటకుఁ జేరిరి.

౨

రూపానుపములను బృందావనమునకుఁ బంపి మహాప్రభువు కాశీకి వెళ్లెను. అచ్చట చంద్రశేఖరభవనమున విడిసెను. ఇచ్చట సనాతనుఁడు గౌడనగరకారాగారమునుండి తప్పించుకొని మహాప్రభువుకడకు చేరెను. రూపునియుత్తరమును జూచుకొని మెల్లగ ధనమును దెప్పించుకొని కావలివానికి కొంతనిచ్చి బయటపడి, యేడువేలరూపాయలొసంగి వానిసహాయమునసే ఆరాత్రియే గంగను దాఁటెను. ఈశానుఁడను సేవకుఁడొకఁడు వెంటనుండెను. సనాతనునిదగ్గఱ నిప్పుడేమియును లేదు. ఒక చినిఁగినధోవతినిమాత్రము కట్టుకొని తిండితిప్పల కేమియును నైకొనక తీరతీరముననే బృందావనమునకుఁ బయనమయ్యెను. రాత్రింబవళ్లు నడచినడచి పాతడా యనుగ్రామమునకుఁజేరి యచ్చట రైతులసహాయమునఁ గొండను దాఁటి వెళ్లెను. ఈతనివెంటనున్న యీశానుఁ డెనిమిదిమోహరీలను తనదగ్గఱ దాఁచియుంచుకొనెను. అచ్చటి రైతులకు ధనాశ మెండగుటచే నొకరాత్రివేళ సనాతనుని, ఈశానునిఁగొట్టి మొహరీలను హరింపఁదలఁచిరి. ధనమహిమ యిదియే కదా! మాంసమును గాంచి మాంసాశనజంతువులు పోరాడి మడిసిన ట్లీధనమునకై లోభిమానవులు నిరంతరము

జగత్తులోఁ బోరాడుకొనుచుందురు. ధన మెచ్చటనుండునో అచ్చటనే దొంగతనము, మోసము, కొట్లాట, వ్యాజ్యము, ముఖస్తుతి మొదలగునవి యుండును. అందఱకును ఉద్దేశము ధనము నార్జించుటే కాని సాధనములు భిన్నములు. కొందఱు కొట్టి తీసి కొందురు. కొందఱు మెల్లగ మోసముచేసి లాగుకొందురు. నేఁడు సనాతనునకును, ఈశానునకును ఆదర మొనర్చుటకుఁ గారణ మిదియే. సనాతనుఁ డిట్లు యోచించెను:- "నా దగ్గఱ చిల్లిగవ్వైన లేదే. వీరు నన్నిట్లేల నాదరించుచున్నా' రని యోజించి యీశాను నిట్లడిగెను:—"ఈశానా! నీవద్ద నేదియో ధనమున్నట్లున్నదే" అనఁగా నొక మొహరీని దాఁచి యేడు మొహరీ లున్నవని చెప్పెను. సనాతనుఁ డిట్లనెను:— ఓరీ! ఈపాపమును దగ్గఱ నేల నుంచుకొంటివి. నీవు వీటి నారైతుల కిమ్ము లేదా వారు బలవంతమునకైన లాగుకొనగలరు. ఆతఁ డొక్క మొహరీని దాఁచుకొని తనదగ్గఱ నున్న మిగిలిన యేడు మొహరీలను రైతుల కిచ్చివేసెను. తర్వాత నీతనివద్ద నింకొక మొహరీ యున్నదని తెలిసికొని త్రిప్పియింటికి పంపివేసెను. ఇప్పుడు సనాతనుఁ డొంటరిగ సుఖముగ వెళ్లుచుండెను. సంధ్యాసమయమునకు హాజీపురమునకుఁ జేరెను. అచ్చట కూర్చుండి యుచ్చైస్స్వరమున శ్రీకృష్ణనామకీర్తనము చేయుచుండెను. ఆతనికి నిజమగు శాంతియు, విశ్రాంతియు దీనిలోనే లభించుచుండెను. నిజమున కంతియేకదా!

సనాతనుని బావమఱఁది శ్రీకాంతుఁడు చాలరోజులు హాజీపురమున నుండెను. ఆతఁడు గౌడపాదుషాకొఱకు గుఱ్ఱములను గొనవచ్చెను. సంధ్యాసమయమున శ్రీకాంతుఁ డొకప్రక్కనఁ గూర్చుండియుండెను. ఆతని కర్ణరంధ్రములకు మధురహరి నామధ్వని తగులఁగనే స్వరమును గుర్తించి, శ్రీకాంతుఁడు లేచి సనాతనునిదగ్గఱకుఁ బోయి చూచి నిర్ఘాతపడెను. ఆతనికిసనాతనుని గూర్చిన సమాచారమేమియును దెలియదు. అందువలన నాతని కాశ్చర్యము వేసెను. సనాతనుని శరీరము చిక్కియుండెను. చినిఁగిన మాసినగుడ్డ కట్టుకొనియుండెను. గడ్డము పెరిగెను. ముఖమున వైరాగ్యచిహ్నములు కనఁబడుచుండెను. ఆతఁడు బిగ్గఱగా నున్మత్తునివలె హరినామమును బలుకుచుండెను. శ్రీకాంతుఁడు సనాతనుని బిలిచి స్వగృహమునకుఁ దెచ్చి, ఆతనిదగ్గఱగఁ గూర్చుండి యీస్థితికి కారణమడిగెను. సనాతనుఁడు సంక్షేపముగ సమస్తవృత్తాంతమును వినిపించెను. శ్రీకాంతుఁ డిట్లనెను:—"ఇది బాగుండలేదు. ఇంటికితిరిగిపోదము" అదివినిసనాతనుఁ డిట్లనెను:—"ఇంటికే వెళ్లుచున్నాను. ఇన్నాళ్లనుండియు నింటిని మఱచితిని. పరాయియింటిని నా యిల్లనుకొంటిని. ఇప్పుడు తెలియుటచేఁ బరువిడుచున్నాను." శ్రీకాంతుఁ డెంత చెప్పినను వినలేదు. వైరాగ్యసాగరమునఁ బొంగిన నింక విషయరూపమగు కసవునకు స్థానమెక్కడిది? శ్రీకాంతుని వాక్య

ములు సనాతనుని జాగ్రత్తహృదయమున కంటలేదు. ఇది గ్రహించి సనాతనుఁ డింక నింటికి రాఁడని గ్రహించి పారిభర్పుఁడకుఁ గొంతపైకము నీయఁబోయెను. సనాతనుఁడు గ్రహించలేదు. అది అతిచలికాలమగుటచేఁ గప్పుకొనుట కొకరత్నకంబళము నీయఁబోయెను. కాని సనాతనుఁడు దానిని గ్రహింపలేదు. భక్తుఁడనను, సాధువులకును, శీతోష్ణసుఖ దుఃఖాదులుగాని, ఆఁకలిదప్పులు యేమియును జేయఁజాలవు.

శ్లో. "శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగవివర్జితః" (గీత. ౧౨-౧౮.)

శ్రీకాంతుఁ డేడ్వఁ బ్రారంభించెను. ఆతనిరోదనమును విని సనాతనునిహృదయము కఱిగిపోయెను. భక్తు లతికోమలహృదయులు. పరులదుఃఖములను గాంచి బాధపడుదురు. అందువలన శ్రీకాంతునిమనస్సును శాంతింపఁజేయుటకు ఆతనివలన నొక కంబళినిమాత్రము గ్రహించి చూచుచుండఁగనే అచ్చటనుండి వెడలిపోయెను. శ్రీకాంతుఁ డట్లే చూచుచు నిలువఁబడిపోయెను.

మహాప్రభువు ఎచ్చట నున్నాఁడని సనాతనుఁ డడుగలేదు. సూర్యోదయమైనతర్వాత నాతఁడు కనఁబడకపోవునా? మహాప్రభువు ఏయేగ్రామములగుండా హరినామసంకీర్తనము చేసికొనుచు వెళ్లెనో ఆగ్రామములలో తుములహరినామ సంకీర్తనము జరుగుచునేయుండెను. దానినిబట్టి సనాతనుఁడు ప్రభువువారిమార్గమును గనిపెట్టి పోవుచుఁ జివరకు కాశీలోఁ జంద్రశేఖరునింటికిఁ జేరెను. అచ్చట పంచలకొలఁదిభక్తులు శరీరములు మఱచి హరినామసంకీర్తనము చేయుచుండిరి. ఆ హరినామధ్వనిని వినఁగానే సనాతనునకు శరీరము పులకరించెను. సనాతనుఁడు చంద్రశేఖరుని యింటివాఁకిటఁ గూర్చుండి ప్రభుచరణములను ధ్యానించుచుండెను. లోపలికి వెళ్లి దర్శించుటకు సాహసము లేదు. ప్రభు వొకరాత్రివేళఁ దన్నొక్కసారియే చూచెననియు గుర్తింపఁడేమోననియు భావించెను. అదియునుగాక తాను పతితుఁడనని భావించుచుండెను. అందువలన దీనునివలె వాఁకిటఁ గూర్చుండెను. ఆతనిలోఁ గపటముగాని దంభముగాని లేశమాత్రమైనను లేదు.

సర్వజ్ఞుఁడగు మహాప్రభువు లోనఁ గూర్చుండియే సనాతనుఁ డిచ్చటఁ గూర్చుండినాఁడని గ్రహించి చంద్రశేఖరుని బిలిచి వాఁకిటఁ గూర్చుండిన వైష్ణవుని లోనికిఁ గొనిరమ్మనెను. చంద్రశేఖరుఁడు బయటకువచ్చి చూడగా నచ్చట ఆతనికి వైష్ణవుఁడు కనఁబడలేదు. లోనికిఁబోయి ప్రభువుతో నెవరును లేరనెను. "ఎవరును లేరా?" యని యడుగఁగా నొకఫకీరుమాత్ర ముండెనని జవాబొసంగెను. "ఆతఁడే పరమవైష్ణవుఁడు. వైష్ణవవేషముకాదు కావలసినది. వైష్ణవహృదయము కావలయును." మరల చంద్రశేఖరుఁడు సనాతనుని కడకువచ్చి ప్రభువు మిమ్ములను లోనికిఁ బిలుచుచున్నా రనెను. అప్పుడు సనాతనుఁ డిట్లనెను:—"నిజముగఁ బ్రభువు పిలుచు

చున్నాఁడా? నేను దీనుఁడను. హీనుఁడను. పతితుఁడను. నేను ప్రభుకృపకుఁ బాత్రుఁడఁ గాఁజాలను. అసలు నేను వచ్చినసంగతి ప్రభువునకు సూచననే చేయ లేదు. అట్టియెడ నన్నెట్లు రమ్మనఁగలఁడు?" చంద్రశేఖరుఁ డిట్లనెను:—"ప్రభువు మిమ్ములనే రమ్మనుచున్నాఁడు. లోనికి రండు. ఇది వారి యాజ్ఞ."

సనాతనునిహృదయమున నానందసముద్ర ముప్పొంగెను; కాని తన స్వాభావికదీనతను గనఁబఱచుచు అపరాధ మొనర్చినవానివలె మెదలక లోనికిఁబోయి ప్రభుచరణములందు సాష్టాంగము పడెను. కన్నులవెంట నశ్రువర్షమును గుఱిపించుచు నిట్లనెను:—"ప్రభూ! నేను పామరుఁడను. నేను జీవితకాలమంతయును గామాదిషడ్వికారములకు లోనై విషయభోగసుఖముల ననుభవించితిని. మానవ జన్మమును నేను వృథాగాఁ బోఁగొట్టుకొంటిని. రాత్రింబవళ్లు నీచులతోఁ జేరి నీచ కర్మ లొనర్చుచుంటిని. నన్నుఁబోలిన పాపియు, నధముఁడును, నీచుఁడును, గుటిలుఁడును నెవఁ డుండఁగలఁడు? ప్రభూ! నేఁడు నీ చరణశరణమునకు వచ్చియున్నాను. నీ స్వాభావికదయాళుతను స్మరించి నాకు నీచరణసన్నిధిని స్థాన మొసంగుము. ఈయ ధమున కీచరణములు వినా ఆశ్రయ మెచ్చట లభింపఁగలదు?"

ప్రభువు సనాతనుని యీవాక్యములను వినఁజాలకపోయెను. ఆతనిహృదయము దయచే ద్రవీభూతమయ్యెను. సనాతనుని బలవంతమున లేవఁదీసి ప్రభువు గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. సనాతనుని యశ్రుధారలు గంగాస్రవంతియై ప్రభు పాదములను సశరీరముతోఁ గడిగివేసెను. ప్రభువువారినేత్రములనుండి బయలు దేఱిన ప్రేమాశ్రుధారలు సనాతనునిశిరస్సును దడిపి పాపములన్నిటిని వత్క్షణమే కడిగివేసెను. భగవంతుఁడును భక్తుఁడును గలిసికొనినప్పు డిద్దరకును బయలుదేఱిన అశ్రుధారలు గంగాప్రతిమమై పవిత్రత కేమాత్రమును దీసిపోకుండును.

సనాతనుఁ డిట్లనెను:—"ప్రభూ! మీరు నన్నేల స్పర్శించెదరు? నా యీ కలుషితకళేబరమును మీరు స్పర్శించుటకు యోగ్యమైనది కాదు. ఈ ఘృణిత, దూషిత దేహమును మీరు స్పర్శింపవలదు. ప్రభు విట్లనెను:—"సనాతనా! దీనతను బోఁగొట్టుకొనుము—నీ దీనతను జూచిన నాహృదయము బ్రద్దలగుచున్నది. శ్రీకృష్ణకృప కలిగినప్పుడు మంచిచెడ్డలవిచారమే లేదు. శ్రీకృష్ణుఁడు నీసమ్ముఖమున నున్నాఁడు. వర్ణించుటకు వీలులేనట్టి కృష్ణకృప నీయందుఁ గలదు. ఆతఁడు నిన్ను విషయకూపము నుండి బయట పడవేసినాఁడు. నీశరీరము పాపరహితమైనది; ఏలననఁగా నీబుద్ధి శ్రీకృష్ణభక్తియందు లగ్నమైయున్నది. నేను పవిత్రుఁడనగుటకే నిన్ను స్పర్శించుచున్నాను. ఏలననఁగా నీవు నీభక్తిబలముచే బ్రహ్మాండమునుగూడ పవిత్రముచేయుటకు సమర్థుఁడవు."

శ్లో. భవద్విధా భాగవతాస్తీర్థభూతాః స్వయం విభో,
తీర్థీకుర్వంతి తీర్థాని స్వాంతఃస్థేన గదాభృతా. (శ్రీమద్భా. ౧-౧౩-౧౦.)

యుధిష్ఠిరుఁడు విదురునితో నిట్లనెను:—“ప్రభూ! మీవంటి భగవద్భక్తులు తీర్థరూపులు. పాపులవలనఁ గలుషితములైన తీర్థములకు మీ హృదయములో నున్న గదాధరునిద్వారా మరల తీర్థత్వమును బ్రసాదించుచున్నారు.”

భక్తప్రహ్లాదుఁడు నృసింహునితో నిట్లనెను:—

శ్లో. విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిందనాభ పాదారవిందవిముఖాచ్ఛ్వపచం వరిష్ఠమ్,
మన్యే తదర్పిత మనోవచనే హితార్థ, ప్రాణం పునాతి స కులం నతు భూరిమానః,
(శ్రీమద్భాగ. ౭-౯అ. ౧౦శ్లో.)

ధర్మము, సత్యము, దమము, తపము, అద్వేషము, లజ్జ, తితిక్ష, అహింస, యజ్ఞము, దానము, ధృతి, వేదాధ్యయనము—ఈ పండ్రెండుగుణములచే విభూషితుఁడగు బ్రాహ్మణుఁడైనను భగవంతుఁడగు పద్మనాభపాదారవిందవిముఖుఁడైనచో వానికంటె మనస్సును, ధనమును, వాక్కును, కర్మలను భగవంతునకు సమర్పించిన చండాలుఁడు శ్రేష్ఠుఁడని భావించుచున్నాను. ఏలననఁగా నాహరిభక్తుఁడగు చండాలుఁడు కులమునంతను బవిత్రము చేయఁగలఁడు; కాని తానే గొప్పవాఁడను కొను బ్రాహ్మణుఁడు తన్నుఁ దానుద్ధరించుకొనఁజాలఁడు!” ఈ రెండుశ్లోకములను జదివి మహాప్రభు విట్లనెను:—

సనాతనా! నీవు హరిభక్తుఁడవు. నిన్ను దర్శించుటచేతను, స్పర్శించుటచేతను, నీగుణగానముచేతను శరీరము పవిత్రము కాఁగలదు—

శ్లో. అక్ష్ణోః ఫలం త్వాదృశ దర్శనం హి తన్వాః ఫలం త్వాదృశగాత్ర సంగః,
జిహ్వాఫలం త్వాదృశకీర్తనం హి సుదుర్లభా భాగవతాహి లోకే.
(హరిభక్తిసుధోదయము. ౧౩-౨.)

“నీ వంటి భక్తులదర్శనమందే కన్నులకు సాఫల్యము కలదు; నీవంటి భక్తులను దాఁకుటచేతనే సఫలత కలదు; నీవంటి భక్తుల గుణగానమందే జిహ్వకు ఫలము కలదు. లోకములో భాగవతుల దర్శన మత్యంతదుర్లభము.”

ఇట్లని మహాప్రభువు సనాతనుని భాగ్యమును గూర్చి మిక్కిలిగఁ బ్రశంసించి యిట్లనెను:—“కృష్ణప్రేమ కలిగిన నిట్టిదినత్వ మబ్బును.” అనంతరము మహాప్రభువు సనాతనుని కారాగారవిముక్తి వృత్తాంతము నడిగెను. సనాతనుఁడు సంక్షేపముగ సమస్తవృత్తాంతమును జెప్పెను.

మహాప్రభువు చంద్రశేఖరునితో నిట్లనెను:—“సనాతనునికి శిరోముండనము కావించి స్నానముచేయించి నూతనవస్త్రములను ధరింపఁజేయుము.” స్నానమైన

తర్వాత తపనమిశ్రుఁడను భక్తుఁడు సనాతనునకు నూతనవస్త్రముల నీయఁబోఁగా సనాతనుఁ డిట్లనెను:—మీరు నాకు వస్త్ర మీయఁదలఁచునెడల చినిఁగిన గుడ్డల నొసంగుఁడు. నూతన వస్త్రములతో నాకు పనిమేమి?" సనాతనుఁడు పట్టుదలఁ బట్టఁగా తపన మిశ్రుఁ డొక ప్రాతధోవతినే యిచ్చెను. సనాతనుఁడు దానినిఁ జించి రెండు కాపీనములుగఁ జేసెను. సనాతనుని వైరాగ్యమును గాంచి మహాప్రభువు లోలోన సంతసించెను. కాని శ్రీకాంతుఁ డొసంగినకంబళి మింకను సనాతనుని భుజముపై నుండెను. మహాప్రభువు రెండు మూఁడుసారు లాకంబళమువైపు చూచెను. ఇది సనాతనుఁడు కనిపెట్టి, దానిని వదలకుండుట తనవైరాగ్యమునకు లోటని గ్రహించి గంగాతీరమునకుఁబోయి దాని నొకబీదవాని కొసంగి, దానికి బదులుగాఁ జినిఁగినబొంతను దీసికొని కప్పుకొనెను. సనాతనుఁడు బొంతను గప్పుకొనుటను గాంచి మహాప్రభువు ప్రసన్నుఁడై యిట్లనెను:—"సనాతనా! శ్రీకృష్ణుఁడు నీవిషయ రోగమును సమూలము నేఁటికిఁ బోఁగొట్టెను. ఉత్తమ వైద్యుఁడు రోగశేషము నేల యుంచును?"

మహాప్రభువు సనాతనుని రెండునెలలవఱకు తనదగ్గఱనుంచుకొని భక్తి తత్త్వము యొక్క పరమోత్తమశిక్షణ నొసంగి, ఆమీఁదట బృందావనమునకుఁ బోయి రూపానుపములతోఁగూడి శ్రీకృష్ణకార్యసంపాదనము కావించుఁడని యాదేశించెను.

మహాప్రభువు నీలాచలము (పురీ) నకుఁ బోఁగానే, ప్రభ్వాజ్ఞచే సనాతనుఁడు బృందావనమునకు వచ్చెను. బృందావనమునకు రాఁగానే రూపానుపములు వేఱు మార్గమున స్వదేశమునకుఁ బోయెనని తెలిసెను. సనాతనుఁడు సుబుద్ధిరాయలబసలో విడిసెను. రాయలు మిక్కిలి యాదరముతో నాతనిని తనదగ్గఱ నుంచుకొనెను గాని సనాతనునకు సమ్మతముగ లేకుండెను. ఏమాత్రము భోగసామగ్రి ఆతనిదగ్గఱలో నున్నను నాతని కసహ్యము. సనాతనుఁ డావిడిదిని విడిచి వనమందొక చెట్టుక్రింద నివసించుచుండెను. ప్రతిదినమును అడివికట్టెలను గొట్టితెచ్చి బజారులో విక్రయించి, తాను దినఁగా మిగిలినదానిని బీదలకుఁ బంచిపెట్టుచుండును. ఒకానొకప్పుడు వంగ దేశమునకు హర్త, కర్త, భర్త యైనవాఁడు నేఁడు హరిప్రేమోన్మత్తతచే దీనుఁ డయ్యెను.

సనాతనుఁడు నిత్యమును యమునాస్నానమునకు వెళ్లెడువాఁడు. ఒకనాఁడు యమునాతీరమున నొకమణి కనఁబడెను. దానిని దీసికొని బీదవాని కెవనికైన నొసంగవచ్చుననుకొనెను. కొంచెముసేపు ఒడ్డునఁ గూర్చుండెను. ఎవరును రాకఁబోవు నప్పటికి మణి మీఁద మట్టిని గప్పి యమునలో స్నానము జేయఁబోయెను. ఇంత

లోనే ఒక బ్రాహ్మణుఁడు వచ్చి యాతనితో నిట్లనెను:—"నే నీవేళ స్వప్నములో మీరు నాకు చాలధనము నొసంగి పరమైశ్వర్యశాలిఁగాఁ జేసినట్లు గాంచి మీ వద్దకు పరువిడివచ్చితిని" బ్రాహ్మణునిమాటను విని సనాతనుఁ డిట్లనెను:—"స్వామీ! నే నకించనుఁడను. కాని ఆ మట్టిక్రింద నొకమణి పడియున్నది; బహుశః శ్రీకృష్ణుఁడే నీకొఱకు దానిని నుంపియుండవచ్చును. మీరుఁ గావలసినచో దానిని దీసికొనిపోవచ్చును." బ్రాహ్మణుఁడు వెదుకఁగా మణి లభింపకపోఁగా, సనాతనుఁడు యమునసుండి బయటకువచ్చి, యాస్థానమునుజూపి యిట్లనెను:—"స్వామీ! నేను స్నానముచేసితిని. కావున నేను మణిని దాఁకను. మీరు దానిని దీసికొనఁబోండు" బ్రాహ్మణుఁడు బహుమూల్యమగు నారత్నమును బొంది మిక్కిలి ప్రసన్నుఁడై దానిని దీసికొని యింటికిఁ బోయెను. వెళ్లుచు వెళ్లుచు నా బ్రాహ్మణుఁ డిట్లనుకొనెను:—"నే నేమణిని ఆనందముతోఁ గొనిపోవుచుంటినో దానిని సనాతనుఁడు తాఁకనైనఁ దాఁకలేదు. కారణమేమైయుండును. సనాతనునకు దీనికంటె మూల్యవంతమగు వస్తువు దొఱకియుండవచ్చును. అందువలననే ఆతఁడు దీనిని దాఁకియుండఁడు. అట్లైనచో నేనుమాత్ర మట్టివస్తువుకొఱకై బ్రాణము నేల యొడ్డరాదు?" బ్రాహ్మణుఁ డిట్లాలోచించి మణిమోహమును విడిచి, సనాతనుని కడకు వచ్చి యాతనివలన భక్తితత్త్వమును దెలిసికొని నవజీవనమును బొందెను. నిజమగు సాధుసాంగత్యమునఁ గలుగుఫలమిదియే.

కొన్నాళ్లు బృందావనమున నివసించి సనాతనుఁడు మహాప్రభువును దర్శించుటకు నీలాచలమునకుఁ బోయెను. దారిలో నాతనికి చర్మరోగము సంభవించెను. ఝారఖండ్ గ్రామములోని మురికినీరు త్రాగుటచే నీరోగము కలిగినదని కవిరాజగోస్వామి చెప్పెను. దేనివలననైనఁ గానిండు సనాతనుఁడు రోగాక్రాంతుడై నీలాచలమునకుఁజేరి తాను దీన, హీన, పతితుఁడనని భావించి హరిదాసువద్ద విడిసెను. ఆతనికి రోగచింత లేకపోఁగా నానందముకూడ కలుగుచుండెను. ఈరోగకారణమునఁ దనదగ్గఱ కెవ్వరును రాకుండిన భజన నిశ్చింతగ జరుగుననియు, పూర్వజన్మకృతపాపఫలము అనుభవించినకొలఁది యీరూపమునఁ బోఁగలదనియు సనాతనుఁడు దీనిని బాధగా భావింపక కుష్ఠును కృష్ణుని కృపగా భావించెను. హరిదాసుకడకు మహాప్రభువు ప్రతిదినమును వచ్చుచుండెడువాఁడు. అక్కడ సనాతనుని గాంచఁగానే ఆతఁడు దూరముననుండియే సాష్టాంగము పడెను. మహాప్రభువు పరువిడి యాతనినిఁ గౌఁగిలించుకొనఁదలఁచెను గాని సనాతనుఁడు వెనుకకుతగ్గి యిట్లనెను:—"ప్రభూ! మీరు నన్ను స్పర్శింపవలదు. నే నతినీచుఁడను. అందువలననే నాకు కుష్ఠు సంభవించినది. కావున క్షమింపుఁడు." మహాప్రభు విట్లనెను:—"సనాతనా!

నీశరీరము నాకుఁ బవిత్రమైనది. నీవు కృష్ణభక్తుఁడవు. నిన్నేవగించుకొనువాఁడే యప్పృశ్యుఁడు." అనుచు మహాప్రభువు సనాతనుని పట్టుదలతో బలవంతముగఁ గౌఁగిలించుకొనెను. ఆతని కుష్ఠుగాయములలోని చీము అసహ్యమైనపదార్థము మహాప్రభువు శరీరమంతటను నంటుకొనెను. మహాప్రభువు సనాతనునితో నిట్లనెను:— "మీతమ్ము లిద్దరు నిచ్చట పదినెల లుండిరి. ఆతఁ డ్వాత రూపుఁడు బృందావనమునకుఁబోయెను. అనుపముఁ డిచ్చటనే శ్రీకృష్ణప్రాప్తిని జెందెను. తన చిన్నతమ్ముని మరణమును వినఁగానే సనాతనునకు ఖేదము కలిగి ఆతని భక్తిభావమును స్మరించి యేడ్వఁదొడఁగెను. ప్రభు వాశ్వాసించుచు సనాతనునితో నిట్లనెను:— 'నీవు హరిదాసువద్ద నిచ్చటనే యుండుము; మీకిద్దఱకును శ్రీకృష్ణునియం దమితప్రేమ కలదు. మిమ్ములను శ్రీకృష్ణుఁ డనుగ్రహింపఁగలఁడు."

ఇట్లు పలికి మహాప్రభువు వెళ్లి, ప్రతిదినము వచ్చి సనాతనునిఁ గౌఁగిలించుకొని వెళ్లుచుండెడువాఁడు. సనాతనునకు దీనివలన మనస్సులోఁ జాల క్షోభ కలుగుచుండెను. తనశరీరముమీఁద చీము మహాప్రభుపుశరీరమునకు అంటుకొనుచుండఁగాఁ జూచి మార్మికవేదన ననుభవించెడువాఁడు. కాని మహాప్రభువు వినుటలేదు. అందువలన సనాతనుఁడు జగన్నాథరథముక్రిందఁబడి నలిగి, చచ్చుటకు సంకల్పించెను. దివ్యజ్ఞానమున మహాప్రభు వీవిషయమును గ్రహించి, సనాతనుని తనదగ్గఱకు బిలిపించి యిట్లనెను:— "సనాతనా! నీవు దేహత్యాగమును జేయ సంకల్పించితివి. దానిని వదలుము. దీనివలనఁ గృష్ణుఁడు లభింపఁడు. శ్రీకృష్ణప్రాప్తికి ముఖ్యమగు నుపాయము భక్తియు, భజనము. నీవు శ్రీకృష్ణానురాగము గలభక్తుఁడవు. నీ వీశరీరము నేవగించుకొనుచుంటివి. కాని నే నట్లు తలంపను. నేను సన్న్యాసిని. సన్న్యాసులకు విష్ఠాచందనములు రెండును సమానములే. కావున నేను నీశరీరము నేవగింపఁగలను. నే నేవగించుకొనిన నేను శ్రీకృష్ణుని సన్నిధిలో నపరాధి నగుదును." సనాతనుఁ డిట్లనెను:— "ప్రభూ! నీయిచ్ఛయేమిటో నేను తెలియఁజాలను. నీవు దీనదయాళుఁడవు. కావున నన్నేవగించుకొనవు. నీకు నాబోటి యధములను గృపఁజూచుటయే పని. నీవు నావంటి పతితులకును, సేవకులకును స్వామివి" మహాప్రభు విట్లనెను:— "సనాతనా! నేను మిమ్ములను బాలకులవలెఁ దలఁతును. నేను మీకు తల్లిని. ఎచ్చటనైనఁ దల్లి సంతానము నేవగించుకొనునా? బాలకుని చొంగ తల్లిశరీరమున కంటుకొనదా? ఎచ్చటనైన ముఱికిగా, రోగముగ నున్న సంతానమును దల్లి యేవగించుకొనునా?"

మహాప్రభువు పలికిన యీవాక్యములను విని హరిదాసు ప్రభువుతో నిట్లనెను:— "నీ వెవరి నేవిధముగఁ గృపఁజూచెదవో అది మాబుద్ధి కందని విష

యము అపరిచితుఁడగు వాసుదేవునకు భయానకమగు కుష్ఠురోగమును బోఁగొట్టితివి. ఈ నీసనాతను........" ఇంతవఱకు పలికి ఆపైనఁ బలుకఁజాలకపోయెను.

హరిదాసుని యీవాక్యములవలన సనాతనునకు మిక్కిలి సంకోచము కలిగెను. మహాప్రభువు శక్తి సనాతనునకుఁ దెలియనిది కాదు; కాని సనాతనుఁడు నిష్కాముఁడు. శరీరమమకారమును విడిచినవాఁడు. సనాతనుఁడు శరీరరోగమును బోగొట్టుఁడని సూచననైనఁ జేసియుండలేదు.

మహాప్రభు విట్లనెను:—"హరిదాసా! సనాతనుని శరీరమున కీరోగము వచ్చుటచే నాకు పరీక్షవచ్చినది. నే నీవ్యాధిని గాంచి యేవగించుకొనుచో శ్రీకృష్ణుని ముందు నేను మహాదోషి నగుదును. సనాతనా! నీవు దుఃఖింపవలదు. నిన్నాలింగనము చేసికొనుటచే నాకు సుఖము కలదు కావున నేను అట్లు చేయుచున్నాను. ఈసంవత్సరము నీవు నావద్దనే యుండుము. రాఁబోవు సంవత్సరము నీవు బృందావనమునకుఁ బోవలసియుండును."

పాఠకులారా! మహాప్రభు వీ సనాతనునిరోగము నేల నివారింపలేదో యాలోచింపుఁడు. ప్రభువు సనాతనునిద్వారా మనబోటివారికి గొప్పగుణపాఠము నేర్పినాఁడు. మొదటిది దుష్కర్మఫలము ననుభవించవలసినదే ననియు, రెండవది, భక్తుఁ డెన్నటికిని నీచుఁడు కాఁజాలఁడనియు, అట్టివాఁడు కుష్ఠురోగము వాఁడైనను పరమపూజ్యుఁడే యనియు నేర్పినాఁడు. సనాతనునివంటి కుష్ఠురోగిని మహాప్రభు వెట్లు ఆలింగనము చేసికొనెనో అట్లే భక్తుఁడు కుష్ఠురోగియైన మనమును కౌఁగిలించుకొనవచ్చుననియు, మూఁడవది భక్తుఁ డత్యంతదీనుఁడు కావలయు ననియు, ప్రభువు సనాతనుని మిక్కిలి సన్మానించుచున్నను సనాతనునకు గర్వమేమి యును గల్గకపోఁగా నాతని దీనత దినదినము వృద్ధియగుచుండెను. నాల్గవది భగవంతుని భక్తుఁ డేమియును నడుగరాదనియు, అయిదవది దీనుఁడు, దుఃఖియు, కుష్ఠురోగియు, పీడితుఁడును, ప్రేమపాత్రుఁ డనియును నీతి నేర్చుకొనవచ్చును.

అనంతరము మహాప్రభువు సనాతనుని బృందావనమునకుఁ బోయి జీవోద్ధరణ చేయుమని యాదేశించెను. మహాప్రభువును వదలుటకు సనాతనున కిష్టము లేకున్నను నాతని యాజ్ఞోల్లంఘనము చేయుట సనాతనునకు మిక్కిలి కష్టముగఁ దోఁచెను. సనాతనుఁడు బృందావనమునకుఁ బోయెను. రూపగోస్వామి కూడ అచ్చటికి చేరెను. ఇద్దరును గలిసి బృందావనములో లోకోద్ధార కార్యమును ప్రారంభించిరి.

సనాతనుఁడు 'బృహద్భాగవతామృతము', 'హరిభక్తివిలాసము', 'లీలాస్తవము', 'స్మరణీయ - టీక', 'దిగ్దర్శనీ - టీక', శ్రీమద్భాగవత దశమస్కంధముమీఁద 'వైష్ణవతోషిణి' టీకను రచించెను. రూపగోస్వామి 'భక్తిరసామృతసింధువు' 'మధురా

మాహాత్మ్యము' 'పదావళి' 'హంసదూతము' 'ఉద్ధవసందేశము' 'అష్టాదశకస్కందము' 'స్తవమాల' 'ఉత్కలికావళి' 'ప్రేమేందుసాగరము' 'నాటకచంద్రిక' 'లఘుభాగవతతోషిణి' 'విదగ్ధమాధవము' 'లలితామాధవము' 'ఉజ్జ్వలనీలమణి' 'దానకేళికౌముదికా' 'గోవిందవిరుదావళి' మొదలగు ననుపమానమగు గ్రంథములను రచించెను. విదగ్ధమాధవమును వి. శ. ౧౫౮౯ నందు రచించెను. ఈగ్రంథములన్నిటిలో భక్తి తత్త్వము, భక్తతత్త్వము, శ్రీకృష్ణతత్త్వము మొదలగు వాటినిగూర్చి విశేషవర్ణనము కలదు. అనుపముని పుత్త్రుఁడు జీవుఁడు ఇల్లు వాఁకిలిని వదలి బృందావనమునకుఁ బోయెను. ఆతఁడుకూడ గొప్పకార్యములను సాధించుటయేగాక, అనేకములగు నుత్తమగ్రంథములను రచించెను.

బృందావనమునుండి యెవ్వరైన నీలాచలమునకు యాత్రికులు వచ్చినయెడల మహాప్రభువు రూపసనాతనుల క్షేమసమాచారముల నడుగుచుండెడువాఁడు. అప్పుడు వా రిట్లు జవాబు చెప్పెడువారు:—'సోదరులిద్దఱును చెట్లక్రింద నిద్రించుచుందురు. భిక్షించి లభించినదానినిఁ దినుచుందురు. చినిఁగిన కౌపీనములను మాత్రమే ధరించుచుందురు. ఒకబొంతయు, నొకముంతయుఁ దప్ప వేఱొకటి వారివద్ద లేదు. ఎనిమిది ఝాములలోఁ గేవలము నాల్గుగడియలు మాత్రము నిద్రింతురు. మిగిలినకాలమంతయును శ్రీకృష్ణనామ సంకీర్తనముసఁ గడుపుచుందురు?'

శ్రీరూప సనాతను లిద్దఱును బృందావనములోనే గోలోకవాసులైరి. ఒకానొకప్పుడు విద్యా, సద్వైశ్వర్య గౌరవాదులచేఁ దులదూగినవారు భగవత్కృపచే నిరభిమానులై, నిర్లేపులై, నిర్లోభులై, వైరాగ్యవంతులుగను, బరమప్రేమమార్గనిష్ఠులు నైరి.

---

# భక్త పరమేష్ఠి దర్జీ

మానవుఁ డీజన్మమున నీచవర్ణమునుండి ఉచ్చవర్ణమును జెందఁజాలఁడు కాని తన భక్తి జ్ఞానాధిక్యముచే భగవదనుగ్రహమును బొంది, సర్వపూజ్యుఁడై గొప్ప సాధుమహాపురుషుఁడు కాఁగలఁడు. సామాజికసంబంధము వేఱువిషయము; భగవానునితో నాత్మీయసంబంధ ముండును. ఈ యాత్మీకసంబంధ మందఱకుండును గాని కొందఱు గుర్తింపఁజాలరు. ఆ భగవంతుని సుహృదునిగను, ఉపాస్యునిగను, పరమగతిగను, పరమాశ్రయునిగను, పరమ ధనముగను, పరమపితగను భావించుచో నాతఁడు భగవజ్జనము కాఁగలఁడు. ఇట్టి భగవజ్జనులు ఏజాతివారైనఁ గానిండు, ఏవృత్తిని జేయువారైనఁ గానిండు వారు పూజ్యులే. వారు వృత్తిని మార్చుకొనవలసినపని లేదు.

ఇప్పటికి నాలుగువందల సంవత్సరములకుఁ బూర్వము అనఁగా పదునారవ శతాబ్దములో ఢిల్లీనగరములో పరమేష్ఠి యను నొక గుడ్డలుకుట్టువాఁ డుండెడు వాఁడు. ఆతనిశరీరము గూనిగ నుండును. నల్లనివాఁడు, హృదయములో భగవద్భక్తియును చేతిలో పనియును నిండుగ నుండెను. ఆతనియగ్గఱ నింక నెన్నియో సాధుగుణము లుండెడివి. ఆతఁడు శూద్రుఁడైనను జితేంద్రియుఁడు. దరిద్రుఁడైనను నుదారుఁడు. శ్రమజీవియయ్యు సదా ఆనందమున నుండును. ఎన్నఁడును నబద్ధమాడి యెఱుఁగఁడు. పొరపాటుననైన జీవహింసను జేసియెఱుఁగఁడు. జగత్తంతటను వాసుదేవుఁడు నిండి నిబిడీకృతమైయుండెనని భావించి ప్రేమించుచుండెడువాఁడు.

పరమేష్ఠి భగవంతుని యపారమహిమమును దలఁచి యొక్కొక్కప్పుడు ప్రేమావేశములో స్పృహతప్పి పడియుండెడు వాఁడు. గుడ్డలను గుట్టునపుడును ఇట్టి స్థితిలోనే పడిపోవుచుండును. చేతిలో సూది, దారము మట్లేయుండెడివి. ఆతనిదేహ మీలోకములో నున్నప్పటికిని ఆతని ఆత్మమాత్రము వైకుంఠమున విహరించుచుండెడిది. ఆతనికన్నులనుండి అప్పుడప్పుడు అశ్రుధారలు ప్రవహించుచుండెడివి. ఈవిధముగ జలములో వికసించిన నవీనకమలమువలె నాతఁడు గంటలకొలఁది యుండెడువాఁడు.

పరమేష్ఠియొక్క భార్య విమల ధర్మపరాయణ, రూపలావణ్యసంపన్న, మహాపతివ్రత. ఆమె కొకపుత్రుఁడు, నిద్దరు పుత్రికలు. పిల్లలందఱకును తల్లిదండ్రుల గుణము లచ్చుగ్రుద్దినట్లుగ వచ్చెను. అందువలనఁ బరమేష్ఠికి సంసారములో అశాంతి యనునది లేకుండెను. ఇట్టి సంసారసుఖ మాతని కున్నప్పటికిని వారియం దేవిధమగు నాసక్తియును లేకుండెను. ఆతనికి భగవంతుఁడు, భక్తులు, భగవన్నామస్మరణము ఇవియన్న మిక్కిలి ప్రీతి, ఏమాత్ర మవకాశము లభించినను ఆతఁడు భగవన్నామ సంకీర్తనములో మునిఁగిపోవుచుండును. ఆతనికి సాత్త్వికభావములన్నియు వచ్చుచుండెడివి. కన్నుల నానందబాష్పములు ప్రవహించుచుండెడివి. ఆతని ఆనందమయ మూర్తిని గాంచిన ఆతఁడు గుడ్డలుకుట్టువాఁడని యెవ్వరు ననుకొనరు.

ఆతఁడు భగవద్భక్తుఁ డగుటయే గాక కుట్టుపని లోను చాల నిపుణుఁడు. ఆతని పనిని గాంచిన నందఱు నాశ్చర్యపడుచుందురు. ఆతనితో సమానముగ కుట్ట గలవాఁడు ఢిల్లీలోనే లేఁడు. ఈసంగతి భాగ్యవంతులకే కాదు పాదుషాకు కూడ తెలియును. అందువలన భాగ్యవంతులును, బాదుషాయును ఈతనికి ఈతనిపనినిఁ జూచి మంచిమంచి బహుమానము లొసంగుచుండెడు వారు.

పాదుషా సువర్ణసింహాసనమునఁ గూర్చుండి పాదములను బెట్టుకొనుటకు దిండ్లుండెడివి. ఆదిండ్లు ఆతనికి బాగుండక మంచిదిండ్లను గుట్టింపవలయునని

పరమేష్ఠిచేత బంగారుతళుకులు, మణులు, రత్నములు, ముత్యములు వీనితో నొక వస్త్రమును దయారుచేయించెను. దానియందమును గాంచి పాదుషా అత్యాశ్చర్యమును జెందెను. ఆతని పనితనమును గాంచి ముగ్ధుండై యాతనిని బ్రశంసించెను. అంతఁ బాదుషా పరమేష్ఠితో నిట్లనెను:—"దర్జీ! మణిమౌక్తికములు పొదిగిన యీగుడ్డతో నాకు రెండు దిండ్లను గుట్టియీయవలయును. పని బాగుండవలయును. వీనిపైనున్న పూలలో నొక్కటియును తగ్గఁగూడదు. వెళ్లుము, దీనిని త్వరగా సిద్ధముచేసి తీసికొనిరమ్ము. నీపని నాకు తృప్తికరముగ నున్నచో నీకష్టమును నే నుంచుకొనను. మంచిబహుమాన మొసంగెదను. తెలిసినదా?"

ఆతఁడు 'చిత్త'మని పలికి సలాముచేసి యింటికి వచ్చెను. స్నానభోజనములు పూర్తిగావించుకొని ఆగుడ్డతో దిండ్లకు గుడ్డసంచులను కుట్టి, దానిలో మంచి వాసనగల అత్తరులో ముంచినదూదిని కూరెను. ఆసుగంధముతో నాతనియిల్లంతయును నిండిపోయెను. దానిమీఁదఁగల బంగారుతళుకులు, ముత్యములు, మణులు, రత్నములు దర్జీయొక్క యిల్లంతటిని వెలిఁగించుచుండెను. వీనిని శీఘ్రముగ పాదుషా కిచ్చుట క్షేమమని యాలోచించుచుండునంతలో నొకక్రొత్తవిచారము మనస్సునకుఁ దోఁచెను.

ఆదిండ్లయొక్క సౌందర్యమును, గాంతిని, సువాసనను జూచినకొలఁదియి ట్లాలోచింపఁదొడఁగెను:—"ఆహా! యిట్టి యపూర్వములగు దిండ్ల నొకమానవుఁడా యుపయోగించుకొనునది? వీని నుపయోగింప నధికారి దేవాధిదేవుఁడగు వాసుదేవుఁడు మాత్రమే. ఇట్టివస్తువును దయారుచేసి భగవంతున కర్పింపకుండిన నాచేతిపని సార్థకత యేమికలదు? ఇది నావస్తువు కాదాయెను; ఏమిచేయుదును?" అని యిట్లు చింతించుచు నాతఁడు తనశరీరమును మఱచెను. ఆతని కేమియును గనఁబడుటలేదు. వినఁబడుటలేదు. ఆతనియాత్మ యీమర్త్యలోకమునుదాటి అప్రాకృతలోకమునఁ బ్రవేశించెను. ఇట్టిస్థితిలోఁ బరమేష్ఠి యొకవిచిత్రమును గాంచెను. ఎన్నియోసంవత్సరములక్రిందట నాతఁడు ఒకసారి జగన్నాథరథయాత్రామహోత్సవమును గాంచెను. నేఁడును నాతఁడు దానిని దర్శించుటలో లీనమయ్యెను. అనేకులగుభక్తులు రథము ముందు పోవుచున్నట్లుండెను. ముందు గుట్టము లాడుచుండెను. "జయ జయ హరి" ధ్వనులతో ఆకాశము మాఱుమ్రోగుచుండెను. జగన్నాథుఁడు రథము మీఁద పరుపఁబడిన నొక వస్త్రముమీఁదనుండి మఱియొక వస్త్రము మీఁదకుఁ బోవుచుండును. రథము తాఁకిడిచే వస్త్రములు నలిగి చినిఁగిపోవుచుండును.

దైవయోగమున రథయాత్రాదినమున నిచ్చట ఢిల్లీలో పరమేష్ఠి జగన్నాథ రథయాత్రను ధ్యానయోగముద్వారా దర్శించుచుండెను. ఇంతలోనే రథము

క్రిందపడబడిన గుడ్డయొకటి చినిఁగినట్లును మఱియొకదానికై సేవకులు ఆలయము వైపునకుఁ బరువిడుచున్నట్లు గాంచి తా నీదిండ్లలో నొకదానిని విడిచెను. రథ యాత్రలో జనసమూహముచే లోనికిఁ జొచ్చుకొనిపోలేక వెనుకనే నిలువఁబడి నమస్కరించుచుండెను. ఇదియంతయు ధ్యానములోననే జరుగుచుండెను. ఇంతలో బాహ్యజ్ఞానము కలిగెను. చూడఁగా నాతని యెదుటనుండిన రెండు దిండ్లలో నొకటియే యుండెను. అప్పుడు పరమేష్ఠి యానందమున నిట్లనుకొనెను:—"నేను కలను గనుచున్నానా? యథార్థమా? జగన్నాథుఁ డీదిండును స్వీకరించినాఁడా? ఆహా! ఏమి నాభాగ్యము! ఏమి నా భాగ్యము!!"

ఇట్లానందముపడి బాహ్యస్మృతిలోనికి రాఁగానే కొంచెము చింతకూడ కలుగకపోలేదు. అప్పు డాతఁడిట్లనుకొనెను:—"అయ్యో! నే నేమి పనిచేసితిని? దిండు పాదుషాది. దీనిని జగన్నాథున కొసంగితిని. నావలన ననధికారకార్యము జరిగినది. నే నిప్పుడు పాదుషా కేమిజవాబు చెప్పఁగలను?" అనుచు మఱుసటి క్షణముననే యిట్లనుకొనెను:—"జగదీశ్వరునిముందు ఢిల్లీశ్వరుఁ డేమి లెక్క? భగవంతుఁడు స్వయముగ గ్రహించినప్పుడు దోషమేమియును నుండఁజాలదు."

దర్జీ యిట్టి యానందములో నుండఁగానే పాదుషావద్దనుండి సిపాయివచ్చి యిట్లనెను:—"ఓయీ! దర్జీ! పాదుషావారి దిండ్లను తయారుచేసితివా లేదా? వారు రెండు దిండ్లను దీసికొని త్వరగా రమ్మనుచున్నారు. రమ్ము! త్వరగా రమ్ము!"

"ఆఁ, ఆఁ, వచ్చుచున్నాను, పదండి!" అనుచుఁ బరమేష్ఠి ఒకదిండును మాత్రమే తీసికొని దర్బారునకుఁబోయి, పాదుషాకు సలామును జేసి దిండు నచ్చట నుంచి దూరముగ నిలుచుండెను. ఆతని పనితనమునుగాంచి పాదుషా మిక్కిలి యాశ్చర్యముపడి, ఒక్కదిండునే తెచ్చినందులకు నవ్వుచు నిట్లనెను:—"నీవు ఒక్క దిండునే యేల తెచ్చితివి? రెండవ దేమైనది? ఇంకను నింతవఱకు తయారుచేయలేదా? నిజము చెప్పుము."

పరమేష్ఠి పాదుషా పాదములమీఁదఁబడి యిట్లనెను:—"దొరవారూ! రెండుదిండ్లును దయారైనవి. అందులో నొకదానిని నీలాచలాధీశ్వరుఁడు గ్రహించి నాఁడు. అందువలన నొక్కదానినే తమదగ్గఱకుఁ దెచ్చినాను. పేదలపాలిటి కల్ప తరువా! నే నెన్నఁడును నబద్ధమాడను." ఈమాటలను విని పాదుషా నవ్వి, కోప మును దెచ్చుకొని యిట్లనెను:—"అరే! ఏమిరా! వెఱ్ఱివానివలె నేమి వాగు చున్నావు? నీలాచల మెచ్చట? ఢిల్లీ యెచ్చట? నీవిచ్చటనుండి దిండు నెట్లిచ్చితివి? ఆతఁ డచ్చటినుండి యెట్లు గైకొనినాఁడు? నేను ఢిల్లీశ్వరుఁడనని నీకు తెలియదా?

నా ఢిల్లీ కివచ్చి నాదిండు నెవఁడు తీసికొనిపోయినది? ఈ బడాయిలు, కపటనాటకములను మానివేయుము. నిజము చెప్పుము లేకున్న నీపని పట్టెదను?"

పాదుషా గద్దింపఁగా పరమేష్ఠి చేతులు జోడించుకొని యిట్లనెను:—"స్వామీ! నేను నిజము చెప్పుచున్నాను. ఒకదిండును జగన్నాథుఁడు గైకొనినాఁడు. రెండవదానినిఁ దమకు తెచ్చితిని. దొరా! నన్ను మీరు చంపుఁడు, కొట్టుఁడు, తిట్టుఁడు, కాల్చుఁడు. ఏమైనఁ జేయుఁడు. అంతయు మీచేతిలోనే కలదు. జగన్నాథుఁ డిచ్చటనుండిన దిండును గైకొనుటలో నాశ్చర్య మేమున్నది. అతఁడు విశ్వేశ్వరుఁడు. విభుడు. అయితే మీఢిల్లీ విశ్వమునకు బాహ్యముగ నున్నదా? అతఁడు లేనిస్థలమే లేదు. అతఁడెల్లప్పుడు సర్వత్రనున్నాఁడు. అతఁడు ఢిల్లీలోనున్న దిండును దీసికొనినాఁడనిన మీకు మిథ్యగఁ దోఁచుచున్నది. అతఁడు ప్రతివాని యొక్క హృదయములో నుండి హృదయాంతర్గతమగు విషయములను దెలిసికొనఁ గలఁడు. అతఁడు శుద్ధాంతఃకరణముతో నొసంగిన పదార్థములను ప్రీతిపూర్వకముగ గ్రహింపఁగలఁడు. మీదిండు నొసంగి నేను నిజముగఁ జింతించితిని. కాని అతఁడు దానిని స్వీకరించినాఁడు. మీరు అదృష్టవంతులు.

అంతఁ బాదుషా మిక్కిలి క్రోధితుఁడై కన్ను లెఱ్ఱఁజేసి మిక్కిలి కర్కశ స్వరముతో నిట్లనెను:—"అరే! దర్జీ! నే నింకను జెప్పుచున్నాను. ఆలోచించుకొనుము. నేను ఢిల్లీశ్వరుఁడను. నా రాజ్యములోని భక్తిఅంతయు మలినుఁడవగు దర్జీకి వచ్చిపడినది. ఎవఁడురా అక్కడ? ఈదుష్టుఁ డగు దర్జీని గొలుసులతో బంధించి వెంటనే చీఁకటికొట్టులో వేయుఁడు. వీనికి తిండి పెట్టకుఁడు. వీనినుంచిన కొట్టునకుఁ దాళము వేయుఁడు. చూచెదనుగాక వీని యబ్బయెవఁడు వచ్చి రక్షించునో? నాదిండును గొనిపోయిన జగన్నాథుఁడే వీనిని రక్షింపఁగలఁడులే. అతఁడే యీతనికి తిండి పెట్టవలెను!"

పాదుషా ఆజ్ఞాపింపఁగనే కావలిభటులు దయావిహీనులై చేతులకు బేడీలను దగిలించి కారాగృహములోనికి నెట్టి బయట తాళము వైచిరి. బయట ఎవ్వరును రాకుండఁజూచుటకుఁ గానలి కాయుచుండిరి. పాపము పరమేష్ఠి విషమవస్థలోనుండి పరమేశ్వరుని ధ్యానించుచుండెను. ఈవృత్తాంతమంతయును పరమాత్మకు క్షణములోఁ దెలిసెను. భక్తవత్సలుఁడగు భగవంతుఁడు భక్తుని రక్షించుటకై సిద్ధపడి నీలాచలమునుండి ఢిల్లీనగరమునకు వచ్చెను.

అర్ధరాత్రి గడచిపోయెను. కారాగృహమునను గావలికాయువారు ఇంకను మేల్కొనియే యుండిరి. ఆసమయములో జగన్నాథుఁడు పరమేష్ఠియొక్క కారాగృహముకడకు వచ్చి వారిని మోహనిద్రలోఁ బడవైచి తలుపులు తెఱచి

లోనికిఁ బ్రవేశించెను. పాపము పరమేష్ఠికి ఇది తెలియదు. అతఁడు నామ చింతనములో మునిఁగి మూలుగుచుండెను. ప్రభువు లోనఁ బ్రవేశించి అమృత మయస్వరముతో నాతనినిఁ బిలిచెను.

ఆశబ్దమును వినఁగానే పరమేష్ఠి యాశ్చర్యచకితుఁడై కన్నులు తెఱచి చూడఁగా నెదుట దివ్యప్రకాశముండెను. ఆప్రకాశములో దివ్యమంగళవిగ్రహమును వర్ణింప నేరికి తరమౌను. నీలకాంతిమణివలెఁ బ్రకాశించుచు చేతిలో సుదర్శన చక్రమును ధరించి, అనుగ్రహింపవచ్చినట్లు దయాహాసమును గుల్కించుచుండెను. చేతిలోని చక్రము తిరుగుచుండెను. భగవద్దర్శనము గావించి పరమేష్ఠి పరమానంద నిమగ్నుఁ డయ్యెను. అతఁడు దీనస్వరమున స్వామి పాదములమీఁదఁబడి యేడ్వఁ బ్రారంభించెను. ఇంతలోనే చేతుల సంకెళ్లన్నియు విడిపోయెను. కాని అతనికి బాహ్యస్మృతి లేదు. ఇంతలో జగన్నాథుఁడు పరమేష్ఠిని సంబోధించి యిట్లనెను:— "పరమేష్ఠీ! నా సహాయముండఁగా నీకు భయమేల? నాచేతిలో నీసుదర్శన చక్ర మున్నంతవఱకు నాభక్తులను నెవ్వరు నేమియును జేయఁజాలరు. నా భక్తుఁ డందఱికంటె శ్రేష్ఠుఁడని నమ్ముము. రమ్ము! నావద్దఱకు రమ్ము!!"

ఇట్లు భగవంతుఁడు పిలుచుచున్నను తాను మహాపాపియనియు, మహా యధముఁడనియు భావించుచు దూరముగ నుండెను.

భగవంతుఁడు భక్తుని దీనతను గాంచి యానందించి, తానే అతని వద్దఱకుఁ బోయి, తన వరదహస్తమున నాతనిమస్తకమును నిమిరెను. ఆసుఖస్పర్శచేఁ బరమేష్ఠియొక్క అంగప్రత్యంగములు మిక్కిలి సుందరములయ్యెను. అతఁ డానందసాగరమున నిమగ్నుఁడై తనను, దామోదరునిగూడ మఱచెను.

ఇచ్చట జగన్నాథుఁడు పరమేష్ఠిని వదలించి, పాదుషా శయనమందిరమునకుఁ బోయి, స్వప్నములో బాధి మాయ మయ్యెను. పాదుషా మేల్కొని ఆశ్చర్య చకితుఁడై బాధ ననుభవించుచు నిట్లనుకొనెను:—"ఆహా! ఇదేమి? ఇది స్వప్నమా? యథార్థమా? యేదియు నిర్ణయించుటకు వీలులేకున్నది. నాశరీరముమీఁద వాత లట్లేయున్నవి. ఆశ్చర్య మాశ్చర్యము!! ఇది విలక్షణమగు సంఘటనముగ నున్నదే.

క్రమముగఁ బ్రభాతమయ్యెను. కాని పాదుషాకు శాంతి లేకుండెను. అతఁడు వెంటనే విశ్వాసపాత్రులగు మిత్రులను బిలిపించి తన స్వప్నవృత్తాంత మును జెప్పెను. అంత నాతఁడు కారాగృహము కడకుఁ బోఁగా కావలివాండ్రు నిద్రించుచుండిరి. కవాటము లన్నియుఁ దెఱువఁబడియుండెను. పరమేష్ఠి సంకెళ్ల నుండి విడువఁబడి దివ్యతేజముతో, దివ్యసౌందర్యముతో ధ్యాననిమగ్నుఁడై

యుండెను. ఈ దృశ్యమును గాంచఁగానే పాదుషాకు అత్యాశ్చర్యము కలిగెను. ఇంతలోఁ బరమేష్ఠి కన్నులు దెఱచిచూడఁగాఁ బాదుషా యెదుట నిలువఁబడి యుండెను. పరమేష్ఠి భగవన్నామస్మరణము చేయుచుండెను.

పాదుషా ఆతని పాదములమీఁదఁబడి క్షమాపణమును వేఁడుకొని, ఆతనికి దివ్య వస్త్రాభూషణములను, కావలసినంతధనము నొసంగి, ఆతనిని ఏనుఁగుపైఁ గూర్చుండఁబెట్టి అనేకవాద్యములతో నూరేగించుచుఁ దన దర్బారునకుఁ గొనిపోయెను. ఈదృశ్యమునుగాంచి ప్రజలెల్లరును బరమేష్ఠి పాదములకు మ్రొక్కిరి. కాని ఈసన్మానమంతయును నాతని కిష్టములేదు. అందువలన నాతఁడు ఢిల్లీనగరమును వీడి యెచ్చటికో వెడలిపోయెను. అతఁడు జీవితాంతము వఱకును దనకాలమును భగవత్పూజా కీర్తనములందు గడపి చివరకు మోక్షమును బొందెను.

---

# భక్త సాలబేగ్

ఒరిస్సా రాష్ట్రములో నున్న కటక్ నగరమునందు లాలుబేగను నొక శక్తిశాలి యగు ముగలువంశీయుఁ డుండెను. అప్పు డారాష్ట్రమును విజయనగరాధీశులగు గజపతి వంశీయులు పరిపాలించుచుండిరి. ఆసమయమున నారాజులు బలహీనులు కాఁగా సమయము చూచుకొని లాలుబేగు వారిపై దండెత్తి రాజ్యమునంతను జయించెను. ఆసమయమున నాతని పేరుచెప్పిన జనులందఱును గడగడ వణఁకు చుండెడువారు. ఆతనిపుత్రులలో సాలబే గొకఁడు. ఈతఁడు యౌవనములోనుండఁగా యుద్ధవిద్యను నేర్వఁ బ్రారంభించెను. అందులో నిపుణుఁడైనకొలఁదియుఁ దనపరాక్రమమును జూచుకొని గర్వించుచుండెడువాఁడు. ఆతనికి భూమిపై గాలు నిలిచెడిదియే కాదు.

ఒకానొకప్పుడు సాలబేగు తండ్రితో నేదియో యుద్ధము చేయఁబోయెను. అచ్చట తనపరాక్రమమును బాగుగాఁ జూపించెను గాని దైవవశమున మంచికత్తి దెబ్బ తలకుఁ దగులఁగాఁ దలపగిలి, రక్త మెక్కువగఁ గారుటచే స్పృహతప్పి క్రిందఁ బడిపోయెను. తండ్రి యీతనికి అనేక చికిత్సలను జేయించెను గాని లాభము లేకపోఁగా నిఁక నెట్లో బ్రదుకఁడని యింటికిఁ దల్లికడకు చేర్పించెను. తండ్రి తరువాతనైన నీతనివైపుఁ జూడలేదు. తండ్రియే నిర్లక్ష్యము చేయుటచే నందఱును నిర్లక్ష్యము చేసిరి. కాని తల్లికేల తప్పును? తల్లి పుత్రుని రోగశయ్యప్రక్కన చింత భావముతోఁ గూర్చుండి ప్రాణపణముగ సేవా శుశ్రూషలుఁ గావించుచుండెను. ఒక

దినమున సాలబేగునకు బాధ యెక్కువయ్యెను. అస్వస్థితిలో తల్లితో నిరాశావ్యాకులయముతో నాతఁ డిట్లనెను:—

'అమ్మా!'

'ఏమి నాయనా?'

'అమ్మా! ఇఁక నేను బ్రదుకను.'

'నీజబ్బు నయముకాదని యేల పలికెదవురా చంద్రా?'

'లేదమ్మా! నేను నిజము చెప్పుచున్నాను. ఇఁక నేను బ్రదుకను. నాకు బ్రదుకవలయునను నాశయును లేదు. రాత్రింబవళ్లు దుఃఖము ననుభవించుటకంటె చచ్చుటయే మంచిది."

'నాయనా! అట్లనకుము. నేను చచ్చినాను. నా ఆయుస్సును బోసికొని నూఱేండ్లు బ్రదుకరా నాయనా!'

'అట్లు కాదమ్మా! నాకు బ్రదుకుపై నాశలేదు. మృత్యువు సంభవింపకున్న ఆత్మహత్య చేసికొనవలసివచ్చును. నే నీదుఃఖమును భరింపలేను. అమ్మా! అమ్మా!! నీవు నా యపరాధములను క్షమింపవలయును. కృతఘ్నుఁడ నగునన్ను మఱచిపొమ్ము.

పుత్రుని మాటలు విని తల్లి దీర్ఘనిశ్శ్వాసమును విడిచెను. ఆతని బాధ ఈమె హృదయమును జీల్చివేయుచుండెను. ఆమె కన్నుల వెంటనీరు కారుచుండెను. ఆమె ప్రేమవలన నేడ్చుచుఁ బుత్రునిఁ గౌఁగిలించుకొని యిట్లనెను:—'నాయనా! నీవు వెళ్లిపోయిన తర్వాత నే నెవని ముఖమును జూచుకొని బ్రదుకుదును! నా చావు వలన నీవు బ్రదుకుచో దానికి నేను సిద్ధముగ నున్నాను. అట్లైనదులకు నాకు చావు రాఁగలదు? నాకర్మ నే ననుభవించియే తీరవలయును. ఏ ఉపాయమును దోఁచకున్న నొక్క యుపాయము కలదు. అది నీవలన జరుగునో లేదో?'

మాతృశ్రీ వచనములను విని సాలబే గిట్లనెను:—"ఎందుకు జరుగదమ్మా? నేను నీమాటను వినకున్న నింకెవరి మాటను విందును? నీవు చెప్పదలఁచిన దేదిమో సంతోషముతోఁ జెప్పుము. నేను తప్పక నీవుచెప్పిన ప్రకారము నడుచుకొందును."

తల్లి యిట్లనెను:—"నాయనా! నీవలనఁగాదు. చిన్నప్పటినుండియును నీకబ్బిన సంస్కారములు నిన్ను విడువఁజాలవు. వాటికి విపరీతముగ నీ వెట్లు నడువఁగలవు? తల్లి యిట్లు పలుకఁగా సాలబేగునకు కొంచెము సందేహముకలిగెను. ఆతఁడు వ్యాకుల ముతో నిట్లనెను:—"అమ్మా! నీవు మాటాడుచున్నది నా కర్థమగుటలేదు. నా శిక్షణకు వ్యతిరేకముగ నీవేమి చెప్పఁదలఁచితివి?"

అంతఁ దల్లి యిట్లనెను:—"వత్సా! నే నెప్పుడును నీయా శిక్షాదీక్షలకు విరుద్ధురాలను. ఈసంగతి నీకు తెలియదా? నాయనా! నేనొక హిందూబ్రాహ్మణపిల్లను'

అనితల్లి పలికిన యీవాక్కులను విని సాలబేగు విస్మితుఁడై యిట్లనెను:—"అమ్మా! నీవేమి యనుచున్నావు. నీవు హిందూస్త్రీవే యైనయెడల నాకు తల్లివెట్లయితివి?"

తల్లియి ట్లనెను:—"నాయనా నీవు అడుగుచున్నావు కావున నేను నీకు సిగ్గును విడిచి చెప్పుచున్నాను. దాతముకుందపురము మంచి సమృద్ధిశాలియగు గ్రామము. ఆ గ్రామముననే నాఅత్తవారిల్లు. నా భర్త నా చిన్నతనముననే మరణించినాఁడు. అత్తమామలుగూడ పుత్రదుఃఖమున మరణించిరి. నీతండ్రి యుద్ధృతము వలన నాగ్రామములోనివారు యిండ్లు వాకిండ్లను వదలిపెట్టిపోయిరి. గ్రామము పాడుపడెను. ఆసమయమున నేను నదికి స్నానమునకుఁ బోయితిని. దైవికముగ నాసమయమున నీతండ్రి యుద్ధమునుండి తిరిగి వచ్చుచుండెను. ఆసమయమునఁ బూర్ణమగు యౌవనవతిగ నున్న నన్ను గాంచి, రూపలావణ్యమునకు ముగ్ధుఁడై, మోహమునుజెంది, ఒంటరిగానున్న నన్ను బలాత్కారమునఁ దన గుఱ్ఱముపై నెక్కించుకొనివచ్చెను. నాయనా! నన్ను కొలఁది దినములకే వస్త్రభూషణాదుల నొసంగి వశము కావించుకొనెను. తత్ఫలితముగ నీవు నాకుఁ బుత్రుఁడవైతివి. హత భాగినియగు నాకు నిన్నుఁజూచుకొని బ్రదుకుభాగ్యము కలిగినది." అని పలుకుచు నామె కంటఁ దడిపెట్టెను.సాలబేగునకు యథార్థవిషయమును గ్రహించుట కెంతో కాలము పట్టలేదు. అప్పుడాతఁడు తల్లి నోదార్చుచు నిట్లనెను:—"అమ్మా! నన్ను నీవు గర్భమున ధరించితివి. ఈశరీరము నీది. అమ్మా! నీవు నాబాధానివారణ మునకు చెప్పఁదలఁచినదేమో చెప్పుము. నే నావిధముననే వర్తించెదను."

తల్లి యిట్లనెను:—"నాయనా! చెప్పెదను వినుము. నీతండ్రి కిప్పుడు నామీఁదఁగాని, నీమీఁదఁగాని ప్రేమలేదు. ఆతఁ డన్యస్త్రీల యెడ నాసక్తి చెంది యున్నాఁడు. నీవిప్పు డాతనికి పనికిరానిస్థితిలో నున్నావు కావున నీవలనను నాతనికి ప్రయోజనములేదు. నీక్షేమ మింతవఱకు విచారించినాఁడేమో చూడుము. ఆతఁడు స్వార్థపరుఁడు. స్వార్థ సిద్ధి చెందుటకు వీలులేనివారితో నాతని కేమి పని? భగవంతుని దయవలన నీవు బ్రదికితివా అంతే చాలును. నేను చెప్పినట్లు చేసెదనని మాట యిచ్చినయెడలఁ జెప్పెదను. లేకున్న నీప్రాణము నాప్రాణమును బోవుట తప్పదు."

సాలబేగు అశ్రుపూరిత నేత్రములతో నిట్లనెను:—"అమ్మా! అమ్మా! నే నొక్కసారికాదు వేయిసార్లు ప్రతిజ్ఞచేసి చెప్పెదను. నీమాటప్రకారము వర్తించి తీరెదను. దైవకృపవలన బ్రదుకుచో నీకంటినీటిని దుడిచెదను. ఇఁక నీవు కంట నీరు పెట్టవలసిన పనిలేకుండఁ జేసెదను. ఆ ఉపాయమును శీఘ్రముగఁ జెప్పుము. తప్పక చేసెదను."

పుత్రుని వచనములను విని తల్లి యిట్లుచెప్పెను:—"నాయనా! నీవు కపట మును వీడి శ్రద్ధాభక్తులతో నందనందనుఁడగు బృందావనచంద్రుని భజింపుము.

ఆశ్రీకృష్ణుఁడే అనంతకోటి బ్రహ్మాండములకు నాయకుఁడు. ఆతఁడే పరమాత్మ. ఆతని యాజ్ఞవలననే సమస్తమును నడుచుచున్నది. ఆతనిని భజించుచో నీరోగదోషము లన్నియును బోఁగలవు. నీవు బ్రదుకుట కింతకన్న వేఱుమార్గము లేదు. ఆతనినే భజించుము. నిరంతర మాతనినే స్మరింపుము.”

సాలబే గిట్లనెను:—“అమ్మా! అట్లే చేసెదను. కాని ఆతని విషయము నాకేమి యును దెలియదే. ఆతఁ డెట్లుండునో, యెచ్చటనుండునో, ఆతని తల్లిదండ్రు లెవరో నాకు బొత్తుగాఁ దెలియదు. ఆతని రూపవిశేషము తెలియకున్న నే నాతనిని గుర్తించు టెట్లు?”

లాలుబేగు ఇంటికివచ్చిన తర్వాత నామెకు శ్రీకృష్ణకథను స్మరించుట కవసరమే చిక్కలేదు. ఇప్పుడా నందనందనుని స్మరించు నవకాశము చిక్కుటచే నామె యానం దమునకు మేర లేకుండెను. అప్పు డామె సంతోషముతో నిట్లు పలికెను:— “నాయనా! ఆతఁడు నీలమేఘశ్యాముఁడు. అందమంతయు నాతని సొమ్మే. మెడలో ననేకములగు మణిహారములు ధరించును. పులిగోరు కలదు. గురువెందపూసలు కలవు. శిరస్సున నెమిలి పింఛముతోఁ జేయఁబడిన కిరీట ముండును. గుండ్రని జగన్మోహన కరమగు ముఖబింబము. చిఱునవ్వు వెన్నెలలు కురియించును. చేతిలో వేణువు కలదు. వత్సా! ఆతఁ డావేణువు నూదెనా సకలలోకములు మోహమును జెందును. ఆతఁడు సర్వవ్యాపియైనను బృందావనారణ్యములలో విశేషముగఁ దిరుగుచుండును. ఆతఁడు జగదీశ్వరుఁడయ్యు దేవకీ వసుదేవుల గర్భమున జన్మించెను. ఆతనిని ఋషులు, మునులు, దేవతలు, మానవులు భజించుచుందురు. ఆతనిని ప్రేమపూర్వకముగ నెవరు భజింతురో వానికే దర్శన మొసంగును. దీనికి విశ్వాసము ముఖ్యము. ఆతనిని విశ్వాసముతో ధ్యానించిన పండ్రెండుదినములలోనే దర్శన మొసంగును. నీబాధల నన్నిటినిఁ బోఁగొట్టుననుటలో నే విధమగు సందేహమును లేదు. సమస్త సందే హములను, సంకల్ప వికల్పములను వీడి విశ్వాసముతో నచంచలమగు భక్తి శ్రద్ధ లతో ధ్యానించుము. చింతించుము.”

సాలబే గిట్లనెను:—“ఆతని స్మరించుట కేమైన మంత్రము కలదా?”

తల్లియి ట్లనెను:—“కలదు. ఆతని పేరు శ్రీకృష్ణుఁడు. శ్రీకృష్ణనామమే ఆతని మంత్రము. ఆనామప్రభావముచే నాతఁడు వశపడఁగలఁడు.”

సాలబేగు నిరంతరము నామస్మరణములో మునిఁగిపోయెను. ప్రతిదినము కన్నులు మూసికొని హృదయములో భగవంతుని ధ్యానించుచుండెను. ధ్యాన ములో భగవానుఁడాతని దర్శన మొసంగెను. అప్పుడాతనికి మానసికముగానే సమస్త పూజోపచారములను గావించెను. ఇంతలో భగవంతుఁ డదృశ్యుఁ డయ్యెను.

అప్పు డాతఁడు తన తల్లితో నిట్లనెను. "అమ్మా! నాకు భగవంతుఁడు ధ్యానములో దర్శన మొసంగినాఁడు. కాని బాధ పోలేదే. ఎక్కువైనదే. కారణమేమి? ప్రభువు నకు నామీఁద దయలేదా యేమి?"

అప్పుడు తల్లి యి ట్లనేను:—"నాయనా! అట్లే యెక్కువ కాఁగలదు. బాధలోనను తనను భజించునో భజించఁడో యని పరమేశ్వరుఁడు పరీక్షచేయు చున్నాఁడు. నీ వింకను భజింపవలయును. దృఢవిశ్వాస మత్యవసరము. సంశయింప కుము. సందయింపకుము." ·

పండ్రెండవదినము వచ్చెను. బాధ పోలేదు. తల్లి దగ్గఱనేయుండి వేలు ఉప దేశమునుజేయక ధైర్యమును వహింపవలయుననియు, విశ్వాసము ముఖ్యమనియును జెప్పెను. సాలబేగు శ్రీకృష్ణుని జింతించుచుఁ జింతించుచు నిద్రావస్థను జెందెను. ఆరాత్రి శ్రీకృష్ణుఁడు ఆతని రోగమును బోఁగొట్టకున్నఁ దెల్లవారఁగానే ఆత్మ త్యాగముచేయ నిశ్చయించుకొనెను. రాత్రి పరుండఁబోవునపు డాతఁడు శ్రీకృష్ణుని గూర్చి యిట్లు ప్రార్థించెను. "ప్రభూ! నీవు నన్ను తెల్లవారునప్పటికి రక్షింపకపోయి తివా ఆత్మహత్యను జేసికొనుట నిశ్చయము. నిన్నే నమ్మితిని."

తల్లి సాలబేగు దగ్గఱనే పరుండియుండెను. ఆమెయును శ్రీకృష్ణభగవానుని జింతించుచుండెను. ఇద్దరకును విశ్వాసములో నేవిధమగు కొఱతయును లేదు. ఆరాత్రి స్వప్నములో శ్రీకృష్ణుఁడు బాలముకుందవేషముతో దర్శనమొసంగి సాలబేగుతో నిట్లనెను.—"వత్సా! ఇదిగో, యీవిభూతిని నీగాయముపై వేయుము. నయము కాఁగలదు. భయపడకుము. నన్ను మఱువకుము." ఇంతలోనే సాలబేగు మేల్కొని ప్రత్యక్షముగ భగవంతుని దర్శించెను. భగవంతుని దివ్యమంగళవిగ్రహ మును జూడఁగానే ఆతఁ డనుభవించిన యానందమునకు మేఱలేకుండెను. ఆతఁ డా భస్మమును శ్రీకృష్ణుని వద్దనుండి తీసికొని తన తలపైఁ దగిలిన గాయముపై రాచు కొనెను. ఇంతలోనే మాధవుఁడు మాయమయ్యెను. వెంటనే సాలబేగు నిద్రను జెంది తెల్లవారఁగానే లేవఁగా గాయము మాయమయ్యెను. మానిన మచ్చ మాత్రము కలదు. ఆతని కాశ్చర్యముకలిగి పట్టరాని సంతోషమున తల్లిని నిద్ర నుండి లేపెను. ఈతని శబ్దమునుబట్టియే ఆతఁడు రోగవిముక్తుఁడైనాఁడని గ్రహిం చెను. ఆతఁడు తల్లితో నిట్లనెను:—"అమ్మా! నాగాయము మానినది. శ్రీకృష్ణుఁ డనుగ్రహించినాఁడు. నా శరీరమంతయును దివ్యానందముతో నిండియున్నది." అంతఁ దల్లియి ట్లనెను:—"నాయనా! శ్రీకృష్ణుని మహిమ మట్టిది. దుఃఖములను బోఁగొట్టుటకు ఆయనను మించినవాఁ డింకొకఁడు లేఁడు. ఇఁక నిప్పుడు నీవు దృఢ చిత్తముతో నాతనిని భజింపుము."

సాలబేగిట్లనెను:—"అమ్మా! సత్యము. ఆతనితో సమానమగు దుఃఖనాశకుఁ డింకొకఁడు లేఁడు. అమ్మా! అమ్మా!! నీకృపచే, నీశిక్షణముచే నాజన్మ సఫలమైనది. అమ్మా! నా కిప్పుడు నీవు ప్రసన్నచిత్తముతో నాజ్ఞ నీయవలయును. ఇఁక నే నిక్కడ నుండఁజాలను. నే నిప్పుడు సన్న్యాసినై దేశదేశములను దిరిగి యీ యనంతదయా సాగరుఁడగు శ్రీకృష్ణభగవానుని మహిమాతిశయమును బ్రచారము కావించి జన్మ సాఫల్యమును బొందెదను.'

సాలబేగుని తల్లియు సామాన్యపు తల్లి కాదు. ఆమె సాధనలో సాలబేగును మించినది. మనస్సునుగూడ స్వాధీనపఱచుకొనినది. ఆమె పుత్త్రుని యిచ్చకుఁ జింతింపకపోఁగా సంతోషపూర్వకముగ సన్న్యాసమున కాజ్ఞనొసంగెను. తనపుత్త్రుఁడు ప్రభుమహిమను బ్రచారము చేయఁదలఁచినాఁడనుటకంటె నింక నానందింపవలసిన విషయ మేమి కలదు? కాని ఆమె సాలబేగుతో నిట్లనెను:—"వత్సా! వెళ్లుము. నీకోరిక నెఱవేఱును గాక! కాని వినుము, నన్ను మఱచినను మఱచెదవు గాక, సమస్తమును మఱచెదవుగాక కాని శ్రీకృష్ణభగవానుని మాత్రము మఱవకుము. నాలుక ఆతని నామమును బలుకుచుండవలయును. మనస్సు ఆయననే చింతించుచుండవలయును. నిత్యజాగ్రతలో నుండవలయును. ఈమాటను మఱవఁజనదు."

సాలబేగు భక్తిపూర్వకముగఁ దల్లిచరణములకు మ్రొక్కి ముక్తకంఠముతో నిట్లనెను:—"అమ్మా! సమర్థుఁడును దయాసాగరుఁడు నగు నిట్టి ప్రభువును భజింపక అన్యుని శరణుజొచ్చిన వాని జన్మము వ్యర్థమైనట్లే. అమ్మా! నీకృపచేతను, నీ యాశీర్వాదముచేతను నే నెన్నడును ప్రభువును మఱవను. నీవును మఱవవలదు తల్లీ!;"

ఇట్లు పలికి సాలబేగు వెళ్లిపోయి మరల తిరిగిరాలేదు. అచ్చటనుండి ఆతఁడు జగన్నాథమునకుఁబోయి, కొన్నిదినము లచ్చట దీనబంధునిఁగొలిచి దక్షిణమునకుఁ బోయెను. చాలదినములు గడచిపోయెను. కాని యాతనిజాడ తెలియలేదు. ఆతఁడు వెళ్లిపోయిన తర్వాత నాతని తల్లియు లాలబేగింటిలో లేదు. అయితే తల్లికి పుత్త్రునకు ఈలోకములో మాత్రము మరల సమావేశము జరుగలేదు. కాని విపచ్ఛోక కాదులు లేక పునరావృత్తిరహిత శాశ్వత వైకుంఠమహానగరమున వా రిద్దరును మరలఁ గలిసికొనిరి.

---

# భక్తమణిదాసు

జగన్నాథములో మణిదాసనునొక మాలాకారుఁడు కలఁడు. అతఁడు పూలనమ్ముకొని కుటుంబపోషణము చేసికొనుచుండును. లోకదృష్టిచే నాతఁ డశిక్షితుఁడయ్యును మణిదాసు నిజముగ సుశిక్షితుఁడే. సుశిక్షితునకు రెండు లక్షణము లుండును. దీనులయెడల, దుఃఖితులయెడల దయగా నుండుటయును, పాపములను వీడి పరమేశ్వరుని భజించుటయును. భగవత్సన్నిధిని దుష్కర్మలను వీడి, భగవత్స్మరణమును జేయువాఁడును, లోకములోని ప్రాణుల నన్నిటిని భగవత్స్వరూపముగఁ జూచువాఁడును, అందఱను నిస్స్వార్థముగ సేవించుటే. తన కర్తవ్యముగ భావించువాఁడు ప్రాపంచికదృష్టిలో దరిద్రుఁడైనను, తిరస్కృతుఁడైనను, పతితుఁడైనను శ్రేష్ఠుఁడే. మణిదాసు తన యత్యల్ప యాదాయములోఁ గొంతభాగమును బీద సాదలకు ఖర్చుపెట్టి, మిగిలినదానితోఁ గుటుంబపోషణము చేసికొని నిరంతరము జిహ్వతో భగవన్నామస్మరణము .చేయుచుండును. ఇట్లు నడుచుటచే నాతఁ డెల్ల వేళలందును సంతోషముగ నుండెడువాఁడు.

కొన్నాళ్లకు దైవప్రేరణచే నాతని భార్యా పుత్రులందఱును మరణించిరి. కాని మణిదాసు దీనిని విపరీతముగా భావింపక, భగవంతుని యాశీర్వాదముగ భావించి, భగవంతునకు ధన్యవాదము లర్పించుచు నిట్లనెను:—"జగదీశ్వరా! నీవు నా మేలుకొఱకు నాకు బంధములు లేకుండఁ జేసితివి. నే నింతవఱకు దారాపుత్రాది మమతా బంధనములోఁ బడి కొట్టుకొనుచున్నాను. నీదయకు నేను ధన్యుఁడను. నేఁడు నీకృపచే నాకు కర్తవ్యతాజ్ఞానము కలిగినది. నా జీవితములో ప్రతినిమిషమును నీ సేవయందు నసుగుణనామసంకీర్తనమందునను గడుపునట్లు వరమిందు"

ఇది యెంతటి చక్కనిభావమో గ్రహింపుఁడు. ప్రాపంచిక భోగములగు ధన, దారా, పుత్రాదులు, యశఃకీర్తులు మొదలగు వాటిని ప్రభువు సొత్తను కొనుచు నహంకార మమకారములను వీడి నిర్వంచనముగఁ, గర్తవ్యపరాయణుఁడై విధ్యుక్తధర్మముగ భావించుచు నవి నశించినప్పుడు భగవానుని వస్తువులను భగవంతుఁడే గ్రహించినాఁడని భావించి దుఃఖమును జెందక, ఆనందముతో నుండు వాఁడే నిజముగ భక్తుఁడు. దుఃఖములందు భగవంతుని దూషించి, భజించుటను మాని, సుఖమునందు పొగడుచుండు వాఁడు నిజమగు భక్తుఁడు కాఁడు. అట్టివాని దృష్టిలో భగవంతునికంటె భోగములమీఁది మమత్వమే యధికము.

ప్రభుప్రేరణమని భావించుచు మణిదాసు భగవంతునే స్మరించుచు, సాంసారిక మమత్వమును వీడి, సంసార మసారమని భావించుచు నిరంతరము శ్రీహరినామమునే

యాశ్రయించి కీర్తించుచుండెను. ఈతఁడు తెల్లవారుజాముననే లేచి స్నానాది కృత్యము లొనర్చి, ధ్యానమును బూర్తికావించుకొని తర్వాతఁ గరతాళములతో జగన్నాథదేవాలయ సింహద్వారమందు భజనము భక్తిపూర్వకముగఁ జేయుచుండెను. ఒక్కొక్కప్పుడు తన్మయత్వమున నృత్యము చేయుచుండును. జగన్నాథస్వామి తలుపులు తెఱచిన తర్వాత లోనికిఁబోయి గరుడస్తంభము దగ్గఱ నిలుచుండి మనసార స్వామిని దర్శించుచు నిట్లని స్తుతించుచుండును:—"జగన్నాథా! దీనదయాళూ! నీయొక్క శ్రీముఖమును దర్శించుచు నాకు మృత్యువు కలుగవలయును. ప్రభూ! నీవు నా ప్రాణములకుఁ బ్రాణమవు. నాబోటి దరిద్రునకు నీవు పరశువేదివి. నీవుతప్ప నా కింక దిక్కెవ్వరు? నాబోటి నిరాధారులకు ఆధారుఁడవు నీవే. నేను నీకు శరణుజొచ్చుచున్నాను."

అనంతరము మణిదాసు మరల కీర్తనములో మునుఁగును. నృత్యముచేయుచుఁ జేయుచు దన్మయావస్థలో నాతఁడు జగన్నాథమూర్తులవఱకును బోయి మరల తిరిగి గరుడస్తంభము వఱకును వచ్చుచుండును. ఈసమయమున నాతనికి అష్టసాత్త్విక భావములు కలుగుచుండును. ఆతఁ డొక్కొక్కప్పుడు నవ్వుచుండును, ఒక్కొక్కప్పు డేడ్చును, మఱొక్కప్పుడు మెదలకుండును, వేఱొకప్పు డుచ్చైస్స్వరమునఁ బాడును, ఇంకొకయెడ స్తుతించును, వేఱొకప్పుడు ప్రణమిల్లును. జయజయ శబ్దములు పలుకును. ఆతఁడు స్తుతించుచు నిట్లనును:—"నాథా! శ్రీకృష్ణా! జయతు! జయతు!! వనమాలీ! నీసౌందర్య మప్రతిమానము. నీవక్షఃస్థలమునఁ గమలహారము వ్రేలాడుచున్నది. నీమెడలో వివిధపుష్పముల హారములు శోభిల్లు చున్నవి. నీయవయవము లన్నియు రత్నహారములచేఁ బ్రకాశించుచున్నవి. నీశిరస్సున నున్న రత్నమకుటము శోభాయమానముగ నున్నది. నీచంద్రవదనమును జూడఁగానే భక్తులమనస్సు రంజిల్లుచుండును. కరుణారసము లొలుకు నీకన్ను లతి లావణ్యప్రదములైనవి. శంఖ చక్ర గదా పద్మాదులతో శోభిల్లు నీ ప్రశస్తహస్తములను బ్రస్తుతించెదను. నీ చరణములు సమస్తభయములను బోఁగొట్టును. నీ చరణకమలములను వీడి నే నెచ్చటికిఁ బోవుదును? స్వామీ! నిన్ను శరణు వేఁడితిని. కావున నన్నుఁ గరుణింపుము. దీనబంధూ! నాకు నీసేవ నొసంగుము."

అని యిట్లు పలుకుచు మణిదాసు ఉన్మత్తునివలె నృత్యము చేయును. ఆతని సంకీర్తనముచే దేవాలయమంతయును ప్రతిధ్వనించుచుండెను. ఆతని యానందమునకు మేర లేకుండెను. ఆతని కెప్పుడు బుద్ధిపుట్టిన నప్పుడు పోయి స్వామి సన్నిధిని సంకీర్తనము చేయును. ఎవరైనను దైవప్రసాద మొసంగినఁ దినును, లేదా యేమతమునకో పోయి ధ్యాననిమగ్నుఁడగును. తన సర్వస్వమును భగవంతునకర్పించును.

జగన్నాథాలయములో నొకప్రక్క ప్రతిదినము పురాణకాలక్షేపము జరుగుచుండును. పురాణమును వినుటకు మిక్కిలి భక్తితో చాలమంది శ్రోతలు వచ్చుచుందురు. పౌరాణికుఁడు గొప్పపండితుఁడు. ఆతని ప్రవచనమున శ్రోత లందఱును ముగ్ధులగుచుందురు. కాని యాతఁడు శుష్కహృదయుఁడు. ఒకనాఁడు మన మణిదాసు చేతులతోఁ జిరుతలను గొట్టుచు, సంకీర్తనము నుచ్చైస్స్వరముతోఁ జేయుచుఁ బౌరాణికుఁడు పురాణమును జెప్పుమండపముకడకుఁ బోయెను. ఆతని చిత్తము అచ్యుతునియందు లగ్నమగుటచే నాతఁ డేమి చేయుచున్నదియు నాతనికిఁ దెలియలేదు. అంతఁ బౌరాణికుఁడు లేచి తన కాలక్షేపమునకు భంగము చేయుచున్నాఁడని భావించి, గద్దించి, తిట్టి, చివరకుఁ గొట్ట నారంభించెను. ఇంతలో నచ్చటనున్న శ్రోతలందఱును గొట్ట నారంభించిరి. అప్పటికి ఆతనికి శరీరము తెలిసెను. అప్పు డాతఁ డాశ్చర్యపడి, సమస్తమును దెలిసికొనెను. ఆతని మనస్సులోఁ బ్రణయకోపము కలిగెను. ఆతఁడు మెదలకుండ అక్కడనుండి బయలుదేరివెళ్లి ఒకమఠములోఁ గూర్చుండెను. ఆతఁడు లోలోన నిట్లనుకొనెను:—

"ప్రభుసన్నిధానములో ప్రభుని కథను జెప్పువారును, వినువారును గొట్టిన నచ్చటికి నే నేల వెళ్లవలయును?" పౌరాణికుఁడు తాను గెలిచినట్లు భావించుచుండెను. భగవంతుఁడు భక్తివశుఁడుగాని విద్యావశుఁడు కాఁడని ఆతనికిఁ దెలియదు. ఎవని హృదయములోఁ బ్రేమ నిండి నిబిడీకృతమైయుండునో వానిహృదయములోనే ఆతఁడు నివసించును.

దినమంతయును గడచెను. సూర్యనారాయణమూర్తి అస్తాచలము నలంకరించెను. ఆలయములో సంధ్యాహారతి పూర్తియయ్యెను. కాని మణిదాసు రాలేదు. నేఁ డాతనికి అన్నమును నీళ్లును లేవు. ఆలయములో సేవాదులు పూర్తియయ్యెను. పూజారులు తలుపులు బిగించి యెవరియిండ్లకు వారు పోయిరి.

పూరీని బాలించు రాజు కలలో జగన్నాథుఁడు కనుపించి యిట్లు పలికెను:— "రాజా! నీకు నీరాజ్యములో నేమి జరుగుచున్నదో తెలియదే. నామందిరములో నేమి జరిగినదో నీవు విచారింపనేలేదు. నాభక్తుఁ డగు మణిదాసు తన్మయతతో సంకీర్తనము చేసికొనుచుండ కథావాచకుఁడును, శ్రోతలును ఆతనిని బాదినారు. ఆతఁ డిప్పటివఱకు అన్నము లేకుండ మఠములోఁ బడియున్నాఁడు. నేఁ డాతని భజనము లేకపోవుటచే నాకానందముగ లేదు. నీవు వెంటనే వెళ్లి ఆతనిసంగతిని విచారించుము. ఆతని సంకీర్తనము జరుగునట్లు జూడుము. పురాణ మిఁకనుండి లక్ష్మీ మండపములో జరుగున ట్లేర్పాటు చేయవలయును. నా మందిరమంతయును నా భక్తుల సంకీర్తనమునకు విడిచి వేయవలయును."

అచ్చట మఠములోఁ బడియుండిన మణిదాసునకు అకస్మాత్తుగా నొక ప్రకాశము కనఁబడెను. ఆ ప్రకాశములో దివ్యసుందరుఁడగు జగన్నాథుఁడు ప్రత్యక్షమై ఆతని శిరస్సును జేతితో నిమురుచు నిట్లనెను:—వత్సా! నీవు భుజింపకుంటి వేమి? నేఁడు నేను నుపవాసముంటిని. లెమ్ము, త్వరగా భోజనము చేయుము.' అంత మణిదాసునకు బాహ్యజ్ఞానము కలిగెను. చూడఁగా నెదుట మహాప్రసాదముతో నొక పళ్లెరముండెను. మణిదాసు కోపమును తగ్గించుకొనెను.

అంత రాజు లేచి గుఱ్ఱమునెక్కి మందిరమువైపునకుఁ బోయి, ఆలయమున కెదురుగానున్న మఠములోనికిఁ బోయిచూడఁగా మణిదాసు నేలపైఁబడియుండుటను గాంచి, రాజు సాదరముగ నాతనిని సభామండపమునకుఁ గొనిపోయి, గొప్పగా నాదర సత్కారములు కావించి, వస్త్రాద్యలంకారముల నొసంగి పూజించెను. అప్పుడు రాజిట్లనెను:—"మణిదాసూ! నీవు ధన్యుఁడవు. భగవత్ప్రేమలేని యున్నతజాతి యెందులకు? నీవును, నిన్నుఁగన్న తల్లిదండ్రులును ధన్యులు. నేఁడు నీవు నాముందు కరతాళములను గ్రహించి కీర్తనచేయుచు నృత్యము చేయుము. దానివలనఁ బ్రభువును, నేనును సంతోషింపఁగలము."

రాజాజ్ఞచేఁ బురాణము ఆయాలయములో తీసివేయఁబడినది. ఆలయమునకు నైరృతికోణమందున్న లక్ష్మీమండపమం దేర్పాటుచేయఁబడి నేఁటికిని అచ్చటనే జరుగుచున్నది. సభామండపము ప్రేమగా సంకీర్తనాదు లొనర్చుటకు విడిచి వేయఁబడినది.

భక్తుఁడగు మణిదాసు జీవితాంతమువఱకును అచ్చటనే తన ప్రేమామృత ధారచే నశేషజనమును బావనముఁ గావించుచుఁ జివరకు జగన్నాథుని సేవించుటకు దివ్యధామమును జేరెను.

---

# భక్త జ్యోతిపంత్

పదునేనిమిదవ శతాబ్దమున మహారాష్ట్రదేశములో సతారా జిల్లాలో బీడ్ యను గ్రామమందు గోపాలపంతను బీదబ్రాహ్మణుఁ డుండెను. ఆతఁడు పిల్లలకుఁ జదువుచెప్పి పొట్ట పోసికొనెడువాఁడు. పూర్వమిప్పటివలె విశ్వవిద్యాలయములు లేకపోయినప్పటికిని బాలురు పాఠశాలలోఁ జదివి గొప్ప గొప్ప పండితు లయ్యెడువారు. వారికి సదాచారము, శీలము, తపము, ధర్మపరాయణత, సరళత, శ్రద్ధ, సంయమము మొదలగు సద్గుణము లలవడియుండెడివి.

గోపాలపంతునకు జ్యోతిపంతను నొకకుమారుఁడు కలఁడు. గోపాలపంతు ప్రతి విద్యార్థికిని చాలశ్రద్ధతో విద్య గఱపుచుండును. ఇఁక తన పుత్రుని విషయ

ములోఁ జెప్పవలసిన దేమున్నది? ఆతని కెంతో శ్రద్ధగాఁ జెప్పుచుండెను గాని ప్రయోజనము లేకపోయెను. ఆతనికి రామనామము తప్ప వేఱొకవిద్య పట్టుబడ లేదు. ఆతని కేడవయేట ఉపనయనముఁ గావించెను. ఆఱునెలలు సంధ్యాకాలము లందు సంధ్యావందనము చెప్పెను. కాని సంధ్యావందనము రాలేదు. తండ్రి ఒక్కొక్కప్పు డిట్టిపుత్త్రుఁడు పుట్టినాఁడే యని పరితపించు చుండెడు వాఁడు. ఒక నాఁడు జ్యోతిపంతు తండ్రి సమ్ముఖమునకు రాఁగానే తండ్రి కోపపడి నీవు విద్యా వంతుఁడవైన తర్వాతనే తన కంటపడవలసినదని యాతని నింటినుండి వెడల నడచెను. పిల్లవాఁడు వెళ్ళిపోఁగానే తల్లి చాల దుఃఖించుచు నాథునితో నిట్లనెను. "నాథా! మనకు పుత్త్రుఁ డొక్కఁడే కదా! అట్టివానిని మనకండ్ల యెదుట లేకుండ వెడలఁగొట్టితిరి. మీకు దయలేదా? వాని కన్నమెవరు పెట్టెదరు? ఎట్లయినను వానిని వెదకి తీసికొనిరండు. వానినిఁ జూడక నే నన్నమును దినను" ఇట్లు పలికి యేడ్వఁ దొడఁగెను. భార్య పలికిన యీమాటలకు గోపాలుని హృదయము కఱ గెను. కన్నులవెంట నీరు కారెను. పుత్త్రుని వెదుకుటకు బయలుదేరెను కాని జాడ చిక్కలేదు.

జ్యోతిపంతు ఇంటినుండి సహవాసగాండ్రను గొందఱను గలుపుకొని వనము నకుఁ బోయెను. ఆవనమందు గణేశ దేవాలయ మొకటి కలదు. దానిలోనికిఁబోయి విద్యాప్రదాత యగు గణేశ్వరుఁడు దర్శన మొసంగినాఁడని సంతోషించి సమస్త శాస్త్రములను, చతుష్షష్టి కళలను నీతనినుండి గ్రహింపవచ్చునని తలఁచెను. ఆతఁడు తన సహచరులనుగూడ తనతోనుండి గణేశుని శ్రద్ధాభక్తులతో భజింపుడని కోరెను; కాని వా రింటికి పోవలయుననిరి. అంత నాతఁడు వారితో నిట్లనెను:—"సోదరు లారా! నే నిచ్చటనేయుండి గణేశ్వరుని భజించెదను. మీ రీయాలయము తలుపును బిగించి, నన్నెవరును జూడకుండునట్లు మట్టితో సందులనుగూడ పూడ్చివేయుఁడు. నే నిచ్చట నుంటినని అన్యుల కెవరికిని చెప్పకుఁడు."

బాలకులు వెళ్లిపోయిరి. ఇచ్చట పుత్త్రునిజాడ తెలియక తల్లిదండ్రు లిద్ద రును బరితపించుచుండిరి. ఆఱుదినములవఱకును గోపాలపంతునింట పొయ్యిని రాజ వేయలేదు. అచ్చట జ్యోతిపంతు పరమవిశ్వాసముతో గణేశ్వరుని బ్రార్థించు చుండెను. ఇట్లు ఆఱుదినములు గడిచెను. ఆఖరుదినమున గణపతి ప్రత్యక్షమై యిట్ల నెను:—"జ్యోతీ! నీకు కావలసిన వరమును గోరుకొనుము. ఇచ్చెదనుఅనెను." అంత నాబాలకుఁ డిట్లనెను:—"స్వామీ! నాకు మొదట విద్యయందు కోరిక గలదు. నీదర్శనమైన తర్వాత నాకింక విద్యలెందులకు? నాకు తత్త్వజ్ఞానమును, నిష్కామ ప్రేమ భక్తియును గావలయును." అంత గణపతి జ్యోతిపంతు నాలుకమీఁద 'ఓమ్'

అను అక్షరమును వ్రాసి యిట్లనెను:—"నీవు విద్యలను గోరకున్నను నీకు సమస్త విద్యలను బ్రసాదించుచున్నాను. నీవు కోరిన తత్త్వజ్ఞానము లభించుటకు కొంత కాలము పట్టఁగలదు. నీకు కాశీలో వ్యాసునిద్వారమున గంగలో మంత్రము లభింపఁగలదు. అప్పుడు నీకోరిక నెఱవేరఁగలదు. నామాట మీఁద విశ్వాస ముంచవలెను. నీకు అవసరము కలిగినప్పుడు నన్ను స్మరింపవలయును. స్మరింపఁగానే నీకు దర్శనమొసంగెదను. ఇఁక నీవు నీయింటికి పొమ్ము"

ఇచ్చట తండ్రికి శివుఁడు ప్రత్యక్షమై "గోపాలా! నీ కుమారుఁడు జ్యోతిపంతు సుఖముగ నున్నాఁడు. నేఁడో రేపో రాఁగలఁడు" అని చెప్పెను.

విద్యల నన్నిటిని బొంది జ్యోతిపంతు ఇంటికి వచ్చెను. ఆనాఁడు తల్లిదండ్రులు పొందిన యానందమునకు మేఱ లేకుండెను. గ్రామస్థులును జ్యోతిపంతు విద్యలను బొంది వచ్చినాఁడని విని వచ్చి యాతని నభినందించిరి. ఆతనిని విడిచివచ్చిన బాలకులు చాల పశ్చాత్తాపమును జెందిరి.

జ్యోతిపంతుయొక్క మేనమామ మహీపతి యనునాతఁడు పూనాలో నొక కార్యాలయములో ప్రధాన కార్యకర్తగాఁ బనిచేయుచుండెను. ఆతఁడు మిక్కిలి సంపన్నుఁడు. తల్లి జ్యోతిపంతును మేనమామకడకు పని నేర్చుకొనుటకుఁ బంపియుండెను. ఏదో అక్కగారు చెప్పుటచే మేనల్లుని నాల్గురూపాయల వేతనముపై తనవద్ద నుంచుకొనెను. జ్యోతిపంతు పనినిఁ జాలచురుకుగఁ జేయుచుండెను.

కార్యాలయమందు చాలదినములనుండి లెక్కలు పెరిగిపోయియుండెను. ఎంత బాగుగాఁ బనిచేసినను ఆ లెక్క లొక్కనెలకు తక్కువ పట్టవు. పై యధికారి తొందఱ పెట్టుచుండెను. మహీపతి చాల చింతానిమగ్నుఁడై యుండెను. అట్టి సమయములో జ్యోతిపంతు మామదగ్గఱకుఁబోయి యిట్లనెను:—"మామా! మీరు చింతపడనక్కఱలేదు. మూఁడు రోజులలో నీలెక్క లన్నిటిని బూర్తిగావించి యిచ్చెదను. నాకొక ఏకాంతమగు గది కావలయును. దానిలో నాలెక్కల పుస్తకములను, సిరాబుడ్డి, కలము, మంచిసింహాసనము, దానిమీఁద మెత్తని పరుపు, దిండు, శుద్ధజలము, ఫలాహారములను బెట్టవలయును. తర్వాత తలుపులను వేయవలయును. మూఁడురోజులైన తర్వాత నేను గుర్తుచూపెదను. అప్పుడు తలుపులను దెఱచిన లెక్కలు సిద్ధముగ నుండఁగలవు." ఇది వినఁగానే అందఱు నాశ్చర్యమును జెందిరి. ఈ విచిత్రమును జూడవలయునని కుతూహలము పడుచుండిరి. మహీపతి జ్యోతిపంతు చెప్పినట్లు ఒకగది నేర్పఱచెను. జ్యోతిపంతు లోనికిఁబోయి తలుపు వైచికొని గణపతిని భక్తిపూర్వకముగఁ బ్రార్థించెను. ఇంతలో గణపతి ప్రత్యక్షమై లెక్కల నన్నిటిని తప్పులులేకుండ మూఁడు దినములలోఁ బూర్తి

కావించి యంతర్థానమయ్యెను. తలుపులు తెఱువఁబడెను. చూడఁగా లెక్కలన్నియును దయారు చేయఁబడియుండెను. అందఱును ముక్కుమీఁద వ్రేలువైచికొని యాశ్చర్యమును జెందిరి. అంత మహీపతి ఖాతాపుస్తకముల నన్నిటిని దీసికొని అధికారివద్దకు పోయెను. ఆ అక్షరములను లెక్కలను అధికారి కాంచి మిక్కిలి యాశ్చర్యమును జెంది, యీ లెక్కలను సయారుచేసినవానిని దన దగ్గఱ హాజరు పెట్టవలసిన దనెను. మహీపతి తన మేనల్లుఁడగు జ్యోతిపంతును బిలిపించెను. జ్యోతిపంతు దర్బారుకు వెళ్లినపుడు వేసికొను వేషమును వేయక సాధారణ వేషముతోఁబోయి అధికారికి నమస్కరించి ఒకప్రక్కకు ఒదిగి నిలుచఁబడియుండెను. ఆతని నిర్మల తేజోయుక్తమగు రూపమును గాంచి అందఱు నాశ్చర్యమును జెందిరి. అధికారి యాతని నతిప్రేమతోఁ దగ్గఱకుఁ బిలిచిఁ పరిచయము నడిగెను. జ్యోతిపంతు వినమ్రభావముతో నిట్లనెను:—"రాజా! నేను మహీపతికి మేనల్లుఁడను. నన్ను జ్యోతిపంతందురు. నేను మా మామగారిపనికి సహాయముచేయుటకు వచ్చితిని. అట్లే చేయుచుంటిని. ఆతఁడు దయతో నాల్గు రూపాయల మాసికభృతి నొసంగుచున్నాఁడు. దానితోఁ బొట్టపోసికొను చున్నాను." బాలకుని సత్యవాక్కులను విని యధికారి యానందమునుజెంది యిట్లడిగెను:— "జ్యోతిపంతూ! మూఁడురోజులలోనే యింతటి గొప్ప కార్యమెట్లు నెఱవేరినది? ఇంతటి సుందరహస్తాక్షరము లెవ్వరివి? ఇంతటి సుందర హస్తాక్షరము లెవరివి? ఇంతటి యందమైన వాటిని నే నింతవఱకు చూడనేలేదు. దీని రహస్య మేమియో చెప్పుము" అంత జ్యోతిపంతు ఇట్లనెను:—"మహారాజా! ఈ లెక్కనంతను దయారుచేసినది గణపతి. ఇవి ఆతని హస్తాక్షరములు." తర్వాత అధికారి బలవంతము చేయఁగా గణపతి ప్రసన్నమైన వృత్తాంతమునుగూర్చి చెప్పెను. అది విని అధికారి మిక్కిలి యానందమునుజెంది జ్యోతిపంతు రాజముద్ర నొసంగి పురందర జిల్లాకు రక్షకునిగా నియమించెను. ఇప్పుడు జ్యోతిపంతుయొక్క అధికారము మహీపతికి మించిన దయ్యెను. మేనమామయును మేనల్లుని గౌరవము తన గౌరవమే యనుకొనెను. భోజనసమయమున నాతనికి బంగారుపళ్లెరములో భోజనమిడెను. భగవత్ప్రేమపాత్రుఁడు ప్రజాప్రేమకు పాత్రుఁడు కాకపోవునా?

జ్యోతిపంతు అధికారమునుబొంది పురందరజిల్లాకు వెళ్లి, తల్లిదండ్రులను బిలిపించుకొని వారిని సేవకుఁడువలె సేవించుచుండెను. ఇట్లు జీవితము గడుచు చుండఁగా నాదినములలోఁ బఠానులు ఉత్తరభారతదేశముపై దండు వెడలఁగా అధికారితోఁగూడి వారిమీఁదకు యుద్ధమునకుఁ బోవలసివచ్చెను. ఆసమయమున జ్యోతిపంతు స్వప్నములో వెంటనే యీయుద్యోగమునువీడి కాశీకి పయనమం

కావలసినదను నాదేశము వినఁబడెను. అంత తన సర్వస్వమును బీదసాదలకుఁ బంచి, అధికారికి తన యుద్యోగభారమును బప్పగించి ఒక బ్రాహ్మణుని వెంటఁ బెట్టుకొని కాశీకి ప్రయాణమయ్యెను. ఆతఁ డచ్చట త్యాగమయ జీవనమును గడుపుచుండెను. కాశీలో నాతఁడు మణికర్ణికా ఘట్టమున స్నానమొనర్చి బొడ్డు లోతు నీటిలో నిలుచుండి జపముచేయుచుండెడు వాఁడు. ఇట్లు మధ్యాహ్నము వఱకు జపముచేసికొని భిక్షనడుగుకొని తినుచుండెడువాఁడు. ఒకదినమున నాతఁడు జపముచేసికొనుచుండఁగా నొక మ్లేచ్ఛుఁడు ఈతనిపై నీటిని జల్లెను. ఆతఁడు వెంటనే మునిఁగి మరల జపించుచుండెను. మరలఁ జల్లెను. దానికి జ్యోతిపంతు ఇట్లనెను:—"ఈవిధముగ ననుష్ఠానమును విఘ్నము కావించుట బాగుండదు" జ్యోతిపంతుయొక్క యీసాత్త్విక కోపమునకు సంతసించి ఆమ్లేచ్ఛుఁడు తన నిజస్వరూపమునకు వచ్చి కనఁబడెను. ఆతఁడే వ్యాసమహర్షి. ఆతనికి జ్యోతిపంతు నమస్కరించఁగా వ్యాసుఁ డిట్లనెను:—"వత్సా! నీవు వ్యాసమంటపమునఁ బరుండుము నీకు తత్త్వజ్ఞానమును బోధించు భాగవతము నిచ్చెదను. దానిని పారాయణముచేసి ప్రేమభక్తి కలిగి కృతార్థుఁడవు కాఁగలవు." అని పలికి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను నీ ద్వాదశాక్షరమంత్రము నుపదేశించి వ్యాసుఁ డంతర్ధాన మయ్యెను.

ఆరాత్రి జ్యోతిపంతు వ్యాసమంటపమునకుఁ బోయి నిద్రించెను. అప్పుడు వ్యాసుఁడు ఆతని తలప్రక్కన ద్వాదశస్కంధయుక్తమగు భాగవతగ్రంథమును బెట్టి పోయెను. ప్రాతఃకాలమున లేవఁగానే యాగ్రంథమునకు సాష్టాంగప్రణామము కావించి, మణికర్ణికాస్నానమొనర్చి జ్ఞానమండపమునఁగూర్చుండి ఉదయము మొదలు సాయంకాలము వఱకును భాగవతపారాయణము జేయమొదలిడెను. ఈ గ్రంథా ధ్యయనమువలన నాతని తపోతేజస్సులు వృద్ధిపొందెను. ఒకదినమున వ్యాసమహర్షి వృద్ధబ్రాహ్మణ రూపమున వచ్చి జ్యోతిపంతు నెదుటఁగూర్చుండి భాగవతపారాయణ మును వినుచుండెను. శంకరుని ప్రభావమున జ్యోతిపంతుని జిహ్వ తడబిడపడి అస్పష్టోచ్చారణకు దిగెను. అంత శివుఁడు ప్రతిదినము నిట్లే పారాయణము చేయు చున్నారా యని యడుగఁగా జ్యోతిపంతు శంకరుని గుర్తించి, లేచి నమస్కరించి అశ్రుపూర్ణ నేత్రములతో పాదములమీఁదఁ బడెను. అంత శివుఁ డిట్లనెను:— ఇప్పుడు నీ మనోరథము పూర్తియైనది. నీకు యథార్థమగు తత్త్వజ్ఞానము లభించినది. ప్రేమభక్తి ప్రాప్తించినది. ఇంక నీ కేసాధనయు నవసరములేదు. ఇప్పుడు నీవు ప్రజల నందఱను భగవద్భజనోన్ముఖులను గావింపుము." అని పలికి శివుఁ డంతర్హితుఁడయ్యెను.

ఈసంగతి నగరమంతటను దెలియఁగాఁ బండితులందఱును నా భాగవతము నూరేగించి జ్యోతిపంతుకు 'మహాభాగవతుఁ' డను బిరుదముఁ నొసంగిరి. తర్వాత

నాతఁడు మహారాష్ట్రమునకుఁ దిరిగివచ్చి తిరిగి భగవద్భక్తిప్రచారము గావించి,అనేక మందిరములను గట్టించి, ప్రజలను భక్తిమార్గనిష్ఠుల నొనర్చెను. చివరకు విక్రమ శకము 1815కు సరియగు కీలక నామ సంవత్సర మార్గశిర కృష్ణ త్రయోదశీ దినమున నాతఁడు పరంధామమును జెందెను.

మహారాష్ట్రభాషలో జ్యోతిపంతుని రచనలు లభించును. ఈతనికి వ్యాసుఁడొసంగిన మహాభాగవతగ్రంథ మింకను చించణేర్ అను గ్రామమందు వారి వంశజులకడ నున్నదని చెప్పుదురు.

---

# విఠ్ఠలదాసు

దక్షిణ దేశమున నొక శ్రేష్ఠబ్రాహ్మణకులములో రాజపురోహితు లిద్దరన్నదమ్ము లుండిరి. ఇంటిలో ధనసంపత్తుల కేకొదువయును లేదు. బ్రాహ్మణకులమునఁ బుట్టుటచే విద్యకు కొదవలేదు. కాని ప్రపంచములో ధనము చేయునంత చెఱుపు మఱియొకటి చేయఁబోదు. విద్వాంసులయ్యు ధనము మూలమున నిద్దరకును కలహము సంభవించెను. ఇద్దరును తమ యాస్తిని పంచుకొనఁ దలఁచిరి. బంధువులు కలహము నణఁపఁదలఁచిరి కాని వారిమాట లిద్దరును వినలేదు. చివరకు ధనముకొఱకై యిద్దరును తగవులాడుకొని కొట్టుకొని చచ్చిరి. ఈమూలమున రాజునకుఁ గూడ చాల చింత కలిగెను. ఇప్పు డీబ్రాహ్మణ కుటుంబములో నిద్దరు విధవలు, చిన్నవాని కొక కుమారుఁడును గలరు. ఈతని పేరే విఠ్ఠలదాసు.

బాలకుఁడగు విఠ్ఠలుదాసు మంచి సద్గుణవంతుఁడును, వృద్ధికిరాగలవాఁడై యుండెను. కొంచెము పెద్దవాఁడైన తర్వాత నాతఁడు తన తండ్రుల విషయ మడిగెను. అప్పుడు తల్లి ధనము మూలమున నన్నదమ్ములు కొట్టుకొని చచ్చిరని చెప్పఁగా నీవృత్తాంతమును విని విఠ్ఠలు ధనము మూలమునఁ గలుగు దుర్ఘటనములను గూర్చి చింతించుచు, ధనము సకలానర్థములకును గారణమని తెలిసికొనెను. అప్పటినుండియు నీతనికి ధనముమీఁద నేవగింపుకలిగి పురోహిత వృత్తిని మానివేసెను. సాంసారికవిషయములందు విరక్తి జనించెను. ఆతఁ డెక్కువకాలము భజన, ధ్యాన, భగవన్నామ కీర్తనములందు గడుపుచుండెను. ఆదినమునుండి తన్నుఁదాను భగవచ్చరణముల కర్పించుకొనెను. తమకు వంశాంకుర మీవిఠ్ఠలుఁ డొక్కఁడే యగుటచే నీతఁ డెన్నఁడైనఁ దమ్ము వదలి వెళ్లిపోవునేమో నని తల్లు లీతనికిఁ బెండ్లి కావించిరి. కాని భగవన్నామామృతరసాయనసారము నొక్కసారి రుచిచూచిన వాఁ డింక దానిని వదలఁగలఁడా? ఆతనికి భగవద్భక్తి దినదిన ప్రవర్ధమాన మగుచుండెను.

ఆతఁడు నిరంతరము సాధుసేవ, భగవత్సేవలు చేయుటయును, ఆన్నాతురుల కన్న దానమొనర్చుటయును భగవత్పూజాదు లొనర్చినపిమ్మట చిరుతలనుదీసికొని 'గోవింద గోపాల శ్రీపతి! అచ్యుతానంద వామనమూర్తి! అను నిట్టి నామములను గీర్తించుచుఁ బ్రేమ విహ్వలుఁడై తన్మయములో నొక్కొక్కప్పుడు మూఁడు గంటలు కూడ పడియుండును. ఆతని ప్రేమ భక్తినిఁగాంచి సాధువులును, భక్తులును మిక్కిలి యానందమును జెందెడువారు. కొందఱు ప్రాపంచికు లీస్థితినిగాంచి యిదియొక డాంభిక వేషమని పలుకుచుందురు.

ఒకదినమునఁ దనపురోహితుని కుమారుఁడగు విఠ్ఠలదాసును స్మరించి, యాతని వృత్తాంతమును దెలిసికొని, యెల్లన నాతని పాదధూళిచేఁ దన గృహమును బవిత్రముఁ గావించుకొనవలయుననియు, నాతనిని సేవించి తరించవలయుననియు భావించి తన యాస్థానమునకు రమ్మనిఁ బిలిపించెను. కాని ప్రతిష్ఠను శూకర విష్ఠాసదృశముగను, రమావిలాసమును వమన సదృశముగను జూచు భక్తవిఠ్ఠలుఁడు తాను రానని నిరాకరించెను. రా జెల్లనను నాతని సేవింపవలయునని గౌరవనీయులగు వారినిఁ బంపి చెప్పింపఁగా విఠ్ఠలుఁడు కాదనఁజాలక రాజ సన్నిధానమునకుఁ బోయెను. భజన చేసికొనుచు వచ్చుచుండిన విఠ్ఠలునిగాంచి రాజు మిక్కిలి సంతసించి, సింహాసనము మీఁదనుండి లేచి మిక్కిలి భక్తితో నాతని కభివాదనము గావించి యాసన మొసంగెను. విఠ్ఠలదాసుని శాంత, సౌమ్య, తేజోపూర్ణమగు ముఖమండలమును గాంచి రాజు మంత్రముగ్ధుఁడై తాను ధన్యుఁడ నైతినని తలఁచెను. రాజాతని భజనమును వినిపింపుమని కోరెను. భక్తులకు భజనమునందు కలుగు ఆనందము మఱే దేనివలనను గలుగదు. దానికి విఠ్ఠలుఁ డంగీకరింపఁగా మృదంగ, తాళ, వీణాదు లేర్పాటుచేయఁబడెను. సాధారణముగ లోకములోఁ గొందఱు సహింపలేని వారుకూడ నుందురు. ఈతని తన్మయతను బరీక్షింపవలయునని కొందఱు మందబుద్ధులు, కలుషితహృదయులు తమకానాఁడు మంచి యవకాశము లభించినదని భావించి రాజుచేఁ గీర్తనము బహిరంగముగఁ బైభాగమున జరుగునట్లొప్పించిరి. దుష్టులు పన్నాగమునుబన్ని విఠ్ఠలదాసుని యాసనము తన్మయము కలిగినఁ బైభాగమునుండి క్రిందఁబడిపోవునట్లు వేసిరి.

విఠ్ఠలదాసు ఆసనముమీఁద వచ్చి కూర్చుండెను. అందఱును యథాస్థానము లందుఁ గూర్చుండిరి. కీర్తన మారంభమయ్యెను. అందఱును గీర్తనలో మునిఁగి తేలుచుండిరి. అనేకులగు భక్తులు మిక్కిలి భక్తితో వీణా మృదంగ తాళాదులతో భజనము చేయుచుండిరి. ఆశబ్దము దశదిశలు మారుమ్రోగుచుండెను. మధ్య మధ్య

హరిగుణగానముకూడ జరుగుచుండెను. విఠ్ఠలదాసు ప్రేమోన్మత్తుఁడై నృత్యము చేయుచుండెను. హృదయములోని భగవత్ప్రేమయును, ఉత్సాహమును, కాళ్లకుఁ గట్టిన మువ్వలు తల్లీనతను బెంచుచుండెను. 'పతితపావన జగదోద్ధారా! ఆదిసర్వేశ! వికుంఠవిహారా! భక్తవత్సలా! ఇందిరావరా! ముక్తిదాయక! మోహనాకారా!" అని యిట్లు నామకల్పనము చేయుచు నమితోత్సాహమున గీర్తనము చేయుచుండి, ప్రేమావేశములో మూర్ఛితుఁడై జారి క్రిందపడెను. దుష్టులగు మూర్ఖులెవరో తప్ప మిగిలిన భక్తులందఱును సంకీర్తన రసపానమత్తులై యుండిరి. ఇట్లు పడునని యెవ్వ రనుకొనలేదు. భక్తులందఱకును బాధకలిగెను. దుష్టుల కిది మనోవాంఛాఫలసిద్ధిగ నుండెను. రాజు ఆతురతతోఁ గ్రిందకు వచ్చిచూడఁగా విఠ్ఠలదాసు పడియుండెను. గుండె కొట్టుకొనుటలేదు. నాడియును శ్వాసయును ఆగిపోయెను. ఆతఁడు మిక్కిలి విచారించి యామృతశరీరమును దల్లికడకు చేర్పించి వారికి మిక్కిలిగ ధనమొసంగి, ఓదార్చి,ధైర్యము చెప్పి యింటికి వచ్చివేసెను.

తల్లి విఠ్ఠలుని శరీరమును దహనముచేయక అప్పు డప్పు డిట్టిస్థితి వచ్చుటను గాంచినదగుటచే నిది యింక హెచ్చుగ వచ్చియుండవచ్చు ననుకొని, ఆశరీరముపై దుప్పటిని గప్పి కాఁచుకొనియుండెను. మూఁడుదినములవఱకు చైతన్యము రాలేదు. నాల్గవదినమున నెమ్మదిగ విఠ్ఠలునకుఁ జైతన్యము కలిగెను. ఆతఁడు రాజమహాలు నందుండక యింట తల్లికడనుండుటకు మిక్కిలి యాశ్చర్యమును జెంది తల్లిని గారణ మడిగెను. తల్లి వృత్తాంతమంతయును జెప్పి, రాజు ధనమిచ్చిన సంగతినిగూడ చెప్పెను. పైనుండి పడియుండినను హానికలుగకుండుటకు భగవత్కృపకు సంత సించెను. గాని తల్లి రాజధనమున కంగీకరించుటచేఁ జాల దుఃఖించెను. ఈఘటనము వలన లోకప్రసిద్ధి కలిగి ఆమూలమున హాని కలుగునని శంకించి ఆరాత్రి చెప్పకుండ వెళ్లిపోవలయునని లోలోన నిశ్చయించుకొనెను.

అది అర్ధరాత్రి సమయము. విఠ్ఠలుని తల్లియు, భార్యయును, వేయేల సమస్త ప్రపంచమును నిద్రావస్థను జెందియుండెను. ఒక్క విఠ్ఠలదాసు నిద్రపోవక తల్లికిని, భార్యకును జెప్పక వ్రజమండలమునకుఁ బోయెను. తెల్లవారఁగానే తల్లికి, భార్యకు విఠ్ఠలదాసు కనఁబడలేదు. వారు చాల దుఃఖించిరి. వారును భక్తు లగుటచే భగ వానుఁడు స్వప్నములోఁ గనఁబడి విఠ్ఠలదాసు మధురలో నున్నాఁడని చెప్పఁగా వారిద్దరును మధురకుఁ బోయిరి. అచ్చట విఠ్ఠలుఁడు కనఁబడఁగా ముగ్గురు నొక చోటుననుండి భగవంతుని భజించుకొనుచుండిరి. తల్లియును, భార్యయును భగవద్భ జనము, పూజ, సేవ, మందిర దర్శనము ఇత్యాదికార్యములలోఁ బాల్గొను చుండిరి.

విఠ్ఠలదాసుని భార్య మహాపతివ్రత. భర్త యిష్టానుసారముగఁ గార్యములు నెఱవేర్చుచుండును. ఆమె యొకనాఁడు పొయ్యి మెత్తుకొనుటకు మట్టినిఁ ద్రవ్వుచుండఁగా నామెకు శంఖ చక్ర గదా పద్మములు ధరించిన యొకవిగ్రహమును, దానిప్రక్కన అపరిమితమగు ధనమును గనఁబడెను. అంత నామె వచ్చి భర్తకు చెప్పెను. భక్త విఠ్ఠలుఁడు అస్థలముయొక్క యజమానిని బిలిపించి యిట్లనెను.— "మీస్థలములో నొకభగవన్మూర్తియు, ధనమును గనఁబడినవి. వానిని గైకొనుఁడు" ఆ స్థలాధిపతి యిట్లనెను:—"అయ్యా! మీరు త్రవ్వఁగాఁ గనఁబడినది కావున మీరే తీసికొనుఁడు. నా కక్కఱలేదు" విఠ్ఠలదాసు తీసికొన నిరాకరింపఁగా గ్రామ పంచాయతీ సభకు తెలుపఁబడెను. వారు విచారింపఁగా నిద్దరును ఆ విగ్రహమును గాని, ధనమునుగాని గైకొన నిరాకరించిరి. అప్పుడు వారు ఆ విగ్రహము దొరికినచోటున నాధనముతో నొకయాలయమును గట్టింపవలయుననియు, నందు ఆ చిన్మయ మూర్తినిఁ బ్రతిష్ఠింపవలయుననియుఁ దీర్మానించిరి. ఆ తీర్మానము ననుసరించి ఆమూర్తి అచ్చటఁ బ్రతిష్ఠింపఁబడెను. అచ్చట ఉపాసన చేసికొనుటకు విఠ్ఠలదాసుని కుటుంబమునకుఁ జక్కని యేర్పాట్లు కావింపఁబడెను. విఠ్ఠలదాసు సపరివారముగ భగవద్భజన స్మరణములందు జీవితమును గడపి చివరకు భగవత్సన్నిధానమును బొంది శాశ్వతానందమును జూరగొనెను.

---

# దీనబంధుదాసు

దీనబంధు దాసు అవంతికాపురమం దొక యుత్తమబ్రాహ్మణ కులమున జన్మించెను. ఆతనికుటుంబములో నాతఁడుగాక ఆతని భార్య మాలతి, ఇద్దరు కొడుకులు. ఒకకోడలు మొత్తము నల్గురువ్యక్తు లుండిరి. ఈ యైదుగురు యోగభ్రష్టులా యనిపించుచుండును. అందఱును భగవద్భక్తులు, వైరాగ్యవంతులు తపస్వులు. ఈకుటుంబములోఁ బొరుపులు లేవు. అందఱును బరస్పరము ప్రేమించుకొనుచుందురు. పరస్పరము సేవ చేసికొనుచుందురు. లోకమునకు వీరు మోహములోఁ బడినట్లు కనఁబడుదురు కాని వాస్తవముగ వీరందఱును వైరాగ్యమునకు మూర్తులే. వీరు శ్రీహరిచరణములందు సర్వమును సమర్పించి భగవద్భజనము చేయుచుందురు. శ్రీహరికథ లనిన వీరికి మిక్కిలి ప్రీతి. వీ రధికకాలమును సాధుసేవలో గడుపుచుందురు. ఇతరులకు మేలుచేయుటయుఁ బ్రతిజీవికిని ఆనందము కలిగించుటయు వీరికి నిత్యవ్రతము. అతిథిసేవయే వీరికి ప్రధానమగు ధర్మము. అతిథి సత్కరింపఁబడక తిరిగిపోయిన నాతఁడు తనపాపముల

నన్నిటిని యాగృహస్థునకు వదలిపోవును. అతిథి పూజింపఁబడినఁ బూజించిన వాని పాపములను గొనిపోవును. ఒకవేళ నతిథిసత్కారము చేయఁజాలకున్న మధుర వచనములతోనైన సత్కరింపవలయును.

దీనబంధుదాసు ధార్మిక జీవనఖ్యాతి దేశమంతటనే కాదు లోకలోకాంతరములను దాటి అప్రాకృత భగవద్రాజ్యమునకునుఁ జేరుకొనెను. అంతర్యామి తెలిసికొనఁజాలనిదేమి కలదు? అతిథులలోను మహాపురుషు లుండవచ్చును. వారును మన సత్కారాదులనుగూర్చి గుణదోష పరీక్షచేసి భగవంతునకుఁ దెలుపవచ్చును. అప్రాకృతరాజ్యమునుండి యేయతిథివచ్చునో యని గృహస్థుఁ డెప్పుడును సావధానుఁడైఁ యుండవలసియుండును.

విషయాసక్తుఁడు ధన, పుత్ర, మానాదులకై యెట్లు వ్యాకులతను జెందునో అట్లే భగవంతుఁడును తనభక్తుని యార్తిని గ్రహించి యెప్పుడెప్పుడు వెళ్లి దర్శన మొసంగుదునా యని తహతహలాడుచుండును. ఇప్పు డెట్లైన దీనబంధు దాసునకు దర్శన మొసంగి కృతార్థునిఁ జేయఁదలచెను. భగవత్ప్రేరణచే నొకవిషసర్పము దీనబంధుదాసుయింటికి వచ్చి పెద్దకుమారునిఁ గాటు వేసెను. విషము తలకెక్కఁగాఁ గొంచెమునేపు తన్నుకొని చివరకు మరణించి భగవద్ధామమునకుఁ జేరెను. పుత్రుని యొక్క అకాలమృత్యువును గాంచి దీనబందుదాసును, ఆతని భార్యయును మిక్కిలి దుఃఖించిరి. ఇఁకఁ గోడలిదుఃఖమును గూర్చి చెప్పవలసిన దేమున్నది? చిన్నవానికిని అన్నయొక్కవియోగదుఃఖ మెక్కుడుగ నుండెను.

ఆసమయముననే అవంతికాపుర రాజమార్గములో నొక తేజఃపుంజము గల సన్యాసి దీనబంధుని గృహము నడుగుచు వచ్చుచుండెను. ఆసంగతి భక్తుని వాకిటకు వచ్చు నప్పటికి లోకు లందఱును గోలాహలముగ నేడ్చుచుండిరి. సన్యాసి యొక్క వాక్కులను విని దీనబంధు దాసు కన్నులను దుడిచికొని బయటకు వచ్చి నమ్రతతో నిట్లనెను:—"దేవా! దయచేయుఁడు. ఈ యధమున కేమైన నాజ్ఞాపింపుఁడు."

సన్యాసి గంభీర స్వరముతో నిట్లనెను:—"దీనబంధూ! నీవతిథిపూజను బాగుగఁ జేయుదువనియు, ఆర్తుల దుఃఖములను జూడఁ జాలవనియు వినియుంటిని. నే నిప్పు డధికముగ నాఁకలి చెందియుంటిని. నాకు భిక్ష నొసంగి ఆఁకలి నుపశమింపఁ జేయుము."

సన్యాసి వాక్యములను విని భక్తిభరితమగు హృదయముతో సన్యాసికిఁ బ్రణమిల్లి, ఆసన మొసంగి యిప్పుడే వచ్చెదనని వెడలిపోయెను.

అంత దాసు లోనికిఁబోయి భార్యాబిడ్డలతో నిట్లనెను:—"ఒకసన్యాసి క్షుధార్తుఁడై మనయింటికి వచ్చినాఁడు. ఆతని కతిథి సత్కార మెట్లు చేయఁగలము? మీయభిప్రాయ మేమి? ఇంటిలో పుత్రశవ మున్నదికదా! ఏది దారి?"

దీనబంధు వాక్యములను విని భార్యయగు మాలతియుఁ, బుత్త్రుఁడును, కోడలును నైక్యకంఠముతో నిట్లనిరి:—"చచ్చినవాఁ డింక రాఁడు. అతిథి విముఖుఁడై పోరాదు. అతిథిరూపమున నెవఁ డప్రాకృతలోకమునుండి వచ్చినాఁడో! కావున ముందుగా నాతని కతిథి సత్కారములను గావించి తర్వాత శవసంస్కారములను జేయుట యొప్పును."

తనకంద అనుకూలముగ నున్నందులకు కాతఁడు సంతసించి, యొక్కవస్త్రమునఁ బుత్రదేహమును మూటఁగట్టి ఒకగదిలోఁ బడవైచి, అందఱును స్నానాదు లొనర్చిరి. అత్తయును గోడలును వంటచేసిరి. వంటకాఁగానే దీనబంధు ఆసనము వైచి సన్యాసి నందుఁ గూర్చుండఁబెట్టి, కాళ్లు చేతులనుఁ గడిగి భోజనమును వడ్డించుచుండెను.

వడ్డించిన తర్వాత దీనబంధునితో సన్యాసి యిట్లనెను:—"దీనబంధూ! పదార్థములు నాకొక్కనికే వడ్డింపఁబడినవి. నే నేగృహస్థునింటికిఁ బోయినను ఒంటరిగా భోజనము చేయను. ఇంటిలో నున్న వారందఱును గలిసి భోజనము చేయవలయును. లేకున్న నేనుగూడ భోజనము చేయను."

సన్యాసి వాక్యములను విని అందఱు నొకరిముఖము నొకరు చూచుకొని యిట్లనుకొనిరి:—"మనము భుజింపకున్న సన్న్యాసియును భోజనము చేయఁడు. కావున మనమును ఆతనితో రెండుముద్దలుభోజనము చేయవలయును. లేక ఆతఁడు తిరిగిపోయిన మనకు దోష మాపాదింపఁగలదు."

అందఱు నంగీకరించి యింక నాలుగాకులలో వడ్డించుకొనిరి. అప్పటికిని సన్యాసి ముద్ద యెత్తక యిట్లనెను:—"దీనబంధూ! నేను గ్రామస్థులవలన మీ దంపతు లిద్దరు గాక యిద్దరుకొడుకులును ఒకకోడలు నున్నట్లు వినియున్నాను. మొత్తము అయిదుగురికి నలుగురే కనఁబడుచున్నారు. అయిదవవాఁడు కూడ వచ్చినఁగాని నేను భోజనము చేయను. కావున నాతనిఁ బిలువుఁడు."

సన్యాసి వాక్యములను వినఁగానే అందఱకు నేమియును మాటలాడుటకు శక్తి రాలేదు. అశ్రుపూర్ణ నేత్రములతో సన్యాసి వైపుఁ జూచుచుండిరి. దీనబంధుని కుటుంబ స్థితిని గాంచి సన్యాసి గంభీర స్వరముతో నిట్లనెను:—"మీ రేల భయపడెదరు? ఎందులకు దుఃఖించెదరు? సాహసించి చెప్పుఁడు. మీపుత్త్రుఁ డెచ్చట నున్నాఁడు?"

సన్యాసివాక్యములను విని వారు నలుగురును సన్యాసి పాదములమీఁదఁ బడిరి. అనంతరము దీనబంధు దాసు మెల్లగ నిట్లనెను:—"స్వామీ! నేను నిజము చెప్పుచున్నాను. నా యపరాధములను మన్నింపుఁడు. మీరు వచ్చుటకుఁ బూర్వమే నా పెద్దకుమారుఁడు పాముకాటుచే మరణించినాఁడు. ఆతనికి దహనసంస్కారములు చేయునంతలో మీరు వచ్చితిరి. మీ రత్యంత క్షుధాతురులై యుండుటచే మీకు భిక్ష నొసంగి దహనసంస్కారము చేయవచ్చునని శవమును వేఱుగనుంచి స్నానశుద్ధులమై వంటఁ జేసితిమి. ఇఁక తమ ఆజ్ఞ."

సన్యాసి ఆశ్చర్యచకితుఁడై యిట్లనెను:— "ఏమి నిజము చెప్పుట? నాకు నమ్మకము లేదు. చచ్చినకొడుకు శవమును వీడి తల్లిదండ్రు లెచ్చటనైన నతిథి సత్కార మొనరింతురా? ఏదీ! నీపుత్రుని దేహమును జూపింపుఁడు. "

దీనబంధు చేయునదేమున్నది. లోనికిఁబోయి పుత్రునిశవము గట్టినమూఁటను గొనితెచ్చెను. మూఁటను విప్పి శోకాకులుఁడై నిలుచుండెను. సన్యాసి యాశవమును జూడఁగానే నిలువఁబడి క్రోధోద్రిక్తుఁడై కన్ను లెఱ్ఱఁజేయుచు నిట్లనెను:— 'దీనబంధూ! నీవు నృశంసుఁడవు వలె నున్నావు. ని న్నెవరు జ్ఞాని యన్నది? నీవు దుష్టుఁడవని తోఁచుచున్నది. పుత్రశవమును ఇంటిలోఁ బెట్టుకొని యేతండ్రి సంతోషముతో అతిథిసత్కారము చేయఁగలఁడు? ఇంత నిర్దయునిఁ, గఠినుని, పాపిని నేను జూడలేదు".

సన్యాసివచనములను విని దీనబంధుదాసిట్లనెను:—"స్వామీ ! మీరు చెప్పునది నిజమే కాని ప్రపంచములోఁ దండ్రి యెవఁడు కొడు కెవఁడు? ఇది విచిత్రము. అక్కడక్కడ వారందఱును వచ్చి యుందురు వ్రాలుదురు. వారిరోజు తీరఁగానే వెడలిపోవుచుందురు. మామిడిచెట్టుమీఁది పండ్లు ఏదిముందు పక్వమైన నది రాలిపోవును. చివరకు కాలము తీరఁగానే చెట్టును నశించును. చిన్న కానిండు, పెద్ద కానిండు, రాజు కానిండు, దరిద్రుఁడు కానిండు. అందఱును గాలవశులు కావలసినదే. కాలచక్రము ననుసరించి యందఱును ముందు వెనుకలుగ మరణింప వలసినదే. అట్లే నాకుమారుఁడును కాలగతిని జెందినాఁడు. మేమును మారోజులు పూర్తికాఁగానే పోయితీరెదము. కావున స్వాభావికముగ బ్రతివానికిని గలుగుమరణమునకై దుఃఖింపనేల? లోకవ్యవహారము ననుసరించి మేము భోజనముచేయుట యనుచితమే. కాని మీరు క్షుధార్తులై వెళ్లుట కోర్వలేక అట్లు చేసితిమి. గీతలో భగవానుఁడు నిట్లే చెప్పెనుగదా:—"చచ్చినవారికి, చావఁబోవువారికి శోకింపనివాఁడే పండితుఁడు."

దీనబంధుని ప్రత్యుత్తరమును విని సన్యాసి లోలోననవ్వుకొని ఆతనితో నేమియును ననక, ఆతని భార్యయగు మాలతితో నిట్లనెను:—"ఏమమ్మా! నీహృదయ

మింత కఠినమైన దేమి? నీవు తల్లివి. తల్లికి పుత్రునిపైఁ బ్రేమ యుండును. ఇది స్వాభావిక నియమము. అట్లయ్యు నీవు పుత్రుని మరణమునకు శోకింపవు. ఇది యెంతటి కఠోరత?"

మాలతి సన్యాసికి నమస్కరించి నమ్రతతో నిట్లనెను:—"తండ్రీ! మీరు జ్ఞానులు. నేను మీకు చెప్పఁదగినదానను గాను. కాని మీ రడుగుచున్నారు కావున చెప్పుచున్నాను. పుత్రుఁడు బ్రదికియున్నంతవఱకు నాకు సంబంధము. ఆతఁడీశరీరములోని భాగము. ఆతనిశరీరము పోఁగానే సంబంధము పోయినది. కుమ్మరి వాఁడు సారె మీఁద నానావిధములగు పాత్రలను జేయును. వానిలోఁ గొన్ని మధ్యలోనే పగిలిపోవును. కొన్ని కొన్నాళ్లుండి పోవును. ఈజగమందు కనఁబడున వంతయును స్వప్నము వంటిది. చెట్లుమీఁద పక్షులు చేరుచుండును. అవి లేచిపోవు చుండును. ఈసంబంధము లన్నియును మాయాలీల యని గ్రహింపుము. కావున శోకము చెందుటలేదు. శోకము ప్రభుభక్తినుండి దూరము కావించును. ఎవని మనస్సులో నానందమయుఁడుండునో అచ్చట శోక ముండదు.

అంత సన్యాసి మాలతిమాటల కానందించి దీనబంధుని చిన్నకుమారునితో నిట్లనెను:—"ఓయీ! నీవు కఠినుఁడవు వలె నున్నావే. నీహృదయములోకూడ చెడ్డ భావమున్నట్లున్నది. లేకున్న భోజనమునకుఁ గూర్చుందువా అన్న మరణించినప్పుడు? నీకు సిగ్గు లేదా ? నీవంటి అజ్ఞాని, మూర్ఖుఁడు, నిర్దయుఁడు, పాపి యీజగత్తులో నెవఁ డున్నాఁడు ?"

బాలకుఁడు చేతులు జోడించి యిట్లనెను:—"స్వామీ ! మీరు స్వాప్నే నేరారోపణము చేసిన చేయవచ్చును. కాని నేను యథార్థమును జెప్పుచున్నాను. ఇప్పటి సోదరులు వెనుకటిజన్మలోను రాఁబోవు జన్మలోను సంబంధము లేనివారే. సంతకు వ్యాపారులు వచ్చినట్లు అందఱు నొక్కచోఁ జేరి అన్నా ! తమ్ముఁడు ! అను కొనుచుందురు. ఎవరి వస్తువులు ముందుగా నమ్ముడుపోవునో వారు ముందు వెడలి పోవుదురు. మిగిలినవారు వెనుకనే పోవుదురు. ఈలోగానే మనము సంబంధముల నారోపించు కొందుము. మరణించు వారితో మరణించువారు లేరు. ఒకవేళ నేను అనుచితముగ మాట్లాడిన క్షమించి, ఉచిత జ్ఞానమును బోధించి కృతార్థునిఁ గావింపుఁడు."

బ్రాహ్మణకుమారునివాక్యములను విని సన్యాసి మిక్కిలి యానందించి, ఆతని వివేకమును బ్రశంసించెను. వివేకవంతునకు సాంసారిక దుఃఖము లేవియు నుండ వను సంగతిని దెలిసికొని యానందపడెను. తరువాత, నాతడు దీనబంధునికోడలిని పరీక్షింప వలయునని తలంచి అప్పుడామెతో యిట్లనెను:—"అమ్మాయీ! నీ ప్రవర్తనమునకుఁ

జాల దుఃఖించుచున్నాను. స్త్రీకి పతియే గదా సర్వస్వమును. పతిహీనయగు పడతికి సౌఖ్య మెక్కడిది ? నీవు ఉత్తమ వంశములోఁ బుట్టియు నిట్టి నిందనీయ కార్యము నొనర్చితివని నాకు చాల ఆశ్చర్యమగుచున్నది. నీపతి మరణింపఁగాఁ గొంచెమైన శోకించుటలేదు. పతిశవము ఇంటిలో నుండఁగా విస్తరిని బఱచుకొని భోజనము చేయ సిద్ధపడితివి ? ఛీ ! ఛీ ! ఏమిజన్మ నీది?"

అని సన్న్యాసి పలుకఁగా నా దీనబంధుని కోడలు నమస్కరించి యిట్లనెను:—

"తండ్రీ ! మీరు చెప్పినది నిజమే. స్త్రీకి పతియే సర్వస్వమనునది నిజమే. యథార్థమునకు స్వామి భగవంతుఁడేకాని వేఱుకాదు. భగవంతుని సేవించుటకుఁ బ్రత్యక్షముగఁ బతినిఁ బ్రసాదించినాఁడు. పతినిఁ బరమేశ్వరుఁ డనియే సేవించితిని. కాని యాశరీరము పోయినతర్వాత దానికై పరితపింపనేల ? బరమేశ్వర సేవ ఆశరీరము మూలముననఁగాక ప్రత్యక్షముగనే చేయ నవకాశ మొసంగెను. అదియునుగాక మానవుని యదృష్టమునుబట్టి సంయోగ-వియోగములు కలుగుచుండును. నాపతికిని నాకును సంబంధము తీరినది. ఇప్పుడు నే నేడ్చిన నాపతి జీవించునా ? భగవదిచ్ఛానుసారముగ సర్వమును జరుగుచుండును. దానికొఱకై దుఃఖింపనేల ? జ్ఞానియగు వాఁడు రాకడ పోకడలకును, సుఖ-దుఃఖములకును, మానావమానములకును, లాభ నష్టములకును లొంగకయును గ్రుంగకయును సమదృష్టితో నుండును. ఇఁక నే నెప్పుడు నాపతికిఁ బతియగు పరమాత్మ నొక్కనినే సేవింప వలసియున్నది. కావున నేను దుఃఖింపనేల ? అదియునుగాక మానవుఁడు విషయములలో మునుఁగునంత వఱకు భగవద్భజనము చేయఁజాలఁడు. అందువలననే పెద్దలు సన్న్యాసమును గ్రహించి యిల్లు వాకిండ్లను వీడిపోవుచుందురు. వైధవ్యము సన్న్యాసమే. అట్టి దానిని భగవంతుఁడు నా కనుగ్రహించినాఁడు. దీనికై నేను శోకింపనేల ? విషయ త్యాగము దాని కదియే లభించినది. పరమార్థ దృష్టిచే నిది సౌభాగ్యవిషయమే !

ఈ ప్రపంచము పరమాత్మయొక్క లీలాక్షేత్రము, ఆయన కొందఱను నవ్వించును. కొందఱ నేడ్పించును. కొందఱకు సంయోగమును మరి గొందఱకు వియోగమును గలిగించును. ప్రభులీలనుగూర్చి దుఃఖింపనేల ?

లౌకిక దృష్టిచేనైనను దుఃఖించుట పాడిగాదు. పతి మరణించినతర్వాతఁ బడతి నలవించినఁ బతి పరలోకమున మోహావశమున దుఃఖమును జెందఁగలఁడు. నాపతి వ న్నానందమున నుండ నియమించియుండెను. అట్లుగాక యిప్పుడు నే నేడ్చు చుండిన పూజనీయుఁడగు పతియాజ్ఞను మీఱినదాననగుదును. కావున శోకమును జెందుట పాడిగాదు. మే మందఱమును మీకొఱకు భోజనముచేయుట కొడఁబడితి మనువిషయము మామగారు మీకు చెప్పనే చెప్పినారు.

తండ్రీ ! గీతలో నాత్మ అజరము, అమరము, అవినాశి, నిత్యము, శాశ్వతము, పురాణమైనదని చెప్పఁబడినది. కావున దానికై దుఃఖింపనేల ? నాభర్తయొక్క శరీరము పోయినది కాని ఆత్మ చావలేదు. కావున నేను దుఃఖింపనేల ? నేను పలికిన దానిలో ననుచిత మేమైన నున్నయెడల క్షమింపుఁడు" అనెను.

బ్రాహ్మణ కుమారి నోటినుండి వినిన యీవాక్యములకు సన్న్యాసి సంతసించి లోలోన నిట్లనుకొనెను:—"నిజమున కిట్టి కుటుంబమే ధన్యమైనది ! ఇట్టివారివలననే యీలోకము శోభిల్లుచున్నది.!" తదనంతరము సన్న్యాసి కమండలువులోని గంగోదకమును ఆశవముపైఁ జల్లి, నోట నొకతులసీదళము నుంచి గంగను వేయుచు 'నాయనా ! యిఁక లెమ్ము' అనెను.

చూచుచుండఁగనే ఆ బ్రాహ్మణకుమారుఁడు నిద్రనుండి లేచినట్లు లేచి; యెదుట తేజఃపుంజమువలె నున్న సన్న్యాసికి ప్రణమిల్లెను. సన్న్యాసి ప్రభావమును గాంచి అందఱు నాశ్చర్యమును జెంది యానందనిమగ్నులై ఆతని చరణములకు మ్రొక్కి, అశ్రువులచే నాతనిపాదములను గడిగి లోలోన సన్న్యాసి యెవరా యని యాలోచించుచుండిరి.

అంత సన్న్యాసి సజీవుఁడగు బ్రాహ్మణ కుమారునితో నిట్లనెను:—"కుమారా ! నే నీదినమున నొకవిచిత్రమును గాంచితిని లోకములోని స్వార్థపరత్వమంతయు నీయింటిలోఁ గరుడు గట్టియున్నది. నీవు ఆత్మీయులని తలఁచు నీతండ్రి, తల్లి భార్య, సోదరుఁడు అందఱును నీవు చచ్చిపడియుండ నాతో భోజనముచేయుటకు సిద్ధపడిరి. ఇట్టియింటిలో నీవు పుట్టితివి."

సన్న్యాసివాక్కులను విని బ్రాహ్మణ కుమారుఁడు నవ్వి యిట్లనెను:—"దేవా ! ఇట్టివంశములో జన్మించుటచే నేను ధన్యుఁడను. ఇట్టి వైరాగ్యవంతులు, భక్తులు నా కాత్మీయులైరి యిదియే నాభాగ్యము. నిజముగ నేను యోగభ్రష్టుఁడను. నే నిట్టివారింటిలో జన్మించుట చేతనే నా కది ఋజువగుచున్నది. భగవంతుఁడు నా కిట్టితల్లిని, దండ్రిని, భార్యను, తమ్మునిఁ బ్రసాదించినాఁడు ఇదియే నాభాగ్యము. నాతండ్రి మా కిదియే నేర్పినాఁడు. గ్రీష్మములో సూర్య తాపమున కాగలేక అందఱును నొకచెట్టుక్రిందకుఁ జేరి వేడి తగ్గఁగానే ఎవరి త్రోవను వారు వెళ్లిపోవుదురు. అట్లే యీసంసారమునందు కూడ ఋణము తీరఁగానే యెవరిత్రోవను వారు పోవుదురు. జన్మించినందులకు పరమాత్మ భజనము చేయుట, సత్సంగ మొనర్చుట, సాధుసేవచేయుట వీనిలోఁ గాలమును గడుపువాఁడు ధన్యుఁడు. కృతార్థుఁడు. ఆతని ఆశలన్నియు ఫలింపఁగలవు."

బ్రాహ్మణ కుమారుని వాక్యములను విని సన్న్యాసి మిక్కిలి యానందించి లోలోన నిట్లనుకొనెను:— "ఇట్టి వివేకులగువారిని ధరింపఁబట్టియే భూమి యింతమాత్రము నిలిచియున్నది." అనంతరము సన్న్యాసి నవ్వుచు నిట్లనెను:—

"వత్సా! దీనబంధుదాసు! మీ యైదుగురయొక్క శుద్ధ వ్యవహారము, వివేకము, వైరాగ్యము, అతిథిసేవయం దనురాగము, శ్రీహరియందు నిష్కామభక్తి వీనిని గాంచిన నాకు చాల ఆనందము కల్గుచున్నది. వాస్తవమున మీరు ధన్యులు. మిమ్ము లను గనిన దేశము, కులము ధన్యమైనది. మీరు నిశ్చింతగ జీవితమును జరిపి చివరకు మోక్షమును బొందఁగలరు. ఇందు సందేహము లేదు."

ఇట్లనఁగానే అందఱును సన్యాసికిఁ బ్రణమిల్లిరి. సన్యాసి వారితో నిట్లనెను:—"భక్తులారా! మీరు సర్వదా విశ్వపతియగు శ్రీహరిని భజించుఁడు. మీ కిఁక దుఃఖములు రాఁజాలవు" అనఁగానే అందఱు నానందించిరి.

అంత సన్యాసి యిట్లనెను:—"ఇఁక నేను వెళ్లుచున్నాను. మీ కేవిఘ్న ములును రాకుండును గాక! నేను మిమ్ముల నెన్నటికిని మఱువఁజాలను. మీరు నన్నును మఱువవలదు. నేఁటినుండి నేను మీ వాఁడను. మీ రందఱు నా వారు. ఈ సంగతిని మీరు జ్ఞాపకముంచుకొనవలయును. నేను మీ వంటి పుణ్యాత్ముల నన్వేషించుచుండును. మీబోటి భక్తులు దొఱకిన నేను వారికి విక్రీతుఁడ నగుచుందును. ఇది నా నియమము. నేనే విశ్వపతినగు భగవానుఁడను."

వారు కన్నుమూసి తెఱచి చూచునప్పటికి యెదుట నున్న భగవానుఁ డంతర్ధానమును జెందెను. అందువలన వారికి వ్యాకుల మధికమై దుఃఖించుచు భగవాను నిట్లు ప్రార్థించిరి:—"హే ప్రభూ! దీనబంధూ!! మా జీవనధనమా!!! నీవు మమ్ములను కఠిన హృదయుల మంటివి. నిజమునకు నీవే కఠిన హృదయుఁడవు. దర్శన మీయకుండిన నీ పరిచయమును గావించు టెందులకు? ఒక్కసారి కన్నులార నీ దివ్యమోహన రూపమును జూపకపోతివి. దివ్యరత్నమును జేతి కందించి మరల లాగుకొంటివి. వస్తుతః నీవు మాయావివి. నీవే సన్యాసివై యిట్లు వచ్చితివని మాకు మొదటనే తెలిసియుండిన నిన్ను వదలిపెట్టెడు వారమా? నీమాయ నెవ్వరు తెలిసికొనఁగలరు? బ్రహ్మాదులనుగూడ నీ మాయచే ముగ్ధుల నొనరించుచుందువు. ఇఁక మా సంగతి చెప్పనేల? తండ్రీ! ఇప్పుడు నీ దర్శనములేక యుండఁజాలను. హృదయము బ్రద్దలగుచున్నది. దయయుంచి నీ జగన్మోహనాకారమును జూపి మమ్ములను గృతార్థులఁ గావింపుము."

అకస్మాత్తుగా దివ్యప్రకాశము కనఁబడెను. భక్తవత్సలుఁడగు భగవంతుఁడు వారి మొఱలను విని తన దివ్యదర్శనము నొసంగెను. చిరకాలాభిలాషను బొంది అందఱు నానందనిమగ్నులైరి. ఇప్పుడు వారు నిజముగ భగవంతునివారైరి. భగవంతుఁడు వారివాఁ డయ్యెను. ఈ విధముగ వా రందఱును హరిసేవలో, హరిచర్చలోఁ దమ పుణ్యజీవితమును గడిపి, చివరకు దుర్లభమగు హరి పదమును బొందిరి.

---

# భక్త నారాయణదాసు

వంగదేశమునకు ప్రసిద్ధరాజగు కీర్తిచంద్రుని రాజ్యమందు గంగాతటమున నారాయణదాసు నివసించుచుండెను. ఆతని గృహము ధనధాన్య సమృద్ధమై యుండెను. ఆతఁడు విద్వాంసుఁడును, సద్గుణ సంపన్నుఁడు నై యుండెను. భగవద్భక్తుఁ డగుటచే నాతనికి ధనమదముగాని, విద్యామదముగాని, గుణగర్వముకాని లేదు. ఆతఁడు శుద్ధచిత్తుఁడును, సరళ స్వభావము కలవాఁడై యుండెను. పెద్దలతోఁగాని, చిన్నలతోఁ గాని నవ్వుచు మాటలాడును. ఎవ్వరిమీఁదను గోపింపఁడు. స్వప్నమం దైనను పరస్త్రీ, పరధనముల నాశింపఁడు. ఎగతాళికైనను నసత్య మాడఁడు. అందఱకు సేవ చేయ నభిలషించుచుండును. బీదసాదలకు సహాయ మొనర్చుచుండును. ఆతని సామాన్య వేషమును గాంచి ఆతఁ డిట్టివాఁడని యెవ్వరును గుర్తింపఁజాలరు. ఇంట మహావైభవము పూర్ణముగ నున్నను ఆతనికి దేనిమీఁదను గోరిక లేదు. తన సర్వస్వమును భగవంతుని దనియే తలఁచును. నిరంతరము పరమేశ్వరుని పాదపద్మములను స్మరించుచుండును. నారాయణదాసుని భార్య మాలతియు పరమ భక్తురాలు. పతివ్రత. సద్గుణరాశి. భక్తులలక్షణము లిట్టివేకదా!

విషయములలోఁ దిరుగుచున్నంతవఱకు సుఖము లేనేలేదు. భగవంతుని భజించుటలోనే యథార్థమగు సుఖము కలదు. నారాయణదాసుని హృదయము వైరాగ్యముతో నిండియుండెను. ఆతని కింట నుండుట కిష్టము లేదు. ఎచ్చటనైనఁ దీర్థస్థలమున నుండవలయునని ఆతని యభిలాష. అందువలన నాతఁడు తన కిష్టదైవమగు శ్రీరామచంద్రుని జన్మభూమియును, మోక్షప్రద క్షేత్రములందు ప్రప్రథమ క్షేత్రము నగు అయోధ్యయందు నివసింపఁదలఁచెను. ఆతఁడు ప్రయాణమగు నంతలో భార్యయగు మాలతియుఁ బ్రయాణ మయ్యెను. దాని కాతఁ డంగీకరించి ఆవశ్యకములగు సామగ్రిని దీసికొని దారిన శ్రీరామనామ సంకీర్తనను చేసికొనుచు వెళ్లుచుండిరి. సంధ్యాకాలములందు అనుష్ఠానాదులకై సత్రములందు విడిసెడువారు. ఇట్లు చివరకుఁ జిత్రకూటమునకుఁ జేరి, అచ్చటి లీలాస్థలము లన్నిటిని దర్శించెను. ఆయా లీలలను స్మరించి ప్రేమమగ్నుఁడై చిత్రకూటమును స్తుతించెను.

నారాయణదాసు పత్నీసహితుఁడై చిత్రకూటమునఁ గొన్ని దినములు ఆశ్రమములందు సాధుసేవ సత్సంగమము, భజనకీర్తనములు చేయుచు గడపి చివరకు అయోధ్యకుఁ బ్రయాణ మయ్యెను.

దారిలో శ్రీరాముఁడు అరణ్యములలో దిరుగుటను స్మరించుచుఁ దాను నట్లే నడకమీఁద · దట్టమైన కీకారణ్యములలో రాళ్లు, ముండ్లని జూడక, వనజంతు

వుల యఱుపులకు భయపడక శ్రీరామనామ సంకీర్తనానందమున దంపతు లిరువురును దన్మయులై వెడలుచుండిరి. వారికి శ్రీరామ స్వరూపము, శ్రీరామ లీలలు తప్ప మిగిలిన విషయము లేవియును దోఁచుటలేదు.

దంపతు లిరువురును అయోధ్యకు దారియేదియో తెలియక ఆ అరణ్యము గుండా వెడలుచుండిరి. చివర కొక దొంగలగుంపగు భిల్లుల పల్లెకుఁ జేరిరి. భిల్లులు వీరిని, వీరి సామానును గాంచి యెల్లన దోఁచుకొనవలయునని తలంచిరి. వారి నాయకుఁడు వినయయుక్తముగ నిట్లనెను:—"అయ్యా! మీ రీయరణ్యముగుండా యెచ్చటికి వెళ్లుచున్నారు? మా వలన నేమైన సాయము కావలసియుండిన సెలవిండు." నారాయణదాసు అందఱను నారాయణస్వరూపముగఁ జూచును గావున వీరు యథార్థముగ సద్భావముతోఁ బల్కుచున్నారని నమ్మి యిట్లనెను:—"అయ్యా! మేము రఘుకుల దివాకరుఁడును, అఖిలలోకాధీశ్వరుఁడును, భక్తవత్సలుఁడు నగు శ్రీరామచంద్రుని దర్శించుటకు అయోధ్యకు వెళ్లుచున్నాము."

నారాయణుఁ డిట్లనఁగానే భిల్లనాయకుఁ డిట్లనెను:—"అయ్యో! ఈ ఘోర వనమునకు వచ్చినారే. మంచియే జరిగినది. మేము కలిసితిమి గనుక సరిపోయినది. మేమును అయోధ్యకుఁ బోవుచున్నాము. మాతో రండు. మీకు రక్షణముఁగూడ జరుగఁగలదు" అని పలుకుచు వారి పని నెఱవేఱ నున్నందులకు వారు సంతసించుచుండిరి. ఇది నారాయణదాసునకు నచ్చలేదు. ఆతఁడు శ్రీరామచంద్రునిచరణముల కడ ఆత్మసమర్పణము కావించియుండెను. అందువలన నిశ్చయముగ నారాయణదాసు ఇట్లు పలికెను:—"అయ్యా! మాకు అనాథనాథుఁడగు శ్రీరామచంద్రుఁడే దిక్కు. ఆతఁడే మాకు రక్షకుఁడు. ఆతఁ డెక్కడికి కొనిపోయిన నచ్చటికి పోఁగలము." దీనికి భిల్లనాయకుఁ డిట్లనెను:—"ఆహా! భక్తవరా! మంచిపని చేసితిరి. శ్రీరామచంద్రుని శరణు వేఁడితిరి. ఆతఁడే కదా అందఱి కాధారము. మేమును శ్రీరామచంద్రుని శరణు వేఁడిన వారమే. వెళ్లుదము పద, ఆ అయోధ్యకు." ఇవి వ్యంగ్యమున పలికిన వాక్యములని నారాయణదాసునకును, ఆతని భార్యకును దెలియదు. దుష్టులు సమయము చూచుకొని వారి కార్యమును నెఱవేర్చుకొనఁ దలంచిరి. ఇదియే అయోధ్యామార్గమని ఒక ఘోరారణ్యమునకుఁ ద్రోవను దీసిరి. ఇంకఁ జూచెద రేమిరా పని పూర్తిచేయక?" అని యొకఁ డనెను. వారు వెంటనే నారాయణదాసుని చేతులు, కాళ్లను గట్టివైచి లోతుగల గోతిలోఁ బడవైచి పైనఁ బెద్ద పెద్దబండలను బెట్టి "ఇక్కడనే పడియుండి రామచంద్రుని దర్శింపుము" అనిరి.

నారాయణదాసుని శరీరము దెబ్బలచే జర్జరితము లయ్యెను. అటునిటుఁ గదలుటకు శక్తిలేదు. మాటాడుటకును శక్తి లేకుండెను. మాటాడలేకపోయినను

లోలోన నిట్లు ప్రార్థించెను:—"త్రైలోక్యచింతామణీ! రఘుకులమణీ! పతిత పావనా! పాపనాశనా! నీకు పదేపదే నమస్కారములు. నీవు విశ్వ మంతటను వ్యాపించితివి. ప్రతి జీవియొక్క అంతఃకరణములో నీ వున్నావు. నీవు లేనిస్థానము లేనేలేదు. లోపలను, వెలుపలను నీవే యున్నావు. నీ వానర్చు ప్రతికార్యమందును ఆనందము కలదు. కేవలము నిన్నే నేను శరణు వేడుచున్నాను. నీవుకాక నా కాశ్రయము వేఱులేదు."

నారాయణదాసు నిట్లు బాధపెట్టి భిల్లులు మాలతి దగ్గఱకు పరువిడిరి. ఆమె తనభర్తయొక్క దుర్గతిని గాంచి నిశ్చేష్టయై మూర్ఛపడెను. ఆమె వెండ్రుకలు విరియఁబడియుండెను. ఆమె శరీరములో ప్రాణము లున్నట్లే కనఁబడలేదు. వారు వచ్చి ఆమెను బూతులు తిట్టుచు కేశపాశములను బట్టుకొని జఱజఱ నీడ్చిరి. ఇంత లోనే మాలతికి తెలివి వచ్చెను. ఈ దుర్మార్గుల వలనఁ దప్పించుకొనుట కామె కేమియు నుపాయము తోఁచక శ్రీరామచంద్రునిగూర్చి యిట్లు ప్రార్థించెను:— "రామా! నీవు దిక్కులేనివారికి దిక్కనియు, అశరణశరణుఁడ వనియు విని యుంటివి. దీనులను. భక్తులను రక్షించుటకు ధనుర్బాణములను ధరించితివని చెప్పుదురు. నీ యనాథరక్షకత్వ మెక్కడికి పోయినది?" అని యిట్లు ఆర్తితోఁ బ్రార్థింపఁగా నొక క్షత్రియుఁడు తెల్లని గుఱ్ఱమునెక్కి చేతిలో విశాలమగు ధనుస్సును, భుజమున నంబుల పొదిని, నడుమున 'యమదంష్ట్ర'మను ఖడ్గము వ్రేలాడుచుండెను. ఆజానుబాహుఁడును, కిరీటాంగదములను ధరించిన వాఁడును, మెడలో మణిమౌక్తికాది దివ్యహారములు ధరించిన వాఁడును, వ్రేళ్లకు మణులు కూర్చిన ఉంగరములను ధరించిన వాఁడును, స్వర్ణచేలమును ధరించిన వాఁడును, భృగుని పాదము గుర్తు ఱొమ్మునపైఁ గలవాఁడు నగు శ్రీరామచంద్రుఁడు దస్యులకు భయంకరముగను, మాలతికి జగన్మోహనాకారముగ నుండెను. ఆతనిని జూడఁగానే భిల్లు లందఱును భయపడి యెక్కడివా రక్కడ పాఱిపో నారంభించిరి. వారు పాఱి పోవుచు గొందఱు క్రిందఁ బడిరి. కొందఱు చెట్లకుఁ గొట్టుకొనిరి. కొందఱు గోతు లలోఁ బడిరి. వారిలో దెబ్బ తగులనివా రొక్కరును లేరు. ఆ తేజోమూర్తి మాలతి కడకు వచ్చి వాత్సల్యామృతమును గుఱిపించుచు నిట్లనెను:—"బిడ్డా! నీ వెచ్చట నుందువు? నీవు స్త్రీవే. నీ భర్త వెంట లేఁడేమి? ఈ ఘోరవనమునకు నీవు ఒంటిరిగా వచ్చితివేమి? నిన్నుఁ బట్టుకొనిన వీ రెవరు? వీరు నన్నుఁ జూడఁగానే పాఱిపోవు చున్నా రేల?"

క్షత్రియుని కరుణాపూర్ణములగు వచనములను విని, యా పల్కులు అమృత వర్షముగఁ దోఁచి, ఆతఁడు రఘువరునిచేఁ బంపఁబడిన రక్షకుఁ డనిభావించి యిట్లనెను:-

"తండ్రీ! మే మయోధ్యకుఁ బోవుచుంటిమి. దారితప్పి యీ భిల్లుల పల్లెకు వచ్చితిమి. ఇచ్చట వీరు మోసగించి, నా నాథుని బాధించి, నన్ను వేశ్యగా భావించి నానామాట లన్నారు. అట్టి క్షణములోనే నా రామచంద్రుఁడు మిమ్ములను బంపినాఁడు. వారు పారిపోయిరి. నా నాథుఁడు జీవించియుండునను నాశ నాకు లేదు. వా రట్లు హింసించుచు నాతనిని గొనిపోయిరి. మీరు నా కొక్క సహాయము చేయవలయును. ఒకచితినిఁ బేర్చుఁడు. దానిమీఁద నా భర్త శవముతోఁగూడ నేను సహగమన మొనరించెదను. ఆలస్యము చేయకుఁడు"

ఇట్లనఁగానే శ్రీరామచంద్రుఁ డిట్లనెను:—"అమ్మా! చింతింపకుము. నీ భర్త మరణింపలేదు. జీవించియేయున్నాఁడు. నా కింతకుముందే "మాలతీ! శ్రీరామదర్శనమునకు మన మయోధ్యకు వెళ్లవలయును" అను వాక్యములు వినఁబడినవి. అవి నీ పతివాక్యములే అయియుండవచ్చును. కావున రమ్ము అచ్చటికి వెళ్లుదము. ఆ స్థాన మిచ్చటి కెంతో దూరమున లేదు."

పాపము పతివిరహిణియగు మాలతీ శరీరము మిక్కిలి యశక్తతతో నుండెను. దీనిని గాంచి భగవానుఁ డిట్లనెను:—"అమ్మా! నీవు నడువఁజాలకున్న నా చేయిపట్టుకొని రమ్ము" అనఁగా "అమ్మా!" యను శబ్దమున నామెకు విశ్వాసము కలిగి చేయిపట్టుకొని మెల్లఁగా నడుచుచుండెను. అచ్చటికి పోయి పతిని జూడఁగానే ఆతఁడు త్రాళ్లతోఁగట్టఁబడి, ఱొమ్ముపై నొకపెద్దబండ పెట్టఁబడి నిశ్చేష్టుఁడై యుండెను. ఆ దృశ్యమునుగాంచి యామె భూమిపైఁ బడిపోయెను. శ్రీరామచంద్రుఁ డా బండను దొలఁగించి, కట్టుత్రాళ్లను గోసెను. అయినను నాతనికిఁ జైతన్యము రాలేదు. అప్పుడు భగవానుఁ డాతనిని గదిలించెను. పరమాత్ముని హస్తస్పర్శచే నాతనికిఁ జైతన్యము కలిగెను. ఆతఁ డీదివ్యరూపమును గాంచి మిక్కిలి యాశ్చర్యమును జెందెను. ఆతఁడు శ్రీరాముఁ డని గ్రహించి పాదములపైఁబడి ప్రార్థించెను.

భక్తుని భక్తియుక్తములగు వచనములను విని శ్రీరామచంద్రుఁడు మిక్కిలి సంతసించెను. నారాయణదాసు శ్రీరామచంద్రమూర్తియొక్క దర్శనము కొఱకే యింటినుండి వైరాగ్యముతో బయలుదేరెను. ఆతఁడు దృఢవ్రతము, యథార్థమగు వైరాగ్యము కలవాఁ డగుటచే భగవద్దర్శన మయ్యెను. అప్పుడు నారాయణదాసు గద్గదస్వరముతో నిట్లనెను:—"ప్రభూ! దీనదయాళూ! నా బోటి తుచ్ఛజీవి కొఱకు నీ వీకంటకయుక్తమగు వనమునకు వచ్చితివా! నీ వంటి దయామయుఁడగు ప్రభువును వీడి పామరుఁడే ప్రయోజనమును గాంక్షించి అన్యదైవములను గొలుచుచుండును!

భక్తుని విశుద్ధభావమును గాంచి భగవానుఁడు ముగ్ధుఁడై దివ్యమధుర స్వరముతో నిట్లనెను:—"మీ విమలప్రేమను గాంచియే నేను మీకు వశుఁడనైతిని. నేను మీ యెడ మిక్కిలి ప్రసన్నుఁడనైతిని. మీ కోరికను నెరవేర్చెద నడుగుఁడు."

అంత భార్యాభర్త లిట్లనిరిః—"నాథా! నీ దర్శనముచే మాకోరికలన్నియు నెఱవేరినవి. మాకు వరము లేవియు నక్కఱలేదు. మాకు ఒక్కటియే కోరిక. మాహృదయమును నీ వెన్నడును వీడరాదు. ధ్యానములో మీదర్శనము నెప్పుడు నిచ్చుచుండవలయును" అని యిట్లు ప్రార్థింపఁగా తథాస్తని శ్రీరామచంద్రుఁ డంత ర్ధానమయ్యెను. మాలతీనారాయణదాసు లిద్దరును భగవంతున కనంతప్రణామములు కావించి, గద్గద కంఠముతో భగవన్నామ కీర్తనము చేయుచు అయోధ్యనుఁ జేరి సాధుజీవనమును శాంతిపూర్ణముగ గడుపుచుండి, చివరకు శ్రీరామచంద్ర సన్నిధాన మును జేరిరి.

---

# బంధు మహాంతి

ఉడీసా జిల్లాలో యాజపురగ్రామమున బంధు మహాంతి నివసించుచుండెను. ఆతనియింట పతివ్రతయగు నాతని భార్యయు, నొక కుమారుడును, నిద్దరు కుమార్తెలు నుండిరి. ఆతఁ డతి దరిద్రుఁడు. ఆతనికి జీవనవృత్తి భిక్షాటనము. కాని భిక్షాటన మొనర్చి ధనమును సంపాదించి, యా ధనమును భూమియందు పాతుట ఆతనికిఁ దెలియదు. వచ్చినదానితోఁ దృప్తిపడి తాను దిని, మిగిలినదాని నతిథులకుఁ బెట్టుచుండెడువాఁడు. బాహ్యముగఁ జూచిన నాతఁడు బాధపడినట్లు కనఁబడును గాని, ఆతని హృదయములో లేశమైనఁ గ్లేశము లేదు. ఆతనికి భగవంతునిపైఁ గల అచంచల విశ్వాసము, నిండిన ప్రేమ ఆతనిజీవితమును సుఖమయ మొనర్చుచుండెను. ఆ కుటుంబములోనివా రందఱును నిరంతరము భగవన్నామ స్మరణములో మునిఁగి తేలుచుందురు. వారికి భగవన్నామమే పరమ మంత్రము. భక్తులే ప్రత్యక్షదేవతలు. భగవంతుని యొక్కయు, భక్తులయొక్కయు ప్రసాదమే వారికి ఉత్తమ ఆహారము. వారి చరణోదకమే సర్వవ్యాధి నివారకమగు మహౌషధి. ఆతని కేవస్తువు మీఁదను గోరిక లేదు. ఆతఁడు విషయైషులకు సంచయహీన దరిద్రుఁడైనను మనస్సున మహా ధనికుఁడు, రాజాధిరాజు.

ఆతని చినిఁగిన బొంత, పగిలిన చెంబు, చిల్లులు పడిన ధోవతిలోనుండి ఆతని ఆనందప్రకాశము బయటపడుచుండెను. ఆతని కానందమే సంపత్తుగ నుండెను.

దేశమునకుఁ గాటకము సంభవించెను. వర్షము లేదు. బావులలోను, చెఱువులలోను జలము లేదు. ఎటుచూచినను హాహాకారములే. అంతటను నాఁకలి చావులే. బంధుమహాంతికిని భార్యకును మూఁడు దినములనుండి తిండిలేదు. పాపము పిల్ల లాఁకలికి గిలగిల కొట్టుకొనుచుండిరి. పతివ్రతయగు నాతని భార్య పతితో నిట్లనెనుః—"నాథా! నా వద్ద సొమ్మేమియును లేదు. కావున మన కేమియును

సహాయము సొమ్మువలన లేదు. మీా కెవరైన మనకు సహాయముచేయు బంధువు లున్నారా? ఎవరైన నుండిన నచ్చటకు పోవుదము. పిల్లలకు పిడికెడు అన్నము దొఱకెనా, యెట్లో కాటకకాలమును గడుపఁగలము."

బధుమహంతి యి ట్లనెను:—"సతీ! ఈ జగత్తులో నా కెవరును బంధువులు లేరు. అయితే, ఒక్క హృదయమిత్త్రుఁడు కలఁడు. అతఁడే నాకు బంధువు. అయితే, అతఁడు చాలదూరమున నున్నాఁడు. ఇక్కడికి అయిదు దినముల ప్రయాణము. అక్కడికి వెళ్లితిమా ఆఁకలి శాశ్వతముగఁ దీరిపోవును. ఆహా! అతని నామ మెంత మధురమైనది! ఆ నా బంధువుపేరు దీనబంధు. మనబోటి దీనుల నాతఁడు మిక్కిలి ప్రేమించును."

అప్పుడు సతి యిట్లనెను:—"నాథా! ఐదు దినముల ప్రయాణమా? అయితే, వెళ్లుదము. దీనబంధుదర్బారుకు వెళ్లి దరిద్రమును బోఁగొట్టుకొందము. మీాభుజము మీాఁద పిల్లవాని నెత్తుకొనుఁడు. నేను చిన్నపిల్ల నెత్తికొందును. పెద్దపిల్ల మమ్ములను బట్టుకొని నడువఁగలదు. సామాను లేనేలేదు గదా! అయిదుదినములే గనుక ఆకో అలమో తిని బ్రతుకుదము."

బంధుమహంతి అంగీకారమును సూచించెను. ఆమె లోపలికిఁ బోఁగానే ఆతఁడు భగవానునిగూర్చి యిట్లు ప్రార్థించెను:—"స్వామీ! నే నేల నీ కడకు ప్రయాణము పెట్టుకొంటినో హృదయేశ్వరుఁడవగు నీకుఁ దెలియును. కేవలము కాటకదారిద్ర్యములవలన నీ దగ్గఱకు వచ్చుటలేదు. నీ చరణదర్శనము చేయు నభిలాష యెన్నాళ్లనుండియో కలదు. మృత్యువుండిన నెచ్చటనైనఁ గలదు. అన్నము కొఱకు భగవంతునిపై విశ్వాసముకలవాఁ డెచ్చటికైనను బోవునా? ఈ నెపమున నీ దర్శనము చేయవచ్చుచున్నాను. ప్రయాణము నిర్విఘ్నమై నీ దర్శనమగున ట్లాశీర్వదింపుఁడు."

చివరకు గంత, బొంత నెత్తిన వైచికొని అయిదు దినములలో జగన్నాథమునకుఁ జేరుకొనిరి. దారిలో, నన్నము దొఱకలేదు. ఏదో కూరయో, కాయయో తిని కాలమును వెళ్లఁబుచ్చిరి. బంధుమహంతికి ఆఁకలిదప్పులు లేవు. ఎప్పు డెప్పుడు పురుషోత్తమునిఁ జూతుమా యనియే యాతని యుత్కంఠత. అక్కడికి చేరఁగానే భార్యను జేరఁబిలిచి యి ట్లనెను:—"సతీ! ఇదియే దీనబంధుని మందిరము." పతివచనములు వినఁగానే ఇఁకఁ బిల్లల కన్నము దొఱకునుగదా యను సంతోషమున సింహద్వారము దగ్గఱకు వచ్చెను. ఆనందావేశమున శ్రమయంత యును దీఱిపోయెను.

సింహద్వారము భక్తసమూహముతో నిండియుండుటచే లోపలికిపోవుట చాల కష్టమై మందిరమునకు దక్షిణమున నున్న వంటశాల ప్రక్కన గంజిగుంట వద్దఁ గూర్చుండిరి. సంధ్యాకాల మయ్యెను. దీనబంధునియింటికి వచ్చినను ఉప వాసము తప్పలేదు. అప్పు డాతనిభార్య యి ట్లనెను:—"నాథా! బంధుగృహము నకు వచ్చియు నీ గంజిగుంటవద్దఁ గూర్చుండు టెందులకు? సంధ్యాకాలమైనది. చీఁకటి పడఁబోవుచున్నది. ఈ పిల్లల నెచ్చటికి దీసికొనిపోవుదుము. ఒక్కసారి బంధువును గలిసికొని, ఆయన ప్రసాదించినదానిని బిల్లలకుఁ బెట్టి ప్రాణములు నిలుపుదము."

పూర్వము ఒకానొకప్పుడు ద్వాపరయుగమున కుచేలునిభార్య ప్రోత్స హింపఁగా నాతఁడు శ్రీకృష్ణుని సంపద లడుగఁబోయెను. కాని కుచేలుఁ డడుగలేక పోయెను. ఆ విధముగనే బంధుమహంతియుఁ దుచ్ఛమగు నన్నమును భగవంతుని అడుగఁజాలకపోయెను. అందువలన భార్యతో ని ట్లనెను:—"సతీ! మన మిప్పుడు లోనికి వెళ్లఁజాలము. దీనబంధుని బంధువులెందఱో వచ్చిరి. ఈ రాత్రి కెట్లో నీరు త్రావి కాలమును గడుపుకొని రేపు ప్రొద్దున ద్వారము తెఱవఁగానే యేకాంత మున దర్శింపవచ్చును."

ఆ రాత్రి ఆ గంజిగుంటలోని భగవత్ప్రసాదములోనికి గంజిని మహంతి తెచ్చిన బొచ్చెతోఁ దీసికొని పిల్లలు, తాము ను త్రావి శరీరము తెలియక నిద్రించిరి. ఆఁకలిగొన్నవారికి గంజియే పరమాన్నముగఁ దోఁచును. మహంతి నిద్రింపక లోలోనఁ దన బంధువును గూర్చి యిట్లు చింతింపసాగెను:—"నాథా! నీచరణము లకు నమస్కారములు. నాకు నీవుతప్ప వేఱు దిక్కులేదు. నీవు తప్ప స్వతంత్రుఁ డెవ డును లేఁడు. నా కేమియును గోరిక లేదు. నిరంతరము నీ దర్శనము నొసంగుచుం డుము. రేపుప్రొద్దున నిన్ను అన్నము కొఱకు ప్రార్థింపుమని నా భార్య కోరినది. మా కోరికలు నీకు తెలియనివా?" ఇట్లు ప్రార్థించుచు బంధుమహంతి ధ్యానస్థుఁ డయ్యెను.

జగన్నాథునకు సేవ సమాప్తమయ్యెను. పుష్పాంజలి అర్పింపఁబడెను. పవ ళింపుసేవ యయ్యెను. ప్రభువు నిద్రించెను. వంటయింటికి వంటవారు తాళములు వేసిరి. పండాలు మందిరద్వారమునకుఁ ద్రాళ్లను గట్టి వానిమీఁద ముద్రలను వేసిరి. దీపము లారిపోయెను. మందిరములోనుండి అందఱును బయటకు వచ్చివేసిరి. నలు వైపులను దలుపులను వేసిరి. అన్ని ద్వారములకును దాళములు వేయఁబడెను. సేవకులందఱును ఇండ్లకు వెళ్లి నిద్రను జెందిరి.

అందఱును నిద్రించిరి గాని భక్తవత్సలుఁడగు భగవానుఁడు నిద్రపోలేదు. తన భక్తుఁడు బాధపడుచుండఁగా లక్ష్మీదేవితో లలితశయ్యపై నిద్రించుట కాతని

క్షిష్టములేదు. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అయినవాని కిది యేమి లెక్క? వంటయింటినుండి రత్నపళ్లెరమును దీసి, దానిలో నాదినమున మిగిలిన నైవేద్య ప్రసాదమును బెట్టుకొని స్వయముగ బ్రాహ్మణవేషమున దక్షిణ ద్వారమున బయటకు వచ్చి "బంధూ ! ఓ బంధూ!!" అని పిలువఁజొచ్చెను.

ఈ పిలుపును విని బంధుమహాంతి కన్నులు తెఱచెను. ఇంతరాత్రివేళ యెవరా ఈ పిలుచునది యని యోచించి "బంధు" అను పేరుగలవాఁడింకొకఁడు కలఁడేమో యని తలఁచి, యొకవేళ భగవంతుఁడే యిట్లు వచ్చినాఁడని తలఁచెను. మరల "బంధూ! బంధూ!!" యను శబ్దము వినఁబడెను. భార్య లేచి భర్తను లేపుచు నిట్లనెను:— "వినండి. ఎవరో మిమ్ములను బిలుచుచున్నారు." బంధు ఇట్లనెను:—"నన్నెవరు పిలిచెదరు ? ఈ పట్టణములో 'బంధు' అనువాఁ డింకొకఁ డుండవచ్చును. భయపడ వలదు."

పతియాజ్ఞ ననుసరించి యామె నిద్రపోయెను. అంతర్యామియగు నచ్యుతుఁడు భక్తునిలోని విషయమును దెలిసికొని ఉచ్చైస్స్వరమున నిట్లు పిలిచెను:— "ఓ యాజపురపు బంధూ ! ఓ గంజిగుంటవద్ద పడి సపరివారముగ నాకలితోఁ బడి యుండిన బంధూ ! లేవయ్యా ! ఇటు రమ్ము! నేను నీకొఱకు ప్రసాదమును దెచ్చి నిలిచియుంటిని."

బంధు శరీరము పులకించెను. "నిజముగ దీనబంధువే పిలుచుచున్నాఁడు. నేను స్వప్నమును గనుటలేదు. మరల మరలఁ బిలుచుచున్నాఁడు. మా స్థితిని దెలిసికొనఁ గలవాఁ డాతఁడుకాక మఱియెవఁడు కలఁడు?" అని యనుకొనుచు లేచి వెళ్లఁగా నచ్చట పళ్లెరమును బట్టుకొని యొక బ్రాహ్మణుఁడు నిలుచుండియుండెను. ఆ బ్రాహ్మణుఁ డిట్లనెను:—"ఏమయ్యా! పిలుచుచుండిన పలుకవు. పిలిచి పిలిచి నా గొంతు బొంగురు పోవుచున్నది. పళ్లెము బరువుచేఁ జేయి వణఁకిపోవుచున్నది. ఇదిగో ఈ పళ్లెరమును దీసికొని యీ పూఁటకు పని గడుపుకొనుము. రేపు నీవు ఉంచుటకును, దినుటకును నేర్పాటు జరుగఁగలదు. చింతింపకుము. సుఖముగఁ దిని నిద్రించుము."

బంధుమహాంతి మంత్రముగ్ధునివలె నయ్యెను. ఆతఁడు చకితనేత్రములతోఁ జూచుచు, నాతని యాజ్ఞానుసారముగఁ బళ్లెరమును దీసికొనెను గాని మాటలాడఁ జాలకపోయెను. సాహసముచేసి కొంచెము మాటలాడఁ దలఁచెను గాని యింతలో నా బ్రాహ్మణుఁ డంతర్ధానమయ్యెను. బంధుమహాంతి బండవలె నచ్చే నిలువఁబడి పోయెను. ఈ స్థితి యెంతసేపు ఉన్నదో తెలియదు. తర్వాత మత్తునివలె నూఁగుచు గంజిగుంటవద్దకు వచ్చి భార్యాబిడ్డలను లేపెను. అందఱును సంతోషముతో భుజించిరి. భార్య ఆ పళ్లెరమును గడిగెను. బంధుమహాంతి దానినిఁ దన బొంతలోఁ

జుట్టి తలక్రిందఁ బెట్టుకొని పరుండెను. గాని నిద్రపట్టలేదు. మాటిమాటికి దానినిఁ గౌఁగిలించుకొనును. ముద్దుపెట్టుకొనును. శిరస్సునకు హత్తుకొనును. ఆతనికి ఆత్మానంద మింకను వృద్ధిపొందుచుండెను. సత్త్వ-రజ-స్తమోగుణముల కలితమగు తురీయావస్థ దాని కదియే ప్రాప్తించుచుండెను. ఆతఁడు నెమ్మదిగా నానందోన్మత్తుఁడై, అవశుఁడై, పళ్లెరముపై శిరస్సు నుంచుకొని యచేతనుఁడై క్రిందఁ బడెను.

ప్రాతఃకాలమునఁ బూజారి మందిరముతలుపులను దెఱచి చూచునప్పటికి ఆతనికి ప్రాణ మెగిరిపోయెను. వంటయింటిలో రత్నపళ్లెరము లేదు. వస్తువు లన్నియు నస్తవ్యస్తములుగఁ బడవేయఁబడియుండెను. వెంటనే దొంగలు పడిరని గోలపెట్టెను. అందఱును గుమిగూడి అంతటను వెదుకఁజొచ్చిరి. చివరకు గంజిగుంట దగ్గఱకుఁగూడ వచ్చి రత్నపళ్లెరముపైఁ దలనుంచి పరుండిన బంధుమహాంతిని జూచి దొంగ చిక్కినాఁడని అందఱును దిట్టుచుఁ గొట్టసాగిరి. పాపము భార్యాబిడ్డ లేడ్వసాగిరి. అంతఁ గర్మచారులు వచ్చి చేతులకుఁ గాళ్లకు సంకెళ్లను వైచి కారాగృహములోఁ బడవైచిరి. మహాంతి యిది యొక భగవల్లీల యని తలఁచుచుండెను. "స్వామీ! ఇదియంతయు నీ పరీక్ష. నీ పరీక్ష కెవరు ఆగఁగలరు? నాకు నిరంతరము నీస్మరణ ముండునట్లును, నీరూపము కనఁబడునట్లును జేయవలయును."

వారును వీరును వచ్చి నాలుగుతిట్లు తిట్టి వెళ్లుచుండిరి. ఇదియేమి యని భార్యాబిడ్డలు విలపించుచుండిరి. పాపము మహాంతి యోదార్చుచుండును. ఆతని ముఖమున నానందము తాండవించుచుండెను. నోట "గోవింద, గోవింద" యను శబ్దము తప్ప మఱియొకటి లేదు. భగవద్విశ్వాసము గల ఆ భక్తునిహృదయములో నిసుమంతైన క్షోభము లేదు.

బంధుమహాంతి యిట్లు ప్రార్థించెను:—"దేవా! నేను మహాపాపిని, మహాపరాధిని. నాకు రావలసిన దండము లభించినది. నాపాపమునకు ఫల మిదియే. నామీఁద నీకృప కలదు. నాథా! మమ్మెక్కడనైన నుంచుము గాని అచ్చట నీచరణము లుండవలెను. నాకు నీవుతప్ప వేఱు దిక్కులేదని నమ్ముము. నేను నిన్నుతప్ప యింకెవరి నెఱుఁగను."

ఒక్కరోజు గడిచెను. మందిరము మూయఁబడెను. అనిన ప్రకారము మహాంతికి యేర్పాటుచేయవలసియున్నది. ప్రతాపరుద్రమహారాజు ఖురదా యనునగరమునఁ దనమహాలులో నిద్రించుచుండెను. భగవానుఁడు రాజు స్వప్నములోఁ గనఁబడి యిట్లనెను:—"రాజా! నాయాజ్ఞను వినుము. నాభక్తుఁడగు బంధుమహాంతి కుటుంబముతో కారాగృహములో బాధపడుచుండఁగా, నీకర్మచారులే యిట్లు బాధపెట్టుచుండఁగా నీ విట్లు సుఖముగ నిద్రించుచున్నావా? నేనే రత్నపళ్లెరము నాతని కిచ్చితిని. అది నీయబ్బసొమ్మా! అది నాది. నాయిష్టమువచ్చినవారి కిచ్చెదను.

ఆతఁడు నా భక్తుఁడు. ఆతనిమీఁద నాకిష్టము కావున నే నాతని కిచ్చితిని. ఇప్పుడు నీవు వెంటనే వెళ్లి వారిని వదలించి సరియైన వారిని మందిరరక్షకులుగాఁ బెట్టుము. నేను నీలాచలాధిపతినగు జగన్నాథుఁడను."

భగవంతుఁ డిట్లు పలికి యంతర్ధానమయ్యెను. అంత రాజు తన గుఱ్ఱమును దెప్పించి, వెళ్లి వృత్తాంతమునంతను గ్రహించి మహాంతికి సంకెళ్లను విప్పించి, ఆతని పాదములమీఁదఁ బడి యిట్లు ప్రార్థించెను:—"ఇచ్చటివారు మిమ్ములను జాల బాధించిరి. అది వారితప్పు కాదు నా తప్పు. మీరు నన్ను క్షమింపవలయును."

భక్తులు పరులదుఃఖములను గనలేరు. వారిహృదయములు వెన్నకంటె మృదువైనవి. వెన్న దానికి తాపము కలిగిన కఱఁగును. సాధువులహృదయము పరులతాపములకుఁ గఱఁగును. ఆతఁ డిట్లనెను:—"రాజా! మీ రేమిచేసితిరి. నేను తుచ్ఛుఁడను, పామరుఁడను, హీనుఁడను, దీనుఁడను, పాపిని. నన్ను తాఁకరాదు." రాజు ఆతనిని వదలలేదు. ఆతనిని సమ్మానపూర్వకముగ లోనికిఁ గొనిపోయి తీర్థజలములచే స్నానము చేయించి, నూతన వస్త్రాభరణముల నొసంగెను. ఆతని భార్యాపుత్రులను సన్మానించి మందిరమునకు దక్షిణపువైపున నుండుటకు స్థానమొసంగెను. ఆతనిని మందిరములో లెక్కలువ్రాయువానిఁగా నియోగించి శాశ్వతముగ బ్రసాద మొసఁగునట్లు లిఖితపత్ర మొసంగెను.

రాజు భగవంతుని క్షమాపణము వేఁడెను. భక్తుని ప్రభావము నాల్గుదిక్కులను వ్యాపించుటచే నిదివఱకు దూషించి కొట్టినవాండ్రఱును వచ్చి క్షమాపణము వేఁడిరి. దీనికి బంధుమహాంతి చాలసిగ్గుపడి, తానే అపరాధిగాఁ దలఁచుచుండెను.

బంధుమహాంతి అక్కడనే నివసించుచు లోపలను బయటను భగవంతుని దర్శించుచుఁ గృతార్థుఁడయ్యెను. ఇప్పటికిని దేవునిలెక్కలు బంధుమహాంతి వంశజులే వ్రాయుచుందురు.

---

# భక్త వ్యాసదాసు

బుందేల్‌ఖండునకుఁ జేరిన ఓఢచాపట్టణములో సనాఢ్య బ్రాహ్మణకులములో పండిత సుమోహానశర్మ శుక్ల అనునాతఁ డుండెను. ఆతఁడు రాజపురోహితుఁడు. ఆతనిమాట యనిన ఓఢచారాజుకూడ మన్నించుచుండును. ఆతని భార్యకు వి. శ. ౧౫౬౭ మార్గశిర బహుళపంచమీ దినమున హరిరాముఁడను బుత్రరత్న ముదయించెను. ఆతఁడు చిన్నప్పటినుండియే బుద్ధిమంతుఁడు. అంద ఱాతనినిఁ బ్రేమించుచుందురు. సుమోహానశర్మ తన యేకైకపుత్రునకు బాగుగా విద్యాభ్యా

సము కావించి గొప్ప విద్వాంసునిఁ గావించెను. ఆతనికి ఉపనయనసంస్కారమును చేసి, సుశీలయగు కన్యను దెచ్చి వివాహము కావించెను.

తండ్రియొక్క సత్కీర్తిని వృద్ధికావించు హరిరామశర్మ విద్యాప్రకాశము వెలిఁగిపోవుచు నాతని ఖ్యాతి దినదిన ప్రవర్ధమానమగుచుండెను. గొప్పగొప్ప పండితులును నాతనివద్ద శాస్త్రమర్మములను దెలిసికొన వచ్చుచుండిరి. ఆతఁడు తన వ్యాఖ్యానముచే వారల సందేహములనన్నిటినిఁ బారఁద్రోలుచుండెను.

ఇంతలోఁ దండ్రి చనిపోఁగా నీతనికి రాజపౌరోహిత్యము లభించెను. ఓఢచా రాజు మధుకరశాహ ఈతనిపాండిత్యమునకు ముగ్ధుఁడయ్యెను.

పండిత హరిరామశర్మ శాస్త్రాధారము మీఁద వాదించుటలో మిక్కిలి నిపుణుఁడు. అందువలన నెక్కడ పండితుఁడున్నాఁడని తెలిసిన నక్కడకు వెళ్లి వారిని జయించి వచ్చుచుండెడువాఁడు. ఆతఁడొకానొకప్పుడు కాశీకి వెళ్లెను. కాశీ పండితులందఱును గొప్ప పండితుఁడును, రాజపురోహిత శ్రేష్ఠుఁడును వచ్చుచున్నాఁడన విని ఆతని నెదుర్కొని చాల సన్మానించిరి. ఆతని పాండిత్యవిశేషముచే వారినందఱను ముగ్ధులఁ గావించెను. శ్రావణమాసములో విశ్వేశ్వరునకు పూజాభిషేకాదుల నొనర్పఁగా విశ్వనాథుఁడు కలలో బ్రత్యక్షమై యిట్లనెను:— "పండిత ప్రవరా! నీ విన్ని శాస్త్రములు చదివితివి. నాకొక్కసందేహమున్నది చెప్పవలయును. విద్య దేనితోఁబూర్తికాఁగలదు?" అందులకు హరిరామశర్మ యిట్లనెను:— "సత్యాసత్యములను దెలిసికొని పొందవలసిన పదార్థమును బొందుటయే" అని సమాధానము చెప్పెను. అందులకు విశ్వనాథుఁడు యిట్లనెను:— "దీనిని నీ వందఱకును జెప్పుచుందువు కాని నీవేలచేయవు? నీవిద్యలో లోపమున్నది. ఆలోపమును భక్తివలననే పూర్తికావించుకొనవచ్చును. భక్తిలేకున్న విద్యకుఁ బూర్ణత లేదు. కావున విద్యాపూర్ణతకు భగవద్భక్తి చేయవలెను."

పండితుఁడు నిద్ర లేవఁగానే విద్యాగర్వమంతయు నణఁగిపోయెను. వివాద వ్యసన మణఁగిపోయెను. జీవితములో నొక నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. దిగ్విజయము చేసి సమస్త పండితులకును విద్యగఱపువాఁడు నేఁడు భక్తి విద్యను గఱపుటకు సిద్ధపడెను.

పండిత హరిరామశర్మ వ్యాసుఁడిప్పు డింటికి తిరిగిపోయెను. ఆతని కిప్పుడు సంతానము, భార్య, ఇల్లు, వాఁకిలి, మర్యాదాగౌరవములు వేయేల సమస్తమును భారముగఁ దోఁచెను.

తన కెక్కడ సాధు మహాపురుషుఁడు గురువుగా దొఱకునా యని యోచించు నంతలో రాధావల్లభ సాంప్రదాయమునకుఁ జెందిన వంశీ అవతారమగు శ్రీహిత

హరి వంశచంద్రమహాప్రభువు వారి శిష్యుఁడగు నవలదాసు ఓఛ్ఛాకు వేంచేయఁగా నాతనిని దర్శించి, ఆతని వలన నీరహస్యమును దెలుపఁగలవాఁడు బృందావనములోని శ్రీహితప్రభువువారని తెలిసికొని, సమస్తమును విడిచి బృందావనమునకుఁ బ్రయాణమయ్యెను. దారిలో నిఁక శ్రీకృష్ణ దర్శనము కాఁగలదని యువ్విళ్లూరుచుండెను. చివరకు శ్రీహితునికడకు వి. శ. ౧౬౦౦ సంవత్సరము కార్తికమాసమునఁ జేరెను. అప్పుడు స్వామి నైవేద్యమునకు శ్రీహితుఁడు వంటచేయుచుండెను. పండితుఁ డాతనితో మాటాడఁగోరఁగా నాతఁడు ప్రొయ్యిలోని కట్టెల నీవలకు లాగి, ఆర్పఁగా వ్యాసుఁ డిట్లనెను:—"స్వామీ! మీరు వంట చేయుచునే మాటలాడవచ్చును గదా!" అనఁగా నాతఁడిట్లనెను:—"అంతయు నేకమనస్కతతోఁ జేయవలయును. ఈసమస్త ప్రపంచము కాలమను సర్పముచే గ్రసింపఁబడుచున్నది. ఇది యెన్నటికైన నంతము కావలసినదే. శ్యామసుందరునికి తలయొగ్గితిమా కాలవ్యాళము నుండి రక్షింపఁబడఁగలము. అప్పుడే జీవన్ముక్తులము కాఁగలమని పలుకఁగా వ్యాసుఁడు తనకు మంత్రోపదేశ మీయవలయునని ప్రార్థింపఁగా మంత్రోపదేశము నొసంగెను.

యథావిధిగ దీక్షను బొందిన తర్వాత వైష్ణవవేషమును ధరించి బృందావనములో సేవాకుంజమునకు సమీపమున నొక మందిరమును నిర్మించుకొని హిత పద్ధతి ననుసరించి సేవ్యులగు రాధాకృష్ణులను మిక్కిలి ప్రేమతో సేవించుచుండెను.

ఈతని మందిరములోఁ బ్రతిదినమును బురాణకాలక్షేపము, ప్రేమ భక్తి చర్చ, రాసలీలానృత్యము ప్రతిదినము జరుగుచుండెడిది. శ్రోత లనేకులు వచ్చుచుండెడు వారు. ఒకనాఁడు రాధావేషము వేసిన ఆతని కాలికి గట్టిన మువ్వలదారము తెగెను. అప్పుడు వెంటనే వ్యాసుఁడు తన జందెమును ద్రెంచి వాటిని గ్రుచ్చి రాధకాలికి గట్టెను. ఇది చూచిన శ్రోత లిట్లనిరి:—"అయ్యా! పవిత్రమగు యజ్ఞోపవీతమును ద్రెంచి ఆతని కాలికి గట్టితివేమి?" యనఁగా నాతఁడిట్లనెను:—"దీనిని నే నెన్నాళ్లనుండియో మోయుచున్నాను. దీనికిప్పుడు సద్వినియోగము జరిగినది. ఇంతకంటె నీసూత్రమునకు సౌభాగ్య మేమి కావలెను?"

ఈతని జాడ ఓఛ్ఛా మహారాజు తెలిసికొని, ఈతనిని నగరమునకుఁ దీసికొని రమ్మని మంత్రినిఁ బంపెను. మంత్రి విషయమును విన్నవించుకొనఁగా 'అవును, కాదు' అని చెప్పలేదు. చివరకు మంత్రి చెప్పఁగా బృందావనమును వదలి తాను రానని చెప్పెను. ఇట్లైన నీతఁడు రాఁడని తెలిసికొని గురువుగారివద్దకుఁ బోయి ప్రార్థించెను. గురువుగారు "సరియే. నాదర్శనమునకు వచ్చినప్పుడు చెప్పెద" ననెను. ఈ సంగతి యెట్లో వ్యాసదాసునికిఁ దెలిసి యమునకు స్నానమునకుఁ బోయి అచ్చట పొదలలో దాఁగుకొనెను. మూఁడు రోజులవఱకు బయటకు రాలేదు. గురువుగారు

శిష్యులను వెదుకఁ బంపిరి. వారు వెదుకుచు నాపాద దగ్గఱకు రాఁగా బయటకు వచ్చెను. అంత యమునలోనికిఁబోయి చాలసేపటివఱకును స్నానమొనర్చి ముఖము నిండ మసిపూసికొని బొంత చంకను బెట్టుకొని గురువు దగ్గఱకు వచ్చుచుండెను. ఇదేమి యని అంద ఱడుగఁగా నాతఁ డిట్లనెను:—"గురువుగారు బృందావనమును విడిచి పోవ్మనఁగలరు. అందుకనియే నరకమునకుఁ బోవు వేషమును వేసికొంటిని" అనఁగా నీసంగతి గురువునకుఁ దెలిసి వెళ్ళనక్కఱ లేదనెను. అంత నామసిని గడుగుకొని పుండ్రమును ధరించి గురువును దర్శించెను. గురువు ప్రసాదమును దీసికొని పోమ్మనెను. ఆలయములో బ్రసాదమును గొని అందఱి యెంగిళ్లను గూడ వ్యాసుఁడు మంత్రి సమక్షముననే తిన నారంభించెను. అంత మంత్రి యిట్టివానినిఁ దీసికొని పోయిన నిక్లే ప్రజల నందఱను ధర్మభ్రష్టులను గావింపఁగలఁడని భావించి యిట్లనెను:—"స్వామీ! ఇఁక నేను వెళ్లెదను. రాజుగారికి ఉత్తరము వ్రాసియిమ్ము".

ఇట్లనఁగా వ్యాసదా సిట్లు వ్రాసియిచ్చెను:—"నాజాతి రసికజాతి. కులదేవి రాధ. వృషభానుపురము తాతగారియిల్లు. వ్రజవాసీనులు తోడునీడ. ప్రభువు గోపాలుఁడు. సంగడికాండ్రు గోపకులు. జపమాలయే జందెము. శిఖముడి పూజాపుష్పములు. హరినామ ధ్వనియే వేదధ్వని. కుశలు కరతాళములు. యమునానది సంగడి కత్తె. హరిలీలా షట్కర్మలు. ప్రసాదమే పానము. రాసలీలయే ధనము. విధి సేవయే. జడులతో సహవాసమే నిషేధము. బృందావనవాసమే వృత్తి. స్మృతి భాగవతము. కృష్ణనామమే సంధ్యాతర్పణ గాయత్రీజపములు. వంశము ఋషి. యజమానుఁడు కల్పతరువు."

ఈయుత్తరము నిచ్చినమీఁదట మంత్రి యిట్లనెను:—"నీపురోహితుఁ డింకఁ బౌరోహిత్యమును జేయఁడు. చెడిపోయినాఁడు. ఏవర్ణమునకును జెందని సాధువుల యెంగిలిని దినినాఁడు. యజ్ఞోపవీతము నెన్నఁడో తీసివేసినాఁడు." ఇది విని రాజు పలుకలేదు.

తనపురోహితుఁడు గొప్ప పండితుఁడనియుఁ, బ్రసిద్ధపురుషుఁడనియు గ్రహించి మంత్రితో రాకపోయినఁ దనతోనైన రాఁగలఁడేమో నని భావించి ఆతఁడు స్వయముగా బృందావనమునకు బయలుదేరెను. రాజు తన్ను దర్శించుటకు వచ్చుచున్నాఁడని విని యాతఁడు మనస్సులో రాజు వచ్చి బలవంతముచేసిన లొంగిపోఁగూడదని ప్రబోధించుకొనెను.

రాజు వచ్చినతర్వాతఁ బరస్పర కుశలప్రశ్నలు జరిగెను. అనంతరము రాజు వ్యాసదాసుని తనవెంట నొక్కసారి రావలసినదనియు, మరల రావచ్చు ననియు బ్రతిమలాడెను. వ్యాసుఁ డాలోచింతము వెళ్లి రండనెను. అనంతర మాతఁడు భగ

వంతుని ప్రార్థించెను. రాజు యెప్పుడువచ్చి యడిగినను 'నేఁడు ఆవనమును జూడుమని యొకదినమును, నేఁ డాస్వామిదర్శనము చేయుమనియును, నేఁ డాయుత్సవములోఁ బాల్గొను మనియు, నేఁడు బృందావనప్రదక్షిణము చేయుమనియు నిట్లు కాలము గడుపుచుండెను. ఇట్లు కాలము గడుపుటకుఁ గారణము బృందావనమును వదలఁ జాలకపోవుటయే.

మహారాజుయొక్క బలవంతముచే వనవాసులు ఆతని కుటుంబమును గలిసి కొనుటకు రమ్మని ప్రార్థించిరి. అప్పుడు వారికి తనకు బృందావనముకంటె బంధువులు, జన్మస్థానము లేదనియు బృందావనమును వదలి సుఖ మపేక్షించువాఁడు రాక్షసుఁ డనియుఁ బలికెను.

ఆతనికి దేవతాస్వరూపులగు సాధుమహాజను లిట్లనిరి:—"వ్యాసదాసూ! నీవు సాధు సేవకుఁడవు. ఒక్కసారి రాజుగారితో వెళ్లి రారాదా! ఆతఁ డొసంగెడు ద్రవ్యముతో నీవు యథేచ్ఛగా సాధు సేవ చేయవచ్చునుగదా! ఒక్కదిన మచ్చటకు పోయిన హానియేమి కలదు?" అనఁగా వ్యాసదాసు వారితో నిట్లనెను:—"సాధు లారా! ఉపాసనకు అనన్యత కావలయును. ఒక్కసారి విషయలంపటలోఁ బడినను బయటకు వచ్చుట దుర్లభము. బృందావనమును విడిచినవాఁడు భక్తిలో వ్యభిచ రించినవాఁడు కాఁగలఁడు. అట్టివాని ముఖమును జూడరాదు." అని యిట్లు పలుకఁగా మెదలక యూరకుండిరి. ఓఢ్ఛానరేశుఁడు "మీరు రాకుండ నేను వెళ్లను. వచ్చి తీరవలయును" అని పట్టుఁబట్టఁగా నాతఁడు తన మనోగత భావమును స్పష్టపఱచెను.

అంత రాజు తన భటులను బిలిచి ఒక పాలకీని దెప్పించి, అందులో బలవంత మునఁ గూర్చుండఁబెట్టుకొని పోవుదు ననెను. పాలకి వచ్చెను. వ్యాసుని బలవంత మునఁ గూర్చుండఁబెట్టఁ బోవుచుండ నా సహచరులను సెలవు నడిగి వచ్చెదనని కదంబవృక్షమును కౌఁగిలించుకొని వియోగవిరహమును సహింపలేక యేడ్వ నారం భించెను. ఎంతసేపటికి రాకపోఁగా భటులు లాగిరి. కాని యాకదంబమును వదలి వేఱొక కదంబమును గౌఁగిలించుకొనెడువాఁడు. ఇట్లింతసేపటికిని తేలక పోఁగా ఒకానొక బృందావనవాసిని వచ్చి "ఏమయ్యా! పిచ్చివాఁడా! రాజంతగా వచ్చి బలవంతము చేయుచుండ నూరక యేడ్చెద వేల? ఈ చెట్లెచ్చటికి పోఁగలవు? మరల రావచ్చును వెళ్లరాదా?" అని పలుక వ్యాసుఁ డిట్లనెను:—"నే నొక్కక్షణమైన నానందమును వీడియుండ లేను. బృందావనమున నాకానంద మెక్కడిది?"

చివరకు మహారాజు ఆతనిని వదలెను. ఎట్లైనను వ్యాసదాసుని తన నగరమునకు ఓఢ్ఛాకుఁ గొనిపోవలయునని ఆతని పట్టుదల. వ్యాసదాసుఁ డనిన నాతఁడు పడి చచ్చును. తనకు పురోహితుఁడే, అఖండపండితుఁడే, భక్తుఁడే, యిట్టివానినిఁ గొని

ాయి గౌరవింపవలయునని యాతని యూహ. కాని చివరకు లాభములేక
లవంతమును జేయుట బాగుగాఁ దోచక వ్యాసదాసుని కాళ్లపైఁబడి క్షమాపణ
ును వేడి యిట్లనెను:—"స్వామీ! మీకుఁ గష్టమును మిక్కిలి కలిగించితిని.
ునస్సునకు బాధ కలిగించితిని. నా నోటవచ్చిన యవమానజనకములును, స్వార్థ
ుయములు నగు దుర్వాక్కులను మీరు సహించితిరి. నా దురాగ్రహమును
ుతిమీఱినది. కాని మీరు నన్నొక మాటనైన ననలేదు. మీరు నాస్నే
ాముసైన వీడితిరి గాని మీదృఢవ్రతమును వీడలేదు." అనఁగా వ్యాసదా
ట్లనెను:—"రాజా! భక్తుఁడు కాక అవమానమును సహింపఁగలవారెవరు?
ుధముఁడగు రాజు రాజమదమున జడభరతునిచే పల్లకిని మోయించెను;
ంసుఁడు తమపిల్లలను జంపుచుండ దేవకీ వసుదేవులు సహించిరి; హిరణ్యకశిపుఁడు
ప్రహ్లాదుని బాధింప నాతఁ డాబాధలను సహించెను; ద్రౌపదికి నిండుసభలో
లువ లూడ్చఁగా నామె సహించి హరి శరణువేఁడినది. నిండుసభలోఁ గౌరవుల
లన విదురుఁ డవమానమును సహించెను. కరి మకరిచే బాధపడుచుండ హరియే
దా రక్షించినది! కావున భక్తి ప్రధానమైనది. మనము అనవసరముగా నెండ
ూవులను గాంచి జలమును నాశఁ బరుగిడునట్లు ధన-పుత్ర-మిత్ర-కళత్రాదులకై
ురువిడుచున్నాము" అని పలుకఁగా నిదివఱకు తనకు ధర్మోపదేశమును గావించిన
ాజపురోహితుఁ డిప్పుడు భక్త్యుపదేశము చేయుటను గాంచి ముగ్ధుఁడై అక్కడనే
ులిచి యాతనివలన మంత్రోపదేశమును బొందెను. కొన్నాళ్లచ్చట నుండి రాజు
ునగరమునకు బోఁ దలఁపఁగా గురువు దగ్గఱకుఁ బిలిచి యాతనికి భక్తిని
ుడరాదని మరల మరల నొక్కిచెప్పెను.

రాజు నగరమునకుఁ బోఁగానే వేషమును మార్చెను. మెడలోఁ దులసీ
మాల, పుండ్రమును, ధరించి సదా నామకీర్తనముచేయు సాధువేషమున నుండుచు
ురంతరము సాధుసేవ, సాధుపాదతీర్థమును బుచ్చుకొనుట మొదలగునవి చేయు
ుండ నాతని బంధువులే చాల బాధింపఁ బ్రారంభించిరి. అంత నాతఁడు తన
గురువునకు ఉత్తరమును వ్రాసెను. దానికి ప్రత్యుత్తరముగ వ్యాసదా సిట్లు
వ్రాసెను:—"నీవు భయపడవలదు. హరినే శరణువేఁడవలయును. ఆతఁడే
రక్షింపఁగలవాఁడు."

రాజుగారే పిలువఁగా రాని తనభర్త తాను బిలిచిన రాఁగలఁడా యని
చింతించి వ్యాసదాసుని భార్య దుఃఖించుచు బృందావనమునకు వచ్చెను. ఆమెకు
వైష్ణవదీక్ష నొసంగి "వైష్ణవదాసి" యని పేరిడి సాధుసేవాకార్యమున నియో
ంచెను.

ఇఁకఁ బుత్రులవిషయములో హరిని భజింపని పుత్రులు పుత్రులుకారు. అట్లు హరిభక్తి చేసిననే వారిని దగ్గఱకుఁ జేర్తుననెను. దానికి మిగిలిన వారందఱు నొప్పుకొనలేదు. కాని యొకపుత్రుఁడు హరిదాసుని స్తుతింపఁగా నాతనికి స్వామిచే దీక్ష నిప్పించెను. ఆతఁడే తరువాత "జుగళ కిశోరదాసు" అనునామమునఁ బ్రసిద్ధుఁ డయ్యెను.

ఒకానొక దినమునఁ దనకు భార్యయైన హరిదాసి కామభావమును బ్రకటింపఁగా నాతఁ డామెతో నిట్లనెను:—"స్త్రీశరీరము మల-మూత్రముల కొంప. కఫ-వాత-పిత్తములతోడను, చర్మాస్థి-రక్త - మాంస - వస - మేద - శుక్ల - శోణితాది దుష్టపదార్థములతోఁ గూడినది. దీనితోఁగాదు రమింపవలసినది. రసికజనమనోభిరాముఁడగు రాధికాశ్యామసుందరితో రమింపవలయును" అనఁగా నప్పటినుండియు నామె చాలజాగ్రత్తగ నుండి సాధుసేవ చేయుచుండెను.

ఒకనాఁడు రాత్రి హరిదాసి సాధువు లందఱకును వడ్డించుచుండెను. దైవవశమున వ్యాసదాసునిగిన్నెలోఁ బాలతోఁగూడ మీఁగడపడెను. వ్యాసదాసు వాటిని విసర్జించి 'పంక్తిభేదము చేసితివి కావున నీవు సాధుసేవకు పనికిరా' వని పలుక నామెయు నాహారమును మానెను. ఇట్లు మూఁడుదినములు జరిగెను. చివరకు సాధువులందఱును వచ్చి యిట్లనిరి:—"స్వామీ! ఆమె పంక్తిభేదము చేసియుండదు. మీఁగడ పొరబాటున దైవవశమునఁ బడియుండవచ్చును. కావలయునని వేసినది కాదు. అందఱకును బాలుపోసి లోననుండి తెచ్చి మీకే వేసిన దోషము కాఁగలదు. పోనిండు ఇదియు దోషమే యందురా? పొరబాటు అందఱకు నుండవచ్చును. దానిని మనము క్షమింపవలదా? ఆమెకు చెప్పి సరిచేయ వచ్చునుగదా!" అని పలుక వ్యాసదాసు వెంటనే ఆమె సొమ్మునంతయు విక్రయించి సాధుసేవకు వినియోగించిన నంగీకరింతు ననెను.

అంత నామె తనసొమ్మును నిరువదిరెండువేల రూపాయల కమ్మి సాధుసేవ చేసెను. దానికి వ్యాసుఁ డత్యధికముగ సంతోషించి, తనకుఁ దగిన సతి దొఱకినదని సంతసించెను.

పరమభక్తుఁడును, దనకు శిష్యుఁడు నగు ఓఁఛాహారాజు వ్యాసుఁడు పూజించు స్వామికి అలంకరించుటకొకబంగారు వేణువును బంపెను. దానిని స్వామికి అలంకరింపఁజేయుటకు గొనిపోఁగా స్వామి చేతిరంధ్రములు చిన్నవయ్యెను. బలవంతమునఁ బెట్టఁబోఁగా చేతికి గాయమై విగ్రహమునుండి రక్తము కారఁజొచ్చెను. అంత వెంటనే ఆవేణువు నావల విసరి పాఱవైచి చాల పశ్చాత్తాపమును జెందుచు నొకగుడ్డ పేలికను జించి తడిపి చేతికిఁ జుట్టెను. స్వామికి గాయమైనందులకుఁ జాల

చింతించెను. ఆవేణువును దిట్ట నారంభించెను. సాయంకాల మగునప్పటికి కావేణువును స్వామిచేతిలో ధరించి యుండెను. గాయము లేకుండెను. దీనికి వ్యాసుఁడత్యధికానందమును జెందెను. (అగుడ్డయు, విగ్రహము, వేణువు ఇప్పటికిని 'పన్నా' యను గ్రామమున నున్నదఁట. బృందావనములో నాతఁడున్న చోట వేఱొక విగ్రహము కలదఁట. దానికిప్పుడు "వ్యాస ఘుర్" అనుపేరు కలదు.)

ఒకానొకప్పుడు మహారాజు స్వామి కొకజరీ తలగుడ్డను బంపెను. జరీ క్రొత్తదగుటచే వ్యాసదాసెంతగాఁ జుట్టినను జారి పోవుచుండెను. ఎంతసేపో ప్రయత్నించి విసుగును జెంది యిట్లనెను:—"నాకు విసుగు జనించుచున్నది. నీపాగను నీవే చుట్టుకొనుము" అనుచు లేచిపోయి సేవాకుంజము ద్వారముకడఁ గూర్చుండెను. ఇంతలో స్వామి తలపైనఁ దలగుడ్డ అలంకరింపఁబడి యుండుటను గాంచి యంపటను వ్యాసదాసుని కడకువచ్చి యిట్లనిరి:—"స్వామీ! మీరు చక్కని తలగడ్డను ప్రభువునకుఁ జుట్టి యలంకరించి మమ్ములను ధన్యులఁ గావించితిరి." అనఁగా వెంటనే వ్యాసదాసు వెళ్లి చూడఁగాఁ దలపాగ చక్కఁగ నలంకరింపఁబడి యుండెను. అప్పుడు వ్యాసదా సిట్లనెను:—"ప్రభూ! నీవు పాగను జుట్టుకొనిన బాగుండును గాని చేతగాని నేను జుట్టిన నేమి బాగుండును. అబ్బో! ఎంత వయ్యారముగ నుంటివయ్యా! ముద్దులు మూటఁగట్టుచున్నావే!"

వ్యాసదాసునకు భజన భావనలయందును, రాసయందును నెంతటి యిష్టమో సాధుసేవయన్నను నీతనికి మిక్కిలి యిష్టము. అందువలన సాధువుల నంపఁ డీతఁడు భగవంతునితో సమానముగ గౌరవించుచుండును. వారి నెచ్చటకును వెళ్ల నీయఁడు. వచ్చినవారి నక్కడే యుండుఁడని బలవంతము చేయుచుండును. వారు బలవంతమున వెళ్లుచుండ చాల దుఃఖించును. ఒకవేళ వెళ్లవలసివచ్చి వెళ్లుచుండిన మరల వారిని రమ్మని బలవంతముచేయును. సాధువులును నీతనిస్వభావమును విని అచ్చటనే యుందురు.

ఒకానొకప్పు డొకసాధువు ఈతని సరళసాధుస్వభావమును, సాధుసేవాసక్తిని, సహనశక్తిని, యశమును గాంచి యీతనిని బరీక్షింపవలయునని వచ్చి మందిరమునఁ బ్రవేశించి భోజనము నడిగెను. "స్వామీ! దేవునినైవేద్యము కాలేదు. త్వరలోఁ జేసి మీకుఁ బెట్టెద నుండుఁడు" అని వ్యాసుఁడు ప్రార్థింపఁగా నాసాధువు ఈతనిని తెగఁదిట్టుచుండెను. వ్యాసదాసు మౌనము వహించి తన్నుఁ బొగడుచుండిన నెంత సంతోషముతో వినునో అంత సంతోషముతో వినుచుండెను. అచ్చట నున్న వారిలో నొకఁ డా సాధువుతో నిట్లనెను:—"ఏమయ్యా! అట్లు తిట్టెదవు? కొంచెమునేపు ఆగలేవా? ఆతఁడు నీకేమి అపకారము చేసినాఁడు? నీపని యేమి చెడినది?" అనఁగా నాతనిని వారించుచు వ్యాసదా సిట్లనెను:—"వ్యాసదాసుని గొప్పతనమును

గాంచుమనస్సు నాకిష్టములేదు. దానికంటె సాధువుల దూషణమే గొప్పది. అదియే నాకు శృంగారము."

ఇంతలో యుగళకిశోరుఁడగు శ్రీకృష్ణునకు నైవేద్య మయ్యెను. వ్యాసదాసు ఒకపళ్లెరములోఁ బదార్థములన్నిటినిఁ బెట్టుకొని సాధువుముందఱఁ బెట్టి చేతులు జోడించుకొని "దయతో నీప్రసాదమును గ్రహింపుఁడు. ఇంకను గావలయుననినఁ దెచ్చెదను. మిగిలిన నుంచుఁడు" అనుచుఁ దాను వీవనతో విసరుచుండెను. ఆ సాధువు కొంతప్రసాదమును దిని మిగిలినదానినిఁ బళ్లెరముతోఁ గూడ నీతని తలపైఁ గొట్టి "ఇదిగో నీవంతు" అనెను. వ్యాసదా సాతనిని మరల మరల పాదములపైఁబడి ప్రణామము కావించెను. క్రింపఁబడిన యెంగిలి ప్రసాదమును గ్రహించి తాను దినెను.

అప్పు డింక నాసాధువు నిలువఁజాలక పొగడుచు "నేను నీసాధుసేవాపరా యణత్వమును విని పరీక్షించుటకు వచ్చితిని. నేను వినినదానికంటె వేయిరెట్లధికమగు నిశ్చలస్వభావము, సాత్త్వికగుణము కలదు. మీరు శ్లాఘనీయులగు మహాత్ములరు" అనుచుఁ బదేపదే వ్యాసదాసునిపాదములు పట్టుకొనుచుండెను. వ్యాసదాసు "ఇదంతయు సాధువుల పరమ కృపాకటాక్షమే. భక్తులు భగవంతునికంటె గొప్ప వారు. వారిదర్శన స్పర్శనములచే హరి లభించును. నాహృదయములో దోషదుఃఖ ములు తొలఁగిపోయెను. నన్ను అపరాధమునుండి ఉద్ధరించితిరి. భవసాగరమును దాఁటితిని." అనెను.

పరీక్షింపవచ్చిన సాధువు ఈతని సాధుత్వము ముందాతని సాధుత్వముతుచ్ఛ మని తలఁచెను.

ఈతనికి భగవత్ప్రసాదమనిన మిక్కిలి భక్తి. భగవంతుని ప్రసాదమును మూఁడువందల అఱువది దినములును వీడఁడు. ఒక్క క్షణమునైనఁ బాగవేయఁడు. ఇది యాతని దృఢవ్రతము. ఎవఁడైన నూతన సాధువు వచ్చి యాతఁ డేకాదశీదిన మునఁ బ్రసాదమును దినుటను గాంచి శంకించిన నాతఁ డిట్లనును:—"నే నేకాదశి నాఁడు భక్తుఁడను గానా? నాకు జీవనము ప్రసాదము. దానినిఁ దినిన నాఱు మాస ముల పాపములు పోవును."

శ్లో. ఏకాదశీ సహస్రేణ ద్వాదశీనాం శతేన చ
యత్ఫలం లభతే గౌరి విష్ణోర్నైవేద్య భక్షణాత్. (పద్మపురాణము.)

"ఓగౌరీ! వేయి ఏకాదశులు, వంద ద్వాదశులు చేయుటచే నేంఫలము లభించునో అంతటిఫలము కేవలము శ్రీహరి మహాప్రసాదమును దినుటచే లభించును."

ఈతఁడు తన గురువువలెనే విధి నిషేధములకు దూరుఁడు. ఈతఁడు భక్త శిరోమణి యనుట కేవిధమగు సందేహమును లేదు.

---

# ప్రయాగదాసు

జనకపురములో నొక బ్రాహ్మణ వనిత యుండెడిది. ఆమె భర్త స్వర్గస్థుఁ డయ్యెను. అప్పటినుండియు వారికన్నియును విపత్తులే. ఆమె కొక్కఁడే పుత్త్రుఁడు. ఆతని పేరు ప్రయాగదత్తుఁడు. ఒక దినమున నాతఁడు తన తల్లి నిట్లడిగెను:— "అమ్మా! మన కింకెవరును లేరా?" తల్లి పిల్లవాని సంతోషముకొఱ కిట్లనెను:— "నాయనా! నీకెందుకు లేరు. మీ బావ యున్నాఁడు. ఆతఁడు చక్రవర్తి, రాజాధిరాజు. అయోధ్య ఆతని రాజధాని." మిథిలా నివాసులు సాధారణముగ జానకిని పుత్త్రికగాఁ గాని, సోదరిగఁ గాని భావించుచుందురు. ప్రయాగదత్తుఁ డిట్లనెను:— "అయితే అమ్మా! నే నాతనికడకుఁ బోయెదను." "మంచిది, కొంచెము పెద్దవాఁడ వైన తర్వాతఁ బోవచ్చునని తల్లి యనెను. ఈవిధముగఁ గొన్నాళ్లు గడచెను. కాని యాబాలకుని హృదయములో బావ నిలిచిపోయెను. ఆతఁడు నిరంతరము తన బావను జింతించుచుండెడువాఁడు. ఇట్లు కొంతకాలము గడచెను. మరల నొక దినమునఁ బ్రయాగదత్తుఁ డిట్లనెను:— "అమ్మా! ఇప్పుడు నేను పెద్దవాఁడ నైతిని గదా! ఇప్పుడైనను బావదగ్గఱకుఁ బోనిమ్ము" తల్లి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను:— "నాయనా! ఉండుము. నేను సిద్ధము చేసెదను. అక్కయ్య కేదియైనఁ గొనిపోవా?"

ఆతని తల్లి బియ్యమును పిండిచేసి, కొంచెముగఁ జక్కెర నందుఁ గలిపి మోదకములను జేసియిచ్చెను. ఆతఁడు తినుటకుఁగూడ కొంత అల్పాహారమును జేసియిచ్చెను.

ప్రయాగ దత్తుఁడు అక్కను, బావను జూచుటకు మిక్కిలి యుత్సాహముతో బయలుదేరి వెళ్లెను. త్వరత్వరగా నయోధ్యకుఁ జేరుకొనవలయునని యాతని యభిలాష. ఱెక్కలుండిన నెగిరిపోవలయుననియే చూచుచుండెను. భూమి మీఁద నాతఁడు నడచిపోవుటలేదు యెగిరియే పోవుచుండెను. కాలకృత్యములకుఁ బోవునెడ నామూఁటను జెట్టున కంటఁగట్టెడువాఁడు. ఇట్లు అల్పకాలమునకే అయోధ్యకుఁ జేరుకొనెను.

అయోధ్యకు వెళ్లినది మొదలు తనబావను వెదుకుటలోనే ఆతనికి సరిపోయెను. ఎవరి నడిగినను అందఱును నవ్వుచుండిరి. బావ యెచ్చటను దొఱకలేదు. మణికూటముపైపునకుఁ బోయెను. అచ్చటను వెదకెను. చివరకు విసుగుపుట్టి సీతాకుండము నకుఁబోవు దారికి దక్షిణముగ దట్టముగఁ జెట్లు పొదలుండిన పురాణ

మసీదు కలదు. దానిలో హనుమన్నివాసమేర్పఱుపఁబడినది. గోమతీదాసుగా రచ్చట భజన చేయుచుండెడువాఁడు. అస్థిపంజరమునకుఁ బోయి యచ్చటఁ గూర్చుండెను. వరుసఁజేసికొని బావను దూషించుచుండెను. "ఇంత వెదకితిని. వెదకివెదకి వేసారిపోయితిని. ఎక్కడను దొరకకఁబోయితివి. నీ నివాస మెచ్చటనో తెలియదుగదా! ఇప్పుడేమి చేయుదును; ఎక్కడికి పోఁగలను?" అని అనుకొను చుండఁగా నొక తెల్లయేనుఁగుపై నెక్కి, బంగారుఅంబారిపైఁగూర్చుండి అక్కయు, బావయు బయలువెడలిరి! ఏనుఁగుసరిగా బావమఱది యగు ప్రయాగదత్తునివద్దకు వచ్చి నిలిచెను. అప్పుడు జానకి యిట్లనెను:—"తమ్ముఁడూ! అమ్మ మాకేమైనఁ బంపినదా?" తమ్మునిస్థితి యచింత్యముగ నుండెను. కొంచెము కుదుటపడి యిట్లనెను:—"అవును అక్కా! ఇదిగో!! తీసికో!!!" అని పొట్లము నిచ్చి అతఁ డిట్లనెను:—"నేను మీకొఱకు వెదకి వెదకి వేసారితిని. కాని మీరు దొరకలేదు. మీనివాస మెచ్చటనో తెలియదు. ఎవ్వరును జెప్పరాయెను.!" అంతఁ జానకి యిట్లనెను:—"అబ్బాయీ! నీవు చాలకష్టపడితివి. అందఱెఱుఁగని స్థలమున మేముందుము, ఏమి చేయుదుము?" జగన్మాతయగు జానకి తల్లిపంపిన మోదకముల పొట్లమును విప్పి అందులోనుండి రెంటిని గైకొని మిగిలిన వాటిని ప్రయాగదత్తున కొసంగి యిట్లనెను:—"సోదరా! వీనిని నీవు తినవలయును. అమ్మ దిగులుపడుచుండును. ఇఁక నీ వింటికిఁ బొమ్ము. మఱికొన్నాళ్లు గడచిన తర్వాత రావలయును. అమ్మకు మేము బాగుగా నున్నామని చెప్పుము. మరల రావలయును." ఏనుఁగు కొంచెముదూరము పోయిన తర్వాత మాయమయ్యెను.

ప్రయాగదత్తు అక్క, బావలయొక్క ధ్యానమందు విహ్వలుఁడై యచ్చటనే పడియుండెను. వాక్కు రుద్ధమయ్యెను. నేత్రములనుండి యశ్రువులు రాలుచుండెను. మఱునాఁడు దినకర కిరణస్పర్శచేతను, దక్షిణానలమువలనను నాతనికిఁ జైతన్యము కలిగెను. ఇంతలో నచ్చటి కొకసాధువు విచ్చేసెను. అతఁ డీపిల్లవానినిఁ గాంచి యాతనివృత్తాంతమునడిగి రహస్యమునంతను దెలిసికొనెను. దగ్గఱనున్న తన గుహలోని కాతనిని దీసికొనిపోయి, స్నానాన్నపానాదులను గావింపఁజేసి యాతని వృత్తాంతము నడిగెను. అడుగఁగానే అతఁ డేడ్వఁ బ్రారంభించుచుండెను. తర్వాత స్పృహ తెలియక పడిపోవుచుండెను. బాగుగాఁ దెలివివచ్చినతర్వాతఁ ప్రయాగదత్తుఁడు ఆమహాత్మునకుఁ దనవృత్తాంతము నంతను జెప్పెను. మహాత్ముఁ డాతనిని గద్గదికముతోఁ గౌఁగిలించుకొనెను. ఒక్క గడియ రాత్రి గడచునప్పటికి గ్రామములోని స్త్రీలువచ్చి రెండుపళ్లెరములలో వంటకములు పెట్టుకొనివచ్చి యక్కడ నుంచి యిట్లనిరి:—ఇవ్వేళ మాయింట భగవత్పూజాసంకీర్తనలు జరిగినవి. మీ

కొఱకు ప్రసాదమును గొనితెచ్చితిమి. తీసికొనుఁడు. ఈపళ్లెరములను రేపుప్రొద్దునఁ గొనిపోయెదము. మేము త్వరగా వెళ్లవలయును" అని పళ్లెరముల నచ్చటనుంచి గబగబ పోయిరి. పళ్లెరములో పెద్దవిస్తరిపఱచియుండెను. దానిమీఁద ననేకము లగు వంటకము లుండెను. ఆకు తీసిచూడఁగా నవి బంగారుపళ్లెరము. సాధుమహాత్ముఁడును, దత్తుఁడును నిర్ఘాంతపడిరి. అవి జగజ్జనని యొసంగిన వంటకములు. వీటిని తనతమ్మునికై తెచ్చియిచ్చెను.

ఆమహాత్ము లిద్దరును మిక్కిలి ప్రేమతో నాప్రసాదమును భుజించిరి. లోకోత్తర రసాస్వాదనము గావించి వా రిద్దరును బ్రహ్మానంద సముద్రమున మునిఁగి తేలిరి. ఆపదార్థములు స్థూలత్వమును అనఁగా బాహ్యజ్ఞానమును హరించి చేతనాసంచారము కావించుచుండెను. వాని నారగించినవెంటనే వారిద్దరకును నవీనబలము, నవీన తేజస్సు, నవీన చైతన్యము కలిగెను. ప్రయాగదత్తుని శ్రమయంతయును, గ్లానియంతయును క్షణములో మాయమయ్యెను. వారి హృదయకమలములు ఆనందరససరోవరమందు నుయ్యాల లూగుచుండెను.

మఱునాఁడు ఉదయమునఁ బ్రయాగదత్తుఁడు వెళ్లబోవుచుండఁగా నామహాత్ముఁడా రెండు బంగారు పళ్లెరములను నొక గుడ్డతోఁజుట్టి యివ్వఁబోయెను గాని వాటిని దీసికొనుట కాతఁడు రాలేదు. అట్లు వచ్చువాఁడును గాఁడు. "అక్కయ్యకై వస్తువులను నీవేలఁదెచ్చితి వని అమ్మ కోప పడఁగలదు" అనెను. కొంతదూరము వఱకు సాధు వాతనిని బంపించి, యాపళ్లెరములను గణేశకుండములో విసరి పాఱవైచెను. అక్క బావలను స్మరించుచుఁ బ్రయాగదత్తు యింటికిఁజేరెను. తల్లి యడుగఁగా వృత్తాంతమునంతను జెప్పెను. పుత్రుని వృత్తాంతమును విని తల్లి చకితయై సంతోషించెను. హృదయస్థలమునుండి కరుణాస్రోత యుబికి కన్నులగుండా బయలు వెడలెను.

సంవత్సరము తిరుగకమునుపే తల్లి పరమపదించెను. ప్రయాగదత్తు ఒంటరివాఁడయ్యెను. ఇంటిలో నింకెవరును లేరు. తల్లికి పైతృకకర్మల నొక్కఁడే చేయుటచే నాతనివైరాగ్యానురాగములు పెల్లుబికెను. దగ్గఱ గ్రామములో నున్న నొకపండితుఁడు తన యేకైకపుత్రికను మన ప్రయాగదత్తున కొసంగి యిల్లటము బెట్టుకొనఁదలఁచెను. ప్రయాగదత్తు బీదవాఁడైనను గులశీలములలో హీనుఁడు కాఁడు. ఆతని పూర్వులు గొప్పవిద్వాంసులు. తండ్రియు గొప్పకీర్తిగల పండితుఁడు. జనుల కాతఁడనిన మిక్కిలి భక్తి. ఆతని కెంపటో శిష్యులును గలరు. చాలధనమునుగూడ సంపాదించియుండెను. కాని ఒకానొకప్పుడు వీతిహోత్రుఁడు తన జ్వాలాకణములచే సర్వస్వమును దహనము గావించెను. ఒకవస్తువైన మిగులలేదు సరికదా ప్రాణములు దక్కించుకొని

బయటపడుటే కష్టమయ్యెను. తర్వాతఁ దండ్రి చనిపోఁగా నీతఁడు కు లక్షణములు గలవాఁడనియు, నందువలననే యీతఁడు జన్మింపఁగనే యిల్లు తగులఁబడినది, ఆస్తి నాశనమైనది. తండ్రియును జచ్చినాఁడనియుఁ బ్రవాదు జనించినది. కాని ఆతని భాగ్యభానుఁడు అలౌకికాకాశమున వెలుఁగుచున్నాఁడని వారికేమి తెలియును? ప్రయాగదత్తు లౌకికవిద్యలోఁ బరిణితిని జెందలేదు కాని వీటికి చరమ విద్యలో విద్వాంసుఁడై యుండెను. అక్షరజ్ఞానమును లేకపోలేదు. ఆతనికిఁ జదు వంతగా నిష్టములేదు. అయినను నాతని కల్పకాలముననే సారస్వతము, అమరకోశము, ముహూర్తచింతామణి మొదలగునవి తుణ్ణమయ్యెను. కన్య నీయఁదలఁచిన పండితుఁడు ప్రయాగదత్తుతోఁ బిల్లనిచ్చెద ననఁగా సరిగా జవాబు చెప్పక అయోధ్యకుఁ బోయెను. రెండురోజులలోనే అచ్చటికి చేరినాఁడు కాని యిప్పుడుండు టెచ్చట?

ఆతఁ డయోధ్యకుఁ జేరఁగానే వెనుక తనకుఁ దన అక్కయు, బావయు దర్శన మొసంగిన స్థలమునకుఁ బోయెను. అచ్చట చెట్లను బొదలను వారికొఱకై వెదకెను. ఇంతలో పూర్వము తనకు పరిచయమైన త్రిలోచనస్వామి వచ్చి యీతనికి స్వాగత మొసంగి, భగవద్విషయములనుగూర్చి ప్రశ్నించెను. దానితో నాతని కావిరహ మింకను నతిశయించెను. మెల్లమెల్లగా తన యపూర్వ సత్సంగప్రభావముచే నాతనిని శాంతింపఁజేసి, సమాధానము కావించెను. తర్వాత భోజన మిడెను.

మఱునాఁడు ఉదయమునఁ బ్రయాగ దత్తుఁడు శ్రీత్రిలోచనస్వామిపాదముల మీఁదఁ బడి తనకు వైరాగ్యదీక్ష నొసంగుఁడని ప్రార్థించెను. యోగ్య గురువునకు యోగ్యశిష్యుఁడు లభించెను. వెంటనే ఆతనికి త్రిలోచన స్వామి కౌపీనము నొసంగి దీక్ష నొసంగెను. రత్నమును బంగారములోఁ బొదిగినట్లయ్యెను. ఇప్పుడు ప్రయాగ దత్తుఁడు ప్రయాగదాసయ్యెను. మంత్రరాజ కళలచే హృదయకమల దళములు వికసించెను. చక్రములు సంచాలితము లయ్యెను. జ్యోతి ప్రకాశించుచుండెను.

ఆనాఁడు కొంచెము ప్రొద్దు పోయినతర్వాత లేచి వనములన్నియుఁ దిరుగ సాగెను. ఒకలక్ష్యము లేక యెక్కడికో వెళ్లుటయు, నెక్కడైన నిలుచుండుట, యిట్లు రాత్రియనకయుఁ బగలనకయుఁ దిరుగుచుండెను. ఎవరైన నన్నము నోటిలోఁ బెట్టినఁ దినుటయు, నీరును త్రావించినఁ ద్రాగుటయు నిట్లు చేయుచుండెను. ఆతని మనస్సు లక్ష్యముమీఁద నుండెను. శరీర మూరకఁ దిరుగుచుండెను. పరమహంస స్థితినిఁ జెందెను. అందఱు నాతనిని "మామ మామ" యనుచుండెడు వారు. ఆతనికి చింపిరితల యయ్యెను. శరీరమంతయును ధూళి ధూసరితమయ్యెను. గ్రుడ్లు వెళ్లుకొని వచ్చెను.

ప్రయాగదాసు ఇప్పుడందఱకును మామయయ్యెను. లక్ష్మీదేవికి అన్నయగుట చేతను, లక్ష్మీదేవి జగన్మాత యగుటచేతను నిదివఱకు మన కందఱకును చంద్రుఁడే

మాము. ఈతఁడు జగజ్జననియగు జానకికి తమ్ముఁడగుటచే సీతఁడును సందఱకు "మామ" యయ్యెను. పరమహింసయగు మామ పరమహంసయే. ఆతఁడు మత్త గజేంద్రునివలె నూగుచు గంభీరముగఁ దిరుగుచుండెను. ఆతని కన్నులలో నొకా నొక విలక్షణచమత్కార ముండెను. అన్నియును జేయవచ్చునుగాని ఆ విలక్షణపు కన్నుల నెచ్చట తేఁగలము? ఒకకవి యిట్లు చెప్పినాఁడు:—

శ్లో. సౌ వర్ణాని సరోజాని నిర్మాతుం సంతి శిల్పినః,
తత్ర సౌరభ నిర్మాణే చతుర శ్చతురాననః.

ఏశిల్పియైనను స్వర్ణకమలముల నిర్మింపవచ్చునేమో గాని దానిలోని సౌర భము నెచ్చట నుండి తేఁగలఁడు. దానిని నిర్మించుటకు ధాతయే సమర్థుఁడు.

ఇట్లే ప్రయాగదాసుని కన్నులును జూపెచ్చటనో చూచుచుండెను. ఆతని శరీరము స్థూలమున నిచ్చటఁ దిరుగుచుండెను, సూక్ష్మమున నాత్మ యెచ్చటనో యుండెను. ఒక్కొక్కప్పు డాతని కనేకదృశ్యములు కనఁబడుచుండెడివి. ఆ దృశ్య ములనుగాంచి యాతఁ డేదియో వాగుచుండెడువాఁడు. ఒకానొకప్పు డాతనికి శ్రీ రామవనగమనదృశ్యము కనఁబడఁగా బావమీఁది కోపముతో ని ట్లనుచుండెడు వాఁడు:—"ఏమయ్యా! నీవు వనమునకు బయలుదేరి సుకుమారియగు మా అక్క య్యనుగూడ రాళ్లలో ముండ్లలోఁ గొనిపోవుచున్నావా?

ఇప్పు డాతఁడు డబ్బు కూడఁబెట్ట మొదలిడెను. ఎవరైన డబ్బు నిచ్చినచో దానిని జాగ్రత్తగ నుంచెడువాఁడు. కొంత డబ్బుకూడఁబడినమీఁదట మూఁడుజోళ్ల చెప్పులను జేయించెను. మూఁడుమంచములను ఒకదానిలో నొకటి యిముడునట్లు చేయించెను. మూఁడు చిన్నపరుపులనుగూడ చేయించెను. ఒకమంచముమీఁద నొకమంచము పెట్టి వానిపై పురుషులను బఱచి, వానిపైఁ జెప్పుల నుంచి వాటిని శిరస్సుపై నుంచుకొని వెళ్లెడువాఁడు. ప్రేమోన్మత్తులలీల లిట్లే యుండును. మామ చివరకు చిత్రకూటమును జేరుకొనెను. దారిలో నాతనికి కుశకంటకములు కనఁబడెనా ఆతఁడు బావను దిట్టుచుండెడువాఁడు. అచ్చట స్ఫటికశిలపైఁ బోయి కూర్చుండెను. మంచములమీఁద పక్కను వైచి, వానిపైఁ జెప్పుల నుంచెను. అటు నిటుఁ జూచుచు అక్కబావలకొఱకు నిరీక్షించుచుండెను. ఏమాత్రము చప్పు డైనను నులికిపడి అటునిటుఁ జూచెడువాఁడు. చెట్టులను గుట్టలను వెదుకుచుండెడు వాఁడు. ఆసమయమునఁ బ్రేమాశ్రువులు స్రవించుచుండెడివి. రోమములు నిక్కఁ బొడిచెడివి. చెమటలు పోయుచుండెడివి. విశ్రాంతి గొనవలయునను గోరిక లేదు. రామునికొఱకు నిరీక్షించుచుండెను. ఎంతసేపటికిని జాడలేకపోఁగా మందాకినీవైపు నకుఁ బోయి యిట్లనుచుండెడువాఁడు:—"ఎచ్చటను దాగుకొనలేదు గదా! ప్రయాగ

దాసు వచ్చినాఁడని తెలిసినదా యేమి? సరే, దాగుకొనుఁడు.........” ఇట్లు మందాకినీ పరిసరములఁ దిరిగివచ్చునప్పటికి మూఁడుమంచములమీఁదఁ దాపసవేష ములతో శ్రీరామచంద్రుఁడు, లక్ష్మణుఁడు, జానకీదేవియుఁ బరుండియుండిరి. ఆతని కానందసముద్ర ముప్పొంగెను. విహ్వలతతో నాతఁ డిట్లనెను:—“మీ రెచ్చట నుంటిరి? ఎప్పుడు వచ్చితిరి? మీకొఱకు నేను వెదుకుచున్నానే?” అనుచు గబగబ పరుగిడిపోయి వారిపాదములకుఁ జెప్పులను దొడిగి రామునితో నిట్లనెను:— “ఏమయ్యా! నీవు అరణ్యమున కేల వచ్చితివయ్యా? సుకుమారియగు మా అక్కయ్యనుగూడ యేల వెంటఁ గొనివచ్చితివి? ఈఘోరారణ్యములో మీ రెట్లు నివసించుచున్నారయ్యా?”

జానకి యిట్లనెను:—“నాయనా! నేనే వచ్చితిని. వీరు నన్ను తీసికొనిరాలేదు.”

ప్రయాగదాసు ఇట్లనెను:—“నేనుగూడ మీ వెంటనుండి మంచములను దెచ్చుచుండెదను.”

శ్రీరామచంద్రుఁ డిట్లనెను:—“మా వనవాసములో మేము ముగ్గురమే యుండవలయును గాని యన్యు లుండరాదు. మేము మంచముమీఁదను బరుండము. ఇప్పు డూరక నీ కానందము కలుగుటకుఁ బండుకొంటిమి. నీ విప్పుడు వీటిని గొనిపోయి వాడుకొనుము. అట్లు చేసిన మే మనుభవించినప్పటికంటె సంతోష మెక్కువ కాఁగలదు”

జానకి యిట్లనెను:—“తమ్ముఁడూ! నీ వేమాత్రమును జింతింపకుము. మేము వనములో సుఖముగానున్నాము. వనవాసులందఱును మమ్ములను సేవించుచుందురు. మాకేమియును గష్టమును గలిగింపరు! నాకు వనమనిన మిక్కిలి యిష్టము. మేము మరల కలిసికొనెదము.”

ఏమి చేయఁగలఁడు? మరల నట్లే వాటిని శిరమున నిడుకొని వెళ్లుచుండెడు వాఁడు. ఒక్కదినమైనను విశ్రాంతిని గొనఁడు; తిరిగియును బోఁడు. లక్ష్మణుఁ డీయవసరము నేలఁ బోఁగొట్టుకొనును. ఆతఁడు తమ బావమఱఁదితో నిట్లనెను:— “ప్రయాగదాసూ! మేమును గూర్చుందుములే. తీసికొనిపోఁగలవా బావా?” ప్రయాగదాసు మిక్కిలి యానందమును జెంది యిట్లనెను:— “అవు నవును, అంద ఱమును బోవుదము” అంత శ్రీరాముఁ డిట్లనెను:— “ప్రయాగదాసూ! నీవు వెళ్లుము. వీ రిట్లే పలుకుచుందురు” పాప మాతఁడు వెళ్లి పోయెను. గొణుగుకొనుచు వెళ్లెను. ఆతఁడు పరుసఁజేసికొని దూషించుచు నిట్లు పలికెను:— “పోవుటలేదు గాని నాతో నెగతాళి నాడెదరు. ఒక్కరును వినరు. వీ రందఱును వనమునకు వారే వచ్చిరి. బంగారపుటిండ్లు భాధించినట్లున్నది, అడవి యానందముగ నున్నది!

మాలక్కయ్య అమాయకురాలు. ఊరక వీరివెంటఁ బడివచ్చినది. ఆతఁడేమి పలికిన దానినిఁ జేయుచుండును. అడవిలోని పచ్చపచ్చని చెట్లుచేమలను, నెమిలి మొదలగు రంగురంగుల పక్షులను గాంచి యిదియే మంచి దనుకొనుచున్నది. పులిని జూచినప్పు డన్నాయి కప్పుడు తెలియఁగలదు. వారికొఱకై కుశకంటకములలోఁ దిరుగుచున్నది గదా! మంచముమీఁదఁ బరుండరఁట. బలే నియమమును బెట్టుకొన్నారు! నేనుగూడ వెంట రాఁగూడదఁట!! వీఁడు వెంటవచ్చిన వాని తోఁబుట్టువునకు అయోధ్యకుఁ దిరిగిపొమ్మని చెప్పునేమో యని వీరికి భయము. బలే చతురులులే......... ఆ చిన్నవాఁడు కూడ గడుసరియే. చెప్పి వెళ్లలేదే!" అని యిట్లు వాగుచుఁ బ్రయాగదత్తు పోయెను. కౌతుకప్రియుఁడగు కరుణాకాకుత్స్థుఁడు భార్యతోడను తమ్మునితోడను గూడి నవ్వుకొనుచుండెను.

మందాకినీ స్నానమొనర్చి ప్రయాగదాసు తనసామానును నెత్తినఁ బెట్టుకొని అయోధ్యకుఁ జేరెను. ఆతఁడు నడిచినా ననుకొనుచుండెను గాని నిజమునకు విసరివేయఁబడెనని తెలిసికొనెను. ఇట్లెన్నోదినములు వాగుచుండెడువాఁడు. కాని కొన్నాళ్లకీదృశ్యము పోయి వేఱొకదృశ్యము కనఁబడెడిది. రాత్రింబవళ్లిట్లే వాగుచుండెడువాఁడు.

చిత్రకూటమునుండి అయోధ్యకు వచ్చి యొకవేపచెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆతఁడు భగవానుఁడు చెప్పినట్లే చేసెను. మంచము, పక్క వేసి దానిమీఁద నాతఁడే పరుండెడువాఁడు. ఈప్రయాగదాసు రెండువందల పాతిక సంవత్సరముల క్రిందట పరమపదించెను. చాలకాలమువఱ కాతనిచరిత్ర నచ్చట చెప్పుకొనుచుండెడువారు.

## శంకరపండితుఁడు

పరమ పవిత్రమగు గండకీనదీతీరమున నొకగ్రామములో భారద్వాజగోత్రీయుఁడగు శంకరపండితుఁడు నివసించుచుండెను. ఇంటిలో సాలగ్రామపూజ కలదు. శంకరపండితుఁడు స్నానసంధ్యావద్యనుష్ఠానములను గావించుకొని విధ్యుక్తముగఁ బూజ కావించుకొని,భగవద్ధ్యానము కావించుచు నొకఝాము సేపటివఱకును నేకాసనమునఁ గూర్చుండి శ్రీరామ షడక్షరీ మహామంత్రజపమును జేసికొని, అనంతరము తర్పణము, బలి వైశ్వదేవమును గావించి, ఊరిబయట నశ్వత్థవృక్షముక్రింద నున్న శివాలయములో శివపూజనము గావించుకొనుచుండెడువాఁడు. శంకరుఁ డనన్యరామభక్తుఁ డయ్యును శివునకును రామునకును భేద మెంచెడువాఁడు కాఁడు. శివపూజావిరహితమగు రామపూజ ఆతనికి కొఱతగానే తోఁచెడిది. అనంతరము ఇంటికిఁ దిరిగివచ్చి వేళకు పాఠశాలకుఁ జేరుచుండెడువాఁడు.

ఆగ్రామములో ధార్మికుఁడగు ఠాకూరు జగపాలుఁడు స్థాపించిన సంస్కృత పాఠశాల యొకటి కలదు. దానిలో పదిమందివిద్యార్థులకును భోజన మిడుచుండెడు వారు. ప్రతి అమావాస్యా పూర్ణిమలకు పదార్థము వచ్చుచుండెడిది. జగపాలుఁడు మరణించినతర్వాత నాతని కుమారుఁడు కుశలపాలుఁడు గ్రామమునకు అధికారి యయ్యెను. ఆతఁడు భక్తివిరహితుఁడును, విలాసియుఁగా నుండెడువాఁడు. పాఠశాల నెత్తివేయుటకు తమ్ముల భయము, తల్లి భయము కలదు. శంకరునియెడల జగపాలునకుఁ గలగౌరవ మీ కుశలపాలునకు లేదు. శంకరపండితునకును బెద్దజీతము లేదు. ప్రతిదినము నొకనికి మోయిను, నెల కేడురూపాయల జీత ముండెడిది. సాయంకాలమున నొకగంటప్రొద్దున్నదనఁగా శంకరుఁడు చెఱువు నద్దఱకుఁ బోయి స్నానసంధ్యాద్యనుష్ఠానములను గావించుకొని శివపూజనము గావించి ప్రొద్దు క్రుంకఁగానే యింటికి వచ్చెడువాఁడు. ఆతని సమస్తకార్యములును గడియారము వలె నియమముగ జరుగుచుండును.

శంకరపండితుఁడు విశ్వాసి, సదాచారుఁడు, సాత్త్వికప్రకృతి కలవాఁడు. అసత్యములు పలుకుటయును, దంభము లొనర్చుటయును నీతనికిఁ దెలియదు. సరళముగను స్పష్టముగను మాటలాడును. నియమితకాలమునకు నియమితకార్యము లొనర్చుటయును, భగవద్భజనము చేయుటయు నీతని కృత్యములు. ఈతని భార్య రమాభాయి సాధ్వి. ఒక్కఁడే పుత్రుఁడు. ఆతఁ డొకపట్టణములోఁ బండితుఁడు. ఆతఁడును సాధుస్వభావము కలవాఁడే.

తల్లి యున్నంతవఱకు కుశలపాలుఁ డట్లే యుండి ఆమె మరణింపఁగానే విలాసములలో నాస్తినంతను నాస్తిచేసెను. ఆతనిదృష్టి తమ్ములసొత్తుపైఁ బడెను. తమ్ములు బుద్ధిమంతులు. శంకరునిపై మిక్కిలి ప్రేమ గలవారు. తండ్రియగు జగపాలుఁడును మరణకాలమునఁ గొడుకుల నందఱను బిలిచి 'శంకరుఁడు గొప్ప మహాత్ముఁడు, ఆతనియందు నాకంటె మిక్కిలి శ్రద్ధ చూపవలయు' నని చెప్పియుండెను. కుశలపాలుఁడు తప్ప మిగిలిన వారెవరు నీమాటలను మఱవలేదు.

కుశలపాలుఁ డొక కుట్రను బన్నెను. ఆతనితండ్రి సూర్యోపాసన చేయఁగా పదునేనులక్షల వరహాలు లభించెను. అందులో పదిలక్షలవరహాలతో సూర్యదేవాలయమును గట్టింపవలయు ననియు, మిగతా అయిదులక్షలవరహాలు నల్గురు కొడుకులు తీసికొనవలయుననియుఁ గాంక్షించెను. ఈసంగతి శంకరపండితునకును దెలియును. కాని దేవాలయమును గట్టింపక పూర్వమే జగపాలుఁడు చనిపోయెను. ఇప్పుడు కుశలపాలుఁడు మొత్తము తానే కాఁజేయవలయునని యొక మోసపుదస్తావేజును తండ్రియక్షరములవలెనే యుండునట్లు సృష్టించెను. అందులో నూరాఁడు

వంతులు కుశలపాలునకుఁ జెందవలయు ననియును, మిగిలిన యొకపాలు ముగ్గురుతమ్ము లును బంచుకొనవలయుననియు వ్రాయఁబడియుండెను. తమ్ములకు మందిరము నిర్మింపఁ బడవలయుననియే కోరిక. కాని కుశలపాలుఁడు జరుపుచుండెను. చివర కొకదిన మునఁ దమ్ములు గట్టిగాఁ జెప్పఁగా నాతఁ డిట్లనెను:—"సోదరులారా! నిజవిషయ మిది. నాయనగారి యభిప్రాయము మరణసమయమున మారినది. వారికి దేవాలయ మును గట్టింపవలయునను నభిలాష లేదు. ధనమంతయు నన్నే తీసికొనుమనెను. మందిరమును గట్టించి తమ్ములకుఁగూడ సమానముగఁ బంచుఁడని నేను కోరఁగా "నట్లుకాదు. నీవు మూఁడువంతులు తీసికొని మిగిలినదానిని ముగ్గురు తమ్ములకును బంచు మనిచెప్పి దస్తావేజును వ్రాసినాఁడు. దానినిఁ జూడవచ్చును" అని దస్తావేజును జూపెను. తమ్ములు చూచి యాశ్చర్యమును జెంది అది తండ్రిహస్తాక్షరముల వలెనే యున్నవి కాని, ఆ హస్తాక్షరములను శంకరపండితుఁడు బాగుగా నెఱుఁగును గావున నాతఁడు చూచి చెప్పినఁగాని యొప్పుకొనమనిరి.

భగవదేచ్ఛ వేఱుగా నున్నది. కుశలపాలుఁ డిట్లనెను:—"ఈ దస్తావేజు శంకరపండితుని సమక్షముననే వ్రాయఁబడియుండఁగా నాతఁ డెందులకు కాదనును?" ఈమాటలనువిని తమ్ము లిట్లనిరి:—"ఇంక విచారణ యెందులకు? అప్పుడు నీవు దస్తా వేజు ప్రకారము నీభాగమును నీవు తీసికొనవచ్చును."

తొందఱగఁ గుశల పాలుని నోటినుండి యీమాటలు వెలువడెను. తర్వాతఁ జాల చింతించెను. బ్రాహ్మణుఁడు నిర్లోభి, సత్యవాజ్మి. ఆతఁడు నిజము చెప్పినఁ దన మాటను, బంగారమును గోల్పోవలసివచ్చునని చింతించి, యెంతటివాఁడైన ధనము నకు వశపడఁగలఁడు సగము ధనయాశ పెట్టెదను. అప్పటికిని వినకపోయెను తమ్ము లకు మందుపెట్టి చంపిన నంతయుఁ దనకే దక్కు'నని తలఁచి 'సరియే, పండితుని రేపు అడిగి కనుగొంద' మనెను.

కుశలపాలుఁ డింటికి వచ్చెను గాని మనశ్శాంతి లభింపలేదు. ఆతఁడు భోజ నముచేసి శంకరపండితునికడకుఁ బోయి ప్రణామము గావించి, చరణసన్నిధిని గూర్చుండి యిట్లనెను:—"స్వామీ! నేఁ డొకపని కొఱకై శ్రమ పెట్ట వచ్చితిని. మీరు నాకు పితృతుల్యులు. మిమ్ములను గష్టపెట్టుట కాదు. విషయమును నివేదించు టకు వచ్చితిని. తండ్రిగారు పదునైదులక్షలవరహాలు సంపాదించిన విషయము తమ కెఱుకయే గదా!"—

"అవు నవును. ఎందుకు తెలియదు? దానిలోఁ బదిలక్షలతో దేవాలయమును గట్టుమనియేఁగదా! ఆతఁడు మరణించిననేమి మీరే మందిరమును గట్టింపుఁడు. నేనును జూచెదను" అని శంకరపండితుఁడు మాటయందుకొని యనెను.

కుశలపాలుఁ డిట్లనెను:—"మందిరమును గట్టింప వలయునని మొదట వారి కభిప్రాయ ముండెడిది కాని తర్వాత మాఱినది. నేను వలదనుచున్నను నాతఁడు దస్తావేజును వ్రాసినాఁడు చూడుఁ' డని దానిని పండితుని ముందుంచెను. పండితుఁడు తీక్ష్ణదృష్టులతోఁ జూచి, దస్తావేజును దీసికొని బాగుగాఁ జదివి యిట్లనెను:—"కుశల పాలా! హస్తాక్షరములు ఆయనవివలెనే యున్నవి కాని యిది ధూర్తుఁ డొకఁడు నిర్మించిన కల్పితదస్తావేజు."

"శివ! శివ!! మీ రేమి మాటలాడుచున్నారు? ఆధూర్తుఁడను నేనే కావల యును. ఆదస్తావేజు దస్తూరి నాది, నాదగ్గఱనే యున్నది. దైవవశమున ధనములో నెక్కువభాగముకూడ నాకే వ్రాయఁబడినది."

"నీవే కావచ్చును! నా కేమియును దెలియదు. అంతర్యామి కంతయును దెలి యును."

"అయితే మీరే ఆ యంతర్యామి యన్నమాట. పండితులవారు నిజము పలుకుదు రనుకొంటిని. సత్యము నాదరింతు రనుకొంటిని. మీరు నేనే కల్పించితి రనుచుంటిరి."

"నీవు కల్పించితివని నే ననలేదు. నీవే నీనోటఁ బలుకుచున్నావు. కుశలపాలా! దైవభీతి యుండవలయును. ధనము వెంట రాదు. మానవుఁడు మోహ వశమున ధనమువలన సుఖకల్పనము గావించుకొని అసత్యము నాశ్రయించి, చివరకు ధనము నిచ్చటనే వదలిపోవును. నీతండ్రి యెట్లు దీనిని వదలిపోయినాఁడో అట్లే నీవును దీనిని వదలిపోవుదువు. ఒక గవ్వైన నీవెంట రాదు. జీవిత మంతయు తపించి చివరకు నరక ములోఁ బడవలెను. ఈభాగ్యమున కింతపాపములోఁ బడు టెందులకు?"

"స్వామీ! మీరు చెప్పునది నిజమే. మీరు నన్ను మోసగాఁ డనుకొను చున్నారు. ఇది పొరపాటు. తండ్రిగారు నాకు మూఁడువంతుల బంగారమొసంగి నారు. నిజముగఁ దండ్రిగారే దస్తావేజును వ్రాసియిచ్చినారు. మీరు కోపఁబడకుండిన నొకవిషయము చెప్పెదను. మీరు నా కీవిషయములో సహాయ మొనర్చిన మీ ఋణ ముంచుకొనను. నేను మీ సహాయమును మఱచు కృతఘ్నుఁడను గాను. బంగారములో సగము మీకు లభింపఁగలదు. మీరు దానితో యథేష్టముగ భగ వంతుని సేవింపవచ్చును. పిల్లలను బోషించుకొనవచ్చును."

"ఏమయ్యా! నీవు హద్దును దాటిపోవుచున్నావు. నాకు ధనము నాశపెట్టి పాపములోఁ బడవేయఁదలంచుచున్నావు. (కొంచెము తేజమును జెంది) నీ దస్తావేజు సత్యమైనదని నాచేతఁ బలికింపఁ దలఁచితివా? అ ట్లెన్నటికిని సాధ్యముకాదు. నాకు ధనముకాదు ముఖ్యము, ధర్మము. నాప్రభువు మోసపు ద్రవ్యము నంగీక

రింపఁడు. చెమట నూడ్చి సంపాదించిన ద్రవ్యముతోఁ గడుపు నిండును గాని పాపపు బంగారముతోఁ గడుపు నిండదు. నాకు బంగార మక్కఱలేదు. మురల నట్టివాక్య మును నోటఁ బలికితివా పరిణామమున వికటింపఁగలదు."

"కాలవైపరీత్యము. హోమముచేసిన జేతులు కాలును. ముష్టి బ్రాహ్మణుని గర్వమును జూడుఁడు. బంగారమనిన నీతని కేవగింపు. నాకు పరిణామ భయమును జూపుచున్నాఁడు" అని కుశలపాలుఁడు కోపముతో ననెను.

"కుశలపాలా! నేను ముష్టి బ్రాహ్మణుఁడ నే. కాని నీవంటి మోసగాఁడను గాను. నాయింట బంగారములేదు; కాని బంగారము కొఱకు నేను నమ్మకమును బోఁగొట్టు కొనలేదు. నేను మరలఁ జెప్పుచున్నాను భగవంతునకు భయపడుమని. అబ్బాయీ! మించినది లేదు. ఇంకనైన నింటికిఁ బోయి పాప మయమగు నాలోచన మును వీడుము."

"శంకరపండితా! ఒంటివ్రేలితో వెన్న రాదని నేను గ్రహించితిని. తండ్రిగారు నిన్ను నెత్తి కెక్కించుకొనినాఁడు కావున నే యిట్లు పలుకుచున్నావు. మంచిది నేను వెళ్లుచున్నాను. నాపేరు కుశలపాలుఁ డనుసంగతి జ్ఞాపకముంచుకొనుము."

"అబ్బాయీ! ఏల యింతగా గర్వపడెదవు. నీవు నన్నేమి చేయఁగలవు? నీక్రోధము నిన్నే కాల్చివేయఁగలదు. భగవద్రాజ్యములో నన్యాయ ముండదు. అంతయు వారివారి కర్మఫలముల ననుసరించి జరుగఁగలదు. నా కోసలపాలుఁడగు శ్రీరామచంద్రునిముందు కుశలపాలుఁ డేమిలెక్క? ఆతఁడే నాకు సహాయమొనర్చు నని నా విశ్వాసము. ఆతఁడు నన్నుఁ దప్పక రక్షింపఁగలఁడు. నాపూర్వకర్మఫలము ననుభవింప వలసియుండిన నది యనుభవించెదను. అది నామేలునకే కాఁగలదు!" అని శంకరుఁ డనెను.

కుశల:—"సరియే, చూచెదము గాక! నేను వెళ్లుచున్నాను."

శంకర:—"వెళ్లునాయనా! భగవంతుఁడు నీకు మేలు చేయునుగాక! నీకు సుబుద్ధి నొసంగునుగాక!"

కుశల:—"నీయాశ్వీరని మేలు, సుబుద్ధి నా కక్కఱలేదు. నేను నామేల్లు నాబుద్ధిచేత నే చూచుకొనఁగలను. నీబోటివారి ఆశీర్వాదము నా కక్కఱ లేదు. నీవు నీకొఱకే భగవంతునిఁ బ్రార్థించుకొనుము." అనుచు నిరాశతోఁ గుశలపాలుఁ డచ్చటనుండి వెళ్లిపోయెను. ఎట్లైన శంకర పండితునిపైఁ బగఁ దీర్చుకొనవలయునని తలఁచుచుండెను. పాపముచేత నే పాపము పెరుగును. ఇంటికిపోయి శంకరునిఁ జంపవలయునని యొక కత్తిని

జేబులోఁ బెట్టుకొని ప్రతిహింసాపాపము బుద్ధినిఁ జెలుపఁగా వానినిఁ బిచ్చివానినిగా నొనర్చెను.

సంధ్యాసమయము. నల్దిశల నంధకారము కప్పినది. కృష్ణచతుర్దశీదినము. మనుష్యసంచారములేని వనమార్గము. అటునిటు నక్కలఱచుచుండెను. దూరమునఁ గుక్కలు మొఱుఁగుచుండెను. శంకరపండితుఁ డెప్పటియట్ల భగవన్నామ గానము నొనర్చుచు నిశ్చింతగ శివాలయమునకు వెళ్లుచుండెను. హఠాత్తుగఁ గుశలపాలుఁ డాతనిచేతినిఁ బట్టుకొని కత్తితో బొమ్మునఁ బొడిచి పాఱిపోయెను. శంకరపండితుని బొమ్మునుండి రక్తము కారుచుండెను. హా రామ! హా రఘువరా!" యనుచు స్పృహ తప్పి క్రిందఁ బడిపోయెను.

ఇంతలోనే ఆతని కొక దృశ్యము కనఁబడెను. చక్కని వనము. అందులో మంచి సరోవరము కలదు. ఆ సరోవరతీరమున రావిచెట్టుక్రింద వివిధరత్నములు కూర్చిన బంగారుసింహాసనము కలదు. అందు శ్రీరామచంద్రుఁడు జానకీదేవితో విరాజిల్లుచుండెను. భరతలక్ష్మణులు చామరములు వీచుచుండిరి. శత్రుఘ్నుఁడు జలకలశమును బట్టుకొనియుండెను. పవనకుమారుఁడు పాదములఁ బట్టి సేవించుచుండెను. ఎదుట రెండు వరుసలలో సాధుపుంగవులు కూర్చుండి భజనము చేయుచుండిరి. శంకరపండితునకు బాధ లేదు. ఆతఁడు వెంటనే స్వామిపాదములపైఁ బడెను. శ్రీరామచంద్రుని యాజ్ఞచే హనుమంతుఁ డాతనిని లేవనెత్తెను. అప్పుడు శంకరుఁడు పవనకుమారుని గౌఁగిలించుకొనెను. ఆతని యానందమునకు మేర లేకుండెను. కన్నుల నానందబాష్పములు రాలుచుండెను. శరీరము పులకరించి రోమాంచ మయ్యెను. అప్పుడు శ్రీరామచంద్రమూర్తి యిట్లనెను:—"శంకరా! నేను నీసేవలకుఁ బ్రసన్నుఁడనైతిని. నీవంటి దంభవిహీనుఁడు, సరళహృదయుఁడు, నిర్లోభి నాకు గనఁబడలేదు. నీవు నిష్కాముఁడ వగుటచే నాకు పరమప్రియుఁడవు. నెల్లము, నన్నుఁ జింతించుచుఁ గొన్నాళ్లు భూమిమీఁద నుండి లోకకల్యాణ మొనర్పుము. శీఘ్రముగ నీవు నా ధామమునకు రాఁగలవు.

శంకరుఁడర భగవద్వచనములను విని యానందించెను గాని స్వామిని వదలుటకు కాళ్లు రాలేదు. దీనిని గ్రహించి శ్రీరామచంద్రమూర్తి "నీవు చింతింపనలదు. నా యాదేశమును మన్నించి జగత్కల్యాణ మొనర్పుము" యని యంతర్ధాన మయ్యెను. శంకరునకుఁ దెలివివచ్చునప్పటికి అచ్చట యథాప్రకారము పడియుండెను. ఇదివఱకు కుశలపాలుఁడు పొడిచిన గాయము లేదు. తాను జూచిన దృశ్యమును జ్ఞాపకము చేసికొనుచు నింటికిఁ బోవుచుండ దారిలోఁ గుశలపాలుఁడు పడియుండెను. ఆతని నోటినుండి రక్తము కారుచుండెను. ఈదృశ్యమును శంకరపండితుఁడు చూచి

జాలినిఁజెంది ఆతనిని లేవఁదీసెను. కుశలపాలుఁడు పండితుని కాళ్లపైఁబడి క్షమాపణము వేడుకొని తనవృత్తాంతము నిట్లు చెప్పుకొనెను:—"స్వామీ! నాయపరాధమును క్షమింపవలయును. నేను దుర్మార్గుఁడను. నేను బంగారమునంతను గాఁజేయవలయునని మోసపు దస్తావేజును సృష్టించి మిమ్ముల నబద్ధమాడుఁడని బాధించితిని. పెద్దలగు మిమ్ములను నానామాట లాడితిని. చివరకుఁ గత్తితోఁగూడ పొడిచితిని. దీనికి నాకు తగినప్రతిఫలము లభించినది. మిమ్ములను బొడిచి నేను వచ్చుచుండఁగా వెనుకనుండి యెవరో యిద్దరు వచ్చి నన్ను తలమీఁద గ్రుద్దిరి. దానితో నేను పడిపోయితిని. ఆబాధను అనుభవింపవలయునే కాని చెప్పలేను. నేను చేసినపాపమునకు తగిన ప్రాయశ్చిత్తమైనది. వారు నన్నుఁ జంపెడువారే. కాని మీరిచ్చిన యాశీర్వచనముచే, ఆయాశీస్సును నిజము చేయవలయునని వారు నన్ను విడిచిరి. ఇప్పుడు నాపాపములన్నియును బోయినవి. నాకు బుద్ధివచ్చినది. నాహృదయము శుద్ధమైనది. నన్ను మీ రనుగ్రహింపవలయును" అని యిట్లు ప్రార్థింపఁగా శంకరపండితుఁ డిట్లనెను:—"నీవును నా కుపకార మొనర్చితివి. నీవు స్పృహాతప్పునట్లు పొడిచితివి కావుననే నాకు భగవద్దృశ్యమును గాంచుభాగ్యము కలిగినది. మనకీజన్మము దుర్లభము. ఈ జన్మలోనే తరించు నుపాయమును జూచుకొనవలయును" అని పలుకుచు కుశలపాలుఁ డిప్పుడు శుద్ధుఁడై నాఁడని గ్రహించి, యాతనికి శ్రీరామషడాక్షరీ మహామంత్రము నొసంగెను.

కుశలపాలుఁడును పదిలక్షలతో సూర్యదేవాలయమును గట్టించి, మిగిలిన అయిదులక్షలను దానధర్మములకు వినియోగించి తాను విరాగియై నిరంతరము భగవద్భజనము చేయుచుండెను. ఈకార్యమున కాతనితమ్ములును హర్షించిరి. శంకరపండితుఁడును కుశలపాలుఁడును జీవితాంతమువఱకును భగవద్భజనము కావించి ముక్తినొందిరి.

---

# ప్రతాపరాయలు

నిజమగు భగవద్భక్తులు నిరంతరము భగవంతుని భజించు చుందురు. వారు సాంసారిక సుఖ-దుఃఖములను లక్ష్యముచేయరు. వారు స్వర్గసుఖమును మోక్షమును గూడ తుచ్ఛముగఁ జూచెదరు. వారికి కావలసినది భగవత్కృప, భగవత్స్మరణ. వా రొక్కనిమిషమైనను భజింపకుండఁజాలరు. కోరికలతో భగవద్భజనము చేయువారు వ్యాపారస్థులని చెప్పవలసియుండును. భక్తిచేసి ఫలమును గొనుచుందురు. కాని మనప్రతాపరాయ లట్టివాఁడు కాఁడు. యువావస్థను వదలి మిగిలిన జీవిత

కాలమంతయు నాతఁడు లోకదృష్టిచేఁ జాలకష్టములు పడెను. కాని యాతఁడు భగవదానందములో మునిగియుండెడువాఁడు. ఎట్టిదుఃఖములును నాతనిఁ జెనకఁజాలక పోయినవి.

పశ్చిమ బంగాళా దేశములో హారసోలా యను నొకగ్రామము కలదు. అందు భానురాయలును, కుసుమిా యను పేరుగల దంపతులు నివసించుచుండిరి. వారు క్షత్రియులు. వీరికి చుట్టున వాతావరణము మద్యమాంసాదులతో నిండిన వామాచారసాంప్రదాయ మైనప్పటికిని వీరు వైష్ణవ ధర్మము నాశ్రయించి నిర్దుష్టముగ నుండిరి. వీరి యిష్టదైవము గోపాలుఁడు. ఆతఁ డుదయముననే నిద్ర లేచి దైవధ్యానము గావించుకొని, స్నానాదు లొనర్చుకొని, తల్లిదండ్రులకు నమస్కరించి, తులసీవనమునకు నీరుపోసి, కొంచెముసేపు జపము చేసికొనును. అందఱితో మృదు మధురముగ మాటలాడఁడు. తల్లిదండ్రులయెదుట మాటలాడనే మాటలాడఁడు. ఆతఁ డాకృతిని సుందరుఁడు. హృదయ మంతకంటెను సుందరమైనది. ఈతఁడు కష్టమును సహించుటలోఁగాని, వేషభాషలందలి, నిరాడంబరములోఁగాని ఈతఁడు విలక్షణముగ నుండెడువాఁడు. ఏవస్తువునైనను దన అక్కచెల్లెండ్రకుఁ బెట్టకఁ దినెడువాఁడు కాఁడు.

ఈతని అక్క పేరు లక్ష్మి, చెల్లెలు పేరు మాధవి. లక్ష్మివివాహ మింతవఱకే చేయఁబడినది. ప్రతాపరాయలవివాహము ఆతనికి పదమూఁడవయేటనే అయినది. మాధవి వివాహ మామెకు పదునొకండవ యేట అన్న వివాహముతో నయ్యెను. ప్రతాపరాయనివివాహమైన పదిసంవత్సరములవఱకు భానురాయలు బ్రదికియుండెను. ఈకాలములో గృహవ్యవహారములన్నిటిని ప్రతాపరాయలే చక్కఁబెట్టుచుండెను. ప్రతాపరాయల కొకపుత్త్రుఁడు కూడపుట్టెను. తండ్రి చనిపోఁగానే ప్రతాపరాయలకు తలకొట్టివేసినట్లుండెను. ఆతని భక్తి వలనను విషయవిరక్తి వలనను నాతఁడు దుఃఖింపలేదు.

ఆత్మ నిత్యమైనదనియు, దేహ మస్థిరమైనదనియు, దానికొఱకు దుఃఖించుట వెఱ్ఱితనమనియు భావించి పితృదుఃఖమును జెంద లేదు. తండ్రియును భగవన్నామము నాశ్రయించినవాఁడు కావున నాతని కేమియును భయముండఁజాలదనియు భావించి నిశ్చింతతో నుండెను.

ఇప్పుడు గృహనిర్వాహణభారమంతయును బ్రతాపరాయనిపైఁ బడెను. విషయాసక్తునకు విషయములం దెంతటిప్రీతియుండునో ఈతనికి భగవత్స్మరణయం దతని కంత ప్రీతి యుండెను. తర్వాత తల్లికూడ మరణించెను. ఇట్లీతని కనేక సంకటములు కలుగుచుండెను. ఇది భక్తుని భగవంతుఁడుచేయు పరీక్షా యనునట్లుండెను. కష్టములు వచ్చినకొలఁది ఆతనిభక్తి యనుసువర్ణము మేలిమి బంగారమువలె నగుచుండెను.

కొన్నిదినములకు ప్రతాపుని పండ్రెండుసంవత్సరముల పుత్త్రుడు దీనబంధు రాయలుకూడ చనిపోయెను. తల్లిదండ్రు లిద్దరును చాల సేవచేసిరి. అది సన్నిపాత మగుటచే జివర కాతఁడు చనిపోయెను. ప్రతాపునివలెనే ఆతనిభార్య మాలతియు నీకష్టమును సహించెను. ఒక్కఁడేపుత్త్రుఁడైనను నాతఁడు చనిపోవుసమయమున నాతనికి సత్కథలను వినిపించియును, భగవన్నామస్మరణము చేసియును నెంతయో సేవ యొనర్చిరి. ఆతనిమనస్సును భగవంతునియందు లగ్నమగున ట్లొనర్చిరి. పుత్త్రుఁడు మరణింపఁగా నిదియంతయు భగవల్లీల యని భావించిరి. వారేడ్చుటయే మానివేసిరి. అంపలి కిది చాల విచిత్రముగ నుండెను.

కొన్నాళ్లకాతని చెల్లెలిభర్త యగువల్లభరాయలు రోగశయ్యపైఁ బరుండెను. తనయన్నయగు ప్రతాపరాయలు భగవంతునిఁ బ్రార్థించినచో వల్లభునకు రోగము నయమగునని లక్ష్మికి నమ్మకము. అందువలన నన్నతో వల్లభరాయల ఆరోగ్యముకొఱకు భగవంతుని ప్రార్థింపుమని కోరెను. కాని ప్రతాపరాయలు నిష్కామభక్తుఁడు. నిష్కామభక్తులు భక్తికి బదులుగా లౌకికకోరికలను గోరరు. భక్తికి బదులుగా లౌకిక కోరికలను గోరిన భగవంతునికంటె విషయములే పరమార్థములనివారు భావించినట్లే కాఁగలదు. శరీరములశాశ్వతములనియు, సంబంధమారోపితమనియుఁ బ్రతాపునకుఁ దెలియును. అందువలన నాత్మీయులశరీరములకొఱకై భగవంతునిఁ బ్రార్థించుట మూర్ఖతయే కాఁగలదు. అయినను సోదరి కోరికను కాదనలేక 'సరియే రేపు ప్రార్థించెద' ననెను. ప్రతాపరాయని యీమాటచే లక్ష్మికి ధైర్యము చిక్కెను.

రాత్రివేళ మూఁడవఝామున ప్రతాపరాయలు బావమఱది ప్రక్కనే గూర్చుండియుండెను. ఇంతలోఁ బ్రార్థనఁ బ్రారంభించి శరీరమును మఱచెను. అందొక స్వప్నము వంటి దృశ్యము గోచరించెను. భగవంతుని పార్షదులు నలుగురు ఆగదిలోనికి వచ్చిరి. గదియంతయును బ్రకాశించుచుండెను. వారు నవ్వుచు వల్లభరాయలతో నిట్లనిరి:—"వల్లభా! నీవు పుణ్యశీలుఁడవు. భగవద్భక్తుఁడవు. పూర్వజన్మముననే నీవు ముక్తినిఁ బొందవలసియుండెను. మాధవి పరమ సాధ్వి, ఆమెకు మాటయిచ్చియుండుటచే మరల జన్మింపవలసివచ్చినది. ఇప్పుడు నిన్ను మేము వైకుంఠమునకుఁ గొనిపోవ వచ్చితిమి. నీతో నీభార్యయు సహగమనమొనర్చి పరమధామమునకు రాఁగలదు. నిన్నిదివఱకే తీసికొనిపోవలసియుండెను. కాని భక్తుఁడగు ప్రతాపరాయలు నీజీవితముకొఱకు ప్రార్థింపఁబోవుచున్నాఁడని ఆగితిమి. ఆతఁడు ప్రార్థించిన నీవు బ్రదుకుదువు. కాని వైకుంఠమునకుఁ బోవు." అనఁగా వల్లభుఁ డిట్లనెను:—"మహానుభావులారా! నాకు జీవిత మవసరములేదు. నన్ను వేగముగాఁ గొని

పొందు" అనెను. ఇంతలోనే ప్రతాపరాయలు కన్నులను దెఱచెను. వల్లభునిశరీరము చైతన్యరహితముగ నుండెను. కాని ముఖములోఁ దేజస్సు, చిరునవ్వు లొలుకుచుండెను. దగ్గఱనే కూర్చుండిన మాధవికిగూడ శరీరము తెలియలేదు. ఆమెకు నిక్లే స్వప్నమువలె వచ్చెను. ఆమె యిట్లనెను:—"అన్నా! నేను, నాభర్తయు వైకుంఠమునకుఁ బోయెదము. మాకొఱకు పార్షదులు వచ్చియున్నారు. ఈ ప్రయాణమునకు నీవు అడ్డుపడుచున్నావఁట యెందులకు? మాసుఖము నీసుఖము కాదా? మేము సుఖముగఁ బరమధామమునకుఁ బోయెదము" అప్పుడు ప్రతాపరాయలు మనస్సులో నిట్లనుకొనెను:—"మానవుఁడు భగవంతుని అనేకకోరికలు కోరుచుండును. అది వట్టి అజ్ఞానము. ఆకరుణామయుఁడు మనక్షేమమునకై యేదేదియో చేయుచుండును. దానిని మార్పుచేయుటకు మన మెన్నియో ప్రయత్నములు చేయుచుందుము. ఒక్కొక్కప్పుడు మోక్షమునుగూడ కాలఁదన్ని తుచ్ఛములగు విషయములను గోరుచుందుము. ఇది వట్టి భ్రమ. కావున భజనకు బదులుగా విషయములను గోరుట తగదు."

ఇంతలోనే వల్లభుఁడు కన్నులను దెఱచిచూచి, అందఱును జూచుచుండఁగనే ఓంకారోచ్చారణ మొనర్చుచుండ తలపగిలి బ్రహ్మరంధ్రముద్వారా పరమధామమును జేరెను. మాధవియుఁ బతి ననుగమించెను. చెల్లెలి యొక్కయు, బావమఱదియొక్కయు మృత్యువును గాంచి ప్రతాపరాయ లానందించెను.

ప్రతాపరాయల తండ్రి తాతలనుండియు వారు వడ్డీవ్యాపారము చేయుచుండెడివారు. చుట్టుపట్టుల నుండు గ్రామములలోని బీదవారు ధన మవసరమగునప్పు డేదోవస్తువును దాఁకట్టు పెట్టి తీసికొనిపోవుచుండెడువారు. రాయలును చాల తేలిక వడ్డీని మాత్రమే తీసికొనుచుండెడువాఁడు. అంతయు విశ్వాసము మీఁదనే జరుగుచుండెడిది.

ప్రతాపరాయని భక్తిని, లోకములో నాతనికి గల గౌరవమును గాంచి అసూయ చెందువారును లేకపోలేదు. ఈతని కెట్లైన నపకీర్తిని దెచ్చి, ఆతఁడు కష్టములోఁ బడిన సంతసింపవలయునని నలుగురు వచ్చిరి. అందులో నొకఁ డొక డబ్బినిఁ బెట్టి పైకము తీసికొనిపోయెను. మిగిలిన ముగ్గురు సంచీలను బెట్టి పైకము తీసికొనిరి. రాయలు వాటి నినుపపెట్టెలోఁ బెట్టి తాళము వేసెను. లోన నేముండెనో ఆతఁడు చూడలేదు. కొన్నాళ్లకు వారు పైకమును వడ్డీతోఁ దెచ్చి మావస్తువులను మాకీయుఁడనెను. ఆతఁడా పైకమును జమకట్టుకొని వారివస్తువులను వారి కొసంగెను. వా రాతనిసమక్షముననే తెఱచిచూడఁగా నందు రాళ్లుండెను. వారిట్లే రాళ్లనుంచి అల్లరిపెట్టుటకు వచ్చిరి కావున నిట్లనిరి:—"ఏమయ్యా! ఇందు

మావస్తువు లేవి? మేము బంగారు వస్తువులను దాఁకట్టుపెట్టఁగా కంకర పోసియిచ్చెదవా? నీవు నమ్మకమైనవాఁడ వనుకొంటిమి. ఏమి భక్తుఁడవయ్యా! భక్తులు చేయవలసినపని యిదియేనా?" అని యిట్లనుచుఁ బదుగురను ప్రోవుచేసిరి. వందమంది చేరిరి. ఇంతమందిమాటను కాదనగలవారేరీ? ప్రతాపరాయనిమాటను వినువారెవరు?

ఆరోజులలో వంగదేశములో ముసల్మానులు రాజ్యము నేలుచుండిరి. వీరందఱును కాజీదగ్గఱకు వెళ్లి చెప్పుకొనిరి. కాజీ ఈతనిని విచారించి ఖైదులోనుంచెను. ఆస్తినంతను జప్తుచేసిరి. మాలతిని ఇంటినుండి బయటకు నడిపించిరి. తనవారివలనను ఇతరులవలనను నవమానింపఁబడెను. అందఱదృష్టిలో నీతఁడు దొంగగాను, మోసగాఁడుగాను నెన్నఁబడుచుండెను. కాని యాతఁడు చలింపక యిదియంతయు భగవద్విధానమని గ్రహించి ద్వంద్వరహితుఁడై నిరంతరము భగవంతుని భజించుచుండెను. అందఱును నీతని గాంచి 'ఈతఁడు ద్రవ్యమును కాఁజేసి భక్తుఁడై కూర్చుండినాఁడనియు, 'వీడు పక్కా దొంగ, వీని ముఖమునఁ గొంచెమైనఁ జింత కలదేమో చూడుఁ' డనియు, 'దంభమును బ్రదర్శించి ధనమును గాఁజేసి మహాత్మునివలె నటించుచున్నాఁడు వీనియంతటి పాపుండుండఁడు కలఁడా' యనియు, "నోట రామ రామ, చంకలో కత్తి" అనియు నిట్లు నానావిధముల మాటలాడుచుండిరి. కాని ప్రతాపరాయలకు చిఱునవ్వుతప్ప వేఱులేదు. ముఖమున శాంతి తాండవించుచుండెను.

జైలుకు పోవునపుడు ప్రతాపరాయలు తనభార్యయగు మాలతితో నిట్లనెను:—"మాలతీ! జాగ్రత్తగా నుండుము. భగవద్విధానమునకు కళంకము తేరాదు. వీ రెన్నెన్ని యెత్తులు వేయుదురో? నీవు నీపుట్టినింటికి పొమ్ము. భగవదనుగ్రహముండిన మరల కలిసికొనెదము" ఈమాటలు వినఁగానే మాలతికన్నుల వెంట నీరు కారెను. ప్రతాపరాయలు జైలులోఁ జీఁకటికొట్టులో నివసించుచుండెను. ఆతనిలోని భగవద్విశ్వాస మిసుమంతైన తగ్గలేదు.

మాలతి ఒంటరిగా నుండెను. తమయిష్టదైవమగు స్వామిపైనను, ఆతని ఆభరణములపైనను వస్త్రములు గప్పి వెళ్లఁదలఁచెను. గ్రామములోని వారందఱును నిప్పుడు విరోధులే. ఒకప్పు డీతనిని భక్తుఁడనియు, నమ్మకమైనవాఁడనియు ననినవారే యిప్పుడు పక్కాదొంగయనియు, మోసగాఁడనియు ననుచుండిరి. ఇంతలో నెవరో పోయి ఖాజీకి చెప్పిరి. మాలతి జప్తుఆస్తిని దీసికొని పరారగుచున్నదను నేరమునకు ఆమెనుగూడ కారాగృహమున కంపిరి.

కారాగృహాధికారి చాల మంచివాఁడు. ఆతఁడు మాలతిని ప్రతాపరాయలనుంచిన గదిలోనే యుంచెను. ఇది యొకమేలే యని యిద్దరును దలఁచిరి. వారచ్చట

నిరంతరము భగవంతుని భజించుచుండిరి. ఒకరోజునఁ బ్రతాపరాయ లిట్లు ప్రార్థించెను:—"ప్రభూ! నీవు మమ్ములను బాగుగా ననుగ్రహించితివి. మాకు బంధములు లేకుండఁజేసితివి. మిమ్ములను భజించుట కవకాశము లభింపఁజేసితివి. స్వామీ! మాకు మీభజన తప్ప వేఱుకోరిక లేదు. అది దినదినాభివృద్ధిని జెందవలయును. మాకు మీదర్శనమొసంగిన నొసంగుము లేకున్నఁ బోనిండు. మా కట్టియధికారమును లేదు. దర్శనము కావలయు ననుకోరిక లేకపోలేదు కాని భజన విడిచిన దర్శనము మా కక్కఱలేదు. దయామయా! కృపయుంచుము."

నిష్కామభక్తుని యొక్క వాక్కులను విని భగవంతుని కానందము కలిగి, ఆ కారాగృహములోనే ప్రత్యక్షమయ్యెను. సహస్రసూర్య లొక్కసారి వెలిఁగిన నెంతకాంతి యుండునో అంతకాంతితో వెలిఁగెను. వేణుగానలోలుఁడగు శ్రీకృష్ణుని గాంచి ప్రతాపరాయలును, మాలతియును శరీరములను మఱచిరి. సంతస మాదివ్యమంగళ విగ్రహమును గాంచుచుండిరి. శరీరములు పులకరించెను. కన్నుల నానందబాష్పములు కారుచుండెను. వాక్కు గద్గదికమయ్యెను. ఇద్దఱును భగవంతుని పాదములపైఁ బడిరి. అప్పుడు భగవంతుఁ డిట్లనెను:—"వత్సా! ప్రతాపా! అమ్మా! మాలతీ! నేను మీనిష్ఠని గాంచి మిక్కిలి ప్రసన్నుఁడనైతిని. సాంసారిక సుఖముల కొఱకై నాభజనమును విక్రయించువారు మూఢులు. నీకు కఠిన పరీక్ష జరిగినది. నీ కనేకకష్టములు ప్రాప్తించినవి; కాని నీవు చలింపలేదు. కష్టములను నివారింపఁజేసికొనుటకుఁ బ్రయత్నింపలేదు. మిమ్ములను నాలోఁ జేర్చుకొనవలయునని నీ కన్ని కష్టములను బ్రాప్తింపఁజేసితిని. వీనితోఁ నీ పూర్వజన్మకృతపాపములన్నియు తొలఁగి పోయినవి. మీవంటి నిష్ఠ కలిగిన భక్తులే నాకు ప్రియులు. నాదర్శనము దుర్లభము. నాదర్శనముకొఱ కెవరు వ్యాకులతను జెందుదురో, నావియోగమున నొక్కొక్క క్షణము నొక్కొక్కయుగముగ నెవరు గడుపుదురో వారికే నేను దర్శన మొసంగుదును. నాదర్శనప్రభావముచే వారి కిఁక సాంసారిక కాంక్ష లేవియు నుండఁజాలవు. నీ పట్టిభక్తులలో నొకఁడవు. అందువలన నాకుఁ బ్రియుఁడవు. మాలతియు నీ కను కూలవతియై యుండుటచే నామెయు ధన్యురాలే. ఇప్పుడు నీకిష్టమువచ్చిన వరమును గోరుకొనుము." అంతఁ బ్రతాపరాయ లిట్లనెను:—"స్వామీ! మాసాధన అంతయును బూర్తియైనది. మీభజనయం దింకను సత్యాధికమగు నాసక్తి కలుగు నట్లు వర మొసంగుఁడు" భగవానుఁడు "తథాస్తు" అని నవ్వుచు నంతర్ధాన మయ్యెను. అనంతజన్మలనుండి ప్రతాపరాయలు చేసిన సాధన నేటితోఁ బూర్తి యయ్యెను.

ఇచ్చట కొద్దిదినములలోనే కాజీకి మొదట నీతనిని మోసముచేసినవారికిని గలిత కుష్ఠురోగము ప్రాప్తించెను. కాజీభార్య తెలివిగలది. బుద్ధిమంతురాలు. నిరప

రాధియైన ప్రతాపరాయలను బాధింపకూడదనియు, నాతనియిల్లు వాకిలిని గొల్ల గొట్టి మాలతి ననాథను జేయరాదనియు నామె మొట్టమొదటనే చెప్పెను. కాని వినలేదు. ఒకదినమున నవకాశమును జూచుకొని ఆమె తనభర్తతో నిట్లనెను:— "నాథా! మీయీ రోగమునకుఁ గారణము భగవద్భక్తుఁడగుఁ బ్రతాపరాయలను బాధించుటయే యని నావిశ్వాసము. మీకు నామాటమీఁద లక్ష్యముండిన నాతనిని వెంటనే కారాగృహమునుండి విడిచి, క్షమాపణమును వేఁడుఁడు." కాజీ భార్యమాటలను విని మన్నించెను. ఆతఁడు ప్రతాపరాయలను, మాలతిని విడిచి పుచ్చెను. మిగిలిన దుష్టులును దమతమ తప్పులను గ్రహించిరి. వారును కాజీతోఁ గూడ వచ్చి ప్రతాపరాయల కాళ్లపైఁ బడి తమ యపరాధముల నొప్పుకొని మన్నింపుమని వేఁడుకొనిరి. వా రిట్లనిరి:—"మీరు నిర్దోషులు. మేము స్వార్థ వశముచే నీపై అసత్యమును మోపి కారాగారమునకుఁ బంపిన నీచులము. మీరు మమ్ములను క్షమించి యీ దుష్టత్వరోగమునుండి విముక్తినిఁ గావింపుమని ప్రార్థింపుఁడు." ప్రతాపరాయ లిట్లనెను:—"సోదరులారా! ఇందు మీదోష మేమియును లేదు. మీరు నిమిత్తమాత్రులు. ఇదియంతయు మేము చేసిన కర్మములకు ఫలము. కాని దీనివలన మీకు పరమలాభమే కలిగినది. అనంతజన్మలలోనిసాధన పూర్తి యైనది. మీ రొనర్చిన యీ ఉపకారమునకు నేను కృతజ్ఞుఁడను." అనుచు నాతఁడు భగవంతుని బ్రార్థింపుచు నిట్లనెను:—"స్వామీ! వీరి యపరాధము లన్నిటిని మన్నింపుము. వీరు శిక్ష ననుభవించిరి. పైగా వీరు మా కుపకారమునే యొనర్చిరి. వీరిని కృపతో రోగవిముక్తులఁ జేయకుండిన మాకు చాలబాధ కలుగఁగలదు. నాథా! మేము నిన్ను శరణు వేఁడుచున్నాము. రక్షింపుము. రక్షింపుము." ఇట్లు ప్రార్థింపఁగానే అత్యాశ్చర్యకరముగ వారిశరీరములు బంగారమువలె నయ్యెను. వారు ప్రతాపరాయని పాదములపైఁ బడిరి. ఇప్పుడు గ్రామములోనివారందఱును నిదివఱకు వీరిపై నపవాదములను బెట్టినవారగుటచే జాల పశ్చాత్తాపమును జెంది పాదములపైఁ బడి క్షమాపణమును వేఁడుకొనిరి. కాజీ జప్తుచేసినవస్తువుల నన్నిటి నిచ్చివేసెను. ప్రతాపరాయలు సమస్త సంపత్తిని బీదలకుఁ బంచి, భార్యాభర్త లిరువురును సంసారత్యాగమును గావించి బృందావనమునకుఁ బోయిరి. తర్వాత ముప్పది సంవత్సరములవఱకును భగవద్భజనమును జేసి, భగవన్నామమును జపించుచుఁ జిత్తవృత్తిని బాగుగా భగవానునిపై లీనము కావించి యిద్దరును గోలోకమునకుఁ బోయిరి.

---

# భక్త గిరివరుఁడు

పావన నర్మదాతటమునఁ గల నొక గ్రామములో గిరివరుఁడను నొక రాజపుత్త్రుఁడు నివసించుచుండెను. ఇంటిలో వృద్ధు లగు తల్లిదండ్రులును, గౌరి యనుపేరుగల పతివ్రత యగు పత్నియు, ఊదా యను నేకైకపుత్త్రుఁడును గలరు. ఇప్పుడు క్షత్త్రియవృత్తి లేదు కావున వ్యవసాయము చేయించుకొని సుఖముగ జీవించుచుండెడువాఁడు. ఆతనికి జరుగుబాటులో నే కొఱఁతయును లేదు. దంపతు లిద్దరును వృద్ధులను మిక్కిలి భక్తితో సేవించుచుండిరి. పుత్త్రుని మిక్కిలి గారాబముతోఁ బెంచుచుండిరి. భార్య యగు గౌరి అత్త మామల కేలోటును రానీయక సేవించుచు, భర్తకు చేయు సేవలను మానలేదు. ఆమె యెల్లప్పుడు నత్తమామల యొక్కయు, భర్తయొక్కయు కనుసన్నలలో మెలఁగుచుండును. భర్తను ఆమె అతిశయముగఁ బ్రేమించుచుండును. పిల్లవాఁడును తల్లిదండ్రుల మాటలను జవ దాఁటఁడు.

ఇచ్చట గల గొప్ప విశేషమేమనఁగా నింటిలో నున్న వారందఱును భగవద్భక్తులే. అందఱును బ్రతిదినమును భగవంతునిఁ బూజించి, భగవద్భజనము చేయుచుందురు. గిరివరుఁడు గొప్పచదువులు చదువలేదు గాని చదువులలో మర్మమెల్ల చదివెను. అదియే భగవద్విశ్వాసము. ఆతఁ డెప్పుడును "భగవంతుఁ డేదిచేసినను మన మేలునకే" యని పలుకుచుండును.

ఆతఁడు యథార్థముగ ననుచున్నను దానిని బ్రత్యక్షముగ నాతనిచే జేయించి చూపింపవలయునని భగవంతుని సంకల్పము. అందఱు నీతని యీ పల్కులను విని అవహేళన చేయుచుండెడువారు. అన్నియును జక్కఁగ జరుగుచున్నప్పుడు బాగుగానే యనవచ్చును గాని చిక్కులు వచ్చినప్పు డీవేదాంతము రావలయును" అనుచుందురు.

ఇంతలోనే గిరివరుని తల్లిదండ్రులు మరణించిరి. ఇంటిలో తోడులేక పోయిరే యనియు, తమకు సేవచేయుట కవకాశము లేకపోయెనే యనియుఁ, జాల చింతించిరి; కాని మరణించిరని చింతింపలేదు. "భగవంతుఁ డేది చేసినను మనమేలునకే" అను మాట యిందెట్లు సార్థకమైనదని యోజించుచుండెను. ఒకరోజున తల్లితోఁ గలిసి ఊదా నర్మదానదికిఁ బోయెను. అప్పటి కాతఁడు ఎనిమిదేండ్లవాఁడు. తల్లి గుడ్డలను జాడించుచుండెను. ఇంతలో ఊదా నీటిలోనికి దిగి స్నానమ్ము చేయుచుండ నొక మొసలి వచ్చి ఆతనిని నీటిలోనికి లాగుకొనిపోయెను. అప్పు డా

బాలుఁ డిట్లుఅ చెను:—“ప్రభూ! నన్ను రక్షింపుము.” తల్లి యేడ్వ నారంభించెను. జనులంద ఱును బరువిడివచ్చిరి. కాని వారు వచ్చునప్పటికి మొసలి నీటిలో మునిఁగి పోయినది. గౌరి యింటికివెళ్ళి యేడ్చుచు వృత్తాంతము నంతను నాథునకు విన్నవించెను. అప్పుడు వెంటనే “భగవంతుఁ డేది చేసినను మన మేలునకే” యని యలవాటు చొప్పున ననెను. పుత్ర శోక పీడితయగు గౌరికి యీపలుకులు బాధ కలిగించియుండ వలసినది; కాని యిది నిజమేనని మరల నంతరాత్మ చెప్పుచుండెను.

ఆతఁడు గౌరితో నిట్లనెను:—“నీవు దుఃఖించెద వెందులకు? ఈలోకములో నెవరి కెవరు? ఇదియొక సత్రము. నానా గ్రామములనుండియు వేలువేలు మనుష్యులు సత్రములోఁ జేరుదురు. చేరినప్పుడు అన్న, అమ్మ అను వరుసలతోఁ బిలుచుకొను చుందురు. వెళ్ళిపోవునప్పు డెవరి త్రోవ వారిదే. కొందఱు ముందు కొందఱు వెనుక. కర్మనాశము కాఁగానే యెవరి త్రోవను వారు వెళ్ళిపోవుచుందురు. దీనికి శోకింప నేల?”

“ఒకరోజున మనయింటి కొకమహాత్ముఁడు వచ్చి యేమి చెప్పినాఁడు. ఇది యొకతోటయనియు, తోటలోని చెట్లును, పండ్లును యజమానివే యైనప్పటికిని ఏదేని ఒకచెట్టుపండ్లను యజమాని కర్పింపుచుందురు. అట్లే భగవంతుని వస్తువగు మనపిల్ల వాఁడు భగవంతునికే అర్పింపఁబడినాఁడు. అదియునుగాక ఆత్మ యెన్నటికినిఁ జావదని నీకు తెలియును గదా! శరీర మశాశ్వతము. అది యెన్నటికైనను నశించి తీరును. నిజముగ విచారించిన శరీరములో పదార్థములును నశింపవు. వస్తువు మారును. పంచభూతములు వేఱువేఱై సమిష్టి పంచభూతములోఁ గలియును. సుత-మిత్ర-కళత్రాదులన్నియు భగవంతునివే. ఒకయజమాని ద్రవ్యము ఒక దుకాణమునుండి వేఱొకయాతని దుకాణమునకుఁ జేరిన ద్రవ్యముకొఱ కాతఁడు దుఃఖించునా? అట్లే భగవంతుని బిడ్డఁడు కొన్నాళ్లు మనవద్ద నున్నాఁడు ఇప్పు డింకొకచోటకుఁ బోయి నాఁడు. దానికి దుఃఖింప నేల? అదియునుగాక ఁడా భక్తుఁడు. మనతోఁగూడి నిరంతరము భజనము చేయుచుండెడువాఁడు. ఆతఁడు చనిపోవునప్పుడు “ప్రభూ! నన్ను రక్షింపుము” అని పలికెనని చెప్పితివి. భగవన్నామ స్మరణముతోఁ బోయి నాఁడు కావున నాతఁడు మోక్షమునకుఁ బోయి యుండవలయును. కావున నట్టి పుత్రునికొఱకు శోకింపనేల?

ఆతఁడు చనిపోయినాఁడని యూహింపనేల? ఒకవేళ మొసలి జారినుండి రక్షింపఁబడకూడదా? ఆతఁడు మరల నిన్నుఁ గలిసికొనఁ గూడదా? “భగవంతుఁడేది చేసినను మనమేలునకే” అనఁగా నామె యిట్లనెను:—“ఁడా యింకను జావలేదని నా యంతఃకరణము చెప్పుచున్నది. అతఁ డిక్కడికంటె నుజ్జ్వలరూపమున నాకుఁ గనఁబడఁగలఁడు.”

"కనఁబడనిమ్ము, కనఁబడకుండనిమ్ము. మనకాచింత యేల? కనఁబడుననుసంతోషమును వలదు, కనఁబడఁడేమో నను దుఃఖమును వలదు. కనఁబడిన భగవంతుని వస్తువని సేవింతము; లేకున్న వేఱొక సేవ చేయుదము. మనపని సేవచేయుట. స్వామిసొత్తును మనసొత్తనుకొనుట తప్పు. మనము నిర్వంచనముగా సేవ చేయవలయును. సేవాప్రకారము, క్షేత్రము యెట్టిదైనను మనయాసక్తి సేవ మీఁదనే యుండవలయును!" అని గిరవరుఁ డనెను.

"స్వామీ! మీరు ధన్యులు. మీనిష్ఠ ధన్యమైనది" అని గౌరి యూరకుండెను.

గిరివరుఁడు నదికడకుఁ బోయి వెదకెను. కాని శవము కనఁబడలేదు. అందఱును "మొసలి పిల్లవానినిఁ దినివేసినది. సుఖముగా భగవద్భజనము చేసికొనుఁడు" అనిరి. "భగవంతుఁ డేది చేసినను మన మేలునకే" అని యింటికిఁ బోయి యిట్లను కొనెను:— "నాతల్లిదండ్రులు బ్రదికియుండినఁ బిల్లవానికొఱ కెంతయో దుఃఖించియుందురు. అందువలననే వారిని ముందుగాఁ దీసికొనిపోయెను."

ముసలివారు చనిపోయిరి. పిల్లవానిని మొసలి తినివేసినది. ఇంక జంజాటమేమియును లేదు. ఇంక మిగిలినది సేవించుటకు భగవంతుఁ డొక్కఁడే. సగముపాలుకు తన పొలమునంతను కౌలున కిచ్చి నిరంతరము భగవంతుని భజింపుచుండిరి. ఇంటిలో విశేషముగఁ బనులు కూడ లేవు. వారి కిప్పుడు భజనములోఁ బ్రేమానందములు లభించుచుండెను. ఒకరోజున గౌరి నాథునితో నిట్లనెను:— "నాథా! భగవంతుఁ డేదిచేసినను మనమేలునకే చేయుననుట నిజము. ఊదా బ్రదికియుండిన మన మమకార మాతనిపైఁ గేంద్రీకృతమై భగవద్భజనమున కింతటి యవకాశ ముండెడిది కాదు. కాని నా కింకను ఊదా జ్ఞాపకమునకు వచ్చుచునే యున్నాఁడు." గిరివరుఁ డిట్లనెను:— "నిజమునకుఁ దల్లి హృదయ మట్లే యుండును. అది విపరీతవిషయము కాదు. కాని, నీవు తెలిసినదానవు. వానిని జ్ఞాపకము చేసికొనుటవలనఁ బ్రయోజనము లేదు. నీమనస్సును భగవంతునిపైననే లగ్నము చేయుము." గౌరి యిట్లనెను:— "నిజమే! ప్రయత్నము చేసెదను. భగవత్కృప యపారము గదా! నా యీమోహము నేలఁ బోఁగొట్టఁడు?"

ఇట్లు సాధన చేయుచు నాదంపతులిరువురును తమ తను-మన-ధన-ప్రాణములను భగవంతునిపై లగ్నమొనర్చిరి. ఒకానొకప్పుడు దేశములో కఱవు సంభవించెను. పశువులు చనిపోయెను. గౌరీ గిరివరులకు భగవత్పూజకుఁగూడ చాల కష్టమయ్యెను. వారు తమ ఆస్తిని, భగవంతుని పూజారికి ఒప్పగించి, గ్రామమునుండి బయలుదేరిరి. రాత్రిపూట యిద్దరును చెట్లక్రింద నివసించుచుండిరి. భగవద్విధాన మతి విచిత్రమైనది. ఒకవిషసర్పము గౌరికాలికి కాటును వేసెను. అప్పుడు గౌరి

యిట్లనెను:—"ప్రభూ! సర్పరూపమున నను స్పర్శించితివా? స్వామీ! నేను ధన్యు రాలను." ఇంతలో గిరివరుడు మేల్కొనెను. పాము పరుగిడుచుండెను. గౌరి విష మెక్కి తన్నుకొనుచు నోట "హరేరామ హరేరామ రామరామ హరేహరే, హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే" అని పలుకుచుండెను. ఆమెధ్వనిలో గిరివరుడు తన ధ్వనిని గూడ కలిపెను. ఆమెకు శ్వాసమాడక అట్లే పడియుం డెను. ఆ వెన్నెలరాత్రిలో నామె ముఖము వెలిగిపోవుచుండెను. ఆమెనవ్వుచున్న ట్లుండెను. గిరివరునినోటినుండి "భగవంతుడేది చేసినను మనమేలునకే చేయును" అను వాక్యము అప్రయత్నముగ వెలువడెను.

తెల్లవారగానే సర్పము కఱచి చచ్చినవారిని దహనము చేయరాదనుసంగ తిని దెలిసికొని ఆమె నా నర్మదానదీప్రవాహమున భగవన్నామముచేయుచు వదలి పెట్టెను. శవము కొట్టుకొని పోయెను. గిరివరుని కన్నులనుండి రెండు నీటిముత్య ములు రాలెను.

గిరివరున కిప్పుడు భగవద్దర్శనము చేయవలయు నను నుత్కంఠత యెక్కు వయ్యెను. ఒకదినమున నరణ్యములోనే వ్యాకులతతో దిరుగుచు దీనముగా భగ వంతుని నిట్లు ప్రార్థింపదొడగెను:—"స్వామీ! నిన్ను వీడి నే నొక్కక్షణమైన నిలువ జాలను. నాకు నీదర్శన మొసంగి నీలో జేర్చుకొనుము. నా కీప్రపంచమంతయును శూన్యముగ దోచుచున్నది. నేను చిరకాలమునుండి నీవియోగమును సహించితిని. ఇక నేను సహింపజాలను. నీ విరహాగ్ని సంసారమునంతను భస్మము చేయగలదు. అనంతా! నీవు సర్వత్ర వ్యాపించియున్నావు. నాకేల ఇచ్చట గనబడవు. నాకుగల అహంకార మమకారముల నన్నిటిని భస్మము గావింపుము. అగ్నికిని తేజము నొసగు నో పతితపావనా! దర్శన మొసంగవా? దర్శన మొసంగవా?..." అని అను నంతలో నావన మంతయు నుజ్జ్వలప్రకాశముచే శోభిల్లుచుండెను. ఇంతలో బృందా వన మచ్చట దర్శనమయ్యెను. శ్రీకృష్ణపరమాత్మ గోపికాసహితుడై త్రిభంగి మముతో వయ్యారముగ నిలుచుండి వేణువు నూదుచుండెను. ఆకృష్ణునకు పాదము లరుణములై యుండెను. కాళ్లకు గజ్జలుండెను. పచ్చని-బంగారువన్నె గల పీతాంబ రమును ధరించియుండెను. మొలకును మువ్వలు గజ్జలు శోభిల్లుచుండెను. చిరు బొజ్జపై పులిగోరు త్రాడు, అనేకదివ్యమణులతో గూడినహారములు శోభిల్లుచుండెను. భుజములకు బాజుబందులు, కరములకు గంకణము లుండెను. చెవులకు రత్న మకర కుండలములును, శిరస్సున నెమలిపింఛమును విరాజిల్లుచుండెను. శరీరమంతయును ఇంద్రనీలపుమణివలె నుండెను. ఇట్టిరూప మాధుర్యమును గాంచి గిరివరు డానం దసాగరమున మునిగెను. నోట మాటరాలేదు. కన్నుల నానందబాష్పములు కారు

చుండెను. శరీరము గగుర్పొడిచెను. ఇట్టిస్థితిలో శ్రీకృష్ణ పరమాత్మ గిరివరునితో నిట్లనెను:—వత్సా! గిరివరా! నీవు నాకు మిక్కిలి ప్రియుఁడవు. నేఁడు నీ కీబృందావన దర్శనముఁ గావింపఁజేసితిని. నీవు ధన్యుఁడవు. ఇఁక నీవు నా పరమధామమునకు రావచ్చును. గౌరి చావలేదు. ఆమె యింకను గొన్నాళ్లు పార్థివశరీరముతో నుండఁగలదు. ఆమెమనస్సులోఁ బుత్రకాంక్ష కలదు. ఆతనిని గలిసికొనినతర్వాత నాసన్నిధానమునకు రాఁగలదు. నీవు ధన్యుఁడవు."

ఇట్లనుచుండఁగనే గిరివరునిదేహము జ్యోతిర్మయమయ్యెను. ఆతనిశరీరము లోనుండి యొక జ్యోతిర్మయపుంజము బయలుదేరి, శ్రీకృష్ణసన్నిధిని జేరి గోపబాలకునిరూపమును జెంది సాష్టాంగము పడఁగా శ్రీకృష్ణుఁ డాతనిని గౌఁగిలించుకొనెను. ఇంతలో బృందావన మంతర్ధానమయ్యెను. గిరివరునిదేహము వనములో నట్లే పడి యుండెను.

గౌరి శరీరము నీటిలోఁ గొట్టుకొని పోయి పోయి వచ్చుచుండి విఱిగిపడిన చెట్టులో నేఁడుదినములవఱకు చిక్కుకొని యుండెను. ఒకరోజున నదీతీరముననున్న సిద్ధమహాత్ముఁడు స్నానార్థము నదికి రాఁగా నాతనికడ కీశరీరము కొట్టుకొనివచ్చెను. ఆతఁ డాగతానాగతము లెఱిఁగిన వాఁడగుటచే నీమె వృత్తాంతమును దెలిసికొని యొడ్డునకుఁ దీసి జలము నభిమంత్రించి చల్లఁగా, నామె నిద్రనుండి లేచినట్లు లేచి కూర్చుండెను. గౌరి కన్నులను దెఱవఁగానే యెదుట తేజఃపుంజమువలె నున్న సిద్ధమహాత్ముని గాంచి యాశ్చర్యమును జెందెను. ఆతఁ డామెను తనకుటీరమునకుఁ గొనిపోయి యిట్లనెను:—"బిడ్డా! దీనినిఁ దినుము" అని కొన్ని మధురఫలముల నొసంగెను. ఆమెశరీరమునకు బలము వచ్చెను. కొంచెముసేపటికి తనభర్త జ్ఞాపకమునకు వచ్చెను. మహాత్ముఁ డామెస్థితిని గ్రహించి యిట్లనెను:—"నీభర్త అదృష్టవంతుఁడు. నీవును బుణ్యశాలివి. ఇఁక నీ పతిస్మృతిని వీడుము. నీపతిని భగవానుఁడు తనలోఁ గలుపుకొనినాఁడు." అని దివ్యదృష్టిచేఁ జూచి సమస్తవృత్తాంతము నామెకుఁ జెప్పెను.

సాధ్వియగు గౌరి తనభర్త కృష్ణైక్యమును జెందుటను విని మిక్కిలి యానందించెను. "నేను నానాథునికడ నుండియుండిన నాథున కట్టిప్రాప్తము లేకపోయెడిది. అందుకనియే మమ్ముల నిద్దరను భగవంతుఁడు విడఁదీసినాఁడు." అని యామె యనుకొనెను.

మహాత్ముఁ డిట్లనెను:—"బిడ్డా! నీవు చింతింపవలదు. నీవు ముక్తవు. ఈ జగత్తంతయు రజ్జుసర్పభ్రాంతిని కేవలము అధ్యారోపితము మాత్రమే. నిజమునకు ఉత్పత్తి నాశనములు లేవు. బద్ధుఁడును లేఁడు, సాధకుఁడును లేఁడు, ముముక్షువును

లేఁడు, ముక్తుడును లేఁడు. నీ వాత్మస్వరూపమవు, నిత్యముక్తవు. తనవాఁడును లేఁడు, పరాయివాఁడును లేఁడు. రెండవవాఁడే లేకపోయినప్పుడు తనవా రెవరు ? పరు లెవరు ? ఆత్మ ఏకరసము. నానాత్వమంతయుఁ గేవలము అజ్ఞానమువలన గోచరించుచున్నది. ఆత్మతత్త్వమునకు వ్యతిరిక్తమగు వస్తు వొక్కటియును లేదు. నీవు అజ్ఞానమును వీడి ఆత్మస్థితియందే యుండుము. ఈజగత్తు నిజమునకు నిత్యము, అజన్మము, శాశ్వతము. ఆత్మస్థితియందుండి యీవ్యవహారజగత్తునఁ జరించుచుండుము.”

పరిపక్వమైన వానికి గురువు చెప్పిన నొక్కవాక్యము చాలును. దానితోడనే తరింప వచ్చును. మహాత్ముఁ డిట్లనెను:—“అమ్మా ! దగ్గఱలోనే నీపతి మృతదేహము కలదు. నాశిష్యులు వచ్చి చూపింపఁగలరు. దానికి సంస్కార మొనర్చి,సాక్షిమాత్రవై యీజగత్తునఁ బ్రారబ్ధశేష మున్నంతవఱ కుండి, చివరకు భగవంతుని జేరుము.”

గౌరి ఆశిష్యులతో నొకచోటకుఁ బోయెను. అచ్చట నొకచెట్టుక్రింద నొక దేవి కూర్చుండియుండెను. ఈమె అచ్చటికి పోఁగానే ఆమె అంతర్ధానమయ్యెను. అచ్చట చూడఁగా భర్తశవము పడియుండెను. దాని కామె దహన సంస్కారములు కావించి, యా చితిభస్మమును నర్మదలోఁ గలిపివేసెను. అంత శిష్యు లొకచితారును కాషాయాంబరము నిచ్చి ఆమెతో నిట్లనిరి:—అమ్మా ! నీ వీకాషాయమును ధరించి, చితారుతో నామ సంకీర్తనము చేసికొనుచు నిర్లిప్తతతోఁ జరించుచుండుమని గురువరేణ్యుల యాజ్ఞ.” అని వారు మాయమైరి. ఆమె తనకు చితారురూపము భగవానుడే తోడైనాఁడని భావించి “భగవంతుఁ డేది చేసినను మనమేలునకే చేయు” ననుట నిజమని తలఁచెను. ఆమె యి ట్లనుకొనెను:—“నన్ను నానాథుని వేఱుచేసి, మహాత్మునిచే జ్ఞానోపదేశము చేయించి మమకారమును బోఁగొట్టెను. లేకుండిన నానాథుని శవమును గాంచి నేను బ్రదుకఁగలిగియుందునో ?”

చాలదినములు గడిచెను. ఆమె కీర్తన చేసికొనుచుఁ జేసికొనుచు నొకపట్టణము చేరెను. ఆపట్టణపు రాజు కుమారునకు రాజ్యాభిషేకము చేసి వనములకుఁ దపస్సు చేయఁబోయెను. సరిగా దర్బారు దినమున నీమె వెళ్లి రాజద్వారమున నిలుచుండి మధురస్వరముతోఁ గీర్తించుచుండెను. స్త్రీ పురుషులందఱును జకితులైరి. రాజకుమారుఁ డలంకారము చేసికొనుచుండఁగా నొకసన్న్యాసిని మధురస్వరముతోఁ గీర్తించుచు వాకిట నిలుచుండి యున్నదనువృత్తాంతమును విని పరువిడివచ్చి కన్నుల నానందబాష్పములు కార్చుచు నామెపాదములపైఁ బడెను, ఆమె కన్నులను దెఱచి చూచి గట్టిగాఁ గౌఁగిలించుకొని “వీఁడు నా ఊదా కాఁడుకదా!” యనెను. దానికి

రాజకుమారుఁ డిట్లనెను:—"నీఊదా అదృష్టవంతుఁడు. నేఁ డీట్టిస్థితిలో మాతృచర ణరజము ప్రాప్తించినది." రాజద్వారమున నీస్థితియంతయును గాంచి ప్రజలెల్లరును జకితులైరి.

రాజకుమారుఁ డామెను లోనికిఁ గొనిపోయి సింహాసనాసీనను గావించి తన రాణిచేత వందనాదులు గావింపఁజేసెను. రాజకుమారుఁడు గౌరి చరణసన్నిధిని కూర్చుండెను. రాజదర్బారు ఆగిపోయెను. దర్బారు సాయంత్రమనెను. తల్లితో నాతఁ డిట్లనెను:—"అమ్మా! పలుకవేమి? మొన్న రాత్రి వచ్చి నాకు సమస్త వృత్తాంత మును జ్ఞాపకముచేసితివి, నిన్నుఁ బ్రతీక్షించుచు నేను గూర్చుంటిని."

తల్లియగు గౌరి యిట్లనెను:—"మొన్నరాత్రి నేను వచ్చి జ్ఞాపకము చేయు టేమిటి? నీవున న్నెట్లు మఱచితివి. నీప్రాణ మెట్లు రక్షింపఁబడినదో, నీ విచ్చటి కెట్లు వచ్చితివో ముందుగాఁ జెప్పుము."

రాజకుమారుఁ డిట్లనెను:—"నేను మొసలి నోటబడి కొట్టుకొని పోవుచుండ నేదియో జలజంతు వొక్కటి వచ్చి దానినుండి వదలింపఁగా నేను గొట్టుకొనిపోయి తిని. నాకప్పుడు స్మృతిపోయెను. నన్ను నావలనైనున్న పల్లెవాండ్రు పైకి దీసి పడవేసిరి. పైకి వచ్చినతర్వాత బొత్తుగా స్మృతిపోయెను. తర్వాత స్మృతి తెలియు నప్పటికి నేను రాజమహాలులో దివ్యశయ్యపైఁ బరుండియుంటిని. నాప్రక్కన తేజస్వియగు నొకవృద్ధరాజును, సన్యాసియును గూర్చుండి యుండిరి. అప్పు డారాజు సన్యాసితో నిట్లనెను:—"స్వామీ! తమవచనము సత్యమైనది. నేఁడే యిరువదొకటవ రోజు. ధన్యుఁడనైతిని. అపుత్రుఁడనగు నాకుఁ బుత్రదాన మొసర్చితిరి." సన్యాసి నవ్వెను. అంత సన్యాసి నాచేతిని దనచేతిలోనికిఁ దీసికొని యిట్లనెను:—"బిడ్డా! నీ వేజాతివాఁడవు. నీపేరేమి?" దానికి నేను "నేను క్షత్రియుఁడను. నాపేరు ఊదా" అంటిని. అంత నాతఁడు "నేటినుండి నీపేరు ఉదయరాజు. ఈచంద్రసేనమహా రాజు నీతండ్రి. తల్లి కమలాదేవి మరణించినది. ఈతఁడు నీ గురుజనుఁడు" యనుచు రాజుతో నిట్లనెను:—"ఈతనికి రాజ్యాభిషేకము పూర్వపుస్మరణమువఱకు జన్మస్మృతి కలుగకుండుఁగాక" యని లేచెను. రాజాతనికి సాష్టాంగనమస్కార మొసర్చెను. సన్యాసి "ఇంక నాపనిదైనది. ఇప్పుడు నేను వెళ్లుచున్నాను." అని వెళ్లిపోయెను.

అప్పటినుండియు నేను సుఖముగ దాసదాసీజనములచే సేవింపఁబడుచుంటిని. సశస్త్రవిద్యలను గఱచితిని. విజయనగరాధీశుని పుత్రికను బెండ్లాడితిని. నిన్ననే మాతండ్రి సన్యాసమును గ్రహించి నాకు రాజ్యాభిషేక మొనర్చెను. మొన్న రాత్రి నాల్గవజామునఁ గునుకుచుండ నీసన్యాసి నీవేషమువనే నాకు దర్శన మొసఁగి,

వడిలోనికిఁ దీసికొని సమస్త వృత్తాంతమును జెప్పితివి. అప్పటినుండి నేను నీకొఱకు నిరీక్షించుచుంటిని. ఇప్పుడు స్వప్న వృత్తాంతమంతయును నిజమయ్యెను. నాతండ్రి నాతో నిట్లు చెప్పెను:—"వత్సా! కలలోఁ గనఁబడినది మీఅమ్మయే కావచ్చును. నాకు సంతానము లేదు. మహారాణి మరణించినది. నాకు మొదటనుండియు వైరాగ్యము కలదు. రాణి మరణించుటచే నింకను విరక్తి కలిగినది. అప్పుడు రాజు సన్న్యాసమును గ్రహింపఁబోవ నొకసిద్ధమహాత్ముఁడువచ్చి యిట్లనెను:—"చంద్రసేనా! నీసన్న్యాసగ్రహణ సమయ మింకను నాసన్నము కాలేదు. నీకర్తవ్య మింక నున్నది. నాతో నరణ్యమునకు రమ్ము. అచ్చట ననుష్ఠాన మొనర్చిన యోగ్యుఁడగు బుత్రుఁడు లభింపఁగలఁడు. ఆతఁడు తనవృత్తాంతమును రాజ్యాభిషేకపూర్వదినమువఱకు మఱచి యుండఁగలఁడు. ఆతఁడు గొప్ప బుద్ధిమంతుఁడు, విద్వాంసుఁడు, భగవద్భక్తుఁడు, సదాచారియుఁ గాఁగలఁడు. ఆతనికి రాజ్యభారమును ఒప్పగించి సన్న్యాసమును గ్రహింపుము. ఆతని మూలమున నీవంశమును విస్తారము కాఁగలదు. నీకు సద్గతియుఁ గలుగఁ గలదు." ఈమాట ప్రకారము మహారాజు వనమునకుఁ బోయి, యనుష్ఠానమును గావించెను. అనుష్ఠానసమాప్తిదినమున రాజు మత్స్యముల కన్నమును వేయుచుండ నేను గొట్టుకొని వచ్చితిని. నే నప్పటినుండి యిరువదియొక్క రోజులు స్మృహతప్పి పడియుంటినఁట. మొసలి కఱచిన గాయమునకు వైద్యము కావింపఁబడెను. రెండుదినముల క్రిందట నాకు పూర్వస్మృతి కలిగినది. నేఁడు దర్బారు దినము. నీదర్శనము లభించినది. కృతార్థుఁడనైతిని. అమ్మా! నీ వీవేషములో నెందుల కుంటివి? తండ్రిగా రెచ్చట నున్నారు? మీరు చాల కష్టపడియుందురు. మీసేవఁ జేయఁజాలని యభాగ్యుఁడను నేను. అమ్మా! అమ్మా! నన్ను వడిలోనికిఁ దీసికొనుము. అనుచు రాజకుమారుఁడు తల్లివడిలోఁ బడెను. ఆతనికి కన్నులవెంట నశ్రుధారలు ప్రవహించుచుండెను.

గౌరికి జ్ఞానము కలిగినను నేఁడుమాత్రము హృదయము పుత్రస్నేహముచే నిండిపోయెను. జ్ఞానము సంబంధమును బోఁగొట్టలేదు. తల్లి వియోగమును జెందిన పుత్రుని కౌఁగిలించుకొని తనవృత్తాంతము నంతను వినిపించెను.

తండ్రియగు గిరివరుని మరణమును వినఁగానే రాజకుమారునకు మిక్కిలి దుఃఖము కలిగెను. కాని తల్లి యోదార్పఁగా శాంతచిత్తుఁడయ్యెను.

ఇంతలో సంధ్యాకాలమయ్యెను. తల్లియొక్క స్నానాన్నపానాదుల విషయమును జూచినమీఁదట దర్బారును బూర్తిగావించెను. రాత్రియంతయుఁ దల్లియు, కొడుకును మాటలాడుకొనుచుండిరి. గౌరి కుమారునకు నిజమగు భక్త్యుపదేశము నొసంగి యాతని హృదయమున భక్తితరంగము లుద్భవించున ట్లొనర్చెను. గౌరి

యిట్లనెను:—"నాయనా! నిన్నుఁ జూచుటతోడనే నాపుత్రస్నేహ వాసన పూర్తియైనది. ఇఁక నేను వెళ్లెదను." కాని రాజకుమారుఁ డామెను వెళ్లనీయలేదు. నగరమున కావల నొకకుటీరము తల్లికొఱకై వేయఁబడెను. గౌరి దానిలో నివసించుచుండెను. ఆమెకు సేవయొనర్చుట కేర్పాట్లు చేయఁబడెను. ప్రతిదినమును బుత్రుఁడగు ఉదయరాజును, రాజకుమారియు నామె దర్శన మొనర్చుచుండెడువారు. ఆమె కొడుకునకును గోడలికిని భక్త్యుపదేశము చేయుచుండును. ఒకదినమునఁ దల్లి యిట్లనెను:—"వత్సా! భగవంతుఁడేది చేసినను మనమేలునకే" అను నీమంత్రమును మఱువ వలదు. ఎల్లప్పు డానందముతో నుండుము. చూచితివికదా! మనల నెట్లు భగవంతుఁ డనుగ్రహించినాఁడో!"

గౌరికి ఇదివఱకే జ్ఞానము కలదు. ఆమె భగవత్ప్రేమయుఁ బరాకాష్ఠను జెందినది. భగవంతుఁ డామెకు సాక్షాత్తుగ దర్శన మొసఁగెను. దర్శనమైన రోజు నుండియు నామె స్పృహతప్పి పడియుండి మూఁడవ దినమున భగవదైక్యమును జెందెను.

పుత్రుఁడగు ఉదయరాజు పత్నీసహితముగ భగవద్భజన మొనర్చుచు రాజ్యము చేయుచుండెను. చివరకు సత్యముగ భగవద్భక్తిని బొంది వీరును కృతార్థులైరి.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.

# వచనగ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ...ధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకటే సంపుటము | 9 | 0 |
| ,, మూడు సంపుటములు | 10 | 8 |
| ...ధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 5 | 8 |
| ,, శాంతిపర్వము | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 7 | 8 |
| ...ధ్రవచనవాల్మీకిరామాయణము— | | |
| ,, బాలకాండము | 2 | 8 |
| ,, అయోధ్యాకాండము | 5 | 0 |
| ,, అరణ్యకాండము | 2 | 8 |
| ,, కిష్కింధాకాండము | 2 | 8 |
| ,, సుందరకాండము | 3 | 0 |
| ,, యుద్ధకాండము | 7 | 8 |
| ,, ఉత్తరకాండము, పాతప్రతి | 2 | 8 |
| ...ధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 3 | 0 |
| ...బియన్‌నైట్సుకథలు | 2 | 0 |
| ...రత్నాకరము, శ్రీగుర్జాడ శ్రీరామమూర్తి | 1 | 0 |
| ...స్తుపై లోకహత్యారోపణ (ప్రహసనము) | 0 | 8 |
| ...సీదాసురామాయణము, వచనము | 12 | 8 |
| ...శోపనిషత్తులు, తెనుగు వచనము | 5 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు పాతప్రతి | 0 | 14 |
| భారతరమణీమణులు— | | |
| ,, ప్రథమభాగము | 1 | 4 |
| ,, రెండవభాగము | 0 | 10 |
| ,, మూడవభాగము | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 12 |
| నీతిచంద్రిక, శ్రీచిన్నయసూరిగారిది | 0 | 12 |
| ,, టీకతో | 1 | 4 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 12 |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | 1 | 12 |
| నీతిరత్నాకరము | 0 | 8 |
| నామహారాష్ట్రయాత్ర | 4 | 0 |
| నేటికాలపుకవిత్వము, శ్రీఉమాకాన్తముగారిది | 3 | 0 |
| సంగ్రహరామాయణము | 1 | 8 |
| సంగ్రహభాగవతము | 2 | 8 |
| భోజునికథలు | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము | 1 | 4 |
| ,, II భాగము | 1 | 4 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 8 |
| ,, A S. P. అయ్యరుగారిది | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, సీతారామశాస్త్రి 1,2 భాగములు | 2 | 0 |
| ,, వేంకటరమణయ్య III భాగము | 2 | 0 |
| రాజశేఖరుడు, గోపాలుడు | 0 | 12 |
| విక్రమార్కుని కథలు | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | 1 | 0 |
| తాతాచార్యులకథలు | 0 | 12 |
| బేతాళునికథలు | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వైద్యులకథలు | 0 | 6 |
| వీరాంగనలు | 1 | 8 |
| పరమానందశిష్యులకథలు | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 8 |
| రేచుక్క పగటిచుక్కకథలు | 0 | 4 |
| సత్యసేనవిజయము | 0 | 6 |
| ఋషులచరిత్ర | 1 | 0 |
| పురాణగాథలు I | 1 | 0 |
| ,, II | 1 | 0 |
| త్రిలిఙ్గకథలు | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర | 1 | 4 |
| రఘువంశకథ | 0 | 10 |
| విక్రమార్కచరిత్ర, భా. రామమూర్తి శాస్త్రి | 1 | 8 |
| ఈసబునీతికథలు, 2-వ భాగము | 0 | 12 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | 0 | 8 |
| మైరావణచరిత్ర | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | 0 | 12 |
| జీవితరహస్యములు, చిత్రమైనకథలు | 1 | 8 |
| శకుంతలచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| నలచరిత్ర ,, | 0 | 8 |
| సావిత్రిచరిత్ర ,, | 0 | 6 |
| హరిశ్చంద్రచరిత్ర ,, | 0 | 8 |
| **నవలలు** | | |
| సీతారామము, (పాతప్రతి) | 1 | 4 |
| [illegible], నవల | 1 | 0 |
| [illegible]రంజని ,, | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ |
|---|---|
| ఉన్మాదిని, నవల | 0 |
| రాధారాణి ,, | 0 |
| దుర్గేశనందని,, | 1 |
| ఆనందమఠ, నవల | 1 |
| లీల ,, | 0 |
| లాలాబాయి ,, | 0 |
| ఆంధ్రరాష్ట్రము,, | 1 |
| ప్రేమాగ్రణి | 1 |
| రోషినార, చరిత్రవిషయికమగునవల | 1 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | 1 |
| శంభుతో నొకనాటి సహవాసము | 0 |
| చంద్రగుప్తుడు, నవల | 2 |
| నీతిసింధువు, నవల | 1 |
| వనజాక్షి ,, | 1 |
| ముగ్గురుమూర్తులు | 2 |
| విశ్వభారతీ గ్రంథమాల ప్రచురణలు | |
| పడవమునుక, I భాగము | 2 |
| ,, II భాగము | 2 |
| ,, 1,2 భాగములుచేరినది | 5 |
| అన్నపూర్ణాదేవి మందిరము | 3 |
| ఇంటాబయటా | 4 |
| కథాగుచ్ఛము I భాగము | 2 |
| ,, II ,, | 2 |
| ,, III ,, | 2 |
| ,, III ,, ప్రథమఖం॥ | 1 |
| ,, III ,, ద్వితీయఖం॥ | 1 |
| ,, IV ,, | 2 |
| గృహప్రవేశము | 1 |
| ప్రాయశ్చిత్తము | 3 |
| పోస్టాఫీసు | 0 |
| స్త్రీల [illegible] | 1 |

**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,**

[illegible] 1872, [illegible]